# విషయానుక్రమణిక

## జనవరి 1956

# స్వవిషయము

భారతి ముప్ఫయిరెండు స్వర్ణసంక్రాంతులను అధిగమించి ముప్ఫయి మూడవయేట అడుగుబెట్టింది. గత జన్మదినసంచిక తదాదీ స్వతంత్రాంధ్ర ప్రజల పురోగమనావసరాల దృష్ట్యా భారతిలో ఒక నూతన పరిణామాన్ని తీసుకురావటానికి ప్రయత్నించుతూ వచ్చాం. ఆశించిన అవధికి ఫలితాలను సాధించలేకపోయినా యీ ఉద్యమాంకురాన్ని అభినందించుతూ పలువురు లేఖలు వ్రాశారు. వారందరికీ ప్రత్యేక ప్రత్యేకంగా కృతజ్ఞత తెలుపలేక పోయాం. ఇందుకు క్షంతవ్యులం.

ఈ శుభసమయంలో ఈ ఉద్యమలక్ష్యాన్ని చటం ఉచితమని తోస్తుంది. ప్రాచీన భారతీయ విజ్ఞానరంగంలో సమాలోచన వృత్తికి ఎన్నడూ అవరోధముండేది కాదు. అలాంటి అవరోధమే వుంటే భారతీయ విజ్ఞాన జయస్తంభములైన దర్శనశాస్త్రముల అవతరణకే అవకాశముండేది కాదు. కాని భారతజాతికి బానిసత్వం తటస్థించిన అనంతరదశలో మహమ్మదీయాది వైదేశిక పరిపాలకులు దౌర్జన్యఖంఢాలో మన విజ్ఞానసంస్కృతుల నణచివేసి వారి మత సాంస్కృతిక సంప్రదాయాల్ని బలవంతంగా భారతప్రజల నెత్తినవేసి రుద్దటానికి ప్రయత్నించిన కారణంగా భారతీయ విజ్ఞానం ఆత్మరక్షణార్థం తనచుట్టూ తానే ప్రమాణశాసనముల కంచుకోట నొకదాన్ని నిర్మించుకుని సమాలోచన వృత్తికి స్వస్తి చెప్పి తన పురోగమనాన్ని తానే అరికట్టుకుంది.

ఇప్పుడు మనం సర్వస్వతంత్రులంగా వున్నా, బానిసదశలో యేర్పడిన ఈ మనఃస్థితి ఇంకా మన్ని వదలటం లేదు. ఇది మన పురోగమనాన్ని మెడనెడా అరికట్టివేస్తున్నది. ఏ నూతనోద్యమాని కుపక్రమించాలన్నా మనం భయభ్రాంతుల మవుతున్నాం.

మనకు భవిష్యత్తువుండాలంటే ఈ సమాలోచనవృత్తిని విస్తృతావధిని పెంపొందించుకోవలసి వుంది. అధునాతనశాస్త్రీయవిజ్ఞానవ్యాప్తి ఇందుకు ప్రథమసోపానం.

సాహిత్యసంస్కృతులకూ శాస్త్రీయవిజ్ఞానానికి సంబంధమేమిటనేవారు కొందరున్నారు. శాస్త్రీయవిజ్ఞానప్రాతిపదికలపై నిర్మింపబడని సాహిత్యసంస్కృతులు పేకమేడలవలె ఏ చిన్నగాలి వేసినా ఛిన్నాభిన్నమైపోతాయి.

ఈ సత్యాన్ని దృష్టిలోవుంచుకుని, దేశోద్ధారకుడు చూపిన వెలుగుబాటను పరిక్రమించుతూ, సాహిత్యసంస్కృతులకు దోహదంగా శాస్త్రీయవిజ్ఞానాన్ని కూడా ప్రజాబాహుళ్యంలోకి వ్యాపింపచేయటానికీ, నిర్దుష్టమైనసమాలోచన వృత్తిని పెంపొందజేయటానికీ ప్రయత్నించుతున్నాం. ఈ ఉద్యమానికి వివిధ విజ్ఞాన శాఖలలో సంపన్నులయిన మహాదాంధ్రరచయితల సహకారం విస్తృతావధిని లభించగలదని ఆశించుతున్నాము.

తమ అమూల్యరచనలతోనూ చిత్రాలతోనూ భారతిని అలంకరించుతూ భారతిని ఇట్టి సమున్నతస్థాయిలో నిర్వహించటానికి కారణభూతులౌతున్న సర్వాంధ్ర రచయితలకూ, కళాకారులకూ, సారస్వతాభిమానులైన పాఠకులకూ మా కృతజ్ఞత.

# మ ఖా ను యా న ము

శ్రీ కోమాండూరు కృష్ణమాచార్యులు

ఉదగయనంబు వీడి తన యుజ్జ్వలతం దిగనాడి శాంతుఁడై
యదనున దక్షిణాయనమునందు వెలుంగు దినేశు కైవడిన్
బొదలె యదూద్వహుండు తన మూపులు రెండును బొంగ నాహలా
యుధుఁడును దృప్తుఁడయ్యె హరియున్ సమకట్టె మఖానుయానమున్.

ఆ యౌధిష్ఠిరరాజసూయ మఖరక్షాపేక్ష దైత్యారి సు
శ్రీయుక్తిం జనువేళ భోజ యదువృష్ణ్యంధకానీక యో
ధాయత్తంబయి జైత్రయాత్ర నడచెన్ హస్త్యశ్వపాదాత భా
రాయాసానత భోగిభోగ చలితాహార్యావనీ చక్రమై.

రాకా శశాంక నిర్మల సితచ్ఛత్ర సం
        ఛాదితంబయ్యె దిక్చక్రవాళ
మురుహేమదండ చామర యుగ్మకోద్వేల
        చంద్రిక లుభయ పార్శ్వముల బొదలె
పటురత్నజాల దీప్ర ప్రభాపటల కి
        ర్మీరితంబయ్యె కిరీట దీప్తి
బాలార్కబింబ ప్రభా భాసమానమై
        కౌస్తుభ మొప్పె వక్షస్థలమున
హేమకోణాభిహత సముద్దామ కాంస్య
భేరికాభాంకృతులతోడ విజయపటహ
శంఖకాహళ జయశబ్ద సాంద్రఘోష
ఘూర్ణితంబయ్యె రోదసీ కుహర మపుడు.

వలమోదంచిత పద్మరాగఘృణులన్ వ్యాలోల రక్తాంగుళీ
కలితంబై హరిపాణిజ ప్రకరముల్ కంఠీరవాకారమున్
దలపించెన్ సురవైరిహృత్కమలమున్ దంభోళి ధారాశితో
జ్జ్వల చంచన్నఖర ప్రఘాతముల నాస్ఫాలించు తద్రూపమున్.

మందరకూటకోటి పరిమర్దన దీప్త మణిప్రభావళీ
సుందరమై వెలింగ మధుసూదను దీర్ఘభుజాగ్రసీమలన్
మందితసూర్యరశ్మి మణిమండితముల్ భుజకీర్తులప్డు సం
క్రందను దివ్యధామ మనఁగాలె నుపేంద్రుని భూమికారుచుల్.

హరిమేని కాంతి పీతాంబరచ్ఛవిఁగూడి
బర్హి కంఠచ్ఛాయ పరిఢవిల్లె
కాంచీకలాప ముక్తా జాలకంబులు
పదజాతసురధునీ ప్రతిభఁ దాల్చె
పంచాయుధములు భాస్వ ద్రూపములతోడ
నిలిచె తత్తత్ స్థాన నియతి బూని
మకరకుండల దివ్యమణిఘృణి స్ఫురణంబు
భాసిల్లె హరి గండఫలకయుగళి
కటక కేయూర మకుట ముక్తాకలాప
చటుల మణిఘృణి వేష్టితోజ్జ్వల విశేష
వేషుఁడై యొప్పె హరిపరివేష వలయ
మధ్యగతుఁడైన తపనుని మాడ్కి యపుడు.

కనకచిరత్నరత్నపరికర్మితమై కనకాద్రి కైవడిన్
దనరు మహారథంబు, సముదంచిత కాంచనమాలికోల్లసద్
ఘనజవనాశ్వయుక్తముగ తార్క్ష్యమహోన్నత దీప్తమూర్తి కే
తనమునఁ గాలఁ దెచ్చెను ముదంబున దారుకు డగ్రచారియై.

హరిజలరాశి ప్రాంత సముదంచిత కాంచనపక్షయుగ్మ సుం
దరమగు రాజహంసమన దైత్యకులాంతకు పాంచజన్య వి
స్ఫురణము దర్శనీయమయి భూరిరవంబున మ్రోసె సర్వ ది
క్కరివరకర్ణరంధ్ర పరికల్పిత భీషణచారుఘోషమై.

కమలాపద లాక్షారస
రమణీయంబైన యా మురారి విశాలో
త్తమ వక్షఃఫలకంబున
సమధికమగు నూత్నశోభ సంక్రామించెన్.

## మఖానుయానము

రమణీయాకృతితోడ పుష్యరథయాత్రారంభ సంరంభియై
సమదానేకప వాజిముఖ్య బలసంఘాతంబుతో సాత్యకి
ప్రముఖుల్ పుత్రకళత్ర భృత్యజనముల్ పణ్యాంగనల్ రా మహో
ద్యమ మొప్పంజనె రాజసూయమఖతంత్రాలోక నోత్సాహియై.

స్థావర జంగమాత్మకము సర్వజగంబు నిజోదరంబునన్
గావగదాల్చియున్న మురఘస్మరు దివ్యరథంబు వ్రేగునన్
భూవలయంబు గ్రుంగ నిజమూర్ధములన్ నిలుపంగ నోపమిన్
మోవగ జేతులూది ధర మోచె ననంతుడు సప్రయత్నుడై.

ఉదధిపరీతవప్రమయి యుజ్జ్వలతోరణ మాలికావళిన్
త్రిదివముబోలె నొప్పు హరిదివ్యనివాసము ద్వారకాపురం
బిది యమరావతీపురికి నించుకయేనియు దీసిపోవదం
చుదధి తరంగఘోషముల నుప్పరవీధుల జాటి చెప్పెడున్

అంబరచుంబి హేమవరణాభిహతిన్ బురి జేరలేక కా
దంబిని రిక్తఘోషముల తర్జనభర్జనముల్ ఘటించి వ
ర్షాంబువులన్ దదీయ పరిఖాయితవారిధి గ్రుమ్మరించు న
య్యంబుజనాభు వీటి సముదగ్రత నేవిధి జెప్పనొప్పగున్.

ఆపురి శోభలం గనుచు హాటక హర్మ్య తలాధిరూఢలై
శ్రీపతిపైని కామినులు సేసలు చల్లగ సిగ్గమించి యా
గోపనితంబినీవిభు డకుంఠిత యానముతోడ నేగె వే
లాపవనోపలాలిత చలత్పట లోలపతాక లొప్పగన్.

* మాఘామోదము నుండి *

# అంతర్వ్యాప్తి

ఉషశ్రీ

"మీరా యిద్దరికీ ఎన్నాళ్ళనుంచి స్నేహం?" అని గడపలో కాలు పెడుతూనే ప్రశ్నించిన లలిత వైపు తెల్లబోయి చూశాడు రామారావు.

ఒక్క క్షణం అలానే చూసి:

"ఇంత ఎండలో వచ్చి, వస్తూనే యిలాంటి ప్రశ్న వేశావేమిటి లలితా?" అని నాలుక కొరుక్కుని- ఏకవచన ప్రయోగానికి క్షమా భిక్ష నర్థించే ముఖం పెట్టాడు.

"అదికాదు ఆయన్ని అసలు నువ్వు ఎంత కాలం నుంచి ఎరుగుదువు?"

అని ప్రశ్నను రెట్టించి అడిగి, రామారావులానే తనూ పొరపాటుగా సంబోధించినందుకు కొద్దిగా బాధపడింది లలిత.

లలిత ఏకవచనంలో సంబోధిస్తోందో, గౌరవార్థక బహువచన ప్రయోగం చేస్తున్నదో అవగతం చేసుకునేటంత తీరిక రామారావుకి ఆ క్షణంలో లేదు. ఒకవేళ అవగతం చేసుకోగలిగినా తన పొరపాటుకీ, ఆమె అనేసినదానికీ చెల్లు పెట్టుకుని తృప్తిపడేవాడు.

లలిత కూర్చున్నది.

లలితను కూర్చోమని చెప్పాలనుకోలేదు రామారావు.

రామారావు చెప్పేవరకూ కూర్చోకూడదని లలిత అనుకోలేదు. అనుకోకపోయినా అతను ఆమాట కాస్తా అనేస్తే అదో అందం. అందమే కాని ఇరవైతొమ్మిది సంవత్సరాల వయసు వచ్చినా వివాహాన్ని గురించీ, జీవితాన్ని గురించీ ఆలోచించుకోలేని రామారావుకి అలాంటి అందాలేం తెలుస్తాయి?

తెలీవని లలితకు తెలుసు.

తెలుసును కనుకనే లలిత కూర్చున్నది.

కూర్చున్న లలిత రెండు నిమిషాలకన్న నిశ్శబ్దాన్ని సహించలేకపోయింది. బైట ఎండతీవ్రం గదిలోకి రాకపోయినా, వాతావరణంలోని తాపం గది నిండా వ్యాపిస్తూనే ఉంది. లలిత మాట్లాడటానికి ఉపక్రమించబోయేసరికి ఆమె నుదురుమీద పట్టిన చిరుచెమట బిందువులన్నీ ఏకమై కనుగొలకుల్లో పడి చుణుక్కుమనిపించాయి. కుర్చీ ప్రక్కగా ఉన్న మంచం మీది తువాల్‌తో ముఖం ఒత్తుకుని:

"అన్నట్టు మీ యింట్లో మంచినీళ్ళుంటాయా, మేస్టారూ?" అని ప్రశ్నించి చిత్రంగా నవ్వింది.

రామారావు నోటితో ఏ జవాబూ ఇవ్వకుండా ప్రక్క గదిలోకి వెళ్ళి కూజా గ్లాసూ తెచ్చి ఆమె దగ్గర పెట్టాడు.

లలిత మరోసారి ముఖం మెడా తువాల్‌తో ఒత్తుకుని, మోచేతుల దగ్గర్నుంచి శుభ్రంగా తుడిచి, కాస్త ముందుకు వాలి గ్లాసులోకి నీళ్లు పోసుకుంటూ:

"మీరు కూడా తాగుతారా?" అని ఓరగా చూసింది.

"ముందు నువ్వు కానియ్యి. చాలా దూరం ఎండలో నడిచి వచ్చావు" అన్నాడు, సానుభూతిని ప్రకటిస్తూ రామారావు.

"అంత శ్రమ పడలేదులే. కారుమీదే వచ్చా. చూశావా, మగవాడికీ, ఆడవాళ్ళకూ ఉండే తేడా. ఈ రావడం నేను కాక రంగారావే వచ్చి, ఆయనే మంచినీళ్ళడిగితే కూజా, గ్లాసూ యిలా పెట్టేసేవాడివేనా? క్షమించండి; ఏమిటో ఈ వేళంతా నాలుక నేను చెప్పినట్టు వినటం లేదు."

అని వరసగా రెండు గ్లాసులు తాగి, కూజా మీద గ్లాసు ఉంచేసింది. రామారావు దిద్దుతూన్న పేపర్లకట్ట బొత్తెట్టి, దానిమీద ఫైల్ పారేసి, సిగరెట్ వెలిగించి:

"ఈ సిగరెట్ అలవాటుదగ్గర మా స్నేహం ఆరంభమయింది" అని ఆగాడు.

# అంతర్వత్ని

"కొందరికి అరవయ్యో యేట గురభ్యాసాలు ఆరంభం కావొచ్చు......" అని ముఖం ఒత్తుకునే నెపంతో కన్నులు మూసుకుంది.

"కావచ్చు కానీ, మాయిద్దరి వయస్సూ కలిపినా అరవై కాదుగా."

"కాదుగా అంటే నాకేం తెలుసూ, ఈ ప్రపంచంలో ఉన్నవాళ్ళందరి వయస్సుల్నీ తెలిపే పట్టీలు నా దగ్గర లేవు."

"అయితే పోనీలే, గూటీబిళ్ళ లాడటం దగ్గర్నుంచి మీ కిద్దరికీ స్నేహం"

"ఇది మరీ బావుంది. నేను చదివేప్పుడు భీమవరం కాలేజీలో డిగ్రీ కుర్రాళ్ళుకూడా గూటీబిళ్ళ లాడేవారు"

అని పకాల్న నవ్వింది.

రామారావు కూడా నవ్వుతా డనుకుంది.

అనుకుంది కానీ, అనుకున్నట్టు రామారావు నవ్వనంతలో పరాభూత మాత్రం కాలేదు.

"మేమిద్దరం ఒక ఊరివాళ్ళం. మా యిద్దరి చదువూ ఒకేచోట ప్రారంభమై, ఒకేచోట ముగిసింది. ఈ విషయా లన్నీ ఇదివరకే వాడు చెప్పిఉండా లే"

"చెప్పారేమో, అంత గుర్తు లేదు. అయితే ఆయన చదువుకునే రోజుల్లో ఆయన్ను గురించి ఏమనుకునేవారు?"

"ఓస్, ఈ ప్రశ్నకోసం ఇంత ఎండలో వస్తావనుకోలేదు లలితా. చూడు, నాలుగేళ్ళనుంచీ కాపురం చేస్తున్న నువ్వు నీ భర్త గతజీవితాన్ని గురించి తెలుసుకోవాలని కుతూహల పడుతున్నావంటే నాకు ఆశ్చర్యంగా ఉంది"

"ఔను, నాకూ ఆశ్చర్యంగానే ఉంది, వర్తమానంలో రంగారావు వ్యవహారం"

అని ఒక్కసారిగా ముఖంలోని చిరునవ్వునీ, ప్రసన్నతనీ మాయం చేసేసింది"

"అంటే"

అని ముందుకు వంగి కూజా అందుకున్నాడు.

"మంచినీళ్ళు నేనిస్తాగానీ, కరెంటు వచ్చిందేమో చూసి కాస్తంత ఆ ఫాన్ ఈ ప్రక్కగా యిద్దరికీ తగిలేట్టు పెడ్తారా?"

'[illegible] మందగిస్తోంది సుమా. పేపర్లు దిగ్గుతూండగా ఎగిరి పోతున్నాయని ఇందాక నేనే కట్టేశాను"

అని స్టూల్ యిద్దరికీ మధ్యగా ఉంచి ఫాన్ దానిమీద ఉంచి 'ఆన్' చేశాడు.

లలిత పంకాను కాస్త ప్రక్కకునెట్టి గ్లాసు దాని ప్రక్కనే ఉంచింది. రామారావు గ్లాసు ఖాళీ చేసి :

"ఏమిటంటున్నావూ, రంగారావు తెలివితేటల్ని గురించి కాదూ......వాడు బ్రహ్మాండమయిన తెలివయిన వాడనీ, వాడివల్ల కాలేజీకే పేరొస్తుందనీ వాడు ఎన్ని ఆటలాడినా, పాటలు పాడినా ఎప్పుడూ వాణ్ణి పిలిచి - కనీసం-ప్రిన్సిపాలు కూడా మందలించే వాడు కాదు. బహుశా వాడు ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ యూనివర్శిటీ రికార్డు బ్రేక్ చేసినట్టు నీకు తెలిసి ఉంటుంది"

"అన్నీ నాకు తెలిసినవే చెప్తున్నారు"

"కాలేజీ లెక్చరర్ అంతకు మించి ఏం చెప్పగలడు లలితా! ఈ చమత్కారం మానేశావా, ఇదే రంగడయితే నీకు తెలిసిన దాన్నికూడా, నువ్వు ఎరగనట్టు చెప్పగలడు. ఇంతకూ సారాంశం ఏమిటంటే వాడు చాలా తెలివయిన వాడనే అభిప్రాయానికి భిన్న వాక్యం ఆరోజుల్లోనే కాదు, ఈ రోజున కూడా నేను అననూ లేను, విననూ లేదు"

అని చేతిలోంచి జారిపడ్డ సిగరెట్, కాలితో నలిపేస్తూ, టిన్నులోంచి ఇంకొకటి తీసి వెలిగించాడు.

"నే నడిగేది తెలివితేటల విషయం కాదు. రంగారావు ఆ మాత్రం తెలివయినవాడు కాకపోతే నే నతనికి భార్య నయేదాన్నీ కాదు; అయినా పోస్టు గ్రాడ్యుయేట్ కంప్లీట్ కాకుండా కాపరానికి వచ్చేదాన్నీ కాదు"

అని ఆగి, కూర్చున్న కుర్చీలోంచి లేచి పడక కుర్చీలో నడుం వాల్చి, తల ప్రక్కకు తిప్పి, తలగడా ఆసరా చేసుకుని, దానిమీద ఒక పార్శ్వం ఆన్చి :

"చెదపురుగులా పుస్తకాల్ని తినేస్తూ, ప్రొఫెసర్ల అడుగులకి మడుగు లొత్తుతూ, ఏ విధమయిన చైతన్యమూ లేని వాళ్ళంటే నాకు పరమ అసహ్యం. మనం చదివే టప్పుడు అలాంటివాళ్లు ఏ అరడజను

మంలో ఉండేవాళ్ళు గుర్తులేరూ.. నువ్వెరగవేమో లే. వాళ్ళు నాతోనే జేరారు. అప్పటికి మీరిద్దరూ రిసెర్చి చేస్తున్నారు. వెంకటేశ్వరరావు, విశ్వనాథం, సోమేశ్వరరావు, సరోజిని, డేనియల్, మెహరున్నీసా వీళ్ళంతా యువపురుషులకంటె అధ్వాన్నంగా ప్రేమించే వారు పుస్తకాల్ని. ఆ పాతగొడవంతా దేనికిలే. ఇప్పుడు నేనొక విషయం చెప్తే నువ్వు ఆశ్చర్యపడవు కాదూ"

అని ఆగి, యిరువురి వైపూ పరిభ్రమిస్తూన్న పంకా తన వైపు తిరగ్గానే మీట నొక్కేసింది.

రామారావు రెండు, మూడు నిమిషాలు ఏ జవాబూ ఇవ్వలేదు. నిశ్శబ్దంగా కూర్చుని తను పీల్చి వదులుతూన్న పొగవైపూ, దాని వివిధాకృతుల వైపూ విచిత్రంగా చూస్తున్నాడు. అతని కన్నుల ఎదురుగుండా యూనివర్సిటీ వాతావరణం - నవనవలాడుతూన్న యవ్వనంతో ప్రవేశించి, తారాజువ్వల్లా ఎగిరి, ఎగిరి మొదటి సంవత్సరం తిరిగే సరికి కాలిపోయిన జువ్వ తాలూకు కొబ్బరి చువ్వల్లా అయిపోయిన యూనివర్సిటీ స్టూడెంట్సూ, తెలివి తేటలున్నా - ప్రొఫెసర్ అనుమతి లేకుండా - ప్రదర్శించినందుకు శిక్షగా మూడో క్లాసుతో జీవితాన్ని అనుభవించటానికి పోయే వాళ్లూ... ఆలోచనా లహరిలో ఆనందనౌకాయానం చేసే రామారావు వైపు డేంజరులైట్ లా చూసి :

"నువ్వేదో ఆలోచిస్తున్నట్టున్నావు?"

అని లేవబోయింది.

"లేదు, లేదు......సరోజినీ, మెహరున్నీసా అంటే వింటున్నా"

అప్రయత్నంగా అనేశాడు.

"మనస్సు అటు పోయినట్టుంది"

అని క్రింది పెదవి పైపంటితో నొక్కి,

"నువ్వు ఇంటిదగ్గర ఉండవేమో అనుకున్నాను. కారులో ఫ్లాస్కు వదిలేశాను. తెస్తానుండు"

అని చకచక నడిచింది.

లలిత మాట్లాడదలచుకున్నదేమిటో రామారావుకి స్పష్టంగా అర్థం కాలేదు. కాకపోయినా లలితకు తనమీద ఎటువంటి అభిప్రాయం ఉందో? అభిప్రాయం కంటే అభిమానం ఎంత తూకంలో ఉందో ఎంతో కాలంనుంచి తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది. ఇటువంటి అవకాశం ఇదివరలో దొరక్కపోలేదు కాని ఏమిటో అవకాశం దొరికినప్పుడు అవసరమయిన ఆలోచన కలగలేదు. అదృష్ట లక్షణం కాదూ .. అని తనలో తానే పొంగిపోయాడు.

లలిత ఫ్లాస్కుతో లోపలకు వస్తూనే మూతతీసి "మీ యింట్లో గ్లాసు లుండా లనుకుంటాను" అంది.

"తమరు నుంచితీర్థం పుచ్చుకున్నది గ్లాసులోనే అని మనవి చేస్తున్నాను" అని నవ్వాడు.

లలిత నవ్వలేదు, నవ్వినట్టు గ్రహించినట్టయినా లేదు. లేదు కాని గ్లాసునిండా పోసి కాఫీ అతనికిచ్చి ఫ్లాస్కు మూతలో తను పోసుకు తాగసాగింది.

"రంగారావు మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడని తెలుసా?"

అని పేముకుర్చీలో కూర్చుని ఫ్లాస్కు కింద పెట్టింది

"W-H-A-T-!!" (వ్వా-ట్!!)

అన్నాడు గ్లాసు రెండుచేతుల మధ్యలో నొక్కిపట్టి, లలిత కన్నులలోకి తన అచంచల దృష్టిని ప్రసరిస్తూ.

"ఔను...ఒక అమ్మాయిని చేరదీసి ఆమెకోసం యిల్లు అద్దెకుతీసుకుని, ఆమెకు కావలసిన సదుపాయాలన్నీ చూస్తూ, రాత్రి పన్నెండింటి వరకూ షికార్లు కొడుతూ, పార్కుల్లో, బీచీలో విహారాలు చేస్తూ, బాల్కనీలో కిలకిల నవ్వుతూంటే...ఇంతకంటె వేరే మంగళసూత్రం కట్టి, మంత్రాలు చదివితేగాని పెళ్ళయినట్టు కాదా?"

అని చీరచెంగుతోనే ముఖం ఒత్తుకుంది.

"నమ్మలేను లలితా"

గుహాద్వారంలో నిలబడి పలికినట్లు పలికాడు రామారావు.

లలిత పిచ్చిగా నవ్వింది.

నవ్వి ఊరుకోలేదు; ఊరుకోక పెదవి విరిచింది.

రామారావు చకితుడయ్యాడు.

లలిత, పంకా వేగాన్ని తగ్గించింది.

లలితా, రంగడికి నీమీద ఎంత అనురాగమో నీకు తెలీదు. బహుశా చదువుకున్న అమ్మాయిలందరి

# అంతర్వత్ని

లానే నీకూ అతనిమీద మోజు తగ్గుతూన్నట్లుంది. నేనొక్క ప్రశ్న అడుగుతాను, చెప్తావా...కోపగించుకోనంటే అడుగుతా?"

అని కుర్చీలోంచి లేచి, కిటికీవైపు నడిచివచ్చి కుర్చీమీద కూలానాను.

"అధునాతన సంప్రదాయాల ననుసరించి ప్రేమించి ఒకరి మనస్తత్వాలను మరొకరు అర్థం చేసుకుని మా యిద్దరి మధ్యా కేవలం భౌతికమయిన మోహమే కాక ఆత్మీయమయిన అనురాగం కూడా ఉన్నదని నిశ్చయించుకున్నాకనే, సనాతన సిద్ధాంతాన్ననుసరించి మంత్ర-తంత్ర యుక్తంగా మా యిద్దరికీ వివాహం అయిందని నీకు తెలుసు."

అని కుర్చీలో ముందుకు వంగి కుడి మోకాలు మీద ఉంచిన ఎడం కాలుపై మోచెయ్యాన్ని పైకెత్తి క్రింద పెదవిని తర్జనీ-బొటన వ్రేళ్ళ మధ్య బిగించింది. ఆమె కన్నులు అర్ధనిమీలితాలై ఉన్నాయి. ఎడమ కాలి పాదం కొద్దిగా ఊగుతోంది.

"అంతా ఏదో కొత్త కథలా చెప్తున్నావ్ లలితా; నేనూ-రంగడూ ఫైనల్ పూర్తిచేసి రిసెర్చి కొచ్చే వరకూ నువ్వు యూనివర్సిటీకి రాలేదు. రిసెర్చి రోజుల్లో నువ్వు వాడి జీవితంలో ప్రవేశిస్తున్నప్పుడు నేను కొద్దిగా భయపడ్డాను. అయితే నాకు రంగణ్ణి ఎప్పుడు చూసినా "డాల్ఫిన్స్‌నోస్" ప్రత్యక్షమయేది. ఎన్ని వందల సంవత్సరాలనుంచో సముద్ర తరంగాల తాకిడిని నిర్లక్ష్యం చేస్తూ, ఎన్ని తుపానులొచ్చినా నిర్లిప్తంగా ఉన్న ఆ కొండలాంటి జీవితం వాడిది."

అని ఆగి భారంగా నిట్టూర్చాడు, రామారావు.

"అది సరే, ఆ విషయం కూడా నాకు తెలుసు. రిసెర్చి రోజుల్లోనే ఆయనంత నిర్లిప్తంగా ఉండేవారు. అది కాదు, ఇప్పుడాయన వ్యవహారం చెప్పాను కాదూ. ఇది సుమారు సంవత్సరం నుంచీ సాగుతోంది. అయినా నేనేం పట్టించుకోలేదు."

"సంవత్సరం నుంచీ...!"

అని తెరచిన నోరు తెరచినట్లే ఉంచాడు.

"ఔను, అదేం పెద్దకాలం కాదు...మానవ జీవితంలో నవగ్రహాల దశలూ తిరగాలంటే నూట ఇరవై సంవత్సరాలు పడుతుంది. అందులో ఒక సంవత్సరం అంటే శతాంశం కూడా కాదు. అయితే ఈ విషయాన్ని ఇంత కాలం ఎవరికీ ఎందుకు తెలీనివ్వలేదని మీ అనుమానం...కానీ, పెళ్ళయిన కొత్తల్లో మా యింటికి మీరు వారానికి రెండు రోజులయినా వచ్చేవారు. అది రాను రాను నెలకు రెండు సార్లుగానూ, అయనానికి రెండు మూడు సార్లుగానూ మారిపోయింది. ఈ మధ్య రెండు నెలలనుంచీ సెలవలయినా మీ రటు రావటమే లేదు."

"ఔనౌను! నాకసలు బైట ప్రపంచం ఎలా పోతుందో తెలీటంలేదు లలితా, కాలేజీ పేపర్లు ఇప్పటికి దిద్దలేదు. యూనివర్సిటీ ఎగ్జామినర్‌షిప్‌తో కొంతకాలం వ్యర్థమయింది. దేశంలో రెండు, మూడు నవలల పోటీలూ, నాలుగైదు కథానికల పోటీలూ నడుస్తున్నాయి. మొత్తం అన్నింటిలోనూ పాల్గొందామని ఉంది. ఏ రెండు బహుమతులిచ్చినా మా చెల్లి పెళ్ళికి ఓ వెయ్యి రూపాయలు మా నాన్నకివ్వగలుగుతాను. అందుచేత..."

"అయితే మంచి పనే చేస్తున్నారు. ఇందాక నాకు కోపం రాకపోతే ఏదో ప్రశ్న అడుగుతానన్నారు. అది కానీండి."

"ఔనౌను...ఒక్క క్షణం ఆగు. యూనివర్సిటీ చదువు మొదలు పెట్టిన దగ్గర్నుంచీ కొంచెం మరుపెక్కువయింది...ఆఁ అదీ...అయితే ఇంతకూ నీకు రంగారావు మీద ప్రేమ యథాపూర్వం ఉందా? నీ మనస్సుకు బాధ కలిగితే జవాబివ్వకు."

అని ఒక వినయమయిన ఆతురతతో కూడిన కుతూహలాన్ని వ్యక్తీకరించే దృష్టి సారించాడు.

లలిత చిన్నవ్వు నవ్వింది.

నవ్విన లలిత బుగ్గల్లో చిన్న సొట్టలు పడ్డవి.

సొట్టలుపడ్డ లలిత బుగ్గలు రామారావు కన్నుల్లో ఒక కాంతినీ, మరొక కోరికనూ ప్రతిఫలింపజేశాయి. చేసినా రామారావు అమాయకంగా అలా చూస్తూనే కూర్చున్నాడు.

"రంగారావు మీద నా ప్రేమ యథాపూర్వం ఉన్నదా? అనే ప్రశ్న కర్థంలేదు. మిష్టర్ రామం, ప్రేమ అనేది యిరువురి మధ్యా ఉండవలసింది. అది అయస్కాంతం వంటిది, ఉత్తర – దక్షిణ ధ్రువాలు రెండూ ఉండాలి. ఇప్పుడు బహుశా నీ సందేహం నివృత్తి అయి ఉంటుంది"

అని సొంపుగా తలవంచి అతని వైపు ఓరగా కోరచూపు చూసింది.

"అర్థమయింది. అయితే అసలు రంగడు అలా అవటానికి కారణమేమై ఉంటుందని నువ్వు "ఊహిస్తున్నావ్?"

"అదే అర్థం కాలేదు ఆదిలో...కాని రాను రాను తెలుసుకున్నా...విశేష మేమిటంటే పెళ్ళయిన మొదటి రెండు, మూడేళ్లూ ఆయనా, నేనూ కూడా పిల్లల్ని గురించి ఎప్పుడూ ఆలోచించ లేదు...."

అని లలిత యింకా చెప్పబోతుండగానే, రామారావు అడ్డుకుని :

"ఇంత బుద్ధిలేని మూర్ఖుడై పోతాడనుకో లేదు. నేను మాట్లాడతానుండు వాణ్ణి పిలిపించి...."

అని కుర్చీలోంచి లేచాడు.

"మిస్టర్, అలా కూర్చోండి. ఆయన మీ కాలేజీలో చదివే స్టూడెంట్ కాదు, పిలిచేసి, కేకవేసి, ప్రిన్సిపాల్ చేత ఫైన్ వేయించి, సస్పెండు చెయ్యటానికి..."

అని కిలకిల నవ్వి, అంతలో గంభీరమయిన కంఠంతో :

"జీవితంలో ఒక స్థిరమయిన స్థితి ఏర్పడి, సాలీనా పది పన్నెండువేల రాబడివచ్చే స్థాయికి వచ్చాక కాస్తంత యింట్లో పిల్లలుండా లనిపిస్తుంది. ఆయనకే కాదు, ఆ కోరిక నాకూ అప్పుడే మొలకెత్తింది కానీ......."

అని సిగ్గుతో తలవాల్చి, మళ్ళీ రెండు క్షణాల్లో కోలుకుని :

"అమ్మను కావాలనే కోరిక ఆడదాని కున్నంతగా తండ్రిని కావాలనే కోరిక పురుషుడి కుండదు. ఈ రహస్యం ఆయనదగ్గర చెప్పే సాహసం నాకు లేక పోయింది. నా హృదయంలో ఆయన మూర్తి ఎంత గాఢంగా చిత్రింపబడి ఉందో, అంత గాఢంగానూ మా అనురాగ ఫలోదయం కావాలనే వాంఛకూడా ఉన్నది..."

లలిత కంఠం గద్గదమయింది. ఆమె కనులు రెండు కన్నీటి కణాలను ప్రసవించినవి.

రామారావు స్తబ్ధుడయి పోయాడు.

లలితవంటి మన స్తత్వంగల స్త్రీలకుకూడా మాతృత్వం మీద అంత బలమయిన వాంఛ ఉంటుందనీ, ఆ వాంఛ యింతగా హృదయాన్ని వేధిస్తుందనీ అతని జీవిత చరిత్రలోని ఏ పుటలోనూ వ్రాయ లేదు.

"ఈ విషయాన్ని ఆయన రెండు, మూడుసార్లు కదిపితే నేను వేళాకోళంగా తీసి పారేశాను. నన్ను తృప్తిపరచటంకోసం ఆయన తాపత్రయ పడుతున్నారనే భ్రమించాను. భ్రమించిన విషయాన్నే ఇంత వరకూ భ్రమ అని తెలుసుకోలేక పోయాను."

"అప్పట్లో నేను తెలుసుకున్నా చేసేదేమీ లేదుగా"

అని వెనక్కు వాలింది.

"ఏమీ లేకపోవట మేమిటి? వాడి ఎదురుగుండా నువ్వు ఇంకోవాడితో షికార్లు మొదలెడితే సరి..."

అని పళ్లు పటపట లాడించాడు.

అపరిమితమయిన వేదనను అణచుకుంటూన్న గంభీరముఖం అంతలో మారిపోయి, పకాల్న నవ్వింది లలిత.

"సాంసారిక విషయాలలో బ్రహ్మచారి సలహా ఇంతకన్నా యోగ్యంగా ఉండదులే. అయినా ఆ పాటి మాట సాహసం చూపించావు. అంతే చాలు. నీతో కలిసి తిరగమన్నావు కాదు".

అని గంభీరంగా కూర్చుని నిశితంగా అతని కన్నులలోకి చూసింది.

చూసిన లలిత చూపులు సరాసరి రామారావు హృదయంలో గిలిగింతలు పెట్టినట్లూ, అతని మనస్సును పలకరిస్తున్నట్టూ, అతని శరీర సర్వస్వాన్ని కాంక్షిస్తున్నట్టూ అనుకున్నాడు. ఒక్కసారిగా ఇన్నిటినీ లొంగదీసుకోవటం కష్టమే అయింది. అయినా నిగ్రహించుకున్నాడు.

"నీ కవసరమనిపిస్తే నా అభ్యంతరం లేదు."

అని తలదించుకున్నాడు.

ఈ వాక్యాన్ని లలిత విన్నది. విన్నదికాని విననట్లే:

"అయితే త్వరలోనే ఆయన స్థితి జారిపోతున్నది. ఆవతల పుస్తకాలు దిగుమతీ కావటంలేదు. అయినవి విడుదల కావటంలేదు. అయినా ఆయన

ఖర్చు మామూలుగానే ఉంది. ఈమధ్యనే యింకో కారుకొన్నారు. అది కూడా నా తృప్తికోసం. ఆయనకూ, ఆవిడకూ ఓ కారవసరం. నాకోసం పాత కారు ఉంచేశారు. సంవత్సరంలోగానే బహుశా బాంక్ బాలెన్సు ఏమీ ఉండకపోవచ్చు. అప్పుడు మాస్థితి.."

అని జేబురుమాల్ ఉండచుట్ట సాగింది.

"నీకేం భయంలేదు. నువ్వు ఏ క్షణంలో వచ్చినా ఈ ఇంటి సింహద్వారంలో నీకు స్వాగత వాక్యాలు లభిస్తాయి."

అన్నాడు రామారావు ఉత్సాహంతో.

"చాలు. ఆపాటి మాటంటే అదే పదివేలు. వస్తాను."

అని లలిత లేచి అడుగులు వేసింది.

ఆమె అడుగుల్లో అడుగులు వేస్తూ రామారావు గుమ్మంవరకూ సాగనంపి, కారు సందు మలుపు తిరిగే వరకూ అలాగే చూస్తూ నిలబడిపోయాడు.

## 2

లలిత రాత్రి తొమ్మిదింటివరకూ తిరిగి, తిరిగి ఇంటికొచ్చేసరికి పూర్తిగా అలిసిపోయింది. కారు కాంపౌండులోనే ఉంచేసి, తాళాలుకూడా తీసుకోకుండా చక, చకా నాలుగడుగుల్లో తన గదిలోకి నడిచేసి, చీరా, జాకెట్ తీసేసి, టవల్ వల్లెవాటుగా వేసుకుని, స్నానాల గదివైపు నడిచేసింది. నీళ్లగదిలో అడుగు పెడ్తూ:

"ఒరేయ్ వెంకా, అన్నం వడ్డించెయ్యమనరా".

అనేసి లోపలకుపోయి తలుపు వేసుకుంది. వెంకడిచ్చిన జవాబు తలుపు వేసే చప్పుడులో లలిత వినిపించుకోలేదు. ఆమె స్నానం అయి ఇవతలకొచ్చేసరికి వంటింట్లో ఏమీ శబ్దం వినబడకపోయేసరికి కొద్దిగా ఆశ్చర్యపడింది. డాబా మెట్లమీద, ఆరిపోతూన్న లంకాకుచుట్టతో కుస్తీపడుతూన్న వెంకడు లలితకు నవ్వును కలిగించాడు. లలిత నవ్వుతూనే:

"వెంకన్నబాబూ!...వడ్డించమని చెప్పలేదూ?"

అని ఒక్క క్షణం ఆగింది.

వెంకడు చికాకుతో చుట్ట విసిరేసి వచ్చి:

"ఈ రోజునుంచి వంటమనిషిని మాన్పించేసి, ఆవిడకివ్వాల్సిన లెఖ్ఖ యిచ్చేశారండి అయ్యగారు సాయంకాలంవచ్చి"

అన్నాడు.

ఒక్క క్షణం లలిత స్తబ్ధురాలయింది రంగారావు తనతో చెప్పకుండా ఇంటి వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోడానికిదే ప్రథమం. అయినా దిగజారుతూన్న స్థితిని గుర్తిస్తున్నందుకు కొంత సంతోషపడింది.

"నిన్నుకూడా మాన్పిస్తానన్నారా?"

"ఏమోనండి, నన్ను బాబుగారు మానిపించినా మీ పాదాలుమాత్రం వదలను. అమ్మగారూ, డ్రైవర్ని కూడా ఇంక రావద్దన్నారండి"

"ఔను, ఆయన కారు తనే నడుపుకుంటారు. మామూలు కారు అవసరమయినప్పుడు నేనే తీసికెడతాను. పోనీలే, బాబుగారు పొదుపు నేర్చుకుంటున్నారు. పైగా ఏ పనీ లేకపోతే నాకూ ఏమీ తోచటంలేదు. రేపట్నుంచి వంటపని కాస్త కాలక్షేపంగా ఉంటుంది"

అని నిట్టూర్చి లోపలకు నడిచింది.

## 3

లలిత రామారావుని కలుసుకున్న పదిహేను రోజుల అనంతరం యూనివర్సిటీ లైబ్రరీలో చూశాడు. చూసినా నమ్మలేకపోయాడు. ఈ లైబ్రరీలో లలితకు పనేమిటో రామారావుకు అందలేదు. అందుకనే ఆమెను చూసి కూడా ఆమె లలిత కాదనుకున్నాడు. అనుకుని ముందుకు నడిచేశాడు.

"మిస్టర్ రామం!"

అని పిలుస్తూనే నిలబడింది లలిత.

రామారావు, నెగ్గబోతూన్న సూచనలు కనపడి, చివరకు రిజైన్ చేయాల్సిన పరిస్థితిలోఉన్న చదరంగపు ఆటగాడిలా వెనుదిరిగి నిలబడ్డాడు.

"మీరు రోజూ వస్తూంటారా?"

"అప్పుడప్పుడు"

"నేను కృష్ణారావుగారి పెర్మిషన్ తీసుకున్నాను. కానీ, యూనివర్సిటీ అబ్బాయిల తంతు మీకు తెలుసుగా—ప్రశాంతంగా చదువుకునే అవ

కాశం ఇవ్వటంలేదు. ఆ ఉపకారం కాస్త చేయించ గలరా?"

"అంటే స్పెషల్ రూమ్ కావాలా?"

"అక్కర్లేదు. స్టూడెంట్సుహాల్ కాకుండా..."

"సరే, రా"

అని ముందుకు నడిచాడు.

లలిత అనుసరించింది.

రామారావు లలితను నేరుగా తన డిపార్టుమెంటు రూమ్‌కి తీసుకెళ్లాడు.

లలిత లైబ్రరీ ఆవరణ దాటుతూండగా కొద్దిగా శంకించి, ఒక్క నిమిషం నిలబడింది కానీ, ఏదో ఆత్మవిశ్వాసం అతని వెనకాలే నడిపించింది.

"అలా కూర్చో"

అన్నాడు రామారావు తన కుర్చీలో తాను కూర్చుంటూ.

టేబుల్‌కి అవతలవైపు నున్న కుర్చీలో లలిత కూర్చున్నది.

"కొంచెం కాఫీ తెప్పించనా?"

అని నెమ్మదిగా అడిగాడు.

లలిత తల ఊపింది.

అది తెప్పించటానికి అంగీకరిస్తున్నట్టో, అనంగీకారాన్ని సూచిస్తున్నట్టో మాత్రం రామారావుకి అర్థం కాలేదు. అయినా ఫ్లాస్కు పంపించి తెప్పించటానికే నిశ్చయించుకుని ఫోన్ తీసి "కాంటీన్" పిలిచాడు.

"అయితే ఇప్పుడు నీకు లైబ్రరీ అవసరమేమిటి?"

ప్రశ్నించాడు.

"ఇప్పుడు కాకపోతే ఇకముందు తీరిక ఉండొద్దూ"

"అంటే?"

"అంత అర్థం కాకుండా ఉందా నా తెలుగు?"

"భాష కాదు, నాకర్థం కానిది భావం"

"భావార్థం కానిదే భాష మాత్రం ఎలా అర్థమయినట్టూ?"

అని నవ్వింది.

రామారావు నవ్వలేదు. నవ్వడానికి ప్రయత్నించనూ లేదు.

"బహుశా మీకు కోపం వస్తుందేమో, నేను కూడా నవలా, కథానికల పోటీకి వద్దామనుకుంటున్నాను"

"వెరీ గుడ్, నా చేతనయిన సహాయం చేస్తాను. ప్రారంభిస్తూనే పోటీలో పాల్గొనాలనే కోరిక కలగటం మంచిదే"

"దానికేముందిలెండి, మా యింటికొచ్చే బొద్దుగా, పొట్టిగా, కుదిమట్టంగా ఉండే ఆయన ఇప్పటికి రెండుమూడు వేలగ్గ కాగితాలు ఖరాబు చేసినా- కనీసం-ఆయన అక్షరాలు కూడా గుండ్రపడ లేదని మీరే అన్నారుగా. అంచేత దీనికి అభ్యాసం కంటె అభినివేశం ఎక్కువవసరం కాదూ"

"ఔను. నేనూ అదే అంటున్నాను. నువ్వు పోటీకి వ్రాస్తూనే, ఈలోగా రెండు, మూడు పత్రికలకు కూడా కథలూ, నాటికలూ వ్రాస్తూండవచ్చు. పైగా నువ్వు లిటరేచర్ దానివి కనక ఇంగ్లీషులో రాస్తే ఎక్కువగా లాభిస్తుంది"

"ఏది లాభిస్తే దానికే వ్రాస్తాను. నాలుగైదు నెలల్లో నేను నా రచనలతో పోషించుకో గలగాలి.."

"ఏమిటీ!"

"అంత ఆశ్చర్యం దేనికి. పైగా నేనూ, ఆయనా కూడా నా కలం మీదనే కొంత కాలం బ్రతగ్గలగాలి. ఇది సాధ్యమవుతుందంటారా?"

"సాధ్యమో, అసాధ్యమో చెప్పలేను కాని నెలకు రెండూ, మూడు వందలొస్తాయి. బహుశా అప్పుడు నువ్వు క్రేప్‌సిల్కూ.అవీ.కట్ట లేవేమో"

"ఆ ప్రమాదం లేదులే. పదేళ్ళకు సరిపోయే చీరలూ, జాకెట్లూ ఇంట్లో ఉన్నాయి. అయితే కనీసం రెండువందలు తెచ్చుకోగల నంటావు."

"రాజులా...ఈ పోటీల్లో ఏ ఒకదాన్లో ఫస్టు వచ్చినా అయిదు వందలొస్తుంది"

"మీ ఆశీర్వాదం. నేవింక వెళ్లొస్తా. మీరొక్క ఉపకారం చెయ్యండి. అవసరమయినప్పుడు ఈ 'రూమ్' కొన్ని గంటలు నా కోసం వదిలేస్తూండండి. అత్యవసరం అయినప్పుడు ఫోను చేస్తే పలికి, కావలసిన లైబ్రరీ పుస్తకాలు మాత్రం యిస్తూండండి.

అని లేచింది లలిత.

"నువ్వు కారు మీద రాలేదా?"

"కారు లేకుండా రావడం అసంభవం"

"అయితే ఒక్క పావుగంట ఉండ రాదూ, నేనూ వచ్చేస్తా"

"ఉందును కానీ, మెడికల్ కాలేజీ అమ్మాయిలిద్దరున్నారు. వాళ్లు ఫీలవుతారేమో క్షమించండి"

"ఫర్వా లేదులే. ఒక్క నిమిషం ఆగు. కాఫీకి పంపాం కదూ"

అని కూలబడ్డాడు కుర్చీలో. లలిత కాఫీ పూర్తి చేసి కదిలింది.

## 4

ఒక ప్రఖ్యాత తెలుగు మాసపత్రికలో లలిత మొదటి కథ ప్రచురింపబడింది. ఆ రోజున సాయంకాలం లలిత కారులో బయలుదేరి రామారావు ఇంటి దగ్గర ఆగింది. గేటుదాటి లోపల అడుగు పెడ్తూండగానే తోటమాలి వీరన్న అయ్యగారు ఊళ్లో లేరనీ, ఈ మేలులో దిగాలనీ చెప్పాడు. రామారావు ఊళ్లో లేడనగానే కొంత నీరసపడ్డ లలిత మేలులో దిగుతాడనే సరికి అపారమైన సంతోషాన్ని పొందింది. మళ్లీ కారులో కూర్చుంటుండగా వీరన్న వచ్చి:

"ఎవరో ఫోనుపిలుస్తున్నారు. కొంచెం కబురు చెప్పేసి వెళ్ళండి"

అని వంగి నిలబడ్డాడు.

లలితకు చికాకు కలిగింది. సరిగ్గా మేలు రావటానికి అయిదు నిమిషాల టైం ఉంది తనవాచీ ప్రకారం. తక్షణం బయల్దేరితే అతన్ని స్టేషన్లో కలిసికోవొచ్చు. మధ్యలో ఈ ఫోన్ కాల్. బహుశా రామారావుని ఫోనులో పిల్చే వారెవరుంటారు? ఎవరనేమిటే? అతని కొకగొడవా? ఒక లోకమా? ఒక వేళ రంగారావు పిలుస్తూంటే... ఈ ఆలోచన రాగానే కారుదిగి వీరన్న దగ్గర తాళాలు తీసుకుని లోపలకు నడిచి, ఫోను ఎత్తి:

"హాలో!"

"ఎవరదీ? లలితా!"

"ఔనండీ, మీరెవరో తెలీటం లేదు"

"ఇప్పుడు నువ్వు మాట్లాడుతున్నది రామారావు ఇంటి దగ్గర్నుంచేనా?"

"అసలు మీరెవరో చెప్పకుండా ఏమిటీ అనవసర ప్రసంగం"

"అంతకోపం దేనికమ్మా లలితమ్మా...... నేను కనుక్కోలేననుకున్నావా, నువ్వెక్కడినుంచి మాట్లాడేదీనూ? ముందు మీయింటికే 'రింగు' చేశా. ఎవరూ పలకలేదు. అప్పుడే అనుకున్నా; నువ్వు పత్రికతో రామారావు గారింటికి వెడతావని. అదికాదే, నువ్వు కథలూ, నాటకాలూ వ్రాస్తున్నట్టు కాస్త చెప్పకూడదుటే. ఇంతకీ నేనెవర్నో అర్థమయిందా? ఎక్స్ఛేంజ్, టెలిఫోన్ ఎక్స్ఛేంజి... తెలిసిందా!"

అంతవరకూ మాటలూ, ఆ తరువాయి నవ్వూ వినిపించాయి. లలితకు చికాకెక్కువయింది. అయినా ఎంతో పరిచితంగా, పైగా ఆరోజుపత్రికలో పడ్డ తన కథగురించీ, తను ఆకథతో రామారావు ఇంటికి...

"మీరెవరో తెలీటం లేదు."

"రంగారావు, రామారావులచేత 'సౌందర్యం' అని..."

"ఓస్! చంపేశావే...నువ్వటే....ఈ మధ్య రాజమండ్రీ వెళ్ళినట్టు విన్నానూ?"

"నువ్వు అంతే విన్నావు. రాజమండ్రీనుంచి బెజవాడ అక్కడనుంచి మరోవాడ యిలాతిప్పి, తిప్పి చివరకు ఇక్కడాఫీసులో క్లార్కుగా వేశారు. సరే కానీ...మరి డిన్నరెప్పుడే?"

"క్లార్కుగా ప్రమోట్ అయినందుకు నువ్వివ్వాలా..."

"ఇంక చాల్లే...కొత్తగా రచయిత్రి వయినందుకు నువ్వే యివ్వాలి. లేకపోతే నీకు సజెషన్సు ఇస్తూ, పుస్తకాలు సప్లయిచేస్తూన్న రామారావుగారివ్వాలి. ఆయనన్నే యిమ్మను శిష్యదక్షిణ."

"బాగా జ్ఞాపకం చేశావు కానీ, రామారావుగారు ఊరునుంచి ఈ మేలులో వస్తున్నారట. కొద్దిగా శ్రమపడి స్టేషన్‌కి మేలు ఎంతలో వస్తోందో కనుక్కుంటావ్?"

"అయితే ఆగు.........

మేల్ ఇప్పుడే ప్లాటుఫారంమీద ఆగుతోందిట, నువ్వు కారులో బయల్దేరి మా ఆఫీసుకివస్తే మనిద్దరం కలిసి ఆయనకోసం దారి కాయవచ్చు"

"రైట్! వస్తున్నా"

అంటూనే ఫోన్ అక్కడ ఉంచేసి తలుపులు కూడా వెయ్యకుండా చకచక వచ్చేసి కారులో కూర్చుంది.

*　*　*　*

తనదగ్గర ప్రైవేటుగా చదివి హిందీ విశారద, ఇంటరు తెలుగూ ప్యాసయినందుకు సౌందర్యానికీ, తన సూచనలతో నడిచి తొలిరచనను ప్రముఖపత్రికలో ప్రకటించిన లలితకూ రామారావు తన యింటిదగ్గర డిన్నరిచ్చాడు. ఆ రాత్రే సౌందర్యం బి.యే. పూర్తి చేయటానికీ, లలిత పోటీలన్నిటిలోను పాల్గొనడానికీ నిశ్చయాలు జరిగిపోయాయి. రాత్రి పదకొండింటికి లలితా, సౌందర్యం కలిసి వెళ్ళిపోయాక రామారావు డాబామీద పడుకుని అనంతాకాశంలో అసంఖ్యాక తారాతోరణాలను అవలోకిస్తూ ఆలోచించసాగాడు. మానవుడు జీవించినంతకాలంలో ఏదో ఒక పరమార్థాన్ని సాధించలేకపోతే వాడిజీవితం పరమవ్యర్థం. ఈనాడు తను ఇద్దరమ్మాయిల భవిష్యత్తును స్వర్ణమయం చేయగలుగుతున్నందుకు తనను తాను అభినందించుకున్నాడు. లెక్చరర్ ఉద్యోగంతో ఎందర్ని వృద్ధిలోనికి తెచ్చినా అది జీతానికి చేసే పని. ఇప్పుడు చేసేది నిస్స్వార్థకృషి! రామారావు తృప్తిగా నిట్టూర్చి గుండెలమీద చేతులు వేసుకు నిశ్చింతగా నిద్రపోయాడు.

## 5

ఆరోజు కారోజు రంగారావు ఇంటిదగ్గరుండటమే అరుదయిపోతుంది; వచ్చినా ఏదో రెండు, మూడునిమిషా లుండటం, ఇంతలో 'ఫోన్‌కాల్' రావటం వెళ్లిపోతూండటం మాత్రమే జరుగుతున్నది. కొంతకాలంవరకూ లలిత—కాపరానికొచ్చిన తొలిరోజులలో వలెనే—స్మిత శ్రీ రోచిఃపరిపూర్ణవదనంతో ఆహ్వానించటం సాగించింది, కానీ రంగారావు ఆ స్వాగతాలకు విశిష్టతను ప్రసాదించకపోయేసరికి నిర్లిప్తంగా ఊరుకో సాగింది. అది రంగారావులో ఏవిధమయిన పరిణామాన్నీ తేలేదు సరికదా; లలిత నిర్లిప్తంగా ఉండటమే తనకు కొంత బెడదను తగ్గించినట్లు తృప్తిపడసాగాడు. ఒకటి, రెండుమాసాల నుంచి యిద్దరూ ఒకరిముఖం ఒకరు చూచుకోవటం కూడా ఏ రెండు, మూడుసారులో జరిగిందేమో! అంతే.

ఇందులో చమత్కారం ఏమిటంటే—లలితను పిలిచి: "నీకూ నాకూ ఈరోజునుంచీ ఏవిధమయిన సంబంధమూ లేదు. నీ దారి నువ్వు చూచుకోవొచ్చు" అని రంగారావూ అనలేదు. రంగారావుని గుమ్మంలో నిలబెట్టి, సామానంతా కారులో ఎక్కించి "ఇంక మనిద్దరికీ కాపరం పొసగదు. నేను వెళ్ళుతున్నా" అని లలితా చెప్పలేదు. రంగారావు—లలితా భార్యాభర్తలని ఎరిగిన వారు మాత్రం వారిద్దరూ సంసార సుఖాలను అనుభవిస్తున్నారనే భావిస్తున్నారు. ఒక్క రామారావుకి తప్ప మిగిలిన ఎవరికీ జరుగుతూన్న కథ ఏమిటో తెలీదు. కొత్తగా ట్రాన్స్‌ఫరయిన 'సౌందర్యం' కొద్దిగా తెలుసుకుందేమో; అంతే! కాలం గడుస్తున్న కొద్దీ లలితకు ఉత్తరాల సంఖ్య పెరుగుతున్నది; ఇతఃపూర్వం రంగారావు తాలూకు టపా యేరోజూ ఓ సంచీడు వచ్చేది; ఇప్పుడది సన్నబడింది; ఎప్పుడో సరోజినీ, శారదా, హైమవతీ ఓ కవరు వ్రాసేవారు లలితకు, అంతకు మించిన ఉత్తరాలు లలితకు లేవు. ఈరోజున ఆమె కనీసం నాలుగైదు కార్డులూ, ఒకటి రెండు కవర్లూ, అయిదారు బుక్ పోస్టులూ, వారానికి ఒకటి రెండు మనియార్డర్లూ అందుకుంటూన్నది. లలితకు తెలుగులో వ్రాయటంకంటె ఇంగ్లీషులో వ్రాయటం మరీ తేలికయింది; తేలికే కాదు ఇంగ్లీషు పత్రికాధిపతుల ప్రోత్సాహం, సహకారాలు తెలుగువారికన్న ఎన్నోరెట్లు ఎక్కువగా కనిపించాయి; అయినా మొత్తంమీద తెలుగులోనే ఎక్కువగా వ్రాసేది. అయిదారు మాసాలు తిరిగేసరికి 'లలిత' ఉన్నతశ్రేణి కథకులలో పరిగణనకు వచ్చింది.

'ఒక ప్రసిద్ధ మాసపత్రిక నడిపిన నవల పోటీలో లలిత వ్రాసిన ఒక కథ ప్రథమ బహుమానాన్ని పొందింది. అదే నవలను సర్వహక్కులతో పన్నెండు వందలకు కొన్నారు ఉదాత్త ప్రచురణ సంస్థవారు. లలిత అనుమతితోనే ఈ కాంట్రాక్టు 'ఆ పత్రికా సంపాదకవర్గం చేసి—పన్నెండు వందలకూ బహుమతి మొత్తం అయిదువందలూ కలిపి, మరో మూడు వందలు ఇంకో నవలకు ఎడ్వాన్సుగా యిస్తూ-మొత్తం రెండు వేలకు 'చెక్' పంపారు. పదిహేను రోజులు తిరగకుండానే మరొక వారపత్రిక కథానికల పోటీలో ద్వితీయ బహుమతి మూడు వందలూ, దాని ఇంగ్లీషు అనువాదపు సర్వహక్కులకు రెండు వందలూ. కలిపి

అయిదువందలకు చేరుకు వచ్చింది. ఇవి కాక మామూలుగా వచ్చే పదిహేనులూ, పాతికలూ వస్తూనే ఉన్నాయి. ఖర్చయినది పోగా లలిత 'బాంక్-బుక్' లో సంవత్సరం తిరిగేసరికి మూడు వేల రెండువందలు తేలింది. ఆమె పుస్తకాన్ని టేబిల్ చాయుసులో పడేసి ఒక వేడినిట్టూర్పు విడిచి, విడిచిన నిట్టూర్పుతో ఎంతో భారాన్ని వదిలేసి, సంతృప్తిగా సోఫాలో వాలింది.

* * * *

ఆ రోజునే పోస్టులో వచ్చిన, లలిత బహుమతి పొందిన నవల చదివి, భారంగా నిట్టూర్చి, సోఫాలోంచి లేస్తూండగా లలిత ప్రవేశించింది. ప్రవేశిస్తూనే చేతిలో ఉన్న 'బాగ్'లోంచి ఓ కాపీ అతని కందించి:

“మీకు అడిగినా చూపించకుండా పంపేశాను. మీ అభిశాపాలు తినక్కర్లేకుండా ఇది నాకు రెండు వేలు చేసి పెట్టింది. చదివి దీనిమీద మీ అభిప్రాయం చెప్తే కాని నాకు తృప్తిగా ఉండదు.”

అని పేము కుర్చీలో కూర్చుంది.

“ఇప్పుడే పూర్తి చేశాను. కాని ... నువ్వు నీ జీవితాన్నే ప్రప్రథమంగా నవలకు ఇతివృత్తం చేసి యింత కౌశలంతో నిర్వహించగలవనుకోలేదు. పూర్తిగా చదివాక రంగడు జిల్లేడుపొదలానూ, నువ్వు జాజిమల్లిలానూ...”

తలవంచుకుని, కిటికీలోకి చూస్తూ ఉపన్యాస ధోరణిలో సాగిపోతున్నాడు. లలిత అంతవరకూ ఆగింది, కాని, తను ఉద్దేశించిన భావమే అయినా - తనభర్తనూ తననూ మూడోవ్యక్తి ఆ విధంగా పోల్చటం ఆమెకు నచ్చక:

“నా ఊహ అది కాదు”

అని కొంచెం తీవ్రంగానే అంది.

“విమర్శకుడికీ అలా అనిపించింది, పాఠకుడికీ అదే తోస్తుంది, ఇందర్నీ నువ్వు బ్రతిమాలి వాళ్ళ అభిప్రాయాలు మార్చలేవుగా...అయినా ఇది ఒక్కసారి రంగడిచేత చదివించాలి. అప్పుడు కానీ...”

అని యింకా చెప్పబోతున్నాడు.

“అదిమాత్రం వద్దు. నిన్న సాయంత్రం యింటి కొచ్చినప్పుడు అడిగారు, ‘నువ్వేదో రాస్తున్నావుట’ అని. అయితే ఆ ప్రశ్న నావైపు చూసికానీ, నన్ను సంబోధించికానీ అడగలేదు. గదిలో ఆయనా, నేనూ తప్ప ఇంకెవరూ లేనిమాట వాస్తవమే అయినా, కట్టుకొన్న పెళ్ళాంతో మాట్లాడే విధానం అదేనా అనిపించి నేను జవాబివ్వలేదు. ‘ఫరవాలేదులే—ఈ దేశంలో ఆడ రచయితలకు సొమ్ము బాగానే ముడుతుంది. ఎప్పుడయినా అవసరమయితే మన బంధుత్వరీత్యా కాకపోతే పూర్వస్నేహాన్ని దృష్టిలో ఉంచుకునయినా కాస్త సాయంచేస్తువు గాని’ అని నవ్వుతూ వెళ్ళిపోయారు. అలా మాట్లాడుతున్నప్పుడు ఆయన సోఫాలో కూర్చుని మేజోళ్లు ఎక్కించుకుంటూండటంవల్ల ఆయన ముఖంలో ఏ భావం ద్యోతకమవుతున్నదీ గుర్తించలేక ఊరుకున్నాను. లేకపోతే రెండు బుజాలూ పట్టుకు నిలబెట్టి, ఆయన కన్నుల్లో కన్నులుంచి ‘మీకూ — నాకూ ఉన్న బాంధవ్యమేమిటి? మనిద్దరం భార్యాభర్తలం. భార్యాభర్తలమధ్య ఉండేది స్నేహమేకాని బంధుత్వం కాదు’ అందామనుకున్నాను. అనుకున్నానంతే.”

అని దిగులుగా తలవంచింది.

“అంతటి మూర్ఖుడిముందు స్నేహానికి మాత్రం విలువేమిటి?”

అని ఛీత్కరించాడు రామారావు.

“మిస్టర్ రామం, ఏ విషయంలోనయినా మీ గుణశీలానికి గౌరవం యివ్వగలను కాని, నా భర్తను నా ముందుమాత్రం మీ యిష్టంవచ్చినట్టూ అంటే సహించలేను.”

అని కాస్త తీవ్రంగానే అంది.

“అది నీ తప్పుకాదులే. ఈ దేశపుస్త్రీల రక్తనాళాలలో పట్టేసిన వ్యాధి అది” అని నిట్టూర్చాడు.

“ఆ వ్యాధికూడా లేకపోతే ఈ దేశంలో ఆడదానికున్న ప్రత్యేకతేమిటి మేష్టారూ” అని చిత్రంగా నవ్వింది.

లలిత నవ్వు రామారావు మనస్సుని మాఘమాసపు పొగమంచులా ఆవరించేసి, అతని హృదయంమీద సమ్మెటపెట్టు పెట్టింది. లలిత వాక్యం సిద్ధాంతాన్ని ఎంత తీవ్రంగా బలపరుస్తూన్నదో, ఆమె నవ్విన నవ్వు అంత తీవ్రంగా వ్యతిరేకిస్తున్నట్టు వినిపించింది. అయితే లలిత నవ్వుతో ఏకీభవించాలో, ఆమె వాక్యాన్ని ప్రతిఘటించాలో మాత్రం రామారావు

కర్తం కాలేదు. కొద్దిక్షణాలు అప్రతిభుడయిపోయాడు. స్త్రీ బుద్ధి ప్రత్యుత్పన్నమయినప్పుడు పురుషుని తర్క కర్కశత్వం ఏమీ సాధించలేదని నిశ్చయించుకున్నాడు. రామారావు సందిగ్ధంలో పడ్డట్టు గమనించింది లలిత. ప్రసంగాన్ని మార్చకపోతే మరీ బాధగా ఉంటుం దనుకుంది.

"ఇంతకూ గెటప్, ప్రింటింగ్ వగయిరా ఎలా ఉన్నాయో..."

అని ఆగింది ఆతురతతో అతనివైపు చూస్తూ.

"ఈ పబ్లిషర్‌ని నువ్వెరుగవనుకుంటాను. ఔను, అసలు వాళ్ళు నీతో మాట్లాడలేదుగా. వాడు నా క్లాస్ మేట్ లే ఇంటర్ వరకూ. యూనివర్సిటీలో మాత్రం నేను లిటరేచర్ తీసుకుంటే, వాడు కామర్స్ పూర్తిచేశాడు. అప్పుడే వాడికి ప్రెస్సు పెట్టాలని ఉండేది."

"అయితే యిదంతా మీ చలవేనన్నమాట. నాతో చెప్పకుండా కూడా మీరు ఎన్నో ఉపకారాలు చేస్తున్నారు."

"ఇప్పటికీ ఇది చెప్పకపోదును. ఈ విషయం నీకు ముందుగా తెలిసిపోతే నీ ప్రతిభమీదకంటే నా సహకారం మీదనే నీకు విశ్వాసం ఏర్పడుతుంది. అప్పుడు నువ్వింత వృద్ధిలోకి రాలేవు. నువ్వు ఈనాడింతగా రాణిస్తున్నావంటే ఈ రహస్యం తెలీకపోవటంవల్లనే. అలా కాని పక్షంలో నువ్వేది వ్రాస్తే అదే అచ్చవుతుందని నమ్మి కృషిలో లోపం చేస్తావు."

"కావచ్చు...కానీ...నేనెంత ప్రతిభావంతురాల్నయినా మీ సహకారం లేకపోతే నేనింత త్వరలో అభివృద్ధిలోకి వచ్చేదాన్ని కాదు. నాకన్న ప్రతిభాసంపత్తి కలవా రెందరు లేరు; అవకాశం, సహకారాలు లేక..."

అని ఆగింది లలిత.

"నువ్వు చెప్పింది పూర్తిగా అసత్య మనలేను"

అని, సిగరెట్ ముట్టించాడు.

"సరేలెండి...దీనికేంగాని మీతో ఒక ముఖ్య విషయం మాట్లాడుదామని వచ్చాను."

"ఏం...రంగదేవన్నా మితిమీరుతున్నాడా?"

"అదేమంత పెద్ద విషయం కాదు."

అని ఎడమ కన్నరమూసి చూసింది.

"అంటే?"

కొంచెం తీవ్రంగా పలికింది రామారావు కంఠం.

"అబ్బే, అలాంటిదేమీ లేదు. పైగా మీరు ఊహించేటంత మనిషి కాదాయన. మనుషుల్ని అర్థం చేసుకోవటంలో మీ రింకా అనుభవం సంపాదించాలి. అసలు మేష్టారూ, మీరు పెళ్ళిచేసుకుంటే కానీ ఇలాటి విషయాలూహించ లేరండీ"

అని చమత్కారంగా నవ్వింది. లలిత పెదవుల కదలికతోనే నవ్వు నాపితే రామారావుకి అందేది కాదు, చిత్ర స్వరంతో ఆమె నవ్వటంతో రామారావు ఆమె వైపు చూశాడు.

"నవ్వ నేదేమిటో నువ్వయినా అర్థం చేసుకుంటున్నావా?"

"నా నవల చదివినట్టు ఇప్పుడు నమ్మాను. సరిగ్గా అదే వాక్యం నా ఆఖరు అధ్యాయంలో వాడాను"

అంటూనే నవ్వింది.

"నవలలూ-నాటకాలూ కావు లలితా జీవితాలు."

"నమ్మలేను, ఇప్పుడే అన్నారు-ఆ నవల-నా జీవితమే నని"

"ఎక్కడో కలుస్తాయి అలాంటివి"

"అలానే మీ జీవితమూనూ"

"అంటే?"

"నేనీ సాహసం చేస్తే మీరేమీ అనుకోరు గదా"

అని సోఫాలోనించి లేచి నిలబడింది.

ఒక్క క్షణం రామారావు కనులముందూ, మనసుముందు అంధకారం తాండవించింది. లలిత వాక్యాన్ని పూర్తి చేసి, లేచి నిలబడేలోగా రామారావు మనస్సు మహా ఝుంఝుంలో ఊగిసిలాడి, శరీర మంతా చమటలు పట్టించేసింది.

"మీరు-సౌందర్యాన్ని పెళ్ళి చేసుకోవాలి"

అంటూ వీధిలోకి నడిచేసింది.

## 8

"ఈ మధ్య రంగారావు ఇంటిదగ్గరే ఎక్కువగా ఉంటున్నట్టున్నారు."

# అంతర్వత్ని

గది గడప దాటుతూనే అన్నది, సౌందర్యం.

"ఔను...వస్తూనే ఈ ప్రశ్న వెయ్యాలనిపించిందేం?"

అంది, లలిత సౌందర్యం ప్రశ్నకు కొద్దిగా నొచ్చుకున్నా, ఆ భావం వ్యక్తంకాకుండా చేస్తూ.

"అః! నాలుగయిదు రోజుల్నుంచీ నేను లోపల కొస్తూండగా ఆయన గేటు దాటుతూండటమో, నేనూ సరిగ్గా మీ రోడ్డుమలుపు తిరిగేసరికి ఆయన కారులో ఎదురయి 'విష్' చేస్తూండటమో జరుగుతోందిలే"

అని నవ్వుతూ లలిత ప్రక్కగా కూర్చుంది, సౌందర్యం.

"బహుశా మీ పెళ్ళి వచ్చే నెలలోనే జరుగుతుందనుకుంటా"

అని ప్రసంగాన్ని మార్చేసింది లలిత.

"ఏమోనమ్మా, అంతా నువ్వే చేశావు. అసలు నాకు..."

"ఏమిటోయ్ అసలు నీకూ..."

"ఏమీ లేదూ. ఇప్పుడది ఎందుకుగానీ, కొత్తగా మొదలు పెట్టిన నవల ఎంతవరకూ వచ్చిందీ?"

"నువ్వు అడిగేవరకూ నాకు గుర్తేలేదు సుమీ; నాలుగయిదు ప్రకరణాలు కాబోలు పూర్తిచేశా... అంతలో—సరిగ్గా ఈ వేళకి వారం పూర్తయింది—మీ చెల్లివచ్చి పట్టుకు చక్కాపోయింది. వ్రాస్తున్నది పట్టుకుపోతే ఎలా ఉంటుందో చిన్నపిల్లకేం తెలుసూ?"

"ఈ కోతలకేంలే, నీకంత వ్రాయాలని ఉంటే కొత్త ప్రకరణం ప్రారంభించనూ గలవు, లేదా... ఒక్క ట్రిప్ కొట్టేసి తెచ్చుకురాగలవు. అసలు సంగతి దాస్తావేం? బావగారు ఇంటిపట్టున ఎక్కువగా ఉంటున్నట్టున్నారు. అందుచేత తీరిక చిక్కటంలేదు. పోనీలెద్దూ, అదిప్పుడన్నా పూర్తి చేసుకోవచ్చు; ఆయన మనసు మారింది. అదే పదివేలు..."

అంటూండగానే రామారావు ప్రవేశించాడు.

రామారావు ప్రవేశంతో ఒక్కసారిగా లేచి నిలబడి పైటచెంగు భుజంమీంచి లాగి కప్పుకుంటూ, సిగ్గుగా తలవాల్చింది, సౌందర్యం. లలిత నవ్వు నాపుకోలేక, అక్కడికీ చెంగు ముఖానికి చాటు చేసుకుని, తల ప్రక్కకు తిప్పింది. రామారావు ఎంత దూకుడుగా ప్రవేశించాడో, అంత ఆకస్మికంగానూ నిలబడిపోయాడు. ఒక్క క్షణం అతని ఆలోచన పనిచెయ్యలేదు.

లలిత ఓపిక పట్టలేక;

"రండి మేష్టారూ కూర్చోండి, కొత్త పెళ్ళికూతుర్ని అంతసేపు నిలబెట్టి చూస్తే బెదిరిపోతుంది"

"ఏమిటో నీ పిచ్చికానీ లలితక్కా, ఆయనకు నాకన్న అందంలో, చదువులో, అన్నిటిలో ఎక్కువయిన వాళ్ళే దొరుకుతారు; పది, పదిహేను వేలు కట్నంకూడా యిస్తారు"

"చాలా దుర్భరంగా ఉంది ప్రసంగం"

అంటూ నవ్వుతూ కూర్చున్నాడు రామారావు.

"కంఠమా? విషయమా? దుర్భరంగా ఉన్నదేమిటి గురూత్తమా!"

అని పకాల్న నవ్వింది లలిత.

లలితతో కలిసి యిద్దరూ నవ్వారు.

"ఈ విషయాన్ని ప్రస్తావించబోయే ముందు నువ్వు ఒక్క విషయాన్ని మరిచిపోయావేమో అనిపిస్తోంది"

అని ఆగాడు రామారావు.

"అసలు మనం ఏ విషయాలూ మాట్లాడుకోకుండానే ఇది పెళ్ళికూతురులా సిగ్గునీ, మీరు పెళ్లికొడుకులా హిరణ్యాక్ష వరాలనూ......"

"కాస్సేపు శ్రద్ధగా వింటావూ?"

"సీరియస్‌గా వింటాం చెప్పండి"

అని ఒక చేత్తో తన నోరూ, రెండో చేత్తో సౌందర్యం నోరూ మూసేసింది.

రామారావు నవ్వాడు; నవ్వువచ్చి కాదు, కోపం వచ్చి నవ్వాడు.

లలిత నవ్వింది, నవ్వకూడదనుకుంటూ సౌందర్యం నవ్వింది.

ఒక్క క్షణంలో వాతావరణంలో ప్రశాంతత ఏర్పడింది. కిటికీలోంచి మలయమారుతం వీచే సావకాశం లేక చల్లగాలి మాత్రమే సముద్రపు హోరుతో వస్తూన్నది. కొద్దిగా కనుచీకటి పడుతున్నా గదిలో మనుష్యుల పోలికలు తెలీనంత స్థితి రాలేదు. అయినా సౌందర్యం లేచి 'స్విచ్' వేసింది. పసుపురంగు దీపం వెలిగింది.

"చూశారా మాస్టారూ, అప్పుడే గదిలో పెళ్లి కళొచ్చింది పసుపు దీపంతో"

అంది లలిత.

సౌందర్యం, వెలుగుతున్న దీపాన్ని అలానే ఉంచి యింకో స్విచ్ నొక్కింది. మెర్క్యురీ దీపం వెలిగింది.

"చూశారా మాస్టారూ, బుద్ధి పాదరసంలా పని చెయ్యాలి."

అంది లలిత నవ్వుతూ, పైట చెంగుచివర నలిపి చెవిలో తిప్పుకుంటూ.

"ఇంతకూ నా సందేహం విన లేదు"

అన్నాడు రామారావు.

"అంతకంటే చెప్ప లేదంటే బావుంటుంది... ఏమే సుందరీ...ఔనుకాని మా-స్టా-రూ-చక్కగా సుందరీ! అని పిలవక సౌందర్యం ఏమిటండీ?"

"అది రంగడి పిచ్చి లే. వాడికి ఏపదం నోరికి నా దాన్ని తద్ధితం చేసి కాని పలకడు. అందులో నామ వాచకాలు దొరికితే... మొదట్లో నిన్ను 'లాలిత్యం' అని పిల్చేవాడు గుర్తు లేదూ? అలాగే..."

"మీ రీ వివరణంతా చేస్తున్నారు కానీ..."

"చెప్తున్నా...బహుశా మా పెళ్ళి జరగటం నిశ్చయమయితే..."

"అయితే అనకండి. అదెప్పుడో నిశ్చయం అయిపోయింది...పెళ్ళి జరిగాక అనండి"

"ఆ మాటే నేనూ అంటూంట..."

"అది అనేశారూ. తరువాయి కానీండి"

అంటూనే సుందరి చేతిని తన పిడికిలిలోకి తీసుకుంది.

"పెద్ద విశేషం కాదు కానీ, అప్పుడు మా యిద్దరిలో ఒకరం ఉద్యోగం మానాల్సి వస్తుంది".

"ఓస్...ఎవరు మానేసినా మానెయ్యొచ్చు. ఏం—మీకు సర్వీసుమీద విసుగు పుట్టిందా?"

అని సుందరివైపు చూస్తూ కన్ను మీటింది. అయినా సుందరి ఆగక:

"అందుకు నాకేమీ అభ్యంతరం లేదు. ఇరవై యేళ్లు పైబడ్డా పెళ్ళికాక, ఇంటరు ప్యాసయి యింటికి భారంగా, నాన్న యెదురుగా ఓ భూతంలా ఉండటం ఇష్టంలేక సర్వీసులో చేరాను"

అంది.

"సస్పెన్స్ పూర్తిగా చంపేశావే. టెంపో తెగిపోయింది మేష్టారూ?"

అంది లలిత లేచి నిలబడి.

రామారావు ముఖంలో ప్రసన్నత ప్రవహించింది.

సుందరి హృదయవనసీమలో మల్లెలు విరిసి మోముపై గుబాళించినవి.

ఆ ముహూర్తంలో లలిత ఇరువురి చేతులూ కలిపి తన గదిలోకి తీసికెళ్ళి, ద్వారబంధం మీదున్న పార్వతీ—పరమేశ్వరుల పాలశిలా విగ్రహాలకు నమస్కరింప జేసింది.

"ఇంక ముహూర్తాలూ, మంగళసూత్రాలూ, పెద్దలూ, పేరంటాలూ తరువాయి విషయాలు. మీకు గుర్తుందా మేష్టారూ, ఆ రోజు సాయంకాలం మా యిద్దరినీ యిలానే ఇక్కడే కలిపారు మీరు"

అని సిగ్గుతో తలవాల్చి, క్రీగంటితో పక్క గోడమీదనున్న తన పెళ్లిఫొటో వైపు చూసింది. అదే క్షణంలో సుందరీ—రామారావులు ఒకరివైపొకరు చిరుసిగ్గుతో చూచుకున్నారు.

"ఈ రాత్రి కిక్కడే ఆగిపోండి ఆయన ఒక్క గంటలో వచ్చేస్తానని వెళ్ళారు. ఏకంగా భోం చేసేద్దాం...అదిగో కారు హారన్...మనదే...వచ్చేస్తున్నారు. కూడా మా చెల్లీ మరోయిద్దరమ్మాయిలూ వస్తున్నట్టున్నారే" అని చకచక వరండాలోకి నడిచి స్వాగతమిచ్చింది లలిత.

## 9

"అందుకన్నమాట రంగడు ఈ ఆరుమాసాల నుంచీ ఇంటిదగ్గరుంటూంట" అన్నాడు రామారావు ప్రసంగ మధ్యంలో.

"అంటే?"

అంది లలిత, నోట్లు లెక్క పెట్టి 'బాగ్' లో పెడుతూ.

"అంత అజ్ఞానినికాదు లలితా! ఒక్కసారిగా బాంక్ లో ఉన్న సొమ్మంతా తీసికోవలసిన అవసరం ఇంతలో నీకేమి టొచ్చింది?"

"ఏ సయినా ఉంటుంది. అంతా చేస్తే మొత్తం అయిదు వేలు లేదు, నా సంపాదన"

"కావచ్చు, కానీ...రంగడిదగ్గర డబ్బు పూర్తిగా అయిపోయి ఉంటుంది. వ్యాపారంలో పెద్ద దెబ్బ తిన్నాడు. అందులో వరదలికి రాజమండ్రీలో పేపరు గోడౌను పూర్తిగా లాగేసిందని విన్నాను. ఇప్పుడు మళ్ళీ వాడికి పెట్టుబడి కావాలి. వ్యాపారంలో మునిగి

పోయినవాణ్ణి ఉద్ధరించటానికి ఎవరూ ముందుకు రారు. అందుకనీ...అయినా డాబా తణఖా పెడ్తే..."

"ఉచితంగా యిచ్చే సలహాలలో ఔచిత్యం ఉంటే ఎంత బావుంటుంది రామం...పోనీలే, భార్య దగ్గర అయిదు వేలు బాంకిలో మూలుగు తూంటేగా భర్తకి ఇల్లు తణఖా పెట్టవలసిన అవసరం?"

"వాడి కీనాటివరకూ భార్యా-భర్త సంబంధ జ్ఞానం నశించింది కనక"

"అంతిలో అనుబంధం చెడుతుందా?"

అని నవ్వింది లలిత.

"అయితే నీ సంపాదన కూడా వాడి తిరుపళ్ళకు ధారపోస్తున్నావన్నమాట"

"మీరింత నీచంగా ఊహిస్తారనుకోలేదు, క్షమించండి – కొంచెం కటువుగా మాట్లాడినట్లున్నాను. మీరే నాస్థితిలో ఉంటే మీరు కూడా నేను చేస్తున్నట్టే చెయ్యని నాడు సంసారం చట్టుబండలవుతుంది."

అని తల ప్రక్కకు తిప్పింది. అంతలో చేతిలో జేబురుమాల్ ఊపుకుంటూ వస్తున్న సుందరి కనిపించింది. లలిత తమాయించుకుని :

"మిమ్మల్ని ఒక ప్రశ్న అడగమన్నారు. మొత్తం పదివేలతో ఆయన పబ్లిషింగ్ హౌస్ ప్రారంభిస్తున్నారు. మాదగ్గర అయిదు వేలున్నాయి. మీరూ అయిదు వేలిస్తే......"

" నేనంత చవటని కాదు లలితా"

అని రామారావు కోపంగా అంటుండగా ప్రవేశించిన సుందరి ఇరువురినీ చూచి ఒక్క క్షణం స్తంభించి నిలబడి :

"ఏదో చాలా తీవ్రంగా నడుస్తూన్నట్టుంది" అంటూ లలిత దగ్గిరకూర్చుంది.

"వ్యాపారానికి సీరియస్ నెస్ అవసరం లే, అయితే మిస్టర్ రామం, మీకు షేర్ తీసికోవటం సుతరామూ ఇష్టంలేనట్లైనా? ఈ అయిదు వేలూ మీరిచ్చేస్తే బాధలేదు. లేకపోతే..."

అని లలిత చెప్తూండగానే :

లేకపోతే డాబా అమ్మేసుకుంటాడా? వీల్లేదని చెప్పు; నీకు గుర్తులేదేమో, డాబా నీ పేరఉంది..."

అని తీవ్రంగా పలికాడు.

"అబ్బబ్బ! మీరంత హైరాను పడిపోతే ఎలా?"

అంది లలిత నవ్వుతూ, సుందరివైపు చూసి.

"అసలేమిటో నాతో చెప్పవే; ఆయనకేంటి వేం తెలుసూ, వండిపెట్టి పులుసులో పులుపు సరిపోయిందా అంటే 'బాగానే ఉంది' అంటారే కాని, ఏం కావాలో తెలీదాయనకు"

అంది సుందరి లలితవైపుకి జరిగి, ఆమె తల తనవైపుకు త్రిప్పిపట్టుకుని.

"చెప్పు...ఆవిడ తీరుస్తుంది నీ కోరిక"

అని గట్టిగా అగ్గి పుల్ల కొట్టి, సిగరెట్ ముట్టించాడు.

"మరేం లేదే, ఈ అయిదు వేలతో స్టాకు తీసుకుని హైదరాబాద్లో వ్యాపారంచేస్తే సంవత్సరంలో రెట్టింపు తియ్యవచ్చు. కాని ఈ సంవత్సరంలో పదివేలూ పెడ్తే సుమారు పాతిక వేలు రావొచ్చు"

అంది లలిత.

నేను వాణ్ణి నమ్మను లలితా; పెళ్ళయిన నాలుగేళ్ళు తిరక్కుండా కట్టుకున్న పెళ్ళాం సంతానవతి కాలేదని సంవత్సరంనర నానాహింసలూ పెట్టి, అన్ని తిరుగుళ్ళూ తిరిగి, వ్యాపారంలో సర్వనాశనం అయి..."

ఉపన్యాసధోరణిలో పోతూన్న రామారావుని ఆపటానికి ఏం తోచక : "చాల్లెద్దురూ...మీకన్నీ అలాగే కనిపిస్తాయి. లలితకిప్పుడు అయిదో నెల... తెలుసా?"

అని లలితతో వంటింట్లోకి నడిచేసింది, సుందరి.

'W-H-A-T!!' (వ్వా...ట్!!)

అని రామారావు సోఫాలో వెనక్కు వాలాడు. రెండు కాళ్లూ మేజామీద ఉంచుతూ. వంటింట్లోంచి కిలకిలలు వినిపిస్తున్నాయి. గేట్లో రంగారావు కారు హారన్ ఆగకుండా మ్రోగుతోంది. "ఒరేయ్, రావుడూ !" అన్న రంగడి చిన్ననాటికేక రామారావుని అమాంతం కారు దగ్గరికి నడిపింది.

# నాగార్జునుడు: నాగార్జునకొండ

శ్రీ చీమకుర్తి శేషగిరిరావు

విశ్వ సంస్కృతి ఒక మహాప్రవాహము. వివిధ భూములనుండి వచ్చు వివిధోపనదులే మహా ప్రవాహమున జేరి నానాట దానిని బలీయ మొనర్చినవి. ఒనర్చుచున్నవి. ఒక్కొక్క కాలమున నొక్కొక్క దేశము ప్రముఖత వహించి తన విజ్ఞాన స్రవంతి నీ మహాప్రవాహమున సంగమింపజేసినది. వేదకాలమున సప్తసింధు ప్రాంతము, బుద్ధదేవుని కాలమున కోసల, కాశీ, మగధ ప్రాంతములు, గ్రీకు తత్త్వవేత్తల కాలమున యవన భూమి, టోలమీల కాలమున అలెగ్జాండ్రియా యిట్టి పుణ్యమునకు నోచుకొన్నవి; విశ్వసంస్కృతీ చరిత్ర యందు గణనీయస్థానముల నాక్రమించినవి.

అట్టి భాగ్యమే కృష్ణాతీరస్థ ఆంధ్రభూమికి, క్రైస్తవ శకారంభ కాలమున సిద్ధించినది. ఇట నానాడు బయలుదేరిన మహాయానమాధ్యమిక వాదము, తత్త్వశాస్త్రమున నొక నూతన యుగమునకు ప్రాతిపదిక వేసినది. దీని మూలస్థానము శ్రీపర్వతము; ఆ వాదప్రవక్త శ్రీ నాగార్జునుడు. ఆ శ్రీ పర్వతమే నేటి నాగార్జున కొండ.

ఆ నాగార్జునుడు బౌద్ధమత పీఠాధిపతులలో పదునాలుగవ వాడు.

ఈ నాడు నాగార్జునకొండ ప్రాంతము చైతన్య రహితము. కాని ఆనాడది ఒక పుణ్యభూమి. ఒక మహావిహారము, ఒక సుప్రసిద్ధ విద్యాపీఠము.

"నాగార్జునుని చరణ సన్నిధిని తత్త్వ రహస్యముల గ్రహించుటకు నేల నాలుగు చెరగులనుండి జిజ్ఞాసువు లానాడచ్చటికి వచ్చెడివారు. వివిధ దేశముల ప్రభువులు, తమ దేశీయులగు విద్యార్థుల వసతినిమిత్తము విహారముల గట్టించిరి. అట్టి వానిలో సింహళ దేశీయుల విహారమొకటి యున్నదను విషయము నేటి త్రవ్వకములవలన తెలియనగుచున్నది."

దరిదాపుననే, ఇక్ష్వాకుల రాజధాని విజయపురి యుండెడిది. దాని శిథిలావశేషములు నేటి త్రవ్వకములలో కానవచ్చుచున్నవి.

ఆనాటి ఇక్ష్వాకులు ఆంధ్ర శాతవాహన సామ్రాట్టుల సామంతులు. శాతవాహనప్రభువు నాగార్జునుని పరమ మిత్రుడు.

ఈవిధముగ, ఆంధ్రప్రభువుల, వారి సామంతులగు ఇక్ష్వాకుల ఆదర సహకారముల చలువను మహాయాన మాధ్యమిక వాదము పెరిగి పెద్దదై చైనా, మధ్యఆసియా కొరియా, జపాను, టిబెట్ దేశములకు క్రమశః వ్యాపించినది.

నాగార్జునకొండను గురించి నాగార్జునుని గురించి స్థూలముగ మనకు తెలియవచ్చు విషయము లివి:

'కాలగర్భమున విలీనమైపోయిన నాగార్జునుని చరిత్రను గురించి మనకీ స్థూలవిశేషములు చైనీయ, టిబెటీయ బౌద్ధమత గ్రంథముల సాయమున మాత్రమే నేడు లభ్యమగుచున్నవి. చైనీయ గ్రంథస్థ విషయముల గ్రహించుటకు వాని ఆంగ్లానువాదములే శరణ్యము. టిబెటీయ గ్రంథములకు హంగేరియను రచయిత రచించిన జర్మను అనువాదములును, వాని ననుసరించిన ఆంగ్ల గ్రంథములును దిక్కు. చైనీయ టిబెటీయ భాషలలోగల గ్రంథములను యీ వపాతలతో నిమిత్తము లేకుండా భారతీయ భాషలలోనికనువదించుటకు భారతప్రభుత్వము పూనుకొనున్నది. నాగార్జుని సమగ్ర చరిత్రను రచించుటయం దాసక్తి వహింపదగు ఆంధ్రప్రభుత్వమయినను యిందులకు పూనుకొనుట సముంజసము.'

ఇక, భూగర్భమున నణగియున్న ఐతిహాసికాధారముల విషయమున నాగార్జున కొండ ప్రాంతమే మనకు దిక్కు. పురావస్తు పరిశోధనశాఖవారిప్పటి వరకు జేసిన త్రవ్వకములవలన లభ్యములయిన యాధారములు కొంత విలువగలవియే యైనను, నాగార్జున చరిత్రను రచించుటకు సాయపడునవి మాత్రము అందు మృగ్యము.

ఈనాడీ త్రవ్వకములవలన మనకు లభ్యములైన దానశాసనము లన్నియు మాఠరీపుత్ర శ్రీ వీరపురుష

దత్తుడను ఇక్ష్వాకు రాజు పరిపాలన కాలపు దరిదాపుల లోనివే. ఇవియన్నియు క్రీ. త. మూడవ శతాబ్దము లోనివి. ఆనాటికి శాతవాహన సామ్రాజ్య మంతరించి నది. ఇక్ష్వాకులు స్వతంత్రులైరి.

ఇంకొక విషయముకూడ గమనార్హము. ఈశాసనముల కాలము నాటికి బౌద్ధమతమునకు రాజాదరణ లేదు. రాజు లందరును వైదికమతావలంబులు. రాణులుమాత్రమే బుద్ధదేవు నుపాసించుచుండిరి. అందువలన ఆనాటికే బౌద్ధబ్రాహ్మణ మతములమధ్య సమన్వయ మారంభ మయ్యెనని నిర్ణయింపవచ్చును. రాణుల ఆదరణమాత్రముననే ఈ మహావిహారములు, స్తూపము నెలకొన్నవనియు మనము చెప్పజాలము.

ఇట్టి మహా విహారముల నిర్మాణమునకు ఆవశ్యకమగు బౌద్ధమతాసక్తి ఆనాటి ప్రభువులలో లేదని తెలియుటచే, వీని నిర్మాణమునకు మనమింకను వెనుకకు పోకతప్పదు. చైనీయ గాథల ననుసరించి యీ విహారములను ఆంధ్ర సాతవాహనరాజు నాగార్జునుని కొరకై కట్టించె నని తెలియుచున్నది. కాని ఆ సాతవాహన రాజెవ్వరు?

## నాగార్జునుని కాలము

నాగార్జునకొండ త్రవ్వకములలో యింకముందు వేరుగ నాధారములు లభించువరకును, మనకున్న సామగ్రితోనే, నాగార్జునుని కాలమును అతని నాదరించిన సాతవాహనరాజు కాలమును నిర్ణయింపవలసి యున్నది. మిత్రులు కొందరీ సాతవాహన ప్రభువు యజ్ఞశ్రీ యని యనిరి. యజ్ఞశ్రీ కాలమగు క్రీ. త. రెండవశతాబ్దినే నాగార్జునుని కాలముగ వారు గ్రహించిరి.

కాని నేడు నాగార్జునకొండవద్ద వెలువడుచున్న శాసనములును, చైనీయ బౌద్ధమత చరిత్రయును, ఈ వాదమునకు విరుద్ధముగ నున్నవి.

చైనీయ బౌద్ధమత చరిత్ర ననుసరించిచూడ, హిందూదేశమున బౌద్ధమతపీఠాధిపతులు 28గురు క్రమముగ అధికారము వహించిరనియు, అందులో పదునాలుగవవాడు నాగార్జునుడనియు, కడపటివాడు బోధిధర్ముడనియు తెలియవచ్చుచున్నది. బోధిధర్ముడు తనకాలమున భారతదేశమందు బౌద్ధము హీనస్థితియందుండుటచే చైనాకు పోయెను. అంతటితో భారతదేశమున నీపీఠ మంతరించెను. బోధిధర్ముడు చైనాకు పోయినది క్రీ. త. 526లోనని కూడ ఈ గ్రంథములవలన తెలియుచున్నది. నాగార్జునుడు బుద్ధుని తరువాత నాలుగువందల సంవత్సరములకు జన్మించెనని ఈ గ్రంథములే చెప్పుచున్నవి.

బుద్ధునినుండి బోధిధర్ముని కాలమునకు దాదాపుగ వేయిసంవత్సరము లగును. ఈ మధ్యకాలము నిరువదియెనమండ్రుగురు పీఠాధిపతు లుండుటచే, యీవిధము లెక్కించినను, పదునాల్గవ పీఠాధిపతియగు నాగార్జునుడు బుద్ధునితరువాత 4—5 శతాబ్దములలో అనగా క్రీ. పూర్వము 1-వ శతాబ్దిలో నుండుననియే తేలుచున్నది.

ఇక యిప్పటికి దొరికిన శాసనముల విషయ మిదివరకే ప్రస్తావించబడినది. క్రీ. త. మూడవశతాబ్ది లోనివగు యీ శాసనములవలన నా కాలము బౌద్ధమతమున కభ్యుదయకాల మని చెప్పుటకు వలను పడకున్నది. యజ్ఞశ్రీకాలమునకును ఈశాసన కాలమునకును గడచిన అంతరము నూరు సంవత్సరములలోపలనేయుండును. నాగార్జునుడు యజ్ఞశ్రీకి సమకాలికుడే యగునేని ఆతని కాలమున బౌద్ధమతము ఆంధ్రప్రాంతమున నత్యున్నతస్థితి యందుండెనని అంగీకరింపక తప్పదు. అట్టి సందర్భమున యిక్ష్వాకుల కాలము నాటికి అనగా వందసంవత్సరముల లోపలనే అది బ్రాహ్మణమతమున నంతర్లీనమై పోవుస్థితికి వచ్చెనని విశ్వసింపజాలము.

ఇదియునుగాక యజ్ఞశ్రీకాలమున బ్రాహ్మణమతము పునరుజ్జీవితమైనదనియు, మత్స్యపురాణ మా కాలముననే సంగ్రథితమైనదనియు, తెలియుచున్నది. అట్టివాడు బౌద్ధగురువు నాదరించి పోషించెననుటయు దుర్లభము. యజ్ఞశ్రీ యను పేరే వైదికమత పునరుజ్జృంభణమును చెప్పక చెప్పుచున్నది.

నాగార్జునుని, పాశ్చాత్యపండితులు రెండవ శతాబ్దివాడని చెప్పుటచే, అతనిని యజ్ఞశ్రీతో సమకాలికునిగ మన ఐతిహాసికులు నిర్ణయించిరనుట స్పష్టము. పాశ్చాత్యు లిటుల నాగార్జునుని కాలమును నిర్ణయించుటలో కొంత పొరపడిరని అర్థమగుచున్నది. అశ్వఘోషుని నాగార్జునుడు తన గ్రంథములలో పేర్కొన్నాడు. అశ్వఘోషుడు తనగ్రంథములలో పేర్కొన్న శకనరపతి కనిష్కుడుగ పాశ్చాత్యులు విశ్వ

సించిరి. కనిష్కుడు క్రీ. శ. 78 లో నున్నాడని విశ్వసించి పాశ్చాత్య పండితులు నాగార్జునిని క్రీ. శ. రెండవ శతాబ్దిలోనికి తెచ్చిరి.

అశ్వఘోషుడు పేర్కొన్నవాడు కనిష్కుడే యని భావించుటచే కలిగిన యీ పొరపాటు నిపుడు సవరించుకొనవలసియున్నది. పుష్కలావతిని పరిపాలించుచు మోహుడను పేరుగల శకరాజు క్రీ. పూ. రెండవశతాబ్దిలో నున్నాడు: యవన, ఖరోష్ఠిలిపులలో నితని నాణెములు మనకు నేడు కనబడుచున్నవి. ఇతని కుమారుడు అజియే పంజాబునందు యవనుల అధికారమును నిర్మూలించెను. కావున ఈ మోహుని (Moa, Moues) అశ్వఘోషుని సమకాలికుడుగ మనము గ్రహించుచో నాగార్జునుడు క్రీ. పూ. రెండవ శతాబ్ది చివర నుండెనని తేలగలదు. అప్పటి సాతవాహన రాజు ఆంధ్ర రాజులపట్టికలో ఇరువదవ శాతకర్ణి కాగలడు. ఈ శాతకర్ణి క్రీ. పూ. 172 లో రాజ్యాధిపత్యము వహించెనని చరిత్రకారు లంగీకరించుచున్నారు.

నాగార్జునిని గురించి చైనీయ టిబెటీయ గాథలలో గల ఇంకొక విషయముతో కూడ యీ కాల నిర్ణయము సరిపోవు చున్నది. నాగార్జున నాదరించిన సాతవాహన ప్రభు వతిదీర్ఘ కాలము పరిపాలించుటచే విసుగెత్తిన రాజపుత్రుడు నాగార్జునుని మృతికి కారణభూతుడయ్యెనని ఆ గాథలు చెప్పుచున్నవి. ఈ శాతకర్ణి పరిపాలనా కాలము 56 సంవత్సరములు. ఆంధ్రరాజులలో ఇంతకాలము పరిపాలన నిర్వహించిన రాజెవరును వేరొకరు లేరు. యజ్ఞశ్రీ పరిపాలనా కాలము 23 సంవత్సరములు మాత్రమే.

పై విషయముల పరిశీలించి చూడ నాగార్జునుడు క్రీ. పూ. రెండవ శతాబ్ది కడపట నుండెనని విశ్వసించుటయే సమంజసమని తోచుచున్నది.

## తాత్త్వికుడగు నాగార్జునుడు

నాగార్జునునిచే ప్రవచితమగు మాధ్యమిక వాదము మానవుని విజ్ఞాన భూమికి కడమెట్టు అని చెప్పవచ్చును. శూన్య భావన ఆనాటి బౌద్ధులకు క్రొత్తకాదు. కాని నాగార్జునుడు శూన్యతకొక నూతనత్వమును సమకూర్చెను. అస్తిత్వ నాస్తిత్వములకు మధ్యగామియగు భావమే నాగార్జునుని శూన్యత. ఈనాటి విజ్ఞానులు సైతము తమ నిత్యపరిశోధనల మూలమున నీ వాదము వైపునకే వచ్చుచున్నారు.

నేటి గణితశాస్త్రమున మనకు పరిచితమగు శూన్యము దరిదాపుగ నిట్టిదే. గణితశాస్త్ర వేత్త దృష్టిలో శూన్యము రెండు విధములు. సర్వశూన్యము గణిత పరికర్మలలో పనికిరాదు. పరికర్మలలో నుపయోగించునది గణితశాస్త్రీయ శూన్యము. ఒకటిని సున్నచే (శూన్యముచే) భాగించితి మనుకొనుడు. అపుడు మనకు లభించు లబ్ధము అనంతసంఖ్యయని గణిత వేత్తల నిర్ధారణ. ఒకటిని భాగించిన సున్న, సర్వశూన్యమే అగునెడల భాగహార పరికర్మయే యుండెడు. అందువలన సున్ననుగురించి ఒక గణితశాస్త్ర వేత్తను నిర్వచింపుమని కోరినచో అతడు మన మూహించగల్గునట్టి చిన్న సంఖ్యా భిన్నములకన్నను చిన్నదియే శూన్యము అని మాత్రము అనును. అయినయెడల దాని కస్తిత్వము గలదా? అని యడిగిన అతడు లేదనును, సర్వశూన్యమా యన్న కాదనును. దాదాపుగ యిట్టిదియే మాధ్యమిక వాద భావన. ఇట్టి శాస్త్రీయ భావనను కనిపెట్టిన ప్రథమ గౌరవము నాగార్జునునికే దక్క వలయుననుట నిర్వివాదము.

ఇక సాపేక్షతా సిద్ధాంతపు మూలసత్యములు నాగార్జునుని ద్వివిధ సత్యములలో కనుపడుచున్నవి.

## ప్రేమైకజీవి నాగార్జునుడు

బుద్ధికుశలతచే ప్రతిపాదించిన తన తత్త్వ సిద్ధాంతముల నాతడు ప్రజల నెత్తిపై రుద్దలేదు. సంవృత్తి సత్యమున మనికిగల యీ ప్రపంచమునందలి ప్రజల సన్మార్గవర్తులుగ జేయుటకై భక్తి మూలకమగు బుద్ధ, బోధిసత్వారాధనల నతడు ప్రోత్సహించెను. ఆ ప్రోత్సాహ ఫలితముగ వ్యాపించిన బుద్ధభక్తికి చిహ్నములే నేటి త్రవ్వకములలో లభించు దానశాసనములు.

## కాలగతి

నాగార్జునుని భావముల నతని యనంతరము ప్రజలలో బోధింపగలుగు ప్రతిభాశాలురు కఱవైరి. మహాయానము క్రమముగ వజ్రయానముగ అటనుండి వామాచారమతముగ మారుటతో, బౌద్ధమతము నీతిహీనుల చేతులలోనికి పోయి ఉదాత్తతను గోల్పోయి అస్తమించినది.

ఆ మతముతో పాటు శ్రీ పర్వతపు శోభయు నంతరించినది. మిగిలినవి నేడు మనకు కనుబడుచున్న కనుబడక భూమిలో దాగియున్న శిలాఖండములు. ఈ శిలాఖండములే నాగార్జున ప్రతిరూపములై, ఆంధ్రులలో నిద్రాణమై యున్న, తేజశ్శక్తుల నుజ్వలింప జేయగల వని ఆశింతము.

# శిథిలాలయం

శ్రీ అంగర సూర్యారావు

పాత్రలు : విరాగి, చిరంజీవి, రాముడు, రత్నాకరం, పార్వతీశం, చంద్రయ్య, యామిని

స్థలం : కొండ శిఖరం మీది దేవాలయం. సమయం : మునిమాపు—దేవాలయ ముఖద్వారం కనిపిస్తూ వుంది. తలుపులు మూసివున్నై. ఆలయ ద్వారానికి యిరు వైపులా చెట్లు జీబురుగా అల్లుకొని వున్నై. ముంగు ఒక వేదికవుంది. కుడివైపు చెట్ల వెనుకనుంచి నల్లని ముసుగుతో ఒక స్త్రీ ప్రవేశిస్తుంది. బెదురుగా ముందుకూ వెనుకకూ చూస్తూ నడుస్తోంది. చీకటిలో ఆమె రూపం స్పష్టంగా కనిపించడంలేదు. ఎడమ వైపు చెట్ల దగ్గరకు వెళ్లి ముందుకు చూస్తూ ఆగిపోయింది. ఆలయం తలుపులు నిశ్శబ్దంగా తెరుచుకున్నై. లోపలనుంచి దీపపుకాంతి బయట పడుతోంది. విరాగి ద్వారం దగ్గర నిలుచొని స్త్రీ కేసి దీక్షగా చూస్తున్నాడు. స్త్రీ మోకాళ్ళ మీద నిలబడి అవనత వదనంతో రెండు చేతులు జోడించి దేవుణ్ణి ప్రార్థిస్తోంది. క్షణం గడచిన తరువాత లేచి నిలుచుంది. ముందుకు ఒక అడుగు వేసింది.

విరాగి : (గంభీర స్వరంతో) ఆగు! మరొక అడుగు ముందుకు వేశావా — నీ జీవితం ముగిసి పోతుంది.

స్త్రీ : (భయ విహ్వలయై వెనుకకు తిరిగి చూస్తూ) ఎవరది? ఈ నిర్జన ప్రదేశంలోకూడా నా సంకల్పానికి ఆటంకమా?

విరాగి : (ఆమెను సమీపించి) నీముందు ఏమున్నదో చూశావా?

స్త్రీ : చూశాను. సముద్రుడు భీకరాకారంతో కొండను ఢీకొంటున్నాడు.

విరాగి : మరొక అడుగు ముందుకు వేస్తే ఏం జరుగుతుందో తెలుసా?

స్త్రీ : తెలుసు. ఈ కొండశిఖరం మీదినుంచి దొర్లి అనంతసాగరంలో కలుస్తాను. సాగరుడు సహస్ర హస్తాలతో నన్ను తన కౌగిలిలోకి తీసుకుంటాడు. (నిర్లక్ష్యంగా అతని ముఖంలోకి చూస్తుంది).

విరాగి : నిన్ను చూడగానే నీ సంకల్పాన్ని తెలుసుకున్నానమ్మా! యిలారా! యీ వేదికపై ఒక క్షణం కూర్చో! మరొకసారి ఆలోచించి చూడు.

స్త్రీ : (రెండు చేతులలోను ముఖాన్ని దాచుకొని వెక్కి వెక్కి ఏడుస్తూ) లాభంలేదు స్వామీ! నా ఆశలన్నీ అడియాసలై పోయినై. దారులన్నీ మూసుకుపోయినై. ఎటు ప్రయాణం చేయడానికి నాకు దారిలేదు. ఎటుచూచినా గాఢాంధకారం. మృత్యువును ఆహ్వానించడం కంటె నాకు మార్గాంతరం లేదు. మీకు చెయ్యెత్తి నమస్కరిస్తాను. నన్ను విడిచి పెట్టండి.

విరాగి : లేదమ్మా! నువ్వు పొరబాటు పడుతున్నావ్. తొందరపాటుతో సుగమమైన మార్గాన్ని చూడలేక పోతున్నావ్. నామాట విని కొద్ది క్షణాలపాటు యిక్కడ కూర్చుంటే నీకు దివ్యమైన మార్గాన్ని చూపిస్తాను.

స్త్రీ : యీ పాపపు జీవితాన్ని మరొకక్షణం కూడా నేను కొనసాగించలేను. నన్ను నా

దారిని పోనివ్వండి. మీకు పుణ్యం వుంటుంది.

విరాగి : నా మాట నమ్మమ్మా. యిక్కడ కొద్ది క్షణాలు కూర్చో. తరువాత ఆత్మహత్యకంటె గత్యంతరం లేదని తోస్తే నువ్వు నిర్భయంతరంగా నీ నిండు ప్రాణాల్ని నిలువునా తీసుకో! నేను అడ్డురాను.

స్త్రీ : (అతని ముఖంలోకి తేరిపారచూస్తూ) మీ రెవరు? మీ మాటలలో ఏదో విచిత్రమైన ప్రభావం వుంది. మనుషులు మసలని యీ ప్రదేశంలో మీ రెందుకు వున్నారు?

విరాగి : నేనా? నేనుకూడా ఒకప్పుడు నీలాగే యిక్కడకు వచ్చాను. కాని నీలా తొందరపడకుండా యీ వేదికపై ఒక క్షణం కూర్చుని ఆలోచించాను. నాకు దివ్యమార్గం ఒకటి కనిపించింది. నాటినుంచీ యిక్కడనే వుండిపోయాను.

[విరాగి వేదికమీద కూర్చుంటాడు. అతని వెనుక స్త్రీకూడా వచ్చి వేదికమీద కూర్చుంటుంది. ఆలయం నుంచి వస్తున్న కాంతి యిద్దరి మీద పడుతుంది. విరాగి వయస్సు 30 సం॥ రాలకు ఎక్కువ వుండదు. అతని ముఖం ప్రశాంతంగా వుంది. సంస్కారంలేని జుత్తు అతనిని చూడగానే ఎవరికైనా గౌరవభావం కలుగుతుంది. స్త్రీ రూపం ముసుగులోంచి కనిపించదు. చేతులుమాత్రం కోమలంగా తెల్లగా కనిపిస్తాయి.)

స్త్రీ : స్వామీ! నాలో ఏవో విచిత్రమైన భావాలు కలుగుతున్నై. ఈ వేదికలో ఏమైనా మాహాత్మ్యం వుందా?

విరాగి : మన మనసులలోనే మాహాత్మ్యం వుందమ్మా! (దేవాలయంలోకి చూస్తూ) చిరంజీవి! చిరంజీవి!

[దేవాలయంలోనుంచి ఒక 16 సం॥ రాల కుర్రవాడు బయటకు వస్తాడు. విరాగి ప్రక్కను కూర్చున్న స్త్రీకేసి ఆశ్చర్యంగా చూస్తాడు.]

చిరంజీవి: (విరాగితో) పిలిచారా?

విరాగి : కొంచెం పళ్లు, పాలు తీసుకురా నాయనా!

[చిరంజీవి లోనికి వెళ్ళిపోతాడు]

స్త్రీ : (తన్మయత్వంతో) ప్రాణం హాయిగా వుంది. ఆపాడు ప్రపంచంలోకి పోయి సంకుచిత చిత్తులైన ఆ మనుషుల మధ్య నివసించేకంటె శాశ్వతంగా యిక్కడే వుండి పోతే బాగుంటుం దనిపిస్తోంది.

[చిరంజీవి తిరిగివస్తాడు. పళ్లు పాలు స్త్రీ ముందు వుంచి విరాగికేసి చూస్తాడు]

విరాగి : తీసుకో అమ్మా! సంకోచించకు!

స్త్రీ : ఇంతవరకూ నాలో లేని ఆకలి, దాహం, అనే భావాలు యిప్పుడే పెల్లుబుకుతున్నై. ఉదయంనుంచి మంచి నీళ్ళైనా తాగలేదు. తాగాలని కూడా నాకు అనిపించ లేదు.

[ఒక పండుతిని కొంచెం పాలు తాగుతుంది]

కొండ దిగువను దీపాలకాంతిలో మనోహరంగా కనిపిస్తున్నది చూశారా అదే మా వూరు. నా పేరు యామిని.

చిరం : వూరు వదలి పెట్టి యిక్కడకు ఎందుకు వచ్చారు? మీకు ఆ వూరిలో బంధువు లెవరూ లేరా?

యామిని: కావలసినంత మంది బంధువు లున్నారు. వాళ్లు లేక పోయినా బాగుండేదనిపిస్తోం దిప్పుడు.

విరాగి : నీకు పెళ్లి అయ్యిందా?

యామి : (నిట్టూర్చి) అయ్యింది స్వామీ? పెళ్ళయిన కొద్ది రోజులలోనే నాభర్త ఎక్కడికో పారిపోయేడు. యీ నాటికీ తిరిగి రాలేదు. ఆయన జీవించి వున్నారో లేదో కూడా తెలీదు.

[మరొక పండు తీసుకొని తినబోతూ వుంటుంది. సింహగర్జనవలె మనిషి కేక వినిపిస్తుంది]

ఒక గొంతు: (నేపథ్యంలోంచి కొండలు ప్రతిధ్వనించేలా) ఎవరక్కడ? అక్కడే ఆగండి! కాలు కదిపితే కైలాసానికి పంపిస్తాను.

యామి : (భయంతో వణుకుతూ) హామ్మయ్యో! మా వాళ్లు నా కోసం ఎవరినో పంపినట్లున్నారు. నన్ను ఆపదనుండి తప్పించండి స్వామీ (విరాగికేసి దీనంగా చూస్తుంది)

విరాగి : భయం లేదమ్మా! రానీ! అత డెవరో చూద్దాం.

[రాముడు కుడివైపు నుండి ప్రవేశిస్తాడు. పెద్ద చింపిరితల బొద్దుమీసం మాసిన గెడ్డం వంకలు తిరిగిన బలమైన శరీరం. చిరుగుల చొక్కా మాసిన పంచె. మనిషిని చూడగానే (తాగుబోతో, దొంగో అయి వుంటాడనిపిస్తుంది]

రాము : (ముగ్గురిని తేరిపార చూస్తూ గట్టిగా నవ్వుతూ) హహ్హహా! యిక్కడ యీ మహానుభావు డెవరో కుటుంబ సహితంగా విహరిస్తున్నట్టున్నాడు. (ముగ్గురి ముఖాలలోకి తీక్ష్ణంగా చూస్తూ) అరె! ఎవరి

ముఖంలోను భయం కనిపించడం లేదే! (విరాగితో) ఏయ్! నిన్నే! రాముడు సాక్షాత్కరించినా కళ్లు అప్పగించి చూస్తూ వూరుకున్నా వేం?

విరాగి : (ప్రశాంతంగా) రాముడనేవాడు వేరే లేడు! కళ్లు తెరిచి చూస్తే ప్రతి జీవునిలోను దేవుడు కనిపిస్తాడు నాయనా!

రాము : (మరింత గట్టిగా నవ్వుతూ) రాముడంటే దేవుడు కాదోయ్ వెర్రిమనిషీ! అది మన సొంత పేరు. సరే, అధిక ప్రసంగం కట్టిపెట్టి తినడానికేమైనా ముందు పారెయ్.

యామి : (రెండు పళ్లు తీసి అతనికిస్తూ) పాపం చాలా దూరాన్నుంచి వస్తున్నట్లున్నావు! అలసిపోయావు. ముందీ పళ్లు తిను.

రాము : (రెండు చేతులతోను రెండు పళ్ళు తీసికొని క్షణంలో తినేస్తాడు.) కావాలి! యింకా ఏమైనా కావాలి తినడానికి. ఏముందో అది తీసుకు వచ్చి యిక్కడ పారెయ్యండి. అలా నిర్లక్ష్యంగా చూస్తారేం? రాముడి సంగతి మీకు తెలియడం లేదు. ఆకలి వేసినప్పుడు పెద్దపులి అయిపోతాడు.

యామి : నీది నిజంగా పెద్ద పులి స్వభావం అయితే నన్ను చీల్చి చంపు. నా కష్టాలు యీ రోజుతో గట్టెక్కుతాయి.

రాము : (హేళనగా) పులిగురించి నీకు కొంచెం కూడా తెలియదన్న మాట! కడుపు నిండిన తరువాత పులి ఎవరి జోలికి పోదు. సుఖంగా ఏ గుహలోనో పడుకొని నిద్రపోతుంది.

(కోపంతో పళ్లు బిగించి) కాని మనిషి మాత్రం అలాంటి వాడు కాడు. ఎందరిని హింసించినా, ఎన్ని ప్రాణాలు తీసినా వాడికి తృప్తి వుండదు. అందుకే నా గురుదేవుడు చెప్పాడు. "ఒరేయ్ రాముడూ! చితగ్గొట్టు, వళ్లు హూనం చెయ్యి, కనికరం చూపకు. దుర్మార్గుడైన మనిషిని హతమార్చు." అని.

విరాగి : ఉద్రేకపడకు నాయనా! జీవితంలో ఏదో పెద్ద దెబ్బ తిని యీ విధంగా తయారైనట్లు కనిపిస్తున్నావు. ఒక క్షణం యీ వేదిక మీద కూర్చో! (చిరంజీవితో) నాయనా! యితనికి తినడానికి యేమైనా తీసుకురా.

[చిరంజీవి ఆలయం లోనికి వెడతాడు]

రాము : (పరిసరాలను పరిశీలించి చూస్తూ) పాడుపడ్డ గుడి, అన్నీ విడిచి పెట్టిన బైరాగి, లేడి పిల్లలాంటి కుర్రాడు, చుక్కలలో చందమామలా ఓ చక్కని చుక్క-వహ్వా! ఎంత బాగా కుదిరినై!

విరాగి : ఇలా ఎక్కడినుంచి వస్తున్నావ్ నాయనా!

రాము : భలే ప్రశ్న వేశావయ్యా బైరాగీ! మనం ఎక్కడినుంచో వస్తున్నాం, ఉన్న నాలుగు రోజులు కుమ్ములాడుకుంటున్నాం, తిరిగి ఎక్కడికో వెళ్లిపోతున్నాం. అందుకే 'మాయామేయజగం' అన్నాడు వేదాంతి. ఇక అసలు విషయానికి వద్దాం. ప్రస్తుతం ఎక్కడినుంచి వస్తున్నావని కదూ నీ ప్రశ్న? (సగర్వంగా) నేను మా అత్తవారింటినుంచి వస్తున్నాను లెండి.

యామి : అత్తవారింటి నుంచి వచ్చే వాళ్లు నున్నగా ముస్తాబై వస్తారు. కాని యిలా చింకి గుడ్డలతోను, మాసినగడ్డంతోను వస్తారా ఎక్కడైనా?

రాము : (విచారస్వరంతో) ఏం చెయ్యను మా అత్తవారు కడు బీదవారు. దేశాన్ని కొల్లగొడుతున్నా వారికి కడుపు నిండడం లేదు. అలా తెల్లబోయి చూస్తారేం! మా అత్తవారి యిల్లు ఏదో మీకింకా బోధపడలేదూ? (ఉత్సాహంతో గట్టిగా) సెంట్రల్ జైల్! తెలిసిందా! ప్రస్తుతం నేను జైలు నుంచి విడుదలై వస్తున్నాను.

యామి : (భయంతో) అమ్మయ్యో! నువ్వు దొంగవా?

రాము : (సగర్వంగా) నేను దుర్మార్గుణ్ణి, దొంగని అని చెప్పుకోడానికి చాలా గర్విస్తున్నాను.

[చిరంజీవి ఒక పెద్ద గిన్నెతో రొట్టెలు చెంబుతో మంచినీళ్లు తీసుకువచ్చి రాముడి ముందు పెడతాడు. రాముడు రొట్టెలన్నీ తొందరగా తింటూ వుంటాడు].

విరాగి : (ప్రసంగాన్ని కొనసాగించే ధోరణిలో యామినితో) పాపం! నీ భర్త చిన్నప్పుడే లేచి పోయాడా? లోకంలో భర్తలేని స్త్రీ పడే పాట్లు ఎటువంటివో నాకు తెలుసు. కాని కష్టాలను సహించ గలగాలి.

యామి : నా కష్టాలు అందరి కష్టాలవంటివి కావు స్వామీ! నేను చంచలచిత్తను! దుర్మార్గురాలిని! నేను చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం లేదు స్వామీ!

విరాగి : నీ తప్పును నువ్వే నాడైతే తెలుసుకోగలిగావో ఆనాడే నీలో జ్ఞానోదయం కలిగింది యామినీ! విచారించకు! పొరబాట్లు చెయ్యడం, ఆ ఫలితాలను అనుభవిస్తూ బాధ పడడం మానవనైజం.

యామి : నేను చేసిన అపరాధం చిన్నది కాదు ప్రభూ! అది మీకు తెలిస్తే మీరుకూడా నన్ను క్షమిస్తారన్న ఆశ నాకు లేదు. అయినా చేసిన పాపం చెబితే పోతుందంటారు.

రాము : (గట్టిగా నవ్వుతూ) చేసిన పాపం చెప్పినంత మాత్రాన్ని పోతే సెంట్రల్ జైళ్లెందుకున్నట్లు? క్రితిల్లీ! చేసిన నేరం చెప్పకుంటే జైలు తప్పదు. చెప్పకపోతే ఉరికొయ్యలు తప్పవు. ఏం లోకం! ఏం న్యాయం!

యామి : నిజమే! లోకంలో న్యాయానికి తావు లేదు. నిజాన్ని ఒప్పుకుంటే భయంకరమైన దుష్ఫలితాలకు తలవంచవలసి వుంటుంది. నేనా యువకుణ్ణి ప్రేమించిన విషయం రత్నాకరానికి చెప్పకపోతే నా బ్రతుకు యింత హీనమై ఉండేది కాదు.

విరాగి : పరపురుషుడిమీదికి నీ మనసు మళ్ళిందా యామినీ!

యామి : (వెక్కి వెక్కి యేడుస్తూ) నన్ను క్షమించండి ప్రభూ! నాపాపానికి ప్రాయశ్చిత్తం లేదా.

రాము : ప్రతి పాపానికి ప్రాయశ్చిత్తం వుంది. అదే సెంట్రల్ జైలు. పాపాలను రోజురోజుకూ అభివృద్ధి చేసే మహాయంత్రం అది (ముగ్గురినీ తేరిపారచూస్తూ) అయితే మీ ముగ్గురు ఒక కుటుంబం కాదన్నమాట! (కుడిచేతి వేలుతో చూపిస్తూ) ఆ లోకంలోంచి బైటకు గెంటివేసిన తీసివేత సరుకా? పరెవా! అయితే నేనుకూడా సరైనచోటుకే వచ్చానే! (గిన్నె ఖాళీచేసి ముందుకు తోస్తాడు. చిరంజీవి ఖాళీ గిన్నె తీసికొని నిమ్పుతాడు.)

విరాగి : (రాముడితో) కొంతసేపు విశ్రాంతి తీసుకోనాయనా! (యామినితో) విచారించకు యామినీ! మనం లోకంలో అడుగు పెట్టినప్పటినుంచీ రకరకాల కష్టాలను సుఖాలను చవిచూస్తూ కొత్త అనుభవాలతో పురోగమిస్తూ ఉంటాం. సుఖాలకు ఉప్పొంగిపోయి కష్టాలకు నిరుత్సాహపడటం పిరికివాళ్ల లక్షణం.

యామి : నేటి లోకంలో స్త్రీకి ఉన్నస్థానం దుస్సహమైనది. అందుకు నా జీవితమే తార్కాణం. నా భర్త చిన్నప్పుడే పారిపోయాడని చెప్పాను. అప్పటితో నా తనువులోను మనస్సులోను పరిణామం ఆగిపోతే ఎంత బాగుండేది. కాని ఆగలేదు. వసంతఋతువులో చెట్లు చిగురించినట్లు కోమలమయిన యౌవనం నాలో ప్రవేశించింది. మనసు వింత వింత కోరికలను కోరింది.

[గాలికి ఆమె తలమీది ముసుగు తొలగిపోతుంది. తెల్లని గుండ్రని ముఖం. మెరిసే కళ్ళు. గులాబీరేకులవంటి పెదవులు. వయసు 20, 25 సంవత్సరాల మధ్య ఎంతైనా ఉండవచ్చు]

మంచిచెడ్డలను తెలుసుకోలేని ఆ సమయంలో నేను వలపులో చిక్కుకున్నాను. మా పొరుగునవున్న ఒకయువకుణ్ణి నామనసు కాంక్షించింది. అతడు నన్ను నమ్మించి మోసగించాడు.

రాము : (కోపంతో) మోసంచేశాడట! మోసం! ప్రతి ఆపదానికి యీమాట బాగా అలవాటైపోయింది. (యామినితో) అప్పుడు నీ తెలివి ఎక్కడికి పోయింది పిల్లా? వాడూ మోసపోయాడు. నువ్వూ మోసపోయావు. నీ మాటలు విని యీ రాముడుమాత్రం మోసపోడు!

విరాగి : రాముడు చెప్పింది నిజం. క్షణికోద్రేకానికి లోనై మీ రిద్దరూ మోసపోయారు. అయినా అతడు పురుషుడు గనక అతనికి సమాజంలో స్థానంవుంది. నీవు స్త్రీవి కనక నీకు లేదు.

యామి : ఇంకా పాపాన్ని కొనసాగించడానికి పూనుకుంటే నాకుకూడా సమాజంలో స్థానం వుండేది ప్రభూ! కాని అందుకు నేను వ్యతిరేకించాను. సమాజం నన్ను బహిష్కరించకముందే నా అంతట నేనే సమాజాన్ని విడిచిపెట్టేను.

రాము : అసలు కథను దాచేస్తున్నావ్ పిల్లా! అదికూడా చెప్పు! విని సంతోషిస్తాం!

యామి : నేనిప్పుడు మృత్యుశిఖరంమీద నిలుచున్నాను. దేనికీ నేను భయపడను. సర్వం మీకు తెలియజేసి నా ఆత్మను క్షాళనం చేసుకుంటాను. తర్వాత నిర్విచారంగా మృత్యుసన్నిధిని చేరుకుంటాను. నేనొక యువకుణ్ణి వలచిన విషయం మాబావ రత్నాకరానికి తెలిసింది. అతను రోజూ నన్ను భయపెట్టేవాడు. అతని కళ్లలో క్రౌర్యం వుండేది. అతనిని చూస్తే నాకు భయం వేసేది. చివరకు అతను ఒకనాడు నాముందు తన హృదయాన్ని విప్పాడు. అతనుకూడా నా అందానికి ముగ్ధుడై నన్ను కాంక్షిస్తున్నాడని తెలుసుకున్నాను. ఇక యీపాపషరంపరను నా హృదయం భరించ

లేక పోయింది. ఏడ్చింది. ఎదురు తిరిగింది. ఎటు పోవడానికి దారి కనిపించలేదు. ఆత్మ హత్యే శరణ్యం అనుకున్నాను. యిక్కడికి వచ్చాను. యిది స్వామీ నా కథ.

రాము : (హేళనగా) ఇది శుద్ధ పాతకథ. ఇందులో రవంత కూడా కొత్తదనం లేదు. ఎవరినో యీమె ప్రేమించిందట! ఈమెను మరొకడు ప్రేమించాడట! వహ్వా! ఏం మాట చెప్పేవు పిల్లా! అందంగా వున్నవాళ్లను చూస్తే ఎవరికైనా మనసు మారుతుంది. ఎవరిమాటో ఎందుకు నిన్ను చూస్తే నాకే మనసు మారుతోంది (బిగ్గరగా నవ్వుతాడు).

విరాగి : పొరబాటు నాయనా! విశాల దృష్టి వున్నవారికి యిటువంటి చిన్న విషయాలకు మనసెన్నడూ మారదు. కోమలంగా పెరిగిన శరీరాలతో నవనవలాడే సుందరాంగులు విజ్ఞానిని ఎన్నడూ ఆకర్షించలేరు. చినికిన శరీరాలతో చింకి వస్త్రాలతో అలమటించే అభాగినులే అతని దృష్టి నాకర్షిస్తారు.

రాము : అది ఎవరో మీవంటి బైరాగులకు సాధ్యం కాని మాలాంటి వాళ్ళకు సాధ్యమటయ్యా మహానుభావా?

విరాగి : మానవ మస్తిష్కం పూర్తి పరిణామాన్ని యింకా పొందలేదు నాయనా! అద్యతన భావిలో మానవుని మనసు వికసిస్తుంది: మనిషిని మనిషి ప్రేమించగలిగే సుదినం ఆసన్నమౌతుంది. ఆనాడు ప్రపంచంలో పీడించే వాళ్లు పీడించబడేవాళ్లు అనే వర్గాలుండవు. ఆ శుభోదయం కొరకు మనం ఆశతో ఎదురు చూడాలి: తాత్కాలికమైన కష్టాలను తట్టుకోలేక, దుర్మార్గాలకు ఆత్మహత్యలకు ఒడిగట్టగూడదు. యామినీ! యిక నీ సంకల్పాన్ని విరమించు!

యామిని: స్వామీ! మీ మాటలు వింటూవుంటే నాకు ప్రపంచం మీద అనురాగం కలుగుతోంది. కాని వెంటనే దుస్స్వప్నంలా మా యింటి పరిస్థితులు జ్ఞప్తికివచ్చి నన్ను మృత్యు గుహలోకి తరుముతున్నై. ఏం చెయ్యడానికి తోచక రెండు విరుద్ధశక్తుల మధ్యపడి కొట్టుకుంటున్నాను స్వామీ! ఏ పరిస్థితులలోను నేను యింటికి తిరిగి వెళ్ళలేను. ఆ పాప పంకిలంలో చూస్తూ అడుగు పెట్టలేను. ఆ ప్రపంచంలో రత్నాకరం మాటకు తిరుగు లేదు.

రాము : (కోపంతో) ఎవడా రత్నాకరం? నాకేమి చెయ్యగలడు?

యామి : ఏమైనా చెయ్యగలడు. అతని మాటకు అడ్డు చెప్పేవాళ్ళుకూడా లేరక్కడ. అందరికీ న్యాయం చెప్పే వూరి పెద్ద, ధర్మకర్త అయిన పార్వతీశం రత్నాకరానికి దగ్గర చుట్టం. ఆయన రత్నాకరానికి వ్యతిరేకంగా తీర్పు చెప్పడు. ఆయనకు కులాభిమానం హెచ్చు.

రాము : (మరింత కోపంతో) కులాభిమానం వున్న వాణ్ణి ఖూనీ చేస్తాను. నా గురుదేవు డేమన్నాడో తెలుసా? "ఒరేయ్ రాముడూ? కులాభిమానాన్ని కూకటి వేళ్ళతో పెళ్లగించు! అందుకు అడ్డువచ్చిన వాణ్ణి ఆలోచించకుండా హతమార్చు!" అన్నాడు.

యామి : అంతటి ముచ్చటైన సలహా యిచ్చిన ఆ గురుదేవు డెవరయ్యా?

రాము : (గట్టిగా నవ్వి) నా గురుదేవుణ్ణి నువ్వు ఎరుగవా? అతడంటే చరాచర జీవకోటికి సింహస్వప్నం. అతని దృష్టి పథంలో నిమ్నోన్నతాలు లేవు. రాజాధిరాజు కానీ, నిరుపేద కానీ, అతని కందరూ సమానమే! అతనిని తప్పించుకోవడానికి ప్రతి ప్రాణీ పెనుగులాడుతుంది, కాని ఫలితం శూన్యం. ఇప్పటికైనా అర్థమయిందా నా గురుదేవు డెవడో? అలా తెల్లబోయి చూస్తావేం వెర్రిపిల్లా? రాముడి గురువు యముడు!!!

యామి : అయితే నీ గురువుగారికి నా గురించి కొంచెం చెప్పకూడదూ?

రాము : నా గురువు ఒకరిమాట వినే బాపతు కాదు. తనకు ఎంత తోస్తే అంతే! అతని నిర్ణయానికి తిరుగు లేదు.

విరాగి : నాయనా! రాముడూ! నీ రూపంలో కర్కశత్వం. మాటలలో విజ్ఞానం తొణికిసలాడుతున్నై. అసలు నువ్వు ఎవరవు? ఎందుకు యిలా మారేవు?

రాము : ఆ విషయం చెప్పడానికి గురువాజ్ఞలేదు. గతాన్ని మరిచిపోమన్నాడు నా గురువు. వర్తమానాన్ని అవసరమైతే భుజ బలంతోనైనా సరిదిద్దకోమన్నాడు. గురువాజ్ఞకు తిరుగులేదు. నేనే నా గురువు. నా గురువే నేను. రాముడే యముడు. యముడే రాముడు! ఒక్క మాటలో చెప్పాలంటే రాముడు యముని అపరావతారం.

విరాగి : (నిశ్చలస్వరంతో) రాముడూ! నీకుగాని, నీగురువు యముడికీగాని జడిసేవాళ్లు ఎవరూ లేరిక్కడ! నీ సిద్ధాంతాలు యిక్కడ ఎందుకూ కొరగావు! అవసరమైతే మృత్యువు కైనా ఆనందంతో స్వాగతం ఇవ్వగలం.

రాము : (ఆలోచిస్తూ) నిజం! నాకు యిప్పుడే ఏదో నూతన సత్యం బోధపడుతున్నట్టుంది. ఇక్కడ యీ వాతావరణం ఎంత ప్రశాంతంగా వుంది! ఇక్కడి పరిసరాలు నాలోని క్రోధాన్ని, అసహనాన్ని లాలించి జోల పాట పాడుతున్నై. ఇక్కడ మరికొన్ని క్షణాలు వుంటే నేను సమూలంగా మారిపోగలనేమోనని భయం కలుగుతోంది. (లేచి) సెలవు స్వామీ! ఇక నేను పోయివస్తాను (వెళ్లిపోబోతాడు)

విరాగి : ఆగు! యింతటి రాత్రివేళ నీవు వెళ్లడానికి వీలులేదు. ఈ రాత్రికి ఇక్కడే వుండిపో! నీకు పోవాలనివుంటే తెల్లవారిన తరువాత నీ దారిన నీవు పోవచ్చు!

రాము : (ఆగి ఆశ్చర్యంతో) రాముణ్ణి ఆజ్ఞాపించగలిగే వాళ్లు కూడా యీ ప్రపంచంలో వున్నారా? నాకు రవంతకూడా కోపం కలగడంలేదే!

విరాగి : అజ్ఞానంతో దారి తప్పుతున్న కుర్రవాణ్ణి ఆజ్ఞాపించడం తండ్రివిధి! కూర్చో నాయనా! ప్రశాంతంగా ఒకక్షణం కూర్చో! ఇక్కడి మలయపవనానికి నీలోని క్రోధాగ్నిని చల్లార్చగలశక్తి వుంది.

[రాముడు వేదికమీద కూర్చొని దీర్ఘాలోచనలో మునిగివుంటాడు]

యామి : పాపం! యితన్ని చూస్తే జాలి కలుగుతుంది. విద్యావంతుడిలా కనిపిస్తున్నాడు. భార్యా బిడ్డలను విడిచిపెట్టి యిలా తప్పుదారిని ఎందుకు నడుస్తున్నాడో? ఇతని యిల్లాలు పాపం! ఎంత దుఃఖపడుతోందో!

రాము : ఆడవాళ్ళకెప్పుడూ పెళ్ళాం,పిల్లలు, ఇల్లు, సంసారం యిదే గొడవ! నువ్వు అనవసరంగా నాకు సానుభూతి చూపించ నక్కరలేదు. నిజానికి నాకసలు పెళ్ళే కాలేదు.

విరాగి : పోనీ! తల్లిదండ్రులు లున్నారా?

రాము : నా తల్లిని నేను ఎరుగను! నేను ఉయ్యాల దిగకముందే ఆమె ప్రపంచాన్ని విడిచి పెట్టింది. కాని నా తండ్రిమాత్రం (గద్గద స్వరంతో) నా కళ్లముందే యీ పాడు ప్రపంచం హతమార్చింది. జరిగిపోయిన ఆ సంఘటనలు జ్ఞప్తికివస్తే నాకళ్లెదుట రక్తపు పొరలు కమ్ముకుంటాయి. ఇక నాకు చూపు కనిపించదు. ఏంచేస్తానో నాకే తెలీదు.

విరాగి : భయపడకు నాయనా! ఈ వేదికమీద కూర్చున్నంతకాలం క్రౌర్యం నిన్ను సమీపించలేదు. నీ గతచరిత్రను నిర్భయంగా చెప్పి నీ హృదయ భారాన్ని దించుకో!

రాము : నేను గతాన్ని స్మృతిపథంలోకి రానివ్వకుండా జాగ్రత్త పడుతున్నాను. నాలో మిగిలినభావం ఒకటే ఒకటి—అదే ప్రతిహింస! (కోపంతో) అందరు మానవులు అనుభవించే ఆనందానికి నన్ను దూరంచేసిన దుష్టశక్తులను రూపుమాపాలి. నా జీవిత సౌఖ్యాలను కొల్లగొన్న విషశక్తులను హతమార్చాలి! హింసను ప్రతిహింసతో అణచాలి! అదే నా జీవితలక్ష్యం.

విరాగి : నువ్వు తప్పుత్రోవను నడుస్తున్నావు నాయనా! హింస ప్రతిహింసద్వారా ఎన్నటికీ అణచబడదు. పైగా మరింత ఉద్ధృతమౌతుంది.

రాము : (కోపంతో) ఇటువంటి చచ్చు సిద్ధాంతాలతో మీవంటి బైరాగులు యీ ప్రపంచాన్ని ఇంతవరకూ మోసం చేస్తూ వచ్చారు. కాని నేడు రాముడిలాంటి పీడిత ప్రజలు కోటానుకోట్లు కళ్లు తెరిచారు. ఇక యీ ఆటలు సాగవు—పాపం, పుణ్యం, పరలోకం, దేవుడు, స్వర్గం, నరకం, యీ మాటలను ఆయుధాలుగా తీసుకుని కొన్ని వర్గాలు మానవుల్ని పీల్చి పిప్పి చేసినై. జాతిని నిర్వీర్యం చేసినై. ఇక యీ పరిస్థితులు మరొక అడుగుకూడా ముందుకు జరగడానికి వీల్లేదు.

విరాగి : (ప్రశాంతంగా) లోకంలో జరుగుతున్న దౌర్జన్యాలను, అన్యాయాలను, నేను యేనాడో గుర్తించాను నాయనా! దేవుడిమీద, పరలోకంమీద నాకూ నమ్మకంలేదు. అంతా కర్మ అనుకొని కిక్కురు మనకుండా అష్టకష్టాలు, అనుభవిస్తే పరలోక సౌఖ్యం కలుగుతుందన్న సిద్ధాంతానికి నేను శుద్ధ వ్యతిరేకిని! మనయిద్దరి సిద్ధాంతాలు ఒకటే. పరిస్థితులు మారడానికి ప్రతిహింస అవసరమని నువ్వంటావు. కాదని నేనంటాను! అదొకటే భేదం.

యామి : (ఆశ్చర్యంతో) మీరు కూడా నాస్తికులా స్వామీ!

విరాగి : దేవుణ్ణి నిత్యం పూజిస్తూ పాపపు పనులు అవలంబించే కంటే, యే ప్రాణికీ బాధకలిగించకుండా సత్ప్రవర్తనతో జీవితాలను సాగించగలగాలి! అనాడే యీ ప్రపంచానికి మహోదయం కలుగుతుంది యామినీ! ఒక వేళ దేవుడే వుంటే ఆయన కూడా యీ సత్ఫలితానికి ఆనందిస్తాడు. ఈ సత్యాన్ని బుద్ధ భగవానుడు ఏనాడో తెలియజేశాడు. ఆ మహత్తర జ్ఞానజ్యోతిని మానవుడింకా సమీపించలేక పోతున్నాడు.

రాము : మీ మీద క్షణక్షణానికి గౌరవం ఎక్కువౌతోంది. అయినా ప్రతిహింస కూడదన్న సిద్ధాంతాన్ని నేను అంగీకరించలేను. స్వామీ! నా గతచరిత్ర వినండి. ఆ తరువాత ప్రతిహింస అవసరం లేదు అని మీరు చెప్పగలిగితే నేను కూడా నా అభిప్రాయాన్ని మార్చుకుంటాను. నేను గతాన్ని జ్ఞాపకం చేసుకుంటే నాలో మానవత్వం నశించిపోతుంది. చెడ్డగా ప్రవర్తిస్తానేమోనని నాకే భయంగావుంది.

విరాగి : నీ కాభయం అవసరంలేదు నాయనా! నా సమక్షంలో నీ ప్రవర్తన దారి తప్పదనే నమ్మకం నాకువుంది. నువ్వు నిర్భయంగా చెప్పవచ్చు.

రాము : (దీర్ఘ నిశ్వాసం విడిచి) నా తండ్రి ముసలివాడై ఉద్యోగంనుంచి విరమించేసరికి అప్పుమాత్రం మిగిలింది. వెంటనే నేను చదువుతున్న చదువును అక్కడకు ఆపుచేసి గుమస్తాగా ఉద్యోగంలో చేరాను. కష్టపడి సంసారాన్ని సాగిస్తున్నాం. ఆ సమయంలో ఆకస్మికంగా మా నాన్నకు జబ్బు చేసింది. నాకు లోకజ్ఞానం బొత్తిగాలేని రోజులవి. చాలా విచారించాను. మేం దరిద్రులమైనందువల్ల మా బంధువులు కూడా మా కేవిధమైన సహాయం చెయ్యలేదు. (కోపంతో) పుర్వార్జితం అనే ముద్రతో మాకు ఆస్తివుంటే బంధువులు మా చుట్టూ పడిగాపులు పడివుండే వారు. కాని మేం దరిద్రులమైనందువల్ల ఒక్కడు, కనీసం ఒక్కడు, కూడా మా కష్టానికి సానుభూతి చూపలేదు.

యామి : అందుకేనా కులాభిమానం వున్నవాళ్ళను చంపుతానంటున్నావు?

రాము : కులం అనే ముసుగులో స్వార్థం తాండవం చేస్తోంది. అంతా మోసం! కపటం! (రౌద్రంతో) కులాభిమానాన్ని కూకటి వేళ్ళతో పెళ్లగించే వరకూ యీ రాముడు విశ్రాంతి తీసుకోడు!

విరాగి : ఆవేశపడకు నాయనా! ఆతరువాత యేంజరిగింది? మీ నాన్నకు చికిత్స చేయించావా?

రాము : వెంటనే మా నాన్నను హాస్పిటల్‌కు తీసుకువెళ్ళాను. ఖాళీలేదు పొమ్మన్నాడు డాక్టర్! ఈ పరిస్థితిని గమనిస్తున్న ఒక పెద్ద మనిషి నాకో సలహా యిచ్చాడు. ఆ సలహా విని ఆశ్చర్యపోయేను. నన్నొకడు పీడిస్తున్నప్పుడు నేను మరొకడిని పీడించాలి. అంతకంటే గత్యంతరం లేదు. ఏమైనా నా తండ్రిని రక్షించుకోవాలి. అవసరమైతే ఎంతటి నైచ్యానికైనా ఒడిగడతాను ఆ సమయంలో నాలో ఉన్మత్తత ప్రవేశించింది. లంచం తీసుకొని మా ఆఫీసులో ఒక పని పూర్తిచెయ్యడానికి పూనుకున్నాను. వెంటనే దొరికిపోయాను. నేను సెంట్రల్ జైలుకు, మా నాన్న యమసదనానికి ఒకేసారి ప్రయాణమయ్యాం. (కోపంతో) ఈసారి చెప్పండి స్వామీ! సమాజానికి పెద్ద పులి ప్రమాదకరమైనదా? డాక్టరు ప్రమాదకరమైన వాడా?

విరాగి : ఉదాత్తమైన ఒక వృత్తికే కళంకం తీసుకువచ్చే దుర్మార్గులు కొందరు వుంటారు. నాయనా! అంతమాత్రాన మనం అందరినీ నిందించ కూడదు.

రాము : (కోపంతో గట్టిగా) ఒక డాక్టరు దురాశకు నా తండ్రి బలైపోయాడన్న విషయం మీరు మరిచిపోకూడదు స్వామీ! ఈ దుర్ఘటనకు నా హృదయం కరడుగట్టిపోయింది. నాలోని అణువణువు "ప్రతిహింస"! "ప్రతి హింస" అని అరచింది. జైలు నుంచి విడుదలై వచ్చాను! వెంటనే డాక్టరు బుర్ర రామకీర్తన పాడించాను. తిరిగి జైలుకు వెళ్లాను. రెండవసారి జైలునుంచి విడుదలైయిప్పుడే వస్తున్నాను. మూడు రోజులలో తిరిగిమూడవసారి జైలుకు వెడతాను. తెలిసిందా స్వామీ! ఇదీమనకథ!

విరాగి : నీవు ఒకవిధమైన ఉన్మాద స్థితిలో ఉన్నావు రాముడూ! అచిరకాలంలో నే యథాస్థితికి రాగలవు. గతాన్ని స్మృతిపథంలోకి రానివ్వకుండా యీ రాత్రి హాయిగా విశ్రమించు.

చిరం : (ఆలయ ద్వారం దగ్గర నిలుచుని) స్వామీ! అన్నీ సిద్ధంగా వున్నాయి.

[విరాగి ఆలయంలోకి వెళ్లి పోతాడు. చిరంజీవి వేదికను సమీపిస్తాడు ]

చిరం : మీరు కూడా ఆలయంలోనికి వచ్చి పడుకో వచ్చు.

రాము : ఒరేయ్ తమ్ముడూ! మనకు అర్ధరాత్రి గడిచే వరకూ నిద్రపోయే అలవాటు లేదు. మరి కొంతసేపు యిక్కడే కూర్చుంటాను (యామినితో) పాపం! చాలా అలసిపోయి నట్లున్నావు. నువ్వైనా లోనికి వెళ్ళి సుఖంగా నిద్రపో!

యామి : (నిట్టూర్చి) నా బ్రతుకుకు నిద్ర కూడానా? సుఖంగా నిద్రపోయి ఎంత కాలమయ్యిందో? (చుట్టూ చూస్తూ) ఈ ఆలయం పూల మొక్కలు యివన్నీ చూస్తూ వుంటే నాలో తెగింపు, వైరాగ్యం కలుగుతున్నై. పోయి నిద్ర పట్టుతుందేమో ప్రయత్నిస్తాను. (ఆలయంలోనికి నిష్క్రమిస్తుంది.)

రాము : (ఆమె వెళుతూన్న వైపు చూస్తూ) వెర్రి పిల్ల! లోకానికి జడిసి పారిపోయి వచ్చిందట! (చిరంజీవితో) ఒరేయ్ తమ్ముడూ! లోకం ఎలాంటిదో తెలుసా! వెర్రి కుక్క లాంటిది. మనం జడిసి ఒక అడుగు వెనక్కి వేశామో! అది అమాంతంగా మీద పడి కాటు వేసిందన్న మాటే!

చిరం : (వింతగా) అలాగా! అయితే నేను కూడా పారిపోయే యిక్కడకు వచ్చాను.

రాము : (హేళనగా) పిరికివాళ్ళంతా యిక్కడకు చేరారన్న మాట! — రోజు రోజుకు లోకంలో పిరికివాళ్ల సంఖ్య పెరిగి పోతోంది. పరిస్థితులు మారాలి! పీడితుల హృదయాలలో ధైర్యాన్ని ప్రకోపింప చెయ్యాలి. యుద్ధానికి సిద్ధం కావాలి. స్వార్థపరుల చేతుల్లోంచి అధికారాన్ని చేజిక్కించుకోవాలి. అప్పుడే హాయిగా విశ్రాంతి తీసుకోవడానికి అర్హత మనకు వుంటుంది. అంతవరకూ విశ్రాంతి మనకు లేదురా వెర్రినాయనా!

చిరం : మరి స్వామి చెప్పేమాటలకు నువ్వు చెప్పే మాటలకు చాలా తేడా వుందే!

రాము : అక్కడేవుంది విశేషం. ఎవడైనావచ్చి బుర్ర పగలగొడుతూ వుంటే చూస్తూ వూరుకోమంటాడు స్వామి. మనల్ని అణగ ద్రొక్కడానికి పైకెత్తిన ప్రతి పాదాన్ని విరిచి అవతల పడవేయాలంటాను నేను. మరి నువ్వేమంటావ్?

చిరం : (ఉత్సాహంతో) నువ్వు చెప్పిందే బాగుందంటాను!

రాము : (సంతోషంతో) భేష్! నువ్వు తప్పకుండా పనికొస్తావు. ఈ రోజునుంచి నిన్ను నా ప్రధాన శిష్యుడుగా స్వీకరిస్తున్నాను.

చిరం : (సంశయిస్తూ) కానీ నాకో సందేహం వుంది?

రాము : (బిగ్గరగా) విలువలేదు నీకు సందేహం కలగడానికి ఎంతమాత్రం విలువలేదు. ఒక వేళ కలిగినా దానిని దాచుకోడానికి అంతకంటే విలువలేదు. అదేమిటో తక్షణం చెప్పు.

చిరం : స్వామిచెప్పే అహింసాసిద్ధాంతం అంత పనికిరానిదా? దానివల్ల ప్రయోజనం లేదూ?

రాము : నేటి దోపిడీ వ్యవస్థలో అహింసాసిద్ధాంతం ఎందుకూ కొరగాదు. ప్రపంచంలో అహింసా సిద్ధాంతాలను ప్రచారంచేసిన మహాత్ములందరూ హింసకు బలియైపోయారు ఇది నగ్న సత్యం. సౌభాగ్యాలతో విలసిల్లే ప్రపంచంలోనే అహింసా సిద్ధాంతానికి విలువ వున్నది. కాని వర్తమాన ప్రపంచంలో దాని విలువ పూజ్యం.

చిరం : నీ మాటే నిజమనిపిస్తోంది.

రాము : నిజాన్ని మాయమాటలతో ఎంతకాలం దాచగలరు! అది ఎప్పటికైనా బయటకు వచ్చితీరుతుంది. దావానలంవలె యీ పృథివి అంతా వ్యాపిస్తుంది. పతితజీవులు కళ్లు తెరుస్తాయి. పగ సాధిస్తాయి.

చిరం : (ఆలోచిస్తూ) అవును! నాకిప్పుడు జ్ఞాపకం వస్తోంది. పగ తీర్చుకోవాలని నా మనసు గాఢంగా కాంక్షించేది. (చేతితో చూపిస్తూ) దూరాన్ని కనిపిస్తున్న ఆ పట్టణంలో ప్రతివాడు నన్ను నీచంగా చూచేవాడు. నా తోటి పిల్లలవలె నేనుకూడా అందమైన బట్టలు వేసుకోవాలని, ఆటవస్తువులు కొనుక్కోవాలని, కారులమీద విలాసంగా తిరగాలని ఉవ్విళ్ళూరేవాణ్ణి. ఇంటిలో చూస్తే తినడానికి తిండికూడా లేదు. ఆలోచనలు మాత్రం ఆకాశాన్ని తాకుతున్నై. వూళ్ళో ప్రతిమనిషి నన్ను చూచి కంటగించుకొనే వారు.

రాము : (చిరంజీవిని నఖశిఖపర్యంతం పరికించి చూచి) నీకేం! చూడ్డానికి చక్కగా ఉన్నావు. నిన్ను చూచి అసహ్యించుకునే దౌర్భాగ్యు లెవరు?

చిరం : (విచారస్వరంతో) అందరు అసహ్యించుకొనేవారు గిట్టచివరకు వాళ్ళ పెంపుడు కుక్కను చూచినట్లు చూచినా ఆనందించే వాణ్ణి. కాని అలా కూడా జరగలేదు. అందుకు కారణం నా తల్లిదండ్రులు....

రాము : ఏం? నీ తల్లిదండ్రులు హంతకులా?

చిరం : హంతకులయితే వాళ్ళ నేరానికి తగినశిక్ష వాళ్ళే అనుభవించి వుండేవారు. కాని వాళ్ళు అంతకంటే గొప్ప నేరం చేశారు. ఆ నేరం యేమిటో తెలుసా? కడజాతిలో పుట్టిన మా అమ్మను ఉన్నతజాతిలో పుట్టిన ఒక మహానుభావుడు పెళ్ళి చేసుకున్నాడు.

రాము : (సంతోషంతో) దివ్యంగా ఉంది. మంచి పని చేశాడు. వాళ్ళిద్దరి సంతానం నీవేనన్న మాట! చాలా బాగుంది.

చిరం : ఏం బాగు? నా తల్లిదండ్రులకు కనీసం డబ్బు ఉన్నా సుఖపడి ఉండేవాళ్ళం. అష్టకష్టాలు అనుభవించి జబ్బుచేసి మా నాన్న, ఆత్మహత్య చేసుకొని మా అమ్మ చనిపోయారు. కొంతకాలం నేను ఒంటరిగా గోష్ఠిమీద తిరిగి తిరిగి ప్రాణం విసిగి యీకొండ శిఖరం మీదకి వచ్చాను. కళ్ళు మూసుకొని సముద్రంలోకి దూకబోయే సమయంలో స్వామి వచ్చి నా ప్రయత్నాన్ని విరమింపజేశారు. నాలో ఉత్సాహాన్ని కలిగించారు. చదువు నేర్పారు. నన్ను తనకొడుకువలె గారాబంతో చూస్తున్నారు. వారంటే నాకు అమితమైన గౌరవం.

రాము : నిజంగా ఆయన మహాత్ముడు. అందుకు సందేహం లేదు. ఆ అహింసా సిద్ధాంతాన్ని వదులుకుంటే నా తలపైన పెట్టుకుపూజిస్తాను.
[ఆలయంలోంచి యామిని వస్తుంది.]

యామి : (వేదికమీద కూర్చుంటూ) ఎంత ప్రయత్నించినా నిద్రపట్టలేదు. ఇక్కడ అడుగు పెట్టినప్పటినుంచీ నాలో అనిర్వచనీయమైన ఉత్సాహం కలుగుతోంది.

రాము : నీకుకూడా అర్ధరాత్రి వరకూ నిద్రపోయే అలవాటు లేదన్నమాట!

యామి : (అరమోడ్పుకళ్ళతో) నాకు విచిత్రమైన అనుభూతి కలుగుతోంది. నా మనసులో యిప్పుడు భయసంకోచాలు లేవు. నా హృదయము దివ్యానందములో మునిగి తేలుతోంది.

రాము : అందుకు ఆశ్చర్యం లేదు. ఆ పాడు ప్రపంచంతో నీకుగల సంబంధాన్ని యే క్షణంలో త్రెంచుకున్నావో ఆ క్షణంనుంచీ నీ హృదయం తేలికయ్యింది.

యామి : అది నిజంకాదు. ఈ శిథిలాలయంలో ఏదో మహత్తు వుంది. ఆ ప్రపంచంలో జరుగుతున్న ఘోరాలను చూడలేక దేవుడు యీ పాడు దేవాలయంలో స్థిరనివాసం ఏర్పరచుకొని వుండాలి. అదే నిజం! ఎక్కడ ప్రశాంతత వుంటో అక్కడే దేవుడు వుంటాడు. న్యాయం, ధర్మం, ఆనందం ఎక్కడ వుంటాయో అక్కడే దేవుడు వుంటాడు. అవన్నీ యిక్కడ వున్నాయి. అందుకే యిక్కడ దేవుడు వున్నాడు.

రాము : (హేళనగానవ్వి గట్టిగా) చూడగాచూడగా నీకు మతిపోతున్నట్లు కనిపిస్తోంది.

ఒకగొంతు : (దూరాన్నుంచి కర్కశంగా) ఏయ్! ఎవరక్కడ?

రాము : (మాట వినిపించిన వైపుతిరిగి గట్టిగా) యిక్కడా అండీ? యిక్కడ చాలామంది వున్నారండి! తమరేంపనిమీద వచ్చారో యిలాదయచేయవచ్చు!

యామి : (భయంతో) నా కోసం ఎవరైనా వస్తున్నారేమో! నాకు భయం వేస్తోంది.

రాము : (హేళనగా) దేవుణ్ణి ప్రార్థించుకో! వచ్చి రక్షిస్తాడు! [కుడివైపు చెట్లలోంచి రత్నాకరం వెతుక్కుంటూవస్తాడు. చేతిలో లాంతరువుంది. మరోచేతిలో కర్రవుంది. మనిషిలావుగా బలంగావుంటాడు. వయస్సు ౪౫ సంవత్సరాలు. ముఖంలో నిర్దాక్షిణ్యం, కపటం కనిపిస్తూ వుంటాయి. అతనిని చూడగానే యామిని భయంతో వణికిపోతూ నల్లని ముసుగులో శరీరాన్ని దాచుకుంటుంది. చేతులు మాత్రం కనిపిస్తూ వుంటాయి]

రత్నా : (కర్కశస్వరంతో రాముడితో) ఏయ్! యిలా ఒక పిల్ల వచ్చిందా?

రాము : (వినయంగా) పిల్లిపిల్లా, మేకపిల్లా, బాబూ?

[చిరంజీవి నవ్వుతాడు]

రత్నా : ఏం? నవ్వులాటగా వుందా? నే నెవరినో తెలుసా?

రాము : (వినయంగా) అది తెలిస్తే యీ సరికే మిమ్మల్ని మర్యాదచేసి వుండేవాళ్ళం. తెలియకే యిప్పటికి కూడా మిమ్మల్ని నిలుచో పెట్టి మాట్లాడుతున్నాం.

రత్నా : మీ రెవరో దూరదేశంనుంచి వచ్చిన వాళ్లయి వుండాలి. ఈ చుట్టుపట్ల రత్నాకరాన్ని తెలియని వాళ్లెవరూ లేరు.

రాము : (పరిహాస ధోరణిలో) పాపం! అతగా డెవరండీ?

[ఈసారి చిరంజీవి యింకా గట్టిగా నవ్వుతాడు]

రత్నా : (కోప పరవశుడై) రత్నాకరంతో పరిహాసమా? ఎవరు నువ్వు? తలచుకున్నానంటే నిలువునా చీరెయ్యగలను. తెలిసిందా?

రాము : (అదే ధోరణిలో) వీరో బీద వాళ్లం! తమ పాదాల దగ్గర గంజి తాగేవాళ్ళం. తమరు కనికరించాలి.

రత్నా : ఇక అధిక ప్రసంగం కట్టిపెట్టి యిలా ఒక ఆడమనిషి ఎవరైనా వచ్చిందేమో చెప్పు?

[ఈసారి చిరంజీవి భయంతో యామినికేసి చూస్తాడు. యామిని ముసుగులో యిమిడి పోయి వుంటుంది.]

రాము : ఎవరైనా వస్తే యీసరికే తమరికి కనిపించి వుండేవారు.

రత్నా : (యామినిని చూపిస్తూ) ఎవరీ ముసుగులో మనిషి?

రాము : మా ఆశ్రమంలోని ఒక బైరాగిని.

రత్నా : సన్యాసినికి ఘోషా కూడానా? ఆమె ముసుగెందుకు వేసుకుంది?

రాము : పాపాత్ముల ముఖాలు చూడ్డం యిష్టం లేక.

రత్నా : (కోపంతో బిగ్గరగా) ఒరేయ్ నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుస్తున్నదా?

రాము : చిత్తం! తెలుస్తున్నదనే అనుకుంటున్నాను.

రత్నా : ఇక నోరు మూసుకుని యీ స్త్రీ ఎవరో ముసుగు తొలగించి నాకు చూపించు!

రాము : స్వామీ! మేము అహింసా సిద్ధాంతాలను వల్లించే బైరాగులం. మీరేం చేసినా మేం సహించాలి. యేం చేస్తాం! అంతా పూర్వ జన్మ కర్మఫలం! మా కర్మానికి మమ్మల్ని వదలి పెట్టి తమ దారిని తాము దయ చేయండి!

రత్నా : ఇక నీ కపటనాటకాన్ని కట్టిపెట్టి ఆమె ముసుగు తొలగించి మర్యాదగా చూపించు! లేదా నీ ప్రాణాలు నీవికావు.

రాము : నాయనా! చిరంజీవీ! అహింసా సూత్రాలు ఎటువంటి ఫలితాల నిస్తాయో చూశావా? మనం "అహింస" "అహింస" అని అరిచే కొద్దీ (రత్నాకరాన్ని చూపుతూ) ఎదుటి మనిషి యీ విధంగా చెలరేగుతాడు.

రత్నా : (కోప పరవశుడై) నేను సహించి వూరుకొనే కొద్దీ నీకారు కూతలకు మితి లేకుండా వుంది (యామినిని చూపిస్తూ) యీమె ముసుగు తొలగించి చూపిస్తావా లేదా నన్నే యీమె ముసుగు తొలగించమంటావా?

[రత్నాకరం యామినిని సమీపిస్తాడు రాముడు వెంటనే లేచి అతనికి అడ్డువస్తాడు]

రాము : (కోపంతో కళ్లెర్రచేసి) మృత్యుదేవతను చూడాలని ముచ్చటగావుంటే ముసుగు తొలగించవచ్చు.

రత్నా : (కోపంతో) ఓహో! బెదిరింపులకు కూడా దిగావే! ఇప్పుడే ముసుగు తొలగిస్తాను, యేం చేస్తావో చూస్తాను. (కోపంతో ముందుకు అడుగు వేసి ఆమె ముసుగు లాగేస్తాడు. యామిని భయంతో కెవ్వున కేక వేస్తుంది. వెంటనే రాముడు అతనిని మెడ పట్టుకొని బలంగా ముందుకు తోస్తాడు. రత్నాకరం నేలమీద పడిపోతాడు.)

రాము : (రెండు చేతులతో కర్ర పైకెత్తి) ఒరేయ్! రత్నాకరుడూ! కాసుకో! యీ రోజుతో నీ జీవితం సమాప్తమౌతోంది!

విరాగి : (ఆలయద్వారంలో నిల్చుని బిగ్గరగా) రాముడూ!

[రాముడు మంత్రముగ్ధునివలె కర్ర క్రిందకు దించి విరాగికేసి చూస్తాడు. విరాగి ఆలయం మెట్లుదిగి అతనిని సమీపిస్తూ వుంటాడు. యామిని, చిరంజీవి ఆశ్చర్యంతో చూస్తూ వుంటారు.]

[తెర]

సశేషం

# వస్తాదు వీరన్న

శ్రీ బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

వీరన్న మహాబలశాలి. మంచి వస్తాదు. అలాంటి వాడిలా అవుతాడని ఎవరూ కలలో కూడా అనుకోలేదు.

ఆరోజు ఎప్పటిలాగే తెల్లవారు జామున కోడి కూసే వేళ లేచి చెరువుకు పోయి, మొహం కడుక్కుని తాలింఖానాకు పోయాడు. కసరత్తు చేయడానికి, కుస్తీలు పట్టడం అభ్యాసం చేయడానికి ఓ పదిమంది చేరుతారక్కడ ప్రతిరోజూ. వారందరికీ, చిన్నవాడైనప్పటికీ వృద్ధిలోనికి వచ్చినవాడు కాబట్టి వీరయ్య అంటే గౌరవం. ఆసీమలో కల్లా ఊరు పేరూ వున్నవాడు కదా మరి. ఆ చుట్టుపట్ల వున్న నాలుగైదు పట్టణాలకూ పోయి ఎవడైనాసరే కుస్తీకి రమ్మని, నూట పదహార్లు పందెం వేసి, బస్తీమే సవాల్ చేశాడు వీరయ్య. ఆయా వూళ్ళలోని వస్తాదు లందరినీ చిత్తుచేసి, మెడలో పూలదండలతో భీమసేనుడిలా తిరిగి వచ్చాడు. చాలమంది పంజాబీ ఫయిల్మానులను కూడా చిత్తుచేసి, తన పేరు వారికి కలకాలం జ్ఞాపకముండేటట్లు చేశాడు.

వీరన్న ఒడ్డూ పొడవూ వున్న మనిషి. కసరత్తువల్ల కండలు తిరిగిన శరీరం. తివాసీసుండు. చిన్నప్పుడు జబ్బుచేస్తే, కుడికంటికి చెవికీ మధ్య, నిలువునా, తిరిగిన దొండకాయ ముక్కంత, వాత పెట్టిన మచ్చ. మెడలో ఆంజనేయుడి బిళ్ళ, జబ్బకు బంగారు తావేజు ఎండలో నిగనిగ మెరిసేవి. లంగోటి బిగించికట్టి, ఒంటికి రేగడి మన్ను రాసుకుని, గురువు పాదాలకు దండం పెట్టి, నోట్లో పళ్ళమధ్య నిమ్మకాయ కొరుకుతూ, తొడచరిచి కుస్తీకి తలబడితే ఎదుటివాడి గుండెలు భయంతో గడగడ వణికేవి. చూసేవారిలో ఉద్రేకం ఉప్పొంగేది.

అలాంటి వీరయ్య ఇలా అవుతాడని ఎవరూ కలలోకూడా అనుకోలేదు.

చెరువులో స్నానం చేసి, మల్లుపంచ కట్టి, మల్లు చొక్కా వేసుకుని, పావంచాల మీదికి వచ్చి బీడీ వెలిగించాడు. బట్టలుతుక్కోడానికీ, స్నానాలు చేయడానికీ చెరువుగట్టుకు వచ్చిన ఆడంగులు వీరన్నను చూసి, ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. "ఏటి ఈరన్నా ఎక్కడికేటి యీ ముస్తాబు, ఏటి ఇసేసం" అన్నారు పల్లెపడుచులు.

"నెల్లిమరలలో అమ్మోరిసంబరం చూడ్డాం రమ్మంటున్నాడు ఎంకయ్యబావ. కరుసు ఆడిదేలే" అన్నాడు వీరన్న బీడీపొగ వదులుతూ.

"నేకపోతే నువ్వెడతావేటి, పిల్లికి బిచ్చం పెట్టవు నువ్వా" అంది గొల్లపిల్ల నరిసి.

"ఓసి, ఊరుకోయే పిన్నమ్మా నా సంగతి నీకేటెరిక" అని పక్కనున్న బిందెను కాలుతో తోశాడు. బిందె చప్పుడు చేసుకుంటూ రెండు పావంచాలు దొర్లింది. వీరన్న "హి, హి, హి" అని నవ్వేడు.

"ఏటిగోరయ్యా ఆ పోగాలం, బాదంపప్పుతిని కసరత్తుసేత్తే ఒళ్లు కొవ్వెక్కినట్టుంది." అంది నరిసి.

"ఆడోళ్లు నీళ్లోసుకుంటారు, నువ్వేటికక్కడ, పో అవతలికి" అంది ఇంకో పిల్ల.

వీరన్న నవ్వుకుంటూ, వెళ్ళిపోయాడు. వెంకయ్యతో కలిసి నెల్లిమర్ల సంబరానికి వెళ్లేడు. వెంకయ్య, వీరన్న స్నేహితుడు. వెంకయ్యకూ, వీరన్నకూ నేస్తం ఎలా కుదిరిందో అందరికీ ఆశ్చర్యమే. ఏ విధంగానూ యిద్దరికీ పోలిక లేదు. వీరన్న వస్తాదు. వెంకన్న సన్నగా పొడుగ్గా ములగకాడలా వుంటాడు. వీరన్న మొద్దువాడిలా కనిపిస్తాడు. వెంకయ్య తెలివైన వాడిలా మాట్లాడుతాడు. అసలు రామమందిరంలో భజనకు వెళ్ళినప్పుడు కలిసింది వీరిద్దరికి నేస్తం. వీరన్న పాడితే, వెంకయ్య డోలకు వాయించేవాడు.

సంబరం చూసుకుని యింటికి తిరిగి బయలుదేరే సరికి చీకటిపడింది. ఊరు పొలిమేరల కొచ్చేసరికి రాత్రి పదిగంటలవుతుంది. వెంకయ్య అలసిపోయాడు. ఊరుబయట పాడుపడిన దేవాలయం మెట్లమీద చతికిల బడ్డాడు.

"ఏం వెంకయ్యా, రెండు కోసులదూరం నడిచే సరికే అలిసిపోనావేట్రా. ఇలాగైతే ఎలా బతుకుతావేఁవ్" అన్నాడు వీరన్న.

"ఒంట్లో బలంలేదు ఏటి సెయ్యగుంటావు. ఆయినా బతకడానికి బలమే ఉండాలేటి, ఎర్రిగాని" అంటూ వెంకయ్య మెట్లమీద నడుంవాల్చేడు. ఇద్దరూ బీడీలు వెలిగించారు.

ఆ కాలువకట్టల్లో వాళ్ల బీడీనిప్పులు తప్ప మరేం కనబడటం లేదు. అమావాస్య రాత్రిల్లే. వెనుకను పాడుపడిన కోనేరుచుట్టూ అడవి బలిసింది. ఆ నిశ్శబ్దంలో కీమరాళ్ల శబ్దంమాత్రం వినిపిస్తోంది. దూరాన ఊరిలో ఒకటీ రెండు దీపాలు మాత్రం మినుకు, మినుకు మంటున్నాయి.

వీరన్న ఆలోచిస్తున్నాడు. ఒక్క బలం ఉన్నంత మాత్రాన అంతా సిద్ధించినట్టేనా? మనిషికి బలం ఒక్కటే కాదు కావలసింది. మావటివాడికి ఏం బలముందని ఏనుగను లొంగదీసుకున్నాడు. పిల్ల పండుగనాడు సాయిబు అగ్గిలోంచి నడుస్తాడు. వాడికేం బలముందని?

అవును వెంకయ్య చెప్పింది నిజమే. వెంకయ్య తెలివైనవాడు. "ఎంకయ్యా" అని పిలిచేడు వెంకయ్య నిద్రపోతున్నాడు అలసివున్నాడేమో కునుకు పట్టింది.

"ఏం ఈరన్నా, పోదామా" అన్నాడు వెంకయ్య కొంచెం ఒత్తిగిలి.

"దప్పికగా వుంది. ఇక్కడెక్కడేనా నీరుందిరా" అన్నాడు వీరన్న.

"వెనుక ఒడ్డెక్క నేనుయ్యివుందిరా. అక్కడే బాల్చీకూడా వుంటుంది సూడు"

వీరన్న నూతిదగ్గర కెళ్లేడు. ఎదురుగుండా దూరాన మైదానం కనిపిస్తోంది. నల్లటి కంబళికి కన్నాలుపడినట్టు చుక్కలు మినుకు మినుకు మంటున్నాయి గాలిచలనం లేదు. చీకట్లు జిమ్ముతుంటూ చెట్లమీద ముసుగుతున్నాయి. దూరాన ఈతచెట్లు తెల్ల వెర్రి పోసుకున్న దెయ్యాల్లా వున్నాయి. కీమరాళ్ల శబ్దం, శరీరమంతటికీ తాకుతున్నట్టనిపించింది. దూరాన మైదానంలోంచి మెల్లిగా ఘల్లు ఘల్లుమంటూ తెల్లచీర కట్టుకున్న ఒక స్త్రీ నడిచివెళ్లినట్టు అనిపించింది. వీరన్న జాగ్రత్తగా తేరిపారజూశాడు. అబ్బే, అది స్త్రీ కాదు ఏదో ఆవుఅయివుంటుంది, అనుకున్నాడు. తన కాళ్లలోంచి ఏదో పరుగెత్తినట్టయింది. ఉలిక్కి పడ్డాడు. ఏదో కిచకిచమని అరిచింది, "ఛెయ్! ఎవ రక్కడ!" అని కేక వేశాడు. అగ్గిపుల్లతీసి వెలిగించి చూశాడు. నూతిగట్టునుంచి ఉడత అటు పరుగెట్టింది. వీరన్నకు దాహం పోయింది. తిరిగి వచ్చేశాడు.

"ఎవరురా అది ఈరన్నా, ఏటి కేకేస్తున్నావ్" అన్నాడు వెంకయ్య లేచి కూర్చొని.

"ఎవరూ నేదోయ్, ఉడత పిల్ల కాళ్లలో పడింది".

"ఈరన్నా, ఎంత పిరికోడివిరా నువ్వు"

"ఛ! నాకు భయమేటిరా!"

ఇద్దరూ లేచి, బీడీలు వెలిగించి ఊరువేపుకు నడక ప్రారంభించారు. ఆ నిశ్శబ్దం వీరన్నకు నచ్చలేదు.

"ఎంకయ్యా, మంచిదనుకు తీసేశావ్"

"నేదురా, కొద్దిగా కళ్లమూశా. ఇప్పుడెంత రేతిరి అవుతుందో గాని మహాచీకటిగా వుంది. దారి సమంగా ఆనకుండా వుంది"

దూరాన్న మైదానంలో ఇందాకటి మంట యింకా మండుతూనేవుంది. "ఏటిరా ఆ మంట, ఎంకయ్యా" అన్నాడు వీరయ్య. "ఏది, అదా? శ్మశానం గదిరా అది. ఎవర్నో తగలేస్తున్నారు గాబోలు."

"దాని తస్సాదియ్యా, ఎంతసేపు మండుతూంది రా" వీరన్నకు భయం వేసిందని వెంకయ్య గ్రహించాడు తాను బలశాలినని గర్వంతో విర్రవీగే ఘయిల్వాను ఇంత పిరికివాడని తానింతకాలం ఊహించలేదు. చిరుతపులిలా మనుషులమీదికి ఉరికే వీరన్న అకారణంగా చెట్టునూ, పుట్టనూ చూసి జడుస్తున్నాడు. వీరన్నను ఇంకా భయపెట్టాలనిపించింది వెంకయ్యకు.

"ఈరన్నా రాత్రేళ చీకట్లో నువ్వెప్పుడూ రానే దేటి? ఇక్కడెట్టి భయం నేదు గాని ఆ తోట దాటి ఎల్లడం మంచిది కాదు. శ్మశానంగదరా. దెయ్యాలు తెగ తిరుగుతాయి. మనిషి ఒంటరిగా దొరికితే నాశనం చేసి పీక్కు తినేస్తాయి. కోమటోళ్ల పిల్ల సచ్చిపోయింది గదా. అది దెయ్యమయింది. ఆ దారంట ఎవడేనా ఎల్లితే ఎనకనుంచి పంచకొంగు పట్టుకు లాగుతాది", అని వెంకయ్య వీరన్న మొహంలోకి చూశాడు.

వీరన్న మొహంలో భయం కనిపించింది. ఆ మానవాతీతమయిన శక్తి స్వరూపం ఎలా వుంటుందో ఊహించుకోడానికి ప్రయత్నిస్తున్నాడు వీరన్న.

"ఎలాగుంటుందిరా దెయ్యం?" అని అడిగేడు.

"నువ్వు నూరేళ్ళేనేటి ఎప్పుడూ? అది నల్లగా మొహం, పెద్దపళ్ళు; మహా వికారంగా వుంటుంది. తెల్లచీర కట్టుకుంటాది. రవిక ఏసుకోదు. దాన్ని సూస్తుంటేగానే శరీరం ఎదిగిపోతా వొస్తాది. కాళ్ళు తాటిచెట్టులాగ, చేతులు మర్రి ఊడల్లాగ ఎదిగిపోతాయి. మనిషి నల కొత్తలే చేతులూపుతూ నడుస్తాది. భయంకరంగా నవ్వుతాది, ఏడుస్తాది." వెంకయ్యకు మరి యింతకంటె భయంకరంగా వర్ణించడం చాతనయింది కాదు.

"అయితే అది మనుషుల్ని ఏం సేస్తాదా?" అని వీరన్న అడిగేడు. వెంకయ్యకు నవ్వొచ్చింది. అది విజయగర్వంతో కూడిన నవ్వు. ఆ ప్రశ్నతోనే వీరన్న మనస్సులో వున్న భయాన్ని అర్థం చేసుకున్నాడు వెంకయ్య. నవ్వు అణచుకుని, "ముందు దండం పెట్టి ఆంజనేయదండకం సదువుకుంటే ఏం సెయ్యదు. మాయమైపోతాది. ఏమాత్రమైనా జడిసినామా అంటే పీక పట్టుకుని నులుపేసి, తినేస్తాది. దెయ్యమంటే మరేటి?" అన్నాడు అదొక సామాన్యమైన విషయంలాగ. వీరన్నను బాగా భయపెట్టగలిగినందుకు తనలో తాను సంతోషించాడు.

చీకట్లో కుక్కలు మొరుగుతున్నాయి. కొంతసేపటికి ఊళ్ళోకి వచ్చినట్టు జ్ఞాపకమొచ్చింది వీరన్నకు. ఊళ్ళో అంతా నిద్రపోతున్నారు. వీరన్న వెంకయ్య ఎవరిదారిన వారు పోయి పడుకున్నారు.

తెల్లవారేక ఊళ్ళో నలుగురూ యీ మాటే అనుకుంటున్నారు. వీరన్నకు నిన్నరాత్రి పాడుపడ్డ కోవెలదగ్గర దెయ్యం కనిపించిందనీ, వాడి బట్టపట్టుకు లాగిందనీ, శ్మశానంలోంచి దెయ్యాల రాళ్ళు రువ్వేయనీ, దానితో వీరన్న జడుసుకున్నాడనీ, యిలా చిలవలు పలవలు కల్పించి చిత్రవిచిత్రంగా చెప్పడం మొదలెట్టేరు. కనబడిన ప్రతీవాడూ "ఏం జరిగింది వీరన్నా" అని అడిగేడే. బాగా పరిచయమున్న మిత్రులు "ఓస్ ఇంతేనట్రా వీరన్నా నీ ధైర్యం! ఒంట్లో ఊపిరి లేకపోయినా నీకంటే వెంకయ్యే నయం" అని వేళాకోళం చేశారు. చెరువుగట్టున పల్లెపడుచులు నీళ్ళు ముంచుకొని వేళాకోళం మొదలుపెట్టేరు. "ఏటి వీరన్నా, శరీరం పెంచగానే సరా చెప్పు" అని ఒక అమ్మి అంటే "అన్నోళ్ళకూడ పెద్దకళ్ళు చెప్పనేటి, గుండెధైర్యం వుండాల" అని ఇంకో అమ్మి హేళన చేసింది. వీరన్న స్వాభిమానానికి ఇది చాలా కష్టంగా, అవమానకరంగా వుంది. వెంకయ్య తెల్లవారేసరికి ఊరంతా యీ పుకారు లేవదీసి వుంటాడు. అందరి దృష్టిలో కూడా తను అపహాస్యంపాలయ్యాడు. ఎంత అవమానం! తన ప్రతిష్ఠకు ఎంత దెబ్బ! దీనికి వెంటనే ప్రతీకారం తీర్చుకోవాలి, అనుకుని వీరన్న ఛాతీ విరుచుకుని వీధిలో నడక ప్రారంభించాడు.

ఊరి నడిబొడ్డులోవున్న వేపచెట్టు క్రిందికి వచ్చాడు. అక్కడున్న బండరాయిమీద వెంకయ్య, మరికొందరు మిత్రులు వేపపుల్లలతో పళ్ళు తోముకుంటూ, లోకాభిరామాయణం చర్చిస్తున్నారు. వారంతా వీరన్నను పలకరించారు.

"రారా వీరన్నా, కూర్చో."

"నేనేదో పిరికివాడిననీ, రాత్రి జడిసిపోయాననీ యీ వెంకయ్య ఇలాగ ఊరంతా చాటినాడు. దాని సంగతేదో ఇప్పుడే తేలిపోవాల" అన్నాడు వీరన్న.

"నేనేం చాటలేదు. ఒకరిద్దరు మనోళ్ళతో మాటవరసకి అన్నాను." అన్నాడు వెంకయ్య.

"అదే అబద్ధం చెప్పినావు. నేను జడిసినానా? వహా! మహా ధైర్యవంతుడిలాగ వొచ్చి చెప్పేసినావంట."

"అబద్ధం కాదురా నాయనా, నిజంగా నీకు భయమేసిందా లేదా చెప్పు? ఆమాటకొస్తే నీకంటె నేను ధైర్యవంతుడినే" అన్నాడు వెంకయ్య.

"ఓరి, చాలు ఊరుకోండి—బయలుదేరినారు మొనగాళ్ళు. ఎల్లరా వీరన్నా ఆడితో నేటి"—అక్కడున్నవారంతా దీనిని సర్దుబాటు చేయడానికి చూశారు. ఇదిగాని మితిమీరితే తీవ్రంగా పరిణమిస్తుందని వారి భయం. ఎందుచేతనంటే వీరన్న మోటవాడు. వెంకయ్య మొండివాడు.

వీరన్నకు ఒళ్ళుమండింది! "గొప్ప ధైర్యవంతుడివంటున్నావే—ఏది చూపించరా నీ ధైర్యం, అదేమాత్రమో నేను చూస్తాను," అన్నాడు.

"ఒరే, ఊరుకో సన్నకోవిలతోటలో నక్కనిమనిసుంటేగా జడిసినోడివి నీకు నాతో పంతమేటిరా?

నీ వెర్రిగాని. జబ్బబలం వేరు, గుండె బలం వేరురా నాయనా!"

"అదే చూస్తాను. ఇదిగో ఒంటిరూపాయలు. పందెమేద్దాం."

"సరే అయితే, మాట తప్పకూడదు సుమా" అన్నాడు వెంకయ్య. చీకట్లో అర్ధరాత్రప్పుడు శ్మశానంలో కెళ్ళి అక్కడ కూర్చొని ఒక మేకు భూమిలోకి కొట్టి రావాలి, అదీ పందెం ఎవరు అలా వెళ్ళి రాలేకపోతే వాడు ఓడిపోయినట్టు. ఆవేళ రాత్రే పందెం. ఈ వార్త ఊరంతా తెలిసిపోయి గొప్ప ఆసక్తి రేకెత్తించింది. అంతా పందెం గురించే మాట్లాడుతూ వుండేవారు. వీరన్న గెలుస్తాడని ఒకడంటే, వెంకయ్య గెలవగలడని ఒకడు. ఎవడికి తోచినట్టు వాడు ఊహాగానం చేశాడు.

ఆ రోజంతా వీరన్న దీనినిగురించి ఆలోచించాడు. తను ఇంతకు ముందు అనేకమందితో పెద్ద పెద్ద కుస్తీలు పట్టేడు.

ఎప్పుడూ యింత ఆలోచించలేదు. దీనిని గూర్చి యింత ఆలోచించడానికేముందో తనకర్థం కాలేదు. పగటివేళ అనేకసార్లు తనా శ్మశానంగుండా నడిచి వెళ్ళేడు. అక్కడ భయపడడానికి ఏమీ లేదు. ఆ మాత్రానికి రాత్రి వేళ మాత్రం భయమేమిటి? ముక్కు చివర ఊపిరితో బతికే వెంకయ్య వెళ్ళగా లేనిది తనేనేమిటి వెళ్ళలేడు. అదేదో చూదాం అనుకున్నాడు వీరన్న. అయితే వెంకయ్య యీ విషయం గురించి ఆలోచించనే లేదు. రాత్రి నలుగురూ వచ్చి పందేనికి రమ్మని పిలిచేవరకూ ఆ సంగతే జ్ఞాపకం లేదు.

అంతా కలిసి పాడుపడిన కోవెలతోటలోకి వెళ్ళి కూర్చున్నారు. అక్కడనుండి కొంచెం దూరాన వున్న శ్మశానంలోకి ముందు వెంకయ్య, తరువాత వీరన్న వెళ్ళి రావడానికి ఏర్పాటయింది.

అమావాస్య రాత్రి. అంతటా చిక్కటి చీకటి దట్టంగా కమ్ముకుని వుంది. ఆకాశంలో మేఘాలు కమ్ముకుని వుండడంవల్ల నక్షత్రాలు కూడా లేవు. గాలి కదలడం లేదు. వీరన్న మాటాడకుండా నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

వెంకయ్య మేకు, సుత్తి పట్టుకుని మైదానంలోకి నడిచి వెళ్ళేడు. ఒకరిద్దరు కొంత దూరం వరకూ వాడి వెంట వెళ్ళి తిరిగిపోయారు. ఓ పది నిముషాలయేక, నిర్ణీత స్థలంలో నేలను మేకు కొట్టి వెంకయ్య తిరిగి వచ్చాడు. తరవాత వీరన్న బయలుదేరేడు.

వీరన్న ఆ వేళ మల్లుపంచ కట్టేడు. మల్లు చొక్కా వేసుకున్నాడు. ఒక చేతిలో మేకూ, ఒక చేతిలో సుత్తీ పట్టుకు బయలుదేరేడు.

మైదానంలో నల్లటి చీకటి తప్ప మరేం కనపడటంలేదు. ఆ మైదానం ఊపిరి తీయని శవంలా నిశ్శబ్దంగా పడుకుని వున్నట్టుంది. అక్కడక్కడ ఈత తుప్పలు శవం ప్రక్క తల విరబోసుకుని కూర్చున్న ఆడవాళ్ళలా, ఏడుస్తున్నట్టున్నాయి. గాలి చలనం లేక ఒక ఆకైనా కదలక, జీవితం కదలని ఒక పెద్ద కొండలా స్తబ్దంగా పడి వున్నట్టుంది. అతనికి తన శరీరం చాలా బరువుగా వున్నట్టనిపించింది. ఆ నిశ్శబ్దంలో దూరాన గుమ్మలగొండి సకిలించింది. అది చేసిన శబ్దం చీకట్లను చీల్చుకుని తన శరీరమంతా తాకినట్లయింది. "పాడు జంతువు; మహా భయపెడుతుంది" అనుకున్నాడు వీరన్న.

దూరాన తాటిచెట్లమధ్య నిప్పులు రాలుతున్నట్లు కనిపించింది. జేబులోంచి కాగితపు పొట్లం తీసి, అందులోని ఆంజనేయస్వామి సిందూరం బొట్టు పెట్టుకున్నాడు. తన చేతి వేళ్లు వణుకుతున్నట్టు గ్రహించాడు వీరన్న.

అనుకున్నచోటికి వెళ్ళి, మేకు నేలను పెట్టి సుత్తితో కొట్టేడు. తనగుండెలు దడదడ కొట్టుకుంటున్నట్టు తెలుసుకున్నాడు. మొత్తంమీద అనుకున్న పని అయిపోయింది. వీరన్న పెద్ద నిట్టూర్పు తీసి, చటుక్కున వెనక్కు తిరిగి ఒక అడుగు వేశాడు. వెనక నుంచి ఎవరో తన పంచెకొంగు పట్టుకు లాగేరు. ఎవరో నవ్వినట్టయింది. మరొక అడుగు ముందుకు వేయబోయాడు వీరన్న. వెనుక పంచ చిరిగిన శబ్దమయింది. అంతే, వీరన్న నిలువునా పడిపోయాడు.

చాలాసేపు చూసి ఎప్పటికీ రాకపోతే కాగడా వెలిగించుకుని చూడడానికి వెళ్ళేరు అంతా. ఫయిల్వాను వీరన్న చచ్చిపోయాడు. అతని పంచ కొంగు మీద మేకు కొట్టివుంది. కేసు పోలీసుల పరమైంది.

# కర్ణాటక సంగీతము

శ్రీ కె. సుబ్బరామప్ప

విజయనగర సామ్రాజ్యస్థాపనాచార్యులైన శ్రీ విద్యారణ్యుల అనుగ్రహమువలన పునరుజ్జీవితమైన కర్ణాటక సంగీతకళ విజయనగర సామ్రాజ్యము నేలిన చక్రవర్తుల కాలమున అవిచ్ఛిన్నముగ పోషింపబడుచు వచ్చెను.

దాక్షిణాత్య సంగీతమునకు కర్ణాటక సంగీతమను పేరు పదియారవ శతాబ్దమునాటి గ్రంథములందే కనబడుచున్నది. క్రీ. శ. 9వ శతాబ్దమున ఆంధ్ర కర్ణాటక భాషలకూ పెలిప్రదేశమైన హంపివద్ద వెలసిన మతంగ పర్వతము చెంత మతంగముని "బృహద్దేశి"ని రచించినట్లు ఆధారము లున్నవి.

భారతీయ సంగీతశాస్త్రగ్రంథములు చాల మట్టుకు కర్ణాటక దేశమందే రచియింపబడి యుండుట వలన కర్ణాటక సంగీతమును పేరు ప్రసిద్ధియైనదని చారిత్రక నిదర్శనములనుండి తెలియుచున్నది. లక్ష్యకారులు ఏ భాషయందైనను, ఏ కాలమందైనను, ఏ దేశమందైనను ఉండినప్పటికిని భారతీయ సంగీతచరిత్ర రచనకు లక్షణగ్రంథములే ముఖ్యమైన ఆధారములను విషయము నిర్వివాదాంశము.

11వ. శతాబ్దమున భరతశాస్త్రమునకు వ్యాఖ్యానము వ్రాసిన నాన్యదేవుడు మిథిల (తీహారు) రాజ్యము నేలుచుండిన కర్ణాటక క్షత్రియుడు. కల్యాణి చాళుక్యులు, ముమ్మడి సోమేశ్వరుడు, జగదేక మల్లుడు (జయసింహుడు) హొయ్సళ ఇమ్మడి వీరబల్లాళుడు మొదలైన కర్ణాటక చక్రవర్తుల గ్రంథములు శార్ఙ్గదేవుని కంటెను పూర్వమే ప్రచారగ్రంథములుగ నుండెను.

కల్యాణి చాళుక్యులకు సామంతులుగ నుండిన కాకతీయులు మొదట కన్నడదేశీయులుగ నుండిరి. గణపతిదేవుల కాలమున జాయసేనాపతి 'నృత్త రత్నావళి'ని రచించెను. దేవగిరిలోని యాదవరాజగు సింహణుని ఆశ్రయమున శార్ఙ్గదేవుడు "సంగీత రత్నాకరము"ను రచించి భారతీయ సంగీత శాస్త్రమునకే ఆచార్యపురుషుడు అనిపించుకొనెను. 'సంగీతాకరము' లేక 'సంగీత సమయసారము'ను రచియించిన పార్శ్వదేవుడు కర్ణాటక దేశీయుడనుటలో నెట్టి సందేహమును లేదు. సుప్రసిద్ధ వీరశైవకవియైన పాల్కురికి సోమనాథుని సంగీతశాస్త్ర వైదుష్యము అతడు రచించిన 'బసవ పురాణము', 'పండితారాధ్య చరిత్ర'లలో కనిపించుచున్నది. ఈతడు కాకతీయ రాజ్యమున నుండినవాడై హెచ్చుగా తెలుగు గ్రంథములను రచియించినను కన్నడభాషలో గూడా మంచి పండితుడనిపించుకొని తన యవసానకాలమును మైసూరు దేశమున గడిపెను.

కర్ణాటక దేశీయుడైన గోపాలనాయకుడు మహమ్మద్ బిన్ తుగ్లక్ పోషణమున మేళకర్త రాగములను నిర్ధరించి ఉత్తరహిందూస్థానమున ప్రచారము గావించెననియూ అమీర్ ఖుస్రూ ఇతనినుండి నేర్చుకొని కొన్ని మార్పులను గావించెననియూ నిర్ధరింపబడియున్నది.

14వ శతాబ్దమువరకు తెలుగునగాని తమిళమునగాని లేదా ఉత్తర హిందూస్థాన భాషలలోగాని సంగీత లక్షణ గ్రంథము లేవియు రచియింపబడలేదు. "సంగీత రత్నాకరము" యొక్క ప్రభావముచేత ప్రాంతీయ సంగీతపద్ధతులలో లక్షణగ్రంథములు సంస్కృత భాషలో రచియింపబడుచు వచ్చెను. శుద్ధకన్నడ పారిభాషికశబ్దములు కన్నడిగులనుండియే యితర భాషలలో గూడ ప్రచారమయ్యెను.

(ధాతు) - మాతు, ఒయ్యార, జోడణ, ధువణె, పెంపు, సొంపు, నవణె, కంపరణె మొదలైన అచ్చ

---

విజయనగర రాజుల కాలమున పోషింపబడుచు వచ్చిన సంగీతకళను గురించిన పరిశోధనా ఫలితములను మైసూరు విశ్వవిద్యాలయ చరిత్రప్రొఫెసర్ డా. యస్. శ్రీకంఠశాస్త్రిగారు "బయకార రామప్పయ్య" అను శీర్షికతో రచించిన కన్నడవ్యాసము ననుసరించి వ్రాసిన దీవ్యాసము.

కన్నడ దేశమున సంస్కృతము, తెలుగు, తమిళ భాషలలో రచితములైన సంగీత శాస్త్రములలో నధికముగ నుపయోగింపబడినందున భారతీయుల శాస్త్రీయ సంగీతమునకు కర్ణాటక సంగీతమను పేరు సార్థకమయ్యెను.

## 2

శ్రీ విద్యారణ్యులచే రచియింపబడిన 'సంగీత సారము' గ్రంథము సంపూర్ణముగ లభింపక పోయినను శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమున కొన్ని మార్పులుచేసి కర్ణాటక సంగీతపద్ధతిని విద్యారణ్యులు కొంత వరకు సంస్కరించిరని చెప్పవచ్చు. విద్యారణ్యులు 15 మేళకర్తలను, 2̃84 రాగలక్షణములను నిరూపించిరని రఘునాథ గోవిందదీక్షితులు చెప్పియున్నారు. అదే కాలమున ఉభయ భాషా కవిశ్రేష్ఠుడైన అష్టావధాని నాచన సోముడు తెలుగునందు గ్రంథరచన చేసెను. బుక్క, హరిహరులపోషణక్రింద 'నాట్యచూడామణి'ని రచించి కోలారు దగ్గర కొన్ని గ్రామములను దానముగా పొందెను.

15వ శతాబ్దమున ఇమ్మడి దేవరాయని పరిపాలన యొక స్వర్ణయుగముగ ననిపించుకొనెను. దేవణ్ణ భట్టు 'సంగీత ముక్తావళి'ని రచించెను. ఈతని కంటెను ప్రసిద్ధికి వచ్చినవాడు చతుర కల్లినాథుడు. సంగీత రత్నాకరమునకు వ్యాఖ్యానము చేయుటయో లేదా అనుకరించుటయో పరిపాటిగ దక్షిణదేశమంతటను వ్యాపించెను. ఇమ్మడి దేవరాయనికి గొప్ప సమకాలికుడైన సర్వజ్ఞసింగభూపాలుడు శ్రీనాథునికి పోషకుడై సంగీత రత్నాకరమున కొక వ్యాఖ్యానమును రచియించెను. శ్రీనాథుని కవిత్వమును మెచ్చికొని ఇమ్మడి దేవరాయలు కనకాభిషేకమును చేయించెను. చతుర కల్లినాథుడు ఇమ్మడి దేవరాయని అంత్యకాలము నందును ఆతని పిమ్మట రాజ్యము నేలిన మల్లికార్జునుని కాలమునను సుప్రసిద్ధ గాయకుడై సంగీత రత్నాకరమునకు వ్యాఖ్యానమును వ్రాయుటయేగాక కొన్ని మార్పులను గావించెను. మల్లికార్జునుని ఆశ్రయమున "జనవశ్య" "రతిరహస్య" అను గ్రంథములను రచియించిన కల్లరసు అనునతడు కల్లినాథుడే కావచ్చును. పిమ్మట సాళువ, తుళువ చక్రవర్తుల కాలమున సాళ్వ గోపతిప్ప, లక్ష్మీనారాయణ, లక్ష్మీధరులు లక్షణ గ్రంథములను వ్రాసిరి. కృష్ణదేవరాయల కూతురకు లక్ష్మీనారాయణ పండితుడు సంగీత శిక్షకుడుగానుండి సంగీతరత్నాకరము ననుసరించి 'సంగీత సూర్యోదయము'ను వ్రాసెను.

గోదావరి - కృష్ణా నదులనుండి కన్యాకుమారి వఱకును విస్తరించిన విశాలమైన విజయనగర సామ్రాజ్యమున తెలుగు, కన్నడము, తమిళము, మళయాళము, తుళు, సంస్కృతము మొదలైన భాషలును; శైవ, వైష్ణవ, జైన, క్రైస్తవ, ముస్లింమతములును, అద్వైత, ద్వైత, విశిష్టాద్వైత, శుద్ధాద్వైత, ద్వైతాద్వైత, శక్తి విశిష్టాద్వైత మొదలైన సిద్ధాంతములును ప్రచారమునందుండి అపారమైన సాహిత్యము పుట్టెను. సాహిత్యముతో పాటు సంగీతముకూడ సమానప్రాముఖ్యముగనుండియుండుట చేత దక్షిణ భారతదేశమున ప్రసిద్ధములైన రీతులకు అప్పటికప్పుడు లక్షణములను నిర్ణయింపవలసి వచ్చెను. ఇది భారతీయ చరిత్రలో సార్వకాలీనమైన గాఢవశ్యకతయైనను విజయనగర సామ్రాజ్యకాలమున యెక్కువగ ప్రామాణిక లక్షణగ్రంథములు ఏర్పడి యింతవఱకు నిలిచియుండుటవలన కర్ణాటక సంగీతచరిత్రయందిది ముఖ్యమైన ఘట్టమైనది.

గ్రామ, రాగ, మూర్ఛన, గమక, స్వర, శృతి, తాళ, ప్రబంధరచన, వాగ్గేయరచన, మొదలైన వానియందు ఒక్కొక్క యంశము యేయేరీతిగ వికాసమానమైనదియు శాస్త్రీయముగ నిర్ధారింపవలసియున్నది. మహారాష్ట్రమున ప్రచారములోనుండిన ఏకనాథ, తుకారాము, పండరిభక్తుల యొక్క మహానుభావులవియు నైన అభంగములు, కర్ణాటకమందలి హరిదాసుల కీర్తనములు, తెలుగున తాళ్ళపాకవారి కీర్తనలు, తమిళములోని అరుణగిరినాథుని తిరుప్పుగళ్ మొదలైనవియు మఱియు నాయా భాషలలో సమకాలీనముగ రచితమైన జానపదగీతములు, నాటకములు మొదలైనవానిని లక్ష్యములుగ అంగీకరించి క్రొత్త నియమములను చేయుటకై లక్షణగ్రంథము లేరీతిగ యత్నించినవో అట్టి వానిని పరిశోధనలచే నిర్ధారణచేయవలసిన ఆవశ్యకత గలదు.

జీవవంతమైనకల యెట్టిదిగాని అభివృద్ధిజెందక యొకచో నేకరూపమున నుండ నేరదు. అందువలను ఆబాలగోపాలమూ సాల ప్రియమైన సంగీతశాస్త్రము శాఖోపశాఖలుగ ప్రచారమగుట అనివార్యము. లక్షణకారులు తమతమ అనుభవపాండిత్యముల చేత గ్రంథములను

రచియించి తమవే అంతిమ నిర్ధారణములని చెప్పికొనవచ్చును. శార్ఙ్గదేవుడు సంగీత సంబంధములైన సమస్తశంకలను పరిహరించినవాడని "నిశ్శంక" అను బిరుదును పొందెను. కాని చతుర కల్లినాథుడు అనేక చోటులందు శార్ఙ్గదేవునికి వ్యతిరేకముగ పరోక్షముగ తదభిప్రాయముల నిచ్చి వెనుకటి లక్షణకారులను తెగడి తన ప్రతిభను చెప్పుకొనెను.

"ఇదానీం అధునా ప్రసిద్ధరాగాంగాదీనాం లక్ష్య ప్రతీతానాం లక్షణ విరోధానాం పరిహారార్థ ముద్యమః క్రియతే" (రాగాధ్యాయ వ్యాఖ్య)

కల్లినాథుని కాలమున మధ్యమ గ్రామమున జనించిన మధ్యమాది, తోడి మొదలైన రాగములు మధ్యమన్యాస ప్రారంభను విడిచి మధ్య షడ్జమస్థానమునుండి ప్రారంభమగుచుండెను. మధ్యమగ్రామము అదృశ్యమై షడ్జగ్రామము యొక్క ప్రచారమునకు వచ్చుచుండెను. క్రియాంగ రాగమైన రామక్రియయందు మధ్యమ, పంచమ శృతులను రెంటిని గైకొనుచుండెను. నాట, దేవక్రియ మొదలైన రాగములు పంచశృతి ఋషభ ధైవతముల నుపయోగించుచుండెను. 15-16 శతాబ్దములలో తాళ్ళపాకవారి కీర్తనలకును, పురందరదాస, కనకదాస, వ్యాసరాయ కీర్తనములకును రాగములను జతించినప్పుడు ఆ కాలమునాటి రాగ లక్షణముల నే చాలవఱకు అనుసరించుట స్పష్టముగనున్నది. ఇప్పుడిప్పుడు ప్రచారమునకు వచ్చిన ప్రయోగములను సాంప్రదాయకమైనవని భావించినచో ఆ వాగ్గేయకారులకు ద్రోహము చేసినట్లగునని ఆధునిక విద్వాంసులు గమనింపవలెను. ఉదాహరణమునకు తాళ్ళపాక అన్నమాచార్య తిరుమలాచార్య మొదలైనవారి కీర్తనములను రాగిరేకులమీద చెక్కించినప్పుడు రాగములు మాత్రము సూచింపబడెను. ఆ సమకాలీన లక్షణ గ్రంథములందు ప్రోక్తములైన రాగ లక్షణములను వానికి సమన్వయింపవలెనే గాని వేంకటమఖి అనంతరము నిర్ధరించబడిన రాగలక్షణములను గాదు. యూరోపియన్ సంగీత పద్ధతిలో ఆంబ్రోషియన్ గ్రిగోరియన్ గీతములకు బీథోవెన్, మోసార్ట్ కాలమునాటి సంగీత లక్షణముల నన్వయించి నట్లగును.

## *బయకార రామప్పయ్య

కృష్ణదేవరాయల కాలమునందు అభివృద్ధిజెందిన కర్ణాటక సంగీతపద్ధతి అచ్యుతరాయల కాలమున బయకార రామప్పయ్య (రామామాత్య తోడరమల్ల) యొక్క "స్వరమేళ కళానిధి"లో మఱికొంత వ్యాప్తి జెందెను. వ్యాసరాయలు, పురందరదాసు, కనకదాసు, తాళ్ళపాక చిన్నన్న, తిరుమలయ్య మొదలైనవారు అప్పటికి సజీవులై యుండిరనుట యథార్థము. క్రీ. శ. 1532 లో అచ్యుతరాయని శాసనమందు "వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యులైన ఆశ్వలాయన సూత్ర భారద్వాజ గోత్ర ఋక్శాఖులైన తాళ్ళపాక తిరుమలయ్య అచ్యుతరాయలవలన పొందిన యూరు గ్రామములను హంపి విఠలదేవునికి దానము చేసెను.

రామామాత్యునికి సంబంధించిన రెండు శాసనములనుండి నితడు అచ్యుతరాయ సదాశివరాయల కాలమున ప్రసిద్ధ వ్యక్తిగ నుండెనని తెలియుచున్నది. బళ్ళారిజిల్లా కూడ్లిగి తాలూకా చిక్క కెరెయాగిహళ్ళిలోనున్న శాసనము శాలివాహనశక 1461 వికారి, భాద్రపద శుద్ధ 12 (ఆగస్టు 29 మంగళవారము క్రీ|| శ|| 1536) లో బయకార రామప్పయ్యచే ప్రతిష్ఠింపబడెను. కొండవీడులోని పరాశర గోత్రజుడైన సింగయ్య కుమారుడు బావయ్య మంత్రి; అతని కొడుకు శ్రీరామ మంత్రి. శ్రీరామునకు తెలుగమ్మ బిడ్డలైన పెద్దతిమ్మ, తిమ్మ, సురేంద్ర, భాస్కర, చమూపతి, బావయ — వీరిలో భాస్కర లేక బావయ ప్రభు అచ్యుతరాయలనుండి కొండవీడును పొందినవాడై అక్కడ గోపీనాథ నగరమును నిర్మించి గోపీనాథుని ప్రతిష్ఠించెను. అతని పెద్ద అన్నయైన పెద్ద తిమ్మ, లక్కమ్మ — వీరే రామామాత్యుని జనకులు.

బయకార రామప్పయ్య కొన్ని గ్రామములను నిర్మించెననియు అనేక చెరువులను కూడా త్రవ్వించెననియు తానే చెప్పికొని యున్నాడు. బళ్ళారిజిల్లా హడగలి తాలూకాలోని వంగిహళ్ళి శాసనమున బయకార రామప్పయ్య సదాశివరాయల పాలనమున తిమ్మలాపుర మనెడి అగ్రహారమును నిర్మించి బంకేశ్వర, గోపీనాథ దేవాలయములను నిర్మించి కొట్టూరు

---

*"బయకార" శబ్దమును అల్లసాని పెద్దన ఆశువుగ చెప్పిన ఉత్పలమాలికలో "బయకారపు కన్నడ గౌళపంతుకా" అని ప్రయోగించినాడు. అనగ సంగీతపు అని అర్థము చెప్పవలెను.

సీమలోని వోళలగొంది—బైరాపుర గ్రామమునకు గోపీనాథ పురమని పేరిడి దానము చేసెను. (S. I. I. IX. 2. 68).

'స్వరమేళ కళానిధి'లో రామామాత్యుడు తన తండ్రి పేరు తొంటపతి తిమ్మ (పెద్దతిమ్మ) అనీ మాతామహుడు కల్లప్ప అనీ చెప్పుకొన్నాడు. ఈ కల్లప్ప కల్లినాథుడేమనా అని విచారించవలసియున్నది. రామామాత్యుడు కల్లినాథుని "సంగీత కళానిధి" అను గ్రంథము యొక్క పేరును "స్వరమేళ కళానిధి" అని వర్ణించియుండుటను గమనించదగినది. కల్లినాథుడు "మేళన"మాత్రము చెప్పియున్నాడు విద్యారణ్యులో లేక గోపాల నాయకుడో 'మేళ' శబ్ద ప్రయోగమును చేసియుండవచ్చును. వెంకటమఖికి ముందే రామామాత్యుడే మేళకర్త నియమమును మొదట తెచ్చెనని నిశ్చయించవచ్చును. విద్యారణ్యులు నాట, గూర్జరి, వరాళి, శ్రీ, భైరవి, సామంతి, కాంభోజి, ముఖారి, శుద్ధరామక్రియ, కేదారగౌళ, హెజ్జుజి, దేశాక్షి అను పదునైదు మేళములను చెప్పియున్నారు. రామామాత్యుడు ముఖారిని శుద్ధమేళముని అంగీకరించియున్నాడు ముఖారి, మాళవగౌళ, శ్రీ, సారంగనాట హిందోళ, సుద్ధరామక్రియ (శుద్ధ?) దేశాక్షి, కన్నడగౌళ, శుద్ధనాట, ఆహిరి, నాదరామక్రియ, శుద్ధవరాళి, రీతిగౌళ, వసంతభైరవి, కేదారగౌళ, హెజ్జుజి, సామవరాళి, రేవగుప్తి, సామంతి, కాంభోజి — మేళములను బహుశః విద్యారణ్యులవలెనే చెప్పియుండుటచేత రామామాత్యుని పంచశ్రుతి 'రి' 'ధ' షట్‌శ్రుతి 'రి', 'ధ' చ్యుతిపంచమము విద్యారణ్యుని పద్ధతిలోనే యుండవచ్చును. విద్యారణ్యులు "సంగీత రత్నాకర" పద్ధతిని సంపూర్ణముగ అంగీకరించలేదు. సర్వజ్ఞసింగము, కల్లినాథుడు శార్ఙ్గదేవుని అనుసరించుటకు ప్రయత్నించిరి.

ఆంధ్రకవితా పితామహుడైన అల్లసాని పెద్దన మనుచరిత్రలో దేశాక్షి రాగము ప్రాతఃకాలమున పాడదగినదని వీణను దానికనుగుణముగ మేళవించవలెనని చెప్పియున్నాడు. "ప్రభాతాయాత వాతాహతాలోల తంత్రుల మేళవింపగదవే లోలాక్షి! దేశాక్షికిన్" (మ. ఆశ్వా. 67 పద్యం). దీనినుండి వీణకు మెట్టులుండెనని యూహించవచ్చును. నాయకియొక్క మృదువైన గోదవ ధ్వనిని కోకిల యొక్క కుహూ, కాకలీ ధ్వనికిని, "కాంభోజీ మేళవించి కౌరవసుధా పూరంబు" (వసుచరిత్ర) నను పోల్చుటచే దేశాక్షి మేళము, కాంభోజీ మేళములు విద్యారణ్య రామామాత్యులు పైన చెప్పినట్టి మేళకర్తలే యైయుండవలెను. రామామాత్యుని కాంభోజీ మేళములో పంచశ్రుతి ఋషభ, అంతరగాంధార, పంచశ్రుతి ధైవత, కాకలినిషాద ప్రయోగమున్నది

రామామాత్యుడు తనకంటెను ముందు చెప్పబడిన అనేక శృతులు తన కాలమునకు అదృశ్యమైనవని చెప్పియున్నాడు. అచ్యుత షడ్జ మధ్యమములు శుద్ధ షడ్జ మధ్యమములైనవి. అదే విధముగ వికృత ఋషభ, ధైవతములు, శుద్ధములైనవి. స్వరముల పేర్లు మారియుండెను. పూర్వపు త్రిశ్రుతి చ్యుతిషడ్జమును నకు రామామాత్యుడు చ్యుతషడ్జ నిషాదమనియు, చ్యుత మధ్యమమునకు చ్యుతమధ్యమ గాంధారమనియు చ్యుతిపంచమమునకు చ్యుతపంచమ మధ్యమమనియు పేరిడెను. పంచశ్రుతి ఋషభమును శుద్ధ గాంధార, షట్‌శ్రుతి ఋషభి సాధారణ గాంధారమువలె పంచశ్రుతి షట్‌శ్రుతి ధైవతములను కూడ చెప్పియుండుట చేత రామామాత్యుడు వెంకటమఖి (ప్రతి మధ్యమ) మేళకర్త పద్ధతికి మార్గమును చూపించెను. కాలక్రమమున స్వరములు తీవ్రమగుచుండుట స్పష్టముగ కనుపించుచున్నది. సోమనాథుడు "రాగవిబోధ" యందు రామామాత్యుని యేడు వికృతముల నంగీకరించి మరి యొనిమిదింటిని చేర్చి మృదుతీవ్రములని సంకేతములను చేర్చియున్నాడు. రామామాత్యుని కాలమునకు వికృతపంచమము అదృశ్యమై చ్యుతపంచమ మధ్యమము వచ్చి, మధ్యమగ్రామము గాంధారగ్రామము వలెనే రూఢిలో లేకుండాపోయెను.

వీణారచనయందు శార్ఙ్గదేవ, కల్లినాథ, రామామాత్య, సోమనాథ, గోవిందదీక్షితులు మార్పు నుగావించిరి. శార్ఙ్గదేవుడు 'నిశ్శంక' వీణను సృష్టించితినని చెప్పుకొనియున్నాడు. శార్ఙ్గదేవుని కాలమున 21 తంతులు గల మత్తకోకిల వీణ ప్రధానముగ నుండి రుద్రవీణయని ప్రవర్తింపబడియుండెను. దానిని రామామాత్యుడు శుద్ధ, మధ్యమములనియు అచ్యుత రాజేంద్ర మేళ వీణయనియు మార్పుగావించెను. అతని మధ్యమ మేళ వీణను 4 తంతుల ప్రక్కలో 3 శ్రుతి తంతులూ

6 మెట్టులూ ఉండెనని తెలియుచున్నది. స్వయంభు స్వరస్థానములను నిర్ధరించి వానికి రామామాత్యుడే సరియైన మెట్టులను వేసియుండుటవలన శ్రుత్యంతరములను చాలమటుకు లెక్కాచార ప్రకారముగ నిశ్చయించుటకు సాధ్యమాయెను. సంవాదులను కనిపెట్టి వానినుండి యితర స్వరస్థానములను శ్రుత్యంతరములను నిర్ణయించు శార్ఙ్గదేవుని పరిపాటికంటెను రామామాత్యుని పరిపాటియే అధిక సమర్పకమైయున్నది. రామామాత్యుని వీణయందలి యేడుతంతులలో ప్రక్కనగల మూడు శ్రుతితంతులు మంద్ర 'ప'; మంద్ర 'స'; అనుమంద్ర 'స' లను ఇచ్చును. పైనగల నాల్గుతంతులు సంపూర్ణ స్పందనముతో అనుమంద్ర 'ప', అనుమంద్ర 'స', మంద్ర 'ప' మంద్ర 'స' లను ఇచ్చును. పిమ్మట రామామాత్యుని ఆరు మెట్టులలో యథాక్రమముగ యీ క్రింద తెలిపిన స్వరములు వచ్చును :—

వెంకటమఖి రామామాత్యుని తీవ్రముగ ఖండించినను అతని మధ్యమ మేళ వీణనే అనుకరించెను. ఇదిగాక శ్రీరాగ(ముఖారి) శుద్ధమని చెప్పి రామామాత్యుని శ్రుతి నామధేయములను అంగీకరించిరి. రామామాత్యుడు మాళవగౌళ, శుద్ధనాట, శుద్ధవరాళి, లలిత, సౌరాష్ట్రి, మధ్యమాది, భూపాల, బౌళి, గుర్జరి, గుండక్రియ, దేశాక్షి, నాదనామక్రియ రాగములను నిర్ధరించెను. రామామాత్యుని సమకాలికుడైన పుండరీక విఠలుడు బెంగుళూరు దగ్గరనుండు సావనదుర్గనివాసిగా నుండి అక్బర్ ఆస్థానమున "అక్బరీయ కాళిదాస" అను బిరుదమును వహించి తాన్‌సేనునకు గురువుగా నుండెను. హిందూస్థాని సంగీత పద్ధతికి మూలపురుషులలో నొకడని చెప్పవచ్చును. ఈతడు 'రాగమంజరి', 'షడ్రాగ చంద్రోదయము', 'నాట్య నిర్ణయము' మొదలైనవి వ్రాసెను. ఈ పుండరీకవిఠలుడు రామామాత్యునే అనుకరించియుండుటచేత బయకార రామప్పయ్య యొక్క కర్ణాటక సంగీతసేవ ఎంతటి అమోఘమైనదో విదితమగుచున్నది.

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|---|
| 1 వ తంతి | శుధ | శుని | కాని | చ్యుతషడ్జని | శుస | శురి |
| 2 వ ,, | శురి | శుగ | సాగ | చ్యుత మధ్యమగ | శుమ | చ్యుత పంచ 'మ' |
| 3 వ ,, | శుధ | శుని | కాని | చ్యుత షడ్జని | శుస | శురి |
| 4 వ ,, | శురి | శుగ | సాగ | చ్యుత మధ్యమ 'గ' | శుమ | చ్యుత పంచ 'మ' |

# ఎదురువచ్చిన మృత్యువు

జీవన ప్రభాత

ముందుగా చెప్పిరాదు. తన రాక తనకే తెలియనట్లు నటిస్తుంది. ఏదో వేళాపాళా తెలియని సమయాన, యధాలాభంగా షికారు తిరుగుతూ తిరుగుతూ వుంటే. చటుక్కున ఏదో స్ఫురణకు రాగా, రవంతసేపు వేచివుండి...ఏదో అనుకుని ఏమో చేయబోయినట్లు......ఎక్కడో మరి యే యింటిమీదనో చక్కగా నిక్కచ్చిగా వాలి కూర్చుంటుంది!—

ఆమె చల్లని బరువైన శరీరం ఆ యిల్లంతా క్షణంలో వ్యాపిస్తుంది. ఆమె ఉనికిని అనేక కంఠాలు ఏకస్థాయిలో పదేపదే ఘోషిస్తాయి.

మనకు అతి సన్నిహితమైనదీ...అతి దూరమైనదీ—

మనిషికి అత్యవసరమైనదీ, కోరుకున్నప్పుడు లభ్యం కానిదీ...

ఆమె....మృత్యువు !

* * * *

ఆరోజు ప్రభలవారి కొంపలోంచి ఒకే ఒక్క కంఠం గొల్లుమంది. వచ్చిన నలుగురికీ వార్తల నందిస్తూ ఇతోధికంగా సహాయపడుతోంది—పనిమనిషి అప్పలమ్మ, కళ్ళనీళ్ళతో పమిట చెంగు తడుపుకుంటూ.

ప్రభల విశ్వనాథశాస్త్రి బ్రతికివుండగా ఏమిటో చనిపోయిన తర్వాత కూడా అంతే అనిపిస్తున్నాడు ఆ వూరి కంతా.

అతన్ని అంతా ఎరుగుదురు — కొంచెమో గొప్పో. అయితే, అతని అంతస్సు మాత్రం యెవరూ యెరగరు ... తానొక్కతె మాత్రమే యెరుగుదునని గట్టిగా చాటిరాగాలమన్నానే చెపుతోంది—సూరమ్మ అని పిలవబడే సూర్యకాంతమ్మ.

"రోజూమాదిరే నిన్నా మామూలుపనన్నీ, చేసుకున్నాడు...రాత్రి యథాప్రకారంభోంచేసి గొడ్లనీ గోదనీ చూసుకోడాని కెళ్ళేడు...తర్వాత ఊరంతా తిరిగి కాస్సేపు చదువుకుని పడుకున్నాడు..."

"అవును—యెంతసేపు గుక్కాడు ప్రాణం..." శవం ప్రక్కనే చదికిలపడుతూ అంది ప్రక్కయింటి ముసలమ్మ.

శాస్త్రి మృతివిధానం కొంత ఆశ్చర్యాన్నే కలిగించింది—

రోజూకంటె ఒకగంట ముందుగానే, అంటే మూడుగంటలకే, తెల్లవారగట్ల లేచి గోదావరీస్నానం పూర్తిచేసుకునివచ్చాడుట. సూరమ్మ లేచేసరికి నారింజ చెట్టుకింద పద్మాసనం వేసుకుని జపం చేసుకుంటూ కనపడ్డాడు.

మళ్ళీ కొంతసేపటికి ఆమె అటువేపు వెళ్ళేసరికి దర్భాసనంమీద వెల్లకిలా పడుకుని నిద్రపోతున్నాడుట—

"లేనిపోని యీతిబాధలన్నీ యీమధ్య పెట్టుకుని వొళ్ళు నాశనం చేసుకున్నాడు—నిస్త్రాణొచ్చిందో యేమో—" అనుకుని సూరమ్మ తనపనులు గబగబా ముగించుకోసాగింది.

అప్పటికి అప్పలమ్మ వీధిపాచి చేసి పెరట్లోకి వచ్చింది. సూరమ్మ కుంపటి రాజేస్తోంది-ఆయన లేచేసరికి ఇంత కాఫీ కాచి యివ్వడానికి....

సూరమ్మ ఏడుపుల మధ్యనే బయలుపడుతున్న కథకి అప్పలమ్మ మధ్య మధ్య కొంత గ్రంథం అతికిస్తూ వస్తోంది.

అప్పలమ్మ పెరడు వూడుస్తోంది — ఆమూల నుంచి ఈమూలకి. అప్పటికప్పుడే చప్పగా తెల్లవారిపోయింది. ఒకటి రెండుసార్లు యధాలాభంగా శాస్త్రిగారికేసి చూసింది. జపం చేసుకునే ఆయన వేపు పాచి చీపురుతో వెళ్ళడం ఆమెకు అనుమాయితీ కాదు. ఆయన తిడతాడని కాదు, పల్లెత్తుమాట అని యెరుగడు. ఇప్పుడే కాదు. ఎప్పుడూ!

# ఎదురువచ్చిన మృత్యువు

సూరమ్మపిన్నిగారు యింకా యింకా ఏవో చాదస్తంపనులు చేసుకుని, సూర్య నమస్కారాలు చేస్తోంది.

నీరెండ నారింజచెట్టుమీద పడుతోంది. యెంతకీ కదలకుండా ఆకాశంకేసి చూస్తూ పడుకున్న శాస్త్రిని చూసి, అప్పలమ్మ మనసు పట్టలేక, చీపురు పారవేసి- మెల్లగా అటు వెళ్ళింది. తనకు తెలియకుండానే యేదో పిచ్చికేక వేసి చతికిలపడింది.

"అప్పటికే గంటసేపయి మారాజు పానాలు పోయుంటాయి!" అంది.

అయినా అనుమానం దిగాలుగా ఆయనకేసి చూస్తూనే వుండిపోయింది. కేక విని కంగారుగా తొట్రుపడుతూ వచ్చిన సూరమ్మ ఆ దృశ్యం చూస్తూనే గొల్లుమంది.

ఒక మునీశ్వరుడిలాగ జపం చేసుకుంటూ యోగ సమాధిలోనే వుండి పరమేశ్వరుడిని చేరేడంటున్నారు, ప్రేక్షకులు.

ఏమైతేనేమి, అర్థం బద్ధం లేకుండా అధార్తగా చనిపోయిన శాస్త్రిగారి వాకిలి దగ్గరే గ్రామం అంతా నిలబడిపోయినా, ఇద్దరు ముగ్గురు పెద్దలు గ్రామ చావడి దగ్గర కూర్చుని పరిస్థితులు సమీక్షిస్తున్నారు. సిసలైన వార్తలు అక్కడికే చేరుతాయి. మళ్ళీ అక్కడనుంచే నలుదిక్కులకీ బయలుదేరుతాయి.

ఆ క్రితం రాత్రి గ్రామం అన్ని వీథులూ శాస్త్రి తిరగ సాగేడు. యథాలాభంగానే అనిపించినా ఏదో ప్రత్యేకమైన ఆప్యాయతతో మాత్రం తిరిగేడు. ఎరిగినవాళ్ళనీ యెరగనివాళ్ళనీ, చివరకి కంటికి కనపడిన కుర్రకుంకలను కూడా పలకరించాడు. కుశలప్రశ్నలు వేశాడు. "మరి సెలవు తీసుకుంటా" అంటూ వచ్చాడు!

ఇన్ని సంవత్సరాలలోనూ యెప్పుడూ యెవరినీ తానై పలకరించి యెరగడు. ఎవరేనా మాట్లాడించినా ముక్తసరిగా మాట తుంచినట్లు మాట్లాడేవాడు. అందుచేత ఆ యెదురయినవాళ్లు కొంత విస్తుపోయారుట కూడా—

"పాపం! ఆవిధంగా అందరిదగ్గిరా సెలవు తీసేసుకున్నాడు..." అన్నాడు ముక్కు పొడుం పీలుస్తూ ... ఆరోజు ఇంటింటికి తిరగడం మానివేసిన యాయవారపు బ్రాహ్మడు.

అంతేకాదుట—

ఆ క్రితం రాత్రి గ్రామచావడిదగ్గిర కూర్చుని ప్రపంచరాజకీయాలను తరుమూరుచేస్తూ నలుగురి చేతా బలవంతాన నెమరు వేయింపిస్తున్న మునసబు కరణాల మధ్య శాస్త్రి పదినిమిషాలు గడిపేడు. ... అలవాటు లేని లోకాభిరామాయణం మాట్లాడేడు. ఎవ్వరూ ఎన్నడూ యెరగని అతని నవ్వు నాలుగైదుసార్లు విన్నారు గ్రామప్రముఖులు!

"యెల్లజతసు మా కోడెదూడనీ మా రైతు పోలయ్యకిచ్చేశాను. గేదెని మా దాసీది అప్పి — పిల్లలు గలది— దాన్ని తీసుకోమన్నాను ... ఇందాకనే వాళ్ళని పసువుల్ని తోలుకెళ్ళమన్నాను ..."

కరణం వెటకారంగానో కొంటెగానో అతని వేపు చూశాడు — తగలవేస్తున్న లంకాకు చుట్టను నోట్లోంచి తియ్యకుండా:

"యేం....యింత దాతృత్వం ... ?" అన్నాడు పైకి నీరసంగా...'యెప్పుడూ లేనిది' అని మనస్సులో గట్టిగానే అనుకున్నాడు, సమాధానంగా పళ్లు పటపట లాడించుకున్నాడు.

"ఊరి పెద్దలు కాబట్టి మనవి చేసుకుంటున్నాను, ...అమాయకులమీద...అనుకోకుండాఒక్కొక్కప్పుడు దొంగతనాలు మోపబడొచ్చు—"

"అటువంటివి జరక్కుండా చూడ్డానికి మీరు బతికేవున్నారుగా—" అన్నాడు మునసబు, వెటకారానికి మరింత కారం కలుపుతూ.

దూరంగాకూర్చుని మాటలన్నీ వింటున్న నారప రెడ్డి కత్తితో తాటికొమ్మని నరికినట్లు, "యింకా అవుండాలి కాబోలు?" అన్నాడు — అదిమాత్రం నీకెందుకోయ్ అన్నట్లు!

శాస్త్రి యథాలాభంగానే సమాధానం యిచ్చాడు: "దాని అవసరం వేరేవుంది!"

"కరణంగారి మాటకి సమాధానమే చెప్పేవారు గాదు—" అని మందలించారు ఆయుర్వేద మార్తాండ అయ్యవార్లం అయ్యగారు.

"వ్యవసాయం మరి మూడుసంవత్సరాల వరకూ మా పోలడే మక్తాకు చేస్తాడు," అంటూ శాస్త్రి లేచి నిల్చున్నాడు ఇతర విషయాలు తనకు కానట్లు.

ఊరుకోలేక పోయాడు మునసబు. తనూ నిలబడ్డాడు: "యావండి శాస్త్రిగారూ సన్యసించేస్తున్నారా?...కాశీకి ప్రయాణం కట్టేరా?...యేవిటి ఈ హడావుడంతా??"

"మనవూరుమీద కోపం వొచ్చిందేమో!" అని గొణుగుతున్నాడు కరణం, తన ప్రశ్నని మళ్ళీ మళ్ళీ చూపులతోనే పృచ్ఛిస్తూ—

శాస్త్రి రెండడుగులు వేశాడు. నారపరెడ్డికూడా లేచి అయ్యవార్లంగారితో అన్నాడు: శాస్త్రి తరఫున: "తంటసాలన్నీ వొదిలించుకుంటున్నాడు లెండీ"—

పేరుపేరునా సెలవుతీసుకుని శాస్త్రి వెళ్ళిపోయిన దిక్కు చూస్తూ అయ్యవార్లంగారు మిగిలిన వారితో అన్నారు:

"నా అనేవారెవరూ లేరు...యెవరికోసమనో సుఖం అనేది లేకుండా ఈమనిషి నాలుగు చేతులా ఆర్జించాడు...సుఖపడేయోగ్యతుండొద్దూ?"

ఈ ఉదయం, ఇదే అయ్యవార్లంగారు ఇదే చావడిదగ్గిర నలుగురితోటీ అంటున్నారు: "తవు అవసరం వేరే వుంది—అని ఆ మనిషి అన్నప్పుడే నాకు అనుమానం వేసింది. తన చితి తనే పేర్చుకుంటున్నాడేమిరా అని!"

ఇటు ప్రభలవారి కొంపలో గుండెలు పగల కొట్టుకుంటూ యేడుస్తున్న వితంతువు, శాస్త్రి కంటె రెండు మూడేళ్లు చిన్నదీ అయిన ఈ సూరమ్మ ఎవరు?

అతనికి తోబుట్టువా? వంటలక్కా? కాదు... కాదు...

అతని సన్యాసి సంసారానికి లోగడ అప్రయత్నంగా దొరికిన ఒక ఆడ దిక్కు!

రెండేళ్ళక్రితంవరకూ ఈమెని ఆవూరివా రెరగరు. ఎక్కడనుంచో ఆకాశంమీదనుంచన్నట్లు ఊడపడి ఒక రోజు శాస్త్రి వాకిట్లో కూలబడింది. ఆనాటినుంచీ ఆ యింటికి ఆమె ఒక కావలి కుక్క అయి కూర్చుంది.

బంధుత్వం విషయం శాస్త్రిని ఎవరూ అడగలేదు. అడగలేరు, అడగరు. సంభాషణ పెంచే మనిషిని చూస్తే అతను తప్పించుకుని వెళ్లిపోయేవాడు. రకరకాల ప్రస్తావనలమీదట సూరమ్మే ఆ విషయం చెప్పకునేది ఇరుగు పొరుగుల ఆడవాళ్ళ మధ్య.

శాస్త్రికి ఈ సూరమ్మ అనే మారవు బంధువు మినహాగా ఇంకెవరూ లేరా?

"ఆయన కెవరూ లేర్నాయనా... అన్ని దిక్కులూ పోయి గొల్లుమంటున్న నన్ను చేరదీశాడు. ఈ దిక్కు కూడా నాకు లేకుండా చేశాడు దేవుడు. ఒక్కమాటేనా చెప్పకుండా వచ్చిపోయాడు మా చినబాబు..."

* * *

రెండు నెలలక్రితమే శాస్త్రిలో ఒక విపరీతమైన మార్పు కనిపెట్టింది సూరమ్మ. మనిషి కొంచెం నీరసపడిపోతున్నట్లు కనిపించసాగేడు. అంతే కాదు— పూర్వం యెప్పుడూ కనిపించని విసుగూ- చిరాకూ అతనిలో ముఖ్యంగా కనిపించసాగేయి.

అప్పట్లోనే అనుకుంటాను- శాస్త్రి ఏదో వూరు వెళ్ళి సాయంత్రానికే తిరిగిరాక మూడు నాలుగు రోజులకు వచ్చాడు. మనిషి ఎందుచేతనో డీలాపడిపోయాడు. ఒక రోజున అనవసరంగా రైతు పోలయ్యమీద మండిపడ్డాడు. తర్వాత తన దురుసుతనానికి తనే చాలా బాధపడ్డాడని సూరమ్మ అంటుంది.

అప్పటినుంచే కాబోలు ఎప్పుడూ లేని చదువులు ప్రారంభించాడు రాత్రిళ్లు. గంటల తరబడి కళ్లు చిల్లులు చేసుకుంటూ లాంతరుదగ్గిర కూర్చునేవాడు. ఏవేవో వ్రాసుకునేవాడు.

నెలరోజుల క్రితం మళ్ళీ ఊరెళ్ళి నాలుగు రోజులలో తిరిగి వచ్చాడు. ఈమాటు మనిషి రవంత స్థిమితపడ్డాడు. కాని అలవాటులేని రాత్రిళ్ల చదువులు మరీ యెక్కువయ్యాయి.

అటువంటి సమయాలలో-నడవలో నేల మీద చెంగుపరుచుకొని పడుకుని వున్న సూరమ్మమనస్సు ఊసూరుమనేది. నాలుగైదు సార్లు నోరు కూడా చేసుకుంది.

"ఒళ్లు పాడుజేసుకుంటూ యెందుకు బాబూ ఈ తాపత్రయం?" అని.

అతను వినిపించుకునేవాడు కాదు.

కాని—ఆ మాటలు అన్న తర్వాత అతను ఏదో పరధ్యానంలోకి చూస్తూ ఊగుకోనడం ఆమె గమనించింది. ఒక వేళ అతని మనస్సుకి కష్టం కలుగుతోందేమోనని మరి అనడం మానివేసింది.

ఈమధ్య రెండు వారాలనుంచీ రోజూ ఎక్కడికో వెళ్ళి వస్తూనే ఉన్నాడు. పొలం కూడా నాలుగైదు రోజులు వెళ్ళనే లేదుట. కాని, మనిషి బాగా తేరుకున్నట్లే కనపడసాగేడు. హుషారుగా, ఏదో పెద్ద బరువు గుండెల మీదనుంచి పోయినట్లుగా కనపడడమే కాకుండా జీవితంలో మొదటిసారి అన్నట్లు అతని ముఖాన చిరునవ్వు కూడా చూడసాగింది సూరమ్మ.

మూడు రోజుల క్రితం కొబ్బరోలు మళ్ళీ రాజమండ్రీ వెళ్ళి వచ్చాడు.

ఇదీ సూరమ్మ చెప్పగలిగిన యావత్తు కథా. ఎన్ని రకాలుగా డొంకతిరుగుడుగా ప్రశ్నలు వేసేది, ఇంతకు మించి రవంత కూడా కథను పెంచలేకపోయింది సూరమ్మ. అది కొంత కారణమయ్యింది, కరణంగారి నిస్పృహకు.

వీధిలో అరుగుమీద మునికాళ్ళ మీద కూర్చున్న కరణంగారికొచ్చింది తలనొప్పి. చుట్టకాలుస్తూ జనాన్ని తదేకదీక్షగా పరికిస్తున్న మునసబుకేసి ఈర్ష్యతో చూడసాగేడు కరణం. ఆలోచనా సలహా ఎప్పుడూ మునసబు ఇవ్వలేడు. ఇప్పుడు మాత్రం ఎక్కడనుంచి తెస్తాడు? ఆ లేని వస్తువును!

ఆ మునసబుకు ఈ గొడవేమీ పట్టినట్లే లేదు. తను పట్టపగలు శవజాగరణం చేస్తున్నానన్న విషయమే మరచిపోయాడు.

ఈ మధ్య వ్యవసాయపు పనులేమీ లేనందువల్లా నాలుగు నెలలకు పూర్వమే పంచాయతీబోర్డు ఎలెక్షనులు పూర్తికావడంవలనా ప్రజలకందరికీ రెండు చేతులా తీరుబడి ఉండిపోయింది.

వాళ్ళందర్నీ పలకరిస్తూ, ఈ సందర్భాన్ని కాస్త వినియోగించుకుంటున్నాడు మునసబు. అటువంటి వీలు సాలులు దొరకబుచ్చుకోవడం చేతికానివాడు కరణం. వయస్సు ముదిరిపోవడం వలనా, ఇట్టే కలతబారే మనస్సు కావడం వలనా, మరీ అయోమయంలో పడిపోతున్నాడు కరణం.

ఒక వేళ యెవరేనా యే కారణంచేతేనా శాస్త్రిని చంపివేయలేదు కదా అని అతని అనుమానం.

నలుగురి వాకబుల వలనా ఈ సూరమ్మ మంచిదే అనీ ఎంతో నమ్మకస్తురాలనీ—అతనెరిగున్న విషయమే అయినా రూఢిపడింది.

శాస్త్రి గంగలాటి మనిషి. ఎప్పుడూ తలనెప్పి కూడా యెరగడని ప్రతీతి. నిన్నరాత్రే పదిమంది ఎదటా నవ్వుతూ మాట్లాడేడు; ఊరంతా ఊరేగి వచ్చాడు.

అటువంటివాడు అధాత్తుగా చచ్చిపోతే నే గ్రామ పెద్దలకు వస్తుంది చిక్కు.

రేపు ఏ సుకూ మొగమూ యెరగనివాడో వారసుడుగా వచ్చి అడ్డదిడ్డమైన ప్రశ్నలూ వేసి తల మొత్తగలడు—ఏమాత్రం పొరబాటూ అశ్రద్ధా జరిగినా.

అయితే ఇప్పుడు శవపంచాయితీ శవపరీక్షా జరిగించాలా? శవాన్ని కొవ్వూరు గవర్నమెంటు డాక్టరుదగ్గిరకి పంపించాలా - లేక గోదావరి గట్టుకు పంపాలా?

"మనిషిగుండెకాయ వుంది చూడండి. అది దేవుడు లాటిది. ఉన్నట్లే మనకి తెలియదు. ఒక మంచిరోజు చూసుకుని 'నేనున్నానయ్రోయ్ కాస్త జాగ్రత్తగా మసులుకోండి' అని గోల ప్రారంభిస్తుంది. మన్ని కాదనుకుంటాం. అది యెంతేనా ఆడుతుందినాటకం. అసలు ఆగిపోయేనాటివరకూ అసలటువంటి వస్తువే వున్నట్టు అంతవరకూ చాలామంది గ్రహించలేరు... అప్పుడింక లాభం లేదు!"

"యెంతటి బలంగల మనిషినీ ఇట్టే పీక నులిమేసి చంపేస్తుందిలెండి.... ఆ మాట నిజం. యేమంటారా మా పెత్తండ్రి కొడుక్కి—"

అయ్యావార్లంగారు మునసబుతో నడిపిన సంభాషణలోని గుండెకాయిని పట్టుకుని కొంత ధైర్యంతో లేచి నిలుచున్నాడు కరణం.

సరి అతని చావునిగురించి ఏదో ఒక నిర్ణయానికి రాగలిగేడు. అతని ఇతరవ్యవహారాలెలాగ తేమల్చాలీ అని—

ఒక యిల్లు, పది పన్నెండెకరాల సుక్షేత్రమైన మాగాణి, మామిడితోట, నారింజతోట, ఇంట్లో నిలవవున్న బస్తాల ధాన్యం, మిరప బుట్టలు, అపరాలు... ఇవి కాక ఎక్కడో యే బ్యాంకులోనో వుంచితీరాలని పుకారుగా వున్న చచ్చినంత రొక్కం నిలవ.

ఇదంతా వివిధంగా యెవరికి దఖలు పరచాలి ఇతని ఆస్తిపాస్తులన్నీ ఎంతకాలం కోర్టు లిటిగేషన్లలో వుండాలి? అని తెమిలేలోగా తనకాళ్ళు ఎంతవరకూ అరిగిపోవాలి?

ఎందుకు వచ్చిందిరా ఈ దిక్కుమాలిన పంచాయితీ అని కరణంతోబాటు బోర్డు అధ్యక్షుడు నారప రెడ్డి కూడా బాధపడుతున్నాడు.

"ఏనాడూ నాటికీ కోటికీ మన హయాంలో ఇలాంటివి జరక్కపోతే యెలాగయ్యా" అంటాడు మునసబు. అతనిదంతా పిడివాదం. ఇటువంటి సంఘటనల వలన గాని ఊరిపేరు పేపర్లో పడదు.

శాస్త్రికి ఆ వూళ్ళో విరోధులుండడానికి వీలు లేదు. ఎవరేనా చిల్లర మల్లర అడిగిందే తడవుగా ఇచ్చి వేసేవాడు. అతని దగ్గరికి, వ్యాపారానికయ్యేది డబ్బు సర్దుబాటుకయ్యేది, రాజమండ్రీనుంచి ఇద్దరు ముగ్గురు వర్తకులు వచ్చిపోయేవారు. వాళ్లు మంచి పరపతులున్నవారే. ఎంత పిసినిగొట్టు మనిషని శాస్త్రి పేరు పొందినా, అతని పిసినారితనంవల్లా—పట్టుదల వలన బాధపడి ఇబ్బందులు పడిన వారుగాని, అతనిపట్టుదల వలన కష్టాలపాలయినవారుగాని, ఆ గ్రామంలో లేరు. ఆ చుట్టుపట్లా లేరు. ఎవరేనా దూరంగా వున్నారేమో యెవరూ యెరుగరు.

పట్టుదలా పిసినిగొట్టుతనం అతను సేద్యంలో చూపించేవాడు ముఖ్యంగా. తను రెక్కలు విరుచుకుని పని చేసేవాడు. ఎదుటివాడిచేత చేయించేవాడు. చెట్టుని వున్న ఒక్క కాయీ ఎవరినీ ముట్టుకోనిచ్చేవాడు కాదు.

గ్రామానికి సంబంధించిన వ్యవహారాలలో మాత్రం మొదటినుంచీ అతనిది ఒకటే పద్ధతి. పదిమందీ కలిసి చేసిన నిర్ణయాన్ని తానూ ఒప్పుకునేవాడు; శషభిషలలో మాత్రం కలుగజేసుకునేవాడు కాదు.

సుమారు పుష్కరంక్రితం శాస్త్రి తల్లిదండ్రులు ఎక్కడనుంచో ఈ వూరు తర్లివచ్చారు. దరిమిలాని ఒకటి రెండు సంవత్సరాలకి శాస్త్రి దిగి వ్యవసాయం ప్రారంభించాడు. రెండెకరాల మాగాణి పొలంతో. అతని తండ్రి యెప్పుడూ వీధి వాకిలి చూడనే లేదు. అయ్యన్న చివరి జీవితం అంతా ఒకే మరచెంబుమీద గడచిపోయింది. శాస్త్రి తల్లిని మాత్రం అవూరివారు తరచు చూస్తూనే ఉండేవారు—గోదావరికీ ఇంటికీ మధ్యని—నీళ్ళ బిందెతో. ఒక పండు ముత్తైదువ ఒక పార్వతీదేవి వలె—మెల్లగా అడుగులలో అడుగులు వేసుకుంటూ వెళ్లేది!

అతను వచ్చిన మరి రెండు సంవత్సరాల లోపునే తల్లిదండ్రులు నిద్దర్నీ ఒకే మాసంలో అతను దహనం చేశాడు. యథావిధిగా కర్మ జరిపించాడు. అదివరకు తలమీద వుండే క్రాఫింగు తల్లి చనిపోయిననాడే మాయమయి మరి రాలేదు. అతని వేషం కూడా ఆనాటినుంచే మారిపోయింది. ఒక తుండుపంచ, బనీను—కుంకుమ వస్త్రాలలోకి.

ఒక విరాగివలె కనపడేవాడు. కాని, అతి పొదుపరి. నిత్య సంధ్యావందనాది కాలంతో కర్మిష్ఠి అనే పేరు సంపాదించాడు. సూరమ్మను పూర్వం స్వయంపాకం మీదనే బ్రతికేవాడు.

మంచిబలిష్ఠుడూ, ఆజానుబాహువూ అయిన అతనికి గ్రామం వయస్సు నిర్ణయించలేకపోయింది. సూరమ్మ అంచనాప్రకారం యేభయి దగ్గర. కాని అతని శివం పది సంవత్సరాలు తక్కువే చెపుతుంది. అతనికంటే చిన్నదే అయిన సూరమ్మ షష్టిపూర్తి అయిన జీవిలాగ కనపడుతుంది.

తెల్లవారగట్ల ఏనాలుగింటికో లేచిన శాస్త్రి పొలంలో కాయకష్టం చేసుకుంటూ, అపరాహ్ణం తిరిగివచ్చాక భోజనం చేసుకుని, ఆతర్వాత ఎన్నడూ విశ్రాంతిని ఎరుగక, రాత్రి ఏ పదింటికో పడక చేరేవాడు.

ఒక విధంగా ఎన్నడూ నీతీ నియమం తప్పని ఈ మనిషి పదిమందికీ ఒక ప్రశ్నగానే, అర్థంకాని సమస్యగానే చనిపోయాడు. తన స్వంత దహన సంస్కారాలకు ఏమి యేర్పాటులు చేసుకున్నాడో గోచరం కావడంలేదు పెద్దలకు.

"ఆయనకి నేనూ నాకు ఆయనా మినహాయిస్తే వేరుదిక్కు లేదండి. యావత్తు కర్మ యథావిధిగా ముందు జరిపించండి స్వామీ—" అని కళ్ళనీళ్లు తుడుచుకుని అన్నది సూరమ్మ.

గతించినదానికి విచారించీ తల మొత్తుకునీ లాభంలేదని ఆమె గ్రహించేసరికి ఉదయం పదిగంటలు దాటింది.

# ఎదురువచ్చిన మృత్యువు

ఆ వీధి స్త్రీలంతా పొయ్యిలలో నిప్పువెయ్యక శవం యెప్పుడు కదులుతుందా, యెప్పుడు రెండు మెతుకులు ఉడకవేసి పిల్లలకి పెట్టుకోడమా అని ఎదురుచూస్తున్నారు.

ఏది ఏమయినా అది తప్పదు కదా!

"ఆ మహానుభావుడి ధర్మమా అంటూ ఇంట్లో ఊరందరికీ సరిపడే సరుకుంది. ఏదో రొక్కం నిలవ వుంటుంది...కానియ్యండి బాబూ..."

అనితవిడ మరొక్కసారి ధైర్యం చెప్పిన తర్వాత కరణంగారి కాలుకదిలింది. రెండు మూడువందల లోగిళ్ల బ్రాహ్మణ్యంగల ఆ గ్రామం, విశ్వనాథశాస్త్రి భౌతిక దేహ దహనసంస్కారానికి గోదావరిగట్టుకు ప్రయాణం చేసింది.

ఇరుగు పొరుగుల స్త్రీలంతా ప్రథమ వారింటికి మిగిలివున్న ఆకెళ్ల సూరమ్మనే మరీమరీ పరామర్శించి వెళ్ళిపోతున్నారు. ఏదో అన్నీ తనకు తెలుసునని చెపుతోందేగాని, నిజానికి విశ్వనాథశాస్త్రి హృదయంలో గుప్తంగా నిలచిపోయి దహనమైపోయిన సంగతులు ఆమెకేమి తెలుసు?

అతని భార్యాబిడ్డలు అసలుండేవారా? అతని అత్తవారెవరు? ఎక్కడ? అతని పూర్వచరిత్ర యేమిటి?

ఈ మధ్య ఎక్కడెక్కడికో తిరుగుతూ రకరకాలుగా పడిన తాపత్రయాలేమిటి? ఎందుకు పడ్డాడుట?

ఈ ప్రశ్నలకి ఆమె ఏమి సమాధానాలు చెప్పగలదు—?

ఒక్క నమస్కారం తప్ప!

* * *

దహన సంస్కారం పూర్తయిన మరుక్షణంలో, ముందుముందు ఎందుకైనా మంచిదనే వుద్దేశ్యంతో, దినపత్రికలకు కరణంగారి సంతకాలతో ఒక ప్రకటన పంపబడింది.

మృతి వివరాలు ఇస్తూ - ఎవరైనా అతి సన్నిహితులు గాని ఆత్మీయులు గాని శాస్త్రిగారి ఆస్తి పాస్తులకి వారసులు కాతగ్గవారుంటే పూర్తి వివరాలతో వెంటనే తెలియచేస్తూ (యథావిధిగా కర్మ చేయడానికి) బయలుదేరి రావలసింది - అని ఆ ప్రకటన.

అనవసరమైన లిటిగేషను ముందుగానే పెరగకుండా వుండడానికిగాను ఇందులో ఆస్తి వివరాలు మాత్రం ఇవ్వబడలేదు. ఇది పంచాయతీ పెద్దలంతా ఏకగ్రీవంగా ఆమోదించి చేసిన పని.

"ఒక్కసారి మాటవరసకు కూడా చెప్పలేదు ఎక్కడ యెవరెవరున్నారో యేమిటో...ఇక్కడ తలదాచుకున్నందుకు మోయలేని బరువులన్నీ నా నెత్తినే వొదిలివెళ్లేడు కదా...అహోరాత్రులు కష్టించి సంపాదించిన ఆస్తికాస్తా ముక్కలైపోతూంటే చూడవలసిన కర్మకూడా నాకు రాసివుంది కాబోలు..."

అని సూరమ్మ మనిషి మనిషిదగ్గరా వాపోవసాగింది.

నిజమే మరి. దిక్కులేనిఆడది. అంతా పరాయివాళ్లు. తానూ పరాయిదే. ఏమిచేస్తే ఏమంటారో ముందు ముందు.

ఆమెని హఠాత్తుగా నిండు సముద్రంలోనే ముంచి పార వేశాడు—అదికూడా వాస్తవమే!

వ్యవహారం వ్యవహారమే మరి. పద్ధతిప్రకారం నడచుకోవలసిందే - ఎవరైనా. ఆ యింటగల సరకుల జాబితా, కంటికి కనపడే ఆస్తివివరం పంచాయతీ పెద్దలు తయారుచేశారు. ఇంట్లో కొంచెం తక్కువగా రెండువందల రూపాయల రొక్కం వుంది. బ్యాంకు పాసుబుక్కులు - చెక్కుబుక్కులు అన్నీవున్నాయి. అతని పెట్టెలు అన్నీ తాత్కాలికంగా సీళ్లు వేశారు. ఇంటెడు సరుకులూ సామానుతో సహా సూరమ్మకు తాత్కాలికంగా వప్పగించారు...

ఆ రోజుకూడ తెల్లవారేసరికి శాస్త్రి గుణగణాలు ఆనోటాఆనోటా రకరకాలుగా ప్రతిధ్వనించసాగేయి. అతని మృత్యువు ఎంత వింతగా వుందో, ఆఖరివారపు అతని చరిత్రకంటే ఆఖరి రోజు అతని దినచర్య అందర్నీ విభ్రాంతుల్ని చేయసాగింది...

ఈ ఆఖరి వారం యావత్తూ వ్యవహారాలన్నీ చక్కపెట్టుకోవడంలో అతను గడిపేడు. తను ఇవ్వవలసినవారందరికీ అణాపైసలతో లెక్కకట్టి ఇచ్చివేశాడు. తనకు రావలసిన బాకీలు చాలావరకూ రాబట్టుకున్నాడు. రానివాటికీ రాలేనివాటికీ విచిత్రంగా తెగతెంపులు చేసుకున్నాడు.

ఇద్దరు బాకీదార్లను తను ముక్కూ మొగం యెరగని ఇద్దరు రాజమండ్రీలోని సామాన్య గృహస్థులకు అవార్జీ వేశాడు. మిగిలిపోయిన నోట్లమీద ఈవిధంగా చెల్లు వ్రాసియిచ్చాడు :

"కారణాంతరాలవలన ఈనాడు మీ పరిస్థితులు బాగుగా లేకపోవడం వలన, ఈనోటు బాపతు అసలు ఫాయిదాలు యావత్తూ నాకు ముట్టినట్లే భావించుకుని చెల్లు వ్రాస్తున్నాను. ఈ నోటుమీద ఇక నాకుగాని, నాఅనంతరం నావారసులకు గాని యెటువంటి చర్యకూ యేవిధమైన హక్కూ లేదు."

ఒక్క కొవ్వూరులోని రంగయ్య శ్రేష్ఠిమాత్రం ఈ విధంగా చెల్లు వ్రాయించుకోడానికి ఒప్పుకోలేదుట. ఒక్కవారం రోజులలో సొమ్ము సర్దుబాటు చేస్తానని బతిమాలుకున్నాడు. శాస్త్రి భిక్షుకడికి అన్నగారు. ఒప్పలేదు. చెల్లువ్రాసి : "నిజంగా సర్దుబాటు చెయ్యాలని నీకుంటే—నీ యిష్టం వొచ్చినప్పుడు, నేనున్నా లేకపోయినా, ఏ పరిస్థితిలో వున్నా— సొమ్ము మావూరి కరణంగారి చేతి కియ్యి. దాన్ని ఏ విధంగా వినియోగించాలో వారికే తెలుస్తుంది—" అని అంటూ రెండోమాట వినిపించుకోకుండా వెళ్ళిపోయాడుట.

ఆ రంగయ్య వెయ్యిరూపాయల చిల్లరా పుచ్చుకుని ఇప్పుడు కరణంగారి యెదుట నిలుచున్నాడు :

"ఇంకో సమయంలో అయితే యిది కాజేసేవాడినే – నేపెద్ద నీతిమంతుణ్ణని కాదు... కాని, ఇందులో ఒక్క పైసా కక్కుర్తిపడితే నే దుంపనాశనమై పోతానేమోనని భయం వేసింది" అని అతను నిజం వొప్పుకున్నాడు.

నలుగురి సలహామీద అన్నిటితోటే యిదీ తేలుతుందనే ధీమాతో కరణం ఆ డబ్బందుకున్నాడు – భగవంతుడిమీద భారం వేస్తూ.

మిగిలిన చెల్లుబడి వ్రాయబడిన నోట్లబాపతు మనుష్యులూ వారి కుటుంబాల సహితంగా గొల్లుమన్నారు శాస్త్రికోసం. అతని చరిత్రకు శిఖరంగా మిగిలివున్న సూరమ్మ పాదాలు తడిపేరు కళ్లనీళ్లతో!

ఇంతేకాదు—

ఇటు రాజమండ్రిలోనూ అటు కొవ్వూరులోనూ—అతనికి స్నేహితులూ ముఖపరిచయులూ చాలామంది వున్నారుట. ఇంటింటికీ వెళ్లి వారిని పలకరించి, వారివారి పిల్లలచేతుల్లో పాతికో పరకో పెట్టి వెళ్లిపోయాడుట – ఈమధ్య.

సూరమ్మలూ పేరమ్మలూ విస్తుపోవడంలో ఆశ్చర్యం లేదు. ఇప్పుడు విస్తుపోతున్నది కరణంగారూ —ఆయన పరివారమూను.

శాస్త్రి నిజంగానే మహానుభావుడయి వుండాలి —సమీపిస్తున్న మృత్యువు సంగతి యెరిగినవాడయితే... లేదా, ఏనాడో అతని భవిష్యత్తు చెప్పిన ఏ జ్యోతిష్కుడి లెక్క ప్రకారమో మృత్యువు వేంచేసి వుండాలి.

అయినా—ఆధారం?

దిసలు తిరిగి పదిమంది స్నేహితులనూ చూసి రావచ్చును... ఏదో విధాన అయినా పయినా తన వ్యవహారాలన్నీ ఇల్లలికి ముగ్గుపెట్టినట్లు చక్కపెట్టుకోవచ్చును... తనకు పిల్లా పీచూ లేరు కాబట్టి రావలసిన బాకీలు వచ్చినట్లే భావించుకుని వుండవచ్చును—

అతనికి నిజంగానే దక్షిణధృవంనుంచి ఆహ్వానం ఒక నెలరోజులు ముందు కాకపోయినా వారంరోజులు ముందుగానే వచ్చివుండవచ్చును... యెదురు వచ్చిన మృత్యువు మరి పదిగంటలు టైమిచ్చివుండవచ్చును...

"తను ఛస్తానని యెరిగిన మనిషి చెయ్యవలసిన పనులన్నీ పూర్తిచెయ్యలేదా ఈమనిషి?" అని కరణం తనమీదనే నోరుచించుకున్నాడూ అంటే కారణం లేకపోలేదు—

గ్రామ త్రిమూర్తుల మెడకు చుట్టుకున్న ఉరిత్రాడే అది !

రెండోనాడు తెల్లవారేసరికి గ్రామచావడి దగ్గిర నలభైరెండో సంవత్సరపు ఆగస్టు ఉద్యమాన్ని గురించి చర్చించేమాదిరి జనం సమకూడివున్నారు. అందరినోటా శాస్త్రి పేరే . పరిక్షించి చూస్తే ఈ జన సమూహంలో పరాయి గ్రామస్థులు కూడా చాలా మంది కనపడతారు. తాత్కాలికంగా అంతా కులమత కక్షలు విడిచినట్లున్నారు.

ఏముందంటే అందులో దాపీరు అనే క్రైస్తవ ఉపాధ్యాయుడు ఇద్దరు ముగ్గురు హరిజన శిష్యులతో ఒక సర్వేరాతిమీద చతికిలపడి వున్నాడు. అతని

ఉబ్బిన ముఖం, ఎర్రపడి లోతుకు దించుకుపోయిన కళ్ళు, జిడ్డు వోడుతున్న బుగ్గమీసాల నోరు.... అయిదారుగుర్ని హత్య చేసివచ్చినవాడి హృదయంతో శుద్ధ నాస్తికవాది తత్వంతో ఉన్నట్లున్నాడు— ఆరిపోయిన బీడీని ఇంకా పట్టుకుని దేవుళ్ళాడుతూ.

గ్రామ మునసబుగారి ముందు చేతులు కట్టుకుని వంచుకున్న తల మధ్యమధ్య యెత్తుతూ "అవునూ కాదూ అనేమాటలతోనే సాక్ష్యమిస్తోంది...పూర్వం నలుగురయిదుగుర్ని మార్చి, ఈమధ్యనే మతం పుచ్చుకొని దావీదును తన కూతురుతోసహా కట్టుకుని కాపురం చేస్తున్న "సువార్త"—

శాస్త్రిగారు తమ ఆఖరిరాత్రి ఇంకా చాలా చాలా వ్యవహారాలు చేశారు...కొన్ని దారుణాలు కూడా చేశారు...

తనకు పట్టులుతికే చాకలి సత్తి కూతురికి ఒక వంద రూపాయలనోటు బహుమానంగా ఇచ్చారుట. ఆ డబ్బుతోటే ఊళ్ళోవాళ్ళ గుడ్డలతోటే అది పరారయిపోయింది— తను ప్రేమించిన నారపరెడ్డిగారి మేనల్లుడుండే పట్టణానికి!— ఈవిషయం సత్తి రకరకాలుగా వర్ణించి చెపుతోంది ఒకవంక!

గ్రామ చావడిలో కబుర్లు పూర్తయిన తర్వాత శాస్త్రి పెద్దవీధి చివర నేవున్న సందులోకి మళ్ళేడుట. అందులో ఒకసగం పాడుపడిపోయిన ఇంటి పెరడులో గొడ్లసాలలో రెండుతడికలు అడ్డుపెట్టుకుని సుబ్బాయమ్మ అనే వృద్ధవితంతువు నివసిస్తోంది. ఎముకలు చీకి చివికిపోయి నడుము విరిగి వంగిపోయినా — తప్పక, దిక్కులేక — ఈ ముసలిది తెల్లవారగట్లనే లేచి ఒక బిందె భుజాన వేసుకుని పోతుంది. రెండు బ్రాహ్మణ కుటుంబాలకు మడినీళ్లు మోస్తుంది. మసకతో మూసుకుపోయిన ఆమె గాజుకళ్ళు, అలవాటూ పరిపాటే అయిపోయిన గోదావరిదాకా నిరభ్యంతరంగా తీసుకువెడతాయి. ఇదివరకు వారింటా వీరింటా చిల్లరపనులు కూడా చేసేది. ఇప్పుడా వోపిక చచ్చింది...ఇన్ని గంజినీళ్ళు కూడా కాచుకోవడం ఒక్కొక్కరోజు మగతలో మరచిపోతూ వుంటుంది.

ఈ ముసలిది ఏ క్షణాన్నో గుటుక్కుమనక తప్పదు. ఆమెకు రాజమండ్రిలో ఒక్కగానొక్క మనవడున్నాడు. వారాలు చేసుకుంటూ చదువుకుంటున్నాడు స్కూలుఫైనలులోకి వచ్చాడు.

శాస్త్రి ఆమెకు యెదురుగా నిలబడ్డాడు. పిలిచాడు. గుడ్డి దీపపుబుడ్డి వెలుతురులో ఒక చింకిచాప మధ్యని వుండచుట్టుకుని పడివున్న ఆమె కదిలింది... వెదుకుతూ ఆ మనిషి వేపు చూసింది. శాస్త్రిని యేమో చాలాసార్లు చూసింది. స్వంత మనుమడినే గుర్తుపట్టగలిగేసరికి ఆమెకు చాలాసేపు పడుతుంది. అటువంటి స్థితిలో వున్న ప్రాణి అతన్ని గుర్తుపట్టగలదా?

ఆయన దగ్గరగా కూర్చుని ఆమెకు అర్థమయ్యేటట్లు చాలాసేపు మాట్లాడి, చివరికి :

"నీ మనవణ్ని చదివించు. వాడేనా వృద్ధిలోకి వొస్తాడు," అంటూ ఆమె వంకరు తిరిగిన చేతులకు ఒక పెద్ద కవరిచ్చాడు.

"ఇందులో బ్యాంకుపుస్తకం రెండు బాండ్లు వున్నాయి. నీ మనవడు బియ్యేదాకా చదువుకోవచ్చు. వెళ్ళి బ్యాంకు వాళ్ళని కలుసుకోమను. నీ మనవడికి ఇది యిస్తే వాడికే తెలుస్తుంది...ఎల్లుండి ఆదివారం— వాడొస్తాడుకదూ..." అన్నాడు.

అతను వెళ్ళిపోయాడు. ఆ మాటలు ఆమెకర్థంకాలేదు. కాగితాలు మనవడికియ్యాలి— వాడు చదువుకుంటాడు'...ఇంతవరకూమాత్రం ఆమెకు ఇంగితం; పదేపదే చెపుతోంది వెళ్ళిపోయిన మనిషి దిక్కే చూస్తూ, ఒక గుడ్డలమూటలాగ, ఆ కవర్ని చేతుల్లోనే పెట్టుకుని కూర్చుండిపోయింది — ఆ రాత్రీ ఇంకో రాత్రీ తెల్లవారి, మనవడు రాజమండ్రీనుంచి వచ్చే వరకూ—

వాడు అర్థంకాని పరిస్థితులలో కవరు చింపుకుని చదువుకుని అమ్మమ్మని కౌగలించుకొని గొల్లున యేడ్చేడు...

ఎంతోసేపటికి నీళ్ళురాని కళ్ళని వాడివేపు తిప్పి వాడివీపు నిమురుతూ......"యెవర్నాయనా పాపం?" అంది...

"శాస్త్రిగారు— ప్రభల విశ్వనాథ శాస్త్రిగారు" అన్నాడు.

ఆవిడ తల ఆడిస్తూ అంది: "పాపం! పోయాడా? యెప్పుడు? మంచివాడులాగుంది..."

ఆ తర్వాత శాస్త్రిగారి విగ్రహం ఊరికి బాగా ఉత్తరాన వున్న మాదిగగూడెం వేపు వడిచివెళ్ళినట్లు స్థానిక చరిత్రకారుల సాక్ష్యం.

తాటి తోపులోంచి వెళుతున్న ఈ పిలకశాస్త్రి గారిని చాకలివీధిలో చాలామంది పరకాయించి చూశారు. ఇగుడు గుడిసెల నీ కళ్ళు కాలవలని తప్పించుకుంటూ ఏదో నిద్రమత్తులో వున్నట్లున్న అతన్ని చూసి అంతా ఆశ్చర్యపోయారు. అతను వాళ్ళని గమనించినట్లే లేదు.

అటు ప్రభుత్వంవారినీ ఇటు మిషినరీవారిని అండగా చూసుకుని ఒక పాక వేసుకుని అందులో ఒక పాఠశాల నడుపుతుంటున్నాడు దావీదు. ఆదివారాలు ఆ పాఠశాలే ఒక చిన్న చర్చిగా మారుతుంది. దావీదు క్రైస్తవమతంమీద ఉపన్యసిస్తాడు. ఎవరేనా మతం పుచ్చుకుంటారేమో నని తాపత్రయపడతాడు. బాప్టిజం, ఒకటికి అయిదురూపాయలూ పెళ్ళి ఒకటికి అయిదురూపాయలూ—మిషినరీ వారిచ్చే పారితోషికం అతనికి. అతని సంపాదన కాస్తా సువార్త తిరుగుళ్ళకే ఖర్చయిపోతుంది.

పాక నెత్తిమీద ఒక పెద్ద కర్రసిలువ వుంది. చుట్టూవున్న ముళ్ళకంచెల ఆవరణకి ఒక విరిగిపడిపోయిన చిన్న వెదురుకర్రల గేటు—దాని నెత్తిమీద అక్షరాలు చెరిగిపోయిన పొడుగాటి బోర్డు.

శాస్త్రి పాకబయట నిలబడ్డాడు. లోపలగదిలో యుద్ధం జరుగుతోంది. శాస్త్రి పిలిచేడు. ఈకంఠస్వరానికి లోపలియుద్ధం తాత్కాలికంగా నిలిచిపోయింది. మరి కాస్తసేపటికి మసిబారిన లాంతరుతో రేగిపోయిన జుట్టుతో దావీదు యెదురుగా ప్రత్యక్షమయ్యాడు—శాస్త్రిని చూసి ఎందుకో నివ్వెరపోయాడు.

అతని వెనకాలే వచ్చి నిలుచున్న సువార్త ముఖం రకరకాల చరిత్ర—ఆ చీకటిచాటునే చెపుతోంది. వయసులో దావీదుకంటే పెద్దది.

ఆ దంపతు లిద్దరికీ బ్రాహ్మలూ, అందులో పిలక వున్న బ్రాహ్మలూ అంటే పరమ అసహ్యం—ద్వేషం...ఇతరకులాల్ల వాళ్ళని ద్వేషిస్తే ఆ వూళ్ళో నిలవ నీడకూడా దొరకదని వారెరుగుదురు...

అర్థాంతరంగా వచ్చిన ఈ పిలకబ్రాహ్మడిని చూసి బిత్తరపోయారు. వాళ్ళని పరామర్శిస్తూ కూర్చో డానికి శాస్త్రికి తీరుబడి లేదు—

శాస్త్రి మాట్లాడసాగేడు...

"ఏం దావీదూ! నీకు చివరకి యెవరూ సహాయం చెయ్యనేలేదుట—ఆ మిషినరీవాళ్లు కూడా?"

కడుపులోంచి కోపంతో పొంగవస్తున్నా అణిచి పెట్టుకునే ప్రయత్నంతో దావీదు మూలిగేడు; సువార్త చిరచిరలాడుతూ రెండడుగులు ముందుకు వచ్చి దావీదు ప్రక్కనే నిలబడింది...అవసరం వస్తే ఆయొగుటి పిలకని వేళ్ళతో లాగి పారెయ్యడానికి!

"సరే...దానికి మన మేంచేస్తాం...అయిందేదో అయిపోయింది. అనవసరంగామతం చెడగొట్టుకున్నావు. అటూ యిటూ కూడా చెడిపోయావు...నీకు సహాయం కావాలి...డబ్బంటే నేగాని నీకు పొట్టగడవదు. అది నాకు తెలిసింది."

దావీదు యెందుచేతనోగాని "చిత్తమండి—" అన్నాడు. ఇంకోమాట అనడం అలవాటులేని నోరు వాడిది.

"ఈమధ్య నువ్వు పస్తులు పడుకుంటున్నావని కూడా తెలిసింది. నీక్కావలసిన సహాయం నేచేస్తా. ఈ స్థలం కొనుక్కోడానికీ, పడిపోయిన నీ పాక శుభ్రంగా కట్టుకోడానికీ...కొంతనీకు యిబ్బంది తీరే దానికీ కావలసింది అంతా నేనిస్తా—"

దావీదు ప్రపంచాన్ని మరచిపోతున్నాడు—ఎదురుగా నిలచివున్నది యెవరో మేమిటో కూడా అతనికి అవగతం కావడం లేదు—

"నీ స్కూలు సరిగ్గానడిస్తే ముందు సంవత్సరానికేనా నీకు గ్రాంటువస్తుంది...ఈలోగా కలో గంజో కాచుకుని బ్రతుకుతూవుండు..."

సువార్త క్రిందిదవడ రెండుఅంగుళాలు జారిపడిపోయింది. దావీదు రెండుచేతులూ కలిసి దణ్ణం పెడుతున్నాయి. ఎదురుగా శాస్త్రి స్వరూపంలో వాడికి ఏసుప్రభువు కనపడుతున్నాడు.

చదువుకున్న వాడివి...ఒక్కటేమరతు...దిక్కులేని పదిమందిపిల్లలకి చదువుచెప్పు...వాళ్ళందర్నీ నీ మతంలోకి ఎలాగేనా అయిదురూపాయల లాభం కోసం మార్చెయ్యాలనే దుర్బుద్ధిమాత్రం పోగొట్టుకో.... ఎప్పటికేనా అది నీకు మంచిది....

శాస్త్రి వెళ్ళిపోతూ ఆగి సువార్తను చూస్తూ దావీదుతో అన్నాడు:

"ఇది యింకా వెనకటి పద్ధతిలోనే వున్నట్టు వింటున్నాను. బోగంది కూడా ఒక నీతికి కట్టుబడివుంటుంది. నీతో కలో గంజో తాగుతూ బతుకుతుండా... సరే...ఇష్టం లేదూ మెడపట్టుకుని గెంటెయ్యి... నీకు పెళ్ళాం లేకపోయినా వచ్చిన ఇబ్బందిలేదు. కూడూగుడ్డా వున్నవాడికి పెళ్ళాం. ఈ యెనుబోతు నీకెందుకు? ఒక్కసారిగా యెందరికి పెళ్ళాం అవుతుంది ఇది?...దీని వ్యవహారం ఈ తెల్లారేలోపునే తేల్చుకో—"

ఆమాటలు వింటూ, అతని చూపులు చూస్తూవున్న సువార్త పాతాళంలోకి దిగిపోతోంటే, దావీదు అన్నిటికీ చిత్తంకొడుతూ లెంపలు వేసుకుంటున్నాడు.

దావీదు దంపతులు ఆ రాత్రి ఏసుప్రభువుని మరచిపోయారు. అందుకు శిక్షగా తెల్లవారేసరికి వారికి వినబడింది—ఒక పిడుగులాగ—శాస్త్రి మరణ ఘోష.

"ఇంతకీ ఆ ప్రభువు కృప నాకులేదు. ఆ పంతుల్ని ఈగాత్రే తీసుకుపోవాలా?" అని తన అసమ్మతిని తన ప్రభువుకు యథేచ్ఛగా తెలియజేసుకున్నాడు దావీదు.

అంతేకాదు—పంతుల్ని ఎలాగయినా సరే తన పరలోక సామ్రాజ్యంలోకి తీసుకోవలసిందని దావీదు దంపతులు ప్రభువును ప్రార్థనలు కావించారు!

* * * *

శాస్త్రి చనిపోయి ఐదురోజులయింది. గ్రామం అతన్ని మరచిపోతోంది. కాని—కరణం మునసబులకు మాత్రం మరవడానికి వీలు కుదరడంలేదు.

దినపత్రికలలోని ప్రకటనకు సమాధానంగా మూడు ఉత్తిరాలు వచ్చేయి. ఉత్తరంకంటే పెద్దదైన టెలిగ్రాం ఒకటి వచ్చింది.

బంధువులు ముగ్గురూ ఎక్కడెక్కడో వుంటున్నారు. వారసులయ్యే ఆస్కారంమాత్రం తమకు కనపడటం లేదని విచారించారు. ఈ ప్రపంచంలో ఏదైనా జరగవచ్చు. అందుచేత వారివారి వావివరసలు పూర్తిగా ఇచ్చుకున్నారు. నిలుచున్న పళంగా రావడానికి గవర్నమెంటు ఉద్యోగాలు—సెలవలు మంజూరు కావాలి. "ఇదేమాదిరి ఉత్తిరాలు మీకు ఇంకా అనేకం వస్తాయికదా—బంధువర్గం పూర్తిలిస్టు మీ దగ్గరే ఈసరికి తయారయి వుంటుంది. నాకు వారసున్నయే యోగ్యత వుందని మీకు తెలిస్తే దయచేసి టెలిగ్రాం ఇప్పించండి...రెక్కలుకట్టుకుని కుటుంబంతో అక్కడ వాలగలను—"

అనే భరతవాక్యంతో మూడూ ఒకే మూసాయిదాకు తీసిన నకళ్లలాగ ఉన్నాయి ఉత్తరాలు! ఒకదానికొకటి సంబంధంలేని మూడు వూళ్ళనుంచి వచ్చేయి.

ఇక నాలుగవది—అది టెలిగ్రాఫు ఉత్తరం. దాని తత్వమే వేరు...టూకీగా :

"నేను బంధువునే అయినా వారసుణ్ని కూడా అవగలిగే యోగ్యత వుంటే—నాలాంటి వారసుల్ని విశ్వనాథశాస్త్రి గారికి ఒక వందమందేనా వుండాలి. ఇంతమందినీ తగవులాడుకోవాలి. కోర్టులచుట్టూ తిరగాలి. కాబట్టి, ఆస్తిపాస్తుల వ్యవహారాలు నాకు సంబంధించినంతవరకూ అతి దూరంగా ఉంచండి.

"ఎంతటి బలగం ఉన్నవాడికయినా సమయానికి ఒకరూ దగ్గరవుండక పోవచ్చును ఆయనకి యథావిధి కర్మ చెయ్యడానికి ఆత్మీయులెవరూ లేకపోయిన పక్షంలో మీరు వెంటనే నాకు టెలిగ్రాం ఇవ్వండి. ఏవిధమయిన ఇతర మీమాంసలూ మీరు పెట్టుకోనవసరం లేదు...నే బయలుదేరి వస్తాను. నాకు సెలవు దొరకదూ, ఉద్యోగానికి రాజీనామా ఇస్తాను. యథావిధిగా కర్మచేస్తాను. తర్వాత మాసికాలూ అవీ ఇక్కడ పెట్టుకుంటాను. ఈవిధంగానైనా వారికి నా కృతజ్ఞత తెలియచేసుకుంటాను.

"అక్కడికి నేను తీరా వచ్చినతర్వాత ఆయన తాలూకువారు యెవరేనా వస్తే, సరేసరి వారేచేస్తారు నేనేమీ అనుకోను.

"నాది ఒక్కటే షరతు. ఆస్తిపాస్తుల వ్యవహారం నాకనవసరం. ఒకవేళ నాకు ఏమైనా హక్కులుండుకున్నట్లయితే వాటి నన్నిటినీ ఈ ఉత్తరం ద్వారా వదులుకుంటున్నాను. వెంటనే టెలిగ్రాం మాత్రం తప్పకుండా ఇవ్వండి..."

సమాధానానికి గాను కావలసినంత డబ్బు కూడా అక్కడే చెల్లించాడు ఈ పెద్దమనిషి....ఇంత పురాణమూ చెప్పి తన బంధుత్వంమాత్రం ఏమిటో తెలియచేయనేలేదు!

"శాస్త్రికి తగ్గవాళ్ళల్లాగే కనపడుతున్నారు ఈ నలుగురూ—" అన్నాడు నారపరెడ్డి. "ఒక్కడికీ ఆశలు లేవు—"

"లేకేం? ఆ ముగ్గురికీ వుంది. ఈ టెలిగ్రాం ఆయన ఎవడో సన్యాసిలాగున్నాడు. పేరేమిటి?" అని మునసబు.

"ఆర్. సి. చంద్రం" అంటున్న కరణం కళ్లు వీధిలో నిలుచున్న అనేకమంది సరిక్రొత్త ముఖాల మీద పడ్డాయి.

వీరంతా ఇప్పుడు స్టీమరులోంచి దిగిన శాస్త్రి బంధువర్గంట—

ఈ నాల్గురోజులనుంచీ రవంత జ్వరం తగులుతున్నట్లనిపించిన కరణానికి టెలిగ్రాం చదువుతోంటేనే పూర్ణజ్వరం ముంచుకువచ్చింది. ఈ బంధువుల సైన్యాన్ని చూసేసరికి అతని కళ్ళకి మైకమూ శరీరానికి కుదుపూ ప్రారంభమయి, ఆ జ్వరానికి ఒక 'మలేరియా' పరపతిని తీసుకువచ్చాయి

బంధువులనందర్నీ తరలించుకొనిపోయి సూరమ్మకు వప్పగించాడు మునసబు. ఎంత కృంగిపోయి వున్నా వారినందరినీ ఆమె గౌరవించింది, ఆదరించింది, భోజనాలకి యేర్పాటులు చేయసాగింది. పాడుపడినట్లున్న ప్రభల వారింటికి ఇప్పుడు ఒక పెళ్ళికళ వచ్చింది...

కరణం తీరుబడిగా కూర్చుని ఆలోచించసాగేడు. నలుగురు పెద్దమనుష్యులలోనూ యెవరిని పిలవడమా—లేక అందర్నీ పిలవడమా? మళ్ళీ మనకెందుకీ బాధ్యత—రేపు గవర్నమెంటు ప్లీడరే అన్నీ చూసుకుంటాడు...ఈ విధంగా పరిపరివిధాల పరుగులెడుతోంది అతని మనసు.

"మర్యాదకోసమేనా డబ్బుకట్టిన ఆ టెలిగ్రాం ఆయనకి ముందు ఏదో వో సమాధానం పంపించు" అన్నాడు రెడ్డి.

"అన్నీ అయోమయంగా ఉన్నాయి. మీకు ఇష్టమయితే రావచ్చు—" అని టెలిగ్రాం ఇవ్వబడింది.

ఆ మర్నాటికి ఒక పాతిక ఉత్తరాలు వచ్చాయి. అవన్నీ శాస్త్రిగారి పరిచయుల దగ్గర్నుంచీ స్నేహితుల దగ్గర్నుంచీ. శాస్త్రి మరణానికి తమ విచారాన్ని తెలుపుతూ అతని కుటుంబానికి (?) సానుభూతులు పంపుకున్నారు.

అందులో ఒకే ఒక ఉత్తరం కొన్ని పేజీలు వుంది. అది చదువుకోలేక పరాకు చిత్తగిస్తున్న కరణానికి నిలుచున్నపళంగా రావలసిందని సూరమ్మ దగ్గర్నుంచి కబురు—

ఇంటికివచ్చిన బంధువర్గం అంతా మెల్లమెల్లగా ఇల్లంతా అల్లుకుపోతున్నారుట. సూరమ్మ మనస్సు అందుకు మాత్రం వప్పడం లేదు.

"ఈ ఆస్తికి అధికారి యెవరో తేలేవరకూ అందరూ పరాయివాళ్ళే—నేనూ పరాయిదాన్నే! ఈ సరుకు నా చేతికి వప్పగించేరు కాబట్టి పూచీపడవలసిన బాధ్యత కూడా నాది. రేపు ఆ అధికారి యెవరో వొచ్చింతర్వాత నేనూ నెత్తిమీద చెంగు వేసుకొని పోవలసిన దాన్నే కదా...ఈ పెద్దమనుషుల్ని కాస్త అదుపాజ్ఞలలో వుంచమనండి. నన్ను వీరెరుగరు—వీళ్ళని నేనెరుగను...లేకంటారూ—మీరే వో మనిషిని ఇక్కడ యాజమాన్యానికి పెట్టండి—" అని నిక్కచ్చిగా అన్నది.

ఆమె మాట చెల్లక తప్పలేదు. మొహమాటాలు లేని మునసబు బంధువులందరితోటీ నిక్కచ్చిగా చెప్పివేశాడు.

"పూచికపుల్ల పోయిందని ఆవిడ ఫిర్యాదు చేసిందా అంటే మీ అందర్నీ తలార్ల చేతికిచ్చి కొవ్వూరు తాలూకా ఆఫీసుకి తోలించేస్తాను—" అన్నాడు.

ఈ మాత్ర బాగా పనిచేసింది బంధువులకి.

* * * *

ఆ సాయంత్రం తీరుబడిగా కూర్చుని మిగిలిపోయిన పెద్ద ఉత్తరాన్ని చదువుతున్నాడు కరణం. రెడ్డీ మునసబూ వింటున్నారు—

అది ఎవరో వక స్త్రీ దగ్గర్నుంచి—

మంచి విద్యావతీ సంస్కారం గలదీ లాగ కనపడుతుంది...అందులో కొన్ని ముఖ్యమయిన భాగాలీ దిగువను ఇస్తున్నాను:

"ఈ వుత్తరం ఎవరికి వ్రాస్తున్నానో యెందుకు వ్రాస్తున్నానో తెలియడం లేదు. కుటుంబం లేని శాస్త్రిగారి కుటుంబానికా? లేక...నాకు నేనే వ్రాసుకుంటున్నానా?...లోని బాధ—ఆ వేదన బయటికి కక్కక తప్పదు...

"ఈ వుత్తరం చివరకి ఎవరు చదువుతారోగదా. ఏమయితేనేమి ఒక కష్టజీవి చరిత్ర ముగిసిపోయింది. ఒక మహానుభావుడు అంతరించిపోయాడు.

మంచీ చెడ్డాకూడా మూర్తీభవిస్తేనే గాని పూర్ణ మానవుడు కాలేడేమో! శాస్త్రిగారు అటువంటివాడు ...చివరికి తనకు మిగిలిన బంధువులనీ, బంధువుల కంటే యెక్కువ అయిన మిత్రులనీకూడా విడిచివేసి ఒక పుష్కరంనుంచీ తన జీవితాన్ని అజ్ఞాతంగా గడుపుకుంటున్నవాడు.

*　　　*　　　*

"ఈయన ఎవరు?"

"మద్రాసులో '—' వీధిలో '—' పేరుతో వున్న మహాసంస్థ సంస్థాపకుడు. లక్షలమీద వ్యాపారం చేసినవాడు. సర్వ నాశనం అయిపోయిన అభాగ్యుడు.

"సుమారు పన్నెండు సంవత్సరాల క్రితం వరద గోజులలో కొవ్వూరు పోలవరాల మధ్య ఒక లాంచీ మునిగిపోయింది. అందులో అంతా పెళ్లివారున్నారు. ఆ లాంచీలోనే తన సర్వస్వాన్నీ సమర్పించుకున్నాడు శాస్త్రిగారు.

"తమ్ముళ్లు, అప్పచెల్లెళ్లు, భార్య బిడ్డలు అంతా గోదావరి తల్లి కడుపులో పడిపోయారు-సుమారు నూరు మంది పైగా వున్న ఆత్మీయులు. ఆ లాంచిలో ప్రయాణం చెయ్యని శాస్త్రిగారూ తల్లిదండ్రులూ మిగిలిపోయారు!!

"ఆ క్షణంనుంచీ మనసు చితికిపోయిన శాస్త్రి గారు కొన్ని దినాలు మాత్రం మద్రాసులో వున్నారు. సంస్థను తన క్రింది ఉద్యోగస్థులందరికీ పంచి ఇచ్చేసి ఎక్కడికో వెళ్ళిపోయారు. ఆ తర్వాత వారి విషయం ఏమయ్యిందీ ఎవరికీ తెలియలేదు. కావాలని మిత్రులందరినుంచీ, పరిచయులందరినుంచీ, పరిచిత స్థలాల నుంచీ దూరమైపోయారు. తమ ఆస్తిపాస్తులంతా అందరికీ పంచి ఇచ్చివేసి, చేతిలో అణాకాసు కూడా మిగుల్చుకోకుండా- ఎక్కడో విశాల ప్రపంచంలో మిగిలిపోయారు.

"ఇప్పుడు తెలిసింది. వారి ఆత్మీయుల నందర్నీ పొట్టను పెట్టుకున్న అదే గోదావరి గట్టున ఈనాడు వారి శరీరం కూడా భస్మమైపోయిందని..."

*　　　*　　　*

కరణం గోదావరిగట్టు వేపు అక్కసుతో కళ్లు చించుకుంటూ చూస్తున్నాడు. భార్యా బిడ్డలనీ, అన్నదమ్ములనీ, వారి వారి సంసారాలనీ ఒకేసారి పోగొట్టుకుని గోవుపాదాల రేవులో తర్పణాలు విడుస్తున్న నిర్భాగ్యుడు, ఏకాకి శాస్త్రి అతని కళ్ళల్లో మెదులుతున్నాడు.

ఈ చావులతో చింపి పారవేసిన గుండె కలిగి, మంచానికి తాపడమయిపోయి నశించిపోయిన అతని తండ్రి; పర్వతాల బరువుతో అణగిపోతూ వున్నా తొట్రుపడుతున్న పాదాలను గోదావరికీ ఇంటికీ మధ్య నడుపుకు పోతున్న పండి రాలిపోయిన అతని తల్లి.

నిలువునా కుటుంబం కూలిపోయినా, ఆ సంగతి ఏమీ యెరగని ఈ కుగ్రామంలో జీవితాన్ని నడుపుకుంటూ, గంభీర యోగముద్రగల ముఖ వర్చస్సుతో కొన్ని దినాల క్రితం వరకూ వీధులవెంబడి నడయాడిన శాస్త్రి...ఒక ఏనుగు...అతని కళ్ళముందు చిరునవ్వులు చిందుతున్నాడు. అతని ముందు తానెంత? చీమ చిటుక్కుమంటే గుండె పగిలి ఉక్కిరి బిక్కిరయ్యే తన బతుకు ఎంత!

ఆఖరి రాత్రి అతని చిరునవ్వుల వెనకాల యెంతటి దారుణమైన రహస్యం...ఒక తరింపరాని తిమిరం...ఉన్నది. చివరికి, ఒకే చూరు క్రింద నిద్ర పోతున్నదే అయినా సూరమ్మకు పిసమెత్తు కూడా తెలియదే ఈ చరిత్ర.

ఉత్తరం వింటున్న నారపరెడ్డి చటుక్కున లేచి వెళ్లిపోయాడు. ఏ వ్యసనం ఎన్నడూ ఎరగని రెడ్డి ఆ రాత్రి తెల్లవార్లూ నిద్రలో ఏడుపుల్తో పలవరింతలూను. మునిగిపోతున్న లాంచీలలో అతను అన్ని నదీ నదాలలోనూ ఆ వొక్క రాత్రిలోనూ యాత్రలు ముగించుకుని వచ్చాడు.

*　　　*

సుమారు ఎనిమిది గంటలయ్యింది. ఎలాగో హితవు చేసుకుని ముక్కుడు కాఫీ తాగిన కరణంగారు, జ్వరం ముసుగుతో శాలువా కప్పుకుని కూర్చున్నారు. దగ్గరే పరిస్థితులు నెమరు వేస్తూ మునసబూ, ఉబ్బి ఎర్రపడిన కళ్ళను నిమురుకుంటూ నారపరెడ్డి కూర్చుని వున్నారు.

రాజమండ్రీ స్టీమరు వచ్చింది కాబోలు. వీధి వెంట కొందరు ప్రయాణికులు వెడుతున్నారు. ఓరక్షణంట

మునసబు వాళ్ళను లెక్కపెడుతున్నాడు. చూస్తూ వుండగానే ఎవరో దొరగారు కరణం ఇంటిముందు నిలబడ్డారు. ఆయన వెనక్కాలే నెత్తిమీద ట్రోలు పెట్టె హోల్డాలులతో కూలివాడు.

ఎవరు చెప్మా అనే లెక్కలోనే ఇంకా మునసబు చూస్తున్నాడు. దొరగారు మెట్లెక్కుతున్నాడు. ఆయన బూట్లు చప్పుళ్లు కరణం గుండెలలో రైళ్లను పరుగెట్టిస్తున్నాయి. అతనికి ఈ ప్రపంచం యావత్తు జనాభామీదా విపరీతమైన కోపం ముంచుకు రాసాగింది. అంతేకాదు, తన సంసారం మీద వైరాగ్యం కూడా వచ్చేసింది—

ఎవరో ... ఏ పెద్దాఫీసరో ... యేమిటో— మంచి సమయానికే విరుచుకు వచ్చాడురా దేవుడా అని బెంబేలు పడ్డాడు. ఇవన్నీ పరీక్షలు...అగ్ని పరీక్షలు...వీటిని నిలవ్రతొక్కుకుంటే వైతరిణి దాటినట్లే. శాలువా ఒకమూలకు విసిరేసి, కవచ ఖడ్గాలు పారవేసిన యోధుడి మొహం పెట్టి, కరణం గబగబా వసారాలోకి నమస్కారాలతో పరుగులు పెట్టేడు. అతని క్రాఫింగూ పిలకా గోదావరీ స్నానం చేసినట్లున్నాయి. కుర్చీని అరుగు మీదికి లాగి చేతులు కట్టుకుని నిలబడ్డాడు మునసబు. ఒక లాంతరు స్తంభం వేషం వేశాడు నారపరెడ్డి.

కుర్చీలో కూర్చోకుండానే ఆ దొరగారు స్వచ్ఛమైన తెలుగులో అడుగుతున్నాడు.

"ఈ వూరి కరణం గారు—?"

"చిత్తం...ఏం సెలవో—"

"క్షమించాలి మీరే నన్ను," ఆయన దిక్కులు పరికించి సంగతి గ్రహించినట్లున్నాడు. "నేను మిమ్మల్ని మింగడానికి వచ్చిన ఏ ఆఫీసర్నీ కాదు లెండి" అన్నాడు.

అర్థంకాని గ్రామ పెద్దలు ముగ్గురూ ముఖాలు చూసుకోసాగేరు.

"సరే.. మీకు కలకత్తానించి టెలిగ్రాం ఇచ్చిన పెద్దమనిషిని నేనే!" అనేశాడు.

ఆ మాటలు కరణం మేధస్సులోకి ప్రవేశించి, అతన్ని మూడు పిల్లి మంత్రాలను కొట్టించింది.

"మీ టెలిగ్రాం సమాధానం చూసుకోకుండానే నే వచ్చేసినందుకూ, ఇటువంటి స్వాతంత్ర్యం తీసుకున్నందుకూ మీరంతా నన్ను క్షమించాలి—" అంటూ చంద్రం, వద్దంటున్నా, అరుగు మీదనే చదికిల పడ్డాడు. "అసలు సంగతేమంటే—విశ్వనాథ శాస్త్రిగారికి నేనెంతో ఋణపడి వున్నాను. ఆయన వల్లనే చాలా సహాయం పొందాను. ఆ ఋణం తీర్చుకో దలచాను. కర్మ నా చేతులతోటే చెయ్యాలని బుద్ధి పుట్టింది. పత్రికా ప్రకటనా, నే మీకిచ్చిన టెలిగ్రాం కాపీ మా డైరెక్టరు ముందు పెట్టి-సెలవు ఇవ్వకపోతే రాజీనామా పెట్టేస్తాను-అన్నాను నవ్వుతూనే. ఆయన ఏమనుకున్నాడో — "ఆలస్యం యెందుకు? వెంటనే వెళ్లు" అన్నాడు. బయలుదేరి వచ్చాను..."

ఇప్పటికి 'షాక్' నుంచి రవంత తెప్పరిల్లిన కరణం కాళ్లు ఇంకా వణకుతూనే వున్నాయి.

"విమానం మీద విశాఖపట్టణం దాకా వచ్చి, అక్కణ్ణించి ప్యాసెంజరులో వచ్చాను. కర్మ యెన్నో రోజునుంచీ చేస్తారో నాకు తెలియదు. ఆయన కర్మ చెయ్యడానికి నాకూ అధికారం వున్నా, అది యెటువంటిదో మీరడగవద్దు— నే చెప్పను..."

ఆజాను బాహుడూ, స్ఫురద్రూపీ, ముప్ఫై అయిదు సంవత్సరాల వయసులోనూ వున్న చంద్రాన్ని చూస్తూ చాలాసేపు కరణం ఏవేవో మంత్రాలు జపం చేసుకుంటూన్నట్లు కనపడ్డాడు. చివరికి ఒక నిర్ణయానికి వచ్చి:

"ఏది యేమైనా అన్ని వివరాలూ మీకు చెప్పెయ్యడానికి తీర్మానించుకున్నాను. వినండి—" అంటూ చదికిల పడ్డాడు.

"క్షమించండి ఆ వ్యవహారాలు నాకు వద్దు. మీరు చెప్పవద్దు. ఈ సూత్రానికి మీరూ నేనూ కట్టుబడి వుండడం చాలా మంచిది—ఉత్తరోత్తరా; ఎవరేనా కర్మ చేస్తున్నారా?"

"లే—దు"

"అయితే ఈ వేళనించి చెయ్యొచ్చునా? నా సామాను ఎక్కడ పెట్టుకోను...అబ్బే—ఇంట్లో వొద్దు: ఏ గొడ్లపాకేనా చాలు—అక్కడి జనానికీ నాకూ ఏవిధమైన ప్రమేయమూ వుండడానికి వీలు లేదు."

చంద్రం మాటలకు ఎదురు చెప్పగల స్తోమతు ఎవరికీ లేకపోయింది. శాస్త్రిగారి ఆవలి వేరడులో వున్న

గొడ్లసాలలో చంద్రం మకాం పెట్టి దినచర్య ప్రారంభించాడు.

* * *

విశ్వనాథశాస్త్రిని వైతరిణి దాటించారు. కాని, అతని లిటిగేషను మాత్రం ఇంకా ఈవలిగట్టు కూడా చేరలేదు. శుద్ధ శ్రోత్రియుడి విధానంలో చంద్రం కర్మ చేశాడు. కూడా తెచ్చిన డబ్బు రెండు చేతులా ఖర్చు చేశాడు. గ్రామంలోగల చతుర్వర్ణాలవారికీ సమారాధనలు జరిపేడు. రెండుమూడు సార్లు ఆస్తిపాస్తుల వ్యవహారాలూ బంధువర్గపు గోషవలూ అతని దగ్గర మళ్లీ యెత్తిపోయేసరికి, ఆ విషయాల వన్నిటినీ ఒక్క చిరునవ్వుతో త్రోసిరాజన్నాడు చంద్రం.

"మీకు ఏ ఆశా లేకపోయినా మీ అనుభవంతో మాకు కొంత సలహా యివ్వవచ్చును కదా—" అని కరణం బాధపడ్డాడు.

"అవసరం లేని వ్యవహారాలలో ఎంత మాత్రం కలగజేసుకోనూ అని ప్రతిజ్ఞ పట్టినవాడిని." అంటూ చంద్రం లేచి వెళ్లిపోయాడు.

ఆ రోజు కరణంగారికి టపాలో కలెక్టరు ఆఫీసు నుంచి ఒక పెద్ద దస్తరం వచ్చింది. అందులో శాస్త్రిగారిని గురించిన ఒక మెమో కాగితం కూడా వుంది— లోగడ శాస్త్రి మరణాన్ని గురించి కరణం చేసిన మామూలు రిపోర్టుకు ఇది సమాధానం.

ఆ మెమో చదివిన కరణానికి ముందు కొంత ఉక్కిరి బిక్కిరి అయినా, తర్వాత కొంత త్రాణ చేరింది.

ఇంక వారం రోజులకు తాను దివంగతుడవుతాడనగా, శాస్త్రి ఏలూరు రిజిస్ట్రారు ఆఫీసులో ఒక విల్లు రిజిస్టరు చేసి, దాన్ని కలెక్టరుగారి చేతికి స్వయంగా అందించుకున్నాడుట. సర్కారువారి ప్లీడరుద్వారా గాని తన గ్రామ పెద్దలద్వారా గాని తన అనంతరం సదరువిల్లును అమలు జరిపించవలసినదిగానూ, తన అనంతరం గాని విల్లును బహిరంగ పరచడానికి వీలు లేకుండా చేయవలసిందనీ కోరినాడుట. ఈ అమలు జరిపేటందుకయ్యే ఖర్చులు శాస్త్రి వారసులనుంచి ప్రభుత్వం రాబట్టుకోవచ్చును. కలెక్టరుగారు శాస్త్రిగారికి ముఖ్య స్నేహితులు కాబట్టి ఈ బాధ్యతలన్నిటికీ వప్పుకున్నారు.

గుట్టు చప్పుడు కాకుండా కరణం వెంటనే యేలూరు వెళ్లి విల్లు నకలుతో ఆ రాత్రికి తిరిగి వచ్చేడు. గ్రామ పెద్దలు ముగ్గురూ విల్లులోని విషయాలు చదువుకున్నారు.

"నాకు ఇతరత్రా బంధువులుగాని వారసులుగాని లేరు. నా ఆస్తిపాస్తులు షెడ్యూలు దాఖలాగా, రాజమండ్రీ ఆంధ్రబ్యాంకులో వున్న రొక్కం నిల్వతో కలిసి సుమారు అరవై యెనిమిది వేల రూపాయలు...

"నేను చనిపోయే లోపున చెయ్యబోయే దాన ధర్మాలు ఇందులో ఉదాహరించడం లేదు. వాటికి సొమ్ము వేరే కేటాయించమని అట్టే పెట్టుకున్నాను. నేను యెవరికీ యేవిధమైన బాకీలు లేను. నాకు ఎవరి నుండీ యే బాపతు సొమ్ములూ రావలసిలేవు.

"నా యావత్తు స్థిరచరాస్తులూ, షెడ్యూలు దాఖలాగా, క్రింది మినహాయింపులు పోను, దాన విక్రయ సర్వాధికారాలతోనూ, ప్రస్తుతం రాజమండ్రీ పట్టణ—వీధి కాపురస్తురాలు, — గారి కుమారిత అయిన చి॥ సౌ॥ సీతారావమ్మకు చెందవలెను. ఈమె ప్రస్తుతపు చిరునామా......ఈ ఒక్కతే నాకు చట్ట రీత్యా వారసురాలై వున్నది. తన వారసత్వాన్ని ఋజువు చేసుకునే డాక్యుమెంట్లు ఆమె దగ్గర వున్నవి.

"మినహాయింపులు :— ఈ క్రింది దానధర్మాలు నా ఆస్తి నుండి చేయవలెను: ఇదే గ్రామంలో మాదిగ గూడెంలో నివసిస్తున్న క్రైస్తవ ఉపాధ్యాయుడు దావీదుకు రూ. 1500; మా పొలం ఈనాటివరకూ మ కు చేస్తున్న రైతు, పోలయ్యకు రూ 500; ఎడ్ల జతలు కూడా ఇతనికే ఇచ్చివేయవలెను."

ఆ తర్వాత సుమారు అయిదు వేల రూపాయలకు సరిపడే దానధర్మాల జాబితా ఇవ్వబడింది. ఇవి అనేక చిల్లరమల్లర సంస్థలకీ వ్యక్తులకీ చేయబడినవి. వ్యక్తులంతా ఆ వూరివారే. కాని, అందర్నీ ఆశ్చర్యంలో ముంచినవి రెండు విషయాలున్నాయి. సూరమ్మ పేరెక్కడా లేదు. ఆమెకు దమ్మిడీకూడా ఇవ్వబడలేదు. మరీ విచిత్రమయింది ఉపసంహారం వాక్యం.

"నా అనంతరం నాకు జరపవలసిన కర్మకాండను గురించి యెవరూ విచారించవలసిన అగత్యం

లేదు. అది యెవరో వకరు నెత్తిమీద వేసుకుని చేసారు. చెయ్యకపోయినా ఇబ్బంది లేదు...''

విల్లులో తన పేరుగాని, తన భవిష్యత్తుకు మార్గం చూపడంగాని జరగలేదని వినీన సూరమ్మ విస్తుపోయింది. "నే నేం చేతును, నన్నింత అన్యాయం చేసేశాడే—" అని గోలుగోలుమంది.

ఆమె గోల వినడానికి కరణం మినహాయించి ఎవరూ లేరు. వారసుల మనో బంధువులమనో వచ్చిన జనమంతా పదమూడవరోజు కాబట్టి ఎవరిదారిని వారు వెళ్లిపోయారు. చంద్రం ఎక్కడికో వెళ్ళి నట్లున్నాడు. అతని సామానింకా అక్కడే కనపడుతోంది...

ఈ కథను కంచికి పంపించెయ్యాలనే వుద్దేశ్యంతో గ్రామ పెద్దలు ముగ్గురూ విల్లులో వుదహరింపబడిన సీతారావమ్మ చిరునామా తీసుకుని రాజమండ్రీ వెళ్ళేరు.

సుమారు మూడు గంటలకల్లా ఒక చిన్న అద్దె కొంప ముందు ఆగి తలుపు తట్టేరు. ఆ యింటి పరిసర స్థలాలూ వాతావరణం కరణానికి మహారోతా, తీరని అనుమానం కలిగించ సాగేయి. ఆ వీధిలో సంసారులెవ్వరూ ధైర్యంచేసి నివసించరనే విషయం జగత్ప్రసిద్ధం.

ఒక స్త్రీ తలుపు తెరిచింది. కళ్లూ ముఖం వాచి జబ్బుపడిన మనిషిలాగ కనపడుతోంది. ఎవరో పెద్ద మనుష్యులను చూసేసరికి కలతపడి తలుపుచాటుకు పోయి నిలుచుంది.

కరణంకంటే ముందు మునసబు మాట వినిపించుకోకుండానే గదిలో అడుగు పెట్టేడు. ఒకరి వెనకాల వొకరు అక్కడ పరచివున్న చాపమీద ఆశీనులయ్యారు. కరణం ఆమె వేపుతిరిగి, మనస్సు పరిపరివిధాల పోతూవున్నా, ప్రారంభించాడు:

"అమ్మా! ప్రభల విశ్వనాథశాస్త్రిగారిని మీరు యెరుగుదురా?"

ఆమె కొంతసేపు సందేహించింది. ఆమె ముఖం ప్రేత కళపడడం కరణం గ్రహించాడు. ఆమె 'చిత్తం' అని నసిగింది.

[illegible] వారు మీ కేమవుతారు?

ఆ ప్రశ్న వస్తుందని ఆమె యెరుగును. ఈవిధంగా ముగ్గురు పెద్దమనుష్యులు వచ్చేరనే సరికే ఆమె ఒక వంక గజబిజ అవుతోంది. ఆమెకు కన్నీళ్లు తిరిగేయి కాని ధైర్యంతోనే అంది—

"బంధుత్వాలిప్పుడెందుకండి ...వారు కీర్తిశేషు లయ్యేరు కదా...ఆవిషయాలు తీసుకురావడం వలన యెవరికీ యేమీ లాభంలేదను కుంటాను .."

"అలా గనకండమ్మా. ఆవిషయా లన్నీ ఇప్పుడవసరాలయి వచ్చేయి. మీరే సీతారావమ్మగారనే వుద్దేశ్యంతో మాట్లాడుతున్నా—"

"చిత్తం—"

"మీ తండ్రిగారి పేరు?"

"సూర్యనారాయణ మూర్తిగారు"

"మీ స్వస్థలం—?"

ఆమె చెప్పింది. తాను వంటరిగానే వుంటున్నాననీ, ఒకనెలా పదిహేనురోజుల క్రితం వరకూ తాను శాస్త్రిగారిని యెరగననీ చెప్పింది.

"అంటే - స్వతహాగా వారు మీకు బంధువులు కారు—?"

"కారండి—"

"పరిచయులూ స్నేహితులూ—"

"కారండి..."

"చాలా ఆశ్చర్యంగా వుంది." కరణం తన సహాధ్యాయు లిద్దరి ముఖాలు తదేకధ్యాసతో చూస్తూ కొన్ని నిమిషాలు గడిపివేశాడు. "అయితే ఆ నెలా పదిహేనురోజుల క్రితం పరిచయం మీ కెలాగయ్యిందో అడగవచ్చు ననుకుంటాను". అని అతివినయంగానే అన్నాడు.

ఆ ప్రశ్నలవర్షానికి ఆమె గజగజ లాడిపోతోంది. తలవంచుకునే ఆమె చెప్పసాగింది—

"ఆ రోజు యెండదెబ్బకి ఆయన సొమ్మసిల్లి పడిపోయారు - ఈ అరుగుమీద స్మారకం లేకుండా... మా పిల్లాడు యెవరో తాత పడిపోయాడని చెప్పేసరికి, ఆయన్ని లోపలికి తీసుకొచ్చి ఇన్ని గంజినీళ్లు పోశాను. ఆ రాత్రి తెల్లవార్లూ ఆయనికి జ్వరం కాసింది. జ్వరంతోటే మర్నాడు వెళ్ళిపోయారు... దరిమిలాని నాదిక్కుమాలిన చరిత్రంతా చెప్పేస్తున్నారు...

ఇంకా ఆమె చెప్పలేక పోయింది.

—ఏమయితే నేమి. ఆ దిక్కుమాలిన వ్యక్తికి తన ఆస్తంతా ధారాదత్తం చేసేశాడు శాస్త్రి. ఎవరికేది ప్రాప్తమో ఈశ్వరుడికే తెలియును!

కరణంగారు మనసుంచ బట్టలేక పోయారు. శాస్త్రిగారి ఆఖరి దాతృత్వాన్ని విపరీతంగా కొనియాడుతూ—

"ఇంతకీ—ఆయన నిస్సహాయ స్థితిలో వుండినప్పుడు మీరుచూపిన ఉదారానికి ప్రతి ఫలంగా దాన విక్రయాది సర్వాధికారాలతో తమ యావదాస్తీ మీకు సమర్పించారు. ఇక నేలు డిచ్చినవి ఇప్పెడటుకులే" అంటూ ఆమె చేతికి విల్లునకలు అందిస్తూ, "మీరే సీతారావమ్మగారని ఋజువు చేసుకుని, శాస్త్రిగారి విల్లు అమలు జరిపించడానికి మాకు తగిన సహాయం కల్పించండి—''

ఆమె కాగితాలు అందుకోనేలేదు. చాలాసేపు దిగాలుపడి అలాగ చూస్తూనే వుండిపోయింది. కొంతసేపటికి తెలివి తెచ్చుకుని లోపలికివెళ్ళి, ఒక దస్తావేజు కాగితం తెచ్చి కరణానికి అందించింది—

"అది - వారు మరణించే దానికి పదిహేను రోజులకు ముందు నన్ను వివాహం చేసుకున్న సంగతిని ఋజువుచేసే డాక్యుమెంటు—''

కరణం చెవులూ కళ్లూ పరిచెయ్యడం మాని వేళాయి అత్యమాత్రం రకరకాలుగా ఘోష పెట్ట సాగింది. అయ్యో మనిషివాడా! 'ఆఖరి క్షణంలో చచ్చిపోతానని యెరిగివుండీ యెంత పనిచేశావ్' అని వాపోతున్నాడు.

"నా దిక్కుమాలిన జీవితం అంతా విని....ఒక రోజుని 'నే చెప్పినట్టు చేస్తావా' అన్నారు. సరే అన్నాను....ఆ రోజొచ్చి తనని వివాహం చేసుకోమన్నారు—''

ఈ పెద్ద మనుష్యులలాగే ఆమె కూడా నిర్ఘాంతపోయి మాటలేక నిలబడిపోయింది. శాస్త్రి ఒకేఒక్క మాటతో ఆజ్ఞాపించాడు: "ఎదురు చెప్పకు—నీ తరఫునీ నా తరఫునీ అన్నీ ఆలోచించే ఈ పనిచేస్తున్నాను...". ఆమె కిక్కురు మనలేదు. ఆ సాయంత్రమే బ్రహ్మసమాజ మందిరంలో ఇద్దరికీ వివాహం జరిగింది. ఆ మర్నాడు ఆమెను తీసుకుని వెళ్ళి సివిల్ లా ప్రకారం వివాహాన్ని రిజిస్ట్రారు వారివద్ద రిజిస్టరీ చేయించాడు.

అసలు భర్తచనిపోయిన సీతారావమ్మ నానా అవస్థలూ పడుతూ జీవిస్తూవచ్చింది. ఒక్కొక్క గాలిపాటుకు ఒక్కొక్క వూరు వెళ్లింది. దరిమిలాని పుట్టిన పిల్లవాడికి వంశగౌరవం ఇవ్వలేక, పతనమైన తన వ్యక్తిత్వాన్ని నిలుపుకోలేక, ఈ జీవితానికే అలవాటు పడి ఈ వీధిలోనే నిలతొక్కుకుని నివసిస్తోంది ...ఈమెకి కులం గౌరవం స్థానం ఇవ్వడానికే ముఖ్యంగా వివాహం చేసుకున్నాడా శాస్త్రి అనిపిస్తోంది—

పాపం...మంచి పుట్టుకగల మనిషిలాగే కనపడుతుంది ఆమె. రూపసి. కాని, ఆమె అందం మోడు బారిపోయినట్లు అనిపిస్తుంది.

"మొదట్లో - కేవలం ఆయన నాకు కులం గౌరవం ఇస్తున్నారనుకున్నాను! ఏమైతే నేమి...ఆయన నాకు మాంగల్యం కట్టినవారు—నా భర్త!...కాని, ఆయన నాకు దక్కనే లేదు....''

"మేం పత్రికలో వేసిన ప్రకటన చూశారా?" కరణం బొంగురుపోయిన కంఠం ప్రశ్నించింది.

"చూశానండి..."

"ఈ విషయం మాకు తెలియజెయ్యలేదేవండి?"

"ఉదాత్తహృదయంతో ఆయన చేసిన పనిని నేను ఇంకో విధంగా ఎలా వుపయోగిస్తాను చెప్పండి. మీ వూరు వొచ్చి ఆయన ప్రతిష్ఠని కొత్తా గంగలో కలిపెయ్యనా? నానుంచి ఏ ప్రతిఫలం ఆశించకుండానే వివాహం చేసుకున్నారే నన్ను...అయినే లేనప్పుడు ఇతర విషయాలింకెందుకండి....''

"అర్థమయింది లెండి..." ఎంతో ఆవేదనతోనే అన్నాడు కరణం.

ఇంతలోకే ఒక ఆరేళ్ల కుర్రవాడొకడు పలక పుచ్చుకొని గెంతుకుంటూ వచ్చాడు. వీరిని చూసి కిక్కురు మనకుండా తల్లిదగ్గరికి వెళ్లి నిలుచున్నాడు.

కరణం తటాలున లేస్తూ అన్నాడు: ఆ పిల్లవాడిని ఉన్నతిలోకి తీసుకురండి. మా ఆస్తంతులు అదే వృద్ధత్వం అయిపోతుంది శాస్త్రిగారివి...తల్లీ! ఇంకో

సారి నేనో - గవర్నమెంటు తరఫున ఇంకెవరో మిమ్మల్ని కలుసుకుంటారు...సెలవు...'' అంటూ వీధిలోకి దారి తీశాడు.

వారందరి వెనక నే ఆమె అరుగుమీదికి వచ్చింది:

"ముందు ఈ యిల్లు మాకెప్పగ్యాండి. ఇంతకీ సూరమ్మగారిని యేం చెయ్యమంటారు?''

"ఆయింటి నే కని పెట్టుకుని వుండమనండి.''

"ఆ వెయ్యి రూపాయాలూ—"

"కర్మ చేసిన వారికివ్వండి.''

"లాభం లేదు. ఆయన పుచ్చుగోడు...''

"అయితే ఆలోచించి చెపతా...అంత వరకూ మీదగ్గిరే వుంచండి."

* * *

తర్వాత రెండు రోజులు కరణం ఒక దీర్ఘ సమాధిలో గడిపవేశాడు. శాస్త్రినీ శాస్త్రిగారి శవమునీ వైతరణి దాటించి వేసినా, శాస్త్రి మాత్రం కరణాన్ని వదిలి పెట్టేటట్టు లేదు. కళ్లు తెరచినా మూసినా శాస్త్రి అతనికి కనపడెతాడు. దీనికి తోడు కరణం శరీరం ఈ పదిహేను రోజుల్లోనూ పదిహేను సంవత్సరాల వార్ధక్యం సంపాదించింది.

కరణంగిరీలు వారసత్వపు హక్కులను ఏనాడో కోల్పోయాయి. అంటే రూల్ ప్రకారం కాకపోయినా, వాస్తవానికి జరుగుతున్న ఫలితాలు అలాగే వుంటున్నాయి. శరీరంలోని రుగ్మత అంతకంతకు ఎక్కువయిపోయి కరణాన్ని వీధి అరుగు మీదికేనా రానీయలేదు ఈ రెండురోజులూ.

పండగలకి వచ్చిన అల్లుడుమీదా కూతురుమీదా అతనికి వైరాగ్యం వచ్చింది. ఏదో మాట్లాడదామని వచ్చిన భార్యని నాలుగు పిచ్చికేకలు వేసి పంపేశాడు. అరుగుమీద కోతిగంతులేస్తున్న మనవళ్ళని దగ్గరికి పిలిచి కసిదీరా వీపులు పగలకొట్టాడు.

ఈ రామరావణయుద్ధసంధికాలంలో త్రిమూర్తులు లాగ దిగివచ్చారు - మునసబు, నారపరెడ్డీ చంద్రాన్ని కూడా పెట్టుకుని. చంద్రం మళ్ళీ దొర వేషంలో తయారయ్యాడు. సిగరెట్టు వెలిగించాడు.

కరణం చంద్రాన్ని ఫంతో మర్యాద చేశాడు:

''మీకు చెప్పకుండా వెళ్లిపోయినందుకు క్షమించండి. రామచంద్రపురంలో నే నే యింట్లో పుట్టానో ఆయింటిని ఒకసారి మాసిరావాలని బుద్ధిపుటి వెళ్ళి వచ్చాను. పనిలో పని కాకినాడవీధులూ రాజమండ్రీ వీధులూ తిరిగి పూర్వస్మృతులు కొన్త నెమరు వేసుకున్నాను..." అన్నాడా చంద్రం.

"మీరు నాకొక్క ఉపకారం చెయ్యాలి,'' అన్నాడు కరణం చంద్రం చేతులుపట్టుకుని దీనాతిదీనంగా చూస్తూ. "నా గుండెలలో బరువు తగ్గించండి. లేకపోతే నే అన్యాయంగా చచ్చిపోతానేమో—"

"నన్నేం చెయ్యమంటారు చెప్పండి—''

"వినండి—''

కరణం జరిగిన సంగతు లన్నీ పూస గుచ్చినట్లు చెప్పుకుపోయాడు.

చంద్రం కళ్లు చెమ్మగిల్లుతూనే వున్నాయి. అతిభారంగా శ్వాసవిడుస్తూ లేచి ఒక నమస్కారం పెట్టి అన్నాడు:

"ఇక నేను సెలవు తీసుకుంటూ...మీరంతా చేసిన సహాయానికీ చూపిన వాత్సల్యానికీ కృతజ్ఞత ఏవిధంగా తెలియజేయాలో!...మా శాస్త్రిగారు ఆఖరి సమయంలో ఒక మహాత్కార్యం చేశారు. ఏమామూలు మనిషీ చెయ్యలేని పని చేశారు...ఉదాహరణకి ఒక్క విషయం చెబుతాను—''

లేచి నిలబడిన ఆ ముగ్గురు వ్యక్తులూ తదేక దీక్షతో వింటున్నారు—

"ఒక స్త్రీని భర్త క్షమించ లేక పోయాడు. ఇంతకీ-ఆమె క్షమించమని కూడా ఎప్పుడూ అడగలేదు...తల్లిదండ్రులు, అన్నదమ్ములు కూడా క్షమించలేక పోయారు. బంధువులు పరిచయులు ఆప్రాణిని దరిదాపు రానీక చంపివేశారు...

''పతనమయిపోయిన ఒక వ్యక్తిని బాగు చెయ్యడానికి బెదరింపులూ, నైతికఉపన్యాసాలూ, కాఠిన్యం డిసిప్లిన్లూ, పతివ్రతల కథలూ పని చెయ్యవు...శాస్త్రిగారు పూర్వం మాకు అతిసమీపంలోనే వుండేవారు. బాగా యెరుగుదును. నేపుట్టిన నాటినుంచీ ఆయన నన్నెరుగును. ఆస్త్రీవిషయంలో ఆయన కూడా చాలా చాలా కలగజేసుకున్నారు''

# ఎదురువచ్చిన మృత్యువు

"ఎవరా వ్యక్తి?" అనకుండా వుండలేక పోయాడు కరణం.

"చెబుతా...ఆప్యాయత చూపించడం వలనా, ఆదిక్కుమాలిన మనిషి నే ప్రేమించడం వలనా మార్పు వచ్చునని వాదు...ఆ ధర్మసూత్రాన్ని ఇన్నాళ్లకి ఈ స్త్రీ విషయంలో దృష్టాంతరంగా చూపించారు శాస్త్రి గారు..."

"ఈ స్త్రీని మీ రెరుగుదురా?"

"బాగా యెరుగుదును. ఆ స్త్రీయే ఈవిడ!"

కరణం కొంచెం విస్తుపోయాడు. "తానిదివరకు శాస్త్రి గారినే యెరగనంటే!"

"పాతగోతులు తవ్వుకోటం వలన లాభం లేదు. ఆవిడ చెప్పిన పరిచయం కథ నిజమే అయివుండొచ్చు. ఘటన అంటే అలాగే వుంటుంది మరి—"

"పాపం....దరిమిలాని ఆ భర్త చనిపోయాడు లాగుంది—"

"ఆమెను వదిలేశాడు. చాలాకాలం విడాకుల కాగితం మీద ఆమె సంతకం పెట్టలేదు. ఎటువంటి పరిస్థితులలోనూ భార్యగా వుండే హక్కులను పోగొట్టుకో నన్నది.. స్వతస్సిద్ధంగా ఆమె చాలా తెలివైనది; చదువుకున్నది—చివరికి బెదిరింపులవల్ల కూడా పని జరగలేదు...

"అల్లాగా!...మీరు వెళ్లిపోతున్నారా—"

"ఇప్పుడే...వొచ్చిన పనేమో అయిపోయింది గదా—"

"శాస్త్రి గారు మీ కేమవుతారో...ఆవిణ్ణి మీ రెలాగ యెరుగుదురో...చెప్పేరే కాదు..."

వెళ్లిపోడానికి రెండడుగులు వేసిన చంద్రం చిరునవ్వుతో ఆగిపోయాడు:

"ఈ రహస్యం దాపరికం యెందుకులెండి. మీ గుండెబరువు రెట్టింపవుతుందని భయపడి వూరుకున్నాను...ఆమె మొదటి భర్తను నేనే! ఎక్కడికో పారిపోయి, ఈ జనాన్నీ బంధువులనీ చూడలేక, ఆమెకి వైధవ్యం ఇచ్చాను...నే చచ్చిపోయినట్టు వార్త పుట్టించి... పేరుమార్చుకుని బతుకుతున్నాను...ప్రఖిల విశ్వనాథశాస్త్రి గారు నా స్వంత అన్నగారు....సరేనా!"

కరణంమీద పిడుగుపడినట్లయింది. అతనికి తెలివి వచ్చేసరికి సావిడంతా ఖాళీగా వుంది. వణుకుతున్న చేతులతో పెట్టె దగ్గరకూర్చుని తన ఉద్యోగానికి రాజీనామా పత్రం తయారుచేశాడు. అది - విశ్వనాథశాస్త్రి వ్యవహారాల మీద తాను రచించిన రిపోర్టుతో జతచేసి జిల్లా కలెక్టరుగారికి పంపుకున్నాడు.

# అవతారిక

"శిఖిముఖి"

సామగానంనుంచి సోమపానంవరకూ ఊగేకుండలాలు చెవులట్టుకుని ఝూడించి అడిగేస్తున్నాయి:

"చూశావా కథ కెంతటివా డయ్యాడో?"

ఎంతటివాడయ్యాడో అంతుచిక్కలేదు అర్కసోమయాజికి.

తరంగాని పున్నామ నరకం. తీరా ఏరుదాటి తెప్పని తప్పిదాలు పట్టడానికి మన సొప్పక, పల్లెత్తుమాటన లేకపోతూ వచ్చేడు. కాని నేటికాలానికి గతించిన వైశ్యదేవ సంప్రదాయపు కులీనతను కదలించే ప్రశ్న దూసుకువస్తే, చిత్తం చివుక్కుమంది. తప్పనిసరిగా తల దించేసుకున్నాడు.

స్వరితంగా సద్దుకుంటూన్న స్వర్ణ కుండలాలకి ఆయన ఆందోళనకి తగని చిలిపిగా నవ్వేసుకువచ్చింది. ఒక్కక్షణం ఆగి మళ్ళీ ఊగిసలాడేయి, ఉదాత్తంగా. కలికాలం అండచూసుకుని గద్దించేయి: "నిన్నే నయ్యా! ఈపాటికి ముద్దుమాని, మొహం వాచేటట్లు చీవాట్లు పెట్టరాదూ?"

ఓహో అనిపించుకున్న సంప్రదాయానికి కాలమహిమ నెంతటి కళంకం వచ్చింది! అని కించపడ్డాడు. ఓకాడికి నిశ్చయానికి వచ్చేడు:

"అవును: చీవాట్లు పెట్టాలిసిందే!"

కొడుకు రాగానే కడిగెయ్యదలచుకున్న మాటల్ని బుక్కబుక్కగా తుణ్ణం చేసుకుని ఘనా, జటాగా పెనవేసి వల్లె వేసుకున్నాడు.

అప్పటికే చీకటి ఆరుఘళ్ల రాత్రిని వడి కట్టుకుని జోకొడుతోంది. రాత్రి వళ్లు విరుపు కన్నగారిలా ఆవులింత వచ్చింది సోమయాజికి.

"ఇహాను రాడు!" అని కాస్త చాదస్తంగా పైకే అనుకుని, కూర్చున్నపాటునే ఓ కునుకు తీసేడు.

ఇక్కడి కిదయిందా...

అక్కడ పుత్రరత్నం పైబేస్తుమీద కుదేలయి, ఆటా పేకా చెల్లంగోరు చేసుకున్నాడు. దారి పొడుగునా దీపాల రేఖల్ని పరకాయిస్తూ, కిటికీల సందులకు కళ్లు వప్పగించి ఇంటి మొహ మయ్యాడు.

ఏ కలవారికోడలో చూరుదాపున సువ్వీ—సువ్వన్న—గా చుక్కల్ని కదలేస్తోంది. యాదాలాభంగా కలయజూచి,

"పిస్తపేషణమా, పిల్లా?" అన్నాడు. శాస్త్రం చెప్పిన తరవాయిగా.

ఏదీ కానివేళ మగగొంతులో చిన్న దానికి పెద్ద చిన్నతనం వినిపించింది. ప్రోషిత భర్తృకత్వంలో ఇంటిల్లిపాదీ తనే అయి మసిలే ఇల్లాలు, మరి. కళవళపాటులో కాని మాటలు దొర్లకుండా మునిపంటితో అధరాన్నదిమి పట్టుకుంది. సూటి తప్పిన సుప్పిపోటులో రోకటిగన్ను రోటి పెదవిని కాటేసి భాయిదాలో ఉంచింది.

మౌనం అర్ధం అంగీకారం అని సంతృప్తి పడడాని కిచ్చగించని ఘటికుడు. ప్రత్యామ్నాయాలెన్నో పరామర్శించి, కవ్వించి కదలేయదలుచుకున్నాడు.

"మరయితే ఊకదంపుల్లా, ఊఁ కొట్టడాలు దండుగన్నట్లు ఉలకకుండా ఉన్నావు?"

"మేనల్లి కాసి తెచ్చిన నూకలురోటే ఇలా ఇయ్యారాదూ?" ఉఫ్‌మన్ని ఉలికిం చేటట్లుంది.

ఒక్కగానొక్క అంగ ముందుకు వేసి, భుజంమీద ఉత్తరీయాన్ని చేజేతులా పీక మీదకి తెచ్చుకున్నాడు.

"వయ్యారం! రోకలి చిగిర్చగలదు!"

"తలకి చుడతానని ఆశిస్తున్నావా? వెర్రి బాగుల్దా!" అని మందలించింది. అరక్షణం ఆగి: "యాదవ యామున్నాతి రాల కథంగ సంగతి జ్ఞాపకంలేదో!" అంది.

ఒక్కచిటికెడుసేపు చిత్తయిపోయాడు.

"వాకిటి కావలి తిమ్మని వాకిట ఆకటి కవికోటి కిటికోటిగా పడివుంది, బేలా!"— మాటు పెట్టిన చాటువు చాటున చాయంగల చిన్నపాటై తెరిపిన పడ్డాడు.

ప్రౌఢ బెట్టసరి ఓ మెట్టు దిగింది. అసురుసురయ్యే, తాడెత్తు ప్రమాణాన లేచిన రోకలి నలా అంతరిక్షంలోనే అట్టే పట్టుకుని, కుడిభుజంమీద కిలకిలలాడింది. చూపుల వెంబడే సరసను జేరి సరసాలాపణం మొదలెట్టేడు కడ కెంతటివాడో అయిన అతగాడు.

"ఎగ్గైనా లేదూ? ఎవరేనా చూస్తారు!" చిరుకోపంచిందామె.

"చూసేవాళ్ళకి సిగ్గుండొద్దూ?"

"నీకేం, మగరాయడివి. లోకులు కాకులు కదూ?"

"అయితే, వాళ్ళతో 'కావు, కావు' కొట్టిస్తే సరి! అయినా ఈపాటి బెంబేలు డేదానివే ఇంత కవ్వించావు దేనికి?"

"శ్రావణీల రాత్రులు. బొత్తిగా ఒంటరిదాన్ని చిన్నబోయానుగదా అని ఉలికించేనే అనుకో. అయితే మాత్రం ఇంత ఆగడమా? లంకకు చేటుగా వ్యవహరించాలా?"—ఇంటి గుట్టుగా గుసగుసలాడింది.

సమాధానపడి ఛాయలోనికి సర్దుకున్నాడు. "మరయితే..." లోమాట కొంచు గోయింది.

"రేపు రారాదా, రాజా!" జవరాలి కన్బొమలు కిల్లాంగి నవభావాలయాయి.

పడతిచెక్కిలిమీద రేపటి రేఖా చిత్రాన్ని ఊహాలూ, మాపులూ గుచ్చెత్తి గీసుకొని, చిత్రం చుక్కా, చారా చామన చాయకి హత్తుగున్నాయని మనసుకు పట్టేక ఇంటిదారి పట్టేడు.

* * * *

సోమిదమ్మ గది తలుపు కిర్రుగా మన కుండా ఓరవాకిలయింది. పరంజాగూట్లో పరంజ్యోతి కంటు వత్తిపెట్టుకొని చూసింది గాలివాలున కదలి కళవళపడింది.

కాసింత కాలి అలికిడికి కంభిన్నం చెద రంగా చితికిపోగా, కంగారింతలా లేచి కూర్చుంది సోమిదమ్మ.

"గోపికల ఇళ్ళకి పోబోకు, నాయనా. గోరంతలమీద కొండంతలు నిలబెట్టలేవు. తండ్రీ!"—తాహతు మాలిన గొంతులో తల్లి వావిగా సలహా చెప్పింది.

"అపరాధమంతా అటకాయించిన అతివదేనమ్మా."

అడ్డబాస ముక్కున ముత్యం కట్టుకుని ముసిముసినవ్వు నవ్వింది. తప్పు తుడిచి తల నిమిరింది తల్లి. కన్నకడుపెమ ప్రేమతో కడుపునిండా బువ్వపెట్టి కంటినిండా నిద్ర బుచ్చింది.

కొడిగట్టిన దీపం కొరకొరా చూసి, కన్నార్పి గదినిండే చీకటి కునుకుతీసింది.

* * * *

అహాల్యల అందాలవైపుకు ఊహల్ని తిప్పుతూ, "కొక్కొరోకో"అంది కోడిపుంజు. కూతవేటుకి బ్రహ్మనాయడంతటివాళ్ళు భయపడి లేచేరు. అంనాటి పలనాడంతా అదిరి దద్దరిల్లింది.

తెల్లగా తెల్లవార్చుకుని రేపు చక్కా వచ్చింది.

పావంచాల రేవు పెళ్ళివారి విడిదిలాగ క్రిక్కిరిసి ఉంది. కలికాలపు చలిగాడుపు ఈదురోమంటూ వీచింది. గట్టుమీద ఘనా పాఠీలు శాలువాలక్రింద అంగుష్ఠపు నవళి కలో గాయత్రి గజగజలాడింది.

మొలబంటి నీటిలో అగ్నిస్వభ్రాత లాచమనం చేస్తున్నారు. అలలు రేగిన నీటికి నాచు తెగు లణిగింది.

చలికి జడిసి మబ్బు ముసుగు బిగించిన ఆదిత్యబ్రహ్మ మొహాన్న తలో ఇన్ని నీళ్ళు చిలకరించి లేపి తీరేరు బ్రహ్మణ్యులు.

భగవాన్లుకి ఒళ్ళు మండుకొచ్చి చుర్రు మన్నాడు. ఎండపొడ తగిలేటప్పటికి యాజికి కోపం జ్ఞాపకమొచ్చింది. ("అవును. చీవాట్లు పెట్టాలిసిందే.")

నిత్యం, నైమిత్తికం ముగించుకుని, చర చరా ఇల్లు జేరి, సోదెమ్మకి పిలుపెట్టేడు

"వషీ !"

కళాపి కలాపంలో ఉన్న వషీ మాట వినిపించుకోలేదు.

"నిన్నే! మన భడ వేడీ?"

యాజి నడినెత్తిన అంగవస్త్రం పిడప ఎటు మొగ్గాలో తెలియక తికమకపడింది. ఆయన తన సత్యమాన్ని సూత్రప్రాయంగా చింతన చేసుకున్నాడు: "అవును. చీవాట్లు పెట్టాలిసిందే!"

గంగాళంలో గాజులు గిలకరించి, సోమిదమ్మ కొడుకును పలకరించింది.

"నీ పొత్తిళ్ళలో పెట్టి కాపాడవే. చచ్చి నీ కడుపున పుడతానే!"- బావురుమన్నాడు భడవ.

నాలుగంగలలో యాజులే అక్కడకు వచ్చి ఖస్సుమని నిలబడ్డాడు.

"సంధ్యా, విద్యా? బదుద్ధాయి! ఆగమ్మ కాకిలా అగ్రహారాలేగడం మాత్రం చేతనయింది. అప్రాచ్యుడా! కులభ్రష్టుడా!"

చెట్టంత కొడుకును పట్టుకొని రెమ్మరెమ్మగా...ఇలా దుంపరించేశాడు.

"కాదండి..." మాట పెగిలి అడ్డుపడబోయింది.

"ఛీ! వాజీ..."

తల్లిచాటు పాపడు తప్పుల తడకలా జవజవలాడిపోయేడు.

"అగ్నిహోత్రం లాంటి వంశగౌరవాన్ని మంటగలిపేవు గదరా, తుచ్ఛుడా!...నడు, నా పంచనుంచి...కదలవేం?"

కుర్రవాడి గుండె గుబుక్కుమంది.

[అనగనగా వెనకటికీ ఇంతే అయిందిలే, ఒకానొకణ్ణి ఇంట్లోంచి పొమ్మంటే, జూదాలాడి కుబేరుడయ్యాడు జన్మానికి శివరాత్రిగా ఒకటో అరో వత్తి ముట్టించి—అని ఓదార్చింది శ్రుతపాండితి.]

తెగించి గడపదాటి కాశీఅంత అంగేసి ప్రజల్లో పడ్డాడు. కన్నతల్లి కడుపు తరుక్కుంటూ చరచరా చక్కాపోయేడు.

* * * *

అరమోడ్పుగా కనుచీకటి పడింది. మాట తప్పని మగరాజు పాజకు.

"కాస్త చిరునవ్వు చిదిపి దీపం పెట్టుకోరాదూ?" అన్నాడు మసక-మసకగా మాట కలుపుతూ.

"కన్నె చీకట్లని కౌగలించుకుంటూ వస్తావని కలగనలేదు!"

"రెప్పపాటు కాలమయినా కునుకు తీయలేని వాలుచూపుల వాసకసజ్జికవు మరి! కల లెక్కడినుంచి వస్తాయి?"

చుబుకం పుణికి, చెంపను ముద్దాడేడు.

"సరసుడివి పో!" పట్టు విదిలించుకుంది.

ఉభయులూ గృహప్రవేశమయి దీపారాధన చేసుకున్నారు. పడకటింటి మర్యాద తెలిసిన ప్రౌఢ పాను పరిచింది.

"...కనికారమెరుగని ఊళ్ళో కటికరాత్రులు గడుపుతూ వచ్చేను..." కంట తడి పెట్టుకుంది (వది) నా అన్నవాళ్ళు లేని వయ్యారి.

ప్రౌఢదేమో మాట పెళుసు, విరుచుకు తిందామని వచ్చేడు. తీరా ఇలా నాన్చుడయేసరికి ఛీత్కారమేసుకొచ్చింది.

"పడిస్తే నీకళ్ళు నీలాలు కావూ!" అనునయించేడు.

"నీలాలు కారితే నువ్వు చూడలేవా?"

"నీ రెక్క— నీ కంటిపాప పువ్వు పూస్తే అర్ధరాజ్యాలిచ్చే దాతయినా లేడుగదా!"

'కాళిదాసుకన్న ఒక పూట ఎక్కువే చదువుకున్నానే!" అంది ఇంకా వరదయ్యను మెరిపిస్తూ భుజాలు రాపాడించి అభినందించింది.

మూడెక్కిన గువ్వలు కథలన్నీ చెప్పుకుంటూ, తల మునకలు తాంబూలంగా నవ్వుకున్నారు ప్రియులు... నోట చిదిమిన గోరింటాకు రంగు పూసి చెక్కిళ్ళమీద చిమ్ముస్తూ నిద్రపోయిందా యిల్లాలు.

*    *    *    *

ఆ అయినింటి ఆముక్తముచు లేచేటప్పటికి చుక్కలు దల్లి సూరీడు పొడిచేడు. అత్తగాడు ఆఖరి శృంగార మర్యాదలందిపుచ్చుకుని దొరికిన దారల్లా తొక్కుకుంటూ పోయాడు.

ఆకాశంలో ఆ మేఘం ఈ మేఘం కూడబలుక్కుని వళ్ళు జల్లుమనే ట్లొక జడి చినుకుల్ని గుమ్మరించేయి. చినుకు చినుకు గాలివానయింది.

శ్రావణ భాద్రపదాలకి జడిసి ఆ ఇంటిమీద కాకి ఈ ఇంటిమీద వాలకపోవడం మూలాన్న తనేమైనదీ తల్లికి కాకమ్మ చేతైన కబురంపలేదా రాజు.

తిరుగువాక తిరుగువాక్క,
"కల్లెటూళ్ళో గిల్లి కేదో
పాడుకల్లో పేగు కదలింది"

అని మాత్రం అనుకున్న పాపాన్న పోయిందట లోకం

[ఇంతవరకూ కథ మొదలందిచ్చేను. కడమ శ్రోతలు శరవాయిస్తే పేదరాశి పెద్దమ్మను కదలేసినా కంచె కెళ్లేవరకూ చెప్పేయ్యగలదు. మరి నాకు సెలవు.]

---

"What is truth?" అని అడిగాడట Jesting Pilate అడిగి, సమాధానంకోసం ఆగకుండా వెళ్ళిపోయాడట. ఆ కాలంలో ఆ ప్రత్యేక సందర్భంలో అతని వెటకారం అతనికున్న విశేషణాన్ని సమర్థించేటంత హాస్యం కలిగించి ఉండాలి. పంధొమ్మిది శతాబ్దాల తరవాత Wilde కాకతాళీయంగా దానికిచ్చిన సమాధానం—"Truth is entirely and absolutely a matter of style"—మరొక రకపు హాస్యాన్ని కలిగించింది. సమాధానంకోసం ఇన్నేళ్ళు ఆగాలిసి వస్తుందని తెలిసే, అంత patience లేకపోవడం మూలాన్ని Pilate చక్కా పోయేడని ఆ రెండు అసంబద్ధ వాక్యాలని సంపుటపరిస్తే వేరొక రకపు ఆహ్లాదం కలుగుతుందనుకుంటాను.

సరే—"What is delight?" ఇదెవ్వరూ అడగనూ లేదు. జవాబు చెప్పనూ లేదు. కాని వ్యక్తుల భిన్నరుచుల కొలమానంగా ఆహ్లాదం అన్నమాట ఎంత అనిర్వచనీయంగా తయారయిందో, Priestley వాక్యాలు చూస్తే తెలుస్తుంది. "Delight No. 74. From some of our windows, on a clear night, I can see the flashes of three light houses. So what? I don't know; and don't feel like arguing about it. Try some other page!"—

సాహిత్యంలోనూ అంతే అనిపిస్తుంది. ఒకప్పుడు ప్రసిద్ధమయిన కథా వస్తువో, అలంకారం ఘటాయిమ్పుతూ శ్యారికేళీ పాకాల్లో, ఉంటే తప్ప రచన పఠ్యాసమునకి ఆహ్లాదం కలిగించేది కాదు. కాని ఈ కాలంలో ఆనుయాయితగా వచ్చే జాతీయాలను గాని, లోకోక్తులను గాని, twist చెయ్యడంలో, రచనల్లో కొత్త ప్రయోగాలు పోవడంలో, చివరికి కథలు గాని కథలు వ్రాయడంలోకూడా ఒక కొత్తరకపు ఆనందం వ్యక్తమవుతోంది.

Stephen Dedalus Shakespeare ను గూర్చి మాట్లాడుతూ, "If Bill (William) had a will Anne hath a way (Anne Hathaway)—మాటవిరుపుతో సారా అనిపించింది. (Ulysses) Huxley, "How do you know that our Earth is not another planet's hell?" అని అడిగినప్పుడు daring, shocking suggestion యొక్క horror లో కూడా ఆనందం వుంది.

# నాట్యశాస్త్రవార్తికములు

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

నాట్యముపై ఊహాలు విజృంభించినట్లు మతంగుడు సంగీతముపైకి పోయెనని ఈ క్రింది కల్లినాథోదాహృత పంక్తులు చెప్పుచున్నవి.

"మతంగోఽపి మధ్య సప్తకేన మూర్ఛనా నిర్దేశః కార్యో మంద్రతార సిద్ధ్యర్థమ్" (పే. 47)

"తథా చాహ మతంగః—'సాధారణ స్వరౌ నిషాద గాంధారవంతౌ తదాది వికృతాస్తత్రైవాంతర్భూతాః' ఇతి" (పే. 49)

"మతంగేనాపి—'సోఽంశానాం త్రిషష్టి భేదభిన్నో బోద్ధవ్యః' ఇతి" (పే. 80)

"యథోక్తం మతంగేన—'అంశోఽథ వాక్యైవ పరం గ్రహస్తు వాద్యాదిభిన్నశ్చ తుర్విధః' ఇతి" (పే. 81)

"యదాహ మతంగః—'షడ్జత్వే షడ్జశ్చాపన్యాసః' ఇతి" (పే. 92)

"'ధైవత నిషాదయో రంశత్వే పంచమోఽపి న్యాసః' ఇతి మతంగోక్తత్వాత్" (పే. 120)

"తథాహ మతంగః—'దేశజానాం రాగాణామానంత్యా దనిబద్ధత్వాచ్చ సంఖ్యా నాస్తీతి మంతవ్యమ్' ఇతి" (పే. 156)

"ఏతేషాం శుద్ధాది రాగభేదానాం మతంగోక్తాని లక్షణాని సంక్షిప్య ప్రదర్శ్యంతే..." (పే. 160)

"యద్యపి గ్రామద్విజాతిజోఽసౌ రాగ స్తథాపి షడ్జోఽస్య గ్రహాంశ మధ్యమ స్తథా దర్శనాదితి మతంగోక్తః..." (పే. 163)

ఈ పంక్తులద్వారా మతంగుని గ్రంథము సూత్రములలోను, కారికలలోను గలదని జెప్ప వీలగుచున్నది.

"ఇహ గ్రంథకారేణోద్దిష్టానామపి లక్ష్యే ప్రసిద్ధి వైధుర్యా దధునా ప్రసిద్ధ రాగ జనకత్వాచ్చ ముక్తలక్షణానాం భాషా రాగాదీనాం స్వరూప పరిజ్ఞానాయ మతంగాదిమతానుసారేణ లక్షణాని సంక్షిప్య వక్ష్యంతే" (పే. 227)

అని మరియొకచో కల్లినాథు డనినాడు. భరతాదుల శాస్త్రములలోని, సూత్రముల నాధారముగా జేసికొని, తద్వివరణమునకు సిద్ధపడినవారిలో మతంగు డొకడుగా కన్పించుచున్నాడు. మతంగుడు ప్రాచీన భరత పాఠము నవలంబించి—

"అలంకారా స్త్రయ స్త్రింశ
దేవ మే తే మయోదితాః"

అని పఠించినాడు. కాని నవ్యపాఠమున నీ యలంకారములలో మూడు పెరిగి మొత్తము ముప్పదియారు కన్పించుచున్నవి. శంకుకపాఠమున నివి ముప్పదినాలుగుగా గలవు. ఐదవ అధ్యాయమున కీర్తిధర కృతముగా కన్పించు చిత్ర పూర్వరంగములలో నొక విధానము నభినవుడు నిరాకరించెను; కాని "చిత్రస్యాప్యస్యాంగస్యైవం తే కైశిక ముఖ్యమః" అని చెప్పుచు మతంగుడు దీని నంగీకరించెను. ఇట్లనేక స్థలములయందు మతంగు డవలంబించిన భరతశాస్త్రమభినవుని గ్రంథముకంటె భిన్నముగా కన్పించుచున్నది.

సంగీత విషయములపై వివరణలను రచించిన వారిలో కశ్యపు డొకడు గలడు. 29 వ అధ్యాయమున అభినవ భారతిలో 72 శ్లోకములు కశ్యపునివిగా ఉదహరించబడినవి. తాను కశ్యపుని గ్రంథము నిట్లు సంక్షేపించెనని ఈ కారికలలోని చివరి పంక్తివలన మన కవగత మగుచున్నది. ఇంతేగాక,

"కాశ్యపాద్యైః తావన్మాత్ర ఏవ కైశికానాం తత్ర చిత్తవృత్త్యౌచిత్యం దృష్ట్వా వినియోగ ఉక్తః. తస్యా బాహ్యత్వాదంగీ కర్తవ్యమ్"
(వ్రాతప్రతి, అ. భా. IV. 2)

అని మరియొకచో కశ్యపుని ప్రస్తుతించుచు భరతుని శాస్త్రముతో విరోధము లేనంతవరకు గల విషయమును కశ్యపునినుండి గ్రహించవచ్చుననినాడు.

"తథాపి కాశ్యపమతేన నిషాద గాంధారయోః పాదాంశిత ఇతి మతం నైతత్ ప్రోక్తత్వాత్..( పే 163)

అని కల్లినాథుడనినాడు ఈతని వ్యాఖ్యలో నీ క్రింది పంక్తులు గూడ కన్పించుచున్నవి.

"న త్వనగ్నాంకస్యతు—'మధ్యమా పంచమీ జాతౌ నష్టోంశే గ్రహ పంచమః' ఇతి కశ్యపాభిమతా ల్లక్షణా న్మధ్యమ గ్రామ సంబంధేవ" (పే. 164)

"తథాచాహ కశ్యపః 'జ్ఞాత్వా జాత్యంశే బాహుల్యం నిర్దేశ్యా మూర్ఛనా బుధైః' ఇతి" (పే. 165)

"తథా చాహ కశ్యపః—

'క్వచి దంశః క్వచిన్న్యాసః షాడవౌడవితే క్వచిత్
అల్పత్వం చ బహుత్వంచ గ్రహోపన్యాస సంయుతం
మంద్రతారౌ తథా జ్ఞాత్వా యోజనీయా మనీషిభిః
గ్రామరాగాః ప్రయోక్తవ్యా విధివ ద్దశరూపకౌః
ప్రవేశాక్షేప నిష్క్రామ ప్రాసాదిక మథాంతరమ్
గీతం పంచవిధం యత్నా ద్రాగై రేభిః ప్రయోజ యేత్ ఇతి" (పే. 165)

భరత శాస్త్రమును పూరించుచు, వివరించిన వారిలో దత్తిలాచార్యుడొకడు కన్పించుచున్నాడు.

"దత్తిలాచార్యేణాపి సంక్షిప్యోక్త మేతత్ —

'ఆద్యద్వితీయ మధ్యాంతా
త్పాద భాగా ద్విగుణక్రమాత్
కనిష్ఠా నామికా యుక్త మధ్యమా దేశినీ కృతాత్
అయుక్త మధ్యహీనః స్యా' దితి"

(అ. భా. I. 205).

అని అభినవుడు దత్తిలాచార్యుని వాల్గవ అధ్యాయమున గౌరవ పురస్సరముగా స్మరించినాడు.

"తదుక్తం దత్తిలాచార్యేణ—

'పదస్థ స్వర సంఘాతస్తాలేన సుమితః' ఇతి"

(ప్రతి ప్రతి అ. భా. III. 101).

అని మరియొకచో ప్రస్తుతించెను.

"తథాచ దత్తిలాచార్యః—

'మార్గో వార్తికం చిత్రేచ వృత్తయః తాస్వయం విధిః ప్రధానం గీతి మథయుంవా న్యచ్చేతి యథాక్రమమ్' ఇతి" (IV 88).

అని ఇంకొకచో సంగీత విషయమున వచించినాడు.

"దత్తిలోప్యాహ—త్రితాలశ్చ పాణిశ్చ
ప్రభురేక మితి...." (IV 81)

అని తాల విషయమున స్మరించెను.

"దత్తిలాచార్యోఽపి—అనాదేశేతు సర్వత్ర
కర్తవ్యం పదశుద్ధలః ఇతి" (IV 87).

అని మరల తాలావసరమున నుదహరించెను.

"తదుక్తం దత్తిలాచార్యేణ—

'ఆద్యద్వితీయ మధ్యాంతం పాదభాగాద్విగుణక్రమాత్
కనిష్ఠానామికా యుక్తః మధ్యమా దేశినీకృతా' ఇతి"

(IV. 99)

అని ఒకచోట పలికినాడు.

"తథాచ దత్తిలాచార్యః—

'అసమానత్వనిత్యత్వే తస్య ప్రాధాన్య కారణే' ఇతి"

(IV. 149)

అని ఇంకొకచోట గలదు.

"యథాహ దత్తిలః—

'అథతానపదౌ పాదౌ తుల్యగీత్యాదిలక్షణౌ
పృథగ్గోలేన కస్యాదౌ పపరాంతిక వస్తువత్' ఇతి"

(IV. 163)

అని మరల సంగీతవిషయమున దత్తిలుడు ప్రశంసింప బడినాడు.

"దత్తిలా ద్యనుసారిణో వ్యాచక్షతే............"

(IV. 179)

అని చెప్పుచు దత్తిలానుయాయులు భరతుని గ్రంథమును వ్యాఖ్యానించి రని చెప్పుచున్నాడు. ఈ వ్యాఖ్యలో దత్తిలాదులు గ్రహించినపాఠము కొంత భిన్న సంప్రదాయమునకు చెందినదని చెప్ప వీలగుచున్నది.

ఇట్లే లొల్లట, శంకుక, ఉద్భట, భట్టయంత్ర ప్రభృతులు హరిపరిరిసముల నాట్యశాస్త్రమునకు వ్యాఖ్యల నిచ్చియున్నారు. వీరితోబాటు భట్టనాయకుడు, తౌతభట్టుగూడ వ్యాఖ్యానించినట్లు తెలియుచున్నది. తౌతభట్టు గూడ శిష్యులకు చెప్పినపాఠము నే అభినవు డంగీకరించినట్లు చెప్పికొనినాడు.

ఈ నాట్యశాస్త్రమునకు కొందరు వార్తికము లను రచించి, ఇందలి విషయపూరణను, వివరణమును

ర్పించి యున్నారని చెప్పుట కనేకములగు నాధారములు కలవు.

"సుబంధుర్నాటకస్యాపి లక్షణం ప్రాహ పంచధా
పూర్ణం చైవ ప్రశాంతంచ భాస్వరం లలితం తథా
సముగ్రమితి విజ్ఞేయా నాటకే పంచ జాతయః
(పే. 238)

అని శారదాతనయుడు భావప్రకాశలో చెప్పినాడు. పైని మనకొక సుబంధుడు తగిలినాడు. ఈ సుమంతుడే సుబంధునై యుండవచ్చునా?

వార్తికకారులు ముగ్గురో, నలుగురో కన్పించుచున్నారు.

"వార్తికకృతా ప్యుక్తం—
'వాచ్యానుగతేఽభినయే ప్రతిపాద్యేఽర్థేన గాత్రవిక్షేపైః
ఉభయోరపి హి సమానేకో భేదో స్యృత్త నాట్యగతిః' ఇతి" (అ. భా. I. 172)

"యద్వార్తికం—
'ఏవ మనాంతర వాక్యై రుపదేశో రాగవర్ణనీయేషు
సింహాదివర్ణకై ర్వాక్య చిప ప్యరాంతిర న్యాసాత్' ఇతి" (అ. భా. I. 174)

అని రెండుచోట్ల వార్తికముల నభినవుడుప్పు డిచ్చినాడు. ఇతడు రాహులుడై యుండవచ్చును.

ఒక చోట స్పష్టముగా
"యథాహ రాహులః—
'పరోక్షేఽపి వక్తవ్యో నార్యా ప్రత్యక్షవత్ప్రియః
సఖీద నాట్యధర్మోఽయం భరతే నోదితం ద్వయమ్' ఇతి" (అ. భా. I. 172)

అని అభినవుడు రాహులుని వార్తికము నొకదానిని ఇచ్చినాడు.

"యథోక్తం రాహులకేన—
'గ్రీవాయాం కరయోః కట్యాం పాదయోశ్చ పృథక్పృథక్ భ్రమణం రేచితం విద్యా'దితి" (అ. భా. I. 115)

అని రేచిత ప్రక్రియను మెడకు, నడుముకు, చేతులకు పాదములకు రాహులుడు చెప్పినట్లు గలదు. కాని
"తేన మార్గ్యనుద్ధ భావికత్వప్రగీతప నాదీనామపి గత్వా చార్య రాహులాదిభి రభిధానం విరుద్ధమిత్యలం బహునా" (ప్రాత ప్రతి, అ. భా. III. 38)

అని పల్కుచు రాహులుని వాదము నిచట అభినవుడు త్రోసి వేయుచున్నాడు. ఇట్లే
"అయం గ్రంథ శ్చిరంతనై ర్వృత్తీనాం చతుష్ట్వేన దృష్టాంతితా మాత్రిత్య వ్యాఖ్యాతః, తత్ర చైవ త్సోగాదూషణ ముక్తమ్" (అ. భా. II. 208)

రాహులకారుడు నాలుగు వృత్తులనే గ్రహించినారు. కాని ఉద్భటుడీ వాదమును నిరాకరించెనని చెప్పుచు ఉద్భటుని సిద్ధాంతమును అభినవుడంగీకరించినాడు. కాగా వార్తికకారుడైనంతమాత్రమున రాహులుడు ప్రామాణికుడు కాజాలడని స్పష్టమగుచున్నది.

రాహులుని వార్తికములు కారికారూపమున గలవు. కాని మరియొక వార్తికకారుడగు శ్రీహర్షుడు వచనమున వార్తికములను చెప్పినట్లున్నాడు.

"తత్రైవ తోటకం భేదో నాటకస్యేతి హర్షవాక్
తదన్యాసక మిత్యన్యే నాద్రియంతే విపశ్చితః"
(పే. 238)

అని శారదాతనయుడు శ్రీహర్ష వార్తికమును ప్రస్తుతించినాడు. నాటకభేదముగా తోటకమును శ్రీహర్షుడు చెప్పి ఉపరూపకములకు గతి కల్పింప నెంచినాడు. కాని ఇతరులీ మాట నప్రామాణికమని త్రోసివేసినారట.

గద్యరూపమునగల శ్రీహర్ష వార్తికము నభినవుడనేక స్థలములలో ప్రస్తుతించెను.
"రసభావవ్యప్త వాస్తవరక్వాద్యయ ద్వంగం పూర్ణంవా పూర్ణంవా కృతవేవ నాట్య నృత్తయో ర్భేద స్తుల్యానుకారత్వ ఇతి హర్ష వార్తికమ్" (అ. భా. I 207)
అని నాల్గవ అధ్యాయము చివర అభినవుడు శ్రీహర్ష వార్తికము నుదహరించుచు నృత్తనాట్యముల పరస్పర సంబంధములను వివేచించినాడు.

"శ్రీహర్షస్తు రంగశబ్దేన, తౌర్యత్రికం ప్రయుక్తా నాట్యాంగ ప్రయోగస్య తస్యైవ పూర్వరంగతాం మన్యమానః పూర్వశ్చాసౌ రంగ ఇతి సమాసమాహ. యదాహ—'ధృవాయే వస్త్వర్థే నాట్యే రంగాయ పాద భాగాః స్యుః ప్రాగ్వం తదేవ యస్మిన్ శుద్ధాః స్యుః పూర్వ.రంగోఽసౌ—ఇత్యాది"
(అ. భా. I. 211)

అని శ్రీహర్షుడిచ్చిన పూర్వరంగపదము శ్లోకరూపమున నిర్వచింపబడినట్లు వేరొకచోట—

"అతఏవచ శ్రీహర్షేణ—అంగనాసముచితం వాద్య
మిత్యాశయేన
వ్యక్తి వ్యంజన ధాతూనాం దశ విధే నేఽత్ర లబ్ధా
త్మనే త్యుక్తం" (4 34)

అని గలదు. అంగహారములపై నొక వార్తిక
కారుడిచ్చిన 14 శ్లోకముల నుదహరించి,స్థిర హస్తముపై
నీ క్రింది కారికలను పేర్కొన్నాడు.

"ఇత్యేవం కరణ గ్రామః సమ్యగ్యోజనయా కృతః
నిర్వర్తయ త్యంగహారం స్థిరహస్త సమాహ్వయమ్.
అత్ర దశ కరణాని.

అత్రైతికే తత్కరణ మంగస్యాత్రోటనేన తు
జిఘృక్షిత మితి హ్యాఖ్యాం తథాకరణ గామినామ్.
హస్తాం గ్ర్యాది సంశ్రితానా ముచితత్వ యుజాం
భవేత్.

యోజనాయద్వర్తనానాం చారీణామతి ఏవచ
అవిచ్ఛిన్న క్రమితిరప్రబంధాలాతచక్రవత్.

ఏక బుద్ధ్యనుసంహార్యా స్థిరహస్తో భవేదథ
ఏవం సర్వేషు మంతవ్య మంగహారేషు సూరిభిః
అహుర స్యై సమాధేరప్యయం భగవతః ప్రియమ్
సర్వేష్వత్రాంగ హారేషు ప్రాధాన్యే కరణే గుణే.

పతుయిత్వా విశిష్టాని చతుర్దిక్షు ప్రయుజ్యచ
పూరయేత్సర్వముఖం తాభ్యామంతాభ్యామితి
మన్యతమ్.

ఏషాం ప్రయోగః ప్రాధాన్యా దదృష్టఫల ఏవహి
ప్రయోగ విషయో గీత వర్ధమానాదికస్యచ.
తత్తద్వాక్యార్థ విధురో విప్రకర్షానుసారతః
తేషాం యుద్ధనియుద్ధాదౌ న కదాచి త్ప్రయో
జ్యతా."

ఈ వార్తికములలోని విషయము నభినవుడు
పూర్తిగా తన వివృతిలోనికి తెచ్చి యుండుటచేతనే
నానా కరణ సమ్మిశ్రితములగు అంగహారములకు
ప్రత్యేక ప్రత్యేక వ్యక్తిత్వము నాపాదింపగలిగినాడు.

తల పుష్పపుటమను కరణమునుగూర్చి ఈ క్రింది
వార్తికములు కన్పించుచున్నవి—

"నృత్తారంభేషు సర్వత్ర తలహస్త ద్వయం తథా
స్థానకం సమపాదాఖ్యం ప్రాచుర్యేణ ప్రయోజ
యేత్.

తేన తత్ప్రథమం కృత్వా సమపాదం లతాకరౌ
దక్షిణాంఘ్రూ నిష్క్రమితే చార్యాశ్యర్థిక
సంజ్ఞయా.
తల సంచర రూపేచ కృతే తత్కాల ఏవచ
వ్యావర్తితేన పార్శ్వేషు సమానీతేన దక్షిణే.
పరివృత్తవశా త్సవ్యగానీతే న చ హస్తయోః
ద్వయోన వామపార్శ్వేతు సౌష్ఠవేన సతేసతి
వామ ఏవ స్తనక్షేత్రే కార్యః పుష్పపుటః కరః
తల సంచరపాదేన యోగాత్పుష్పపుటేనచ.
తలపుష్పపుటం నామ్నా ప్రథమం కరణం భవేత్
కరణే ష్వేవ మన్యేషు మంతవ్యా నామ వాసనా.
యదాతు చతురశ్రాంగం విధాయ కరణం త్విదమ్
ప్రయుజ్యతే తదా స్వేస్వే పార్శ్వేవ కరయో
ర్ద్వయోః.
ఆవేష్టిత క్రియాం కృత్వా పరివేష్టిత కర్మణా
కరణీయః పుష్పపుట హస్తబంధః ప్రయోక్తృభిః"

భరతుని నిర్వచన మీ కరణమున కొక కారికలో సూత్ర
ప్రాయముగా గలదు. కాని ఈ కరణమును జూపు
నపుడు యోజించవలసిన చారీస్థానకాది సహితముగ
ప్రక్రియను పై వార్తికములు చక్కగా వివరించు
చున్నవి. ఈ వివరణను సులభగ్రాహ్యముగా నభినవుడు
తన వివృతిలో ప్రసాదించుటచే మనకు కరణము
లన్నియు చక్కగా బోధపడుచున్నవి.

నృత్త హస్తములగు తల ముఖముల నీ రీతిగా
వార్తికములు వివరించినవి—

"యా పూర్వం చతురశ్రౌతు తతో వ్యావృత్త
కర్మణా
ఉద్వృత్తి క్రియయా చైవ హంస పక్ష కరావపి
స్వస్వ పార్శ్వగతౌ త్ర్యశ్రౌ తలే నాన్యోన్య
సంముఖౌ

తదాతల ముఖౌ ప్రోక్తౌ యదాతల ముఖౌకరౌ"

ఈ విషయమంతయు నృత్తాధ్యాయమున కత్యంత
ముపకరించునది. ఇట్టి వివరణము కన్పించుటచే నభిన
వుని కృత్యము చాలవరకు సులభమైనట్లు చూపట్టు
చున్నది.

దోలా పాదాచారీ విధాన మీ రీతిగా వార్తిక
ములయందు కన్పట్టుచున్నది—

"కుంచితాంఘ్రిం యదోత్క్షిప్య కర్ణాంతం
నిజ పార్శ్వతః
పార్శ్వ ద్వితీయం తస్మాచ్చ దోలావత్ పార్శ్వ
మాత్రతః
నీత్వాతంతు నిజే పార్శ్వే పాతయేత్ పార్ష్ణినా తదా
దోలాపాదా భవేచ్చారీ"

ఆక్షిప్తాచారీ ప్రక్రియ నీ క్రింది విధముగా వార్తికకారుడు నిర్వచించినాడు—

"కుంచితాంఘ్రిం యదా పురః
సముత్క్షిప్యన తాలాం త్రీ నర్ధ మండలకస్థితః
నీత్వా పార్శ్వాంతరం జంఘా స్వస్తికే
నిపాతయేత్
పార్ష్ణ్యా భూమౌ తదాక్షిప్తా"

ఆవిద్ధాచారీ విధి నీ క్రింది రీతిగా వార్తికములు ప్రపంచించినవి—

"యదా విశేష వర్తిగా
కృత్వా జంఘా స్వస్తికం తు కుంచిత శృంగోఽగ్రతః
ప్రసారితాంచితా విద్ధః సన్ పార్శ్వస్యైవ నిపాత్యతే
పార్ష్ణ్యా పార్శ్వాంతర క్షేత్రే తదావిద్ధా హ్యసౌ
భవేత్"

ఈ విశేష వివరణ నభినవుడు చేపట్టి తన వివృతిలోనికి అనువదించినాడు. నృత్తాధ్యాయమున కల్పించు ప్రక్రియను గూర్చి గ్రంథస్థము చేయ నెంచిన ఈ వార్తికములతి ముఖ్యములని వేరుగా జెప్పనక్కరలేదు. గురుశిష్య పరంపరలో మూల గ్రంథము వ్యాఖ్యానింపబడుట గలదు. ఈ వ్యాఖ్యయే వార్తికరూపమున బయలుదేరి శాస్త్రవిషయములను వివరించుచు, పూరించుచు, విశేషములను తెలుపసాగినది. ఇట్టి వార్తికములను రాహులుడు, శ్రీహర్షుడు మొదలగువారు రచించినారు. వీరిలో కల్పించని విశేషాంశములను ప్రపంచించుటకై ఇతర టీకలు, వ్యాఖ్యలు, వివృతులు బయలుదేరినవి.

# స్వార్థం - త్యాగం

శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

ఇంతకు ముందు వరకూ వాన కురిసి, యిప్పుడే వెలిసింది. అయినా నీలాకాశం యింకా నిర్మలం కాలేదు. మూడు గంటలకు చదువుతూన్న పుస్తకం మూసి వచ్చి లేడీ డాక్టరు విశాలాక్షి పిట్టగోడ వద్ద నిల్చుని మేడ క్రిందకు చూస్తోంది.

పట్టపగలే సాయంత్రంలా వుంది. ఈ విషయమే స్ఫురించి విశాల చిరాకు పడింది. వర్షం వస్తే అన్నీ నిర్బంధాలే. శుభ్రమైన బట్టలు ధరించటానికి వీలు లేదు. షికారు పోదామంటే వీలు లేదు. ఇవాళ ఆదివారమే కాబట్టి యీ పూటంతా ఖాళీ. కాస్త ఊపిరి తీర్గా పీల్చుకునేది వారానికి యీ సగం రోజే. మళ్లీ తెల్లవారితే మామూలే. తిరిగి వానరాకుండా వుంటేనే యీ సాయంత్రం ఏమయినా సర్దాగా తిరగటం.

సందేహం నివృత్తి చేసుకునేందుకు ఆమె తల ఎత్తి ఆకాశంలోకి చూసింది. ఆశ నిరాశ అయింది. అనుమానమే—విసుక్కుంది.

ఏదో తోచి వెనుదిరుగ బోయేసరికి అప్పుడే మెలిక తిరిగి తమ యింటిని సమీపిస్తున్న ఓ చిన్న కారు దృగ్గోచరమైంది. "కొంప తీసి..."—భయపడింది. ఈ కారు తమ గేటు ముందరే ఆగదు కదా.

కారు గేటు ముందరే ఆగింది.

విశాల వచ్చే విసుగుతో తొంగి చూసింది. కారు లోంచి ముందు తలుపు తెరుచుకుని ఓ యువకుడు దిగి పైకి చూశాడు. పైనున్న షేడ్ మీద నుంచి అయిదారు నీటి బిందువులు జారి ఆమె తలమీద పడి, వెనక్కి జారగిలబడేటంతలో అతను విష్ చేశాడు.

ఆమె తప్పని సరిగా, మనసులో దూషిస్తూ మెల్లగా నడిచి క్రిందకు వొచ్చింది. అప్పటికే డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చి సోఫాలో కూర్చున్న ఆ యువకుడు వినయంగా లేచి నిలబడ్డాడు. కూర్చోమన్నాక కూర్చున్నాడు.

"ఏం కావాలి?"

"చాలా అర్జంటు"

"ఏం కావాలి?" విసురుగా, విసుగ్గా అడిగింది ఆమె.

అతనీసారి కొంచం కంగారు పడ్డాడు; అన్నాడు "నా మిసెస్‌కి పెయిన్స్ వస్తున్నాయి. దయవుంచి రావాలి"

"ఎక్కడికి?"

"మా వూరికి"

"వూరికా? ఈ వూరు కాదా" ఆశ్చర్యపడింది విశాల.

కొంచం జంకుతూ ఆ యువకుడు "ఊహు; కాని యిక్కడకు ఆరు మైళ్ళే" అన్నాడు.

విశాల అతన్ని నిశితంగా పరికించింది. బయటకు ఎక్కువ తెలియపర్చకపోయినా అంతరంగికంగా చాలా వ్యధననుభవిస్తూన్నట్లుగా వున్నాడు. వాలకం చూస్తే వొదిలేటట్లు లేదు. తనమీద గురివుంచి వచ్చిన వ్యక్తిని, మిష పెట్టి పంపటం కష్టమే. అన్యాయం కూడా.

"చప్పున రారా!"

విశాల నిస్సహాయురాలైంది. "సారీ...యింకెవరి దగ్గరకైనా" అని కనీసం తప్పించుకునేందుకు ఒక ప్రయత్నమైనా చేద్దామనుకున్న ఆమె నోరు మూతపడింది.

"ఇదే మొదటిసారి. ఏమవుతుందోనని భయంగా వుంది"

ప్రశ్నలు అడిగి అతన్ని వేధించటానికి ఎక్కువగా అవకాశం లేదు. ఎన్ని ప్రశ్నలు అడిగినా ఏవో సాకులు చెప్పి "మీరే రావాలి" అని పట్టుబట్టే సమర్థత లేనివాడై వున్నాడా యువకుడు?

చేసేది లేక అనంగీకారంగానే లేచి నిలబడి "ఉండండి" అని లోపలకు వెళ్ళింది. పది నిమిషాల్లో తల్లికి చెప్పి కావలసిన యిన్స్ట్రుమెంట్సు వున్న బ్యాగ్‌తో గదిలోకి వచ్చింది. అతను లేచి నిల్చుని బ్యాగ్ అందుకుని, బయటకు నడిచాడు. ఆమె మౌనంగా అతన్ని అనుసరించి, కారు వెనక సీట్లో కూర్చుంది. అతను ముందు సీట్లో డ్రైవరు పక్క కూర్చున్నాడు.

కారు కదిలాక విశాల నిట్టూర్చింది. ఇవాళ ఎంత ప్రోగ్రాం! ఎన్ని ప్లాన్లు?

ఓ క్షణం ఆగి "టాక్సీనా?" అని అడిగింది. ఎక్కే ముందు చూసుకోలేదు.

"అవునండి"

ఆమె మౌనం వహించింది. ఓ అయిదు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాక, ఓ విషయం స్ఫురించి అంది. "మా మిడ్‌వైఫ్ లీవ్ మీద వుంది. మీ ఊళ్లో.."

"ఉన్నారు లెండి. ఆ జాగ్రత్త తీసుకునే వచ్చాను" అని వెంటనే ఆ యువకుడు అన్నాడు.

*   *   *   *

నాలుగు గంటలకాలం గడిచింది. లేడీ డాక్టర్ విశాల యివాళ అదృష్టవంతురాలు... ఎక్కువ శ్రమ లేకుండా సఫలీకృతురాలైంది. మొగపిల్లవాడిని దంపతులకు అందిచ్చింది.

అతను ఫీజు తెచ్చి యిచ్చాక తీసుకుని "యిక వెడతాను" అంటూ లేచిందామె.

"వొచ్చి దిగబెడతాను" అన్నాడు.

జాలిపడి, నవ్వి అంది విశాల "వొద్దు. వెళ్లగలను. ఈ సమయంలో మీరు యింట్లో వుంటేనే బాగుంటుంది."

కారు చిన్నగా కదిలాక లైటు వెలుగులో టైము చూసుకుంది. ఏడు పది నిమిషాలు. గట్టుకుంటే అరగంట ప్రయాణం.

కొంతదూరం పోయాక గాని పొరపాటు చేశానని తెలియలేదామెకు. తను చేసింది అంత ఆరోగ్యకరమైన పని కాదని అప్పుడు గ్రహించింది. మధ్యాహ్నం అవటం మూలాన ముసురుగా వున్నా వచ్చేటప్పుడు దారి ప్రమాదకరమైనదని అనిపించలేదు. ఇప్పుడు యీ రహదారి నిజస్వరూపం బయటపడింది. కటిక చీకటి. అటూ యిటూ జీబురాత్తా చెట్లు. భయంకరమైన నిశ్శబ్దం.

అరగంట యీ నిశ్శబ్ద నిశీధిలో పయనం. భయపడవలసిన విషయం ఎందుకు కాదు? విశాల డాక్టరే — కానీ లేడీ డాక్టరు.

ఆమె బిగబట్టుకుని కూర్చుంది. ఈ డ్రైవర్‌ను యిష్టం వచ్చినట్లు అధికార రీత్యా ఉపయోగించుకునే సాహసం యీ స్థితిలో ఆమెలో హరించింది. "కొంచం స్పీడుగా పోనియ్యి డ్రైవర్" అనటానికి కూడా ఆమె సంసిద్ధురాలు కాలేకపోయింది. ప్రయత్నించి విరమించింది.

బహుశా యింకా మూడు మైళ్లు కూడా పోయి వుండదు. గమ్యస్థానం సగందూరం పైగా వుంది. హఠాత్తుగా కారే ఆగింది.

విశాల భయకంపితురాలైంది.

"ఏ...మి...టి...ఏ...."

ఆమె అడగలేదు. డ్రైవరు మాట్లాడకుండా సెల్ఫు లాగి రెండు మూడు సార్లు ప్రయత్నించాడు, ఉహుఁ స్టార్టు కాలేదు. టార్చిలైట్ తీసి తలుపు తీసుకుని బయటకు వెళ్లి, బాయ్‌నెట్ ఎత్తి చూస్తున్నాడు.

లేడీ డాక్టర్ గారికి ఏమి చేయాలో పాలుపోలేదు. మనుషులకిచ్చినట్లు ఆమె నోరులేని యీ కార్లకు యింజక్షన్ యివ్వలేదు కదా. ఓ నిమిషం తటస్థంగా ఊరుకుని, ఏదో తోచి, ధైర్యం తెచ్చుకుని, బయటకు దిగింది. టార్చిలైటు వెలుగులో డ్రైవరు ఏదో యోచిస్తున్నాడు. మెల్లిగా అతన్ని సమీపించి కంపిత స్వరంతో అడిగింది,

"ఏమయింది?"

"కార్బొరేటర్‌లో ఏదో లోపం వచ్చింది సాబ్. దీని అంతు తేలుస్తాను" తల ఎత్తకుండానే జవాబు వొచ్చింది.

"ఎంతసేపు పడుతుందో?"

"పది నిమిషాలు"

విశాల మౌనం వహించింది. తిరిగి లోపలకు పోయి కూర్చో బుద్ధి కాలేదు. చుట్టూరా చీకటి. బడీ దిపాడూ లేదు. ట్రాఫిక్ అసలే లేదు... ఛీటి చెందవలసిన అవసరం ఎందుకు లేదు? కదిలి ఓ అడుగు

వేసి, కొంచంగా జారింది. చాలాసేపు వర్షం కురియడంవల్ల రోడ్డంతా బురదమయంగా వుంది. చీరంచులు తడవకుండా జాగ్రత్తగా నడిచి, ఓ చెట్టు క్రిందకు వచ్చి నిల్చుంది. గాలి కూడా లేదు, ప్రకృతి సరికొత్త చీకటి తెరల మాటున దాగింది కదా. ఏం చెయ్యాలి యిప్పుడు?

చూస్తుండగా, ఆమెలో ఎప్పుడో జనించిన చిరాకు అధికం కాసాగింది. అది నైరాశ్యంగాకూడా మారుతోంది. ఈ సాయంత్రం అంతా ఎప్పటిలాగా గడిచింది. కొత్తదనం ఏదీ లేదు. సరదా అసలే లేదు. కానీ యిలా కారు మధ్యదారిలో ఆగినప్పుడైనా ప్రక్కన యిద్దరు ముగ్గురు స్నేహితులు వుంటే...

హఠాత్తుగా ఉలుక్కి పడింది. మానవ సంచారం ఏమీలేని యీ అంధకారంలో ఒంటరిగా, ఓ ముక్కూ మొహమూ తెలియని వ్యక్తితో యీ ఏకాంత ప్రదేశంలో వున్నాననే తలంపు వచ్చేసరికి ఒళ్లంతా జలదరించింది. రక్తం ఘనీభవించినట్లయింది.

కొన్ని గజాల దూరంలో, తంటాలు పడుతున్న డ్రైవరు వంక చూసింది. పొరపాటునైనా యిటువైపు చూడటం లేదు. అయినా విశాల ప్రసన్నురాలు కాలేదు. ఏదయినా అపాయం సంభవిస్తే యిక్కడ తనను కాపాడేది ఎవరు?

ఆమె హృదయ క్షేత్రంలో ప్రియుడు నిలిచి, క్రూరంగా నవ్వుతున్నాడు. ఆ నవ్వులోని అంతరార్థం స్త్రీయైన విశాలకు తెలుసు.

ఆమె భావాలు అంతటితో ఆగలేదు.

హఠాత్తుగా దొంగలు వచ్చారు. వాళ్ళకు పెద్ద పెద్ద మీసాలున్నాయి. తనని బయటకు రమ్మన్నారు. తన కంఠసీమలో ఒకేఒక నెక్లేస్. అది కాస్తా కాజేశారు. అంతటితో ఆగినా బాగుండును. వాళ్ళు యింకా ఏమిటి ఆశిస్తున్నారు? వణికిపోతూంది తను.

నవ్వొచ్చింది విశాలకు. అందరి వంటి స్త్రీ కాదు తను. చదువుకుంది. తెలివిగలది. కావాలని ఓ యువకుడి సహాయం తిరస్కరించింది. మళ్లీ ఎందుకంత భయం, కాని అంత చీకటిలో కూడా తనని ఎవరూ చూడకపోయినా దొంగనవ్వు ఎందుకు నవ్వుకుందో ఆ క్షణంనుంచీ అర్థం కావటంలేదామెకు.

ఈ విచిత్రమైన అవస్థ భరించటం ఆమెకు దుర్భరంగా వుంది. ఇంకా ఎంతసేపని అడుగుదామనుకుంది. తల ఎత్తి చూసింది. ఓ క్షణంపాటు ఆనందంతో పరవశురాలై నిల్చుంది. దూరంగా ఆమెకు ఆశాజ్యోతి —ఊహు— ఆశాజ్యోతులు కనిపించాయి.

అవి క్రమక్రమంగా సమీపిస్తున్నాయి.

బాగా ధైర్యం చిక్కింది. మెల్లగా నడిచి రోడ్డుమీదకు వచ్చి నిల్చుంది. రోడ్డు మెలికలలో జ్యోతులు దాగుడుమూతలు ఆడుతున్నాయి. అయితే నిమిషాలు గడిచాయి. చీకట్లో చిన్నగా సద్దు చేసుకుని, దాని నతుక్కుంటూ వస్తున్న చిన్న కారు విశాల చుట్టూవున్న పరిస్థితి గమనించి కాబోలు దవ్వున ఆగింది. ఆమె వుద్దేశంకూడా అదే. లైట్లు ఆరాయి.

మరుక్షణంలో తలుపు తీసుకుని, టార్చిలైటు వెలుగు రోడ్డుమీద ప్రసరింపజేస్తూ ఓ వ్యక్తి, విశాల దగ్గరకు నడిచివొచ్చాడు.

"ఏం జరిగిందండీ?" యింగ్లీషులో, నమ్రతగా ప్రశ్న వొచ్చింది.

వెంటనే విశాల జవాబు చెప్పింది.

ఆ వ్యక్తి సానుభూతి చూపించి "ఎంతదూరం పోవాలి?" అని మళ్ళీ అడిగాడు.

జవాబు చెప్పింది విశాల.

"మేమూ ఆ ఊరే మీ పేరు ఏమిటి?"

జవాబు చెప్పింది.

చీకటిలో కనిపించకపోయినా ఆ వ్యక్తిలో కొద్దిగా సంచలనం కలిగినట్లు లీలగా తట్టింది విశాలకు. ఈ విషయంలో ఆమె ఏదీ నిర్ధారణ చేసుకోకముందే ఆ వ్యక్తి "మాలతీ" అని పిల్చాడు.

లేడీడాక్టర్ నివ్వెరపాటు గ్రహించకుండా అతను దవ్వున తన కారుదగ్గరకుపోయి మళ్ళీ "మాలతీ" అని మృదువుగా పిలిచాడు.

"ఏమిటి?" అని లోపలనుండి ఓ హీనస్వరం వినవచ్చి, యించుమించు అదే క్షణంలో లోపలి లైటూ వెలిగింది. సుదూరంలో నిల్చున్న విశాల వెనుక సీటులో కూర్చునివున్న ఓ స్త్రీ తాలూకు పాలిపోయివున్న సుందరవదనాన్ని అస్పష్టంగా చూడగలిగింది.

# స్వార్థం - త్యాగం

"ఎవరొచ్చారో చూడు" ఆ పురుషుడి కంఠ ధ్వని ఉత్సాహంగా వినవచ్చింది.

"ఎవరు?"

"నువ్వే గుర్తుపట్టు... డాక్టర్! ఓసారి యిటు వస్తారా?"

ఆమె మెల్లగా కారుదగ్గరకు నడిచివచ్చి, లోపలవున్న స్త్రీకేసి దీర్ఘంగా చూసింది. లోపలి ఆమె అలాగే చూసింది.

మొదట సందేహం, పిదప ఆశ్చర్యం, తరువాత సంతోషం యివన్నీ యించుమించు ఒకేసారి ఆయిద్దరి స్త్రీల ముఖాకృతులలోనూ ప్రతిఫలించి "నువ్వా" అని యిద్దర్నీ మళ్ళీ ఒకేసారి రమారమి పలకరింపజేశాయి.

"మాలతీ" అంది విశాల గాద్గదికంగా. ఆమెకు ఎందుకో యిప్పుడే దుఃఖంలాగా వచ్చింది. ఆ స్థితిలోనే కన్నీళ్లు కారితే వాటినే ఆనందభాష్పాలంటారు.

"ఎన్నాళ్లకి కలుసుకున్నాం విశాలా. లోపలకు రా"—ఆమె మాటలు పూర్తికాకముందే పెద్ద దగ్గుతెర వచ్చింది. చప్పున వెనకవున్న బాలీసుకు ఆనుకుని, తల వంచుకుని, ప్రేగులు తెగిపోయేట్టు దగ్గుతూ, అవస్థ పడసాగింది. విశాల ఆలస్యం చేయకుండా అటునైపు తిరిగివెళ్లి, తలుపు తీసుకుని లోపలకువెళ్లి మాలతి భుజాలను గట్టిగా పట్టుకుంది.

"మాలతీ. అయ్యో ఏమిటిది?"

మాలతి స్నేహితురాలివైపు జాలిగా, దీనంగా చూసింది. అతి ప్రయత్నంమీద జవాబు ఏదో చెప్పబోయేటంతలో మళ్ళీ దగ్గుతెర వచ్చి, మనిషి వేళ్లాడిపోయింది.

అయిదునిమిషాలు బాధగా, వ్యథగా నిశ్శబ్దంగా గడిచాయి.

మాలతి బాగా తేరుకున్న తర్వాత హీనస్వరంతో అంది—"అంతే అది."

"అంటే?"

నవ్వటానికి ప్రయత్నించి విఫలురాలై ఆమె "నాకు టి. బి."

విశాల ఒక్కసారిగా విద్యుద్ఘాతం తగిలినట్లుగా వొణికింది. "ఏమిటి? ఏమిటి?."

"ఏమీ లేదు. రెండేళ్ల క్రితం దాపురించింది నాకు. అప్పటినుంచీ యింతే."

"ట్రీట్ మెంట్ తీసుకోలేదా?"

"వెయ్యవలసిన ప్రశ్న వేశావు? ఎందుకు తీసుకోలేదూ? రోజూ స్పెషలిస్టు మా ఇంటికి వచ్చిపోతుంటాడుగా."

విశాల నిట్టూర్చి "ఎటువంటి పరిస్థితిలో నిన్ను చూశాను" అని ధోరణి మార్చటానికి ప్రయత్నిస్తూ "అయితే ఇక్కడికి వచ్చి ఎన్నాళ్ళయింది? దాగుడు మూత లాడదామనుకుంటున్నావా? కనిపించావు కాదేం?" అని గబగబ అడిగింది.

మాలతి యీ ప్రశ్నలకు జవాబు చెప్పబోయేటంతలో బయటనే తచ్చాడుతున్న మాలతి భర్త మరీ దగ్గరకు వచ్చి "యిక్కడేనా ఏమిటి కబుర్లు? ఈ చీకట్లో ఏమిటి? డాక్టర్ గారు మనతోనే కారులో వస్తారు." అన్నాడు.

"కాదు. నాకోసం అక్కడ టాక్సీ వుందికదా" అని విశాల చప్పున అంది.

"అది యింకో గంటకు గాని బాగుపడితే నయమే. డ్రైవర్ తోనే చెప్పేసి వస్తాను" అని అతను రెండు నిమిషాల్లో ఆ పని ముగించుకువచ్చి ముందు తలుపు తెరిచి స్టీరింగు ముందు కూర్చున్నాడు. ఇందులో మొహమాట పడాల్సింది ఏమీ లేదని గ్రహించి విశాల మౌనంగా కూర్చుంది. కారు కదిలింది.

"ఇప్పుడు చెప్పు" అంది విశాల రెండు నిమిషాలు గడిచాక.

"ఏముంది? వారికి యిక్కడికి ట్రాన్స్ఫర్ అయి వారం రోజులయింది"

"అయితే నేను యిక్కడే వుంటున్నానని తెలిసి ఎందుకు వచ్చి కనిపించలేదు? పోనీ ముందుగా ఎందుకు ఉత్తరం రాయలేదు."

మాలతి వెంటనే క్షీణస్వరంతో "ఏం చెప్పను. నా ఊహలు మరో విధంగా వున్నాయి. హఠాత్తుగా వచ్చి ఆశ్చర్యంలో ముంచి వేద్దామనుకున్నాను" అంది.

"ఆశ్చర్యం సరే. దుఃఖంలో ముంచావు" అనుకుంది విశాల లోలోపల.

ఇంతలో ఆమె దృష్టి సీరియస్ గా డ్రైవ్ చేసుకుపోతూన్న మాలతి భర్తపై బడింది. ఆమె పెళ్ళికి తను వెళ్లలేదు. అతని పేరు ముకుందరావు అన్నట్లుగా గుర్తు. గజిటెడ్ ఆఫీసరని మాలతి ఉత్తరాలే చెప్పాయి. ఆమెలో హఠాత్తుగా ఓ ప్రశ్న ఉదయించింది. దానికి జవాబు సులభమే. ఆ సులభమైన జవాబు ఆమెకు తోచేటంతలో మాలతి నాలిక కొరుక్కుని అంది. "సారీ—మీ యిద్దరకూ పరిచయం చేయనేలేదు."

పరిచయం ముగించాక ముకుందరావు అన్నాడు: "మీతో నాకు ముఖ పరిచయం యిదే ప్రథమం అయినా, మీ గురించి ఎంతో స్నేహితుడైన వాడు కూడా తెలుసుకోనట్లుగా, మీరు నాకు తెలిసేటట్లు మా మాలతి చేసింది. ఘన కార్యం కదూ. అందుకనే మీ పేరు మీ నోటినుంచి రాగానే ఎవరో గ్రహించివేశాను."

ఇదే, యిందాక విశాలకు తోచబోయిన సులభమైన జవాబు. ఆమె యిప్పుడు చిన్నగా నవ్వి, ఊరుకుంది.

తర్వాత స్నేహితురాళ్లిద్దరూ లోకాభిరామాయణంలో పడ్డారు. మధ్య మధ్య ముకుందరావుకూడా వాళ్ళ సంభాషణలో జోక్యం కలిగించుకున్నాడు. ఈ యిద్దరి స్నేహితురాళ్ల మధ్య వున్న స్నేహం కొంచెం విచిత్రమయింది. అయిదేళ్లు ఒకర్నొకరు చూసుకోకుండా గడిపారు. ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా యిన్నాళ్లు ఎక్కువగా జరగలేదు. కాలేజి రోజులలో ఆప్త మిత్రురాలిగా పరిగణించిన వ్యక్తి వివాహానికే కారణాంతరాలవల్ల విశాల హాజరుకాలేదు. విశాల డాక్టర్ అయాక చూడటానికి అవతల వ్యక్తికీ పడలేదు. ఆమెకు భయంకరమైన ఓ వ్యాధి సంక్రమిస్తే ఈమెకు తెలియటం సంభవించలేదు. విచిత్రం కాదూ? ఐనా ఇద్దరిమధ్యా ఆప్యాయతకేం లోటు లేదు. అంతేకాదు, చాలా సంవత్సరాల తర్వాత కలుసుకున్నప్పుడు తాత్కాలికంగా జనించే సిగ్గు, మొహమాటం యివన్నీ లేవు వీళ్లమధ్య. విశాల స్నేహితురాలి ఆరోగ్యం గురించి వివరాలింకా అడుగుదామనుకుంది గాని అది సమయం కాదని ఊరుకుంది. మధ్య మధ్య రెండు మూడు సార్లు మాలతికి దగ్గుతెరలు వచ్చాయి. ఆ సమయాలలో మాలతి కళ్లలో ఒకరకం బాధతో తిరిగిన కన్నీళ్లే, విశాలతరళనయనాల్లోనూ మరో రకం బాధతో తిరిగాయి.

చాలాసేపు గడిచాక, సిటీలో జనసంచారం బాగా సన్నగిల్లాక కారు పురవీధులలోకి ప్రవేశించింది. ఒకటి, రెండు మైళ్లు, పది పదిహేను మలుపులు తిరిగింది. ఓ పెద్దమేడ గేటుముందు కారు చిన్నగా ఆగాక "యిదే మా యిల్లు" అంది మాలతి. విశాల తల ఊపి, లేచి స్నేహితురాలు కారునుంచి దిగటంలో సాయపడింది.

"లోపలకు రా" అంది ఆమె ఆయాసపడుతూ.

"ఇప్పుడు కాదు. ఇప్పటికే చాలా రాత్రయింది. ఇంకో రెండు మూడు రోజుల్లో వీలు చూసుకుని వస్తాను" అంది విశాల.

"తప్పకుండా రావాలిసుమా." అని భర్త వంక తిరిగి "కారులో ఆమెను యింటివరకు దిగబెడ్తారుగదా" అంది.

విశాల యింకా కంగారు పడుతూండగానే ముకుందరావు "రాండి" అని ఆహ్వానించాడు. మనసులో చాలా నొచ్చుకుంటూ స్నేహితురాలి దగ్గర సెలవు తీసుకుని కారులో ఎక్కి కూర్చుంది. తర్వాత యిద్దరూ ఎక్కువగా మాట్లాడుకోలేదు. విశాల తన యింటివద్ద దిగిపోతూంటే, అతను "ఒకసారి వీలు చూసుకుని తప్పకరండి. మాలతి కేమీ తోచదు" అన్నాడు. ఆమె తల ఊపి, థ్యాంక్సు చెప్పి లోపల కొచ్చేసింది.

* * *

మొదట ఆమె రెండు మూడు రోజుల్లోనే స్నేహితురాలింటికి వెడదామనుకుంది గాని, డిస్పెన్సరీలో వర్క్ ఎక్కువగా వుండటం వల్లా, బంధువుల ఇంటికని వెళ్లిన తల్లి ఇద్దరు ముగ్గురు బంధువులని కూడా వెంటబెట్టుకుని బెంగుళూరునుంచి వచ్చేయటంవల్ల తీరిక లేక వెళ్ళలేకపోయింది. ఆ ప్రయాణం ఆదివారం దాకా వాయిదా వేసుకుంది. చివరకు ఆదివారం వచ్చింది. మధ్యాహ్నంనుంచీ అంతా సెలవే కావటంవల్ల ఆమె వొంటిగంటకు బయల్దేరింది.

"కుక్కలున్నాయి జాగ్రత్త" అన్న బోర్డు ఆమె చూసుకోలేదు. తొందరలో రెండడుగులు గేటు దాటి ముందుకు వేసేసరికి గొలుసు కట్టివున్న దెయ్యపు కుక్క గయ్యుమని ముందుకు ఉరకబోయింది. విశాల చచ్చే భయంతో కళ్ళప్పజెప్పి చూస్తూ నిలబడి

పోయింది. లేడీ డాక్టర్ గారిని యిప్పుడో పెద్ద సమస్య ఎదుర్కోబోతోంది. కాని ఆమె అదృష్టం బావుంది; ప్రక్క గదిలోంచి సవ్వడి విని లేచివచ్చిన ప్యూన్ ఆమెను రక్షించాడు.

కుక్కని గదుముతూ, వినయంగా ఆమెవైపు చూస్తూ "లోపలకు వెళ్ళండమ్మా" అన్నాడు.

విశాల వాడివంక కృతజ్ఞతతో చూసి, మరి రెండు మూడు అడుగులు వేయకముందే నీరసించిన మాలతి సుందరవదనారవిందం పైనున్న కిటికీనుంచి తొంగిచూసింది.

"విశాలా" అని పిలిచింది ఆమె చేయి ఊపుతూ.

విశాల పైకి చూసి జాలిగా నవ్వి "వస్తున్నా" అంది. ప్యూన్ మెట్లవైపు దారి చూపాడు. ఆమె గబగబ మెట్లు ఎక్కి పైకి వెళ్ళిపోయి, స్నేహితురాలితో ముందుగా అన్న మాట యిది: "హడిలి చచ్చాననుకో"

మాలతి గోడకుఆనుకుని నిల్చుంది. ఆ క్షణంలో ఆమె పాలిపోయిన పెదవులమీద విరిసిన చిరునవ్వు ఆ ముఖానికి ఎటువంటి వన్నె చిన్నెలూ తెచ్చిపెట్టలేదు సరికదా, వెలా తెలా పోయినట్లుంది.

"మా యింటికి వచ్చిన ప్రతివారిపనీ యిలాగే అవుతుంది. "వద్దండీ" అన్నాను. విన్నారు కాదు.

తర్వాత యిద్దరూపోయి కుర్చీలలో కూర్చున్నారు. "రెండు మూడు రోజుల్లో రావటం అంటే యిదేనా ఏమిటి?" అని మాలతి ప్రశ్నించింది.

"ఏం చేయను? నీకూ నాకున్నంత పనివుంటే తెలుస్తుంది."

మాలతి స్నేహితురాలి వదనంలోకి ఒకసారి చూసి, తర్వాత తలవంచుకుని అంది "ఉన్నపనే నేను చేసుకోలేనుకదా."

ఉత్తరక్షణంలో ఆమె కనుకొనల్లో నీళ్లు తిరిగాయి. చిన్నగా అవి తర్వాత చిక్కిపోయిన చెక్కిళ్ళమీదుగా కంఠసీమపైకి ప్రవహించాయి.

"మాలతీ" అంది విశాల. "ఛా—ఏమిటిది?"

"ఏం చెప్పను విశాలా! నావంక చూడటానికి నీకిప్పుడు భయం వేయటంలేదూ? నన్ను తాకేందుకు కూడా నీవు జంకటల్లేదూ? బహుశా యీ అనుభూతులు నీ కంతగా వుండకపోవచ్చు. డాక్టరువిగా నువ్వు. మావారికీ లేవనుకుంటా. ఆయన భర్త కాబట్టి భరిస్తున్నారు. మరి...మరి...." ఆమె కంఠం వొణికింది. ఎంతో నీరసంగా వొణికింది. "సహృదయంతో నన్నెవరు ప్రేమిస్తారు విశాలా? ఒకప్పుడు—నీకు తెలుసుగా. ఈ అందం ఎంతమందిని ఉన్మాదుల్ని చేసిందో! ఈ చేతులు చూడు ఎలా క్షీణించిపోయాయో. నా గొంతులో మాధుర్యమేనా నీకు వినిపించేది? ఇంకా కొంచెం గట్టిగా మాట్లాడితే అంతా రక్తం—రక్తం—రక్తమయం.

ఆమె రెండు చేతుల్లో ముఖాన్ని కప్పుకుంది రక్తంతో కాదు; రక్తంలాంటి కన్నీళ్ళతో అవి త్వరలోనే తడిసిపోయాయి. విశాల ఉద్వేగాన్ని అణచుకుంటూ ఆమె చేతుల్ని, వదనమండలంనుంచి బలవంతంగా విడదీసి, కంపితస్వరంతో అంది "మాలతీ. నీకు పిచ్చిగానీ ఎత్తలేదుగదా."

"ఆ అదృష్టం అందరికీ పడుతుందా విశాలా."

"చాల్లే. ఈ వేదాంతం ఎప్పటినుంచీ?"

"చెప్పలేను" అని ఆమె గంభీరంగా "యిదీ వేదాంతమంటావా డాక్టర్. నే నందులో ఓనమాలయినా నేర్చుకోలేదే. బహుశా ఒకటి నిజం కావచ్చు. కష్టాలు వచ్చినప్పుడు మానవుడి నోటినుంచి ప్రతిమాటా వేదాంతంగా యితరులకు ధ్వనించవచ్చు" అని నిట్టూర్చి "సంతోషంవస్తే మనిషి నవ్వుతాడు. కష్టంవస్తే నాలాగే ఏడుస్తాడు మరి యీ దుఃఖసమయాల్లోనేనా వేదాంతం వచ్చేది? విశాలా, నేను చెప్పేది అర్థమయిందా? వేదాంతంలో కొంతస్వార్థం వుందన్నమాట. ఆ ప్రకారం ప్రతివారూ ఎప్పుడో ఒకప్పుడు, ఏదో ఒక క్షణంలో వేదాంతులు అవుతూనే వుంటారు. బలే. అయితే యీ సిద్ధాంతానికి ఏర్పడిన ఆ ప్రత్యేక విలువ ఏమయినట్టు."

"మాలతీ...మాలతీ...మాలతీ"

తల వంచుకుని, కొంచం ఆగి, మళ్ళీ తల పైకిఎత్తి గాద్గదికంగా అంది ఆమె.

"మాట్లాడనివ్వు విశాలా! మాట్లాడితే కొంచం ఆవేదన తగ్గవచ్చు"

విశాల స్వరం చిన్నదిచేసి అంది: "నీకెలా ఊరట కలిగించాలో నాకు బోధపడటంలేదు. డాక్టర్లందరూ సాధారణంగా కృత్రిమంగా ఊరడించటానికే అలవాటుపడి వుంటారు. ఈ అలవాటు

బహుశా నీవు నాకు ప్రాణస్నేహితురాలివి అవటం చేత నేమో, నా చేత నోరు విప్పించటం లేదు."

తరచి యోజిస్తే యీ మాటలు అవతల వ్యక్తి హృదయానికి ఎంత గాఢంగా నాటుకుంటాయో విశాల ఆలోచించ లేదు. కాని అవతలి వ్యక్తి అంత తరచి యోజించక పోవటంవల్ల అక్కడ సన్నివేశం మరింత చెడి రసాభాస కాకుండా కాపాడబడింది.

తరువాత మళ్ళీ మాలతి అంది "అక్కడవుండగా రెండేళ్లు యీ మాయదారి జబ్బుకోసం వేలకు వేల రూపాయలు తగలబోశాం. మెడిసిన్స్ తీసుకుని తీసుకుని ప్రాణం విసిగిపోయింది. ఈ ఊళ్ళో మాకు తగ్గ స్పెషలిస్ట్ ఎవరూ దొరక లేదు." అని కొంచెం ఆగి "బహుశా యింకా కొన్నాళ్ళలో మదనపల్లి శానిటోరియమ్‌లో జాయిన్ అవుతాను. వారు అందు కోసం ప్రయత్నిస్తున్నారు."

విశాలకు మనసంతా చాలా కలతగా వుంది. ఇవాళ యింత విపరీత పరిస్థితుల్లోకి యీడ్చుకు పోబడ తానని ఆమె ముందుగా కొంచమైనా ఊహించ లేక పోయింది.

ఎవరూ మాట్లాడకుండా నిమిషాలు కొన్ని చికాకుగా మౌనంగా గడిచాయి.

మాలతి హఠాత్తుగా స్నేహితురాలి ముఖంలోకి సూటిగా చూస్తూ "డాక్టరివి కదా నువ్వు. నన్ను పరీక్షచేసి నేనింకా ఎన్నాళ్లు బ్రతుకుతానో చెప్పు" అంది.

విశాల ఒక్కసారిగా చలించింది. చప్పున ఆమె ముఖం నీలమేఘాచ్ఛాదితమైన ఆకాశంలా, వివిధ వర్ణ కిర్మీరితం అయింది. చాలా సేపటికి తెప్పరిల్లి అంది" నేనా సబ్జెక్టును స్పెషలైజ్ చేయలేదు. అయినా అవేం ప్రశ్నలు? నీ మొహం"

"నా కెందుకో అటువంటి ప్రశ్నలే వేయబుద్ధి వేస్తూంటూంది విశాలా"

ఇహ లాభంలేదని విశాల గ్రహించి టాపిక్ మారుద్దామని "ఆదివారం కదా. మీ వారు కనిపించ లేదేం?" అని ప్రశ్నించింది.

"లేరు. క్యాంప్ వెళ్ళారు?

"అయితే యింట్లో ఎవరెవరు వున్నట్లు?"

"నేనూ, పనివాళ్లూ అంతే. మా కెవరూ పెద్ద దిక్కు లేరుకదా"

ఎక్కువసేపు కూర్చోవటంవల్ల విశాలకు విసుగు పుట్టి, లేచి కిటికీ దగ్గరకు పోయి నిల్చుని క్రిందకు చూసింది ఇందాక మాలతి యీ కిటికీలోంచె తనను పిలిచింది. క్రింద పనివాడు కుక్కతో ఆటలాడుతున్నాడు. అది మచ్చిక అయిన జంతువే అయినా జాతి పౌరుషం నిలుపుకునేందుకు కాబోలు అప్పుడప్పుడు వారాము చేస్తోంది. కరుస్తోంది కూడా. పెద్ద ఉత్సాహమేమీ లేకపోయినా ఆమె యీ దృశ్యాన్ని పరికిస్తోంది. ఒక నిమిషమైనా పూర్తిగా గడవ లేదు. ఇంతలో పెద్ద పెట్టిన సనుక దగ్గు వినిపించింది. ఆమె ఆదుర్దాతో చప్పున వెనుదిరిగింది. రోగి చాలా సేపు దగ్గి దగ్గి అలిసిపోయి, రొజుకుంటూ, శక్తినంతా కూడదీసుకుని లేచి ప్రక్కనే మెత్తని పరుపు వేసి వున్న మంచం మీద కూలబడి, తరువాత వాలిపోయి, తన వంక విచారంగా చూస్తోన్న విశాల నేత్రద్వయంలోకి దీనంగా చూసింది. తెల్లబోయి చూస్తున్న విశాలకు యీ చూపులు భరించటం కష్టం కాగా, చూపులు మరల్చుకుంది. ఎంత సేపు దుఃఖం భరించటం? చివరకు సాధ్యం కాలేదు. ఏనాడూ చేయని పని ఒకటి యీనాడు చేసింది. పమిటచెంగు కన్నీళ్లతో తడిసింది.

"విశాలా! ఇలారా. నా దగ్గర కూర్చో"

నడిచి వెళ్ళి కూర్చుంది.

"నీ కళ్ళు అలా ఎర్రగా వున్నాయేం?"

"అంతే అవి. అప్పుడప్పుడూ అలా ఎర్రబారుతుంటాయి."

"మా వారికీ అంతే. అప్పుడప్పుడూ యీ అరుణ వర్ణం వారి నేత్రాల నావరిస్తుంది"

విశాల జవాబు చెప్పలేదు.

"చెంపమీద గట్టిగా కొడితే ఆ ప్రదేశమంతా ఇలాగే ఎరుపు రంగు దాలుస్తూంది కదూ"

విశాల ప్రశ్నార్థంగా చూసింది.

"అలాగే హృదయం మీద ఎవరైనా కొడితే కళ్ళలో యీ రంగు ప్రతిఫలిస్తుందని నాకప్పుడప్పుడూ అనిపిస్తూంది విశాలా?"

ఈమె దీనికి ఏమని జవాబు చెబుతుంది? తల మాత్రం వంచుకుంది. బహుశా ఆ సమయంలో చేయవలసిన సరియైన పని అదే.

మళ్ళీ కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాయి.

"వారు నన్ను చాలా ప్రేమిస్తున్నారు విశాలా."

మాలతి ఆకస్మికంగా అంది. విశాల తల ఆడించి ఊరుకుంది.

"నాకు ఒకటే దిగులు. వారి ప్రేమను, నేను తిరిగి యివ్వలేక పోతున్నానే అని. ఈ రోగిష్టిదాన్ని చూసి ఆయన ఏనాడూ విసుక్కోనులేదు. నా ఏమాటనూ త్రుణీకరించలేదు. ఆయనకు నేను చాలా ఋణపడివున్నాను. ఆ ఋణాన్ని తీర్చుకోలేకుండా వెళ్ళిపోతానేమోనని ...ఏదైనా క్యాంప్ వెళ్లాల్సివస్తే వారి మనసెంత కొట్టుకుపోతుం దనుకున్నావ్?"

మళ్ళీ నిశ్శబ్దం; చాలా సెకన్లు.

"అదే నా బాధ. అర్థమైందా?"

విశాల మాట్లాడలేదు. తల ఊపలేదు. స్తబ్ధుగా చూస్తూ ఊరుకుంది.

ఆమె అక్కడ మరి రెండు మూడుగంటలు గడిపింది. అవి అంతే చాలా నిస్సారంగా గడిచాయి. ఆమె యీ స్నేహితురాలి దగ్గరకు సరదాగా, కులాసాగా గడుపుదామని ఆశపడి రాలేదుగాని, అనుకోకుండా దుఃఖం మరింత అధికమించింది. మూడింటికి వంటమనిషి కాఫీ తెచ్చియిచ్చింది. మాలతి పాలు త్రాగింది. తర్వాత విశాల లేచి వస్తానంది. మాలతి ప్రతి రెండుమూడు రోజులకూ ఓసారి కలుసుకుంటానని మిత్రురాలు మాట యిచ్చాకనే ఆమెను వదిలిపెట్టింది. మధ్యాహ్నం నాలుగుగంటలకు విశాల దిగులుగా బరువుగా యింటికి చేరింది.

* * *

ఆమె అన్నమాట నిలబెట్టుకుంటూనే వుంది. సాధారణంగా వీలుదొరికినప్పుడల్లా మాలతి యింటికి వెళ్లి వస్తూనే వుంది. తన జబ్బునుగురించి మాలతిఅంటున్న మాటలలోని నిజం డాక్టరైన విశాలకి తెలుసు. ఆ వ్యాధి చాలా తీవ్రంగా ఆ వ్యక్తిలో ముదిరిపోయిం దనీ ఆమెకు తెలుసు. కాని యీ స్థితిలో ఆమె చేయగలిగింది ఏమీ లేదు. చప్పున శానిటోరియమ్‌లో చేరి పొమ్మని సలహాలు ఇచ్చింది. చివరికి అదీ కార్యరూపం దాల్చింది. ఓ నెలరోజులలోనే ముకుందరావు అంతా ఖాయం చేశాడు.

ఆ రాత్రికి మాలతి బయలుదేరి వెళుతుందనగా విశాల చూసివద్దామని బయల్దేరింది. ఆమె వెళ్లేసరికి మాలతి వొంటరిగా కనబడింది. ముకుందరావు యింట్లో లేడు.

ఇద్దరూ ఆసీనులయ్యాక "అయితే వెళ్లిపోతున్నావన్న మాట" అంది.

"అవును. వెళ్లిపోతున్నాను."

విశాల చప్పున నాలుక కొరుక్కుంది. ప్రతి మాటకూ యిలా పెడర్థం తీస్తే తనుమాత్రం ఏం చేస్తుంది?

"అలా గనకు మాలతీ. ఇంకో ఆరు నెలల్లో నువ్వు ఎలా తయారౌతావో చూడు. అద్దంలో చూసుకుంటే నిన్ను నువ్వే గుర్తుపట్టలేవు తెలుసా?"

"ఏ లోకంలో?" అని మాలతి పొడిగా నవ్వి "అవన్నీ గాలిమేడలు. రైట్ లంగ్ యిప్పటికే పూర్తిగా చెడింది. దాని బదులు స్పాంజ్ రిప్లేస్ చేస్తారుట."

ఒక క్షణంఆగి విశాల గట్టిగా నవ్వింది "అయితే ఏం? అలా వున్నవాళ్లు ఎంతమంది లేరు?"

కాని మాలతి యీ రోజు మరీ గంభీరంగా వుంది. కొంచం ఆగి "నిన్నో ప్రశ్న అడగనా?" అంది.

కొద్దిగా తెల్లబోయి విశాల "ఏమిటది?" అని ప్రశ్నించింది.

"జవాబు సూటిగా రావాలి."

"అలాగే"

"నువ్వింకా ఎందుకు పెళ్ళి చేసుకోలేదు?"

విశాల ముఖం చప్పున నల్లబడింది. స్నేహితురాలి ముఖంలోకి ప్రశ్నార్థంగా చూసి ఊరుకుంది.

"చెప్పవూ?"

ఆమె జవాబుగా అస్పష్టంగా గొణిగింది.

"కారణం లేకపోలేదు"

"అదే. చెప్పవూ?"

ఎంతో జాలిగావుంది యీ మాట; ఈ మాటే విశాల గుండెను చీల్చింది. తను యింకా పెళ్లి ఎందుకు

చేసుకోలేదు? పాతికేళ్ళ యీవయస్సు, యీ యౌవనం, యీ సౌందర్యం, యింకా... ఎందుకు? ఎందుకు? తను యింకా పెళ్ళెందుకు చేసుకోలేదు? ఈ విశాల జగత్తులో తనకు సమఉజ్జీ ఎవరూ దొరకలేదా? కాదు. ఈ న్యాయవాది డాక్టరీ వృత్తిలో తను యీ సుఖాలన్నీ త్యజించిందా? వీటన్నిటినీ విస్మరించిందా? కాదు. కాదు. ఎందుకు తను యింకా పెళ్ళిచేసుకోలేదు?

ఆమె చలించింది. దీని కంతటికీ కారణం ఒకటే.

చూస్తూండగానే ఆమె తరళనయనాలు అవిరళ బాష్ప జలపూరితాలయాయి.

ఈ వైఖరి చూసి మాలతి తృళ్ళిపడింది. విహ్వల దృష్టితో ఆమె వంకచూస్తూ "విశాలా యిదేమిటి?" అని గొణిగింది.

ఒక క్షణం విశాల కనురెప్పలు, టపటప కొట్టుకున్నాయి. వెంటనే ఆమె తేరుకుని రుమాలుతో కళ్లు గబగబ తుడిచేసుకుంది. అంది:

"చెప్పలేను మాలతీ క్షమించు."

ఈ జవాబు తన మొదటి ప్రశ్నకో, రెండో ప్రశ్నకో ఆమెకు మొదట అర్థం కాలేదు. ఈకన్నీళ్లు తనలాంటి ఆవేదనవే. కొంచెం నిశితంగా ఆలోచించాక రెండు ప్రశ్నలకూ జవాబులదేనని తెలుసుకుంది.

"నాతో చెప్పకూడదా?"

"కూడని కాదు. చెప్పలేను. అది నా అశక్తత"

"అయితే నిన్ను ఆ విషయం గురించి మరి ప్రశ్నించను. నా యింకో ప్రశ్నకు మాత్రం సమాధానం సూటిగా యివ్వాలి."

"ప్రయత్నిస్తాను".

"ఊహు. ఒప్పుకోను. నాకు చాలా ఖచ్చితమైన జవాబు అవసరం."

విశాల తల ఊపింది.

ఈ ప్రశ్న అడగబోయే లోపుగా మాలతి చాలా విచిత్రమైన అనుభూతి నొందింది. నెత్తురులేక పాలిపోయిన ఆమె ముఖం మరింత పాలిపోయింది. చిన్నబోయిందికూడా. తనలోని శక్తినంతా కూడదీసుకున్నట్లుగా, విశ్వప్రయత్నం చేసి పెదవులు కదిలించింది.

"అవసరం వస్తే యిహముందు పెళ్ళి చేసుకుంటావా?"

"ఇప్పుడేం చెప్పగలనూ?"

"అలా కాదు. కొంత శ్రమఅయినా సరే, ఆలోచించి చెప్పితీరాలి".

విశాల పెద్ద చిక్కులో ఇరుక్కుంది. ఏమిటీ ప్రశ్నలు? తన మనసు యిహ ముందు ఏవిధంగా వుంటుందో తనేం చెప్పగలదు? కాని చెప్పకుండా ఊరుకుంటే మాలతి ఊరుకునేటట్టులేదు. ఈ అవస్థ భరించలేక చివరకు ఆమె నోరు జారింది.

"అఁ చేసుకోవచ్చు".

ఈసారి మాలతి పరిస్థితి మరింత దిగజారింది. ఆమె ఫాలభాగం మీద స్వేద బిందువులు అలుముకున్నాయి. శరీరం కొద్దిగా కంపించటం ప్రారంభమైంది. పెదాలూ వొణుకుతున్నాయి.

"అయితే...అయితే...విశాలా! ఒక ప్రార్థన"

"ఏమిటి?"

"నీమీద ఎక్కువ చనువు తీసుకుంటూంటే క్షమించు. ఇది నా ప్రార్థన. నా కోరిక. నా కడసారి కోరిక."

వివర్ణమైన ఆమె వదనం. హఠాత్తుగా గంభీర రూపం దాల్చింది.

"నా గురించి నాకు తెలుసు. నేను యిహ ఎలాగూ జీవించను. కాని పోతూ పోతూ నేను ప్రేమించే, నన్నెంతగానో ప్రేమించే ఒక మహాపురుషుడికి అన్యాయం చేసి పోతున్నాను. ఇదే నా హృదయాన్ని కాల్చి వేస్తోంది. ఈ ఆవేదనను భరించలేను విశాలా కొంచమైనా భరించలేను. నేను పోయాక వారు ఏకాంతంగా యీ దుఃఖాన్నంతా భరిస్తూ ఎలా జీవించగలుగుతారు. వారి బాధల్ని పంచుకుని, వారికి మనశ్శాంతిని ప్రసాదించే హృదయం ఎక్కడ లభ్యమాతుంది?"...కాని...యింత చొరవ తీసుకుంటున్నందుకు క్షమించు. అది నువ్వే...ఆ హృదయం నువ్వే విశాలా. నీ విశాల హృదయంలోనే వారికి చోటివ్వాలి"

భయంకరమైన యీ ఆవేశంలో కూడా ఆమె ఎదుటి వ్యక్తి ముఖం చూడటానికి భయపడింది. పాడు ముఖం అనుకుంటున్న తన వదనాకృతి ఎదుటి వ్యక్తికి

చూపించకుండా దాచేందుకు వేరే ప్రదేశం లేక, ఆ వ్యక్తి చేతుల్లోనే తల వాల్చి వలవలా ఏడ్చింది.

ఈ విపరీత పరిస్థితిలో ఏ స్త్రీ హృదయం, అందులో మరీ సన్నిహితురాలైన ఏ స్త్రీ హృదయం కరగదు.

మాలతి, విశాల హృదయంలో చోటు చేసుకుని ఏడుస్తోంది.

ఈ కన్నీళ్ళని తుడిచేందుకు ఆమె చేతిలో వున్న రుమాల చాలదు; పమిట చెంగూ చాలదు. ఒకే ఒక వస్తువు. కాని అది తన స్వాధీనంలో లేదే.

"విశాలా. నాకోసం నువ్వీ త్యాగం చేయాలి."

త్యాగమా? ఇది త్యాగమా? విశాల మేను గగుర్పొడిచింది. చాలా సంవత్సరాలుగా తనలో దాగున్న ఓ వ్యక్తి, యీనాడు భూమి మీద జీవించి వుంటే, అప్పుడు యీ చర్యకు విపరీతార్థం తీసుకుంటే అది త్యాగంలాగా ధ్వనించ వచ్చు. కాని ఆ వ్యక్తి యిప్పుడు లేడే. కాబట్టి ఆరూపేణా యిది త్యాగమూ కాదు. తనను తాను త్యాగం చేసుకోవటమన్న మాటకి తన దృష్టిలో అర్థం లేదు.

సుఖాన్వేషణకు అది మారుపేరు. ఇందులో ఒకే ఒక అర్థం స్ఫురిస్తోంది. స్వర్గంలో వున్న ఆ వ్యక్తికి అపచారం చేయటం.

"విశాలా...వి...శా...అబ్బ"

దగ్గు...దగ్గు... దగ్గు....అంతులేని దగ్గు చాలా ఘోరమైన దృశ్యం. దగ్గు వెనుక నే రక్తం. రక్తం మరకలు విశాల చేతులు కూడా పంచుకున్నాయి. ఇహ యీ మనిషిలో కాఠిన్యానికి తావులేదు. సానుభూతికి లోటులేదు. అలిసి, సొలిసి నేలమీద వాలిపోయి, కళ్లు మూసుకుని పడుకున్న మాలతి ముఖంలోకి ఆమె వంగింది. పేరు పెట్టి పిలిచింది.

ఈ పిలుపు క్రిందపడివున్న వ్యక్తియొక్క శ్రవణకుహరాన్ని తాకి విశీర్ణం చేసేటట్లుగా పనిచేసి వుంటాయి. నెమ్మదిగా కళ్ళు విప్పింది. ఎంత ఆతృత ఆ వాడిపోయిన నయనాల్లో కూడా.

ఈసారి విశాల గొంతు వీణమీటినట్లు మోగింది. "సరే అలాగే".

మాలతి బలహీనంగా విశాల చేతిని పట్టుకుని, తన హృదయం మీదకు లాక్కుంది.

"వొట్టువెయ్యి"

విశాలవెను దీయలేదు. మాలతి చేతిలో చేయి వేసి ప్రమాణం చేసింది.

* * * *

చాలా నెలలు కాకపోయినా అయిదారు దొర్లాయి. ముకుందరావు భార్యను దింపి, అక్కడే పదిహేను రోజులుండి, తనకు అంతకంటే సెలవు లేక పోవటంవల్ల వచ్చేశాడు. ఒక ఆడపని మనిషి, పనివాడూ అక్కడే వున్నారు. విశాల, అతనివద్దకు పదిహేనురోజుల కోసారి అయినాపోయి వస్తూండేది. మొదటి రోజుల్లో అతనితో మాట్లాడటానికి ఒక విధంగా సంకోచించినా, యిప్పుడా సిగ్గు, బిడియం లేవు. అయినా వీళ్ళయిద్దరిమధ్యా మాలతి సంభాషణ తప్ప మరొకటి దొర్లేది కాదు. అదయినా చాలా ముక్తసరిగా వుండేది. స్వభావసిద్ధంగా అతను మాట కారే అయినా యీ విచారాలవల్ల చాలా ముభావంగా వుంటున్నాడని ఆమె గ్రహించింది. వీలయినప్పుడల్లా అతను మాలతి దగ్గిరకుపోయి వస్తూండే వాడు. అటువంటి సమయాలలో మరీ దిగులుగా వుండేవాడు.

మాలతిదగ్గరనుంచి విశాలకు తరుచు ఉత్తరాలు వస్తూనే ఉన్నాయి. వాటిల్లో రానూ రానూ నిరాశావాదం ఎక్కువై పోతూండంటే ఆమె ఆశ్చర్యపడ లేదు. మూడు నాలుగు నెలలవరకూ ప్రతి ఉత్తరం లోనూ విశాల తనకు చేసిన వాగ్దానం విషయం హెచ్చరింపబడుతూ వచ్చింది. ఈ విషయం ఒకసారి ఎంత లోతుగా వెళ్లిందంటే "వారికి యిదేమీ తెలీదు, నన్ను ఎంత గాఢంగా ప్రేమిస్తున్నారో తెలుసా? బహుశా నేను చచ్చిపోయాక మళ్లీ పెళ్లి చేసుకోనని భీష్మించుకు కూర్చుంటారు. అటువంటప్పుడు ఆ బాధ్యత నీదే. నాకు నువ్వుగాక యింకెవరున్నారు చెప్పు..."

ఈ ఉత్తరం చదివాక ఓవిధమైన అసహ్యం కూడా జనించింది విశాలకు. ఏమనుకుంటోంది తన గురించి మాలతి. తోటి ఆడదాన్ని యిదేనా అర్థం చేసుకునే విధానం! స్నేహానికి యిటువంటివా పరీక్షలు? అయినా ఆమె తనకోపాన్ని ప్రత్యుత్తరంలో ఏమాత్రమూ తెలియపర్చలేదు. ఈసారికూడా ఆ స్నేహితురాల్ని మన్నించింది.

కాని ఎందుకో తిరువాత తరువాత మాలతి దగ్గర నుంచి వచ్చే ఉత్తరాలలో యీ అంశం మాయమైంది.

మొదట విశాలకు అర్థం కాలేదు. ఇదివరకటిలాగా వివరంగా కూడా మాలతి ఆ ఉత్తరాలు రాయలేకపోతుంది. తనమీద వుంచిన నమ్మకం ఆమె ఆత్మకు హామీగా నిలిచి వుండవచ్చు. అదే నమ్మింది విశాల.

రాను రాను మాలతి దగ్గరనుంచి ఉత్తరాలు రావటం తక్కువై పోతోందికూడా.

ఒకసారి మరీ పదిహేనురోజులు జాడా, కబురూ ఏమీ తెలియలేదు. ఆఖరికి ఓ రోజు యిహ ఉండబట్టలేక ముకుందరావు దగ్గరకు పోదామని బయల్దేరబోతూండగా అతని నౌకరే ఒకచీటీ తెచ్చియిచ్చాడు. "మాలతికి చాలా ఎక్కువగా వుందిట. నేనక్కడికి వెడుతున్నాను."

విశాల చప్పున కుర్చీలో కూలబడి బరువుగా నిట్టూర్చింది. త్వరత్వరగా ఆమె కనుకొనలనుండి నీళ్లు స్రవించాయి. "అంతే. ఇంకా కొన్నాళ్లలో ఆవార్తా చేరుతుంది."

ఏ వార్త! ఏ వార్త? అయ్యో! ఎటువంటి దుర్వార్త!

బహుశా; బహుశా కాదు నిజంగానే యిది తన జీవితంలో తనలో సంచలనం రేపే రెండో చావు అవుతుంది.

హఠాత్తుగా ఆమె ఉలుక్కుపడింది. ఎంత కఠినాత్మురాలు తాను? జీవించివున్న ఒక వ్యక్తి మరణాన్ని గురించి ముందుగా ఊహిస్తోంది.

కాని, తప్పదు. తప్పదు. మనసుని అరికట్టే శక్తి తనకు లేదు.

ఆ మొదటిచావు! అది ఎంతటి భయంకరమైంది. తను జీవితాన్ని గురించి నిర్మించుకున్న ఆశలూ, ఊహలు అవన్నీ తనతో తీసుకుపోయింది. తనని యించుమించు జీవచ్ఛవాన్ని చేసింది.

ఇంతకాలం యీ దుఃఖాన్నంతా ఎలా భరించింది? చూపరులకు మామూలు మనిషిలా ఎలా కనిపించ గలిగింది? స్నేహితులతో, బంధువులతో సరదాగా, కులాసాగా కాలం ఎలా గడుపుతోంది?

ప్రయత్నం. ప్రయత్నం. ఆ ప్రయత్నమే తనని యింతవరకూ నలుగురితో కలిసిమెలిసి వుండేటట్లు చేస్తోంది. అది పోయేటందుకే ఆదివారాలు ఆనందంగా గడపాలని తాపత్రయ పడటం.

కాని...కాని...తనకు కఠినంగా ఆలోచించక తప్పటల్లేదు. రాబోతూన్న మాలతిచావు తనను మళ్ళీ ఏదో పరిస్థితుల్లోకి తీసుకు వెళుతోంది. మొదటిచావు తనను ప్రేమనుంచి దూరంచేసింది. ఈ రెండవది ప్రేమని నేర్పుతుందట. తను ప్రేమించాలట.

అంత దుఃఖంలోనూ ఆమె పెదవులు చిన్నగా హసించాయి. ఇది సాధ్యమా? అయితే తనలో స్వార్థం ఓపాలు ఎక్కువవుతుందన్నమాట. దీన్నే మాలతి త్యాగం అనవచ్చు.

ఏది త్యాగం? ఏది స్వార్థం? దానికీ దీనికీ ఎంత తేడా? మాలతికోసం అతన్ని పెళ్ళిచేసుకోవటం మాలతి దృష్టిలో త్యాగం. అంతవరకూ తనూ ఒప్పుకోవచ్చు కాని...కాని అతన్ని ప్రేమించడం. అది త్యాగం కాదు. ఏమాత్రమూ కాదు. అంతేకాదు స్వర్గంలోవున్న మరో వ్యక్తికి ద్రోహంకూడా.

"నిన్ను తప్ప ఎవర్నీ ప్రేమించలేను విజయ్"

ఈ మాటలు తను నోటితో పలికిందా? కాదు. ఎక్కడో ఓచోట శాశ్వతంగా వుండేటట్లు లిఖించింది. ఎంత మనస్ఫూర్తిగా, వేదనగా రాసింది! ఇప్పటికీ ఆ లేఖ ఎక్కడో ఓచోట భద్రంగా వుండే వుంటుంది. అతను తన ప్రాణంకన్నా మిన్నగా దానిని దాచుకుని వుంటాడు.

"నేనూ అంతే విశాలా"

తన దగ్గర యీ మాటలు ఇప్పటికీ సురక్షితంగా వున్నాయి. మనసు బాధపడినప్పుడల్లా వాటిని చదువుకుంటూనే వుంది. అతను అదృష్టవంతుడు. బ్రతికివుంటే తన మాటల్ని నిలుపుకునేవాడు. జీవించలేదు కాబట్టి ఆ బాధ్యత అతనిపై లేదు. మొదటిది జరిగివుంటే తనూ నిలుపుకునేది. ఇప్పుడూ చాలా కాలం వరకూ సఫలీకృతురాలౌతూ వచ్చింది. కాని మాలతికి సంభవించబోయే విపత్తు తన మాటల విలువను నశింప జేసేటట్లు చేస్తోంది. ఒక వాగ్దానం వచ్చి మరో వాగ్దానాన్ని ఎగరగొట్టింది. తను మాలతి భర్తను వివాహమాడకా తప్పదు. అతన్ని ప్రేమించకా తప్పదు.

ప్రేమ...ప్రేమ...ప్రేమ ప్రేమించాలి కాబట్టి ప్రేమించాలి.

తనకు యీ అవస్థనుంచి విముక్తి వుండదు. దానికి ఒకటేదారి. మాలతి బ్రతకాలి. విశాల నిట్టూర్చింది. కాని ఆమె బ్రతకదు.

అలా ఏకాంతం అనుభవిస్తే యింకా ఎంతసేపు ఆలోచనలు సాగిపోయేవో! కాని ఆమె తల్లి వచ్చి వాటికి బ్రేకు వేసింది. లోపలకు వెళ్ళిపోయింది.

*   *   *

మరో కొన్నిరోజులు బరువుగా నడిచాయి. ఆమెకు మనసు మరీ పాడయింది. డిస్పెన్సరీలో సరిగా పని చేయలేకపోతోంది. కాని తప్పనిసరి. చాలామందికి తనమీద గురివుంది. చాలామందికి తను మాతృత్వాలు ప్రసాదించాలి. అది తన విధ్యుక్త ధర్మం.

చివరకు ఒకరోజు హఠాత్తుగా ముఖం తెలిసిన ప్యూన్ ఒకడు వచ్చి, చీటీ అందిచ్చాడు. అది ముకుందరావు దస్తూరీ.

"మాలతి పోయింది"

వెంటనే దిమ్మెరపోయినా, మరుక్షణంలో తట్టుకుని వాడిని అడిగింది. "ఆయన ఎప్పుడు వచ్చారు?"

"రాత్రి వచ్చారమ్మగారూ!"

బరువు గుండె యింకా మొగ్గలేదు. దాని శక్తి యిదివరకే అయిపోయింది. ఇకముందు రాబోయే ఆలోచనలకు అర్థం వుండదు. మాట్లాడకుండా పోయి పడుకుంది. నిండా ముసుగు కప్పుకుంది. అయిదారు సార్లు తల్లి వచ్చి పిలిచినా లేవలేదు. మిడ్‌వైఫ్ అర్జంటుగా వచ్చి బ్రతిమిలాడినా కదల్లేదు. మెదల్లేదు. విధ్యుక్త ధర్మం అనుకుంటున్న గుణం ఆమెను యీసారి కదిలించలేకపోయింది. ఆ రోజు ఆమెను కదిలించ ప్రయత్నించిన వాళ్ళందరికీ నిరాశే మిగిలింది.

సాయంత్రానికి ఆమె ఉబ్బరించి పోయిన ముఖంతో ఒకసారి లేచి, అద్దంలో తన ప్రతిరూపం చూసుకుని, మళ్ళీపోయి పడుకుంది.

మరునాడు ఉదయం ఆమె లేచి స్నానం చేసింది. ముఖం యింకా కళావిహీనంగానే వుంది. ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడలేదు. తరువాత టాక్సీలో ముకుందరావును చూడటానికి పోయింది.

నౌఖరు ఎదురుగావచ్చి "అయ్యగారు యింకా నిద్ర లేవలేదమ్మగారూ" అన్నాడు.

"లేపు. నేను వచ్చానని చెప్పు."

వాడు తెల్లబోయి, కొంచం సంకోచించి యిహ విధిలేక లోపలకు వెళ్ళిపోయాడు. పావుగంటసేపు ఆమె అలాగే మౌనంగా కూర్చోవలసి వచ్చింది. తర్వాత ముకుందరావు లోపలనుంచి, చంటిపిల్లాడులా నడిచి వచ్చాడు. అతనికళ్ళు ఎర్రగా జ్యోతుల్లా వున్నాయి. అవి పూర్తి నిరాశాజ్యోతులు. మాట్లాడకుండా ఆమె ఎదురుగా కూర్చున్నాడు.

రెండు నిమిషాలు యిద్దరిలో ఎవరూ పెదవులు కదపలేదు.

చివరకు అతనే బలవంతంమీద అన్నాడు "మాలతి చచ్చిపోయి అయిదురోజు లయింది."

విశాల మాట్లాడేందుకు ప్రయత్నించటం లేదు. తలవంచుకు కూర్చుంది.

ఇద్దరిలోనూ ఎవరూ మాట్లాడేస్థితిలో లేరు. సంభాషణ జరగటం ఎలా? ఈలోగా నౌకరు కాఫీ తెచ్చి బల్లమీద పెట్టి వెళ్ళిపోయాడు. కొంతసేపటిదాకా కాఫీ తీసుకునేందుకు ఎవరూ ప్రయత్నించలేదు. అనాలనిపించికాదు గాని, అవసరం అనిపించి విశాల అనేసింది "కాఫీ తీసుకోండి. చల్లారిపోతుంది" తరువాత నాలిక కొరుక్కుంది. మాటలు ఆమెకే ఎలాగో ధ్వనించాయి.

ముకుందరావు ముఖం ఎత్తి, ఆమెవంక పాడిగా చూసి, కాఫీకప్పు చేతుల్లోకి తీసుకుని అన్నాడు, "మీరూ తీసుకోండి."

విశాల తీసుకుంది. కాఫీ త్రాగుతున్నారే కాని ఎవరికీ మాటలురావు. ఏం చెయ్యటమో ఆమెకు పాలుపోవటం లేదు. తను ఏమి చెబుదామని యిక్కడికి వచ్చిందో గుర్తుకు రావటం లేదు.

"మిమ్మల్ని చాలా అడిగానని చెప్పమంది."

జవాబు యివ్వలేక పోయింది యీసారి కూడా ఆమె.

"మిమ్మల్ని క్షమించమని కోరుకుంటున్నానని చెప్పమంది?"

క్షమించమందా? ఎందుకు? త్వర త్వరగా ఆమెకు మాలతికీ తనకూ ఆనాడు జరిగిన సంభాషణ అంతా జ్ఞప్తికివచ్చింది. ముకుందరావు వంక చూసింది. విరాగిలా, యోగిలా వున్నాడు. అతన్ని చూస్తే చెయ్యెత్తి నమస్కరించ బుద్ధి వేస్తోంది. "ఎంత పని చేశావు మాలతీ" అనుకుంది.

ఎంతసేపు యీ మౌనం! తనయిక్కడికి ఏదృఢ నిశ్చయంతో వచ్చింది? మళ్ళీ అవన్నీ గుర్తుకు వస్తున్నాయి. రహస్యాన్ని మనసులో దాచి పెట్టుకునే శక్తి తనకు లేదు.

తనని మాలతి కోరిన సహాయం చేయవలసిన సమయం దగ్గరకు వచ్చింది. ఈ తరుణంలో తప్ప అటువంటి వాక్యాలు పెదవులుదాటి బయటకు రావు. కనీసం పెదవులవరకైనా వచ్చే నమ్మకం లేదు. ఇదే మంచి అదను.

"మాలతి మీతో యింకేమైనా చెప్పిందా?"

"ఆఁ"

"ఏమిటి?" కుతూహలం ఆపుకోలేక పోతోంది. ఈ విషయం అతనికి కూడ తెలుసునా?

అతను ఒకసారి సూటిగా ఆమె ముఖంలోకి చూశాడు. ఏదో చెప్పబోయి, చేతకాక, తలవంచుకుని, ఏదో తోచి, మళ్ళీ తలఎత్తి యిలా పలికాడు:

"నా...నా...పెళ్లి విషయం"

విశాల ఊపిరి బిగపట్టింది. ఈ స్థితిలో అతని మొహం తాను ఎలా చూడ గలుగుతోంది?

"ఏ.. ఏ...మంది?"

ఉన్నట్టుండి అతను విషాదం గానవ్వాడు. నాతో అమె అయిదు సంవత్సరాలు గడిపింది. కాని నా గురించి కొంచమైనా అర్థం చేసుకోలేక పోయిందని మొన్న తెలిసింది"

ఏమిటి అతను అనేది? తన నిశ్చయం, త్యాగం, ఊహు స్వార్థంలో త్యాగం, ఊహు త్యాగంలో స్వార్థం—అవన్నీ.......

"ఆమె అందికదా...మీరు...మీరు యింకెవర్నీ పెళ్లి చేసుకోకండి"

త్రుళ్ళి పడింది విశాల. ఏమిటి? మాలతి యిలా అందా?

ఆకస్మికంగా అతను ముఖం గంభీరంగా చేసి, కటువుగా నవ్వాడు. "ఎంత స్వార్థమో చూడండి. నేను యింకెవర్నీ పెళ్ళి చేసుకోకూడదుట. ఆమెని ఎంత ప్రేమించినా, ఆ స్వభావాన్ని నిందించకుండా ఉండలేను."

"విశాల యింకా, యింకా తెల్లబోతోంది. ఆమెలోని రక్తమంతా ఘనీభవించినట్లు అనుభూతి పొందుతోంది.

"ఆమె నన్ను ఎందుకు అరం చేసుకోలేదో నా కర్థం కావటం లేదు. అలా అని ఒట్టు కూడా వేయించుకుంది."

అతని గొంతు అపస్వరాలు పలుకుతోంది.

"నా హృదయంలో ఆమెకు తప్ప యింకొకరికి చోటు లేదని ఆమెకు తెలియదు."

విశాల ముఖం క్షణంలో మ్లానమైంది. మాలతి! తను ఆమెను అర్థం చేసుకోవటంలో పొరబడిందా? లేక ఆమె తనను అర్థం చేసుకోవటంలో పొరబడిందా? మరి ఆనాడు ఆమె తనతో అన్న మాటలు? ఆ ప్రార్థన ఆ వాగ్దానం; ఇంతలో యీమె మనసు మారి పోయిందా? ఇంత స్వార్థమా? స్త్రీ స్త్రీ స్త్రీ ఆమెకు పూర్తిగా దుఃఖమే వస్తోంది. తనూ స్త్రీయే. తన ఆత్మను ఆమె సర్వ నాశనం చేసింది. ఆ మాటలకు లోబడి తను స్వార్థానికి తలపడింది. త్యాగం చేయబోయింది. ఇష్టము లేని ఒక వ్యక్తికి ద్రోహం చేయ తలపెట్టింది. అన్నీ చేసింది. మనసు వున్న స్త్రీ చేయరాని పనులన్నీ చేసింది. ఏది స్వార్థం? ఏది త్యాగం? చివరకు యీ విచక్షణా జ్ఞానాన్ని కూడా విస్మరించింది. తనని మాలతి తనకు తెలియకుండానే అన్ని విధాలా సాధించింది. తన మనసు మీద స్వారీ చేసింది. చివరకు తనని ఎందుకూ పనికిరాని దానిగా చేసింది. తను దూరంగా తప్పుకుంది.

అధరాలు...ఆమె అధరాలు అదురుతున్నాయి. కన్నీళ్లు కారబోతున్నాయి.

కాని ఆ పరిస్థితి అంతటితోనే ఆగింది. హఠాత్తుగా ఆమె నేత్రాలు మెరిశాయి.

ఎందుకు యిందాకటినుంచి దుఃఖపడింది? ఏం జరిగిందసలు?

ఏమీ జరగలేదు. కొంచం మెలికలు. అంతే. క్రమక్రమంగా ఆమె వదన మండలాన్ని ఆవరించిన చీకటి ఛాయలు తొలగిపోయాయి. ఇప్పుడా వదనం తైలం లేని దీపంలా లేదు. లేచి, నిలబడి ముకుందరావు వంక చూసింది. అతను తల వంచుకు కూర్చున్నాడు. ఈ వ్యక్తితో కొన్ని నిమిషాలక్రితం ఏం మాట్లాడబోయిందతాను? సిగ్గుతో ఆమె సుందర వదనారవిందం సంధ్యారుణరాగ దీపితమైంది. కాని అది క్షణంసేపే. తరువాత ఏమీ శబ్దం చేయకుండా బయటకు నడిచి వచ్చేసింది.

బయట ఆమెకోసం యింకా టాక్సీ నిలబడే వుంది. విసురుగాపోయి కూలబడింది.

"థ్యాంక్యూ! థ్యాంక్యూ మాలతీ."

# ఋశ్యశృంగర్షి

## నన్నయ : విశ్వనాథ

శ్రీ కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి

ఋశ్యశృంగర్షి కథ రామాయణమునను న్నది. భారతమునను నున్నది. రామాయణమునకు ఋశ్యశృంగునితో గల దగ్గర తనము భారతమునకు లేదు. భారతమున ఋశ్యశృంగుని వృత్తాంతము ప్రాసంగికముగ చెప్పబడినది. రామాయణమున ప్రధాన కథా సంబంధిగా చెప్పబడినది. ఋశ్యశృంగుడు లేనిచో రామాయణము లేదు. అతడు లేకపోయినను భారత ముండును. రాముడు లేనిచో రామాయణము లేదు. దశరథుడు పుత్రకామేష్టి చేయనిచో రామావతార ముండెడు. ఋశ్యశృంగుడు లేనిచో పుత్రకామేష్టియే యుండెడు. మరొకరు ఋత్విజులుగా నుండిన ఇష్టి కాదాయనిన అగును. ఇష్టియగుట గాదు ముఖ్యము. దశరథు డెందువలన సంతానవంతు డగుట ముఖ్యము. ఇదియే ముఖ్యమైనచో ఆ యజ్ఞమును ఋశ్యశృంగుడే నిర్వహించవలయును. ఇది దేవ రహస్యము. కనుక నే ఇతడు లేనిచో రామాయణమే లేదని చెప్పుట. భారత కథావిధానము వేరు. కాలకర్మ ప్రభావములకు లోనైన ధర్మరాజు వనములందుండి, కాలము వెళ్లబుచ్చుకొనుటకు తనకు కనుపించిన బృహదశ్వ, నారద, రోమశ, మార్కండేయాదుల నేనేనికథలు చెప్పవలసినదిగా కోరును. ఉత్తమ పురుషుల కథలు, ధర్మసూక్ష్మములు వినుట ఉభయతారకమని వానిని వినిపింపవలసినదిగా కోరును. ఆ ఋషులు చెప్పుదురు. రోమశుడీ ఋశ్యశృంగుని కథను ధర్మరాజునకు చెప్పినాడు. అగస్త్యోదంతము, గంగావతరణము, హేమకూటమాహాత్మ్యము చెప్పుచు నడుమ నల్లదె ఋశ్యశృంగుడను ముని ప్రోదమని చెప్పినాడు. ధర్మరాజా కథ చెప్పవలసినదిగా కోరినాడు. రోమశుడు చెప్పినాడు. ధర్మజు డూకొట్టినాడు. అంతవరకే ఆ కథకు భారతమున గల ప్రాధాన్యము. భారతమున ప్రధానేతివృత్తము దీనివలన మారుటగాని—సాగుటగాని ఏమియు లేదు. కనుక నే ఋశ్యశృంగుడు లేకపోయినను భారత ముండు నని చెప్పుట.

వ్యాస వాల్మీకులతో నీ వ్యాసమునకు సంబంధము లేదు. భారతమును నన్నయ వ్రాసినాడు. రామాయణమును చాలమంది వ్రాసిరి. రంగనాథ, భాస్కర, రఘునాథులు ముఖ్యులు. నవ్యులలో నొకరు భారతమును, ఒకరు రామాయణమును వ్రాసిరి. భారత కర్తయైన నవ్యునితో మనకు నిమిత్తము లేదు. రామాయణకర్తయైన నవ్యుడు విశ్వనాథ. ఈయనచే వ్రాయబడిన ఋశ్యశృంగుని కథను వెనుకటి వారి కథలతో పోల్చి చూచి గుణ నిర్ణయము చేయుటకే వ్యాస ముద్దిష్టము. నన్నయ విశ్వనాథులను పోల్చుటయనగా రంగనాథాదులను సందర్భానుసారముగ పేర్కొనుచు పోల్చుటయని గ్రహింపవలయును. నన్నయతో విశ్వనాథకు తాదాత్మ్య మున్నది. పురా మహాకవు లందరితోడను నున్నది. ఇది మహాకవి లక్షణము. నన్నయ విద్యాదయితుడు. విశ్వనాథ కవితారూప తపస్సమాధి గతచేతస్కుడు. అతడు గాఢ ప్రతిభుడు. ఇతడు ప్రోవౌ సర్వ కవిత్వ మర్మవిదుడు. అతడు నానారుచిరార్థ సూక్తినిధి. ఇతడు బ్రాహ్మీమయమూర్తి. ప్రసన్న కథా కలితార్థయుక్తి నన్నయది. కథాకథన శిల్పానేక మార్గాభిరామ వేతృత్వము విశ్వనాథది. కనుక నే నన్నయతో విశ్వనాథను పోల్చి చూడవలసియున్నది. రంగనాథాదులు విశ్వనాథ వ్రాసిన ఒక్క కథను మాత్రమే గాక, ఆ గ్రంథమును సర్వమును వ్రాసిరి. పూర్వ రామాయణ కర్తలలో వారు శ్రేష్ఠులు. పూర్వ కవీంద్రుల కావ్యప్రపంచమును క్రాంత దర్శిత్వమున

దర్శించుట—పరిశీలించుట చేయగలవాడు కవియగుచో అతడు మహాకవియగును. విశ్వనాథ అట్టివాడు. కనుకనే వారితో పోల్చదగినవాడు. ఆ పోల్చుటకే ఋశ్యశృంగుని కథను గ్రహించుట.

నన్నయ ఈ కథను 29 గద్యపద్యములలో వ్రాసెను. రంగనాథుడు 83 ద్విపదలలో వ్రాసెను. భాస్కరుడు (మల్లికార్జునభట్టు) 32 గద్యపద్యములలో వ్రాసెను. రఘునాథుడు 110 గద్యపద్యములలో వ్రాసెను. విశ్వనాథ 54 గద్యపద్యములలో వ్రాసెను. అందరికంటెను తక్కువమాటలలో ఋశ్యశృంగుని ఉదంతమును చెప్పినది నన్నయ. ఋషులు ఎక్కువ యర్థమును తక్కువమాటలలో చెప్పుదురు. నన్నయ ఋషివంటివాడు. అదియునుగాక భారతమున నా కథ నంతకంటె యెక్కువమాటలలో చెప్పరాదు. ప్రాసంగికముగ వచ్చిన కథ యది. నాలుగైదు విషయముల నూహించుట కవకాశము కల్పించుచు నొక విషయమును చెప్పుట నన్నయ కథాకథనములోని యొక శిల్పము. కనుక, నన్నయ తక్కువగనే వ్రాయును. రఘునాథు డందరికంటెను ఎక్కువ మాటలలో వ్రాసెను. అతడు దక్షిణాంధ్ర యుగకవి. ఆ యుగమున వర్ణన లెక్కువ. వాచ్య మెక్కువ. వ్యంగ్య విభవ శిల్పము తక్కువ. కనుక రఘునాథు డట్లు వ్రాసెను. రంగనాథునికంటె మల్లికార్జునభట్టు ఉత్తమకవి. కథను స్వయంసంపూర్ణము చేసి కథన శిల్పమును ప్రదర్శించుటలో మల్లికార్జునభట్టుకంటె విశ్వనాథ గొప్పవాడు. ఈ విషయమున విశ్వనాథ నన్నయవంటివాడు. కనుకనే నన్నయ విశ్వనాథలను పోల్చవలసి వచ్చినది.

రామాయణమునకు ఋశ్యశృంగునకు త్రెంచరాని విడదీయరాని సంబంధమున్నది. వనములబడి యున్న ఋశ్యశృంగుని దేశములోనికి తెచ్చినవాడు రోమపాదుడు. ఒక హేతువును పురస్కరించుకొని తెచ్చినాడు. అనగా తెప్పించినాడనుట. ఆ హేతువును ముందు సుస్పష్టము చేయుట కథను స్వయంసంపూర్ణము చేయుట. ఆ పనిచేయుట రామాయణమున కొక క్రొత్త బిగువు దెచ్చుట. భారతమున నట్లు చేయనక్కరలేదు. సూచించిన చాలును. నన్నయ అట్లే చేసెను. విశ్వనాథ అవసరమును గ్రహించి బిగువు కూర్చెను. పూర్వ రామాయణ కర్తలలో ఒక్క రఘునాథుడు మాత్రము స్పష్టముగా నా హేతువును చిత్రించినాడు. అనావృష్టి హేతువు. తత్ఫలితమును వర్ణించుటవలన రఘునాథుని చిత్రణము రక్తికట్టినది. విశ్వనాథయు వర్ణించినాడు. రఘునాథుడా వర్ణనమునకు గీతమొకటి, కందమొకటి, సీసమొకటి వాడినాడు. విశ్వనాథ ఒక ఉత్పలము — ఒక సీసము వాడినాడు. ఇరువుర భావనయు దాదాపు నొకటిగనే యున్నది. భావన యొకటియైనను కథన శిల్పము భిన్నమగుటవలన విశ్వనాథది పైచేయియైనది. అనావృష్టియు, తత్ఫలితమును రోమపాదుడే పురోహిత బ్రాహ్మణులతో చెప్పినట్లుగా వర్ణించినాడు రఘునాథుడు. సుమంత్రుడు దశరథునకు చెప్పినట్లుగా వర్ణించినాడు విశ్వనాథ. ఇందొక విశేషమున్నది. పురోహిత బ్రాహ్మణులకు అనావృష్టియు, తత్ఫలితమును తెలియును. తెలిసినవారికి తిరిగి విషయమును వివరించుటలో వాస్తవికత యుండిన నుండవచ్చును గాని శిల్పము లేదు. అనావృష్టి వలని ఫలితములు దశరథునకు మాత్రము తెలియవా? అట్టిచో సుమంత్రుడు దశరథునకు చెప్పినట్లుగా వర్ణించుటలో మాత్రము విశేష మేమి? అని అడుగవచ్చును. నిజమే. కనులముందు జరుగుచున్న విషయమును వివరించుటలోకంటె, తెలిసినదయినను ఎన్నడో జరిగిన విషయమును చెప్పుటలో నొక విశేషమున్నది గదా? దానినే విశ్వనాథ సాధించినాడు. ఇది మాత్రమేగాక మరొక రమణీయమైన కల్పన చేయుటవలన విశ్వనాథదైన పైచేయి సవిశేషమైనది. ధర్మము రాజానుమతము. ధర్మహానివలన అనావృష్టియైనది. తత్ఫలిత మెంతవరకు పోయినదనగా 'పాడియావుల చన్నులుపట నెత్తురు ధార లోడు' వరకు పోయినది. అధర్మవిజయమును సూచించుటకు భారతీయుల కింతకంటె కొలమానము లేదు. నాలుగైదు దినము లన్నము లేకపోయినను భారతీయాత్మ నిమ్మళముగనే యుండును. గోవు లేమాత్రము స్వస్థములైనను అది కలగుండు గొనును. హాహారవము చేయును. అంగదేశ ప్రజాహృదయ మట్లు చేసినది. రాజు మొగసాల నిలచి చేసినది. అపుడు రాజేమి చేయును? చేయవలయును? అనావృష్టి అంతకు పూర్వము చాలకాలమునుండియు నున్నది. తన్నివారణోపాయము రోమపాదు డాలోచించుచునే యున్నాడు. అనావృష్టివలని ఫలితములను ప్రజలనుభవించుచునే యున్నారు. సహించుచునే యున్నారు. ఆవులు నెత్తురు లోడుటతో, కలతపడి ప్రజా హృదయము

హాహాకారము చేసినది. దానిని రాజు చూచినాడు. మాటాడలేక పోయినాడు. దైన్యము వేయి మానవాకృతులతో ప్రత్యక్షమైనట్లున్న ఆ ప్రజా సమూహమును చూచి రాజును దైన్యపడినాడు. ఏడ్చుచు వారిని చేవసరి పంపినాడు. పురోహితులను మంత్రులను కనుగొని 'పాప మెవ్వరిది. వికృతపు బాములు ప్రజలకు. ఈ యనావృష్టికే ప్రాయశ్చిత్తమో చెప్పుడు. అదియును శీఘ్రమేను గావించెదను' అని ప్రలాపించుచు నడిగినాడు. అతఁడు పూర్వ మట్లు వారి నడుగలేదు. అడుగకపోయినను చెప్పవచ్చును గదా యనిన ఆ మార్గము దుర్ఘటమనియు, చేయ నసాధ్యమనియు వారు చెప్పలేదు. ప్రస్తుతము రాజు ఆ ప్రాయశ్చిత్త మెట్టి దుర్ఘటమును, అసాధ్యమును, నైనను చేయుటకు నిశ్చయించుకొనినాడు. నిశ్చయము వ్యక్తమైనది. ద్విజులు మార్గము నుపదేశించినారు. రోమపాదునిగూర్చి యింత వ్రాయుట కథను స్వయం సంపూర్ణము చేయుట. నన్నయ భారతమున నెంత వ్రాయుట అవసరమో అంత వ్రాసినాడు. విశ్వనాథ రామాయణమున నెంత వ్రాయుట అవసరమో అంత వ్రాసినాడు. భారతమున ఋశ్యశృంగునకే ప్రవేశమున్నది గాని రోమపాదునకు లేదు. కనుక నన్నయ ఒక గీతము, మూడు పాదముల వచనముతో రోమపాదుని స్థితిని యెరుకపరచి వదలినాడు. భాస్కర రంగనాథులకంటె రామాయణ కథా హృదయమును రఘునాథుడు కొంచ మధికముగా నర్థము చేసికొనినాడు కాని, తరచు అనౌచిత్యమునకు పాలుపడుట హేతువుగా వారి ముందు నిలువజాలక పోయినాడు. అనౌచిత్యములను సాధ్యమైనంతవరకు పరిహరించుచు, గాఢమైన ప్రతిభ కలిగి, రామాయణకావ్యాత్మతో పూర్వులకంటె అధికముగా తాదాత్మ్యమును చెందుటకు శక్తుడైన విశ్వనాథ ఇంతవరకు వచ్చిన రామాయణకర్తలలో శ్రేష్ఠుడు. రంగనాథుడు భాస్కరునకు చాలడు. రఘునాథ రామాయణమంతయు లభింపక పోవుట, లభించినదానిలో అనౌచిత్యపుపాలధికముగా నుండుట కారణములుగా రఘునాథుడు పై వారికి తీసికట్టు. పూర్వ రామాయణములలో ఒక్క భాస్కర రామాయణమే విశ్వనాథ రామాయణముతో పోల్చుకొనుటకు శక్తమైనది. కథా కథనమునను, పాత్రచిత్రణమునను - మనస్తత్త్వ నిరూపణమునను విశ్వనాథ కుశలుడగుటవలన తరచు భాస్కరునికంటె పైచేయిగా కనుపించును.

అనావృష్టికోపము నుపశమించు మార్గమును ద్విజులు రోమపాదునకు చెప్పిరి. ఋశ్యశృంగర్షి అంగదేశమున అడుగిడినచో వర్షము కురియునని చెప్పిరి. ఆ మాట విని రాజు 'మీరు వేగపడి మునిపుంగవుఁ దెండు' అనినాడనియు, 'ఏము చాల నప్పరము తపోధనోత్తముని పాలికిఁ గాంతలఁ బంపు' మని వారు ప్రత్యుత్తర మిచ్చినారనియు, అంత జనపతి వారస్త్రీలను రావించి 'మీరు చతురతతోడం జని ఋశ్యశృంగుఁ గొనిరండు' అనినాడనియు భాస్కరుడు వ్రాసినాడు. 'మునినాథు నగరి కేరీతి రావింతునని విచారము చేసి మంత్రులఁ బిలచి మునులను రప్పించి యడుగ 'వారకాంతలఁ బంపు' డని వారు చెప్పినట్లును తరువాత రాజు వారస్త్రీలను పిలచి చెప్పి పంపినాడనియు రంగనాథుడు వ్రాసినాడు. రఘునాథుడు భాస్కరునివలెనె వ్రాసినాడు. బ్రాహ్మణులవలన విషయము నెరిగి బుద్ధిమంతులతో విచారించి విదగ్ధ వేశ్యాంగనలను బిలువనంపి, చెప్పి, పంపినట్లు నన్నయ వ్రాసినాడు. అందరును వేశ్యలనే పంపించిరి. విశ్వనాథయు వేశ్యలనే పంపెను. ఉచితమును చమత్కారమును నైన నొకకల్పన చేసి పంపెను. మంత్రులతో విచారించి యదికాదని యిది కాదని పెక్కు ఆలోచనలు త్రోసిపుచ్చి దారి తోఁచకయున్న సమయమున వింజామరలు వీచు వారయువతులు నలువురు తమలోతాము కన్గిలుపుకొని ప్రభువులు తాంబూలంబు దయసేయించినచో పోయి ఆ ఋశ్యశృంగుని దెత్తుమనిరి. రాజు వారిని పంపెను. ఇట్లు సన్నివేశమును కల్పించుటలో విశేషమున్నది. ఋశ్యశృంగుని వృత్తాంతమును పురోహితులు రాజునకు చెప్పుచుండగా వారస్త్రీలు వినినారు. అతడు స్త్రీ పురుష భేదము నెరుగనివాడని వారి మాటల వలన వ్యక్తమైనది. అట్టి వానిని చూడవలయునన్న ఒక ఉబలాటము కలుగుట తగును. వారకాంతల కది కలిగినది. అతనిని చూచి వచ్చుట రాజుగారి ప్రయోజనమును చేయుటగాదు. అతనిని గొని తేరవలయును. స్త్రీ స్పర్శ నెరుగక ముక్కు మూసికొని యున్నవారి నెందరనో తమజాతి వెంట బడి తిరుగునట్లు చేసికొనలేదు? అట్టి వారిని వశము చేసికొనుట యనునది వారస్త్రీ జాతికి గౌరవాపాదకమే యగును. అది వారి జాణతనమునకు, రాసిక్యమునకును నిదర్శనము. అట్టిచో స్త్రీ పురుష భేద మెరుగని వానిని వశము చేసికొని వెంట పడవేసి

కొనుట తమ జాతిలో తమ్ము తామున్నతస్థితిలో నుంచుకొనుట. అందులకు వారుత్సహించిరి." 'అతనికి లోకమే తెలియదు. స్త్రీ పురుష భేదము కూడ నెఱుంగడు' అని పురోహితులు రాజుతో చెప్పినప్పుడే వారి కాయుత్సాహము కలిగినది. తరువాత మంత్రులతో నాలోచించి ఆలోచించి 'అనావృష్టిచేఁ జేసి యున్ మృత్యువు వద్ద నుండియు మునిం జేరన్ భయంబంట' అని రాజు ఒక దీర్ఘ నిశ్వాసము విడచు వరకు, వారస్త్రీల యుత్సాహము ద్విగుణమై త్రిగుణమై లోపల నిముడక హృదయమును భేదించుకొని వచ్చునంత యైనది. అట్లే వచ్చినది. ఇంత యుత్సాహము, పట్టుదల పూర్వ రామాయణములలోని వేశ్యలకు లేదు. ఉండుట కవకాశము లేదు కనుక లేదు. రాజు వేశ్యలను పిలిపించి చెప్పి పంపుటకంటె వారే ముందుకు వచ్చి తాము పోయి తెచ్చెదమనుటలో గుణమున్నది. క్రొత్తగా రాజుచేత పిలిపింపబడి వచ్చిన వారికి ఋశ్యశృంగుని యుదంతము తెలియదు. రాజుగాని, తదితరులుగాని వారి కాతని విషయము చెప్పినట్లు పూర్వరామాయణ కర్తలు వ్రాయలేదు. అందువలన పూర్వ రామాయణములలోని వేశ్యలు ఋశ్యశృంగుని యాశ్రమ ప్రాంతములకు వెళ్లుట—ఋశ్యశృంగుని గుర్తించుట — ఇత్యాదులెట్లు పొసగినవను ప్రశ్నములకు సమాధానములంత తృప్తికరముగా నిచ్చుటకు వీలుపడదు. భాస్కరుడు మాత్రము చమత్కరించి ఒక సమాధానమును చెప్పినాడు. ఋశ్యశృంగుడు మెలగెడు వృక్షవాటి చెంతల వారస్త్రీలు నిలిచి యున్న సమయమున నొక ఋషి యటవచ్చిన 'ఓ మునిపుత్ర యేల యొక్కరుఁడవుఁ జొచ్చి యీ విజన కాననభూమిఁ జరించెద' వని వారడిగినట్లును దానికి సమాధానముగా నతడు ఋశ్యశృంగుడనువాడ నని తన యుదంతము చెప్పినాడట. అందువలన వేశ్యలు తమ కౌశలమును జూపుట కుపక్రమించినారట. ఇది భాస్కరుని కల్పన. రంగనాథునకీ సందేహము కలుగలేదు. సమాధానము వ్రాయలేదు. రఘునాథుని వేశ్యలు సుపరిచితమైన స్థలమును ప్రవేశించినట్లు ఋశ్యశృంగుని యాశ్రమమును ప్రవేశించిరి. తప్పటడుగులు వేయుటలో రంగనాథ, రఘునాథు లొకరినొకరు మించిరి. నన్నయ తానొక చమత్కారము చేసెను. తాను పంపిన విదగ్ధ వేశ్యాంగనలలో నొక జరద్వేశ్యను గూడ నుంచెను. అది ఆరితేరిన గడుసరి. విభాండకుడు వన్యఫలాహరణార్థము వనమున కరిగిన యవసరము గుర్తించి అభినవయౌవన విలాస విభాసిని యైన తన కూతు నామునిపుత్రునిపాలికి పంపినదట. ఇది నన్నయ పద్ధతి. విశ్వనాథుని వేశ్యలు ఋశ్యశృంగుని కథను వినిరి. కావలెనని విశ్వనాథ వినిపింపలేదు. అట్లు కలిసి వచ్చినది. 'ఆ జనకుండు పుత్త్రవిరహంబు సహింపఁడు. విభాండకుఁడు మొఱఁగి రావలె. లేవలెఁ గుఱ్ఱవాని' ననుమాటలను గూడ వారు వినిరి. కనుక జాగరూకులగై తాము మెలగవలసి యున్నదను విషయము విశ్వనాథ రామాయణములోని వేశ్యలకు తెలియును. కనుక నే వారు 'విభాండకుని యాశ్రమంబున కుపల్లయము ప్రవేశంబున బంధ్గు దిగియందు విడిసి' ఋశ్యశృంగుని రాకకై ఎదురుతెన్నులు చూచుచుండిరి. ఒకనాడు ఋశ్యశృంగుడు వచ్చినాడు.

రంగనాథ, రఘునాథుల వేశ్యలకు విభాండకుని గూర్చిన జ్ఞానమున్నట్లే లేదు. విభాండకుని యాలోచన లేక యాశ్రమమును ప్రవేశించుటవలన సమయమున కతడచట నే యున్నచో శపింపకపోడు. అప్పుడు వారు వచ్చిన కార్యము సాధ్యము గాదు. స్త్రీలను స్త్రీలుగా గుర్తించగల జ్ఞానము విభాండకున కున్నది. కనుక అతడున్నచో కుపితుడై శపించుట యనివార్యము. ఋశ్య శృంగుడని తెలిసికొనినతరువాత నే భాస్కరుని వేశ్యలు ప్రసంగమునకు దిగిరి. కనుక ఇట విభాండకుని శాపప్రసక్తి లేదు. నన్నయగారి జరద్వేశ్య, విభాండకుడు లేని సమయము చూచి, తనకూతు నా ఋష్యశృంగుని పాలికి పంపినది. విశ్వనాథుని వేశ్యల నుల్లయము ప్రవేశమున నుంచినాడు. అటు నిటు తిరుగాడుచు ఋష్యశృంగు డటకు రావచ్చును. విభాండకుడు గూడ రావచ్చును గదా? అట్టిచో నాతడు వారిని శపింపక పోవునా యనిన, దూరముగా నున్న వారిని, పాంథులను, స్త్రీలను, అతడూరక యేల శపించును? అతడు వచ్చినపుడు వీరు హావభావ విలాసము లేల ప్రదర్శింతురు? ఋష్యశృంగుడు వచ్చినపుడు తామవన్నియు ప్రదర్శింపవలయునుగదా, అతనిని గుర్తుపట్టుట ఎట్లు? అతని కథ వారికి తెలియునుగదా? అతనికి స్త్రీపురుష భేదజ్ఞానము లేదు. తనకంటె భిన్నమైన యాకృతి ప్రవృత్తి కలిగి తనవలెనె యున్నవారు కనిపించినచో

మానిసి ఎంత వింతగా చూచును. ఆవింతదనము, ఋష్యశృంగు డటకు వచ్చినపుడు కప్పిపుచ్చుకొనలేడు. దానినిబట్టియే గ్రహింపవచ్చును. విభాండకున కట్టి ప్రవృత్తి యుండెను. కనుకనే వేశ్యలుల్లయు ప్రదేశమున దగినారని విశ్వనాథ వ్రాయుట.

యవ్వనాగమనంబున నొకనాడు ఋష్యశృంగుడు వేశ్యలు విడిసియున్న కాంతారాభిముఖుడై వచ్చినాడు. వారు చూచిరి వీణయు, మృదంగమును, తాళములను మ్రోయించిరి. నాయకురాలు గొంతెత్తి కృతులు వర్ణములు పాడినది. వేశ్యలు గానము చేసినట్లు రంగనాథుడు, భాస్కరుడు వ్రాసిరి. రఘునాథుడట్లు వ్రాయలేదు. నన్నయ, ఋష్యశృంగుని చేరిన వేశ్య 'మునిముందటఁ గందుక నర్తన మృదుగీతములయందుఁ దన కౌశలమెల్లను జూపి, విరచితాలింగనయై, మునిపతికి ముదము గావించె'నని వ్రాసినాడు. విశ్వనాథ, భరతశాస్త్ర సరణిని పాడిన ఆ పాటలు వినిన ఋష్యశృంగునిలో కలిగిన అంతరంగములయిన మార్పులను వర్ణించెను. ఇది పూర్వకవులెవ్వరును చేయని పని. మానవజీవితముపై గానకళాప్రభావమెంత యుండునో ఈ ఘట్టమున విశ్వనాథ నిరూపించినాడు. సంగీతము మానవుని ఎంత చైతన్యవంతునిగా చేయగలదో అంత చేసిన దా వేశ్యల సంగీత మాఋష్యశృంగుని. గానము చేసినారని చెప్పుటలో లేదు గొప్పతనము. దాని ప్రభావమును, తత్ఫలితమును చెప్పగలుగుటలో నున్నది. అదియే విశ్వనాథ చెప్పినాడు. ఆ గానము వినుచున్న ఋష్యశృంగునకు "తన యాత్మఁ దానెఱుంగని యొక్క యానందపరిధి రేఖాస్వయం వ్యక్తి కలిగి మైగగుర్పొడిచి వెనుకటి బిగువు చెడి శ్రోత్ర బిగువులను దెచ్చుకొనె'నట. కనులు విచ్చి చూచుచు నిలువబడిపోయినాడు ఋశ్యశృంగుడు. అంత వారు నృత్యము చేసిరి. నాలుగంబుధులవోలె చేసిరి. నర్తన కళాప్రదర్శనమునుగూడ చేసినారనిమాత్రము రంగనాథుడు వ్రాసినాడు. కేవలము నర్తనము చేసినారని గాక ఎట్లు చేసినదియు విశ్వనాథ వ్రాసినాడు. నాట్యశాస్త్రముతో వానికిగల పరిచయమున కిది నిదర్శనము. ఉచితస్థలమున శాస్త్రపాండిత్యమును ప్రదర్శించుటను మహాకవులు చేయుదురు. విశ్వనాథ ఆ కోవలోనివాడు. సంగీతమును, నృత్యమును, విని విని, చూచి చూచి కనువేదుఱు తీరఁగ వారిఁ జేరినాడు ఋశ్యశృంగుడు. కనులు చెవులు సుతరితముగా నొనరించినారని వారల పొగడి, ఆనందాతిశయమున వారిని అలవల్లన స్పృశించి కౌగిలించుకొనినాడు. ఒక తెలియరాని సుఖానుభూతికి లోనయినాడు. పూర్వ రామాయణములలో కౌగిలి ప్రసక్తి లేదు. 'ఒడలెంతయుఁ బులకింపఁగఁ పుడికి' నారని మాత్రము వేశ్యలనుగూర్చి భాస్కరుడు వ్రాసెను. ఆలింగనప్రస్తావన భారతమున నున్నది. భాస్కరుడు-మఱునాడు వచ్చినపుడు వేశ్యలు వానిని పలుమాఱు కౌగిలించుకొనినా రనినాడు. నన్నయ విశ్వనాథ లిరువురును మొదటినాడే కౌగిలింతలు జరిపించిరి. నన్నయ ఋశ్యశృంగుని వేశ్యయే కౌగిలించుకొన్నది. విశ్వనాథ ఋశ్యశృంగుడు తానే వేశ్యలను కౌగిలించుకొనెను. ఈ విషయమున నన్నయ విశ్వనాథలకు భేదమున్నది. నన్నయ సంయమనమున కిచ్చిన ప్రాధాన్యము కళాప్రభావమున కీయలేదు. విశ్వనాథ కళాప్రభావము సంయమనమును లోగొనగలదని నిరూపించినాడు. నన్నయ వ్రాసినది కావ్యముగాదు. కావ్యత్వము నిముడ్చుకొనిన ఇతిహాసము. విశ్వనాథ వ్రాసినది ఇతిహాసము గాదు. ఇతిహాసరేఖల నిముడ్చుకొనిన కావ్యము. ఇది సర్వమును రసపర్యవసితము కావలయును. అందుకే నర్తన కళాసంగీతతతులను, వాని యాథార్థ్య స్వరూపమును చిత్రించినాడు విశ్వనాథ. భారతమున సంయమనమునకు ప్రాధాన్యమున్నది కనుకనే, తరువాత విభాండకునితో ఋశ్యశృంగుడు జరిగిన వృత్తాంతమంతయు పూసగ్రుచ్చినట్లు తూచా తప్పకుండ చెప్పినట్లు నన్నయ వ్రాసినాడు. రామాయణ కర్త లెవరును ఈ పని చేయలేదు. చేయగూడదు గనుక చేయలేదు. చేయవలయును గనుక నన్నయ చేసినాడు. భారతములోని ఋశ్యశృంగునకు వేశ్య చూపిన కందుక నర్తన మృదుగీతములయందలి కౌశలమువలన ముదముగలిగినది. రామాయణమునందలి ఋశ్యశృంగునకు తన యాత్మఁ దానెఱుగని ఒక ఆనందము కలిగినది. ముదమునకంటె ఆనందము గొప్పది. ఆనందము కలిగినది గనుకనే విశ్వనాథ ఋశ్యశృంగుడు వారిని తానుగా కౌగలించుకొనినాడు. భారతమున నన్నయ ఋశ్యశృంగర్షియందు నిగ్రహమును పరాకాష్ఠలో చూపినాడు. తన కౌశలము చూపి, విరచితాలింగనయై గాని భారతమున వేశ్య మునిపతికి ముదము గావించలేకపోయినది. అధికనిష్ఠాశీలుడైన ఋశ్య

శృంగుని స్థితి భారతమున నన్నయ అట్లు చూపినాడు. వేశ్యలను ఋషి కుమారులనియే రెండు గ్రంథములలోని ఋశ్యశృంగుడును తలచినాడు. కనుక రెండింటియందును కామవాంఛ రేఖా మాత్రముగానైనను వాని హృదయమున పొడగట్టలేదు. కళా ప్రభావమునకు లొంగిన వానిగా చిత్రించుట మూలముగా, కొందరు ఋశ్యశృంగునకు వేశ్యలయందు కామిక మేర్పడినదని తలతురేమోనని విశ్వనాథ, అంతగా వ్రాసియు చివరకు 'అసమశరుడు లొంగిపోడు ముని ఋశ్యశృంగువంక' అని స్పష్టము చేసినాడు. అంత యానందమును గూర్చిన వారి యాశ్రమ భూములోకములు మాకు వలయునన్న సాత్త్వికపు కోరిక మాత్రము కలిగినది ఋశ్యశృంగున కని విశ్వనాథ వ్రాసినాడు. చదురెంచిన 'తరుణి మునినందను చిత్తంబునకు వైకృతము జేసె'నని మాత్రము నన్నయ వ్రాసెను. మఱునాడు ఋష్యశృంగుడు వారి వద్దకేగెను. పోదమా యనిన పోదము పోదుమనుచు నందరును కదలి అందరును అంగదేశము చేరిరి. అంతట వర్షము కురిసెను. అదివర కేమియు తెలియని ముని కుమారుడు అంగదేశ ప్రవేశమాత్రమున సర్వమును గ్రహించెను. సమాజబోద్ధలు నిశ్చితతత్త్వమానసులని విశ్వనాథ సమర్థన. నన్నయకూడ తన భారతమున నొక విషయమును సమర్థించినాడు. అది విశ్వనాథ సమర్థించిన దానికంటె భిన్నము. వేశ్యను మఱునాడు ఋష్యశృంగు డనుసరించుటను 'విలాసినుల సహాలాప సహాసన సహయానములు బంధనములు' అను సిద్ధాంతమును చూపి సమర్థించినాడు. ఇనుపకచ్చడాలు కట్టుకొనిన మునులను కూడ స్త్రీలమెయితావు గగుర్పొడించును. ఇక సామాన్యుల విషయము చెప్పవలసిన దేమి? అను విషయమును నిరూపించుటయే నన్నయ యుద్దేశము. తపస్సమాధిగతి చేతస్కృత మానవుని అత్యున్నత స్థానమున నిలుపగలదని వైదికమైన యభిప్రాయము. వేద తుల్యమైన భారతమును వ్రాయు నన్నయ కున్నదియు నదియే. 'సచ్చరిత్రంబైన తన యాశ్రమంబు విడిచి మనుష్యయోగంబునం దగిలి యకార్యమలి పిఱుందన చని'యెనని ఋశ్యశృంగుని గూర్చి నన్నయ వ్రాయుటలో నర్థమదియే. వాస్తవమును చెప్పి అవసరమును నన్నయ సూచించినాడు. ఆ సూచనకే ఋశ్యశృంగుని కథను వ్రాసినాడు. ఋశ్యశృంగుని పట్ల పాఠకునూహించిన వాస్తవిక విషయమే రామాయణమునకు ముఖ్యము. సాంసారిక విషయ పరిజ్ఞానము ఋశ్యశృంగునకు కలిగినట్లు వ్రాయ వలసిన యవసరము భారతకర్తకు లేదు. ఆత్మసంయమనమును నిరంతరమును ఈషణత్రయము ఖేదించుటకే చూచుచుందురు. కనీస మాజ్ఞానము లేని వానిని గూడ అవి లోగొనునని వ్రాయుట భారతకర్త చేయవలసిన పని. దానినే నన్నయ చేసినాడు. సాంసిద్ధికమైన సాంసారిక విషయ పరిజ్ఞానము కలుగుటయే రామాయణమునకు కావలయును. ఋశ్యశృంగున కది కలిగినది. దానిని విశ్వనాథ సమర్థించినాడు. ఏ చిత్తస్థలమున దేనిని సమర్థించుట యవసరమో దానిని సమర్థించుట మేధావంతులు చేయగలరు. నన్నయ విశ్వనాథ లట్టి వారు. ఋశ్యశృంగుని ప్రవేశపెట్టినప్పటినుండియు నన్నయ నిగ్రహము వైపునకు ములు సూపించుచు నడిపించి నడిపించి చివరకు 'విలాసినుల... బంధనములు గాన' అను సూత్రమును వ్రాసి ఋష్యశృంగుని వేశ్యవెంట పంపినాడు. విశ్వనాథ ఋశ్యశృంగుడు గానమును వినుటకు ప్రారంభించినప్పటినుండియు ఆ మహర్షిలో ఎక్కడనో, అందని లోతులందు, అంకురింపకయే చితికిపోయిన భావసముదాయము, ప్రాణము పోసికొని మెల్లదిగా పైకి వచ్చి, చివరికొక క్రొత్త బిగువు కూర్చుకొని, పూర్వ మననుభూతమైన ఒక ఆనందానుభూతిని అతనికి కలిగించినట్లుగా వ్రాసి, తరువాత నతడు వారిని కౌగిలించుకొని మాటాడి, వారిచ్చిన భక్ష్యముల నారగించి, తరువాత తన యాశ్రమమునకు పోయి 'దినదినము నారేయును వారలఁ గూర్చి యూహ లూహించుచు ప్రొద్దున లేచి' వేశ్యలున్న చోటకు వచ్చి వారితో కలిసి అంగదేశమునకు వచ్చినట్లు వ్రాసినాడు. నన్నయ ఋశ్యశృంగుని నొక మార్గమున నడిపించినాడు. విశ్వనాథ మఱొకట నడిపించినాడు. నన్నయ దృష్టి సంయమనము మీద విశ్వనాథ సృష్టి సంసారము మీద. భారతమునకు నన్నయ యవసరము. రామాయణమునకు విశ్వనాథ యవసరము. ఋశ్యశృంగుని సంసారము వైపు త్రిప్పుటకు విశ్వనాథ సంగీతమును సాధనముగా వాడినాడు. సంగీత శ్రవణ మాత్రమున మహర్షి యట్లు బిగువు చెడి లోబడునా యని ప్రశ్న. అట్లయినచో నాతని మహర్షిత్వము కుంటుపడిన యట్లగుగదా? కొంచము కుంటు పడవలయును. అట్లు పడినపుడే భారత రామాయణ కర్తల నిరూపణము రక్తి గట్టును. సంగీత మట్టి ప్రభావ

మను చూపగలదని తులసీదాసు కూడ వ్రాసినాడు. సీతా రాముల కల్యాణసమయము నందలి గాన కళా ప్రదర్శనమునకు మహర్షులు, ధ్యానముద్ర విడిచి ఒక ఆనందము ననుభవించిరని తులసీదాసు వ్రాసినాడు. మహర్షుల తపోభంగము చేయుటకు వచ్చిన స్త్రీ జనము గానకళా నర్తన ప్రదర్శనము మునుముందు చేసినట్లుగనే మన పూర్వ గ్రంథములు చెప్పుచున్నవి. కనుక గానకళకు సంయమి లోబడుట వింత గాదు.

విశ్వనాథ ప్రదర్శించిన కథాకథన శిల్పమును పూర్వులతో పోల్చి స్థూలముగ పైన నిరూపించితిని. ఋష్య శృంగ పాత్ర విషయమున నన్నయ విశ్వనాథుల కున్న దృష్టిభేదమును గూడ కొంత వ్రాసితిని. నన్నయ విశ్వనాథులలో నున్న ఈ రెండు విశేషములు భాస్కరాదులలో లేవు. నన్నయకు లేని యవసరము విశ్వనాథ కున్నందున కథను స్వయంసంపూర్ణము చేసినాడీతడు. ఆ చేయుటలో రోమపాదుని పూర్తి మూర్తిని చిత్రించుట యొకటిగా వెనుక నిరూపించితిని. ఇక వేశ్యల పాత్రము లున్నవి. వారి విషయము వ్రాసిన గాని ఈ వ్యాసము సంపూర్ణము గాదు.

విశ్వనాథ, రాజునకు వింజామరలు వీచుచున్న వేశ్యలతో రంగము ప్రారంభించెను. వారు నలువురు. కుసుమ శరకోదండ లస్తకమధ్యలు, తత్కార్ముక భ్రూయుగలు, తజ్జ్యాతనూలతలు—అను వారయువతులు నలువురని వ్రాసినాడు. నలువురకును మూడు విశేషణములు వాడినాడు. నలువురకును నాలుగు వాడవచ్చును గదా—వాడలేదు. అందరి మధ్యములు, అందరి భ్రూవల్లులు, అందరి తనూలతలు కూడ కుసుమశరకోదండుని లస్తకమును వలెను, కార్ముకమును వలెను, జ్యావలెను నున్నవట. ఇందొక విశేషమున్నది. అందరును అన్నింటివలె నున్నను, ఒక్కొక్కరియందు ఒక్కొక్క గుణము త్రిగుణమై యున్నది. మరి నాల్గవదాని మాట—చెప్పబడలేదు. మిగిలినవారియందు వలెగాక ఈమెయం దన్నిగుణములును మూర్తి గట్టుకొని యున్నవి. ఈమెయే నాయకురాలు. వీణయును, మృదంగమును, తాళములును మ్రోయించుటయే పై ముప్పురపని. గొంతెత్తునది నాయకురాలు. ఈమెను, ఈమె పాటను చూచుటనే, వినుటనే మును ముందాముని విధువు చెడినాడు. ఆ ముప్పురయందు కంటె నాయకురాలియం దొక విశేష ముండవలెననే, విశ్వనాథ ఆమెకు ప్రత్యేకముగా నొక విశేషణము వాడలేదు. సూచించినాడు. రాజుతో మాటాడినది నాయకురాలు. ఆమె గడుసరియట. కనుకనే "మానీంద్రుఁ గొని మనతం దెత్తుఁ, తేనుం జాలక వృత్తి రానే, రానీ పట్టణరము సిగ్గిల్లఁ" అని 'పణము' కొట్టి చెప్పినది. ఆ గడుసరి తనమునకు రోమపాదు డచ్చెరువడి "ముని శాపభీతి మీకు లేనో భీతహరిణ నేత్రలార! యన లవిత్రముల్ వోని చూపులు నిగుడ్చి మందముగ హసిం"చినారట వారస్త్రీలు. భీతహరిణ నేత్రలార యని రాజనగానే లవిత్రముల్ వోని చూపుల నిగుడ్చి పైపెచ్చు మందముగా హసించినారనుటలో నున్నది కవిత్వము. వ్యంగ్యవైభవవాసన యనగా నది. హరిణ నేత్రము లందముగా నుండును. హరిణమునకు బిత్తరపోవు గుణ మొకటి సహజము. ఆ గుణము దాని నేత్రాపాంగములలో వ్యక్తమగుచుండును. అదియే ఆ నేత్రముల కందము. స్త్రీల కన్నులట్లుండునని వర్ణించుట కవిలోక సామాన్యము. ఊరకే హరిణము భీతిగొనును. నిజముగా భయమే సంభవించినపుడు దాని కన్నులు చూడవలసినదే గాని చెప్పవలవి గాదు. రోమపాదుడా వేశ్యలను భీతహరిణ నేత్రలార యని సంబోధించినాడు. వారు రాజునకు పరిచారికలు. హరిణ నేత్రలైనవారు రాజుగారిని చూడగనే భీతహరిణ నేత్రలగుట వారి కలవాటు. అది మర్యాద. అతఃపూర్వము రాజు వారి భీతహరిణనేత్రములనే చూచినాడు. నేడు వారు తాముగా ముందుకు వచ్చి ఋశ్యశృంగర్షిని గొని తెత్తుమనినారు. హితులు, పురోహితులు, మంత్రులు మునిని చేరుటకు భయపడుచుండగా వారు తెత్తుమని ముందుకు వచ్చినారు. రాజును నచ్చెరువడినాడు. తాను ప్రతిదినమును చూచు భీతహరిణ నేత్రలేనా వీరు? అను సందేహము కలిగినది. భీతహరిణ నేత్రలుగా కనుపించు మీకు మునిశాపభీతి లేదేమి యనినాడు. అపుడు వారు భీతహరిణ నేత్రలు కారుగదా, హరిణ నేత్రలు కూడ కాకుండ లవిత్రముల్వోని చూపులు నిగుడ్చిరి. ఈ హఠాత్సంభవమునకు రాజచ్చెరువడి గ్రహించుకొనినాడు. మా అసలు విషయము ప్రభువులకు దెలియదేమియని మందముగ హసించిరి. లవిత్రములువోని చూపులు నిగుడ్చుట వారు నేర్చుకొనిరి. ఆ నేర్పునంతకు పూర్వము ప్రదర్శించవలసిన యవసర మేర్పడలేదు. భరతు నాగము మెల్లను ప్రయోగవైఖరిం దెచ్చినవారు వారు. ఆ చూపులు,

నిరుపట్టుట వారి కొక లెక్కా యేమి? అలవోకగా వారట్లు చూచిరి. ఆ మాపులు రాజునకు వారి గుండెనిబ్బరమును చూపినవి. రాజు వారి నంపినాడు. విశ్వనాథ వ్రాసిన ఆ యాటవెలది పద్యములోని ఆ రెండు వాక్యములలో నింత అర్థమున్నది. ఈపద్ధతిని నన్నయ వ్రాయగలడు. లవిత్రములు వోని మాపులు వారు చూచెగా వారి గుండెనిబ్బరమును తెలిసికొనుటయే గాదు రోమహర్షము చేసినది, ఋశ్యశృంగుని తప్పక ఆ మాపులను మెడకు తగిలించి తీసికొని వత్తురు - అతడు వచ్చును - అని తానును గుండెనిబ్బరము చేసికొనినాడు. క్షణములో నింత వ్యవహారమును రెండు వాక్యములలో చెప్పి భాస్కరాది పూర్వ రామాయణ కర్తలను మించినాడు విశ్వనాథ.

వేశ్యలు బయలుదేరినారు. 'తాతినిగూడ మాను మెయిజొప్పు గనుగొనిపించు నిట్టిటే చేతను గల్గునారి నీకుఁ జెప్ప మటంచును గువ్వకోలుగా నవ్వుచుఁ గ్రుళ్లుచు — మన్మథాస్త్ర — 'ఓసీ నవ్వకువ నీవు' అని పరస్పర మనుకొనుచు బయలుదేరినారు. విభాండకుని, ఋశ్యశృంగుని తలంచుకొనుచు వెళ్ళినారు. 'విభాండకున్ మొఱఁగి రావలె'నను వాక్యము వారు మరచిపోలేదు. కనుక నే మార్గమధ్యమున 'మాని కోపంబున నోసి మిమ్ము నెవరింక పంపినారన్న భూపతుని చెప్పకుడు. ఏమి వచ్చితి మన పాపానో బీజానో' అని యనుకొనినారు. ఇది వారి స్వామిభక్తికి నిదర్శనము. ఇటి సమయములందు తప్ప వారు రాజునకు చేయు సాహాయ్యము మరి యొకటి లేదు. ఇట్టి యవకాశములు మాత్రము తరచు వచ్చునా? ఋశ్యశృంగుని గొని తెచ్చుట కుపక్రమించుటలో వేశ్యల యుత్సాహముతో పాటు ప్రభుభక్తియు నిరూపించి విశ్వనాథ వారి కొక యున్నతి కలిగించినాడు. ఇంత ప్రభుభక్తి పరాయణలు గనుకనే, ఋశ్యశృంగుడు తమ్ము సమీపించి ఉరములు తాకుచు, పిఱుదులు ముట్టుచున్న సమయమున 'భూపశ్రేష్ఠుని కొఱకు పెన్మిటనుచున్ బూజింతు రమ్మౌని' నని విశ్వనాథ వ్రాయుట. సంగీత నర్తన కళాకౌశలము నెరపిన తరువాత ఋశ్యశృంగుడు వారిని సమీపించి యెన్నియో ప్రశ్నలడిగి వారలను కౌగిలించుకొని ఉరములు - ఆననములు - పిఱుదులు స్పృశించుచున్నంతసేపును వారేమియు మాటాడలేదు. సాధ్యమగు నా సన్నివేశమున వారు మాటాడలేరు. తాము మాటాడక ఋశ్యశృంగుని యాతిథ్యమును పొందిరి. 'నమున్ మీ సంటఁ గొంపో వుగ్రో! మీ పుణ్యాశ్రమ మెచ్చోట నెచ్చటనున్ మేలొను నా సందే' కని యాతడడిగిన తరువాత 'మా యాశ్రమమున నన్నియుఁ గనకసౌధములు గల' వనిరి ఇది యాతడడిగిన ప్రశ్నకు సమాధానము గాదు. ఇంకను నతని కొక అస్తిత్వమున్నదా? లేక తాను చేతిలోని వాడైనాడా? అను విషయమును స్పష్టము చేసికొనుటకు వారా వాక్యము పలికిరి. దానికి అస్తిత్వము లేదు. ఉన్నచో తన ప్రశ్నకు సమాధానమును మందిమ్మని కోరి యుండెడివాడు. లేదు కనుక నే కనక మన నేమని వారి మాట నందుకొని యడిగినాడు. వారేది పలికినననేమో అతని చెవి కింపుగా నున్నది. కనక మన నేమో వారు చూపి చెప్పిరి. అట్లయిన తప్పక వత్తు ననినాడు. ఈ రెండింటికిని సంబంధము లేదు తెలియకుండనే వారియందొక గౌరవము, వ్యామోహము నేర్పడినది ఋశ్యశృంగునకు. వారి యాహ్వానముతో నిమిత్తము లేకుండనే వారి ననుసరించవలెయునన్నంత యుత్సాహ మాతనియందు వారు రేకెత్తించిరి. వారిచ్చిన భక్ష్యములు సేవించుచు మగల 'నన్నాహ్వానించుట కేనైనఁ గలదా యభ్యంతరము?' మని యడిగినాడు. వారికి నమ్మక మేర్పడినది. వారు నాగరు లతనిచేత నడిగింపించి 'తమ గన్ జనుదెంచు రో! శాంతి యీయుంచిచ్చెద మింతకన్న వలెనే చరితార్థుల మమ్ముఁ జేయగ' ననినారు. అతడు తృప్తిపడినాడు. తన యాశ్రమమునకు వారి నాహ్వానించినాడు. వారంతట 'మిమ్ములబట్టి నిల్చితిమి. మేమును బోవలె మాకు ప్రత్యూయమ్ములు పుట్టు తక్షణము పూర్వత లెన్న మీ రాదు నాతిథేయులు మమ్ముల మాకు వచ్చె. అద దాగము నాథుడు యుండుము మమ్ముల నింటె యొల్లి.' అని బ్రాహ్మణ సంప్రదాయము ననుసరించి మాటాడినారు. మంచిదటే యుండుమని చెప్పి తన తండ్రి యుటజము చేరు వేళ యైనదని చనినాడు ఋశ్యశృంగుడు.

తాము నిర్వహించవలసినదంతయు జాగరూకమై నిర్వహించిరి. అతడు పోయిన తరువాత వారి కొక భయము పట్టుకొన్నది ఈ యమాయిక వ్యక్తి జరిగినదంతయు తండ్రియైన విభాండకునకు చెప్పునేమో నని వారి భయము. చెప్పినచో క్రుద్ధుడై వృద్ధముని వచ్చినచో నిక తమ పాట్లు పెరుగాళ్ళకే ఎగుక. మరునాడు ఋశ్యశృంగుడు వారిని చేరవచ్చువరకు

వారికి భయమున్నది. అంతవరకు వారు మంటపై కూర్చున్నటుల భ్రాంతపడినారు. ఎంత గడుసుగత్తెలైనను వృద్ధమహాశివలని భయ మిప్పుడు వారికి కలిగినది. ఇది సహజము. ఇప్పుడు వారు భీతహారిణీ నేత్రలు. తండ్రికి చెప్పినాడో లేదో తెలియదు గాని విభాండకునకు మాత్రము రాలేదు. మరునాడు ఋశ్యశృంగుడే వచ్చినాడు. వారి యత్నము సఫలమైనది. అందరును అంగదేశమునకు వచ్చినారు. వర్షము కురిసినది. దేశ ప్రజలకు హర్షము కలిగినది. అంగదేశము ప్రవేశించుటతోడనే లౌకికవ్యవహార రహస్యములన్నియు నా ఋషికుమారునకు తెలిసిపోయినవి. అంత రోమపాదుడు దిగివచ్చి శిష్యక నాతని పదాబ్జముల చేర్చి, ఆత్మజ నిచ్చి వివాహము చేయుమనని శాంతను పిల్చి చూపగా ఋశ్యశృంగర్షి లజ్జగొని త్రిప్పబడి మొగము వాల్పగా "ముద్దరాలా! పురికిన్ వంటబునను నీ గాత్రంబు భేదంబటంచు జల్ ప్రోవులు వారముఖ్యలు సురంగింటించి రెంటించుచు పరిహాసములు" చేసిరట. అంత శాంతకును, ఋశ్యశృంగునకును వివాహము చేసినాడు రోమపాదుడు.

ఋశ్యశృంగోపాఖ్యానమున వేశ్యల నింత కట్టుదిట్టముగా పూర్వ రామాయణ కర్తలు దిద్దలేదు. ఈ విషయమునమాత్రము భాస్కరాదులకంటె రఘునాథుడు కొంత నయము. అతడు కూడ ఋశ్యశృంగునకును, వేశ్యలకును జరిగిన సంభాషణము గాక, వారి వారి చేష్టల నభివర్ణించినాడు. వేశ్యలను గూర్చి ఋశ్యశృంగుడును, ఋశ్యశృంగుని గూర్చి వేశ్యలును మనస్సులలో ఏమేమనుకొనిరో కొంత విపులముగా రఘునాథుడు వర్ణించినాడు. వేశ్య లనుకొనిన విషయము లన్నియు అతి సామాన్యములు. అందు కొన్ని పేలవములు. కొన్ని అనౌచితీ దోష దూషితములు. వారు దక్షిణాంధ్ర యుగమునకు సంబంధించిన వారే గాని, రామాయణకాలమునకు, అంగదేశమునకు సంబంధించినవారు గారు. వారిని చూచిన ఋశ్యశృంగునకు కలిగిన అంతర భావములను వ్యక్తీకరించుచు వ్రాసిన మూడు సీసపద్యములలో నొకటి అత్యుత్తమము. ఒకటి ఉత్తమము. ఒకటి అధమము.

అబ్బురంబుగ నెన్ని ఋబ్బకొమ్ములు మొల్చె
ఘనులు వీరౌర నాకన్న ననుచుఁ
బసిములఁ బొడమెడుఁ బద్మము లీవ్వరల
మహిమ యెంతటిది యింత మహానటంచు
ఘనములు వెనువెంటఁ గదియుచున్నవి జల
దాకర్షణము సేసి కట్టెననుచుఁ
బలుకుల నమృతంబు బొలఁకెడు బళిపిక,
లమృతాంధసులకన్న నధికులనుచుఁ
గాన మెన్నఁడు నీసాటి గాన గరిమఁ
గరఁగు పాషాణముల నీరు గాఁ గరంచె
నంచు మది నెంచి పలుకుల నగుచు బడుచుఁ
గొమ్మకొన యూగఁ దలయూచికొనుచుఁ జేరె!

(రఘునాథ రామాయణము. ఆ. 2. ప. 157.

ఈ పద్యము తరువాత నున్న రెండు సీసపద్యములును నతని చేష్టలను వర్ణించునవి. చేష్టలకంటె భావములను సృష్టించుటలో గొప్పతనమున్నది. ఆ పద్యములలో రఘునాథుడు పడియే చేసినాడు. అతని రామాయణమున సర్వత్ర ఇట్టి భావకల్పన కనుపించదు. అనౌచిత్యము లెక్కువ. ఋశ్యశృంగునకు వేశ్యలను చూచినప్పుడీ పై భావము కలిగినట్లు పూర్వ రామాయణ కర్త లెవ్వరును వ్రాయలేదు. విశ్వనాథ సర్వమును నానందములో లీనము చేసినాడు. రఘునాథుని వేశ్యలకు సంభాషణచాతుర్యమే లేదు. భాస్కరాదు లంత చాతుర్యమును చూపకపోయినను వేశ్యలచేత అధిక ప్రసంగము చేయింపలేదు. రఘునాథుడు చేయించిన దంతయు నదియే. ఏమి దిద్దినను విశ్వనాథ దిద్ది తీర్చినాడు వేశ్యలను.

రోమపాదుని దీనస్వరూపమును, పురోహితుల యుచితజ్ఞతను, వేశ్యల నైజాణతనమును - ఉచిత ప్రవర్తనమును, ఋశ్యశృంగుని అమాయికప్రవృత్తిని కన్నుకచ్చున తీసినట్లు చిత్రించినాడు విశ్వనాథ. ఋశ్యశృంగుని పాత్రచిత్రణమున విశేషమైన వైదుష్యమును ప్రదర్శించి సన్నయతో తౌల్యము తెచ్చికొనినాడు. వేశ్యావిషయమున నొక యౌన్నత్యమును కల్పించి, పూర్వరామాయణములను మించి ఋశ్యశృంగోపాఖ్యానమును తేజోవంతము చేసినాడు. పాత్రల మనస్తత్త్వ వ్యక్తీకరణమునను, అర్థగాంభీర్య ప్రతిపాదక రచనాకౌశల్యమునను విశ్వనాథ తిక్కనను తలపించుచున్నాడు. మహాకవుల గ్రంథములను వలె విశ్వనాథ రామాయణమును మననము చేసి చేసి ఒక మాట మాటాడవలయును.

# కలగూరగంప

## విశ్వనాథ వ్యక్తిత్వము

శ్రీ హారీత శివశర్మ

కవులు రెండువిధములు. కవిత్వపుజాలు కొంత కాలము వరకుండి, అనంతరము అది ఆగిపోగా, ఆ పూర్వపు అంతమాత్రపు తమ వైభవమును మూడుకొని కవుల మను కొనువారు ఒక తరగతి. మరిఒకతరగతి నిరంతరము ప్రవహించు గంగానదివలె కవిత్వపు జాలు కలవారు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఈ రకము కవి.

మరి ఈ కవులు మరియు రెండు విధములు. వట్టి భావుకులు; ప్రతిభావంతులయిన మహామనస్వులు అని. శ్రీ సత్యనారాయణగారు ఈ ప్రతిభావంతు లయిన మహామనస్వులలోనివాడు.

మరి ఈ ప్రతిభ విచిత్రమైనది. ఇది కొందరిలో అనుకూల పరిసరములలో గాని పెరుగదు. కొందరిలో ప్రతికూల పరిసరములను చీల్చుకొని, వాటిని అడిమి గాని పైకి రాదు. శ్రీ సత్యనారాయణగారిది ఈ రక మైన ప్రతిభ.

*　　*　　*

శ్రీ సత్యనారాయణగారిది నందమూరు. బెజ వాడ దగ్గర. తాను తల ఎత్తేనాటికి తమ కుటుంబ స్థితి ఏమిటో రామాయణ కల్పవృక్షంలో ఆయనయే ఇట్లా వ్రాసుకున్నారు:

"నకనకలాడునట్టి కడుపులన్ వచ్చి
తేచుచు బోయెడు తెరువరులును
చినిగిన గుడ్డల చనుదెంచి నూతన
పరిధానముల దాల్చి యరుగువారు
పరిదీనవదనులై యరుదెంచి ఉత్సాహ
కృతమందహాసులై యేగువారు
సందేహభాజనాస్యములతో వచ్చి యా
శ్చర్యసూచిముఖాల జనెడువారు
బాలుతురన్నాతురులు యాచకులును నిత్య
కలిత బహుళ కార్యాంతరాగతులు విశ్వ
నాథ వంశాబ్ధి శశి శోభనాద్రి యింట
నిరులు వదలి వెల్తురులు గొంచేగునట్లు.

తప్తాఘుల్ బహుసోమపీథి పరిభు
క్తక్లిష్ట సోముక్ బలేక్
సప్తాశ్వద్యుతి శోభనాద్రి పినయాం
చద్వంశపారంపర
ప్రాప్తంబై చను క్షేత్రమగ్ధి జన లి
ప్సాపూర్తి వెచ్చించి ని
ర్లిప్తుండుంబలె బోల్చె యాచకముఖా
లీఢార్తి నిర్యాశనన్."

అనగా తల ఎత్తునాటికి ఆర్థికము గా పరిస్థితులు ఆయనకు తారుమారులైనవి. బ్రతుకు కష్టమున పడినది. గిరికుమారుని ప్రేమగీతములయందును, మరికొన్ని ఖండ కావ్యములయందును ఈ కష్టముల ఉద్ధతి యొక్క వర్ణనమున్నది. ఆ కష్టముల తాను ఎదుర్కొన్న వైఖరి ఎట్టిదో అది యున్నది. ఒక అరటిమూకు ముంతల

---

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి షష్టిపూర్తి మహోత్సవాలు గుడివాడపట్టణంలో జనవరి 14, 15 తేదీలలో జరుపుటకు విస్తృతావధిని ప్రయత్నాలు జరుగు తున్నట్లు, ఇందుకొరకు ఏర్పడిన సన్మాన సంఘమువారు ప్రకటించుతున్నారు.

పయి పడగా పడగా, దానికి ఆ ముంగ్లవలని బాధ బాధ కాకుండా పోయినదట. కష్టములు, సుఖములు త్రాసు దండము కాగా, తాను జీవితములోని లాభనష్టములను ఎంచినాడట. ఆయన వైఖరి అట్టిది. ఆ వైఖరియే ఆయన కవిత్వ సర్వస్వమునకుగూడ పట్టినది. తన్ను తాను విచక్షించుకొని ఇతరులను విచక్షించి, లోకమును విచక్షించి విషయమును విచక్షు చేసి సాగు ఆయన మహారచనాశిల్పవైఖరికి జీవితమును గూర్చిన ఆయన ఈ వైఖరియందే జన్మము.

*　　*　　*　　*

సత్యనారాయణగారు చదువుకొన్నది బందరులో ఆంగ్లపుం చదువు. అవి చెళ్లపిళ్లకవి గురువంచు చెప్పికొనగా గొప్పయైన రోజులు. జంటకవిత్వముల యందు మోజు రోజులు. సత్యనారాయణగారికిని జంటకవిత్వపు మోజు ఉండెడిదేమో అని మనము అనుకొనవలెను. ఆయన ఒక నాటకముమీద జంటపేరులున్నవి. మరి ఈ జంటకవిత్వమును ఎవరితో కలిపి వ్రాయవలెనని ఆయన ఆరోజులలో అనుకొనెనో తెలియదు. కాని అది బెడిసిగా, తాను తన కవిత్వమార్గమును నిర్ణయించుకున్నవాడై అద్యతనాంధ్రకవిత్వ క్షేత్రయాత్రను ప్రారంభించినట్లు తోచును. రాళ్లవాగు దాటి, పథాంతరములు దాటి, అడుసులలో అడుగులు కలుపుకొనుచు అడవులను దాటి, కొండకోనలను దాటి, వెన్నెల బయలులో ప్రవేశించి, మధురరసమూర్తి గోదావరితో సంగమించి, సంగమించి కూడా తన విశిష్టతను నిల్పుకొని, అనంతర సంసారంలో చిరంతనమైన ప్రయాణాన్ని మహాకవిత్వ కిన్నెర ప్రారంభించింది. తెలుగు కవిత్వ వసంత ఉద్యానవనంలో ఒక కొత్త కోకిల కూసింది.

*　　*　　*

అసలు బందరు రోజులే సత్యనారాయణగారి రచనాచరిత్రలో ప్రధానమైన వనిపిస్తుంది. అక్కడ వుండగానే ఆయన మహారచనలు వెలువడ్డాయి. నవలలలో ఏకవీర, నాటకాలలో వేనరాజు, అనార్కలీ కావ్యాలలో ఆంధ్రప్రశస్తి, కిన్నెరసాని పాటలు, శృంగారవీధి ప్రకటితాలైనాయి. వెయ్యి పడగలు రచన బందరులోనే సాగింది. రామాయణ కల్పవృక్షం రచనకు అంకురార్పణ కూడా అక్కడే. వ్రాసిన 'రామచంద్రుకథ వ్రాసితివం చనిపించుకో, వృథాయాసము కాక కట్టుకథలైహికమా పరమా' అటంచు తా జేసిన తండ్రి యాజ్ఞ, జీవుని వేదన, ఏకముకాగా కల్పవృక్షరచనం ప్రారంభమైంది.

*　　*　　*

బందరులోవుండి ఆయన రచనలు సాగించిన కాలం రెండుభాగాలుగా వుంది. ఒకటి 1921 ప్రాంతపు కాలం. రెండవది 1930 అనంతరకాలం. 1930 అనంతరమే ప్రసిద్ధమైన నవలలరచన సాగింది. చెలియలికట్ట, మా బాబు, జేబుదొంగలు, వెయ్యిపడగలు రచనలు ఈ కాలంలో సాగినవే. అవి ఉద్యోగంలేని రోజులు. కష్టములలోవున్న రోజులు. ఆ రోజులలో ఈ నవలలనేగాక బహుఖండకావ్యములను గూడా ఆయన ప్రకటించెను. ఒక విషయము: అసలు సత్యనారాయణగారి ఖండకావ్యములను ప్రకటించినచో అవి కొన్ని సంపుటములు గావచ్చును.

బందరు అనంతరం ఆయన కొన్ని రోజులు గుంటూరులో మేష్టరుగా వున్నారు. కాని ఆ రోజులనాటి రచనలు ఇవి అని చెప్పడానికి లేదు. బందరు తర్వాత బెజవాడలోనే మళ్ళీ బృహద్రచనలు సాగాయి. కుణాలుని శాపం, ధర్మచక్రము, బద్దన్న సేనాని, స్వర్గానికి నిచ్చెనలు, తెఱచిరాజు మొదలైన నవల రచనలు, విశ్వనాథ పంచశతి, ఝాన్సీరాణి వంటి కావ్యాలు, రామాయణం రచన, బెజవాడలో సాగినవే. ఈ విధంగా సత్యనారాయణగారి రచనలను బందరు రచనలు, బెజవాడ రచనలుగా భాగించవచ్చును.

*　　*　　*

సత్యనారాయణగారు జీవితంలో పోరాటం సాగించినట్లే, కవిత్వ రంగంలో గూడా పోరాటం సాగించే ఇప్పటి తమ స్థానాన్ని పొందగల్గారు. ఈ పోరాటం పురాణములోని విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అగుటకు సాగించిన పోరాటంలాగా ఉంటుంది. దీని లక్షణం ఆయన ప్రతి పుస్తకంలోను గోచరిస్తుంది. ఋషులలో విశ్వామిత్రుడు గాయత్రిని దర్శించినట్లు కవులలో సత్యనారాయణగారు రసాత్మను సాక్షాత్కరింపజేసుకున్నారు. వేదానికి గాయత్రి ఏలాగో, మరి కావ్యానికి రసం అలాగేగదా. వేదపరిభాషలో కవి శబ్దం సత్యనారాయణగారియందు సర్వథా అన్వర్థం అవుతుంది.

అయినా ఆయన లోకం తన్ను కవిగా గుర్తిస్తుందా, గుర్తించదా అని బాధపడ్డ రోజులూ

వున్నాయి. లోకం తన్ను ఏమో అనుకుంటున్నదని తనకు విరోధి వర్గం వున్నదని, ఆ అర్థాన్ని తాను వ్రాసిన ఖండకావ్యాలలో ధ్వనించినపట్లు అంతలోనే తాను కవిని అన్న యథార్థ జ్ఞానమును అనుభవించిన స్థానములు చాలా వున్నాయి. మచ్చుకు అన్న ఖండకావ్యంలో, కవి-ప్రభువు అన్న ఖండకావ్యంలో ఇట్టి అర్థాన్ని మనము దర్శించవచ్చు. ఇట్లుగాక తాను బహిరంగముగా బయటకు వచ్చి "నన్ను ఎరుగరో, విశ్వనాథకవిని" అని బాహాటంగా ప్రద్ది చెప్పినపట్లు లేకపోలేదు. ఇట్టిపట్లల్లో సత్యనారాయణ గారి స్వయం వ్యక్తిత్వం ఆయన కవిత్వ వ్యక్తిలో ఎంతగా హత్తుకొనిపోయిందో కన్పిస్తుంది.

* * *

సత్యనారాయణగారు ఇప్పుడు 70వ పడిలో పడుతున్నారు. షష్టిపూర్తి ఉత్సవాలు అవీ జరుగుతున్నాయి. ఇప్పుడాయనలో ఆదినుంచి ప్రజ్వలిస్తూ వచ్చిన శక్తి ప్రజ్వలిస్తూనే వుంది. చిరంతనమైంది. దానికి వయస్సేమిటి? ఆయన కవిత్వానికి మల్లేనే, ఆ శక్తికీ వయస్సు లేదు. ఆయన అంతగా భారతీయాత్మను కావ్యాలలో నిక్షేపించిన కవి ఈ దేశంలో మరి ఎవ్వరు వున్నారు! ఆయన ప్రతి గ్రంథము ఆ ఆత్మయొక్క లక్షణానికి వ్యాఖ్యానమే. ఈ రహస్యాన్ని గ్రహించినప్పుడే, ఆయన వ్యక్తి, ఆయన కవిత్వము సరిగ్గా అర్థం అవుతాయి లేకపోతే కావు

# నిర్జీవ వస్తురాశినుంచి జీవరాశి పరిణామం సాధ్యమా?

వ్యాధులకు సూక్ష్మక్రిములు (Bacteria) కారణమని పాశ్చర్ (Pasteur) ప్రతిపాదించిన నాటినుంచీ, విజ్ఞానవేత్తలంతా అదే విశ్వాసంతో వ్యవహరిస్తూ వచ్చారు. మైక్రోస్కోపు సహాయంతో ఆయా చాలా వ్యాధులకు కారణములైన వివిధ క్రిములనూ విస్పష్టంగా తెలుసుకోగలిగారు. మిగతా వ్యాధులకు కారణభూతములైన క్రిములను కూడా ఉత్తరోత్తరా కనుగొనగలమనుకున్నారు. పాశ్చర్ సహాయ పరిశోధకుడు చాంబర్లండ్, కెయొలిన్ (Kaoline) అనేమట్టితో నల్లకంకరను (Quartz) కలిపి ఉడకబెట్టిన పదార్థాన్ని [illegible] పదార్థంగా ఉపయోగించి ఒక క్రొత్తరకం వడపోత యంత్రాన్ని తయారుచేశాడు. దాన్ని 'చాంబర్లండ్ ఫిల్టర్' అంటారు. ఈ చాంబర్లండ్ ఫిల్టర్ సూక్ష్మక్రిములను క్రిందికి దిగకుండా వడపోయగలదు.

1892 ప్రాంతంలో ఇవానోవిస్కీ అనే రష్యన్ శాస్త్రజ్ఞుడు పొగాకు మొక్కలకు తగిలే చీడను గురించి పరిశోధనలు చేస్తూ, చీడబట్టిన పొగాకు ఆకులను తొక్కి రసం తీసి దాన్ని 'చాంబర్లండ్ ఫిల్టరు'లో వడపోశాడు. ఈ ఫిల్టరులో వడపోసినప్పుడు సూక్ష్మక్రిములేవీ (Bacteria) క్రిందికి దిగటానికి వీల్లేదని చెప్పాం. ఇవనోవిస్కీ అలా దిగినజలాన్ని పరిశీలించాడు. దాన్ని మంచి పొగాకు ఆకులకు రాస్తే అవి తిరిగి చీడబట్టిపోయినాయి. దీన్ని బట్టి ఆ జలంలో సూక్ష్మక్రిములేవీ లేకపోయినా చీడకు కారణమైనదేదో మిగిలివుందని తేల్చుకున్నాడు. సూక్ష్మక్రిములకంటే సూక్ష్మాతి సూక్ష్మములైన వేవో ఇందులో వున్నాయని తేల్చి వాటికి 'వైరస్' (Virus) అని నామకరణం చేశాడు.

అచిరకాలంలోనే వివిధ శాస్త్రపరిశోధకుల కృషి ఫలితంగా, కామిలాజ్వరం, జలుబు, ఇన్‌ఫ్లుయంజా, మశూచి, టైఫాయిడ్, మొదలైన వ్యాధులన్నిటికీ ఈ 'వైరస్' లే కారణమని తేలింది.

ఈ వైరస్ మైక్రాస్కోపువల్ల పరిశీలించటానికి గాని వడపోయటానికి గాని వీలులేనంత సూక్ష్మాతి సూక్ష్మమైనవి కావటంచేత చిరకాలం వాటి రూపురేఖ లెలావుంటాయో తెలుసుకోవటం సాధ్యం కాకపోయింది.

తొలుదొల్త వీటివిషయం కొంత తేల్చినవాడు అమెరికన్ శాస్త్రజ్ఞుడు స్టాన్లీ (W. M. Stanley) చీడపట్టిన పొగాకు ఆకులను నూరి ఆపసరును 40°–50° ల. వరకూ వేడిచేస్తే అందులో వుండే మామూలు మాంస కృత్తులన్నీ (Proteins) గడ్డకట్టుకుపోతాయి. వీటిని వడపోయటం సాధ్యం కాదు. వీటిని 'అల్ట్రా సెంట్రిఫ్యూజ్'లో వేగంగా తిప్పి తేర్చితే వేరుపడిపోతాయి. అలా తేర్చి గడ్డకట్టిన మాంసకృత్తులను తీసివేయగా మిగిలిననీటిలో, స్టాన్లీ, ఉదజహరికామ్లము కలిపాడు. తెల్లని అవక్షేపమొకటి (Precipitate) యేర్పడ్డది. దీనిని వేరుచేసి శుభ్రపరిచాడు. దానికి చీడబట్టే గుణం వుండటంచేత, ఇదే పొగాకుచీడకు కారణమైన 'వైరస్' అని తేల్చాడు.

ఈ 'వైరస్' కణములు (Molecules) ఉదజని కణముల కంటే 4 కోట్ల రెట్లు ఘనంగా వుంటాయనీ కాంతి వక్రీకరణ గుణములు కలిగివుంటాయనీ పరిశోధనలవల్ల తెలుసుకున్నారు. వక్రీకరణ స్వభావము కలిగివున్నాయంటే కడ్డీలవలె పొడవుగా వుంటాయని మనం ఊహించవచ్చు.

మన కంటికి కనబడే వెలుగుయొక్క ప్రసరణ తరంగాంతరము (వేవ్ లెన్‌గ్త్) ఒక మిల్లిమీటరులో 10 వేల వంతుండటంచేత మైక్రోస్కోపుతో మిల్లిమీటరులో 4 వేల వంతుకంటే తక్కువున్న కణాలను చూడటానికి వీల్లేదు. 'అల్ట్రా వైలెట్' కిరణాలను ఉపయోగించితే మిల్లిమీటరులో పదివేల వంతుకంటే చిన్నవైన వాటినికూడా చూడవచ్చు. మశూచివగైరా వైరస్‌ను ఇలా చూడవచ్చు. కాని మిగతా వైరస్‌లు ఇంతకంటే చాలా సూక్ష్మాతి సూక్ష్మమైనవి.

1924 లో డి బ్రోగ్లీ (De Broglie) ఎలక్ట్రానులు తరంగాలుగా ప్రవర్తిస్తాయని నిరూపించాడు. ఎలక్ట్రాన్ తరంగాంతరము మిల్లిమీటర్లో వందకోట్ల వంతు వుంటుంది, అనికూడా తేల్చారు. ఎలక్ట్రాన్ కాంతిని వాడితే ఎంత చిన్న 'వైరస్' నైనా చూడవచ్చు. ఈ కాంతిని వాడే మైక్రాస్కోప్ నే 'ఎలక్ట్రాన్ మైక్రాస్కోప్' అంటారు. ఎలక్ట్రాన్ మైక్రాస్కోప్‌తో తీసిన చిత్రాలు దిగువను చూడవచ్చును.



స్ఫటికాలరూపంలోకూడుకున్న పొగాకు వైరస్
(ఎలక్ట్రాన్ మైక్రాస్కోప్ ఫోటో.)



కడ్డీల రూపంలోవున్న పొగాకు వైరస్
(ఎలక్ట్రాన్ మైక్రాస్కోప్ ఫోటో.)

వైరస్‌లు వంశపారంపర్యంగా జీవకణముల ద్వారా వ్యాపింపబడుతవి. అవి ప్రాణులవలె తమ జాతిని తాము ఉత్పత్తిచేసుకొను శక్తినికూడా కలిగియున్నవి. ప్రొటోప్లాసమ్‌లో తప్ప ఇవి జన్మించినట్లు కనబడదు.

రెండుమాసముల క్రితం కాలిఫోర్నియా విశ్వవిద్యాలయపు వైరస్ కేంద్రంలో ఫ్రెంకెల్ కొన్రాట్, విలియమ్స్‌లు (Fraenkel Conrat, Williams) పొగాకు చీడవైరస్ (దీనిని T. M. V—అంటే Tobacco Mosaic Virus—అంటారు)లో పరిశోధనలు చేస్తూ దానిని (వైరస్‌ను) ప్రోటీన్లుగాను, న్యూక్లియర్ ఆమ్లములు (ప్రాణులలో వుండే ఒక రకమయిన ఆమ్లములు)గాను విరగకొట్టి, వేరుచేసి మరలా వాటిని కలిపి వైరస్‌ను 'నిర్మించారు.'

పొగాకు వైరస్ ద్రావకానికి కొంచెం క్షారములను (alkalies) కలిపితే పైన చెప్పిన ఆమ్లములుగాను, ప్రోటీనులుగాను వైరస్ విడుతుంది. వీటిని రెండింటినీ అల్ట్రా సెంట్రిఫ్యూజ్ (Ultra Centifruge)తో వేరుచేశారు. ఈ ఆమ్లములుగాని, ప్రోటీనులుగాని పొగాకుకు చీడ పుట్టించలేవు. అంటే వీటికి 'ప్రాణము' లేదని నిర్ధారణ అగుచున్నది. మరలా ఈ రెండింటినీ కలిపి కొంచెముగా ఉదజహరికామ్లమును (Hcl.) చేర్చి, O° (centigrade) కంటే కొంచెం పైగా ఉంచగా పొగాకు వైరస్ తిరిగి ఏర్పడినది! దీనికి పొగాకు మొక్కలకు చీడ పుట్టించే గుణాలన్నీ ఉన్నవి. అంటే 'ప్రాణం' ఉన్నదని చెప్పవచ్చు.

ఈ నూతన పరిశోధన వైద్యశాస్త్రంలో అనేక విప్లవాత్మకములైన పరిణామములకు దారితీయవచ్చు. అంతేకాక పదార్థ విజ్ఞానశాస్త్రంలో తీరని సమస్యగా ఉన్న 'అప్రాణిపదార్థంనుంచి జీవరాశి యెట్లా ఉత్పన్నమవుతాయి?' అనే ప్రశ్నకుకూడా వొక సమాధానం ఇకముందు లభించవచ్చు. ఈ ఆశనే విలియమ్సుకూడా వ్యక్తంచేస్తున్నారు.

# గ్రంథ విమర్శనము

## నాగార్జున సాగరం

గేయకావ్యం, రచన: శ్రీ సి. నా రా య ణ రెడ్డి: ప్రచురణ: తెలంగాణా రచయితల సంఘం హైద్రాబాదు. వెల రు 1-8-0.

నాగార్జున కేంద్రంలో బయల్పడిన బౌద్ధ కళా శిల్పాలు, వాటి పరిపోషకులైన ఇక్ష్వాకు రాజుల, రాణుల చరిత్రలు, బౌద్ధమత సంప్రదాయాలు ఈ మొదలైన కళాసామగ్రిని సేకరించి శ్రీ నారాయణరెడ్డిగారు రసవత్తరమైన ఒక కల్పనచేశారు. అది యీగేయకావ్యానికి కథావస్తువు. నాగార్జున పర్వతక్షేత్రంలో 'మహాచైత్యము' శిల్పారామంగా నిర్మింపబడుతున్న రోజులవి. ఆమహాచైత్యంలో శిల్పమూర్తులను గండరించటానికి బౌద్ధాచార్యులచే నియోగించబడిన పద్మదేవుడు ఈకథకు నాయకుడు, ఇతడు యువకుడు, అందగాడు. చిత్రశిల్పకళలందు మహత్తరమైన అభినివేశం కలవాడు.

'కళాత్మ'ను ఉలితో
మేల్కొలిపెనదో యువకు డొకడు.
ఆతడు సామాన్య మనుజు
డైన నమరకళ నజుండు.
ఆంధ్రు డతడు అంతియకా
దనంత విశ్వాత్మజుండు
అతడు పద్మదేవు డనెడు
అభిధచేత మించువాడు
అతడు కళాత్మక జీవన
మభ్యాసము జేసినాడు
అతనికి ప్రాంతపు టెల్లలు
అక్షిగోచరములు గావు
అతనికి మతవైషమ్యము
లణుమాత్రము తెలియరావు
అతని హృదయ మనల్పము
అతడు సజీవ శిల్పమ్ము.

అతడు మానవుని రూపము
నందికొన్న గాంధర్వము.

* *

కఠినశిలల నవనీతము
గా మార్చెడు తాంత్రికుండు
అతని కలలే కళలైతా
ఆకారము దిద్దుకొనుచు
'మహాచైత్య' కుడ్యమ్ముల
పై హల్లీసకమాడెను

ఇతను ఒకనాడు యశోధరాగౌతముల ప్రణయ ఘట్టం చిత్రించుతూవుండగా:

అల్లంతదూరాన
అంగనామణిదోచె.

కదలివచ్చిన మల్లి లే
వల్లికయనంగ
అవయవమ్ములుదాల్చి
నట్టి అమృతమనంగ
మదన సామ్రాజ్యము
ర్మర్యాదలను దాట
వెనుకముందాడు క్రొ
వ్విరి మార్గణమనంగ,

కథానాయిక శాంతిశ్రీ అచ్చటికివచ్చింది. 'దోరవెన్నెలవంటి ఆ రూపం చూచీచూడ్డంతోనే అతని 'కుంచియ' చేజారింది. 'కుంచియ' అతని చేతి అంచులను దిగజారిందో లేదో, అంతిలోనే 'ఆమె నేత్రాల జోత్స్నకలూరిసై.'

కాని వారి ప్రణయం సుఖాంతంకాలేదు. ఆమె బౌద్ధధర్మం ఉపాసించటానికివచ్చిన విద్యార్థిని. కఠోరమైన బౌద్ధమత సంప్రదాయం వారి ప్రణయజీవితాన్ని ఛిన్నాభిన్నం చేసింది. బౌద్ధమతాచార్యులు ఆమెకు శాశ్వతి బ్రహ్మచర్య దీక్ష నిచ్చి, అతన్ని ఆ బౌద్ధారామంనుంచి బహిష్కరించాడు. అతడు విరా

గిరియై వెళ్ళిపోయాడు. దుఃఖార్తిలో పొగులుతున్న ఆమెకలలో :

............పరా
ఙ్ముఖుడైన పద్మదే
వుడు వెన్నెల బయళ్ల
బడి మాయమగుచుండె.

ఆమెహృదయమే సాగరమైపోయినది. ఆ నాగార్జునసాగర తరంగములపై నడయాడుచూ అతని మూర్తి అనంతపథంలోకి పరిక్రమించుతున్నది.

కరుణావిలమైన ఈ మధురగాథను శ్రీ నారాయణ రెడ్డి చాలా ప్రతిభావంతంగా నిర్వహించారు. ఈ రచనలో రెడ్డిగారిభావన, ఒక సమున్నతస్థాయిని అందుకున్నది. రచనా శిల్పంకూడా వీరి యితర రచనలలో కనుపించని క్రొంగ్రొత్త సొగసులనుకైసేసుకున్నది.

ఆమెలో పద్మదే
వారోపితమైన
ప్రణయాంకురము రెమ్మ
లను వేసివర్థిల్లె

*   *   *   *

నేటి శాంతి శ్రీ వి
నీల ధమ్మిల్ల భా
రమునందు దినమొక్క
రంగు పువ్వులు నవ్వ

*   *   *   *

ఆమెలో నీ సంశ
యమ్ముకుబుసమువిడిచె.

ఈ రకం సొగసు సొంపుల నెన్నిటినో ఈ రచన సంతరించుకున్నది. శ్రీ నారాయణరెడ్డిగారి రచనా శిల్పం ఇంకా మున్ముందు విరియ బూయగల సూచనల ఈ రచనలో కన్పించుచున్నాయి. తె. సూ.

## పుష్పాంజలి

ఖండకావ్య సంపుటి: రచన: శ్రీ చిల్లర భావనారాయణరావు; ప్రచురణ: నవ్యకళా సమితి, శంకర వీధి సికింద్రాబాదు, వెల రు. 0-8-0.

## ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష

రచన: శ్రీ వజ్ఝమూడి గోపాలకృష్ణయ్య: ప్రచురణ: ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు, పసుమటలంక. వెల రూ 4-0-0.

తెలుగుభాషకు వున్న వ్యాకరణదీపం చాలా చిన్నది. ప్రజలలో తరతరాలుగా పెరుగుతున్న విజ్ఞానాభివృద్ధితోపాటు భాష కూడా విస్తృతావధిని పెంపొందివున్నా ఈ గుడ్డిదీపంతోనే దాన్ని అవగతం చేసుకోటానికి ప్రయత్నించుతున్నాం. నిజానికి ఇది చాలా హాస్యాస్పదమైన విషయం. శిష్టవ్యవహారసిద్ధమై ఈనాడు జాతిలో విస్తరించివున్న భాషనంతను లక్షణబద్ధంచేసి ఒక రూపానికి తెచ్చుకోవలసి ఉంది.

ఇట్టి వ్యాకరణనిర్మాణం సాధ్యం కావాలంటే భాషయొక్క వృద్ధిపరిణామాల చరిత్ర మనకు సమగ్రంగా తెలిసివుండాలి. ఆ దృష్ట్యా శ్రీ గోపాలకృష్ణయ్యగారి యీ రచన అమూల్యమైనదిగా వుంది.

చిన్నయసూరి బాలవ్యాకరణపు కొలబద్దతో కొలిచి పోతనాది మహామహులు వాడిన భాషను సహితం లక్షణ యుక్తమైనదికాదని కొట్టి పారేసే వరకూ పోయింది మన గుడ్డిమాపు. ఈ గుడ్డిమాపును ఆధారం చేసుకుని సంస్కరణపేరుతో ప్రాచీన మహాకవుల ప్రయోగాలను చెడదిద్ది వాఙ్మయ ప్రపంచంలో అయోమయస్థితిని కలిగించిన 'తిరుబొల్డ్స్' ఈనాడు ఎందరో ఉన్నారు. ఇట్టిస్థితి యేర్పడటానికి కారణం భాషాశాస్త్ర విషయికమైన కృషిలోపము నే చెప్పాలి.

తెలుగుభాషకు వ్యాకరణనిర్మాణం చెయ్యటానికి పూనుకున్నవారే బహు కొద్దిమంది. వారైనా కౌముదిని దృష్టిలో పెట్టుకుని దానికి నకలుగా వుండేలాగు తెలుగుకు వ్యాకరణాన్ని నిర్మించ ప్రయత్నించారేగాని తెలుగుభాషయొక్క స్వరూప స్వభావాలను గాని దాని ప్రయోజనాలను గాని దృష్టిలో ఉంచుకొని చేసిన ప్రయత్నాలు లేవు. వ్యాకరణ నిర్మాణస్థితి ఇలావుండగా, ఈ భాషయొక్క వృద్ధి పరిణామములను తెలిపే సరియైన భాషాశాస్త్ర నిర్మాణమే జరుగలేదు. శ్రీ గోపాలకృష్ణయ్యగారు రచించిన ఈ గ్రంథాన్ని పరిశీలించితే అట్టి భాషాశాస్త్ర నిర్మాణానికి ఒక ప్రాతిపదిక యేర్పడినట్లు మనకు అవగతమౌతుంది.

'ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష' అనగానే శ్రీ గోపాలకృష్ణయ్యగారు, ప్రాచీన కవులలో గల, లాక్షణికు లంగీకరించని ప్రయోగాలను జాబి

తాగా యిచ్చారు కాబోలునని భ్రమ కలుగుతుంది కాని ఈ గ్రంథంలో జరిగిన ప్రయత్నం అదికాదు ప్రాచీన వాఙ్మయంలో వున్న వ్యావహారిక భాషను దాని స్వరూప పరిణామాలనూ ద్యోతమానం చేయటంలో శ్రీ గోపాలకృష్ణయ్యగారు ఒక శాస్త్రీయ పద్ధతిని అవలంబించారు. దానికి వీరు "ధ్వని—లిపి—పరిణామం" అని నామకరణం చేశారు. ఈ సూత్ర నామాన్నే వీరు గ్రంథానికి కూడా నామాంతరంగా వుంచారు. ఉచ్చారణ సౌలభ్యాన్ని బట్టి జన వ్యవహారంలో భాష ఎలా ఎలా మారుతున్నది? వ్యవహారంలోవున్న భాషను కవులు యెలా గ్రంథస్తం చేస్తూవచ్చారు. లాక్షణికులు ఈ భాషను యెలా సూత్రబద్ధం చేస్తూవచ్చారు? ఒక దశలో గ్రంథస్తమూ సూత్రబద్ధమూ అయిన శబ్దాలు తిరిగి అనంతర దశలో జన వ్యవహారంలో యెలా పరిణామాలు పొంది తిరిగి గ్రంథస్తము లవుతూవచ్చాయి?—ఈ మొదలయిన విషయముల నన్నిటినీ పరిశీలించి గంభీరమైన విమర్శచేసి భాషాస్వరూపాన్ని సువ్యక్తంచేశారు.

అచ్, హల్ వర్ణక్రమాన భాషలోని వర్ణములు, సంయుక్తాక్షరములు వ్యవహారంలో యే కాలంలో యే యే రూపాలను పొందాయో ఆయా రూపాలను కవులూ లాక్షణికులు యెలా స్వీకరించుతూ వచ్చారో విస్పష్టం చేశారు.

ప్రాచీన వాఙ్మయంనుంచి వీరు ఎత్తి చూపుతున్న ప్రయోగాలను పరిశీలించితే శ్రీ గోపాలకృష్ణయ్యగారు ఈ గ్రంథరచనకు చేసినకృషి యెంత మహత్తరమైనదో మనకు బోధపడుతుంది.

కీ|| శే|| గిడుగు రామమూర్తి పంతులుగారు వదలివెళ్ళినపనిని గోపాలకృష్ణయ్యగారు చేపట్టి దానిని ఫలితానికి తేవటానికి ప్రయత్నించుచున్నారు. వీరు వ్యావహారిక భాషా వ్యాకరణాన్ని కూడా నిర్మించి ఉన్నట్లు తెలుస్తుంది. ఆ గ్రంథంకూడా త్వరలో వెలువడగలదని ఆశించుచున్నాము. తె. సూ.

## జీవనరంగం

నాటికలు: (రెండు సంపుటాలు):

ప్రచురణ: దేశోద్ధారక గ్రంథమాల, 3-5-1027 నారాయణగూడ, హైదరాబాదు. వెల: ప్రథమ సంపుటము రూ 1-12-0. రెండవ సంపుటము: రు. 1-12-0.

ప్రథమ సంపుటంలో శ్రీయుతులు మల్లికార్జున్, ధరణికోట శ్రీనివాసులు, పొట్లపల్లి రామారావు, పోతుకూచి సాంబశివరావు, వట్టికోట ఆళ్వారుస్వామి, పల్లా దుర్గయ్య, కనుమతరెడ్డి నారాయణరెడ్డి, దివాకర్ల వేంకటావధానిగార్ల రచనలు ఎనిమిది వున్నాయి.

రెండవ సంపుటంలో శ్రీయుతులు ఏ. ఆర్. కృష్ణ, దాశరథి, భాగి నారాయణమూర్తి, వెంకటాచార్యులు, డి. రామలింగం, సి. నారాయణరెడ్డి, శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగార్ల రచనలు 7 వున్నాయి ఒక్కొక్క రచయితలో ఒక్కొక్క ప్రత్యేకత వుంటుంది గనుక, ఈ సంపుటాలు రెంటినీ సేకరించుకుంటే 15 మంది ప్రసిద్ధ రచయితల అభిరుచుల వైవిధ్యాన్ని మనం అవగతం చేసుకోవచ్చు.

## యాజ్ఞవల్క్య చరిత్రము

ఘట్టుప్రభు ప్రణీతము: ప్రచురణ శ్రీ లింగంగుంట వెంకటసుబ్బయ్యగారు; 4 లైన్, బ్రాడీపేట, గుంటూరు. ఘట్టుప్రభువు 1730—1780 ప్రాంతముల వాడు. ఈ కవి యితర కృతులు సత్యభామా విజయము (ద్విపద), సురాభాండేశ్వరము, కుచేలోపాఖ్యానము. యాజ్ఞవల్క్య చరిత్ర మూడు ఆశ్వాసముల ప్రబంధం. ఘట్టుప్రభువు గొప్పపండితుడు ప్రాచీనాంధ్ర కవులలో ఒక ప్రధానమైనస్థానం అలంకరించుతున్నవాడు. ఈ రచనను ఉద్ధరించి యిచ్చిన శ్రీ లింగంగుంట వెంకటసుబ్బయ్యగారికి ఆంధ్రులు కృతజ్ఞులు.

## శ్రీహరిరావు కథలు

(కథా వాహిని : 8)

ప్రచురణ: ఆదర్శ గ్రంథమండలి విజయవాడ: వెల 1-0-0 ఈ సంపుటిలో శ్రీ పోలవరపు శ్రీహరిరావుగారు రచించిన ఆమె చూపులు, ఎంతో చోద్యం, అనసూయ, సీతాపతి, కర్మిష్ఠి, విరిగిన మనస్సు, కస్తూరివారు, ఇల్లరికపు అల్లుడు, లకలుకలు, మంచివాడు, జారుడు నేల అనే, 11 కథలున్నాయి.

## శారద కథలు

(కథా వాహిని : 9)

ప్రచురణ: ఆదర్శగ్రంథమండలి, విజయవాడ-2 వెల రూ 1-0-0.

'శారద' అనే సంకేతనామంతో ఆంధ్ర పాఠకలోకానికి సుపరిచితులైన కీ|| శే|| నటరాజన్ రచించిన పరిష్కారాలు, కళారాధకుడు, ఎగిరే పళ్ళెం, జీవితసారం పరోపకారం, అవసానం, కౌముది, శవం విలువ అనే 8 కథలున్నాయి. బీదవల జీవితసమస్యలను వ్యక్తీకరించటంలో శారద ప్రత్యేక ప్రాభవాన్ని చూపారు.

Printed & Published For Nageswara Rao Estates Ltd., by S. Radhakrishna,
at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1.
Editor: S. Sambhu Prasad.

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

ఫిబ్రవరి 1956

: సంచిక 2

సంపుటము 33 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1956



ఉజ్ బెక్ నట్టువరాండ్ర సమ్మోహన నృత్యం

# తెలుగు పొలము

## శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

కమలని లేతనవ్వుల నిగారము జిల్కఁగ లేచి ముంగిటన్
గమగమ గోమయాన్వితముగా నుదకంబులు, పూలు జల్లి యం
దముగను ముగ్గువైచి నిజధామము దీర్చుచు పూర్వసంప్రదా
యములకు గౌరవం బొసగు నావిడ తెల్గుకుమారి గావలెన్!

తొలి తెలి కాంతి తూరుపున దోఁపగ నేత్రములల్లవిప్పి, యం
జలి నిజమాతృపాదమున సన్నిధిసల్పి, గురూపదిష్టముల్
సలలిత కావ్యజాలములు శాస్త్రములున్ గొని వల్లెవేయ మం
జుల మృదుకంఠ నిర్గళిత శోభలు చల్లెడు నాంధ్రబాలుఁడా?

కనుగవ వాల్చి భక్తి తొలుకాడ నమస్కృతి సల్పి వల్లకిన్
గొని మృదులాంగుళీచలిత కోమల తంత్రులు మ్రోయ గానవా
హిని బారలించి యీ జగతినే మఱపించి, కళానురక్తి నె
మ్మనముల నుద్ధరించెడి సుమాంగి తెలుంగుల గేస్తురాలగున్ !

పొలములవైపు నెద్దులను బోవగదోలుచు కాడికట్టి, యీ
హాలము భుజాగ్రసీమ నిడి, యాదల కుచ్చుల తీవిపాగతో,
మలయ సమీర వీచికలు మై సొగ్గియింపగ నేలపాటయై
గులుకు కుమారకర్షకుని కోమలహాసము పండెపంటయై !

అరుణ కరప్రసార ముదయం బగుచోట సువర్ణకాంతులన్
బరపుచు దేవతానిలయ పార్శ్వములన్, గుడిగోపురంబులన్
విరిసరులెల్ల గ్రుచ్చినటు వింతలు వింతలు దోపజేయు నీ
తెరువులు ముద్దుగొల్పెడిని తెల్గుల శిల్పవిలాసవీథులా?

# ఇల్లు కొన్నాడు

శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

వర్షాకాలం; నిన్నటినుంచీ ముసురుగావుంది. ఇవాళ ఉదయం తుంపరగా ప్రారంభమై మధ్యాహ్నానికల్లా మరీ జోరయింది వాన.

అప్పటిదాకా నిద్రపోయి, వాన ఎలావుందో చూద్దామని ముందుగదిలోకి వచ్చిన చిదంబరానికి తెరిచివున్న కిటికీలోంచి వాన జోరు గోచరించింది. పొరపాటుచేత కిటికీ తలుపులు తెరవబడి వున్నాయి. పడమటి జల్లుకు గది కొంత భాగం బాగా తడిసిపోయింది. పంచా, చొక్కా తడుస్తున్నా లెక్క జేయకుండా, వెళ్లి తలుపులు మూశాడు.

వాన తగ్గలేదు. ఇంకా తగ్గలేదు. ఇప్పుడు నాలుగయింది. ఇంకా కొంచం సేపటిలో అయిదు, మరికొంతసేపటిలో ఆరు. అంతలో చీకటి పడుతుంది. రాత్రి ప్రారంభమౌతుంది. తిరిగి రేపటి ఉదయం వరకు ఏపనీ చేయటానికి వీలులేదు.

రెండు మూడు నిమిషాలు ఆయన విసుగ్గా ఆలోచిస్తూ నిలబడ్డాడు. అంతలో టప్‌మని ఒక నీటి బిందువు సరిగ్గా నెత్తిమీదపడింది. వెను వెంటనే యింకొకటి. గ్రహించి, తలపైకిఎత్తేలోగా మరొకటి. తలఎత్తి చూశాక యింకా ఒకటి; సరిగ్గా యీసారి నోటిలోకి వచ్చిపడింది. తెరిచివున్న నోట్లోకి.

ఛీ. చీదరగా ఆయన రెండడుగులు యివతలకు వేశాడు. ఈసారి భుజం తడిసింది. విసుక్కుని అవతలకు వెళ్ళాడు. ఈమారు వీపు తడిసింది చినుకులు! చినుకులు! చినుకులు! గదంతా కురుస్తోనేవుంది. ఎటువెళ్లినా తడిశాడు. నేలంతా తడిసిపోతోంది. గోడల మీదుగా నీళ్లు కారిపోతున్నాయి. పైకప్పు అంతా తడిసి ముద్దయింది.

పూర్తిగా తడిసిపోయి కోపంగా లోపలకు వచ్చాడు. ఇల్లంతా నిర్మానుష్యంగా వుంది. మూడే గదులు మొత్తం. ముందుగది గతి అలావుంది. మధ్య హాలు ఒకమాదిరి పరవాలేదు. మళ్ళీవంటగది ఎంతో సేపు విడిచినట్లు చెమ్మగిలివుంది.

మధ్య హాల్లో పరిచివున్న చాపమీద మళ్లీ పడుకున్నాడు చిదంబరం.

నీళ్లు! నీళ్లు! నీళ్లు! ఎక్కడ చూసినా నీళ్లు యీ యింటినిండా. ఈ యింట్లో నేకాదు. యాభయి అయిదేళ్ళ వయస్సు తనది. పుట్టి బుద్ధెరిగాక యింతకంటే మంచి యింట్లో ఎప్పుడూ వుండలేదు. తన జీవితమంతా యింతవరకూ అద్దెయిళ్లలోనే బ్రతికాడు. ఇన్నాళ్ళూ అద్దె యిళ్ళ బ్రతుకుకే అలవాటు పడిపోయాడు. గదుల్లోకి ఎండ వచ్చినా సహించాడు. నీళ్ళు కురిసినా భరించాడు. ఖాళీచేయమన్నప్పుడు ఖాళీచేశాడు. ఎన్నో యిబ్బందులు పడ్డాడు. కొన్ని పదుల ఇళ్లు మారాడు. ఏనాడూ ఏ యింటిమీదా తనకు స్వాతంత్ర్యం లేదు.

“ఈ యిల్లు నాది. నా ఇష్టం వచ్చినట్లు చేసుకుంటాను” అని యెన్నడూ అనుకున్న పాపాన పోలేదు.

“ఇది అద్దె యిల్లు—అద్దె యిల్లు” ఎప్పుడూ యీ భయమే.

రాత్రిళ్లు ఎక్కువసేపు లైటు వెలిగిస్తే యింటి యజమాని వచ్చి దెబ్బలాడాడు.

తన దగ్గర ప్రయివేటు నేర్చుకునే పిల్లలు కొంచం గొడవచేస్తే యింటి యజమాని ఆ యిల్లు ఖాళీ చేయమన్నాడు.

కొన్ని కొన్ని ఇళ్లలో యిష్టం వచ్చినప్పుడు బయటకు వెళ్లటానికి వీలులేదు. ఇష్టం వచ్చినప్పుడు లోపలకు రావటానికి వీలులేదు.

ఎదురింటి వాడితో జగడాలు, ప్రక్క యింటి వాడితో విరోధాలు, పంపుదగ్గర దెబ్బలాటలు, అద్దె దగ్గర దెబ్బలాటలు.

ఆజ్ఞలు, అసూయలు, వైషమ్యాలు, పగలు.

ఇంకా ఎన్ని? ఎన్ని?

ఆ దృశ్యాలన్నీ ఈనాడు తలలో తిరుగుతున్నాయి ఎన్ని యిబ్బందులు పడ్డాడు! ఎందుకు పడ్డాడు? తనకు అద్దె ఎక్కువ యిచ్చే తాహతు లేదు. చిన్న యిళ్లే తీసుకోవాలి. చౌకబారు యిళ్లలోనే కాపరం చెయ్యాలి. సరిపోకపోయినా సరిపెట్టుకోవాలి.

# ఇల్లు కొన్నాడు

యాభయి అయిదేళ్ళ జీవితం తనది. నిన్నగాక మొన్న ఉద్యోగం నుంచి రిటైరైన జీవితం తనది.

ఉద్యోగమే; బతకలేని బడిపంతులు పని.

అయిదు వేలు అందిచ్చి తనను వదిలిన బడిపంతులు పని.

ఇన్నాళ్ళయాక, జీవితం యింత మొద్దుబారాక, అద్దె బ్రతుకు అలవాటు పడ్డాక మనసు ఇప్పుడెందుకో తిరగబడుతోంది. ఉద్యోగంనుంచి స్వేచ్ఛ లభించింది. ఇహముందు ఈ మనిషి తెల్లవారు ఝామునే తప్పనిసరిగా మేలుకోనక్కర్లేదు. కాలకృత్యాలు తీర్చుకుని ఆదరాబాదరాగా నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని, రెండుమైళ్ళ దూరం కాళ్ళీడ్చుకుంటూ నడవనక్కర్లేదు. అధికార్ల చీవాట్లు తిననక్కర్లేదు. రాత్రుళ్లు పన్నెండు వరకూ మేలుకుని కాంపోజిషన్ పుస్తకాలు దిద్దనక్కర్లేదు.

అంతటితో ఆగక మనసు ఇంకా స్వేచ్ఛ వెదుకుతోంది. అద్దె బ్రతుకుకు స్వస్తి చెప్పాలని చూస్తోంది.

తనూ ఓ యిల్లు కొనాలి.

చిదంబరానికి మేనంతా ఒక్కసారిగా గగుర్పొడిచింది. ఎంత తియ్యని అనుభూతి!

నిన్న తన స్నేహితుడు; అతనికీ తనకీ పాతికేళ్ల స్నేహం; అతనిది బ్రతికిచెడ్డ జీవితం — తన దగ్గరకు వచ్చి:

నా కో సహాయం చెయ్యాలి?"

"ఏమిటది?"

"చేస్తావా?"

అప్పుడే భయం వేయటం మొదలు పెట్టింది. ఏం సహాయం చేయగలడు తను? అశక్తుడే.

"చెప్పు" గొణుగుతున్నాడు.

"నాకు డబ్బు కావాలి"

"ఎంత?"

అతను వికటంగా నవ్వి అన్నాడు. జుట్టు నెరసినా, శరీరం ముడతలు పడినా, జ్వరం పీడిస్తూన్నా అతని నవ్వు యింకా యౌవనపు తీవితోనే వుంది. బ్రతికిచెడ్డవారి నవ్వులు అలానే వుంటాయి కాబోలు.

"నాకు ఎంత అయినా అవసరం వుంది. కాని అంత నా కెవ రివ్వగలరూ?"

కాని తను కొంత అయినా యివ్వలేడు గా—

"నా దగ్గ రెక్కడుంది?"

"విను" అంటూ వచ్చిన స్నేహితుడు తాపీగా అన్నాడు: "మా తండ్రి తండ్రి రాజాబ్రతుకు బ్రతికాడు. మా తండ్రీ అంతే. నేనూ అంతే. కాని వాళ్ళంతా రాజాచావే చచ్చారు. కాని నాకా అదృష్టం లేకపోయింది. నా ఆస్తంతా యిప్పటికే నశించింది. ఒక్కొక్కరోజు తినటానికి తిండికూడా వుండదు. నా గుస్తులు మాయగా ఎప్పుడైనా నువ్వు చూశావా? ఇప్పుడూ చూడవు. లోకానికి దరిద్రుడిగా కనిపించటం భరించలేక యిలా దొంగబ్రతుకు బ్రతుకుతున్నాను. నువ్వు నా ఆప్తమిత్రుడివి కాబట్టి చెబుతున్నాను. నీ ముందు నేనెటువంటి రహస్యమూ దాచను. నీ ముందుమాత్రం నాకు సిగ్గు, అభిమానం లేవు. చంటిపిల్లకు జబ్బుచేస్తే నిన్న మందు యిప్పించేందుకుకూడా చేతిలో దమ్మిడీ లేకపోయింది. కంఠస్వరం వొణుకుతోంది. వేడి నిట్టూర్పు చలిగాలిలో కలిసిపోయింది. ఈ బ్రతుకు దుర్భరంగా వుంది. పదిమందిలో నా పరువు ఎలా పోగొట్టుకోను? ఇహ యీ వూళ్లో నిలవలేను. నాకు...నాకు...మిగిలింది ఒక్క యిల్లే. అది అమ్మేద్దామనుకుంటున్నాను"

భుజా లెగురవేశాడు తను. ఏం చేయగలడు తను?

"పరాయివాడికి బేరం పెట్టి నా పరువు ప్రతిష్ఠల్ని వేలం వేసుకోలేను. నువ్వే నన్ను కాపాడాలి?"

విమాశ్చర్యం? ఎటువంటివాడు తననివచ్చి బ్రతిమాలుతున్నాడు? కాపాడగలిగేశక్తి తనకు వుందా?

"నీకు ప్రావిడెంట్ ఫండ్ వచ్చిందికదూ"

తలవూపక తప్పలేదు.

"ఎంత?"

"అయిదు వేలు"

"నేను చెప్పేది బాగా ఆలోచించు. నా యిల్లు నువ్వు చూశావుగా. దాని ఖరీదు యెంత చేస్తుందో కూడా ఆలోచిస్తే నీకు తెలియకపోదు. ఇంకా మూడు వేలు యెలాగయినా సంపాదించు. నీకిచ్చేస్తాను"

"నాకెందుకు యిల్లు?" అని గొణిగాడు.

"ఎందుకేమిటి? ఈ రోజుల్లో స్వంత యిల్లు వుండటంకన్న వేరే సౌఖ్యం ఏముంది? నాలో నమ్మకముంటే నా మాటల్ని విశ్వసించు. నాకు వేరేగత్యంతరం లేక యిల్లు అమ్ముకుంటున్నా కాని, మరేం లేదు. నేను యెటువంటివాడినో నీకు తెలిసి వుండకపోదు. నన్ను బహిరంగపరచి, నలుగురిలో నవ్వులపాలు చేయడం నీకు యిష్టమా ఏమిటి?"

తల అడ్డంగా తిప్పాడు.

"మరి? బేరానికి పెడితే నేను చెప్పిన ధరకన్నా యింకో రెండుమూడు వేలు యెక్కువ రాకపోవు. కాని నా పరువూ, మర్యాదా..."

ఎప్పుడూ యిదేమాట. ఈలోకంలో యితనికి యీ రెండే ప్రీతిఅయిన పదార్థాలు కాబోలు.

"ఏమంటావు?"

ఏమనాలి? ఈడబ్బు వచ్చినదగ్గరనుంచీ యేం చెయ్యాలో తనకూ బోధపడటంలేదు. వడ్డీకి తిప్పమని ముందు అనుకున్నాడు. కాని ఆ వ్యాపారం తనకేం చాతవును? తనదృష్టిలో ఇంకా రెండుమార్గాలు వున్నాయి. ఏమీ పాలుపోవటంలేదు. భార్యసలహా తీసుకోటానికే భయం. ఆడవాళ్ల తెలివి తేటల్లో తనకంత నమ్మకంలేదు. ఇప్పుడు హఠాత్తుగా యీ చిరకాలమిత్రుడు నూతన సమస్య తెచ్చి పెట్టాడు. ఇందులో లాభంవుందో, నష్టంవుందో తనకేం తెలుసు? వ్యవహారాలు తనకు అంతగా తెలియవు.

"ఆలోచించాలి"

"ఆలోచించు. ఒకగంటసేపు టైముఇచ్చాను." బ్రతికి చెడినవాళ్ల మాటలు ఇలా నేవుంటాయి కాబోలు.

"గంటా?" అని తెల్లబోయి "కాదు, రేపు చెబుతాగా" అని అప్పటికి తప్పించుకున్నాడు.

"రేపుసాయంత్రం మీయింటికి వస్తాను. అర్జంటయిన విషయంసుమా."

"ఎందుకూ? నే నేవచ్చి ఏ సంగతీ చెబుతాను."

అతను వెళ్ళిపోయాడు.

రాత్రంతా ఆలోచనలు. ఒకొనొక పెద్దసమస్య: ఎలా పరిష్కరించాలి. ఆ మాటలు స్నేహితుడి నోటిలోంచి విన్నప్పుడు ఎక్కువ చలించలేదుగాని, లోతుగా ఆలోచించిన కొద్దీ ఊహలన్నీ హాయిగా, తీయగా వున్నాయి. స్వంతయిల్లు. ఇన్నాళ్లకు ఓ స్వంతయిల్లు. ఎడాతెరిపీ లేకుండా అద్దెయిళ్ళలో గడిపిన వ్యక్తికి, స్వంతయిల్లంటూ రావటం వింత అనుభూతే. మొదట కొద్దిగా భయం, తరువాత ఆందోళన, ఆ తరువాత కుతూహలం, యింకా తరువాత ఆనందం యివన్నీ కలుగుతున్నాయి.

ఇన్ని మెట్ల తరువాత వుంది ఆనందం. ఇంటి యజమాని అయితే అంత ఆనందమూ అనుభవించ వచ్చన్నమాట.

చివరకు కొందామనే కోరికే బలమవుతోంది. కాని అంతడబ్బు తను భరించగలడా? మూడువేలు అప్పు. అసంభవం.

రాత్రంతా కలిగిన ఆలోచన ఫలితమే యీనాటి యీ దృఢనిశ్చయం. అందుకే యీ ఆదుర్దాను అణుచుకోవటం కష్టంగావుంది. పాడువర్షం పగసాధిస్తోంది. ఈ వానలో ఎలా తడిసి, బయటకుపోయి అతనికి యీ విషయం వెల్లడించటం.

ఒక్కరోజులో పుట్టి పెరిగిన వాంఛకు ఎంత బలం? తనని యింత ఆకర్షణలో పెట్టిందే. మిగత విషయాలపట్ల శ్రద్ధను పూర్తిగా విస్మరింప చేసిందే.

అంతేకాదు. ఎన్నడూ యింత చిరాకుపడలేదు. ఈరోజు యీ అద్దెయింటిమీద ఎనలేని అసహ్యం కలుగుతోంది.

ఈ యింట్లో పంపులేదు. బావినీళ్లేగతి. ఎలక్ట్రిసిటీ లేదు. వానవస్తే యిల్లంతా తడుస్తుంది. చెప్పలేని యిరుకు. ఇన్నాళ్లు యీ యింట్లో తనూ, భార్యాపిల్లలూ యింతమంది ఎలా కాపురమున్నారు?

అమ్మకానికి వచ్చిన యిల్లు తనకు పరిచితం. ఇంతకు మూడురెట్లు వుంటుంది. డాబాయిల్లు ఎలక్ట్రిసిటీ, పంపు యీ సౌకర్యాలన్నీ వున్నాయి. మంచి లొకాలిటీ. ఇంతకన్నా ఏంకావాలి? అంతేకాదు. తాము కాపురముండగా మరొకరికి అద్దెకుకూడా యివ్వవచ్చు.

ఏమిటి? తనుయిల్లు అద్దెకు యిస్తున్నాడా?

వళ్లు పులకరించింది. ఆనందబాష్పాలు రాలటానికి అట్టే వ్యవధిలేదు. ఎంతటి ఘనకార్యం చేయబోతున్నాడు? తను ఓయింటియజమాని అవుతున్నాడు. తనయిల్లు అద్దెకిస్తున్నాడు. తన చుట్టూ అద్దెకిమ్మని అనేకమంది ప్రాధేయపడుతూ తిరుగుతారు. ఎంత కథా? ఎంత కమామీషూ?

వీధితలుపు ఎవరో తట్టినట్లు అనుమానం కలిగింది. ఈ వానలో తన యింటికి ఎవరువస్తారనే అపనమ్మకముతో లేవలేదు. రెండు నిమిషాలాగి తలుపు మళ్ళీ అస్పషంగా మోగింది. అనుమానం తీరింది. తనతలుపే. ఆ కొట్టేవాడు స్పష్టంగా కొట్టరాదూ? ఆయన లేచి వెళ్లి, తలుపుతీశాడు. చప్పున జల్లు లోపలకు వచ్చింది. సన్నని, పొడుగాటివ్యక్తి గుమ్మంలో నిలబడివున్నాడు, చేతిలో గొడుగు.

చిదంబరం వెంటనే సంతోషంతో "ఓ లోపలకు రా" అన్నాడు. ఆ వ్యక్తి లోపలకువచ్చాక, తలుపు మూశాడు.

ఇద్దరూపోయి చాపమీద కూర్చున్నాక ఆ వ్యక్తి "ఏమాలోచించావు?" అన్నాడు.

వస్తూనే వ్యవహారంలోకి లాగుతున్నాడు. ఎంత ధీమా?

తనూ సూటిగానే మాట్లాడాలి. మొహమాటం కూడదు. స్నేహాన్ని కొంతసేపు అవతలకు నెట్టాలి. నేర్పుకావాలి.

"అంత యివ్వలేను."

"ఎనిమిది వేలు!"

# ఇల్లు కొన్నాడు

"అవును."

అతను ఓసారి వికటంగా నవ్వి "అంత ఇంటిని ఎనిమిదివేలకు తక్కువ కొనటానికి ఎలా ఆశించావు?" అన్నాడు.

"నా శక్తికి మించినపని చెయ్యలేను."

"అప్పు చెయ్యి."

"ఎంతని? మూడు వేలా? నావల్ల కాదు."

"పోనీ ఎంతకు కొందా మనుకుంటున్నావు?"

"ఆరు వేల కన్నా దమ్మిడీ ఎక్కువ యిచ్చుకోలేను."

అతను వెంటనే లేచి నిలబడ్డాడు. "ఆశకు అంతం ఉండాలి. సరే నీ ఉపకారాన్ని జీవితాంతం గుర్తుంచుకుంటాను లే. తప్పేదేముంది? నా పరువు ప్రతిష్ఠల్ని వేలం వేస్తాను" అన్నాడు.

"అది చాలా పాతయిల్లు" అని చిదంబరం హీన స్వరంతో గొణిగాడు.

"అయినా ఎనిమిదికంటే ఎక్కువ విలువే చేస్తుంది.

చిదంబరం మౌనం వహించాడు. "సరే— అయితే వెళుతున్నాను" అని అతను రెండు మూడు అడుగులు వేశాడు.

వెళ్ళిపోతున్నాడే. తన కలలు!

దురాశ పీకుస్తోంది. "పోనీ—ఇంకో అయిదు వందలు.

"లాభంలేదు"

వెళ్ళిపోతున్నాడు. చిదంబరానికి కోపం వచ్చింది. పౌరుషంతో కూడిన కోపం కాదు యిది. నిరాశవల్ల కలిగిన కోపం. దుఃఖపూరితమైన కోపం.

"నాకు అక్కర్లేదు. వెళ్ళిపో" అని అరిచాడు. మళ్ళీ అన్నాడు. "నీ స్థితే నీకు తెలుసు. ఇవతలివాడి సాధకబాధకాలు నీకు అక్కర్లేదా? అంత నిర్లక్ష్యమా? మూడువేలు నేతెస్తే ఎలా తీర్చేది?"

పోబోతున్నవాడల్లా ఆగి, వెనక్కి తిరిగి వచ్చాడు. ఎంత గాంభీర్యం ఆ చూపుల్లో! "సరే. అంగీకరించాను."

చిదంబరం సంతోషంతో లేచి నిలబడ్డాడు.

అతను చేయిజాపి "అయిదువేలు ముందు తే."

రాజా మాటలు. మాటల్లో ధీమాకు తక్కువ లేదు.

కాని చిదంబరం తట్టుకుని "నాదగ్గరెక్కడున్నాయి? బ్యాంకిలో వేశాను. రేపు ఫైసలు చేసుకుందాం. కాని...అని సందిగ్ధంతో ఆగాడు.

"ఏమిటి?"

"నాకు పదిహేను వందలు ఎవరిస్తారు?"

"ఆ పూచీ నాది. ఇంటి తాకట్టు మీదే, నీకు యిప్పిస్తాను."

"తాకట్టా?" అని చిదంబరం నివ్వెరపోయాడు.

"అవును. భయమేముంది? నిమ్మదిమీద తీర్చుకోవచ్చు?

మనసు పని చేయటం మానింది. ఎలాగూ రంగంలోకి దిగాడు. ఏం జరుగుతుందో జరగనియ్యి.

"సరే. రేపు ఉదయం వస్తాను" అని వెళ్ళిపోయాడు. చిదంబరం మళ్ళీ చాపమీద కూలబడ్డాడు. ఇన్ని ఆలోచనలను భరించటమెలా? ఒకటే... ఒకటే ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. భయాన్నీ కలిగిస్తోంది. ఇంత పెద్ద విషయాన్ని, ఎవరికీ చెప్పకుండా, స్వంతంగా, యింత తేలికగా ఎలా పరిష్కరించుకున్నాడు. ఈ ధైర్యం తనకు ఎలా వచ్చింది.?

జవాబు లేదు. జవాబు రాదు.

* * *

ముచ్చటగా మూడురోజుల్లో వ్యవహారం అంతా ముగింపుకు వచ్చింది. ఇల్లు కొంత బాగు చేయవల్సింది వుంది. అందువల్ల అప్పు రెండు వేలవరకూ ఎగ్రబాకింది. మూడోరోజుకు యిల్లు చిదంబరం స్వాధీనం అయింది.

ఈవిషయం ఆయనభార్యకూ తెలియదు. పిల్లలకూ తెలియదు. పెళ్ళికి వెళ్ళినవాళ్లు తిరిగి వచ్చేటప్పటికి కనీసం యింకో మూడురోజులు పడుతుంది. వాళ్లు యిక్కడికివచ్చి ఆశ్చర్యపోవాలి. అభినందించాలి. తర్వాత సుఖించాలి.

ఇల్లు ఖాళీ అయింది. తన చేతిలోకి వచ్చింది. దీనికి మరమ్మత్తు చేయవలసిన అవసరం వుంది. ఈపని కూడా భార్యా, పిల్లలూ వచ్చేలోగానే సంపూర్తి చేయాలి.

ఈ మూడురోజులూ ఆయన నిద్రాహారాలు లేకుండా కష్టపడ్డాడు. క్రొత్తయింటికి మరింత అందం అంటగడుతున్నాడు. చాలామంది మిత్రులువచ్చి అభినందించి వెడుతున్నారు. తనతో పనిచేసిన వాళ్లలో, తనస్నేహితుల్లో ఎవరికి వుంది స్వంత యిల్లు?

మరమ్మత్తు పూర్తిఅయ్యాక డాబామీద నిల్చొని గర్వంగా, నలువైపులా చూశాడు. ఎటువంటి పరిసరాలు!

ఇహముందు తను అద్దె యింట్లో బాధపడ నక్కర్లేదు. "ఇంకా కొన్నాళ్లు పోనీయండి" అని ఎవరికీ

ప్రాధేయపడనక్కర్లేదు. చాలీ చాలని దీపం వెల్తుర్లో చత్వారపుకళ్ళతో పుస్తకాలు చదవలేక యిబ్బంది పడనక్కర్లేదు. నీళ్ళకోసం బావిదగ్గర అవస్థపడనక్కర్లేదు. ఇహముందు తనయింట్లో నీళ్లు కురవవు. ఇహ ముందు తనకు మనశ్శాంతికి కొదవలేదు. తన పిల్లలందరూ ఒకేచాపమీదపడి దొర్లరు. ఇల్లు చాలటం లేదని భార్యవిసుక్కోదు. ఎంతశాంతి!! ఎంతహాయి? ఎంతసౌఖ్యం?

ఈ స్థితిలో వెలువడే నిట్టూర్పులో ఎంత సొగసు వుంది?

ఇటువంటిస్థితిలో నడిచే నడకలో ఎంత ఠీవి వుంది?

ఇట్టిస్థితిలో నవ్వే నవ్వులో ఎంత గాంభీర్యం వుంది?

ఎంత కమ్మని అనుభూతి? యాభయి అయిదేళ్ల తర్వాత ఎంతటిప్రయోజకుడు అయ్యాడు.

తను యిల్లు కొన్నాడు.

తను యిల్లు అద్దెకిస్తాడు.

అరోజేకాదు, ఈవిధమైన ఆలోచనతో మరో రెండురోజులు గడిచాయి. ఓరోజు ఆయన ఇదివరకటి యింటిముందు బండీవచ్చి ఆగింది. అందులోంచి నలభైయేళ్ల ముత్తైదువ, ఇరవై రెండేళ్ల యువకుడు పదహారేళ్ళ అమ్మాయి, ఇద్దరు చిన్నపిల్లలు, ఒక చిన్న పిల్లవాడు దిగారు. వాళ్లు దిగేసరికి ఆ యింటికి తాళం పెట్టివుంది.

"ఎక్కడికో పోయార్రా అబ్బాయి" అంది ఆవిడ.

అతను చిరాకుపడటం ప్రారంభించాడు. ముసలాయనకు యీ వేళకాని వేళలో పెత్తనాలు ఏమిటి? తిని యింట్లో హాయిగా పడుకోరాదూ? రాత్రంతా చచ్చీ చెడి ప్రయాణంచేసివచ్చి, యిప్పుడింటిబయట ఎవరు పడిగాపులుకాస్తారు? గొణగటం మొదలు పెట్టాడు. తండ్రి ఏమాత్రంపొరబాటుచేసినా సహించటం అలవాటులేని పద్ధతి అతనిది.

పిల్లలు ఎక్కువసేపు 'ఆకలో' అని గోలచెయ్యకుండానే, తల్లి మరింత విసుక్కోకుండానే, యువకుడి సణుగుడు తిట్లలోకి యింకా మారకుండానే చిదంబరం అక్కడికి అవతరించాడు.

"ఉత్తరం రాయకుండా యెందుకు వచ్చారే?" అన్నాడు.

"బాగుంది నిర్వాకం. తొందరగా తాళం తియ్యండి" అందావిడ. మరో రెండునిమిషాల్లో అంతా లోపలకు చేరుకున్నారు.

"ఎలా జరిగింది పెళ్ళి?" అని ప్రశ్నించాడు చిదంబరం.

"పెళ్ళికేం? నిక్షేపంలా జరిగింది! మీరు రాలేదని వాళ్లంతా ఒకటేదెప్పి పొడిచారు" అందిభార్య.

"రెండు సంవత్సరాల క్రితం అతనంతే మాట అన్నాక నాకు రా బుద్ధిపుట్టలేదు"

"చాల్లెండి. అతనింకా మనసులో ఆ విషయం పెట్టుకుని కూర్చున్నాడనే అంటారేమిటి?"అని ఆవిడ కాళ్లూ చేతులూ కడుక్కునేందుకు లోపలకుపోయింది.

తర్వాత చాలాసేపు పెళ్లి కబుర్లలో అంతా మునిగిపోయారు. చిదంబరం యింకా ఆ విషయం ఒకటపెట్టలేదు. హఠాత్తుగా వెల్లడించి వాళ్లందరినీ సంభ్రమాశ్చర్యాలలో ముంచివేద్దామని అతని ఉద్దేశం. తర్వాత ఆవిడ వంటప్రయత్నంలో మునిగిపోయింది. వంట చేస్తుంటే చిదంబరం అక్కడికి ఓసారి వచ్చిచూశాడు. పెద్దకూతురు తల్లికి వంట ప్రయత్నం చేస్తోంది. చాలీచాలని వంటిల్లు. బోలెడు సామాను. మనిషి కదలటానికి కూడా వీలులేనంత ఇరుకు. అట్లా యిబ్బంది పడుతున్న భార్య మీద చెప్పలేని జాలి పుట్టుకొచ్చింది అతనికి.

భోజనం చేస్తుండగా భార్య అంది హఠాత్తుగా "అన్నట్టు చెప్పటం మరిచిపోయానండోయి. కొంప మునిగింది?"

చిదంబరం ఉలుక్కుపడి "ఏమిటే?"అన్నాడు.

అంతవరకూ గుమ్మందగ్గర నిలబడివున్న పెద్దమ్మాయి చప్పున లోపలకు వెళ్ళిపోయింది.

"కట్నం యివ్వంగే వాళ్లు జానకిని చేసుకోరుట."

చిదంబరానికి ముద్ద మింగుడుపడలేదు. ఒక్కక్షణంలో ముఖమంతా వివర్ణమైంది. గబగబ మంచి నీళ్లుతాగి "మరి మొన్నటిదాకా అలా అనలేదుగా" అన్నాడు.

"కట్నమిస్తామంటూ వాళ్ల కింతకంటే మంచి సంబంధాలొస్తున్నాయట"

చిదంబరానికి తల తిరిగినట్లయింది. ఏమిటీ దుర్వార్త? ఇంతవరకూ కూతురి పెళ్ళిగురించి తనకెటువంటి చింతా లేదనుకున్నాడు. దమ్మిడీ కట్నమివ్వకుండా సంబంధం సిద్ధంగావుందని సంతోషించాడు. కాని చివరకు కథ యిలా అడ్డం తిరిగిందా? తన పరిస్థితి తెలిసికూడా అలా అడిగేందుకు వాళ్లకు మనసెలా వొప్పింది?

"నువ్వేమన్నావు?" అన్నాడు కీచు గొంతుకతో.

# ఇల్లు కొన్నాడు

"బ్రతిమిలాడి, భంగపడ్డాను"

"మరి, యిప్పు డెలాగ" అన్నాడు చిదంబరం దిగులుగా.

కొంచం ఆగి ఆవిడ అసలు విషయం మెల్లగా బయట పెట్టింది "వాళ్ళంటారూ? మొన్న నేకదా—— 'అకేమిటమ్మ ఆఘండ్ నోరు తిరగదు నాకు' అయిదు వేలు వచ్చిందికదా. కూతురి పెళ్ళికోసం ఆ మాత్రం ఖర్చు చేయలేడా?" అని.

చిదంబరం నెత్తిమీద పిడుగు పడ్డట్లయింది. బంధువులు అనుకున్నవాళ్లు చివరకు యింతటి కుతంత్రానికి పూనుకున్నారా? ఎంత దారుణం?

"దమ్మిడీ యిచ్చేది లేదు" అన్నాడు.

ఈయన ధోరణి చూసి, ముందు భార్య కొంచం బెదిరినా, తర్వాత తెలివిగా అంది: "మనంకూడా అలా పట్టుబడితే ఎలా? ఆడపిల్లలు కలవాళ్ళం."

"అయితే, అడుగులకు మడుగులొత్తాలా?"

"అదికాదు, నేననేది, మనం ఒక మెట్టు క్రిందవుండాలి."

"ఇవన్నీ నాకు తెలుసు. చస్తే నేను కట్నం యివ్వను"

"అంత పట్టుదల అయితే ఎలాగండీ? మన మ్మాయి పెళ్ళి కావటం మనకు ముఖ్యంకాదా?"

"అయినప్పుడే అవుతుంది. కట్నం యివ్వకుండా చేసుకు నేవాడు వచ్చినప్పుడే చేస్తాను."

"అవన్నీ కలలోని మాటలు. ఇంత దగ్గర సంబంధం వొదులుకుంటే మళ్ళీ మన తరంకాదు, దాని పెళ్ళి చెయ్యటం."

చిదంబరం విసుగ్గా "అయినా నా దగ్గర డబ్బేదీ?" అన్నాడు.

"అదేమిటి? అయిదు వేలూ..."

"ఇల్లు కొన్నాను" మానవుడు నోరు జారాడు.

వడ్డిస్తూన్న భార్య, తలవంచుకు తింటూన్న పెద్ద కొడుకూ, గోడ చాటునుంచి చాటుగా వింటూన్న పెద్ద కూతురూ ఒక్కసారిగా కొయ్యబారి పోయారు. చిదంబరం నాలిక కొరుక్కుంటున్నాడు. చెప్పక తప్పని విషయమే. ఎటువంటి పరిస్థితుల్లో చెబుదామనుకున్నాడు? ఎటువంటిస్థితిలో చెప్పాడు? ఒక్కసారిగా వాళ్ళందరి హృదయాలకూ కొరడా చురుకు అంటించాడే వాళ్ళలా తెల్లబోవటం, ఆ ముఖాల పేలవం తనకు మరీ హృదయ విదారకంగా వుంది. ఇహ యీ అన్నం నోట్లోకి ఎలా పోతుంది? ఇక్కడినుంచి తప్పుకపోయి ఎక్కడైనా దాక్కుంటే బాగుండును. ఇహ అనుకోని సంఘటనలు ఎదురౌతాయి కాబోలు. ఎటువంటి ఘాతాన్ని కలిగించే మాటలు వినిపిస్తవో!

నిశ్శబ్దం——రెండు...మూడు క్షణాలు భయంకరమైన నిశ్శబ్దం.

"ఇలా ఎందుకు చేశారండీ" అంది ఆవిడ. "నాతో ఒక్క మాటయినా చెప్పకుండా కొంప కూల్చారే."

చిదంబరానికి కోపం వచ్చింది. అసమ్మతితో కూడిన కోపం. "కొంప కూలవలేదు. కొంప కొన్నాను."

భార్య వెంటనే అందుకుంది. "ఎవరి కోసం? ఏ సుఖం కోసం?"

"ఏ సుఖం కోసమా?" చిదంబరం కటువుగా అన్నాడు. "ఇన్నేళ్ళు వచ్చాక ఆ విషయం నీకు చెప్పాలన్నమాట. ఆహా. నీ బుద్ధి చూపించావే. ఇన్నాళ్లు నా రక్తం పోసి సంపాదించాను. మీ అందర్నీ పోషించాను. వీడు పెద్దవాడయ్యాడు. ప్రయోజకుడయ్యాడు. నెలకో నూటయాభయి తెస్తున్నాడు. ఇప్పటికైనా నేను సుఖానికి నోచుకో లేదా?"

"ఎవరు వద్దన్నారు? కాలుమీద కాలు వేసుకుని కూర్చోండి మహారాజులాగా. కాని యిదేంపని? ఎవరితో చెప్పా పెట్టాకుండా?"

ఆయన యీ సారి ఆకాశ మండలానికి లేచాడు. "ఏమిటే నీవు చెప్పేది. ఈ బోడి సలహా చెబుతావ నేనా? ఆ మాత్రం తెలివి తేటలు నాకూ లేకపోలేదు. డబ్బుని ఏవిధంగా సద్వినియోగం చెయ్యాలో నాకూ తెలుసు. ఇంకా...ఇంకా..." అని గాద్గదికంగా "యిలా అద్దెయిళ్ళలో పడి వాళ్ల చేత వీళ్ల చేత మాటలు పడమన్నావా? ఎవడైనా చుట్టం వస్తే కదిలేందుకు, మెదిలేందుకు కూడా చోటు లేని ఈ కొంపలో కుళ్లి కుళ్లి జీవించమంటావా? ఇన్నాళ్లు ఉద్యోగం చేశాను. ఇంత అనుభవం సంపాదించాను. నాకు తెలుసంటావా నీకు తెలుసంటావా? కష్టపడి సంపాయించిన డబ్బుతో యిల్లుకొని అందులో హాయిగా వుందామంటే మీకు కంటగింపైందీ. ఈ సమయంలో కాకపోతే సప్త జన్మాలకైనా అటువంటి యిల్లు కొనగలుగుతామా?"

ఆ తరువాత మాటలు పెగల్లేదు. ఆ సన్నివేశంలో మరి అక్కడ నిలవగలగటం అసంభవం. అప్పుడు ఒకటే సంభవం. బయటకు నడవటం. అదే చేయగలిగాడు.

బయట తిరిగి ఆలోచిస్తూ ఆత్మవిమర్శ చేసుకుంటున్నాడు

ఎంత పని చేశాడు? ఆ విధమైన ఉద్రేకం ఎందుకు ప్రదర్శించాడు? నిజంగా అది నిజమైన ఉద్రేకమేనా? కౌజాలను తెచ్చిపెట్టుకున్నదీ కాదు. అంత కృత్రిమ ఉద్రేకాన్ని ప్రదర్శించే అవసరం తనకు లేదు. ఏదో భావాన్ని ఉద్రేక రూపంలో చూపించాడంతే.

భార్యతో యిలా మాట్లాడటం మంచిదో, కాదో తనకు తెలియదు. కాని ఆ సంభాషణ యింట్లో చాలా గొడవ లేవదీయగలదని మాత్రం ఊహించగలడు. కన్నీళ్లకు కొదవ వుండదు. ఊహ తెలిసిన ఆడవాళ్లు ఒకరికి యిద్దరున్నారు గనుక. నిజానికి ఆలోచిస్తే తను చేసిన తప్పేమిటో కూడా బోధపడటం లేదు. బహుశా కొద్ది రోజుల్లో తన మాటల్లోని సత్యం వాళ్లే తెలుసుకుంటారు.

నిజానిజాలు ఇప్పుడే బోధపడుతున్నాయి. కొడుక్కి కూడా కోపం రావటం అసహజం కాదు. ఇంటికి ఆఫీసుకూ ఎంతో దూరం. సైకిలు కొనుక్కోవాలని వాడు చాలా కాలంనుంచీ అభిప్రాయ పడుతున్నాడు. ఆ కోరిక రెండుమూడుసార్లు పరోక్షంగా తెలియపర్చాడు కూడా. ఈ విషయాన్ని తను పూర్తిగా విస్మరించాడు. మనసులో వాడు చాలా మధనపడుతూ వుండాలి.

అదీగాక భార్య యీ విషయానికీ, కూతురు పెళ్లికీ ముడి పెడుతుందని తను కలగనలేదే.

చిదంబరం ఆ మధ్యాహ్నం యింటికి పోలేదు. ఎంత అరికట్టుకుందామన్నా ఏదో తెలియని భయం వెన్నాడుతూనే వుంది. తను చేయని తప్పుకు, కొన్ని గంటల క్రితం వరకూ ఘన కార్యం అని ఉప్పొంగిన పనికి యీ క్షణంలో భయపడుతున్నాడు. బెదురుతున్నాడు. చలిస్తున్నాడు.

కాళ్ళలో మునుపున్న బలంలేదు. ఎక్కువ దూరం తిరగలేడు. మనసుకు నిగ్రహశక్తిలేదు, స్నేహితుల యిళ్లలో ఎక్కువసేపు గడపలేడు.

కాబట్టే రాత్రి ఏడు అయేసరికి తిరిగి యింటికి చేరాడు.

కొడుకు యింట్లోనే వున్నాడు. తలెత్తి తనని చూడలేదు. ఎందుకు వాడికంతకసి? వాడి మదిలో యింకా తీరనికోర్కెలు ఏమయినా వున్నాయా? మాట్లాడకుండా పోయి. కాళ్ళూ చేతులూ కడుక్కు వచ్చి పీటముందు కూర్చున్నాడు. భార్య నిశ్శబ్దంగా వచ్చి వడ్డించసాగింది. ఇద్దరిలో ఎవరూ మాట్లాడటం లేదు. జరిగిపోయిన విషయాన్ని గురించి రేపితే ఉదయంలా, తను మళ్ళీ ఎంగిలిచేత్తోనే బయటకు వడుస్తాడని ఆవిడకు భయంకాబోలు.

భోజనం అయాక, చేతులు కడుక్కొని, తువ్వాలుతో తుడుచుకుంటూండగా వెనకనుంచి వచ్చింది.

"ఏయిల్లు కొన్నారు ?" నిదానంగావుంది. కంఠస్వరం.

"గోవిందరావుగారిది."

కొన్ని క్షణాలు నిశ్శబ్దం.

"ఎంత ?"

"ఆ..." అప్పుచేశానని చెప్పటానికి నాలిక జంకింది. ఈ నిజం చెప్పటానికి పూర్తిగా అధీరుడయ్యాడు.

"అయిదువేలు సరిగ్గా."

ఆమె ఏమీ మాట్లాడకపోయేసరికి మళ్లీ తనే "ఎల్లుండి మంచి రోజు, గృహప్రవేశం" అన్నాడు.

తలవూపి ఆవిడ లోపలకు వెళ్లిపోయింది.

* * * *

స్వంతయింట్లోకి ప్రవేశించి పక్షం రోజులు గడిచాయి. మానసిక బాధలు మళ్ళీ అంతరిస్తున్నాయి. మాసిపోయిన గర్వం, ఆనందం మళ్ళీ చిగురిస్తున్నాయి.

ఓరోజు "ఈ భాగము అద్దెకివ్వబడును" అని తనే స్వంతంగా కూర్చుని ఓపిగ్గా బోర్డురాశాడు. దాన్ని గోడకు తగిలించి, దానివంక ఓసారి నిటారుగా చూసి, హాయిగా నవ్వుకున్నాడు.

ఇక రేపటినుంచీ తన యింటిచుట్టూ అద్దెకోసం మనుషులు విసుగులేకుండా తిరుగుతారు కాబోలు. తను వాళ్లని యక్షప్రశ్నలు వేస్తాడు కాబోలు. వాళ్లు అద్దె తగ్గించమని తనని బతిమలాడుతారు కాబోలు.

ఒక భాగం తన కుటుంబానికి చాలు. ఎడంవైపు వున్న చిన్న భాగం అద్దెకు యివ్వబడుతుంది.

"ఈ భాగము అద్దెకు యివ్వబడును."

ఈ భాగం తన స్వంతం. తనకు సామాన్యంగానే కనబడుతోంది. కాని కొంతమందికి యిది దాహంవేసిన వాడికి మంచినీళ్లు కనిపించిన చందాన కనిపిస్తుంది కాబోలు. దీనికోసమే వాళ్లు తపిస్తారు కాబోలు. అద్దె యిళ్ళకోసం తిరుగుతున్న వాళ్లకు యిది వెదుకబోయిన తీగె కాళ్ళకు తగిలినట్లు అనుభూతి కలిగిస్తూ, గిలిగింతలు పెడుతుంది కాబోలు.

అనుకున్నట్టుగానే ఆయన కలలు నిజమౌతున్నాయి. తీర్థప్రజలా కాకపోయినా రోజుకు ఒకరూ యిద్దరూ యింటికివచ్చి చూసి, మాట్లాడి వెడుతున్నారు. అద్దెనుపుయిరూపాయలు. ఏ మాత్రమూ తగ్గవద్దని ఒక రిద్దరు స్నేహితులు సలహాలు యిచ్చారు. ఆ ప్రకారమే కఠినంగా వుండటానికి మనసు కొంచం ఎదురు తిరుగుతున్నా పాటిస్తున్నాడు. ఇద్దరు ముగ్గురికి యిల్లు నచ్చలేదు. ఇద్దరు ముగ్గురు అద్దె భరించలే

మన్నారు. ఇద్దరు ముగ్గురు హిరణ్యాక్ష వరాలుకోరి, అయన్ని విసిగించి తిరస్కరింపబడ్డారు. తను అనుకున్న విధంగా ఎవరూ తనని హృదయపూర్వకంగా ప్రతి మిలాడక పోవటం కొంచెం బాధాకరంగానే పరిణమించింది ఆయనకు. తన దగ్గరకు అటువంటి వాళ్లు రారు కాబోలు. కొద్దిరోజులవరకూ, సరియైన వాళ్లెవరూ కుదరకపోతే చిరాగ్గానే వుంది.

చివరకు ఓ ప్లీడరుగారు ఆ యింట్లో వుండటానికి ఖాయం చేసుకున్నారు. మరో రెండు రోజులకు భార్యా, ఒక యింటర్మీడియట్ చదువుతూన్న కొడుకుతో సహా వచ్చి దిగారుకూడా.

ఈ గొడవల్లో ఆయన అప్పు విషయం మరిచిపోలేదు. నీడలా ఆ భయం అనుక్షణం వెన్నాడుతూనేవుంది. ఒకళ్ళకు చెప్పుకునే బాధకాదు. భార్యకు తెలియదు కొడుక్కు తెలియదు. కొడుకు సంపాదిస్తున్న నూట యాభయి రూపాయలతో సంసారం యీదుకురావచ్చు. అద్దె మీదవచ్చే ముప్ఫయి పదిలంగా దాయాలి. తను ఇప్పుడు అయిదుగురు కుర్రాళ్లకు ప్రయివేట్లు చెప్పుతున్నాడు. దానిమీద ఓ నలభైరూపాయలు వస్తాయి. వీటిలో ఓ దమ్మిడి ఖర్చుచేయటానికి వీల్లేదు. వీటిద్వారానే ఆ అప్పును రద్దుచేయాలి.

ఒకరోజు సాయంత్రం అలా బజారు పనిచూసుకొని వస్తూంటే బలరామయ్య కనిపించాడు. దారిలో ఆపి చాలాసేపు కబుర్లు చెప్పాడు.

"నీకేమిటోయ్? అదృష్టవంతుడివి చవగ్గా కొట్టేశావు" అన్నాడు.

లోపల సంతోషం ఉబుకుతున్నా, బయటకు తేల్చేస్తూ "ఆఁ ఏం చవక? పాతయిల్లు. రిపేర్లు చేయటానికే మూడు నాలుగువందలు అయింది" అన్నాడు.

"ఎన్నయినా అను. అదృష్టవంతుడివి."

చిదంబరం విచారంగా నవ్వి "ఏం లాభం? దీనికోసం నీదగ్గరే రెండువేలు అప్పుచేయాల్సివచ్చింది" అన్నాడు.

"దానిదేముంది? నీకు వీలయినప్పుడు తీర్చేద్దువుగాని."

"నువ్వు కాబట్టి తాకట్టులేకుండా అంత డబ్బు అప్పు యిచ్చావు, లేకపోతే నాపాట్లు ఉండేవి" అని చిదంబరం పదోసారో, పదిహేనోసారో అభినందనలు తెలియజేశాడు.

"నావిధి నేను నెరవేర్చుకున్నాను. నీమీద నాకు నమ్మకం ఆమాత్రం లేదా?"

కృతజ్ఞత నిండిన కళ్ళతో చిదంబరం చూశాడు మరికొంతసేపు మాట్లాడి తనదారిన వచ్చాడు.

ఈమధ్య భార్యకూడా ఏమీ గొడవచేయటం లేదు. మనసులో ఏమి అనుకుంటూందో ఏమో. కాని యీ యిల్లు అందరి సంతోషం కోసం కొన్నప్పుడు అందరికీ కాక సంతోషం తనకు ఒక్కడికే కావటంవల్ల కొంత విచారంగానే ఉంది. బయటకు ఆవేశాలు పొక్కటంలేదు. ఏనాడో ఒకనాడు మనసులో దాచుకున్న యీ దుఃఖాలూ, ఆవేశాలూ బయటకు విరజిమ్మవు కద?

చిదంబరం ఇంటికి వచ్చేసరికి ప్లీడరుగారి భార్యా తనభార్యా హోరాహోరీగా పోట్లాడుకొంటున్నారు.

ఆ మాటలు వినరానివి. ఇంకా విచిత్రమైనవి.

తనరాకతో యిద్దరినోళ్ళూ కట్టుబడ్డాయి. వారటూ, వీరిటూ వెంచేశారు. విశాలమైన ముందుగదిలో కొత్తగాకొన్న కుర్చీమీద చిదంబరం కూలబడి "ఏమిటే యీ దెబ్బలాట?" అన్నాడు.

"అదికాదండీ. మన పంపులో నీళ్లుపట్టుకున్నంతసేపూ వాళ్ళపైపుకు నీళ్లురావుట అందుకని మనల్ని నీళ్లు పట్టుకోకుండా వూరుకోమంటే ఊరుకుంటామా?"

"అందుకని నలుగురిలో నవ్వులపాలు అయేటట్లు అరుచుకుంటారా? అప్రతిష్ఠ వాళ్ళకుకాదు. మనకు. ఫలానా యింటివాళ్లు మంచివాళ్లు కాదంటారు."

"మీకేం? అలానే చెబుతారు. అవిడమాటలు వింటూ ఊరుకోవటం నాకు చేతకాదు."

"ఏం చాతవును? వాళ్ళింకా యింట్లో చేరి పదిరోజులు కాలేదు. అప్పుడే జగడాలా?"

భార్య గొణుక్కుంటూ లోపలకు పోయింది. తను యెంతోకాలం అద్దె యిళ్లలో నివసించాడు. ఎప్పుడూ పైచెయ్యిగా యింటివాళ్లదే వుండేదిగాని తనదిమాత్రం కాదు. ఇప్పుడు యీ యింటియజమాని తను. ఈ ఆధిక్యత ఎందుకని నిరూపించుకోకూడదు? ఒకవేళ బానిసత్వం అలవాట్రబతుకు అధికారం చెలాయించటానికి వెనుకంజ వేసినట్లు తనూ వెనక్కు తగ్గిపోవటల్లేదుకదా. మరి ఆ చొరవ రాదేం?

*　　　*　　　*

రోజులు గడిచిపోతున్నాయి ఆయన అనుకున్నవి సరిగ్గా ఒక్కటీ నెరవేరుతున్నట్లు కనబడటం లేదు. చీటికీ మాటికీ రెండువేల అప్పు కళ్ల ముందర మెదుల్తోంది. ఎవరికీ తెలియని అప్పు, ఎవరికీ తెలియకుండానే తీర్చాలి. మొదట నెలకు డెబ్బై రూపాయలు దాద్దామని అంచనా వేశాడు. కాని పాతిక రూపాయలకంటే మిగలటల్లేదు. ఎక్కడలేని డబ్బు ఖర్చు అయిపోతోంది. తన అవసరం వాళ్ళకు తెలియక పోవటంవల్ల వాళ్ల అవసరాలకు ఖర్చుపెట్టేస్తున్నారు.

కాదని అనటానికి నోరు రావటంలేదు. పెద్దకూతురికి ఎప్పుడైనా మూడు చీరెలకన్నా ఎక్కువ వున్నాయా? పెద్దకొడుకు ఎప్పుడయినా ఇంట్లోనూటపాతిక రూపాయలేశాడా? చిన్నపిల్లలు ఒక్కొక్కరికీ రెండు మూడులాగూచొక్కాలకన్నా ఎక్కువవున్నాయా? ఈ క్రొత్తరోజుల్లో అన్నీ అధికవుతున్నాయి. ఈ ప్రకారం బాకీ ఏనాటికి తీర్చేటట్లు? ఈ తన బాధను ఎవరు సర్దిస్తారు"

ప్లీడరు గారు మంచివాడేమో అని మొదట అనుకున్నాడు. ఆయన మంచితనం బొగ్గులైనట్లేవుంది. అద్దెకున్న వాళ్లలో యింత లేకి మనుష్యులు కూడా వుంటారన్న సత్యం యీనాటికి బోధపడుతోంది. తన లాగే తన భార్యా ఏ మాత్రమో అధికారాన్ని అభిలషించి వుండవచ్చు. తనవలెనే ఆమెకూడా యిన్నాళ్ళూ అద్దె బ్రతుకు బ్రతికి విసిగివుంది కదా. ఆ మాత్రం హోదా చూపించకుండా ఎలా వూరుకుంటుంది?

ప్లీడరు గారు లాపాయింట్లతో వేపుకు తినేస్తున్నాడు. రానురానూ నెత్తిమీదకు ఎక్కి కూర్చుంటున్నాడు. "ఇది యిక్కడ బాగు చేయించాలి అది అక్కడ బాగు చేయించాలి" అని ఆయన పోరు పెట్టని రోజు లేదు. అస్తమానం స్పర్థలే. ఇదేనా శాంతి అంటే? ఇదిలా వుండగా ప్లీడరుగారి యిరవై ఏళ్ల అబ్బాయి తనవంక అదోరకంగా చూస్తున్నాడనీ, వెక్కిరిస్తున్నాడనీ కూతురు తల్లితో రహస్యంగా చెప్పిందిట. ఇదేనా అద్దెకు యిచ్చినందువల్ల వచ్చే సౌఖ్యం?

ఈ దెబ్బలాటలు విని యిరుగూ, పొరుగూ వారు గుసగుస లాడుకుంటున్నారు. తాను రిటైరైన బడిపంతులు. ఫైలు లేకపోయినా ఆయన ప్లీడరు గారు. ఇరుగుపొరుగు ప్రజలంతా ఆయన పక్షం అవలంబిస్తున్నారు.

వీళ్ళంతా యీ విధంగా ఎందుకు తనమీద కత్తిగడుతున్నారో తనకు అర్థం కావటంలేదు. తనయింటి ఎదురుగా ఓ క్రొత్త నెచ్చాల మేడ వెలిసింది. ఆ మేడ కారు తనని యిదివరకు యిల్లు అడిగి తిరస్కరించబడిన వాడే. తనవంక కోరగా చూడటం, తను దారిన పోతున్నప్పుడు వెకిలిగా నవ్వుతూ ప్రక్క వాళ్లతో ఏదో గుసగుసలాడటం, యిదంతా చిదంబరం చాలా సార్లు పసిగట్టాడు.

ఇది యిలావుండగా బలరామయ్య ఎవరితోనో అన్నాడుట. "చిదంబరం కాలాంతకుడు. పదిహేను వేలు ఖరీదు చేసే యింటిని ఆరువేలకు కొట్టేశాడ"ని.

ఏమిటి?-బలరామయ్య యిలా అన్నాడా? కనిపించినప్పుడల్లా తన శ్రేయోభిలాషిలా కబుర్లు చెబుతున్నాడే. ఆ తర్వాత బలరామయ్య చాలా సార్లు కనిపించాడు. ఇంకా శ్రేయోభిలాషిలాగానే కబుర్లు చెబుతున్నాడు. చిదంబరానికి నిజానిజాలు తెలియవు. అందుచేత మెదలకుండా ఊరుకున్నాడు.

తనపై మరో బాధ్యతవుంది. పెద్దకూతురికి పెళ్ళి చేయాలి. దమ్మిడీ కట్నం యివ్వకుండా పెళ్ళి చేస్తానని భార్యముందు ప్రగల్భాలు కూడా పలికాడు? అది కేవలం బుకాయింపు క్రిందే తయారయింది. తనకేమి పరపతివుంది? తనకి ఎంతమందితో పరిచయంవుంది? పెళ్ళికొడుకులు అని పిలువబడేయువకులు ఎక్కడెక్కడ దాక్కొనివున్నారో, వెదికిపట్టుకోవటం తనకు ఎలా సాధ్యం? ఒకరిద్దరు తారసిల్లినా కట్నాలు అడిగారు. ఒకటి కాదు, రెండు కాదు. వ్యవహారం మూడు పైన వుంది. తను ఏలా తూగగలడు?

ఆనాడు బావమరిది, తన భార్యతో అంతమాట అన్నాక యిప్పుడు మళ్ళీ మొగ్గుతాడని ఆశలేదు. ఇంకా కొంతకాలం ఊరుకుంటే వ్యవహారం చేయికూడా దాటిపోవచ్చు. జానకికి యుక్తవయస్సు వచ్చిన మాట ఎవరూ కాదనరు. తన స్థితిలోవున్న వాడికి యింకా కొంతకాలం పోతే దాని పెళ్లి చేయటం కూడా కష్టమైన విషయంగా పరిణమిస్తుందనటంలో అబద్ధం ఏదీ లేదు. అన్నీ తెలిసే తను తప్పటడుగు వేస్తున్నాడు. కొడుకు ఏవిషయంలోనూ తనకు సహాయపడడు. వాడిదంతా అదో వింత ప్రకృతి. ముభావంగా వుంటాడు. గట్టిగా అడిగితే తీరిక లేదంటాడు. తను వృద్ధుడు. ఒంటరి. చొరవలేని మనిషి. ఇన్ని విభిన్న ప్రకృతులకూ, పరిస్థితులకూ ఏవిధంగా తట్టుకోగలడు?

ఇన్ని సమస్యలతో యీ మధ్య ఇల్లు కదలటం కూడా మానేశాడు. రోజుకు నాలుగయిదు గంటలు ప్రయివేటు చెప్పటంలో గడిచేది. మిగిలిన కాలమంతా ఏమీ చేయకపోవటం.

ఒకరోజు పది గంటల వేళప్పుడు పోస్టుమేన్ వచ్చి ఒక ఉత్తరం అందిచ్చి వెళ్ళాడు. చదివాడు.

బావమరిది రాశాడు. తనకొడుక్కి సంబంధాలు ఎక్కువగా వస్తున్నాయట. తాము ఏవిషయమూ సరిగ్గా తెలియజేస్తే దాన్నిబట్టి వేరే సంబంధం చూసుకుంటారుట. లేకపోతే ఎవరికి ఏమాట చెప్పాలో కష్టంగా వున్నదిట.

"నీ తమ్ముడు రాశాడు" అన్నాడు ప్రక్కన నిలబడివున్న భార్యతో.

ఆవిడ ఉలక లేదు, పలక లేదు.

"ఏమని జవాబు ఇవ్వమంటావు?"

ఈసారీ పలక లేదు ఆవిడ.

"మాట్లాడవేం?"

## ఇల్లు కొన్నాడు

మళ్ళీ మాట్లాడలేదు. అంతేగాక లోపలికి పోతూంటే ఆయన కసిగా ఆపి "ఏమిటి నీ ఉద్దేశం? ఇంట్లో నీ బాధ్యత ఏమీ లేదనుకున్నావా?" అన్నాడు.

తల ఎత్తి భర్త ముఖంలోకి ఓసారి విసుగ్గా చూసి "నాదేముంది? మీకేం తోస్తే అది చెయ్యండి" అని లోపలకు వెళ్ళిపోయింది.

చిదంబరం అంతటితో వదల్లేదు. గబగబ తనూ వెనకనే పోయి ఆవిడ భుజం పట్టుకుని ఆపి "నాకేం తోస్తే అది చేస్తే నువ్వు సంతోషిస్తావా?" అని అడిగాడు.

"ఎందుకు సంతోషించను? అన్నీ తెలిసినవారు"

"ఆక్షేపిస్తున్నావా?"

"అయ్యో కర్మ. మిమ్మల్ని ఆక్షేపించే పాటి తెలివితేటలు, ధైర్యం భగవంతుడు నాకు ఇవ్వలేదు."

"మరయితే ఏమిటి ఈ మొండితనం?"

"నేనేం మొండితనం చేశాను? అనుకుంటే సిగ్గు. చిన్నదాన్నా? చితకదాన్నా? అలా నాటకాలు ఆడడానికి."

"నాకు నీ ఉద్దేశం తెలుసులే. అన్నాడు చిదంబరం."

"తెలిస్తే యింకా ప్రశ్నించడ మెందుకు?"

"ఎలా అయినా యీ సంబంధం చేసుకోవాలని నీకు వుంది"

ఆవిడ జవాబివ్వలేదు.

"రెండు వేల అయిదొందలూ యిచ్చుకోవాలనే"

ఆవిడ మాట్లాడలేదు.

"అప్పో సప్పో చేసి, అయిన కాడికి యీ పెళ్ళి జరిగించాలి. ఏం?"

ఆవిడ పలుకలేదు.

"జవాబివ్వమని అడుగుతున్నాను"

జవాబు రాలేదు.

"జవాబివ్వటం నామర్దా అనుకున్నావా?

ఉలక లేదు, పలక లేదు.

"మాట్లాడ వేమిటే?" అని ఊచి పెట్టి ఒక చెంపకాయ కొట్టాడు. లోపలనుంచి యిందాకటి నుంచీ వింటూన్న పెద్ద కూతురు "అమ్మా" అంటూ బావురుమంటూ వచ్చి తల్లి వళ్ళో వాలకముందే, విసవిస నడిచి బయటకు వెళ్ళిపోయాడు.

ఒక వైపునుంచి కోపం, మరో వైపునుంచి దుఃఖం, ఒక వైపునుంచి ఆవేశం, మరో వైపునుంచి ఆవేదన ఆరోజంతా ఆయన్ని కాల్చుకు తిన్నాయి.

భార్యను యిదివర కెన్నో సార్లు కొట్టాడు. కాని ఆ కొట్టటానికీ, యీ కొట్టటానికీ ఎంతో వ్యత్యాసం కనిపించింది. ఇదివరకు తనకు అన్నం పెట్టడం ఆలస్యమయిందని కొట్టాడు. చొక్కా చిరిగితే కుట్టలేదని కొట్టాడు. సినిమాకి వెళదామని పేచీ పెట్టిందని కొట్టాడు. కాని ఇప్పుడో? కూతురి కోసం కన్నతల్లి హృదయం రోదిస్తూంటే కొట్టాడు. ఛీ ఛీ ఛీ తను పాపాత్ముడు. నిజంగా పాపాత్ముడే.

అయినా తన మనస్తత్వం అంత ఎందుకు అర్థం చేసుకోకపోవాలని మరుక్షణంలో కోపం కూడా వచ్చింది.

ఏమిటి అర్థం చేసుకునేది? ఏ తల్లి మాత్రం ఆసమయంలో సహనం కోల్పోదు?

చిందరవందరగా అల్లుకు పోతూన్న యిన్ని ఆలోచన్లలోనూ చీకటిలో మెరుపు మెరిసినట్టు ఆయనకు ఓ ఉపాయం తట్టింది.

తన కొడుక్కి కూడా కట్నం తీసుకుంటే?

అవును. ఆ డబ్బుతో కూతురు పెళ్ళి చేయవచ్చు.

కాని ఆలోచన యింకా అసం పూర్తిగా వుండగానే, పెదవులపై దరహాసం యింకా ఉదయించకుండానే ఎవరో అజ్ఞాత వ్యక్తి వెన్నుమీద ఛెళ్లున చరిచినట్లయింది.

ఎంత ద్రోహం తల పెట్టాడు? తన చెల్లెలికి యింత అన్యాయం చేయటానికి మనసెలా వొచ్చింది? ఆమె పోతూ పోతూ తనచేత ప్రమాణం కూడా చేయించుకుందికదా. "ఎల్లాఅయినా అనంతుడే నాల్లుడు కావాలన్నాయ్" అంది. "అలాగేనమ్మా." అన్నాడు తను. ఆనాడు చనిపోతున్న ఆ అభాగ్యురాలికి అంత ఆశ కలిపించి యీనాడు ఆడి తప్పటానికి సంసిద్ధపడతాడా? వాళ్ళూ తమలాగే బీదవాళ్ళు వీలులేదు. వీలులేదు. ఇంత ద్రోహం చేయటానికి తన అంతరాత్మ అంగీకరించదు.

కాని తన బావ మరిదీ తనకు యిదివరలో మాట యిచ్చినంత పని చేశాడు. అతను ద్రోహం చేయలేదా తనను?

అది వేరు. తను బావమరిదికాదు అతనిలోవున్న కాఠిన్యంలేదు. పదమూడేళ్ల పిల్ల అది. ఇంకో రెండేళ్ళలో పెళ్లీడుకు వస్తుంది. వాళ్ళు తమ మీదనే ఆశలు పెట్టుకు కూర్చున్నారు. ఇటువంటి స్థితిలో "కట్నం యివ్వందే చేసుకోను" అని తను వెళ్లడిస్తే వాళ్ళ గాలి మేడలు కూలిపోవా? తనకుండే యీ రోజుమండి పోతున్నట్లే వాళ్ళ గుండెలు ఆ రోజు మండి, మాడిపోవా?

లేదు. వీల్లేదు. అంత దురన్యాయం తను చేసు లా రా చేయలేడు. తను బాధ పడనీ. కష్టాల పాలు కానీ, చావనీ. ఆ అమాయకుల్ని బాధలపాలు చేయ టంకూడదు. కనీసం కొందరైనా సుఖించాలి.

తిరిగి తిరిగి, అలిసి అలిసి, విసిగి విసిగి అప్పుడు యింటివారి పట్టినప్పుడు విద్యుత్ తగిలినట్లు మరో ఆలోచన తాకింది.

"ఈ మనశ్శాంతి లేకపోవడం, యీ మనస్పర్ధలు యివన్నీ తను యిల్లు కొన్నందుకే."

ఒక్క క్షణం "నిజమేనా?" అనిపించింది.

ఎందుకు కాదు? ఆ డబ్బువుంటే కూతురు పెళ్లి చేసేవాడు. కొడుక్కి సైకిలు కొనేవాడు. ఇంట్లో యీ కలతలు వుండేవి కావు.

తను యిల్లు కొనటమన్నమాట యిన్నిటికీ మూలమైంది.

తను యిల్లు కొనకుండా వుంటే యీ అవస్థ లన్నీ వుండకుండా ప్రశాంతంగా వుండేవాడన్నమాట.

అబ్బ. ఈ ధాటికి తను తట్టుకోలేడు. రాను రానూ ఓపిక సన్నగిల్లుతోంది. ఒకొక్క క్షణంలో "పిచ్చి ఎత్తుతుందేమో" అన్న భయంకూడా కలుగు తోంది.

ఆరాత్రి చిదంబరానికి నిద్రపట్టలేదు. తెల్లవారు ఝామున కాబోలు ఓ కునుకు తీశాడు. ఇంతలో ఎవరో భుజాలమీద , చేతుల్తోతట్టి లేపితే మెలకువ వచ్చింది. కళ్ళు నులుపుకుంటూ లేచాడు.

ఎదురుగుండా భార్య. ఆవిడ ముఖమంతా వివర్ణమై, కన్నీళ్ళు తెరువాయిగా వుంది.

"ఇదిగో చూడండీ. ఈ ఉత్తరం."

చిదంబరం గబగబ చదివాడు. అది ప్రేమలేఖ. తను జానకిని ప్రేమిస్తున్నాడట. ఆమెకోసం తనహృద యంలో విశాలమైన చోటు ఖాళీచేసి వుంచాటడ. తనని కనికరించాలట. లేకపోతే బ్రతకలేడట.

చిదంబరం కళ్ళెర్రజేశాడు. "ఎవరి పని యిది?"

"ప్లీడరు గారబ్బాయి పనిమనిషిచేత పంపిం చాడు.

మారుమాట మాట్లాడకుండా ఆయన లేచి గబగబ ప్లీడరుగారి భాగంల్లోకి వెళ్ళాడు. ఆ సమయానికి అలక్ష్యంగా లేచిన పీడరుగారు బ్రష్‌తో పళ్ళుతోము కుంటూ బయటకు వస్తున్నాడు.

చిదంబరం ఎక్కువకాలం వ్యర్థం చేయకుండా "ఇదిగో చూడండి; మీ అబ్బాయిచేసిన ఘనకార్యం" అన్నాడు.

ప్లీడరుగారు ఆ ఉత్తరం ఆసాంతం చదివాడు. క్షణకాలం ఆయన ముఖం పాలిపోయినా, గాంభీర్యత తిరిగి వచ్చింది.

"మా అబ్బాయి యిటువంటి పని చేయడే?"

"అందరి తలిదండ్రులూ ఇలానే అనుకుంటారు. ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నారుగా?"

ప్లీడరు తాపీగా "మా వాడు ఇంత తొందరపడ్డా డంటే ఏదో కారణం వుండి వుంటుంది కదా" అన్నాడు.

చిదంబరం కోపం ఆపుకోలేక "ఇంకేం కారణం? ఒకటే. యౌవన మదం" అని అరిచాడు.

"అదే. ఎవరి మదం" అని

చిదంబరం ఒక్కసారిగా నివ్వెరపోయి "ఏమిటి?" అన్నాడు.

"అవునయ్యా. మీ అమ్మాయి ఏమీ అలుసు యివ్వందే మావాడు యిలా తొందరపడ్డాడంటావా?"

చిదంబరానికి మతిపోయింది. ఏమి మాట్లాడు తున్నాడో అన్న జ్ఞానంకూడా లేకుండా "పైగా యిదా? నాయింట్లో అద్దెకు వుండి నాకే ద్రోహం తలపెడతావని చూస్తున్నావా? తప్పుచేసినవాడిని దండించటంపోయి నాకే తప్పు అంటగడుతున్నావా? ఇదేనా నీవు చేయవల్సిన ప్రత్యుపకారం?" అని అరవటం ప్రారంభించాడు

ప్లీడరు వెంటనే సమాధానం చెప్పకుండా గంభీర మయిన మౌనం ధరించి నిల్చున్నాడు. ఈలోగా యిరుగుపొరుగు వాళ్ళు నలుగురూ అక్కడికి పోగ య్యారు. ప్లీడరుగారు యీ అవకాశాన్ని పూర్తిగా వినియోగించుకున్నారు. అడిగినవాళ్ళకు కాదనకుండా విషయాన్ని సవిస్తరంగా వివరించాడు.

ఆడపిల్లలకు లోకంలో పూర్తిగా న్యాయం జరుగుతుందని ఎవరయినా అంటే వాళ్ళు యీ సమ యంలో అక్కడ నిల్చుని జరిగేది పరికించవచ్చు. ఆడపిల్ల తండ్రిమీద కూడా లోకం యింత కఠినంగా యెదురు తిరుగుతుందని కలలోకూడా తలపోయలేదు.

"ఆ అమ్మాయి విషయం నాకు బాగా తెలుసును" అని ఒకరన్నారు.

"సమ్మంలో నిల్చుని వచ్చేపోయే వాళ్ళవంక ఒకటే యిదిగా చూపులు"

"ఆ అబ్బాయి తొందరపడ్డాడంటే అతనిదేం తప్పు?"

"ఆ స్థితిలో యెవరున్నా అలానే చేస్తారు."

చిదంబరానికి మతి చెడింది. ఈ స్థితిలో తన కన్నా శవం నయం. ఒక్కమాట ఆయన నోటినుంచి

పిలువలేదు. ఆవేశం, ఆగ్రహం ఎప్పుడో యెగిరి పోయాయి. మిగిలింది ఒకటే. అవమానం...అవమానం...

వెనక్కి తిరిగాడు.

వెనకనుంచి యెకయెకలు, పకపకలు.

లోపలకు వస్తుంటే గదిలో పడుకుని యేడుస్తూన్న పెద్దకూతురూ, గోడకు ఆనుకుని కళ్లు మూసుకుని నిల్చున్న భార్యా, కుర్చీలో తల పట్టుకుని కూర్చున్న పెద్దకొడుకూ లీలగా కనిపించారు. అంతే. పోయి చాపమీద పడ్డాడు.

తొమ్మిదయినా లేవలేదు. పదయినా లేవలేదు. పదకొండు, పన్నెండు, వొంటిగంటయినా లేవలేదు.

చివరకు పాదాలమీద మెత్తగా తగిలితే యెర్రబడ్డ కళ్ళు విప్పి బలహీనంగా చూశాడు.

"మీ పాదాలమీద పడి ప్రాధేయపడుతున్నాను అమ్మాయి పెళ్ళి అయేమార్గం చూడండి."

చిదంబరం ఉలకలేదు, పలకలేదు.

"డబ్బుకోసం చూడకండి. దాని జీవితం నాశనం చేయకండి."

చిదంబరం మళ్ళీ కళ్లు మూసుకున్నాడు. ఆవిడ మరో పదినిమిషాలు అలానే పడివుండి భారంగా లేచి లోపలకు వెళ్ళిపోయింది.

ఆలోచన, మౌనం, బాధ. ఆరోజునుంచీ చిదంబరానికి యిదేపని. ఇల్లు - పెళ్ళి, పెళ్ళి - ఇల్లు. ఇదే ధ్యాస.

ప్లీడరు మరో రెండురోజుల్లోనే యిల్లు ఖాళీ చేసి వెళ్ళిపోయాడు. కొన్నిరోజులు ఆ భాగం అలా ఖాళీగా పడి ఉంది. తనభాగం అది. దాని అద్దె వృధాగా పోతోంది. అంత బాధలోనూ వెళ్ళి పాత బోర్డు దులిపి దానికి తగిలించివచ్చాడు.

"ఈ భాగము అద్దెకు యివ్వబడును"

లోపలకు వస్తూంటే యెదుటి షాపులోని షావుకారు నవ్వినట్లు వినిపించింది ఆయనకు. లెక్క చేయకుండా లోపలకు వచ్చేశాడు.

ఇది మరీ విచిత్రం. ఈసారి యింట్లో అద్దెకు వుండేందుకు యెవరూ రావటంలేదు. ఒకరిద్దరు వచ్చి అద్దె యెక్కువయిందని వెళ్ళిపోయారు. ఒకరిద్దరు ఇల్లు బాగాలేదని వెళ్ళిపోయారు. ఒకరిద్దరు వచ్చి చేరుతామని చెప్పికూడా రాకుండామాయమయ్యారు. ఇంకా మరీ విచిత్రమైన సంగతి. ఒకరిద్దరు వచ్చి ఇంట్లో ఒకటిరెండురోజులువుండి "అబ్బే, దెయ్యాల కొంపలావుంది" అని వెళ్ళిపోయారు.

ఎప్పుడైనా చిదంబరం కిటికీలోంచి బయటకు చూసినప్పుడు యెదుటిషాపులోనుంచి షావుకారు విషపు నవ్వుతో ప్రత్యక్షం.

ఈ నవ్వుకూ ఆ విచిత్రానికి యేమీ సంబంధం లేదుగదా.

ఇకేనా చివరకు ఫలితం? ఇందుకోసమేనా ఇల్లు కొన్నాడు? ఈ యింట్లో సుఖం లేదు, శాంతి లేదు. ఈ యింట్లో అధికారం చెలాయించే హక్కు లేదు. కనీసం మాట్లాడేవారు లేరు. ఈ యింట్లో ఎప్పుడూ కన్నీళ్లు. ఏడ్పుమొహాలు, పెడమొహాలు.

ఒక వేళ...ఒక వేళ...ఈ యింటికన్నా ఆ పాత యిల్లే, నీళ్లుకురిసే ఆ యిల్లే నయమేమో.

అవును కన్నీళ్ళకన్నా అదే నయంకదూ.

ఆయింట్లోవుంటే యింతటి విరోధానికి సరికాదు. ఇన్నికక్షలువుండవు. ఇంతకంటే మనశ్శాంతి హెచ్చు. కూతురిపెళ్ళికి అడ్డువుండదు.

కూతురు పెళ్ళికీ, యిల్లుకొనటానికీ సంబంధం.

అంటే...అం...టే ... ఇల్లు అమ్మడానికీ, కూతురి పెళ్ళికీకూడా సంబంధం.

వళ్లు ఝల్లుమంది. ఇల్లు అమ్మటం—ఇల్లు అమ్మటానికేనా కొన్నాడు.

అంతేకాక చిదంబరానికి తనుచేసిన రెండువేల అప్పు మనోనేత్రం ముందు గోచరించింది. ఇంతవరకూ తీర్చింది వడ్డీకికూడా సరిపోదు. రెండువేలూ రెండు వేలలాగానే వుంది. ఆరోగ్యం పూర్తిగా పాడయింది. ఈస్థితిలో ఏంకష్టపడి అబాకీ తీర్చేందుకు ప్రయత్నిస్తాడు? కలలోనిమాట. ఇంకా కొన్నాళ్లుపోతే చేసిన అప్పుకోసమే యిల్లు అమ్మాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది.

ఏయింటికోసం అప్పుచేశాడో? ఆ అప్పుకోసం ఆయింటిని అమ్ముతున్నాడు.

భరించలేడు. ఈ ధాటిని తట్టుకోలేడు.

బావమరిదినుంచి బెదిరిస్తూ వచ్చే ఉత్తరాల ధాటికి తట్టుకోలేడు.

హఠాత్తుగా ఓరోజు దృఢనిశ్చయంతో చిదంబరం లేచాడు. విడిచేభార్యా, ఏడిచేకూతురూ హృదయంలో చెరిసగం పంచుకున్నారు. బలరామయ్య యింటికేసి ఫర్లాంగుదూరం నడిచేసరికి కళ్లు తిరిగాయి. శరీరం తూలింది. రిక్షాలో యింటికి తిరిగి వచ్చాడు.

ఆరోజే అనుకుంటే మర్నాడుకూడా లేవటం కష్టమైంది. లోపలినుంచి పొంగి పొర్లే ఉత్కంఠను అణుచుకోవటం కష్టంకాగా, చిన్నకొడుకును బలరామయ్య యింటికి కబురుపంపించాడు.

మరో అరగంటలో- "ఎందుకు చిదంబరం పిలిచావుట" అంటూ బలరామయ్య వచ్చాడు.

"కూర్చో"అని చిదంబరం సౌంజ్ఞ చేశాడు. మళ్ళీ కొంచం ఆగి "ఆ తలుపులు వేసెయ్యి"అన్నాడు.

బలరామయ్య తలుపులు వేసి వచ్చి చిదంబరానికి చేరువలో కూర్చున్నాడు.

"నా యింటిని అమ్మేస్తున్నాను."

"ఇదేమిటి ? ఎందుకు ?"

"అంతే. అలా కావలసి వచ్చింది. పదిమందిలో బేరం పెట్టి, ధర పెంచేటంతటి ఓపిక లేదు. నాయిల్లు కొనటం నీ కిష్టమేనా ?"

ఈ మాటలు అంటూంటే జరిగిపోయినదేదో చప్పున మనసులో స్ఫురించింది. చరిత్ర తిరుగుతోంది.

బలరామయ్య కొంచం ఆలోచించి "నాకు యిష్టం లేనిమాట నిజమే. కాని డబ్బు నీ కంత గా అవసరమైతే అలాగే చేదాం" అన్నాడు.

"ఈ యిల్లు చాలా ఖరీదు చేస్తుందని ఒకనాడు నువ్వు నాతో అన్నావు. కాని నేనేమీ లాభాలు ఆశించటం లేదు. కొన్నధరే యిచ్చి తీసుకో."

బలరామయ్య వెంటనే ముఖం చిట్లించాడు. "ఇప్పుడు యిళ్ళ ధరలు పడిపోయాయి. అదీగాక నాదగ్గర అంత డబ్బెక్కడిది?" అన్నాడు.

"ఎంత యిస్తానంటావ్?"

"అయిదు వేలకన్నా నేను దమ్మిడీ యెక్కువ యివ్వలేను."

చిదంబరం పెదవులు వొణికాయి. "నేను అన్ని విధాలా నాశనం అవుతున్నాను. నన్ను ద్రోహం చేయటానికి ప్రయత్నించబోకు బలరామయ్యా" అని గొణిగాడు.

బలరామయ్య కొంచెం ఆలోచించి "ఇంకో అయిదు వందలు. అంతకంటే నాకు శక్తిచాలదు" అన్నాడు.

చిదంబరం అయిష్టంగా తల ఊపాడు.

బలరామయ్య వెంటనే లేచి నిలబడి "అయితే నీ యిష్టం. నా శక్తి నేను చెప్పాను. నిన్ను నష్ట పెట్టుకోమని ఎవరన్నారు? వేరే ఎవరిదగ్గరైనా లాభం వచ్చేదాకా ప్రయత్నించి చూడు" అంటూ వెళ్ళిపోసాగాడు.

చిదంబరం కళ్ళలో నీళ్లు తిరిగాయి. "ఆగు" అని సౌంజ్ఞ చేసి "అయితే రేపే అన్ని యేర్పాట్లూ చేస్తావుగా" అన్నాడు.

"నేను చెప్పిన ధరకు యిష్టమేనా?"

చిదంబరం తల ఊపాడు.

"రేపు వస్తాను" అని బలరామయ్య వెళ్ళిపోయాడు. "అదృష్టం పండింది. నా బాకీకోసం రిజిస్టర్ నోటీసు యివ్వకుండానే సులభంగా పని జరిగిపోయింది" అని వెళ్ళిపోతూ మనసులో ఊహించుకుని సంతోషించడం అసహజమని ఎవరూ అనరు.

మూడు రోజుల్లో యింట్లో ఎవరికీ తెలియకుండానే పని సక్రమంగా జరిగిపోయింది. బాకీ తీరిపోనూ చిదంబరానికి మూడు వేల రెండు వందలు మాత్రం చేతికివచ్చింది.

ఆయనలో బలహీనత నానాటికీ ఎక్కువయి పోతోంది. కదలడం కూడా కష్టంగా ఉంది. ఆరాత్రి ఆయన చాలా రోజుల తర్వాత భార్యను ప్రేమతో దగ్గరకు పిలిచాడు.

"ఇదిగో. ఇలారా."

ఆవిడ చెంతకువచ్చి నిల్చుంది.

"ఇలా కూర్చో."

"కూర్చుంది."

"నా పరువు ప్రకించే డబ్బువుంటుంది చూడు"

ఆయనమాట తడబడుతోంది.

ఆవిడ తడిమి తీసింది.

మూడు వేల...రెండు వం...ద...లు."

"ఎక్కడి వండీ?"

"ఇల్లు అమ్మాను"

ఆవిడ పమిట చెంగుతో కళ్ళు తుడుచుకుంది.

"అమ్మాయి పెళ్ళి సలక్షణంగా జరుగుతుంది. వాళ్ళకు...కట్నం...యిస్తానని ఉత్తరం...రాయించు"

తర్వాత కొద్ది సేపటిలో స్పృహ తప్పింది. పెద్దకొడుకు వెళ్ళి డాక్టరును పిల్చుకు వచ్చాడు. ఆయన పరీక్ష చేసి ఇంత ఆలశ్యం ఎందుకు చేశారు? చాలా ప్రమాదస్థితిలో వున్నాడు అని చెప్పారు.

"ఏమిటి?" ఇల్లంతా ఓసారి ఉలిక్కిపడింది.

"అవును" నా చేతనైనంతవరకూ ప్రయత్నిస్తాను.

* * * *

ఆరోజు మరునాడూ గడిచింది. మూడోదినం తెల్లవారుఝామున రోగిచుట్టూ అంతా కూర్చున్నారు. ఇద్దరు ముగ్గురు బంధువులు కూడా వున్నారు.

ఉన్నట్లుండి ఆయనకు గురక పుట్టింది.

"అమ్మా" అంటూ తల్లివళ్లో తల పెట్టి బావురు మంటోంది పెద్ద కూతురు.

సరిగ్గా ఆసమయానికే బలరామయ్యగారి మనుషులు యిద్దరు వచ్చారు.

ఇంట్లో చచ్చిపోవటానికి వీల్లేదు: బయట పెట్టాలి"

ఎవరూ ఏమీ మాట్లాడలేదు. పెద్దకొడుకు కళ్ళు తుడుచుకుని బంధువుల సహాయంతో రోగిని, బయట చలిలోకి తీసుకుపోతూంటే "తల్లీ" అంది ఆవిడ కూతుర్ని బిగ్గరగా కౌగలించుకుని ఏడుస్తూ.

# విశ్వనాథవారి తార

**కుమారి మల్లాది వసుంధర**

ఒక మహాకవియొక్క కథాశిల్పనిబద్ధ నిగూఢార్థ నిక్షేపముల ప్రసన్న మొనర్పఁగొనగలుగు టనునది చాల కష్టసాధ్యమైన విషయము. అట్లు తెలిసికొను శక్తికూడ వ్యక్తియొక్క యదృష్టమును బట్టియుండును. ప్రతిభావంతుఁడైన మహాకవియొక్క కవిత్వ వైశిష్ట్య మెఱుఁగగల్గుటకు కూడ ప్రతిభ కావలయును. అసలప్పుడు కావ్యమును చూచెడి వైఖరియే వేరగును. సూక్ష్మపరిశీలనారమ్యములైన విషయములను కేవలము కథాదృష్టితో చూచినఁ జెల్లదు. అంతరమైన దీక్షమైన నిశిత విచారణమతియై చూచుటకై సర్వమనోహరత్వము శిల్పప్రాభవము గోచరించును. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి రామాయణ మీ దృష్టితో పరిశీలించదగినది. అట్లు చూచెడివారి కది సర్వనిగూఢ సుమనోహర చతురభావనా సర్వస్వము. లేనివారికి వట్టి రామగాథ. మననశీలము చేత చారువైన దేవీస్వరూపమువలె నిదియు నాలోచనాచారువైనది.

ప్రస్తుతము వారి తారయొక్క చరిత్ర చిత్రణముఁ బరిశీలింతము. తార వానర ప్రభువైన వాలి భార్య. కేవల మట్లని యూరకొన్నచో మనమామెను గూర్చి సాంతముగఁ దెలిసికొన్నవారము కాజాలము. ఆమె తనకుగ నొక ప్రత్యేక వ్యక్తివివేచనము కలిగినది. వానరరాజ్యమున నొకవిధముగ వాలికంటె తార ప్రాబల్యమే మిన్నయా యన్నట్లుండును. వాలి యెంతటి బాహుబలసంపదతిశయబుద్ధియో తారయంత రాజనీతిబలసంపదతిశయమతి. రాజ్యమున కాతని శౌర్యప్రాభవ మెంత ప్రాముఖ్యమో తార యూహావైభవ మంత ప్రధానము. ఆయన యెంతటి మహావీరుడో యామె యంత మహారాణి.

తార రాజనీతి చతుర, పరమ లౌకికురాలు, మహాయూహాశాలిని, అమిత కోపన, భర్తృప్రేమ విహ్వల, కాని భర్తృప్రేమ కన్న మిన్నయైన పుత్రప్రేమ యంతకంటెను నధికమయి హృదయగతమై జీవ సంబంధియైన రాజనీతి సంలగ్నమానసము కలది. ఆమె బ్రతుకున కెల్ల పరమార్థము రాజనీతి. ఆమె రాజనీతిజ్ఞతా చాతురిపై హనుమంతు నంతటి వానికి, వాలికి, సుగ్రీవునికి నమిత విశ్వాసము. అది లక్ష్మణుని నాశ్చర్యచకితునిఁ జేసినది. ఆమె చరిత్ర చిత్రణమున నీ గుణముల పొసఁగుదల యెట్లు కలిగినది? ఆమె యేయే చర్యలవల్ల యే సంభాషలవల్ల నామె యట్టిదని తెలిసికొనగల్గుచున్నాము? ఇంతగ నాకర్షించిన యామె రాజనీతి చాతుర్య మెట్టిది? ఇవి యన్నియు ప్రశ్నలు. వీని కన్నిటికి నీ రామాయణమున సమాధానములు నిక్షిప్తములై యున్నవి. కాని నిశిత పరిశీలనా ప్రసన్నములు.

ఈమె రాజనీతి చతురత రెండు చోట్ల స్ఫుర్తమమై కనుపట్టుచున్నది. ఒకచో వాలితోటి సంభాషణయందు, వేరొకచో లక్ష్మణునితోటి సంభాషణయందు. అందునను వాలితోనైన సంభాషణమున నీమె ప్రాజ్ఞన వాక్యమును యూహాశాలినీత్వమును వెల్లివిరియుచున్నవి.

సుగ్రీవకృతము రావమును విని వాలి యుద్ధసన్నద్ధుఁడైనాడు. అప్పుడు తార యనినమాటలు. 'మున్ను నిను యుద్ధమాడ రాబోనివాడు' యిప్పుడెందులకు వచ్చెనో! ఇందులో నేదో పరమరహస్యమున్నది. లేకున్న నాతఁ డిట్లు రెండవమారు రాఁజాలఁడు. అని మరల ననినది:

> "ప్రాంచన్నీతిపథప్రమాణధిషణా
> భావుండు తా నై విచా
> రించున్ చేయక మున్న సర్వమును
> సుగ్రీవుండు నీముందు తా
> నంచున్నిల్వగలే డెఱింగియును
> నేలా వచ్చె కవ్వించుచున్
> కించిత్తైనను చేయఁడాతఁడు వృథా
> కృత్యం బనుత్యంబుగన్."

తారకు సుగ్రీవుని చేతలపై నింత విశ్వాసము. అతఁడు ప్రతిపనియు విచారించిగాని చేయఁడట. కించిత్తైనవృథాకృత్య మొనర్చఁడట. ప్రాంచన్నీతి పథ ప్రమాణధిషణా భావుండట సుగ్రీవునిగూర్చి చెప్పుచు వాలినిగూర్చి ఇట్లనినది. — "నీకు న్నిరాదృతి నీవై యనుకొన్నదే నిజము సుగ్రీవుండునుం దోషిగా మతికిన్ దోచిన నంతియే నతని యేమాట న్నిజం బెన్నకన్"; "పండితలోక శిరోవిభూషణం బాహానుమంతు డుజ్జ్వల మహామతి; తాను రఘుప్రవీరుతో స్నేహము [illegible]

యుండఁగను గణించవు నీవు మరంత వానినిన్.”—అని వాలిని కేవలము బుద్ధి కెంత తోఁచిన నట్లు చరించు వానినిగ నేరిచి లెక్క పెట్టనివానినిఁగ చేసి మాటాడినది ఈ నిర్ణయమే శ్రీరాముడు వేరొక విధముగ జేసినాడు. సుగ్రీవుఁడు ధృతమతియై ప్రతి పనియు భగవత్ప్రేరితమైనట్లుగ జేయును. దైవమందు విశ్వాసము కలవాడు, బంధుభావమునం దధికుడు నని, వాలి ప్రతి చిన్న విషయ మాలోచించు నని, రాజభావ తీక్ష్ణుడని ప్రగమకారమునం దధికాదరుఁడని యనినాడు. మరి వీరిరువురి యభిప్రాయములయం దింత వైవిధ్యమెట్లు వచ్చినది? లోకమున నొక డొక పథకము వేయును. అది సఫలమగును. అది యట్లగు నని యతడే వేయలేదు కాని యైనది. చూచువారికా యగుటయం దాతని యాలోచనా విశేషము గోచరించును. లోకము ఫలితమునుబట్టి వ్యక్తిబుద్ధిని కొలుచును. తార పరమలౌకికురాలు. కావుననే సుగ్రీవుని చేతలో నామెకు ప్రతి చిన్న విషయ మాలోచన చేసి యొనర్చిన తన మగుపించినది. రాముని కట్టెల తోఁచలేదు? రాముఁ డతి లోకమైన యూహ కలవాడు. ఆయన వ్యక్తుల విలువకట్టు పద్ధతియే వేరు. ఆయన యత్నమునుబట్టి చూచును గాని ఫలితమునుబట్టి గాదు. తార యూహ లౌకికము. రాముని యూహ దైవికము. తార రామునిగూర్చి వాలితో ననిన మాటలలో నామె యమితమైన యూహా వైభవము గోచరించును. వాలితో నామె మున్నలేని విచారణ నిన్న నేట నేల కలిగినది. మొన్న వచ్చినప్పుడే ఏదో యున్న దని నలనీలతారు లంగదునితో చెప్పినది నీకునుఁ దెలియును. మొన్న నే యేల యేమియు చేయలేదనిన ఏదో యజ్ఞేయమైన విషయము ఘటిల్లి యుండఁగను అందులకే నేడీ రాక యనినది. రాముని శౌర్యమును గూర్చి ప్రసంగించుచు “ఆరామ వృక్షా నిలపోతిముల్ సైతి మహా యూఁడు తచ్ఛౌర్యముల్” అనినది. రాముని పేరు విన్నంతనే హృదయ మాకర్షిత మగుచున్నది. అతని స్వభావ మూహాతీతమైనది. నీకుఁగూడ నాతనియెం దేదో యాకర్షణపట్టి లాగుచున్నది. లేనిచో నీవరకే యాతనిపై కేగెడివాడవు. ఆతఁడుల్లోక సౌజన్య విస్ఫురితాత్మఖ్యుడు. అదిమహార్యునియట్లాయత ధర్మమూర్తి. అట్టివాని సహాయము సుగ్రీవునికి లభించినది. వాని యదృష్టము పండినది. యుద్ధమునకు వచ్చినాడు. అట్టి వారూరక రాజ్యము వదలి యేఁగుదురు? నీ కామమునర్మము గూడ కట్టినఁ జెల్లగించుటకుఁ గాని రారు. ఆ ధర్మలక్షణము ఆదిమ మూర్తులయినవారికే తెలియును. లోకము ప్రమాణముగ లోకులాపని నీ పనిఁజేయుదురు. దానినే ధర్మమని, దేశాచారమని యందురు. అసలైన ధర్మము — ‘నిత్యమోక్షాక్షాత్రాభిముఖంబుగా నడచు జీవాద్వైక సూక్ష్మస్థితిన్’ అని వాక్రుచ్చినది. ఆ రాముఁడైన మొదలనిటు రాడాయెను. నీకన్న శూరుఁడలిగూ సుగ్రీవుని కాతని స్నేహము లభించినది? అటని యేగను నన లేగు. కర్మపథమిట్టిదని యేర్పాటున్న కే ధరలో నని కర్మసిద్ధాంతమును చెప్పి వాలియం దధర్మ ప్రతిపాదన చేసినది. ఆ రాముడే చెట్టునో చాటుచేసుకొని నిన్ను బాణమున వధించును. నీకు నాతనికి ప్రత్యక్షవైరము లేదు. కావున నదియు మర్యాదగనే యుండఁగను. అని వాలి వధ విషయ సామంజస్యమునుగూర్చి శ్రీరాముడే యూహఁజేసెనో సరిగ నదే యూహఁజేసినది. మరల వాలికి రాజకీయపు టెత్తుఁ జెప్పినది. అయిన దెదో యైనది. భ్రాతృత నిలిపి సుగ్రీవునికి యువరాజపదము నిచ్చి రాముని రాకయే తెలియనట్లుగ నీతిని నడుపుమని. అప్పుడు రాముని పని యింక సున్నయగును. సీతను పొందుటకై యాతఁ డరణ్యసీమల నేమి యొనర్చునో మనకెందులకు? అనినది. ఆమె యంతటి సూక్ష్మ విషయ పరిశీనాచతుర.

సుగ్రీవునకు తార రాజనీతివేత్తృత్వముపైఁ బరమ విశ్వాసము అందువలననే లక్ష్మణుడు వచ్చి యంతఃపురద్వార ప్రదేశమున నిల్చి జ్యానిస్వన మొనర్చినప్పుడాతనిఁ శాంతింపఁజేయుటకై — “తారవంకగని యుదారమూర్తి! నీవు పోయి రాము సహోదరుని కోపమపనయించునట్లు లాడవలయు”ననినాడు. (ఇచ్చట “నపనయించు”నను దానికి ప్రేరణార్థమున నర్థము చెప్పుకొనవలయును.) హేతువులేనికోపము వారికి మాపైఁగల్గినది. కాబట్టి హేతువు లేదనునట్టి వేళనున్ శాంతము ఘటించి పెట్టుమని యర్థించినాడు. తార బయలుదేరినది.

> “వడి వడి తడబడు నడుగులు, మదిరా
> బంధురలోచన కాంతులతో
> నడుమున గడుసగు కనకఁపు రశనా
> నాదమనోహర కింకిణితో.
>
> నొడికపు మెలపున నొఱఁగిన మెడతో
> నుజ్జ్వలహాస రుచచ్ఛవితో
> నడతుక చనియెను రఘుకుల పతి యొ
> ప్పుంగను నిల్చిన చోటునకున్.”

సర్వాలంకార భూషితయై మనోహరముగ వచ్చినది. ఇది యామె రాజనీతికి శ్లోకీభూతమైనది. ఎదుట వచ్చియున్న వాఁడమితోగ్రక్రోధాక్షుభితమూర్తి అంతఃపుర ద్వార దేశమున వింటినారి సంధించి నిలిచినాడు. అతడు తలంచినచో కపిలోక ప్రళయమగును. సుగ్రీవునికిఁ గాలుసేతులాడలేదు. ఎదురుగ తార కనిపించినది. ఆమెను పంపినాడు. ఆమె యట్లు వచ్చినది. ఆ వచ్చుటలో లక్ష్మియొయ్యారములు పోయినది. ఆమె

రాకను చూడఁగనే లక్ష్మణుని కోపము దక్కైవదట. అనఁగా నామె యంతటి యభినయ మొనర్చినది. ఎవరును వైర విషయములందు సామరస్యమును ఘటించుటకు భార్యలను పంపరు. ఆ భావమే చాలును. పైఁ గీమె వేసము. "దీప్తాస్యనః కామినీ సారా భోగమనోజ్ఞ మూర్తి పురస్థ" యట. ఇక నాయన కోపమునకుఁ దావులేక పోయినది. ఆయన తలదించుకొని నాఁడు. తార యనినది-"మీమాట మెవరు కాదని రేమి?, వాగ్దాన భంగ మెవరాడిరి? అంతః పురద్వారసామీప్యమునందు వచ్చి జ్యాగ్రమోయింపన్" అనియు చెలికాఁడవును సమర్థుఁడ వలఘుఁడవును నీవు వచ్చి యంతిపురము ముంగిలినిలిచి నారిలాగితి చెలికారమునందైన చెల్లును గాదే" యనియు ననినది. ఈసంభాషణచే నామె యెంత మాటకారియో యెంత వ్యంగ్య భావచతురయో తేట తెల్లమగును. ఆమె జాణ; మామూలుగ లోకమునందువలె మాటాడ మొదలు పెట్టినది? మీమాట యెవరు కాదని నారని? వాగ్దానభంగ మెవరొనర్చిరి? చాల బాగున్నది. ఇంత మాత్రమునకే నా యంతిపురము ముందు నిలిచి యల్లెత్రాడు మ్రోయించితివి? నీవేమో స్నేహితుఁడవు సమర్థుఁడవు అలఘుఁడవు. ఇటువంటి వాఁడవు నీవా యంతిపురము ముందు నిలిచి నారి సారించితివి? అవును. చెలికారమున నైదైన చెల్లునుగదా యనినది. ఇందు ప్రతిమాటచేతను లక్ష్మణుని కడిగి వైచినది. వ్యంగ్యముచే నాతని సిగ్గిలఁజేసినది. అంతఃపురము ముందరకు వచ్చి నారిలాగితివని వాచ్యార్థము. స్త్రీనైన నన్ను బయటకు రప్పించితివని వ్యంగ్యార్థము. చెలికారమున నేదియైన చెల్లునని తేల్చినది. దానితోనిక లక్ష్మణు డప్రతిభుఁడైనాఁడు. తరువాత నేవో చాల మాటాడినాఁడు. చివరకు 'శాఠ్యవచోనిశుంభినా యని' నాఁడు లక్ష్మణుడు. యెదుట స్త్రీయున్నది కాన కోపమును తగ్గించుకొని మాటాడుచున్నాఁడే కాని నిజముగ నకు కోపము తగ్గలేదని తార తెలిసికొన్నది. అప్పుడు తార యుత్తోపితమానసాంబురుహ. ఆమె కనులు తెలిమక్కలై 'క్రీబెదరి చిక్కని గాఢ్సపించి డాల్లుగా' ప్రవిక్షేపము పొందెనట. ఆమె "చమూసమూహ విచయాధిక కార్యగతి ప్రయత్న విజ్ఞానసమాప్త ధైర్య గుణసంపద, కోమలమందహాస రేఖావిభ్రతాస్య, వామ పదకంజ వికస్వర హేమనూపురస్థాన విరావ కింకిణులు "సన్న విధైర్యము నాడుచుండఁగన్" మృగుతెమ సాంద్ర సుమమాలల్లభ్య రేఖామలిస్లుచగంభీర నమ్రప్రియోక్తుల వచియించెన్."

ఇచ్చట నామెకీవి యప్రతిమానమైనది. ఎదుట లక్ష్మణుని కోపము చల్లారలేదు. నిజముగ కోపము రావలసినపని సుగ్రీవుఁడు చేయలేదు. అతఁడు తన ప్రయత్నమున నప్రమత్తుఁడు. కపిసైన్యముల ప్రోగుసేసియే యుంచెను. ఇది యామెకు దెలియును. అందులకే యామె కోమల మందహాసరేఖావిభ్రతాస్యయైనది. వామపదకంజ వికస్వర హేమనూపుర స్థానవిరావ కింకిణులు సన్న విధైర్యము నాడుచుండఁగ రాయంచవలె ముగ నిలబడినది. ఆమె కాలిగ నెపమువాదము రాయక్క మంజీరప్రకువ్వలు మెల్లగ మ్రోఁగునట్లు రాయంచవలెఁగ నిలబడినది. ఆమె యూ లెక్క లేని తనము. ఆమంజీర ధ్వని సర్వము నేవో సన్న విధైర్యమును చెప్పుచున్నది. చమూసమూహ విచయాధిక కార్యగతి ప్రయత్న విజ్ఞాతసమాప్త ధైర్యగుణసంపద కాపురవే యట్లు నిలచినది. ఆమె యంతటి మహామతిమంతురాలు.

ఇంకను మాటాడుచున్నది 'భాగిణీ విదర ద్వైవతములు భవాదృశులు, సాధిపాక్ష కోపస్ఫుటాక్షచిరాత్ములు, మా కామవశతాహంబు మీకు ప్రాతయ్యెనా?' అనియు, 'మీరును మీరు పరమమిత్రులు' మీమీ మర్యాదల మైత్రికి యాకొంచెపుఁ బ్రమాద విస్మరణమున కోర్చుకొనలేరా? ఈ రాజ్యము మీరు చేసిపెట్టినది. ఆ రాజ్యము చేతఁ గల్గిన యానందము ననుభవించుచున్నప్పుడు మరల మీరే కోప మెన్నుటాశ్చర్యముగ నున్నది. మీరు ప్రకృష సత్త్వులు. ఆశ్రితావనులు." అని పరిహాసగర్భ వ్యంగ్యమాడినది. తరువాత కలమాపు చెప్పినది.

"ఎవ్వరు నిన్నెరుంగరిట యెవ్వరు నిన్నిటు రాలచెట్లతో
రువ్వఁగ నెంచిరో నిను నెఱుంగరు పాఱిట నిన్నెఱుంగరా
రెవ్వరికొకపుల్ మరియు నెవ్వరొ క్రొత్తల నేలవచ్చివా
రివ్వసుధాతలంబునకు యింకె ప్రయత్నము లేక యుం
టిమా?"

ఆ చెప్పుట యెంత సొగసుగ హృదయమునకు హత్తుకొనునటుల చెప్పినది; సాధారణముగ లోకమున నెవరైనఁ దప్పుఁజేసిన తినవారే క్షమించకున్న పనులా క్షమించుచున్నది; అధిక సత్త్వుల కల్ప సత్త్వుల యెడ నంగమునఁ బ్రీతికూటమునఁ గోపమువచ్చునా? అల్ప బలులపైఁ బ్రేమ కలిగిన నది ముద్దు జాలి నవ్వులుగ నుండును. విసువుగల్గిన నెక్కస పాటగును. కాని చింటికొప్పుపై మనస్సుపోదు. పిమ్మట పైఁ బ్రహ్మాస్త్రమా యని నచ్చఁ బల్కి మరల ననినది.—"మీరు జగదేకోజ్వల కార్ముకులు మానవకపిభక్తకంఠులై యున్నారని మేము సంతసించుచున్నాము ఈ రాజ్యమునకు వెనుక లోక కంటకుఁడైన రావణుడున్నాఁడు. రాజా మాటుటచే నాతని కిసు పెరిగినది. మీరేమో మాకు సాయముగను రముచుండఁగా మీరే విల్లు నమ్ములు పూని మాయింటి పైకి వచ్చితిరి. ఇంకేముందు నని రావణవధావిషయమును పేర్కొనినది. ఇంతదవ్వు వచ్చి యేటికి మారకేపోవ రాజు చూచి పోదుగాని" రమ్మనినది. ఇచ్చట నామె తెలివి పారము ముట్టినది. రాముతమ్ముని కస్పుత మనిపించినది. చంపునంతటి కోపముతో వచ్చిన యాతండట్లు గ్రుక్క త్రిప్పుకొనకుండునట్లు ఖట్లాడి

చివరకు యింతదాఁక వచ్చి యూరక యేల పోవలెను. రాజును చూచియే పోవచ్చుననినది. ఆమె ముందింక లక్ష్మణుడు మాటాడలేక పోయినాడు. సుగ్రీవుని చూచునంతకే కోపముకూడ నిల్వదాయనుకొనినాడు. ఆవిడ యట్టి నీతిని నెఱపినది.

లక్ష్మణుడు దంతిపురమునకు వెళ్లినాడు. సుగ్రీవుని ష్టను వచ్చినట్లు మాట్లాడినాడు. 'రుమాదులొదిగి పోయిరి. మంత్రులధోముఖులైరి. సుగ్రీవుండు నిశ్చలుండై నిలచిన తార యిట్లనియె:'

"అంత ఘోరముగ కట్టె విరిచి ప్రొయ్యిన పెట్టినట్లు మాట్లాడవలెనా? విషయము విషయముగ మాట్లాడరాదా? అప్పుడు ధర్మము ధర్మముకాదా?" ఇంత మంది యట్లు మూన్పడగా ఒక్క తారయే మాటాడుటలో నామె వైశిష్ట్యము సంభాషణా నైపుణి కామె కామెయే సాటియని తెలియుచున్నది. ఆమె తనమాట కారితనమున లక్ష్మణు ననునయించుచున్నటుల మందలించుచున్నది. సూర్యసుతుడు మీకమిత్రుడు కాడు. అజ్ఞాని కాడు. మూర్ఖుడు కాడు. కృతఘ్నుఁడు కాడు. అలజ్జుడు, అజ్ఞా నిరపేక్షు భావుడును గాడు. అతఁడు తేజోనిధి. సాధుశీలుఁడు. శూరుడు. మీకుపరమమిత్రుడు అనినది, ఇట్లనుట యామెకే చెల్లును. సుగ్రీవునిలో లేని దుష్టగుణములు చెప్పి, తదుపరి యతడెంత సుగుణవంతుడో చెప్పుట యామె మతివైభవమునకు నిదర్శనము. అటుగాక వీరు సూర్యవంశపువారు. అతడు సూర్యసూతి, కావున మిత్రత్వమే కాని యితరము పొసగని విషయము. అతడు న్యాయమైన ఊహవెంబడి సంచరించువాడు. అతడు నీ యీ మాటల కబ్బాయని క్లేశముఁ జెందవచ్చునుగదా. ఈ సృష్టిలో కామపరత్వమున కితడె మొదలా? శ్రీ సమువేతులు యోగులు కూడ నీ భావములకుఁ దలలొగ్గవలసిన వారైరి. మేనకాస్పృహా యోగియైన గాధిసుతునకు ముక్కునకు బదులు కన్నులు పదియేండ్లు మూతబడినవి. అంతటి మహర్షులే యటులైన నిక సుగ్రీవుఁ డొక లెక్కయా? ఇచ్చట నీమె యతిలౌక్యమును నెఱపినది. సుగ్రీవుఁ డబ్బా యనుకొనవచ్చుననినది. కాని కోపపడవచ్చుననలేదు. అట్లనినచో లక్ష్మణునిదే పైచేయి యగును. అది యామెకుఁ దెలియును. తాను సామరస్యమును సంపాదించవలయునుగాని విభేదమును కాదుగదా! తరువాత కామభావ విషయమున మీ గురువని చెప్పకుండ గాధిసుతుఁడని, మేనకాస్పృహాయోగియని యుదాహరణగ చెప్పినది. ఆ యనుట మరల మీ గురువన్నచో తగాదా కొని తెచ్చుకొనుటయే యగును. తరువాత—

"అతి సూక్ష్మంబులు తర్కవాక్యములచే
నా కార్యముక్ న్యాయ్య సం
గతేష్వుంగాగ నిరూపితం బొనరు
షంగా. నైవ క్లిష్టంపు ప
ద్ధతి సుగ్రీవుని రాజు చేసుకొని
చింతాకంత నోసమ్మన
ల్పతికై చంపితి వేని సర్వము
పునఃప్రాక్ప్రయత్నం బగున్."

అని బెదరించినట్లుగ మాట్లాడినది. వాలి వధ విషయగతమైన కించిద్దోషమును చెప్పి అది యతిసూక్ష్మంబులు తర్కవాక్యములచే నా కార్యము న్యాయసంగతముగ వారియందు దోషప్రతిపాదన చేసినది. అనగా వాలి వధయందలి కించిద్దోషమును, దాని సమన్వయ కాఠిన్యమును, ఆమె యూహించియే యట్టిపెట్టినది. ఆమె యంతటి నిగూఢ విషయపరిశీలనా బుద్ధి, ఆ సుగ్రీవునిఁ జంపిన, ఏ కార్యమునకై యాతని రాజుగఁ జేసిరో యా కార్యమునకే పునఃప్రయత్నావశ్యకత కల్గుననినది. అని యంతలో నూరకొనివదా? - "ఆతని కన్ననున్ తెలిసినట్టిడు లేడు తదర్థమంగు విజ్ఞాతము వాలికిన్". అని మునుపు నాకు చెప్పినాడు. తదర్థమున ననగా రావణ వధ విషయమున నని యర్థము - "క్రూర దైత్య సేనాతమసోగ్ర నిర్భరఘనాఘన ధూర్జర కాళరాత్రి సంజాతుడు రావణుండు." అతడు వానర సేనకు అందునను సుగ్రీవునకు సాధ్యుడని యనినది. కాబట్టి రామకార్యమును చెడగొట్టకు మనినది. ఇచ్చట తార రాజనీతి మిన్నులనంటినది. వాలికన్న రావణుని విషయముఁ దెలిసినవాఁడు లేడు. అతఁడు మున్నే నడుగగా రావణుడు సుగ్రీవునకు వానర సేనకుఁదక్క నొరుల కజేయ్యుఁడని చెప్పెననినది. ఆ చెప్పుటలో సమాన కాఠిన్యముచే రావణుని చంపుటలోని క్లిష్టతయు నాపని సుగ్రీవునికి సాధ్యమనుటలో సుగ్రీవుని యాధిక్యము, రామకార్యమనుటచే లక్ష్మణుని కన్నుల సన్నగుస్థితి యాడుట, అందుచే తాను తొందర పడకూడ దనుకొనుట యిన్ని స్ఫురించున ట్లర్థగర్భముగ మాట్లాడినది— తార మరియు ననినది — ప్రియ ముష్మద్ధనకార్య లగ్నమతి" సుగ్రీవుడు నానాదిక్కులను కపీశ్వరులకొఱకై సేనా నాయకుల బంపినాడు. నేడో రేపో వత్తురు. ఇప్పుడు నీవు యవీయాంసుడ వింత ప్రయత్నము వమ్ముగావింతువా? సుగ్రీవునికి వైచిన విశేషణము ద్వారమున నాతని పీరిపట్లఁగల గౌరవభావముఁ జెప్పి వాని యత్నముఁ జెప్పి నీవు వట్టి పసివానివలెఁ గార్యముఁ జెడగొట్టుకొందువా యని యతనిని యనుభవహీనునిగఁ జేసి మాట్లాడినది. ఇకపొగడ్తకుఁ దిగినది. ఇదివరకే వచ్చిన కపిసైన్యము నిన్ను అచ్చ మధుమాస మనోహరమూర్తివని చూచుచున్నారు, నీ రూపునకు. నీ వాక్యవైఖరియు మధువనమున బెబ్బులియఱపులవలె నున్నవి. చాలు పృథుమతివి. ప్రసన్నతనూజుని వృథా వ్యాకులునిఁ జేయకుము. అని తానొక యనుభవజ్ఞురాలై చిన్నవానిని మందలించినట్లనినది. ఎంత స్నేహమైనను యితడు

# విశ్వనాథవారి తార

రాజు, అంతఃపురము కొంతలు, సేవకులు యిట్టిచోట నింతటి మాటలాడవచునా? నీవు సమస్తజగత్ప్రమాథ దుర్దాంతభుజాబలుండవు దానికిని, దీనికిని సామ్య మున్నదా యని యాతనిని వట్టి యప్రతిభునిగఁ జేసి మాటాడినది: మఱల నెక్కడ కోపము వచ్చునో యని పొగడ్త మొదలు పెట్టినది. ప్రభువైన రాఘవుని హాసము సర్వ జగద్విమోహనము, అప్రతిమానము. నీ వాతని కైన ప్రియానుజుఁడవు. అది మీ వంశ శాఖాప్రణుతమైయుండవలెను. ఏదీ కొంచెము నవ్వుము. మీ ప్రియమిత్రుడు 'హృదయ మేకరమోదరసాకృతిఙా' జనునని యన్నను బొగడి తమ్మునగ్గించి సుగ్రీవుని వారికి మిత్రునిగఁ జెప్పి తన యపూర్వమైన ప్రతిభను వెలార్చినది. ఆమె రాజనీతి యంతటిది. ఆమె మాటల కాతఁ డప్రతిభుఁడై చమత్కృతచిత్తవీథియై ప్రసన్నరేఖాననుం డయ్యెనఁట. తారయంత కార్యజ్ఞురాలు. ఆమె కూటనీతి ప్రాశస్త్యమున కవధి లేదు.

వాలి పడిపోయిన వార్త వినగనే తారయాయన యొద్దకు పోఁబోయినఁ వానరచమువు—"నీవున్నావు సమస్తవానరచమూనిర్వ్యాజ రక్షాకళాప్రావీణ్యోజ్జ్వలద్ధురీణవు—" అని మా ప్రాణములన్నియు నీ మీఁదనే పెట్టుకొనినాము. నీ వచ్చటికి పోవద్దని నారు. అనగా నామె మతి ప్రాచుర్యముపై వారి కంతయమేయమైన నమ్మకమున్న దన్నమాట. ఆమె వారిని వారించి వారియొద్దకుఁ బోయినది. ఇంతసేపు వివేక దుఃఖముఁ బొంది యంగదుని కౌగిలించి కేవలము రాజ్యవివాద వశతచేతఁగదా నీ తండ్రి తాను చచ్చి నన్ను చంపినాడనినది. వాలియందు రాజ్య వివాద వశదోషముఁ జెప్పినది. పాల్య జనము పాపముఁ జేయుటయు రాజు శిక్షించుటయును ననున దున్నది. రాజు చేసిన పాపమునకు దైవము శిక్షించును. దైవమొనర్చిన పాపమును కర్మమొక్కటే శిక్షించును. కర్మ జన్మల చేత మనుష్యదైవములఁ బొందును. లోకములో నెల్లరును మతివ్యూహ కషాయ కర్మకలనోగ్రులేయని రాముని పైఁ గోపమును వెలిబుచ్చినది.

తార—"ఇదియెదో మృత్యుతాపముగ స్వామీ
వచ్చులోనుండి తిప్పగు నిన్నుంబడి వచ్చు
చుంటిని వియత్పర్యాప్తమార్గంబునన్, ప్రహసమా
వర్తము గూఢవార్ద్వివర సంరావంబు సర్వంబు నా
యెదలో పుట్టె యికొక్కఁ డింమకొనుటే యీ
వేగ కాత్రోవలో."

అని ప్రగల్భు తేలవేయుచున్నంతలో యంగదుడమ్మ యని కౌగిలించిన సుడిగుండమునుండి పైకిఁ దేలినవిధమున కొడుకుపైఁబడి యేడ్చి 'నే బ్రతికియే యున్నానుగా' యనినది. ఆమె భర్తృప్రేమ యంతటిది. కాని పుత్రప్రేమ దాని నధిగమించినది. తార వాలినిగూర్చి—"నీవెంట రానన్నానంచను కోకుముంటి సుతరక్షార్థంబు శత్రుంజయా". అని కపిసేనకుఁ గూడ నట్లే చెప్పి తనదైన భర్తృప్రేమను స్పష్టము చేసినది. తరువాత శ్రీరామునితో ననినది :

"మా మా దుఃఖమ్ములు మఱి
మీమీ మృదు మందహాసమేచకవీథుల్;
మామాన ప్రాణహారిన్
మైమరపులు మీకు కేళి మందస్మితముల్."

అని గూఢకోపభావరిశిత వాక్కులనాడినది.

ఇట్లు తార సర్వవిషయముల మహారాజనీతి చతురయై లౌక్యసంపన్నబుద్ధియై కపిరాజ్య రక్షాబద్ధ జీవికయైనది. ఆమెనుగూర్చి వాలి యంగదునితో ననిన మాటలు:

"గోలాంగూల రాజ్యాంగ మాతంకం బింతయు లేక సాగుటకు నీతల్లిన్ పరానీతినిశ్శంకన్ జూడక తప్పరాతడు."

శ్రీరాముఁ డామెను గూర్చి చిన్నమాటలు వాలితో నన్నమాటలు..."తారను గూర్చి నే వినిన దానిని బట్టి వచింతు తద్వివేకారభమాణమై జరుగు నన్నియు మీ కపిరాజ్యమందునన్".

సుగ్రీవుఁ డామెను లక్ష్మణునియొద్దకు పంపుట, కపిసైన్య మామెను వారియొద్దకుఁ బో నిరాకరించుట సర్వమామె రాజనీతిజ్ఞతా పరాకాష్ఠకు సూచకములు.

లోకములో సాధారణముగఁ బ్రతిజీవికిని స్వాంతరమైన యొకానొక ప్రత్యేకకోర్కె జీవలక్షణమై యుండును. అట్లే తారకామె జీవభావమును బట్టి రాజనీతిపై వాంఛ. ఆమెకు వాలి బాహుబలమున నెట్టి బుద్ధియో సుగ్రీవుని మతినీతిపథమునం దట్టి బుద్ధియే యున్నది. అదియుఁగాక సుగ్రీవుడు ధర్మముగ నంగదుని యువరాజును చేయుట, అగ్రజ మరణానంతరము దేవర న్యాయముండుట, సుగ్రీవునిదైన—"ధాత్రీయుత నీతిపాలనకృతిప్రవణాభి హితార్థ నాసమాధేయత" కారణముగ తార సుగ్రీవునికి భార్యగనుండుట కంగీకరించుట యైనది. తన రాజనీతి కౌతని పాలనము మెరుఁగులు పెట్టవచ్చు ననుకొనినది. ఆమె తన జీవలక్షణమైన కోర్కె ప్రధానముగ సుగ్రీవు నంగీకరించినదే కాని కేవల కామవశతచేత గాదు. ఆమె ముద్దుకట్టిన రాజనీతి. ఆమె లౌక్యమున కవధి లేదు. ఆమె రాజకీయముఁ పుటెత్తులసామాన్యములు. ఆమె వాక్చాతుర్య మనితర సులభము, ఆమె లౌకికముగ కానిదేమియూ లేదు. ఆమె కామెయే సాటి.

ఇట్లు చరిత్రచిత్రణ మొనర్చుట ప్రతిభావంతుడై మహాకవియైన వానికే చెల్లును.

'అపారే కావ్యసంసారే కవి రేవ ప్రజాపతిః' యన్న యాలంకారికోక్తికి మూలభూతమైనట్లున్న దీపాత్ర నిర్మాణవైఖరి.

# ఆంగ్లేయ పండితుల సంస్కృత భాషాసేవ

డాక్టర్ ఎ. యల్. బాషమ్

దాదాపు 18-వ శతాబ్ది అంతంవరకూ, యూరప్‌లో సంస్కృత భాషా పరిచయం వున్నవారు యెవ్వరూ ఉండేవారుకారు. భారతదేశంలో వుండి భారతీయులతో పాటు పని చేసుకుంటూ వుండేవారికి తప్ప మిగతా యూరపియనులలో నూటికి తొంభై తొమ్మిది మందికి అసలు యిలాంటి భాష వొకటివున్నదనికూడా తెలియదు. ప్రప్రథమంగా సంస్కృత భాషాధ్యయనానికి ఉపక్రమించిన యూరపియనులు దక్షిణభారతానికి వచ్చిన జెసూట్ ఫాదరీలు. వీరిలో కొంతమంది ప్రాంతీయభాషలలో విశేష పాండిత్యం సంపాదించగలిగారే గాని సంస్కృతభాష మాత్రం వీరెవరికీ సరిగా కొరుకుడు పడలేదు. సంస్కృత భాషలో వీరికి కలిగింది కేవలం మిడిమిడిజ్ఞానం. ఇక భారతదేశపు ప్రాచీనసాహిత్యం విషయంయెత్తుకుంటే, అసలు వారికి దానిసంగతే తెలీదు. అత్యంతమైన సానుభూతితోనూ శాస్త్రీయమైన దృక్పథంతోనూ సంస్కృతభాషాధ్యయనానికి ఉపక్రమించిన తొలి యూరపియనులు, వంగదేశంలో, 'ఈస్టిండియాకంపెనీ'లో ఉద్యోగులుగాపనిచేసిన కొందరు ఆంగ్లేయులు.

## తొలి అనువాదం

సంస్కృత భాషలో చెప్పకోదగిన పాండిత్యాన్ని సముపార్జించుకున్న మొట్టమొదటి ఆంగ్లేయుడు చార్లెస్ విల్‌కిన్స్. ఈయన వంగదేశంలో ఈస్టిండియా కంపెనీలో ఉద్యోగిగా పనిచేస్తూఉండేవారు. యకాయెకీ సంస్కృతం నుంచి ఆంగ్లభాషలోకి వచ్చిన "భగవద్గీత" అనువాదాలలో విల్‌కిన్స్ అనువాదం మొట్టమొదటిది.

తరువాత తరువాత భారతదేశానికి వెళ్లిన బ్రిటిష్ పరిపాలకులు, ప్రాంతీయ ప్రజలతో సన్నిహిత సంబంధం లేకుండా దూర దూరంగావుండే మన స్తత్వాన్ని పెంపొందించుకుంటూ వచ్చారు గాని, ఆదిలో ఈస్టిండియాకంపెనీ ఉద్యోగులుగా వెళ్ళినవాళ్లు అలా ఉండేవాళ్లు కారు. వారిలో కూడా కొంతమంది విజ్ఞానపిపాసాల ప్రమేయం లేనివారు కొందరున్నా, అత్యంత ప్రాచీనము, మహోజ్వలము అయిన భారతీయ సంస్కృతిని చూసి విభ్రాంతులై, మోజుపడి దాన్ని అవగతం చేసుకోవాలని తీవ్రమైన అభిలాషతో పని చేసినవారు అనేకమంది ఉండేవారు.

ఇలాంటి ఉద్యోగులలో కొందరు కలసి 1784లో "ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్" అనే పేర ఒక సంస్థను స్థాపించారు. అప్పట్లో గవర్నర్ జనరల్‌గా వున్న వారన్ హేస్టింగ్స్ ఈ సంస్థకు అండదండగా వుండి ప్రోత్సహించుతూ వుండేవాడు. ఈ సంస్థను ఏర్పాటు చేయటానికి తొలిగా పూనుకున్నవాడూ, ఈ సంస్థకు తొలి అధ్యక్షుడుగా కార్యకలాపాలను నడిపినవాడు, సర్ విలియం జోన్సు. ఈయన కలకత్తా హైకోర్టు జడ్జిగా పనిచేస్తూ వుండేవాడు. ఈయన 18వ శతాబ్ది ప్రసిద్ధ విజ్ఞాన వేత్తలలో ఒకడు. నిజానికి యూరప్‌కు సంబంధించి నంతవరకూ భారతీయ విజ్ఞాన పరిశోధనకు ఆదిపురుషుడని చెప్పవచ్చు.

యూరప్‌లోని ప్రాచీన మహాభాషలకూ సంస్కృత భాషకూవున్న సన్నిహిత బాంధవ్యాన్ని గుర్తించిన మొట్టమొదటి వ్యక్తి జోన్సు. ఇది యీయన సాధించిన మహత్కార్యం. భారతీయ ప్రాచీన చరిత్రను త్రవ్వి యెత్తటానికి తొలిగా ప్రయత్నించిన మహామహుడూ ఈయనే. యూరప్‌లోని ప్రాచీన భాషలలో ఉల్లేఖింపబడిన "సాండ్రకోటస్" సంస్కృత భాషలో చెప్పబడుతున్న చంద్రగుప్త మౌర్యుడు ఒక్కడేనని నిరూపించటానికి ఈయన చేసిన పరిశోధనలు తరువాతి చారిత్రిక పరిశోధకుల కందరికీ ప్రాతిపదికలైనాయి.

ఈయన అనేక పరిశోధన వ్యాసములను రచించి "ఏషియాటిక్ సొసైటీ" సమావేశాలలో చదివి, వాటిని అనంతరం ఆ సంస్థ నిర్వహించుతూవుండే "ఏషియాటిక్ రీసెర్చెస్" అనే పత్రికలో ప్రకటించుతూవుండే

---

ఈ వ్యాసాన్ని తిరుపతి సంస్కృత మహాసభల నాటికే పాఠకులకు అందజేయటానికి ప్రయత్నించాం, కాని దురదృష్ట వశాత్తూ సకాలంలో మాకు అందలేదు. వ్యాస రచయిత డాక్టర్ భాషమ్ లండన్ విశ్వవిద్యాల ప్రాచ్య విజ్ఞాన శాఖలో రీడరుగా పని చేస్తున్నారు.

# ఆంగ్లేయ పండితుల సంస్కృత భాషాసేవ

వారు. ఈ వ్యాసములు అమూల్యమైనవి. వీటిని ఆధారం చేసుకుని, అనంతరం, భారతీయ విజ్ఞాన పరిశోధకులు ఎంతో ముందుకు పోగలిగారు. భారతీయ విజ్ఞానశాఖలలో ఆయన యింతో అంతో పరిశోధించని శాఖలేదు. సంస్కృత భాషపట్ల ఆయన కున్న అభిలాష ఇంతా అంతా కాదు.

1786లో ఆయన ఇలా వ్రాశాడు: "సంస్కృత భాష మహత్తరమైన స్వరూపం కలది — గ్రీకు భాష కంటే నిర్దుష్టమైనది, లాటిన్ భాషను మించి అర్ణవ ప్రాయమైన శబ్దజాలం కలది — ఈ రెంటికంటే సొగసైనది."

1794 లో మరణశయ్యను అధిష్టించే వరకూ ఆయన కృషి చేస్తూనే వున్నాడు.

'మానవ ధర్మశాస్త్రం', జయదేవుని 'గీత గోవిందం', కాళిదాసుని 'శాకుంతలం' ఈ మూడింటికీ ఆయన చేసిన అనువాదాలు విశ్వవిఖ్యాతిని గడించు కున్నాయి.

నిజానికి ఆయన 'శాకుంతలం' అనువాదం పాశ్చాత్య సాహితీ రంగానికంతకూ విభ్రాంతిని కలిగించింది. ఆ నాటి ఆంగ్ల కవులలో ఆ గ్రంథాన్ని చదివి మోజు పడనివారు లేరు. అనతికాలంలో అది ఫ్రెంచి జర్మన్ భాషలలోకి కూడా అనువదించబడ్డది. ఈ అనువాదాలు యూరోపియన్ సాహిత్య రంగాన్నంతా జ్వలింప జేసివేసినై. ముఖ్యంగా జర్మన్ కవి గెతే, ఈ అనువాద రూపాలలోనే, 'శాకుంతలం' 'మేఘదూతమ్' చదివి పట్టరాని ఆనందంతో చిందులు త్రొక్కాడు.

విల్‌కిన్స్, జోన్సులతోపాటు హెన్రీకోల్ బ్రూక్ నామధేయాన్ని కూడా స్మరించ వలసివుంది. ఈయన భారతీయ వేదాంత ధర్మశాస్త్రాల పరిశోధనలకు అంకురార్పణ చేశాడు. కంపెనీ ఉద్యోగం విరమించుకుని ఇంటికి తిరిగి వెళ్లిన అనంతరం కూడా ఈయన తన మిగతా జీవితాన్నంతా ఈ కృషిలోనే వ్యయం చేశాడు. ఈయన, విల్‌కిన్సు — వీరిద్దరూ కలసి కృషిచేసి, 1823 లండన్‌లో 'రాయల్ ఏషియాటిక్, సొసైటీ' స్థాపించటానికి కారణభూతులైనారు.

పై ముగ్గురూ పాశ్చాత్యదేశాలలో సంస్కృత భాషా ప్రభావం వ్యాపింప చేయటానికి ప్రయత్నించిన వారిలో అనాది పురుషులు.

పాశ్చాత్యులకు క్రమపద్ధతిలో సంస్కృత భాషను బోధించటానికి ప్రయత్నించిన మొదటి పాశ్చాత్యదేశం బ్రిటన్ కాదు. 1803 లో ఫ్రాన్సు తొలిగా ఇందుకు పూనుకుంది. కాని అక్కడ అధ్యాపకుడుగా పనిచేసినవాడు, ఎలెగ్జాండర్ హామిల్టన్ అనే బ్రిటిష్‌వాడు. లోగడ ఆయన 'బెంగాల్ ఏషియాటిక్ సొసైటీ'లో సభ్యుడు. నెపోలియన్ బ్రిటన్ మీద సాగించిన యుద్ధాలలో ఆయన ఫ్రాన్సులో ఖైదీగా చిక్కుబడి పెరోల్ మీద విడుదలై బ్రిటనుకు తిరిగి వచ్చే ఆస్కారంలేక అక్కడే వుండిపోయాడు. సంస్కృత విద్యాబోధన బ్రిటనులో ప్రారంభమైంది 1805 లో. ఈస్టిండియా కంపెనీ 'హార్ట్‌ఫోర్డు' లో స్థాపించిన ప్రత్యేకశిక్షణకేంద్రంలో హెచ్. హెచ్. విల్‌సన్ ఆచార్యత్వంక్రింద సంస్కృతభాషా బోధన ప్రారంభమైంది. 1832 లో ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయం సంస్కృతశాఖను స్థాపించినప్పుడు కూడా ఈయననే ఆచార్యుడుగా స్వీకరించారు.

ఈయన ఎంతో కృషిచేశాడు. 'సంస్కృతాంగ్ల నిఘంటువును' సంఘటించాడు. ఆంగ్లేయులకు సంస్కృతభాష సుబోధకమయ్యేలాగు ఒక వ్యాకరణాన్ని రచించాడు. ఇవి సంస్కృతం నేర్చుకోదలచిన పాశ్చాత్యులందరికీ నిన్న మొన్నటివరకూ పాఠ్యపుస్తకాలుగా ఉపకరించినై. ఈయన సంస్కృత భాషలోని అనేక ప్రధానగ్రంథాలకు అనువాదాలు చేశాడు. వాటిలో ప్రధానమైనది, బహుళవ్యాఖ్యాసమన్వితమైన 'విష్ణుపురాణం' మొదటిది. రెండవది సంస్కృత నాటక సముచ్చయం, మూడవది భారతజాతికి ప్రాచీన సాహిత్యనిధిగా సంక్రమించిన 'ఋగ్వేద సంహిత' కు విశేష వ్యాఖ్యాసమన్వితమైన అనువాదం.

19 శతాబ్ది తవాడీ, సంస్కృతాధ్యయన విషయికంగా జర్మనీ, బ్రిటన్‌కంటే తీవ్రంగా కృషిచేసి ముందడుగు వేసిందన్న మాటను ఒప్పుకు తీరాలి. సంస్కృత జర్మన్ భాషలకుండే సన్నిహితత్వం జర్మన్ భాషావేత్తలను ఆకర్షించింది. భారతీయుల ఆధ్యాత్మిక వాదం, హెగెల్ మొదలైన జర్మన్ జాతీయ వేదాంతుల ధోరణికి సన్నిహితంగా వున్న కారణంగా జర్మన్ పండితులకు భారతీయ విజ్ఞానం పట్ల విశేషమైన ఔత్సుక్యం కలిగింది.

హిట్లర్ వచ్చేవరకూ సంస్కృత భాషాధ్యయనం జర్మనీలో సాగిన అవధికి మరే యితర

పాశ్చాత్య దేశంలోనూ సాగలేదు. కాని ఈ తరుణంలో కూడా ఆంగ్ల సంస్కృత భాషావేత్తలు చేతులు ముడుచుకుని కూర్చున్నారని చెప్పటానికి వీల్లేదు. ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయంలో మొ_స్తగగా నే కేంబ్రిడ్జి, లండన్, ఎడింబరో విశ్వవిద్యాలయాలలో సంస్కృత పీఠాలను స్థాపించారు. ఈ విశ్వవిద్యాలయాల గ్రంథాలయాలు సంస్కృత గ్రంథాలను సంపాదించటానికి పూనుకుని ఎంతో కృషి చేసినై. చార్లెస్ విల్‌కిన్స్ ప్రధాన గ్రంథాలయాధికారిగా, ఈస్టిండియా కంపెనీ గ్రంథాలయం అమూల్యములైన సంస్కృత గ్రంథాల నెన్నిటినో సంపాదించింది. అనంతరం ఈ గ్రంథాలయం ఇండియా ఆఫీసుకు సంక్రమించింది. ఇప్పుడు 'కామన్వెల్తు' కార్యాలయం ఆధిపత్యంలో వుంది.

19 వ శతాబ్ది చివరి భాగంలో నాల్గు ఆంగ్లేయ విశ్వవిద్యాలయాలలోనూ, ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయం సంస్కృత భాషా వ్యాప్తికి యెంతో కృషి చేసింది. ఆ తరుణంలో ఆ విశ్వవిద్యాలయంలో, సంస్కృత భాషా పండితులుగా ప్రసిద్ధులైన ఇద్దరు మహామహులు ఏకకాలంలో పనిచేశారు. వారిలో విశ్వవిఖ్యాతిని గడించుకున్న ఫ్రెడ్రిచ్ మాక్స్‌మ్యుల్లర్ కృషి మాననీయమైనది. మాక్స్ మ్యుల్లర్ పుట్టుకచేత జర్మన్ దేశీయుడైనా, ఆయన ఆంగ్ల దేశంలోనే స్థిరనివాస మేర్పరచుకొన్నాడు. ఆయన సాధించిన మహాత్కార్యాల నన్నిటినీ ఆంగ్ల దేశపు నడిగడ్డమీద నే సాధించాడు. మ్యుల్లర్ ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయంలో భాషాశాస్త్ర శాఖలో ఆచార్యుడుగా పనిచేస్తూ వుండేవాడు. ఆయన పాశ్చాత్య జాతులకు వారసత్వంగా అందజేసిన విజ్ఞాన నిధి "ఋగ్వేద" అనువాదం. ఇదిగాక "ప్రాచ్యదేశాల పవిత్ర గ్రంథాలు" అనే పేరుతో ఆయన సంపాదకత్వాన వెలువడిన అనువాద పరంపర మహత్తర మైనది. ఈ విజ్ఞాన గ్రంథపరంపరను సంఘటించటంలో ప్రాచ్యభాషలలో పరిష్ఠులైన పలువురు ఆంగ్లేయ పండితులే కాక యితర పాశ్చాత్య దేశాల పండితులు కూడా అనేకమంది ఆయన చేతిక్రింద పనిచేసి ఆయనకు సాయపడ్డారు.

ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయంలో ఆయనతో పాటు పనిచేసిన రెండవ సంస్కృత భాషావేత్త సర్ మోనియర్ విలియమ్సు. ఈయన హెచ్. హెచ్. విల్‌సన్ అనంతరం ఆ స్థానం అలంకరించాడు. ఆయన సంఘటించిన సంస్కృతాంగ్ల నిఘంటువు, విరివిలోనేమి, విషయ సంచయంలో నేమి జర్మన్ భాషను గల 'సెయింట్ పీటర్స్‌బర్గ్' నిఘంటువును మించి వుంది. సంస్కృత భాషలో విశేష పాండిత్యం సంపాదించుకో దలచినవారందరికీ ఈనాటికీ ఈ నిఘంటువే శరణ్యం.

ఆటు తరువాతితరంలో అంటే 20 వ శతాబ్ది ప్రారంభదశలో కృషిచేసిన సంస్కృత భాషా పండితులు అనేకమంది ఉన్నారు వారందరిని గురించి వ్రాయటానికి ఈ పరిమితావధిలో సావకాశం లేకపోయినా, ఎడింబరో విశ్వవిద్యాలయంలో పనిచేసి ప్రఖ్యాతుడైన ప్రొఫెసర్ ఎ. బెర్రెయిడేల్ కీత్‌ను గురించి ఒకటి రెండు వాక్యాలు చెప్పక తప్పదు. సంస్కృతభాషా విజ్ఞాన విషయాలపైన ఆయన అనేక గ్రంథాలు ప్రచురించాడు. వేదాలలో ఆయనకు విశేషమైన పాండిత్యం వుంది. వేదమతం యొక్క స్వరూప స్వభావాలను ఆయన క్షుణ్ణంగా అవగతం చేసుకున్నాడు. బౌద్ధ హైందవ వేదాంతాల లోని ఆయా విషయాలను వివరించుతూ ఆయన అనేక గ్రంథాలు ప్రచురించారు.

ఆయన రచించిన "సంస్కృత భాషా చరిత్ర", 'సంస్కృత నాటకములు' అనే గ్రంథాలు, నాటికీ నేటికీ ఆ విషయాలపై అంతకు మించిన ఉత్తమ గ్రంథాలు లేవనిపించుకుంటున్నయ్ వైజ్ఞానిక రంగంలోనే గాక కీత్ 'రాజ్యాంగ శాసనాల' విషయంలో కూడా ప్రామాణికుడు. రాజ్యాంగ చట్టాల పురోగమనాన్ని ఉల్లేఖించుతూ అనేక రచనలు వెలువరించారు.

బ్రిటిష్ సంస్కృత విద్వాంసులలో వీరు పూర్వీకులు : ఇక ఇప్పటి నవీనులు :

భారతదేశం స్వతంత్ర దేశంగా ఏర్పడిన అనంతరం కూడా భారతీయ విజ్ఞానంపట్ల బ్రిటిష్ విజ్ఞాన వేత్తలకున్న ఔత్సుక్యం సన్నగిలలేదు సరికదా మరింత అభివృద్ధి చెందింది. యుద్ధానంతర దశలో, బ్రిటన్ సంస్కృత భాషాన్వయన విషయంలో జర్మనీకంటే చాలా ముందుకు పోయింది. ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాలలో సంస్కృత భాషాపీఠాలమీద యిప్పుడు టి. బరో, హెచ్. డబ్లియు. బెయిలీ అనే ప్రొఫెసరు లున్నారు. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం,

# ఆంగ్లేయ పండితుల సంస్కృత భాషాసేవ

డాక్టర్ జె. నార్మన్ అనేవారిని అధ్యాపకులుగా నియమించి సంస్కృతాధ్యయనాన్ని మరింత ప్రోత్సహించుతున్నది.

ఎడింబరో విశ్వవిద్యాలయంలో మాత్రం కీత్ గారి నిర్యాణానంతరం సంస్కృతాచార్య పీఠానికి మరొకర్ని యెవర్నీ నియమించలేదు. కాని డాక్టర్ జాన్ ఎలెన్ ఉపన్యాసకుడుగా నిన్నమొన్నటివరకూ సంస్కృత భాషాబోధన సాగుతూనే ఉంది. ఆయన ఇటీవలనే చనిపోయారు. జాన్ ఎలెన్ భారతదేశపు ప్రాచీన నాణెముల పరిశోధనలో విశేషప్రజ్ఞ సంపాదించినవాడు. ఇటీవల జరిగిన ఎడింబరో విశ్వవిద్యాలయ పరిపాలక మండలి సమావేశంలో డాక్టర్ ఎ. కె. వార్డర్ అనే సంస్కృత పండితుణ్ని (యువకుడు) సంస్కృత భాషాబోధకుడుగా నియమించారు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం డర్హామ్ విశ్వవిద్యాలయం సంస్కృత విద్యాబోధనను ప్రారంభించింది. డాక్టర్ యన్. బాసు అనే వంగదేశపు సంస్కృత పండితుడు ఆ విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడుగా వున్నారు.

## లండన్ విశ్వవిద్యాలయం

యుద్ధానంతర దశలో, లండన్ విశ్వవిద్యాలయం, సంస్కృత విద్యాబోధనను విస్తృతావధిని పెంపొంద జేసింది. ప్రాచ్యభాషా శాఖలో యిప్పుడు నలుగురు అధ్యాపకులు పనిచేస్తున్నారు. (ప్రొఫెసరు జె. బరో, డాక్టర్ వి ఏ. బేక్, సి. ఎ. రినాల్డ్స్, జె. ఇ. బి. గ్రే) వీరుగాక పాళీ ప్రాకృతాలకు ప్రత్యేక పండితులున్నారు. (డాక్టర్ డి. మాస్కెల్, డాక్టర్ టి. యస్. జేవీ. వీరుగాక భారతీయ మత వేదాంత శాస్త్రాలను ప్రబోధించటానికి డాక్టర్ డి. ఫ్రెయిడ్ వాన్ ఉన్నారు. భారతీయ పురాతత్వ పరిశోధన శాఖలో ఒక ప్రొఫెసరూ, ఒక లెక్చరరు ఇద్దరు పనిచేస్తున్నారు—కె. డి. బి. కాడ్రింగ్టన్ డాక్టర్ ఎఫ్. ఆర్. ఆల్బిన్. ప్రాచీన భారత చరిత్రా పరిశోధన శాఖలో ఒక రీడర్ ఉన్నారు. (ఈ వ్యాస రచయిత.) ఈ ప్రాచ్యశాఖ కంతకూ ప్రధానాధికారిగా ఉన్న సర్ రాల్ఫ్ టర్నర్ సంస్కృతభాషలోనూ ఇండో - ఆరియన్ భాషలలోనూ ఉద్దండ పండితుడు.

భారతదేశం బయట, ఇలా ఇంతమంది సంస్కృత పండితులు ఒక భవనంలో వుండి పనిచేయటం ఒక్క లండన్ విశ్వవిద్యాలయంలో తప్ప మరొకచోట ఇతరదేశంలోనూ లేదు—ఏ కాలంలో కూడా. విద్యార్థులు ఇతర విజ్ఞాన శాఖలలో చదువుతున్నంతమంది సంస్కృత శాఖలో లేరుగాని, క్రమేణా సంస్కృతం చదువుకుంటున్నవారి సంఖ్య పెరుగుతోంది. ఈ విశ్వవిద్యాలయంలో ప్రాచీన భారత చరిత్రకు సంబంధించిన వివిధ విషయాలలో పరిశోధనలు జరుపుతున్నవారు పదిమంది 'పోస్టుగ్రాడ్యుయేట్' విద్యార్థులున్నారు.

బ్రిటన్‌లోవున్న నాలుగు ప్రధానమైన ప్రాచ్య గ్రంథాలయాలలోనూ (కామన్‌వెల్తు గ్రంథాలయం, బ్రిటిష్ మ్యూజియం, లండన్ విశ్వవిద్యాలయంలోని ప్రాచ్యశాఖా గ్రంథాలయం, 'రాయల్ ఏషియాటిక్ సొసైటీ' గ్రంథాలయం) పాఠకులు బహుళ సంఖ్యలో వుంటారు.

అంతర్జాతీయ రంగంలో, నానాటికి, భారతదేశపు ప్రాధాన్యత పెరుగుతున్నది. అందుచేత అంతర్జాతీయ సాంస్కృతికరంగంలో భారతీయ సాంస్కృతిక ప్రభావంకూడా పెరుగుతుంది. ప్రతిజాతిలోనూ కొందరు పండితులుండి తమ తమ ప్రజలకు భారతీయ నాగరికతను గురించి తెలియజెప్పవలసినస్థితి యేర్పడుతుంది. అందుచేత బ్రిటన్‌లో సంస్కృతవిద్య విస్తరించే పరిస్థితులేగాని, పరిమితమయ్యే పరిస్థితి యేమీ లేదు.

## భారతీయుల బాధ్యత

అయితే పాశ్చాత్య జాతీయులందరికీ సుబోధకమయ్యేలాగు, భారతదేశపు ప్రాచీనోజ్వల నాగరికతను మరింత వెలుగులోకి తెచ్చి చూపించవలసిన బాధ్యత భారతదేశపు విశ్వవిద్యాలయాలలో పనిచేస్తున్న పండితులమీదనే వుంది.

•

ఈ 20 వ శతాబ్దిలో జరుగుతున్న భారతీయ విజ్ఞానవ్యాప్తి కృషిలో రెండు మైలురాళ్లు కనుపించుతున్నయ్. మొదటిది విపుల వ్యాఖ్యా సమన్వితమై సమ్యక్ రూపంలో వెలువడనున్న "భారతం;" రెండవది "పూనా సంస్కృత నిఘంటువు." ఈ రెండు

మహాకార్యాలూ భారతదేశంలోనే సంఘటింపబడుతూ వుండటం గమనింపదగిన విషయం.

బ్రిటిష్ సంస్కృత విద్వాంసులు భారతీయ విద్వాంసులకు సహాయకులుగానూ, సుహృద్ విమర్శకులుగానూ మాత్రం ఉపకరించగలరు. అయినా భారతీయ విజ్ఞాన వ్యాప్తిలో వారు కొంత ప్రముఖమైన పాత్రనే నిర్వహించవలసి వుంటుంది. చారిత్రక పరిశోధనల విషయంలోనూ, భాషా పరిశోధనల విషయంలోనూ పాశ్చాత్య సంప్రదాయ పరిశోధనా పద్ధతులు అభ్యసించాలనే అభిలాషగల భారతీయ విద్యార్థులు, సరియైన యోగ్యతలుగలవారు వస్తే వారికి బ్రిటిష్ విశ్వవిద్యాలయాలలో తప్పక ప్రవేశం లభించుతుంది. ఇంతేగాక ఆయా కొన్నిరంగాలలో భారతీయ పరిశోధకుల కంటే యితర దేశాల పండితులు, విషయాన్ని ఆవేశరహితమైన నిష్పాక్షిక దృష్టితో అవగాహన చేసుకునే సావకాశం ఉంటుంది. అందుచేత భారతదేశపు ప్రాచీన నాగరికతను త్రవ్వి ఎత్తటంలో బ్రిటిష్ పండితులు చేయవలసిన కృషి ఇంకా చాలావుండవచ్చు.



లండన్ విశ్వవిద్యాలయంలోని ప్రాచ్య విజ్ఞానశాఖ కార్యాలయం



## సర్ విలియం జోన్స్

18 వ శతాబ్ది బ్రిటిష్ విజ్ఞాన వేత్తలలో పేరెన్నిక గన్నవాడు. ఈస్టిండియా కంపెనీ హయాములో కలకత్తా హైకోర్టు న్యాయమూర్తిగా పనిచేస్తూ 1784 లో బెంగాల్ ఏషియాటిక్ సొసైటీ'ని స్థాపించి దానికి ప్రథమాధ్యక్షుడుగా వ్యవహరించి భారతీయ విజ్ఞాన పునరుద్ధరణకు ఎంతో సేవచేశారు. కాళిదాసు శాకుంతలానికి ఈయన చేసిన అనువాదం చదివి మహాకవి గెటే ఆనందంతో చిందులు త్రొక్కాడు.












## సర్ చార్లెస్ విల్కిన్స్

ఈస్టిండియా కంపెనీ ఉద్యోగిగా భారత దేశానికి వచ్చి సంస్కృత భాషను చూసి ఆనతుడై తన జీవిత సర్వస్వాన్నీ తత్సేవలో త్యాగం చేశారు. భగవద్గీతను తొలిగా ఆంగ్లంలోకి అనువాదం చేసి పాశ్చాత్య దేశాలకు కనువిప్పు కల్గించిన మహామహుడు.











చిత్రాలంకృతమైన ఒక ప్రాచీన తాళపత్రగ్రంథంలోని రెండు పుటలు; గ్రంథం మహాభాగవతం; ఈ గ్రంథం, యిప్పుడు 'కామన్వెల్తు కార్యాలయం' ఆధిపత్యంలోకి వచ్చిన 'ఇండియా ఆఫీసు' గ్రంథాలయంలో భద్రపరుపబడివుంది.

పైపుట; శిశుహంతయైన కంసుడు దేవకీ దేవికి క్షమాపణ చెప్పుకుంటున్న ఘట్టం.

దిగువపుట : పూతనఘట్టం.

# చెరగని అక్షరాలు

శ్రీ ఇసుకపల్లి దక్షిణామూర్తి

వాన తుంపరలు కన్నీటి చుక్కల్లా నేలమీదకు బరువుగా రాలుతున్నాయి. అమావాస్య చందమామ భూమికి అందకనే వుండిపోయింది. ఆకాశమంతా ఆవరించిన చీకటి తెరలోనుంచి చిల్లులు చేసుకుని స్వర్గం సుషుప్తిలోవున్న భూభాగాన్ని పరికిస్తోంది. వీధిలోని చీకటి, తలుపులు లేని కిటికీగుండా లోపల ప్రవేశించి, గోడమీదవున్న ఆముదం దీపాన్ని భయపెడుతోంది. అప్పుడప్పుడు చెదురువాటుగా వీస్తున్న గాలికి వూగులాడుతున్న దీపశిఖ, ఆ గాలి తెర తగ్గగానే ధైర్యం కూడగట్టుకుని సూటిగా నిలబడి చూస్తోంది—పొగను సూటిగా పైకి వదిలేస్తూ. దాని మీద చలిప్రభావం పడ్డట్లు కనిపించటంలేదు గాని ఎదురుగా కూర్చున్న పార్వతిమాత్రం మోకాళ్లకు తల వానించి గజగజా వణికిపోతోంది. పైనకప్పుకున్న దుప్పటి ఆమెలోంచి వస్తున్న వణుకును ఆపలేక పోతున్నట్లుంది.

“తలుపు తియ్యమ్మా పాపా...” బయటనుంచి తలుపును బాదుతూ లలితమ్మ గట్టిగా అరిచింది.

“మరీ చోద్యంగా వుందే వ్యవహారం.. యింత కంగారయిపోతే ప్రతిదానికీ ఎట్లాగే...మనిషన్న తర్వాత రోగం నొప్పి రాకుండా వుంటుందా...” లలితమ్మ తలుపు కవతలనుంచి పార్వతి నుద్దేశించి సముదాయింపు పూర్వకంగా అంటోంది. పార్వతి తడిసిపోయిన చేతిగుడ్డను మంచంకిందకు తోసేస్తూ “వస్తున్నానమ్మా” అని తలుపు తీసింది. తలుపు తెరుచుకోటంతోటే పార్వతిని చేతుల్లోకి తీసుకుని “వెర్రిపిల్లా అని...ఛీ...” అంది.

“మరీ యిదిగా వుంటేమిటే...మీ మామయ్యకు యింతకంటే పెద్ద సుస్తీ చేసిందిగాని యింత కంగారు ఎవ్వరూ పడలేదమ్మా...తమ్ముడిని అనుకోరాదుగాని యిప్పుడు మూడు మనిషి ఎట్లా వున్నాడో...” పార్వతి కళ్లకు కొంగు అద్ది “కొద్దిగా మెతుకు ఎంగిలి పడమ్మా...మామయ్యేమో విస్తరిముందు కూర్చున్నాడు...నువ్వు రాందే అన్నం తినడుట...పోనీ వాడికోసమైనా రారాదుటే...”

పార్వతి మెల్లిగా లలితమ్మకౌగిలి వదిలి వంటింటి వైపుకు కదిలింది. కాళ్లు కొద్దిగా నీరసించి తడబడుతున్నా తల్లి భుజంమీద చెయ్యివేసి అడుగులు మెల్లిగా వేస్తూ వచ్చింది.

“ఏం పాపా...అట్లా బేజారయిపోతావుటే... ఆ...నాకెంత సుస్తీ చేసిందో నీకేం తెలుసు...మీ అత్తయ్య ఏమైనా మనిషి కదలిందా...మనిషి అంటే అట్లా వుండాలి...ఏమే సావిత్రీ...’ గోపాలరావు నోటివెంట మాట పూర్తికాగానే పార్వతి చిరునవ్వు నవ్వబోయి సావిత్రిని చూసి వూరుకుంది. సావిత్రి చేతిలో గరిటె కింద పడేసి పార్వతిని చూసి పక్కున నవ్వింది.

‘అన్నానికి కూర్చుంటాను గాని...ఆ ప్రమిదలో చమురుందేమో మాసిరావే అమ్మా!

‘ఏం? చీకట్లో రాములవారికి గదిలో సామానన్నీ కనపడవనా...వుంటే వుంటుంది...పోతే పోతుంది గాని...నాకొంచెం అన్నం పట్టుకు రావే అక్కయ్యా...’

పార్వతి చివాలునలేచి గోపాలరావువంక ఒక సారి తీవ్రంగా చూచింది. తన గదిలో వెలుతురు లేక పోయినా ఫరవాలేదనే టప్పటికి గుండె జల్లుమంది పార్వతికి.

‘నువ్వు అన్నం సంగతే చూసుకో అమ్మా... నా దీపం సంగతి నేనే చూసుకుంటానులే’ అంటూనే పార్వతి గదివైపు గబగబా నడిచింది.

వీధితలుపు నెవరో బాదినట్లు చప్పుడయింది. గోపాలరావు అన్నం కలుపుకోవటానికి ఉద్యుక్తుడవుతూ.

‘వాకిట్లోకి ఈ వానలో పడివచ్చారెవరో... చూసి రావే సావిత్రీ’ అన్నాడు. సావిత్రి గడపలోనే నిలబడింది. లలితమ్మ వీధి తలుపు వైపుకు పోవటం చూసి.

‘వస్తున్నానండీ...ఎవరో ఒక్కక్షణం ఆలస్యం అయితే సరి...తలుపు నట్లా బాదుకుంటారు...ఊ...’ అంటూ సణుగుతూ వెళ్లింది. తలుపు యింకా చప్పుడు అవుతునే వుంది లలితమ్మ గడియతీసి తలుపు తెరిచే వరకూ. బయటి చీకటిలో దీపంలేని సైకిలుమీద

గొడుగు వేసుకుని వచ్చిన వ్యక్తి ఒక కాలును నేల మీద మోపుతూ సైకిలుమీదనే కూర్చుని కనపడ్డాడు. లలితమ్మ చీకటిలో బయటికి పోవటానికి సందేహించింది. బయటి మనిషి గొడుగును మెడతో గట్టిగా పట్టుకుని సైకిలు దిగి,

'అయ్యగారున్నారా' అన్నాడు. సావిత్రి వంటింటి గుమ్మంలోనుంచే.

'అన్నం తింటున్నారుగా... కాసేపు అరుగు మీద కూర్చోమని చెప్పండి అత్తయ్యా!' అంది. పార్వతి ప్రమిదమాట మరచిపోయి కిటికీలోనుంచి వస్తున్న చలిగాలికి కొద్దిగా కంపిస్తూ.

'ఏమి కావాలో కనుక్కోరాదుటే అమ్మా' అంది.

గోపాలరావు కంచం ముందరనుంచి లేచి వాకిట్లోకి వస్తూ 'ఎవరండీ వాకిట్లో...లోపలకు రండి' అన్నాడు. లలితమ్మవైపుకు తిరిగి 'అక్కయ్యా... అట్లా వాకిలికడ్డంగా నిలబడకపోతే ఆయన్ని లోపలకు రానీయరాదుటే' అన్నాడు.

'వద్దాలెండీ....అయ్యగారికి అర్జెంటు కాగితం యిచ్చేగుంటే' నసిగాడు వాకిట్లో మనిషి అక్కడినుంచే, చలి విచక్షణలేకుండా గోపాలరావునుకూడా గజగజ లాడించింది. వాకిట్లోకి వచ్చి టెలిగ్రాం అందుకుని కాగితంమీద సంతకం పెట్టి "మామూలు రేపొద్దున్న యిస్తాలేరా...మళ్ళీ రా" అన్నాడు. బయటి బంట్రోతు సైకిలుమీద ఎక్కుతూ "పాపిష్టోణ్ణి...నాకు మామూలు ఎందుకులే అయ్యా" అన్నాడు.

పార్వతి పరుగెత్తుకుంటూ వచ్చింది. సావిత్రి చెయ్యి కడుక్కుని కొంగుకు తుడుచుకుంటూ మెల్లగా సావిట్లోకి వచ్చింది.

"ఏరా గోపీ...ఈ వాల్టప్పుడు మనింటికి వుత్తరం వచ్చింది..." అంది లలితమ్మ ప్రతి అక్షరాన్ని సాగదీస్తూ.

"మీతో ప్రతీదానికి చావొస్తోందే...ఎందుకు యీ హడావుడి...గుబగుబలూనూ...ఆ..." గుండె దడను మాటలలో దాచుకోలేక తడబడుతూ అన్నాడు, కవరు వక్రపక్కన వంకరగా చించేస్తూ.

పార్వతి సావిత్రికి వెనకాలగా నిలబడి రెండుసార్లు "అత్తయ్యా...అత్తయ్యా" అంటూ పిలిచింది. గోపాలం టెలిగ్రాం పూర్తిగా చదవకుండానే "అక్కయ్యా..." అంటూ లలితమ్మ కాళ్ళమీదకు వరిగిపోయాడు. లలితమ్మ గుండె బాదుకుంటూ:

"ఏమయిందిరా గోపీ...నా కొంపకు ఏం యిక్కట్టు వచ్చిందిరా దేవుడా" అంటూ రాగాలు తీయటం మొదలుపెట్టింది. సావిత్రి అతని చేతిలోని ఉత్తరం వక్కసారిగా గుంజి:

"ఏమయిందండి...మాట్లాడరేం" అని టెలిగ్రాం గబగబా నాలుగు ముక్కలూ చదివేసి పార్వతికోసం వెనక్కు తిరిగింది. పార్వతి కళ్ళు ఎర్రగా జ్యోతుల్లాగా వెలిగిపోతున్నాయి. సావిత్రి ఏదో మాట్లాడటానికి పెదవి కదల్చబోయింది. పార్వతి:

'అత్తయ్యా...యిప్పుడే వస్తా ప్రమిదలో నూనెపోసి వకక్షణం ఆగు...' అంటూ గదిలోకి పరుగెత్తబోయి జారిపోయిన చీరె కొంగు కాలికి తగులుకుని గభాలున గది ముందర పోయి పడ్డది. ఆ గాలికి అసలే నూనెలేని దీపం గబుక్కున ఆరిపోయింది. కొడిగట్టిన దీపాన్ని ఆసరా చేసుకుని నివసిస్తున్న పొగ దానిని వదిలి పైకి వెళ్ళిపోయింది.

'అమ్మా దీపం పోయిందే' అంటూ పార్వతి బిగ్గరగా అరిచింది. లలితమ్మ పార్వతిని లేవతీసి వళ్ళోకి తీసుకుని,

'అవునే తల్లీ మన దీపం ఆరిపోయిందే...తల్లీ దేవుడో' అంటూ బిగ్గరగా రోదించటం మొదలు పెట్టింది. పార్వతి తల్లివైపు చూసి విషాదంగా నవ్వుతూ 'నేననుకున్న దేనమ్మా' అంటూ గొణిగింది.

సావిట్లో గచ్చుమీద మూలగా పడుకున్న పార్వతి పగిలిపోయిన గాజు పెంకులవంక చూస్తోంది నిలువుగుడ్లు పెట్టుకుని. ఎడంచేతి పని అయిపోగానే కుడిచేతి గాజులవంక చూస్తూ లలితమ్మ ఏమనాలో తోచక పార్వతిమీద పడి 'అయ్యో... నేను బ్రతికుండగానే యిటువంటి కష్టం వస్తుందని అనుకోలేదే తల్లీ' అంది. పార్వతి నిర్లిప్తంగా అటువైపు చూస్తూ కుడి చెయ్యి బలవంతంగా లేపి పక్కకు తిరిగి ఎడం చేతి పక్కన పెట్టింది. కంగు కంగు మంటూ గాజులు చిటికిపోతుంటే పార్వతి కంటి వెంట వకొక్క బాష్పంరాలి చెక్కిళ్ళకిందకు జారకుండానే ఆరిపోతున్నాయి.

"పదిగంటల బండికి రామాపురం పోదాం అక్కయ్యా...పెట్టెలో నాలుగుబట్టలు సర్దు" గోపాలరావు యింట్లో హడావుడి కొంచెం సర్దుకోగానే మెల్లిగా లలితమ్మతో అన్నాడు. పార్వతి అతనివంక నిర్లక్ష్యంగా చూసి ముఖం లలితమ్మ వళ్ళోకి దాచుకుంది.

"నేను బజారుకుపోయి వచ్చేలోపుగా అన్నీ సర్ది సిద్ధంగా వుంచండి..." గోపాలరావు వుత్తరీయం భుజాన వేసుకుని:

"సావిత్రీ...ఆ సంచీ యిటు తీసుకురావే... బజారుకుపోయి పదినిమిషాల్లో వస్తాను" అన్నాడు. సావిత్రి దణ్ణెంమీద వేసిన సంచీవంక చూస్తూ 'అంద దన్నట్లు' నిలబడింది. గోపాలరావు సంచీని పైనుండి అందుకుంటూ.

"ఏమక్కయ్యా...వచ్చేపొద్దా...పోయేపొద్దా. తొందరగా లేచి ఆ పనేమిటో చూడరాదూ... రెండు మెతుకులు నోట్లో వేసుకుని మళ్ళీ బయలు దేరాలయ్యె...మనకోసం బండీ ఏమన్నా ఆగుతుంది గనకనా" అన్నాడు. లలితమ్మ కళ్ళనీళ్లు కొంగుకి తుడుచుకుంటూ:

"నీతిండి పాడయిపోను...యిక్కడ వకమూల చచ్చి యేడుస్తుంటే నీ తిండి తాపత్రయం...యిదై పోతుందా...యివ్వాళ పొయ్యిమీద బియ్యంయెక్క డానికి వీల్లేదు."

"అయ్యో నా తల్లీ....ఎంత ఆపదవచ్చిందే..." పార్వతి తల్లిని ఇంకా గట్టిగా కౌగలించుకుని "అమ్మా ...అమ్మా" అంటూ బావురుమంటోంది.

"సావిత్రీ నువ్వన్నా చూడవే...తిండి సంగతి.. వాళ్ళనట్లా కాసేపు కదలకుండా వుండనీ..."

"అమ్మో...మరీ వుప్పలాయిగా వుంటేమండీ.. మీ మొండిపట్టు యిటువంటప్పుడు మానకపోతే ఎట్లా గండీ...ఛీ..." అంటు విసుక్కుంటూ వంటింట్లోకి వెళ్ళింది.

"అంతా కట్టకట్టుకుని ఏడవండి...ఏడిస్తే తీరే దుఃఖమా...నేను గూడా ఆడదానిలా ఏడవలేక వూరుకున్నా గాని...నా దుఃఖంలో వకవంతు—" గోపాలం వుత్తరీయంతో ముఖం గట్టిగా తుడుచుకుని సావిట్లో ఒకమూలకి గిరవాటు వేశాడు.

"మనం ఏం చెయ్యగలం అక్కయ్యా..."లలిత మ్మదగ్గరకు పోయి చతికిల బడ్డాడు. లలితమ్మ అతని భుజంమీద చెయ్యివేసి "త...మ్ముడూ" అంటూ ఆవురుమంది.

"మనం ఏం చేస్తాం అక్కయ్యా...నాకూ యింతరోగమూ వచ్చిందా...ఏమయింది...యింత యిక్కట్టు వస్తుందని కలలో గూడా అనుకోలేదు" పార్వతి ... అతని కళ్ళల్లోకి సూటిగా చూసింది. ఆమె కనురెప్పలు నల్లగుడ్డును గాలికి వదిలేసి నిశ్చింతగా నిలిచి వున్నాయి. నుదురు అదురుతోంది. పెదవులు అస్పష్టంగా వణుకుతున్నాయి.

"అట్లా చూడకపారూ...నా వంక... వద్దుపారూ అట్లా నావంక చూడకు..." గోపాలరావు పార్వతి వంక చూస్తూ రెండు చేతులూ కళ్ళకు అడ్డం పెట్టు కున్నాడు. సావిత్రి మెల్లిగా పార్వతి ప్రక్కకు చేరింది.

"పారూ...నా వంక చూడమ్మా..." పార్వతి సావిత్రివంక చూడకుండానే తల్లి వళ్లో ముఖం దాచుకుంది.

"సావిత్రీ...కాసిని మంచినీళ్లు తీసుకురా అమ్మా...గొంతు ఆర్చుకు పోయినట్లుంది పార్వతికి!..

"అట్లాగే అత్తయ్యా..."

"పారూ...ఏడవకమ్మా...మనం ఏం చెయ్య గలం యిప్పుడు" అన్నాడు గోపాలరావు.

పార్వతి తల్లి వడిలోనుంచి విడివడి కూర్చుంది గోపాలరావు వంకకు తిరిగి. ఆమె బలవంతాన పెదవులు కదిపి:

"అవును, యిప్పుడు చెయ్యగలిగింది ఏముంది... చెయ్యగలిగిన దంతా అదివరకే చేసేశారు..." అంది ఆగ్రహంగా.

"ఆ..." అంటూ అదిరిపడ్డాడు గోపాలరావు. అతని మెదడులో గతించిన చరిత్రంతా పుటలు తిరగ వేస్తూ ప్రత్యక్షమయింది. పార్వతి ముఖంలో రోగిష్టి భర్త బింబం కనపడుతోంది.

"చెయ్యగలిగిందంతా అదివరికే చేశారు. చిన్న తనంలోనే గొంతుకకు వురిపోశారు ... యిప్పుడు చెయ్యగలిగినదేముంది వురి బిగిసిపోయిన తర్వాత...'

'అదేమిటే పార్వతీ...అదేమిటే కన్న కూతు రుకు వురిపోసుకుంటారు టే...అవేం మాటలే...'

'అడుగు మీ తమ్ముణ్ణి అడుగు'—తమ్ముడు అంటూ వ్యంగ్యంగా వచ్చినమాట శూలంలా గుచ్చు కుంది గోపాలం హృదయానికి. పార్వతి వంక అతను చూడటానికి భయపడ్డాడు. అక్కడినుంచి లేచి వంటింటి వైపుకు ముఖం తిప్పి:

'నేనేం చేశాను...' అంటూ గొణిగాడు. పార్వతి హృదయం బ్రద్దలైంది. ముఖం జేవురించింది.

'అంతా నువ్వే చేశావు...నా పచ్చని జీవితంలో నిప్పుల కుంపటి పెట్టావు...ఆయనకా సుస్తీ మొదటి నుంచీ వుందని మీ రందరికీ తెలియదూ...అతని ఆస్తికి ఆశపడి...ఎదురువచ్చే సొమ్ములకు వ్యసనపడి...అమ్మా ...నా గొంతు కోశారే...' అంటూ బిగ్గరగా అరుస్తూ లలితమ్మ వళ్ళోకి వరిగిపోయింది పార్వతి గోపాల రావు పిచ్చెత్తినవాడిలా అయిపోయాడు. లలితమ్మ అతనివంక తీవ్రంగా చూస్తూ 'ఏంరా...ఆయనకి

సుస్తీ వున్న సంగతి తెలుసురా నీకు ... మాట మాత్రంగానైనా చెప్పలేకేంరా నాకు' అంది గట్టిగా.

"అదేం లేదక్కయ్యా" మాట తడబడిపోతోంది గోపాలరావుకు. "కొద్దిగా దగ్గవచ్చేదిట చిన్నప్పుడు...జలుబు మనందరికీ వున్నట్టే అతనికీ వుండే దిట...అంతే"

"అంతేనా"—పార్వతి కంయ్యి మంటూ లేచింది. "అతనికి రోజూ జ్వరం వచ్చేదిగాదూ...నోటి వెంబడి నెత్తురు పడేదిటగాదూ..యివన్నీ అబద్ధాలా?" సావిత్రి ముఖం తిప్పించుకుంది. లలితమ్మ అందుకుని,

"ఏరా మాట్లాడవేం" గోపాలరావుని గట్టిగా గద్దించి అడిగింది.

"ఎప్పుడోనన్నా వచ్చేదిట అక్కయ్యా"

"అవన్నీ వప్పుకున్నవాడివి...అతనికి క్షయ వున్నదని చెప్పడానికి దాపరికమెందుకు...నా జీవితాన్ని నీ సౌఖ్యంకోసం నాశనం చెయ్యటానికి సాహసించావుగాని, కావాలంటే నీవు కోరిన పైకం ఎక్కడైనా ముష్టెత్తుకుని యిచ్చేదాన్నిగాదూ నీకు..." పార్వతి ముఖం వివర్ణమైపోయింది. ఊపిరికే రొప్పుతోంది. పిచ్చిదానిలా జుట్టు చేతుల్లోకి తీసుకుని "మీరంతా దొంగలు...నన్ను చంపుతున్నారు...వురిబిగుసుకు పోతోంది...అమ్మా...అమ్మా..." అంటూ అరవటం మొదలు పెట్టింది.

లలితమ్మ కంగారుపడ్డది. ఎన్నడూ నోరెత్తి మాట అనని పార్వతి ఎందుకు అట్లా గొంతుచించుకుని అరుస్తోందో అర్థంగావటంలేదు. దుఃఖంలో అవురావురుమని ఏడవటం ఎరుగుందిగాని యిటువంటి వెర్రికేకలను వింటుంటే పార్వతికేదైనా మతి భ్రమించిందేమోనని భయపడింది.

'ఒరేయి గోపాలం...నా కొంపకేదో ముప్పు వచ్చిందిరా నాయనా...డాక్టరును పిలుచుకురా...రా...ముందర... తొం ద ర గా పోయిరారా నాయనా...' లలితమ్మ పార్వతిని కదలకుండా ఒళ్లో పెట్టుకుని అదుముకుంటోంది.

"నాకేం పిచ్చెత్తలేదు...దయ్యం గూడా పట్టలేదు...నన్ను పిచ్చిదాన్నిచేసి నా జీవితాన్ని నాశనం చేశారు...మల్లెచెట్టు పీకివేసి తుమ్మచెట్టు నాటారు...యింకా డాక్టరు గూడా ఎందుకు..." పార్వతి ముఖంలో ఎరుపుదనం తగ్గి కొద్దిగా తెల్లబడింది. చిరునవ్వు పొడగూడా కనపడింది. ఒక్కసారిగా విరగబడి నవ్వుతూ 'ఏం మామయ్యా నన్ను పెళ్ళి చేసికోరాదూ...నువ్వు...సావిత్రి అత్తయ్యను వీధిలో వదిలి పెట్టేద్దు గానిలే....' అంది. సావిత్రి కంగారు పడింది. పరుగెత్తుకుంటూ పార్వతి దగ్గరకు పోయి 'నన్నేమనక పారూ...నాకేమీ తెలియటం లేదు...అంతా అయోమయంగా వుంది' అంది. లలితమ్మ మాట్లాడలేదు. గోపాలరావు స్తంభీభూతుడైనాడు. సావిత్రి పార్వతి నానుకుని 'ఓగ్గరగా మాట్లాడకూడదమ్మా' అంది 'నాకు తెలుసులే' అన్నట్లు పార్వతి పెదవి విరిచి కళ్లు మూసుకుంది.

గోడగడియారం గంటలుకొట్టలేక కొట్టలేక విషాదంగా మూలిగింది. దానితాలూకు చప్పుడు గంటలు ఆగిపోయిన తర్వాత కొద్దిసేపటిదాకా గదిఅంతా మూగ ధ్వనినిచ్చింది. పార్వతి కళ్లు తుడుచుకుని "అమ్మా రామాపురం తప్పకుండా పోవలసిందేనా?" అంది. లలితమ్మ అక్కడ లేదు—అప్పటిదాకా యింట్లో జరిగిన సంగతు లేవీ పార్వతికి తెలియవు. ఆ పదినిమిషాల నిద్రలోనూ ఆమె కలలో చనిపోయిన భర్త నీడగా వచ్చి "నన్ను వకసారివచ్చి చూసిపోవూ" అంటూ ప్రాధేయపడ్డట్లు కనిపించింది. అతనివంక చూసి ముఖం ముడుచుకుంది గాని అతను ప్రాధేయపడటంచూసే టప్పటికి ఆమెగుండె నీరయింది.

"సుస్తీ నయమయి బాగుపడతానని అనుకున్నా గాని యిట్లా అర్థాంతరంగా కథ ఆగిపోతుం దనుకోలేదు పార్వతీ...అటువంటి సంశయం లేశమాత్రంగా నయినా వుండివున్నట్లయితే...నీ జీవితంలో తెలిసి నిప్పులు పోస్తానా పార్వతీ...నన్ను నమ్మవూ" అతను యింకా ప్రాధేయపడుతున్నట్లు పార్వతి కళ్లముందర కనపడుతోంది.

"పార్వతీ...నువ్వు అన్యథా భావించకపోయి నట్లయితే నా ఆత్మశాంతికోసం వక్కపని చెయ్యవూ. నేను ఎప్పటికీ నీకు కృతజ్ఞుడనై వుంటాను...నాశాంతికోసం పారూ....అదీ స్వార్థమేఅనుకో....నువ్వుమళ్ళీ పెళ్లి..."

పార్వతి కళ్లవెంబడి నీరు జాలువారుతున్నాయి. మళ్లీ పెళ్లిమాట తలపుకు వచ్చేటప్పటికి కళ్ళు బాగా గట్టిగా నులుముకుని చేతులు కళ్లముందర వూపింది ఆ నీడను వదిలించుకోవటానికి. ఆమెభర్త నీడ, వచ్చినట్లుగానే గాలిలో కలిసిపోయింది.

"ఏమిటి పారూ...యిందాకటినుంచీ కలవరిస్తున్నావు..." లలితమ్మ పార్వతి దగ్గరకు వచ్చి బుజ్జగిం

పుగా అడిగింది. వాకిట్లో వంటెద్దుబండి చేస్తున్న గజ్జెల గలగల పార్వతికి కొలయాసుని గజ్జెల ఘుంఘుణాల వినిపించింది.

"అక్కడికి వెళ్లక తప్పదా అమ్మా..."

గోపాలరావు బండీలో పెట్టె పెట్టివచ్చి చేతులు దులుపుకుంటూ.

"ఇంకా ఏమిటి అక్కా—యిట్లా ఆలస్యం... బండికి టైమయి పోతుందేను..." హడావుడిగా అన్నాడు. పార్వతి లేచి మెల్లిగా అడుగులు వేసుకుంటూ బయటికి వచ్చింది. లలితమ్మ భుజంమీద చెయ్యి వేసుకుని.

బండి స్టేషనుకు చేరేటప్పటికి రైలు రానే వచ్చింది. బండివనిషి ఎద్దు మెడతాడు బండిచక్రానికి కట్టేశాడు. బండి అటూ యిటూ కదలకుండా వుండటానికి. గోపాలరావు జనసమూహంలోనుంచి తోసుకుంటూ పెట్టెను ప్లాటుఫారం మీదికి చేరవేశాడు. బండివనిషి గోపాలరావు చేతిలో పెట్టెని కిందకు అందుకుంటూ:

'మీరు పోయి టిక్కెట్లు తెచ్చుకోరండి... నేను పెట్టెలట్టుకొస్తాగందా' అన్నాడు. పార్వతి బండీ దిగి పెద్ద పెద్ద అంగలు వేస్తూ గోపాలరావు దగ్గరకు వచ్చి:

'నాకు సెకండు క్లాసు టికెట్టు తీసుకో మామయ్యా...మూడో క్లాసులో నేను కూర్చోలేను' అంది. గోపాలరావు మారుమాట్లాడకుండా బుకింగ్ ఆఫీసుకు బరువుగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

పార్వతిని సెకండుక్లాసు కంపార్టుమెంటులో ఎక్కించి బండికి టయం అయిపోవటంవల్ల 'అమ్మ వాళ్లు దగ్గరకు పోతాను పారూ. బండి టయం అయింది మరి...మళ్ళీ పై స్టేషనులోవచ్చి కలుసుకుంటానులే.' అన్నాడు. ఆమె చింపిరి జుట్టు, కుంకుమ లేక వెలవెల బోతున్న ఆమె ముఖం, బోసిపోయిన ఆమె చేతులూ అతన్ని వెక్కిరిస్తున్నాయి ముఖం వెనక్కి తిప్పేసుకుని ఆర్ద్రమైన స్వరంతో 'పోతున్నా పారూ' అన్నాడు. పార్వతి అతని మాట వినిపించుకోకుండానే డబ్బులున తలుపువేసి లోపలకు వెళ్లిపోయింది.

బండి బయలుదేరినప్పటినుంచీ లలితమ్మా సావిత్రీ అదే పనిగా మాట్లాడటం మొదలు పెట్టారు. రామాపురంలో చూడబోయే పరిస్థితులు, జరుగుతున్న పరిస్థితులు పార్వతి భావి జీవితం మొదలైనవి చర్చలోనికి వస్తున్నాయి. సావిత్రి మాటకు లలితమ్మ ఏమీ మాటన్నా ఈసారి [illegible]. గోపాలరావు రైలెక్కినాక [illegible] లోనే ఉన్న సగం మంది [illegible] ఆడవాళ్ళు మెలకువగా కూడా [illegible]. మగ్గి మగ్గి [illegible] అటూ యిటూ [illegible] ఉన్నారు. ముగ్గ ముగ్గి [illegible] కూడా. ఆ [illegible] చూస్తుంటే అంతకుముందు [illegible] ఏదో విషాద సంఘటన [illegible]. లలితమ్మకు నిద్రముంచుకొస్తున్నట్లుగా వస్తోంది. సావిత్రి ప్రక్కకు జరిగి లలితమ్మ నిద్రపోవటానికి చోటిచ్చింది. లలితమ్మ జారి పడిపోయి పక్కకు ఒరిగింది.

"ఏరా గోపాలం...పార్వతి నొకసారి చూస్తారా...ఎట్లా వుందో ఏమిట్లో...ఎంత కష్టమైనా దాని మొండిపట్టేగాని ఒక్కతే అక్కడా...నలుగురికీ అక్కడే కొడరా అంటే వినదు లేదా అని నీ గొడవ...ఛీ...సరే నా మాటలకేం గాని ఒకసారి చూసిరారా" లలితమ్మ దవడలు నొక్కుకుంటూ నాలుగు పక్కలా పరికించింది. అంతా మగత నిద్రలో వున్నారు. బయటినుంచి చలిగాలి రివ్వుమంటూ వస్తోంది ముగ్గ ముగ్గ మిణుగురు పురుగులు గాలికి ఎగిరిపడి వస్తున్నాయి లోపలకు. రైలు వేగంతోపాటు హెచ్చుతూ తగ్గుతోంది లోపలి ఎలెక్ట్రిక్ దీపం.

"స్టేషను వస్తున్నట్టుంది...యిక్కడ దిగి చూసి రారా...వీలయితే అక్కడే కొన్నాళ్ళుండి...ఏదైనా మంచిమాటలు నాలుగు చెప్పేరా..." అంది.

"ఇది అప్పుడే మనవూరినుంచి నాలుగో స్టేషను. ఇప్పుడే స్టేషను వచ్చినట్లు మాట్లాడుతున్నావు... చూసివస్తాలే...'' అన్నాడు గోపాలరావు కూర్చున్న చోటినుంచి లేచి వాకిలివైపు పోతూ.

"నాలుగు స్టేషన్లవస్తే యిందాకటినుంచీ ఏం చేస్తున్నావురా" అంది లలితమ్మ విసుగ్గా మెటికలు విరుస్తూ.

బండి కూతకూస్తూ వేగం తగ్గించి మెల్లిగా పోతోంది. చూస్తుండగానే సిగ్నలు దాటిపోయి స్టేషనుకూడా వచ్చేసింది. తన పెట్టెలోకి ఎక్కటానికి వచ్చేవాళ్ళను తోసుకుంటూ కిందికు దిగి, పార్వతివున్న పెట్టెదగ్గరకు మెల్లిగా అడుగులు వేసుకుంటూ వెళ్లాడు. తలుపులోపల వేసివుంది. బయటనుంచి తీయటానికి సర్వవిధాలా ప్రయత్నం చేశాడు. తలుపును నాలుగైదుసార్లు కొట్టిచూశాడు. అప్పటికీ తలుపు రాకపోయే టప్పటికి గాబరాపడుతూ పార్వతిను పిలుచుకు రావటానికి పరిగెత్తాడు. ప్లాటుఫారం ఆ మూలనుంచి ఈ మూలదాకా రెండు నాళ్లుతిరిగినా

ఒక్కడూ కనపడలేదు. టిక్కెట్టు కలెక్టరుతో చెపితే పని వుందంటూ హోటలు లోకి చొరబడ్డాడు. గోపాలరావు అయోమయంలో పడ్డాడు. ఏం చెయ్యటానికి తోచక బండి బయలు దేరేటట్టుగా వుండేటప్పటికి పార్వతివున్న పెట్టె వాకిలి దగ్గరకు పరుగెత్తాడు. ఫుట్ బోర్డుమీద నిలబడి కడ్డీ బట్టుకున్నాడు. బండీ బయలుదేరింది.

బండీ ప్లాట్ ఫారం దాటగానే తలుపు దానంతట అదే తెరుచుకుంది. 'అమ్మయ్యా' అనుకుంటూ బండీలోపల అడుగు పెట్టి తలుపును పూర్తిగా తోసేసి లోపలకు వెళ్ళాడు. గప్పుమని అత్తరువాసన ముఖానికి కొట్టేసింది నిర్ఘాంతపోయాడు తను పొరపాటున తప్పు పెట్టెను ఎక్కాడేమోనని. వాకిలినుంచి తల బయటకు పోనిచ్చి పెట్టె నెంబరు చూశాడు. తను గుర్తు పెట్టుకున్నదే. సంశయంతో బెరుకుగా అడుగులు వేస్తూ లోపలకు వచ్చాడు.

'ఏం మామయ్యా....అట్లా కంగారు పడుతున్నావు' పార్వతి నింపాదిగా సోఫాలో పడుకుని అడిగింది. గోపాలరావు కళ్లు తిరిగిపోయినాయి. ఎర్రటి తిలకం నుదుట ఎలెక్ట్రిక్ బల్బు కాంతిలో మిలమిల లాడుతోంది. మల్లెపూలు సోఫానిండా విరజిమ్మబడి వున్నాయి. పెద్ద మల్లెపూల చెండు చుట్ట చుట్టుకుని పార్వతి కొప్పులో కూర్చునివుంది. ఆ పూలన్నీ గాత్రం విప్పి గానం చేస్తున్నట్లు కనపడుతున్నాయి గోపాలరావుకు. ఘుమఘుమలాడుతున్న ఆ పెట్టె... ఆ వాతావరణం...పెట్టె తలుపులన్నీ మూయబడి వుండటంవలన పెట్టెలో గాలికి రాకపోకలు లేక నులివెచ్చగా ఉంది. స్విచ్ బోర్డులో అగరువత్తుల కట్ట వకటి నిలువునా కాలిపోతోంది.

పార్వతి చిరునవ్వునవ్వుతూ "ఏంమామయ్యా .. బావుందా" అంది. ఆమె ముఖం విప్పారింది. ఆమె తలలోని పూలన్నీ కిలకిలా నవ్వుతున్నాయి. గోపాలరావు కళ్లు నులుముకున్నాడు. పార్వతికి తెలియకుండా నే ఎడంకాలిని కుడికాలి గోరుతో గిరుకుని చూశాడు, అతను చూస్తున్నది కలా...నిజమా అనే సంశయంతో.

"పారూ....యిదంతా ఏమిటి..." అన్నాడు అమితాశ్చర్య పడుతూ.

"ఊర్కో మామయ్యా....చెపుతాను గా.." అంది పార్వతి. ఆమె ముఖం యింకా నవ్వుతునే వున్నది.

"నేను మళ్ళీ పెళ్లి చేసుకుంటానుమామయ్యా... ఈసారి మంచి సంబంధం చూసి పెడతావుగదూ."

గోపాలరావుకు పిచ్చెత్తినట్లయింది. పార్వతికి పిచ్చెత్తిందేమోనని భయపడ్డాడు.

"పార్వతీ!" అంటూ బిగ్గరగా అరిచి గొలుసు లాగటానికి లేచాడు దానివంక చూస్తూ. పార్వతి గభాలున అతని చెయ్యి పట్టుకుని "ఊర్కో మామయ్యా...తొందరపడకూ..." అంది ప్రతి అక్షరాన్నీ సాగదీస్తూ. గోపాలరావు మాట్లాడకుండా సోఫాలో కూలపడ్డాడు.

"నేను పెళ్లి చేసుకుని సుఖపడటం యిష్టంలేదా మామయ్యా"

"పార్వతీ...ఒక్క గంటలో యిలా మారి పోయావేమిటి..."

"నిజం చెప్పు మామయ్యా ... గుండెల మీద చెయ్యివేసుకుని చెప్పు...నా సుఖం నువ్వు కోరటం లేదా...?"

"మళ్ళీ పెళ్లా...మన శాస్త్రాలు ఎలా వొప్పుకుంటాయి" గోపాలరావు మూర్ఖంగా వెలుగుతున్న బల్బువంక చూస్తూ అన్నాడు పార్వతి అతనిచేయి పట్టుకుని "మన శాస్త్రాలన్నీ మనం రాసుకున్నవేగా మామయ్యా...మనల్ని బాధపెట్టేవి మన కెందుకు?" అంది. గోపాలరావు ఆలోచనలో పడ్డాడు. అతని ఆలోచనలో స్మృతులూ, శ్రుతులూ వరుసాగ్గా నీడల్లాగా కనబడుతున్నాయి.

"వీల్లేదు పారూ...మళ్ళీ పెళ్లి వీల్లేదు...మన మతం హర్షించదు...మన పెద్దలు వప్పుకోరు...వీల్లేదు పారూ...నన్నిలాంటి ప్రశ్నలు మళ్లీ అడగవద్దు..." అన్నాడు. పార్వతి సంచీలోనుంచి అద్దంతీసి ముఖం చూసుకుని కుంకుమ సర్దుకుంది సగర్వంగా చూసుకుంటూ.

"ఈ సామానంతా ఎక్కడిది పారూ" వెలుగుతున్న అగరువత్తుల కట్టవంక చూస్తూ అడిగాడు.

"ఈ పెట్టెలో నేనెక్కినతర్వాత చాలా స్టేషనులు వచ్చాయి మామయ్యా..."

గోపాలరావు మౌనం దాల్చాడు. అటూ ఇటూ చూస్తూ ఆ పూలవాసన దొంగతనంగా ఆఘ్రాణిస్తున్నాడు. అగరువత్తుల మీదనుంచి వస్తున్న సువాసన మత్తును కలిగిస్తోంది.

పార్వతి గోపాలరావుకు యింకా దగ్గరగా జరిగి 'మామయ్యా' అంది. ఆమె గాత్రంలోని తొట్రుపాటు గోపాలరావు గ్రహించక పోలేదు. అతనికేదో మైకం కమ్మినట్లయింది. పిచ్చిగా ఆమెవంక చూస్తూ

'ఏం మామయ్యా...నీకు కనపడేచోట దాచి పెట్టాననుకున్నావు గదూ... అంత తెలివితక్కువ దాన్ని గానులే...తెలివి రానప్పుడు చేసిన అన్యాయానికి తెలివి వచ్చిన తర్వాత ప్రతీకారం తీర్చుకున్నాను...అయినా కౌగితంమీద కాదులే రాసింది.. ఒక నల్లరాతిమీద రాశాను....చెప్పుదామంటే చెప్ప గదులే...అది కఠినశిలగనుక మామయ్యా...అందుకని' 'కఠిన శిల' అంటుంటే ఆమె గాత్రం గదగదలాడింది. ఆమె నేత్రాలు అశ్రుపూరితాలయిపోయినాయి

"రాక్షసీ...నిన్నేం చేస్తానో చూడు...అది దొరక్కపోతే పోయిందిలే" కౌగితం దొరకని ఆవేశంలో ఆమెను గట్టిగా ఒకచేత్తో దగ్గరకు లాక్కుని రెండు చేతులతో గొంతు పట్టుకోబోయాడు.

"వృథా శ్రమపడక మామయ్యా...నాకే సంగతీ తెలుసు...అందుకనే నీకు శ్రమలేకుండా నేనే పోదామనుకున్నాను...ఇదుగో ఈ సీసా చూడు... తాగేశానులే ... పాయిజన్ ... అంటే తెలుసు అనుకుంటా...నీ కెందుకు శ్రమ...దానంతట అదే పోతుందిలే ప్రాణం..." గోపాలరావు సందిగ్ధావస్థలో పడ్డాడు. విషంతాగి మరణావస్థలోవున్న మనిషితో ఎట్లా వేగాలో తెలియటంలేదు. పార్వతి తూలుపాటువచ్చి సోఫామీద విరుచుకు పడిపోయింది. రైలు ధనధనామని చప్పుడుచేస్తూ నిర్లిప్తంగా పోతునే వుంది.

"పార్వతీ ... పారూ ... ఆ కౌగితం ఎక్కడ పెట్టావో చెప్పవూ...నీ కేం కావాలంటే అది చేస్తాను" గోపాలరావు ఆమె గడ్డం పట్టుకు బ్రతిమిలాడుతున్నాడు.

"నాకేం చేస్తావు మామయ్యా...వెళ్ళిపోతున్న దానికి...కౌగితం ఎక్కడపెట్టావో చెబితే చించి వేద్దామనిగదూ...ఆ...కౌగితం మీద కాదని చెప్పానుగా రాసింది...నల్లరాతిమీద రాశాననిగూడా చెప్పానుగా...అదిగూడా చెప్పమంటావా"

"పార్వతీ ... నాకేం అర్థంకావటంలేదు ... నన్ను క్షమించలేవా ... ఎక్కడా నువ్వు రాసింది చెప్పవా పారూ..."

'క్షమించలేను మామయ్యా...నా పేరు పదే పదే ఉచ్చరించి కలుషితం చెయ్యకు...అయినా చెబుతానులే...చూసుకో...నీ రాతి గుండె మీద రాశాలు...చేతనయితే హృదయం చీల్చుకుని చెరిపి వేసుకో...' పార్వతి ఆయాసపడుతూ ముఖం పక్కకు తిప్పుకుంది. ఆమె ముఖం రంగు మారి పోయింది నల్లబారుతోంది. గోపాలరావు బరువుగా నిట్టూర్చాడు. పార్వతి గిలగిలా తన్నుకోవటం మొదలు పెట్టింది. అతను కంగారు పడుతూ గొలుసు లాగుదామని దానిని చేతిలోకి పట్టుకోగానే బండి దానంతట అదే ఆగిపోయింది.

బయటినుంచి కిళ్ళీ, టీ వాళ్ళు పూరికేక అరుస్తున్నారు. గోపాలరావు గబగబా కిందకుదిగి స్టేషను మాష్టరు దగ్గరకు పరుగెత్తుకు వెళ్లి ఆయన్ని పిలుచుకు వచ్చాడు. ఆయన వచ్చేటప్పుడు ఫస్టు యెయిడ్ బాక్సు పట్టుకువచ్చాడు. ఇద్దరు పోర్టర్లు గబగబా పెట్టిలోకి ఎక్కి పార్వతిని బలవంతంగా దించారు. కింద అప్పటికే జనం గర్దీ ఎక్కువయింది. చుట్టూరా మూగి హడావుడి చేస్తున్నారు. లలితమ్మా, సావిత్రీ గూడా సామాన్లు దింపుకువచ్చారు వీరున్న చోటికి. ఆ స్టేషను రామాపురం అని తెలుసుకున్నాక. జనంలోనుంచి చొచ్చుకుని పార్వతి దగ్గరకు చేరటం ప్రళయం అయిపోయింది.

పార్వతి మూలుగు ఎక్కువైంది. ఆ ధ్వని ఎక్కడో పాతాళంనుంచి వస్తున్నట్లుంది. రెండు మూడుసార్లు బలవంతాన పెదవులు కదల్చటానికి ప్రయత్నం చేసింది. ఆ వచ్చినాయన ఏదో సీసాలోనుంచి మందు చెంచాతో తీసి పెదవులు తడిపాడు. పార్వతి పెదవులు బలవంతాన కదుపుతూ 'విషం... నేనే...చచ్చి...పో...పు చ్చు కు న్నా ను' అంది. గోపాలరావు స్టేషనుమాష్టరుగారి భుజం పట్టుకుని:

'వినండి డాక్టరుగారూ...నాకేం తెలియదు... నేనేం చెయ్యలేదు' అన్నాడు. పార్వతి ముఖంలో రేఖామాత్రంగా చిరునవ్వు పొడసూపింది గోపాలరావు వంక చూస్తూ. లలితమ్మ సావిత్రీ, పార్వతి దగ్గరకు చేరి హోరు హోరున ఏడుపు ప్రారంభించారు. రైలు స్టేషను మీదుగా రాలిపోయిన నక్షత్రం గోపాలం దృష్టిలో పడింది. అతని హృదయం జల్లుమంది. ఒక్కసారిగా వణికిపోతూ అతని రెండు చేతులూ హృదయానికి హత్తుకున్నాడు. అతని చేతి కేమిటో అక్షరాల్లాగా గుచ్చుకున్నాయి.

# శిథిలాలయం

శ్రీ అంగర సూర్యారావు

గత సంచిక తరువాయి

**2**

* * అదే స్థలం, కొండశిఖరంమీద దేవాలయంముందు; సంధ్యాసమయం; సూర్యకిరణాలు చెట్లమీద, పూలమొక్కల మీదపడి మెరుస్తున్నాయి. దేవాలయం తలుపులు తెరచి వున్నాయి. చిరంజీవి వేదికపై కూర్చుని పుస్తకం చదువుతూవుంటాడు. ఆలయంలోనుంచి రాముడు వస్తాడు. అతని ముఖంలో యీసారి ప్రశాంతత కనిపిస్తూ వుంటుంది.

రాముడు: (వేదికమీద కూర్చుంటూ) యామిని యేదీ?

చిరంజీవి: కొండవాలులో పూలమొక్కల దగ్గర తిరుగుతోంది. ఇక్కడికి వచ్చిన యీ మూడు రోజులలోను ఆమెలో ఏదో మార్పు కనిపిస్తోంది.

రాము : జీవిత సంగ్రామంలో అలసిపోయిన వాళ్లకు యీ ప్రదేశం స్వర్గం వంటిది. ఇక్కడి నుంచి వెళ్ళడానికి నాకే కాళ్లు ఆడడంలేదు. (నిట్టూర్పు) తప్పదు! వెళ్ళిపోవాలి! ఇక్కడే మరికొంతకాలం వుండడం తటస్థించినట్లయితే నా లక్ష్యాన్ని నేనే మరిచిపోవలసి వస్తుంది.

చిరం : ఎక్కడికి వెడతావు?

రాము : ఎక్కడికా? ఇక ఎక్కడికి వెడతాను! ప్రపంచం మీదికి (అతనిముఖంలో క్రౌర్యం కనిపిస్తుంది) నా జీవితసౌఖ్యాలు కొల్లగొట్టిన లోకంమీద దండయాత్ర చేస్తాను.

చిరం : లోకాన్ని నువ్వొక్కడవూ ఏం చెయ్యగలవు?

రాము : అది నాకూ తెలుసురా తమ్ముడు! లోకాన్ని నేనొక్కడినీ యేం చెయ్యలేను. నేను లోకం మీద దండయాత్ర చెయ్యడం గొర్రె కొండను ఢీకొన్నట్లే అవుతుంది. అలా అని పిరికివాడనై ఒక మూల కూర్చోలేను. జీవితంలో ఆనందాన్ని సౌఖ్యాన్ని అనుభవించే అర్హతను నేను కోల్పోయాను. నాపతనానికి కారణభూతమైన యీ ప్రపంచంతో నా యావజ్జీవితం సంఘర్షణ తప్పదు.

చిరం : మనల్ని హింసించిన వాళ్లపై పగ పట్టడం కంటే మనకు మార్గాంతరం లేదా? (ఆలోచిస్తూ) అవును! అప్పుడప్పుడూ నా మనస్సు నాకు ఎదురు తిరిగి పగ తీర్చుకోమని హెచ్చరిస్తూ వుంటుంది. నా కళ్ళముందు నా తల్లిదండ్రులు పడిన కష్టాలు నాలో నిద్రాణమై వున్న ప్రతిహింసాభావాన్ని మేల్కొలుపుతున్నై.

రాము : తమ్ముడూ! నిన్ను చూస్తూవుంటే నా మనస్సు కరిగిపోతుంది. నువ్వు కళ్లు తెరవకముందే కష్టాలకు గురి అయ్యావు. సమాజపు కఠోర శాసనాలకు బలియై నీ తల్లిదండ్రులు నీ కళ్ళముందే అంతరించారు. వెర్రి తలలు వేసిన కులమతాభిమానాలకు నీ కుటుంబం ఆహుతి అయిపోయింది. తమ్ముడూ! ఒక్క మాట చెబుతాను. నువ్వు నావలె మారిపోవాలని నేను కోరలేను. నేనెలాగూ చెడిపోయాను. నా హృదయం తూట్లు పడిపోయింది. నేను యిక ఎప్పటికీ మనిషిని కాలేను. (విచారస్వరంతో) కాని తమ్ముడూ! నువ్వు మాత్రం దారి తప్పవద్దు.

నీ చేత మనస్సును గాయపరచుకోవద్దు. నేను నడిచే కంటకావృతమైన మార్గంలో నువ్వు నడవలేవు. నీవు యిక్కడ ఆగిపో.

చిరం : అయితే నీవు వెళ్లడం తప్పదా?

రాము : తప్పదు. నేను వెళ్లి తీరాలి. ఈ మూడు రోజులు యిక్కడ ఎలా వుండగలిగానా అని నాకే ఆశ్చర్యంగా వుంది. నేను ఎత్తిన కత్రను ఎన్నడూ దించి ఎరుగను. మొన్న నే మొదటిసారి దించాను. ఇక్కడ మరికొన్ని రోజులు వుంటే నా మనసు సమూలంగా మారిపోతుందేమో నని భయంగా వుంది.

[కుడివైపు చెట్ల వెనుకనుంచి యామిని వస్తుంది. ఆమె ముంగురులు గాలికి చెదిరి చిందరవందరగా ముఖంమీద పడివున్నాయి. ముఖంలో ఆనందం, ఉత్సాహం నిండి వున్నాయి. ఒడినిండా పూలువున్నాయి. వేదికమీద ఒక మూల కూర్చొని ఒడిలోని పూలను ముందు వేసుకుని మాల అల్లుతూ వుంటుంది.]

రాము : ఆ పూ లన్నీ ఎందుకు యామినీ?

యామిని: మనుషులు పువ్వులంటే ఎందుకు అంత యిష్ట పడతారో నీకు తెలియదా రాముడూ? (ఒక అందమైన పువ్వు తీసి చూపిస్తూ) చూడు! యీ పువ్వు ఎంత అందంగా వుందో! ఇది నిన్ను ఆకర్షించడంలేదూ?

రాము : ప్రపంచంలోని ఏవస్తువుకూ నన్ను ఆకర్షించే శక్తిలేదు.

యామి : అలాగా! నువ్వు నీ జీవితంలో ఎన్నడూ ఏ స్త్రీని ప్రేమించలేదా?

రాము : ప్రేమా? దానినిగురించి ఆలోచించే తీరిక కూడా నా కింతవరకూ కలగలేదు.

యామి : (కొంటెగా) పోనీ యిప్పుడు కలిగిందా?

రాము : ఇక్కడ అడుగుపెట్టినప్పటినుండి నాకు ఎన్నడూ రాని ఆలోచనలు వస్తున్నాయి. తలపైనున్న పెద్ద బరువు తొలగించి తీరికగా కూర్చున్నట్లు అనిపిస్తోంది.

యామి : విశ్రాంతి, సౌఖ్యం, వున్నప్పుడే మనిషి మనసు వికసిస్తుంది. అప్పుడు దానంతట అదే కొత్త కోరికలను కోరుకుంటుంది.

చిరం : ఆ పూలమాల లెందుకు?

యామి : దేవుడికోసం.

రాము : (హేళనగా) పూలమాలలతో దేవుణ్ణి పూజించు! అందుకు ప్రతిఫలంగా యీ జన్మాంతం నీకు కష్టాలను ప్రసాదిస్తాడు. ఆ తర్వాత పునర్జన్మలో నీకు చక్కని భర్తను, ఐశ్వర్యాన్ని ప్రసాదించి నీ జీవితాన్ని పూలపాన్పుగా మారుస్తాడు.

యామి : (కోపంతో) నువ్వు నాస్తికుడవని నాకు తెలుసు! నీ ఉద్దేశాలను ఏ స్త్రీ గౌరవించదు! పరాధీనపు బ్రతుకు బ్రతికినంతకాలం స్త్రీకి దేవుడికంటే వేరే శరణ్యంలేదు. దేవుడనే భావమే ఆమె కష్టాలకు తాత్కాలికోపశమనాన్ని కలిగిస్తుంది. ఆ దేవుణ్ణి కూడా నీలాంటివాళ్లు తొలగిస్తే ఆమెకు వున్న ఒక ఆశారేఖా అంతరించి ఆమె జీవితం దుఃఖభాజన మౌతుంది.

రాము : స్త్రీలకే కాదు. పరాధీనులైజీవించే మానవు లందరికీ దేవుడేగతి. వాళ్లందరూ తమ అధ్వాన్నపు జీవితానికి ఆకాశంలో వుండే భగవంతుడే కారణమని నమ్ముతారు. తమ నికృష్టజీవితాలకు తమతోటి మానవులే కారణమని వాళ్లు ఎంతమాత్రం విశ్వసించరు. (క్షణంఆగి) నేనిలా అంటున్నానని యేమీ అనుకోకు యామినీ! నీవు లోనికివెళ్ళి నిశ్చల భక్తితో నీ దేవుణ్ణి పూజించుకో!

యామి : నేనొక ప్రశ్న వేస్తాను. జవాబు చెబుతావూ?

రాము : ఒక ప్రశ్నే కాదు. లక్ష ప్రశ్న లడిగినా జవాబు చెబుతాను!

యామి : నిజంగా మరొక జన్మవుంటే—ఆ జన్మలో ఏమై జన్మించాలనుకుంటావు?

రాము : జన్మసిద్ధాంతమే మన కొంప తీస్తోంది యామినీ! నిజానికి పునర్జన్మగనక వుంటే ఆ జన్మలో దుర్మార్గులను, వంచకులను, స్వార్థపరులను హతమార్చే యమదూతగా జన్మించాలని నా ఆకాంక్ష!

చిరం : (నవ్వుతూ) హోయి! హోయి! చాలా బావుంది. భలే మాట చెప్పావు రాముడూ?

యామి : (కోపంతో) ఊహుఁ! అలాగా! రాముడు చెప్పిన మాటలు నీకు నచ్చిన వన్నమాట! (అనునయంగా) చూడమ్మా! చిరంజీవి! నువ్వింకా చిన్న వాడవు! అటువంటి మాటలు వింటే నువ్వు చెడిపోతావు. ఇదిగో యీ పూలమాలతీసుకువెళ్లి గోవుడిమెడలో వేసిరా! (పూలదండ చిరంజీవికి యిస్తుంది. చిరంజీవి మారు మాటాడకుండా మాలతీసుకొని దేవాలయంలోకి నిష్క్రమిస్తాడు. యామిని మరోమాల అల్లుతూ వుంటుంది. రాముడు లేచి దీర్ఘంగా ఆలోచిస్తూ అటూ యిటూ తిరుగుతూ వుంటాడు.)

యామి : రాముడూ!

రాము : ఏం? యామినీ!

యామి : ప్రేమ అంటే ఎలా వుంటుందో నీవు ఎన్నడూ ఎరుగవు కదూ!

రాము : చిన్నప్పుడు పుస్తకాలలో చదువుకున్నాను. ఆ తరువాత దాన్నిగురించి ఆలోచించే తీరిక నాకు కలగ లేదు.

యామి : పోనీ తల్లి ప్రేమ ఎటువంటిదో తెలుసా?

రాము : అందుకు కూడా నేను నోచుకోలేదు. నేను కళ్లు తెరిచే సరికే నా తల్లి యీలోకాన్ని విడిచి పెట్టింది.

యామి : అందుకే నువ్విలా మారిపోయావు! తల్లి ఒడిలో పెరిగిన బిడ్డకు దయాదాక్షిణ్యాలు తప్పకుండా అలవడతాయి.

రాము : నాలో దయాదాక్షిణ్యాలు లేనందుకు నేను చాలా గర్విస్తున్నాను. యామినీ! (ఆశ్చర్యంతో) కాని! యింతకు పూర్వం నా మాటకు ఎదురుచెప్పినవాళ్లను ఎన్నడూ విడిచిపెట్టలేదు. నేటికి నామాటలకు ఎదురు చెప్పేవాళ్లు యిద్దరు కనిపిస్తూన్నారు.

యామి : (చిరునవ్వుతో) ఎవరా యిద్దరు?

రాము : (దేవాలయంవేపు చూపిస్తూ) ప్రాపంచిక విషయాలను ఏమాత్రం పట్టించుకోకుండా కళ్ళు మూసుకొని ఈ పాడుదేవాలయంలో కూర్చున్న విరాగి ఒకడు. రెండవ దానివి నువ్వు.

యామి : నీ మాటలకు ఎదురు చెబుతున్నందుకు నీకు మామీద కోపం కలగడం లేదా?

రాము : లేదు! అందుకే నేను ఆశ్చర్యపోతున్నాను.

యామి : దాని అర్థం యేమిటో తెలుసా రాముడూ? (రహస్యంగా) నీలో ప్రేమ, సహనం ఏర్పడుతున్నై.

రాము : (కోపంతో) వీల్లేదు. నాలో ప్రేమా సహనం కలగడానికి ఎంతమాత్రం వీల్లేదు. నా ప్రధానాశయమయిన ప్రతిహింసను మరిచి పోవడానికి వీల్లేదు. (ఆలోచిస్తూ) మరొక రోజు యిక్కడ వుంటే నా పతనం తప్పదు. ఈ చోటును ఎంత తొందరగా విడిచిపెడితే అంత మంచిది. (లేచి తొందరగా వెళ్ళ బోతూ ఉంటాడు.)

యామి : (ఆజ్ఞాపించే ధోరణిలో) రాముడూ! ఆగు! (రాముడు ఆగి వెనక్కి తిరిగి చూస్తాడు.) నువ్వు ఇప్పుడు వెళ్లడానికి నేను అంగీకరించడం లేదు. కూర్చో!

[మంత్రముగ్ధునివలె వెనుకకు తిరిగి వచ్చి రాముడు వేదికమీద యామినికి దూరంగా ఒక కొసను కూర్చుంటాడు.]

రాము : (దీనంగా) యామినీ! నేను యిక్కడ ఉన్నందువల్ల ప్రయోజనం ఏమిటి?

యామి : (నూటిగా) నువ్వొక్కడవూ ప్రపంచంమీద తిరుగుబాటు చేసినందువల్ల ప్రయోజనం ఏమిటి?

రాము : నీ మాటలలోని అయస్కాంత శక్తి నన్ను కదలనివ్వడం లేదు. నేను పరాజయాన్ని అంగీకరించవలసిందేనా? నేను నిజంగా పతనమౌతున్నానా? నా తల తిరుగుతోంది. ఎన్నడూ లేని వికారం ఏదో నాలో కలుగు తోంది.

[దేవాలయ జీర్ణప్రాకారానికి జేరబడి కళ్లు మూసుకుంటాడు]

యామి : విశ్రాంతి తీసుకో! ఇహలోకపు కల్మషాలకు దూరంగా వున్న యీ ప్రదేశంలో నిశ్చింతగా విశ్రాంతి తీసుకో! ఒక మనిషిలోని కర్కశత్వాన్ని తాత్కాలికంగా

సైనా తొలగించ గలిగినందుకు నేను సంతోషిస్తున్నాను.

రాము : (కళ్లు తెరచి దీనంగా) నాలో యింతటి దుర్బలత్వం వుందని నేనెన్నడూ అనుకోలేదు. నా మనోవికారానికి కారణం తెలియడం లేదు. (యామినిని తేరిపార జూస్తూ) నిన్ను చూస్తుంటే నాలో విచిత్రమైన భావాలు కలుగుతున్నై యామినీ!

యామి : (ఒక నిశ్వాసం విడిచి) హమ్మయ్య! ఇప్పటికి నీలో పూర్తిమానవత్వం వచ్చింది. ఆ లోకంలో నన్ను చూచిన ప్రతి యువకుడు వికారానికి లోనయ్యేవాడు. ఆ రోజుల్లో నా సౌందర్యాన్ని చూసుకొని ఎంతో మురిసిపోయేదాన్ని. చివరకు నా సౌందర్యమే నా పతనానికి కారణమయింది.

రాము : ఎప్పుడూ నీతోనే వుండిపోవాలని అనిపిస్తోంది.

యామి : అందరు యువకుల వలె నీవు కూడా ప్రేమలో చిక్కుకున్నావు. కాని నేను పతనమైన స్త్రీని. నేను ప్రేమించే అర్హతను కోల్పోయాను.

రాము : ఆ లోకపు కొలబద్దతో చూస్తే నేను కూడా పతితుడనే యామినీ!

యామి : (హేళనగా నవ్వుతూ) అయితే మనం చక్కని జంట! యిద్దరం వెళ్ళిపోయి ఏటి ఒడ్డున యిల్లు కడదాం.

[ఆలయంలోంచి విరాగి వస్తాడు.]

విరాగి : ఈ రోజు నీలో ఉత్సాహం కనిపిస్తోంది యామినీ!

యామి : స్వామీ! మోడు అయిపోయిన లతను మీరు చిగురింపచేశారు. కాని అది కేవలం చిగురించి వూరుకోలేదు. పూవులు పూయడానికి, కాయలు కాయడానికి ప్రయత్నిస్తోంది.

విరాగి : నీలో ఎంత ఉత్సాహం కనిపిస్తోందో యీ రాముడిలో అంత నిరుత్సాహం కనిపిస్తోంది.

యామి : (నవ్వుతూ) అతడు కొత్తగా ఒక ఆపదలో చిక్కుకున్నాడు స్వామీ!

విరాగి : ఓహో! అలాగా! రాముడు ఏ ఆపదలనూ లెక్క చెయ్యడే!

యామి : ఈ ఆపద వేరుస్వామీ! దానినుంచి ఏ మానవ మాత్రుడు తప్పించుకోనలేడు.

చిరం : (ఆలయద్వారం దగ్గరకు వచ్చి) రాముడూ! ఒకసారి యిలా రావూ?

[రాముడు ఆలయంలోనికి నిష్క్రమిస్తాడు.]

విరాగి : రాముడికీ చిరంజీవికీ రోజురోజుకూ స్నేహం ఎక్కువ అవుతోంది.

యామి : చిరంజీవి కూడా రాముడి ప్రతిహింసా సిద్ధాంతం వైపు మొగ్గుతున్నాడు స్వామీ!

విరాగి : అది నాకు తెలుసు యామినీ! లేత మనసు తాత్కాలిక ప్రయోజనాల వైపు తల వంచుతుంది.

యామి : వీళ్ళిద్దరూ ఏకమై ఏ దురంతానికి పూనుకుంటారో అని నాకు భయంగా వుంది.

విరాగి : నా సమక్షంలో అటువంటివి ఎన్నడూ జరగవు యామినీ!

యామి : ఒకడు యౌవనంలో కళ్లు కనిపించక సంచరించే యువకుడు. మరొకడు కళ్లు పూర్తిగా తెరవనిపసివాడు. ఇద్దరూ సహజంగా ఎంతో మంచివాళ్లు. ఒక్కొక్కప్పుడు ఎంతో సౌమ్యంగా ప్రవర్తిస్తూ వుంటారు. కాని ఉత్తర క్షణంలోనే విచిత్రంగా మారిపోతూ వుంటారు.

విరాగి : మానవునిలో మార్పు పరిసరాలను బట్టి వుంటుందమ్మా! మానవుడు పుట్టుకతో నిష్కల్మషాత్ముడు. కాని అతడు పెరిగే వాతావరణాన్ని బట్టి అతనిలో దయ, నిర్దయ, జాలి, క్రౌర్యం స్థావరాలను ఏర్పరుచుకుంటూ వుంటాయి. ఉదాహరణకు రాముణ్ణి చూడు! మన మధ్య వున్నంతకాలం సాధువు అయిపోతాడు. పై మనిషి ఎవరైనా వచ్చి దౌర్జన్యానికి పూనుకుంటే పులి అయిపోతాడు. (ముందుకు నడుస్తూ) నువ్వు ఒంటరిగా యిక్కడ కూర్చోవడం మంచిది కాదు. లోనికి వెళ్ళిపో యామినీ!

[విరాగి ఎడమవైపు చెట్లగుంపులోనికి నిష్క్రమిస్తాడు. యామిని మాల అల్లడానికి

తిరిగి ఉపక్రమిస్తుంది. దూరాన్ని మనుషుల మాటలు వినిపిస్తాయి. ఆమె భయంతో గుడి వైపు చూస్తుంది.]

రత్నాకరం: (నేపథ్యంలో) అదుగో! ఆ పాడు దేవాలయంలో నే వుంది.

[యామిని భయకంపితయై పూలన్నీ చెల్లా చెదరుగా పారేసి ఆలయంలోకి పారి పోతుంది. కుడివైపునుంచి రత్నాకరం, పార్వతీశం మాట్లాడుకుంటూ వస్తారు. పార్వతీశం తెల్లగా, లావుగా వుంటాడు. నొసట విభూతి రేఖలు వున్నై. విలువైన శాలువ కప్పుకుని వున్నాడు. మనిషిని చూడగానే పూర్వాచారపరాయణుడని తెలుస్తుంది.]

పార్వతీశం: ఈ గుట్టలు, డొంకలు అన్నీ దాటి ఇక్కడికెలా రాగలిగిందోయ్?

రత్నా : అదే నాకు ఆశ్చర్యంగా వుంది.

పార్వ : (చుట్టూ కలయజూస్తూ) ఇక్కడ ఎక్కడా మనుష్య సంచారం వున్నట్లు కనిపించదే!

రత్నా : యిదుగో! యీ గుడిలో వుంటారు. (ఆలయ ద్వారందగ్గర నిలుచొని) వినయ్యోయ్! బైరాగీ!

[లోననుంచి చిరంజీవి వస్తాడు. అతని ముఖంలో కోపం కనిపిస్తూ వుంటుంది.]

చిరం : (కోపంతో) ఏం? ఎందుకు?

రత్నా : పోయి మీ బైరాగిగారిని యిక్కడికి పంపించు! అతనితో మేం మాట్లాడాలి!

చిరం : వారు అలా పైకి వెళ్లారు. ఇప్పుడే వస్తారు.

పార్వ : (చిరంజీవిని నఖశిఖ పర్యంతం పరికించి చూసి) హారివెధవా! నువ్వటరా!—నువ్వు కూడా యిక్కడ చేరేవు?

చిరం : (కోపంతో) ఏమండోయ్ పార్వతీశం గారూ! మీరు కొంచెం మర్యాదగా మాట్లాడాలి. ఇది మీ దేవాలయంకాదు నోటికి వచ్చినట్లు మాట్లాడ్డానికి.

పార్వ : (కోపంతో) నన్నే ధిక్కరిస్తున్నావటరా?

చిరం : ధిక్కరించకపోతే చేతులెత్తి మొక్కమంటారా? ఒకనాడు నేను మీ ఆలయంలోకివస్తే ఏంచేశారు?

పార్వ : (కోపంతో) ఏంచేశావు? మొదటిదాకా కక్ష చేసి బయటకు గెంటావు? — ఏమి చేశావ్? నన్ను ఎదిరించే పాటి వాడివా నువ్వు? జాతీ నీతీ లేని వాళ్ళందర్నీ దేవాలయంలో అడుగుపెట్ట నిస్తాన్రా?

రత్నా : నూతిలోపడి చచ్చిపోయిన ఆ పిల్లకొడుకు కదటండీ వీడు?

పార్వ : వాడే! ఇంతవాడయ్యాడు! దానికి నీతి వుండిగనక నూతిలోపడి చచ్చింది. ఈ వెధవకు అదీ వున్నట్టు లేదు.

చిరం : ఈ విధంగానైనా మా అమ్మకు నీతివుందని ఒప్పుకున్నారు. సంతోషం. నా తల్లిదండ్రులు ఎందుకు చచ్చిపోయారో మీ రొక్కసారి ఆలోచించండి.

రత్నా : మేం అవన్నీ ఆలోచించడానికి యిక్కడకు రాలేదు. మీ బైరాగిని వెంటనే యిక్కడకు పంపించు.

చిరం : ఆయన వచ్చేవరకూ మీ రిక్కడ కూర్చోవచ్చు. (ఆలయంలోకి తిరిగివెళ్ళిపోతాడు)

పార్వ : ఎవడో తాగుబోతు వున్నాడని చెప్పేవు. వాడు ఎక్కడా కనిపించడేమోయ్ రత్నాకరం!

రత్నా : యామినీ వాడూ కలిసి యీ గుడిలో దాక్కొని వుంటారు. ఆ పోగరుబోతు అడ్డుకోక పోతే మొన్న నే యామినిని యింటికి తీసుకుపోయి వుండేవాణ్ణి.

పార్వ : వాడు ఎవడైవుంటాడు? ఇక్కడ ఎందుకున్నట్లు?

రత్నా : అదే తెలియడంలేదు. ఎవడో దారినపోయే మనిషనుకుంటాను.

పార్వ : వాడు బాటసారి అయితే అప్పుడే పోయి వుంటాడు.

రత్నా : నేనూ అలాగే అనుకుంటున్నాను. వాడు తిన్నగా కూర్చునే ఘటంకాడు. ఇక్కడ వుంటే యీ పాటికే మనతో ఘర్షణపడివుండే వాడు.

పార్వ : నువ్వు అనవసరంగా భయపడ్డావు. వాడు ఆ రోజే వెళ్ళిపోయివుంటాడు.

రత్నా : వాడి పొగరు అణచేశక్తి నాకువుంది. పోలీసులను తీసుకువచ్చి వాణ్ణి జైలుకు ఆ రోజునే పంపించి వుండేవాణ్ణి. కాని యింటిగుట్టు రచ్చకెక్కడం యిష్టంలేక ఆ పనికి నేను పూనుకోలేదు. యామిని యింటినుంచి పారిపోయిన విషయం, లోకానికి తెలియకూడదు. తెలిస్తే నాకు అప్రతిష్ఠ తప్పదు. ఈ రాత్రి ఆమెను రహస్యంగా తిరిగి యింటికి తీసుకుపోవాలి.

పార్వ : ఇక్కడ ఎవరో సాధుపురక్షణలో ఆమె వుందన్నావుకదూ! అతడు వర్ణాశ్రమ ధర్మాలకు కట్టుబడిన నిజమైన సాధువు అయినట్లయితే నా మాట తప్పక వింటాడు

రత్నా : మర్యాదగా మనతో పంపుతాడా సరేసరి! లేదా బలప్రయోగంవల్లనైనా ఆమెను యిక్కడనుంచి తీసుకుపోయి తీరతాను.

పార్వ : నేనా సాధువుతో మాట్లాడేటప్పుడు నువ్వు తొందరపడి నోరు జారకూడదు సుమా!— చూడు రత్నాకరం—ఉపాయంతో ఎటువంటి పనినైనా సాధించవచ్చు.

రత్నా : ఆ దుర్మార్గురాలికోసం మనం ఎన్నిపాట్లు పడవలసి వస్తున్నదో చూడండి (కోపంతో పళ్లు బిగించి) కులట! నా పరువును నిలువునా తియ్యడానికి పూనుకుంది.

పార్వ : నీకు ఆలోచనకంటె ఆవేశం హెచ్చు! నువ్వు మొదటే మా మరదలు విషయంలో మంచిగా ప్రవర్తిస్తే యిన్ని చిక్కులు ఎందుకు వస్తాయి చెప్పు!

రత్నా : అటువంటి కపట ప్రవర్తన గల స్త్రీని కనికరించకూడదు. దాన్ని నిలువునా చీరినా పాపం లేదు. కుటుంబ ప్రతిష్ఠను దృష్టిలో పెట్టుకొని దాన్ని క్షమించవలసి వచ్చింది. కనికరించి విడిచినందువల్ల కలిగిన ప్రతిఫలం యిదీ!

పార్వ : (ఎడమ వైపు చూస్తూ) ఇటు ఎవరో వస్తున్నట్లున్నారు చూడు!

రత్నా : అతడే యిక్కడ వుండే బైరాగి!
[ఎడమవైపు నుండి విరాగి వస్తాడు. ఇద్దరినీ పరిశీలనగా చూస్తాడు]

విరాగి : (రత్నాకరంతో) మొన్న రాత్రి వచ్చింది మీరే కదూ?

రత్నా : అవును! నేనే! యిప్పుడు మీతో మాట్లాడ్డానికి (పార్వతీశాన్ని చూపిస్తూ) మా వూరి దేవాలయ ధర్మకర్త పార్వతీశంగారు వచ్చారు.

విరాగి : ఆ వేదికపై కూర్చొని తామెందుకు వచ్చారో నిస్సంకోచంగా చెప్పవచ్చును.

పార్వ : చూడండి! మీరు సర్వసంగ పరిత్యాగులైన సాధువులా కనిపిస్తున్నారు. అటువంటి మీరు ఒక సంసారస్త్రీని తీసుకువచ్చి మీ మఠంలో చేర్చుకోవడం ధర్మమా?

విరాగి : జీవితంపై విరక్తి కలిగి ఆత్మహత్యకు ఉపక్రమిస్తున్న ఒక స్త్రీని రక్షించి ఆశ్రయమివ్వడం అధర్మమా?

పార్వ : ఓహో! అలాగా! ఆమె యిక్కడకు ప్రాణత్యాగం చెయ్యడానికి వచ్చిందా? అదే నిజమయితే మీరామెను రక్షించినందుకు మిమ్మల్ని అభినందించవలసిందే!

విరాగి : నేనీ ఆలయంనుంచి వెలుపలికి రావడం ఒక క్షణం ఆలస్యమయితే ఆ రోజు ఆమె యీ కొండ శిఖరం మీదినుంచి దూకి సముద్రంలో కలిసి వుండేది.

పార్వ : ఆమె ప్రాణాన్ని కాపాడినందుకు మీకు హృదయపూర్వకంగా కృతజ్ఞత తెలియజేస్తున్నాం. ఆమెను యిక దయచేసి మాతో పంపించండి.

విరాగి : ఆమె మీతో రావడానికి అంగీకరిస్తుందని నేను అనుకోను.

పార్వ : అన్ని ధర్మాలూ తెలిసిన మీరు యిలా మాట్లాడ్డం ఏమీ బాగా లేదు. ఒకరి స్త్రీ మీద హక్కు మరొకరికి ఎన్నటికీ వుండనేరదు. పొలం, యిల్లు, స్త్రీ, మున్నగునవి పురుషుని ఆస్తిలో భాగాలని శాస్త్రేతిహాస పురాణాలు ఘోషిస్తున్నవి. ఇతరుల స్త్రీలపై హక్కు మీకు ఎంత మాత్రమూ లేదు.

విరాగి : అటువంటి సిద్ధాంతాలవల్లనే నేటి సమాజం శిథిలమైపోయింది. పురుషునివలె స్త్రీకి

కూడా ఆలోచించడానికి మస్తిష్కం, ద్రవించడానికి హృదయం వున్నాయి. స్త్రీని బానిసగా చూచినంత కాలం సమాజానికి ముక్తి లేదు.

పార్వ : (కోపంతో) ఆడదానికి స్వేచ్ఛ వుండాలని చెప్పి ఒక పెద్దయింటి స్త్రీని మీ మఠంలో దాచి వుంచుతారా?

విరాగి : (ప్రశాంతంగా) మీరు అక్కడే పొరబాటు పడుతున్నారు. ఇది మఠమూ కాదు. నేను బైరాగినీ కాను. జీవిత సర్వస్వం కోల్పోయి విరక్తితో నేను యిక్కడకు వచ్చాను. ఇక్కడి ప్రశాంత వాతావరణాన్ని చూచి యీ దేవాలయంలోనే నివాసం ఏర్పరుచుకున్నాను. మరికొంతకాలానికి కళ్ళు పూర్తిగా తెరవని ఒక పసివాడు వచ్చాడు. అతను కూడా యిక్కడనే వుండిపోయాడు. తరువాత యామిని వచ్చింది. ఇక్కడ నిర్మల పరిసరాలకు ఆకర్షించబడి వాళ్ళంతట వాళ్ళే యిక్కడ వుండిపోయారు.

పార్వ : (హేళనగా) ఓహో! ఎంత పవిత్రస్థలం యిది! సంఘంనుంచి బహిష్కరింపబడిన వాళ్లు, దుర్మార్గులు, విద్రోహులు చేరే పవిత్రమైన పాడుదేవాలయమన్నమాటయిది!

విరాగి : (ప్రశాంతంగా) యీ దేవాలయపు శిథిలాలు బహిరంగంగా కనిపిస్తాయి. అందువల్ల ఎవరికీ కీడుకలిగే అవకాశం లేదు. కాని మీరు నివసించే ఆ ప్రపంచపు శిథిలాలను కంటికి కనిపించకుండా దాచడానికి మీరు ప్రయత్నిస్తారు. అది ఒక శిథిలాలయం. దాని ప్రాకారాలు మీ కళ్ళముందు నేల కూలుతున్నా మీరు చూడనట్లు నటిస్తున్నారు.

రత్నా : (పార్వతీశంతో) యీ అనవసర ప్రసంగం కట్టిపెట్టి ఆమెను మనతో పంపిస్తాడో లేదో కనుక్కోండి.

పార్వ : మనలో మనకు విరోధం మంచిదికాదు. ఆమెను మాతో పంపించండి.

విరాగి : ఆమె మీతో రావడానికి యిష్టపడితే ఆమెను నిరభ్యంతరంగా మీరు తీసుకు పోవచ్చు.

రత్నా : మహారాణీలా యిష్టపడుతుంది. ఎందుకు ఇష్టపడదు? సుఖంగా యింట్లో కూర్చొని తినడం చేదా?

పార్వ : ఆమెను యిక్కడకు ఒకసారి పిలిపించండి.

విరాగి : (ఆలయం ద్వారం వైపు తిరిగి) యామినీ! యామినీ!!

[యామిని ఆలయంలోంచి వచ్చి తలవంచుకొని ఒక ప్రక్క నుంచుంటుంది. ఆమె ముఖంలో భయసందేహాలు కనిపిస్తూ వుంటాయి ]

పార్వ : (మందలించే ధోరణిలో) ఏమమ్మా! యామినీ! నువ్విలా యిల్లు వదలిపెట్టి రావడం ఏమైనా ధర్మమే! మీ వంశం ఎంత గొప్పది! మీ కుటుంబంలో యింతవరకూ ఎవరూ వేలుపెట్టి చూపించుకోలేదు. జరిగినదేదో జరిగిపోయింది. రా అమ్మా! యింటికి పోదాం. నువ్విలా పారిపోయి వచ్చినట్లు యింకా ఎవరికీ తెలీదు. ఏమీ జరగనట్లు ఎప్పటిలా హాయిగా యింటికి వచ్చి వుండు!

యామి : (గద్గద కంఠంతో) ఇక నేను ఆ యింట్లో అడుగు పెట్టలేను.

పార్వ : నా మాట విను! నీకు ఏ కష్టమూ కలగకుండా నేను చూస్తాను.

యామి : (దృఢనిశ్చయంతో) ఆ యింట్లో అడుగు పెట్టి పాడు జీవితం సాగించేకంటే యీ కొండ శిఖరంమీదినుంచి వురికి చావటం మంచిది.

రత్నా : (ఉగ్రుడై) ఏమన్నావ్? ఇంటికి రాకుండా యిక్కడే పుట్టికట్టుకొని పూజలు చేద్దామనుకొంటున్నావా? నిన్ను జుట్టుపట్టుకొని యీడ్చుకు వెళతాను. ఎవరు అడ్డు వస్తాడో చూస్తాను. (కోపావేశంతో యామిని మీదికి వస్తాడు. యామిని భయంతో కెవ్వున అరుస్తుంది. దేవాలయం

తలుపులు పెద్ద ధ్వనితో తెరుచుకుంటాయి. ముందు రాముడు వెనుక చిరంజీవి శస్త్రాస్త్రాలతో ఆకస్మికంగా ప్రవేశిస్తారు. యిద్దరి చేతులలోను కర్రలు వుంటాయి.)

రాము : (కర్ర పైకెత్తి) ఒరేయ్! రత్నాకరుడూ! నన్ను మరిచిపోయేవుట్రా?

చిరం : (కర్ర పైకెత్తి) మెత్తగా వూరుకుంటే మొత్తడానికి వచ్చావా?

[రత్నాకరం భయంతో విరాగి వెనుకకు వస్తాడు.]

విరాగి : (రాముణ్ణి, చిరంజీవినీ తీక్షణంగా చూస్తూ) ఏమిటిది? (యిద్దరు మంత్రముగ్ధులవలె కర్రలు క్రిందికి దించుతారు) హింసతో మనం యే కార్యాన్నీ చక్కపెట్టలేం నాయనా! హింసవల్ల తాత్కాలిక ప్రయోజనం కలిగినా దానివల్ల శాశ్వతమైన దుష్ఫలితం కలిగే అవకాశం వుంది.

పార్వ : (రత్నాకరంతో) ఆ పిల్ల రాను మొర్రో అంటున్నప్పుడు మనం మాత్రం యేం చెయ్యగలం. రా! పోదాం! (పార్వతీశం, రత్నాకరం కుడివైపు నిష్క్రమిస్తారు.)

రాము : కొందరు దుర్మార్గులు మన మీదికి వచ్చి హింసించడానికి పూనుకుంటే మనం అహింసా సిద్ధాంతాలను వల్లిస్తూ చేతులు ముడుచుకు కూర్చోవలసిందేనా?

విరాగి : ప్రతిహింసకు పూనుకునేకంటే హింసను సహించి వూరుకోవడం మంచిది. నిన్నొకడు హింసిస్తాడు. అతనిని నువ్వు తిరిగి హింసిస్తావు. అతడు మరింత పగపట్టి ప్రతిహింసకు సిద్ధమవుతాడు. ఇక దానికి అంతు ఎక్కడ? హింసను ఎదుర్కోవడానికి అహింసకంటే గొప్ప సాధనం మరొకటి లేదు నాయనా?

యామి : వాళ్లు యిక్కడకు రాగానే రాముడు ఉగ్రుడై పోయాడు. స్వామీ! నేను అతి ప్రయాసమీద మీరు వచ్చే వరకూ యితనిని ఆపగలిగాను.

చిరం : అంతటి దుర్మార్గులను మంచి మార్గంలో సాధించలేం...

రాము : నిజం చెప్పేవురా తమ్ముడూ! (విరాగితో) చేతులు ముడుచుకు కూర్చుంటే నేటి పరిస్థితులు ఎన్నటికీ మారవు స్వామీ! దుర్మార్గులను, వంచకులను, స్వార్థపరులను, క్రూర జంతువులవలె వేటాడి చంపాలి. అనాడే లోకంలో సుస్థిరశాంతి సౌభాగ్యాలు స్థావరం యేర్పరుచుకుంటాయి. అనవ్య సమాజంలోనే మీ అహింసా సిద్ధాంతానికి పట్టాభిషేకం జరుగుతుంది.

విరాగి : ఆవేశంవల్ల పరిస్థితులను అర్థంచేసుకో లేక పోతున్నావు నాయనా! ప్రతి మానవ ప్రాణికి హృదయంవుంది. కొందరు కర్కశ హృదయులు వుంటారు. వారిలో పరివర్తన తీసుకు రావడం కష్టమైన పని కాదు. ఎంతటి దుర్మార్గుడికైనా కొన్ని సమయాలలో హృదయం ద్రవించక మానదు. హృదయ పరివర్తనవల్ల కలిగే విప్లవమే శాశ్వతమైనది.

రాము : మీ సిద్ధాంతాలను నేను అంగీకరించ లేను స్వామీ! నేటి ప్రపంచంలో జరుగుతున్న హింసాకాండను, పీడనను చూస్తూ సహించి వూరుకోలేను. ఎక్కడ ఏ మాత్రం దౌర్జన్యం కనిపించినా నాలో ఉడుకు రక్తం పొంగి ప్రవహిస్తుంది.

విరాగి : ఉద్రేకపడకు నాయనా! కూర్చో! అహింస గొప్పదని నీవు స్వయంగా అంగీకరించే సుదినం తప్పక వస్తుంది.

యామి : రాముడి మాటలు వింటూవుంటే నేటి ప్రపంచంలో ప్రతిహింసను అవలంబించే కంటే గత్యంతరం లేదనిపిస్తోంది. వెనువెంట నే మీ మాటలలోని లాలిత్యం మమ్మల్ని అహింసామాత్రంవైపు లాగుతోంది. అహింసా సిద్ధాంతం సరసనే హింసా సిద్ధాంతం కూడా వర్ధిల్లుతూ వుంటుందనిపిస్తోంది.

[కుడివైపు నుంచి చంద్రయ్య ప్రవేశిస్తాడు. ముఖంలో దైన్యం కనిపిస్తూ వుంటుంది. మాసినబట్టలు, సంస్కారంలేని జుత్తు కష్టాల మధ్య చిక్కుకున్న మనిషి అని తెలియజేస్తూవుంటాయి.]

చంద్రయ్య: (దీనంగా) యిక్కడ ఎవరో చాలా మంది వున్నారు. (విరాగితో) బాబూ! యీ రాత్రికి నన్ను యిక్కడ తలదాచుకో నిస్తారా?

విరాగి : ఈ స్థలంపై హక్కు ఎవరికీ లేదు నాయనా! యిక్కడ అందరూ సమానమే! నువ్వు నిరభ్యంతరంగా వుండవచ్చు.

రాము : (ముందుకు వచ్చి) ఎవరు నువ్వు? ఇలా ఎందుకు వచ్చావు?

చంద్ర : నేను చాలా కష్టాలలో వున్నాను బాబూ! నా ఆస్థి అంతా అప్పుల వాళ్లు దోచుకు పోయారు అన్నీ వదులుకొని ఆ మహా సముద్రంలో నుంచి కట్ట బట్టలతో గట్టెక్కాను. ఏ పొరుగూరో పోయి పొట్ట పోషించు కుందామని బయలు దేరాను. దారి తప్పి యిలా వచ్చాను.

యామి : పాపం! చాలా కష్టాలు అనుభవించి నట్లున్నావు.

[చీకటి దట్టమవుతుంది. చిరంజీవి లోనికి వెళ్లి లాంతరు వెలిగించి తీసుకువచ్చి వేదిక మీద వుంచుతాడు]

రాము : ఆడదాని హృదయం అతికోమలమైనది. అది దొంగమాటలకు కూడా యిట్టే కరిగి పోతుంది. (చంద్రయ్యతో) నీ పేరేమిటి?

చంద్ర : (భయంతో) చంద్రయ్య అండి?

రాము : పాపం! నువ్వు దారి తప్పి యిలా వచ్చావా?

చంద్ర : అవునండి!

రాము : చూడు! చంద్రయ్యా! నువ్వు కూడా గట్టి మోపైన మనిషిలా కనిపిస్తున్నావు. రే ప్రొద్దున్న ఏమైనా అవసరం వస్తే నువ్వు ఒక భుజం వెయ్యాలి! తెలిసిందా!

యామి : (నవ్వుతూ) రాముడు యిద్దరు శిష్యుల్ని సంపాదించాడు.

చంద్ర : నేను రేపు ఉదయమే వెళ్ళి పోవాలమ్మా!

రాము : అలాగే పోవయ్యా! నిన్ను యిప్పుడు వుండి పొమ్మని ఎవరు ప్రతిమాలేరు!

యామి : ఈ రోజు లేచింది మొదలు అన్నీ చిక్కులే! తినడానికి ఏమీ లేవు; అన్నీ అయిపోయినై

చిరం : (విరాగితో) ప్రొద్దుపోయింది ఏదైనా తీసుకు రమ్మంటారా స్వామీ!

విరాగి : ఈ రాత్రివేళ నీవు వొక్కడవూ వెళ్ళడం మంచిదికాదు. నాయనా! (చంద్రయ్యతో) నువ్వుకూడా చిరంజీవితో వెళ్లు చంద్రయ్యా!

[చంద్రయ్య, చిరంజీవి కలిసి బైటకు నిష్క్రమిస్తారు. విరాగి ఆలయంలోకి వెళ్ళి పోతాడు ]

యామి : పాపం! చంద్రయ్య కూడా కష్టాలలో చిక్కుకున్న మనిషిలా కనిపిస్తున్నాడు.

రాము : యామినీ! నాకీ లోకంలో ఏ మనిషి మీదా నమ్మకం లేదు. నేను యిక్కడ అడుగు పెట్టి పెట్టగానే మిమ్మల్ని అనుమానించాను.

యామి : నువ్వు యిక్కడికి ఎలా రాగలిగావు?

రాము : (క్షణం ఆలోచించి) అప్పుడు నాకు ఆకలి దహించుకు పోతోంది. ఊళ్ళో అడుగు పెడితే తిరిగి ఏ దుర్మార్గానికైనా నేను ఒడి కట్టవచ్చు అనే అనుమానం నాకు కలిగింది. ఆ సమయంలో నాకు యీ కొండమీది దేవాలయం కనిపించింది. ఒంటరిగా ఆ రాత్రి యిక్కడ గడపవచ్చు కదా అని ఇక్కడకు వచ్చాను మీరు కనిపించారు.

యామి : నువ్వు సమయానికి యిక్కడకు రావడం దైవనిర్ణయం రాముడూ! నువ్వే గనక అప్పుడు ఇక్కడకు రాకుండా వున్నట్లయితే నన్ను యీ సరికి మా వాళ్లు యీడ్చుకు వెళ్ళి ఆ నరకకూపంలో పడవేసి వుండే వారు.

రాము : (కోపంతో) దైవనిర్ణయం మట! దైవ నిర్ణయం! నీకీ దుర్గతి రావడానికి దేవుడు కారణమా? నిన్ను బలవంతంగా తీసుకు పోవడానికి రత్నాకరం రావడం కూడా దైవ నిర్ణయమేనా? బుద్ధి వక్రించి మనిషి చేసే ప్రతిఘోర కృత్యానికీ దేవుణ్ణి అడ్డు పెట్టుకోవడం ఎంతటి దురన్యాయం?

యామి : దేవుడు పేరు విన్నప్పుడు నువ్వెందుకు అంత ఉగ్రుడవై పోతావు?

రాము : దేవుడి మీద నాకేవిధమైన ద్వేషం లేదు. దేవుడున్నాడో లేదో అంతకంటే తెలీదు. దైవ నిర్ణయం అనే ముసుగులో మానవులు సాగించే దోపిడీ చర్యలను, హింసా కాండను నేను చూస్తూ సహించి వూరుకోలేను.

యామి : భగవంతుడు వున్నాడు. నాకు కనిపిస్తున్నాడు. పసిపాప చిరునవ్వులోను, వికసిస్తున్న పువ్వులోను నాకు దేవుడు కనిపిస్తున్నాడు. (అరమోడ్పు కళ్ళతో) నా కష్టాల నుంచి ఆ దయామయుడు నన్ను తప్పక దరి జేరుస్తాడు.

రాము : పాపం! మానవుడు కష్టాలను సృష్టిస్తూ వుంటే దేవుడు వచ్చి వాటిని తొలగిస్తూ వుంటాడు!

[ఆలయంలోంచి విరాగి వస్తాడు]

విరాగి : ఆలోచించి చూస్తే నువ్వు యిక్కడ వుండడం మంచిది కాదనిపిస్తోంది యామినీ!

రాము : అయితే యామినిని ఆ కసాయివాడితో పంపుదామంటారా స్వామీ!

విరాగి : ఆమె వుండవలసిన స్థానం యిది కాదు. కష్టాలను సహించి మంచిరోజుల కోసం ఎదురు చూస్తూ ఆమె పోయి తన యింటిలో వుండడమే మంచిది.

యామి : (దృఢ నిశ్చయంతో) పులి నివసించే గుహలోకి వెళ్ళమన్నా సంతోషంతో వెళ్ళగలను గాని ఆ ఇంట్లో మాత్రం తిరిగి అడుగు పెట్టలేను.

రాము : ఆమె ఇక్కడ వున్నందువల్ల నష్టమేమిటి స్వామీ!

విరాగి : మనకేమీ నష్టం లేదు నాయనా! ఆమె క్షేమం కోరి నేను చెబుతున్నాను. మనం అన్ని బంధాలు త్రెంచుకొని బయటకు వచ్చాం. మనం దేనికీ భయపడం. నేడు కాకపోయినా రేపైనా ఈమె సమాజంలో నివసించవలసిన స్త్రీ.

రాము : (హేళనగా) పురుషుల కొకనీతి, స్త్రీల కొకనీతి. ఏం లోకం! ఏం న్యాయం!

యామి : నాకు యిక యీ జీవితం మీద ఆశ లేదు స్వామీ! ఆశలను కోల్పోయి ఆత్మహత్యకంటే శరణ్యం లేదని నేను యిక్కడకు వచ్చాను. మీమాటలు విని నా ప్రయత్నాన్ని తాత్కాలికంగా విరమించుకున్నాను. నేను తిరిగి యింటికి పోవడానికి ఎంత మాత్రం అంగీకరించను. అంతకంటే యీ కొండశిఖరం మీదినుంచి హృదయ పూర్వకంగా సంతోషంతో ఆ అనంతసాగరంలోకి దూకగలను.

రాము : శభాష్! మంచిమాట చెప్పావు. నువ్వు పిరికిదానివి కనక కొండమీదినుంచి దూకి చస్తానంటున్నావు. నా ఆశయం ఏమిటో తెలుసా! మన సంకల్పానికి అడ్డు వచ్చిన కొండనయినా పిండిచేసి ముందుకు పురోగమించాలి!

[కుడివైపునుంచి తొందరగా చంద్రయ్య ప్రవేశిస్తాడు. భయంతో వణుకుతూ వుంటాడు.]

చంద్ర : స్వామీ! కొంప మునిగింది!

రాము : (లేచి ఆతృతతో) ఏం? ఏం జరిగింది? చిరంజీవి యేడి?

చంద్ర : (ఆయాసంతో) మేం కొండ దిగీ దిగగానే నలుగురు మనుషులు వచ్చి మామీద పడ్డారు బాబూ! నేను అతి ప్రయాసమీద వాళ్ళను తప్పించుకొని పారిపోయి వచ్చాను. చిరంజీవి వాళ్ళకు దొరికిపోయాడు.

రాము : (ఉగ్రుడై కర్ర తీసుకొని) ఎవరు వాళ్ళు? ఇప్పుడే వాళ్ళను యమసదనానికి పంపించి చిరంజీవిని విడిపించుకు వస్తాను. నేను వచ్చే వరకూ నువ్వు యిక్కడే వుండు. కాలు కదిపితే నిన్ను కైలాసానికి పంపుతాను. జాగ్రత్త!

[రాముడు కోపోద్రేకంతో కుడివైపుకు తొందరగా నిష్క్రమిస్తాడు. విరాగి, యామిని, "రాముడూ! రాముడూ!" అని పిలుస్తారు]

యామి : (నిట్టూర్చి) లాభం లేదు! తన పని పూర్తి అయ్యేవరకూ రాముడు యిక వెనుకకు తిరగడు. ఎటువంటి ఘోరపరిణామాలు కలుగుతాయో! (దుఃఖంతో) దీని కంతటికీ

కారణం నేనే! ఆ రోజే నేను యీ కొండ శిఖరంమీదినుంచి దూకి శాశ్వతంగా కళ్లు మూసివుంటే యీ సంఘర్షణ యీ రక్త పాతం తప్పివుండేవి.

విరాగి : (చంద్రయ్యతో) కూర్చుని విశ్రాంతి తీసుకో నాయనా! (యామినితో) విచారించకమ్మా! ఆ ప్రపంచంతో బంధనాలను త్రెంచుకొని మనం ఎంత దూరంగావున్నా అది మనలను విడిచిపెట్టదు. యావజ్జీవితం యీ సంఘర్షణ తప్పదు. (లేచి నడుస్తూ) రాముడు ఈ ఘోరానికి పూనుకుంటాడో! లేక రాముడినే వాళ్లు శాశ్వతంగా మననుంచి దూరంచేస్తారో!— యామినీ! ఇక నీవు లోనికి వెళ్ళిపో! నువ్వు యిక్కడ వుండడం మంచిది కాదు.

యామి : దీనితో నాకు జీవితంమీద అనురాగం పూర్తిగా నశించిపోయింది స్వామీ! ఇటువంటి పరిణామాలు కలుగుతాయని తెలిస్తే మీ మాటలను లెక్కచెయ్యకుండా ఆనాడే నా జీవితాన్ని ముగించుకొని వుండేదాన్ని. (ఏడుస్తుంది)

విరాగి : జరిగిపోయిన విషయాలను తలచుకొని దైన్యపడడం విజ్ఞుల లక్షణం కాదమ్మా! నీ మనసు పూర్తిగా కలగిపోయింది. లోనికి పోయి పడుకో!

యామి : నావల్ల మీకు యింకా కష్టాలు కలుగుతాయేమో నని నాకు భయంగా వుంది.

విరాగి : నేను కష్టాలకు భయపడేవాణ్ణి కాదమ్మా! రా లోనికి పోదాం. (చంద్రయ్యతో) రా నాయనా! ఆలయంలో కూర్చుందాం.

చంద్ర : (భయభక్తులతో) రాముడి మాట జవదాటడానికి వీల్లేదు బాబూ! నేను యిక్కడ కూర్చొని కాపలా కాస్తూవుంటాను. మీరు లోనికి వెళ్ళండి!

[విరాగి, యామిని, ఆలయంలోకి వెళ్ళిపోతారు. ఆలయం తలుపులు దగ్గరకు మూత బడతాయి. చంద్రయ్య లేచి తిరుగుతూ వుంటాడు. కుడివైపునుంచి బెదురుచూపులు చూస్తూ రత్నాకరం ప్రవేశిస్తాడు. అతని చేతిలో పెద్దకర్ర వుంటుంది. అతనిని చూస్తూనే చంద్రయ్య సంతోషంతో అతనిని సమీపిస్తాడు.]

రత్నాకరం : (నెమ్మదిగా) వాళ్ళేరీ?

చంద్ర : (రహస్యంగా) ఆలయంలోకి పోయారు.

రత్నా : ఆ దొంగవెధవ ఒకడూ లేకుండా వుంటే చాలు! ఇక ఎంతమంది వున్నా మనకేం భయం లేదు. ఈ ప్రయత్నం కూడా చెడిపోతే యిక మనం ఆశ వదులుకోవాలి.

చంద్ర : ఆలస్యంచేస్తే ప్రమాదం! నువ్వు తొందరగా లోనికి వెళ్ళి ఆమెను లాక్కురా! నేను యిక్కడవుండి చూస్తూవుంటాను.

[రత్నాకరం ఆలయంలోకి వెళ్లి, ఉత్తరక్షణంలో యామినిని చెయ్యిపట్టుకొని యీడ్చుకువస్తాడు.]

రత్నా : (కోపంతో కళ్లెర్రజేసి) నా సంగతి తెలిసి కూడా నన్ను తప్పించుకు తిరుగుదామనుకున్నావుకదూ! బుద్ధిగా యింటికి నడు! ఎదురు తిరిగావా! చిత్రహింస తప్పదు!

యామి : (గట్టిగా అరుస్తూ) నేను రాను! నన్ను విడిచిపెట్టు!

[రత్నాకరం ఆమెను బలవంతంగా ముందుకు యీడ్చుకు వెడుతూవుంటాడు. ఆమె ఆలయంకేసి చూస్తూ] స్వామీ! స్వామీ! రక్షించండి! (విరాగి తొందరగా ఆలయంలోంచి బయటకు వస్తాడు).

విరాగి : (దూరాన్నుంచి) ఎవరది? (సమీపించి) ఎందుకు నాయనా! ఆమెను హింసిస్తావు?

రత్నా : (కోపంతో) ఏయ్ బైరాగీ! ఆమె నేకాదు! నాదారికి అడ్డువచ్చిన ప్రతివాణ్ణీ హింసిస్తాను! (కళ్ళెర్రజేసి కర్రపైకెత్తి)మాయింటి వ్యవహారాలలో జోక్యం కలగజేసుకున్నందుకు నీకు యిదిగో ప్రతిఫలం (కర్రతో గట్టిగా విరాగి తలమీద కొడతాడు. రక్తం ఒక్కసారిగా పైకి చిమ్ముతుంది. విరాగి బాధతో నేలమీద పడతాడు. యామిని కెవ్వున అరచి విరాగిని సమీపించబోతుంది. రత్నాకరం, చంద్రయ్య ఆమెను బలవం

తంగా యీడ్చుకుంటూ కుడివైపు నిష్క్రమిస్తారు. రెండు నిముషాలు నిశ్శబ్దంగా గడిచిపోతాయి. కుడివైపునుంచి రాముడు, చిరంజీవి ప్రవేశిస్తారు. ఇద్దరి చేతులలోను కర్రలు వుంటాయి ఒక మూల పడివున్న విరాగిని వాళ్లు చూడరు.)

రాము : (చిరంజీవిని ప్రశంసిస్తూ) ధైర్యం అంటే నీది రా తమ్ముడూ! రాముడికి తగిన శిష్యుడవు నోరికావు.

చిరం : దీనిలో ఏదో మోసం వున్నట్టుంది రాముడూ! వాళ్లు నన్ను ఒక్కణ్ణే పట్టుకొని చంద్రయ్యను ఎందుకు వదిలేశారూ?

రాము : (చుట్టూ చూస్తూ) ఏడీ? వాడెక్కడా కనిపించడేం?

చిరం : ఆలయంలో వున్నాడేమో చూద్దాం! పద!

[యిద్దరు రెండడుగులు వేస్తారు. రక్తసిక్త వదనంతో నేలమీద పడివున్న విరాగిని చూసి ఆకస్మికంగా ఆగిపోతారు. రాముడు ఆత్రుతతో విరాగి ప్రక్క కూర్చొని అతని తలను తన ఒడిలోకి తీసుకుంటాడు].

రాము : (ఉగ్రుడై బిగ్గరగా) మోసం! మోసం! నన్ను మోసంతో యిక్కడినుంచి తప్పించి స్వామిని హింసించారు. (చుట్టూ చూస్తూ) మరి యామినిని యేం చేశారో!

[చిరంజీవి తొందరగా ఆలయంలోకి పరుగెత్తి తిరిగి బయటకువస్తాడు.]

చిరం : ఆమె ఆలయంలో కూడా లేదు.

రాము : (విరాగిముఖంలోకి చూస్తూ) స్వామీ! స్వామీ! (విరాగి కళ్లు తెరిచి చూస్తాడు) మీవంటి ధర్మాత్ముణ్ణి హింసించిన దుర్మార్గుడెవరో చెప్పు స్వామీ! వాణ్ణి క్షణంలో హతమార్చివస్తాను.

విరాగి : (హీనస్వరంతో) తొందరపడకు నాయనా! నాకేం ప్రమాదంలేదు. (నెమ్మదిగా లేచి కూర్చొని) నువ్వు ఎక్కడికీ వెళ్లవద్దు! ఎవరినీ హింసించవద్దు.

చిరం : యామిని ఏమయింది స్వామీ!

విరాగి : ఆమె కేమీ ప్రమాదం కలగలేదు. ఆమెను వాళ్లు తీసుకుపోయారు.

రాము : (ఉగ్రుడై లేచి) ఏమిటి! యామినిని వాళ్లు తీసుకుపోయారా? వీల్లేదు! (కర్రచేత్తో పట్టుకొని) ఎంతటి రక్తపాతమైనాసరే! ఆమెను ఆ చెరసాలనుంచి విడిపించుకు వస్తాను. ఆమె లేని యీ ఆలయంలో నేను క్షణమైనా వుండను. ఆమెను మృత్యుకోరల నుంచి విడిపిస్తాను. అడ్డువచ్చినవాణ్ణి హతమారుస్తాను.

[రాముడు తొందరగా కుడివైపు నిష్క్రమిస్తాడు చిరంజీవి "రాముడు!" "రాముడూ!" అని పిలుస్తాడు]

చిరం : (నిస్పృహతో విరాగి ముఖంలోకి చూస్తూ) రాముడు యిక తిరిగి వస్తాడా స్వామీ!

విరాగి : (నెమ్మదిగా నిలుచుని) యీ సంఘర్షణకు యిక అంతం లేదు నాయనా!

[విరాగి, చిరంజీవి, ఆలయంలోకి నిష్క్రమిస్తూ వుంటారు.] (తెర)

# వజ్రహారము

శ్రీ నండూరి బంగారయ్య

**ఇటీవల, ఆంధ్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావు గారి అధ్యక్షతను జరిగిన, రాజమహేంద్రవర న్యాయవాదసంఘం వజ్రోత్సవ సందర్భంలో చదివి, శ్రీ బంగారయ్యగారు, సభికులను ఆహ్లాదపరచిన హాస్య రచన. దీనిలో హాస్యంతోపాటు ఆదేశాన్నికూడా మిళాయించారు.**

* * *

నిన్న గాక మొన్న నే స్వర్ణోత్సవము; ఇంకనూ జరుగుతూ నే వున్నట్లుంది. అప్పుడే పదేళ్లు గిరగిర తిరిగి వచ్చాయి! మన మాతృదేవత అయిన సంఘమును నాడు సువర్ణపుష్పాలతో అర్చించడానికి ప్రయత్నించాను. జేబులో లేకపోయినా పేరులోనైనా సువర్ణం ఉన్నవాడిని అవటంచేత పెద్దల ఆశీర్వచన బలంవల్ల ఏ మాత్రమో కృతార్థుణ్ణి కాగలిగాను. ఈ వజ్రోత్సవ సమయమున వజ్రహారం సమర్పించాలంటే తాహతుకు మించిన సాహసం. అయినా సహృదయుల సానుభూతి నే చేయూతగా గొని ఉపక్రమిస్తాను.

ఒక్కమారు సింహావలోకనం చేసి చూసుకుంటే దేశములో నాటికీ నేటికి ఎంత వ్యత్యాసం కనబడుతుంది!

నాడు భరతమాత నిండు చూలాలు. స్వాతంత్ర్యము ఇంకా జన్మించలేదు. కాని ప్రసవ వేదన మారంభమయినది. నేడు భరతమాత పచ్చి బాలెంతరాలు. లేక లేక కలిగిన స్వపరిపాలన మనే వెయ్యేండ్ల నోముల పంటను చూసుకొని మురిసిపోతూ ముద్దు పెట్టుకుంటోంది.

చీకట్లు పటాపంచలయి ఉదయభానుని స్వాతంత్ర్య కిరణములు బంగారమును ప్రసరిస్తున్నాయి. దేశములో ఎక్కడ చూచినా నూతనోత్సాహమే! క్రియాశూరత్వమే! ఆత్మవిశ్వాస విజృంభణమే! అటు భాక్రానంగాల్ మొదలుకొని ఇటు నాగార్జున సాగరం వరకూ ఎక్కడ చూచినా క్రొత్త నిర్మాణాలే. అటు ఇండోచైనా మొదలుకొని ఇటు రష్యావరకూ ఎక్కడ చూచినా భారతీయుల యశోగానమే. ఉపదేశము ఇవ్వడానికో లేక పుచ్చుకోవడానికో అమెరికా, రష్యా, చైనా, సౌదీఅరేబియా మున్నగా ఖండఖండాంతరములనుండి ప్రతిదినము భరతఖండమును సందర్శించడానికి వచ్చే యాత్రికుల సందడిలో—ఎత్తేగంప దింపేగంప అన్నట్లు—మన నాయకులకు ఎక్కడా తీరుబడిలేకుండా పోతున్నది

స్వర్గీయు బారు రాజారావు పంతులు గారు నాతో చెప్పేవారు. అప్పటి కింకా జవహర్‌లాల్ ఒక్కమారయినా కాంగ్రెసు ప్రెసిడెంటు కాలేదు. ఒకనాడొక పోనీ (Pony) నధిష్ఠించి ఎక్కడికో పోబోతూంటే తాతపాదులయిన మోతీలాల్ నెహ్రూ రాజారావు గారిని పిలిచి "రాజారావు! చూడు! చూడు! అతడొక రాజకుమారునివలె లేడా?" (Rajarao ! See ! See ! Does he not look like a Prince ?) అని ఉత్సాహాతిశయమును ప్రకటించినారట. నేడు స్వర్గమున ఉన్న మోతీలాల్ తనకుమారుని దిగ్విజయము చూచుకొని ఎంత మురిసిపోతూవుంటాడో ఎవరు చెప్పగలరు? బుద్ధభగవానుని అవతారమునకు అంతర్జ్యోతియై వెలుగు సర్వభూతహిత సిద్ధాంతమును పుణికి పుచ్చుకుని సర్వనాశమునకయి అంకెలు వేయుచు విజృంభించు రష్యా అమెరికా లను రెండు అబోతుల నడుమ నిలచి చిరునవ్వులు చెంగలించు ముఖారవిందముతో వేణుగానము చేయుచు ఆ యాబోతులను రెండింటిని మంత్రముగ్ధములు గావించి ప్రపంచమున సౌహార్దము నెలకొల్పుటకయి శాంతిగీతము నాలపించు

కుమారరత్నమును జ్ఞానమునొసగిన కన్న తలిదండ్రులనే గాక, భరతఖండమును మాత్రమే గాక, మానవజాతి యెల్ల నిలువున పులకింపవలసి యున్నాదిగదా!

* * *

మనలో ఒక నమ్మకమున్నది మలయమారుతము వీచినపుడు మామూలు చెట్లుకూడా మంచి గంధపు వృక్షము లౌతాయట! నేడు కోర్టులలో స్వాతంత్ర్య మనే మలయమారుతము వీస్తోంది. అందుచే ఎక్కడ చూచినా దివ్యసౌరభమే ప్రత్యక్షమౌతూ వున్నది. వేపచెట్టూ, ప్రత్తిచెట్టూ మాత్రము మలయమారుతమునకు కూడా మారవట. ఎన్నాళ్లకూ ఎగుడూ బొదుగూ లేకుండా వుండవలసినదే గాక, "నానాటికి తీసికట్టు నాగంభొట్లూ" అన్న మాదిరిగా స్వాతంత్ర్యము వచ్చిన తరువాత మరీ పుష్కలించి పోతూవున్న మన లాయరు వృత్తిని వేపచెట్టుతో పోల్చుకోవలెనా? ప్రత్తి మొక్కతో పోల్చుకోవడమా? ఈ మధ్య, 'వడకడము' (Spinning) లో మనకు వున్న ప్రావీణ్యము, లోక సభాధ్యక్షులు కూడా అంగీకరించినారు కొబట్టి ప్రత్తి మొక్కతోనే పోల్చుకుందాము.

* * *

మొన్న గుంటూరులో అప్రెంటిస్ (apprentice) లకు ఉపదేశిస్తూ, మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి 'షాక్ ట్రీట్ మెంటును' (Shock treatment) ను ప్రశంసించారు. తదనుగుణముగా అరవైయేండ్లు నిండిన మన సంఘము కూడా షాక్ ట్రీట్ మెంటు (Shock treatment) పుచ్చుకుంటే శ్లేష్మప్రకోపమునకు (Rheumatism) కొంపుదలగా వుంటుందేమో!

* * *

ఆత్మపరీక్ష చేసి చూసుకుంటే న్యాయశాఖ గాని దీనిలో అంతర్భాగమయిన లాయరు ఉపశాఖ గాని నేడు అవలంబిస్తూవున్న అనాచారములు గాని అత్యాచారములు గాని ఉగ్గడింప తగ్గవిగా కనబడవు. వెనకటి రోజులతో పోల్చిచూస్తే ఈ శాఖలలో యిప్పుడు స్వర్ణయుగ మవతరిస్తోందా అనిపిస్తుంది.

ముమ్ముందుగా న్యాయాధికారులను పరిశీలిద్దాం. వెనకటి న్యాయాధికారులలో కొందరిని గూర్చి:

'లంచయో రలంచయోర్మధ్యే
యతో లంచ స్తతో జయః
ఉభయోర్లంచయో ర్మధ్యే
యతోఽధిక స్తతో జయః'

అనే మొదలయిన కారికలు కొన్ని ప్రచారములో వుండేవి. ఇప్పుడలా ప్రేలుపెట్టి చూపడానికి వీలులేదు. ఉచితార్థముగా ఉద్యోగాలను మంచినీళ్ళయినా పుచ్చుకోవాలనే కుతూహలం న్యాయాధికారులలో మృగ్యము. వారు వహించవలసిన భారమునుబట్టి చూస్తే వారికిచ్చే జీతము కిట్టదనే చెప్పాలి. మనము ఒక కక్షి భారమే వహిస్తాము గాని వారు రెండు కక్షుల భారమూ వహించాలి ఒక్కొక్క ప్లీడరుకు, కోర్టులో వున్న పనిలో కొంతభాగమే వుంటుంది. కాని కోర్టులో వున్న యావత్తు పనీ వారిదే.

మినిస్టీరియల్ లెవల్ (Ministerial level)లో లంచగొండితనము నిర్మూలించామని కొందరు పెద్దలు పూనుకున్నారు. మిక్కిలి సంతోషావహమయిన విషయం. కాని ఈ తరగతిలో కూడా లంచగొండితనము సక్రృత్తే అని చెప్పాలి. నేను ప్రాక్టీసుకు రాకముందు అనుకునేవారు. "ఆచార్లూ దీనిలో ఆర్డరు వెయ్యవచ్చునా?" అని గుమాస్తా అనుమతి పుచ్చుకోనిదే అర్జెంటు ఆర్డర్లు పడేవి కావట. అంతేకాదు, పొరపాటున ఒక్కొకసారి బెంచిగుమాస్తాచేతినుండి రూపాయి జారి క్రిందపడి ఖంగున మ్రోగేసరికి, "ఆచార్లూ! నిద్రపోతున్నావా ఏమిటి?" అని మేలుకొలుపులు కూడా పాడేవారట. ఇప్పుడో కొన్ని డిపార్టుమెంటులతో పోల్చిచూస్తే ఈ న్యాయశాఖలోని క్రింది ఉద్యోగులకు నిత్యమూ మ్రొక్కవలసి వుంటుంది బస్తా 1 కి రు. 48-0-0 లకు తగ్గకుండా వున్న ఈ రోజులలో పదిమంది పిల్లలున్న స్వల్పోద్యోగులు వచ్చే జీతములతో "ఎలా మానసంరక్షణ చేసుకుంటున్నారా" అని ఆశ్చర్యపడవలసివున్నది.

లాయర్ల ప్రతిభా పాండిత్యములు వెనకటికంటే తగ్గిపోయాయి అనడము యిప్పుడు ఒక ఫ్యాషన్. ఇది ఎంతమాత్రమూ సత్యసమ్మతముగా కనబడదు.

ఇప్పుడున్నంత తీర్పుల బాహుళ్యము (case law) వెనక లేదు. ఇప్పుడున్నంత చట్టబాహుళ్యము (legislation) కూడా వెనుక లేదు. ఇంత విజృంభిణ దశలో నున్న న్యాయశాస్త్రమును "తుచ" లు తప్ప

కుండా అవగాహన చేసికొని, స్వల్పమయిన ఫీజు తోనే సంతృప్తిపడి ప్రజలను సేవించాలని తహతహ లాడుతూ వున్న నేటి న్యాయవాదులు పాండిత్యము లోనూ ప్రతిభలోను వెనుకటివారికి పైచేయిగాని క్రిందిచేయి గాదని ఘంటాపథముగ జెప్పగలను. అప్ప టికీ ఇప్పటికీ పద్ధతులే (technique) మారిపోయాయి. క్రాసుపరీక్ష తీసికోండి. అసంగతముగానైనాసరే వెను కటి రోజులలో ఎంత దీర్ఘముగా క్రాసుచేస్తే అంత గొప్ప. ఇప్పుడిన్నదో సంగతముగానూ సూటిగాను చేసు స్తున్నది. వెనకటివారు సుదీర్ఘ పరీక్షగా స్వల్పాంశ ములను అన్వేషించేవారు (Searching details) ఇప్పటివారో ఏమున్న కుంభస్థలములను కొట్టినట్లు ఘటనాసంఘటలను విడగొట్టడానికి (Shaking the probabilities) విజృంభిస్తారు. కేసు నిర్మాణములో వెనుక చాలాభాగం గాత్రపాటమీదనే ఆధారపడి వుండేది. ఇప్పుడు సాక్ష్యమయినంతవరకు దస్తావేజుల మీద ఆధారపడి వుంటుంది. ఆర్గుమెంటులో కూడా "Brevity is the soul of wit" అనే కవి వాక్యాన్ని ఇప్పటివారు సాధారణముగా విస్మరించరు. ఇట్టి నవీన పద్ధతులకు నీతి, పాండిత్యము, ప్రతిభ సమ్మేళనపరచి ఇప్పటివారిలో కొందరు పనిచేస్తూ వుంటే చూడటానికి ఎంతో ముచ్చటగా వుంటుంది..

ఎన్ని సుగుణములు అలవరచుకొని పనిచేస్తూ వున్నా "మంది ఎక్కువైనకొద్దీ మజ్జిగ పలుచన" అన్నట్లుగ జనబాహుళ్యము హెచ్చి రాబడి పలుచ బడడముతోనే లోకానికి మనము పలుచబడిపోయాము —రాబడినిబట్టే వ్యక్తుల విలువను నిర్ణయించే అధ మాధమ స్థితిలో లోకము వున్నది కాబట్టి.

వెనుకటి అత్యాచారాలు కొన్ని గమనించండి. "వారు ప్లెయింటుకు వెయ్యిరూపాయల స్టాంపు బెట్టి నప్పుడు మనము రిటైన్ స్టేటుమెంటుకు కనీసము రెండు వేలరూపాయలేనా పెట్టకపోతే మర్యాదగా వుండదు" అనే వారట. "వెండిగిల్టు వున్న పుస్తకమునుండి సెక్షను వేస్తే ఒక ఫీజు, బంగారపు గిల్టువున్న పుస్తకములో నుండి సెక్షను వేస్తే మరివొక ఫీజు, అని అలమారులో వున్న 'బైబులు' (Holy Bible) ప్రతులకేసి చూపి ద్రవ్యాకర్షణ చేసేవారట. హీనక్రయానికి భాషాంతరీ కరణంగా. "It is a most heinous sale your honour" అనే వారున్నూ, కోర్టుకు జ్యూరిస్ డిక్షన్ లేదనే వాదము స్టేటుమెంటులోవుంటే, "ఘనత వహించిన కోర్టువారికి జ్యూరిస్ డిక్షన్ లేదనటమేనా? ఎంత సాహసము! అనరాదు, వినరాదు. కోర్టు వారు దివ్యాంశ సంభూతులు, వారి చేతులకు అడ్డే మిటి? వారి జ్యూరిస్ డిక్షను కూడా [illegible] మెంటు [illegible] ఉండేవా [illegible] మహాలు కంటితో కలికాని కైనా కనబడదే [illegible] అయితే కర్మసిద్ధాంతము అనతిక్రమణీయం కాబట్టి [illegible] వారి అత్యాచారాలవల్ల పీడించిన అవస్థాలన్నీ [illegible] కాలప్రవాహ మెడవ ముడుచుకొన్నాయి కష్టాలు తెర వని పనికూడా [illegible] [illegible] ప్రవృత్తి లాయరు వృత్తిని నిందించడమే! "మా అర్థము సంబంధించిన విషయములలో లాయర్లను జోక్యము చే సరాదు." అని బాహాటముగా చట్టములు నిర్మించరే! చూచి చూచి లాయరు వృత్తిని నిరూపిస్తే సంఘప్ర తిష్ఠకు భంగమేమో నని ఒకవంక సంకోచము. స్వార్థ విహారమునకు అర్థంగా ఎక్కడి కక్కడనే [illegible] యిట్లు లేకపోవటం ప్రానకములో ప్రపంచంలో ఈ ప్లీడరు పిశాచ మెక్కడ దాపురించినావు రాయబారి మనసు నిండాకని. అందుచే దీనిని పుస్తకంలో పెట్టడమే ఉపా యమన్నారు. క్షయరోగివలె చావకుండా బ్రతుక కుండా కల్యాగత ప్రాణములో ఈ వృత్తి నడుస్తూ వున్నదీ అంటే పెద్దలు సిద్ధాంతపోసే నా నిశ్చ యము.

"దాసుడి పాట్లు పెరుమాళ్ళ కెరుక" అన్నట్లు ఈ వృత్తి నవలంబించేవారు పొందే ఆరాటము పడే యమయాతనా ఆ పరమాత్మకే తెలియాలి ఇచ్చే ఫీజు మాట అలావుంచండి—తలవెంట్రుకల చిక్కులుఎన్నో వుండి కొన్ని శతాబ్దముల వయస్సుకలిగిన వారసత్వపు దావాలో ఇరవైమంది సాక్షులను వెంటబెట్టకొని కన్ను పొడుచుకున్నా విడిపోని పూర్వ చారిత్ర్యల నాటి దస్తావేజుల దస్తర మొకటి నెత్తిని బెట్టుకొని విచారణ వాయిదా నాడు సరిగా ఉదయము 10–45 కు పార్టీ వకీలుగారి కచేరీ సావడిలో అడుగు పెడతాడు. 11 గంటలకు కోర్టు గదా? దస్తావేజులలో ఏమివున్నదో సాక్షు లేమిచెబుతారో తెలియకుండా ఏలాగో ఓలాగున కథ నడిపెయ్యడమా? మానడమా? 'నసేమిరా' అన్నా అవతల వాయిదా యివ్వరు! రెండు మూడువాల రికార్డువున్న అప్పీలు నలభయి వాయిదాలకయినా ఎప్పటికప్పుడే తూర్ణముగా చదువుకొని మంచి తయా రీలో పాడిచేద్దామని మహోత్సాహముతో కోర్టుకువస్తే "సెషన్సు! అడ్జరండ్" (Sessions Adjourned) అని పకడుగా వాయిదా పడిపోవడము నలభయిఒకటో సారి "ఈరోజున సెషన్సు వున్నది కదా. అయినదా ఏమన్నా నా" అని అశ్రద్ధచేసి కోర్టుకువస్తే ఆసెషన్సు దొరక్కనో కారణాంతరము చేతనో సెషన్సు నిలు వునా నీరయిపోయి (Collapse) పట్టుపట్టు మంటూరు.

అందరి దగ్గరా తీసుకున్నారు. అందుచేత మాస్టారు చదువుకోడానికి రావద్దన్నారు, అని యేడుస్తూ చెప్పానండి. వాళ్లు ఆవేళ రాత్రి మా అన్నయ్యల్ని గట్టిగా తిట్టారండి. ఒరేయ్ నువ్వు చదువుకోవాలంటే బళ్లోకి వెళ్లి చదువుకో. మాస్టారింటికి వెళ్లకు—" అన్నారండి.—మాస్టారేం చేశారు. ఆయనకు నేనంటే యెంతో ప్రేమ. ఆయన నాకు ఉచితంగా చదువు చెబుతున్నారు, అన్నానండి. ఆ యెదవ మెట్ట వేదాంతాలన్నీ వదిలేసి నేను చెప్పినట్టు చేస్తే చెయ్యి. లేకపోతే నువ్వు బడికి వెళ్లడం కూడా మానెయ్యి--అన్నాడండి మా బాబు." అని చెప్పాడు. "అయితే మీ బాబూ అమ్మా నేను నీ చేత రూపాయలు తెప్పించానని అనుకొంటున్నారా?" అన్నాను.

"లేదండి. నేను స్పష్టంగా చెప్పేశానుకదండీ మాస్టారు తెమ్మనలేదు, నేనే పట్టుకెళ్ళానని?" "అయితే నా దగ్గరకి ఎందుకు వెళ్ళొద్దన్నారు." "మీ మామయ్యగారూ మావాళ్ళూ చాలాసేపు దెబ్బలాడుకొన్నారండి. ఆవేళ మీ మామయ్యగారు మీ కుర్రాడు మావాళ్ళ కుమ్మంలోకి వెళ్లడానికి వీల్లేదన్నారండి. ఆయన పంపమని బతిమాల్నా పంపనుపొమ్మన్నారు యేమనుకొన్నారో గాని అన్నాడండి మా బాబు. అందుచేత మా బాబు అమ్మ మీ దగ్గరికి వెళ్లవద్దన్నారండి" "అయితే ఆమర్నాడు ప్రొద్దుటే వచ్చావెందుకు నువ్వు?" "మా వాళ్లు చూడకుండా వచ్చేశానండి." అన్నాడు. వాళ్లే వాళ్లు వద్దన్నా వీడు నా వద్దకు రావడం మాన్లేదు. మా రాధ పొమ్మన్నా ఆ రోజున వీడు కదల్లేదు. అలాగే నిలబడ్డాడు. నువ్వు చదువు మానేస్తే నువ్వూ నేనూ సుఖపడతాం అని నేనంటే వాళ్లు చంపినా చదువు మాననన్నాడు. ఆ తరువాత, నువ్వు రోజూ మాయింటికి వస్తుండడం, చదువుకోవడం జరుగుతూంటే నా పరపతి పోయి చివరికి నా ఉద్యోగం కూడా పోతుంది అన్నాను. ఇంక వాడు మాట్లాడలేదు. తరువాత చదువుకోనేందుకు రాలేదు.

ఇక నేనేమీ ప్రశ్నించలేదు. బడికి బయలుదేరాను. నా వెనకనే వాడూ వచ్చాడు.

* * *

ఆరు నెలలు గడిచాయి. ఈ ఆరు నెలల్లోనూ బడి ఉన్నా లేకపోయినా ప్రతిదినం సుబ్బారావు మా యింటికి వస్తూనే వున్నాడు. నన్ను వెంబడిస్తూనే వున్నాడు. అది పంతొమ్మిదివందల యాభైమూడో సంవత్సరం ఆగష్టు నెల. గోదావరి గట్లు తెంచుకొని గ్రామాలకీ, పొలాలకీ, కాలవలకీ, చెరువులకీ వుండే భేదాన్ని దూరం చేసింది. అంతా జలమయం. గొయ్యెక్కడో, నుయ్యెక్కడో, చెరువెక్కడో, చేలెక్కడో తెలియడం లేదు. పల్లపు ప్రదేశాలలో వుండే పల్లెలూ, గూడేలూ నీటిలో మునిగిపోయాయి. మా గ్రామం వీధులలో మోకాళ్లలోతునా తొడలలోతునా నీరు ప్రవహిస్తోంది. జాతి, కుల, మత భేదాలు తొలగిపోయాయి. ఊళ్ళో గట్టిగావున్న యిళ్ళు మెరక మీద వున్న యిళ్ళు జనంతో కిటకిటలాడుతూన్నాయి. బద్ధవైరాలున్నవాళ్లు, ఒకే పంచలో చేరుకొని కలిసి వండుకొని తింటున్నారు. ఒకే చదరపు గజంలో పడుకొంటున్నారు. ఈ వీధివార్త ఆ వీధికికూడా తెలియడం కష్టమౌతోంది. ఆ పల్లె కొట్టుకుపోయిందనీ, ఈ గ్రామంలో యిళ్లల్లోకి నీరు వచ్చేసిందనీ వదంతులు బయలుదేరాయి. మా యింటి కుమ్మంముందు మూడు మెట్లు మునిగిపోయాయి. ఇంకో అడుగు నీరువస్తే మా యిల్లు నీటితో నిండుతుంది. వీధి గడపమీద ఒక అడుగు యెత్తున మట్టితో గోడకట్టాను. ఇంటికి బయటవున్న ద్వారాలన్నీ బిగించి కొళ్లీలన్నీ మట్టితో మద్దించాను. మా రెండు అరుగులమీదకూ రెండు మాల వాళ్ళ కుటుంబాలు చేరాయి. మా అత్తవారి ఊరి సంగతి తెలియలేదు. వాళ్ళేమైపోయారో అని మా రాధ ఒకటే మొహం పెట్టింది. వాళ్లయిల్లు గట్టిది, ఎత్తైనది, వాళ్ళకేమీ పరవాలేదని ధైర్యం చెబుతూ ఉన్నాను. ఇంతలో ఆ ఊరినుంచి యిద్దరు వ్యవసాయదార్లు తడిసినబట్టలతో నీటిని తోసుకొంటూ వీధిలో వెడుతూ నన్ను పేరెట్టి పిలిచి "బావున్నారా బాబూ? మీ మామయ్యగోరు తెల్సుకొని రమ్మన్నారు" అన్నారు. "ఆఁ, బాగానే ఉన్నాం. వారంతా ఎలా ఉన్నారు? మీ ఊళ్లో నీరు ఎంతవరకూ వచ్చింది?" అని అడిగాను. ఇలాగే మోకాళ్లోతూ తొడలోతునా వీధుల్లో నీరు పారుతోందండి" "మరి రోడ్డెలాగుంది. మీ రెలా రాగలిగారు?" "రోడ్డుమీద మోకాల్లోతున నీరుందండి" రోడ్డుపక్కనుండే చెట్లూ తుప్పలూ ఆనవాలుగా చూసుకొంటూ వచ్చామండి" "మా మామగారింట్లో కులాసాగా ఉన్నారా?" "అయ్యా" అని చెప్పి వాళ్లు

వెళ్ళిపోయారు. నిన్నా, ఈ వేళా సుబ్బారావు రాలేదు. మధ్యాహ్నం మూడు గంటలౌతుంది. నేను గుమ్మంలోపల నిలబడి ఎదుటికి చూస్తున్నాను. కాలువగట్టు నీటిమీద ఒక అడుగు యెత్తున కనుపిస్తోంది. మామిడి చెట్టుకు కట్టి ఉన్న బల్లకట్టు స్పష్టంగా కనుపిస్తోంది. ఆ గట్టుకీ మా యింటికీ ఒక ఫర్లాంగు లోపుగా దూరముంటుంది. అదంతా జలమయం. కాలువగట్టు కావల ఎక్కడా గడ్డియైనా మొలవకుండా ఉన్న పచ్చమట్టి నేలగా కనుపిస్తోంది బురద నీటితో నిండిన పంటప్రదేశం. అక్కడక్కడ చిన్న చిన్న తాడి, ఈత మొదలయిన చెట్ల తలలు కనిపిస్తున్నాయి జలప్రళయమని పురాణాలలో వినడమే గాని చూచినవాడెవడూ లేడు. ఈ నీరు యిలాగే పెరిగిపోతే ప్రళయంగాక మరేమౌతుంది అని మనస్సులో అనుకొంటున్నాను ఇంతలో ఎవడో కుర్రాడు కాలువకి అవతలిగట్టు యెక్కాడు. నేను పరకాయించి చూస్తున్నాను. వాడు కాలువలోని బల్లకట్టు యెక్కాడు. తాడు లాగుతున్నాడు కాబోలు బల్లకట్టు మెల్లగా కదులుతోంది. కొంతసేపటికి వాడు యివతలిగట్టుకి వచ్చాడు కాలవగట్టునుండి మా ఇంటికి వచ్చే బాట వుండేచోట నీటిలోకి దిగుతున్నాడు. నా నరనరమూ గజగజ వణికిపోయింది ఏవో వెర్రికేకలు వేసుకొంటూ ఒక్క గంతులో మా వీధిగుమ్మంలోంచి నీటిలోకి ఉరికాను. వాడు దిగేచోట పల్లం, వాడి కందని లోతుంటుందక్కడ, మునిగిపోతాడు అని నా హృదయం హాహాకారం చేస్తోంది. మోకాళ్ళు మునిగే నీటిలో గెంతుకుంటూ పరుగెత్తుతున్నాను. అరవబోతున్నాను. మాట రావడంలేదు కాళ్ళు తడబడి పడి లేస్తున్నాను. నా వెనుక దగ్గరలోనే ఎవరో కేకలు వేస్తున్నారు. ప్రపంచమంతా హాహాకార ధ్వనితో మారుమ్రోగుతూన్నట్లుంది నా చెవులికి. ఇంతసేపూ కనుపించిన ఆ కుర్రాడు కనుపించడంలేదు. ఇంక కాలువగట్టు నలభైగజాల దూరముంటుంది. నేను మొలలోతు నీటిలో నిలబడి యేవో వెర్రి కేకలేస్తున్నాను. చుట్టూ చూస్తున్నాను. వాడు కనుపించడంలేదు. మా అరుగుమీద మకాం చేసిన మాలవాళ్లిద్దరూ మునిగిపోయాడు, కొట్టుకుపోయాడు అంటూ నా ప్రక్కనే కేకలు వేస్తున్నారు. ఇంకా యెదుటికి వెళ్లాం. పీకలోతు నీరుంది. కాలవగట్టు ఎక్కడానికి యీదడం మొదలుపెట్టాం. బాటదాటి వందగజాలు ప్రవాహవేగానికి కొట్టుకొనిపోయి కాలువగట్టు యెక్కాం. ఒక ఫర్లాంగు, రెండు ఫర్లాంగులు, మూడు ఫర్లాంగులు పరుగెత్తాం. వాడు కనుపించలేదు. మా కంగారూ గోలా యెక్కువైపోయింది.

పిచ్చెక్కినవానిలా వెనక్కీ ముందుకీ పరుగెత్తుతున్నాను. నేను యింకా ముందుకి పరుగెత్తాను. నాకూడా ఒకడు పరుగెత్తుకొని వస్తున్నాడు. ఒకడు మళ్లీ వెనక్కి వెళ్ళాడు. ఇంకో అరమైలు పరుగెత్తాం. ఇంక వెళ్లడానికి వీల్లేదు. కాలువగట్టు తెగి నీరు ఉరకలేస్తూ ప్రవహిస్తోంది "రండి బాబయ్యా, వెనక్కి వెళదాం. ఇక్కడిదాకా రాడు. కాలవలో నీరు బయటికి పోతూంది" అంటూ మాలాడు వెనక్కి పరుగెత్తాడు. వాని వెనుకనే, నేనూ పరుగెత్తాను. కొంతసేపటికి యథాస్థానానికి చేరాం. రెండో మాలాడు చేలల్లో గుండెలోతు నీటిలో కుర్రాణ్ణి భుజాలమీద యెక్కించుకొని బాటవైపుకి వస్తున్నాడు. కుర్రాడి తల, వాడితలమీద ప్రేలబడి ఉంది. మేమిద్దరం నీటిలో కురికి వాడివైపుకి యీదాం. వాణ్ణి సమీపిస్తున్నకొద్దీ నా అనుమానం బలపడుతోంది. నా కాళ్లూ చేతులూ పట్టుతప్పుతున్నాయి నా ప్రక్కను నడుస్తూన్న మాలవాడి భుజం పట్టుకొన్నాను. నా స్థితి చూచి "అదేం బాబయ్యా?" అంటూ నన్ను పట్టుకొని లాక్కెళ్లాడు. కుర్రాడి ముఖం స్పష్టంగా కనుపించింది. మా సుబ్బారావే, వాడు. 'సుబ్బారావూ' అంటూ యేమేమో అరిచాను. అప్పటికప్పుడే పాతిక ముప్ఫైమంది జనం మోకాల్లోతు నీటిలో నిలబడి యేదో గోలచేస్తున్నారు. సుబ్బారావును తీసుకొచ్చి మాయింటి అరుగుమీద పడుకోబెట్టాం. ఊళ్ళోని డాక్టరుగారు వచ్చారు. నాడి అందడంలేదన్నారు. కడుపునొక్కి త్రాగిన నీరంతా కక్కించారు. ఏవో ఇంజెక్షన్లు చేశారు. కుంపటి పెట్టి వళ్ళంతా ఆరకాస్తున్నారు. "కొనవూపిరుంది. యేం జరుగుతుందో చెప్పలేం" అన్నారు డాక్టరుగారు. నేను స్తంభించిపోయి వాడిదగ్గర బండరాయిలా కూర్చున్నాను. సూర్యాస్తమయ సమయానికి కొంచెం కదిలాడు. చైతన్యం లేనివానిలా కూర్చున్న నాకు చైతన్యం కలిగింది. మరికొంతసేపటికి 'మాస్టారు' అని అస్పష్టంగా అన్నాడు. వాడి ముఖందగ్గర ముఖం పెట్టాను. మళ్ళీ అయిదు నిమిషాలకి కళ్లు కొంచెం తెరచి 'మాస్టారూ' అని నూతిలోంచి పిలచినట్లు అన్నాడు. "ఏం నాయనా? సుబ్బారావూ?" అన్నాను. మళ్ళీ వెంటనే వాని కన్నులు మూతపడిపోయాయి. నా కళ్లు నీళ్ళతో నిండిపోయాయి. వాడి ముఖం చూడ్డానికి వెంటనే తుడుచుకొన్నాను. రెండు మూడు ఎక్కిళ్లు వచ్చాయి వాడికి. అంతే, ఇక వాడు శాశ్వతంగా కన్నుమూశాడు. లోకమంతా అంధకారబంధురమైంది.

# కన్నడ యక్షగానాలు

శ్రీ ముట్నూరి సంగమేశం

## 1

తెలుగులోవలెనే కన్నడభాషలోకూడ యక్షగానాలు రెండు రకాలుగా దొరుకుతాయి. ఇండ్లో ఆడవాళ్లుగాని, కళ్ళాల్లో కాపులుగాని ఏ మేళతాళాలు అక్కరలేకుండా హాయిగా పాడుకొని కాలక్షేపం చేయడానికి అనువుగాఉండే యక్షగానాలు మొదటిరకం. వీధిలో పందిరివేసి మేళంకట్టి మద్దెల తాళాలతోనూ వెనుక పాటకుల మద్దత్తుతోనూ రాత్రల్లా ఆడి పాడి అభినయించడానికి అనుకూలించే యక్షగాన నాటకాలు రెండవరకం. ఈ రెండిటిలోనూ పాటలు, పద్యాలు, గద్యలు వగైరా అన్నీ ఉంటాయి. రెండూ దేశికవితలే. రెండూ రచనాగత సంప్రదాయాలలో అతి సన్నిహితాలుగా ఉండి, ఎటుకావాలంటే అటు, ఎలా అంటే అలా ఒకదానికొకటిగా పిరాయించి పాడుకోనేందుకు లేదా ఆడుకోనేందుకు అనుకూలంగా ఉండేవే. కన్నడ సాహిత్యంలో 'యక్షగానం' అనే ముద్రతో వెలసిన రచన లేవీ పదిహేడవ శతాబ్దానికి ముందున్నట్లు కనపడవు కాని యక్షగానానికనీ చెప్పిన లక్షణాలుగల జానపద గేయాలు, నాట్యాలు మాత్రం అంతకు వెయ్యేళ్లు వెనుకనుంచీ ఉన్నట్లు ఊహించడానికి తగిన సాహిత్యకాధారాలు చాలా ఉన్నాయి.

కన్నడ సాహిత్యంలో దొరికినంతమేరకు అత్యంత ప్రాచీనతమమైన గ్రంథం 'కవిరాజ మార్గ' మనే లక్షణ గ్రంథం (860 క్రీ. శ.). ఇందులో ఆనాటి నాటు నాటకాలు 'నాళ్ పగరణా' లనే పేర ప్రస్తావించబడ్డాయి. నాళ్ అంటే నాడు అనిన్నీ, పగరణ మంటే ప్రకరణ మనే రూపక భేదమనిన్నీ, సంస్కృత రూపకాలకి నాటకమనే పేరు రూఢమైనట్లే దేశీయనాటకాలకి పగరణం లేక ప్రకరణ మనే పేరు రూఢమై ఉండవచ్చుననిన్నీ పండితుల అభిప్రాయం. ఈ నాటకాలకి లక్షణంచెప్తూ కవిరాజ మార్గకారుడు వీటిలో క్లిష్ట కల్పనాదులు దోషాలనీ, గ్రామ్యత్వాశ్లీలత్వాదులు హాస్యోక్తులుగా ఉపయోగిస్తాయి కనుక దోషాలనిపించుకోవనీ వ్రాశాడు.1 తననాటి దేశీయగీతాలనుకూడ ప్రస్తావించి, కంద పద్యానికి మరొక జాతీయవృత్తం జోడించినట్లయితే 'బెదండె' లనే గేయరచనలు లభిస్తాయనికూడ యీ లక్షణకర్త నిర్వచించాడు.2 ఛందోంబుధి (10 వ శతాబ్ది) అనే మరొక లక్షణగ్రంథంలో అక్కర; చౌపది, గీతిక, ఏల, ఉత్సాహ వగైరాలు ఆనాటికి ప్రసిద్ధమైన జాతీయ గీతి ఛందాలుగా పేర్కొబడ్డాయి.3 కావ్యావలోకనంలో నాగవర్మ (1145 క్రీ. శ.) 'రఘుటా' ఛందాన్ని వేర్వేరు మాత్రలలో పేర్చి నిల్పి రచించినట్లయితే వేర్వేరు తాళగతుల కనుకూలమైన గేయాలు లభిస్తాయని వ్రాశాడు.4 ఇవి పాడుకోనేందు కనుకూలించే రచనలు గనుక వీటిని 'పాడుగబ్బా' లని వ్యవహరించి నాటకాల లోనూ నృత్యాలలోనూ తాళవాద్యాల పొందికతో పాడి అభినయించడాని కనుకూలించే మరొక తరహా రచనలను నాగవర్మ 'బాజనెగబ్బా' లని వ్యవహరించాడు. ఈ బాజనె గబ్బములో పాటలు పద్యాలు వచనాలు వగైరాలన్నీ ఉంటాయనీ, యథాయోగ్యంగా నగరర్తు వన పర్వతాది వర్ణనలు కూడ ప్రవేశపెట్టుకోవచ్చుననీ, ముఖ ప్రతిముఖాది నాటక సంధులుకూడ ప్రయోగింపబడతాయనీ వ్రాశాడు.5

కాలంలో వెనుకవే అయినా తెలుగు లక్షణ గ్రంథాలుకూడ దేశీయ గీతి నాట్యాల లక్షణాలు పైన

---

(1) చూ. కన్నడ కవిరాజ మార్గ – ఆ 1 ప 66, 67, 68.

(2) చూ. కన్నడ కవిరాజమార్గ 1-34.

(3) చూ. కన్నడ ఛందోంబుధి 1-47.

(4) చూ. కన్నడ కావ్యావలోకనం. సూత్ర 232.

(5) చూ. కన్నడ కావ్యావలోకనం. 245-249 సూత్రాలు.

చూపిన కన్నడ గ్రంథాలపద్ధతినే అనుసరించి చెప్పాయి తెలుగులో తాళ్లపాకవారి సంకీర్తన లక్షణం నాటినాటకాలలో హాస్యానికి ఎంతైనా స్వేచ్ఛ ఉన్నట్లు సాక్ష్యమిస్తూంది.

క॥ పల్లవ నారీ మ్లేచ్ఛాచ్ఛుల్లాసమనోజ్ఞ
బంధురోక్తులు చవియై
చెల్లును గ్రామ్యములైనను హల్లీసక
ముఖ్య నాటకాదిక ఫణితిన్.

అని వ్రాయడమే కాక వాటకలో ఉన్న పదాలను ప్రస్తావించి, వాటికి ఉండవలసే లక్షణంకూడ విస్తరించి యీ లక్షణకర్త మన కందించేడు. కందార్థగతులు, ఏలలు, చౌపదలు వగైరాలు నాటి జానపద గేయ నాట్యాలలో విరివిగా వాడబడేవని దీనివల్ల తెలుస్తూంది. అప్పకవి యక్షగానలక్షణమనే పేర 'రగడ' ఛందోభేదాలనే వర్ణించాడు.

లక్షణాలు దొరికినందున ఆనాటి లక్ష్యాలు దొరకకపోయినా యక్షగానాలు మన కపూర్వంగా సిద్ధించిన రచనలు కావనీ, ఇవి ఎనిమిదవ శతాబ్దం నాటికే దేశంలో ప్రచారంలో ఉన్నవనీ ఊహించవచ్చును. కన్నడ కవిరాజ మార్గంలో కావేరినుండి గోదావరి వరకుగల దేశం కన్నడదేశంగా పేర్కొబడింది 6 అంటే, ఆ ఎల్లలలో ఇమిగిపోయిన ఆంధ్రదేశంలో కూడ అదేకాలానికి ఈ తరహా గేయనాట్యాలు ప్రచారంలో ఉన్నాయనే సంగతి చెప్పక చెప్పినట్లే.

## 2

యక్షుల సంప్రదాయానికి చెందిన నాట్యగానాలే యక్షగాన నాట్యాల్లో వెలసేయనేది పురాణం, పుక్కిటి పురాణం, ఊహ, కల్పన, సంకేతం వగైరా లెన్నిటినో కూడగట్టుకొని కాని రూపొందని సత్యం. గంధర్వ కిన్నెరాదులవలెనే యక్షులకు కూడ ప్రత్యేకమైన ఒక గాన సంప్రదాయమున్నట్లు ఆంజనేయభరతంలో పేర్కొబడిందని చెప్తూ 'యక్షేషు గీత మపి గాన శైలీం' అని గోవింద దీక్షితులవారు తమ సంగీత సుధలో పేర్కొన్నారు. గంధర్వగానం మార్గి అనీ, యక్షగానం దేశి అనీ పండితుల అభిప్రాయం. కన్నడ కవి అభినవ పంపడు (12 వ శతాబ్ది) వ్రాసిన మల్లినాథ పురాణంలో 'యక్షాందోళన' మనే నాట్యం ప్రస్తావించబడింది.7 కన్నడ యక్షగాన నాట్యప్రదర్శనలలో 'యక్షిణీ' వేషం ఈ ఆందోళికా నాట్యాన్ని నేటికీ ప్రదర్శిస్తూన్నందున, గానంలోవలెనే నాట్యంలో కూడ యక్షులది ప్రత్యేక సంప్రదాయమే అనిఊహించవచ్చు.

యక్షులు దేవయోనులుగా పేర్కొనబడ్డారు. యక్షేశ్వరుడైన కుబేరుడు ధనాధిపతిగా అంగీకరింపబడ్డాడు. ఇతడు లంకలో కొన్నాళ్లు రాజ్యం చేసినట్లు పురాణాలు చెప్తాయి. ఇతని తర్వాత లంకా రాజ్యమేలిన రావణుడు కూడ జైనుల పురాణాల్లో యక్షరాజుగానే పేర్కోబడ్డాడు. జైనులు నేటికీ యక్ష యక్షిణీలను పూజిస్తున్నారు. బౌద్ధులు కూడ యక్షులపట్ల భక్తివిశ్వాసాలు చూపుతారు. బౌద్ధసాహిత్యంలో యక్షుల ప్రశంస ఎక్కువగా దొరకడమే కాదు, అసలు బుద్ధుడే మహాయక్షుడుగా పేర్కొబడిన ఘట్టాలుకూడ దొరుకుతాయి. ప్రాసాద గోపుర ప్రాకార తోరణాలకి సంరక్షకులుగా యక్షులు శిల్పాలలోను చిత్రాలలోను మూర్తిభవించారు. మాయ మంత్రాలకీ, వినోదవిద్యలకీ విలాస విన్యాసాలకీ యక్షమూర్తులు ప్రతీకలుగా గ్రహింపబడ్డాయి.

భట్టిప్రోలు స్తూపంవద్ద దొరికిన శాసనాన్ని బట్టి క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దంలో ఆ ప్రాంతం ధనదుడనేవాని ఏలుబడిలో ఉన్నట్లు తెలుస్తూంది. తత్సమీపంలో ధనదప్రోల నే పట్నంకూడ కనిపిస్తూంది. వేంగీదేశపు మధ్యకాలీన దానశాసనాలు కొన్నిటిలో కొందరు దాతలు కుబేరవంశీయులుగా పేర్కోబడ్డారు. యక్షశబ్దానికి తెలుగు కన్నడ భాషలు రెండింటిలోనూ తద్భవంగా చెప్పబడిన 'జక్క' శబ్దం నేటికీ ఒకానొక జాతిజనులకు నియతాభిధానంగా వినిపిస్తూంది.

యక్షులు పరాభూతులై నేలవిడిచి వేరొక చోటికి వలసపోయిన జాతి. వీరికి తన కొండమీద ఆశ్రయమిచ్చి ఆదరించిన జంగమదేవర శంకరుడు రాజబంధువు. యక్షరాజు ధనేశ్వరుడేకాని కుత్సిత బేరుడు. యక్షులు నగరు విడిచి వన పర్వత తటాకారామ గ్రామోపరిసీమలలో విహరించే జాంగలులు. సంజై

6. చూ. కన్నడ కవిరాజమార్గ. 1-36.
7. చూ. మల్లినాథ పురాణం. ఆ. 12, ప 47.

వేశలు యక్షులకు పక్షులకు సంచారవేళలు. లక్ష్మి వీరి కౌగాగ్ర్యదేవత. దీపావళి యక్షరాత్రి. యక్షిణీలు వెన్నెల విసనకర్రలు. ప్రసన్నులైతే యక్షిణీ లెంతటి కార్యమైనా సాధించగలరు. ఆ గతానాగతాలను చెవిలో చెప్పగలరు. ఏదైనా ఎత్తుకొని పోవాలంటే యక్షిణీలకే ప్రజ్ఞ. క్షణంలో చాటుబడి మాటుమరిగి పోవడం వీరికి వెన్నతో బెట్టిన విద్య. పర్వతారణ్య భూములలో విహరించే వీరికి, వనలక్ష్మి తోబుట్టువు ఆమెను వరించిన నృసింహస్వామి పరాచకాలాడదగిన బావగారు. ఇవన్నీ పరంపరాగతంగా వినవస్తూన్న యక్షుల లక్షణ సంకేతాలు.

తెలుగు సాహిత్యంలో జక్కుల పురంధ్రుల పాటలు ప్రస్తావించబడినట్లుగానే కన్నడ సాహిత్యంలో 'ఎక్కలగాణ'ల నాట్యగానాలు పలుతావుల ప్రస్తావించబడ్డాయి. అగ్గళుడు (12 వ. శతి) వ్రాసిన చంద్రప్రభాపురాణంలో వనవిహారం చేస్తూన్న నాయకుడు, మేళతాళాలతో నిమిత్తం లేకుండా దేశీయగీతాన్నొకదానిని ఒక 'ఎక్కలగాణ'యింపుగా పాడుతూఉంటే విన్నాడని వర్ణించబడింది.8 అభినవ పంపని (12 వ. శతి) మల్లినాథ పురాణంలో కమలామోదియైన తుమ్మెద ఝుంకారం కమలాలయయైన లక్ష్మిని కీర్తిస్తూ పాడే 'ఎక్కల' గానంతో పోల్చి వర్ణించబడింది9. రత్నాకరవర్ణి (16 వ. శతాబ్ది) వ్రాసిన భరతేశ వైభవంలో వెనుక పాటకులతోనూ, మేళతాళాలతోనూ 'ఎక్కడిగలు' నాట్యమాడినట్లు వర్ణించబడింది.10 ఆ యీ వ్రాతలవల్ల యీ ఎక్కలగాణలు తెలుగు జక్కుల పాటకులవలెనే జానపదగాయకులనీ, లక్ష్మీప్రశస్తిని వర్ణించడమే వీరికి కూడ కులాచారమనీ, నృత్యంకూడ వీ రెరుగుదురనీ, అందులో హంగుదారుల ఆటోపంకూడ వీరి కవసరమే అనీ బోధపడుతూంది.

ఆంధ్రదేశంలో నేడు కనిపిస్తూన్న జక్కుల జాతి వారికి నృత్యగానాలు వృత్తిగా ఉన్నట్లు రూపించదు. కన్నడదేశంలో యీ ఎక్కలగాణలు గాని, ఎక్కడిగలు గాని యిదే పేరుతో ఉన్న జాతిగాని నేడు దొరకరు. శబ్దాన్ని విడదీసి చెప్తే యీ ఎక్కలగాణలనే పదానికి యింపైన గాయకులు అనే అర్థం చెప్పాలి. కాని ఎక్కడిగలు అనేది కేవలం జాతివాచకమైన శబ్దం. తెలుగులో నన్నెచోడుడు తన కుమార సంభవంలో ఎఱుకలవాడు గొడు గీతాలు పాడినట్లు ఒకచోట వర్ణించాడు. ఈ ఎఱుకలజాతివారు విశాఖమండలంలో నేటికీ యక్షగానాలు ప్రదర్శిస్తున్నారు. వీరి ప్రదర్శనాలకి ఎఱుకల కీర్తన, ఎర్రగొల్లల భాగవతం, చెంచు నాటకం వగైరా పేర్లున్నె వ్యవహారంలో ఉన్నాయి. అప్పటి మద్రాసుప్రాంతాలలో యీ నాటకాలాడేవారి సంఘాలు 'మేళా'లనే పేరున నేటికీ సజీవంగా ఉన్నాయి. ఈ ఎఱుకలు కొండజాతులకు చెందినవారు ఎఱుక, యానాది, ఎర్రగొల్ల, చెంచు, కోయ, కొరవ, కురుబ, మందులవాడి, రామజోగి వగైరా పేర్లతో పిల్వబడే యీ జాతులన్నీ మూలంలో ఆటవికజాతులే. స్థిరనివాసాలు లేకపోవడం, కొండకోనలలో తిరగడం, మందులు మూలికలు, అమ్ముకోవడం, చేతులు చూసి జోస్యాలు చెప్పడం, ఢక్క, డమరుక, కొయ్యచితారు వంటి వాద్యాలు వాయించడంలో ప్రత్యేకమైన నేర్పుకలిగి ఉండడం, 'కొల్లాపురమ్మను గొలిచి తిరిగేము, ఎల్లవారికి నదే యిలవేలుపమ్మ' అని చెప్పుకోవడం, ఆయా జాతులన్నిటికీ సర్వసామాన్యమైన లక్షణాలు. పైన వివరించిన యక్షుల లక్షణాలు కన్నడ ఎక్కల లక్షణాలు కూడ వీరిలో ఎన్నో కనిపిస్తాయి. ఎఱుకలు యక్షగానాలు ప్రదర్శించడమే కాక, ఎఱుక, ఎఱుకత అనే పాత్రలు గల కొరవంజి రచన లన్నీ యక్షగానాలుగానే పేర్కొబడుతున్నాయి. ఈ కారణాలవల్ల ఈ ఆటవికజాతుల నాట్యగానాలవల్ల స్ఫూర్తిగొని, వారి సంప్రదాయాలను చాలవరకు స్వాంతీకరించేసుకొని, ఆనాటి కొనాటి సాహిత్యకలక్షణాలను పెంపొందించుకొంటూ వెలసిన దేశిరచనలే యక్షగానాలని నమ్మవచ్చు.

## 3

యక్షగాన రచనలలో ఒక తరహా రచనలకి కొరవంజి రచనలనే పేరు తెలుగు, తమిళ, కన్నడభాషలు మూడింటిలోనూ వినిపిస్తుంది. కొరవలనేవారు ఎఱుకలు. ఈ జాతి స్త్రీలను కొరవంజులని పిలుస్తారు. ఈ

8. చూ. చంద్రప్రభా పురాణం. ఆ. 7, ప 95.

9. చూ. మల్లినాథ పురాణం. ఆ. 6, ప 98.

10. చూ. భరతేశ వైభవం – ఆస్థాన సంధి. పద్యం 68.

కొరవంజి లేక ఎఱుకత అనే పాత్ర వర్ణించబడిన యక్షగాన రచనలే కొరవంజి రచనలు.

కొరవంజి యక్షగానాలు మువ్విధాల కనిపిస్తాయి. కొరవంజి, కొరవ నాయకుల ప్రణయ వృత్తాంతాన్నే వర్ణించేవి మొదటి రకం. ఇందులో చెంచులక్ష్మి (కొరవంజి)ని నృసింహస్వామి (కొరవ) వలచి వరించిన గాథ వర్ణించబడుతుంది. కొరవంజిని సింగి అనీ, కొరవనాయకుని సింగడనీ యిందులో వ్యవహరిస్తారు. తెలుగులో గరుడాచలమాహాత్మ్యం, చోడిగాని కలాపం వగైరా రచన లిట్టివి. విశాఖమండలంలో ప్రదర్శింపబడే ఎఱుకల కీర్తన యీ చోడిగాని కలాపమే. ఈ కథలోగల ప్రణయఘట్టం, యీ పాత్రలూ మిగిలిన కొరవంజి రచన లన్నిటికీ మూలాలు. లక్ష్మీనృసింహులకు బదులుగా పార్వతీ పరమేశ్వరులను ఎఱుక దంపతులుగా మార్చి వ్రాసిన యక్షగానాలు కూడ దీని ననుకరించి వెలసిన రచనలే. శహాజీ మహారాజుగారు తెలుగులో వ్రాసిన కిరాత విలాసమనే యక్షగాన మిట్టి అనుకరణమే. ఇందులో శివుడు పాచికలాడి, పార్వతితోడి, విరక్తుడై తపస్సు చేయబోవడం, పశ్చాత్తప్త అయిన పార్వతి భిల్లాంగనారూపం ధరించి శివునివెనుక బోవడం, శివుడామెకు సుముఖుడై తిరిగి కైలాసానికి పోవడం అనే ఘట్టాలు వర్ణించబడ్డాయి.

నాయకుడు ఎఱుకత వేషంతో పోయి నాయికను కలసి, ఆమె హస్తరేఖలు పరీక్షించి, త్వరలో ఆమెకు మనోనుకూలుడైన భర్త దొరుకుతాడని చెప్పి, కొంత పూర్వరాగం ప్రదర్శించినట్లు వర్ణించిన రచనలు కొరవంజి రచనలలో రెండవ రకం. తెలుగులో రాముల వారి ఎఱుక, సీతాకల్యాణం వగైరాలు, కన్నడంలో అర్జున కొరవంజి, కృష్ణ కొరవంజి వగైరాలు యీ రకమైన రచనలు.

ముఖ్య కథతో ఏవిధమైన సంబంధమూ లేకపోయినా ఏదోవిధంగా ఎఱుకత పాత్రకు ప్రవేశం కల్పించి, ఆమెచేత నాయికకు సోది చెప్పించడం, తదుపరి ఎఱుకరాజును ప్రవేశపెట్టి పరిహాసపూర్ణంగా వర్ణించడం, ఆమీద ఆ ఎఱుక దంపతుల వాదవివాదాలు ముతుకగా ఏకరువుపెట్టి ప్రదర్శించడం అనే ఘట్టాలు కల రచనలు మూడవ రకమైన కొరవంజి రచనలు. ఈ రచనలలో ముఖ్యకథలో పూర్వభాగం ఎఱుకల సంవాదానికి పీఠికగా ఉపకరిస్తుంది. వీరి సంవాదం ముగిసినపిదప ముఖ్యకథలోగల మిగతా భాగం ఏదో అయిందంటే అయిందన్నట్లుగా పూర్తిచేయబడుతుంది. ఉదాహరణకి కన్నడభాషలోగల పార్వతీ కొరవంజి అనే రచన చూడవచ్చు. ఇందులో కథ శ్రీరామ జననం. దశరథుని సంతానచింత నారదుని ఉపదేశం, పుత్రకామేష్టి యాగం, కౌసల్యాదుల గర్భధారణ అనే ఘట్టాలు వర్ణించినపిదప కవి కైలాసం మీదికి తందృష్టి మరలించాడు. పరమేశ్వరుడు పార్వతిని పిల్చి:

'కొరవంజి వేషమున భూలోక మరిగి
కౌసల్యగని సోది గణియింపు మెరిగి' 11

అని ఆజ్ఞాపించాడు. సరే అని పార్వతి ఎఱుకత వేషంతో అయోధ్యకు వెళ్ళి, కౌసల్యను చూచి శ్రీరాముని జననం గూర్చి సోది చెప్తూ:

"తరుణిరో నావాక్కు తగ నమృత వాక్కు
కొల్లాపురమ్మన పొల్లు గాదమ్మ" 12

అని నమ్మకం కలిగిస్తుంది. ఈ లోపుగా సాక్షాత్ శివుడే ఎఱుక నాయకుడై భూమికవతరిస్తాడు.

"పిల్లి కళ్ళూ, భేరి పొట్టా, సప్పినారిజాడ ముక్కూ
పిల్లి గడ్డం పేడి మీసం, ఓ సింగీ అనుచూ
తల్లడిల్లీ వచ్చె సింగడూ." 13

తర్వాత యీ సింగీ సింగళ్ళిద్దరూ కొంత వివదించుకొని, తిరిగి రాజీపడి కైలాసానికి వేంచేస్తారు. కథ కంచికి పోతుంది. మనమింటికి వస్తాం. ఇలా మధ్యంతరాన కథకు మంగళహారతి పట్టడమే యీ పాటలలోగల విశిష్టత. తమిళ భాషలో గల 'తిరుక్కుర్రలక్కురవంజి' అనే రచనలో కూడ కథ ఇదే

(11) కొరవంజి వేషదలి ధరెగె పోగువుదు
అరసికౌసలిగె నీ కణియ హేళువుదు —
(పార్వతియ కొరవంజి మూలం.)

(12) తరుణి యెన్న మాతు తవె యమృత వాక్కు
కరెయు కొణిసదు కొల్లాపురదమ్మ నాణె.
(పార్వతియ కొరవంజి మూలం)

(13) బెక్కుకణ్ణు భేరిహొట్టె, చెక్కెదంతె వారెమూగు
చిక్కవుళ్ళి గడ్డె మీసయు వోసింగి యెనుతా
అక్కరింద బందా సింగాను.
(పార్వతియ కొరవంజి మూలం)

విస్తంగా మధ్యలో ఆగిపోతుంది. అంటే యీ కొరవల గొడవే యీ రచనలలో ప్రధానమనీ, అందుకే వీటికి కొరవంజు లని పేరు వచ్చిందనీ స్వతస్సిద్ధంగా ప్రమాణించినట్లవుతుంది.

కన్నడ భాషలో యీ కొరవంజు లెన్నో ముద్రితాలై దొరుకుతున్నాయి మైసూరు ఓరియంటల్ లైబ్రరీలో యింకా కొన్ని అముద్రితాలుగా ఉన్నాయి. కాని కాలంలో యీ రచనలేవీ పదిహేడవ శతాబ్దానికి మించి ప్రాచీన మనిపించుకోవు

## 4

కన్నడ దేశంలో యక్షగాన నాటకాలకి బయలాటలు, దశావతారాలు, మేళాలు వగైరా పర్యాయ నామము లెన్నో వినిపిస్తాయి ఈ నాటక సంఘాలను కూటాలనీ లేక మేళాలనీ పిలుస్తారు నటులు భాగవతులు, సూత్రధారుడు భాగవతారు. నాటక సంఘపు యాజమాన్యం తరుచుగా దేవస్థానాలకి చెంది ఉంటుంది. ఆడే నాటకాలన్నీ పౌరాణికగాథలే. ప్రదర్శనలో గల సంప్రదాయ విభిన్నతను బట్టి దక్షిణ కన్నడ జిల్లాలో యక్షగాన నాటకాలు ఉత్తరాది, దక్షిణాది అనే రెండు పద్ధతులలో కనిపిస్తాయి.

పార్తిసుబ్బ (1760-1820) అనే ఆయన కన్నడ భాషలో 'యక్షగాన వాల్మీకి' గా పేరు పొందాడు. ఈయన రామాయణ కథకు సంబంధించిన యితివృత్తాలు తీసుకొని ఎన్నో యక్షగానాలు రచించాడు. ఇతడు కేవల కవిమాత్రుడే కాదు. గాయకుడు, నటుడు కూడ. పొరుగున గల కథాకళీ నాట్యాలనుండి అనేక సంప్రదాయాలు గ్రహించి, యక్షగాన మేళాలు నెలకొల్పి నడిపించాడు. వేషధారణ, మూక నృత్యం వగైరాలలోనే కాక, చండీ వాద్యం, జేగంట వగైరా వాద్య సంగ్రహణలో కూడా కన్నడ యక్షగాన నాటకాలు, మళయాళపు కథాకళీని అనుకరిస్తాయంటే అది ఈయనవా ఏర్పడిన సంప్రదాయమే. ఇతని నాటికే కన్నడ దేశంలో పూర్వరంగ ప్రదర్శనానికి కావలసిన కలాపం 'సభాలక్షణ' మనే పేరున గ్రంథ రూపంలో ప్రసిద్ధమై ఉంది. పార్తి సుబ్బ దీనిననుసరించి తన నాటక ప్రదర్శనాలలో పూర్వ రంగం జోడించుకొన్నాడు. ఈ సభాలక్షణంలో కొన్ని పాటలు, మాటలు తెలుగు యక్షగాననాటకాల పూర్వ రంగంలో వినిపించేవే. సంప్రదాయంకూడా సజాతీయమే.

కన్నడ యక్షగాన నాటకాలలో వీరరసాభినయానికి విలువ హెచ్చు. ఆరభటీవృత్తి ప్రదర్శనంలోను, యుద్ధ దృశ్యాభినయించడంలోను కన్నడ భాగవతులు ప్రత్యేక ప్రజ్ఞ గడించుకొన్నారు. దీనికి తగినట్టుగానే వీరాడే కథలు కూడ భీష్మవిజయం, విరాటపర్వం, ద్రౌపదీప్రతాపం, వాలి నిగ్రహం, అతికాయ వధ వంటి వీర రసోచితమైన యితివృత్తాలు కలిగి ఉంటాయి లేనిచోటకూడ కల్పించుకొని వీర రసాభినయం చేయడం కన్నడనటుల విశేషం. మోహినీ రుక్మాంగద వంటి శాంత రసప్రధానమైన కథలో కూడా వీరు సాత్వతీ ఆరభటీ వృత్తులకి జాగా చేసుకొంటారు. ఇది కారణంగా శృంగారానికి ఆస్కారం తగ్గిపోయింది. స్త్రీ పాత్రలు ఉపేక్షింపబడ్డాయి. వేషంగాని ఆటగాని అభినయంగాని ఏదీ స్త్రీ పాత్రలలో చెప్పుకోదగిన స్థాయిలో కనపడదు. నాయకుని కంటె ప్రతినాయకుని వేషం సభారంజకంగా ఉంటుంది. ప్రతి నాయక పాత్ర తెర బయల్దేరడమే ఒక రసవంతమైన ఘట్టం. వేషధారణలో చాల వరకు కథాకళీ సంప్రదాయాలు కనిపిస్తాయి.

కన్నడ నటులంతా నాట్యంలో ప్రజ్ఞకలవారే. నాట్యం చాల శాస్త్రీయమైన పద్ధతిలో ఉంటుంది. మూకనృత్యం, ముద్రాభినయం, చారీ భ్రమణాది సంచారనృత్యాలు, మండల గోమూత్రిక, డోల పదాది కరణాభినయాలు, యుద్ధాభినయంలో పాటించే నాట్యనర్మాలు వగైరా లెన్నో వీరు ప్రశంసనీయంగా ప్రదర్శిస్తారు. సందర్భానుసారంగా సమ్మి, రాస, ఆందోళికాది జానపదనృత్యాలు కూడ వీరీ ప్రదర్శనాలలో అభినయిస్తూ ఉంటారు. తాండవనృత్యాలు, అద్భుత కరణాంగహారాలు వీరి సొమ్ము. లాస్యంలో వీరికి నేర్పు కనపడదు.

కన్నడ నటులెవ్వరూ పాడరు. పాడవలసే కలాప మంతా భాగవతారు (సూత్రధారుడు) పాడతాడు. అతడు పాడుతూన్నంతసేపూ నటులు మూక నృత్యాభినయాలు ప్రదర్శిస్తూంటారు. పాట ముగిసిన పిదప అదేపాటలోగల భావాన్ని నటులు తమ స్వంత వాక్యాలలో పేర్చి సంభాషణశైలిలో వినిపిస్తారు. అంటే మూకనృత్యం జరుగుతూన్నప్పుడు కథాకళీని, సంభాషణలు జరుగుతూన్నప్పుడు ఆధునిక స్టేజి నాటకాలను స్మరింపజేస్తూ ఉంటుందీ నాటకం. మాటాడ

డంలో నటులకు కావలసినంతగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఉన్నందున అవి అప్పుడప్పుడు మితిమీరి రసభంగం చేయడంకూడ మామూలే. సంభాషణానంతరం భాగవతారు తిరిగి మరొకసారి పాట పాడడానికుపక్రమిస్తారు. నటులు మాటలుమాని, పాటలోగల భావాన్ననుసరించి నృత్యగతులు ప్రదర్శిస్తారు. తెల్లవార్లూ యిదే క్రమంలో యీ నాటకాలాడబడతాయి.

కన్నడ నాటకాలలో హాస్యానికేమంత విలువ లేదు. హాస్యగాడు ముఖ్యపాత్రలవద్ద నౌకరుగా రూపొందుతాడు. ఇతని హాస్యంకూడ స్టేజినాటకాలలో వినిపించే జఫ్ఫాహాస్యం వంటిదే.

ఈ నాటకాలన్నిటిలోనూ పూర్వరంగం ప్రదర్శింపబడుతుంది. ఇష్టదేవతాప్రార్థన, బాలగోపాల ఇంద్ర అర్ధనారీశ్వర వేషాలప్రవేశం, కోడంగిహాస్యం, యక్షిణీ (స్త్రీ వేషం) నృత్యం, కథాప్రారంభం, పాత్రలు తెర బయల్దేరడం, వచ్చిన ప్రతీ పాత్రను పృచ్ఛించి ఊరుపేరులన్నీ రాబట్టి సభకెరుకపర్చడం, నృత్యగానాలతో ప్రవేశించి, నృత్యగానాలతోనే తమసాద వెల్లడించడం వగైరా లక్షణాలన్నీ తెలుగు వీధినాటకాలలో కనిపించేవే.

## 5

కన్నడ యక్షగాన నాటకాలు తమ పూర్వరంగంలో ప్రాచీన సంప్రదాయాన్ని నేటివరకూ భద్రంగా నిల్పుకున్నాయి. భరతోదితమైన పూర్వరంగాధ్యాయానికి వీరి యీ పూర్వరంగ ప్రదర్శనం ప్రత్యక్షోదాహరణగా ఉపకరిస్తుంది. భరతుడు చెప్పిన పూర్వరంగం సుదీర్ఘమైన తంతుకలిగి ఉంటుంది. కాని అతడే దానికి లఘుప్రక్రియకూడ చెప్పాడు. కన్నడ నాటకాలలో యీ లఘుప్రక్రియ నేటికీ తూచా తప్పకుండా అనుసరింపబడుతూంది. ఈ నాటకాలు నడివీధిలో పందిరివేసి ఆడబడడంవల్ల నేపథ్యమేదో రంగమంటపమేదో తెలుసుకోడానికి తగిన హద్దులేవీ అక్కడ ఉండవు. పందిట్లో ముందుభాగం రంగమంటపంగాను వెనుకభాగం నేపథ్యంగాను వినియోగింపబడతాయి. ఈ కారణంచేత నేపథ్యంలో జరిగే పూర్వరంగాంగాలైన సమస్త ప్రక్రియలు సభికుల సమక్షంలోనే జరుగుతాయి.

సాయంకాలం ఆరేడు ఘంటలకల్లా ప్రదర్శనస్థలంలో చండవాద్యాన్ని ముమ్మరంగా వాయిస్తారు. ఇది మ్రోగుతూండగా మద్దెల, తాళాలు, శ్రుతి వగైరాలు పట్టుకొని వాద్యకులు, గాయకులు రంగస్థలానికి వస్తారు. ఇదే భరతోదితమైన ప్రత్యాహారమనే క్రియ. తరువాత గాయకులు, వాద్యకులు తమ తమ నియత స్థానాల్లో నిలుస్తారు. ఎవరు ఏ ప్రక్కగా నిలవాలో అనేది నిర్ణయించి, అలా వచ్చి నిలవడానిని భరతుడు అవతరణమనే పేర వ్యవహరించాడు. వాద్యకులు తమ తమ వాద్యాలను గాయకులు తమ తమ కంఠాలను శ్రుతి కూర్చుకోవడంతో ఆరంభం ఆశ్రావణం అనే క్రియలు నిర్వర్తించినట్లవుతుంది. ఆమీద బృంద గానంతో ప్రార్థన ప్రారంభిస్తారు. ఈ ప్రార్థన జరుగుతూ ఉండగా ఓ యిద్దరు పిల్లలు మంగళకలశాలు, మామిడికొమ్మలు పట్టుకొనివచ్చి నాట్యం చేస్తారు. వీరినే బాలగోపాల వేషాలని పిలుస్తారు. వీరి నృత్యం తాండవగతిలో జరిపి పరిఘట్టనా సంఘట్టనా అనే అంగాలు నిర్వహిస్తారు. తరువాత భాగవతారు (సూత్రధారుడు) యింద్రధ్వజాన్ని యెత్తి, దానికి పుష్పాలు చుట్టి, ప్రక్కవాని చేతిలోగల మంగళ కలశంనుంచి కొంత వసంతం గ్రహించి దానిమీద జల్లుతాడు. పిదప ఆ వసంతాన్ని తనమీద తదితర గాయకులమీద జల్లి పవిత్రత నాపాదించుకొంటారు. ఒక కొబ్బరికాయకొట్టి నైవేద్యంగా అర్పించి ప్రార్థిస్తారు. ఈ సందర్భంలో ఇంద్రవేషం ప్రవేశించి నాటీగతులతో నృత్యం ప్రదర్శిస్తుంది. ఇలా పుష్పదానం అనే క్రియ నిర్వర్తించిన పిదప భాగవతారు నాందీ శ్లోకం చదువుతాడు. తిరిగి మరొకసారి బృందగానంతో ప్రార్థన జరుగుతుంది. ఆ సమయంలో అర్ధనారీశ్వర వేషం వచ్చి నృత్యం ప్రదర్శిస్తుంది. ఇందులో కూడ చారీ మహాచారీగతులు ప్రదర్శిస్తారు. దీనికి రంగద్వార మని శాస్త్రీయనామం. ఈ క్రియ ముగిసిన వెనుక కోడంగివేషం ప్రవేశిస్తుంది. భాగవతారు కోడంగివేషంతో కొంత హాస్యప్రసంగం జరిపి త్రిగత మనే క్రియ నిర్వహిస్తారు. తరువాత విదూషక వేషం ప్రవేశిస్తుంది. వానితో సంభాషిస్తూ భాగవతారు కథాసూచన చేసి ప్రరోచన అనే క్రియ నిర్వర్తిస్తారు. ఆ తర్వాత భాగవతారు (స్థాపకుడు) సభనూ సభికులనూ ప్రశంసించి, నాటకకథ, కవి వగైరాలను వర్ణించి,

ఆనాటి ఉత్సవాన్ని, ఆ దేవతను, తత్కాల ఋతువును వర్ణిస్తున్న గేయాలు వినిపిస్తారు. ఆమీద ప్రస్తావన, ఆముఖం, స్థాపన వగైరాలు యథావిధిగా నిర్వహింపబడతాయి. ఇవి నిర్వహించేటప్పుడు భాగవతారు విదూషకునితోను నటితోను సంభాషిస్తూ ఉంటాడు.

కన్నడ యక్షగానాల్లో నటి వేషాన్ని యక్షిణీ వేషమనీ, శ్రీ వేషమనీ, మోహినీవేషమనీ పరిపరి విధాల పిలుస్తారు. ఈమె మొదటిసారి రంగస్థలానికి వచ్చినప్పుడు నడుమువరకు అట్టతో కట్టిన ఒక తొట్టె వంటి చౌకంలో నిల్చి నృత్తగతులు ప్రదర్శిస్తుంది. ఈ నృత్తాన్ని అంవోళికానృత్యమనీ, మంచెచప్పర నృత్యమనీ పిలుస్తారు. రెండవసారి వచ్చినప్పుడీ నటి వేషం ఆరంభ నృత్యం, కలాస నృత్యం అనే రెండు రకాల లాస్య నృత్యాలు నెరపుతుంది.

నటీవేషపు నృత్యం ముగిసిన పిదప భాగవతారు విదూషకునితో సంభాషిస్తూ కథానాయిక ప్రవేశాన్ని సూచిస్తాడు. ఇక్కడితో పూర్వరంగం సమాప్తమౌతుంది. ఇద్దరు వ్యక్తులు వచ్చి తెర పట్టుకొని నిలుస్తారు. గ్యాసులైటు ఉన్నా రెండు దివిటీలు వెలిగించి తెర కిరుప్రక్కలా నిల్పుతారు. వచ్చిన పాత్ర తెరలో కొంతసేపు నృత్యం చేసి, తెర గజగజలాడించి, దివిటీల వెలుగున ముఖం చూపి, గ్రీవారేచక అడ్డీయాదులు ప్రదర్శించి, తిరిగి తెరమరుగున మాటు పడుతుంది. రెండవసారి తెర నడుమువరకు దించి ఉండగా పాత్ర తన కుడిచేతిని తెర యివతలకు చాచి నృత్యంచేస్తుంది. ఈ నృత్యం ముగిసిన పిదప మూడవసారి పూర్తిగా తెరతీసివేస్తారు. బాహాటంగా బయటకు వచ్చినపాత్రను, ప్రవేశగీతం పాడి, ప్రశ్నలు వేసి, ఊరు పేరు లడిగి, జవాబులు రాబట్టి సభ కెరుకపరిచే కార్యం భాగవతారు నిర్వహిస్తారు. ఆ తరువాత కథాభినయం జరుగుతుంది.

తెలుగు వీధినాటకాలలో సమయాభావంచేతనో ధనాభావంచేతనో బాలగోపాల, యింద్ర, అర్ధనారీశ్వర వేషాలకు చాలకాలం క్రితమే స్వస్తి చెప్పబడింది.[14] అసలు భాగవతారే విదూషకుడుగా మారిపోయి ప్రక్క తాళగాని నొకనిని పారిపార్శ్వకునిగా పిరాయించుకొంటాడు నటివేషం అవసరానుకూల్యాలెరిగి రాధగానో రుక్మిణిగానో లేక మరేదో ఆ నాటి కథకు సరిపోయే ఆడవేషంగానో అవతరిస్తుంది. అయితేనేం, తెలుగు నటుడెవరూ మూగకోముపట్టి నటించరు. పాత్రలు స్వయంగా ప్రవేశగీతాలు పాడుకొని ప్రవేశ నృత్యాలు నెరపుతాయి భరతుడు చెప్పిన ప్రవేశిక నిష్క్రమణాది నృత్యాలు తెలుగు వీధి నాటకపు దరువులలో నిర్వహింపబడినంత చక్కగా కన్నడ యక్షగాన నాటకాలలో నిర్వహింపబడవు. తెలుగులో పాటకు విలువ కన్నడంలో మాటకు విలువ. తెలుగువారు లాస్యాన్నాదరించారు. కన్నడులు తాండవాన్నాదరించారు.

---

(14) కన్నడదేశంలో కూడ యిప్పటిప్పుడు ఇంద్ర, అర్ధనారీశ్వర వేషాలకు స్వస్తి చెప్పబడుతూంది. నటివేషం కూడ నృత్యంలో మునుపటంత ప్రజ్ఞ చూపడంలేదు.

# చి...కా...బు

విజయ రాఘవ

అర్థరాత్రికాలంలో బయలుదేరారు వాళ్ళయిదుగురూ!...

ప్రతికాదేవి—వులిక్కిపడి, "ఎవరూ! బయలుదేరింది" అన్నది.

సర్కస్ సింహంలాగా గంతులు వేస్తూ, అటూ యిటూ తిరిగే యీదురుగాలి వాళ్ళ వాననని మెలుగ్గొడ్డులాగా పీల్చి—

"వస్తున్నారు! యిటే వస్తున్నారు." అంది భయకంపిత స్వరంతో—

ప్రతికాదేవి సరోజ నేత్రాలు, స్వాతి వానచినుకులకు నోళ్లు విప్పే ఆలుచిప్పల్లాగా సాగిలివిచ్చుకొన్నాయి. గుమ్మడి పూపుప్పొడి రంగువంటి నుదురుమీద, తామరాకుమీద నీటిబిందువుల్లాగా స్వేద బిందువులు ముత్యాల్లాగా మెరుస్తున్నాయి.

ఈదురుగాలి తడారిపోయిన గొంతుకతో—

"దగ్గర కొచ్చేసారు. జాగ్రత్త దేవీ!" అంటూ కిటికీగుండా శూన్యంలోకి దూసుకుపోయింది.

ప్రతికాదేవికి ఉత్తర ధృవంలో ఉన్నట్లనిపించింది. నాసికారంధ్రాలగుండా, ఉష్ణ రక్తకాసారంలోంచి వచ్చే సెగల్లాంటి పొగలు, వుంగరాల మాదిరిగా తిరుగుతూ వస్తున్నాయి. అప్పటికి కాలం కందగడ్డలా తయారైంది. వాతావరణం అంతా వాతం కమ్మినట్లు బిగుసుకుపోయింది.

వీటన్నిటిని చీలుస్తూ వాళ్లయిదుగురి వింత వింత నవ్వుల మాటల మరకలు కనిపించాయి. వాళ్ల వేళాకోళాలు - వేష భాషలు చూస్తుంటే శోషొచ్చినట్లయింది ప్రతికాదేవికి.

లేచి కిటికీ పరజా తప్పించి చూసింది.

వాళ్ళయిదుగురూ మెట్ల దగ్గర కొచ్చారు.

"ప్రచండ ఝంఝూ ప్రభంజనంలో యెగిరే గాలిపటం తనకన్నా బలం గలదని వూహించుకొంది" - ప్రతికాదేవి ఆ సమయంలో.

కిటికీదగ్గరనుండి వాకిట్లోకి రాగానే—

"వాళ్ళయిదుగురూ" పంచభూతాల్లాగా కనిపించారు.

దేవి ప్రశాంతవాతావరణం కోరుకొంటానికి ప్రయత్నిస్తోంది. నయాగరా జలపాతంలో నాగమణులు మెరుస్తున్నాయి. జలియన్ వాలాబాగ్‌లో ఘోరకృత్యాలు, మనఫిరంగుల ధ్వనులు; హాలాహాలంలో కోలాహలాలు — కేరింతలు — ప్రేయసీ విరహగీతాలాపనలు—రాజహంసల నడకల చప్పుడులు - అగ్నిపర్వతంలోనుంచి ప్రవ

హించే 'లావా' కుతకుత ప్రలాపాలు దేవిని అయోమయం చేస్తున్నాయి.

ఎలాగో జాగృతిదశలోకి హృదయాన్ని జారవిడిచింది, దేవి. కళ్ళు వాళ్ళయిదుగురి శరీరాల్ని-మనస్సుల్ని గౌరవించినయ్ వుచి తానవాల్ని చూపిస్తూ.

వాళ్ళయిదుగురూ కొండమీద కొక్కిరాయల్లాగా కూర్చున్నారు దేవి కెదురుగా.

వలిగాలి తెరలకు వణికి రెపరెపలాడే లేత రావిఆకులాగా - దేవి అరుణాధరాలు కదుల్తున్నాయి.

'నిశ్శబ్దం' మంచుగడ్డలాగా వది నిముషాలు కరగకుండా వుంది.

ఎడమవైపునుండి రెండో వ్యక్తిని దేవి పరకాయించి చూసింది.

సిల్కు లాల్చీ,—గ్లాస్కో పంచె—, కళ్లద్దాలు—కారా కిళ్లీకి యెరుపెక్కిన నల్ల పెదవులూ—బైౖల్ క్రీం, ఆమ్లా-స్వస్తిక్-తాతా ఆయిల్స్-రీటా-సీపా, కొబ్బరినూనె, బాయ్‌పిల్ మొదలైన పేర్లు కవచంలాగా తొడుక్కున్న వాసననూనెల గుచిమూడక, కుంకుడికాయ పులుసుతో సంతృప్తిపడే వుంగరాల జుట్టు, బెండకాయల్లాంటి చేతివేళ్లు, వంకాయ తొడిమలాంటి ముక్కు, వేళ్ళమధ్య "జీవితం కూడా యింతే"— అన్నట్లు తార్కాణంగా కాలే విదేశీయ సిగరెట్ దేవిని పల్కరించమని ప్రోత్సహించాయి.

గొంతు సరిజేసుకోబోతూ మిగతా నలుగుర్నీ చూచాయగా చూసింది.

ఎడమనుంచి మొట్టమొదటి అతను జేబురుమాలుతో మొగం తుడుచుకొంటూ విలన్‌లాగా కనిపించాడు.

రుమాల్ మీద "పిస్తోల్" గుర్తు వుంది.

దేవి గుండె గతుక్కుమని పిడచకట్టుకొనిపోయింది.

అయిదో అతను గోడకు వ్రేలాడుతున్న పటంవంక చూస్తూ పెదవులు కదుపుతూ—మధ్య మధ్య డైరీలో యేదో వ్రాస్తున్నాడు.

మూడో అతను దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

నాల్గో అతను టేబిల్ మీదవున్న తెల్ల కాగితంమీద యేవో గీతలు గీస్తున్నాడు.

ఎవ్వరూ యేమీ మాట్లాడటంలేదు.

వాళ్ల పేర్లేమిటో తెలుసుకోవాలనుకొంది దేవి.

కుతూహలం ఎవరెస్టుశిఖరం లాగుంది.

ఉత్సాహం సాగరతరంగాల్లాగా యెగురుతోంది.

ఇంతలో అయిదో అతను నిల్చున్నాడు.

దేవికి టి. బి. పేషంట్ గుర్తువచ్చాడు.

"వ్రాసినంత వరకూ చదువుతా" అన్నాడు అందరివంకా చూసి—ఎవ్వరూ జవాబివ్వలేదు.

దేవిమాత్రం చూస్తోంది, అతనివాలకం.

అతను మొదలెట్టాడు — సిగరెట్ ముట్టించి—

"పిగిలి-రగిలి

నలిగి-తొలిగి,

సీల్లి-మూల్లి
వెగటెగసిన హృద్వీథిలో
అరుణారుణ జయపతాక
కిరణాలను చిమ్మింది—,
కాగితాల మడతలలో
కీచురాళ్ల కలవరింత—,
సిల్కు-చీర కౌగిళిలో
వుల్కలాల సలపరింత—,
దిగజారిన వక్షోజమ్ముల నీడలలో-
పొగజూరిన కామోద్రేకపు మేడలలో-
నాణ్యం తిరుగాడుతోంది.
ప్రావీణ్యం పొర్లాడుతోంది-
అంత్యంలేనిది గమ్యం—,
సాంగత్యం లేని దగమ్యం—.

రచన:
"రుధిరోద్గారి"

అని చదివి వేళ్ళమధ్య ఆరిపోయిన సిగరెట్టుని చూసి నిర్వేదించాను.

దేవి హృదయంలో యీ రచన ఎగుడు దిగుడుగా పడుకొంది.

మొదటతను "ఫిస్టోల్" గుర్తు జేబురుమాల టేబిల్ మీద వుంచుతూ, కుర్చీలోంచి క్రిందకు వంగాడు.

దేవి అతన్ని చూసింది:

అతను సిగరెట్ కొడిని అరచేతిలోకి భద్రంగా తీసికొని, దేవికి చూపిస్తూ-.

"బ్రతికి సాధించలేని ముక్తి చచ్చి సాధించింది" అన్నాడు. నాల్గో అతను అందుకొంటూ-

"ఫిస్టోల్ శర్మగారూ! అలా అనకండి" అన్నాడు.

ఫిస్టోల్ శర్మ, "యేమిటీ!" అన్నట్లు బాయినెట్ లాగా మొగంపెట్టాడు.

దేవికి నవ్వొచ్చింది.

ఫిస్టోల్ శర్మకు ఆ నవ్వు చూడంగానే తల తీసేసినట్లనిపించింది.

"శాస్త్రిగారూ!" అన్నాడు.

"నస్సెన్నుశాస్త్రి", ప్రక్కనే కూర్చొన్న "ప్లాట్ రావు"ని పరిచయం చేస్తూ-"శ్రీ" గారికి ఆమాటలు కూర్చొని వినిపించాడు.

'రుధిరోద్గారి' "ఏమిటీ!" అన్నట్లు కొండ శిలువలాగా నోరు తెరిచాడు.

"మిట్టమధ్యాహ్న శ్రీ" రుధిరోద్గారి ఆదుర్దా గ్రహించినవాడై:

"మిత్రులు - సహృదయులు అయిన ఫిస్టోల్శర్మగారు ఒక క్షుద్రమైన విషయాన్ని, అపరాధ పరిశోధకుడిలాగా పరిశీలించి, ఒక చక్కని మాటన్నారు. దానిలో నస్సెన్ను శాస్త్రిగార్కి నచ్చిన విషయం దాగివుంది. అట్టిదానికి ప్లాట్ రావుగారు తన మేధా సంపత్తి సామాగ్రితో వన్నెచిన్నెలు కూర్చే ప్రయత్నాలు జరగబోతున్నాయి." అని యింకా చెప్పబోతూండగా, రుధిరోద్గారి "అన్నమాట్లేమిటీ?" అన్నాడు తిమింగలంలాగా—

"బ్రతికి సాధించలేని ముక్తి" చచ్చి సాధించింది"..."అని "చివర ప్రాసభాగం నీ కొదిలారు." అని నసిగాడు మిట్టమధ్యాహ్న శ్రీ.

రుధిరోద్గారి కి సాగరమథనంలోనుంచి చందనం పూసుకొన్నట్లయింది.

అప్పటికప్పుడు యిర్ని ఆరాధించాడు.

యీ క్రింది విధంగా పూర్తి చేశాడు చివరకు.

"బ్రతికి సాధించలేని ముక్తి చచ్చి సాధించింది రక్తి"-అని చెప్పుతూ-

"ఇంతకీ ఫిస్తోల్ శర్మగారికి యెలా వుంటుందో యీ ప్రాస సొగసు" అన్నాడు రుధిరోద్గారి.

వాళ్లూ-వాళ్లూ పిల్చుకునే ధోరణిలో డొల్లిన మాటల్నిబట్టి, వారికున్న సాంకేతిక నామాలేమిటో దేవి అర్థం చేసుకొంది.

ఒక్కసారి తనలో తాను వాక్చిత్రం చదువుకొంది.

"ఫిస్తోల్ శర్మ-"

మిట్టమధ్యాహ్న (శ్రీ)"-

"ప్లాటురావు"-

"సస్పెన్సుశాస్త్రి"

"రుధిరోద్గారి"

దేవిగుండెముసిముసి నవ్వులు నవ్వుకొంది.

రాల్చిన సిగరెట్ కొండిని గురించి బయలుదేరిన ధర్మసందేహాల్లో వాళ్ళవాళ్ళ మనస్తత్వాలు యెలాంటివో గ్రహించుకోగలిగింది దేవి.

ఇంతలో పత్రికా దేవి టేబిల్ మీద టెలిఫోన్ మ్రోగింది.

దేవి చెవిదగ్గర పెట్టుకొంది.

ఎవరో యేమో అడిగినట్లున్నారు.

"త్వరగా రావాలి" అని దేవి జవాబిచ్చింది. సస్పెన్సు శాస్త్రి యీ సమయంలో దేవిని మాట్లాడిద్దామనుకున్నాడు.

"వస్తానన్నారా!" అన్నాడు చివరకు.

"ఎవరూ?" అందా మనుకొంది దేవి. కాని సస్పెన్సు అవమానపడిపోతుందేమోనని వూరుకొంది.

"బూటు చప్పుడునిబట్టి వ్యక్తిని గ్రహించవచ్చు—

మనిషి కనిపించకపోయినా మాటను బట్టి వయస్సు చెప్పొచ్చు—

మనస్సు యెటువంటిదో తెలుసుకోవాలంటే, చేసే చేష్టలు చూస్తే చాలు—"

ఇట్లా ఫిస్తోల్ శర్మ, ప్లాట్ రావుకి వక్కపొడి పెడుతూ కాస్త, కాస్తగా చెప్పుకొస్తున్నాడు.

"ఇంత సేపూ కూర్చోబెట్టివుంచినందుకు యేమిటీ లాభం. యేదో కూర్చుని, పత్రికా కార్యాలయంలోనే, తన ప్రతిభను చూపి, ఒక గేయం వ్రాసి దేవదత్తంలాగా చదివినా, అప్పుచేసిన సిగరెట్లు అయిపోయినా, కాసిని కాఫీనీళ్ళయినా తెప్పించి యివ్వలేదే!" అని—

"సిందూరం"

"రక్తచందనం"

"బంధూకం"

"సంధ్యారాగం"

"పులిచంపిన లేడి నెత్తురూ"

ఇత్యాది నవ్యకవితా సామగ్రికి వుదాహరణగా,తయారై వూరుకొంది రుధిరోద్గారి వదనం.

ఫిస్తోల్ శాస్త్రి, ప్లాటురావువంక అప రాధ పరిశోధకుడిలాగా చూస్తున్నాడు. సస్పెన్సుగా చూస్తున్నాడు శాస్త్రి. రుధిరోద్గారికి సిగరెట్లు అయిపోయినయి. కాఫీ కషాయంకోసం గిజగిజలాడుతున్నాడు.

మిట్టమధ్యాహ్న క్రీకి అప్రాప్త మనోహారీ సౌందర్య లావణ్యాం జ్ఞాపకమొస్తోంది.

ఇంతలో కందిరీగల అందలంలోంచి దిగివచ్చినట్లుగా వచ్చాడు పత్రికాదేవిని ఆధారంగాపెట్టుకొని బ్రతికే "పూసర వెల్లి" గారు. వాళ్ళయిదుగురూ పూసరవెల్లిగార్ని చూసి నిల్చున్నారు.

దేవికూడా నిల్చుని వాళ్ళని పరిచయం చేసింది. పూసరవెల్లి రంగు మారుస్తూ - మందహాసంతో —

"ఫరవాలేదు కూర్చోండి."

అందరూ కూర్చున్నారు.

"మీ పేర్లు వినడమే గాని, స్వయంగా వ్యక్తుల్ని చూడగలిగే భాగ్యం నేటికి కుదిరింది. చాలా సంతోషం" అన్నాడు

తరువాత మాట "కాఫీలు తెమ్మని" చెపుతాడేమో అనుకున్నాడు రుధిరోద్గారి.

ఇంతలో ఫిస్తోలు శర్మకి చిరాకెత్తింది. "ఇటువంటి సంభాషణలవల్ల లాభం యేమిటీ! ఎందుకొచ్చాం యిక్కడికి?" అని చాణక్యుడిలా ఆలోచించాడు ఒక్కసారి.

పగబట్టిన త్రాచులాగా లేచాడు.

అతన్ని చూసి 'పూసరవెల్లి' అదిరి పడ్డాడు.

"ఇప్పటికి మీకు—

"గంధకంలో సుగంధం"—,

"కాళరాత్రిలో కత్తినవ్వు"—,

"చెలికత్తె రొమ్ముమీద చెరగని నిశాని"—,

"శశిరేఖలో సారాయి రుచి"—,

"హూపాయిలో నిహూపారాయ్" అనే అయిదు అపరాధపరిశోధక రచనలు మీ పత్రికకు పంపాను. వాటి గతి యేమైనట్లు? యెన్ని వుత్తరాలని వ్రాయాం? రచయితల్ని యిలాగేనా ఉత్సాహపరిచేది. ఎనిమిది సంవత్సరాలు దాటినా వాటిఅంతు తెలియదయ్యే" అంటూ ఫిస్తోలు గుళ్ళులాంటి మాటలు పూసరవెల్లిమీదకి వదిలాడు.

దేవి గజగజలాడింది.

ఫిస్తోల్ శర్మ - రుధిరోద్గారిని లేవమని చెప్పి, రొప్పుతూ కూర్చున్నాడు.

రుధిరోద్గారి లేచీ లేవడంతోనే మొగం చించుకొన్నాడు. మొసలి నోరులాగా పళ్లు బయటికి పెట్టాడు. కిళ్ళీ నమిలిన నాలుక కత్తిలాగా తిరుగుతోంది —

"వజ్రాయుధంలాంటి కలంతో వ్రాసిన, అపూర్వ ప్రతిభాసంపత్తితో మేళవించబడే పదాలతో, నిత్యమూ జరిగే సంఘర్షణలో, ప్రగతికి పురోగమించడంలో, ప్రజాస్వామ్య యుగంలో, కాలచక్రాల గమనంలో, శ్మశానవీథిలో యెగిరే జీవాల వికటాట్టహాస రోషాలలో, నలిగిపోయే బీదసాదల గుండెల రుధిరస్రావాన్ని రుచిచూస్తున్న రాబందుల మనస్తత్వాన్ని చిత్రీకరించుతూ, దీపావళికి రెండు సంవత్సరాల క్రిందట పంపుకొన్న "మంత్రగబ్బ డెక్కల్లో మరులుగొన్న మస్తిష్కం" అనే నా గేయం ఏమైంది? ఎక్కడుంది? కాళరాత్రి కౌగిలిలో కమిలి

పోయే నీలిరంగునితీసి, అధివాస్తవికత్వాన్ని నిరూపించా నా గేయంలో. అటువంటి రచన యింతకాలానికే ప్రపంచంలో ప్రచారానికి ప్రకాశానికి - ప్రభావానికి రాకపోతే, యింకా నా సాహిత్యసేవ దేనికి? నాకీ పేరు వుండి లాభం యేమిటి" అంటూ అలిసిపోయి కుర్చీలో కూలబడిపోయాడు - పత్రికాదేవివంక చూస్తూ.

'పూసరవెల్లికి' చింతనిప్పులమీద కూర్చున్నట్లనిపించింది.

మొగంలో రంగులు మారుతున్నాయి. ప్లాట్ రావు సావకాశంగా చూస్తూ, లేచి -

"ఊహించినా అందరాని విషయాలన్నీ ఏకరువుపెట్టి, అధిగమించలేని మార్గాలన్నీ అన్వేషించి, "ప్లాటు"కి సాహిత్యంలో ప్రధాన పాత్రనిచ్చి వ్రాసిన "మంగలిపెట్టె"- "దాలిగుంట" - "గొగ్గిపన్ను" - కుక్కతల్లి" మొదలైన నా అధునాతన కథానికలను ఏ వుద్దేశ్యంతో ప్రచురించకుండా వున్నారు? పోనీ యెందుకు తిప్పి పంపలేదు. చెప్పండి. భయంలేదు. ఫర్వాలేదు" అంటూ బాధనంతా నెమరువేసుకొంటూ ప్లాటురావు అడిగాడు.

పూసరవెల్లికి నవ్వొచ్చింది.

సస్పెన్సుశాస్త్రికి వొంటిమీద దురదగొండాకు సోకినట్లనిపించింది.

"పిస్తోల్ దెబ్బ - గుండె పగిలి కారిన పాలలో సేమ్యా తీగెలు కిలకిలమని నవ్వుతున్నాయి—"

"దూరంగా గులాబిరంగు జాకెట్ నవయౌవన యువతిది సిగ్గుపడుతూ, - దానిమ్మకొమ్మమీద దాక్కొంది."

"ప్రేయసీ! లైలా!" అని కేకేసు మజ్నూ! సినిమాలో - ఇసుక తుఫానులో - ఎడారిలో గుడారం లేచిపోయింది. ఆ హూంకార గాలి ధ్వనిలో మజ్నూ విలాపం ప్రేక్షకులికి రాజేశ్వరరావు సంగీతమైతే బాగుండేదనిపించింది—"

"అనార్కలీ, సమాధిలోంచి—

అల్విదా...అల్విదా అంటూ సలీమ్‌కి జిలేబీ - రసగుల్లాలు తామరాకుమీద పంపింది."—

"గుడ్లగూబ కోయిల్లాగా కూసింది. సెలయేరు మునిసిపాలిటీ ముసుగు కాల్వ మాదిరిగా విషాదగీతాలాపన చేస్తోంది"—

"ప్రియురాలిని కలుసుకున్నాడొకడు. ఎదురుగా సాలెగూడు గుండ్రంగా కనిపించింది. ఆమెను హృదయానికి ముందు హత్తుకొన్నాడు. తరువాత బిగియార కౌగిలించుకొన్నాడు. తేలిగ్గా ముద్దుపెట్టుకొన్నాడు - యింతలో అగ్నిపర్వతం బద్దలైంది. మెరుపులు - వురుములు - జాకెట్ లో వేలిం దొాక రాకెట్ - తరువాత ప్రళయం - మళ్ళా నవ్య సృష్టి"—

యిలా రకాలుగా - డైలాగ్సు పెట్టి, యింత సస్పెన్సుగా వ్రాసి పంపుకొన్న "బూడిదలో భూకంపం" అనే నా 'నవల' యెక్కడ దాక్కొంది? గుండుదెబ్బ తగిలి యెండిపోయిన నా హృదయానికి అదొక్క రచనే ముక్తిదాయకం. ఇంతకీ ఏమైంది?" అంటూ సస్పెన్సుశాస్త్రి కలవరిస్తూ కూలిపోయాడు కుర్చీలో.

పత్రికాదేవి కుర్చీలో కూలిపోయింది. కాసేపటికి స్పృహ వచ్చి మామూలుమని పైంది. ముక్కుమీద వ్రేలుంచుకొంది.

ఊసరవెల్లి నవ్వుతూ—

"మీరేం లేవా!" అన్నాడు మిట్టమధ్యాహ్న శ్రీని చూసి.

ఆ మాట ఆకురాయిలాగా రాసుకొంది హృదయానికి.

చ్యూయింగ్ గమ్ తింటున్న వాడిలాగా నోరుపెట్టి-గోడకు ఎదురుగా తగిలించివున్న "ఊర్వశీ" చిత్రాన్ని చూస్తూ-తేటగీతిలో-

"ఆమెనులి వెచ్చ కౌగిలిఅంతు లేని
మృదుసుఖాల తరంగాలుముంచుకొచ్చి,
మేను మరపించి జీవితమే, వసంత
ఋతువు గావించు సుకుమారి
బ్రతుకు నెపుడు"—

అని అపర పుఃహూరవుడినై వ్రాసికొన్నాను తొలి రేఖలో.

పిండారబోసిన పండు వెన్నెల శారద రాత్రులు-ఉజ్వలతారకల వెలుగులో-సన్న జాజి పూలపందిరిలో - తూగుటుయ్యాలలో-కప్పురపువిడెము సేవిస్తూ - కలువ మొగ్గలా వున్న నా అప్రాప్త మనోహరి సౌందర్య లావణ్య సుకుమార, సుందర, స్వరూపాన్ని తల్చుకుంటూ - కలలుగంటూ— "సిగలో మొగలి రేకు" అనే ప్రబంధ కావ్యాన్ని సీరియల్‌గా ప్రచురించమని ప్రాధేయపడుతూ పంపాను రెండేండ్ల క్రిందట. తరువాత అలాంటి కావ్యం వ్రాయడానికి నా మనస్సు తూగలేదు. నా ప్రియురాలి వయసులో వసంతఋతువు వెళ్ళిపోయింది. నా కలంలో నిర్ఝరిణీ ప్రవాహంలాగా పారే జీవధార సన్నగిల్లింది సడలని కౌగిలింతలు-ముద్దులు జాజిమల్లెల సురభిలాలు-సెలయేటి రొదలు-తుమ్మెద పాటలు - ఆనంద రసైకధుని— మొదలైనవన్నీ నాలో తడారిపోయినట్లని పించింది. అయ్యా! ఒక్కసారి నా కావ్యం లోని 'తొలిరేఖ' అని పేరు పెట్టకొన్న పద్యాల్ని చదువుకోవాలని వుంది. యెక్కడుందో తీసివ్వండి. వ్రాతప్రతిని చూసుకొని, అచ్చుప్రతిగా తృప్తిపడతాను సెలవివ్వండి. ఎక్కడుంది?" అని మిట్టమధ్యాహ్న శ్రీ దీన వదనుడై గాద్గదికంగా పల్కాడు.

దేవి గుండెలో జాలీ - కరుణ ద్రవించాయి. ఊసరవెల్లికి వికృతమైన నవ్వొచ్చింది. వాళ్ళయిదుగురి మొరలూ - మొక్కుబడులూ విన్నాడు వూసరవెల్లి.

దేవివంక చూసాడు.

ఆమె ముఖంలో విషాదచ్ఛాయలు దృగ్గోచర మవుతున్నాయి - కనుకొలకుల్లో అమృతధార లూరినయి. బాధను వ్యక్తం చేయలేక సతమతమవుతోంది.

ఊసరవెల్లికి వూపిరిసలప లేదు. అందరూ తనవంకే ఖూనీకోరుల్లాగా చూస్తున్నారు.

దేవి మొగంలో సానుభూతి అలుముకొంది. ఆమె వాళ్ళమాటలు నమ్మింది. గాద్గదికంతో వూసరవెల్లితో అంది.

"ఎందుకిలా చేస్తున్నారు. మిమ్మల్ని ఆధారంగా పెట్టుకొని, పేరు తెచ్చుకుందా

మనుకొంటే, యిటువంటి పనేనా చేసేది! ఇలాగేనా నా మొగానికి కళంకం తెచ్చేది!" సాహిత్యాన్ని పోషించాలి. రచయితల్ని ప్రోత్సహించాలి" అని సంపాదకీయాలు - వుపన్యాసాలు చెప్పిందీ-వ్రాసిందీ మీరేనా! ఏమి టిదంతా!"అంటూ పత్రికాదేవి వూసర వెల్లిని గట్టిగా నిలబెట్టి అడిగింది.

వూసరవెల్లికి మెదడులోనూ-గుండె లోనూ 'ఉషా' పంకాలు తిరిగినయి-కెనడా రైలింజను యీల వేసింది.-ఫ్యాక్టరీ పొగ గొట్టం మసిబొగ్గులు రవ్వలు చిమ్మింది-పసి పిల్ల పాలకోసం యేడ్చింది-ప్రియురాలి వక్షస్థలంలో త్రిశూలం దిగబడింది - ప్రియుడి నెత్తిమీద వజ్రాయుధం దెబ్బ టంగ్ మని మోగింది. అమాంతంగా లేచి ముందున్న టేబిల్ లేపి ప్రక్కకు పడత్రోశాడు.

"చి...కా...బు." కనిపించింది.

"పిస్తోల్ శర్మ" కళ్లు గుండ్లు రాల్చాయి.

"మిట్టమధ్యాహ్న(శ్రీ)"- హృదయారవిందం పుప్పొడి రాల్చింది.

"ప్లాటురావు"- బుర్రలో గూడ్సుబండి కదిలింది.

"సస్పెన్సు శాస్త్రి" - కోటు జేబులో చుంచుపిల్ల నవ్వింది.

"రుధిరోద్గారి"- నాలుకమీద కలకత్తా రుద్రకాళి కత్తిగీటు పెట్టింది.

ఊసరవెల్లి వులిక్కిపడి, కెప్పరిల్లి చూసాడు. అంతా భయానక దృశ్యాలు. విసురుగా ప్రక్క కిటికీదగ్గరకు వెళ్లాడు. పరజా దీశాడు-ప్రకృతిలోకి పారిపోయాడు.

దేవి వాళ్లయిదుగురి ముందుకొచ్చింది.

"చి...కా...బు" యెత్తి చూపింది.

ఒకళ్ళ మొగా లొకరు చూసుకొన్నారు. అప్రయత్నంగా అందరి నోటిమీదికి వచ్చిందీ క్రిందిమాట:—

"చిత్తు కాగితాల బుట్ట"—

"ఇన్నాళ్ళబట్టి యెంతో ఐకమత్యంగా వుండగలిగాం."—

"యివ్వాళ ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోతున్నాం." అంటూ రచనలు వాళ్లయిదుగురి కరకమలాల్లోకి వెళ్లి నవ్వాయి.

దేవి హృదయానికి యీదురుగాలి మంద మలయానిలమై శాంతి - హాయి - చేకూర్చింది.

# అక్కయ్య

శ్రీ ఆర్. యం. చిదంబరం

సముద్రపుటలలు అశాంతితో చెలరేగుతున్న హృదయంలా ఎగిరిపడుతున్నాయి. సంధ్యకాంతులు నెమ్మదిగా జారుతున్నాయి. అంతసేపటివరకూ తేనెపట్టులాగుంజిన సముద్రతీరం క్రమంగా పల్చబడుతోంది. సంధ్య సౌందర్యాన్ని, అరిసికుడి చేతిలో పడిన అందంలా, కబళించి వేయటానికి చీకటి తొంగిచూస్తూ నవ్వింది.

అక్కడి వాతావరణం శ్రీపతి హృదయంలో ప్రతిబింబించింది. హృదయ సముద్రపు వీచికలు. హోరుమని చెవులదగ్గర నిరంతర ధ్వని. నాలుగో సారి అటుచూశాడు. ఛీ...ఏనాడూ రానిది తను బీచ్ కెందుకొచ్చాడు. అవును. నిస్సందేహంగా అది అక్కయ్యే తెల్లకౌగితంమీద ఎర్రసిరాగీతల్లా కిరణాలు.

ఆదర్శానికీ-యథార్థానికీ మధ్యయుద్ధం.

తెగినవీణమీద శాస్త్రీయ సంగీతాలాపన...

ధైర్యంగా అక్కడకు వెళ్ళలేదు. అక్కయ్యను పలకరించలేదు. అతని మెదడంతా విపరీతపు టాలోచనల్తో వుక్కిరి బిక్కిరవుతోంది.

క్రమంగా చీకటిపడుతోంది. అతను నెమ్మదిగా నడవనారంభించాడు. అక్కయ్యపక్కనుంచే కదిలిపోతున్నాడు. ఆమె తన్ను పిలిస్తే?...పిలవదు. పక్కన కూర్చుని విరగబడినవ్వుతున్న వ్యక్తిని చూడగానే అతని కళ్లు రెండూ ఎర్రబడ్డాయి. రిక్షాయెక్కి సినిమా రోడ్డుకు పోనీమన్నాడు.

శ్రీపతి కృష్ణాటాకీస్ దగ్గరకొచ్చాడు. ఇంకా సినిమావదల్లేదు. అదేదో ఇంగ్లీషు చిత్రం. బైటవున్న స్టిల్సుని బట్టి అంతా 'సెక్స్'. నాన్న గనక తను యీ సినిమాకు వెళ్ళటంచూసివుంటే?...బుర్ర బద్దలు కొట్టుకు నేవాడు. ఇప్పటికతను అక్కయ్యను టవున్‌లో మూడుసారులు చూశాడు. ఓసారి సిటీ యంపోరియంలో సిల్కుచీరలు కొంటుండగా-అతను పలకరించలేదు. ఆమెచూడలేదు గాబోలు! చూస్తే పలకరించదూ! మరోసారి మేటినీషోలో-మూడోసారి పార్కులో-తప్పించుకుని వెళ్ళిపోయాడు.

సిగరెట్టుకాలుస్తూ రోడ్డువారగా నిలబడ్డాడు. సగంకాలిన సిగరెట్టువంక చూశాడు. గుండె గుభేలుమంది. తనవంశంలో-కనీ-వినీ-ఎరగంది...

నాన్నకు తెలిస్తే?

తక్షణం ఆత్మహత్య.

సిగరెట్టు కాలుస్తే తప్పేముంది? పరిమితంగా వుంటే ఫరవాలేదు. అనేవాడు ఓలెక్చరరు. క్రమంగా ఆ సిద్ధాంతం అతనిలో జీర్ణించుకు పోయింది. ప్రతి విషయంలోనూ మోడరేషన్ వుండాలనే హిల్టన్ వాదన కూడా అతను "హేట్సాఫ్" అన్నాడు. ఆఖరుకు స్త్రీ పాతివ్రత్యాని కూడా మోడరేషన్! అతను నవ్వుకున్నాడు.

సినిమా వొదిలేశారు.

మరో అరగంటకు టిక్కట్టు తీసుకుని వెళ్ళి కూర్చున్నాడు. ఆట మొదలు పెట్టటానికి ఇంకా గంట వుంటుంది.

అతను మరో సిగరెట్టు వెలిగించాడు.

"సిగరెట్టు కాలుస్తున్నావా తమ్ముడూ!... నాన్నకు తెలిస్తే ఏమవుతుందో - ఎంత బాధపడతాడో తెలుసా?"

శ్రీపతివాస్తవిక ప్రపంచంలోపడి పక్కకు తిరిగి చూశాడు. అక్కయ్యే కనిపించింది. ప్రక్కన సాయంత్రం కమల నవ్వులో భాగం పంచుకున్న వ్యక్తి.

"ఇక్కడ కూర్చుందాం"...తన పక్కన అక్కయ్య అతనూ కూర్చున్నారు. అతనింకా

ఆమెకేసి అలా చూస్తూనే వున్నాడు. మెళ్ళో రవ్వల నెక్లెస్ మెర్క్యురీలైటు కాంతిలో తళుక్కు తళుక్కు మంటోంది. ఎర్రటి దుస్తులు మెరుస్తున్నాయి. చేతిలో హేండ్ బాగ్! స్వంతంగా అల్లింది గాబోలు! ఇంతటి సిరి సంపదలు అక్కయ్య ఏనాడైనా యెరుగునా?

"నామీద నీకు కోపంకదూ తమ్ముడూ? అందుకే అలా మూగనోము పట్టావు" చిలిపిగా, ప్రేమగా నవ్వింది అక్కయ్య.

"ఛీ... సిగ్గులేని నవ్వు" అనుకున్నాడు.

"ఎందుకూ కోపం?"

"కాకపోతే నన్ను బీచ్‌లో చూసినప్పుడు ఎందుకు పలకరించలేదు? ఇంతకు ముందు మూడుసార్లు నువ్వు నన్ను చూడటం - నిన్ను నేను చూడటం సంభవించింది. నీ అభిప్రాయం?

"నిజంగా నేను నిన్ను చూడలేదు. కాని నువ్వు చూశావు కదా! ఎందుకు పలకరించలేదు?"

"నువ్వు పలకరిస్తావో లేదో చూద్దామనే వూరుకున్నా!

"నేనూ అంతే!" అనేసి నాలిక్కరచుకున్నాడు.

"అబద్ధం ఆడినా నేర్పుగా వుండాలి. దొరికిపోయావ్" అంటూ పకపక నవ్వింది. శ్రీపతి సిగ్గుపడిపోయాడు.

"పోనీ- అయిష్టంతో నే మాటలు మానుకున్నా; నువ్వు చేసినపనికి ఎవరైనా అంతే! ఇందులో క్రాస్ ఎగ్జామిన్ చెయ్యటానికే వీల్లేదు."

అక్కయ్యకు కోపం రాలేదు. నవ్వింది. అంత గంభీరత అక్కయ్యకెలా వచ్చిందో!

"ఇతను మా తమ్ముడు శ్రీపతి. ఇంటర్ సీనియర్... ఈయన మీ బావగారు." అంటూ పరిచయ వాక్యాలు పలికింది అక్కయ్య.

"బావ" అన్నమాట వినగానే అతనికి ముళ్ళమీద నడిచినట్లైంది.

"అలాగా!... మా బావమరిదిని కలుసుకున్నందుకు చాలా సంతోషం. నీ గ్రూప్?"

శ్రీపతి జవాబు చెప్పకూడదనే అనుకున్నాడు. కాని అనుకోకుండా "యం. పి. సి." అన్నాడు. అతని మొహం చూడగానే రావలసినంత కోపం రాలేదు.

ఇంటర్వెల్ దాకా ముగ్గురికీ మధ్య మౌనం నిలిచింది. అక్కయ్య మూడు డ్రింకులు పుచ్చుకుని ఒకటి శ్రీపతికిచ్చింది. అతను వద్దనలేక పుచ్చుకుని తాగాడు. నాన్న మాటల్లో అనాలంటే అటువంటి పాపిష్టిదాని చేతి డ్రింకు తాగినందుకు ఏడుజన్మల పర్యంతం మహాపాపం వెంటవస్తూంటుంది. సినిమాలోంచి వెళ్ళిపోదామనుకున్నాడు కూడా!

ఇంతకీ అక్కయ్య చేసిన అపరాధం? —

* * *

ఆవేళ ఇంకా బాగా తెల్లవారలేదు. గలగలమని మువ్వలచప్పుడు క్రమంగా దగ్గరై ఇంటిముందు ఆగింది. అక్కయ్య రెండెడ్ల బండిలోంచి దిగింది. ముసుగు తన్ని పెట్టి నిద్రపోతున్న తను ఒక్కసారి మేలుకున్నాడు. ముందు వుత్తరం ముక్కయినా రాకుండా అక్కయ్య వచ్చింది. ఇందులో ఏదో విశేషముంది- అక్కయ్య తనెందుకు వచ్చిందీ చెప్పటం లేదు. నాన్న అడగనూ లేదు. ఎందుకొచ్చావని కన్నకూతుర్ని ఎలా గడుగుతాడు? అందుకే ఆవిడ నోటంటే విందామని వూరుకున్నాడు.

'అల్లుడు రాలేదే?' అని మాత్రం అడిగాడు.

దానికి అక్కయ్య ఎలాంటి సమాధానమూ యివ్వకపోవటంతో అనుమానాలు ఇంకా స్థిర పడ్డాయి.

అక్కయ్య మునుపటికిమల్లే ఉత్సాహంగా లేదు. ఎప్పుడూ నవ్వేదిగాదు. దిగులుగా వుండేది. ఇదంతా చూస్తుంటే ఇద్దరికీ మధ్య ఏదో అఘాతం ఏర్పడిందన్న సంగతి రుజువైంది. ఓనాడు నాన్న అడిగాడు:

'అమ్మాయ్!...ఏదో దాస్తున్నావు. అసలు సంగతి చెప్పమ్మా!

అక్కయ్య భోరుమంది. ఇన్నాళ్ళూ అణచిపెట్టిన దుఃఖం లావాలా పైకుబికింది. అగ్నిపర్వతం బద్దలైంది. బావతత్వం ఆయనకి కొద్దిగా తెలుసు. అక్కను రెండో పెళ్ళివాడికిచ్చారు. మొదట్లో ఈ సంబంధం వొద్దని నలుగురూ నచ్చచెప్పారు. కాని

తండ్రి వినలేదు వాళ్ళకుటుంబం సంప్రదాయమైంది. దేవుడి గదిలో ఎత్తయిన దేవుడివిగ్రహం ముందు కూర్చుని పెద్దగా మంత్రాలు చదువుతూ, మడిగా వియ్యంకుడు పూజచేస్తున్నాడట వియ్యపురాలు పుదయమే కాలవకెళ్ళి స్నానంచేసి వస్తుందట. ఇంటి నిండా దేవుడిపటాలు! ఇంతకంటె ఏంకావాలి?... సాయంత్ర మయ్యేసరికి భగవద్గీతా పారాయణంకాని-పురాణ పఠనంకాని వుంటుంది.

మొదటిపెళ్ళాన్ని అత్తగారు విషం పెట్టి చంపింది రాచిరంపాన పెట్టింది...

ప్రతిరోజూ తల్లిమాటలు విని పెళ్ళాన్ని అకారణంగా చావగొడతాడు. అతన్తో ప్రతిదీ పేచీయే!

అక్కయ్య ఏడుస్తూ ఇంకా చెప్పింది. భర్త ఎన్నివిధాల తనను బాధపెట్టాడో! అత్తగారు ఎన్ని విధాల సాధించిందో! అంతా మామూలు సొదే! అందుకే తను ఎదిరించి వచ్చేసింది.

'అయితే ఇంక వెళ్ళవా? శాశ్వతంగా బంధం తెంపుకుని వచ్చేశావా?...ఆడదానికి పుట్టిల్లు నరకం-అత్తిల్లు స్వర్గం-భర్త దైవం-తెలిసిందా? అనవసరంగా అప్రతిష్ఠ. నేను తలెత్తుకు తిరగొద్దూ? అది సంప్రదాయ కుటుంబం. కట్టుబాట్లు ఎక్కువగా వుంటాయి. అన్నింటికీ వోర్చుకోవాలి. మరి ఆడదంటే ఏమనుకున్నావు?" అని వుపదేశం చేశాడు తండ్రి. అత్తగారిబాధలు ఎలాగ తొలగిపోతాయో కూడా తండ్రి వివరించాడు. ఆవిడకు ముసలితనం వచ్చింది. కనక త్వరగా కన్ను మూస్తుంది. అప్పుడు అక్కయ్యే ఆ యింటికి రాణి అవుతుంది. భర్తను తన కనుసన్నల్లో వుంచవచ్చు. అంతేకాని కళ్ళువుండి తను గోతిలోకి దూకొద్దని మాత్రం ఒప్పుకోడు నాన్న. అక్కయ్య మూగగా చూసింది. ఆమె మానసికబాధ శ్రీపతి కర్థం కాలేదు. ఆ యింట్లోనే వుండి తండ్రి భావాలలో భాగం పంచుకున్నవాడు కనక అతను అక్కయ్యను క్షమించలేక పోయాడు. నాలుగయిదు సార్లు అక్కయ్యను తిరిగి భర్త దగ్గరకు వెళ్ళిపొమ్మని శాసించాడు తండ్రి. అంటే అతనికి కూతురిమీద ప్రేమ లేకనా? [illegible]...అది అతనికి మాత్రమే అర్థం

"నన్ను తలెత్తుకుని తిరగనియ్యవా?" అన్నాడు. నలుగురూ నాలుగు మాటలూ అంటున్నారట. ఎలాగ?

పతి ఎలాంటి వాడయినా అతడే దైవం!...... తుమ్మెదరొదలా చెవిలో ఉపన్యాసం...హిందూ స్త్రీ అంటే?...భర్త ఎలాంటి వాడయినా అతనికి సపర్య చెయ్యాలి. తన సర్వస్వం అతని కప్పగించాలి. ఎంతమంది వొచ్చినా వొండిపారేయాలి. కనీసం రెండు కూరలు - వో పచ్చడి - అతిథి మర్యాదఅంటే యేమిటి మరి? భర్త కుష్ఠురోగి అయినా అతన్ని మోసుకుని వెళ్ళి అతని ప్రేయసి దగ్గరకు చేర్చాలి. చచ్చిపోతే యముడితో పోట్లాడాలి.

'నువ్వు గులాబీరంగు చీరకట్టుకో!' అంటే వెంటనే ఆపని చెయ్యాలి. రాత్రిపన్నెండుకూ, రెండుకూ అతనువచ్చినా మేలుకునివుండి అతను అన్నంతిన్నాక తనుతినాలి. ఎంతమంది పిల్లల్నికంటే అంతగొప్ప. 'ఒక్కసారి సినిమాకు తీసికెళ్ళరూ?' అంటూ భర్తను బ్రతిమాలుతూండాలి. ఇంతవినయంగా అణగిమణగివుంటే సమాజం ఆమెకు 'ఉత్తమ ఇల్లాలు' పట్టాన్ని ప్రసాదించటానికి యత్నిస్తుంది...శ్రీపతికూడా అక్కయ్యతో మాట్లాడటం మానుకున్నాడు.

చివరికి ఓనాడు అక్కయ్య అంది: 'నాన్నా! నేనివాళ వెళతాను. నాకు ప్రపంచం అర్థమైంది. ఎత్తిపొడుపులు ఇంక సహించలేను.'

నాన్నకళ్ళు తళుక్కుమన్నాయి. హిందూ ధర్మం నిలిచింది. 'దేవుడికి కటాక్షం కలిగింది' అన్నాడు. అక్కయ్య బండెక్కి వెళ్ళింది...భర్త దగ్గరకు.

'మొగుడంటూ వొకడుంటే అదే పదివేలురా! భర్తపోయినవాళ్ళను చూడు!' అన్నాడు,అక్కయ్య వెళ్ళిపోయాక తన్నుద్దేశించినాన్న. అదీ నిజమేననిపించింది అతనికి. భర్తపోతే హిందూసంఘంలో ఇంకేమైనావుందా? చీకటిగదిలో వుండాలిట. పువ్వులను గురించి మనసులో అయినా తలపెట్టకూడదు. సౌంధర్యాన్ని చంపుకోవాలి. వీలైనన్ని ఉపవాసాలు చెయ్యాలి. భగవద్గీత నిరంతరం చదువుకోవాలి. పోనీ, రామాయణభాగవతాల్లాంటి గ్రంధాలనైనాసరే!... నాన్న దేవుడిముందు కూర్చుని 'ఓం' అంటూ ముక్కు పట్టుకున్నాడు.

# అక్కయ్య

సరిగ్గా అక్కయ్య వెళ్ళిపోయిన నెలరోజులకు ఓనాడు సాయంత్రం తండ్రి తన రూంకు పరుగెత్తు కొచ్చాడు.

"కొంప మునిగింది" అన్నాడు. శ్రీపతి ఏవ న్నట్టు చూశాడు.

"మీ అక్కయ్య భర్తదగ్గరకు కాదు వెళ్ళింది-"

"కొంపతీసి మనసువిరిగి ఆత్మహత్యకాని చేసు కోలేదుకదా ?"

శ్రీపతి ఈమధ్య తండ్రి దగ్గర లేనికారణం చేత పత్రికలు తెగచదువుతున్నాడు. అందులో ఇలాంటి సంఘటనలు అనంతం.

"అలాగైనా బాగుండును. ఎవడితోనో లేచిపో యింది. నా పరువు ప్రతిష్ఠలన్నీ గంగపాలయ్యాయి. అందరికీ యీ విషయం తెలిసిపోయింది. కడుపులో చిచ్చుపెట్టింది. మన కుటుంబ గౌరవాన్నంతా మంట గలిపింది. ఇంక ఏ మొహం పెట్టుకుని వూళ్లో తిరగను?"

నాన్న వొణికిపోతున్నాడు. అతనికున్న మన స్థైర్యం అంతే! అతనికి సంఘంలో ఆకాశమంత ఎత్తు స్థానం వుంది. సమాజం ఈమాటతన్ని కిందకు తోసివే స్తుంది. నాన్న పాతాళంలో పడ్డాడు. శ్రీపతికూడా చలించి వూరుకున్నాడు. అక్కయ్యను గురించి అతని కెలాంటి అభిప్రాయమూ కలుగలేదు.

తరువాత కొంతకాలానికి అక్కయ్య సిల్కు చీరలు కొంటూ సిటీ ఎంపోరియంలో కనిపించింది.

* * *

"తమ్ముడూ !... పరధ్యానంగా వున్నావు. సినిమా చూడ్డానికికదూ నువ్వొచ్చింది ? అస్తమానం ఆలో చించి బుర్ర పాడుచేసుకునేవాళ్లు సంఘానికి విద్రో హులు." అంది అక్కయ్య. అతను పరధ్యానంగా అనుకోకుండా నవ్వాడు.

సినిమా అయిపోయింది.

ముగ్గురూ బయటకొచ్చారు. శ్రీపతి సైకిలు రిక్షా బేరమాడబోయాడు.

"నువ్వీ రాత్రి మాతో రావాలోయ్! ఎక్కడికీ వెళ్ళటానికి వీలులేదు" అంది అక్కయ్య. అతను ఎందుకో కాదనలేకపోయాడు. డ్రైవరు డోర్ ఓపెన్ చేశాడు. శ్రీపతిముందు సీట్లోకూర్చున్నాడు. ఇద్దరూ వెనకాల కూర్చున్నారు.

"శ్రీపతికి సుభావంగా వుండటం సహజాగా బోలు!" అన్నాడతను.

"మరే...నిజం తెలిసొచ్చేవరకూ అలాగే వుంటుంది." అని సమాధానం చెప్పింది అక్కయ్య.

ఇంగ్లీషు పిక్చరు కావటం మూలాన త్వరగా అయిపోయింది. ఓ పెద్ద మేడముందు కారు ఆగింది. శ్రీపతి అక్కయ్య వెనకాల ఇంట్లో అడుగు పెట్టగానే గడియారం పన్నెండుకొట్టింది. ఇంటిముందు గులాబీ మొక్కలు, మల్లె మొక్కలు నిద్రపోతున్నాయి. మెర్క్యురీ లైటువేయగానే హాలంతా తళుక్కు మంది...

"స్వీట్ హోం" అంటూ సుమాత్రికి కట్టెను.

"తమ్ముడూ నువ్వు భోంచేశావా?"

"చేశాను." అన్నాడు ధీమాగా.

"అబద్ధం!" అంది. అతను భయపడ్డాడు. ఈ ఆడ వాళ్లకు రహస్యాలన్నీ ఎలా తెలుస్తాయి? అదీ విచిత్రమే !

"నిన్ను భోంచెయ్యమని బలవంతం పెట్టంలే! పన్నెండు గంటలకు భోజనం యేమిటి? మాకూ ఆ అలవాటులేదు' అని అక్కయ్య శ్రీపతి ముందు ఆపిల్సూ, ద్రాక్షా, హాంగ్కిల్లా నైస్ బిస్కట్లు ఉంచింది. ఫ్లాస్కులో ఉన్న పాలు ముగ్గురికీ సర్దింది. అతను సంశయిస్తూ తినసాగాడు. ఎదిరించి అక్కణ్ణుంచి వెళ్ళిపోదామనే ఉంది. కాని ఎలాగ? ఎందుకో హృదయం అంగీకరించ టం లేదు. ఏదో అజ్ఞాతశక్తి ముందరికాళ్ళకు బందం వేసి తనను కదలనీయకుండా చేస్తోంది.

'అయితే శ్రీపతీ! నువ్వు బై. పి. సి. తీసుకుని ఉంటే హాయిగా మెడిసన్ చదవొచ్చుగదా! ఎందుకు ఎం. పి. సి. చదువుతున్నావు?'—అతను కొంచెం ఆశ్చర్యపడ్డాడు. అయితే తన్నుగురించి అక్కయ్య అంతా చెప్పిందన్నమాట!

'బహుశా ఇంజనీరింగు చదువుదామని గామోలు ఏం తమ్ముడూ! అంతేనా?' అంటూ భర్త ప్రశ్నకు తనే సమాధానం చెప్పింది.

'నీకు తెలియందేముంది అక్కయ్యా!...నాన్న తత్వం - ఆయనతీరు కొత్తకాదుగా!' అన్నాడు శ్రీపతి. అతనికే ఆశ్చర్యం కలిగింది. 'అక్కయ్యా!'

అని పిలవకూడదనుకొన్నాడు... కాని అక్కయ్య అంతా గ్రహించినట్టు నవ్వింది.

'పోనీ... నే చదివిస్తా చదువు నీకంటె కావలసిన వాళ్లు నాకెవరూ లేరు.'

అక్కయ్య గంభీరంగా అంది.

'సరి...అయితే నన్ను వెయిటింగ్ లిస్టులో వేశావన్నమాట!' అని హృదయపూర్వకంగా నవ్వాడు డాక్టరు.

అయిదు నిమిషాలు నిశ్శబ్దం తాండవించింది.

'శ్రీపతీ!...నువ్వు కుర్రాడివి కాదు. తెలివైనవాడివని మీఅక్కయ్య చాలాసార్లు చెప్పింది.అంచాత మూఢ సంప్రదాయాలకు, అర్థంలేని పట్టింపులకూ లొంగిపోయి బుర్ర పాడుచేసుకోకు. విశాల హృదయంతో పరిస్థితుల ప్రాభవాన్ని అర్థంచేసుకొని మంచి చెడ్డలు నిర్ణయించు. చెప్పేను మాటలు ఎన్నడూ వినకు...మీ యక్క మీద నీకు విపరీతమైన కోపం వుండి వుంటుంది. ఆ కోపం ఇంకా నీలో వుందంటే నీకూ, అనాది మానవుడికీ వ్యత్యాసం లేదన్నమాట... అంతేకాదు. నీచదువు కూడా వృథా'

శ్రీపతి ఏదో తప్పిదం చేసినవాడిలా బాధపడుతూ వింటున్నాడు. డాక్టరు ఇంకా ఏదో చెప్ప బోయాడు. టెలిఫోన్ కాల్ వచ్చింది.

'అర్జంటుగా కేసొకటి వచ్చింది. నేను వెళ్లాలి.'; అంటూ పాలు మాత్రం ఒక్క గుటకలో తాగేసి డాక్టరు స్టెతస్కోపు, లెదర్ బాగ్ తీసుకుని వెళ్ళిపోయాడు.

'క్షణం తీరిక వుండదు; ఇంట్లో సుఖం వుండదు ఏం డాక్టర్లు బాబూ!...తమ్ముడూ, నువ్వు మాత్రం డాక్టరు చదివొద్దు. ఇంజనీరైనా అంతేననుకో.'

శ్రీపతి పాలు తాగటం పూర్తయింది.

'డాక్టరుగారిప్పుడు రారా!

'వస్తారు. కాని బావని పిలవటానికి నీకు నోరు తిరగటం లేదుకదా! అవును...ఎలా తిరుగుతుంది? నేను చేసిన పని వ్యభిచారంతో సమానంగా — ఇది క్షంతవ్యం కానిపని. అందరూ మొహంమీద వుమ్మేస్తారు. సంఘంలో ఎవరూ గౌరవించరు... నువ్వూ అంతే నంటావా?'

అతను మాట్లాడలేకపోయాడు.

తలుపులు రెండూ చేరవేసింది.

'నిద్ర వొస్తోందా? నీకు బాగా లేదుకదా!'

"లేదు.... నేను ఒంటిగంటదాకా ఏదో చదువుకుంటూ వుంటాను." శ్రీపతి చిన్న అబద్ధం ఆడాడు. అతను పదింటికే పడుకోటం అలవాటు.

"నేను చేసినపని తప్పని నువ్వు విశ్వసిస్తున్నావా?...నీకు నేనంటే అసహ్యంగా లేదూ? నన్ను తప్పు పడతావు కాని నే నెలాంటి జీవితం అనుభవించానో నీకు తెలుసా? భర్త భార్యను అకారణంగా చావగొట్టి, అత్తగారూ, వెధవకూతురూ కూడా ఎందుకులే! సింహాసనంమీద కూర్చుని నానా చాకిరీ చేయిస్తుంటే, అన్నీ సహించి, ఆఖరుకు భర్త శీలాన్నే శంకిస్తే? అప్పుడు హిందూస్త్రీగ తేమిటని నువ్వెప్పుడైనా ఆలోచించావా? నా పరిస్థితులు కూడా అంతే! డాక్టరుగారు, ఆయన స్నేహితులు. డాక్టరుగారితో నాకు అనుబంధంవుందని శంకిస్తే?...దాన్ని నిజం చేసుకోటమే వుత్తమం. నువ్వింకా చిన్నవాడివి. నేనూ మొన్న మొన్నటిదాకా చిన్నదానినే! కాని ఈ స్వల్పకాలంలో నాకు ప్రపంచం అర్థమైంది. నాలాంటివాళ్లు ఎంతమందో నీకేం తెలుసు? ఈ సంసారాల్లో నూటికి తొంభైమంతులు ట్రాజికల్. నాచరిత్ర సామాజిక యితివృత్తం కదూ?"

శ్రీపతి కళ్లమ్మట నీళ్లు తిరిగాయి. అక్కయ్య కూడా ఏడుస్తోంది. పాత గాథలన్నీ తళుక్కున మెరిసివుంటాయి. అక్కయ్య ఏడవటం అతను సహించడు. అక్కయ్యస్థితి బాగుపడిందికదా! ఇంకా ఎందుకీ కన్నీరు! ఇంతటి అనుభవం సంపాదించినది ఏడవటంవలన జీవిత శృంఖలాలు తెగవని తెలుసుకోలేదూ?

'అక్కయ్యా!...నువ్వు దేవుడుగుళ్ళోకి వెడుతున్నావా?'

అక్కయ్య తమాషాగా నవ్వుతూ 'ఎందుకూ?... అలాంటి నమ్మకాలు నాకూ వొదలిపోయాయి. నాకు ముక్తి, మోక్షం అక్కర్లేదు స్వర్గలోకం అసలేవొద్దు. అదీకాక నావంటి పాపాత్ముల్ని దేవుడు క్షమించడుగా!...నువ్వు రూంలో ఎందుకుంటున్నావు? ఇక్కడికి వచ్చేయకూడదూ? కలిసి హాయిగా వుండవచ్చు' అంది విషయం మారుస్తూ.

అతను సమాధానం చెప్పకుండా భయంభయంగా చూశాడు.

'భయం వేస్తోంది కదూ!... ఈ దుర్మార్గురాలితో నా కెందుకనుకుంటున్నావు కదూ! మాతో కలిసివుంటే చిత్రగుప్తుడు నీ పేరుకూడా చిట్టాలో ఎక్కిస్తాడు. అప్పుడు యమకింకరులు నిన్ను సల సల కాగే నూనెలో పడేస్తారు...అమ్మో! ఆ బాధ అనుభవించటం కష్టం కాదూ?...అదీకాక నాన్నగుండెలు బాదుకుని ఏడవడూ? నీ సంప్రదాయ జీవితం నశింపు కాదూ?'

అదేం కాదు...తప్పకుండా వొస్తాను.'

అక్కయ్య ఇంకేం మాట్లాడలేదు. గడియారం ఒంటిగంట చూపించింది. అతను నిద్ర వొస్తోందని పడుకున్నాడు. తన కర్తవ్యాన్ని గురించి ఆలోచించుకుంటూ రెండు గంటలదాకా గడిపాడు. తరవాత చిన్న కునుకు పట్టింది...

శ్రీపతి రూం మార్చలేదు కాని ఇరవైనాలుగు గంటల్లో ఇరవై గంటలు అక్కయ్య ఇంటిదగ్గిరే గడుపుతున్నాడు. అతను డాక్టరుని 'బావ' అని మాత్రం పిలవటం లేదు. ఎన్నో విషయాలు అతనికి తెలిశాయి. ఎంతోమంది కొత్త వ్యక్తులతో అతనికి పరిచయం కలిగింది. డాక్టరు బలవంతాన క్లబ్‌లో మెంబరయ్యాడు. ఇద్దరూ కలిసి రాత్రి ఎనిమిదింటివరకూ పింగ్‌పాంగ్ ఆడుకుంటూ వుండిపోయేవారు.

అక్కయ్య నూతన జీవితాన్ని సూక్ష్మంగా పరీక్షించే అవకాశం కలిగిందతనికి. ఆమె లేచివచ్చిందన్న సంగతి ఎవరికీ తెలియదు. డాక్టరు కూడా తలిదండ్రులు లేరు. కావలసినవాళ్ళెవరూ లేరు. ఇద్దరూ రిజిష్టర్డ్ మేరేజి చేసుకున్నట్టు చెప్పాడుట డాక్టరు. ఈ అబద్ధం ఆడకపోతే ఎంత సహృదయులైనా హిందూ సంఘంలో క్షమించరన్న సంగతి అతనికి బాగా తెలుసు.

ఓనాడు తండ్రి తనను వెతుక్కుంటూ క్లబ్బుకు వచ్చాడు. తండ్రి క్లబ్బుకు రావటం ఇదే మొదటిసారి. రూంకు మొదట్లో వెళ్ళాడట. తనీ మధ్య అసలు రూంకి రావటంలేదని, ప్రస్తుతం క్లబ్బులో వుంటాడనీ ఆ యింటి యజమాని అన్నాడట. దాంతో నాన్న తిన్నగా ఇక్కడికే వచ్చేశాడు. శ్రీపతి డాక్టరుతో పింగ్‌పాంగ్ ఆడుతూ లోకాన్నే మరిచాడు. తండ్రి పిలవగానే వచ్చాడు.

'వెంటనే రూంకి పోదాం పదరా...నీతో మాట్లాడాలి' అన్నాడు ముందుకు రెండడుగులు వేసి.

మళ్ళీ అక్కడికి వెళ్ళబోయాడు.

"మళ్ళీ ఎక్కడికిరా?" అని గర్జించాడు తండ్రి.

"ఆయనతో నేను వెడుతున్నానని చెప్పేసి వస్తా."

శ్రీపతి తండ్రివెంట, పితృవాక్య పరిపాలకుడిలా నడిచి వెడుతుంటే డాక్టరు నవ్వుకున్నాడు. రూమ్ చేరుకున్నాక తండ్రి అడిగాడు: "స్వర్ధంగా కూర్చుని చదువుకునేవాడివి. ఏం పొయ్యేకాలమొచ్చి ఆ క్లబ్బులో చేరావురా" డబ్బు తేరగా వస్తుందనుకున్నావా?..."హోటల్లో భోజనం చెయ్యటం లేదట. మరి యేం చేస్తున్నట్టు?" అతని కనుమానముగానే వుంది. దాపరిక మెందుకనుకున్నాడు శ్రీపతి.

"మీ అక్క ఈ వూళ్ళోనే కులుకుతోందట కదూ? అది మరో వెధవతో కారులో వూరేగుతుంటే మన రామాచారి చూచి చెప్పాడు. నిజమేనా? దాని మొహం తగలెయ్య. కుటుంబ గౌరవానికి చిచ్చు పెట్టింది"

శ్రీపతి వుద్రేకం ఆపుకోలేకపోయాడు.

"ఆగునాన్నా ... అక్కయ్య ననవసరంగా యేమనకు"

"అయితే దానిచర్యను సమర్థిస్తున్నావన్నమాట...దౌర్భాగ్యుడా? నాకంతా తెలుసు. దానింటి దగ్గరే నీ మకాం—దాని చేతి తిండి కూడా తింటున్నావు. నీ పాపం లక్ష జన్మాలకయినా తరగదు. మరి నే నెందుకు చావటానికి?"

తెగేవరకూ లాడు లాగటమే మంచిది.

"నీకంత బాధగావుంటే నా గురించి శ్రమ పడొద్దు"

అప్రయత్నంగా శ్రీపతి చెంప ఛెళ్ళుమంది. అతను మాట్లాడలేదు. ఎడం చెత్తో చెంప రాసుకున్నాడు.

"అవునుమరి...ఇన్నాళ్ళూ చదివించాను కదూ మరి! అందుకు ప్రతిఫలం! "ఇప్పుడా రంకు ముండ

కనపడగానే కళ్లు నెత్తిమీదకొచ్చి నాన్న కనపట్టం మానేశాడు. నీకు కొమ్ములొచ్చాయి. ఎలాగా తెగ తెంపులు చేసుకున్నావు కనక అలాగే చావు...నీకూ నాకూ బంధం నాస్తి" అనేసి ఆయన చకచక వెళ్లిపోయాడు. నాన్న తత్వం తనకు తెలుసు. ఎన్నను కుంటే యేం లాభం? అయినా తనకంత వుద్రేకం కూడదు. అక్కయ్యను అనరాని మాట లంటుంటే తను క్షమించలేకపోయాడు. చేతిసంచీ పట్టుకుని, చింకిగొడుగుతో వెళ్లిపోతున్న నాన్నను చూడగానే అతనికి కళ్లమ్మట నీళ్లు తిరిగాయి. పోనీ—వెనకాల వెళ్లి బ్రతిమిలాడి తీసుకొస్తే!...

గదికి తాళంవేసి అక్కయ్య దగ్గర కెళ్ళాడు. అంతా వివరించాడు.

"నీయిష్టం. తండ్రీ కొడుకులమధ్య అనుబంధాన్ని ఛేదించాననే అపవాదు నాకెందుకు? అనవసరంగా అక్కయ్యకోసం నీ నైతికజీవితాన్ని పాడు చేసుకోకు."

అతని దుర్బల హృదయం ఘోరుమంది. ఎటూ నిర్ణయించుకోలేకపోయాడు.

ఆకాశంలో చీకటి అవరిస్తోంది. చుక్కల్ని క్రమంగా మబ్బులు కబళిస్తున్నాయి వర్షానికి నాందీ వాక్యం కాబోలు!

ఆవేళ డాక్టరు రాత్రి తొమ్మిదిదాటాక వచ్చాడు. రావటంతోనే గుండెల్లో బాధగావుందంటు పడుకున్నాడు. ఇద్దరిగుండెల్లోనూ రాయిపడింది. చేసిన తప్పులకి శిక్ష అనుభవించే సమయం వచ్చిందా? అయినా ఇంత చిన్న విషయానికి కంగారెందుకు? తాము చేసిన చర్యలు తప్పని భావించేవారందరికీ క్షణక్షణానికీ ఇలాంటి అనుభూతులు తప్పదు. అక్కయ్య మాత్రం నవ్వుతూనే వుంది. గుండె కొచింది. శ్రీపతి నిలువునా కంపిస్తున్నాడు. ఏ తెగకూ చెందని వాడతను. అలాగని తటస్థుడూ కాడు. ఉభయ పక్షాల్లోనూ వున్నాడు. దేవుడు వున్నాడని నమ్మలేడు. లేడని ధీమాగా చెప్పటానికి తరతరాలనుంచీ వొస్తున్న ఆచారాలు, కట్టుబాట్లు ఆకాశాన్ని అంటుతున్న అనేక రకాల దేవుళ్లు గుళ్ళు అడ్డం వొస్తున్నాయి. అలాగే అక్కయ్య చేసిన పనిని పూర్తిగా సమర్థించనూ లేడు. ద్వేషించి వైదొలగనూలేడు. అతని తత్వం ఉభయ భ్రష్టత్వం. అందుకే అక్కరలేని భయం అతనికి.

* * *

'నువ్వేం కంగారు పడకు. ఇదీయనకు అప్పుడప్పుడు వొస్తూంటుందిలే! తగ్గిపోతుంది. కొంచెం హార్ట్ వీక్‌నెస్ అంతే' అంది అక్కయ్య. కాని పదైనా నొప్పి తగ్గలేదు. ఫోన్ చెయ్యగానే డాక్టర్ సీతాపతి వొచ్చాడు. అతనేదో చికిత్సలు చేస్తూ ఆ రాత్రికక్కడే వుండిపోయాడు. డాక్టరుకు సీతాపతి ముఖ్య స్నేహితుడు. అతని ఆంతరంగిక విషయాలన్నీ-ముఖ్యంగా అతని వివాహం గురించి అంతా సీతాపతికి తెలుసు.

'మరేం ఫరవాలేద'ని అభయమిచ్చాడు సీతాపతి. కాని ఆరాత్రే అతని అభయ హస్తాన్ని ఖండించి డాక్టరును ఎగేసుకు పోయింది మృత్యువు.

ఏడవటం తెలివితక్కువని బోధించిన అక్కయ్య కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. ఎంతకాలం నుంచి దాచి వుంచిందో! భర్తను వొదిలివచ్చినప్పుడు కూడా అక్కయ్య ఏడవలేదు. ఆ సంగతి అతనికి బాగా తెలుసు. ఆకాశమంత యెత్తున హృదయ జ్వాలలు... ఇప్పుడామె బ్రతుకు?...ఎవడైనా ఛాందసుడి దగ్గరకు వెళ్లి అక్కయ్య జీవితాన్ని నేటివరకూ వివరిస్తే ఏం చెప్తాడు? ముందు అలాంటి పాపిష్టి గాథ విన్నందుకు చెవులు మూసుకుంటాడు గామోలు! 'అంతే అవుతుంది నాయనా!...పాపానికి తగ్గ ఫలితం అనుభవించొద్దూ? కట్టుకున్న మొగుణ్ణి వదిలేసి మరొకడితో వుండటం రంకుతనం కదూ!...దానికి ప్రాయశ్చిత్తం అంటూ లేనేలేదు. చూడు నాయనా! అహల్య, మండోదరి, ద్రౌపది. వీళ్లందరికీ మల్లే పతివ్రతల్లా బతక్కూడదూ? ఎందుకొచ్చిన పాడుబతుకు?' అని సమాధానం చెప్తాడు. మండోదరికి ఇద్దరు భర్తలట. ద్రౌపదికి అయిదుగురు వున్నా కర్ణుడిమీద మోజు వుండేదట. శ్రీపతి వెర్రిగా నవ్వుకున్నాడు. అక్కయ్య ఎంత కాలం ఏడుస్తుంది? అమ్మో! ఆమె కన్నీటికి ప్రపంచాలు మునిగిపోవూ? ఇంకెలా జీవిస్తుంది?...మరొకణ్ణి పెళ్లాడుతుందేమో!...

ఆమెను ఓదార్చటానికి అతను యత్నించలేదు. మర్నాడుదయం సీతాపతి వచ్చాడు. అతను కూడా చాలా బాధపడ్డాడు. అక్కను ఓదార్చటానికి యెన్నో విధాల ప్రయత్నించాడు. డాక్టరు తాలూకు సొమ్ము బాంక్‌లో ముప్పైవేల దాకావుంది. ఆమెకు బోలెడు నగలున్నాయి. ఇక

ముందు ఆర్థికంగా ఎలా నడుస్తుంది అన్నది ప్రస్తుతానికి సమస్య కానేకాదు. సీతాపతి ఆనాటినుండి పాతస్నేహాన్ని పురస్కరించుకుని తరుచుగా వొస్తూండేవాడు. డాక్టరు పోవటం శ్రీపతికి మరోసమస్యను సాధించి పెట్టింది. ఇప్పుడు అక్కయ్యకు "నా" అన్నవాళ్లెవరూ లేరు. అంటే ఒక్క శ్రీపతే! అంచాత అతను అక్క దగ్గరేవుంటూ ఆమె యోగక్షేమాలు గమనిస్తూవుండటం స్థిరపడిపోయింది. గడి పని లేసి బసమార్చాడు. అక్కయ్యకూడా ఆడంబరం తగ్గించింది. పనిమనిషిని మాన్పించింది. వీలైనంతవరకూ ఖర్చులు తగ్గించింది. శ్రీపతి తండ్రికి వుత్తరం రాశాడు కాని జవాబు రాలేదు. ఒకసారి తనే స్వయంగా వెళ్లాడు.

ఆ వూళ్లో నలుగురూ అతన్ని యీసడిస్తూ చూశారు. నోటికివచ్చినట్టు తిట్టారు. తండ్రిని చంపావన్నారు. అతను దిక్కులేని చావు చచ్చినందుకు తనే కారణమన్నారు. ఇల్లూవాకిలీ అమ్మేసి కొంతధర్మానికి, కొంత తనకిమ్మని ఏర్పాట్లు చేశాడు. శ్రీపతి తల బాదుకుని ఏడ్చాడు. "అంతా దొంగ ఏడుపు...నటన" అన్నారు. ఓ పెద్దమనిషి అతని ముందు డబ్బులెక్క పెట్టివుంచాడు. శ్రీపతి అది కూడా ధర్మనిధికి కలపమన్నాడు. అతని గొప్పతనాన్ని ఎవరూ మెచ్చుకో లేదు.

"పాపం!... ఆ మారాజు ఎంతమంచివాడు! కొడుకెలాంటి వాడైనా కన్నకడుపుకదూ! అతని కన్యాయం జరగకూడదని సగం వాటా అతనికిచ్చాడు. మరోడైతే ఆ స్తంతా తగలెట్టటానికైనా వొప్పుకుంటాడుకాని ఇతనికివ్వడు. కుర్రతనం వాడికేం తెలియదు అంటూ పోయాడు. ఎంత పశువుగా బతికాడు! ఎంత నిష గా వున్నాడు! ఆచారం. కట్టుబాటు!...ఆ హా హా! ఆయన కాయనేసాటి!" అన్నారు అందరూ.

శ్రీపతి తను పుట్టిపెరిగిన యింటికేసి వోమాటు చూసి వెనక్కి తిరిగాడు. అతనికి నాన్న ఎదురుగా కనిపిస్తూనే వున్నాడు. చిన్న పిలక – ఎప్పుడూ పంచ లపాక చొక్కా – కళ్లల్లో కాఠిన్యం – తాను పట్టిన కుందేటికి మూడేకాళ్లనే తత్వం—ఎంతో అభిమానం, ప్రేమ వున్నా వెల్లడించటం చేతకాదు. అర్థంలేని ఆవేశం—అతను తిరిగొచ్చి అంతా అక్కయ్యకు నివేదించాడు. అక్కయ్యకూడా ఘోరున ఏడవటంతో "ఆమె కెందుకు చెప్పానా?" అనుకున్నాడు.

* * *

శ్రీపతి జీవిత క్రమమంతా మారింది. తన కుటుంబ చరిత్ర నలుగురికీ తెలిస్తే తనకు సంఘంలో వున్న గౌరవం నశిస్తుందేమోనని అతనికి భయంగానే వుంది. అతని తలిదండ్రులనుగురించి నలుగురూ అడిగారు. అతనేదో సమాధానం చెప్పుకున్నాడు. "ఫలానా లేట్ డాక్టరు గారి భావమరిదిని నేన"ని కొన్నిచోట్ల పరిచయం చేసుకున్నాడు.

శ్రీపతి ఇంటర్ ప్యాసై ఇంజనీరింగులో సీటు సంపాదించాడు. తను ఇంజనీరింగు చదవగలనని అతనెన్నడూ అనుకోలేదు. సీతాపతి ఇదివరకటికంటె తరుచు అక్కడికొస్తున్నాడు. నలుగురూ నాలుగు మాటలూ అనుకోటం అటుంచి శ్రీపతి కూడా కొంత ఫీల్ అయ్యాడు: ముగ్గురు నలుగురు అతన్ని గురించి చాటుగా అనుకోటం కూడా జరిగింది. ఏ ఇద్దరైనా నెమ్మదిగా మాట్లాడుకుంటూ మధ్య మధ్య అతనికేసి చూస్తుంటే అదంతా తననుగురించేనని అతను చాలాసార్లు అనుకోటం సంభవించింది. సీతాపతిని రావొద్దందామని చాలాసార్లనుకున్నాడు కాని అక్కయ్య ఏమంటుందోనని కొంచెం భయం. తను లేనప్పుడు కూడా సీతాపతి వొచ్చేవాడు. అయితే అతను అక్కయ్యతో అంత తరుచుగా మాట్లాడేటానికేం విషయాలున్నాయో మాత్రం అతని కంతుచిక్కలేదు.

ఇంజనీరింగు కాలేజీలో చేరిన నెలరోజులకు అతనోమాటు కాకినాడలో ఎగ్జిబిషన్ చూసి తిరిగి వస్తూ సామర్లకోటలో రైలుకోసం నిలబడ్డాడు. అతని భుజంమీద బరువైన చెయ్యి పడింది. వులిక్కిపడి వెనక్కి తిరిగాడు.

'శ్రీపతీ!... నేను జ్ఞాపకం వున్నానా?' అనడిగాడా వ్యక్తి. శ్రీపతి నిమిషంసేపు అతన్ని తేరిపార చూసి 'ఓ...బావ! ఏమిటీ అవతారం! కులాసాగా వున్నావా?' అనడిగాడు.

'ఈ అవతారం ఎందుకెత్తానో వూహించుకో. ఇది పదకొండో అవతారం.' అనేసి నవ్వాడు బావ.

శ్రీపతి కళ్లు నులుముకున్నాడు. బావకేసి చూడలేకపోయాడు. ఎందుకో బాగా గెడ్డం పెంచాడు. బట్టలు మాసిపోయాయి. కళ్లు "పాతాళం ఇక్కడే నయ్యా! ఎందుకు అనవసరంగా వెతుకుతావు?" అంటున్నాయి. దవడలు రెండూ పీక్కుపోయాయి. మనిషి సగమయ్యాడు.

'రా బావా! స్టాల్ కి వెళదాం.' అంటూ ఓవర్ బ్రిడ్జి క్రాస్ చేశాడు.

'నీకు బండికి టైం కాలేదూ?' అనడిగాడు బావ.

'ఇంకా అరగంటవుంది...అసలు సంగతేమిటి? ఎందుకిలాగై పోయావు?' అనడిగాడు పూరీ—కూరా అతని ముందుకు తోస్తూ.

'నీకు తెలియందేముంది? మీ అక్కయ్య పెళ్ళి పోయాక నేను పశ్చాత్తాపపడ్డాను. అంతా జరిగిపోయింది. ఎందుకులే అవన్నీ చెప్పుకోటం...అసలు నిన్ను పలకరించకూడదనుకున్నాను మొదట. మా అమ్మ—నాన్న ఇద్దరూ కలరావచ్చి పోయారు. నేనూ పోతే బాగుండును...తరవాత మీ సంగతి గురించి అంతా విన్నాను. నేను సుఖపెట్టలేక పోయాను. దాన్నైనా సుఖపడనీ—'

రెండు జతల కళ్లు కన్నీటిని నింపుకున్నాయి. నాన్న ఇదివరకన్నమాటలు అతనికి జ్ఞప్తికొచ్చాయి... "అత్తగారికి ముసిలితనం వచ్చింది కనక ఆవిడ త్వరగా కన్నుమూస్తుంది. అప్పుడు అక్కయ్య ఆ యింటికి రాణీ అవుతుంది. భర్తను తన కనుసన్నల్లో వుంచవచ్చు.' బావ ఎన్నడూ పూరీల మొహం ఎరగనివాడిలా ఆవురావురుమని తింటున్నాడు.

'ఇప్పుడెక్కడికెడుతున్నావు?'

'మావూరే! ... పెళ్లి సంబంధం చూట్టానికి కాకినాడెళ్ళాను.'

'ఎవరికి? నీకా?'

బావ ప్రశ్నకాలు మన్నాడు. 'నాక్కాదు, ఏం? నేను పెళ్ళికొడుకులా కనిపిస్తున్నానా? ఇంకీ జీవితానికి అలాంటి ఆశల్లేవు. మా చెల్లాయికి సంబంధం.'

బావ వెళ్ళాల్సిన బండి వొచ్చింది మౌనంగా బండిలోఎక్కి కూర్చున్నాడతను. బండి కదులుతుంటే బావ అన్నాడు:

'మీ అక్కయ్యతో నన్ను క్షమించమని చెప్పు.'

'తప్పు బావా! అవేం మాటలు!' అన్న శ్రీపతి వాక్యాలు రైలింజను కూతలో కలిసిపోయాయి.

శ్రీపతికి బావగురించి ఇదివరకున్న అభిప్రాయాలు కొంచెం పరివర్తన చెందాయి. పాపం! అతని హృదయం అమాయకత్వంలో మునిగిపోయింది. నవనీతం లాంటిది...తల్లీ తండ్రీ కలిసి అతనిలోవున్న మంచిని అణచివేసి అతనికయిష్టమైన పనులు చేయించారు. అతన్నలా పెంచారు. తనను తండ్రి పుస్తకాల పురుగుగా—మూఢ నమ్మకాలకి—'ఏం? ఎందుకు'? అని ప్రశ్నించటానికి వీలులేని కట్టుబాట్లకు బానిసగా పెంచాడు. చివరికాసంకెళ్లు అక్కయ్య తెంపాల్సి వచ్చింది. బావ కివికాక జీవితం ప్రసాదించిన కొన్ని సమస్యలున్నాయి. అందులో మొదటిది సరైన వుద్యోగం కాని వనకొధారం కాని లేకపోవటం—చెల్లాయి పెళ్ళొకటి—నలుగురూ అనుకుంటారు 'అమ్మాయి అచ్చోసిన అంబోతులా తిరుగుతుంటే పెళ్ళెందుకు చెయ్యరు? పెళ్ళానికి చుళ్లే ఇదికూడా వోనాడు వుడాయిస్తుంది' అంటారు ఈ మాటలన్నీ పడుతూ—ఈ సమస్యలను ఛేదించటానికి మార్గం వెతుక్కుంటూవుంటే జీవితకాలం సరిపోతుంది. మోకాలు వరకూ గడ్డం పెరుగుతుంది. జుట్టు తెల్లబడుతుంది. అగితే బావకు పట్టేట్టుగా వుంది. ఆవేళ బావను చూట్టంతో అతని మనసంతా చికాకుతో నిండిపోయింది. రాగానే అక్కయ్యతో అంతా చెప్పాడు. అతను వెళ్ళేసరికి సీతాపతితో మాట్లాడుతూ నేవుంది. శ్రీపతి వుత్సాహంగా వుండలేకపోయాడు.

పిచ్చి పిచ్చి ఆలోచనల్తో ఆ రాత్రంతా అతనికి నిద్ర పట్టలేదు. జీవితాన్నంతా విమర్శించుకున్నాడు మళ్ళీ. మర్నాడు వుదయం లేచేసరికి కళ్లు మండిపోయాయి. తల బరువుగా వుంది. నాడి పట్టుకుని చూసుకుంటే జ్వరం వచ్చిందని తేలింది నిద్ర లేకపోవటం మూలాన వచ్చింది. అదే తగ్గుతుందనుకున్నాడు కాని మధ్యాహ్నానికి పడుకో బెట్టేసింది. అక్కయ్య సీతాపతికి ఫోన్ చేసింది.

'ఎందుకక్కయ్యా! అదే తగ్గిపోతుంది. ఈ మాత్రం దానికి డాక్టరెందుకు?' అన్నాడు. వున్న విషయం, అతనికి సీతాపతి రావటం ఎంతమాత్రం యిష్టంలేదు. మరో పావుగంటకు అతను కారుమీద వచ్చి పరీక్ష చేశాడు. ఇంజెక్షన్ ఇచ్చేసి వెళ్ళాడు. తగ్గిపోతుందనుకున్న జ్వరం క్రమంగా టైఫాయిడ్ లోకి దింపింది. సీతాపతి రోజుకు మూడుసార్లు వచ్చి చూసిపోతున్నాడు...ఇదికాక మరోసారి తీరిగ్గా వచ్చి

ఆమెతో కబుర్లు చెబుతూ కూర్చునేవాడు డాక్టరు పోయిన తరువాత సీతాపతికి ప్రాక్టీస్ మంచి జోరుగా వుంది.

అక్కయ్య రాత్రింబగళ్లు మంచంపక్కన కూర్చుని తనకు సేవచేసింది. ఒక్కోనాడు తిండికూడా మానేసేది...అతను క్రమంగా కోలుకున్నాడు... కాని శ్రీపతి ఆలోచనలు మరో దిశలో విచిత్రంగా సాగిపోయాయి. ఒకవేళ అక్కయ్యకాని సీతాపతిని పెళ్ళి చేసుకుంటుందేమో! వాళ్ల మాటలతీరు—నవ్వులాటలు చూస్తుంటే అలాగేవుంది. అక్కయ్య లేచి రావటం సరైందని తనను తానెలా ఊరడించుకున్నాడో—అలాగే—ఈ సంఘటన జరిగినా సమర్థించుకుని తనను తాను ఊరడించుకోవాలి. అయినా సీతాపతి వివాహం చేసుకుంటాడా? అతనికి వెంటనే నవ్వొచ్చింది. అక్కడ బావ బతికే వున్నాడు. ఇక్కడ సంఘంలో అక్కయ్య విధవగా చలామణీ అవుతోంది......

* * *

ఈమధ్య ఏడింటికే శ్రీపతి మంచ మెక్కుతున్నాడు. ఆరయ్యేదాకా అతనికి మెలకువరాదు. ఓనాడు అర్ధరాత్రి అతనికి మెలకువ వచ్చింది. ఎక్కడో గుసగుసలు వినిపిస్తున్నాయి. అతను లైటు వేసి పక్కగదిలో కెళ్ళాడు. అక్కడ సీతాపతి, అక్కయ్య కనిపించారు.

“అరె!...డాక్టరుగారు రెప్పుడొచ్చారు?” అన్నాడు. సీతాపతి కంగారుపడుతూ ‘గంటవుతుంది’ అన్నాడు.

“ఇలా మామూలుగా వొస్తుంటారా సరదాగా?” అని నవ్వుతూ అడిగాడు. ఎలాంటి సమాధానమూ రాలేదు. శ్రీపతి లైటు ఆర్పేసివచ్చి పడుకున్నాడు.. ఏమైనా సరే! ఈ వాతావరణంలోంచి తను బయటపడాలి......

ఇది ఆఖరుకు వ్యభిచార గృహంగా తయారయ్యేలా వుంది.

సీతాపతి వెంటనే వెళ్లిపోయాడు.

మర్నాడుదయం శ్రీపతి అడక్కూడదనుకుంటూ భయపడుతూ అడిగాడు : “అక్కయ్యా!... నువ్వు పునర్వివాహం చేసుకుంటావా?” అని. ఆ ప్రశ్న అడిగాడేకాని అతను అక్కయ్య మొహంలోకి ఏమాత్రం చూడలేక పోయాడు.

“ఏం!.. అలాగ అడుగుతున్నావు? నాకలాంటి ఆలోచ నెప్పుడూ లేదు” అని సమాధానం ఇచ్చింది.

అతను సాయంత్రం యింటికి తిరిగొచ్చేసరికి అక్కయ్య అటుతిరిగి పడుకునుంది. వేళకాని వేళ యెందుకు పడుకునుంది? వంట్లో బాగాలేదేమో ననుకున్నాడు. అక్కయ్యను లేపబోయి కెవ్వుమన్నాడు. ...అతనికి ఏడుపు రాలేదు. పెద్దగా ఏడుద్దామనుకున్నాడు కాని ఎవరో పీకనొక్కేసి నట్టయింది. అది శాశ్వతనిద్ర. బల్లమీది వుత్తరం చదువుకున్నాడు.

“తమ్ముడూ!

ఆత్మహత్య పాపమని చేతకానివాళ్లంటారు. అంతకంటే జీవిత శృంఖలాల్లోంచి బయట పడడానికి మంచిమార్గం లేదు. అందుకే నన్ను నేను అంతమొందించుకుంటున్నా.

మరి ఈ ఆత్మహత్యకు కారణం ఏమిటని అడగవూ? డాక్టరుగారంటే నాకెంతో గౌరవం. ప్రేమ—కానీకి కొరగాని నన్ను వివాహం చేసుకుని ఆయన ఉద్ధరించారు. అటువంటి ఆయనకు ద్రోహం చేశాను. నా భర్తను వదిలిరావటం నేను ద్రోహం అనను... నా ఆత్మహత్యలో సీతాపతిగారికి వాటా తక్కువ. అందుకు ప్రాయశ్చిత్తం యిది. ఆ బాధ ననుభవిస్తూ కుమిలిపోయే దానికంటె యిది ఉత్తమం. ఇంక నేను బ్రతికి ఏంలాభం చెప్పు?

నువ్వు పట్టి అమాయకుడివి తెల్లవన్నీ పాలు—నల్లవన్నీ నీళ్లు అని విశ్వసిస్తావు గడుసుగా వుండటం నేర్చుకో. ఎన్ని మానసిక బాధలున్నా అన్నింటినీ అణిచేసుకుని నాలా పైకి నవ్వుతూకనపడాలి. అప్పుడే ఈ సంఘంలో బ్రతకగలవు. అంతేకాని అడుగడుగునా భయపడుతూ జీవయాత్ర సాగించలేవు. కొంత తెగింపు. ఎదిరించే శక్తి వుండాలి. అందుచేత అనవసరంగా గడిచిన వాటిని తల్చుకుని ఏడవక బుద్ధిగా చదువుకుని ఉన్నతస్థితికి రా. నీ ఔన్నత్యానికి ఆయనకూడా కారకులు గనుక నన్ను మర్చిపోయినా ఆయన్ను జ్ఞాపకముంచుకో...నా కిలాంటిగతి పట్టిందికదా అని నాలా తెగించిన వాళ్లందరికీ జీవిత పర్యవసానం ఇదేనని నేను విశ్వసించను. చిన్నవాడవయినా నా పొరపాట్లు క్షమించు...ఆశీస్సులు...”

శ్రీపతి ఉత్తరం భద్రంగా దాచాడు. మళ్ళీ ఎప్పుడైనా అక్కయ్య ఆదేశాన్ని చదువుకోవచ్చు కర్మకాండంతా పూర్తయ్యేసరికి రాత్రి తొమ్మిదైంది. ...శ్రీపతిని ఓదార్చటానికెవరూ లేరు. ఆదుకోటానికి బంధువులెవరూ లేరు బావకు టెలిగ్రాం యిద్దామనుకున్నాడు. అనవసరంగా అతన్నెందుకు శ్రమ పెట్టడం! ఆ రాత్రి అతనింటిదగ్గ రుండలేక పోయాడు. ఎక్కడ చూసినా అక్కయ్యే కనిపిస్తోంది. కొంచెం భయం వేసింది కూడా. అక్కయ్యకు మల్లే తనూ "స్లీపింగ్ టాబ్లెట్స్" ఓ డజను వేసుకుంటే... శ్రీపతి తలుపు తాళం వేసి బయలుదేరాడు. తిన్నగా వెళ్లి పార్కులో కూర్చున్నాడు.

వాతావరణం ప్రశాంతంగా వుంది. గాలికూడా స్తంభించి పోయింది. ఆకాశంలో నక్షత్రాలు చీకటిని చూసి భయంతో వొణుకుతున్నాయి. శ్రీపతి చెక్కిళ్లమీదుగా నయాగరాజలపాతంలా నీరు ప్రవహిస్తోంది. అతనికి గడచిన జీవితం అంతా జ్ఞప్తికొచ్చింది.

నాన్న!....ఎవర్నీ మెప్పించలేని జన్మ! చచ్చిన వాడి కళ్ళు చేరడని చనిపోయాక అందరూ పొగిడారు. పిచ్చివాడిలా తిరిగాడు. తన బాధ స్వంతంతో కొడుకును దూరం చేసుకున్నాడు. అయినా నాన్న తన కోసం ఎంత శ్రమించాడు! తను కృతఘ్నుడు కదూ! జంతువులకైనా కుక్కకైనా కృతజ్ఞత వుంటుంది. మానవుడే వుండడు. గర్భశోకం గురించి తనకేమీ తెలియదు. తెలియక పోవటమే మంచిది. ఇంక బావ!...పిచ్చి బావ! అమ్మ నాన్న పన్నినవల్లో చిక్కుకుని రాలేక బాధపడ్డాడు. ఇంకా అతనెన్ని బాధలు అనుభవించాల్సి వుందో!...లేక అతనుకూడా అక్కయ్యకు మల్లే హఠాత్తుగా శూన్యంలో కలిసిపోతాడేమో!... ఇంక అక్కయ్య! అమ్మో! అదో గంభీరస్వరూపం... దాన్ని తల్చుకోలేం...ఇంక తను? సిమండ్స్ అన్నాడు..."నీ గురించి నీకు పూర్తిగా తెలియదు." అదీ నిజమే నిరూపించింది. ఇంటర్‌లో చేరేవరకూ తన అభిప్రాయాలు?...దేవుడంటే అమితభక్తి!

ఈ రెండేళ్లలో తను పూర్తిగా మారాడు. వచ్చిన కొత్తల్లో అనాది మానవుడికీ – తనకూ మధ్య అంగుళం మాత్రమే దూరం—తన భావాలు, ఆశయాలు అన్నీ విపరీతంగా మారిపోయాయి. స్కూలు ఫైనలు దాకా గడచిన అతని జీవితక్రమం స్ఫురణకు వచ్చింది ..ఆరుదాటకుండా లేవాలి. ఆరున్నరకల్లా గణగణమని గంటమోగిస్తూ నాన్న పూజకు నాందీ వాక్యం పలికేవాడు విధిగా తను పూజ అయ్యేవరకూ ఆ ఇత్తడి విగ్రహాలకు నమస్కరిస్తూ కూర్చోవాలి. భక్తిలేకపోయినా అథవా వున్నట్టయినానటించాలి... అదవగానే చల్దన్నం తినేసి పుస్తకం చదువుకోవాలి. మధ్యమధ్య నాన్న వచ్చి తనిఖీ చేస్తూంటాడు. బయటికి పోకూడదు. సినిమాలు చూడకూడదు. అథవా చూసినా పోతన-త్యాగయ్య-లాంటి భక్తిరసచిత్రాలకే ప్రవేశం. పత్రికలూ-నవలలూ చదవకూడదు. టంచనుగా అయిదయ్యేసరికి పుస్తకం పుచ్చుకొని చదువుకోవాలి. షికార్లకు పోకూడదు. ఇదీ అతని జీవితం. ఇంటి దగ్గర్నుంచి స్కూలుకున్న రెండు ఫర్లాంగుల రోడ్డు తప్పించి అతనికేవీ తెలీదు. తెలుసుకోవలసిన అవసరం కూడా లేదు.

కాని ఇప్పుడు! అంతా మారిపోయింది.

పన్నెండుగంటలవరకూ అతనక్కడే వున్నాడు నైట్ వాచర్ అతన్ని బైటికి పంపాడు.

అంతులేని ఆలోచనల్లో చీకట్లో ఒంటరిగా నడుస్తూ వస్తూన్న శ్రీపతిని ఏటి వొడ్డున గంభీరంగా నిలబడిన క్లాక్ టవర్ 'నీ భావిజీవితం గురించి ఆలోచిస్తున్నావా?' అనడిగి నట్టయింది.

అతను వెర్రిగా నవ్వుకుంటూ కటిక చీకట్లో కలిసిపోయాడు.

# కలగూరగంప

## జాతక చంద్రికపై పండిత మీమాంస:

శ్రీ ఆదిరాజు అన్నాజీరావు

శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తి శాస్త్రిగారి, శ్రీ వఝుల చినసీతారామస్వామిశాస్త్రిగారి అభిప్రాయ భేదములు-

శ్రీ పూసపాటి విజయరామగజపతి (1670-1757) మిర్జా-మన్నె సుల్తాన్-మహారాజా-ముశే-రేసుల వలస వగైరా వారియొక్క 199 వర్ధంతి మహోత్సవ సందర్భమున 24-1-1956 తారీఖున సాయంత్రం ఉపనిష ద్విహారమున-శ్రీ వారి చిత్రఫలకావిష్కరణము-వారిచే సంస్కృతమునుండి ఆంధ్రీకరింపబడిన జ్యోతిష ఫలగ్రంథరాజము పారాశరీయ హోర (విజయ రామరాజీయం) యొక్కయు ముద్రిత ప్రతుల ప్రకటన సందర్భమున శ్రీ "కలాప్రపూర్ణ" వఝుల చినసీతారామస్వామిశాస్త్రిగారి అధ్యక్షతను సభ జయప్రదముగ నడచినది. శ్రీ అధ్యక్షుల వారు తొలిపలుకునందు జాతక చంద్రికను గూర్చి కొన్ని విషయములను ప్రస్తావించిరి. అందు మూడు విషయములయందు అభిప్రాయ భేదమును-సభాముఖమున బ్రహ్మశ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రిగారు సవినయముగ ప్రతిపాదన చేసిరి-ఆవిషయములను దిగువ పొందుపరచుచున్నాను.

1. ప్రతిలగ్నం సమాలక్ష్య పూర్వోద్దిష్టావిరోధతః
   తత్తద్గ్రహస్వరూపాణి క్రమేణైవం వివృణ్మహే

అని ప్రతిజ్ఞచేసి- మేషలగ్నమునకు - "కవిస్సాక్షాన్నహంతా స్యాత్ మారకత్వేన లక్షితః" అనుశ్లోకము పూర్వ గ్రంథమునకు విరుద్ధము. ఎట్లన "నదిశంతి శుభం నృణాం సౌమ్యాః కేంద్రాధిపా యది". మరియు "అష్టమం హ్యాయుషస్థానం అష్టమా దష్టమంచ తత్ తయోరపి వ్యయస్థానం మారకస్థాన ముచ్యతే" అని చెప్పుట వలన శుక్రునకు కేంద్రాధిపత్యము-ద్వితీయ సప్తమ మారక స్థానములకు ఆధిపత్యము కలిగినను శుక్రుడు మారకుడు కాడని చెప్పుట-పూర్వోత్తర భాగములకు విరోధము కనుక, మరియొకడు ఉత్తర పారాశరిని చేసి ఇందుల జతపరచినట్లు అభిప్రాయమును వ్యక్తపరచిరి.

అనంతరమందు శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తి శాస్త్రిగారు ప్రసంగించుచు ఈ సందర్భమున శ్రీ శాస్త్రిగారు వ్యక్తపరచిన పూర్వాపర విరోధము లేదని గ్రంథమంతయు సాంతముగ విమర్శించ ఏకకర్తృకమనియు చెప్పుచు స్వాభావికము, ఆధిపత్య ప్రతిపాదితము శుభపాపత్వములను మేళవించి నిష్కర్ష చేసి గ్రంథకర్త చెప్పెనని చెప్పుచు పూర్వ భాగమున "కేంద్రాధిపత్యదోషస్తు బలవాన్ గురుశుక్రయోః, మారకత్వేపి చ తయోర్మారకస్థాన సంస్థితిః"—అనగా గురు శుక్రులకు కేంద్రాధిపత్య దోషము బలముగలది. గురు శుక్రులకు మారకత్వము కలుగుచుండగ (అనగా మారక స్థానాద్యాధిపత్యముచే కలిగిన మారకత్వము కంటె మారకస్థానస్థితి బలముకలది. అనగా కేవల మారక స్థానాద్యాధిపత్యమువలన శుక్రుడు ప్రబల మారకుడు కాడనుట స్పష్టము. ప్రబల మారకుడే మారకమును చేయును. ఇదియు లోక ప్రసిద్ధిని పొందినది. ఈ విషయమునే ఉత్తర భాగమున బలపరచి చెప్పెను. మారకత్వేన లక్షితః, ఆధిపత్యముచే మారకుడగు కవిః శుక్రుడు, సాక్షాన్నహంతా=తానాత్రముచే (అన్య సహాయము లేకుండగ) చంపువాడుకాడు. కనుక ఈ చెప్పుట పూర్వభాగమునకు విరుద్ధముగాదు. అని సమన్వయ పరచుచు, ఈ రీతిగ విమర్శించుచో పూర్వోత్తర భాగములకు భేదముండదు కనుక ఏకకర్తృకమే యనియు, భిన్న కర్తృకము కాదనియు ప్రసంగించిరి.

(2) పశ్యంతి సప్తమాన్ సర్వే శని జీవ కుజాః పునః
   విశేషతశ్చ త్రిదశ త్రికోణ చతురశ్రగాన్.

"సంజ్ఞాం బ్రూమో విశేషతః" అని వెనుకటి శ్లోకములో చెప్పుటచే - వీరి పారాశరహోరయందు - బృహజ్జాతకాదులందు వరాహమిహిరాదులు చెప్పిన- పాదదృష్టి - అర్ధదృష్టి త్రిపాద దృష్టులను పారాశరి గ్రంథకర్త అంగీకరించలేదు కనుక - పరాశర తంత్రమున పాదార్ధ త్రిపాద దృష్టులను ఫలవిశేషములపట్ల చూడ నవసరములేదని శ్రీ వఝుల చినసీతారామస్వామి శాస్త్రిగారు శెలవిచ్చిరి.

అనంతరమందు శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తి శాస్త్రి మాట్లాడుచు ఈ సందర్భమున పాద - అర్ధ - త్రిపాద దృష్టులు శని - గురు - కుజులకు లేక పూర్ణ దృష్టితో చూచెదరు. అనగా 3—10 గృహములను అన్ని గ్రహములు పాదదృష్టితోను, శని - విశేషతః అనగా పూర్ణదృష్టితోను, 5, 9 గృహములను అన్ని గ్రహములు అర్ధదృష్టితోను గురుడు విశేషతః అనగా పూర్ణ దృష్టితోను, 4, 8 గృహములను అన్ని గ్రహములు త్రిపాద దృష్టితోను—కుజుడు - విశేషతః అనగా పూర్ణ దృష్టితోను చూచునని విశేషమును చూపెనుగాని పరాశర తంత్రమున సర్వాత్మనాపాద దృష్టి - అర్ధదృష్టి, త్రిపాద దృష్టులను ఫలవిషయము పట్ల గ్రహించ కూడదని - గ్రంథకర్త అభిప్రాయము కాదు. "అనుక్త మన్యతో గ్రాహ్య" మని చెప్పియుండెను కనుక—గ్రంథకర్త చెప్పిన విశేషదృష్టిని- అన్య గ్రంథకర్తలచే చెప్పబడిన సామాన్యదృష్టిని జతపరచి చూడవలయునని గ్రంథకర్త అభిప్రాయమైనట్లు— శ్రీ|| వ|| చిన సీతారామస్వామి శాస్త్రిగారితో గల అభిప్రాయ భేదమును వ్యక్తపరచిరి.

3. సర్వే త్రికోణనేతారో గ్రహాశ్శుభ
ఫల ప్రదాః
పతయస్త్రిషడాయానాం యది పాప
ఫల ప్రదాః

అను శ్లోకమునకు శ్రీ|| వ|| చిన సీతారామస్వామి శాస్త్రి తాత్పర్యమును విశదపరచుచు త్రికోణములకు (1-5-9) అధిపతులగు అన్ని గ్రహములు శుభఫల ప్రదులు. అన్ని గ్రహములకు 3-6 11 లకు ఆధిపత్యం కలిగిన పాపఫల ప్రదత్వము అనియు శెలవిచ్చిరి.

అనంతరము శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తి శాస్త్రి గారు ఉపన్యసించుచు ఈ సందర్భమున యది అను అవ్యయమువలన ఏ గ్రహములకు త్రికోణాధిపత్యము కలదో ఆ గ్రహములకు త్రిషడాయాధిపత్యము కలిగిన శుభత్వము పోయి పాపత్వము సంభవించునని మకర లగ్నమునకు షష్ఠ భాగ్యాధిపతి యగు బుధుడు పాపి యగుచున్నాడని తమ అభిప్రాయభేదమును ప్రకటన చేసి తమ ఉపన్యాసమును విరమించి అధ్యక్షుల యొద్ద శెలవు గైకొని సభ ముగియకుండగనే వెళ్ళిపోయిరి.

తరువాత శ్రీ అధ్యక్షులు ప్రసంగించుచు ముందు త్రికోణములను—తరుపరి త్రిషడాయములను—అనంతరమందు కేంద్రములను క్రమముగ చెప్పుటచే పిడపర్తి చిన కృష్ణమూర్తి శాస్త్రిగారు చెప్పినది శాస్త్రీయ మార్గము కాదని, సాహిత్య పరిజ్ఞానము లేక చెప్పిన విషయమని వారి పరోక్షమున విమర్శించిరి

4. ఇచట నా విమర్శనమును పొందుపరచు చున్నాను.

కొన్నిట కేవలము తృతీయషష్ఠ లాభాధిపత్యములు కలవు. కొన్నిట కోణాధిపత్యముతో కూడిన త్రిషడా యాధిపత్యములు కలవు

శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తి శాస్త్రిగారు చెప్పిన అర్థమును గ్రహించిన-కేవలతృతీయ షష్ఠ లాభాధిపతుల శుభ పాపత్వ విచారణ కాదు-శ్రీ సీతా రామస్వామి శాస్త్రిగారిది గ్రహించిన త్రిషడాధి పత్యములు, త్రికోణాధిపతికి వచ్చినప్పుడు శుభపాపత్వ నిర్ధారణ పూర్తిగాదు-గ్రంథకర్త ద్వాదశ భావముల యొక్క ఆధిపత్యములచే కొన్ని విషయములను చెప్పి కొన్ని విషయముల చెప్పలేదనుట సబబు గాదు కనుక విచారణచేయగా-ఈ ఈ ఇద్దరి పండితుల అభిప్రాయములను ఒకచో మేలవించి చూచిన శాస్త్రీయములని స్పష్టపడుతున్నది-ఎట్లుగననగా యది అను అవ్యయమును-కలిపి ఒకసారి. కలుపకనొకసారి సమన్వయము చేసిన చక్కగ కుదురుచున్నది

1. "త్రికోణనేతారః సర్వేగ్రహాః శుభఫల ప్రదాః (2) త్రిషడాయానాం పతయః అశుభఫల ప్రదాః (3) త్రికోణనేతారః త్రిషడా యానాంపతయో యది అశుభఫలప్రదాః" అని సమన్వ యము చేసిన అన్ని విషయములు సంగతములగుచున్నవి- శ్రీ వఝుల చినసీతారామస్వామి శాస్త్రిగారు, చినకృష్ణమూర్తి శాస్త్రిగారు-చెరియొక వ్యాఖ్యా

మును ఆహారముచేసుకొని ప్రసంగించియుందురు-ఇట్టి తరి శ్రీ చినకృష్ణమూర్తి శాస్త్రిగారు సభాముఖమున విమర్శక దృష్టితో నిర్ధారణకొకుండగనే అభిప్రాయభేదమును తెలియపరచిన మాత్రమున అస్వీకులు-వారి పరోక్షమున న్యూనతగా విమర్శించుట "వృద్ధాస్తే న విచారణీయచరితాః" అను భవభూతి వాక్యమును స్మృతిపథమునకు తెచ్చుచున్నది.

దైవజ్ఞపుంగవులు ఈ మూడు విషయముల యందును ఈ పండితద్వయముయొక్క అభిప్రాయములను-మూడవ విషయమున ప్రత్యేకముగా నా అభిప్రాయమును విమర్శించి పత్రికాముఖమున తమ అభిప్రాయములను వ్యక్తము చేయగోరుచున్నాను.

# నందవరీక మంత్రులు

## శ్రీ కొత్త భావయ్యచౌదరి

నియోగి బ్రాహ్మణులలో నందవరీక మంత్రుల చరిత్ర ప్రాచీనమైనదిగ గన్పడుచున్నది. వీరిలో కొందరు దమకుగల యద్భుత మహిమలచే బ్రసిద్ధికెక్కినదేగాక, నందరాజువద్ద యగ్రహారములు బొందిరట. నందరాజునకు కాశీకిబోవుటకై యోగ శక్తులనొసంగగా, నతడు వియన్మార్గమున నిత్యము కాశికేగువాడట. మంత్రాక్షతలను జల్లి యప్పటి కపుడు రావిమోడునకు చిగుళ్లు వచ్చునట్లు చేయుటయు చౌడేశ్వరీ మహాశక్తిని సాక్షిగా సాక్షాత్కరించునట్లు చేసిరనియు పరంపరా జెప్పుకొందురు. వీరి మంత్ర తంత్రము లెట్లున్నను, అప్పటినుండియు పారంపర్యముగా నగ్రహారీకులై రాజసభలందు పేరుగాంచుచున్నట్లు విదితమగుచున్నది. 16 వ శతాబ్దినుండియు మనకు తెలిసినంతలో వీరిలో నాత్రేయ గోత్రజులందు యెనుముచింతలవారు ప్రసిద్ధికెక్కినవారు. వీరికి మూలపురుషుడు చెన్నమరాజను నతడు. ఈయనకు అయిలమాంబ యను సతీరత్నమువల్ల లక్ష్మీపతి, కొండయ్య, తిమ్మయ్య, కృష్ణమంత్రి యను వారలు జన్మించిరి. ఇందలి కొండమంత్రికి తమ్మన, తిమ్మన మంత్రులనువారు జనించి ప్రసిద్ధికి వచ్చిరి. ఇందలి తమ్మన విజయనగరరాజ్యమున మంత్రులలో నొకడుగా పేరొందెను పెనుకొండ రాజ్యమును శ్రీరంగరాయలు (1565-1583) పాలించుచుండగా నతడు మంత్రిత్వము వహించుటయేగాక నా రాజన్యుని దక్షిణ భుజాదండమని, నుతికెక్కెను. ఆయనచే "గజవాహనాంనోళికా సితచ్ఛత్రములు" బహుమానముగా బొంది ప్రసిద్ధికెక్కెను శ్రీరంగరాయల రాజ్యపాలన ముగిసిన పిమ్మటగూడ నతడు రెండవ వెంకటపతిరాయల పాలనలో నుండి (1586-1614) యనేక రాచకార్యములను చక్కబెట్టుచు, యాయనచే పొగడ్తల నందుటయేగాక వశ్యులుగాని మన్నె సరదారులను జయించి యాతనికి పాదాక్రాంతులుగ జేయగలిగెనట. ఈ మంత్రివర్యుని కీర్తి దశదిశల వ్యాపించగా, నుత్తరదేశమున గల రాజాస్థానము లన్నియెడల నీయనను నుతించుచుండెరట. ఈయన పినతండ్రి యగు కృష్ణమరాజు దానరాధేయుడుగా కీర్తివహించెను. ఈతడుగూడ విజయనగరాస్థానమున ప్రసిద్ధ మంత్రివర్యుడే. అందుననే యాతడు "సకల భువనైక భవనపాళి" కి నయవచో మాధుర్య విభవహసిత జిష్ణుహితమంత్రి యని చెప్పబడినాడు. ఈ సకల భువనైక భవనము రాయలవారిదే గాని యన్యము గాదనవచ్చును. విజయనగరములోని కృష్ణదేవరాయల భువనవిజయము వంటిది పెనుకొండలో నిర్మింపబడి యుండును. ఈ కృష్ణమంత్రికి బసవాంబయను భార్యయందు తిమ్మన, లింగన యను యిద్దరు మంత్రు లుదయించిరి. తిమ్మమంత్రి మిక్కిలి యౌదార్యవంతుడనియు, నతని తమ్ముడగు లింగమంత్రి శ్రీరామునికి లక్ష్మణునివలె విధేయుడై మెలంగెడివాడనియు జెప్పెదరు. ఈ లింగమంత్రి 1594 ప్రాంతీయుడై పెమ్మసాని పెదవీర నృపాలుని సమకాలికుడై యుండెను. వీరి చర్యలను రాయలు మిక్కిలి మెచ్చుకొనుచుండెనట. తిమ్మమంత్రికి వెంకటపతి, శ్రీహరి యను యిద్దరు కుమాళ్లు జనించిరి. ఈతిమ్మమంత్రి తన కాలములో బ్రాహ్మణపల్లె యందొక గోపాలస్వామి యాలయమును నిర్మాణమొనరించి, యాడకి గ్రామమందొక వనమును ప్రతిష్ఠించి, చెరువొకదానిని త్రవ్వించి, బ్రాహ్మణులకు వేదశాస్త్రములను, నేర్పించి పేరొందెను. శ్రీహరి మంచివాయసకాడై, రాజ సభలందు సమయోచిత ప్రసంగములలో నారితేరి, యుద్ధములందు గూడ బాల్గొనుచు బ్రసిద్ధి

కెక్కెను. లింగమంత్రి 1594 లో చింతలరాయస్వామికి సూర్యగ్రహణకాలమున గొంత భూమిని (పెమ్మసాని నారసింహనృపాలదత్తము) నొసంగెను. శ్రీహరికి మంగపతియను కుమారుడు జనించెను. ఈతడు గూడ నొక మంత్రి వర్యుడుగానే ప్రసిద్ధికి వచ్చినట్లు కనపడుచున్నది.

ఇక మంత్రివర్యుడగు మంగపతికి జనకుడైన శ్రీహరికి తాతగారి జ్యేష్ఠులైన లక్ష్మీపతి కొండయ మంత్రులలో లక్ష్మీపతి కిరువురు భార్యలుండిరి. చౌడాంబిక, తిప్పమాంబ యనువారు. వీరిలో చౌడమకు వెంకటామాత్యుడు, తిప్పమాంబకు చెన్నమరాజు, రామచంద్రుడు, తాయన, యను ముగ్గురుకుమాళ్లు గల్గిరి. వీరందరును రాయల యాస్థానములోనే యుండి రాచకార్యములందు ప్రసిద్ధిగాంచుచుండిరి. ఇందలి చెన్నమరాజునకు బాలకొండమయను సతివల్ల శేష మంత్రి జనించెను. ఈ శేషమంత్రి తన తల్లిదండ్రుల పేర అగ్రహారము లిచ్చెననియు, రాయలవారేగాక, రాజాధిరాజులు గూడ తల లూచునట్లు తన ప్రజ్ఞా విశేషములు కనబరచెననియు చెప్పబడినది.

శేషమంత్రి రామాంబ, సర్వమాంబలను యిరువురు భార్యల బెండ్లాడగా సర్వమాంబయందు తిమ్మన, లక్ష్మీపతి, చెన్నయామాత్యుడు, తాయన యనువారిని గాంచెను. వీరు నల్వురును రాజాస్థానములందు దండనాయకులు మంత్రులుగా ప్రసిద్ధికెక్కిరి.

ఇందలి చెన్నమరాజు పెమ్మసాని తిమ్మభూపాలునికి మంత్రిగా గండికోటరాజ్యము నందుండెను. తిమ్మభూపాలుడు వెంకటపతి రాయలవారికి సామంతుడై, యీయనకు మహమ్మదీయులకు జరిగిన అనేక యుద్ధములలో పాల్గొని "గండరాదిత్య, గండరగండ, మన్నెమార్తాండా"ది బిరుదములను, గరుడ నారాయణ బిరుదధ్వజము, బంగారుపూవుల చంద్రకావిపావడ, తురాయి, గజము, అశ్వము, వీరమల హారికంఠమాలిక, తాళిచాకట్లు, ముత్యాల కడియాలు, గండపెండేరము, కత్తి, కచ్చు మున్నగు బహుమానములను బొందగల్గెను. ఈ బహుమతులు చెన్నమరాజను మంత్రి రాయల యాస్థానమునుండి తెచ్చి యొసగగా తిమ్మభూపాలుడు తన మంత్రికి ప్రీతితో రాయదత్తమైన కుళ్లాయి మీది పాగ, ధవళ శంఖము, పల్లకి, తాళిచాకట్లు ఒసంగి గౌరవించెను. రాయలవారు చెన్నమంత్రికి "కుంచ కాళాంజి" బట్టించుకొనుటకు (అనగా చామరములు వేయించుకొనుట) ఆజ్ఞయిచ్చిరట. ఈ కుంచ కాళాంజి పట్టించుకొను గౌరవము రాజులకు మంత్రులకే కలదు. ఈ చెన్నయామాత్యుడు గండికోటరాజ్యము (ఇది కమ్మవారిది) నందు ప్రధానియగుటవల్ల, నచటి తాడిపత్రిలో గోపాలకృష్ణ ప్రతిష్ఠ యొనర్చియు నా స్వామికి కిరీట పీతాంబరము లొసంగియు, యాడికివద్ద కోనేరొకటి, వన మొకటి వేయించియు, తన తల్లి పేర సర్వమాంబాపురాగ్రహార నిర్మాణము జేసియు, మిక్కిలి కీర్తివహించెను. ఈతడు కేవల మంత్రివర్యుడగుటయే గాదు, పండిత కవియగుట వలన "చారుచంద్రోదయము" అను కావ్యమును రచించి తన యిలవేల్పగు గోపాలకృష్ణస్వామి కంకిత మొసంగెను.

ఈ చెన్నమరాజునకు యల్లమాంబ, అక్కమ్మ యను యిరువురు సతీమణులుండిరి. ఇందలి యల్లమాంబ వల్ల గోపాలామాత్యుడు, శేషమంత్రియను యిరువురు కుమాళ్లు జనించి తండ్రియుండగనే ప్రసిద్ధ మంత్రి వర్యులై, పుత్రపౌత్రులతో నలరారుచు ప్రసిద్ధికి వచ్చిరట-గోపాలామాత్యుడు "రాజనీతి విలసద్భాషాపరాభూత గోపాలామాత్యుడని" చెప్పబడినాడు. ఇతను బంధురక్షణ కళాపాండిత్య సంస్తుత్యుండట. శేషయామాత్యుడు "మంచినడత, జననుతప్రజ్ఞ నుపకార ఘనమనీష సభ్యసాంగత్యము"లు గల్గియుండి పేరొందెనని చెప్పబడినది. ఇట్టి నందవరీక బ్రాహ్మణులలోని యెనుముచింతల వంశీకులు ప్రసిద్ధమంత్రి వర్యులుగా మొదటి శ్రీరంగ రాయలకాలము (1575-1586)నుండియు పనిజేయుచు మహమ్మదీయుల డాకకు విజయనగర హిందూరాజ్యము లెక్కచేయక పెనుగొండలో నిలుచునందాక దాదాపు 1650 వరకు నున్నట్లు కనబడుచున్నది. వీరి కాలములో వైష్ణవ మతము మన దేశమున బాగుగా ప్రోత్సహింపబడి వృద్ధిలోనికి వచ్చినట్లు, యిందలి మంత్రుల కథనములవల్లనే స్పష్టపడగలదు.

---

ఈ వ్యాసమునకు చెన్నమరాజు ప్రణీతమగు చారుచంద్రోదయ ప్రబంధమును, యితర చరిత్రలు మూలాధారములు. చారుచంద్రోదయ మింకను అముద్రితముగా ఓరియంటల్ మానుస్క్రిప్ట్స్ గ్రంథాలయములో నున్నది.

# జీవశాస్త్రంలో విచిత్ర పరిణామాలు

జంతువులనుంచి గాని, వృక్షములనుంచి గాని సజీవ పదార్థాన్ని సేకరించి దానిని మైక్రోస్కోపుతో పరీక్ష చేస్తే అది లక్షోపలక్షల జీవకణాల సంపుటీకరణంగా మనకు కనుపిస్తుంది. ఇట్లాంటి ప్రతి కణం (Cell) లోనూ మధ్యగా కేంద్రకం (Nucleus) ఒకటి వుంటుంది దీనిచుట్టూ సైటోప్లాజమ్ (Cytoplasm) ఆవరించి వుంటుంది ఈ సైటోప్లాజమ్‌లో ప్రోటోప్లాసమ్ అనే ముఖ్యమైన పదార్థం ఒకటి వుంటుంది.

ఈ జీవకణాల విభజనవల్లనే జీవపదార్థం పెరుగుతుంది. ఈ జీవకణంలోని కేంద్రకం ఉన్నట్టుండి గోళాకారస్థితిని కోల్పోయి సన్నని దారపాములా విస్తరించి పోగుగా సాగుతుంది అనంతరం ఈ పోగు దానంతటికదే తునకలు తునకలుగా విడిపోతుంది. ఇలా విడిపోయిన తునకలను శాస్త్రవిజ్ఞానవేత్తలు 'క్రోమోజోములు' అంటున్నారు. ఇలా యేర్పడిన క్రోమోజోములు, కణంలో ఎడమవైపున ఉన్నవి ఎడమవైపుకూ, కుడివైపున ఉన్నవి కుడివైపుకూ జరిగి రెండువైపులా రెండు క్రొత్తకేంద్రకాలుగా ఏర్పడతాయి. ఈ పరిణామాన్ని అనుసరిస్తూ తొలికేంద్రకం చుట్టూవున్న సైటోప్లాసమ్‌కూడా క్రమేణా దానంతటికదే రెండుభాగాలుగా విచ్ఛిన్నమైపోయి ఈ రెండుభాగాలు ఈ రెండు కేంద్రకాలచుట్టూ ఆవరించుకొని వుంటాయి. ఇలా అనుక్షణం జీవకణాలలో సహజమైన పరిణామం కలిగి ఒకటి రెండు కణాలుగానూ, రెండు నాలుగుగానూ ఇలా పెరిగిపోతూ వుంటయ్. ఇలా జీవిలోని జీవకణాల సంఖ్య పెరిగిన కొద్దీ జీవి పెరుగుతూ వుంటుంది.

చిత్రమేమిటంటే ప్రతి ప్రత్యేక జీవరాశిలోనూ, ఈ కణాలు చీలి యేర్పడే క్రోమోజోములు ఒక నిర్ణీతసంఖ్యలోనే వుంటాయి. జీవరాసులలో వంశపారంపర్యంగా సంక్రమించే రూపురేఖ గుణాదికాలకు ఈ క్రోమోజోములే కారణం. ఈ క్రోమోజోములలో జీన్స్ (Jenes) అనే ప్రోటీన్లు ఉన్నవనీ వీటివల్ల వంశపారంపర్యత సిద్ధించుతూ ఉండటమే గాక వీటిలో వచ్చేమార్పులే జీవరాశి పరిణామానికంతకూ కారణమనీ చెబుతున్నారు.

ఇటీవల, మెసాచ్యుసెట్స్ (Massacheucets) టెక్నాలజీ కేంద్రంలో, ష్మిట్ అనే శాస్త్రజ్ఞుడు ప్రోటోప్లాసమ్‌లోని ప్రోటీనులమీద కొన్ని పరిశోధనలు చేశారు. ఈ ప్రోటీనులను కొన్ని రసాయనిక పదార్థాలతో విడగొట్టగా అవి ఇంతకంటే చిన్నరకం ప్రోటీనులుగా విడిపోయాయి. ఇలా విడిపోయిన ఈ చిన్నరకం ప్రోటీనులకు ఆయన 'మేక్రో మాలిక్యూల్స్' (Macromolecules) అని నామకరణం చేశారు. ఈ మేక్రోమాలిక్యూల్సును, మళ్లా కొన్ని రసాయనిక పదార్థాలతో చేర్చి తిరిగి మొదటిరకం ప్రోటీనులను తయారు చేశారు. మొదటి ప్రమాణంగల ప్రోటీనులనే గాక అనేక రకాల ప్రోటీనులనుకూడా తయారు చేయగలిగారు.

ప్రోటీనులను ఎలక్ట్రాన్ మైక్రోస్కోపుతో పరీక్షించితే అవి రేఖలు రేఖలుగా కనుపిస్తవి. ప్రతి ప్రత్యేక జీవరాశిలో వుండే ప్రోటీనులలోను ఈ రేఖలు రేఖకూ వుండే దూరం నిర్ణీతంగా వుంటుంది. అంతేగాక ఈ రేఖల సంపుటి ప్రత్యేకాకృతి (Special pattern) కలదిగా వుంటుంది. ఈ ఆకృతినిబట్టే మనం ఆయా జీవరాసుల ప్రోటీనులను గుర్తించగలం.

మేక్రోమాలిక్యూల్స్ కూర్పు వల్లనే ఈ రేఖలు కనుపించుతాయనీ, పరిసర రసాయనిక స్థితినిబట్టి మేక్రోమాలిక్యూల్స్ వేరువేరు విధాలుగా (Different patterns) కూడుకొని వేరువేరు రకాల ప్రోటీనులు యేర్పడుతాయనీ ష్మిట్ భావిస్తున్నారు.

ప్రోటీనులకేగాక క్రోమోజోములకు కూడా యిలాంటి రేఖలు వుండటం శాస్త్రజ్ఞులకు చిరకాలంగా విదితమైయున్న విషయమే. కాని ష్మిట్ పరిశోధనా ఫలితాన్నిబట్టి యీ రేఖలు మేక్రోమాలిక్యూల్స్ అస్థిత్వంవల్లనేమోయని ఊహించటానికి వీలుగా వుంది. ఇదే నిజమయితే జీవిశాస్త్ర విజ్ఞానంలో ఒక మహత్తర పరిణామమే రావచ్చు. క్రోమోజోములను కూడా పై ప్రోటీనులను విడగొట్టినట్టే విడగొట్టి, వాటి నిర్మాణము మన యిష్టమువచ్చినట్లు మార్చటానికి వీలు కావచ్చు. క్రోమోజోములకు వుండే ఈ రేఖలను గమనించి మనం ఆ ప్రత్యేక జీవియొక్క పరంపరాగత గుణాలను విస్పష్టంగా తెలుసుకొనగలగటమే కాకుండా, ఈ క్రోమోజోముల రూపురేఖలను మార్పు చేయగల శక్తిని చేజిక్కించుకుని ప్రత్యేక జీవరాసులలో పరంపరగా సంక్రమించే రూపగుణాలను సహితం మన యిష్టంవచ్చినట్లు మార్పు చేయగలుగుతామేమో! జీవరాశి భవిష్యత్తును మన యిష్టంవచ్చిన రీతి పరిణమింప జేయగలమేమో కూడా!

ష్మిట్ క్రోమోజోముల మీదకూడా ఇటువంటి పరిశోధనలనే చేయబోతున్నట్టు వెల్లడించారు.



రిపబ్లిక్ మహోత్సవాల సందర్భంలో ఢిల్లీకి వచ్చిన నాగజాతి నాయకులు

# గ్రంథ విమర్శనము

## సర్వమంగళేశ్వర శాస్త్రిగారి జీవిత చరిత్ర

రచన: శ్రీ నడిమింటి పతంజలిశాస్త్రి, అడ్వొకేట్ పార్వతీపురం: వెల రూ 1 4-0.

'అభినవ కాళిదాస' బిరుదాంకితులు కీ॥ శే॥ నడిమింటి సర్వమంగళేశ్వర శాస్త్రిగారి జీవితచరిత్ర. గ్రంథకర్త వీరి ప్రపౌత్రులు.

శబ్దమంజరి చేత బట్టిన ప్రతిఒక్కరికీ సర్వమంగళేశ్వర శాస్త్రిగారి నామం సుపరిచితమే. సంస్కృతం అభ్యసించాలనుకునే జిజ్ఞాసవులకు ఎలా అభ్యసించాలో తెలియక సరియైన ప్రాథమిక పాఠ్య గ్రంథాలు లేక దారీ తెన్నూ తెలియకుండా వున్న అయోమయస్థితిలో శ్రీ సర్వమంగళేశ్వర శాస్త్రిగారు శబ్దమంజరినీ, సమాసకుసుమావళినీ రచించి మహోపకారం చేశారు ఈ రెండు గ్రంథాలూ ఒకే గ్రంథముగా సంపుటీకరింపబడి సంస్కృత బాలశిక్షగా ఒక్క ఆంధ్రసీమలోనేగాక ఆ సేతు హిమాచలమూ వ్యాప్తిలో వుంది. సంస్కృతం చదువుకోదలచిన వారికి నాటికీ నేటికీ ఇదే శరణ్యం. సమాసకుసుమావళిలోని ఈ దిగువ శ్లోకంలో వారి నామధేయాదులు పొందుపరుపబడివున్నయ్.

శ్రీమన్న్యమందిర కులాంబుధి పూర్ణచంద్ర
శ్రీ సర్వమంగళమనీషికృతా సలీలమ్
ఏషా సమాసకుసుమావళి రోజ్జ్వలాఽరం
జీయాత్కృపానిధి సదాశివ సత్ప్రసాదాత్

శ్రీశాస్త్రిగారి జన్మస్థలం:

అమలాపురంతాలూకా "ముంగండ" గ్రామానికి చేరువలోవున్న గన్నవరమనే గ్రామం. విజయనగరగజపతిరాజులఆస్థానంలో, విజయరామగజపతి(2), నారాయణగజపతుల కాలంలో పండితులుగా వుండేవారు. ఆసేతు హిమాచలం పర్యటించారు. ఆయా దేశాలలో వున్న పెక్కురు సంస్కృత పండితులతో వాదోపవాదాలు సలిపి విజయాన్ని చేపట్టారు. వీరికి "అభినవ కాళిదాసు" అనే బిరుదు వుంది. శ్రీ శాస్త్రిగారి చాటూక్తులు మధురములు చమత్కార సంయుతములు. రచయిత అలాంటి చాటూక్తులను అనేకం సేకరించి ఈ గ్రంథంలో పొందుపరిచారు. ఒకటి రెండు చవి చూతాం :

దక్షిణదేశయాత్రలో శ్రీ సర్వమంగళేశ్వర శాస్త్రిగారు, ఒక రోజున ఆనందతాండవపుర మనే ఒక అగ్రహారంలో ఒక తమిళ బ్రాహ్మణుని యింట్లో భోజనం చేశారు ఆ యింటి యజమానురాలు శాస్త్రిగారికి నెయ్యి వడ్డించింది అనంతరం ఆ నేతిగిన్నె మీద శాస్త్రిగారు చెప్పిన చాటువు:

శ్లో॥ ఆనందతాండవపురే ద్రవిడస్య గేహే
చిత్రం వశిష్ఠవనితాసమ మాజ్య పాత్రమ్.
విద్యుల్లతేవ పరినృత్యతి తత్ర దర్వీ
ధారాం విలోకయతి కశ్చన యోగసిద్ధః॥

అర్థము: — ఆనందతాండవ పురమున ఒక ద్రావిడుని యింటియందు ఆజ్యపాత్ర (నేతిగిన్నె) అరుంధతీ నక్షత్రమువలె (వశిష్ఠ వనిత) ఉన్నది. అంటే కనుపించీ కనుపించకుండా మినుకుమినుకు మంటూ వుంది. అంటే అంత చిన్నది. తత్రదర్వీ = దానిలో గరిటె—విద్యుల్లతేవ పరినృత్యతి = మెరుపు తీగవలె నాట్యమాడు చున్నది—జిగేల్ జిగేల్ మని అంతలో కన్పించి అంతలో మాయమౌతున్నది. ధారాం = గరిటలోనుంచి పడే ఆజ్యధారను—విలోకయతి కశ్చన యోగసిద్ధః=యోగసిద్ధి పొంది దివ్యదృష్టిని సంపాదించిన మహామహులు మాత్రమే చూడగలరు—మానవ మాత్రుల మామూలు కళ్ళకు కనుపించదు-అని.

సత్యప్ప పంతులు అనే ఉద్యోగిమీద శ్రీ శాస్త్రిగారు చెప్పిన మరో శ్లోకం:

"అమంగళే మంగళవార సంజ్ఞా
అపుణ్యగే పుణ్యజన ప్రతీతిః
అసత్యపే సత్యప ఇత్యభిఖ్యా
త్రయః ప్రసిద్ధా విపరీతరీత్యా"

అమంగళకరమగు వారమునకు మంగళవారమని పేరు పెట్టుట, అతి పాపులగు రాక్షసులకు పుణ్యజనులని పేరు పెట్టుట. సంతతము అనృతములే పల్కు వీనికి సత్యప్ప పంతులని పేరు పెట్టుట యీ మూడును ప్రసిద్ధ విపరీతములు. ఇలాంటి చాటువులు ఇంకా అనేకం ఉన్నయ్.

చాటువులే కాక శాస్త్రిగారి జీవితానికి సంబంధించిన చిత్రవిచిత్రములైన కథలనెన్నిటినో రచయిత యీ గ్రంథంలో పొందుపరిచారు.

ఒకసారి జగన్నాథ క్షేత్రం వెళ్ళినప్పుడు శాస్త్రిగారు దేవదర్శనం చేసుకొని బయటికి వస్తూ ఆలయ ప్రాకారంలో వున్న మఱ్ఱిచెట్టు ఆకులు నాలుగు కోసి చేత్తో బట్టుకున్నారట. అది ఒక ఉత్కళ పండితుడు చూచి ఇలా పృచ్ఛించాడట.

ఉ. పం: అయ్యా మీరు మఱ్ఱియాకుల నెందుకు తెంపితిరి.

మం. శా: విస్తరంట కుట్టి భోజనము చేయుటకు

ఉ. పం: మఱ్ఱియాకున భుజింతురా?

మం. శా: ఏమి? నిషేధమున్నదా?

ఉ. పం: లేకేమి మీకు తెలియదా?

మం. శా: నాకు తెలిసినంతవరకు ఎట్టి నిషేధమును లేదు.

ఉ. పం: 'వటార్కాశ్వత్థ పత్రేషు భుక్త్వా చాంద్రాయణం చరేత్' అని లేదా?

మం. శా: దాని యర్థము మీరేమనుకొనుచున్నారు?

ఉ. పం: మఱ్ఱి, జిల్లేడు, రావి ఈ యాకులలో భుజించినయెడల తత్పాప పరిహారార్థము చాంద్రాయణ వ్రతము చేయవలెనని.

మం. శా: అట్లు కాదు; చాంద్రాయణ వ్రతము చేయదలచుకొన్నవారు, వట, అర్క, అశ్వత్థ ఈ మూడు జాతుల ఆకులలో ఏదైన నొకదానియందు భుజించి తరువాత నా వ్రతము చేయవలయునని దాని యర్థము. అయ్యది విధిని సూచించుచున్నది గాని నిషేధమును గాదు.

ఉ. పం: అయిన భగవంతుడు వట పత్రశాయి కాడా? భగవంతుని శయ్యను భుజింపదగునా?

మం. శా: మీ ఉత్కళులు భగవంతుని అవతారములలో మత్స్యకూర్మవరాహములనే భక్షించి వేయుచున్నారు గదా. ఆయన శయ్యను భుజించుట మీకు తప్పుగా కనిపించుచున్నదా? (ఆంధ్ర బ్రాహ్మణులవలె గాక ఉత్కళ బ్రాహ్మణులు మత్స్యములను తాబేళ్లను అడవి పందులను భుజింతురట).

ఇలాగే మరొక కథ:

ఒకసారి శాస్త్రిగారు శ్రీ విజయరామగజపతిగారి సభకు రాగా రాజావారు తమ రాకకు కారణమేమని శాస్త్రిగారిని పృచ్ఛించారు. శాస్త్రిగారు:

'నాకుపనయనము, నా కుమారునకు వివాహము కావలెను' అన్నారు.

రాజావారికి అదేమిటో అర్థం కాక ఉపిరితపిరైంది. సరే రేపు తప్పక సభకు దయచేయండి అని చెప్పి ఆ నాటికి తప్పించుకుని యివతల బడ్డారు. శాస్త్రిగారు బయటికి వెళ్ళిపోగానే రాజావారు మిగతా పండితులను ఆ మాటలకు అర్థమేమిటని అడిగారు. పండితులు: 'బహుశా శాస్త్రిగారు తడబాటుగా పొర

పడి అలా అడిగి వుంటారు. వారికి భార్యావియోగము తటస్థించింది. వారికి వివాహమూ, కుమారునికి ఉపనయనము అవటానికి అలా అని వుంటారు' అని చెప్పారు.

కాని మహామహుడైన శ్రీ శాస్త్రిగారికి తన బాధేమిటని రాజా వారే స్వయంగా ఆలోచించారు.

మరునాడు శ్రీ శాస్త్రిగారు సభకు రాగానే రాజావారు పట్టురుమాళ్ళు కప్పివున్న రెండు పళ్లెములను తెప్పించి వాటిలో మొదటిపళ్లెం మీది రుమాలు తొలగించి శ్రీ శాస్త్రిగారి చేతికందించుతూ 'మీ కుమారుల వివాహమునకు' అన్నారు. ఆపళ్లెంనిండా కొంత వెండి, బంగారం వుంది. రెండో పళ్లెం మీది రుమాలు తొలగించి: 'తమకీ యుపనయనములనేవి తగి యుండునో చూడుడు' అన్నారు. ఆపళ్లెంలో రకరకాల సైజులలో కొన్ని కళ్లజోళ్లున్నాయ్. సభ వారికి అమితమైన ఆశ్చర్యం కలిగింది.

శాస్త్రిగారి కుమారుని పెళ్లిలో జరిగిన ముచ్చటొకటి మనోజ్ఞంగా వుంది.

శాస్త్రిగారి కుమారుడు భగవత్పతంజలి శాస్త్రి గారికి వివాహం జరుగుతోంది. ఆడపెళ్లివారు పెళ్లికొడుకును తలుపుదగ్గర అటకాయించి పెళ్లికూతురు పేరు చెబితేగాని తలుపుతీయమని పట్టుబట్టారు. మేము పేరు చెప్పవలసినవారము కాము, అన్నాడు పెళ్లికొడుకు. అలా కుదరదన్నారు ఆడపెళ్లివారు. ప్రక్కన నిల్చున్న మంగళేశ్వర శాస్త్రిగారు 'అబ్బాయీ నీవన్నమాటే మువ్వూరు చెప్పరా'— అన్నారు. పెండ్లికుమారుడు తండ్రిగారి ఆదేశంతో మరింత ఉత్తేజితుడై 'మేము పేరు చెప్పవలసినవారము కాము, కాము, కాము,' అన్నాడు.

సరే యిక యిరువురి పంతాలూ చెల్లిపోయాయి గనుక తలుపుతీయండి అని చమత్కరించారు శ్రీ శాస్త్రిగారు. నలుగురూ తెల్లబోయారు.

పెళ్లికూతురు పేరు 'కామాక్షమ్మ'. తల్లిదండ్రులు "కాము" "కాము" అని కూడా పిలుస్తూ వుండేవారు.

ఇలాంటి చక్కటికథలు ఎన్నో ఈగ్రంథంలో వున్నయ్.

కాని ఈ గ్రంథాన్ని గురించి ఒకమాట చెప్పవలసివుంది. చదవటానికి గ్రంథం ఎంత హృదయాహ్లాదకరంగా వున్నా దానికి చారిత్రక సిద్ధి లభించే ఆస్కారం కనుపించుటలేదు. దీల్లోనుంచి భగవత్సాక్షాత్కారాదికాలను తొలగించితే బాగుండేది. శాస్త్రిగారికి భగవత్సాక్షాత్కారం వున్నదని వక్కాణించినంత మాత్రంచేత శాస్త్రిగారిప్రతిభకు వన్నెతిరిగేదేమీ లేదు.

—

శాస్త్రిగారు రచించిన గ్రంథాలు:

(1) కర్మజ్ఞానవివరణము (మీమాంసాశాస్త్ర సారం)
(2) వేదసారము
(3) పార్థవిజయము (కావ్యం)
(4) సమాసకుసుమావళి (శబ్దమంజరి సహితము)
(5) విభక్తి విలాసము (అచ్చుకాలేదు)
(6) సర్వ మంగళీయము (వ్యాకరణ గ్రంథం)
(7) సన్మతీయం (ఖండన గ్రంథం)
(8) భగవద్గీతాభాష్యము
(9) శ్రీ జగన్నాథాష్టకము
(10) శ్రీ లలితా పంచదశీ మంత్ర వర్ణమాలా స్తోత్రము
(11) సూర్యాష్టకము (సౌరాష్టాక్షరీ వర్ణ మాలాష్టకము)

## శంకరగ్రంథ రత్నావళి

[ప్రథమ సంపుటము]

అనువాదకులు : శ్రీ నిర్వికల్పానందస్వామి, ప్రచురణ: సాధన గ్రంథ మండలి, తెనాలి, వెల రు 3; పోస్టు ఖర్చులు రు. 0-12-0

'శంకరాచార్య నామధారు లెందరు? వారువారు రచించిన గ్రంథము లేవి?' అని చర్చించటానికి ఇది అవకాశం కాదు. ఈ గ్రంథములో శంకరాచార్యకృత ములుగా చెప్పబడుతున్న నలభై రచనలున్నాయ్ ఇవి:

అద్వైతానుభూతి, ఆత్మానాత్మ శ్రీ విగ్రహ ప్రకరణమ్, ఆత్మషట్కమ్, ఆత్మపూజ, ఆత్మబోధ, ఏకశ్లోకి, కాశీపంచకమ్, కేవలో అహమ్, కౌపీన పంచకమ్, గుర్వష్టకమ్, భజగోవిందం, మోహముద్గరం జీవన్ముక్తానందలహరి, తత్వోపదేశం, ధన్యాష్టకమ్, నిరంజనాష్టకమ్, నిర్వాణాష్టకమ్, నిర్వాణదశకమ్, నిర్వాణమంజరి, నిర్గుణమానసపూజ, ప్రాతఃస్మరణ, ప్రశ్నోత్తర రత్నమాలిక, ప్రశ్నోత్తర మణిరత్నమాల, ప్రౌఢానుభూతి, బ్రహ్మజ్ఞానావళీమాల, బ్రహ్మానుచింతనమ్, మనీషాపంచకం, మఠామ్నాయం, యోగతారావళి, వాక్యవృత్తి, లఘువాక్యవృత్తి, వాక్యసుధ, విజ్ఞాననౌక, వేదాంతడిండిమం, సదాచారం, సాధన పంచకం సారతత్వోపదేశం, స్వాత్మప్రవేశిక, హస్తామలకమ్.

శ్రీ నిర్వికల్పానందస్వామివారి తెలుగు వచనానువాదాలతో ఈ రచనల సంస్కృత మాతృకలను సహితం ఈ గ్రంథంలో ప్రచురించారు. ఈ రచనలు చాలామటుకు నిత్యపారాయణకు అనువైన గ్రంథాలు కనుక ముముక్షువులకు చాలా ఉపయోగకరంగావుంది. శ్రీ స్వామివారి అనువాదం చాలా సరళమైన భాషలో సర్వులకూ సుబోధకంగా వుంది. శ్రీ శంకరాచార్యుల గ్రంథముల నన్నిటినీ కూడా అనువాదరూపంలో సంపుటాలుగా తీసుకురావటానికి ప్రకాశకులు ప్రయత్నించుతున్నారని తోస్తుంది. వీరి కృషికి తప్పక తగిన ప్రోత్సాహం లభించగలదని ఆశించుతున్నాము.




Printed & Published For Nageswara Rao Estates Ltd., by S. Radhakrishna,
at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1.
Editor: S. Sambhu Prasad.

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

మార్చి 1956

సంపుటము 33 : : సంచిక 3

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మార్చి 1956

# విశాలాంధ్ర అవతరణ

## ప్రధాని నెహ్రూ ప్రకటన

'ఆంధ్ర తెలంగాణములను కలిపి విశాలాంధ్రను ఏర్పాటు చేయటానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఈ నిర్ణయం, యీ సమస్యతో సంబంధ మున్న అన్నిపక్షాలవారి అంగీకారంతోనూ జరిగింది. రాష్ట్ర పునర్విభజన సంఘం తెలంగాణమును అయిదు సంవత్సరములపాటు ప్రత్యేకంగా వుంచి అనంతరం ఆంధ్రరాష్ట్రంతో కలిపివేయాలని సిఫారసుచేసింది. అలా ఆ చిన్నరాష్ట్రాన్ని అయిదు సంవత్సరాలవరకూ సందిగ్ధ స్థితిలో వుంచటం అనేక అనర్థాలకు కారణమౌతుందని, కాంగ్రెస్ కార్యవర్గం అభిప్రాయపడ్డది. తొలుత యీ నిర్ణయానికి విముఖులుగా వున్నవారు కూడా నిర్ణయం జరిగిన అనంతరం, ఈ నిర్ణయాన్ని అమలు జరుప ఉత్సాహపూరితులై ముందుకు రావటం నాకెంతో ఆనందంగా వుంది. విశాలాంధ్రకు సంబంధించిన ఈ వాదప్రతివాదాలు ఇంతటితో ఆగిపో గలవనీ, ఈ సమైక్యతను వినియోగించుకుని ఉభయప్రాంతాల ప్రజలూ అభ్యుదయమార్గాన పురోగమించగలరని ఆశించుతున్నాను.'



దీ 5-3-56 న నిజామాబాద్ బహిరంగ సభలో

ప్రధాని నెహ్రూ ప్రకటన.

# శారదాయణము

శ్రీ మిరియాల రామకృష్ణ

హైమశ్రీ పరిఫుల్లమల్లిక కిరీటా విస్ఫూర్త స్వచ్ఛహే
లా మంజిష్ఠత - సృష్టిశిల్పి కతివేల స్నిగ్ధ సౌందర్యమై
ఏ ముత్తైదువ కచ్ఛపీనినద సాహిత్యమ్ముతో నిచ్చు భా
షా మాధుర్యము లట్టి భారతికి సాష్టాంగక్రియారాధనల్ !



ప్రణవ ఘంటారవ ప్రాభవాలయ ఎవరు
ప్రణయ శంఖారవ ప్రాణ ఎవరు
ఎవరహో ఎవరు విశ్వావతారక వీణ
ఎవరహో కవికళా నవధుని కళ్యాణి

ఎవరహో ! పరమేష్ఠి నవవిశ్వసృష్టిలో
అర్థసాహోయ్యమ్ము నవఘుళించి
ఎవరహో ! పుట్టపుట్టువు జిహ్వాలో రస
దుగ్ధమ్ము కవితలోతులకు తఱచి
ఎవరహో ! శివుని తాండవవేళ డమరుకా
న్వయలీల అ ఇ ఊల లయలు పాడి
ఎవరహో ! భరతర్షి నవకళావేద ప్ర
ణాళికా రచనలో నాట్యమాడి
ఎవరహో ! ఎందఱో మహాకవుల లేఖి
నీ మహోదయ మధుర భాషా మహత్త్వ
మంజురేఖా సమాపాద్యమాన భావ
హంసికాసింహపీఠి తూగాడినారు !

హైమసువర్ణసుందర సుమాంక మరాళ మృణాళశిల్ప శో
భామయ చేలరేఖ పయిపై నటియింప-మనోజ్ఞభంగి ఏ
భామిని నవ్వు మీగడ లపారకృపానవనీతమై కవీం
ద్రామృత భావవీథి పడు - నా యమ భారతి కక్షరార్చనల్ !

# భారతి

రవిలేక ఘృణిలేక రామణీయక మేది
కవిలేక కళలేక కళ్యాణ మేది
ఏ తల్లి కవిమనః స్ఫీత మధుమయమల్లి
ఏ తల్లి కవికళాక్షేత్ర కల్పకవల్లి.

ఏ దేవితాటంక హేమరాగమ్ము మా
భావాల చిఱుబంతి పసుపు జిమ్ము
ఏ వధూటిక హల్లకావతంసక రక్తి
కూర్చు మా కవితకు కుంకుమమ్ము
ఏ ముద్దరాలి నెమ్మోము చిఱ్ఱనగవు మా
లేతలంపుల ప్రఫుల్లీకరించు
ఏ వేదగేహిని గ్రైవేయ కర్పూర
ములకు మా పదరమ్యతలు వలంచు
ఏ ముగుద నెన్నుదుట చందమామ నవ్వు
ఏ వనిత కెంబెదవి విద్యులావహిల్లు
ఏ రమణి పాలు గాన సాహితుల జాలు
ఆ కళా భారతియె జగదేక రాజ్ఞి!

నీ యొయ్యారము వెన్నెలల్ చిలికి - నీ నెమ్మోము కెమ్మోవి ని
శ్శ్రేయ వ్యాపక వాక్సుధామధురిమన్ రేకెత్తి - నీ కచ్ఛపీ
గేయమ్ముల్ జనతా కళాభ్యుదయముల్ కీర్తించి - నీ పాద సే
వా యాత్రాధ్వగులందు శోభనము లై వాటించు వాణీ! నమః!



భావనా సౌందర్య జీవనావిష్కార
పావనా వేశ సంప్లావనాకార
ఏ యమృత సాధన మ్మో యవని కావ్యాల
ధ్యేయ మాసౌందర్య మెవరహా! ఎవరు!

ఒక కవి సోమయాజికి రసాభ్యుచిత చా
తుర్యమ్ము భావసౌందర్య మిచ్చి
ఒక కవి పండితునకు మకరంద మా
ధుర్యమ్ము మాట సౌందర్య మిచ్చి

# శారదాయణము

ఒక కవి శ్రీనాథునకు సాహితీ భోగ
తారుణ్యరూప సౌందర్య మిచ్చి
ఒక కవి శ్రీ కళాభ్యుదయ పూర్ణునకు వృ
త్తాంత సర్వస్వ సౌందర్య మిచ్చి

హరిహర హిరణ్యగర్భ మహాత్మ్యమెల్ల
జిహ్వాలకు భిక్ష కవికళా శిక్షగాగ
ఆంధ్రి వైతివి అల్ల నన్నయ్య మొదలు
నిత్యయౌవన వాక్పిరంటీమతల్లి !



చిఱుగాలి కెఱటాల నొఱిగి పూవులతావి
నెఱ నవ్వుఁలతోడ కఱగు సుషిరమ్ము
మఱపించు మాంగళ్య మధురవీణారవళి
మొఱయించు నేదేవి ముగ్ధపాణీయుగళి

శిలల కార్కశ్యమ్ము సిగ్గున నీరాయె
నేదేవి వల్లకీ నాదము విని
ఓంకార హంసక్రేంకార మేదేవి
నాదించునప్పు డామ్నాయ మొదవె
బ్రహ్మ యంతటివాని వర్చస్సునకేదేవి
ప్రణయరాగమ్ము కావలసివచ్చె
కిలకిల హృదయమూకీభూత తంత్రులై
వ్వతె నిశ్శ్వసింప సవ్వడులు నేర్చె

ఏ లలనగీతి విశ్వవైతాళికమ్ము
ఏ యతివ చూపు విశ్వహితైకకరము
ఏ రమణి కాలిపారాణి జీఱువాఱి
ఉదయసంధ్యాసముద్ర రాగోదయ మగు.

శాపానుగ్రహదక్ష సంయమములన్ – సాహిత్య సంయోజనా
నైపథ్యాంతర కల్ప శిల్పకములన్ – నానా కళాభ్యాసతై

షోడ్యపాధ్యాయికలన్ - నదించు భవదీయోంకార నాదమ్మె - భా
షా పారమ్యనిధానసాధనకు నిష్ప్రత్యూహ సంసిద్ధికిన్.



నీలి గగనము క్రుంగు నిండు వెన్నెలలందు
పాల మున్నీటి కెఱటాల సయ్యాట
లావహిల్లిన కీర్తి నవచంద్రికారేఖ
ఎవరహో సౌందర్య కవి కల్పశాఖ

ఏ తల్లి పూజలో మా తెన్గురాజన్య
    కీర్తినర్తకి గజ్జె ఘంగురనియె
ఏ తల్లి నోములో మా తెన్గు కవుల కూ
    తురు రాజు భుజమెక్కి మురిసిపోయె
ఏ తల్లి పూజలో మా తెన్గు శిల్పి హ
    స్తము గండశిలకు సౌందర్యమిచ్చె
ఏ తల్లి చలువలో మా తెన్గు గాయక
    గళము సీమాంతాల కదలి వచ్చె

పలుబన కెంజివురుగేలు క్రేవి చిలుక
తెనుగు పసిపాప నాల్కల తెలివి చిలుకు
ఏ పురంధ్రి లలాటక వ్యాపితమ్ము
రేకు లెత్తిన కోటి చంద్రికల వెలుగు.

విన్నాణమ్ముల వెన్నజిల్కిన మహా వేదార్థ సీమంతినీ !
నిన్నుంగొల్చి కవిత్వరాజ్యపదవీ నీరాజనమ్మందగా
నెన్నాళ్లేని తపస్సుచేయనగుగాని - దాని ముందెంత లే
మూనాళ్లుండెడి రాజ్యపాలనకళా మూర్ధాభిషేకక్రియల్!



ఒక విలక్షణ తప స్స్వొక విచక్షణ దీక్ష
నికటమైనపుడె నీ స్నిగ్ధ సౌందర్యమ్ము
కవి ప్రతిభ ముకురమై నవకళాకిరణమై
హావణించుకొను యశోధవళ చంద్రికల.

# శారదాయణము

ఆ నిమీలిత నయనాపాంగభంగి సౌం
దర్య సర్వస్వ మధఃకరించు
ఆ మందహాస రేఖాపాదిత జ్యోత్స్నల
స్వర్లోకమార్గ ముపన్యసించు
ఆ శ్యామకబరికా హాసదుత్పల శ్రేణి
లోకలోకాల సురభీకరించు
ఆ కించిదానమితాంభోజ వదన భం
గిమ సర్వమాధువు సంక్షోభవించు

కవి మనోదృష్టి నామె సాక్షాత్కరించు
ఆమె కజ్జలీకృత సమాహ్లాద బాష్ప
లహరి ప్రవహించు సర్వలీలా పథాంత
హాసిత లేఖినీ రచిత ముక్తాక్షరముల

లాక్షారంజిత పాద వేల్లిత మహాలావణ్య నిష్యంద
వైలక్షణ్యద్యుతి వాహినీ జల
సమాప్లావత్కృపీశా! నమః!
వీక్షాయుగ్మక నైగనిగ్య విగళ ద్విద్యుత్తరంగాత్త
వైచక్షణ్య ప్రతిభా సముజ్జ్వల
కళాచైతన్య దీపా! నమః!

# పిన్నలు : పెద్దలు

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

గాలి కదలకుండా కదుల్తున్నాయి చెట్ల ఆకులు.

ఒడ్డును తాకీతాకకుండా వెనక్కి మరల్తున్నాయి ఆ చెరువులోని చిరు కెరటాలు.

గోపీ ఇదేమీ గమనించకుండా, గట్టునున్న ఓ బండపై కూర్చొని శూన్యంలోకి తదేకంగా చూస్తున్నాడు.

సాయంకాలపు నీరెండలో అసలే ఎఱ్ఱనైన అతని శరీరం మరింత ఎఱ్ఱగా మెరిసిపోతోంది. దువ్వకోని అతని చింపిరిజుట్టు మొగంమీదకుపడి మరింత నల్లగా కన్పిస్తోంది.

నీళ్ళకొచ్చిన ఒకరిద్దరు అమ్మలక్కలు అతని దగ్గరకొచ్చి పరకాయించి చూసి మరీ వెళ్ళారు. దూరంగా ఒక పెయ్యదూడను మొరాయిస్తున్నా లెక్కట్టకుండా మెడకు తాడేసి ఇంటికి లాక్కెల్తున్నాడో సన్నకారు రైతు.

ఇదేమీ గోపీ గమనించటల్లేదు. శూన్యంలోకి తీక్షణమైన తన దృక్కులు బఱపుతూ దేనినిగూర్చో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

"మాష్టరుగారిమీద తన కసి ఎలా తీర్తుంది?" దీనికి సమాధానం తోచీతోచకుండా వుందతని చిన్ని మెదడుకు.

ఒక ఆలోచన కలిగీ కలగకుండానే వేరొక ఆలోచన అతనికి ప్రత్యక్షమౌతోంది.

"మాష్టరుగారికో నాలుగేళ్ల అబ్బాయి వున్నాడు. ఆ అబ్బాయిని పట్టుకు చితక్కొట్టే! ఛా—అది పిరికితనంకదూ? ఎవరో ఆర్నెల్లు సాము చేసి మూలనున్న ముసలమ్మమీద తన బలం చూపించాడట! తను అంతపెద్ద వాడైవుండి ఒక చిన్న పిల్లవాడి మీద పౌరుషం చూపించటమా?"

సిగ్గుతో తల దించుకున్నాడు గోపీ.

ఎవరో ఒక పెద్దాయన చిన్న పిల్లాణ్ణొకణ్ణి చేత్తో పుచ్చుకుని షికారు వెళ్తున్నాడు. ఆ పిల్లాడు ఎంచక్కా గంతులేస్తూ ఆ పెద్దాయనవెంట నడుస్తున్నాడు!

వారిద్దరూ కనుమాపు మేర గాటేవరకూ అట్టే చూస్తూండిపోయాడు గోపీ!

అతనిలో లీలగా ఒక దరహాసం గోచరించింది. రేఖామాత్రంగా పాతరోజులు జ్ఞాపకం వచ్చినందుకు తనలో తనే ఆనందపడ్డాడు అతను.

"తనను చిన్నతనంలో ఎత్తుకొని తప్ప షికారుకు తీసుకువెళ్ళేవాడు కాదు నాన్నగారు. మరి ఈ అబ్బాయినో? పాపం—నడిపించుకు వెళ్తున్నాడా పెద్దమనిషి!"

బెస్తవాడొకడు అప్పుడేవచ్చి గాలమేసి కూర్చున్నాడు.

గోపీ బెస్తవాడివేపు చూశాడు. వాడి వంటిమీద గోచీతప్ప మరే గుడ్డపీలికా లేదు.

తనవేపు చూసుకున్నాడు గోపీ. చినిగిందైనా తనకో లాగూవుంది. భుజాలమీద అతుకులున్నా మంచి చొక్కా వుంది.

ఇంకేం? బెస్తవాడికి లేనివి తనకున్నాయి.

ఇదివరలో వాళ్ళక్కయ్య చెప్పిన మాట వొకటి జ్ఞాపకం వచ్చింది గోపీకి—'ఒకడికన్న ఇంకొకడు గొప్పవాడవడానికి కారణం ఒకడికిలేని వస్తువును వేరొకడు కల్గి వుండడమేనట!'—

"అయితే తను ఆ గాలంఅతనికన్న చాలా గొప్పవాడన్నమాట! మరి గొప్పవాళ్ళు తక్కువ వాళ్ల దగ్గరనుంచి ఏదిబడితే అది తీసుకోవచ్చుగా! తను కూడా ఆ గాలంఆయన దగ్గర అది పుచ్చుకోవచ్చునా?"

— బెస్తవాడి ప్రక్కనున్న చేపల బుట్టల్లోంచి చిన్నరకం చేపలు రెండు బయట పడడానికి ఎగిరెగిరి ప్రయత్నిస్తున్నాయి.

అబ్బ ఎంత బావున్నాయి అవ్వీ?

"తనుకూడా వాటిని పట్టుకుంటే?"

ఏదో ఆలోచన తట్టినవాడిలా ఒక్కసారిగా లేచి నుంచున్నాడు గోపీ!

ప్రయత్నించి, ప్రయత్నించి చివరికెలాగైతే నేం బుట్టలోంచి బయటకు పడిందొక చేప.

చిరకాలంగా అనుభవిస్తున్న బానిసత్వపుబాధల నుండి తప్పించుకొన్న మానవుడు స్వస్థలం చేరుకోబోయేముందు పొందే ఆనందంకన్న ఎన్నోరెట్లు గుణాతీతమైన సౌఖ్యం అనుభవిస్తోందా జీవి తన కుప్పిగంతుల మూలంగా! నేలపై బ్రతకడం బాధాకరమే కావచ్చు—కాని—బంధం నుండి తప్పించుకోవడం ఎంత అదృష్టం?

పట్టుకున్న గాలం అలాగే ఒడ్డున పెట్టి, చేపను తిరిగి పట్టడానికి లేచి నుంచున్నాడా బెస్తవాడు. లేచినుంచున్నవాడల్లా ఒక్కసారి ముందుకు చూశాడు. ఎదురుగ్గా సరిగ్గా పదేళ్లయినా లేని ఓ అబ్బాయి!

ఆ అబ్బాయి తదేకంగా ఎగురుతోన్న ఆ చేప వంకే చూస్తున్నాడు. చేప యెగురుకుంటూ యెగురుకుంటూ వెళ్ళి మెల్లగా చల్లగా తన స్వస్థలం తిరిగి చేరుకొన్నది. ఇంకొక చేప బుట్టలోంచి బయట పడడానికి తన శక్తికొద్దీ ప్రయత్నిస్తున్నది. ఆ బెస్తవాడు ఏమనుకున్నాడో ఏమో తటాలున వెళ్లి ఆ బుట్టమూత వేసేశాడు. ఆ బుట్టకు మరింతదగ్గరగా జరిగి కూర్చున్నాడు. మళ్లీ యథాప్రకారంగా గాలం ఆడిస్తూ తనపనిలో నిమగ్నుడైనాడు.

అంతా నిశ్శబ్దం! ప్రకృతి ప్రశాంతంగా వుంది.

పక్షులేవీ పైన విహరించటల్లేదు. పశువులేవీ క్రింద చరించటల్లేదు. ఎఱ్ఱగన్నేరు పూవులా వున్న సూర్యుడు కొస్తా దూరంగా ఎక్కడో దాక్కోడానికి ప్రయత్నిస్తున్నాడు.

గోపీకేమీ తోచటల్లేదు.

గాలిపటం వుంటే ఏంచక్కా సాయంకాలం పూటదాని నెగరేసుకోవచ్చు! గోలీ కాయలు, బిళ్ళంగోడు, కోతికొమ్మచ్చి. అబ్బ! యెన్ని ఆటలు తామాడేవారు ప్రతిరోజూ! మరి ఇవ్వాళ ఒక్కరూ రారేం?"

"ఛీ! దరిద్రపు వెధవలు!" రానందుకు తన కసి నంతా ఈ తిట్టమూలంగా బయలుపరిచాడు గోపీ. కానీ ఇది వినడానికెవరూ అక్కడ లేరు.

బెస్తవాడొక్కసారి పిల్లవాడివేపు చూసి తిరిగి తనపనిలో నిమగ్నుడైనాడు. గోపీకేమీ తోచటల్లేదు. "ఏం చేయాలా?" అని ఆలోచిస్తున్నాడు. ఆలోచిస్తున్నవాడల్లా రెండడుగులు ముందుకు వేసి బుట్టదగ్గరకు చేరుకొన్నాడు. బుట్టకు అక్కడక్కడా చిల్లులున్నాయి. ఆ చిల్లుల్లోనుండా లోపల చేపలెంత బాధపడుతోందీ స్పష్టంగా కన్పిస్తోంది.

అసలు మూతనే తీసేస్తే? ఇంకా బాగా చూడవచ్చుగా! కావాలంటే ఒకటిరెండింటిని పట్టుకోనూ పట్టకోవచ్చు!"

ఆహారాన్వేషణలో నిమగ్నమైన బెస్తవాని నేత్రాలకు ఏవో రెండు మృదుహస్తాలు తమప్రక్క ప్రక్కగా జీరాడుతున్నట్లు గోచరించింది. మానవ లోకంలో పయనిస్తున్న ఆ బెస్తవాని దృగ్రేఖలు బాహ్యంలోకి తటాలున తమమార్గాన్ని మరలించాయి.

ప్రక్కకు బుట్టమీదకు చూపులు నిగుడించాడు బెస్తవాడు. కానీ...బుట్టకు మూతలేందే?

ఏమైంది?

మూతలో బాటే బయటపడిన ఒకటి రెండు జలచరాలు ఒక్కసారిగా లభించిన స్వాతంత్ర్యంతో ఉక్కిరిబిక్కిరై బాధపడుతున్నాయి

తోటివారి ఆనందంచూచి ఓర్వలేని మరో రెండు వాట సహచరులు బుట్టకు, ఒక మూలకుపోయి అలిగి పడుకున్నాయి!

కొందరు అతి సంతోషంతో వొళ్లుమఱచి ఆనందిస్తుంటే మరికొందరు అతి దుఃఖంతో నిర్జీవులై పడి వుండడం లోకవిచిత్రం కాబోలు!

బెస్తవాడి గుండెలు ఒక్కసారిగా స్తంభించినంత పనైంది.

చేత్తో పట్టుకున్న గాలం ఆదాటున అలాగే వొదిలేశాడు అతడు.

తను ఉదయంనుండి సంపాదించిన ఆహారం అది! కష్టించి కళ్ళల్లో నొత్తులు వేసుకు సంపాదించిన ఆహారం అది!"

దాదాపు ఏడుపు వచ్చినంతయింది బెస్తవానిపని.

బరువుగా వున్న కనురెప్పలను అతికష్టంమీద విప్పి పరిసరాలను చూడగలిగాడు గోపీ!

గోపీ తల తనతొడపై పెట్టుకుని కూర్చున్న బెస్తవాడు ఆత్రుతగా, భయం భయంగా ముద్దు ముద్దుగా ఆ పిల్లవాడి కళ్ళల్లోకి చూస్తున్నాడు.

పిల్లవాడు చలికి గజగజా వణకుతున్నాడు.

వణకుతున్న ఆ పిల్లవాడు కదులుతున్న ఓ కాంతి రేఖలా కనుపించాడు బెస్తవాడి కంటికి

మొద్దుబారిన తన హస్తాలతో ఆ మృదు శరీరాన్ని మెల్లగా నిమిరాడు అతడు.

గోపీ ఆలోచిస్తున్నాడు. "తనెందుకు నీళ్ళల్లో పడ్డానా అని? కాలు జారింది. అది తనకు బాగా జ్ఞాపకం వుంది. మరి ఉత్త పుణ్యానికి కాలెందుకు జారింది.

ఇవాళే బళ్లో మాష్టారు చెప్పారు కూడా! ఏది జరగాలన్నా ఏదో ఒక కారణం వుండాలట

మాష్టారనేసరికి మళ్లీ జరిగిందంతా జ్ఞాపకం వచ్చింది గోపీకి!

"తను మాష్టారు మీద కసి తీర్చుకోవాలనుకున్నాడు. మరి నీళ్లలో ఎందుకు పడ్డాడు?"

ఎదురుగా వున్న బెస్తవాడు అదేపనిగా గోపీ వేపు చూస్తున్నాడు.

గోపీ మళ్లీ ఆలోచించడం మొదలెట్టాడు. "ప్రొద్దున తను మాష్టారు మీద కోపంతో క్లాసునుంచి పారిపోయి వచ్చాడు. ఆ కోపంతో తను అన్నానికి కూడా ఇంటికి పోలేదు పాపం! తన అక్కయ్య ఇంటిదగ్గర తనకోసం ఎదురు చూస్తుంటుంది కాబోలు!

పుచ్చపువ్వులా వున్న ఆ వెన్నెట్లో నల్లచీర కట్టుకున్న ఓ తెల్లమ్మాయి చెఱువుగట్టు వెంబడే పరిసరాలు పరికిస్తూ రావడం చూచాయగా కనుపించింది పడుకుని ఆలోచిస్తున్న గోపీకి.

చెఱువుగట్టు ప్రక్కనున్న జువ్వి చెట్టు క్రిందగా ఓ క్షణం సేపు నిల్చుంది, ఆ అమ్మాయి, బడలిక తీర్చుకొంటున్నట్టుగా.

అయినా చెట్టు కొమ్మల మధ్యగా తెల్లని వెలుగు ఆమెమీద పడ్తూనే వున్నాయి

నల్లచీర నిగనిగ మెఱుస్తూ, ముఖపద్మం మరింత ధవళంగా వుండనే వుంది.

పడుకున్నాని ఆలోచనల్లో కొట్టుమిట్టాడుతున్న గోపీ పక్కకు చూసిగా ఆపాటున లేచి కూర్చున్నాడు.

తడితడిగా వున్న అతని బట్టల్లోంచి బొట్లు బొట్లుగా పడుతోంది నీరు. అలల మీదుగా వస్తున్న చల్లగాలి అతని శరీరాన్ని పూనుకుపోతోంది. కాని ఆ నల్లచీర వేపే చూస్తున్నాడు గోపీ!

ఆమె మెల్లగా అడుగులో అడుగేసుకుంటూ ఇక్కడివేపే వస్తోంది.

దగ్గర దగ్గరగా వచ్చిన ఆమెను చూచాడు గోపీ. అమ్మో! తన అక్కయ్య! ప్రయత్నాంతర్వా కంపించిపోయాడు పదేళ్ళవాడైన గోపీ

గోపీవేపు చూస్తున్న బెస్త మనిషి 'ఏమిటా?' అని ఒక లిప్తకాలం ఆ వస్తున్న ఆగంతకురాలివైపు తన దృష్టిని మరలించాడు.

దీనురాలుగా కనిపించిందిగానే కాదు.

"ఇక్కడేంపనీ గొప్పింట పిల్లకు?" అనుకున్నాడతడు మనసులోనే. అయినా సమాధానం మాత్రం శూన్యం.

"ఇక్కడేమైనా మా తమ్ముడు వచ్చాడా?" వార్ధవంగా సుతిమెత్తని స్వరంతో సన్నగా పలికిన పలుకు విని బెస్తవాడు చుట్టుపట్ల చూచాడు గోపీ కోసం. ఏడీ గోపీ?

"ఏమిటోయ్ అలా దిక్కులు చూస్తావు నా తమ్ముణ్ణేంచేసెంటూంజే?" మళ్ళీ అదే కంఠం కొంత కోపం రంగరించిన హుంకారంలో ప్రశ్నించింది.

బెస్తవాడు మళ్ళీ చుట్టు ప్రక్కల గాలించాడు. ఏడీ గోపీ?

బెస్తవాడికో నాలుగు గజాల దూరంలో మఱ్ఱి చెట్టు ఒకటి వేయి ఊడలతో వంగిపోయి బ్రతుకుతోంది.

"నిన్నే కాదుటోయి అడుగుతోంది?" దెబ్బతిన్న అహం మూలంగా, ఉప్పొంగిన కోపంతో పెద్దగా ప్రశ్నించిందామె.

ఎవరో ఏమిటో అడుగుతున్నారని అయోమయావస్థలోనుండి జాగృతిలోకి కడుగెట్టిన బెస్తవాడు ఒక్కసారి ఆ ఆగంతకురాలి మొహంలోకి చూచి "మీ పేరేంటి బుల్లెమ్మగోరూ!" అన్నాడు నమ్రతగా.

ఆవిడకు మహా చిరాకేసింది. కోపం ముంచుకొచ్చింది. "ఏమిటే చొప్పనంటు ప్రశ్నలు?" విసుక్కొన్నదామె తనలో తానే.

"నా పేరేదైతే నీకేం?" ఆమె పలుకులు విని రెండు చేతులూ జోడించి వినయం వుట్టి పడేటట్లుగా జవాబిచ్చాడు బెస్తవాడు. "ఆ బాబును కొట్టబోకండమ్మగోరూ! ఎంతో ముద్దొస్తారు!"

ఆవిడ నవ్వకుండా వుండలేక పోయింది. నవ్వుతూనే జవాబిచ్చింది.

"అసలెవరోయ్ ఆ బాబు! మా గోపీకోసం నే వెతుకుతుంటేను."

ఆమె జవాబు పూర్తిగా వినకుండానే బెస్తవాడు మర్రిచెట్టు దగ్గరకు పరుగెత్తాడు.

చెట్టు వురుట్లో వణకుతూ నిలబడిన గోపీని సందిట్లో ఇముడ్చుకున్నాడు. ఒక్క పరుగున మరలా యథాస్థానం చేరుకొన్నాడు.

గోపీని ఒకప్రక్క చలిబాధా, మరోప్రక్క భయమూ బాధిస్తున్నాయి.

అతను మాట్లాడనూలేదు పరుగెత్తనూలేదు.

అలాగే శిలాప్రతిమలా నిలబడ్డాడు.

ఆమె గోపీ కండ్లలోకి సూటిగా తీక్షణంగా చూచింది. గోపీ తల దించుకున్నాడు.

ఆమె గోపీ చెయ్యి పట్టుకుని ముందు నడవడం ప్రారంభించింది. తప్పించుకు పోవటానికొకుఱ్ఱవాడు ప్రయత్నం చేయలేదు.

"ఈడకొస్తారా బాబుగోరూ మల్లీ రేపటికియ్యాల్టికి?" బెస్తవాడు కోరిన కోర్కెకు వెనుకకు తిరిగిచూచాడు గోపీ!

అతని కళ్ళనుండి రెండు పసిడి ముత్యాలు రాలి చొక్కామీద పడ్డాయి.

గాలి తాకిడికి తట్టుకోలేని మేఘంవలె బాధపడ్డాడు గోపీ!

"పెద్దింటోళ్లు యేడవగోద్దు బాబూ!" బెస్తవాడి స్వరం గోపీకి వినిపించకుండానే గాలిలో కలసిపోయింది.

ముందు పోతున్నామె అడుగుల్లో అడుగేస్తూ; వెనకకు చూచి చూచి నడుస్తున్న గోపివేపు చూస్తూ— అలానే నిలబడిపోయాడా బెస్తవాడు చెఱువుగట్టున. చంద్రబింబం మబ్బులు చాటుకు వెళ్ళింది కూడా గుర్తించకుండా!

* * *

ఆమె కండ్లు విస్ఫులింగాల్ని వెళ్ళగక్కుతున్నాయి.

ఆమె అంటున్న ప్రతీమాటా గాలిలో కలసిపోతూ, గోపీ చెవుల్లో ములుకులు నాటుతోంది.

"వెధవాయ! చేపలవాళ్ళతోనట్రా ఆటపాటలు, చదువు సంధ్యలు మానేసి?"

గోపీ కంతా అయోమయంగా వుంది. "చేపలవాళ్లకూ తనకూ భేదమేమిటో!"

అందమైన మొగంనుండి చిలిపి చూపులు చూచే అతని కండ్లు ప్రశ్నార్థకంగా మారాయి లక్ష్మివేపు.

జవాబీయకుండా శిలాప్రతిమలా నుంచున్న తమ్ముణ్ని చూసేసరికి కోపం పెచ్చు పెరిగింది లక్ష్మిలో.

"ఎంత నిర్లక్ష్యం ఈ రాలుగాయికి?" అనుకొన్నదామె మనసులో.

మనసులోవున్న భావాన్ని చేతల్లో వెలువరించే వరకూ నిలువరించుకోలేక పోయిందామె.

అమాయకుడైన ఆ చిన్నవాణ్ణి కొట్టకుండా వుండలేకపోయింది లక్ష్మి.

ముట్టుకుంటే కందిపోయే అతని పాలబుగ్గలపై ఆమె అయిదువ్రేళ్ల ముద్రలు స్పష్టంగా పడ్డాయి.

ఎఱ్ఱనైన అతని శరీరంమీద నల్లని చారలు ప్రత్యణువునా కనిపించాయి. చెవులు—కళ్లు—బుగ్గలు— అన్నీ బాధతో కంపించాయి.

పదేళ్లైనాలేని గోపి నిట్టనిలువునా బాధతో కంపించిపోయాడు.

"అక్కయ్యా! అక్కయ్యా!" ఇక ఎప్పుడూ వాళ్ళతో తిరగనక్కయ్యా!"

బాధగా జాలిగా వ్యథగా విలపించాడు గోపీ!

అతని హృదంతరాళ్లోనుంచి వెలువడిన ఆర్తనాద మది.

లతలా, లక్ష్మిపాదాలు చుట్టుకుపోయాడు గోపి, కొట్టవద్దన్నట్లుగా!

నిరవధిగా ప్రవహిస్తున్న అతని కన్నీరు లక్ష్మిపాదాల నభిషేకం చేసింది.

శరణన్నట్లుగా తనపాదాలపై వున్న తమ్ముడి వేపు చూచింది లక్ష్మి.

ఎంతైనా ఆమెది స్త్రీ హృదయం.

స్త్రీలు సామాన్యంగా ప్రేమ ప్రపూర్ణలు.

అకస్మాత్తుగా వంగి తన బాహువల్లరిలో పొదువుకున్నదామె తన తమ్ముణ్ణి.

"తమ్ముడూ! మనం బీదవాళ్ళం కదా! అమ్మా నాన్నా కూడా లేరా? నువుకూడా ఇలా అల్లరిచేస్తే ఎలా చెప్పు? నునుచేత గోపీ చెంపలు సవరిస్తూ పలికిందామె యీ పలుకులు.

లక్ష్మి పరిష్వంగంలో మాతృత్వంలోని వెచ్చదనా న్ననుభవిస్తున్నాడు గోపి! ఆ వెచ్చదనంలో కోలుపోయిన ధైర్యాన్నంతా కూడగట్టుకొం టున్నాడతను. అణగారిన అతని శక్తులన్నీ అప్పుడప్పుడే తిరిగి తమ సహజత్వాన్ని సాధించుకుంటున్నాయి.

"మాస్టరుగారిని అలా తిట్టవచ్చా చెప్పుబాబూ!" తను చేసిన తప్పిదానికి సిగ్గుపడుతూ అడిగింది లక్ష్మి.

తనెంతగా హింసించినా, బాధనంతా ఒక్క క్షణంలో మరిచిపోయి, తనవేపు బరువుచూపులు చూచే తమ్ముణ్ణి చూసేసరికి ఆమెహృదయం కలగుండు పడింది.

గోపి, లక్ష్మి కళ్ళల్లోకి చూస్తూ నిర్మలంగా నవ్వాడు.

ఆ నవ్వులో ఎన్ని ధవళవీచికలు వీచాయి!

"మరెందుకు నన్ను ఉట్టిపుణ్యానికి కొట్టాలేం?"

"అసలేం జరిగింది తమ్ముడూ?" విషయాన్ని తెలుసుకుందా మన్న కుతూహలంతో తమ్ముణ్ణి మరింతగా దగ్గరకు లాక్కుంది లక్ష్మి.

గోపీ నవ్వుతూ గారాబంగా జవాబిచ్చాడు. "మరేం—మాష్టరుగారి పెద్దబ్బాయి లేడూ—వాడే నన్ను తిట్టాడే—నేనేమో కొట్టానే—అప్పుడు మాష్టారేంచేయాలి చెప్పు?"

లక్ష్మికి సంగతంతా కొద్ది కొద్దిగా అర్థమైంది.

"మరి నళ్యం పంతులుగారలా చెప్పారేం?" విడరాని వ్యూహాన్ని ఛేదించాలని తనకుతానే ప్రశ్నను వేసుకొన్నది లక్ష్మి. "అడకూడని దుర్భాషలాడాడుట గోపీ! బడికి పంగనామాలు చుట్టి రోజల్లా చేపల వాళ్ళతో తిరుగుతూంటాడట గోపీ!" లక్ష్మి కళ్ళు ఒక్కసారిగా జలపరించింది.

"అమ్మో! తన తమ్ముడు చెడిపోతున్నాడు. వాడే తన ఏకైక జీవనాధారం. వాడేలేకపోతే తన బ్రతుకు—?"

ఎంత నిస్సారంగా ఉంటుందో ఊహించుకోలేకపోయింది లక్ష్మి.

ఆలోచనల పరధ్యానంలో మునిగిపోయిందామె తమ్ముణ్ణి చూస్తూ.

గోపీ అర్థంకాని చూపులతో లక్ష్మివేపు అలానే చూస్తుండిపోయాడు.

"ఏమిటే ఒక్కసారి అలా అయిపోయిందేం తన అక్కయ్య? తనేమైనా తప్పుపని చేశాడా?"

గోపీకి అర్థంకాలేదు తన అపరాధం.

ఇంతలో వెంకటాచారు లోపల కదుగెట్టాడు.

అతను ఆ వూళ్ళో బడిపిల్లలపాలిటి సింహ స్వప్నం.

ఆ ఊళ్లో ఉన్నది ఒక్కటే బడి. ఆ బళ్ళో ఉన్నది ఒక్కడే మాష్టారు. అతడే శ్రీమాన్ వెంకటాచార్లు ఉరఫ్ నళ్యంపంతులుగారు.

సమయంకాని సమయంలో ఆయనక్కడకు రావడం భయపుటూహలు రేపింది గోపీ మనస్సులో.

తనను బహుశా కొట్టటానికే వచ్చివుంటాడని ఊహించుకోటానికి ఎంతో కాలం పట్టలేదు గోపీకి.

మాష్టారును చూసి, అభివాదంచేసి తుంగచాప వేసింది లక్ష్మి.

ఆయన కూర్చోలేదు. అలానే నిల్చుండిపోయాడు.

"గోపీ ఇంటికొచ్చాడా లక్ష్మి!" అన్నమాటలు విని "ఆ! ఆ! వచ్చాడండీ!" అన్నదామె అసలు సంగతేమిటో అర్థంకాకుండా.

"ఏడీవాడు?" మళ్ళీ ఆయనే ప్రశ్నించాడు కూర్చోనకుండానే.

లక్ష్మి చుట్టుప్రక్కల చూచింది. గోపీలేడు. వంటింట్లో ఏదో చప్పుడైంది.

మళ్ళీ శ్రీమాన్ ఆచార్లుగారే అందుకున్నాడు: "అమ్మాయ్! మధ్యాహ్నం నీకు చెప్పానా వాడు బళ్ళోనుంచి పారిపోయాడని!" అవునని తలూపింది లక్ష్మి. "వాడొక్క చేపలు పట్టడమే కాదట నేర్చుకొంటూంది. ఈతలు కొట్టడం కూడానట!"

"ఏమిటే?" అన్నట్లు ఆశ్చర్యంగా తలెత్తి మాష్టారి వేపు చూచింది లక్ష్మి.

"మా అబ్బాయి చూశాడుట — మీ వాడూ బస్తీవాడూ కలిసి చెరువులో ఈతలు కొట్టడం." మాష్టరుగారు తనధోరణిలో తను చెప్పుకుపోతున్నారు "నీకు తెలుసుకదూ ఆ చెరువులోదిగిన మహామహా గజయీతగాళ్ళే మళ్ళీ లోకం మొహం చూడలేదని."

ఆ మాట విన్న లక్ష్మి గబగబా వంటింట్లోకి పరుగెత్తింది.

ఓ మూలగా గోడకంటుకుపోయి నిలబడి వున్నాడు గోపి!

ఆ కుఱ్ఱవాణ్ణిచూచి, అతని మనస్సులో ఎంత సంఘర్షణ జరుగుతోందో తెలుసుకోవడం ఎవరికైనా కష్టంకాదు.

వణికిపోతున్న గోపీని వాటంగా ఓ చేత్తో పట్టుకుని సావిట్లోకి తీసుకొచ్చింది లక్ష్మి.

"ఎందుకు బళ్ళోనుంచి పారిపొయ్యావు?" గర్జించాడా బడిపంతులు.

గోపీ జవాబు చెప్పలేదు తలవంచుకుని అలాగే నిలబడ్డాడు.

"పంతులుగారడిగినదానికి సవ్యంగా జవాబు చెప్పవేరా?"

కోపంగా అడిగిన లక్ష్మి వేపు దీనంగా చూచాడు గోపి!

"అమ్మాయ్! వీడు మరీ బరితెగిపోయాడు ఏలా కాపాడుకొంటావో?"

లక్ష్మికి సూచన చేసి వెనక్కు మరలాడా బడిపంతులు.

అసలెందుకు వచ్చినట్టు? ఎక్కడకు వెళ్తున్నట్టు?

సామాన్యంగా బడిపంతుళ్ళకు మఱపు సహజమట.

తన కొంగు పట్టుకు నుంచున్న గోపీని చూచి కోపం పొంగి పొరలింది లక్ష్మికి.

'వెధవ వినయాలూ, వీడూనూ!' అనుకొన్నదామె.

బెరుకు బెరుగ్గా చూస్తున్నాడు లక్ష్మివేపు గోపి!

"అలా నిల్చున్నకొద్దీ మరింత మితిమీరుతున్నాడు వీడు!" ఆమెలో కఱకుదనం మెల్లమెల్లగా ప్రవేశిస్తోంది.

ఏం చేయటానికీ తోచని గోపి అక్క వేపు చూడడానికి భయపడి తలదించుకొన్నాడు.

"మొక్కయి వంగనిది మ్రానయిన తర్వాత అసలు వంగదట!" పూర్వులు చెప్పిన సుభాషితం ఆమె ఆలోచనలను విశ్రాంతిలేకుండా వేధించుకు తిన్నది.

"గోపీ!" లక్ష్మి పిలిచిన పిలుపుకు ఆ కుఱ్ఱవాడు అదిరిపడ్డాడు.

గోపీని తీసుకుని ఆమె బయటకు వచ్చింది.

అక్కడక్కడావున్న నక్షత్రాలు పేలవంగా ఏడుస్తున్నట్లున్నాయి.

చంద్రుడు పూర్తిగా మబ్బుల చాటుకు వెళ్ళిపోయాడు. బహుశా లోకంలో జరిగే దారుణ సంఘటనలు చూట్టానికి ఇష్టంలేకేమో!

గోపీ వికృతంగా తలలూపుతున్న చెట్లను చూచి గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

"అక్కయ్యా!" అంటూ మెల్లిగా ప్రక్కలకు చూచాడు.

కానీ అతని అక్కయ్య అక్కడలేదు.

భయపడి తొట్రుపాటుతో ఇంట్లోకి పరుగెత్తబోయాడు.

కానీ తలుపులు రెండూ అతని కెదురుగా మూసుకుపోయాయి.

"అక్కయ్యా!" అంటూ అదేపనిగా అతను గొంతు చించుకుని విలపించాడు.

కానీ లక్ష్మి తలుపు తీయలేదు. ప్రశాంతంగా జవాబు నిచ్చింది. "బడినుంచి పారిపోయిన ఫలితమిది!" అని.

ప్రక్కన దూరంగావున్న చెట్లకు ఆవల నక్కలు ఏడుస్తున్నాయి

గోపీకి నక్కలంటే అమిత భయం! అవి మనుష్యుల్ని తినేస్తాయట!"

లోపలనుంచి మళ్ళీ లక్ష్మి స్వరం వినవచ్చింది. "ఏం చెలువులో ఈతబాడింత బాగా లేదా బయట?"

నిస్సహాయుడైన గోపీ, నీరసించి చతికిలబడ్డాడు అరుగుమీద

*       *       *       *

తలుపులు మూసినా వీస్తోంది గాలి చాలా తీవ్రంగా.

బయటనుంచి వెక్కి వెక్కి ఏడుస్తున్న స్వరం వినవస్తోనే వుంది.

అయినా లక్ష్మి వెచ్చగావున్న గదిలో నిశ్చలంగా కూర్చుని ఆలోచించుకొంటోంది "తానేమైనా తప్పుచేశానా?" అని.

ప్రక్కనున్న పెంకుటింటివారి గడియారం, గంటలు కొట్టడం అస్పష్టంగా వినిపించింది ఆలోచించుకొంటున్న లక్ష్మికి.

"బహుశా పదేమో!" అనుకొన్నదామె ఆలోచించుకొంటూనే.

జీవన్మరణాలలో కుస్తీపడుతోన్న దీపం మరణానికి చేరువవుతోంది.

దీపం ఆరిపోబోతుండడం చూచి, లేచి వెళ్లి పెద్దది చేసింది వత్తిని ఆమె.

కానీ గదిలో కొన్ని మూలల్లో అంధకారం పోనేలేదు.

ఆమెలోనూ కొన్నిచోట్ల చీకటి సందేహాలు తలలెత్తి అరుస్తూనే వున్నాయి.

బయటనుండి వినవస్తున్న విషాదస్వరం అంతకంతకూ తగ్గుతోండడం చూచి "నిద్రపోతున్నాడేమో!" అనుకొని తలుపు తీయబోయింది లక్ష్మి.

కానీ ఆగిపోయింది. అలాగే మంచంమీద కూర్చొని ఆలోచించుకొంటోంది.

"పసివాణ్ణి అంతగా శిక్షించడం అన్యాయమేమో!"

"కాదన్నాయి" ఆమెలోని అంతర్గత భావాలు.

"ఓ రాత్రి బయట పడుకుంటే వచ్చిన నష్టమేం లేద్దూ!" అన్నారెవరో ఆమెలో దాక్కున్నవారు.

ఆరుబయట తీతువుపిట్ట కూస్తూ వెళ్లిపోయింది.

నక్కల అరుపులు తగ్గినా అప్పుడప్పుడు వినిపిస్తూనే వున్నాయి.

ఏవో రెండు మూడు గ్రామసింహాలు గోపీ దగ్గరకొచ్చి దూరంగానుండి కాసేపు చూచి తిరిగి వెళ్ళిపోయాయి

గోపీకి నక్కలన్నా కుక్కలన్నా అమితభయం!

కుక్కలు కరిస్తే మనుషులు బ్రతకరట! నక్కలు మనుషుల్ని తింటాయట!

అదీగాక నక్కలూ కుక్కలూ భార్యాభర్తలుగా! తన అక్కయ్య ఎప్పుడో చెప్పింది. ఎండా వానా కుక్కల నక్కల పెళ్ళి అని!

గోపీ నిలువునా వణికిపోయాడు.

'అమ్మో! తనను తినవుకదా!'

ఎక్కడన్నా దాక్కోవాలనుకున్నాడు గోపి.

దూరంగా రెండు మూడు ఇళ్ళ కవతల ఓ చీకటి ప్రదేశం వుంది.

'అక్కడకు వెళ్తే తను నక్కలకూ కుక్కలకు కనబడడు.'

ఆ వేపు చూచాడు గోపీ!

కానీ అదేమిటి! ఆ చీకట్లో కొరివి దయ్యాలేవో 'నాట్యం చేస్తున్నట్లున్నాయి. గట్టిగా కళ్ళు మూసుకున్నాడు గోపీ!

'ఆ బెస్తవాడన్నా రాడేం? అయినా ఆ బెస్తవాడి వొళ్ళో పడుకుంటే ఎంత హాయిగా వుందీ!"

మనసు నావరించిన భయంతో నిద్రపోలేకపోయాడు గోపి!

ఆలోచనల పరధ్యానంలో అలాగే కన్ను మూసింది లక్ష్మి.

బయట కీచురాళ్ళ ధ్వనులు మాత్రం మిక్కుటంగా వినవస్తున్నాయి.

మేఘాల్లోంచి రెండు మూడు నక్షత్రాలు తొంగి తొంగి చూస్తున్నాయి.

వేగు చుక్క కాబోలు గోపిని చూసి పరిహసించి వింతగా వెలిగింది.

వేగు చుక్కను చూచి కుక్కుటం అఱచింది.

కోడి చేసిన మేలుకొలుపు సద్దుతో నిద్ర పోతున్న లక్ష్మి అదాటున లేచి, చీర సర్దుకుని యథాలాపంగా ప్రక్క మంచంకేసి పరికించింది

కానీ గోపీ అక్కడెందుకుంటాడు?

ప్రక్కనున్న వారి గడియారం మూడు కొట్టడం స్పష్టంగా వినిపించింది లక్ష్మికి.

"అయ్యో! గోపీ బయటనే వుండిపోయాడా?" ఆందోళన ఆతుర్దాలతో ఒక్క సారిగా తలుపు తెరిచి బయటకు తొంగి చూచింది లక్ష్మి.

కానీ వెన్నెల తీవలు మాత్రమే ఆమెకక్కడ కనుపించాయి

ఏ అరుగుమీద గోపీ నిద్రపోతుంటాడని ఆశించిందో ఆ ప్రదేశంలో అతగాడు లేడు.

లక్ష్మిలో ఒక్కసారిగా విషాదం పెల్లుబికింది. కన్నీరు కట్టలు త్రెంచుకు ప్రవహించింది. "తనే గోపీని తనకు కాకుండా చేసుకుంది. నేరానికి మీరిన శిక్షను విధించింది."

కారుతున్న కన్నీళ్ళనా తుడుచుకోకుండా అలాగే చతికిల పడిందామె గడపమీద ఏం చేయాలి? ఎక్కడని వెతకాలి?"

ప్రతీ ప్రశ్నా ఆమెలోని అపభ్రంశపు వ్యూహాల్ని రేపి, సైపరాని కష్టాన్ని కల్గించింది.

"ఎందుకమ్మా ఏడుస్తున్నావ్?" తెల్లవారు జామునే పొలానికి పోతున్న ఓ పండు ముసలాయన ఆమెను చూసి జాలిపడి ప్రేమగా పల్కరించాడు.

"మా గోపీ కనుపించడం లేదండీ!" అన్నదామె గాద్గదికంగా.

"అలాగా అమ్మా! అన్నాడాయన సానుభూతి పూర్వకంగా, "కనిపిస్తాడు లేమ్మా. అలా అధైర్యం చెందితే ఏలా చెప్పు?" కరుణతో బుజ్జగించి ఆ ముది వగ్గు ముందుకు రెండడుగులు వేశాడు. కానీ మళ్ళీ వెనక్కు వచ్చి, లక్ష్మిని చూస్తూ "చూడూ! అబ్బాయి ఎలా ఉంటాడూ!" అన్నాడు.

లక్ష్మి నీరునిండిన కళ్ళతోనే జవాబిచ్చింది: "అదే ఎఱ్ఱగా వుంటాడు. చిరిగిన లాగూ..."

మధ్యలోనే ఆయనందుకుని "నాకా వివరాలైతే తెలీవుకాని, చూడమ్మా! ఎవరో కుఱ్ఱవాడు ఆ బెస్తవాడలోకి పరుగెత్తుకుంటూ పోవడం కనిపించింది. బహుశా——!"

ఇంకా ఆ ముసలాయన సరిగా జవాబైనా చెప్పలేదు. ఒక్కసారిగా లేచి నుంచుని పిచ్చిదానిలా పరుగెత్తిపోయింది బెస్తపల్లె వేపు లక్ష్మి.

"పిచ్చి పిల్లలు!" ప్రేమతో ఆశీర్వదించి, ఆ యింటి తలుపు దగ్గరగా మూసి ముందుకు సాగిపోయాడా ముసలాయన, తూర్పుదిక్కు ఎఱ్ఱబడడం చూచి.

# దిక్కులేని కుక్కపిల్ల

శ్రీ కె. ఆర్. రెడ్డి

పుడమి తల్లికి పురిటి నొప్పులు వచ్చి మూగగా మూలిగింది. నింగినిండా నీహారం కురిసింది. ప్రకృతి మాత పమిట విసిరింది. మలయానిలం మంత్రసాని తనంలో 'అమ్మా!' అన్న ఆ వేదనలోంచి 'కేవు, కేవు' మని కేకలు ప్రాదుర్భవించి ప్రపంచాన్ని పార వశ్య పరిచాయి

కర్ణుడిలాగా కవచకుండలాలు లేవు —

రాకుమారుడిలా రాజసము పుట్టి పడలేదు —

పుడమి గర్భంలో పూడిపోయిన నల్లబొగ్గులా నిగనిగలాడే కళ్ళు తెరవని కసుగందు 'కేవు' మంది.

అమరలోకం విరిజల్లులు విసరలేదు. గంధర్వులు గానం చేయలేదు. సముద్రాలు పొంగడము, వృక్షతతి విరియబూయడము, కోయిల కూనలు కుహూరుతాలు పాడడము, ఈ విశేషాలు ఏవీ జరుగలేదు.

పక్షులు నిదురోతున్నాయి. కొమ్మలు మోడు బారాయి. సముద్రం చల్లగా కునుకు తీస్తూంది. అర్ధరాత్రి వేళ కమ్మగా కన్ను మూయకుండా ఇంత అల్లరీ ఎందుకు చేయాలి అవి?

పుడమి తల్లి మాత్రం పురుటి నొప్పులతో బాధగా వొళ్ళు విరిచింది.

ఒకటి రెండు సృగాలాలు సృష్టిని చూస్తూ 'ఓ' మని ఓంకారం తీస్తున్నాయి.

ఎక్కడో ఊరి మూలనుంచీ ఆకలితో అరవలేని—కూటి బాధతో కునుకురాని—కుమిలిపోతూన్న కుంటి కుక్క మూగ.గా మూలిగింది.

ఎలకోసం వెదికి వేసారిన దివాంధము దిక్కులు చూస్తూ రెక్కలు తాడించింది.

'అఁ...మ్మాఁ!' కొడికట్టిన గుడ్డిదీపం కొంటె గాలికి గుప్పున ఆరిపోయింది.

మొరడు బారిన మోటుకొమ్మ మొగ్గ తొడిగి ఎండిపోయింది. కళ్ళు తెరవని కసుగందు మాత్రము 'కేవు' మన్నాడు ప్రకృతి మాత పమిటలోనుంచి.

నింగినిండా నీహారం. భూమినిండా నిద్రపనం. కుంటి కుక్కది మాత్రం కూనిరాగాలు.

*  *  *

'ఛీ వెధవముండా! వళ్ళవే యిక్కణ్ణుంచీ. ఇక మీదట గుమ్మము తొక్కావా బుర్ర పగులగొడుతా.' అంటుంది సరోజమ్మ.

'దీని జన్మ తగలెట్ట ఎంతపని చేసుకుంది పాపిముండ!' అని మొహంమీద ఎత్తి పొడిచి వెళ్ళగొడుతుంది సుబ్బాయమ్మ.

'ఏ నూతిలోనో—గోతిలోనో పడి విరగడై పోయివుంటే బావుండేది. నా కడుపున పుట్టేదు అగ్గి పోయటానికి పుట్టింది తూ్ఫ! పోవే సుమ్యం వదిలి. మొహం చూస్తే మూఫై యేళ్ళ శని ఆవాహనవుతుంది' అని చీదరిస్తుంది కన్న కడుపు

దారిన పోయే దానయ్య కూడా 'ఛీ' అని ఛీకొడ్తాడు.

ఎదురుపడ్డ వెంగళప్ప కూడా 'థూ్ఫ' అని వుమ్మి వేస్తాడు.

ఎందుకు? ఎందుకిలాచేస్తున్నారు వీళ్ళు? అర్థం కాలేదు సీతకి.

బుర్ర గిర్రని తిరిగిపోతూంది. కడుపు నకనకలాడుతుంది ఆకలితో. కడుపులోని కదలికలు 'అమ్మా' అని అంగలారుస్తాయి. కానీ, వీళ్ళందరికీ ఏమయింది? ఎందుకిలా దెప్పిపొడుస్తారు?

*  *  *

సీత పుడమిమీద పుట్టిందిమొదలు ప్రకృతిలోనే ఆడుకుంది. ప్రకృతిలోనే పాడుకున్నది. 'తిక్కది' అన్నారు అందరూ. 'పిచ్చిదే!' అన్నాయి కన్నకడుపులుకూడా.

వీధిలోని దుమ్ము నెత్తినిండా నింపుకున్నపుడు ఆకాశం వర్షించి అభ్యంజనం చేయించింది. ఒళ్లుమరిచే

నిదుర కళ్ళి నావరించినపుడు అంకాలమ్మ దిన్నెమీది అష్టరాళ్లన్నీ హంసతూలికల నమర్చాయి. వేపపూవులు ప్రియబాంధవులుగా తనతో ఆడుకునేవి. తాళ్ళ పూవులు ఆభరణాలుగా తనను అలంకరించేవి.

అప్పుడు అందరూ తనను పిచ్చిది అనేవాళ్ళు. బుర్ర గిర్రుమనేలా మొట్టికాయవేసి పళ్లికిలించేవాళ్లు. పకద్రోసి పరిహసించేవాళ్లు. అది వాళ్ళపిచ్చి ఇది తనపిచ్చి.

'ఏయ్ సీతీ! ఆ తొట్టినిండా నీళ్ళుతోడూ' అనేది సరోజమ్మ.

'ఏమే సీతీ! ఆ కొట్టంలో కాస్త చెత్త వూడ్చిపెట్టు' అనేది సుబ్బాయమ్మ.

సీతి ఎవరు చెప్పినా ఏదిచెప్పినా అన్నీ చేస్తుంది ఊరందరికీ చాకిరీచేస్తుంది. అందరికీ చుట్టమే. కడుపునిండా కమికడన్నం పడేస్తారు. ఒంటినిండా అంతబట్ట పడేస్తారు. అంతా మనవాళ్లే. స్వంత గృహంతో తనకు నిమిత్తంలేదు. అక్కడ తనను తలచేవాళ్లు లేరు. తను పిచ్చిది. చిన్నితమ్ముడిమీద అంతగా ఆశవేస్తే ఎప్పుడేనా వెళ్లి ముద్దాడబోయేది.

'ఛీ! పిచ్చిముండా! వాణ్ణి ముట్టుకోవద్దు' అనేది చెల్లెలు.

'దాన్ని కాస్త అబ్బాయిదగ్గరనుంచీ దూరముగా వెళ్లమనవే' అనేది అమ్మ.

తనుకూడా వీరాసామికూతురే. ఆ కుగ్రామంలో ఎకరా పొలము, ఒక పూరిగుడిసె, జతఎడ్లకు ఖామందుడైన వీరాసామి కూతురే తనుకూడా. అయినా తమ్ముణ్ణి తనను తాకనివ్వరు. ఛీకొడుతారు. 'హుం! పిచ్చివాళ్లు!' అని వెళ్లిపోతుంది సీతి.

ఊరిలోని పిల్లలంతా ఆమెకు తమ్ముళ్లే. తనతో ఆడుకుంటారు. ఏడిపిస్తారు. వెంట్రుకలు లాగుతారు. దుమ్ముచల్లి ఆనందిస్తారు. అప్పుడే ఆప్తులైపోయి చిరుతిండ్లు తెచ్చిపెట్టి నవ్విస్తారు. సీతి పకపకనవ్వుతుంది. వాళ్ళూ నవ్వుతారు. అంతా పిచ్చి.

వాళ్లు నిదురపోయే వేళల్లో సీతి ప్రకృతిలోకి జారుకుంటుంది. చీమలు, మిడుతలు, నానావిధాలైన పురుగుజాతులూ తనకు మిత్రులే. వాటితో ఆడుకుంటుంది. వాటితోనే పాడుకుంటుంది. ఏ బండమీదనో, [illegible]దనో కాసేపు కన్నుమూసి వూర్కు చేరుకుంటుంది. పిచ్చిసీతి! 'పిచ్చి ప్రపంచం' అంతా అఖండ విశ్వంలోనే.

మొరడుబారిన మోటుకొమ్మకూడా వసంతం వస్తే పసిమి తిరిగి మిసిమి చూపిస్తుంది. ఒక్కటి— కనీసం ఒక్క సుపత్త చిగురునైనా చివురింపజేస్తుంది. ప్రకృతి సిద్ధాంతాన్ని పరాభవించడం దానిచేతకాదు.

నల్లని కళ్ళు, ముచ్చటైన మొహం, సంస్కారంలేక వంపులుకట్టిన గుబురువెంట్రుకలు, వయసులోని శరీరం పిచ్చి పిచ్చిగా వంపులుదిద్దుకుంది పిచ్చి సీతికి.

పెళ్ళిపందిట్లో మేళతాళాలు మేళవించుకుని మంత్రపఠనాలు మారుమ్రోగుతున్నాయి. పచ్చతోరణాలు పరిఢవిల్లుతున్నాయి చిట్టి చెల్లెలు పసిడి బొమ్మలా కూర్చుంది వరునిప్రక్కన మొహంవంచుకుని. పిచ్చిగా చూసింది సీతిపిల్ల. చల్లగా ఒక నవ్వు నవ్వుకుని అంకాలమ్మ దిన్నెకు పరుగుతీసింది

'చెల్లె - మరిది' ఉహూ 'మరిది - చెల్లె' రెండు గొగ్గిరాళ్ళను నిలబెట్టి, పందిరి పెట్టి, తాటాకు మేళం పట్టింది. పెళ్ళిబాగుంటుంది పెళ్ళి, రెండు మిడతలను పట్టుకుని పందిట్లో కూర్చోబెట్టి మేళం వూదబోయింది అవి రివ్వున లేచిపోయాయి 'పెళ్ళి- మిడతన్నకు పెళ్ళి!' అంటూ రాగాలను లంకించుకుంది.

'ఎందుకు పిల్లా అలా ఏడుస్తున్నావు?' అంటూ విస్తుపోయాడు పాత్రలమూట భుజాన వేసుకుని వెడుతూన్న బుర్రమీసాలాతను. గిరజాల క్రాపు. మాసిన మల్లుజుబ్బా. ఎగచెక్కిన పాత పైజమా. నవ్వొచ్చింది సీతికి.

'మిడతన్నకు పెళ్ళిచేద్దామంటే ఎగిరిపోతున్నాడు' చూడూ కళ్ళుతుడుచుకుంది.

'పిచ్చిపిల్ల!' అనుకున్నాడు సుంకన్న. 'ఏయ్ పిల్లా! గార్లదిన్నె ఎంతదూరముంది యిక్కడ్నుంచీ?'

'గార్లదిన్నె! మావూరేకదూ? ఇక్కడేవుంది. వెడదామురా' అంటూ గంతులేసి నడిచింది. సీతిపిల్ల.

సుంకన్న ఊరిఅవతల పూరిపాకలో మకాం వేశాడు. పాత పాత్రసామగ్రికి కొత్తవస్తువులు మార్చడం అతడివృత్తి. ఒకవూళ్లో మకాం వేసి చుట్టుపట్ల పల్లెలన్నీ తిరిగాక మజిలీమార్చడం అలవాటు.

ఊరిలోని పిల్లలందరూ సుంకన్నకు రెండు రోజుల్లో మచ్చికైపోయారు. అందరూ నెమ్మ

దిగా చుట్టూ చేరి కూర్చుంటే కాసేపు మాధుర్యంగా మురళి వాయిస్తాడు. తాటాకులతో రకరకాల పీకలు చేసి పిల్లలకందరికీ యిస్తాడు. చాలా సరదా మనిషి.

సీత అక్కడే కూర్చుని సుంకన్న చేసే వింత పనులన్నీ చూస్తూవుండేది. అతడు వాకిటి చెత్తవూర్చ మంటే - వూడ్చిపెట్టి - అతడి మీదపడి నాకూ ఒక పీక చేసి పెట్టమనేది. ఒక్కోరోజు పిల్లలందరూ ఆడుకుని వెళ్లిపోయాక కూడా సుంకన్నవున్న గుడిసె చూరుక్రిందనే మైమరచి నిద్రపోయేది. తనను లక్ష్యం చేసేవాళ్లులేరు. ఎక్కడికెళ్లావు అనేవాళ్లు లేరు. తనే ప్రకృతి. ప్రకృతియే తాను.

వసంతం వస్తే మోడుకొమ్మ - ఎంత మోడుదైనా చిగురించి తీరుతుంది. కనీసం ఒక - ఒక్క మొగ్గ చివురైనా అంకురిస్తుంది. ఆ చిగురాకుకు అంతగా లేకున్నా - కొంతైనా అందమువుంటుంది.

నల్లని కళ్లు - చుట్టలు తిరిగిన సంస్కారం లేని జుత్తు, పిచ్చి పిచ్చిగా మిట్ట పల్లాలతో వంకరలు తిరిగిన వయసు శరీరం, అర్థరాత్రి పండువెన్నెల్లో వెర్రిగా వెల్లకిలబడి నిదురపోతున్న సీతి పిల్లలో పిచ్చి సౌందర్యాన్ని వెలకోల్పాయి ప్రక్క పల్లెనుంచి అప్పుడే యింటికి వచ్చిన సుంకన్న చూరు క్రింది సీతి పిల్లను చూశాడు.

దిక్కు లేని కుక్క. ఎక్కడ పడితే అక్కడ నిదురోతుంది తలచేవాళ్లు లేరు. మనిషే, మాంసం, రక్తం అన్నీవున్నాయి.

ఏకాంతం. ప్రకృతి స్తబ్దత. ఆనల్లనికళ్లు, చంద్రుని మొహం, ఎత్తుపల్లాలు, మాంసపు హంగు! మతి పోయింది సుంకన్నకు. చుట్టూ చూశాడు. ప్రకృతి పలకరించింది. చెట్లు చెవులొగ్గి వింటున్నాయి. ఇంకెవ్వరూ లేరు.

అతడిలోని నీచమృగం గర్జించింది. సీతిని స్పృశించాడు. వులిక్కిపడి. లేచి "నువ్వా! నాకు పీక చేసివ్వకుండా యిందాక ఎక్కడికెళ్లావు? ఇప్పుడు చేసివ్వు" రాగాలు తీసింది సీతి.

"లోనికి పోదాం రా - పీకలు గాదెమీద వున్నాయిగా"

పిచ్చి గంతులేస్తూ మగతలో ఒళ్లు విరిచింది సీతి. వంపులు, సొంపులు, ఎత్తులు-పల్లాలు-పిచ్చిలో సౌందర్యం.

సుంకన్నలోని పిచ్చి పశువు ఆంక్ష వేసింది. వేడి నెత్తురులు రెండూ స్పృశించుకున్నాయి

"ఏంటది" అంది సీతి. కానీ వసంతం — మోడు కొమ్మలో కూడా ఏవో పులకలెత్తాయి మొగ్గలు వేసి పుష్పించింది.

* * *

"పాపిష్టి ముండ! ఎంతపని చేసుకుంది!"

"గాడిద కొడుకు, నోరులేని పిచ్చి ముండతో పాపి కూడు కుడిచి, దాని జీవితంలో కొరివి పెట్టాడు."

ఏమిటి వీళ్ళను కోపడము? ఎందుకిలా మొహం చిట్లించు కోవడం? అయోమయంగా కనిపించింది సీతి పిల్లకు. సుంకన్న పీక చేసివ్వకుండా వెళ్ళిపోయాడని ఏనులంబటుపడి ఏడ్చింది. కనబడ్డ ప్రతి అమ్మలక్కలూ తన కడుపువైపే చూస్తూ చెప్పి పొడిచారు.

ఏముంది కడుపులో? ఏవో కదలికలు. క్రొత్త క్రొత్త కదలికలు. నూతనమైన — తన పిచ్చి మనసుకు గోచరించని అనుభవాలు!

ముందు ప్రతి గుమ్మమూ తనను ఆహ్వానమిచ్చేది. ప్రతి అమ్మా కమికన్నం పడేసి కమ్మగా మాట్లాడించేది. కానీ — కానీ యిప్పుడు కళ్లు చెరవని కసుగందు కూడా తనను గుమ్మం త్రొక్కవద్దని గదమాయిస్తుంది. కనపడ్డ ప్రతి అమ్మా కళ్ళెర్రజేసి చూస్తుంది. కన్నతల్లి కూడా కళ్ళనీళ్లు బెట్టి "పాపిముండా! ఎక్కడేనా వెళ్ళి బావో — నూయో చూసుకోరాదూ!" అంటూ వ్రేళ్లు విరుస్తుంది.

ఏమిటిదంతా? ఎందుకు ప్రపంచమిలా మారిపోయింది? చేలోకి వెళ్ళిపోయింది సీతి. మిడతలు రెండు పట్టుకుని కాసేపు ఆడుకుంది. గుంటినీడలో ఘడియసేపు కునుకుతీసింది. ఆకలేస్తోంది. ప్రొద్దు అంకాలమ్మ దిన్నక్రింద అస్తమిస్తోంది. కడుపులో అలసట. క్రొత్తక్రొత్త కదలికలు. ఆరాటము. ఊళ్లోకి వెళ్ళి సుబ్బాయమ్మను కాస్త గంజి పోయమని ప్రాధేయపడింది.

"ఛీ! ముండా. గుమ్మం తొక్కవద్దని ఎన్ని సార్లు చెప్పాలి నీకు? శని కూర్చుంటుంది ముండ

మొహం చూస్తే. పళ్లు ఆవతలికి." కట్టె చేతిలోకి తీసుకుంది సుబ్బాయమ్మ.

వెంటనే అంకాలమ్మ దిన్నె మీద గుండా ప్రక్కనున్న పట్నానికి దారితీసింది సీతిపిల్ల.

సంఘం, నియమాలు, నిబద్ధాలు. కట్టుబాట్లు, ఏమి తెలుసు సీతిపిల్లకి యిన్ని యిబ్బందులు వస్తాయని? సంఘమంటే గోజా పుల్లపొద అని ఆమెకు ఎవరు నేర్పారు? ప్రకృతిలో పుట్టింది. ప్రకృతితో పాడింది. సుంకన్న ఏదో తనకు తోచని—తనకు అందని అనుభూతి నొకదాన్ని అందించాడు. అందుకుంది. అంతే.

కడుపులోని కుర్రకుంకడు ఆకలితో అల్లరి చేసే నవమమాసం నడుముకు చుట్టుకుంది. బాధ. ఆవేదన. పట్నంలోని కుక్కలు — అవీ కుంటికుక్కలు — కురూపి కుక్కలు —ఎంగిలి ఆకుల్లోని కూటిమెతుకులు కూడా తనచేతికి అందనివ్వవు. అంకాలమ్మ దిన్నె మీద దిమ్మదిరిగేలా గంతులేసేది సీతి. కాని ఈనాడు కూర్చున్న చోటునుంచీ కదలడమే కష్టమయి పోయింది.

ఏమి రోగమ్మా ? ఎందుకొచ్చింది ? చిరాకేసింది సీతికి. కష్టం మీద కదిలింది గార్లదిన్నెకు అభిముఖంగా.

"మళ్ళీ తగలడింది పీడముండ! ఎక్కడో విరగడయిపోయిందనుకున్నాము." ఇంట్లో పిల్లా జల్లా అంతా దెప్పి పొడిచారు.

ఊళ్ళో అందరూ వుమ్మివేశారు.

కాని కమికెడన్నం పెట్టిన పాపాన పోలేదు ఎవరూ. కడకు గుటికెడు నీళ్లు పోయలేదు. ప్రపంచం. నియమాలు...నిబంధాలు...

అడుగుపైన అడుగు వేసుకుంటూ అంకాలమ్మ దిన్నెకు వెళ్ళింది సీతిపిల్ల. తాటాకులు పీకలు చుట్టింది. వాయించలేక పోయింది. రాళ్ళు నిలబెట్టి కొనుగ ఆకులతో గుడి కట్టాలనుకుంది. కాని కదలలేక పోయింది. సూర్యుడు కూడా ఎర్ర ఎర్రగా కళ్ళెర్ర చేసి దిన్నె క్రిందకు చేరుకున్నాడు. మంచు, పొగ మంచు కురుస్తోంది. చలి శరీరాన్ని చిదికేస్తోంది. వెండి చంద్రుడు మట్టుకు వెలుగుతూనే వున్నాడు.

మెల్లగా ఏటి వంకకు కదిలి కడుపునిండా నీళ్ళు త్రాగి నల్లరాతి గుంటకి చేరగిలపడింది సీతిపిల్ల. ప్రపంచమంతా ప్రశాంతంగా నిద్రపోతోంది. కానీ తనకు కునుకు రాదు. కడుపులో ఏదో కల కల, బాధ, సుస్తీ, చలి, చెమ్మ. క్రిందకు వాలిపోయింది సీతి. కళ్ళు మూతలు పడుతున్నాయి. కాళ్లు గుంజుకుంటోంది.

ప్రకృతిమాత పమిటె విసిరింది.

సెలయేటి చిరుతరగలు వింజామరలు పట్టాయి.

పుడమితల్లికి పురిటినొప్పులు వచ్చి మూగగా మూల్గింది.

ఊరి చివరను కుంటికుక్కకు కునుకు రాక 'కయ్యో' మని కాళ్లు కడుపులో దాచుకుంది కట్టాకలితో కంపించిపోతూ.

చిన్ని దీపాన్నొకదాన్ని చిత్రంగా వెలిగించేసి కొడి కట్టిన బుడ్డి దీపం గుప్పుమని ఆరిపోయింది.

'కేవు' మన్న కేక మాత్రం ప్రపంచాన్ని పారవశ్యం పొందించింది.

ఆకాశంలోనుంచి అలరు వర్షం కురియలేదు.

గంధర్వవధులు గానం చేయలేదు.

మొరడు బారిన మోటుకొమ్మ మాత్రం మొగ్గ తొడిగి ఎండిపోయింది.

# "పిరదౌసి"

శ్రీ ప. గోపీచంద్

"దాటి పోయిన యుగముల నాటి చరిత్ర
మరల పుట్టింప గవియె సమర్థుడగును"

నవ్యాంధ్రకవి ప్రపంచమున జాషువా ప్రసిద్ధుడు. ఈతని సేతలయందు "పిరదౌసి" ప్రముఖస్థానమును వహించియున్నది.

ఈ కావ్యమునందలి కథావస్తువు దేశీయము కాదు. ప్రాచీన పారసీక కవులలో ప్రసిద్ధుడైన పిరదౌసి చారిత్రమును స్వీకరించి- జాషువాకవి యీ లఘు కావ్యమును సంతరించెను.

విశ్వసారస్వత చరిత్రలో గవులు పేదలగుట గమనీయాంశము. వారికి శారద యనుగ్రహము ప్రాపించినదే కాని లక్ష్మి వారిని బొందలేదు. లౌకికముగ బేదలగు కవుల సాహిత్యపూజ, వారి కాశ్రయమిడు రాజుల యాగ్రహానుగ్రహములు, కవి బ్రతుకుబాట యందలి వెలుగు చీకటులు నీ కావ్యమునందు బ్రదర్శితములు. కవి సంఘమున వహించిన స్థానమెట్టిది? అతని నితరమానవు లెట్లర్థము గావించుకొనుచున్నారు? వారి మనస్తత్వము లెట్టివి? యనునంశముల నీ కావ్యమున దృష్టాంతీకరించుట జాషువా కవి యుద్దేశము.

మన తెలుగు సారస్వత చరిత్రము నే లక్ష్యముగ గ్రహించిన నీవిషయము గ్రాహ్యమగును. పూర్వ రాజులు నిరంకుశులు. తమకీర్తిప్రతిష్టలకై వారొనర్పని మారణ హోమములును, రక్తపాతములును లేవు. వారి రాజ్యతృష్ణ యంత బలీయమైనది. కవి పక్షపాతులరుదు. కవులును బేదలగుటచే దామాశ్రయించిన నృపులను గల్పతరువులుగను, నింద్రచంద్ర సదృశులుగను, శిబిబలి కర్ణులుగను వర్ణించి, తమకృతులను వారి కంకితమొనర్చి, విభవముల నార్జించుకొని మనుచుండిరి. భారతదేశపు సరిహద్దుల వెలుపల నున్న మానవ సంఘములందుగూడ నిట్లే జరిగినది. గజనీ పట్టణమును రాజధానిగావించుకొని, యఫ్ఘన్ దేశము బాలించు గజనీ మహమ్మదు కాలమున జరిగిన విషాద వృత్తమే యిందలి కావ్యవస్తువు. రాజు బలవంతుడు, పైగ ధనికుడు. కవి బలహీనుడు, అందును నిరుపేద. రాజు నిజాధికారమును, నాత్మతేజమును, నమ్ముకొనెను. ఇక గవి దైవబలమును గవితా మహత్త్వమును విశ్వసించెను. ఈ యిరువురకును నడుమజరిగిన యొకతీవ్ర సంఘర్షణము (conflict) ఈ కావ్యమున వర్ణితమైనది. రాజునకున్న చతురంగ వాహినీ బలముకంటె, సామంతరాజుల యండకంటె, నిజభుజవీర్యముకంటె, నియంతృత్వముకంటె, బదునైన కత్తికంటె; సంఘములో నేమాత్రమో నిరాడంబరముగ జీవించు కవియొక్క కలము వాడియైనదని యీ కావ్యమున నిరూపితమైనది. తాను జేసిన దత్తప్రతిజ్ఞను భంగించుకొని, దండశాసనుడై పాలించు రాజుపై, నెవరి సహాయము బొందజాలని యొక నిర్భాగ్య కవి పోరాడించి తిరుగుబాటు సల్పి, తన శాస్త్రముచే శస్త్రము నోడించి, తుదకు క్రూరుడగు రాజునందు నైతిక చిత్త సంస్కృతి గల్పించెనని యీ కావ్యమున బ్రదర్శితమైనది.

ఈ కావ్య మింత హృద్యముగనుండి సహృదయ హృదయములకు గాఢముగ హత్తుకొను నట్లుండుటకు ముఖ్యహేతువు కవి పొందిన స్వీయానుభూతి యనదగును. కవి, తాను రచించిన పీఠికయందీ కథను దానేదియో పత్రికయందు జదివినట్లును, వెంటనే మనసు కరుగగా, నీ కావ్యరూపమున సంతరించినట్లును దెలిపిరి. ముఖ్యముగ మెచ్చుకొనదగిన విషయమొండు కలదు, అభూతాంశములను, స్వకపోల కల్పిత గాథలను నాలంబనముగగొని, కవి, యీ కావ్యమును వ్రాయలేదు. మన యందలి నడుమను రక్తమాంసములతో నివసించి, జీవించి, మన సానుభూతిని వాంఛించి, మట్టిలో గలిసిన యొక నిర్భాగ్య మానవుని జీవితయాత్రను వస్తువుగ గొని, కవి, యీ కావ్యమును వ్రాసెను. ఇది ముదావహము. చారిత్రిక సత్యముతో గూడిన యీ కథ కలతిమార్పుల జేసి, కవి యొక రసవత్తర కావ్యమును వ్రాసి శ్లాఘ్యుడైనాడు. అందును వర్ణనములపట్ల మాత్రమే యీ మార్పులొనర్పబడినవి.

కావ్యము బూర్తిగ పఠించి, ముగించుసరికి, భావుకుల డెందములు, కవిపై జనించిన సానుభూతిచే నార్ద్రములగును. ఈ కావ్యమున బ్రధానముగ గోచరించు నంశము పిరదౌసి కవికిగల స్వాత్మాభిమానము. ఇట్టి గుణముండుటచేతనే, తన్నేలు రాజును గూడ ద్రోసి రాజనగలిగినాడు. రాజుయొక్క దండశాసనమునకు భీరుడు కాలేదు. తానాశించిన ధనమును

రాజీయలేదు — కావున నిరాశనొందిన పిరదౌసి యాశాపరునిగ దోచవచ్చును. నిజము మాడ నది సరి కాదు. ముప్పదియేండ్లనేక కష్టముల నెదుర్కొనుచు, కూర్చిన కావ్య మర్హసత్కారముల బొందకుండెనే యనియే కవి చింత. అంత దీర్ఘకాలము నింతటి నైరాశ్యమును, నిరుత్సాహము జొందుటకేనా తాను వెచ్చించినది? ఇదియే యాతడు పొందిన యాజన్మఖేదము. తన కావ్యప్రాశస్త్యము నెఱుగుటకు రాజు పాత్రుడు కాకపోయెను. తుదకు దన దేహముపై మృత్యువు నీడలు పడెను. తన యంత్యదశయందు జిత్తశాంతి లాభింపకుండెనే యనియే కవి బాధపడినాడు. నాకు జూడ, నీ కావ్యమునందలి కవి, విశ్వసారస్వత చరిత్రములందలి కవి సంఘములకు బ్రతినిధిగ సూచింపబడినాడని తోచును.

పిరదౌసి, యాంగ్ల సారస్వతమునందలి ప్రకృత్యభిమాని యగు 'వర్డ్స్వర్త్' కవివలె, ప్రకృత్యారాధనా ప్రియుడు. జీవితమునందు జాల భాగము ప్రకృతియందే గడపినాడు. ముప్పదేండ్లు నగ్నప్రకృతియందే వసించి, 'షానామా' కావ్యమును వ్రాసినాడు. కాందిశీకుడై, తూసు నగరమునకు జనునపుడు మధ్యమార్గమునందు ప్రకృతి స్తవమొనర్చినాడు. ఈతని ప్రకృతిప్రీతి నే జాషువా కవి యిట్లు వర్ణించును.

సీ॥ ముసురు కోయిల కంఠమున నివాసము సేయు
కొసరింపుఁ బూఁతల గుట్టుఁ దెలిసి
ప్రతి పుష్పగంధ గర్భముఁ జీల్చికొని వచ్చు
పిల్లగాడ్పుల జన్మవృత్త మరసి
మేఘంబు తెరచాటు మెఱపు భోగముసాని
మోసగింపుల యర్థమును గ్రహించి
శరధి నాయకుని క్రొన్నురువు పిల్లల తీఱు
బడి లేని యాటల భావ మెఱిఁగి

ముగ్ధ మోహన సౌందర్య పూర్ణయైన
ప్రకృతి రమతోడ స్నేహ భావమున మెలఁగి
ముప్పఁదేడులు సర్వాంగ పుష్టి మెఱయఁ
గబ్బము రచించె పిర్దౌసి కవి వరుండు."

రాజుచే శాసితుఁడైన పిదప, పిరదౌసి "భవ్యకవితా వేసడై" చేసిన కవితా పరిశ్రమము మెచ్చుకోన దగినది. పారశీకగ్రంథభాండారముల నెల్ల బరికించి "తీయని పదము లేఱి", "వ్యంగ్య వాచ్యార్థమహాంభోనిధానంబు దరిచి ముత్యములు రత్నములు గూర్చి", "లలితంబులైన యలంకారముల నెల్ల బోరలించి, మేలైన సరకులెత్తి, దిరిసెనపుంబూవు కరణి ముద్దులు గారు శయ్యావిలాసంబు సంతరించి, శాసనంబు లన్ని పరికించి సకల రాజ చరితలం దింత సత్యంబు జాఱనీక" కావ్యమును రచింప సాగినాడు. రాజుల చరిత్రములను వర్ణించుపట్ల, మన కవులకంటె పారసీక కవులు త్రొక్కిన త్రోవ విచిత్రముగ నున్నది. వారు శాసనముల బరికించి "యింత సత్యంబు జాఱనీక" కబ్బములను రచించెడి వారట! ఇక మన కవుల కట్టిది రుచింపకుండెననుట విజ్ఞులెఱిగినదే కదా!

ఇట్టి కవితా వేసడగు పిరదౌసియెట్టి యుస్థితిని గలఁ డొకనుడు. కవి లేఖినిని బూనినంతనే, వాణి తల వాల్చినది. భావ యంతయును వాని యధీనమైనది. దీనినే, జాషువా

"వాని డెందంబు సోకిపోవని తలపులు
వాని కన్నుసన్న దలలు వంపని యుపమలు
వాని కలమున గులుకఁ జూపని పదములు
మందునకు లేవు నాటి వాఙ్మయమునందు" యనెను.

పోనిండు, పారశీక కావ్యములందు "దలలు వంపని యుపమలు లే"వట! ఇక మన కవులకు "దలలు వంపని యుత్ప్రేక్షలు, అతిశయోక్తులు" నసలే లేవుకదా! అట్టియెడ, వారి యుపమాప్రయోగములు న్యాయములే!

అట్లు కావ్యదీక్ష నూనిన పిరదౌసి యొకరాత్రి "సవళించి, ముమ్మరముగ ముసురుకొని వచ్చు తలఁపు గుంపులను రసముఁబొందఁ జేయుచుఁ గన్నులు మోడ్చి యుండ" నొక కల వచ్చినది ఆ స్వప్నమున "పారసీక సతులం దాకారరేఖా సుభ్రశీకిం బట్టపు రాణియైన యొక రాజీవాక్షి" సాక్షాత్కరించి, కవిని, మోహితునిగఁజేసి, తన్నుఁ జేపట్టుమని యడిగెను. సంతసముతోఁ గవి యంగీకరించి, యా స్వప్న సుందరినిఁ గౌఁగిలించుకొనునంతలో, నాకస్మికముగఁ "గఱకు శాణం బొందు డెందాన గ్రుచ్చిన యట్లై" మేల్కొని, దానిని గూర్చి యోజింపసాఁగెను. "హృద్యకావ్య రచన నేకాగ్రత వహించి కళవళంబులేని కవి మనస్సు" దీని గలతజెందెను. జాషువా, భావి సూచకముగ.

"పగని సుఖ దుఃఖముల ముందు నడచి వచ్చు
నీడలే స్వప్నములు సుమ్ము నిశ్చయముగ
కాల చక్రంబు గంభీర గమనమందు
దాఁగికొని యెన్ని యెన్ని చిత్రములు కలవో!"

యని వ్యంజించిరి. ఆంగ్లమున "Coming events cast their shawdows before" అను సూక్తికి నిది ఛాయ. ఈ కల వెంటనే ఫలించినది. ప్రొద్దుననే, యొక వార్తాహరుడు వచ్చి, కవి భార్య వ్రాసిన యొక లేఖను జూపెను. అందాతని మూడేండ్ల కొడుకు గతించినట్లు కలదు. ఇక పిరదౌసి దుఃఖమున కవధి

లేదు. కాని సుఖమెప్పుడును వాసము చేయదుకదా! క్రమముగ "కాలపురుషుండు దినదినాకారుండగుచు భార్గవుని భాతి నోదార్చి పోవుచుండె"ను. మఱి రెండేండ్లకు బుత్త్రికోదయమైనంతనే, 'సానందుడై' కావ్యమును రచియింపసాగెను. తుదకు గావ్యము ముగిసినది. ఈ ముప్పదేండ్లును నిద్రాహారములను విసర్జించి, కావ్యము వ్రాయుటకై దాపొందిన కష్టములకిది పంటయని పిరదౌసి యెంతయో మురిసిపోయినాడు. ఇక దన జీవితమంతయు వెన్నెల కాయునని తలచినాడు. తాను పయనించు బాటలో బువ్వులు కురియునని యూహించినాడు. వాగ్దానము ననుసరించి, సుల్తాను, తన్ను, బంగారు నాణెములతో గనకాభిషేకము నొనర్చుననియు, రాజాస్థానములోని కవి పండితుల మధ్య తాను గర్వముతో దలయెత్తుకొని తిరుగవచ్చుననియును భావించినాడు. విశ్వసారస్వత చరితయందు దన పేరుజ్జ్వలముగ భాసించునని నమ్మినాడు. తాను బొందు సుఖానందములలో నిజదారాసుతులకూడ బాలు పంచుకొందురనుకొనినాడు. రాజాజ్ఞనొంది, కావ్యమును బఠించుచు:

సీ॥ కంపంబు గదుర జెంగట నిల్చు నొకసారి
యుక్కు పుప్పొడిరాలు యుద్ధభూమి
పులక లుప్పొంగ గన్నుల గట్టు నొకసారి
చెలఁగు రాజుల యేలుబడుల బొమ్మ
ఆనందమొదవ బ్రత్యక్షించు నొకసారి
మగువల కడకంటి మంత్రశక్తి
దయనిండి పాఱ బ్రదర్శించు నొకసారి
బక్కచిక్కిన పేదవాని బ్రతుకు,

సున్నితంబైన కవి మనస్సున వసించు
కల్పనాశక్తి బహువిధ గతుల మెఱయ
పాదుషాతోడ నతని దర్బారు సీమ
సంచితానంద జలనిధి ముంచి తేల్చె.

పిరదౌసి కవి మనస్సు సున్నిత మగుటచేతనే, యందు వసించు కల్పనాశక్తి, "షానామా"ను విభ్రాజిత మొనర్చెను. తత్కావ్యామృత రసాస్వాదనా సంజనిత ప్రమోదముచే సభికుల మానసము లుఱ్ఱూత లూగ జొచ్చినవి. అతని

"పదముల పొందిక, ఘట్టపుఁ
గదనున కెనవచ్చు పద్యగమనము, రస సం
పదయును, స్వభావశబలతియును" వారి నాక

ర్షించినవి. కావ్యరసౌత్కృష్ట్యమును రాజు ప్రశంసించెను. నిండు మనస్సుతో పిరదౌసి నివాసముజేరెను. పద్యమున కొక్కొక బంగారు నాణెమిత్తునని బాస చేసిన పాదుషా, లుబ్ధుడై, యఱువదివేల వెండి నాణెములను బంపెను. కవి యాశాసౌధములు నేలకూలినవి. నైరాశ్యతిమిర పటల మతని మానసమున గ్రమ్ముకొనినది. రాజు వర్తనముపై నాతని కేహ్యాసు కలిగె—

"పొరలు కొనివచ్చు సుఖంపు వెరల నదుము
నా కృతి వహించి యున్న నిరాశ వంటి
యుత్తరము"ను నిందాసహోక్తికముగ వ్రాసి

పాదుషాకు బంపెను. "ఓ సుల్తాను మహాత్ముడా! నేను నిర్మించుకొనిన యాశాసౌధములను గఱకు గుండెతో గూల్చితివి దారుణ రక్తపాతము లొనర్చి, హింసనే ప్రేమించు నీకు గమనీయ కవితా సుధను జిందించిన పాపము నాకీ శిక్షను విధించినది. తుదకీ ముప్పదియేండ్ల సేవకు "నిరాశాంకిత బాష్పములే" ఫలములైనవి. "ఒక్కొక్క పద్యమునకు నొక్కొక్క నెత్తురు బొట్టును" నెచ్చించితినే! నా శ్రమ నెఱుగ గలవా? అల్లా తోడని వచించి, వంచించితివి. నీ యశస్సు కలకాల ముండునట్లు చక్కని మేడగట్టి, దీర్ఘాయువు బోసితివి—త్వదన్యాయ వల్లికి. వట్టి చేతులతో సంధకారమున బడి—పోయెదను. అహోస్వయశము నీకు సర్హత నాపాదించితిని. ఇక నేను సమాధి శయ్యపై జేరి, ముప్పదేండ్ల ప్రయాసను దీర్చికొందును" అని వ్రాసిన యాతని లేఖను బాదుషా చదువుకొనెను. నెత్తురుడికెను. క్రోధముచే, భటులను బిలిచి, పిరదౌసిని బట్టి వధింపుడని మొదలయిడెను. ఇక గొండెగాండ్ర కవకాశము లభించినది. పిరదౌసిపై గొండెములు చెప్పి, రాజును మఱింత రెచ్చగొట్టిరి. "ఇచ్చిన సొమ్ముగొని తుష్టి వహింపరాదా!" యని హేళన చేసిరి. సభికుల మనఃప్రవృత్తిని జాషువా యిట్లు సూచించును.

"రాజు తలమీద గవి కప్పురంబు చల్లె
సుకవి తలమీద రాజు నిప్పుకలు విసరె
గొంద ఱేపుణ్యమో చేరుకొనియె ననిరి,
కొంద ఱేపాపమో పట్టి కుడిచె ననిరి."

రాజశాసనమును వినిన యొక పండిత పక్షపాతి రాజాజ్ఞను పిరదౌసికి వినిపించెను. వినిన కవికి, భీతి కలుగ లేదు. కోపమును రాలేదు. మఱి, యఱువదివేల దీనారము లస్త్రములై, తన కుత్తుకను గోయుట కుద్యమించిన విధానము. సర్వము నాలకించిన యాతని "ముఖాబ్జమునఁ జిన్నని నవ్వుదయించె"నట. ఎందులకు?—"మింట నీశ్వరుడు కలండో లేఁడో" యను సంశయము కలిగెను. ఈ న్యాయాన్యాయములను జూచుటకు దేవుఁడను వాఁడు కలఁడా యని సంశయము—పైఁగ, నేదియో మహత్తర ఫలమును గాంక్షించి, తుదకు నిరాశ నొందుటచే, నైరాశ్యమును స్ఫురింపఁజేయు "చిన్నని నవ్వు" సహజములే! "ఆనిపైఁ బొడమిన

స్నేహ్యభావము మఱింత వృద్ధి కాఁగా, నా పట్టణమును తన భార్యా తనయులతోఁ గూడ వదలి, తూసు నగరమునకు జని, యట శేషజీవితము గడుప నిశ్చయించెను.

ప్రతి క్షణమును దన్నాటంక పఱచు క్లేశములకు సంసిద్ధేను. దృఢసంకల్పముతో ఘోరాటవులను గమించుచుండెను. సంజప్రొద్దు పొడమినది. నానాశకుంత సంతానము గూండ్లకు జేరుకొనుచున్నవి. ఇంతలో నాకసమున గాఢము మొయిళ్లు క్రమ్ముకొనసాగెను. పిదప. "చిటపట చినుకులు చిలుకరించెనే కాని కుంభవృష్టిగ గురియలేదు." ఇట్టి విజన విపినములందు దిగులువచ్చు నీ యిక్కట్టులకు, కవి మనస్సు లొంగలేదు. అతని ధ్యానమంత్రియొక్క దన చుట్టును నిశ్శబ్దముగా నావరించియున్న మనోజ్ఞమగు ప్రకృతిపైననే కేంద్రీకృతమయి యుండెను. దారిలో దినములు గంభీరములగు లోయలు, పచ్చిక బీళ్లు, నానావిధ పుష్పములు తిన్నెలకు బంపు సౌరభసంపద, నభోవీధిలో ప్రకాశించు తారకా చంద్రులను, గాండ్రించు సుందర లోతులలో నుండి యుత్పన్నమగు భావోద్వేగముచే బాహ్యవిశ్వము ననుభవించుచు, నా రమణీయ ప్రకృతిని, దాని స్రష్టను నుతింపనారంభించెను. ఇట్లు పయనించుచుండ "గౌకులనుండి, హైరి గుఱ్ఱముల గిట్టలచప్పుడు" విన వచ్చెను. వివిధ మృగములు వసించు, పెనులోయలయం దెడదారులం బడి కవి కుటుంబము నడచుచుండెను. ఆ భీకరాటవియందు:

"కోసరి నివ్వరి ధాన్యంబు గోరికి నములు
నెలుక ముని పంటి నవ్వెడి కులికి పడుచు
ద్రోవ గమియించు నాటి పాంథుల నదేమొ
యదరి బెదరించె నొక యెండుటాకు గూడ"
నని జాషువ కవి యనెను.

ఇంతలో వారి భాగ్యవశమున నొక నిషాదుడు వారి కయాచితముగ సహాయ మొనర్ప నేతెంచెను. దూరముగ గన్పట్టు వివిధ ప్రదేశములను, వాసయోగ్యములగు తావులను, పాన యోగ్యములగు చెరువులను, నందందు దిరుగాడు నొంటెలను, నరబ్బీ వర్తకులను వారికి జూపి, యెఱింగించెను. "పురమి చేడియ చన్నుల క్రేవ దాల్చు రోమాంచమొకో" యనం దనరు నా త్రోవలోని కొండల కీవల నావల గల తను చెంచుగూడెముల జూపెను. "మూపు లకిద యరణ్యంబు కాని, బ్రహ్మసృష్టిని వింత యాపదల పుట్ట" పడీ యని వారిని హెచ్చరించెను. మహమ్మదీయుల పుణ్యక్షేత్రములగు మక్కా మదీనాలకు బోవు త్రోవలను, బారసీకుల శ్మశాన క్షోణులను, దేనెపట్టుల భ్రమ గల్గించు దొంతులు గల ఖర్జూరపు దోపులను గూడ వారికా బోయ చూపెను. అందువసించు నారబీయుల యాహారము నిట్లు వర్ణించును.

"ఈ యెడార్ల గండుటిసుక తిప్పలమీది
నెట్టచేత ఓగిలి పిల్లలయిన
నిప్పుకోడి గ్రుడ్లు నీటి కుండలు వారి
కొంటె పాడి వారి కుగ్గుపాలు"

కడకు ఫిరదౌసిని జూచి వినమ్రుడై "మీ రెవరు" "ఎందు బోవుచుంటి"రని ప్రశ్నించెను. తూగ్రుడగు వాని పూజ్యభావమునకు గవి మెచ్చుకొనురీతిని, "నరులు గడించు వినాశన సూచకమగు పాపము ధరణి కసహ్యము. ఈశ్వరుని క్రుధాగ్నిలోకన దవానలములు, నీవంటి సజ్జనులందరుం గలుగుటచే, వెఱచి, పాపులను దహింపలేకున్నవి" యని వచించి, పూర్వ సంఘటనములు స్మరణకు రాఁగా, "నాదు తనూపటుత్వమును, నా కవితాతపనీయరాశి భూమీదయితుం డొకండు బలిమిం గొని నన్ను జంపఁజూచెను. నా ఈ విషాదకథనమును వినినచో, శిలాసహస్రములును జెమరించును. ఆ లువదియేండ్ల ముసలినై, బ్రతుకుట యనవసరము కాని "ఈ కోమలుల రక్షణార్థం బే, మేను దొఱంగ సంశయించుచుంటి"నని వాని కుత్తర మొసఁగి, వాని సాహాయ్యమునకు ధన్యవాదము లొసఁగి, మఱల, ప్రయాణింపఁ దొడఁగినాఁడు. భూమిపై తయుఁ బాలించి రాజునకులేని గౌరవ భావముతో, ననుకంపముతో, నా నిషాదుఁడు విషాదముతో నిష్క్రమించెను.

అట, ఫిరదౌసిని బంధించుటకై చనిన రాజభటులు అతని శూన్యగేహముఁ గాంచి, సేనాపతి కెఱింగించిరి. అతని పనుపున నెల్లచోట్లను వెదకుచు పాదుషా భటాళి వెడలినది. కవి పలాయితుఁడైన వార్త విని పాదుషా యాగ్రహించెను. ఆ క్రోధములోఁ దన యాజ్ఞ కవమతి సేసిన నిజభటులనే బంధించెను. అంతియకాక "కవికి నెవ్వండు శరణంబిడు, నతఁడు నాకు శాత్రవుండగు"నని పరవానా లిచ్చి చాటఁ బంపెను. ఇది రాజసభలోని ముచ్చట. ఇఁకఁ బ్రజానీకమో "షానామా యను కావ్యరాజమునకీ క్ష్మాభర్త, తా, భర్తయై శాశ్వతమగు కీర్తిమకుటమును మౌళిపైఁ బూనినాఁడు. ఏతత్కృతి గ్రాహిఁ గుందు ముదుసలి కవిని ఖండింపనుంకించి, రాజీవితముగ సమ్మానించినాఁడు. భళి!" యని ముక్కుపై వ్రేలునైచుకొనెను. సామంత రాజలోకము కొంచెము ముందువెనుకలాలోచించినది. ధైర్యముగఁ బాదుషాకు, నాతని పరాక్రమమును, నాతని విజయములను, విభవములను, నాతని యిస్లాం మత ప్రీతియును, నాతని రాజసమును, భోగములను వర్ణించుచు, "మీరు మా యవన రాజ్యమునకుఁ బూర్ణాయువు లని మేము తలఁచుచు ధైర్యముగ నుంటి"మని పొగడినది. "కవి కోరు ద్రవ్యంబు మీ హుక్కా ఖర్చునకు సాటిరాదుకద, రాజోత్తంస యోచింపుమా"

యని మెత్తగనే మందలించుచురీతిని ప్రశంసించినది. "లలితకళలు విడంబించు సెలవు మీదు నింకుకొలువున కన్నీరు తగనుసుండీ' యని వారించినది. ఇకహితసుగోష్ఠభాతిని

"కవి శాశ్వతుం డుర్వర నా
రవితారముగా వసించు రాజా! మీరా!
కవి తా కన్యకుం బత్తు లా
రవితారముగా సహింతురా యపకీర్తుల్"

అని హెచ్చరించినది. వెండియును, "మీరు కళాపోషకులు. కృతికన్యక బంగారును, మణులను వర్షించు త్మ్రారాజ్యవధూటికం టెం జక్కనిదికదా!" యని నుడివినది. ఈ ప్రియపూర్వక నయోక్తులతోం బాదుషా కోప ముపశమించెను. అతండు శాంతించి, యస్థిరతతో, మూండేండ్లు, కేవల పండితగోష్ఠి యందే కాలము' గడిపినాండు. ఈ యల్పకాలములోనే,

సీ॥ ఒక కవీశ్వరుని కైతకు మెచ్చుకొని నోటి
నిండ మాణిక్యముల్ నింపినాండు
ఒక పండితుని విమర్శకుం జిత్తముప్పొంగం
గనక చేలంబులు గప్పినాండు
ఒక విగాయకుని పాటకు మేను పులకింప
దోసిట ముత్యాలు పోసినాడు
ఒక యాటవెలంది యాటకు 'సెబా' సనిపల్కి
కొంగుల వరహాలు కురిసినాండు,

అని జాషువాకవి వర్ణించుచు,

"ఏమి చెప్పుదు నిత్యసంతృప్తి జేర్చి
విప్రుల వాఙ్మయ సేవ గావించునాడు
దానవలయంబు లిరుగేల దాల్చినాడు
పిరదవుసి నేమొ పూర్తిగా మఱచినాడు"

అని జాలిగ నిట్టూర్చెను.

ఇట్లుండ, నొక ప్రాతఃకాలముననే చక్రవర్తి నిదుర మేల్కొని, నమాజు చేయుటకై మసీదునకు జనినాడు. అట "భిత్తికాధానము, బాష్పహేతుక కథానక మాపిరదౌసిపద్య" మాతని కనులబడినది. పాదుషా జాగ్రత్తగ జదివెను.

"కృతియొక బెబ్బులింబలె
శరీరపటుత్వము నాహరింప శే
షితమగు నస్థిపంజరము
జీవలవంబున నూగులాడగా
బ్రతికియు జచ్చియున్న
ముదివగ్గు మహమ్మదుగారి ఖడ్గదే
వతకు రుచించునా?
పరిభవ వ్యథ యింతట నంతరించునా?

ముత్యములకిక్కయైన సముద్రమునను
జొక్కమాలెలు మునుకలు వేసినాడ
భాగ్యహీనుడ ముత్యంబు పడయనైతి
వంచి నను మ్రింగ నోరు విచ్చినది తుదకు"

అని పఠించునరికి, పిరదౌసి కవి దీనవదనుడై, స్మృతిపథమున గోచరించెను. "ప్రత్యక్షరమునకొక దీనారము యిత్తు" వని ప్రత్యక్షము సేయుచున్న యా పద్యములను, భూపతి ప్రగల్భయె వ్యాజాకరమును జెప్పెన్" యనుచు గలచినది నంటనే, తన తప్పిదము తెలిసి వచ్చినది. తన యపరాధము వలన గదా కవి కష్టముల నొందుచున్నాడని పాదుషా గ్రహించెను. తన కృతఘ్నతకు ప్రాయశ్చిత్తముగ, నఱువదివేల సువర్ణనిష్కములను, నుష్ట్రపుట్టముపైనిడి, తూసునగరికి బంపినాడు.

అట, పిరదౌసి శోకవహ్నిసంతప్తుడై రోగియై, శయ్యాపన్నుడు,

"పెంపు దరిగిన కాయము, ప్రియసఖాట
చింతచే పస్సి కృశించి కుమిలి
వేతనయిన సపర్యలు సేయుచుండ
తనువు చాలించెను
"సుకవి దేహంబు ప్రేతభూమికి లభింప

అదెముపుడె ఘనన్యగృహమును జేరెను జాషుకవి యొకకుణ మూరిపంచె,

నిమిష క్షేపంబు నతము సంభింపబడిన

యీ రహస్యంబు గనుగొన నెవరితరము" అని విధి విలాసమున కచ్చెరువొందును.

కవిసుత మాత్రము సామాన్యయా? ఆ తండ్రికి గల యాత్మాభిమాన మంతయును బుంజీభవింపజేసికొని పుట్టినది. ద్వారము యొద్దగల రాజభటులను యమభటులుగ దలచినది. రాజు యమధర్మరాజుగ గోచరించెను. ఆమె ధనము గొనుటకు రోతజెంది "యిది నా తండ్రిని గష్టపెట్టినశరము. ఇది ముట్టిన నా జనకుని కాత్మశాంతిలభింపదు. నా ముది తండ్రిని దయతో నేలిన మీ స్వామికి నా పదివేలంజలుల"ని నిందాగర్భితముగ బల్కి, ధనముం దిరుగ గొట్టినది. చేయునది లేక, పాదుషా కడకు దిరిగి వచ్చిన భటులు జరిగిన దంతయు జెప్పిరి. పాదుషా కవి తన యవివేకమును, దన కృతఘ్నతయును, కవికీర్తిశేషుడైచనుటయు' ను దన యెదకు వజ్రఘాతమువలె దగిలి కలంచగా,

"కొలువు చాలించి, కన్నీరు గ్రుక్కుకొనుచు
బిరబిరంబోయి, శయన మందిరముం జొచ్చి,
ద్వారములు మూసికొని, కవీశ్వరునిం దలంచు
కొనుచుం దనుం దాను నిందించుకొనం దొడంగె."

ఇప్పటికి నాతని కర్కశహృదయము ద్రవించినది. చిత్తమునఁ బరివర్తనము కలిగినది. గతించిన తన దుశ్చేష్టలు విస్పష్టముగ స్మృతిపథమున గోచరించినవి. గుండె పెకలించుకొనివచ్చు దుఃఖావేగమునఁ దన్నుఁదాను నిందించుకొన సాఁగెను. ఆఫ్ఘన్ ధరాతలమునం దెయుఁ గావ్యసుధా ప్రవంతిలో హాయిగ నోలలార్చిన మహామహుఁడౌ పిరదౌసితోడ స్వర్గీయ సుఖంబు నీకుఁ దొలఁగినది—ఇఁక మను పీనుఁగువై బరింపు" మని నిందించుకొనినాఁడు. "న్యాయముపీడి భూపతిలి కొాయనునం దలయెత్తఁ జాలుదునా? శ్రీయును బౌరుషంబును బ్రసిద్ధియునుంగల రాజవంశ మందీయపకీర్తి జరలేని కృతిస్వరూపమునఁ జుట్టుకొన్న దే" యని వగచినాఁడు. "మురువుఁజూపు కావ్యరచన మొనర్చు కవులెందఱో కలరు. వారు పిరదౌసితో సమాను లగుదురా? వరహీరంబును గాలఁ దన్నుకొను నిర్భాగ్యం దేవంకుర్వర" యని తన బుద్ధిలేమినిఁ దిట్టికొనినాఁడు. ఇంతయైన వెనుకఁ జేయున దేమి? 'చేతులు కాలినవెనుక నాఁకులు పట్టుకొన్న' ట్లయినది. ఇప్పుడు తనకుఁ బశ్చాత్తాపముఁ గల్గిన లాభమేమి? పరలోకములోనున్న కవి యాత్మకు శాంతి లేక యెంత కుందుచుండెనో! ఈ పాపమునకు నిష్కృతి యేమికలదు? పాదుషా చిత్తశాంతిలేక బ్రతికియున్నపుడే నరకము ననుభవించుచుండెను. కవి పేరఁ దూసుపట్టణమున నొక సత్రము నిర్మించినచోఁ గవియెడలఁ దాఁ గావించిన పాపము కొంతయైనఁ దీఱునని నిశ్చయించినాఁడు. ఆతని తలఁపు రూపునొందెను. ఇది పెక్కు శతాబ్దముల క్రిందటి మాట. నేఁడు,

"వాని శైథిల్యములు నేఁడుఁ గానఁబడును
పారసీకులు చూచి కన్నీరు విడుతు
రట! మహమ్మదు గారికి నపయశంబు
విండు సత్కీర్తి కవికిని నిలిచిపోయె" ననునవి

జాషువకవి పలుకులు.

ఇంతయైనను బాదుషాకుఁ జిత్తశాంతి చేకూరెనా? ఆతని కృతఘ్నత నశించెనా? ఆతని అపకీర్తి తొలఁగెనా? నాఁటికవి లేఁడు. పాదుషాయును లేఁడు. నేఁడును,

"గజనీ పట్టణ వీథులన్ నృపుని కంకాళంబు సప్రాణమై రజనీ మధ్యములందుఁ బ్రుమ్మరుచు నార్తధ్వానముల్ సేయునంచు, జనశ్రేణి వచించుచుండు" నట! అది విని, "అవునా, క్షోణీస్థలిన్ వీడివన్, వృజినంబూరక పోవునే, నరుని శాంతిజ్యోతిఁ జల్లార్పదే" యని జాషువకవి యక్కసుఁదీర, నోరారఁ, బాదుషాపైఁ దన యభిప్రాయమును వెల్లఁబుచ్చును.

ఇఁకఁ గవితావిషయిక సమీక్ష నొనర్చినచో నీ కావ్య ముత్తమ సృష్టియని యంగీకరింపనగును. కరుణ మిందలి ప్రధానరసము. "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్" అని రసగంగాధరకారుని మతము. జాషువకవి కవితాక్షేత్రమున రమ్యములగు భావములను బుట్టించు శబ్దములే పండినవి. ఈ కవియొక్క కవితయం దొక ప్రత్యేకత కలదు అది యితరు లందరుగు. పదములపొందికలోను, జక్కనిజాతీయములను వాడుటలోను, స్వీయభావములను సందర్భము ఉటంకించినపుడు వెలిఁబుచ్చురీతిలోను, గమనీయములగు వర్ణనము లొనర్చుటలోను, వీరి కవితాకళయందలి ప్రత్యేకత గోచరించును. ఈ కావ్యముఁ బఠించునెడఁ గవి హృదయము మిక్కిలి గంభీరముగఁదోఁచును. మననము చేసి, చేసి దీర్ఘముగ నాలోచించిననే తప్ప, కొన్ని కొన్ని భావములలోని "లోపలితత్త్వము" సులభముగ స్ఫురింపదు. భావములు మనోహరములు. ఈ యందములగు భావములనట్లు గంభీరమగు వేషమున, గూఢముగనుంచి, "మీరే యీ భావసౌందర్యముఁ గనుఁగొని యానందింపుఁ"డని, యీ కవి పాఠకులకు వదలిపెట్టును. మనోజ్ఞములగు వీరి భావ గాంభీర్యమును సూచించుటకీ పద్యములే దృష్టాంతము కనుఁడు.

గజినీ మహమ్మదు, భారతదేశముపైఁ బదునెనిమిదిసార్లు దండెత్తివచ్చి, విజయగర్వముతో స్వస్థానమునకుఁ జేరి.

"నగరి మొగసాలనుండు గంధద్విపంబు
దంతములమీఁద వ్రాయించెఁ దనచరిత్ర;
తనదు దిగ్దంతుల పగాలుదంతములకుఁ
గలుపు కోఁబోలు విజయ సంగ్రామ సంఖ్య"

తన దోర్విక్రమముచే నష్టదిక్కులను జయించెను. ఆ విజయ యాత్రాచరిత్రములను దిగ్గజముల దంతములపైన జెక్కించెను. ఇఁకఁ బదునెన్మిదవసారి, భారతదేశమును జయించిన పిమ్మట, యా విజయ వృత్తమును వ్రాయించుటకు దిగ్గజదంతములపైఁ జోటు లేదు. అవి యిదివఱకే లిఖితములైనవి కదా! కావున ప్రస్తుత విజయచరిత్రమును, నగరి మొగసాలనున్న మత్తేభముయొక్క రెండు దంతములపైన వ్రాయించెను. అనఁగఁ దుది విజయకథన మా గజముయొక్క దంతములపై లిఖితమై, యాతని పరాక్రమముఁ జాటుచున్నదని భావము.

పాదుషాకు పిరదౌసి వ్రాసినలేఖలోని భావముఁ జిత్తగింపుఁడు.

"ముత్యముల కిక్కయైన సముద్రమునను
బెకు మాఱులు మున్కలు వేసినాఁడ;

భాగ్యహీనుఁడ మత్యంబు వదయనైతి,
వంధి నన్ మ్రింగ నోరువిచ్చినది తుదకు."

"నేను రాజాశ్రయముఁ బొందితిని. నాకు, రాజు, సంపదలను ద్రవ్వి తలకెత్తునని యాశించితిని. ఎన్నియో యాశాసౌధములఁ గట్టికొంటిని. నా దౌర్భాగ్యవశమున, నా యాశయము విఫలమైనది. తుదకు నేను నమ్ముకొనిన రాజే నా యాశాహర్మ్యములకుఁ జిచ్చు పెట్టినాఁడు. ఇదంతయును నేను దురదృష్టవంతుఁడగుట వలన వచ్చినది కాక మఱేమి?" యని భావము.

కవి స్వకుటుంబముతో నటవీ మార్గములఁ జను తఱిఁ గావించిన ప్రకృతిస్తుతిఁ గనుఁడు.

"అగడపు మబ్బు శయ్యల నపరశిఖరి
బుకతి చంద్రుఁడు నిద్దుర వోవుచుండె
ఈ చెఱువునీట నతని కుయ్యెలలు గట్టి
జోల పాడుచు నా వంకఁ జూడవేమి?"

(ఇందు మధ్యమ పురుష యందుద్దేశితుఁడైన వాఁడు ఈశ్వరుఁడు.)

అపరశిఖరమున నున్న బాలచంద్రుడు డాగడపు మేఘములను శయ్యపై నిదురించెనట. అనిద్రిత చంద్రునికి చెఱువు నీట నుయ్యెలలు గట్టి, యూపుచు నీశ్వరుఁడు జోలలు పాడుచుండెనట! మేఘములలో నిద్రించి, చంద్రుఁడు చెఱువు నీట బ్రతిబింబించుచుండెను. గాలివలన చెఱువులోని నీరు కదలుచుండెను. పైనుండి నీటిలో బ్రతిఫలించు చంద్రుడందుచే, నూయలలూగు రీతి నుండెనని కవి యుత్ప్రేక్షించెను.

మనోహరభావనా విషయికముగ, నీ కావ్యము ప్రముఖ స్థానమును వహించినది. ఈ కావ్యమునందలి పద్యములు, చాలవరకు, మధురమగు రసము నొలికించుచున్నవి. జాషువ కవి భావనా పటిమ మనోజ్ఞములగు వర్ణనముల చాటుననుండి సౌందర్యము నినుమడింప జేసికొనినది. ఇందుల కుదాహృతి గనుఁడు.

"అంభోజాప్తుఁడున్ దూర్పుకొండ
తలన్ గుంకుమ చల్లె" నట ఇందలి తూర్పుకొండ

స్త్రీపరముగ నుక్తము. కుంకుమ యన సాంధ్యరక్తిమ. సూర్యుఁడామె తలపై కుంకుమ చల్లెననుటచే, నరుణరాగ ముదయాచలము పైనుండి యాకసమున వ్యాపించుచున్నదని ధ్వనించుచున్నది.

షానామాను బఠించుచు, పిరదౌసి "యుక్కు పుప్పొడిరాలు యుద్ధ భూమిని, గంపంబు గదుర చెంగట నిల్చు" నట! రణరంగమున యుద్ధమొనర్చు సైనికుల యాయుధముల రాపిడివలన ఛిన్నాభిన్నములై, నుగ్గై, రణభూమియందు రాలుపొడి, యుక్కు పుప్పొడియట.

ఒక సాయం వేళయందు గాఢ మేఘములు క్రమ్ముకొనెను. అప్పుడు "ధరాలలనా రత్నము స్నానమాడునని వేగాఘంటికల్ మ్రోచె" నట! అనగా వర్షము రాబోవుననుటను గాలియు సూచించుచున్నదని భావము. భూమిని స్త్రీగజేసి, రాబోవు వర్షమామె జలకమాడు నీరని, యాసమయ మామె స్నానమొనర్చు సమయమనియు, రమ్యముగ వర్ణితమైనది.

అడవియందు బాధల నొందుచు బరువించు తన దారాసుతుల క్లేశములకు పిరదౌసి విచారింపసాగెను. అట్టియెడ "కవిశ్రేష్ఠుండు వర్షించుమిప్పుడి కన్నీటికి గారణంబగు మహాశమ్రుత్యవలిం బంక్తు నాకేఁటయ ట్లంబర వీధి యందుఁ జెమి యార్చెఁ గర్భిణీ మేఘముల్" యని కవి వ్రాసెను.

కర్కశుఁడగు ఱేని యనుచితకృత్యముల కాజలదములు కోపించి, పండ్లు కొఱికెనా యను రీతి నుఱిమెనట! ఇట "గర్భిణీ మేఘము"లను ప్రయోగమునందలి సొంపు గనుఁడు. మేఘములను మహతీ వాచకముగ గ్రహించెను. అవి నీటిని గర్భమున దాల్చెను. కావున గర్భిణీ మేఘములైనవి వేఱొకచో"

"కుంకుమ పంకముఁబులుముకొన్నవి
తూరుపు కొండ నెత్తముల్
పంకజ బాంధవుం డరుణ పాదముల
న్నిగిడించె, మింట నే
ణాంకుఁడు చిన్నవోయి చరమాచల
సాను తటంబులెక్కె, మై
జింకయు దానుగడ్డి గఱచెన్,
జను చీకటు లార్చెబాసలై"

యని సూర్యోదయమును కవి వర్ణించెను.

ప్రాగ్దిశగల కొండలు, తమ శిఖరములపైన కుంకుమ పంకమును బులుముకొనెను. దీనిచే సాంధ్యారుణ శోభ సూచింపబడినది. ఇక, రవి, తన యరుణ పాదములను నిగిడించె ననుటచే, రెండర్థములు గోచరించును. రవి, యొజ్జనివాడు. అతని పాదములను సెఱుపే! అతఁడు మెల్లమెల్లగ, దన పాదముల నాకసముపై జాచుచున్నాఁడు. దాన, నాతని పాదములగల యరుణ రక్తిమ యాకసముపై వ్యాపించుచున్నది. ఇక, రెండవ యర్థము: సూర్యుఁడు తన కిరణముల నాకసముపై నిగిడించెను. దాన, నాకసముపై గావిరంగలముకొనినది. ఇది కవి చమత్కృతి. సూర్యుని ప్రాబల్యము విస్తరిల్లుటచే, నాత్మతేజము క్షీణించినది—కావుననే చంద్రుఁడు చిన్నవోయి, వన్నె దఱిగియుండుట అతని కాంతి పరికిరాకపోయినదని యనుటకు "గడ్డి గఱచె" నని చమత్కారముగ, కవి, వర్ణించెను.

"ఈ తొలికోడి కంఠమున నే యిన బింబము నిద్ర వోయెనో రాత్రికి?" యని ప్రాభాత సమీరపోతముల సందేహము. పవలెల్ల సూర్యుడు మనకు గనిపించును. రాత్రి కానరాడు. కాని సూర్యు డుదయింపబోవునను జ్ఞానము తొలికోడికి గలదు. కావుననే కూతవెట్టుచున్నది. ఇది ప్రకృతి ధర్మము. కాని, సూర్యుని గానకయే, కోడి యెట్లు కూతవెట్టుచున్నది? రాత్రి మనకు గానరాక, యదృశ్యుడైన రవియే యీ తొలికోడి కంఠమున నిద్రించెనా? ఇది భావము. ఇంత విషయము నా యొక్కటే వాక్యమున, కవి పొదిగించెను. ఇదియే భావగాంభీర్యము.

కొండొకచో, "వేగురు జుక్కతో నిలిపివేసిన నీ రచియించు లేఖకుం గాగితమైన యాకసమునన్" అని కవి యనినాడు. ఇట ఈశ్వరుడు 'ప్రకృతిని నడుపుట' యను లేఖను వ్రాయుచున్నాడు. దీనికి సాధనము కాగిత మాకాశము. వేగుజుక్క పొడిమి నంత వఱకు ప్రకృతి ధర్మమును నిర్వర్తించెను. అనగ విద్యమాన మెంతవఱకో, యంతవరకే లేఖ లిఖితమైనది. ఇది భావము.

మఱొకచో:

"పొడుపు గుబ్బలి తొలుదొల్త బూదివంటి
ధవళ వర్ణంబు దాల్చి, యంతట బసిండి
నిగ్గుమెదిపిన చెంగల్వ మొగ్గదొడిగె
వేగుజామున నూసర వెల్లివోలె"

నని సూర్యోదయమును కవి వర్ణించెను. ఇట, పొడుపుగుబ్బలి—యూసరవెల్లితో నుపమితము. ఊసరవెల్లి రంగుల నెట్లు మార్చుచుండునో! యట్లే వేగుబంతి రంగులను మార్చుచున్నది. ఎట్లన దొలుత ధవళిమను దాల్చెను. కాని సూర్యోదయమైన పిదప పసిడి నిగ్గుమెదిపిన చెంగల్వమొగ్గ దొడిగెను కాన నెఱ్ఱగ నున్నది. అనగ, వేగుజామున నాకాశము తెల్లగ నుండును. కాని సూర్యోదయమైన వెనుక నెఱ్ఱగ మాఱును. ఇది యందలి భావము.

"మక్కాలో బయిగంబరుండగు మహమ్మద్ గారి గోరీ పయిన్ బక్కా కీర్తుల వెల్లవేసిన మహా భక్తాగ్రగణ్యుండవై" యని ప్రయోగము. గజనీ మహమ్మద్, ఇస్లాం మత రక్షకుడైనాడని భావము. "కీర్తుల వెల్లవేయుట" యనగ, నిస్లాం మతమును స్థాపించిన మహమ్మద్ యొక్క మతబోధలను వ్యాప్తి బొందించి, యాతనికి గీర్తి సంపాదించెనని యర్థము. కీర్తిని దెలుపురంగుతో బోల్చుట సాధారణ విషయమే. 'కీర్తిని వెల్లడిచేయుట' యను ప్రయోగము, అంతర్భావమునకు మెఱుగు పెట్టుచున్నది.

ఇక, జాషువాకవి యీ కావ్యమున వాడిన జాతీయముల సొంపు, పలుకుబడుల తీరు మెచ్చదగినది. కనుడు:

"ముసరుకొనివచ్చు తలపు గుంపులు", గుండెలు గుమ్మరించు, ఊళుల నేళుల బక్కాణంబులన్ జల్లెడ పట్టి చూచుట, ఘననాయకునకు దంతములు పులియ, కీర్తుల వెల్లవేయు, నోటినిండ మాణిక్యముల్ నింపినాడు, వంటి జాతీయములు, తెనుగు పలుకుబడులు మిక్కిలి చక్కనైనవి.

ఈ కావ్యమున, జాషువకవి, వీలు దొరికినపుడు కవిపారమ్యము నుగ్గడించుచు వచ్చెను. పాదుషా, పిరదౌశిని రావించి, తన విజయయాత్రలను వర్ణింపుచు గావ్యమును వ్రాయుమనుతఱి నిట్లు పలుకును.

"కవినిఁగన్నతల్లి గర్భంబు ధన్యంబు
కృతినిఁజెందువాఁడు మృతుఁడు కాఁడు
పెరుగుఁ దోటకూర విఖ్యాత పురుషులు
కవిని వ్యర్థజీవి గాఁ దలంత్రు"

విశ్వమునఁ, కవి యట్టి విశిష్టస్థానము బొందెను. కవిని బనికిమాలినవానిగ దలచువారిపై సవాల్ చేయబడినది.

"తమ్మిచూలి కేలుదమ్మినిగల నేర్పు
కవి కలంబునందు గలదు గాన
నీశ్వరత్వమతనికే చలామణియయ్యె
నిక్కువముగ బూజనీయుడతడు"

అని జాషువకవి, కవికిని విధాతకును వారి వారి ధర్మములయందు సాదృశ్యము (similarity) కలదని పల్కెను విధాతకు లౌకికప్రపంచమును సృజించుటయందు నేర్పు (dexterity) కలదు. కాని కవికి నలౌకిక విశ్వమును సృష్టించుటయందు కౌశలమున్నది. ఈ యలౌకిక ప్రపంచమును సృజించి, భావుకులకు జిత్తానందమును గావ్యపఠనముఖమున గల్పించు నేర్పు కవి గంటమున గలదు. కావున కవి పూజ్యుడు.

అంతియకాదు. కవికెట్టి శక్తికలదో కనుడు.

"క్షణము గడచిన, దానివెన్కకు మఱల్ప
సాధ్యమే మానవున కిలా చక్రమందు?
దాటిపోయిన యుగముల నాటిచరిత
మరల పుట్టింప కవియు సమర్థుడగును"

అని కవిపారమ్యము సమర్థితము. ఇతర మానవుల కంటె గవికి గల మహత్తరశక్తి యదియే. గతించిన క్షణమును వెనుకకు దెచ్చుట సాధారణ మానవునకు దుస్సాధ్యము. కాని, కవి గతించిన, చరిత్రనంతయు,

నిజకావ్యముఖమున, వెనుకకు దెచ్చి, లోకమునుంచుచ గలడు. అతని కావ్యమున, చరిత్రలో గతించిన ప్రతి సంఘటనమునకు, ప్రతివ్యక్తికిని నూపిరివోసి, చైతన్యమునగల్గించి, కవి ప్రదర్శించును.

మరల,

"వసుధ శాసింపగల సార్వభౌముడును
ధనుడును, భిక్షుకుడును, దీనుడగును
దుఃఖితుండగు నిత్యసంతోషియగు
సత్కవి ధరింపరాని వేషములు కలవె"

ఈ విశ్వములోఁ గవి ప్రతిరూపమును ధరించును ఏల? ప్రతివస్తువు నందణఁగి యున్న తత్త్వముఁ దెలిసికొనుటకు, ప్రతి వస్తువునందును గల ప్రతి తత్త్వము గ్రహించి, యనుభవించి, తన కావ్యమునఁ బ్రదర్శించుట, కవి యొక్క ధర్మము.

ఈ కావ్యమునందుఁ గల యొక పద్యము నన్నయగారి పద్యము ననుకరించు చున్నది. కనుఁడు.

"వాని మృదూక్తినైపుణియు- వాని
వినమ్ర విధేయ భావమున్
వాని పరోపకార నిరవద్య గుణ
ప్రతిభా విశేషమున్
వాని శరీర సౌష్ఠవము- వాని
భుజార్గళ మాంసలత్వ, మిం
పైన కృతజ్ఞతార్థ కృతులై వెడలెన్
పిరదౌసి వాక్కునన్"

(పిరదౌసి తృతీ. ప 24)

ఇఁక నన్నయ్యగారి పద్యరత్నముఁ గనుఁడు:

"దాని శరీర సౌరభము, దాని
విలోలవిలోకనంబులున్
దాని మనోహరాకృతియు, దాని
శుచిస్మిత వక్త్రకాంతియున్,
దాని విలాసముం గడు ముదంబునఁ
జూచి మనోజబాణసం
తాన హతాత్ముఁడై, నృపతి
దానికి నిట్లనియెం బ్రియంబునన్"

(భార. ఆది. ప. చతు. ఆ. 172ప)

ఈ కావ్యమున నంసంవ నౌచిత్యములును, వ్యాకరణ విరుద్ధరూపములును గన్పట్టును.

'షానామా'ను పారసీక భాషయందు వ్రాయు పిరదౌసి — "తెలుఁగు కవిత్వపుంజిగి, విశేషపుఁ దైతల చెన్ను, ద్రావిడీయుల కవనంబులోని పస యుంబొసఁగ" రచించుట యనౌచిత్యము, పారసీక కవి, పారసీక సారస్వతమునఁ గావ్యము వ్రాయుతఱి, నా కవితా లక్షణములు ద్రావిడ భాషా వాఙ్మయ లక్షణములఁ బోలియున్నవనుట యనౌచిత్యము.

మఱియొకచో "బెబ్బులులు కరుల్ గిరుల్ హరులు మొత్తములై విహరించు పెద్దలోయల" నవి ప్రయుక్తము. ఇందలి "గిరుల్" యను శబ్దమర్థము నొసఁగదు. 'గిరులు' జడపదార్థములగుటచేఁ దక్కుం గల తిర్యక్కులవలెఁ జరింపజాలవుకదా! బహుశః, శబ్దాలంకారార్థమై; యీ పదము ప్రయుక్తమై యుండవ నోపును.

"పారసీక సరిహద్దు" వంటి వైరి సమాసమును, మహమ్మదుఁడు, సుల్తానుఁడు, నవాబుఁడు, పైగంబరుఁడు, వంటి యసాధురూపములును గన్పట్టుచున్నవి తెలుఁగు సారస్వత సంప్రదాయమునం దన్యదేశ్యములకు 'డుఁ' ప్రత్యయము ప్రాపింపదు. కాని, పై ప్రయోగము లాయా తావులయందుఁదప్పని సరిగఁ గావింపఁబడెనని తలఁపనగును, కావ్యమునందలి దోషములు మితములు మాత్రమే! అయ్యును నీ కావ్యమునఁ బెక్కు గుణములుండఁగ, దోషములను, "క్షీరనీర న్యాయముగ" వదలిపెట్టుట యుక్తము.

ఈ "పిరదౌసి" కావ్యము, మన నవ్యాంధ్ర సారస్వత కల్పతరువునకుఁ బండిన యొక మధురఫలము. సహృదయు లీ కావ్యఫలము ననుభవించి, తద్రసాస్వాదనము నొంది యానందించినచోఁ గావ్య ప్రాశస్త్యము లెస్సగ గ్రాహ్యమగును.

# ముత్తాయి కూతురు

శ్రీ మా. గోఖలే

ఆ సంటుపల్లి పల్లెటూరుకు కొంచెం పెడగావున్న మాలపల్లిలో ఓ మూలగుడిసెలోంచి తెల్లవారి చద్దిబువ్వతిని, పైపంచతో మూతితుడుసుకుంటూ బయిటికి వొచ్చాడు మాదిగ ముత్తాయ్.

గుడిసె పక్కన సాయిమేకుకు కట్టివున్న బర్రెపడ్డకు నాలుగు గడ్డిపరకలు వేసి మునుసుబు కచేరి నౌకరుపనికి పోదామనుకుంటున్న ముత్తాయికి మటిగాబు దగ్గిర రొచ్చులో దిగి, ముంతతో గాబులో నీళ్లు తాగుతున్న తన నాలుగేళ్ళ కూతురు లచ్చి కనిపించింది.

"అప్పుడే తెల్లారిందంటే నీకు గాబుకాడికి చేర్డానికి? మీ అమ్మ సూసిందంటే చంపుద్ది రా ఇటు" అన్నాడు ముత్తాయ్ బర్రెపడ్డకు గడ్డిపరకలు వేస్తూ.

"ఈ లచ్చిముండ అప్పుడే గాబుకాడికి చేరిందీ? ఒస్తున్నా, ఇయాల దీనికి మూడిందే" అంటూ గుడిసెలోంచి, ముత్తాయ్ పెళ్ళాం మాణిక్యం కేకేసింది.

ముంత గాబులో దభీమని పారేసి బురదకొట్టుకొంటూ గబగబ ముత్తాయ్దగ్గిరకు పరుగెత్తుకొచ్చింది లచ్చి.

"ఛీ, నీ బురద సేతుల్తో నన్ను ముట్టుకోమాక" అంటూ కూతురుకు దొరక్కుండా పక్కకు తప్పుకుంటున్నాడు ముత్తాయ్ నవ్వులాటగా.

"మరి నాకు సెనగపప్పు తెచ్చిపెత్తానంతే"... అంటూ బురద చేతుల్తో ముత్తాయ్ వెంటపడింది లచ్చి పెద్దపెట్టున కేరింతలు కొడ్తూ.

"ఆసి సచ్చిందానా, ఇంకా తెల్లగా తెల్లార్నన్నా లేదు అప్పుడే ఒల్లంతా బురదపూసుకుండా? ఇయ్యాల నీ ఈపు పగిలిందే—ఒత్తున్నా వుండు" అంది గుమ్మంలో కొచ్చిన మాణిక్యం, మూర్లోంచి చీటిమట్ట తీసుకుని లచ్చి దగ్గిరకొస్తూ.

"అయ్యా, అయ్యా" అనరుస్తూ మాణిక్యానికి దొరక్కుండా తప్పించుకుని ముత్తాయిని గభాల్న వాటేసుకుంది లచ్చి.

"అయ్యొ, సచ్చిందానా, అయ్యపంచకు బురద పుయ్యనే పూశావుగందే! ఉండు నీకు రాసింది"... అంది మాణిక్యం లచ్చివీపుదిక్కొస్తూ.

"ఎహె ఉండు ఏంది నీ రగడా"...అంటూ లచ్చి ఒళ్ళు తడిమి"..."పిల్లఒళ్లు ఎచ్చగా ఉందేమే?" అన్నాడు ముత్తాయ్.

ఆ? ఎచ్చగా ఉందా? అయ్యొ నా తల్లీ" అంటూ ఎన్నకరిగినట్టు కరిగిపోతూ లచ్చిపొట్టపట్టుకు సూసింది మాణిక్యం.

"పిల్లదానికి కాకతగిలిందిలేయ్," అన్నాడు ముత్తాయ్ లచ్చి మెడకింద సెయిపెట్టి సూస్తూ.

"ఎచ్చగా పొట్టావజాసుంటే కాకతగిలిందని ఇంకా మెల్లిగా అంటావేం? తెల్లారి ముక్కు కార్తుంటే అప్పుడే అనుకుండా ఇయ్యాలేందో ఉండదని" అంది, మాణిక్యం లచ్చి సేతులూ, ఒంటిమీద బురద కడుగుతూ.

"ఏందే తెల్లారే పొట్టుకుందీ? కొత్తె కసాయం కాసిపోత్తావంటే?" అన్నాడు ముత్తాయ్, అడీద లచ్చిసేసిన బురద తుడుసుకుంటూ.

"నువ్వుసేశాగా. ఇప్పుడే కాసిపోత్తా" అంది మాణిక్యం, లోపల్నుంచి ఇంత ఉప్పుగల్లు తెచ్చి లచ్చికి దిష్టితీస్తూ.

"నిన్నరేత్రే మునుసుబుగారు ఊర్నుంచి ఒచ్చారంట. నేను కచేరిసావిడికి ఎల్తుండాగానీ పిల్లదాన్ని బయిటికెక్కడికీ కదల్నీమాకేవ్" అన్నాడు ముత్తాయ్ సుట్టముట్టిచ్చుకుని బయల్దేర్తూ.

"కొత్తె పెందలకాడే తిరిగిరాయ్యా," అంది మాణిక్యం లచ్చిని చంకకెత్తుకుంటూ.

# ముత్తాయి కూతురు

మాలపల్లినుంచి సుంటుపల్లికి ఎంత లేదన్నా అరమైలు పైసిలుకుంటుంది. సుంటుపల్లి మునసబు కచేరీలో ముత్తాయికి వెట్టిపని. ఈ నౌకరీ ముత్తాయికి ముత్తాతలనాటినుంచీ దొర్లుతూ ఒచ్చిందే. మోతాదు బడే సాయిబు కచ్చేరీలో వేలిముద్రలేయించడం, లెక్కల పుస్తకాలు, సిరాబుడ్లు పరిమాడ్డం, సిస్తు వసూళ్లకు వారికీ పొరికీ ఎచ్చరికలు సెయటం మొదలైనవి సూసుకుంటుంటే ముత్తాయి పొలాల కొలతలకూ, టంకు వేసేందుకూ, ఇంకా సిల్లరమల్లర పన్లు సేసేందుకూ ఏర్పాటైనాడు. ఇదిగాక దేవుడిగుడి తిరణాలకు డప్పుకొట్టి, కాష్టాలకు కట్టెలు మోసీ, పసువులు చస్తే తెమ్మకుని, ఆటితోల్లితో సెప్పులు, ఎద్దుమెళ్లో పట్టెళ్లు, సికమూర్లు, సెర్నాకోలలు సేసి కుటుంబం గడుప్రకుంటున్నాడు ముత్తాయ్.

మాలపల్లి జనం కూలిజనం గనుక పెందరాడే లేస్తారు. వీలుంటే పెళ్లాలకు సాయంగా ఊరిబయట కుంటలో నీళ్లు తెచ్చి బానలు, బుంగలు నింపి కూడు తిని కూలిపనికి పొయ్యేవారుపోతే, సీకట్లో లెగసే లెగవంగానే నెత్తిన పైపంచేసుకుని ఎల్లుర్లో పెళ్లాం, పిల్లజల్లను సూసుకోనన్నా సూసుకోకుండా పనికెల్లిపోతారు కొందరు మాలపల్లి జనం.

"ఓరి ముత్తాయోవ్? ఇయాలేం కచేరీకి మా ఉసిమీ నెల్తుండావు. మునసుబుగారొచ్చారా?" అని వీపుమీద కావిడిబరువుకు నిగడదన్నుకుని కుంటనుంచి బరబరా ఒస్తున్న లచ్చాయ్ కేకేశాడు ముత్తాయిని.

"నిన్న రేత్తిరే ఒచ్చారు మునసుబుగారు. సిస్తుబకాయిలు ఇంకా మిగిలుండయిగా, ఇయాల సానా మటుకు వసూలు గావాలి మరి. ఇంకా నువ్వు కూలిపనికి పోకుండా ఈడే కూకుండావేరా? ఇయాల మా మరదలుపిల్ల నీలుపోసి గాని పోనీనని నిలేసిందా ఏరా?" అన్నాడు ముత్తాయ్ కావిడిబద్ద ఊపుకుంటూ దగ్గిర కొచ్చిన లచ్చాయితో.

"అదిగంతేలే. పోనీగందా అని ఏనాడన్నా కుంటనుంచి నాలుగు బుంగలనీలు తెచ్చిపోత్తానా? ఇదిగో ఈ వజానంటారు. అందుట్లో నీకు సందు దొరుకుతేసాలు మరదల్ని ఎనకేసుకొత్తావు. నోట్లోకి కొత్తె పుగాకు ముక్కంటే పెడ్తావంట్రా ముత్తాయ్?" అన్నాడు లచ్చాయ్, కావడిబరువుతో కాసేపు ఆగుతూ.

"ఎబ్బా నీతోడు. ఏలకంటే ఏలెకంటే ఇంకేకు సుంగతే సుట్టుసుట్టు కుండా. ఉంటే తెప్పిత్తాలే. పిల్లదానికి కాత్తె కొకనెల్లెట్టుండరా లచ్చాయ్" అన్నాడు ముత్తాయ్.

"ఛా, ఇంతకుముంగలే మీ గాజు కొడ సీలు పారబోత్తుంటే సూశావు గదంట్రా ముత్తాయ్? పిల్ల బాగనే ఉందటే? ఇంతలోనే కొట్టుకలెదిగిరా?" అన్నాడు లచ్చాయ్ నమ్మనట్టు.

"అక్కమ్మ కేకలేత్తుంటే ఒచ్చి నా కాళ్ల నాకేసుకుంటే ఇట్టనూద్దును గందా, ఒళ్లు ఎచ్చగా ఉంది" అన్నాడు ముత్తాయ్, లచ్చి ఒంటిమీది లేనసేకులకు ఇంకా తగుల్తున్నట్టుగా.

"ఓసి, మద్దాన్నానికి అదే జారిపోద్దిలే. మరి పిల్లదానికి నోట్లో కాత్తేమన్నా పోశావా?" అన్నాడు లచ్చాయ్

"మీ ఒదినె కసాయం కాసిపోత్తానందిలే" అన్నాడు ముత్తాయ్.

"ఇగనేం, మా మాణిక్యం ఒదినెకు ఇసుమంటి వైద్దికాలు సానా తెలుసు. ఇహ దానంతటదే పోద్దిలే. అదిగో నీ మరదలు దడికాణ్ణుంచి అప్పుడే నిక్కి నిక్కి సూస్తుందది - ఎల్తుండారోయ్ ముత్తాయ్" అంటూ కావడిబద్దతో కిర్ కిర్ ఊపుకుంటూ ఎల్లిపొయ్యాడు లచ్చాయ్.

లచ్చాయ్ గుడిసెవడివగ్గిర నిజంగానే నిలబడి సూస్తున్న సుబ్బాం వేపు సెయి ఊపుతూ సుంటుపల్లి వేపుకు సాగాడు ముత్తాయ్.

— సుబ్బాముంటే తనకెంత సురో మధ్య మధ్య అనుకుంటుంటాడు ముత్తాయ్. తనకు మాణిక్యంమీద మనసుమల్లి సెడ్డ తిపనబడ్తున్న రోజుల్లో సుబ్బాం అతీ తెలివిగా యవారం పెళ్లి ఏర్పాటుదాకా నడిపి తనకూ మాణిక్యానికి జోడుకలిపింది. ఇందుకు తనూ, మాణిక్యం నాగారుబొమ్మకు ఓ ఏటపోతును బలిమ్మకున్నారు గూడా. తన పెళ్లయి మాణిక్యంతో సుకంగా గడిసిపోతుంటే కొన్నాళ్లకు సల్లగా నస పాగించింది మాణిక్యం. తనకు పిల్లలు పుట్టకపోటం వల్ల తనను గొడ్డుమోతని ఒకరిద్దరనుకోటం ఇన్నానని మొదులపెట్టింది మాణిక్యం. కరువులో అదికమాసం అన్నట్టు పిల్లలకోసం ఇప్పట్నుంచీ ఎగబడ్తన్నాడు తను మాణిక్యంతో. ఇప్పటికిప్పుడు పిల్లలు

ప్రబ్బికపోతేమటుకు ముందుకు పుట్టరనే ఖిరానా ఏమిటిని కూడా తను మాణిక్యంతో సానాసార్లు సెప్పి సూశాడు. అయినా మాణిక్యం నస అపకపోంగా కనపడ్డ సెట్టుకు పుట్టకు దీపాలెలిగించీ, పాలుపొంగించీ పప్పుబెల్లాలు పెట్టి, తడికుడ్డల్లో పెదచ్చినాలు సేసీ సెప్పి గందరగోళం సేసింది లచ్చిపుట్టేదాకా. లచ్చి పుట్టే మాణిక్యం మళ్లీ మామూలుదారినపటం తన బరువంతా తీసినట్టయింది ముత్తాయికి. ఏమయినా తన పెళ్ళాంకంటే తనకే లచ్చింటే ఎక్కువ ముద్దని మాణిక్యం లచ్చిమీద కేకలేస్తున్నప్పుడెల్లా అనుకుంటాడు ముత్తాయ్. అందుకే లచ్చికి ఏ ఇంత ఎచ్చు తగ్గు లొచ్చినా కాత్తె కంగారుపట్టం ముత్తాయికి వాడ్రీ. అయితే ఏ లచ్చాయిలాంటి మనసుకలిసిన మనిషోగనక ఈపుతడ్తే దైర్యంగా నిలబడిపోయే మనిషే ముత్తాయ్ కూడా.

మునుసబుగారింటి కెల్లి డణ్ణాలు పెట్టుకుని, మునుసబుగారి గొడ్లసావిట్లో గొడ్లకు మేత ఉందో లేదో సూసి, జీతగాడు సావిడంతా బాగుసేసిపోయినా మళ్లీ ఒకటి రెండు పేడకళ్లు తీసేసి, మునుసబుగారి పెళ్లాం సెంద్రమ్మగార్ని ఏ పనేమన్నా ఉందేదా అని అడిగి, లేదనిపించుకుని, మునుసబుగారు గుడ్డలేసుకుని కచీరుసావిడికి బయలుదేర్తే ఎనిక్కే వెళ్లి, కచీరుసావిడి గుమ్మందగ్గిరకు సేరి సేతులుకట్టుకుని నుంచున్నాడు ముత్తాయ్.

పెదకరణం, సినకరణం అప్పటికేవచ్చి లెక్కలు రాసుకోటం ఓరకన్నుతో సూశాడు ముత్తాయ్.

"ఇవాళ సిస్తులు కట్టాలని మొన్న టంకు వేశావుట్రా ముత్తాయ్?" అని కేకేశాడు కచేరీలోంచి మునుసబుగారు.

"సిత్తం దొరా. తమరు సెప్పినట్టే ఓ పూట పూటంతా టంకేశానండి" అన్నాడు ముత్తాయ్, మునుసబుగారి కంటికి కొంచెం ఓరగా కనుపిస్తూ.

"మరి ఏరీ ఇంతవరకు ఎవరూ రాలేదేం?" అన్నాడు మునుసబుగారు విసుగ్గా.

"బడేసాయిబు కేకేసుకురాటానికి ఎల్లాడండి. అదిగో రామయ్యగోరు ఒత్తున్నాడు దొరా" అన్నాడు ముత్తాయ్ రామయ్యకు దారి ఒదుల్తూ.

"ఇవాళే సిస్తుకట్టాలని గాపకమే లేదండి మునసబుగారూ" అంటూన్నాడు కచేరిసావిట్లోకి పోయిన రామయ్య.

"ఇకేం మర్యాద రామయ్యా? ఇప్పటికి రెండు వాయిదాలు దాటిపోయినై. ఇంకెన్నిసార్లు టంకు వేయించమంటావో నువ్వే చెప్పు" అని నెమ్మదిగానే అడుగుతున్నాడు మునుసబుగారు.

"మళ్ళీ టంకు దేనికి? రెండుమూడురోజుల్లో పిలవకపోయినా వచ్చి కట్టిపోతే సరిగా" అంటున్నాడు రామయ్య.

"ఒరేయ్ ముత్తాయ్? ఆ రత్తియ్యను వెళ్ళి పిల్చుకురారా — ఊరంతటికీ తెలిసినా ఆయనకుమటుకు తెలియలేదంటాడూ?" అని కేకేశాడు మునుసబుగారు.

"రత్తియ్య బర్రెగొడ్డు ఇంతకుముందే చచ్చిపోయిందంట, మరి ఏం వస్తాడో..." అన్నాడు రామయ్య.

"సరే, చచ్చిన గొడ్డును బతికించటం ఎవరివల్లవుతుంది. రామయ్యా, సర్కారుసొమ్ము కట్టకపోతే పేచీ వస్తుందిగానీ? వెళ్లి కేకేసిరారా ముత్తాయ్?" అన్నాడు మళ్లీ మునుసబుగారు.

చచ్చిన బర్రెగొడ్డుమట్టూతా తిరుగుతున్న రత్తియ్య కెదురుగా వెళ్ళి నిలబడ్డాడు ముత్తాయ్.

"వెయ్యేళ్లు బతకరా ముత్తాయ్, అనుకుంటుండగానే ఒచ్చావు. ఎటువంటి బర్రెగొడ్డు చచ్చిందో సూశావా?" అన్నాడు రత్తియ్య విచారంగా.

"తమరి బర్రెగొడ్డు నాకు తెలవనంటండీ దొరా? మాలావు పుటగ్గలది!" అన్నాడు ముత్తాయ్.

"సరే, బతకనిబిడ్డ బారెడు. మరి దీని సంగతేమంటావ్? బయటకి చేరేస్తావా" అన్నాడు రత్తియ్య.

"అదేంటి దొరా కొత్తగా మాట్లాడ్తుండారూ? సచ్చినగొడ్డును మేం గాకపోతే ఇంకెవరు తీసికెల్తారూ"? అన్నాడు ముత్తాయి.

"అదిసరే లేవోయ్. కాదని ఎవరన్నారూ? ఇదిగో ముత్తాయ్? ఎందుకంటున్నానో అనుకోవద్దుగానీ — బర్రె ఖరీదు నాలుగు రూపాయలవుతుంది. తరవాత నీ ఇష్టం" అన్నాడు రత్తయ్య.

"సచ్చినబర్రె నాలుగు రూపాయిలా? ఎప్పుడూ ఇన్లేదండి దొరా" అన్నాడు ముత్తాయ్, అట్టాగే నోరు తెరుస్తూ.

"ఇప్పుడు వింటున్నావుగా, చచ్చినబర్రె యినా నాలుగు డబ్బులు గిట్టుబాటు చేస్తుంటే నాలుగో మూడున్నరో ఇచ్చుకుంటే దండగ కాదుగా?" అన్నాడు రత్తయ్య.

"తమ రట్టంటే మా బీనోళ్లంగాకాలి దొరా. మునుసుబుగోరు తమర్ని కేకేయమంటే ఒచ్చానండి రత్తయ్యగోరూ" అన్నాడు ముత్తాయ్.

"విన్నాం లేవోయ్ ఇంతకుముందరే మీ బడే సాయిబును తోలరుగా, మళ్లీ నువుకూడానా? దాంగుంపదెగిరి మరీ ఒకటే ఊదరగొతే ఎట్లా? ఇదిగో నాచేత నాలుగుసార్లు ఎందుకనిపిస్తావు, దీని విషయం మేమంటామో పైసల్జేసి మధ్యాహ్నం లోపల నేల్చి చెప్పేయ్, మళ్ళీ ఇంకోర్ని చూసుకోవాలి" అనేసి ఇంట్లోకి వెళ్లిపోయ్యాడు రత్తయ్య.

చచ్చినబర్రెగొడ్డు నోసూపు చూసి ఆలోచిస్తూ రత్తయ్య గుమ్మం దిగాడు ముత్తాయ్.

"ఒరే ముత్తాయ్!" అని కేకేశాడు బైస్కిలు బండిమీద ఉసిగా పోతూ చేసునొక్కి ఆగిపోయిన ఆస్పత్రి డాక్టరు.

"దణ్ణాలండి డాటరు దొరా" అన్నాడు ముత్తాయ్.

"ఒరేయ్, ఇంట్లో కట్టెలు లేవల్లే ఉంది; వెళ్లి నేను చెప్పానని చెంచయ్య కొట్లో రెండు గుళ్ల కట్టెలు ఇంట్లో పడేసిపో" అంటూ ముత్తాయ్ గుక్క తిప్పుకునేలోపే డాక్టరు బైస్కిలుమీద మాయమయ్యాడు.

ఇహ తప్పదు తొందరగా చేసేసి పోదామని చెంచయ్య కొట్టువేపుకు ముత్తాయ్ నాలుగడుగులు వేశాడో లేదో-"ఒరేయ్ ముత్తాయ్ ఒక్క క్షణం ఆగరా?"...అని ఆడకూతురు గొంతు వినిపించింది.

"అబ్బే ఏం లేదులే, ఏమిటా డాక్టరుగారు నీతో చెప్పిపోతున్నారూ?" అంది సీతారావుమ్మ. ఎదురింటిగుమ్మంలో నిలబడి డాక్టరు వెళ్లిన దిక్కే నిక్కినిక్కి చూస్తూ.

"ఆఁ ఏం లేదండీ సీతారావుమ్మగోరూ! నాలుగు కట్టెపేళ్ళు ఇంట్లో పడేసి పోమన్నారెండి" అన్నాడు ముత్తాయ్ తొందరపడ్తూ.

"అహాఁ అయినా ఆయనేం చెబుతే నాకెందుకులే. ఒక్కసారి ఇటూచ్చిపోరా ముత్తాయ్. కర్మ కాలిపోను. తెల్లవారి లేవంగానే నాకీ బ్రహ్మహత్య చుట్టుకుంది. మా దొడ్లో పిల్లి చచ్చింది. నాయనా య్యవ కాస్త దాన్ని అటెటైనా పారేసిపోదూ" అంది సీతారావుమ్మ ఆరాటంగా.

"అబ్బో, నానాపస్నుండాయ్ దొర్సానమ్మగోరూ" అనంటున్నాడు ముత్తాయ్.

వాటికేం లే నీకెప్పుడూ ఉండేవే. నువు ఇప్పుడు కాదన్నావంటే ఇహ బ్రహ్మదేవుడు దిగివచ్చినా ఆ పిల్లిని నాకంటికి కనపడకుండా తప్పించలేడు. నాయన్నా యన" అంది సీతారావుమ్మ దొడ్లోకి దారితీస్తూ.

సీతారావుమ్మ పిల్లి పనినుంచి బయటపడి, చెంచయ్య కొట్టుకు గబగబ వెళ్తున్న ముత్తాయికి వాల పల్లినుంచి ఒస్తున్న ఆదాయ్ కోసెలు వీరమ్మ దార్లో ఎదురయింది.

"ఏం ఈరమ్మా బాగుందావా? యాడ కెల్తుండా?" అని పలకరించాడు ముత్తాయ్ వీరమ్మను.

"పిల్ల కొలనగట్టు కెల్తుండాగానీ మీ ఉచ్చికి కాక తగిలిందంటగా? పిల్ల బురబుర్లాడ్తా అదేమయిన దగ్గుతుంటేఏంటా డాటరుగారికొకడ ఏదన్నా మందు తీసుకురామని సెప్పమంది మాణిక్యం" అంది వీరమ్మ

"ఆఁ కాక బాగా ఎక్కువైందా ఈరమ్మా?" అన్నాడు ముత్తాయ్.

"అదేమో మరి, పిల్ల సూడబోతే కాస్తె నలిగినట్టే ఉంది. ఎందుకైనా మంచిది ఆ డాటరుగార్ని డిగి మందిప్పిచ్చుకుని దబ్బున ఇంటికెళ్ళరాదూ? నేను లుండా నీ తిమ్మడు నాకోసం ఆ పిల్లకొలవగట్టు మీదే కూకునుంటాడు" అంటూ వెళ్ళిపోయింది. వీరమ్మ.

ఇంకొంచెం సేపటికి కట్టెలు తెచ్చి దొడ్లో ఏసి, సెమట తుడుసుకుంటూ ఆస్పత్రిలో డాక్టరుకు కనుపించేట్టు కాస్తె పెదగా నిలబడ్డాడు ముత్తాయ్.

"తెచ్చి పడేశావా?" అన్నాడు డాక్టరు రోగులకు మందులు రాసిస్తూ.

"పడేశానండి, పిల్లదానికి కాకతగిలింది దొరా" అన్నాడు ముత్తాయ్.

"ఏ పిల్లదానికి?" — అన్నాడు డాక్టరు, తలొంచుకుని రాసుకుంటూ.

"మా పిల్లదానికేనండి"—అన్నాడు ముత్తాయ్

"కాక తగిలిందా"—అన్నాడు డాక్టరు.

"అవును దొరా" అన్నాడు ముత్తాయ్.

"ఉహూ, సరే కానీపోండు" అన్నాడు డాక్టరు ఓజబ్బుమనిషిని పొట్ట ఒత్తిచూస్తూ.

"బురబుర్రాడ్డా పక్కకూడా బాగా ఉందంటండి దొరా." అన్నాడు ముత్తాయ్, కాసేపుసూసి.

"ఎవరికి?"...అన్నాడు డాక్టరు, ముత్తాయి నోసారి మళ్ళీ చూస్తూ.

"నా పిల్లదానికేనండి పగ్గూ జరం బాగా ఒచ్చిందండి".. అన్నాడు ముత్తాయ్ కొత్తె గట్టిగా.

"ఏం తిన్నదేం?" అన్నాడు డాక్టరు.

"పిల్లముండ అదేం తింటదండీ నిన్న ఇంకేంటే ఇంత ఉల్లికారం, దొగ్గలాకుపప్పు తిన్నదండి" అన్నాడు ముత్తాయ్.

"ఏదిపిల్ల? ఇటుతీసుకురా?" అన్నాడు డాక్టరు

"పిల్లదాన్ని తీసుకురామంటారండీ?" అన్నాడు ముత్తాయ్ కంగారుపడ్తూ.

"తీసుకురాకపోతే ఎట్లాగయ్యా మందివ్వటం? ఊ వెళ్ళి తీసుకురా"

ఆ నడిరేత్రి ఒళ్లు తెలియకుండా నిదరపోతున్న ముత్తాయిని లేపింది మాణిక్యం. గబాల్న మూచి ఒణుకుతున్న మాణిక్యం చెయి పట్టుకున్నాడు ముత్తాయ్.

"పిల్ల-పిలుస్తే పలకటం లేదు"...అందిమాణిక్యం సన్నగా వినపడీ వినపడకుండా.

ముత్తాయ్ మంచమ్మీదకు ఒంగి లచ్చిసుండె మీద సెయి పెట్టాడు. "అఁకేంటే పిచ్చిముండ పిల్ల సుబ్బరంగా నిదరపోతుంటేనూ?" అన్నాడు ముత్తాయ్. మాణిక్యం కళ్లు అనుమానంగా చూస్తూ.

డొక్క ఎగరేసుత్తుందది- మాపిటాల అట్టా లేనేలేదు" అంది మాణిక్యం సన్నగా మూలుగుతూ.

మైకంలో ఉన్న లచ్చి ఊపిరి పీల్చుకుంటానికి తంటాలుపట్టం నిదానంగా సూచిన ముత్తాయ్ మాణిక్యం కళ్ళ బిత్తరచూపులు సూశాడు.

"డాటరిదగ్గిరకెళ్దాం — పద —" అంది మాణిక్యం.

"ఇంత నిశిరేత్రప్పుడా? డాటరు పలుకుతాడా?" అన్నాడు ముత్తాయ్.

"కాళ్లు పట్టుకుందాం — బగమంతుడే ఉంటాడు—"

దారివెంట కుక్కలరుస్తూ వెంటపడ్తుంటే వినిపించుకోకుండా లచ్చిని బుజాన వేసుకుని ఒచ్చి డాక్టరు తలుపు గబ్బగబ్బాకొట్టారు ముత్తాయ్, మాణిక్యం.

"ఎవరది?" తలుపు తెరిచి బ్యాట్రీలైటు మీదేసి సూశాడు డాక్టరు.

"ముత్తాయిని దొరా—రచ్చించాలి."

"నీకేమన్నా మతుందా లేదా? గాభరా పెట్టి చంపావేం?"

"మీపాదాలు పట్టుకుంటాం దొరా — పిల్లది డొక్క ఎగరేత్తుందని."

"ఏడ్చినట్టే ఉంది. మేమేం మనుషుల మనుకున్నారా, పిశాచాల మనుకున్నారా? పగలంతా ఏం చేస్తున్నావ్ ఇంత అర్ధరాత్రి రాకపోతే?"

"తమరు పిల్లదాన్ని సుద్దాన్నం సూసి మందిచ్చారుగందా తగ్గిపోతుందనుకుండాం దొరా. మరిం తలో కొంపమీనకొచ్చిందని..."

"చాల్లే రండి లోపలికి..."

సగం నిదరమత్తుతో ఒంగి లచ్చిని పరీక్ష చేస్తున్న డాక్టరు ఒక్కసారి నిటారుగా నుంచున్నాడు

"మీ అలగా జనానికేం తెలియదు" అన్నాడు డాక్టరు పెళ్లున.

"అదేందిదొరా? —" అన్నాడు ముత్తాయ్, మాణిక్యం ఒక్కసారిగా.

"ఇంజెక్షనివ్వాలి, నా దగ్గిర లేదాఇంజెక్షను. చీటీ రాసిస్తాను పొన్నూరువెళ్లి అర్జెంటుగా తీసుకురావాలి."

"అబ్బో, అంతదూరమా? ఇంత రేత్రి ఎవరు పలుకుతారు డాటరు బాబూ?"...అన్నాడు ముత్తాయ్ నీలుకారిపోతూ.

"తెల్లవారేదాకా ఉండేనా ఇంజెక్షను తీసుకురావాలి—అయిదు రూపాయలు తీసుకుపో."

"అయిదు రూపాయిలా?" అన్నాడు ముత్తాయ్.

"సూడు—పిల్లకు ఇంకా మైకం ఒదల్లేదు—అయ్యొయ్యనాలచ్చీ—" అంది మాణిక్యం కోక చెంగు మొహాన కప్పుకుని మూలుగుతూ.

డాక్టరిచ్చిన సీటీ ఒక గుప్పెట్లో పెట్టుకుని, తమవుకోకుండా రెండో సేయి మాణిక్యం మెళ్లోకి పోనిచ్చి పుస్తెతాడు పటిక్కన తెంచి—ఇంకొక్క క్షణంలో గుంటుపల్లివీధులన్నీ దాటి పెద్దకాలవ గట్టెక్కి పొన్నూరువేపుకు రొప్పుకుంటూ పరుగెత్తాడు ముత్తాయి—సీకట్లో కలిసిపోతూ.



దేవకన్య

చీనా దేశపు పింగాణీ శిల్పం



వీరనారి షీషిత్

చీనాదేశపు మృణ్మయ శిల్పం

# నాట్యశాస్త్ర వ్యాఖ్యాతలు

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

## 1

నాట్యశాస్త్రమునకు గల వివిధ వ్యాఖ్యాతలలో నొక టీకాకారుడు కన్పించుచున్నాడు. ఈ టీకాకారు డెవ్వరో మన మిప్పుడు నిశ్చయింపలేము. కాని క్రమేణ అభినవ భారతిని పర్యాలోచన చేయగా, చేయగా మనమీ ప్రశ్నను నివృత్తి చేయగలము.

"టీకా కారైస్తు శ్లోకార్థస్యాస్య ప్రతికర్షణత్వ మస్య వ్యాఖ్యాతమ్"(అ. భా. IV 22 వ్రాతప్రతి)

అని ఒకచో అభినవ భారతిలో కన్పించుచున్నది. ఇచట వ్యాఖ్యాన భేదము కలదు.

"సంభోగేన హాస్యాంగత్వే నాపేక్షితో విప్రలంభే చ
సమాన వ్యభిచారికత్వాత్కరుణ ఇతి టీకాకారః"
(అ. భా. I—318)

అని మరియొక చోట అభినవభారతీ కారుడు టీకాకారుని స్మరించెను.

"టీకా కారా స్త్వాహుః—ఆశ్రయః స్వతః స్వరూపేణ జాతీనాం
గాన ఉపయోగో న తు రక్తి సంపాదకత్వేన"
(వ్రాతప్రతి అ. భా. IV 14)

అని వేరొకచో చెప్పబడినది.

"టీకా కృద్భిస్తు-సదాశివ మతాది గ్రంథాంతరాలిఖితం త్రయస్త్రింశది మే ప్రోక్తా అలంకారా ఇత్యాది" (IV 25)

అనుచో టీకాకారునకు ముప్పదిమూడలంకారములే సమ్మతమని కన్పించుచున్నది.

"టీకాకారైః పూర్వ రంగే వంశస్య కారణ నైకల్యాత్ అసంస్కార్యతా" (IV 59)

అని ఇంకొకచో గలదు.

"టీకాకార స్త్వాహ—ఇహ వంశస్య ఛిద్రవిధానం ముఖవాయ్వా సంయోగా దంగులి సంయోగ క్రియాయాశ్చేతి" (IV 63)

అని ఇంకొకచోట అభినవు డుదాహరించినాడు.

"టీకా కృత్త్వదాహ—లయాంతర మితి కనిష్ఠ మేవోచ్యతే, తదాశ్రయత్వా దుపచారేణ" (IV 116)

అని పల్కినపుడు టీకాకారుడు మూలగ్రంథమునకు ప్రతిపదార్థమును గూడ చెప్పినట్లున్నది.

"టీకా కృతస్తు—సన్నిపాత వ్యుత్పత్త్యా శమ్యాది వ్యుత్పత్త్యా శమ్యాది వ్యాఖ్యయా అవాంతర తాలవగేష్వై రిత్యాది యదుక్తం, తదవిభక్తాంగ మావిభక్తాంగ మాద్యమం త్యజ జ్వాలాదివ్య మాత్రేతి ఇయతా సిద్ధే శిష్టం శ్లోక భాగో వ్యర్థ ఏవే త్యల మనేన" (IV-137)

అని చెప్పుడు పూర్వాపర విషయములను సమన్వయపరచుకొనుచు, సందర్భోచితముగ అర్థమును చెప్పినట్లు గలదు.

"టీకా కారా స్తావద్వ్యా కుర్వంతి—ఇహ చతురశ్రే ఒస్మిన్ ప్రథమాంగేన నైషాయసికేన తాదృశాభావ్యం ద్వాదశ కలప్రపతం తత్కృతం చతశ్రః కలా మాత్రానంతర శూన్యప్రయోగేణ వర్ణానుకర్షాన్నిర్వాహ్యాః" (IV-161)

అని ఇంకొకచో టీకాకారుని సమగ్ర విషయ పర్యాలోచన నభినవుడు గుర్తించినాడు.

"టీకాకారాస్తు-పశ్చిమార్థం యన్మాత్రా త్రియం తదాదౌ కుర్యాత్ ..." (IV 162)

అని వేరొకచో అభినవుడు పల్కియున్నాడు.

"అత్రటీకాకారేణాక్షిప్త వజ్రం శీర్షకం చేతి యో వినియోగః ప్రొక్తః......" (IV 192)

అని మరొకచోట గలదు.

"టీకా కారాస్తు— పరిక్రమణైః త్రికోణ చతుష్కోణ రంగాపేక్షయా త్ర్యశ్రే చతురశ్రతాతి విభాగమాహుః" (IV. 197)

ఇట్లనేక పర్యాయము లభినవుడు టీకాకారుని స్మరించుట గలదు. ఈ ఉదాహరణల ద్వారా నాట్య

శాస్త్రవ్యాఖ్యా సంప్రదాయ మవిచ్ఛిన్నముగా గల దని చెప్ప వీలగుచున్నది.

## 2

అభినవుడు విశిష్టముగా లొల్లట, ఉద్భట, శంకుక, భట్టనాయక, భట్టతోత ప్రభృతుల వ్యాఖ్యల నక్కడక్కడ స్మరించినాడు. వీరినిగూర్చి కొంత తెలిసికొనవలసిన అవసరము గలదు.

వీరిలో లొల్లట, ఉద్భటు లతి ప్రాచీనులు. ఉద్భటునకన్న లొల్లటు డతి ప్రాచీనుడు. నాట్యశాస్త్ర ప్రాచీన పాఠమునే వీరిరువురు పఠించినారు. ప్రాచీన పాఠములోగల సంక్షిప్త గ్రంథము నుద్భటుడును, విస్తృత గ్రంథమును లొల్లటుడు పఠించినారు గనుక వీరిలో లొల్లటుడే అతిప్రాచీను డనదగును.

లొల్లటుడు పూర్వ మీమాంసా దర్శనములో కొంత కృషిసల్పిన వాడగుటచే పూర్వమీమాంసకుల ప్రమాణజ్ఞానముతో రసప్రతీతిని సమన్వయపరుప నెంచినాడు. రసనిష్పత్తి సూత్రమును వ్యాఖ్యానించుచు లొల్లటుడు మీమాంసకుల ఉత్పత్తివాదమును తెచ్చి, విభావాదులద్వారా ఉత్పాద్యమగు విశిష్ట నవ్యపదార్థమే రసమని యనినాడు. ఈ వాదమును దండి, రుద్రట, భోజ ప్రభృతులు స్వీకరించినారు. కాని శంకుకాదు లీ వాదమును దూషించిరి. ఐనను అభినవుడీ లొల్లట వ్యాఖ్యను నిరసించినట్లు కన్పడక పోవుటయే గాక, పైపెచ్చు లొల్లటుని రసోత్పత్తిని అంగీకరించినట్లే కన్పించుచున్నాడు. ఈ వాదము ప్రామాణికము, న్యాయబద్ధము, యుక్తియుతము అని భారతిలో లోగడ చెప్పితిమి.

విభావములు, అనుభావములు, స్థాయిభావములు, సంచారి భావములు మొదలగున వన్నియు ప్రత్యేక ప్రత్యేకముగా రసములుగా పరిణమించగల వని, కాని లోకప్రసిద్ధి లేకపోవుటచే నెనిమిదిరసములే చెప్పబడినవని లొల్లటుడు నిరూపించెను. మిగిలిన వేవియు రసములు కాజాలకపోయినను, సంచారి భావములుమాత్రము రసములుగా పరిణమించగలవని చెప్పుట వివరములు వేరొకచోట నిచ్చితిని. ఈ వాదమును దండి, రుద్రట, నమిసాధు, భోజులు గ్రహించినారు.

"రసా భావా హ్యభినయాః" అను ఆరవ అధ్యాయ మండలి శ్లోకమున కోహలాదు లేకాదశాంగముల నంగీకరించిరి. ఈ వాదము నుద్భటు డంగీకరించెను గాని, లొల్లటుడు దీనిని దూషించి, నాట్యమున రసభావాభినయ గీతాతోద్యములను పంచాంగములే కలవని నిర్ధారణ జేసినాడు. దీనిని అభినవుడు స్వీకరించినాడు. లొల్లటునిపై అభినవునకున్న గౌరవ మితర వ్యాఖ్యాతలకే గాక, నేటి సమీక్షకులకు గూడ లేకపోవుట శోచనీయము.

తేనాయ మర్థః – ధ్రువా తాలేఽపి గత్యను సార్యేవ
కలా విధి ర్లయవిధిశ్చ-అత ఏవైతదనుసారేణ
భట్టలొల్లట గోపాలాది భి ర్భంగోపభంగవిభంగ
విషయే తాలదీపికాదౌ చిరంతన సంమతో ధ్రువా
తాలానాం వినియోగః ప్రపంచతో దూషితః"
(II. 184)

అని వేరొకచోట అభినవుడు ఆదరాతిశయములతో లొల్లటుని ప్రస్తుతించినాడు.

"అత ఏవం వాదినా కథ్యాదేర పృథగ్భావేమో హేతురుక్తః క్రమోల్లంఘనా దితి తస్యాసిద్ధత్వం
విరుద్ధతా చ, ప్రత్యుత ప్రత్యేక ప్రసంగత్వలాభాత్
క్రమస్యా పదార్థత్వా న్నార్థ ప్రమాణకత్వాత్,
ముఖ్యశ్రౌత పదార్థ బాధకత్వ మయుక్తం, శ్రుత్యా
వాక్య ప్రమాణస్య బాధనాదితి తు భట్టలొల్లటోక్తం
ప్రకృతే సిద్ధ్యతి, విరోధాభావాత్ ..." (II. 193)

అని ఇంకొకచో లొల్లటుని స్వీకరించినాడు.

పదునెనిమిదవ అధ్యాయములోని
"అంక ఇతి రూఢి శబ్దో భావై శ్చ రసై శ్చ
రోహయత్యర్థాన్"

అను పంక్తిలో "రూఢి" యనుటకు బదులు "గూఢ" అను పదమును లొల్లటుడు స్వీకరించి వ్యాఖ్యానించెను. ఈ పాఠ మభినవ సమ్మతము గాకపోయినను, అభినవుడి చట లొల్లటుని దూషించక పోవుట గమనింపవలసిన విషయమే. ఇదే అధ్యాయమున:

యఃకశ్చిత్కార్యవశా ద్గచ్ఛతి పురుషః ప్రకృష్ట
మధ్వానమ్
తత్రాప్యం కచ్ఛేదః కర్తవ్యః పూర్వవ త్తజ్జైః"

అను శ్లోకమును లొల్లటుడు నిరాకరించినాడు. కాని తోతభట్టు ననుసరించి అభినవుడీ శ్లోకమును సమర్థింపనెంచెను.

"షట్ప్రదేయం నాటికేతి సంగ్రహేను సారిణో భట్ట లోల్లటాద్యాః" (II. 436)

అని యొకచోట అభినవు డనినాడు. భట్టలోల్లటుడు నాలుగు వృత్తులనే గ్రహించెనని చెప్పుదు, అభినవు డీ విషయమున కొంత విజృంభించెను గాని లోల్లటుని అగౌరవ పరచలేదు. (II. 452)

లోల్లటుడు నాట్యశాస్త్రమును సమగ్రముగా వ్యాఖ్యానించినట్లు కన్పట్టెను. ఆనందవర్ధనాదులు ప్రపంచించిన ఔచిత్యవాదము సహితము లోల్లటునిదే యనుటకు రాజశేఖర, హేమచంద్రు లిచ్చిన లోల్లట శ్లోకము లాధారములుగా గలవు.

"'అస్తు నామ నిస్సీమా అర్థసార్థః; కింతు రసవత ఏవ నిబంధోయుక్తః, నతు నీరసస్య' ఇతి అపరాజితిః, యదాహ—

'మజ్జన పుష్పాపచయన సంధ్యా చంద్రోదయాది వాక్య మిహ
సరస మపి నాతి బహులం ప్రకృత రసాన న్వితం రచయేత్
యస్తుసరిదద్రి సాగరపురతురగ రథాదివర్ణ నేయత్నః
కవిశక్తిఖ్యాతిఫలం వితతధియాం నో మత స్స ఇహ ఇతి"

అని రాజశేఖరు డాపరాజితీవాక్యమును, కారికలను ఇచ్చినాడు. అపరాజితియనగా లోల్లటుడని హేమ చంద్రునిద్వారా మనకు తెలియవచ్చుచున్నది. హేమ చంద్రుడు, లోల్లటుని కారికయని పైనగల రెండవ శ్లోకము నిచ్చి, తర్వాత :

"యమకానులోమతదితర చక్రాదిభిర్హి రసవిరోధినః
అభిమానమాత్రమేతత్ గడ్డరికాది ప్రవాహో వా"

అను ఇంకొకశ్లోకమును లోల్లటునిదిగా ఇచ్చినాడు. ఈ శ్లోకమును లోల్లటునిదిగా ఇచ్చుచు నమిసాధువు ఔచిత్యమును ప్రపంచించియున్నాడు. ఈ లోల్లటుని వ్యాఖ్య చాలవరకు అభినవభారతిలో లీనమై పోయినది.

### 3

ఉద్భటుడు గూడ భరతుని వ్యాఖ్యాతలలో నొకడు. ఇతని వాదముల నప్పుడప్పు డభినవుడు స్పృశించినాడు. కాని లోల్లటునిపైజూపు భక్తిశ్రద్ధల నిచట అభినవుడు చూపునట్లుకన్పించదు. ఉద్భటుడు కోహలమతానుయాయి. నాట్యాంగములను చెప్పు సందర్భమున:

"అనేన తు శ్లోకేన కోహలమతే ఏకాదశాంగత్వ ముచ్యతే, తత్సంగృహీతస్యాపి పున రత్రోద్దేశాత్, నిదేశేసైతత్క్రియవ్యాఖ్యాసనా దిత్యోద్భటాః"
(అ. భా. I. 266)

అని అభినవుడు పలికినాడు. కోహలుడు, ఉద్భటుడు ఏకాదశాంగముల నంగీకరించినారు. ఇది లోల్లట, అభినవులకు సమ్మతముకాదు. శాస్త్రప్రచార విషయమున

"ఉత్తానః పార్శ్వగశ్చైవ తథాధోముఖ ఏవ చ
ప్రచారస్త్రివిధోఽంగానాం నాట్యంవృత్తే సమాశ్రయః"

అని అభినవుని పాఠమున మూడువిధముల ప్రచారమే గలదు. కాని ఈ శ్లోకమును:

"ఉత్తానోఽథ స్తలస్త్ర్యగ్రోఽగ్రగోధోముఖ ఏవ చ
పంచప్రచారాహ స్తస్య నాట్యన్వృత్తసమాశ్రయాః"

అని పఠించి, ఉద్భటు డైదువిధముల ప్రచారము నవశ సరముగా కల్పించినాడు. పదునెన్మిదవ అధ్యాయమున:

"వృత్తానిసమవకారే కవిభి స్త్రావిప్రయోజ్యాని"

అనుటకు బదులు

"వృత్తాని సమవకారే కవిభి ర్నైవ ప్రయోజ్యాని"

అని ఉద్భటుడు పఠించి సమవకార సంధ్యంగము లగు విద్రవ కపటముల కీపంక్తి సరిపోదని గుర్తించలేక పోయినాడు.

ఉత్సృష్టికాంకమున న్యాయవృత్తి, అన్యాయ వృత్తి, ఫలవృత్తి యను మూడువృత్తులు గలవని ఉద్భటుని వ్యాఖ్య. న్యాయవృత్తి యనగా కైశికీవృత్తి. లోల్లటుడు ఫలవృత్తిని దూషించినాడు. శంకుకు డిచట సాత్త్వతీ వృత్తినే అంగీకరించెను. అభినవుడు భారతీ వృత్తినే ఇచట చెప్పవలెననినాడు. ఉద్భటుని పంచమ వృత్తిని శంకుకుడు సహితముదూషించెను.

కాగా ఉద్భటుని వ్యాఖ్యలో క్రొత్త పోకడలు గలవని, వ్యాఖ్యాత యొక్క స్వాభిప్రాయములకిది ఆకరమైనదని గనవచ్చుచున్నది. కాని ఈతని వ్యాఖ్యకంత ప్రాధాన్య మిచ్చిన వారున్నట్లు కన్పించదు.

## 4

శంకుకుడు నవ్యపాఠము నవలంబించి నాట్యశాస్త్రమును వ్యాఖ్యానించెను. ఇతడు న్యాయదర్శనమున కృషి సల్పినవాడు. రసప్రతీతిని నిర్వచించు సందర్భమున నైయాయికుల ఆనుమానిక వాద మితనికి చాల ఉపకరించినది. ఈ వాదము నీతడె ట్టిచట సమన్వయ పరుప జూచినది "శంకుకుని రసానుమితి" అను వ్యాసమున భారతిలో వివరించితిమి.

మూడవ అధ్యాయమున రంగ పూజావసరమున "నాగ పుష్పస్య మూలేన వితుషాభిః ప్రియంగుభిః" అను పంక్తి గలదు. దీనిని వ్యాఖ్యానించుచు శంకుకుడు వృథాప్రయాస నంది అపార్థమును చేబట్టెనని :

"అతః చతుష్స్తం రంగపీఠ, పృష్ఠ ఏవ మండల మిత్యుక్తం భవతి. తేన శంకుకాదిభిః షోడశ హస్తావకాశా భావః అసన స్తంభాది వశాత్తస్మాదకృత ఏవ రంగపీఠే, ఇత్యాది వృథైవ బహుతర ముపన్యస్తమ్" (అ. భా. *I*. 74-75)

అను పంక్తులవలన తెలియును. పైగా విశేషపాఠభేదములతో గ్రంథమును పఠించి అపార్థములను కల్పించెనని గూడ అభినవు డనినాడు. (అ. భా. *I* 216-217) శంకుకుడు సమగ్రముగా గ్రంథమును వ్యాఖ్యానించెను. కాని అభినవున కీతని వాదము సర్వదా పూర్వపక్షమే యయినట్లు తోచుచున్నది

"ప్రఖ్యాతే భారతాదౌ యద్వస్తు తద్విషయోఽస్య తత్రాపి కించి దప్రసిద్ధం భవతి, తన్నిరాకరణాయ ప్రఖ్యాతో దత్తేతి శ్రీ శంకుకః ఏతత్తు ప్రఖ్యాత వస్తు విషయోఽస్యేతి ఇయతా గతార్థ మిత్యుపాధ్యాయాః" (అ. భా. *II* 411)

అని అభినవు డనినపు డీ విషయము బోధపడుచున్నది. ఇట్టి పంక్తు లనేకము లభినవభారతిలో కన్పించుచున్నవి.

శంకుకుని పాఠమున ముప్పదియారు గాక, ముప్పదినాలు గలంకారములే కన్పించుచున్నవి. అభినవుని పాఠమునకు శంకుకుని పాఠమునకు విపరీత భేదము లేకున్నను వీరి వ్యాఖ్యలలో చాల భేదము గలదు. వీరి సంప్రదాయములు వేరు, భావములు వేరు, శాస్త్రమర్యాదలు వేరు. న్యాయ దార్శనికులకు సాహిత్యమీమాంసకులకు పొత్తు కలియుట దుర్ఘటము.

## 5

తర్వాత వచ్చిన వారిలో మహా వ్యాఖ్యాత, గొప్ప మేధావి, సునిశిత బుద్ధిసంపదగల సమీక్షకుడు, భావనాపటిమగల వ్యక్తియగు భట్టనాయకుడు కన్పించుచున్నాడు. భట్టనాయకుడు చెప్పిన విషయ మేదో, అభినవు డితని వ్యాఖ్యనుండి ఎక్కడ గ్రహించుచున్నాడో, వేఱుజేయులేము. భట్టనాయకుని భావముల నభినవభారతినుండి తీసి వేసితి మేని, అభినవభారతిలో సజీవమైన భాగమేదియు మిగులజాలదని చెప్పుటలో నతిశయోక్తి లేదు.

సాంఖ్య, యోగదర్శనములను చక్కగా తనలో జీర్ణము చేసికొని, అద్వైత వేదాంతదర్శనమును స్వానుభవైక వేద్యముగా జేసికొని, కావ్యజగములో కన్పించు సౌందర్యము సచ్చిదానంద భావనలో పర్యవసితి మగునదని గ్రహించి, నాట్యశాస్త్రవ్యాఖ్యకు భట్టనాయకుడు పూనుకొని కృతకృత్యుడైనాడు. భట్టనాయకుని రసప్రతీతి వాదమును రసభోగవాదమని గాని, రసాస్వాదవాదమని గాని వ్యవహరించవలెను. ఈ వాదము నీమణ్మాత్రము మార్చి అభినవుడు వ్యంజనకు గతి కల్పింప నెంచినాడు. రసభోగమున కన్పించు సాధారణీకరణము, భావన, రసధ్వని, శబ్దవైశిష్ట్యము, అర్థవైశిష్ట్యము, శబ్దార్థ సంబంధము, మొదలగునవన్నియు భట్టనాయకుడే సాహిత్య సమీక్షకుల కర్పించినాడు. ఈ భట్టనాయకునివాదమే రసగంగాధరకారుని చేతిలో "భగ్నావరణాచిత్"గా పరిణమించినది. భట్టనాయకుని మించిన సమీక్షకుడు నేటిదనుక జగత్తులో నెచ్చటను జన్మించలేదనుట సత్యము. మనదౌర్భాగ్యవశమున ఇతనివ్యాఖ్య నమసిపోయినది. కాని అభినవభారతిలో విశిష్టముగా మనకు గోచరించు స్థలములన్నిటియందు మాటాడునది భట్టనాయకుడే యని నిర్ధారణ చేయవచ్చును. అభినవుడు భట్టనాయకునిలో లీనమైనాడు. మనకు నాట్యశాస్త్ర మర్థవంతముగా చేసినవాడు. భట్టనాయకుడు. ఇతనిని సమగ్రముగా అర్థము చేసికొనిన తౌతభట్టుద్వారా, అభినవుని పంక్తులలో మనకు భట్టనాయకుడు కన్పించుచున్నాడు.

నాట్యశాస్త్రమునకు పరమ ప్రయోజనమును చెప్పు సందర్భమున భట్టనాయకుని పంక్తుల నీరీతిగా అభినవు డుదాహరించెను :

"భట్టనాయకస్తు— 'బ్రహ్మణా పరమాత్మనా యదుదాహృత మవిద్యా విరచితం నిస్సారభేద గ్రహే యదుదాహరణీకృతం తన్నాట్యం, తద్వ్యాఖ్యామి. యథా హి కల్పనామాత్రసారం తత ఏవ వాసనస్థిత్యైకరూపం క్షణేన కల్పనాశతసహస్రసహం, స్వప్నాది విలక్షణమపి సుష్ఠుతరాం హృదయగ్రాహి నిదాన మత్యక్త స్వాలంబన బ్రహ్మకల్పనోపరచితం రామరావణాది చేష్టితం కుతోఽప్యభూతాద్భుతాద్భుత వృత్త్యాభాతి, తథా భాసమానమపి చ పునర్నోపాయాతామేతి, తథా తాదృగేవ విశ్వమిద మసత్యనామరూప ప్రపంచాత్మకమ్. అథచ శ్రవణ మననాదివశేన పరమపుమర్థ ప్రాపక మితి లోకోత్తర పరమపురుషార్థ సూచనేన శాంతరసోపక్షేపోఽయం భవిష్యతి.

"స్వంస్వం నిమిత్త మాదాయ శాంతాదుత్పద్యతే
రసః" ఇతి.

తద నేన పారమార్థికం ప్రయోజన ముక్తమ్' ఇతి వ్యాఖ్యానం సహృదయ దర్పణే పర్యగ్రహీత్, యదాహ—

'నమస్త్రైలోక్య నిర్మాణ కవయే శంభవే యతః
ప్రతిక్షణం జగన్నాట్యప్రయోగ రసికోజనః'
ఇతి" (అ. భా. I. 4-5).

ఈ వాక్యములలో భట్టనాయకుని అద్వైతవేదాంతము స్పష్టముగా కన్పించుచున్నది. నాట్యశాస్త్రమును శ్రవణమననాది పరముగా జెప్పి, శాంతరసోపక్షేపమని నాడు. శాంతమే రసమని, రసమవగా శాంతమని, శృంగారాదులు శాంతరస వికృతులని: శాంతిహారసము లకు వివర్తోపాదానమని భావము. అభినవుని నాట్యశాస్త్రపాఠమున ఆరవ అధ్యాయములో కన్పించు శాంతరస ప్రకరణము భట్టనాయకునిచే రచింపబడినదా? యను సందేహము కలుగకమానదు. ఈ ప్రకరణమును భట్టనాయకుడే మనకర్పించినాడు. అభినవుడీ ప్రకరణమును వ్యాఖ్యానించినాడేగాని, భట్ట నాయకుని భావమును పూర్తిగా అవగాహనము చేసికొనినట్లు కన్పించడు. కొన్నిచోట్ల శాంతమును మహారసమని, మరికొన్నిచోట్ల శృంగారాదులవంటి రసమని అభినవుడు పల్కుట భట్టనాయకునకు సమ్మతముగాదు. పై వాక్యముల కనుగుణముగా శాంతమును నిర్వచించినచే శాంతరసస్వరూపము బోధపడగలదు

శాంతమునుగూర్చి, రసమునుగూర్చి లోచనలో ప్రపంచించునపుడు గూడ అభినవుడు భట్టనాయకుని భక్తిపురస్సరముగా ప్రస్తుతించియున్నాడని విస్మరించరాదు. నాట్యశాస్త్రములోని పదునారవ అధ్యాయమున లక్షణను నిర్వచించుచు అభినవుడు తన ఉపాధ్యాయమతమును వదలి, భట్టనాయకుని మతమునే సేకరించినాడు. అచటనే భట్టనాయకుని శబ్దార్థ సంబంధ నిర్వచనమును గూడ తీసికొనినాడు.

# జంటపక్షులు

నాగభూషణ్

## రంగము : I

* * అప్పుడే ప్రొద్దుగూకింది. తెర లేచేసరికి ప్రేక్షకులకు చీకటిగా ఉన్న హాలు కనిపిస్తుంది. ఆ చీకటిలో ఒక ఆకారం అటూ యిటూ కదుల్తూ, అవీ యివీ సర్దుతూ వుంటుంది. ఇంతలో మరో ప్రక్కనుంచి మరో ఆకారం సిగిరెట్టు కాలుస్తూ ప్రవేశిస్తుంది.

సిగరెట్ మనిషి : గదులన్నీ సిద్ధంగా వున్నయ్యా?

మొదటి మనిషి : చిత్తం సార్!

సి. మ : అన్ని గదుల్లోనూ సామాను సరిగా సర్దించావా?

మొ. మ : చిత్తం సార్.

సి. మ : అంతా మామూలుగానే జరగాలి. ఎక్కడా పొరపాటు జరగకుండా చూడు.

మొ. మ : నిండా జాగ్రత్తతో వుందును.

[సిగరెట్ తాగుతున్న మనిషి వెళ్లిపోతాడు. ఇంతలో వీధితలుపు చప్పుడవుతుంది. మొదటి మనిషి వెళ్ళబోతున్నవాడు, వెనక్కి వచ్చి, లైట్ స్విచ్ వేసి, వీధితలుపు తీస్తాడు.

ఆ లైటు వేసింది లోకనాథం—బట్లరు; ఆ యింట్లో యజమాని తరువాత యజమాని అంతటివాడు. కొంచెం బొద్దు మనిషి. వేషమూ, భాషా కూడా యాస.

ఇక ఆ హాలు—ఆ యింట్లో అతిథులకోసం ప్రత్యేకించబడినది—నిజంగా గది కాదు, ముందు హాలు మాత్రమే. కాని దానికివున్న రెండు వాకిళ్ళకు గట్టి కర్టెన్లు కట్టివుంచడంతో ముందు హాలుకు వుండే అసౌకర్యం లేవీ దానికి లేవు. కుడివైపునుంచి వీధిలోకి; ఎడమవైపునుంచి యింటిలోకి రాకపోకలు జరుగుతాయ్. వెనక ప్రక్కగా ఓ కిటికీ వుంది. కొంచెం కుడివైపుగా ఓ టేబుల్, దాని చుట్టూ మూడు కుర్చీలు వుంటయ్. అటూ యిటూ వున్న రెండు సోఫాలు, పైన తిరుగుతున్న సీలింగ్ ఫాన్, డూంలైట్లూ, క్రింద పరిచిన తివాసీ—ఇవన్నీ అదో భాగ్యవంతుడి యిల్లని చెబుతయ్.

[బట్లర్ తలుపు తీస్తాడు. రామమూర్తి లోపలకు వస్తాడు. సగం లోపలకు వచ్చి గదివి చూచి ఆశ్చర్యపడతాడు. ఫ్రెంచికట్ మీసం, మధ్యగా పాపిడి తీసి వెనక్కి దువ్విన జుట్టు—ఇరవయ్యో శతాబ్దంలో బతికే యంత్రంలాంటి మనిషి ]

రామమూర్తి : ఆఁ!...చూడండి...ఇది హోటలేనా?...మేము దారి తప్పినట్లుగా వున్నాం.... ఈ రాత్రికి యిక్కడే వుండొచ్చని మా జవాను చెప్పాడు... (వెనక్కి తిరిగి పిలుస్తూ) చూడు రాముడూ! ఇది హోటల్ లా లేదే!...

జానకి : (లోపలనుంచి) రాము డెక్కడికో వెళ్లాడు, రాం!

మూర్తి : (లోపలికి చూస్తూ) వెళ్లాడా? ఏమొచ్చింది?

బట్లర్ : రాముడు కానా నిజం చెప్పినాడు సార్. ఇది 'ఒక రకం' హోటలే!

మూర్తి : ఇంతకూ వాడు ఎక్కడకు వెళ్లాడు?

జానకి : నువ్వు కారులోనుంచి దిగగానే వెళ్ళాడు రాం! ఇది నిజంగా—

[ఈ మాటలంటూ ఆమె లోపలకు వస్తుంది. మూర్తి చెయ్యి మృదువుగా పట్టుకొని వుంటుంది. అందంగా, అమాయకంగా కనిపించే కళ్లు, వాటి వెనుక దాగివున్న పల్లె మాలిన అల్లరి, నవ్వినప్పుడు కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. రాణిలా, హుందాగా మాట్లాడుతుంది. ప్రస్తుతం జరిగిన కొన్ని అసాధారణమైన విషయాలవలన నిస్పృహతో కనిపిస్తుంది.]

బట్లర్ : రాముడు నిజమే చెప్పినాడు సార్.. ఇది ఒకరకం హోటలుదా! అవును.

మూర్తి : ఇంతలో వా డెక్కడికి వెళ్లాడు?

బట్లర్ : కారు లోపల పెడుతున్నాడు సార్... అయ్యగారు—

మూర్తి : మేం—ఈ ఒక్కరాత్రికే—ఇక్కడ వుండడానికి వీలుంటుందా?... నేను ..ఆ:...మా ఆవిడ, నేను.

బట్లర్ : దానికేమిసార్!...లోపలికి—

మూర్తి : (లోపలకు వెళదాం అన్నట్టుగా జానకి వంక చూస్తూ) ఈ పరిస్థితుల్లో మనం ఇంతకంటె యింకేం చెయ్యలేం, జానీ! జరిగినదానికి నాకు చాలావిచారంగా వుంది...కాని, ఈ కొత్తస్థలం—

జానకి : ('బట్లర్ ముందు అలా మాట్లాడతా వేం?' అన్నట్టుగా చూస్తూ) ఫరవాలేదు. ఈ ఒక్కరాత్రికే కదా!

బట్లర్ : ఇంకేం సార్! లోపలకు రండి.

(ఇద్దరూ లోపలకు వస్తారు. రాగానే తలుపు గడియవేసి, కర్టెన్ సరిగా లాగుతాడు బట్లర్. ఈ చప్పుడుకు వెనక్కు తిరుగుతుంది జానకి. తలుపు వెయ్యటం చూచి నిశ్చేష్టురాలవుతుంది ... మూర్తి అక్కడ వున్న కుర్చీలూ, బల్లలూ చూస్తూ 'ఈ హోటలు చాలా తమాషాగా వుందే!' అనుకుంటాడు).

---

ఇది ఎ. ఎ. మిల్న్ (A. A. Milne) రచించిన 'ది డోవర్ రోడ్' (The Dover Road) అనే రచనకు అనుసరణ. నవ్యాంగ్ల రచయితలలో ప్రసిద్ధుడైన మిల్న్ (The Dover Road) 'ది డోవర్ రోడ్,' (Pim Passes By) 'పిమ్ పాసెస్ బై,' (The Fourth Wall) 'ది ఫోర్త్ వాల్' అనే మూడు నాటికలను రచించారు. ప్రదర్శన సౌలభ్యంగల మొదటి రెండు నాటికలూ లక్షలాది ప్రేక్షకులకు ఆనందం కలిగించుతున్నాయ్. 'ఫోర్త్ వాల్' అనే మూడవ నాటిక హత్యానేరాలకు గల కార్యకారణ పరంపరను హేతుబద్ధంగా నిరూపించటంలో విజయాన్ని చేపట్టిన మహా రచనగా కీర్తి నార్జించుకున్నది. మనోహరమైన శిల్ప సంపదగల నాటిక.

మిల్న్‌కు బాలసాహిత్య నిర్మాతలలో అగ్రస్థానం వుంది. 'విన్నీ ది పూఫ్' (Winne the Pooh) అనే పేర ఈయన రచించిన బాలసాహిత్య గ్రంథ పరంపర ఆంగ్లేయ బాలబాలికలను ఆనంద డోలికలలో ఊచుతున్నాయి.

74 సంవత్సరాల ప్రాయంవరకూ ఉల్లాసకరమైన సాహిత్యజీవితం నెరపుకుని, మిల్న్ జనవరి 31 వ తేదీన 'ససెక్సు' లోని తమ స్వగృహంలో కీర్తిశేషులైనారు. వారి సాహిత్యసేవాసంస్మరణగా పాఠకులకు ఈ రచనను అందజేస్తున్నాము.

మూర్తి : (స్థిరంగా కూర్చుంటూ) మాకు ఆకలిగా వుంది—

జానకి : నాకేమీ అక్కర్లేదు, రాం!

మూర్తి : ఛా! అదేమిటి జానీ!

బట్లర్ : భోజనం అయిదు నిముషాల్లో వడ్డిస్తారు సార్!

జానకి : (హఠాత్తుగా) మేం ఎవరమో నీకు తెలుసా?

బట్లర్ : అదేమి సార్! నాకేమి తెలియదు?

మూర్తి : (ఇష్టంలేనట్లుగా) పోనీ జానీ.

జానకి : ఫరవాలేదు రాం...(బట్లర్‌తో) ఏం?

బట్లర్ : అయ్యగారు, మీరు ఆయనగారి భార్యగారు అని చెప్పినారు కదమ్మా!

జానకి : ఆ...అవును...అయితే? ఆయ న్నిప్పుడు చూస్తున్నావు కాబట్టి ఎరుగుదువా?

మూర్తి : (పూర్వం మాదిరిగానే) దాన్లో ఆశ్చర్యం ఏముంది?

బట్లర్ : అయ్యగారి ఉద్యోగం ఏమో తెలియునమ్మా! కాని పేరుదా తెలియదు.

మూర్తి : (ఆశ్చర్యంతో) నా ఉద్యోగమా?...ఎట్లా తెలుసు?

బట్లర్ : భోజనం అయిందేమో చూసివస్తును సార్! [వెళ్ళిపోతాడు. ఒక క్షణం అతను వెళ్ళిన వైపే చూస్తూవుంటా రిద్దరూ.]

మూర్తి : (నిట్టూరుస్తూ) తమాషాగా వుందే!

జానకి : నాకుమాత్రం ఏమీ బాగాలేదు, రాం.

మూర్తి : ఛా! అదేమిటి జానీ?

జానకి : మనం వస్తామని వాళ్ళకు ముందే తెలిసి నట్లుగా వుంది.

మూర్తి : (నవ్వుతూ) పిచ్చిపిల్లా! వాళ్లకెలా తెలుస్తుంది? సరిగ్గా మనప్రయాణం సాగివుంటే మనం ఈపాటికి హైదరాబాదులో వుండే వాళ్ళం.

జానకి : (బాధగా) నిజమే!...కాని లేముకదా!

మూర్తి : ఆ కారూ...రాముడూ...అందరూ దొరి కారు. అన్నీ ఆటంకాలే!

జానకి : ఈ వినాయకుడి పెళ్లికి అన్నీ విఘ్నాలె వంటావ్!

మూర్తి : (జానకి ఈ మాటలు ఏ ఉద్దేశ్యంతో అన్నదా అని సూటిగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ) అట్లాగే వుంది!

జానకి : (లాలనగా) నీకే ఆటంకాలు ఎప్పుడూ వస్తూనే ఉంటయ్యా?

మూర్తి : జానీ! ఏమిటి నువ్వనేది? నేను నిజంగా కావాలనే ఈ ఆటంకాలు కలిగించానవా?

జానకి : అబ్బే...లేదు...కాని ఇన్ని రాత్రుల్లోనూ ఈ రాత్రే జరగాలా యివన్నీ? (దూరంగా వున్న సోఫాలోకి వెడుతుంది).

మూర్తి : నిజమే! కారు చెడిపోవడం...ఆలస్యం కావడంవల్ల రైలు అందకపోవటం —అయితే యేం? రేపు పదిగంటలకల్లా హైద్రాబాద్‌లో వుంటాం.

జానకి : రేపు పదిగంటలు! కాని అతేడా వుండనే వున్నది కదా! ఈ తెలుసువాళ్ల పొలిమేరల్లో గడిపే ప్రతినిమిషం నాకు భరించ రానిదిగా వుంటుంది.

మూర్తి : నిజమే! కాని—

జానకి : నేనుచెప్పేది విను, రాం. నేను ముందుగానే చెప్పాను: ఇదివన్నూ లేవతీసుకు రావడం కాదు; దీనికోసం తంత్రాలు పన్నక్కర్లేదు, అబద్ధాలూ, నటనలూ అనవసరం అని. మనం కొత్తదేశంలో, కొత్తజీవితం మొదలు పెట్టాలని. ఏమైనా, మనం చేసిన ఈ పనికి, తెలుసువాళ్లకంటే ఎవరైనాసరే, మనల్ని ఎక్కువగా ఆదరిస్తా రనుకుంటాను. అందువల్ల నే ఇక్కడ వుండకూడ దనుకున్నాను....కాని, ఇంకా యిక్కడేవున్నాం!

మూర్తి : (నిట్టూర్చి) నిజం...... (ఒకక్షణం ఆగి, సిగరెట్ కాలుద్దామని) నీకేమీ అభ్యంతరం లేదుకదా!

జానకి : (విసుగ్గా, తీక్ష్ణంగా) అబ్బ! నిత్యాగ్నిహోత్రం లేంది ఈ మగవాళ్లు క్షణం నిలవ లేరుకాబోలు. భోజనం చెయ్యబోతూ కూడా — ఒక క్షణంకూడా పొగలేని గాలి పీల్చలేరల్లేవుంది.

మూర్తి : క్షమించు జానకీ! (సిగరెట్, కేసులో పెట్టి జానకికి పక్కగా వచ్చి కూర్చుంటాడు.) అలా వున్నావేం, జానీ?

జానకి : కొంచెం నీరసంగావుంది.

మూర్తి : ఛా! నాజానీ పరిస్థితులకు భయపడుతుందా? ......ఇదేకమైతేనా?

జానకి : (శాంతంగా) రాం! మన సంభాషణల్లో నీ భార్య ప్రసక్తి తీసుకురాకపోవడం బావుంటుందేమో!

మూర్తి : ఓ!... అవునవును... అదేమంటివి.

జానకి : (తనలో తాను అనుకుంటున్నట్లుగా) అదీ నిజమే! ఇటువంటి పరిస్థితుల్లో మేం— ఆడవాళ్లం— అందరం ఒకటే.

మూర్తి : అబ్బే! నావుద్దేశ్యం అదికాదు......... (ఆమెదగ్గరకువెళ్లి) డియర్!

జానకి : ఏం? నేను కొత్తమనిషిలా కనిపిస్తున్నానా?

మూర్తి : ఏం మాటలు జానీ?

జానకి : నేను యిదివరకులా లేకపోయినా, నన్ను ఎప్పటి మాదిరిగానే ప్రేమిస్తావ్ కదూ? (దానికి సమాధానంగా ఆమె చేతుల్ని అందుకొని, మృదువుగా ముద్దు పెట్టుకోబోతాడు.)

జానకి : (వారిస్తూ) నువ్వు సిగరెట్ తాగబోతున్నావ్ రాం! (కేస్‌లోనుంచి సిగరెట్ తీసి అందిస్తుంది) నేను వెలిగిస్తాను... నిప్పుపెట్టె?

మూర్తి : (జేబులు చూసుకొని) అరె! నా సామాన్లలో వుండిపోయిందే!

(ఇంతలో అవసరం వచ్చినప్పుడల్లా రావడానికి అలవాటుపడ్డ బట్లర్ వస్తాడు).

బట్లర్ : నిప్పుపెట్టె సార్! (జానకి కివ్వబోతాడు. మూర్తి అందుకోబోతాడు. కాని బట్లర్ దాన్ని జానకికే యిస్తాడు. ఇద్దరూ దీనికి నిశ్చేష్టులౌతారు.)

జానకి : సరే!

మూర్తి : (బట్లర్ వంక కోపంగా చూస్తూ) థాంక్స్.

[జానకి దగ్గరకువెళ్లి స్వయంగా సిగరెట్ వెలిగించుకుంటూ వుండగా బట్లర్ వెళ్లిపోతాడు.]

మూర్తి : వీడెక్కడ దాపురించాడు?

జానకి : (నవ్వుతూ) అతని తప్పేముంది? నేను నీభార్య ననుకుంటున్నాడు. భార్యలు భర్తల సిగరెట్లు వెలిగించటం కొత్తకాదుగా!

మూర్తి : అదీ నిజమే! ఈచోటు చాలా కొత్తగా, వింతగా కనిపిస్తోందికదూ?

జానకి : ఏం? నీకిప్పుడనిపించిందా?

మూర్తి : నాపేరు తెలియకుండా, నా వుద్యోగం తెలుసునంటాడు; వీడి వుద్దేశ్యం యేమిటో?

జానకి : (సహజంగా) బహుశా నీ మొహంచూసి చెప్పివుంటాడు.

మూర్తి : నా మొహంలో ఏముంది?

జానకి : అబ్బే! కోతులాడడంలేదులే! తమాషా కన్నాను...అంతే!

[ఒకక్షణం నిశ్శబ్దం]

మూర్తి : ఈ హోటల్‌లో ఒక్కటే టేబుల్ వుంది!

జానకి : (వ్యంగ్యంగా) అదికూడా ముగ్గురికి! కాని వాళ్ళెవరో మనం వస్తామని అనుకొని వుండరాయె!

మూర్తి : (తప్పుగా అర్థంచేసుకొని, తనకొక బెడద తప్పినసంతోషంతో) నిజమే! ... హోటళ్ళలో యిదో కొత్తపద్ధతేమో! పల్లెటూళ్ళలో, యిళ్లల్లోనే హోటళ్లు వుంటాయని కొంబోలు విన్నాను ... అన్నట్లు, నువ్వేం తీసుకొంటావ్?

[బట్లర్ వస్తాడు...మళ్ళీ యిద్దరూ నిర్ఘాంతపోతారు]

బట్లర్ : భోజనం తెమ్మంటే తెస్తునుసార్...పండ్లు, ఫలాహారాలు అన్నీ మస్తుగ వున్నయ్... మీకేం యిష్టమో చెబితే—

[అతనివంక యిద్దరూ ఆశ్చర్యంతో చూస్తూ వుంటారు]

చెప్పడం మరచానుసార్... వేదాంతంగారు మరో రెండునిముషాల్లో దావస్తురు. మిమ్మల్ని స్వయంగా రిసీవు చెయ్యలేకపోయినందుకు ఎక్స్‌క్యూస్ అడిగిరిసార్!

మూర్తి : ఎవరు? వేదాంతంగారా! ఈ విశాలవిశ్వంలో వేదాంతంగా రెవరో ఎప్పుడూ వినలేదే!

జానకి : నీకూ తెలియదా? తమాషాగా వుందే!

మూర్తి : (జానకి తనను అనుమానిస్తున్నదని తెలుసుకున్నాడు) చూడు మిస్టర్! ఇది హోటలేనా? లేక పొరపాటున మేం ఎవరియింటికైనా వచ్చామా?

బట్లర్ : చెబితినిగద సార్! ఇది ఒకరకం హోటల్ దా అని. మీకు ఏమీ యిబ్బంది వుండదు సార్! (వెళ్లిబోతూ తిరిగివచ్చి) ఇంతకూ మీకేం కావాలో చెప్పలేదు, సార్!

జానకి : నేనిప్పుడు భోజనం చెయ్యలేను.

మూర్తి : (నీరసంగా) నా పరిస్థితీ అలాగే వుంది... టిఫిన్ తీసుకుంటే సరి! (బట్లర్‌తో) ఏం? ఏమున్నయ్యోయ్?

బట్లర్ : మీకేం కావాలంటే అవి వున్నయ్ సార్! ఇడ్లీ, సాంబార్, పూరీ పొటాటో, అట్టూ, వుప్మా...

మూర్తి : సరే! రెండుప్లేట్లు పూరీ, పొటాటో—

[జానకివంక చూస్తాడు. ఆమె తలత్రిప్పి తన అంగీకారం తెలియచేస్తుంది]

బట్లర్ : నిముషంలో తెస్తునుసార్. (వెళ్ళిపోతాడు)

జానకి : (కూర్చుంటూ) చాలా తమాషా మనిషి!

మూర్తి : (లేస్తూ) చూడు జానీ! దీని అంతు ఏమిటో తేల్చుకు వస్తాను.

జానకి : అంత తొందర ఎందుకు? రెండు నిముషాల్లో ఆ వేదాంతంగారెవరో స్వయంగా వస్తారు కదా!

మూర్తి : నిజమే! కాని ఆ వేదాంతంగారు ఎవరు అని ?

జానకి : రాం! నీకు కావాలనుకున్నప్పుడు చాలా తమాషా అయిన నాటకాలు సృష్టించగలవు! అవన్నీ బాగానే వుంటాయ్. కాని యిప్పుడా! మనం ముందు ఈ ప్రాంతాలు వదిలివెళ్లాలి. అటువంటప్పుడు అర్థం లేని ఈ హోటలూ, అసందర్భమయిన యీ వేదాంతంగారు—ఇదంతా ఎందుకు? ఇటువంటి తమాషాలు మన జీవితం కొన్నాళ్లు సాగిన తర్వాత మొదలు పెడితే బావుంటుంది... అప్పటికి మనం ఒకళ్లను ఒకళ్లం బాగా అర్థం చేసుకుంటాం.

మూర్తి : ఏమిటి జానీ నువ్వంటున్నది? ఇదంతా నేను కావాలనే చేశాననా?

జానకి : ఏమో? మొత్తానికి ఎవరో చేశారు— కావాలనే!—

బట్లర్ : (వచ్చి) వేదాంతంగారు సార్!

[వేదాంతంగారు వస్తాడు. మనిషి యువకుడూ కాదు, ముసలివాడూ కాదు. ప్రతి మాటా తూచి తూచి మాట్లాడుతాడు... ఎప్పుడూ నవ్వేముఖం... కాని నవ్వినప్పుడు కొంచెం కౌతుకం కనిపిస్తుంది.]

వేదాంతం : నమస్తే.

జానకి : నమస్కారం.

మూర్తి : నమస్తే......ఆఁ......

వేదాంతం : మిమ్మల్ని నా యింటికి ఆహ్వానించినందుకు క్షమించండి... కాని అది ఎన్నో కష్టాలనుంచి మిమ్మల్ని కాపాడింది......ఆఁ! నా పేరు తెలుసుకదా! వేదాంతం అంటారు. అసలు పేరు ఏదైతేనేం? 'పేరులోన నేమి పెన్నిధి యున్నది?' అన్నాడు గిరీశం. మనం మాట్లాడుకోవడానికి పేర్లు అవసరమేననుకోండి. అయినా—

మూర్తి : క్షమించండి......(ఏదో చెప్పబోతాడు.)

వేదాంతం : అయినా మీరు చెప్పబోతున్నట్లుగా మనం ఒకళ్ళనొకళ్లం ఏదో ఒక పేరుతో పిలుచుకోవాలిగద? (ఆలోచిస్తూ) మిమ్మల్ని నేను 'రాం' అని పిలువవచ్చు.—ఎక్కువ చనువు తీసుకుంటున్నానా?—కాని 'రాం' అనేది ఆడవాళ్లు పిలవవలసిన పేరు... నేను 'మూర్తిగారూ' అంటాను. (వయ్యారంగా జానకి వంక చూసి నవ్వుతూ) ఏమంటారు?

జానకి : ఇది కలకాదు కదా!

వేదాంతం : (మూర్తి వైపు చూడకుండా) కాని మూర్తిగారు ఏమీ ఆశ్చర్యపడడం లేదు. 'నుదుటన్ వ్రాసిన వ్రాత తప్పతరమా?' అనుకుంటూ బ్రహ్మ రాసిన రాతను చూసుకుంటున్నారు.

[ఇంతవరకూ అదే పని చేస్తున్న మూర్తి బిత్తరపోయి; ఆపని చెయ్యడం ఆపేస్తాడు.]

మూర్తి: జరిగినంతవరకు చాలు వేదాంతంగారూ! మీరు నిజంగా పిచ్చివాళ్లు కాకపోతే మీరాడే యీ నాటకానికి ముందు జవాబు చెప్పండి.

వేదాంతం : అంత కోపమైతే ఎలా మూర్తిగారూ! ఈ పరిస్థితుల్లో జరిగిన దానికి జవాబు చెప్పవలసిన బాధ్యత నామీద వున్నదని అందరికీ తెలుసు... కాని స్నేహంతో చెప్పే జవాబు, స్నేహంతో యిచ్చే ఆతిథ్యం తరువాత చెప్పకూడదా?

మూర్తి: మేము మీ అతిథులమా?

వేదాంతం : ఏం? కాకూడదా?

జానకి : (ఒప్పుకుంటూ) సరే!

వేదాంతం : థాంక్స్....కాని ఈ పేర్ల తతంగం అలానే వుంది. వీరి పేరు తేలిపోయింది కదా! (అంటూ జానకి వంక చూస్తాడు )

జానకి : నా పేరు జానకి.

వేదాంతం : అయితే, కుమారి జానకి—

మూర్తి: (త్వరగా, అసహ్యంగా) ఆ...నా భార్య!

వేదాంతం : అయితే నేను 'కుమారి'ని వదిలి వెయ్యాలన్న మాట!

మూర్తి: (కొంచెం తత్తరపాటుతో) చూడండి—

వేదాంతం : (అటు చూచి) కాని, తీరా చూస్తే, ఏమీ వుండదు మూర్తిగారూ!

[బట్లర్ లోపలికి వస్తాడు.]

సరే! మనం భోజనాలు చేద్దామా?

జానకి : నేను భోజనం చెయ్యనండి. (మూర్తి ఆమెవైపు చూస్తాడు.) నాకు ఆకలిగా లేదు.

వేదాంతం : మీ యిష్టం....అవును, పూరీపొటాటో తెప్పించమన్నారుకదూ! (బట్లర్ వెడతాడు) మీరక్కడ కూర్చోండి జానికీదేవీ! ఆఁ!... మీరక్కడ కూర్చుంటారా మూర్తిగారూ!

[ఇద్దరికి మధ్యగా వేదాంతంగారు. ఇక చెయ్యగలిగిందేమీ లేదని విసురుగా కూర్చుంటాడు మూర్తి. ఇంతలో ప్లేట్లతో సహా బట్లర్ వస్తాడు. జానకి, వేదాంతం తినడం మొదలు పెడతారు. మూర్తి ఒకక్షణం ముట్టుకోడు.]

వేదాంతం: మీరు తినరేం మూర్తిగారూ! మనిషి బతకడంకోసమైనా ఏదో ఒకటి తినాలి కదా! అందులోనూ ప్రయాణం చేస్తున్న వాళ్లు ఇంకా ఎక్కువ తినాలి... చూస్తే ఈ మీ ప్రయాణం సుఖంగా అంతంకావడం మీకు యిష్టంలేదల్లే వుంది.

మూర్తి : అంతం దాకా ఎక్కడ? నాకు మొదటే అర్థంకాలేదు వేదాంతంగారూ! — మీరు క్షమిస్తే—ఇందులో మీ ప్రసక్తి ఏముంది? అసలు మీ రెవరు?

జానకి : ఆతిథ్యం ఇచ్చినవాళ్లను అలా అడగవచ్చా, రాం?

మూర్తి : నిజమే, జానీ! అలాగయితే మనం ఇక్కడికెలావచ్చాం? రాముడు ఇది హోటలని చెప్పాడు. ఆ బట్లర్ కూడా ఇది 'వొకరకం' హోటలని ఒప్పుకున్నాడు ... కాని తీరాచూస్తే ఇది స్వంత యిల్లు. అదీకాకుండా, మేం వస్తామని మీకు ముందే తెలిసినట్లుగా వుంది. నిజం చెబుతున్నాను, నా కిదేమీ అర్థం కావడంలేదు.

వేదాంతం: మీ బాధ యేమిటో నా కర్థమయింది మూర్తిగారూ!

మూర్తి : ఏమీ తెలియని కొత్తవాళ్ళచేత 'మూర్తిగారు' అని పేరుపెట్టి పిలిపించుకోవడం నాకు యిష్టమూ కాదు, అలవాటూ లేదు.

వేదాంతం: చూడండి...మీలో మీరనుకొంటున్నారు, ఈ వేదాంతం యెవరు? ఈయన మనకు తెలుసా? అసలీయనది ఉత్తర దేశమా. దక్షిణ దేశమా? ....

జానకి : (తాపీగా) ఏ దేశమయితే నేం?

వేదాంతం: (ఆవిడవంకకు తిరిగి) మీకు పూరీ బాగున్నట్లుగా వుంది...చూస్తే, మూర్తిగారి కది నచ్చినట్లు కనిపించడంలేదు.

మూర్తి : (వాటివంకనే చూస్తూ) ఈ పూరీల్లో తప్పు పట్టడానికేమీ.కనిపించడం లేదు. మీ వంట మనిషి భీముడులా వున్నాడే.

వేదాంతం: థాంక్స్ ... (బట్లర్ వస్తాడు) చూడు లోకనాథం! అయ్యగారు రుచి చూడకుండానే, పూరీలు బావున్నాయన్నారని భీముడితో చెప్పు.

బట్లర్ : నిండా థాంక్స్ సార్ ... చెప్పి వస్తును (వెడతాడు)

జానకి : మీ అన్ని జవాబులతో పాటు ఈ ప్రశ్నకు కూడా జవాబు చెప్పండి—

వేదాంతం: ఏమిటది?

జానకి : మీ బట్లర్ కావలసినప్పుడల్లా ఎలా ప్రత్యక్షమవుతాడు?—జీవుడిలా!—

వేదాంతం: (జేబులో కాగితంతీసి) నేను ఆ ప్రశ్న రాసుకుంటాను...బట్లర్...ప్రత్యక్షం—

(బట్లర్ వస్తాడు. అతిథులు ఆశ్చర్యపడతారు)

వేదాంతం: లోకనాథం! పాలు—(బట్లర్ వెడతాడు)

మూర్తి : (త్వరగా పూరీతిని, కుర్చీలోనుంచి లేస్తూ) మేం ఇప్పుడే వెళ్ళిపోవాలి వేదాంతం గారూ! మీ ఆతిథ్యానికి మా హృదయపూర్వకమైన కృతజ్ఞత ... హైదరాబాదు మాకు ఎక్కువదూరంలో లేదనుకుంటాను.

వేదాంతం: నిజమే! మీరు హైదరాబాదు రోడ్డుకు దగ్గరలోనే వున్నారు.

మూర్తి : మీరు మా రాముడికి సరైనదోవ చెబితే—

[ఇంతలో బట్లర్ రాగానే ఆపుతాడు]

వేదాంతం: లోకనాథం! పాపం, మూర్తిగారికి బాగా ఆకలిగావుందట! గ్లాసునిండా పాలుపొయ్.

బట్లర్ : దానికేమిసార్! ఎన్నితాగినా తాగవచ్చును. మస్తుగ వున్నయ్...

వేదాంతం: అని కొంచెం చల్లారేలోపుగా ఆ సోఫా సరిచెయ్ ... పాపం, మూర్తిగారు ఆ కుర్చీలో కూర్చోలేకుండా వున్నారు (బట్లర్ సర్దుతాడు. వేదాంతం గ్లాసు తీసుకొని) రాత్రిళ్లు ఇది చాలా బలమైన ఆహారం. (జానకివైపు తిరిగి) ఏమంటారు?

జానకి : నాకిది చాలా ఇష్టం.

వేదాంతం: చాలా సంతోషం. (గ్లాసులోకి చూస్తూ) ఏమిటిది వేదాంతం!

బట్లర్ : పాలల్లో కొంచెం సేమియాదా వేసిరి!

వేదాంతం: ఈ సేమియా చూశారా! మొన్న సుమిత్రాకు వెళ్ళినప్పుడు స్వయంగా తెచ్చాను కొటిం!

[బట్లర్ వెడతాడు. ఈ అవకాశం కోసమే చూస్తున్న మూర్తి కుర్చీలోనుంచి లేస్తూఉండగా]

వేదాంతం: ఆ సోఫాలో కూర్చుంటారా?

మూర్తి : చూడండి వేదాంతంగారూ! జరిగినంతవరకు ఈ తమాషా చాలు. మా అనుమానాలకు మీరు జవాబు చెప్పకపోతే మేం ఇక్కడ పచ్చి మంచినీళ్లుకూడా ముట్టం.

[జానకి ఆశ్చర్యంగా అతనివంక చూస్తుంది]

మూర్తి : ఇప్పుడు మీరా జవాబు చెప్పనైనా చెప్పాలి. లేకపోతే—జానీ!— లేకపోతే మా దోవన మేం పోతాం.

వేదాంతం: (ఆలోచనగా) కాని, ఏది మీదోవ?

మూర్తి : హైదరాబాదు ... మా జవాను కొంచెం దోవ తప్పివుంటాడు. మమ్మల్ని మళ్ళీ హైదరాబాదు మార్గానికి చేరుస్తే—

వేదాంతం: (తనలోతాను మాట్లాడుకుంటున్నట్లుగా) హైదరాబాదు మార్గం! చాలా కష్టమైన మార్గం మూర్తిగారూ!— అదీ కాకుండా మీరు రాత్రిపూట ప్రయాణం చేస్తున్నారు.

మూర్తి : ఆ భయం మాకు లేదు.

జానకి : (మూర్తికిదగ్గరగా వెళ్ళికూర్చుని, వేదాంతం గారితో) అంటే, మీ వుద్దేశ్యం?

వేదాంతం: (ఆమెతో)అదిమీకు చాలాకొత్తదోవ— కొత్తదీ, ఇదివరకెప్పుడూ ప్రయాణం చెయ్యనిదీ!

మూర్తి : అదేమిటి! ఆమె చాలాసార్లు ఈరోడ్డుమీద ప్రయాణం చేసింది. (జానకితో) అవునా జానీ!

జానకి : (తల తిప్పుతూ) నిజానికి నేనెప్పుడూ ప్రయాణం చెయ్యలేదు...కాని, నాకేమీ భయంలేదు వేదాంతంగారూ!

[మూర్తి బిక్క చచ్చిపోతాడు. ఒక్కక్షణం నిశ్శబ్దం]

వేదాంతం: (సిగరెట్ కేసుతీసి) మీకేమీ అభ్యంతరం లేదుకదా!

జానకి : అబ్బే!

[సిగరెట్ ఆఫర్ చేస్తాడు మూర్తికి]

మూర్తి : అక్కర్లేదు...

వేదాంతం: చాలా మంచిరకమండి ... లండన్ నుంచి తెప్పించాను.

మూర్తి : (తీసుకుంటూ) సరే!...థాంక్స్!

వేదాంతం: (వారికి దగ్గరగావున్న కుర్చీలోకి జేరుతూ) మీకక్కడ సుఖంగావుందా మూర్తిగారూ?

మూర్తి : (సాధ్యమైనంత గంభీరంగా) మీజవాబులు?

వేదాంతం: మీ ప్రశ్నలు?

జానకి : ముందు నా ప్రశ్నలకు జవాబు చెప్పండి... (వేదాంతం ప్రశ్నార్థకంగా ఆమెవైపు చూస్తాడు) ఈ టేబుల్ చుట్టూ మూడు కుర్చీలున్నయ్. ఒకటి మీకనుకుందాం.... మిగిలిన రెండూ?

వేదాంతం: మీకోసం, మూర్తిగారికోసం.

జానకి : అంటే, మేంవస్తామని మీకు ముందుగానే తెలుసునన్నమాట!

వేదాంతం: మిమ్మల్ని యిక్కడికే తీసుకురమ్మని రాముడికి ముందుగానే చెప్పివుంచాను.

మూర్తి : (కుర్చీలోనుంచి లేవడానికి ప్రయత్నం చేస్తూ) రాముడు! నా జవాను!! మీరు చెప్పేది—

వేదాంతం: మీరుచెప్పేదేమిటో నిదానంగా కూర్చొని చెప్పండి. (నిదానంగా కూర్చున్నాడు మూర్తి)

మూర్తి : మమ్మల్ని యిక్కడకు తీసుకురావడానికి రాముడికి మీరు లంచం ఇచ్చారన్నమాట!

వేదాం : లేదు మూర్తిగారూ! రాముడు మా మనిషి. వాడికి మీరే ఎక్కువజీతం అన్న లంచం ఇచ్చి మీ జవానుగా వుంచుకున్నారు.

మూర్తి : (నమ్మలేక) అంటే—

జానకి : అసలు రాముడెవరు?

వేదాం : సాక్షాత్తూ సీత మొగుడు—అంటే మా తోట మాలి తమ్ముడు...సీత మా పనిమనిషి.

మూర్తి : (కోపాన్ని అణచుకుంటూ, లేవబోయి, మళ్ళీ వేదాంతం సంజ్ఞ చెయ్యగానే కూర్చుని) మీరిలా నా స్వంత విషయాల్లో జోక్యం కలిగించుకోవడం యేమైనా బావుందా?...చెప్పండి...

జానకి : ముందు ఈ సందేహం తీర్చండి...రాముడు మీరు పంపిన మనిషే కావచ్చు ... కాని మేమంటే మీరు ఎందుకింత ఉత్సాహం చూపుతున్నారు? మీ కెవరు?

వేదాం : (నవ్వుతూ) పట్టి వేదాంతాన్ని! ఇదివ్యక్తిగతమైన ఉత్సాహంకాదు. మీరు హైద్రాబాదు రోడ్డుమీద పోతున్నారని, ఆ రోడ్డుమీద పద్దెనిమిదేళ్ళపిల్ల రాత్రిపూట ప్రయాణము చెయ్యడం మంచిదికాదని — నేనీపని చేశాను.

జానకి : (మెల్లగా, కాని గర్వంతో) కాని, నా విషయంలో యీ విశేషమైన ఉత్సాహం, జాగ్రత్త తీసుకోమని మిమ్మల్ని కోరలేదే!

వేదాం : నిజమే! కాని, నాకుమాత్రం చాలాఉత్సాహం. ఇట్లా యీ రోడ్డుమీద ప్రయాణం చేసేవాళ్ళందరితోనూ యీ ఉత్సాహం పంచుకుంటాను...అది నా సరదా!

మూర్తి : (ఇంతవరకు కోపాన్ని అణుచుకున్నాడు. ఇక ఉండబట్టలేక, జానకికి 'యిక్కడి నుంచి వెళదాం' అన్నట్లుగా సంజ్ఞచేస్తూ) జానీ! (అంటూ రోడ్డుమీదకువున్న వాకిలి దగ్గరకు వెళతాడు)

వేదాం : ఆతలుపు తాళంవేసివుంది మూర్తిగారూ!

మూర్తి : (వేదాంతం దగ్గరకు గబగబా వచ్చి) ఐతే ఓ క్షణంలో అది తీయించండి.

[ఈమాట లంటూవుండగా బట్లర్ వస్తాడు]

వేదాం : లోకనాథం! మూర్తిగారు నాకు దగ్గరగా వచ్చి ఏదో చెబుతున్నారు, విన్నావా?

[మూర్తి నీరసపడి, కుర్చీలో కూలబడతాడు]

వేదాం : ద్రాక్ష తెచ్చావా ఏమిటి?

జానకి : నాకక్కర్లేదు.

మూర్తి : నాకూ అక్కర్లేదు.

వేదాం : సరే! నాకూ అక్కరలేదు.

[బట్లర్ పోతాడు]

వేదాం : లోకనాథం! ఈ సాయంకాలం హాస్పిటల్లు వెళ్ళొచ్చావా?

బట్లర్ : చిత్తంసార్! ఆ అయ్యగారు నిండా ఆరోగ్యంగా వున్నారు .... యీరోజు కొంచెం రొట్టె, పాలూ తీసుకుంటారని నర్సు చెప్పింది.

వేదాం : సరే! (బట్లర్ వెడతాడు) అతను ఓ కుర్రాడు ఇంకా చదువుసాంతం పూర్తయిందో లేదో! అతను ఓ అమ్మాయితో పారిపోతున్నాడు. అరె! ఆవిడ పేరు మరచిపోయానే!...నాకు చాలా మతిమరుపండీ! ... అతను ఆవిణ్ణి 'పుస్సీ' అనో, 'టైగర్' అనో పిలిచేవాడని జ్ఞాపకం...(మూర్తి కోపంగా ఆయన వంక చూస్తాడు...అదేమీ పట్టించుకోకుండా, ఏదో చెప్పబోయి, జేబులో కాగితం తీస్తాడు) అరె! ఏమిటది బట్లర్... ప్రత్యక్షం...ఓ! (జానకివైపు తిరిగి) ఇది నా పిచ్చి అనండి, వుత్సాహం అనండి— ఏదైనా—ఈహాల్లో ఎక్కడ చూసినా, టేబుల్ మీద, నేలమీద, కుర్చీల్లో, అన్ని చోట్లా గంటలున్నయ్. ఇటువంటి సాయం కాలాలు మా పనిమనుషులందరూ నా పిలుపందే దూరంలో నే ఉంటారు.

జానకి : అంటే, మేం కొంచెం జాగ్రత్తగా వుండాలన్న హెచ్చరికన్నమాట!

వేదాం : నిజమే! ఆ విషయం మీకు చెప్పడమే మంచిదనుకున్నాను ... మూర్తిగారు చాలా కోపంతో కూడా వున్నారు. మా తోటమాలి వాడి యిద్దరితమ్ముళ్లూ, బట్లర్—అందరూ మంచి వస్తాదులు. (మూర్తివైపు తిరిగి) ఈ సంగతి తెలిసివుంటే ఎందుకైనా మంచిది.

జానకి : (లేచి) చూడండి వేదాంతంగారూ! నేను తమాషాగా చెప్పడంలేదు. నా విషయం నాకు బాగా తెలుసు...మిమ్మల్ని పెద్దమనుష్యులుగా అడుగుతున్నాను. ఆ తలుపు తీయించండి.

వేదాం : అది అసంభవం అనుకుంటాను, జానకీదేవి!

[జానకి మెడలు కుదించుకొని కూర్చుంటుంది]

మూర్తి : అంటే, మేం ఈయింట్లో జబర్దస్తీగా ఖైదు చేయబడ్డామన్నమాట!

వేదాం : ఆ విషయాన్ని గురించి అంత రాద్ధాంతం ఎందుకు మూర్తిగారూ! ఒక స్నేహితుడి ఆహ్వానంమీద, హైదరాబాదు వెళ్లటం కొన్నాళ్లు వాయిదా వేశామని ఎందుకనుకో కూడదు?

మూర్తి : నేను జబర్దస్తీ అనే అంటాను.

వేదాం : అనండి. దానికేం? స్వతంత్ర భారతదేశంలో వాక్స్వాతంత్ర్యం సంపూర్ణంగా ఉంది. మీరన్నమాట నేనెందుకు కాదనాలి? నేనూ జబర్దస్తి అనే అంటాను.

మూర్తి : అంటే మేం ఇక్కడ బందీ చెయ్యబడ్డామన్నమాట!

వేదాం : 'ఈయింటి ఆవరణలోపల' అనండి...యీ ఆవరణ లోపల మీ యిష్టంవచ్చినట్లు వుండవచ్చు.

మూర్తి : ఒకవేళ రేపుపొద్దున్నే మా...మా ఆ...వీధిలోకి వెళ్ళాలని బయలుదేరితే, మీ జవానులు ఆవిడమీద బలవంతాన చెయ్యివేసి ఆపుతారన్నమాట!

వేదాం : మూర్తిగారూ! మీ...మీ ఆవిడ అంత పొద్దునే వీధిలోకి వెళ్ళాలని ఎందుకనుకుంటారు, చెప్పండి? ఇంత చలికాలం ఉదయాన్నే వీధిలో యేం పని ఉంటుంది, చెప్పండి?

మూర్తి . ఒకవేళ ఆవిడ దగ్గర్లోవున్న పోలీసుస్టేషనుకు వెళ్ళాలనుకోండి—

వేదాం : (జానకితో) ఏం? వెడతారా?

జానకి : (చిరునవ్వుతో) వెళ్లొచ్చా?

వేదాం : ఓ! మూర్తిగారి భుజాలు ఎక్కి నిలబడితే, మీరా గోడ తేలిగ్గా దాటవచ్చు. (మూర్తికి కోపం వచ్చిందని తెలుసుకొని) జవాన్లెవరో గేటు తాళంచెవులు కూడా పారవేశారని లోకనాథం చెప్పాడు...జాగ్రత్త లేని వెధవలు—

మూర్తి : (లేవబోతాడు)

వేదాం : మీరు కొంచెంసేపు ప్రశాంతంగా కూర్చోండి.

మూర్తి : కూర్చోడానికి కూడా మీ అధికారం ఏమిటి? నేను మళ్ళీ చెబుతున్నాను. ఇది అమానుషం—

జానకి : నిజమే! కాని ఆ మాటే ఎప్పుడూ చెబుతూ కూర్చోలేంకదా! ఎట్లాగో మనం యిక్కడికి వచ్చాం. వెళ్ళగలిగేవరకూ యిక్కడే

వుండాలి. కాని నాకింకా ఆశ్చర్యంగా వుంది: వేదాంతంగారు మనమంటే ఎందుకింత ఆపేక్ష చూపిస్తున్నారా అని!

మూర్తి : ఎట్లాగయితే నేం? నన్ను ఈసారికి ఆపగలిగారు. కాని ఎప్పుడూ యిలానే ఆపగలరనుకోకండి నాకు జరిగిన ఈ అవమానానికి ఇంతకు ఇంతా నేను ఏదోవిధంగా తీర్చుకోగలను.

వేదాం : (నిర్లక్ష్యంగా) దానికేమండీ? తప్పకుండా! మీరు నా పేర వరంగల్‌కు రాసే ప్రతి వుత్తరం నాకు తప్పకుండా అందుతుంది. మీరు చేసుకోనే ప్రయత్నాలు మీరు నిరభ్యంతరంగా చేసుకోవచ్చు.

మూర్తి : నాకు...ఆ...నా భార్యకూ, నాకూ జరిగిన యీ అవమానం—

వేదాం : (త్వరగా) కాదు, కాదు...మీ భార్య కాదు.

మూర్తి : (కోపమూ వచ్చింది, నిశ్చేష్టుడూ అయినాడు) ఏమిటీ!

వేదాం : అవును. నేను చెప్పింది పొరపాటు కాదు. (జానకితో) మీరూ, ఆయనా కలిసి పారిపోతున్నారు. అవునా?

మూర్తి : (ముందుకు వచ్చి) చూడండి—

జానకి : (వారిస్తూ) ఇంకా రాద్ధాంతం ఎందుకు రాం? మనం చేస్తున్న పనికి మనం సిగ్గుపడటం లేదు, కదా!...నిజమే వేదాంతంగారూ! మేం యిద్దరం పారిపోతున్నాం.

వేదాం : నిజమే! ఎందుకు పారిపోకూడదు? ఈ పనికి మీరు సిగ్గుపడ్డం లేదుకదు మూర్తిగారూ?

మూర్తి : ఇట్లా నా స్వంతవిషయాల్లో జోక్యం కలిగించుకోవడం —

వేదాం : మీరు చెప్పిందంతా నిజమే! కాని అదంతా యిదివరకే చెప్పారుకదా! నేను జోక్యం కలిగించుకున్నాను— అదీ అర్థం లేనిదీ, అమానుషమైనదీ—నిజమే! కాని నేనిలా జోక్యం కలిగించుకోవడం మీరిద్దరూ సుఖంగా వుండాలనే!

మూర్తి : నా సుఖం నేను చూసుకోగలను.

వేదాం : (జానకిని చూస్తూ) మరి ఈమెది?

మూర్తి : నామీద ఆమెకు నమ్మకముంది.

జానకి : నేనేమీ చిన్నపిల్లను కాదు...ఈ అపవాదు, నేను పోగొట్టుకోనే మంచిపేరు, ఆ అమ్మాయి తిట్టే—నే నివన్నీ ఆలోచించలేదనుకున్నారా?

వేదాం : మీ రాలోచించని విషయం ఒకటి వుంది జానకీదేవి!

జానకి : మీరు పూర్వకాలం మనుషులు. నాకు నీతినిగురించి చెప్పబోతున్నారు.

వేదాం : (ఆశ్చర్యంతో) లేదే!

జానకి : (వినిపించుకోకుండా) ఈ ఇంట్లో ఒంటరిగా, ప్రపంచాన్నించి మిమ్మల్ని వేరుచేసే నాలుగు గోడలమధ్య వుంటున్నారు మీరు ...పెళ్ళిచేసుకున్నవాళ్ళు జీవితాంతం సుఖపడతారని పాతపురాణాలు చెప్పేమాటలు నమ్ముతున్నారు మీరు.

వేదాం : నా వుద్దేశ్యం అదికాదు.

జానకి : లేకపోతే, సుఖంగా వున్న దంపతులను విడదీసే నీచురాలినంటారు నేను.

మూర్తి : సుఖం! అది ఒకమురికిగుంట... నేను జీవితంలో నిజంగా హాయిగా వున్నది యిప్పుడే!

వేదాం : జీవితంలో నిజంగా హాయిగా వున్నది యిప్పుడేనా?...కమలను పెళ్ళిచేసుకోబోయే నాడుకూడా యీ మాటే చెప్పారేమో?

మూర్తి : (నీరసించిపోతాడు) ఆఁ!

వేదాం : కూర్చోండి.

[ఒకసారి వేదాంతం వంక తీక్ష్ణంగా చూచి, కుర్చీలో కూలబడతాడు మూర్తి]

వేదాం : మిమ్మల్ని రెండు ప్రశ్నలడుగవచ్చా?

జానకి : ఏమిటి?

వేదాం : ఆయన కమలకు విడాకు లిస్తారా?

మూర్తి : మాకా ప్రసక్తే అక్కర్లేదు.

వేదాం : మీకా ప్రసక్తే అక్కరలేకుండా జానకీదేవిని వివాహం చేసుకుంటారా?

మూర్తి : మరో అవమానం!...ఇహ—

వేదాం : క్షమించండి. నాకు కావలసింది సమాధానం.

జానకి : ఆయన నన్ను పెళ్ళి చేసుకుంటారు.

వేదాం : అప్పుడు, పాతపురాణాలు చెప్పినట్లుగా పెళ్లిచేసుకొన్నవాళ్లు జీవితాంతం సుఖంగా వుంటారా? (జానకి మాట్లాడదు.)

మూర్తి : జానకి సుఖంకోసం నా సర్వస్వం—

వేదాం : కావచ్చు! అంతమాత్రాన—(జానకితో) నేను పాతకాలం మనిషిని. నాకు ప్రపంచం అంటే యేమిటో తెలియదు. మీరు ఈ కాలంవాళ్లు...మీకు శాస్త్రాలన్నీ పుక్కిటి పురాణాలు...కాని ఈ పెళ్లితరువాత జీవితాంతం సుఖంగా వుంటారా?

మూర్తి : మీ రంటున్న దేమిటో నా కర్థంకావడం లేదు.

వేదాం : జానకీదేవికి తెలిసింది.

జానకి : (మెల్లగా) ఆ కష్టాలు నేను పడతాను, వేదాంతం గారూ!

వేదాం : కాని చాలా కష్టాలు పడాలి...నామాట నమ్మండి. నేను ప్రపంచానికి మీరనుకున్నంత దూరంలో లేను. అలాగే వుండి వుంటే, మీ సంగతి తెలుసుకో గలిగేవాడి నా?... నేను ప్రపంచాన్ని ఎరుగుదును... ఈ పెళ్ళిళ్ళలో వున్న కష్టాలు ఎరుగుదును. అసలు వివాహం ఒక వ్యాపారం లాంటిది. (సూటిగా) కాని మీరు చేస్తున్న దేమిటి? జీవితంలో అదివరకే ఒకసారి ఈ వ్యాపారంలో చిత్తుగా ఓడిపోయిన మనిషిని పెళ్ళి చేసుకుంటున్నారు.......సుఖాన్ని కోనుక్కుందా మనుకుంటున్నారు......(మూర్తితో) క్షమించండి...(మళ్ళీ జానకివైపు తిరిగి) మీరు పెళ్ళి చేసుకోవడానికి ఆయనలో ఘనత ఏమిటి? వివాహ జీవితంలో కొంత అనుభవం సంపాదించా రన్నదేగా? ...అదికూడా సుఖవంత మయినది కాదని ఆయనే చెప్పారు.

మూర్తి : (వ్యంగ్యంగా) బాగా చెప్పారు.

వేదాం : అది నిజం కాదా?

మూర్తి : కావచ్చు...నిజం చెబుతున్నాను—సరే! కములకు వ్యతిరేకంగా నే నేమీ చెప్పదలుచుకోలేదు.

వేదాం : చెప్పండి, చెప్పండి.. మనం జీవితాంతం పెద్దమనుష్యులంగా చెలామణీ అవుదామనుకున్నా, మనం బ్రతికేదే కొద్దిరోజులు!

మూర్తి : సరే! నేను చెబుతున్నాను. భగవంతుడు కూడా మా జీవితాన్ని సుఖవంతం చెయ్యలేదు. ఆ...భగవంతుడు కూడా!

వేదాం : కాని మీరు ఆవిణ్ని పెళ్ళి చేసుకున్నారు కదా!

మూర్తి : నిజమే! ఆ...నిజమే - నిజమే! - తరువాత?

వేదాం : (నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ) నాకు ధనం వుంది. డబ్బున్న మనుషులు మంచివాళ్లు కావడం చాలా అరుదు. కాని నా డబ్బు నాకే కాక, నాతోటి వాళ్ళకుకూడా వుపయోగపడి, వాళ్ళ సుఖానికి వుపయోగపడితే నా కానందం! అందువల్ల సాధ్యమయినంత వరకు సంఘంలో సుఖంలేని వివాహాలను ఆపుచేద్దామని నా ప్రయత్నం. సరదాకోసం చేస్తున్నా. డబ్బు మనిషికిచ్చే విలువను, శక్తిని చూస్తే ఆశ్చర్యం వేస్తుంది.

మూర్తి : అందులో ఆశ్చర్యం ఏముంది?

వేదాం : చాలా వుంది. ఆ సంగతైనా అందరూ గ్రహించారా? గుర్తించి వుంటే ప్రతివాళ్లూ ఒకేవిధంగా డబ్బును తగలెయ్యరు...సరే! ఈ డబ్బు యిచ్చిన శక్తితో యిక్కడకు వచ్చిన అనేక జంటలకు—బాగా ప్రేమించుకుంటున్నాం అనుకునే వాళ్లకు—అనేక విషమ పరిస్థితులను కలిగించి ప్రేమించుకో మన్నాను. ఆ పరీక్షలకు నిలబడితేనే ప్రేమ, పెళ్ళి...అటువంటి వాళ్లు చాలామంది ఎవరిదారిన వాళ్లు పోయేవాళ్లు...కొందరు పెళ్ళి చేసుకొని చాలా హాయిగా వున్నారు.... ఆలోచించకుండా పెళ్లిళ్లకు దిగడం నాకిష్టం లేదు. అందువల్ల, మీవంటివారు ఈ రోడ్డుమీదుగా పోతూవుంటే, వాళ్లను ఆపి, "పాత పాతపురాణాలు చెప్పినట్లు, మీరు జీవితాంతం సుఖంగా వుంటారా?" అని ప్రశ్నిస్తాను.

మూర్తి : మీ వుద్దేశ్యాలు గొప్పవే...కాని మీరిలా చెప్పకుండా, చెయ్యకుండా జోక్యం కలి

గించుకోవడం ఏమీ బాగాలేదు. మీకు డబ్బు యిచ్చిన శక్తిని అధికారాన్నీ దుర్వినియోగం చేస్తున్నారన్నమాట!

వేదాం : అధికారమా! దీన్లో అధికారం యేమీ లేదు. ఇక డబ్బుకున్న శక్తి అంటారా! ఇప్పుడు మీ కొక పదిలక్షల రూపాయలిచ్చి ఈ రాత్రికి రాత్రి మీ ఆవిడ దగ్గరకు తిరిగి వెళ్లమంటే, (జానకిని చూపుతూ) ఈవిడకు యిహ జీవితంలో కనిపించకుండా వుండ గలరు.

మూర్తి : ఈ అసహ్యమైన విషయాలే చెబుతారా, ఈ రాత్రి అంతా?

వేదాం : అసహ్యమా? (నవ్వి) ఒక్కొక్కప్పుడు నిజం, అసహ్యంగానే వుంటుంది మరి! ఈ అసహ్యమయిన విషయాన్ని గురించే ఈ రాత్రంతా ఆలోచించండి.. పదిలక్షలు!

[ఒకక్షణం ఈ ఎరలో పడ్డట్లుగా కనిపిస్తాడు మూర్తి.]

జానకి : (తిరస్కారంగా) నేను ప్రేమించిన అతను, నా ఎదుటనే మరొకరి దయాభిక్షను యాచించేటట్లు చేయటంకూడా మీ ఆదరణలో ఒకభాగం కాబోలు!

వేదాం : (నవ్వుతూ) అబ్బే! నా ఆదరణ అటువంటిదే అయితే, యిక నాకు తెలిసినంతలో పెళ్లిళ్లే వుండేవి కావు. సరే! నే నిప్పుడు చెప్పిన మాటల్ని ఉపసంహరించుకుంటున్నాను... కాని మీరు నన్ను అపార్థం చేసుకున్నారు. మిమ్మల్ని నేను జబర్దస్తీగా విడదీయదల్చుకోలేదు. అందుకు నాకు అధికారంకూడా లేదు.

మూర్తి : ఇంతలో ఎంత వినయం!

వేదాం : (మూర్తివైపుకు తిరిగి) థాంక్స్.

జానకి : (నవ్వుతూ) రాం! నువ్వు అసూయపడడానికి మరో మనిషి వున్నారు. జాగ్రత్త... (వేదాంతంతో) ఏమంటారు?

వేదాం : వెరీగుడ్...యు ఆర్ స్పోర్టివ్......(గంభీరంగా) నేను చెప్పాను కదా, మీరు హైదరాబాదు వెళ్ళడానికి నాకేమీ అభ్యంతరం లేదు. కాని కొన్నాళ్ళిక్కడే వుండి మీ జీవితం ఎలా సాగుతుందో చూసుకోకూడదా?

మూర్తి : మా సంగతి మాకు తెలుసు.

వేదాం : కావచ్చు...మీ యిద్దరూ హృదయపూర్వకంగా ప్రేమించుకొని వుంటే—అటువంటి అమరమైన ప్రేమకు దేవతలు పూలవాన కురిపిస్తారు. అప్పుడు నాకంటే ఎక్కువ సంతోషించేవాళ్లుండరు. 'మీ యిద్దరూ కలిసి హాయిగా జీవించడానికి వీలు లేదు. మూర్తిగారు కమల దగ్గరకే వెళ్ళిపోవాలని' నేను చెప్పడం లేదు. సుఖం లేని వివాహ జీవితాన్ని అనుభవించినవాణ్ణి నేను. అది తెలిసివుండే—నా దగ్గర డబ్బూ, అధికారమూ వుండికూడా...సుఖంలేని పెళ్లిళ్లు జరగడం నాకు బాధగా వుంటుంది. (కొంచెం దగ్గరగా వచ్చి) కాని జానకీదేవి! భర్తగా అప్పుడే ఒకసారి అసమర్థుణ్ణనిపించుకున్న వారిని పెళ్ళి చేసుకోబోయేముందు ఎంతో దూరం ఆలోచించాలి.

జానకి : అబ్బే! అట్లా అనడం బాగా లేదండి!

వేదాం : బాగాలేదు, నిజమే! కాని నిజం అదేకదా! ఏమంటారు మూర్తిగారూ?

మూర్తి : నేను యిదివరకే చెప్పాను, కమలకు వ్యతిరేకంగా నే నేమీ చెప్పదలచుకోలేదని.

వేదాం : ఆ సంగతి యిందాకటినుంచీ చెబుతూనే వున్నారుకదా! కాని జరిగిన విషయాల్లో అంతా కమలదే తప్పని నచ్చచెప్పడానికి మాత్రం ప్రయత్నించకండి.

మూర్తి : (అనుమానంతో) అయితే—

వేదాం : సంవత్సరం తరువాత తప్పంతా జానకీదేవిదే అనవచ్చు.

మూర్తి : 'సంవత్సరం తరువాత' అనడంలో మీ వుద్దేశ్యం?

వేదాం : క్షమించండి......నా వుద్దేశ్యం 'తరువాత సంవత్సరం' అని.

[మూర్తి మొహం ముడుచుకుంటాడు]

జానకి : (ఆవలిస్తూ) నే నిక పడుకోవాలి. మిమ్మల్నిలా ఎంతకాలం వుంచుతారు?

వేదాం : ఒక వారం రోజు లుండగలరా? హాయిగా, కలిసి జీవితాన్ని గడపడానికి మీ కింకా చాలా రోజులున్నయ్ ముందు.

జానకి : మా నాన్నగారికి నే నొక వుత్తరం రాసి వచ్చాను. (విజయగర్వంతో) అది మీ ఎత్తులకు ఆటకట్టు కాదుకదా?

వేదాం : ఎంతమాత్రం కాదు. ఆ వుత్తరం మీ నాన్నగారి కందడంలో కొంచెం పొరపాటు జరిగింది. మీరు మీ స్నేహితురాలితో కొన్నాళ్లు గడపడానికి వాల్తేరు వెళ్ళారని మీ నాన్నగా రనుకుంటున్నారు... డబ్బుకున్న శక్తి! (మూర్తితో) ఏమంటారు? (మూర్తి ఏమనగలడు?)

జానకి : మీరు అనుసరించే విధానాలకు నేను మిమ్మల్ని హృదయపూర్వకంగా అభివందిస్తున్నాను. సరే! నేను పడుకుంటాను.

వేదాం : లోకనాథం! అమ్మగారు పడుకుంటారట!

బట్లర్ : చిత్తంసార్...రండమ్మా (ఇద్దరూ వెళ్తారు)

మూర్తి : (వ్యంగ్యంగా) మీ గొప్పతనానికి నేనూ మిమ్మల్ని అభివందిస్తున్నాను.

వేదాం : ఎప్పటికైనా నిజం ఒప్పుకోక తప్పదుకుందా మూర్తిగారూ?...మీరుకూడా మీవాళ్లకు ఉత్తరం రాశారా?

మూర్తి : మీకు తెలిసేఉండాలే! మీ గూఢచారులు ఎక్కడ పడితే అక్కడే ఉన్నారుగా! రాముడు జానకీవాళ్ళ పనిమనిషి—యింకా ఎందరో?

వేదాం : డబ్బు, మూర్తిగారూ, డబ్బు! మీకు పది లక్షలు అసహ్యం కలిగించడం విచారించవలసిన విషయం. ఆ డబ్బుతో నన్ను శపించడానికి భగవంతుడికికూడా లంచం యివ్వవచ్చు...సరే! ఒకవారం ఇక్కడ వుండడం మీకు కష్టం కాదనుకుంటాను...ఆఁ! చాలా కష్టపడ్డారు; కాఫీకాని, పాలుకాని కావాలా?

మూర్తి : నేను వెళ్ళేవరకూ మీయింట్లో పచ్చి మంచినీళ్ళుకూడా తాగను.

[బట్లర్ రెండు కప్పులతో డ్రింక్ తెస్తాడు]

వేదాం : ఇంకేం! తీసుకోండి.

మూర్తి : మీయింట్లో ప్రతీవస్తువుమాదిరిగానే, యిదీ మీ దౌర్జన్యంవల్ల నే తీసుకుంటాను.

వేదాం : సరే! మీబాధ నాకర్థమయింది.

మూర్తి : మీ ప్రవర్తన నీతికి విరుద్ధం—

వేదాం : (నవ్వుతూ) ఆ సోఫాలో కూర్చుని ఉపన్యాసాలివ్వకండి—

మూర్తి : ఇది రాక్షసం అని బల్లగుద్ది చెబుతాను. (అని బల్ల గుద్దబోతాడు)

వేదాం : (వారిస్తూ) ఆ...ఆ...దెబ్బ తగులుతుంది.

(మూర్తి వేదాంతంవంక తీక్షణంగా ఒకసారి చూచి డ్రింక్ గటగట తాగేస్తాడు)

వేదాం : సిగరెట్ కావాలా?

మూర్తి : నేను వెంటనే నిద్రపోతాను.

వేదాం : అన్నట్టు, పారిపోతున్న మరో జంట ఇక్కడేవుంది. వాళ్లు బహుశః యివాళో, రేపో వెడతారు. వాళ్లను చూస్తారా?

మూర్తి : మీరు యింతకుముందు చేసిన పాపాలను గురించి వినడానికి నాకు యిష్టమూ లేదు, ఓపికా లేదు.

వేదాం : సరే! రేపు వుదయం పెందలాడే కాఫీకి ఈ రూములోకి రండి.

మూర్తి : అదీ మీ దౌర్జన్యంవల్ల నే—

వేదాం : ఎలాగైతే నేం, రావడం కావలసింది...గుడ్ నైట్! (బట్లర్ వస్తాడు) లోకనాథం! అయ్యగారు పడుకుంటారట!

బట్లర్ : రండిసార్! [మూర్తి వేదాంతంవంక చూచి భయంగా బట్లర్‌తో వెళ్లిపోతాడు. వేదాంతంగారు ఆ వంకకేచూసి, నవ్వి, యేదో ఆలోచిస్తూవుంటాడు.] తెర.

స శే ష ం

# కన్నడాంధ్రములు

శ్రీ గొట్టిముక్కల కృష్ణమూర్తి

సాహిత్య సముద్రము అపారమూ అనంతమైనది. బ్రహ్మసృష్టిలోని రసార్ణవములకన్న కవి బ్రహ్మ సృష్టిలోని రసార్ణవములు అనంతములూ అపారములూ. బ్రహ్మసృష్టిలోని అర్ణవములు యుగముల మార్పులచే స్థలాంతర నామాంతరములు పొందినవి. కాని కవిబ్రహ్మ సృష్టిలోని రసార్ణవములు చిరంజీవములు, అమృతములు, నిత్యనూతనములు. బ్రహ్మసృష్టిలోని అర్ణవములకు కొలంబసులు జనించి అంతు కనుగొన్నారు. కాని కవిరసార్ణవముల కడ, కడలేనిదని అందరూ అంగీకరించి అసాధ్యమని పూరకున్నారు.

బ్రహ్మసృష్టిలోని మానవులు రెండు విధములు. ధనార్థులూ, విద్యార్థులూ అని. ధనార్థుల చెంత విద్య, విద్యార్థుల చెంత ధనమూ ఉండడం చాలవరకు అరుదు. ఇతని కన్న సనాతనుడైన కవిబ్రహ్మ యీ యిరువురికీ సాహిత్య సామ్రాజ్యంలో సామరస్యమును సాధించినాడు. 'విత్', అను ధాతు వాధారంగా జ్ఞానం, విత్తం అని సాధించినాడు. కవిబ్రహ్మ సహాయంతోడనే విధాత తన పని సాగించగలిగినాడని 'ధాతా యథా పూర్వ మకల్పయత్', వంటి ఋగాధారములు కనపడుచున్నవి. కావున లక్ష్యం పుట్టనిది లక్షణము పుట్టుట అసంభవము.

బ్రహ్మసృష్టికి అంతమున్నది కాని కవిసృష్టి చిరంజీవము. వాల్మీకి యీనాడు మనకు లేడు కాని అతని రామాయణ మున్నదీనాటికీ. వేదవ్యాసుడు మనకు యీనాడు కానరాడు. కాని అతని భారత సంహిత నేటికీ నిలచినది. కాళిదాసకవి కాలగర్భంలో కలసినాడు. కాని అతని శకుంతల కళకళలాడుతూ నూతన యౌవనంతో మనకళ్ళముందు కనిపించుచున్నది. షేక్స్పియర్ కీర్తిశేషుడైనాడు కాని అతని రోమియో జూలియటులు మనముందీనాటికీ విహరించుచున్నారు. బ్రహ్మసృష్టిలోని రామకృష్ణావతార పురుషులను యీనాడు చూడజాలము కాని కవిబ్రహ్మ సృష్టించిన రామకృష్ణులు, వారి లీలాసత్కీర్తులు మనకు నేటికీ కావ్యదర్పణములలో కనబడుచున్నవి కదా?

సాహిత్య జగత్తు ఉత్తమాదర్శోపేతమైనది. సాహిత్యం అనగా (సహితస్య భావః సాహిత్యం, లేక సహితం రససంయుక్తం తదేవ సాహిత్యం) రసమునకు హితమైనది లేక రససంయుక్తమైనది సాహిత్యము లేదా (హితేన నిరతిశయ ప్రేమాస్పదేన రసేన సహితం తదేవ సాహిత్యం) అంటె నిరతిశయ ప్రేమాస్పదమైన రసముతో కూడినది సాహిత్యం అని అభిప్రాయ మగుచున్నది. ఈ సాహితీజగత్తుకు ఆధారభూతమైన రసము నే బ్రహ్మ ఆకృతిగా దాల్చినట్లు 'రసోవైసః' అను ఋక్కులు చాటుచున్నవి. రసమే పరబ్రహ్మ. "మమాత్మా సర్వభూతాత్మా", కాబట్టి సర్వభూతాత్మకమే పరబ్రహ్మ స్వరూపము. యీ ప్రపంచము సర్వభూతమయమైనది. కావున రసమయమైన లేక బ్రహ్మమయమైన ప్రపంచ హితమూ ప్రపంచ సహితమూ అయినదే సాహిత్యం. బ్రహ్మ సృష్టిలోని రొడుదుడుకులు సవరించుతూ నీతిపథగాములూ, బ్రహ్మానందలబ్ధులుగా ప్రాణికోటిని నడిపించునది సాహిత్యజగత్తు. దానికి స్రష్ట కవి. అందువలన కావ్యసృష్టియొక్క ముఖ్యోద్దేశ్యము విశ్వశ్రేయము.

కాలమునకు అనుగుణ్యంగా, సంఘమునకు హితంగా వుంటూ సందేశాత్మకమూ, సంశ్రేయాత్మకమూ అయిన రచనలను కవి సృష్టిస్తాడు. కాబట్టి కవి సృష్టిలో భాషావైషమ్యములకు తావులేదు. సమకాలికములూ, తత్ప్రాచీనములూ అయిన సోదర భాషలలోని వైశేషిక రామణీయకపదమ్ములను కవి అప్యాయంగా స్వీకరిస్తాడే కాని తృణీకరించడు.

ఏ ఖండమున వున్నా, ఏ దేశమున వున్నా, ఏ భాషారాష్ట్రమున వసించినా, కళావేత్తలందరిదీ ఒకే శాఖ. కవులు ఏలోకమున వున్నా వారి ఆలోకనము దివ్యాలోకనమే! వారు ఏభాష మాట్లాడినా యే

వృత్తంలో కవితానృత్యం చేయించినా కవు లందరిదీ ఒకేగోత్రం—ఒకేజాతి. అయితే వారి సాహిత్య సంపదార్జనలో కొందరు కవులు కుబేరులు కావచ్చు. మరికొందరు కుచేలురు కావచ్చు, కొందర నేక కావ్య రాసులు పోయవచ్చు మరికొందరు మితంగా వాడు కొనుచుండవచ్చు, కొందరు శృంగార రసాశ్రయులు కావచ్చు, కొందరు కరుణారాధకులు గావచ్చు. కొందరి శిల్పం నిగూఢం కావచ్చు మరి కొందరిది ఆబాల గోపాలగ్రాహ్యమానం కావచ్చు వృత్తినివర్త నలో తారతమ్యము లుండవచ్చు కాని కవు లందరిదీ ఒకే వృత్తి, ఒకేగోత్రం ఒకే సాహితీప్రపంచం.

కోకిల పంచమస్వరాలాపన చేయుటకు యిదే భాషాప్రాంత మని పక్క చూపులు చూడదు వసంతా గమనమే దానికి కావలసినది. కవికోకిలకూడ రసికా వతంసాగమనమే కాంక్షించును. శరత్తుకు దేశ భేదం లేదు. శారదకూ అభేద ప్రతిపత్తియే. కాబట్టి తమ భాషకు మించినభాష లోకంలో లేదు అనుకొనడం విజ్ఞుల విలక్షణ లక్షణంకాదు. 'స్వస్థాన వేష భాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధధియః లోకే బహుమన్యంతే', అనవచ్చు. కావచ్చును. కాని స్వేతరభాషా దూషణ మాత్రం పనికిరాదు. పరిగ్రాహ్యములు ఏ భాషలోనివైనా స్వీకరించుటలో దోషంలేదు. ఉచి తానుచిత పరిశీలనమాత్రమే అవసరము.

మన దక్షిణదేశమందలి భాషలలోని మహాకవులు "ఉదారచరితానాం తు వసుధైవకుటుంబకం" అని తోడి భాషలలోని స్వారస్య శబ్దములనూ, పోకడలనూ అను కరించినారు. గ్రహించినారు. తమ కావ్యములలోకి సమకాలిక సజీవములైన తోడిభాషాముద్రలు ఒక దానిపై యింకొకదానికి మనకు తెలియకుండగనే పడుట సహజము. ప్రాచీన మహాకావ్యముల పార జూచినయడల యిందుకు నిదర్శనములు కనబడగలవు.

దక్షిణదేశమందలి తమిళ, కన్నడ, తెనుగులు ఒక తల్లి బిడ్డలు. ఈ ముగ్గురూ అక్కాచెల్లెళ్లు. తెలుగు కన్నడములకు సంస్కృతాభిమాన సంపర్కములు యెక్కువగుటచేత యివి తమిళముకంటే మూలమగు దేశికి చలదూరముగా పోయినట్లు కనబడును. మూల భాషలోని పోలికలు తెలుగుకన్న కన్నడముకన్న విశే షంగా మారిపోయినవి. అనగా సంస్కృత మెంత ఆకర్షణీయమూ ప్రభావభరితమూ అయినా తమిళ శారదను మూలమగు దేశినుండి దూరము చేయజాలక పోయినది. మూలమగు దేశికి అందుకొనరాని దూర మేగినది తెనుగుశారద; కన్నడశారద మధ్యస్థంగా వుండినది. అనగా తమిళశారద పుట్టింటి మమత వద లించుకొనలేక పోయినది. కన్నడశారద పుట్టింటికీ మెట్టినింటికీ అనుకూలంగా మెలగి అందరి ఆదర మార్జించినది. తెనుగుశారద సంస్కృతంతో పెనవైచు కొని వాగర్థములబోలిన పార్వతీపరమేశ్వరత్వము పొందినది. తన సంసారపు అభివృద్ధికే జీవిత మర్పించి నది తన స్వజాతీయపు అలవాట్లను, సిరిసంపదలను సైతం తను మెట్టినింటివారి ఆచారములకై త్యాగం చేసినది. సంస్కృతపు వృత్తి (వృత్తము) చేపట్టినది. తమిళశారద:

> "అత్తవారింట సకల భాగ్యంబులున్న
> మగనిమీదట తనకెంత మక్కువున్న
> ఆడపుట్టువు పుట్టింటి కాసపడును."

అని అనిపించి తన పుట్టినింటి దేశికళా వైదగ్ధ్య ములకు ఆసపడి నిలచినది కాని తెనుగుశారద మాత్రము —

> "ఎట్టి సాధ్వులకును పుట్టిన యిండ్లను
> పెద్దకాల మునికి తద్ద తగదు
> పతులకడన యునికి సతులకు ధర్మవు
> సతుల కేమగడయు పతులమావె!"

అన్న భారతనీతి నిబద్ధయై పుట్టినిల్లగు దేశికళా వైదగ్ధ్యములనూ సంప్రదాయములనూ వడినించుకొని వెళ్లి మెట్టిన యిల్లగు సంస్కృతమున గుబాళింప చేసినది.

అయితే సాహిత్య జగత్తులో లాక్షణికులు పుట్టి సాహిత్యంపై అతి పెత్తనం చేయసాగినారు. వీటో బల మును వుపయోగించ నిలచినారు. ఈ వీరి పెత్తనం పలుకుబడి పొందుట ఆరంభం కాగానే స్వయంవద అయిన కవిత వారి క్రమశిక్షణకు కట్టుబడినది. వీరి నియ మాలలో కెల్ల దుర్భరమైనది 'చౌర్యం" అనేది అమి తంగా చెలామణి అయినది. ఒక భాషనుకాని, కవిని కాని అనుసరించితే దానిని దొంగతనముక్రింద చేర్చి నారు లాక్షణికులు. అతి భక్తుడైన ఒక కవి 'కవినీ దొంగనూ," ఒకే విధంగా జమకట్టి యిద్దరి వృత్తీ ఒకే చౌర్య మని శ్లేషించినాడు. అయితే వెనుకటి మహా

నీయుల వుత్తమాదర్శములైన మార్గములను యెవడైనా పురోగమించ దలచినయెడల అది మార్గచౌర్యమా? శ్రీకృష్ణునివలె వేణువూ, వాణివలె వీణా సారించుటకు యత్నించినయెడల అది అనుకరణాన్యూనత్వమా? కాదు. కళావైదగ్ధ్యమునకు మంచిని దేని నుండి పరిగ్రహించిన నేమి? ఈనాటి నాగరికుల నాయికా నాయకులుగా ఒక యితివృత్తమును కావ్యముల వలె నన్న యీనాడు వెనుకటి కంచుకములు లేని నాటి సనాతన నాయికనుగా సృష్టించవలెనా? పాత్రౌచిత్యము, కాలౌచిత్యములను గమనింపవలదా? సంస్కృతభాష సైతము ఉపయుక్తమైన వానిని యితర భాషలనుండి స్వేచ్ఛగా స్వీకరించినది. మన అను వారి పైటశబ్దము పతాకనుండి దిగుమతి అయినది కాదా? మ్లేచ్ఛ శబ్దములను సంస్కృతీకరించి సంస్కృతశబ్దానురూపములకు వ్యుత్పత్తులను కల్పించి వాని అర్థము యెట్లు సాధింపయత్నింప బడినదో కుమారిలభట్టు తన తంత్ర వార్తికమున ద్రావిడభాషా శబ్దములను వుదాహరణముగా గ్రహించి వివరించినాడు... "ద్రావిడాదిభాషాసూం యేతావత్ వ్యంజనాంత భాషాపదేషు స్వరాంత విభక్తి స్త్రీ ప్రత్యయాది కల్పనాభిః స్వభాషానురూపా నర్థాన్ ప్రతిపాద్య మానాన్పృశ్యంతే. "చోర్," ఇత్యుక్తే చోరపదవాచ్యం కల్పయంతి. పన్థానం 'అతర్' ఇత్యుక్తే 'అతర' యితి కల్పయిత్వాహుః. సత్యం దుస్తరత్వాత్ అతర; ఏవ పన్థాయితి. తథా 'పాప్' శబ్దం పకారాంతం, సర్వవచనం అకారాంతం కల్పయిత్వా పాప ఏవా సావితి వదంతి...తద్యథా ద్రావిడాదిభాషా ఈదృశీ స్వచ్ఛంద కల్పనా తదా పారశీక యవన బర్బర రోమకాదిభాషాసు కిం వికల్ప్యం కింప్రతిపత్స్యం తయితి నవిద్మః" అని కుమారిలభట్టు ప్రశ్నించినాడు.

అందుకే ఆంధ్ర కన్నడ ప్రాచీన మహాకవులు ఉదాత్త విషయములూ, భావములూ యే భాషలో వున్నా స్వీకరించి తమ కావ్య సుందరులను సింగారించుకున్నారు. తమ కావ్యములకు అజరామరత్వమును సంపాదించుకున్నారు. నన్నెచోడుడు, పాల్కురికి సోమకవి, తిక్కన, శ్రీనాథుడు, పంపడు, రన్నడు, మల్లికార్జునుడు మొదలగు కవిశాఖీయులైన పెద్దలు అందరూ రుచ్యములైన భక్ష్యములను పొరుగింటివని, దేవి, అనక భేదా లేక స్వీకరించి జీర్ణించుకున్నారు. ఈ వుదాహరణలో దక్షిణదేశ భాషలలో కెల్ల కన్నడాంధ్రములు అతిసరసంగా ప్రవర్తించి ఆదర్శమైనవి.

మన గత చరిత్రను కొంత నిర్మలిన నిదాన దృష్టులతో చూచినయెడల అనాటి పరిపాలకులు ప్రజలలో భాషావైవిధ్య మున్నంతమాత్రమున భాషా వైరుధ్యమునకు ప్రోత్సాహమీక, దాని వైదగ్ధ్యము నే పాటించి పాలించినారు. అనాటి రాజ్యాంగ నిర్మాతలూ, రాజులూ కత్తులతో కత్తికల కోసికోని రక్తస్నానము చేసి వేషల జందెములు తాల్చినా, కళావేత్తల జోలికి పోలేదు. వారిని పల్లెత్తుమాటా అనక పల్లకీల నూరేగించి గౌరవించినారు. కళాసృష్టి సుష్టుగా వృద్ధిచెందుటకు దోహదకారులైనారు. శాలివాహనులు కన్నడమును యేలినారు. "నేను తెనుగు వల్లభుండను," అని చాటుకున్న కృష్ణదేవరాయలు కొండవీడు మొదలు కటకమువరకు పాలించినాడు. అటులనే కన్నడిగులు కూడ ఒకనాడు గౌతమీ గంగ నుండి కావేరిదాక పరిపాలన చేసినట్లు "కావేరి యింద గోదావరి వరిగె మిద్దా వసుధాతళ తళియ భావిసె కర్ణాటక జనపదవ నావ నోలింద బణ్ణిసువెను" అని చెప్పుకున్నారు.

ప్రాచీన కన్నడాంధ్ర కవులు దేశీయ వృత్తముల లోనే రచనలు చేసినారు. నన్నయ భట్టారకునికి పూర్వము శాసనములలో సీసము, మధ్యాక్కర, తరువోజ, రగడ, ద్విపద, మొదలైన దేశీయ వృత్తములలో తెనుగు రచనలుండినవి. కన్నడకవులు నన్నయభట్టుకు పూర్వమే సంస్కృత వృత్తములను వాడుకొనిరి. నన్నయ సైతం ఆంధ్ర మహాభారతములో చంపక శార్దూలాది సంస్కృత వృత్తములను వాడినాడు. భారతాంధ్రీకరణమునకు తనకు నారాయణ భట్టు; పాకశాసనికి నారాయణునివలె తోడుపడినాడని వ్రాసికొన్నాడు. నారాయణ భట్టు కన్నడాంధ్ర సంస్కృత పైశాచికాది భాషాకోవిదుడూ గ్రంథకర్తయై "కవీభవజ్రాంకుశుడు," అను బిరుదు పొందినాడు. నన్నయ తన భారతంలో :

"పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు
నారాయణు నట్లు, వాసిగ, ధరామర వంశ
విభూషణుండు నారాయణభట్టు వాఙ్మయ
ధురంధరుడున్ తనకిష్టుడున్ సహాధ్యాయుడు
నైన వాఁ డభిమతస్థితి తోడయి నిర్వ
హింపగాక్"

అని చెప్పుటచేత నారాయణభట్టు వాఙ్మయ ధురంధరుడూ, నన్నయభట్టుకు యిష్టుడూ, సహాధ్యాయుడు అయినవాడని, అట్టివాడు తోడయి నిర్వహించినాడు ఆంధ్ర భారత రచన అని తేలుచున్నది. అనగా నన్నయకు హితుడైనందున ఒండొరుల అభిమతములు తెలియగలవు. అందుచేత యిష్టులైనవారిలో ఒకరి సూచనలు యింకొకరు మిత్రసమ్మతముగా అంగీకరించుట సహజము. ఇష్టుడైనందున ఒక్కొకచోట సాధికారంగా కూడ సూచించి యుండవచ్చును నారాయణభట్టు అని వ్యక్తమగుచున్నది ఇట్టివాని తోడ్పాటుతో జగద్ధితముకొరకే భారత ఆంధ్రీకరణము చేసినానని :

"సారమతిఁ గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థ
యుక్తిలో నారసి మేలునా నితరు లక్షర
రమ్యత నాదరింప నానారుచిరార్థ సూక్తి
నిధి నన్నయభట్టు తెనుంగునన్ మహాభారతసం
హితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్"

అని చెప్పుకున్నాడు. జగద్ధిత కార్యాచరణలో స్వాభిమాన మమకారములకు తావుండదు నారాయణ భట్టు వివిధభాషలలోని అభినివేశము నన్నయభట్టు రచనలపై ప్రభావితమగుట అసహజముగాదు. ఆంధ్ర కవికోటికి ఈ మాట ఆగ్రహము కలిగింపవచ్చును. కన్నడాంధ్రకవు లుభయులూ ఛందస్సాహితీ రీతులకు సంస్కృతమును అనుకరించిరని, వాగనుశాసనుడైన నన్నయ భట్టారకునకు కన్నడానుకరణపు గతి పట్టలేదని వాదింపవచ్చును. అది వారి అభిమానము మాత్రమే. వాగనుశాసనుడైనా కూడ యింకొక భాష—సంస్కృతమే కానీయండి అనుకరించక తప్పలేదు. సంస్కృతానుకరణము సమంజసమైనప్పుడు కన్నడాదిభాషల అనుకరణము కంటగింపు కావడమేమి? ఒకదాని అనుకరణ గ్రాహ్యమూ మరియొకదానిది గర్హ్యమూ కాజాలదు. కన్నడకవులు నన్నయకు పూర్వమే మహాకావ్య రచనలు ఆరంభించినారు. సంస్కృతమును కన్నడకవులు అనుకరించుట గాంచి తెనుగువారూ అనుకరించి యుండరాదా? తెనుగువారు కన్నడిగులను అనుకరించిరన్న కన్నడిగులకు కడుపుబ్బును. తెనుగువారు తీండ్రింతురు. తెనుగువారిని కన్నడిగులు అనుకరించిరన్న కన్నడిగులకు కన్నెర్ర, తెనుగువారికి సంబరము. కాని చరిత్రను కాదనుట యెట్లు? ఆనాడు భాషాభిమానము అతివ్యాప్తదోషజుష్టము కాలేదు. భాషాభిమానము చెడుపిందెల ఫలించలేదు. రాజరాజనరేంద్రుడు అన్ని భాషల పండితులను పోషించి కావ్యగోష్ఠి చేయుచుండెడి వాడని :

"బహుభాషల బహువిధముల
బహుజనముల వలన వినుచు భారతబద్ధ
స్పృహులగువారికి చెప్పఁగ
బహుయాగంబుల ఫలంబు పరమార్థముగన్."

అని చెప్పకొనుటలో ఆనాటిరోజుల, కవిరాజుల బహుభాషాదరము తారాపథమందినట్లు స్పష్టముగుట లేదా?

నారాయణభట్టు సంస్కృతంలోనూ మహాకవి అనియు, వేణీ సంహార నాటకకర్త భట్టనారాయణుడే నారాయణ భట్టు అనియు యింకా యిదమిద్ధమని తేలని వాద మొకటి విమర్శక రంగంలో నున్నది. వారు చూపే వుపపత్తులు పూర్తిగా తిరస్కార్యములు కావు.

వేణీసంహార నాటకంలో "తదిదం కవేః మృగరాజలక్ష్మణో (లక్షణో) భట్టనారాయణస్య కృతిం వేణీసంహారం నామ నాటకం ప్రయోక్తు ముద్యతా వయం తదత్ర కవిపరిశ్రమానురోధా ద్వా ఉదాత్త కథావస్తు గౌరవా ద్వా నవనాటకదర్శన కుతూహలా ద్వా భవద్భి రవధానం దీయమాన మభ్యర్థయే" అను సూత్రధారుని మాటల్లోని "మృగరాజలక్ష్మణో భట్టనారాయణస్య" అన్న మాటలకు మృగరాజలక్ష్మ అనగా చంద్రుడగుటచేత చంద్రునివలె కళానిధిఅగు భట్టనారాయణుడనియు, మృగరాజు బిరుదాంకమువలన శ్రీమంతుడైన వాడనియు నూహింపవచ్చును.

ఈ సందర్భమున ఆంధ్ర భారత రచనకు నన్నయకు తోడుపడిన నారాయణభట్టు స్ఫురించగలడు. నెహ్రూపండితుడు, పండిత నెహ్రూ, గాంధి మహాత్ముడు-మహాత్మ గాంధి అని బిరుదవాచకములను పేరులకు పూర్వోత్తరములనుంచు సంప్రదాయమున్నందున నారాయణభట్టు, భట్టనారాయణుడు అన్న నామాంతరగ్రహణము స్ఫురించగలదు. "భట్టః చతుర్దశకలాభిజ్ఞః" అని లక్ష్మణసూరి చూడామణి వ్యాఖ్యలో గలదు. కావున భట్టశబ్దము బిరుదవాచకమని దానిని

పేరునకు యిరువైపుల వాడుటకలదని, కావున భట్ట నారాయణుడే నారాయణభట్టు కాదగదా? కావచ్చు ననుటకు మరికొన్ని ఆధారములు కూడ కనిపించు చున్నవి.

నారాయణభట్టునకు రాజరాజనరేంద్రుడు నందంపూడి అనుగ్రామము అగ్రహారముగా ఇచ్చినట్లు అచటి శాసనము పలుకుచున్నది అందులో "విజయాదిత్య భట్టారకోష్టాదశ, తత్తనుజో విష్ణువర్ధన షట్త్రింశతం. తత్సూనుర్విజయాదిత్య నరేంద్ర మృగరాజశ్చ అష్టా చత్వారిశతం...తస్మై సకలజగదభినుణశాలి నే సరస్వతీ కర్ణావతంసాయ అష్టాదశావధారణ చక్రవర్తి నే భట్ట నారాయణాయభవస్విషయే నందమపూడి నామగ్రామో అగ్రహారీకృత్య సోమగ్రహణ నిమిత్తే ధారాపూర్వకం అస్మాభిస్సర్వకర పరిహారేణ దత్తయితి విదిత వస్తువః" అని గలదు. ఇందు గమనింప వలసినవి కొన్ని గలవు. రాజరాజనరేంద్రుని పూర్వీకుడొకడు మృగరాజు అను బిరుదమో, నామమో దాల్చి యుండెననియు, నారాయణభట్టుకు, భట్టనారాయణ నామాంతర మున్నదనియు, అతడు సంస్కృత .కర్ణాటక, ప్రాకృత, పైశాచికాది భాషా పండితుడై, 'కవిరాజశేఖర, కవీభవ్రజాంకుశ, అష్టావశావధారణ చక్రవర్తి' అని బిరుదులు పొందిన వాడనియు తేలుచున్నది. విష్ణువర్ధనునకు రాజరాజనరేంద్రుడన్నది బిరుద నామమైనట్లే మృగ రాజ శబ్దము బిరుదవాచియే కావచ్చును. రెండవ విజయాధిత్యునకు మృగరాజ బిరుదము గలదు. భట్ట నారాయణుడు రాజరాజు కతన శ్రీమంతుడైనందున ఆ అర్థమున నే మృగరాజ లక్ష్మణుడని వాడియుండెనేమొ"

నారాయణభట్టు కన్నడమున భారతము రచించెనని కన్నడ వాఙ్మయము చాటుచున్నది. ఆంధ్ర భారత రచనమున ఈతడు చేసిన సాయము అత్యంతమని నన్నయభట్టే చెప్పినాడు గదా? పైగా యీతని తండ్రి తాతలు మహాపండితులు కవిలోక చక్రవర్తులు. ఇట్టి వానివలన ఇతడే తనకు అత్యంత ప్రియమగు భారత గాథను సంస్కృత ప్రాకృత భాషా విలసితమగునట్లు వేణీ సంహార నాటకము రచించియుండుననుట అసమంజసము కాజాలదు. అట్టి మహాపండితుడు కాబట్టే కాన్యకుబ్జ, వంగాది దేశములెల్ల తిరిగి అచట కవితా వీరవిహారము చేసి సంస్కృతులు పొందినాడు.

అంతేకాక నన్నయభట్టు కాలము క్రీ. శ. 1050 ప్రాంతమని పెక్కుమంది విమర్శకులు అంగీకరించినారు. భట్టనారాయణుని కాలమును నిర్ణయించుటకు మమ్మటాచార్యుని కావ్యప్రకాశమున భట్టనారాయణుని వేణీసంహార నాటకమునుండి పెక్కు శ్లోకములను ఉదాహరించినాడు. మమ్మటుడు క్రీ. శ. 1150-1200 ప్రాంతం వాడు. కావున భట్టనారాయణుడు అంతకు పూర్వుడై యుండవచ్చును. కావున అతడు 1050 — 1100 ప్రాంతమువాడై యుండవచ్చును. మరియును క్రీ. శ. 1070 ప్రాంతపు భోజదేవుడు తన "సరస్వతీ కంఠాభరణము," నను క్రీ. శ. 1030 ప్రాంతమునకు చెందిన దశరూపకమునను వేణీ సంహారము నుదాహరించుటచేత నన్నయ, భట్టనారాయణుల కాలము ఒకటే కావచ్చును అనుకొనుటకు వీలుకలుగు చున్నది. వీనివలన నారాయణభట్టే భట్ట నారాయణుడు కావచ్చును. పండితులు పరిశోధించి నిర్ణయించిన యెడల, నారాయణ భట్టే, భట్ట నారాయణుడైయెనేని ఆంధ్ర కన్నడులకు అంతకన్న గర్వకారణ మున్నదా ?

కావున నన్నయకు కన్నడము తెలియునని కాని, సమకాలికపు యితర భాషాప్రాభవము అతని రచనల పైపడి యుండెనని కాని చెప్పజాలము. సమకాలికము లైన యితర భాషాప్రాభవములు పడినవన్నంత మాత్రమున ఆంధ్రవాగనుశాసనుని న్యూనపరచినట్లు గాదని మాత్రము విన్నవింతును.

ఆంధ్ర కన్నడములలో దేశి వృత్తముల విషయమున అతిసూక్ష్మ భేదములూ అందందున్నవి. అప్పకవి మధ్యాక్కరకు రెండు ఇంద్రగణములు ఒక సూర్య గణము, తర్వాత రెండింద్రగణములు, ఒక సూర్య గణముండి నాల్గవ గణము ప్రథమాక్షరము యతిగా పేర్కొన్నాడు. నన్నయ భట్టు మధ్యాక్కరలు యతినితో భేదించుచున్నవి. నన్నయభట్టు అయిదవ గణము మొదటి అక్షరమును యతిమైత్రి చేసినాడు. ఇంతే కాక గణములలోనూ నన్నయభట్టు కన్నడ మధ్యాక్కర లక్షణమునే అనుసరించినాడు. కన్నడములోని మధ్యాక్కరకు బ్రహ్మవిష్ణు రుద్రగణములని మువ్విధములు. గగ, స, గల, న, గణములు బ్రహ్మ గణములు, నల, గన, సల, భ, ర, త,

మ, సగ, గణములు విష్ణుగణములు. కన్నడ లక్షణం ప్రకారం మధ్యాక్కరకు (దొరెయక్కరకు) రెండు విష్ణుగణములు ఒక బ్రహ్మగణము. పిదప రెండు విష్ణుగణములు ఒక బ్రహ్మగణము లుండును. కన్నడ అక్కరలలో అయిదు మాత్రలకు మించిన విష్ణుగణం లేక పోగా నన్నయభట్టు ఆరు మాత్రల గణములనూ వాడి కన్నడంతో కొంత భేదించినాడు.

ఆర్యాగీతి ప్రాకృతమున ఖందనీ అనబడినది. దీని నే ఆంధ్ర కన్నడ కవులు కందముగా వాడినారు. ఈ ఉభయభాషలలోను కందవృత్తమునకు ప్రాసనియమము చేసినారు వుభయభాషా లాక్షణికులు. కాని కన్నడంలోని, గీతికె అనుదానికి ప్రాసనియమం వుండగా తెనుగులో దానిని సడలించి తేటగీతి గావించినారు తెనుగువారు క్రౌంచపదవృత్తమున నన్నెచోడుడు తన కుమార సంభవంలో కన్నడలక్షణపు ప్రాసను పాటించినాడు. ప్రథమ ద్వితీయ దళములలో యతి పాటించినాడు. రెండుచోట్లనే యతి పాటించినాడు. కాని తెనుగు లాక్షణికులు మూడుచోట్ల యతి మైత్రి నియమించినారు.

తెనుగు:—కాంచన భూషా సంచయ మొప్పన్, ఘన
కుచ భరమున గవునసియాడన్ (భ, మ,
స, భ, న, న, న, న, య గణములు)

నన్నెచోడుడు:—చంచుల నాస్వాదించుచు లే।
దూండ్ల కరువు ప్రియులకు నల
తలచు మైరో। మాంచము లో లిం
గంచుకి తంబై। పొడమగ నడగుచు
బులినములం గ్రీడించుచు సంభా
షించుచు ప్రీతిన్। బొలుచుచు
జెలగుచు బొలయు సముద్య।
త్క్రీంచగతుల్ వీక్షించుచు
భాస్వ। జ్వలనుడు శరవణ సరసికి
వచ్చెన్.

కన్నడము:—శీకర శీర్వాత శ - శాంకర్ యుగ
మిత సురపుర నివహాద కడెయోళ్.

సంస్కృత మందువలె కన్నడమునను భ, మ, స, భ, న, న, న, న, గ గణము లున్నవి. ప్రతి పంక్తిలోనూ ప్రాసయతి యున్నది.

సంస్కృతంలోని ముద్రాలంకార సాంప్రదాయం కన్నడాంధ్ర కవు లుభయులూ అవలంబించినా ఆదిలో కన్నడంలో పంపడు తన భారతంలో ఆరంభించినాడు.

"బక కిమ్మీర జటాసురోద్ధత జరాసంధ ద్విషం, సంఘ కీచకరం దోర్వ్యూహమం పడల్పడ నిక్షిత్వప్పంద దోర్దండ ముగ్రకురుక్ష్మాప మహీరుహ ప్రకరమం మత్తేభ విక్రీడితం, క్రకరం పొల్సెగవందు భీమ రణదోల్ నుర్గాడదం పోకు మే."

తిక్కన సోమయాజి భారతమందలి ఉద్యోగ పర్వంలోని యీ క్రింది పద్యం, పంపని పై పద్యపు పూర్తిఛాయలో గనబడుట గమనించుడు. అంతేకాక వృత్తమూ, ప్రాస, కూడ ఒకటిగానే యుండుట గమనార్హము ఈ మాట అనేవరకు తిక్కన సోమయాజిని తీసి వేసినట్లని భావించరాదు సోదరభాషా రచనల ప్రాభవములు యెట్లు తెలియకుండగనే వచ్చి పడుచుండునో మాత్రమే గమనించవలెను.

"బక విధ్వంసి జటాసురాంతకు
హిడింబప్రాణ పారీణు కీ
చక నిర్మూలన కేళిలోలు
సమరోత్సాహైక శీల ప్రవ
ర్తకు నాగాయుత సామ్యకీర్తి బలో
దగ్రుం బ్రతివ్యూహ దా
హకు భీముం గొని వచ్చు ధర్మజుడు
బాహాటోపమున్ జూపగన్."

సంస్కృతము నందలి ముద్రాలంకార సాంప్రదాయమును పంపనివలె నన్నెచోడుడు సైతము కుమారసంభవమున పలుచోటుల రసోపస్కారకంగా వాడినాడు.

"హృదయాహ్లాదముతోడ బాయక
సదానైక ప్రభావంబులన్
మదనాసక్తి బెనంగుచున్న
విలసన్మత్తేభ విక్రీడితం
బది దాక్షాయణి నూచి కౌతుక
రతైకాలీన భావాభిలా
ష దృగత్యుజ్జ్వల దీధితుల్ పరపి
నీలానాననాబ్జంబుపైన్."

అని మదనాగముల మన్మథ క్రీడలకు పురాణదంపతుల శృంగార విహారమును పోల్చి వర్ణించుపట్ల ముద్రాలంకారము యెంత రసవంతముగ పడినదో గమనించుడు. "సముద్యత్ క్రౌంచ గతుల్ వీక్షించుచు భాస్వజ్జ్వలనుడు శరవణ సరసికి వచ్చెన్" అనుచోట క్రౌంచపద వృత్తిమును పద్యపాదమున చమత్కరించినాడు.

కన్నడాంధ్ర కవిత్వములలో యిదిమాత్రమే కాక భావసామ్యములూనూ అనేకమున్న వృత్తములు ప్రాచీనవాఙ్మయ మథనమునకు బూనుకున్న మనకు లభించకపోవు. ఈ క్రింది రెండుభాషల పద్యముల పోకడలను, నడకలను చిత్తగించుడు.

కన్నడము :

శ్రీపతి వాక్పతి ప్రముఖదేవతెగళ్
బహుపరిపాద వా
ర్తాపగళింద కాణది మహాశైవ
మహత్వ మనల్పబుద్ధి యిం
దాపనలాసమర్థన కృతార్థన
దంతి హనల్లదర్కచి
ర్హాపన వాచ్యనం నతిపనై
శివపర్వత మల్లికార్జునా?

మల్లికార్జున పండితుని మల్లికార్జున శతకంలో :

"లోకము లెల్ల నీ తనువు లోనివ
నీవటు యెంత కల్గనో
నాకప పద్మసంభవ జనార్దను
లాదిగ నెల్ల పెద్దలున్
నీ కొలదింత యంత యన
నేరక మ్రొక్క దొడంగి దన్ను ని
న్నే కరణిన్ నుతింతు పరమేశ్వర
శ్రీగిరిమల్లికార్జునా?"

కన్నడ వాఙ్మయంలో రత్నత్రయమని పేరు గాంచిన వారు పంప, పొన్న, రన్న అను కవులు తెనుగుదేశమున జన్మించినవారు. కన్నడవాఙ్మయమును పూర్వచాళుక్యులు, పశ్చిమ చాళుక్యులు కూడ ఆదరించి పోషించినారు. క్రీ. శ. 841 లో వేంగి మండలంలోని విక్రమపురాగ్రహారం నెల్లూరులోనిది, పంపని జన్మస్థానం. పంపని తండ్రి అభిరామదేవుడు. ముత్తాత మాధవ సోమయాజి. అభిరామదేవుడు జైన మతం అవలంబించినందున అతని వంశీకుడైన పంపడును జైనుడైనాడు. ఆంధ్ర దేశమున జైనము పట్ల వ్యతిరేకత శృతిమించినందున వీరు వేంగినాటి నిరాశ్రయులై కన్నడ దేశమునకు కొండికపులై వెళ్లినారు. అప్పటికే కన్నడ దేశమున చాళుక్యరాజులు జైన మతము నవలంబించి యుండిరి కాని భాషకు వారు పట్టుగొమ్మలై యుండిరి ఆంధ్రులలో తీవ్ర వైదికము తీండ్రించి, వైదికేతరమతములపట్ల వైరము విజృంభించినది. ఆంధ్రుల ఆదరణ లేకపోవుటచేత పంపడు కన్నడమున నే రచనలు గావించి వేములవాడ పశ్చిమ చాళుక్యుడు రెండవ అరికేసరి ఆస్థాన పండితుడై మొదటి తీర్థంకరుని చరిత్రను మూడు నెలలలో ఆది పురాణమను పేర జైనమత పరముగా కన్నడమున రచించినాడు. పంపని సమకాలికుడైన పొన్నకవిది వేంగి దేశంలోని పుంగనూరు అను గ్రామము జన్మస్థానము. ఇతడు కౌండిన్య సగోత్రుడు. తండ్రి నాగయ్య జైనుడైనందున పొన్న కవియు జైన వ్యాప్తంగల కన్నడ దేశమును చేరినాడు. ఇతడు సంస్కృత కర్నాటక మహాకవి. రాష్ట్ర కూటులలోని మూడవ రాజు కృష్ణరాజు వలన ఉభయ కవి చక్రవర్తి బిరుదము నందినాడు. పదునారవ తీర్థంకరుని చరిత్రను శాంతి పురాణము పేర కన్నడమున వ్రాసినాడు. రన్నడు అనుకవి క్రీ. శ. 997-1008 ప్రాంతమువాడు. భారత కథను సాహసభీమ విజయము అను పేర పదిఆశ్వాసముల కావ్యముగా కన్నడమున రచించినాడు పంపకవి సమకాలికుడైన నాగవర్మ 948 లో కన్నడ భాషలో ఛందోంబుధి అను అలంకార శాస్త్రమును, రామాయణమును వ్రాసినాడు. ఆనాటి చరిత్రను చూచిన యెడల కవులు మొదట మాతృ భాషలో గ్రంథకర్తలై పిదప సోదర భాషలలో తమ పాండిత్య సౌండీర్యమును చూపికొన్నారు. ఈ కన్నడ రచయితలు వ్రాసిన తెనుగు గ్రంథము లేమైన గలవో లేవో? వైదిక మతము పునరుద్ధరింపబడి వీర విహారం చేయు రోజులలో జైన మతముపై కసి దీర్చుకొనుటకు జైన రచనలను అగ్నిదగ్ధం గావించినట్లు చరిత్రలు చాటుచున్నవి. ఈ రచయితల గ్రంథములనూ అందేమైన చేరి మనకు నేటికి ధారణకు విభూతిగా నిలచె నేమొ?

జైనమతమునకు పోటీగా వీరశైవము మదురు పాకమున బడగానే కన్నడదేశమున బయలుదేరిన ఈ వీరశైవము తెనుగు దేశమునందూ వ్యాపించిన తోడనే పాల్కురికి సోమనాథుడు వీరశైవమునకు తెనుగు దేశ

మున పట్టుగొమ్మలయి నిలచినాడు. కన్నడమందు వలెనే తెలుగునందును దేశీయఛందోభేదమై ప్రచార మందుండిన 'రగడ' రచనను చేబట్టి జనసామాన్యమున వీరశైవ మతవ్యాప్తి కొరకు "బసవరగళె, సద్గురురగళె— చెన్నబసవస్తోత్రదరగళె" అను వానిని కన్నడమున రచించినాడు. కన్నడమునందలి వచనములను పోలిన గద్యాలను అక్షరాంకగద్య—నమస్కారగద్య—పంచ ప్రకారగద్య అనువానిని తెలుగునకూడ రచించినాడు.

కన్నడమున హరీశ్వరకవి పంపాశతకమును వ్రాసి నట్లే పాల్కురికి సోమన్న తెలుగున వృషాధిపశతకము రచించి శతకవాఙ్మయమునకు తెలుగున దారిచూపి నాడు. బంధకవిత్వం, కందగర్భ చంపకంలాంటి కవిత, బన్ధ్కాల సంప్రదాయం తొమ్మిదవ శతాబ్దం నాటికే వుండినట్లు కవిరాజమార్గమను కన్నడ గ్రంథమువలన తెలియుచున్నది. ఈ పద్ధతిని తెనుగులోనికి నన్నెచోడుడే దిగుమతి చేసినాడు. నన్నెచోడుడు తన కుమారసంభవ కావ్యంలో కన్నడ పదములను అతి నిర్భయంగా వాడినాడు.

> "చెనసి గుణమైన దోసంబు చేయ నేర్చు
> కుకవి కృతులందు, దోసంబు గుణము సేయ
> నేర దది అట్లు దొంతులు సేరినాయి
> దోర్చు నేర్పుగా కదియేమి నేర్పు నేర్పు?"

పాల్కురికి సోమనాథుడు ఆంధ్ర కన్నడ సంస్కృతములే కాక భారతదేశమందలి అనేక భాషలను వశంవదలను చేసికొన్నాడు. కావ్యము రసోప స్కారకంగా రాణించుటకై పాత్రౌచిత్యమును పాటించి పండితారాధ్య చరిత్రలో పర్వత ప్రకరణములో వివిధ రాష్ట్రీయులైన శైవభక్తులు శ్రీశైల పర్వ తారోహణ గావించు పట్టులను వర్ణించుచు వారి వారి భాషలలో సంస్కృత, ఆంధ్ర, కన్నడ, తమిళ, కాశ్మీర, వంగ, గుజరాతీ, మహారాష్ట్ర మొదలగు భాషీయుల ప్రసంగములను ఆ భాషాపదములనే యథా తథంగా తెనుగు ద్విపదములో కూర్చి ద్విపదము నడి పించినాడు. తెనుగు కవితాసుందరికి నానారాష్ట్రాలం కారముల చేసి జీవముపోసి అమరము గావించినాడు.

కెరయ పద్మరసు కన్నడ రచనలు అధారముగా 1572-1595 ప్రాంతంవాడైన పిడపర్తి బసవనకవి వీర శైవ దీక్షాబోధి అను కావ్యమును కన్నడ ఆంధ్ర ఉభయభాషలలో ద్విపదగా రచించినాడు. పిడపర్తి సోమన్న అనుకవి, కన్నడంలో చామరసుకవి వ్రాసిన ప్రభు లింగలీలలు అనువానిని ద్విపదలో తెనిగించినాడు.

జాతీయములను (Idioms) ఉభయ భాషా కవులూ ఉదారంగా అవి యేభాషలోనివైననూ తమ కావ్యములకు అలంకరించుకున్నారు. పంప మహాకవి తన భారతంలో "పన్నతెర నడువనుడియ ల్కెన్న భుజార్గళమె సాల్గుమె సపేఱ్మనిమె కొన్ననుడి టాద డాఘణ, మెన్నం బెసనువదు రాజసూయంజేళ్," అను పద్యంలో టాఠాడాఢాలాడుట-అనగా కఠి నంగా, గురుసుగా మాటలాడుట అని అర్థమిచ్చే తెనుగు జాతీయమును చేర్చుకొన్నాడు. కవి సార్వభౌముడు శ్రీనాథుడునూ క్రీడాభిరామంలో "కర్నాటస్త్రీలు కటారి కత్తియలచే రాపాడగాబట్టగా డాఠా లీడ గుణింపరాదు పెరచోటం బోలె పైపాటునన్" అని చెప్పినాడు శ్రీనాథుడు కవి సార్వభౌముడే కాక బహు దేశముల పర్యటించి నట్టివాడు. వివిధ దేశముల పండిత పామరజనుల సంస్కృతులను నాగరికతలను ఒడిచి పట్టుకున్నవాడు. వీరశైవ మహాభక్తుడు. ప్రౌఢ దేవరాయల కాలము కన్నడమునకు స్వర్ణయుగము. ప్రౌఢ రాయల ఆస్థాన పండితుడు గౌడడిండిమ భట్టు. ఇతని కంచుఢక్కను పగులగొట్టినవాడు శ్రీనాథుడు. సభలో శాస్త్రార్థమునకు మొదలు పెట్టుచూ శ్రీనాథుడు:

> "వేదార్థంబుల వాదమో కవితలో
> వీణాశ్రుతుల్ నించుటో
> లేదా తర్కమో నీతిసూత్రముల
> నాలింతో మరేదో వృథా
> గాదా కాలము నూరకున్న
> సెలవీగా వేడెదం డిండిముం
> డేదన్నం సరె సిద్ధమే పగుల
> వేయింతున్ ప్రభూ ఢక్కలన్."

అని ఢీకొన్నాడు. గెలిచినాడు. ఢక్కను తుక్కు గావించినాడు. కన్నడాస్థాన పండితుని గెలుచుటకు, అన్నిటనూ అతనికన్న మెరుగై యుండవలయునుగదా ? శ్రీనాథునకు కన్నడము రాదనుటయెట్లు? శ్రీనాథుడు శైవమతాచారసారథ్యగుడు. అనాటికి శైవ మత ప్రదీప్తిదములైన మహాకావ్యములు శాఖోపశాఖలుగా కన్నడభాషలో పెరిగి, చిగురించి కుసుమించి, ఫలించినవి. ప్రౌఢరాయల ఆస్థానమున అనేకులు శివ

కవు లుండినారు. అట్టియెడ శ్రీనాథునకు కన్నడ పరిచయం వుండకపోదు. "కర్ణాటదేశ కటక పద్మవన హేళి శ్రీనాథభట్టసుకవి" అని కాశీ ఖండమున చెప్పుకున్నాడు. రామగిరి దుర్గమునకు అధీశ్వరుడుగా నున్న తెలుగు రాయడను ఒక ప్రభునిదర్శించి ఆశీర్వదించు పట్ల:

"స్ఫాటీ ఘోటక రత్నఘట్టన మిళద్ద్రాఘిష్ఠ కల్యాణ
ఘంటాటంకార విలుంఠలుంఠిత మహో
న్మత్తాహితక్షోణిభృ త్కోటీ ఘోటకసంభినీ
ధర సముత్కూటాటవీ ఝూటకర్ణాటాం
ధ్రాధిప సాంపరాయని తెలుంగా నీవు
దీర్ఘాయువౌ"

అని అనుటవలన శ్రీనాథుడు కన్నడ ప్రభుల ఆస్థానములను సైతము విద్యావీర విహారము చేసి కనకతావీణను సాధించినట్లు స్పష్టమగుచున్నది. ఇది స్పష్టమగునపుడు అతనికి కన్నడం తెలియదని తీసివేయుటెట్లు? కాశీఖండమున అన్నపూర్ణ విశాలాక్షి వేదవ్యాసునకు భోజనము వడ్డించునప్పటి వర్ణనలో తనకిష్టమైన తాను రుచి మాచిన వివిధ దేశముల శాక పాక పదార్థములను పిండివంటలను, ఇడ్డెనలు, రొట్టెలు, గుగ్గిళ్లు, చారులు సైతం వదలక నోరూరునట్లు వర్ణించినాడు. కన్నడ రాజుల ఆస్థానంలో కన్నడ పండితులను గెల్చినాడన్న కన్నడమువచ్చి తీరవలెనన్న దృష్టాంత మేమి? సంస్కృతమున వాదించి యుండరాదా? అనవచ్చును. అంతమాత్రమున నే శ్రీనాథుడు నిలచియుండిన యెడల యీ ఆక్షేపణ సహేతుకమైనదే కాగలదు. కాని శ్రీనాథుడు కేవలం రాజసభలనుటుకే నిలచిపోలేదు. సామాన్యుల గ్రామపు పౌరోహితుని, కుమ్మరి, కమ్మరి, కంసాలి వారలతోనూ పరిచయం చేసికొని వారింట్లలో వసించి వారి లిండ్లను భుజించినాడు అన్నపుడు వారికి మాతృభాషయైన కన్నడము నేర్వనిది శ్రీనాథుడు యెటుల నెగ్గగలిగినాడు? కన్నడ దేశమున తాబడిన బన్నములను చాటువుల ద్వారా యెటుల చాటినాడో చిత్తగింపుడు.

'కొల్లాజుట్టితి కోక గట్టితి మహోకూర్పాసముం దొడ్గితిన్ వల్లెల్లిన్ దిలపిష్టముక్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపగా చల్లా అంబలి ద్రావితిన్ రుచులు దోసంబంచు పోనాడితిన్ తల్లీ కన్నడరాజ్యలక్ష్మీ! దయలేదా నేను శ్రీనాథుడన్.

అని చెప్పుటవల్ల అతని లౌకిక జీవిత కారణంగా బహుభాషా పరిచయ మున్నట్లు తెలియుచున్నది.

కాకతి ప్రతాపరుద్రుని ఆస్థానంలో రాఘవాంకుడను కన్నడకవి హరిశ్చంద్రచరిత్ర రచించినాడు. ఈ గ్రంథమును ప్రతాపుని మహాసభలో చదివి చదువగా విన్న కవుల వాగ్బంధము గావించి ప్రతాపరుద్రుని చేత సత్కార మందినాడు 1251 1295 కాలంలో రంగనాథుడను కవి రామాయణమును ద్విపదలో రచించినాడు ఇతడు సంస్కృతాంధ్ర కన్నడములలో మహాకవి. శివస్తుతి చేయుచుండు కవులు బాగా 'సంగతి రగడ' అను శివభక్తిపరక కన్నడమున వ్రాసి దనములు అర్పించినా డితడని యితిహాసము చెప్పుచున్నది. పాల్కురికి సోమనాథుడు తెలుగున రచించిన ద్విపద బసవ పురాణమును అనుసరించియే 14 వ శతాబ్దపు కన్నడ బసవపురాణము షట్పదీకావ్యంగా భీమకవి అను ఆరాధ్య బ్రాహ్మణుడు రచించినాడు. 15 వ శతాబ్దపు ఆరంభమున చామరసుకవి అల్లమ ప్రభుచరిత్రను "ప్రభులింగ లీలలు" అను పేర రచియించి ప్రౌఢదేవ రాయల గౌరవమందినాడు. దీనిని కృష్ణదేవరాయలు ప్రోత్సహించి తెలుగు తమిళములలోనికి అనువదింప చేసినాడు. క్రీ॥ శ॥ 1704-1731 వరకు మైసూరు పాలించిన ప్రసిద్ధ రాజకవి చిక్కదేవరాజుల కొలువున వీరికి సామంతులూ, సైన్యాధిపతులుగా నుండిన కళలె వంశీయులు వచన రచన పెంపొందించిరి. వీరి వంశీయుడగు కళలెవీరరాజు మహాభారతమును వచనముగ తెనిగించినాడు. ఇందులో ఆదిసభాభీష్మపర్వములు లభ్యములై ముద్రితములైనవి. వీరరాజు కుమారుడు నంజరాజు సంస్కృతాంధ్ర కన్నడభాషా విశారదుడు. ఇతడు పండిత కవి మాత్రమే కాక కవిపండిత పోషకుడు. సంస్కృతమున నంజరాజ యశోభూషణము అను అలంకారశాస్త్రము యితని పేర వెలసినది.

శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానము అనేక భాషల పండితులకు ఆస్థానము. పెద్దనకవి సంస్కృతాంధ్రములే కాక యితర దాక్షిణాత్యభాషలూ బాగా యెరిగినవాడు. అతడు వ్రాసిన:

"నిరుపహతిస్థలంబు రమణీ ప్రియదూతిక తెచ్చియిచ్చు
కప్పుర విడె మాత్మకింపయిన భోజన మూయ
లమంచ మొప్పుతప్పరయు రసజ్ఞు లూహ
తెలియంగల లేఖక పాఠకోత్తముల్ దొరికిన

గాక యూరక కృతుల్ రచియింపు మటన్న
శక్యమే?

అను పద్యము యితనికి సుమారు 300 సంవత్సరములకు పూర్వముండిన మల్లికార్జునుడను కన్నడ పండితుని:

"నిరుపహతి స్థలం మృదుక రాసన మెళ్లణిసింపు దంబులం నరపిద పుస్తక ప్రతతి, లేఖక వాచక సంగ్రహం నిరంతర గృహానిశ్చితస్థితి విచారక సంగతి సత్కళత్ర సాదరతయు నుళ్ళ సత్కవియుమీసువదాగదె కావ్యవార్ధియుం"

అను దానికి అనువాదముగా కనపడుట లేదా? వీనిని మనసునందిడికొని నేటి పరిస్థితులకు అనుగుణంగా నేనూ

"నిరుపహతి స్థలంబును కనీసము నాకలివేళ కింత ఓగిరము చింకిచాపయు లిఖించుకొనన్ దగు వస్తు జాత మక్కరపడి కోర లేదనక గారవమున్ బ్రకటించు స్నేహితుల్, దొరకక యున్న నెట్టుల కృతుల్ రచియింపగ సాధ్య మీకలిన్?"

అని వ్రాసికొంటిని. ఇది కవిస్వాతంత్ర్యమును తెలుపునే కాని కవితాచౌర్య మెట్లగును?

పదునేడవ శతాబ్దిలోని లక్ష్మీసుడు అనునతడు శ్రీనాథునీ, వసుచరిత్రకారుని అనుకరించిన కన్నడ కవి. శ్రీనాథుని 'వాణీ నఖముఖరిత వీణా తంత్రీనినాద మాధుర్యం' అనుచరణమును గుర్తుంచుకొని వీణెయుం గానముం నుడిసువండది లోక వాణియుం కవితెయుం పేళిసిద నెందంకు" అని తన కవితా వీణను సారించినాడు. వసు చరిత్రకారుని :

"భావం బెక్కడ లేక వృత్తనియమాపాయంబు చింతింపకెందే వర్తించి పదార్థవంచనలచే దీపించి మూర్ఖాళి సంభావింపన్ సుకవిప్రణీత కృతి సామాన్యీకృతింబూని పై పైవన్నెల్ పచరింప దాని తిలకింపంబోరు ధీరోత్తముల్."

అను దానిని మనసులో నుంచుకొనే

"పారదె పదార్థముం వరయతిగె భంగముం
తారద్దె నిజాన్వయ క్రియగగ్గళె దూషణం
బారదె విశేష గుణకళా గౌరవం
తీరద్దె దురక్తి గగ్గె...అనుదానిని
వ్రాసినట్లు ఛాయలు కనపడుచున్నవి.

ఇక వేమన్నను చూచిన సర్వజ్ఞుని చూచినది లేదు అన్నంత రచనా సామ్యం వారిరచనల్లో ప్రతిబింబించును. ఉభయులూ శైవభక్తులు కాని వేమనలో హాస్యమూ, సర్వజ్ఞునిలో ఆవేశమూ మాత్రము యెక్కువపాళ్ళలో నున్నవి. సామాన్యప్రజా హృదయములలో శాశ్వతంగా అధిష్ఠించిన వారు కన్నడాంధ్రములలో వీరుయిద్దరే. వీరిద్దరూ ఒకే కోవలోని వారే.

కాబట్టి, అపారములైన కావ్యసముద్రములంతు పట్టినది కాదు. కావున మనము సహనమూ, ఉచితాభిమానమూ గల మనసుతో ప్రాచీనవాఙ్మయములను చూచినయెడల కన్నడరాజులు, తెనుగుకవులనూ, తెనుగురాజులు కన్నడకవులనూ సమదృష్టితో ఆదరించి పోషించినారని, తెనుగు కవులు కన్నడ రచనలనూ, కన్నడ కవులు తెనుగు రచనలనూ చదివి, చదివి, వానిలోని అమూల్య సంప్రదాయ, భావ, పోకడలను స్వీకరించి తమ కావ్య సుందరులను సింగారించుకొనిరనియు, ఉభయభాషలలోనూ కావ్యములల్లిన తెనుగు కవులూ గలరనియు, తెనుగు కావ్యములు కన్నడములోనికి, కన్నడ కావ్యములు తెనుగులోనికి కూడ అనువదింపబడినవనియు, తోడిభాషా కావ్యములపట్ల వారు వైరుధ్యమును కనబరచక, వైవిధ్యమున్ననూ వైదగ్ధ్యము నే పూజించిరనియు, అంతమాత్రమున కన్నడాంధ్ర కవులను న్యూనత పరచుట కాదనియు, మన ప్రాచీన కవిజాతి ఆ ఉదాత్త పథాను వర్తనులై యుండిరనియు, ఉత్తమజాతి రత్నముల వంటి కవితాగుణము లెచ్చటనున్ననూ రసికుడైనాణెమెరిగిన కవి నిర్లక్ష్యము చేయక, తూష్ణీకరించక స్వీకరించుననియూ, యే కవికూడా తన సమకాలపు తనకు పూర్వపు వివిధ భాషారచనల ప్రభావముద్రపడకుండా రచనలు చేయజాలడనియూ, మాత్రమే యీ నా వ్యాసమునందలి అంతర్యము. సహృదయ విమర్శకులైన సాహితీవేత్తలలోని సరస్వతీతత్వము. నా యీ వ్యాసమునందలి అంశములకు ఆగ్రహించుకొనరని భావించుచున్నాను. భవతు.

సహనా వవతు। సహనౌ భునక్తు। సహ వీర్యం
కరవావహై
తేజస్వినా వధీతమస్తు, మావిద్విషావహై
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# ఘరానా మనుష్యులు

శ్రీ కంచి శేషగిరిరావు

* * బసవయ్య ఇంట్లో ఒకగది; మంచి ఫర్నిచరుతోటీ, గోడలమీద మంచి పటాలతోనూ నిండి వుంటుంది; అప్పలస్వామి డస్టర్‌తో బల్లలు పటాలు కుర్చీలు వగైరా తుడుస్తుంటాడు; అప్పలస్వామి, పెద్ద పెద్ద కంపెనీలలోవుండే నౌకర్ల వలె తెల్లకోటు, తలపాగా, పంచెకట్టు ధరించి వుంటాడు. తెల్లకోటుమీద, 2, 3 మెడల్సు మెరుస్తూ వుంటాయి, చీటికీ మాటికీ మెడల్సును తుడుస్తూ వుండడం, తడముకుంటూ వుండడం అప్పలస్వామికి అలవాటు; బసవయ్య విసురుగా ఆవేశంతో రంగం మీదకువస్తాడు. ఖరీదైన బట్టలు ధరించి వుంటాడు. కండువా కుర్చీ మీదకు విసిరివేసి కుర్చీలో కూలబడతాడు.

బసవయ్య: అబ్బబ్బ! ఈ పాడు వూళ్లో బతకడమే కష్టంగా వుంది.

అప్పల : ఏమొచ్చిందంటయ్యా! అంతటి ఉపద్రవం?

బస : ఇంతటి అఘాయిత్యం ఎక్కడయినావుందా అప్పలస్వామీ!

అప్పల : ఏం జరిగిందయ్యా?

బస : నాతిండి నేను తింటూ, నా మానాన నేను బ్రతుకుతూవుంటే నా సంగతే కావలసి వచ్చింది, యీ వూళ్ళోవాళ్లందరకూ.

అప్పల : ఊళ్ళోవాళ్ళకు ఇంకేంపనులు లేవ్ర కాబోలు.

బస : ఏదో పదిరాళ్ళు సంపాదించుకుని ఘరానాగా బ్రతుకుతూ వుంటే ప్రతివాడూ కళ్ళల్లో నిప్పులు పోసుకుంటున్నాడు కద. నా డబ్బు నాయిష్టంవచ్చినట్లు ఖర్చుచేస్తా. మధ్య వీళ్ళకెందుకంటా నొప్పిమురదః?

అప్పల : వుందికాబట్టి ఖర్చుచేస్తున్నారు. అయినా లోకమంతా అంతేనండయ్యా. పక్కవాడు పచ్చగావుంటే ఇవతలివాడికి కన్నెర్రగా ఉంటుందండి.

బస : కొత్త మోడల్ 'బ్యూక్' (Buick) కారు స్వయంగా నేను మద్రాసునుంచి 18,000 రూపాయలకు కొనుక్కునివచ్చానా? అది యెవరో సినిమాస్టార్ వాడుకున్న కారని. ఆ సెకండుహాండు కారును నేను చవకగా 12,000 రూపాయలకు కొనేసి కొత్తకారని చెప్పుకుంటున్నానట.

అప్పల: నిజంసంగతి వాళ్లకెందుకయ్యా? బిల్లు వాళ్ల మొహానకొట్టే తెలిసేది.

బస : అంతటితో ఊరుకున్నారా? ఆ కారును కొని తాళ్ళపల్లి జమీందారుగారిని యిమిటేట్ చేస్తున్నాడురోయ్ బసవయ్య అని కూస్తున్నారు.

అప్పల : "బ్యూక్" కారు ఆ రాజాగారొక్కరే కొని ఎక్కి తిరగాలని రాసివుందేమిటయ్యా?

బస : వేటకుక్కలు, రైఫిల్సు ఢిల్లీనుంచి బోలెడంత ఖరీదుపెట్టి తెచ్చానా? ఏమంటున్నారో చూశావా? "బసవయ్య పట్టేది పందికొక్కులనూ, కొట్టేది ఉడుతలనేకదరా! పెద్ద షికారీనని అనుకుంటున్నాడు కాబోలు" అని వొకటే వాగుడు.

అప్పల : మనింట్లోవున్న జింకకొమ్ములు, పులితోళ్లు, ఫోటోలు చూస్తేగా ఎర్రిసదవాయిలు!

బస : ఇంత అల్లరిచేస్తుంటే బతికేది యెట్లాగరా అప్పలస్వామీ!

అప్పల : (మెడల్స్ చేత్తో నిమురుకుంటూ) యెనక మా జమీందారుగారిని కూడా ఇట్లాగే ఆడిపోసుకున్నారండయ్యా. ఎవరో పులిని కాల్చి చంపితే, దానిమీద కాలుపెట్టి చేత్తో తుపాకీ పట్టుకుని ఫోటోలు తీయించుకున్నారని అన్నారండయ్యా

బస : (నవ్వుతూ) మనలోమనమాట. రాజాలంతా అంతేలెగా?

అప్పల : (సీరియస్ గా మొగముపెట్టి) తిన్న యింటి వాసాలు లెక్కపెట్టడం నేను చేసేపని కాదండయ్యా!

బస : నాకెందుకులే! మొన్న నేను మినిస్టరుగారికి డిన్నరుపార్టీ యిస్తే, పర్మిట్లు కొట్టెయ్యడానికి బసవయ్య ఎత్తులు వేస్తున్నాడని ఒకటే కాకిగోల.

అప్పల : అయ్యగారికి ఒకులు తిరుగుతూంటే పర్మిట్ల కర్మ ఏమి పట్టిందండి?

బస : నీకున్న జ్ఞానంలో పదోవంతైనా వాళ్లకుంటే బాగుపడేవాళ్లు; నేనేంచేసినా వీళ్లకేకావాలి వెనకాల సి. ఐ. డి. లను పంపుతున్నారేమో!

అప్ప : అంత కచ్చ మీమీద ఎందుకండి?

బస : ఏమో! వ్యాపారంమీద క్రిందటివారం బొంబాయి వెళ్ళేనా? మెడ్రాసులోకూడా పనివుంటే బొంబాయినుంచి మెడ్రాసుకు విమానంలో వచ్చాను. నా కర్మంకాలి నేను ఎక్కిన విమానంలోనే 'జిప్సీ' శోతి, బీనారాయ్, దిలీప్‌కుమారు యింకా ఎవరో పెద్ద పెద్ద సినిమాతారలు కూడ ఎక్కారు.

అప్ప : దానికేముందండి (మెడల్సుతడుముకుంటూ) నేనుకూడ మా రాజాగారితో విమానం! ఎక్కలేదూ?

బస : అప్పటినుండి సినిమా ఏక్టర్లందరు నా స్నేహితులని చెప్పుకుంటున్నారుట. మీసం బాకంలో తీసిన తారలఫోటోలో నా తలకాయకూడా దూర్చారుట. ఆ ఫోటో తీసినవాడు నా నౌకరా? స్నేహితుడా? నా సొమ్ము తింటున్నాడా?

అప్ప : అయ్యా! ఈ నిందలన్నీ మీ గొప్ప చూసి ఓర్వలేనివాళ్ళు వేస్తున్నారండి?

బస : ఈ ఒక్క పుకారేనా? బెజవాడలోకూడా యిదేగోల. కిందటేడు వైజయంతీమాల తన ట్రూపుతోవచ్చి బెజవాడలో డాన్సులు చేసింది తెలుసా? అప్పుడూ యింతే. మెడ్రాసు మెయిలులో సెకండుక్లాసులో కాలుపెట్టా. ఆ కాలు బెజవాడలో ప్లాట్‌ఫారమ్‌మీద దింపా. దిగేవరకు వైజయంతీమాల ట్రూపు నా ప్రక్క కంపార్టుమెంటులో వున్నట్లే నాకు తెలియదు.

అప్ప : అవునండయ్యా! అప్పుడు మీతో నేను కూడ వున్నాగా?

బస : చూడుమరి! మెడ్రాసునుంచి వైజయంతీమాల ట్రూపును బెజవాడకు తెచ్చి "డాన్సు పెర్ఫార్మెన్స్" చేయించింది నేనేనని బెజవాడలో అందరితో నేను "టాం! టాం" వేస్తున్నానుట. అనవసరంగా ఆడిపోసుకుంటున్నారురా అప్పలస్వామీ!

[ప్రవేశం కమలా దేవి—బసవయ్య రెండవ పెళ్లి భార్య; గొప్పయింటి ఆడబిడ్డ. నాజూకువి, ఖరీదువి చీరలు కట్టుకుని వుంటుంది; కోపంగా హడావిడిగావచ్చి హాండ్‌బాగ్ బల్లమీదకువిసరి కుర్చీలో కూర్చుంటుంది.]

బస : ఏమిటోయ్! బలేజోరుగావుంది వ్యవహారం!

కమ : ఆ! జోరుగానే వుందిట మీ ప్రతాపం కూడాను. మీ గొప్పలు బొంబాయికి పాకి, బొంబాయినుండి మెడ్రాసుకు ఎగుకుతున్నాయిట.

బస : (ఉత్సాహంతో) ఏమిటేమిటే! చెప్పావు కాదు! ఏమంటున్నారో చెప్పు.

కమ : ఇందాకటి నుంచి చెప్పకుంటున్నారుగా మీ అప్పలస్వామితో! అవే వూరంతా చెప్పుకుంటున్నారు.

బస : అప్పలస్వామి కాకపోతే ఈ ఇంట్లో నా మాట లక్ష్యం చేసేది ఎవరే? నా మాటంటే నే గిట్టదు నీకు. ఎప్పుడూ రుసరుసలా నువ్వూనూ.

కమ : మీ వెర్రివేషాలకు రుసరుసలాడకపోతే వూళ్లో అందరికిమల్లే పకపక లాడమంటారా ఏమిటి?

బస : ఇకేమి అల్లరి వచ్చి పడిందిరా అప్పలస్వామీ! ఇంటా బయటాకూడా.

కమ : వారికేం! అప్పలస్వామి ఒకడు మీకు. నమ్మినబంటువున్నాడుగా — మీ రహస్యాలు వాడికి చెప్పడం, వాడు ఊ కొట్టడం... వేరే పని వుంటేనా వాడికి.

అప్ప : అమ్మగారూ! (మెడలు తడుముకుంటూ) ఎవ్వరు ఏమి చెప్పినా ఇనమన్నారు మా రాజాగారు.

కమ : విను! వినడమేగా నీ పని. వేలకొలది డబ్బు అయ్యగారి వెర్రిగొప్పలకు ఆహుతి అవుతుంటే వద్దు అని ఎప్పుడేనా సలహా చెప్పేవు?

అప్ప : సేవకుడు యజమానికి సలహా చెప్పకూడదండి అమ్మగారు!

కమ : మండినట్టే ఉంది నీ సేవాధర్మం.

అప్ప : (మెడలు నిమురుతూ) సేవాధర్మంలో నేను ఇంకొకళ్లచేత చెప్పించుకునే పని లేదండి.

బస : ఏమిటి కమలా! జోరీగలాగ వాడిమీదకు లేస్తావు. పడేవాడిని, పడవలసిన వాడిని నేను ఉన్నానుగా! చెప్పు! ఈ దుమారమంతా ఎందుకో చెప్పు.

కమ : లేకపోతే బొంబాయికి వెళ్లడం, ఆ సినిమా తారలవెంట తోకలాగ తిరగడం, టీపార్టీలు డిన్నరు పార్టీలు చెయ్యడం ఏమిటండి? ఈ లేనిపోని డాబులు వెర్రివేషాలు యెందుకంటా?

బస : అదుగో! నువ్వుకూడా అల్లానే అంటావేమిటి? ఘరానా బసవయ్యగారి పేరు, సినిమా తారలకు యిచ్చిన పార్టీల్లో ఘనంగా పేపర్లలో ఫోటోలతో సహా పడుతుంటే ఎంత గొప్పగా వుంటుందో తెలుసా?

కమ : పులిని చూసి నక్క వాతలు పెట్టుకుందట.

బస : పోనీ నీవుకూడా నాతో రాకపోయావా? నువ్వే మిరా రానంటే రానన్నావు వస్తేనా "మైకా మర్చంట్" బసవయ్యగారి భార్య అని ఎంత మర్యాద చేసేవారో నీకు!

కమ : ఈ మర్యాదలతో గొప్పలతో మన సంపత్తిసిరి హారతి కర్పూరంలాగ కరిగిపోయి నా గతి అధోగతి అయితే మీకేంపోయింది?

బస : అయితే పరువు ప్రతిష్ఠలకోసం డబ్బు ఖర్చు పెట్టే తప్పా?

కమ : డబ్బు ఖర్చు పెట్టడానికి దోవా తెన్నూ, అవసరం అనవసరం వుండక్కర్లా? తనకు మాలిన ధర్మం మొదలు చెడ్డ బేరం అని ఊరికే అన్నారా?

అప్ప : మనిషై పుట్టాక, ప్రతివాడికీ కొద్దో గొప్పో గౌరవం అంటూ ఉండాలండి అమ్మగారు!

కమ : చాల్లే వూరుకో! నిన్ను అడగలేదు నేను.

అప్ప : నేను మీతో చెప్పలేదండి. అయ్యగారితో చెప్పా

బస : అబ్బ! వూరుకోవే! బుద్ధితక్కువై గొప్ప యింటి పిల్లను రెండో పెళ్లి చేసుకున్నందుకు రోజూ సతాయించి వదలిపెట్టున్నావు... ఏదో నా అంత ఎత్తుగా ఘరానాగా ఎదుగుతావనుకున్నాను గాని ఇట్లా...

కమ : ఎక్కువగా ఎగిరి రెక్కలు కొల్పోయే గుణం మా వంశంలో ఎవరికీ లేదు. నక్క ఎక్కడ నాకలోకమెక్కడ (విసురుగా ఇంటి లోపలికి వెళ్ళిపోతుంది)

బస : అప్పలస్వామీ! ఏమిటిరా ఈ గొడవంతా?

అప్ప : మీ మీద పనిగట్టుకొని ఎవరో అల్లరి చేస్తూ వుండాలండయ్యగారూ!

బస : ఇంకెవరురా? వున్నాడే వాడు! ఆ సుబ్బారాయుడుగాడే చేస్తున్నాడు యిదంతా.

అప్ప : సుబ్బారాయుడు గారూ మీరూ చిన్నప్పుడు చదువుకున్నారని చెప్పేరు గదండయ్యా?

బస : అదే మెడకు చుట్టుకుంది. ఎప్పుడో చిన్ననాటి స్నేహితుడు వాడు. ఆ తర్వాత చాల మార్పులు వచ్చాయని నేను గొప్ప వాళ్ళ అంతస్థుకు చేరుకున్నానని తెలియటల్లా వీడికి.

అప్ప : వీకోడు కదండయ్యా, గొప్పోళ్ల అలవాట్లు, ఎవ్వారాలు ఆయన కేం తెలుస్తాయి. మీ రైనా 4, 5 ఏళ్లనుండేగా తెలుసుకుంది.

బస : వీధవాడు వీధవాడిలాగా అఘోరిస్తుంటే వేచీ ఏముంది? తినుకునమ్మా అంటూ నాకు బుద్ధులు చెప్పాస్తాడు.

అప్ప : మీ మంచికే అంటూ రండి ఆయన.

బస : నా మంచి గురించి వాడు తెలియదూ? వీడు చెప్పాలా? వేసవి కాలంలో కూడ ఫ్లానల్ సూట్లు శీతకాలంలో చలువ కళ్ళజోళ్ళు 'రిమ్ లెస్ గోల్డ్ స్పెక్టికిల్స్' (Rimless Gold spectacles) వాడుతానుట. రాసేదిలేకపోయినా షీఫర్ పెన్ను 80 రూపాయల ఖరీదుది జేబులో వుంచుకుంటానుట. 'స్వాన్' పెన్ను వుంటే చాలుట గోల్డుసిగరెట్ కేసు వాడడం తప్పదంటుగట; పైగా పోయే ప్రమాదం వుందిట. ఇట్లాగే నీతులు సలహాలూను. వీడి సలహా ఎవడికి కావాలి. బోడి ముండ సలహా.

అప్ప : చేసినా చేయకపోయినా ప్రతి సలహా వినాలని అనే వారండి మా రాజాగారు.

బస : సలహా కాదు, చట్టు బంధాలు. నా గొప్ప... నా దర్జా— నా హోదా చూసి ఓర్వలేక తన తోటి వాడు ఇంత గొప్పవాడయ్యాడే అని ఓర్వలేని తనం వెళ్లగక్కడం అది. చిరిగిపోయిన సైను చొక్కాలూ వీడూను!

అప్ప : ఇంత డబ్బు మొగాన కొడ్తే నోరుమూసుకు నే నాడేమో నండయ్యా.

బస : అబ్బే! లంచాలకు లొంగే రకం కాదది. మొన్న సాయంత్రం క్లబ్బులో పేకాడుతుంటే ఎవరో పాపం ఇద్దరు బీద కాలేజీ విద్యార్థులు జీతం సహాయం చేయమంటూ వచ్చారు. ఆవేశంగా పర్సుతీసి 100 రూ|| నోటు బల్లమీద పడేసి యిద్దర్నీ చెరోక ఏభై తీసికోమన్నా. ఈ సంగతి సుబ్బారాయుడి గాడికి ఎట్లాగో తెలిసింది. ఆ రాత్రే గాలిగుమారంలాగా ఇంటికివచ్చి దుమ్ము దులుపుకున్నాడు నన్ను. "ఒరేయ్! బసవాయ్! ప్రాణావసరమని యివాళ ప్రొద్దున వచ్చి పది రూపాయ లిమ్మంటే పదీ లేదు, గిదీ లేదు, పొమ్మన్నావు, వాళ్లెవళ్లో ముక్కూ మొగం తెలియని వాళ్ళొచ్చి అడిగితే 100 రూ|| యిచ్చావు. "అపర కర్ణు డవుతున్నావులే" అంటూ నాలుగూ దులిపి వెళ్ళేడు.

అప్ప : అయ్యా! మనము ఇక్కడనుంచి మకాం ఎత్తేసి మద్రాసు వెళ్ళిపోతే బాగుంటుందండి.

బస : నాకూ ఆ ఆలోచనే వస్తోంది కాని... ఎటొచ్చీ వ్యాపారం కోసం యీవూళ్లో వుండి పోవాలిరా.

అప్ప : చిత్తమండయ్యా!

బస : (ఉస్సూరు మంటూ) ఒరేయ్! అప్పలస్వామీ! ఫలహారాలు తయారయాయేమో వంటలక్కని కనుక్కో. ఆలస్యం వుంటే ముందు కాఫీతీసుకురా. ప్రాణం పోతోంది.

అప్ప : అలాగే నండయ్యా. (నిష్క్రమణ)

[ప్రవేశం అప్పలస్వామి—ట్రే మీద కప్పు, సాసరూ, కెటిల్ వగైరాలతో; ట్రే బల్ల మీద పెట్టి, కాఫీ కప్పు సాసరూ, బసవయ్య దగ్గరకు తెచ్చి అందిస్తాడు]

అప్ప : ఫలహారాలు ఇంకా తయారవ లేదండయ్యా అందుకని కాఫీ ఒకటే తెచ్చా.

బస : (కాఫీ కప్పు అందుకుంటూ అప్పలస్వామి మెడల్స్ వేపు నిఘాయించి చూస్తాడు) అకేమిట్రా! అప్పలస్వామీ! మెడల్స్ అలా వెలా తెలా పోతున్నాయే. కొంపతీసి మీ రాజాగారు రోల్డు గోల్డుతోటో, పారిస్

గోల్డుతోటో మెడల్స్ చేయించి యివ్వ లేదు కద (వెటకారంగా నవ్వుతాడు.)

అప్ప : (కంగారు పడుతూ, రామరామ! అంతటి మాట అనకండయ్యా! జమీందార్ల దగ్గర నేను చేసిన యిరవై ఏళ్ల "సార్వీసు"కు మా రాజా గార్లు యిద్దరూ మెచ్చుకుని చేయించి యిచ్చిన బంగారు పతకాలండి యివి (మెడల్సును చూపుతాడు.)

బస : ఆ మెడల్స్ యిట్లా తే—నన్ను చూడనీ.

అప్ప : (కంగారు పడుతూ) ఎందు కండయ్యా.

బస : ఊ! ఇవ్వరా! ఇవ్వమంటుంటే!

[విచార వదనంతో అప్పలస్వామి తీసి యిస్తాడు; బసవయ్య వాటిని పరీక్షగా చూచి, చేత్తో పట్టుకుని బరువు చూచి, విరగబడి నవ్వుతాడు.]

బస : నన్ను మోసం చేస్తా వట్రా! బంగారం సంగతి తెలియని వాళ్లలో జమకట్టేశావే నన్ను? రంగూ పోయింది. బరువు లేదు. బలే రాజా గార్లురా! రోల్డ్ గోల్డ్ మెడల్ ప్రెజెంటింగ్ రాజా గార్లు! (మళ్లీ విరగబడి నవ్వుతాడు.)

అప్ప : (చెవులు రెండు చేతులతో మూసుకుంటూ) మా రాజా గార్ల నేమీ అనకండయ్యా. వారు మహారాజులు. అందరు రాజాలు నిజాయితీ గలవాళ్ళేనండి. అవసరమయితే ఆ ప్రభువులకోసం నా శరీరం ముక్కలు ముక్కలుగా కోసియిచ్చి హాయిగా ప్రాణం వదులుతానండి.

బస : ఊరుకోరా! కబుర్లూ నువ్వూను. ఎదురుగా దాఖలా కన్పిస్తుంటే.

అప్ప : (లెంపలు వేసుకుంటూ) ఆ తప్పంతా నాదేనండయ్యా! మా రాజా గారు మంచివన్నె బంగారంతోటే మెడల్సు చేయించి యిచ్చారండి,

బస : మరి యివి ఎక్కడినుంచి వచ్చాయిరా?

అప్ప : జమీందారీలు గవర్నమెంటోరు తీసుకున్నాక నా నౌకరీ పోయిందండి. పొట్ట గడవక, అమ్మలేక అమ్మలేక వాటిని అమ్మేసి, అచ్చంగా అదేమాదిరిగా వుండే నమూనాలు రోల్డుగోల్డులో చేయించుకోవలసిన కర్మం పట్టిందండయ్యా!

బస : మంచిపని చేశావు!

అప్ప : అవేమి రోల్డుగోల్డు మెడల్సా కాని, ఉత్తదిగా అండయ్యా! పైగా పత్రికల్లో "గ్యారంటీ" అని పెద్దరాతలు రాస్తారండి. మెరుగుపోయిందని తిప్పి పంపిస్తే కోటింగు వేసి పంపారండి. పదిరోజులలో మళ్ళా పోయిందండి మళ్ళాపోతే మళ్ళా పంపేనండి. ఇంక వేయమని చెప్పేరండి ఇంక యీళ్ళతో లాభం లేదనుకుని బజారులో మలామా సాయబు దగ్గర రెండు నెలల కొకసారి బంగారపుగిల్టు వేయిస్తూ వుంటానండి.

బస : ఆ సాయబ్బు ఇంత నాసిగా గిల్టు వేసేశేమిటిరా? వెలా వెలా బోతోంది. (మెడల్సు అప్పలస్వామికి యిచ్చేస్తాడు.)

అప్ప : (జాగ్రత్తగా తీసికొని తుడిచి కోటుమీద పెట్టుకుంటూ) గిల్టు వేయించి రెండు నెలలు దాటిందండి. ఆ సాయబ్బు వూళ్ళో లేడు. ఇంకో రెండు నెలలకు కాని రాడుట.

బస : పోనీ యింకో సాయబ్బుకు యివ్వలేక పోయావా?

అప్ప : అదేమిటండి బాబుగారు! మీరుకూడ అల్లా అడుగుతారు. నాకూ సాయబ్బుకు మధ్య వుండవలసిన రహస్యాన్ని మూడో వాడికి చెప్పి మా రాజా గార్ల పేరు బజారుకు యీడుస్తానా?

బస : నాతో చెప్పావుగా!

అప్ప : కర్త ప్రభువులు మీరు. పోలీసుకళ్ళు మీవి. మీ దయే వుండాలి కాని మీరు నాకు మంచి మెడల్సు చేయించి యివ్వక పోతారా?

బస : మంచిమాట చెప్పేవు. నా దగ్గర పదేళ్ళ సర్వీసు నింపనీ. అప్పుడు నీకు మేలిమి బంగారపు మెడల్సు ఎన్నో చేయించి యిస్తానో చూడు.

అప్ప : తమ కటాక్షం మండయ్యా!

బస : అయితే అప్పలస్వామీ! నాకు తెలియక అడుగుతా. ఆ మెడల్సు రోజూ పెట్టుకుని మెరుగు పోగొట్టకోడం ఎందుకురా? నేను పెద్ద పెద్ద డిన్నరుపార్టీలు, టీ పార్టీలు యిచ్చినపుడు పెట్టుకుంటే బాగుంటుంది గా!

అప్ప : అన్నీ తెలిసిన మీరే యిల్లా సెలవిస్తారేంటి బాబుగారూ! జమీందారుల దివాణంలో నేను చేసిన యిరవై ఏళ్ళ 'సార్వీసు'కు యివి ...గుర్తులండయ్యా. సేవాధర్మంలో నేను సంపాదించుకున్న గొప్ప గౌరవాన్ని గురించి చెప్పేవి యివే కదండయ్యా?

బస : కత్తి రాజలాంఛనమయితే, మెడల్సు నీ నౌకరీకి లాంఛనమన్న మాట.

అప్ప : రాజాలకు నాకూ పోలిక తేవద్దండయ్యా.

బస : అయితే అప్పలస్వామీ! నీకూ గొప్ప, గౌరవము కావాలన్నమాట.

అప్ప : తప్పకుండా కావలండయ్యా. ఎవరి అంతస్తుకు తగ్గట్టు వాళ్ళు వుండాలి. పై అంతస్తు వాళ్ళు తక్కువ వాళ్ళనుండి మన్ననలు పొందుతుండాలండి.

బస : నిజం చెప్పేవు.

అప్ప : లోకమంతా అంతేనండి! వంటలక్క ఒకసారి అడిగిందీ, "అదేమిటి అప్పలస్వామీ! మెడల్సు ఎప్పుడూ అంత మెరుస్తూ వుంటాయి. చింతపండుపెట్టి రోజూ తోముతూ వుంటావా ఏంటి" అంది. వెంటనే నే నన్నాను," చస్! నోరుముయ్! పెద్ద వాళ్ళసంగతి నీ కెందుకు. అధిక ప్రసంగం చేశావంటే అయ్యగారితో చెప్పి ఉద్యోగం ఊడపీకిస్తా" అన్నా. దాంతో కుక్కినపేను లాగ మళ్ళా మాట్లాడలేదండి.

బస : నిజమే! తక్కువవాళ్ళను అల్లాగే అణచి పెట్టి ఉంచాలి. లేకపోతే బతకనిస్తారా. అయితే అప్పలస్వామీ! నేనుకూడ గొప్పగా, గౌరవంగా బ్రతుకుతున్నా నంటావా?

అప్ప : యజమానుల సంగతి సేవకులు చెప్పకూడదండయ్యా!

బస : (నవ్వి) బలేవాడివిరా నువ్వు!

[కమలాదేవి ప్రవేశం]

కమ : (అధార్టీగా) అప్పలస్వామీ! బాతాఖానీ కట్టిపెట్టి ఫలహారాలు తయారయాయేమో కనుక్కో. అయితే తీసుకురా. మర్చిపోయా, ఇదిగో ఉత్తరాలు- ముందు వీటిని పోస్టులో వేసి తర్వాత టిఫిన్ సంగతి చూడు.

అప్ప : చిత్తమండమ్మా! (అప్పలస్వామి నిష్క్రమణ).

బస : అయితే కమలా! నువ్వు ఒక్కత్తెవు, మేడ మీద పడుకుని ఆ పుస్తకాలు పత్రికలు చదువుకోకపోతే నాకుకూడ చదివి వినిపించరాదూ? హాయిగా వింటాను.

కమ : ఆ! వింటారు! మీ కర్థం అయితేగా. అయినా పుస్తకాలు విజ్ఞానం మీ వంశంలో వారికి కావాలేమిటి?

బస : పోనీలే ఇందాకటినుంచీ నేను ఇంత గొడవ పడుతున్నాగదా, ఏదో కాస్త నాకు సలహా ధైర్యం చెప్తే?

కమ : నా సలహాలు మీకు నచ్చుతాయేమిటి?

బస : డబ్బు ఖర్చుపెట్టవద్దనేగా నువ్వు చెప్పే సలహా. డబ్బులేదో, లేదో, బీదవాళ్ళం అంటూ మొదటి పెళ్ళాం చచ్చింది. ఇంత డబ్బు, ఇంత ఆస్తి ఆ తర్వాత సంపాదించి, నిన్ను పెళ్ళి చేసుకుని, యివన్నీ అనుభవించమంటుంటే డబ్బు ఖర్చు అవుతుందని అస్తమానం ఏడుపా? బాగుంది మేళం!

కమ : మహా మీరు నా కోసం ఖర్చుచేస్తున్నారు కాబోలు.

బస : నీకు నేను ఏం తక్కువ చేశానో చెప్పు. రవ్వల నెక్ లేసు చేయించలేదా? డయమండ్ రింగ్ చేయించలేదా? ఏడాదికి యిరవైపట్టు చీరలు కొనడంలేదా? కావలసిన పుస్తకాలన్నీ కొని యివ్వడంలేదా? ఇంకా ఏం కావాలి?

కమ : అవన్నీ మహా పెద్ద ఖర్చా ఏమిటి? మీ వెర్రి గొప్పలకు, పటాటోపాలకు చేసే ఖర్చులో ఎంత?

బస : నువ్వు అదేమాట. నేను చేసే వెర్రి ఖర్చు లేమిటో చెప్పు.

కమ : పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్నట్లు, లేనిపోని గొప్పలకు ఎగరడం డబ్బు తగలేసు కోవడం ఎందుకంటా? ఇందులో మీకు ఒరిగే దేముంది?

బస : డబ్బు యింత సంపాదిస్తున్నందుకు ఘరా నా గా అనుభవించక యినుప పెట్టెలో పెట్టి పూజచేస్తూ కూర్చోమంటావా?...అయినా ఖర్చు ఎంత ఎక్కువగా వుంటే, అంత ఎక్కువగా డబ్బు సంపాదించడానికి ఉపా యాలు కూడా కనబడతాయి.

కమ : వెర్రి ఎక్కువయితే జరిగే పిచ్చి పనులేయివి! మా వంశంలో వా రెవరూ యిటువంటి వెర్రి గొప్పలకు ఎగబడలేదు. అందుకనే వంశం చూసి పెళ్ళి చేసుకోమన్నారు.

బస : అయితే అంత గొప్పవంశం దానివి నన్నెం దుకు చేసుకున్నావు.

కమ : నేను చేసుకున్నానా ఏమిటి? మా నాన్న బలవంతాన అంటగట్టేడు, ఈ సంబంధం. దానధర్మాలు ఎక్కువై, ఆస్తిఅంతా నాశన మయిపోయి మా సంసారం అంతా చితికి పోతే, డబ్బున్న వాడికిచ్చి పెళ్ళిచేస్తే సుఖ పడతానని మానాన్న యీ పెళ్ళి చేశాడు.

బస : ఆయనంత ఆలోచించి యీ పెళ్ళి చేస్తే హాయిగా యిక్కడ సుఖపడక మరి రోజూ ఏడు పెందుకు?

కమ : ఆ! ఇంట్లో ఈగలమోత. బయట పల్లకీల మోతలాగా వుంది, సుఖపడడం.

బస : (పై వాక్యంలోని సంగతి అర్థం చేసుకో కుండా) ఈగలను, దోమలను చంపడానికి ఫ్లిట్ (Flit) తెచ్చేగా!

కమ : (విసుగా) ఆ! ఫ్లీట్ వచ్చింది, బ్యాంకు మానేజరూ వచ్చాడు, షావుకారూ వచ్చాడు.

బస : ఆ! ఆ! వాళ్లెందుకు?

కమ : బ్యాంకులో మన ఎకౌంటులో డబ్బులేదనీ బ్యాంక్ మేనేజరు, ఇల్లు కరా రావుడి అవు తుందని షావుకారు చెప్పడానికి వచ్చారు.

బస : తలకు మించిన ఖర్చు చేస్తున్నానా, ఏమిటి చెప్తావ్?

కమ : దేనికి మించి చేస్తున్నారో నా కెందుకు? 'ఓవర్ డ్రాఫ్ట్' కట్టలేదని చెప్పే బ్యాంకు వాళ్ళకు, ఇంటి తాకట్టుమీద వడ్డీ కాదు అసలును అడుగుతుంటారని చెప్పే షావు కారుకు ఏమి సమాధానం చెబుతారో చెప్పు కోండి.

బస : ఆ! వాళ్ళల్లాగే భయపెడ్తారులే. ఉన్నాదే వెయ్యమన్నారు, వెండికొండా?

కమ : ఆరిపోయే దీపం భగ్గుమంటుందట లెండి. కాగడాయే కాలుస్తారో, మునకలే ఇలిగి స్తారో నా కెందుకు? నేను మా పుట్టింటికి పోతా.

బస : భయపడకే పిచ్చిదానా! గొప్ప వంశప్ర దానికి భయమా లేమిటి? అయినా 'ప్రొహి బిషన్' వున్నంతకాలం మన సిగ్గుపాప్రు వాడదనుకో.

కమ : ప్రొహిబిషన్ కూడా పోతోందటలెండి.

బస : అయినా ఫర్వాలేదులే. కావాలంటే ఇప్పుడు నా పలుకుబడితో లక్ష రూపాయిల అప్పు చిటికెలమీద పుట్టిస్తా.

కమ : అందుకనే అప్పుచేసి పప్పుకూడు తిన మన్నారు.

[ప్రవేశం అప్పలస్వామి]

అప్ప : ఉత్తరాలు పోస్టులో వేశానండి అమ్మగారు. ఫలహారాలు తయారవుతున్నాయి. అయిదు నిమిషాల్లో పట్టుకు వస్తా.

కమ : సరేలే! ఇందాక చెప్పడం మరచిపోయా. ఆ టైలరు నా జాకెట్లు కుట్టాడో లేదో...

అప్ప : నేను కనుక్కున్నానండి అమ్మగారు. ఇంకా తయారవలేదుట.

కమ : 'క్లాత్' యిచ్చి నెల రోజులు దాటింది యింత ఆలస్య మేమిటి?

బస : ఊళ్లో కల్లా ఫ్యాషనబుల్ గా కుట్టే టైలరు అతను. ఆలస్యం అయితే ఏమిలే, మంచి పసందుగా కుట్టాడులే.

అప్ప : మా రాజా గారి దివాణంలో ఒక జైలరు వుండేవాడండి. పెళ్లికని బట్టలు యిస్తే బార సాలకు అందజేశేవాడండి.

కమ : ఆ సంగతి మీ అయ్యగారితో చెప్ప సంతోషిస్తారు.

అప్ప : చెప్పటం మర్చిపోయా. రోడ్డుమీద చాటింపు వేస్తున్నారండి.

కమ : ఏమని? (అప్పలస్వామి బసవయ్య వేపు తిరిగి).

అప్ప : ఈ సంగతి అయ్యగారితో చెబుతున్నానండి అమ్మగారు.

బస : వాడమెందుకు అప్పలస్వామీ చాటింపు ఏమని?

అప్ప : ఇవాళ పొద్దున్న ఆ డెవడో దొంగ, తాలూకా ఆఫీసు జైలు గోడలు దూకి పారిపోయాడుటండి. అడు బలే గట్టివాడుట అందరినీ జాగ్రత్తగా వుండమని, ఆడి ఆచూకీ తెలిపితేగాని, పట్టుకుంటేకాని 'గవర్నమెంటోరు' మంచి బహుమానం యిస్తారుటండి ఫలహారాలు తెస్తా (నిష్క్రమణ)

బస : దొంగ వెధవ లెక్కువైపోయారు దేశంలో.

కమ : కరువిట్లా మండిపోతుంటే దొరలే దొంగలవుతున్నారు. పాపం జైలు కెళ్లేది బీదవాళ్లే!

బస : గొప్పవాళ్లు దొంగతనాలు చేస్తారంటే నేను ఒప్పుకోను. అవి చేసేవన్నీ తప్పు వరకాలే. వాళ్లకు నీతి నియమాలుంటాయి.

కమ : పాపం! దొంగ ఎంత బెదిరిపోతూవుంటాడో. పోలీసు ఎక్కడ దాపురిస్తాడో అని అరచేతుల్లో ప్రాణం పెట్టుకుని, బిక్కు బిక్కుమంటూ, నక్కి నక్కి తిరుగుతూ...

బస : మరేం ఫర్వాలేదులే! రేపు వాడంతటవాడే పోలీసు స్టేషనుకు హాజరు అవుతాడులే. బయటుంటే బువ్వ ఎవడు పెట్తాడు? జైలు కెళ్తే పులుసు ముద్దలు గంజీ తాగొచ్చు.

కమ : పాపం! దొంగ ఎంత కంగారు పడుతుంటాడు. నాకు ఎదురైతేనా, మన కారులో ఎక్కించి, మనింటికి తెచ్చి, దాచి సద్దు అణగగానే పంపించి వేస్తా.

బస : నీకేమన్నా మతిపోయిందా ఏమిటి? 'లా' అంటే భయం భక్తీ వుండక్కర్లా? సహాయం చేశావంటే, నిన్నూ వాడిని కలిపి జైలులోకి తోస్తారు.

కమ : దయా దాక్షిణ్యాలు మీ వంశంలో వుంటేనా? కడుపు కక్కుర్తి కోసం వాడు దొంగగా తయారవుతే తప్పు వాడిదా? సంఘానిది, గవర్నమెంటుది.

బస : ఆ మీమాంసలన్నీ నాకెందుకు? 'లా' అండ్ 'ఆర్డర్' అంటే నాకు గౌరవం వుంది. వాడు నాకు దొరికితేనా, పట్టుకుని అప్పచెప్పి బహుమతి కొట్టేస్తా.

కమ : (కోపంగా) అయితే బయలుదేరండి ప్రారంభించి వెతకడానికి.

బస : మొగంచూచి దొంగ ఎవడో నేను యిట్టే చెప్పేస్తా? మెడ్రాసులో నా పర్సు కొట్టేసిన వాడిని చిటికలో పట్టుకున్నా.

కమ : పర్సులో పదిరూపాయలేగా వుంది మీరు చేసే ఖర్చులో ఎన్నోవంతు.

బస : పదిరూపాయలు కాదు పది దమ్మిడీలున్నా సరే దొంగతనం దొంగతనమే. శిక్షపడాల్సిందే!

[తోటమాలి హడావిడిగా లోపలికి వస్తాడు.]

తోట : అమ్మగారండీ! అయ్యగారండీ! ఎవడో మన తోటగోడ దూకి అడ్డొస్తే నన్ను తోసేసి ఇంట్లోకి దూరేడండి.

కమ, బస: వాడు దొంగే అయివుంటాడేమో?

బస : ఫర్వాలా! నేనున్నా! వీడి పని నేను పట్టిస్తా.

[తోటమాలి నిష్క్రమణ]

[ప్రవేశం రాజా ప్రతాప్ పచ్చగా అందంగా వుంటాడు. ట్రౌజర్, షర్ట్ తొడుక్కుని వుంటాడు. బట్టలు నలిగి జుట్టు రేగివుంటాయి. ప్రవేశించి తలుపు నెమ్మదిగా మూసి చేతులు దులుపుకుంటూ ఠీవిగా ముందుకు వస్తాడు.]

రాజా : (కమలాదేవి వేపు తిరిగి) భార్యాభర్తల ఏకాంతమునకు విఘాతము కల్గించినందుకు క్షమించాలి.

బస : ఎ......ఎవ......ఎవఁడా నువ్వు?

రాజా : కంగారుపడుతూ మాట్లాడకండి. కంగారు పడే వాళ్ళను చూస్తే నాకు మా చెడ్డ చిరాకు.

బస : ఎవడవురా నువ్వు? ఏమిట్లో పెద్ద కబుర్లు చెబుతున్నావు. దొంగచాటుగా దూరేవు యింట్లో.

రాజా : దొంగచాటుగా కాదులెండి. దొరచాటుగా నే.

బస : (ముందుకువచ్చి) ఎవడవురా నువ్వు? చెప్పు! దొంగవా? దొరవా?

రాజా : మీ నోటితో నే చెప్పేరు గదండీ!

బస : అయితే......అయితే నువ్వు దొంగవే అన్నమాట. చాటింపు వేయించింది నీగురించే అన్నమాట.

రాజా : చాటింపు చేయకపోయినా మీ ఆతిథ్యం స్వీకరించడానికి వచ్చేవాళ్ళమే లెండి.

బస : దొంగ వెధవకు ఆతిథ్యమేమిటి? నువ్వేమైనా కలెక్టరువా? మినిస్టరువా? గవర్నరువా? వెళ్ళు. వెళ్ళకపోతే 'రైఫుల్' తెస్తా.

రాజా : ఇదిగో! దొంగ దొంగ అని ఇంకా ఎక్కువగా అనకండి. మేము దొంగ అని ఇంకా ఋజువు కాందే? ఉత్త అనుమానం మీద అట్టే పెట్టేరు అంతే.

బస : ఊరికే గడ్డిగా తోసేరేం జైల్లో? పాపం! భలే కబుర్లు చెబుతున్నావు. ముందుకునడు. అప్పలస్వామీ! నా రైఫుల్ తే.

రాజా : రైఫుల్ కాదు మాకు కావాల్సింది, మంచి వేరే బట్టలు. అవి యిచ్చారంటే ఆ తర్వాత మీకు 'రైఫుల్ షూటింగ్'లో కొత్తపాఠాలు నేర్పుతాం? (బసవయ్య దగ్గరకువచ్చి) వా! సిల్కు దోవతీ, సిల్కుషర్టూ చాలా ఖరీదైనబట్టలు కట్టుకున్నారు. బట్టలు పసందు చేయడం బాగా తెలుసు; 'చెల్లారామ్స్'లో కొన్నారా?

బస : (తగ్గి) ఆ!...అవునవును. చెల్లారామ్స్‌లో నే ఎప్పుడూ బట్టలు కొంటూ నేను.

రాజా : మా ఆస్థానం అంతటికీ చెల్లారామే బట్టలు సప్లయి చేస్తాడండీ.

బస : నిజం!

కమ : ఏమిటండీ ఓడిల్లో ఖాతాఖానీ. అప్పల స్వామిని పిలిచి బయటకు గెంటెయ్యండి.

బస : బట్టల్లేవు, గిట్టల్లేవు. ఛా!

రాజా : ఊరికే, వరహా ధర్మంగా, 'ఫ్రీ'గా, 'ముఫ్త్'గా వద్దు లెండి ఎరువుగా యివ్వండి అంతే. రాజాప్రతాప్ తీసుకునే ప్రతివస్తువు ఎరువుగానే అని తెలుసుకోండి. కావలసినప్పుడల్లా తీసుకున్నవి వాపసు చేస్తా వుంటాము.

కమ : ఓ డొక రాజాట! ఇదో గారాసం. ఎరువు పేరు పుంటే మరి నిన్ను దొంగగా ఎందుకు జమ కట్టారు.

రాజా : అభిప్రాయభేదమండి. ఎరువు వస్తువులు వాపస్ చేయడానికి నాకు తగినంత వ్యవధి వీలు, టైము, ఛాన్సు, యిస్తేనా? వడ్డీతో సహా తిరిగి యిచ్చేస్తానంటే వింటేనా. (కమలాకేసి వేళ్ళకు రెండడుగులు నడచి) ప్రపంచంలో కొంతమందికి అవసరాన్ని మించి డబ్బు యిచ్చాడండి దేవుడు. రాజమ్రాన్ రాణీగారు వుంది చూశారూ. ఆవిడకు డబ్బు ఎంతుందో ఆ విడకే తెలియదు. ఆవిడకు చాలా ఖరీదైన మంచి ముత్యాలహారం వుంది. లక్ష రూపాయలు ఖరీదు చేసే ఆ హారం ఎక్కడపడితే అక్కడ వదిలి వేస్తుంటుంది ఆ విడ. ఎందుకో తెలుసా? అంత ఖరీదు వస్తువైనా తనకు లెక్కలేదని, తన గొప్ప అంత అని అందరికి చెప్పుకోడానికి.

కమ : ఆ రాణీగారి గొడవ మాకెందుకు? ముందు బయటకు నడు.

రాజా : ఆగండి చెప్పేది వినండి! మొన్న ఆదివారం మద్రాసులో గవర్నర్స్ గార్డెన్ పార్టీ జరిగింది. రాణీగారు బల్లమీద హారం పారేసి విహారం చేస్తున్నారు. ఇదుగో చెప్పకూడదు కాని ఆవిడ మా మేనత్తే లెండి! అప్పుడు చూచేవారు లేక, దిక్కులేకుండా పడి

వున్న ఆ హోరాన్ని సద్వినియోగం చేయడానికి మేము ఎతువు తీసుకున్నాం. అంతే! వినియోగం చేసే లోపల పట్టుకుంటే, అది నా బిజినెస్‌కు 'ఇన్వెస్టుమెంటు' అని, డివిడెండ్లు, బోనసులు, రాణీగారికి యివ్వబోతున్నవి, పోలీసులతో చెబితే వాళ్లు వింటేనా! అబ్బే! పోలీసువాళ్ళకు బిజినెస్ సంగతి ఏం తెలుస్తుందండి?

కము : (బసవయ్యతో) ఈ దొంగతనం సంగతి మా అన్నయ్య నాకు ఉత్తరం రాశాడని మీతో చెప్పలేదండీ?

బస : ఏం చెప్పానో ఎవడికి జ్ఞాపకం?

రాజా : రాశారా? మీరు కూడా మా అంతటివారు. గొప్పవాళ్ళ సంగతులు ఎప్పటి కప్పుడు మీకు కూడా తెలుస్తూ వుంటాయి.

కము : గార్డెన్ పార్టీకి పిలువబడ్డ అతిథులలో నే దొంగ వున్నాడని, తీసినవాడు అదేదో జమీందారుగారి పెద్ద కొడుకై వుంటాడని అందరు అనుమాన పడుతున్నారని కూడ మా అన్నయ్య నాకు రాశాడండీ.

బస : (ఆశ్చర్యంతో) రాజా వేపు చూస్తూ ఆ! ఏమిటి! అయితే నువ్వు....కాదు... మీరు జమీందారుగారి పుత్రులన్నమాట. చెప్పేరు కాదు.

రాజా : ఇప్పుడు మేమున్న పరిస్థితులలో జమీందారులమనే సంగతే మరచిపోతున్నాము (బసవయ్య వద్దకు వచ్చి చొక్కా పట్టుకుని చూచి) మీరు మా వాదిరిగానే మంచి ఫాషన్‌గా వట్టలు కుట్టిస్తుంటారు. మనిద్దరికీ చొక్కాల సైజు యించు మించుగా ఒకటే. మంచిచొక్కా, మంచి ధోవతీ యిచ్చారంటే మేము తిరిగి రాజాప్రతాప్ అవుతాము.

బస : అప్పల స్వామీ!

కము : అప్పలస్వామి రాగానే యిద్దరుకలిసి ఈ దొంగ వెధవను పోలీసుల కప్ప చెప్పండి.

[ప్రవేశం అప్పలస్వామి]

రాజా : (బసవయ్య యొక్క రిస్టువాచి చూస్తూ) రోలెక్స్ ఆయిస్టర్ (Rolex Oyster) సాలిడ్ గోల్డు (Solid gold) రిస్టువాచ్ ఫస్టుక్లాసు సెలక్షన్ చేశారు. యుద్ధం ముందు వెయ్యి రూపాయలకు కొన్నాం మేము.

బస : (తన రిస్టువాచి చూడముని మహదానందం పొందుతూ) మీకు పరిశీలన దృష్టి బాగా వుంది రాజాగారూ! నేను 1600 రూపాయలు పెట్టి దాన్ని కొన్నాను లెండి. చవక పారు వాచీలు నాకు నచ్చవు రాజాగారూ!

రాజా : మనిద్దరి గుణాలు ఒకటేనండి. (అప్పలస్వామి వేపు తిరిగి) అప్పలస్వామీ! బట్టలు బీరువా వేపుకు పోవతియ్యి!

బస : అప్పలస్వామీ! రాజాగారిని మేడమీదకు తీసుకువెళ్ళి నా గా(డెజ్ ఆల్మైరాలోనుంచి రాజాగారికి కావలసిన మంచిపట్టు పంచె యిచ్చి వారు విడిచిన బట్టలు లాండ్రీకి పంపించు.

అప్ప : (ఉత్సాహముతో) అట్లాగే సండయ్యా!

కము : మీకేమన్నా మతిపోయిందా ఏమిటి? 'లా' అంటే గౌరవం భక్తి వున్నాయని యిప్పుడేగా చెప్పింది. వాడేదో గొప్పగా నాలుగు కల్లబొల్లి కబుర్లు చెప్పేసరికి వాడి వలలో పడ్డారే. మీరు నేత కాకపోతే నేనే వెళ్ళి పోలీసులను పిలుచుకువస్తా.

బస : పోలీసులను పిలుచుకు వస్తావూ? నీకే మతి పోయింది. ఇప్పుడేగా అన్నావ్? దొం.... కాదు ఆయన దొరికితే రక్షిస్తానని.

రాజా : దొంగ అని మమ్మల్లను పిల్వడానికి సంకోచించుతారెందుకండీ? దొంగకాదని యింకా 'జ్యూరీ' చెప్పలేదుగా?

బస : రాజాగారూ! మీరు దొంగతనం చేశారంటే నేను నమ్మను. కూటికి లేనివాళ్ళే దొంగతనాలు, దోపిడీలు చేస్తారు.

రాజా : మామీద మీకు వున్న ఆదరాభిమానాలకు యివే నా ధన్యవాదాలు. భార్యా భర్తల ప్రణయకలహం ధాన్యపు గింజలో బియ్యపు గింజ అన్నారు...ఊ! పదరా! అప్పలస్వామీ! మనమెందుకు ఇక్కడ. (ఇద్దరు నిష్క్రమణ)

కమ : ఇంత బోల్తా తింటారని, ఇంత అవమానకరంగా, ఇంత పిరికితనంగా ప్రవర్తిస్తారని నేనెప్పుడూ అనుకోలా?

బస : నువ్వే బోల్తా కొట్టేవు.

కమ : నేను కాదు మీరే దొంగ దొరికితే పోలీసు స్టేషన్లో అప్పగిస్తానని డప్పాలుకొట్టి, తీరా దొరికితే వాడి మాటలకు మైనంలాగా మెత్తపడ్డారు.

బస : నువ్వు వెలగబెట్టిం దేమిటోయ్ మహా! దొంగను దాచి రక్షిస్తానని చెప్పి తీరా వస్తే పోలీసులకు అప్పచెప్తానంటున్నావు. మాట తప్పడం గొప్ప వంశలక్షణం కాబోలు!

కమ : దీనవాడు, దరిద్రుడూ అయితే తప్పకుండా రక్షించేవాణ్ని. ఇటువంటి మోసగాణ్ని వంశ మర్యాదలు గంగలో కలిపేవాడినా?

బస : వూరుకో! రాజాగారు మోసగాడు ఏమాత్రం కాదు. కష్టదశలో వున్నాడు అంతే. ఆ మాటలు...ఆ ఠీవి ... ఆ దర్పం... ఆ గ్రహింపు ఆ మర్యాద...అహహ! మామూలు వాళ్ళ కెట్లా అలవడతాయి?

కమ : రాజాగారు మనింటికొస్తే నాకేమీ ఒళ్ళు పరవశ మవడంలేదు. గంగ వెర్రులెత్తటం లేదు...అసలు వాడు రాజా కాదేమో? అన్నీ అబద్ధాలేమో!

బస : (తన్మయత్వంలో) అహహ! రాజాగారి కొడుకు మనింటికి రావడం, మన...కాదు, కాదు, నా సహాయం పొందడం ఎంత గొప్ప? ఎంత పేరు? రాత్రికి భోజనానికి వుండమంటా.

కమ : దొంగలను యింట్లో దాస్తున్నామని మా అన్నయ్యకు తెలిస్తే వాడు మనింటి గడప తొక్కడు. తెలుసా?

బస : మహా యిప్పుడు తొక్కుతున్నాడు కాబోలు.

కమ : ఈ మాటు వస్తే మనిద్దరినీ జైల్లో పరామర్శించుతాడు లెండి, వాడిని ఉద్ధరించినందుకు.

భస : కష్టకాలంలో మనం సహాయంచేస్తే, ఆ సంగతి బయట పెట్టేటంత అల్పుడనుకున్నావేమిటి, రాజాప్రతాప్! ఎప్పటికీ అట్లాంటి పని చెయ్యడు. వంశం, వంశం అంటూ వాగుతూ వుంటావు గొప్పవంశపు రాజా వస్తే మర్యాద చేయడమైనా తెలియదు నీకు.

కమ : నేను చేసే మర్యాద ఏమిటో తెలుసా? చేతులకు సంకెళ్ళు వేయించి సత్కరించడం.

[ప్రవేశం రాజాప్రతాప్ తల దువ్వుకొని, మొగం కడుక్కొని, సిల్కుపంచె, చొక్కా, కండువాతో]

రాజా: : (బసవయ్య వేపు తిరిగి) అపూర్వాదరణ చూపిన మీకు యివే నా నమస్కృతులు!

బస : అబ్బెబ్బే! అంతమాట అనకండి మీనుంచి నమస్కారాలు పొందేటంత గొప్పవాణ్ని కాదు

రాజా : (బల్లదగ్గరగా వున్న చెప్పులజత చూసి అటు నడుస్తూ) ఉన్నమాట చెపితే తప్పేమిటండి. ఆశ్రితరక్షణ సామాన్యులు చేయగలిగేపనా? ఆనాడు గయునికి అర్జునుడూ, ఈనాడు నాకు మీరు చేయగల్గారు.

[చెప్పులు తొడుక్కొని గోడమీదవున్న 'పెయింటింగ్' వేపు నడుస్తూ]

ఓహో! చాల గొప్ప 'పెయింటింగ్'; అద్భుతమైన ఆర్టు వుంది దీంట్లో, ఎవరో చాల గొప్ప ఆర్టిస్టు దీనిని చిత్రించివుండాలి.

బస : 'ఆర్టు' అంటే నాకు కొద్దిగా యిష్టముండండి రాజాగారూ! ఆర్టు ఎగ్జిబిషన్లో రు. 1116 పెట్టి కొన్నానండి దీన్ని ?

రాజా : రవివర్మ గీసిన అసలు చిత్రాలు మాకోటలో వున్నాయండీ; ఆమాటకువస్తే, మీ యిల్లుకు మాకోటకు చాల పోలికలున్నాయి.

బస : ఇవాళ కట్టే రేపు పడిపోయే యిళ్ళు మాకు నచ్చవండి ఏదైనా హుందాగా చెయ్యాలి.

రాజా : గొప్పవాళ్ళ బుద్ధులు అట్లాగే వుంటాయండి. (బట్టలు చూచుకుంటూ) మాకు నచ్చే బట్టలు దొరికాయండి. మీరు మాకు చేసిన గొప్పసహాయంగురించి రేపే మా తమ్ముడుగారికి ఉత్తరం రాస్తా. ఆయన అమెరికాలో 'టూరు' చేస్తున్నారు. టూరు

నుంచి రాగానే వారు సరాసరి మీయింటికి స్వయంగా పెద్దకారులో వచ్చి తమ ధన్యవాదాలు మీకు తెలియజేస్తారు.

బస : అంత మహాభాగ్యమే !

రాజా : కృతజ్ఞత మాపట్లంకూడ గొప్పదనే? (అప్పలస్వామిని చూపిస్తూ) బలే నౌకరును సంపాదించారండి. మాకు ఏ బట్టలు నచ్చుతాయో, యిట్టే గ్రహించి, ఆ బట్టలుతీసి మాకిచ్చాడు. ఈ మాటు మీ యింటికి వచ్చినపుడు అప్పలస్వామిని తీసుకుపోతాము.

బస : అప్పలస్వామికి రాజాగారిదగ్గర యిరవై ఏళ్ళ సర్వీసు వుందండి.

రాజా : అల్లా చెప్పండి; అందుకనే అంతసులువుగా మా మనస్సు కనిపెట్టేడు.

బస : అప్పలస్వామీ ! ఈ రాజాగారు రమ్మంటే వెళ్తావా ?

అప్ప : (ఉత్సాహంతో) మీ చిత్తం, నా ప్రాప్తమండయ్యా.

రాజా : అడగటం మరచిపోయినందుకు క్షమించాలి. తమ నామధేయం ?

బస : బసవయ్య అంటారండి (అప్పలస్వామితో) అప్పలస్వామీ ! ఫలహారాలు అయితే తీసుకురా.

అప్ప : అట్లాగేనండయ్యా (నిష్క్రమణ).

రాజా : వాట్ ? బసవయ్య అంటుకో, వైన్ మర్చెంట్స్ (Wine Merchants) మీరే నన్నమాట. చెప్పేరు కారూ ! మీ పేరు మాకుబాగా పరిచయమే. కాని దర్శనభాగ్యం యిన్నాళ్ళవరకూ అబ్బలా. జానీ వాకర్, త్రీ డేగర్ (Johnny Walkar, Three Dagger) సీసాలు మాకు డజన్లకొలది సప్లయి చేసేవారు కారూ ?

బస : ఏదో తమదయ.

రాజా : అయితే మీరు మాకు ఆప్తులే. ఇక పోయి వస్తాము.

బస : కాఫీ, ఫలహారములు తీసుకుని, రాత్రి భోజనానికి వుండి రేపు ఉదయమే వెళ్ళొచ్చు. నా కోర్కె మన్నించుతారని...

రాజా : మీ ఔదార్యంతో కడుపు నిండిపోయింది. ఇక కాఫీ, వగైరాలు అక్కరలేదు. రాత్రికి మీ యింట్లో విడిదిచేస్తే ఎల్లా? రాత్రికి రాత్రే ఏరు దాటేసి మా అస్థానపు క్లీనరును కలుసుకోవాలి. పైగా మేముంటే మీకు ప్రమాదం ఏర్పడవచ్చు.

బస : ప్రమాదం ఎందుకొస్తుందండి. మీరు మా యింటికి వచ్చారని బయట వాళ్ళకు తెలిస్తేగా. కోటలాంటి యీ యింట్లో నెల రోజులున్నా ఎవ్వరికీ తెలియదు.

రాజా : ఎందుకు లెద్దురు? పోనిద్దురు! (నవ్వేటట్లు నటిస్తూ) మీరిచ్చిన బట్టలు త్వరగానే వాపస్ చేస్తాము లెండి.

బస : ఎంతమాట సెలవిచ్చారు. ఏమంత ఖరీదని? మీకు కష్టంలో సహాయపడ్డాను అదే పదివేలు.

రాజా : అబ్బెబ్బె! పరాయి సొమ్ము మా దగ్గర అట్టే పెట్టుకోవడం మా వంశంలో ఎవరికీ లేదండీ. బట్టలంటే బట్టలే వాపస్ చేయలేము అనుకోండి. డబ్బు రూపంలోనో, యింకో వస్తు రూపంలోనో, వాటి విలువ మీకు ముట్టచెబుతాం. ఈ మార్పుదల పనులంటే బలే సరదా మాకు!

కమ : (సీరియస్ గా) ఇప్పుడు విడిచేసిన బట్టలకు విలువ ఎట్లా చెల్లించావు?

రాజా : (తాపీగా) ఆ బట్టలు కట్టుకున్న మనిషి, పాపం, మంచి నిషాలో క్లబ్బు ముందు రోడ్డుమీద పడి వున్నాడు. ఆ మనిషి ఏ కారుకిందో పడి ప్రాణాలు పోగొట్టుకోకుండా రక్షించి హాస్పిటల్ కు చేర్చి, ప్రాణరక్షణకు బదులుగా అతని బట్టలు తీసుకున్నాను. అన్యోన్య సహకారాలు, మార్పుదలతోనే మా జీవిత చర్యలు నిండి వున్నాయి.

బస : నాకు అర్థం కావటంలేదు. కొంచెం విశదంగా.

రాజా : అంటే మరేమీ లేదండి. మీ ఆవుకు మేము చిట్టు, తవుడు పెట్టాము. దానికి బదులుగా మీరు మాకు పాలు పోస్తారు. ఇంచు మిం

చుగా అన్నీ ఇంతే ననుకోండి. పూర్వం కదనరంగములో వీర విహారం సల్పిన సూర్య వంశస్థులమైన మేము, ప్రస్తుతం ఆర్థిక రంగములో స్వైర విహారం సల్పుతున్నాము. మా వంశ ఆస్తి చాలా వుండేది లెండి. మూడు లక్షలు ఖరీదు చేసే పెద్ద మహల్, తోట, వుండేవి. మా వూళ్ళో మార్వాడీకి చాల డబ్బుంది. ఏ ముంది, 80,000 రూపాయిలు మేము మార్వాడీ దగ్గర తీసుకున్నాం. దానికి బదులుగా మహల్, తోట, రెండూ మార్వాడీకి యిచ్చివేశాం.

[అప్పలస్వామి ట్రే మీద వెండి ప్లేట్లు, కప్పులు, కెటిల్, బంగారపు స్పూను, ఫలహారాలు, కాఫీ వగైరాలతో ప్రవేశిస్తాడు. రాజా వాటిని నిశితంగా చూస్తాడు.]

కమ : బలే! బలే ఎక్సేంజి! "కుండాపోయి కత్తి వచ్చె—ఢం, ఢం" అన్నమాట.

రాజా : (క్షణమాత్రం తొట్రుబాటుపడి తెప్పరిల్లి) మీ భార్యాగారికి హృదయం ఇంకా పరిపక్వం కాలేదండి.

బస : (కమలాదేవితో) ఊరుకో! వారు తమ సంగతి చెబుతుంటే మధ్య హంసపాదులూను వ్వాను.

రాజా : మాకు నాలుగులక్షలు రొఖ్ఖం వుండేవండి. రెండులక్షలు గుఱ్ఱపు పరుగుమీద పెట్టేం. దాని పరుగుకు మా వేగం అందలేదు. అనుభవం మాకు వచ్చింది. ధనం గిండీరేస్ క్లబ్‌కు వెళ్ళింది!

కమ : "కత్తిపోయి కర్రా వచ్చె ఢం"...

బస : వూరుకో! కుర్రతనం వేషాలూ నువ్వూను. (రాజాతో) అంతా విచిత్రంగా ఉందండి.

రాజా : ఓ! యిటువంటివి యింకా వున్నాయండి. అవన్నీ ఆడవాళ్ళముందు చెప్పడం పెద్దమనుష్యుల లక్షణం కాదు. (బల్లమీద అప్పలస్వామి పెట్టిన సామానును పరీక్షగా చూస్తూ ఉంటాడు)

కమ : ఉత్త జూదగాడు! వ్యసనపరుడు!

రాజా : జీవితమంతా జూదమేనండి కమలా దేవి గారూ?

కమ : (చకితురాలయి) అరె! నా పేరు మీకెట్లా తెలిసింది?

బస : వారిని నువ్వు అని పిలవకు కమలా! గౌరవముగా మీరని పిలువు.

రాజా : పిలవనియ్యండి ఫర్వాలేదు. ఆడవాళ్లు... అందులో అందమైనవాళ్లు. ఎట్లా పిల్చినా అందంగానే ఉంటుంది.

(కమలాదేవితో) మీ పేరు ఎట్లా తెలిసిందని అంత ఆశ్చర్యపడతారెందుకండి? మీ రెండవ ఉంగరంమీద కె. డి. అని వ్రాసి అక్షరాలు వున్నాయి. కె. డి. అంటే కమలాదేవి పేరే అయివుంటుందని ఊహించాను.

బస : రాజాగారు కుశాగ్రబుద్ధులని ఇప్పటికైనా గ్రహించు కమలా!

రాజా : (బల్ల దగ్గరకు వెళ్ళి 'ట్రే'లో నున్న బంగారు చెంచా తీసి) పసుమర్తి కన్నయ్య శెట్టి మేక్! బంగారు వస్తువులు మాకు కూడా తయారుచేసి యిచ్చేది కన్నయ్య సెట్టేనండి. 5 తులాలు బరువుంటుం దండి?

బస : సరిగ్గా సెలవిచ్చారు. ఆ బంగారపు చెంచా కన్నయ్య శెట్టి అంగడిలో కొని మా అవిడ పుట్టిన రోజుకు బహుమతి యిచ్చా రాజా గారూ?

రాజా : కమలాదేవి గారూ! మీ వజ్రపు టుంగరం నీరు దిగిందండి.

కమ : అరె! మెరుపులో వచ్చిన ఆ కొద్ది తేడా దూరాన్నుంచి కనిపెట్టేవే!

బస : 2000 రూ పెట్టి "బ్లూ డయిమండ్" ఉంగరము చేయించి పెళ్ళి బహుమతిగా యిచ్చానండి..

రాజా : రత్న పరీక్ష, నగల విలువ కట్టడం, మాకు ఉగ్గుపాలతో నేర్పబడుతాయండి కమలా దేవి గారూ!

కమ : మద్రాస్ వెళ్ళినపుడు నీరు తీయించాలి.

రాజా : అంత శ్రమ ఖర్చు ఎందుకండి? దానికొక చిన్న చిట్కా వుంది. అగ్గిపుల్ల వెలిగించి సెగ ఒకమూల చూపితే నీరంతా యిట్టే బయటకు ఎగిరిపోతుంది.

కమ : నిజం ? మా కెవరకు యింతవరకు తెలియదే!

రాజా : కాని ఆ పనిమట్టుకు అనుభవంతో జాగ్రత్తగా చెయ్యాలి.

కమ : కీ తెరిగి వాత పెట్టమన్నట్లు.

రాజా : అంతే! కాని వాతమటుకు గాఢంగా పెట్టకూడదు. లేకపోతే రాయి పగిలిపోతుంది. ఉంగరం యిట్లా యివ్వండి. మీ ఎదుటనే నీరుతీసి యిస్తా.

కమ : (కుతూహలంతో తీసి యిచ్చి చూస్తూవుంటుంది)

రాజా : (జేబులోనుంచీ అగ్గిపెట్టె తీసి) పుల్లవెలిగించి ఉంగరంలోపల కాలుస్తాడు. అది గదిగో! చూశారా! డల్ గా వున్న రాయి తళ తళ లాడుతూ ఎట్లా మెరుపు తెప్పించుకుంటోందో!

కమ : ఏదీ! చూడనియ్యి (రాజా ఉంగరం యిచ్చివేస్తాడు)

కమ,బస: (ఆశ్చర్యంగా ఉంగరం చూస్తుంటారు)

కమ : అవును. ఇదివరకటికంటేబాగా మెరుస్తోంది.

రాజా : ఇంకా కొంచెం పనివుంది. ఉంగరాన్ని యిట్లా యివ్వండి వేడి వెంటనే చల్లారితే రాయి పగిలి పోవచ్చు. మెల్ల మెల్లగా వేడి చల్లారాలి. (కమలా దేవి యిచ్చిన ఉంగరాన్ని వేళ్ళమధ్య నొక్కి పట్టుకొని) వేళ్ళ మధ్య నొక్కిపెట్టితే ఉంగరం మెల్లగా చల్లారుతుంది.

బస : రాజా గారూ! మీకు చాల సంగతులు తెల్సునండి.

రాజా : అనేక దేశాలు తిరిగి, అనేకమందితో స్నేహాలు చేయడంవల్ల వచ్చిన అనుభవం యిది. ఒక పెద్ద డైమండ్ మర్చంట్ కొడుకూ నేనూ ప్రెసిడెన్సీ కాలేజీలో క్లాసుమేట్లం. అతను నేర్పేడు నాకీ కిటుకు. ...ఇదుగోనండి, కమలాదేవి గారూ! బాగు పడిన మీ ఉంగరం (బల్లమీద సుతారంగా పడేస్తాడు.)

బస : ఈపని మీరు చేయకపోతే, దాని బాగుకు మెద్రాసులో ఏ ఏభై రూపాయలో వదిలివుండేవి.

[వీధితలుపు కొట్టినచప్పుడు ; తోటపనివాడు ఆదుర్దాగా లోపలికి వస్తాడు.]

తోట : అయ్యగారూ! పోలీసుయినస్పెక్టరు గోరు టండి వచ్చారు. మిమ్మల్ని చూడాలంట.

బస : (కంగారుతో) పోలీసు ఇనస్పెక్టర్! కొంప మునిగిపోయిందే కమలా.

కమ : అనుభవించండి! నేను మొదటినుంచీ మొత్తుకుంటుంటే విన్నారూ!

బస : రాజా గారూ! ఇనస్పెక్టరుగారు వచ్చారుట ఏం చేసేది ? ఎల్లా బయటపడడం ?

రాజా : కొంపా మునగలా, పుట్టీ మునగలా! (తోట పనివానితో) ఒరేయ్! అయ్యగారు ఇప్పుడే వస్తున్నారని ఇనస్పెక్టరుగారితో చెప్పు.

తోట : (కదలక నిలబడతాడు.)

బస : ఎంతపని జరిగిందండి. నన్నుకూడా అరెస్టు చేస్తారురా--ఏం కర్మం వచ్చిందిరా దేవుడా!

రాజా : ఇందులో ఇంత గాబరా పడడానికి ఏముందండి బసవయ్యగారూ! గాభరా పడడం అంటే మాకు నూ చెడ్డ చికాకు. ఇంతా చేస్తే ఆ ఇనస్పెక్టరుగారు చుట్టపు చూపు మీద వచ్చారేమో ?

కమ : ఇప్పటికేమీ మించి పోలేదు. మీరంత భయపడక్కర్లా, చిందులుతొక్కనక్కర్లా.

బస : ఏం చేయ మంటావో చెప్పు. (తోటమాలితో) ఒరేయ్! ఇనస్పెక్టరుగారిని ఆఫీసు గదిలో కూర్చోబెట్టు. నేను ఇప్పుడే వస్తున్నానని చెప్పు. (తోట పని వాడు నిష్క్రమణ) (కమలతో) ఏం చేయ మంటావు ?

కమ : దొంగ మనింటికి వచ్చాడని పట్టుకుని అట్టే పెట్టేమని, కబురుచేయ బోతుంటే ఇంతలో మీరే వచ్చారని వెళ్లి యినస్పెక్టరు గారితో చెప్పి ఆయన్ను యిక్కడకు తీసుకురండి.

బస అంతే! అదే! అట్లా చేస్తేనే బాగుంటుంది.

(వెళ్లడానికి రెండడుగులు ముందుకు వేస్తాడు)

రాజా : (బసవయ్యకు అడ్డుగావచ్చి నిలబడి దబాయింపుగా). ఆ పప్పులు ఉడకవండి బస

వయ్యగారూ! భార్య సలహాని ఆ తెలివి తక్కువ పని చేశారంటే మాతో బాటు మీరు కూడ జైలుకు నడవాలిసి వుంటుంది. తెలుసా! జామీను మీద మీరు బయటకు వచ్చినా, పరువు, ప్రతిష్ఠలుగల...న్యాయ చట్టం అంటే భయ భక్తులుగల...గౌరవ నీయులైన బసవయ్య గారు...దొంగను... యింట్లో దాచిన...సహాయం చేసిన... నేరానికి కోర్టులో...బోనులో...నిలబడ వలసి వస్తుందంటే......శిక్షింప బడతా రంటే...ఎంతటి తల వంపులో ఆలోచించు కోండి. మీకు యీ వూళ్లో ఎంతటి అప్రతిష్ఠో గ్రహించండి.

బస : నాకేం! బెదిరించి బలవంతంచేసి బట్టలు తీసుకున్నాడని చెబుతా.

రాజా : పాపం! మీకు కోర్టు సంగతి తెలియ దండీ బసవయ్యగారూ! మీయింట్లో దాక్కొ మన్నారనీ బట్టలు మీరే యిచ్చారనీ నేను చెబితే తిరుగు వుండదు. కావాలంటే అప్పల స్వామి నాతరఫున సాక్ష్యం యిస్తాడు.

అప్ప : (రాజావేపు, బసవయ్యవేపు సందిగ్ధంగా చూస్తాడు)

బస : నాకు మతిపోతోంది! అంతా అయోమయంగావుంది.

రాజా : ఊబిలో మేము, మాతోబాటు మీరు దిగ బడ్డారు. బయటకు రావడానికి హడావిడి చేసి, తన్నుకుంటే కూరుకుపోవడం తప్ప బయటపడడం వుండదు. మేము...మీరు... తక్కిన అందరు...ఈవిపత్కర స్థితినుండి రక్షింపబడాలంటే ఉపాయం మాఒక్కరి చేతిలోనే వుందని గ్రహించండి.

బస : నాకర్థం కావటంలేదు.

రాజా : అర్థంకాకపోతే నష్టంలేదు. మీరు చేయవలసిందల్లా మేము చెప్పినట్లు తుచ తప్పకుండా నడచుకోవడమే!

బస : అయితే మరి ఏమి చేయమంటారో చెప్పండి

రాజా : ఏమీలేదు! మేము యిప్పుడు దాక్కో డానికి ప్రయత్నం చేయాలి.

బస : (అటుయిటు కలయచూచి) దాక్కోడాని ఎక్కడా చోటులేదే! మీరు కొంచెం తోటలోకి నడిస్తే... అక్కడ దొడ్డ బావి వుంది ... అందులో నీళ్లు లేవు లెండి. అందులో దాక్కుంటే చాలా బాగుం టుంది.

రాజా : కాదు దాక్కోడానికి ఈగదే చాలావుంది.

బస : (చకితుడయి) ఈ గదిలోనా, చోటు ఎక్కడుందయ్యా మహానుభావా?

రాజా : ఇక్కడే, మేము నిలబడ్డ చోటులోనే.

బస : అబ్బ! నాకేమీ అర్థం అవటల్లా.

రాజా : చేతకానివాళ్ళు. మాతుల్లో, గోతుల్లో దాక్కుంటారు. అందరికీ కనపడేచోటున దాక్కుంటే రహస్యం బాగా దాగుతుంది.

బస : ఏమిటో! నా బుర్ర తిరిగిపోతోంది.

రాజా : (బసవయ్యతో) మీరు 'పో' (Poe) చదువలేదనుకుంటా. ఎడ్గార్ ఏలన్ పో (Edgar Allen Poe) రాసిన కథలు... (కమలాదేవితో) బహుశా మీరు చదివి వుంటారనుకుంటా!

కమ : (కోపంగా పెదవి ఓగించుతుంది)

రాజా : 'పో' (Poe) రాసిన కథలో ఒక దొంగ తను దొంగిలించిన వజ్రాలహారాన్ని అంద రికీ కనబడుతున్న బల్లమీద వాజా (Vase) లో దాస్తాడు. ఎంత వెదకినా ఎవరికీ వాజాలో చూడాలని ఊహ కలుగ లేదు.

బస : మీరు దాక్కునేటంత పెద్ద వాజా ఈ యింట్లో ఎక్కడ వుందయ్యా. చివరికి అంత పెద్ద జాడీకూడా లేదు.

రాజా : వాజు కావాలని ఎవరడిగారండీ? ఆకథలో యిమిడివున్న సూత్రాన్ని మేము యిప్పుడు ఆచరణలో పెట్టాము.

బస : అదేదో త్వరగా కానియ్యండి.

రాజా : ఇప్పుడు రాజా ప్రతాప్ గారు బట్లరు అప్పల స్వామి వేషంలోనికి రూపాంతరం పొందు తారు, తెలిసిందా?

బస : అంతా మీకు వదిలేశా. నీటముంచినా, పాల ముంచినా మీదే భారం.

రాజా : పాలలోనే ముంచుతాములెండి... అప్పల స్వామి! త్వరగా నీ తలపాగా, మెడల్నె తోసహా కోటు, మా కిచ్చెయ్యి. (అప్పల స్వామి కిక్కురు మనకుండా విప్పి యిస్తుంటాడు. రాజా అవి తొడుక్కుంటాడు) ... ఓహో. ఏమి విధివైపరీత్యం! రాజా గారు బట్లరుగా మారారు. అప్పలస్వామి! ఇంక నీవు లోపలికిపోయి ఎవ్వరికీ కనపడకుండా దాక్కో.

(బసవయ్య, కమల ఆశ్చర్యంగా చూస్తుంటారు.)

రాజా : (ట్రే చేతిమీద మోపుకుని బట్లరులాగా నటిస్తూ, బల్లమీద ప్లేట్లు పెట్టి వాటిలోకి ఫలహారాలు బంగారు చెంచాతో తోడుతూ వుంటాడు) అయ్యా! బసవయ్యగారూ! నిలబడకండి, కూర్చోండి.

బస : (దిగాలుగా కుర్చీలో కూలపడతాడు)

రాజా : (బసవయ్యతో, కమలతో) మామూలుగా మీరు ఫలహారం చేసేటప్పుడు ఎట్లావుంటారో అట్లా వుండండి ... మరి కొంచెం ఉత్సాహంగా సహజంగా నటించాలి. ఉన్న చిక్కంతా యిక్కడేవుంది. మీరు కనుక నేను చెప్పినట్లు నడచుకుంటే ఏ పేచీ రాదనుకోండి.

బస : (ప్లేటులోనుంచి పకోడీముక్కలు తీసుకుని మెల్లగా కొరుకుతూ వుంటాడు.)

కమ : (చెంచాతో ప్లేటుమీదకొట్టూ ఆలోచనలో సందిగ్ధస్థితిలో వుంటుంది.)

రాజా : అట్లా ఆలోచనలో పడితే ఎట్లాగండీ అమ్మగారూ.

కమ : చేసుకున్నవాళ్లకి చేసుకున్నంత మహాదేవా అన్నారు. సరేకానియ్యి (ఫలహారాల ప్లేట్లులో చేయివుంచుతుంది.)

[ప్రవేశం పోలీసు ఇనస్పెక్టరు. మామూలు డ్రెస్‌లో వుంటారు. చేతిలో చేతి కర్ర వుంటుంది.]

బస : (ఇనస్పెక్టరును చూచి ఎదురు వెళ్లుతూ) దయ చెయ్యండి ఇనస్పెక్టరు గారూ! దయ చెయ్యండి!

ఇన : ఎంతసేపటికీ మీరు రాకపోతే స్నేహితం మీద నేనే లోపలికి వచ్చేశా. వేరే విధంగా అనుకోకండి.

బస : ఎంతమాట! ఎంతమాట! ఏదో యింటిపని వల్ల తెమలలేదు. వెంటనే రాలేకపోయా. వద్దా మనుకుంటున్న ఇంతలో మీరే వచ్చేశారు. ఏమిటి విశేషాలు?

ఇన : తాలూకా ఆఫీసు జైలునుంచి ఇవాళ పొద్దున్న దొంగ ఒకడు గోడదూకి పారిపోయాడు. ఆ పారిపోయిన దొంగవెధవ చాల ఉద్దండపిండమంట! వాడిని రెండురోజుల్లో పట్టుకోలేకపోతే డిస్మిస్ చేస్తానని డి. యస్. పి. గారాలు మిరియాలు నూరుతున్నారు. అబ్బ! పోలీసు సర్వీసు అంత వెధవ సర్వీసు లేదండీ.

బస : మరి డ్రెస్ మీదలేరే!

ఇన : డ్రెస్‌మీదవుంటే దొంగ దొరుకుతాడండీ! కాకిచొక్కా చూడగానే కాలికి బుద్ధి చెపుతాడు.

బస : మీరే స్వయంగా రావాలండీ? మీ పోలీసు వాళ్ళను పంపితే చాలదూ?

ఇన : పారిపోయిన దొంగవెధవ గొప్ప వంశం వాడుట. అందుచేత మామూలు వాళ్లయిళ్లకు మా పోలీసులనుపంపి గొప్పవాళ్ల యిళ్లు అన్నీ నేనే వెతుక్కుంటూ వస్తున్నా.

బస : మా యింటికి వస్తే అవలీలంగా వాడిని నేను పట్టుకుని మీకు కబురుచేసే వాడినికదండీ!

ఇన : ఆ సంగతి నాకు తెలియదేమిటి? అయినా డ్యూటీ ప్రకారం చేసుకుపోవాలి కదండీ.

బస : అంతేనండి. అంతే. మీ ఇష్టం. మా యిల్లంతా మీదే ఎక్కడైనా వెతకండి.

[ఇనస్పెక్టరు గారు ముందు. వెనుక బసవయ్య నడుస్తుండగా యినస్పెక్టరు కుడి ప్రక్క సైడ్ వింగ్ దగ్గరకు నడుస్తూ లోపలికి తొంగి చూస్తూ బసవయ్యను ఏదో అడుగుతూ వుం

టాడు. బసవయ్య ఏవో జవాబులు యిస్తుంటాడు. రాజా వాళ్ళవేపు వీపు తిప్పి బల్లమీదకు వంగి వడ్డించుతూ వుంటాడు. కమలాదేవి సందేహంగా 'సైడ్ వింగ్' వేపు చూస్తూ వుంటుంది]

రాజా : (కొంచెం ఆదుర్దాగా) అమ్మగారూ! జీడిపప్పు పకోడీలండి యివి. మరి కొంచెం వెయ్యమంటారా? (పకోడీలు వేస్తాడు).

కమ : పకోడీలు వద్దు, గికోడీలు వద్దు!

[బంగారు కంచా బల్లమీద పడేస్తుంది]

రాజా : అమ్మగారూ! పోనీ జిలేబీ తీసుకోండి

ఇన : (కుడిమూల కర్టెను దగ్గరగా నిలబడి కర్టెను మీద కొట్టూ) బసవయ్యగారూ! ఈగదిలో ఏముందండీ?

బస : అదా! అది సామానులగది. పాత సామానులుంటాయి.

ఇన : రండి! ఆ గదిలోకి పోయి చూద్దాము.

[ఇద్దరు నిష్క్రమణ]

రాజా : (వాళ్ళు లోపలికి వెళ్తుంటే) అమ్మగారూ! స్ట్రాంగ్ కాఫీ యివ్వమంటారా?

కమ : వద్దు! (ఇనస్పెక్టరుతో చెప్పడానికి అన్నట్లుగా మొగం పెట్టి కుర్చీలోనుంచి లేవబోతుంది).

రాజా : (బల్లమీదకు బాగా వంగి) కమలాదేవిగారూ కనికరించండి. శరణు అన్న వాడిని రక్షించడం గొప్ప వంశలక్షణం.

కమ : (తికమక పడుతుంది).

రాజా : (మెల్లగా) కమలాదేవిగారూ! రక్షించమని నేను యింతవరకు ఎవరినీ అడుగలేదండి.

కమ : (కుర్చీలో మెల్లగా కూర్చుంటుంది.)

రాజా : (గండం గడిచినట్లు మొగం తుడుచుకుంటూ మెల్లగా) ఏదో ఒకటి మాట్లాడండి. కావాలి. వద్దు అని అయినా అనండి.

[ఎడమప్రక్క సైడ్ వింగ్ చివరనుండి బసవయ్య, ఇనస్పెక్టరు స్టేజిమీదకు వస్తారు.]

రాజా : (బసవయ్యతో) అయ్యగారూ! అమ్మగారు ఇవాళ ఏమీ ఫలహారం తీసుకోలేదండి. తలనొప్పిగా వుందేమో.

బస : డాక్టర్ని పిలవమంటారేమో కనుక్కో.

రాజా : అమ్మగారూ!

కమ : అక్కర్లేదు.

[ఇనస్పెక్టరు యింకోప్రక్క ఎడమప్రక్క సైడ్ వింగులలోకి తొంగిచూచి బయటకు వస్తాడు.]

ఇన : ఈ ప్రక్క గదిలో కూడా ఎవరూ లేరండి.

బస : నేను చెప్పేను కదండీ.

ఇన : (ముందుకు వస్తూ). ఏమండీ బసవయ్యగారూ? ఇవాళ మీ బట్లరు సిల్కు పంచె కట్టేడే?

బస : అహా! అదా! ఇవాళ వాడి పుట్టినరోజుట. అందుకని నా సిల్కు పంచె వాడికి బహుమతి చేశా!

ఇన : ఓహో! అదా సంగతి. కొత్తగా కనిపిస్తే ఏమిటో అనుకున్నా.

రాజా : అమ్మగారూ! ఇదిగో స్ట్రాంగ్ కాఫీ తాగండి తలనొప్పి తగ్గుతుంది.

కమ : తే! (కప్పు తీసుకుంటుంది.)

రాజా : అమ్మగారూ! బజారునుంచి కూరలు అవీ తెమ్మన్నారు కదండీ! (బసవయ్యతో) అయ్యగారూ! పెన్ను ఒకసారి యివ్వండి. కావలసిన వస్తువులు లిస్టు రాయాలి (బసవయ్య గోల్డు కేప్ పెన్ యిస్తాడు)

రాజా : (తీసుకుని) ఏం కావాలో చెప్పండి అమ్మగారూ!

కమ : నీకు తెలుసుగా.

రాజా : (బల్లమీద వున్న పత్రికతీసి దానిమీద రాస్తూ) వీశెడు బంగాళదుంపలు.... 2 శేర్ల మాంసం, అర్ధశేరు నవటాకు మసాలా పియర్స్ సబ్బులు ఎన్ని డజనా, అర డజనా?

కమ : అరడజను చాలులే.

రాజా : పాండ్స్ క్రీము రెండుసీసాలు.

ఇన : ఇల్లంతా వెతికాము బసవయ్యగారూ ఇక తోట వెదకాలి రండి.

బస : వెళ్దాం కాని, కాస్త మీరు కాఫీ పుచ్చుకుని...

ఇన : కాఫీ తాగి యింటిదగ్గర బయలుదేరేవండి ముందు తోట వెనకవద్దాం పదండి.

[ఇద్దరు నిష్క్రమణ]

రాజా : నిజంగా రక్షించిన పుణ్యం మీకు దక్కిందండీ కమలా దేవి గారూ ?

కమ : (అభినందనగా చూస్తూ) నీ ధైర్యం మెచ్చుకోదగ్గది.

రాజా : తమరి దయా అంతఃకరణ మెచ్చుకోతగ్గదండీ.

కమ : నటించడంలో మొనగాడిలాగా వున్నావు.

రాజా : అహా ! మీ మెప్పుదల కూడా పొందే భాగ్యం లభించింది.

(బల్లమీదకు కొద్దిగా వంగి ఒక చేత్తో బల్ల మీద వస్తువులను సర్దుతూ వుంటాడు)

కమ : పొగడ్తకాదు వున్న సంగతి చెప్పా.

రాజా : దయాసముద్రులంటే మీరు.

కమ : దయాదాక్షిణ్యాలకు మా వంశం పెట్టింది పేరు.

రాజా : అంతటి గొప్పవంశంలో జన్మించినందుకు అంత గొప్పగా కరుణారసం చిలికించారు.

కమ : వంశం, పెంపకం, యివే మనిషిని గొప్పగా తయారుచేస్తాయి. (పెదవి విరచి) మా ఆయన ఎంత గాభరా పడిపోయారో! వాళ్ళ వంశమంతా అంతే! ఉత్త పిరికి ఘటాలు.

రాజా : (య్చ్) పాపం! రెండవ పెళ్ళి అనుకుంటా.

కమ : (కొంచెం నవ్వి ఆ మాటకు బదులు చెప్పకుండా) మా అన్నయ్యను ఎరుగునే వుంటారనుకుంటా ?

రాజా : పేరు ?

కమ : కృష్ణకుమార్.

రాజా : క్లబ్బులో విన్నట్టే జ్ఞాపకం.

కమ : మా అన్నయ్య మొన్న యుద్ధంలో 'వార్ పైలట్' (War Pilot)గా పనిచేశాడు తెలుసా ? ఎంతో ధైర్యంగా వెళ్ళి జర్మనీ మీద బాంబులు వేశేవాడు.

రాజా : నేను అజాద్ హింద్ ఫౌజ్‌లో పనిచేశా; నా కార్యరంగమంతా బర్మా జంగిల్స్‌లో, అస్సామ్ అడవుల్లో నడిచింది. కోహిమా కొండల్లో బ్రిటీషు సైన్యాన్ని ముప్పతిప్పలు పెట్టి మూడుచెరువుల నీళ్ళు తాగించామంటే నమ్మండి.

కమ : మా యింట్లో అందరివీ ఉక్కునరాలు.

రాజా : ఆ సంగతి నేను మొదటనుంచి కనిపెట్టుతూనే వున్నా. తొణకకుండా, బెణకకుండా అదరక, బెదరక యిందాకటినుంచీ ఎంత ధైర్యంగా వున్నారండి !

కమ : అదంతా మా వంశలక్షణం.

రాజా : ఇనస్పెక్టరుగారు వచ్చినపుడు మీరు కూడ అద్భుతంగా నటించారండి.

కమ : అదికూడ పెద్ద కష్టమే?

రాజా : ఆ నటనాశక్తి! ఆ ధైర్యం! ఆ అందం! (నిట్టూర్పు వదులుతూ) అడవి గాచిన వెన్నెలై పోతున్నాయి.

కమ : (ఉత్సాహంగా నవ్వి) ఏం లాభం! చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవా అన్నారు.

రాజా : మీరు చేసిన సహాయానికి ఆ జన్మాంతం కృతజ్ఞతతో వుంటా.

కమ : పొగడ్తలంటే నాకు తలనొప్పి. ముందుగా నీకు సహాయం చేయాలనిపించింది. మధ్యలో బుద్ధి మారింది. కాని ఎట్లాగైతే నేం. అనుకున్నది చిట్టచివరికైనా నెరవేర్చుకున్నా. అనుకున్నమాట నెగ్గాల్సిందే! మా యింట్లో అందరిదీ అటువంటి పట్టుదలే!

రాజా : (నిస్పృహతో) అయిదేళ్ళ క్రితం—ఒకానొక స్త్రీ...మీ మల్లే...నాకు తోడ్పడి...పట్టుదలతో నడచి...నా అండన వుండి వుంటేనా...నా జీవితం ఎంత ఉత్తమంగా వుండేదో! ఈ దేశ ద్రిమ్మరి బ్రతుకుపోయి సన్మార్గ పథం తొక్కి ఎంతటి కీర్తి యశస్సులు గడించుకుని వుండేవాడినో!

మక : ఎవరా స్త్రీ?

రాజా : (ప్చ్) ఎందుకులెండి 'గతం నాస్తి' అన్నారు. అదొక విషాదగాథ. పాత చరిత్ర త్రవ్వుకోటం ఎందుకు పోనిద్దురూ.

కమ : నేను తెలుసుకుంటే తప్పా?

రాజా : తప్పుకాదండీ! కాని ఒక స్త్రీ విషయం మరొక స్త్రీ దగ్గర చెప్పడం అంత బాగుండదు...అయినా మీరు అడిగారు కనుక చెప్పకపోవడం కూడా బాగుండదనుకోండి (ఎడమప్రక్క సైడ్ వింగ్ దగ్గరకు వెళ్లుతూ) అదుగో అయ్యగారు పిలుస్తున్నారు.

కమ : నాకు చెబితే మరేమీ పర్వాలేదు.

రాజా : బసవయ్యగారికి పెన్ కావాలిట. అదియిచ్చి వచ్చి మీ కా విషయం చెబుతా (రాజా, నిష్క్రమణ) (కమలాదేవి పరధ్యానంగా కూర్చుని వుంటుంది).

[ప్రవేశం బసవయ్య, ఇనస్పెక్టరు]

ఇన : మీ యిల్లంతా పూర్తిగా గాలించివేశాం, ఎక్కడా ఎవడూ లేడు.

బస : చిత్తం. నేను చెప్పేను కదండీ.

ఇన : ఇంక యీ పక్కయింటికి వెళ్లి వెతకాలి, వస్తానండి బసవయ్యగారూ!

బస : చాలా శ్రమపడ్డారు. కాస్త ఫలహారం కాఫీ తీసుకుని వెళ్లండి. ఆ కుర్చీలో కూర్చోండి.

ఇన : ఒక్క కాఫీ చాలు, యింకేమీవద్దు. (కుర్చీలో కూర్చుంటాడు)

బస : అప్పలస్వామీ! ఇనస్పెక్టరుగారికి కాఫీ ఫలహారం తీసుకురా!

[ప్రవేశం : తోటమాలి, హడావిడిగా]

తోట : అయ్యగారండీ! ఇందాకొచ్చిన మనిషి ఇనస్పెక్టరుగారి సైకిలు ఎక్కి తుర్రున వెళ్ళిపోతున్నాడండి.

ఇన : (కుర్చీలోనుంచి దభాలున లేచి) ఏమిటి? నా సైకిలే? ఎవడు వాడు? దొంగే అయివుంటాడు. నా నాలుగు వందల రూపాయల ర్యాలీ సైకిలు కొట్టేస్తాడూ!

బస : (బల్ల దగ్గరకు వెళ్ళి వెతుకుతూ) అరే! నా ఎనభై రూపాయల పెన్ను ఎత్తుకుపోయాడే!

కమ : (బల్ల తడుముకుతూ) అయ్యో! అయ్యో! నా డైమండ్ రింగ్, నా గోల్డ్‌స్ట్రాప్ కన్పడటం లేదు

ఇన : వాడు నాకే మస్కాయిస్తాడూ? ఆ వెధవ ఈ లోకంలో ఎక్కడున్నా జుట్టుపట్టుకు లాక్కొచ్చి లాకప్‌లో పెట్టా. నాకే టోపీ వేస్తాడా వీడు!

బస : అందరం నష్టపోయామండీ, యినస్పెక్టరు గారూ!

ఇన : (అథార్టీగా) ఆగండి నేనడిగే ప్రశ్నలకు జవాబు చెప్పండి. ప్రక్కయింట్లో ఫోను వుంది కాదూ?

బస : వుందండి.

ఇన : రోడ్లన్నీ కాపలా కాయమని మా పోలీసులకు ఫోనుచేసి వస్తా. (వెళ్లుతూ ఆగి వెనక్కు తిరిగి అధికారంగా) బసవయ్యగారూ! మీరందరూ ఎక్కడకూ కదల వద్దు ఇక్కడే వుండండి. మీ అందరినీ ప్రశ్నలడగాలి. నాకేమిటో మొట్టమొదటి నుంచి మీ అందరి ప్రవర్తన విచిత్రంగానే వుంది. ఏమిటో అనుకున్నా, దొంగ వెధవ పారిపోడానికి మీ రెంతవరకు సహకరించారో తెలిసికోవాలి? తెలిసిందా?

బస : చిత్తమండి.

[ఇనస్పెక్టర్ నిష్క్రమణ]

బస : నా బట్టలు—నీ రింగూ, నా పెన్నూ—నీ చెంచా, నా చెప్పులూ...అన్నీ ఎత్తుకుపోయాడు రాజా. దొంగవెధవ. 3000 రూపాయలు క్షౌరం అయిపోయాయి. పైగా పోలీసులతో పీకులాట ఒకటి.

కమ : నేను చెబితే విన్నారూ? మా గొప్ప రాజా దొరికాడు మీకు.

బస : నా అనుమానం వాడసలు రాజా కాడేమో నని. రాజాలాగా గొప్పగా నటించి మనల

నందరినీ బుట్టలో వేసికొని, తనపని కానిచ్చు కున్న ఘరానా దొంగయివుంటాడు వాడు.

[ప్రవేశం అప్పలస్వామి. శరీరంమీద కోటు వుంది తువ్వాలు కప్పుకునివుంటాడు]

అప్పల : ఏమిటంటయ్యా! అంత గందరగోళం పడు తున్నారు.

కమ : మీ రాజాగారు అయ్యగారికి 3000 రూ॥లు కరారావుడి చేసి పారిపోయాడు.

అప్పల : (బసవయ్యతో) నిజంగా నేనంటి అయ్యా?

బస : నిజం కాకపోవడమేమిటి? మీ అమ్మగారి డైమండ్ రింగ్, గోల్డు స్ఫూన్, నా బట్టలు, పెన్ను, ఇనస్పెక్టరుగారి సైకిలు ఎత్తుకుని పారిపోతే?

అప్పల : (ఆదుర్దాగా) నా మెడలు కూడా పోయాయా అండిఅయ్యా!

బస : ఏదేసినట్టేవుంది. నీవు మెడల్సు నువ్వు

అప్పల : పోనీలెండయ్యా! ఆయన నిజమైన రాజా అయితే, నా సొమ్ము అట్టే పెట్టుకోరు. తప్పకుండా వాపస్ చేస్తారు నా మెడల్సు.

బస : వాపస్ చేసినప్పుడు చూద్దాంలే!

[అప్పలస్వామి దగ్గరకువచ్చి అతని ఛాతీమీద మెడల్సు పెట్టుకునే చోట కొట్టూ] ఒరేయ్! అప్పలస్వామీ! మీ రాజాగారు మా కంద రికీ టోపీ వేశాడు కాని (అహహా! విచా రంగా నవ్వుతూ) నీ మెడల్సు......

అప్పల : (రహస్యం చెప్పవద్దు అనే అర్థం వచ్చేట ట్టుగా దీనంగా తలకాయ అడ్డంగా ఊపు తాడు.)

బస : (విచారంగా నవ్వుతూ) నీ విషయములో మటుకు రాజాగారు బలే టోపీలో పడ్డా డురా! తిన్నాడురా పెద్ద దోసు! [తెర]

# నేటి పాశ్చాత్య నాటకరంగము

శ్రీ శింగీతం శ్రీనివాసరావు

ప్రతిదేశపు సామాజికజీవితంలోనూ నాటకరంగం యొక్క ప్రభావం ప్రముఖపాత్రను వహిస్తుంది. దేశకాల వాతావరణ పరిస్థితులనుబట్టి, సంప్రదాయాలనుబట్టి ఆ యా దేశాలు వాటివాటికి అనుగుణ్యమైన కళలను పెంపొందించాయి. సంగీతం, చిత్రలేఖనం, సారస్వతం పరిశీలించి అవి ఏ ప్రాంతాలకు చెందినవీ ఏ కాలానికి చెందినవీకూడ చెప్పగలం. నాటకకళకూడా అంతే కాని ఇక్కడ గమనించవలసిన విషయం ఒకటుంది. ఒక వ్యక్తి ఒక సృజనక్రియ (Creative work) చెయ్యవలెనంటే, సృజించబడిన కళావస్తువు (Work of art)తో సంబంధం ఏర్పరచుకొని, తన్మూలంగా "సంచలనం" (React) పొందే వ్యక్తి ఒకడుండాలి. అప్పుడే ఆ కళావస్తువుకు ఒక పరిమాణం (Dimension) ఏర్పడుతుంది. శూన్యంలో ఎవ్వరూ కళావస్తువును సృజించలేరు. సంగీతకారుడు తనచుట్టూ ఎవ్వరూ లేకపోయినా సరే, కనీసం తనొక్కడే ఉన్నా తను పాడుతున్నపుడు, అదేక్షణంలో ఆ పాటను తానే వింటున్నాడు. అంటే కళావస్తువు (ఇక్కడ పాట)ను సృష్టిస్తూ, అదేక్షణంలో దాన్ని అవగాహన చేసుకుంటున్నాడు. అవగాహన చేసుకున్నప్పుడే పాటకు పరిమాణం ఏర్పడింది ఇక్కడ ఈ రెండువ్యక్తులు ఒకే వ్యక్తిలో సమ్మిళితమైనారు. అదే విధంగా చిత్రకారుడు చిత్రాన్ని చిత్రించినప్పుడు దానికి ఎలాంటి పరిమాణము లేదు. కాని తక్షణం తనే చిత్రాన్ని చూచి దాన్ని తనమనస్సులో ప్రతిబింబింపచేసుకున్నపుడు ఆచిత్రానికి ఒక పరిమాణం ఏర్పడింది. ప్రతీ కళావస్తువూ ఇంతే. నవలా ఇంతే. కావ్యమూ ఇంతే. వీటిలో అన్నమం రచయిత, పాఠకుడు ఒకడే అవుతాడు. కానీ నాటకంలో ఒక భేదం ఉంది. నాటకం వ్రాయటం నటించటానికి, ప్రదర్శించటానికి. ప్రదర్శనయోగ్యం కాక, చదువుకోటానికి నాటకాలు అనే పేరుతో వ్రాసిన రచనలన్నీ సంభాషణారూపం (Dialogue form) లో ఉన్న నవలలే కావచ్చు, విజ్ఞాన వేదాంత తత్వశాస్త్ర పుస్తకాలే కావచ్చు, (ప్లేటో వ్రాసిన "రిపబ్లిక్" దీనికి ఉదాహరణ), కాని అవి నాటకాలు మాత్రం ఎన్నటికీ కావు. నాటకంలో అధమం ఒక్క పాత్ర ఉండాలి. అంటే ఆ పాత్రను నాటక రచయితే ప్రదర్శిస్తున్నప్పటికీ, తన ప్రదర్శనను తానే చూడలేడు కాబట్టి, అది చూడేందుకు ఇంకొక వ్యక్తి తప్పనిసరి అవసరం. అంటే మిగతా కళలను సృజించేటప్పుడు కావలసిన వ్యక్తులు అధమం ఒక్కరు అయితే, నాటకంలో ఇద్దరు,—ఒక నటుడు, ఒక ప్రేక్షకుడు. అంటే నటుడు, ప్రేక్షకుడు కలిసినప్పుడే నాటకం ఒక విశిష్టమైన, సజీవమైన, సంపూర్ణమైన స్వరూపం దాలుస్తుంది.

అందుకని పాత్రలు ప్రేక్షకుల సంఖ్య అధికం అయ్యేకొద్దీ దేశంలో నాటకంయొక్క స్వరూపం వేరువేరుగా పరిణామం చెందుతుంది. ఆధునిక యుగంలో ఈ పరిణామంపైన దేశంయొక్క ఆర్థిక పరిస్థితి ప్రభావం చెప్పుకోతగ్గది. పాశ్చాత్య నాటక రంగంలోని దినదినాభివృద్ధికి, ముఖ్యంగా ఇప్పుడు మన దేశంలో నాటక రచనలోగాని, ప్రదర్శనలో గాని కొత్త పోకడలు ఎక్కువగా కనుపించక పోవడానికి కారణం చాలా మట్టుకు ఆర్థిక పరిస్థితి. యీ మధ్య మనలో ప్రదర్శించటానికి వ్రాసిన నాటకాలకన్నా, పత్రికలలో ప్రచురించబడి చదువుకోనబడే నాటకాల, నాటికల సంఖ్య ఎక్కువగా ఉన్నట్టు కనబడ్తూంది. దీన్నిబట్టి నాటకాల ప్రథమ కర్తవ్యం (Primary Motive) ప్రదర్శించటానికి అనేభావం మనలోకన్నా పాశ్చాత్య దేశాలలో ఎక్కువ దృఢంగా వున్నదని తెలుస్తుంది.

పాశ్చాత్యదేశాలలో పెంపొందిన నాటకాలలో ఎక్కువ ప్రజాబాహుళ్యానికి ప్రదర్శించి, ఇక్కడా అక్కడా కొందరు ఇది కళకాదు, వ్యాపారం అని

విమర్శించినా, నిజంగా అమెరికా, ఇంగ్లాండులలో నాటకకళకు ఆయువు పోసింది వ్యాపారిక నాటకరంగం (Commercial Theatre). దీని అభివృద్ధి ముఖ్యంగా 1914-18 లో జరిగిన మొదటి ప్రపంచ యుద్ధంతో ఉన్నట్టుండి ఎక్కువఅయి, మళ్ళ మళ్ళ కొంత హెచ్చుతగ్గులు ఉన్నా నేటివరకు కూడా మంచి ప్రాముఖ్యంలో ఉంది. ఇంగ్లండులో యుద్ధంలో పాల్గొన్న సైనికుల వినోదార్థం కుక్క గొడుగుల్లాగ నాటకసంస్థలు చాలావచ్చి, ఏవేవో నాటకాలు వేసి డబ్బును సంపాదించుకున్నయ్. చేతుల్లో డబ్బు లుండటంమూలాన, ప్రజలు నాటకాలంటే విరగబడ్డున్నారు. కాబట్టి, నాటకాలసంఖ్య ఎక్కువై కళారీత్యా వాటి అంతస్తు తగ్గింది. అందుకని రెండవ ప్రపంచయుద్ధం వచ్చేసరికి లండన్‌లోని చాలామంది విమర్శకులు, కళాకారులు మళ్ళీ నాటక రంగం అధోగతిని అందుకుంటుందని భయపడ్డారు. యుద్ధానంతరం కొంతవరకు ఇది నిజం అయినా, విలువ లేని క్రింది తరగతి వినోదాన్ని అందిచ్చే నాటకాలతో పాటు, ఉన్నతమైన నాటకాలు కూడా వచ్చాయి. ఎమిలిన్ విలియమ్స్ వ్రాసిన "ది మార్నింగ్ స్టార్", జె. బి. ప్రీస్ట్‌లీ వ్రాసిన "దే కేమ్ టు ఎ సిటీ"- విజయం పొందడంతో ప్రేక్షకుల అభిరుచులలో కళాకారులకు కొంత ధైర్యం వచ్చింది. ఇప్పుడు ఇంగ్లండులో మనం చూచే నాటక రచయితలకు చేయూత నిచ్చింది ఈ వ్యాపారిక నాటకరంగమే. నోయెల్ కోవార్డు, జేమ్స్ బ్రైడీ, ఎమిలిన్ విలియమ్స్, సోమర్సెట్ మాహం, జార్జి బెర్నార్డ్ షా—వీరంతరూ ఆ విధంగా, అక్కణ్ణే తమ వ్యక్తిత్వాన్ని ప్రస్ఫుటింప చేస్తూ ఒక స్థాయిని అందుకున్నవారే. కానీ ఇందులో ఒక చిన్న చిక్కు ఉంది. నాటకాలు రచించేది, నటించేదీ ఎవరైనా, వాటికి డబ్బిచ్చి ప్రదర్శింపచేసేవి నాటక సంస్థలు. ఆ సంస్థల కర్తవ్యం నాటకంయొక్క విలువకన్నా, అది రాబట్టే రాబడి. అందుకని హెచ్. ఎమ్. టెనెంట్ లిమిటెడ్ (H. M. Tennent Ltd.)లాంటి పెద్ద సంస్థ కూడా పేరుపడ్డ నాటక రచయితల నాటకాలకే అవకాశం ఇస్తుందేగాని మూల దాగున్న కొత్త రచయితలకు ప్రోత్సాహం ఇవ్వడంలేదు. ఈ విషయంలో అమెరికాలోని పరిస్థితికూడా ఇంతే. పైన అమెరికాలో బ్రాడ్వేలో వేసే నాటకాల ఖర్చు చాలా ఎక్కువ. ముఖ్యంగా అక్కడ నటులు లేక "తారలు"కు ఇచ్చే ధనం కళ్లు చెదిరేలా ఉంటుంది. అందు మూలంగా ఎక్కువ జనసామాన్యానికి అందుబాటులో ఉండే నాటకాలు, సంగీత నాటక ప్రదర్శనాలు (Musicals) జోరుగా సాగటం జరిగింది. ఫ్రాంసుదేశంలో వ్యాపారిక నాటకరంగానికి ; కళాత్మక నాటకరంగానికి (Artistic theatre) భేదం చూపడం కష్టం. ఫ్రాంసులో—ఇంకా సరిగ్గా చెప్పాలంటే—ప్యారిస్‌లోని కొద్ది నాటక సంస్థలు మోలియర్, సార్త్రు వ్రాసిన అత్యుత్తమ నాటకాలు మొదలుకొని ఏలాంటి అంతర్భూతమైన విలువ (Intrinsic Value) లేని చెత్త నాటకాలు ప్రదర్శించబడినవని, నాటక మందిరాల (Play Houses) సంఖ్య తక్కువ కాబట్టి అక్కడ నాటకరంగం యొక్క భవిష్యత్తు మారుమూలలలో ఉద్భవించే సంస్థలమీద, అమెచ్యూరు ట్రూపుల మీద ఆధారపడి వుందనీ ఎమెన్యుయల్ వేక్స్ ఫ్రాంసుదేశపు వ్యాపారిక నాటకరంగాన్ని గురించిన తన వ్యాసంలో పేర్కొన్నాడు.

ఆర్థికంగా చాలవరకు ప్రజల అభిరుచులమీద తప్పనిసరి ఆధారపడి నాటకాలాడే అమెరికా, ఇంగ్లండువంటి దేశాలు ఒకవైపు ఉంటే (ఇక్కడ స్థాపించిన ఆర్ట్స్‌కౌన్సిల్‌ను గురించి తరువాత చర్చిస్తాం), అటు ఈ పరిస్థితిని మరొకవిధంగా ఎదుర్కొన్న దేశాలసంగతి గమనిద్దాం. వీటిలో సోవియట్ రష్యాకు అగ్రస్థానం లభిస్తుంది. ఇక్కడ నాటకసంస్థలన్నీ ప్రభుత్వ అధీనంలో ఉన్నాయి. అందుకని ఒక సంస్థకు ఒక నాటకంలో నష్టంవచ్చినా లాభంవచ్చినా మరొక సంస్థ దీన్ని సర్దుకొంటుంది. ఏండ్రీ వేన్ గిసెహెమ్ (Andre van Gyseghem) వ్రాసినట్లు, నాటకసంస్థల పాలన నిర్దుష్టంగా ఉండటం మూలాన, సంస్థలకు నష్టం రాకపోవడం సరికదా, ప్రజలు అమెరికా బ్రాడ్వేలో టిక్కెట్లకోసం ఎలా ఎగబడ్తారో, అదేవిధంగా యిక్కడకూడా జనం తండోపతండాలుగా వస్తారు. ఇక అందులో పనిచేసే దర్శకుడు మొదలు మిగిలిన కళాకారులందరు ఆ యా సంస్థలకు చెంది, ప్రభుత్వపుజీతం పుచ్చుకుంటూ, సంఘంలో చాలా గౌరవంగా బ్రతుకుతారు. ఈ విధ

పైన నాటకవ్యవస్థలో ఒక పెద్దలాభం ఉంది. వ్యాపారిక నాటకరంగంలో అట్టే కొనసాగించలేని ప్రయోగాత్మక నాటకరంగం (Experimental theatre) ఇక్కడ సాధ్యం అవుతుంది. కొత్త పోకడలు అవలంబించటంవల్లాన, నాటకరంగం దిన దినాభివృద్ధి చెంది, ప్రేక్షకులుకూడా నాటకాలంటే ఇష్టపడే మనస్తత్వం కలిగి (Theatre minded) నాటకరంగం ఉన్నతదశకు వస్తుంది. కాని యిక్కడ నాటక రచయితకు, దేశాన్ని పరిపాలించే పక్షానికి ఎటువంటి సంబంధం ఉందో చెప్పడం కష్టం. జె. బి. ప్రీస్ట్లీ "అంతర్జాతీయ నాటకరంగము"(International theatre) అనే పుస్తకానికి వ్రాసిన ముదిపలుకులలో ఇంగ్లండు దేశంలో నాటక రచయితకు ఇతివృత్తాన్ని ఎన్నుకొనడమేమి, తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టే పద్ధతిలో చెప్పడమేమి, వీటిలో రష్యాలోని నాటక రచయితకన్నా యెక్కువ స్వాతంత్ర్యం ఉందేమోనని సంశయించాడు. రష్యాలో చాలా సంస్థలు కొత్త నాటకాలను ప్రదర్శించినా, ముఖ్యమైన సంస్థ అయిన మాస్కో ఆర్ట్ థియేటర్ (Moscow Art theatre) మాత్రం మొదట్లో వెనుకటి మహానాటకాలనే ప్రదర్శిస్తూ ఉండేది. కాని నటనలోనూ, స్టేజి సెట్టింగులలోనూ అంతకు ముందు కంటె ఎక్కువ వాస్తవికత చూపడంతో నాటకప్రదర్శనలో నూతనశకం ప్రారంభం అయింది. ఇందుకు మూలకారకుడు మాస్కో ఆర్ట్ థియేటర్‌ను స్థాపించిన వారిలో ఒకడైన స్టేనిస్లావ్స్కీ (Stanislavsky). వీరు రష్యన్ నాటకాలు వెయ్యడమే కాక విదేశాలనుండి వచ్చిన నాటకాలు, ఉదాహరణకు షెరిడన్ వ్రాసిన "స్కూల్ ఫర్ స్కాండల్" మొదలుకొని స్ట్రిన్‌బెర్గ్, షా, ఇబ్సెన్, మోలియర్ మొదలైన రచయితల నాటకాలన్నీ ప్రదర్శించారు. అంతేకాకుండా ఆ సంస్థ నాటకకళలో అమరస్థానం అందుకున్న ఏన్టన్ చెకోవ్ (Anton Chekhov) లాంటి సుప్రసిద్ధ నాటకకర్తకు పుట్టినిల్లయింది. పైన నాటకాలు వేసేవాళ్లకు విద్యుచ్ఛక్తిసాధనసామగ్రి గాని, సంగీత వాయిద్యాలు గాని, ఎలాంటి సదుపాయాలైనా దొరికే అవకాశం లభించింది. ఇది చాలా బాగున్నా, తత్కారణంగా నాటక రచనలో వచ్చే లోపం జె. బి. ప్రీస్ట్లీ తన రచనలలో ఈ విధంగా పేర్కొన్నాడు.

"రష్యాలోని నాటక కర్త ఆధీనంలో అతనికి కావలసినంతమంది నటులు, సెట్లు, సాధనసామగ్రి ఉంది. ఈ సంఖ్య కొంత తగ్గి, తన ప్రేక్షకులకు నాటకాన్ని గూర్చి ఓపిక కొంత తగ్గితే, తప్పనిసరి తన నాటకాన్ని ఇంకా ఎక్కువ మెరుపుతో, ఎక్కువ పటుత్వంతో, ఇంకా చక్కని నిర్మాణంలో తయారుచేసి ఉండేవాడు......ప్రపంచం కోరేటట్టి రష్యా ఇవ్వకలిగినట్టి ఉత్తమోత్తమ నాటక రచయితలను రష్యా ఇవ్వటంలేదని నా ఉద్దేశ్యం."

ప్రభుత్వముగానీ, మునిసిపాలిటీగానీ ఆధీనంలో నాటక సంస్థలు పెంపొందించే మరొక దేశం జెకోస్లవేకియా. ఇక్కడ సంస్థలు పాలించేందుకు ఒక ప్రభుత్వాధికారినీ, ప్రదర్శననుసరించి ఎన్నుకునేందుకు కళాకారులైన వ్యక్తులనూ ఉంచుతున్నారు. కొన్ని ప్రాంతీయ నాటకాలే కాక విదేశాల నాటకాలు కూడా వేస్తుంటారు.

కానీ పాశ్చాత్య నాటకరంగంతో పరిచయం ఉన్న ఎవరైనా నాటకం కోసం అటువైపు తలెత్తి చూచారంటె మొదట కనబడేది స్కాండినేవియా,- ఇంకా సరిగ్గా చెప్పాలంటె నార్వే. మొదట కనబడే నాటకకర్త, నాటక నిర్మాణంలో, పాత్ర పోషణలో, ప్రజ్ఞలో, శిల్పంలో, నాటక రచనలోని ప్రతి భాగంలో అత్యుత్తమస్థాయిని అందుకున్న మహా రచయిత-హెన్రిక్ ఇబ్సెన్. ఈ రోజు పాశ్చాత్య దేశాలలో వెలువడే సమస్యాపూరిత నాటకాలు (Problem plays)కు మార్గదర్శి ఇబ్సెన్. నాటక రచనలోనే గొప్పమార్పు తెచ్చాడు. మిగతావారంతా చాలామంది బయలుదేరి ఏవో విప్లవభావాలు ఒకటి రెండు పడేస్తే నాటకం చలామణీ అవుతుంది అనుకుని పొరబడ్డారు. ఎందుకంటె ఇబ్సెన్ ఊరికే కొన్ని కొత్తభావాలను ఉపన్యాసధోరణిలో అందిచ్చే ఉపాధ్యాయునికన్నా, వివిధపాత్రలను వారివారి మనస్తత్వాలతో సజీవంగా ప్రతిబింబింపచేస్తూ, క్షణక్షణం తన నాటకంమీద సర్వాధికారం చూపిస్తున్న మహా నాటకకర్త. అలాంటి ఇబ్సెన్, జార్న్‌సన్ (Bjornson), హాంబర్గులను కన్న నార్వేలో ఈ రోజు అట్టే స్వతంత్ర నాటక రచన (Original play writing) ఎక్కువగా ఉన్నట్టులేదు. ప్రసిద్ధనటుడు, విమర్శకుడు,రచయిత అయిన పీటర్ ఉస్టినావ్ (Peter-Ustinov) అన్నట్టు నార్వేలో నేడు రచనలోకన్నా

ప్రదర్శనలో బాగా వృద్ధి కనుపిస్తోంది. సైక్లోరమాలాంటి ఆధునిక యంత్రసామగ్రిని ఉపయోగించటమే కాక, నాటకాలను భావగర్భితంగా, మంచి వాతావరణాన్ని సృష్టిస్తూ ప్రదర్శిస్తున్నారు. ఏమైనా స్వభావసిద్ధంగా నాటకకళామనస్కులైన నార్విజియన్లు మంచి మంచి రచనలను అందివ్వవచ్చుని ఆశించవచ్చు. ఇదీ పాశ్చాత్య దేశాలలో నాటకరంగం మట్టుకు ఉన్న పరిస్థితి.

ఇక రచనలనుగురించి కొద్దిగా ఆలోచిద్దాం. ఇంగ్లండులాంటి దేశాలలో నాటక ప్రదర్శనకు వెచ్చించిన డబ్బు మళ్లీ ఆదాయం నష్టం లేకుండా తిరిగి రావాలంటే నాటకం జనాన్ని ఆకర్షించటమే కాక, అసలు ప్రదర్శించటానికి అయ్యే ఖర్చు సాధ్యమైనంత వరకు తక్కువగా ఉండాల్సివచ్చింది. అందుకని ఇంగ్లీషులో వచ్చేవన్నీ చాలావరకు మూడు అంకాలతో ఒకే సెట్టింగుతో డ్రాయింగ్ రూమ్ కామెడీస్ (Drawing - room Comedies) అనే పేరుతో వచ్చాయి. పైన సెట్టింగులను పదేపదే మార్చి, ఇంద్రజాలం చేసి ప్రజలను మురిపించి, మరిపించే పద్ధతి ఎక్కువకాలం ఉండదని కొందరికి తెలిసి, సెట్టింగులకన్నా నాటక నిర్మాణంలో, కథాపోషణలో కథాగమనంలో ఎక్కువ శ్రద్ధ వహించటం జరిగింది. అందుకని నాటకాలన్నీ ఎక్కువ రక్తి కట్టినయ్. ఇందులో హాస్య ధోరణిలో సమస్యలను తర్కించే నాటకాలు చెప్పుకోదగ్గవి. ఇందుకు జె. ఎమ్. బేరీ వ్రాసిన "అడ్మిరబిల్ క్రైటన్" (Admirable Crichton) మంచి ఉదాహరణ. ఈ నాటకంలో ఇప్పుడుండే ప్రజాస్వామ్యాన్ని గురించిన భావనలలోని అవకతవకలను బాగా చిత్రించి, పాత్రలు ఒకరితో ఒకరు వాదించుకోకుండా, బేరీ కలంలో మంచి నాటకంగా తయారైంది. సిద్ధాంతప్రాధాన్యం గల నాటకాలు (Plays of Ideas) మరొక శాఖకు చెందినవి. బెర్నార్డ్‌షా నాటకాలు ఈ జాబితాలో చేర్చవచ్చు. షాను చూచి, అతన్ని అనుసరిస్తూ చాలామంది తయారయ్యారు. కాని షా నాటకాలలో కూడ శిల్పం, పాత్రపోషణ, అన్నిటికంటె ముఖ్యం కథావస్తువు అతని ఉద్దేశాలుకన్న ముఖ్యమైనదని, కాలంయొక్క వరవడికి తట్టుకొని చిరకాలం నిలచేవి అవేనని చాలా మంది గుర్తించినట్టు కనబడదు.

నూతన రచనావిధానాలను ప్రోత్సహించేది ఎప్పటికైనా ప్రయోగాత్మక నాటకరంగం (Experimental theatre) ఇందుకు ఆర్థికసహాయం రానిదే ఇది జరగదు. నాటకరంగం ఉన్నతదశకు పరిణామం పొందాలంటే ఇదిముఖ్యం. ఇది గుర్తించి, పైన వ్యాపారిక నాటకరంగం అక్కడక్కడ మరీ అధోస్థితిని అందుకుంటుందని భయపడి, ఇంగ్లండులో ఆర్ట్సు కౌన్సిల్ (Arts Council) ఒకటి స్థాపించబడింది. ఈ సంస్థ ఉద్దేశ్యం నాటకాలను వ్యాపార దృష్టితో కాక, కళారీత్యా ఉన్నతశ్రేణిని అందుకున్న నాటకాలనే వెయ్యడం. దీనికి ప్రభుత్వం ఆర్థికసహాయం చేస్తుంది. దీని అభివృద్ధిలో డేమ్ సిబిల్ థార్న్‌డైక్, లూయి కేసెన్ లాంటి నటులు ఎంతో సహాయపడ్డారు. వీటి సహాయంతో నే టి. ఎస్. ఇలియట్ వ్రాసిన "మర్డర్ ఇన్ ఎ కెథిడ్రెల్" అనే కావ్యనాటకం మొదట మెర్క్యురీ నాటకమందిరంలో ప్రదర్శింపబడింది. ఆ తరువాత ఇంగ్లీషు ప్రేక్షకులకు రోనాల్డు డంకన్, క్రిస్టాఫర్ ఫ్రైల నాటకాలు పరిచయం చేయబడ్డాయి. యుద్ధరంగంలో వాతావరణాన్ని ఇతివృత్తంగా తీసుకొని సైనికులలో సైతం సహజ మానవత్వం ఉందని చూపే నాటకాలలో కొంతమంది విజయంపొందారు. ఇందుకు ఉదాహరణ ఆర్. సి. షెరిఫ్ వ్రాసిన "లాస్టు జర్నీ." ఈ నాటకం జరిగే స్థలం యుద్ధరంగంలో సైనికులు నివసించటానికి త్రవ్వుకున్న గుంటలు (Dug-outs). నాటకంలో అదొక్కటే సెట్టింగు. దూరంగా తుపాకి కాల్పులు అప్పుడప్పుడూ వినబడుతూ ఉంటుంది. ఇందులో రోజూ కాకీదుస్తుల్లో అంతా ఒకటేగా కనబడే సైనికులను వివిధపాత్రలుగా, సజీవంగా చూపించడం గొప్పతనం ఆ నాటకం చూచిన ప్రేక్షకులకు అదొక కనువిప్పు ఇక ఇటీవల పాశ్చాత్య దేశాలలో వెలువడిన నాటకాలలో అన్నిటికన్నా మిన్నగా చెప్పుకోదగిన నాటకం టెరెన్స్ రాటిగాన్ వ్రాసిన "విన్‌స్లోబాయి". శిల్పంలో, రంగంమీద అనుభవం, నాటకరంగజ్ఞానం (Theatre Sense) ఎక్కువ అని రేటిగాన్ కు ఉన్న పేరు దీనితో దృఢపడింది. పదునాల్గు ఏండ్ల కుఱ్ఱవానిమీద అన్యాయంగా మోపబడిన నేరంమీద పార్లమెంటుసభలో, బాహ్యప్రపంచంలో జరిగి తర్జనభర్జనలను రంగంమీద చూపకుండానే, విన్‌స్లో గృహంలో నివసించే పాత్రలమీద వాటి ప్రభావం చూపెడుతూ ప్రేక్షకులను నాటకం యొక్క ఆవేశంలోనికి లాగుకున్న ఉత్తమనాటకం అది. రచనా

# నేటి పాశ్చాత్య నాటకరంగము

శిల్పంలో ఇది నిర్దుష్టం. ఇంగ్లాండులో దీనికి ఎల్లెన్ టెర్రీ బహుమానం లభించింది.

ఇదే సమయంలో అమెరికాలో టెన్నెసీ విలియమ్స్, క్లిఫర్డ్ ఆడెట్స్ వ్యక్తి మనస్సు అంతర్భాగంలో రేకెత్తే వివిధ ప్రత్యేకతలను, వాస్తవికంగా చిత్రించటం మొదలెట్టారు. దాంతో మానసిక నాటకాలు (Psychological Plays) విజృంభించాయి. టెనెసీ విలియమ్స్ వ్రాసిన 'ఎ స్ట్రీట్ కార్ నేమ్డ్ డిజైర్"లో మనుష్యుల్లో మారుమూలలలో దాగుకున్న కామోద్రేకాలు ఒక్కసారి ఎలా ఉబికి బయటకు వస్తాయో ఉద్రేకంగా చిత్రించబడింది. చాలా వరకు మానసిక నాటకాలన్నిటిలోను బాహాటంగానో, అంతర్గతంగానో సెక్సుకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడుతూంది. ఇందుకు కారణం మానసికశాస్త్రిల్లో ఫ్రాయిడ్ చేసిన పరిశోధనల మూలంగా రచయితల హృదయంలో వెలిగిన నూతన వికాసం. కొత్తసత్యాల కాంతిలో కనపడిన కొత్త అభిప్రాయాలు. ఈ నాటకాలతో పాటు పాట్రిక్ హేమిల్టన్ మున్నగువారు రోప్, గేస్ లైట్ లాంటి నాటకాలలో మానసిక తత్వనిరూపణతోపాటు అపరాధపరిశోధకధోరణినికూడా కలగలపు చేసి వ్రాశారు.

ఇకపోతే పాశ్చాత్యదేశాలలో స్థావరంగా నిలిచిన నాటకసంస్థలు మినహాయించి, అమెచ్యూరుసంస్థలకు అట్టే విలువ ఉన్నట్టు కనపడదు. అమెచ్యూరు సంఘాల ప్రయోజనాన్ని గురించి చాలామంది విమర్శిస్తున్నప్పటికీ, ఏవో విశ్వవిద్యాలయాలలో, నాటకోత్సవాలలో (Play festivals) ఏదో ఒక చిన్న సంస్థ ఉన్న సదుపాయాలతో ఒక చిన్న నాటకం వెయ్యడమేగాని దానికి ఒక శ్రేణిలో విలువ ఇవ్వడం లేదు. వీరు నాటకాలేకాక, ఏకాంకికలు కూడా ఎక్కువ వేస్తుంటారు. ప్రయోగాలు (Experimentation) చెయ్యడానికి ఏకాంకికలు చాలా తోడ్పడ్డాయి. చెప్పకోదగ్గ ఏకాంకికలు వ్రాసిన రచయిత నోవెల్ కోవార్డు.

నటనలో కూడ పాశ్చాత్యరంగం మంచి అభివృద్ధిని పొందింది. మొదట్లో మొగవాళ్లే ముందుకు వచ్చి నటిస్తుండేవారు. స్త్రీలుమాత్రం ప్రథమదశలో పాత్రను అర్థం చేసుకొని నటించడంకన్నా అంగసౌష్ఠవాన్నిమాత్రం ప్రదర్శించడంతో ప్రదర్శనలు నియమిత అంతస్తును అందుకోలేక పోయాయి. కాలక్రమేణా నటనాకౌశలంగల స్త్రీలు నాటకరంగంలో ప్రవేశించటంతో నాటకాలు మంచి రక్తికట్టసాగినవి. ఈరోజు నటించే స్త్రీలు, సిబిల్ థార్న్‌డైక్, వివియన్ లీ—పురుషు జాన్‌గీల్‌గుడ్, లారెన్స్ ఒలివియర్‌లను పరిగణిస్తారు. ఇంకొకటి; ప్రథమదశలలో వేసిన నాటకాలలో (ఐరిష్ ఏబ్బీ థియేటర్‌లోని కొన్నిటి నాటకాలు) పాత్రలు ప్రేక్షకులను చూస్తూ ఉపన్యాస ధోరణిలో మాట్లాడేవారు. ఇప్పుడు సంభాషణలు చురుకుగా, వాస్తవికంగా, మరీ ఉపవాస్తవికం (Neo-realistic) అయి ప్రేక్షకులకు విసుగు పుట్టకుండా ఉండే నాటకాలు చక్కగా తయారవుతున్నాయి.

ఏమైనా పాశ్చాత్యదేశాలలో చలనచిత్రం వచ్చి అడ్డు తగిలినప్పటికీ నాటకకళమాత్రం నలుదిశలా మంచి పరిణామాన్ని పొందుతూంది. నూతన శైలి కనబడ్తూంది. సాధ్యమైనంతవరకు కొత్త రచయితలు వస్తున్నారనే చెప్పాలి. దీనికి కారణం నాటకాల ప్రదర్శనకు కావలసిన వాతావరణం ఏర్పరచుకోవడం. నాటకాలను మరీ క్రిందిఅంతస్తుకు తీసుకొనిపోయి, విలువలేని క్రిందితరగతి వినోదాన్ని అందించి డబ్బు సేకరించడం చెయ్యకూడదు. అట్లు పూర్తి కట్టుదిట్టాల్లో ఉంచి, ప్రజలకు ఏమి కావాలో కూడ తెలుసుకోనే అక్కరలేకుండా "కొత్త కోసరం కొత్త" (New for the sake of new) అనే పద్ధతిలోనూ పోకూడదు. పైన రచయితకు సాధ్యమైనంత స్వాతంత్ర్యం ఇవ్వడం అవసరం. వీటిని దృష్టిలో పెట్టుకొని నాటకసంస్థలను స్థాపించి, నాటకరంగం కొనసాగించవలెనని ఉద్దేశ్యం చాలా దేశాలకు ఉన్నట్టుగా కనబడ్తూంది. మొత్తానికి ఆధునిక యుగంలో ప్రపంచ నాటక కళారంగాన్ని ఒక్కసారి చూస్తే, దాని అభివృద్ధికి పాశ్చాత్య నాటకరంగం చాలా ఎక్కువగా తోడ్పడిందని చెప్పక తప్పదు. ఈ పరిస్థితుల్లో ఇంకా ముమ్ముందు పాశ్చాత్య నాటకాల ప్రభావమేకాక, అనుభవంకూడా ప్రపంచ నాటకరంగానికి తోడ్పడి, నాటక కళకు క్షణక్షణం వినూత్న వికాసాన్ని ఇస్తుందని ఆశించవచ్చు.

# శ్రీహర్ష శ్రీనాథుల స్వర్గసమావేశము

శ్రీ కె. వి. ఆర్. నరసింహం—శ్రీ కె. జోగయ్యశర్మ

: ఊహా గోష్ఠి :

శ్రీహ : ఒడలంతా విభూతిపెండికట్లూ, మెడలో రుద్రాక్షతావళమూ, పట్టెంచలూ మడిచి కట్టిన రత్నాంబరమూ, చేతులకు రత్నాల బటువులూ, చెవులకు మకరకుండలాలు శాంతశృంగారాలు మూర్తీభవించినట్లున్న ఈ మహానుభావు డెవరో! ఇటే వస్తున్నారు, అడిగిచూద్దాం, ఎవరు మహాత్మా మీరు ?

శ్రీనా : నన్ను శ్రీనాథు డంటారు.

శ్రీహ : సకలవిద్యాసనాథులు శ్రీనాథులు మీరేనా ? నైషధాంధ్రీకర్తలు.

శ్రీనా : అవును, ఆ భాగ్యం నాకే లభించింది. కాని యింత విడమరచి అడుగుతున్నారు తమ రెవరో ?

శ్రీహ : నన్ను శ్రీహర్షు డంటారు.

శ్రీనా : నైషధీయచరిత్రగ్రంథకర్తలా ?

శ్రీహ : అవును.

శ్రీనా : ఆహా ! నేడెంత సుదినం ! చింతామణీ మంత్రసిద్ధులు, కాశ్మీరనృపసభాకమలార్కులు, కన్యాకుబ్జరాజాస్థాన రంగ మంగళాభరణులు, నైతండికకమలషండవేదండులు, ఖండనఖాద్యకారులు, నైషధీయచరితరచనావిదగ్ధులు, శ్రీహర్షకవి చక్రవర్తులు, తమ దర్శనభాగ్యాన్ని ప్రసాదించి నన్ను ధన్యుణ్ణి చేసేరు.

శ్రీహ : నన్ను మీరు అంతగా ప్రస్తుతించడం భావ్యం కాదు. మీరు మాత్రం సామాన్యులా? త్రైవిద్యాంతవిద్యానిధులనీ, బహుభాషా కోవిదులనీ భాష్యాంతవైయాకరణులనీ విన్నాం. విన్నదాది మిమ్మల్ని దర్శించాలనే కుతూహలాన్ని పొందేం అది నేటికి నెరవేరినందుకు సంతోషం.

శ్రీనా : అదంతా మీ అభిమానం.

శ్రీహ : కేవలం అభిమానంవల్ల ఏం ప్రయోజనం లెండి. మీరు అంతవారు కనుకనే రాజాస్థానములలో విద్యాపరీక్షాధికారులవటమూ బహుదేశ బుధులతో భాషించడమూ జరిగినది.

శ్రీనా : అదీ ఒక పెద్ద విశేషమే అంటారా? తత్రాపి కాన్యకుబ్జాధీశ్వరుల నిండుపేరోలగంలో ఆ రాజచంద్రుని చేత తాంబూలద్వయ ఆసనాది గౌరవాలను పొందిన మీ యెదుట చెప్పుకోదగ్గ విశేషమే అంటారా ?

శ్రీహ : కాకేమండీ! మీరు అంతటి సకలవిద్యాసనాథులు కనుకనే ఉద్దండపండితుడు డిండిమ భట్టుని శాస్త్రవాదంలో జయించడమూ, విశిష్ట, దక్షిణాధీశ్వరుల ముత్యాలశాలలో కనకాభిషేక గౌరవాన్ని పొందడమూ జరిగింది. అది సాధారణకవికి జరిగే గౌరవమేనా ?

శ్రీనా : అదంతా మీవంటి పెద్దల ఆశీర్వాదబలమూ, ఆ బ్రహ్మీదత్తవరప్రసాద బలమూను. అంతేగాని, అందులో నా ప్రయోజకత్వమేమీ ఉందనుకోను.

శ్రీహ : నిండుకుండ ఎప్పుడూ తొణకదు లెండి. ఉభయ భాషలలోనూ నిశితమైన పాండిత్యమూ, ఉభయ మీమాంసలలోనూ కూలంకషమైన పరిజ్ఞానమూ ఉన్నవారు కాబట్టే ఆంధ్ర కవి ప్రపంచంలో మీకు విశిష్టమైన ఒక ఉన్నతస్థానం లభించింది. నే నెరిగినంత వరకూ తెనుగుకవులలో ఇంతటి సకలవిద్యాసనాథులు లేరనుకుంటాను. కనుకనే విద్వదౌషధమయిన నా నైషధీయచరితాన్ని ఆంధ్రీకరింపగలిగినారు. బహుశా, మీకు

తప్ప ఇంకొకరికి ఆ పని సాధ్యం కాదనికూడ నా భావన.

శ్రీనా : ఏదో అదంతా ఆ శారదాంబ కృప. ఆ తల్లి దయవల్ల పండితవాదమూ, గ్రంథరచనమూ జయప్రదంగానే సాగినవి. రాజాస్థానగౌరవం కూడా లభించింది. ఇక మీ నైషధీయ చరితానువాదం సంగతి, ఆ మహాగ్రంథానువాదంపట్ల చాలా శ్రమే పడవలసివచ్చింది. ఖండనఖాద్యగ్రంథకర్తలైన మీ ప్రతిభకు నెలవైన ఆ జటిలప్రబంధాన్ని ఆంధ్రభాషా వధూటి అనుగుణంగా కనిపెట్టి పలుకుతోడై ప్రసన్నభావం చూపడంవల్ల కొంతలో కొంతగానైనా సరసంగా ఆంధ్రీకరించి కృతార్థుణ్ణయ్యా ననుకుంటున్నాను

శ్రీహ : కొంతలో కొంతగా ఏమండీ, మీ ఆంధ్రీకరణ విధానం ఎంతో సరసంగా ఉంది. నేనూ చాలాభాగం చూచేను; బహు నేర్పుగా పరివర్తనం సాగించేరు. రసవద్ఘట్టాలను జాగరూకతతో నిర్వహిస్తూ, కొన్నిటిని కుదిస్తూ, విడివిడిగా ఉన్న శ్లోకములను ఒక వరుసకు తెచ్చి మీ భావానుగుణంగా ఒక పద్యంలో ఒకరూప మిస్తూ, ఒక్కొక్క శ్లోకానికొక్కొక్క పాదముగా సీసపద్యముల నడకను వయ్యారంగా తూగిస్తూ, ఒక్కొక్క చోట ఒక శ్లోకభావాన్ని ఒక్క సమాసంలో అందంగా పొందుపరుస్తూ, కొన్ని శ్లోకములు కలిపి ఒక వచనంలో వివరిస్తూ, మొత్తమ్మీద రచనంతా ఎంతో మనోహరంగానే నిర్వహించారు. అనువాదం బహు రమ్యంగా ఉంది.

శ్రీనా : నాశక్తివంచనలేకుండా, సరసంగానే అనువాదం సాగించే ననుకుంటున్నాను. కానైతే యీ రచనను గూర్చి ఆంధ్రదేశమందు పండితలోకంలో కొన్ని భేదాభిప్రాయా లున్నట్లు విన్నాను. సంస్కృతబాహుళ్యం ఉన్నపట్లు చూచి కాబోలు "డుమువులు చేర్చడం తప్ప ఆయన ఆంధ్రీకరణంలో పడిన శ్రమేమిటని" కొందరు, "అదేమ్మాట, అంత క్లిష్టమైనమహాకావ్యాన్ని అనువదించేటప్పుడు ఆపాటి సంస్కృతం వాడకుండా ఎలా కుదురుతుంది? అందమైన పలుకుబళ్లూ ఒయ్యారములైన రచనావిశేషములూ ఎన్నున్నాయో గుర్తించారా! మొత్తంమీద రచన ఎంతో హుందాగా ఉందని కొందరూ" వాదోపవాదాలు సాగిస్తున్నట్లు వినికిడి.

శ్రీహ : దానికేం లెండి. 'భిన్నరుచిర్హి లోకః'! ఏతావతా, "విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం". నా దృష్టికి మాత్రం మీ రచన చాలా సరసంగా ఉంది.

శ్రీనా : నమస్తే. పెద్దలూ బహుశ్రుతులూ మూల గ్రంథకర్తలూను మీ ఆమోదమే నాకు పరమ సంతోషదాయకం. ఇప్పటికి నా పరిశ్రమ చరితార్థమైనదని భావిస్తున్నాను.

శ్రీహ : తథాస్తు. కానైతే, మీ రచనలో అక్కడక్కడా కొన్ని సందేహాలు...

శ్రీనా : ఉన్నవా? నిస్సంకోచంగా సెలవిప్పించండి. ఓపినంతమట్టుకు సమాధానం చెబుతాను.

శ్రీహ : మంచిది. ఆంధ్రీకరణవిషయంలో అవలంబించిన విధానం, గ్రంథాంత గద్యలో మీరు ఉద్ఘాటించినది, బహుశా జ్ఞప్తిలో ఉందనుకుంటాను.

శ్రీనా : బాగా జ్ఞప్తిలోఉన్నది. వినిపించమంటారా?

శ్రీహ : అక్కర్లేదక్కర్లేదు. అందులో, "ఔచిత్యం బాదరించియు అనౌచిత్యంబు పరిహరించియు" అన్నారే, దీన్ని మీరెలా సమర్థిస్తారు?

శ్రీనా : ఏ సందర్భంలోనైనా మీ కంటబడితే మీ మనస్సు ఏమి నొచ్చుకుంటుందో అని సందేహిస్తూనే ఈ వాక్యం రాసేను. అది మీకంట పడనేపడింది, అడగవలసిన ప్రశ్న అడిగేరు, మనవి చేస్తాను చిత్తగించండి. మీ గ్రంథంలో నలుని సౌందర్యానికి త్రిమూర్తుల భార్యలూ, శచీదేవీ మరులుకొన్నట్టు పేర్కొన్నారు. జగన్మాతలకు చాపల్యం కలిగినట్లు వర్ణించడం ఔచిత్యం కాదనుకుంటాను.

శ్రీహ : సరే ఈ ఒక్కటీ అలాగే కానివ్వండి. అంత మాత్రానికే అది ఉద్ఘాటించి చెప్పవలసిన విషయమా?

శ్రీనా : ఇది ఒకటే కాదు. నా దృష్టిలో మరికొన్ని కూడా ఉన్నవి. తమరు సావధానంగా వింటే చెబుతాను.

శ్రీహ : ఏమిటో అవి: సావధానంగానే ఉన్నాను. చెప్పండి.

శ్రీనా : నలదౌత్యంలో, దూతగా వచ్చిన నలుణ్ణి చూసీచూడటంతోనే దమయంతి కామించి, అతణ్ణించి తన దృష్టిని మరల్చలేనట్లు—

'దమస్వసుర్దృష్టి సరోజరాజిశ్చిరం
నతత్యాజ సబంధుబంధుం'

ఇత్యాదిగా సుదీర్ఘమైన వర్ణన సాగించేరు. మాచేరా, అప్పటికి ఆ దూత నలుడని దమయంతికి తెలియదుగదా? అలాంటప్పుడు, ఆమె అతణ్ణి కామించినట్లు వర్ణించడం ఉచితం కాదని నా అభిప్రాయం. అలాగే, హంసని, 'రతిక్లమాలసః' అని చెప్పి, వక్ష్యమాణ శ్లోకంలో హంసిని 'నవప్రసూతిర్వరటా తపస్వినీ' అని వర్ణించేరు. ఈ రెండూ ఒకచోట చెప్పడం అంత సరసమైనపద్ధతి కాదనుకుంటాను.

శ్రీహ : ఈ సందర్భంలో మీరు చేసిన మార్పు?

శ్రీనా : ఆవర్ణనా, ఈ విశేషణమూ పరిత్యజించేను.

శ్రీహ : ఏదో కవితావేశంలో నేను ఆ విధంగా వర్ణించి ఉంటాను. ఈ విషయాన్ని మీరు సరసంగానే సమర్థించారు.

శ్రీనా : అంతే, లేకంటే ఆపాటి ఔచిత్యం తమకు తెలియక చేశారనగలనా?

శ్రీహ : సరే, ఇక మరోవిషయం చూదాం. "సరసీః పరిశీలితుం మయా" అన్న శ్లోకానికి మీరు రెండుపద్యాలు రాసినట్టుంది. ఒక పద్యం చాలదా?

శ్రీనా : భావాన్నే చెప్పాలంటే ఒకపద్యం చాలు. కాని, ఆ పదసంయోజనలోని వైచిత్రిని తేవాలంటే రెండుపద్యాలూ అవసరం. 'గమికర్మీకృత నైకనీవృతా' అన్న సమాసానికొక పద్యం, 'సదసత్సంశయ గోచరోదరీ' అన్న సమాసానికొకపద్యం.

శ్రీహ : సరేకాని, ఇందులో మీరు చేసిన తెలుగేముంది? ఎవరో అన్నట్టు 'డుముపులు' చేర్చడం మాత్రమేనా?

శ్రీనా : మీరూ ఇలాగనడం భావ్యంగాదు. శబ్దచమత్కృతికే ప్రాధాన్యమిచ్చే కావ్యంలో ఆ శబ్దాన్ని సర్వత్రా పరిహరిస్తే, ఇక మిగిలేదేముంది? మీగ్రంథాన్ని పండితమండలి శిరసావహించడానికి కారణం అందులోని శబ్దచమత్కృతివిశేషమేగాని, నలునికథ తెలియక కాదుగదా!

శ్రీహ : మీ సమాధానం చాలా బాగుంది. నా గ్రంథాన్ని ఉద్దేశపూర్వకంగానే గ్రంథగ్రంథులు పెట్టి నేను క్లిష్టంచేసేను. "గ్రంథగ్రంథిరిహ క్వచిత్ క్వచిదపి న్యాసి ప్రయత్నాన్మయా" అని ముక్తకంఠంగా చాటి చెప్పేను

శ్రీనా : అంతేకాదు. "యథా యూనస్తద్వ త్పరమరమణీయాపి రమణీ, కుమారాణాం అంతఃకరణహరణం నైవ కురుతే" అని మీగ్రంథం కొంత సంస్కారంకలవారికేగాని కేవలం అజ్ఞులకోసం రచింపబడలేదని కూడా చెప్పేరు.

శ్రీహ : అవునంతే. ఏదీ మరి, 'చేతో నలం కామయతే మదీయం' అన్న శ్లోకాన్ని మీరెలా ఆంధ్రీకరించేరో చెప్పండి.

శ్రీనా : మీరు కవిత్వం చెప్పింది గీర్వాణభాషలో. అందులో పొసగిన శబ్ద చమత్కారాలు కొన్ని తెలుగులో పొసగవు. నలం, కామయతే అని న-లం కాం-అయితే అని, విరవడానికి దేవభాషలోనే అవకాశం ఉంటుంది. తెలుగుభాష కాశక్తిలేదు. కాబట్టి అటువంటి శ్లోకాలన్నీ జారవిడిచేను.

శ్రీహ : అయితే, పంచనళీయంలోని "దేవః పతిర్విదుషి నైషధరాజ గత్యా" అన్న అయిదర్థాలుగల శ్లోకాన్నికూడా...

శ్రీనా : విడిచిపెట్టేను.

శ్రీహ : పంచనళీయంలో నా శక్తంతా ధారపోసేను. దానిలోని సొగసులు కొన్నైనా మీ వంటి

ప్రతిభాశాలురు తెలుగులోనికి తెస్తే బాగుం డును. సరే, అదలాగుణ్ణీయండి "పశ్యోత్సన్న సౌఽస్థితి సౌఖ్యలత్వే" అన్న శ్లోకాన్ని మీ రాంధ్రీకరిస్తూ 'గగనమధ్యోపస్థితున్' అన్న విశేషణాన్ని మూలంలో లేనిదాన్ని హెచ్చుగా వాడేరే! ప్రయోజనం?

శ్రీనా : ఉన్నది. గగనమధ్యస్థితుడు కానప్పుడు చంద్రుడు హంసప్రక్కనే ప్రతిబింబింపడు. కొంచెం దూరంగా ప్రతిబింబం కనపడు తుంది. అది చుంబించడానికి హంస కదిలితే ప్రతిబింబంకూడా కదులుతూనే ఉంటుంది. కాబట్టి మింటినడుమ చంద్రుడున్నప్పుడే ప్రతిబింబం చుంబించడానికి అవకాశం ఉంది. అందుకే ఆ మార్పు.

శ్రీహ : నేను "తం వీజయామః స్మరకేళికాలే" అంటే, మీరు "వీతు నాతని వైశాఖవేళ లందు" అన్నారే, ఈ మార్పు చేయడంలో మీ అభిప్రాయం?

శ్రీనా : "స్మరకేళికాలే" అన్నమాటలో సవతిపోరు ధ్వనిస్తోంది. అది హంస ఆశించిన కార్యానికి వైరస్యం కలిగించవచ్చునని భావించి ఆ విధంగా మార్చేను.

శ్రీహ : ఇది సరేగాని, "అళీవ పశ్యే ప్రతిషేధతీయం కపోతి హుంకారగిరా వనాళీః" అన్న చోట, కపోతాన్ని వనప్రియగా మార్చ డంలో మీ ఉద్దేశం?

శ్రీనా : పురుషస్వరమైతే కపోత హుంకారంతో పోల్చడం సరసంగా ఉండేది. ఇక్కడ చెలి కత్తె స్వరం ఉపమేయం కాబట్టి కోకిల స్వరంతో ఉపమించడమే ఉచితంగా తోచి అలా మార్చేను.

శ్రీహ : సరే, ఈ మార్పు కీసమాధానం సరిపడ్డది. కాని అన్నిటికీ మీకు సమాధానాలు లభించ వనే నా నమ్మకం.

శ్రీనా : లభించనప్పుడు నమ్రతతో నా లోపాన్ని అంగీకరిస్తాను. తాము అడిగదలచిందేదో అడగండి.

శ్రీహ : దమయంతీసౌందర్య వర్ణనలో "అధరం కిల బింబ నామకం" అన్న శ్లోకాన్ని మీరెందు కాంధ్రీకరించలేదో! బహు చమత్కారా వహమైన ఆ శ్లోకం తమకు నచ్చలేదా?

శ్రీనా : నచ్చకేమి! కాని, కేవల శబ్దచమత్కృతి తప్ప అందులో విశేషమేమీ నా బుద్ధికి గోచ రించలేదు.

శ్రీహ : దాని లోపం?

శ్రీనా : లోపమేమీ లేదు కాని, ఆ వర్ణన వల్ల దమ యంతీసౌందర్యమేమీ సూచితం కాదు. కేవల పాండిత్యప్రకర్ష తప్ప.

శ్రీహ : అయితే, కావ్యంలో పాండిత్యప్రకర్ష ప్రదర్శించడం అనావశ్యక మంటారా?

శ్రీనా : ఎలా అనగలను! కాని, అది వర్ణ్యవస్తు వునే ఆచ్ఛాదించకూడదు గదా! అదీకాక, ఇది ఆంధ్రీకరణం. మూలంలోని సాహిత్య ప్రధానములైన వర్ణనలన్నీ అనువదించా లంటే ఈ భాషకి ఒదుగుచాలదు. అలాగని అసలే విడవకుండా వీలూ, ఔచిత్యమూ, అవసరాలనుబట్టి చాలా వర్ణనాంశాలను అనువదించేను. కొన్నిటికి మెరుగుపెట్టేను కూడా.

శ్రీహ : అలాగా! ఏదీ నా వర్ణనమీద మెరుగు పెట్టిన భాగం ఒక్కటి చూపెట్టండి సంతో షిస్తాను.

శ్రీనా : అలాగనండి సరసమైన మాట. చూడండి "మధ్యే శ్రుతీనాం ప్రతివేశినీనాం సరస్వతీ వాసవతీ ముఖేఽస్యాః" అన్న శ్లోకం జ్ఞప్తిలో ఉందనుకుంటాను.

శ్రీహ : లేకేం, హంస తన్నుగూర్చి దమయంతితో చెప్పే సందర్భంలోది.

శ్రీనా : దానిభావం?

శ్రీహ : ఏముంది, వేదసాహచర్యంవల్ల నా వాక్కు అసత్యంకాదు అని.

శ్రీనా : దీనికి నా ఆంధ్రీకరణం చిత్తగించండి:

"భారతీదేవి ముంజేతి పలుకుఁజిలుక
సముదగజయాన, సబ్రహ్మచారి మాకు;
వేదశాస్త్ర పురాణాది విద్యలెల్ల
తరుణి, నీయాన ఘంటాపథంబు మాకు"

శ్రీహ : శెబాష్! కవిసార్వభౌమా! మీ ఆంధ్రీకరణం నిజంగా మూలానికి వన్నె తెచ్చింది. "భారతీదేవి ముంజేతి పలుకుఁజిలుక సముద గజయాన, సద్బ్రహ్మచారి మాకు," ఎంత ఉదాత్తంగా ఉంది! అద్భుతమైన కల్పన! ఏదీ మరొక్కటిలాటిది.

శ్రీనా : ఇలాటిదానో కాదోగాని మరోచోట చిన్న మార్పు చేసేను. అంటే కొంచెం పెంచి వ్రాసేను.

శ్రీహ : ఊఁ, విందాం కానీయండి.

శ్రీనా : దేవదూతగా వెళ్ళిన నలుడు దాంబరీవిద్యను విడిచి దమయంతిముందు సాక్షాత్కరిస్తాడు. ఆ సన్నివేశాన్ని మీరు ఒక్క ఉపమానంతో ముగించేరు.

శ్రీహ : అవును, "పలాలజాలైః పిహితః స్వయం హి ప్రకాశమాసాదయతీక్షువంశః" అని ఒకే ఉపమానం చెప్పేను.

శ్రీనా : ఔనుగదా, ఆ అద్భుత సన్నివేశాన్ని ఒక్క సామాన్యమైన ఉపమానంతో ఆవిష్కరించడం నాకు ఆపోలేదు. అందుకని సరసమైన మరి మూడు కలిపేను. "జవనిక వాయంపట్టినం బొడసూపు బహురూపు తెఱంగున, జలధర తిరోధానంబు వాసినం బ్రకాశించు నా హిమధాముని పగిది, అవిద్యావరణంబు విరిసినం దోఁచు పరమాత్ముని ప్రకారంబున, దోహద పలాలజాలంబు...

శ్రీహ : బాగుంది. మీరు వేసిన మూడు పమానాలూ సముచితంగానే ఉన్నవి. ఆ ఘట్టాని కవి ఆవశ్యకమే. అద్భుతానందజనకమైన నలుని హఠాత్ సాక్షాత్కారాన్ని చాలా చక్కగా విశదీకరించేరు.

శ్రీనా : ఇంకా మరికొన్ని వినిపించమని......

శ్రీహ : అక్కర్లేదు. మీ ఆంధ్రీకరణ విధానమూ నైపుణ్యమూ నాకు అవగతమయేయి కాని, ఒక్క సందేహం.

శ్రీనా : కవి చక్రవర్తులు సందేహించడం దేనికి? అడగండి.

శ్రీహ : ప్రప్రథమంలోనే వచ్చింది ప్రశ్న. నేను నైషధీయచరితమంటే మీరు శృంగార నైషధమని మార్చేరే! కారణం?

శ్రీనా : ఇది మొట్టమొదటే అడగవలసిన ప్రశ్న. తుది నడిగినా దీనివిలువ దీనికుంది లెండి; నైషధీయ చరితంలో నిషధరాజు చరిత్రంతా మీరు చెప్పడంలేదు. వివాహఘట్టాల నన్నిటినీ విడిచిపెట్టి; అతని శృంగారజీవిత సన్నివేశాలను మాత్రమే వర్ణించేరు. కాబట్టి యీ గ్రంథాన్ని నైషధీయచరిత మనడంకంటె శృంగారనైషధ మనడమే ఉచితంగా నాకు తోచింది. ఈ విషయంలో తామూ నాతో ఏకీభవిస్తారనుకుంటాను?

శ్రీహ : ఈ విషయమొక్కటేమేం, మీతో సర్వథా నేను ఏకీభవిస్తున్నాను. మీ ఆంధ్రీకరణం నా గ్రంథానికి చాలాచోట్ల మెరుగుపెట్టింది. మిమ్మల్ని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

శ్రీనా : ఏమైనా నేను ఆంధ్రీకర్తను మాత్రమే. అసలు సృష్టికర్తలు మీరు. పచ్చిబంగారాన్ని మీరందిస్తే పైనగిషీలు నేను చెక్కేను.

శ్రీహ : అలాగనకండి, ఎవరి విలువ వారిది, మీరు నిజంగా కవిసార్వభౌములే. నా గ్రంథానికి ఆంధ్రదేశంలో ఇంత ప్రశస్తి రావడానికి మీ ఆంధ్రీకరణమే కారణమని యిప్పుడు గ్రహించేను. మీతోడి సల్లాపసౌభాగ్యాన్ని అనుభవించేను చాలా సంతోషం. కాని ఒక్క సంగతి!

మనం ప్రసంగం ముగించేముందు చెప్పాలనుకుంటున్నాను. మీరు గుర్తించారో లేదో నా రచనలో ఒక్కచోట చాలా పొరపాటు జరిగింది.

శ్రీనా : కవిచక్రవర్తులూ మహాపండితులూను, తమకు కూడా పొరపాటు!

శ్రీహ : ఎవరైతేనేం జరిగిన తరువాత! అది మీ ఆంధ్రీకరణంల[illegible]నైనా సవరించే రనుకుంటాను.

శ్రీనా : అసలదేమిటో సెలవియ్యండి, సవరణ మాట తరువాత చూదుకుందాం, వినాలని నాకూ ఆతుర్దాగానే ఉంది.

శ్రీహ : నలదమయంతుల స్వయంవరానంతరం, కలి దిక్పాలుర సంభాషణలో "పాంచాలీ పాండవైరివ" అన్నానండీ కాలవ్యత్యాసాన్ని గుర్తించకుండా. నలుని కాలంలో, ఆతనికి ఎన్నోతరాలు తరువాతివారైన పాండవుల ప్రసక్తి ఎంత ప్రమాదజనితం! ఇది మీరైనా గుర్తించి సవరించేరను కుంటాను.

శ్రీనా : ఏమన్నారు! నలుని కాలంలో పాండవ ప్రసక్తి! "పాంచాలీ పాండవైరివ!" హౌనండోయ్! చాలా గొప్ప పొరపాటే! ఈ సందర్భంలో నేనేం రాసుంటానో! ఉండండి జ్ఞప్తికి తెచ్చుకుంటాను. 'పాకశాసనుండు...పంచముఖుడైన యేను నియ్యేపు రసు పాండవులు పాంచాలిని బోలెఁ బంచుకొని యనుభవింతము"—నేనూ కవితావేశంలో ఆ మాటలే అనువదించానంకి కాలవ్యత్యాసాన్ని గుర్తించకుండా.

శ్రీహ : మొత్తమ్మీద, అన్ని శాస్త్రాలు చదివి అన్నేసి గ్రంథాలు వ్రాసి, అంతటి కీర్తిప్రతిష్ఠలు సంపాదించిన యిద్దరమూ ఈ విషయంలో ఒక్కలాగే పొరపడ్డామన్న మాట!

శ్రీనా : అయ్యా, 'ప్రమాదో ధీమతామపి'. అది మానవ సహజమనుకుంటాను.

శ్రీహ : అవును నంతేఁసుకోవాలి. సరే, మళ్ళీ కలుద్దాం.

శ్రీనా : సెలవు.

# కలగూరగంప

## జాతకచంద్రికపై పండిత మీమాంస:

శ్రీ వఝల చినసీతారామస్వామిశాస్త్రి

శ్రీ భారతీపత్రిక 33 సంపుటము 2 సంచిక "కలగూరగంప"లోని వ్యాసమునకు జవాబు:

అన్యవ్యక్తుని ప్రారంభోపన్యాసముపై నొకరు విమర్శించి యన్యవ్యక్తుని జవాబు వినకయే వెంటనే వెడలిపోవునపు డన్యవ్యక్తుఁ డుపన్యాసకుల వాఙ్ముఖముల తుదిని జవాబిచ్చుట తప్పా? అతని పరోక్షమందుఁ జెప్పరాదనుట యుక్తమా? అన్యవ్యక్తుఁ డాతని యింటికిఁబోయి యాతని ప్రత్యక్షమునఁ జెప్పవలయునా?

జాతకచంద్రికను బూర్వపారాశరి యుత్తరపారాశరి యను రెండు భాగములనుగా విభాగింపవచ్చుననియు నందుఁ బూర్వపారాశరి మొదటి నలువది శ్లోకములు మాత్రమె యనియు నయ్యది మాత్రమె వేంకటేశదైవజ్ఞవిరచిత మనఁదగుననియు నొకపక్షము గలదనిమాత్రమె నాఁటి సభలో నేను వచించితిని. కాని యదియే సిద్ధాంతమని నేను వచింపలేదు. ఇందులకు విలక్షణముగా వ్రాసిన వ్రాఁత సత్యము కాదు.

పూర్వ పారాశరీకర్త గ్రహములను "సామాన్య శుభులు- కేవల శుభులు- సామాన్య పాపులు- కేవల పాపులు-మారకులు- యోగకారకులు" అని నాల్గు తరగతులుగా విభజించెను. "నదిశన్తి శుభం నృణాం। సౌమ్యాః కేన్ద్రాధిపా యది। క్రూరాశ్చే దశుభం త్వేతే। ప్రబలా ఉత్తరోత్తరమ్" (పా ౬ శ్లో) అని నైసర్గిక సౌమ్యులగు గురుశుక్రాదులు కేంద్రాధిపతు లయినచో శుభఫలము నియ్యఁజాలరనియు, నైసర్గికక్రూరులు కేంద్రాధిపతు లయినచో వారశుభఫలము నియ్యరనియు నిట్లు సామాన్య శుభ పాపులను వచించెను. అట్లె యష్టమ వ్యయాధిపతులు సామాన్యపాపులుగా వచింపబడిరి.

"భాగ్యవ్యయాధిపత్యేన। రన్ధ్రేశో న శుభప్రదః। సఏవ శుభసంధాతా। లగ్నాధీశోపి చేత్ స్వయమ్" (పా॰ 8 శ్లో॰) అని యిట్లగ నష్టమాధిపతి యశుభఫలదాతయనియు లగ్నాధిపత్యముగలవాఁ డైనచో శుభఫలదాతయనియుఁ జెప్పెను. ఇటఁ బాపులని చెప్పక శుభఫలప్రదాతలు కారనిచెప్పుటచేత వీరు కేవలపాపులు కారని విశదమగుచున్నది. ఇట్లె యశుభము నియ్యరనుటచేఁ గేవలశుభులు కారనియు వ్యక్తమగుచున్నది.

"సర్వే త్రికోణనేతారో। గ్రహాః శుభఫలప్రదాః। పతయస్త్రిషడాయానాం। యది పాపఫలప్రదాః. (పూర్వ పా ౫ శ్లో)

పంచమ నవమాధిపతులు శుభు లనియుఁ దృతీయ షష్ఠ లాభాధిపతులు పాపులనియు నీ శ్లోకమున కర్థము. పంచమ నవమాధిపతులు శుభులనియు వారు తృతీయ షష్ఠ లాభాన్యతమాధీశులయినచోఁ బాపు లగుదురనియుఁ బూర్వపక్షులు చెప్పిన యర్థము. ఈ పక్షమునఁ దృతీయ షష్ఠ లాభాధిపతులు పాపులను నర్థము వాచ్యము కాలేదు. పంచమ నవమాన్యతరాధిపతులై తృతీయ షష్ఠ లాభాన్యతమాధిపతులును నయినవారె పాపులను నర్థము వాచ్యమగుచున్నది. మఱియుఁ బూర్వపక్షుల యర్థము గ్రంథకర్తృత్వప్రణాళికకు విలక్షణము. ఇది పూర్వపారాశరకర్తకే కాక యుత్తరపారాశరకర్తకును సమ్మతము కాదు. కర్కాటలగ్నమునకు గురుఁడును మకరలగ్నమునకు బుధుఁడును షష్ఠ నవమాధీశులయి యుండఁగా వారు శుభులేయని యుత్తరపారాశరిలోఁ జెప్పబడినది. పంచమ నవమాన్యతరాధీశతారూపశుభత్వమును ద్వితీయ షష్ఠ లాభాన్యతమస్థానాధీశతారూప పాపత్వమును నొక్కనికే కల్గునపుడా గ్రహము మిశ్రఫల దాతయగునే కాని పాపి యెట్లు

గును? శుభత్వాధిక్యమున శుభుఁడే కావచ్చుననియుఁ జెప్పఁబడెను

"కర్కాటలగ్నమునకు:—భార్గవేన్దుసుతౌ పాపౌ భూసుతాఙ్గిరసౌ శుభౌ। ......కులీర సంభవస్యైవం। ఫలాన్యూహ్యాని సూరిభిః"

(ఉత్తర పా. ౫౧-౫౨ శ్లో)

"మకర లగ్నమునకు :—"కుజ జీవేన్దవః పాపాః శుభౌ భార్గవచన్ద్రజౌ......జ్ఞాతవ్యాని బుధైరేవం। ఫలాని మృగజన్మనః" (ఉత్తర పా ౬౩ ౬౪ ౬౫ శ్లో)

మఱియు 'యది' శబ్దమాత్రముచే బూర్వపక్షుల యర్థము లభింప నేరదు. గ్రంథకర్త యట్టి స్థలముల నెట్లు వచించునో యరయుఁడు—

"భాగ్యవ్యయాధిపత్యేన । రన్ధ్రేశో నశుభ ప్రదః। స ఏవ శుభసన్ధాతా। లగ్నాధీశోఽపి చేత్ స్వయమ్." (పూర్వ పా. ౭ శ్లో) యది శబ్దము చేనర్థకమే కదా.

'సఏవ - అపి' అను వానిని జేర్చిన యీ గ్రంథ ప్రణాళి ప్రకృతమగు సర్వే త్రికోణేత్యాది శ్లోకమున లేదే !

ఇంత యేల ! శుభత్వ పాపత్వ సంధాయకాధిపత్యద్వయ మున్నపుడా గ్రహము మిశ్రఫలదాత యగునే కాని పాపియగు ననుట యెట్లు పొసంగును?

"నర్మకర్మాధి నేతారౌ। రన్ధ్ర లాభాధిపౌ యది। తయోస్సంబన్ధమాత్రేణ। న యోగం లభతే నరః" (పూర్వ పా. ౨౧ శ్లో) అని కదా మిశ్రాధిపత్య ఫలము చెప్పబడెను. అట్టి గ్రహమునకు శుభత్వమే కాక పాపిత్వమును గలుగుననిన ననవచ్చును

పయి సందర్భమును బట్టి పూర్వపక్షుల యర్థము శాస్త్రసంప్రదాయ విరుద్ధమును విమర్శనారాహిత్యకృతమును ననుటలో సందియము లేగుగదా.

పూర్వపారాశరి యుత్తరపారాశరి యనునవి యేక కర్తృకములు కావను పక్షము బలవత్తరముగాఁ గన్పట్టుచున్నది పూర్వపారాశరిలో నెచ్చటనూ మారకులు కేవలపాపులని వ్యవహరింపఁబడలేదు. శుభ ఫలానుభవకాలమందును మారకము కలుగవచ్చునుగదా. పూర్వపారాశరీకర్త ద్వితీయ సప్తమాధీశులు మారకులని చెప్పి యట్టి పద్ధతి చొప్పున మారకములు సంభవింపనపుడు వ్యయాధీశదశయందును నష్టమాధీశదశయందును మారకము గల్గుననియు నట్లును సంభవింపనపుడు తుదికిఁ గేవలపాపులదశయందు దనఁగాఁ దృతీయ షష్ఠలాభాధిపతులదశలయందును మారకమునుగల్పింపవలయుననియుఁ జెప్పెను.

"అష్టమం హ్యాయుషస్థానం మష్టమాదష్టమంచ తత్। తయోరపి వ్యయస్థానం। మారకస్థానముచ్యతే।... అలాభే పునరేతేషాం సంబన్ధేన వ్యయేశితుః క్వచిచ్ఛుభానాంచ దశా। స్వష్టమేశదశాసు చ। కేవలానాంచ పాపానాం। దశాసునిగ్రహం క్వచిత్। కల్పనీయం బుధైర్నౄణాం। మారకాణా మదర్శనే"

(పూర్వ పా ౨౨ మొ. ౨౭ వ)

ఉత్తరపారాశరీకర్త యన్ననో మారకులను సైతము కేవలపాపులను తృతీయషష్ఠలాభాధిపతులతో పాటు పాపులలోఁ బరిగణించుచు వచ్చెను.

"మేషలగ్నమునకు- మన్ద సౌమ్య సితాః పాపాః ......। క్రియాభువః" (ఉత్తర పా॥ ౪౧ శ్లో) అనుచు ద్వితీయ సప్తమాధిపత్యమమాత్రముగల శుక్రుని పాపులలోఁ బరిగణించెను మఱియుఁ బూర్వపారాశరి చొప్పునఁ బ్రబలమారకుఁడగు(ద్వితీయ సప్తమాధిపతి) శుక్రుఁడు, మారకుఁడు కాఁడనుచు "కవి స్సాక్షాన్నహన్తా స్యాత్" అని వచించెను. దీనినిబట్టి యీతఁడు "ద్వితీయ సప్తమస్థాన నేత్రైకో యది సౌఖ్యకృత్" (ఉడుదశాప్రదీపిక ౧౭ శ్లో) అను నుడుదశాప్రదీపికాపద్ధతిని బూర్వపారాశరీ విరుద్ధముగా నంగీకరించెనని తోఁచుచున్నది. పూర్వపారాశరినిబట్టి మేషలగ్నజునకు శుక్రుఁడు మారకుఁడు కాకుండుట కేమియు నాధారము లేదు.

ఇట్టి భిన్నాభిప్రాయములు పెక్కులుండుట చేత నట్టి భాగద్వయమును భిన్నభిన్న కర్తృకమను పక్షము నవతరించెననఁదగును.

వేంకటేశదైవజ్ఞుడు (పారాశరీకర్త) "అనుక్తమన్యతో గ్రాహ్యామ్" అనుటచేత నాతఁడు స్పృశించిన విషయములనుక్తములు కానేరవు. వానిపట్ల నన్యగ్రంథపద్ధతులను గ్రహింపరాదు. ఇట్లె గ్రహముల దృష్టుల విషయము నాతఁడు "పశ్యన్తి సప్తమం సర్వే శని జీవ కుజాః పునః। విశేషతశ్చ త్రిదశ, త్రికోణ చతురస్రగాన్" (పూర్వపా ౪ శ్లో) అని పూర్ణదృష్టులను మాత్రమే సమ్మతించి యుండుటచేత బృహజ్జాత

ఆ సభలో నుపన్యసించిరి. తమ విమర్శన మందిచ్చి అందును ప్రత్యుక్తిప్రత్యుత్తరము లందుకొనకుండగనే సభారంగనిష్క్రమణమును గావించిరి. సభామర్యాద చొప్పునఁ జెప్పవలసివచ్చినప్పుడు ఈ రీతి నిష్క్రమణము విమర్శకౌచిత్యమునకు అభాస మనవచ్చును. తనసయి విమర్శగా నుపన్యసించినవా రెవరయినను తన ప్రత్యుత్తరము నందుకొనకముందే సభనుండి జారిపోయినయెడల ఏ యుపన్యాసకుఁడయినను ఉగ్రుఁడు కాకుండఁడు. అందును అధ్యక్షుఁడయి యుపన్యసించిన సహస్రమాసవృద్ధుని విమర్శించుటకు దొరకొన్నపట్ల శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారు యువ భ్రమణ మొనర్చిరేని శ్రీవజ్ఝలవారి చిరంతన నిష్కర్ష సంప్రదాయము కెంతవ్యతి నొప్పనిదే! అట్లే జరిగినది!! ఈ యాభాసబీజమే-భారతియందలి అన్నాజీ రావుగారి వ్యాసరూపమున మొలకగాఁ జూపట్టినది- పరస్పరనిందావిధాన మింతకుమించి దోహదపఱుపఁ దగినది కాదు. అట్టి యుత్క్రోశము న్మనసునం దిడుకొన్న శాస్త్రవాదము పేర - వ్యర్థవివాదము భారతి వంటి విలువయైన పత్రికపుటలను అస్మాదృశుల మాక్రమింపను జనదు. ఇది కాదందురేని-శ్రీ అన్నాజీరావుగారు తమ వ్యాసములో ననువదించి యాహ్వానించినంత మేరకు జాతక తత్త్వవేత్తలగు దైవజ్ఞ శిఖామణులు భారతికి వివిధ వ్యాసము లందిచ్చి జ్యోతిషఘట్ట ఘట్టన కుద్యమింతురేని, అట్టి యావద్వ్యసనమున భారతీపాఠకుల కేనను రామణీయకత నొడఁగూర్పఁ గలాఁడను—గనుక—తథాస్తు! నాఁటి సభానంతరంబ ప్రసంగాయమానమున్న కళాప్రపూర్ణుని యొక్క యధ్యక్షోపన్యాసమును అద్దానిం బేర్కొనుచు విమర్శనాత్మకముగా కృష్ణమూర్తిగారొనర్చినయుపన్యాస విషయమును అన్నాజీరావుగారిచే భారతి కందింపఁబడినది గదా! విమర్శించుచుఁ బల్కిన ఉపన్యాసకులు ప్రత్యుక్తినందుకొని, మరల నవసరమయితే ప్రత్యుత్తర మివ్వఁదగియుండెఁగా అట్టి సభ్యధర్మము నుల్లంఘింపఁబడుటచేతఁగద సభాప్రారంభమున గావించిన నేను, తుదిని ఉపసంహారమున శాంతిపలుకవలసిన యవసర మేర్పడినది. అట్లే చేసినాఁడను. ఆ ఉపసంహార వాక్యములలో వాదోపవాదాత్మకమయిన ఘట్టము మీఁద నేను చేపట్టిన పంచ్రెండు వ్యాఖ్యానములం బేర్కొని—కోణపతికిఁ ద్రిపదాయాధిపత్యమువలని ఫలమునకు నిదర్శనముగా శ్రీ అలకనారాయణ గజపతి



ది 19-2-56 తిరుపతి వేంకటేశ్వర కళాశాల వార్షికోత్సవసందర్భంలో ప్రదర్శింపబడిన 'మర్చెంట్ ఆఫ్ వెన్నిస్' నాటకంలో షైలాక్ భూమిక. నటకులు శ్రీ యం. గోపీనాథ్.

మహారాజావారి జాతకమును దిఙ్మాత్రము చేసితిని ఇట్టి యంశముల నన్నాజీరావుగారేలనో సూచింపనైన లేనందున ఈ వ్యాసలేఖన కారణము: శ్రీ వజ్ఝల వారి నుద్దేశించి శ్రీ పిడపర్తివారినిగురించి కానోపునని యెంచి నేను మిన్నకుందునా? ప్రతివిమర్శన వినకుండ కృష్ణశాస్త్రిగారు నిష్క్రమణ మొనర్చినందువల్ల నుత్పత్తిలిన యాభాసమునకు ఉపబలమునఁదగినట్లుగా సభలో జరిగినదంతయుఁ గాకుండ పాక్షిక లేఖనము శ్రీ రావుగారొనర్చిరేలనో!

(౧) పారాశరీయహోరయందలి ఉత్తరభాగమునకు లభించిననన్ని ప్రతులను పరకాయింపగా బూర్వోత్తరభాగములు రెండునూ ఏకకర్తృకములు గావని పరిశోధకులు నిర్ణయింపగలట్టి సందర్భము లనేకములున్నవి ఈ సందర్భములను విజయరామ రాజీయుపీఠికలో గొన్ని పుటలుగా జర్చించి యున్నాడను. అందులకింక నిక్కడ నేను విరివి సేయను.

(౨) కర్కాటకలగ్నజాతకునికి కుజుడును, కన్యాలగ్నజాతకునికి శనియు నీరీతి యోగప్రదులో శాస్త్రచర్చ కనుకూల ప్రతికూల జాతకానుభవముల మీదుగా ఎత్తిగించుటలోనే ఈ సమస్య యిమిడి యున్నది. ఏతత్ ఫలకథనములోనే ఊర్ధ్వదృష్టి— పాదదృష్టీత్యాదులును ప్రాసంగికములు కాగలవు. ఇంతకంటె విస్తరమేల?

---

# మానసిక వ్యాధులు

ఒక ప్రతిభావంతుని, లేదా పిచ్చివాని మేధస్సుకూ, మామూలు మనుష్యుని మేధస్సుకూ తేడా ఏమన్నా వుంటుందా? ఈ విషయాన్ని పరిశోధించడంకోసం, శాస్త్రవిజ్ఞానవేత్తలు, ప్రపంచ ఖ్యాతి నార్జించిన కొందరు మేధావుల మస్తిష్కములనూ అనేకమంది పిచ్చివాళ్ళ మస్తిష్కములనూ పరిశోధించారు. కాని ఇంతవరకూ అలాంటి తేడాలేమీ ఉన్నట్లు కనుపించటంలేదు. అందుచేత మానసిక వ్యగ్రతలకూ ఇతర మానసిక వ్యాధులకూ, మస్తిష్కస్థితితో అసలు సంబంధం ఉన్నదో లేదో కూడా మనం ఊహించలేకుండా ఉన్నాం.

వ్యక్తిగతస్వభావాలకూ పరిసర పరిస్థితులకూ కలుగుతున్న సంఘర్షణ సమస్తమానసిక వ్యాధులకూ కారణమనే సిద్ధాంతం ఒకటి ఇప్పుడు సర్వాంగీకారమై చెలామణిలో వుంది.

కాని యీ దిగువ విషయాలు గమనించదగి ఉన్నాయి.

న్యూయార్కు స్టేటులో, (మొదటి దఫాగా) మెంటల్ హాస్పిటల్సులో చేరే వ్యాధిగ్రస్తుల వివరాలు:

28% శిథిలబుద్ధులు: (Schezo-phrenia)

24% మస్తిష్కములోని నాళములు గట్టిబడటం వల్ల మానసికవ్యగ్రత (Psychosis) గలిగినరోగులు.

1F% వార్ధక్యదోషము (Senility)

ఈ వివరాలు ఇలా వుండగా కొంతకాలంపాటు హాస్పిటల్ లో ఉంటూవున్నవారి వివరాలు వేరే సేకరించబడినాయి. అవి యిలా ఉన్నాయి:

57% శిథిలబుద్ధులు.

9% మస్తిష్కములోని నాళములు గట్టిబడటం వల్ల మానసికవ్యగ్రత గలిగినవారు.

6 % ఇతర కారణాలవల్ల వ్యగ్రస్థితి గలిగినవారు.

పైన తెలుపబడిన రెండు రకాల వివరాలనూ పోల్చి చూస్తే మనకు కొన్ని విషయాలు బోధపడ గలవు.

(i) హాస్పిటల్ లో దినదిన ప్రవర్ధమాన మవుతున్న సంఖ్యనుబట్టి శిథిలబుద్ధి చికిత్స కష్టసాధ్యమైనదిగా అవగతమౌతోంది.

(ii) వార్ధక్యదోషము కారణముగా వ్యాధిగ్రస్తులై హాస్పిటలులో చేరటానికి వస్తున్నవారి సంఖ్య పెరుగుతున్నది. చికిత్సావిధానం పెంపొందుతున్న కారణంగా మరణాల సంఖ్య తగ్గుతూ వుండటమూ అందుచేత వృద్ధుల సంఖ్య పెరుగుతూ వుండటమూ యిందుకు కారణమై వుండవచ్చు. కాని వార్ధక్యదోషం ఫలానా నిర్ణీతమైన వయస్సులో అంకురిస్తుందని చెప్పటానికి తగిన ఉపపత్తులు లేవు. పైగా ఆ రకం చైతన్యహీనత అనేకమంది చిన్నవాళ్ళలో కూడా కనుపించుతూ వుండటంచేత దాన్నిగురించి యిదమిత్థమని యేటూ నిర్ణయించటానికి వీలుగా లేదు.

(iii) ఒక విషయంలో మాత్రం మనం ఊహించవచ్చు: చిన్నవాళ్ళలో కలిగే మానసిక వ్యగ్రతలకు మస్తిష్కనాళాలు గట్టిపడటం ప్రధాన కారణమై వుండవచ్చు; ఇది ఊహమాత్రమే గాని సిద్ధాంతం కాదు. ఈ విషయాన్ని స్థిరీకరించటానికి తీవ్రమైన పరిశోధనలు జరుగుతూవున్నయ్.

(iv) ఇక శిథిలబుద్ధి విషయం: శరీరంలోని యితర భాగాలకువలెనే మస్తిష్కంకూడా ప్రాణవాయువును (Oxygen) సేకరించుకుంటూ వుంటుందని విజ్ఞానవేత్తలు తెలుసుకున్నారు. మస్తిష్కం ఇతర

శరీరావయవాలకన్న ఎక్కువ ప్రాణవాయువును సేకరించుకుంటుందనికూడా యిటీవలి పరిశోధనలవల్ల తేలింది. అంతేకాక శ్లేషబుద్ధుల మస్తిష్కం మామూలు ఆరోగ్యవంతుల మస్తిష్కం సేకరించినంత ప్రాణవాయువును సేకరించలేకపోతున్నదనికూడా తెలుసుకున్నారు.

ఇంతకూ శ్లేషబుద్ధి మస్తిష్కానికి తగినంత ప్రాణవాయువు లభ్యం కాకపోవటంవల్ల కలుగుతోందా? లేక శ్లేషస్థితి యేర్పడటంవల్ల మస్తిష్కం తగినంత ప్రాణవాయువును సేకరించలేకపోతోందా అన్న విషయం తేలవలసివుంది. ఈ విషయమై పరిశోధనలు కొనసాగుతున్నాయే గాని యిదమిద్ధంగా, యింకా ఏమీ తేలలేదు.

శ్లేషబుద్ధి వ్యాధిని గురించి పరిశోధనలు జరుపుతూ డాక్టర్ ఫాబింగ్...కొన్ని అత్యంత ప్రధానమైన విషయాలను కనుగొన్నారు. మామూలు ఆరోగ్యంగా వున్న మనుషులకు కొన్ని రసాయనిక పదార్థాలను (లైసర్జిక్ ఆసిడ్ ఎమైడ్ వగైరాలు) యిస్తే శ్లేషబుద్ధిని కలుగచేయవచ్చునని తెలుసుకున్నారు. దేహంలో ఇలాటి రసాయనిక పదార్థాల ఉనికిచేత శ్లేషబుద్ధి యేర్పడినప్పుడు ఆ పదార్థాలను రూపుమాపితే ఆ వ్యాధి తగ్గిపోతుంది. అలా రూపుమాపటానికి కొన్ని ఓషధులున్నాయ్. కాని ఆ ఓషధులు శ్లేషబుద్ధిని నయంచేసినా, ఆఓషధుల ప్రయోగంవల్ల అనంతరం దేహానికి ఉపద్రవకరములైన బాధలు యేర్పడే అవకాశం వుంది గనుక వాటిని వాడకూడదని డాక్టర్ ఫాబింగ్ అభిప్రాయపడుతున్నారు. ఫాబింగ్ మరోవిషయంకూడా తెలుసుకున్నారు. రక్తంలోవుండే 'ఎడ్రినలిన్' పదార్థాన్ని విచ్ఛిన్నం చేస్తే, అలా విచ్ఛిన్నం చేయటంవల్ల యేర్పడిన రసాయనిక పదార్థాలు శ్లేషబుద్ధిని కలుగజేస్తాయి.

పై విషయాలన్నిటిదృష్ట్యా, 'సమస్త మానసిక వ్యాధులకూ, వ్యక్తిగతావేశాలకూ పరిసర పరిస్థితులకూ కలిగే సంఘర్షణే కారణము' నే సిద్ధాంతం పరాస్తమై పోతున్నట్టు మనం అవగాహన చేసుకోవచ్చు. శరీరంలో కలిగే రసాయనిక మార్పులే,మానసికవ్యాధులన్నిటికి కారణమని ఫాబింగ్ చెబుతున్నారు.

# గ్రంథ విమర్శనము

## మంచివాళ్లు-మాటతీరు

రచన: శ్రీ మునిమాణిక్యం నరసింహారావు: ప్రచురణ: సాహితీ సమితి (రేపల్లె-గుంటూరు-మచిలీపట్టణము); వెల ఒక రూపాయి.

ఈ గ్రంథానికి పీఠిక వ్రాస్తూ శ్రీ అబ్బరాజు సూర్యనారాయణగారు ఇలా అన్నారు:

"కావ్యం కావ్యం అంటారే కావ్యం అంటే ఏమిటి? ఛందస్సుతో గూడిన పద్యాలా? సంగీతంతో గూడిన పాటలా? సమాసజటిలంగావున్న రచనలా? కృత్రిమాలంకారాలా? కాదుకాదు, అష్టాదశ వర్ణనలా? 'విశ్వశ్రేయః కావ్యమ్' అన్నారు కాదూ పెద్దలు. గ్రంథంలో విశ్వశ్రేయాన్ని ప్రతిపాదించని వాక్యమేమైనా వుందా? ఇది కావ్యమే. ప్రపంచ కళ్యాణానికి కావలసిన విషయాలు మన మహర్షులు సంస్కృతంలో చెప్పారు. పాశ్చాత్యులు ఇంగ్లీషులో చెప్పారు. మునిమాణిక్యంవారు తేటమాటల్లో ముచ్చటించారు."

పై వాక్యాలు కావ్యతత్వాన్ని గురించి అయోమయస్థితిని కలుగజేసేవిగా వున్నాయి అందుచేత కొంచెం వివరించవలసివస్తున్నది.

ఛందస్సుతో గూడిన పద్యాలైనమాత్రంచేత కావ్యం కాకపోవచ్చు; సంగీతంతో గూడిన పాటలైనంతమాత్రంచేత కావ్యం కాకపోవచ్చు; సమాసజటిలంగావుండీ కావ్యం కాకపోవచ్చు; అలంకారసంయుతమైవుండీ కావ్యం కాకపోవచ్చు, అలాగే విశ్వకళ్యాణదోహదకారి అయివుండీ కావ్యం కాకపోవచ్చు. 'విశ్వశ్రేయః కావ్యమ్' అన్నది కావ్యప్రయోజనాన్ని ప్రతిపాదించుతున్న వాక్యమే గాని కావ్యగుణాన్ని ప్రతిపాదించుతున్న వాక్యం కాదు విశ్వశ్రేయములైనవి, కావ్యములు కానివీ, అనేకమున్నయ్. 'కడుపు నొప్పికి వాము దివ్యౌషధము' అన్నది విశ్వశ్రేయాన్ని ఉద్దేశించి చెప్పబడిన వాక్యమే. అంతమాత్రంచేత ఈ వాక్యం కావ్యమౌతుందా? అలాగే శ్రీ మునిమాణిక్యంవారి యీ రచనకూడా కావ్యమని అనటానికి వీలులేదు. కావ్యగుణాన్ని వివరించుతూ 'వాక్యం రసాత్మకమ్' కావ్యం ఇత్యాది పెద్దల నిర్వచనాలున్నాయి. ఇక 'రసాత్మకం' అంటే యేమిటని తేల్చవలసివస్తే అలంకారశాస్త్రాలనన్నిటినీ ఇక్కడ వ్యాఖ్య పెట్టవలసి వస్తుంది.

ఇది కావ్యం కానంతమాత్రంచేత ఈ గ్రంథానికివచ్చే నష్టమేమీలేదు. ఆబాలగోపాలానికి అత్యంత ప్రయోజనకరమైన ఉత్తమరచనగా దాన్ని అంగీకరించటానికి ఎలాంటి అభ్యంతరమూ వుండనక్కరలేదు ఆంగ్లభాషలో 'లార్డ్ చెస్టర్ ఫీల్డ్స్ ఎడ్వైజ్ టు హిస్ సన్' (Lord Cheserfield's' advice to his Son) మొదలైన ఇలాంటి గ్రంథాలు కొన్ని వున్నయ్. శ్రీ నరసింహారావుగారు ఆ విషయాన్ని ఉల్లేఖింపక పోయినా ఆ గ్రంథాన్ని చూచివుంటారని అనుకోవచ్చు. ఆంగ్లభాషలోని ఈ లోటును భర్తీచేయటానికి శ్రీనరసింహారావుగారు పూనుకోవటం ముదావహం.

ఈ గ్రంథంలో (1) మధురవాక్కును అలవరచుకొనుము. (2) అందరితోనూ నవ్వుతూ మాట్లాడు. (3) కష్టాలలో వున్నప్పుడుకూడా నవ్వుతూ మాట్లాడు. (4) ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడు (5) ఇతరులకు సంతోషం కలిగేలాగున మాట్లాడు (6) రాగ్వాదాలు పెట్టుకోకూడదు (7) ఇతరుల కష్టసుఖాలలో పాల్గొనవలెను (8) కష్టములలో నున్నవారితో హృదయపూర్వకమైన సానుభూతితో మాట్లాడు. (9) మంచి మాటలతో స్నేహం సంపాదించు (10) ముగింపు అనే శీర్షికలలో పదివ్యాసాలున్నాయి. పై శీర్షికలను గమనించితే శ్రీ నరసింహారావుగారు చెప్పదలచిన సంగతేమిటో మనకు స్థూలంగా బోధపడుతూనేవుంది. కాని పై విషయాలు బోధించటానికి నరసింహారావుగారు అనుసరించిన రచనావిధానం హృద్యంగా వున్నది. ముచ్చట గొలిపే అనేక కథలనూ, కట్టుకథలనూ సంఘటలను ఉదహరించుతూ ఉత్సాహంగా చదవటానికి, విషయాన్ని వంట పట్టించుకోవటానికి సావకాశం కల్పించారు. నరసింహారావుగారు ఉదహరించిన ఒక చిన్ని సంఘటన:

'నేను గుంటూరులో కాలేజీలో మాస్టరుగా ఉన్న రోజులలో ఒకసారి జబ్బుచేసి పదిరోజులు పాఠశాలకు వెళ్ళలేదు. ఆ తరువాత పథ్యం పుచ్చుకొని వెళ్లాను.

'వళ్ళిన రోజున అప్పటికి మా ప్రిన్సిపాల్ అయిన సైప్రుదొర వచ్చి నన్ను చూచి—హల్లో మిస్టరు మునిమాణిక్యం హౌ-డు-యు-డు? (How do you do?) అన్నాడు. కులాసాగా ఉన్నారా అని ఆ మాటలకు అర్థము.

'దొరగారే స్వయంగా నా సంగతి అడిగినందుకు నేను సంతోషించి "కొంచెము కులాసా యిచ్చిందండీ. కాని నా జబ్బు పూర్తిగా తగ్గలేదు. ఇంకా కాలువాపు అల్లాగనే వున్నది. జ్వరం మటుకు రావటంలేదు. అయితే జీర్ణశక్తి బొత్తిగా చెడిపోయింది" అని యేమో చెప్పాను.

'దొరగారు నేను చెప్పిందంతా ఓపికగా విని చివరకు మిస్టర్ మునిమాణిక్యం ఇదంతా చెప్పడం మర్యాద కాదు. నేను "హౌ-డు-యు-డు" అని అడిగినప్పుడు నీవు "థ్యాంక్యూ, నేను ఆరోగ్యంగానే ఉన్నాను" అనవలె. నీ జబ్బును గూర్చి ఎవ్వరైనా అడిగితే చెప్పవలెనే కాని లేకపోతే ఊరుకోవడమే మర్యాద అని నాకు హితవు చెప్పినాడు అప్పుడు తెలిసింది నాకు. ఈ విషయం.'—ఇలాంటి చిన్న చిన్న సంఘటనలు ఆద్యంతం గ్రంథంనిండా ఎన్నో వున్నాయి.

తెలుగువాళ్లు దురుసుగా మాట్లాడతారని పలువురు అంటూవుంటారు. ఇతరులు అనటమే కాదు. మనం అలా మాట్లాడుతాంకూడా. మాట పొందికను అలవరుచుకోవటానికి ప్రతిఒక్కరూ యీ గ్రంథాన్ని చదువవలసివుంది. పాఠశాలలలో కూడా 'మోరల్ పీరియడ్'లో విద్యార్థులచేత చదివించదగిన ప్రయోజనకరమైన గ్రంథం. కావ్యం కాకపోయినా శ్రేయోదాయకమైనది.

## జానకి - శర్మ

కథలసంపుటి; రచన: శ్రీ మునిమాణిక్యం నరసింహారావు. ప్రచురణ: దేశికవితామండలి, విజయవాడ 2

కొంతకథలు జనానికి మొహం మొత్తుతున్నాయని తెలుసుకుని కాబోలు శ్రీ నరసింహారావుగారు, జానకి-శర్మ అనే పేరుతో తిరిగి కథలు వ్రాయటానికి ఉపక్రమించారు. కాని ధోరణిలోమాత్రం చెప్పుకోదగిన మార్పేమీ కనుపించదు. ఈ గ్రంథంలో 'శర్మ కాఫీతాగాడు' 'ప్రకరణభంగం,' 'శర్మజానకిని ముద్దుపెట్టుకొన్న ఘట్టం' 'ప్రతిజ్ఞాపాలనం', అనే నాలుగు కథలున్నాయి ఇందులో కొంచెం బాగా వున్నదని చెప్పటానికి వీలుగా వున్న మొదటి కథలోనే ఒక చోట ఇలా వ్రాశారు.

'తరువాత
ఆ పిల్ల అటునుంచీ
శర్మ ఇటునుంచీ
ఒకరికి దగ్గరగా ఒకరు
జరిగి, జరిగి
సమీపించి సమీపించి
ఒకరు నొకరు కౌగలించుకొన్నారు'

ఈ రకం 'అబ' ఈ రచనలలో సర్వత్రా వళ్ళు బోశారు పై వాక్యాన్ని అలా 7 తుండాలుగా ఖండించి అరపేజీ జాగాలో ముద్రించారు. ప్రయోజనమేమిటో భగవంతునికి తెలియాలి.

ఈ రచనలలో హాస్యాన్ని సృష్టించటానికి శ్రీ నరసింహారావుగారు పడే యమయాతన చూస్తే మనకు నిజంగా జాలికలుగుతుంది.

ఈ దిగువ వాక్యాన్ని చిత్తగించండి.

"శర్మ జానకిని ఒక కన్నుతోమాత్రం చూస్తూ ఈ కన్నుమూసి ఆ కన్నుతోనూ, ఆ కన్నుమూసి ఈ కన్నుతోనూ చూచి చివరకు రెండు కళ్లు మూసికొని కూర్చున్నాడు

పై వాక్యం పాఠకులకు ఎలావుంటుందో గాని, భాషించి మాధురీదర్శనం చేయదగిన మహా వాక్యంగా శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు తాము యీ గ్రంథానికి రచించిన 'భూమిక'లో ఉటంకించారు.

శ్రీ నరసింహారావుగారి రచనలో కనుపించుతున్న మరో క్రొత్తవైచిత్రి యేమిటంటే ఉండుండి సంస్కృతశ్లోకాలను ఉటంకించటం. పాండిత్యం వున్నప్పుడు ప్రదర్శించటంలో దోషం లేదనుకోండి— అయినా దానికి తగినంతగా తగిన అవకాశం లభించాలి. అంతేగాని ఏదో శ్లోకం దొరికిందికదా అని దానికోసం కథను సుళ్లుతిప్పుకు రావటానికి ప్రయత్నించటం ఆరోగ్యకరమైన సంగతి కాదు.

అన్నిటినీ మించి శ్రీ నరసింహారావుగారు, మహామహులైన ప్రాచీనాలంకారికులను వేళాకోళం

చేస్తున్నా ననే అభినివేశంతో పోయిన పోకడలు అనుదాత్తధోరణిలో వుంచటమే గాక క్లుప్తి వాక్యాలుగా కూడా కనుపించటం లేదు.

# సుందర భారత యాత్ర

[1, 2 భాగములు]

రచన: శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి ప్రచురణ: సాధన గ్రంథ మండలి, తెనాలి; ప్రథమభాగం: రు 2-8-0; ద్వితీయ భాగం, రు 2-8-0.

గ్రంథ నామాన్ని బట్టి ఇదేదో, యాత్రికుల ఉపయోగార్థం ప్రచురించిన 'గైడ్స్ గైడు' లాంటి పుస్తకమేమోనని భ్రమ కలగటానికి సావకాశంగా వుంది. దీన్లో ప్రయాణాదిక సౌకర్యాలకు స్థల పురాణాలకూ సంబంధించిన భోగట్టా కొంతవున్నా ఇది అలాంటి అల్పమైన కృషి గాదు. ఈకృషిని అభినందించుచూ శ్రీ వేమరాజు భానుమూర్తిగారు రచించిన వాక్యాలు తిలకించితే గ్రంథము యొక్క విలువ యెనుముగా పాఠకులకు అవగతమౌతుంది:

'శాస్త్రిగారి పుణ్యమా అంటూ కాశ్మీరు నుంచి కన్యాకుమారి వరకూ, కచ్ నుంచి కలకత్తా వరకూ గల యావద్భారత దేశ పర్యటన మన కందరికీ ఒక ఆరు రూపాయల ఖర్చులతో లభించింది. కాశ్మీర్ కమనీయ సౌందర్యాన్ని, ఉత్తర ప్రదేశ మనోజ్ఞ దృశ్యాలను, అనేక సామ్రాజ్యములకు జన్మభూమి అయిన ఢిల్లీ నగర వైభవాన్నీ, దాని చారిత్రక ప్రశస్తిని ప్రకృతి మాత వంగదేశంలో తీర్చి దిద్దిన రంగవల్లులను, మహాభక్తులకు నిలయములైన గుజరాత్, మహారాష్ట్ర దేశములను, హిందూ, మహమ్మదీయ సంస్కృతుల మేలు కలయికకు నుంచి నిదర్శనమైన హైదరాబాదును, అక్కడి శిల్పసంపదను, ఆవేశానికీ సదర్శానికీ ఆటపట్టయిన ఆంధ్రావనిని, వ్యాపార నిపుణతకు దేవాలయ నిర్మాణ శిల్పచాతురికి నిలయమైన తమిళనాడును, పాండ్య, చేర, సంస్కృతులకు కాణాచియైన కేరళ దేశాన్ని అక్కడి వింతలను యీ యాత్రాక్రమంలో మనకళ్లకు కట్టినట్లు చూపించారు. అతివృద్ధ అయినప్పటికీ నిత్యనూతన అయిన భారతమాత సహజ సుందర స్వరూపాన్ని యాత్రికుల చర్మచక్షువులకే కాక చదువరుల మనోనేత్రాలకు కూడా, సాక్షాత్కరింపజేశారు.'

దేవతల చిత్రాలూ, దేవాలయాల చిత్రాలూ, చారిత్రక ప్రశస్తిగల భవనాదుల చిత్రాలూ బహుళ సంఖ్యలో వున్నయ్.

# నాగార్జునకొండ

రచన: శ్రీ నారెమంచి రామారావుగారు. ప్రచురణ: అజంతా పబ్లికేషన్సు, 7112 మహాకాళి వీధి, సికింద్రాబాదు వెల 0-12 0

గ్రంథ పీఠికలో శ్రీ రామారావుగారు ఇలా ఉద్ఘాటించారు.

'నాగార్జున సాగరం కట్టనిర్మాణం పూర్తి అవటంతో ఈ లోయ యావత్తూ కృష్ణాజలంలో లీనం అయిపోతుంది గనుక ఈ పుణ్యస్థలం "కలలోని వార్త" అయిపోతుంది. కాలోగా యిక్కడికి యాత్ర చేసి ఈ పుణ్యస్థలాన్ని దర్శించి ఆంధ్రులంతా తమ విధిని నిర్వహించాలి... ఈలోయను గురించి వివరాలు ప్రభుత్వము వారి ప్రచురణలలో ఉన్నవి. అవి సామాన్యులకు అందుబాటులో లేవు. ఈ పుణ్యక్షేత్రాన్ని చూడబోయేవారి ఉపయోగార్థం ఈ చిన్న పుస్తకం వ్రాయబడింది.'

'ఉనికి-ప్రయాణము,' 'నాగార్జునుడు: నాగార్జునకొండ,' 'ఇక్ష్వాకు రాజులు' 'శాసనములు' '[illegible] తీర్థం,' 'శిల్పాలు' 'నాగార్జున సాగరం' అనే శీర్షికలలో శ్రీ రామారావుగారు ఈ లోయను సంబంధించిన అనేక విషయాలను పాఠకులకు అందజేస్తున్నారు. నాగార్జున శిల్పాల ఫోటోలు 16 వరకూ గ్రంథం చివర అనుబంధరూపంలో ముద్రింపబడివున్నాయి.

# రామచంద్ర స్తవమంజరి

పద్యరచన: శ్రీ యమునూరులు కోట సోదరకవులు: ప్రాప్తిస్థానము: శశిచంద్ర గ్రంథమాల, 18, వరదాముత్తియప్పన వీధి, మద్రాసు—1.

ఈకవులు రామాయణగాథనంతా 64 పద్యాల లోకి సంక్షిప్త పరచి, 'రామచంద్రప్రభూ!' అనే మకుటంతో స్తవరూపంలో చెప్పారు. శ్రీరామచంద్రుని పుణ్యకథనాన్ని దినదినం మన్నన చేసుకోవటానికి అనువుగా వుంది.

# కర్రా, చెప్పులు

కథలసంపుటి; రచన: శ్రీ నార్ల చిరంజీవి. ప్రచురణ: వినోదా పబ్లికేషన్సు, విజయవాడ-2. వెల 1-0 0

ఈ సంపుటిలో, కర్రా చెప్పులు, ఎండమావులు, పగిలిన పచ్చికుండలు, ఎడారిపూలు, ప్రేమాభిరామం, గూటిలో చిలక, అనేకథలు ఆరు వున్నాయి.

# గుచ్చుకోని ముళ్లు

కథలసంపుటి: రచన: శ్రీ [illegible] వెంకట సీతారామమూర్తి: అలమూరు, తూర్పుగోదావరి జిల్లా. వెల 0–4–0

Printed & Published For Nageswara Rao Estates Ltd., by S. Radhakrishna,
at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1.
Editor: S. Sambhu Prasad.

# విషయానుక్రమణిక

## ఏప్రెల్ 1956

# జీవగీతం

హారీత శివశర్మ

నా యెదలోన వీణియలు నాదముచేసిన యంతసేపు రా
గాయతి నాదు కంఠము సుగంధిలమై ప్రథితమ్మునై మధు
ధ్యాయిత లోనలోనె యరుదైన స్వరమ్ములు పల్కుగాని తా
నై యొకడైన రాదు మృదువై మరి నా ముఖకార వీడదున్.

ఈ హృదయమ్మున కాహా
ఊహా యటన్నదియు నొకటి యున్నదా లేదో
ఆహత తను కుంజముపై
పోహటిలగ జేయు నిదియుపో కోకిలలన్.

కోకిల కూయదున్ అసలు కూసిన దేయనుకో ఒకప్పుడున్
వీకను పంచమస్వరము వీడి బయల్వడబోదు లోననే
తాకి రహస్తరంగములదార్చి మదంతర లింగదేహ మూ
ర్ఛాకిలికించి తమ్మగనె సాగును; సాగదు నోటి వెంబడిన్.

సప్తస్వర ప్రశస్త మధుధారాలోల
విలులితాంబువులు కన్నులను జారి
అర్థనగ్నార్ద్రవాగర్థ సంచయ ధురా
హాతిని మనస్సెల్ల హాతినిపొంది
ఎడద మెత్తదనంబు విడిదిగా పొసగించి
పైకి తేనూహ చాలక తపించి
లోన భావమునూది బోనమ్ముపచరించి
మృదు మృదంగము లేక మెలికలు పడి
యెడద నెడదయందు నిమిడించుకోలేక
కుతిలపడియు లోన కుతకుతపడి
శిశిరమందు నాకు చెడిన చెట్టును వోలె
దినగనైన బ్రతుకు తెలిసి యేడ్చి.

నునుగాలి పొరలు చేసిన జొన్న చేలపై
　　　　కంకెసందులలోని కలరవమ్ము
లీలవేసిన గతి లీల తేలించుకో
　　　　నాత్మ లేవక మది నలమటించి
ఇంత యేడ్పునులోన నంతయు పాటనై
　　　　మరి పైకి రాక స్థంభము భజించి
బాహ్యమునకును అభ్యంతరమునకును
　　　　పోలికలేక తా పోయి, యేమి

చేయలేక మ రేమియు చేయలేక
మనసులోకుంది హృదయ కృంతననుగాగ
నాత్మ గుడుసుళ్లు చెంది నాయంబె నేను
పలువరింతును కష్టపు కలకలమున.

నిగనిగలాడు ఆకసపు నీడలలో తెలిరెక్కలార్చి వా
లుగ విహాగంపు గుంపు కదులున్; మరి నేనును యట్లుగా విమా
న గతిని రెక్కకట్టుకొనినట్టుల పోవగజూతుగాని; కా
నగ మరి దేహ మడ్డుపడినంతన చింతల కుందుచుండుదున్.

ఒడ్డుకట్టిన నదివోలె ఉరికి ఉరికి
పైకెగురు జాడలేక లోపలనె లోన
నున్న చైతన్యమదియును నున్న మిత్రము
వెలికురికిరాగ క్రొత్తదారులకు వెదుకు.

ఇక శరీరమ్ము పాంచభౌతికము జడము
లోని చైతన్యధారను లోనె యదుము
అదుముగా కల్గు బాధల నదవదపడి
పైకి నొత్తును; లోని ఆపత్తి తెలిసి.

కన్నదోయికి నన్య కాంతలడ్డంబైన
　　　　కామన చేత నుగ్ర గ్రసితుడ
నెవ్వరో యేదియో నెకసక్కమాడిన
　　　　పాముకన్నను పగ బట్టువాడ

# జీవగీతం

నింతటి విషయమ్ము సుంత నేర్చిన జాలు
ఆధిక్యమును పెంచు నట్టివాడ
నవును నీయంతవాడవు నీవగాని మ
రెవ్వరనిన మత్సరీహుంకనయి
ద్వేషమును పెంచుకొందు, మోదించుకొందు
రాగమున జేసి పాశవారణ్యపథిని
నన్ను నేనుగ భావించుకొన్నదారి
వెలుగు తోచక బహుదుఃఖముల వశింతు.

ఒక అందమైన మహోత్కృష్ట దర్శన
ధృతిచేతలోన నర్తితమ్ములైన
భావమ్ము లెదతాకి పదపడి సర్వ ర
క్త ప్రవాహముబడి కదిలి కదిలి
ఈ శరీరమ్మునం దింతలింతలు మధు
రమయిన అనుభూతులను రచించి
మనసులో నవకావ్య మర్మమ్ము లెగద్రోసి
పదముల నేగుకో నదనుచూపి
కంఠమును దాటిరాని సంగతిని తెలిపి
నన్ను కికురించు శక్తి నేనన్నయఃఫఫ
నాత్మ రూపమునందున యాత్మయందు
కర్మవృత జీవవృత్తి నిష్కృష్మడగుదు.

ఈ దుఃఖమ్ములు నేడ్పులు
చేదై, బహుజిహ్మగోద్ధ చేష్టము లూహా
సూదనప్రోద్ధతి ఖడ్గపు
వాదరలై లోనలోన వంచన చేయున్.

ఈ దుఃఖమ్ములు నేడ్పులు
మేదురమై లోనిదృష్టి మెట్టిన యెడలన్

# భారతి

స్వాదుత నాహరించును
కాదో మరి జీవితమ్ము కాంతిని చెరచున్.

ఈ దుఃఖమ్ములు నింతలింతలయి బహిర్భూత తామస్ఫూరే
ఖా దౌర్భాగ్య పథిన్, ననున్, బహుళ దుఃఖధ్వాంతక్షీనున్, దురా
శాదౌర్గత్యనిధిన్, గ్రసించు, పృథు లేపాసర్ప హాలాహలున్
కాదో వెన్నెలచిల్కు ఆత్మశశినన్నా! చీకటుల్ గ్రమ్మెడున్.

ఈ దుఃఖమ్ములు నాయెడ
స్వాదుత మృదుచింత నార్ద్రివ్రతమ్ములైనన్
శ్రీదము ఓంకారార్థము
చేదనో! కరుణా రసప్రసిద్ధ మమృతమున్ !

# మానవుడు

"కావ్యశ్రీ"

## పాత్రలు

వీరయ్య; శివయ్య; నరసింహం; కనకాచలం; వెంకటపతి.

* * పాతపడిన పల్లెటూరి రైలు స్టేషను లోని వెయిటింగ్ రూమ్! నలువైపులా చీకటి. గుమ్మంలో లాంతరు మందంగా వెలుగుతూంటుంది. రైలు వచ్చి వెళ్ళిపోయింది. ప్రయాణీకుల కోలాహలం సద్దుమణిగింది. చిరిగిపోతూ వున్న చొక్కా—పాంటు—మాసి దుమ్ముపట్టి వున్న జుట్టు—గడ్డం — మీసం — జేవురించి వున్న కళ్ళతో వికారంగా భయంకరంగా చూస్తూ వస్తాడు వీరయ్య.

వీర : (భారంగా నడుస్తూ వచ్చి—లోపల పెట్టిన అడుగు చటుక్కున తీసికొని బాధగా నిట్టూర్చి) మాణిక్యం! మాణిక్యం! (దుఃఖముతో తలవంచుకొని చేతులతో ముఖం దాచుకొంటాడు.)

[చింపిరి బట్టలతో—జడలు కట్టిన జుట్టుతో—చిరిగిన రగ్గుకప్పుకొని—కర్ర పూతవేసుకుంటూ శివయ్య వస్తాడు.]

శివ : బాబూ! ఒక్క కానీ బాబూ!

వీర : (వినిపించుకోడు.)

శివ : (కొంచెం గట్టిగా) బాబూ!

వీర : (చిరాకుగా) ఎందుకురా అరుస్తావ్!

శివ : ఒక్క కానీ యిప్పించు బాబూ!

వీర : (కోపంగా) పోరా అవతలికి!

శివ : చలిగా వుంది. వెళ్ళిపోతాను. ఒక్క కానీ పడేయ్ బాబూ!

వీర : (అతని వైపు తిరిగి) ఏరా—తన్నులు గావాలా ?

శివ : ఎందుకు నాయనా అంత కోప్పడతావ్?

వీర : కోపం—కాక ఇంకేముంది? నా జీవితాన్ని నాశనం చేసిన యీ లోకాన్ని—నా సర్వస్వాన్ని దోచుకున్న యీ వెయిటింగ్ రూమ్‌ని చూస్తూ ఉంటే కోపంగాక మరేముంది ?

శివ : ఎవరు నాయనా నీకు అపకారం చేసింది.

వీర : ఎవరేమిటి! నువ్వు! హుఁ! ఎవడో తెలిస్తే వాడింకా ప్రాణాలతో బ్రతికి వుండేవాడేనా ? ఎవడు వాడు ? ఎవడైతే నేం ? ఎలా తప్పించుకొంటాడో చూస్తాను.

శివ : పగ బట్టి సాధించాలని చూస్తున్నావా బాబూ !

వీర : అవును. ప్రాణానికి ప్రాణం! అంతే!

శివ : పగ చాల చెడ్డది నాయనా. బ్రతికివుండగానే యమయాతనలు పెడుతుంది. జీవితాన్ని నరకం చేస్తుంది నాయనా.

వీర : ఫరవాలేదు. జైలుజీవితానికి అలవాటు పడినవాడికి నరకంమాత్రం యెంత?

శివ : (నిట్టూర్చి) జైలుకెళ్లావా నాయనా?

వీర : నోరుముయ్! అడుక్కునేవాడవు అడుక్కోక అవన్నీ నీకెందుకు ?

శివ : నువ్వేదో మథనపడుతూ వున్నట్లువుంది. కాస్సేపు పడుకోవయ్యా! బండికి యింకా టైముందిలే!

వీర : పడుకుంటాను. వాడిని శాశ్వతంగా పడుకోబెట్టి మరీ పడుకుంటాను.

శివ : చంపటంకంటే క్షమించటం కష్టం! క్షమించటం నేర్చుకో నాయనా!

వీర : అనవసరంగా వాగకు. తన్నులు తినగలవు.

శివ : అనుభవంతో చెబుతున్నాను. పగ మానవుణ్ణి పశువుని చేస్తుంది. కళ్లు మూస్తుంది. మనసును మసి చేస్తుంది. ఆవేశపడకుండా ఆలోచించు నాయనా.

వీర : ఒరేయ్ ముష్టి సన్యాసీ! రైలు వచ్చేదాకా యింకా గంటసేపు గడపాలిరా ఇక్కడ. నన్ను విసిగించి అనవసరంగా ప్రాణాలు పోగొట్టుకోకు.

శివ : (వెటకారంగా) మహా మొనగాడిలా మాట్లాడుతున్నావే!

వీర : (చర్రున వెనక్కు తిరిగి) కాక —?

శివ : ఏడిశావ్ !

వీర : ఊఁ! (చాచి - చెళ్లున చెంపమీద కొడతాడు.)

శివ : (బాధగా నవ్వి) పగతో నీ హృదయమెంతగా ఉడికిపోతూ వుందో చూడాలనే అలా అన్నాను.

వీర : చూశావుగా — ఇప్పటికైనా వెళ్ళిపో!

శివ : నువ్వెవరివో నాకు తెలియదు. అయినా నిన్ను క్షమిస్తున్నాను. చలిలో బాధపడుతున్నావు; ఈ రగ్గు కప్పుకొంటావా?

వీర : (వింతగా) చలి! ఎవరికి? నాకా! చూడు. నా శరీరంలోని ప్రతి అణువునుంచీ పొగలెలా వస్తున్నాయో!

శివ : అవును. మనసులో పగ వున్నంతకాలం — తనువులో పొగలు ఉంటాయిలే నాయనా!

వీర : ఒరేయ్! మాటలు ఖర్చుపెట్టి నాకు శ్రమ కల్గించకు! పో ఇక్కడినుంచి.

శివ : వెళతాను. నీకు భయపడి కాదు. నీ మనశ్శాంతి కోసం వెళతాను. మళ్లా వస్తాను. మనస్సు మార్చుకో నాయనా. (వెళ్ళిపోతాడు)

వీర : (బాధగా) మాణిక్యం తిరిగి రానిదే మనసెలా మారుతుంది? (చరాలున వెనక్కు తిరిగి బోర్డు వంక చూస్తూ) హుఁ! వెయిటింగ్ రూమ్ — కాదు — డయింగ్ రూమ్. (గిరుక్కున వెనక్కు తిరిగి జుట్టు పీక్కొంటూ బల్లకు చివరగా కూర్చుంటాడు.)

[బీడీ నోట్లో పెట్టుకొని - లుంగీకట్టుతో - లాల్చీ జేబులు తడుముకొంటూ నరసింహం వస్తాడు.]

నర : (కండువా సర్దుకొని వీరయ్యని చూచి) సార్! అగ్గిపెట్టె వుందా సార్!

వీర : (మాట్లాడడు)

నర : (నిదానించి-పెదవి విరిచి) ఏయ్! ఎవరివోయ్ నువ్వు?

వీర : ఏం? ఎవరు కావాలి?

నర : ఏమిటా తలబిరుసు?

వీర : తలబిరుసు కాదు పనస చెరుపు.

నర : (కోపంగా) ఏం ఒళ్ళు కొవ్వెక్కిందా? ఎవరివిరా నువ్వు?

వీర : నేనే కావలసివచ్చినా నీకు (ఇటు తిరిగి పరకాయించి చూచి ముఖం చిట్లించి దగ్గరకు వస్తూ) ఓహో! తమరా? ప్రస్తుతం తమరేం చేస్తున్నట్టు?

నర : (అనుమానంగా) నన్ను ఎరుగుదువా?

వీర : బాగా కిట్టినట్టుంది. వేషం దబాయించావ్.

నర : పొరపాటు. నన్నెవరనుకొంటున్నావో!

వీర : సాక్షాత్తూ నువ్వే అనుకొంటున్నాను.

నర : (అనుమానంగా) నా పేరు తెలుసా?

వీర : ఈమధ్య మార్చుకోకుండా వుంటే తెలుసు.

నర : పేరు మార్చుకోవలసిన అవసరం నాకేమీ లేదు.

వీర : అయితే నీ పేరు నరసింహం! అవునా?

నర : (ఉలిక్కిపడి అతనివంక చూస్తూ వుంటాడు.)

వీర : నువ్వు సగం మనిషివి సగం పశువ్వని అవునా? అవును. అది నీ పేరులోనే వుంది. ఇంతకూ వ్యాపారం కిట్టుబాటుగా వుందా?

నర : (సంకోచిస్తూ) వ్యాపారమా? నాకు వ్యాపారమేముంది?

వీర : నలుగురూ వింటారు నెమ్మదిగా చెప్పనా (గట్టిగా) జూదం!

నర : (కోపంగా) నోరుముయ్!

వీర : (వెటకారంగా) ఎవరిది?

వీర : నీదే!

నర : ఎందుకో!

నర : అనవసరంగా మాట్లాడకుండాను.

వీర : నోరయితే యిప్పుడు మూసినా మరలా మరలా మాట్లాడుతూనే వుంటుంది. ఏకంగా తల తీసేస్తే ఇంక నోరు చస్తేవాగదు.

నర : (క్రేక్... ఇక్కడనుంచి వెళ్ళిపోవాలి!

వీర : వెళ్ళిపోతావా?

నర : నేనుకాదు నువ్వే!

వీర : ఎందుచేత?

నర : ఇది పెద్దమనుష్యులుండే స్థలం!

వీర : పెద్దమనుష్యులంటే జూదగాళ్లా?

నర : ఏమిటూ పేలాపన? కళ్ళు నెత్తికెక్కాయా?

వీర : లేదు. అరికాళ్ళల్లోకి దిగాయి (బాకు తీస్తాడు.)

నర : (భయంగా కత్తివంక చూస్తూ) ఏమిటది?

వీర : (మీదకు నడుస్తూ) కనిపించటం లేదా? కత్తి!

నర : ఏం...ఎం...దుకు?

వీర : తల తీయటానికి!

నర : ఎ...వ...రిది?

వీర : నీదే!

నర : (తుళ్లిపడి) ఆ! నా...దా...?

వీర : అవును. నీదే!

నర : (వణకుతూ - వెనక్కు నడుస్తూ) నేనేం చేశానని?

వీర : జ్ఞాపకం చేయమంటావా?

నర : (వణకుతూ) వద్దు ... వద్దులే ... (పారిపోబోతాడు)

వీర : (చటుక్కున పట్టుకొని) ఏరా! పారిపోదామనుకొంటున్నావా? (ముందుకులాగి) నేనెవరినో తెలుసా?

నర : తెలియదు సార్.

వీర : పన్నెండు సంవత్సరాల క్రితం-యిక్కడే-యీ వెయిటింగ్ రూమ్‌లోనే మన మిద్దరం తొలిసారిగా కలుసుకొన్నాం. గుర్తుందా?

నర : (భయంగా) లేదు సార్!

వీర : పన్నెండు సంవత్సరాల క్రితం నేనూ నా భార్యా బండి మారటానికి యీ వెయిటింగ్ రూమ్‌లోనే. ఇటువంటి రాత్రే ఒక రాత్రి వుండగా సరదాగా పేకాడదాం రమ్మని ప్రక్కకు తీసుకువెళ్లి - జూదంలోవున్న మీ వాళ్ళనందరినీ పిలిచి నన్ను కొట్టి నా దగ్గర నున్న డబ్బంతా దోచుకుపోయావు- అవునా-ఆలోచించు-

నర : (బెదురుతూ) అవునుసార్, జ్ఞాపకం వస్తూవుంది.

వీర : (కత్తి కంఠంమీద పెడుతూ) నరసింహం! పన్నెండు సంవత్సరాల క్రితం యెవడిని మోసం చేశావో వాడి చేతిలోనే చచ్చిపోవటం నీకు సరదాకదూ (పొడవటానికి కత్తి పైకెత్తుతాడు)

నర : (నమస్కరిస్తూ) మీ పాదాలు పట్టుకొంటాను. మీ డబ్బు మీకిచ్చేస్తాను. నన్ను క్షమించండి!

వీర : నిన్నా? యెలా క్షమించమంటావ్? నా నాశనానికి నువ్వుకూడా కారకుడవే! ఆనాడు నువ్వు నన్నలా చేయకుండా వుంటే నా మాణిక్యం నాకు దూరమయ్యేది కాదు. నా కీజైలుశిక్ష వచ్చేదీగాదు. ఇంతటి నాశనానికి కారకుడవైన నిన్నా - నేనా - క్షమించటమా? అసంభవం! (పొడవబోతాడు)

నర : (బావురుమని యేడుస్తూ) అయ్యా! (కాళ్లమీదపడి) నా భార్య కడుపుతో వుంది. నా వంశాన్ని అన్యాయం చేయకండి! నన్ను క్షమించండి!

వీర (ఆగి-పైకి చూస్తూ) భార్య-కడుపుతోవుంది. క్షమించాలి. (నిట్టూర్చి) ఛీ! పిరికిపందా! పో!

నర : (కంగారుగా లేచి పారిపోతూ వుంటాడు)

వీర : నరసింహం!

నర : (చటుక్కున ఆగి) సా—ర్—!

వీర : ఇలారా!

నర : (బెదురుతూ) సా—ర్—

వీర : భయంలేదురా!

నర : (అనుమానంగా-మెల్లగా వస్తుంటాడు)

వీర : పన్నెండు సంవత్సరాలు జైల్లో కూర్చుని మిమ్మలినందరిని చంపాలని తపస్సు చేసి కూడా యిప్పుడు నిన్నెందుకు విడిచిపెడుతున్నానో తెలుసా?

నర : తెలియదు సార్!

వీర : భార్యా భర్తల వియోగదుఃఖం నాకు తెలుసు. భార్య మాట తలపెట్టి నీ ప్రాణాలు కాపాడుకున్నావ్! పో!

నర : (భయంగా వెనక్కి చూస్తూ వెళ్ళిపోతాడు)

వీర : (కత్తి పదును చూచి) హుఁ! అసలు వాడు దొరకాలి! (పళ్లుకొరికి-నిట్టూర్చి-కత్తి జేబులో పెట్టుకొని-బోర్డు వంక చూస్తూ వుంటాడు)

[లెదర్ బేగ్ చంకను పెట్టుకొని చేతిబెత్తం ఆడించుకొంటూ కళ్లజోడు సర్దుకొంటూ-పంచె, లాల్చీ — బద్దెల కండువా — హాఫ్ బూట్స్‌తో కనకాచలం వస్తాడు)

కన : (విసుగ్గా వాచీ వంక చూచి) వెధవది! ఇంకా ముప్పావుగంట వుండాలి. ఎన్ని మారినా పన్నెండేళ్లనుంచీ యీ రైలు టైం సూత్రం మారకుండా వుంది. (ముందుకు నడచి నలువైపులా కలయ జూసి) రామ! రామ! యీ వెయిటింగ్ రూములో కన్నా బయటే నయం! (కళ్లజోడు తీసి కండువాతో తుడుస్తూ వుంటాడు)

వీర : (అతని వంక నిదానించి చూచి-తలూచి) ఓ! కనకాచలం! కావలసినవాడు కాళ్ల దగ్గరకే వచ్చాడు. కామవరం వెళ్ళనక్కరలేకుండానే కత్తికి ఆకలి తీరిపోతుందిలే! (కత్తి పదును చూస్తూ దగ్గరకు వచ్చి) చూశారా యీ బాకెంత పదునుగా వుందో!

కన : (వెర్రిగా చూస్తూ) అవునవును. పదునుగానే వుంది.

వీర : ఏ ఎందుకు పనికొస్తుం దీ కత్తి?

కన : (భయంగా నవ్వి) మరి...మరేం.... పెన్సిలు చెక్కుకోవచ్చు.

వీర : (కత్తి ముఖం మీదకు చూపిస్తూ) ఇంకా?

కన : (బెదురుతూ) ఇంకా-మామిడి పండ్లు, చెరకు ముక్కలు-

వీర : (చటుక్కున) తరుక్కోవచ్చు.

కన : అవును...అవు...అవును...

వీర : తలకాయ తప్పించ వచ్చుకదూ!

కన : (అనుమానంగా) అంటే?

వీర : అంటే! మెడకాయకు బరువు లేకుండా తలకాయ తప్పించటం!

కన : (భయంగా) ఎవరితల? (దూరంగా జరుగుతాడు.)

వీర : నీ తలే! (దగ్గరగా వస్తూ వుంటాడు)

కన : (ఉలిక్కిపడి) ఆ! నాదా? (వెళ్ళిపోబోతాడు)

వీర : ఆగక్కడ! (పట్టుకుంటాడు)

కన : (కంగారుగా) నన్ను పట్టుకుంటా వెందుకు?

వీర : వెళ్ళి పోలీసుల్ని పిలుద్దామనుకుంటున్నావా?

కన : అబ్బే!

వీర : ఫరవాలేదు పిలు!

కన : రామ-రామ.

వీర : వాళ్ళ సంగతి నాకు తెలుసులే! పన్నెండు సంవత్సరాలు వాళ్లతో నేనుండి వస్తున్నాను. పిలు. నేనే చెప్తాను-

కన : ఏం చెప్తావ్?

వీర : తక్కువ వడ్డీ అని తనఖా మీద అప్పులిచ్చి తారీఖులు మార్చేసి తనఖా ఆస్తిని కబళించే ఘరానా దోపిడీ వ్యాపారం! ఇంకా చేస్తున్నావా లైసెన్సు లేని ఆ దొంగవడ్డీ వ్యాపారం!

కన : (చింతగా) నన్ను నువ్వెరుగుదువా?

వీర : అవును. నేను వస్తున్నదికూడా నీకోసమే!

కన : ఎలా ఎరుగుదువు?

వీర : మీది కామవరం కదూ!

కన : అవును.

వీర : నీ పేరు కనకాచలం కదూ!

కన : అవునవును. నన్ను బాగా ఎరుగుదు వన్న మాట!

వీర : ఎరుగుదును. మీ ఊరికల్లా నువ్వే ధనవంతుడవు-!

కన : (సంబరంగా) ఆ! ఆ!

వీర : నువ్వే దుర్మార్గుడవు!

కన : (ఆ! అనబోయి చటుక్కున ఆగి కోపంగా చూస్తాడు).

వీర : పాపం! ఎంత ధనముండేమాత్రమేం లాభం! కడకిలా దిక్కులేని చావు చస్తున్నావు! ఇది నీ దుర్మార్గానికి ఫలితం కాదంటావా?

కన : (బ్రతిమాలుతున్నట్లు) నన్ను చంపుతావా?

వీర : చంపాలనే అనుకొంటున్నాను.

కన : నిజంగానా?

వీర : ముమ్మాటికీ! నీ కంఠంమీద కత్తిపెట్టి ప్రమాణకం చేయమంటావా? (దగ్గరకు వస్తూ వుంటాడు)

కన : (బెదురుతూ) వద్దు.. వద్దులే...(వెనక్కు జరుగుతాడు)

వీర : కనకాచలం! యింకా వ్యభిచారం చేస్తున్నావా?

కన : (ముఖం చిట్లించి) ఛ! ఛా! నేనా?

వీర : ఊఁ! (హుంకరించి కత్తి పైకెత్తుతాడు)

కన : (కంగారుగా) ఆ! ఆ! ఏదో అప్పుడప్పుడు- అంతే.

వీర : మీ పొలాన పనిచేయటానికి వచ్చే పడుచు పిల్లల్ని యింకా బలవంతం చేస్తున్నావా?

కన : (భయాన్ని అణచుకొంటూ) లేదు. నేనెప్పుడూ అలా చేయలేదు.

వీర : చేయలేదా? పన్నెండు సంవత్సరాలక్రితం మీ పొలాన మాణిక్యం అనే మనిషి వుండేది గుర్తుందా?

కన : (జ్ఞాపకం తెచ్చుకొంటూ) మాణిక్యం! (సంతోషంగా) అవునవును. మాణిక్యం-మా గుమాస్తా వీరయ్య పెళ్లాం! మా పొలాన కొబ్బరికొట్టులో వుండేవారు. ఇప్పుడెక్కడుంది?

వీర : ఏం? నీకు కావాలా?

కన : అబ్బబ్బే! పన్నెండు సంవత్సరాలక్రితం - ఉన్నట్టుండి - ఒక రాత్రి పారిపోయారు. అప్పటినుంచీ మళ్లా కనుపించనేలేదు.

వీర : ఎందుకు పారిపోయారు.

కన : నాకు బాకీపడి—నా అప్పు తీర్చలేక—

వీర : (ఆశ్చర్యంగా-కోపంతో) ఏమిటి? నీకు బాకీపడా? నీ అప్పు తీర్చలేకా? (కత్తి గుండెలకు గురిచూస్తూ ముందుకు వస్తాడు)

కన : (భయంగా వెనక్కు జరుగుతూ) కాదు-కాదు-

వీర : మరెందుకు పారిపోయారు? చెప్పు!

కన : ఏమో! నాకు తెలియదు!

వీర : (బాకాన్ని పట్టుకొని కత్తి పైకెత్తి) తెలియదా?

కన : (వణకిపోతూ) తెలుసు-తెలుసు-

వీర : అయితే చెప్పు! ఎందుకు పారిపోయారు?

కన : దాన్ని నేను బలవంతపెట్టేవాడను. నా బాధ పడలేక...

వీర : అవును. అందుకే యిప్పుడు నిన్ను చంపేస్తున్నాను.

కన : ఆ విషయంతో నీకేం సంబంధం?

వీర : నా భార్య విషయంతో నాకు సంబంధం లేదా?

కన : (వింతగా) ఆ! నువ్వు మాణిక్యం మొగుడివా? వీరయ్యవా?

వీర : అవును. నేను వీరయ్యనే!

కన : నేను నమ్మను.

వీర : నీ నమ్మకాలతో నా కవసరంలేదు.

కన : అంత నెమ్మదిగా, అంత అమాయికంగా వుండేవాడవు ఇంత పచ్చి రౌడీగా యెలా మారిపోయావు వీరయ్యా?

వీర : ఇంకా మారతాను. హంతకుడ నవుతాను.

కన : ఎంత మారిపోయావు వీరయ్యా!

వీర : నువ్వే మార్చేశావ్!

కన : నేనా?

వీర : అవును నువ్వే!

కన : నేనేం చేశాను?

వీర : యజమానివైయుండి—అధికార గర్వంతో నిర్దాక్షిణ్యంగా నా హృదయాన్ని గాయపరిచావ్! నేరంలేని శిక్ష మానవుణ్ణి రాక్షసుడుగా మారుస్తుంది. అందుకే ఇలా మారిపోయాను. ఇంకా మారిపోతాను.

కన : నాకు అర్థంకాకుండా మాట్లాడుతున్నావ్!

వీర : అవును. జీవితమే అర్థం కా[illegible]ప్రంది.

కన : నేనేంచేశాను చెప్పవేం?

వీర : చెప్పనా? నీ దగ్గర నున్నంతకాలం నా మాణిక్యాన్ని వశంచేసికోవాలని నానా పాట్లు పడ్డావు. మమ్మల్ని నానా హింసలు పెట్టావు. నీ బాధ పడలేక పట్నం పోదామని బయలుదేరాం! ఇక్క[illegible] యీ వెయిటింగ్ రూమ్‌లో నే ఇలాగే బం[illegible] మారటం కోసం వుండగా నా మాణిక్యం [illegible] చేయబడ్డది.

కన : అరరే! మాణిక్యం పోయిందా? [illegible]హరీ!

వీర : నక్క వినయాలు చాలించు కనకాచలం! నా మాణిక్యం పోకపోతే నే నిలామారివుండే వాడనే గాదు. నా మాణిక్యం పోవటానికి నువ్వే కారణం! అందుకే నిన్ను చంపుతున్నాను. జైల్లోవున్న యీ పన్నెండు సంవత్సరాలు నీ మీద పగతో నా మన సంతా అగ్ని కుండంలా మండిపోతూ నే వుంది. (కత్తి సవరించుకొంటూ) కనకాచలం! కడసారి దేవుణ్ణి తలుచుకో!

కన : (చటుక్కున కూలబడి) వీరయ్యా! (కాళ్లు పట్టుకొని) వీరయ్యా! నన్ను మన్నించవా వీరయ్యా!

వీర : లాభంలేదు. నిన్ను చంపితే నేగాని నా గుండెలమంట చల్లారదు. లే కనకాచలం! పైకిలే!

కన : వీరయ్యా! నువ్వడిగిందల్లా యిస్తాను. మా అమ్మాయి నిచ్చి పెళ్ళిచేస్తాను. నన్ను విడిచిపెట్టు వీరయ్యా!

వీర : బుద్ధి తక్కువగా మాట్లాడక-లే-కనకాచలం!

కన : నేను లేకపోతే నా సంసారమంతా నాశనమై పోతుంది వీరయ్యా!

వీర : కావలసిందే! నా జీవితాన్ని నువ్వు నాశనం చేయలేదా!

కన : (కాళ్లు గట్టిగాపట్టుకొని యేడుస్తూ) వీరయ్యా! నన్ను చంపితే నీభార్య తిరిగి వస్తుందా! నీ భార్య పోయిందిగదా అని నా భార్య నేడిపిస్తావా వీరయ్యా! (ఏడుస్తాడు.)

వీర : (ఉలిక్కిపడి — వెనక్కు జరిగి—బాధగా) భార్య నేడిపించాలి! (అదేమాటను మరలా మరలా అంటూ ఉద్రేకం పొందుతాడు.)

కన : యౌవనంలో యేదో తెలియక తప్పుచేశాను. మాణిక్యం చచ్చిపోవటం నాకుమాత్రం యిష్టమా? మాణిక్యాన్ని చంపినవాడిని ద్వేషించాలి గాని నన్నెందుకు వీరయ్యా?

వీర (పరధ్యానంగా) భార్య నేడిపించాలి! (నిట్టూర్చి) కనకాచలం!

కన (భయంగా లేస్తుంటాడు.)

వీర : విడిచిపెట్టేస్తున్నాను. వెళ్లిపో!

కన : (అనుమానిస్తూవుంటాడు)

వీర : నిన్నెందుకు విడిచిపెడుతున్నానో తెలుసా?

కన : మాణిక్యాన్ని నేను చంపలేదు కాబట్టి!

వీర : కాదు. నా మాణిక్యాన్ని నువ్వుకూడా యిప్పటికీ ప్రేమిస్తున్నావు కాబట్టి! చూశావా సంఘం నేర్పిన నీచబుద్ధి. మాణిక్యం బ్రతికినన్నాళ్లూ ఆమెను ప్రేమించినందుకేగదా నిన్ను నేను ద్వేషించాను. ఆమె చనిపోగా నే ఆమెను ప్రేమిస్తూవున్నందుకే నిన్నే-నే నే—మెచ్చుకొంటున్నాను. ఛీ! ఛీ! ఏమిటి యీ నైజం! వెళ్ళిపో కనకాచలం!

కన : (భయంతో తడబడుతూ వెళ్ళిపోతాడు)

వీర : (కత్తిదాచి చికాకుగా బెంచీ చివర కూర్చుంటాడు) (ప్రాతరకపు సూటు—రంగుమాసిన బూటు — భూతద్దాల కళ్ళజోడుతో—చిన్నసైజు బెడ్డింగ్ హోల్డాలు పట్టుకొని వెంకటపతి వస్తాడు)

వెంక : ఇంక యీ స్టేషను దాటిపడే అవకాశం లేనట్లే! అంతవరకూ కూర్చునే ఆసరా అయినా కనబడదే! (వాచీచూచి) అబ్బా యింకా పావుగంట వుండాలి. ఈ రేవుదాటి వెళ్ళాలంటే యీ అర్థరాత్రి ప్రయాణం యింక తప్పేటట్లులేదు. (హోల్డాలుమీద కూర్చుని) ఇటువంటిచోట హత్యలు జరగటంలో వింతేముంది? (వీరయ్యనుచూచి) ఎవరది?

వీర : (వినిపించుకోడు)

వెంక : ఏయ్! ఎవరక్కడ?

వీర : (ఒకసారి నిర్లక్ష్యంగా చూచి వూరుకొంటాడు.)

వెంక : ఏయ్! నిన్నే!

వీర : ఏం?

వెంక : (ముఖం చిట్లించి) ఏమిటా సమాధానం?

వీర : ఏమిటి నీ ప్రశ్న?

వెంక : ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా.

వీర : నువ్వెవరైతే నాకేం?

వెంక : నువ్వు—నువ్వు అంటున్నావే!

వీర : అది మామూలే—కావాలంటే నువ్వుకూడా అను.

వెంక : బుద్ధిలేదా ?

వీర : నీకు కావాలా ?

వెంక : షటప్! రాస్కెల్!

వీర : (చటుక్కున లేచి వస్తూ) రాస్కెల్! అంటే అర్థం నీకు తెలుసా నీ బాబుకు తెలుసా (నిదానించి—గుర్తుపట్టి) ఓహో! ఆంధ్రదేశంలో అఖండప్రజ్ఞావంతులనిఅశేష పేరు ప్రఖ్యాతులతోబాటు లక్షలాది ధనం సంపాదించి అధికార గర్వంతో మాట్లాడుతూవున్న న్యాయాధిపతి మిస్టర్ వెంకటపతిగారా! (వికటంగా నవ్వి) మిస్టర్! అనువుగానిచోట అధికులమనరాదు! మరిచిపోయావా?

వెంక : (ఆశ్చర్యంగా) నన్నెలా ఎరుగుదువు?

వీర : పన్నెండుసంవత్సరాల క్రితం చూశాను.

వెంక : అబ్బా! ఇంకా జ్ఞాపకం వున్నానా?

వీర : చచ్చేవరకూ మరచిపోగలనా నిన్ను?

వెంక : (కోపంగా) అదేమిటి?

వీర : యథార్థం! నేరస్థుణ్ని స్వేచ్ఛగా విడిచిపెట్టి నిరపరాధిని ఉరికంబం యెక్కించే అసత్యమూ గాదు.- అసత్యాలు సత్యాలుగా చెలామణీ అయ్యే న్యాయస్థానమూ గాదు. ఇది వెయిటింగ్ రూమ్ మిస్టర్ వెంకటపతీ!

వెంక : ఇక్కడ నువ్వెందుకున్నావ్.

వీర : నువ్వెందుకున్నావో నేనూ అందుకే!

వెంక : నీవంటివాళ్ళకోసం కాదిది.

వీర : మరి! హంతకుని విడిచిపెట్టి అమాయకుని శిక్షించే అన్యాయమూర్తులకోసమా?

వెంక : అసభ్యంగా మాట్లాడుతున్నావ్!

వీర : అలా మాట్లాడేలాగ చేస్తున్నావ్!

వెంక : మర్యాదగా మాట్లాడడం మంచిది.

వీర : మంచిదే! కాని మర్యాద అంటే యెలా వుంటుంది? మనిషిని రాక్షసిగా మార్చే తప్పుడు తీర్పులా వుంటుందా?

వెంక : అనవసరంగా మాట్లాడకు!

వీర : మాట్లాడితే?

వెంక : పోలీసులను పిలువవలసివస్తుంది.

వీర : (హేళనగా నవ్వి) హుఁ! పోలీసులు! నిజంగా పిలుస్తావా? తమరింకా ఉద్యోగం చేస్తున్నారా?

వెంక : లేదు. రిటైరైనాను.

వీర : అదే మంచిది. లేకపోతే యింకా యెంతమంది నిరపరాధుల్ని శిక్షించేవాడవో!

వెంక : నేనెప్పుడూ అలా చేయలేదు.

వీర : బాగా జ్ఞాపకంవుందా?

వెంక : ఆ!

వీర : పన్నెండుసంవత్సరాలక్రితం ఈ వెయిటింగ్ రూమ్‌లో నే భార్యను హత్య చేశాడన్న నేరానికి ఒకడికి పన్నెండు సంవత్సరాల శిక్ష విధించారు జ్ఞాపకముందా?

వెంక : అవును. జ్ఞాపకముంది. ఆ విషయం నేనెన్నటికి మరచిపోలేనుకూడాను.

వీర : ఎందుచేత?

వెంక : భార్యకోసం అతని హృదయం యెంతగా దుఃఖించిందో నే నర్థంచేసికోగలిగాను. అటువంటివాడు భార్యను చంపాడంటే నేను నమ్మలేకుండా వున్నాను.

వీర : మరి మీ రిచ్చిన తీర్పు అన్యాయం కాదా?

వెంక : తీర్పు మాత్రం అన్యాయం గాదు.

వీర : నిజంగా చంపినవాడినే శిక్షించావా? (కోపంగా) ఆమెను భర్తే చంపాడని నమ్మావా?

వెంక : నా వ్యక్తిగత నమ్మకాలతో చట్టానికి సంబంధంలేదు. సాక్ష్యాన్నిబట్టి ఋజువైనట్లు శిక్షించాం. భర్తే చంపినట్లు సాక్ష్యం వచ్చింది. జ్యూరీ అంగీకరించింది. చట్టం శాసించింది.

వీర : ఆ భర్త తాను చంపలేదంటే విన్నావా?

వెంక : అది వినటానికి వీల్లేని విషయం! ఆ సంగతి ముద్దాయి కాకుండా మరొకరు చెప్పవలసింది. అలా జరగలేదు.

వీర : పోనీ—నీ హృదయం చెప్పిన మాటనైనా విన్నావా?

వెంక : నాకు హృదయంకంటే చట్టం ముఖ్యం!

వీర : ఆ చట్టం యిప్పుడు నిన్ను రక్షిస్తుందా? (కత్తితీస్తాడు)

వెంక : (గంభీరంగా) నన్ను చంపుతావా?

వీర : అవును.

వెంక : ఎందుకని?

వీర : పన్నెండు సంవత్సరాలక్రితం భార్యను చంపాడన్న నేరానికి శిక్షింపబడినవాడను నేనే! ఇవాళనే విడుదలై వస్తున్నాను. యజమానిబాధ పడలేక రంగూన్ పోదామని ఒకనాటి రాత్రి ఈ వెయిటింగ్ రూమ్‌లో నే బండికోసం వుండగా ఒక జూదగాడి మోసంలోపడి నేను దెబ్బలుతిని తెలివితప్పి పడివున్న సమయంలో ఎవడో నా భార్యను నిర్దాక్షిణ్యంగా హత్య చేశాడు. హృదయానికి హృదయమైన నా యిల్లాలిని పోగొట్టుకోవడమే కాకుండా—ఆ యిల్లాల్ని నేనే చంపానన్న అపనిందతోబాటు కఠిన శిక్షను కూడా అనుభవించటమంటే యెంత బాధగా వుంటుందో తెలుసా? కుర్చీలో కూర్చుని కలంతో ప్రాణాలు తీసేటంత సులువుగా వుంటుందా? చెప్పండి న్యాయమూర్తి గారూ! నా ఈ నాశనానికి కారణమైన మిమ్మల నందరను చంపటమే నా ఆశయం! ఆ ఆశతోనే ఈ పన్నెండు సంవత్సరాలు జైల్లో గడిపి బయటకు వచ్చాను. ఏ చట్టాన్ని ఆధారం చేసికొని నన్నింత అన్యాయంగా శిక్షించావో ఆ చట్టం యిప్పుడు నిన్నెలా రక్షించగలదో చూడాలని వుంది. (కత్తి సవరిస్తాడు).

వెంక : చట్టం నన్నిప్పుడు రక్షింపలేకపోవచ్చు. కాని అప్పుడు నేను చట్టానికి బాధ్యుణ్ణి! ఆ తీర్పు—ఆ శిక్ష నే నిచ్చినవి గావు. చట్టం శాసించిన ఉత్తరువులు నేను చదివాను అంతే! ఇప్పుడు నువ్వూ నేనూ సమానులమే! మన హృదయాలు చెప్పినమాట మనం విన వచ్చు. నీలోనూ మానవత్వముంది. నీ హృదయాన్ని అడుగు ఏమంటుందో!

వీర: (బాధగా నిట్టూర్చి) హుం! మానవత్వం! మానవుడుగా బ్రతికే నా నెత్తిని అన్యాయంగా అపరాధం రుద్ది రాక్షసుణ్ణి చేసింది నన్నీ చట్టం! పన్నెండు సంవత్సరాలు రాక్షసుడుగా బ్రతికిన నాలో యింకా యెక్కడుంటుంది మానవత్వం?

వెంక : నన్ను చంపటంతో నీ హృదయానికి శాంతి కలుగుతుందంటే చంపు. నా అభ్యంతరం లేదు. నీకూ హృదయముంది. ఆలోచించు.

వీర : (బాధగా గుండెలు పట్టుకొని) వెంకటపతి గారూ!

వెంక : అవును. నీ శిక్షకు పూర్తిగా నేనే కారణమని నీ హృదయం చెపితే-నా రక్తంతో నీ భార్యకు మనశ్శాంతి కలుగుతుందంటే చంపు! సిద్ధంగా వున్నాను.

వీర : (బాధగా-గట్టిగా అరచి) ఆ! నా భార్యకు రక్త తర్పణమా? కాదుకాదు! నా మాణిక్యం రాక్షసిగాదు. మనిషి. పరాయి కష్టాన్నైనా చూచి సహించలేని మానవత్వం గల మనిషి! ఛీ! ఛీ! అటువంటి నా మాణిక్యానికా రక్తదాహం? మాణిక్యం! నీ మీది ప్రేముకొద్ది-మూర్ఖుడనై నీ కిష్టంలేని కర్మకాండను చేయబోయాను. కానీ దేవత వయ్యావేమో నన్నా పశుకృత్యాన్నుండి తొలగించావు. నన్ను క్షమించు మాణిక్యం! (చేతులలో ముఖం దాచుకొని ఏడుస్తాడు) వెంకటపతి గారూ! వెళ్ళిపొండి! తక్షణం వెళ్ళిపొండి! (పాదాలు పట్టుకొని) ఇప్పటికైనా నేను హంతకుడను కానని విశ్వసించారు. మరిచిపోయిన మానవత్వాన్ని తిరిగి జ్ఞాపకం చేశారు. ధన్యవాదాలు. వెళ్లిపొండి! (బయటకు విసిరేసి వెంకటపతిని బయటకు గెంటేస్తాడు) ఏమిటి నాకీ ఆందోళన? అబ్బా! చలి! ఇంతసేపూ లేని చలి యిప్పుడెలా వచ్చింది? (చేతులు కట్టుకొని పైకి చూచి చూచి) మాణిక్యం! మాణిక్యం! (కుమిలికుమిలి యేడ్చి ముఖం దాచుకొని బెంచీ చివర కూర్చుంటాడు)

[కాస్సేపయాక శివయ్య వస్తాడు]

శివ : ఏం బాబూ చలిగా వుందా?

వీర : (మాట్లాడడు)

శివ : నా దగ్గర నున్నదిల్లా యీ పాతరగ్గే! కప్పుకొంటావా?

వీర : (సాఫీగా) అక్కరలేదు శివయ్యా!

శివ : ఫరవాలేదు. కప్పుకోవయ్యా! (మీద వేస్తాడు)

వీర : (దాన్ని కదపకుండా వెర్రిగా చూస్తూ వుంటాడు)

శివ : ఆవేశపడకు నాయనా! ఆలోచించకుండా తప్పటడుగులు వేస్తే జీవితాంతం దుఃఖించ వలసి వస్తుంది బాబూ!

వీర : వేదాంతమా!

శివ : కాదు బాబూ! నా జీవితానుభవం!

వీర : మాటిమాటికి అనుభవమో అనుభవమో అంటున్నావు. ఏమిటా అనుభవం?

శివ : పగవల్ల ఒక్కొక్కప్పుడు ఎంతటి అనర్థాలు జరుగుతాయో కళ్ళారా చూశానయ్యా.

వీర : ఏం జరిగిందో చెప్పవేం?

శివ : చెపుతాను. (నిట్టూర్చి) అసలు వాడీ ఒక పెద్ద కుటుంబమే! భార్యా బిడ్డలతో కాపురం చేసుకొంటున్నా వాడినే! చేసిన పాపాన్ని దాచుకోవటానికి మారువేషంతో దూరదేశంలో నుండగా కలరా తగిలి నా కుటుంబమంతా నాశనమైపోయింది. ఆ స్తిని వారసులు ఆక్రమించుకొన్నారు. ఈ స్థితిలో బయటపడి ఫలానా అని చెప్పుకో లేక చేసేదిలేక చివరకిలాబిచ్చమెత్తుకొని జీవిస్తున్నాను. నేను చేసిన మహా నేరానికి యీ శిక్ష కూడా సరిపోదు లేవయ్యా!

వీర : అసలు నువ్వు చేసిందేమిటి? ఆ సంగతి చెప్పవేం?

శివ : ఇరవై సంవత్సరాల క్రితం ఒక అందమైన అమ్మాయి నన్ను ప్రేమించినట్లు నటించి, మోసగించి మరొకడిని పెళ్ళాడింది. దాన్ని చంపాలని పగ పట్టాను. సమయం కోసం యెదురుచూస్తున్నాను. సరిగా యెనిమిది సంవత్సరాలు గడిచాక ఒక నాడు అవకాశం వచ్చింది. బండి మారటానికి కాబోలు కూర్చున్నారు. భర్త బయటకు వెళ్ళాడు. నేను కత్తి కోసం యింటికి వెళ్ళాను. కత్తి తెచ్చాను.

వీర : తెచ్చి-చంపేశావా?

శివ : (బాధగా) ఆ! చంపేశాను.

వీర : కోరిక నెరవేరిందన్నమాట!

శివ : లేదు.

వీర : (వింతగా) అదేమిటి?

శివ : నేను చంపింది—నేను చంపవలసిన స్త్రీని గాదు. మరొక స్త్రీని.

వీర : అదెలా జరిగింది?

శివ : నేనింటికి వెళ్ళి కత్తి తెచ్చేలోపులో అసలు వాళ్ళు ఏమయ్యారో తెలియదుగానీ ఆ స్థానంలో అటువంటి స్త్రీ మరొకావిడ కూర్చునివుంది. ఆవిడ కూడా వంటరిగానే వుండటంతో — ఆ చీకటిలో — ఆ ఆవేశంలో — ఆ ముక్కూ మొగమూ తెలియని పరాయి స్త్రీని చంపేశానయ్యా! (దుఃఖంతో) యీ పాపిష్టి చేతులతోనే యిక్కడే యీ వెయిటింగ్ రూమ్‌లోనే ఒక నిండు ప్రాణాన్ని బలిగొన్నానయ్యా!

వీర : (ఉలిక్కిపడి) ఇక్కడా! యీ వెయిటింగ్ రూమ్‌లోనా?

శివ : (బాధగా) అవును నాయనా! ఈ వెయిటింగ్ రూమ్‌లోనే ఇటువంటి చీకటి సమయంలోనే!

వీర : (తొట్రుపాటుతో) ఎన్ని సంవత్సరాల క్రితం?

శివ : పన్నెండు సంవత్సరాలయ్యింది బాబూ! (రైలు కూత)

వీర : (భయంగా-కంగారుగా-గట్టిగా) ఆ!

శివ : (తెల్లబోయి) ఏమిటది?

వీర : బండి వచ్చేసింది (జేబులు తడుముకొంటూ వుంటాడు)

శివ : ఏమిటి వెదుకుతున్నావ్? (రైలు కూత)

వీర : (కంగారుగా) బండి బయలుదేరుతూ వుంది.

శివ : ఏం? వెళ్ళిపోతావా?

[బండి బయలు దేరుతున్న ధ్వని]

వీర : అవును ఇదిగో ఈడబ్బు తీసుకో! పన్నెండు సంవత్సరాలు జైల్లో కష్టపడ్డ దాని ఫలితం! (నోట్లు కట్ట-రగ్గు-బాసు-శివయ్య కాళ్ళదగ్గరకు విసరివెళ్ళిపోతూ వుంటాడు)

శివ : (ఆశ్చర్యంగా) ఏమిటది?

వీర : (వెనక్కు తిరగకుండానే ఆగి) నేనే ఆ చంపబడినదాని భర్తను. నీశిక్ష నేననుభవించి యీవాళనే విడుదలయి వస్తున్నాను (వెళ్ళిపోతాడు)

శివ : (అచ్చెరువుతో గట్టిగా) ఆ! నువ్వా!

వీర : (వెళ్ళిపోతూ లోపలనుంచే) అవును నేనే! నిన్ను చంపుదామనే వచ్చాను—కానీ— [బండిదూరంగా వెళ్ళిపోయిన చప్పుడు].

శివ : (బరువుగా నిట్టూర్చి-నేలమీదున్న కత్తితీసి) ఈకత్తితోబాటు నీ హృదయంలోని క్రౌర్య కల్మషాన్ని కూడా విడిచిపెట్టి వెళ్ళిపోయావా నాయనా? (ముఖం పైకెత్తి గంభీరంగా చూస్తూ అలాగే నిలుచునివుంటాడు)

[తెర]

# కన్నడ సాహిత్య పరిచయము

శ్రీ కె. సుబ్బరామప్ప

తెలుగువారికి సన్నిహితులుగా నుండు కన్నడిగుల సాహిత్యమునుగూర్చి మనము తెలిసికొనుట సముచితము. దక్షిణదేశభాషలలో తమిళము తర్వాత ప్రాచీనమైన భాష కన్నడమే. తెనుగున పదునొకండవ శతాబ్దమున గ్రంథరచన కాగా కన్నడమున తొమ్మిదవ శతాబ్దముననే ప్రారంభమయ్యెను. నృపతుంగుడను రాజు 'కవిరాజ మార్గ'మను వ్యాకరణగ్రంథము నీ కాలమున వ్రాసెను. "ప్రయోగశరణం వ్యాకరణం" అను నానుడిప్రకారము పరికించితిమేని కన్నడ భాషయు నీ గ్రంథరచనకు పూర్వమే బలసియుండ వచ్చునని యూహించవచ్చును. కన్నడమున ప్రాచీనమైన శాసనములలో హల్మిడి శాసనము (క్రీ॥ శ॥ 700) శ్రవణబెళగొళశాసనము (క్రీ॥ శ॥ 700) - వీనిని పరిశీలించిన కన్నడనుడియొక్క స్వరూపమును దాని స్వభావమును కొంత తెలియవచ్చును. అప్పటి భాషను హళెగన్నడమని (ప్రాత కన్నడము) చెప్పెదరు. తమిళమునకు కొంత సన్నిహితముగా నుండును. నృపతుంగుడు తన 'కవిరాజమార్గము'న పూర్వ కన్నడ కవులను కొందఱిని పేర్కొనెను. శ్రీవిజయ, కవీశ్వర, పండిత, చంద్ర, లోకపాల, మొదలైనవారు కన్నడమున గ్రంథములు వ్రాసి యుండవచ్చును కాని యవియన్నియు నుత్సన్నములు.

పంపయుగము :

ఆంధ్రవాఙ్మయమున కవిత్రయమువంటి మువ్వురు కవులు కన్నడ సాహిత్యమున రత్నత్రయమను పేరుతో గలరు. పంప, పొన్న, రన్న అను వీరు మిక్కిలి ప్రసిద్ధులైన ప్రాచీనకవులు. సామాన్యముగ కన్నడ సాహిత్యచరిత్రను జైనయుగమని, వీరశైవయుగమని, బ్రాహ్మణయుగమని విభజించుట పరిపాటి. తెనుగున నన్నయభట్టారకు డెట్లనో కన్నడమున ఆదికవియని ప్రసిద్ధి జెందినవాడు పంపడు. నృపతుంగు డితని కంటెను ముందుగా కావ్యరచన చేసినను నది కేవలము వ్యాకరణగ్రంథమే యగుటచే సాహిత్యరంగమున దానికి ప్రాశస్త్యము తక్కువ.

తొలుత పంపకవి (క్రీ॥ శ॥ 941) ఆంధ్రదేశమైన వేంగిదేశమున నుండినవాడు. జైనమతావలంబియై కన్నడదేశమున దానికిగల ప్రాశస్త్యమును గాంచి యా దేశమునకు వచ్చెనందురు. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారితనిని తెలుగుకవియనియు నితని తెలుగురచనయని చెప్పబడు నొకటి రెండు పద్యములను తన ఆంధ్ర సాహిత్య చరిత్రలో నుదాహరించియున్నారు. వైదిక మతాభిమానియైన కన్నడకవి నారాయణభట్టునకు గూడ జైనమతము గిట్టక రాజమహేంద్రవరమును జేరి కొని నన్నయభట్టునకు భారతరచనయందు సహాయపడెను. మొదట మనకధికముగ దొరకునవి జైనగ్రంథములే. జైనులు తమ తీర్థంకరుల జీవితచరిత్రలను పురాణములుగ రచించియున్నారు. పంపని 'ఆదిపురాణము'న మొదటి తీర్థంకరుడైన వృషభనాథుని చరిత్ర వర్ణింపబడినది. ఇతని 'విక్రమార్జున విజయము' (పంపభారతము) మహాభారతకథను నిరూపించును. ఈ జైనకవులలో పంప, పొన్న, రన్న, నేమిచంద్ర, జన్న, రత్నాకరసిద్ధ మొదలైనవారు ప్రసిద్ధి కెక్కిరి. జైనులలో రామాయణ భారతములును శ్రీకృష్ణునికథయును గలదు. కాని మనలో ప్రచారమున నున్న కథలకును జైనమతస్థులలో నాదృతగా నుండు కథలకును వ్యత్యాసములు గలవు. వీరి రామాయణమున రావణుని సంహరించువాడు రాముడు కాదు లక్ష్మణుడు. పంపకవి తనకు ఆశ్రయదాతయైన వేంగిదేశాధీశుడు అరికేసరి సచ్చరిత్రను మెచ్చికొని యతనిని అర్జునునితో బోల్చి గ్రంథమును వ్రాసెను. అందులకే దానికి విక్రమార్జునవిజయమని పేరిడెను. ఇతని భారతకథాసంవిధానమున మార్పులు గలవు. ద్రౌపది పంచభర్తృక గాక అర్జునుని యేకైక భార్య. కృష్ణునికి వ్యాస భారతమునగల ప్రాధాన్యమిచట లేదు.

పంపకవి యనంతరము రన్నకవి ఖ్యాతిని గడించెను. ఇతడు జాతిలో వైశ్యుడు, వృత్తిలో గాజుల

వాడు, ధర్మాచరణమందు జైనుడు. ఈతని "అజిత తీర్థంకరపురాణము, 'సాహసభీమ విజయము' లేక 'గదాయుద్ధము' మిక్కిలి వ్యాప్తిగాంచిన గ్రంథములు. రన్నని 'గదాయుద్ధము'నకు భీముడే నాయకుడు. దుర్యోధనుడు పురుషకారమే ప్రధానమని యెంచి యుద్ధ మొనరించి దుఃఖము లనుభవించి కపటపరి శుద్ధాంతఃకరణుడగును. మొత్తముపై కన్నడసాహిత్యమున రన్నని రసప్రతిపాదన, శైలి, పాత్రపోషణ, ఔచిత్య పరిజ్ఞానము, అర్థోచితమైన పదప్రయోగము, వేరొక ప్రాచీనకవికి లేవని చెప్పెదరు. ఈతని రచనను మన తిక్కన సోమయాజి రచనకు పోల్చవచ్చునని నా యూహ. ఈ రన్నకవికి పోషకుడైన చావుండరాయుడు తాను గ్రంథకర్త యగుటయే గాక జైనమతావలంబియై శ్రవణబెళగొళలో నిర్మింపబడిన బ్రహ్మాండమైన గోమటేశ్వరుని శిలావిగ్రహమును స్థాపించిన వాడట. పొన్నకవి జైనమతాశ్రయముననే 'శాంతి పురాణము'ను వ్రాసెను. ఈతడు ఆంధ్రదేశీయుడనియు చిత్తూరుజిల్లాలోని పుంగనూరు వాస్తవ్యుడనియు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు తమ 'భారత కవితా విమర్శ'లో వ్రాసిరి.

ఈ కాలముననే నాగవర్మ 'ఛందోంబుధి' 'కావ్యాలోకన', 'కాదంబరి' అను గ్రంథములను వ్రాసెను. ఇతడు సంస్కృత తత్సమ పదములను తక్కువగ నుపయోగించుచు కన్నడపదముల నెక్కువగ వాడెను. 12 వ శతాబ్ది ఆదిభాగమున నాగిచంద్రుడను కవి 'రామచంద్రచరిత పురాణము" 'మల్లినాథ పురాణము' అను రెండు గొప్ప కావ్యములను వ్రాసెను. ఈతనికి 'అభినవపంప' అను బిరుదు గలదు. ఇతడు వ్రాసిన జైన రామాయణ కథకును వాల్మీకి రామాయణమునకును కొన్ని భేదములు గలవు. దశరథుడు గావించిన పుత్రకామేష్టిని గాని విశ్వామిత్ర వశిష్ఠాది ఋషుల ప్రస్తావనగాని యెత్తలేదు. ఇతని హనుమంతుడు విమానమెక్కి సముద్రమును దాటునుగాని తానై తానే లంఘించిపోడు. వాలి వైరాగ్యమునొంది సన్యాసియగును. అతడు రామునిచే గూలెనను ప్రసక్తియే లేదు. సుగ్రీవుని హింసించినది మాయాసుగ్రీవుడు, వాలి కాదు. ఈ మార్పులవలన నాగచంద్రుడు రావణుని పాత్రను ఆదర్శప్రాయముగ చిత్రించియున్నాడు. ఈతని రావణుడు మిక్కిలి యోగ్యుడు, ధర్మపరుడు. నలకూబరుని పత్ని తనను వలచి తన కోరికను చెప్పిపంపగా వలదని వారించి బుద్ధిచెప్పి పంపును. మన, కంకంటి పాపరాజు యొక్క కాముక రావణునివలె గాక ఈతనిరావణుడు జితేంద్రియుడు. పరస్త్రీపరాఙ్ముఖుడు. ఈ గ్రంథములన్నియు కేవలము జైనమతప్రచారమునకై వ్రాయబడినవని చెప్పకయే చెప్పును. జైనమతము నాశ్రయించుకుని ఆ మతావలంబులైన రాజుల పోషణమున నీసాహిత్య మభివృద్ధిజెందెను. ఆంధ్రవాఙ్మయరంగమునగూడ సాహిత్యము మతము నాశ్రయించిన ఘట్టము లెన్నియోగలవు జన్నకవి యశోధరచరిత్ర, అనంతనాథ పురాణము లనెడు రెండుకావ్యములను రచియించెను. ఇవియు అహింసను ప్రతిపాదించు గ్రంథములే.

ఈ కాలమందలి సాహిత్యము రాజాస్థానములలో నుండెను. సామాన్యజనులకై కవులు సాహిత్యమును సృష్టించలేదు. సంస్కృతగ్రంథములే వీరికి మూలములు. వానియొక్క అనువాదములే యెక్కువగా బయలుదేరెను. కేవలము సంస్కృతమూలములలోని దీర్ఘసమాసములకు కన్నడప్రత్యయములను చేర్చి వృత్తములను వ్రాయుచు వచ్చిరి.

12 వ శతాబ్దమును కన్నడసాహిత్యచరిత్రలో స్వతంత్రయుగమని చెప్పవచ్చును. సుమారు క్రీ॥ శ॥ 1190 ప్రాంతమునకు ప్రసిద్ధికి వచ్చిన బసవడు కన్నడ సాహిత్యమున కొక నూతనమార్గమును చూపించెను. వేమనపద్యములవలె యివి నూటిగా ప్రచారమును దృష్టియందుంచుకొని చెప్పబడినవి. వీనిని కర్ణాటకమున 'బసవణ్ణన వచనగళు' అని చెప్పెదరు. వీనిని సామాన్యజనులకుగూడ అర్థమగునట్లీతడు రచియించెను. కన్నడమున దేశికవిత కీతడు మార్గదర్శి యనవచ్చును. ఈ రచనలయం దనావశ్యకములైనపదము లుండవు. దీర్ఘసమాసములతోకూడిన సంస్కృత తత్సమ పదము లుండవు. వాగాడంబరములేదు. 'వచనగళ సాహిత్య' కన్నడవాఙ్మయమున నొకవిశిష్టతను నిరూపించినది. అనేక 'వచనములు' ఆతుకవిత్వధోరణిలో నుండును! అప్పుడప్పుడు జంగమువారీవచనములను పాడుకొనుచుందురు. బసవని సమకాలికులైన అల్లమప్రభు, సిద్ధరాము, మడివాళ మాచయ్య, అంబిగర చౌడయ్య మొదలైనవారు బసవనివచనములనుబోలినవానిని రచించిరి. స్త్రీలుకూడ కొందఱిట్టిరచనలను గావించిరి. వారిలో అక్కమహాదేవి పేర్కొనదగినది.

ఈ వీరశైవ సాహిత్యమును వ్యాప్తికిదెచ్చిన వారిలో క్రీ॥ శ॥ 1200 ప్రాంతమున హంపీ వాస్తవ్యుడైన హరిహరకవి ముఖ్యుడు. ఈతడు 'గిరిజా కళ్యాణము' కావ్యమును వ్రాసెను. ఈతడు రగళెఛందస్సున శివశరణుల కథలను వ్రాసెను. "రగళెయకణ్ణి" యని

ప్రసిద్ధికి వచ్చెను. హంపి హరిహరుని మేనల్లుడును విశిష్టుడును అయిన రాఘవాంకుడు 'హరిశ్చంద్రకావ్య' 'సిద్ధరామపురాణ', 'సోమనాథచరితె' మొదలైన కావ్యములను షట్పదీఛందస్సున వ్రాసెను. రాఘవాంకుని కావ్యములలో 'హరిశ్చంద్ర కావ్యము' మిక్కిలి ప్రసిద్ధికి వచ్చెను. ఈతని "సంభాషణశైలి" పాఠకులను శ్రోతలను ముగ్ధులను జేయును. ఈతని తర్వాత చామరస, భీమకవి, విరూపాక్ష పండిత, మొదలగు వీరశైవకవు లుదయించిరి. చామరసకవి "ప్రభులింగ లీలె"ను (అల్లమప్రభులీలలు) భీమకవి బసవపురాణమును వ్రాసిరి. మన పాల్కురికి సోమనాథుడు వ్రాసిన బసవపురాణమును చూచి తను వ్రాసినట్లు భీమకవి చెప్పికొన్నాడు.

కన్నడ కవులలో నత్యంత స్వతంత్రకవి యని పేరుబొందిన కుమారవ్యాసుడు విజయనగరము నేలిన ప్రౌఢదేవరాయలకాలమున (1423-1446) తన అమూల్యమైన కన్నడ భారతమును వ్రాసెను. ఈతడు తాను వ్రాసిన భారతమును గదగ్ వంశలి వీరనారాయణస్వామి దేవుని కంకితము గావించెను. ఈతని స్వంతపేరు నారణప్ప. ఈభారతమునకు "గదుగిన భారత" అనియూ పేరు గలదు. ఇతడు మొదటి పది పర్వములను మాత్రము వ్రాసెను. పిమ్మట కృష్ణదేవరాయని కాలమున తిమ్మణ్ణకవి మిగిలిన యెనిమిది పర్వములను వ్రాసెను. కాని కుమారవ్యాస భారతమునకు గల వ్యాప్తి దీనికి లేదు. బ్రాహ్మణమత సంబంధులైన కవులును గ్రంథములును చాల తక్కువ. చరిత్రాత్మకకథాగ్రంథములు గాని మిశ్రమకథారూపములు గాని ఆంధ్రవాఙ్మయమునందువలె కర్నాటకవాఙ్మయమున నీకాలమున కానుపించవు. అనంతరము బ్రాహ్మణ ధర్మమునకు సంబంధించిన వైదికధర్మములను ప్రతిపాదించునట్టి కొన్ని సంస్కృతగ్రంథములు భాషాంతరీకరింపబడుటచే నీకొఱత దీరెను. నిత్యాత్మకశుకయోగి భాగవతము ననువదించెను. కుమారవాల్మీకి "తొరవె రామాయణము"ను భామినీ షట్పదీవృత్తములలో వ్రాసెను. లక్ష్మీశుడు జైమినిభారతమును వార్ధక షట్పదిలో రచియించెను. ఈతని రచన మనోహరమైనది. పండితపామరులకుగూడా నర్థమగు శైలిలో నీతడు వ్రాసెను.

సుమారు క్రీ. శ. 1567 ప్రాంతమున గ్రంథ రచన గావించిన రత్నాకరవర్ణి పేర్కొనదగిన వాడు. ఈతని గ్రంథములలో "భారతేశ వైభవము" ప్రసిద్ధి చెందినది. ఇదియొక జైన తీర్థంకరుని చరిత్రను వర్ణించు కావ్యము. నవరసభరితమై తత్త్వజ్ఞానభూయిష్ఠమై యొప్పియున్నది.

పదునారవశతాబ్దివేళకు కన్నడనాడున కొందరు హరిదాసు లుద్భవించి పాటలధోరణిలో రచనలు ప్రారంభించిరి. బసవని వచనములు శివునిగూర్చి వర్ణించగా యీ హరిదాసుల పాటలు విష్ణువును కీర్తించెను. వీరిలో పురందరదాసు, కనకదాసు, విజయదాసులు ముఖ్యులు. భగవంతుని భజించి బ్రతుకవలెను. అతడు భక్తవత్సలుడు, ఆపద్బాంధవుడు, అనాథరక్షకుడు, భక్తవశంకరుడని పాటలలో కీర్తించిరి.

"నంబికెట్టవరిల్లవో రంగయ్యన నంబదె కెట్టరె కెళిలి" (రంగని నమ్మి చెడినవారూ లేరూ, నమ్మక చెడిపోయేరూ) ఈదాసులు ప్రజలకు వైరాగ్యమును బోధించి వారిని సన్యాసులుగా జేసిరని యొకయపవాదము గలదు. అది సరికాదు. వీరు ఇహజీవనమును తిరస్కరించలేదు. కాని చార్వాకసిద్ధాంతమువలె ఇహలోకజీవనమే పరమావధిగా నెంచి చెడిపోవుదని బోధించిరి. "ఈసబేకు-ఇద్దు జైసబేకు" (సంసారము నీదవలెను-ఈదుతూ దరిజేరవలెను.) అనునది వీరితత్త్వం.

## చిక్కదేవరాయని కాలము (1673-1704)

విజయనగర సామ్రాజ్యము నాశమైన పిమ్మట కన్నడనాడునందు చిన్నచిన్న పాళెగాళ్లు రాజ్యములు స్థాపితములగుటతో సాహిత్యరచనయు కుంటువడెను. అనంతరము మైసూరు రాజులకాలమున నిది మరల తలయెత్తసాగెను. వైష్ణవమతప్రాబల్యముగూడ సాహిత్యాభివృద్ధికి కారణమాయెనని చెప్పవచ్చును.

చిక్కదేవరాయలు, శ్రీకృష్ణదేవరాయనివలె, స్వయముగ కవియు కవిపోషకుడును నై కన్నడసాహిత్యాభివృద్ధికి చేయూత నిచ్చెను. తిరుమలార్య, సింగరార్య, చిక్కుపాధ్యాయ అను కవులును హొన్నమ్మ యను కవయిత్రియు నీతని యాశ్రయమున గ్రంథములను రచియించిరి. చిక్కదేవరాయలు స్వయముగ జయదేవుని గీతగోవిందము ననుసరించి "గీతాగోపాల"మును 'చిక్కదేవరాయ బిన్నపం' అను గ్రంథమును వ్రాసెను. లక్ష్మీపతి యను నామాంతరముగల చిక్కుపాధ్యాయు డనేక గ్రంథములు వ్రాసెను. ఇతడు వ్రాసినన్ని గ్రంథములను ఆనాటికి మఱియొక కన్నడకవి వ్రాసియుండలేదట. రుక్మాంగద చరిత్ర, విష్ణుపురాణము మొదలగు నీతని గ్రంథముల మూలమున వైష్ణవమతోద్ధరణము గావింపబడెను. శ్రీకృష్ణ

దేవరాయలవలె నీ చిక్కదేవరాయలును వైష్ణవమతోద్ధరణకై గ్రంథములు వ్రాయించెను. ఈతని కాలముననే ప్రప్రథమముగ కన్నడభాషయందు నాటకరచన గావింపబడెను. సింగనార్యుడను కవి శ్రీ హర్షుని రత్నావళి ననుసరించి "మిత్రవిందా గోవిందా" అను నాటకమును రచించెను. యక్షగానములుగూడ నీ కాలముననే వాడుకలోనికి వచ్చెను. అప్పటినుండియు యక్షగానరచనయు కన్నడదేశమున వ్యాప్తికి వచ్చెను.

సింగనార్యుని శిష్యురాలైన హొన్నమ్మ యను కవయిత్రి తొలుత చిక్కదేవరాయని యంతఃపురమున నూడిగము సేయుచు కవనశక్తిని ప్రదర్శించుచుండెనట. రాజు ఆమె కవితాశక్తిని గుర్తించి గ్రంథమును వ్రాయించెనట. అతని ప్రేరణపై "హదిబదెయధర్మ" అను పుస్తకమును వ్రాసెను ఇందులో నీమె పతివ్రతాధర్మములుగల సన్నివేశములను చక్కగ చిత్రించినది. "ఆంధ్రశబ్దచింతామణిని" నన్నయభట్టు సంస్కృతభాషలో రచియించినట్లు కన్నడవ్యాకరణమును భట్టాకళంకుడను కవి "శబ్దానుశాసన" అను పేరిట సంస్కృతభాషలో వ్రాసెను. ఈ కాలముననే కన్నడనాడునందు జనప్రియుడైన "మహాలింగ రంగుడు" (రంగనాథుడు) "అనుభవామృత"మను గ్రంథమును భామినీ షట్పదులలో వ్రాసెను. అద్వైతమతమును "సులిద బాళెయ హణ్ణినంతిహ" ("ఒలువబడిన అరంటి పండెటు") సులభగ్రాహ్యముగ పామరులకుగూడ నర్థమగునట్లు ప్రతిపాదించెను. ఈ అనుభవామృతమును అనంతపురంజిల్లా రాయదుర్గంతాలూకా కలుగోడు కరణం అశ్వత్థరావుగారు తెనుగునకు పరివర్తించినారు. చక్కని అనువాదము.

ఈ చిక్కదేవరాయని దండనాథుడైన కళలె వీరరాజు కన్నడ ఆంధ్ర భాషలలో గ్రంథరచన గావించెను. కన్నడమున "వైద్యసంహితాసారార్ణవ," "వీరరాజోక్తి విలాస" అను వైద్యగ్రంథములను తెనుగున వచనభారతమును వ్రాసెను. వీరరాజపుత్రుడు నంజరాజుగూడ కన్నడమునను తెనుగునను గ్రంథములు వ్రాసెను. 'హాలాస్యమాహాత్మ్య'మును తెలుగునను కన్నడమున మార్కండేయపురాణము, హరివంశము, కాశీకాండము అను గ్రంథములను వ్రాసెను. చిక్కదేవరాయల కాలమున తెలుగుకవులు కొందరు యక్షగానములు రచియించిరని చెప్పబడుచున్నది. "చిక్కదేవరాయ విలాసము" అను నొక యక్షగానమున్నట్లు తెలియుచున్నది. ఈతని కుమారుడు కంఠీరవ నరసరాజు (మూకరసు) తెలుగున యక్షగానములు రచియించినాడనియు వానిని శ్రీ నిడదవోలు వెంకటరావుగారు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీయందు చూచితిననియు ("*Annals of Oriental Research*") వ్రాసియున్నారు. 1791 సంవత్సరమున చంద్రకవి యను నొక తెలుగుకవి శ్రీ ముమ్మడి కృష్ణరాజేంద్ర ఒడయరు పోషణమున "శ్రీకృష్ణభూపాలీయము" అను వ్యాకరణగ్రంథమును పద్యరూపమున వ్రాసెను. ఇది నన్నయ "ఆంధ్రశబ్ద చింతామణి"కి అనువాదము. దీనిని శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి పీఠికతో మైసూరు ప్రభుత్వమువారు ప్రకటించి యున్నారు. (మైసూరు ఓరియంటల్ రీసర్చి లైబ్రరీలో ప్రతులు అమ్మబడును) ఈ రాజు కవిపోషకుడే గాక గ్రంథకర్తయు నగును. "శ్రీ కృష్ణరాజ వాణీవిలాస భారత" "శాకుంతల నాటకద నవీన టీకె" అను గ్రంథములను వ్రాసెను. "ముద్రామంజూష" యను జనప్రియమైన నొక గ్రంథమును కెంపు నారాయణశర్మ యను కవి యీ రాజాశ్రయముననే రచియించెను.

శ్రీ చామరాజ ఒడయర్ కాలమున అనేక సంస్కృత నాటకములు కన్నడమునకు భాషాంతరీకరింపబడెను. అభినవకాళిదాస బిరుదాంకితుడయిన శ్రీ బసవప్పశాస్త్రిగారు శాకుంతలం మొదలైన నాటకములను దమయంతీస్వయంవర మాదిగాగల కావ్యములను వ్రాసిరి. ఈతనిని ఆంధ్ర వాఙ్మయమున కీ॥ శే॥ వేదం వేంకటరాయ శాస్త్రిగారికి పోల్చవచ్చును. ఈ శతాబ్దాంతమున పేర్కొనదగిన కవి "ముద్దణ". ఈతని అసలు పేరు నంజళికెయ లక్ష్మీనారణప్ప. హళగన్నడమున "రామాశ్వమేధ" మను హాస్యరసభరిత మయిన గ్రంథమును రచియించి కన్నడిగుల మెప్పును వడసెను.

రాజాశ్రయముల నపేక్షింపక తమ్ము మెచ్చికొన్నను సరే నిందించినను సరే యని ఫలాపేక్ష లేక కొందరు జనప్రియులైన కవులు బయలుదేరి సామాన్యజనుల సుఖదుఃఖములను కష్టనిష్ఠురములను వర్ణించి కవనము లల్లిరి. ఇవి యుద్గ్రంథములనే చూచి మెచ్చికొను వారి చెంతకు వచ్చునవి కావు. కాని జనసామా

న్యము విని సంతోషించి ఆదరించునట్టివి. వీనిలో నిజమైన జీవితసౌందర్యమును నిత్యజీవనవిమర్శలను నిమిడియున్నవి. ఇవి లావణులను నొక మెట్టున రచింపబడినట్టివి. "టిప్పుసుల్తాన్ లావణి", "సంగప్ప నాయకన లావణి" మొదలైనవి ప్రఖ్యాతములు. జనపద సాహిత్యమున ఇవి మేల్బంతులు. ఉదాహరణముగ కొన్నింటిని చూడుడు :—

1. "గంజీయ కుడిదరూ గండన మనెలేస"
   (గంజి తాగినా మగనిల్లే లెస్స)
2. "తవరూరు దారీలి కల్లిల్ల ముల్లిల్ల"
   (పుట్టినింటికి పోయే దారిలో రాళ్లూ లేవూ ముళ్లూ లేవు)
3. "బాలకరిల్లద బాలీద్యాతర జన్మ
   బాడిగి ఎత్తు దుడిద్హాంగ"
   (పిల్లలు లేని జన్మ ఎందుకు? బాడిగ యెద్దు సేద్యం చేసినట్టు)
4. తాయిల్ల తవరీగె హోగదిరు ననమనవ! నీరిల్ల
   కెరెగె కరబందు"
   (తల్లి లేని పుట్టినింటికిపోతే నీరులేని చెరువుకు పోయినట్టే)

ఇటువంటి పద్యాలకు ఎవరి వ్యాఖ్యానము అవసరములేదు. భాష మిక్కిలి సులభము. చెప్పనట్టి విషయములా జనుల నిత్యజీవితానికి సంబంధించినట్టివి. సహజముగ వచ్చు అలంకారములకు కొఱతయే లేదు.

సర్వజ్ఞుడను కవి త్రిపదులలో మన వేమన్నవలె పాడుకొనుచు నూరూర తిరిగి తన సందేశమును పామర జనమునకు అందించినాడు. ఇత డేకాలపువాడైనదియు నింకను నిర్ణయించబడలేదు. కొందఱు వేమన సమకాలికు డందురు. కాని యిదమిత్థమని తేల్చలేదు. "వేమన—సర్వజ్ఞ సంభాషణ" మను నొక పుస్తకమును కన్నడ భాషలో ప్రకటించియున్నారు—అందులో వేమన పద్యములకు సుమారుగ సరియైన యర్థమిచ్చు సర్వజ్ఞుని వచనము లీయబడినవి. సర్వజ్ఞుడు, "కుంతల్లి నింతల్లి పదగళు హేళువ సంప్రదాయదవను" (అనగ కూచున్నచోటే నిల్చున్నచోటే సూక్తులను వికరువు పెట్టే సంప్రదాయానికి చేరినవాడు) అని కన్నడ దేశమున ప్రసిద్ధి. ఆంధ్రదేశమున వేమనపద్యాలవలె కన్నడనాడున అతి బాహుళ్యముగా ప్రజాభిమానమును చూఱగొన్న వైరాగ్యకవి సర్వజ్ఞుడు.

20 వ శతాబ్దమున ఆధునిక కన్నడరచన ప్రారంభమాయెను. ప్రాచీన సాహిత్యములందు సంస్కృతప్రభావమును చూచితిమేని నేటి కన్నడ సాహిత్యమును (ఆంధ్ర వాఙ్మయమునందువలె) ఆంగ్ల ప్రభావమును పాశ్చాత్యపోకడలును చూడవచ్చును. జీవితచరిత్రలు, నవలలు, చిన్నకథలు, ప్రహసనములు, భావగీతికలు మొదలైన క్రొత్తపద్ధతులను రచయితలు అవలంబించి గ్రంథములు వ్రాయుట ప్రారంభించిరి. వైజ్ఞానికవిషయములనుగూర్చియు గ్రంథములు రచియింపబడుచున్నవి. వృత్తములను, కందములను, త్రిపదులను, షట్పదులను విడిచి క్రొంగొత్త ప్రాసములతో కవిత్వము నల్లుచు పుస్తకములు వ్రాసి ప్రకటించుచున్నారు. ఇంకొకవైపున పురాతన గ్రంథములను సంగ్రహించి ప్రకటించు కార్యమును కొందఱు చేయుచున్నారు. ఆధునిక కవులలోను రచయితలలోను శ్రీయుత కీ॥ శే॥ టి. సి. కైలాసం, కీ॥ శే॥ బి. యం. శ్రీకంఠయ్య, శ్రీయుత కె. వి. పుట్టప్ప (*మ. సం. పు)

శ్రీ టి. వి. సుంకప్ప, బేంద్రె,దం. శ్రీ. ముగళి, వి. సీతారామయ్య, శివరామకారంత, దేవుడు నరసింహ శాస్త్రి, అ. న. కృష్ణరాయ, త. రా. సుబ్బరామ మొదలైనవారు పేర్కొనదగినవారు.

---

* వీరి "రామాయణదర్శనం" అను గ్రంథానికి కేంద్రప్రభుత్వమువారు కన్నడమున నిటీవల ప్రకటింపబడిన గ్రంథాలలో నుత్తమమైనదని యెంచి రు 5000 పారితోషికము నిచ్చిరి. వీరు మైసూరు విశ్వవిద్యాలయమున కన్నడభాషశాఖాధ్యక్షులు, మహారాజాకళాశాల ప్రిన్సిపాలు.

# శ్రావణమేఘాలు

శ్రీ పురాణం సూర్యప్రకాశరావు
శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

ఇల్లు మార్చి రెండురోజులైనా కాకుండానే ఇరుగు పొరుగు అమ్మలక్కలంతా మా సరస్వతికి పరిచయస్థులైపోయారు. నాకుమటుకు ఏ ఇరుగింటాయన పొరుగింటాయన జోస్తీ కలవలేదు. పదింటిదాకా ఉదయం కిటికీవారగా కూర్చుని ఏ పుస్తకమో చదువుకోవటం, గడియారం పదీ కొట్టగానే నాలుగు మెతుకులు కతికి ఆఫీసుకుపోవటం, మళ్ళీ సాయంత్రం ఇంటిముఖం చూస్తే అప్పుడిక ఓపికుంటే అలా షికారుకుపోవటం, లేకుంటే సరస్వతి ఎదురుగుండా కూర్చుని ఆమె చేసే ప్రతిపనినీ వంకలుపెడుతూ ఆమె కోపగించుకుంటే అనునయిస్తూ ఇలా కాలం గడుపుకోవటం జరుగుతోంది.

"ఉంటే ఆఫీసు, లేకుంటే ఇల్లూ ఈ రెండూ తప్పించి మీకు..." చప్పున సరస్వతి మాటకు అడ్డుపడుతూ "నువ్వనేది బోధపడింది. మొగవాడు తిరక్క చెడ్డాడంటావు. అంతేగా?" అన్నాను.

"నన్ను చూడండి, ఎంత సులువుగా కాలం గడుపుకుంటానో."

సరస్వతి చెప్పింది నిజమే. ఎటువంటి పరిస్థితుల్లోనైనా, ఎటువంటి పరిసరాల్లోనైనా ఇట్టే ఇమిడిపోగలిగే శక్తి ఆడవాళ్ళకుంది. ఆ నేర్పు మొగవాడిలో లేదు. వచ్చి రెండురోజులైనా కాకుండానే అప్పుడే ఇరుగింటి పొరుగింటి వాళ్ళ అట్టుపుట్టుఆనవాళ్లన్నీ తెలుసుకోవటమే కాకుండా వాళ్ళందరి హృదయాల్లోనూ తను కొంతభాగం పంచుకుని తనహృదయంలో వాళ్లందరికీ చోటు ఇవ్వగలిగింది.

వచ్చిన మర్నాడే "మాశారా పాపం! మన పొరుగింటి సుందరమ్మగారు లేరూ, ఆవిడెవరో తెలుసా?" అంది సరస్వతి ఆశ్చర్యంగా.

"తెలియదు. ఎవరేవిటి?"

"సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు సుబ్రహ్మణ్యం పేరు ఎరగరుటండీ. ఆయన పాటకచ్చేరీలు అనేకమార్లు విన్నాం."

"అవును. అయితే నువ్వనేదేవిటి?"

"ఈవిడ భర్తట ఆయన."

"చాలా అదృష్టవంతురాలు అటువంటి కీర్తిమంతుని భార్య మన పొరుగున ఉండటం మన అదృష్టం!"

"మీదంతా వేళాకోళం. ఎంత పెద్ద పేరు మోసినవాడయితే మటుకు నీతి లేకపోయింతర్వాత ఎందుకొచ్చిన పేరు. ఛీ!" కిటికీలోంచి అవతలికి ఉమ్మేసింది సరస్వతి.

"ఇంతకీ ఏవిటో పూర్తిగా చెప్పకుండానే పోతావేం?"

నన్ను గొప్ప సస్పెన్సులో పడేసి సరస్వతి వంటగది పొగలో అదృశ్యమైపోయింది.

సాయంత్రం మళ్ళీ తనే ఆ ప్రస్తావన తీసుకొచ్చింది. "ఉత్తి త్రాగుబోతుట. ఏ ఆరు నెల్లకో, అయిదు నెల్లకో ఓమారు వస్తూంటాట్ట, సంపాదించిన డబ్బంతా పాడుచేస్తున్నాట్ట"—ఇదీ సరస్వతి చెప్పిన విషయం.

"అయితే మరి ఆవిడ సంసారం ఎలా గడుస్తున్నట్టు?"

"మనిషి చాలా తెలివైందిలెండి. పుట్టింటినించి తెచ్చుకున్న నగా నట్రా ఉంటే అది కాస్తా భద్రంగా దాచుకుని వాడిచేత ఎన్ని తిట్లుతిన్నా ఎన్ని దెబ్బలు తిన్నా సహించి, ఆ నగలు అమ్ముకుని కాస్త పొలం పుట్రా కొనుక్కుని అలా కాలక్షేపం చేస్తోంది. వడ్డీ వ్యాపారంకూడా చేస్తూంటుంది. ఆ కాస్త ఆధారం అయినా లేకపోతే ఆవిడ బ్రతుకు ఏమయ్యేదో ఆలోచించండి"—సరస్వతి ఓమారు కళ్లు తుడుచుకుంది.

"ఇలా జాలిదల్చటం ప్రారంభిస్తే నీ కన్నీరుకి అంతే ఉండదు."

"కేవలం ఆమె ఒక్కతెగురించే కాదు నే బాధపడుతుంట."

"మరెవరిగురించి?" అన్నాను.

సరస్వతి తీవ్రమైన ఆలోచనలో మునిగిపోయింది. మాట్లాట్టంలేదు. ఇవాళ సరస్వతి మహా

ఉత్సాహంగా కనుపిస్తోంది. కారణం నేను ఊహించలేకపోయాను. అడగనూ లేదు. భోజనం చేస్తుంటే ఆమే చెప్పుకొచ్చింది. నేను క్షణం నివ్వెరపోయాను.

"నిన్న ఒకావిడ్ని గురించి చెప్పానా, ఇవాళ మరొకరిగురించి చెబుతాను వినండి. మన ఇంటి వరసలో రెండిళ్ళ అవతల ఉన్నవాళ్లు ఇవాళే ఉదయం మన పక్క ఇంట్లోకి మారారు. రాగానే ఇంటాయన ఇంటావిడచేతి దెబ్బలు ఒకటి రెండు తినేశాడు."

"అదేవిటి ?"

సరస్వతి పగలబడి నవ్వేసింది. ఆ నవ్వు వెనకాల నమిలిమింగెయ్యాలన్నంత కసికూడా వ్యక్తం అయింది. ఏదో తృప్తి! నాకర్థం అయింది.

"నీ ధోరణి చాలా అన్యాయంగా ఉంది."

"ఏమీ అన్యాయం లేదు ఈ దేశంలో ఆడాళ్ళంతా అలాంటివాళ్లయిపోతే ఎంత బాగుండును అనిపించింది నాకు."

"ఎంత అహం!" నాలో నేను అనుకున్నాను. "నువ్వు కోరే స్త్రీస్వాతంత్ర్యం ఇటువంటిదేనా ఏమిటి ?"

సరస్వతి కొంత ఉద్రేకాన్ని శాంతింపచేసుకుంది కాబోలు సిగ్గుపడుతున్నట్టుగా కనిపించి తల వంచుకుంది. "మనిషి సిగ్గుపట్టం మరిచిపోలేనంత కాలం భవిష్యత్తుమీద కొంత ఆశ కలిగి ఉండటానికి అవకాశం లేకపోలేదన్నమాట. చేసింది తప్పయితే పశ్చాత్తాప పట్టంమాట అలాగుంచి తప్పని గుర్తించగలిగే సంస్కారంకూడా మా మగజాతిలో లేదు. అందులో స్త్రీవిషయం అయితే ఇక చెప్పనక్కర్లేదు. ఈ యినప పాదాలు ఇలా ఎంతకాలం నిర్దాక్షిణ్యంగా కదను తొక్కుతాయో!"

సరస్వతి మళ్ళీ ముఖంలో నవ్వు మాయం చేసుకుంది. చాలా తీవ్రంగా ఆలోచనలో పడిపోయింది. ఒకసారి బరువుగా నిట్టూర్చింది. జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి చిరాగ్గా రేపుకుంది. నుదుటిమీద చెమటపట్టి కుంకుమ కరిగి ముఖాన్ని కొంత భీభత్సం చేసింది. లోకంలోని స్త్రీత్వమంతా ఒక్కరూపం ధరించి పగబట్టి బుసలు కొడుతూ విరుచుకు పడుతోందా అనిపించింది.

సరస్వతి చురుకయిన మెదడు ఎంత నిశితంగానైనా యోచనలు చేస్తుంది. ఎంత లోతులకైనా ఆమె దృష్టి ప్రసరించగలదు. ఏ కోణంలోనుంచైనా పరిశీలించగలదు. వయస్సు మటుకు పాతికేళ్ళే. అప్పుడప్పుడు అంటూఉంటుంది. "నా ఆలోచనలూ, మాటలు చాలామందికి రుచించవు. మొగవాళ్లమాట అలాగుంచి ఆడవాళ్లక్కూడా కష్టంగానే ఉంటాయి" అని.

నేన నేనాన్ని, "ఆగి నీకు మతి జాలి కలిగిస్తూంటుంది కదూ" అని.

అప్పు నవ్వుతూగా తల ఊపుతుంది సరస్వతి. "నేనూ మనిషినే గా నాలోనూ ఆలోచనలని చంపేసే ఆవేశం అప్పుడప్పుడు సహాయం చేస్తుంది" అంది ఓమాగు.

"ఏం ?"

"నా సానుభూతిలో కూడా దారుణం అయిన పక్షపాతం లేదూ ?"

"ఏమీ లేదు" అన్నాను ఖచ్చితంగా నే.

"ఈ క్షణంలో నాకిలా కనిపించటం లేదూ. స్త్రీ విషయంలో నీకు అపారమయిన సానుభూతి ఉండొచ్చు. పురుషుని కొంత త్యాగానికి నువ్వు సిద్ధపడొచ్చు. కానీ నువ్వు చేసే ప్రతి పనినీ ఛిన్నాభిన్నం చేసేసి నీ ప్రయత్నాన్ని ఆ స్త్రీయే భగ్నం చేసి విజయగర్వంతో వికటాట్టహాసం చేస్తుంది. వంటింటి గుమ్మందాటి బయట ప్రపంచాన్ని చూడలేని ప్రతి స్త్రీ ఇప్పుడు ఆపనే చేస్తోంది. నవ్వుతూనే మగవాడు తన మట్టిలో కట్టే రాతిగోడల్లో తన సహకారం కూడా పూర్తిగా లభిస్తోంది. ఈ ఆడవాళ్లంతా ఒళ్లు తెలియకుండా తాగేసి తలగోడకేసి కొట్టుకునే పిచ్చివాళ్లు. తాగి రోడ్డువార మురుగుకాల్వలో పడి దొర్లుతూ "అబ్బ! ఎంత హాయిగా ఉంది" అనుకుంటూ గొంతు చిత్తు ఎండుకు పోవడాన్ని మాశాను. తాగి రోడ్డుమీది దుమ్ము ముఖాన్ని పూసుకుని "ఫేసు పౌడరు రాసుకున్నాను. అందంగా లేనూ" అని నన్నడిగా డొకడు. తాగి ఇంటికి నిప్పంటించుకుని ఆ విలయాన్ని చూస్తూ పగలబడి నవ్వుతూ ఆర్పడానికి వచ్చిన వాళ్ళతో "ఆగండి చలి కాచుకోనీ" అనే వాణ్ణి మాశాను. ఇంతకంటె మెరుగైన స్థితిలో ఏమీ స్త్రీ జాతి లేదు. వాళ్ళ అజ్ఞానానికి జాలి చూపిస్తున్న నేను మొగవాళ్ళవిషయంలోకూడా సానుభూతి లేకపోవటం దారుణంగా ఉందేమో?"

"ఎందుకోయ్?"

"వాళ్లూ అజ్ఞానులే గా."

"నిన్నిలా అర్థం చేసుకోవాలో నాకు బోధపట్టం లేదు. స్వజాత్యాభిమానం కలవాణ్నయితే నేనన వలసినమాటది. నువ్వే అనేశావు. నన్ను నిమిత్తమాత్రుణ్ణి చేసి [illegible] వాదించుకుని నిర్ణయాలు చేసేస్తున్నావు".

సరస్వతి ముఖంలో నవ్వు తుఫాను వెలిసిన తర్వాతి కాసే నీరెండలా ఉంది. ఆఫీసుకు పోతుంటే గుమ్మందగ్గర నిలబడి "పెందరాళే వచ్చేయండి" అంది.

తల ఊపి వీధిలోకొచ్చి పడ్డాను. ఇంటి ఎదురుగ్గా ఉన్న పెంకుటిల్లు తలుపులు తెరిచి ఉన్నాయి. ఉదయంకూడా తాళం వేసే ఉంది. నే వచ్చినప్పట్నుంచి ఆ యిల్లు అలా జనశూన్యంగానే ఉంది. నడికప్పుమీద అక్కడక్కడ కొన్ని పెంకులుపోయాయి. కిటికీ రెక్కలు పగిలిపోయి మేకులు ఊడిపోయి వేళ్లాడుతున్నాయి. బీటలు తీసిన అరుగుమీదా, గోడమీదా గజం ఎత్తుదాక పెరిగిన మర్రిమొక్కల్ని పది పైసల్లో కుర్రాడు శక్తినంతా కేంద్రీకరించి పీకుతున్నాడు. ఏళ్ళ తరబడి, కనిపెట్టుకుని ఉండేవాళ్లు లేక చివికి జీర్ణించిపోయిన ఆ కొంప, ఏ మాత్రం జనవాసయోగ్యం కాని ఆ కొంప, కొందరికి నిలవనీడ అయిందంటే ఆ పంచని చేరినవాళ్ళ చరిత్ర తప్పకుండా సరస్వతి జాబితాలోకి ఎక్కిపోయిందన్నమాటే. సందేహం లేదు సాయంత్రం ఇంటికిరాగానే మనసుని ఉద్రేకపరిచే మరికొన్ని గాథలు నా చెవిని పడతాయి ఎంతసేపూ ఆ గాథలు వింటూండటమేనా చెయ్యగలిగిందేమైనా ఉందా?" అనిపిస్తూంటుంది నాకు.

పోస్టుమనిషి ఎదురుపడి కవరు చేతిలో పెట్టాడు. పైన దస్తూరీనిబట్టి ఆ ఉత్తరం ఎక్కణ్నించి వచ్చిందో పోల్చుకున్న నేను చదవకుండానే జేబులో కుక్కేశాను. దూరంగా పది గంటలు వినిపించాయి. రోడ్డుమీద జనం పల్చగానే ఉన్నారు. స్టేషన్లో రైలు వచ్చి అప్పుడే ఆగింది బజారంతా ఒక్కసారి ప్రయాణీకులతో ఇరకాటం అయిపోయింది. అందరి ముఖాలు పరిశీలిస్తున్నాను. ఎందుకో? రిక్షా కొట్టువాడు ఇచ్చిన చిల్లర డబ్బులు జేబులో వేసుకుని మళ్ళీ రోడ్డుమీదికొచ్చాను.

మధ్యాహ్నం విశ్రాంతిసమయంలో జేబులో కవరుసంగతి జ్ఞప్తికి వచ్చింది తీసి చదివాను నాన్న రాశారు.

"అబ్బాయీ,

నిన్ను ఆశీర్వదిస్తున్నాను. నీకు ఆశ్చర్యం కలగొచ్చు ఇలా రాస్తుంటే. కాని గత్యంతరం లేకపోయింది. నా మానాభిమానాన్ని చంపుకునే ఈ ఉత్తరం రాస్తున్నాను. దేముడు దయదల్చి నా ఉద్దేశం నెరవేరితే నేను లోకంలో తలెత్తుకుని తిరగలేనని నాకు తెలుసు. అయినా బెంగతో కుళ్ళిపోయి మంచం పట్టిన నీ తల్లికోసమే ఈ ఉత్తరం రాస్తున్నాను. ఆమె కోరిక తీర్చాలనే ఇలా సాహసించాను. ఇప్పటికి నెల్లాళ్ళయింది. మరీ నీరసించిపోయింది. ఎముకల పుట్ట. మంచంమీద పడుకుంటే ఆ దృశ్యం చూట్టానికి హృదయవిదారకంగా ఉంటుంది. నీ గురించే పలవరిస్తోంది ఒకటేపదగ్గ. నిన్న కొద్దిగా తెరిపిచ్చింది. నిన్ను చూడాలంటూ మరీమరీ చెప్పింది.

నువ్వు చేసినపని ఈ జన్మలో కలవకుండా మన సంబంధాన్ని నిర్దాక్షిణ్యంగా తెంపివేసినా, నా కోసం కాకుండా నీ తల్లికోసం మళ్ళీ ముళ్ళువెయ్యాలని నా తాపత్రయం. నా మాట తీసిపారెయ్యకు. నువ్వు వ్యామోహంతో చేసినపని క్షమించతగినది కాకపోయినా నేను క్షమిస్తున్నాను. కులంకాని దాని మెళ్ళో తాళికట్టినంతమాత్రాన అది భార్య అయిపోతుందా. అయినా నీలాంటివాళ్ళనే జీవితపర్యంతం అంటిపెట్టుకుని ఉండాలనే సిద్ధాంతానికి వాళ్ళు కట్టుబడి ఉంటారా? అంతా మోసం! అంతగా కాదూ కూడదంటే నాలుగైదు వందలు డబ్బు పడేద్దాం. దానిదారి అది చూసుకుంటుంది. నువ్వు నా మాట విని ఒచ్చేసెయ్యి. మళ్ళీ పెళ్ళి చేసుకోవాలంటే నీకు పిల్లనెవరిస్తారనే సంకోచం నీకక్కర్లేదు. అందుకు అన్నీ సిద్ధంచేసి ఉంచాను. నీకేం! నువ్వు మొగాడివి. ఇవన్నీ కేవలం నా అభిప్రాయాలే కాదు. అమ్మకూడా ఇలాగే అంది నిన్న. నా కోసం కాకపోయినా అమ్మకోసమయినా నువ్వీపని చెయ్యక తప్పదు. తర్వాత ఏమనుకున్నా లాభంలేదు. నా కోరిక మన్నించి నీ తల్లిని దక్కించుకోగలవనే విశ్వాసంతో ఎదురుచూస్తూంటాను."

అంటూ ముగించారు ఉత్తరం. హృదయాంతరాళంలో ఎక్కడో, ఏ మూలనో రేగిన తుఫాను చిలికిచిలికి గాలివానయి నా మనసంతా అల్లకల్లోలం చేసిపారేసింది. శరీరమంతా వ్యాపించింది. రెండు తీవ్రమయినశక్తులమధ్య మెదడు రణరంగమైపోయింది. మార్గాంతరంకోసం యోచించి నిర్ణయానికొచ్చే వ్యవధానమూ లేదు. అటు తల్లిమీద ఏ మాత్రం అభిమానమున్నా నన్ను చెయ్యమని తండ్రి ప్రోత్సహిస్తున్న అకృత్యం దారుణమైంది. సరస్వతి నా హృదయంలో భాగం. ఆ భాగం అప్పుడే తిరుగుబాటు వాదాన్నీ, బలాన్నీ, కూడదీసుకుని సిద్ధం చేసుకుంటోంది. ఏమిటి చెయ్యటం? ఎలా ఈ ఉపద్రవాన్నించి బయటపడ్డం. అటు తల్లిని రక్షించాలనే పట్టుదల ఎంత తీవ్రంగా అల్లుకుంటుందో అందుకోసం మరో జీవితాన్ని నాశనం చేయ్యాలనే తలంపుకూడా నా మనసు దరిదాపులకి రాలేకపోతోంది. నిలువెత్తు ధనం పోసినా సరస్వతి నన్ను వదులుకోనిమాట నిజమే కాని అలా పొయ్యాలనే తలంపుకే నాలో చోటు లేదు. నా కోసం ఆమె చేసిన త్యాగంకంటె ఆమెకోసం నే చేసిన త్యాగం ఏ మాత్రమూ గొప్పది కాదు. ఆమెను ఒదులుకుని నేను మరో వ్యక్తికి నా హృదయంలో చోటు ఇవ్వలేనట్టే ఆమె తన హృద

యాన్ని నాతో తప్పించి మరొకరితో పంచుకోలేను. అమ్మని వదులుకోనా? సరస్వతిని వదులుకోనా? ఏ ఒక్కరి పక్షం వహించినా మరొకర్ని వదులుకోవల్సిందే. చివరికి నిర్లిప్తంగా ఉన్నా జరిగేదనే.

మధ్యాహ్నం సెలవుపెట్టి ఇంటికి చక్కా వచ్చేశాను. పెంకుటింట్లోకి కొత్తగా వచ్చినవాళ్ళు వీథి గుమ్మంలో కూర్చుని వచ్చేపోయేవాళ్ళకేసి చూస్తున్నారు. వాళ్ళల్లో ఓ నడివయస్సు ఆవిడ కూడా ఉంది. మిగతావాళ్ళంతా పిల్లలు. బహుశః ఆవిడే ఆయింటికి పెద్దదిక్కు అయి ఉంటుంది. లోకం దృష్టిలో అమంగళి. అలా అమాయకంగా చూస్తూ కూచుంది. ఆమె ఒడిలో పసిగుడ్డు! తలమీద వెనక్కి జారిన గుడ్డని ముందుకు లాక్కోవటంలో ఆమె ఇంకా బాగా అలవాటు పడలేదు. ఇటీవలే అనాథ అయి ఉంటుంది

గుమ్మంలో సరస్వతి ఎదురుచూస్తూనే ఉంది. ఆమెను చూస్తుంటే నా మనస్సు అదోలా అయిపోతోంది. పోనీ ఆమెతోనే సంప్రదిస్తే ఏమంటుందో? ఎటువంటి సలహా ఇస్తుందో?

చెప్పలేక చెప్పాను. "ఇవాళ ఉత్తరం వచ్చిం"దని.

"ఎవరు రాశారు?"

"నాన్న"—ఆమెముఖం వివర్ణమై పోయింది. బాగా సన్నిహితంగా వచ్చేసి రెండుచేతులూ పట్టుకుని ఆత్రుతగా నా ముఖంలోకి చూస్తూ "మిమ్మల్నంతగా కృంగతీసిన ఆ ఉత్తరంలో విశేషాలు నేను వినొచ్చునా?" అంటూ ప్రాధేయపూర్వకంగా అడిగింది.

"నువ్వెందుకంతగా గాభరా పడతావు సరస్వతీ."

"ఏమో! నా అదృష్టం ఎలాగుందో."

"నీ కేమీ భయంలేదు సరస్వతీ. నా గురించి ఆలోచించుకుంటేనే అంతా అయోమయంగా ఉంది." అని నాజేబులో ఉత్తరం ఆమె చేతిలో పెట్టాను. "ఈ ఉత్తరం చదివి నువ్వు నా తల్లిదండ్రుల్ని ఎంతగా ఏవగించుకుంటావో నాకు తెలుసు. అయినా నీకు చదవమని ఇస్తున్నాను. నువ్వు నా పరిస్థితిని బాగా అర్థంచేసుకోగలవనుకుంటాను."

తలుపుకు చారబడే ఆ ఉత్తరం ఆద్యంతం సరస్వతి చదివింది. ఆమె ముఖంలోకే చూస్తూ నిలబడ్డాను. ఏ భావమూ లేదు. నన్ను గట్టిగా హృదయానికి హత్తుకుంటూ "మీ రే నిర్ణయానికొచ్చారు?" అంది.

నేను తలవంచుకున్నాను నిరుత్తరంగా. తలెత్తేసరికి ఆమె కళ్ళలో దుర్భరమైనబాధ వ్యక్తంఅయింది. అశ్రుపూరితాలయిన ఆ కళ్ళని నాకు చూపించటం ఇష్టంలేక కాబోలు ముఖం పక్కకి తిప్పుకుని "అయితే ప్రయాణం ఎప్పుడు నిశ్చయించుకున్నారు?" అంది.

"నీ ఉద్దేశం ఏమిటో చెప్పు"

"నే నేమీ చెప్పను; చెప్పలేను; మీరేం చేసినా నే సహించటానికి వెనుకాడను. మీ పరిస్థితి నాకు అర్థం అయింది."

"నువ్వూ నన్ను నిర్దాక్షిణ్యంగా బాధపెడతావా సరస్వతీ?"

"మీరేం చేసినా నేను సహిస్తానంటున్నాగా, నే నేమీ బాధపెట్టటం లేదుగా."

"నీతో సంప్రదిస్తే మరో మార్గాంతరం ఏదైనా కనిపిస్తుందేమో అనుకున్నాను."

సరస్వతి ఏమాటా చెప్పకుండానే వంటగదిలోకి వెళ్ళిపోయింది. రాత్రి అన్నం తినమని ఎంత బలవంతం చేసినా నేను కంచంముందు కూర్చోలేకపోయాను. నిత్యం ఇద్దరం కబుర్లు చెప్పుకుంటూ సరదాగా భోజనంచేసేవాళ్ళం. ఇవాళ దుర్భరమైన మౌనం ఇద్దర్నీ మింగేసింది. సువ్యక్తంకాని దిగులు సుడిగుండంలా చుట్టేసి ఉక్కిరి బిక్కిరి చేస్తుంటే ఆకలేస్తుందా? నేను అన్నం ముట్టుకోలేను. సరస్వతి వంటగది తలుపు గొళ్ళెం వేసి ఇవతలికి వస్తుంటే "నువ్వు భోజనం చేశావా?" అన్నాను.

"అక్కర్లేదు" అంది. అవును. సరస్వతి కడుపు నిండిపోయింది దుఃఖంతో. లోకంలోని చీకటంతా మా హృదయాల్లో పేరుకు పోయింది. తన్ను గురించి తాను బాధపడుతూ ఎదుటివారిగురించికూడా బాధపడే దురవస్థకి ఇద్దరం గురయాము. లోపల రేగుతున్న బీభత్సాన్ని దాచుకుందుకు ఇద్దరం ప్రయత్నిస్తున్నాం.

సరస్వతి నన్ను ఏవగించుకుంటుందేమో! అలాటి అవకాశం తను ఇస్తున్నమాట నిజం! తెగించి నేను నీవాడిని అని చెప్పలేనప్పుడు ఆమె నన్ను శంకించి నన్ను దూరంగా పెట్టటానికి ప్రయత్నించటంలో తప్పులేదు. ఆమె హృదయంలో స్థానాన్ని నా చేతులారా దూరం చేసుకుంటున్నానా? సరస్వతి నాకేమీ కాదా? తల్లి గీసిన హద్దులకోసం ఆమెకు అన్యాయం చెయ్యనా? అలా చేసి నేను సుఖపడగలనా? ఎంత అహంకారంగా ఆ ఉత్తరం రాశాడో సరస్వతికి తెలుసు. నేను "మొగవాణ్ణిట!" ఈ ఒక్క ముక్క వెనకాలా నిగూఢమై ఉన్న సంకుచితభావాన్ని వమ్ము చెయ్యగలిగే శక్తి నేను కోల్పోతే ఈ ప్రపంచంలో నేనూ మనిషినే అని చెప్పుకొని తిరగటం హాస్యాస్పదం. సభ్యతాలోకం హర్షించదు. అసలు ఎవరెలాపోతే నాకేం. నా మనసు పడే బాధని నేను

సహించలేను. నా సరస్వతిని నేను ఒదులుకోలేను. దృఢంగా అనుకున్న తర్వాత మనసు శాంతించినట్లయింది. పక్కకి చూశాను. గుమ్మందగ్గర తలుపుకి ఆనుకుని కూర్చుంది సరస్వతి. ఆలోచిస్తోంది. ఇవ్వాళ సరస్వతి ముస్తాబు చేసుకోలా. తలైనా దువ్వుకోలేదు. ముఖం జిడ్డు ఓడుతోంది.

"సరస్వతీ!"

"హాఁ!"

"పొద్దు గూకింది. దీపం వెలిగించవూ?"

సరస్వతి లేచి దీపం వెలిగించి కొంకికి తగిలించింది. పూలమ్మేవాడు గుమ్మంలో నిలబడి "అమ్మగారూ!" అని పిలిచాడు.

సరస్వతి నావైపు చూసింది. అప్రయత్నంగా నా తల వంగిపోయింది. ఉన్నట్టుండి సరస్వతి చిన్నగా నవ్వటం వినిపించి తలెత్తాను. ఆమె నవ్వుతూనే "చిల్లరుంటే ఓ అణా ఇవ్వండి" అంది.

జేబులు తడుముకున్నాను. ఓ కానీ మట్టుకు చేతికి తగిలింది. అయిదు రూపాయలనోటు తప్పించి మరి చిల్లర లేదు.

"పోనీలెండి లేకపోతే. అక్కర్లేదు అబ్బీ నువ్వెళ్ళు" అంది సరస్వతి.

పూలమ్మేవాడు వెళ్ళిపోయాడు. మళ్ళీ నిశ్శబ్దం మిగిలింది. సరస్వతి కూచున్నచోటునుంచి కదలలేదని అలికిడి కాకపోవటంవల్ల తెలుస్తూనే ఉంది. ఏం చేస్తోందో పాపం! కళ్ళు తెరచి ఓసారి చూద్దామనిపించింది. కాని భయం! ఏవిటో తెలియని సిగ్గు భారం! దొంగతనం చేసి పట్టుబడినప్పుడు అమ్మా, సరస్వతికీ నాకూ మధ్య ఉన్న సంబంధం తెలిసినప్పుడు నాన్న పెట్టలేని భయం ఇప్పుడు సరస్వతి చూపులు కల్గిస్తున్నాయి. ఆ నేత్రాలలో ఎంతశక్తి! ప్రథమ సమావేశంలో "నీ కళ్ళు ఎంత చక్కనివి" అని నేను వేటిని పొగడానో అనుక్షణం ఏ నేత్రాలలోకి చూసి తన్మయత చెంది అనునిత్యం పరితపించానో ఆ కన్నులు, ఆ నయనదళకాంతులు ఈ క్షణంలో దీపకాంతిలో భీకరంగా నావంక పరికిస్తూ ఉండి ఉండాలి.

చాలాసేపు ఇలా గడిచిపోయింది. కిటికీ తలుపులు తెరిచే ఉన్నాయి. అయినా ఉక్కబోస్తోంది. ఈ తపన, హృదయంలో మంటకి తోడయి దుర్భరంగా పరిణమిస్తోంది. ఇంతసేపటికి సరస్వతి ఏమి చేస్తుందో తెలుసుకోవాలని అనిపించింది. దీపంకూడా తగ్గినట్టుంది. నాముఖంమీద కాంతి పడ్డట్టుగా అనుభూతి కలగడం లేదు. మెల్లగా కళ్ళు విప్పాను. దారుణమైన నిశ్శబ్దం! తలపక్కకు తిప్పాను. తొలికాన్పులోనే పుట్టిన పసికందును పోగొట్టుకున్న చిన్ని బాలింతరాలులా అలవాటులేని బాధని అనుభవిస్తోంది. సరస్వతి బహుశా నేను ఇంతసేపట్నుంచీ మెలకువగా నేఉన్నాననే అభిప్రాయం పొరబాటయి ఉంటుంది. నిద్రను అనుభవించకపోయినా కనీసం సమీపించి ఉంటాను. లేకపోతే నాకళ్ళముందే ఆమె లేవటం, చాపపరుచుకోవటం పడుకోవటం ఏదో కలలో జరుగుతున్నట్టుగా ఎందుకు అనిపించాలి.? శాంతమూర్తి సరస్వతి అమాయకంగా నిద్రపోతోంది. సరస్వతి నాఅభిమాన నామధేయం కాదు. ఆమెకు మొదటిలేఖ రాసినప్పుడు "మాలతి" అనే సంబోధించాను.

"నా పేరు మాలతి కాదు."

"నిన్ను నేను అలాగే పిలుస్తాను."

"అలా పిలుస్తే జవాబు ఇచ్చేది లేదు."

"సరే ఏం చేస్తాను"—ఏవిటో ఇష్టంలేకపోయినా తప్పనిసరయింది యీ పిలుపు. అలవర్చుకున్నాను.

దగ్గరకు వెళ్ళి తొంగి చూశాను. ప్రశాంతంగా నిద్రపోతున్నట్టు కనిపిస్తోంది. ఓక్షణం సరస్వతిమీద అసూయ వేసింది. ఇంతటి సంఘర్షణలోకూడా నిద్రను అనుభవిస్తూ ఎలా సుఖాన్ని పంచుకుంది? తలుపులు తెరిచే ఉన్నాయి. గాలిమటుకు వేడిగా 'గీ' పెట్టుకుంటూ వీస్తోంది. పెద్దముల్లు పన్నెండుమీదా, చిన్నముల్లు పదిమీదా ఉన్నాయి. సూర్యోదయం కావాలంటే చాలా యుగాలు గడవాలి. దుస్సహం! ఈ రాత్రి నాకు నిద్రపట్టదు. మెలకువగా ఉండలేను. సరస్వతికి నిద్రాభంగం జరక్కుండా అలికిడి కాకుండా వెళ్ళి మంచంమీద కూర్చున్నాను.

"అబ్బాయీ!" అని తండ్రి సంబోధన! ఉత్తరంలో కాదు. ఎదురుగా నిలిచి పిలుస్తున్నట్టుగా అనిపిస్తోంది. జవాబు చెప్పకుండా విదిలించుకొని పోగలనా? నాదీ మనస్సే! ఈ రాగద్వేషాలు అజ్ఞాతంగా ఎంత దృఢంగా బిగిస్తాయి!

"నిన్ను చూడాలంటూ మరీ మరీ చెప్పింది."

అబ్బ! నరాలు కోస్తున్నాయి! చేసినపని ప్రశంసనీయమైనదే. ఆత్మవిశ్వాసం ఉన్నా పరిస్థితులకూ, పరిసరాల ప్రభావానికీ తట్టుకోలేక క్షణక్షణానికీ లొంగిపోతూ తిరిగి దిటవు తెచ్చుకొని సర్దుకుంటూన్న ఈ సమర్థుడైన అసమర్థుడు ఈ తల్లి కడుపున జన్మించకపోయినా బాగుండిపోయేది! కనీసం ప్రేమ అనే ఊబిలోకి దిగబడకపోయినా జీవితంలో ఈ లోయలు ఏర్పడేవి కాదేమో!

ఉత్తరం అంటోంది "కాదూ కూడదంటే నాలుగైదొందలు డబ్బు పడేద్దాం" ఛీ! సంస్కారం రాక్షసుడుగా చిత్రిస్తే స్వాభిమానం, జఘుత్సోంది

ఎందుకో. నాకు తండ్రికంటె తల్లి సన్నిహితురాలు! తండ్రి నెత్తురు తల్లిద్వారా నాలో ప్రవేశించింది. అందుకనే తల్లి మందంపట్టింది. తండ్రి నిబ్బరంగా ఎలా మోసంచెయ్యాలో సలహా లిస్తున్నాడు. 'నువ్వు మొగవాడివి' అంటూ సమాజం తరఫున హామీలు ఇస్తున్నాను.

ఇహ ఇటూ ఆగకుండా మనసు సముద్రమథనం ప్రారంభించింది. అర్ధాంగి మూగవేదన! ఆ ఉత్తరం లోంచి మాతృమూర్తి పలవరింతలు! నాన్నగారి వ్యవహారజ్ఞానం! అసమర్థుడి ఆక్రందన!

హృదయం వెయ్యిముక్కలయినా బాగుంటుందను అనిపించే ఈ వేగం ఎలా భరించేది?

కాని.....ఎముకలు పోగుచేసి ఓ చోటుకు చేరిస్తే ఒకప్పుడు ఎంతటి సంకుచితత్వాన్ని జీర్ణం చేసుకున్నవైనా అవన్నీ కలసి ముక్తకంఠంతో "కొడుకా!" అని విలపిస్తుంటే నా రక్తం ద్రవించి పోకుండా ఎలా గుంటుంది. ఊహించలేను. లోలోపల ఉమ్మరిపురుగు దొలుస్తున్నట్టుగా బాధ! ఇక ఆట్టే వ్యవధానం లేదు. అమ్మ పిలుపు దగ్గరౌతోంది.

కాని సరస్వతి దూరం కావటంలేదు.

అమ్మ ప్రాధేయపడుతోంది తుది కోరిక చెల్లించమని.

కాని సరస్వతిని దూరం చెయ్యలేకపోతున్నాను.

ఆలోచన! ఆవేదన! ఆవేశం! ఉప్పెనలా ముంచుకొస్తుంటే...లోలోపల ఓ వెర్రికేక వేసి లేచి కూర్చున్నాను.

సరస్వతి నిద్రపోతోంది. వేడిగాలి విసుగ్గా తోసుకొచ్చింది. సరస్వతి నిద్రలో నిట్టూరుస్తోంది. సరస్వతి పెదాలు కదులుతున్నాయి. వెనక్కి తగ్గాను. దీపం చిన్నదౌతోంది. వణుకుతూనే చూశాను. తక్కువైన వెలుతురులో చిన్నబోయింది వన్నె తగ్గిన వదనం. చూపు మరల్చుకోలేక మళ్ళీ చూశాను. అడుగు ముందుకువేశాను. దీపం రెపరెపలాడింది. గాలి 'రంయ్' మని హోరుపెడుతూంది. సరస్వతి మెల్లగా కదుల్తూంది. ఇంకో అడుగు ముందుకు వేశాను. దీపం ఆరిపోడానికి సిద్ధంగా ఉంది. సరస్వతి చెయ్యి ముందుకు మరికొంత జరిగింది. ఇహ కదల్లేను. మృదువైన ఆ హస్తం ఈ ఇనప పాదాల్ని బంధించింది. నా శరీరం స్పందించింది. భావోద్వేగంతో నరాలు పీక్కుపోతున్నాయి. రక్తం ఘనీభవిస్తోంది. దీపం ఆరిపోయింది. కిటికీలోంచి మావైపే తొంగి చూస్తోంది నక్షత్రం!

చీకట్లను చీలుస్తూ హఠాత్తుగా పెద్ద కేక! మరు క్షణంలో హృదయవిదారకంగా విలపిస్తూన్న ఆడ గొంతు! కాళ్ళకింద భూమి కదలింది. గుండెలు జల్లు మన్నాయి. అనుకోకుండానే సరస్వతి హఠాత్తుగా లేచి నిల్చోబోయి తూలి కింద పడింది. చప్పున ముందుకు దూకి ఆమెను లేవనెత్తి "సరస్వతీ" అని పిలిచాను.

"మీరా? ఇంకా నిద్రపోలేదూ?"

"ఎందుకలా భయపడ్డావు?"

"ఏదో గావుకేక వినబడింది"

"అవును. పెంకుటింట్లోంచి వచ్చింది ఆ కేక."

"అయ్యో! ఇందాకనే వాళ్ళబ్బాయికి జబ్బుగా ఉందే. దీపం ఏదీ?"

"నువ్వు కంగారుపడకు."

"ఏం అఘాయిత్యం జరిగిందో పాపం! నేను కదల్లేకుండా ఉన్నాను. దీపం వెలిగించండి."

నేను చీకటిలోనే వెతుకులాట మొదలుపెట్టాను. చివరికి టార్చిలైటు దొరికింది. దీపంకూడా వెలిగించాను అయిదు నిముషాలు పట్టింది ఇదంతా పూర్తయే సరికి. అప్పుడు చూశాను నిట్టూర్పులతో నీరసించిన సరస్వతి ముఖం

బయట గొళ్ళెం పెట్టి టార్చిలైటు వెలిగించి బయల్దేరాం ఇద్దరమూ. నా భుజం పట్టుకుని నడుస్తోంది పక్కగా. పెంకుటింట్లో దీపం వెలుగుతూంది. అయిదారుగురు మనుష్యులు గుమ్మందగ్గర మూగారు. కాళ్ళకి గులకరాళ్లు గుచ్చుకుంటున్నాయి. సరస్వతిని చూసి వాళ్ళు దారి ఇచ్చారు. నేను గుమ్మం దగ్గర నిలబడే లోపలికి తొంగిచూసాను. ఆ నడివయస్సు స్త్రీ దారుణంగా విలపిస్తోంది. ఒడిలో పసిగుడ్డు వికృతంగా పడివుంది. చుట్టూ పిల్లలు కూర్చుని కన్నీళ్ళతో అమాయకంగా తల్లి ముఖంలోకి చూస్తున్నారు. నాకు వికారంలాంటిది ఏదో కలిగింది. ఒళ్లు తిప్పుతున్నట్టుగా అనిపించి వెనక్కి తిరిగాను. ఇంటికివచ్చేసి గుమ్మంలో తలుపుని ఆనుకుని కూర్చుండి పోయాను.

ఇది ఆలోచన్ల రాత్రి! జ్ఞాపకాలరాత్రి! భయంకర రాత్రి! కాళరాత్రి! చుట్టుప్రక్కల కొన్ని ఇళ్లల్లో దీపాలు వెలిగాయి! బద్ధకంగా అందులో కొన్ని ఆరిపోయాయి; ఆతృతగా కొన్ని అటూ ఇటూ కదుల్తున్నాయి; పోనీద్దూ మన కెందుకులే అన్నట్టుగా మరికొన్ని ఇళ్ళల్లో చీకటి చీకటిలాగానే ఉంది. పెంకుటింటి ముందు మనుష్యులు మరికొంచెం పెరిగారు. పెంకుటింట్లోంచివస్తున్న వెలుగు రానురాను పెద్దదై ఈ బ్రహ్మాండమంతా వ్యాపించినట్టూ ఆ వెలు

గులో నేను కరిగి నీరై పోతున్నట్టూ.. ఏమిటో అనుభూతి! అసలే వికృతమైన ఆక్రోశంలో దారుణమైన ఈ సంఘటన! దరిద్రఛాయలూ, మృత్యుఛాయలూ రెండు పాయలుగా అల్లుకుని మూడో పాయగా చీకటిని కలుపుకుని ఈ విలయానికి నేలను తాకే జడ ఎవరు అల్లుతున్నారో?!! అంత కర్కోటకత్వం ఏ చేతుల్లో ఉందో! ఉండి ఉండి వీచే వేడిగాలి రివటలు తలనొప్పి పుట్టిస్తున్నాయి ఇక అక్కడకూడా ఉండలేక లోపలికి వచ్చి మంచంమీద కూలబడ్డాను దీపం నిలిచి నిశ్చింతగా వెలుగుతోంది. పడుకున్నాను. ఏదో మగతలా క్రమ్మింది. క్షణంలో మైకం వదిలిపోయింది. లేచి గదిలో ఆ మూలనుంచి ఈ మూలకు లెక్కలేనన్ని సార్లు పచార్లు చేశాను.

ఓ అరగంట గడిచింతర్వాత కళ్ళు తుడుచుకుంటూ లోపలికి వచ్చింది.

"అసలు జబ్బేమిటో?" అన్నా ఆతృతగా.

సరస్వతి మాట్లాడకుండా దీపం తగ్గిస్తూ "పడుకో లేదూ" అంది.

"నే అడిగిందానికి అది జవాబు కాదు. ఎందుకు చనిపోయింది పాపాయి!" ఈ ఆఖరి "పాపాయి!" అన్న పదంలోని మృదుత్వం సరస్వతి హృదయాన్ని కరిగించింది కాబోలు "అవును పాపాయి చనిపోయింది..." వాక్యం పూర్తి చెయ్యకుండానే ఏదో ఆలోచనలో పడిపోయింది సరస్వతి క్షణం పోయింతర్వాత తనే అంది "చాలా విచిత్రమైన చావు!"

"ఏమిటూ విచిత్రం?"

"అదేది..."—సరస్వతి ముఖాన్ని రెండు చేతుల్లోనూ కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. దగ్గిరకి వెళ్ళి ఆ రెండు చేతులూ ముఖంనుంచి తప్పించి "విషయం ఏమిటో చెప్పకుండా అంత దుఃఖాన్నీ నువ్వే భరించటం న్యాయంగా లేదు. నేనూ పంచుకుంటాను. నాకు చెప్పటానికి సంకోచం దేనికి?" అన్నాను అనునయంగా.

నిమిషం స్తిమితపడి "ఆ పిల్లవాడు పుట్టిన కొన్ని రోజులకే తండ్రిని పోగొట్టుకున్నాడు. పదిమంది పెద్దలూ, ఇరుగుపొరుగు హితైషులూ, దగ్గిరవాళ్ళం అని చెప్పుకునే బంధువులూ, నలుగురూ చేరి ఒక ఏకగ్రీవ నిర్ణయానికొచ్చి ఆమె అభిప్రాయంతో నిమిత్తం లేకుండానే ఆమెని పూర్తిగా అందవికారిని చేసేసి, ఆ వికృతాన్ని చూసి తృప్తి అనుభవించారు వాళ్ళు. కాని దాని పర్యవసానం ఇలా పరిణమించింది. ఒక్క క్షణంలో మారిపోయిన తల్లి రూపు ఆ పసికందును దూరం చేసేసింది. తల్లి దగ్గరకు వస్తే కళ్ళు మూసుకుని ఏడ్చేవాట్ట! ఎత్తుకోబోతే కొత్తవాళ్లని చూసినట్టుగా బిక్కముఖం వేసేవాట్ట! పాలియ్యబోతే తాగేవాడు కాదట్ట! ఏదో బెంగ! నిరాహారంగా ఎంతకాలం ఉంటాడు. కృశించి కృశించి ఇవాళ శాశ్వతంగా విశ్రాంతి తీసుకున్నాడు. నోరులేని పసికందు ఎంత బాధని అనుభవించాడో! అబ్బ! దారుణంగా లేదూ?"—సరస్వతి రెండు చేతుల్తోనూ ముఖాన్ని కప్పుకుని నిట్టూర్చింది.

"స్త్రీని గురించి కొత్తగా నేనేం చెప్పగలను సరస్వతీ."—లోపల్లోపల కరిగిపోతున్నాను. ఇప్పుడు నేనూ అటువంటి పరీక్షలోనే ఉన్నాను.

బహుశా యీ సంభాషణ యింకా యిలా కొనసాగితే లోతులు పెరిగిపోతాయేమోనన్న భయంకొద్దీ "పడుకోవా, యిహ" అన్నాను.

"నాకు నిద్ర ఏం పడుతుందండీ యివాళ? అదీగాక ఎవరూ ఆదరించేవాళ్లుకూడా లేరాయె. నేనూ వెళ్ళకపోతే ఏం బాగుంటుంది? వెళ్ళి కాసేపుండి వస్తాను. మీరు పడుకోండి" అని జవాబుకోసం కూడా ఎదురు చూడకుండా వెళ్ళిపోయింది నిశీధిలోకి ధైర్యంగా.

ఛీ, ఏం రాత్రి? చివరకు అదే మంచిదనుకుని మేను వాల్చి నిద్రపోయేందుకు ప్రయత్నం చేస్తున్నాను. ప్రతివారికీ ఏదో ఓ సమస్య. ఇప్పుడా స్త్రీ హృదయంలో ఏయే పెనుతుపానులు, గాలిదుమారాలు చెలరేగుతున్నాయో కదా. ఆ యింటి వాతావరణం యిప్పుడెంత దుర్భరంగా వుందో ఏం చెప్పగలను?

కొంచం వత్తిగిల్లాను చూపువెళ్ళి గడియారం మీద పడింది.

చిన్నముల్లు పదకొండు మీద, పెద్దముల్లు పన్నెండుమీద నిలిచాయి. ఏదో అనుభూతి శరీరమంతా చురుక్కుమంది. విద్యుల్లతలా ఓ మెరుపు మెరిసింది మదిలో.

"మూర్ఖుడా!" అంది మనసు.

జవాబు చెప్పేందుకు ఏదీ లేదు.

ఒక రెండు నిమిషాలు సందిగ్ధానికి అతీతంగా గడిచింది కాలం. ఇప్పుడు నిశ్చయం దృఢమైంది. హఠాత్తుగా జనించే ఆలోచనల వేగం సాటిలేనిది. వాటిబలం ఆపలేనిది. తెలివిగా చేసినా, తెలివితక్కువగా చేసినా యిది తప్పనిసరి. ఒక అపూర్వమైన మానసికావస్థ. చావో, బ్రతుకో మనిషికి తప్పనట్లే యిది చేయడమో, చేయకపోవడమో యిది జరగకుండా వుండరాదు. చేస్తే ఫలితాలకు బంగారుపూత పూయవచ్చు. సూర్యరశ్మికి ఆ బంగారుపూత మెరిస్తే ధన్యుణ్ణే.

డ్రాయరు సొరుగులాగి గబగబ కాగితం, పెన్సిలు బయటకు తీశాను. కాని పెన్సిలు రాయ లేదు. చెక్కాలి. ఈ మసకచీకట్లో బ్లేడుకోసం ఏం వెదకను? వెర్రి ఎత్తుతోంది. అయిదు నిమిషాల శ్రమకు ఫలితంగా సగం విరిగిన బ్లేడుముక్క కనిపించింది. దాంతో పని ప్రారంభించి, రెండు మూడుచోట్ల రెండు రక్తపు బిందువులు చిమ్మినా చివరకు పని ముగించాను. వేగంగా, వంకరటింకరగా వ్రాయ దల్చుకున్నవి కాగితంపై వ్రాశాను. బల్లమీద కన పడేలావుంచి, సంచీలో రెండు మూడు బట్టలు కుక్కాను అయిదు రూపాయలనోటు జేబులోవుంది. సరిపోతుంది. తలుపు తాళంవేసి, తాళంచెవి కిటికీలో పెట్టి నేను అంధకారంలోకే అడుగుపెట్టాను.

* * * *

సూర్యోదయం యింకా కాలేదు. చీకట్లు నెమ్మదిగా విడిపడుతున్నాయి. రైలు మందంగా సాగిపోతోంది. నిద్రలేని కళ్ళతో కిటికీలోంచి వేటినీ చూడకుండా చూస్తున్నాను. ఇతరులు చేసే సందడి నా నిశ్శబ్దతకు, ఏకాంత చింతకు ఆటంకం కలిగించటం లేదు.

సూర్యుడు క్రమంగా మేఘాలచాటున, కొండపై ఉదయించాడు.

వందలకొద్ది ప్రయాణీకులతోబాటు నన్నూ స్టేషన్లో దిగవిడిచింది రైలు. దిగి చూస్తూన్నాను. ఎటు పోవాలో, ఏంచేయాలో అర్థంగాకుండా వుంది. ఓక్షణం స్తబ్దత. తుదకు ఏ నిశ్చయంలేకుండా నే కదిలి బయటకు వచ్చాను.

ఊరు కొత్తగా లేదు. ఏణ్ణార్ధ క్రితం ఎలావిడిచి వచ్చానో అలానేవుంది. నారయ్య కిళ్లీదుకాణం యింకా తెరవబడలేదు. సాయంత్రులు ఆ దుకాణం ముందున్న బల్లలమీదకు పదిమందీ యింకా అలానే పోగవుతున్నారు గావును. అదిగో సుబ్బారావు హోటలు ఆరన్నా కాకుండా జనం అప్పుడే విరగబడు తున్నారు. రోడ్డుప్రక్కనవున్న పంపులవద్ద స్త్రీలు గుమిగూడి వున్నారు. అదేవిధం. అక్కడక్కడా దెబ్బలాటలు. సరి కొత్త పాత వింతలన్నీ చూసుకుంటూ మెల్లన్నర నడిచాను.

అదో! అదోయిల్లు. ఏమీ మార్పు లేదు. కన్నీటి బిందువులు బరువులేక నీరసంతో ముందుకూ వెనక్కూ తటపటాయిస్తున్నాయి. అడుగులు తడబడుతున్నాయి సంశయాత్మకంగా. వెల్తురు వెనకనుంచి తరిమి కొడ్తోంది.

ముందుకు నడిచాను.

తలుపులు వేసివున్నాయి. సమీపించాను. మరి పిలవాలి. ఎవర్ని? ఇదివరలో ఎప్పుడు తలుపుతట్టినా 'అమ్మా' అని పిలిచేవాణ్ణి.

"అమ్మా" అన్నాను యిప్పుడూ అలవాటుగా, జవాబులేదు.

"అమ్మా" అన్నాను మళ్ళీ.

విరామం విసుగ్గా వుంది. లోపలసవ్వడి వినిపించింది. అడుగులు సమీపిస్తున్నాయి. నాన్న అడుగులు యింత తేలిగ్గా వుండవు. గాజులు గలగలమని ఎందుకనాలి? గుండె శక్తినంతా ఉపయోగించి, రెట్టింపు వేగంతో రక్తాన్ని అన్ని భాగాలకూ విరజిమ్ముతోంది. మితిమించిన నెత్తురు వేడి శరీరాన్ని మండిస్తోంది. హృదయాన్ని అదిమిపట్టుకుని నిల్చున్నాను.

తలుపులు తెరుచుకున్నాయి.

అప్రయత్నంగా చూశాను. ఎదురుగా బద్ధకంగా నిలబడివున్న ఓ యువతి, యువతే, తెలివి తెచ్చుకుని, చప్పున తలుపుచాటుకు చేరి "ఎవరు కావాలండీ?" అంది మధురస్వరంతో.

ఇది మాయిల్లు కాదా ఏం కర్మం ఇంతగా పొరబడటం అసంభవం విభ్రమంనుంచి నేనింకా కోలుకోలేదు. శిలావిగ్రహంలా, స్థాణువులా నిలబడ్డాను. బహుశా యోచనలతో, ఆశ్చర్యంతో యిరు హృదయాలూ ఒకేదారిని నడుస్తున్నట్లున్నాయి. గమ్యస్థానం సమీపించినట్లుంది. మెల్లిగా, మెల్లి మెల్లిగా ఓ చిరునవ్వు వెలిసింది నా పెదాలపై. "సావిత్రి" అన్నా తుదకు.

సుందరవదనం తాలూకు విశాలనేత్రాలు తలుపుచాటునుంచి తొంగిచూశాయి.

"ఎవరూ?" అంది సుందరి కంఠం. సంకోచాన్ని నిజంచేసుకుంటూన్న ధ్వనితో.

"నేనే సావిత్రీ!"

చెదిరిపోయిన జుట్టూ, బొత్తాలులేని చొక్కా, సంధ్యారుణిమకంటె ఎరుపులు వెదజల్లుతున్న త్రాగుబోతువాడికళ్ళూ, కంఠంలో అపస్వరాలూ, మరుపు తెరలచాటున మరుగుపరుస్తూ కొంతసేపు, నేనీ కొద్ది క్షణాలు ఆమెనుంచి దూరదూరంగా వుంచుతాయన టంలో సందేహంలేదు. నన్ను అన్నికోణాలనుంచీ చూచుకోవటానికి అవకాశాలు ఇస్తూ అలాగే నిలిచాను.

సంకోచం సత్యానికి దగ్గరగా వచ్చింది. చివరకు "నువ్వా?"

జవాబు చెప్పకుండా లోపలకు నడిచాను. ప్రక్కగదిలోంచి నావెనగ్గా ఆమె ఎటో వెళ్ళిపోయింది. ఎదురుగా నాన్న వస్తున్నారు. సంచీ క్రిందపెట్టాను.

"ఎప్పుడూ రావటం?" నన్ను ఆకస్మికంగా చూడటంచేత ఒకింత చకితులై అడిగారు.

"ఇప్పుడే."

"అలా వున్నావేం?"

"ఏమీ లేదే?"

మాటలు వెతుక్కున్నట్లున్నారు ఓ నిమిషం. పరాజయంపొంది "అమ్మ అగదిలో వుంది వెళ్లు" అని ఎడమవైపు వున్న ఓగది చూపించారు. అటుకేసి నడిచాను.

మంచంమీద అమ్మ నిద్రపోతోంది. తల అటు వైపు తిరిగివుంది. దౌర్భాగ్యుణ్ని అమ్మను 'అమ్మా' అని పిలిచేందుకు నోరు సిగ్గుపడి వంకర్లు తిరుగుతోంది. పెదాలు మరింతభయంతో వెలువడటంలేదు ఇహ తప్పని సరి అని గ్రహించాక, నా అజ్ఞానానికి నేనే చింతపడి సున్నితంగా అలికిడిచేశాను. కఠోరమైన ధ్వనితరంగాలు అమ్మకు పరిశ్రాంతి కలిగిస్తాయేమో నన్న భయంతో. ఫలించలేదు. మంచాన్ని పూర్తిగా సమీపించి, కొంచంముందుకు వంగి, ముఖంలోకి 'అమ్మా' అని పిలిచాను తెగించి.

కల అని భ్రమిస్తోందేమో, పెదాలపై చిరుహాసం చిగురిస్తోంది.

"అమ్మా" అన్నాను మళ్ళీ

ఆ అవస్థ దాటింది. ఈపిలుపులోని మృదుత్వం నరాలు కదిలించిందా? మెల్లిగా కళ్ళు విచ్చింది. అబ్బ ఇంత బలహీనంగాకూడా వుంటాయా చూపులు? ఎముకలగుట్టకన్నా ఏమీ మెరుగ్గా లేదు అమ్మ. నాన్న మాట తూచివాడారు. కొలంగడిచి కొద్దిలో ఉదయిస్తున్న సూర్యునిలా చూపు మెల్లిమెల్లిగా తేజోవంతమైంది. అది తాత్కాలికం. చిక్కిపోయిన చేతులు ముందుకు కదలటానికి విశ్వప్రయత్నం చేస్తున్నాయి.

"నాయనా! నువ్వా?"

"వచ్చానమ్మా!"

ఇదే దృశ్యం ఇదివరకే నాకే జరిగినట్లు అనుభూతి కలుగుతోంది.

"కూర్చో."

మంచంమీద కూర్చున్నాను. నా చేతిని బలవంతంగా అందుకుని శుష్కించిపోయిన గుండెపై అదుముకుంది. అశ్రువులు బలహీనంగా, చెంపలలోని లోయలకు జారుకుంటున్నాయి.

"అమ్మా" అన్నాను ఎందుకో.

"ఇప్పటికి దయకలిగిందా?"

'దయ' అనే పదానికి యిటువంటి అర్థం తీసుకుంటే ఏంచేసేది ?

తలవంచుకు కూర్చున్నాను. పదినిమిషాలు యిలాగే కుశలప్రశ్నలు వేసింది. నేను సూటిగా జవాబుచెప్పాను. నేను సగం అయినానంది. తాను సగంలో సగం అయిందని వెంటనే నాకు స్ఫురించింది.

"దా నాయనా. మొహం కడుక్కో" అంది చివరకు. తల ఊపి యివతలకు వచ్చేశాను.

తల అంతా బరువుగా వుంది, ఎన్ని వేల క్రిమికీటకాదులో అందులో చేరిపోయినట్లు. పార్శ్వం భరించలేనంత నొప్పిగా వుంది. బావిదగ్గరకు పోతూంటే సావిత్రి మళ్ళీ ఎదురుపడింది. తప్పుకుని దారి యివ్వడం మినహా ఏమీ మాట్లాడలేదు. ముఖం కడుక్కుంటూంటే ఆలోచనలు మిన్నుముట్టాయి. ఈ వాతావరణం ఎలా భరించాలో గ్రాహ్యం కావటంలేదు. అమ్మకు ప్రమాదంగా వుందనటంలో సందేహంలేదు. నేను డాక్టర్ని కాకపోయినా మృత్యుచిహ్నాలు స్పష్టంగా ముద్ర వేసినట్లు ముఖంమీద దృగ్గోచరమైనప్పుడు, దవడగలిగే సామాన్య తెలివితేటలు భగవంతుడు యివ్వకపోలేదు. తల్లీ తండ్రీ లేని నిర్భాగ్యుడి జీవితం ఎంత క్షుద్రంగా వుంటుందో వూహించడానికికూడా బుద్ధి క్షోభిస్తోంది. "అయ్యా మా అమ్మలేదు, అమ్మా మా నాన్న లేడు ఓ కానీ ధర్మం చెయ్యండి బాబయ్యా" అని హోటళ్ల దగ్గరా, సినిమాహాళ్లముందరా, రైళ్ళలో, రోడ్లు ప్రక్కా యింకా యింకా అనేకస్థలాలలో అనుక్షణం అనాథల హృదయాల్లో ఏంమెదుల్తుందో తెలియదుగాని, దానం చేసే మానవులు ఓ కానియో, మరికొంత ఎక్కువో యిచ్చేసి, అంతటితో తమ కర్తవ్యం తీరిపోయిందన్నట్లు భావించుకుని, తల్లీతండ్రీలేని అభాగ్య సోదరుడి, స్థితి ఆమాట నోరారా రోజుకు వందలసార్లు పఠించటంలో ఆ అమాయకుల గుండెలు ఎంత ద్రవించిపోతున్నాయో అని ఆలోచించకపోవడం కఠినత్వం కాదంటే, ఆ వ్యక్తి తప్పక వజ్రహృదయుడే. ఒకటో ఏట తల్లినీ రెండో ఏట తండ్రినీ పోగొట్టుకుని, బంధువులయింట్లో పెరిగి, నాకు యిప్పటికీ ప్రాణస్నేహితుడై నిలిచిన మా 'మణి' ఎప్పుడైనా "నీ జీవితాన్ని గురించి ఆలోచించుకుంటావా?" అని నేను ఉత్సాహంతో ప్రశ్నించినప్పుడు వాడు అప్పుడు అనేక సందర్భాలలో నిర్లక్ష్యంగా నవ్వేసిన ఆ చిరునవ్వులు ఎంత విషాదాన్ని దాచుకున్నాయో యిప్పుడు తెలుస్తోంది.

ఇట్లా ఊహిస్తూ ఆ కృత్యం ముగించాక, లోపలకువచ్చి తువ్వాలకోసం వెదుకుతూంటే ఓ మృదుహస్తం కావలసిన వస్తువు అందించింది.

"థాంక్స్" అన్నా నవ్వబోయి.

మరో మృదుహస్తం కాఫీ యిచ్చింది.

ఈసారి ఆతృతను అణచుకునే శక్తి నశించి "సావిత్రీ, ఎప్పుడూ రాక ?" అన్నాను.

"పెళ్లాళ్లయ్యింది. అత్తయ్యకు జబ్బుచేసినప్పటి నుంచీ యిక్కడే వున్నాను." ఇలా అని అక్కడినుంచి

నిష్క్రమించబోతూండగా ఓ విషయం తోచి ఆపాను.

"ఏమిటి?"

"ఇలావస్తే చెప్పగలను" నా ధైర్యం నాకే ఆశ్చర్యం వేసింది.

"అక్కణ్ణుంచి చెప్పవచ్చు"

ఇటువంటి జవాబు వస్తుందని ఊహించలేదు కనీసం. ఎక్కడైనా నాన్న అడుగుల చప్పుళ్లు వినిపిస్తవో అని, ఆలకించి సంతృప్తిపడ్డాను. ఈ మొదటి క్షణంనుంచీ సావిత్రిముందు సిగ్గుపడటం, బలహీనుణ్ణి కావటం వగైరాలు చేసినట్లయితే యిహముందు కదుకుతనానికి యీ బొంగిలో తావులేదన్న సత్యం స్పష్టంగా కళ్ళముందు గోచరించింది.

"దగ్గరనుండి వినే విషయాలు దూరనుంచే ఎలా చెప్పమంటావు? సరే, అందుకు నువ్వు సంసిద్ధంగా వున్నావా ?"

ఆమె చప్పున బెదిరి "ఏమీవద్దు యిప్పుడు"— అక్కడినుంచి వెళ్లిపోయింది. కాఫీ త్రాగటం పూర్తయింది. ఓ నిట్టూర్పువిడిచి యీజీఛైర్‌లో కూర్చున్నాను. నాన్న అటూ యిటూ తిరుగుతూ రెండు మూడుసార్లు కనిపించాడు. ఆయన కనిపించినప్పుడల్లా శరీరంమీద ఎవరో చాటుగా చరిచినట్లు చుఱుక్ చుఱుక్ మంటోంది. సావిత్రి యిటునుంచి అటు వెళ్లింది. మధ్యలో ఓ చూపు. నా రక్తం ఆవేశంతో పొంగింది. ఈసారి ఆమెకు తగిన పాఠం నేర్పాలి.

ఆ మధ్యాహ్నం భోజనాలవేళ నాన్న కొంచెం మట్లాడారు. సావిత్రి వడ్డిస్తోంది.

"వంట్లో ఆరోగ్యంగా వుంటోందా ?"

ఇక్కడ వుండేగా తరుచూ దగ్గూ, జ్వరం రావటం పరిపాటే.

తల ఊపాను.

అలాగే ఆయన వేసిన రెండు మూడు ప్రశ్నలకు సైగల్లోనూ, అవసరమైతే మాటల్లోనూ జవాబు చెప్పాను. ఆ ప్రశ్నల్లోనూ, ఈ జవాబుల్లోనూ అసలు సారంలేదు. పైపెచ్చు కృత్రిమంగా వున్నట్లు కూడా నా కెందుకు అనిపించాలి? చోద్యమే !

మధ్యాహ్నం బాగా నిద్రపట్టింది. అంత గట్టి నిద్రలో కూడా మనసు ఏమీ బాగుండకపోవడం నా దురదృష్టం కాకపోతే ఏమిటి ? చాలా విచిత్రమైన దశ. హృదయం కన్నీరు విడుస్తూ నేవుంది. చాలా సేపటికి మెలకువచ్చింది. ఆ మెలకువ రావటంలో స్వాభావికత ఏమీ కనబడకపోయేసరికి, కళ్లకు ఏదో అడ్డుపడినట్లు కాగా, తరిచితరిచి చూశాను. సావిత్రిని క్రమంగా గుర్తుపట్టాను.

"మనుషులు నిద్రలోకూడా ఏడుస్తారాఏమిటి?"

నా హృదయం కన్నీరు విడిచినసంగతి ఆమెకెలా తెలుసు ?

"ఎవరు ఏడిచింది?" అని బొంకాను బింకంగా.

"మ రెవరు నీవికావా ?"

సిగ్గుతో తడుచుకుని "ఆ నీళ్లు బయటకు విరజిమ్మబడ్డాయన్నమాట" అనుకున్నాను. బదులు చెప్పలేదు.

"నా కెందుకులే" అని వేడివేడి కాఫీ యిచ్చింది.

వెళ్లిబోతూండే ఉపాయంగా ఆపి, "ఒక సందేహం తీర్చి మరీ వెళ్లు" అన్నాను.

ఆగి విసుగ్గా వున్నట్లు నటిస్తూ, ప్రశ్నార్థకంగా చూస్తూ నిలబడింది.

నానోటినుండుగా రాబోయే ప్రశ్నను ఆమె రకరకాలుగా ఊహిస్తోందని తెలుసు. కాని ఆమె అభిప్రాయాన్ని తారుమారుచేశాను.

"అమ్మ పరిస్థితినిగురించి ఏమిటే నీ అభిప్రాయం?

దెబ్బతిని, స్వభావాన్ని మరుగు పర్చుకుని "నాకేం తెలుసూ. డాక్టర్లు చెప్పేమాట నా చెవివరకూ రానేలేదు."

"నలుగురూ అనుకునేమాట."

"అదీ అంతగా తెలియదు. కాని ఒకటేమాత్రం చెప్పగలను ఆమెజబ్బు ఇహమీదట నయంకావచ్చు".

"ఏమలా?"

"ఈ ప్రశ్నకు జవాబు నీకే తెలుసు. కాని ఆ నయంకావటం శాశ్వతంగా నిలిచిపోదని నా అనుమానం "

బెదిరినట్లై "నీ ఉద్దేశం అంతకన్న స్పష్టంగా చెప్పకూడదా ఏం?"

ఆమె మాట్లాడకుండా వెళ్లిపోతోంది. ఆవేశంతో వెర్రిగా "సావిత్రీ!" అని పిలిచాను. ఆగలేదు వెళ్లిపోయింది.

చేసేదిలేక కాఫీని చప్పరిస్తున్నాను. సావిత్రి కలిపింది. అయినా సరస్వతి కాచినట్లే ఉంది. ఎలా అయినా వీళ్ళిద్దరికీ అట్టే భేదంలేదు.

అయిదునిమిషాలు గడిచాక "అత్తయ్య పిలుస్తోంది"-ఆమెగారి విషాదమూ, మధురమూ గాని కంఠస్వరం గది బయటనుంచి పలికింది. లేచి అమ్మ గదిలోకి వెళ్ళాను. ఆవిడ మనస్తత్వం నాకు తెలియనిది కాదాయె. మంచీ, చెడూ రెండూ కడుపులో దాచుకోలేదు. తుపానులూ, ప్రళయాలూ రేపడానికి ఆమె అట్టే వ్యవధి తీసుకోదు.

"కూర్చోరా బాబూ" అంది. ...అలాచేశాను. "సరస్వతి ఏమయిందిరా?"

అమ్మ స్వభావాన్ని ఏమాత్రం విస్మరించి వెళ్లినా హఠాత్తుగా వెలువడిన ఈ ప్రశ్నకు గుండె పగిలిపోవలసిందే. నా జాగ్రత్తలో నేను ఉన్నాను కాబట్టి బ్రతికిపోయాను. సాక్షాత్తు మాతృదేవితో ఇటువంటి...ప్రసక్తిమీద ముఖాముఖి మళ్ళీ ఓసారి మట్లాడవలసివచ్చినందుకు నన్ను నేను ఘోరంగా నిందించుకోవటం తప్ప పెద్దశిక్ష నాకేం కనబడలేదు.

"ఏమీ కాలేదు."

"ఎందుకు వచ్చినట్లు తిరిగి?"

"నాన్న ఉత్తరం రాశారు."

"కడసారి చూసిపోదామనా?"

"అబ్బ! అవేం మాటలు?"

"మరి ఏమిటేరా?"

"ఆ విషయాలన్నీ ఈ సమయంలో మాట్లాడడానికి ఎందుకంత ఉత్సాహం కనబరుస్తావు? నీకసలే ఆరోగ్యం బా వుంటలేదు."

"రేపు మరీ బాగుండదు. తెలివి వున్నప్పుడే మాట్లాడనియ్యి."

పలకలేక పలక లేదు.

"సరస్వతిని వదిలివేయనా?"

"అమ్మా! నీ కొడుకు చచ్చిపోవటం నీకిష్టమా?"

"కాని దిక్కులేనిచావు చావటం నా కిష్టం లేదు."

"ఏడాదిన్నర క్రితం యిదేవిషయం గురించి తల్లీ కొడుకూ, తండ్రి కొడుకూ అన్న బాంధవ్యం, మొహమాటం, సిగ్గు విడిచి హోరాహోరీగా పోట్లాడాము. మనుషులన్నమాట మరిచి నీచాతి నీచంగా ప్రవర్తించి నలుగురిలోనూ నవ్వులపాలు అయ్యాము. మళ్ళీ ఎందుకా ప్రళయాన్ని సృష్టించటానికి యిష్టపడతావు?"

"దాన్నిబట్టి అదే ఫలితాన్ని యిప్పుడూ సాధిస్తానని నీ తాత్పర్యమా?"

"ఏం చెప్పేది నీకు? నాకంటే ఎంతో విజ్ఞురాలివి ఈ చిన్నహృదయాన్ని నువ్వు శోధించలేకపోయావంటే మా అమ్మ యింత కఠినురాలని అనుకోమంటావా?"

"శోధించాను, నాయనా శోధించాను. నీ ఒక్క హృదయాన్నే కాదు. మరో యిద్దరినీ శోధించాను. కన్నకొడుకుమీది ప్రేమకన్న కట్టుకున్న భర్తమీది భక్తి తక్కువది కాదు. తోటి ఆడదాన్ని నీకన్న వెయ్యిరెట్లు అర్థం చేసుకోగలను. సావిత్రి ఎవరికోసం తపిస్తోందో నాకన్నా ఎక్కువగా ఎవరికీ తెలియదు."

"నిజమేనా అది? సావిత్రిస్థానంలో నే సరస్వతిని వుంచి కాస్త యోచించు నీకో అపూర్వమైన సత్యం గోచరిస్తుంది."

"యోచించానయ్యా! నా రక్తబంధువుమీద నాకున్న ప్రీతి, నా కులంమీద, హోదామీద నాకున్న మమకారం ఆ అభాగ్యురాలి ఆవేదనపట్ల నాకు కలుగుతున్న సానుభూతిని జయించాయి బాబూ!"

"అమ్మా, నువ్వు నాన్నలి కొసంగుకు నా ఆనందాన్ని అణుచుకోలేకుండా వున్నాను. నా సంతోషం ఎలా వెలిబుచ్చేది? కాని యింత తెలిసినదానివి స్వార్థానికీ, స్వలాభానికీ లోబడిపోయావుకద."

"ఎవరికి తప్పుతుంది నాయనా ఆ దుస్థితి? అమ్మమీదా, నాన్నమీద కల గౌరవం నిలుపుకోవాలా వద్దా అని నువ్వుపడిన అంతఃసంక్షోభంలో రెండో భాగానికే దాసుడివయ్యావు కాదూ?"

"కాని నా జీవితం యింకా చాలా వుంది. ఆ సంగతి ఆలోచించావా?"

"హు. నా జీవితం పరిసమాప్తి చెందబోతూంది. ఆ సంగతి నీకు పట్టటంలేదు కాబోలు?"

"అసలు నీతో వాగ్వాదానికి పూనుకోవటమే ఓ క్షమించరాని నేరం చాలా తప్పయిపోయింది" అని కన్నీళ్లతో "కాని అమ్మా నన్ను చంపకు. నువ్వయినా నన్ను అనుగ్రహించకపోతే ఏం కాను? మీ వ్యథలకూ, మనస్తాపాలకూ నేను ముమ్మాటికీ బాధ్యుడని ఒప్పుకుంటున్నాను. నీ సృష్టి అంతవరకే వుంచు. కాని సావిత్రి పెంచుకున్న ఊహలకూ, వాంఛలకూ నేను బాధ్యుణ్ణి కాను. నేను సరస్వతిని వదల్లేను. సావిత్రి జీవితంలో ఏర్పడ్డ శూన్యానికి నేను కారకుణ్ణి కాను" అని ఆమె కాళ్లు బలంగా పట్టుకుని, వాటిమీదే తలవాల్చి, వెచ్చని కన్నీళ్లతో తడిపేస్తూ "ఈ పాదాలు చాలాసార్లు పట్టుకున్నాను. పరీక్షలకుపోయేముందూ, పుట్టినరోజు పండక్కీ, సరదాకి యింకా ఎన్నోసార్లు. కాని యింత దీనాతిదీనంగా, కుళ్లిపోతూ ఎప్పుడూ వీటిని స్పృశించే భాగ్యం రాలేదు. నా కోరికను మన్నించవూ?" అన్నాను.

ఏమిటది? మానవుడి అంత్యకాలం [illegible] ఆసన్నమౌతూన్న భయంకరమైన చావును తలుచుకుని బలహీనంతో పెట్టిన చిన్న కేక, పెద్దదై, మరింత పెద్దదై, విజృంభించి యీ ప్రపంచాన్నే అలలనే హస్తాలతో నలుమూలలనుంచీ శక్తివంతంగా తన కార్యక్రమాన్ని నిర్వహిస్తూ పురుగుల్ని బంధించినట్లు బంధిస్తూంటే, భయంతో, ప్రాణాలపై తీపితో, ఒకరిపై ఒకరికిగల మమకారాల్తో, తనువుపై విసుగు జనించి, యీ ప్రళయాన్ని చూసి మమకారం పుట్టుకొచ్చిన చంచలచిత్తంతో, హాడిలి [illegible] హాహాకారాలు, ఆక్రందనలు మిన్నుముట్టక చిన్నదై, మరింత చిన్నదై చిరుగాలికి రేగిన మర్రిఆకు శబ్దంతో లీనమైపోతోంది. ఆకాశంనుంచి ఓనక్షత్రం రాలిపడి,

"నా తలమీదపడుతుంది," "అయ్యో మా అబ్బాయి," "నా రెండో భార్య అయ్యయ్యో" అని ఎవరికి వారు ప్రాణాలు తమకోసం, తమవారికోసం అరచేతుల్లో పెట్టుకుని ఆకాశంలోకి చూస్తూంటే అది మధ్యలోనే మారించి, అంతర్థానమైంది. అది చుక్క కాదు. ఉల్క. భూమిపైనుంచి లేచిన ఓ జ్యోతి, తారకలా రూపుదాల్చి, చూస్తూండగానే గాలిపటమై, దారం తెగి ఎగిరిపోయింది. ఏమిటది? ఎందుకొచ్చింది? దూరదృష్టా? హ్రస్వదృష్టా? హఠాత్తుగా ఎందుకు యీ వృథాప్రయాసం? ఏదీ కనబడదేం? కనబడుతున్న దంతా నిజమేనా? ఆకదిలేది ఏమిటి? ఒకటి కాదు రెండు. కాదు పది. అవును. అయిదూ అయిదూ పది. ప్రపంచంలో యింత వేగంగా కూడా కంపించే వస్తువులు వున్నాయా? శబ్దకంపన అబద్ధం నెలగువొంపులు అబద్ధం. దీనికి, యీ ప్రత్యక్షసత్యానికి మించింది, సాక్ష్యమేది ఎక్కడాలేదు. లేదు. కళ్ళు తిరగటం అంటే యిదేనా ఎంతగట్టిగా అరిచినా ఎవరూ రారేం? నాలికమీంచి, కంఠంలోంచి, గుండెల్లోంచి అరుపు అరుస్తోంది.

ఓ పెద్దశబ్దం ఓ తాకిడి.

"అమ్మ. యిదేమిటి?" వినిపించుకోదేం. కోటానుకోట్ల ప్రజలు ఏడ్చిన కన్నీళ్ళు ఒక్క కణవలోకి సరిపోవటం లేదు. వాటి ప్రభావం అంతేనా?

"అమ్మ. యిదేమిటే?" భూమిమీద నా పాపపు యినుపపాదాలున్నాయి. పవిత్రమైన చేతులు వాటిని బంధించివేస్తున్నాయి? విదిలించుకోలేనేం? క్రూరాతిక్రూరమైన, నీచాతినీచమైన యీ సాలెగూడు సన్నివేశంనుంచీ బయటపడలేనేం? ప్రేమించిన యువతిచేతులకన్న ప్రేమించిన తల్లి చేతులు ఎంతబలమైనవి?

అది కంఠస్వరమే అయితే అందికదా "ఈ ఈ పాదాలు నీ పసితనాన ముద్దుపెట్టుకున్నాను. జబ్బు చేస్తే వొత్తాను అసహ్యం చేసుకుంటే కడిగాను. కాని ఒక్కనాడూ! యింత దీనాతిదీనమైనస్థితిలో, కుళ్ళిపోతూ ఎప్పుడూ వీటిని ముట్టుకోలేదురా. నాయనా నాకోరిక మన్నించు."

అయ్యో ఈ ముసలి హృదయంలో ఆ వేదనకూ, అనురాగానికీ, పట్టుదలకూ హద్దులు లేవా? ఛీ ఛీ ఛీ నా కాళ్ళు తెగనరకటానికి చక్రి ఎందుకు ఉపేక్షిస్తున్నాడు?

జారిపోతోంది ఆమె భూమిపైకి. నా శక్తినంతా కూడదీసుకుని క్రిందకు ఊగి నా చేతుల్లోకి తీసుకున్నాను. మరీ పాపాత్ముడ్ని. బంధించిన వేళ్ళను త్రొక్కేశాను. కాని వాటిని చూడటానికి అవకాశమే లేదు. అధరాలు కదులుతున్నాయి. కళ్ళు యిందాకే మూతలు పడ్డాయి.

"ఊఁ" అను నాయనా.

ఈ ఒక్క అక్షరం చాలు. నన్ను ప్రపంచంలో తల్లక్రిందులు చేయటానికి.

"సరస్వతిని..."

ఉప్పెనలా పొంగింది దృఢ నిశ్చయం. "వొదిలి వేస్తాను" అన్నాను ధీమాగా. తెగిపోయిన గాలి పటాన్ని ఎవరో అందుకున్నారు.

"సావిత్రినే..."

"పెళ్ళాడతాను."

వైతన్యానికి అది అంత్యదశ. నా చేతుల్లో అమ్మ స్పృహ తప్పి వాల్లాడిపోయింది. గొంతెంతా చించుకుని "నాన్నా! నాన్నా!! నాన్నా!!!" అని పిలిచాను. ఎవరో లోపలకు పరిగెత్తుకువచ్చారు బహుశా. నాన్న విగ్రహంలాగే కనబడింది. వారికి అప్పజెప్పి డాక్టరుకోసం పరిగెత్తాను.

*          *          *          *

డాక్టరుగారు యిలా అన్నారు రహస్యంగా.

"ఇంకోరోజయినా గడుస్తుందో గడవదో."

కన్నీళ్ళు కారలేదు. ఇందాకనే ఖర్చయిపోయాయి.

అర్ధరాత్రి దాటింది. డాబామీద నిశాచరుడిలా తిరుగుతున్నాను. నా అడుగులు చప్పుడు నాకే భయంకరంగా, వికృతంగా వినిపిస్తున్నాయి.

ఒక క్షణం ఆగాను.

అడుగుల చప్పుడూ ఆగింది.

మళ్ళీ నడిచాను.

అడుగులూ వినిపిస్తున్నాయి.

రైలు చక్రాల టకటక, రైల్లో కూర్చుని మనం ఏదనుకుంటే అది పలికినట్లే యీ అడుగులూ నా ఆలోచనకు లయబద్ధంగా శ్రుతి కలుపుతున్నాయి. ఆలోచనకు గొంతు పోతోంది అయిదుస్వరలో రాగాలాపన. రెండుస్వరలో అడుగులు మెత్తగా శ్రుతి వేస్తున్నాయి

"అమ్మా! అమ్మా!! అమ్మా!!!"

అపశ్రుతులు లేకుండా అడుగులు స్వరాలు అందిచ్చాయి.

చీకటి అందంగా వుంది. చీకటి అసహ్యంగా వుంది. ఓహో! విభావరి ఎంత ఆనందంగా వుంది? అవునవును. దుఃఖంగా వుంది.

చీకటీ పాపమూ ఒకటే. చీకట్లో పుణ్యంచేసినా అది పాపమే. చీకటిలో నవ్వినా అది ఏడుపే. చీకటిలో ఆనందించినా అది దుఃఖమే. చీకటి అందంగా వున్నా అసహ్యమే. చీ...క...టి...లో సత్యం చెప్పినా అబద్ధమే. అబద్ధం చెప్పినా అబద్ధమే.

కాని పగలులో అబద్ధం చెప్పిన పాపానికి విలువ కట్టడం అసాధ్యం. ఆ పాపానికి పరిధులు లేకపోతే

పోనీ, దారుణంగా అబద్ధం చెప్పినమాట నిజం. ప్రపంచంలో క్షమాపణలు లేని నేరాలలో మరి ఒకటి. అమ్మ అసంతృప్తితో వెళ్లిపోవటానికి వీలు లేదు. అంత్యదశలో, వాంఛలు తీర్చుకోవటానికి ఉబలాట పడేవారిదగ్గర, వారి మానసిక సంతృప్తికోసం ఓ అబద్ధం చెప్పటానికి ధైర్యం చేయటంలో ఘోరం ఏమీ కనబడలేదు అప్పుడు.

జీవితంలో యింతకన్నా నీచమైన మానసికావస్థ లేదు రోజూ యింతమంది ప్రజలు ఆత్మహత్య ఎందుకు చేసుకుంటున్నారో యిప్పుడిప్పుడే బోధపడుతోంది. అందులో ప్రేమించిన వాళ్లగోల దుర్భరం. లోకంలో ప్రేమకు విలువ వున్నదీ, లేదు. ప్రేమించిన వాళ్లే అంతరంగాలు ప్రేమించినవాళ్లనీ చదవగలగడం అనుమానాస్పదమే. ఆక్షేపణగా, హాస్యాస్పదంగా నవ్వినా నవ్వవచ్చు. ఒక ఆనందమైన అసహ్యం ప్రేమ.

ఇంతకన్నా చావే వాంఛితం.

చచ్చిపోయినవాళ్ళంతా అదృష్టవంతులు. గుండె ఆగి మరణించిన వాళ్ళు మరీ ఈ ఉన్నతమైన కష్టపరంపరనుండి, కూర్చున్నా, నిల్చున్నా, నీడకన్నా వేగంగా వెంటాడే యీ వర్ణించలేని అనుభూతులకన్న మనశ్శాంతికోసం తహతహపడి అదే శాంతిని కోల్పోవటం కన్న, నీటన్నిటినుంచీ విముక్తిచేస్తూ "యిహ నీకు ఏ బంధాలూ లేవు పో"అంటూ సర్వస్వాతంత్ర్యం ప్రసాదిస్తున్న మరణం ట్రాజెడీ అని ఎవరంటారు? ఇంతకంటె సుఖాంతం ఎక్కడవుంది?

వడగాడ్పు యీ చెవినుంచి ఆ చెవిలోకి కొడుతోంది. దాహంతో గొంతు ఆర్చుకుపోతోంది. తెలివి తప్పుతున్నట్టుగా వుంది. మరణం సన్నిహితమౌతున్నట్లుగా తోచింది కొన్నివేల ప్రాణాలు తనలో విలీనం చేసుకున్న వడగాలి, నామీద పాశం విసురుతున్నట్లుగా వుంది. ఇలా నిల్చుంటే, కొంచం ముందుకు జరిగితే, బరువంతా ముందుకే అన్వయిస్తే చావు ఎంత సులభం!

"బావా!"

ఓ నీడ నా వైపు కదుల్తోంది ధైర్యంగా.

"సావిత్రీ!" అన్నా పిరికిగా.

"ఇక్కడ ఏం చేస్తున్నావు యిక్కడ, యింత రాత్రివేళా?"

"ఏమీ చేయలేనివారే చీకటిని కోరుకుంటారు."

ఆమె చిన్నగా నవ్వడం వినిపించింది.

"ఎందుకా నవ్వు? నన్ను చూసేనా?"

"నిన్నుచూసే ఒకరు నవ్వుతారని ఎందుకనుకోవాలి?"

జవాబు చెప్పలేదు. చప్పున ఆమె నాదగ్గరకు వచ్చేసింది. ఆమె పమిటిచెంగు గాలికి నాభుజాలు స్పృశిస్తోంది. మరుగుతెరలు ఏవో చిరుగుతున్నాయి చాలారోజుల క్రితం ఓ సంధ్యాసమయం యిలానే నిలబడ్డాము యిక్కడే. అప్పుడు వడగాలి వీచలేదు. అది మలయానిలం. కాని బాహ్యంగా నే. అప్పుడు నన్ను ఏదో ప్రశ్నించబోయింది. ప్రశ్నిస్తానంది. ప్రశ్నించమన్నాను. కాని ఎంత ప్రయత్నించినా అడగలేకపోయింది. చివరకు ఆమెను ఏకాంతానికి వదిలి నేను క్రిందకుదిగి వెళ్ళిపోయాను.

"బావా" అంది సావిత్రి.

ఎందుకో యీ పిలుపులో మధురత కనిపించటం లేదు ఏదో క్రొత్తభావం వశుడ్ని చేసుకుంటోంది.

"అడుగు. ఏమిటి నీ ప్రశ్న?"

ఆవేశం పొంగింది. ఎంత కుటిలత్వం! ఈ ఊబిలోకి మళ్ళీ దింపటానికి కాకపోతే అర్ధరాత్రివేళ వచ్చి ఏమిటీతంతు?

క్రోధాగ్ని ప్రజ్వలించకుండా ప్రయత్నిస్తూ "వద్దులే సావిత్రి దానివల్ల నీకేం లాభంలేదు." అన్నాను

ఆమె మళ్లీ చిన్నగా నవ్వి "నా కెందులో లాభం కలిగింది గనుక? నా స్థితి చూడు. నీ సందేహం తీరదామన్న కుతూహలంతో యింత రాత్రివేళ నీకోసం వచ్చాను" అంది.

"అడగలేను."

"సావిత్రి ముందుకూడా సంకోచమా? చిల్లిగవ్వ విలువలేని సావిత్రిముందు" ఈ సమయంలో ఎందుకూ నవ్వుతోంది? ఆ నవ్వు చల్లగా వుంది.

సరస్వతి మాటలు గుండెల్ని తొలుస్తాయి. సావిత్రి మాటలు గుండెల్ని గుచ్చుతాయి బహుశా యిదే మొదటి వ్యక్తి విజయానికి కారణమై వుంటుంది.

ఆ నవ్వు యింకా ఆగలేదు. ఇహ నా వశం కాదు. ఇటువంటి సమయం మళ్లీరాదు. ఈ అదృష్టానికి నన్ను నేను నిందించుకుంటే నాకంటె పిరికివాడు లేడు. ఈ అవకాశాన్ని వృథాచేసుకుంటే నాకంటే అసమర్థుడు లేడు.

"లాభం లేదు. చెప్పను"

"ఎందుకు చెప్పవ్ ఆశపెట్టి?"

నవ్వాను వెగటుగా "ఎందుకు చెప్పాలి?"

"నేను యీ రాత్రి అవమానం పొందటానికే నీ దగ్గరకు వచ్చాననుకున్నావా?"

దీనత్వం క్షణంలో మాయమైంది ఆడదానిలో. కంఠస్వరం బుసలు కొడుతోంది. నేనూ కొట్టగలను బుసబుసలు.

"అవమానం" అని మళ్ళీ వెటకారంగా నవ్వి "నా చేత అవమానం చెందటానికి అభిమానపడినదానివి దేనికి యింత ప్రయాసపడటం?" అని ఆగాను.

"ఏమిటికి నేను ప్రయాసపడ్డాను?"

'ఏమిటికో' నేను చెప్పాలన్నమాట. ఎంత నిబ్బరం; ప్రపంచంలో ఎత్తైన గోడకన్నా ఎత్తైన గోడ నా జీవితాన్ని చీల్చివేసేందుకు పెరుగుతోంది. పొమ్మన్నా పోదు. తన అసమానశక్తితో నన్ను ముక్కలు ముక్కలు చేస్తోంది. ఈ భూమ్మీద సావిత్రి లాంటి వ్యక్తి జన్మించకపోయినా దిగుల్లేదు. పరమాత్మునికి కృతజ్ఞతలు. ఈ అడ్డుగోడను పడద్రోయటానికి ప్రయత్నించటంలో నే నెందుకు జాలి వహించాలి? తనకు తెలియకుండా ఓ మహాపరాధాన్ని కావిస్తే ఆ అపరాధాన్ని క్షమించేందుకు కొంతవరకూ అవకాశం వుంది. కాని అలా కాదే నే పెంచుకోలేని ప్రేమ తనెందుకు పెంచుకోవాలి? ఆమెలో యీ భావం కలిగించటానికి నేనెప్పుడూ కారకుణ్ణి కాలేదు. తన ఒంటరి జీవనంతో నన్ను ఎందుకు పనికిమాలినవాణ్ణి చేయాలి? తను అమాయకురాలిగా నటిస్తూ ఓ అమాయకుడి జీవితవిధానంతో ఎందుకు చెలగాటలాడాలి? ఈ స్త్రీకి హృదయం ఉండనీ, లేకపోనీ కనీసం జ్ఞానం అయినా లేకపోయె. ఒక్క మాటతో తాను పరిభ్రాన్త శాంతుణ్ని, బంధవిముక్తుణ్ణి చేయవచ్చునే.

కారుచీకటిని చూసి కోపం చంపుకోలేదు. ఈ సన్నివేశం తెరచాలి, ఆమెకు కొంచెం దగ్గరగా జరిగి, పిట్టగోడకు ఆనుకుని దర్పంగా చూపులు విరజల్లాను.

అదేమిటి? నీడ కదిలి వెళ్ళిపోతోంది.

"సావిత్రీ" అని పిలిచాను నీరసంగా.

నీడ వినిపించుకోక వెళ్ళిపోతోంది. ఆలస్యానికి తావులేదు. ఆమె నాకు దూరం కారాదు. పరుగున ఆమెను వెంబడించాను. నీడ వేగంగా, దూరంగా కదలిపోతోంది. ఆగమని పిలిచాను వెనకనుంచి. పలకలేదు. మా యిద్దరిమధ్యా దూరం తక్కువై తక్కువై మాయమయింది. వడిగా చెయ్యి పట్టుకుని ఆపాను.

"నన్ను వెళ్ళనియ్యి. నువ్వు తిరిగి రావటంతో పరిస్థితులు చక్కబడతాయనుకున్నాను. నన్నర్థంచేసుకున్నా వనుకున్నాను" అంది గాద్గదికంగా.

ఆమె హస్తాన్ని జాలిగా వొదిలి "అర్థం చేసుకున్నాను సావిత్రీ! అందుకే అమ్మకు మాటయిచ్చానని గ్రహించలేవా?" అని కొంచెం ఆగి "ఈ రాత్రివేళ నేను చెందే ఆవేదనకు అర్థం అదికాదు" అని నిట్టూర్చాను.

"ఓహో ఏమిటే విచిత్రం!"

"నిన్ను క్షమించమని అడగటానికి నే నేమీ సంకోచించటం లేదు. గతించిన జీవితపు పుటలలో అన్నీ తప్పుడు వ్రాతలే. నన్ను క్షమించు. సావిత్రీ. మనోహరమైన యీ రాత్రినుంచి నా పాతజీవితానికి ఉద్వాసన చెబుతున్నాను. అంతా రోత. నీకింకా అర్థం కాలేదా?" అని ఆవేశంతో ఆమె చేతిని మరో మారు అందుకోబోయాను.

విదలించుకుని "ఛీ" అంది.

"నేను యింక పరాయివాణ్ణి కాదు" అని శృతిమించబోయాను.

"మూర్ఖుడా!" అందామె రోషాయమానంగా. "ఇంతటి దుర్బలుడవా నీవు? ఊరిగాలి సరిపడిందా మళ్ళీ? కడుబుద్ధి వేయటంలేదా ఇక్కడున్నంతే? సరస్వతిని నీకంటే నేనెక్కువ బోధపర్చుకున్నానంటే, నువ్వందులో సిగ్గుపడాల్సింది ఏమీలేదు. అత్తయ్యకిచ్చిన మాట మాటగానే ఉండనియ్యి. అది మంచిపని. ఆమాట అనిపించుకునేందుకు నేనింత దూరం రాలేదు. నిన్నింకా యిన్నాళ్ళూ అభినందించాను. అబ్బ నీ మనసు ఎంత చంచలం?" అని అసహ్యముగా నిట్టూర్చి "ఇప్పుడిహ ఆ పని చేయలేను. సిగ్గువిడిచి చెబుతున్నా. ఇదికూడా విను. సావిత్రి మరో వ్యక్తికి హృదయం అర్పించకపోయినా మూఢోత్తరగతి విజ్ఞానంతో తన హద్దులు తెలుసుకుంది. నీ ప్రశ్న ఏదైనా యిదే జవాబు వర్తిస్తుంది."

నీడ బరువుగా వెళ్ళిపోతోంది. "సావిత్రీ" అని పిలిచాను బలహీనంగా.

మెట్లదగ్గర నిలుచుని "ఇంకా ఏదయినా మిగిలివుందా" అంది ఉదారంగా.

"మరి యిన్నాళ్ళూ యీ విషయం అమ్మకెందుకు చెప్పలేదు?"

"చెప్పాను. కాని నా ఏకాంతం నా మాటల్ని అబద్ధమని నమ్మేట్లుగా చేసింది."

ఇలా అని ఆమె క్రిందకుదిగి వెళ్ళిపోయింది. మైకం వదిలింది యిందాక కాదు, ఇప్పుడు. భంగపడింది నేను. తీరని కసి, తీరకుండానే అస్పష్టమైంది. అయినా విచారం లేదు. నాకింతకన్నా సంతృప్తి అక్కర్లేదు. సంతృప్తిని యివ్వగలిగానేమో. ఇంతకన్నా నాకు నిశ్చింత ఏముంది?

మెట్లుదిగి క్రిందకు వచ్చాను. బెడ్‌లైట్ వెలుగుతోంది. చప్పుడు చేయకుండా అమ్మవున్న గదిదగ్గరకు పోయి తొంగిచూశాను. నిశ్చింతగా నిద్రపోతోంది. ఈ నిద్ర రేపటివాకామాత్రం యీ రూపంలో వుంటుంది.

కఠినుణ్ణే అయినా కళ్ళు తుడుచుకుని వెనుదిరిగాను. నాన్నకూడా మంచి నిద్రలో వున్నారు. నా గదిలోకి పోతూంటేగా ఏదో అనుమానం తగిలింది. మునివేళ్ళమీద వెళ్ళి సావిత్రి గదిలోనికి తొంగి చూశాను.

సావిత్రి నిశ్శబ్దంగా ఏడుస్తోంది.



దేశోద్ధారకుని వర్ధంతిమహోత్సవము
చైత్ర శుద్ధ ద్వాదశి — ది 22—4—56



నిలుచున్న మనిషి - లోహశిల్పం
శిల్పి: హెన్రీ మూర్

# జంటపక్షులు

శ్రీ నాగభూషణ్

* గత సంచిక తరువాయి

## రంగము : 2

* * ఉదయం ; హాలులో కమల, జోగారావులు కూర్చునివుంటారు. కమల అంటే రామమూర్తి భార్య; సంసారపక్షంగా వుంటుంది. కాని, జీవితంలో భర్తవల్ల పొందగల ఆనందంలో ఏ కొంచమూ పొందలేక పోవడం వల్ల నిస్పృహచెందిన మనిషి. జోగారావు కుర్రవాడు. నిన్న మొన్ననే చదువు పూర్తి చేసుకొన్నవాడు. అనుభవం లేకపోయినా, పరిస్థితులను ఎదిరించి స్వసుఖం కోరుకునే మనిషి...... అప్పుడే టిఫిన్, కాఫీ పూర్తిచేసుకొని మూతి తుడుచుకుంటూ వుంటాడు.

కమల : మరో ఇడ్లీ కావాలా ?

జోగారావు : అక్కర్లేదు.

కమల : మరికొంచెం ఉప్మా ?

రావు : నాకు తిండిదగ్గర మొహమాటం లేదు, కమలా!

కమల : కొంచెం కాఫీ—?

రావు : (నిట్టూర్పుతో) అక్కర్లేదు కమలా ! నేను కాఫీ తాగడం పూర్తయింది.

కమల : అతని కమల అతనికోసం యిచ్చినా అక్కర్లేదన్నమాట !

రావు : కావలసివుంటే తీసుకోనా ? అందులోనూ నా కమల నాకోసం చేసియిస్తానంటే !—

కమల : (రుసరుసగా) ఇహ ప నేముంది? ఆ సోఫాలో మునిగిపోవడం; తన కమలకు యిష్టంవున్నా లేకపోయినా సిగరెట్ ముట్టించడం...... అతనికి కమలకంటె సిగరెట్టే యిష్టం (నవ్వి) కాదుకదూ !

రావు : అవును. (లేని నవ్వు తెప్పించుకుంటాడు.)

కమల : నువ్వు చెప్పింది నిజమైతే చేతిలో చెయ్యి వెయ్యాలి.

రావు : (చేతిలో చెయ్యివేస్తూ) మరీ చిన్నపిల్లవై పోతున్నావు కమలా !

కమల : ఇప్పుడివ్వు నీ సిగరెట్ కేసు! (దాన్ని ముద్దు పెట్టుకొని ఇందాక నీవన్నది నిజం కాదు. ...ఓ! (అవిడ ఒక పళ్లె పళ్లెం చూసింది.)

రావు : ఏమిటి ?

కమల : నువ్వు ఒక్క పండుకూడా తినలేదు కదూ!

రావు : పండా ! కాయలతోనే కడుపునిండింది. ఇంకా పండెందుకు ?

కమల : కాదు కాదు......నువ్వొక ఆపిల్ పండు తప్పక తినాలి...తినకపోతే నీ కమల చాలా నొచ్చుకుంటుంది.

రావు : ఇంతవరకూ తిన్నదానికే కడుపులో చోటు లేక గొంతులోకి వస్తోంది. (కమల అతని వైపు జాలిగా చూస్తుంది.) లేదు కమలా ! నేను టిఫిన్ తినడం ఎప్పుడో పూర్తి చేశాను.

కమల : నేను స్వయంగా యిచ్చినా అక్కర్లేదా ?

రావు : అక్కర్లేదు కమలా ! మామూలుకన్నా ఎంతో ఎక్కువ తిన్నాను.

కమల : (లేస్తూ) నిజంగానా ?

రావు : నీతో అబద్ధం చెప్పగలనా?...ఆఁ! నువ్వెక్కడ కూర్చుంటావ్ ?

కమల : (సోఫామైపు చూపుతూ) నా రావు అక్కడ, నేను అతని ప్రక్కన (అతన్ని లేవదీస్తుంది)

రావు : (నిరుత్సాహంగా) అవును.

[ఇద్దరూ సోఫాలో కూర్చుంటారు]

కమల : సిగరెట్!

రావు : థాంక్స్!...(ఆమె ముట్టిస్తుంది) ఆ... కమలా! మనం యిక్కడికి వచ్చి ఓ వారం రోజు లయింది కదూ ?

కమల : అవును. వారంరోజులు! ఎంత గొప్పగా గడిచినయ్! చివరకు యివ్వాళ యింత మంచి యిల్లును వదిలి వెడుతున్నాం.

రావు : (అది వినిపించుకోకుండా నే) వారంరోజులు! మొదటిరోజు తప్ప మిగిలిన రోజులన్నీ మనం కలిసే కాఫీ, భోజనం తీసుకున్నాం కదూ!

కమల : (సంతోషంతో, ఆశ్చర్యంతో) అవును.

రావు : మనం ఆ టేబుల్ ముందు రోజుకు నాలుగు సార్లు కూర్చున్నాం — రెండుసార్లు కాఫీకి, రెండుసార్లు భోజనానికి — మొత్తం ఇరవై నాలుగుసార్లు!

కమల : ఇరవైనాలుగుసార్లు! నిజం ?

రావు : మనం కూర్చున్న ప్రతిఒక్కసారీ "ఇంకా కొంచెం తిను, ఇంకా కొంచెం తాగు" అని కనీసం నాలుగుసార్లయినా అన్నావు నువ్వు. అంటే ఏమీ అవసరం లేకపోయినా, నన్ను రోజుకు తొంభైసార్లు, వారానికి ఏడువందల సార్లు— 'అక్కర్లేదు కమలా' అనేటట్లు చేశావ్!

కమల : (దెబ్బతిని) రావ్!

రావు : (వెనుకటిమాదిరిగానే) నాకు పాతిక్కేళ్లు. నీకు ?

కమల : (ఆశగా) ఇరవైమూడు.

రావు : ఇరవైమూడు! అంతా సవ్యంగా జరిగితే, మనం యింకా యాభైఏళ్లకి తక్కువ బ్రతకం. అంటే రెండువేల అయిదువందల వారాలు...మనం కలిసివుంటే ఈ రోజుల్లో 'అక్కర్లేదు కమలా' అనే మాట కనీసం పదిహేనులక్షల సార్లు నా చేత అనిపిస్తావ్! — నిజానికి ఏమీ అవసరం లేకపోయినా!

కమల : (విచారంతో) రావ్! (దుఃఖంతో ముఖం కప్పుకుంటుంది)

రావు : మనం, ఈ విషయంలో ఏదైనా సంధి కుదుర్చుకుంటే బావుంటుంది, అంతే! —

కమల : ఎంత కఠినమైన మనిషివి! (జాలిగా నిట్టూర్పుస్తుంది.)

రావు : (తెప్పరిల్లి) నా వుద్దేశ్యం విను కమలా! మనం యీ విషయాన్ని గురించి ఆలోచించుకుంటే బావుంటుందేమోనని —

కమల : (ఈ లోకంలోకి వస్తూ) రావ్!

[రావు ఈ విషయాన్ని ఎందుకు తెచ్చానా అని విచారిస్తున్నాడు. కమల నిట్టూర్పుల వంకకు దృష్టి పోనివ్వకూడదని ఎంత నిగ్రహించుకున్నా వీలుపడదు...అవి భరించలేనివి]

రావు : (ఆమెను దగ్గరకు తీసుకొంటూ) ఊరుకో కమలా! నాది పొరపాటే!... (ఇంకా నిట్టూర్పుల వేగం తగ్గదు.) నా కమలే నన్ను క్షమించకపోతే నన్నీలోకంలో మరెవరు క్షమిస్తారు, చెప్పు ?

కమల : (నిట్టూర్పులమధ్య) నేను నిన్నెంతో ప్రేమిస్తున్నాను కాబట్టే, నిన్నా పండ్లు తినమన్నాను.

రావు : నిజం...నిజమే కమలా! నేనంటే నీకెంత యిష్టమో నాకు తెలియదా ?

కమల : ఏ డాక్టరునైనా అడుగు. నువ్వాపళ్లు తినాలనే అంటాడు.

రావు : అవును.

కమల : అందువల్లనే నువ్వు తినాలి.

రావు : అవును కమలా! (మళ్లీ కమలను ఎదిరించడం ఈ జన్మలో చేతకాదు రావుకు.)

కమల : (కళ్లు తుడుచుకుంటూ) భర్తకు వంట్లో బాగుండకపోతే, జాగ్రత్తగా చూడడానికి, అతను తినకపోతే తినేటట్లు చెయ్యడానికి కాకపోతే, భార్య ఎందుకు?

రావు : అవును...అందుకే—

కమల : మనం యిక్కడకు వచ్చిన మర్నాడే నీకంత జలుబు చేస్తే, నిన్ను జాగ్రత్తగా చూసుకొని, మళ్లీ కులాసాగా వుండేటట్లు చేశానా, లేదా ?

రావు : నువ్వు చాలా దయగలదానివి కమలా!

కమల : దయేమీ లేదు......నిన్ను జాగ్రత్తగా కాపాడుకోవడం నాకుచాలా యిష్టం. అందులోనూ జబ్బుపడ్డవాళ్లకు సేవ చెయ్యడమంటే నా కెంతో యిష్టం. మూర్తి ఒక్కసారి కూడా జబ్బుపడలేదు.

రావు : మూర్తి—?

కమల : మా ఆయన.

రావు : అతని పేరు మూర్తా?...సరే! నేనతన్ని ఎరుగను కాబట్టి అతన్ని గురించి నేనేమీ మాట్లాడదలుచుకోలేదు.

కమల : నిజమే రావ్! నేనుకూడా అంతే!

రావు : మనం యింటినుంచి పారిపోయివస్తున్నాం. మళ్ళీ తిరిగి వెళ్లంకదూ ?

కమల : (ఆశ్చర్యంతో) రావ్!

రావు : చూడు కమలా! మనం చాలాదూరం వచ్చాం కదూ ?

కమల : అదేమిటి రావ్ ? నువ్వు పశ్చాత్తాప పడుతున్నావా ?

రావు : (త్వరగా) లేదు, లేదు......(ఆవిడ మళ్ళీ నిట్టూర్పులు మొదలుపెడుతుంది) లేదు కమలా, లేదు. నేనునిన్ను యింతగా ప్రేమిస్తున్నప్పుడు పశ్చాత్తాపం ఎందుకు! నేను ఇప్పుడున్నంత హాయిగా యిదివరకెప్పుడూ లేను.

కమల : (అతనికి దగ్గరగా జరిగి) రావ్! ఎంత భయపెట్టావ్! నువ్వు నిజంగా పశ్చాత్తాపపడుతున్నావనుకున్నాను.

రావు : పశ్చాత్తాపం ఎందుకు ? నేను చాలా హాయిగా వున్నాను.

కమల : వేదాంతంగారు ఎంత నిజం చెప్పారు.

రావు : అవును. చాలా నిజంచెప్పారు.

కమల : నీతో రమ్మని నువ్వడిగినప్పుడు, మన కొకళ్ళనుగురించి ఒకళ్లకు ఎంత తక్కువగా తెలుసు ?

రావు : అవును. చాలా తక్కువ తెలుసు.

కమల : ఈ వారం రోజులలో మనం ఒకళ్లను గురించి ఒకళ్లం ఎంత తెలుసుకున్నాం ?

రావు : అవును ఎంత తెలుసుకున్నాం ?

కమల : ఇప్పుడు నాకేమీ భయంలేదు...మనం యిద్దరం కలిసి ప్రపంచం ఎదురై నిలిచినా జయించగలం యిప్పుడు.

రావు : అవును.

[పాపం! రాజా చేసిన పాపం యింకా పరిహారం కాలేదు. కుడిచేతిలో సిగరెట్ వుంది. అదే చెయ్యి కమల నడుముచుట్టూవుంది. సిగరెట్ నోట్లో పెట్టుకోడానికి చేసే ప్రయత్నాల్లో రెండు మూడుసార్లు ఆమెను దగ్గరకు లాక్కోవలసి వస్తుంది. ఆమె ఆ ఆనందంలో మైమరచి కళ్లుమూసుకొని వుంటుంది. నాలుగో ప్రయత్నంలో విజయుడైన రావు, సిగరెట్ నోట్లో పెట్టుకొని ఒక దీర్ఘ నిశ్వాసం విడుస్తాడు......ఇంతలో వేదాంతంగారు వస్తాడు.]

వేదాంతం : నమస్తే! (వాళ్లు దూరంగా జరుగుతారు)

రావు : నమస్తే!

వేదాం : ఆఁ! ఇవ్వాళ మీ రీ యిల్లు వదిలి పెడుతున్నారన్న మాట!

రావు : (ఉత్సాహం ఏమీ లేకుండా) అవును.

కమల : కాని ఇక్కడ గడిపిన ఈ వారంరోజుల్ని మాత్రం మేం జీవితంలో మరచిపోలేం వేదాంతంగారూ!

వేదాం : కొన్నాళ్లపాటు మిమ్మల్ని యిక్కడ వుండమన్నందుకు నన్నిప్పటికి క్షమించారన్న మాట మీరు.

కమల : (సిగ్గుపడుతూ) అవును...కాని మీరు చాలా నిజం చెప్పారు...ఆ విషయం ఇంతకుముందే రావుతో చెప్పాను. ఏంరావ్ ?

రావు : అవును....ఒక్క నిముషం క్రిందటే!...... (గడియారం చూసుకొని) కాదు. రెండు నిముషాల క్రిందట.

వేదాం : మీ కే విషయంలోనూ పొరపులు, పోట్లాటలూ లేవుకదూ?

కమల : ఒక్క విషయంలోకూడా లేవు...అవునా రావ్?

రావు : అవును.

వేదాం : ఇంకేం...చాలా సంతోషం. (గడియారం చూసుకుంటూ) మిమ్మల్ని తొందర చెయ్యను...మీ పనులన్నీ పూర్తిచేసుకోండి....కారు మరో అరగంటలో వస్తుంది.

కమల : అరె! అరగంటలోనా! నేను త్వరగా వెళ్లాలి. (అంటూ రావువంక చూస్తుంది)

రావు : (కదలకుండా) అవును. మనం త్వరగా వెళ్లాలి.

[కమల లేస్తుంది.]

వేదాం : (కమలతో కొంచెం ముందుకువెళ్లి) అన్నట్లు, చూడండి కమలాదేవి! రాత్రి యిక్కడకు మరో యిద్దరు అతిథులు వచ్చారు.

కమల : (ఆగి, ఆసక్తితో) అంటే—మరో ప్రేమికుల జంట—

వేదాం : అవును మరో జంట—

కమల : మేం వెళ్లేముందు ఒక్కక్షణం వాళ్లను కలుసుకుంటే బావుండును. ఇక్కడ గడిపే వారం రోజులూ ఎంత హాయిగా, గడపవచ్చునో చెబుతాను.

వేదాం : దానికేం? మీరు తప్పకుండా కలుసుకొందురుగాని.

కమల : సరే, వస్తాను. (కమల వెళుతుంది.)

రావు : చూడండీ?

వేదాం : ఏమిటీ?

రావు : చూడండి......మీరన్నది...... నిజంగా, ఇప్పుడే—(గడియారం చూసుకొని, విచారంగా) అరగంట!—సరే నేనూ తయారు కావాలి. (బయలుదేరుతాడు.)

వేదాం : రావ్ గారూ!

రావు : (వెళుతున్నవాడు ఆగి) ఆఁ!

వేదాం : ఒక్కమాట! (రావు వెనక్కితిరిగి వస్తాడు) (బుజంతడుతూ) హుషారుగా వుండాలండీ! అసలిటువంటిసమయంలో సంతోషంతో డాన్సు చెయ్యాలి.

రావు : (నిస్సారంగా) సంతోషమా?

[వేదాంతం నవ్వుతాడు.]

సరే! నేను సామాను సర్దుకోవాలి.

[వెళ్లిపోతున్న రావుకు బట్లర్ ఎదురు వస్తాడు. నిరుత్సాహంగావున్న రావును చూచి వేదాంతం, బట్లర్ యిద్దరూ నవ్వుకుంటారు.]

బట్లర్ : గుడ్ మార్నింగ్ సర్!

వేదాం : మార్నింగ్...ఈ వుదయం ఎంత గొప్పగా వుందో చూశావా?

బట్లర్ : చూడకేమిసార్! (కొంచెంసేపు ఆలోచించి) చూడలేదు సార్!

వేదాం : చూడలేదా! ఐతే కొంచెంసేపు ఆగు. ఎంత గొప్పగావుందో కనిపిస్తుంది...ప్రపంచం అంటే, నాకిప్పుడు ఆశ కలుగుతోంది.

బట్లర్ : నిండా నిజంసార్!

వేదాం : మనం చెయ్యగలిగినదంతా చెయ్యాలి...... తెలిసిందా?

బట్లర్ : దానికేమిసార్! మస్తుచేస్తును (పేపర్ యిస్తాడు.)

వేదాం : ఏమిటిది?

బట్లర్ : ఇవ్వాల్టి పేపరు సర్!

వేదాం : చూడు!...దీనిలో ఎన్ని కొత్తజంటలు వున్నయ్యో? (లెక్కపెడుతూ) ఒకటి, రెండు, మూడు...పది!—పది జంటలు! పాత పురాణాలు చెప్పినట్లు జీవితాంతం సుఖపడదలుచుకున్న వాళ్లు యిరవైమంది... అన్నట్టు, మీ దొరగారేమంటున్నాడు?

బట్లర్ : నిండా విచారంలో వున్నారుసార్!

వేదాం : విచారమా?...ఎందుకు?

బట్లర్ : ఆయన సామాను ఎక్కడో పోయింది సార్!

వేదాం : అంటే, అది ఆయనతో రాలేదా?

బట్లర్ : వచ్చినట్టు లేదు సార్ !

వేదాం : ఎంత అజాగ్రత్త? ఆయనకు మనం ఏమీ సహాయం చెయ్యలేమా ?

బట్లర్ : లుంగీ, అద్దం, దువ్వెన, అన్నీ యిస్తున్నాడు సార్ మన లింగరాజు! మూర్తిగారు నల్ల ఒప్పుకోలేదు సార్ !

వేదాం : లింగరాజు సంగతి నాకు తెలియదా! చాలా మంచివాడు.

బట్లర్ : క్రైమ్‌కు మన యింట్లోకూడా ప్లేటులు నిండా అయిపోయాయి సార్!......ఇన్ని చూచి అయ్యగారు డౌన్ అయిపోయారు సార్!

వేదాం : మళ్లీ లేచి మామూలు మనిషి కావడానికి ఏం చెయ్యాలంటావ్ ?

బట్లర్ : కడుపునిండా టిఫిన్ తింటే సరి సార్!

వేదాం : నీ సలహా అద్భుతంగావుంది...అది మూర్తి గారికి స్వయంగా అందచెయ్.

[ఇంతలో జానకి వస్తుంది...మూర్తిమీద ఆశ చాలా కొద్దిగావుంది...ఈ గది చూచి చాలా ఆశ్చర్యపడుతుంది]

వేదాం : ఓ! నమస్తే జానకీ దేవీ! రాత్రి బాగా నిద్రపట్టిందా ?

జానకి : మీ గదులు చాలా బావున్నాయండి.

వేదాం : థాంక్స్.

బట్లర్ : టిఫిన్ తెస్తునుసార్. (వెళ్ళిపోతాడు.)

వేదాం : మీరు కాఫీ తాగుతారా? పాలా?

జానకి : ఏవయితే యేంకాని, రాం యేడీ?

వేదాం : రాం? ఎందుకు?

జానకి : ఇవ్వాళ మొదటిసారిగా అతనితో కలిసి కాఫీ తాగుదామనుకున్నాను—ప్రాక్టీస్ కోసం—అతనితో కొన్ని సంగతులు చెప్పాలి.

వేదాం : (నవ్వుతూ) పోనీ, అవి నాతోనే చెప్పండి.

జానకి : (కూర్చుంటూ) అవి భార్యాభర్తలు ఏకాంతంగా చెప్పుకోవలసినవి.

వేదాం : ప్రాక్టీస్‌కోసమే కదా! ఇట్లా చెప్పినా ప్రాక్టీసే!

జానకి : సరే!

వేదాం : థాంక్స్..... (ఇంతలో మూర్తిగా మారి పోయి) ఆఁ! నీకేంకావాలి జానీ? ఇడ్లీ, సాంబార్, పూరీ పొటాటో, ఉప్మా, పంచదార, బోండా బజ్జీ, —అన్నీ ద్వంద్వాలమీద నడుస్తున్నయ్.

జానకి : అప్పుడే మరచిపోయ్యావా?

వేదాం : లేదు, లేదు....ఉప్మా.

[బట్లర్ రెండు ప్లేట్లతో ఉప్మా తెచ్చి అక్కడ పెడతాడు.]

జానకి : (ఉప్మా తిని) కాఫీనా, టీనా రాం?

వేదాం : నేను కాఫీ తప్ప మరొకటి తాగనని నీకు తెలియదా, జానీ!

జానకి : మరచిపోయాను. (బట్లర్ కాఫీ తెస్తాడు)

వేదాం : (తాగుతూ) కాఫీ చాలా బావుంది ప్రేయసీ! అరె! నాటకాల్లో భాష వస్తోందే! ఎలావుంది?

జానకి : బాగానేవుంది.

వేదాం : ఇంతకుముందే పేపర్లో ఓ భయంకరమైన వార్త చూశాను రాణీ...రాణీ!...అదోలా వుంది !

జానకి : నిజంగా జీవితంలో వుపయోగించవలసిన భాష అది...నువ్వు ఇంతవరకు పెళ్ళి చేసుకోలేదు కదూ, రాం.

వేదాం : ఇంతవరకు ఒకే ఒక్కసారి చేసుకున్నాను కమలని...కమల నీకు తెలియదా, జానీ?

జానకి : జ్ఞాపకంలేదు...నేను మిమ్మల్ని నిజంగానే 'రాం' అనుకున్నాను.

వేదాం : నన్ను గురించి ఇంత మంచిగా ఎవరు మాట్లాడతారు.

జానకి : మీవంటివాళ్ళను నేనెక్కడా చూడలేదు.

వేదాం : (మళ్లీ మూర్తయిపోయి) అరె! సరిగ్గా కమల కూడా అట్లానే అనేది...సరె! కమలకు వ్యతిరేకంగా నేనేమీ చెప్పదలుచుకోలేదు.

జానకి : రాం! మన సంభాషణలోకి నీ భార్య ప్రసక్తి తీసుకురావడం నాకు బావుండదు.

వేదాం : నాకూ అంతే!...సరే! అసలు సంగతి చెప్పలేదు—నిన్న గుర్రపు పందాలలో మన గుర్రాలన్నీ ఓడిపోయినయ్

జానకి : అయ్యో!

వేదాం : నేను సర్వస్వం ఓడిన ధర్మరాజునైపోయాను...ఇక నేనేదైనా వుద్యోగం చెయ్యాలి, జానీ!

జానకి : నువ్వేవుద్యోగం చెయ్యాలో చెప్పనా? (చెప్పమన్నట్లు చూస్తాడు.) నువ్వు కేంద్ర ప్రభుత్వంలో మంత్రివై పెద్ద పెద్ద వుపన్యాసాలివ్వాలి.

వేదాం : నన్నెందుకూ పనికిమాలినవాడికింద కట్టావన్నమాట!

జానకి : ఏం?

వేదాం : జీవితంలో దేనికీ పనికిరానివాడు రాజకీయాల్లో చేరతాడంటారు. అందులోనూ మంత్రికావడానికి మరీ......

జానకి : ఏమో! నాకుమాత్రం నువ్వదే కావాలి.

వేదాం : అయితే సరే! నువ్వేది కావాలంటే నేనదే అవుతాను.

జానకి : ఎంత చిలిపిగా మాట్లాడుతావ్!...కొంచెం కాఫీ కావాలా?

వేదాం : నువ్వు యిస్తానంటే వద్దంటానా? ... మన కీమాటలతో జీవితాంతం గడుస్తుందనే నీ వుద్దేశ్యమా?

జానకి : ఏం? ఎందుకు గడవదు?

వేదాం ; పాడిందే పాడుతూ, జీవితమంతా,—సరే! కాఫీ తాగేటప్పుడీమాట లెందుకు? కులాసాకోసం రాత్రి నీకు వచ్చిన కల ఒకటి చెప్పు.

: (ఆలోచించి) రాత్రి నాకు చాలా తమాషా కల వచ్చింది.

: (ఆసక్తితో) ఏమిటది, జానీ?

: ఒక రాత్రి మనం పారిపోతున్నాంట! మధ్యలో దారి తప్పి, ఒక యిల్లు చూసి హోటలనుకొని అక్కడకు వచ్చాం. కాని అది హోటలు కాదు......వేదాంతం అనే తమాషా మనిషి వున్న తమాషా యిల్లది

వేదాం : చాలా తమాషాగావుందే! వేదాంతం ఎవరు? ఈ భూప్రపంచంలో ఆయన పేరెక్కడా వినలేదే!

జానకి : ఆయన మనల్ని బందీలన్నాడు. ఆ యింటి తలుపులన్నీ తాళాలువేసి మనం బయటకు కదలకూడదన్నాడు.. ...ఒక వారం మనం అక్కడే వుండి, ముందు ముందు సుఖంగా వుండగలమో లేదో ప్రయత్నం చేసి చూడమన్నాడు......ఆ వారం తర్వాత మనం వెళ్ళొచ్చుట!

వేదాం : ఎంత అసంభవంగా వుంది! సర్వస్వతంత్ర భారతదేశంలో గౌరవనీయులైన మనుష్యుల్ని బందీలుగా వుంచడానికి ఆ వేదాంతంగారికి హక్కేముంది?

జానకి : చాలా అసంభవంగా వుందికదూ!

వేదాం : అసంభవం యేమిటి, హాస్యాస్పదంగా వుంది.

జానకి : (ఆ మాటల్లోని నిజాన్ని పరిశీలిద్దామని తలుపుదగ్గరకు వెళ్లితోస్తుంది. తలుపు తీసే వుంది.) నేనూ అదే అనుకున్నాను (బయటకు వెళ్ళి, వచ్చి) గేటు తలుపులుకూడా తీసేవున్నయ్! రాత్రి నాకు వచ్చిన కల ఎంత అసంభవంగా వుంది.

వేదాం : కలలకు సంభవం, అసంభవం యేమిటి?... సరే! నాకూ ఓ తమాషా కలవచ్చింది.

జానకి : ఏమిటది?

వేదాం : (ఓ క్షణం సూటిగా జానకి వంకచూచి, ముఖం తిప్పుకొని) ప్రపంచానికి సంబంధం లేని ఒక యిల్లువుంది. ఆ యింట్లో తండ్రీ, కూతురూ—యిద్దరే! తండ్రి ముసలివాడు. తనపనేమో తనకు తప్ప యితరుల సంగతి పట్టించుకోడు. ఆ కూతురు చదువుకొంటున్నా, పరిస్థితులవల్ల, పెంపకంవల్ల ఒంటరిది. ఆమెకు సర్వస్వం పుస్తకాలు...అటువంటి పరిస్థితుల్లో ఆమె జీవిత ప్రాంగణంలోకి ఓ మనిషి ప్రవేశిస్తాడు (ఇంతవరకు చెప్పి, మరోసారి జానకివంక చూస్తాడు. ఆమె పాలిపోయివుంది.)...ఏమీ ఎరుగని ఆ అమాయకురాలికి, అతను స్వర్గంనుంచి

దిగివచ్చిన వాడిలా కనిపిస్తాడు. చివరకు ఆమె అతనికి ఎంత కృతజ్ఞురాలైందంటే, అంతనేం చెబితే అదే వేదమయింది ఆమెకు...అప్పుడు కాని చెప్పలేదతను తనకు పెళ్లయిన విషయం......తనకూ భార్యకూ మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుందన్నాడు. నువ్వే నాకు సర్వస్వం అన్నాడు...ఇద్దరూ కలిసి పారిపోదామన్నాడు...పాపం! పిచ్చి పిల్ల!! అన్నీ నమ్మింది. అతనితో వచ్చేసిందట! ఎంత అసంభవం?

జానకి : (అతనికంతా తెలుసునన్నమాట! తెల్లబోయిన మనిషి తెప్పరిల్లుతుంటుంది.) చాలా అసంభవంగా వుంది...సరే! కారు ఎప్పుడు వస్తుంది వేదాంతంగారూ?

వేదాం : కారా?

జానకి : అవును...మూర్తిగారి కారు.

వేదాం : అంటే, ఈ సాహసకృత్యాన్ని కొనసాగిస్తారన్నమాట!

జానకి : అవును...ఏం?

వేదాం : సరే! చాలా విచారకరమైన సంగతి... సరే! మరో యిరవై నిముషాల్లో—

జానకి : మీ మేలెన్నటికీ మరచిపోలేం.

వేదాం : ముందు మూర్తిగారు కాఫీ తీసుకోవాలి... (లేస్తూ) మరో యిరవై నిముషాల్లో!

జానకి : నేను మిమ్మల్ని మళ్లీ కలుసుకోగలనా?

వేదాం : దానికేం? మిమ్మల్నింకా భగవంతుడికి అప్పగించవలసిన భారం నామీద వుంది.

[ఆయనవైపు ఓ క్షణం చూసి వెళ్ళిపోతుంది జానకి...ఇంతలో బట్లర్ వస్తాడు.]

వేదాం : విన్నావా లోకనాథం! మీ దొరగారు దొరసానిగారు మరో యిరవై నిముషాల్లో వెళ్ళిపోతారట!

బట్లర్ : (హేళనగా) అలాగే సార్!

వేదాం : ఇంతవరకు రిహార్సల్స్ బాగానే జరిగినయ్. ఇహ నాటకం మొదలు!—నీ పాత్ర నువ్వు బాగా పోషిస్తావ్ కదూ?

బట్లర్ : మీరు చెప్పవలెనా సార్! మనకు దీన్లో టెన్ఇయర్స్ ఎక్స్‌పీరియన్సదా!

వేదాం : సరేనండ్...

[బట్లర్ వెనకాలే వేదాంతం వెళ్లిపోతాడు— ఒక క్షణం తరువాత మూర్తి వస్తాడు. నలిగిన నైట్‌డ్రెస్‌తో, దువ్వుకోని జుట్టుతో జబ్బుచేసిన మనిషిలా వుంటాడు...బల్లమీద కాఫీ కెటిల్ కనిపిస్తుంది...దగ్గరకు వచ్చి కాఫీ కప్పులో పోసుకొని ఒక గుక్కెడు తాగుతాడు...ఎవరైనా వున్నారేమో నని చుట్టూ చూసి, మరో గుక్కెడు తాగుతూ వుంటాడు]

వేదాం : హల్లో! గుడ్‌మార్నింగ్ మూర్తిగారూ!

మూర్తి : (ఉలిక్కిపడి, వెనక్కి తిరిగి, కోపంతో) ఊఁ! ఇందాకట్నుంచీ మీరిక్కడే వున్నారన్న మాట!

వేదాం : (నవ్వుతూ) లేదండీ!... ఇప్పుడే వస్తున్నాను. (కూర్చుంటూ) బాగా ఆకలయినట్టుగా వుంది. ఏం?

[మూర్తి మాట్లాడడు]

రాత్రి బాగా నిద్రపట్టిందా?

మూర్తి : నిద్రా? ఆ వెధవ రూములో మరో రోజు పడుకుంటే శాశ్వత నిద్రే పడుతుంది... అయితే నా సామా నేదయిందండీ?

వేదాం : (ఆశ్చర్యంగా) మీ సామానా?

మూర్తి : అవును...అసలు కారులోనుంచి యింట్లోనే పెట్టలేదట!

వేదాం : అయితే కారులో వుండేఉంటుంది.

మూర్తి : అక్కడ వుంటే పోయిందనుకోవడం ఎందుకండీ?

వేదాం : ఈ విషయం ఏమిటో కనుక్కుందాం... (సానుభూతిగా) మూర్తిగారూ! హనీమూన్‌కు పోతూవుండగా సామాను పోవడమంటే అపశకున మన్నమాట!...అంతే! అదృష్టవంతుల్ని చెరిచేవాళ్ళు లేరు...దురదృష్టవంతుల్ని బాగుచేసేవారు లేరు.

[ఒక్కొక్క మాట అన్నకొద్దీ మూర్తికి కోపం ఎక్కువవుతుంది...పళ్లు బిగించి ఏదో చెప్పాలని లేచేసరికి, బట్లర్ వస్తాడు. మూర్తి కుర్చీలో కూలబడతాడు.]

వేదాం : లోకనాథం మూర్తిగారి సామానట, ఏమయింది ?

బట్లర్ : ఏమయిందో కనిపించలేదని రాముడు చెప్పినాడు సార్!

వేదాం : ఆ సామాను ఆయనతో రాలేదా?

బట్లర్ : రాలేదనే రాముడు చెప్పినాడు సార్.

వేదాం : చ్చ్! ఎంత అజాగ్రత్త!...(మూర్తి వంక చూస్తూ) ఏమిటది?

మూర్తి : (చాలాసేపట్నుంచి అదే ప్రయత్నంలో వుండి హఠాత్తుగా తుమ్ముతాడు.)

వేదాం : అరె! బాగా జలుబు చేసినట్టుగా వుందే! ఈ జేబురుమాలు తీసుకోండి

మూర్తి : (తనదగ్గర లేదు కాబట్టి తీసుకోక తప్పలేదు. అందులో అది కొత్తది కూడాను.) థాంక్స్!

వేదాం : (సానుభూతిగా) పాపం! బాగా జలుబు చేసింది కాబోలు! అందువల్ల నేనా యీ నైట్ డ్రెస్ విప్పలేదు?

మూర్తి : అందుకు కాదు...వున్నది యిదే కాబట్టి!

వేదాం : (సానుభూతిగా) నిన్న మీరు వేసుకొన్న బ్రౌన్ సూటు ఏమయింది?......ఎక్కడో చూశానే! (మూర్తి తుమ్మబోతాడు.) ఎక్కడంటే — (బట్లర్ వైపుకు తిరగ్గా, అతను మూర్తిని చూపుతాడు.) ఎక్కడంటే (మూర్తి తుమ్ముతాడు.)

మూర్తి : వాడు...ఆ ఫూల్ (మళ్లీ అదే ప్రయత్నంలో ఆగిపోతాడు.)

వేదాం : (బాధగా) ఏమిటి మీర నేది?—లోకనాథం! మూర్తిగారి బ్రౌన్ సూటు ఏమయింది?

బట్లర్ : పొరపాటు సార్...అయ్యగారి లగేజి—

వేదాం : లగేజి సంగతి కాదు నే నడుగుతున్నది. ఆయన బ్రౌన్ సూటు—(మూర్తి తుమ్ముతాడు.) నే నేమనుకున్నానో తెలుసా? మూర్తిగారు ఎంత చక్కని సూటు వేసుకున్నారు? మనిషి బావుండకపోయినా ఈ సూటు వేసుకుంటే ఎవరైనా బావుంటారే!—అనుకున్నాను ... అంటే మీరు బావుండలేదని కాదండోయ్!...ఏమయిందోయ్ అది?

బట్లర్ : రాముడు చిన్న పొరపాటు చేసినాడు సార్! మూర్తిగారి కోసం అదితీసుకొస్తుంటే కిందపడి కొంచెం బురద అయిందిసార్! మళ్ళీ బాగుచేస్తున్నాడు.

వేదాం : వెధవ అజాగ్రత్త.

బట్లర్ : నిజం సార్. నే నప్పుడే కోప్పడివుంటిని.

మూర్తి : కోప్పడ్డమా? వాణ్ణి నిలుచున్న వాణ్ణి నిలుచున్నట్లుగా కాల్చెయ్యాలి.

వేదాం : బాగా చెప్పారు...లోకనాథం! వాణ్ణి నిలుచున్నపాటున కాల్చెయ్.

బట్లర్ : చిత్తం సార్.

వేదాం : ముందు మూర్తిగారి బ్రౌన్ సూటు త్వరగా వచ్చే ఏర్పాటు చూడు.

బట్లర్ : ఈసరికి అయిపోయి ఉంటుందిసార్.

వేదాం : ఎక్కడా తడి ఉండకూడదు. ఇప్పటికే మూర్తిగారికి బాగా జలుబుచేసింది.

మూర్తి : (తుమ్ముతాడు.)

వేదాం : బాగా జలుబుచేసిందే! మీకు తరుచు జలుబు చేస్తుందా ?

మూర్తి : నేను పుట్టినతర్వాత యింతవరకు జబ్బుచేసి ఎరగను.

వేదాం : విన్నావా, లోకనాథం! మూర్తిగారికి జబ్బు చెయ్యడం యిదే మొదలట!

బట్లర్ : కావచ్చుసార్! రావుగారికి, యింకా యిద్దరు ముగ్గురికికూడా ఆ గదిలో పడుకోగానే జలుబు చేసిందిసార్!

మూర్తి : వెధవగది!—

వేదాం : నాకు యిదివరకే ఎందుకు చెప్పలేదు ? ఇవ్వాళ రాత్రికి మూర్తిగారికి మరోగది ఏర్పాటు చెయ్.

బట్లర్ : తప్పకుండాసార్! (వెళ్లిపోతాడు.)

వేదాం : (సానుభూతిగా) నాకు చాలా విచారంగా వుంది—సరే! మీకు తెలుసుగా, 'జ్వరానికి కటిక ఉపోషం, జలుబుకు కడుపుకునై వేద్యం' అంటారు పెద్దలు.

[మూర్తి అర్థంకాక వేదాంతంగారివంక సీరియస్‌గా చూస్తాడు.]

# జంటపక్షులు

శ్రీ నాగభూషణ్

* గత సంచిక తరువాయి

## రంగము : 2

* * ఉదయం; హాలులో కమల, జోగారావులు కూర్చునివుంటారు. కమల అంటే రామమూర్తి భార్య; సంసారపక్షంగా వుంటుంది. కాని, జీవితంలో భర్తవల్ల పొందగల ఆనందంలో ఏ కొంచమూ పొందలేక పోవడం వల్ల నిస్పృహ చెందిన మనిషి. జోగారావు కుర్రవాడు. నిన్న మొన్ననే చదువు పూర్తి చేసుకొన్నవాడు. అనుభవం లేకపోయినా, పరిస్థితులను ఎదిరించి స్వసుఖం కోరుకునే మనిషి...... అప్పుడే టిఫిన్, కాఫీ పూర్తిచేసుకొని మూతి తుడుచుకుంటూ వుంటాడు.

కమల : మరో ఇడ్లీ కావాలా ?

జోగారావు : అక్కర్లేదు.

కమల : మరికొంచెం ఉప్మా ?

రావు : నాకు తిండిదగ్గర మొహమాటం లేదు, కమలా!

కమల : కొంచెం కాఫీ—?

రావు : (నిట్టూర్పుతో) అక్కర్లేదు కమలా! నేను కాఫీ తాగడం పూర్తయింది.

కమల : అతని కమల అతనికోసం యిచ్చినా అక్కర్లేదన్నమాట!

రావు : కావలసివుంటే తీసుకోనా ? అందులోనూ నా కమల నాకోసం చేసియిస్తానంటే!—

కమల : (రుసరుసగా) ఇహ పనేముంది? ఆ సోఫాలో మునిగిపోవడం; తన కమలకు యిష్టంవున్నా లేకపోయినా సిగరెట్ ముట్టించడం...... అతనికి కమలకంటె సిగరెట్టే యిష్టం (నవ్వి) కాదుకదూ!

రావు : అవును. (లేని నవ్వు తెప్పించుకుంటాడు.)

కమల : నువ్వు చెప్పింది నిజమైతే చేతిలో చెయ్యి వెయ్యాలి.

రావు : (చేతిలో చెయ్యివేస్తూ) మరీ చిన్నపిల్లవైపోతున్నావు కమలా!

కమల : ఇప్పుడివ్వు నీ సిగరెట్ కేసు! (దాన్ని ముద్దుపెట్టుకొని ఇందాక నీవన్నది నిజం కాదు. ...ఓ! (ఆవిడ ఒక పళ్ల పళ్లెం చూసింది.)

రావు : ఏమిటి ?

కమల : నువ్వు ఒక్క పండుకూడా తినలేదు కదూ!

రావు : పండా! కాయలతోనే కడుపునిండింది. ఇంకా పండెందుకు ?

కమల : కాదు కాదు......నువ్వొక ఆపిల్ పండు తప్పక తినాలి...తినకపోతే నీ కమల చాలా నొచ్చుకుంటుంది.

రావు : ఇంతవరకూ తిన్నదానికే కడుపులో చోటు లేక గొంతులోకి వస్తోంది. (కమల అతనివైపు జాలిగా చూస్తుంది.) లేదు కమలా! నేను టిఫిన్ తినడం ఎప్పుడో పూర్తి చేశాను.

కమల : నేను స్వయంగా యిచ్చినా అక్కర్లేదా ?

రావు : అక్కర్లేదు కమలా! మామూలుకన్నా ఎంతో ఎక్కువ తిన్నాను.

కమల : (లేస్తూ) నిజంగానా ?

రావు : నీతో అబద్ధం చెప్పగలనా?...అం! నువ్వెక్కడ కూర్చుంటావ్ ?

కమల : (సోఫావైపు చూపుతూ) నా రావు అక్కడ, నేను అతని ప్రక్కన (అతన్ని లేవదీస్తుంది)

రావు : (నిరుత్సాహంగా) అవును.

[ఇద్దరూ సోఫాలో కూర్చుంటారు]

కమల : సిగరెట్!

రావు : థాంక్స్!...(ఆమె ముట్టిస్తుంది) ఆ... కమలా! మనం యిక్కడికి వచ్చి ఓ వారం రోజు లయింది కదూ?

కమల : అవును. వారంరోజులు! ఎంత గొప్పగా గడిచినయ్! చివరకు యివ్వాళ యింత మంచి యిల్లును వదిలి వెడుతున్నాం.

రావు : (అది వినిపించుకోకుండానే) వారంరోజులు! మొదటిరోజు తప్ప మిగిలిన రోజులన్నీ మనం కలిసే కాఫీ, భోజనం తీసుకున్నాం కదూ!

కమల : (సంతోషంతో, ఆశ్చర్యంతో) అవును.

రావు : మనం ఆ టేబుల్ ముందు రోజుకు నాలుగు సార్లు కూర్చున్నాం—రెండుసార్లు కాఫీకి, రెండుసార్లు భోజనానికి—మొత్తం ఇరవై నాలుగుసార్లు!

కమల : ఇరవై నాలుగుసార్లు! నిజం?

రావు : మనం కూర్చున్న ప్రతిఒక్కసారీ "ఇంకా కొంచెం తిను, ఇంకా కొంచెం తాగు" అని కనీసం నాలుగుసార్లయినా అన్నావు నువ్వు. అంటే ఏమీ అవసరం లేకపోయినా, నన్ను రోజుకు తొంభైసార్లు, వారానికి ఏడువందల సార్లు— 'అక్కర్లేదు కమలా' అనేటట్లు చేశావ్!

కమల : (దెబ్బతిని) రావ్!

రావు : (వెనుకటిమాదిరిగానే) నాకు పాతిక్కేళ్లు. నీకు?

కమల : (ఆశగా) ఇరవైమూడు.

రావు : ఇరవైమూడు! అంతా సవ్యంగా జరిగితే, మనం యింకా యాభైఏళ్లకి తక్కువ బ్రతకం. అంటే రెండువేల అయిదువందల వారాలు...మనం కలిసివుండే ఈ రోజుల్లో 'అక్కర్లేదు కమలా' అనే మాట కనీసం పదిహేనులక్షల సార్లు నా చేత అనిపిస్తావ్!— నిజానికి ఏమీ అవసరం లేకపోయినా!

కమల : (విచారంతో) రావ్! (దుఃఖంతో ముఖం కప్పుకుంటుంది)

రావు : మనం, ఈ విషయంలో ఏదైనా సంధి కుదుర్చుకుంటే బావుంటుంది, అంతే!—

కమల : ఎంత కఠినమైన మనిషివి! (జాలిగా నిట్టూరుస్తుంది.)

రావు : (తెప్పరిల్లి) నా వుద్దేశ్యం విను కమలా! మనం యీ విషయాన్ని గురించి ఆలోచించుకుంటే బావుంటుందేమోనని—

కమల : (ఈ లోకంలోకి వస్తూ) రావ్!

[రావు ఈ విషయాన్ని ఎందుకు తెచ్చానా అని విచారిస్తున్నాడు. కమల నిట్టూర్పుల వంకకు దృష్టి పోనివ్వకూడదని ఎంత నిగ్రహించుకున్నా వీలుపడదు...అవి భరించలేనివి]

రావు : (ఆమెను దగ్గరకు తీసుకొంటూ) ఊరుకో కమలా! నాది పొరపాటే!... (ఇంకా నిట్టూర్పుల వేగం తగ్గదు.) నా కమలే నన్ను క్షమించకపోతే నన్నీలోకంలో మరెవరు క్షమిస్తారు, చెప్పు?

కమల : (నిట్టూర్పులమధ్య) నేను నిన్నెంతో ప్రేమిస్తున్నాను కాబట్టే, నిన్నాపండ్లు తినమన్నాను.

రావు : నిజం...నిజమే కమలా! నేనంటే నీకెంత యిష్టమో నాకు తెలియదా?

కమల : ఏ డాక్టరునైనా అడుగు. నువ్వాపళ్లు తినాలనే అంటాడు.

రావు : అవును.

కమల : అందువల్లనే నువ్వు తినాలి.

రావు : అవును కమలా! (మళ్లీ కమలను ఎదిరించడం ఈ జన్మలో చేతకాదు రావుకు.)

కమల : (కళ్లు తుడుచుకుంటూ) భర్తకు వంట్లో బాగుండకపోతే, జాగ్రత్తగా చూడడానికి, అతను తినకపోతే తినేటట్లు చెయ్యడానికి కాకపోతే, భార్య ఎందుకు?

రావు : అవును...అందుకే—

కమల : మనం యిక్కడకు వచ్చిన మర్నాడే నీకంత జలుబు చేస్తే, నిన్ను జాగ్రత్తగా చూసుకొని, మళ్లీ కులాసాగా వుండేటట్లు చేశానా, లేదా ?

రావు : నువ్వు చాలా దయగలదానివి కమలా !

కమల : దయేమీ లేదు......నిన్ను జాగ్రత్తగా కాపాడుకోవడం నాకుచాలా యిష్టం. అందులోనూ జబ్బుపడ్డవాళ్లకు సేవ చెయ్యడమంటే నా కెంతో యిష్టం. మూర్తి ఒక్కసారి కూడా జబ్బుపడలేదు.

రావు : మూర్తి—?

కమల : మా ఆయన.

రావు : అతని పేరు మూర్తా ?...సరే ! నేనతన్ని ఎరుగను కాబట్టి అతన్ని గురించి నేనేమీ మాట్లాడదలుచుకోలేదు.

కమల : నిజమే రావ్ ! నేనుకూడా అంతే !

రావు : మనం యింటినుంచి పారిపోయివస్తున్నాం. మళ్ళీ తిరిగి వెళ్లంకదూ ?

కమల : (ఆశ్చర్యంతో) రావ్ !

రావు : చూడు కమలా ! మనం చాలాదూరం వచ్చాం కదూ ?

కమల : అదేమిటి రావ్ ? నువ్వు పశ్చాత్తాప పడుతున్నావా ?

రావు : (త్వరగా) లేదు, లేదు......(ఆవిడ మళ్ళీ నిట్టూర్పులు మొదలుపెడుతుంది) లేదు కమలా, లేదు నేనునిన్ను యింతగా ప్రేమిస్తున్నప్పుడు పశ్చాత్తాపం ఎందుకు ! నేను ఇప్పుడున్నంత హాయిగా యిదివరకెప్పుడూ లేను.

కమల : (అతనికి దగ్గరగా జరిగి) రావ్ ! ఎంత భయపెట్టావ్ ! నువ్వు నిజంగా పశ్చాత్తాపపడుతున్నావనుకున్నాను.

రావు : పశ్చాత్తాపం ఎందుకు ? నేను చాలా హాయిగా వున్నాను.

కమల : వేదాంతంగారు ఎంత నిజం చెప్పారు.

రావు : అవును. చాలా నిజంచెప్పారు.

కమల : నీతో రమ్మని నువ్వడిగినప్పుడు, మన కొకళ్ళనుగురించి ఒకళ్లకు ఎంత తక్కువగా తెలుసు ?

రావు : అవును. చాలా తక్కువ తెలుసు.

కమల : ఈ వారం రోజులలో మనం ఒకళ్లనుగురించి ఒకళ్లం ఎంత తెలుసుకున్నాం ?

రావు : అవును ఎంత తెలుసుకున్నాం ?

కమల : ఇప్పుడు నాకేమీ భయంలేదు...మనం యిద్దరం కలిసి ప్రపంచం ఎదురై నిలిచినా జయించగలం యిప్పుడు.

రావు : అవును.

[పాపం ! రాజా చేసిన పాపం యింకా పరిహారం కాలేదు. కుడిచేతిలో సిగరెట్ వుంది. అదే చెయ్యి కమల నడుముచుట్టూవుంది. సిగరెట్ నోట్లో పెట్టుకోడానికి చేసే ప్రయత్నాల్లో రెండు మూడుసార్లు ఆమెను దగ్గరకు లాక్కోవలసి వస్తుంది. ఆమె ఆ ఆనందంలో మైమరచి కళ్లుమూసుకొని వుంటుంది. నాలుగో ప్రయత్నంలో విజయుడైన రావు, సిగరెట్ నోట్లో పెట్టుకొని ఒక దీర్ఘ నిశ్వాసం విడుస్తాడు......ఇంతలో వేదాంతంగారు వస్తాడు.]

వేదాంతం : నమస్తే ! (వాళ్లు దూరంగా జరుగుతారు)

రావు : నమస్తే !

వేదాం : ఆఁ! ఇవ్వాళ మీరు యిల్లు వదిలిపెడుతున్నారన్నమాట !

రావు : (ఉత్సాహం ఏమీ లేకుండా) అవును.

కమల : కాని ఇక్కడ గడిపిన ఈ వారంరోజుల్ని మాత్రం మేం జీవితంలో మరచిపోలేం వేదాంతంగారూ !

వేదాం : కొన్నాళ్లపాటు మిమ్మల్ని యిక్కడ వుండమన్నందుకు నన్నిప్పటికి క్షమించారన్న మాట మీరు.

కమల : (సిగ్గుపడుతూ) అవును...కాని మీరు చాలా నిజం చెప్పారు...ఆ విషయం ఇంతకు ముందే రావుతో చెప్పాను. ఏం రావ్ ?

రావు : అవును....ఒక్క నిముషం క్రిందటే!...... (గడియారం చూసుకొని) కాదు. రెండు నిముషాల క్రిందట.

వేదాం : మీ కే విషయంలోనూ పొరపులు, పొట్లా టలూ లేవుకదూ ?

కమల : ఒక్క విషయంలోకూడా లేవు...అవునా రావ్ ?

రావు : అవును.

వేదాం : ఇంకేం...చాలా సంతోషం. (గడియారం చూసుకుంటూ) మిమ్మల్ని తొందర చెయ్యను...మీ పనులన్నీ పూర్తిచేసు కోండి....కారు మరో అరగంటలో వస్తుంది.

కమల : అరె! అరగంటలోనా! నేను త్వరగా వెళ్లాలి. (అంటూ రావువంక చూస్తుంది)

రావు : (కదలకుండా) అవును. మనం త్వరగా వెళ్లాలి.

[కమల లేస్తుంది.]

వేదాం : (కమలతో కొంచెం ముందుకువెళ్లి) అన్నట్లు, చూడండి కమలాదేవీ! రాత్రి యిక్కడకు మరో యిద్దరు అతిథులు వచ్చారు.

కమల : (ఆగి, ఆసక్తితో) అంటే—మరో ప్రేమి కుల జంట—

వేదాం : అవును మరో జంట—

కమల : మేం వెళ్లేముందు ఒక్కక్షణం వాళ్లిను కలుసు కుంటే బావుండును. ఇక్కడ గడిపే వారం రోజులూ ఎంత హాయిగా, గడపవచ్చునో చెబుతాను.

వేదాం : దానికేం? మీరు తప్పకుండా కలుసు కొందురుగాని.

కమల : సరే, వస్తాను. (కమల వెడుతుంది.)

రావు : చూడండీ ?

వేదాం : ఏమిటీ ?

రావు : చూడండి......మీరన్నది...... నిజంగా, ఇప్పుడే—(గడియారం చూసుకొని, విచా రంగా) అరగంట!—సరే నేనూ తయారు కావాలి. (బయలుదేరుతాడు.)

వేదాం : రావ్ గారూ!

రావు : (వెడుతున్నవాడు ఆగి) ఆఁ!

వేదాం : ఒక్కమాట! (రావు వెనక్కి తిరిగి వస్తాడు) (బుజంతడుతూ) హుషారుగా వుండాలండీ! అసలిటువంటిసమయంలో సంతోషంతో డాన్సు చెయ్యాలి.

రావు : (నిస్సారంగా) సంతోషమా ?

[వేదాంతం నవ్వుతాడు.]

సరే! నేను సామాను సర్దుకోవాలి.

[వెళ్లిపోతున్న రావుకు బట్లర్ ఎదురు వస్తాడు. నిరుత్సాహంగావున్న రావును చూచి వేదాంతం, బట్లర్ యిద్దరూ నవ్వు కుంటారు.]

బట్లర్ : గుడ్ మార్నింగ్ సర్ !

వేదాం : మార్నింగ్...ఈ వుదయం ఎంత గొప్పగా వుందో చూశావా ?

బట్లర్ : చూడకేమిసార్! (కొంచెంసేపు ఆలోచించి) చూడలేదు సార్ !

వేదాం : చూడలేదా! ఐతే కొంచెంసేపు ఆగు. ఎంత గొప్పగావుందో కనిపిస్తుంది...ప్రపంచం అంటే, నాకిప్పుడు ఆశ కలుగుతోంది.

బట్లర్ : నిండా నిజంసార్ !

వేదాం : మనం చెయ్యగలిగినదంతా చెయ్యాలి....... తెలిసిందా ?

బట్లర్ : దానికేమిసార్ ! మస్తుచేస్తును (పేపర్ యిస్తాడు.)

వేదాం : ఏమిటిది ?

బట్లర్ : ఇవ్వాల్టి పేపరు సర్ !

వేదాం : చూడు !...దీనిలో ఎన్ని కొత్తజంటలు వున్నయ్యో? (లెక్కపెడుతూ) ఒకటి, రెండు, మూడు...పది!—పది జంటలు! పాత పురాణాలు చెప్పినట్లు జీవితాంతం సుఖపడదలచుకున్నవాళ్లు యిరవైమంది... అన్నట్టు, మీ దొరగారేమంటున్నాడు ?

బట్లర్ : నిండా విచారంలో వున్నారుసార్ !

వేదాం : విచారమా ?...ఎందుకు ?

బట్లర్ : ఆయన సామాను ఎక్కడో పోయింది సార్!

వేదాం : అంటే, అది ఆయనతో రాలేదా ?

బట్లర్ : వచ్చినట్టు లేదు సార్ !

వేదాం : ఎంత అజాగ్రత్త? ఆయనకు మనం ఏమీ సహాయం చెయ్యలేమా ?

బట్లర్ : లుంగీ, అద్దం, దువ్వెన, అన్నీ యిస్తున్నాడు సార్ మన లింగరాజు ! మూర్తిగారు నల్ల ఒప్పుకోలేదు సార్ !

వేదాం : లింగరాజు సంగతి నాకు తెలియదా! చాలా మంచివాడు.

బట్లర్ : క్రైమ్ కు మన యింట్లోకూడా ప్లేసులు నిండా అయిపోయాయి సార్!......ఇన్ని చూచి అయ్యగారు డౌన్ అయిపోయారు సార్!

వేదాం : మళ్లీ లేచి మామూలు మనిషి కావడానికి ఏం చెయ్యాలంటావ్ ?

బట్లర్ : కడుపునిండా టిఫిన్ తింటే సరి సార్!

వేదాం : నీ సలహా అద్భుతంగావుంది...అది మూర్తి గారికి స్వయంగా అందచెయ్.

[ఇంతలో జానకి వస్తుంది...మూర్తిమీద ఆశ చాలా కొద్దిగావుంది...ఈ గది చూచి చాలా ఆశ్చర్యపడుతుంది]

వేదాం : ఓ! నమస్తే జానకీ దేవీ ! రాత్రి బాగా నిద్రపట్టిందా ?

జానకి : మీ గదులు చాలా బావున్నాయండి.

వేదాం : థాంక్స్.

బట్లర్ : టిఫిన్ తెస్తును సార్. (వెళ్ళిపోతాడు.)

వేదాం : మీరు కాఫీ తాగుతారా? పాలా?

జానకి : ఏవయితే యేంకాని, రాం యేడీ?

వేదాం : రాం? ఎందుకు?

జానకి : ఇవ్వాళ మొదటిసారిగా అతనితో కలిసి కాఫీ తాగుదామనుకున్నాను—ప్రాక్టీస్ కోసం—అతనితో కొన్ని సంగతులు చెప్పాలి.

వేదాం : (నవ్వుతూ) పోనీ, అవి నాతోనే చెప్పండి.

జానకి : (కూర్చుంటూ) అవి భార్యాభర్తలు ఏకాంతంగా చెప్పుకోవలసినవి.

వేదాం : ప్రాక్టీస్ కోసమే కదా ! ఇట్లా చెప్పినా ప్రాక్టీసే !

జానకి : సరే !

వేదాం : థాంక్స్..... (ఇంతలో మూర్తిగా మారి పోయి) ఆఁ! నీకేంకావాలి జానీ? ఇడ్లీ, సాంబార్, పూరీ పొటాటో, అట్టూ, పంచదార, బోండా పచ్చి, —అన్నీ ద్వంద్వాలమీద నడుస్తున్నయ్.

జానకి : అప్పుడే మరచిపోయ్యావా?

వేదాం : లేదు, లేదు....ఉప్మా.

[బట్లర్ రెండు ప్లేట్లతో ఉప్మా తెచ్చి అక్కడ పెడతాడు.]

జానకి : (ఉప్మా తిని) కాఫీనా, టీనా రాం?

వేదాం : నేను కాఫీ తప్ప మరొకటి తాగనని నీకు తెలియదా, జానీ !

జానకి : మరచిపోయాను. (బట్లర్ కాఫీ తెస్తాడు)

వేదాం : (తాగుతూ) కాఫీ చాలా బావుంది ప్రేయసీ! అరె! నాటకాల్లో భాష వస్తోందే! ఎలావుంది?

జానకి : బాగానేవుంది.

వేదాం : ఇంతకుముందే పేపర్లో ఓ భయంకరమైన వార్త చూశాను రాణీ...రాణీ!...అదెలా వుంది !

జానకి : నిజంగా జీవితంలో వుపయోగించవలసిన భాష అది...నువ్వు ఇంతవరకు పెళ్ళి చేసుకోలేదు కదూ, రాం.

వేదాం : ఇంతవరకు ఒకే ఒక్కసారి చేసుకున్నాను కమలని...కమల నీకు తెలియదా, జానీ?

జానకి : జ్ఞాపకంలేదు...నేను మిమ్మల్ని నిజంగానే 'రాం' అనుకున్నాను.

వేదాం : నన్ను గురించి ఇంత మంచిగా ఎవరు మాట్లాడతారు.

జానకి : మీవంటివాళ్ళను నేనెక్కడా చూడలేదు.

వేదాం : (మళ్లీ మూర్తయిపోయి) అరె! సరిగ్గా కమల కూడా అట్లానే అనేది...సరె! కమలకు వ్యతిరేకంగా నేనేమీ చెప్పదలుచుకోలేదు.

జానకి : రాం! మన సంభాషణలోకి నీ భార్య ప్రసక్తి తీసుకురావడం నాకు బావుండదు.

వేదాం : నాకూ అంతే!...సరే! అసలు సంగతి చెప్పలేదు—నిన్న గుర్రపు పందాలలో మన గుర్రాలన్నీ ఓడిపోయినయ్

జానకి : అయ్యో!

వేదాం : నేను సర్వస్వం ఓడిన గుర్రపు రాజు నైపోయాను...ఇక నేనేదైనా వుద్యోగం చెయ్యాలి, జానీ!

జానకి : నువ్వేవుద్యోగం చెయ్యాలో చెప్పనా? (చెప్పమన్నట్లు చూస్తాడు.) నువ్వు కేంద్ర ప్రభుత్వంలో మంత్రివై పెద్ద పెద్ద వుపన్యాసాలివ్వాలి.

వేదాం : నన్నెందుకూ పనికిమాలినవాడికింద కట్టావన్నమాట!

జానకి : ఏం?

వేదాం : జీవితంలో దేనికీ పనికిరానివాడు రాజకీయాల్లో చేరతాడంటారు. అందులోనూ మంత్రి కావడానికి మరీ......

జానకి : ఏమో! నాకుమాత్రం నువ్వదే కావాలి.

వేదాం : అయితే సరే! నువ్వేది కావాలంటే నేనదే అవుతాను.

జానకి : ఎంత చిలిపిగా మాట్లాడుతావ్!...కొంచెం కాఫీ కావాలా?

వేదాం : నువ్వు యిస్తానంటే వద్దంటానా? ... మన కీమాటలతో జీవితాంతం గడుస్తుందనే నీ వుద్దేశ్యమా?

జానకి : ఏం? ఎందుకు గడవదు?

వేదాం : పాడిందే పాడుతూ, జీవితమంతా,—సరే! కాఫీ తాగేటప్పుడీమాట లెందుకు? కులాసా కోసం రాత్రి నీకు వచ్చిన కల ఒకటి చెప్పు.

జానకి : (ఆలోచించి) రాత్రి నాకు చాలా తమాషా కల వచ్చింది.

వేదాం : (ఆసక్తితో) ఏమిటది, జానీ?

జానకి : ఒక రాత్రి మనం పారిపోతున్నాంట! మధ్యలో దారితప్పి, ఒక యిల్లు చూసి హోటలనుకొని అక్కడకు వచ్చాం. కాని అది హోటలు కాదు......వేదాంతం అనే తమాషా మనిషి వున్న తమాషా యిల్లది

వేదాం : చాలా తమాషాగావుందే! వేదాంతం ఎవరు? ఈ భూప్రపంచంలో ఆయన పేరెక్కడా వినలేదే!

జానకి : ఆయన మనల్ని బందీలన్నాడు. ఆ యింటి తలుపులన్నీ తాళాలువేసి మనం బయటకు కదలకూడదన్నాడు......ఒక వారం మనం అక్కడే వుండి, ముందు ముందు సుఖంగా వుండగలమో లేదో ప్రయత్నం చేసి చూడమన్నాడు......ఆ వారం తర్వాత మనం వెళ్ళొచ్చుట!

వేదాం : ఎంత అసంభవంగా వుంది! సర్వస్వతంత్ర భారతదేశంలో గౌరవనీయులైన మనుష్యుల్ని బందీలుగా వుంచడానికి ఆ వేదాంతంగారికి హక్కెక్కడుంది?

జానకి : చాలా అసంభవంగా వుందికదూ!

వేదాం : అసంభవం యేమిటి, హాస్యాస్పదంగా వుంది.

జానకి : (ఆ మాటల్లోని నిజాన్ని పరిశీలిద్దామని తలుపుదగ్గరకు వెళ్ళితోస్తుంది. తలుపు తీసే వుంది.) నేనూ అదే అనుకున్నాను (బయటకువెళ్ళి, వచ్చి) గేటు తలుపులుకూడా తీసేవున్నయ్! రాత్రి నాకు వచ్చిన కల ఎంత అసంభవంగా వుంది.

వేదాం : కలలకు సంభవం, అసంభవం యేమిటి?... సరే! నాకూ ఓ తమాషా కలవచ్చింది.

జానకి : ఏమిటది?

వేదాం : (ఓ క్షణం సూటిగా జానకి వంకచూచి, ముఖం తిప్పుకొని) ప్రపంచానికి సంబంధం లేని ఒక యిల్లువుంది. ఆ యింట్లో తండ్రీ, కూతురూ—యిద్దరే! తండ్రి ముసలివాడు. తనపనేమో తనకు తప్ప యితరుల సంగతి పట్టించుకోడు. ఆ కూతురు చదువుకొంటున్నా, పరిస్థితులవల్ల, పెంపకంవల్ల ఒంటరిది. ఆమెకు సర్వస్వం పుస్తకాలు...అటువంటి పరిస్థితుల్లో అవిడ జీవిత ప్రాంగణంలోకి ఓ మనిషి ప్రవేశిస్తాడు (ఇంతవరకు చెప్పి, మరోసారి జానకివంక చూస్తాడు. ఆమె పాలిపోయివుంది.)...ఏమీ ఎరుగని ఆ అమాయకురాలికి, అతను స్వర్గంనుంచి

దిగివచ్చిన వాడిలా కనిపిస్తాడు. చివరకు ఆమె అతనికి ఎంత కృతజ్ఞురాలైందంటే, అంతనేం చెబితే అదే వేదమయింది ఆమెకు... అప్పుడు కాని చెప్పలేదతను తనకు పెళ్ళయిన విషయం......తనకూ భార్యకూ నువ్వు పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుందన్నాడు. నువ్వేనాకు సర్వస్వం అన్నాడు...ఇద్దరూ కలిసి పారిపోదామన్నాడు...పాపం! పిచ్చిపిల్ల!! అన్నీ నమ్మింది. అతనితో వచ్చేసిందట! ఎంత అసంభవం?

జానకి : (అతనికంతా తెలుసునన్నమాట! తెల్లబోయిన మనిషి తెప్పరిల్లుకుంటుంది.) చాలా అసంభవంగా వుంది...సరే! కారు ఎప్పుడు వస్తుంది వేదాంతంగారూ?

వేదాం : కారా?

జానకి : అవును...మూర్తిగారి కారు.

వేదాం : అంటే, ఈ సాహసకృత్యాన్ని కొనసాగిస్తారన్నమాట!

జానకి : అవును...ఏం?

వేదాం : సరే! చాలా విచారకరమైన సంగతి... సరే! మరో యిరవై నిముషాల్లో—

జానకి : మీ మేలెన్నటికీ మరచిపోలేం.

వేదాం : ముందు మూర్తిగారు కాఫీ తీసుకోవాలి... (లేస్తూ) మరో యిరవైనిముషాల్లో!

జానకి : నేను మిమ్మల్ని మళ్ళీ కలుసుకోగలనా?

వేదాం : దానికేం? మిమ్మల్నింకా భగవంతుడికి అప్పగించవలసిన భారం నామీద వుంది.

[ఆయనవైపు ఓ క్షణం చూసి వెళ్ళిపోతుంది జానకి...ఇంతలో బట్లర్ వస్తాడు.]

వేదాం : విన్నావా లోకనాథం! మీ దొరగారు దొరసానిగారు మరో యిరవైనిముషాల్లో వెళ్ళిపోతారట!

బట్లర్ : (హేళనగా) అలాగే సార్!

వేదాం : ఇంతవరకు రిహార్సల్స్ బాగానే జరిగినయ్. ఇహ నాటకం మొదలు!—నీ పాత్ర నువ్వు బాగా పోషిస్తావ్ కదూ?

బట్లర్ : మీరు చెప్పవలెనా సార్! మనకు దీన్లో టెన్ఇయర్స్ ఎక్స్‌పీరియన్స్‌దా!

వేదాం : వెరీగుడ్...

[బట్లర్ వెనకాలే వేదాంతం వెళ్ళిపోతాడు — ఒక క్షణం తరువాత మూర్తి వస్తాడు. నలిగిన నైట్‌డ్రెస్‌తో, దువ్వుకోని జుట్టుతో జబ్బుచేసిన మనిషిలా వుంటాడు...బల్లమీద కాఫీ కెటిల్ కనిపిస్తుంది...దగ్గరకు వచ్చి కాఫీ కప్పులో పోసుకొని ఒక గుక్కెడు తాగుతాడు...ఎవరైనా వున్నారేమో నని చుట్టూ చూసి, మరో గుక్కెడు తాగుతూ వుంటాడు.]

వేదాం : హల్లో! గుడ్‌మార్నింగ్ మూర్తిగారూ!

మూర్తి : (ఉలిక్కిపడి, వెనక్కు తిరిగి, కోపంతో) ఉఁ! ఇందాకట్నుంచీ మీ రిక్కడే వున్నారన్న మాట!

వేదాం : (నవ్వుతూ) లేదండీ!... ఇప్పుడే వస్తున్నాను. (కూర్చుంటూ) బాగా అలసినట్టుగా వుంది. ఏం?

[మూర్తి మాట్లాడడు]

రాత్రి బాగా నిద్రపట్టిందా?

మూర్తి : నిద్రా? ఆ వెధవ రూముల్లో మరో రోజు పడుకుంటే శాశ్వత నిద్రే పడుతుంది... అయితే నా సామానేమయిందండీ?

వేదాం : (ఆశ్చర్యంగా) మీ సామానా?

మూర్తి : అవును...అసలు కారులోనుంచి యింట్లోనే పెట్టలేదట!

వేదాం : అయితే కారులో వుండే వుంటుంది.

మూర్తి : అక్కడ వుంటే పోయిందనుకోవడం ఎందుకండీ?

వేదాం : ఈ విషయం ఏమిటో కనుక్కుందాం... (సానుభూతిగా) మూర్తిగారూ! హనీమూన్‌కు పోతూవుండగా సామాను పోవడమంటే అపశకునమన్నమాట!...అంతే! అదృష్టవంతుల్ని చెరిచేవాళ్ళు లేరు...దురదృష్టవంతుల్ని బాగుచేసేవారు లేరు.

[ఒక్కొక్క మాట అన్నకొద్దీ మూర్తికి కోపం ఎక్కువవుతుంది...పళ్ళు బిగించి ఏదో చెప్పాలని లేచేసరికి, బట్లర్ వస్తాడు. మూర్తి కుర్చీలో కూలబడతాడు.]

వేదాం : లోకనాథం మూర్తిగారి సామానట, ఏమయింది?

బట్లర్ : ఏమయిందో కలిపించలేదని రాముడు చెప్పినాడు సార్!

వేదాం : ఆ సామాను ఆయనతో రాలేదా?

బట్లర్ : రాలేదనే రాముడు చెప్పినాడు సార్.

వేదాం : చ్ఛ్! ఎంత అజాగ్రత్త!...(మూర్తి వంక చూస్తూ) ఏమిటది?

మూర్తి : (చాలా సేపట్నుంచి అదే ప్రయత్నంలో వుండి హఠాత్తుగా తుమ్ముతాడు.)

వేదాం : అరె! బాగా జలుబు చేసినట్టుగా వుందే! ఈ జేబురుమాలు తీసుకోండి

మూర్తి : (తనదగ్గర లేదు కాబట్టి తీసుకోక తప్పలేదు. అందులో అది కొత్తది కూడాను.) థాంక్స్!

వేదాం : (సానుభూతిగా) పాపం! బాగా జలుబు చేసింది కాబోలు! అందువల్ల నేనా యీ నైట్ డ్రెస్ విప్పలేదు?

మూర్తి : అందుకు కాదు...వున్నది యిదే కాబట్టి!

వేదాం : (సానుభూతిగా) నిన్న మీరు వేసుకొన్న బ్రౌన్‌సూటు ఏమయింది?......ఎక్కడో చూశానే! (మూర్తి తుమ్మబోతాడు.) ఎక్కడంటే — (బట్లర్ వైపుకు తిరగ్గా, అతను మూర్తిని చూపుతాడు.) ఎక్కడంటే (మూర్తి తుమ్ముతాడు.)

మూర్తి : వాడు...ఆ ఫూల్ (మళ్లీ అదే ప్రయత్నంలో ఆగిపోతాడు.)

వేదాం : (బాధగా) ఏమిటి మీర నేది?—లోకనాథం! మూర్తిగారి బ్రౌన్‌సూటు ఏమయింది?

బట్లర్ : పొరపాటు సార్...అయ్యగారి లగేజీ—

వేదాం : లగేజి సంగతి కాదు నే నడుగుతున్నది. ఆయన బ్రౌన్ సూటు—(మూర్తి తుమ్ముతాడు.) నే నేమనుకున్నానో తెలుసా? మూర్తిగారు ఎంత చక్కని సూటు వేసుకున్నారు? మనిషి బావుండకపోయినా ఈ సూటు వేసుకుంటే ఎవరైనా బావుంటారే!—అనుకున్నాను ... అంటే మీరు బావుండలేదని కాదండోయ్!...ఏమయిందోయ్ అది?

బట్లర్ : రాముడు చిన్న పొరపాటు చేసినాడు సార్! మూర్తిగారి కోసం అది తీసుకొస్తుంటే కిందపడి కొంచెం బురద అయిందిసార్! మళ్ళీ బాగుచేస్తున్నాడు.

వేదాం : వెధవ అజాగ్రత్త.

బట్లర్ : నిజం సార్. నే నప్పుడే కోప్పడివుంటిని.

మూర్తి : కోప్పడ్డమా? వాణ్ణి నిలుచున్న వాణ్ణి నిలుచున్నట్లుగా కాల్చెయ్యాలి.

వేదాం : బాగా చెప్పారు...లోకనాథం! వాణ్ణి నిలుచున్నపాటున కాల్చెయ్.

బట్లర్ : చిత్తం సార్.

వేదాం : ముందు మూర్తిగారి బ్రౌన్‌సూటు త్వరగా వచ్చే ఏర్పాటు చూడు.

బట్లర్ : ఈసరికి అయిపోయి ఉంటుందిసార్.

వేదాం : ఎక్కడా తడి ఉండకూడదు. ఇప్పటికే మూర్తిగారికి బాగా జలుబుచేసింది.

మూర్తి : (తుమ్ముతాడు.)

వేదాం : బాగా జలుబుచేసిందే! మీకు తరుచు జలుబు చేస్తుందా?

మూర్తి : నేను పుట్టినతర్వాత యింతవరకు జబ్బుచేసి ఎరగను.

వేదాం : విన్నావా, లోకనాథం! మూర్తిగారికి జబ్బు చెయ్యడం యిదే మొదలట!

బట్లర్ : కావచ్చుసార్! రావుగారికి, యింకా యిద్దరు ముగ్గురికికూడా ఆ గదిలో పడుకోగానే జలుబు చేసిందిసార్!

మూర్తి : వెధవగది!—

వేదాం : నాకు యిదివరకే ఎందుకు చెప్పలేదు? ఇవ్వాళ రాత్రికి మూర్తిగారికి మరోగది ఏర్పాటు చెయ్.

బట్లర్ : తప్పకుండా సార్! (వెళ్లిపోతాడు.)

వేదాం : (సానుభూతిగా) నాకు చాలా విచారంగా వుంది—సరే! మీకు తెలుసుగా, 'జ్వరానికి కటిక ఉపోషం, జలుబుకు కడుపుకు నై వేద్యం' అంటారు పెద్దలు.

[మూర్తి అర్థంకాక వేదాంతంగారివంక సీరియస్‌గా చూస్తాడు.]

వేదాం : అందువల్ల మీరు కడుపునిండా తినాలి.

[బట్లర్ ఉప్మా, కాఫీ తెచ్చి బల్లమీద వుంచి వెడతాడు. మూర్తి ప్లేటు తరువాత ప్లేటు తింటూ వుండగా]

ఓ! మీరివ్వాళ గడ్డం చేసుకోవాలి కదూ! మరచిపోయాను! మీ షేవింగ్ సెట్ కూడా పోయిందికదూ!

మూర్తి : థ్రూట్స్—

వేదాం : సరే! ఆపదలో ఒకళ్లకొకళ్లం సహాయం చేసుకోకపోతే ఎలా? నా రేజర్ యిస్తా లెండి.

మూర్తి : తప్పకుండా—

వేదాం : మీరు తింటూవుండండి ...... ఈలోగా నే తెస్తాను.

[వెళ్లిపోతాడు. తింటూవుండగా జానకి వస్తుంది]

మూర్తి : హల్లో! రా, జానీ, రా!

[అని లేవబోతాడు.]

జానకి : ముందు నీ టిఫిన్ కానీ!

మూర్తి : (తుమ్మడానికి అట్టహాసం చేస్తూవుంటాడు)

జానకి : ఏమిటది?

మూర్తి : బాగా జలుబుచేసింది...నాకు జీవితంలో జబ్బుచెయ్యడం ఇదే మొదటిసారి...దీనికి మందేమిటో తెలుసా? — కడుపు నిండా తినడం—(తింటూవుంటాడు)

జానకి : నాకు జలుబునుగురించి నిజానికి ఎక్కువగా తెలియదు. అయినా జాగ్రత్తగా తిను.

మూర్తి : థాంక్స్...మరి నువ్వు?

జానకి : నేను కాఫీ తీసుకున్నాను.

మూర్తి : గుడ్...(అలా తింటూ నేవుంటాడు)

జానకి : రాం! (ఒకసారి ఆమెవంక చూచి మళ్లా తినడం మొదలు పెడతాడు) రాం! నావంక ఒకసారి చూడు. నీతో మాట్లాడాలి

మూర్తి : (ఇంకా తింటూ నే) ఒకసారేమిటి? వంద సార్లు చూస్తాను.

జానకి : నువ్వు జాగ్రత్తగా వినాలి...ఆ తిండి ఇకనైనా మానుదూ!

మూర్తి : సారీ!...(మూర్తి ముక్కు బిగపడతాడు, తుమ్మురాకుండా) చెప్పు...

జానకి : మరో పావుగంటలో మనకారు ఇక్కడకు వస్తుంది.

మూర్తి : ఎవరిది?

జానకి : మనదే!...ఇంకా బాగా చెప్పాలంటే, నీది!

మూర్తి . సరే...ఎందుకు అని?

జానకి : (ఓర్పుతో) నువ్వూ నేనూకలిసి ప్రయాణం చేస్తున్నాం, రాం...బహుశః ఆ సంగతి తిండి అడుగునపడి మరచిపోయినట్లున్నావ్! కారుమీద వరంగల్ వెడతాం ... అక్కడ నుంచి రైలుమీద హైదరాబాదు...నువ్వు కాఫీ తాగినవెంటనే—

మూర్తి : మరి వేదాంతంగారు?

జానకి : మనమిద్దరమే రాం, వెడుతున్నది.

మూర్తి : అదేమిటి జానీ! నువ్వప్పుడే మరచిపోయావా యేమిటి, వేదాంతం గారు మనల్ని యింట్లో వుంచి తాళాలు బిగించడం?

జానకి : కలలు కనకు రాం. మరో పావుగంటలో కారు వస్తుంది.

మూర్తి : కారు వస్తుందా?

జానకి : ఎందుకు రాదు? అది నీ కారు......ఇది స్వతంత్ర దేశం......అందులో ఇరవయ్యో శతాబ్దం...దారి తప్పడంవల్ల రాత్రిఇక్కడ వున్నాం......ఈ పూట మనదోవన మనం పోతాం.

మూర్తి : కాని, రాత్రి వేదాంతంగారు అంత అసంభవంగా మాట్లాడారు కదా?

జానకి : దానిసంగతి అలా వుంచు...త్వరగా కానీ! ఇంకా నువ్వు గడ్డం చేసుకోవాలి...గుడ్డలు వేసుకోవాలి...(ప్రేమతో) కొంచెం కాఫీ కావాలా?

మూర్తి : (జానకి పోసిన కాఫీ తాగుతూ) కాని నేను ఈ గుడ్డల్తో ఎలా-వస్తాను?

జానకి : నేను చెప్పేదీ అదే!

మూర్తి : అది కాదు జానీ!...నా సామాను పోయింది. అదీకాక ఇంత జలుబుతో మళ్ళీప్రయాణం.

జానకి : (నిస్పృహతో) స్!...అడుగడుగునా ఈ హంసపాదు లేమిటి? తీరా బయలుదేరే సమయానికి నీ సామాను పోగొట్టుకున్నావా?

మూర్తి : నేను పోగొట్టుకోలేదు. అదేపోయింది.

జానకి : (కోపంగా) సామాను పోగొట్టుకున్నావ్... జలుబు పట్టించుకున్నావ్...

మూర్తి : నేను పట్టించుకోలేదే! అదే పట్టుకుంది.

జానకి : అయితే ఇప్పుడేంచేద్దామని?

మూర్తి : నా సామాను కనిపించగానే—ఈ జలుబు కొంచెం తగ్గితే—

జానకి : అంతవరకు ఈ వేదాంతంగారి ఆతిథ్యం స్వీకరిస్తా వన్నమాట!

మూర్తి : అదీ దౌర్జన్యం, నిర్బంధంవల్లనే—మనం యిక్కడ తీసుకున్న ప్రతిదీ జ్ఞాపకం వుంచుకొని—

జానకి : ఇది నువ్వు మూడోసారి కాఫీతాగడం! జ్ఞాపకం వుంచుకో.

మూర్తి : అవునవును......

జానకి : నేను పొద్దున ఉప్మా, కాఫీ—రాత్రి మన టిఫిన్—ఇవన్నీ జ్ఞాపకం వుంచుకోవడానికి ఒక పుస్తకంలో రాసి వుంచుకోండి.

మూర్తి : చూడు జానీ!

జానకి : ముందు కాఫీ తాగు

మూర్తి : అంత కోప్పడితే ఎలా జానీ? నాకు తొడుక్కోవడానికి ఒక జత గుడ్డలన్నా లేంది, వెళ్లడం ఎలా?

జానకి : అంటే, నువ్వు తొడుక్కున్నవికూడా పోయాయంటావ్?

మూర్తి : అది నా తప్పుకాదు, జానీ!...వాడెవరు... వాడు,...వాడి పేరు జ్ఞాపకం రావడంలేదే!

జానకి : అరె! ఇటువంటివాడివి ఒక అమ్మాయిని బొంబాయి ఏం తీసుకు వెడతావ్? పరిస్థితుల నెదిరించలేవు, మనుష్యులనంతకన్నా ఎదురోక్కలేవు—

మూర్తి : చూడు, జానీ!

[జానకి చూడకముందే వేదాంతంగారు వస్తాడు.]

వేదాం : (షేవింగ్ సెట్, టవల్ అందిస్తూ) ఇదుగో మూర్తిగారూ!

జానకి : చూడండి వేదాంతంగారూ! మాకు కారు అవసరంలేదు.

వేదాం : ఏం?

జానకి : రామానికి ఒంట్లో ఏం బాగాలేదు...రేపటికి కులాసాగా వుంటాడేమో!...అప్పటిదాకా యిక్కడే వుండాలనుకుంటాను...నాకు చాలా విచారంగా వుంది.

వేదాం : మీరిక్కడ వుండడం నాకు చాలా సంతోషమని ముందే చెప్పానుకదా!

జానకి : సరే, వస్తాను...(ఏదో పనివున్న దానిలా వెళ్ళిపోతుంది)

వేదాం : ఊఁ! కానివ్వండి.

మూర్తి : థాంక్స్...(సామానులు పట్టుకొని లేస్తాడు.)

వేదాం : ఎక్కడికి?

మూర్తి : వసారాలోకి

వేదాం : అరె! ఈ చలికాలం వుదయం వసారాలోకి వెడతారా? అందులోనూ యింత జలుబుతో.

మూర్తి : ఇక్కడెట్లా చేసుకుంటానండీ?

వేదాం : ఫరవా లేదండీ!...మీ కిదివర కెప్పుడూ జలుబు చెయ్యలేదల్లేవుంది....

మూర్తి : సరే!

వేదాం : మీకేమైనా కావాలంటే అడగడానికి మోహమాట పడకండి...(వెళ్ళి పోతాడు)

[మూర్తి గడ్డం చేసుకుంటూవుండగా రావు వస్తాడు]

రావు : హల్లో!

మూర్తి : (చుట్టూ చూస్తూ) హల్లో!—

రావు : స్వంత క్షౌరం అన్నమాట?

మూర్తి : (తెలియనివాడు, అంతచొరవ చేసుకొనే సరికి, కోపం వచ్చి) కనిపించడంలా?

[మూర్తి గట్టిగా తుమ్ముతాడు.]

రావు : అరె! జలుబు కూడా చేసిందా?

మూర్తి : ఆఁ!

రావు : చ్చ్చ్!...చలి కాలంలో జలుబా?

మూర్తి : ఏమండోయ్! మిమ్మల్ని నేనిక్కడకు రమ్మనలేదు...మీకు నన్ను గురించి ఏమీ విమర్శలు చెయ్యనక్కర్లేదు.

రావు : ఆమాటకొస్తే ఈహోటలులోకి నేను ముందు వచ్చాను. మీ రిక్కడ గడ్డం చేసుకోడానికి వీలులేదు.

మూర్తి : దానికి చాలా కారణాలున్నయ్.

రావు : మీ రా కారణాలు చెప్పడానికి శ్రమపడకండి. నాకవి యిదివరకే తెలుసు.

మూర్తి : ఎట్లా తెలుసు?

రావు : మీరేనా రాత్రి వచ్చిన అతిథులు?

మూర్తి : అవును...(ఆలోచించి) ఇవ్వాళ్లి వెళ్లిపోతున్నది మీరేనన్నమాట!

రావు : అవును...

మూర్తి : మీకు తెలిసిన కారణాలేమిటి?

రావు : అదే! వారంరోజులక్రితం ఒకఉదయం నేనుకూడా ఇదేహోటలులో ఇట్లాగే గడ్డం చేసుకోవలసి వచ్చిందని.

మూర్తి : అంటే ... (అనుమానంగా) మీ సామాను పోయిందా?

రావు : ఆహా!

మూర్తి : మీకు తెల్లవారి లేచేసరికి జలుబు చేసిందా?

రావు : అవును...

మూర్తి : వాడెవరు...వాడు, మీగుడ్డలు బురదలో పారేశాడా?

రావు : నిరభ్యంతరం గానూ! ... భలేవాడులే ఈ వేదాంతంగారు.

మూర్తి : భలేవాడా!...పట్టి దగాకోరు.

రావు : పాపం ... ఆయన్నేమనకండి ... ఇక్కడ వుండి చాలా సంగతులు తెలుసుకుంటారు. ఆయన చెప్పేవి చాలానిజం.

మూర్తి : నేనిక్కడ ఓక్షణం వుండను...ఇదికొగానే వెళ్లిపోతాను.

రావు : ఇంకా వెళ్లిపోవాలనే అనుకుంటున్నారా?

మూర్తి : అంటే...మీరు వెళ్లిపోదలుచుకోలేదా?

రావు : వేదాంతంగారు చాలా నిజం చెప్పారు... నామటుకు నేను ఇక్కడకు వచ్చినతర్వాత చాలా విషయాలు నేర్చుకున్నాను.

మూర్తి : (షేవ్ చేసుకుంటూ) మరి...అదే...మీ 'భార్య' సంగతి?

రావు : అక్కడే వచ్చింది చిక్కు.

మూర్తి : మీ రిద్దరు కలిసి వెళ్లిపోవడమే పెద్దమనిషి చెయ్యవలసిన పని.

రావు : పెద్దమనిషా?...అసలలా లేచిరావడం పెద్దమనుషులు చెయ్యవలసిన పనేనా?

మూర్తి : అది వేరు——

రావు : నా మాట వినండి, ఎంతో అనుభవంతో చెబుతున్నాను.........ఈ ఆడవాళ్లు ఎంత తమాషా అయినవాళ్లు?

మూర్తి : నిజమే!....ఎంత ఆశ్చర్యం కలిగిస్తారు? వాళ్లను అర్థం చేసుకోడానికి యుగాలు పడతయ్.

రావు : అదేమిటి? నాకు వారంరోజుల్లో ఎంతో అర్థమయిందే?

మూర్తి : ఎంత అసహ్యంగా ప్రవర్తిస్తారు?

రావు : ఎంత అసంభవంగా ప్రవర్తిస్తారు?

మూర్తి : ఆ కవి ఏదో అన్నాడే.——

రావు : చాలా అంటారు లెండి, పనీ పాటా లేకపోతేసరి!

మూర్తి : అయినా ఈ ఆడవాళ్లను గురించి చాలా మంచిమాట చెప్పాడండీ?

రావు : అదా? 'క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్' అన్నాడు.

మూర్తి : అబ్బే అది కాదండి!...అదే కనుక చెప్పివుంటే చాలా తప్పు...వాళ్ల చిత్తాలు మారడం నే నింతవరకు ఎరగను?

రావు : అంటే మీకు ఆడవాళ్లను గురించి ఏమీ తెలియదన్నమాట!

మూర్తి : నాకా! నాకు ఆడవాళ్లను గురించి ఏమీ తెలియదంటారా?

రావు : అవును...ఆ సంగతి మీరే చెప్పారు కదా!

మూర్తి : అబ్బే! నే నా మాట అనందే! నేను చెప్పింది——

రావు : మీకు తెలియకపోతే తెలుసుకోండి——వాళ్లు స్వర్గంలోనుంచి అప్పుడే దిగివచ్చిన దేవకన్యల్లా మాట్లాడుతారు.

మూర్తి : దేవకన్యల లాగానా?

రావు : అవును...అది కావాలా, ఇది కావాలా? నేను చెప్పింది చెయ్యండి, మీ రోగం ఠక్కున కుదురుతుంది!——యివీ వాళ్ల మాటలు!

మూర్తి : అచ్చే! నా అనుభవం అది కాదండీ!

రావు : పోనీ మీరు చెప్పండి, వాళ్ళిట్లా మాట్లాడుతారో?

మూర్తి : నా సంగతే తీసుకోండి! ఇంత జలుబుతోనూ పొద్దున్నే దిగివచ్చానా?—ఈ తనువు కోసమైనా కాస్త తిండి తినాలి కదా! అందుకోసం టేబుల్ ముందు కూర్చున్నాను. అప్పుడేమయింది?—

[అంతకు ముందే వేదాంతం వస్తాడు.]

వేదాం : ఏమయింది? కడుపునిండా తిన్నారు

మూర్తి : (కోపంతో) ఓ! మీరా! సమయానికే వచ్చారు. నేను మీ యింట్లోనుంచి తక్షణం వెళ్ళిపోవాలనుకుంటున్నాను.

వేదాం : అరె! అట్లాగేనా? చెవి వెనక సబ్బుతోనేనా? (కుడి చెవి వెనక చూసుకుంటాడు మూర్తి) అ... అవతల చెవి... (తుడుచుకుంటాడు.) ఆ! అదీ!

మూర్తి : తక్షణం—

రావు : మీరు మాతో రావచ్చు... మేం యిప్పుడే బయలుదేరుతున్నాం......

మూర్తి : థాంక్స్...

వేదాం : రెండు జంటలు తక్షణమే యిక్కడినుంచి వెళ్ళిపోతున్నారన్నమాట! బావుంది... చాలా బావుంది...(పేపర్ ఒకటి చూస్తూ వుంటాడు.)

[జానకి వస్తుంది.]

మూర్తి : జానీ! మనం బయలుదేరుతున్నాం.

జానకి : కాని—ఎట్లా?

కమల : (లోపలినుంచి) రావ్! రావ్!

రావు : ఓయ్!

కమల : ఎక్కడ?

రావు : ఇక్కడ...హాలులో!—

కమల : నువ్వు సామానంతా సర్దుకున్నావా?... (వస్తూ) మనకు టైం లేదు......వెంటనే బయలు దేరాలి.

[అక్కడ అందరినీ చూస్తుంది.] మూర్తీ!

రావు : (అర్థం చేసుకొని) మూర్తి!

మూర్తి : కమలా!

జానకి : కమల!

[అందరూ నిశ్చేష్టులౌతారు..... ఎవ్వరూ మాట్లాడరు...ఏమీ ఎరుగనట్లు వేదాంతం గారు పేపరు చూస్తూనే వుంటాడు...... యుగాలు గడిచినట్లుంటయ్, ప్రతి వాళ్ళకీ [

జానకి : (తెప్పరిల్లి) వేదాంతంగారూ! రాం ఏదో ఆలోచిస్తున్నాడు. ఈలోగా మీరు ఆయన భార్యను నాకు పరిచయం చెయ్యవచ్చునే!

వేదాం : క్షమించండి......కమలాదేవీ! ఈమె జానకి—

జానకి : నమస్తే—కులాసాగా వున్నారా?

కమల : (కోపంగా) ఆ—

వేదాం : చూడండి మూర్తిగారూ! ఈయన జోగారావు...యూనివర్సిటీనుంచి యిప్పుడే వచ్చారు......జోగారావుగారూ! ఈయన తెలుసుకదూ! మూర్తిగారు! పెద్ద రాజకీయవేత్త!

రావు : మేం ఇదివరకే కలుసుకున్నాం.

మూర్తి : అప్పటికి మనం ఎవరమో పరిచయం లేదు. ఇప్పుడు...సరే! నాకు ఏం చెప్పాలో తెలియడం లేదు—

రావు : తెలియకపోతే మానివెయ్యడం మంచిపద్ధతి.. మనం అందరం ఎలాగో యిక్కడ కలుసుకున్నాం. కలుసుకున్నందుకు ఆనందంగా గడపాలి.

మూర్తి : (చాలాసేపు ప్రయత్నించేసి,తుమ్ముతాడు.)

కమల : ఏమిటండీ అది! జలుబు చేసిందా?

రావు : బాగా జలుబు చేసింది, పాపం!

కమల : మీకు ఒంట్లో నలతేంటూ ఎరగరు, యింతవరకూ!

మూర్తి : నిజమే! ఇంతవరకు లేదా...తీరా జబ్బు చేసేసరికి నావంక ఎవ్వరూ చూడడం లేదు.. ఈ వేదాంతంగారు బలవంతంగా మమ్మల్ని అడ్డగించి...

వేదాం : అడ్డగించడం ఏమిటండీ? ఆపాననండి—

మూర్తి : నా యిష్టమయిందంటాను... ఈయన అడ్డగించి కావాలని జలుబు చేసేటట్లు చేశారు. (జానకిని చూపుతూ) నేను ఇంత బాధ పడుతున్నా, ఈవిడ నావంక తిరిగి చూడ

లేదు. (రావుతో) ఇహ ఈయన, నాకు జబ్బుగా వున్నప్పుడు చూసి నా భార్యతో కలిసి పారిపోతున్నాడు. (కమలతో) నువ్వు—సరే! నువ్వు నన్నందరికన్నా ఎక్కువ ఆశ్చర్యపరిచావ్! నువ్విట్లా చేస్తావని నేను కలలోకూడా అనుకోలేదు

వేదాం : (చప్పట్లు కొడుతూ) మూర్తిగారు పరిస్థితుల్ని ఎంత గొప్పగా సమీక్షించారో చూశారా! అందుకే ఆయన అంతటి రాజకీయవేత్త కాగలిగారు!!...సరే! చివరకు మీరందరూ చేసిన పనులకు విచారపడుతున్నారన్నమాట!

కమల : కాని, మీరు యింత జలుబుతో ప్రయాణం చేస్తున్నారా? ఎంత ప్రమాదమో ఆలోచించారా? వేదాంతంగారూ! నాకు కొంచెం గ్లుకోస్, వేడినీళ్ళు కావాలండి!

వేదాం : అయ్యో! వాటికేం?

మూర్తి : (జానకితో) నిజంగా జబ్బును గురించి తెలిసిన మనుషులు రంగంమీదికివస్తే ఎట్లా వుంటుందో చూశావా?

[బట్లర్ వస్తాడు.]

వేదాం : చూడు లోకనాథం! అయ్యగారికి వేడినీళ్లు కావాలట!

బట్లర్ : చిత్తంసార్!

వేదాం : తాగడానికి కాదోయ్, స్నానం చెయడానికి—

బట్లర్ : అలాగేసార్...మస్తుగా వున్నయ్.

కమల : కొంచెం గ్లుకోస్—

బట్లర్ : దానికేమమ్మా! అదీ తెస్తును...అయ్యగారి కోసం ప్రత్యేకంగా ఒక టిన్ వుందమ్మా!

వేదాం : అదేమిటోయ్! క్రిందటి టిన్ అంతా ఖర్చు అయిందా యేమిటి?

బట్లర్ : అంతా ఈ అయ్యగారికోసమే ఖర్చు అయిందిసార్!

రావు : (సిగ్గుపడుతూ) నేను నిజంగా దానిమీదనే బ్రతికాను.

వేదాం : ఫరవాలేదులెండి....కొంచెం త్వరగా తెచ్చిపెట్టు లోకనాథం! అమ్మగారు తొందరపడుతున్నారు—

బట్లర్ : చిత్తంసార్.. (వెళ్ళిపోతాడు)

రావు : వీటన్నింటికంటె కొంచెం పొడుంపీలుస్తే త్వరగా తగ్గిపోతుం దనుకుంటాను.

మూర్తి : నీ సంగతి నువ్వు చూసుకో—నీ సలహా లెవ్వరికీ అక్కర్లేదు.

కమల : ఇస్! మీ రెక్కువగా మాట్లాడకూడదు. ఆ మూలకుపోయి కాసేపు విశ్రాంతి తీసుకోండి (అతన్ని లేపి, మూలగా వున్న సోఫా పైకి తీసుకుపోతుంది) జాగ్రత్త! నన్ను పట్టుకొని నడవండి.

జానకి : జలుబుచేస్తే ముక్కుకు బాగగాని, నడిచే కాళ్ళకేం?

రావు : అట్లా నడవడం చాలా ప్రమాదకరం—

వేదాం : ఎంతో అనుభవం వున్నట్లుగా మాట్లాడుతున్నారే!

కమల : ఈ కుర్చీలో బావుందా?

మూర్తి : చాలా హాయిగా వుంది.

[కొంచెం సేపు నిశ్శబ్దం]

వేదాం : రావుగారన్నట్లు, మనం అందరం ఇక్కడ ఎట్లాగో కలుసుకున్నాం ... కలుసుకున్నందుకు హాయిగా గడపాలి.

జానకి : నన్ను మాత్రం వదిలి పెట్టండి.. నాకు పనివుంది.

[అంటూ వెళ్లిపోతుంది. పాపం, ఈ సంఘటనలో జానకి బాగా దెబ్బతిన్నది]

వేదాం : చూడండి కమలా! మూర్తిగారిని లోపలకు తీసుకువెళ్ళి, టెంపరేచర్ చూడండి...లోకనాథంతో వేనీళ్ళు కాగ పెట్టమనండి, మీ మాటంటే అతనికి బాగా గురి

[కమల మూర్తితో కలిసి వెడుతుంది.]

రావు : అ...(రావు ఏదో చెప్పబోతాడు.)

వేదాం : ఏమిటి? ఏదో చెప్పబోతున్నట్లున్నారు... చెప్పండి.

రావు : (పక్కగది వైపు చూపుతూ) ఉష్...మెల్లగా.

వేదాం : (నవ్వి) ఫరవాలేదులెండి.

రావు : చూడండి...ఈ పరిస్థితుల్లో....ఆ-నేను-మీకు అర్థమయిందనుకుంటాను.

వేదాం : అర్థం కాకపోవడ మేమిటండీ? ఈ పరిస్థితుల్లో మీలాంటి ప్రతి పెద్దమనిషీ చేసేదదే!

రావు : అందుకనే...ఇప్పుడే మెల్లగా జారుకుంటే

వేదాం : బాగానే వుంటుందనుకోండి. కాని-

రావు : మీరు నన్ను అనుమానిస్తున్నట్లుగా వున్నారు' నాకు కమలంటే ఎప్పటి అభిమానమూ వుంది.

వేదాం : కాని ప్రస్తుతం మీరు వెళదాం అనుకుంటున్నది పరిస్థితుల ప్రోద్బలం వల్ల అంటారు.

రావు : అవును... నిజంగా అందుకే-

వేదాం : నిజమేననుకోండి. కాని కమల — ?

రావు : ఆమెకేం?—సరే! కమలకు వ్యతిరేకంగా నేనేమీ చెప్పదలుచుకోలేదు

వేదాం : అరె! ఈ యింట్లో అందరూ కమలకు వ్యతిరేకంగా ఏమీ చెప్పదలచుకోనివాళ్లే!—చాలా బావుంది.

రావు : కాని, చూడండి — మాటవరసకు చెబుతున్నాను...జానకీదేవి సంగతి తీసుకోండి—

[జానకి వస్తుంది]

వేదాం : ఓ! జానకీ దేవీ! సరిగ్గా సమయానికే వచ్చారు...రావుగారికి మీ సలహా కావాలట!

రావు : అదేమిటండీ! నేను చెప్పింది అదేనా?

జానకి : చూడండి వేదాంతంగారూ! నా సామాను తీసుకొని దగర్లో వున్న రైలుస్టేషనుకు వెళదామని పైకి వెళ్లాను...కాని...కాని నేను వెళ్ళకపోవడానికి ఓ కారణం వుంది. ఆ కారణం మీకు చెప్పాలనే అనుకుంటున్నాను.

వేదాం : మీరు నిజంగా వెళదామనుకున్నారా?

[అవునని తలతిప్పుతుంది జానకి]

మీరు మనస్సు మార్చుకున్నందుకు చాలా సంతోషం.

జానకి : కాని, దానికి కారణం వుంది.

వేదాం : కారణం ఏదయితే నేం? ఆగారు...మా కదే కావాలి...(రావుతో) చూస్తే జానకీదేవి ఆగింది మీకు సలహా చెప్పడంకోసమే నని పిస్తోంది.

జానకి : రావుగారికేం కావాలో?

రావు : థాంక్స్......కాని ఈ విషయాలన్నయ్ చూడండి, ఎవరికి వారు చూసుకోవలసినవి.

వేదాం : ఆయన ప్రశ్న ఏమిటో నేను చెబుతాను వినండి: "నేను సామాను సర్దుకొని దగ్గర్లో వున్న రైలుస్టేషనుకు వెళ్లాలా?" అని.

జానకి : (కంగారుగా) వద్దు, వద్దు.

వేదాం : చూశారా రావుగారూ!

రావు : (ఆశ్చర్యంతో) సరే,...సరే!

[ఇంతలో లోపలినుంచి కమల వేదాంతంగారిని పిలుస్తుంది. ఆయన గుమ్మందగ్గరకు వెడతాడు]

రావు : ఆఁ! జానకీదేవీ! నేను నిజంగా యిక్కడ ఉండాలనే మీ ఉద్దేశ్యమా?

జానకి : అవును...మిమ్మల్ని ఉండమనే కోరుతున్నాను.

రావు : అయితే సరే! తప్పకుండా ఉంటాను.

[లోపలనుంచి కమల వస్తుంది. థర్మామీటర్‌తో సహా—ఆమె వెనుకగా మూర్తి వస్తాడు]

వేదాం : (థర్మామీటరు తీసుకుంటూ) మూర్తిగారికి జ్వరం రావడమంటే రాజకీయ లోకంలో విప్లవం రావడమన్నమాట!

మూర్తి : ఎంత ఉంది?

వేదాం : 109°

మూర్తి : నూటతొమ్మిదా? అమ్మమ్మో!

కమల : భయపడకండి...తొంభైతొమ్మిదే.

రావు : (వేదాంతంపగ్గరకువచ్చి) ఇక నేనుహాయిగా వెళ్లవచ్చు.

కమల : (ఆశ్చర్యంతో) ఎక్కడికి?

రావు : (కంగారుగా) అబ్బే! ఎక్కడికీలేదు.

వేదాం : ఆయన అనేది—నేనిక హాయిగా మేడ మీదకు వెళ్ళవచ్చునని — మేము ఇప్పుడే పరిస్థితుల్ని ఒక్కసారి సమీక్షించుకున్నాం.

కమల : పరిస్థితులేవీ ఇదివరకటిలా లేవు... నేనిదివరకెప్పుడూ మూర్తిగారికి జబ్బు చెయ్యడం అంటే ఏమిటో ఎరుగను. కాని, ఇవ్వాళ?

రావు : అవును...మనం ఎక్కడున్నామో ఒక్కసారి చూసుకుంటే—

వేదాం : ఎందుకు? అదుగో మూర్తిగారు ఆ సోఫాలో —సరే! సోదర సోదరీమణులారా! యీనాటి కార్యక్రమాన్ని నేను ప్రారంభిస్తాను —ఒక చిన్న ఉపన్యాసంతో—

రావు : ఉపన్యాసం అవసరమంటారా?

వేదాం : తప్పకుండా—(మూర్తి ఏదో మాట్లాడబోతాడు.)

కమల : ఇస్!...ఊరుకోండి.

మూర్తి : నే నేమీ మాట్లాడంలే!

కమల : కాని మాట్లాడబోతున్నారు.

వేదాం : జబ్బు చేసిన మనిషి చెయ్యవలసిం దేమిటో తెలుసా? మాట్లాడకుండా కూర్చుని, ఇతర్లు చెప్పేది వినడం.

మూర్తి : సరే! నేను — (వేదాంతం వారిస్తాడు. మూర్తి మాట్లాడ్డం మానేస్తాడు.)

వేదాం : సోదర సోదరీ మణులారా!—పరిస్థితులవల్ల కానివ్వండి—మరి దేనివల్లనైనా కానివ్వండి రెండు పారిపోతున్న జంటలు నాయింట్లో కలుసుకున్నయ్. (మూర్తితో) పేర్లు చెప్ప వలసిన అవసరం లేదుకదా!—నేను చెప్ప బోయే దేమంటే—నా ఉపన్యాసం అయి పోయిందని—ఇప్పుడు మూర్తిగారు, భారత దేశం, ఇదివరకు, ఇప్పుడు, ఇకముందు— ఎప్పుడూ గర్వించదగ్గ సీత, సావిత్రి, అనసూయల జాబితాలో చేర్చవలసిన కమలా దేవిని—పతిభక్తి పరాయణురాలిని—వదిలి మరొకరితో ఎందుకు పారిపోతున్నారో చెప్పవలసి ఉంటుంది.

మూర్తి : నిజం చెప్పాలంటే—సరే! నేను—

వేదాం : సరే! మూర్తిగా రెప్పుడూ 'కమలకు వ్యతి రేకంగా నే నేమీ చెప్పను' అనే రకం మనిషి. కాని కమలాదేవి కూడా మూర్తి గారికి వ్యతిరేకంగా ఏమీ చెప్పదలుచుకో లేదా?

కమల : (మూర్తితో) మీరు నన్నెప్పుడూ సరిగా చూడలేదు. తీరా నాకు జబ్బుచేసేసరికి—

మూర్తి : నీకు యెప్పుడూ జబ్బేనాయె! అక్కడే వచ్చింది చిక్కు.

వేదాం : మీ జీవితంలో మీరు జబ్బే ఎరుగరాయె! అసలు చిక్కు అది. హృదయంలేని మనిషి! హోప్ లెస్ క్రీచర్!!

[మూర్తి ఏదో మాట్లాడబోతాడు కమల వారిస్తుంది.]

వేదాం : మీకు ప్రమాదకరమైన జబ్బులు చెయ్యక పోతే పోయినయ్. అప్పుడప్పుడూ జబ్బు చెయ్యడమో, కనీసం తలనొప్పి రావడం కూడా వుండదయ్యె! ఆడవాళ్లు యెప్పుడూ మరొకరి కోసం జాలిపడే స్వభావం కల వాళ్లు అందులో కమలాదేవి మరీను!— ఆమాత్రం తెలియనివారు—అవున్లెండి... మీరు రాజకీయ నాయకులని ఆ జబ్బులకు కూడా తెలిసివుంటుంది.

జానకి : (చిరునవ్వుతో) తప్పకుండా తెలిసేవుండాలి. [మూర్తి ఆమెవంక కోపంగా చూస్తాడు.]

వేదాం : కమలాదేవి వంటి స్త్రీలు భారతదేశంలో ఏ కొద్దిమందో కాని వుండరు. అంత మంచిగా, అంత వినయంగా, అంత సహాయకారిగా వుండే ఆడవాళ్లు తక్కువ. అటువంటి ఆమె యెడ కూడా మూర్తిగారు పాషాణంలా వర్తించారు

కమల : మీరు చెప్పింది కొంచెం గురుసుగా లేక పోతే చాలా బావుండేది......అసలు నిజం కూడా అదేకదా!

వేదాం : (మూర్తిని మాట్లాడనివ్వకుండా ఆపి) ఇక రావుగారు—

రావు : ఏమిటి ?

వేదాం : మీకుతోచింది మీరూ చెప్పండి. అప్పుడు కాని విషయం సవిస్తరంగా తెలుసుకోడా నికి వీలుండదు.

రావు : (కమలకు ఎదురుచెప్పలేడు) కాని...సరే ! ఆ...ఆమె...ఒంటరిగా—

వేదాం : అవును. ఒంటరిగా, భర్తచేత తిరస్కరించ బడి—నిజానికి కమలాదేవి మూర్తిగారిని క్షమించకూడదు.

రావు : (మాట మార్చడానికి ప్రయత్నిస్తూ) దాని కేం, చూడండి—

వేదాం : చూస్తూనే వున్నానుకదా!—మనం అంద రము ఇక్కడ ఉన్నామని—సరే! మనం ఇప్పుడు ఏం చెయ్యబోతున్నాం? మీరూ కమలాదేవీ?

కమల : మూర్తిగారికి తగ్గేవరకూ నేనిక్కడే ఉం డాలి కదా !

వేదాం : సరే! కమలగారి విషయం తేలిపోయింది. ఇక మీరు జానకిగారూ?

జానకి : నేనూ ఇక్కడ వుండాలి ప్రస్తుతానికి—

వేదాం : పెరీఫడ్ ....ఆమె విషయం నిశ్చయమైంది. మరి మీరు రావుగారూ?

రావు : (జానకివంక చూస్తూ) నేనూ అంతే!— ప్రస్తుతానికి—

వేదాం : (మాట విరుస్తూ) దానికేం? ఇక మిగిలింది మూర్తిగారు—

మూర్తి : ఆఁ... నేను—

[బట్లర్ వస్తాడు]

బట్లర్ : వేడినీళ్లు కాగినయ్ సార్! అయ్యగారు—

వేదాం : మూర్తిగారి విషయం బాగా నిశ్చయమయి పోయింది...

[కమల మూర్తిని లేవదీసి అతి జాగ్రత్తగా తీసుకు వెడుతుంది. మిగిలిన నలుగురూ దీర్ఘమయిన నిశ్వాసాలు విడుస్తారు...] [తెర]

## రంగము : 3

* * మూడురోజుల తరువాత నాటి సాయంకాలం. జానకి పెన్సిల్‌తో ఏవో లెక్కలు కడుతున్నది... ఆవిడ చేతిలో పర్సు, రైల్వే గైడూ వున్నయ్.. లెక్కలు పూర్తికాగానే, ఏదో నిశ్చయానికి వచ్చినట్లు దీర్ఘ నిశ్వాసం విడుస్తుంది...కొంచెంసేపు ఆగి, వాకిలిదాకా వెడుతుంది.

జానకి : (పిలుస్తూ) జోగారావుగారూ! జోగారావు గారూ!

రావు : (లోపలినుంచి) ఎవరు?

జానకి : ఎక్కడ?

రావు : వచ్చె—(అతను వస్తాడు.) సిగరెట్ టిన్ తెచ్చుకుందామని మేడమీదకు వెళ్ళాను. తీరా దిగివచ్చేటప్పుడు టిన్ మరచిపోయే వచ్చాను.

జానకి : మరీ చిన్నపిల్లలై పోతున్నారు—

రావు : నువ్వేమనుకుంటే, అదే అవుతాను... అయినా నాకిప్పుడు సిగరెట్ తాగడం ఏమీ యిష్టంలేదు.

జానకి : అరె! మీ మగవాళ్ళెప్పుడూ సిగరెట్ తాగడానికే యిష్టపడతారనుకున్నాను!

రావు : (కొంచెం ఆమెకు దగ్గరగా జరుగుతూ) కాని అవి వాళ్ల వాళ్ల యిష్టాలమీద ఆధారపడి వుంటయ్...

జానకి : (ఆమెకు తెలుసు అతను ప్రేమపాఠాలు వల్లిస్తున్నాడని! అందువల్లనే కొంచెం జాగ్రత్తపడుతుంది ... బయటకు చూస్తూ) ఓహో!

రావు : ఈ మూడురోజులూ చాలా హాయిగా గడిచినయ్ కదూ?

జానకి : బాగానే గడిచినయ్.

రావు : మనం ఈ మూడురోజుల్లోనూ ఎంత సన్నిహితంగా వున్నాం?

జానకి : అవును.

రావు : నువ్వు నేనంటే చాలా ఆదరం చూపించావ్!

జానకి : మీరూ అంతే! నేనంటే చాలా దయగా వున్నారు.

రావు : నీకోసం అని వున్నాను కాని, లేకపోతే నేను ఎప్పుడో వెళ్ళేవాడిని.

జానకి : మీరు వెళ్ళివుంటే నే నేంచేసేదాన్నో నాకే తెలియదు.

రావు : నువ్వే నన్ను ఎంతో ఆదరంతో వుండి పొమ్మన్నావ్.

జానకి : నిజం...మిమ్మల్ని వెళ్లనివ్వలేక పోయాను.

రావు : నువ్వేం చెప్పావో జ్ఞాపకం వుందా!... 'మిమ్మల్ని వుండమనే కోరుతున్నాను!' అన్నావ్...నువ్వట్లా ఎందుకన్నావా అని అప్పటినుంచీ నాకు ఆశ్చర్యంగానే వుంది.

జానకి : మనం స్నేహంగా వుండాలని....మీతో పరిచయం కలిగి, మీరు నన్ను కూడా స్నేహితురాలినిగా భావించాలని—

రావు : మనం స్నేహితులమే కదా?—కాదా—

జానకి : అవును...నాకా నమ్మకం యిప్పుడు పూర్తిగా కుదిరింది...ఇకనుంచి మనం స్నేహితులమే.

రావు : (నిట్టూరుస్తూ, తనలో అనుకుంటున్నట్లుగా) స్నేహితులం!

జానకి : (ఆశ్చర్యంగా చూస్తూ) రావుగారూ!

రావు : (ఆమె వంకకే తిరిగి) ఏం జానకీ?

జానకి : మీరు నాకొక చిన్న సహాయం చేసి పెట్టాలి.

రావు : చిన్నదేమిటి? ఏ పని చెయ్యమంటే ఆ పని చేస్తాను.

జానకి : మిమ్మల్ని అడగవచ్చా, కూడదా అని యిందాకటినుంచీ ఆలోచిస్తున్నాను.

రావు : ఫరవాలేదు. తప్పకుండా చెప్పు.

జానకి : నిజమే! మనం స్నేహితులం....దగ్గర దగ్గరగా అన్నా చెల్లెళ్ళవంటి వాళ్లం.

రావు : (బిత్తర పోయాడు.) సరే! మన స్నేహం ఎటువంటిదైతేనేం కాని——

జానకి : అందుకనే మిమ్మల్ని అడగాలనుకున్నాను.

రావు : అడుగు జానకీ! నీ కోసం నే నేమైనా చెయ్యగలనని నీకు తెలియదా?

జానకి : నిజం, మీరు చాలా దయగలవారు...... (త్వరగా) నాకు అత్యవసరంగా ఆరు రూపాయల తొమ్మిదణాలన్నర కావాలి... అప్పుగా——

రావు : అప్పు——

జానకి : ఇవ్వాళ శుక్రవారం. మీకు సోమవారం నాడు మళ్ళీ డబ్బు పంపుతాను...తప్పకుండా——(ఒకక్షణం నిశ్శబ్దం.) అసలు మగవాళ్ళని ఇటువంటి విషయాల్లో సహాయం అడుగకూడదు...కాని మీ సంగతి వేరు...మనం చాలా చనువుగా వున్నాం-- అన్నా చెల్లెల్లి మాదిరిగా——మీ కర్థమైందనుకుంటాను.

రావు : కాని...కాని, నాకర్థంకాలేదు.

జానకి : (వివరంగా చెప్పడానికి అభిమానం అడ్డు వచ్చింది. కాని చెప్పక తప్పదు.) చూశారా! నాదగ్గర అయిదు రూపాయల అరణాలన్నర వుంది. ఇంటికి వెళ్ళాలంటే యింకా ఆరు రూపాయల తొమ్మిదణాలన్నర కావాలి...మొత్తం పన్నెండు రూపాయలు...(కొంచెం కోపంగా) ఈ మగవాళ్లు వృధాగా మాకోసం యింత ఖర్చు పెడతారు కాని మా అవసరానికి ఒక్క కానీ కూడా యివ్వరు...సరే! ఇంటికి వెళ్ళడానికి——

రావు : అదే...అదే! ఇంత తొందర ఎందుకా అని?

జానకి : తొందరా? నేను యిక్కడకు వచ్చిన ప్రతి క్షణం నేను ఆలోచిస్తున్నదదే! ఆ నాడే నా సామాను తెచ్చుకోవడానికి పైకివెళ్ళి చూస్తే అయిదు రూపాయల అరణాలన్నరే వుంది... నే నేం చెయ్యాలి?

రావు : నువ్వు కావాలనుకుంటే ఎవరుపడితే వాళ్లు యిచ్చేవాళ్ళే!

జానకి : మూర్తినే తీసుకోండి——

రావు : తీసుకోక తీసుకోక మూర్తిగారినే తీసుకోవాలా? నువ్వాయన దగ్గర చిల్లిదమ్మిడీ తీసుకోవని నాకు తెలుసు...కాని వేదాంతం గారు——?

జానకి : వేదాంతంగారా ? మనల్ని యిక్కడకు రప్పించి, భవిష్యత్తు పేరుతో బంధించి వుంచిన ఆయన దగ్గరకు వెళ్ళి: "ఏమండీ వేదాంతంగారూ! మీ యింటినుంచి వెళ్ళిపోవడానికి నాకు ఆరురూపాయల తొమ్మిదణాలన్నర యివ్వండి" అని అడగటం టూరాళ్ అసంభవం.——

రావు : నిజమే!... కాని నువ్వాయనతో ఈమూడు రోజులూ స్నేహంగా నే వున్నావు కదా!

జానకి : ఆయన అతిథిగా ఆయన ఇంట్లో వున్నప్పుడు గౌరవం చూపించడం నా విధి...ఆ గౌరవాన్ని పురస్కరించుకొని——

రావు : కాని వేదాంతంగారి విషయం వేరు...మనం గాడిదలం కాకుండా కాపాడాడాయన.

జానకి : అందుకాయనకు నేను కృతజ్ఞత చూపించాలా?...చూస్తే, ఈలోకంలో ఏ మగవాడూ, ఏ ఆడదాన్ని అర్థం చేసుకున్నట్లు కనిపించదు.

రావు : (కొంచెం బాధతో) అంటే నువ్వనేది—— నేను నిన్ను అర్థం చేసుకోలేదనా?

జానకి : నేననేది——మీరు నేనడిగిన డబ్బుయిస్తే కృతజ్ఞురాలిని, అని...

రావు : అవునవును...నువ్వు యిక్కడనుంచి వెళ్లిపో వడానికి అంత తొందర పడుతున్నప్పుడు—అంతా చిల్లరగా యివ్వనా?

జానకి : మీ యిష్టం

రావు : (డబ్బు లెక్కపెడుతూ) ఇక్కడనుంచీ వెళ్లి పోవడానికి అంత తొందర—

జానకి : ఇంకా నేను ఇక్కడ వుండడం ఎందుకు?

రావు : అవునవును......(ఏదో చెప్పబోయి) సరే! ఇదిగో! ఆరు రూపాయలు......తొమ్మి దణాలు......అర్ధణా......(ఇస్తూ) అవును ......నువ్వెందుకు వుండాలి?...సరే! నే నెందుకిక్కడ [illegible] తెలుసా?

జానకి : దానికేం! [illegible] వున్నారు. ...... [illegible] మంచివాడు. మనం గాకేదలం కాకుండా కా[illegible] డాడు.

రావు : నిన్ను గురించి, నువ్వు మాట్లాడే మాటల్ని గురించి ప్రస్తుతం వున్న నా అభిప్రాయం చెబితే నువ్వు భూమిమీద ఆగవు—

జానకి : (చాలా శాంతంగా) అంటే-మీరు నన్ను పొరబాటుగా అర్థం చేసుకోలేదు కదా!

రావు : కావచ్చు...కాని ఎట్లా అర్థం చేసుకుం టే నేం? నువ్వు యిప్పుడే వెడుతున్నప్పుడు. (డబ్బు యివ్వబోతాడు. కాని రావు అనిగంగా అంటే జానకి డబ్బుతీసుకుం టుందా?)

జానకి : స్నేహితులుగా నేకదూ మీరా డబ్బుయిస్తు న్నది?

రావు : అవును.

జానకి : స్నేహితురాలి నేకదూ!

రావు : (కొంచెం తటపటాయిస్తూ) అవును.

జానకి : (డబ్బు తీసుకొని) థాంక్స్...మీ మేలు ఎన్నటికీ మరువలేను.

[ఆమె త్వరగా వెళ్ళిపోతుంది...రావు ఈ జన్మలో ఆమెను చూడలేడు.]

రావు : ఛీ! ఎంతపొరపాటు చేశాను?

[ఒకక్షణం అవేమాటలు, జానకి నిష్క్రమిం చిన వైపుచూచి అనుకుంటాడు...ఇంతలో మూర్తి, కమల వస్తారు. కమల జాగ్రత్తగా నడిపించుకొని వస్తుంది మూర్తిని.]

రావు : క్షమించండి—వస్తాను. (వెళ్ళబోతాడు)

మూర్తి : (తానొక్కడే వుండవలసి వస్తుందన్న కంగా రుతో) వెళ్ళకోయ్, వెళ్ళకు...మన ముగ్గు రికీ కావలసినంత చోటువుంది యిక్కడ.

కమల : చూశారా! మూర్తిగారు యింకా మామూలు మనిషి కాలేదు...మళ్లీ యివ్వాళ జ్వరం వచ్చింది......(మూర్తితో) ఆ సోఫాలో హాయిగా వుంటుంది. (అతనిప్రక్కనే, రావుకు సాధ్యమయినంత దూరంలో కూర్చుంటూ) మిమ్మల్ని కష్టపెడుతున్నా మేమో?

రావు : అబ్బే! కష్టంఏముంది? నేనెలాగూ వెళ్ళబో తున్నాను.

మూర్తి : అదేమిటి! కొంచెంసేపు కూర్చో. కులా సాగా కబుర్లు చెప్పుకుందాం.

రావు : మేడమీద నా సిగరెట్ కేస్ మరచిపోయి వచ్చాను—వట్టి గాడిదలా గా—

కమల : అంటే, గాడిదల కంతమతిమరుపువుంటుందా?

రావు : (కచ్చగా) గాడిదల సంగతి నాకు తెలియదు గాని, పులులుమాత్రం ఏ విషయమైనా యిట్టే మరచిపోతయ్—అందులో ఆడ పులులు మరీను— (వెళ్ళడానికి లేస్తాడు.)

మూర్తి : మళ్ళీ త్వరగా వస్తావుకదూ!

రావు : (అయిష్టంగా) మళ్ళీనా?...సరే! వస్తాను. [వెళ్ళిపోతాడు]

మూర్తి : మాకు వచ్చి కాస్త సాయంగా వుండు.

[కమల శాలోగా అతనికి దుప్పటి కప్పు తుంది]

అక్కర్లేదు కమలా!

కమల : అబ్బే! వుంచుకోవాలి...నాకే చలిగావుంది నీకు అక్కడ మెత్తగా వుందా? లేక మరో దిండు తీసుకురానా?

మూర్తి : చాలా హాయిగా వుంది...నువ్వు అనవస రంగా శ్రమపడకు.

కమల : శ్రమా? నీకోసం చేసేపని నాకు శ్రమా?

మూర్తి : (నిస్సారంగా) సరే!

కమల : అదీ! (దిండు తెస్తూ) నువ్వు హాయిగా వుండడమే నాకు కావలసింది...ఇప్పుడెట్లా వుంది?

మూర్తి : చాలా హాయిగా వుంది...

కమల : నిజంగానా? నీకేం కావలసినా నిమిషంలో తెస్తాను.

మూర్తి : కావలసినప్పుడు అడుగుతానుగా!

కమల : సరే! ఏదైనా చదవనా?......లేకపోతే, కబుర్లు చెప్పుకుందామా?

మూర్తి : నువ్వు చదివితే నే బావుంటుంది...చదువు.

[ఆమె ఓ పుస్తకం తెస్తుంది...ఇంతలో రావు సిగరెట్ టిన్‌తో వస్తాడు]

రావు : క్షమించండి... నేను మీకు అడ్డంకాదుగదా?

మూర్తి : అబ్బే! లేదు......కమల ఏదో చదవబోతున్నది...కూర్చో.

రావు : (కూర్చుంటూ) ఏమిటా పుస్తకం?

కమల : పతివ్రత—

రావు : మీరు 'చలం' గారి పుస్తకాలేమైనా చదవవలసింది.

మూర్తి : ఏం? అతను బాగా రాస్తాడా?

రావు : బాగా? గొప్పగా రాస్తాడు...అందులో భర్తతో సుఖంలేని భార్యల సంగతి మరీను.! (అదికూడా రావుకు కమల చదివి వినిపించిందే కదా!)

కమల : (మాట తప్పిస్తూ) అరె! నేను గుడ్డలు మార్చుకోవాలి...స్నానంకూడా చెయ్యాలి.

రావు : (తన గడియారం వంక చూస్తూ) అవును.

కమల : మూర్తీ! నువ్వీపూటకు ఆ గుడ్డలతోనే వుండాలి.

మూర్తి : నువ్వు నిన్నకూడా యిదేమాట చెప్పావ్!

కమల : నిజమే ననుకో! నీకు మళ్ళీ జ్వరం వచ్చింది కదా!

(తన కడుపుమీద తనే చెయ్యివేసి చూసుకుంటాడు. చల్లగావుంది. కుడిచేతిని ఎడం చేతిమీద పెట్టుకుంటాడు.)

రావు : బహుశః ఆ 'పతివ్రత' అంత వుద్రేకం కలిగించి వుంటుంది.

మూర్తి : ఆ పుస్తకం యింకా చదవందే!

రావు : అయితే నిన్నటి వుద్రేకం మిగిలివుంటుంది

మూర్తి : (కోపంతో) కావచ్చు.

కమల : (అయిష్టంగా) వీల్లేదండీ......ఈ ఒక్కపూటకూ మీ కమల చెప్పినట్టు వినాలి.

మూర్తి : సరే!

కమల : మీ రెంత మంచివారో నాకు తెలియదా? ...సరే! నేను యిప్పుడే వస్తాను.

[వెళ్ళిపోతుంది.]

మూర్తి : (దీర్ఘనిశ్వాసం విడిచి) చూడు — (ఆగిపోతాడు.)

రావు : ఏమిటి ?

మూర్తి : (అది చెప్పకపోవడమే మంచిదనుకొని) ఏమీలేదు...

రావు : (ఒక క్షణం ఆగి) ఈ ఆడవాళ్లు ఎంత తమాషా అయినవాళ్లో!

మూర్తి : (ఆమోదిస్తూ) ఎంత ఆశ్చర్యం కలిగిస్తారు

రావు : ఎంత అసహజంగా మాట్లాడతారు!

మూర్తి : ఎంత అసహ్యంగా మాట్లాడుతారు!

రావు : అవును...

మూర్తి : ఈరోజుల్లో, ఆంధ్రదేశం ఏమీ బావుండదు.

రావు : నాకూ అంతే!

మూర్తి : అంటే,....వుత్తరదేశం పోదాం అనుకున్నావన్నమాట!

రావు : ఆహా!

మూర్తి : ఎక్కడికి? ఢిల్లీకా?

రావు : [illegible] హైదరాబాదు [illegible] —

మూర్తి : [illegible] బొంబాయి బావుంటుంది.

రావు : అబ్బే! ఈ మనుష్యుల బడాయిలు, లడాయిలు తప్ప అక్కడేమీ వుండవు

మూర్తి : కాదు, కాదు. మనల్ని మనం మరచిపోవాలంటే అక్కడే వుండాలి...చూడు—మన లోమాట...నాకు ఆడవాళ్ళంటే ఉత్సాహం పోయింది.

రావు : నాకు మోహంమొత్తిపోయింది.

మూర్తి : నాకు అసహ్యం పుడుతోంది.

రావు : అవును.

మూర్తి : అంటే, నీకుకూడానా?

రావు : అట్లాగే అనిపిస్తోంది.

మూర్తి : ఎంత అర్థం లేకుండా మాట్లాడతారు!

రావు : ఎంత అసహజంగా మాట్లాడతారు!

మూర్తి : అయితే, నువ్వు హోటల్లో, గదులుకూడా 'బుక్' చేశావా?

రావు : ఆహాఁ!

మూర్తి : నేను కూడాను!

రావు : బొంబాయిలోనా?

మూర్తి : అవును...బొంబాయి బాగానే వుంటుంది.

రావు : ఇంతకూ నువ్వు నేది—

[అంటూ కమల వెళ్ళిన వంక చూపుతాడు.]

మూర్తి : (తల ఊపుతూ) అవును...

రావు : అదీ నిజమే! అడ్వాన్సు కట్టి 'బుక్' చేసిన గదుల్ని వాడుకోక పోవడమేం? కనీసం ఒక్క వూళ్ళో వాటినైనా వాడుకుందాం.

మూర్తి : ఏ వూళ్ళో వాటిని?

రావు : ఈ విషయంలో మనకు పోట్లాటెందుకు? హెడ్స్ ఆర్ టైల్స్ (Heads or tails) వేద్దాం...నీకేం కావాలి? బొమ్మా? అక్షరాలా?

మూర్తి : బొమ్మ...బొమ్మ పడితే నువ్వు బొంబాయి రావాలి...లేకపోతే నేను హైదరాబాదు వస్తాను...

[ఎగర వేస్తాడు...బొమ్మ పడ్డది]

మూర్తి : అదుగో బొమ్మ!...నువ్వు బొంబాయి వస్తా వన్న మాటేగా?

రావు : తప్పదుగా! అయితే ఎప్పుడు వెడదాం? రేపు బావుంటుందేమో?

మూర్తి : రేపు మళ్ళీ అవకాశం దొరుకుతుందా? ఈ రాత్రే బయలు దేరితేనేం?...వచ్చిన అవకాశం పోగొట్టుకోవడం మంచిది కాదు.

రావు : అంటే-కమలాదేవి బట్టలు మార్చుకొని వచ్చే లోపలేనా?

మూర్తి : అవును...ఇదే మంచి అవకాశం. ఈ రాత్రికి హైదరాబాదులో — రేపు బొంబాయి వెళ్ళడం......

రావు : ఆవిడ మన వెంటనే బయలుదేరుతుంది.

మూర్తి : నాన్సెన్స్! ఎందుకు బయలుదేరుతుంది? నీకింకా కమల సంగతి పూర్తిగా తెలియదన్న మాట!

మూర్తి : ఏమిటి? నాకు కమల సంగతి తెలియదా! బావుంది.

రావు : (నచ్చచెబుతూ) ఆవిడ తప్పకుండా మీ వెంట పడుతుంది. ఎవరికైనా జబ్బుచేస్తే సేవ చెయ్యడం ఆవిడకు చాలా ఆనందం. అందులో మీ వంటి రోగిని అసలు వదులుకోదు.

మూర్తి : నా వంటి వణ్ణా! నాకు తెలియదే ఆ సంగతి!

రావు : మూర్తిగారూ! మీకు ఆవిడతో పరిచయం మూడురోజులే! నాకు ఆరురోజులు! అందు వల్ల మనం—

[వేదాంతంగారు వస్తాడు.]

వేదాం : ఏం మూర్తిగారూ! ఏవో రహస్యాలు మాట్లాడుకుంటున్నట్లున్నారు!

రావు : ఇప్పుడే మీ మాట చెప్పబోతున్నాను... సరిగ్గా సమయానికే వచ్చారు.

మూర్తి : (చెప్పవద్దన్నట్లుగా) ష్!

వేదాం : ఆయన నాకేదో చెప్పాలనుకుంటూ వుంటే, మధ్య మీ 'ష్' ఎందుకు చెప్పండి?

రావు : ఫరవాలేదు...వేదాంతంగారు పెద్ద మనిషి.

వేదాం : భేష్! (మూర్తితో) చూశారా మీ ప్రక్కన నాకున్న పలుకుబడి! (రావుతో) ఏమిటి మీరు చెయ్యబోతున్నది? ఇక్కడనుంచి వెళ్ళిపోబోతున్నారు కాబోలు! అవునా?

మూర్తి : అ...అహాఁ!... మేము—

రావు : అరె! మీకెట్లా తెలిసింది?

వేదాం : అదేమిటి! మూర్తిగారి కారు ఆయన కోసం ఇరవై నాలుగు గంటలనుంచి కనిపెట్టుకొని వుంది.

మూర్తి : నిజం ?

వేదాం : మీరుకూడా ఆయనతో వెడుతున్నారా రావుగారూ?

రావు : అవును...వెడదామనే అనుకుంటున్నాను. కాని మీకుమాత్రం కృతజ్ఞుణ్ణి.

వేదాం : నేనేమనుకున్నానో తెలుసా?—సరి! తీరా వెడుతున్నప్పుడు చెప్పడమెందుకు ?

మూర్తి : చూడండి... నేను...నా సంగతి...మళ్ళీ వంట్లో కొంచెం బావుండగా నే—వస్తాను.. వస్తాననుకోండి—ఈలోగా ఆవిణ్ణి కొంచెం—మీకు జ్వరం వచ్చిందనో—అదే ! నటించో...అఁ! నేన నేది—ఆ రావుగారి నడగండి.

వేదాం : (నవ్వుతూ) మీరనేది రావుగారికెలా తెలుస్తుందండీ?...మూర్తిగారూ! ఎందుకీ సంజాయిషీలు? మీ దంపతుల విషయంలో జోక్యం కలిగించుకోవడానికి నేనెవర్ని? మీరు, రావు వెళ్ళిపోతున్నామనండి... బావుంటుంది. అంతే కాని—

రావు : కాని కమలాదేవి సంగతి? ఈ పరిస్థితులలో మూర్తిని - అందులోనూ జ్వరం తగిలిన మూర్తిని ఆవిడ చస్తే వదులుకోదు.

వేదాం : అంటే, ఆవిడ యిక్కడే వుండాలన్నమాట!

రావు : అంతే!

వేదాం : ఆవిడ యిక్కడ వుండవలదనుకోకపోతే!

మూర్తి : మీరు అందర్నీ ఎలా వుంచగలుగుతున్నారు?

వేదాం : గౌరవంతోనూ, నచ్చచెప్పీ—

మూర్తి : ఆ మాత్రానికే కమల వుండిపోతుందనుకోను.

వేదాం : ఆ సంగతి మీకు బాగా తెలుసుననుకోండి. ఎంతగా ఆలోచించినా ఈ పవిత్రుడికీ, ఆ పతివ్రతకూ వియోగం కలిగించడానికి ఒక్కటే మార్గం కనిపిస్తున్నది.

రా. మూ: ఏమిటది? [బట్లర్ వస్తాడు]

వేదాం : మీ దొరగార్లిద్దరూ యిక్కడినుంచి వెళ్ళిపోతున్నారు. కారు సిద్ధంచేయించు.

బట్లర్ : నిన్నటినుంచీ సిద్ధంగా వుందిసార్.

వేదాం : సరే! వీళ్ల సామాన్లు సర్దించి ఒకసారి యిలారా!

బట్లర్ : చిత్తంసార్. (వెళ్లిపోతాడు.)

వేదాం : ఇంకా సామానేమైనా మిగిలితే, తరువాత పంపుతాను.

రావు : థాంక్స్.

మూర్తి : మీరు నిజంగా చాలా మంచివారండీ.

వేదాం : ఆఁ! నిజంగా?

మూర్తి : ఇంతకూ యిందాక మీరు చెప్పబోతున్న మార్గం—?

వేదాం : ఏముంది? కమలాదేవి సపర్య చెయ్యడానికి మూర్తిగారికి బదులు మరొకరోగి కావాలి.

రావు : బాగా చెప్పారు!... అంత మంచిమార్గం కనిపెట్టిన మీరే.

వేదాం : అదేమిటి? నేనా? నేను అంతత్యాగం చెయ్యలేను...మా బట్లర్ అయితే—

బట్లర్ : (వస్తూనే) ఏమి కావలెనుసార్!

వేదాం : లోకనాథం! నీకెప్పుడైనా జబ్బుచేసిందా?

బట్లర్ : ఎప్పుడూ చెయ్యలేదు సార్ — కొంచెం కూడా!—

వేదాం : అబ్బే! అదేం బాగాలేదు. మరొకళ్ల చేత సపర్య చేయించుకోకపోవడం ఏమీ బాగా లేదు.

రావు : (బట్లర్‌తో) చూడవోయ్! నువ్వు జ్వరం వచ్చినట్లు నటించాలి.

బట్లర్ : ఎందుకుసార్?

మూర్తి : ఆ...అదే—

వేదాం : కమలాదేవిగారు మంత్రసాని కోర్సు చదువుతోంది. సామాన్యంగా ఎవ్వరూ నయం చెయ్యలేని రెండు జబ్బుల్ని కుదిర్చింది. మరొకటికూడా నయంచేస్తే ఆవిడ దాన్లో పాస్ అవుతుంది.

రావు : అవునవును.

బట్లర్ : అంటే...మూడోరోగం నాకు రావలెనంటారా?

మూర్తి : ఆ...అంతే—

బట్లర్ : ఏమోసార్! నాకు భయం వేస్తోంది.

రావు : భయమెందుకు? చాలా హాయిగా వుంటుంది

మూర్తి : (అసహ్యంగా ఫీలయి) అసలు మేమే... నిజంగా నువ్వు...నీకేమీ కష్టం కలగదు.

వేదాం : మూర్తిగారు హామీయిస్తున్నారోయ్ నీకు. నీకేమీ భయంవుండదు...పైగా నీ శరీరానికి లాభంవుంటుంది.

బట్లర్ : ఏమోసార్; నాకు మాత్రం ధైర్యం చాలటం లేదుసార్!

వేదాం : సరే!

[బట్లర్ వెళ్లిపోతాడు.]

రావు : సరే! ఒకళ్ళ విషయం తేలిపోయింది... (వేదాంతంగారితో) మరి మీ సంగతి? మీకూ యిష్టంలేదా? ఇంకా కొంచెం సేపాగితే విప్లవం చెలరేగుతుంది.

వేదాం : సరే! ఏదో ఒకటి చెయ్యకతప్పదుకదా!... కానివ్వండి...మిమ్మల్ని నేనెందుకు కష్టపెట్టాలి?

మూర్తి : మీ కిష్టమేనా?

వేదాం : ఆఁ!

మూర్తి : అంటే—

వేదాం : అంటేలూ, గింటేలూ కుదరవు. త్వరగా నిష్క్రమించండి

రావు : (వెళ్లిపోతూ) రెండో అధ్యాయం చాలా చక్కగా ముగిసేటట్లుగా వుంది.

వేదాం : వినండి! ఆవిడ వస్తున్నట్లుగా వుంది!

మూర్తి : ఓ!

[వాళ్లు త్వరగా నిష్క్రమిస్తారు. వేదాంతం ఒంటరిగా ఆలోచిస్తూ వుంటాడు. ఏం జబ్బు చెయ్యాలనూ అన్నది ప్రశ్న — ఇంతలో బట్లర్ వస్తాడు.]

వేదాం : చూడు లోకనాథం! నీ శరీరానికి జబ్బు చేసేటట్లు చెయ్యడం నీకు చేతకాదు కాబట్టి ఆ భారాన్ని నేనే మోస్తున్నాను.

బట్లర్ : మీ సంగతి నాకు తెలియదా సార్!

వేదాం : అవునవును. బాగా తెలుసు...సరేగాని నాకిప్పుడు ఏ రకమైన జబ్బు చేస్తే బావుంటుందంటావ్?

బట్లర్ : (ఆలోచించి) కాళ్లనొప్పులు సార్.

వేదాం : ఏమో! నాకెప్పుడూ రాలేదు. సక్రమంగా వుంటయ్యంటావా?

బట్లర్ : ఎందుకు వుండవు సార్? అదీకాక అప్పుడు మీరు భోజనం చెయ్యటానికి ఏ అభ్యంతరం వుండదు సార్.

వేదాం : నిజమే సుమా! నేను భోజనం సంగతే ఆలోచించలేదు.

బట్లర్ : మరి, జలుబయితేనో సార్—

వేదాం : ఇబ్బంది లేదు కాని, అందరికీ ఒకటే జబ్బు వస్తే ఎంతవాళ్ళకయినా అనుమానం కలగవచ్చు కదా!

బట్లర్ : అదీ నిజమే సార్!

[ఒక క్షణం నిశ్శబ్దం. ఇంతలో]

కమల : (లోపల్నుంచి) లోకనాథం ..లోకనాథం!

బట్లర్ : ఆవిడ వస్తున్నట్లుగా వుంది సార్! ఏం చేద్దాం?

వేదాం : నేనేదో ఒకటి చేస్తాను కాని నువ్వు వెళ్ళి ఆవిడ్ని కాసేపటివరకు యిక్కడకు రాని వ్వకు...ఈలోపల నాకు జబ్బు చెయ్యాలి.

బట్లర్ : చిత్తం సార్...(త్వరగా వెడతాడు.)

[వేదాంతం సోఫాలో పడుకుని మూలుగుతాడు. ముందు చెయ్యి తలమీద పెట్టుకొని కణతలు చూసుకుంటాడు. తరువాత కడుపుమీద, మోచేతుమీద, మోకాళ్ళమీద చూసుకుంటాడు. ఎంతసేపటికీ కమల రాదు. మధ్య మధ్య తల ఎత్తి చూస్తూవుంటాడు. ఎవరో వస్తున్న చప్పుడవుతుంది. మూలుగుతూ కళ్ళు మూసుకుంటాడు. ఇంతలో జానకి వస్తుంది. ఒక చేతిలో సంచి వుంది. మూలుగు విని 'ఏటిటిది?' అని కంగారుపడుతూ త్వరగా వస్తుంది.]

వేదాం : (ఏం చెప్పటానికీ తోచక) అబ్బ! తల పగల కొట్టుకుపోతోంది.

జానకి : ఏమయింది? (అంటూ దగ్గరకువచ్చి కణతలు పట్టుకొని చూస్తుంది)

వేదాం : అబ్బా? తల—(జానకిని చూస్తాడు ఉత్సాహంతో) ఓ! మీరా జానకీ!

జానకి : అవును...ఏమయింది?

వేదాం : భయంలేదు. కాని కంగారు పడ్డప్పుడు మీ వంటివాళ్ల ముఖాలు మరీ బావుంటాయ్ సుమా?

జానకి : (పొగుడుతూ వుంటే ఎవరికి బావుండదు? కాని జానకి దా[illegible]గా మసులుతుంది.) నేను ఈపాటికి వెళ్ళిపో[illegible]దాన్ని.

వేదాం : నాకు చెప్పకుండానే!

జానకి : (సిగ్గుపడి) అవును.

వేదాం : ఏం?

జానకి : వెళ్ళిన తర్వాత రాసేదాన్ని—

వేదాం : ఓ కార్డు—

జానకి : ఓ కవరు.

వేదాం : మీ ఆతిథ్యానికి కృతజ్ఞురాల్ని...ఇట్లు, పరిచయస్థురాలు.

జానకి : ఇట్లు,—స్నేహితురాలు.

వేదాం : తాజా—మిమ్మల్ని ఎప్పటికీ చూడను.

జానకి : మిమ్మల్ని ఎప్పటికీ మరచిపోలేను.

వేదాం : కాని నువ్వు తప్పకుండా మరచిపోవాలి.

జానకి : అదే మంచిదంటారా?

వేదాం : దాదాపూ అంతే! ఎప్పుడూ జరిగేదదే! ఆఁ! నీ వేళ్ళ మహిమ చూశావా? నా తల నొప్పి అప్పుడే తగ్గుతోంది.

జానకి : నేను ఒక్క నిముషమే యిక్కడ వుండేది.

వేదాం : (ఏదో చప్పుడవుతుంది.) ఏమిటది?

జానకి : ఏమో! నాకూ యిప్పుడే వినిపించింది.

వేదాం : ఆఁ! ఎలుకలో, పందికొక్కులో—చిన్నవైతే ఎలుకలు, పెద్దవైతే పందికొక్కులు.

[ఇంతలో మూర్తి, రావులు కిటికీనుంచి కనిపించి నిష్క్రమిస్తారు.]

జానకి : ఏమిటది?

వేదాం : అది నీ జీవిత కావ్యంలో ఒక ఘట్టం—అయిపోయింది, మరచిపోయింది, మరణించింది.

జానకి : అసలది జరగనే లేదేమో? అవునా!

వేదాం : కావచ్చు --కేవలం కలలాంటిది!

[బట్లర్ వస్తాడు]

వేదాం : నాకు పాగ్శ్వం నొప్పి వచ్చింది లోకనాథం!

బట్లర్ : విన్నాను సార్! కొంచెం జాగ్రత్తగా వుండాలి సార్!

వేదాం : జానకీ దేవి నన్ను చాలా జాగ్రత్తగా చూస్తోంది...ఆఁ! ఇంతకూ నీకేం కావాలి?

బట్లర్ : కమలమ్మగారు రాత్రికి కనిపించరట సార్! ఆ మాట చెప్పమన్నారు సార్!

వేదాం : (జానకితో) కనిపించక పోతే ఏమైనా ప్రమాదమా?

బట్లర్ : రాముడికి సడెన్‌గా జబ్బు చేసింది సార్!

వేదాం : అరె! నేను రాముడి సంగతే మరచిపోయానే!

[అని నాలుక కొరుక్కుంటాడు]

జానకి : పాపం! రాముడికి జబ్బేమిటి?

బట్లర్ : గొంతు నొప్పి చేసిందటమ్మా! అన్నం తిననివ్వదు. నీళ్లు తాగ నివ్వదు...కొంచెం జాగ్రత్తగావుండాలంటున్నారుఅమ్మగారు.

వేదాం : కమలాదేవి గారికి థాంక్స్ చెప్పు.

బట్లర్ : అలాగే సార్! (వెళ్లిపోతాడు.)

వేదాం : నువ్విప్పుడు వెళ్లవద్దు జానకీ వుండాలి.... (జానకి తల అడ్డంగా తిప్పి నవ్వుతుంది.) తప్పకుండా వెళ్లాలా?

జానకి : అవును.

వేదాం : మీ నాన్నగారి దగ్గరకేనా?

జానకి : అవును.

వేదాం : సరే! వెళ్ళిరా...నీ చేతులలో ఏదో మాజిక్ ఉంది...(నిట్టూర్చి)మనం యిక విడిపోదాం.

జానకి : వెళ్లొస్తాను......మిమ్మల్ని ఎప్పటికీ మరచిపోలేను. మా నాన్నలా వున్నారు...మీకెప్పటికీ కృతజ్ఞురాల్ని.

[అనీ వెళ్లిపోతుంది; నిజయుగన్వంతో. అద్దంలో తన ప్రతిబింబం చూసుకొని నవ్వుకుంటాడు. ఇంతలో బట్లర్ వస్తాడు.]

వేదాం : లోకనాథం! నాకు ఎన్నియేళ్లు వున్నాయంటావ్?

బట్లర్ : ఎన్నైనా ఉండవచ్చును సార్!

వేదాం : కాని నేనొక్కొక్కప్పుడు చాలా కుర్రవాణ్నిగా కనిపిస్తాను కదూ!

బట్లర్ : అవును సార్...పసిపిల్లల్లా కనిపిస్తారు.

వేదాం : నేను వాళ్ళ నాన్నలాంటి వాడినంది జానకీ దేవి!

బట్లర్ : బాగా అన్నారు సార్!

వేదాం : అవును...ఇకముందు అటువంటి పొరపాట్లు రాకుండా వుండడానికి ఒక తెల్లటిగడ్డం అతికించుకోవాలి.

బట్లర్ : అయితే, బజారులో ఆర్డరు చెయ్యమంటారా సార్!

వేదాం : థాంక్స్....తరువాత ఆలోచిద్దాం.

బట్లర్ : ఈ వారంరోజులు బాగా గడిచినయ్ సార్!

వేదాం : చాలా బాగా గడిచినయ్....నాకు చాలా వయసుమీరిన పిల్లలున్నారు ఈ వారంలో... తెలుసా?

[వాళ్లు ఒకళ్లనొకళ్లు చూస్తూ నిలబడ్డారు. మరుక్షణంలో వాళ్ల హోదాలు మరచిపోయి వాళ్ళిద్దరూ మెల్లిగా నవ్వు మొదలుపెట్టి విపరీతంగా నవ్వుతారు...మధ్యలో వేదాంతం "చూడు చూడు ఈ పిల్లలు", "వీళ్ళకు నేను నాన్నని" అంటాడు. "చాలా బావుంది సార్" అంటూ బట్లరు నవ్వుతాడు.

ఇంతలో వాకిలి తలుపు చప్పుడౌతుంది. వాళ్లు ఎవరి ఉద్యోగంలో వాళ్లు ప్రవేశిస్తారు. వేదాంతం వెళ్ళిపోతాడు. బట్లర్ గదిలో సామానులన్నీ సర్దుతాడు.

అంతా మొదటి రంగంలానే వుంటుంది. బట్లర్ వెళ్ళి తలుపుతీస్తాడు. తలుపు అవతల నుంచి మాటలు వినిపిస్తాయ్...]

మగగొంతు : చూడండి...ఇది హోటలేనా?...మేము దారితప్పినట్లుగా వున్నాం......ఈ రాత్రికి యిక్కడ ఉండవచ్చా? మేము—

[తెర]

# అభినవభారతి

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

అభినవగుప్తుని గురువగు తౌతభట్టు (లేక తోతభట్టు) నాట్యశాస్త్రమును వ్యాఖ్యానించినట్లు కన్పించును. కాని ఇతనివద్ద నాట్యశాస్త్రము నభినవుడు పఠించియుండుటచే ఇతని భావముల ననేకపర్యాయము లీతని శిష్యుడు ప్రస్తుతించి, శిరసావహించినాడు. తౌతభట్టు రచించిన కావ్యకౌతుకము కాలవాహినిలో లీనమైనది. కాని అందలి విషయసమూహము లోచనలోనికి, అభినవభారతిలోనికి చక్కగా, సమగ్రముగా అనువదింపబడినది.

వివిధ పాఠభేదములతో నయోమయమై కన్పించుచు, కీకారణ్యప్రాయమైయున్న నాట్యశాస్త్ర ప్రతులను చక్కగా అవలోకించి, చక్కని పాఠమును తోతభట్టు సంస్కరించి తనశిష్యున కిచ్చినాడు.

"పఠితోద్దేశ క్రమ స్త్వస్మ దుపాధ్యాయ
పరంపరాగతః" (అ. భా. (II) 298)

అని అభినవుడు పదునారవ అధ్యాయమున చెప్పుటచే నీ తోతభట్టు సల్పినకృషి తెలియవచ్చుచున్నది. నాట్యశాస్త్రప్రతులను సంస్కరించిన తోతభట్టు మన ప్రయాసను చాలవరకు సులభము గావించినాడు. ఇతనిచే సంస్కృతిమైన పాఠము నభినవు డంగీకరించి వ్యాఖ్యానించెను. అభినవుని వ్యాఖ్య నవలంబించి ఆ పాఠము నే పునరుద్ధరింపవలసిన అవసరమున్నది.

శ్రేయోదాయకమగు ప్రవృత్తికి ఉత్సాహ సంపదను చేకూర్చుచు, తదభివృద్ధికై స్వవిజ్ఞానక్రమోపారూఢగురురూపమగు సర్వబ్రహ్మాధిపతి పరమేశ్వరవిషయము, స్మృత్యౌత్సుక్యధృతిమత్యాది లక్షణము, బాహ్యకరణీయవిషయము నగు జడతావహిత్థ ప్రభృతి భావగణమును పురస్సరముగా గాలించి, ధర్మవీరానుప్రవిష్టమై, తదుచితాంగిక వాచికానుభావప్రకటనపూర్వమైన స్వప్రవృత్తి ప్రయోజనము నే ఈ నాట్యశాస్త్రము నిరూపించవలెనని తోతభట్టు పలికినాడు. కాగా లౌకికపదార్థవ్యతిరిక్తము, తదనుకార ప్రతిబింబాలేఖ్యసాదృశ్యారోపాధ్యవసాయోత్ప్రేక్షాస్వప్నమాయేంద్రజాలాది విలక్షణము, ఆస్వాదనరూపసంవేదనసంవేద్యము నగు వస్తువును రసస్వభావముగల నాట్యమని చెప్పవలసివచ్చుచున్నది భట్టనాయకుని వాదములోని సారాంశమైన ఈ భావమును తోతభట్టు ప్రపంచించినాడు.

నాట్యము నియతానుకారముగాని, అనియతానుకారముగాని కాజాలదని కావ్యకౌతుకమున తౌతభట్టు వివరించుచు శ్రీశంకుకవాదమును దూషించినాడు. ఈ దూషణలోని సారాంశము నభినవుడు మనల కిచ్చినాడు. అభినయహస్తముల సందర్భమున

"ఉపాధ్యాయాస్త్వాహుః — 'అభినయహస్తాయే
వక్ష్యంతే తత్ప్రధానస్యకరణస్య వాక్యార్థాభినయే
ప్రయోగః, న తు కేవలవర్తనాప్రధానస్య కేవల
నృత్తహస్తప్రధానస్యవా; తస్యతు నృత్తే ప్రయోగః
ప్రాధాన్యేన' ఇతి." (అ. భా. I. 109)

అని ఉపాధ్యాయమతము గలదు ప్రధానకరణము నాడు నపుడు వాక్యార్థాభినయమున నే అభినయహస్తములను యోజించవలెనని భావము. కేవలము సాహిత్యములో నే గాని, కేవలము వాదమున నే వ్యాపృతుడు గాక, అభినయమునకు జెందిన అభ్యాసములో సహితము తోతభట్టు కృషిసల్పెనని ఇచట తెలియుచున్నది. తద్ద్వారా అభినవుడుగూడ నృత్తాభ్యాసములో నారితేరెనని చెప్ప వీలగుచున్నది.

"కరణాంగహారాన్ ప్రయుంజీతేతి భాండవాద్యస్యా
నుప్రయోజ్యతా ప్రాధాన్యేనోక్తా, యథోక్తం భట్ట
తోతేన–'పర్యాయశస్త్రశ్రేస్య ప్రయోగ' ఇతి."
(అ. భా. I. 187)

అని అభినవు డనినపుడు తౌతభట్టుగూడ నాట్యశాస్త్రమును వ్యాఖ్యానించెనా? యను సందేహము

కలుగగలదు. లేనిచో నీ పంక్తి కావ్యకౌతుకములోనిది కానోపును. ఇట్లే

"చతుర్విధాభినయ యోగాభావాద్రసభావా
ప్రాధాన్యా ద్గీతవాద్యనృత్తానాం యథేష్టం
ప్రాధాన్యం
నర్తకీవృద్ధైః కావ్యే వస్త్వపేక్షత్వాత్ ...పిండీ
బంధ ప్రకారే వైచిత్ర్యాం తే నృత్తమాత్ర
విశ్రాంతః
ప్రయోక్తృ ప్రవర్తయిత్ర గాత్రస్పృష్టఫల
ప్రాధాన్యా
చ్చ, తద్విలక్షణం నాట్యం తద్వృత్తిర్భిద్యత
ఇత్యేవం శబ్దస్యార్థ ఇత్యుపాధ్యాయమతమ్"
(అ. భా. I. 207)

అనుచో 'ఏవం' శబ్ద మీ రీతిగా వ్యాఖ్యానింపబడు టను గమనించితిమేని తోతభట్టు నాట్యశాస్త్ర వ్యాకర్తలలోనివాడని చెప్పక తప్పదు.

శుష్కావకృష్టను తోతభట్టు ప్రయోజనమును నిర్వచించినాడు (I. 220). పైగా అభినయమునకు సంబంధించిన విషయములయందు, గీతాతోద్యవిధాన మున ననేకపర్యాయము లభినవు డుపాధ్యాయమత మును వివరించియున్నాడు. సాహిత్యవిషయముల యందు తోతభట్టు విశేషకృషి సల్పెను. రససిద్ధాంత మితని చేతులలో సమగ్రపరిపోష మందినది. నాట్యమే రసమని, కావ్యనాట్యము లభిన్నములని, కావ్యార్థ విషయము ప్రత్యక్షకల్ప సంవేదనోదయముకాగా రసోదయమగునని తోతభట్టు చెప్పెనని పల్కి,

"ప్రయోగత్వమనాపన్నే కావ్యే నాస్వాద
సంభవే,"

"వర్ణనోత్కలికాభోగప్రౌఢోక్త్యా సమ్యగర్పితాః
ఉద్యానకాంతాచంద్రాద్యాభావాః ప్రత్యక్ష
వత్స్ఫుటాః."

అను కావ్యకౌతుకములోని పంక్తుల నభినవుడిచ్చినాడు (I. 291-292)

రతి విప్రలంభమున కంగము గాకపోయినచో రసత్వము నందజాలక, స్వాతంత్ర్యప్రవృత్తిలో కన్పించు రతివలె నుండునని చెప్పు సందర్భమున,

"స్వాతంత్ర్యేణ ప్రవృత్తౌ తు సర్వప్రాణిషు సంభవః
(I. 310)

అను కావ్యకౌతుకపంక్తిని అభినవు డొసగినాడు. భీభత్సరసమునకు రూపత్రైవిధానమును తౌతభట్టు సర్తించినాడని అభినవు డనినాడు. ఈ వాదమును అద్భుతరసవివరణలో భారతిలో గానవగును.

"అభినయ శబ్దస్య వైచిత్ర్యం పశ్యంతః
ఉపాధ్యాయా
వ్యాచక్షతే-'అభిశబ్దేనాభిముఖ్యం,
నిశబ్దేననిష్ఠో,
యశబ్దేన యదర్థో లక్ష్యతే; తేన
స్వపార్శ్వే స్వసమ్ముఖ
దేశాగమనేనాభిముఖ్య మభిముఖత్వం, పార్శ్వ
క్షేత్రేతు రేచన పూర్వ మధోముఖోత్తాన
పరివర్తనేన
చ య చ్ఛబ్దార్థ మభినయే దితి" (II. 31)

అనునపుడు అభినయశబ్దమునకు తోతభట్టు వ్యాఖ్య మనకు లభించుచున్నది. ఉత్తముల హస్తములు లలాట క్షేత్రమున, మధ్యముల చేతులు వక్షస్సున, అధములవి అధోభాగమున సంచరించవలెనని చెప్పు తొమ్మిదవ అధ్యాయ శ్లోకమున గల విప్రతిపత్తులను నివర్తింప జేయుచు,

"యే చతురారాలాద్యైః సత్త్వానృత గాంభీర్య
శౌండీర్యాది విరుద్ధవిషయా ఉక్తా స్తేషాం విభా
గార్థ మిదం వచనమ్. యేధాన్యానయ ఉత్తమా
అర్థా స్తేషా మభినయే లలాటక్షేత్రగత్వ
మిత్యాది క్రమేణ" (II. 67)

అని తౌతభట్టు అర్థముచెప్పి పాత్రల శీలమునకు, అభినయ ప్రక్రియకు గల సన్నిహితసంబంధమును నిరూపించినాడు. ధర్మి వివరణ సందర్భమున,

"యదస్త్రా స్తి న తత్రాస్య కలే ర్వర్ణన మర్హతి
యాన్నా సంభవి తత్రాస్యా త్సంభవ్య త్ర తు ధర్మతః"

అను తౌతభట్టు శ్లోక మీయబడినది (II. 216).

"మహాకవీనాం పదవీ ముపాత్తా మారురుక్షతామ్
నా సంస్కృత్య పదస్పర్శాన్సంప
త్సోపానపద్ధతిః"

అను కారిక మరియొకచో నొసగబడినది (II. 292).

లక్షణ నిర్వచనమున తౌతభట్టు వాద మొకటి గలదు. లక్షణబలము వాశ్రయించుకొని అలంకారము లకు వైచిత్ర్యము చేకూరుచున్నదని ఇతని వాదము.

ఈ వాదము నభినవు డంగీకరించకపోయినను, పూర్తిగా నిరాకరించెననికూడ చెప్ప వీలు లేదు.

ప్రఖ్యాతోదాత్త శబ్దమునకు శంకుకు డొసగిన వివరణ తోతభట్టు నిరాకరించెనని యొకచో నభినవు డనినాడు (II. 411). భట్టలోల్లటాదులు నిరాకరించిన :

"యః కశ్చిత్ కార్యవశాద్గచ్ఛతి పురుషః
ప్రకృష్ట మధ్వానమ్
తత్రాప్యంకచ్ఛేదః కర్తవ్యః పూర్వవత్తజ్ఞైః"

అను పదునెనిమిదవ అధ్యాయములోని శ్లోకమును ప్రక్షిప్తము కాదని, తౌతభట్టు చక్కగా సమర్థించినాడు (II. 423).

"ఉపాధ్యాయాస్త్వాహుః—'తత్ర నాయకయో రనుప్రాప్తిర ప్యన్యగతైవ. యథా భగవత్ భవానీ పతేః గిరిరాజపుత్రీ సంగమన మింద్రాదీనాం తారకాక్రాంత నిజరాజ్య సమున్మోచనాయ భవతి' ఇతి" (II. 440)

అని యొకచో తోతభట్టుయొక్క అభిప్రాయ మీయబడినది. కైశికీ విషయమున

"ఉపాధ్యాయాస్త్వాహుః—'న కామ సద్భావ మాత్రా దేవ కైశికీ సంభవః, రౌద్రప్రకృతీనాం తదభావాత్.

విలాసప్రధానం యద్రూపం సా కైశికీ, నచ చరితం తద్రూపానుప్రవేశేఽపి తద్వ్యవహారతి, ప్రాధాన్యకృతో హ్యసా విత్యుక్తమ్ తేన తత్రవిషయే భారత్యాది వృత్త్యంతరాభిధాన మేవయుక్తమ్' ఇతి" (II. 441).

అని చెప్పబడినది. చివర చివరి అధ్యాయములలో తౌతభట్టు కారిక లనేకము లొసగబడినవి. కారికలు కావ్యకౌతుకములోనివని యంగీకరించినను, గద్యభాగములనుగూర్చి నిర్ధారణ చేయుట కష్టము. ఏది యెట్లున్నను, అభినవునివంటి శిష్యుని సంపాదించిన తౌతభట్టు తన శిష్యుని రచనలలో సదా కన్పించుచున్నాడు. కాన నేటి నాట్యశాస్త్రముయొక్క పరిష్కృతప్రతి ఈ గురుశిష్యుల కృషియొక్క ఫలితమని వేరుగా చెప్ప నక్కరలేదు.

మహామాహేశ్వరుడు, ప్రత్యభిజ్ఞాదర్శన నిష్ణాత, సాహిత్యాలంకారశాస్త్ర కుశలవుడు, రసధ్వనివాదము నుద్ధరించి ప్రచారములోనికి తెచ్చినవాడు నగు అభినవగుప్తునిగూర్చి కొంత చెప్పవలసియున్నది. లోల్లటుడు పూర్వమీమాంసను, శంకుకుడు న్యాయదర్శనమును, భట్టనాయకు డద్వైతవేదాంతమును గ్రహించి నాట్యశాస్త్రమును వ్యాఖ్యచేయ నెంచినట్లు, అభినవుడు ప్రత్యభిజ్ఞాదర్శనముతో రససిద్ధాంతమును నిర్వచించ బయలుదేరినాడు. ఈ నిర్వచనమున కొంతవరకు భట్టనాయకుని వాదము కన్పించుచున్నది కాని అభినవుడు తన శివాద్వయ వేదాంతమును విస్మరించజాలడు. శాంతరసవిచారములో సహితము శాక్తశైవాగమములను ప్రస్తుతించినాడు. ఇతనికి పూర్వ మున్న వ్యాఖ్యాతలు, నాట్యశాస్త్రకర్తలు అభినవభారతిలో కన్పించుచున్నారు. భట్టనాయక తౌతభట్టులతో తాదాత్మ్యమునందిన అభినవగుప్తుడు నాట్యశాస్త్రమునకు సమగ్రముగా వ్యాఖ్యను రచించినాడు. కాని ప్రస్తుతము మనకు కొన్ని అధ్యాయములలో నీతని వ్యాఖ్య లభించుటలేదు. కొన్ని అధ్యాయములలో సంక్షిప్త వివరణము నొసగియున్నాడు. కాని వ్రాసినంతవరకు, మనకీ వ్యాఖ్య లభించుచున్నంతవరకు విశిష్టవిషయమే గోచరించుచున్నది. అభినవభారతి లేనిచో నాట్యశాస్త్రము నర్థము చేసికొనజాలమనుటలో నతిశయోక్తి లేదు.

రసము, ధ్వని అనునవి సాహిత్యలోకమున ప్రసిద్ధిగాంచినవి. రససిద్ధాంతము భరతుని కాలమునుండి వచ్చుచున్నది. ధ్వనివాదము ఆనందవర్ధనుని చేతులలో సమగ్రరూప మందినది. ఈ వాదములను రెండింటిని సమన్వయించి, మేళవింపగలిగిన భట్టనాయకుని మతము నవలంబించి అభినవగుప్తుడు రసధ్వనిసిద్ధాంతమునకు వైశిష్ట్యమును తెచ్చినాడు. ఈ దృష్ట్యా నాట్యశాస్త్రము నవగాహన చేసికొని, వాక్యభేదాదిదోషములను తావొసగక, విషయైక్యము నభినవభారతిలో ప్రతిపాదించగలిగినవా డభినవగుప్తుడు. కాని సాధ్యమైనంతవరకు ప్రత్యభిజ్ఞాదర్శనసిద్ధాంతములతో సమన్వయము నందురీతిగా నాట్యవేదవివృతి నిచ్చినాడు. కాగా నీవివృతిలో నా సిద్ధాంతములకు సరిపోని వాదములు, వివరణాలు త్రోసివేయబడినవి. ఇట్లు నిరాకరింపబడిన వాదములలో భట్టనాయకుని వాదమొక్కటే పునరుద్ధరింపబడ దగినది.

సౌందర్యమీమాంసాసంప్రదాయమున నభినవుని వాక్యము వేదతుల్యమైపోయినది. తర్వాతి సమీక్షకు లీతని భావములను తమ సిద్ధాంతములుగా పఠింపసాగిరే గాని, ఈ సిద్ధాంతము తమ దార్శనిక సిద్ధాంతములతో సరిపోవునా ? యని గమనించినవారు కారైరి. జగన్నాథుడు సహితము బహిరంగముగా నభినవుని త్రోసివేయ సాహసింపలేదు. వక్రోక్తిజీవితకారు డభినవుని చాలవరకు శిరసావహించినాడు. వ్యక్తివివేకకారుడు ధ్వనివాదము నంగీకరింపజాలక పోయినను, అభినవునిపై గౌరవము జూపినాడు. తను దూషించిన వాదములపై అభినవునకే మిక్కుటమగు గౌరవము కలదు గనుకనే.

"తస్మాత్సతా మత్ర నదూషితాని
మతాని, తాన్యేవ తు శోధితాని;
పూర్వప్రతిష్ఠాపిత యోజనాసు
మూలప్రతిష్ఠా ఫలమామనంతి"

అని చెప్పగలిగినాడు. పూర్వ మతములను శోధించి, అందలి సారమును గ్రహించి, శాస్త్రము నవగాహనము చేసికొనుటయే తన పరమావధిగా నుంచికొనినాడనని చెప్పినాడు. కావుననే శాస్త్రమును మనకు సులభగ్రాహ్యముగా చెప్పగలిగెను.

సాహిత్యవిషయములపైననే గాక, గీతాతోద్యాభినయాదివిషయములపై గూడా అభినవుడు విజృంభించి, తన పాండిత్యమును, సహృదయాభిజ్ఞత్వమును చూపగలిగినాడు. అభినయప్రకరణములను గమనించితిమేని, అభినవుడు నృత్తాభ్యాసకుశీలవుడని బోధపడగలదు. గీతాతోద్యములయందుగూడ నిట్టి పటిమనే చూపినాడు.

పాఠమును సంస్కరించుటలో సహితము అభినవుడు చక్కని సహృదయత్వమును వెలిబుచ్చినాడు. పాఠభేదములను తిరస్కరించుటలోను, వ్యాఖ్యానభేదములను నిరసించుటలోను, మంచి ఉపపత్తుల నీయగలిగినాడు. ప్రాతప్రతులను పోల్చుట, పాఠక్రమమును దిద్దుట, పునరుక్తులను త్రోసివేయుట మొదలగు పరిశోధకకృత్యములలో సహస్రవర్షముల క్రితమే అభినవు డారితేరెనని గమనించుట ఆశ్చర్యకరమే.

పూర్వ వ్యాఖ్యాతలు, పూర్వ శాస్త్రకారులు అభినవునిలోనే మనకు కన్పించుచున్నారు. భట్టనాయక, తోతభట్టు లితనిలో నేకమై పోయినారు. ఇట్టి అభినవుని మన మనుసరించుటలో దోషములేదు; కాని వివేకముతో ననుసరింపవలెనని మరువరాదు.

# జీవితపు మలుపు

మురయా

ఆ విషయంలో ఎవరు ఏమని అనుకొన్నా—సాను భూతితో కానీయండీ—ఆదుర్దాతో కానీయండీ—వివిధంగా అనుకొన్నా ఆయనమాత్రం ఇల్లా అనుకొన్నారు. వీడు పసివెధవ—ఇంత అన్యాయం జరిగిపోతోందే—ఏమైపోతాడో! అని బాధతో అనుకొన్నారు. ఇన్నాళ్ళూ అతని విషయమై పడిన శ్రమ అంతా యథాయథాలై పోతున్నదే అని మథన పడుతూ అనుకొన్నాడు.

కాని ఆయనకేమిటో ఒక ఆశ కలిగింది. ఆ... కేవలమూ అది ఆశమాత్రమే. ఆవిషయ మాయనకూ తెలుసును. అసంభవమని తెలిసికూడా తనకున్న ఆపేక్షకొద్దీ—జాలికొద్దీ అల్లా ఆయన ఆశపడ్డారు. "అవధాని ఆ గండంగడచి బయటపడతాడు—పడ వచ్చు" అదీ ఆయన ఆశ. రోగం రొష్టూ లేకుండా మొండిగా బండగా బలంగా నెమ్మదిగా ఉంటూ వచ్చినవాడికి అకారణంగా అఘాటుగా అల్లాంటి ప్రమాదం జరిగేసరికి ఆయన మనిషి నిలువునా నీరైనారు. ఏమిచెయ్యడానికీ వెంటనే తోచలేదు. చెయ్యనూలేదు. ఆయన భార్య 'నాయింట్లో ఉండగానే వీడికీ ప్రమాదం సంభవించిందే. ఏదైనా అపసవ్యం జరిగిపోతే ఆపాపం నాకొంపకు చుట్టుకుంటుందేమో భగవంతుడా' అని భయపడింది. అందుకనే ఆవిడ దేవునివిగ్రహంముందు నిలబడి ఓక్షణం చేతులు జోడించింది. తన్నుతాను తిట్టుకొంటూ, అతన్నీ, అతన్ని తన యింటికి పంపిన విధినీ, అతన్ని అక్కడ ఒంటరిగా వదిలివెళ్లిన అతని అయినవాళ్లనూ ప్రస్తావనలోకి తీసుకొనివచ్చింది. "మనకెందుకు వచ్చిన బెడద—వద్దండీ అంటే మీరు విన్నారూ?" అని భర్తను దెప్పిపొడిచింది. విడిపోతున్న చీరకొంగును మాటిమాటికీ బొడ్డున దోపుకొంటూ, ఇల్లంతా తిరిగింది. నిజానికి ఆవిడ చాలా భయపడ్డది. ఆయన—మాధవయ్యగారు ఆవిడను ఊరడించి, తాను తాపీగా ఆలోచించడానికి సమయం లేకపోవడంచేత గాభరా పడి—ఆందోళనపడి—పడుతూ ఆలోచించారు.

ఆయనకు వెంటనే ఏ ఉపాయమూ తట్టలేదు.

జరిగిందేమో ప్రమాదకరమైన సంఘటనే. పైగా అది జరిగికూడా కొన్నిగంటలు గడచిపోయినాయి. ఆయన ఒకసారి లోపలకూ ఒకసారి అతని గదిగుమ్మం దగ్గరకూ వెళ్లివచ్చారు. తిరిగి వెళ్లారు.

ఆవిషయం ముందుగా ఆయనకే తెలిసింది. సాయంకాలంపూట మూడుగంటలకు బజారునుంచి వచ్చాక అప్పటిదాకా తాను తిరిగి తిరిగి రావడంవల్ల మళ్లా బయటకు వెళ్లలేక అతన్ని ఏదో చిన్నపని మీద పంపుదామని ఆ గదిగుమ్మందగ్గరకు వచ్చిన ఆయనకు అతనేదో తపనపడుతున్నట్లు ఇట్టే తెలిసిపోయింది భయపడుతున్న అతను విషయం చెప్పక తప్పిందికాదు. తప్పనిసరై — చెబితే ఏమంటారో అని భయపడుతూనే—చెప్పక ఇంకా ఆలస్యంచేస్తే ఏం ప్రమాదం ముంచుకొని వస్తుందో అని గుంజాటన పడుతూ చెప్పేశాడు. అతను అనుకొన్నంతా అయ్యింది. ఆయనకు మొదట కోపంవచ్చింది. "ఇంత అజాగ్రత్తవెధవ్వయితే ఎల్లారా" అని కేకలు వేశారు. మరి ఇంతసేపూ నాకెందుకు కబురు చెయ్యలేదని అతనిపైనా తన భార్యపైనా నిష్టూరాలు వేశారు. అంతలో విచారం కలిగింది. ఆదుర్దాపడ్డారు. అల్లా ఆయన ఖంగారుపడుతూ ఆవిడతో అన్నారు. "ఏం చేద్దామే—నువ్వయినా ఉపాయం చెప్పవే" అని. ఆవిడ మరింత గాభరా పెట్టింది.

ఆయన మళ్లా అతని గదిలోకివచ్చి "ఎల్లా వుందిరా?" అని అడిగారు. అతను మూలుగుతూ సంజ్ఞ చేశాడు. ఆయన అక్కడే మరోనిముషం నిలబడి అతనివంక—ఆర్ద్రంగా చూచారు. జాలి పొంగి వచ్చింది. అప్పటికే తాను విషయం తెలుసుకొన్నాక

పదినిముషాలకాలం వృథాచేశానని స్ఫురణకు తెచ్చుకొని బయటకు పరుగెత్తారు.

ఆయన—ఏదో ఒక అభిప్రాయం మెరుపులా కలిగి — అల్లా పై ఉత్తరీయమైనా వేసుకోకుండా ముందుకు వెళ్ళారేగానీ - రాక్షసు ఇంటికి దారితీశారే గాని—ఆయన మనస్సు వెనక్కి పరుగెత్తింది. అతని దగ్గరకే వెళ్ళింది. ఆయన అతనివిషయమై అంత గాభరాపడడానికి—నిజానికి అతనేమీ అతను తనకు గానీ—తన భార్యకుగానీ బంధువు కాదు. కాని ఆయన హృదయం కదిలింది.

## 2

అవధాని పదిహేనేళ్ళ వయస్సులో సుమారైన ఎత్తుగావున్న కుర్రవాడు. గత నాల్గుసంవత్సరాల లోనూ—ఆ సంవత్సరాలు అతనికి ఎల్లా గడిచినప్పటికీ—నాలుగు అంగుళాలు ఎత్తు పెరిగాడు. నిదానంగా మెట్టు తర్వాత పైమెట్టు ఎక్కుతూ ఉన్నతపాఠశాల చదువు సాగిస్తున్నాడు. మరో మూడు నాలుగేళ్ళలో మరో నాలుగంగుళాలు ఎదక్కపోడు. అవకాశం లభిస్తే అన్నివిషయాల్లోనూ అతను పైస్థాయికి వెళ్ళగలడు. గతాన్నిబట్టి చూచినా అల్లాగే అనిపించి తీరుతుంది.

తల్లితండ్రులచాటున ఉండి నిక్షేపంలా పాతికేళ్లు పైబడేదాకా ఏ చదువో ఓ చదువు వెలిగిస్తూ బస్తీలలో కాలాన్నీ ధనాన్నీ వ్యయపరుస్తూ సుష్టుగా తిని తిరిగే అదృష్టం కొందరికే ఉంటుంది. ఆ కొందరిలో అవధాని ఒకడు కాడు. దిక్కూ దివాణమూ లేకుండా ఏకాకిలా పెరిగి వెట్టివెధవలా తిరిగి—తను కావాలని చేసుకోగానో—విధివశానో జీవితపు నడక భ్రష్టమైపోగా—ఏ పాడుజీవితాలనో గడిపి—కొంత పైకివచ్చినా వచ్చినట్లే అనిపించక—ఏ కొన్నాళ్లో సుఖపడ్డా సుఖపడినట్లే అనిపించక—చివరకు ఎక్కడో రాలిపోయేవాళ్లు కొందరు ఉంటారు. ఈ కొందరిలోనూ ఇతను ఒకడుకాడు.

అవధానికి తల్లీ తండ్రీ ఇద్దరూ ఉన్నారు. అతను సుష్టుగా తిని తిరగనూలేదు. ఏకాకిలా ఇష్టానుసారంగా ఊరేగనూలేదు. కొందరి జీవితాలు అల్లా చూస్తుండగానే అత్యున్నతస్థాయి సందుకొంటాయి—చూచే వాళ్లకు నిజానికి కొంత ఈర్ష్యకూడా కలిగిస్తూ. కొందరు అమితోత్సాహంతో ప్రవాహంలా ముందుకు త్రోసుకొనిపోతారు—వెనకముందులు చూడకుండానే. వారిలో కొందరు బొసుపడతారు. కొందరు నెమ్మదిగా—సింహాచలంకొండ మెట్లెక్కినట్లుగా నడుస్తారు. అవధాని కొంతదూరం ప్రయాసపడుతూ నిస్పృహనూ—ఈర్ష్యనూ వెంటపెట్టుకొని బరువుగా—పోదూ పుణ్యమూ వద్దు పురుషార్థమూ వద్దు—ఏం ఈ కొండ ఎక్కకపోతే ఏం అని ఎక్కలేక ఎక్కే తైర్థికునిలా జీవితపుమెట్లు గడచాడు అల్లా నడుస్తూ—ఒక మలుపులో—ఆ మలుపు తిరగగానే పరుగు అందుకొన్నాడు. అతని నడకే చిత్రమనిపించింది కొందరికి. మనిషినిచూస్తే బొద్దుగా ఆరోగ్యంగా చామనచాయలో—కాదు పచ్చగా—పెద్దఇళ్లల్లో పుట్టిన ఆడపిల్లలా—పాలు పెరుగు త్రాగుతూ, నెయ్యి అదీ కాస్త జాస్తీగానే తినగా మిసమిసలుపోయే మేనిపచ్చదనం కాదది. అది కానేకాదు. స్వతహాగా వచ్చిన రంగది. ఆ రంగులో అల్లా కన్పించేవాడు. ఆ రంగూ అదీ చూస్తే కొంత ఆకర్షణీయంగా కన్పించవచ్చునేమో గాని ఎంతపాటి కష్టమైనాసరే రానీయండి భరిస్తాను అని కాసేపూ భరించక ఏంచేస్తానులే అని కాసేపూ అంటున్నట్లుండే అతని ముఖమూ, విచారాన్నీ అసూయనూ దాచేసుకోగలను అన్నట్లుండే అతని కన్నులూ పరీక్షగా చూస్తే అతనేమంత ఆకర్షణీయంగా కన్పించడు. అందుకే అతనేమంత అందమైనవాడు కాదు అని అన్నా పెద్ద అభ్యంతరం ఉండనక్కరలేదు.

అవధాని అందమైనవాడు కాదు. కాని అతన్ని చూడగానే ఒకటిమాత్రం అనిపించితీరుతుంది. అతను మంచి ఆరోగ్యవంతుడనీ పనికి బద్ధకించేవాడు కాదనీ. ఈ రెండుగుణాలూ మొగపిల్లల్లో కన్పిస్తే—కనీసం అల్లుళ్లకోసం వెతికే ఆడపిల్లల తండ్రులైనా ఆకర్షింపబడతారు. ఆ దృష్టి కలుగుతుంది. కాని మాధవయ్యగారు అల్లా ఆకర్షింపబడలేదు. అటువంటి భావాలవల్ల ఏర్పడిన ఆపేక్ష కాదది. నాలుగేళ్ల నుండి తనయింట్లో ఉండడమువల్ల గానీ—అతని ప్రవర్తనవల్లగానీ—ఆయనకు అతనమీద అట్టి భావం ఏర్పడింది.

* * *

అవధాని తండ్రిని వెంటపెట్టుకొని వచ్చి బెజవాడ హిందూ హైస్కూలులో తర్డుఫారంలో చేరాడు.

కొడుకు పట్టుదలమీద వచ్చి బళ్లో చేర్పించి మొదటి నెల జీతమైతే ఎల్లాగో కట్టగలిగాడేగాని ముందు ముందు అతని చదువు ఎల్లా సాగుతుందో ఆ తండ్రికే తెలియదు. కాని ఒకసారి చేరాక పట్టుదల చూపడం అవసరం అనిమాత్రం ఆయన ఊహించారు. తనకు చిన్ననాటి స్నేహితుడైన మాధవయ్యగారిని ప్రాధేయపడితే—మాధవయ్యగారు అతనికి ఉండడానికి తన యింట్లోనే ఓ చిన్న గది ఇచ్చారు స్నానాదికాలకు ఏర్పాటు చేశారు భోజనంవిషయంలో ఉపాయం చెప్పారు.

అవధాని తండ్రి సరేనన్నాడు. ఆయన కొడుకును మాధవయ్యగారికి అప్పజెప్పి వెళ్లుతూ "సరే వీణ్ణి నీ కప్పగించి వెళుతున్నా. అన్నివారాలూ కుదిరి సాగుతుందా చదువు సాగనివ్వండి. అట్లా సాగుతున్న సమయంలో వాడు కొద్దో గొప్పో ఇబ్బంది పడినా మరేం బెంగలేదు. గడవనీయండి. కాస్త దార్లో పెట్టండి. ఇప్పట్లో వాడు సంపాదించి నాకు పెట్టవలసిన స్థితి ఏమీ లేదు. నేనెట్లాగో—అప్పో సప్పో చేసి ఇల్లు గడుపుకుపోతా. వాడు మధ్యలో భయపడినా—బెంగపడినా ఒకటిమాత్రం స్పష్టంగానే చెప్పేసెయ్యండి. 'ఒరేయ్ అబ్బీ ఇంటికి వెళ్ళిమాత్రం ఏంబావుకొంటావ్, ఎల్లాగో ఇక్కడే గడిపి గట్టెక్కు' అని. ఒకవేళ ఈ చదువు సాగక్కపోతుందీ—ఏదైనా పనిలో ప్రవేశపెట్టండి. ఒక అచ్చాఫీసులో చేర్పించి పని నేర్పించండి. కొన్నాళ్లకు పొట్టపోసుకొనే శక్తి వస్తుంది" అని ఇల్లా ఆయన చెప్పి అతన్ని వృద్ధిలోకి తీసుకొనివచ్చే బాధ్యత మాధవయ్యగారిమీద పెట్టి వెళ్లారు.

మాధవయ్యగారైనా ఏమంత — ఉన్నవాడు కాదు. సాధారణకుటుంబం. ఇద్దరు ఆడపిల్లలూ వారి తర్వాత ఒక పాలుత్రాగే మొగపిల్లవాడూ— అప్పటికి. ఇంకా వరుసగా సంతానం కలిగే సూచనే గాని అప్పటితో ఆగే వ్యవహారంలా కన్పించలేదు. బస్తీ కాపరం. చేస్తున్నదేమో మాస్టరుగిరీ. ఆయన భార్య ఎంత పొందిగ్గా వాడినా చాలీచాలక గడుస్తున్న సంసారం. అందువల్లనే ఆయన అవధానికి ఉండడానికైతే వరండాలోవున్న గది ఇవ్వగలిగారేగాని పూర్తిగా తానుగా భోజనం ఏర్పాటు చెయ్యలేక పోయారు. అటువంటి సదుపాయం చేయాలని మనస్ఫూర్తిగా మనస్సులో ఉన్నా స్తోమతులేక వారాలు కుదిరించిపెట్టారు. సంసారపక్షంగా తానూ ఒక వారం ఇచ్చారు.

అతనుకూడా అట్టే అభిమానాలకు పోయేవాడు కాదు. అందుకనే ఆయన దారిచూపిస్తే ఆదారిని తల వంచుకొనే నడిచాడు—లోపలలోపల ఏమని అనుకొన్నా ఇది కావాలని అడిగి వేయించుకోకపోయినా ఆయా ఇళ్లల్లో అతను కొంత తృప్తిగానే తిని వచ్చేవాడు. ఆయా ఇళ్లి ఇల్లాళ్లు ఎప్పుడైనా సినిమాలకు వెళ్ళితే భోజనం చెయ్యకుండానే గదికివచ్చి పడుకునేవాడు. ఒకపూటా అరపూటా భోజనం మానేస్తే అస్తవ్యస్తమయిపోయి తోటకూరకాడలా వాడిపోయే మనిషి కాదతను. ప్రొద్దుట భోజనం చెయ్యకుండా బడికి వచ్చేసినా సాయంకాలందాకా అతను బళ్లో అందరికీ సాధారణంగానే కన్పించేవాడు. మనిషి స్థూలంగా కన్పించడంవల్ల అట్లాంటి ఉపవాసపు లక్షణాలు అతనిలో కన్పించేవి కావు మాధవయ్యగారికే అందేవికావు కాని అతని మనస్సులోమాత్రం— అందరిపిల్లల్లా తనూ మూడుపూట్లా తిని క్రొత్తబట్టలు తొడుక్కుంటూ తిరగలేకపోతున్నానే అనీ-వాళ్లకు కలిగిన సౌభాగ్యం తనకు లేకపోయిందే అనీ—కొంత ఈర్ష్య — కొంత నిస్పృహా కలుగుతూ ఉండేవి. ఆ అభిప్రాయాలు వయస్సు తక్కువ కావడంచేత సరిగా దాచుకోలేకపోయాడు. అణచివేసుకోవడము మాట అల్లా ఉంచి, అందువల్లనే తన తరగతిలో ఉన్న గొప్పఇంటి బిడ్డలు ఎవరైనా అతని దుస్తులను చూచో అతని వాలకం చూచో కాస్త నవ్వితే-అతను సహించలేక దెబ్బలాటకు దిగేవాడు. దెబ్బలాటకుపోయి అవమానం పొందేవాడు. మాధవయ్యగారుకూడా అతన్నే కోప్పడేవారు. "ఒరేయి వెంకవధాన్లూ—అసూయ పడడము మంచిపని కాదురా" అని వారు చెప్పిన పాఠాలు అతని కప్పట్లో అర్థం కాలేదు

ఆ సంవత్సరం నెలనెలా మాధవయ్యగారే తాను సొంతంగా అయితేనేమి—ఇతరులదగ్గర పోగుచేసి అయితేనేమి బడిజీతం కట్టి అతనికి అండగా నిలచారు.

కొంత కష్టంమీదనే ఆయేడు గడిచింది.

* * *

నాల్గవ ఫారంలోకి వచ్చాడు.

చదువుకు కొంతగా అలవాటుపడ్డాడు అవధాని. కొంత ఊహ వచ్చింది. మాధవయ్యగారంటే భయభక్తు లేర్పడ్డాయి ఆయన అంటే ఆ యింట్లో అందరికీ అదే భావం. ఆయన భార్యకూడా ఆయన ఇంట్లో లేనప్పుడు ఆయనచేసే పనులమీద కొన్ని వ్యాఖ్యానాలు తయారుచేసి వల్లించినా ఆయన సముఖంలో భయంగానే ఉండేది. కాని పిల్లలతల్లి కావడంచేతా— పెండ్లి కాకముందే ఆయన తనకు దగ్గరవాడు కావడంచేతా సలహా లివ్వడానికిమాత్రం వెనకాడేది కాదు.

“అతన్ని——ఈయేడు మరెవరింట్లోనైనా ఉంచమందురూ” అన్నది మాధవయ్యగారి భార్య ఒకరోజున— తన పెద్దకూతురు పెద్దమనిషి కాబోతున్నది కదా, అయితే ఆగది కావలసిస్తుందనీ, ఆ కుర్రవాడు ఉండడం ఇబ్బందిగా వుంటుందనీ ఆలోచిస్తూ.

“చూద్దాంలే” అని మాత్రమే అని ఊరుకొన్నారాయన.

“చూద్దాంలే అంటే ఎట్లా—ఇల్లేమో చిన్నదయ్యె— నేనయితే పగలు ఆ వరండాలోనే గడిపి రాత్రిళ్లు ఈ చిన్నహాల్లో ఎలాగో ఒదుక్కొని సర్దుకొస్తున్నా ఆ మూడురోజులూ - నెలనెలా—పిల్లతో ఎల్లా?” అన్నదావిడ పెద్దసమస్య నొకదానిని ప్రతిపాదిస్తున్నట్టు. “పోదూ ఎల్లాగో సద్దుకోవాలి-పొమ్మంటే ఎక్కడికి పోతాడూ! అయినా వాడు మనయింటి పిల్లవాడులా మెలగుతున్నాడే! నువ్వు అల్లా అనబోకు” అని ఆగి ఆమెవంక కొస్త అనునయిస్తూ చూచారు. కాని ఆవిడ కొంతదూరం వాదానికే సిద్ధపడ్డది. “మనకు వీలు కానప్పుడు ఎందుకీ లేనిపోని బెడద” అని కూడా అనేసింది.

ఆయనకు వెంటనే కోపం రావలసిందే గాని ఆ పూట వేగం రాలేదు. ఆయన మరోవిషయంకూడా ఆలోచించారు. తను ఆవిడకు నచ్చచెబితే ఆవిడ కూడా అతన్ని దయగా చూస్తుందికదా అని. “తీరిక చిక్కినప్పుడల్లా పిల్లవాణ్ని ఎత్తుకొని ఆడిస్తున్నాడు. చెప్పగానే బజారుకెళ్ళి కూరలూ అవీ తెచ్చి ఇస్తున్నాడు. సాయంకాలం బడి వదలగానే ఆటలకు పోక సరాసరి ఇంటికి వచ్చి “పిన్నిగారూ— నేను తోడుతా నుండండి” అంటూ వేడినీళ్ళ కాగులోకీ—గంగాళంలోకీ నీళ్ళు తోడి నాకు సాయపడుతున్నాడు. ఇవన్నీ కాక అటు బళ్ళో—ఇటు ఇంట్లో బుద్ధిగా మసలుకొంటున్నాడు.” ఇల్లా ఆయన అతని విషయం ఒక్కటొక్కటే మెల్లగా చెప్పి “ఇంతకంటే వాడుమాత్రం ఏం చెయ్యగలడే—వాణ్ణిప్పుడు పొమ్మంటే బాగుంటుందీ—నువ్వే చెప్పు?” అని అడిగారు.

“సరే మీ ఇష్టం—ఉంచనీయండి” అన్నది మూతివిరుస్తూ. ఆయనకు కొంచెం కోపం వచ్చింది. కొస్త ఎఱ్ఱగా చూచారు. ఆవిడ అవతలకు వెళ్ళిపోయింది.

ఆయన పట్టుదలవల్ల ఆయేడు సవ్యంగానే జరిగిపోయింది. కోప్పడప్పుడు కోప్పడినా మాధవయ్యగారు అతనికి కావలసివచ్చినప్పుడు—అడక్కుండానే డబ్బులు చిల్లరగా ఇస్తూండేవారు బేడలూ, పావలాలూ. డబ్బులు చేతిలో ఉన్న రోజులలో పెద్ద ఇంటి పిల్లల్లా తనూ బడికి అమ్మవచ్చే చిల్లిగారెలూ— అవీ కొనుక్కొని అందరి ముందూ—తన్ను వాళ్ళు ఊరించినట్లే తనూ వాళ్ళను ఊరిస్తూ తినేవాడు. అవి, ఆ చిల్లరకానులు లేనప్పుడు...వాళ్లకు దూరముగా పోయి—తను వాళ్ళకంటె బీదవాణ్ణికదా అనుకొని కొంత ఈర్ష్యతో—కొంత బాధతో—వ్యధపడేవాడు. సెలవలు ఇవ్వగానే ఇంటికి పరుగెత్తాడు. మాధవయ్యగారు అతనికోసమై ఆ సెలవల్లో కొంత ప్రయత్నముచేసి ఒక చిన్న స్కాలర్షిప్పు ఒకటి వచ్చే ఏర్పాటు చేశారు.

* * *

అతను బెజవాడ చదువుకు వచ్చిన మొదటిరోజులలో తరచు ఇంటికివెళ్ళి తల్లినీ తండ్రినీ చూడాలని సహజంగానే అనిపించేది......కొంత బెంగగానూ ఉండేది. వెళ్ళితే మళ్ళీ మరునాటికల్లా వచ్చేయవచ్చుకూడా దగ్గరే గనుక. కాని రానూపోనూ రెండుమూడు రూపాయలు అవుతాయి. అంత డబ్బు అతని దగ్గర ఉండేదికాదు. మాధవయ్యగారిని అడిగితే ఒకప్పుడైనా ఇవ్వగలిగేవారే గాని అతనికంత సాహసం లేదు. అంత తాపత్రయపడి వేసంగి సెలవలకు ఇంటికి వెళ్ళాడు. కాని అక్కడి పరిస్థితులూ అంతంతమాత్రంగా ఉన్నాయి. తల్లితండ్రులకు దారిద్ర్యంతో పాటు వృద్ధాప్యంకూడా వచ్చింది. అతని అక్క

పెండ్లికి చేసిన అప్పు అయినా పూర్తిగా తీరలేదు. ఆ యిచ్చినదేమో దాదాపు బీదసంబంధం; పైగా దూరాభారం. ఆ తల్లి కూతుర్ని ఏడాదికొకసారి పండక్కైయినా తీసికొనిరాలేకపోతూనని మథనపడుతుంది. కాని చేయగలిగిందేమీ లేదు. సెలవలకు కొడుకు ఇంటికి వస్తే ఏడెనిమిది నెలల తర్వాత వచ్చాడే అని ఎంతో ఆపేక్ష పడుతూందేగాని ఓ పిండివంట చేసి పెట్టుకోగల తాహతు లేదు. అతని బాల్యంలోకంటె ఆ ఇంటి పరిస్థితులు మారినాయి. మారుతూ ఉన్న స్థితిగతులు అతనికి క్రమంగా అర్థమయినాయి. ఈ సెలవల్లో నాకు మంచిబట్టలు కుట్టిస్తే నేగాని వీల్లేదని తల్లితో అన్నాడు. ఎన్నాళ్ళనుండో పసుపుకుంకాలలో పడేసి ఉంచిన మెట్టెలు చాటుగా అమ్మేసి ఒక లాగూ ఒక చొక్కా కుట్టించింది.

ఆ సెలవలు నిర్విచారంగా గడిపేశాడు. బళ్ళు తెరుస్తున్నారనేసరికి అతనికి భయం వేసింది. తన ఊరికన్నా బెజవాడ నెయ్యిరెట్లు బాగున్నా-తన తల్లి పెట్టే భోజనంకంటె వారాలు కుదిరిన ఇళ్ళల్లో ఆహారపదార్థాలు మెండుగానూ రుచికరంగానూ ఉన్నా అతని కేదోబాధ అనే అనిపించింది.

"అంత బాధపడుతూ చదవకపోతే ఏం" అనుకొన్నాడు కొంతసేపు. అందుకే వెళ్ళడం ఒకటి రెండు రోజులు ఆలస్యం చేశాడు. అవధాని తండ్రి ఒక అయిదు రూపాయల నోటొకటి బయలు తెచ్చినది అతని చేతుల్లో పెట్టి "వెళ్లు ఆలస్యం చేస్తే మాధవయ్యగారికి కోపం వస్తుంది" అన్నాడు.

అత నారోజే తిరిగి వచ్చాడు. తిరిగి వచ్చాక తెలిసింది తన స్థితి. అయిదవ ఫారంలోకి వచ్చాడు. బాగా ఊహ వచ్చింది తను కష్టపడి ఎల్లాగో గడపాలనీ అంతకుమించి మరో గత్యంతరం లేదనీ మాధవయ్యగారి దయవల్లనే తను వృద్ధిలోకి వస్తున్నాననీ అర్థం చేసుకొన్నాడు.

అయిదవఫారం అతనికి తానాయేడాది ఎల్లా గడుపుతానా అనుకొంటూఉండగానే గడిచిపోయింది. మాధవయ్యగారితోపాటే కాసిని కాఫీ త్రాగి సంచీ పుచ్చుకొని బజారువెళ్లి వచ్చేవాడు. ఆయన అట్టే పనులు చెప్పేవారు కాదు. ఆవిడ మాత్రం —తన కొట్టే సాయపడడం లేదని పెద్దకూతురితో రుసరుసలాడుతూ నే—సరేలే మర్నేం చెయ్యక్కర్లేదు. వెళ్లి ఆ చదువేదో చూడమ్మా. మీ బావగారికి—ఆ తైనలు ఏవో అయితేనే గాని పనికి రావట...వెళ్ళి చదువు" అని వంటపాలోకి రానిచ్చేది కాదు. కాని అవధాన్నిమాత్రం ఊరికే కూర్చోనిచ్చేది కాదు. ఊరికే తిని ఇంట్లో ఉన్న పరాయివాడికి ఆ మాత్రం పనులు చెప్పడం ఏమంత తప్పు కాదని తన్ను తానే సమాధానపరుచుకొని అన్ని పనులకూ అతన్నే పురమాయించేది. అవధాని విసుగు అనేది ఏమాత్రమూ పైకి కన్పించనీయకుండా ఆ పనులు చేసేవాడు. తను ఏమాత్రం విసుక్కొన్నా ఆవిడ కసురుకొంటుంది. ఆ విషయం ఆయనకు తెలుస్తుంది. కొంత అలజడి—అశాంతి కలుగుతుంది వారి కట్టిది కలిగించడం అతనికి ఇష్టం లేదు.

పదిగంటలకల్లా అతను మాధవయ్యగారితోపాటు బడికి వెళ్ళేవాడు. కొన్నిపూటలు దారిలో వారాల ఇళ్లల్లో భోజనంచేసి బడికి వచ్చేందుకు వీలు కలిగేందుకు వాళ్లకు వీలు కాకపోతే మధ్యాహ్నం ఆట విడుపు సమయంలో అంతదూరం వెనక్కి వచ్చి భోజనం చేసి గబగబా నడిచి మధ్యాహ్నపు గంటకు బడి అందుకునేవాడు. సాయంకాలంపూట భోజనమూ తరచు ఆలస్యమయ్యేది. కాస్త పెందరాళే వెళితే "అప్పుడే ఏం తొందరొచ్చిందమ్మా—ఇంకా పిల్లలకైనా పెట్టందే" అంటుందో తల్లి. కాస్త ఆలస్యమైతే "ఇప్పుడే కాస్త నడుము వాలుద్దామనుకొంటున్నా—ఇంతలో నువ్వు...అని ఆగిపోతుంది అర్ధోక్తిలో మరోతల్లి. ఊహ తెలిసిరావడంవల్ల వాళ్లమాటలు బాగా అర్థమయ్యేవి. అతను బాధపడేవాడు. అల్లా భోజనం ముగించుకొని గదికి చేరేవాడు. పుస్తకం ముందు బుడ్డిదీపం వెలుగులో కూర్చొని చదువు ఆరంభించేసరికి నిద్రవస్తున్నట్లనిపించేది. కాస్త కునికిపాట్లు పడితే మాధవయ్యగారు వచ్చి కేకలేసి వెళ్ళేవారు. ఒక్కొక్కసారి ఆయన అతని గదిలోనే కూర్చుని కాంపోజిషన్ పుస్తకాలు దిద్దుకొనేవారు—అతన్ని ఏదో చదవమని పని చెప్పి. మరొకప్పుడు కూతుర్నికూడా పిల్చి ఇద్దరిచేతా లెక్కలు చేయించేవాడు. అతనలా కొన్నిరాత్రులు తప్పనిసరిగా భయపడుతూ చదివేవాడు. బళ్ళో కూడా అతనివిషయం తోడి ఉపాధ్యాయుల్ని అడిగి తెలుసుకొంటూ ఉండేవారాయన.

తరచు ఆయన "అల్లా ఉన్నావేంరా?" అని అడిగేవారు అతని ముఖంవంక చూస్తూ. ఆయనకు అతను తెలివైనవాడేనని కష్టపడి ఉత్సాహంగా చదివితే వృద్ధిలోకి వస్తాడని గట్టి నమ్మకం ఏర్పడింది. అందుకే అతను కాస్త నిరుత్సాహంగా కన్పిస్తే పది ప్రశ్నలు వేసైనా సరే సమాధానం రాబట్టేవారు.

"ఏం ఎవరన్నా విసుక్కున్నారా?"

అతను కొన్ని సమయాల్లో నిజం చెప్పేసేవాడు. "నిజమే అయివుండవచ్చురా — అవధానీ — కాని చూడూ-ఎవరో వంటమనిషీ నౌకర్లూ ఉన్న ఇళ్లల్లో తప్ప సామాన్య కుటుంబాలలో ఆడవాళ్లు ప్రొద్దస్తమానమూ వళ్ళు విరుచుకోవాలసిందేనా — ఏదో ఆమాత్రం విసుక్కున్నారంటే పెద్ద విశేషం కాదు — తమ పిల్లల్నిమాత్రం విసుక్కోరా ఏమిటి — దానికి నీవింత మనస్సులో కష్టపెట్టుకోకూడదు — ఆ; తెలిసిందా" అని నెమ్మదిగా చెప్పేవారు.

వారం పదిరోజులు సెలవలువచ్చినా అతను ఇంటికి పోకపోవడంచూచి అతనికి వినపడేటట్టుగానే "వీడికింత తిండి దొరికితే చాలు — ఇల్లూ అక్కర్లేదు, వాకిలీ అక్కర్లేదు" అని కాస్త ఎగతాళిగానో ఎత్తిపొడుపుగానో ఒకళ్లిద్దరు అనేవారు వారాలు ఇచ్చినవాళ్లు — అంతకంటే ఎక్కువగా వారం వీల్లేదన్నవాళ్లూ. ఆ మాటలకు అతనికి నిజంగానే కష్టంగా ఉండేవి. మనస్సులో వాటిమూలంగా కలిగిన బాధ తరచు మెదలుతూనే ఉండేది. మాధవయ్యగారికావిషయం చెప్పేవాడు కాదు. "పితూరీలుకూడా చెబుతున్నావా" అని కోపగిస్తారేమోనని భయపడి.

తన బట్టలుచూచి పిల్లలు వెక్కిరించారని గానీ — సూటు వేసుకొని వచ్చే సైన్సుమాష్టరు గారు — క్రొత్తగా వచ్చిన ఆయన తను పరిశుభ్రంగా లేడని అసహ్యించుకొన్నారని గానీ అతను ఆయనతో చెప్పుకొనేవాడు కాదు, ఆ భయంతోనే.

అతని దుస్తులు తరచు మ పురంకులోనే ఉండేవి. ఆవిషయంలో అచ్చంగా నిజమే చెప్పాలంటే అతనికున్నవే రెండు జతలు. ఒక జత ఉతికి ఆరవేసుకొని మరో జత కట్టుకొని వెళ్ళేవాడు. ఇస్త్రీ చేయబడకపోవడం ఒక లోపం కాగా — పురపాలక సంఘంవారి దయవల్ల అందరి దుస్తులపైనా దుమ్ముపొరలు క్రమ్ముకోవడం కారణంగా అతని దుస్తులు ఆ తీరున ఉండేవి.

అతను వీటి అన్నింటికీ బాధపడ్డాడు. కొందరు తన్ను చూచి అసహ్యించుకొంటున్నందుకూ కొందరు తన్ను తిండికి కరువు వాచినవాడిలా పరిగణిస్తున్నందుకూ — నిజంగానే తాను దారిద్ర్యం అనుభవిస్తున్నందుకూ అతను మనస్సులోనే బాధపడేవాడు. "ఇంత బాధపడుతూ ఏం ఈ చదువు చదవకపోతే?" అని తరచు అనుకొని నిరుత్సాహపడేవాడు.

తగిన ధనసహాయం లేకుండా ఈ దరిద్రపు బ్రతుకు బ్రతికిమాత్రం ఏం ప్రయోజనం అని అనుకొని నిరాశపడేవాడు.

ఒకొక్కసారి వారం ఇచ్చిన ఇంటి ఇల్లాలు ఏ సినిమాకో వెళ్లితే భోజనం చెయ్యకుండానే గదికి వచ్చి చదువుకొంటూ కూర్చొని ఏ తొమ్మిదో అయ్యాక ఆకలి వేస్తున్నదని గ్రహించి బయటకు పోయి కేవలము బీదవాళ్ల కోసము చెట్టుక్రింద, అమ్మే పునుగులు కొనుక్కొని తినేసి పంపుదగ్గర కడుపునిండా నీళ్లు త్రాగి వచ్చి మళ్లీ చదువుకు ఉపక్రమించేవాడు. ఆకలిని కాదననూ లేదు. పోనీ అభిమానాన్ని చంపుకొని "ఈ పూటకూడా మీయింట్లోనే అన్నం పెట్టించండి" అని అడగనూ లేదు. అల్లా అడిగి పెట్టించుకొని తినకపోవడం అతనిలోని అభిమానం కాక — తనకు ఆశ్రయమిచ్చినవారికి మరింత శ్రమ కలిగించడము ఇష్టం లేకపోవడముకూడా మరో కారణం. అల్లా జరిగేవి కొన్ని రోజులు.

"రోజులు ఇల్లా గడవకపోతే — నేనసలు రాలిపోతేమాత్రం ఏం?" అని ప్రశ్నించుకొనేవాడు. హృదయం అమాయకంగా ఉండడముచేత సరియైన సమాధానాలు అతనికి లభించేవి కావు.

మాధవయ్యగారు అతని హృదయగతమైన ఇట్టి భావాల్ని ఇంతదూరంవచ్చి అర్థంచేసుకోలేరు. కొంచెం చిన్నతనంవల్లా ఇల్లు వదిలివచ్చి — కొంత ఇబ్బందిపడుతూ చదువుతున్నాడే అని అనుకోవడం వల్ల కలిగే మందకొండితనంవల్లా అతను అల్లా కన్పిస్తున్నాడని అనుకొని కాస్త ఘట్టిగానే మందలించేవారు.

కొన్ని సమయాల్లో చెయ్యిచేసుకొన్నంత పని అయ్యేది.

పరీక్షకు ఇది ముఖ్యము — అది ముఖ్యము అన్న విచక్షణలేకుండా అన్నీ — అన్నిపాఠాలు వప్ప

చెప్పించుకొనేవారు. దగ్గర కూర్చొని ఆంధ్ర—ఆంగ్ల వ్యాకరణాలు చెప్పి చదివించారు.

ఆయేడు రాత్రిళ్లు చదివిన చదువే చదువు.

అవధాని ఆయేడు అయిదవఫారం ప్యాసయ్యాడంటే అదంతా మాధవయ్యగారి చలవేగాని మరోటి కాదు. ఆమాట అందరికంటే ఎక్కువగా ఆయన భార్య అనుకొన్నది అవిచ్ఛిన్నధోరణిలో. "అంత నూరిపోస్తూ—భయపెట్టి చదివించకపోతే - ఉహూ—వీడు ప్యాసయ్యేవాడా!" అని. అతనికోసం అంతసేపు కాలం వృథాచేయడంకంటే మరో ట్యూషను చెప్పుకున్నా దండీ—నాల్గుడబ్బులు వచ్చునుగదా అని ఆయనతో గూడా అన్నది.

* * *

ఆయేడు సెలవలకు అతను ఇంటికి వెళ్లలేదు. వేసవికాలం అంతా అక్కడే ఉండిపోయాడు. డబ్బులు సంపాదించాలని బుద్ధిపుట్టింది. ఒకరు ఉపాయంకూడా వెంటనే సూచించారు. అతను నాల్గయిదు ట్యూషన్లు సంపాదించాడు. ఒకటవఫారంలోకీ—అయిదవతరగతిలోకీ పిల్లల్ని ప్రవేశపెడితే లాభిస్తుందని చెప్పారు. అవనే చేశాడతను. వారాల ఇళ్లల్లో పిల్లలకు తాను ఉచితంగా పాఠాలు నూరిపోస్తే వారు అతనికి భుక్తిని సెలవల్లోకూడా ఏర్పాటు చేశారు. అవికాక ఇతర ట్యూషన్లవల్ల—ఆ రెండు నెలలూ ఎండల్లోపడి తిరిగి—అవస్థపడి చెబితే సెలవ లాఖరుకు మొత్తంమీద—జీతాలూ ఆయా పిల్లలు పరీక్షల్లో ఉత్తీర్ణులయినందుకుగాను లభించిన బహుమానాలూ కలుపుకొని నలభైరూపాయలు పోగయ్యాయి. అప్పట్లో అది పెద్దమొత్తమే. అతని కంటికి మరీ పెద్దమొత్తంగా కన్పించింది. ఆ డబ్బులో సగం మాధవయ్యగారికిచ్చి మిగతా సగం తీసుకొని ఇంటికి వెళ్లాడు. తల్లిచేతికిచ్చాడు. ఆమె వద్దనుకొంటూనే ఆడబ్బు పుచ్చుకొని ఆయేడు కూతుర్ని పండక్కు పిలిపించుకొన్నది. తల్లి ఆనందబాష్పాలూ — "ఎంత కష్టపడ్డావురా నాయనా—పోనీ నువ్వు పట్టుకొని పోయి ఖర్చుక్రింద వాడుకో—అక్కయ్యను పిలవనులే" అంటూ ఆడిన బీదరికపు మాటలూ అతన్ని కొంత క్రుంగతీశాయి.

దారిద్ర్యం అంటే బాగా అర్థమయ్యింది. ఆసారి ఇంటికివెళ్లినప్పుడు అతను పట్టుమని వారంరోజులైనా ఉండలేదు. తల్లిదండ్రుల పరిస్థితిచూచి కొంత దిగులుపడ్డాడు. ఆ పరిస్థితిలో తాను వాళ్లకు సాయపడకపోగా వాళ్లకు భారంగా నిలవడము ఇష్టంలేక బరువైన హృదయంతో వెంటనే తిరిగివచ్చాడు. అప్పటికింకా పాఠాలు సరిగా మొదలుపెట్టలేదు. సెలవల్లో తాను ట్యూషన్లు చెప్పడంవల్ల ఏడాది పొడుగునా అల్లా ట్యూషను చెప్పించుకొంటామని ఒకరిద్దరు వచ్చారు. అవధాని మొదలు అందుకు సిద్ధపడ్డాడు. కాని మాధవయ్యగారు అడ్డుపడి "ఒరేయి అవధానీ నువ్విప్పుడు వళ్లువంచి చదవాలి — కష్టపడాలి. ఈ స్కూలుఫైనలు గడిచి బయటపడ్డావా నువ్వొక దారిలోకి వస్తావు. మొదటినుంచీ చదవాలి. ఆ ట్యూషన్లేమీ వద్దు. ఊరికే నాలుగు డబ్బులకు కక్కుర్తిపడకు. చదువు కానీయ్—తర్వాత చూద్దువుగాని ఈ సంపాదన" అని హితబోధచేస్తూ అడ్డుపడ్డారు. అతను సరే అనక తప్పలేదు. కాని...

ఆ ట్యూషన్లూ అవీ ఉంటే మధ్యాహ్నాలప్పుడు కాస్త ఉపాహారం సేవించే భాగ్యం అతనికి లభించేది. అది వీలుగాకపోయింది. అయినా అతను వారి మాటకు సరే అన్నాడు.

మొదటి మూడు నెలలూ గడచిపోయాయి.

## 3

నెలలు గడుస్తున్నా గడవక ఆగిపోతున్నాయనే అనిపించింది. మాధవయ్యగారు ఎప్పటిలాగా అతనియందు దయనూ శ్రద్ధనూ చూపుతూనే ఉన్నారు. ఆయన భార్య పనులు చెప్పుతూనే ఉన్నది. వారాల భోజనం ఆకలి తీరుస్తూనే ఉన్నది. ప్రొద్దుట భోజనం చేసి వచ్చిన రోజున మధ్యాహ్నం రెండుగంటలయ్యే సరికి తరచు ఆకలి వేసేది. కొంతసేపు దాన్ని గమనించుకొనేసరికి అతనికి బాధగానే ఉండేది. కాని రోజూ అల్లా జరిగి కొంతసేపటికి తప్పనిసరై బడి వ్యవహారంలో మునిగిపోతే—ఆకలి అణగిపోయేది. స్కూలుఫైనలు తరగతి పంతుళ్లు అప్పటినుంచే కొంచెం హడావిడి మొదలుపెట్టారు. హెచ్చరికలు చేశారు. "ప్యాసయినా తప్పినా నావల్ల ఒరిగిపోయేదేమిటిలే" అనట్లు అవధాని మందకొండిగా నడక సాగించాడు.

తను అట్టే తెలివైనవాడు కాదన్న సంగతి తెలుసుకొన్నాడు అవధాని. తను చదువుతున్న బళ్ళో

తనకంటె చాలారెట్లు తెలివైన పిల్లలు కన్పించారు. వారి తెలివి స్పష్టంగా కన్పించింది. వారితో తన్ను పోల్చుకొంటే—వారి భాగ్యంతో పోల్చుకొన్నట్టే అయ్యింది. వాళ్లందరూ పరీక్షలో ప్యాసయితే తాను తప్పిపోతానేమోనని అధైర్యం—అనుమానం కలిగింది. ఆ కలగడం అతని నడకకు మరీ ఆటంకమైంది. మరింత నిరుత్సాహపడ్డాడు.

మాధవయ్యగారి చేత చీవాట్లుతినడం ఎక్కువయ్యింది.

*　　*　　*

ఆరోజు మధ్యాహ్నం—ఆదివారం కావడం చేత భోజనం కాగానే గదికివచ్చి పుస్తకం పుచ్చుకొని పడుకొని చదువు మొదలుపెట్టాడు. కళ్లముందు తెరచిన పుటలు స్పష్టంగా కన్పిస్తున్నా అతని మనస్సు ఎక్కడికోపోయింది.

"డబ్బులేనివాడు—అసలు చదువుకోకూడదు—అసలు బ్రతకనేకూడదు—బ్రతికి ఏంప్రయోజనం..." అతని ఆలోచనలు కుంటుతూ సాగాయి.

అంతలో మాధవయ్యగారి భార్య కేక విని ఉలిక్కిపడి లేచాడు. చప్పున హాల్లోకివెళ్లి "ఏమిటండీ" అన్నాడు. ఆవిడ ఒక చిన్నపని చెప్పింది. అతనందుకు ఉపక్రమించాడు. హాల్లో అక్కడక్కడ మేకులు కొట్టి కొన్ని పటాలు తగిలించాలి. అదీ ఆవిడ చెప్పిన పని. ఒక స్టూలూ—ఒక చిన్న సుత్తీ—ఆవిడ అందించిన క్రొత్త మేకుల పొట్లం తీసుకొని అతను ఆలస్యం చెయ్యకుండా పని మొదలుపెట్టాడు.

ఒక్కొక్కపటానికి మూడేసి మేకులు. పైనైపు ఒకటీ క్రిందవైపున రెండూ—ఇల్లా మేకులుకొట్టి పటాలు తగిలిస్తున్నాడు. చివరి పటంకోసం మేకులు కొడుతూండగా ఆ ప్రమాదం జరిగింది. క్రిందపెట్టిన పొట్లంనుండి మూడు మేకులు తీసుకొని స్టూలు ఎక్కాడు. రెండు పళ్లసందున కరచిపట్టుకొని ఒక దాన్ని గోడకు కొట్టాడు. రెండోది సరిగ్గా గుర్తుపెట్టుకొన్న చుక్కమీదనే పెట్టి కొడుతూండగా బల్లి ఒకటి పైనుండి జారి నెత్తిమీదపడ్డది. అతను అనవసరంగా ఖంగారుపడ్డాడు. నెత్తిమీద పడ్డదాన్ని ఒకసారి తలవెనక్కు విసురుగా విదిలించి అది దూరంగా పడేటట్టు చూచాడు. ఆ సమయంలో నోట్లో ఆ చిన్న మేకు అరఅంగుళం పొడవు మేకు—ఇనపదైనా క్రొత్తది కావడంచేత సన్నగా తెల్లగా వెండిలా మెరుస్తున్నది ఉన్నదన్న విషయమే అతనికి స్ఫురణలో లేదు. అది అతనికి తెలియకుండా ఎట్లా పడ్డదో—పడి లోపలికి జారిపోయింది. కాని లోపలికి జారినట్లే అనిపించలేదు. అది అల్లా జరిగిపోయింది. కాస్త తల తిరిగినట్లనిపించింది. నాలుగైదు క్షణాల తర్వాత క్రిందకు దిగి అనుమానం కలిగి—అటూ ఇటూ పరికించి—తల పంకించి సుత్తి స్టూలుమీద కాసేపు నిలబడ్డాడు. క్రింద పడిపోయిందేమోనని హాలంతా ఒకక్షణం వెతికాడు. కాని కన్పించలేదు. కాగితపు పొట్లం గాలికి కదలి హాల్లో ప్రాకుతోంది. మొదలుపెట్టిన పని పూర్తికాలేదు. అదే చివరి మేకు. "ఆ పటం తర్వాత తగిలిస్తానండీ" అని అవతలగదిలో ఉన్న ఆవిడకు విన్పించేలాగున చెప్పేసి చరచరా తన గదిలోకి వెళ్లాడు. మళ్లీ ఒకసారి హాల్లోకివచ్చి కళ్లు పెద్దవిచేసుకొని పదినిముషాలసేపు వెతికాడు. ఆమెవచ్చి "సరేలే—నీకే పనిచెప్పినా శ్రద్ధలేదు. రేపు మరోటి తెప్పిస్తానులే అన్నది.

అది—ఆ మేకు మింగానేమోనన్న అనుమానం అప్పుడు కలిగింది అతనికి. భయం వేసింది. "అయితే మరి నొప్పి పుట్టలేదేమా — అడ్డం పడలేదేమా అని పిచ్చిప్రశ్నలు మనస్సులో మెదిలాయి. మంచినీళ్లు అడిగి పుచ్చుకొని కొంతసేపు గుక్కలు గుక్కలుగా కొంతసేపు గడగడా త్రాగాడు. "ఏం అనిపించడం లేదే" అనుకొన్నాడు. మళ్ళీవచ్చి గదిలో పడుకొన్నాడు.

*　　*　　*　　*

అవధానికి అకస్మాత్తుగా—సకారణంగా అమితమైన భయం కలిగింది. అంత భయం అతను ఎన్నడూ ఎరుగడు. ఏదో వికారపెడుతున్నట్లనిపించింది. ఆ సమయంలో ఏదైనా బాధ కలిగితే తాను మూలిగితే ఆవిడ ఏమైనా అంటుందేమోనని గబగబా నడిచి బయటకు వెళ్ళాడు. ఒకటి రెండు వీధిమలుపుల్లో రెండు మూడు సోడాలు త్రాగాడు. కొంతసేపు అయ్యాక దారిలో ఏం అవాంతరం వస్తుందో అని మరీ భయపడి గదికి వచ్చేశాడు. వచ్చి నిల్లకిలా పడుకొని దూలాల వంక చూస్తూ ఆలోచన చేశాడు.

ఆదుర్దా ఎక్కువయ్యింది.

నిముషానికో ఆలోచన—క్షణానికో భావం భయపెడుతూ—నల్లని మేఘాలను చీల్చుకొనిపోయే మెరపుల్లా మనస్సులో మెదిలి మాయమయ్యాయి. మనస్సులో సుడిగాలి బయలుదేరింది. ప్రళయ ప్రభంజనాల విజృంభణలు—వికృతరూపాల కారు మేఘాల కదలికలు—వరదవాగుల ఔద్ధత్యపు పరవళ్లు — సంక్షోభం—నిరాశ — మృత్యుభీకరకరాళ దంష్ట్రిస్ఫులవిలయతాండవం అతని హృదయాన్ని ఆవరించాయి. శరీరం కంపించిపోయింది. హృదయం వేడెక్కిపోయింది. నిట్టూర్పులు బహు వెచ్చనయినాయి. నరనరంలోనూ రక్తం తన గమన వేగాన్ని పదిరెట్లుగా పెంచుకొన్నది. నరాల ప్రతి మలుపులోనూ ప్రతి రక్తనాళాల కేంద్రంలోనూ సుత్తిదెబ్బలు వినిపించాయి. పది నిముషాలు గడిచిందో లేదో నీరసం వచ్చింది. ఎంతో దూరం పరుగెత్తినట్లయింది. ముచ్చెమటలు పోశాయి. ఆ చిన్న మేకు అన్నకోశంనుండి—చిన్న ప్రేవుల్ని రెండుగా చీల్చుకొంటూ నెమ్మదిగా ముందుకు సాగుతున్నట్లే అనిపించింది. "ఈ పూటతో ఆఖరు—ఈ దరిద్రుని జీవితం" అని ఎవరో అన్నట్లే అనిపించింది.

అనుకోకుండా అతను పెద్దగా మూలిగాడు. అప్పుడే పనిమీద వెళ్లి ఇంటికి తిరిగివచ్చి హాల్లోకి ప్రవేశిస్తున్న మాధవయ్యగారు ఆ మూలుగువిని అవధాని తలుపు తట్టారు. అతను లేచి తలుపు తెరిచాడు.

అప్పుడే తెలిసింది ఆయనకు జరిగిన ప్రమాదం. ఆయన డాక్టరుకోసం పరుగెత్తి తిరిగి వచ్చేసరికి కొంత ఆలస్యమయ్యింది...కదలకుండా పడుకోమని చెప్పి వెళ్లారాయన. కళ్లు రెండూ గట్టిగా మూసుకొని పడుకున్నాడు. కాసేపు మళ్ళా అవే ఆలోచనలు.

* * *

అవధానికి అంతలో బ్రతుకుపై ఆశ పుట్టింది. ప్రాణంమీద తీపి తెలిసివచ్చింది. చివరకు ఈ గండం గడచి ఏమైనాసరే బయటపడాలని దృఢమైన ఆకాంక్ష—వాంఛ బయలుదేరింది. "పోనీ—పోతే మాత్రం ఏం?" అని మరోభావం మనస్సులోనే విదిలించుకొన్నది. "కాదు—కాదు, అని పెద్దగానే అన్నాడు. అనుకొన్నాడు. "ఉండి ఏం ఘనకార్యాలు సాధింపబోతున్నావూ?" అని రూపం దాల్చిన మరో ప్రశ్న, ఎదురుగా వికటంగా నవ్వుతూ.

ఇంటిదగ్గర ఉన్న ముసలి తలిదండ్రులు—దూరముగా ఉన్న అక్క—తనకు ఆశ్రయమిస్తూ దారి చూపిస్తూ చెయ్యిపుచ్చుకొని తీసుకొని వెళుతున్న మాధవయ్యగారూ - తను గడిపిన జీవితం, పడ్డ కష్టం - చదివిన చదువూ—అందర్నీ—అన్నింటినీ జ్ఞాపకం చేసుకొన్నాడు.

మరో కొద్ది నెలల్లో వస్తున్న పెద్ద పరీక్షలు స్ఫురణకు వచ్చాయి. మాధవయ్యగారి మాటలు చెవులలో మారుమ్రోగాయి.

ఆ పరీక్ష ప్యాసవుతే—చిన్న ఉద్యోగం వస్తుంది. సంపాదన—జీవితం—తలిదండ్రుల పోషణ-పెండ్లి—సంసారం — సౌఖ్యం— సాగిపోయాయి అతని ఆలోచన భావపరంపరలు అల్లుకొనిపోయాయి.

"బ్రతకాలని — బ్రతుకుదామని వాంఛ" ఆ వాంఛ—భయంకరమై—దుస్సహమై బుసలుకొడుతున్న భయమనే సర్పంచే చుట్టివేయబడి విడిపించుకోవాలని ప్రయత్నం చేస్తున్న ఆ వాంఛ—ఆందోళననూ—ఆశనూ కలిగిస్తున్న ఆ వాంఛ ఒక్కసారిగా ఉబికింది.

ఊటజలంలా ఉబికి వచ్చి ముందుకు సాగింది. మధ్యలో కొంత నీరు ఇంకి—కంటుపడినా వెనుకగా నిరంతరంగా వస్తున్న జలధారలసాయంతో ముందుకు పరుగెత్తే ఊటజలంలా — ముందుకు పరుగెత్తిందా వాంఛ.

అతనొకసారి ఉలికిపడ్డాడు. లేచి కూర్చున్నాడు. మనసు దిటవుచేసుకొన్నాడు. ఇక నాకేం పర్వా లేదనుకొన్నాడు.

"నేను చావను" అనుకొన్నాడు. ఆ మాట పదిసారులు అనుకొన్నాడు.

మాధవయ్యగారు డాక్టరును వెంటపెట్టుకొని వచ్చేసరికే అతను లేచి తిరుగుతున్నాడు. ఆ గాభరా అంతా పోయింది. పైగా చిరునవ్వులు కూడా నేర్చుకొన్నాడు.

* * *

"కదలకుండా పడుకోరా అంటే తిరుగుతున్నావేరా ?" అని ఆయన వచ్చీ రావడంతోనే అతన్ని కేకలు వేస్తూ "ఏదేనండీ అని అతన్ని ఆ డాక్టరుకు

చూపించారు. ఆ డాక్టరుగారు అతన్ని పదినిముషాలు పరీక్ష చేసి ఏవో కొన్ని ప్రశ్నలు వేశారు.

అతను కొన్నిటికి సరిగా సమాధానాలు చెప్ప లేకపోయాడు.

అర్థం లేకుండా నవ్వాడు.

ఆ నవ్వు చూచేసరికి మాధవయ్యగారికి కాసేపు ఒళ్లు మండింది.

"ఏం పర్వాలేదండీ మాస్టారూ- నే నీగండం బహు సులభంగా గడచి బయటపడతాను. నా మనస్సు అల్లా చెబుతోంది. నాకు ధైర్యం వచ్చేసింది. రేపీపాటికి - చూస్తుండండి మరి - అదుర్దా తొలగి పోతుంది. పరీక్షకు మీరు చెప్పినట్లుగా శ్రద్ధగా చదువుతాను. ఏంభయం లేదండీ" అదీ అతను చెప్పబోయే మాటలు. చెబుదామనుకొన్న సమాధానం. కాని చెప్ప లేదు. బయటకు అనలేకపోయాడు. ఒక్క నవ్వు మాత్రమే చేతనయ్యింది.

"ఎందుకండీ అంత గాభరాపడతారూ - ఏం నాలాంటిదరిద్రుడొకడు పోతే ఏం- నష్టమేముందీ?" అని చెప్పాలనుకొంటున్నాడు; మాధవయ్యకు ప్రాణం పోతుందన్న భయం ధ్రువపడిపోయి ఉంటుంది. కాస్త మతి ఏమైనా చలించిందేమో! అందుకే ఈ నవ్వు" అని మాధవయ్యగారు అనుకొన్నారు.

ఆయన కాస్త కోపంగా "ఒరేయి అవధానీ నువ్వానవ్వు కట్టిపెట్టి సరిగా సమాధానం చెప్పు" అన్నారు.

* * *

ఆరోజు రాత్రి అతన్ని ఆసుపత్రిలో చేర్పించారు. ఇంటికివచ్చిన డాక్టరుగారు మాధవయ్యగారితో ఇక్కడ మనం చెయ్యగలిగిందేమీలేదు, ఎక్సరే అదీతీసి 'అబ్సర్వు' చేయాలి. అంతే అదృష్టంవుంటే బ్రతుకుతాడు" అని చెప్పి వెళ్ళారు.

మాధవయ్యగారు ఆసుపత్రి పెద్దడాక్టరుగార్ని కూడా కలుసుకొని నమస్కారం చేసి చెప్పుకొన్నారు తన ఆందోళన అంతా.

ఆయన భార్యకూడా భయపడ్డది.

ఆమె మనస్సుకు అతనిక దక్కడనే అనిపించింది. అదంతా తనమూలకంగా జరిగిందేమో ననిపించింది. ఆట్టే కారణం లేకపోయినా ఆయన తనమీద ఎక్కడ విరుచుకొనిపడతారో అని భయపెట్టింది.

ఓయి భగవంతుడా — మొదటినుంచీ నేను చెబుతూనేఉన్నా — మనకెందుకొచ్చిన బెడద అండీ అని కాని ఆయనగారు విన్నారుకాదు ఇప్పుడేంచెయ్యడం అని ఆమె మనస్సులోనే మథనపడ్డది.

ఆమె మనస్సు కరిగింది.

పిల్లలకు అన్నాలు పెట్టి ఆవిడకూడా ఆసుపత్రికి వచ్చేసింది. పదకొండు దాటాక భగవంతుడిమీద భారం వేసి ఆయన ఆవిడ్ని అతనిదగ్గర వదిలేసి— నర్సు మీరు వెళ్ళండి- ఇంతమంది అనవసరం ఇక్కడ- రాత్రిళ్ళు పేషెంట్సుదగ్గర ఉండడానికి వీల్లేదు అంటుండగా- ఇంటిదగ్గర ఎవ్వరూ లేకుండా ఉంటే ఎల్లారా అనుకొంటూ ఆయన ఇంటికి తిరిగివచ్చారు

ఆవిడ ఆ రాత్రంతా అక్కడే ఉన్నది.

కాసేపు అతనికి దగ్గరగా కూర్చున్నది. కాసేపు ప్రక్క వరండాలో గోడకు చేరగిలబడి కునుకుపాట్లు పడ్డది. అంతలో అదరిపడ్డది. అతనొక వేళ... అల్లా జరిగితే అతని తల్లి ఏమని ఇడవుతుందా అని కాసేపు ఆలోచించింది. ఆ తల్లి శోకనాదాలు ఆమె చెవుల్లో మ్రోగుతున్నట్లనిపించింది.

తను ఇన్నాళ్ళూ అతనియందు అనుకోకుండా వహించిన నిర్దయ జ్ఞాపకంవచ్చింది.

ఒంటిగంట దాటింది.

అతను సన్నగా మూలగడం ఆరంభించాడు. మేకు కదులుతున్నట్లనిపించింది. భయం చిన్న అపవాదులా మెదిలింది. కాసేపు కదిలింది. అంతలో హృదయపీఠంమీదకు ఉరికి కొరివిదయ్యంలా చిందులు త్రొక్కడం ఆరంభించింది. ఒళ్ళంతా పగలవేసుకొని లేచింది.

అతను పెద్దగా మూలిగాడు. ఏమిటినాయనా మూలుగుతున్నావ్ అని మాధవయ్యగారి భార్య వచ్చి మెల్లగా అడిగింది. మళ్ళీ అడిగింది "బాధగా ఉందా" అని. అతను "అవునండీ" అన్నాడు. ఆవిడవెళ్లి నర్సును పిల్చుకుని వచ్చింది. నర్సు వచ్చి ఎక్కడనొప్పి అని అడిగితే ఇదిగో ఇక్కడ అని అతను నిజంగానే చెప్ప లేకపోయాడు. ఆ నర్సుకు అతనిబాధ కొంత అర్థమయ్యింది. ఆమె వెళ్లి డాక్టరును వెంటనే పిల్చుకుని

వచ్చింది ఆయన వస్తున్న దారిలో నిలబడి మాధవయ్య గారి భార్య "ఏమండీ డాక్టరుగారూ పిల్లవాడు చాలా బాధపడుతున్నాడండీ—మరి" అని ఆగిపోయింది.

ఆయన "ఏం పర్వాలేదు. మనం చెయ్యగలిగింది చేద్దాం. బ్రతికితే అది అతని 'లక్'-అంతకంటే ఏమీ లేదు" అని ముందుకువచ్చి అతన్ని పరీక్ష చేశారు. ఆ సాయంకాలమే అతనికా డాక్టరు గ్లిసరిన్ ఇచ్చారు. ఇప్పుడువచ్చి మత్తుమందు ఇచ్చారు. ఇప్పుడాయన చేసిన ఊహ చాలా చక్కనిది. భయంవల్లగానీ, బాధ వల్లగానీ అనుకోని ప్రమాదమేమైనా రావచ్చు" అని అనుకొని అల్లా చేశారాయన.

నిజానికి అతనికి కలిగింది బాధకంటే పదివందల రెట్లు భయం ఒక్కసారి మనిషిని ఊపివేసి పాముకరచిన మరుక్షణంలోలాగా-గుండె దడదడలాడించి నిలిపి వేయగల-వేసే భీతి. ఆభయం అటువంటిది. ఆ డాక్టరు గారు ఆపని చెయ్యకపోతే మేకవల్లగాక-భీతివల్ల అతని ప్రాణం హరీ అనేది. అతను ఎంతో ధైర్యం వహించాలని ప్రయత్నించేసినా.

"బ్రతకడేమోలే" అనుకున్న అవధాని బ్రతికి బయటపడ్డాడు. ప్రొద్దుట ఆ మేకు బయటకువచ్చేసింది. ఆమెకారాత్రంతా ఆ నర్సు సాయపడ్డది. ప్రొద్దుట ఆ నర్సు ఆమెను అభినందించింది-రాత్రంతా మేల్కొని అతనికి సేవచేస్తూ-దగ్గరకూర్చొని విసురుతూ కనిపెట్టుకొని ఉన్నందుకు ఆమె భగవంతుణ్ణి అభినందించి తన్ను మన్నించమని ప్రార్థించుకొన్నది. ఆపూట పది గంటలకు అతన్ని వెంటపెట్టుకొని బండిచేసుకొని సంతోషంగా ఇంటికివచ్చింది, మాధవయ్యగారిభార్య. అతన్నామె వారాలు మాన్పించి మిగిలిన నెలలన్నీ తన ఇంట్లోనే భోజనం చెయ్యమన్నది.

జీవితంలో ఒక మలుపు ఉంటుంది. అందరి జీవితాలకూ ఉంటుందామలుపు. అవి వారి వారి జీవితానికే-జీవిత మార్గానికే ఒకమలుపు ఏదో ఒక హఠాత్సంభవమైన, విచిత్రమైన ఒకానొక సంఘటన కారణంగా ఆ మలుపు చేరతారు. ఇక అక్కడనుంచి కొందరు ఆరోలు పరోలు చూస్తూ చెంచెం మెట్లు ఎక్కి పైకి వెళతారు. తారాపథాన్ని అందుకొంటారు. కొందరు ఆమలుపు దాటరో లేదో పడిపోయి క్రిందకు జారతారు-జారి జారి ఎక్కడ పడిపోతారో వారికే తెలియదు.

అవధాని జీవితంలో ఇల్లాంటి మలుపు దాటాడు. అతను క్రమంగా ఎవ్వరూ అనుకోని అభివృద్ధిలోకి వచ్చాడు. ఆ సంఘటన అతనిలో ఎవ్వరూ ఊహించనిమార్పు వచ్చింది.

బ్రతకననుకొన్న తాను బ్రతికేసరికి గాఢంగా వాంఛించినది నిజమయ్యేసరికి అతనిలో ఉత్సాహం ఉబికి వచ్చింది అతని జీవితం ఒక క్రొత్త ఒరవడిని సాగిపోయింది.

అతనాయేడు స్కూలుఫైనలు పరీక్షలోచక్కగా ప్యాసయ్యాడు.

దాంతో నీళ్లు విదిలించి వేసిన మల్లెచెండులా మెరిసాడు.

మాధవయ్యగారతనికి ఒక వ్యాపారసంస్థలో ఉద్యోగం ఇప్పించారు.

అతనది అందుకొని చూస్తుండగానే నెలకు రెండువందలు సంపాదించే ఉద్యోగస్థుడయ్యాడు.

"మాస్టారూ-ఇప్పుడు మీకంటే ఎక్కువ సంపాదిస్తున్నాకదండీ" అన్నాడొకరోజున వారింటికి ఇన్ని పళ్లు పట్టుకొనివచ్చి.

"అవునవును" అన్నారాయన.

# శిక్షానిరూపణము

శ్రీ తటవర్తి సూర్యనారాయణ

వేదవేత్తలగు బ్రహ్మర్షులు వేదశిక్షణమందు స్వరము ప్రధానమని నుడివిరి. స్వరశాస్త్రానుసారము విశేష రూపమున—ఆర్చిక—గాథిక సామిక స్వర వ్యవధాన ప్రయోగము జేయవలెను. ఋక్కులలో నొకటి గాథలలో రెండు సామమంత్రములలో మూడు వ్యవధానములచే స్వర మగును. స్వరముల ఇంతటి వ్యవధానమును సర్వత్ర యోజించనగును. ఋక్సామయజుర్వేదముల కంగభూతములైన యాజ్యస్తోత్రకరణ మంత్రాదులు యాజ్ఞికులద్వారా యజ్ఞములందు బ్రయోగించబడు నందులో శిక్షాజ్ఞానరాహిత్యముచే విస్వరములు (విరుద్ధోచ్చారణ) కలుగుచుండును. మంత్రములు యథార్థ స్వర—వర్ణహీనములై—మిథ్యా ప్రయుక్తములైనచో నభీష్టార్థములు గాజాలకుండును. ఇంతియే గాదు ఆ అపస్వరము వాగ్రూపవజ్రమై యజమానికే యనర్థ మాపాదించుచున్నది. ఉదా—"ఇంద్రశత్రు" యీ పదము స్వరభేదజనితాపరాధముచే యజమానికే యనిష్టకారి యయ్యెను.* సంపూర్ణ వాఙ్మయ ముచ్చరింపబడుటకు వక్షస్థలము—కంఠము—శిరస్సు మూడును స్థానములు. ఈ మూడింటెని సవనమందురు. అనగా వక్షస్థానమందు నీచస్వరముతో జరుగు శబ్దోచ్చారణమును ప్రాతస్సవన మనియు కంఠస్థానమున మధ్యమ స్వరముతో జేయబడిన శబ్దోచ్చారణమును మాధ్యందిన సవన మనియు మస్తకస్థానములో నుచ్చస్వరముతో జేయబడు శబ్దోచ్చారణమును తృతీయసవన మనియు నందురు. అక్షరోత్తరభేదములతో సప్తస్వరాత్మక సామమునకుగూడ పూర్వోక్తములగు మూడుస్థానములు గలవు, ఉరోభాగము—కంఠము—శిరస్సని సప్త స్వరములకును విచరణస్థానములు. కానియురస్థలమందు మంద్ర మతిస్వారముల సరియగు అభివ్యక్తి కానందున దానిని సప్తస్వరముల విచరణస్థలమని చెప్పుటకు వీలులేదు. అయిన నధ్యయనాధ్యాపనములకై అట్టివిధానము చేయబడెను. (సరియగు అభివ్యక్తిలేకున్నను కూడ నుపాంశు—లేదా మానసప్రయోగమున వర్ణస్వరముల సూక్ష్మోచ్చారణ మాత్రము జరుగుచు నేయుండును.) కఠ—కలాప తైత్తిరీయ—ఆహ్వారక శాఖలలోను ఋగ్వేద—సామవేదములందును ప్రథమస్వర ముచ్చరించవలెను. రెండవ—మూడవ స్వరమువలన ఋగ్వేద ప్రవృత్తి కలుగుచున్నది. లౌకిక వ్యవహారమున నుచ్చ—మధ్యముల సంఘాతీస్వరము కలుగుచున్నది. ఆహ్వారకశాఖీయులు తృతీయమందును ప్రథమమందును నుచ్చారితస్వరప్రయోగములు గావింతురు. తైత్తిరీయశాఖీయులు ద్వితీయము ప్రభృతి పంచమము వఱకును నాల్గుస్వరముల యుచ్చారణ చేయుదురు. సామగానముజేయు విద్వాంసులు ప్రథమ (షడ్జము) ద్వితీయ (ఋషభము) తృతీయ (గంధారము) చతుర్థ (మధ్యమము) పంచమ (మంద్రము) కృష్ట (ధైవతము) అతిస్వారము (నిషాదము)లు సప్తస్వరములు మచ్చారణ చేయుదురు. ద్వితీయము—ప్రథమ మిని తాండి (తాండ్య పంచవింశాది బ్రాహ్మణాధ్యేతలగు శాఖ మాదిశాఖీయులు) భాల్లవి (ఛందోగశాఖీయులు) విద్వాంసుల స్వరములు. శతపథబ్రాహ్మణములో వచ్చియున్న యీ రెండుస్వరములును వాజసనేయశాఖీ

*తైత్తిరీయశాఖలోని కృష్ణయజుస్సంహిత యొక్క ద్వితీయకాండలో పంచమ ప్రపాఠక ద్వితీయానువాకములోని ప్రథమ పంచశతిలో మంత్రమున్నది—'స్వాహేంద్ర శత్రు ర్వర్ధస్వ' పౌరాణిక కథానుసారముగ ప్రజాపతి త్వష్ట ఇంద్రుని శత్రువగు వృత్రుని అభ్యుదయమునకై యీ మంత్ర ముచ్చరించెను. ఇంద్రస్య శత్రుః ఈ విగ్రహముబట్టి షష్ఠీసమాసములో సమాసాంత ప్రయుక్తాంతోదాత్తోచ్చారణ మభీష్టమైయున్నను ప్రయోగమున పూర్వపదప్రకృతిస్వర, మాద్యుదాత్తముగ బలుకుటచేత నది బహువ్రీహి యర్థమును ప్రకటించెను. ఇందుచే "ఇంద్రః శత్రుః యస్య సః ఇట్టి యర్థమువచ్చుటచే వృత్రాసురుడే ఇంద్రునిచేత జంపబడెను.

యులద్వారా కూడ ప్రయుక్తములగుచున్నవి. అన్ని వేదములయందును ప్రయుక్తములగు నీ స్వరములు విశేషరూపముగ జెప్పబడియున్నవి. ఈ విధముగ సార్వవైదికస్వరసంచారము జెప్పబడెను. ఇక సామవేదస్వరసంచారము వర్ణింపబడుచున్నది. అనగా ఛందోగవిద్వాంసులు సామగానమందును ఋక్పాఠమందు నుపయోగించు స్వరముల నిట విశేషరూపముగ నిరూపించబడును. ఇచ్చటి శ్లోకముల సంఖ్య స్వల్పమే యైనను నిందర్థమధికవిస్తారమై యుండును. ఈయుత్తమ వేదాంగవిషయ మత్యంతశ్రద్ధాపూర్వకముగ వినదగినది. ద్విజాతులకు ఋగ్యజుస్సామ వేదస్వరూపమును బరిచయము జేయించుట శిక్ష యందురు. సప్తస్వరములు మూడుగ్రామము లిరువదియొక్క మూర్ఛనలు నలుబదితొమ్మిది తానములు — ఈ అన్నింటిని స్వరమండలమని చెప్పుదురు.

షడ్జ ఋషభ గాంధార మధ్యమ పంచమ ధైవత నిషాదము లివి సప్తస్వరములు. షడ్జ మధ్యమ గాంధారము లివి మూడును గ్రామములు. భూలోకమునుండి షడ్జము భువర్లోకమునుండి మధ్యమము స్వర్గ-మేఘలోకము నుండి గాంధారము జనించుచున్నవి. ఈమూడే గ్రామస్థానములు. స్వరముల రాగవిశేషముచేత గ్రామముల వివిధరాగములు జెప్పబడినవి. సామగాయకులు మధ్యమగ్రామములో నిరువది షడ్జగ్రామములో బదునాలుగు గాంధారగ్రామములో బదునైదు తానములను స్వీకరింతురు. నంది, విశాల, సుముఖి, చిత్ర, చిత్రవతి, సుఖ, బల ఇవి దేవతల సప్తమూర్ఛనలు. ఆప్యాయిని విశ్వభృత, చంద్ర, హేమ, కపర్దిని, మైత్రి, బార్హతి ఇవిపితరుల సప్తమూర్ఛనలు. షడ్జస్వరములో నుత్తరమంద్రము ఋషభములో నభిరూఢత (అభిరుద్గత) గాంధారములో నశ్వక్రాంత యని పేరుగలవి మూడవమూర్ఛన యని చెప్పబడెను. మధ్యమస్వరములో సౌవీర, పంచములో హృషిక, ధైవతములో నుత్తరాయత నామములు గల మూర్ఛనలు గలవు. నిషాదస్వరములో రజనీనామక మూర్ఛన యెఱుంగవలెను. ఇవి ఋషుల సప్తమూర్ఛనలు. గంధర్వగణము దేవతల సప్తమూర్ఛనలు, యక్షులు పితరుల సప్తమూర్ఛనలు స్వీకరింతురు. ఋషుల సప్తమూర్ఛనలు లౌకికములని చెప్పబడెను. మనుష్యులు వాని ననుసరింతురు. షడ్జస్వరము దేవతలను ఋషభస్వరము ఋషి-మునులను సంతృప్తిపరచును. గాంధారస్వరము పితరులకు - మధ్యమస్వరము గంధర్వులకు పంచమస్వరము దేవతలకు-పితృదేవతలకు మహర్షులకును గూడ సంతోష మొసంగుచున్నది. నిషాదస్వరము యక్షులకును ధైవతము సమస్తభూతసముదాయమును నాహ్లాదపరచుచున్నది. గానగుణప్రవృత్తి దశవిధములు గలది. అనగా లౌకికవైదికగానము దశగుణములతో గూడియున్నది. రక్త, పూర్ణ, అలంకృత, ప్రసన్న, వ్యక్త, వికృష్ట, శ్లక్ష్ణ, సమ, సుకుమార, మధురము లను నవే యీ దశవిధగుణములును. వేణు, వీణా పురుష స్వరములు గలసి యేకమై యభిన్నమై తోచి రంజకముగ నున్నచో దాని పేరు రక్తము. స్వర-శ్రుతుల పూర్తి చేయుటచే - ఛందస్సు - పాదాక్షర సంయోగముచే ప్రకటమగు గుణము "పూర్ణము". కంఠమం దనగా ప్రథమస్థానమందలి స్వరమును గ్రిందుగాజేసి హృదయములో స్థాపించుట. ఉన్నతమొనర్చి శిరస్సులోనికి గొనిపోవుట "అలంకృతము." కంఠముయొక్క గద్గదభావము వెలువడి యేశంకయు లేకుండబోయిన నది "ప్రసన్న" గుణము. దేనియందు పద - పదార్థ-ప్రకృతి-వికార-ఆగమ, లోప, కృదంత, తద్ధిత, సమాస, ధాతునిపాత, ఉపసర్గ, స్వర-లింగ, వృత్తి, వార్తిక, విభక్త్యర్థ, ఏకవచన బహువచనాదుల స్పష్టోపపాదనముగలదో దానిని "వ్యక్త" మందురు. పద-అక్షరములు స్పష్టములై యుచ్చస్వరమున బలుకబడునది "వికృష్టము." ద్రుతము (తొందర) విలంబిత మీ రెండుదోషములు లేనిదై యుచ్చ నీచ-ప్లుత-సమాహార హేల-తాళ ఉపనయాద్యుపపత్తులతో యుక్తమగు గీతమును 'శ్లక్ష్ణ' మందురు. స్వరముల యారోహణావరోహణ స్థానముల వ్యవహిత స్థానసమావేశమే "సమము." పద-వర్ణ-స్వర-కుహరణము (అవ్యక్తాక్షరములను గంతమణచి పలుకుట) లన్నియును మృదుకోమలములైయున్న గీతమును సుకుమారమందురు. స్వభావతః ముఖమునుండి వెలువడిన లలితపద మక్షరగుణసంపన్నగీతము మధుర మని చెప్పబడును. ఇట్లు గానము దశగుణయుక్తము.

ఇక దోషములు-శంకిత, భీషణ, భీత ఉద్ఘుష్ట, అనునాసిక, కాకస్వర, మూర్ధగత (అత్యంతోచ్చస్వరముతో శిరస్సువఱ కెక్కించిన యపూర్ణగానము) స్థానవివర్జిత, విస్వర, విరస, విశ్లిష్ట, విషమాహత వ్యాకుల, తాళహీనము లను పదునాల్గును గీతదోషములు. ఆచార్యులగు వారు సమగానమును బండితులు పదచ్ఛేదమును స్త్రీలు

మధురగీతమును వాంఛింతురు. ఇతరులు విక్రుష్టము (పద-యక్షరముల విభాగముతోడి యుచ్చస్వరోచ్చారితము) విన నభిలషింతురు. షడ్జస్వరవర్ణము కమల పత్రమువలె హరితము. ఋషభస్వరము శుకమువలె నొంచెము పసుపురంగుతోడి యాకుపచ్చనిరంగు గలది. గాంధారము సువర్ణవర్ణము. మధ్యమము కుందసదృశ శ్వేతము. పంచమము శ్యామవర్ణము ధైవతము పసుపు పచ్చనిరంగు గలది. నిషాదమున సర్వవర్ణములు గలసి యున్నవి. పంచమ, మధ్యమ, షడ్జము లీమూడును బ్రాహ్మణజాతివి. ఋషభ, ధైవతములు రెండును క్షత్రియజాతిలోనివి. గాంధార, నిషాదము లర్ధవైశ్యజాతివి. పతితము లగుటచే నియ్యవి అర్ధశూద్రములును. ఋషభానంతరప్రకటిత షడ్జ స్వరముతో గూడ ధైవతసహిత పంచమస్వరము మధ్యమరాగమున బ్రాప్తముగునప్పుడా నిషాదసహిత స్వరగ్రామమును "షాడవము లేక షాడ్జవమని యెఱుంగ వలెను. మధ్యమస్వరమున బంచమ విరామమై యంతర స్వరము గాంధారమైపోయినచో — దదనంతరమున గ్రమముగ ఋషభ నిషాద-పంచమ ముత్పన్నమగుచో నా పంచమమును గూడ నిట్లే (షాడవము లేదా షాడ్జవము) తలంచవలెను. మధ్యమస్వర మారంభమైన మీదట గాంధారస్వరాధిపత్యము (వృద్ధి) గలుగుచో —నిషాదస్వరము మాటిమాటికి వచ్చుచు బోవు చున్నచో - నొక్కసారిమాత్రమే యుచ్చరింపబడి యుండుటచే ధైవతము దుర్బలావస్థలో నుండి షడ్జ-ఋషభస్థితి యన్యపంచకసమానముగ నుండియుండినచో దానిని మధ్యమగ్రామ మందురు. ఆరంభములో షడ్జముండి నిషాదమును గొలదిగా స్పృశించి యున్నచో—గాంధార మెక్కువ యుచ్చరింపబడి యున్నచో—వెనువెంట ధైవతస్వరకంపనము—పాతనము చూడబడుచున్నచో—వటుపిమ్మట నితర స్వరముల యథారుచి గానము చేయబడియున్నచో దానిని షడ్జగ్రామమందురు. ప్రారంభముననే షడ్జ ముండి పిదప నంతరస్వర సంయుక్త కాకలి చూడబడు చున్నచో నవగా నాల్గుసారులు కేవలము నిషాదము మాత్రమే వినబడుచున్నచో—బంచమస్వరమందున్న యా ఆధారయుక్తగీతమును శ్రుతికైశికమని యెఱుంగ వలెను. పూర్వోక్త కైశికనామగీతమును సర్వస్వరములతో సంయుక్త మొనర్చి మధ్యమమునుండి ప్రారంభము చేయబడి మధ్యమమందే దాని స్థాపనము గూడ జఱిగియుండినచో నది 'కైశికమధ్యమ' మను గ్రామరాగ మగుచున్నది. పూర్వోక్త కాకలి కన్పించుచు బంచమస్వరప్రాధాన్యత యుండి మిగిలిన యన్యాన్యస్వరములు సామాన్యస్థితిలో నుండియున్నచో దానిని కశ్యపఋషి మధ్యమగ్రామజనిత కైశికరాగ మనెను. విద్వాంసులు 'గాయన' గేయమనియు 'ధ'యన గశాపూర్వక వాద్యము ప్రయోగించుటయనియు రేఫ సహిత వ యన వాద్యసామగ్రి యనియు నర్థము జెప్పుదురు.

ఇదే 'గాంధర్వ' శబ్దలక్ష్యార్థము సామగాయకుల ప్రథమస్వరమే వేణు మధ్యమస్వరము. వారి ద్వితీయ స్వరమే వేణు గాంధారస్వరము తృతీయస్వరము వేణు ఋషభము. చతుర్థస్వరము వేణు షడ్జము. పంచమము వేణు ధైవతము. షష్ఠస్వరము వేణు నిషాదము. సప్తమ స్వరము వేణు పంచమస్వరము మయూరము షడ్జస్వరమున బలుకును; గోవు ఋషభస్వరమున నంభారవము చేయును; మేక-గొఱ్ఱె గాంధారము స్వరమున నఱచును; క్రౌంచ (కురర) పక్షి మధ్యమస్వరమున బలుకును; సాధారణముగ సర్వవిధ పుష్పవికాసముగు వసంతర్తువున గోకిల పంచమస్వరమున బలుకును; అశ్వము ధైవతస్వరమున సకిలించును; మాతంగము నిషాదస్వరమున ఘీంకరించును. షడ్జము కంఠమునుండియు, ఋషభము మస్తకమునుండియు, ముఖసహితనాసికతో గాంధారోచ్చారణయు, హృదయమునుండి మధ్యమస్వరము వెలువడును వక్షము, కంఠము, శిరస్సు పంచమస్వరమునకు లలాటము ధైవతమునకు సంపూర్ణ సంధులు; నిషాదమునకు నుద్గమస్థానములు. షడ్జము నాసిక కంఠము వక్షస్థలము తాలువులు జిహ్వా దంతముల నాశ్రయించి యుండును. ఈ షడంగములనుండి దాని పుట్టుక గనుకనే దానిని షడ్జమందురు. నాభినుండి లేచిన వాయువు కంఠమస్తకములను డీకొని వృషభమువలె గర్జనచేయును గనుక దానిని ఋషభస్వరమందురు. నాభినుండి లేచిన వాయువు కంఠమస్తకములను డీకొని పవిత్రగంధవహమై వీచును గనుక దానిని గాంధారమనిరి. నాభి నుండి వెల్వడిన వాయువు హృదయము గవిసి నాభిస్థానమును జేఱి మధ్యవర్తి యగుచున్నది గాన నందుండి వెల్వడిన స్వరమునకు మధ్యమమని నామము. నాభినుండి వెల్వడిన వాయువు వక్షము-హృదయము

కంఠము శిరములతో గవిసి యీ యైదుస్థానములనుండి స్వరముతోగూడ బ్రకటమగును గాన నా స్వరమునకు బంచమమని పేరు గలిగెను. అన్యవిద్వాంసులు ధైవత—నిషాదము లీ రెండుస్వరములుగాక మిగిలిన యైదు స్వరములు నైదుస్థానములనుండియు వెల్వడునని చెప్పుదురు.

స్థానములైదింటియందుండు హేతువుచే వీనిని సర్వస్థానములయందును ధారణ చేయవచ్చుచున్నది. షడ్జమగ్నిచే ఋషభము బ్రహ్మచే గాంధారము జంద్రునిచే మధ్యమము విష్ణునిచే బంచమము నారదునిచే ధైవత నిషాదములు తుంబురునిచే గానము చేయబడెను. విద్వాంసులు షడ్జస్వర దేవత బ్రహ్మయనియు ఋషభ ప్రకాశము తీక్ష్ణము నుద్దీప్తము నగుటచేత నగ్నిదేవుడే తదధిపతి దేవత యనియు గాంధారస్వరము విని గోగణము ప్రసన్నమగును గాన దాని కధిష్ఠాత్రిదేవి గోవే యనియు జెప్పుదురు. గాంధార స్వరము విని గోవులు సమీపించుననుటలో సందేహము లేదు. పంచమ స్వరదేవత సోము డితనిని బ్రాహ్మణుల రాజనియందురు శుక్ల కృష్ణ పక్షములలో జంద్రుని వృద్ధిక్షీణతలవలె స్వరగ్రామమందు బ్రాప్తమైనప్పుడు హ్రాసవృద్ధులు జరిగి యీ పూర్వోత్పన్న స్వరముల అతిసంధి జరుగునదే ధైవతము ఇందుచేతనే దాని ధైవతత్వ విధానము చేయబడెను. నిషాదమందన్ని స్వరముల నిషాదన (అంతర్భావ) ముండును గనుకనే యది నిషాదమని చెప్పబడుచున్నది. ఇది అన్ని స్వరములను సూర్యుడు సర్వ నక్షత్రముల నభిభూత మొనర్చుకొనునట్లుగ నభిభూత మొనర్చుకొనును. సూర్యుడే దీని యధి దేవత.

కాష్టవీణ—గాత్రవీణ; గానజాతిలో నివి రెండు విధములైన వీణలు. సామవేదమునకు గాత్రవీణయే ముఖ్యము. సామగాయకు లీ గాత్రవీణపైననే పాడుదురు. అది అంగుళ్యంగుష్ఠరంజితమై స్వరవ్యంజన సంయుక్తమై యుండును. దానియందు తన రెండు చేతులను సంయమములో నుంచుకొని మోకాళ్ళపై నుంచి గురువు ననుసరించవలెను. అట్లుచేసిన భిన్నబుద్ధి యుండదు. మొదట బ్రణవమును బిదప వ్యాహృతులను నుచ్చరింపవలెను. అనంతరమున గాయత్రీమంత్ర ముచ్చరించి సామగానము బ్రారంభించవలెను. అన్ని వ్రేళ్ళను జాపి సర్వమండలారోపణము గావించవలెను. వ్రేళ్ళలో నంగుష్ఠమును నంగుష్ఠముతో వ్రేళ్ళను నెన్నడును స్పృశించరాదు: సర్వదా అవ్రేళ్ళ మధ్యపర్వమున నంగుష్ఠాగ్రభాగముచే స్పృశించుచుండవలెను. మాత్రా, ద్విమాత్రా వృద్ధి విభాగమునకై యెడమచేతి వ్రేళ్ళతో ద్విమాత్రను జూపించుచుండవలెను. త్రిరేఖ కల్పించినచోట సంధినిర్దేశము గావించవలెను. అది పర్వముగా విభాగజ్ఞులగువారెఱుంగవలెను. శేష మంతరాంతరము సామమంత్రమున (ప్రథమద్వితీయ స్వరముల మధ్య) యావత్తుల్యాంతరము జేయవలెను. ఋక్కులలో దిలసదృశాంతరము లెస్సగ నిదిష్ట మొనర్పబడిన స్వరములనే మధ్యమపర్వములయందు నివేశ మొనరించవలెను. విద్వాంసు డిట శరీరావయవముల దేనిని గంపింపజేయదగదు. నిమ్నాంగము లూరువులు జంఘలు మున్నగునవి సుఖపూర్వకముగ నుంచి వానిపై రెండుచేతులను బ్రచలితపరిపాటి ననుసరించి యుంచవలెను. (అనగా దక్షిణహస్తమును గోకర్ణమువలెను, వామహస్తము నుత్తానభావముగను నుంచవలెను) మేఘములలో విద్యుత్తు మణిమయసూత్రమువలె బ్రకాశించుచు గన్పడునట్లుగ నీ వివృత్తిభేదమే (పదాది విభాగము) వేఱువేఱ్పఱచుట స్పష్టనిర్దేశమునకు దృష్టాంతము. శిరస్సుపైని కేశములను గత్తెరనడచుచు వేఱుచేసినైచునట్లే పదస్వరాదుల పృథక్పృథగ్విభాగ పూర్వకబోధము చేయుచుండవలెను. సర్వాంగములను గూర్మము లోనికి ముడుచుకొనునట్లుగ నితరచేష్టలన్నింటిని విలీనమొనర్చి మనస్సు-దృష్టియు నుంచి విద్వాంసుడు స్వస్థ-శాంత-నిర్భయుడై వర్ణముల నుచ్చారణచేయవలెను. మంత్రోచ్చారణసమయమున నాసికకు దిన్నగా దూర్పుదిశవైపునకు గోకర్ణసమానముగ హస్తమెత్తియుంచి హస్తాగ్రభాగమున దృష్టియుంచుచు శాస్త్రార్థ నిరంతర చింతనము జేయుచుండవలెను. ద్రుతాది వృత్తితో నెట్లు వర్ణములను దొలుత నుచ్చరించునో అట్లే సమాప్తముగూడ జేయవలెను. (ఒకే మంత్రములో యట్టే రెండు వృత్తుల రచన తగదు) అభ్యాఘాత, నిర్ఘాత, ప్రగాన, కంపనము లొనరింపగూడదు. సమభావముతో సామమంత్రములను గానము చేయవలెను. ఆకాశమున శ్యేనపక్షి సమగతితో నెగురునట్లుగా జలములో దిరుగు మత్స్యముల కాకాశమున నెగురుపక్షులకు విశేషరూపముగ మార్గము తెలియరానట్లు సామగానమున స్వరగతశ్రుతివిశేషరూప మవధారణగా నేరదు. సామాన్యతః గీతమాత్రోపలబ్ధి యుండును. దధిలో

ఘృతము కొష్ఠములో నగ్ని దాగియుండి ప్రయత్నించినచో దదుపలబ్ధి యగునట్లే స్వరగతశ్రుతికూడ గీతములో దాగియుండును ప్రయత్నించిన దాని విశేషరూపము గూడ నుపలబ్ధమగును. ప్రథమస్వరమునుండి ఇతరస్వరముపై జరుగు స్వరసంక్రమణము ప్రథమస్వరముతో సంధియుంచుకొనుచునే చేయవలెనుగాని విచ్ఛేదమొనర్చిగాని వేగముగాగాని చేయరాదు. ఛాయ ఎంత సూక్ష్మగతితో నొకచోటనుండి రెండవచోటకు జనుచుండును గాని పూర్వస్థానమునుండి సహసాసంబంధమును వదలుకొనవు-వేగముగా క్రొత్తచోటకు జరుగుటవుగదా యట్లే స్వరసంక్రమణముగూడ సమ-అవిచ్ఛిన్న భావముతో జేయవలెను. ప్రథమస్వరమును లాగుచు ద్వితీయస్వరముగ చున్నప్పుడు దానిని కర్షణమందురు. విద్వాంసులు నిమ్నోక్తషడ్దోషకర్షణములను త్యజించవలెను. అనాగత-అతిక్రాంతావస్థలో గర్షణము చేయరాదు. ద్వితీయస్వరారంభమునకు ముందు దాని యనాగతావస్థయనియు ప్రథమస్వరము సర్వథా వ్యతీతమైపోవుట—యతిక్రాంతావస్థ యనియు నందురు. ఈ రెండుస్థితులలోను ప్రథమస్వరకర్షణము జేయదగదు—ప్రథమ మాత్రను విచ్ఛేదమొనర్చియు జేయదగదు. దానిని విషమాహతము—పంపిత మొనర్చియు ద్వితీయస్వరము మీదకు జనరాదు. కర్షణకాలమున మూడుమాత్రలకంటె నధిక స్వర విస్తారము చేయరాదు. అస్థితాంతిమును త్యజించవలె ననగా ద్వితీయస్వరమందును త్రిమాత్రాయుక్త స్థితి యుంచవలెనుగాని ద్విమాత్రాయుక్తము మాత్రము గాదు. స్థానమునుండి చ్యుతిమై నిజస్థానము నతివర్తనము (లంఘనము) జేయు స్వరమును సామగాయకులు 'విస్వర'మందురు. వైణికవిద్వాంసులు దానిని 'విరక్త' మని చెప్పుదురు. స్వయముగ నభ్యాసము చేయుటకొఱకు ద్రుతవృత్తిలో మంత్రోచ్చారణ చేయవలెను. ప్రయోగముకొఱకు మధ్యమవృత్తిని శిష్యుల కుపదేశమునకు విలంబితవృత్తిని గ్రహించవలెను. ఇట్లు శిక్షాశాస్త్రోక్తవిధితో క్తగ్రంథమును (సామగానము) గ్రహించిన విద్వాంసుడగు ద్విజుడు గ్రంథోచ్చారణ శిక్షగైకొను విద్యార్థులకు హస్తముతోడనే యధ్యయనము చేయించవలెను.

క్రుష్ట (సప్తమ, పంచమ) సర్వస్థానము మస్తకము ప్రథమ (షడ్జము) స్వరము లలాటము, ద్వితీయ (ఋషభము) స్వరస్థానము రెండు కనుబొమ్మలమధ్యను, తృతీయ (గాంధార) స్వరస్థానము రెండు చెవుల మధ్యను, చతుర్థ (మధ్యమ) స్వరస్థానము కంఠమనియు జెప్పుదురు. మంద్ర (పంచమ) స్వరస్థానము రసన (మంద్రమురసి కూచ్యతే యీ పాఠానుసారముగ దాని స్థానము వక్షఃస్థలముగూడ) అతిస్వారమని పేరుగల నీచస్వర (నిషాదము) స్థానము హృదయము, అంగుష్ఠశిరోభాగమున క్రుష్ట (సప్తమ, పంచమ) న్యాసము చేయవలెను. ప్రథమ స్వరస్థానముగూడ నంగుష్ఠముందేయని చెప్పబడెను. తర్జనిలో గాంధారము మధ్యమములో ఋషభము—అనామికలో షడ్జము కనిష్ఠికలో ధైవతమును గలవు. కనిష్ఠికా నిమ్నమూల భాగమున నిషాదస్వరస్థితి యందురు. మంద్రస్వరము కంటె సర్వథా పృథక్కు కానందున నిషాద 'మపర్వము.' దానికి పృథక్స్థానము లేనందున దానిని 'అసంజ్ఞ'మని యందురు దానిలో లింగ—వచనాదుల సంబంధము లేనందున దానిని 'అవ్యయ'మని కూడ జెప్పుదురు. గనుక మంద్రమే మందీభూతమై 'పరిస్వారము' (నిషాదము)గా జెప్పబడినది క్రుష్టస్వరము వలన దేవతలు, ప్రథమమువలన మనుష్యులు ద్వితీయము వలన బశువులు తృతీయమువలన గంధర్వాప్సరలు జీవితము ధరించుచున్నారు. అండజములు పితృగణము చతుర్థస్వరజీవులు. పిశాచాసుర రాక్షసులు మంద్ర స్వరమున, స్థావర జంగమ రూపమగు సమస్త జగత్తు నీచ—అతిస్వారము (నిషాదము) వలన జీవించుచున్నది. ఇట్లు సామికస్వరమువలన ప్రాణులన్నియును జీవించుచున్నవి.

దీప్త ఆయత కరుణ—మృదు మధ్యమ శ్రుతుల విశేషజ్ఞుడు గానివా డాచార్యుడని చెప్పబడుట కనర్హుడు. మంద్ర ద్వితీయ చతుర్థ-అతిస్వార, తృతీయ స్వరముల శ్రుతిని 'దీప్త' మందురు. (ప్రథమశ్రుతి మృదువు) సప్తమశ్రుతి 'కరుణ' అన్యములగు మృదు—మధ్యమ—ఆయతాశ్రుతులు ద్వితీయస్వరమున వచ్చుచున్నవి. నీచమనగా ద్వితీయస్వరము పరమునందుండగా ద్వితీయస్వరశ్రుతి 'ఆయతి' మగుచున్నది. విపర్యయమనగా చతుర్థస్వరము పరమునందుండగా నుక్తస్వరశ్రుతి-మృదుభూతి మగుచున్నది. స్వస్వరము పరమునందుండి స్వరాంతరము పరమున నుండకున్నచో నది మధ్యమ శ్రుతి యగుచున్నది. ఇదంతయు నెఱింగి సామస్వరము

ప్రయోగించవలెను. క్రుష్టస్వరము పరమైయుండగా ద్వితీయ స్వరమందున్న శ్రుతి 'దీప్తము'; ప్రథమస్వరమందున్నచో నది మృదుశ్రుతి; ఒకవేళ జతుర్థస్వరముననున్నచో నదియును మృదుశ్రుతియే. మంద్రస్వరమందున్నయెడల 'దీప్త'మగును. సామము సమాప్తమైనపిమ్మట నేయేస్వరమందుండియున్నను శ్రుతి 'దీప్తమే' యగుచున్నది. స్వరము సమాప్తముగాక పూర్వ, మాయతాది శ్రుతిప్రయోగము జేయదగదు. స్వరము సమాప్తమైపోయినను గానవిచ్ఛేదము గానంతవఱకును రెండు స్వరముల మధ్యనుగూడ శ్రుతిప్రయోగము జేయదగదు. హ్రస్వ—దీర్ఘాక్షర గానము వేళనుగూడ శ్రుతిచేయరాదు. (కేవలము ప్లుతమందే శ్రుతి కర్తవ్యము) ఘుటసంజ్ఞికస్వర మున్నను శ్రుతి ప్రయోగము చేయరాదు. తాలవ్య ఇకారమునకు 'అ' 'ఇ' భావమగును. 'అ' 'ఉ' భావము నగును. ఇవి రెండువిధములైన గతులు. ఊష్మవర్ణములైన శ, ష, సలతో గూడిన త్రివిధ పదాంతసంధి—ఇవన్నియు గలిసి యైదుస్థానములు. ఈ స్థానములలో ఘుటసంజ్ఞిక స్వర మెఱుంగవలెను. (ఇందు శ్రుతి చేయరాదు) శ్రుతిస్థానములందు స్వరము స్వరాంతరము సమాప్తము గాకుండ నున్నచో నవియును హ్రస్వ - దీర్ఘ - ఘుట సంజ్ఞికస్థలములును శ్రుతిరహితములు. వాటియందు శ్రుతి చేయరాదు. అచ్చట స్వరముతోడనే శ్రుతి వత్కార్యమగును.

సామవ్యతిరిక్తస్థలములందు ఉదాత్తస్వరమున 'దీప్త' నామకశ్రుతియని యెఱుగవలెను విద్వాంసులు స్వరితమందును దీప్తస్థితియనియే చెప్పుదురు. అనుదాత్తమందు 'మృదుశ్రుతి' గాంధర్వగానమున శ్రుతి యభావమైనను స్వరమునే శ్రుతితుల్యము జేయవలయును. అట స్వరమందే శ్రుతివైభవము నిహితమైయున్నది. ఉదాత్త మనుదాత్తము స్వరితము ప్రచయము నిఘాత—మీయైదును స్వరభేదములు.

ఆర్చికస్వరములు మూడు. మొదటిది ఉదాత్తము రెండవది అనుదాత్తము మూడవది స్వరితము. ఉదాత్తమని చెప్పబడినదే స్వరితముకంటె బరమగుచో విజ్ఞులు దానిని ప్రచయమందురు. అట రెండవ స్వరాంతమేదియు నుండదు. స్వరితము ద్వివిధములు-వర్ణస్వార మతీతస్వారమని. ఇట్లే వర్ణముగూడ మాత్రిక ముచ్చరితము బిదప దీర్ఘమగును. ప్రత్యయస్వార రూప ప్రత్యయము గన్పించినచో దానిని సప్తవిధములని యెఱుంగవలెను. అదేమిటి ఎక్కడ నెట్లున్నదను జ్ఞానము పదముచే లభించును. దక్షిణకర్ణమున సప్త స్వరములను వినిపించవలెను. ఆచార్యులగువారు పుత్రుల—శిష్యుల హితేచ్ఛుకులై యుండియే యీ శిక్షాశాస్త్రప్రవచనము గావించియుండిరి ఉచ్చము (ఉదాత్తము) కంటె నుచ్చతరమేదియును లేదు. అట్లే నీచము (అనుదాత్తము) కంటె నీచతరమును లేదు. విశిష్టస్వరూపములోని స్వారసంజ్ఞ—దానిలో స్వారస్థాన మేది యను ప్రశ్నకు సమాధాన మీయబడుచున్నది.

ఉచ్చ (ఉదాత్త) నీచ (అనుదాత్త) మధ్యమందలి 'సాధారణ' మను శ్రుతినే శిక్షాశాస్త్ర పారంగతులు 'స్వార' సంజ్ఞలో 'స్వార' నామముతో నెఱుంగుదురు. ఉదాత్తములో నిషాద - గాంధార స్వరము లనుదాత్తములో ఋషభ ధైవత స్వరము లున్నవి. మఱి యీ షడ్జ మధ్యమ పంచమములు స్వరితమందు ప్రకటితమగుచున్నవి. పరమందు 'క-ఖ' లు గలదియు జిహ్వామూలీయరూపమగు ప్రయోజనమును సిద్ధింపజేయునదియు నగు 'ఊష్మము' (ఁకఁఖ) మాత్రయని యెఱుగవలెను. అది తన స్వరూపముచేతనే "కళ" (ఏ రెండవ యక్షరావయవము గాదు. దీని నుపధ్మానీయము యొక్క యుపలక్షణమనియు నెంచనగును.)

జాత్యము క్షైప్ర మభినిహితము తైరవ్యంజనము తిరోవిరామము ప్రశ్లిష్టము పాదవృత్త మనునవి సప్త స్వారములు. ఈ స్వారలక్షణములు వేఱు వేఱుగ జెప్పి యన్నింటికి నుచితములగు నుదాహరణములు గూడ జూపించబడుచున్నవి. యకార వకారములతో స్వరితమగు నక్షర మేయక్షరము ముందుదాత్తముండదో ఆ యక్షరమును 'జాత్యస్వార' మందురు. ఉదాత్త ఇ - ఉ వర్ణములు పదాదిన నుదాత్త అకారము పరమై యుండగా సంధిగలిగి య - వ రూపములో బరిణతమై స్వరితమైనచో నట సదా క్షైప్రస్వారలక్షణ మెఱుంగ నగును. ఏ - ఓ యీ రెండుదాత్తస్వరములకు బరమున వకారసహిత అకారము నిహితమై (అనుదాత్త రూపములో నిపాతితమై) యుండినను దాని లోప (ఏకార ఉకారములలో నను ప్రవేశ) మైనను దాని నభినిహితస్వార మందురు. ఛందస్సులో

నెటనైన నేదైన పూర్వమున నుదాత్తముండిన యే స్వరితమైన నున్నప్పుడా సర్వబహుస్వారము (సర్వత్ర బహుళీతాపూర్ణస్వరము) తైరవ్యంజనమని పిలువబడును ఉదాత్తమవగ్రహమై యవగ్రహమునకు బరమున అనంతర స్వరితముండియున్నచో దానిని తిరో విరామమని ఎరుంగవలెను ఉదాత్త ఇకార మనుదాత్త ఇకారముతో సంయుక్తమై కన్పించినచో నది ప్రశ్లిష్ట స్వారమని గ్రహింపదగును. స్వరాక్షర మకారాదిలో స్వరితమై పూర్వపదముతో గూడ సంహిత విభక్తమై యున్నచో దానిని బాదవృత్తి స్వారము యొక్క శాస్త్రోక్త లక్షణమని యెరుంగవలెను. జాత్యస్వార మునకుదాహరణ—'స జాత్యేన' ఇత్యాదులు.

"ప్రశుష్టీ+అగ్నే=ప్రశుష్ట్యగ్నే" మున్నగు స్థలము లందు 'క్షైప్ర' స్వారము. 'వే మన్వత' ఇత్యాదులం దభినిహిత స్వారము. 'హో+ఊతయే=హోతయే'. వి+ ఈతయే='వీతయే' ఇత్యాదులలో తైరవ్యంజన స్వారము. "విస్కభితే విస్కభితే". ఆది స్థలములందు తిరోవిరామము. హి ఇంద్ర గిర్వణః=హీంద్ర—ఇందు 'ప్రశ్లిష్టము' 'క ఈమ్' క ఈం వేద ఇత్యాదులలో బాదవృత్త స్వారము. ఇట్లివి యన్నియు సప్తస్వారములు.

జాత్య స్వరములు గాక ఒక పూర్వవర్తి యుదాత్తాక్షరముతో బరమై యే యక్షరమున్నను దానిని స్వరితమందురు. ఇది స్వరిత సామాన్య లక్షణము. పూర్వోక్త స్వారములు నాలుగు నుదాత్తము లేక ఒక యనుదాత్తము పరమైయుండగా శాస్త్రతః కంపమును బుట్టించును. (చలస్వరూపమైన స్వారము పేరు కంపము) దీని కుదాహరణ—'జుహ్వాగ్నిః' 'ఉపత్వా జుహూ' 'ఉపత్వా జుహోమ్వ మను' ఇత్యాదులు. పూర్వపద మికారాంతమై పరమున ఉకారముండి యున్నచో మేధావు లట హ్రస్వకంపమని యెరుంగవలెను. ఉకారద్వయ యుక్తపదము పరముననుండి ఇకారాంత పదమందు దీర్ఘకంప మెఱుంగనగును. దీని కుదాహరణ "శగ్ధ్యృఘా" ఇత్యాదులు సంధ్యక్షరములలో నున్నచో మూడు దీర్ఘకంపముల నెఱుంగవలెను క్రమముగా నుదాహరణలు — 'మన్యా', 'పత్న్యాః,' ఇంద్రాభ్యామ్' శేషములు హ్రస్వములని చెప్పబడెనవి. అనేకోదాత్తముల పిదప నేదయిన ననుదాత్త ప్రత్యయ ముండియున్నచో—నొక యుదాత్తము పరమైయుండ రెండవ మూడవ ఉదాత్తములకు 'శివకంప' మని పేరు. అనగా నది శివకంపసంజ్ఞగల యుదాత్తమగుచున్నది. కాని యది ఉదాత్తప్రత్యయమగ వలెను. రెండు మూడు నాలుగు అన్యుదాత్తాక్షరములై నీచమనుదాత్తముండి అనగా ఉదాత్తముండి అది యును బూర్వముందున్న ఉదాత్తము లేదా ఉదాత్తములకంటె బరమైయున్నచో నట విద్వాంసు లుదాత్తమని తెలంతురు. రేఫము—హకారముల కెక్కడను ద్విత్వ ముండదు. రెండు రేఫములు గాని రెండు హకారములు గాని యొక్కసారి ప్రయోగింపబడవు. కవర్గాది వర్గల రెండవ నాల్గవ యక్షరములకుగూడ నెప్పుడును ద్విత్వముండును. వర్గల నాల్గవ యక్షరమును మూడవ యక్షరముతోడను రెండవ యక్షరమును ప్రథమాక్షరముతోడను బీడించరాదు. ఆది-మధ్య-అంత్యాక్షరములను (క-గ-జ) స్వాక్షరములతోడనే పీడిత (సంయుక్త) మొనర్పవలెను. ఒకవేళ సంయోగ దశలో ననంత్యవర్ణము (అంతిమవర్ణము కాని గకారాదులు) మొదట నున్నచో నకారాద్యంతివర్ణములు పిదప నున్నచో మధ్యలో యమ (య వ ర ల ఞ మ ఙ ణ న) యక్షరముండి పూర్వమందున్న యక్షరమునకు సవర్ణమగుచున్నది. పూర్వవర్తి శ ష స య ర ల వ యీ యక్షరములతో సంయుక్తవర్గాంతిమవర్ణములను గాంచి చోరులను హంతకులను గాంచి పథికుడు నిజమార్గమును వీడి తిరిగిపోవునట్లుగా యమము నివృత్తమై పోవును. సంహితలో వర్గులోని మూడవ యక్షరము నాల్గవ యక్షరము సంయుక్తములైనప్పుడు పదకాలమందు జతుర్థాక్షరముతోడనే యారంభించి యుత్తరపద మగును. ద్వితీయ తృతీయములు—హకార మీ యన్నింటితో సంయోగమగుచో నుత్తర పదము హకారాదియే యగును. అనుస్వార ముపధ్మానీయము జిహ్వామూలీయముల యక్షరము లే పదమున నేగవు. రెండు పర్యాయములు వాటి యుచ్చారణయు నుండదు. పూర్వమున ర-హ అక్షరములతో సంయోగమైనచో బరవర్తియక్షరము ద్విత్వమగును. సంయోగమున స్వరితముండి యుద్ధృతములోను (క్రిందినుంచి

1. స్వరితమునకు ముందు స్వరితమే యున్నచో దానికి ప్రచయమని పేరు.

2 ప్రచయము పరమై యుండియున్నయెడల స్వరితాహనన మున్నచో దానికి నిఘాతమని సంజ్ఞ. స్వరితము లేకున్నచో శుద్ధస్వరితమే యుండును.

పైకి పోవుట) బశీనము (పైనుంచి క్రిందికి వచ్చుట) లోను స్వరితమున్నచోట బూర్వాంగము నాదిలో జేసి (నీచముం దుచ్చత గొనివచ్చి) పరాంగాదిలో తస్వరిసన్నివేశము జేయవలెను. సంయోగము విరత (విభిన్న) మైనప్పు డుత్తరపదమునుండి కన్పడు అసంయుక్త వ్యంజనమును బూర్వాంగముని యెఱుగవలెను. అట్లే యుత్తరపదారంభమైన వ్యంజనమును బరాంగమనియు నెఱుంగనగును. సంయోగమునుండి పరవర్తియైన భాగమును స్వరయుక్తముగా జేయవలెను. ఏలనన నది యుత్తమమైన సంయోగనాయక మదటనే ప్రధానతయా స్వరవిశ్రాంతి యగుచుండును. వ్యంజనసంయుక్తవర్ణమునకు బూర్వాక్షరము స్వరితము. దానిని స్వరములేకుండనే పలుకవలెను. అనుస్వారము పదాంతము ప్రత్యయము సవర్ణపదము పరమై యుండగా నగుద్విత్వము రేఫ స్వరూప స్వరభక్తి—ఇదంతయు బూర్వాంగముని చెప్పబడును. పాదాదియందును బదాదియందును సంయోగ- అవగ్రహములందును గూడ యకారమునకు ద్విత్వము ప్రయోగించవలెను. దానిని 'య్య' యని యెఱుంగవలెను. అన్యత్రి య కేవలము య రూపముననే యుండును. పదాదియం దంశియుండియు విచ్ఛేదము (విభాగము) కాకున్నచో లేదా సంయోగారంభమున నుండి యున్నప్పుడు ర్. హ్. రేఫ విశిష్ట య యను నీ మూడునుగాక మిగిలిన వర్ణములకా యాదేశము (ద్విత్వాభావము) చూడబడుచున్నది. స్వయం సంయోగ యుక్తమగు నక్షరమును గురువని యెఱుంగనగును. అనుస్వార—విసర్గ యుక్తవర్ణము గురువగుట విదితమే. శేషించినవి యణువులు (హ్రస్వములు.) హ్రీ. గోః ఇందులోని ప్రథమాక్షరము సంయుక్తము ద్వితీయము విసర్గయుక్తమును. సంయోగ—విసర్గల రెండింటి ఆద్యక్షరముల గురుత్వమును విదితమే. ఉదాత్తముదాత్తముగనే యుండును. స్వరితము పదములో నీచ (అనుదాత్త) మగుచున్నది. విభిన్న మంత్రములలో వచ్చియున్న 'అగ్నిః' 'సుతః' 'మిత్రమ్' 'ఇదమ్' 'వయమ్' 'అయా' 'వహో' 'ప్రియమ్' 'దూతమ్' 'ఘృతమ్' 'చిత్రమ్' 'అభి' యీ పదములు నీచము (లనగా ననుదాత్తముతో నారంభము) లగును. అర్కః; సుత, యజ్ఞ, కలశ, శత, పవిత్ర, యీ శబ్దములలో ననుదాత్తముతో శ్రుతియొక్క యుచ్చారణ ప్రారంభించబడును. హరి, వరుణ, వరేణ్య, ధారా, పురుష, యీ శబ్దములలో రేఫయుక్తస్వరమే స్వరితమగుచున్నది. గాని 'ఉదుత్తమంత్వం వరుణ' ఇత్యాది వరుణ సంబంధములగు రెండు మంత్రములలో వకారమే స్వరితమగుచున్నదిగాని రేఫ గాదు. 'ఉరుధారా మరం కృతమ్' 'ఉరుధారేవదోహ నే' ఇత్యాది మంత్రములలో 'ధారా' లోని 'ధా' కారమే స్వరితమగుచున్నదిగాని రేఫ గాదు. (ఇది పూర్వనియమమున కపవాదము.) హ్రస్వము లేదా దీర్ఘాక్షరమిట నెయ్యది స్వరితమగుచున్నదో దాని మొదటి యర్ధమాత్ర యుదాత్తమగుచున్నది (పాణినికూడ నిదే చెప్పియున్నాడు—తస్యాదిత ఉదాత్త మర్ధహ్రస్వమ్). కంప, ఉత్స్వరిత, అభిగీత విషయమున ప్రయోగింపబడు ద్విస్వరములలో హ్రస్వమును దీర్ఘమువలె జేయవలెను. హ్రస్వమును గర్షణ మొనర్పవలెను. కనురెప్పపాటు కాలమును మాత్ర యందురు. విద్యుత్తు మెఱసి మాయమగునంతటి సమయమును మాత్రయని కొందఱు, ఋ, ఛ. శ ల యుచ్చారణలో పట్టు కాలమును మాత్రయని కొందఱు నుడివిరి. సమాసమం దవగ్రహము (విగ్రహము లేక—పదవిచ్ఛేదము) చేయవలసిచో నందులోని సమాసపదమును సంహితాయుక్తముగనే యుంచవలెను. ఏలనన నక్షరాదికరణమగు స్వరమునే ఆ సమాసపదముని యెంచెదరు. సర్వత్ర, పుత్ర, మిత్ర, సఖి, అద్రి, శతక్రతు, ఆదిత్య, ప్రజాతవేద, సత్పతి, గోపతి, వృత్రహా, సముద్ర, యీ శబ్దములన్నియు నవగ్రాహ్యములు. (అవగ్రహయోగ్యములు.) స్వగ్యావః, దేవయువః, అరతిమ్, దేవతాతయే, చికితిః, చుక్రుధమ్, యీ యన్నింటియందు నొకపదముండుటచేత బండితు లవగ్రహము జేయరు. అక్షర నియోగముచే నాల్గువిధముల వివృత్తుల నెఱుంగవలెను. వాటి నామములు! — వత్సానుసృతా, వత్సానుసారిణీ; పాకవతీ, పిపీలికా యనునవి. పూర్వపదమున హ్రస్వముత్తరపదమున దీర్ఘము గల వివృత్తి హ్రస్వాదిరూపములతో ననుగతమైన హేతువుచేత 'వత్సానుసృతా' యని చెప్పబడెను. మొదటి పదముననే దీర్ఘముత్తరపదమున హ్రస్వము గలది వత్సానుసారిణీ వివృత్తి. రెండు పదములయందుగూడ హ్రస్వముగలది పాకవతీ వివృత్తి. రెండు పదములయందును దీర్ఘముగలది పిపీలికా వివృత్తి యని పిలువబడును. ఈ నాల్గు వివృత్తులలో నొక్క మాత్రాంతర ముండును

అర్ధమాత్రయని అణుమాత్రయని కొందఱి యుద్దేశ్యము. రేఫ శ ష స ఇవి యాదిలో నుండియుండి ఇట్టి పదములు పరమైనచో మకార మనుస్వారభావమును బడయును. య-వ లు పరమైనచో నది పర సవర్ణముగు చున్నది. స్పర్శవర్ణములు పరమైనచో నా యా వర్గల పంచమాక్షరమును బొందును. నకారాంత పదము పూర్వమందుండి స్వరము పరమైనప్పుడు నకారము ద్వారా పూర్వవర్తియగు ఆకార మనురంజిత మగు చున్నది గాన దానిని 'రక్త' మందురు. (యథా:—'మహాఀ 3 అసి' ఇత్యాదులు) నకారాంతపదము పూర్వమందుండి య-వ-హ ఆది వ్యంజనములు పరమై యున్నచో బూర్వమందలి యర్ధమాత్ర - యణుమాత్ర యనురంజితమగుచున్నది. పూర్వమందు స్వర సంయుక్త హలంత నకారము పదాంతమందుండి యున్నచో—దానికి బరమునగూడ బరమున్న యెడల నది నాల్గు రూపములతో యుక్తమైన దగుచున్నది. ఒకప్పుడది రేఫ మొకప్పుడు రక్త మొకప్పుడది లోప మొకప్పు డనుస్వారము నగును. ('భవాంశ్చినోతి'లో రేఫము 'మహాఀ 3 అసి' లో రక్తము 'మహాఀ ఇంద్ర'లో నకారలోపము మొదటిది అను నాసిక లేదా అనుస్వారమైనది) రక్తము (రంగు) హృదయము నుండి లేచును. దాని ధ్వని కాంస్యవాద్యతుల్యము. అది మృదువును ద్విమాత్రల (దీర్ఘముగల) దియును. 'దధన్వాఀ 3 యో' ఇది యుదాహరణము. సౌరాష్ట్ర స్త్రీ 'అరాం' పలుకునట్లుగ 'రంగు' ప్రయోగించవలెను. నామ ఆఖ్యాత ఉపసర్గ, నిపాతములను నీ నాల్గు పదముల యంతమున స్వరపూర్వకములగు గ డ ద వ జ ణ న మ ష స యీ పది యక్షరములు పదాంతము లని చెప్పబడెను. ఉదాత్త-అనుదాత్త-స్వరిత-స్వరము లెక్కడనున్నను సరే వ్యంజనములు వాటి ననుసరించు చుండును. ఆచార్యులగువారు మూడు స్వరములకుఁ గూడా ప్రాధాన్యత జెప్పుదురు. వ్యంజనములను మణులతో సమానముగను స్వరమును సూత్రమువలెను దలంచవలెను. బలశాలియగు నరపతి దుర్బలుని రాజ్య మపహరించునట్లుగ బలశాలులు దుర్బలవ్యంజనములను హరించివేయును. ఓ భావము, వివృత్తి, శ ష స ర, జిహ్వామూలీయ, ముపధ్మానీయము నివి యెన్మిదియు నూష్మగతులు. ఊష్మ (సకార) మీ యెన్మిది భావములలోను బరిణతమగుచున్నది. సంహితలో స్వర ప్రత్యయావివృత్తి గలుగుచోట విసర్గ నెఱుగవలెను.

లేనిచో దానికి తాలవ్యమగును. సంధ్యక్షరములు (ఏ-ఓ-ఐ-ఔ) గల ఉపపదలోని యిట్టి సంధిలో య-వలు లోపించినచో నట వ్యంజననామక వివృత్తి-స్వరనామక ప్రతిసంహితయు నగుచున్నది. ఊష్మాంతము విరతమైనచోటను సంధిలో 'వ' యగుచున్న యెడలను గలుగు వివృత్తి విస్వర వివృత్తి. ఓ భావము ప్రసంధానముగుచో నుత్తరపదము ఋకారాది యగు చున్నది. అట్టి ప్రసంధానమును స్వరాంతమని యెఱుంగనగును. దీనికి భిన్నముగా నూష్మ ప్రసంధాన మగు చున్నది. (యథా:—వాయోఋషిః) ఇచ్చట ఓ భావ ప్రసంధానము. శ ష స ఆదులు పరమైనప్పుడు ప్రథమ (వర్గ ప్రథమాక్షరములు) ఉత్తమ (వర్గాంతిమాక్షరములు) వర్ణములు పదాంతమందుండియున్నచో నవి ద్వితీయస్థానమును బొందుచున్నవి. ఊష్మము సంయుక్తమగుచో ననగా సకారాదులు పరమైనప్పుడు ప్రథమమందలి తకారాద్యక్షరములను ద్వితీయము (థకారాది) వలె జూపించవలెను. థకారాదులవలె నుచ్చరించవలెను. గాని వాటిని స్పష్టతః థకారాది రూపమున దలంచరాదు ఉదా:—'మత్స్యః' 'క్షురః' 'అప్సరా' మున్నగునవి. లౌకిక శ్లోకాదులలో ఛందో జ్ఞానముగలిగించుటకు మూడు హేతువులు-ఛందోమానము వృత్తము, పాదస్థానము (పదాంతము) గలవు. కాని ఋక్కులు స్వభావతః గాయత్రీ ముఖ్యచ్ఛందములతో గూడినవి. వాటి పాదగణన—గురులఘువులు-అక్షరగణన ఛందోవిభాగము నెఱుంగుటకు మాత్రమే కాని యా లక్షణముల ననుసరించియే ఋక్కు లుండ వలెనని నియమము లేదు. పాద—అక్షరగణనానుసారముగ నుండునవి లౌకికములగు ఛందములే. ఋ వర్ణములోని—స్వరభక్తిలోని రేఫము నక్షరాంతర మని యెంచి ఛందస్సు యొక్క యక్షర గణనలో లేక మాత్రాగణనలో సమ్మిళిత మొనర్చవలెను గాని స్వర భక్తులలో ప్రత్యయముతో గూడ రేఫరహితాక్షరగణన చేయవలెను. ఋ వర్ణములో రేఫరూపవ్యంజనప్రతీతి వేఱుగానుండును. స్వరరూపాక్షర ప్రతీతి వేఱుగా నుండును. ఊష్మాక్షరసంయోగము గాకున్నచో ఋకారమును లఘ్వక్షరమని తలంచవలెను. ఊష్మసంయుక్తమై ఋకారము పీడితమగుచోట ఆ ఋ వర్ణము స్వరమైనను గురువని ఎంచవలెను. ఇచ్చట 'తృచమ్' ఉదాహరణ. (ఇందు ఋకారము లఘువు) ఋషభ, గృహీత, బృహస్పతి, పృథివి, నిరృతి—

ఈ యైదు శబ్దములలోని ఋకారము స్వరమే యను టలో సందేహము లేదు. శ-ష-స-హ-ర ఇవి యాదిలో గల పదములు ద్విపద సంధియైనచో నొకప్పుడు ఇ-ఉ రహితములు ఏకపదా స్వరభక్తి యగుచున్నది. ఇది క్రమముగా కమగుచున్నది. స్వరభక్తి ద్వివిధములు— ఋకారము రేఫమును దానినే యక్షరచింతకులు క్రమముగా 'స్వరోదా—వ్యంజనోదా' యని నుడి విరి. శ ష సల విషయమై స్వరోదయా వివృతా స్వర భక్తియని, హకార విషయములో వ్యంజనోదయా సంవృతా స్వరభక్తి యనియు నిశ్చయింపబడెను. (రెంటింటికి క్రమశః ఉదాహరణలు 'ఊర్షతి'— 'అర్హతి'.) స్వరభక్తిప్రయోగకుడు ఇకార ఉకార గ్రస్తదోషములను దోషత్రయమును ద్యజించవలెను. పరమున సంయోగమున్నవి—పరమున 'ఛ' యున్నవి—విసర్గతో గూడియున్నవి—ద్విమాత్రిక (దీర్ఘములు) లంతమునను౦డునవి—యనుస్వార యుక్తములైనవి—ఘుటంతములైనవి—లఘువులని ఎంచబడవు.

పథ్యా—(ఆర్యా)చ్ఛందమునకు ప్రథమ—తృతీయ పాదములు పండ్రెండు ద్వితీయపాదము పదు నెన్మిది చతుర్థపాదము పదునైదు మాత్రలుండును. ఇది పథ్యాలక్షణము. ఇందులకు భిన్నమైనదాని పేరు 'విపుల.' అక్షరమందలి హ్రస్వము దానికి బరమున సంయోగము లేనిచో దానికి లఘువని పేరు. హ్రస్వము బరమున సంయోగమున్నచో దానిని—దీర్ఘాక్షరము లను గురువులని ఎంచవలెను. స్వరము రాగానే వివృతి కన్పించినచో నచ్చట గురుస్వరమని యెంచవలెను. పద ముల స్వరము లష్టవిధములు—అంతోదాత్తము, ఆద్యు దాత్తము, ఉదాత్తము, అనుదాత్తము, నీచస్వరితము, మధ్యోదాత్తము, స్వరితము, ద్విరుదాత్తము—యీ యెనిమిదియును బద సంజ్ఞలు. 'అగ్నిర్వృత్రాణి' ఇందులో 'అగ్నిః' అంతోదాత్తము 'సోమఃపవతే' ఇందలి 'సోమః' ఆద్యుదాత్తము. 'ప్రవోయవ్యామ్' ఇందలి 'ప్ర' ఉదాత్తము. 'వః' అనుదాత్తము 'బలం న్యుబ్జం వీర్యమ్' ఇందలి 'వీర్యమ్' నీచస్వరితము. 'హవిషావిధేమ' ఇందలి 'హవిషా' మధ్యోదాత్తము 'భూర్భువః స్వః' ఇందలి 'స్వః' స్వరితము. 'వన స్పతిః' ఇందలి 'వ' కారము 'స్ప' రెండుదాత్తములు గలిగియున్నందున 'ద్విరుదాత్తము'. నామమం దంత రము మధ్యమం దుదాత్తము నుండును. నిపాత మం దనుదాత్త ముండును. ఉపసర్గలో ఆద్య స్వరముకంటె బరమున స్వరిత ముండును. అఖ్యాతమున రెండు నుదాత్తములుండును. స్వరిత మునకు బరమున గల ధార్యాక్షరము (యథా:— 'నిహోతా—సత్సి' ఇందలి 'తా' స్వరితము. దాని కంటె బరమునందలి 'సత్సి' ధార్యాక్షరములు) లన్ని యును ప్రచయస్థానములు. ఏలనన 'స్వరితము' ప్రచిత మగుచున్నది. అచ్చట నాది స్వరితమునకు నిఘాత స్వరము కలుగును. ప్రచయము కన్పించినచోట విద్వాంసుడు స్వరమును నిఘాతము చేయవలెను. కేవలము మృదుస్వరితము మాత్రమే యున్నచోట నిఘాతము చేయరాదు. ఆచార్యకర్మము పంచ విధములు. ముఖ-న్యాస-కరణ-ప్రతిజ్ఞ-ఉచ్చారణలు ప్రతిజ్ఞోచ్చారణమే శ్రేయమని యీ విషయమున జెప్పుదురు. ఏ వర్ణమునకైనను కరణ (శిక్షాదిశాస్త్ర) ముపలబ్ధము గాకున్నయెడల నచట ప్రతిజ్ఞానిర్వాహము (గురుపరంపరాగతనిశ్చయము) జేయవలెను. ఏలనన కరణము ప్రతిజ్ఞారూపమైనదే. నారదుడు తుంబురుడు విశ్వావసువు మున్నగు గంధర్వులు గూడ సామ విషయక శిక్షాశాస్త్రోక్త సంపూర్ణలక్షణములను స్వర సూక్ష్మత్వహేతువు చేత గ్రహింప నశక్తులగుదురు

హితకరభోజనము జేయుచు జఠరాగ్నిని సర్వదా కాపాడుకొనుచుండవలెను. భోజనము పచనమైన పిదప నుషఃకాలమున నిద్రనుండి మేల్కాంచి బ్రహ్మ చింతన మొనర్పవలెను. శరత్కాలములో విషువ ద్యోగము (రాత్రియు బవలును సమానముగ నుండు కాలము) వ్యతీతమైనపిదప వసంతర్తు మధ్యరాత్రి ప్రాప్తించునంతవఱకు వేదస్వాధ్యాయమున- కుషః కాలముననే లేవవలెను. ఉదయముననే లేచి మౌన భావముతో బలాశ, బిల్వ—అపామార్గ, శిరీషములలో నేదైన నొకదానితో దంతధావనము జేయవలెను. కదంబ కరవీర కరంజములను గూడ నుపయోగించ వచ్చును. కంటక,—క్షీర వృక్షములన్నియును బవిత్ర ములును యశోదాయకములును. అట్టి దంతధావనము చేత వాగింద్రియమున సూక్ష్మతి (కఫనాశనమై సరళతాపూర్వకశబ్దోచ్చారణశక్తి, మధురతి త్రీయని స్వరము) గలుగును. ఇది ప్రాచీనావవ్రజియను నాచార్యుని యభిప్రాయము. శిష్యుడు లవణముతో గూడ సదా త్రిఫలచూర్ణమును భక్షించుచుండవలెను. ఈ చూర్ణము జఠరాగ్నిని (ప్రజ్వలిత మొనర్చి) మేధస్సును (ధారణాశక్తిని) వృద్ధిచేయును. స్వర—వర్ణ ప్రస్ఫుటోచ్చారణకు నుపకరించును. ప్రథమమున జఠరానలోపాసన (అనగా మలమూత్రత్యాగము దంత ధావనము, స్నాన—సంధ్యోపాసన) యనంతరమున మధుఘృతపానముచే బరిశుద్ధుడై వేదపాఠము జేయ వలెను. మొదట సప్తమంత్రముల నుపాంశుభావ ముతో (స్పష్టముగ బలుకకుండ) జపవలెను. పిమ్మట మంద్రస్వరములో వేదపాఠము ప్రారంభించి యథేష్ట స్వరమున మంత్రోచ్చారణ చేయవలెను. ఇది యన్ని శాఖల వారికిని విధి. ప్రాణుల కుపరోధము గావించు వాణిని ప్రాతఃకాలమున నుచ్చరింపరాదు. ప్రాణోప రోధముచేత వైస్వర్యము (విపరీత స్వరోచ్చారణ)

కలుగును. ఇంతేగాక దానివలన స్వర—వ్యంజన మాధుర్యము గూడ లోపించిపోవును. కుతీర్థ ప్రాప్త ద్గవస్తువును భుజించెడు పురుషుడా దోషమునుండి యుద్ధరింపబడజాలడు. పాపరూప సర్పమువలన జీవన రక్షణ కొఱజాలనట్లే కుతీర్థుని (దుష్టాధ్యాపకుడు) వలన లభించిన దగ్ధ (నిష్ఫల) అధ్యయనము నశుద్ధ వర్ణోచ్చారణపూర్వక భక్షణమొనర్చువారు పాప రూపమగు సర్పమువలె పాపాత్ముడైన యుపాధ్యాయుని వలన లభించిన యా కుత్సితాధ్యయనదోషమునుండి విముక్తి బడయజాలరు. ఉత్తమాచార్యుని వలన లభించిన యధ్యయనమును గ్రహించి లెస్సగ నభ్యాస మొనర్చినచో నది శిష్యునిలో సుప్రతిష్ఠితమై తన్మనోహర ముఖశోభన మధుర స్వరోచ్చారితమై వేద మెక్కుడుగ శోభించును. నాసాకర్ణాగ్రములు వికృతముగుటచే వికరాలరూపమున గన్పట్టువాడు దీర్ఘోష్ఠములు గలవాడు మాటలు నాసికతోడనే పలుకు వాడు గద్గదకంఠుడు జిహ్వాబంధింపబడినవాడనగా నాగియాగి మాట్లాడువాడును వేదమంత్రప్రయోగముల కధికారులు నర్హులును గాజాలరు. ఏకాగ్రచిత్తుడు వశీకృతాంతఃకరణుడు సుందరదంతోష్ఠములు గల వాడును స్నానమాత్ర పరిశుద్ధుడై గానము ప్రారంభించెనా మంత్రాక్షరముల సమ్యక్ప్రయోగము జేయ జాలును. అత్యంతక్రోధి, స్తబ్ధు డలసుడు రోగి వ్యస్త మనస్కుడీ పంచవిధమనుష్యులు విద్యాగ్రహణమున కవకాశము లేనివారై యుందురు. విద్య మెల్ల మెల్లగ నేర్వబడుచున్నది. ధనము మెల్లమెల్లగ నార్జింపబడుచున్నది. పర్వతముపైకి మెల్లగా నెక్క వలెను. మార్గానుసరణము గూడ నెమ్మదిగా జేయ వలెను. దినమున నొక యోజనముకంటె నెక్కువ నడవరాదు. చీమ కూడ మెల్లమెల్లగ నడిచి యెంతో దూరము పోవగలుగుచున్నది. కాని గరుత్మంతుడుగూడ నడచుట ప్రారంభించకున్నచో నొక్కడుగు గూడ ముందుకు బోవజాలడు. పాపుల పాపదూషితవాణి, ప్రయోగముల (వేదమంత్రముల) యుచ్చారణ చేయ జాలదు. చతుర రమణియు బధిరునిముందేమియు మాట్లాడ జాలదుగదా. ఉపాంశు(సూక్ష్మము) వుచ్చారణచేయు వాడు నుచ్చారణమందు తొందరపాటు చేయువాడును భయపడుచున్నట్లుగ నధ్యయన మొనర్చువాడును సహస్రరూపముల(శబ్దోచ్చారణ) విషయమున సర్వదా సందేహములో బడియుండును. కేవలము గ్రంథాధార మున జదివినవాడు—గురు సమీపమున నధ్యయనము జేయనివాడు సభలలో సన్మానింపబడడు. ప్రతిదినము వ్యయించినచో నంజనపర్వతరాసులును క్షయమగును. చెదపురుగులద్వారా స్వల్ప మృత్సంగ్రహమున గూడ పెద్దయెత్తైన వల్మీక మేర్పడును. ఈ దృష్టాంతపు వెనుకట నుంచుకొని దానాధ్యయనాది సత్కార్యములలో సం లగ్నుడై జీవితములోని ప్రతియొక క్షణమును సఫలమొన ర్చుకొనవలెను. గాని వ్యర్థముగ గడిచిపోనీయరాదు. కీటకములు ధూళికణములతో వల్మీకమును నిర్మించు నందు తద్బలప్రభావముగాక ఉద్యోగమే కారణ మగుచున్నది. విద్య నెన్నో సహస్రపర్యాయములభ్యా సములోనికి గొనితెచ్చుచుండవలెను. వందలకొలది పర్యాయములు శిష్యులకు గఱపుచుండవలెను. అప్పుడే యా విద్య యున్నతస్థానమునుండి జలము నిమ్నస్థలము నకు స్వయముగ జనునట్లుగ జిహ్వాగ్రభాగమునకు వచ్చుచుండును. ఉత్తమజాతి ఘోటకములు నిశ్శమం దర్ధనిద్రయే యనుభవించుచుండును—అర్ధరాత్రమున నొక జాము మాత్రమే నిద్రించును. అటులనే విద్యా ర్థుల నేత్రములలో నిద్ర ఎక్కువ కాలము నిలవదు. విద్యార్థులకు భోజనమం దాసక్తియు నధ్యయనమందు విలంబనమును దగదు. స్త్రీ మోహమును దగదు. విద్యాభి లాషియగు ఛాత్రు డవసరము వచ్చినచో గరుడ—హంసలవలె నెంత దూరమైనను బోవలెను. జనసమూ హమునుజూచి సర్పమును జూచినట్లుగ భయపడవలెను. మిత్రత్వము పెంచుకొను వ్యసనము నరక సదృశముగ నెంచి స్త్రీలను రాక్షసులభాతి యెంచి దూరస్థుడై యుండవలెను. ఇట్టి వ్యక్తియే విద్య సముపార్జించగలు గును. శఠ ప్రకృతిగలవాడు విద్యారూపమగు నర్థమును బడయజాలడు. భీరుడు నహంకారియును విద్యా-ధన ముల నార్జింపలేడు. 'నేడు గాదు రే'పని సదా ముందటి దినమును బ్రతీక్షించువాడును విద్య చదువను లేడు ధనము నార్జింపనులేడు. ఖనిత్రముతో ధరిత్రి ద్రవ్వువాడెప్పటికైన దప్పక జలమును బడయగలుగు నట్లే నిరంతరము గురువును సేవించుచుండు విద్యార్థి గురువులోని విద్య నవశ్యము గ్రహించజాలును. గురు సేవ వలన—అధిక ధనవ్యయమున లేదా ఇంకొక విద్య యొసంగుటవలనను విద్య బడయవచ్చును. ఇతరవిధముల నది ప్రాప్తించదు. బుద్ధిగుణమువలన—గురుసేవ చేయ నవసరము లేకుండగ విద్య బడసిన నది వంధ్యాస్త్రీవలె సఫలము కానేరదు. రాణించదు. ఇది శిక్షాగ్రంథ సంక్షేపవర్ణనము—ఈ యాది వేదాంగ మెఱింగి మను జుడు బ్రహ్మప్రాప్తి కర్హుడు కాజాలును.

# చిట్టిబాబు

శ్రీ వేదుల లక్ష్మణమూర్తి

అది హైదరాబాద్ నగరానికి వెలుపల మెట్ట పల్లములతోనున్న బయలు. అక్కడక్కడ మెట్టమీదొకటి పల్లంలో ఒకటి బంగళాలు కనిపిస్తున్నాయి. రాస్తాకు ఒకవైపున పల్లపుప్రదేశంలో ఒక చిన్న మామిడితోట ఉంది. దానిచుట్టూ ప్రహరీగోడ, తోటమధ్య పెద్ద భవనం ఉన్నాయి. ప్రవేశద్వారందగ్గర ఒక కావలివాడు ఉన్నాడు. ఆ ద్వారానికి ఎదురుగా రోడ్డుప్రక్కను శిథిలమైన కట్టడమొకటుంది. అది బహుశా ఎవరిదో సమాధిచిహ్నం కావచ్చు. ఎత్తైన దాని తిన్నెమీదకూర్చుని తంబుర మీటుతూ గానంచేస్తున్నాడొక వ్యక్తి. తెల్లని ధోవతి, ఉత్తరీయము ధరించి తంబురమీటుతూ గానం చేస్తూన్న ఆ వ్యక్తి త్యాగరాజును తలపుకి తెస్తున్నాడు. ప్రొద్దు గ్రుంకింది. చీకటి తెరలు లోకాన్ని అలముకొంటున్నాయి. అదేసమయాన ఒక మోటారు వచ్చి భవన ప్రవేశద్వారందగ్గర ఆగింది. షేర్వాణీ, షుర్వా, నల్లనిటోపీ ధరించిన ఒక భద్రపురుషుడు కారులోనుండి దిగి గానంచేస్తూన్న వ్యక్తిని చూస్తూ నిలబడ్డాడు. తన కంఠమును తంబురశ్రుతితో మేళవించి జయదేవుని గీతగోవిందశ్లోకమును గానంచేస్తున్నాడా యెదుట కూర్చున్న వ్యక్తి. తుమ్మెదల ఝుంకారమువంటి కంఠధ్వని, మధురస్మృతులను మేల్కొల్పే భావసంపద, భావమును స్పష్టంచేస్తూ, కళలను ఒలికించే రాగాలాపన, ఆ భద్రపురుషుని కొన్ని నిమిషములసేపు తన్మయునిచేశాయి. గానమాగింది. ఆ పురుషుడు చైతన్యమును కోలుకొన్నాడు. ఆ గాయకుని సమీపించి 'తమ నివాసమెక్కడ?' అని హిందీలో ప్రశ్నించాడు. 'నాకొక నివాసస్థానం లేదు' అని స్వచ్ఛమైన హిందీలో సమాధానమిచ్చాడు గాయకుడు. 'ఈ రాత్రికి మా యింటికి దయచెయ్యండి' అని వినయముట్టిపడుతూ కోరాడు పురుషుడు. 'తమదయ' అని లేచాడు గాయకుడు. భద్రపురుషుడా గాయకుని ఎదురుగా తోటలోనున్న తన నివాసానికి వెంటబెట్టుకొని వెళ్లాడు. అతిథికి పళ్లూ పాలతో శ్రద్ధాభక్తిపూర్వకంగా ఆతిథ్యమిచ్చాడు. పిమ్మట వాని ఉనికి, ప్రస్తుత వ్యాపారం మొదలైన విషయాలు తెలుసుకొనే కుతూహలంతో నాలుగైదు ప్రశ్నలు వేశాడు ధనవంతుడు. అతడు ఉనికీ వ్యాపారమూ లేని వ్యక్తి అని తెలుసుకొన్నాడు. గానం వినాలనే తన కుతూహలం వెల్లడించాడు. అయిదారు జయదేవుని శ్లోకాలూ, రెండు గీతాలూ, రెండు కృష్ణలీలాతరంగాలూ వీనుల విందుగా పాడి వినిపించాడా గాయకుడు. ఆ భవనంలోని పదిమంది వ్యక్తులూ వాని గానంవిని ఆనందించారు. వారితోబాటు ఒక వృద్ధుడుకూడ సోఫాలో కూర్చుని గానం విన్నాడు. గానం సాగినంతసేపూ ఆ వృద్ధుడు వచ్చే దగ్గును బలవంతాన ఆపుచేసుకొంటూ తప్పనిసరియైనప్పుడు దగ్గుతూవున్నాడు. పాట ముగించి, గాయకుడు తనవద్దనున్న చేతిసంచినుండి మందుపొట్లామొకటి తీసి అందుండి కొంచెం మందు వేరే చిన్న పొట్లాంకట్టి ఆ వృద్ధునికిస్తూ 'దీన్ని సేవించండి. రాత్రి సుఖంగా నిద్రపడుతుంది' అన్నాడు. "ధన్యవాదాలు! మీకు వైద్యం తెలుసును కాబోలు" అంటూ మందు తీసుకొని సేవించాడు వృద్ధుడు. ఆ రాత్రి వృద్ధుడు సుఖంగా నిద్రపోయాడు. తెల్లవారినతరువాత ఆ వృద్ధుడేకాకుండా ఆ భవనములోనివారంతా ఆయన మందు ప్రభావాన్ని మిక్కిలి కొనియాడారు. గాయకుని తీసుకొనివచ్చిన భాగ్యవంతుడు వానికి తన కృతజ్ఞతను తెలియజేస్తూ, "మా తండ్రిగారి జీవిత సంధ్యాసమయంలో తమరు ధన్వంతరివలె దర్శనమిచ్చారు. ఎంతోమంది ఘనమైన డాక్టర్లచే మందు లిప్పించాం. కాని ఆయనకు బాధ తప్పడంలేదు. దయయుంచి వారు సుఖంగా దినములు గడపడానికి కొంతకాలం మందు యిప్పించండి. వారికి వ్యాధి తగ్గేవరకైనా మా ఆతిథ్యాన్ని స్వీకరించమని మా ప్రార్థన."

అన్నాడా భద్రపురుషుడు. "అతిథ్యానికేంగాని, ఈమందు నలభైదినాలకు సరిపోతుంది. దీన్ని సేవిస్తే వారు చాలవరకూ కోలుకొంటారు." అనిచెప్పి మందు యిచ్చాడు గాయకుడు. ఆ ధనికుని బలవంతంచేత గాయకుడు అక్కడనే ఆగిపోయాడు. అప్పుడప్పుడు కొంచెంగా దగ్గువస్తూన్నా చాలాకులాసాగా ఉన్నాడు వృద్ధుడు. రెండురోజులు గడిచిన పిమ్మట—"తమరు అనుగ్రహిస్తే నాదొక మనవి" అన్నాడు ధనికుడు గాయకునితో. 'ఏమిటి?' అన్నట్లు చూచాడు గాయకుడు. "మేము నిస్సంతులము. తమ ఆశీర్వచనంవల్ల మాకొరత తీరుతుందని మా ఆశ."

"మీ దంపతుల ఆరోగ్యానికి సంబంధించిన విషయాలను వివరించండి. మందు తయారుచేసి యిస్తాను. ఆతరువాత భగవదనుగ్రహం" అన్నాడు గాయకుడు.

తనకేవిధమైన అనారోగ్యంలేదని చెప్పి తన భార్యకుగల అనారోగ్యాన్ని వివరించాడా భాగ్యశాలి. మధ్య మధ్య కొన్ని అవసరమైన ప్రశ్నలు వేస్తూ సమాధానాలు పొందాడు గాయకుడు. "బజారు నుండి కొన్ని మూలికలు తెప్పించండి. మందు తయారు చేస్తాను."అని కొన్ని మూలికలపేర్లు వ్రాసి యిచ్చాడు. మూలికలు వచ్చాయి. రెండురోజులకు మందు తయారైంది. "ఈ మందును ఎనభైదినాలు మీ సౌభాగ్యవతి చేత సేవింపచేయ్యండి. ఇంక నాకు శెలవు" అని లేచాడు గాయకుడు.

"తమరు కొంతకాలం ఇక్కడనే ఉండాలని మా ప్రార్థన. ఈ గృహంలో తమకు సదుపాయంగా ఉండదు. అదిగో, ఆ మెట్టమీద ఉన్న బంగళా మాదే. అందు బసచేసి మమ్ము అనుగ్రహించండి. తమకు అక్కడ ప్రశాంతంగా ఉంటుంది." అని ప్రార్థించాడు భాగ్యవంతుడు.

"సరే, మీ ఆదేశాన్ని కాదనలేకపోతున్నాను" అన్నాడు గాయకుడు.

* * *

ఎనిమిదిసంవత్సరాలు గతించాయి. గాయకునికి ఆశ్రయమిచ్చిన భాగ్యశాలి ముద్దుల కుమారుని కిప్పుడు ఏడుసంవత్సరముల వయస్సు. ప్రతిదినం తన కుమారుని గాయకుని సన్నిధికి తీసుకొని వెడుతూవుంటాడా భద్రపురుషుడు. ఆ బాలుడు చేతులు జోడించి 'నమస్తే' అని గాయకునికి నమస్కరించి వాని దీవనలందుతాడు.

ఇప్పుడు గాయకుడు 'సాధూరామ్' అనే పేరుతో ప్రసిద్ధికెక్కాడు. సాధూరామ్ గారి పేరు నగరంలో చాలామందికి తెలుసు. ఆయనిచ్చే మందుతో ఎంతటి గడ్డువ్యాధులైనా సమసిపోతున్నాయని చాలా ప్రతీతి. వందలాది వ్యాధిగ్రస్తులు ఆయన దర్శనం చేసి మందు సేవిస్తూంటారు. సాధూరామ్ వింధ్యపర్వత ప్రాంతంనుండి వచ్చారనీ, గొప్ప సాధువనీ, అనేక మంత్రశక్తులు కలవాడనీ, వనమూలికల ప్రయోగంతో అసాధ్యమైన రోగాలను పోగొడుతున్నాడని వదంతి.

హైదరాబాద్ నగరానికి వెలుపలనున్న భాగ్యవంతుని బంగాళాలోనే ఆయన మకాం. ఒక వంటవాడు వారి స్నానభోజనాలకు యేర్పాట్లుచేస్తూంటాడు. మల్లుధోవతి లుంగీ కట్టు, తెల్లని ఉత్తరీయం ఆయన దుస్తులు. నాలుగు అంగుళాలవరకు పెరిగిన గడ్డం, గిరజాలుతిరిగిన తలకట్టు, మంచి పోషణలోవున్న శరీరము, ఆయనొక కళాకారునిగాను, యోగాభ్యాసకునిగానుకూడా నిరూపిస్తాయి. ఉత్తమ కళాకారుడుగా ఆయన ప్రసిద్ధికెక్కకపోయినా కళాకారునికుండవలసిన లక్షణాలన్నీ ఆయనలో ఉన్నాయి. శాస్త్రసమ్మతముగా ఆయన పాడలేకపోవచ్చు. కాని వీనులవిందుగా జయదేవుని గీతాలు, శ్రీ కృష్ణలీలా తరంగాలు తన తంబురశ్రుతిమీద గానంచేస్తూంటాడు. ఆయన నీటిరంగులతో చిత్రించిన ప్రకృతిదృశ్యాల చిత్రాలు నాలుగు బంగళాలోని గోడలమీద ఉన్నాయి. ప్రతిదినం బ్రహ్మముహూర్తాన లేచి శరీర వ్యాయామంచేస్తాడు. సూర్యోదయమయ్యే వేళకు స్వచ్ఛమైన తెల్లని దుస్తులతో బంగళా ముందు భాగంలో కుర్చీలో కూర్చుంటాడు. రెండు పళ్లుతిని పాలు త్రాగుతాడు. ఉదయం ఏడుమొదలు పన్నెండు గంటలవరకు రోగులు ఒకొక్కరే వరుసగా వస్తారు. వారు చెప్పినది విని మందు ఇస్తాడు. ఆహార విహారాలకు కొన్ని నియమాలు చెప్పిపంపుతాడు. మందు ఖర్చునకుగాను ఆయన కెదురుగావున్న డబ్బాలో ఎవరికి తోచినసొమ్ము వారు వేసి వెళ్లిపోతారు. పన్నెండు దాటాక ఎంతటివారికైనా మందు యివ్వబడదు. వారి దర్శనమే లభించదు. సాయంకాలం మధురమైన గానం ఆ బంగళా ఆవరణనుండి వినిపిస్తుంది. రాత్రి

ఏడు మొదలు పదిగంటలవరకు ఇరవై ముప్పైమంది భగవద్భక్తులు అక్కడ భజనలో పాల్గొంటారు. రాగ తాళములతో కూడిన పరమేశ్వర సంకీర్తన, ఆత్మ పరమాత్మలో ఐక్యమైనట్లు అక్కడి ప్రశాంత ప్రకృతిలో లీనమౌతుంది.

* * *

పసిడిపంజరంలోని చిలుక మానవుల చర్మచక్షువులకు చాలా మనోహరంగా కనిపిస్తుంది. దాని శరీర లావణ్యం మానవులను ముగ్ధులజేస్తుంది. దాని పలుకులు వీనులకు విందుచేస్తాయి. వారు దానిచుట్టూ చేరి పళ్ళూ పాలూ ఇస్తారు. రమ్యమైన దాని బాహ్య సౌందర్యాన్ని చూచేవారేగాని దాని హృదయావేదన గ్రహించి సానుభూతి ప్రకటించగలిగే మానవులెందరుంటారు? తన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను కోల్పోయి, తోటివిహంగముల సాంగత్యానికి దూరమై ప్రియురాలి విరహంతో తపించి, కన్నీరు మున్నీరుగా యేడ్చే ఆ కీరహృదయాక్రందనం వినగలిగే మానవులెందరున్నారు?

హైదరాబాద్‌లో సాధూరామ్ అనే పేరుతో ప్రసిద్ధికెక్కిన వ్యక్తికి పంజరంలోని చిలుకకును ఒక్క విషయంలో మాత్రమే భేదముంది—చిలుక మానవులచే బంధింపబడుతుంది. బంధవిముక్తికై తన సర్వశక్తులనూ ధారపోసి ఓడిపోతుంది. కాని సాధూరామ్ తనకుతానే కోరి తెచ్చుకొన్నాడు బంధనం. బాహ్యప్రపంచంలోకి పోయి తనవారినిచేరి సాటివారితో సంతోషంగా జీవించాలని వాని హృదయం, పంజరంలోని చిలుక హృదయంవలె కొట్టుకొంటోంది. బయటికిపోయి తనవారిని చేరడానికి అవకాశంగాని, శక్తిగానిలేక తల్లడిల్లుతుంది చిలుక. తనవారిని చేరడానికి అవకాశమూ శక్తీ రెండూ ఉన్నా కదలలేక పోతున్నాడు సాధూరామ్. ఇందుకు కారణం?

* * *

చిట్టిబాబు నివాసస్థానం కాకినాడకు దగ్గరలోనున్న ఒక గ్రామం. చిన్నతనంలోనే తల్లిని కోల్పోయాడు. అనాటినుండీ తల్లిలేని లోపంలేకుండా అతిగారాబంతో పెంచాడు తండ్రి. వైదికవృత్తిచేస్తూ తనకువచ్చే అతి స్వల్పమైన రాబడితోనే కుమారునికి సమస్తసదుపాయాలూ కలుగజేస్తూ ఉండేవాడాయన. గారాబం ఎక్కువైన కారణంచేత చిట్టిబాబు ఎప్పుడూ బడికి వెళ్ళడంగాని చదవడంగాని జరుగలేదు. పన్నెండేళ్ళ వయస్సు వచ్చేవరకూ ఆటపాటలతోనే కాలం గడిపేవాడు. తన గ్రామంలోగాని చుట్టుప్రక్కల గ్రామాల్లోగాని జరిగిన నాటకాలు, హరికథలు అతను కననివిగాని విననివిగాని లేవు. వీని పోరుపడలేక ప్రతీ వినోదానికీ తండ్రి తీసుకొని వెళ్ళేవాడు. తాను విన్న పాటలు పాడడం, బొమ్మలు గీయడం వానికి చాలా ప్రియమైనవి. ఎల్లప్పుడు శుభ్రమైన తెల్లని దుస్తులు ధరించటం వానికి ఆనందం. ఆ తరువాత చిట్టిబాబు సవతితల్లి అదుపాజ్ఞల్లో ఉండవలసివచ్చింది. అప్పటినుండీ వానికి లోకంలోని కష్టసుఖాలంటే యేమిటో తెలియడం ప్రారంభమైంది. చిన్నప్పటినుండీ ఒకరి అదుపాజ్ఞల్లో ఉండకుండా స్వేచ్ఛ ననుభవించాడు. అందుచే సవతితల్లి అధికారం వానికి సహింపరానిదైనది. వాని గ్రామానికి రెండుమైళ్ళ దూరంలోవున్న గ్రామంలో వాని తల్లివైపు బంధువులున్నారు. అక్కడికి పోయి అక్షరాభ్యాసం ప్రారంభించాడు. రెండు సంవత్సరాల్లో చక్కగా చదువను వ్రాయను నేర్చుకొన్నాడు. తరువాత ఆ గ్రామంలోని సంస్కృతపాఠశాలలో చేరి రెండుమూడు కావ్యాలు చదివాడు. తాను రెండోవివాహం చేసుకొన్న తరువాత తన గృహపరిస్థితులు మారి చిట్టిబాబు విషయంలో తటస్థంగా ఉన్నాడు తండ్రి. వానికి అవసరమైనప్పుడు రూపాయో అర్ధో యివ్వడం తప్ప వాని విషయంలో కలుగజేసుకోవడంలేదు వాని తండ్రి. వాని భవిష్యజ్జీవితానికి తగినమార్గం చూపించేవారెవరూ లేరు చిట్టిబాబుకు. తనకుతానే స్థిరమైన బాట యేర్పాటుచేసుకొని అందులో పయనించి అభివృద్ధికి రావడానికి తగినంత జ్ఞానమూ వయస్సూకూడ లేవతనికి. రెండుసంవత్సరాలు మాత్రమే సంస్కృతం చదివి తరువాత సంగీతం నేర్చుకొనడం మొదలుపెట్టాడు. నాలుగైదునెలలు గడిచాక సంగీతంమాని చిత్రాలు గీయడం అభ్యసించాడు. అదికూడా అయిదారు మాసాలుమాత్రమే సాగింది. ఆ తరువాత హిందీ చదివి మధ్యమపరీక్ష పాసయాడు.

ఏది చదువుతున్నా తరచు నాటకాలూ సినీమాలూ చూడ్డం వానికి అత్యవసరమైన విషయం. కొంతమంది స్నేహితుల్ని కూడగట్టి ఒక నాటకసమాజం యేర్పాటుచేశాడు. చిన్న చిన్న నాటకాలు తోడిపిల్లలకు ప్రదర్శిస్తూ ఉండేదా నాటకసమాజం. చిట్టిబాబు పాట, నటన, పిల్లలనేకాకుండా పెద్దలను

కూడా ఆకర్షించేవి. పెద్దవాళ్లతో జంకులేకుండా మాట్లాడడం, తన పాటచే వారిని మెప్పించడంవల్ల స్వగ్రామంలోనూ — చదువుకొనే గ్రామంలోనూ చిట్టిబాబుని ఎరుగనివారు లేరు. ఎల్లప్పుడూ శుభ్రమైన బట్టలు కట్టుకోడం, పిన్నలతోనూ పెద్దలతోనూ చనువుగా మాట్లాడడం, మధురంగా పాడడం వాని ప్రత్యేకాకర్షణ. ఫలానా చోట తినాలి, ఫలానా చోట పరుండాలి అనే నియమం వానికి లేదు. భోజనం వేళ ఎవరింటి దగ్గర ఉంటే అక్కడ భోజనం చెయ్యడం, నిద్రపోయే వేళ ఎక్కడ వుంటే అక్కడ నిద్రపోవడం అలవాటయింది. ఈవిధంగా చిట్టిబాబు వయస్సు ఇరవై సంవత్సరాలు దాటిపోయింది. తండ్రి వానికి పెళ్ళి ప్రయత్నం చేశాడు. దమ్మిడీ సంపాదించడానికి మార్గం లేనివాణ్ని, నాకు పెళ్ళి వద్దని తండ్రితో మొరపెట్టుకున్నాడు చిట్టిబాబు. కాని వాని ఆప్తబంధువులంతా రకరకాలుగా నచ్చజెప్పి వివాహానికి సమ్మతింపజేశారు. ఎవరెన్ని జెప్పినా వినే స్వభావం కలవాడు కాదు. కాని వానికి భార్యగా ఎన్నికైన కన్య సౌందర్యం వానిని మంత్రముగ్ధుని చేసింది. ఆమె లావణ్యం వాని భవిష్యజ్జీవితానికి సంబంధించిన ఆలోచనను దూరం చేసింది. పెండ్లి చేసుకోను అనే వాని పట్టుదలను సడలింపజేసింది. నిరాడంబరంగా చిట్టిబాబుకు వివాహమైంది. వానికి ఏవిధమైన ఆస్తిపాస్తులూ లేవు. ఏదైనా నౌకరీ చేసుకొని జీవించడానికి తగిన చదువు లేదు. ఇంతవరకూ యేవిధమైన మనోవేదనా లేకుండా ఆకాశంలోని విహంగంలా జీవించాడు. తన ఆహార విహారాలకు సంబంధించిన చింత వానికెప్పుడూ కలగలేదు. నూతనవధువుతో ఒక నెలరోజులు మాత్రం ఆనందముగా గడిపాడు. తరువాత రోజులు గడచినకొద్దీ వాని ఆనందం దూరమౌతోంది. తండ్రి సంపాదనతో తనూ భార్యా, తండ్రీ సవతితల్లీ, నలుగురు ప్రాణులు జీవించడం అసంభవమయింది. బియ్యం లేవు, పప్పు లేదు, ఉప్పు లేదు అని చెప్పే సవతితల్లి మాటలు వానికి హృదయవిదారకంగా ఉన్నాయి. తాను డబ్బు సంపాదించాలి. అది ఎలా సాధ్యపడుతుంది? నౌకరీ చెయ్యాలంటే చదువుకోవాలి. ఇప్పుడు చదవడం అసంభవం. దానికి పెట్టుబడికావాలి. ఏ చిన్న వ్యాపారం చేద్దామన్నా పెట్టుబడిలేనిదే సాగదు. తనకు బాగా స్నేహితులు పరిచితులు అయిన కొంత మంది ధనవంతుల్ని ఋణం యాచించాడు. నిర్భాగ్యుడైన వానికి ఋణమెవరిస్తారు?

ఇంతలో వాని మేనత్తగారి అల్లుడు వాళ్ళ గ్రామం వచ్చాడు. ఆయన ప్రసిద్ధికెక్కిన ఆయుర్వేద వైద్యుడు. గుంటూరులో ఉంటున్నాడు. ఆయన్ని ఆశ్రయించి వైద్యం నేర్చుకొంటే బ్రతుకుతెరువు సాధనం కాగలదని అనుకొన్నాడు చిట్టిబాబు. తన పరిస్థితంతా ఆయనతో వివరించాడు. ఆయన వాని స్థితికి జాలిపడి తనతో రమ్మన్నాడు. ఒక సంవత్సరం పాటు భార్యను పుట్టింట ఉంచి తాను గుంటూరులో వైద్యం నేర్చుకోవడమే తన పరమలక్ష్యమని నిర్ణయించుకొన్నాడు. ఆ మరునాడే భార్యను పుట్టింటికి పంపించి తాను గుంటూరు వెళ్లాడు. వాని మకాము భోజనము వాని మేనత్తగారి అల్లుని ఇంట్లోనే. ఆయన వైద్యశాస్త్రం బాగా చదువుకొన్న ఘనవైద్యుడు. మందులు తయారుచెయ్యడం వాటిని అమ్మడం, వైద్యం చెయ్యడం ఆయన వ్యాపారం. చిట్టిబాబు ఆయన పనులన్నిటిలోనూ పాల్గొంటూ ఆయనకు చేదోడుగా ఉండేవాడు. వాని మేనత్త కూతురు వానికంటె రెండేళ్లు పెద్దది. వానితో ఎంతో చనువుగా ఉండి వానిని చాలా ఆదరించేది. ఆమెభర్త వయస్సు నలభై సంవత్సరాలు దాటి ఉంటుంది. అయిదారుమాసాల క్రితమే వారి వివాహమైంది. ఆయన యీమెను ద్వితీయవివాహం చేసుకొన్నాడు. తన భార్య చిట్టిబాబు, మేనత్త మేనమామ బిడ్డలని ఆయన ఎరుగును. కాని వారు చనవుగా మాట్లాడుకోడం ఆయనకు కష్టం కలిగించేది. ఆమె తనతో ఎక్కువ చనవుగా మాట్లాడి వేళాకోళాలు చెయ్యడం చూచి చిట్టిబాబు తన్నుతాను సంబాళించుకొంటూ ఆమెను తప్పించుకొని దూరదూరంగా తిరుగుతూండేవాడు. ఆమె ప్రవర్తనలోని పరివర్తన చిట్టిబాబు కనిపెడుతూనే ఉన్నాడు. సాధ్యమైనంతవరకు ఆమె ఎదుట బడకుండా తిరిగేవాడు. ఒకనాడు సాయంకాలం చిట్టిబాబు ఒంటరిగా మందుల గదిలో ఉండగా ఆమె వచ్చింది. 'ఆమందు ఏంపని చేస్తుంది? వీటిలో మగవాళ్ల మందులేవి? ఆడవాళ్ల మందులేవి? మొదలైన అర్థరహితమైన ప్రశ్నలు వేస్తూ అతడు తొలగుతూన్నా దగ్గర దగ్గరగా నిలబడి వెకిలిగా నవ్వుతూ

మాట్లాడుతోంది. అదే సమయాన ఆ మెడి భర్త అక్కడికి రావడం వారిద్దర్నీ ఆ గదిలో చూడ్డం తటస్థించింది. ఆ మరునాడే ఆయన చిట్టిబాబుని ఏకాంతముగా కలుసుకొని "ఇప్పటికి నీవు వచ్చి ఆరుమాసాలైంది. ఇంత వరకూ ఏదో కొంతవరకూ వైద్యం నేర్చుకొన్నావు. ఎక్కువకాలం నీవు భార్యను పుట్టింటిదగ్గర వదలడం మంచిపనికాదు. ఇంక ఇంటికి చేరి స్వతంత్రంగా వైద్యం చేసుకుంటూ కాలక్షేపం చెయ్యడం మంచిది" అని నిర్మోహమాటంగా చెప్పాడు. చిట్టిబాబుకి ఆయన చెప్పింది నిజమే అనిపించింది. సామాన్యమైన వ్యాధులకు చికిత్స చెయ్యగలిగే శక్తి తనకు కలిగింది. తాను వివాహమైన నెలరోజులకే భార్యను వదిలిపెట్టాడు. ఇంకా ఇలాగే కాలక్షేపం చేస్తే ఆమెకు చాలా అన్యాయం చేసిన వాడౌతాడు. తన భార్య కుటుంబం తలపుకి వచ్చేసరికి వాని మనస్సు వికలమైంది. ఇంక ఒక్క గంటకూడా అక్కడ ఉండడం దుర్భర మనిపించింది. మరునాడు ఆయన్నడిగి కొన్ని సామాన్యమైన మందులు, పది రూపాయలు తీసికొని ఇంటికి బయలుదేరాడు. ఆయన సంతోషంతో ఆశీర్వదిస్తూ వానిని సాగనంపాడు.

* * *

ఇంటికి వచ్చినవెంటనే భార్యను తీసుకొని వచ్చాడు చిట్టిబాబు. తాను వైద్యం చేస్తాడనే విషయము అందరికీ తెలియజెయ్యడమెలాగ అనే సమస్య బయలుదేరిందతనికి. తనకు పరిచితులైన వారందరితోనూ, తాను, గడచిన ఆరుమాసాల్లోనూ వైద్యం నేర్చుకొన్నాననే విషయం వివరించాడు. యింక తాను వైద్యవృత్తితో కాలక్షేపం చేస్తానని చెప్పాడు. ఇదివరలో చిట్టిబాబు ముద్దుముద్దుగా పాటలు పాడి చిన్న చిన్న నాటకాలలో వేషాలు వేసేవాడు. కొంతమంది కళాభిమానులు వారికి ఏపనీ లేనప్పుడు కాలక్షేపానికి వానిని వినియోగించుకొనేవారు. ఆరు మాసాల్లో అతను వైద్యుడయాడంటే ఆ గ్రామంలోనివారికి నవ్వువచ్చింది. హేళనభావంతో నవ్వుతు వాని మాటలకు ఊకొట్టేరు. చిట్టిబాబు స్వగ్రామం చేరి వారం గడచింది. మందిమ్మని వచ్చినవారెవరూ లేరు. ఇంకోవారం గడచినా వానిదగ్గరకు యెవరూ రాలేదు. గుంటూరులో పదిరూపాయలు అప్పు తీసుకొని ఇంటికి వచ్చాడు. భార్యను తీసుకొనివచ్చాడు. పది రూపాయలు అంతటితో పూర్తి అయాయి. ఒక రోజంతా ప్రయత్నంచేసి మరో పదిరూపాయలు అప్పు సంపాదించాడు. వారంరోజులకు అవికూడా ఖర్చయిపోయాయి. తండ్రిసంపాదనతోనే అన్నపానాలు అతికష్టంమీద గడుస్తున్నాయి తండ్రిసంపాదన రోజుకి ఒకరూపాయికి మించివుండదని వానికి తెలుసు. ఆయన కుటుంబపోషణకై యేవిధంగా కష్టపడుతున్నదీ తాను కళ్లారా చూస్తున్నాడు. అటువంటప్పుడు తాను ఎంతో కొంత సంపాదిస్తేనేగాని కుటుంబ నిర్వహణ అసంభవమౌతుంది. తన వైద్య వ్యాపారం వ్యాపింపచెయ్యడ మెలాగ అనే ప్రశ్నతో వాని మనస్సు రాత్రింబవళ్లు తీవ్రంగా పనిచేస్తోంది. ఆ గ్రామంలో ఒక ఎల్లోపతి వైద్యుడు ఒక ఆయుర్వేద వైద్యుడు ఉన్నారు. వారు తమ వృత్తిలో తగినంతగా సంపాదిస్తున్నారు. అనేకమంది వారి వద్దకు వెళ్ళి వైద్యం చేయించుకొంటున్నారు. వారి మందుల బీరువాలు, వారి వేషభాషలు చూస్తే తాను కూడా అటువంటి యేర్పాట్లు చేసుకొంటే ఉపయోగపడగలదని వానికి తోచింది. కాని వాటికి పెట్టుబడి కావాలి. పది రూపాయలు అప్పు దొరకడమే దుర్ఘటమైతే రెండు మూడు వందలైనా ఖర్చయే ఏర్పాట్లు తానెట్లు చెయ్యగలడు. అసంభవమనిపించింతనికి అయినా నిరుత్సాహపడక ఒక బల్లకు నల్లరంగువేసి దానిమీద 'శ్రీ లక్ష్మి ఆయుర్వేద వైద్యశాల' అని చక్కగా వ్రాసి తన యింటిగుమ్మానికి వ్రేలాడదీశాడు. ఒక నెల అతి కష్టం మీద గడిపాడు. ఈ నెల రోజుల్లోనూ ఇద్దరు కూలిపని చేసుకొనేవారికి తనకు గడ్డంగిసే మంగలికి మాత్రం నాలుగైదుసార్లు మందులిచ్చాడు. ఒక కూలీ అర్ధరూపాయి మరియొకడు ఒక రూపాయి యిచ్చారు. ఊళ్లో అర్ధ, పావలా, రెండూ మూడూ చొప్పున అప్పులు యేభై రూపాయలవరకూ తేలాయి. నిత్యమూ బాకీలడిగే వారికి సమాధానం చెప్పడం చాలా కష్టమౌతోంది. ఈ రకమైన కష్టం తానెప్పుడూ అనుభవించి యెరుగడు. ఇంక దినములు దొర్లించడం దుస్సాధ్యమనిపిస్తోందతనికి. రెండు మూడు పేటెంటుమందులు తయారుచేసి దుకాణదార్లకు అమ్మడం మంచిదనిపించిందతనికి. అందుకైనా మొదట ఒక పాతిక ముప్పైరూపాయలు పెట్టుబడి పెట్టాలి. నాలుగురోజులు విశ్వప్రయత్నం చెయ్యగా ఒకరిదగ్గర

పది మరి యిద్దరి స్నేహితులదగ్గర రెండు అయిదురూపా యలు అప్పు సంపాదించగలిగాడు. వెంటనే అవసరమైన మూలికలు వగైరా సరుకులుకొని చంటిపిల్లల బల్ల వ్యాధికొకమందు, కురుపులు చిడుము మొదలైనవాటికి ఒకమందు, మలబద్ధకమున కొకమందు తయారుచేసి వాటిని సీసాలలో ఉంచాడు. కాగితం ముక్కల మీద మందులపేర్లు, వాటి గుణములు వ్రాసి చిన్నసీసాలమీద అంటించాడు. ఒక వారం రోజుల్లో ఒక్కొక్కరకానికి ఇరవై మందుసీసాలు తయారయాయి. వాటిని తీసికొని అద్దెసైకిలుమీద ఒక్కొక్క గ్రామమే చూచుకొంటూ కాకినాడ చేరాడు. ఏ దుకాణంమీదకు వెళ్ళి అడిగినా అవి అమ్మి డయే సాధనం కనుపించలేదు. "నాలుగేళ్ళక్రితం కొన్నమందులు అమ్మడుకాక బూజుపట్టి పడి ఉన్నాయి. ఇంకా మాకు మందులెందుకయ్యా బాబూ" అన్నాడొకడు. మందుసీసామీద చేవ్రాతతో ఉన్న లేబిలుచూచి 'అబ్బే, ఇలాంటివి అమ్మడుకావు' అన్నాడింకొకాయన. ఫలానా మందులున్నాయి తీసుకొంటారా అంటే సమాధానమే చెప్పక బేరాలు చూచుకొంటూ గంటసేపు నిలబెట్టి 'పోవయ్యా, ఇప్పుడు తీరికలేదు' అని కసిరాడు ఒకవ్యాపారి.... ఈవిధంగా రెండురోజులు కాళ్ళరిగేటట్లు తిరిగినా ఒక్కసీసాకూడా అమ్మడుకాలేదు చిట్టిబాబుకి. రెండుపూటలు పట్నంలోఉన్న దూరపుబంధువు లింట్లో భోజనం చేశాడు. ఒకపూట హోటల్లో భోజనం చేశాడు. ఒక పూట ఇంక భోజనానికి దగ్గర డబ్బులు లేవు. ఆ పూట భోజనం లేకుండానే గడిపి మూడోరోజుకి యింటికి చేరాడు. సైకిలు అద్దె రెండు న్నర రూపాయలు యివ్వవలసి వచ్చింది. ఇప్పుడు ఇచ్చి తీరాలన్నాడు షాపు యజమాని. సాయం కాలానికి యిస్తానని వానిని అతికష్టం మీద ఒప్పించి యిల్లు చేరాడు. ఆ సాయంకాలం సైకిలుషాపు యజ మాని వచ్చి డబ్బిమ్మన్నాడు. రేపు తప్పకుండా యిస్తా నన్నాడు. 'అదేం పనికిం'దు పాత బాకీ అర్ధరూపాయి, ఇప్పుడు రెండున్నర రూపాయలు యిస్తేనేగాని కదల నని కూర్చున్నాడు. చుట్టుప్రక్కలవాళ్ళు నలుగురూ చేరి నాలుగు విధాలుగానూ మాట్లాడ్డం మొదలు పెట్టారు. వానికేమి చెప్పాలో తోచలేదు చిట్టిబాబుకి. చివరకు వాని తండ్రివచ్చి 'రేపు నేనిస్తాను నాయనా' అని బ్రతిమాలి పంపించాడు.

ఈ సంఘటనంతా చిట్టిబాబు భార్య గుమ్మం లోపల నించి చూస్తూనే ఉంది. తన పేదతనాన్ని తనను భార్యకు తెలియనీయకూడదని పెళ్ళయిన నాటినుండీ ప్రయత్నిస్తూనే ఉన్నాడు. కాని సవతి తల్లి నోటిని కట్టలేకపోయాడు. ఊళ్ళోని అప్పుల సంగతులైనా ఆమెకు ముసుగువేయాలని ప్రయత్నించాడు. నేడు ఆ బండారంకూడా బయలుపడిపోయింది. అవసానంతో వాని తెర చిరిగిపోయింది. అందాలుచిందే ఆ నూతన వధువుకి తన ముఖం చూపించలేకపోయాడు. ఇంక ఇంట్లోకి వెళ్ళకుండానే బయలుదేరి తాను చదువుకొన్న గ్రామంలో పినతల్లిగారింటికి వెళ్ళాడు. తన పినతల్లిని యేదో విధంగా ఇరవై రూపాయలు అప్పుయిస్తేనేగాని తన పరువు నిలబడదని ప్రాధేయపడ్డాడు. ఈ యిరవై రూపాయలతో చిల్లర బాకీలు తీర్చుకొని తనవద్ద నిల్వ ఉన్న మందులతో కాలక్షేపం చెయ్యగలనని చెప్పాడు. ఆమె జాలిపడి ఇరవై రూపాయలు యిచ్చింది. ఆ రాత్రి అక్కడే వుండి మరునాడు ఉదయమే కాకినాడ బస్సు ఎక్కాడు. అక్కడినుండి మరునాటికి బెజవాడ చేరుకొన్నాడు. హోటలుకి వెళ్ళి భోజనం చేసి ఇంక యేమిటి కర్తవ్యం అని ఆలోచిస్తూ బయటకు వచ్చాడు. ఒక సాధువు తంబుర మీటుతూ పాడుకొంటూ హోటలు యెదుట నిలబడ్డాడు. సాధువును చూడగానే చిట్టిబాబు మనస్సులో యేదో తళుక్కుమంది. వాని దగ్గరకు వెళ్ళి "ఇలాంటి తంబుర ఒకటి కావాలి. ఎలా దొరుకు తుంది? దాని ఖరీదు ఇచ్చేస్తాం" అన్నాడు "వార క్కాం బాబూ, నాలుగు రూపాయలౌతుంది. తమరు తెమ్మంటే సాయంత్రం తెస్తాను." అన్నాడు సాధువు. "తప్పకుండా తీసుకొనిరా. సాయంత్రం నేనిక్కడే ఉంటాను." అన్నాడు చిట్టిబాబు ఆ పూట, కాల క్షేపానికి బజారంతా తిరిగాడు. పుస్తకాల దుకా ణంలో భగవత్సంబంధమైన గీతాలు గల పుస్తకాలకై వెతికాడు. 'గీత గోవిందము' 'శ్రీ కృష్ణలీలాతరంగ ములు' రెండు పుస్తకాలు కనుపించాయి. వాటిని కొని హోటలుదగ్గరకు చేరాడు. సాయంకాలం సాధువు తంబురతీసుకొని వచ్చాడు. నాలుగు రూపా యలు వాని చేతిలోపెట్టి తంబుర తీసుకొన్నాడు. తంబుర, పుస్తకాలూ చూచేసరికి వానికేదో చెప్ప లేని విషాదమూ ఆనందమూకూడా కలిగాయి. ఆవి

చేతిలో ఉండగా ఎవరైనా మాస్తారేమోనన్న భయం కలిగింది. బెజవాడ తన గ్రామానికి దగ్గరగా ఉందనిపించింది. జేబులోని డబ్బు దాచుకొన్నాడు. ఈ డబ్బుతో ఇంకా చాలా దూరంపోవచ్చునను కొన్నాడు. తిన్నగా స్టేషనుకి చేరి హైదరాబాద్‌కి టిక్కెట్టు తీసుకొన్నాడు. ఇంక ఒక్క అణా మాత్రమే వాని జేబులో మిగిలింది. ఎందుచేతనో పరవాలేదనిపించిందతనికి. రైలు కొంతదూరం సాగిన తరువాత తంబుర శ్రుతిబిగించి తనకు వచ్చినగీతాలూ, శ్లోకాలూ ఒక గంటసేపు పాడాడు. ఆ పెట్టెలోని వారంతా తన్మయులై విన్నారు. పాట ముగించి తంబుర క్రింద పెట్టాడు. అతనికి దగ్గరలో కూర్చున్న ఇద్దరు వ్యక్తుల్లో ఒకాయన పావలా, ఇంకో వ్యక్తి అణా యిచ్చారు. మరో అయిదు నిమిషాల్లో ఆ పెట్టెలోని వారు ఎవరికి తోచింది వారు యిచ్చారు. చిట్టిబాబు, చేతిలోని డబ్బులవైపు కొన్ని క్షణాలు చూచాడు. కళ్లు నీళ్ళతో నిండాయి. ఆ పెట్టెలోని వారంతా వానికి అపరిచితులైనా, వారి వైపు చూడలేక పోయాడు. ఆడబ్బులు జేబులో వేసుకోడానికి వానికి చాలా సిగ్గూ, భయమూ, సందేహమూ కలిగాయి. బరువెక్కిన హృదయంతో, నీళ్లునిండిన కళ్లు మూసుకొని కూర్చున్నాడు. ఒక గంట గడచిన తరువాతగాని ఆ డబ్బులు జేబులో వేసుకొనలేక పోయాడు.

* * *

హైదరాబాద్ చేరిన ఆరుమాసాల తరువాత చిట్టిబాబుకి ఒక భాగ్యవంతుని ఆశ్రయం లభించింది. చిట్టిబాబు గాయకుని రూపంలో ఆ ధనవంతుని ఆకర్షించాడు. వైద్యుని రూపంలో వాని ఆదరాభిమానాలు పొందాడు. వానికి కుమారుడు కలగడంతో ఆ కుటుంబానికి ఆరాధ్యదేవత అయినాడు.

ప్రతికూల పరిస్థితుల కఠినప్రహారాల్ని తట్టుకోలేక ఇల్లు వదలివచ్చాడు. వాని వేషభాషలు, ప్రవర్తనచూచి ప్రజలే వానికి 'సాధూరామ్' అని పేరుపెట్టి వానినొక సాధువుగా పరిగణిస్తున్నారు. సిరిరా మోకాలొడ్డువాడెవడు? పేరుప్రఖ్యాతుల్ని, పూజనీయస్థానాన్ని అయాచిత ధనార్జనను కలుగజేసిన పదవిని కాలదన్నుకొనేటంత మూర్ఖుడు కాడు భాగ్యశాలికి కుమారుడు కలిగిన తరువాత చిట్టిబాబు భాగ్యరేఖ బయటపడింది. వానిలో రెండు సంవత్సరముల నుండి సుప్తమైన మధురస్మృతులు జాగృతమౌతున్నాయి. నిరాశానిబిడాంధకారంలో ఆశాద్యుతులు దీపింపనారంభించాయి.

వానివద్దకు వచ్చే వ్యాధిగ్రస్తులు నిత్యమూ మందుల ఖర్చుకై ఎవరికి తోచింది వారు డబ్బాలో వేస్తుంటారు. ప్రతిదినం మధ్యాహ్నం సాధూరామ్ స్వయంగా డబ్బీని తెరుస్తాడు. ఏభైమొదలు వంద రూపాయలవరకూ ప్రతిరోజూ దానిలో సొమ్ము ఉంటుంది. మందులఖర్చులుపోను ప్రతినెలా రెండు వేల రూపాయలవరకూ నిల్వచేస్తున్నాడు. ధనంతోపాటు వానిలో ఆత్రత పెరుగుతోంది. ఏదోలక్ష్యాన్ని చేరడానికి అనుదినమూ అటమటిస్తోంది వాని మనస్సు. మధుర స్మృతుల సుధాపానంతో మత్తెక్కి ఉరకలు వేస్తోంది వాని మనస్సు.

తాను యువకుడు. తన రూపానికి యోగ్యతకు మించిన భార్యను పొందాడు. కడు బీదవారి కడుపున పుట్టిన కారణంచేత లక్ష్మి తనకు భార్యఅయింది. ఆమె సౌందర్యానికి తాను ముగ్ధుడయ్యాడు. ఆమె శరీరపు వంపుసొంపుల కదలికతో తన హృదయం ఉయ్యాల లూగింది. తాను భవిష్యత్తులో ఆమెతోకూడి ఆనంద తరంగాలమీద కేరింతలు కొట్టాలని కలలుకన్నాడు. క్రొత్తగా కాపురానికి వచ్చిన అందాలరాణి సిగ్గువిడచి తనతో మాట్లాడేవరకైనా ఆమెతో ఉండే భాగ్యం తనకు లభించలేదు.

భార్య స్వరూపాన్ని మననంచేస్తూ తియ్యని తలపులతో తన్మయుడై కొన్ని వందల రాత్రులు గడిపాడు సాధూరామ్ పేరుతోఉన్న చిట్టిబాబు. సాధ్యమైనంతవరకు స్వవిషయాన్ని మరచి కాలం గడపడానికి వీలుగా కార్యక్రమం యేర్పాటు చేసుకొన్నాడు. కాని మధ్యాహ్నం రెండుమూడు గంటలు, రాత్రి ఎనిమిదిగంటలకాలం వానికి ఏకాంతవాసం తప్పలేదు. కాని ఆ యేకాంతసమయం వానికి ప్రియమైనదిగా కనుపించేది. మధురస్మృతులు వానికి దుఃఖాన్ని కలుగజేసినప్పటికి ఆ దుఃఖంలో వానికి యేదో మాధుర్యం కనుపించేది. అతడు తన ప్రియురాలితో గడపిన అమూల్యమైన కొలది దినాలలో ఆర్థికంగా చాలా అసమర్థుడు. అప్పటికవి అమూల్య దినాలుగా కనుపించినా వాటిలో కొంత లోపం ఉన్నట్లుగా ఇప్పుడు వానికి తోస్తోంది. ఆ లోపంకూడా లేకుండా సంపూర్ణమైన ఆహ్లాదాన్ని తృప్తిని కలుగజేసే జీవితాన్ని గడపడానికి కావలసినది ధనం. దానికై రమారమి పది సంవత్సరాలుగా తపస్సుచేశాడు. చెదరిపోయే మనస్సును అనేకసార్లు కూడగట్టి బంధించాడు. తన

యౌవనం సడలకుండా ఉండాలని నిత్యమూ వ్యాయామం చేశాడు. తన అవయవసౌష్ఠవం చూచుకొని మురిసేవాడు. తన కంఠమాధుర్యానికి ముగ్ధుడయేవాడు. తన యవ్వనం, తన శరీరం, తన గానం తనవికావని వాని భావన. పది సంవత్సరాలు తన యెడబాటుతో తపింపజేసిన ప్రియురాలికవి కానుకలు. ఆ ముగ్ధమోహన రూపం తనది. ఒకవేళ అది తన విరహానికి తపించి, కృంగి, కృశించి, నశించిపోతే? అనే సందేహం కలిగేటప్పటికి వాని గుండె ఝల్లుమంటుంది. 'కాదు, కాదు అలా ఎన్నటికీ కాదు' అని వాని అంతర్వాణి పదేపదే గద్దించి పలుకుతుంది. దానితో అతను ఊరటచెందుతాడు. మనసును కుదుటపరచుకొంటాడు.

ఇప్పటికి సాధూరామ్ నిల్వచేసినధనం ఇరవైవేలు దాటింది. వాని లక్ష్యం సిద్ధించింది. ఆశలు ఫలించే సమయం సమీపించింది. 'ఇంక ఇంటికి వెళ్లాలి' అనే తలపు కలిగేటప్పటికి వాని శరీరం ఉప్పొంగి కుప్పిగంతులు వేస్తోంది తనకు ఆశ్రయమిచ్చిన అమీరుతో "ఇంక నేను వెళ్లాలి" అన్నాడు. "ఎక్కడికి స్వామీ?" అన్నాడతను అయోమయంగా. "పరమేశ్వరుడు నిర్దేశించినచోటికి". "మేము ఏమైనా అపరాధంచేసిఉంటే క్షమించమని వేడుకొంటున్నా. తమరుమాత్రం మమ్మల్ని విడచిపెట్టకండి." అంటూ ప్రాధేయపడ్డాడు భాగ్యశాలి. "మీరా? అపరాధం చెయ్యడమా! అలా ఎన్నడూ అనుకోకండి. నేనిక్కడ అవసరమైనదానికంటె ఎక్కువ కాలమున్నాను. మీతో నే చిరకాలం ఉండిపోడం నాకు ఉచితం కాదు. నా కర్తవ్యం చాలాఉంది. పరమేశ్వరుడు మీకు మేలుచేస్తాడు. ఈ సాయంకాలమే నా ప్రయాణం." అన్నాడు సాధూరామ్. ఏమీమాట్లాడలేక నిశ్చేష్టుడై నిలబడిపోయాడు భాగ్యవంతుడు.

సాయంకాలం తన చేతిసంచిని తంబురను తీసుకొని బయలుదేరాడు సాధూరామ్. భాగ్యశాలి తన కుమారుని వెంటబెట్టుకొని పాదచారియై సాధూరామ్‌తో బయలుదేరాడు. అనేకమంది ధనవంతులు బీదవారు విషణ్ణవదనాలతో ఆయనకు వీడ్కోలు నిచ్చారు. రైలు ఎక్కి అందరికీ చేతులు జోడించి నమస్కరించాడు సాధూరామ్ రైలు దృష్టికి దూరమయే వరకూ నిండినకళ్ళతో, బరువెక్కిన హృదయంతో చేతులు జోడించి నమస్కరిస్తూ తన కుమారునితో నిలబడ్డాడా సత్ప్రభువు. ఆనాటి రైలు ప్రయాణం కిన్నెరగానం వింటూ మలయమారుతంలో తేలిపోతూన్నట్లనిపించింది సాధూరామ్‌కి.

తన తంబురాను రైల్లోనే వదలి బెజవాడ ప్లాట్‌ఫారంమీద దిగాడు చిట్టిబాబు. నేటికి పది సంవత్సరాలనాడు తాను తంబుర చేతబట్టుకొని ఆ ప్లాట్‌ఫారమ్‌మీద ఉన్న స్థితికి నేటి స్థితికి పోల్చుకొన్నాడు. దీర్ఘమైన నిట్టూర్పువిడచి తొందరగా బజారుకి వెళ్లాడు. పదిసంవత్సరాలుగా పెరిగిన గడ్డమూ తలకట్టూ తీయించి చక్కగా క్రాపుచేయించాడు. నాలుగుజతల షుర్వాలు, షేర్వాణీలు తయారుచేయించాడు. తలకు టోపీ, కళ్లకు కాళ్ళకు జోళ్లుకొన్నాడు. తన ప్రియురాలు ఎటువంటి చీరలుధరిస్తే ఆమె అందం ఇనుమడిస్తుందో పదిసంవత్సరాల క్రితమే తాను ఊహించుకొన్నాడు. ఎటువంటి నెక్‌లెస్ బాగుంటుందో తనకు తెలుసు. ఒక డజను చీరలు వాటికి సరిపడే జాకెట్టు గుడ్డలు, రవ్వలూ, రాళ్ళూ పొదిగిన నెక్‌లేసును కొన్నాడు. వాటిని ధరించిన తన భార్యరూపాన్ని మనఃఫలకంమీద చిత్రించుకొన్నాడు. తన తండ్రికి సవతి తల్లికి కూడా బట్టలు కొన్నాడు. హైదరాబాద్ అమీరు దుస్తులతో, పెద్ద పెట్టెను కూలివాని కెత్తి మరునాడు రైలు ఎక్కాడు.

రైలు రాజమండ్రికి బయలుదేరింది. చిట్టిబాబు ఎక్కిన పెట్టెలో జనం నిండుగావున్నారు. వానికి ఎదురుగా పెట్టెకు అడ్డంగా ఉన్న సీటులో ఒక యువకుడు యువతి కూర్చున్నారు. యువతి ఒడిలో ఒక సంవత్సరం వయస్సుకలిగిన పసిపాప ఉన్నాడు. వారు ధరించిన దుస్తులు వారి పెట్టెలు చూస్తే తగినంత భాగ్యవంతులవలె కనుపిస్తున్నారు. అతడొక ఉన్నతోద్యోగి కావచ్చునని తోచింది చిట్టిబాబుకి. వానికి పంట్లాం, బుష్‌కోటు, రిస్ట్‌వాచి, కాలికి బూటు ఉన్నాయి. ఆ యువతి చాలా అందమైనది. వారికి వీనికి మధ్య ఎంతోదూరం లేకపోయినప్పటికి మధ్యసీటులో కూర్చున్న మనుష్యులు అడ్డుగా ఉన్నారు. అయినా ప్రయత్నంతో పదేపదే ఆమెవైపు చూచాడు. ఒకసారి కళ్ళజోడుతీసి పరీక్షగా ఆమె ముఖం చూచాడు. పిల్లచేపల్లా మెరిసే కళ్లు, పద్మపత్రంలాంటి ఫాలభాగం, గులాబిరేకును పోలిన చెక్కిళ్లు, పిల్లతుమ్మెదలవంటి సుడులుతిరిగిన ముంగురులు మొదలైన తన భార్య

పోలికలు ఆమెలో చూచాడు. మనస్సు పరిపరివిధాల పరుగులెత్తుతోంది. గుండె దడదడలాడుతోంది. "ఛా. నేను పొరబడుతున్నాను. ఈ చెక్కిళ్లు కొంచెం నొక్కుకొనిపోయి ఉన్నాయి. పెదిమలు వడలినట్లున్నాయి. ఈ యువతి కొంచెం సన్నంగాను పొడుగ్గాను ఉంది. అయినా ఒడిలో పిల్లవాడు! సరిగా ఆమెకు అక్కలా వుంది." కాని ఆమెకు అక్క ఉన్నట్లే నేనెప్పుడూ విననూలేదు, చూడనూలేదు. "మనిషినిపోలిన మనుషులు ఉంటారు. నాకుండే ఆత్రతకొద్దీ మతి భ్రమిస్తోంది." అని అనుకొంటూ కళ్లజోడు తగిలించుకొన్నాడు. ఆ యువతికూడా తన వైపు చాలాసార్లు ఒక్కొక్క క్షణంసేపు చూడ్డం తాను గమనించాడు. బహుశా అందుకు కారణం తన వేషం కావచ్చు. ఆమెయేకాకుండా ఆ పెట్టెలోని చాలామంది తన్ను ఆ విధంగా చూచారు. ఈ విధంగా యేమో తలచుకొంటూ చెదరిన మనసును కూడగట్టుకొన్నాడు. గుండె దిట్టపరచుకొన్నాడు. కాని ఎంత ప్రయత్నించినా అనుమానం, మనస్సులో పాదరసంలా మెదులుతూనే ఉంది. మధ్య మధ్య ప్రయత్నంచేసి ఆమెను చూడకుండా ఉండలేకపోతున్నాడు. ఆమె పమిటకొంగును మేలిముసుగులా వేసుకొని ముఖం ప్రక్కకు పెట్టుకొని కూర్చుంది. అందుచే ఆమె ముఖం ఇప్పుడు కనిపించడంలేదు. ఎట్టకేలకు బండి గోదావరి స్టేషను చేరింది. ఆ దంపతులు దిగిపోయారు. ఆమె ప్లాటుఫారమ్‌మీద ఉండగా పరీక్షగా చూడాలని అనుకొన్నాడు. కాని ఆమె ముఖం మేలిముసుగు చాటున కనుపించలేదు. తాను కాకినాడకు టిక్కెట్టు తీసుకొన్నాడు. ఐనా బండిలో ఉండలేకపోయాడు. కూలీని పిలచి పెట్టెతీసుకొని రమ్మన్నాడు. ఆయువతీ యువకులు రిక్షా ఎక్కారు. తనుకూడా ఒక రిక్షాలో కూర్చుని పోనిమ్మన్నాడు. రిక్షావాడు 'ఎక్కడికండి?' అన్నాడు. "ఆ వెళ్లే రిక్షా వెనకనే పోనియ్యి" అని ముందు వెళ్లిపోతూన్న రిక్షాని చూపించాడు. రిక్షావాడు ఒకసారి వానివైపు వింతగా చూచి రిక్షా పోనిచ్చాడు. ఎదుటి రిక్షా ఆర్యాపురంవైపు నడచింది. చుట్టూ ప్రహరీగోడ ఉన్న ఒక డాబాదగ్గర ఆగింది. ఆ యువతి వెంటనే లోనికి పోయింది. "ఇంకా ముందుకి పోనియ్యి" అన్నాడు రిక్షావానితో. ఒక ఫర్లాంగు వెళ్లాక 'ఆగు' అన్నాడు. రిక్షా ఆగింది; "సూపర్‌వైజరుగారు ఉన్నారేమో అడుగు ఆయింట్లో" అని ఒక యిల్లు చూపించాడు రిక్షావానికి. అతను వెళ్ళి తిరిగివచ్చాడు. "లేరన్నారండి" అన్నాడు. "సరే, దగ్గరలోని భోజనహోటలుకి తీసుకొనివెళ్ళు." రిక్షా తిన్నగా స్టేషను దాటి ఒక హోటలు దగ్గర ఆగింది. చిట్టిబాబు హోటలులోని ఒక గదిలో బస చేశాడు. స్నానం భోజనం చేసి గదిలోని కుర్చీలో నడుం వాల్చాడు. ఆ స్త్రీ పురుషులు చేరినయిల్లు తనకు బాగా గుర్తు ఉంది. కాని వారెవరో తానెలా తెలుసుకోగలడు. ఆయనెవరో తెలుస్తుంది. కాని ఆమె యెవరో ఆమె పుట్టుపూర్వోత్తరాలు యేమిటో ఎలా తెలుస్తాయి? అసాధ్యమనిపించింది. లేచి కూర్చుని ఆలోచించాడు. పచారుచేశాడు. మళ్లీ కూర్చున్నాడు. ఒక గంటకు ఒక నిర్ణయానికి వచ్చాడు. 'ఆఁ, అలా చేస్తేనే బాగుంటుంది.' అనుకొన్నాడు. త్వరగా గదికి తాళం వేసి హోటలు మేనేజరుదగ్గరకు వెళ్ళి "ఒక పోస్టల్ కవరు దొరుకుతుందా?" అని అడిగాడు. మేనేజరు డ్రాయరు సొరుగులో వెతికి కవరు యిచ్చాడు. కాగితం పెన్నూ కూడా వానివద్ద నేతీసుకొని గదిలోకి వెళ్లాడు. తన మామగారి పేర ఉత్తరం వ్రాయనారంభించాడు—

బ్రహ్మశ్రీ మామగారికి, తమ అల్లుడు చిట్టిబాబు నమస్కరించి వ్రాయునది—

ఇంతకాలానికి నాపత్తా తెలియజేస్తూ మీకు ఉత్తరం వ్రాయడానికి సాహసిస్తున్నాను. నేను అపరాధిని. మీకు, మీ అమ్మాయి లక్ష్మికి చాలా అపచారం చేశాను. కుటుంబ దుస్థితికి మనస్సు వికలమై పదిసంవత్సరాల క్రితం ఇల్లు వదలిపోయాను. నా జీవితయాత్రకు యేదో మార్గం చూచుకొంటేనే గాని ఇల్లు చేరదలచుకోలేదు. నా కోరిక ఫలించేవరకు మీకు నా ఉనికిని తెలియజేయడానికి నామనసు అంగీకరించలేదు. నా ప్రవర్తన చాలా అన్యాయమైనదని నేనెరుగుదును. దుర్భర దుస్థితికి లోనైన నాకు అంతకంటె గత్యంతరం లేకపోయింది. పది సంవత్సరాల అవిరళకృషివల్ల నేటికి పరమేశ్వరుడు నన్ను అనుగ్రహించాడు. నా కోరిక సఫలమైంది. ఇంక నా జీవితాన్ని ఒక బాటలో నిరాటంకంగా నడుపుకొనగలననే ధైర్యం కలిగింది. నేను చేసిన అపరాధాన్ని విస్మరించి నన్ను మన్నించమని వేడుకొంటున్నాను. క్షమించానని మీరు వెంటనే జాబు వ్రాస్తే ఇల్లు చేరుకొంటాను. లేదా నేను మీ ముఖం చూడలేను.

చిత్తగించవలెను,

చిట్టిబాబు.

C/o. లక్ష్మీభవన్, రూమ్ నం. 4.

రాజమండ్రి.

# చిట్టిబాబు

కవరును వెంటనే పోస్టుచేసి వచ్చాడు చిట్టిబాబు. అతి కష్టంతో వారంరోజులు దొర్లించాడు. ఈ వారంలోనూ నాలుగుసార్లు అర్యాపురం వెళ్లాడు. ఆ డాబా ముందునుంచి నడచి ఆవీధి చివరవరకు వెళ్ళి మళ్లీ తిరిగివచ్చేవాడు. ఎవరో ఆ యింట్లోవున్న ఆలికిడిమాత్రం గోచరించేది. కాని ఆమె కనుపించలేదు. ప్రతిదినం ఉదయమూ సాయంకాలమూ ఉత్తరం వచ్చిందా అని హోటలుమానేజరును అడుగుతూ ఉన్నాడు. వారం గడిచిపోయింది. కాని వాని ఉత్తరానికి జవాబురాలేదు. ఎనిమిదోరోజున మళ్లీ మామగారి పేర ఉత్తరం వ్రాశాడు. వెంటనే తన ఉత్తరానికి జవాబు వ్రాయమని కోరాడు. లేదా తాను మళ్లీ అజ్ఞాతవాసంలోకి పోతానని వ్రాశాడు. ఐదోరోజుని జవాబు వచ్చింది. కవరు చేతబట్టుకొని గదిలోకి పరుగెత్తాడు. లోపల గడియవేశాడు. దడదడలాడే చేతులతో కవరు చించాడు. పరమేశ్వరుని తలచుకొని ఉత్తరం విప్పి చదివాడు. కళ్లు నీళ్లతో నిండిపోతున్నాయి. చేతులు కంపిస్తున్నాయి. కాగితం పట్టుకొనడం కష్టమౌతోంది మరల మరల ఎన్నోసార్లు చదివాడు. ఎన్నిసార్లు చదివినా అందులోని విషయమింతే—

చిట్టిబాబుకి, ఆశీస్సులు !

నీవు వ్రాసిన ఉత్తరాలు రెండూ చేరాయి. ఈనాటికి నీజాడ తెలిసినందుకు సంతోషించాను. నీవు ఇల్లువదలి వెళ్ళిన తరువాత ఆరుసంవత్సరములవరకూ నీజాడ తెలుసుకొనేందుకు మాచేతనైన ప్రయత్నాలన్నీ చేశాము. కాని లాభంలేకపోయింది. కన్నకూతురు ముఖంచూస్తూంటే గుండె చెరువైపోయేది. ఆ ఆరుసంవత్సరాలూ మా కుటుంబం సుఖంగా నిద్రపోలేదు, తృప్తిగా భోజనం చెయ్యలేదు. ఆ తరువాత ఒకనాడు మాయింటికిఎదురుగావున్న రాఘవరావు గారింటికి వారి మేనల్లుడు వచ్చాడు. అతను బాగా చదువుకొన్నవాడు, సంస్కారంకలవాడు. బెజవాడలో రిజిస్ట్రారుగా పనిచేస్తున్నాడు. వాని భార్య అప్పటికి కొద్దికాలం క్రితమే మరణించింది. తను వచ్చిన నాలుగురోజుల్లో మా కుటుంబపరిస్థితులు తెలుసుకొన్నాడు. ఒకనాడు రాఘవరావుగారూ అతనూ వచ్చి "మీ అల్లుని జాడ యేమైనా తెలిసిందా?" అని అడిగారు. నేను తెల్లబోతూ లేదన్నాను. "అతను వస్తాడనే ఆశయేమైనా ఉందా?" అని అడిగారు. "ఇంకా ఆశ యేమిటండీ, ఆరుసంవత్సరాలు గడిచిపోయాయి" అన్నాను. "మీరు అన్యథా భావించకపోతే నేనొక మాటచెప్తాను" అన్నాడు రాఘవరావుగారు. "అలాగే, చెప్పండి" అన్నాను. "మీ అమ్మాయికి వివాహంచెయ్యండి. వరుడు సిద్ధంగావున్నాడు" అన్నాడాయన. నేనింకా పూర్వసంప్రదాయాన్ని పాటించేవాణ్ణి కావడంచేత ఆయన మాటకు నిశ్చేష్టుడనయాను. "అలాచెయ్యడం అసంభవం. క్షమించండి" అని ఆనాడు వారికి జవాబుచెప్పాను. కాని దుర్భరపరిస్థితులు నీ మనస్సును వికలం చేసినట్లే నన్నూ చేశాయి. నేను వివశుడనయాను. నీజాడ వెంటనే తెలియజేస్తూ ఇంటికి చేరవలసినదని, లేదా నా కుమార్తెకు మరల వివాహం చేయుదునని పత్రికలో ప్రకటించాను. అప్పటికికూడా నీజాడ తెలియలేదు. ఒకనెల తరువాత రాఘవరావుగారి మేనల్లునికిచ్చి నా కుమార్తెకు అగ్నిసాక్షిగా వివాహం చెయ్యవలసివచ్చింది. వారికి గడచిన సంవత్సరం కుమారుడు కలిగాడు. ఇరవైరోజులక్రిందట వానికి ఉద్యోగం బదిలీ అయింది. ఇప్పుడు వారు బెజవాడలో లేరు. నీవు గడచినదానికి చింతించిన లాభంలేదు. నీ తండ్రిగారు నీకై తపిస్తున్నారు. వారినిచేరి వేరుమార్గం చూచుకొని సుఖించవలసినదని నా సలహా. పరమేశ్వరుడు నీకు మేలు చేస్తాడు.

నీ హితైషి,

రామనాథశాస్త్రి.

# కలగూరగంప

## జాతకచంద్రికపై పండితమీమాంస:

శ్రీ ఆదిరాజు అన్నాజీరావు

భారతి పత్రిక 1956 మార్చి పత్రికలో జవాబునకు ప్రతిజవాబు. అధ్యక్షులుగువారు తొలి పల్కునందు శాస్త్రీయమార్గములకు విభిన్నముగ ప్రసంగించుచో అందలి భేదములను మాపుట తప్పుగాదు. తిరిగి అధ్యక్షులు శాస్త్రీయపద్ధతిని సమన్వయ పరచుట యుక్తము. కాని అట్లు చేయక "సాహిత్యజ్ఞానము లేదు. కావ్యపరిచయము తక్కువ" ఇత్యాదికములగు వ్యక్తిని పురస్కరించుకొని దూషణలతో మాట్లాడుట అధ్యక్షపీఠ మలంకరించినవారికి ధర్మ మెట్లగును?

"జాతకచంద్రికను...ఇందులకు విలక్షణముగ వ్రాసిన వ్రాత సత్యము కానేరదు" అని వ్రాసిరి—నేను ఫిబ్రవరి సంచికలో వారు అభిప్రాయమును—వ్యక్తపరచిరి అనిమాత్రమే వ్రాసితిని కాని వారి సిద్ధాంతమని నిశ్చితాభిప్రాయమనియు నేనుమాత్రము వ్రాసితినా. నే నట్లు వ్రాసితినని యభిప్రాయపడుట, నే నసత్యమును వ్రాసితిననుట, తిరిగి వారు దేనిని నిశ్చితాభిప్రాయముగ చెప్పలేదరిరో దానినే సమర్థించి వ్రాయుటచే ఎవరు సత్యముగ పల్కిరో లోకమే తెలుసుకొనగలదు.

"మంద సౌమ్యసితాః పాపాః.........
కవిస్సాక్షాన్న హంతా స్యాన్మారక త్వేన లక్షితః
............జ్ఞాతవ్యాని క్రియాభువః॥

మేషలగ్నమునకు-శుక్రుడు పాపి అనగా యోగము చేయజాలడు-మారకలక్షణము కలిగిన శుక్రుడు-సాక్షాత్—అనగా తానుమాత్రముచే మారకుడు గాడు అని యర్థము. "సదింశతిశుభం నృణాం సౌమ్యాః కేంద్రాధిపా యది-అని చెప్పుటచే సప్తమకేంద్రాధిపతి పాపి. మరియు "కేంద్రాధిపత్యదోషస్తు బలవాన్ గురుశుక్రయోః" అని చెప్పుటచే శుక్రుడు కేంద్రాధిపతి అగుట మిక్కిలి దోషమును చేయును-"లగ్నాద్వ్యయ ద్వితీయే శౌ పరేషాం సాహచర్యతః – స్థానాంతరానుగుణ్యేన భవతః ఫలదాయకౌ" అని చెప్పుటవలన సప్తమాధిపత్యము శుక్రునకు దోషము కాని ద్వితీయాధిపత్యము దోషముగుచుండెను. కనుక ద్వితీయ సప్తమాధిపతియగు శుక్రుడు మేషలగ్నమునకు యోగకారకుడు కాదని స్పష్టమగుచుండెను – "మారక త్వేపి చ తయోర్మారకస్థాన సంస్థితః" శుక్రునకు ఆధిపత్యముచే మారకత్వము కలిగినను మారకస్థానస్థితి బలము కలది అని చెప్పుటచేతనే—"కవిస్సాక్షాన్న హంతా స్యాత్ మారక త్వేన లక్షితః" యని చెప్పెను—ఇట్టి పరిస్థితియందు ప్రతిపక్షులు గత వ్యాసములో శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తి శాస్త్రిగారు చేసిన సమన్వయమును మేము చూపగ దానికి శాస్త్రీయమగు సమాధానము చెప్పక "ద్వితీయ సప్తమస్థాన నేతైకో యది సౌఖ్యకృత్" అను ఉడుదశాప్రదీపికాపద్ధతిని పూర్వపారాశరి విరుద్ధముగ గ్రహించెనని తోచుచున్నది"—అని వ్రాసిరి. ప్రకృతము పూర్వపారాశరికి ఉత్తర పారాశరికి విరోధము కలదా-లేదా యను విషయము చర్చలో నుండగ — అప్రస్తుతవిషయముతో పని యేమి—జాతకచంద్రికలో విషయములన్నియు సర్వ గ్రంథసమ్మతమని ఎవరు చెప్పియుండలేదు గదా—అట్టి సందర్భమున ఈ విషయము ప్రస్తుతము-"పూర్వపారాశరినిబట్టి మేషలగ్నమునకు శుక్రుడు మారకుడు కాకుండుటకు ఏమియు నాధారము లేదు" అనిరి. సాక్షాన్మారకుడు కాదని చెప్పెను గాని "తత్రగ్రహాః" అనురీతిగ మారకస్థానస్థితి మొదలగునవి కలుగుచో మారకుడు అని అర్థము వచ్చుచుండెనుగదా—ఇందుల పూర్వపరవిరోధ మేమున్నది, శ్రీ కృష్ణమూర్తిశాస్త్రి గారు ఈ విషయమునే చెప్పిరిగదా—

ప్రతిపక్షులు కర్కాటక లగ్నమునకు—మకర లగ్నమునకు శుభపాపత్వాది విచారణ చేయునపుడు—కర్కాటక లగ్నమున గురునకు—మకరలగ్నమున బుధు

నకు శుభత్వమును చెప్పెను—అనుటకు కారణము ఈక్రిందివిధముగ చూపిరి — "పంచమనవమాన్యతరాధీశతారూప శుభత్వమును - తృతీయషష్ఠలాభాన్యతమాధీశతారూప పాపత్వమును నొక్కనికే కల్గినపుడా గ్రహము మిశ్రఫలదాత యగు నేకాని పాపియెట్లగును? శుభత్వాధిక్యమున శుభుడే కావచ్చుననియుఁ జెప్పబడెను" అని వ్రాసిరి.

లఘుపారాశరీకర్త ద్వాదశభావాధిపతులకు శుభపాపత్వవిచారణ చేసెనుకాని — మిశ్రఫలదత్వోక్తి చెప్పలేదు. మిశ్రఫలదత్వోక్తి దశాంతర్దశాఫలములయందే చెప్పెనుగాని—ద్వాదశభావాధిపతులకు ఎచటను మిశ్రఫలదత్వ సూచనకూడా లేదు. ఇది ప్రతిపక్షుల సృష్టి కాని శాస్త్రీయము గాదు.

ఇట్లుగుచో శ్రీ చినకృష్ణమూర్తి శాస్త్రిగారు చెప్పిన విధముగ కర్కాటకలగ్నమునకు షష్ఠభాగ్యాధిపతి గురుడు. మకరలగ్నమునకు షష్ఠభాగ్యాధిపతియగు బుధుడు పాపులగుచుండగ ఉత్తరపారాశరియందు వీరలకు శుభత్వము చెప్పుట పూర్వాపరములకు విరోధము కనుక పూర్వపారాశరికర్త వేరు. ఉత్తరపారాశరికర్త వేరు అని ప్రతిపక్షుల పూర్వపక్షము.

"కేంద్రత్రికోణపతయ స్సంబధేన పరస్పరం
ఇతరై రప్రసక్తాశ్చేత్ విశేష శుభదాయకాః
కేంద్రత్రికోణ నేతారౌ-దోషయుక్తావపి స్వయం
సంబధ మాత్రాద్బలినౌ భవేతాం యోగకారకౌ."

"నను విశేష శుభదాయకత్వోక్తి రయుక్తా, త్రికోణేశానాం త్రిషడాయాధిపతిత్వే పాప ఫలదత్వోక్త్యా, తదీశ సంబధే నాపి పాపఫలదత్వే ప్రాప్తే కేంద్రాధిపతిసంబంధమాత్రేణ శుభదత్వమాత్రం—స్యాత్ — ఇతరైః కేంద్రకోణాధిపతివ్యతిరిక్తైః అప్రసక్తాః అసంబద్ధాశ్చేత్ విశేషశుభదాయకా భవంతీతి ప్రథమశ్లోకస్య ఫలితార్థః.

పూర్వశ్లోకే-కేంద్రత్రికోణాధి సంబంధాదేవశుభదాయకత్వ ముక్తం—దోషయోగే శుభకారిత్వం—దోషాభావేతు విశేషశుభకారిత్వంచ ప్రతిపాదితం-ద్వితీయ శ్లోకేపి తస్మాదేవ సంబధాత్ రాజయోగకారకత్వ ముచ్యతే—తర్హి పూర్వశ్లోకాత్ అస్మిన్ కో విశేషః. ఇత్యాశంకాం పరిహరతి.

"ప్రబలా ఉత్తరోత్తరం" ఇత్యనేన దశమ నవమాధిపత్యోరేవ బలవత్వాత్-బలినౌ-ఇత్యనేన నవమ దశమాధిపతీ కేంద్రత్రికోణనేతారౌ-దోషయుక్తావపి స్వయం యోగకారకౌ (సంబంధరహితావేవ) సంబంధ మాత్రాత్ విశేషయోగకారకౌ ఇతి — పూర్వస్మాద్విశేషః.—"

కనుక నే బలవత్తరుడగు త్రికోణాధిపతి త్రిషడాయాధిపత్యములచే దోషయుక్తుడైనను స్వయముగ నే యోగకారకుడగుచుండెను. మరియు బలవత్తరులగు కేంద్రత్రికోణాధిపతులసంబంధము రాజయోగకరము. ఈ అర్థమునే ఉత్తరపారాశరియందు చెప్పెను. కర్కాటక లగ్నమునకు "...... శుభాధిపతిః భూసుతో - రాజయోగకరస్సాక్షాత్ ఏకఏవ ధరాసుతః-భవేతాం-రాజయోగస్య కారకౌ గురు భూమిజౌ-ఇట్లుగ నే మకరలగ్నమునకు "సుధాకవి చంద్రజౌ-రాజయోగకరస్సాక్షాత్ ఏకఏవ భృగోస్సుతః-చంద్రాత్మజేన సంయుక్తో విశేష ఫలదాయకః"కర్కాటకలగ్నమునకు గురుడు-పైన చూపిన ప్రకారం-శుభుడు - కర్కాటకలగ్నమునకు "కుజస్య కర్మనేతృత్వప్రయుక్తకారితా, త్రికోణాస్యాపి నేతృత్వేన కర్మేశత్వమాత్రతః అని చెప్పుటవలన కుజునకు సాక్షాద్రాజయోగకారకత్వము సంబంధమాత్రాద్బలినౌ భవేతాం యోగకారకౌ" అని చెప్పుటచే గురుకుజసంబంధము విశేషరాజయోగకరము.

పై కారణములచే మకరలగ్నమునకు బుధుడు-బుధశుక్ర సంబంధము కర్కాటకలగ్నమునందువలెనె-ఇక రాజయోగకరస్సాక్షాత్ ఏకఏవ భృగోస్సుతః అనునది—"త్రికోణాధిపయోర్మధ్యే సంబంధో - యేన కేనచిత్, కేంద్రాధిపస్య బలినో భవేద్యది సయోగకృత్" ఇచట ప్రబల కేంద్రాధిపతియగు శుక్రునకు పంచమకోణాధిపతిత్వమువలనను దశమకేంద్ర-కోణాధిపతులకు సంబంధముచే శుక్రుడు సాక్షాద్రాజయోగకరుడగుచుండెను.

కనుక ప్రతిపక్షులు చెప్పిన పూర్వాపరవిరోధమెచటను కానరాదు. ఏకకర్తృకములు గాని అన్యకర్తృకములు గావని సిద్ధాంతము.

మరియు ప్రతిపక్షులు యది శబ్దమాత్రముచే ఆ యర్థము లభింపదు యనిరి. సామీప్యములో నదిశంతి శుభం నృణాం సౌమ్యాః కేంద్రాధిపా యది. అనుచోట సౌమ్యాః కేంద్రాధిపా యది యనువట్లు-శుభ ఫలప్రదాః తే సర్వే త్రిషడాయాణాంపతయో యది

అని సమన్వయమగుచుండగ అపి-ఏవ మొదలగునవి లేవనుట సమంజసము కాదు.

శాస్త్రములయందు-అనువృత్తి-ఆవృత్తి-అపకర్షలచే సమన్వయపరచుట శాస్త్రజ్ఞులకు పరిపాటియే-మేము చేసిన మూడుపద్ధతుల సమన్వయముచే అన్ని అర్థములు వాచ్యము లగుచుండెను.

పై విమర్శనుబట్టి "యది" అనుదానికి వారు చెప్పినట్లు అంగీకరించిన త్రికోణాధిపతులకు త్రిషడాయాధిపత్యములు వచ్చినప్పుడు శుభపాపత్వవిచారణ పూర్తి యగుటలేదు - గ్రంథకర్త శుభులను - పాపులను నిర్వచించుచుండగ గ్రంథకర్త ప్రణాళికకు భిన్నముగ మిశ్రఫలదాతలను ప్రతిపక్షులు సృష్టించుట శాస్త్ర సంప్రదాయవిరుద్ధము - విమర్శనా రాహిత్యకృతమనుటలో ఆవంతయు సందియము లేదు.

"ఇంతయేల? శుభత్వ పాపత్వ సంధాయకాధిపత్యద్వయ మున్నపుడు ఆ గ్రహము మిశ్రఫలదాత యనే కాని పాపియగుననుట యెట్లు పొసగును?

"ధర్మకర్మాధి నేతారౌ రంధ్రలాభాధిపౌ యది
తయోస్సంబంధమాత్రేణ న యోగం లభతే నరః"

అని కదా మిశ్రాధిపత్యఫలము చెప్పబడెను. అట్టి గ్రహమునకు శుభత్వమే కాక పాపిత్వము గలుగుననిన ననవచ్చును" అని ప్రతిపక్షులు వ్రాసిన మాటలను విచారణచేసిన ఈశ్లోకము వారికి అర్థము కాలేదనుట స్పష్టము. ఇది శాస్త్రీయవిమర్శము-అప్పటికప్పుడు సిద్ధపడుట భావ్యము కాదు. వారు వ్రాసిన మాటలు అర్థరహితములు—గమనించుడు. కేంద్రత్రికోణనేతారౌ దోషయుక్తావపి స్వయం- ఇత్యాది శ్లోకముచే మేషమిథున లగ్నజులకు రాజయోగము ప్రాప్తమగుచుండగ రంధ్రలాభాధిపత్యములవలన పూర్వోక్తమగు రాజయోగమునకు అపవాదను చెప్పెను.

"పశ్యంతి సప్తమం సర్వే శనిజీవకుజాః పునః
విశేషతశ్చ త్రిదశ త్రికోణ చతురస్రగాన్ ॥

విశేషతః-చ అని యుండుటవలన విశేషసామాన్య దృష్టులకు అన్వయము కలుగుచుండగ విశేషదృష్టినే చెప్పెననుట సరిగాదు. లఘుపారాశరికి మూలము బృహత్పారాశరి కాదగియున్నది. అందలి విషయములను లఘురూపములో చెప్పెననుట సమంజసము. బృహత్పారాశరిలో సామాన్యవిశేషదృష్టులను చెప్పగ పాదాదిదృష్టులు పారాశరిపద్ధతిలో గ్రాహ్యములు కానేరవనుట శాస్త్రీయమార్గము కానేరదు.

కనుక ప్రతిపక్షులు చెప్పిన రీతులు జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయవిరుద్ధములు గాన గ్రాహ్యములు కానేరవు-అన్యగ్రంథసహాయ మక్కరలేకుండగనే పూర్వోత్తర పారాశరులను సమన్వయపరచుటకు సిద్ధముగ నుంటిమని లోకమునకు మరొక్కసారి మనవిచేయుచున్నాను.

# రేగుప్తి రాగము

శ్రీ దువ్వూరి జగన్నాథశర్మ

గాయకులు: మంచి గురువుల సన్నిధినుండి వల్లించిన గేయ వాఙ్మయముతోపాటుగ సంప్రదాయములు ఏ కాలమునం దెట్లుండెడివో అవి కాలక్రమమున ఏ యే మార్పులకు లోనగుచు వచ్చుచున్నవో తెలిసికొనుటకుఁ గూడ ప్రయత్నించు చుండవలెను.

కంచర్ల గోపన్న భద్రాచల రామదాసుఁడని సుప్రసిద్ధి చెందినవాఁడు. అతఁడు 1687 క్రీ. శకమునకుఁ గొంత ముందు వాగ్గేయకారుఁ డయియుండి వాడిన రాగములలో రేగుప్తి అనేది యొకటి. ఈ రాగమునే కృష్ణలీలలు రచించిన నారాయణ తీర్థులును, అష్టపదుల రచయిత జయదేవుఁడును వాడుకచేసి యుండిరి. ఇనుకొండ విజయరామ పదాలయందేమి గోవింద స్వామయ్య చౌకవర్ణాలయందేమి రేగుప్తి రాగమునందు సంప్రదాయశుద్ధములగు గుణకము లగుపడుచున్నవి. ఈనాఁడు రేగుప్తి రాగము నే గాయకుఁడు గాని ఆలపించుటలేదు. డెబ్బది యెనుబది సంవత్సరముల క్రిందట తిరువళ్లిక్కేణి—వీణ రామానుజయ్య గారి తదనంతరమునుండి రేగుప్తి రాగములో సంగీత విద్యార్థులకు పఠన పాఠ్యములే తొలగిపోయినవి. రాగాల పట్టికలో రేగుప్తిరాగ మగుపడుట కలదు. సరిగ పధస—సధప గరిస అని యీ రాగ మూర్ఛన. 15 మేళకర్త మాయామాళవనుండి జన్యరాగమిది—ఔడవ రాగమని ఈనాఁటి గాయకశిరోమణులెల్లరు ఏకగ్రీవముగాఁ బల్కుదురు. ఈ లక్షణము నే— సంగీత సంప్రదాయ ప్రదర్శిని మున్నగు సంగీతలక్షణ గ్రంథరాజము లన్నియు బలపఱచును. సంగ్రహ చూడామణి—సంగీత సుధ—సంగీత సారామృతము

మొదలగు సంస్కృత గ్రంథములు యిందుకు వ్యతిరేకములు కావు. సంగీతసార సంగ్రహకారుఁడు కూడ "మారు వము రేవగుప్తియు మల హరియును...... మాయ మాళవ గౌళందు...బుట్టె"నని చెప్పుట పై రీతిని ఔడవ మూర్ఛననే అందిచ్చినాఁడు. ఇట్టి లాక్షణిక క్రమమంతయును రేవగుప్తి రాగము పేర నిర్వివాదమయియుండఁగా ఇప్పుడెంతపాటి సంగీతవిద్వాంసు నడిగినను రేవగుప్తిరాగమంటే మోహనరాగమే అని నిర్వచించుట కద్దు. ఇప్పటికి ఏబదినలువది యేండ్ల క్రిందట ఆంధ్రదేశమునం దెల్లకడల ఏపాటి ధనాఢ్యమైన పెండ్లి పందిరి యేర్పడినను సువ్యాప్తమైయున్న మేజువాణీలలో గోవిందస్వామయ్య రేవగుప్తి వర్ణము నృత్యమొనర్పఁబడుచుండెడిది. రేవగుప్తి మాయా మాళవ గౌళ జన్యమయితే అందలి శుద్ధ రిషభము శుద్ధ ధైవతము మార్పఁజాలవు. రిషభ ధైవతములు చతుశ్శ్రుతులైతే మోహనరాగమే అగును. ఆ మేజువాణీ సంగీతమునం దీరీతి విచక్షణకుఁ దగినంత సుశిక్షణ లేకుండెడిది. కాఁగా రేవగుప్తి వర్ణము శీర్షికతో మోహనరాగములోనే "సరిగా దానిపయి నెనరుంచి" అను వర్ణము గేయమగుచుండెడిది. ఇట్లు మోహన—రేవగుప్తి రాగములు ఒకే రాగముయొక్క పర్యాయ నామము లన్నది ఈనాఁటి దేశీయ మర్యాద యైనది.

ఈనాటి మాటలలో రేవగుప్తియనఁగా మోహన రాగమే యను నొక్కమాట చాలినదయినను రేవగుప్తి-మోహనలయొక్క పుట్టుక-పూర్వోత్తరము లెంతో చారిత్రిక రమ్యతను సంగీతమునకుఁ గలిగించును. చతుర్దండి ప్రకాశికలో "రేవగుప్తిస్తు హెజ్జుజ్జి మేళోత్థో మనివర్జనాత్ | ఔడవశ్చ" అని రిషభగ్రహరాగముగా అనువదింపఁబడినది. వేంకటమఖిచేఁ జెప్పబడినఁ హెజ్జుజ్జి మేళము ("షడ్జేచ త్రిసఋషభే త్రిస్రోగే పంచమస్య మే | ఏకస్యాత్పే చతుస్రః స్యుశ్శేతిస్రోద్వే నిషాదకే"—ఈ సూత్రము మేరకు) ఇప్పటి కర్ణాటక మేళపద్ధతిలో 13 వదగు గాయకప్రియ యగుచున్నది. ఈ పదమూడవ మేళములో మధ్యమ నిషాదములులేని ఔడవరాగముగా రేవగుప్తి చెప్పఁబడినదంటే షడ్జము, శుద్ధర్షభము, అంతరగాంధారము, పంచమము, శుద్ధ ధైవతముగల సరిగపధస-ఔడవరాగము మోహన రాగము కాఁజాలదు. తులజేంద్రుఁడు సంగీత సారామృతమునందు మాళవగౌళజన్యముగా రేవగుప్తిని జేర్కొనుటవలన - చతుర్దండిచేఁ జెప్పఁబడిన స్వరలక్షణమునకయ్యది వ్యతిరేకించదు. ఏలన? మ,ని, వర్జ్య రాగము పదమూడవ మేళజన్యమన్నప్పటికిని పదునైదవ మేళజన్యమయినప్పటికిని—రాగముయొక్క నాదగుణ సమత్వము చెడదు. సంగీతసుధయొక్క రచనమునుబట్టి తండ్రి గోవిందదీక్షితులకు సంబంధమున్నదని వేంకటమఖి పల్కుచుండువాఁడు. అట్టి సంగీతసుధలో గోవింద దీక్షితులచే నుజ్జరి మేళభవముగా రేవగుప్తి చెప్పఁబడినది. సంగీతసుధలోని నుజ్జరి మేళము (మాళవగౌళ) ఇప్పటి పదునైదవ మేళమునకు సమమైనదేను. ఇట్లు రేవగుప్తి జన్యస్థానముపట్ల ఈ తండ్రి-కొడుకులు ఏకీభవింపరైరి. తండ్రి 15 మేళమన్నచోటు చూపఁగా - కొడుకు 13 మేళమున్న తావు చూపిన వాఁడయ్యెను. ఐనను రాగస్వర నాదగుణ సామ్యములో ఈ యిరువురికిని అభిప్రాయభేదము లేదు. వీరికిఁ బూర్వలాక్షణికులలో స్వరమేళ కళానిధి కారుఁడు, రాగవిబోధకారుఁడు ఈ యిరువురును రేవగుప్తిని జన్యరాగముగా న్యూనతి పఱవలేదు. క్రీ.శ. 1550-1600 నాఁటికి సంగీతమునందు పరివ్యాప్తమయియున్న ఇరువది మేళములలో రేవగుప్త-ఒకటి. 1609 A. D. నాటికే రేవగుప్తిలో మధ్యమ నిషాదవర్జ్యము ఆరంభమయ్యెన్నను అంతకుముందు షడ్జపంచమ వర్జ్యరాగమిది. ఇట్లే ఆనాఁడు స,ప,వర్జ్య రాగము-సావేరి మరియొకటి యుండెడిది. సోమనాథుని కాలమందే సావేరి గ,ని, వర్జ్యరాగముగ మార్పు చెంద నారంభించినది. ఈ మార్పుమీద దృష్టినిడిచి—గాయకోత్తములు స,పా,వర్జ్య రాగములయొక్క స్వరూపమెట్లుసాధ్యము కాఁగలదో విచారింప దక్షులు. రేవగుప్తిని "రిగమధని" "నిధమగరి" గా మాత్రమే ఆలపించి రూపించవలయును; సావేరిని అట్లే—ఐతే, రేవగుప్తిలో శుద్ధరిషభ అంతర గాంధార శుద్ధమధ్యమ శుద్ధధైవత శుద్ధ నిషాదములు తగులుచుండును. సావేరిలో చతుశ్శ్రుతి రిషభ—అంతర గాంధార—శుద్ధమధ్యమ—చతుశ్శ్రుతి ధైవత—కాకలి నిషాదములు—తగులుచుండును - ఇట్లు 1600 A. D. నాటి ఈ రెండు రాగములనూ ఆలప్తిసేసి పూర్వ గాన స్వరూప మెఱుఁగఁ దగదా? ఇట్లు పదునేడవ శతాబ్దపు టాదిమవ్యవస్థలో షడ్జమును పంచమమునుగూడ వినాయించి పాడఁదగిన సంగీతము అతి ప్రాచీనమయిన ప్రాతిపదిక గల్గియుండెడి. పదునాఱవ శతాబ్దము మొదలుగ షడ్జస్వర ప్రాధాన్యత

యేర్పడినట్లు ఫాక్స్ స్ట్రాంగ్ వేస్ (Fox Strangways) అను వ్యక్తి వెల్వడించిన మ్యూజిక్ ఆఫ్ హిందూస్థాన్ (Music of Hindosthan Foot-note P 153)—నందు వ్రాయఁబడినది. ఈ యర్థము నుండి షడ్జము లేని నాద సందర్భమున "రిగమధని" గుణించిన కెట్లు రాఁగలుగుట? అను సమస్య యేర్పడును గదా! ఇందులకయియే 1440 A. D నాఁడు సర్వజ్ఞ సింగ భూపాలుఁడు "షడ్జోయత్ర స్థాపితః—తద వేత్తు య్యైవ అన్యేషాం స్వరాణా ముచ్చారణమ్" అని భావించియున్నాఁడు—భరత దత్తిలాదుల కాలమున స,ప, వర్జిత సంగీతము విశేషవ్యాప్తి గలిగియుండెడిది. తానక్రియాత్మక సంగీతములో మాత్రమే స—ప వర్జనము సుసాధ్యము కాఁగలదు

"ద్విధాతానక్రియాతంత్ర్యాం ప్రవేశా న్నిగ్రహ స్తదా—" అని భరతుఁడు. ఇట్లే దత్తిలుఁడును—" "తాన క్రియాద్విధాతన్త్ర్యాం ప్రవేశా న్నిగ్రహాత్తథా" అని. "ప్రవేశోఽన్యనిసాదృశ్యం అసంస్పర్శస్తు నిగ్రహః"—"నిగ్రహాస్తు ఉత్తరస్వరస్య పరిత్యాగః" — "ప్రవేశో నామాధర స్వరవిప్రకర్షా దుత్తర స్వరమార్దవాద్వా నిగ్రహాచ్చ—అసంస్పర్శః—" పూర్వాపరస్వరములకు ప్రవేశమిచ్చుచు స—పలను నిగ్రహించుట—ఇచ్చట స—ప వర్జనమని చెప్పఁబడును. అనగా రిగమధని స్వరములను స్పృశించి ధ్వని సాదృశ్యము గలిగించి స—పలను అసంస్పృశ్యతనొందించుట—ఇట్లు తానక్రియాత్మక సంగీతము. దీనిలోనుండి గ్రహాంశ తారమంద్ర న్యాస అపన్యాస అల్పత్వ బహుత్వ షాడవ ఔడవ(సన్యాస—విన్యాస)ములను అంతరమార్గములో అనగా వాది సంవాది వివాది అనువాది పద్ధతిలో నుపయోగించు ఆచార మేర్పడినది. జాతుల నాలపించు మార్గ సంగీత మీద్దాని నుండియే దేశ్య సంగీత మేర్పడినది. షడ్జవర్జనము దేశిసంగీతమున లేదు. మార్గ సంగీతములో నిట్లు రేవగుప్తి రిగమధని—నిధమగరి మూర్ఛనలో నుండెడిది. దేశిలో ఆ నాదానుకరణము సరిగపధస—సధపగరిస మూర్ఛనలో వ్యాపించినది. స్వరాపకర్షద్వారమున మూర్ఛన మారును. ఇట్లే మార్గసంగీతమందలి సావేరి సరిమ పధస—సధపమరిస అని దేశిసంగీతమునఁ బ్రవేశించినది. ప్రసంగమందున్న రేవగుప్తి అతి ప్రాచీనరాగము. దీని సంపూర్ణ నాదగుణము—ఇప్పటి గాయకప్రియ — శుద్ధరిషభ — అంతర గాంధార — శుద్ధమధ్యమ—పంచమ—శుద్ధధైవత-శుద్ధ నిషాదములు ప్రాచీన రేవగుప్తి మేళము. ఇందున్న మధ్యమనిషాదములు పరస్పరము వాది సంవాదులు కాఁదగిన అంతరువులో నుండియును విసంవాదులగుట వలన విడువవలసి వచ్చెను "సంవాదిలోపా దౌడవితా" అని మతంగుఁడు సిద్ధాంతపరచియున్నందున శుద్ధ మధ్యమము శుద్ధ నిషాదములకు సంవాదిత్వము లేకపోఁగా సరిగపధ ఔడవితమూర్ఛన రేవగుప్తికి సంఘటిల్లినది. శుద్ధమధ్యమ శుద్ధనిషాదముల పరస్పర సంబంధము రక్తిచ్ఛేదకమని ప్రతీతి గలది. "శుద్ధశ్చమధ్యమః శుద్ధ నిషాదశ్చైత్యుభౌ స్వరౌ, శ్రుత్యష్టకేనాంతరితావపి సంవాదినౌ నహి" అని చతుర్దండి. ఈ రీతి స్వరసమ్మేళనమును నాదశాస్త్ర విశారదులు (TRITONE) 'ట్రైటోన్' అందురు.

"Augmented fourth being a Tritone was from early days in music strictly forbidden, in fact was Diabolus in Musica. (The Devil himself) mi contra fa est. Tritone = interval of augmented fourth F B = శు.మ శు.ని or B E. కై.ని. అం.గ. It consists three whole Notes It is a discord. In all poly phonic music the Tritone was a forbidden interval—Foss

ఈ రీతిగా రేవగుప్తియందలి శుమ-శుని స్వరములు విసంవాదులైనందున అది సంపూర్ణరాగము గాక ఔడవిత (సరిగపధ) రాగమైనది.

> రేవగుప్తా వర్జయేత్ క్రౌంచ
> నిషాదా వృభమాత్రచ-
> రాగోసా వౌడవ స్తత్ర
> దేశాంతర మనోహరః—పరమేశ్వరః.

అతి ప్రాచీన మనఁదగిన యీ రేవగుప్తి 18 జాతులలో ఆర్షభీ సముత్పన్నత గలది. అభిరుద్గత మూర్ఛన రిగమపధనిస-దీని ప్రాతిపదిక. రిధలకు అంశ. ఇట్లు మార్గసంగీతమున వీర రౌద్రాద్భుత రసజనకమయిన రాగముగా బహు ప్రాముఖ్యత గాంచినదై— 1720 క్రి. శ. తర్వాత కాలమున దేశీ సంగీతమునందలి మోహనతో లీనముకా నారంభించినది. 1920 తరువాత రేవగుప్తి మోహనగా మూర్తీభవించి యున్నది.

# గ్రంథ విమర్శనము



## గులాబితోట

మూలం: పారశీక మహాకవి సాదీ; అనువాదం: కీ. శే. దువ్వూరి రామిరెడ్డి; కవికోకిల గ్రంథమాల, ఎల్లాయపాళెం (పోస్టు), నెల్లూరు జిల్లా; వెల: మూడున్నర రూపాయలు.

ఇది అంతర్జాతీయ వాఙ్మయరంగంలోని మహా గ్రంథాలలో ఒకటి. సాదీ రచించిన "గులిస్తాన్" (గులాబితోట) "బోస్తాన్" (పండ్లతోట) అనే యీ గ్రంథాలు రెండూ, ఇంచుమించు ప్రపంచంలోని అన్ని ప్రధానభాషలలోకీ అనువదింపబడినై.

13 వ శతాబ్ది నాటికి, పారసీక దేశం, నాగరికత విషయంలోనూ, శాస్త్రవిజ్ఞానవిషయంలోని మహోన్నత దశ నందుకున్నది. నాటి పారసీక చక్రవర్తుల ఆశ్రయంలో అనేకమంది విజ్ఞానవేత్తలు వెలుగులోకి వచ్చారు. సాదీ మహాకవి వారిలో ఒకడు.

'అవతారిక'లో సాదీ ఇలా వ్రాసాడు:

'సాదీని గురించి చక్కని ప్రశంసలు ప్రజాసామాన్యము నోట వెలువడుచుండెను. అతని వచనముల ప్రఖ్యాతి లోకమెల్లెడల వ్యాపించెను. ఆయన ప్రియమయిన రెల్లుకలముతో రచించు కృతులను జనులు చక్కెరవలె భుజించుచుండిరి. ఆయన పద్యములు వ్రాసిన చిత్తుకాగితపు ముక్కలు సర్కారునోట్లవలె చలామణి యగుచుండెను. దీని కంతటికి అతని పాండిత్యాతిశయము వచోనైపుణ్యము కారణమున రాదు. ఏలనన, సార్వభౌముడు కాలచక్రపరిభ్రమణమునకు ఉత్తరధృవము. సులేమానుకు ప్రతినిధి, ముసల్మాన్ భక్తరక్షకుడు, సాద్ జంగీ పుత్రుడు, ఇహలోకమున దైవచ్ఛాయ. ముజఫరుద్దీన్ అబూబకర్ అనుగ్రహావృష్టి సారించి, అంగీకారము సూచించి, నిష్కపటమయిన తన యభీష్టమును తెలియపరచినందువలన గొప్పవారు మొదలు సామాన్యులవరకూ ఆయనపై స్నేహభావము చూపుచుండిరి. ఏలయన రాజుల మతమునే ప్రజలునూ అవలంబింతురు."

సాదీ తన ప్రభువునకు కృతజ్ఞత తెలిపే సందర్భములో తన మహోన్నతికంతకూ అతనే కారణమని అన్నాడు కాని వాస్తవానికి, అమోఘవచస్కుడైన సాదీ స్నేహకారణంచేతనే అబూబకర్ చరితార్థుడై ప్రపంచ చరిత్రలో నిలిచి వున్నాడు. లేకపోతే యెందరు చక్రవర్తులు జగత్తులో ఊరూ పేరూ లేకుండా నశించిపోయారు కారు?

సాదీకి గల విజ్ఞానం అర్ణవప్రాయమయినది. శాస్త్రవిజ్ఞానవిషయాదికాల నటుంచి మానవహృదయాన్ని అతడు అవగతం చేసుకున్నంత విశదంగా ప్రపంచ రచయితలలో ఏ కొద్దిమందో తప్ప ఇతరులెవ్వరూ అవగతం చేసుకోలేకపోయా రనటంలో అతిశయోక్తి లేదు.

ఈ గ్రంథాన్ని కావ్యమనాలో విజ్ఞానశాస్త్రమనాలో బోధపడదు. యిది యెనిమిది అధ్యాయముల గ్రంథము. పాదుషాల ప్రవర్తనము, దరిబేసుల శీలము, సంతృప్తి, మౌనము వలని లాభములు, ప్రేమ యౌవనములు, వార్ధక్య దౌర్బల్యము, విద్యాప్రయోజనములు, సాంఘిక ధర్మనిర్వర్తనవిధులు అనే ప్రధాన శీర్షికలలోనికి గ్రంథం విభజింపబడి వున్నది. ఒక్కొక్క శీర్షికలో అనేక విషయాలు హృదయానికి వికాసాన్నిచ్చే రీతిని ఉల్లేఖింపబడివున్నయ్. రచనలో సాదీ అనుసరించిన విధానం మెచ్చదగివుంది.

ఆయన వచనానికీ పద్యరచనకూ ఏమీ తేడా లేకపోయినా, మున్ముందు మధురమైన వచనంలో ప్రారంభించి ముచ్చటైన ఒక చిన్నకథ చెప్పి మన మనస్సును స్వాధీనం చేసుకుంటాడు. వెంటనే పువ్వొత్తి కాల్చినట్టు పద్యాన్ని వెలిగించి దాని వెలుగులో పై కథయొక్క అంతరార్థాన్ని ప్రకాశమానం చేసి మనకు ఆశ్చర్యానందాలను కల్గించుతాడు. వెలుగు మొగ్గలులాంటి అలాంటి చిన్నిచిన్ని కథలు ఈ గ్రంథంనిండా కోకొల్లలు. ఈ గ్రంథాన్ని గురించి విశేషించి విమర్శించటానికి ఈ అవకాశం చాలదు.

ఈ తోటలోని ఒకటి రెండు గులాబీలను ఆఘ్రాణించి ఆనందించుదాం:

## 1

ఒక పెద్దమనుష్యునివద్ద రమణీయవతియగు దాసి యుండెను. దానిపై నతడు మోజుపడియుండెను. "ఎంత శోచనీయము! నా యీ దాసికి అంత చక్కదనమున్నందుకు గట్టివాయితనము, నిర్లక్ష్యభావము లేకుండిన నెంత సంతోషకరముగ నుండెడిది" అని అయన ఒక స్నేహితునితో ననెను. అంతట మిత్రుడిట్లు చెప్పెను: 'సోదరా! స్నేహము నంగీకరించి నపుడు దాస్యమును కోరవుము. ప్రేయసీప్రేయసుల సంబంధమునందు దాసి యొడయడు అను భేద మంతరించును."

"ఇంటిఖామందు తెరగంటివంటి దాసి
తోడ సయ్యాటలాడ నాతొత్తుమూతు
రాజ్ఞపెట్టును సామినియట్టు: లతడు
ప్రణయభారంబు మోయ సేవకుని భంగి."

"ఇటుక కంకర గొట్టుటో ఇంటవలయు
నీరు దెచ్చుటో దానికి నియతవృత్తి;
అట్లుగా కది ప్రేయసి యయ్యెనేని
చెనటి యజమాని చెంపకు జేటు మూడు."

## 2

పామరుడొకడు కంటిజబ్బుతో బాధపడుచుండెను. అతడు గుఱ్ఱపు వైద్యునియొద్దకు బోయి "కంటికి మందు వేయుము" అని కోరెను ఆ వైద్యుడు నాలుగు కాళ్ల జంతువుల కన్నులకువేయు కొటుకను వాని కన్నులకు దరిమెను. కన్నులు గుడ్డిగారిపోయినవి. అంతట వాడు న్యాయాధిపతియొద్దకు బోయి, తన పరిస్థితినిగురించి మొరబెట్టుకొనెను. న్యాయాధిపతి వానిని యిట్లు ఓదార్చెను: 'అతనిదేమియు తప్పు లేదు. నీవు గాడిదవు గాకుండినయెడల గుఱ్ఱపువైద్యుని యొద్దకు బోయియుండవు."

జ్ఞానవంతుడు ముఖ్యమౌ కార్యములను
వదలి పెట్టడు కొరగానివాని చేత;
నేతకొడయ్యు చాపల నేయువాని
పట్టుపనిశాల నెవ్వరు బెట్టబోరు.

## 3

"నీవేల పెండ్లిచేసికొనవు" అని యొక మునలి వాని నడిగిరి.

"నాకు మునలిదానిపై కోరిక లేదు."

"నీకు భాగ్యమున్నదిగాన యువతినే యేల పెండ్లాడరాదు."

"అది యువతియేయైన నావంటి మునలాతని నెట్లు ప్రేమించగలదు."

డెబ్బదేడుల తాతయ్యా నిబ్బరంపు
యౌవనరసానుభూతిపై నాసగొనుట
కలను సంగుండు కన్నులు గాంచినట్లు
తరుణబలమును గోరు నీ ధనము గాదు.

## 4

యౌవనపు టజ్ఞానమున ఒకనాడు మా తల్లిని అరచి కసరితిని. ఆమెహృదయమున వేసనపడుచూ, ఒకమూల కూర్చుండి యేడ్చుచూ ఇట్లనియెను. 'నీవు బాల్యము జ్ఞప్తియున్నయెడల ఇప్పుడు నన్నిట్లు కష్టపెట్టి యుండవు.'

పులివలె శౌర్యంబు బలమును గల్గి
గున్నయేనుగుబోలు కొడుకును గాంచి
ముదముతో నిట్లనె ముదుసలితల్లి
పాల్ద్రావి నాయెద బన్నున్న నాటి
నిస్సహాయస్థితి నీ స్మృతినున్న
కసరికొట్టవు నన్ను, కాని యీనాడు;
సింహసత్త్వుడ వీవు; జీర్ణాంగి నేను.

గ్రంథమంతా ఇలాంటి అమూల్యరత్నాలతో నిండివుంది. ఆబాలగోపాలం చదువదగిన అమూల్య గ్రంథం.

ఈ గ్రంథం, కవికోకిలవృష్టికి తగిలి వారి మధురాలాపంగా అనూదితమై అనుభూతికి అందటం ఆంధ్రుల అదృష్టం.

ఈ గ్రంథ ప్రచురణవిషయంలో ఒక్క విచారంమాత్రం కలుగుతోంది. మహాకవి సాదీని గురించిన వివరాలు గాని గ్రంథాన్ని గురించిన యితర వివరాలు గాని యేమీ గ్రంథంతోపాటు అందించారు కారు. ప్రచురణకర్తలు, పారసీకవాఙ్మయంతో పరిచయమున్న యేపండితుని చేతనైనా చక్కని పీఠిక వ్రాయించివుంటే ఎంతో ఉపయోగకరంగా వుండేది. మలి ముద్రణలో అలాంటి ప్రయత్నం జరుగుతుందని ఆశించుదాం.

## మహాబోధి

పద్యకావ్యం: రచన: శ్రీ దాశరథి, ప్రచురణ: తెలంగాణా రచయితల సంఘం, హైదరాబాదు. వెల రూపాయి.

పలుకుబడికోసం కానివ్వండి, పరమార్థంకోసం కానివ్వండి, ఈనాడు దేశంలో పాలకులూ పాలితులూ యావన్మందీ, గాంధీ జపంతోపాటు బుద్ధనామస్మరణ కూడా చేస్తున్నారు. ఏ ఆశయంతో చేస్తేనేమి మహాపురుషుల నామస్మరణ శుభదాయకం. 'రామనామ తారకం భక్తిముక్తి దాయకం' అన్నారు లుబ్ధావధానులు.

ఈ బౌద్ధభావాల ప్రచారం, ఆంధ్రదేశంలో ఇటీవలి 'నాగార్జున సాగర తతంగంతో మరింత అర్ణవప్రాయంగా తయారయింది. వచ్చే బుద్ధజయంతితో మరింత రభసగా తయారుకావచ్చు. ఏది యేమైనా కావ్యరచనాసంప్రదాయాన్ని 'క్యాలెం

డక్ హాయిస్' స్థాయిలోకి దిగజారిపోకుండా చూసుకోవలసిన బాధ్యత రచయితలమీద వుంది. 'ఆంధ్ర ప్రదేశ్'లోని ప్రముఖ రచయితలే కొందరు ఈ ధోరణిలో పరిక్రమించటానికి ప్రారంభించిన కారణంగా యీ హెచ్చరిక చేయవలసి వచ్చింది. ఈ ధోరణి రాజకీయవాదులకు కొన్ని ప్రచారావకాశాలను కలిగించటానికి ఉపయోగపడితే పడవచ్చును గాని, కవులకుగాని కావ్యాలకు గాని గౌరవహేతువు కాకపోగా, సాహిత్యరంగానికి గట్టిదెబ్బగా పరిణమించి అధోగతికి త్రోసివేస్తుంది.

ఈ కృతి హైదరాబాదు ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావు గారికి అంకితం. మధ్యప్రదేశ్ గవర్నరు శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు ఈ కృతికి ప్రస్తావన రచించారు. ప్రస్తావనకారులు కృతిలోని విషయాలను వేటినీ స్పృశించకనే ఆశీః కాలాపంతో ముగించివేయటం ఆశ్చర్యకరం

తొలుదొల్త రచయిత నాగార్జునకొండ ప్రాశస్త్యాన్ని కొంత ఉగ్గడించారు అనంతరం గౌతముడు సాధకుడై యింద్రియ వ్యాలోలతలను జయించి జ్ఞానోదయం పొందిన కథను టూకీగా చెప్పారు. అక్కడనుంచి బుద్ధుడు ధర్మబోధ చేస్తూ ధర్మమార్గానుసరణకు ఉదాహరణలుగా తన పూర్వజన్మగాథలను వివరించుతున్నట్టు కథ నడిపారు. జాతక కథలలోని,—'మహాపద్మ జాతకము', 'చాంపేయ జాతకము', 'ఛదంత జాతకము'— ఈ మూడు గాథలను వివరించారు. ఈ మూడు గాథలనూ మూడు ప్రత్యేక ఖండకృతులుగా మనం స్వీకరించవచ్చు.

కావ్యనిర్మాణం చెయ్యటంలో శ్రీ దాశరథి ఈ గ్రంథంలో అనుసరించిన విధానానికి లోగడ యితర కావ్యాలలో అనుసరించిన విధానానికి కొంత తేడా కనుపిస్తోంది. ప్రబంధశిల్పంలో వుండే, జిలుగులూ, మిలమిలలూ ఇందులో కనుపించవు. అలంకారరహితమూ, కేవల ప్రసాదగుణాశ్రయి అయిన పురాణశైలిని అనుసరించారు. శ్రీ దాశరథి రచనలో మామూలుగా వుండే ఆ సొగసులను ఆశించేవారికి కొంత ఆశాభంగం కలిగించినా, పరిణతమై, నిర్మల వాహినిలా ప్రశాంతంగా సాగిపోయే ధారశుద్ధిని అభినందించగలవారికి హృదయాహ్లాదకరంగానే వుంటుంది. మచ్చుకు ఛదంతజాతకంలోని ఈ రెండు మూడు పద్యాలను వరుసగా చూదాం.

'హిమగిరీంద్రమందు కమనీయ కాసార
మొకటి గలదు, దాని యూర్మికాళి
ప్రాణికోటికెల్ల శ్రమవారకము, ప్రాణ
ధారకమ్ము సౌఖ్యకారకమ్ము.

ఆ సరస్సుచుట్టు నలరు పుష్పవనమ్ము
లేడు, వాని వెనుక నేడు గిరులు
గిరులలోన స్వర్ణగిరి మహోత్తాలంబు
దాన నొక గుహాపథమ్ము గలదు.

ఎనిమిది వేల వారణము
లీ గుహలో వెలసెన్; ఛదంతనా
మని నొక శ్వేతవారణము
బుద్ధుని పూర్వభవావతారమూ
ర్తిని తమ నాయకుండుగ
వరించెను; తత్ప్రభు వెండికొండవున్
గనుగొని ఆరుదంతములు
గాంచి గజాఘట పొంగిపోయెడిన్.

అత డెన్బదియెనిమిది యడుగు లెత్తు
నూటయిరువదయడుగులపాటి పొడవు
చాగు శారదమల్లికా సదృశతనువు
ధీరగంభీరమైన శృంగారమూర్తి.

ఇలా సునాయాసంగా కథ చెప్పుకుపోతారు.

జాతక కథలతో పరిచయం లేనివారికి, బౌద్ధశిల్పాలలో కనుపించే నాగులబొమ్మలూ, ఏనుగుల బొమ్మలు నగ్నస్త్రీల బొమ్మలూ చూస్తూవుంటే యివన్నీ యేమిటా అని కొంత ఆశ్చర్యమే కలుగుతుంది —శిల్పులు జాతక కథలను చిత్రించారని తెలియకపోవటంచేత. అందుచేత ఆయా శిల్పాలను అభినందించటానికి సామాన్యప్రజలకు జాతకకథల పరిచయం కొంత అవసరమే. కావ్యరసాస్వాదనవిషయం అటుంచి, యీ దృష్ట్యా ఈ గ్రంథం కొంత ప్రయోజనకారి కాకపోదు.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by
S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty
Street, Madras—1. Editor: S. Sambhu Prasad.

# భారతి

సాహిత్య మాసపత్రిక





సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

వే 1956

సంపుటము 33 : : సంచిక 5

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మే 1956



# మహాపరినిర్వాణ మహోత్సవం

'దీపవంశ' అనే బౌద్ధపాళీగ్రంథాన్ని అనుసరించి గౌతమబుద్ధుడు నిర్వాణం చెంది ఈ వైశాఖ పూర్ణిమకు 2500 సంవత్సరాలవుతుంది. బుద్ధుని జననమూ, నిర్వాణమూ కూడా వైశాఖ పూర్ణిమ పుణ్యదినమే అనే ప్రతీతి ఒకటి వుంది. దీన్ని పురస్కరించుకుని—నిర్వాణ దినాన్ని 'వర్ధంతి' అనటమే గాని 'జయంతి' అనే సంప్రదాయం లేకపోయినా—భారత ప్రభుత్వం 'పరినిర్వాణ జయంతి' అనే పేర అధికారికావధిని మహోత్సవాలు జరపటానికి నిశ్చయించింది. వైశాఖపూర్ణిమ తదాదీ (మే 24) కేంద్ర ప్రభుత్వమూ రాష్ట్రీయ ప్రభుత్వములూ కూడా దేశం సర్వత్రా యీ మహోత్సవాలు జరపటానికి విస్తృతావధిని యేర్పాట్లు చేస్తున్నారు. భారతప్రభుత్వ ఆహ్వానాన్ని అందుకుని సమస్త బౌద్ధ దేశాల ప్రతినిధులూ ఢిల్లీకి వచ్చి ఈ ఉత్సవ కార్యక్రమాలలో పాల్గొనబోతున్నారు. ఈ మహోత్సవం భారతప్రభుత్వ పరమాశయమైన 'పంచశీల' ప్రచారానికే గాక ఆసియా సాంస్కృతిక సమైక్యతను ద్యోతమానం చేయటానికి గూడా ఉపకరించగలదు.

'అహింసా పరమో ధర్మః'

# సంబోధము

శ్రీ హారీతశివశర్మ

ఉరువేల భూమిభృత్తుదయించె నెచ్చట
మరి నిరంజరయు సొంపెరుగు నెచట
నెచ్చట నజపాలు రిద్ధశోభలు కూర్తు
రానందగీతికా నూనపదము
ముచలింద సాగర మ్మెచట నరాతి భీ
కరమయి సాధుసంగతిని నెరపు
అశ్వత్థతరుమూలమందు మ్రొక్కిన మ్రొక్కు
సేస్నియగ్రామ సంక్షేమ మెచట

నచట నుందురు యోగులు, నచట నుంపు
రార్య సత్యమ్ములారయునట్టి వారు,
నచట వృక్షముల్ పట్టినయట్టి నీడ
నూత్న ధర్మగవేషణ ప్రత్నపథము.

చల్లని నీరముల్ కదిలి సాగరగర్భము చెందునో మహోఽ
ధ్యల్లసితంబు ఫల్గునదియొడ్డనె యోగి తపించునో పొరిన్
తల్లి నిరంజరానదియుఁ దానొక దుఃఖముచేత నెంతొ శీ
ర్ణిల్లినదయ్యు నూతనమనీషవలెన్ హాయసుల్ వెలార్చెడిన్.

తన యెన్ని జన్మల తపము ఫలించెనో
ఆ రావిచెట్టు క్రొత్తాకు తొడిగె
నచట న్యగ్రోధమ్మునందు యేమున్నదో
తన కొమ్మలోన నందనము విరిసె
అవును రాజాయతనవనరుహమ్మది
వీతరాగస్ఫూర్తి వింత లొలికె
ధర్మమ్మునందు మూర్తమ్మందియున్నట్లు
ప్రజ్ఞాంకమయ్యె నశ్వత్థ తరువు

ఒక టొకటి నిల్పి యింద్రియ వ్యూహ మడచి
దుఃఖ దౌర్మత్య పాథోవిధూన నాత్మ

నీ నిరంజరాజల వేణి నూని బలిసి
పట్టు నీడలు నిర్వాణ పథసమాప్తి.

ఆ నీడల్, కుశలమ్ములై, దశదిశాహ్లాద శ్రియః శ్రావ్య క
ర్మాసీతంబులునై, విధూత భృశధర్మద్వేషి. మారోగ్రద
ర్పానూన ప్రథితమ్ములై, కదిలె, నత్యంత ప్రశాంతమ్ములై
ధ్యానోన్మీలితుడైన శాక్య ఋషితా ధర్మంబు బంధించుచో.

ఏ కల్పంబున తాను బుద్ధుడయి ఎంతే స్నిగ్ధచిత్తుండునై
శ్రీ కల్యాణ మృదూక్తులన్ వినమిత శ్రీకున్ సుమేధున్ తనున్
ప్రాకామ్య స్థితి చూచి బుద్ధుడవు రారమ్మంచు దీపంకరుం
డాకంఠంబుగ నన్న వాక్కు హృదయంబందున్ ప్రశంసించుచున్.

తన పది ముఖ్య జన్మములు తత్పరమైన తపః ప్రభావ వ
ర్ధన రతిచే గడించుకొని తాల్చిన పారమిత ప్రధాన భా
వనములు నొందుకొండు గురువై మృదువై ధృత ధర్మమార్గ చా
లనములు శీలముల్ నిడుదలై మరి చల్లనివై చరించినన్

దృంహిత దాన యోగ పరిధీకృతనైజమహః ప్రభూతిచే
సంహననం బొనర్చె తమసంబుల నెవ్వడు, వాడు బోధి కాం
తింహావణించి మారకృతతీర్ణ దురోదరతాపృదుస్త భీ
ష్మాంహములన్ అడంచిన మహాతపముల్ తన యందు వెల్గినన్.

తన విస్సాంతర జన్మ సత్కథ వినూత్నంబైన స్వప్నంబు ఛా
యను ధీనేత్రము ముందు తోచి పదిలంబైనంత తానప్డు నె
ట్టన పాలించిన దానయోగ ఘన నిష్ఠాస్పష్టద్రాఘిష్టతల్
కనుగొంచున్ మది నూనె గౌతముడు నిష్కామాచ్ఛతేజచ్ఛటన్.

గుంజిత మధురస్వర సం
రంజితమయి నట్టి యీ నిరంజరయు మహా
వ్యంజనయుత ధర్మశ్రీ
పుంజమ్మయినట్లు కొత్తపోకడను చనున్.

ఇట్టి వెన్నెలలిప్పుడే గాని మున్నెప్డు
లేవు వసంత సంజీవకములు
ఇట్టి చల్లనిగాలు లిప్పుడేగాని యె
ప్పుడు లేవు వేడిమి నడచు జిల్లు

# సంబోధము

లింతటి యందమ్ము నెప్పుడు చిక్కదు
    ద్యుతిమంతమయిన చంద్రుని మోము
ఇంత విశదములై యెప్పుడు లేవు ది
    క్కులు స్వచ్ఛములును అకుంఠితములు
  ఊహ కందని యొక క్రొత్త పోహాణమున
  సర్వమును గూడ ధర్మభాస్వద్వికాసి
  శ్రద్ధచేతను వినమితాశా ప్రతారి
  కృష్ణతృష్ణా తమస్వినీ జిష్ణువయ్యె.

తన యెడందకు నేమి తాత్పర్యమబ్బెనో
    అజపాలవట ద్రుశిఖాంకితతలి
కూర్చున్నవా డట్లె కూర్చుండె నెన్నాళ్లొ
    ధర్మచింతనరక్తి తాల్మి బలిసి
పుట్టుట పెరుగుట గిట్టుట జీవికి
    సహజమే యగును పో; సంతసమరి
దుఃఖమ్మునందున దోదూయమానులై
    జీవులు వేగుదు రేవిధమున

  కర్మమందురు; కావచ్చు; గాని దుఃఖ
  బహుళ జరఠమ్ములోకమ్ము; బధిరమయ్యె
  ధర్మమన్నను ధర్మతాత్పర్య మనిన
  తిరిగి వెలిగింతు ధర్మసందీప్తి నిపుడు.

అరయగ జన్మము దుఃఖము, కరమును దుఃఖమ్ము వ్యాధి, కానరు జనముల్
జరచేతను మృతిచేతను గరగరనయి జీవితమ్ము కష్టమున పడున్.

ఎవ్వడు గాని పుట్టినపు డెట్టుల నుండెను యట్టు లేచిరం
బెవ్విధి నుండు; నీ నడుమ నెక్కొనవో వయసుల్: దురీహచే
త్రెవ్వదొ జీవితంబు; మతి తేకువ లేమిటికిన్ వచింతురో
దివ్వియ లేని చీకటి విధిన్ ముదుసళ్లయి కుందుటేటికో!

ఒకని దేహంబు కచ్చికవోలె నుసిరాలు
    రాలు నొక్కడు పండు రాలినట్లు
ఒక్కడు లేవలే డూతయు లేనిదే
    బ్రతుకలే డొకడు దుర్భ్రమల గుడిచి
సర్వ రోగమ్ముల ఖర్వమై తనయందు
    నిల్వ నేడ్చును మది నిల్వకొకడు

ముదిమిపై బడ్డ సమ్మోహమంచు నార్పును
బ్రతుకు విపర్యాస పథమునబడి
ఇదియ జీవితమ్ము నిదియును లోకమ్ము
దుఃఖదురితవారి దోగి తోగి
బ్రుంగిపోయి బెంబుబెండగుచున్నది
తగిన తేపలేక, దారిలేక.

నిత్యమేదియొ మరియు ననిత్యమేదో తెలియరానట్టి చీకటి తెట్టులందు
జిక్కి మనుజులు దుఃఖరాజిని పడుదురు మరి వివేకంబులేమి సందర్భమిదియ.

దుఃఖముకన్నను సత్యము
దుఃఖపు సముదయమె యగును; దోర్బలము మెయిన్
దుఃఖనిరోధ మ్మెరిగిన
దుఃఖనిరోధంపు పథము తోడై నిలుచున్.

అని చింతించెడి శాక్యరాజకుల వంశాంకూరమా, లోకవ
ర్ధనమా, ధర్మము చూపు బుద్ధిని మునీంద్రమ్మా, ప్రసిద్ధార్థ భా
వన మేఘమ్మునయందు తోచినవిపో, వారుల్, మహాధర్మచం
దన వాతాయతవాసనాభరితముల్ ద్రాక్షాంతి గర్భంబులున్.
ఒక భూమీరుహమూల దేశమున తానూహించు ధర్మంబు, వే
రొక భూమీరుహ దివ్య శాఖికలఛాయోత్సర్గ దేశంబునం
దు కరాళంబగు దుఃఖ సంతతికి ప్రత్యూహమ్ము నూహించుచి
ట్లోక వారమ్మును వారమాపయిని తానూనెన్ మహా బోధమున్.

ఆప్తుని వోలిక కడు ప్రే
మాప్తిన్ బోధి చలచ్ఛద మాశా వ్యాప్తిం
గోష్ఠిగ పట్టిన స్నీడల
సప్తాహము గడిపెను "ప్రతిసల్లీను"డూనై.

తాను సమాధి పొంది బహుధాచరియించు హృషీకజాలమున్
పూనియడంచి గోతముడు పొంది సుఖమ్ము, విముక్తి ధర్మముల్
ఊనిన యంతలో జగములో నడతెంచెను కాంతు లుద్ధుర
శ్రీ నమితమ్ములున్ మహిమ చేతను దుఃఖనివారకమ్ములున్.

ఇంతటి దాకను నంతు తేలని చిక్కు
చిటికలో తేలి తోతెంచినట్లు
ఇంతటి దాక దానెంత తపించిన
దొరకని అర్థమ్ము దొరికినట్లు

# సంబోధము

ఇంతటిదాక నేమేమి చేసిన గాని
తీరని ఒకపని తీరినట్లు
ఇంతటిదాక దుర్దాంతమై, పోనట్టి
బాధ, యొక్కటి విడి పారినట్లు
'శాక్య క్షత్రియగోతమ సమణ నీరజ
విమల' మానసబోధి సంప్లవమాన
శీతసంబోధి వాయువీచీవితాన
శబలిత వినూత్న ధర్మసంసత్తు వాలిచె.

జరయును మరణంబు జాతిచేతను కల్గు
తనర జాతికి ఉపాదాన మిక్క
తృష్ణ చేతనుకల్గు నీ యుపాదానంబు
తృష్ణకు వేదన మిచ్చు బ్రతుకు
వేదన స్పర్శచే విక్రమించును మరి
నామరూపంబులం దడియు పుట్టు
విజ్ఞాన ప్రత్యయ విధిబడివచ్చును
నామరూపముల విరామగతిని
"మలిన పరిదేవ దుక్ఖదోమ్మనస"ములకు
ఇవియ కారణ మగుచును, నులియబెట్టు
సర్వ లోకమ్ములను గూడ; సత్యమైన
ధర్మధృతి వీని నడచి పథ్యమును చూతు.

అగును నిరోధమార్గమునయందున నే పొసగున్, సమూలమై
తెగిపడు దుఃఖచక్రమును; తేకువతో వ్రతశీల సంపదల్
చిగురుల నొత్తినొత్తియు బచేళిమమాగతి బ్రహ్మచర్య దీ
క్ష గడిపినన్ మహాధ్వములు గన్పడు ధర్మపుచక్రమున్ బడిన్.

స్వామి యెడంద నా తపము సాగిన సాగుట బోధివృక్షశా
ఖామృదు రాగరంజిత శిఖావలయంబులలో కషాయముల్
ప్రామిన ప్రాగ్దిశాగత ప్రభాకర దివ్యకరాళి హావళిన్
ఓమిన ధర్మమై దిశల నోమినదై, మిగిలెన్, గభీరమై.

ఆ వైశాఖము నట్టిపూర్ణిమయు నార్యశ్రీ మహోద్యోగముల్
ఈ వైశాఖమునందు గాదు మరి యేయే కాలమందైననున్
రావున్; రావును నట్టి ధర్మకలనారాజ త్తపశ్చర్యలున్
ఈ వైశాఖము మాత్ర మిట్టు లరుదెంచెన్ స్వామికీర్త్యంకమై.

శ్రవ్యనాటిక:

# శ్రీరామ పాదుకలు

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

పాదుకలు

శ్రీ రఘురామ పాదసర
సీజమరందము గ్రోలి క్రోలి త
ద్భూరిసుఖోన్నతిం దగిలి
పుల్కలనెత్తి సజీవవాణినో
రారగ బల్కమాకు మన
సైనది తత్కథ విన్నవేళ మం
దారము పూచి మా మనము
నన్ విరజిమ్మెను దివ్య వాసనల్

అలనాట నడవి బాటల బోవ మునిరాణి
పాషాణతనువు జీవమున గదలె
నవనీతమంచు క్రొన్నలంచు వైదేహి
ములు ద్రొక్కుకొనుచు మాముంగు నడచె
ముసలి రాజుల త్రోవ మసలి పల్లెను జేర
ఎడద తేనెల మమ్ము గడిగె గుహుడు
వితత సాకేత పృథ్వీ నేత భరతుని
మృదు మస్తకమ్ము మన్నించె మమ్ము
ఏ మహారణ్య వృక్ష సంజాత తనువు
నుండి పుట్టిన వారమో, పండినట్టి
పూర్వ పుణ్యాన నరసురపూజలంది
ఇచట నీ హేమ పీఠి వసించినాము.

[గంభీరంగా ఒక ప్రకటన వలె]

అలనాట నడవి బాటల బోవ మునిరాణి
పాషాణతనువు జీవమున గదలె.

[గౌతమాశ్రమం... ప్రాంతఃకాలం,
అహల్య—ఇంద్రుడు]

అహల్య: (గంభీరంగా) చాలు దేవరాజా ఇక వెళ్ళు. అది సుముహూర్తమో దుర్ముహూర్తమో... నాలోనూ... ఇన్నాళ్ళుగా అణచి వుంచిన బడబానలం పొంగింది. ఇక ప్రళయం తప్పదు. అయినా విచారించను—నువ్వు మాత్రం కంటపడటం నాకిష్టం లేదు. అది శివుని మూడవకన్ను. ఈ గుబురు చెట్లచాటుననుంచి త్వరగా వెళ్లిపో.

ఇంద్రు: (పరిహాసంగా) కాళ్లు నడువవు. ఎట్లా వెళ్లను? పేరుకు స్వర్గంగాని అక్కడ ఏముంది? నా అమృత కలశం... స్వర్గసీమ... నీ సుందరవదనంలో ఉన్నాయి. విడిచివెళ్లగలనా? శపించనీ ఆ శాపాయుధుడు. మోయలేని ఆయన తపోభారం కొంత తగ్గుతుంది. నా దేవకార్యం కొంత నెగ్గుతుంది.

అహ: ఆఁ—ఆఁ—అరుగో గౌతములు!

ఇంద్రు: కాని...

[గౌతముని కర్కశ స్వరం]

గౌత: ఆగు అక్కడే ఆగు! ఎవరు నీవు? నన్ను చూచి సాలవృక్షాల చాటునుండి తప్పించుకొని పోతున్నావా? ఏ దొంగతనానికి ఈ ముని వేషం తోడు? ఏమీ నా వేష మేనా? ఏమిది అహల్య అట్లా రాతి బొమ్మలా నిల్చుని చూస్తున్నది? ఓహో తెలిసింది. ఈ కళంక క్రీడలో ఆమె కూడా భాగస్వామినియేనా? ఇంద్రా ఇక నీ బ్రతుకు ని...ష్ఫలం... పో...ఆశ్రమం విడిచి....అహల్యా... అలాగే రాపడి కదలక మెదలక శిలవైపోతావు—తప్పదు—నీ ప్రత్యుత్తరంతో నా కర్ణాలను కళంకితం చేయదలచుకోలేను.

అహ: ప్రభూ! ప్రభూ! క్షమ, క్షమ, అయ్యో, నాలుక గట్టి పడిపోతున్నది. తలరాయి—యింక—గతి—గతి?

గౌత: తపస్వినీ! భావియుగంలో శ్రీరామచంద్రుని పవిత్ర పాదధూళి...

* * *

విశ్వామిత్రుడు:

రామచంద్రా! ఇదీ—యీ శిలా గాథ—... ఆ మునిపత్ని అహల్య వర్షసహస్రాలనుంచీ పాషాణ రూపంతో యిక్కడ పడివున్నది...అదిగో నీ దక్షిణ

పాదస్పర్శతో ఆరాయికదలి ఎట్లా అహల్యగా మారుతున్నదో చూడు.

[హఠాత్తుగా వినిపించిన గొంతు అహల్య]

పతితపావన శ్రీరామభద్రమూర్తి!
ఏది? నీపాదకంజాత మెంత మృదువు!
ఎంత కరుణావిశాల మ్మదెంత ప్రియమొ
నా శిలాజీవితమున ప్రాణములు పోసె ...

* * *

"నవనీతమంచు క్రొన్ననలంచు నైదేహి
ములు త్రొక్కకొనుచు మాముందున కిదె"

[సీత — రాముడు — లక్ష్మణుడు]

సీత : అయ్యయ్యో!— ఏమి వార్త అభిషేకమన్నా అరణ్యమన్నా — ఏమి మీ నిర్వికారము... పట్టుబట్టలను నారచీరలను ఒక్కటే చూపుతో చూచే మీ గంభీరవదనము నన్ను వణకిస్తున్నది ఇక గత్యంతరంలేదా?

లక్ష్మ : (హఠాత్తుగా అందుకొని) లేకేమి... ఈ ధనువును ఒక్కసారి మ్రోగించి అంతా చక్క జేస్తాను.

రాము : (శాంతంగా) లక్ష్మణా ఎవరిమీద నీ ఆగ్రహం? విల్లెత్తి ఎవరిని చంపదలచావయ్యా — నీవూ నేను పుట్టకముందే రాజ్యం పినతల్లికి దత్తమయింది నీకు తెలియదు ఇక శాంతించు... నా అటవీ ప్రయాణానికి సర్వం సిద్ధంచేయించు. ఇప్పుడే ప్రయాణం.

సీత : ఏమిటీ... ఆర్యపుత్రు లొక్కరేనా? ప్రయాణం... వీలు లేదు. సుఖదుఃఖాలలో అహర్నిశాలలో భాగం పంచుకొనే ఈ అర్ధాంగికికూడ సగభాగం వుంది వనవాసంలో... ఇదిగో నేను సిద్ధమవుతున్నాను.

రాము : సీతా ఏమిటి నీమాటలు? వనవాసం అంటే అయోధ్యాపుష్పోద్యానం అనుకొంటున్నావా? భయంకర మృగాలు... ముళ్లపొదలు, రాళ్ళగుట్టలు — అడుగుపడదు...

సీత : కనుక నే — నేనూ వస్తాను — నా ప్రభువు మెత్తని పూలపాదాలలో ముళ్లుగుచ్చుకోడమేనా? నేను సహించను... ముందున్న దర్భముళ్ళు త్రొక్కి నేను దారి సరిచేస్తాను.

రాము : లక్ష్మణా వదినను వారించలేవా?

లక్ష్మ : అన్నా ఏమిచెప్పను...

విధుని గ్రహణమ్మునందైన విడదు తార
తరు వొరగినంత లత వసుంధరను వ్రాలు
బురదదిగిన గజేంద్రుని కరిణి విడునె
పయన ముచిత మ్మనుపమే మెం వదిన కిప్రకు.

నేనును నిరంతరాశ్రితుణ్ణే గదా! నైని తమ చిత్తము.

రాము : (నవ్వుతూ) ఇదేనా నీమన్య వక్తృత్వం? నీవుకూడా వనవాసానికేనా? వస్తే నాయనా ...సీతా! లక్ష్మణునికి నచ్చజెప్పు.

సీత : సౌమిత్రీ! నామాట విను నాయనా; మనుష్ములను వెళ్లనీ...

లక్ష్మ : అమ్మా అన్నగారి పాదసేవలో మీకీ స్వార్థం ఎప్పటినుంచీ వచ్చింది? మీరు దక్షిణపాదం సేవిస్తావుంటే నేను వామపాద పరిచర్య చేస్తాను.

రాము : భళిరా! ఏమి ముగ్ధహృదయులు.

* * *

"ముసలిగాజుల త్రోవనుసలి పట్టైను జేర
ఎడవ తేనెల మమ్మ గడెగె గుహుడు."

[గుహుడు — రాముడు]

గుహు : (విచారంగా) ఈ పాడు చేతులతో ఇదిగో మట్టిపాలు తెచ్చాను... శ్రీ రామచంద్రా! పట్టాభిషేకానికి, కలిగిన కానుకలు తెచ్చి మీ పాదాలచెంత సమర్పించవలసిన సేవకుడికి — ఈ ఆనతి పెట్టావేమయ్యా — మహాప్రభూ —

రాము : మిత్రమా కంటనీరు పెట్టకు సీతా సుమంత్రుడూ మాడకుండా యీపాలతో జడలు కట్టుకోనీ... త్వరగా గంగదాటడానికి.... ఆయత్తపరుచు... లే...

[పడవవాళ్ల కంఠాలు — గంగ గలగలలు]

— పాట —

అడవిదారులుదాటి అకొండ దాటి
జడదారిసాంబయ్య జడలన్ని దాటిర
కోరి పరుగునవచ్చె కొమ్మ గంగమ్మ
పూలు కుంకుమ పోసి మొక్కుకుందాము!

గుహు : ఓహోయ్... కొండన్న! ఆపడవ సరిగా రేవులోకి రానీ. మహారాజు ఒడుదుడుకులలో ఎక్కలేరు. మాతల్లి సీతమ్మ అసలే ఆ గుండురాళ్ళల్లో అడుగుపెట్టలేదు. ఆ... ఆ... అదీ పని మా ప్రభువులు నడిచే దారిలో మెత్తనియిసక... చిగుళ్ళు పరిచావుకదూ. మంచిపని చేశావు. ఉహూ నీకూ తెలుసును రామయ్య తండ్రిని సేవించడం. ఇక రావచ్చు మా తండ్రి — ఆయన మెత్తని అడుగులు మోపిన నేల ఎంత ముద్దు

లోలుకు పోతున్నదిరా ఆ మట్టితీసి కళ్లకద్దుకోవాలనిపిస్తున్నది.

రాము : నేస్తం ఏమి వెర్రిప్రేమ నీది ఆ చెక్కిళ్లు తుడుచుకో. గంగను సమీపించాం—ఇంక పడవ ఎక్కవచ్చుకదూ ?

గుహు : (ఆత్రంగా) బాబ్బాబు...ఒక్క నిముసం వుండండి మీ బంగారుపాదాలు కడిగి వేస్తాను నెత్తురుమ్మేకు ఈడు జోడులైన మీ అడుగుదోయిని నా కన్నీటితో కడిగి వేస్తాను. రామయ్య తండ్రీ రాతిని నాతిని చేసే పొడలున్నాయి నీ అడుగులలో.
రాయికి కట్టెకు ఎంతో వారలేదు—నీ అడుగులు సోకగానే నా పడవ పడతిగా మారిపోతే—నాకు బ్రతుకు తెరువు లేదు ఆ పని మాత్రం చెయ్యకు. నీకిచ్చగలిగితే—నన్ను నీ పాదుకలుగా మార్చుకో. అంతేగాని పది మందిని ఏరు దాటించే పడవను మాత్రం మార్చకు.

రాము : (నవ్వుతూ) మిత్రమా...సందేహమెందుకు—నీ ప్రేమ యీ గంగకంటె లోతైనది—అలాగే కాని...

* * * *

"వితత సాకేత పృథ్వీ నేత భరతుని
మృదుమస్తకమ్ము మన్నించె మున్ను-"

రామ : ఎవరు...? భరతుడా, నాయనా—ఎన్నాళ్లకు నిన్ను చూడగలిగాను.

రమ్మ తమ్ముడ భరత! వక్షమ్ము విప్పి
ఎగుభుజమ్ముల నను గౌగలింపుమయ్య
మొగము నెత్తుము శరదిందు మోహనమ్ము
వేదనా దగ్ధదేహము నాహ్లాదపరపు.

తండ్రిగారిని తలచుకొని విచారించకు—మనవంటి పుత్రులు ఆయన సత్యవ్రతాన్ని శిరసావహించి పాలిస్తూ వున్నపుడు ఆయన ధన్యులు కాక యింకేమిటి..."

భర : అన్నా లక్ష్మణునివలెనే నాపైనిగూడ అనుగ్రహించకూడదా...? నేను కూడ అడవిలో వుండి పరిచర్య చేస్తాను.

రాము : నాయనా వద్దు వద్దు. ఇక్కడ లక్ష్మణుడు-అక్కడ నీవు—ఇది నా నిర్ణయం—

భర : ఆర్యా, దయచూపండి ఈ దేహం యిక్కడనే వుండి, అక్కడి పనులు కూడా నిర్వహిస్తుంది. మీ పేరు చెపితేనే రాజ్యానికి శ్రీరామరక్ష గదా.

రామ : కైకేయినందనా, అట్లా జరగడానికి వీలు లేదు. నేను పితృదేవుల ఆనతివల్ల అడవికి వచ్చాను గాని, గర్వం చేతగాని, మతిభ్రమ చేతగాని కాదుగదా. మన కులధనం సత్యమని మరచిపోకు.

భర : అన్నా, అభిషేకం మాట...?

రామ : అమ్మగారు కోరినట్లే జరిగితీరాలి.

భర : ఆర్యా — గాయంపై మరింత గాయం చేస్తారా...?

రామ : నాయనా ఖేదపడకు. నీ హృదయం నిష్కల్మషం. నీ మృదు వచనాలకు, గుణ పరంపరకు లోబడిపోయేనంటే నమ్మ కాని, మన కర్తవ్యపాలనం? ఇద్దరం కలసి ఆ మహారాజును అసత్యవాదిని చేద్దామా...? ఆలోచించు—వేగిరపడకు.

భర : అన్నా యింకేమీ ఆలోచించలేను మీ నియమావసానంవరకూ మీ పాదాలచెంతనే వుంటాను.

రాము : అట్లా అనకు. నాయనగారి సుకృతం ఫలవంతం కానీ-ఇక వాదంవద్దు నీవు అయోధ్యా రాజ్యం పాలించకపోతే నామీద ఒట్టు.

భర : అయ్యో, ఇక మాటలాడకుండా చేశారు. అయితే, ఒక నిర్ణయంమీద మీ రాజ్యాన్ని పాలిస్తాను.

రాము : (సంతోషంగా) ఏమిటా నిర్ణయం....?

భర : నా చేతిలో వుంచిన రాజ్యాన్ని పదునాలుగు సంవత్సరాల మరునాడు వెంటనే మీరు వచ్చి స్వీకరించాలి.

రాము : మంచిది.

భర : (సంతోషంగా) అయ్యా, తపోధనులూ, పౌరులు, వినండి ఈమాట. దీనికి అన్యథా ఎప్పుడూ జరుగకూడదు. సరే అన్నా యింకొక వరం యివ్వక తప్పదు నాకు.

రాము : (ఆనందంగా) నాయనా ఏమిటది ?

భర : అన్నా నీ పాదుకలు నాకు ప్రసాదించు. వాటిని శిరసావహిస్తాను. మీరు వనవాసం నుంచి తిరిగి వచ్చేవరకు యీ పాదుకలే సింహాసనాన్నలంకరిస్తాయి. మీ పాదాలకు మారుగా ఈ పాదుకలను పూజిస్తాను. అనుగ్రహించు.

రాము : వత్సా, ఎంతకాలానికో నాకు కొంత ఖ్యాతి దక్కిందనుకొన్నాను. అల్ప కాలంలో నీవెంత యశస్వివైనావు. నీ అభిమతమే కానీ, ఇదిగో పాదుకలు.

భర : ధన్యుణ్ణి. శిరసావహించి పట్టుకువెళతాను.

కంఠాలు : జయము రామచంద్రప్రభువునకు జయము, జయ భరతకుమారునకు జయ!

# సమానాంతర రేఖలు

శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

చలమయ్య రెండో కూతురు రుక్మిణి కందిచేలో కూర్చుని గాభరాగా ఆలోచిస్తోంది. సంధ్యవేళ. ఊరు సద్దు మణిగిపోతోంది. తానేమో యిక్కడికి వచ్చేసింది. భయంతో గజగజ వణికిపోతోంది. తొందరలోను, ఆవేశంలోను యేదో అనేసింది. ఏదో చేసేసింది. తన ధైర్యానికి తానే ఆశ్చర్యపడుతోంది. బలీయమైన అవసరం, యెంతపనైనా చేయిస్తుంది. కాకపోతే తానెక్కడ! సూరిబాబు యెక్కడ! వళ్ళంతా గలతరించిపోతోంది. తాను చేసింది తప్పేమో! తన తండ్రికి తెలుస్తే యేమవుతుందో? ఊళ్ళోవాళ్ళకి తెలుస్తే యేమనుకుంటారో! అయినా మా అయ్య చెపుతూ నేవుంటాడు వాళ్ళ సంగతి. నేను చేసినదాంట్లో తప్పేమీ లేదులే అనుకుని తృప్తిపడుతోంది. ఏమిటో, యెప్పుడురాని ఆలోచనలూ వస్తున్నాయి. ఒక్కసారిగా తన అరచెయ్యి చూసుకుంది. ఇంకా కందగడ్డలాగానే ఎర్రగావుంది. సూరిబాబు చెంపకంటె తనచెయ్యే బాగా కందిపోయిందనుకుంది. అరచెయ్యివైపు ఆట్టే చూస్తూవుంటే, సూరిబాబు చెంప అచ్చుపడ్డినట్లు కనిపిస్తున్నట్లుంది. కళ్లు చెదిరిపోయినాయి. శరీరం వణికింది. గబగబ అరచెయ్యి తుడిచేసుకుంది. ఇంకా ఆ ఎర్రదనం తగ్గటంలేదు. ప్రక్కనున్న తొట్టిలో చెయ్యికడుక్కుని పమిటకొంగుతో తుడుచుకుంది. ఇంకా ఆనమాలు కనిపిస్తూనేవుంది. భయంవలన చేసేదేమీలేక ఏడుపొచ్చింది. చేసింది తప్పుకాదని తన అంతరాత్మను వప్పించలేక పోవటంలో వుక్రోషంవచ్చింది; మళ్లీ వుక్రోషంవలన కూడా ఏడుపే వచ్చింది. చందమామ గుంభనంగా కదులుతున్నాడు. ప్రక్కన తొట్టెనీళ్ళల్లో. తనవీపు యెవరో చరిచినట్లనిపించింది. చప్పున నీళ్లు కుమ్మరించేసి తొట్టె బోర్లించేసింది. పైనవున్న చందమామ తననుచూసి పక్కున నవ్వినట్లనిపించింది. చారడేసి కళ్లు, గులాబి రంగు చెక్కిళ్లు విశాలమైన నుదురు నిజంగా చలమయ్య కొంపలో తప్పబుట్టింది రుక్మిణి. నలుగురూ యిదేమాట అసలు చలమయ్యకు పుట్టిందవుతేగా! రామనాథంగారి పోలిక. అచ్చుపడ్డినట్లు కనిపిస్తోంది. ఇవన్నీ వింటూంటే పురుగుతీసుకుని చచ్చిపోదామని అనిపిస్తూ వుంటుంది రుక్మిణికి. కాని ధైర్యం చాలటంలేదు. ఇంకా యేవేమిటో జ్ఞాపకంవస్తున్నాయి. ఇంటికి వెళ్ళటమా, వెళ్ళకపోవటమా మనస్సు యేమీ ఆలోచించుకోలేక పోతోంది. ఈపాటికి తప్పకుండా అయ్యకు బాబుగారొచ్చి జరిగిన విషయం అంతా చెప్పేవుంటారనుకుంది. ఏమిటో ఒక్కసారిగా రుక్మిణికి యెక్కడలేని ధైర్యం వచ్చినట్లనిపించింది. పోనీ చెప్పనీ. దీంట్లో దాపరికం యేముంది. నేనూ చెపుతాను వున్నదంతా, నాకేమన్నా భయమా, ముందరవుతే నేనేమీ చెయ్యలేదు. తప్పంతా అయ్యగారికే. ధైర్యం తెచ్చుకుంది. పమిటకొంగు విదిలించేసి నడుముకు చుట్టేసుకుంది. చెదిరిన ముంగురులను వెనక్కినెట్టేసి, మాటిమాటికి అరచేతిని చూసుకుంటూ ఇంటిదారి పట్టింది రుక్మిణి. పైకి కనిపిస్తున్నంత ధైర్యం లోపలనుంచి రావటంలేదు. అందువల్లనే బెరుకుగానే అడుగులు వేస్తూ, ఒక్కొక్కప్పుడు అంగలువేస్తూ ధీమాగా బయలుదేరింది. ఎవరో ఒకళ్ళిద్దరు రుక్మిణిన్ని చూసి వ్యంగ్యంగా నవ్వారు. తన మనస్సులో ఇంకేమీ ఆలోచించే పరిస్థితిలో లేదు. ఏమీపట్టించుకోకండానే చరచర నడిచి వెళ్ళిపోతోంది.

చలమయ్య సాధారణంగా, ప్రొద్దుగుంకగానే వేపచెట్టుక్రింద నులకనుక్కి వేసుకుని కూర్చుని, చేతికి మూతికిపట్టని చుట్టపీకతో సాము చేస్తూ వుండేవాడు. అట్లాగే చెయ్యి మూతి కాల్చుకుంటూ; నివురుగప్పిన నిప్పు కనిపించకండానే పొగవదులుతూ వుండేవాడు. ఏమిటయ్యా, ఇంట్లో అంత పొగాకు పెట్టుకుని, ఆ చుట్టముక్క కాల్చుకుంటా వెందుకు అని అంటూవుండేది రుక్మిణి. అలాంటిది, చలమయ్య అక్కడ లేనేలేడు. రుక్మిణిమాత్రం వచ్చి వాకిట్లో

నుంచుంది. రోజూ ఉంటున్న యిల్లే క్రొత్తగా కనిపించింది. సరాసరి లోపలకు పోవటానికి మనస్సు వప్పటంలేదు. అటూ ఇటూ అదుర్దాగా చూస్తూ నుంచుంది. ఇంట్లోంచి సూరిబాబు కమతగాడు కస్సు బుస్సులాడుకుంటూ బైటకు వస్తున్నాడు. రుక్కిణి ప్రాణాలు పైకి ఎగిరిపోయినాయి. తనశరీరం కనిపించకుండా, వేపచెట్టు ఆశ్రయం యిచ్చి దాచేసింది. రుక్కిణికి ఏమిచెయ్యాల్లో యేమీ పాలుపోవడంలేదు. అట్లాగే యింటిలోనికి తొంగి తొంగి చూస్తూ నుంచున్నది. గంగి, గంతులు వేసుకుంటూ బైటకు వచ్చేసింది. అటూ ఇటూ ఓసారి చూసి, వేపచెట్టు క్రింద నులక కుక్కి లాగి, దానిమీద బరువుగా వత్తిగిలింది. అమ్మ కూడా కోపంగానే బైటకు వచ్చేసింది. చలమయ్య, చప్పబడ్డ చుట్టపీకెను, రెండు పళ్లమధ్య కరిచి పట్టుకుని, వికృతంగా మొహంపెట్టి, యేమిటో అట్టహాసంగా వచ్చేశాడు. బైటకు వచ్చిన ముగ్గురూ కూడా మూడు రకాలుగా మొహాలు పెట్టి మొటమొట లాడుతున్నారు. రుక్కిణి చెట్టుచాటున నక్కిందన్న మాటేగాని, యెంతసేపని అక్కడ అట్లా వుండి పోతుంది కనక! ఈ ముగ్గురిదగ్గర మొహం యెట్లా చూపిస్తుంది. ఉక్కిరి బిక్కిరయి పోతోంది. అమ్మ, నులకమంచం దగ్గరగా చతికిలబడింది. చలమయ్య వీధి గుమ్మం దగ్గరగా నడుస్తున్నాడు. సమయం చిక్కింది గదా యెవరూ చూడకుండా తాను యింట్లోకి జొరబడొచ్చు గదా అని అడుగుతీసి అడుగులేస్తూ రుక్కిణి యింటి లోపలివైపుకు పోసాగింది. చలమయ్య గబుక్కున యెందుకో వెనక్కి తిరిగాడు. రుక్కిణి చటుక్కున నిలబడిపోయింది.

“ఏం రుక్కిణి యింటికి రావటానికి వేళాపాళా లేదేంటి...” చలమయ్య కస్సుమన్నాడు.

గంగి, అమ్మ యిద్దరూ కూడా రుక్కిణి వైపుకు తిరిగారు.

“ఈ యాళదాకా యేం చేస్తుండావే...” గంగి కోరచూపులతో అడిగింది.

రుక్కిణి గతుక్కుమంది.

“ఏమిటే అట్లా చూసుకు పోతున్నావు” అమ్మ వికటంగా అడిగింది.

రుక్కిణి యేమీ మాట్లాడలేదు.

“నలుగురు కళ్లల్లోపడి నాశనమైపోదా మనుకుంటున్నావా......గంగి చేసిన రభస చాలు......ఇహ నువ్వు కూడా......” చలమయ్య ముందుకు అనలేక పోయాడు.

“ఇంటికాడ కూకుంటే, పొట్టగడిచే దెట్టా... తానేమో యేమీ చిల్లిగవ్వకూడా సంపాదించి పెట్టలేడు. పోనీ యెవరైనా సంపాదించుకుని వస్తుంటే, చూసి వోర్వలేడు. గంగికేమీ సుఖంలేదు. తన శరీరం అమ్ముకుని, నిన్ను నన్ను పోషిస్తోంది. ఆ మాత్రం యిదిలేదు, నీకు, పైగా దాన్ని నానా మాటలు అనటం, దానికి పెళ్ళిచేసి దానింటికి దాన్ని పంపిస్తే సుఖపడక పోయిందేమిటి...చేతగాని చవట. ఆత్మను అమ్ముకుని, వాళ్లకు వీళ్ళకు తొత్తుగా వుంటూ మనకు సహాయం చెస్తున్నా కూడా నీకు జాలి కానిలేదు. పైగా గౌరవం, మర్యాద, వంశం యేమిటేమిటో సణుగుతావు. అవన్నీ దానికి మాత్రం లేవేంటి? నీకంటె యెక్కువేవున్నాయి తిండి గడవద్దూ...మొహానికి సిగ్గుండాలి...’ అమ్మధోరణి చాలా తీవ్రరూపంలోకి వచ్చేసింది.

‘అయ్యకంటె ఆ బాబుగార్లే ప్రేమగానూ, గౌరవంగానూ చూస్తారు...’ గంగి యింకా యేవేమిటో జాడిస్తూనే వుంది.

రుక్కిణివంటే, చలమయ్యకూడా లోపలికి వెళ్ళాడు బరబరా, యీ అంటున్నవన్నీ యెవరో అన్నట్లు.

‘ఏమే రుక్కు...నిజం చెపుతావా చెప్పవా’ చలమయ్య నిలవేశాడు.

రుక్కిణివళ్లంతా వేడెక్కిపోయింది.

‘నువ్వేంచేసొచ్చావు...ఇంతసేపటిదాకయెక్కడున్నావు...సూరి బాబుగారింటికి వెళ్ళదాంపద... నాకు అన్నీ తెలుసు. నాకళ్లకే గంతలు కటదా మనుకుంటున్నావా? గంగిని యిప్పుడు నేనేమి అనేట్టులేను. నిజంచెప్పు...’ చలమయ్య రుక్కిణి వూపిరి అడనీయటంలేదు.

రుక్కిణికి, తన తండ్రికి జరిగిన విషయం అంతా తెలిసిపోయిందేమో అని భయంగా వుంది. ఆసమయంలో రుక్కిణికి నిజం చెప్పాలో అబద్ధం చెప్పాలో

తెలీకండా వుంది. ఇంతలోకి, గంగి, అమ్మకూడా లోపలికి వచ్చేశారు.

'ఏమిటా నిలవెయ్యటం...నాకు అంతా తెలుసు. నేను కనుక్కుంటూన్నానే నువ్వుపద...' అమ్మ చొరవ చేసుకొని చలమయ్యను వెనక్కి నెట్టేసింది.

రుక్కిణికి యేమీ అర్థం కావటం లేదు. తన తండ్రి అడిగే ప్రశ్నలకు గాని, అమ్మ చెప్పే సమాధానానికి గాని పాత్రేమిటో రుక్కిణికి బోధపడటంలేదు. ఆ సమయంలో మాత్రం, తప్పించుకుని బైటపడ్డాను అని లోపల లోపల సంతోషించింది. చలమయ్య కోర చూపులు చూస్తూ, వాకిట్లో అరుగుమీద కూలబడ్డాడు.

'అమ్మా...' అని పిలిచింది రుక్కిణి యెంతో ఆవేదనగా.

'అమ్మాయి రుక్కిణి నాకు అంతా తెలుసు... నువ్వేమి చెప్పక్కర్లేదు...'

గంగి యేమిటో చెప్పబోయి ఆపేసింది.

రుక్కిణికి అంతా అయోమయంగా వుంది. ముందు ముందు యేమవుతుందో అనే భయం పట్టుకుని పీడిస్తోంది. తాత్కాలికంగా అప్పటికప్పుడవుతే యెట్లాగైతే బైటపడింది. మనస్సులో దిగులు, భయం స్థావరాలు యేర్పరచుకున్నాయి. ఆ రాత్రంతా రుక్కిణి మనస్సంతా కలవరపడి పోతోంది. నిద్రపట్టటం లేదు. చాపమీద అటూయిటూ దొర్లిపోతోంది. మధ్య మధ్య లేచి, కాసిని మంచినీళ్లు త్రాగి మళ్ళీపడుకుంటోంది. తెల్లారుతుంది. మళ్ళీ బాబుగారింటికి పనికి వెళ్ళాలి. పనికి వెళ్లితే, బాబుగారు వూరుకోరు తన్నేమన్నా చేస్తారు. పోనీ పనికి వెళ్ళకంటె, అయ్య, అమ్మ, వూరుకోరు. వెళ్ళకపోవటానికి కారణాలు యేం చెప్పాలి. అక్క కూడా వప్పుకోదు. పరిపరివిధాల ఆలోచిస్తూ కళ్లుమూసింది, అప్పటికే తెల్లవారి పోయింది.

'రుక్కి! యింతసేపైనా నిద్దర లేవవేమిటే...' లెమ... రుక్కిణి తట్టి, అమ్మ నిద్రలేపుతోంది.

రుక్కిణి బద్ధకంగా అటూయిటూ సాగి, కళ్లు నలుపుకుంటూ లేచి కూర్చుంది.

'ఒక్కనాటికే యిట్లా అయిపోయినా వెంటే... అమ్మ, రుక్కిణ్ని చూసి నవ్వుతుంది.

అమ్మకేసి ఆరాటంగా చూసి, రుక్కిణి ప్రక్క వదిలి లేచేసింది.

అమ్మ, గంగితో యేమిటేమిటో చెప్తూ సంబరపడి పోతోంది. గంగికూడా తెలిసినట్లు నవ్వేసింది. చలమయ్య పిల్లిద్దర్నీ చూసి చిటచిటలాడి పోయాడు.

"ఇయ్యాల పనికి వెళ్ళవేంటి...ఎంత ప్రొద్దెక్కిందో చూశావా...రుక్కిణ్ని, సూరిబాబుగారింటికి వెళ్లమని ప్రోత్సాహం చేస్తోంది అమ్మ.

"అమ్మ!...తలకాయనెప్పి బాగా యెక్కువగా వుందే. ఇయ్యాల యెక్కడికీ వెళ్లలేనే..." తలకాయ గట్టిగా పట్టుకుని వున్నచోటనే చతికిల పడింది రుక్కిణి.

అమ్మ మళ్లీ నవ్వేసింది. జుట్టు నిమురుతూ పోనిలే యివ్వాళిటికి అక్క వెళుతుందిలే అన్నది అమ్మ; రుక్కిణికి ప్రాణం యెంతో తేలికగా అనిపించింది.

ఈ నాడు ఉదయం గంగేవెళ్ళి అక్కడ పనులన్నీ చూసుకుని వచ్చింది. మధ్యాహ్నం దాటినప్పటినుంచి మళ్ళీ రుక్కిణికి. గుండె అదురు యెక్కువయింది సాయంత్రానికి యేమి వంక చెప్పుదామా అని ఆలోచిస్తోంది. ఎట్లాగైనా అక్కనే కోరుకుందాం సాయంత్రం కూడా వెళ్లి పనిచెయ్యమని అనుకుంది రుక్కిణి. గంగి, రుక్కిణి కోరినట్లుగానే చేసింది. కాని మళ్లీ తెల్లారుతుంది. తాను పనిలోకి వెళ్ళాలి. అప్పుడేం చెయ్యటం ఈ ఆలోచన ఆ రాత్రి నుంచే ప్రారంభమయింది రుక్కిణికి. ఎన్నాళ్లు యిట్లా గడపటం అనుకుంది. ఏదో ఒకనాడు యిది బైట పడక మానదు. నలుగురు నాలుగు మాటలు అనటం తప్పదు. ఏట్లాగైనా ధైర్యం చేసుకుని ముందుకు పోవాలని నిశ్చయం చేసుకుంది. అంతగా బాబుగారు అడుగుతే వున్నది వున్నట్లు చెప్పేద్దాం నలుగురికీను. అప్పుడే తప్పెవ్వరిదో అందరికీ తెలిసిపోతుందని, గుండె నిబ్బరం చేసుకున్నది రుక్కిణి.

ఛల్లున తెల్లారింది. ఎవరి పనుల్లో వాళ్లు నిమగ్నులయి పోయారు. రుక్కిణి అదివరకు వెళ్లినట్లుగానే సూరిబాబుగారింటికి పనికివెళ్లింది. కసువువూడ్చి ముగ్గేసింది. గనులు చిమ్మి చెత్త అవతల పారబోసింది.

ఒకటో రెండో బట్టల్ని బండకేసిబాది ఎండలో ఎండేసింది. చెంబులు గిన్నెలు తోలిచి యింట్లో పెట్టేసింది. ఇన్ని పనులు చేస్తుండగా ఎప్పటి కప్పుడు రుక్కిని మనస్సులో ఓ విధమైన ఆవేదన, భయం, తొట్రుపాటు, పెల్లుబుకుతూనే వున్నాయి. కాని యెవరూ కూడా తన పనికేమీ అడ్డంరాలేదు. సూరిబాబుగారు అసలు కనిపించనే కనిపించలేదు. రుక్కినికి భయం కంటె ఆశ్చర్యం యెక్కువ అయింది. తాను వూహించుకున్నట్లు యేదీ జరగలేదు. పైపెచ్చు. సూరిబాబే కనిపించలేదు రుక్కినికి వుక్కిరి బిక్కిరి అయినట్లయింది. మామూలుగానే వెళుతున్నా అమ్మగారు అని చెప్పి వచ్చేసింది. రుక్కిని. సాయంత్రం కూడా చెప్పతగ్గ మార్పేమీ కనిపించలేదు, రుక్కిని పనిలో. అయితే ఆ పని యీ పని చెప్పటంవలన, ఆ సాయంత్రం రోజూకంటె కొంచెం ఆలస్యంగానే యింటికి వచ్చింది.

ఎదురుగా చలమయ్య వచ్చేసి, 'ఇంతసేపటి దాకా యేంచేస్తున్నావు' అని ప్రశ్నించాడు.

'అమ్మగారు యేవో పనులు చెప్పారు. అందుకని ఆలస్యం అయింది...' తొణక్కుండా నిదానంగా సమాధానం చెప్పింది రుక్కిని.

చలమయ్యకు ఆ సమాధాం యేమాత్రం కూడా తృప్తిగా లేదు. పైగా అది అబద్ధం అని కూడా అనుకున్నాడు. ఇంతలోనే అమ్మ యింట్లోంచి వచ్చేసింది.

'రుక్కీ వచ్చావమ్మ! నీ మాటే అనుకుంటున్నా...' బుజాన చెయ్యివేసి, అమ్మ, రుక్కిన్ని లోపలికి తీసుకు వెళ్లింది.

'సూరిబాబుగారు యేమన్నారు......' అమ్మ నవ్వుతూ అడిగింది.

రుక్కిని యేమీ మాట్లాడలేదు.

'అమ్మకు యెక్కడలేని సిగ్గు......' అమ్మ, రుక్కిని, చెక్కిళ్ళను గట్టిగా వత్తి లోపలికి వెళ్ళిపోయింది.

రుక్కిని యెంతో తీవ్రంగా ఆలోచించటం మొదలుపెట్టింది. అమ్మ ధోరణి తనకేమీ అర్థం కావటంలేదు. లేకపోయినా సమయానుకూలంగా, అవుననో, కాదనో సమాధానం చెప్పి, ఆ వేళకు తప్పించుకుంటూ వస్తోంది. ఒకటి రెండు రోజులు గడిచిపోయినాయి.

రుక్కిని మనోవేదన యెక్కువయిపోతోంది. ఇంట్లో చూడపోతే అమ్మ ధోరణి ఒకవిధంగా వుంది, తండ్రి ధోరణి యింకోవిధంగా వుంది. బాబుగారింటికి పనికి వెళితే అక్కడవాళ్లు కూడా ముక్తసరిగా మాట్లాడి ముభావంగా వూరుకుంటున్నారు. సూరిబాబుగారైతే కనిపించనే కనిపించటం లేదు. బాబుగారెక్కడ అని యెంత అమాయకంగా అడిగినా, ఆ ప్రశ్న యెన్నివిధాల యెంతమంది అర్థం చేసుకుంటారో అనే భయం. రోజురోజుకు రుక్కిని నలిగి నలిగి పోతోంది. నాలు గైదు రోజులు తెచ్చిపెట్టుకున్న భయంతో గడిపేసింది.

ఆనాడు పనెక్కువవటంవలన, ఆయాసపడుతూ అలసిపోయి యింటికి వచ్చింది రుక్కిని. బద్ధకంగా వాకిట్లో మంచంలో నడుము వాల్చింది. చలమయ్య ఆనాడు అప్పటికి యింటికి రాలేదు. ఆ రాత్రికి గంగి యింటికి రాదని అమ్మకు తెలుసు. అమ్మవక్కత్తే యింట్లో వుంది. కొడిగట్టిన దీపాన్ని తోసేసి, చమురు నిండా పోసి ఓలాంతరు వెలిగించి సావిట్లో పెట్టింది. ఉండి ఉండి గప్పు గప్పు మంటోంది. నేలకేసి గట్టిగా రెండుసార్లుకొట్టి, ఆ లాంతరును వీధి గుమ్మం దగ్గరకు తీసుకువచ్చేటప్పటికి, మంచంలో పడుకునివున్న రుక్కిని కనిపించింది.

"రుక్కీ ఎప్పుడొచ్చావే...ఎంతసేపయిందేమిటి...' అమ్మ లాంతరు పట్టుకుని మంచం దగ్గరకు వచ్చింది. రుక్కిని అలిసిపోయి, మొహం యెంతో నీరసంగా కనిపించింది.

అమ్మ పమిటకొంగుతో రుక్కిని మొహంఅంతా తుడిచేసి మెల్లిగా లోపలికి తీసుకుపోయింది.

'రుక్కీ! అట్లా రోజు రోజుకు నలిగిపోతున్నావేమిటి...బాబుగారు నీతో చక్కగా మాటలాడుతున్నారా ..వారి దయ మనకుండాలే గాని, మనకు తక్కువేంటే...ఇంకా నువ్వు చిన్నపిల్లవి. నీకుబాగా తెలీదమ్మా...అంత సిగ్గు వుండకూడదు. ఎంతయినా అయ్యగారితో చనువుగా వుండి, వారిని మెప్పించావంటె, యింకా మనకు యేలోపమూ వుండదు......

ఏమిటి నేను చెపుతోంది తెలుస్తోందా...' అమ్మ నవ్వుతూ, రుక్మిణ్ని అడిగింది.

రుక్మిణి ఎందుకనో బలవంతంగా చిరునవ్వు తెప్పించుకుని అమ్మవంక చూసింది.

అమ్మ పకాలున నవ్వింది.

ఆ రాత్రి రుక్మిణికి తీవ్రమైన ఆవేదన కలిగింది. అమ్మ అంతరార్థం పూర్తిగా తెలుసుకుంది. ఏ కారణం చేత అమ్మను, తాను ఏవగించుకుంటోందో, మళ్ళీ ఆ విషయాన్నే ప్రోత్సహిస్తూ తనదగ్గర ప్రస్తావించటం, రుక్మిణికి యెంతో వికటంగా అనిపించింది. కచ్చితంగా తనతల్లికి చెప్పెయ్యాలనుకుంది. తనతల్లిమీద తనకు యెన్నడూ రాని కోపంవచ్చేసింది. తాను ఒక యింటిదైతే భర్త కొంపట్టుకుని చెమటోడ్చి పనిచేసి యింత గంజి త్రాగలేకపోదు తన శరీరంలో మంచి ఓపిక వుంది. కష్టించి పనిచెయ్యగలదు తన బ్రతుకు తాను బ్రతకగలదు. మరీ యీ నీచమైన బ్రతుకు అమ్మ తనకు యెందుకు ఉద్బోధిస్తోంది, తమ స్వార్థంకోసం. అక్కను అనవసరంగా అల్లరిపాలు చేశారు. ఈనాడు అక్కంటే నలుగురు యేమనుకుంటున్నారో అర్థం కావటంలేదు. కడుపుకులేని యింట్లో పుట్టాం. కడుపు కోసం కష్టం చెయ్యగలం. ఇంకా మనకు లోటేమిటో. ఇతరులను మెప్పించాలని, యెవరికోసమో కూడబెట్టాలని, మనం నాశనమయిపోవటం యెందుకో అర్థంకావటంలేదు. నా జీవితం నన్ను చూసి మురిసిపోయిన వాళ్ళందర్ని మెప్పించటానికి కాదు. నా జీవితం నాకోసం, నా ఆనందంకోసం. అంతే. అమ్మకు యివన్నీ చెప్పేసేస్తాను. మళ్ళీ ఆ విషయం నాదగ్గర తీసుకురాకుండా చేస్తాను. ఏమిటేమిటో ఆరాత్రల్లా అనుకుంటూనే వుంది. లోపలలోపల కృశించి పోతూనేవుంది.

చిరాకుగా లేచి, రేగిన జుట్టుకు యింత నూనె పట్టించి టైముకు సూరిబాబుగారింటికి వెళ్ళిపోయింది రుక్మిణి. వీధిగుమ్మం తీసేవుంది. లోపలికి వెళ్ళిపోయింది. కాని యేమిటో భయమేస్తోంది. ఆ యిల్లు ఆ ఒక్కరాత్రిలోనే యెంతో మారిపోయినట్లనిపించింది. చెప్పలేని భయం, రుక్మిణ్ని ఆవహించింది. ఆ యింట్లో కనిపిస్తున్న ఒకరిద్దరు వ్యక్తులు భయంకరంగా కనిపిస్తున్నారు. తప్పటడుగులు వేసుకుంటూ, పని లోకి వెళ్ళింది వాకిట్లోకి యింతలో ఓ బండీవచ్చి ఆగింది. ఇంట్లోంచి ఓ ముసలావిడ, యింకో నడివయస్సు వ్యక్తి వెళ్ళి బండీలో యెక్కారు. బండీ సాగిపోతోంది. రుక్మిణి ఆదేపనిగా అట్లాచూస్తూ నిలబడిపోయింది. వెళుతున్న బండీని సాగనంపటానికి కొంచెం ఆలస్యంగా లోపల్నుంచి సూరిబాబు వచ్చి, చెయ్యివూపి మళ్ళీ లోపలికి వెళ్ళిపోయాడు. రుక్మిణి, సూరిబాబును మళ్ళీ చూడటం అదే మొదటిసారి. వళ్ళు ఝల్లుమన్నది ప్రక్కకు తప్పుకుంది. సూరిబాబు నిరామయంగా లోపలి గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు. రుక్మిణి హృదయంలో ఆవేదన అలలాగ పైకి వుబుక్క వస్తోంది. చకచక ఆ పని యీ పని చేసుకుపోతోంది. సూరిబాబు కూర్చున్న గది గుమ్మం దగ్గరకు వచ్చేటప్పటికి, రుక్మిణి ఆగిపోయింది. తన అరచెయ్యి మళ్ళీ చూసుకుంది. ఇంతలోకే సూరిబాబు లోపల్నుంచి బైటకు వచ్చేసి, తల వంచుకుని గంభీరంగా దిగి వెళ్ళిపోయాడు. రుక్మిణి, సూరిబాబు కళ్ళల్లోవున్న గంభీరతను భరించలేకపోయింది. రుక్మిణికి హృదయం బ్రద్దలయినట్లనిపించింది. వళ్ళంతా గజగజ వణికిపోయింది. తనకు తెలీకుండానే తన శరీరం తడిసిపోయింది. పెద్ద నిట్టూర్పు విడిచి యింటికి వెళ్ళిపోయింది.

రోజు రోజుకి రుక్మిణి సన్నపడిపోతోంది. మనోవ్యాధి యెక్కువయిపోతోంది మనిషి చేసిన తప్పు పనిని ఎదిరిస్తూవుంటే ఆ తప్పు పనిని సమర్థించే శక్తి అతనిలోనుంచి బహిర్గతం అవుతుంది. అలాంటి తప్పు పనిని, యే ఒక్కడూ కూడా విమర్శించకండా, యెవరూ పట్టించుకోకండా వుంటే, మానవుల్లో అంతర్గతంగా వుంటున్న ఆ మనోదౌర్బల్యం సన్నగిలి పోతుంది. పశ్చాత్తాపానికి, పరితాపానికి అవకాశం కలుగుతుంది. తాత్కాలికంగా అహంకారం పెరిగిపోయినా. రాను రాను, తాను చేసిన తప్పును యెంతో ఘోరంగా చిత్రించుకుని పశ్చాత్తాపపడి ప్రణాలు తీసుకుంటారు. ఇదో రకపు మనోప్రవృత్తి. ఇలాంటి ప్రవృత్తిలో పడి తన్నుకుపోతోంది రుక్మిణి. సూరిబాబు తనను యేమిటేమిటో చేస్తాడని, తన తల్లి, తండ్రి, యింకా యితరులు, తనను యేదో ఆడిపోస్తారని అనుకున్న రుక్మిణి అప్పట్లో, తాను చేసినపని చెడ్డదికాదు అని రుజువు

చెయ్యటానికి తగిన సామాగ్రిని చేకూర్చుకుంది. ఈనాడు ఆ విషయం యెవరూ పట్టించుకోవటం లేదు. సూరిబాబే, తన యెదుటనుంచి, తలెత్తకుండా గంభీరంగా వెళ్ళిపోయాడు. రుక్మిణ్ని మరింత పిచ్చిదాన్ని చేసింది యీ సంఘటన. తాను చేసింది నిజంగా తప్పేమో. సరిగ్గా అర్థం చేసుకోలేదేమో, ఏమైనా తొందరపడ్డానేమో, యేమిటో యేమిటో రుక్మిణి పిచ్చిదానిలాగ ఆలోచిస్తోంది. ఆమెలో ఆ వేదన పశ్చాత్తాపానికి దారితీస్తోంది. కాని యేంచెయ్యాలో తోచటం లేదు.

ఆనాడు కూడా మామూలుగానే సూరిబాబుగారింటికి వెళ్ళింది. పనులేవో తన చిత్తం వచ్చినట్లు చేసుకుపోతోంది. మనస్సు మథించుకుపోతోంది మెల్లిగా మేడమీద గదికి వెళ్ళటానికి మెట్లు యెక్కుతోంది. అంతపెద్ద యింటిలోను సూరిబాబు తప్ప యింకా యెవ్వరూ లేరు. నిశ్చలంగా ఏమిటో ఆలోచించుకుంటూ కూర్చున్నాడు సూరిబాబు.

సూరిబాబు జీవితం మహా తమాషా అయినది. అతని మానసిక ప్రవృత్తి బహు చిత్రమయినది. జీవిత లక్ష్యం యేమిటో నిశితంగా ఆలోచిస్తూ వుంటాడు. తనకు గ్రాయకం వచ్చినప్పటినుంచి, తాను నిర్దుష్టమైన విషయావృతాలలో విహరిస్తూ, ఆలోచనలు చేస్తూ వుండేవాడు. ఆలోచిస్తున్నకొద్దీ, ఆస్తి, ధనం, మానవజీవిత పురోభివృద్ధికి ఆటంకాలు అని నిశ్చయానికి వచ్చాడు. ఆయేడే అతని తాలూకు యెవరో దాయాది పోవటంవలన, ఏభై ఎకరాల ఆస్తి, ఓ పెద్ద తోట ఇతనికి సంక్రమించినాయి. నలుగుర్లో కలిసి తిరగాలని వుబలాటపడ్డాడు. ఆత్మీయులకోసం, సూరిబాబు యెంతో పరితపించిపోయాడు. తాను ప్రాణంతో సమానంగా చూసుకుంటున్న తన అన్న అకస్మాత్తుగా తనను విడిచిపెట్టి వెళ్ళిపోయాడు. తనతల్లితండ్రులు తనను పూర్తిగా అర్థంచేసుకుని తన పురోభివృద్ధికి యెంతో దోహదం యిస్తారని కలలుకంటూ వుండేవాడు. కాని తన తండ్రి తనకు గ్రాయకం వచ్చినప్పటినుంచి పెళ్ళి చేసుకోమని యింట్లో పోరుపెడుతూ వుండేవాడు. తనతల్లి దానికి వత్తాసుగా నీతులు బోధిస్తూ వుండేది. కాలగర్భంలో యిద్దరూ కలిసిపోయారు. ఆస్తిని ఆసరాగా పెట్టుకుని, ఆత్మీయత వలకబోయాలని, చాలామంది విఫలంగా ప్రయత్నించారు. ఆత్మీయత అనేది డబ్బుతో కొనేదికాదని సూరిబాబు యెన్నడో గ్రహించాడు. ఇలా తన జీవితం సుఖమయం చేసుకోవటానికి కృతనిశ్చయుడై వుండిపోయాడు. ఆ సమయం కోసం యెంతో ఓపిగ్గా కనిపెట్టుకు కూర్చున్నాడు. ఆ సమయం వచ్చిందనుకున్న తరుణంలో, అతను పూర్తిగా దెబ్బతిన్నాడు. తాను ఊహించలేని విషయం జరిగింది దానికి కారణమేమిటి? బాధ్యత యెవరిది? తానెంతవరకు బాధ్యుడు! సంఘంలో మానవునికి మానవునికి ఇనుపతెరలెందుకు! ఇవి సృష్టించిన వాళ్ళెవరు? వీటిని విచ్ఛిన్నం చేసే శక్తి యెవరికుంది? గుణాలన్నీ డబ్బునే అంటిపెట్టుకుంటాయా? గుణహీనులలో డబ్బునే అంటిపెట్టుకున్నవాళ్ళు యెంతమంది? జీవితంలో ధ్యేయం యేమిటి! నిజమైన ప్రణయానికి విలువలేక పోవటం, తుచ్ఛమైన కామానికి విలువ వుండటం! ఈ విరుద్ధభావాలెందుకు? ఒక స్త్రీ, అబల తిండికి వెతుక్కునే అభాగ్యురాలు, రూపసి, ఆమెలో నేను ఊహించలేని శక్తి యెవరు యిచ్చారు. కృత్రిమ బంధనాలలో బిగించేసి, యితరుల సౌభాగ్యాన్ని చూడలేని కొంతమంది స్వార్థపరులతో ఏర్పడిన సంఘమా? అర్థంలేని ఆవేశంలో, తన బాగుయేమిటో తాను తెలుసుకోలేని ఒక అమాయకపు పిల్ల క్రౌర్యమా! ఇంత డబ్బున్నా, జీవితంలో నేను యెందుకు సుఖపడటం లేదు. నాకు వ్యక్తుల్లో విశ్వాసం నశించింది. సంఘంమీద గౌరవం లేదు. నేను కూడా ఒక నిస్సహాయుడు లాగ సంఘపు వురిత్రాడులో యేనాడో ఒకనాడు చిక్కుకు పోవాల్సిందే! ఆలోచించి ఆలోచించి అలసిపోయాడు. చివాలున కుర్చీలోంచి లేచాడు. కిటికీ తలుపులు వేసేశాడు. బైటకు రాబోతున్నాడు ఎదురుగా రుక్మిణి నిలబడి ఉంది. ఒక్కక్షణం తీక్షణంగా చూశాడు రుక్మిణి వంక. రుక్మిణి వెక్కి వెక్కి యేడ్చి, కాళ్ళ మీద పడింది క్షమించమంటూ.

పెద్ద నిట్టూర్పు విడుస్తూ, నిశ్చలంగా నిలబడిపోయాడు.

"అయ్యగారు, అయ్యగారు" అంటూ వలవల యేడ్చింది రుక్మిణి.

సూరిబాబు యేమీ చలించకుండానే అట్లాగే నిలబడి ఉన్నాడు.

రుక్మిణిని మళ్ళీ పిలిచింది.

సూరిబాబు తీక్షణంగా చూశాడు మళ్ళీ ఓ సారి రుక్మిణి కళ్ళల్లోకి.

'రుక్మిణీ! లోకం నన్ను ఏమిటేమిటో అంటోంది. నీకు వినిపిస్తోందో లేదో నాకు తెలీదు నేను నీ జీవితాన్ని నాశనం చేశానట. నీ పొంగి పొరలుతున్న యౌవనం, నేను చూసి సహించలేక నీకు తీరని అన్యాయం చేశానట. దానికి ఫలితమే నువ్వు రోజు రోజుకు యిట్లా అయిపోవటంట నామీద మంచి విశ్వాసం వున్నవాళ్ళే నన్ను యీ విధంగా తూలనాడుతున్నారు. నీతో పరిచయం వుందనే ప్రచారం చాలా తీవ్రంగా సాగిపోతోంది. నా గౌరవానికి, నా ఆత్మకు అలాంటి పరిచయం యెంతో వంచన అని యీనాడు గ్రహించుకోకలిగాను. నీ జీవితం అంతా సుఖమయం చేద్దామని నా జీవితం సుఖమయం చేసుకుందామని, మానవులు కల్పించిన బంధనాలన్నింటినీ త్రుంచివేసి, యెంతో వున్నతమైన ఆదర్శంతో నిన్ను పెళ్ళి చేసుకుందామని ఆశించి నీ దగ్గరికి వచ్చాను. కాని నువ్వు అపార్థం చేసుకున్నావు నన్ను. నాడబ్బు నా ఆస్తి. నా ధనం, నన్ను సరిగ్గా అర్థం చేసుకోనీయలేదు అది నీ తప్పేంగాదు. కాని యీ నాడు నాకు తగినశాస్తి జరిగింది. నీ జీవితంలో నిప్పులు పోస్తాననే దురభిమానంతో, నా జీవితాన్ని నాశనం చేశావు నా మనస్సులో క్షోభ పుట్టించావు. ఈ దావాగ్ని యీ జన్మను క్రమ క్రమేణా దహించుకుపోతుంది. నాకు తెలుసు. నా జీవితంలో నేను కోరుకున్నది యేదీ జరగలేదు. అన్నింటిని సహించి, చివరకు నీ ప్రేమకోసం తపన పడ్డాను. అది కూడా నాకు లభ్యం కాలేదు. నేను నిన్ను ప్రేమించటం నా స్వార్థంకోసమే కాదు. నిన్ను చూసి, నేను చాలా ఆలోచించాను. నీ జీవితంలో యెలాంటి కష్టాలు యెదుర్కొనవలసి వస్తుందో యీ సంఘంలో వుంటున్న నేను పూర్తిగా గ్రహించగలను వాటన్నింటిని తొలగించి, నీ రూపానికి నీ గుణానికి తగ్గ అవకాశాలు యివ్వాలని, యెంతో దూరం ఆలోచించి, యెంతో ఆదర్శం అనుకొని నీ దగ్గరకు వచ్చాను. అది నువ్వు గ్రహించుకోలేక పోయావు. ఈ నాడు నీవల్ల నేను, నా వల్ల నీవు భ్రష్టులమై పోయినాం. ఈ అపవాదు యీ అపనింద తప్పించటానికి నేను శాయశక్తులా ప్రయత్నం చేస్తాను. నువ్వు కూడా ప్రయత్నం చేసి నా పక్షపు నిలబెట్టు. అంతకంటె నిన్ను కోరేదేమీ లేదు. నేను చెప్పినవాటిల్లో యేఒక్కటీ కూడా పూర్తిగా అర్థం చేసుకోలేవని నాకు తెలుసు, కాని నా ఆవేదన తగ్గేదెట్లా! నేను యెవ్వరితో ఇవన్నీ చెప్పి హృదయ భారాన్ని తగ్గించుకోగలను...' సూరిబాబు గజగజ వణికిపోతూ నిలబడివున్నాడు.

అయ్యగారు నాకేం తెలీటంలేదండీ, నన్ను క్షమించండి...హోరుమని ఏడుస్తోంది రుక్మిణి.

'ఈపరిస్థితుల్లో నేనేమీ చెయ్యలేను...' చెయ్యి మొహానికి అడ్డం పెట్టుకుని సూరిబాబు దబ దబ క్రిందకు వెళ్ళిపోయాడు.

రుక్మిణికి యేదో ఛాయామాత్రంగా బాబుగారి బాధ అర్థమయింది. తన అరచేతిని భూమిమీద గట్టిగా నాలుగైదుసార్లు బాదింది. తనను తాను నిందించుకుంటోంది. తాను చేసిన ఘోరమైన తప్పుకు పశ్చాత్తాపపడటానికి కూడా అవకాశం లేక పోయింది. హృదయంలోనుంచి నిప్పు ఆవిర్లు బుసలు కొడుతూ పైకి వస్తున్నాయి. తన కల్మషాన్ని దహించేస్తున్నాయా అన్నంత తీవ్రంగా వచ్చేస్తున్నాయి మనస్సు పరిపరివిధాల పోతోంది. తన జీవితాన్నే సమాప్తి చేసుకోవాలని వచ్చిన ఆవేశం ఆక్షణంలోనే మాయమైపోయింది తాను జీవితంలో యెంతో సుఖం అనుభవించాలని, యెంతో ఆనందంగా గడుపుతూ వుండాలని యేమిటేమిటో కలలుకంటూ వుండేది. తన అందాన్ని చూసి తానే అసూయ పడుతూ వుండేది. అలాంటిది యీనాడు జీవితాన్ని సమాప్తిచేసుకోవాలనే ఆలోచన వికృతంగాను, విరుద్ధంగాను తోచింది. అయ్యగారికి తనమూలాన చెడ్డపేరు వచ్చిందని తెలుసుకుంది. దానికి తాను చెయ్యదగ్గ పనేమిటి ఆలోచించటం మొదలు పెట్టింది. ఓమూల అమ్మ తననియెవరికో అమ్మేసి డబ్బు సంపాదించాలనిఆశపడుతూ వుంటుంది. అక్క జీవితం అంతా బజారుపాలయింది. అయ్య యేమీ చెయ్యలేనివాడు. ఇక వీళ్ళతో ఉండి లాభంయేమిటి? నాకు వీళ్లతో యేవిధమైన సంబంధమూ లేదు. నేను వీళ్ళెవ్వరికీ కనిపించకుండా యెక్కడికో దూరంగా వెళ్ళిపోతాను. అక్కడే నా జీవితం క్రొత్తవిధంగా సాగించు

కుంటాను. ఇక యీ వూళ్ళో నాకు తావులేదు. ఓ నిశ్చయానికి వచ్చేసింది. ఆ సాయంత్రం బండికి యెవరికీ చెప్పకండా ఆ వూరు వదిలి వేసి వెళ్ళిపోవాలని నిశ్చయించేసుకుంది రుక్కిణి. పగలల్లా మండిన సూర్యుడు పశ్చిమాగ్రంలోకి కుంగిపోతున్నాడు సూరిబాబు గదిలో పిచ్చివాడులాగ పచార్లుచేస్తున్నాడు అటూ యిటూ. అతని బుర్ర వేడెక్కిపోతోంది ఏమీ ఆలోచన తట్టటంలేదు. చటుక్కున యేదో ఓ వుపాయం తట్టినట్లు వులిక్కిపడ్డాడు. తాను యీ వూరు వదిలిపెట్టి వెళ్ళిపోవాలి. ఈ అపనింద భరించలేను. ఈ అపవాదు సహించలేను అనుకున్నాడు. గబగబ పెట్టెలోకి నాలుగైదు బట్టలు కుక్కేసి, సరిగ్గా బండిటైముకు రైలు స్టేషను చేరుకున్నాడు. గుండెల్లో రైళ్లు పరుగెత్తుతున్నాయి. ఎరుగున్న వ్యక్తి యెవరైనా కనిపిస్తే వులిక్కిపడుతున్నాడు. ఆవేదనగా రైలు రావటానికి యింకా యెంత టైముందో కనుక్కున్నాడు. ఆనాడు కూడా గంట లేటుగానే రైలువచ్చింది. ముచ్చెమట్లు పోసిన సూరిబాబు తెప్పరిల్లి, రైలువచ్చి ఆగంగానే జనాన్ని నెట్టుకుంటూ ఓ పెట్టెలోకి చొరబడ్డాడు. గుంపులు గుంపులుగా నడుస్తున్న జనంమధ్య శరీరాన్ని దాచుకుంటూ, తానుమాత్రం యెవర్నీ చూడకండా, యెక్కడో జనం వత్తిడిగావున్న మధ్య పెట్టెలో యెక్కేసింది రుక్కిణి. రైలు సాగిపోయింది. రాత్రి వెళ్ళిపోయింది తెల్లారేటప్పటికి సూరిబాబు రుక్కిణ్ని లేవతీసుకుని వెళ్లాడనే మాట వూరంతా పాకిపోయింది.



# భారతదేశంలోని జాతులు

శ్రీ టి. ఆర్. లక్ష్మణన్

భారతదేశంలోని వివిధ జాతులను గురించీ తెలుసుకోవాలంటే, ముందుగా, 'జాతి' అనే పదానికి సరియైన నిర్వచనమేమిటో తెలుసుకోవాలి. 'జాతి' అనే పదాన్ని యెవరియిష్టంవచ్చినట్టు వారు వాడుతూండటంవల్ల చాలా అయోమయస్థితి ఏర్పడుతోంది. 'ఒక ప్రత్యేక జీవరాశిలో, అంతర్వర్గమై వుండి, ఆ జీవరాశిలోని యితర అంతర్వర్గాలకు విభిన్నములైన కొన్ని శారీరక లక్షణాలుగల ఉపశాఖ' అని జీవశాస్త్రవేత్తలు ఈ పదాన్ని నిర్వచించారు. ఈ దృష్ట్యా యోజించితే మానవసంఘంలో అనేక జాతు లున్నట్టు మనకు బోధపడుతుంది. కాని, సామాన్యంగా, జనబాహుళ్యం ఈ శబ్దాన్ని వాడుతున్నప్పుడు ఇంత శాస్త్రీయమైన విశిష్టార్థంలో దాన్ని వాడటంలేదు. 'జర్మన్ జాతి' 'బ్రిటిష్ జాతి' అనేవి యిలాంటి ప్రయోగాలే; ఒక ప్రత్యేక భూభాగానికి పరిమితమైవున్న ప్రజను 'జాతి' అంటున్నారు. ఇంతే కాదు: ఒక మతానికి చెందినవారిని, ఒక భాషకు చెందినవారిని, ఒక ప్రత్యేక సంస్కృతికి చెందినవారిని, స్థూలంగా 'జాతి' అని పిలవటం మామూలైంది. 'హైందవజాతి', 'యూదుజాతి' 'ఆర్యజాతి' ఇత్యాదయః. ఇది తప్పుడుప్రయోగం కావటమే గాక సామ్రాజ్యవాద ధోరణిగల రాజకీయవాదులు దాన్ని ఆయుధంగా ఉపయోగించి, ప్రపంచంలో అనేక అనర్థాలకు దారితీశారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామ సందర్భంలో జర్మనీ అనుసరించిన అసందర్భపు విధానం యిందుకు ప్రబలమైన ఉదాహరణ.

మానవసంఘంలోని విభిన్న జాతులలో స్థూలంగా కనుపించుతున్న సమానధర్మములనూ పరిశీలించినట్లయితే, మానవజాతి యావత్తూ ఒకే జీవరాశినుంచి పరిణామం చెందిందని మనం తేలికగా అవగాహన చేసుకోవచ్చు. అనంతరదశలో ఈ ఆదిమ మానవులు, వివిధభూభాగాలకు విస్తరించి, ఆయా ప్రత్యేక ప్రదేశాలలో స్థావరా లేర్పరుచుకున్న కారణంగా, ఆయా నైసర్గిక స్థితిగతులకు అవసరమైన కొన్ని ప్రత్యేక ప్రత్యేక ధర్మాలను పెంపొందించుకోవటం కనుపించుతుంది. నైసర్గికపరిస్థితులకు అనుగుణములైన ధర్మాలను పెంపొందించుకునే స్వభావం, యితర జీవరాసులతో పోల్చిచూస్తే మానవునిలో ఎక్కువ స్పష్టంగా కనుపించుతుంది.

ప్రాణికోటిలోవుండే "జీవాణువుల" (Genes) ద్వారా పారంపర్యగుణాలు తరాలవారీగా సంక్రమించుతున్నట్టు, జీవశాస్త్రవేత్త మెండెల్ అనంతరం సర్వులూ అంగీకరించుతున్న సిద్ధాంతమే. విభిన్న జీవకణాల సంయోగంవల్ల క్రొత్త క్రొత్త పరిణామాలకు అస్కారంవుంది. అయినప్పటికీ ఆయా జాతుల ప్రత్యేక లక్షణాలు కొంతవరకు పరిరక్షింపబడుతూనే వుంటాయి.

మానవోదయమైన ప్రప్రథమ పరిణామం ఎలాంటిదో నిరూపించటానికి సరియైన ఆధారాలేమీ కనుపించకుండా వున్నా మానవుడు, వృక్షములను ఆశ్రయించుకుని బ్రతికే, వానరమూ మనిషీ కాని, జావా మనిషిలాంటి ఒకానొక జంతువు (Dryapithecus type) నుంచి ఉద్భవించినట్టు తలపోయబడుతున్నది. ఆ వానరదశనుంచి రెండు వెనకపాదాలమీదా నిట్టనిలువుగా లేచి నిల్చోవటానికి జరిగిన ప్రయత్నంలో అనేక అంతర్దశలు వుండవచ్చు. ఇంకా చెట్టుచేమలను పుచ్చుకుని వ్రేలాడేస్వభావాన్ని విడువలేకుండావున్న గోరిల్లా వగైరా కోతులు ఇలాంటి అంతర్దశలే అయి వుండవచ్చు.

చెట్టుమీదనుంచి భూమిమీదికి అవతరించి భూమిమీద సంచరించేటందుకు అనువుగా తన అవయవాలను సాధనచేసుకునే తరుణంలో అనేక పరిణామాలను చెందివుండవచ్చు. జావా, పెకింగ్, ఫిల్ట్‌డౌన్, ప్రాచీన మానవులు మొదలయిన జీవులు ఈ అంతర్దశలకు చెందినవారై యుండవచ్చు.

ఇలా మానవులుగా రూపొందిన ఈ ద్విపాద జీవసముదాయం, ఆహారావసరాలవల్లనైతేనేమి

సుఖజీవనానికి అనువైన వాతావరణాన్ని అన్వేషిం చుతూ నైతేనేమి, దూర దూరాంతర సీమలకు ప్రపం చము నలుమూలలకూ వ్యాపించి యుండవచ్చు.

నూతన పరిసరాలలోకి ఎప్పుడు మార్పు జెంద టము జరిగిందో అప్పుడు దేహంలో వుండే జీవకణా లలో, నూతన పరిస్థితులకు అనువైన పరిణామం రావ టము సహజం.

ఆదిమ మానవ పరిణామాలుగా కనిపించుతున్న నీగ్రో, మంగోల్, కాకసస్ జాతులు ఇలాంటివే. ఈ ప్రత్యేకజాతులు పెంపొందించుకున్న గుణాలకు ప్రాంతీయ నైసర్గికస్థితిగతులే కారణమని మనం తేలి కగా నిరూపించవచ్చు. కాని ఈ వివిధజాతులలో ఎట్టి పరిణామాలు వచ్చినా—శరీరవర్ణం, జుట్టు, తలకట్టు, ముఖం, కళ్ళు, వివిధ రక్తశాఖలు—మొదలయిన బాహ్య లక్షణాలలో నే కాని, మానవ ప్రాథమికధర్మాలుగా ఉండేవాటిలో ఎట్టి మార్పూ లేదు. ఈ బాహ్యలక్ష ణాలుకూడా, దండయాత్రలు, వలసలు కారణంగా అనంతరదశలలో కలిగిన వివిధజాతుల పరస్పర సంయో గమువల్ల వాటి వాటి ప్రత్యేకలక్షణాల విస్పష్టత నశించి అనేక నూతనజాతులుగా పరిణమించినై. అందుచేత ఈనాడు, ఇదమిత్థం ఇది ఈ ప్రత్యేకజాతి అని యే మానవవర్గాన్ని గురించీ ఖండితంగా చెప్పే ఆస్కారం లేదు.

## భారతదేశపరిస్థితి

అనాది రాతియుగం నాటినుంచీ, నేటివరకూ ఆయాకాలాలలో అనేకజాతుల ప్రజలు భారత దేశంలో ప్రవేశించి ఇక్కడ స్థావరాలేర్పరుచు కున్నారు. అందుచేత భారతప్రజలలో అనేకజాతుల లక్షణాలు నేడు మనకు కనుపించుతున్నాయి. హిమా లయపు కనుమలనుంచి కొత్తకొత్తజాతులు ఎప్పటి కప్పుడు లోపలకు చొచ్చుకువస్తూవుండటమూ, అతః పూర్వం వచ్చిన జాతులను, దక్షిణానికీ తూర్పుదిశకూ తరిమితరిమి వత్తివేస్తూ వుండటమూ జరిగింది. ఈ వత్తిడి వల్ల ఆట్టే మార్పుచెందకుండా తమ వ్యక్తిత్వాన్ని ఇంతో అంతో నిలుపుకున్నవారు కొండలలో జీవిం చుతూ యితరజనప్రవాహాలతో సంబంధం లేకుండా తలదాచుకున్నవారూ, అతిప్రాచీనజాతులైన ఆటవిక వర్గాలూ మాత్రమే.

అందుచేత భారతదేశంలోని వివిధజాతులను గూర్చి సమీక్ష చేయవలసివచ్చినప్పుడు ప్రపంచంలో వున్న ఈ అన్ని జాతుల లక్షణాలనూ దృష్టిపథంలో వుంచుకోవలసి వస్తుంది.

భారతదేశపు విఖ్యాతశాస్త్రవేత్త శ్రీ బి. ఎస్. గుహ మనదేశంలో, ఈ దిగువజాతు లున్నట్టు గుర్తించారు.

1. నీగ్రో
2. ప్రోటో-ఆస్ట్రిలాయిడ్
3 మంగోలాయిడ్
   - (i) పాలియో-మంగోలాయిడ్
      - (a) నిలువుతల
      - (b) అడ్డతల
   - (ii) టిబెటో-మంగోలాయిడ్
4 మెడిటెరేనియన్‌జాతి
   - (i) పాలియో-మెడిటరేనియన్
   - (ii) మెడిటరేనియన్ (సాధారణ తెగ)
   - (iii) మెడిటరేనియన్ ఓరియంటల్
5. వెస్టరన్ బ్రాచీసీఫాల్ (అడ్డతల గల పశ్చిమ జాతులు.)
   - (i) ఆల్పొనాయిడ్
   - (ii) డినారిక్
   - (iii) ఆర్మినాయిడ్
6. నార్డిక్.

## నీగ్రోలు

ఈ జాతి ఆదిమనివాసం భారతదేశంలోని ద్వీపకల్పభాగం. కాని ఇప్పుడు వీరెక్కడా యీప్రాంతంలో కనుపించరు. వీరు మరుగుజ్జు రూపం కలవారు. (5 అడుగుల లోపు) చిన్నతల, గోళాకారం గల నుదురు, నల్లని చర్మం; కాని ఆఫ్రికా మొదలైన అధికోష్ణమండలాలలో వుండే నీగ్రోల కారునలుపు కాదు. సూర్యుని అల్ట్రావైలెట్ కిరణాలనుండి దేహాన్ని రక్షించడానికి చర్మం పొరపై యేర్పడే ఒక పదార్థం ఈ నలుపురంగుకు కారణం. ఇదికాక ఈ జాతిలో కనుపించే మరో ప్రత్యేకలక్షణం; కొవ్వుతో బలసిన పిరుదులు కలిగివుండటం. వీటి అన్నిటినీ మించిన ప్రత్యేకత తలవెంట్రుకల వైచిత్రి.



1. నీగ్రో—రాజమహల్ పర్వతప్రాంత ఆటవికులు, బెంగాల్
2. మంగోల్—నాగా, అస్సామ్.
3. ఆర్మినాయిడ్ — తమిళ బ్రాహ్మణుడు, మధుర.
4. మెడిటరేనియన్—తెలుగు బ్రాహ్మణుడు, విశాఖ.
5. ఆల్ప్-డినారిక్—గుజరాతీ వైశ్యుడు.
6. ,, —బెంగాలీ కాయస్థుడు.
7. నార్డిక్—పఠాన్.

తలమీద తీగచుట్టల్లా ఉంగరాలు చుట్టుకుని, తుప్ప లాంటి బిరుసు వెంట్రుకలు వుండి, మధ్య ఖాళీ జాగాలో కపాలం కనుపించుతూ ఉంటుంది. ఈజాతి మనుష్యులు ఇప్పుడు మలయా, న్యూగినీ, ఫిలిప్పైన్సు ప్రాంతాలలో కనుపించుతారు. భారతదేశంలో కొచిన్ కాదార్లు వైనాడ్‌లోని ఇరుల్లా మొదలైన ఆదిమ జాతుల ప్రజలు ఈ జాతికి చెందినవారే అండమాన్ దీవులలో కూడా ఇలాంటి ప్రజలున్నారు. బీహారులో గంగకు దక్షిణాన రాజమహల్ పర్వతాలలోనూ, అస్సాంలోని నాగపర్వతప్రాంతాల ఆటవిక ప్రజలలోనూ కూడా చాలామంది వున్నారు. భారతదేశపు ప్రధాన భూభాగంమీద యిప్పుడు ఎక్కడో సకృత్తుగా తప్ప వారు కనిపించరు. కాని ఒక అతి ప్రాచీనదశలో వీరు భారతదేశంలోని తూర్పు దక్షిణ ప్రాంతాలను ఆక్రమించి వుండేవారని మనం ఊహించవచ్చు.

## ప్రోటో-ఆస్ట్రిలాయిడ్

ఈ జాతికీ నీగ్రోజాతికీ కొన్ని పోలికలున్నాయి. కాని నుదురు నీగ్రోలకు వున్నట్టు, పసిపిల్లల నుదురులా చిన్నదిగానూ, గోళాకారంలోనూ వుండదు. విశాలంగా వుంటుంది. నుదురు అంచులు కోలగా పలకలు తీరి వుంటాయి, కాని ఈ రెండు జాతులకూ వుండే ప్రధానమైన వైవిధ్యం తలవెంట్రుకలలో కనుపించుతుంది. ఆస్ట్రిలాయిడ్ జాతికి జుట్టు ఉంగరాలు చుట్టుకుని వుండదు. తరంగాలు తరంగాలుగా ఒత్తుగా ఉంటుంది. చప్పిడిముక్కు. సంస్కృత వాఙ్మయంలో 'నిషాదు'లనే పేర వారి ప్రసక్తి కనుపించుతుంది. నాసికారహితులనీ, నల్లటిదేహం కలవారని అభివర్ణింపబడివున్నారు. వీరికీ ఆస్ట్రేలియా ఆటవికప్రజలకీ దగ్గరసంబంధం వుంది. అర్చిపెలగో దీవులలో కూడా ఈ జాతి కనుపించుతుంది. దక్షిణ భారత ప్రాంతంలో ఆదిమనివాసులు చాలామంది ఈజాతికి చెందినవారే. ఉత్తర భారతంలోని అర్థార్థం హిందువులుగా మారిపోయిన, ఆటవిక ప్రజలలోకూడా చాలామంది ఈజాతికి చెందినవారే. హైందవ సమాజంలో, నాలుగు ప్రధానవర్ణాలూ కాక మిగతా వెలిగావున్న ప్రజానీకమంతా చాలాభాగం ఈజాతివారేనని చెప్పవచ్చు. నీగ్రోల తరవాత ఈదేశాన్ని ఆక్రమించిన తొలిజాతిగా దీన్ని అంగీకరించటానికి తగిన ఉపపత్తులున్నాయి. తిరునల్వేలి జిల్లాలో భూగర్భంనుంచి బయటపడిన ఈజాతి ప్రజల తలపుర్రెలు ఇందుకు నిదర్శనంగా వున్నాయి. ఇవి చరిత్రకందని ప్రాచీనకాలంనాటివని శాస్త్రవేత్తలు చెబుతున్నారు. ఆస్ట్రేలియా ఆటవికజాతికి సన్నిహితత్వమున్న జాతి గనుక ఈజాతిని 'ప్రోటో-ఆస్ట్రిలాయిడ్' జాతి అని శాస్త్రకారులు సంకేతనామంగా చెబుతున్నారు.

## మంగోలాయిడ్ జాతి

ఈజాతికిగల ప్రత్యేకలక్షణాలు: తక్కిన జాతులకుమల్లే ముఖంమీదనూ శరీరంమీదనూ వెంట్రుకలు ఎక్కువగా మొలవవు. ముఖం బల్లపరుపుగా వుంటుంది. గవద బొమికలు బలంగా కొట్టొచ్చినట్టు వుంటాయి. ముక్కు ఆకారం అంత కొట్టవచ్చినట్టుండదు. మంగోల్‌జాతిలో ప్రత్యేకంగా గమనించదగినది, కన్ను ఆకారం. కనుగ్రుడ్డు బాదంగింజలా సుదీర్ఘంగా చెవులమీదికి వ్యాపించివుంటుంది. ఇదిగాక కనురెప్పపైన చర్మం ముడతపడి, కన్నులు సర్వదా నిమీలితాలుగా వున్నట్టు భ్రమకలిగిస్తూ వుంటాయి. ఈలక్షణాలన్నీ మంగోల్ తెగలన్నిటిలోనూ యింతో అంతో కనుపించుతూనే వుంటాయి. ముఖ్యంగా చీనా, టిబెట్టు జాతులలో విస్పష్టంగా గోచరించుతాయి.

మంగోల్‌జాతిలో రెండు ఉపశాఖలున్నాయి. (i) పాలియో మంగోలాయిడ్ శాఖ మొదటిది. దీనిలో మంగోల్ జాతి ప్రధాన లక్షణాలుగా పైన వివరించిన అంశాలు అంత కొట్టవచ్చినట్టు కనుపించవు. వీరిలో అనాదిమానవలక్షణాలు అధికంగా వుంటాయి. ఈ ప్రాచీన మంగోల్‌జాతిలో ఒకవర్గం నిలువుతల గలిగి, చామనచాయవర్ణంలో వుంటారు. ఈ లక్షణాలున్న ప్రజలు అస్సాం కొండజాతుల్లోనూ, బర్మాసరిహద్దు ప్రాంతాలలోనూ ఎక్కువగా కనుపించుతున్నారు. ఇందులో మరో తెగ వుంది: అడ్డతల గలవారు; కనురెప్ప ముడత బాగా స్పష్టంగా కనుపించుతుంది. వీరు మొదటి తెగకంటె కొంచెం నాగరికమైన జాతి.

(ii) పైన పేర్కొన్న ప్రధానలక్షణాలన్నీ టిబెటో-మంగోలాయిడ్ జాతిలో విస్పష్టంగా గోచ

రించుతాయి బారాటిమనుషులు; మంచి దేహకాంతి కలవారు; ముఖాలమీదా శరీరంమీదా వెంట్రుకలుండవు. కనురెప్ప ముడత విస్పష్టంగా కనుపించుతుంది. పెద్ద పరిమాణంగల అడ్డతల వుంటుంది. సిక్కిం, భూటాన్ ప్రాంతాలప్రజలు ఈ తెగకు చెందినవారు.

మనదేశంలో కనుపించుతున్న ఆటవికప్రజానీకమంతా పైన పేర్కొన్న మూడు ప్రధానజాతులలోనూ—నీగ్రో, ఆస్ట్రిలాయిడ్, మంగోల్ జాతులు—ఏ జాతికో ఒకజాతికి చెందినవారు.

## మెడిటరేనియన్ జాతులు

అనాదికాలంలో మధ్యధరాప్రాంతం ఆవాసంగా కలవారు గనుక ఈ జాతులను స్థూలంగా ఆ పేరున పిలుస్తున్నాం. పైన వివరించిన జాతులు పోతే, భారతదేశంలోని మిగతా ప్రజాబాహుళ్యంలో అధికభాగం ఈ మధ్యధరాజాతులకు చెందినవారే. మధ్యధరాజాతి అంటే ఇదంతా ఒకే ఒక్క పెద్దజాతి అనుకోకూడదు అత్యంత సన్నిహితములైన లక్షణాలు కల వివిధ ఉపజాతుల సంపుటిగా మాత్రమే మనం అర్థం చేసుకోవాలి స్థూలంగా ఈ జాతు లన్నిటలోనూ కనుపించే ప్రధాన లక్షణాలు మాత్రమే పరిగణించి అలాంటి లక్షణాలన్నీ కల తెగలనన్నిటినీ కలిపి స్థూలంగా మెడిటరేనియన్‌జాతి అంటున్నాం. ఈ జాతి సాధారణలక్షణాలు: నల్లటి శరీరచ్ఛాయ, నిలువుతల, సామాన్యమైన ఎత్తు. సళానువంటి శరీరం. ఈ జాతి తొలుత ఆఫ్రికా పచ్చికబయిళ్లలో నివసించుతూ అనంతరం అటు పశ్చిమానికీ ఇటు తూర్పుకు వ్యాపించి వుంటుంది. ఈ మధ్యధరా జాతిలో మూడు ప్రధానవర్గాలు కనుపించుతున్నయ్.

(i) పాలియో - మెడిటరేనియన్—(ప్రాచీన మధ్యధరాజాతి) మెడిటరేనియన్‌జాతులలో ఇది అత్యంత ప్రాచీనమైనశాఖ. ఈ వర్గానికీ నీగ్రో జాతులకూ కొన్ని దగ్గరపోలికలు కనుపించుతాయి. ఈ తెగ దక్షిణ భారతదేశానికి వలసవచ్చి, ద్రవిడభాషను మాట్లాడే ప్రజలలో అధికభాగంగా రూపొందింది. దక్షిణ భారతపు ఉష్ణాధిక్యత కారణంగా, క్రమేణా నలుపువర్ణాన్ని పెంపొందించుకుంది.

(ii) మెడిటరేనియన్ (సాధారణతెగ): ఈ రెండవ తెగ మధ్యధరాజాతులలో ప్రధానమైన తెగ. వీరు పాలియో—మెడిటరేనియన్ తెగ వచ్చిన చాలా కాలానికి భారతదేశానికి వచ్చివుంటారు. ప్రాచీనమైన సింధునాగరకత యావత్తూ ఈ తెగకు చెందినదే నని చెబుతున్నారు. అనంతరదశలో వారు ఆర్యదండయాత్రలు కారణంగా గంగానదీప్రాంతానికి తరిమివేయబడివుంటారు. నేటి ఉత్తరహిందూస్థానంలోని ప్రజాబాహుళ్యంలోని ప్రధానభాగం ఈ తెగకు చెందినవారే. అంతేకాక దేశంలోని యితర ప్రాంతాలన్నిటిలోనూకూడా అగ్రవర్ణాలుగా చలామణీ అవుతున్న ప్రజానీకంలో చాలాభాగం ఈ తెగకు చెందినవారే.

ఈ తెగ లక్షణాలు: చెప్పుకోదగిన ఎత్తు; చామనచాయ దేహకాంతి; నిలువుతల, కొట్టవచ్చినట్టు కనుపించే నాసిక.

(iii) మెడిటరేనియన్ ఓరియంటల్ తెగ: ఈ తెగకు ఈపేరు పెట్టిన శాస్త్రజ్ఞుడు ఫిశ్చర్. దీన్ని కొందరు యూదుజాతులలో కలుపుతున్నారు. కాని అది పొరపాటు. వీరికీ పైన పేర్కొన్న మెడిటరేనియన్ జాతిలోని రెండవతెగకూ చాలా సన్నిహిత లక్షణాలున్నాయి. ఈ రెండుజాతులలో కనుపించే తేడాలు; ఈ జాతివారికి విపరీతమైన నిడివిగల తల వుంటుంది ముక్కు ఉబ్బెత్తుగా వుంటుంది ఆసియా మైనర్, అరేబియా ప్రాంతాలు ఈ జాతి ప్రధాన కేంద్రాలు. ఈ జాతి, పంజాబ్‌ప్రాంతమంతా విస్తృతావధిని కనుపించుతుంది. రాజస్థాన్‌లోనూ ఉత్తరప్రదేశ్‌లోని పశ్చిమభాగంలోనూ కూడా బహుళవ్యాప్తంగావుంది. దేశంలోని యితరప్రాంతాలలోకూడా చెదురుబెదురుగా కనుపిస్తారు.

## వెస్టరన్ బ్రాచీ సేఫాల్

### (అడ్డతల గల పశ్చిమజాతులు)

భారతదేశానికి వచ్చిన జాతులలో అడ్డతలగల జాతి, మంగోల్‌జాతి కాక, పశ్చిమదేశాలనుంచి వచ్చిన జాతి మరొకటివుంది. ఈజాతిని వెస్టరన్ బ్రాచీ సేఫాల్‌జాతి (లేక అడ్డతలగల పశ్చిమజాతి) అంటున్నారు. ఈ జాతిని తిరిగి మూడు తెగలుగా విభజించవచ్చు.

(i) ఆల్పైన్ తెగ (ఆల్ప్స్‌పర్వత ఉత్తర శ్రేణి తెగ).

(ii) డినారిక్ (ఆల్ప్స్ దక్షిణ శ్రేణి తెగ).

(iii) ఆర్మినాయిడ్ (ఆర్మీనీయా ప్రాంతీయులు).

(i) ఆల్పైన్ తెగ (ఆల్ప్స్‌పర్వత ఉత్తర శ్రేణి శాఖ): ఈ జాతి లక్షణాలు—సుమారైన ఎత్తు; అడ్డతల; పెద్దముక్కు గుండ్రనిముఖం; పుష్కలమైన తలకట్టు; బలిష్టమైన దేహం.

(ii) డినారిక్ తెగ (ఆల్ప్స్ దక్షిణ శ్రేణిశాఖ). ప్రధాన లక్షణాలు: చెప్పుకోదగిన ఎత్తు; చామన చాయ దేహకాంతి; గద్దముక్కు.

(iii) ఆర్మినాయిడ్ తెగ (ఆర్మీనియా ప్రాంతీయులు): ఈ తెగవారిలో పై రెండు తెగలకూ గల లక్షణాలు ఇంకా విస్పష్టంగా కనుపించుతాయి. అడ్డతలగల ఈ పాశ్చాత్య జాతికీ మంగోల్ జాతికీ గల ప్రధానమైన తేడా ఒకటే. ఈ జాతికి నెత్తిమీద జుట్టు ఒత్తుగా పెరుగుతుంది.

ఈ జాతి తమ ఆదిమనివాసం వదలి పశ్చిమ సముద్రతీరం వెంట బయలుదేరి దక్షిణ బెలూచిస్థానం గుండా భారతదేశంలో ప్రవేశించి వుంటారు. ఆ పైని సింధుప్రాంతంగుండా, సౌరాష్ట్ర గుజరాత్, మహారాష్ట్ర, కర్ణాటక తమిళ ప్రాంతములకూ, అక్కడ నుంచి సింహళానికి వ్యాపించివుంటారు. వీరిలో మరొకభాగం అటు తూర్పుదిశగా పరిక్రమించి మధ్య ప్రదేశం, వింధ్యప్రదేశంలోని తూర్పుభాగం, బీహార్ ప్రదేశాలను ఆక్రమించారు.

ఈజాతి ఆంధ్ర, మలబారు ప్రాంతాలనుమాత్రం ఆక్రమించలేదు ఈ రెండు ప్రత్యేకప్రాంతాలలోనూ మధ్యధరాప్రాంతీయులు (పాలియో-మెడిటరేనియన్) ఆక్రమించారు.

స్వచ్ఛమైన 'డినారిక్ ఆల్పైన్‌జాతిని చూడాలంటే కూర్గులో చూడవచ్చు. వంగ, ఓఢ్ర, కర్ణాటక తమిళప్రాంతాలలోకూడా సకృత్తుగా కనుపించుతారు.

బొంబాయి పార్సీలుకూడా అడ్డతల కలిగివున్న జాతియే కాని. వీరు గుజారాత్ జాతికి భిన్నమైనవారుగానూ ఆసియామైనరుకు చెందిన ఆర్మినాయిడ్ తెగకు సన్నిహితులుగానూ కనుపించుతున్నారు.

## నార్డిక్ జాతి

భారతీయ సంస్కృతీపరిణామంలో నార్డిక్ జాతి దండయాత్ర (2000 క్రీ. పూ.) ఒక ప్రధానమైన ఘట్టం. వీరు దక్షిణ రష్యా బంజర్లు ఆదిమనివాసంగా కలవారు నిలువుతలగలజాతి; కాని మిగతా నిలువుతల జాతులకూ వీరికి చాలా తేడాలున్నాయి. ముఖ్యంగా శీర్షం చాలా పెద్దదిగా వుంటుంది; బలమైన గవద బొమికెలుంటాయి కనుగ్రుడ్లు గోధుమ వర్ణంనుంచి నీలవర్ణంవరకూ అనేక ఛాయల్లో వుంటాయి. సాధారణంగా ఈజాతికి రాగివెంట్రుకలుంటాయి. వర్తమానంలో ఈజాతివారు, పంజాబ్ రాజస్థాన్ ప్రాంతాలలో ప్రధానంగా కనుపించుతున్నారు. అంతే కాక, ఇతర జాతులతో సంయోగం పొంది ఉత్తరహిందూస్థానంలోని అగ్రవర్ణాలలో రెయిడ సెడా కనుపించుతూ వుంటారు. వంగదేశపు సరిహద్దులోకూడా కొన్ని ప్రాంతాలలో చెదురుగా కనుపించుతారు. మహారాష్ట్రం లోని చిత్పవన్‌బ్రాహ్మణకుటుంబాలలో ఈ జాతిలక్షణాలు ద్యోతమానంగా వున్నాయి. ఈ జాతి ఈ దేశం వచ్చి యింతకాలం అయినా అనేక ప్రధానలక్షణాలను అలానే నిల్వరించుకోగలిగింది:—నిలువుతల, ఉదారైన ఎత్తు ఇత్యాదయః. కాని (ఉష్ణప్రదేశం కావటం చేత) దేహవర్ణంలో మాత్రం కొంత చామనచాయరంగు వచ్చేసింది. యూరప్‌లోకి వలసవెళ్లిన యీ జాతి ప్రజలకూ యిక్కడికి వచ్చినవారికీ, ఇప్పుడు ప్రధానంగా కనుపించుతున్న తేడా ఇదొక్కటే.

భారతదేశంలో వున్న వివిధజాతుల లక్షణాలేమిటో మనం స్థూలంగా తెలుసుకున్నాం. కాని యీ వివరాలన్నీ కేవలం ఉజ్జాయింపున ఇచ్చినవే గాని కచ్చితంగా ఈజాతి ఇది అని నిర్ణయించటానికి ఎట్టి ఆస్కారమూ లేదు. అట్టి నిర్ణయానికి ప్రధానంగా వున్న అభ్యంతర మేమిటంటే, ఈ జాతులన్నీ అనేక శతాబ్దాల పరస్పరసంయోగంవల్ల, సాంకర్యంపొంది మిశ్రమస్థితిలో కనుపించుతున్నాయే గాని స్వచ్ఛమైన తన అనాదిలక్షణాన్ని నిలుపుకున్న జాతి, యించుమించు ఏఒక్కటీ లేదు.


భారత దేశము
జాతులు
టిబెటో-మంగోలాయిడ్
ఓరియంటల్
పాకిస్థాన్
మెడిటరేనియన్ ఓరియంటల్
ప్రోటో-నార్డిక్
పాలియో-మెడిటరేనియన్
ఓరియంటల్-మెడిటరేనియన్
ఆల్పో-డినారిక్
మెడిట. ఓరియంటల్
ప్రోటో-ఆస్ట్రలాయిడ్ ; నీగ్రో
పాలియో-మంగోలాయిడ్
పాలియో-మెడిటరేనియన్
పాలియో-మంగోలాయిడ్
తూ. పాకిస్థాన్
(అడ్డతల)
పాలియో-మంగోలాయిడ్
పాలియో-మెడిటరేనియన్;
ప్రోటో-ఆస్ట్రలాయిడ్; ఆల్పో-డినారిక్
ప్రోటో-నార్డిక్
పాలియో-మెడిటరేనియన్
ప్రోటో-ఆస్ట్రలాయిడ్
మెడిటరేనియన్-ఓరియంటల్;
ప్రోటో-నార్డిక్
పాలియో-మెడిటరేనియన్; ప్రోటో-ఆస్ట్రలాయిడ్
నీగ్రో

## జాతులు, భాషాసంస్కృతులు

మరొక చిత్రమేమిటంటే ఈ జాతులకూ, భాషావర్గాలకూ సంబంధమేమీ లేదు. ఉదాహరణకు; ద్రవిడభాషలు మాట్లాడే ప్రజలు ఎన్నో రకరకాల జాతులవారున్నారు. కాదార్ నీగ్రోలు, (అసలు వీరి అనాదిభాష యేమిటో మనకు తెలియనే తెలియదు) ప్రొటోఆస్ట్రిలాయిడ్ జాతికి చెందిన గోండులు, అనాది మెడిటరేనియన్ జాతికి చెందిన ఆంధ్రులు, తమిళులు, కూర్గులోని ఆల్పోడినారిక్ ప్రజలు— వారంతా ద్రవిడభాషలనే మాట్లాడుతున్నారు. అల్లాగే ఆర్యభాషలు మాతృభాషలుగా గలవారు అనేకజాతులవారు ఉన్నారు. అందుచేత "ద్రవిడ జాతి" వగైరా ప్రయోగాలు అర్థం పర్థం లేని అపప్రయోగాలు.

అలాగే భారతీయ సంస్కృతికి ఏ జాతి ఏమి దోహదం చేసింది అన్న విషయంకూడా ఖండితంగా తేల్చటానికి ఎట్టి అవకాశమూ లేదు. సంతానంకోసం వృక్షాదులను పూజించే సంప్రదాయం నీగ్రో జాతుల నుంచి సంక్రమించి వుండవచ్చు; జంతువుల అర్చన, దేవతామహిమల్లో విశ్వాసం ఇత్యాదయః ఆస్ట్రిలాయిడ్ జాతులనుంచి సంక్రమించి వుండవచ్చు. కాపాలికాది సంప్రదాయాలు, పట్టు టీ బియ్యం వగైరాలను ఉపయోగించటం, కొండచరియలలో అంతస్థులు అంతస్థులుగా మళ్లుగట్టి వ్యవసాయం చేయటం యీ మొదలైనవి మంగోల్ జాతుల నుంచి దిగుమతి అయివుండవచ్చు. సముద్రతీరాల మంగోల్ జాతులనుంచి తెరచాపపడవలు, కొబ్బరి పంటలూ దిగుమతి అయివుండవచ్చు సింధు నాగరకత కంతకూ కారకులు మధ్యధరాజాతులు. భారత సంస్కృతిలోని ప్రధానభాగం ఈ మధ్యధరాజాతులదే. పశువుల పెంపకం, నదీస్నానం, కుండలు తయారు చేయటం, మొదలైనవే గాక మతవిషయంలో నేమి, ఖగోళశాస్త్రవిజ్ఞానంలో నేమి వీరు భారతసంస్కృతికి కలుగచేసిన దోహదం ఇంతా అంతా కాదు. భారతీయ లిపులు చాలాభాగం వీరి లిపుల అనుయాయులే. నార్డిక్ జాతులు గుర్రాలను, ఇనుప పనిముట్ల వాడకాన్నీ, మనుపానాన్ని అన్నిటికంటె ముఖ్యంగా ఆర్యభాషను తీసుకువచ్చారు. అన్నిటికీ మించి తాత్వికరంగంలో వీరి ప్రజ్ఞ అమోఘం. కళా వేదాంత రంగాల్లో భారతదేశం సాధించిన మహోజ్వలత కంతకూ వీరే కారకులు.



సంబుద్ధి
సార్‌నాథ్ మూలగంధకుటీవిహారంలోని
కాంస్యమూర్తి



బౌద్ధవిహారం

బుద్ధగయలో ఆయాదేశాల బౌద్ధులు
ప్రత్యేకవిహారాలు నిర్మించారు. ఇది చైనాబౌద్ధుల విహారం

# బౌద్ధసంస్కృతి

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

బౌద్ధమతం వ్యాపించిన తొలికాలంలో మన దేశములో పూర్వం గణరాజ్యాలు, సంఘరాజ్యాలుండేవి. వీటి నిప్పుడు మనం రిపబ్లికు లంటున్నాం. ఈ రాజ్యాలు, రాజ పరిపాలితములైన రాజ్యాలు బలపడి సామ్రాజ్యాలుగా వృద్ధిపొందిన తరువాత, ఇవిపాతబడి నశించిపోయినవి. బౌద్ధయుగంలోని శాక్యరాజ్యం గణరాజ్యం. దేశ పరిపాలనకు న్యాయమునకు సంబంధించిన వ్యవహార మంతా శాక్యనాయకులు వారి రాజధానియైన కపిలవస్తు నగరంలోని గణరాజ్య సభామండపంలో సమావేశమై చర్చించి చక్కబెట్టేవారు. శాక్యుల రాజ్యము వలెనే మల్లుల రాజ్యమూ గణరాజ్యమే. 'వజ్జియ'నుబడి సంఘరాజ్యము (ఫెడరేషన్) ఈ రాజ్యమును ఎనిమిది కులములకు చెందిన కులపుత్రులు పరిపాలించేవారు. ఈ కులము వారిలో లిచ్ఛవులు, విదేహులు ముఖ్యులు. ఈ గణ, సంఘ రాజ్యములు మౌర్య సామ్రాజ్యము వర్ధిల్లిన తరువాత విజితములై అంతరించి పోయినవి. సామ్రాజ్యమైనా, చిన్నరాజ్యములైనా రాజ్యపాలన తంత్రములో భేదముండేది కాని ఈ రెండువిధములైన రాజ్యాలలోను రాచరికానికి సంబంధించిన అభిప్రాయాలలోను ఆచారములలోను ఒక రీతిగాన ఉండి, వ్యవహారం ఒక రీతిగా జరుగుతూ వచ్చేది.

ప్రాచీనకాలములో మన దేశంలో గణరాజ్యమయినా, రాజ పరిపాలిత రాజ్యమయినా రాజకీయంగాను, సాంఘికంగాను, ఆర్థికంగాను, మతవిషయకంగాను ధర్మం కాపాడటమే, ధర్మాన్ని అనుసరించడమే దాని విధి. ధర్మం అనే పదానికి చాలా విశాలార్థం ఉంది. ఈ సందర్భంలో ధర్మం అంటే ఇంగ్లీషున 'లా' అని గ్రహించాలి మనదేశంలో ధర్మానికి మూలం శ్రుతీ, స్మృతీ, ఆచారమూను. వీటినిబట్టే ధర్మశాస్త్ర గ్రంథాలు విరచితములైనవి. శ్రుతి అంటే వేదం. అందువల్ల మన భారతదేశంలో రాజ్యానికి చట్టములు, విధులు చేసే అధికారం లేదు—ఇప్పటి లాగ. రాజు ధర్మపరిపాలకుడు కాని ధర్మకర్త కాడు. బౌద్ధం హిందూ మతంలోనుంచి—వైదిక మతంలో నుంచి దానిమీది తిరుగుబాటుగా వచ్చిందే కాని దానికి కేవలము భిన్నమైనది కాదు. అందువల్ల హిందూ యుగంలో వాడుకలో ఉండిన ధర్మమే బౌద్ధయుగంలోను పాటింపబడుతూ వచ్చేది. హిందూ సంఘంలో అయినా, బౌద్ధ సంఘంలో అయినా ధర్మమే రాజతంత్రానికి ప్రాతిపదిక. పూర్వకాలంలో రాజ్యానికీ, రాజ్యానికీగల సంబంధం, ప్రధానంగా ఒక్క యుద్ధ విషయంలోనే. సామంత రాజ్యాలు ప్రభురాజ్యాలకు అన్నివిధముల లొంగి అణకువగా ఉండడంవల్ల వాటిని పరిగణనలోనికి తీసుకోవలసిన అవసరమే లేదు అందువల్ల స్వతంత్ర రాజ్యాల విషయమే మనం ఆలోచింపవలసినది. మొదట విరచితములైన ధర్మసూత్ర గ్రంథాలలో ధర్మానికి సంబంధించిన ప్రాథమిక సూత్రాలు మాత్రమే ఉన్నవి. బౌధాయనుడను ధర్మసూత్రకర్త ప్రకారం ఇతరరాజ్యాలతోగల సంబంధం విషయంలో రాజు ఆదర్శంగా పెట్టుకోవలసినసూత్రాలు ముఖ్యమైనవి మూడు: అవేమిటంటే (1) యుద్ధంలో ఎప్పుడూ వెన్నుచూపి పారిపోకూడదు, (2) విషసిక్తములైన ఆయుధములను ఉపయోగింపకూడదు, (3) భయపడిన వారు, పిచ్చివారు, నిరాయుధులు, స్త్రీలు, పిల్లలు, వృద్ధులు, బ్రాహ్మణులు-వీరు తనకు ప్రాణహాని కలిగించి నప్పుడు తక్క వారితో పోరాడ కూడదు. హిందూయుగంలో అయితే నేమి, బౌద్ధ యుగంలో అయితే నేమి, ఇదే మన దేశంలో ప్రాచీన కాలంనుంచీ ఆచారంగా వస్తూవున్న క్షత్రియ ధర్మం. దేశీయ ప్రభువుల పరిపాలన సాగినంతకాలం ఆర్య సంఘంలోని క్షత్రియ వర్ణంవారు అవలంబిస్తూ వచ్చిన ధర్మమిది. తుదకు దీనిని క్షత్రియ వర్ణంవారే కాదు, భూపరిపాలకులై, క్షత్రియ ధర్మం అవలంబించిన క్షత్రియేతరులు కూడా ఈ ధర్మాన్ని పాటిస్తూ వచ్చారు. ఇదే అంతర్జాతీయ, అంతర్ రాజ్యసంబంధా

లలో మనపూర్వులు పాటిస్తూవచ్చిన సనాతనధర్మం. కొన్ని కొన్ని కాలాలలో కొందరు కొందరు భూపతులు దీనిని పాటించని సందర్భాలు లేక పోలేదు. అయినా అటువంటివి ఇదివరలో చెప్పిన సామాన్య సూత్రానికి అపవాదాలే అవుతాయి. మొత్తం మీద ఈ ధర్మం మొన్న మొన్నటి వరకు అవలంబింప బడుతూనే వచ్చింది.

మెగాస్థనీసు చంద్రగుప్త చక్రవర్తి ఆస్థానంలో యవనరాయబారిగా ఉన్నాడు. అతడు వ్రాసిన ఇండికా అనే గ్రంథాన్ననుసరించి డయాడోరస్ ఇట్లా వ్రాస్తున్నాడు. ఏమనంటే, యుద్ధం సంభవించినప్పుడు ఇతర జాతులవారు దేశంలోని పంటపైరులు నాశనం చేయడం, గ్రామాలు తగలబెట్టడం వాటిలోని జనాన్ని-వ్యవసాయం చేసేవారు, బీదలు, సాదలు, అనే భేదంలేకుండా - అందరినీ వధించడం ఆచారం కాని హిందూదేశీయులు అట్లా చేయరు. యుద్ధం చేసే ఉభయ పక్షాలవారు ఒకరినొకరు చంపుకొంటారు. అంతే కాని, ఇతరులను, అందులోను వ్యవసాయకులను అసలే చంపరు, గ్రామాలు తగలబెట్టరు, చెట్లు కొట్టివేయరు. యుద్ధరంగానికి సమీపంలో వ్యవసాయకుడు తన పొలం దున్ని వ్యవసాయం చేసుకొంటూనే ఉంటాడు. అతనికే అపాయం హానీ కలుగదు.

ఇది యిప్పటికి రెండు వేలసంవత్సరాలకు పూర్వపు మాట. ఈ పద్ధతే అటుతరువాత కూడా అవలంబింపబడుతూ వచ్చిందనడానికి చాలా ఆధారాలున్నవి. మెగాస్థనీసుకు రమారమి వేయిసంవత్సరాలకు తరువాత హిందూదేశం సందర్శించడానికి వచ్చిన చీనా బౌద్ధయాత్రికుడు యువాన్‌చ్వాంగ్ ఇట్లా అంటున్నాడు. దేశంలో చిన్న చిన్న పోరాటాలు, పెద్ద యుద్ధాలు తరచుగా జరుగుతూనే ఉంటాయి. కాని యుద్ధం చేసేవారు ఒకరినొకరు వధించుకొనుట తప్ప ఇతరులకు ఏవిధమైన హానీ చేయరు అని. 'అభిధర్మకోశ' మనే బౌద్ధమత గ్రంథానికి గల వ్యాఖ్యాగ్రంథంలో వాదంలో తత్వశాస్త్రవేత్తలకు తమ ప్రత్యర్థుల అభిప్రాయాలను పూర్తిగా ఖండించే స్వేచ్ఛ ఉన్నా ఉభయపక్షాలవారికీ ఉపయోగకరమైన తర్కసూత్రాలను ఉభయులూ గౌరవించాలి. ఎట్లాగంటే, రాజులు తమ శత్రుసైన్యాన్ని నాశనం చేసినా పొలాలలో పనిచేసే కృషీవలుడు ఉభయ సైన్యాలకు ఆహారం పండించి యిచ్చి సహాయం చేసేవాడు గనుక ఉభయ కక్షులవారు అతనిని గౌరవిస్తారు. ఇందువల్ల బౌద్ధయుగంలో కూడా అంతకు పూర్వమున్న ధర్మమే అవలంబింపబడుతూ వచ్చిందనే విషయం తేటతెల్లమవుతున్నది.

ఈ విధమైన పద్ధతే పద్దెనిమిది పందొమ్మిదో శతాబ్దంలో కూడా వాడుకలో ఉండడం చూచి ఆశ్చర్యపడి దానిని తమ గ్రంథాలలో వ్రాసిన ఇంగ్లీషు చరిత్రకారులు, రాజకీయోద్యోగులు కూడా ఉన్నారు. యుద్ధము ప్రకటించుటకు సంధిచేసుకొనుటకు సంధివిగ్రహి అనే రాజకీయోద్యోగి ప్రతి రాజ్యంలోను పూర్వం ఉండేవాడు.

బౌద్ధమతం అహింసను ఎంత ఎక్కువగా బోధించినా యుద్ధాలు అంతరించను లేదు, అంతర్జాతీయ సంబంధాలలో అంత గమనింపదగిన మార్పు ఏదీ సంభవింపను లేదు. కాని కోసలులు శాక్యరాజ్యంమీదికి దండెత్తి వచ్చినప్పుడు శాక్యులు జరిపిన సత్యాగ్రహానికి బౌద్ధమత ప్రభావమే కారణ మనక తీరదు. బుద్ధుడంటే అతనికి సమకాలికుడైన కోసలాధిపతి 'పసేనది'కి చాలా గౌరవం. అందువల్ల బుద్ధుడవతరించిన శాక్యవంశమువారితో వియ్యమొందాలని అతని కోరిక. అతడొకమారు శాక్యవంశజులకు వార్త నంపాడు. శాక్యకులజను వివాహమాడాలని వుంది గనుక ఎవరినైనా తనకీయవలసిందని. శాక్యనాయకులీ విషయాన్ని చర్చించడానికి కపిలవస్తు నగరంలోని గణరాజ్య సభామండపంలో సమావేశమయినారు. ఈ విషయం చర్చించారు. కులంలో శాక్యనాయకులకు తామేమో గొప్పవారమనీ, కోసలాధిపతి 'పసేనది' తక్కువవాడనీ అభిప్రాయం. కాని శాక్యకులజ నీయమని నిరాకరిస్తే తమకంటె బలవంతుడు 'పసేనది', ఎక్కడ దండెత్తి వచ్చి తమ్ము పరిమారుస్తాడో అని భయం. అందువల్ల వారిలో మహానాముడనే శాక్యనాయకుడొకడున్నాడు, అతనికి దానిస్త్రీవల్ల కలిగిన ఒక కూతురున్నది. ఆమె పేరు వాసభఖత్తియ. ఆమెనిచ్చి 'పసేనది'కి పెండ్లిచేశారు. 'పసేనది'కి ఆమె దానిస్త్రీకి కలిగినదని తెలియదు. 'పసేనది'కి వాసభఖత్తియకు జనించిన విడూడభునికి కాలక్రమాన ఈ విషయం తెలిసి, అతనికి శాక్యులమీద ఆగ్రహం వచ్చింది. అతడు కోసల సింహాసనం ఎక్కిన తరువాత శాక్యులమీదికి దండెత్తివచ్చాడు. శాక్యనాయకులు తమ సైన్యాలను యుద్ధరంగంలో సమీకరించారు కాని బుద్ధుని ఉపదేశాన్ని పాటించి ఆయుధాలు పరిత్యజించి సత్యాగ్రహంచేశారు. ఇదే చరిత్రకు తెలిసిన మొదటి సత్యాగ్రహ సమరం. కాని బుద్ధుడు లోకోత్తర పురుషుడయినా ఒక వ్యక్తియే. అతని అహింసా

విధానం రాజ్యతంత్రంలో తరువాత పాటింపబడలేదు. దానిని లోకకల్యాణం నిమిత్తం రాజ్యతంత్రంలో ప్రవేశపెట్టిన మొదటి భూనేత అశోకచక్రవర్తి.

మౌర్యచక్రవర్తియైన అశోకుడు కళింగ దండయాత్రా కాలంవరకు తన తండ్రి తాత లవలంబించిన పద్ధతిని అనుసరించినవాడే, కళింగయుద్ధంలో విజయం కలిగినా అతనికి ఆనందం కలగలేదు. యుద్ధం వల్ల లక్షా యేభై వేలమంది కళింగంలోనుంచి వెళ్ళిపోయారు; అంతకంటె ఎన్నిరెట్లో యుద్ధంలో చచ్చిపోయారు యుద్ధంవల్ల కలిగిన కష్టాలు, నష్టాలు అనేకాలు. ఈ జన నాశనం, కష్ట నష్టాలు చూచి అశోకునికి అనుతాపం ఎక్కువైంది మన శ్శాంతి కోసం ఉపాసకుడుగా ఉన్నాడు. తరువాత బౌద్ధం అవలంబించాడు. 'కత్తితో సాధించిన విజయం విజయంకాదు; ధర్మ విజయమే విజయము' అని ఎలుగెత్తి చాటాడు. కరుణారసహృదయుడైన అతడు మనుషులందరు నా సంతానం, నా సంతానానికి ఐహిక పారలౌకిక సౌఖ్యాన్ని ఎట్లా కోరుతానో అట్లే సమస్త జనుల విషయంలోను కోరుతున్నానని తన రాజకీయ పరివారాన్నంతను ధర్మప్రచారం నిమిత్తం వినియోగించాడు ఈ ధర్మాన్ని పాలించినట్లయితే స్వర్గం లభించడమే కాకుండా రాజు ఋణాన్ని తీర్చుకొన్న వారవుతారని ప్రజలను ప్రబోధించాడు. దేశంలో యుద్ధాలాగిపోయినవి. రాజాజ్ఞ నిర్వర్తించడానికి జను లుత్సహించారు. దేశంలో శాంతి వెల్లివిరిసింది. శాంతి కాలంలో విదేశరాజాస్థానాలకు దూతలను పంపే ఆచారం పూర్వకాలంనుంచీ ఉంది. అశోకచక్రవర్తి కూడా తన దూతలను బర్మా, ఈజిప్టు, గ్రీసు మొదలైన దేశాలకు పంపడమే కాకుండా ఆ దేశాలలోని ప్రజలకు ధర్మం బోధించడం, మనుష్యులకు, జంతువులకు ఆరోగ్య శాలలు— ఆస్పత్రులు పెట్టడం, ఓషధులను పెంచేటందుకు ఆరామాలు వేయడం, ఈ పనులు చేయాలనికూడా వారికి ఆదేశించాడు. ఇదంతా అశోకు డవలంబించిన బౌద్ధమతప్రభావమే అశోకుని రాజనీతితో అంతర్జాతీయ సంబంధాలతో ఒక క్రొత్త యుగం ఆరంభమైంది. అశోకుడు తలిదండ్రులను సేవించవలెనని, ప్రాణిహింస చేయకుండవలెనని, వ్యయము తగ్గింపవలెనని, కలహించుట పరమతదూషణ కూడదని, ఆత్మనిగ్రహము, హృదయ పారిశుద్ధ్యము, కృతజ్ఞత, విశ్వాసము ఉండవలెనని, క్రౌర్యము, ఈర్ష్య, క్రోధము, గర్వము కూడదని — అతడు లోకకల్యాణకరములైన సామాన్య ధర్మములనే బోధించాడు; శీలం లేనివానికి ధర్మాచరణం సాధ్యంకాదన్నాడు. అశోకుడు చేపట్టుటతో బౌద్ధం ప్రపంచమతమయింది. బౌద్ధం వ్యాపించిన చోటల్లా బౌద్ధధర్మాలు, ముఖ్యంగా పంచశీలాలు ప్రజాహృదయాన్ని బాగా ఆకర్షించాయి.

సంసార దుఃఖంనుంచి విమోచన పొందాలంటే మనిషి శీలవంతుడు కావాలన్నాడు బుద్ధుడు. 'అష్టాంగ మార్గం'లోని 'సమ్యక్కర్మ'లో—అనగా చేసే పనులలో చేయవలసినవీ, చేయరానివీ ఉన్నవి. చేయవలసినవాటికి విధులని, చేయరానివాటికి నిషేధాలని పేరు. ఈ నిషేధాలలోనివే బౌద్ధుల పంచశీలాలు. ఇవేమిటంటే ... (౧) జీవహింస చేయకూడదు; (౨) ఈయబడనిదాని తీసికొనకూడదు; (౩) కామ సంబంధమున అవినీతికరంగా ప్రవర్తించకూడదు; (౪) అనృతము చెప్పకూడదు; (౫) సురాపానము చేయకూడదు. వీటితోపాటు ఇంకో అయిదున్నవి. కాని ప్రధానమైనవి ఇదివరలో చెప్పినవే. ఈ పంచశీలములు ఒక బౌద్ధానికే కాదు. హిందూ మతానికీ సామాన్యమైనవే. అశోకుడన్నట్టు శీలంలేనిదే ధర్మాచరణం సాధ్యంకాదు.

రెండవ ప్రపంచయుద్ధం తరువాత స్వాతంత్ర్య సంపాదన ప్రయత్నంలో ఇండొనీషియా నాయకుడు డాక్టరు సుకర్నో తమ జాతీయాదర్శాన్ని అయిదు సూత్రాలలో వివరించి వాటికి 'పంచశీ'లాలని పేరు పెట్టాడు. అవేమిటంటే: (౧) తమజాతిలో తాము విశ్వాసం కలిగిఉండడం — అంటే జాతీయత; (౨) విశ్వమానవ ప్రపంచంలో విశ్వాసం కలిగియుండడం; (౩) స్వేచ్ఛాదర్శంలో విశ్వాసం కలిగియుండడం; (౪) సాంఘిక న్యాయం (సోషల్ జస్టిస్)లో విశ్వాసం కలిగియుండడం; (౫) భగవంతునిలో విశ్వాసం కలిగియుండడం. బుద్ధుడు వ్యక్తి తరించే నిమిత్తం వ్యక్తి విషయంలో ప్రతిపాదించిన పంచశీలాదర్శాన్ని డాక్టర్ సుకర్నో కొంచెం మార్చి జాతీయాదర్శం చేశాడు. దేశకాల పరిస్థితులకు అనుగుణంగా అయిదు ముఖ్యసిద్ధాంతాలు ప్రతిపాదించి ఈ పంచశీలాదర్శాన్ని పండిత జవహర్లాల్ నెహ్రూ అంతర్జాతీయ రంగానికి మార్చాడు. క్రొత్తగా మన దేశాన్నే కాదు, వివిధదేశాలను ఆకర్షిస్తున్న ఈ పంచశీలాదర్శం ప్రతిపాదితమైంది బౌద్ధమతప్రభావం చేత కాదని ఎవరనగలరు?

# మనసులూ...! మమతలూ...!

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

ఆ రోజు ఉదయం నిద్ర లేచీ లేవకముందే, నాకనిపించింది ఎవరో క్రొత్తవాళ్లు లంకంత మా ఇంట్లో తిరుగుతుండటం. వంటింటి గుమ్మం దగ్గరగా గడప నానుకుని కూర్చుని ఓ క్రొత్తావిడతో మాట్లాడుతోంది మా అమ్మ, మధ్యమధ్య పమిటకొంగుతో కళ్లు వొత్తుకుంటూ. నల్లగా బొద్దుగా కాకిలాగు తొడుక్కున్న ఓ ఎనిమిదేళ్ళ అబ్బాయి గోడప్రక్కనున్న ట్రంకుపెట్టెమీద కాళ్ళు రెండూ ముడుచుకుని భయంభయంగా దిక్కులు చూస్తూ కూర్చున్నాడు. నల్లగళ్ళ పూలపరికిణీ కట్టుకున్న ఒక తెల్లమ్మాయి గిరగిరాలు తిరుగుతూ తనజడ తను చూచుకోడానికి ప్రయత్నిస్తోంది.

నాకు మెలకువ పూర్తిగా రావడంలేదు. కానీ ఆ అమ్మాయిని చూస్తుంటే మళ్లీ కళ్లు మూసుకోవాలనిపించటంలేదు. మంచంమీద ముసుగు తొలగించుకొన్న నన్నుజూచి ఒక్కసారి పక్కున నవ్వి తిరిగి తన పనిలో నిమగ్నురాలైంది ఆ అమ్మాయి. ఆ పసిపిల్ల నవ్వినప్పుడు విప్పారిన మల్లెపువ్వు జ్ఞాపకం వచ్చింది ఒక్క క్షణం. తెల్లని ఆ అమ్మాయీ, నల్లని ఆ జడా అల్లానే శాశ్వతంగా నాలో స్థిర నివాసం ఏర్పరచుకున్నాయి.

నిద్రలేచినా మంచం వదలని నన్నుజూచి మా అమ్మ "ఏమైంది రామూ!" అన్నది మెల్లగా. ఏమైనా పని ఉన్నప్పుడు ఆమె చెప్పేతీరలాంటిది. నిద్రబద్ధకం కొద్దిగా వదిలించుకుని, దుప్పటి ఓమూలకు త్రిన్ని, విధిలేక మంచం దిగి ఇంట్లో క్రొత్తవాళ్లున్నారన్న బిడియంతో గబగబా తల వంచుకునే దొడ్డిగుమ్మం వేపు నడిచాను. అంతవరకూ అమ్మతో మెల్లగా మాట్లాడుతోన్న ఆ క్రొత్తయువతి నా బిడియాన్ని చూచి కాబోలు కొద్దిగా పెద్దగా నవ్వి నన్ననుసరిస్తూ 'అలా సిగ్గుపడుతున్నావేమిటి రామూ నన్నుజూచి?' అన్నది సన్నగా.

అలా అంటున్నప్పుడు ఎందుకో ఆమె స్వరం కొద్దిగా వణికింది. కంపించే ఆ స్వరం విని ముందు పోతున్న నేను ఒక్కసారిగా వెనక్కు తిరిగాను.

ఉబికివస్తోన్న దుఃఖాన్నాపుకోటానికి బలవంతంగా ప్రయత్నిస్తోందామె.

ఆమె వదనం తిలకరహితమై వెలవెలబోతోంది.

ఆ నీలికళ్లు తీరని ఆవేదనతో కుమిలిపోతున్నట్లున్నాయి.

నేను వెనుకకు తిరిగి ఆమెవేపు సూటిగా చూస్తున్నానని తెలిసికొని, నాలోకి చూడలేక, వక్కసారిగా రెండుచేతుల్తోనూ మొగాన్ని కప్పుకుని తన విషాదాన్ని నేను తెలిసికోకుండా ఉండాలని విఫల ప్రయత్నం చేసిందామె.

ఇంతసేపూ ఒకప్రక్కగా నిలబడి నా మనోభావాలను సునిశితంగా పరిశీలిస్తున్న మా అమ్మ నన్ను సమీపించి "చిన్నప్పటి సీతనే మఱిచావా రామూ!" అన్నది శాంతంగా, ఎన్నడో గతంలో కోల్పోయిన ఆ అమూల్యవస్తువు తిరిగి సమీపిస్తున్న సమయంలో దూరం చేసికోవద్దన్నట్లుగా.

ఆ మాట వినగానే దశాబ్దంనాటి ఆ మధుర గాథ వక్కసారి నా స్మృతిపథంలో మెఱసి నన్ను పిచ్చివాణ్ని చేసి దూరంగా అదృశ్యమైంది.

సీత! ఒకనాడు నన్నున్మత్తుణ్ణి చేసిన సీత! నా హృదయంలోని 'మాధుర్యాన్నంతా' ఆమెముందుపోసి, జాలిగా, ప్రేమగా 'నేనంటే నీ కిష్టమేకదు సీతా' అని అడిగినప్పుడు పేలవమైన ఓ నవ్వు నవ్వి మౌనంగా వెళ్లిపోయిన సీత!

ఆమె ఇప్పుడిలా అకస్మాత్తుగా ఎందుకు నా గృహంలో అడుగిడిందో నాకర్థంకాలేదు. సీతవేపు చూచాను. ఇంకా అలానే దుఃఖిస్తోంది. ఆడుకుంటున్న ఆ బంగారుపాప వేపు చూచాను. చిరునవ్వుల జల్లులు చిందించుకుంటూ తన ప్రపంచం తను నిర్మించుకుంటోంది. ఆ నల్లబ్బాయివేపు చూచాను. అర్థంకాని దృక్కులతో సీతవేపు దీనంగా చూస్తున్నాడా పిల్లవాడు!

మా అమ్మ మళ్ళీ నా వేపు చూచి అన్నది. "నా అన్నావాళ్ళందరూ గతించారట. ఆస్తిపాస్తులు గానీ అంతఃపురాలు గానీ లేవట పాపం!"

ఒకనాడు నన్ను తృణీకరించి వెళ్ళిపోయిన సీత ఈనాడు తిరిగి నా పంచజేరి నా అనుగ్రహం ఆశిస్తోంది. ఒకవేళ ఇప్పుడు నేనూ తిరస్కరిస్తే?

ఊహించుకోలేకపోయా నా దృశ్యాన్ని. సిరి కోసం ఆప్తులను చేరేవారు కోట్లకొలది. ఆమెకున్న కొద్ది ఆస్తిపాస్తులూ హరించిన తర్వాత? నడివీధిలో ఆ అమాయకపు పసికందులు అన్నహారాలకోసం గోడుగోడున అలమటించవలసి రావచ్చు. వీధి మొగ మెరుగని సీత నాల్గు బాటల కూడలిలో నిలబడి పగుల క్షమాభిక్ష నర్థించవలసి రావచ్చు.

ఆలస్యం ఏమాత్రం లేకుండా మా అమ్మవేపు తిరిగి జవాబిచ్చాను. "సీత మనింట్లోనే వుండిపోకూడదా అమ్మా?"

మా అమ్మ నవ్వింది. ఆమెతో నలభై వసంతాల జీవితం గడిపిన మా నాన్నారికే ఆ మందహాసంలోని నిగూఢభావాలప్పుడప్పుడర్థంకావు. ఇక నేనా! అయోమయంగా ఆమెవేపు చూచాను. ఆమె సీతను వొళ్ళో దాచుకుని మెల్లిగా సముదాయించటానికి ప్రయత్నిస్తోంది

ఆ దృశ్యం ఎంత హృదయవిదారకంగా వుంది!

తల నెరిసిన వృద్ధు మా అమ్మ. ఆమె వొడిలో జీవిత సుడిగుండాలర్థంచేసికోలేని అమాయక హృదయ సీత! పద్మపత్రంలా కంపిస్తున్న సీతను చూడలేక గబగబా ఆ ప్రాంగణం దాటి బయటకు వచ్చేశాను.

చెట్లమధ్యగా సిగ్గుపడ్డ మొగంతో బయటకు వస్తున్న సూర్యుని చూచినా నా సీతను నేను మరువలేకపోయాను కడుపునిండినా ఇంకా తృప్తిలేక తల్లిని బాధిస్తున్న లేగదూడను చూచినా ఆడుకుంటున్న ఆ బంగారుపాప నా మదిలో మెదుల్తూ నేవుంది. గోళీలాడుతూ అల్లరిగా ఒకరి నొకరు త్రోసుకుంటున్న ఆ బడిపిల్లలను చూచినా, దిగులుగా ట్రంకుపెట్టె మీద కూర్చున్న ఆ నల్లబ్బాయి జ్ఞాపకం వస్తూనే వున్నాడు. కాలకృత్యాలు ముగించానన్న మాటేకాని గాయపడిన సీత హృదయాన్ని పూరడించలేనే అన్న వేదన మిక్కుటంగా బాధిస్తూ నేవుంది. త్వరత్వరగా మరలా చావడిలోకి నడిచాను. అమ్మ అక్కడలేదు. పిల్లలిద్దరూ అప్పుడే ఎక్కడకు వెళ్ళారో అర్థంకాలేదు. సీత మాత్రం వంటరిగా గోడనానుకుని నిలబడి తనలో తనే కుమిలిపోతోంది.

నా రాకను గమనించినట్లులేదు సీత. దుఃఖబాష్పాలామె కంఠానికు తెఱలుకట్టి ప్రపంచాన్ని చూడనీయకుండా చేస్తున్నాయిగామోసు! మెల్లిగా సమీపించి, కొద్ది దూరంలో నిలబడి "సీతా!" అని పిలిచాను నేను పిలిచిన పిలుపు నాకే వినబడినట్లులేదు. సీతకు వినబడి వుండదని నా అభిప్రాయం. కాని సీత మెల్లగా కళ్ళు తెఱచి నా వేపు ఒక్కసారి చూచి తిరిగి కళ్ళు మూసుకొంది.

ఆడవారి హృదయాలు అగాధాలట! కానీ అప్పటి సీతను చూచిన వారికి మాత్రం నేనామె హృదయపీఠంలో ఏ కొద్దిగానో స్థానం సంపాదించుకొన్నానని మాత్రం తెలిసికోగలరు. సీతను సమీపించి మెల్లగా ఆమెను నా వేపుకు త్రిప్పుకున్నాను. అప్పుడు... అప్పుడు... మొదలు నరికిన తరువులా సీత నాపాదాలవద్ద రాలిపోయింది. హీనమైన నా పాదాన్ని వేడి కన్నీటితో అభిషేకం చేసి, తన నన్నుని చేతులతో నన్ను బంధించి 'రామూ' అన్నది దీనంగా.

నేను చలితుణ్నయ్యాను నన్ను తృణీకరించిన సీతలో ఇంతగా నాపై వాత్సల్యమున్నదని అంతవఱకూ నాకు తెలీదు. మెల్లగా సీతను లేవనెత్తి "భయపడకు సీతా—ఇంకా నీ చిన్ననాటి రామూ చనిపోలేదు" అన్నాను వ్యగ్రతతో. సీత ఏమీ మాట్లాడలేదు. తనలో తననుకుంటున్నట్లుగా "నా పిల్లలు... నా పిల్లలు..." అని మాత్రం కలవరించింది.

నా కళ్ళు చెమ్మగిల్లడం నేను చూచుకోనేలేదు. నా ఊహల్లో నేను పరిభ్రమిస్తూ ప్రకృతాన్ని మఱచిపోవడం గమనించనేలేదు. సీత తన పమిట కొంగుతో నా కన్నీరు తుడిచే వఱకూ జాగృదవస్థలోకి నేను రానేలేదు.

"నన్నుజూచి నువ్వు దుఃఖిస్తున్నావేమిటి రామూ!" వర్షించిన మేఘంలా వుంది ఆమె వదనం. జవాబుకోసం తడుముకున్నాన్నేను కొద్దిసేపు.

"నీ మెడకొక గుదిబండను కాదుకదు రామూ నేను?" అంత విషాదంలో కూడా ఇంత సున్నితంగా మాట్లాడడం ఒక్క సీతకే చేతనవును.

అందుకే ఆమె అంటే నాకు పంచప్రాణాలూ! ఇంతలోకి ఆ చిన్నిపాప పరుగెత్తుకుంటూవచ్చి తల్లి వొడిలో వాలింది. ఆ పాపను సీత ప్రేమగా హృదయానికి హత్తుకుంది. ఆ పాప నును చెంపలపై ముద్దుల

వర్షం కురిపించింది. మాతృప్రేమ నంతటినీ నా ముందే వొలక బోసింది.

"ఈ జలజ, ఆ రఘులే రామూ నా జీవితానికేడుగడ. ఈ పసికందులను చూచే నే బ్రతుకవలసి వస్తోంది."

పెద్ద ఆరిందాలా సీత చెబుతున్న ఆ మాటలకు నేను నవ్వకుండా వుండలేక పోయాను. నా కళ్ళ ముందు పుట్టి పెరిగిన సీత చివరకు నాకే పాఠాలు బోధిస్తోంది.

"ఈ రోజే బళ్ళో చేర్పిస్తాను పిల్లిద్దర్నీ!" అన్నా నెమ్మదిగా ఆ పసిపిల్లల మొగాల్లోకి చూస్తూ. సీత నోటితో ఏమీ చెప్పకపోయినా ఆ కళ్లలో విరిసిన ఆ జ్యోతులు ఆమె భావాన్ని వ్యక్తపరిచాయి

ఆలా ప్రవేశించింది సీత మళ్ళీ నా జీవితంలోకి. బిక్కు బిక్కుమనే మా యిల్లు మళ్ళీ ఆనంద తరంగాల్లో వోలలాడింది. మా అమ్మకు చేతినిండా పని; సీతకు మనసునిండా సంతోషం, పిల్లలకు కావలసినంత తృప్తి. ఒంటరివాణ్ణైన నేను మళ్ళీ సంసారంలో ఓ బాధ్యత కలిగిన వాణ్ణయ్యాను. రాత్రి పూట పిల్లలకుపాఠాలు, పగటిపూట బడిపనీ, సాయంకాలం చక్కగా సీతతో అదీ ఇదీ మాట్లాడడం; మా యింట్లో సీత తిరుగాడుతుంటే రాజహంస నడయాడుతున్నట్లుండేది. ఆమె మా యింటికి ఒక కళ, లక్ష్మి. కానీ—

ఆ రోజు రాత్రి...

పుచ్చ పువ్వులావున్న వెన్నెల ఆకాశంనుండి క్రిందకు రాల్తోంది. సముద్రపు కెరటాలు గట్టునున్న బండరాళ్ళను విడువలేక విడువలేక వెనక్కి వెళ్తున్నాయి. 'మినర్వా'నుండి జనం ఒక్కరొక్కరే తిరిగి తమ యిండ్ళకి జేరుకుంటున్నారు.

అయినా ఆ నిశీథ ప్రశాంతత ఏమాత్రం చెక్కుచెదరకుండా అలానేవుంది. దరిదాపు నిర్జనంగావున్న గజపతిరోడ్డుగుండా ఇంటికి నడక ప్రారంభించాన్నేను. దారిలో పడుకున్న ఒకటి రెండు కుక్కలు నన్ను చూచి మొరిగి దూరంగా వెళ్ళిపోయాయి. ఇల్లు చేరటానికింకా ఎంతో దూరం వుండడంవల్ల త్వరితం చేసిన నా నడకనుచూచి పైనున్న పున్నమ చంద్రుడు కూడా పరుగెత్తడం ప్రారంభించాడు.

దూరంగా మారుక్రిందనున్న చీకటిలో ఏవో నీడలు రెండు వకదానిలో నొకటి త్వరత్వరగా కలిసి పోయాయి. అప్పుడే నన్ను దాటిపోయిన రిక్షాలో నుండి కిలకిలలు వినిపించీ వినిపించనట్లు వినిపించాయి. పైనున్న తారలు కూడా శశాంకుని పెనవేసుకుంటున్నాయి.

ఆ సౌందర్యానికి నేనూ వివశుణ్ణయ్యాను. నా హృదయాంతరాళ్లో ఎక్కడో ఒకమూలనున్న ప్రేమ కొంతెరలు తీయనిరాగ మాలపించాయి. అయినా ఇంటిమీది ధ్యాసతో నడుస్తూనే వున్నాను.

ఇంతలో—వెనుకనుండి గాజుల సవ్వడి. మల్లె పువ్వుల పరిమళం అనిర్వాచ్యమైన ఏదో ఆకర్షణకు లోబడి వెనుకకు తిరిగి చూడకుండా వుండలేక పోయాను.

తెల్లచీర ఆమె వొంటికి మరింత సోయగాన్ని సమకూరుస్తోంది చక్కని ఆ వదనం నును సిగ్గుదొంతరలు చిందిస్తోంది ఆమె ఆ వెన్నెట్లో, ఒంటరిగా క్రీగంట దిక్కులు చూస్తూ — చూడముచ్చటేసింది. దరిజేరకుండా వుండలేకపోయాను

భీతహరిణి ఒక్కసారి నా వేపుచూచి, తల వంచుకు నడవడం ప్రారంభించిందామె. మంత్రముగ్ధునిలా ఆమె ననుసరించాను.

ఆ అర్ధరాత్రి ఆ అందాలరాశితో ఎన్నో సందులూ, గొందులూ గడిచి చివరకు నేను చేరుకున్నది ఓ పూరిగుడిసె

బయట వెన్నెల వెలుగులు విహరిస్తుంటే ఆ పూరి గుడిసెలో గుడ్డిలాంతరు చివరిశ్వాస పీల్చుకుంటోంది. ఓ నులకమంచం వాల్చి, దానిమీద కూర్చోమన్నట్టుగా మౌనంగా సంజ్ఞచేసిందాయువతి.

పరులెవ్వరూ లేకపోయినా ఈ మూగ ప్రణయమెందుకో? నా నరనరాల్లో నాకే తెలియని చైతన్యమేదో ప్రవహిస్తోంది. నా మనస్సు అంతు తెలియని ఆనందప్రపంచంలో విహరించాలని ఉరకలు వేస్తోంది. ఆ మంచంపై కూర్చోకుండా ఆ యువతి వెనుకకుజేరి ఆమె వదనాన్ని నా వేపుకు త్రిప్పుకున్నాను. ఆమె సిగలోని ఒక మల్లెపువ్వు నా పాదాలక్రిందబడి, నలిగి పోయింది. బలంగా ఆమెను నా వేపుకు త్రిప్పుకోవడంలో ఆమె చేతి గాజు వకటి విరిగిపోయింది.

అప్పటికీ ఆమె నాతో మాట్లాడనే లేదు. దీనంగా నా కళ్లలోకి చూస్తూ చేయి జాపింది డబ్బుకోసమన్నట్లుగా.

ఒక అబల—అదీ అర్ధరాత్రి—నా అనుగ్రహాన్నాశించడం, నిజంగానాలోని పురుషత్వం కోటుకాలరు సవరించుకొంది. గర్వంగా ఆమెవేపు ఒక్కసారి చూచి జేబులోని పర్సుతీసి ఆమె వేపు విసిరివేశాను.

నా యీ చర్య చూచి మెరిసిన ఆమె కళ్లలో సౌందర్యదేవత తాండవించి నట్లనిపించింది నాకు.

ఆమెనుండి ప్రసరించిన చంద్రికలు అణువణువునా నాకు శైత్యోపచారాలు చేశాయి.

ఆమె వేపు చూస్తూ అలాగే నిలబడిపోయాను చిత్రప్రతిమలా.

ఆమె పర్సు తెరిచింది. నాలో ఆభిజాత్యం వెలిగింది.

పర్సులో డబ్బుకోసం చూస్తోందామె. ఆమెలో విరిసిన అందాన్నవలోకిస్తున్నాన్నేను. చూస్తుండగానే—ఆమె యెందుకో కళవళపడింది. ముఖం చిట్లించింది.

ఎఱ్ఱబడిన ఆమె వదనం ఎంత అందంగా వుంది!

మెల్లిగా ఆమెను సమీపించి కారణం కనుక్కోవాలనుకున్నాను. అందుకు ముందు రెండడుగులు వేశాను.

ఇంతలో సుతిమెత్తని పదార్థమేదో బలంగా నా చెంపను—అబ్బా! కళ్ళు బైర్లుకమ్మాయి. ఆసరాకు పక్కనున్న గోడను—ఆనుకోవలసి వచ్చింది.

ఆమె బుసలు కొడ్తోంది!

కోపంతో ఆమె నిలువునా కంపిస్తోంది!

ఆమె అంటున్న మాటలేవీ నాకు సరిగా విన్పించలేదు. కానీ 'దరిద్రుడా!' అన్న శబ్దం మాత్రం నన్ను సమీపించి నా హృదయంలోకి చొచ్చుకుపోయింది. నాకాశ్చర్యం వేసింది. పిచ్చి పిల! నెలతిరిగే సరికి రెండువందల వెండిరూపాయలు సంపాయించే నన్ను దరిద్రుడంటోంది. నేనే దరిద్రుడైతే ఈ హిందూదేశంలో ఇక నూటికి ఒకడుకూడా భాగ్యవంతుడుండడం—అసంభవం!

కూర్చున్న స్థలంనుండి లేచి ఆమెను సముదాయించబోయాను. నన్ను దగ్గరకు జేరనివ్వకుండా ఆమె కండ్లనుండి నిప్పులు కురిపిస్తూ ఉత్త పర్సు నా ముందు పడేసి "ఏదీ డబ్బు?" అని అరిచింది.

పర్సులో చిల్లరడబ్బులు మాత్రం వున్న సంగతి, అప్పుడు జ్ఞాపకం వచ్చింది. నాకు ఈ అర్ధరాత్రి ఇంత పరాభవం సహించడం తలగొట్టేసినట్లనిపించింది. ఆమె వేపు సూటిగా చూడలేకపోయాను. మౌనంగా అలాగే కూర్చుండిపోయాను.

కొద్దిసేపు నిశ్శబ్దం. తలవంచుకు కూర్చున్న నాకు ఎవరో ఏడుస్తున్నట్లనిపించింది. ఆ ఏడుపులోనుండి ఆవిర్భవించినట్లున్నాయి ఆ మాటలు. "ఈనాడు కూడా గంజికి నేను నోచుకోలేదు. అరువు తెచ్చిన పూలకు డబ్బుకోసం వస్తాడు వాడు. ఇంతకన్నా ఆత్మ—"

వినలేకపోయాను నేనా మాటలు. ఆమె హృదయంలోని బాధ ప్రతి మానవుడికీ అర్థమౌతుంది. కానీ మానవుడుగా చలామణీ అవుతున్నా ఆమెకు సహాయం చేసే స్థితిలో మాత్రం లేను.

ఆమె వేపు తిరిగి చూడకుండా ఆ కుటుంబంనుండి బయటకు వచ్చేశాను. వెనకనుండి ఆమె వెక్కి వెక్కి ఏడుస్తున్నట్లు కొద్దిదూరంవరకూ విన్పిస్తూనే వుంది.

నేను రోడ్డుమీద నడుస్తున్నాన్న మాటే కాని ఆమె రూపం నానుండి తొలగించుకోలేకపోయాను. బెదురుతున్న ఆకళ్ళు, చూడగానే ఆకర్షించే ఆ మొహం యింటికి చేరేంతవరకూ నన్ను వెంటాడుతూనే వున్నాయ్.

అదీగాక పరాభవం నాలో జ్వలిస్తున్నా, స్త్రీ కాంక్ష కూడా నాలో జాజ్వల్యమానమౌతూనే వుంది. ఆమె కోపమూర్తిగా ఏకసమయంలో నాకు కనిపించినా, తెల్లచీరలో దాక్కున్న ఆమె దేహం నాకు చక్కిలిగింతలు పెడుతూనే వుంది.

ఇంటికి చేరి తలుపుకొట్టగానే, గడియ వేసిలేదు గామోసు, వూరకనే వచ్చేశాయి తలుపులు. లోపలికడుగెట్టి, గడియ వేసి, పైనున్న చంద్రుడింకా వెలుగుతుండడం చూచి నాలో నేనే తిట్టుకుంటూ నా మంచం చేరబోయాను.

అసలే వేసవికాలం—అందులోనూ వెన్నెల రాత్రి. ఇటువంటి సమయంలో సామాన్యంగా మా అమ్మ నా మంచాన్ని దొడ్లోవున్న పున్నాగ చెట్టు క్రింద వేస్తుంటుంది. సీత రాకముందు మా అమ్మకూడా తన పడకను దొడ్లోనే వేసుకునేది. కాని సీత మా జీవితంలో ప్రవేశించినప్పటినుంచీ వారిద్దరు కలిసి ఇంట్లో పడుకోవడం అలవాటు చేసుకున్నారు. పిల్లలుమాత్రం నామాలిమి మానలేక, నా ప్రక్కనే తమ మంచాలు కూడా వేయించుకుని, కథ చెప్పించుకుని మరీ నిద్రపోయేవారు ప్రతి రాత్రీ.

అలవాటు ప్రకారం పున్నాగ చెట్టు క్రిందున్న పట్టెమంచం వద్దకు వెళ్ళాను. పున్నమి చంద్రుడు తన ఆకతాయి తనం మానకుండా పడుకున్న వాళ్ళ మొగాలమీదకు వెన్నెల బాణాలు పంపుతూ చిలిపిగా నవ్వుతున్నాడు. ఆ పాలకాంతుల్లో నా మంచంమీద అమాయకంగా నిద్రపోతున్న సీత మొగం కొట్టవచ్చినట్లు కనిపించింది నాకు.

గాలికి గామోసు ఆమె జడ ముడివీడి ఆ నల్లని శిరోజాలు పట్టు దిండుమీద నాట్యం చేస్తున్నాయి! నల్లని శిరోజాల మధ్యగా ఎఱ్ఱని ఆమె పెదవులు నవ్వుకుంటున్నాయి తమలో తాము!

ఆ సౌందర్య మూర్తిని ఒక్క క్షణం అలా చూస్తూ నిలబడ్డాను. ఇంతలో ఆ ప్రశాంతమూర్తి ఆ స్థలంలో అదృశ్యమై, ఇందాక నేచూచిన ఆ అందాల బరిణ నవ్వుతూ ప్రత్యక్షమైంది.

నాకేమీ తోచకుండా వుంది. ఇది కలా? యథార్థమా? మళ్ళీ వక్కసారి కళ్లు నులుముకుని ఆ మంచంవేపు చూచాను. సీత చిరునవ్వులతో నిద్రిస్తోంది.

సీతను చూస్తూ, ధనంకోసం, మానాన్నమ్ముకునే ఆ వేశ్యను జ్ఞాపకం తెచ్చుకున్నందుకు నన్ను నేనే నిందించుకున్నాను కాని—నన్ను నేనెంత నిందించుకొన్నా ఆ భావం మాత్రం నాలోంచి పోవటంలేదు.

డబ్బు పారేసి ఆ యువతిని కొనుక్కోగలను నేను. సీతకు డబ్బేకాక సర్వం సమకూరుస్తున్నాను. అయినప్పుడు నాకు, ఆ యువతిపైవున్న అధికారం సీతపై మాత్రం ఎందుకుండ కూడదూ?

ఈ పాపపు వ్యూహంలో కీటకాన్నయ్యాను. తప్పించుకుందామన్నా తప్పించుకోలేకుండా వున్నాను. అక్కడికీ వెనుకకు తిరగాలని రెండడుగులు వేశాను. కానీ మనసులోని కాంక్ష పైశాచిక వికటాట్టహాసంతో ఉటంకిస్తోంది. నాలో చెప్పలేని దౌర్బల్యం ఏదో ప్రవేశించింది. లోని భావావేశంతో బాటు ప్రతి అవయవమూ మహా ఆరాటపడిపోతోంది. మనసూ, మెదడూ, దేహం, ఒకటేమిటి చైతన్యమున్న ప్రతి అణువూ సీతపైనే కేంద్రీకృతమై నన్ను ఆమె వేపుకు నడిపించినై.

నిద్రిస్తోన్న ఆమె వంపుల సోయగంమీద పైనున్న పున్నాగపుష్పాలుపడి తీయని పరిమళాన్ని వెద జల్లుతున్నాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు చలిస్తున్న ఆమె సౌందర్యం విభ్రాంతి కల్గిస్తోంది.

ప్రతీ మానవుడిలో విరుద్ధశక్తులు పనిచేస్తుంటాయట! కానీ నన్ను అప్పుడు మాత్రం రాక్షసత్వం నిలువునా ఆక్రమించుకొంది. ఏంచేస్తున్నానో నాకే తెలీదు. నాలో మంచీ-చెడూ-విచక్షణ పూర్తిగా నశించింది.

నిద్రిస్తున్న సీతపై ఏమి అత్యాచారం చేశానో!

ఆమె ఒక్కసారిగా ఉలిక్కిపడి లేచింది. ఉన్మాదస్థితిలోవున్న నన్ను జూచి కెవ్వుమని కేక వేసి 'అన్నయ్యా!' అంటూ నా పాదాలవద్ద పడిపోయింది.

ఆమె కేకలు విని అమాయకంగా నిద్రపోతున్న ఆ పసికందులు కంగారుగా లేచి, సీత నా అయోమయ స్థితిలో చూచి మరింత బెంబేలు పడిపోయారు.

పిల్లల భీతావహస్వరం విని ఇంట్లో పడుకున్న మా అమ్మ అదాటుగా ప్రవేశించింది ఏమిటేమి టంటూ.

నా తల తిరిగిపోతోంది. కాళ్ల క్రింది భూమి లోలోతునకు క్రుంగుతున్నట్లనిపిస్తోంది. నిలబడలేక తూలి క్రిందబడబోయాను.

మా అమ్మ నన్ను చూచి మరింత గాబరా పడిపోయింది. 'ఏమైంది రఘూ!' అని ఆదుర్దాగా ప్రశ్నిస్తూ నాకు ఆసరాగా పట్టుకుంది.

సీత తనకుతానే తెప్పరిల్లుతున్నది. పరిస్థితి నవలోకించి తన స్థానం తెలిసికున్నదిగా మోసు మెల్లిగా మా అమ్మ ప్రక్కకు చేరి "ఏమీ లేదమ్మా నేనూ, నిద్రలో కొద్దిగా పెద్దగా కలవరించడం చూచి అనవసరంగా భయపడిపోయాడు!" అన్నది.

సీత మాటలు విన్న నేను ఆమెవేపు చూడలేకపోయాను. ఎవరికైతే ద్రోహం తలపెట్టానో వారే నన్ను రక్షింపవలసి రావటం—నా గదిలోకి పరుగెత్తుకు వెళ్ళి మంచంమీద కుమిలిపోతూ పడుకున్నాను. అవ్యక్తంగా ఎప్పుడు కన్నుమూశానో!

మళ్ళీ కళ్లు తెరిచేసరికి ప్రపంచంలోని రణగొణ ధ్వనులు నా చెవికి వినబడుతున్నాయి. కానీ మా యిల్లే నిశ్శబ్దంగా వుంది. పిల్లల చిరునవ్వులు వినిపించడంలేదు. సీత అందెల రవళి మోగడంలేదు. మా అమ్మ మౌనంగా గృహంలోని పని గబగబా చేసుకుంటోంది.

గబగబా ఆమెవద్దకు పరుగెత్తుకు వెళ్ళాను. ఇల్లంతా అలా నిద్రపోవటానికి కారణ మేమిటని అడిగాను.

మా అమ్మ కొద్దిసేపు జవాబీయకుండా వూరుకొని తరువాత నెమ్మదిగా అన్నది. "ఎవరో దూరపు చుట్టాలు, ఎక్కడో వున్నారట! చూసివస్తానని వెళ్ళింది పిల్లను తీసుకుని. నిన్ను మాత్రం రఘును జాగ్రత్తగా చూస్తోండమంది!"

వర్షంలేని పిడుగు మీదపడింది. మరుమాటాడకుండా వెళ్ళిపోయాను. మా అమ్మవేపు చూడలేక.

ఏలా అకస్మాత్తుగా నా జీవితంలోకి ప్రవేశించిందో ఆలా అకస్మాత్తుగానే వెళ్ళిపోయింది సీత, నన్ను మళ్లీ వంటరివాణ్ణి చేసి. కాని వెళ్లిపోయేటప్పుడు మాత్రం నా మెడలో గుదిబండను తగిల్చి మరీ వెళ్లింది!

# అశ్వఘోషుడు : బౌద్ధవాఙ్మయము

శ్రీ సామవేదం జానకిరామశర్మ

సాధారణంగా భారతీయులు మన ప్రాచీన ఔన్నత్యాన్ని తలుచుకొని గర్వపడుతూ ఆ ఆవేశంలోనే పశ్చిమదేశవాసులు ఆ ప్రాచీనకాలంలో అనాగరకులుగా ఉండేవాళ్లని చెప్పుకొని సంతోషిస్తూ ఉంటారు ఈ కాలంలో ఏ క్రొత్త విషయాన్ని పాశ్చాత్యులు కనిపెట్టారనే వార్త విన్నా ఆ క్రొత్త విషయం అతి ప్రాచీనకాలంక్రిందటే మనవాళ్లు కనిపెట్టియున్నారని వేదాల్లోంచో, పురాణాలలోంచో ఉదాహరణలు చూపిస్తూ ఉంటారు. ఇందులో కొంత స్వాభిమానాన్ని స్ఫురింపజేసే మానసిక ప్రవృత్తి వెల్లడి అవుతూవున్నా సర్వం అసంగతం అని కొట్టి పారవేయటానికి వీలులేదు. ఇలా కొట్టివేయటానికి వీలు లేకుండా మనకు గౌరవాన్ని సంపాదించిపెట్టిన వాటిల్లో ముఖ్యమైనవి వేదాలూ, పురాణాలూ, మహాకావ్యాలూను. వేదాలు అపౌరుషేయాలనీ అతి పురాతనాలనీ — పురాణాలైనా వేలకొలది సంవత్సరాలక్రిందటివే,అనీ ఇక రామాయణాది మహాకావ్యాలుగూడా ఆతరగతికి చెందినవే అనీ, విజ్ఞులెల్లరకూ తెలిసినవిషయమే. ఐతే మనదేశానికి కీర్తిప్రతిష్ఠలు సంపాదించిపెట్టిన ఈ గ్రంథాలన్నీ సంస్కృతభాషలోనే వ్రాసిఉన్నై. అంతేకాదు అన్నిటియొక్క మహత్తరాశయమూ ఒక్కటే. అది ఏమిటంటే— మానవుణ్ణి ఉత్తమశీలవంతునిగానూ, పరోపకారపరాయణునిగానూ సంఘశ్రేయస్సునుకోరే ఉత్తమ ఔదార్యవంతునిగానూ రూపొందించటమే! ఈ ప్రయత్నసిద్ధి వేదాలూ, పురాణాలూ కావ్యాలూ అనే ఏఒక్క తెగగ్రంథాలద్వారానైనా కావటానికి వీలున్నా ప్రజల శక్తిసామర్థ్యాల ననుసరించి భిన్న భిన్న రూపాలు పొందవలసివచ్చినై. ఆ దినాల్లో ఏ మంచివిషయాన్ని లోకానికి బోధించవలసిఉన్నా సంస్కృతంలో చెప్పితీరవలిసిందే. అదే సంస్కృతానికి ఉన్న పరమపూజ్యత, ఉత్కృష్టత. కనుకనే వైదికమతాన్ని కాదని వేఱుగా ప్రచారం చేయదలచుకొన్న బౌద్ధమతావలంబులకు కూడా సంస్కృతభాషే ఉపాదేయమైంది. బౌద్ధమతవ్యాప్తికి ప్రారంభదశలో సంస్కృతమే అవలంబనంగా ఉన్నదని చెప్పటానికి పైవిషయాలు సూక్ష్మంగా చెప్పటమైంది.

సంస్కృతాన్ని బుద్ధచరితముద్వారా బౌద్ధమత ప్రచారానికి స్వీకరించిన కవి అశ్వఘోషుడు అని కొందఱు తలచుచుండగా 'లలితవిస్తరము' అను వేఱొక గ్రంథము — అనిశ్చితకర్తృత్వముగలదన్నీ — సంస్కృతభాషలో వ్రాయబడినదన్నీ — సర్వప్రథమస్థానము నాక్రమిస్తుందని మఱికొందఱు అనుకొంటున్నారు. బుద్ధచరితము సంపూర్ణముగా బుద్ధుని ఉదంతమును తెలుపుతూ ఉండగా లలితవిస్తరము మాత్రము బుద్ధుడు తన ప్రథమోపదేశాన్ని ప్రారంభించినంతవఱకుగల కథనుమాత్రమే తెలియచేస్తోంది. ఏమైనా— ఈ రెండుగ్రంథాలూ సంస్కృతభాషలోనే వ్రాయబడి ఉన్నవి. అశ్వఘోషుడుగాక ఇతరులుకూడా సంస్కృతంలో బౌద్ధధర్మ ప్రచారానికి చాలా గ్రంథాలూ వ్రాసినవారు ఉన్నారు. అంతేకాకుండా సంస్కృతగ్రంథరచనలు సాగినతరువాత పాలీభాషలోగూడా బౌద్ధమతగ్రంథాలు అనేకం ఉద్భవించినై. ఈ వ్యాసంలో అశ్వఘోషుణ్ణి, ఆయన సంస్కృతభాషలో వ్రాసిన బౌద్ధమతగ్రంథాలనూ గూర్చి మాత్రమే మనవిచేసుకుంటున్నాను.

చాలాకాలం క్రిందటివరకూ బౌద్ధగ్రంథాలు అసలు పాలీభాషలోనే వ్రాయబడి వున్నవని అనుకొనేవాళ్లు. పందొమ్మిదవ శతాబ్దపు ప్రారంభంలో పాశ్చాత్యులు — నేపాళము, తిబెత్తు మంగోలియా, సింహళము మొదలైన దేశాలలో ఉండి బౌద్ధవాఙ్మయాన్నిగూర్చి చేసిన విశేష పరిశోధనలఫలితంగా పాలీభాషలో ఉన్న గ్రంథాలు సంస్కృతగ్రంథాలకు అనువాదాలని తేలింది. ఈ పరిశోధనల్లో విశేష శ్రమ చేసినవారిలో ముఖ్యులు — నేపాళంలో హడ్గసన్ — తిబెత్తు దేశమున సోమడికొరోసీ — మంగోలియాల్లో ష్మిడ్ — సింహళంలో జార్జి టర్నరు

అనువారు. చీనా, జపాన్ దేశాలలో మాత్రం సంస్కృతగ్రంథాలే ఎక్కువగా లభించినై. క్రీ. శ. ఎనిమిదో శతాబ్దంలో బౌద్ధభిక్షువై ఖ్యాతి నార్జించిన వినీత దేవులనే పండితులు బౌద్ధవాఙ్మయం, సంస్కృతం, అపభ్రంశం, పైశాచి, మొదలైన భాషల్లో ప్రచారంలో ఉన్నట్లు పేర్కొన్నారు.

ఈ బౌద్ధమతం ఆ కాలంలో మనదేశంలోనే కాకుండా కొంచెం ఇంచుమించుగా ప్రాచ్యదేశాలన్నిటిలోనూ — విశేషవ్యాప్తి చెందివుండి, నేటికీ మనదేశంలోకంటె విశేషంగా అవలంబించబడుతూన్నప్పుడు — తద్వ్యాప్తికి ఎంత ప్రచారం జరిగి ఉండెనో ఊహించి తెలిసికోవచ్చు. ఆ ప్రచారసాధనాలుగా ఎన్ని ఉద్గ్రంథాలు రచింపబడిఉండెనో ఊహించలేము. కాలగర్భంలో ఎన్నో అణగిపోయి ఉండవచ్చు. మనకు ఇప్పుడు ఆయా దేశాల్లో లభ్యమయిన వాఙ్మయంకూడా తక్కువ అని అనలేము. ఆ దేశాల్లో — ఆ గ్రంథాలు — బౌద్ధమతం మిక్కిలి వ్యాప్తిలో ఉన్నది కనుక తప్పక పరిరక్షింపబడుతూనే వుంటవి. పోతే మనదేశంలో ఆ మతానికి ప్రాముఖ్యం లేకపోయినా మనంకూడా వానిని సాహిత్యదృష్టితోనైనా కాపాడటం ధర్మం. వైదిక బౌద్ధ మతాలలోని తర తమ భేదాలనుగూర్చి చర్చించడంకంటే — కళా దృష్టితో — వాఙ్మయదృష్టితో ఆ గ్రంథాలు మనకుకూడా ఆదరణీయాలు కాకతప్పదు.

అశ్వఘోషుడు ఏ శతాబ్దంవాడో స్థూలంగానైనా తేల్చటానికి ముందు బుద్ధుని కాలాన్నిగూర్చి కూడా యోచించటం అవసరం కాకపోదు. బుద్ధుడు క్రీ. పూ. 6 వ శతాబ్దంలో జీవించియుండినట్లు చరిత్రకారులు నిర్ణయించారు. కనుక అశ్వఘోషుడు ఆ తరువాతివాడు కావటంలో ఆశ్చర్యం లేదు. చాలామంది చరిత్రకారులు అశ్వఘోషుడు కనిష్కుని కాలంలోవాడని నిర్ణయించారు. ఈ కనిష్కుడు బుద్ధుడు నిర్వాణంపొందిన పిమ్మట 9 వందల యేండ్ల నాటివాడని హుయన్‌త్సాంగు—4 వందల యేండ్ల నాటివాడని మాక్సుముల్లర్ పండితుడు—క్రీ. శ. 278 వాడని భండార్కరూ అన్నారు. పాచి, మొదలగు పండితులు అశ్వఘోషుడు క్రీ. శ. 2 శతాబ్ది వాడని నిర్ణయంచేశారు. బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు తమ 'సంస్కృత కవి జీవితం'లో పైవారి మతాలనన్నిటినీ తెలిపిఉన్నారు. అశ్వఘోషుడు కనిష్టుని కాలంనాటివాడనటానికి చీనా దేశపు కథలు ప్రబలసాక్ష్యం ఇస్తున్నవి. వీనిలో ఆ సంగతి నిస్సందేహంగా చెప్పిఉంది. అంతేకాకుండా కనిష్కుని కాలంలో 'అభిధర్మ'వ్యాఖ్యానము 'విభాష' అనే దానిని అశ్వఘోషుడే వ్రాసి ఉండెనని కూడా చెప్పబడుతోంది. అశ్వఘోషుని ఇంకో గ్రంథం 'శారిపుత్రప్రకరణం' వ్రాతప్రతి ఒకటి దొరికింది. అది కనిష్కుని కాలపు లిపిని తెలియచేస్తోంది. దీనినిబట్టి ప్రొఫెసరు లూడర్సు అనుపండితుడు అశ్వఘోషుడు కనిష్కుని కాలంనాటివాడని నిర్ణయం చేశాడు. ఇంకో విషయంకూడా వుంది. అశ్వఘోషుని బుద్ధచరిత్ర చీనా భాషలోకి అనువాదం క్రీ. శ. 5 శతాబ్దంలో జరిగింది. కాబట్టి అంతకు పూర్వమే అశ్వఘోషుడు జీవించి ఉన్నాడనటం సమంజసమేకదా! అశ్వఘోషుని రచనల్లో కాళిదాసును అనుసరిద్దామనే ప్రయత్నం—భావాల్లోనూ, భాషలోనూ గూడా కనిపిస్తుంది. దీనివలన కాళిదాసు తరవాతవాడే అశ్వఘోషుడు అవుతాడు. మొత్తం మీద అశ్వఘోషుడు సుమారు రెండువేల సంవత్సరాలకు పూర్వపువాడని నిర్ణయించవచ్చునని తేలింది.

అశ్వఘోషుడు సౌందరనందమనే తన గ్రంథంలో తుదిని "ఆర్యసువర్ణాక్షీ పుత్రస్య సాకేతకస్య భిక్షోరాచార్యస్య భదన్తాశ్వఘోషస్య మహాకవేర్మహావాదినః కృతి రియమ్" అని వ్రాయడాన్నిబట్టి ఈయన తల్లి పేరు సువర్ణాక్షి అని, అయోధ్యానగరవాసి అనీ తెలుస్తోంది. ఈయన వ్రాసిన గ్రంథాలనుబట్టి ఆలోచిస్తే హిందూ ధర్మగ్రంథాలలో మిక్కిలి పాండిత్యం గడించినట్లు తెలుస్తుంది. ఏ కారణం చేతనో ఆయన బౌద్ధమతావలంబి అయినాడు. అంతమాత్రంతో ఊరుకోక ఉపదేశకుడుగానూ ప్రచారకుడుగానూ కూడా తన ధర్మాన్ని నెరవేర్చినాడు. చీనా యాత్రికుడు ఇత్సింగ్ తన భారతదేశయాత్రనుగూర్చి వ్రాస్తూ అందులో అశ్వఘోషుడు బౌద్ధమతానికి పట్టుగొమ్మ అని వర్ణిస్తూ ఆయన రచనలను ఆ కాలంలో ప్రతి మఠంలోనూ శ్రద్ధాభక్తులతో పఠిస్తూ ఉన్నట్లుగా పేర్కొన్నాడు. అశ్వఘోషుడు, నాగార్జునుడు, దేవుడు అనే ఈ మూర్తిత్రయమునకు బౌద్ధమతాభివృద్ధిప్రయత్నంలో ఒక విశిష్టమైన స్థానం

ఏర్పడిఉన్నదనీ, ఇలాంటివాళ్లు అదృష్టవశాత్తూ శతాబ్దానికి ఏ ఒకళ్లో పుడుతూ ఉంటారనికూడా ఇత్సింగ్ కీర్తించాడు. హుయన్‌త్సాంగ్‌కూడా ఇత్సింగ్ అభిప్రాయాలనే వెల్లడిచేస్తూ—అశ్వఘోషుఁడు, నాగార్జునుఁడు, దేవుఁడు కుమారలబ్ధుఁడు అనే ఈ నలుగురు బౌద్ధశాస్త్రజ్ఞులూ ప్రపంచానికి వెలుగునిచ్చే నలుగురు సూర్యులవంటివారని శ్లాఘించాడు.

మనదేశంలో నేటికీ ఔత్తరాహులు కొంత మంది అశ్వఘోషుణ్ణి కాళిదాసుతో సమానమైన లేక అంతకంటె గొప్పవాడైన కవిగా వర్ణించి తమకు అశ్వఘోషునిపైనా ఆయన కవిత్వంపైనా ఉన్న అభిమానాన్ని వెల్లడిచేస్తున్నారు. నిజానికి అశ్వఘోషుఁడు కాళిదాసు కవిత్వాన్ని బాగా జీర్ణంపచేసుకొని ఆకవిత్వమంటే ఎక్కువ ఆదరాభిమానాలు కలవాఁడనిమాత్రం చెప్పవచ్చు. కనుకనే ఆయన రచనల్లో పదాలలోనూ భావాలలోనూ కూడా మహాకవి కాళిదాసునకు అనుకరణలు కనిపిస్తూ ఉన్నవి. అశ్వఘోషుని తక్కువ చేయటమూ, ఎక్కువ చేయడమూ కాక ఉన్నదున్నట్లు బ్ర. శ్రీ. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు "కాళిదాసు కవిత్వముతో పోలకున్నను తక్కిన అనేకుల కవితకు అశ్వఘోషుని కవిత్వము తీసిపోదు" అని వచించినది యథార్థమని గ్రంథములు చదివినవారికి తోఁచకపోదు. వీనిలో పాండిత్యప్రదర్శనోద్దేశం కవికి యెంతమాత్రమూ ఉన్నట్లు గోచరింపదు. ఈ విషయాన్ని అశ్వఘోషుఁడే తన బుద్ధచరితము తుదిసర్గ తుదిశ్లోకంలో ఆ గ్రంథప్రయోజనాన్ని వివరిస్తూ—కళాకౌశలం కోసంగానీ, పాండిత్యప్రదర్శనంకోసంగానీ ఈ గ్రంథం వ్రాయలేదు. కేవలం జగత్తుకు, సుఖాన్నీ, ఉపకారాన్నీ కాంక్షించి ఇది వ్రాశానని చెప్పుకొన్నాడు.

అశ్వఘోషుఁడు సంస్కృతభాషలో రచించిన గ్రంథాలలో బుద్ధచరితము, సౌందరనందము, శారిపుత్రప్రకరణము మొదలైన మూఁడు నాటకభాగాలూ, స్తోత్రగాథ, సూచివజ్ర, మహాయానశ్రద్ధోత్పాదకము, సూత్రాలంకారము అనునవి ఇప్పటికి ఉపలబ్ధములైనవి. ఈ గ్రంథాలవిషయం సంగ్రహంగా వివరిస్తాను.

బుద్ధచరితం ఒక మహాకావ్యంగా పండితులంతా అంగీకరించారు. ఇందులో బుద్ధుని జీవితమూ సిద్ధాంతాలూ వర్ణించబడినై. సంస్కృతంలో ఉన్న ఈ కావ్యంలో 14 సర్గలు మాత్రమే నేటికి కనబడుతున్నవి. మొత్తం ఇందులో 28 సర్గలు ఉన్నవి. ఐతే సంస్కృతశ్లోకాల్లో సగం గ్రంథంమాత్రమే మనకు ఉపలబ్ధమైంది. మిగిలిన 14 సర్గలూ చీనా భాషలోనూ, తిబెత్తు భాషలోనూ ఉన్నవి. 28 సర్గలలో ఉన్నకథ బుద్ధ నిర్వాణందాకా ఉన్నది. సంస్కృతంలో 14 సర్గలలోనూ ఉన్నకథ బుద్ధజననం మొదలు బుద్ధత్వప్రాప్తిదాకా ఉన్నది. తిబెత్తు భాషలో ఉన్న సంపూర్ణమైన ప్రతినిబట్టి మిగిలినకథ సంస్కృతంలో లేనిది తెలుసుకోటానికి వీలైంది. తిబెత్తుభాషలో ఉన్న సంస్కృతంలో లేనికథ హిందీలో ఇప్పుడు పరివర్తనం చెంది భారతదేశం నాలుగు మూలలా సంపూర్ణ బుద్ధచరితకథ లభ్యమయ్యేటట్టు చేసింది

ఇత్సింగ్ బుద్ధచరితాన్ని గూర్చి, భారతదేశం అంతటా ప్రచారంలో ఉన్నదనీ, భారతీయులు దాన్ని విసుగులేకుండా ఆనందంతో పలుసారులు పఠిస్తున్నారనీ వ్రాశాడు. బుద్ధచరితంలో అనావశ్యకములై విసుగుపుట్టించే అలంకారాలు కానీ, అలంకారాల కోసం ప్రత్యేకం కవి ప్రయత్నం చేసినట్టుగానీ కనిపించదు. గౌతముణ్ణి మోహపరవశుణ్ణి చేసి వివాహం చేసుకుందామని సౌందర్యవతులైన స్త్రీలు పడ్డ పాట్లను—గౌతముడు మందిరం విడిచి విహారార్థం పోయేటప్పుడు గుంపులు గుంపులుగా కూడి ఆయన్ని చూచే స్త్రీల మనోవికారాలనూ, చేష్టలనూ—ఆయన మహాభినిష్క్రమణ సమయంలో నిద్రిస్తూ ఉన్న స్త్రీలస్థితినీ—వర్ణించిన శృంగారఘట్టాలు రమణీయంగా ఉన్నవి. 14 సర్గలో కుల పురోహితుఁడు గౌతమునకుచేసిన నీతిబోధ అశ్వఘోషుని సమగ్ర జ్ఞానానికి నిదర్శనంగా ఉంది. ఇంకా, అనేకఘట్టాల్లో ఆయన కవితాప్రతిభ ప్రకాశించి పాఠకులను తన్మయులను చేసేటట్టుగా ఉన్నది.

సౌందరనంద కావ్యంలో 18 సర్గ లున్నవి. సౌందరనందకావ్యపు మూలప్రతులు రెండు జీర్ణావస్థలో ఉన్నవి, అవి ప్రాచీనకాలానివి నేపాలదేశపు రాజాగారి గ్రంథాలయంలో లభ్యమైనవి. కాని వాని ననుసరించి సౌందరనందం పూర్తిగా శుద్ధప్రతిని



బుద్ధదేవుని ప్రధాన శిష్యులు శారిపుత్ర, మౌద్గల్యాయనుల అస్థి నిక్షేపాలు భద్రపరచిన మందసం.

తయారుచేయటానికిగానీ, పాఠభేదాలను ఉచితములని తోచినవానిని నిర్ణయించటానికిగానీ బాగా వీలుకలుగలేదు. సౌందరనంద కావ్యం బౌద్ధధర్మాలతో నిండి ఉంది. ఇది మొత్తం మీద, హీనయానసంప్రదాయానికి చెందిన గ్రంథమైనా, అక్కడక్కడ మహాయానసంప్రదాయ సిద్ధాంతాలుకూడా ఇందులో ఉల్లేఖింపబడి ఉన్నై. బుద్ధుని జీవితసంబంధాలైన కొన్ని దృశ్యాలూ,ఘటనలూ బుద్ధచరితలో సంగ్రహంగా ఉన్నవిన్నీ, అసలులేనివిన్నీ సౌందరనందంలో సమగ్రంగా వర్ణింపబడివున్నవని చెప్పవచ్చు. ఈ దృష్టితో మనం చూస్తే సౌందరనందం బుద్ధచరితానికి పూరణగ్రంథం అవుతుందనికూడా చెప్పవచ్చు.

సౌందరనందంలో సుందరీనందుల కథ ప్రధానంగా ఉంది. సుందరి నందుని ప్రియురాలు. నందుడు బుద్ధుని సోదరుడు. సుందరీనందులకు ఒకళ్లపై ఒకళ్ళకు ఉన్న ప్రేమ మాటలతో చెప్పలేనంత ఉత్కృష్టమైంది. పాపం బుద్ధుడు ఏ మాత్రం ఇచ్ఛలేని నందుడికి తన ధర్మదీక్ష ఇప్పిస్తాడు; పత్నీవియోగాన్ని భరించలేని నందుడు చాలా దుఃఖించాడు, అంతేకాదు బుద్ధుని వలలోంచి తప్పించుకొని సుందరి దగ్గరకు పారిపోవటానికి కూడా ప్రయత్నం చేశాడు. బౌద్ధభిక్షువులు అనేకవిధాల అతని మనస్సు మార్చటానికి ప్రయత్నం చేసి విఫలులైనారు. అప్పుడు బుద్ధుడు నందుణ్ణి తనవెంట పెట్టుకొని హిమాలయాల



శారిపుత్ర మౌద్గల్యాయనుల అస్థి నిక్షేపాలను ప్రతిష్ఠించటానికి ఇటీవల సాంచీలో నూతనంగా నిర్మింపబడిన చైత్యగిరి విహారం.

దాపుకు వెళ్ళాడు. అక్కడ ఓ గ్రుడ్డి ఆడకోతి కనపడింది. దానిని బుద్ధుడు నందుడికి చూపించి, ఈ గ్రుడ్డికోతి అందంగానూ విలాసంతోనూ ఉన్నదా? లేక నీ భార్య అందగానూ విలాసయుక్తంగానూ ఉన్నదా? అని సూటిప్రశ్న వేశాడు. అప్పుడు నందుడు స్వామీ! ఈ కోతికీ! నా భార్యకూ ఏమి పోలిక ఉన్నది స్వామీ అని దీనంగా వాపోతాడు. బుద్ధుడు అంతటితో ఊరుకోక నందునకు ఇంద్ర లోకంలో ఉండే అప్సరసలనుచూపించి నీ భార్యకూ వీరికీగల తేడా ఏమిటో చెప్పుమంటాడు. ఆ దేవతా స్త్రీలనుచూచి నందుడు ముగ్ధుడై—ప్రభూ నా భార్యలోనూ కోతిలోనూ ఉన్న అంతరమే ఈ అప్సరసలలోనూ నా భార్యలోనూ కనపడుతోందని ఆశ్చర్యపోతూ అన్నాడు. ఆఅప్సరసలను చూసేటప్పటికి నందుడి మనస్సు చలించింది కూడా. అప్పుడు బుద్ధుడు: రూపము, సేవాబుద్ధి, బలము, దానశీలత, మొదలైన ఉత్తమస్థితులు తేలికగా అందటమూ, లభ్యంకావు. అవి లభ్యం కావాలంటే అవలంబించవలసింది ఉత్తమ తపస్సు. అది లేకుండా ఏఉత్తమస్థితీ లభ్యంకాదు, అనే మాట జ్ఞాపకం ఉంచుకోవలసిందని హెచ్చరిస్తాడు. అది నందునిమనస్సులో బాగా నాటింది. వెంటనే తపస్సు ప్రారంభిస్తాడు. ద్వంద్వ

తీతుఁడుగూడా అవుతాడు. ఆ స్థితిలో ఉన్న నందు డితో బుద్ధశిష్యుఁడు-ఆనందుడు-స్వర్గానందం స్వల్ప కాలావధి కలదనీ, స్వర్గనివాసం ప్రవాసంతో సమాన మనీ, పుణ్యక్షీణత కలిగితే తిరిగి మర్త్యలోకంలో జీవులు ప్రవేశిస్తారనీ చెప్పి—నందుడికి స్వర్గంమీదా—అప్సరసలమీదా వైముఖ్యం కలిగిస్తాడు. ఆపైన నందుడు బుద్ధుని దర్శనంచేసి ఆయనతో దేవా! సర్వ దుఃఖాలనూ రూపుమాపే మీ ఉత్కృష్టధర్మంలో, నేను ఆనందం పొందుతున్నాను. కనుక నాకు ఆ ధర్మసారం సంగ్రహంగా వ్యాఖ్యానించండి. అది విని ఆచరించి పరమపదాన్ని అందుకుంటానని వేడు కొన్నాడు. బుద్ధుడు ఆదరంతో నందుడికి ఉపదేశం చేస్తాడు. ఆ ప్రకారం నందుడు ప్రయత్నించేసి 'అర్హత్తు' డవుతాడు. ఆ పిమ్మట గురుశిష్యులు మళ్ళీ కలుసుకుంటారు. శిష్యుడు గురు ఋణం తీర్చటానికి ఆలోచిస్తూవుంటే అప్పుడు బుద్ధుడు పరోపకారం చేయటమే తగిన గురుకట్నం అవుతుందని ఆదే శిస్తాడు. ఎవరు ఉత్తమ నైష్ఠిక ధర్మమార్గావలంబులై ఇతరులకుకూడా దీన్ని ఉపదేశిస్తూ ఉంటారో వారే ఉత్తములు అవుతారు. వారిజన్మే చరితార్థమవు తుంది. కనుక తిమోవృతమై ఉన్న ఈ లోకంలో వారికి నీవు ధర్మప్రదీపధారణం చేసి వెలుగుమార్గం చూపించు అని బోధిస్తాడు. అంతేకాకుండా నీ భార్య సుందరికూడా నీవలెనే స్త్రీలకు వైరా గ్యోపదేశం ఈపైన చేయగలదు అని అనుగ్రహిస్తాడు.

దశవిధరూపకాల్లోనూ ప్రకరణం ఒకటి. శారి పుత్రప్రకరణమనే అశ్వఘోషుని ఈగ్రంథం ఆజాతికి చెందింది. నాయకుఁడు ప్రశాంతుఁడూ ధీరుఁడూ ఐన విప్రుఁడు. నాయిక కులీనస్త్రీయో లేక వేశ్యయో సరిగా తేలటం లేదు. ఇది వాస్తవమైన కథ తీసికొని కవి కొన్ని మార్పులు చేసినట్లు అనిపిస్తుంది. అంకా లకు ప్రత్యేకించి పేర్లులేవు. ఇందులో తొమ్మిది అంకాలు ఉన్నై. సామాన్యంగా నాటకాల్లో చివర "అతః పరమపి ప్రియమస్తి" అని నాయకుఁడు భరత వాక్యం చెప్పడం ఉంది. ఈ ప్రకరణంలో అలాలేదు. బుద్ధుఁడే భరతవాక్యం పలుకుతాడు. అంతిమ అంకంలో శారిపుత్రుఁడు బుద్ధునివలన ఉపదేశం పొందుతాడు. అప్పటిదాకా కూడా వుంటున్న విదూషకపాత్రను అంతటితో సమాప్తి పొందించి కవి ఔచిత్యం ప్రద ర్శించాడు. విదూషకుఁడు ప్రాకృతంలోనూ బుద్ధ శారి పుత్రులు సంస్కృతంలోను సంభాషిస్తారు.

ఈ శారిపుత్రప్రకరణంలో కొంతభాగం, ఇంకా రెండు అసంపూర్ణనాటకాలూ కలిసి ఒకే తాళపత్ర గ్రంథంలో కనిపించినై. వీనిలో శారిపుత్రప్రకరణ విషయమైన పై విషయాలు కొంతకొంతగా తెలు స్తున్నవిగాని మిగిలిన రెండు నాటకాలపేర్లుగాని విష యాలుగాని సరిగా బోధపడటంలేదు. శారిపుత్ర ప్రక రణం పేరే శారద్వతీపుత్రప్రకరణమనికూడా వాడ బడివుంది. ప్రకరణకర్తృత్వవిషయమై సువర్ణాక్షీ పుత్రుఁడు అశ్వఘోషుఁడని నిస్సందేహంగా తెలు స్తోంది. ఈ ప్రకరణంలో మౌద్గల్యాయనుఁడు, శారి పుత్రుఁడు బుద్ధునివలన ధర్మదీక్ష పొందటం కథ ప్రధానంగా ఉంది. శారిపుత్రుడు విదూషకునితో ప్రస్తావిస్తూ క్షత్రియుఁడైన బుద్ధుఁడు ఉపదేశకుఁడు కావటంవిషయంలో చర్చ లేవదీస్తాడు. విదూషకుఁడు క్షత్రియుడికి ఉపదేశార్హత లేదంటాడు. అప్పుడు శారిపుత్రుఁడు నీచజాతివైద్యు డిచ్చిన ఔషధం అగ్రజాతిరోగికి వ్యాధి నివారణ చేయటానికి తోడ్ప డటంలేదా అలాగే క్షత్రియోత్తముడు బ్రాహ్మణు లకు ధర్మోపదేశం చేయవచ్చునని నిర్ణయిస్తూ విదూష కుని వాదాన్ని ఖండిస్తాడు. చివరకు మౌద్గల్యాయన శారిపుత్రులు బుద్ధునివలన ధర్మదీక్ష పొందుతారు. ప్రకరణం చివరిభాగంలో బుద్ధ శారిపుత్రులు కొంత వేదాంతచర్చ చేస్తారు. ప్రకరణాంతంలో మౌద్గల్యా యన, శారిపుత్రులను ఉత్తమశిష్యులుగా మెచ్చు కుంటూ బుద్ధుడు భరతవాక్యం పఠిస్తాడు.

శారిపుత్రప్రకరణంగాక పేర్లు తెలియని నాటక ఖండాలు రెండుకూడా ఆ తాళపత్రగ్రంథంలోనే ఉన్నవని వ్రాశాను. ఆ రెండూ కూడా అశ్వఘోషుఁడే వ్రాసివుంటాడని ఊహించడమే కాని ఆ పుస్తకాల్లో మాత్రం దీన్ని నిర్ధారణచేయటానికి తగిన ప్రమాణం ఏమీలేదు. ఇందులో మొదటినాటకం ఒక గొప్ప విశిష్టత సంపాదించుకొనిఉంది. అది ఏమిటంటే— ఇందులోఉన్న పాత్రలు బుద్ధి, కీర్తి, ధృతి మొదలైనవి! ఇవి రంగస్థలంమీద సంభాషిస్తూ ఉంటే బుద్ధుఁడు అక్కడ అవతరిస్తాడు. అన్ని పాత్రలూ సంస్కృ తంలోనే సంభాషణలు సాగిస్తై. బుద్ధి—బుద్ధిహీనుణ్ణి గూర్చి కీర్తితో మాట్లాడుతూ "నిత్యం ససుప్త ఇవ

యస్య నబుద్ధిరస్తి" (బుద్ధిలేనివాడు ఎల్లప్పుడూ నిద్రిస్తున్నవానితో సమానం) అని హేళన చేస్తుంది. ఈ నాటకంలో పత్రాలు చాలా తక్కువగా మిగిలి ఉండటంచేత విశేషంగా తెలుసుకోవడానికి వీలు కలుగలేదు.

11 శతాబ్దంలో ప్రబోధచంద్రోదయం అనే పేరుతో కృష్ణమిశ్ర కవి నాటకం వ్రాసి ఉండటానికి ఈ అసంపూర్ణ నాటకం తోడ్పడిందేమో!

ఇక రెండో అసంపూర్ణనాటకం పేరుకూడా తెలియదు. ఇందులో మగధవతి అనే వేశ్య, కౌముదగంధనామకుడైన విదూషకుడు, సోమదత్తుడనే నాయకుడు, ధనంజయుడనే రాజకుమారుడు, ఒక దాసీ, శారిపుత్ర మౌద్గల్యాయనులు పాత్రలుగా కనిస్తారు. వేశ్యాదాసీలు ప్రాకృతంలోనూ మిగిలిన పాత్రలు సంస్కృతంలోనూ సంభాషణలు సాగించారు. వేశ్యామందిరము, జీర్ణోద్యానము రంగస్థలాలుగా ఉన్నై. ఈ నాటకంలోకూడా తాళపత్రాలు చాలా తక్కువగా మిగిలి ఉండటంచేత కథావిశేషం పూర్తిగా తెలియరావటం లేదు. బౌద్ధధర్మప్రచారంకోసం ఈ నాటకం కూడా వ్రాయబడిందని అనవచ్చునని తోస్తుంది.

స్తోత్రగాథ అనే పుస్తకంలో 29 వృత్తాలు మాత్రమే ఉన్నై. అందులో చాలాభాగం స్రగ్ధరా వృత్తంలో రచించబడివున్నై. ఇది ఒక సుందరమైన గేయకవితాఖండమని అనిపిస్తుంది. ఈ వృత్తాల్లో బుద్ధుడు, సంఘమూ కీర్తింపబడటం కనిపిస్తుంది.

వజ్రసూచి అనే పేరుగల గ్రంథంలో వర్ణవ్యవస్థలు పనికిరావని నిశితంగా విమర్శింపబడి ఉంది. వర్ణవ్యవస్థలను సమర్థించేవాళ్లకు ఈ పుస్తకం వజ్రపు సూదిలాగా గుచ్చుకుంటుంది అనేభావం వ్యక్తీకరించటానికి దీనికా పేరు పెట్టిఉండినట్లు భావింపబడుతోంది. ఇందులో శ్రుతిస్మృతులు, మహాభారతంలోని వర్ణాశ్రమ వ్యవస్థలను నిర్ణయించే ఘట్టాలూ కఠినంగా విమర్శింపబడినై. "సుఖదుఃఖాలు, జన్మమరణాలు భయకాంక్షలూ," మొదలైనవన్నీ, అన్ని తరగతుల ప్రజలూ సమానంగానే అనుభవిస్తారు అనే సమానత్వప్రతిపాదన ఇందులో చేయబడిఉంది.

'మహాయానశ్రద్ధోత్పాదకము' మహాయాన సంప్రదాయానికి సంబంధించిన ఒక వేదాంతగ్రంథం. ఈ పుస్తకం చీనాదేశంలో చీనాభాషలో లభ్యమైంది. దీనికి మూలం సంస్కృతంలో ఉందో లేదో తెలియరాలేదు. కర్తృత్వవిషయంకూడా వివాదాస్పదంగానే వుంది. హుయన్‌త్సాంగ్ తన ఆత్మకథలో ఈ పుస్తకం అశ్వఘోషుడు వ్రాసినట్లుగా పేర్కొన్నాడు. కాని కొందరు వేదాంతియైన అశ్వఘోషుడొకడూ కవియైన అశ్వఘోషుడొకడూ ఉన్నారనీ— అందుచేత కర్తృత్వం కవియైన అశ్వఘోషుడికి అంటకట్టవీలులేదనీ అంటున్నారు. అదీకాక పుస్తకంలో ఎక్కడా రచయిత పేరు లేదు. జపానుదేశంలోని పండితులు దీనికి మూలం సంస్కృతంలో లేనేలేదనీ అసలు ఇది చీనాభాషలోనే వ్రాయబడిందనీ నిర్ధారణ చేశారు. జపానుదేశంలో ఇప్పుడు ఈ పుస్తకం మిక్కిలి ప్రచారంలో ఉంది.

'సూత్రాలంకార'మనే గ్రంథానికి ఇంతవరకు సంస్కృతమూలం దొరకలేదు. కుమారజీవుడనే పండితుడు దీనిని చీనాభాషలోకి అనువదించాడు. ఇది జాతకకథలలోనించి వేరుగా పుస్తకరూపం ధరింపచేసిన అందమైన కథలసంపుటి. బౌద్ధధర్మప్రచారంలో దీని పాత్ర ప్రముఖంగా భాసించింది. ఇత్సింగ్ 7 వ శతాబ్ది ఉత్తరార్ధంలో వ్రాసిన తన యాత్రావివరణగ్రంథంలో అశ్వఘోషుడొక సూత్రాలంకారగ్రంథం వ్రాసిఉన్నట్లూ అది బహుళప్రచారంలో ఉన్నట్లూ వ్రాసివున్నాడు. దీనినిబట్టి మనం అశ్వఘోషరచితమైన సంస్కృత సూత్రాలంకారం ఒకటి వున్నదనీ అది లోకానికి లభ్యంకాలేదనీ అనుకోవలసివస్తోంది.

మొత్తంమీద అశ్వఘోషుడు ప్రతిభావంతుడైన పండితుడనీ—కవి అనీ తాను ఉత్తమమని నమ్మిన బౌద్ధధర్మవ్యాప్తికి సహస్రవిధాల ప్రయత్నించేసిన ఉత్తముడనీ చెప్పడంలో సంకోచించవలసిన పని లేదు.

# మన్వంతరం

"శిఖిముఖి"

## ఉపోద్ఘాతం

హంసతూలికాతల్పం కాదు గాని అలివేణికి తగ్గ పాన్పు. సెజ్జ కేసు మల్లెపూలెత్తున వలపుతలపులలో తల తేలిపోతూంటే, పలుకే బంగారమయిన ప్రౌఢను బిడియంగా జడిసి, కథ పేరడగకుండానే సాగిపోతోంది.

ఉలకని, పలకని-ఉనిద ఉన్నట్లుండి, చటుక్కున చక్కిలిగింతలు పెట్టే యౌవనాన్ని "ఊఁ, పోదూ, మరీనూ!" అన్నట్లు ఒళ్లు విరిచి కసిరింది! నిరీక్షణలో నిమేషాలు దేవమాన కాలమంత దీర్ఘాలయేటప్పటికి, ఆత్రత మించి శ్రుతిలోబడింది. అయినా, రాగంరాని బోగంచాన ఉంటుందిటండీ?

ఎవరికోసం ఎవరికోసం ?
పంచమంలో గండుకోయిల
పాడి కూసే దెవరికోసం ?
పూలవాసన కమ్మతెమ్మెర
లాడి వీచే దెవరికోసం ?

ఆరోహణంలో అసహనం తలకెక్కి కంపించింది వీణ. తన పేరెత్తదేం?...తనే ఓమెట్టు దిగి, అమరసింహుని అండజూసుకుని, మేళవింపులో ముచ్చట తీర్చుకుంది.

క్వాణ నిక్వణ క్వణన నాదం
వీణ పాడే దెవరికోసం ?
మానసాబ్జమృణాళతంత్రీ
మూర్ఛనా లవి ఎవరికోసం ? ..

ఎక్కడో మగని పొలుపు తెలిపే ఒక మారుత మొలయగా జంత్రగాత్రాల గాంధర్వం వెన్నతో నేర్పిన విద్దెం-విద్దెం-గా మెట్టూ స్థాయీ దిగింది.

ఎనభైనాలుగు వేల రాగాల బరువునే దిగదించి దిగమింగింది గాయని. పాన్పుదిగి, ఉన్మత్తగా నిలబడి కన్నుపొడుచుకున్నా కనబడని అంధకారంలో నెల పొడుపుకోసం నిదానించి చూసింది.

శ్యామాకాశం చీకట్లని చెరిగిపొయ్యగా, పుట్టెడు శనగలలో ఒకటే రాయిలాగ బయటబడ్డాడు బహుళ

---

** కృతిచెయ్యడంమీద మోజు కలిగి, Modus Operandi కోసం కవితాపితామహుణ్ని కదలేసేను. కావలసిన హంగులు చెప్పమంటే, "నిరుపహతిస్థలంబు" అని ఆరంభించేడు ఆయన.

"ఏమిటీవరస?" అని అడ్డొచ్చి గద్దించేడు కవిసార్వభౌముడు, బుద్ధికి బృహస్పతంతటివాడుకూడా బేజారెత్తిపోయేటట్టు. "భోజనం ముందే తాంబూల మడుపుతా వేసెయ్యాల్య, భోగాలెరగని వాడికి మల్లే? నన్ను చూడు. కలనాటి అలవాటుప్రకారం కాని రోజులలోకూడా క్రమం తప్పలేదు. బట్ట, బత్తెం, బొట్టు, భోజనం......విన్నావా?" అని వినిపించేడు రత్నాంబరాలనుంచి హేమపాత్రాన్నంవరకూ నడిచిన వరస.

పెద్దన పెద్దరికానికి పెద్ద ఇదిగా కోపం వచ్చింది. "బొట్టు భోజనాన్ని చెరిపినా బెట్టుసరి మానలేదా?" అని చీవాట్లేసేడు.

"విశ్వస్తచేతి వెల్లుల్లి వడ్డనలు తిన్నవాడివి, నా తాంబూలంసంగతి విని తగవుకి వచ్చేవా?"

"వెల్లుల్లి తిన్నా, వీథినాటకం రాసినా, నా గొప్పకి తప్పిదాలు పట్టేవాడెవడు?" అన్నాడు కవిరాజు. "రుచులు దోసమని పోనాడినా, రసాలకు దోషం రానియ్యలేదు, తెలుసునా? ఇక తాంబూలాలా? సత్కారంలో క్రమం తప్పనియ్యని కవిసమ్రాట్టును, వేసుకోవడం విషయంలో వరసతప్పని విలాసపురుషుణ్ని. కనక కాస్త చెప్పిపోదామని వస్తే కస్సుమంటా వేమిటయ్యా?" అని చక్కాపోయాడు.

పెద్దనతో పేచీపడడాని కంతా పెద్దతే! అనుకుంది, ఈ వాదం విని విస్తుపోయిన మాకథానాయిక,

"ఔ" నన్నాడు నాయకుడు. పడితే పెద్దనతోనే పడాలి పేచీ, అన్నాడు. మాధురీమహిమ నెపంపెట్టి "మాటమాత్రానికి" మరో కవిపక్షం జేరేడు.

విదియ చంద్రుడు. దూరాన అరుంధతి చక్కని చుక్క లాగ మెరిసింది.

వెన్నెలని వెతికిన చకోరాక్షికి రాడేమో అనిపించిన అనుమానపు నీడలాగ చూచాయగా గోచరుడయాడు వచ్చినాయన. తేరిపార జూసేటప్పటికి ధృవుడై ముంగల నిలబడ్డాడు.

"వచ్చేవా విప్రవరా"-ప్రశ్నార్థకం తోపించని గొంతుతో నిస్సందేహంగా అడిగిందామె.

అపృష్టుడు నిరుత్తరంగా నవ్వేడు.

"ధూర్జటిలాగ తియ్యగా మాట్లాడడం నేర్చుకుందామని..." సహేతుకంగా మాటలు మిగిలేడు.

"హా! తెలిసెన్!" అంది—"పెద్దన పోకడలతో పేచీపడ్డావూ?"

"అల సానిదాని అలక గజిబిజిచేస్తే, అల్లసాని వాని అల్లిక జిగిబిగిలో ఎన్ని వసంతాలని గడుస్తాయి?"

ఎన్నా?-సున్నా అన్న విన్యాసంలో అతని చుట్టూ కైవారం చేసేయి కోమలిచేతులు. కాని ఆ శ్లేషంలో ఆర్ద్రచిత్తయైన అతివకి పెల్లుబికిన జాలి ముంచెత్తుకువచ్చింది.

పెద్దనతో పేచీపడడాని కందరూ పెద్దలేగదా! అని విస్మయపడింది. ప్రథమ సమాగమంలోనే ప్రణయాన్ని పరాకాష్ట నందించలేదనిగదా, ప్రబంధ పరమేష్ఠిపై తనప్రియుడికి చిన్నచూపు! అని చింతించింది. మళ్లీ పొద్దుపొడిచేటప్పటికి ప్రత్యామ్నాయ నాయకుణ్ణి ప్రవేశపెట్టిన వైనం జ్ఞాపకంచేసి కొత్త నయందలి తన పక్షపాతాన్ని ప్రదర్శిస్తా మనుకుంది.

"వసంతాలని వ్యర్థంచేసేటంత జైత్రివాడు కాడయ్యా!" అంది. "ఒకరోజు విలంబన చేసినా, ఆలంబనానికి హాని రానీయలేదుగదా! కొంచెం జాప్యంచేసేసంటే, మరి బుద్ధిజాడ్యం!"

"ఏ వేదంబు పఠించె లూత?"—సంశయీకుడి శ్రోత్రియం మీద నమ్మకంలేని ప్రశ్నని దూసి అడిగేడతడు. అల్లిక కైతలధర్మమా అని, ధూర్జటి అనువాదం అతికిందని సంతోషించేడు.

"అయినా, కడకి కల్పించినవి కళ్లుమూసుకుపోయే క్రీడలేగదా!"

"ప్రేమ గుడ్డిదన్నమాట పాతకాలంనాటిదే!" అందామె, వాదానికి తలపడి. "కళ్లు తెరిచిచూస్తే చెదిరిన కలలు కోట్లు. కథలవిషయం కావాలంటే, కామదహనాన్ని స్మరించు!"

అంత అని ఇంకొకింత కొసిరింది: "పైగా వళ్లు తెలియని సరసాలకంటె కళ్లు మూసుకున్న సరసాలే నయం. వధూనఖాగ్ర ములచే కాయగ్లాచిన ధూర్జటి కాయాని కేం తెలుస్తుంది సహాసానఖ...సీసంలోని సౌఖ్యం?"

పేచీ మాని ప్రస్తుతమయిన పరిరంభంవైపు మరల్చేడతడు తన దృష్టిని. స్ఫురితచుంబనంలో సంధి చేసుకుని నిరోష్ఠ్యంగా సరసోక్తులు గుసగుసలాడుకున్నారు ప్రియులు. కడకి కళాద్వయం తప్పించ

---

ఔను - కాదన్న వాదానికి దిగదలుచుకోని శ్రీ గొట్టిముక్కల కృష్ణమూర్తిగారు కాస్త "ముందు వెనకలు" మాత్రం చూసుకోండని, పెద్దనకి మూడు శతాబ్దాలకి ముందు మల్లికార్జునుడూ, అయిదుశతాబ్దాల అనంతరం ఆయన రాసిన పద్యాలు ఉదహరించి ఊరుకున్నారు. (మా. భారతి, మార్చి, పుట-60)

"ఔ"నన్నారు శ్రీశ్రీ., చమత్కారానికో, Proletarian Prejudices తోటో. విడెం, భోజనాల వరస అల్లా ఉంచి, అసలు కవితాపితామహుడు కోరిన వేవీ అక్కర్లేదన్నారు.

"అల్లసాని పెదనార్యు
డడిగిన నిరుపహతి
స్థలేత్యాదు లనవసరం
సదా కృతిః ప్రభవతి."

సాంతంగా పద్యాన్ని చదువుకున్నాక అంత సాహసంలేని నా స్వగతం గొణిగింది, పెద్దన అడిగినవన్నీ Bourgeois amenities మాత్రమే కాదని.

"స్థలం, విడెం సరే కాని
సదసద్జ్ఞులచే నధి
గతం కాని కృతికి శరణు
కాలోయం నిరవధిః!"

ఈ గందరగోళంలో ప్రబంధం విబంధనలు చెప్పించుకోవడమే కుదరలే దింతకీ నాకు. కృతి చెయ్యబోతే కోతిచేష్టయిందన్నట్లు పరిణమించిందీ రచన చివరికి. దీనికి శరణేమిటో? ఒప్పుతప్పరయు రసజ్ఞులు, ఊహ తెలియంగల పాతకొత్తములూ మాత్రమే నిర్ణయించగలరు.

చంద్రుడు కన్నుగీటినట్లు తోట్రి మెట్రిగా చూస్తూంటే, సిగ్గుపడి ఎడబాటయ్యారు.

"వాతెర దొండపండయిందా?" వాచవిగా పరామర్శించిందామె.

ప్రముదితుడు పెదవి చప్పరించేడు. "కదళీ సేవించిం దీమాధురీమహిమ!"

"అయితే,

పండుద్రాక్ష పదాలు పాకాన వేసి,
వెండి వెండియు దెచ్చి విందు చేస్తావా?"

ఉవ్విళ్లూరుతూ అడిగింది.

"కవయామి!" అన్నాడు కాబోయే ధూర్జటి, ధీమాగా.

"మరి పెద్దన పోకడలకి స్వస్తేనా?" పక్షపాతం వదలలేక ప్రశ్నించింది.

"వయామి!" అన్నాడతడు చాటువు చెప్పినట్లు.

చివరకు మాట తనమీదుంచుకోవడ మెందుకని, ముగించేడు :

"యామి!"

"...విధావసుహూలే?" మళ్ళీ రావడాన్ని గురించిన మాటందుకుందామె, అనగనగా ఓ అమ్మాయి సంగతి తలుచుకుని.

సతి-సప్తమి సంధినుంచి చాయంగల విన్నపాలై బయటబడ్డవి (బు) ధుడి "ఉదంతం" అతనికీ జ్ఞాపకం వచ్చింది. విధిగా ఆమెకు ధైర్యం చెప్పవలసివచ్చింది, పునరేష్యామీతి...

"బ్రహ్మాతర మాతుందిలే!" అన్నాడాశాపూరితంగా. "కాగా, చంద్రుడు మనతోడే!"

ఆ మాటల అర్థం చిత్తగించమని, సెలవు తీసుకొని వెళ్ళిపోయాడతడు, చంద్రుడు తోడుగా. తనకు తోడుగా నిలబడ్డ జాబిల్లి తనకీ సుముఖుడే అని సంతోషించింది చంద్రవదన.

## ఉపోద్ఘాతం

కథను శేషరాత్రి నిద్రబుచ్చి కలం నింపుకున్నాడు కథకుడు. చంద్రుడు చెలియదగ్గరే ఉన్నాడా, వచ్చినాయనతో వెళ్లిపోయాడా? (రాముడంతటివాడు పిలిస్తే రాలేదు కాని కాముడి సహవర్తిత ఇతిసేః! కళాకళల బుద్ధి!) అన్న జిజ్ఞాసలో ఉండగా ఖరేలుమనే విషయమొకటి ఛురికపోటులాగ జ్ఞాపకంవచ్చింది.

"వెండి వెండియు తెచ్చి..."

ఆ మాటలలో ఆమ్రేడితాన్నిమించిన దోషం తోచింది. నాయికది లోహవ్యామోహమన్న అపోహలో ఆగ్రహంవచ్చింది.

లంచమడగని మంచితనంతో ప్రేమైకజీవిగా ప్రకరణాలు గడుపుతానని తనకిచ్చిన మాటను లెక్కచెయ్యలేదు గణిక! అని కించపడ్డాడు. ఆటవెలది మాట వెలచూస్తే, తన కథకీ నాయిక ఉచితమైనది కాదని తోచింది. కథ కింతటితో స్వస్తి చెప్పేద్దామనుకున్నాడు.

"కథా, లే..."

కథ లేచి కళ్లు నులుముకుంది. సూర్యుడు చీకట్లని తూర్పారబట్టడం, నీలోత్పలం వర్ణాభిమానంతో ముఖం చిన్నబుచ్చుకోవడం వగైరా నిత్యకృత్యాలని పరిశీలనగా చూడడమయ్యాక, పంకజంతోబాటుపకాలున ఆవులించింది.

"ఇతి..." ఖచ్చితంగా కథాంతగద్య మొదలు పెట్టేడు కథకుడు.

"ఆహా!" అని ఆవులింత ముగించింది కథ. "ఏం కథ?" అని ఎదురు తిరిగింది.

తన ఫిర్యాదు చెప్పుకున్నాడు కథకుడు. "వెండి వెండియు దెచ్చి..." అనువదించేడు.

"నీది అశూక్తి రజతభ్రాంతి, అమాయకుడా!" అని మందలించింది కథ, "ఆమె ప్రయోగం అసమర్థనీయమయినా, దానిని మళ్లీ మళ్లీ అర్థం చూసుకో... మళ్లీ" అని హెచ్చరించింది.

"అర్థకుసి"గా సమాధానపడి ఊరుకున్నాడు కథకుడు.

## ఉపాలంభం

గత రాత్రి విషయం గాలికబురులాగా ఎలా పాకిపోయిందో కాని, పేటపేటంతా ఇలా పాక్కిపోయిందంటే నమ్మండి. ఊరూ వాడా ఏకమై వారిద్దరి విషయమూ పెద్ద ఇదిగా గుసగుసలాడి పోసుకున్నారు.

లోకంనోరు మయ్యలేమని తెలిసిన నాయకుడు తమ సంగతి నలుగురి నోళ్ళలోనూ ఓ నువ్వుగింజ నానినంతసేపు పడినా ఫరవాలేదనుకున్నాడు. కాని ప్రేయసి వాడమీద ఊరంత కోపంతో పెదవులకు

చేటు తెచ్చుకుంటుందేమోనని మాత్రం భయపడ్డాడు. కానివేళ బయలుదేరి నిత్యసుత్తయిదువ గాజుల గలగలల్లోకి జేరాడు.

సాష్టాంగంగా నాయికను కౌగలించుకుని, వైశంపాయనుడిలాగ విషయాన్ని సవిస్తరంగా చెప్పేడు. పూసగ్రుచ్చినంత శ్రద్ధతో విని, ఆమె కోక పొడుగునా రెపరెప లాడిపోయింది.

"హుం! వాడంతా నీలాటి రేవయిపోయిందన్నమాట!" అక్కసుగా మెటిక విరిచింది.

"కన్నెలంతా మనసంగతే కడవలతో తోడుకుపోతున్నారు," అని ముగించేశాడు.

"అనాఘ్రాతపుష్పాలు!" అని ముగ్ధలని చీదరించుకుంది. శ్యామ.

మాటమట్టుకు గంభీరంగా అనేసింది కాని అబల గుండె నిబ్బరం కప్పగా కూలిపోయింది. కలకంఠి కళ్లు చెమ్మగిల్లేయి.

"లోకులు కాకులని తెలిసిన నెఱజాణవు..." స్తుతిలో సాంత్వనానికి పూనుకున్నా డలంకారికుడు.

కాకాసురుడూ, లోకులూ తెచ్చిన సీతాశోకాలని ఇక్ష్వాకుల నాటి ఇతిహాసంనుంచి ఎత్తిచూపిందామె.

"అవింకా కట్టికుడుపుతూనే ఉంటాయా మా స్త్రీజాతిని?" ధనుష్టంకారంలాగ ఎక్కి వెక్కి అడిగింది నారి.

"మనకి రామరాజ్యాల ప్రారబ్ధం తప్పింది," అని హామీ ఇచ్చేశాడు. "లోకాభిరామాయణంగా జనం చెప్పుకునే పుక్కిటిపురాణాలకి జడిసి అడవి గాచిన వెన్నెలలో విరహానికి గురికానక్కరలేదు!"

ఆమె హృదయాన్ని దిగులుకు తావులేనంత దగ్గరగా తనకు హత్తుకుని, అన్నాడు:

"పైగా, కౌగల కార్యం గాంధర్వంగా నే తీర్చుకున్నాము కదూ!"

"ఓ!" అని ఒప్పుకుందామె. "నఖముఖాలా!"

మరొక బారెడు-ప్రొద్దెకు సేపు ఊసూ, పలుకూ ఆడి, ఆమెకోమాత్రపు గుండెదిటవు చేరుకోగానే సెలవు తీసుకుని వెళ్లిపోయాడతడు.

## ఉపద్రష్ట

ఈకథకి కృతిపతిగా ఉండాడని కెవరు సమ్మతిస్తారో తెలియని కథకుడు నలుగురైదుగురు సంపాదకులకి సమానంగా సమన్వయించేటట్లు వృత్త్యంతాలు రాసే కిపరింపులో నిమగ్నుడయ్యాడు. అన్యాయత్తచిత్తతలో గతప్రకరణం గతి ననుసరించక, కథ ఏకొక్కి కొచ్చిందో తెలియని తికమకలలో పడ్డాడు.

కథని కంచువా కొంగున తనతప్పిదం తెలియనంత, గోప్యంగా ముడివేసి, అపరాహ్ణానికి నాయికయింటికి జేరుకున్నాడు.

ఉ. కు. రి.

"కత్తే కిం తవ?" కుతూహలాన్నాపట్టలేని నాయిక నోరు విప్పి అడిగింది.

"తల్లీ నిన్ను గురించి పుస్తకము చేయంబూనితిన్" అని యతి తప్పిన సరాగాలాపనలో కథకుని జవాబు.

"ఇంతవరకూ జరిగిన కథని అడపా - తడపా గ్రథితంచేస్తూనే వచ్చేను. కాని, ఓ చిన్నవిషయం తేలకుండా ఉంది. అంతటి రసికుడు లోకానికి వెరచి..." పెద్దమనిషితనంగా, కీడెంచడానికి నోరురాక, అర్ధోక్తిలో ఊరుకున్నాడు.

నిలువెత్తు కీవితో చిరునవ్వు నష్టంగా ఊపిందామె. నిన్నృత్తంలో సందేహనివృత్తి చేసింది: "...రామరాజ్యాల ప్రారబ్ధం ... లోకాభిరామాయణం...అడవిగాచిన...గురికానక్కర లేదు."

"ఏమో అని భయపడ్డాను," అన్నాడు కథకుడు. "చివరికి విప్రలబ్ధ వౌతావేమోనని భయపడ్డాను."

అతని భయాలకి పతాకహస్తాన్నెత్తేసిందామె. ఒక ధలాన్నిను: "విప్ర——లబ్ధ నేనండీ!" అని.

కళావతి మాటవిరుపు సొగసుకి గుండె నిండింది కథకుడి సహృదయత.

ఆమె అలవోకగా తలపంకించి అనుమంద్రంలో అంది: "మా స్థాయి అనురాగం మహాశయా!"

హమ్మయ్య-గా తల తడుముకున్నాడు మహాశయుడు.

## ఉపాఖ్యానం

అతనిది ఆభాసలోని ఆశ. (పక్కఊరి పడుచుకుర్రాడి మాటలెండి-) ఈ కథసంగతి నామమాత్రంగా తెలుసుకుని ఇది ఇరుమారుమనువు చరిత్ర అనుకున్నాడు. ప్రత్యామ్నాయనాయకభూమికను తాను వహిద్దామనుకున్నాడు.

పొంచి ఉందామని పొలిమేర దాటగానే కథకుని శకునం. పడుచుకుఱ్ఱాడు పరామర్శగా మాట జారేడు:

"మన కాలంలో మందుకైనా రసరాట్టు లేదండీ!"

"ఏం బాబూ?" చివుక్కుమన్న చిత్తాన్ని చిరునవ్వు వెనకదాచి ప్రశ్నించేడు కథకుడు.

దండించి దరఖాస్తు పెట్టుకుందామనుకున్నాడు కుఱ్ఱాడు.

"లేకపోతే అనుకరణకి అర్థం ఉండొద్దూ? అసలువాడ్డోరమోమిడితే, నిసలువాణ్ణి నాచేతి చుబుకం పుణికించరాదూ? ఇంతటి ప్రఖ్యాత కథకులు మీరే ఇలాగ..."

"ఉత్పాద్యం, నాయనా, నా కథ!"— మాటకు మాట తెగులుగా అడ్డువచ్చేడు కథకుడు. "ప్రబంధ వ్యామోహంతో పెట్టిన పేరు జూసి పొరబడకు."

* * *

తెల్లబోయి దిక్కులు చూశేడు దక్షిణుడు. పరకాయింపుల పరిమితిలో పైట చెంగేదో పిలిచిన వైనం కనబడగా, అందని అందాలకై జాచిన అఱ్ఱుల నుపసంహరించుకుని అటు దారితీసేడు.

వెనుకనుంచి వెన్నుపొడుగునా హెచ్చరించేడు. కథకుడు: "చొరవజేసి చెంత జేరుదామనుకుంటున్నావేమో, ఛేకానుప్రాసంగా పొమ్మంటుంది సుమా!"

కొత్తలకుత్యం కవ్వింపులో పెద్దవాని మాటలు పెడచెవిని వేసుకుపోయాడు పడుచుకుఱ్ఱాడు.

## ఉపజీవి

యథేచ్ఛగా అసలు ప్రియులు కలుసుకుంటున్నారు. గడిచే నెలలు చెలికి నిండుతూ వచ్చేయి.

"మోహానికి మొహంవాచిపోయేను," అన్నాడు మగరాయడు, మురిపెంగా.

"మూన్నాళ్లీ ముచ్చటలు మినహాయింపులు కూడా లేని కాలం, మొహం మొత్తిందంటావేమో అని భయపడ్డాను."

అంతర్వత్ని మృత్సురభిముఖాన్ని మరోసారి ముద్దుపెట్టుకుని అన్నాడతను, కాళిదాసు ప్రమాణంగా: "అధికమాసాలలో కరువొచ్చింది తృప్తికి."

మనసు కక్కుర్తి మెల్లన లేచి చేతుల గాంతుని జబ్బుగా కౌగలించింది పాతికేళ్ళ (ఎనిమిది నెలల) పడతి.

## ఉపాంత్యం

నాయికతో బాటు కథకి కూడా ఓపిక సన్నగిలుతోంది. ఒకనాటి ఉదయం ఎంతకీ లేవక, కడుపులో కాళ్లు పెట్టుకుని పడుక్కుంది. పైకన లేదుగాని ఆ కడుపులోనే మరో రెండు పాదాలు మెదిలేయి:

"ఈ నీళ్లు ఎంతదూరం వెళ్ళినా ఇంతే,
వ్యర్థం ఈ ప్రయాణం వెళ్లిపోదాం వెనక్కి."

ఆ మాటల అర్థమిాదే అలిగి, కథకుడు రాగానే ఖచ్చితంగా చెప్పేసింది. ఇంకొక్క ప్రకరణంకంటె ఎక్కువ సాగలేనని.

"ఇంకెంతో దూరం లేదులే," అని ఆయన కథని ఒళ్లు నిమిరి, వెంటబెట్టుకుని...

## ఉపసంహారం

...యకాయకి నిండు చూలాలి ఇంటికి జేరుకున్నాడు.

"నీకేమైనా కోరికలుంటే చెప్పు, తల్లీ, అవి తీర్చి మరీ గ్రంథం ముగిస్తాను," అని అడిగేడు, సాంప్రదాయికంగా.

మొహమాటపడుతూ నసిగిందామె: "నాకు మంచి పేరు సంపాదించాలని ఉందండీ!"

"అఁ! అన్నట్లు అడగ మరిచేను. నీ నిజనామం?"

చెమ్మగిలిన కళ్లు దించేసుకుని వైస్వర్యంలో అంది: "పడుపు వృత్తిలో పేరు మాసిపోయిందండీ. నేటికాలానికి మీరు సంస్కరించి ఓ ఇంటిదానిని చేసేరు. అందుకే ఈ ఈప్సితం...ఈడేర్చరూ?" ప్రాధేయపడింది.

"దానికేం తల్లీ!" అన్నాడాయన తండ్రిలాగ. ఓ క్షణం నిదానించి "నీ నిత్యయౌవనానికి తగినట్లు నిన్ను 'అమ్లాన' అంటాను," అన్నాడు.

కాలం మించిపోయిందమాయకుడా అన్నట్లు మందలించేయి ఆమె చిలిపిచూపులు. మాసాష్టకపుటం తర్వాత్ని వెలా—తెలా వాడిపోయిన వళ్ళంతనీ పరకాయించుకుంది.

పుత్రోదయం తర్వాతి పూబోడిని మనోజ్ఞంగా ఊహించుకుంది కథ. ప్రస్తుతపు వైవర్ణ్యంలో కూడా ఆమె చెక్కిళ్లెంత అందంగా ఉన్నాయి! అని విస్తుపోయింది.

కనుక, "నేనామె కపోలకల్పితాన్నయితే ఎంతసుందరంగా ఉండునో!" అని కథ కలలు కన్నదంటే, లోకం బుగ్గమీద వేలేసుకోనక్కరలేదు!

# బద్దెన నీతులు

శ్రీ బులుసు వేంకటేశ్వరులు

ఆంధ్రభాషాయోష కమూల్యాలంకార మొసఁగిన ఆంధ్ర నృపాలురయందుఁ జేరెన్నిక గన్నవారలలో బద్దెనృపాలు డొకఁడు. ఈతఁ డాంధ్ర చోళులఁ సంతతికిఁ జెందిన యొక సామంతరాజైనను, తన పరిపాలనానుభవమును బురస్కరించుకొని, తన పాండితీగరిమఁ దోడుచేసికొని తోడిరాజులకే కాక భావినృపాల సంతతికిని అనువర్తనసాధనము నాదర్శప్రాయమైన రాజనీతిని 'నీతిశాస్త్రముక్తావళి' యను నామమున విరచించియున్నాఁడు. ఈ గ్రంథమే 'బద్దెనీతులు' అను నామాంతరమున సైతము వ్యవహరింపఁబడుచున్నది. ఇం దాదర్శప్రాయములగు రాజనీతులే కాక త్రికాలాబాధ్యములైన పరమసత్యములు సైతము విరాజిల్లుచున్నవి. ఈ గ్రంథ విమర్శనమునకు ముందు బద్దెనృపాలుని కాలమునుగూర్చి కొంత విచారింపవలసియున్నది.

## బద్దెనకాలము - వివిధవాదములు

ఈ బద్దెనకాలమును గురించి రెండు మూఁడు వాదములు కలవు. అందు 'నీతిశాస్త్రముక్తావళి'ని పరిష్కరించి ప్రకటించిన శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు, ఆంధ్రకవుల చరిత్రమును విరచించిన కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగము పంతులుగారు, కళాప్రపూర్ణులు, సూర్యరాయాంధ్ర నిఘంటు సంపాదకులునై కీర్తిశేషులైన జయంతి రామయ్యపంతులుగారును దమతమ యభిప్రాయములను దెలిపియున్నారు. వీరి యాధారములను గ్రమముగాఁ బరిశీలించి యందలి యౌచిత్యమును పరిగణింతము.

శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు పైగ్రంథమునకుఁ జేర్చిన తమ పీఠికలో ఈ క్రింది శాసనము నుదాహరించిరి.

"శాసనము—శ్రీ కృష్ణవేణీనదీతీర దక్షిణషట్సహస్రవిషయాధీశ్వర వీరమహేశ్వర కీర్తిసుధాకర గుణరత్నాకర వేంగిచాళుక్యమూలస్తంభ రిపుదళిత కుంభికుంభ బల యాంగనాగృహతోరణ నన్నసంగ్రామకారణ నామాది ప్రశస్తిసహితం శ్రీ మహామండలేశ్వర బద్దె (దై?) చోళనరేంద్రమ్..." (పాశ్చాత్య చాళుక్యుఁ డగు భువనైకమల్లుని కాలమునాఁటి శాసనము)—

ఈ శాసనము ననుసరించి బద్దెన క్రీ. శ. 1070-వ సంవత్సరమున నుండవచ్చుననిరి. కాని, ఇది నమ్మఁదగినది కాదని శ్రీ కవిగారే రెండు ప్రమాణములఁ జూపిరి. అందు మొదటిది శాసనము చెన్నపుర గ్రంథ భాండాగారమందలి చరిత్రములోనిది గాన విశ్వసింపఁ దగదనియు, రెండవది పైశాసనమందలి బిరుదావళి గలవాఁడు సామంతరాజ మాత్రుఁడు కాఁజాలఁడనియును దీనిని త్రోసివేసిరి. ఈ ప్రకారము శ్రీ రామకృష్ణకవిగారు బద్దెనకాలము ననిశ్చయముగనే విడిచిరి.

పిమ్మట ఆంధ్రకవుల చరిత్రకారులగు వీరేశలింగముగారు అట్టి బిరుదులుగల సామంతరాజులుండుట టాశ్చర్యము కాదనియు, పైకాలనిర్ణయమును గాదని బద్దెన 12-వ శతాబ్దమువాఁడని తేల్చిరి. ఇందులకు బద్దెనకృతముని రామకృష్ణకవిగారు 'నీతిశాస్త్రముక్తావళి' 30-వ పుటలో నుదాహరించిన ఈ క్రింది పద్యము నాధారముఁ జేసికొనిరి. ఆ పద్యమిది :

"పరువడి నాంధ్రభాషఁ గల
బద్దెన నీతియు సంస్కృతంబులోఁ
బరఁగు ప్రతాపరుద్ర నర
పాలునిచే రచియింపఁబడ్డ యా
నరవరు నీతిసారము వి
నం జదువం గడు మంచి దంచుఁ జె
ప్పెరఁ గవి నీతిపద్ధతులు
చేపె వినోదము బాలబోధకున్."

పై పద్యమునఁ జెప్పఁబడిన (మొదటి) ప్రతాపరుద్రుఁడు 1140 మొదలుకొని 1186 వరకు రాజ్యపాలనము చేసినవాఁ డగుట చేత బద్దెన ఆతని

తరువాతివాఁడగుట పైపద్యమునుండి స్పష్టమగుట 1186-వ సంవత్సరమునకుఁ దరువాతివాఁడు కావలెను. కనుక 12-వ శతాబ్దివాఁడని వీరేశలింగము గారు తేల్చిరి.

వీరేశలింగము గారి వాదము సమంజసము, సక్రమమును. ఈ పద్యమును జూడ నిది బద్దెనకృతము గాదని స్పష్టముగాఁ దేలుచున్నది. ఏలన, పైపద్యము ఇది: "ఆంధ్రముననున్న బద్దెననీతియు, సంస్కృతమునఁగల ప్రతాపరుద్ర విరచిత నీతిసారమును వినఁ జనువ నుత్తమములైన వగుట బాలబోధకై వినోదముగాఁ గవియందలి నీతుల ననుసరించి యీ నీతిపద్ధతులఁ జేసెను." ఇదివఱకే గ్రంథరూపముఁ దాల్చిన బద్దెన నీతి, నీతిసారముల ననుసరించి బాలబోధకై నీతిపద్ధతులఁ జేసెనని యీ పద్యము చెప్పుచుండఁగా, బద్దెన నీతిని జూచి మరల బద్దెన వ్రాయఁదలంచు టసంబద్ధము కాదా? అందుచేనిది బద్దెనకృతము కానిదగుట శ్రీ రామకృష్ణ కవిగారీపద్యమును బద్దెనదని నీతిశాస్త్రముక్తావళిలోఁ జేర్చుట కాధారము మృగ్యము. దానిభావ మరయక దానిని తమ వాదమున కాధారముగా వీరేశలింగముగారు చేసికొనుటయుఁ జింత్యమే. ఇంతేకాక, పుర్వాపర సందర్భముల ననుసరించినను బద్దెన నీతిని మొదట పేర్కొనుటయు, నీతిసారమును పిమ్మటఁ బేర్కొనుటయు బద్దెన ప్రతాపరుద్రునికిఁ బూర్వుఁడనుటకే యీ పద్యము తోడ్పడును కాని తరువాతివాఁడయి యుండవలెనని యీ పద్యము వీరేశలింగముగారి కెట్లు స్పష్టముగాఁ గానవచ్చినదో తెలియకున్నది. మరియుఁ బై పద్యాంతమున 'బాలబోధకున్' అని యుండుటచే, 'రాజనీతిశాస్త్రము' బాలురకుఁ గాఁజాలదుకదా! అంతియ కాక "ఆదిలో నీతిసారమను గ్రంథమున బద్దెన పూర్వకవిగా స్తుతింపఁబడె"నని శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు నీతిశాస్త్రముక్తావళీ పీఠికలో వ్రాసియున్నారు. అందుచే పై పద్యము నీతిశాస్త్రముక్తావళి, నీతిసారము రెండింటి ఛాయలు గల సుమతిశతకమునకే యన్వయించుట కుపయోగించును గాక దీనిపైఁ గావించిన వీరేశలింగము గారి యూహలు నిరాధారములే యగును. అందుచే బద్దెన కాలనిర్ణయమునకు మఱియొక ప్రబలాధారము చూడవలసియున్నది.

ఇఁక మూఁడవవారగు శ్రీ జయంతి రామయ్యపంతులుగారు బద్దెన కాలనిర్ణయమును దెలుపు రెండు శాసనములను సంపాదించి ప్రకటించిరి. ఈ రెండును కృష్ణాజిల్లాలోని గన్నవరము తాలూకాయందలి కొండ (డె? నాయుని) వరగ్రామ బ్రహ్మేశ్వరస్వామియాలయము నందలివి. వీనిలోని మొదటి శాసనమసంపూర్ణముగా లభించినది. మిగిలినది శిథిలమైనది. ఇది: "శాసనము-స్వస్తి సమస్తప్రశస్తి సహితం శ్రీ మన్మహామండలేశ్వర వీరనారాయణ చోడబద్దిగ దేవరాజులు శకవర్షంబులు ౧౧౮౩ ణ్గు నేఁటి కర్కాటక సంక్రాంతి నాఁడు..."

ఈ శాసనమునఁ జెప్పిన శాలివాహనశకము 1183 నకు 78 కలుపఁగా 1261 క్రీ శ. అగుచున్నది. మఱియు రెండవ శాసన మిట్లున్నది.

"శాసనము,—

శ్రీనాథనాభినీరేజ సంభూతః బ్రహ్మణః పురా,
జాతా విశ్వగుణాత్మీణ లక్ష్మీ రాజపరంపరా,
తస్యాం బద్దిగభూపోఽభూ ద్వీరనారాయణాంకితం,
చోడదోరయ (భూపో) స్వపుత్రో భూదస్యనందనః.
శ్రీ శాకాబ్దే పురాష్ట
దశ శశిగణితే కర్క సంక్రాంతి కాలే
సప్రాదా ద్దీప మిష్ట
ప్రద మనవరతం చోడబద్దిక్షితీశః,
శ్రీమద్బ్రహ్మేశ్వరాయా
శశి రవి విశదం గోంకనాంకస్య, (తే?) తే
స్తద్దీపార్థంచ వేలేటి
జనపదమహీ వింశతిద్రోణసంఖ్యాం."

అని పూర్తిగానున్న శాసనమునుబట్టికూడ క్రీ.శ. 1261-వ సంవత్సరమని తేలుచున్నది. క్రీ. శ. 1261 ప్రాంతమున కాకతీయ రాజ్యమును రుద్రమదేవి పరిపాలించుచుండెను. కనుక బద్దెనయనువాఁ డామెకు సామంతుఁడై కృష్ణాతీరమం దొక చిన్న రాజ్యమును బాలించుచు నుండియుండవలెనని శ్రీ జయంతి రామయ్యపంతులుగారు నిర్ణయించిరి.

ఈ నిర్ణయమును బరిశీలించినను సంశయాంశములు లేకపోలేదు. బద్దెన నామధేయు లనేకులు కానవచ్చుచున్నారు. శాసనమున నున్నంతమాత్రముననే బద్దెనయో నిర్ణయించుట కాధారములు మృగ్యములే. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారిచ్చిన చెన్నపురి భాండాగార శాసనమునను బద్దెన నామధేయము కలదు. ఆతఁడు 1070 ప్రాంతము వాఁడుగా గన్పట్టుచున్నాఁడు.

ప్రస్తుత గ్రంథ మేబద్దెన వ్రాసినదియును, దెలియదు. మఱియు, నీతిశాస్త్రముక్తావళి యందలి గద్య ననుసరించి—

"గద్య. ఇది శ్రీ లక్ష్మీవల్లభ శ్రీపాద పద్మారాధక కమలాప్తకుల పవిత్ర నన్నన గంధవారణ రాజరాజ మనోజాంక బద్దెనాఖ్య ప్రణీతంబైన రాజనీతి ప్రకారం బన్నది సర్వము సంపూర్ణము."

పై నన్నన గంధవారణేత్యాది బిరుదములఁ గాంచి పరిశీలించినను, చెన్ననగర భాండాగార శాసనమున నైతము "నన్నన గంధవారణ నామాది ప్రశస్తి సహితం" అని యున్నది. ఇది పై పెద్ది రామయ్య పంతులు గారు సంపాదించిన శాసనములందే కానవచ్చుటలేదు. ఇంతేకాక, విక్రమార్క చరిత్రమునఁ జెప్పఁబడిన నన్నయగంధ వారణుఁ డొకఁడు కలఁడు. ఈతనికి సిద్ధనమంత్రి మంత్రి. ఈతని మనుమఁడైన సిద్ధనకే విక్రమార్క చరిత్రము కృతిగా నీయఁబడినది.

విక్రమార్క చరిత్రమునఁ గల పద్యమిది :

"వనరుహ నాభు కుద్దవుఁడు
వజ్రికి జీవుఁడు వత్సభూరణీ
శునకు యుగంధరుండు దితి
సూతికి దైత్యగురుండు విక్రమా
ర్కునకును భట్టి రీతి నధి
కుండగు నన్నయగంధవారణం
బునకుఁ బ్రధానుఁడై నుతులఁ
బొందెను సిద్ధనమంత్రి యిద్ధరన్."

దీని విషయమున వీరేశలింగము పంతులు గా రిట్లు వ్రాసియున్నారు :

"1156-వ సంవత్సరము మొదలుకొని 1183-వ సంవత్సరము వఱకును రాజ్యపాలనముచేసిన వెలనాఁటి చోడుఁ డనఁబడెడు రాజేంద్ర చోడునిచే నగ్రహారాదికమును బడసిన నూరన సోమయాజికి మనుమఁడగుటచే సిద్ధనమంత్రి 1240-50 సంవత్సర ప్రాంతముల నుండియుండవలెను. అప్పుడు సిద్ధనమంత్రి ప్రభువైన నన్నయ గంధవారణుఁడును ఇంచుమించుగా ఆకాలమునందే యుండును. ఈ కాలము బద్దెనృపాలుని శాసనకాలముతో దాదాపుగా సరిపోవును. కాబట్టి యీ నన్నయగంధవారణుఁడే బద్దెనృపతియే మో!"

ఈ యూహ సమంజసముగానే కానవచ్చుచున్నది. మఱియు రామయ్యపంతులు గారి నిర్ణయమునకుఁ దోడగుచున్నది.

కాని, పైనిర్ణయము నంగీకరించుటకుఁ బూర్వోదాహృతమైన:—

"పరువడి నాంధ్రభాషఁ గల
బద్దెన నీతియు సంస్కృతంబులోఁ
బరఁగు బ్రతాపరుద్ర నర
పాలునిచే రచియింపఁబడ్డ యా
వరవరు నీతిసారము..."

అను పద్యము ననుసరించి బద్దెన ప్రతాపరుద్రునకుఁ బూర్వుఁడే యని తోఁచుచున్నది. అనఁగా 1140 మొదలు 1186 వఱకుఁ బ్రతాపరుద్రుఁడు పాలించియుండుటచే బద్దెన 1140 కి పూర్వుఁ డవవలెను. ఈ యూహ 1070 ప్రాంతమువాఁ డన్న చెన్నపురి శాసనమునకు రమారమి సరిపోవుచున్నది. పైఁగా, ప్రతాపరుద్రుఁడే నీతిసారమునఁ బూర్వకవిగా బద్దెనను స్తుతించెనని కవిగారు వ్రాసియున్నారు.

ఇంతకుఁ దేలినదేమన ! పై రెండు నిర్ణయములకును బ్రతిబంధకములు పై రీతిఁ గానవచ్చుచుండుటచేతను, నేవాద మంగీకరించుటకును బ్రబలాధారములు లభింపకపోవుటచేతను బద్దెన కాలనిర్ణయము ఇంకను బరిశోధనీయాంశమేయై యున్నది.

బద్దెన నీతిశాస్త్ర ముక్తావళి రచించుటకుఁ బూర్వము సుమతి శతకము రచించిన ట్లీక్రింది పద్యమునఁ జెప్పియున్నాఁడని రామకృష్ణ కవిగారును, దాని నంగీకరించి వీరేశలింగము పంతులుగారును జెప్పియున్నారు.

"శ్రీవిభుఁడ గర్వితారి
క్ష్మావరదళనోపలబ్ధ జయలక్ష్మీ సం
భావితుఁడ సుమతి శతకము
గావించిన ప్రోడఁ గావ్యకమలాసనుఁడన్."

ఈ పద్యము నీతిశాస్త్ర ముక్తావళి వ్రాఁతప్రతుల నెద్దుటను గానరాలేదనియుఁ, గాన నంత విశ్వసనీయము గాదనియు ధ్రువపఱచియున్నారు.

పైపద్యమున సుమతి శతకమే ముందు వ్రాసినట్లు, "పరువడి నాంధ్రభాషఁగల బద్దెననీతి.." యను పద్యమున నీతిశాస్త్రముక్తావళియే ముందు విరచించినట్లును బద్దెనయే చెప్పుకొనెనని యుదాహరించిన శ్రీ వీరేశ

లింగముగారి యూహ పరస్పర వైరుద్ధ్యమున కాలవాలమైనది. కాక, దీనివలనఁ గూడ సుమతి శతకము బద్దెనకృతము కాదనియు నాతని తరువాత కవిచేత నే విరచింపఁబడిన దనియుఁ దేలుచున్నది. అందువలన బద్దెన నీతిశాస్త్రముక్తావళి యను గ్రంథ మొక్కటా నినే రచించియున్నాఁడనుటయే సత్యము.

## గ్రంథ ప్రాశస్త్యము

సారస్వతమున బద్దెన నీతిశాస్త్ర ముక్తావళికిఁ గల స్థానము ఇందలి పద్యముల ననేకులు లాక్షణికు లుదాహరించి యుండుటవల్లను, భాషామాధుర్యమునను, భావవైశిష్ట్యమునందును ఆంధ్రమునఁగల రాజనీతి గ్రంథముల నుత్తమమైనదిగా నెన్నబడుటవలనను విదితమగుచున్నది. ప్రతాపరుద్రుని చే విరచింపఁబడిన నీతిసారమను గ్రంథమున బద్దెన పూర్వ సుకవులలో నొకఁడుగా స్తుతింపఁబడినాఁడు. మడికి సింగన తన సకల నీతిసమ్మతములో ననేకములగు నీతని పద్యము లుదాహరించియున్నాఁడు. శ్రీ నరచ్ఛందమునను, కవి సంజీవనియందును, రత్నాకరమునందును, ప్రబంధరాజ శ్రీ వేంకటేశ్వర విజయవిలాస మను నద్భుతగ్రంథమును విరచించిన వేంకటకవి లక్షణశిరోమణియందును బద్దెన నీతిశాస్త్రముక్తావళి యందలిపద్యముల నుదాహరించియున్నారు.

ఆంధ్రమునఁగల రాజనీతిగ్రంథములలో క్షేమేంద్రుని ముద్రామాత్యము, ప్రతాపరుద్రుని నీతిసారము, భోజరాజ విభూషణమను నీతిభూషణము, చారుచర్య, ప్రాచీనకామందకము, ప్రాచీన పంచతంత్రి, శివదేవయ్య పురుషార్థసారము, ఆరాధ్యదేవుని స్మరతత్త్వసారము, మడికిసింగన నీతికావ్యావళి మున్నగునవి ప్రసిద్ధములు. పైవానిలోఁ గొన్ని గ్రంథములు ప్రస్తుతము లభింపకపోయినను మడికి సింగన విరచించిన సకలనీతిసమ్మతమున నుదాహరింపఁ బడియుండుటచే, తత్పరిశీలమున వానియందలి పద్యములకన్న బద్దెన పద్యముల ప్రౌఢత్వము, మాధుర్యము విశదమగును. నీతిశాస్త్ర ముక్తావళియందీ పోలికపద్యము లీయఁబడియుండుటచే వాని నిట నుదాహరించుట చర్వితచర్వణమే యగును.

నీతిశాస్త్రముక్తావళి యందలి విషయ మారంభ పద్యమున నే వివరింపఁబడియున్నది:

"రాజనీతియు నసద్రాజలక్షణమును
మంత్రిమార్గంబు దుర్మంత్రివిధము,
నధికారవిధియుఁ గార్యవిచారము నుపాయ
గతియును రాజ్యరక్షాక్రమంబు
ఇల నరాజకవృత్తి హితసేవకస్థితి
దుస్సేవకక్రియ దుష్టరాజు
సేవాబలము దానశీలతామహిమ వి
వేక సంగతియును లోకనీతి
పద్ధతులు............"

పై విషయములపైఁ జెప్పిన పద్యములను దిక్ప్రదర్శనమాత్రముగా నుదాహరించి యందలి యౌచిత్యము నరయుదము.

రాజనీతులలో:

"న్యాయము ప్రజ పెక్కువకును
బ్రాయము ప్రజకల్మి సిరి కుపాయం బగుటన్
న్యాయమె భండారము నర
నాయకులకు............"

న్యాయపరిపాలనావశ్యకముఁ ప్రధానముగాఁ జెప్పఁబడినది.

"తప్పు లెఱింగిన నాప్తుల
యాప్తు లెఱుంగుదురు తత్తదాప్త శ్రవణ
ప్రాప్తమగుచుండుఁ గావున
నాప్తపరంపర లమంత్ర మగునిం బతికిన్."

అను రాజ్యతంత్రరహస్యగోపనావశ్యకమును:

"నయమునఁ గాని భూమిప్రజ
నమ్మదు నమ్మినఁ గాని యర్థసం
చయమును తంత్రవృద్ధియును
జాలదు, చాలినఁ గాని శత్రులన్
బయి చని యోర్వరాదు, ప్రతి
పక్షము సంగినఁ గాని భూమి య
క్షయముగ నేలరాదు......"

అను చోటను—

"సతికన్న నబల వసుమతి
సతిపతి లేకున్నఁ జెడదు సత్యము ధాత్రీ
పతిలేని నాఁడు సద్య
చ్చ్యుతి వసుమతికి......"

అను చోటను—

## బద్దెన నీతులు

"మండలము చెడిన పతి చెడు." అను చోటను రాజునకును, ప్రజలకును గల యవినాభావసంబంధము చక్కఁగాఁ దెల్పఁబడినది.

మఱియు దానశీలతా లోకనీతి పద్ధతులందలి త్రికాలాబాధ్యములగు పరమసత్యము లద్భుతముగా నీ గ్రంథమున వివరింపఁబడినవి.

"దానగుణంబ యెన్నఁగఁ బ్ర
 ధానగుణం బది మున్ను గల్గినన్
గాని విశేషమై పురుష
 కారము నిల్వదు లోభినాఁగఁ జ
న్నేని యశంబు సత్త్వము స
 హిష్ణుతయున్ విభవంబు విద్యయున్
మానము బీరమున్ వృథయ
 మానిసికిన్......".

"ఎత్తిన కాలఁగాని సిరి
 కెన్నఁడు నిల్చిన కాల నిల్వఁగాఁ
జిత్తములేదు కాన సిరి
 చెందిన నాఁడె పరోపకారముల్
హత్తి కడంగి సేయుఁ డెవ
 డైనఁ బదంపడి వేఁడుకొందమున్
చిత్తమె కాని యిత్తమను
 చిత్తము పుట్టునె యెట్టివారికిన్?"

అను పద్యము లద్భుతములు, అనుపమానములు.

ఈతని కవిత్వమున నెన్నుట కొక్క పొల్లు మాటైన నుండక పోవుటే కాక.

"హాసఁగ ముత్తెపుసరుల్ పోహళించిన లీలఁ
 దములోన దొరయు శబ్దములఁ గూర్చి."

యన్న సూరనార్యుని నానుడికిఁ దీఁటై యీతని పద్యములుండును. సమస్తమును విధివశమన్న విషయ మెంత చక్కఁగాఁ జెప్పెనో చూడుఁడు:

"అగుటయుఁ గామియు విధివశ
మగు టెఱుఁగక తనవశంబె యని డెందములో
వగ చెడు మూఢుఁ గనుంగొని
నగఁడె విధాత్రుండు..."

"కాని యది కాద యర్యోకు
 దాని కవశ్యంబు నన్యథాభావ మిలన్
గానేర దింత యెఱుఁగని
మానిసి చింతాసముద్రమున్మఁగు కాఁడే."

"కరిసన మోపి చేసినను
 కర్షునిఁ గొల్చిన హీనమాడినన్
దిరిసిన ధాత్రి రోసి పర
 దేశము పోయిన విద్యకల్గినన్
సిరి తన పూర్వజన్మమునఁ
 జేసిన యంతయ కాక కల్గునే
పొరలిన వ్రేలఁ బట్టఁ దల
 పోఁతలు పోసిన వెచ్చనూర్చినన్?"

ఈతని పద్యముల కూర్పు, అల్లిక జిగిబిగి, ధారాశుద్ధియు నత్యుత్తమములు. తిక్కనకుఁ బూర్వమే యిట్టి కవితాపాటవము బద్దెనృపాలునినోట వెలువడుట యత్యంత మోదసంధాయకము.

"ధరణియు తల్లి తన్ గనిన
 తల్లియు వేల్పు గుణంబు మేని కా
భరణము బుద్ధి రూపు కుల
 భామయు సంపద బొంక వేఁ పో
దరుఁ డిలఁ బ్రాపు దంపమియ
 ధర్మువు క్రోధము పాతకంబు మ
త్సరము వినాశహేతువు వి
 చారమె సారము..."

ఈ విధముగనే గ్రంథమంతయు నత్యంత శ్లాఘాపాత్రముగా వెలయుచున్నది.

ఇట్టి యుత్తమగ్రంథమునకు రెండు మూఁడు విధముల ప్రతులుండుటయు నందు పాఠభేదము లధికముగా నుండుటయు, ఒక ప్రతియందు మూఁడాశ్వాసములుగా విభాగింపఁబడి యిందలి పద్యములుండుటయు మొదలగు విషయములు కానవచ్చుచుండుటచే నీ యుద్గ్రంథమును తిరిగి సవిమర్శకముగా సంపాదించి ప్రకటించు టత్యావశ్యకముగా నున్నది. ఏ తక్కుప్రతి కర్తయగు బద్దెనృపాలుని కాలమునుగూడ సద్విమర్శకులు పరిశోధించి యాధారసహితము, నామోదనాయకమునగు నిర్ణయము గావింపవలసియున్నది.



భారత సింహళ జపాన్ మహాబోధి సంఘములు కలసి సార్‌నాథ్‌లో
నిర్మించిన 'మూలగంధ కుటీ విహారం'



సార్‌నాథ్‌లోని 'మూలగంధ కుటీ విహారం లోపలిభాగం. జపాన్ చిత్రకారు
డొకరు బౌద్ధగాథలకు సంబంధించిన అనేక కుడ్య చిత్రాలను చిత్రించి విహారాంత
ర్భాగాన్ని శోభామయం చేశారు. అచ్చెరువు గొల్పుతున్న ఈ కళా వైభవం ప్రాచ్య
పాశ్చాత్య యాత్రికుల ననేక మందిని ఆకర్షించి అనందపరుస్తున్నది.

శ్రవ్య నాటిక:

# మేఘ మల్హార్

శ్రీమతి మానికొండ సరోజినీదేవి

## పాత్రలు

ప్రద్యుమ్నుడు    సరస్వతీదేవి
సూరదాసు    సునంద
పూర్ణవర్ధనుడు

* * ప్రాతఃకాలాన్ని సూచించే సంగీతం క్రమేపీ తగ్గిపోతూ వుంటుంది.

పూర్ణవర్ధనుడు : (ఉచ్చైస్స్వరంతో)

ఏ ధర్మ హేతు ప్రభవా
తే సమ్ హేతుమ్ తథాగతః
తే సచ్ ఏ నిరోధో
ఏవంవదీ మహాసమనో.

[విరామం]

ప్రద్యుమ్నుడు : (అడుగుల చప్పుడు-రొప్పుతో) స్వామీ!

పూర్ణ : ఎవరూ? ప్రద్యుమ్నా!

ప్రద్యు : అవును స్వామీ!

పూర్ణ : (కంగారుగా) అలా రొప్పుతున్నావేం. తెల తెలవారకముందే లేచొచ్చినట్లున్నావ్. యేం జరిగింది?

ప్రద్యు : రాత్రంతా నిద్రపట్టలేదు స్వామీ!

పూర్ణ : ఎందుకని?

ప్రద్యు : ఎందుకనో మరి. యేవో విషయాలు నన్ను భయపెడుతున్నాయి. మనస్సంతా ఆందోళనగా వుంది. ఎప్పుడు తెల్లవారుతుందా జరిగిందంతా యెప్పుడు చెబుదామా అని ఆదుర్దా యెక్కువైంది. రాత్రంతా నిద్ర లేదు.

పూర్ణ : ఏమిటి నాయనా అది. అంతా విచిత్రంగా వుందే!

ప్రద్యు : మనవి చేసుకొంటాను.

* * *

[జనుల సందడి—కోలాహలధ్వనులు—నాగస్వర చిహ్నాలు – గావుకేకలు-పొలికేకలు].

ప్రద్యు : (తనలో) ఈ మాసంలో జరుగుతూండే సంక్రాంతి వుత్సవాలకు తప్పకుండా వస్తానన్నాడే! యేమి చెప్మా! యింకా వచ్చినట్లు లేదు. మూడురోజుల్నుంచి యేకధాటిగా వెతుకుతున్నా. జనం మూగిన చోటల్లా అన్వేషిస్తున్నా! కళ్లల్లో జ్యోతులు వేసుకొని చూసినా ఆయనమాత్రం కానరాలేదే! — (నెమ్మదిగా)

[నాగస్వరం ఊదుతున్న ధ్వని]

ఎవరది! ఆ పాములవంక తదేకదృష్టితో చూస్తున్నాడు. మనిషంతా అచ్చంగా అతడిలాగే వున్నాడు. నిజంగా...సూరదాసే అతడు —సూరదాసే...

[క్షణం విరామం]

నమస్కారం సూరదాసుగారూ!

సూరదాసు : 'దీర్ఘాయురస్తు' నాయనా! అన్నట్లు నన్నే గదూ యిందాకట్నుంచీ నువ్వు వెతుకుతోంది?

ప్రద్యు : (సంతోషంతో) ఎలా తెలుసుకోగలిగారు స్వామీ! చెప్పకుండానే.

సూర : (చిన్నగా నవ్వి) అదా నీ అనుమానం. నేను అవంతీపుర గాయకుణ్ని. అసలు నిన్ను నేనెరుగుదును. ఇదివరలో మీ నాన్నగారూ నేను మంచి స్నేహితులం. మీవూరెప్పుడైనా పనివుండి వెళ్లడం జరిగితే తప్పకుండా మీ

నాన్నగార్ని కలుసుకొని, పల్కరించి, మరీ వచ్చేవాణ్ణిసుమా!

ప్రద్యు : అలాగా స్వామీ! మరి నన్నెప్పుడూ చూడలేదా!

సూర : అదేమిటి నాయనా! నిన్ను చూడకపోవడమే. అప్పట్లో నువ్వు చాలా చిన్నవాడివి. తప్పటడుగులు వేసుకుంటూ గుమ్మాలు దాటుతూండేవాడివి. చాలా ముద్దొస్తూండేవాడివి కూడా.

ప్రద్యు : అయితే మీరు ప్రస్తుతం ఎక్కడుంటున్నారు?

సూర : ఇక్కడికి దక్షిణపుదైపుగా ఒక నది వుంది తెలుసుగదూ!

ప్రద్యు : ఆఁ...వుందండీ!

సూర : దాని వొడ్డునే శిథిలమైన దేవాలయం ఒకటి వుంది.

ప్రద్యు : ఆఁ... ఆఁ...

సూర : దాన్నెప్పుడైనా చూశావా నాయనా!

ప్రద్యు : చూడకేం స్వామీ! చాలాసార్లు చూసొచ్చాను. కొన్నాళ్లుగా ఒక సన్యాసి బస చేస్తూండేవాడు కూడా.

సూర : ఆ...! యిప్పటికీ ఆ మహానుభావుడు అక్కడే వుంటున్నాడు. నీ కెప్పుడయినా తీరికవుండి—వీలు చిక్కితే అక్కడికొచ్చి నన్ను కలుసుకో! మరిచిపోకుసుమా!

ప్రద్యు : అలాగేస్వామీ! తప్పకుండా వచ్చి దర్శించుకొంటాను.

సూర : ఇదిగో! అన్నట్టు...నీ పేరేమిటీ?

ప్రద్యు : ప్రద్యుమ్నుడండీ!

సూర : ఇంతా తెలుసుకొని అసలైంది అడగటం మరిచా!

ప్రద్యు : ఏమిటది స్వామీ?

సూర : మరేంలేదూ! ప్రస్తుతం నీ బసెక్కడ?

ప్రద్యు : ఇక్కడకు దగ్గర్లో ఒక బౌద్ధ విహారం వుంది. తెలుసుగదండీ? అదే. అక్కడే ఇప్పటికి మూడు సంవత్సరాలబట్టీ చదువుకొంటున్నాను.

సూర : మంచిది నాయనా! బాగా చదువుకో! మరి... తప్పకుండా వస్తావ్ గదూ! ఒకసారి.

ప్రద్యు : స్వామీ! ఇంకా ఇక్కడ ఎన్నాళ్లుంటారు?

సూర : ఈలోపుగా నన్ను కలుసుకొంటావ్ గా! మళ్ళీ అప్పుడు చెబుతాలే! ఏమనుకోకు— వస్తా మరి...

* * *

ప్రద్యు : ఇలా మాట్లాడుకొన్నాం గురుదేవా! మొదటి నాకు పరిచయమైనప్పుడు ఆ సూరదాసు గారన్నా— నేనన్నా!

పూర్ణ : ఆయన రమ్మన్నప్రకారం తర్వాత ఎప్పుడైనా కలుసుకొంటానికి వెళ్ళావా?

ప్రద్యు : వెళ్ళకేం స్వామీ!

పూర్ణ : ఏ వేళప్పుడు వెళ్ళావ్.—

ప్రద్యు : ఇంకా సాయంత్రం ముదిరిపోలేదప్పటికి.

పూర్ణ : ఒంటరిగా నేనా?

ప్రద్యు : ఒంటరిగా నే బయలుదేరి వెళ్లాను స్వామీ!

పూర్ణ : మధ్యలో యెవరూ తోడుగా కనిపించలేదా?

ప్రద్యు : ఆప్రాంతంలోకి వెళ్లుతూండేటప్పటికి యెదురుగా ఒక పర్వతం కనిపించింది. దాని కిరుపైపులా కొలిదాస్తన్నవి పగలల్లా పని చేసి, గృహోన్ముఖులైన పల్లె జనమంతా వరుసగా ఆ దారివెంట బయలుదేరారు.

పూర్ణ : ఎవరినంకా పరీక్షగా చూడలేదుగదా!

ప్రద్యు : (దీనంగా) అబద్ధం చెప్పి మిమ్మల్ని మోసం చేయలేను స్వామీ! ఆత్మవంచన చేసుకొంటూ మీముఖంవంక చూసి మాట్లాడలేను...

పూర్ణ : నాకు తెలుసు ప్రద్యుమ్నా! నువ్వు చంచల స్వభావివని, నీలో ఉన్మాదం, కుతూహలం యిటువంటి పరిస్థితుల్లో ఉప్పొంగిపోయి వుంటాయని, నే ననుకొంటూనే వున్నా! తప్పకుండా నువ్వు ప్రతిభావంతుడవై తీరుతావనికూడా ఆశిస్తున్నా... కాని...

ప్రద్యు : క్షమించండి స్వామీ! సునందకోసం ఆ వెళ్లే పల్లెగుంపులో వెతికాను. మీ రన్నట్లుగా మారిపోయిన విషయంకూడా వాస్త

వమే! ఆమెను చూస్తూంటే యెందుకో అలా అయిపోతున్నా!

పూర్ణ : అయితే ఆనాడు సూరదాసుని కలుసుకో లేదా!

ప్రద్యు : సునందతో కాసేపు మాట్లాడి వెడదామనుకొన్నా! కాని పొద్దు వాలిపోబోతోంది. చీకటి; వెన్నెలజేవురింపబోతోందని గ్రహించాను.

పూర్ణ : సునందతో మాట్లాడటం యింతికీ కుదర్లేదా? ఆ రోజు.

ప్రద్యు : అదే మనవి చేసుకుంటూ స్వామీ!

* * * *

[నవ్విన ధ్వని]

ప్రద్యు : ఎవరూ! సువ్వా! ఎప్పుడొచ్చావ్?... అబ్బ!...నీ కోసం యెంత వెతికానని... (నవ్వుతున్న ధ్వని) యేమి టా పిచ్చి నవ్వు!...కొంత దాముకో రేపటికి... అదిగో మొదలెట్టావ్ కొంటెపనులూ!... సునందా! యింకా చంటిపిల్లలాగా యేమిటీ అల్లరిచేష్టలు...

సునంద : (నవ్వాపుకొంటూ) పాపం! చాలా అలసిపోయారు కదూ!

ప్రద్యు : దేనికీ?

సునంద : కోపానికి.

ప్రద్యు : కోపం?-ఎవరికీ?

సునంద : మీకే!

ప్రద్యు : అబ్బే! నాకేం కోపం. అయినా యెందుకు? యిప్పుడు.

సునంద : ఇంతలోకే యెంత మారతారండీ! యిప్పుడేగా కసురుకొన్నారు పైపంచ లాగితే.

ప్రద్యు : అలా లాగడం కొంటెపని కాదూ!

సునంద : అంతమాత్రానికే కోపం రావాలా! మీరెన్ని సార్లు నా పమిటచెంగు లాగి నన్ను కవ్వించారు!—గుర్తులేదా! అసలు మీ మగాళ్లకి ఆడవాళ్ళంటే అతి చులకనలెండి. మీరే మైనా చెయ్యొచ్చుగాని, మేంచేస్తే యిట్టే బయటపడతారు. సహనమనేది వుంటేగా అసలు.

ప్రద్యు : (లాలనగా) పోన్లే సునందా! ఒక్కసారి యిలా చూడు.

సునంద : సిగ్గులేకపోతే సరి.

ప్రద్యు : అంతకోపం దేనికి సునందా! యేది ఒక్కసారి యిలా నావంక చూసి నవ్వవూ! నా సునందవుగా! ఏది! నీకోసం యెంతగా వెతుక్కుంటూ వచ్చానో తెలుసా!

సునంద : నిజంగా! నాకోసమా!—లేక పాములవాడి కోసమా!

ప్రద్యు : నీకోసమే!

సునంద : పైమాటేగాని, నాకోసం యెందుకొస్తారు. ఆ పాములవాడికోసం వచ్చివుంటారు. ఇంతలో నే కనబడ్డానని నీకోసమే అంటున్నారు. అంతేనా!

ప్రద్యు : ఎంత మాటకారి వైపోయావ్ ?

సునంద : (హేళనగా) అలాగా!

ప్రద్యు : నిజం సునందా! ముమ్మాటికి నమ్ము. ఎప్పట్నుంచో వెతుకుతున్నాను. ఇప్పుడూ వెతుకున్నా.

సునంద : బాగుంది ఎదురుగా—వుండగా నే

[ఇంతలో అడుగుల చప్పుడు]

ప్రద్యు : సునందా! యెవరో యిటే వస్తున్నారు...

సునంద : ఎవరూ!

ప్రద్యు : కాలి అందెలు మ్రోగుతున్నయి—గాజులు కూడా కదిలిన శబ్దం వినిపిస్తోంది.

సునంద : అయితే నే వెళ్ళిరానా! మళ్ళా కలుసుకొంటా స్లే ప్రద్యుమ్నా!

ప్రద్యు : (తనలో) ఏమిటో యీ రహస్య ప్రణయ సమావేశాలు. పండువెన్నెల్లో — నిండు శారద రాత్రుల్లో—హృదయం విప్పి సునందతో కాసేపు కులాసాగా మాట్లాడుదామనుకొంటే యేవో అవాంతరాలు తటస్థపడుతూంటాయి. విహారంలో గురుదేవులు త్రిపిటకమునుగురించి రేపడిగితే యేం చెప్పాలి. నిజంగా నేను చంచలాత్ముడి నే. లేకపోతే నా యీ మనస్సు కాసేపు జ్యోత్స్నాపూరితమైన ప్రకృతివైపూ, మరి

కాసేపు ప్రణయానందదాయియైన సునంద నైపు వినిటిది?

[ఇంతలో సాయంకాలపు హారతి గంటల చప్పుడు వినిపించి క్రమేపీ తగ్గిపోతూ వుంటుంది.]

అదిగో! పరిమిత దేవాలయంలో హారతి గంటలు మ్రోగుతున్నయ్. యెంతసేపని యిట్లా వుండను—ఆశ నిరాశ అయింది. దారిన బడితే నెమ్మదిగా వెళ్లొచ్చు. (నడక చప్పుడు)

[మనిషి కదలిన చప్పుడు]

ప్రద్యు : ఎవరా మనిషి ?

[క్షణం విరామం నవ్వు శబ్దం]

ప్రద్యు : ఎవరూ! సునందా!

సునంద : ఊఁ...!

ప్రద్యు : సునందా! యేమిటీ చెట్టుచాటున చీకట్లో దాగుడుమూత లాడుతున్నావ్.

సునంద : కనుక్కోవాలి మరి...

(క్షణం విరామం)

ప్రద్యు : అబ్బ! యేమిటో!

సునంద : చెప్పుకోవాలి మరి...

ప్రద్యు : ఇవాళ అగ్నిపరీక్షలు మరీ యెక్కువై నయ్యే! అదేమిటో నువ్వే చెబుదూ!

సునంద : ఇంతేనా మరి!...ఆలోచించి చెప్పండి చూద్దాం.

ప్రద్యు : నాకెట్లా తెలుస్తుంది యేమిటో అది.

సునంద : ఓడిపోయారా?

ప్రద్యు : ఓడిపోయినట్లే—అదీ గాక ఆడదాని ముందు పందెంలో గెలిచినవా డెవర్లే!

సునంద : అది బాగానే వుంది గాని, యింతకీ మీరు దారివెంట పోతున్నారా! లేకపోతే నన్ను వెతుకుతున్నారా! అదీ గాకపోతే పాముల వాడికోసమా!

ప్రద్యు : అబ్బే! నేనసలు వెతకడం లేదు. పైగా నువ్వే వెతుక్కుంటూ వున్నావ్—వేళా కోళ మాడుతున్నావ్.

సునంద : నే నవ్వక పోతే యేమయ్యేవారూ?

ప్రద్యు : నే చూడకపోతే నువ్వేమయ్యేదానివి? యిటువంటివి చూస్తుంటేనే నాకు మహా కోపం వచ్చేది.

సునంద : తప్పుచేసి యింకా కోపం దేనికి? ఆలోచించ యేం చెప్పారో గుర్తుకు తెచ్చుకోండి! తెలుస్తుంది.

ప్రద్యు : లేకేం, బాగానే వుంది. నీ విషయం అసలు లేదు. అయినా నువ్వు భాగ్యవంతుడి కూతురివి. ఇంతకీ నువ్వు చెప్పే విషయం యేమిటో తెలియటం లేదు.

సునంద : మెత్తిపోతుమాటలు చాలు గాని, అబద్ధ మాడబోకండి — ఆడపిల్లలు పట్టుతారు. ఆ మాటేమిటో మీరే ఆలోచించి గుర్తుకు తెచ్చుకోండి. అంతవరకూ నే నెక్కడికీ పోను...సరేనా...

ప్రద్యు : (క్షణమాగి) ఆ...అదా! గుర్తొచ్చిందిలే. మురళీగానమేనా!

సునంద : ఇంకా బాగా ఆలోచించండి. ఆ రాత్రి రెండుఝాములకే దేవాలయంలోకి వచ్చి కూర్చుంటానని కూడా మాటిచ్చారు... మరి...వచ్చారుగనుక!

ప్రద్యు : వచ్చాగా! సునందా!

సునంద : చెప్పిన వేళకి,

ప్రద్యు : సరిగ్గా ఆ వేళకి రాలేకపోవచ్చు. తరువాత వచ్చినమాట వాస్తవం. యింతకీ నన్ను చూశావా! సునందా!

సునంద : మీకోసం వచ్చినప్పుడు-నమ్మి మన సిచ్చి కొన్నప్పుడు-చూడకుండా యెలా వుంటా!

ప్రద్యు : (నవ్వుతూ) సరే సునందా! చూసినదానివి యెందుకు పిలువలేదూ ?

సునంద : అప్పుడు నా పరిస్థితి చూసివుంటే, మీకు తెలిసేది. ఒక్కతెనే వున్నానా! రెండు ఝాములప్పుడు ఒంటరిగానే వచ్చాను. ఆలయమంతా వెతికాను...మీ రెక్కడా కనిపించలా చాలాసేపు దిగాలుపడివున్నా. ఇంతలో మా వూరిజనమంతా వచ్చారు. అప్పు డెలా పిల్వను-చెప్పండి.

ప్రద్యు : చివరకు నన్నే ఓడించావ్ సునందా! సరేనా! తప్పుకూడా నిజంగా నాపల్లే వుంది.

సునంద: కాసేపు అలాగే అంటూంటారు—మీ బోటివాళ్లంతా. అయినా మీ లాంటి పాములవాళ్లని యెవరూ నమ్మరి?

ప్రద్యు: ఇం కెవరంటారు నీ బోటివాళ్లే. అయినా అడగటం మరిచా. సునందా! నువ్వు యీ మధ్య మాటిమాటికి నన్ను పాములవాడంటున్నావ్, యేమిటీ అసలు రహస్యం?

సునంద: అదేమిటో మీకే తెలియాలి.

ప్రద్యు: నిజంగా నాకేం తెలియదు.

సునంద: తెలిసి అడగటం తెలివనుపించుకోదు.

ప్రద్యు: (క్షణమాగి) ఓ......అదా......ఆ రోజు సంక్రాంతి వేడుకల్లో నేను, పాములవాడు పాముల్ని ఆడిస్తూంటే చూస్తూ నిలబడ్డందుకేనా యీ వేళాకోళం? సునందా! యథార్థంగా ఆ దృశ్యంమీద కుతూహలం వుండికాదు నిలబడింది.

సునంద: మరి దేనికి?

ప్రద్యు: ఆ వేళ అవంతీపురంనుంచి ప్రఖ్యాత మురళీ వాద్యగాడు సూరదాస నే ఆయన రావలసి వుంది. ఒక వేళ వచ్చివున్నాడేమోనని ఆ గుంపులో వెతుకుతున్నా.

సునంద: ఎందు కాయన?

ప్రద్యు: ఎందు కేమిటి సునందా! ఆయనవద్ద మురళీ గానం నేర్చుకోవాలనే అభిలాష నాకుందని నీకు లోగడ ఒకసారి చెప్పలా! మరిచిపోయావా?

సునంద: ఇంతకీ పాపం! కష్టపడి వెతికినందుకు కనిపించారా?

ప్రద్యు: 'వెదుకబోయిన తీగ కాలికి తగిలినట్లు' ఆయ నంతట ఆయనే కనిపించి, పరామర్శించారు కూడానూ.

సునంద: ఆయ నిప్పు డెక్కడున్నారు?

ప్రద్యు: నదివొడ్డునవున్న దేవాలయంలో వుంటున్నానని చెప్పారు. అన్నట్టు మీ నాన్న గారు ఎక్కడా కనిపించలేదేం ఈమధ్య?

సునంద: యీ సందట్లో ఆయ నెందుకు జ్ఞాపకమొచ్చాడు?

ప్రద్యు: ఆ...! యేంలేదు! ఇదివరకు నా దగ్గరకొచ్చినప్పట్నుంచీ వెళతా—వెడతా నంటూండేదానివి. కాని.... ఈ రోజు ఆ మాటేమీ అనకుండా యింతసేపూ, నాతో కాలం వెళ్లబుచ్చుతూంటే ఆశ్చర్యంవేసి "యేమి" అని అడుగుతున్నా!

సునంద: మూడు నాలుగు రోజుల క్రితం మహారాజు ఆహ్వానం పంపితే కౌశాంబి వెళ్లారు. ఇంకా రాలేదు.

ప్రద్యు: (పక్కున నవ్వి) అందుకనా! ఇంత ధైర్యం.

సునంద: మీకేం తెలుసు. ఎన్ని కష్టాల్ని తప్పించుకొని, ఈ అడవిలో చీకటినికూడా లెఖ్ఖచేయకుండా మీ దగ్గరికి వస్తున్నానో!

ప్రద్యు: సునందా! నిజంగా నువ్వన్నట్లు తెలియదు. పిలవటం అనేదే ధ్యేయంగా పెట్టుకొన్నవాడికి యెదుటివ్యక్తి అగచాట్లు యెలా తెలుస్తయి. ఎందుకంటే నీలాగ నేను కష్టపడటం లేదుగా! (మృదువుగా) సునందా! నువ్వు నా ప్రేయసివి—నా ఆరాధ్యదేవివి. నా ఆనందాల సునందవు

సునంద: అబ్బ! ఎందు కంత బిగ్గరగా పొగుడుతారు.

ప్రద్యు: ఏం?

సునంద: ఏ మేమిటి! వూరుకోండి. హారతి వేళ కావొచ్చింది జనమంతా యిటే వస్తారు.

ప్రద్యు: గుర్తొచ్చింది. ఈసారి మీ నాన్న రాగానే తప్పకుండా చెప్పేస్తాను.

సునంద: (చిరుకోపంతో) చెప్పకోండి. భయమను కొన్నారా! ఏం.

ప్రద్యు: అటువంటి వేమీ లేవని నాకు తెలుసుగా!

సునంద: ఆయన గారికి తెలియకపోతేగా!

ప్రద్యు: మన విషయమేనా!

సునంద: అబ్బ! యిది కాదూ!

ప్రద్యు: మరేదంటావ్?

సునంద: హారతి యిచ్చేదాకా దేవాలయంలోనే వుంటానన్న సంగతి.

ప్రద్యు: అయితే కాసేపు యెప్పుడైనా ఆలస్యమైతే మీ నాన్న వూరుకోంటాడన్నమాట. చాలా అదృష్టవంతురాలివి. అన్నట్లు చెప్పనులే... సునందా!

సునంద : ఫరవాలేదు చెప్పిచూడండీ !
ప్రద్యు : నిజంగా చెబుతాననుకొన్నావా !
సునంద : మీ విషయం నాకు తెలియకపోతేగా! భయ పడటానికి.
ప్రద్యు : మరి...మురళి...వినిపించనా !
సునంద : ఇదివరకల్లా అడిగి వినిపిస్తున్నారా !
ప్రద్యు : పోనీ, యిప్పుడడిగి వినిపిస్తున్నా ననుకో రాదూ !
సునంద : అయితే... కాస్త...దగ్గిరగా రానీయండి నన్ను...
[మురళీగానం మాచాయగా మేఘమల్హార్ రాగాన్ని గుర్తుచేస్తుంది. రెండు నిముషాలనంతరం క్రమంగా తగ్గుతూంటుంది.]
సునంద : (నెమ్మదిగా) ఇవాళెందుకో వొళ్ళు మరిచి పోయాను ప్రద్యుమ్నా !
ప్రద్యు : అప్పుడప్పుడు నీ కలవాటేగా ! అది.
సునంద : ఆనందించడంకూడా అలవాటేనా !
ప్రద్యు : కాదుమరి ! అన్నట్టు చాలా పొద్దు పోయింది.
సునంద : అవును! నీ వొడిలో తల పెట్టి—పడుకొంటే హృదయం యెందుకో హాయిగా వుంటుంది. తూచలేని స్వర్గభోగాల అనుభూతి అంతా నాలో పొర్లుతూంటుంది యెంతసేపయినా అలాగే వుండాలనిపిస్తుంది...
ప్రద్యు : సునందా !
సునంద : ప్రద్యుమ్నా ! చాలాదూరం వెళ్ళాలిగదూ!
ప్రద్యు : అవును. నే వెంట వస్తానులే కొంతదూరం దాకా! పద...

[విరామం]

పూర్ణ : ఇంతకీ, ఆ వేళ సూరదాసుని కలుసుకో లేదన్న మాట.
ప్రద్యు : కలుసుకోకేం స్వామీ ! తెల్లవారు ఝామునే బయలుదేరి వెళ్ళాను. గుడిలో విగ్రహం లేదు. గుడి గోడలన్నీ పెద్ద పెద్ద పగుళ్ళిచ్చి వున్నాయి. వాటిమధ్యనుంచి యేవో మొక్కలు - తీగెలు అల్లిబిల్లిగా మొలిచి, అల్లుకొనివున్నాయి. చుట్టూ ఏవో గ్రామాలున్నట్లు మినుకుమినుకుమంటూ దీపాలుకూడా కనిపించాయి.
పూర్ణ : సూరదాసు కనిపించలా! అప్పుడు.
ప్రద్యు : కనిపించారు గురుదేవా!
పూర్ణ : ఏమన్నారు?
ప్రద్యు : చాలా ఆప్యాయంగా స్వాగతం తీసుకుంటూ-

[విరామం]

సూర : ఇదేనా రావడం! నాయనా!
ప్రద్యు : అవును స్వామీ!
సూర : చాలా సంతోషం... లోపలంతా చీకటిగా వుంది...పద......అలా వెలుతుర్లోకి వెళ్ళి కాసేపు విశ్రాంతిగా కూర్చొని మాట్లాడు కొందాం.
ప్రద్యు : అలాగే స్వామీ !
సూర : (ఆలోచనగా — తనలో) జరుగుతుంది... తప్పకుండా జరుగుతుంది...నీవల్లనే జరిగి తీరుతుంది...యీ విషయం నాకు బాగా తెలుసు...నా పరీక్ష ఫలిస్తుంది. జరిగితీరు తుంది...
ప్రద్యు : (నెమ్మదిగా) స్వామీ! ఏమిటో సెలవిస్తు న్నట్టున్నారు.
సూర : ఆ...! యేమీ లేదు...యేదో విషయం జ్ఞాపకానికి వచ్చింది...అనుకొంటున్నా!

*  *  *  *

పూర్ణ : ఇంకా యేమైనా అన్నాడా సూరదాసు?
ప్రద్యు : ఆయనగారి భీకరస్వరూపాన్ని చూడంగానే నాకెందుకో భయం వేసింది. ముందుగా నాకు నేనై మాట్లాడ్డానికి వెనుకంజ వేశాను. ఆయనలో వున్న ఆకర్షణేదో నన్ను ఆతనికి దగ్గరగా చేర్చింది.
పూర్ణ : మరి, పలకరించగల్గావా!
ప్రద్యు : ఎలాగో ధైర్యంచేసి యిలా అనగల్గాను.

[విరామం]

ప్రద్యు : స్వామీ! నమస్కారం.
సూర : దీర్ఘాయురస్తు నాయనా! అనుకొంటూనే వున్నా! నువ్వీపాటికి వస్తూంటావని. మరేమీ అనుకోకు. నీకేమైనా మీ నాన్నగారిలాగా సంగీతశాస్త్రంలో ప్రవేశముందా?
ప్రద్యు : సంగీతం నేర్చుకోవాలనే అభిలాషయితే వుందిగాని, స్వామీ ! సాధన సక్రమంగా జరగడం లేదు.

సూర : గాత్రమేనా!

ప్రద్యు : కాదు స్వామీ!

సూర : మరెందులో...

ప్రద్యు : కొద్దిగా మురళివాయించడంలో నే అభ్యాసం చేసాను.

సూర : అది సహజమే! మీ తండ్రిగార్ని యెరుగని వారంటూ యెవ్వరూ లేరు యీ చుట్టుపట్ల. అనేకమంది మహారాజులనుంచి ఆహ్వానాలు వస్తూండేవి.

ప్రద్యు : చిత్తం.

సూర : మరైతే నువ్వు యేయే రాగాలు ఆలాపించ గలవు ?

ప్రద్యు : వాటికి సంబంధించిన వివరాలేమీ నాకంత బాగా తెలియవు. యేదో వుబుసుపోకకు అప్పుడప్పుడు వూదుకొంటూ ముచ్చటపడు తుంటాను.

సూర : అలాగా! అయితే! నువ్వెప్పుడన్నా "మేఘ మల్హార్" అనే రాగం పేరు విన్నావా!

ప్రద్యు : ఎక్కడో విన్నట్లే జ్ఞాపకం - స్వామీ!

సూర : మరి దాన్ని...తరువాత...తరువాత సాధన చేయలేకపోయావా ?

ప్రద్యు : మొదట్లో కొన్నాళ్ళు, అంటే గుర్తున్నంత కాలం రోజూ వూరంతా సద్దుమణగిన తర్వాత, పొద్దుపోయేదాకా కాసేపు, తెల్లవారుఝామునే లేచి కాసేపు సాధన చేసాను.

సూర : తప్పకుండా అటువంటప్పుడు ఆ రాగం అనటం సులువుగానే వుంటుందే!

ప్రద్యు : వాస్తవంగా మీరన్నట్లే వుండాలి, మరి కాని...

సూర : ఏమయ్యేది (ఆదుర్దాగా)

ప్రద్యు : ఏమయ్యేదో నాకే తెలియదు. తీరా అవరోహణలోకి వచ్చేటప్పటికి మరొక రాగంలోకి దిగేది.

సూర : అయినా! నువ్వు మురళిమీద మేఘమల్హార్ బాగా ఆలాపించగలవని విన్నానే!

ప్రద్యు : పెద్దలూ—గురుతుల్యులు. మీరంతగా వినాలని కుతూహలపడుతూంటే, వినిపించకుండా యెలా వుంటాను స్వామీ!

సూర : నిజంగా వినాలనేవుంది ప్రద్యుమ్నా! ఎటువంటి అభ్యాసం చేసావో విందామని ఆదుర్దాగా కూడా వున్నమాట కాదనలేను. ఏదీ...ఒక్కసారి...అను...

[మురళిపై మేఘమల్హార్ రాగాలాపన శ్రుతి బద్ధంగా మూడునిముషాలుండి ... క్రమేపీ తగ్గిపోతూ వుంటుంది.]

సూర : (ఆనందాతిరేకంతో) ప్రద్యుమ్నా! ధన్యుడ నోయ్. నీ మురళీ మధురాలాపన నన్ను ఉన్మత్తునిగా చేసింది. నిదురపోతున్న యీ ప్రకృతిని చీల్చుకొంటూ-నిశ్చింతగా-నిర్మలంగా-నిండు తారల కొలువులో-నెలబాలుని సమ్మోహనచంద్రికల ఛాయల్లో-నీలి నీడల్లో జాలిగొలిపే పూలబాలల పాన్పులపై వూయాలలో-జొంపాలలో-నీలి మేలిముసుగు కప్పుకొని, కరాళ భీకర వికటాట్టహాసం చేస్తున్న కాళరాత్రిని కాలదన్ని-సర్వవేళలా యీ భూమిపై ప్రవహించే నీ మురళీగానసుధా రసధార నన్ను పునీతుణ్ణి చేసింది. అయినా యిది నా స్తోత్రంగాని, ఇంద్రదనునుడి కుమారునకు యిది ఒక పెద్దపని గాదు. ముందుగానే నాకీవిషయం తెలుసు-జరిగి తీరుతుందని.

ప్రద్యు : ఏమని క్షమాపణ చెప్పుకోవాలో అర్థం కాకుండా వుంది స్వామీ!

సూర : దేనికంత ప్రయత్నం?

ప్రద్యు : వచ్చీరాని విద్య మీవంటి సర్వజ్ఞులముందు ప్రదర్శించినందుకు.

సూర : అలా అనకు నాయనా! 'సాధన' విద్యకు మెరుగు పెడుతుంది నీ రాగాలాపన విన్న తరువాత నీకొక రహస్యం చెబుదామని బుద్ధి పుడుతోంది. ఈ విషయం చెప్పాలని, నీ కోసం చాలానాళ్లు వెతికాను కూడా.

ప్రద్యు : చిత్తం.

సూర : ప్రద్యుమ్నా! మరి ఆ రహస్యాన్ని నువ్వెక్కడా వెలిబుచ్చకూడదు-యెట్టి పరిస్థితుల్లోనూ తెలియనివ్వకూడదు. అలాగని వాగ్దానం చెయ్యి.

ప్రద్యు : ప్రకృతిసాక్షిగా.

[క్షణం విరామం]

సూర : ప్రద్యుమ్నా! ఏమిటో ఆలోచిస్తున్నట్టున్నావ్. భయపడుతున్నావా! అపాయం కలిగించే విషయం యేమీ కాదు. అటువంటిదయ్యేటట్లయితే స్వయంగా నేను చెప్పనే చెప్పను-తెలుసా!

ప్రద్యు : (క్షణమాగి) ఆత్మసాక్షిగా ... అలాగే స్వామీ!

సూర : అయితే విను :

[నేపథ్యంలో మేఘమల్హార్ రాగాలాపన సూచనగా]

ఆ శిథిలాలయం చూశావుగా. దానిలో యింతకుముందు, ఎంతోకాలంనుంచి సరస్వతీదేవి విగ్రహం వుంది. ప్రఖ్యాత సంగీత విద్వాంసులంతా అప్పట్లో తమ తమ విద్యాభ్యాసం పూర్తయిన తర్వాత ఆ దేవిదగ్గరకు పోయి, మనస్ఫూర్తిగా ఆరాధించి, తమ గానకళాకౌశలాన్ని ప్రదర్శించేవారు. అటుపిమ్మట తోచినవిధంగా సంగీతాన్ని పలుచోట్ల వినిపించుతూ జీవితాన్ని గడిపేవారు. ఎవరైతే నిష్కల్మషంగా నిర్మల మనస్కులై ఆషాఢ పూర్ణిమనాడు శ్రావణ పూర్ణిమనాడు ఆ దేవిముందు మేఘమల్హార్ రాగాన్ని ఆలాపనచేస్తారో, వారికి దేవి ప్రత్యక్షమై కోరిన వరములిచ్చేది.

ప్రద్యు : ఇప్పుడుకూడానా స్వామీ!

సూర : ఈ విషయం యిప్పుడెవ్వరికీ తెలియదు. నియమితసమయంలో 'పరిశుద్ధమైన' హృదయంతో ప్రార్థనచేస్తూ ఆరాధిస్తేగాని, ఆ గానానికి సిద్ధి లభించదు. అదీగాక సంగీత శాస్త్రంలో అతనికి తెలియనిదంటూ వుండదు. ఇది ఇలావుండగా మరొక నియమం వుంది.

ప్రద్యు : స్వామీ! యేమిటది?

సూర : ఆరాధనచేసే వ్యక్తి అవివాహితుడై వుండాలి; ఇంతకూ చెప్పేదేమంటే, వచ్చే పూర్ణిమనాటి రాత్రి మనమిద్దరం ఆ దేవి సాన్నిధ్యంలో వుండాలి. నువ్వు నీ మురళీగానవిన్యాసాన్ని మేఘమల్హార్‌లో చూపించాలి. ఏమంటావ్?

ప్రద్యు : ఇది అనుకొన్నంత సామాన్యవిషయమా స్వామీ! ఏమో! నాకు నమ్మకంలేదు.

సూర : ఏం...భయమేస్తోందా? పోనీ...యిష్టంగా లేదా? మురళీగానవిశారదుడవని జగద్విఖ్యాతిని పొందదలచలేదా? మీ తండ్రిపేరు చిరస్థాయిగా – చిరస్మరణీయంగా వుండటం – నీ కభిమతంగాదా?

ప్రద్యు : అందేంకాదు స్వామీ!

సూర : మరింకేది?

ప్రద్యు : "ఇదెలా సంభవం" – అని ఆలోచిస్తున్నా! అంతే!

సూర : ఆ విషయంలో నువ్వేం భయపడకు – దిగులు పడకు. నిశ్చింతగా వుండు. నిజం దానికదే బయటపడుతుంది. కాని వ్యక్తిని పరీక్షిస్తుంది. నిలబడాలి. కళోపాసన చేయదమంటే, కర్మబద్ధంగా – కాలానుగుణ్యంగా ప్రవర్తించాలి. సంగీతంకూడా మోక్షసాధనకు ఒక మార్గమే. దానికి నాందీ ప్రస్తావన పల్కు. నువ్వు సరేనంటే పూజకు ప్రయత్నాలు సలుపుతాను. తేల్చి చెప్పమరి... అనుమానంతో ఆత్మవంచన చేసుకోవద్దు. అది లలితకళలకు తీరని కళంకం...ఏమంటావ్ మరి?...

ప్రద్యు : సరే....సిద్ధంచేయండి...వస్తాను.

సూర : ఇంకా యేమన్నా సందేహంగా వుందా!

ప్రద్యు : లేదు స్వామీ! సంతోషంగానే వుంది.

సూర : అంతవరకూ రాకుండా వుండేవ్. ప్రద్యుమ్నా! అప్పుడప్పుడు వస్తూ పోతూ వుండు. పూజకు సిద్ధంకావటంతోనే తెలియజేస్తా. నువ్వుకూడా కొన్నిపనులు చేయాలి.

ప్రద్యు : ఏమిటవి? స్వామీ!

సూర : అవేవో తర్వాత చెప్తాలే! ప్రద్యుమ్నా!

ప్రద్యు : చిత్తం...మరి సెలవా!

సూర : మంచిది నాయనా! జాగ్రత్తగా వెళ్ళిరా!

ప్రద్యు : చిత్తం...అలాగే...

* * *

[నేపథ్యంలో]

[ఆషాఢ పౌర్ణమినాటి రాత్రి; ఆకాశమంతా కారుమేఘాలో క్రమ్ముకొని వుంది; మహత్వ

మళ్ళ ఉరుములు — మెరుపులు. అంధ కారంలో అడివి అలసినట్లుంది. ప్రద్యుమ్నుడు, నారదాసు రమ్మన్న ప్రకారం నదివొడ్డుకు వెంటనడిచాడు. భద్రావతీ నది నిశ్శబ్దంగా ప్రవహిస్తోంది. కెరటాలపైనుండి చల్లనిగాలివచ్చి అడవినంతటినీ వూపుతోంది. నారదాసు ప్రద్యుమ్నుని వంక చూస్తూ—]

నారద : ప్రద్యుమ్నా! చెప్పినప్రకారం రాగలిగేవంటే నే, నీలో యెంతటి గురుభక్తి వుందో నేను గ్రహించాను.

ప్రద్యు : చిత్తం...స్వామీ!

నారద : మరి...పూజకు వేళ అతిక్రమిస్తోంది. స్నానంచేసి శుచివై బట్టలు మార్చుకో. ఈలోపు పూజాప్రయత్నాలన్నీ సరిచూసి వస్తాను.

[నీటిలో గల గల ధ్వని]

ప్రద్యు : (తనలో.......కంపించే స్వరంతో) ఏమిటిదంతా! తాంత్రికుడి సంరంభంలాగా వుంది. మునుపు ఒకసారి తాంత్రికుణ్ణిగురించి మా విహారంలో యోగాచార్య పద్మసంభవుల వారి భిక్షుక శిష్యుడు చెప్పగా విన్నాను... చాలా భయం వేసింది. అమాదిరిగానే వుంది. యీ నారదాసుగారి పూజాతతంగమంతా! చూస్తుంటే...

[ఇంతలో అడుగుల చప్పుడు]

నారద : అయిందా స్నానం ప్రద్యుమ్నా! నేనుసిద్ధంగానే వున్నా ... నీకోసమే ... యెదురు చూస్తున్నా! త్వరగారావాలి ప్రద్యుమ్నా!

ప్రద్యు : అలాగే స్వామీ! ... అయిపోయింది ... వస్తున్నా!

నారద : (తనలో) జరుగుతుంది...జరిగితీరుతుంది...

ప్రద్యు : స్వామీ!...

నారద : (ఉలిక్కిపడి) ఆ...వచ్చావా!...పద... వెడదాం...

[ఉరుముల చప్పుడు...గాలి రొద...కీచురాళ్ళ ధ్వని...నది హోరు...]

ప్రద్యు : స్వామీ! ఏమిటవి...చూడ్డానికి భయంకరంగా వున్నాయ్?

నారద : ప్రద్యుమ్నా! ఎందుకలా భయపడిపోతున్నావ్. అవి ... పూలదండలు... దేవికి సమర్పించడానికి తెచ్చాను.

ప్రద్యు : (తెల్లబోతూ—ఆశ్చర్యంగా) ఎంతఎర్రగా వున్నాయి రక్తం పూసినట్లు...జపా పుష్పాల్లాగా!

నారద : అవునవును...కొత్తవాళ్లకు భయం కలిగించేలాగున్నాయికదూ!

ప్రద్యు : అందుకేగా స్వామీ! అడిగింది.

నారద : ఏం భయంలేదు ప్రద్యుమ్నా! చూడు ... నేను మెళ్లోకూడా వేసుకొంటున్నా మరి... అందంగా లేవూ...!

ప్రద్యు : భయంగావున్నా, మీలాంటివారిటువంటివి వేసుకొంటే, నిజంగా ఎంతో అందంగా వున్నారు. అలా జుట్టు విరియబోసుకొని, దీపాన్ని వెలిగించేటప్పుడు ఆ కాంతులు మీమీదపడి, మీ శరీరానికి మరింత వన్నె తెచ్చాయి.

నారద : ప్రద్యుమ్నా! ఎంత చక్కగా వర్ణించావోయ్. మరి ... పూజ చేస్తున్నా ... నే చెప్పేవరకు మురళి ఆలాపన చెయ్యాలి.

ప్రద్యు : అలాగే స్వామీ!

[విరామం]

[చిరుగంటల చప్పుడు — కొబ్బరికాయ కొట్టిన చప్పుడు]

నారద : నాపని పూర్తయింది. యిక నీపని ప్రారంభించు. కాని జాగ్రత్తసుమా! నీ కార్య నిర్వహణంమీదే అంతిమ ఫలితం ఆధారపడి వుంది......

ప్రద్యు : స్వామీ! ప్రారంభిస్తున్నా!

[మేఘమల్హార్ రాగం శ్రావ్యంగా—అయిదు నిముషాలు వుండి క్రమంగా తగ్గుస్థాయిలోకి వస్తూంటుంది.]

[నేపథ్యంలో]

ఆ సమయంలో గాలిలేదు. ప్రకృతి నిశ్శబ్దంగావుంది. భద్రావతీనదిమాత్రం మెల్లగానే వుంది. చిన్న చిన్న కెరటాలు మంద స్వరాల్ని తియ్యగా ఆనందాతిరేకంతో

ఆలపించుతున్నాయి గుడిముందు చీకటి విడిపోయింది.

ఉ॥ శారద నీరదేందుఘన
సారపటీర మరాళ మల్లికా,
హార తుషార ఫేన రజతా
చల కాశ ఫణీశ కుంద మం,
దార సుధాపయోధి సిత
తామర సామరవాహినీ శుభా,
కారత నొప్పు నిన్ను మదిగానగ
నెన్నడు గల్గు భారతీ! (భాగవతమ్)

ప్రద్యు : (తనలో—పారవశ్యంగా) ఎవరూ! పౌర్ణమి నాటి వెన్నెల్లో ఈ అపురూపసుందరి. జఘనాలవరకూ పొడుగాటి నల్లని వెంట్రుకల తలకట్టు భూమిమీద వసంత సౌందర్యం వెల్లివిరుస్తున్నట్లుగా వుండే ఎర్రకలువల్లాంటి పాదాలు-లలిత కళోపాసకుల హృదయాల్లో సౌందర్యతృష్ణను మంగళయుక్తం చేసే వీణియ ఝంకారం...సత్యాన్ని సృష్టించే సర్వశోభనదాయిని...సరస్వతీదేవియా!... నమస్సులమ్మా!!...

[విరామం]

సూర : ప్రద్యుమ్నా!...

ప్రద్యు : (ఉలిక్కిపడి....కళ్లు నులుపుకొంటూ) ఆ...యేం...స్వామీ!

సూర : మేలుకొన్నావుగా!

ప్రద్యు : ఇదంతా స్వప్నమా! నిజమా!......యేమిటి...స్వామీ!

సూర : (నవ్వుతూ చిన్నగా) అదృష్టవంతుడివి. ఆనందించగల్గుతున్నావ్. సర్వవిద్యల్ని సమర్పించే సౌందర్యమూర్తిని—సరస్వతిని దర్శించుకోగల్గావ్! ధన్యుడవైనావు......నీ జీవితం చరితార్థమైంది.

ప్రద్యు : మీ దయవల్ల నేగా స్వామీ!

సూర : నాదేముందిందులో! ఎప్పుడూ నీ శ్రేయోభిలాషి నే! ఆనందం అనుభవించడానికి కూడా పూర్వజన్మసంస్కారం వుండాలి. అందరికి అనుకొన్నంత అందుబాటులో వుండదు.

ప్రద్యు : ఇంకా మీ పని పూర్తి కాలేదనుకుంటా!

సూర : ఏం...వెడతావా?

ప్రద్యు : ఇప్పటికే చాలాపొద్దు పోయినట్లుంది......చీకటికూడా దట్టంగా వుంది.

సూర : పేరుకి పౌర్ణమేగాని, చూపుకి అమావాస్యలాగా వుంది ప్రద్యుమ్నా! ఇంకా నా పని కాలేదు. నువ్వు వెళ్లాలనుకుంటే బయలుదేరు. అక్కడిదాకా పంపుతాను. ఇంతకీ నా మాటలోని నిజం బాగా తెలిసిందిగా.

ప్రద్యు : పెద్దల వాక్యాలు నిష్ఫలమెలా అవుతాయి స్వామీ! మరి సెలవా!...

[విరామం]

పూర్ణ : అప్పటికి ఎంత పొద్దుపోయిందో గుర్తుందా!

ప్రద్యు : సరిగ్గా తెలియదు గురుదేవా! నేను బయలుదేరే టప్పటికి దట్టమైన మేఘాలు ఆవరించి ఉన్నాయి మెరుపులు—ఆగి ఆగి మెరుస్తున్నయ్ వాతావరణమంతా గ్రహణం పట్టినట్లుగా ఉంది.

పూర్ణ : ఒక్కడివే ఎలా రాగలిగావు-అంత చీకట్లో?

ప్రద్యు : భిక్కు భిక్కుమంటూ ఒక్కణ్ణే బయలుదేరాను. ఆలయపు ఆవరణ చాలా పెద్దది. దాన్ని దాటిరావడానికే చాలా శ్రమ పడ్డాను. తరువాత ప్రదేశమంతా అడివే. సాల, దేవదారు వృక్షాలతో దట్టంగా వ్యాపించి వుంది. ఆలాగే దారి వెతుక్కుంటూ వస్తూంటేగా...

పూర్ణ : మళ్ళా ఏం జరిగిందేమిటి?

ప్రద్యు : ఒకవైపునుంచి హఠాత్తుగా వెలుగువస్తోంది.

పూర్ణ : వెలుగా!

ప్రద్యు : అవును స్వామీ! సూర్యోదయపు కాంతి కిరణంలాగా వుంది. చెట్లచాటునుంచి ప్రసరిస్తోంది. కాసేపటికి అది అదృశ్యంగా లేదు. కొంచెం ముందుకి వెళ్లాను. ఒక రావిచెట్టు కనిపించింది. దానిక్రింద ఒక సుందరి నిలబడివుంది. నవ వసంత ఋతువుని తొడుక్కున్న విరికన్నెలాగుంది. నాకు భయం వేసింది. కళ్ళు నలుపుకొని ఆశ్చర్యంగా చూశాను. కాసేపటివరకు నోట మాట రాలేదు. ఎక్కడో చూసినట్లు జ్ఞాపకం మొదలసాగింది. ఈ కాళరాత్రిలో—యీ కీకారణ్యంలో ఒంటరిగా ఎందుకు తిరుగు

తోంచో నాకు తోచలేదు. చాలాసేపు అలాగే నిలబడి పిచ్చివాడిలాగా చూశాను.

పూర్ణ : "ఒక సుందరి"!— చీకట్లో!......తిరుగాడుతూ!...కనిపించిందా!...చెట్టుక్రింద!... ఒంటరిగా...! నిజంగానా ప్రద్యుమ్నా!

ప్రద్యు : నిజంగానే స్వామీ!......ఈ కళ్ళతో నే చూశాను. దగ్గరగా వెళ్ళికూడా చూశా. దీన వదనయై వుంది. మిణుగురు పురుగుల కాంతి ఆమె దేహంమీదనుంచి వస్తోంది. సరోజ నేత్రాలు ఎర్రబడి వున్నాయి. తెల్లకనుగుడ్డు మీద యెర్రజీరలు కంది యేదో బాధనూ— జాలి గాథనూ వ్యక్తం చేస్తున్నాయి. ఆ అరణ్యంలోనుంచి బయటపడటానికి దారి వెతుకుతున్నట్లుగా తోచింది......ఎంతోసేపో అలాగే వున్నా....

పూర్ణ : (ఆతృతగా) తరువాత—

ప్రద్యు : ఎక్కువసేపు అలావున్నా ప్రయోజనం లేక పోయింది. నా కేదో భయం వేయనారంభించింది. జరిగిందంతా పుంఖానుపుంఖంగా గుర్తుకు రాసాగింది. మనశ్శాంతి లేకుండా పోయింది. ఆ చంద్రుని క్షీణకాంతిలో అప్పటికప్పుడే బయలుదేరి వడివడిగా విహారానికి చేరుకొన్నా!

పూర్ణ : ఇంకా అప్పటికి తెల్లవారలేదా?

ప్రద్యు : అప్పటికే ఇంకా రెండున్నర ఘడియల కాలం వుంది. తిన్నగా వచ్చి, వికలమైన హృదయంతో పడుకొన్నా. కలత నిద్రలో పగిలిన ఆలోచనలతో స్వప్నం వచ్చింది...

పూర్ణ : స్వప్నమా! తెల్లవారుఝాము ఘడియల్లో... ఏమని...?

ప్రద్యు : "భద్రావతీ నదీతీరాన ఒక లావణ్యవతియైన స్త్రీ, వచ్చినదారి మర్చిపోయి ఎంతో బాధపడుతూ వుంది. ఆమె బాధనే వ్యక్తం చేస్తూ భద్రావతీనది దీనంగా ప్రవహిస్తోంది. ఆ ప్రవాహపు నురుగు ఆమె శరీరకాంతిని మరుగు పరుస్తోంది. చీకటిలో—తెనిపోని ఆలోచనలతో—తీరని బాధతో—మారిన హృదయంతో—విసిగి వేసారిన ఆశలతో— విచారంతో తడిసిపోయిన కోమల వదనంతో—పారాణి చెరిగి—ము ర క లు పడుతూన్న అరుణ చరణాలతో ఒక్కుమ్మడి తిరిగాడుతోంది—నీటి కెరటాలు వచ్చి ఆమె పాదాల్ని ముద్దెట్టుకొంటున్నాయి. చిరుచేపలు తమ రెక్కలతో ఆమె పాదాలకు అంటుకొన్న తడిని తుడుస్తున్నాయి. కొన్ని విసురుతున్నాయి అసహాయత్వం వల్ల కుమిలి కుమిలి దుఃఖిస్తోంది. ఇంతలో ఒక భయంకరమైన సొరచేప, తన భీకర దంతాల్ని చూపిస్తూ వికటాట్టహాసం చేసింది. ఆమె కంపితురాలైంది. ఉలిక్కిపడింది, వణికిపోయింది. బెదిరింది. హృదయం మరింత చెదిరిపోయింది. ఆ నవ్వు సరిగ్గా సూరదాసు నవ్వులాగే వుంది. ఆమె మాత్రం వలలో పడ్డ హరిణ శాబకంలా, జాలిగా — దీనంగా — బాధగా—విచారంగా—మాస్తోంది...తరువాత విహారవాటికల ఘంటికలచప్పుడుకు కల కరిగిపోయింది. లేచిచూసేసరికి సూర్యోదయం కావొస్తోంది ఉషోదయం మధ్య దశలో వుంది.

* * *

పూర్ణ : (నిట్టూర్పుతూ) ఎంతపని చేశావ్ ప్రద్యుమ్నా! ముందే యీ విషయాలన్నీ నాకెందుకు చెప్పలేకపోయావ్ అంత తీరిక లేకుండా పోయిందా!

ప్రద్యు : ఆయనే చెప్పొద్దన్నారు గురుదేవా! అదీగాకుండా వాగ్దానంకూడా చేశాను.

పూర్ణ : (ఆలోచనగా) అర్థమైంది అసలు విషయం. అయితే యిప్పుడు యెందుకు చెప్పడానికొచ్చావ్?

ప్రద్యు : (దీనంగా) క్షమించండిస్వామీ ! నా తప్పుని మన్నించండి గురుదేవా! ఇప్పటికిగాని తెలుసుకోలేకపోయాను — ఒకరి హృదయానికి కష్టం కల్గించినట్లుగా.

పూర్ణ : (బాధగా) ప్రద్యుమ్నా! ఇటువంటి సంఘటన ఒకటి త్వరలోనే జరుగుతుందని నాకు తెలుసు. పద్మసంభవుడు, అతని శిష్యులు దేశాటనంచేస్తూ యీ మతాన్ని నాశనం చేయాలని ప్రయత్నిస్తున్నారు. కాని...

ప్రద్యు : అది సత్యమేనా గురుదేవా!

పూర్ణ : ముమ్మాటికి సత్యమే! ఇప్పుడు నీకుతూహలమంతా ఆ బాధ్యతలో నే సర్వనాశనం అయినట్లుగా కనిపిస్తోంది...నిజంగా అయింది కూడా! ప్రద్యుమ్నా! ఎంతపాపానికి వొడిగట్టుకున్నావ్...చివరకు—

ప్రద్యు : (గాద్గదికంగా) నే చేసింది అక్షరాలా పాపమేనా!

పూర్ణ : నీ మురళిపై సాగి తీవలైన మేఘమల్హార్ రాగాలాపన తన్మయత్వం—తుదకు సరస్వతీదేవిని ఖైదు చేయటంలో వినియోగించబడింది...తెలుసా!

ప్రద్యు : (ఏడుస్తూ...వణుకుతూన్న కంఠంతో) గురుదేవా!... అయితే... నా పాపానికి పరిహారం...లేదా!...ఈ జన్మలో నా జీవితం వ్యర్థలపాలేనా!...నా సంగీతమంతా నిష్ప్రయోజనమైందేనా!...నా మురళి సునందకిక వినిపించదా!...నా కంఠమంతా విషపూరితమేనా!...నా రాగాలాపనంతా అనురాగ సరాగాలకు దూరమేనా!...స్వామీ!...

పూర్ణ : (ఓదార్చుతూ) ప్రద్యుమ్నా! విచారపడి ఇప్పుడేంలాభం? ఇటువంటి కార్యాలు చేయకుండా తప్పించడానికే యే శిష్యుణ్ణీ నేను విహారందాటి బయటికి పోనివ్వకపోవటం. అయినా ఇప్పుడని యేంలాభం వుంది. నువ్వు నిజంగా అమాయకుడివి ఇందులో నీ తప్పు కూడా పెద్దగా లేదు. సంగీత ప్రియుడివనే దృష్టితో సూరదాసుని చేరావు. అతను నువ్వనుకొన్న నిజమైన సూరదాసు కానే కాడు...ఆ సంగతి తెలుసా!...

ప్రద్యు : అతను సూరదాసుకాడూ! (ఆశ్చర్యంతో) అవంతీపురంకూడా కాదా!...

పూర్ణ : ఏదీ కాదు...!

ప్రద్యు : మరెవరతను?

పూర్ణ : (ఆలోచనగా) అతడు ఒక ప్రసిద్ధ కాపాలికుడు.... పేరు గుణాఢ్యుడు. తన ప్రయోజనంకోసం నీకు మారుపేరు చెప్పి, ఫలితం నీవల్ల పొందగల్గాడు.

ప్రద్యు : (వింతగా) మారుపేరా! వింతగా ఉందే! ఇంతకీ అతని సంగతేమిటి గురుదేవా!

పూర్ణ : ఇంకా నీకా కథ తెలియదనుకొంటా. నీవు చూసిన గుడి సరస్వతీదేవిది. పూర్వకాలంలో అది హిందువులకు ప్రసిద్ధ తీర్థభూమి. ఇప్పటికి రెండు సంవత్సరాల క్రిందట, ఆదేవాలయం చాలా వుచ్ఛస్థితిలో వుండేది. దాన్లో సూరదాసనే యువ గాయకుడు నివసిస్తూ, మేఘమల్హార్ రాగాలాపన చేసి సరస్వతీదేవిని ఆరాధించి వరాలు పొందాడు. అతని వెంట వుండి, ఆ దృశ్యం చూసిన ఈ గుణాఢ్యుడనే కాపాలికుడ్ని ఆ దేవి యేం కావాలో కోరుకొమ్మంది. గుణాఢ్యుడు ఆమె రూపానికి ముగ్ధుడై "దేవీ! సర్వకాల సర్వావస్థలయందు నా దగ్గరే వుండిపోవాలమ్మా" అని కోరాడు.

ప్రద్యు : శాశ్వతంగా నేనా స్వామీ!

పూర్ణ : అవును ప్రద్యుమ్నా! కాని, సరస్వతి ఒక విషయం చెప్పింది ఈ సందర్భంలో. "నన్ను శాశ్వతంగా తన బంధంలో వుంచుకోవడం అంటే సామాన్యమైన పనిగాదు. దేన్లోనైనా ప్రావీణ్యత వుండాలి" అంది.

ప్రద్యు : స్వామీ! యే కళలోనైనా ఆమె చెప్పినట్లు ప్రతిభకాని—ప్రావీణ్యంగాని—వుందా!

పూర్ణ : ఎందులోనూ కావలసింది లేకపోవడంవల్ల నే, దేవి అంతర్ధానానంతరం ఈ విధంగా క్రోధం వహించాడు. మంత్ర తంత్రాలతో దేవిని తన కైవసం చేసుకోవాలనే మంత్రోపదేశం పొందాడు. ఆ విషయం ఈ చుట్టుప్రక్కల వున్న గ్రామాల్లో పెద్దలకు తెలియందిగాదు. తరువాత తరువాత మంత్రోపదేశం చేసిన గురువువద్ద ఈ గుణాఢ్యుని దుర్బుద్ధి బైటపడింది. గురువు తరిమివేశాడు—అవమానం గుణాఢ్యుణ్ణి నిలువెల్లా దహించుకుపోసాగింది. హృదయంలో క్రోధం ఉరకలు వేయసాగింది. పట్టుదల, కళ్లల్లో—చూపులో — మాటలో — బల మెక్కిపోతోంది. చివరకు "సిగ్గుతో ఈ దేశంవిడిచి ఎటో పోయాడు" అనుకున్నాం. కాని, ప్రస్తుతం జరిగిన సంఘటనబట్టి గుణాఢ్యుడు తన ప్రతిజ్ఞని, పట్టుదలని, క్రోధాన్ని, కసిని సఫలీకృతం చేసుకొన్నాడని తెలుస్తోంది...

ప్రద్యుమ్నా! కడకు ఎంత పని జరిగిందో చూశావా!...

ప్రద్యు : (దీనంగా - జాలిగా - పశ్చాత్తాపంగా) ... స్వామీ... యిక నా తప్పుకి యే జన్మలోనూ క్షమాపణ చెప్పుకోవడం సాధ్యంకాదా!

[విరామం]

[కాళరాత్రిని సూచించే కీచురాళ్ల ధ్వనులు— అడవి జంతువుల వికృతఘోషలు—క్రూర సరీసృపాల బుస బుసలు—యీదురుగాలి విసురులు—అప్పు డప్పుడు చెట్లు రాచుకొంటున్న శబ్దం ...]

గుణా : (తనలో...భీతిగా) ఏమి టీభయంకర శబ్దాలు—!...ఎక్కడనుంచి వస్తున్నయి!.. కాళరాత్రి వికిలిగా నవ్వుతోందే!... నన్ను చూసేనా!...ప్రళయం ముంచుకొని రావడం కీడుగదా!...ప్రకృతి నా మీద పగబట్టి కాటు వేయదల్చిందా!......లేక పోతే యేమిటి యిదంతా!...మాటి మాటికీ వికృతఘోషల్తో యీ అడవి నన్నెందుకు భయపెడుతోంది.........! ఏమిటది!... కదుల్తోంది......నేనికోసమో పాకుతూ వుంది......బుస కొడుతోంది......నన్ను చూసేనా!...నాగుపాము కాదుగదా!... ఎటు పోను......అంతా చీకటిమయం..... నమ్మినభూమి నా పాదాలక్రింద తొలుస్తోంది...! యీదురుగాలి నన్నెందుకో కసిరికొడుతోంది......దానికి నా మీద యెందుకంత విసుగు కల్గింది...! యేమి టా దద్దరిల్లిన శబ్దం...! శబ్దంరూపంగా మారిందేమిటి! నా వైపుకే వస్తోందే!...ఎవరి దా రూపం...! పోల్చుకోలేకపోతున్నానే!... వికటాట్టహాసం చేస్తోందే!......చలద్రక్తాక్షుడై చూస్తున్నాడే!......అగ్నికణాలు రాల్చుతున్నాడే!......మీదమీదకు పెద్ద పెద్ద అంగలతో వస్తున్నాడు...! కొన గోళ్లతో నా మెడను నులిమివేయడానికి చేతులు పొడిగిస్తున్నాడు......గుండెమీద రగిలిన కంపటి సెగల్ని వెదజల్లుతోంది...! మొగమంతా జ్వలితజ్వాలగా వుందే!... యేం చేయను...! ఎట్లా తప్పుకోను...! యెటు పోను!.....దారేది.....! యెలాగో పోవాలి......! ఎటు పోవాలి......ఎట్లా పోను......!......

మగగొంతు: (కర్కశంగా—భయంకరంగా-) ఎలాగూ పోలేవు!...ఎక్కడికీ పోలేవు...! నీకు వేరొకచోట తల దాచుకో నెందుకు తావు లేదు...! నీవు చేసిన ఘోర పాపానికి బాధ్యుడివి నువ్వే! అది పరిపక్వమై నిన్ను సర్వనాశనం చేస్తుంది......యీ జన్మలో తప్పుకోదల్చినా మరో జన్మంటూ వుంటే తప్పక అనుభవించుతావ్. అవివేకివి. అందరాని అర్హతను ఆవేశంతో—క్రోధంతో- ఆశతో—పట్టుదలతో - అహంకారంతో- ఆక్రమించుకొన్నావ్......! అశ్లీలపరిచావ్...! అవమానపరిచావ్...! విపరీత బుద్ధులను విద్రోహచర్యల్ని — విద్వేష హృదయాలను-విశ్వాసబాహ్యులను అధోగతికి లాక్కుపోవడానికి విలయం ఆవిర్భవించుతుంది. అప్పుడు నువ్వు అధఃపతితుడవు గాక తప్పదు...నీ పాపానికి ప్రాయశ్చిత్తమంటూ లేదు...యీ - జన్మకు - జీవితానికీ— ఆత్మకు - క్షమాపణ లేదు...ఏ జీవి నీమీద జాలిచూపదు...దయను పంచివ్వదు. సాను భూతిని కనబర్చదు...యిక నీకు యేవిధంగానూ దారిలేదు...ఎలాగూ పోలేవు. ఎక్కడకూ పోలేవు...గుణాఢ్యా!...

గుణా : (దీనంగా) అయ్యో! ఇక నాగతేమిటి...! యేమిటీ వింతమాటలు...! యెవరూ... అనేది!...ఎక్కణ్ణుంచి వచ్చేది!... నా మీద యెందుకంత పగ - కసి, విరోధం...! నన్నెందు కిట్లా బెదిరిస్తారు...అనవసరంగా యెందుకలా అదరగొడ్తారు...నా అభిమానాన్ని ఛిద్రపర చెవరూ చేసేది...! చెత గని అక్షరాలు నా గుండెమీద యెవరూ చెక్కింది?!...అయ్యో! నన్నెందు కిలా వంచిస్తారు-ఎవరూ అనేది యీమాటలు?...

[నేపథ్యంలో]

గుణాఢ్యా! యిటువంటి భయంకర స్వప్నాలకు - ఆలాపనలకు - ఆలోచనలకు - అపోహలకు - అవమానాలకు తాళుకోక తప్పదు.

నువ్వు చేసిన యీ పాపపంకిలమైన - క్షుద్రమైన - హీనమైన - మ్లానమైన - పనికి - పాపానికి - విముక్తిలేని శిక్ష - ఆత్మసంక్షోభం! ఆజన్మాంతం అనుభవించక తప్పదు. అనంతమైన - అగాధమైన పరాభవం తప్పదు... తప్పదు... విద్య నభ్యసించింది వికారచేష్టలకు - వికృత కృత్యాలకు కాదు, స్వప్రయోజనానికి. క్రోధం వహించి కన్నూ మిన్నూ కానకుండా - స్వలాభంకోసం - స్వప్రయోజనంకోసం - కైవసం చేసుకొని కామితార్థం పొందాలని కలలు గన్నావే—! వలలు పన్నావే—! కాని కలకాలం కలుగబోయే - కమ్మని మోక్షానికి - ఆనందానికి - ఐహిక సుఖాలకి కారకుడివి కాలేకపోయావ్. కలవరిస్తున్నావిప్పుడు — గతజలసేతుబంధనం వల్ల ఉపయోగం ఏమిటి! నువ్వు చేసిన యీ పనివల్ల లోకంలో యెంత మార్పువచ్చి, హాహాకారాలు చెలరేగి కోలాహల ధ్వనులు మిన్నుముట్టి - గగ్గోలు దిక్కులు పిక్కటిల్లేలాగు ఉవ్వెత్తుగా లేచి - అజ్ఞానాంధకారంలో అలమటిస్తున్నారో ఒక్కసారైనా అవలోకించావా! కనీసం అనుకోగల్గావా!...అటు చూడు...

* * *

ప్రద్యు : (ఆత్రుతగా) సునందా! వచ్చావా!

సునంద : ఏమిటా తొందర...వస్తున్నాగా...

ప్రద్యు : త్వరగా రావాలి...మరి...పనుంది.

సునంద : అప్పుడే...యేమిటా తొందరపని...పూరికే ఆత్రుతపడతారు.

ప్రద్యు : సునందా! యిలా దగ్గరగా రా...మాట...

సునంద : ఒక్కమాటేనా!

ప్రద్యు : రద్దూ! ఆలస్యం అమృతం విషం అన్నారు. యిలా రా...దగ్గరికి...

సునంద : యేమిటామాట?

ప్రద్యు : చెప్పేదాకా వూరుకోలేవు...

సునంద : అయితే చెప్పండి.

ప్రద్యు : ఇలా రమ్మంటే అలా దూరంగా కూర్చుంటావేం?

సునంద : దగ్గరకే వచ్చాగా!

ప్రద్యు : దగ్గరికి అంటే వొళ్ళో కన్నమాట... యెప్పుడూ ప్రశ్నేనా!

సునంద : తొందరగా పోయేవారికి యింకా సరసాలెందుకు? సయ్యాటలెందుకు?

ప్రద్యు : సునందా! త్వరగా పని వున్నా, మరిగిపోతుండే మనకోరాన్ని - యెలా త్రోసిరాజన గల్గుతాను. నీ కోసం నా శరీరం మన్మథాకృతి దాల్చి, నీ చిరునవ్వు కోసం నా కళ్లు ఆకర్ణాంతాలుగా విచ్చుకుంటున్నయ్. నీ అనురాగ సరాగాలకోసం నా మనసు వికసించి నీ మనసులో లయించిపోవడానికి తహతహలాడుతుంది...సునందా! నాకు నేను వ్యక్తీకరించుకోలేను - నీ మనస్సే దానికి సాక్షి. నా మురళిపై నీ కంఠస్వరాలే మృదుమధురమై పల్కుతయి - నా మురళీరాగ సమ్మేళనంలో నీ యౌవనలావణ్యం రంగరించుకొనిపోయి వలపు వాసనలను - తలపుల, తియ్యందనాల్ని అందిస్తుంది ... నీ కడగంటి చూపుల్లో నవరసభావ బంధురమైన కావ్యగానం సెలయేరై - విరితావుల విహారంలోనుంచి - కలకలమంటూ - కాకలీస్వరాలలో కమ్మగా సాగుతూ - వుయ్యాలలూగుతూ - సాగిపోతుంది ... సాగి సాగి పోతుంది....సునందా!

సునంద : ప్రద్యుమ్నా ! మనసుల్లో మన్మథావస్థలు మాటు మణుగుతయ్యా చెప్పు...!

ప్రద్యు : కనులలో కామప్రేరేపణలు కరుగుతయ్యా చెప్పు సునందా!

సునంద : ప్రద్యుమ్నా! యీ గాఢనిశాధ్వాంతంలో - నీ వుపగూహనాతన్మయత్వం నా జీవితానికి తొలి వలపురేఖను చవిచూపింది... ఆనందరసైకసాగరంలో హాయిగా వున్నట్లుగా వుంది కదూ!

ప్రద్యు : ఇలా ఎంతకాలం వుండగలం సునందా!

సునంద : ప్రద్యుమ్నా! యెంతకాలమైనా వుండగల్గుతాం...

ప్రద్యు : మనసు చెరిగితే—!

సునంద : కోరిక కొక్కిరాయిలాగా కదిల్తే—

ప్రద్యు : ఊహాలన్నీ అపోహాలే...అనుకొన్నవన్నీ అబద్ధాలే!...అనుభవించిన దంతా - అవమాన పూరితమే ! — చివరికి అంతా నాటకమే! మిగిలేది కూడా మిథ్యే!...

సునంద : ప్రద్యుమ్నా! ఇంతలోకే ఇంత వేదాంత మెందుకొచ్చింది...ఏమిటీ వైరాగ్య సూచనలూ మాటలున్నా!

ప్రద్యు : మనసులో కదిలే మాటను అణగార్చుకొన్నా మధ్య మధ్య దాని చిహ్నాలు బయలుపడుతూనే ఉన్నాయి.

సునంద : ప్రద్యుమ్నా! ఏమిటాకదిలే మాట...... చెప్పవ్...? దాచుకొని యెందుకలా కలవరపడటం—నా దగ్గరకూడా, ఇంకా దాపరికమేనా! చెప్పవ్...ప్రద్యుమ్నా?

ప్రద్యు : (విచారంగా—ఉద్విగ్నతతో) చెప్పలేను సునందా...నిన్ను చూస్తూ చూస్తూ మోసం చెయ్యలేను...నా మూలంగా నిన్ను బాధపెట్టినవాణ్ణవుతాను........చెప్పలేకపోతున్నాను సునందా!...హృదయాన్ని చిక్కబట్టలేను...వెడతా.

సునంద : ప్రద్యుమ్నా! యేమిటిది. నన్నిలా యేడ్పించకపోతే, ఆ చేతుల్తోనే యిక్కడే కసితీరా చంపరాదూ! నీ మనస్సాక్షిగా నా మనస్సుని నాశనం చెయ్యరాదు...నీ చేతివ్రేళ్లతోనే నా హృదయాన్ని పిసికి పారవెయ్యరాదూ! నీ కొనగోళ్లతోనే నా శరీరాన్ని చిత్రవధ చేయరాదూ! యెందుకిలా చూస్తూ చూస్తూ యేడ్పిస్తావ్ ప్రద్యుమ్నా!

ప్రద్యు : సునందా! చాలు. (నిట్టూర్చుతూ) ఇక చాలు.

సునంద : నేను బ్రతికెందుకు? నీ రూపంలేని నాకీ జీవిత మెందుకు? నీ పిలుపు పల్కించలేని నా హృదయవీణెందుకు? ఎవరికోసం ఇంకా! ప్రద్యుమ్నా! చెప్పవ్...హృదయమిచ్చానంటివే! వలపు వీచికల్లో తూగాడానంటివే! తియ్యని తలపులలో తేలిపోయానంటివే! యిందుకేనా! చెప్పవా! ప్రద్యుమ్నా!

ప్రద్యు : (బరువుగా నిట్టూర్చుతూ) యేమనుకోకు సునందా! "నేను...విహారం...దాటి...కొన్నాళ్లు...దేశాటనం... చేయడానికి...వెడుతున్నా!"...అంతే...

సునంద : (విచారంగా) కొన్నాళ్లంటే—

ప్రద్యు : (ఆలోచనగా) కొన్నాళ్ళంటే......త్వరలోనే...తప్పకుండా రాగలను......ఏమనుకోకు...సునందా...! వెడుతున్నా.

సునంద : (దీనంగా) ప్రద్యుమ్నా! నిన్ను యిన్నాళ్లుగా చూసి మురిసిన యీకళ్ళు—నీప్రేమ పాశాలలో చిక్కుకున్న ఈ హృదయం—నిన్ను తలచకుండా ఎలా వుంటయి! యీ శరీరం నిన్ను వదలి యెలా వుండగల్గుతుంది ప్రద్యుమ్నా!

ప్రద్యు : (కొంచెం ధైర్యంగా) సునందా! నువ్వే అలా అంటే యెలా! ఫరవాలేదు...త్వరలోనే వస్తా...కంగారుపడకు...యేదీ ఇలా చూడు...సునందా! ఒక్కసారి...యేదీ...నవ్వు...

సునంద : (బాధగా) కుసుమించిన హృదయానికి—కసిదీరా గాటుపడింతరువాత యింకెలా నవ్వొస్తుంది.

ప్రద్యు : నీ కడసారి నవ్వే నా కార్యనిర్వహణకు సాఫల్యం కూరుస్తుంది సునందా! యేదీ...ఒక్కసారి...సంతోషంగా...

సునంద : సంతోషం నాకిక గగనపుష్పంలాంటిది...యింకెలా సాధ్యం.

ప్రద్యు : సునందా! బాధను పదేపదే నెమరువేయకు. లోతుగా పోయినకొద్దీ అన్నీ అభూతకల్పనలే...ఎడబాటు... జీవితాల్లో కూరుకుపోయిన ప్రేమను బలపరుస్తుంది. నామాట విను సునందా! బాధల గాథాలహరిలో మునకలు వేయకు...తప్పకుండా వస్తాగా...నాకు మాత్రం లేదూ బాధ? నిన్ను విడిచి వుండగలనో, లేదో, నీకు తెలియదా! నాది మాత్రం హృదయంకాదూ!...ఏది...

[నవ్వు—క్షణం విరామం]

మరి వెళ్ళిరానా! జాగ్రత్త...త్వరలోనే రాగలను ... సునందా! ... వెళ్ళొస్తా... సునందా!...

సునంద : (నిట్టూర్చుతూ) ప్రద్యుమ్నా!...

[నేపథ్యంలో]

[గుణాఢ్యునికి చిత్ర విచిత్రమైన ఘట్టాలు కనిపించసాగాయి- వాటిని చూస్తూ ఉంబేలుపడుతున్నాడు.]

# మేఘమల్హార్

గుణా : (ఆశ్చర్యంతో-తడబాటుతో) ఎవరతను?... తదేకదృష్టితో అలా చూస్తున్నాడేమిటి! దేని వంక...ఏం కావాలో...?

[నేపథ్యంలో]

అతడే!... నీవలలో పడిన ప్రద్యుమ్నుడు ...నీకోసమే వెతుకుతూ బయలుదేరాడు.... రాజాజ్ఞ ననుసరించి మిహిరగుప్తుడనే శిల్పి బుద్ధవిగ్రహం తయారుచేయడంలో నిమగ్నుడై, ఒక సంవత్సరం అష్టకష్టాలకు వోర్చి, తుదకు వికృతంగా-పోలిక లేకుండా తయారు చేశాడు. దాన్నే దీనంగా-బాధగా పరిశీలిస్తున్నాడు. కారణం యెవరో తెలుసా?

*　　　*　　　*

గుణా : (మరింత ఆశ్చర్యంతో) ఇదేమిటి...వ్రాస్తూ వ్రాస్తూ ఆగిపోయాడు...! చిరాకెత్తిపోయాడేం...! యేమిటో చదువుతున్నాడు! దేనికోసం...?

[నేపథ్యంలో]

విను...అతనెవరో తెలుసా! విఖ్యాత దార్శనిక పండితుడు యమునాచార్యులు. మీమాంస శాస్త్రానికి వ్యాఖ్యానం వ్రాస్తూండగా జ్ఞానం మందగించింది. వ్యాఖ్యకు బదులు మతి చలించి పాణిని సుబంత ప్రకరణం అధ్యయనం చేస్తున్నాడు. కారణం యిప్పటికైనా యేమిటో తెలుస్తోందా!...

*　　　*　　　*

గుణా : (కలవరపాటుతో) ఎవరీయన!...ఆ శిలాఫలకంమీద ఏమిటో పిచ్చిగీతలు - వెర్రి వ్రాతలు...ముద్ద ముద్దగా రంగులు...!

[నేపథ్యంలో]

సరిగ్గా చూడు గుణాఢ్యా! కనబడుతోంది అదే బౌద్ధ విహారం. చిత్రకళా సిద్ధహస్తులు వసువ్రతులవారాయన. గీసేది "బుద్ధుడు—సుజాత" అనే చిత్రాన్ని. పూర్తిరూపం యెలా తెప్పించాలో తెలియక తికమకలు పడి విరక్తి చెందాడు...దానికీ ముఖ్య కారణం గమనించావా!

గుణా : (కంగారుతో) ఏమిటో... తెలియటం లేదు. ...యివన్నీ కలగోలుగా చెప్తూంటే నాకేమో భయంగా వుంది.....నామతి పోతోంది...నా హృదయమంతా అవమానాగ్నిజ్వాలల్లో దహించుకునిపోతోంది.

మగగొంతు: గుణాఢ్యా! అలాగే వుంటుం, తప్పుచేసినప్పుడు తనకు తానే తడబడుతూ వుండటం సహజం. అది ఆత్మవంచనకు సాక్షి.

*　　　*　　　*　　　*

[నేపథ్యంలో]

గుణాఢ్యునికోసం ప్రద్యుమ్నుడు కాంచీ, ఉత్తర కోసల, అవంతి, మగధ, తక్షశిల, మొదలగు దేశాలలో—అనేక పట్టణాలలో—గ్రామాలలో అన్వేషిస్తూ చివరకు ఊరువిల్వ అనే గ్రామానికి వెలుపల వున్న ఒక పెద్ద చెట్టు క్రిందకు చేరుకున్నాడు. అప్పటికి సాయంకాలం కావొచ్చింది. ఆ గ్రామానికి చుట్టు వరిపొలాలు. బంగారు రంగుతో పంట మెరుస్తోంది. సమీపంలో కలువ పూలతోనూ — తామర పూలతోనూ నిండిన జలాశయం వుంది. అందులో అడవి హంసలు తిరుగాడుతున్నాయి. ఆ చెట్టు గ్రామానికి-అడవికి సరిహద్దు. చుట్టూ చిన్న చిన్న పర్వతాల వరుస. వాటిమీదనుంచి గలగలమంటూ ప్రవహించే ఒక సెలయేరు ప్రద్యుమ్నుడు యీ రమణీయ ప్రకృతిని కలయ చూస్తూండగా ఒక సుందర లావణ్య సుకుమార రమాలలామ చంకన కడవనిడుకొని, యెదురుగా వున్న పర్వతాన్నుంచి దిగి వస్తోంది. చూశాడు ప్రద్యుమ్నుడు—అతని కళ్ళల్లో ఆమె సౌందర్యం మెరిసిపోతోంది. అనుమానం తీరిపోయింది. హృదయం అనేక భావాలతో కల్లోలమైంది. ఆమె దిగి జలాశయందగ్గరకే వస్తోంది. ఆనాడు భద్రావతీ నదీ తీరాన ఒంటరిగా కనిపించిన దేవి సరస్వతిలాగే వుంది. ఆభావమే నిశ్చయం చేసుకొన్నాడు. ఎన్నో యిటువంటి సాయంకాలాలు యీ నిశ్చయానికి కారణభూతాలైనయి...యీ చెట్టుదగ్గర వుంటున్న కాలంలోనే......... భావంలో భామాహృది కనిపించ సాగింది. ప్రద్యుమ్నుడికి. ఒకనాడు...!

[సాయంకాలాన్ని సూచించే సంగీతపు ధ్వని—పక్షులు రెక్కలు కొట్టుకొంటున్న శబ్దం—అరుపులు—నీరు కదిలిన చప్పుడు—రొప్పు...ముస్య ముస్య ఊపిరి బిగపట్టి వదిలిన శబ్దం—ఆయాసం...]

సరస్వతీదేవి: (రొప్పుతో) నాకు ఆ పూవు కోసిస్తావా! అందటం లేదు.

ప్రద్యు: అలాగే ... (అడుగుల చప్పుడు) (నీళ్లు కదిలిన చప్పుడు.)

సరస్వ: ఇందాకణ్నుంచీ అవస్థపడుతున్నా దాని కోసం..అందినట్లే అంది చేజారిపోతోంది.. చూస్తూనే వున్నావుగా! —

ప్రద్యు: ఆ...ఆ...! చూస్తూనే వున్నా! ఇదిగో... అందుకోండి....

సరస్వ: ఎంత మంచివాడివి...అడగంగానే సాయం చేశావు...మాయింటి కెపుడాం వస్తావా!...

ప్రద్యు: రావడానికేం ... వస్తాను ... మరి ... ఒక సహాయం చేస్తారా?

సరస్వ: తప్పకుండా చేస్తా! యేమిటది?... చెప్పు.!

ప్రద్యు: మరేంలేదూ! ఆకలవుతోంది...అంతే!...

సరస్వ: ఆకలవుతోందా! ఆ సంగతి ముందెందుకు చెప్పలేదు!...బయటికి రా యిక... కోసిన పూలు చాలు..నిన్ను అనవసరంగా కోరానే సాయం...రా బయటికి...

ప్రద్యు: ఫరవాలేదు...కోసేశాగా!..యివిగో! యీ కాసిని కూడా అందుకోండి.

[అడుగుల చప్పుడు]

సరస్వ: నువ్వెవరివో నాకు తెలియదుగాని, ఒకటడుగుతా చెప్తావా?

ప్రద్యు: అడగండీ!...అలాగే!

సరస్వ: నువ్వు రోజూ ఆ చెట్టుక్రింద ఎలాగో కూర్చుంటావ్ గదూ.

ప్రద్యు: తమరుకూడా యిక్కడికి నీటికి వస్తూంటారు గదూ!

సరస్వ: రాబట్టే చూశాను... చూడబట్టేగా అడిగాను...

ప్రద్యు: అడిగారు కాబట్టే చెప్పానుగదండీ! అయితే మీ యిల్లెక్కడ?

సరస్వ: మా యిల్లా! కనబడుతోందే పర్వతం..దాని మీద... ఆకలవుతోందనంటున్నావ్ గా... నా వెంటరా...తింటానికేమైనా పెడ్తాను..

[నడుస్తున్న శబ్దం]

ప్రద్యు: క్షమించండి! తమరు ఒంటరిగానే వుంటున్నారా!

సరస్వ: (విచారంగా) లేదు ... ఒక సన్న్యాసి నన్నిక్కడకు తీసుకొచ్చాడు...

ప్రద్యు: ఏం చేస్తూంటాడు? ఆయన.

సరస్వ: ఏమో! నాకు తెలియదు. తరచుగామాత్రం వస్తూ — పోతూ వుంటాడు ... అన్నట్లు ఆకలవుతోందన్నావ్ గా..విప్పపూపానీయం యివ్వనా! త్రాగుతావా!...

[త్రాగిన చప్పుడు...]

ఎలా వుంది?

ప్రద్యు: ఎలాగేమిటి? అమృతంలాగా వుంది. యిటువంటిది యింతవరకు నా జన్మలో రుచి చూడలేదు.

సరస్వ: అంత బాగుందా! నిజంగానా!

ప్రద్యు: నిజమే నమ్మా! (ఆలోచనగా) ఆచార్య పూర్ణవర్ధనులవారు చెప్పిందీ - నేను చూసిందీ అక్షరాలా నిజం. యీమె తప్పకుండా సర్వవిద్యాసమన్వయసాధ్వి సరస్వతే! యింతకు ముందెక్కడుందో!...

సరస్వ: ఏమిటీ అలా ఆలోచిస్తూ—నీలో నువ్వేదో గొణుక్కుంటున్నావ్!

ప్రద్యు: అబ్బే! యేంలేదండీ! వూరికే...యేదో!... గుర్తొచ్చి!

సరస్వ: యేమీ లేకపోతే యెందు కనుకొంటావు?

ప్రద్యు: ఆ....! యేదో చిన్న సందేహం! వస్తే...

సరస్వ: ఏమిటది! నాకు చెప్పకూడదా!

ప్రద్యు: మరేంలేదూ... "ఇంతకు ముందెక్కడుండే వారోనని."

సరస్వ: అదా! సందేహం...నాకంత బాగా గుర్తులేదు...(క్షణ మాగి) ఆ...గుర్తొచ్చింది... విదిశమార్గంలో...ఒకజీర్ణ దేవాలయంలో... వుండేదాన్ని. అక్కణ్ణుంచే యీ సన్యాసి నన్ను తీసికొచ్చాడు. అప్పట్నించే ఇక్కడ.

ప్రద్యు: (క్షణ మాగి) సరే ... మరి వెళ్లొస్తాను ... పొద్దు కూకిపోయింది... సెలవిస్తారా!

సరస్వ: (గాద్గదికంతో — బేలగా) వెడతావా!... వెళ్లొద్దు...! నువ్వు వెడితే నాకేం తోచదు

యీ రాత్రి యిక్కడే వుండిపోవాలి... కలువరేకుల పాయసం వండి పెడతా! కమ్మగా వుంటుంది! తెల్లారింతరువాత వీలయితే వెళ్ళువుగాని... నా మాట విను... వుండిపో...!

[విరామం]

(ఒకటి—రెండు నిముషాల అనంతరం)

ప్రద్యు : దేవీ! యీ కీకారణ్యంలో రాత్రిపూట ఒంటరిగా వుంటూంటే భయంగా లేదూ!

సరస్వ : బాగా భయం వేస్తోంది! యేం చేయను! అందుకేగా పొద్దుకూకడంతోనే కుటీరం తలుపులు మూస్తాను... కాని... నిద్ర నేది పట్టదు....

ప్రద్యు : (ఆదుర్దాగా) మరి మేల్కొనే వుంటారా తెల్లవార్లూ!

సరస్వ : ఏం చేస్తాను!

ప్రద్యు : వెన్నెల రోజుల్లోనో!

సరస్వ : నాకు చీకటి—వెన్నెల రెండూ ఒకటే— అందం, ఆనందం గురించి నాకేమీ తెలియదు.

ప్రద్యు : దేవీ! యీ రోజు వెన్నెలేగా! అలా కాస్త బయట కూర్చుందామా!

దేవి : వెన్నెలను ఆరుబయట కూర్చోవాలా!

ప్రద్యు : చల్లగా—హాయిగా వుంటుందికదూ! అందుకని...

దేవి : సరే... వదురుచాప యిదుగో... వస్తున్నా పద...

ప్రద్యు : (ఆలోచనగా) ఎంత విద్రోహకరమైన పని జరిగింది... ఎంతటి మంత్రశక్తి అయినా ఆత్మ విస్మృతి కలుగజేస్తుందని కలలో కూడా అనుకోలేదే!......

* * *

[రెండు నిముషాలు వేకువను సూచిస్తూ మురళీగానం]

దేవి : తెల్లవారింది... అల్లాచూడు సూర్యోదయం కూడా అయింది... అడవి హంసలు యెలా తటాకం దగ్గరకు చేరుకొంటున్నాయో చూడు...

ప్రద్యు : అవును దేవీ! మరి నే వెళ్ళిరానా!

దేవి : ఏం! అప్పుడే వెళ్ళకపోతే!

ప్రద్యు : వెళ్ళాలి దేవీ! కొంచెం పనుంది!

దేవి : అయితే సన్యాసి వచ్చింతరువాత ఒకసారి రా...

ప్రద్యు : అలాగే... దేవి... వస్తా...

* * *

[పదిహేను రోజులనంతరం దూరంనుండి దేవి కంఠంలో నుంచి సావేరిరాగం— రెండునిముషాలు]

ప్రద్యు : ఇప్పటికి పదిహేనురోజుల్నుంచీ చూస్తూన్నా! దేవి ఒంటరిగా కూర్చొని యేదో పాడుకొంటూ వుంటోంది. యేదో వ్యక్తం గాని భావం అందులో పాతుకొనివుంది. ఆమె గొంతులో తారాడేనాదం, నా హృదయాన్ని గిలిగింతలు పెట్టి, యే లోకాలకో తీసుకొనిపోతోంది......ఆహా!... యేమా సంగీతసుధారసం... అందులోని భావశైబలత జీవుల్ని సమ్మోహింపచేస్తోంది.

[ఇంతలో నీరు కదలిన చప్పుడు—హంసల రెక్కలు తపతపమంటున్న ధ్వనులు - మధ్య మధ్య—చిలుకల పలుకులు—]

ప్రద్యు : (ఉలిక్కిపడి ఆశ్చర్యంతో) ఆ...! యెవరది! ఈవేళప్పుడు స్నానంచేసేది?

[మళ్ళా నీళ్ళ చప్పుడు]

గుణాఢ్యుడా! ... అతిగాడేనా! నిజంగానా!...ఆ...! అతడే... గుణాఢ్యుడే! ఇక్కడెందుకొచ్చాడు...! యీ గట్టు మీద సామానుకూడా అతనిదే! ఇదివరకటి బట్టలే... పాతిరంగు యింకా వెలిసిపోలా! గుణాఢ్యశివే...!... ముమ్మాటికీ ఆ కాపాలికుడే!

[క్షణం విరామం.]

గుణా : (తెల్లబోతూ ఆశ్చర్యంగా) నీవా!...... ఇక్కడికెలా రాగలిగావు...

ప్రద్యు : (మంద్రస్థాయిలో) మీకు తెలియదా! నిజంగా యెలాగొచ్చానో తెలియకుండా వుందా!

గుణా : (బాధగా) ప్రద్యుమ్నా! అర్థమైంది!... ఇంకా నన్ను నువ్వుకూడా అవమానపరచదల్చావా! నిన్ను మోసంచేసి నీపై వలపన్ని నీ హృదయాన్ని వంచనచేసి నీ సంగీతాన్ని నాశనం చేసినందులకు యిప్పుడు తీరని దుఃఖాన్ని అనుభవిస్తున్నా!

ప్రద్యు : (క్రోధంతో) "బాధ" - వ్యక్తిని పరీక్షిస్తుందని చెప్పారుగా! చేసినపాపం చెప్పుకుంటే పోతుందా! ఎవరికర్మకు వారే బాధ్యులు. మీకు యిలాంటివన్నీ తెలియనివి కావుగా!

గుణా : ప్రద్యుమ్నా! ఎవరితో చెప్పుకోన్నా ఏమీ లేదు...నిద్రలో భయంకరస్వప్నాలు వచ్చి "నువ్వు చేసినపని మంచిదికాదు – "దానికి శిక్ష అనంతనరకం" అని యెవరో చెప్తున్నారు. అలా చెప్పేవాళ్ళకు ఇదమిత్థమైన రూపాల్లేవు.

ప్రద్యు : (జాలిగా) గుణాఢ్యా! అసలు ఇలా ఎందుకు చేశావు...?

గుణా : (దీనంగా) నా పాపం పండటానికేనేమో! మరి. వశీకరణమంత్రంద్వారా [illegible] [illegible] చేయగల్నే గాని, ఆకర్షించుకోలేను. నాకసలు సంగీతం రాదు. నేను నువ్వనుకొన్న సూరదాసునూ కాదు. దేవి సరస్వతిని బంధించి, సర్వవిద్యల్నీ నాకబ్బేటట్లుగా చేసుకోవాలని వాంఛ నాకుండేది. ఆ వాంఛ ఒకసారి పరాభవించబడింది. అప్పట్నుంచీ నాలో దేవిమీద క్రోధం ఏర్పడింది. దాన్ని నీ మేఘమల్హార్ రాగంవల్ల తీర్చుకోగలిగాను. నామంత్రానికి ఎంతటి శక్తివుందో ఒకసారి పరీక్షించా దీనివల్లనే. కాని యిలా చేసినందుకు నాకు బాధలు పెరగసాగాయి.

ప్రద్యు : అయితే ఇప్పుడు నీ అభిప్రాయమేమిటి?

గుణా : ఈ బాధల్ని యెలా తెగతెంపులు చేసుకోవాలో కొన్నాళ్ళవరకూ తెలియలేదు. నా గురువుగారితో మొర పెట్టుకున్నాను. ఆయన పూర్వపు మంత్రాన్ని నాశనంచేసి, యథాస్వరూపాన్నిచ్చే శక్తిని ప్రసాదించారు. ఈ శక్తిని ప్రయోగించేముందు ఈ కమండలములోని జలం దేవి పాదాలమీద చల్లేటట్లయితే బంధవిముక్తి కలుగుతుంది... కాని, నీళ్లు చల్లినవాడికి ఆపద సంభవిస్తుందని చెప్పారు. దానికిజంకుతున్నా! ప్రద్యుమ్నా!

ప్రద్యు : అందుకని దేవిని బందీగా నే ఉంచదల్చారా?

గుణా : ప్రద్యుమ్నా! చూస్తూ చూస్తూ చేతులారా ఈ ఆపదకు బలికమ్మంటారా! ఈ పాపానికి అనుకొన్నవెంటనే ప్రాయశ్చిత్తం చేసుకోవటము సాధ్యమేనా!—

ప్రద్యు : నీకు ధైర్యం లేదనిపిస్తోంది ... యేమిటా ఆపద?

గుణా : పసివాడివి ... ఎందుకు ఆహుతవుతావు ... కమ్మని జీవితం—యీ దేవికోసం బలిగా ఇచ్చుకోకు. అనుభవించవలసిన సుఖాలు లోకంలో ఎన్నో వున్నాయి. ఎందుకలా త్వరపడిపోతావ్! ప్రద్యుమ్నా! నా మాట విను...

ప్రద్యు : గుణాఢ్యా! ఏమిటా ఆపద...!

గుణా : చెప్పాల్సిందేనా!—తప్పదా?

ప్రద్యు : తప్పించుకోడానికి యెందుకు ప్రయత్నించాలి...అది పిరికివాడికి లక్షణం.

గుణా : అయితే సరే!...నీరు చల్లినవాడు శిలారూపంలోకి మారిపోతాడు. అందుకే దేవిని బంధించివుంచాను. కొంచెం సుఖంగానైనా యీ లోకంలో కొద్దికాలం వుండామని. కోపం తెచ్చుకోకు ..కొంచెం బాగా ఆలోచించు...పసివాడవు...పదేపదే చెప్తున్నానని విసుక్కోకు...ప్రద్యుమ్నా!

ప్రద్యు : (ఆలోచనగా) ఈ విషయంలో యేమాలోచించినా నిష్ప్రయోజనమే! ఎవరూ నీళ్లు చల్లకపోతే, దేవి ఎలా విముక్తురాలవుతుంది? లోకంలో శాశ్వతంగా విద్య లేకుండా పోవాల్సిందేనా? ఆమెకు ఆత్మవిస్మృతి కలగటం లోకోపకారంగాదా! మీ స్వార్థానికని లోకాన్ని—సర్వకళల్ని—మంటగలుపుతారా! నిరక్షరాస్యుల్ని చేసి మానవకోటిని మానవత్వాన్ని మటుమాయం చేస్తారా! చదువులతల్లికోసం, నావంటి సామాన్యుడు ప్రాణాలర్పించడం ఒక పెద్ద లెక్కలోదికాదు... నేను నా దేవిని విముక్తురాలిగా చేయాలనే యిక్కడికి యెన్నో దేశాలు తిరుగుతూ వెతుక్కుంటూ వచ్చాను.

గుణా : అయితే—యీ పనికి అంగీకరిస్తున్నావా!

ప్రద్యు : ముమ్మాటికీ. గుణాఢ్యా! మానవుని జీవితం తుచ్ఛమైంది. స్వార్థపూరితమైంది. పద్మాల్లాంటి ఆమె పాదాలలో చిన్నముల్లు గుచ్చుకొన్నదంటే తీయడానికి, అవసరమైతే నా ప్రాణాల్ని కూడా త్యాగం చేస్తాను... పదండి....ఆ కమండలం ఇలాగివ్వండి... చల్లి నా తల్లిని విడిపించుకొంటాను.

గుణా : బాగా ఆలోచించుకొన్నావా! ప్రద్యుమ్నా!

ప్రద్యు : సావధానంగా ఆలోచించే, యీ పనికి ముందడుగు వేస్తున్నా! నాకు సుఖాలపై మమకారం లేదు...నా తల్లిని హృదయంలోనే స్థాపించుకొని ప్రేమపూరితమైన జీవితాన్ని ఆనందంగా గడుపుకొంటా... నడవండి...

గుణా : ప్రద్యుమ్నా! దీర్ఘంగా ఆలోచించుకో మరొక్కసారి! తరువాత నిన్ను రక్షించే శక్తి మరి దేనికీ లేదు.

ప్రద్యు : నాకు లేనిబాధ మీకు దేనికి—మీకు మల్లే ప్రవర్తించాలనే ఆశయంకలవాణ్ని కాదు. ఆ ఆశే నాకుంటే, నా ఆనందాల సునందను విడిచి, నా కంటికి రెప్పలాగుండే మాతృదేవిని వదులుకొని, ఇక్కడి కెందుకొస్తాను. నాకు పిరికిమందు నూరిపొయ్యకండి. దానివల్ల లోకం నశించిపోతోంది— సర్వకళలూ సమసిపోతాయి — పదండి... ఆలస్యం యిక అనవసరం...

[విరామం]

దేవి : (ఆత్రుతతో) రా ... రా... నిన్ను గూర్చే ఆలోచిస్తున్నా! అగోచరంగా పోయి మళ్లా యీరోజుకా కనిపించటం! నీకు ఆ రోజున సరిగ్గా భోజనం పెట్టలేదని కోపంవచ్చిందా! నిజంగా నాకెంతో చిన్నతనం వేసింది!

ప్రద్యు : స్వామీ! (మెల్లగా) యేదీ మంత్రజల కమండలం...ఇలా యివ్వండి!

గుణా : (కంగారుగా) నిజంగా యీపని చేయడానికి సిద్ధపడుతున్నావా!

ప్రద్యు : ప్రతిసారీ నా నిశ్చయాన్ని మీరు చెప్పి వొప్పించలేను. ముందా జలమిలా ఇవ్వండి!

గుణా : అయితే...ఇదిగో కమండలం...దేవి, నీటి కోసం బయలుదేరినట్లుంది ... వస్తోంది ... వచ్చేటప్పుడు యెదురుగావెళ్లి పాదాలపై అభిషేకించు. (తడబాటుతో) ప్రద్యుమ్నా! యిక నే వెడుతున్నా!...సెలవా!

ప్రద్యు : దేనికి? ఎక్కడికి స్వామీ!

గుణా : ప్రద్యుమ్నా! (దీనంగా) నీ ఋణం తీర్చుకోలేను. నేను నిజంగా పిరికివాణ్నే... యెటన్నా పోతాను...నన్ను వెళ్లనియ్యి... దేవి జీవితప్రకరణంలో నీ పేరు చిరస్థాయిగా చెప్పుకోతగినట్లు లిఖించబడుతుంది.. నే వెడుతున్నా ప్రద్యుమ్నా ... వెడుతున్నా...వెడుతున్నా...

[విరామం]

ప్రద్యు : (ఆలోచనగా) ఇరవై సంవత్సరాలక్రితం యీ నీలాకాశంక్రిందనే జన్మించాను. మా అమ్మ కాశీలో యింట్లో కిటికీ దగ్గరగా కూర్చొని ప్రవాసియై పోయి, నాకోసం యెదురుతెన్నులు చూస్తూ, యెప్పుడొస్తానో అనుకొంటూ తహతహలాడుతూ వుంటుంది. ఆమెను యింకెలా చూడగల్గుతాను...సునంద యేం చేస్తోందో...

[అడుగుల చప్పుడు...]

దేవి : (నవ్వుతూ) యిక్కడే నిలబడున్నావే! ఆ సన్యాసి యేడీ!

ప్రద్యు : దేవీ! అతగాడెక్కడికో వెళ్ళిపోయాడు.

దేవి : (దీనంగా) ఇక రాడా! మరి.

ప్రద్యు : మాట లిలాగే స్ఫురించాయి. రాడేమో కూడా!

దేవి : (ఆశ్చర్యంగా) ఏమిటిది...నా పాదాలకు నమస్కరిస్తున్నావ్.

ప్రద్యు : (ప్రార్థనపూర్వకంగా) దేవీ! మీ పాదధూళి తీసుకొని నమస్కారం చేస్తున్నాను. ఎంతటి అపకారం చేసానో నీకు తెలియదమ్మా! దానికి తగిన శిక్ష యీనాడు అనుభవించబోతున్నా. అందుకని యేమాత్రం విచారించడం లేదు. కాని, నాకు స్మృతి తప్పిపోయేంత వరకు విశ్వసౌందర్యవిద్యావతిని బంధవిముక్తురాలినిగా చేసే భాగ్యం లభించినందుకు హృదయపూర్వకంగా సంతోషిస్తున్నా!

దేవి : (ఆశ్చర్యంగా) ఏమిటీపని!

ప్రద్యు : (జాలిగా) దేవీ! యింతకుముం దెక్కడ వుండేదానివో జ్ఞాపకం తెచ్చుకోవమ్మా!

దేవి : (కంగారుతో) ఎందుకూ. !విదిశమార్గంలో...

[నీళ్ళు చల్లినట్లు శబ్దం...తుఫాను గాలిహోరు ...నదీతరంగాల శబ్దం...మేఘాల్లో మెరుపులు—ఉరుములు చూచాయగా మేఘమల్హార్ రాగాలాపన - ఉదృతమైపోతూన్న గాలి విసురులు—జేగంటల ధ్వానాలు.]

[నేపథ్యంలో]

ఉ॥ అంబ నవాంబుజోజ్జ్వలకరాంబుజ
శారదచంద్ర చంద్రికా
డంబర చారుమూర్తి ప్రకటస్ఫుట
భూషణ రత్నదీపికా
చుంబిత దిగ్విభాగ శ్రుతి సూక్తి
వివిక్త నిజ ప్రభావ భా
వాంబరవీథి విశ్రుత విహారిణి నన్
గృపజూడు భారతీ! (భాగవతమ్)

[నేపథ్యంలో]

అపూర్వ సౌందర్యమూర్తి దేవి సరస్వతి సర్వాలంకారభూషితయై ప్రద్యుమ్ముని ముందు ప్రత్యక్షమైంది. ఆమె దేహంనుండి సుప్రకాశ దీధితులు ప్రసరింపసాగాయి. వీణాపాణియై, గానామృతాన్ని సర్వలోకాలకు విందుచేస్తోంది. కనులలో సంతోషం కళలకు వన్నె తెస్తోంది. హృదయంలోని

ఆనందం సహృదయాలకు ప్రమోదాన్ని కూర్చుతోంది. చిరునవ్వు తొణికిసలాడి, ప్రద్యుమ్నుణ్ని సుమనస్సుతో దీవించింది.. వెంటనే కోకిలో మిద్దెమీద కూర్చున్న తల్లి గుండెలో రక్తం చల్లబడింది. రెండు కళ్ళూ ఆశ్రుపూరితాలయినయి...

* * *

[కాలం కొంత గడిచినతర్వాత—
దూరాన్నుంచి- మందమందంగా వినబడుతూ వచ్చే మేఘమల్హార్ రాగాలాపనా స్రవంతిని గుర్తుపట్టి...]

సునంద : (ఆశ్చర్యంగా-ఆనందంగా) ఎవరిదా వేణు గీతి...సూచనగా వచ్చి నా ప్రద్యుమ్నుణ్ని గుర్తు చేస్తోంది...! నన్ను రమ్మనమని పిలుస్తున్నాడా! నన్ను మరిచాడనుకున్నా సుమా!..అదిగో! యింకా బాగా వినబడుతోంది...! వస్తే....పిలుస్తున్నాడు...ఆ రాగం నాకిష్టమైందని అతనికి తెలుసు....! అందుకే రమ్మంటున్నాడు...ఎటువెళ్లాలి.

[అడుగుల చప్పుడు]

పూర్ణ : (మృదువుగా) సునందా!

సునంద : (ఉలిక్కిపడి)...ఆ....యేం...స్వామీ!

పూర్ణ : (కరుణాత్మకంగా)ఎవరికోసం పండువెన్నెల రాత్రులలో యింకా నీ విరహవేదన... దేనికి! యీవూహా కల్పనలు...!

సునంద : (బేలగా) అదేమిటి స్వామీ! నా ప్రద్యుమ్నునికోసమే! ఇప్పుడే అతను నన్ను రమ్మని మురళికూడా వాయించాడు....ఆ మురళిపై ఊయలలూగే మేఘమల్హార్ రాగములో అతని హృదయం నన్ను మరీమరీ పిల్చింది...యెటు వెళ్లాలో- ఎలా వెళ్లాలో దిక్కుతోచడం లేదు.

పూర్ణ : (జాలిగా) సునందా! యిక నీకా అదృష్టం దూరమైంది. నీ మనస్సులోవున్న మనోహరుడు కాలవశాన మారిపోయాడు. అతను ఆ కీకారణ్యంలో పర్వతశిఖరంమీద వెదురు పొదలమధ్య అర్ధనగ్న శిలామూర్తియై వున్నాడు. నిస్తబ్ధపు నిశీథిలో ఆ వెదురు కొమ్మలు అతని హృదయంమీద కప్పుకొని గాలికి వూగిసలాడుతూ నీ ప్రద్యుమ్నుణ్ణి జ్ఞప్తికి తెచ్చేందుకు మేఘమల్హార్ రాగాన్ని ఆలాపిస్తున్నయి. అడవి తెల్ల ఆకులతో అతని ముఖం కప్పుకొనిపోయింది......దేవి బంధవిముక్తురాలైంది. దివ్యతేజోవిరాజమానంగా సాక్షాత్కరించి, సరస్వతి దీవించింది...సునందా యింకా దేనికీ యీ విరహపరీక్ష....

సునంద : (గాద్గదికంగా) స్వామీ! ఆ వెదురు వనం యెక్కడ?..... యెటువైపు ఆ శిలా విగ్రహం?...యెంతదూరం వుంటుంది...? ఎలా వెళ్ళాలి?...చెప్పరూ...(దీనంగా) నా ప్రియుణ్ణి యెడబాసి యెలా వుండగలను...అతని మధుర మురళీగానంలో మేఘమల్హార్ రాగాలాపనా స్రవంతిలో నాకు పారవశ్యంలేదా!...స్వామీ! ప్రద్యుమ్నుణ్ణి మరిచిపోలేను...అతడు మరుపుకి రాని మన్మథుడు......యిక నా బ్రతుకు — ఎవరికోసం వేచివుండనూ! స్వామీ! కడసారి చూపులకైనా కొరగాకుండాపోయానా!...

పూర్ణ : సునందా! విచారపడి యేమిటే లాభం? అతడు లోకోత్తరపురుషుడైనాడు... మేఘమల్హార్ రాగప్రశంసలో అతనికి చరితార్థత కల్గింది. సరస్వతీదేవిమాహాత్మ్యప్రకరణంలో ప్రద్యుమ్నుని పేరు సువర్ణాక్షరాల్లో వ్రాయబడుతుంది...యీ నిరర్థకపు ఊహా కల్పనలు — స్వప్నాలు శాశ్వతంకావు. యిలా చూడు సునందా! అతడెవరో తెలుసుగా!...కరుణాస్వరూపుడు...బోధిసత్వుడు...అతనివద్ద జీవులకి శాంతి — దయ — జాలి — సానుభూతి — అహింస లభిస్తయి. పద......ఒక్కసారి దర్శించుకో!...... హృదయంలో రేగిన అశాంతి తగ్గిపోతుంది.! పద......

సునంద : (దీనంగా) స్వామీ!......

[శరణత్రయాన్ని ఉచ్చరిస్తూ బౌద్ధ భిక్షువులు — జేగంటల ధ్వానాలు — మేఘమల్హార్ రాగాలాపనాసూచనలు క్రమేపీ హెచ్చి—తగ్గుతూంటాయి.]

---

* విభూతిభూషణవంద్యోపాధ్యాయ రచన ఆధారంగా

# కవి: కావ్యము

శ్రీ హన్మనగుత్తి రాధాకృష్ణశర్మ

భగవత్సృష్టియందు సుందరములు, సుందరతరములు, వికృతములునగు వస్తువు లెన్నియో గలవు. ప్రతిమానవుఁడును వానిఁ గాంచుచున్నాఁడు. కాని, కవియొక్క దృష్టి వేరు. సామాన్యునిదృష్టి వేరు. ఒక ప్రవాహమును చూచి సామాన్యుఁడు "నీరు వేగముగ ప్రవహించుచున్నదని చెప్పును. కవిమాత్ర మద్యది పరమేశ్వరుని దయారసప్రవాహ మనును. ఒక తీగ సామాన్యుని చూపున కది తీగమాత్రమే యగును. కవి దృష్టియం దన్ననో! అది సుందరమైన వనితయొక్క శరీరముగను, దానిపువ్వులు అంగములగు నేత్రములుగా నగుపించును. కావున లోకమునం దెల్లరును చూచు సామాన్య వస్తువులే కవియొక్క ప్రతిభావిశేషమున నాతనికి, విలక్షణముగ గోచరించును. కవి తన హృదయమునకుఁ దోచు నొకవిషయమును పలువిధములుగ మాటిమాటికి చిత్రణచేసికొని తద్విషయమును కావ్యరూపముగ వెలువరించును. ఏదైన నొకదృశ్యమును కవి చూచినంత నే చిత్రింపఁజాలఁడు. కాని వాల్మీకి ఋషికి మాత్రము క్రౌంచద్వంద్వ వియోగదృశ్యమును గాంచినంత నే:

> "మానిషాద ప్రతిష్ఠాం త్వ
> మగమశ్శాశ్వతీస్సమాః।
> యత్క్రౌంచమిథునా దేక
> మవధీః కామమోహితమ్"

అని శ్లోకరూపమున వెలువడినది. వాల్మీకి ప్రతిభావంతుఁడు, నంతర్ముఖుఁడును గావున క్రౌంచద్వంద్వ వియోగమును చిత్రించుకొనుటకు దానియందు లీనుఁడైపోవుట కంత శీఘ్రముగ వీలుగలిగినది. అయోధుఁడగు యోగి తనకుఁ గావలసినక్షణమందే బాహ్యప్రపంచమును మఱచి సమాధినిఁబొంది, బ్రహ్మానందము ననుభవించునట్లు, మహాకవియు తలఁచుకొన్న క్షణమునందే విషయములో లీనుఁడై కావ్యరచన మొనర్పఁగలఁడు. అపుడాతఁడు పొంగివచ్చు తన కవనవేగము నాపుకొనఁజాలఁడు. అతనికి భాష యెట్లు చెప్పిన యట్లు నడచును. మహర్షి వాల్మీకి యట్టివాఁడు గనుక క్రౌంచద్వంద్వ వియోగమును గాంచినంత నే, ఆ విధముగ శ్లోకరచన మొనర్పఁగల్గెను.

ప్రతిభావంతుఁడగు కవి, ఎట్టివస్తువును గ్రహించి నను సుందరముగ చేయును. వస్తువునందలి గౌరవము ననుసరించియే కావ్య గౌరవ మేర్పడును. వస్తువునందలి యౌత్కృష్ట్యమువలన గదా! "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" యను ఖ్యాతి భవభూతి రచనకుఁ గల్గినది. ఒకవేళ వస్తువు లోకోత్తరము గాకపోయినను, కవి తన కృత్యమును చక్కగా నిర్వహించును. అచేతనములకుఁ జేతనత్వమును గల్పించును. చెక్కపప్పలును, బంగరుబొమ్మలగు పడఁతులును, కవియొక్క కావ్యమునందు సహజముగ సుందరమూర్తులుగనే భాసింతురు. నవ్యకవులు సుందర వస్తువులను గూర్చియే కవి వ్రాయవలె నందురు. సుందరమైం దెప్పడును సుందరమే! సుందరము గాని దానిని సుందరముగఁ జేయుటయందే కవియొక్క ప్రత్యేకశక్తి గలదు. "తృణేఽ కార్యం భవతీశ్వరాణాం" అన్నట్లు కవి స్వీకరింపఁదగని వస్తువు సృష్టియందు లేదు. కవిత్వమొక్క కళ గావున, కళప్రకృతి కనుకరణమే యగుటవలన, కళయొక్క ప్రయోజనమానందమే!

అనుకరణ మానందమును గొలుపును. (Imitation begets pleasure) అన్నట్లు లోకమునందువలె గాక కావ్యమునందలి, యసుందరవస్తువులవలనను, ఆనందమే కల్గును. ఈ క్రింది దశరూపక శ్లోకమును గనుఁడు:

> "రమ్యం జుగుప్సిత ముదార మథాపి నీచ
> ముగ్రం ప్రసాదిగహనం వికృతంచ వస్తు
> యద్వాప్యవస్తు కవిభావుకభావ్యమానం
> తన్నాస్తి యన్నరసభావ ముపైతి లోకే"

పై శ్లోకము ననుసరించి కవి సుందరముగు వస్తువులనుగూర్చియే వ్రాయవలెననుట యనుచితము. ఆంగ్లము నందుగూడ నిట్టి యభిప్రాయమే గలదు.

"Poetry turns all things to loveliness" It exalts the beauty of that which is most beautiful and it adds beauty to that which is deformed—SHELLY.

[కావ్య మెల్లవస్తువులను సుందరముగ మార్చును. అది సుందరములగు వస్తువులను సుందరతమములుగ జేయును. వికృతములను సుందరములుగ జేయును.]

ప్రథమమున "కవి ర్మనీషీ పరిభూః స్వయంభూః" అని కవిశబ్దము పరమాత్మపరముగ వైదికమంత్రములందు గానవచ్చుచున్నది. క్రమముగ నా పదము పరమాత్మయొక్క సాక్షాత్కారమును బొందిన "ఋషి" పరముగ వ్యవహారమునకు వచ్చినది. సాక్షాద్ద్రష్టలగు వైదిక ఋషులు కవులు. వారికావ్యము లుపనిషత్తులు. ఆద్యులగు వైదిక కవులును, లౌకికులగు వాల్మీకివ్యాసాదులు ఋషులగుటచేతను, దివ్యచక్షువులతో వారు లోకరహస్య మెఱింగినవారగుటచేతను, లోకోత్తరవర్ణనాత్మకముగ వారి కబ్బములు భాసిల్లుటచేతను, "నా నృషిః కురుతే కావ్యమ్", "కవయః క్రాంతదర్శినః" అను లోకోక్తులు గలిగినవి. కనుకనే అప్పకవి:

క॥ ఇమ్మహిని మునులచే వెల
సెమ్మను కావ్యములు "నా నృషిః కురుతే కా
వ్యమ్మను వచనార్థంపుఁ
సమ్మతిఁ గలివేళ సుకవిజనులే మౌనుల్"

అని వచించెను. కాని కేవలము ఋషి కావ్యరచన మొనర్పలేడు. "హేమచంద్రుఁడు" "భట్టతౌతుని" శ్లోకముల మూఁడిఁటి నీ విషయమున సంగ్రహించెను:

"నానృషిః కవి రిత్యుక్త మృషిశ్చ కిలదర్శనాత్
విచిత్రభావ ధర్మాంశ తత్త్వ ప్రఖ్యాచ దర్శనమ్
సతత్త్వదర్శనా దేవ శాస్త్రేషు పఠితః కవిః
దర్శనా ద్వర్ణనా చ్చాథ రూఢా లోకే కవిశ్రుతిః
తథా హి దర్శనా స్వచ్ఛే నిత్యేప్యాది కవేర్మునేః
నోదితా కవితా లోకే యావజ్జాతా న వర్ణనా"

ఋషి గానివాఁడు కవి గాదని చెప్పుదురు. ఋషి యనగా ద్రష్ట. దర్శన మన విచిత్రమైన వస్తువుల యొక్క ధర్మాంశముల నెఱుఁగుట. దీనికే ప్రతిభ యని పేరు. అట్టి తత్త్వదర్శనము గలవానినే శాస్త్రములు కవి యని పేర్కొనుచున్నవి. లోకమున దర్శనము, వర్ణనము నీ రెండిఁటివలన "కవి" యని ప్రసిద్ధి వహించును. వాల్మీకి మొదట ద్రష్టయైనను వర్ణనము సేయువఱకుఁ గవిగాఁ బరిగణింపఁ బడఁడయ్యెను. కావున దీనివలన కవి ద్రష్టయైనను వర్ణనానిపుణుఁడు గావలయునని తెలియుచున్నది. ఈ యభిప్రాయము నే "భామహుఁ" డిట్లు తెలిపెను.

"ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభామతా
తదనుప్రాణనా జ్జీవే ద్వర్ణనా నిపుణః కవిః"

(నవనవోన్మేషశాలిని యగు ప్రజ్ఞ "ప్రతిభ" యనఁబడును. తదాశ్రితుఁడై వర్ణనము సేయువాఁడు కవి)

ఆనందవర్ధనుఁడు:

"అపారే కావ్యసంసారే కవి రేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే
శృంగారీ చేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్
స ఏవ వీతరాగశ్చేత్ నీరసం జాత మేవ తత్
భావా నచేతనా నపి చేతనవ చ్చేతనా నప్యచేతనవత్
వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా"

[అపారమైన కావ్యప్రపంచమునకుఁ గవియే బ్రహ్మ. అనఁగా సృష్టికర్త. అతఁడు దన యిచ్ఛానుసారముగ లోకమును మార్చును. శృంగారియైన లోకమును శృంగారమయ మొనర్చును. విరాగియైన నీరసవంతముఁగఁ జేయును. అచేతనములను చేతనములుగను, చేతనముల నచేతనములుగను స్వతంత్రముఁగాఁ గవి కబ్బమున వర్తించునని కవినిఁగూర్చి తెలిపెను.]

కాన వీరి వాక్యముల ననుసరించి కవి "ప్రతిభావంతుఁడగు కావ్యప్రపంచమును సృజించు బ్రహ్మ" యని తేలినది. కవి ప్రతిభావంతుఁడైననే లోకమును రసమయముఁగాఁగాని, నీరసమయముఁగాఁగాని చేయఁగల డిట్టి. కనుకనే ("కావ్యంతు జాతుజాయేత కస్యచిత్ప్రతిభావతః") ఒకానొక ప్రతిభావంతునివలననే యట్టికావ్య ముదయించునను నార్యోక్తి గల్గినది. కవి యనఁగా క్రాంతదర్శియై, ప్రతిభావంతుఁడై, వర్ణనాదినిపుణుఁడై యుండవలయును.

"కావ్యమీమాంస"యం దీ క్రిందివిధముగ కవులు విభాగింపఁబడియున్నారు. 1 శాస్త్రకవి, 2 కావ్యకవి, 3 ఉభయకవి, వారిలో నుత్తరోత్తరుఁడు

శ్రేష్ఠుఁడు. ఉభయకవి నే "విద్వత్కవి" యందురు. "విద్వత్కవయః కవయః కేవల కవయస్తు కేవలం కపయః" అనఁగా ప్రతిభావ్యుత్పత్తులు రెండునుఁ గల వాఁడే విద్వత్కవి. అట్టివాఁడే లోకోత్తరవర్ణనా నిపుణుఁడు.

## కావ్యమననేమి?

పై విషయమునుగూర్చి చెప్పుటకు ముందుగ "కావ్య" మను దానినిగూర్చి సంస్కృతాలంకారి కుల నిర్వచనముల నుటంకింతును.

"శబ్దార్థౌ సహితౌ కావ్యమ్"అని భామహుఁడు.

"గుణాలంకార యుక్తార్థౌ కావ్య" మని వామనుఁడు.

"అదోషౌ సగుణావనలంకృతీ పునః క్వాపి" యని మమ్మటుఁడు,

"నిర్దోషం గుణాలంకార రసవత్ వాక్యమ్ కావ్య"మని భోజుఁడు.

"గుణాలంకార రీతి రసోపేతః సాధు శబ్దార్థ సందర్భః కావ్య" మని వాగ్భటుఁడును.

"నిర్దోషం గుణాలంకారరీతివృత్తిమ ద్వాక్యం కావ్య" మని పీయూషవర్షనుఁడు.

"రసాదిమ ద్వాక్యం కావ్య" మని శౌద్ధోదని యను నాలంకారికుఁడు.

"వాక్యంరసాత్మకం కావ్య"మని విశ్వనాథుఁడు.

"ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ కావ్య"మనిదండి.

"రమణీయార్థ ప్రతిపాదక శ్శబ్దః కావ్య"మని జగన్నాథుఁడు.

ఇంకను మఱికొందఱు. "కవనీయం కావ్య" మని లోచనకారుఁడును, "కవయతీతి కవిః తస్యకర్మ కావ్య"మ్మని విద్యాధరుఁడును, "క్రాతిశబ్దాయ తే విమృశతి రసభావా న్నితి కవిః, తస్య కర్మ కావ్య "మ్మని భట్టగోపాలుఁడును, "లోకోత్తరవర్ణనానిపుణ కవి కర్మ కావ్య" మని మమ్మటాచార్యుఁడును జెప్పియుండిరి.

ఈ పైఁ జెప్పబడిన నిర్వచనములం దంతటను కవి కర్మ ప్రధానముగఁ జెప్పఁబడియున్నను నిండుఁ గవి లక్షణ మిమిడియే యున్నది. వీనిలోని "లోకోత్తర వర్ణనానిపుణకవికర్మ కావ్య"మ్మనుదానినిఁబట్టి లోకోత్తరవర్ణనానిపుణుఁడే కవియని,వానియొక్క "కర్మ"యే "కావ్య"మని తేలినది. లోకోత్తరవర్ణనానైపుణి యను నది ప్రతిభాలభ్యము. ప్రతిభ దేవతానుగ్రహ సంపాద్యము. దేవతానుగ్రహము తపస్సంపాద్యము. తపస్సు ఋషికర్మ. గనుక నే "నానృషిః కురుతే కావ్యమ్" "కవయః క్రాంతిదర్శినః" యను లోకోక్తులు గల్గినవి.

పై విధముగ ఋషియయినవానియొక్క కర్మయే కావ్యమై లోకమునం దధికమయిన ప్రచార మొందు నని తెలియుచున్నది. అట్టి కవిత్వము రాకున్న నూఱ కుండవలె నే గాని కుకవి మాత్రము కాఁగూడదు.

"నాకవిత్వ మధర్మాయ, మృత్యవే దండనాయ వ
కుకవిత్వం పున స్సాక్షా న్మృతి మాహు ర్మనీషిణః.

[కవి గాకుండిన నెట్టి యధర్మము, లేక పాపము సంభవింపదు. కవిగానియెడల మనుష్యుఁడు చావఁడు రాజాదులవలన దండనము రాదు. కాని కుకవి యగుట వలన కేవలము మృత్యువే.]

ఇఁక నా ప్రతిభ యనునది కారయిత్రి, భావయిత్రి యని రెండు విధములుగ కావ్యమీమాంస కారుఁడు వక్కాణించెను. కవిచేఁ గావ్యమును వ్రాయించుశక్తి కారయిత్రి. పాఠకునిచేఁ గావ్యము యొక్క యర్థమును భావింపఁ జేయునది భావయిత్రి. కాబట్టి కవికివలె నే పాఠకునకు ప్రతిభ యుండవలెను. లేకున్నచో గవిభావమును గ్రహింపలేకపోవును. ప్రతిభాతారతమ్యము ననుసరించియే "అప్పకవి" చెప్పినట్లు కవులలో నీ క్రింది భేదములు ఏర్పడినవి.

ఆ॥ వె॥ వినుతి గాంచు రిల వివేకి, వాచక, రాచి
కార్థ, శిల్పి, భూష, ణార్థు లనఁగ
మార్దవానుగతి సమాహ్వయుఁడును నాఁగఁ
గవులు సప్తనామకములతోడ.

## కావ్యమున కుండవలసిన లక్షణములు
## ఆలంకారికుల అభిప్రాయములు :

"సంగీత మపి సాహిత్యమ్ సరస్వత్యాః స్తనద్వయమ్" అన్నట్లు వాగ్దేవికి సంగీత సాహిత్యములు రెండును స్తనద్వయములుగ నొప్పియున్నవి. సంగీతము నందెంత మోహనశక్తి గలదో, సాహిత్యమునందును, అంతటి మోహనశక్తి గలదు. రమారమి రెండువేల సంవత్సరములనాఁడే "భరతుఁ"డను మహర్షి "నాట్య శాస్త్ర"మను గ్రంథమును రచించెను. అదియేసాహిత్య

శాస్త్రమున ప్రథమగ్రంథము. ఇది కేవలము రూపక ములనుగూర్చి వాని భేదములనుగూర్చి చర్చించును. భరతునిదృష్టిలోఁ గావ్యమన నాటకౌదులే. నాటక ములకే "రూపకము"లని పేరు. ఈతని మతమునఁ గావ్యమునకు శరీర మితివృత్తమే. "ఇతివృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తితమ్"

## భామహమతము

భరతునికిఁ బిమ్మట నైదవ శతాబ్దిలోని "భామహ" నామకాలంకారికుఁడు శ్రవ్యకావ్యచర్చను సాగించి "శబ్దార్థౌ సహితౌ కావ్యమ్." కావ్యమునకు శబ్దార్థ ములు శరీరమని, స్త్రీ పురుషాదుల శరీరసౌందర్యమున కలంకారములు ప్రాధాన్యమైనట్లు, కావ్యశరీరమును వక్రోక్త్యాద్యలంకారములు పెంపొనగూర్చుననియు, కావ్యమున కలంకారములు ప్రాధాన్యమని నిర్వచిం చెను.

## దండిమతము

ఆఱవ శతాబ్దివాఁడగు "దండి" కావ్యసిద్ధాంతము నిట్లు ప్రతిపాదించెను. "శరీరం తావ దిష్టార్థవ్యవ చ్ఛిన్నా పదావళీ" (రమణీయార్థమగు పదసంఘాతము కావ్యశరీరము) ఈతని మతమున రమణీయార్థభూషిత మగు శబ్దమే కావ్యము.

## వామనమతము

తరువాత తొమ్మిదవ శతాబ్దిలోని వామనుఁడు "కావ్యాత్మ"ను గూర్చి విచారించి "రీతిరాత్మా కావ్యస్య" అని సిద్ధాంతీకరించెను. శరీరమున కాత్మ వలె కావ్యశరీరమున కాత్మ యుండుననియు, నది "రీతి" యని యాతని మతము. రీతి కావ్యమున కాత్మయని చెప్పి భామహుని యలంకారసిద్ధాంత మును, దండిగుణసిద్ధాంతమును దన రీతితో సమన్వయ పఱచెను. ఎట్లన ? కావ్యాత్మ రీతి. రీతి గుణములచే నేర్పడును. అలంకారములు కావ్యసౌందర్యమును వృద్ధి చేయును. (కావ్యాలంకారసంగ్రహమితని గ్రంథము.)

## ఆనంద వర్ధనమతము

వామనునకుఁ దరువాత నీతఁడు సాహిత్య క్షేత్ర మున కరుదెంచెను. "ధ్వన్యాలోక" మను గ్రంథమును రచించెను. ఈతనిదొక క్రొత్త సిద్ధాంతము. కావ్యశరీర మున కాత్మ ధ్వని. అది వస్త్వలంకార రసరూపము. అనఁగా వస్త్వలంకార రసధ్వనులని త్రివిధములు. ఈ మూఁటిలో వస్త్వలంకారధ్వనులకన్న రసధ్వని సర్వ శ్రేష్ఠము. అయినను వస్త్వలంకారధ్వను లథమములు గావు. కావ్యమున కలంకారములు ముఖ్యాంగములు గావు. ఇతఁడు ధ్వనినే ప్రాధాన్యముగ నిర్వచించెను.

## అభినవ గుప్తమతము

ఆనందవర్ధనునికిఁ బిమ్మట నభినవగుప్తుఁడను నొక యాలంకారికుఁడు సాహిత్యరంగమునకు వచ్చెను. ఈతఁ డానందవర్ధనుని ధ్వనిసిద్ధాంతము నంగీకరించి యాతని "ధ్వన్యాలోకము" నకు "లోచన" మను వ్యాఖ్యవ్రాసెను. "రసేనైవ సర్వం జీవతి కావ్యమ్. నహి రసశూన్యం కావ్యం కించి దస్తి. రసయేవ వస్తుతః ఆత్మా. వస్త్వలంకార ధ్వనీతు సర్వథారసం ప్రతిపర్యవస్యేతే" (రసముచేతనే కావ్యము జీవిం చును. రసశూన్యమగు కావ్య ముండెదు. మూఁడు విధములగు ధ్వనులలో రసధ్వనియే కావ్యాత్మ. వస్త్వ లంకారములుగూడ రసపర్యవసాయులు గావలయును ) ఈ సిద్ధాంతమే విశ్వనాథుని "వాక్యం రసాత్మకమ్ కావ్య"మ్మను కావ్యలక్షణమును లేవదీయించినది.

## మహిమ భట్టమతము

అభినవగుప్తుని పిమ్మట నీ ధ్వనిసిద్ధాంతమును "మహిమభ"ట్టను పండితుఁడు ఖండించెను. "ఇతఁడు "ధ్వన్యాలోకము"నకు ఖండనముగ "వ్యక్తివివేక"మను గ్రంథమును రచించెను. ఇతని ప్రతిన యిది—

శ్లో. అనుమానేంతర్భావమ్ సర్వస్యాపి
ధ్వనేః ప్రకాశయితుమ్
వ్యక్తివివేకం కురుతే ప్రణమ్య
మహిమా పరాం వాచమ్.

[ఎల్ల విధములగు ధ్వనుల ననుమానమునందే యంత ర్భవింపఁ జేయుటకై మహిమభట్టు వాగ్దేవికి నమస్క రించి వ్యక్తివివేక గ్రంథమును రచించుచున్నాఁడు.]

ఇతఁడు కావ్యమున రసప్రాధాన్యము నంగీకరిం చెను."కావ్యస్యాత్మని సంజ్ఞిని రసాదిరూపేన కస్యచిద్వి మతిః" (కావ్యమున కాత్మ రసాదిరూపమనుటయందు విప్రతిపత్తి లేదు) ఈతని వాదము కడకు నిలువలేదు. మమ్మటు, విశ్వనాథ, జగన్నాథాది మహాపండితులీతని

వాదమును ముక్కలు ముక్కలు జేసివైచిరి. ప్రత్యేకముగ నానందవర్ధనుని సిద్ధాంతము నే, అనఁగా "వ్యంజనావృత్తి"ని ప్రత్యేకముగ నంగీకరింపవలసినదని నిర్ధరించిరి.

## కుంతక మతము

అభినవగుప్తుని కాలమునందలివాఁడే యీ కుంతకుఁడు. "ధ్వని" మతమునకుఁ బ్రతికూలముగ నొక సిద్ధాంతమును బ్రతిష్ఠించెను. ఈతని సిద్ధాంతము. "వక్రోక్తిః కావ్యజీవితమ్". భామహుని వక్రోక్తినే యీతఁడు విశేషముఁగ బెంచెను.

## క్షేమేంద్ర మతము

కుంతకుని యనంతరమున క్షేమేంద్రుఁడను నొక పండితుఁడు నూతన సిద్ధాంతమును లేవదీసెను అది:

"ఔచిత్యస్య చమత్కారకారిణ శ్చారు చర్వణే
రసజీవితభూతస్య విచారం కురుతే ధునా
కావ్యస్యాల మలంకారైః కిం మిథ్యా గుణితైర్గుణైః
యస్య జీవిత మౌచిత్యమ్ విచింత్యాపి నదృశ్యతే
అలంకారా స్త్వలంకారా గుణాయేవ గుణాస్సృతాః
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్."

[రసమునకు జీవితభూతమును, చమత్కారకారియు నగు నౌచిత్యమును గూర్చి విచారణ సేయుదము. కావ్యమునకు జీవిత భూతమైన యౌచిత్యము లేకున్నచో నలంకారము లేల? గుణము లేల? అలంకారము లలంకారములే! అనఁగా బాహ్యశోభా హేతువులు. కాని జీవితము గాదు. అట్లే గుణములును బ్రుతతపస్సత్యశీలాదుల వలెనే గుణములే. అనఁగా నవియు జీవితము గావు. కాన రసవంతమగు కావ్యమునకు జీవితభూత మౌచిత్యమే ]

ఆంగ్లమున గూడ నీ యౌచిత్యచర్చ గలదు. ఔచిత్యమున కాంగ్లమున డికోరమ్ (Decorum) అందురు

"వాక్యం రసాత్మకం కావ్య" మనగా రసస్వరూపముగల వాక్యము (మహావాక్యము లేక వాక్యసమూహము) కావ్యమని విశ్వనాథుఁడు వచించెను. ఇట్లనుటచేఁ బ్రబంధములలోఁ గొన్ని నీరసపద్యములకుఁ గావ్యత్వము లేకపోవచ్చును. అట్టియెడ రసవత్పద్యములనుబట్టి కావ్యత్వమును నీరస పద్యములను బట్టి యకావ్యత్వము నొక్క కావ్యమందే సంభవించి యది కావ్యముగాని యకావ్యముగాని కాకపోవలసివచ్చునని శంకించి రసవత్పద్యములలోనున్న గొన్ని నీరస పదములకును బద్యరసముచే రసవత్త్వము గల్గువిధమునఁ బ్రబంధరసముచే నీరసపద్యములకును రసత్వము గల్గునని సమాధాన మిచ్చెను.

"రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్" అనగా రమణీయమగు నర్థమును దెలుపు శబ్దము కావ్యమని యర్థము. రమణీయార్థ మనఁగా నేయర్థమును దిరిగి తిరిగి భావించుటచే లోకోత్తరాహ్లాదము గలుగునో అది. ఆ లోకోత్తరమగు నాహ్లాదమునకే "చమత్కార" మనియు నామాంతరము. కాన రమణీయార్థమనగా చమత్కారమును గల్గించునది యని యర్థము. చమత్కారము లేకున్న కావ్యము గాఁజాలదు. ఎట్లన ?

శ్లో॥ కిం కవే స్తస్య కావ్యేన కిం కాండేన ధనుష్మతః
పరస్యహృదయేలగ్నం నఘూనయతి యచ్ఛిరః॥.

[పరహృదయమున నెయ్యది లగ్నమై తలనూపింపఁజేయదో, ఆ కవియొక్క కావ్య మేల? ఆ ధానుష్కుని బాణ మేల? అని యార్యోక్తి కాన గావ్యమునఁ జమత్కారమున్న నే పాఠకుఁడు తలనూగించును.

## ఆంగ్లమునందలి కావ్యలక్షణములు

1. The expression of the imagination (తన భావనను (ప్రతిభను) వాగ్రూపకముగఁ బ్రకటించుటయే కవిత్వము

2. The language of the imagination. (తన భావనను బ్రకటించుభాషయే కవిత్వము).

3 The art of employing words in such a manner as to produce an illusion on the imagination (ప్రతిభకొక రూపమును గల్పించువిధమున బదములను గూర్చు కళ కవిత్వము.)

4 The rhythmic creation of beauty— (సౌందర్యమును గణబద్ధముగా సృజించుటయేకవిత్వము)

5. The most delightful and perfect form of utterance that human words can reach (మానవ వాక్కుల కందఁదగినంత యానందకరమైనట్టియు, రసస్ఫోరకమైనట్టియు, నిర్దుష్టమైనట్టియు రచనారూపము కవిత్వము )

6. The art uniting pleasure with truth by calling imagination to the help of reason. (ప్రతిభోత్థాపితమైన కారణములతో సత్యమును, ఆనందముతో మేళనముఁజేయు కళయే కవిత్వము.)

"జాన్‌స్టూఅర్ట్ మిల్"అను లాక్షణికుఁడు కావ్యమన నేమి? అని ప్రశ్నించుకొని పై లక్షణములకన్న భిన్నమగు దృక్పథముతో "మూర్తీభవించిన యావేశము గల పదములును, అర్థములును కావ్య"మనెను.

"వర్డ్స్‌వర్త్" యింతకన్న విశేషముగ "కావ్య మనఁ బరిపూర్ణమైన యా వేశముతో హృదయమునుండి వెలువడు వాక్ప్రవాహ" మని తెలిపెను.

అట్లే 'జాన్ కేబెల్' అనునాతఁడు "కావ్యమన హృదయము యొక్క యొద్దాలోరసి ప్రవహించు భావనా ప్రవాహమునకుఁ బరీవాహ" మనెను.

# కావ్య ప్రయోజనము

మన వాఙ్మయము (వైదిక లౌకిక వాఙ్మయములు) ప్రభు సమ్మితము, మిత్రసమ్మితము, కాంతా సమ్మితములని మూఁడు విధములుగా విభినపద్ధతులు ప్రపంచమున వ్యవహరించిరి. తరువాతి యాలంకారికు లెల్లరు నీ విషయము నిట్లే స్వీకరించిరి. వేదవాఙ్మయము ప్రభుసమ్మితము. పురాణ వాఙ్మయము మిత్ర సమ్మితము కావ్యవాఙ్మయము కాంతాసమ్మితమును గా విభజించిరి ప్రభు సమ్మితి మన? రాజువలె నిరంకుశ ముగ శాసించునది; వేదము. "సత్యం వద" "ధర్మం చర" ఇత్యాదికమగు కర్తవ్య ధర్మములను శాసనరూప మున బోధించును. ప్రభుశాసన మల్లంఘింపరాని విధ మున వేద శాసనముగూడ నుల్లంఘింప వీలుకానిది. మన కిష్టము లేకున్నను ప్రభు శాసనము విధిగాఁ బాలింపవలసిన విధమున వేదశాసనము బాలింపవల యును. ఈ వాఙ్మయమున శబ్దములకే ప్రాధాన్యము. కావున వేదములు శబ్దప్రాధాన్యములు. మిత్రసమ్మిత మన మిత్రునివలె నుపదేశించునది.

లోకమున

"మాతా మిత్రం పితా చేతి స్వభావా త్రితయం హితమ్
కార్యకారణ తశ్చాన్యే భవంతి హితబుద్ధయః"

అన్నవిధమున మన మేలుగోరువారు తలిదండ్రులు, మిత్రుఁడనువారు మువ్వురుమాత్రమే! అట్టి మిత్రునివంటి పురాణవాఙ్మయము వైదికమగు "సత్యం వద, ధర్మం చర" యను శాసనము నే సహేతుకముగ, సోదాహరణముగ, కథారూపమున, తదాచరణమువలన లాభములు, అనాచరణమువలనఁ గలుగునష్టముల నుపదేశించి, కర్తవ్య ధర్మాచరణమునందుఁ బ్రవేశింపఁ జేయును. కావ నీ వాఙ్మయ మర్థప్రధానము.

ఇఁక "కాంతాసమ్మితి" మనగా, నుత్తమురాలగు భార్య తన గుణాలంకారరూపములచే భర్తృమనోరంజనముఁ జేయుచు దుర్మార్గమున నున్నవానిని సన్మార్గమునకుఁ ద్రిప్పువిధమున, ఆయుత్తమ కాంత తనభర్తకు వాచ్యరూపముగ నుపదేశింపక, గుణ ప్రవర్తనలచే వ్యంగ్యరూపమున నుపదేశించును. ఆమెయే "స్వాధీన పతిక" యనఁబడును. కావ కావ్యవాఙ్మయము కాంతా సమ్మితి మనుటవలన వేదపురాణ వాఙ్మయములకన్న వైలక్షణ్య మీ వాఙ్మయమున కేర్పడినది. ఇందా రెండిటియందు లేని చిత్తరంజనము, వ్యంగ్యరూప మగు నుపదేశములు గలవు. మఱియొక విషయము:—

వైదిక వాఙ్మయమే కర్తవ్యధర్మమును, నిరంకుశముగ, శాసనరూపముగ బోధించుచున్నదో, ఆ కర్తవ్యధర్మము నే పురాణవాఙ్మయము సహేతుకముగ కథానికల రూపమునఁ దెలుపుచున్నది. తత్కర్తవ్యధర్మము నే కావ్యవాఙ్మయము "శైలీగుణాలంకారము"లచే ప్రజా హృదయముల నాకర్షించుచు, హృద్యముగ నుపదేశించు చున్నది. వేదము "సత్యం వద" యని శాసించెను. పురాణము "సత్యహరిశ్చంద్రా"ది కథల రూపమున దెలుపబడెను. ఆ కథయే దృశ్య, శ్రవ్య కావ్యము లందింతకన్న మనోరంజకముగ ప్రదర్శింపఁబడి, యా ధర్మమును మరింత లెస్సగా మనస్సులందు నాటుకొను నటు లొనర్పుచున్నది.

ఈ క్రమమునుబట్టి చూడఁగాఁ గావ్యము తప్పక ధర్మము నుపదేశించునదిగా నుండవలెనని తెలియు చున్నది. కనుకనే "భామహుఁడు":

> ధర్మార్థ కామ మోక్షేషు
> వైచక్షణ్యం కళాసు చ।
> కరోతి కీర్తిం ప్రీతిం చ
> సాధు కావ్య నిషేవణమ్॥

అని చతుర్వర్గవ్యుత్పత్తియే "కావ్య ప్రయోజనము"గ పేర్కొనెను.

మఱియు కావ్య ప్రకాశకర్త;

> "కావ్యం యశసే, అర్థకృతే,
> వ్యవహార విదే, శివేత రక్షతయే,
> సద్యః పర నిర్వృతయే,
> కాంతాసమ్మితత యోపదేశయుజే"

అని సద్యః పర నిర్వృతిని (ఆనందమును) ఉపదేశమును, కావ్యఫలముగాఁ బేర్కొనెను. ధ్వన్యాలోకకారుఁడును "సదాచారోపదేశరూప నిబంధనాహి, నాటకాదిగోష్ఠీ వినేయ జనహితార్థ మేవ మునిభి రవతారితా"! (పామరజనహితార్థమై - సదాచారోపదేశ మొనర్చుటకే భరతాదులు నాటకాగలు నిర్ణయించి)రని నుడివెను. కావున భరతాదులు "ఆనందమును. ధర్మోపదేశమును" కావ్యముయొక్క ముఖ్య ప్రయోజనములుగ వెల్లడించి యుండిరి. ఇట్టి కావ్యములు వెలువరించి కవులాంధ్రరమణి కింకను శోభను వెలార్చుదురుగాక!

* ఈ వ్యాసమును శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారి "కావ్యాలంకార సంగ్రహ"వ్యాఖ్యా నాధారముగ రచించితిని. వారికి నాహృదయ పూర్వక వందనములు—
రచయిత.

# నాటకాంతం

## శ్రీపంతుల శ్రీరామశాస్త్రి

మరదలు శకుంతల పెళ్ళికి వెళ్ళకూడదనే అనుకొన్నాడు సుబ్రహ్మణ్యం—ఆ ఉద్దేశంతోనే ముందుగా శారదను పంపించేశాడు. కాని, చిట్టచివరికి పోనీ ఒక్క రెండురోజులు వెళ్ళివస్తే ఏం పోయింది, లేకపోతే శారదకి అక్కడ నలుగురిలోనూ చిన్నతనంగానూ ఉంటుం దనుకొని బయలుదేరేడు.

ఇదివరలో పెద్దమరదలు సరోజని పెళ్ళికి పదిహేను రోజులు ముందుగా వెళ్ళి, భారమంతా తన భుజస్కంధాలమీదే వేసుకొన్న సుబ్రహ్మణ్యానికి ఈమారు శకుంతల పెళ్ళికి అసలే వెళ్ళాలని లేకపోవడానికి కారణం ఏమిటి? అక్కచెల్లెళ్ళు ముగ్గురిలోనూ శకుంతల అందరికంటే అందమైనదే కాక తెలివయినదని కూడా సుబ్రహ్మణ్యం నమ్మకం—ఆమె కాలేజీలో ఇంటరు సీనియరు చదువుతూండగా (అంటే ఎనిమిదినెలల క్రిందట) బి. యే సీనియరు చదువుతూన్న ఒక విద్యార్థితో లేఖామూలకమయిన ప్రణయవ్యవహారం కొంత జరిగిందన్న విషయం సుబ్రహ్మణ్యానికి తెలిసింది. వాళ్ళిద్దరికీ తమ భవిష్యత్తు గురించి ఎటువంటి అనుమానాలు లేకపోయినా పెద్దలకు అంగీకారం కుదరలేదు—సుబ్రహ్మణ్యం సలహా నిష్ప్రయోజనం అయింది. ఇప్పుడు కుదిరిన సంబంధం చాలా గొప్పదనీ, ఇటువంటిది మరెన్నడూ దొరకదనీ శారదతో సహా అందరూ విశ్వసిస్తున్నారు...కాని, శకుంతల మనస్థితిని గూర్చి ఆలోచించినవా రెవ్వరూ లేరు—డబ్బు, కులమూ, గోత్రమూ...ఇవన్నీ ఆలోచించదగినవే కావచ్చును—గాని, వ్యక్తుల మానసికస్థితి, అభిరుచులు వీటిని గూర్చి అసలే ఆలోచించకపోడమన్నది ముందు ఎటువంటి పరిణామాలకు దారితీస్తుందో?... పెళ్ళి హడావిడిలో ఎలాగో వీలు కల్పించుకొని శకుంతలను అడిగితే గడుసుగా అటూ ఇటూ తేలకుండా చెప్పి తప్పించుకొంది—కాని, లోపల్లోపల 'ఇదేదో వీళ్ళందరి ఆమోదంకోసం చేస్తున్నపని, అంతేగాని దీంతో నాకేం సంబంధం లేదు' అన్న విరక్తభావన మెదల్తూన్నట్టుంది. ఇప్పటి ఈ హడావిడిలో ఇలాగే అనిపించవచ్చును కాని, ముందు ముందు బాధ్యత అంతా తనదే నిజంగా తనకి అయిష్టంగా ఉంటే ఇప్పుడే కాదని గట్టిగా ఎదురు తిరిగి ఉండవలసింది—ఎంత తెలివయినవాళ్ళకీ తమకి సంబంధించిన విషయాల్లో ఉద్రేకపు పాలు తప్ప హేతువాదపు ప్రభావం పనిచెయ్యదు కాబోలు?

గతజలసేతుబంధనంవల్ల ప్రయోజనం లేదు—పెళ్ళి అయిపోయింది—మగపెళ్ళివారి ధోరణి అందరికీ దుస్సహంగానే పరిణమించింది. ప్రత్యేకించి పెళ్ళికొడుకుతో తాను ఆడిన కొద్దిమాటలవలన అతడి అహంకారమూ, ఔద్ధత్యమూ స్పష్టంగా బోధపడ్డాయి సుబ్రహ్మణ్యానికి.

ఇంకా మరి రెండు రోజు లుండడానికి వీలుండగానే బయలుదేరిపోయేడు—ఎవ్వరూ ఏమీ అభ్యంతరం చెప్పలేదు—'మరి రెండు రోజులుంటే నేను కూడా వచ్చేస్తాను కదా!' అంది శారద—'నిన్ను తొందరపెట్టడం ఇష్టంలేకనే నేను బయలుదేరిపోతున్నాను' అన్నాడు సుబ్రహ్మణ్యం.

రయిలందుతుందనుకో లేదు—కాని, మామూలుగా వచ్చే అరగంటేకాక మరొక అరగంట కూడా లేటు కావడంతో అందింది.

నీది బెర్తుమీద హోల్డాలు పరుచుకొని క్రిందను మూలగా ఉన్న స్థలంలో కూర్చొని సిగరెట్టు ముట్టించాడు.

సిగరెట్టు కాలుస్తూ ఉన్నా అతని ఆలోచనలు అతకని బ్రతుకులకు కారణమయిన పెళ్ళిళ్ళమీదనే లగ్నమయి ఉన్నాయి — సోక్రటీసు, అబ్రహాం లింకను, టాల్‌స్టాయి—మొదలయిన వాళ్ళ దాంపత్య జీవితాలు దుర్భరంగా తయారయాయంటే, తమ అభిప్రాయాలతో సరిపడని భార్యలను చేసుకోడమే— అలాగే ఎందరో స్త్రీల జీవితాలు జీవన్మృత స్థితిలో

ఉన్నాయంటే అందుకు అననుకూల దాంపత్యాలే కారణం—వివాహానికి ఉండే ఈ ప్రాముఖ్యాన్ని అంచనా వేస్తారు—కాని, తమతమ వివాహ సందర్భాలలో ఎందుకో అర్థంలేని తొందర పడుతున్నట్టనిపిస్తుంది.

ఎవరి సంగతో ఎందుకు; తన విషయంలో తాను అరుంధతిని చేజేతులా పోగొట్టుకొన్నాడంటే అంతకంటె తెలివితక్కువ ఇంకేమయినా ఉంటుందా? తరవాత శారద ఇంత మంచిదీ, అనుకూలవతీ అయిందంటే అది వేరే సంగతిగాని, తన పొరపాటు మాసిపోతుందా? అయినా అరుంధతి తెలివితేటలు, చాకచక్యమూ, సారస్వతాభినివేశమూ ఇవన్నీ శారద కెక్కడనుంచి వస్తాయి? ఆనాడు అరుంధతి నేగాని జారవిడుచుకోకపోయిఉంటే, ఈనాడు తాను ఏ స్థితిలో ఉండేవాడో? చాలా విషయాల్లో నేడు తాను ఉదాసీనంగా, విరక్తుడుగా, ఎలా అయితే అలా జరగనీ అన్నట్టుంటున్నాడు. ఇంతకంటే ఎంతో చొరవగా, ఉల్లాసంగా, ధైర్యంగా ఉండి ఉండేవాడేమో అరుంధతి నే పోగొట్టుకోకుండా ఉంటే.

అనుకొన్నట్టుగానే సిగరెట్టు అయిపోగానే మీది పెదవి మీదికి పోవడం జరగలేదు—మరొక సిగరెట్టు ముట్టించి, కనురెప్పలు మోడ్చి వెనుకటిరోజులకు సంబంధించిన దృశ్యాలను నెమరు వేసుకోడం మొదలు పెట్టేడు—

అవి తాను తాడుతెగిన గాలిపటంలా ఎగురుతున్న రోజులు—హఠాత్తుగా మేనమామ పోవడంతో బి. యే చదువు అర్థాంతరంగా ఆగిపోయింది. సిఫార్సులు లేని నిష్ప్రయోజనమయిన ఉద్యోగ ప్రయత్నాలు సాగిస్తూ, కోస్తా పొడవునాఉన్న స్నేహితులను నిర్మొగమాటంగా కొంత కొంతకాలం ఉద్ధరిస్తూ, కాలక్షేపం నిమిత్తం పద్యాలు రాస్తూఉండిన రోజులవి—

బి. యల్ పాసయి కొత్తగా ప్రాక్టీసు పెట్టిన రాజేశ్వర్రావును చూసేవరకూ తాను నిరుద్యోగిగా ఎంతకాలం గడిపిందీ గుర్తురాలేదు సుబ్రహ్మణ్యానికి. వాడు తాను జూనియర్ చదువుతున్నప్పుడు సెప్టెంబర్ పరీక్షకు వెళ్ళేడు.

తన మామూలుపద్ధతి—కొన్నిరోజులుండి, రైలు ఖర్చులకని పదో పదిహేనో పుచ్చుకొని బయలుదేరి పోయే పద్ధతి రాజేశ్వర్రావు దగ్గర కుదరలేదు.

పద్యాల్లో పక్షుల స్వేచ్ఛాజీవితం గురించి వాపోవడం బాగానే ఉంటుందిగాని, నిత్యజీవితంలో పక్షుల్లా తయారవడం ఆత్మనాశనాన్ని తెచ్చుకోడమే అన్నాడు రాజేశ్వర్రావు—అతనితో పూర్తిగా ఏకీభవించలేక పోయినా, ఎదిరించలేకపోయేడు సుబ్రహ్మణ్యం.

'ప్రవాళమాల' (పద్యరచనల సంపుటి), పాఠశాల (కథానికల సంపుటి) ఈ రెండూ ఆనాడు ప్రచురితమయేయంటే అందుకు రాజేశ్వర్రావు పడ్డ తాపత్రయం ఇంతా అంతా కాదు.

ఆ తరవాత ఈ ఆరేడేళ్ళలోనూ తాను ఏవో రచనలు చేసేడు, వాటిలో చాలావరకూ పత్రికలలో అచ్చయాయి కూడా. అయినా, ఇప్పటికి తాను మరొక పుస్తకం ప్రకటించలేక పోయేడు. ఇంత వేగంలో వెలువడే సావకాశమూ కనిపించడంలేదు.

ఆనాడు రాజేశ్వరరావు తనకి కల్పించినది కేవలం ఆర్థికమయిన ప్రోత్సాహం మాత్రమే కాదు; మానసికంగా ఎంతో ధైర్యాన్ని చేకూర్చాడు. అతను అంతగా అనుకొని ఉండకపోతే బైరాగులలో కలిసి పోవడమో ఆత్మహత్య చేసుకోడమో ఈ రెంటిలో ఏదో ఒకటి తనకు శరణ్యం అయి ఉండును.

కేవలం ప్రాక్టీసు మీద నే ఆధారపడవలసిన అవసరం లేనిపాటి ఆస్తి కలవాడు రాజేశ్వరరావు. అటువంటి వాడికి సింహానికి ఎలుక చేసిన సహాయంలాగ తానొక చిన్న ఉపకృతి చేయగలిగేడంటే విశేషమే.

అరుంధతి ఆ సంవత్సరం బి. యిడి., చదువుతూంది. ఆమెకు బి. యిడి చదవాలనే కోరిక పుట్టి ఉండకపోతే ఆరు నెలలకు పూర్వమే వాళ్లిద్దరి పెళ్ళి జరిగి ఉండేది. పెళ్ళి చేసుకొన్నా అవసరమయితే స్వతంత్రంగా జీవించగలిగే సావకాశం ఉండాలని ఆమె అభిమతం.

అంతగా వ్యావహారికంగా అన్నిటినీ చూడ గలిగిన అరుంధతి అన్నీ ఉన్న రాజేశ్వర్రావుని కాదని ఏమీలేని తనని వరిస్తుందన్నది కలలోనయినా నమ్మలేని సంగతి.

కాని, కలల్లో ఊహల్లో అసాధ్యాలుగా కనిపించిన విషయాలు ఒక్కొక్కప్పుడు యథార్థంగా జరిగిపోతూ ఉంటాయి. ఆమెకి మొదటినుండి తనను ఎగతాళి చెయ్యడం అంటే ఎందుకో అంత సరదా అర్థం అయేదికాదు తానూ తీసిపోకుండా నోటికి వచ్చినట్టు వాగేవాడు. ఇద్దరినీ చూస్తూ, సిగరెట్టు కాల్చుకొంటూ గంభీరంగా కూర్చొనేవాడు రాజేశ్వరరావు—అక్కడితో ఆగిపోయినా బాగుండును. ఆమెకు తనను డిగ్రీల పండితుణ్ణి చెయ్యాలనే సంకల్పం ఒకటి పుట్టుకొచ్చింది. చిన్న పిల్లవాణ్ణి శ్రద్ధగా కూర్చోపెట్టి చదివించినట్లుగా చదివించేది—ఎప్పుడయినా ఆమె చదవమని చెప్పినవి చదవలేదనీ, పేకాట ఆడుతూనో, పద్యాలు రాస్తూనో కూర్చున్నాననీ అంటే ఆమెకు కోపంలో కళ్ళనీళ్ళ పర్యంతం అయేది...

ఏం జరిగినా రాజేశ్వరరావు సూచించి ఉండకపోతే తనకి అర్థమయేదేకాదు, ఆమె తనను ప్రేమిస్తున్నదని — అప్పటికీ నమ్మడం కష్టంగానే తోచింది.

కాని, కర్తవ్యం?...రాజేశ్వరరావు ఎలాగో అనగలిగాడు—మీరిద్దరూ పెళ్ళి చేసుకొని హాయిగా ఉండగలిగితే నాకంతే చాలును. ఆమె సుఖపడ గలిగితే, నేనూ సుఖపడినట్టే—నేను మరి పెళ్లి చేసుకోక పోయినా నాకు విచారంలేదు...వెంటనే రాజేశ్వరరావుకి ఏమీ సమాధానం చెప్పలేకపోయేడు.

రాత్రంతా ఆలోచించి, ఆలోచించి తెల్లవారు జామున ఒక నిశ్చయానికి వచ్చేడు. మాటమాత్రమయినా, రాజేశ్వరరావు తాను ప్రేమించిన స్త్రీ సుఖపడడమే తనకి కావాలన్నాడు. ఆ పనే తానెందుకు చెయ్యకూడదూ? స్నేహము—ప్రేమ—ప్రేమ ఎక్కువదే కావచ్చును—కాని, తాను ఆమెకు తగిన ఉజ్జీ కాగలడా? ఆమె ఆర్జిస్తూ ఉంటే ఇంట్లో కూర్చొని అసమర్థుడుగా పడి ఉండడమా? అంతే కాక, రాజేశ్వరరావు తనకు మనసులో ఏ లేశమో అనుమానం తట్టగానే "భాయి, ఈ పాతికా తీసుకొని రేపే నువ్వెక్కడికైనా బసవెత్తి పెట్టేయి" అని ఉంటే ఏమవును?

వ్యక్తిగతంగా తనయెడల ఆమెకు ద్వేషం కలిగించుకోడమే అయితే అంత కష్టం కాకపోయేది— వెనుకటి స్థానంలో రాజేశ్వరరావును పునఃప్రతిష్ఠితుణ్ణి చెయ్యడం తేలికగా కుదరలేదు. అందుకుగాను లేని ప్రియురాళ్ళను సృష్టించుకోవలసి వచ్చింది, రాని ఉత్తరాలు రప్పించుకోవలసి వచ్చింది—ఎన్నడూ లేని దురభ్యాసాలు ఉన్నట్టుగా నటించవలసి వచ్చింది—

ఏమయితేనేం, నాటకంలో తన పాత్ర చాలా చక్కగా నిర్వహించినట్లే—ఆమె తన బి. యిడి. పరీక్ష పూర్తికాకమునుపే రాజేశ్వరరావుతో వివాహానికి అంగీకరించింది; అంతేకాదు, తమ వివాహానికి తాను రావడానికి కూడా ఆమె అంగీకరించలేదు.

తరవాత కొంతకాలంవరకూ కృతజ్ఞతతో ముంచెత్తుతూ రాజేశ్వరరావు ఉత్తరాలు రాస్తూ ఉండేవాడు. అటువంటివాటికి ఏమిటి జవాబు రాయడం? ఏదో ముక్తసరిగా క్షేమసమాచారం మాత్రం తెలియజేసి ఊరుకొనేవాడు. కొన్నాళ్ళకి రాజేశ్వరరావు కీ రాసే ఓపిక తగ్గిపోయింది. ఇదే బాగుంది. ఒకమారు జరిగిన ఏదో పనికి పదేపదే కృతజ్ఞతను ప్రదర్శించడమన్నది రెండువైపులా సుఖతరమయిన వ్యాపారం కాదు—అంతేకాక, రాజేశ్వరరావు ఉత్తరం చూసినప్పుడల్లా, తాను అరుంధతిని పోగొట్టుకోడంలోని తెలివితక్కువ మనసులో అస్పష్టంగా మెదలుతూ ఉండేదేమో?

ఒక వస్తువు మనకు అందుబాటులో ఉన్నప్పటికంటె పూర్తిగా పోగొట్టుకున్నప్పుడే ఎక్కువ విలువయినదిగా రూపిస్తుంది. అరుంధతిని గూర్చిన జ్ఞాపకాలతో కొంతకాలం అసలే పెళ్ళి చేసుకోకూడదన్నంతటి వైరాగ్యం కలిగింది. కాని, తరవాత తరవాత ఏదో ఒక ఉద్యోగం దొరకడం, అక్కడ ఏర్పడిన పరిచయం మూలంగా శారద మేనమామగారికి తెలియడం—పెళ్లి—మొదలయినవన్నీ జరిగాయి.

మొదట్లో కొంతకాలం ఏమాత్రం అసంతృప్తి కలిగినా మనసులో శారదను అరుంధతితో పోల్చుకోడం జరుగుతూ ఉండేది. కాని, ఆ విచారం అట్టే కాలం నిలవలేదు. శారదలో అరుంధతిలో ఉన్న వ్యక్తిత్వమూ తెలివితేటలూ లేకపోతేనేం, తనను సంతోషపరచడమే స్వీయానందంగా భావించుకోగలదు. తమ దాంపత్యజీవితం ఎటువంటి కలతలూ కల్లోలాలూ లేకుండా సాగిపోతుంది. ఇంతకంటే మరింకేం కావాలి?

మరదలు శకుంతల పెళ్ళికి సంబంధించి పుట్టిన ఆలోచనలు క్రమంగా విస్తరించి, గతంలోనికి వ్యాపించి, ఏనాటివో దృశ్యాలను స్మృతిఫలకంమీద ప్రకాశింపజేశాయి—

ఆనాడు తాను రాజేశ్వరరావు కోర్కెకు అంగీకరించి ఉండకపోతే ఏమయిఉండును?

అతను ఆశాభంగంవలన ఆత్మహత్య చేసుకొని వుండునా? అలాగే అయితే బ్రతికిఉన్నా ఆ జన్మాంతమూ తనకు తీరని వ్యథగా ఉండేది.

అంతమాత్రంలో అతను ఆత్మహత్య ఎందుకు చేసుకోవాలి? సలక్షణంగా పెళ్ళిచేసుకొని హాయిగా సాంసారిక జీవితం గడుపుతూ ఉండి ఉండును— అయితే తమ పరిస్థితి ఏవిధంగా పరిణమించేదో? ఆమెమీద నిరుద్యోగస్థుడుగా ఆధారపడిన స్థితిలో తన మనసు ఎటువంటి వికారాలకు లోనయి ఉండేదో? తరవాత కూడా, ఇద్దరూ వేర్వేరు స్థలాల్లో ఉద్యోగాలు చెయ్యవలసివస్తే? అప్పుడు తమలో ఎవరో ఒకరు ఉద్యోగం మానేసి ఉండేవారా?

ఛ ఛ ఇవేమిటీ ఆలోచనలు? ఆమె ప్రస్తుతం తన స్నేహితుడి భార్య—అంతే.

ఆనాడెప్పుడో అలా కాక ఇంకోకలా జరిగి ఉంటే ఎలా ఉండేదో అని ఆలోచించడంకంటె, జరిగిన పద్ధతివలన వాళ్ళ జీవితాలు ఎంత మధురంగా గడిచిపోతున్నాయి అన్నరకం ఆలోచన తెచ్చుకోవడం మంచిదికదా అనుకొన్నాడు సుబ్రహ్మణ్యం.

ఈ రకమయిన బుద్ధి పుట్టడంతో అదివరకెన్నడూ కలగని కొత్త ఆలోచన ఒకటి వచ్చింది— రాజేశ్వరరావునూ అరుంధతినీ గూర్చి ఊహించేకంటె ఒకమారు వెళ్ళి చూసివస్తే? అక్కడ పెళ్ళివాడావిడి భరించలేక బయలుదేరిపోయాడేగాని మరొకటి రెండు రోజులు ఆలస్యంఅయినా బాధలేదు. మళ్ళీ ఎప్పుడో గాని తాను ఈ ప్రాంతం వచ్చేదిలేదు. ఇప్పుడే ఒకమారు రాజమండ్రిలో దిగితే?

ఇప్పటికీ అరుంధతి తనను చూసి అసహ్యించుకొనే పరిస్థితిలో ఉంటుందా? లేక ఈ మధ్యకాలంలో వచ్చిన మార్పులకు సంతోషిస్తుందా? ఆరేళ్ళలో తనలో ఎన్నో మార్పులు వచ్చినట్టే ఆ యిద్దరిలోనూ ఎన్నో మార్పులు వచ్చి ఉంటాయి. ఈనాడు వాళ్ళ దాంపత్య జీవితాన్ని పరిశీలించగలగడం నిజంగా ఒక మంచి పాఠమే అవుతుంది.

సామర్లకోట వచ్చేసరికే రాజమండ్రిలో దిగి తీరాలని నిశ్చయం అయిపోయింది. అక్కడనుండి మెయిలు చాలా నెమ్మదిగా పోతున్నట్టు, ఏమాత్రం అవకాశం కనిపించినా ఆగిపోడానికే ప్రయత్నిస్తున్నట్టు అనిపించసాగింది.

రాజమండ్రి స్టేషనులో మెయిలు ఆగేసరికి సాయంకాలం అయిదూ నలభైఅయిదు అయింది.

అదివరకల్లా అంత తొందరపడిన మనిషి, రైలు, స్టేషనును విడిచిపెట్టేవరకూ (సుమారు ఇరవైనిమిషాల కాలం) ప్లాటుఫారంమీదనే గడిపాడు. చిట్టచివరి క్షణంలో మళ్ళీ రైల్లోకి ఎక్కిపోవాలనిపించింది. కాని, తన అనిశ్చితత్వానికి విసుక్కొని, హోల్డాలు కూలీనెత్తిమీద పెట్టి, దూరప్రయాణపు టిక్కెట్టు కావడంవల్ల మధ్యలో ఒక రోజు ఆగే సావకాశాన్ని వినియోగించుకొని బైటపడ్డాడు.

సైకిలురిక్షాలో కూర్చొని తిన్నగా హోటలుకి తీసుకొని వెళ్ళమన్నాడు.

బస అని గది తీసుకోకపోయినా హోల్డాలు హోటలువారికే అప్పజెప్పి, వెనుకటి రోజుల్లో అతి పరిచయమయిన ఇన్నీసుపేట వీధుల్లో నడక సాగించాడు.

అప్పటికీ ఇంకా చిన్న సందేహం పుట్టింది— వాడు పోర్టునుంచి వచ్చినా క్లబ్బులో, మరెటో వెళ్ళి ఉంటాడేమో? వాడులేని సమయంలో వెళ్ళేకంటె ఉన్నప్పుడు వెళ్ళడమే నయం. అందాకా కాస్తసేపు గోదావరి ఒడ్డున కూర్చోడం బాగుంటుంది—ప్రయాణపు బడలిక తగ్గుతుంది—అనుకొని, మరొక సిగరెట్టు ముట్టించి బయలుదేరాడు. ఈమధ్యకాలంలో రైలులోంచి వెళ్ళిపోతూ నదిని చూడ్డమేగాని, గోదావరి ఒడ్డున కూర్చోడం జరగలేదు— రేపు ఉదయం తప్పకుండా స్నానం చెయ్యాలి...అస్తమయ సమయారుణ తరణి కిరణ శోభను ప్రతిఫలింపజేస్తూ ప్రకాశిస్తూ సాగిపోయే గోదావరి దృశ్యం, తాను చిత్రకారుడు కాకపోయినందుకు, ఇదివరకెన్నిమార్లలాగానో, మనసుకు నొప్పి కలిగించింది.

సిగరెట్టువెంట సిగరెట్టు కాల్చడంతో సిగరెట్లమీద కలిగిన అరుచి, విసుగుదలా తన సంకోచంమీదికి.

కూడా వ్యాపించాయి—మెయిల్లో దిగిన వాడిని ఇప్పటివరకూ ఏం చేస్తున్నావంటే ఏమని సమాధానం చెప్పడం?

ఇంకా సగమయినా కాలని సిగరెట్టును బలంగా విసిరేడు—అది నీళ్ళవరకూ వెళ్ళలేదు; మధ్యలో రాతిమెట్ల మీద నే పడింది.

ఈ మారు మరే సంకోచం లేకుండా కొంచెం తొందరగా వెళ్ళేడు—అప్పటికింకా ఏడుంపావు కంటె ఎక్కువ కాకపోయినా, మీదినుండి పడే వెన్నెల వెలుగులో వెలవెలబారే ఎలక్ట్రిక్ దీపాల ప్రభావంవల్ల ఎంతో రాత్రయినట్టనిపించింది.

ముందున్న క్రగేటు ఎప్పటి మాదిరిగా నే దగ్గరగా వేసుకొని ఉంది కుడిచేతితట్టు గదిలో లైటుంది—అది వాడి ఆఫీసుగది—బహుశః వాడు ఉంటే ఉండవచ్చును—లేకపోయినా...

తన ఆలోచన పూర్తి కాకుండా నే మెట్లను సమీపించి, "రాజేశ్వర్రావ్! రాజేశ్వర్రావ్!" అని రెండు మార్లు పిలిచాడు.

గదిలోనుండి వినిపించింది అరుంధతి గొంతు... "ఎవరూ, మీరా? ఎన్నాళ్లికి వచ్చేరు? రండి:" ఈ మాటలను అంటూ ఆమె గుమ్మంలోనికివచ్చింది పక్క తలుపు తెరచుకొని.

మెట్లెక్కుతూ ప్రశ్నించాడు. "వీడింకా క్లబ్బునుండి రాలేదా?" అని.

ఆమె అతని మాటకు సమాధానం చెప్పకుండా, "ఎప్పుడు వచ్చారు? సామానదీ ఏమీ లేదా?" అని అడిగింది.

"ఇందాకా మెయిల్లో దిగేను—మళ్ళీ రాత్రి బండికే వెళ్లిపోవాలి. అందుకని హోల్డాలు స్టేషను లోనే విడిచి పెట్టేను. దార్లో ఎవళ్ళో కనిపిస్తే మాట లాడుతూ ఉండడంవల్ల ఆలస్యం అయిపోయింది."

"పోనీండి, అలాగే రైలుకి తిరిగివెళ్ళి పోకుండా ఇలా వచ్చేరు—కూర్చోండి. మంచినీళ్ళు తెస్తాను. కాఫీకూడా ఫ్లాస్కులో ఉంది."

"మంచినీళ్లుమాత్రం—ఇయ్యండి. కాఫీ వాడు వచ్చేక నే తాగుతాము ఇద్దరం కలిసి."

"ఆయనకోసం ఎదురు చూడనక్కర లేదు లెండి" అంటూ ఆమె లోనికి వెళ్లిపోయింది.

ఆగది, ఆ పరిసరాలూ చూస్తూఉంటే వాటన్నిటినీ తాను విడిచిపెట్టి వెళ్లిపోలేదన్నట్టే అనిపించింది. తనవయసుకూడా కొన్ని సంవత్సరాలు వెనక్కు జరిగినట్టు తోచింది.

కాఫీ పట్టుకొని వస్తూ ఆమె అడిగింది—"మీ రొక్కరే వచ్చారే, కుటుంబం అంతటినీ తీసుకొని వచ్చిఉంటే బాగుండును కదా?" అంది—మరొక ళ్లయితే మీకు పెళ్ళి అయిందా? ఎందరు పిల్లలు? అని అడిగిఉండేవారు. ఆమె ప్రశ్నకు సమాధానం చెప్పక తప్పలేదు. "కుటుంబం అంటే నేనూ మా శ్రీమతి శారదా మాత్రమే, ఇంకా పిల్లలు లేరు" అని చెప్పుకోవలసి వచ్చింది.

"కాఫీలో మీకు కావాలని కొంచెం ఎక్కువగా పంచదార కలిపాను. ఈ మధ్యనుగాని పద్ధతి మారలేదు కదా?"

"ఇటీవల నేను మాయింట్లో తాగే కాఫీ అనే పదార్థాన్ని ఇతరు లేమంటారో తెలీదు. పాల స్వచ్ఛ మయిన తెల్లనిరంగు తగ్గడానికి మాత్రమే ఒక చిటికెడు కాఫీ పొడుము వేసిన పానీయం అది, కాకపోతే పానకం అనుకోవచ్చును."

మొదట్లో మీరే ఆవిడకు ఆవిధంగా అలవాటు చేసిఉంటారు. ఇప్పుడు మీరే తప్పులెన్నుతున్నారు."

"తప్పు అని కాదు, గాని, ఆవిడ ఇచ్చే కాఫీకే అలవాటుపడి బాగుందనడం తప్పని సరికదా!"

"అదీ కొంతవరకు నయమే—తాము కావాలన్న ప్రకారమే చేసినా భార్యల చేతలను వంటనూ ఆడిపోసుకొనే మగవాళ్లకంటె మేలు.

"అటువంటి భర్తలుంటారనేది మీకు ప్రత్యక్షానుభవం కాదుకదా? మావాడు మీ రెంతంటే అంతే అన్నట్లోనూ. లేక ఇటీవల ఏమయినా మారిపోయాడా?..ఇటువంటి అంతరంగిక విషయం ప్రశ్నించ కూడనిదేగాని, వెనకటి చనవువలన అప్రయత్నంగా వచ్చేసింది. మీ కిష్టంలేకపోతే సమాధానం చెప్పకండి..."

"ఎందుకు సంకోచిస్తున్నారు? సిగరెట్టుకాల్చుకొందికేనా? నాకేం అభ్యంతరం లేదు. కాల్చుకొండి. కాని, మీకు ఇప్పటికీ చీటికీ మాటికీ ప్రతి చిన్నవిషయానికీ అనుకోకుండా అబద్ధం చెప్పే దురలవాటు పోలేదన్నమాట?"

"అలవాట్లు పుడకలతోగాని పోయేవికావు అంటే గాని, ఇప్పుడు నేను మీతో ఏ విషయంలో అబద్ధం చెప్పానో నాకే తెలియకుండా ఉందే—ఏ విషయంలో...

"చెప్పనా? మీరు మెయిలుదిగి, ఇటు వస్తూ దార్లో ఎవరో స్నేహితులతో మాట్లాడుతూ నిలబడి పోయేరన్నది శుద్ధ అబద్ధం—అసలు మా యింటికి రావటమా మానటమా అన్న సంకోచంతో ఊరంతా చాంద్రాయణం చేస్తూ ఉండిఉంటారు ఒంటరిగా—

"ఊరంతా తిరగటం మాత్రం కాదుగాని, గోదావరి ఒడ్డున కూర్చుండిపోయేను—మీరు నన్ను ఈమాత్రం ఆదరంగా పలకరించి ఆతిథ్య మిస్తారనుకో లేదు—వాడితో కాస్తసేపు మాట్లాడి ఏ హోటలుకో పోయి భోంచెయ్యవలసి వస్తుందేమోననికూడా అనుకొన్నాను.

"ఆ ఉద్దేశంతో నే హోల్డాలు కూడా తేలేదన్న మాట?" మీ రిలా కూర్చొని ఈ పత్రికలూ అవీ చూస్తూ ఉండండి. నేను వెళ్ళి భోజన ప్రయత్నం చేస్తాను."

"నా గురించి విశేషంగా ఏమీ చెయ్యనక్కర లేదు. వాడితో పంక్తిని కూర్చోడానికే తప్ప, దారిలో అడ్డమైన ఫలహారాలూ చెయ్యటంవల్ల ఇప్పు డేమీ ఆకలి కావటం లేదు. వీ డింకా రాలేడేం చెప్మా? వచ్చేసరికి మరొకగంట పడుతుందంటే నేనూ క్లబ్బు వంకకు ఒకమారు వెళ్ళివస్తాను.

"ఈ రాత్రికి మీ రొక్కరూ భోంచెయ్య వలసిందే."

"ఏమిటి, వీడుగాని ఊళ్లో లేడా? నేను..."

"మరేం భయపడకండి మిమ్మల్ని నే నిక్కడ కట్టిఉంచను—రాత్రి జనతాలో కదూ మీరు వెళ్ళా లనుకొంటున్నది. నేనూ రాత్రి ఇటు వెళ్ళే బండికి వెళ్తున్నాను. నాకు సాయంగా ఉంటారు రైలెక్కే వరకూ."

"ఓ, అలాగే, అంతకంటేనా? అంటే ఇద్దరూ కలిసి తిరిగి వస్తారన్నమాట? ఇన్నాళ్ళకి వచ్చి వాణ్ణి చూడ్డంఅయిందికాదు, మిమ్మల్ని అయినా చూడగలి గాను. ఇదే రేపో ఎల్లుండో వచ్చి ఉంటే మరీ అశా భంగమయేది."

"అసలు బ్రతకడమే ఒక పెద్ద ఆశాభంగం" అంటు ఆమె లోనికి వెళ్ళిపోయింది.

ఇటువంటిమాట ఈవిడ నోటి వెంట రావడాని కి కారణం ఏమయి ఉంటుందా అన్న ఆలోచన అట్టే సేపు నిలవలేదు సుబ్రహ్మణ్యం మనస్సులో...పర ధ్యానంగా ఏవో పత్రికలు తిరగవెయ్యటం కూడా కొంచెంసేపే సాగింది—కుర్చీలో నే వెనక్కు చేరగిల బడి నిద్రపోసాగాడు.

మెలకువ వచ్చేసరికి పదింపావయింది. ఎదురుగా ఆమె కుర్చీలో కూర్చొని చదువుకొంటూంది.

"మిమ్మల్ని లేపి మీ నిద్ర పాడుచెయ్యా లనుకోలేదు. కాని, భోజనానికి మరీ ఆలస్యం అవు తుందని పదింపావుకి అలారం పెట్టేను" అంది పుస్తకం లోకి చూస్తూ.

చాలా మంచి పని చేసేరు. ఇంకా ఆలస్యమయితే మీకు మరీ శ్రమ. అయినా నిజానికి ఇప్పుడేమీ భోంచెయ్యాలని లేదు."

"ఎంత తినాలని ఉంటే అంతే తినవచ్చును—స్నానం చేస్తారా? బాత్ రూములో వేణ్ణీళ్ళూ సబ్బూ అన్నీ ఉన్నాయి. ఇందాకా నేను చూసేసరికి వేడి గానే ఉన్నాయి. ఇప్పటికి వేడి తగ్గిపోయినా మరీ చల్లబడి ఉండవు."

స్నానం చేసేసరికి నిద్రబద్ధకం కొంత తగ్గింది. భోంచేస్తూ ఉండగా రాజేశ్వర్రావు ప్రాక్టీసు గురించి, ప్రస్తుతపు సరదాలగురించీ ఇంకా ఎన్నెన్నో విష యాలు అడగా లనిపించిందిగాని, ఆమె సందివ్వలేదు.

జరిగిన సంభాషణ అంతా కూరలగురించీ ఊర గాయల గురించీ మాత్రమే.

భోంచేసి వచ్చేసరికల్లా వీధిగుమ్మంలో తనకని వెయ్యబడ్డ పక్క చూపించింది. మీకు బాగా నిద్ర వస్తున్నట్టుంది. పడుకోండి; రైలు వేళకు నేను లేపుతాను" అంది.

"సరేగాని, అక్కడ నా బెడ్డింగు భద్రంగా ఉందో లేదో, వెళ్ళి తెచ్చేసుకొంటే అప్పుడు తాప త్రయ పడవలసిన అవసరం ఉండదు.

అలాగే వెళ్ళిరండి; గాని, ఈ వెళ్ళడం ఇలాగే వెళ్ళిపోరుకదా?

"ఎంతమాట? మీరు రాత్రి ప్రయాణం అవుతున్నారుకదా? రైలెక్కించే వరకూ మీకు తోడుగా ఉంటాను."

దగ్గరలో నేఉన్న హోటల్లోని బెడ్డింగు తెచ్చుకోడానికి ఎక్కువ ఆలస్యం కాదుకదా అని దారిలో ఒక కిల్లీ దుకాణం దగ్గర ఒక సిగరెట్టు కాల్చుకొని, తిరిగి వచ్చేడు.

ఆవిడ అంతవరకూ తలుపు తెరిచే ఉంచింది. "బెడ్డింగు విడిగా ఇవతల ఉండడం ఎందుకు?" అని లోపల ఉంచి, మంచి నీళ్లించి, లోపల గడియ వేసుకొంది.

పడుకోడమే తడవుగా సుబ్రహ్మణ్యానికి నిద్ర పట్టి పోయింది.

అతనికి మెలకువవచ్చి చెయ్యవలసిన పనంతా ఆమె తెప్పించి ఉంచిన రెండు రిక్షాల్లో ఒకదానిలో కూర్చోడమే.

"మీకు నేను సాయంగా ఉండాలనుకొన్నాను—ఆఖరికి రిక్షా తెచ్చే పని కూడా నావల్ల నయింది కాదు.

"ఇంతలో నే నేం కష్టపడలేదులెండి ఈ దారిని వెళ్తూన్న ఒక రిక్షా మనిషితో చెప్తే అతను రెండవ మనిషిని కూడా తీసుకొని వచ్చేడు—

ఆమెకు సెకెండు క్లాసు టిక్కట్టు వాల్తేరుకి కొన్నాడు—

ఆమె ఎక్కవలసినబండీ ముందు వచ్చింది.

బండిలో కిటికీ దగ్గరగా ఆమె కూర్చుంది. అతను క్రిందను నిలబడి ఉన్నాడు.

ఆమె అడిగింది! "ఇందాకటినుండి అడగాలనుకొని అడగలేక పోతున్నాను—ఇక మరి మనం ఎన్నటికీ తిరిగి కలుసుకోక పోవచ్చును— అప్పుడు మీరు నా ముందు ఎందుకలా వికారంగా ప్రవర్తించారు—తరవాత నాకంతా తెలిసింది లెండి" అని మొగం అవతలి పక్కకు తిప్పుకొంది.

"తెలిస్తే మరి నే నెందుకు చెప్పడం? నా లో స్నేహితుడి మనోవాంఛితం నెరవేరుస్తున్నా ననే తృప్తో, మీకు తగిన భర్తను కాలే నేమోనన్న భయమో, లేక రెండూనో, నా చేత అలా నాటకం ఆడింపజేశాయి ఏమయితే నేం, నాకిదే సంతోషం—నేను ఎలాగోలాగు బండి లాగించేస్తాను—మీ రిద్దరూ సుఖంగా హాయిగా"...

"ఆ మాట మరి అనకండి" ఈ మాట చీర చెరుగులో మొగం కప్పుకొని ఆమె అంది—ఆయన పోయి రెండు నెలలయింది సరిగా ఇవాళకు—ప్రమాదమో, ఆత్మహత్యో తెలియని జలగండం"—

"ఆఁ ఆఁ ఆఁ ఏమిటే, నా చెవులను నేనే నమ్మలేక పోతున్నాను."

"కాని, ఏం చేస్తాం నమ్మక తప్పదు—ఆయనకి ఎప్పుడూ ఏదో విషమయిన వెలితో అసంతృప్తో లోపల్లోపల మెదుల్తూన్నట్టుండేది"—

"కాని, మీరు...ఇంతసేపూ ఎందుకు చెప్పలేదూ'

"అసలు చెప్పకూడద నే అనుకొన్నాను—కాని, చివరికి ఉండలేకపోయాను కానీండి, ఏం చేస్తాం, కొన్ని నాటకాలు మనం ఊహించని విధంగా అంతమవుతూ ఉంటాయి—అదుగో రైలు కూసింది—మీరు కోరదలచినట్లుగా, నేను కోరుకొంటున్నాను—మీ జీవితం సౌఖ్యవంతంగా సాగిపోవాలని"—

కదుల్తూన్న రయిలుతో కలిసి నడుస్తూ, "నేను చేసిన త్యాగం ఇటువంటి విపరీత ఫలితం ఇస్తుందని తెలిసి ఉంటే..."

అతని వాక్యం మరి పూర్తి కాలేదు—ఆమె కళ్ళతో నే కాదు, చేతులతోనూ నమస్కరించింది.

# గ్రీకు భారతీయ రూపకములు

శ్రీ యస్వీ జోగారావు

చాలకాలమునుండి సంస్కృత సారస్వతము ద్వారా భారతీయ సంస్కృతిగూర్చి పరిశోధనలు జరిపి, తదితరప్రసిద్ధ దేశీయ సంస్కృతులతో సరిపోల్చి వాని పౌర్వాపర్యాదికవిచారణ మొనర్చుట పాశ్చాత్యపండితుల కొక పరిపాటియైనది. ఆ పండితులకృషి అనర్ఘమైనది. మనకు మనమే మరచిపోయిన మన ప్రాచీన సంస్కృతీ మహనీయతను మహత్తర పరిశోధనల మూలమున గ్రహించి లోకప్రకాశ మొనర్చిన మహానుభావులు వారు. కాని వారి పరిశోధనలలో పొరపొచ్చెము లటనట లేకపోలేదు. భారతీయ నాటక కళోత్పత్తి విషయమై అది గ్రీకు నాటకములనుండి యుత్పన్నమైనదను వీబరుదొర అభిప్రాయ మట్టిదే. అలెగ్జాండరు దండయాత్రల కాలము (క్రీ. పూ. 4 వ శతాబ్ది) నుండి భారత గ్రీకు దేశములకు సాంస్కృతిక సంబంధము లనేక మేర్పడినమాట వాస్తవము. ఇందులకు అలెగ్జాండరు సేనాపతియగు సెల్యూకస్‌తో మన చంద్రగుప్తమౌర్యుని సంబంధబాంధవ్యములు, చంద్రగుప్తునాస్థానమున నుండిన గ్రీకు రాయబారియగు మెగస్తనీస్ వ్రాతలు, భారతీయ విజ్ఞానార్జనార్థులై పైథాగరస్, అపొల్లోనియస్ ప్రభృతులు గ్రీకుపండితులు జరిపిన రాకపోకలు మొదలగునవి తార్కాణములు కాగలవు. గణితశాస్త్ర తత్త్వశాస్త్రాదిక విషయములందు భారతీయులు గ్రీకులకును, ఖగోళశాస్త్రము, విగ్రహారాధన సంప్రదాయము మొదలగు విషయములందు గ్రీకులు భారతీయులకును అనుకార్యులైనట్లు తెలియుచున్నది. ఇట్లే యింకను మరి కొన్నివిషయములందును ఇరువాయముల పరస్పరసంబంధము కొంత యుండియుండవచ్చును. కాని నాట్యకళావిషయమున మాత్రము గ్రీకు భారత విజ్ఞానములు పరస్పర నిరపేక్షములు. వీబరుదొర సిద్ధాంతము భ్రాంతిమూలకము. అసలట్టి భ్రాంతికి మూలములైన విషయము లేవి యనగా:

1. ప్రాచీనకాలమున గ్రీసుదేశమే యావత్ ప్రపంచవిజ్ఞానమునకును ప్రసారకేంద్రమను వెనుకటి పాశ్చాత్యపండితుల భావన.

2. అలెగ్జాండరు దండయాత్రల ఫలితముగా గ్రీకులతో భారతీయులకు సాంస్కృతికసంబంధము లేర్పడుట.

3. అప్పటికి భారతదేశమున నాట్యశాస్త్ర నిర్మాణ సన్నాహములు మాత్రమే జరుగుచుండుట, గ్రీసుదేశమున నాట్యకళ కప్పటికే ప్రచురప్రచార మేర్పడియుండుట.

4. 'అయోనియా' అనునది గ్రీసుదేశ నామాంతరమనియు, భారతీయులు జాతివాచకముగా వాడు 'యవన' శబ్దము తద్భవమే యనియు, ఆ యవన సంబంధమువలన భారతీయ నాటక ప్రదర్శనములలో తెరఎరవు తెచ్చుకొనబడి యుండుననియు, అందులకే అది భారతీయులచే 'యవనిక' అని వ్యవహృతమైనదనియు ననుట.

ఇందుకు తగిన సమాధానము గలదు. గ్రీసు దేశమునకు మహోజ్జ్వలమైన ప్రాచీన సంస్కృతీ ప్రాభవము గల్గియుండును గాక. తదితర పాశ్చాత్యదేశములపై దాని ప్రభావ మతిమాత్రముగా నుండియుండును గాక. అంతమాత్రమున యావత్ప్రపంచమునకును అదే విజ్ఞానభిక్ష పెట్టినదని తలంపరాదు. ప్రాచీనసంస్కృతి ప్రతిష్ఠల విషయమై దానితో సమానప్రతిపత్తిగల దేశములున్నవి—ఇండియా, చైనా, ఇరాక్. అందు భారతదేశ సంస్కృతి ప్రతిష్ఠలు మరియు ప్రాచీనముగ అనగా వేదకాలమునకు ప్రాకగలవు. భారతదేశచరిత్ర పూర్తిగా తెలియని రోజులలో ఆ తెలియమివల్లనో లేక గ్రీకుసంస్కృతి యందలి అంధప్రాయమైన విశ్వాసముచేతనో లేక మరేయహంభావముచేతనో వెనుకటి పాశ్చాత్యపండితులు కొందరు గ్రీకు సంస్కృతియే లోకైకప్రాభవోపేతమైనదని కొన్ని అపోహలు గల్గియుండెడివారు. అట్లే అలె

గ్జాండరు దండయాత్రల ఫలితముగా ఏర్పడిన సాంస్కృతిక సంబంధములలో నాట్యకళావిషయము నొకటి యను నూహకును ఆధారము కానరాదు. ఆధారము మాట యటుండ ఈనాడుపలబ్ధములగు ఆనాటి గ్రీకు భారత నాటకగ్రంథముల రచనా ప్రక్రియలలో గాని సంప్రదాయములలో గాని తగిన సాదృశ్యము గానరాదు. విశేషభేదము గలదు. ఆ విషయము ముందు ప్రపంచింపబడును.

ఇక 'యవనిక' శబ్ద విషయము అది మరియొక అపోహ. భారతీయు లన్యజాతీయుల ననేకులను యవన శబ్దముతోడనే వ్యవహరింతురు. అదికాక, గ్రీకు నాటకప్రదర్శనములలో నే చాలకాలమువరకు తెర వాడకమే యుండెడిది కాదట. అందుచే ఆనాడు మన దేశముతో వస్త్రవ్యాపారాదులు సాగించుచుండిన యే అరేబియా పారశీకాది దేశములనుండియో మనవా రట్టి తెర కనువైన వస్త్రమును మాత్రము గ్రహించి తత్రాపి దానికి 'యవనిక' అని నామకరణము చేసియుందురు.

గ్రీకు భారత రూపకభేదాభేదముల నరయుటకుముందు గ్రీసు దేశీయ నాటక చరిత్రమును గొంత పరామర్శించుట లెస్స.

అతి ప్రాచీనకాలమునుండియు గ్రీసుదేశీయులు ద్రాక్షపంటలకాలమందు వసంతోత్సవములు జరుపుకొనుచుండెడివారు. ఆ యుత్సవములకు మదిరాప్రభువగు 'డయోనిసస్' (Dionysus) అధిష్ఠానదైవతము. డయోనిసస్ కీర్తిని గానము చేయుటకే 'డితీరాంబ్' (Dithy ramb) అని పేరు.

("The Dithy ramb was an elaborate choral ode sung and performed by a trained chorus of fifty, the song itself having a direct bearing upon the central religious orientation of the whole festival and its connection with the god, Dionysus.") ఆ యుత్సవములలో మేషబలిగూడ గావింపబడుచుండెడిది. అనగా నిది దైవప్రీత్యర్థమును, మత విషయికము నైన యొక జాతర. అదే గ్రీసు నాటక కళా ప్రాథమిక స్వరూపము.

తరువాత బయలుదేరినవి ట్రాజెడీ కామెడీలు (విషాదాంత మోదాంత నాటకములు).

ఆనాటి గ్రీకు ట్రాజెడీ. అనగా ("Funeral performance at the grave of a warrior" అని Prof. Ridgeway) ఒక మృతయోధుని సమాధికడ జరుపబడు అపరకర్మకలాపమని యర్థము కాని రాను రాను ట్రాజెడీ ఒక రూపకప్రక్రియగా పరిణమించినది. క్రీ. పూ. 536-లో థెస్పిస్ (Thespis) అనునాతడు ట్రాజెడీ రచన కంకురార్పణ గావించినట్లు తెలియుచున్నది ఐస్కిలస్ (Aeschylus), సాఫాక్లిస్ (Sophocles) యూరిపిడీస్ (Euripides) అనువారొక్క శతాబ్దమున (B. C 499-405) మూడువందల ట్రాజెడీ గ్రంథములు రచించిరట. లక్ష్యకోశమునుబట్టి వారి ట్రాజెడీ రచనాప్రక్రియలో నాలుగంతిస్థులు గలవు: 1 Prologue (ప్రస్తావన), 2. Parados (Chorus-బృందగానము), 3 Episode (అంకము లేక రంగము వంటిది), 4. Exodus (చరమాంకము). ఆనాటి యా గ్రీకు ట్రాజెడీ కొక విశిష్టలక్షణప్రక్రియ నేర్పరచినవాడు అరిస్టాటిలు. అతని గ్రంథమే రాను రాను కడను పాశ్చాత్యదేశ రూపకరచనాప్రయత్నములకెల్ల ప్రమాణగ్రంథమైనది.

గ్రీసుదేశమున కామెడీ క్రీ. పూ. 5-వ శతాబ్దిలో నే బయలుదేరియున్నను, దానికిగూడ ట్రాజెడీ లక్షణములు కొన్ని పట్టియున్నను, నాడు ట్రాజెడీకున్న ప్రచురప్రచారము కారణముగా కామెడీ కంతప్రత్యేక వ్యక్తిత్వము లేకుండబోయినది. తదుపరి అరిస్టోఫేన్సు (Aristophanes) మొదలగు సమర్థరచయితల చేతిలో పడి పరిణతమైనది. క్రీ. పూ. 340 నాటికి గ్రీకు కామెడీలో బృందగానప్రాముఖ్యము, అంతకుముందుండిన ఫాలాస్ (Phaleas) అను పురుష చిహ్నమైన లింగధారణాచారముగూడ పరిత్యజింపబడినవి. పారాబాసిస్ (Parabasis) అను పేర, నాటకమధ్యమున సాగుచుండిన నాటి రాజకీయవిషయములను గూర్చిన విమర్శకూడా చట్టముద్వారా నిషేధింపబడినది. పల్లెపట్టులందు డయోనిసస్ ఉత్సవసందర్భములలో 'కోమస్' (Commus-Lyrical passage), 'గామస్' (Gamos-Union of Sexes), మధుపానము, హాస్యప్రలాపములు, పశుపక్ష్యాది వేషములు మొదలగు వానితో ప్రారంభమైన కామెడీ గ్రీసు రాజధానియగు ఏథెన్సు నగరమునకును ఎగబ్రాకి నాటి నాటకపు పోటీలలో ట్రాజెడీకి ప్రతిస్పర్థియై నిలచినది. ఇట్టి

పోటీలనుగూర్చి అరిస్టోఫేనస్ వ్రాసిన 'ది ఫ్రాగ్స్' (The Frogs)లో హాస్యరసోల్బణమైన విమర్శ గలదు అందు డయోనిసస్సే కథానాయకుడు. గతించిన నాటక గ్రంథకర్తలు ఐస్కిలస్ యూరిపిడీస్సులే పోటీదారులు. (ఇట్టి రచనావిధానము భారతీయ రూపకములం దెచ్చటను గానరాదు).

ఇట్టి చరిత్ర, లక్షణ ప్రక్రియయుగల గ్రీకు రూపకమునకు భారతీయ రూపకము బహుధా విప్రతిపన్నము ఎట్లనగా :—

1. ప్రాచీనత: నాటకకళా విషయమున గ్రీకులకు అరిస్టాటి లెట్టివాడో, భారతీయులకు భరతాచార్యు డట్టివాడు. అతని నాట్యశాస్త్రమే భారతదేశమందంతట పరమప్రమాణగ్రంథము. నాట్యశాస్త్ర రచనాకాలము క్రీ. పూ. 2 వ శతాబ్ద ప్రాంతముగా శ్రీ హరప్రసాదశాస్త్రి, శ్రీ కాణే పండితుడు మొ॥ వారిచే ఊహింపబడుచున్నది. అట్టిచో అరిస్టాటిలుకంటె భరతాచార్యుడు సుమారు రెండు శతాబ్దు లర్వాచీను డగుచున్నాడు. భరతాచార్యునకు పూర్వమే మనకు కొన్ని నాట్యశాస్త్రగ్రంథము లుండినవని భరత గ్రంథమువలననే తెలియనగును. భారతీయ రూపక స్వరూపమును బహు లక్ష్యములతో మహోదాత్తముగా నిరూపించిన, భాసమహాకవి భరతాచార్యునకు పూర్వుడుగా చాలమంది పండితులచే తలంపబడుచున్నాడు. మన పురాతత్త్వశాస్త్రపరిశోధకులకు ఛోటా నాగపూరులోని రామఘుర్ గిరిగహ్వరములలో సింధులోయలోని హరప్పా మొహంజొదారోల కడ లభించిన ఆధారములనుబట్టి క్రీ. పూ. 2, 3 శతాబ్దులకే విశిష్టములైన నాటకశాలలు మనదేశమున వెలసియుండినట్లు తెలియుచున్నది. వాల్మీకి రామాయణమున వధూనాటక ప్రసక్తి, పతంజలి మహాభాష్యమున (క్రీ. పూ. 2 వ శ.) కంసవధము, బలిబంధనము అను నాటకముల ప్రసక్తి, పాణినీయమున (క్రీ. పూ. 6 వ శ.) గూడ రూపకోపస్థితిగురించి కొన్ని సూచనలుడు గన్పట్టుచున్నవి. అనగా మన నాటకకళా చరిత్ర యింకెంత ప్రాచీనమైనదో! అస లతి సనాతనములైన మన వేదములందే ఉదాహరణకు ఋగ్వేదమున యమ యమీ - ఊర్వశీ పురూరవుల సంవాద సందర్భములందు భారతీయ నాటక కళాబీజములు నిక్షిప్తములై యున్నవని పాశ్చాత్యపండితులే కొంద రంగీకరించిరి. అట్టిచో గ్రీకులమండి భారతీయులు నాటకకళ నభ్యసించిరనుట హాస్యాస్పదము. నాటకకళాభిరుచి యన్నది ప్రతి నాగరకజాతికిని అతిసహజమైన విషయము. (ప్రత్యేకముగా నేవో మత విశ్వాస విహితములైన నిషేధములు గాని లేకున్నచో) ఏనాటి నాగరకత మనది!

2 ఆదర్శము-ప్రయోజనము : గ్రీకు నాటకము దేవతాతృప్తి, కథావశేషుడైన యొక మహావ్యక్తిని పూజించుట అనునవి పరమప్రయోజనములుగా గలది. 'విశ్రాంతి జననం కాలే నాట్య మేత న్మయా కృతమ్' అని మన భరతోక్తి. అనగా మన రూపకలక్ష్యము 'రిక్రియేషన్' (Recreation). అట్లని మన నాటకేతివృత్తములు అల్లిబిల్లికథలు గావు. అవి మహోదాత్తములైనవి. ధర్మపథనిర్దేశముతో కళాధర్మసౌభాగ్యము సూచముట్టుగా సాధించునట్టివి మన నాటకములు. శిల్పదృష్టితో జూచిన సాహిత్యమున శిఖరతుల్యమైన ప్రక్రియగా భారతీయులకే పరిగణింపబడుచున్నది నాటకము.

3. విషాదాంతములు: ప్రాచీన గ్రీకు నాటకములందు విషాదాంతము లెక్కువ. ధర్మాధర్మసంఘర్షణము పెట్టి మానవ మనోమర్మములను నిరూపించి ధర్మాచరణ పథమునందు గల ఆటంకములవలని భయమును పోగొట్టి ధైర్యమును పురిగొల్పుటయే గ్రీకు విషాదాంతనాటకముల పరమార్థము. 'నాఽశ్లీలం కీర్తయేత్', 'నాఽధికారి వధం కదాపి సూచయేత్', అను శాంతితత్త్వప్రవణమగు భారతజాతిసంస్కృతికి విషాదాంతములు సొక్కవు. కావ్యవిషయమున 'మంగళాదీని మంగళమధ్యాని, మంగళాంతాని' అని భారతీయాదర్శము. పతంజలి మహాభాష్యమున పేర్కొనబడిన కంసవధము, బలిబంధము, భాసుని ఊరుభంగము మొదలగునవి విషాదాంతము లందురు కొందరు; కాని నాటకాంతమున సామాజికనిష్టముగా విషాదము మిగిలిననే అది విషాదాంత మగును; ఈ దృష్టితో జూచిన కంసవధాలు వధ ప్రసక్తమైనంత మాత్రమున విషాదాంతములు కాజాలవు అట నాయకునితో సామాజికునకు సానుభూతి లేదు.

4. ప్రస్తావన: గ్రీకు నాటకములలో పంద్రెండుగురుగాని యిరువదినలుగురుగాని యుండెడి నాయకమండలిచే రూపకప్రస్తావన జరుగును. మన నాటకములలో నటీ సూత్రధార పారిపార్శ్వకులచే ప్రస్తావన ప్రవర్తితమగును. మనకు నాందీ - ప్రస్తావనలకు

ముందు పూర్వరంగవిధులు ప్రత్యేకముగా గలవు (చూ. నాట్యశాస్త్రము-పంచమాధ్యాయము).

5. పాత్రలు: మన విదూషకునివంటి పాత్ర గ్రీకు నాటకములలో గానరాదు ప్రోఫెట్స్ (Prophets) ఆరకిల్స్ (Oracles) మొదలగు వారు గ్రీకు నాటక ప్రత్యేకపాత్రలు.

6. పారాబాసిస్ (Parabases): గ్రీకు నాటకములలో పారాబాసిస్ (Parabases) అను పేర గాయకబృంద నాయకుడు (ఒకప్పుడు నాటకకర్తయే కావచ్చును) నాటకమధ్యమున నాటి రాజకీయ నైతిక విధానములను విమర్శించుట జరుగును. భారతీయ నాటకములలో కవి నామాదులకు మాత్రమే అదియు ప్రస్తావనలోనే ప్రసక్తిగల్గును గాని కవికి గాని, కవి యనుచరులకు గాని రంగమధ్యమున ప్రవేశము లేదు.

7. రంగము: గావ్రాపుగల ఏథెన్సునగరమున దప్ప గ్రీకు నాటకములు సాధారణముగా పల్లెటూళ్ళ ఆరుబయళ్ళ నాడబడుచుండెడివి. భారతీయ నాటకరంగము ఆకార పరిమాణ ప్రసాధనాది సర్వవిషయములందును అతి విశిష్టమైనది. ఇందులకు భరతుని నాట్యశాస్త్రమే ప్రమాణము. (చూ. నా. శా. ద్వితీయాధ్యాయము)

8 లక్షణ ప్రక్రియ: గ్రీకు నాటక లక్షణమునకు అరిస్టాటిల్ గ్రంథమును, మన నాటక లక్షణమునకు భరతుని నాట్యశాస్త్రమును గదా ప్రమాణగ్రంథములు. ఆ ఉభయగ్రంథముల నుక్తమైన నాటకలక్షణములకు పోలిక లెవ్వియు గానరావు. దానికి కారణము అరిస్టాటిలు విషాదాంతమును, భరతుడు శుభాంతమును మాత్రమే ఉద్దేశించియుండుట యని కొందరందురు. కాని శుభాశుభాంతములలో వేమున్నది—అవధ్యశేషముతప్ప. అరిస్టాటిలు చెప్పిన లక్షణములు కొంతవరకు శుభాంతములకును సరిపోవును. అట్లే భరత లక్షణమును.

(a) అనుకరణ వాదము: అభేదవాదుల మతమున మన 'అవస్థానుకృతి ర్నాట్యమ్' అను సూత్రమున కర్థము అరిస్టాటిల్ చెప్పిన 'Mimesis' (అనుకరణ) అట! కేవలార్థమున గాదు.

అరిస్టాటిలు చెప్పిన అనుకరణవాదమునుగురించి డబ్ల్యు. జె. ఓట్సు పండితు డిట్లు వ్యాఖ్యానించియున్నాడు:

'In saying that the artist 'imitates' his models, Aristotle does not use the word in its primary sense of 'copying' but rather is seeking to give a secondary meaning to the term By the word he seems to mean the process which takes place when an artist creates his work of art. It is through mimesis that form comes to be imposed upon the artist's material, broadly conceived."

ఆ అనుకృతియన్నది పునః త్రిధా విభాజ్యము:

1. Medium of imitation (Diction and song)

2 Manner of imitation (Spectacle).

3. Objects of imitation (Plot, character, & thought).

ఇట్టి అనుకరణవాదతత్వప్రకృష్టమైనది గ్రీకు నాటకము. మనవారిది రసవాదము. అది విభావానుభావవ్యభిచారిభావములవలన ప్రపంచింపబడినది. రెంటింటికిని వాదివయసలు కుదరవు.

b. ఐక్యవాదము: అరిస్టాటిలు ఐక్యత్రయము (Unity of action, Time and Place) గూర్చి ప్రస్తావించెను. 'ఏకైకదివసం వృత్తమ్' అన్న మన అంకలక్షణము కాలైక్యమునకుమాత్రమే సంబంధించిన సూత్రము. స్థలైక్యము గూర్చి మనవారికి తలంపే లేదు (మనవారి కథలు త్రిలోకసంచారులు). అస లరిస్టాటిలు స్పష్టముగా చెప్పినది కథైక్యముగూర్చియే. కాలైక్యముగూర్చి

'Tragedy endeavours, as far as possible, to confine its action within the limits of the single revolution of the Scene or nearly so' అను నర్థమున అతడు చెప్పిన సూత్ర మానాడే పాటింపబడినట్లు లేదు.

అనుకరణైక్యవాద తత్త్వములు గ్రీకు రూపకముల ప్రకృతులైతే రససిద్ధాంత, సంధి సంధ్యంగ ప్రక్రియాదికము భారతీయ రూపకములకు ప్రాణభూతమైనది. ఆ యీ యుపపత్తులవలన గ్రీకు భారతీయ

నాటకకళలకు జన్యజనకసంబంధముగాని సోదర భావముగాని 'ససేమిరా' లేవనుటయే సిద్ధాంతము. మన నాటకకళ మన కచ్ఛముగా దేశీయమై ప్రభవించినది. స్వతంత్రముగా అభివృద్ధి పొందినది. ఇదే సముద్రమును లంఘించి జావా బాలీ మొదలగు పరిసర పరసీమలకును ప్రాకి పరిఢవిల్లినది కాని దీని యుపస్థితికి విదేశీయరూపకము లెవ్వియు ప్రాపకములు గావు.

అయితే గ్రీకు భారతీయ రూపకముల విషయమున ఒక సమన్వయమున కవకాశము గలదు—నిబిడమైన అవయవావయవిసంబంధము, ఉదాత్తవస్తు, స్వీకృతి, ప్రాసంగికేతివృత్తము లుపాదేయము లగుట, ప్రకృత్యుపాసనాప్రవణత్వము, అర్థవంతమైన ఆత్మాశ్రయభావపావిత్ర్యములతో గూడిన ఉత్తమ కవిత మొదలగు విషయములు రెండిట సమాన ప్రతిపత్తి వహించియున్నవి. ఈ సందర్భమున శ్రీ జవహర్ లాల్ నెహ్రూ పండితుని అభిప్రాయ మొకటి విన్నదగి యున్నది:

"Reading the Greek Drama one comes across many customs and ways of thought and life which suddenly remind one of old Indian customs. Nevertheless Greek Drama is essentially different from the Sanskrit"—(Discovery of India Chap. v–viii)

గ్రీకు భారతీయ రూపకముల కసలు పరస్పర సంబంధమేమైన నుండియుండునెడల అది సంస్కృత దశరూపకముల విషయమున గాక అష్టాదశాధికములైన మన ఉపరూపకముల విషయమున నేకోశముననో కొంత గోచరింపవచ్చు నన్న యాశ గలదు. విషయ మవశ్యము పరిశోధనీయము.

# కలగూరగంప

## దేవాలయ నిర్మాణము

శ్రీ కొత్త బావయ్యచౌదరి

కొన్ని స్థలపురాణములనుబట్టి దేవాలయములు క్రీస్తు పూర్వము 3000 సం॥ల క్రిందట దాదాపుగా ఆర్యజాతిలో శ్రీరాముని కాలమునుండి స్థాపింపబడినట్లు చెప్పబడినను, చారిత్రక దృష్టాంతములు దీనిని ధృవపరచుటలేదు — పురాణములందు మాత్రము త్రేతాయుగమునుండి మనుజులు విగ్రహారాధన ప్రారంభించారని వ్రాయబడియున్నది. గౌతమ బుద్ధుని కాలమునకు అనగా క్రీస్తుపూర్వము 5 వ శతాబ్దినాటికి విగ్రహారాధన కనబడుటలేదు — ఈ బుద్ధమతము బాగుగా విజృంభించిన తర్వాత ముందుగా బుద్ధ విగ్రహారాధన 1, 2 శతాబ్దులనుండి కనబడుచున్నది. మహాయాన మతములో నిది నూతనముగా ప్రవేశపెట్టబడినట్లు చెప్పబడుచున్నది. వింధ్యవాసినీ మహాశక్తి మొదలగునవి తత్పూర్వమే యున్నట్లు కొందరు నుడువుచున్నారు. మొహెంజొదారో శిల్పములందు విగ్రహారాధన కనబడుచున్నది బుద్ధుడు చనిపోయినతర్వాత ఆయన పేర స్తూపములు, చైత్యములు, విహారములు, ఆయక స్తంభములు నెలకొల్పబడెను. క్రమముగా వానిలో బుద్ధ విగ్రహములు స్థాపింపబడుచుండెను. బౌద్ధమతము బాగుగా ప్రబలిన చోట్ల శ్రీ హర్ష చక్రవర్తి కాలమునకు (7 శతాబ్ది) బుద్ధదేవుని రథోత్సవములుగూడ జరుపుచుండిరి రథమునందు బుద్ధవిగ్రహముంచి దానికి పూజా పురస్కారములు, హారతి కైంకర్యములు సమర్పించుచుండిరి. జైనమతములోనుండిన జనులు తీర్థంకరుల విగ్రహాలను ఆరాధించుచు వచ్చిరి. ఇట్టి విగ్రహాలు క్రీస్తు పూర్వము 2 వ శతాబ్దికే యున్నట్లు కారవేలుని హాత్తిగుంప శాసనమునుబట్టి చెప్పవచ్చును.

బ్రాహ్మణమతము బౌద్ధమతమునకు పోటీగా క్రీస్తుపూర్వము ఒకటి రెండు శతాబ్దుల కాలములో వృద్ధిచేయుట కారంభము చేయబడెను. హీలియొడోరసు భగవాన్ వాసుదేవుని పేరిట నొక (రాతి కట్టడము) గరుడధ్వజము క్రీస్తుపూర్వము మొదటి శతాబ్దిని కట్టించి యొక శాసనము వ్రాయించెను. మన మెరిగినంతలో నిదియే హిందూ మతాభివృద్ధి కారంభదశ. శాతవాహన ఆంధ్రరాజులు క్రీస్తుపూర్వము 200 ప్రాంతమునుండి దాదాపు క్రీ. శ. 225 వరకు పాలించియుండిరి. వీరి కాలములో బౌద్ధ విగ్రహాలే గాక, మహారాజుల విగ్రహాలుగూడ నిర్మింపబడు ఆచారము వచ్చెను. నాసికలో శ్రీముఖ శాతకర్ణి వంశీకుల విగ్రహాలు, అమరావతిలోని గౌతమీపుత్ర శాతకర్ణి విగ్రహము, మొదలైనవి దీనికి తార్కాణములు. కాని హాలుని కాలమునాటికే హిందూమతస్థులు శివపార్వతులను, గణపతి, లక్ష్మీనారాయణులను, సీతారాములను, సౌమిత్రిని, సరస్వతిని, బుద్ధదేవునిగూడ పూజించుచున్నట్లుగా గాథాసప్తశతిలోని విషయములవల్ల తెలియుచున్నది. ఈ హాలుడు 1 వ శతాబ్దిలోనివాడు. శాతవాహనరాజులు హిందూ వేదమతస్థులగుటవల్ల వారు విగ్రహాలు ఉండినా లేకపోయినా, ఇంద్ర, యమ, వరుణ, కుబేర, వాసవ, ధర్మ, సంకర్షణ, వాసుదేవ, చంద్ర, సూర్య, లోకపాలక, శివ, కేశవ దేవతలను ఆరాధించుచు వచ్చినట్లు వారి శాసనములవల్ల తెలియుచున్నది. ఇక్ష్వాకు రాజులు 3 వ శతాబ్దిలో పాలించిరి. వీరి రాణులు బౌద్ధమత ప్రోత్సాహకులైనా వీరుగూడ వైదిక మతానుయాయులే. వాసిష్ఠీ శాంతమూలుడు, ఉజ్జయినిలోని మహాసేనుని భక్తుడని శాసనములందు చెప్పబడినది.

అందుచే నా కాలమునకే యచట మహాసేనాలయమున్నట్లు భావింపవచ్చును. శాతవాహన సామ్రాజ్యమంతరించిన పిమ్మట క్రీ. శ. 320 లో

గుప్తరాజులపాలన మన దేశములో వచ్చినది. వీరు బ్రాహ్మణమతము నుద్ధరించినారు. ఈ రాజులపాలనలోనే ప్రాచీనమైన దేవాలయములు వెలసినట్లు కనబడుచున్నది. వీరి ప్రాబల్యమున నేమి, సహజముగా దక్షిణదేశమునందున్న శైవమత ప్రాబల్యమువల్ల నేమి కాంచీపుర పల్లవరాజులు యీ దేవాలయ నిర్మాణమునకు హెచ్చుగా పూనుకొనిరి. శివస్కందవర్మ శైవ, వైష్ణవాలయములు నిర్మించినాడు—ఈ పల్లవ రాజుల కాలములోనే ఆంధ్రదేశమున ముఖ్యముగా ప్రసిద్ధ బౌద్ధక్షేత్ర స్తూపములన్నియు మరల తలయెత్తకుండుటకై భూమిలో పూడ్చివేయబడి, కొన్నిటి మీదనే దేవాలయములు నిర్మింపబడినట్లు నిదర్శనములు చిక్కుచున్నవి. దేవాలయము నిర్మించకున్ననూ ప్రతి బౌద్ధస్తూపమును పూడ్చిపెట్టిరి. ఇట్టి విపరీత చర్యకా కాలమున విజృంభించిన శైవ, వైష్ణవమతముల ప్రాబల్యమే కారణము—క్రీ. శ. 610 ప్రాంతమున చైనా యాత్రికుడగు హుయన్‌సాంగు వచ్చి చూచునాటికే అమరావతిలోని బౌద్ధస్తూపము, అమరేశ్వరాలయముగా మార్చబడెననియు, రాజాదరణముచే బ్రాహ్మణులు బౌద్ధులనుండి బలాత్కారముగా నా స్తూపమును వశపరచుకొనిరనియు వ్రాసియున్నాడు—ఉండవల్లి గుహాలలోని బౌద్ధవిగ్రహాలు, మొదలైనవి హిందూదేవతలుగా మార్చబడినవి. ఇవి యెప్పుడు జరిగినది చెప్పలేము. ఇట్లే యనేకచోట్ల జరిగెను.

ఆ కాలమువరకు బౌద్ధభిక్షుకులకు, బ్రాహ్మణులకు దానము లిచ్చు ఆచారము రాజులలో నుండెను. అందుచే పల్లవరాజులు చాల బ్రాహ్మణాగ్రహారముల నిచ్చిరి. నూతనముగా దేవాలయాలు నిర్మించి వానికి గూడ భూముల నిచ్చిరి. చారుదేవి యొక నారాయణ దేవాయలమునకు భూమినిచ్చెను. ఇది విజయస్కంద వర్మకాలమున జరిగెను. ముండరాష్ట్రమున పికిరి గ్రామమున నొక దేవళ మేర్పడెను. వేంగిరాష్ట్రమున మంగడూరులో నొకటి యుండెను. వానికి పల్లవ రాజులు భూములనిచ్చిరి. వేంగిరాష్ట్రమున శాలంకాయన రాజులు పాలించుచు సూర్యుని పేరిట చిత్రరథ స్వామి దేవళము నిర్మించిరి. ఆ దేవుడే వారికి కుల దేవుడయ్యెను. చేజెర్లలో కపోతేశ్వరాలయ మెప్పు డేర్పడెనో తెలియుటలేదుగాని యీ ప్రాంతమును పాలించిన ఆనంద గోత్రరాజులు మాత్రము వంకేశ్వర శంభుదేవర భక్తులమని చెప్పుకొనినారు—ఈ కపోతేశ్వరాలయముగూడ బౌద్ధస్తూపమును మార్చి నిర్మించిన యాలయమే.

శాలంకాయన రాజులలో నందివర్మ హెచ్చుగా దేవాలయములకు భూముల నిచ్చినవాడు. ఇతడు విష్ణుగ్రహస్వామికి తదితర దేవళములకు ఆకుసూరు, మందూర, చెరువ, కంబురాం చెరువ గ్రామములలో దేవ హాలముల నిచ్చెను.

వీరితర్వాత పాలనకు వచ్చిన విష్ణుకుండి రాజుల పాలనలోగూడ వేంగిదేశమున దేవాలయ నిర్మాణములు, వానికి భూములిచ్చుట జరిగెను—విక్రమేంద్ర వర్మ సోమగిరీశ్వరనాథ దేవాలయమునకు కృష్ణవేణీ తీరమునందుగల రేవోద్రమను గ్రామమును దానమిచ్చెను.

ఉత్తర దేశమున గూడ నిట్లే దేవళము లేర్పడుచు వచ్చెను అదివరకు బౌద్ధక్షేత్రముగా విలసిల్లిన జగన్నాథ క్షేత్రము హిందూ దేవాలయ మయ్యెను. క్రీ. శ 483 నాటికి జనార్దన ఆలయ మొకటి యేర్పడెను. పిఠాపురమున శక సం॥ 474-509 ల మధ్య విష్ణు, సూర్య దేవాలయములు ప్రతిష్ఠింపబడెను మందసార్ ప్రాంతమున గూడ వైష్ణవభక్తి విరివిగా వ్యాపకమునకు వచ్చెను. ధాన్యవిష్ణు, మాత్రివిష్ణు లను పేర్లు ఆ కాలపు మతవిశ్వాసుల పేర్లుగా నున్నవి. కడప జిల్లాలో పల్లవరాజులకు సామంతులుగా తెలుగు చోళ రాజులు పాలించుచువచ్చిరి. 6, 7 శతాబ్దుల మధ్యవాడగు పుణ్యకుమారచోళుని కాలములో కొన్ని దేవళములు నిర్మింపబడెను. రాజులపేర్ల, రాణుల పేరిట దేవాలయములు ఈ కాలమున నిర్మింపబడుచుండెను. అతని రాణియగు వాసంతపోరిదేవి తన పేరిట వసంతేశ్వరాలయమునకు కొన్ని భూముల నిచ్చెను. క్రీ. శ. 850 ప్రాంతీయుడగు బల్లయచోడరాజు ప్రేతేశ్వరాలయమునకు కొన్నిభూముల నొసంగెను.

వేంగీ దేశమును హుయన్‌సాంగను చైనా యాత్రికుడు 7-వ శతాబ్దిలో దర్శించెను. అప్పటికి వేంగిలో బౌద్ధ, బ్రాహ్మణ మత సంస్థలు దాదాపు సమానముగా నుండెను. 30 హిందూ దేవళము లచట నున్నట్లు వ్రాసియున్నాడు.

మొదట జయసింహ చాళుక్యుడు విప్పర్ల, మాచెర్ల గ్రామములలో కొన్ని దానము లిచ్చెను. ఆ గుడులు ఎప్పుడు నిర్మింపబడెనో తెలియుటలేదు.

దక్షిణదేశమున పల్లవ మహేంద్రవర్మ కాలము వరకచటి రాజులు ప్రజలు జైనమతమును పోషించుచుండిరి. మహేంద్రవర్మ జైనమతమునుండి నూతనముగా శైవమతమును స్వీకరించెను. అప్పటివరకు జైన మునులు శ్రీశైలము, తిరుచిరపల్లి మున్నగు కొండల మీద గుహలలో స్థావరము లేర్పరచుకొని తపస్సు చేసుకొనుచు, తమ మతస్థులకు అప్పుడప్పుడు బోధనలు సల్పుచుండిరి. తిరుచిరపల్లి ప్రాంతమున (Trichinopoly) గుణభార బిరుదముగల్గిన మహేంద్రవర్మ కొండ గుహలలో విగ్రహములను చెక్కించి, పూజాపురస్కారముల కనువగునట్లొనరించెను. ఇవి (Rock-Cut temples) నేటికిని పల్వురచే ఆకర్షింపబడుచున్నవి. మహాబలిపురమునగూడ నిట్టివి కలవు. 854-880 సం||ల మధ్య పాలకుడగు నృపతుంగ పల్లవుని కాలములో నాతని ప్రోత్సాహమున తిరువాడునందు అప్పార్ అను శివయోగి అచటి జైన తీర్థంకరుల విగ్రహాలను తొలగించి శైవాలయము నిర్మించెనట. ఆ ప్రాంతముల కదియే మొదటిది—11-వ శతాబ్దినాటికి కాంచీ పురమునందు రాజసింహేశ్వరాలయము ప్రసిద్ధికి వచ్చెను. ఇది 9—10 శతాబ్దుల మధ్యకాలము నెప్పుడో నిర్మింపబడియుండును.

ఓరుగల్లు ప్రాంతమంతయు 10-వ శతాబ్ది వరకు హెచ్చుగా జైనమత ప్రాబల్యముతో నుండుటవల్ల నచట నప్పటి వరకు హిందూదేవాలయములు లేకుండెను. రెండవ బేతరాజు (1080—1115) కాలములో నతడు తన పేరిట బేతేశ్వరాలయమును నూతనముగా నేర్పరచెను. అతడే క్రొత్తగా శైవమతమున జేరగా, నా వంశీకులందరు తర్వాత శైవ మతస్థులై యనేక శైవదేవాలయముల నిర్మించుచు పోషించుచు వృద్ధికి దెచ్చిరి — మొదటి ప్రతాపరుద్రుడు 84 గ్రామములను దేవాలయములకు దానమిచ్చియున్నాడు — వేంగీదేశమును తూర్పు చాళుక్య చక్రవర్తియగు మూడవ విజయాదిత్యుడు 9వ శతాబ్దిని పాలించుచు, 108 దేవాలయములను వివిధ స్థలములలో గట్టించెను. అప్పటి నుండి ఆంధ్రదేశమున దాదాపు ప్రతి ముఖ్యపట్టణమందును దేవాలయ మేర్పడినట్టు చెప్పవచ్చును-దాదాపు కాలములో నాగమ శాస్త్రములు మంత్రములు దేవాలయములం దేర్పడి యుండవచ్చును—విజయవాడలో మొదటి పల్లవుల కాలములోనే గాబోలును కుమారస్వామి దేవళము నెలకొల్పబడి యుద్ధమల్లుని కాలము నాటికి మల్లేశ్వరాలయముగా వృద్ధినొందినట్లు కపబడుచున్నది. శ్రీశైల, త్రిపురాంతక ప్రదేశాదులలో మల్లేశ్వరస్వామి లాకాలములో నేర్పడినారేమోనని తోచుచున్నది — ద్రాక్షారామ భీమేశ్వరాలయము రాజరాజనరేంద్రుని కాలమునకే ప్రాముఖ్యత గల్గియుండెను లీలావతీ ప్రాకృతకావ్యమును బట్టి యిది 1వ శతాబ్దినుండి యుండెను. పంచారామములలోని దేవాలయములు మిక్కిలి ప్రాచీనములుగా కనబడుచున్నవిగాని వాని నిర్మాణకాలము సరిగా తెలియుటలేదు 8-10 శతాబ్దుల నివి యెప్పుడో యేర్పడి యుండవలెను, మొదటి చాళుక్య భీముడువీనిని నిర్మించెనని కొందరనుచున్నారు. ఇట్లే సింహాచల నారసింహాలయము, మంగళగిరి నరసింహాలయము, తిరుపతి వెంకటేశ్వరాలయము అహోబలం నరసింహాలయము మొదలైనవిగూడ యప్పుడే నిర్మింపబడియుండును. ప్రాచీన సంగం వాఙ్మయములో తిరుపతి వంగడము ప్రస్తావన, ఆదేవుని వర్ణనలున్నట్లు తెలియుచున్నది.

మదరాసులోని ట్రిప్లికేను (తిరువళిక్కేణి)లో పల్లవదంతివర్మకాలమునుండి యున్న పార్థసారథి కోవల గలదు. చేజెర్ల కపోతేశ్వరాలయము మహేంద్రవర్మకాలమునకే ప్రసిద్ధిగానుండెను.

7వ శతాబ్దిలోని రెండవ పరమేశ్వర వర్మ పాలనకాలములో నిర్మించిన కంచిలోని వైకుంఠ పెరుమాళ్ళ ఆలయమును, తత్పూర్వము మొదటి పరమేశ్వరుని కాలము నాటి ఆలయమొకటి కూరంలో నిర్మింపబడినదియు కనబడుచున్నది.

రామ్నాడు జిల్లాలో 7, 8 శతాబ్దుల వరకు కొండలమీద తొలిచిన దేవాలయాలు, విగ్రహాలు అగస్త్య పులస్త్యఋషులవి గూడ ప్రసిద్ధిగా నుండెను—ఇట్టివి పిళ్లయార్ పట్టి, కన్నకుడి తిరుక్కొలక్కుడి మున్నగుచోట్ల నున్నవి. అలంబాకమున దంతి వర్మ కాలపు కైలాసనాథాలయ మొకటియున్నది. అచటనే సప్తమాతృకల పేరిట గట్టబడిన దొక గుడి కలదు. క్రమముగా మన దేశమంతటను దశావతారముల పేరిటను, ఋష్యాదుల పేరిటను, రాజులు, చక్రవర్తులు

మున్నగు ప్రసిద్ధ పురుషుల పేరిటను, యశోవంతు లాంధ్ర స్త్రీ రత్నముల పేరిటను దేవాలయముల నేక చోట్ల ప్రజలు, ప్రభువులు నిర్మించి పోషించుచు వచ్చిరి. కాకతీయులలో సంగమేశ్వరులు సముద్ర ప్రాంతమున సముద్రేశ్వరులు, దేశీయుల పేరిట శక్తులు పంచ పాండవులు, గోపాలకృష్ణుడు, హనుమంతుడు, జామదగ్ని, రేణుక, పరశురాముడు అగస్త్యుడు మొదలగు వారి దేవాలయములు కూడా కొన్ని చోట్ల యేర్పడెను. బృహన్నారదీయమను ధర్మశాస్త్రములో అనుపవీతులు స్త్రీ శూద్రులు మినహా యెల్లవారును లింగస్థాపనను తమ పెద్దల పేరనో తమ పేరనో శైవ వైష్ణవాలయములందు నెలకొల్పవచ్చునని చెప్పబడెను. ఆనిబంధన లమలునకు వచ్చినతర్వాత దేశములో ప్రతి స్థలమునను దేవాలయ నిర్మాణము సాగెనవచ్చును బౌద్ధజైన ప్రతిమారాధనలు నామమాత్రముగా 12 వ శతాబ్దివరకుండెను. ఆ శతాబ్ద చివరనుండి పలనాటి వీరపురుషుల దేవళములు కూడ వెలసెను. ఓరుగల్లు, కారెంపూడి మున్నగు పెక్కు చోట్ల యీ వీరపురుషారాధన జరుగుచు వచ్చెను. యుద్ధములలో పరాక్రమము జూపిన పెక్కు యోధుల పేర కూడ దేవళము లంతకు పూర్వమే తూర్పుచాళుక్య రాజుల కాలములో నిర్మింపబడుచు వచ్చెను. దేవాలయ కట్టడములు, వానినిజరుపు ఆగమపద్ధతులు తెలుపుటకై మరీచి సంహిత యను పేరున నొక సంస్కృత గ్రంథము రచింపబడెను గాని దీని కాలము తెలియదు. రాష్ట్రకూట రాజులలోని దంతి దుర్గ II కాలములో ఎల్లోరా, అజంతా గుహలలో కైలాసనాథ మందిరమును, విగ్రహాలను తొలిపించెను. శ్రీ కూర్మములో కూర్మనాథాలయం ఉన్నది. ఇదియొక్కటే కూర్మావతార దేవాలయమనవచ్చును. హుయన్ సాంగ 7 వ శతాబ్దిలో చూచినపుడు కళింగనగరములో నూరు దేవాలయాలు, నూరు బౌద్ధ ఆరామాలు ఉండెనట. ప్రాచీన కళింగరాజధానియైన ముఖలింగంలో జైన, బౌద్ధ విగ్రహాల ప్రాముఖ్యము తగ్గిన తర్వాత మధుకేశ్వరస్వామిని గాంగరాజులలో నొకరు ప్రతిష్ఠించిరి. శ్రీకాకుళములో ఆంధ్రవిష్ణువు ఆలయం ఒకటి 11 వ శతాబ్దినాటికే ప్రసిద్ధిజెందెను. శ్రీ కృష్ణదేవరాయలు గూడా దానిని దర్శించెను. కాళహస్తిలోని కాళహస్తీశ్వరాలయమొకటి శైవమతములో ప్రాచీనమైనదిగ కనబడుచున్నది. మహేంద్రగిరికొండలమీద గాంగ రాజులు గోకర్ణస్వామిని ప్రతిష్ఠించిరి.

బెజవాడవద్ద గల మొగల్రాజపురం కొండమీద నటరాజ విగ్రహం, శక్తి విగ్రహం మొదలైనవి కొండ గుహాలలో తొలువబడినవి. ఇవి విష్ణుకుండిరాజులు 6 వ శతాబ్దిలో నిర్మించి యుందురని కొందరి విశ్వాసము.

770-806 మధ్య పాలకుడగు రెండవ విజయాదిత్య చక్రవర్తి బెజవాడలో సమస్త భువనాశ్రయ శైవ దేవాలయమొకటి నిర్మించెను. దీనిని కాలాముఖ శైవగురువులు నడపుచుండే వారు. బెజవాడలో అప్పటికి పోటీగా జైనమతము ఉండెను. కావురూరి జైన శాఖీయులట ప్రభువులఆదరణలో వానిని పోషించుచుండిరి. దేవాలయములందు అఖండ దీపారాధనలు ప్రతివారును చేయుచు వచ్చిరి.

13 వ శతాబ్ది నాటికి దేవాలయములేని గ్రామమే లేదనవచ్చును. విజయనగర రాజ్యమున యీ దేవాలయ నిర్మాణ, పోషణలు అత్యున్నత స్థాయిలోనికి వచ్చెను. గ్రామములలో ప్రజలు చెల్లించు పన్నులనేకము దేవునకు కైంకర్యముగా రాజులచే దానమీయబడెను. దేశమంతటికి ఒకే పద్ధతి గాక, యెచటి పద్ధతులచటనే అనుసరింపబడెను. అందుననే అట్టి శాసనములు దేవాలయములందు రాళ్ళమీద శాశ్వతముగా నుండునట్లు చెక్కబడుచు వచ్చెను. శివకేశవుల అనంత నామముల పేరిట ననేక దేవళములు ప్రతిష్ఠింపబడెను విద్యార్థులకు వేద పండితులకు భోజనాలు, దేవునికి పూలవనాలు, తాపసులకు సౌకర్యాలు దేవాలయములందు చాలచోట్ల చేయబడుచుండెను.

దక్షిణాంధ్రదేశమున యీరీతిగా దేవాలయ నిర్మాణము 1565 సం॥ వరకు జరిగెను. ఒక్క చంద్రగిరి పట్టణమున 1547 సం॥ నాటికి 74 దేవళములున్నట్లు ఒక శాసనమున చెక్కబడినది. దేవుని ప్రార్థించుటకు సామాన్యజనులందరి కందుబాటులో నుండుటకే యిట్టి సౌకర్యములు ప్రభువులు, సామంతులు చేయుచుండిరి. వారికి దేవునియందు గల భక్తికూడ దీనికి కారణమనవచ్చును ఉత్తర దేశమున 11 మొదలు 18 వ శతాబ్దివరకు మహమ్మదీయ రాజులచేతను, మొగలు రాజులచేతను హిందూ దేవాలయములు అప్పుడప్పుడు నాశనము చేయబడుచుండెను. పురాతన మత విద్యాసంస్థలన్నియు పాడొనరింపబడెను. భక్తియారుఖిల్జీ, సికందరు, జైనులాబ్దిను, మహమ్మదుగజనీ, ఔరంగజేబు చక్రవర్తి మున్నగువారిట్లు చేయుచు వచ్చిరి. మిక్కిలి ప్రసిద్ధిచెందిన సోమనాథ దేవాలయము, కాశీ విశ్వేశ్వరాలయము మొదలైనవి అట్టివారిచే పాడుచేయబడెను. కాశీవిశ్వేశ్వరాలయము మరల ప్రతిష్ఠింప

బడెను. హిందూ దేవాలయములు నూతనముగా ప్రతిష్ఠించు కాలములో బౌద్ధస్తూపములు, చైత్యములు, విహారములు పూడ్చిపెట్టబడినందులకు ప్రతిఫలమను నట్లుగా, మహమ్మదీయులు దేవాలయము లనేకము ధ్వంసముచేసి మసీదులను నెలకొల్పిరి. వానికిగల మడి మాన్యములు, సొత్తు లూడబెరుకుకొనిరి 1757 ప్రాంతమున సర్కారుజిల్లాల ఆధిపత్యము వహించిన ఫ్రెంచి వారుకూడ యిట్లే చేసి, నూతనముగా తమ క్రైస్తవ చర్చిలను గట్ట నారంభించిరి.

కాలప్రభావమువల్ల దేవాలయములు కూడ ఉచ్ఛ నీచము లనుభవించినను, తిరిగి 19వ శతాబ్దమునుండి కోలుకొనుచున్నవి. అసంఖ్యాకములైన పునఃప్రతిష్ఠలు కన్యకాపరమేశ్వరి వంటి నూతన దేవాలయాలు ఆంధ్రదేశమున విరివిగా నెలయుచున్నవి. చాల చోట్ల వైభవముగా యేటేట బ్రహ్మోత్సవాలు, కళ్యాణాలు, భాగవత హరికథాదులు జరుప బడుచు, వేలకొలది భక్తజనుల నాకర్షించుచున్నవి. ఇట్టి యుత్సవములు క్రీస్తు మొదటి శతాబ్దినుండి బౌద్ధ మతమున నుండెననియు, నా యాచారమే హిందూ మతమునగూడ వర్ధిల్లె ననియు లోగడ తెలిపితిమి. ఈ మధ్య పత్రుపత్రి, కోటిపత్రి, శతకోటిపత్రి పూజలు, నామ సంకీర్తనాలు దేవళములలో వృద్ధియైనవి. కన్నడాంధ్ర దేశమున పశ్చిమ చాళుక్య చక్రవర్తులు జైనమతమును పోషించిరి. వారి కాలములో ననేక సుందరతమ జైనతీర్థంకర విగ్రహములకు దేవాలయా లనేక ప్రదేశములలో స్థాపింపబడి, 11వ శతాబ్ది వరకు ఉచ్ఛస్థితిలో నుండెను, 12వ శతాబ్దిని బిజ్జలుడు, బసవన్న, చెన్న బసవన్న, పండితారాధ్యులను మున్నగువారు వీరశైవమును వృద్ధికి దె నారంభించిన కొలది ప్రజలలోనుండి వీరశైవ జంగములు వేలకొలదిగా బయలుదేరి శైవమతాభివృద్ధికై యనేక శైవాలయముల ప్రభుపోషణతో నిర్మించుచువచ్చిరి రామానుజాచార్యులు వచ్చి వైష్ణవమత ప్రచారమునకు బూను కొన్న కొలది వైష్ణవాలయములుగూడ వృద్ధి యయ్యెను. శ్రావణ బెలగొల మున్నగుచోట్ల మాత్రము జైనవిగ్రహాలు, వాని యుత్సవములు ప్రజలచే ఆకర్షింపబడుచునే యుండెను.

ప్రాముఖ్యమైన పవిత్రస్థలముల దేవాలయము లన్నిటి చరిత్రలను వానికిగల స్థలపురాణ విశేషములతో ప్రత్యేక గ్రంథముగ పరిశోధించి తయారు చేయించుటకై ఆంధ్రప్రభుత్వము పూనుకొన దగియున్నది. తిరుపతి మున్నగు మహాస్థలముల చరిత్ర యిది వరకే యింగ్లీషుభాషను నిర్మాణమైనను, తెలుగుభాషలోనికి రానందున ఆంధ్రజను లందరి కందుబాటులో లేకున్నది. ఈ లోటును ప్రభుత్వంవారు, దేవస్థానము వారును తీర్చగలరని విశ్వసింతును.

# లైసెంకో

న్యూయార్కు నగరంలోని ఇతాకా నగరంలో ఆరవ అంతర్జాతీయ జనుశ్శాస్త్రవేత్తల (Genetics) మహాసభ జరిగినప్పుడు (1932) ఆ మహాసభలో రష్యన్ ప్రతినిధి వావిలావ్ (Vavilov) ఒక విచిత్రమైన ప్రకటన చేశాడు.

రష్యన్ విప్లవానంతరం వ్యవసాయ రంగములో జనుశ్శాస్త్రానికి గల ప్రాధాన్యతను గుర్తించిన లెనిన్ అధ్వర్యాన, రష్యన్ వ్యవసాయ పద్ధతులను మార్చివేయటానికీ ధాన్యోత్పత్తులను పెంపొందజేయటానికి కృషిచేసిన శాస్త్రవేత్తలలో ప్రధాన పురుషులలో వావిలోవ్ ఒకడు.

లైసెంకో అనే రష్యన్ శాస్త్రజ్ఞుడు 'వెర్నలైజేషన్' (Vernalization) అనే అపూర్వ విధానాన్ని కనిపెట్టినట్టు వావిలావ్ ఆ సభలో ప్రకటించాడు. విత్తనాలను శీతలీకరించి నిలువచేసి వుంచి ఆ విత్తనాలతో వసంతఋతువులో పండే పంటను (గోధుమ) శిశిరఋతువులో పండేటట్టు చేయటాన్ని

వెర్నలైజేషన్ అంటారు. ఈ ప్రక్రియలో ఆశ్చర్య పడవలసిందేమీ లేదు. ఇది అమెరికాలో యేనాటి నుంచో ఆచరణలో వున్న విధానమే. కాని విచిత్ర మెక్కడనంటే, వెర్నలైజేషన్ వల్ల ఒకరకం ధాన్యం మరొకరకం ధాన్యంగా పరిణామం చెందుతుందని లైసెంకో అన్నాడు. ఈ వాదనను సమర్థించటానికి వావిలావ్ ప్రయత్నించటమే ఆశ్చర్యకరమైన సంగతి.

ఈ వాదం అప్పటికీ ఇప్పటికికూడా జనుశ్శాస్త్ర విజ్ఞానంలో మనకు తెలిసిన విషయాలన్నిటికీ విరుద్ధంగా వుంది. పారంపర్యంగా సంక్రమించిన జీవుల సహజస్వరూపగుణాలు ఒక జీవితకాలంలోనే యీ మార్పు చెందటం అసంభవమని జనుశ్శాస్త్రమే గాక జీవ పరిణామ శాస్త్ర సిద్ధాంతాలుకూడా చెబుతున్నాయి మరొక విధంగా చెప్పాలంటే ప్రాప్త గుణములు (Acquired Characteritics) పారంపర్యమౌతాయని లైసెంకో వాదం.



విశ్వాసమున్నా లేకపోయినా ఇలా వావిలావ్ లైసెంకో వాదాన్ని బలపరచినప్పటికీ, అతను అనతికాలంలోనే అధికారుల ఆదరాభిమానాలను కోల్పోక తప్పిందికాదు. చివరకు 1940-లో అతన్ని అరెస్టు చేసి సైబీరియాకు పంపివేశారు. అతను అక్కడ మరణించాడు. లైసెంకో సిద్ధాంతాలను ఎదిరించిన శాస్త్రజ్ఞులు కనీసం ఒక 50 మంది ఇలానే అదృశ్యులయ్యారు. లైసెంకో పలుకుబడి మాత్రం దిన దినం పెరుగుతూవచ్చింది అనేక ఉన్నత పదవులను ఆక్రమించగలిగాడు. స్టాలిన్‌కు అతను ఆప్తుడు కావటం చేత అతని సిద్ధాంతాలన్నీ అవి ఎంత అవకతవకలైనా అధికార సిద్ధాంతాలుగా (Official Doctrines) స్వీకరింపబడుతూ వచ్చినాయి. వాటిని కాదని ఎదిరించినవారినల్లా శిక్షించేవారు. రష్యా వ్యవసాయాభివృద్ధి కంతెకూ దోహదం కాగలదని లెనిన్ పెంపొందజేయించిన జనుశ్శాస్త్రం, సిద్ధాంతాలు ఈ విధంగా, 'పెట్టుబడిదారీ — ప్రతాప సిద్ధాంతాలు' గానూ, 'సామ్రాజ్యవాద దురాదర్శాలు' గానూ దూషింపబడుతూ వచ్చినాయి. క్రోమోసోములు, వాటిలోవుండే జీన్సు—వాటిలో కలిగే పరిణామమే ప్రాణాలలోని పరిణామాలుగా రూపొందుతాయన్న నవీన సిద్ధాంతాన్ని తీవ్రంగా ఖండించేవారు. విచిత్రమేమిటంటే లైసెంకో చేసి చూసినట్టు చెప్పిన ప్రయోగాలలో వీటిని యితరులు ప్రయత్నించి పరీక్షించినా ఆ ఫలితాలు వచ్చేవిగావు ఒక సంవత్సరం లైసెంకో సిద్ధాంతాలను రష్యా వ్యవసాయరంగంలో అమలు జరపటంవల్ల 60,00 000 ఎకరాల ధాన్యం నాశనమైపోయింది. మిగతా దేశాలు ఆచరణలో పెట్టిన మిశ్రమ ధాన్యాల సిద్ధాంతాలను ఆచరణలో పెట్టకపోవటం వల్లకూడా వ్యవసాయరంగంలో రష్యా చాలా నష్టపోయింది. లైసెంకో పలుకుబడి మూలంగా భౌతిక రసాయనిక శాస్త్రాలుకూడా 'మార్క్సిస్ట్ — లెనినిస్ట్' సిద్ధాంతాలకు అనుగుణంగా మార్చబడినై.

స్టాలిన్ మరణంతో లైసెంకో జాతకం వక్రించింది. 1954 లో ప్రావడా పత్రిక అతని మీద ఒక విమర్శను దూకించింది.

ఇటీవల 'అఖిల సోవియట్ వ్యవసాయ శాస్త్ర మహా పరిషత్' (All Union Academy of Agricultural Sciences) అధ్యక్షు పదవినుండి లైసెంకో తొలగింపబడినట్లు వార్తలు వచ్చినాయి. కాని అతనిని సైబీరియాకు పంపడం కాని చంపివేయడం గాని జరగకపోవటం ముదావహం.



# సిగ్మండ్ ఫ్రాయిడ్ శతవార్షిక జయంతి

ప్రసిద్ధ మానసిక శాస్త్రవేత్త కీ. శే. సిగ్మండ్ ఫ్రాయిడ్ జన్మించి నూరు సంవత్సరాలైంది. ఈ మే 6 వ తేదీ ఆయన శతవార్షికోత్సవ మహోత్సవ దినం. అంతర్జాతీయావధిని ఈ శతవార్షిక మహోత్సవాలు వైభవోపేతంగా జరుగుతున్నాయి. ఆయన పరిశోధనల కన్నిటికి రంగస్థలమైన వియన్నా నగరంలో ప్రత్యేకంగా విస్తృతావధిని ఉత్సవ కార్యక్రమం జరుగుతోంది ప్రధాన విశ్వ విద్యాలయాలన్నీ ఆయనకు జోహారు లర్పిస్తున్నాయి.

ప్రాయిడ్ 1856 మే 6 వ తేదీన జకోస్లావేకియాలోని మొరేవియాలో జన్మించారు. ఆయన తండ్రి ఉన్ని వ్యాపారం చేస్తూవుండే యూదు వర్తకుడు. ప్రాయిడ్ 4 సంవత్సరాల బాలుడైవున్న దశలోనే వారి కుటుంబం, వియన్నా నగరానికి మారింది. ఆయన విద్యావ్యాసంగమంతా యీ నగరంలోనే సాగింది. ఆయన పరిశోధనల కన్నిటికీ ఇదే రంగభూమి.

స్వప్న కారణాలను వివరించుతూ ఆయన వ్రాసిన తొలిగ్రంథం 600 కంటే యెక్కువ ప్రతులు అమ్మకం పోలేదు. కాని ఈ రచనతో ఆయన ప్రముఖులైన అనేకమంది విజ్ఞానవేత్తల దృష్టిని అకర్షించాడు. ఆల్‌ఫ్రెడ్ ఆడ్లర్, కారల్ యూంగ్, హాన్స్‌జాక్స్, ఎర్నెస్ట్ జోన్స్ మొదలైనవారు శిష్యవర్గంగా చేరారు. వీరిలో మొదటి యిద్దరూ ప్రాయిడ్ 'సెక్సు' సిద్ధాంతాలకు అతివ్యాప్తిదోషం వున్నదన్న తలపుతో ఆయన నుండి దూరస్థులయారు.

రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు నాజీలు యూదులమీద నెరపిన హింసాకాండ కారణంగా ఆయన ఎర్నెస్ట్ జోన్స్ సహాయంతో లండన్‌కు వలస పోయాడు.

83 సంవత్సరాల వృద్ధుడుగా 1939 సెప్టెంబర్ 23 వ తేదీన దేహంచాలించాడు.

తన సిద్ధాంతాలను ప్రతిఘటించుతున్నవారిని గురించి ప్రాయిడ్ ఇలా అన్నాడు: 'పగలు వీరు నా సిద్ధాంతలను పడతిట్టితే తిట్టిపోయనీండి-కాని రాత్రిపూట వీరు వీటిని పురస్కరించుకునే కలలు గంటారనేది సత్యం.'

# గ్రంథ విమర్శనము

## ఉపాహారము

ఖండకావ్య సంపుటి: రచన: శ్రీనివాస సోదరులు (శతావధానులు); ప్రచురణ తెలంగాణా రచయితల సంఘము, హైదరాబాదు. వెల ఒక రూపాయి.

ఈ సోదరకవులు ప్రతిభావ్యుత్పత్తులు రెండూ కలవారు. వాక్శుద్ధి, ధారాశుద్ధి కలవారు. భావుకులు. అనేక క్రొంగ్రొత్త పుంతలు త్రొక్కి చూడ నుత్సాహము కలవారు. ఈ ఖండకావ్య సంపుటిలో విస్తృతమైన వైవిధ్యం కనుపించుతున్నది.

రచయితలు ఆయా సందర్భములలో రచించిన పద్యములు, గేయములు, వచన పదములు చేర్చి ఈ సంపుటిని తయారుచేశారు. సంపుటిలో నలభైవరకూ ఖండకృతులున్నాయి.

రచయితలు ద్రవిడాంధ్రసంస్కృతభాషలలో పాండిత్యమున్నవారు. పండితరాయల భామినీ విలాస శ్లోకాలకు వీరి తెలుగుసేత హృద్యంగావుంది. పాశురములనుకూడా కొన్నిటిని అనువదించారు. పద్యనిర్మాణంలో వీరికిగల ప్రతిభ ఎలాంటిదో, గజ్జలగుర్రాలులా వున్న ఈ పద్యాలను తిలకించితే బోధపడుతుంది.

'కాళీమాతృ కటాక్ష వీక్షణ సదా
    కల్లోలినీ మజ్జనో
న్మీల న్నిర్మల కాంత కాంతి తతి
    కుంఠీభూత ధీజాడ్య లో
కాలోక ప్రచుర ప్రజాగణ నమ
    స్కారస్ఫుట ద్ధర్మ దీ
క్షా లీలామధుకోరక ప్రకరు
    డాశాసించు నాతం డిలన్.

'ఉపనిష దుజ్జ్వలాంతర
    రహోర్ధ సమర్థక మూఢలోక బో
ధపద సువిస్ఫుర త్స్వరలతా
    కవి తాతతసూక్తి మాధురీ
సుపరిచితి ప్రమోద పరి
    శోభిత భారత భారతేతర
వ్యపగత జాతిగర్వ నుతి
    హారుడు డతండు జగమ్ము లేలుతన్.

వీరు ఆంగ్ల పదాలను కూర్చి హాస్యధోరణిలో కొన్ని మణిప్రవాళ రచనలు చేశారు. అవి అంత మంచి అభిరుచిలో వున్నాయని చెప్పటానికి వీలు లేదు. అయినా చదువరుల పరిశీలనకు ఒకటి రెండు ఉదహరించి చూపుతాము.

'ఇది గణతంత్ర భారతం
భారత్ దటీజ్ ఇండియా
కాన్స్టిట్యూషన్ ఫాటోలో
ఫండమెంటల్ రైట్సు
బ్లాక్ అండ్ వైట్సు!
కాని నేటి చరిత్రలో
వైట్సూ వైట్సే
బ్లాక్సూ వైట్సే—'

*       *       *

మేం గెలిస్తే అది డిమోక్రసీ
ప్రజ లితరుల గెలిపిస్తే
"డిమోక్రసీ ఇన్ డేంజర్,
ఇన్ టిమిడేషన్ ఆఫ్ ఓటర్స్".

మా బ్లాకుమార్కెట్టుకు చిరాయువు
మా కరప్షనుకు దీర్ఘాయువు!
మా డిమోక్రసీకి బ్రహ్మాయువు!
ప్రజానీకానికి పాతికాయువు!

క్రొత్త దోవలు త్రొక్కాలనే ఉబలాటంలో వేసిన యేవో కొన్ని తప్పటడుగులను మినహాయిస్తే, సంప్రదాయమార్గకవితాధోరణిలో వున్న వీరి రచనలన్నీ హృద్యంగానే వున్నయ్.

## పునర్నవం

గేయసంపుటి; రచన : దాశరథి; ప్రచురణ : దేశోద్ధారక గ్రంథమాల; 3-5-1027 నారాయణ గూడ, హైదరాబాదు. వెల : 1-6 0.

ఈ సంపుటిలో మొత్తం 20 ఖండకృతు లున్నాయి. ప్రకాశకులు స్థూలంగా వీటి నన్నిటినీ గేయాలు అని చెబుతున్నా వీటిలో కొన్ని వచన పదాలుకూడా వున్నాయి.

ఈ కృతులలో 'పునర్నవం', 'ప్రాణదీపం', 'అచుంబితం' మొదలైన కొన్ని రచనలు, భారతి, ఆంధ్రపత్రిక ఉగాది సంచికలద్వారా లోగడ పాఠకులకు పరిచయం చేయబడినవే.

'పునర్నవమ్' అన్న కృతిలో శ్రీ దాశరథి కవిత్వానికి నిర్వచనం చెప్పారు :

'దూరాన పొడిగాలి దెబ్బలకు
తునాతునకలైపోయిన ఆకులతో
ముసలిముఖం పడిన వృక్షంమీద
యౌవనం చిగురించటం కవిత్వం.

రోజూ కనబడే నక్షత్రాల్లోనే
రోజూ కనబడని క్రొత్తదనంచూచి
రోజూ పొందని ఆనందానుభూతి
పొందటం అంటేనే కవిత్వం.

మనకంటే లక్షయేండ్లు పెద్దది
మన నెత్తిమీదున్న ఆకాశం
దూదిపింజెల్లాంటి కొత్తమబ్బుల్లో
తొంగి చూడ్డమే పునర్నవం.

ఎప్పటికప్పుడు జరాజీవితాన్ని చీల్చుకొని క్రొత్త చివుళ్లుగా పొటమరించటమే 'పునర్నవం'. ఇదే కవిత్వం అంటారు దాశరథి ఈ ఆవేశం ఈ గేయాలన్నిటా సర్వత్రా గోచరించుకున్నది. నవయుగోదయ వేళాలతో వికాసోన్ముఖ మవుతున్న లోకాన్ని భావించి రచయిత ఆనంద వివశుడౌతాడు:

ఆకు రాల్చిన మనసుల్లో
అప్పుడే పూలు పూస్తున్నాయి
పునర్నవకాలం వచ్చింది
పూచింది లోకం హర్షంతో

ఇంతవరకూ నిద్రాణమైవున్న కారణంగా ఈ మనోవికాసపు అనుభూతిని మానవజాతి పొందలేక పోయింది. బాహ్యజగత్తులో వ్యాపించివున్న అంధకారంలో కొట్టుమిట్టాడుతూ, అంతర్ముఖుడు కాలేక పోవటమే యిందుకు కారణం. ఇప్పుడు 'అచుంబితం' మైవున్న ఆ దివ్య సౌందర్యాన్ని ఆహ్వానించుతున్నాడు; 'అచుంబితం' అనే కావ్యంలో:

'మాట్లాడని మల్లెమొగ్గ
మాదిరిగా నడచిరా!
నిశ్శబ్దం ఎరగనట్టి
నిమ్నగవలె నడచిపో!
*　　　*　　　*
మట్టి ఆకుపై విష్ణువు
మాదిరి శబ్దమున శక్తి
*　　　*　　　*
మనకున్న నిఘంటువులు
విననట్టిది కననట్టిది
నది తరగలలో భావుకు
మదిలో వింత పలుకు'

అన్నారు. ఇలాంటి సొగసులు ఈ గేయాలలో చాలా వున్నాయి.

'బాల్యం' అనే కృతిలో:

'నిశ్శబ్దంగా నితాంత
జీవితాగ్రాన పూచే
నిర్మలమైన ఎర్ర రోజా
ప్రసూనం బాల్యం'

అన్నారు. నిజానికి ఈ భావం వర్డ్సువర్తు భావనలోకు (Ode on Intimations of Immortality) కోటీరపు తురాయి పువ్వులా ఎర్రగా పూసింది.

---

## ర త్నా వ ళి

మహాకవి శ్రీ హర్షుని సంస్కృత కృతికి అనువాదం: అనువాదకులు శ్రీ సామవేదం జానకి రామశర్మ, ప్రకాశకులు; రామా అండ్ కో, ఏలూరు. వెల రు. 1-8-0.



Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor:; S. Sambhu Prasad.

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

జూన్ 1956

సంపుటము 33 : : సంచిక 6

విడిపత్రిక వెల ఒక రూపాయి

# ప్రతి మైలుమీద డబ్బు నిల్వచేయండి

పట్టణంలోగాని కుగ్రామపు రోడ్ల
మీదగాని ఎట్టి విధములైన బరువు
లతో నైనను సెన్-రాలె బైసికిల్సు
ఎక్కువ కాలంమన్ని రిపేరీల ఖర్చు
లేకుండా అవి పరిగెత్తే ప్రతి
మైలుమీద విలువగల అణా
లను భద్రపరచును.



# రాలే
# రాబిన్ హుడ్












SRX-38 TG

# విషయానుక్రమణిక

## జూన్ 1956

# నేను

శ్రీ గొట్టిముక్కల కృష్ణమూర్తి

ఏనొక సమీర బాలుఁడ! నీ కవిత్వ
పారిజాత ప్రసూన మెవ్వండో యొసగె ;
మా పరస్పర సంస్పర్శ మహిమ వలన
పులకితబ్రహ్మపదమును పొందగలను.

ఏనొక త్రిలోక విజయుఁడ! నీ కవిత్వ
దివ్య గాండీవము నొసంగె దేవు డెవడో ;
సతుల శీలంబు దోచు దుశ్శాసనులను,
అడ్డుపడు సైంధవుల నెల్ల హతము సేతు.

ఏను మధుపాన మత్తుఁడ! నీ కవిత్వ
స్వాదు మధుపాత్ర నందించె 'సాఖి' యొకతె
స్వాదు వెరుగని పైత్య విభ్రాంత మతులు
తిట్టనీ వెలివేయనీ దిగులు పడను.

ఏనొక ధనంజయుండను! ఈ కవిత్వ
దివ్య చింతామణీ మహా దీప్త శక్తి
చింతలన్ వీడి క్రౌర్య విచ్ఛిత్తిచేసి
కలిమిలేముల చెరలాట కట్టివేతు.

ఏనొక విశిష్ట తాపసి! నీ కవిత్వ
దివ్యమార్గము చూపించె దేవు డెవడొ;
ఏ అపామార్గమును బట్టకేను నడచి
ఆ మహానందపదమును నందగలను.

ఏనొక ప్రగాఢ భక్తుఁడ! నీ కవిత్వ
పుష్పక విమానమును నెక్కి పోగలాను
ఆ చిదానందు నంతఃపురాననుండి
రమ్మనుచు పిల్చు తల్లి పదమ్ముకడకు.

ఏనొక విశుద్ధ రసికుఁడ! నీ కవిత్వ
కన్యకా దానము నొసర్చె ఘను డెవండొ;
జంటగా నేగి భక్తిమై శారదాంబ
దివ్య పాదార్చనము చేసి తేరికొందు.

ఏనొక త్రికాల భిక్షువు నీ కవిత్వ
కామధేనువు నాకు నొక్కం డొసంగె;
కార్త వీర్యార్జునుల పాపికళ్లనుండి
కాచుకొందును లోక సంగ్రహముకొరకు.

# ప్రాచీన శిలాశాసనములు

శ్రీ కె. హెచ్. వి. శర్మ

"శాస్యన్తే ఏభిరితి శాసనాని"—వీనిచే శాసింపబడును గనుక ఇవి శాసనములు. శిలలపైఁ జెక్కబడినవిగాన నివి శిలాశాసనములు. భారత దేశమున నీ శిలాశాసనములకొక విశిష్టస్థానము గలదు.

మన దేశమున శాసనములకంటె నతి ప్రాచీనమైన, జంతువులు మొదలగువాని చిహ్నలుగల, మృణ్ముద్రలు (clay seals) సింధు నాగరికతా ఫలితముగఁ దెలియవచ్చినవి. అయిననూ వానినిగూర్చి ఇంకనూ సుస్పష్టముగా వివరించుటకు వీలుగాకున్నది.

శిలాశాసనములనగానే అశోకుడు స్ఫురించును. శాసన వాఙ్మయావతరణమునకు మన ఆదికావ్య రచనకు సామ్య మొకింతగలదేమో యనిపించును. మహర్షియైన వాల్మీకి క్రౌంచద్వంద్వమునుఁ జూచుచూ నానందసాగర నిమగ్నుడైయుండగా నందు నిషాదబాణ నిహతమైన యొకపక్షి నేలగూలును. అప్రయత్నముగ నాతని శోకము నోటనుండి ఛందోరూపముగ వెడలి ఆదికావ్యరచనకు దారిఁ జూపినది.

"మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీస్సమాః।
యత్క్రౌంచమిథునా దేకమవధీః కామమోహితమ్"

మూర్థాభిషిక్తుడైన యశోకుడు కళింగ దిగ్విజయార్థము మహాసంగ్రామ మొనర్చి జయమును గైకొనెను. ఫలితము వేనవేలు ప్రజ మృతినొందుట గన్నారగాంచెను. హృదయము శోకముతో ద్రవించుకొనిపోయినది. అపారమైన జీవహింస కాతనిమనస్సు మారి యహింసాతత్త్వము నుపదేశించు బౌద్ధమతమునం దాదరణఁ జూపెను. ఆ మతావేశములో, తోడనే శిలాశాసనములు వెలసినవి.

క్రీస్తుపూర్వము మూడవశతాబ్దములో నీ శాసనములు నాటి బ్రాహ్మీ లిపిలోఁ జెక్కింపబడినవి. శాసనములలో నిట్లు దొలుత బ్రాహ్మీలిపి ప్రథమస్థానమొందినదనవచ్చును. స్థల భేదములనుబట్టి ఆ లిపియందు ఉత్తర బ్రాహ్మీ, దక్షిణ బ్రాహ్మీ యని రెండువిధములు గాన్పించును. మొదట నాభేద మీషన్మాత్రముగ నుండెడిది. పరిమాణసహజమగు లిపినుండి అనేక లిపులు బయలుదేరుట వింతకాదుగదా! అట్లే యుత్తరబ్రాహ్మీనుండి నాగరి, హిందీ, బెంగాలీ మొదలగు యుత్తరదేశ లిపులును, దక్షిణ బ్రాహ్మీ నుండి తెలుగు, కన్నడ, తమిళ మళయాల లిపులును యుద్భవించినట్లు భాషాశాస్త్ర వేత్తలు నుడివెదరు.

పైనఁ జెప్పిన బ్రాహ్మీలిపి గాక "ఖరోష్ఠి" యను మరియొక లిపియందుగూడ కొన్ని శాసనములు గలవు. పశ్చిమోత్తర భాగమునందును, గాంధారి దేశమునం దీ లిపి క్రీ॥ పూ॥ మూడవ శతాబ్దినుండి క్రీ॥ వె॥ నాల్గవ శతాబ్దివఱకు వాడుకలో నున్నట్లు దెలియవచ్చినది. ఇది బ్రాహ్మీవలె గాక కుడినుండి యెడమకు వ్రాయబడియున్నది.

అశోకుని శాసనములు మతావేశములో వెలసినవి గాన ధర్మబోధకములు మాత్రమే. బ్రాహ్మణులను, శ్రమణులను పూజించుట, వారికి దానము లొసంగుట, గురువులను, పితరులను సేవించుట, బీదలను, వృద్ధులను, అనాథుల నాదరించుట, భృత్యులయందు, జంతువులయందు దయఁ జూపుట సర్వప్రాణులయం దహింస మొదలగు ధర్మము లాతని శాసనములయం దగపడును.[1] ఆదర్శప్రాయమైన జీవితమును వానియందుఁ జూడగలము.

ప్రాచీన హైందవ రాజులు చతుర్విధ పురుషార్థములలో నాదియైన ధర్మమునం దాభిముఖ్యముగల వారనుటలో సందియము లేదు. మన అశోకుడు నట్టివాడే. ధర్మమహామాత్రులను నియమించి ప్రజలకు ధర్మమును బోధించుటయే గాక, వారి క్షేమమున కాతడు బాటలు వేయించుట, చెరువులు, నూతులు త్రవ్వించుట, వృక్షములను నాటించుట మున్నగు సౌఖ్యముల నెన్నిటినో కల్పించినట్లు శాసనములు చాటుచున్నవి.

---

1. Rock Edicts no. s. III D; IV C; IX G; XI C etc.

"అత్ర పానాని మే బహూకారాని తత తత కారాపి తాని పటీభోగాయే పసు మునిసానం."2—

మానవులు, పసువులు నీరు త్రావుటకు గాను నాచే నచ్చటచ్చట జలాశయములు నిర్మింపబడినవి.

"మగేసు పి మే నిగోహాని లోపాపితాని ఛాయో పగాని హోసంతి పసు మునిసానం అంబావడిక్యా లోపాపితా"3—

'మార్గములయందు నాచే పశువులకు, మనుష్యులకు నీడకొఱకు మఱ్ఱి మామిడి వృక్షములు నాటింపబడినవి.'

ప్రజల నాతడు తన కన్నబిడ్డలవలెఁ జూచుకొనునని యు, వారి సౌఖ్యమే తన సౌఖ్యమనియు, దానిచే నాతడు పరలోకమున సుఖించగలడనియు నాతని శాసనములలో గలదు.

"అథాపజాయే ఇచ్ఛామి హకం కింతి సవేన హిత సుఖేన హిదలోకిక—
పాల లోకికేన యుజేవు తి తథా...మునిసేను పి ఇచ్ఛామి హకం"—4

ఈ మాటలు అశ్వఘోషుని బుద్ధ చరితమందీ దిగువ శ్లోకమును జ్ఞప్తికిఁ దెచ్చును.

"స్వాభ్యః ప్రజాభ్యో హి యథా తథైవ
సర్వ ప్రజాభ్యః శివ మాశశంసే"—
(2 సర్గ॥ 35 శ్లో.)

సంఘములోని కొన్ని మూఢ విశ్వాసముల నాతఁడు నిరశించి యెట్టి జీవహింసయు కూడదనెను 5 ఆ కాలమున రాజుల వినోదార్థమై కల్పించబడి మల్లుల, ఎనుపోతుల, బెబ్బులుల దెబ్బలాటలను మాన్పించెను. అట్టివి మన రాజులకు వినోదార్థమని దెల్పుటకు విరాట పర్వమునందలి ఈ పద్యమును జిత్తగింపుడు.

చ॥ "వలసిన వేలు మేను బలవంతుఁడఁ గాఁ దెను
పోతు దంతి బె
బ్బులి మృగనాథునిం దొడరి పోరుదు శూరత
యుల్లసిల్లఁగా
దలమును లావు విన్న మెయి దర్పముఁ జేర్చి
పెనుంగు జెట్టి మ
ల్లుల విఱుతున్ వడిన్ గడియలోనన మూఁడ్కి
కి వేస్కసేయుదున్."
(వి॥ ప్ర॥ 223 ప.)

ఆతని శాసనములనుబట్టి పరిపాలనా సౌకర్యమున కాతడు మహామాత్రులు, ధర్మ మహామాత్రులు, రజుకలు, యూతలు, దూతలు, పురుషులు, ప్రదేశికులను ఉద్యోగులను నియమించినట్లు దెలియవచ్చుచున్నది. 6

అశోకుడు బుద్ధుని జన్మస్థలమగు లుంబినీ గ్రామము దర్శించి దానిని ఉంబలికగా అనగా శిస్తులేకుండఁ జేసెనట.

"లుంమిని గామే ఉబలికే కటే అఠభాగి యే చ."7

ఈ శాసనములలో విదేశీయులగు యవనులు (Greeks) స్వదేశీయులగు చోళ, పాండ్య, ఆంధ్రులను రాజవంశములును, మరియు కౌశాంబి, ఉజ్జయిని, తక్షశిల, పాటలీపుత్రము మొదలగు పట్టణముల పేర్లునుఁ దెలియవచ్చుచున్నవి. వానినిబట్టి ఆ సార్వభౌముని సామ్రాజ్యపు వైశాల్యము నూహింపనగును.

అశోకునకు శిలాశాసనముల కీ విధమైన యవినాభావ సంబంధమేర్పడెను. నిజమున కాతని నీ విషయమున 'భారత శాసనపు పిత' (Father of Indian Epigraphy) అనవచ్చును. శాసన వాఙ్మయమున కాతడు చిరస్మరణీయుడు.

Thus Asoka, who was infact the father of Indian epigraphy, showed that it is some kind of religious thought which actuated an Indian to set up an inscription."
(Prof. D. B. Diskalkar)

క్రీస్తువెనుక రెండు, మూడు శతాబ్దములవఱకీ శిలాశాసనము లనేకముగ గుహాలయందును, స్తంభములయందును చెక్కబడి గలవు. వానిని గూర్చి నూత్నముగఁ దెల్పి గుప్తుల కాలమునకు పోగలము. కళింగాధి

---

2. "The Inscriptions of Asoka"— Seventh Pillar Edict: Delhi—Topra. B. Round the Pillar (T).
3. —Do— Round the Pillar(R).
4. First Separate Rock Edict : Dhauli (F).
5. First Rock Edict: Girnar.
6. Third Rock Edict: Girnar.
7. Rummindei-Pillar inscription (C).

పతియగు ఖారవేలుని హాతిగుంఫ (Hatigumpha) శాసనములో నాతడు శుంగవంశ స్థాపకుడును, మౌర్య వంశ నాశకుడును అగు సేనాని పుష్యమిత్రు నోడించి నట్లు గలదు. గౌతమీపుత్ర శాతకర్ణిని గూర్చిన ప్రశస్తి నాశిక ప్రశస్తిలో గలదు. అల్హాబాదు ప్రశస్తి, నాశిక ప్రశస్తి, చంద్రవల్లి శిలాశాసనములనుబట్టి శకరాజుల పాలనమును, ఆరా, మోరా శాసనములనుబట్టి కుషాను క్షత్రపుల పరిపాలనములను దెలియగలము.

కృష్ణా జిల్లాలోని జగ్గయ్యపేట స్థూపములను, గుంటూరు నండలి నాగార్జునుని కొండ స్థూపములను బట్టి శాతవాహనుల పాలన మాంధ్రదేశమున నిక్ష్వాకులు, పల్లవులచే నంతమొందింపబడినట్లు దెలియును.

గుప్తుల కాలమున శాసనముల లిపిలోగూడ మార్పు స్పష్టముగ గాన్పించును. సంస్కృత భాషయొక్క సౌష్ఠవ మేర్పడినదని చెప్పవచ్చును. మహాకావ్యపు పోకడల నన్నింటిని శాసన రచనల యందుఁ జూడగలము. పరిపాలనా విషయమున వారు కడు సమర్థులనిపించుకొనిరి. బౌద్ధ, జైనమతముల ప్రాబల్యముచే నడుగంటిపోవు హిందూమతమును పునరుద్ధరించిరి. వీరి కాలమునకే స్వర్ణయుగమని పేరిడిరి.

సముద్రగుప్తుని అల్హాబాదు శాసనము కడు ముఖ్యమైనది. క్రీ॥ వె॥ 360 సంవత్సరములనాటిదిది. అతని దిగ్విజయములనుఁ దెల్పుచూ భారతదేశమున నాటి రాజవంశముల నన్నింటెనిఁ బేర్కొనెను. "ధనంజయ ప్రభృతి సర్వదక్షిణాపథ రాజగ్రహణ మోక్షానుగ్రహ జనిత ప్రతాపోన్మిశ్ర మహాభాగ్యస్య,"— దక్షిణ హిందూదేశమంతయూగూడ నాతనిచే జయించబడి నట్లు గలదు. ఆటవికులను, ఆర్యావర్తమునం దితర రాజులను గూడ జయించెనట. ఇట్టి విజయములకే నాతనిని పాశ్చాత్యులు "భారత నెపోలియన"ని నుడివిరి. కవికులతిలకుడగు కాళిదాసు తన రఘువంశమునందలి రఘువు దిగ్విజయములను వీనినిబట్టియే వర్ణించియుండ నోపు. కవులను, సంస్కృతభాషను గూడ నాతడు పోషించెను.

పై ప్రశస్తిని రచించిన కవి హరిషేణుడు. దీనిని గద్య పద్య మయముగా చంపు కావ్యముగఁ జేసెను. దండికి పూర్వమే నాల్గవ శతాబ్దిలో ప్రకృష్టమైన గద్యరచన శాసనములలోఁ జూడగలము. కాదంబరి, హర్షచరితము, దశకుమారచరితము మున్నగు గ్రంథముల యందుగల రాజుల వర్ణనములకు నీ శాసనమునందలి వర్ణనములకు గొన్ని పోలికలు గలవు. గద్యము ఓజోగుణ విశిష్టము దీర్ఘసమాసయుతము. పద్యములయందు స్రగ్ధరా, శార్దూల విక్రీడితము, మందాక్రాంతాది వృత్తములును, శబ్దార్థాలంకారములును గలవు. సుందరమైన చిన్న చంపు కావ్యమని జెప్పవచ్చును.

క్రీ॥ వె॥ 457 సంవత్సరము నాటిది స్కందగుప్తుని జునగడశాసనము. మ్లేచ్ఛులనాతడోడించి సమర్ధులగు పాలకులను తన రాష్ట్రములయందు నియమించినట్లును, సుదర్శన మను తటాకము (మౌర్యులకాలమున నిర్మించబడినది. రుద్రదాముని గిర్నార్ శాసనమునందు బేర్కొనబడినది.) గండి తెగగా మరల వేయించినట్లు గలదు.

ఈ శాసనమునందు కవినామము, గాన్పింపదు గాని కవి ప్రసిద్ధుడనుటలో సందియము లేదు. సుదర్శన తటాకమును గూర్చిన వర్ణనము పరమ రమణీయము. ఆతడు బ్రాహ్మణులను పూజించి వారి కనేక దానము లొసంగి యజ్ఞ, యాగాదికర్మలను ప్రోత్సహించి హిందూమతమును పునరుద్ధరించినట్లు గూడ గలదు. శాసన మంతయు పద్యరూపముగనే యున్నది. వారు వైష్ణవులని దెల్పుటకు వారి శాసనములు విష్ణుస్తుతితో నారంభింప బడినవి

"శ్రియమభిమత భోగ్యాం నైక కాలోపనీతాం
త్రిదశపతి సుఖార్థం యో బలే రాజహార |
కమల నిలయనాయాః శాశ్వతం ధామ లక్ష్మ్యాః
స జయతి విజితార్తి ర్విష్ణు రత్యన్త జిష్ణుః ॥

కుమారగుప్త, బంధువర్మల మందసూర్ శిలాశాసనము క్రీ॥ వె॥ 473 సంవత్సరముల నాటిది. చారిత్రకముగా నంత ముఖ్యమైనదిగాదు. లాట విషయము నుండి దశపుర నగరమునకు శిల్పులు వలసబోవుటయు నందు సూర్యదేవళము నొకదానిని నిర్మించుటయందలి విషయము.

దీనిని రచించిన కవి వత్సభట్టి. ఆతడొక మహాకవి యనియు నాతని రచన మహాకావ్యపు తునుక యనుట సత్యదూరము గాదు. మహాకావ్యపుఁ బోకడలన్నియు నిందుఁ జూడగలము. నగర నాగరికారామ గృహ నదీ ఋతు వర్ణన లిందు జొప్పింపబడి మిక్కిలి రమణీయత్వము నాపాదించినవి.

పండ్రెండు విధముల వృత్తభేదములను, కులకయుగ్మకములను, రస, ధ్వని, అలంకారములను, ప్రసాదగుణము మొదలగు మహాకావ్య సామగ్రినంతయు నిందు జూడ గలము. మచ్చున కీ శ్లోకము జూడుడు.

శ్లో. చతుః సముద్రాన్త విలోల మేఖలాం
సుమేరు కైలాస బృహత్పయోధరామ్।
వనాన్త వాన్త స్ఫుటపుష్పహాసినీం
కుమార గుప్తే పృథివీం ప్రశాసతి.॥

ఈ ప్రశస్తి దక్క ఇట్టి మహాకవి గ్రంథ మింకొకటి గాన రాకపోవుట యెంతయు దురదృష్టము.

యశోధర్మని మందసూర్ శాసనమున కింక బోవుదము. దాని కాలము దాదాపు క్రీ॥ శ॥ 532 సంవత్సరములని వచ్చును. దీని యందు యశోధర్మని ప్రశస్తిమాత్రమే గలదు. అతని వంశ వర్ణనముగాని యితర విషయములుగాని అంతగా లేవు లౌహిత్యా నది మొదలు పశ్చిమసముద్రము వఱకును, హిమాలయము మొదలు మహేంద్రగిరి వఱ కాతని సామ్రాజ్యము విస్తరించి యుండెనట. హూణరాజగు మిహిరకులు డాతనిచే యోడింపబడెనట.

వాసులుడని కక్కుని కొమారుడు దీనిని రచించెను. తుది శ్లోకము తప్ప మిగతయన్నియు స్రగ్ధరావృత్తములలో, దీర్ఘసమాసములతో గలవు. మొత్తముమీద కవి మహామేధావియని వచ్చును. ఈ క్రింది శ్లోకమాతనిది చూడుడు.

శ్లో. "నీచై స్తేనాపి యస్య ప్రణతి భుజబలావర్జన
క్లిష్ట మూర్ధ్నా
చూడా పుష్పోపహారై ర్మిహిరకుల నృపేణా
ర్చితం పాద యుగ్మమ్॥"—

ఈ విధమైన వర్ణన విశాఖదత్తుని ముద్రారాక్షసము నందీ క్రింది వర్ణనను బోలియున్నది.

"ఆగత్యా గత్య భీతి ప్రణత నృపశతైః శశ్వ
దేవ క్రియన్తాం
చూడా రత్నాంశు గర్భా స్తవ చరణ యుగస్యా
ఙ్గులీ రంధ్ర భాగాః"—(త॥ 19 శ్లో.)

విష్ణువర్ధన, యశోధర్మల మందసూర్ శాసనమున నొక వింత విషయము దెలియవచ్చుచున్నది. రవికీర్తి యను బ్రాహ్మణుడు, క్షత్రియవంశజయగు భానుగుప్త యను స్త్రీని వివాహమాడెనట. నిజమునకీ వివాహము "అనులోమ" మనబడు శాస్త్ర సమ్మతమైనదియే. దీని యందు గలుగు సంతానము గూడా సంస్కారాదుల వలన బ్రాహ్మణాదులే కాగలరు.

"తేషాం సవర్ణజాః శ్రేష్ఠాస్తే భ్యోఽన్వగనులోమజాః॥—ఏ తేఽను లోమజాః పుత్రాం సంస్కార్యాస్యుర్ద్విజాతయః"—8

చూడుడు:

రెండవ పులకేశి ఐహోళె (Aihole) శిలా శాసనము చాల ముఖ్యమైనది. దీని యుద్దేశ్యము రవికీర్తి యను నాతనిచే జైన దేవళ మొకటి నిర్మించ బడినదని దెల్పుట. చారిత్రకముగ నిది నాటి దక్షిణాపథ సార్వభౌముఁడగు రెండవపులకేశిని యాతని వంశమును వర్ణించి దక్షిణహిందూదేశమును యేడవ శతాబ్దిలోఁ బాలించిన రాజవంశములనుఁ బేర్కొనెను. ఉత్తర హిందూదేశమునకు సార్వభౌముఁడగు హర్షుని దిగ్విజయము నరికట్టినట్లు గూడగలదు.

శ్లో॥ "అపరిమిత విభూతిస్ఫీత సామన్తసేనా
మకుటమణి మయూఖాక్రాన్త పాదారవిన్దః।
యుధిపతిత గజేన్ద్రానీక బీభత్సభూతో
భయవిగళిత హర్షో యేన చాకారి హర్షః॥"

పై యాలయమును గట్టించిన రవికీర్తియే ప్రశస్తినిగూడ రచించెనట. "కర్తా కారయితా చాపి రవికీర్తిః కృతీ స్వయమ్." అంతయు పద్యరూపముగనే యున్నది. మహాకవుల కావ్యములను జీర్ణము చేసికొనిఁ దన ప్రశస్తి గూడనట్లే స్థిరకీర్తి నొందవలయు నని యాశించి రచించెను. కవి తల్లజులగు కాళిదాసు భారవులను సుదూరమనుకరించి యంతతో నాగక వారి నామోచ్చారణముఁ జేసి భాషాచరిత్రమున కొక మహోపకారమొనర్చెను. వత్సభట్టాదులవలె ధ్వనింపఁ జేయుటగాక వాచ్యముగ వారిరువురనుఁ బేర్కొనెను; "సవిజయతాం రవికీర్తిః. కవితాశ్రిత కాళిదాస భారవి-కీర్తిః"—

దీనినిబట్టి యేడవ శతాబ్దము నాటికైన కాళిదాసు, భారవులు సుప్రసిద్ధులని నొక్కి వక్కాణింపగలము గదా!

అపరాజితుని యువయపూర్ శాసనమును దామోదరు డను కవి రచించెను. అతని రచనగూర్చి క్రింది పద్యమును పరికించుఁడు.

శ్లో॥ "శ్రీ ర్ధ్యంబకీ స్థాణురతా చ గౌరీ
వైధవ్య దుఃఖోపహతా రతిశ్చ।
బాలా త్రిలోక్యా మతులోపమానా
సీమన్తినీనాం ధురి సైవ జాతా॥

---

8. History of Dharmasastra by P. V. Kane Vol. II Part I Page 58. and (foot-notes.)

సాంచి (Sanchi) యందు బౌద్ధశాసనములలో నొకదానియందు సనాసిద్ధ ఉపాసకుని భార్య, హరిస్వామిని యను ఉపాసిని ఆర్యసంఘమునకు కొంత ద్రవ్యమును దానమొసంగెనని దానివృద్ధిచే నొక భిక్షువునకు దినదినము భోజన మొసంగవలయుననియు, బుద్ధుని యాలయములో దీపారాధనఁ జేయవలయు ననియు గలదు 9

3. "—ఏసామ్ దీనారాణాం యావృద్ధి
4 రుపజాయతే తయా దివసే దివసే సంఘమస్య
ప్రవిష్టక భిక్షు రేకః భోజ
*
5 యితవ్యః [॥] రత్నగృహేపి దీనారత్రయం దత్తం।
తద్దీనారత్రయస్య వృ[ద్ధ్యా] రత్నగృహే
6 "భగవతో బుద్ధస్య దివసే దివసే దీపత్రయం ప్రజ్వా
లయితవ్యం"—

దాదాపు 8 వ శతాబ్దము నాటికే దేశ భాషల యందీ శిలాశాసనములు విరివిగా వెలయ నారంభించెను. దక్షిణ హిందూ దేశమున తమిళ, కన్నడ, తెలుగు భాషలయందును, ఉత్తర హిందూ దేశమున నాయా భాషలయందును గలవు. దక్షిణ దేశమున నీ శాసనములు లెక్కకు మీరి యున్నవి

దక్షిణ దేశమున చెంగల్పట్టు జిల్లాలోని యుత్తర మల్లూరు గ్రామమందలి వైకుంఠ పెరుమాళ్ళ దేవళముపై జెక్కబడిన రెండు శాసనములు గలవు 10 క్రీ॥ శ॥ పదియవ శతాబ్దిలోని చోళరాజైన మొదటి పరాంతకుని కాలములోనివి లిపి, భాషయు గూడ తమిళము. నాటి గ్రామ పరిపాలనా విధానము (Rural administration) న కేర్పరచిన సంఘములు, సంఘముల సభ్యులు, సభ్యుల యెన్నికలు, ఎన్నికల విధానము మొదలయిన విషయము లన్నియుఁ దెలియవచ్చును.

గ్రామస్థులను ముప్పది కుటుంబములక్రింద విభజింపవలయును, ఒక్కొక్క కుటుంబమునందలి వ్యక్తులు గూర్చుండి యెన్నికల జాబితాలను తయారు చేయవలెను. అట్టి జాబితాలలో వ్యక్తుల పేర్లనుఁ జేర్చుటకు కొన్ని నిబంధనలు గలవు. క్రితం మూడు సంవత్సరములనుండి అతడెట్టి పాలకసంఘ సభ్యుడుగ నుండరాదు. విరమించిన పాలక సంఘ సభ్యులతో నాతని కెట్టి బంధుత్వమునుఁ గూడదు. పన్నుకట్టు క్షేత్రమేమైన నుండవలెను, స్థిరమైన స్వంత గృహము కావలెను; ముప్పది సంవత్సరములకు పైబడి డెబ్బది వత్సరములకులోపు వయస్సుండవలయును; మంత్ర బ్రాహ్మణముల నధ్యయనాధ్యాపకముగా దెలిసి యుండవలయును. భాష్యమును బోధించు సమర్థుడుఁ గావలెను, న్యాయమైన యార్జనము, ధర్మమునందాసక్తిగలవారు మాత్రమే నందు జేర్ప నర్హులు.

ఎట్టివారి కందుఁజేర్ప నర్హతిలేదో గూడ వివరించ బడినది. పంచమహాపాతకములలో నెట్టిపాపము జేసినవాడును, ద్రవ్యాపహరణము చేసినవాడును, జాతిచే వెలివేయబడ్డవాడును, ఉచ్ఛిష్టము నారగించినవాడు నర్హులు కారు.

పైనఁ జెప్పిన జాబితాలలోని పేర్లనుబట్టి కొన్ని తాటాకు చీట్లను కుండలో వేయుటకు (కుడవోలై) తయారుఁజేయుదురు. వానినొక కుండలో బెట్టి ప్రజలందరి సముఖమున నీ విషయ మేమియుఁ దెలియని అమాయకపు బాలునిచే నొక్కొక్కటి, దీయించి చదివి వారు సభ్యులుగా నెన్నబడినట్లు ప్రకటింతురు. ఈ కార్యక్రమమునకొక రాజాధికారిగూడ సాక్ష్యముగ నుండవలెనట అవసరమునుబట్టి వారిని కొన్ని శాఖలుగ విభజింతురు. ఒక సంవత్సర కాలము మాత్రము వారు న్యాయముగ బాలించి విరమించవలెను.

పైఁజూపిన పది శతాబ్దములనాటి ఎన్నికలకును నేటి యెన్నికలకును తారతమ్యము తజ్ఞు లూహింతురు గాక!

చోళరాజుల కాలమున విద్యాలయములు, సత్రములు, వైద్యశాలలు విరివిగా నెలకొల్పబడినట్లు శాసనములలో గలవు 11 దేవళముల యాదాయము వీనికై వినియోగింపబడుచుండెనట. విద్యాలయములలో వేదశాస్త్ర, వ్యాకరణాది విద్య లభ్యసించుటకును, సత్రములయందు, వాస, స్నాన, భోజనాది సదుపాయములు అనేకముగ గలవు వైద్యశాలలలో వ్యాధిబాధితులకు ప్రత్యేకం పడుకలు, పథ్యాహారము, వంశపారంపర్యముగఁ జేయు వైద్యులు, శస్త్రచికిత్సకులు (శల్యక్రియై పణ్ణువాన్), సేవకులు, మంత్రసానులు (Nurses) వివిధావసరములు మున్నగు సహాయము లెన్నో గలవు.

ఈ శాసనములలో వివిధ రకములను జూడగలము. వీనిలో చాలభాగము దానశాసనములు మాత్రమే. దీనినే డాక్టరు ఫ్లీటు మహాశయు డిట్లు చెప్పెను.

---

9. The Gupta Inscriptions; No 62, Plate XXXVIII B'

10. Archaeological Survey of India, Annual Report 1904-5 page 131.

11. Annual Reports on Epigraphy 1924 page 119. para 16.

# ప్రాచీన శిలాశాసనములు

"For the great bulk of the epigraphic records that have come down to us we are indebted, not to any historical instinct of the Hindus, but of the religious side of their character and their disire for making endowments on every possible occasion."

అశోకుని శాసనము లన్నియు మత ప్రచారార్థమై వెలసినవి గాన ధర్మశాసనములు మాత్రమే. గుప్తుల కాలమున నీ శాసనములను ప్రశస్తు లనవచ్చును. యూపశాసనము లని యొక తెగగలవు. యజ్ఞ యాగాది కర్మలను ప్రోత్సహించుట కివి బయలుదేఱి యుండ నోపును. రాను రాను యివి యంత మెండినవి. జైన శాసనము లని వేఱొక తెగ గలవు. వీనిలో జైన సాధువులు "సల్లేఖనము" జేసి ప్రాణములు విడుచుట విషయము. దక్షిణ దేశమున కర్ణాటమందిట్టివి గలవు.

పూర్వము మనదేశమున నొక యాచారము గలదు. భర్త పరలోకమున కేగిన భార్యగూడా నాతని ననుసరించవలయునట. దానిని సహగమన మందురు. వీనిని దెల్పుచు 'సతీ శాసనము'లు గలవు. భారత స్త్రీ పాతివ్రత్యము నివి శిలాక్షరములుగా చాటుచున్నవి. ముసల్మానుల కాలము తర్వాత నివి యంతగా కాన్పించవు. వీరశాసనములు (Hero stones) పరిహార శాసనములని మరికొన్ని రకములుగూడ గలవు.

పైనఁ జూపిన యుదాహరణ శ్లోకములను బట్టి సాహిత్య విద్యార్థికి శాసనములయందలి సాహిత్యమును దెలిసికొనుట యెంత యవసరమోఁ దెలియును గదా! అజ్మీరునందు మనకింతవఱ కేవిధముగనూ దెలియని సోమదేవ కవిచే, చాహమానరాజు ప్రీతికొరకు రచింపబడిన 'లలిత విగ్రహరాజ' మను నాటకము గలదు. విగ్రహరాజు 'హరికేళి' నాటకము, మదనుని 'పారిజాత మంజరి' లేక 'విజయశ్రీ' నాటకమునందు రెండంకములు కూడ శిలలయందు గలవు. ఇట్లు సాహిత్య విద్యార్థి శాసన వాఙ్మయపు చవిఁ జూడనిదే యాభాష యందు పరిపూర్ణుడు గాలేడని నొక్కి వక్కాణించ గలము.

ఇట్లీ శాసనములు చారిత్రక, భూగోళ, సాహిత్య, దాన, ధర్మశాస్త్ర, వ్యవహారాది విషయములన్నిటిని దెల్పును. ఈ సందర్భమున వాగనుశాసనుడు భారత మునుగూర్చి చెప్పిన యీ క్రింది పద్యముఁదోచును.

"ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని,
యధ్యాత్మ విదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని, కవి
వృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని,
యైతిహాసికు లితిహాస మనియు"—

అమూల్యమయిన ఈ శాసనములు ప్రకృతివలన, అజ్ఞాన, మూర్ఖత్వములచే నెట్లు ధ్వంసముఁ జేయబడు చున్నవో చూడుడు.

సామాన్యముగ నీ శాసనములు గుహాభాగము లందుగాని, దేవళముల ప్రాకారపు వెలిగోడల యందునుఁ జెక్కబడి యుండును. దుస్సహమైన శీతోష్ణ పరిస్థితులకు గురియై శిలలయందలి యక్షరములు చెరిగి పోవును. తిరుపతి, శ్రీరంగము, సింహాచలములలోని శాసనముల కీ గతియే పట్టుచున్నది.

పల్లెలు, పట్టణముల పొలిమేరల యందుండు బండలు గూడా ప్రబల వాతావరణము నెదుర్కొన వలసినవే మరియు వ్యవసాయదారులు వానిపై తమ వ్యవసాయపు పనిముట్లను గీచి యందలి శాసనములను ధ్వంసముఁ జేయుచున్నారు.

కృష్ణా జిల్లాలోని భట్టిప్రోలు వద్ద అమూల్యమైన స్తూపములను మోసికొనిపోయి కృష్ణానది కానకట్ట గట్టి ముచ్చట పడిరి!

దేవళములను, గృహములను నిర్మించుతరి యందమైన శాసనపు శిలలను గొంపోయి కట్టడములు గావించి ఆనందించుచున్నారు. అర్చకుల ప్రోత్సాహముచే ధనవంతులు, జమీందారులు తమకు పుణ్యము గల్గుటకు గాను దేవళముల ప్రాకారములకు సున్నములు రంగులు వేయించి శాసనములను నాశనములుఁ జేసి పుణ్యములను గట్టుకొనుచున్నారు.

ముసల్మానులు హిందూ దేవాలయపు ధ్వంసమునకే యవతరించిరేమో! సర్వోత్కృష్టమైన సోమనాథ దేవాలయమును పదేపదే బగులగొట్టి యందలి శిలలను తమ ప్రాసాద సోపానములుగా నొనర్చి యనుభవించినారు. భరత్‌పూర్ నందు కామన్ (Kaman) లోని నొక మసీదు స్తంభమందు సంస్కృత భాషలో శాసన మొకటి గలదు12. దానినిబట్టి మొదట అదియొక వైష్ణవాలయమునకుఁ జెందిన శిలాఫలకమని దెలియును. మధ్యభారతమునందు జుమ్మా మసీదులో, ప్రాకృత నాటక మొకటి చెక్కబడిన విశాలపు శిలలను గోడల లోని కమర్చి యక్షరములు గానరాకుండ కట్టివేసినారు. ఇట్లు మన దేశచరిత్ర చాలభాగము ధ్వంసమగు చున్నది.

అత్యన్తోపయోగకరములైన ఈ శిలా శాసనములను మూర్ఖుల పాలుగాని, ప్రబల వాతావరణము నెదుర్కొన వీలుగాగానిఁ జేయక బుద్ధిమంతులు ప్రభుత్వమువారికిఁ దెల్పి దేశ చరిత్రమునకు దోడ్పడుదురు గాక యని ప్రార్థించుచున్నాను.

---

12. The Indian Antiquary vol. 10. Page 34.

# శప్తాహల్య

శ్రీ శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం

ప్రాప్తావస్థను జాలిమైఁ దెలియఁ జెప్పంజాల నే జాగృతిన్
సుప్తావస్థ నచించితావమతినై జోగంగ నేఁజాల - సం
తప్తాంత ర్హృదయమ్ము చిమ్ము విపరీతజ్వాలలన్ మ్రగ్గెదన్ —
శప్తాహల్యను! రామపాద సరసీజం బెంచి కేలొగ్గెదన్.

ఈ పాషాణములోఁ నణంగిన త్రపాహేతుల్ విజృంభింపఁగా
శాపావాప్త శిలాపటాపిహిత భస్మప్రాయనైతిన్ - పురా
పాపోద్ధత్యము స్వామికోపవివశత్వంబై ననున్ మూఁగగా
రేపున్ మాపును మ్రగ్గఁజేసె - వినువారే లేని యీకానలన్.

నాలో నాకు శరీరముం గలుగు - నంతర్దృష్టియుం గల్గు - చే
గాళుల్ మాత్రము రావు - నాల్కయును బల్కంజాల దొక్కింత - ఈ
శైలాకారము స్వామి కింపికని నాస్వాంతమ్ము సాంతమ్ముగా
నేలా మాయదు? మన్మనోవ్యథయు దానేలా ననున్ బాయదో!

ఔరా! శాపము - తాపముం బెనుపఁగా దా స్వామి సంధించె? - నా
నేరం బున్నదో లేదో యెవ్వఁ డెఱుఁగున్? నేరంబు లేకుండియున్
ఘోరావస్థలపాలు నేనయితినో! - ఘోరాఘభారోత్కటా
కారన్ దూఁచెడి త్రాసు లేమి, లఘుశితూలక్ష్యమే యైతినో!

పతికే నర్థ శరీరఁ - బూర్ణహృదయన్! ప్రత్యేకతల్ లేవు — నా
పతనం బాతనికై భరించితిని - శాపశ్రాంతి సైరించితిన్ —
బ్రతుకుం జావొక రీతిఁజూచితి - యథార్థంబే ప్రదర్శించితిన్ —
గతమాగామియు మీదు గట్టి, తన సంకల్పమ్మునం బెట్టితిన్.

# శ ప్తా హ ల్య

ఎటులైనన్, బరిణామ పూర్ణతకు మధ్యేమార్గమందున్న న
న్నిటు శిక్షాస్పదఁ జేసి త్రోసిచనె గానీ స్వామి, నాయందు లే
కెటు పోవున్ మమకార మాయనకు? తానే నేనుగా లోన మ్ర
గ్గుటయుం గన్నులఁ గట్టి నట్టులనె నాకుం దోఁచె నిప్పట్టులన్.

మహాస్త్రీయాశయముల్ సృజించుకొని-దిఙ్మాత్రంబుగా నైనఁ ద
న్మహిమల్ గాంచక సర్వతోఽపజితనౌ నాకంటె మేలే కదా,
సహానార్హ శ్రమబద్ధ జీవితగతిన్ సౌఖ్యమ్ము సాధించుచున్
స్పృహఁ గోల్పోవని మత్సఖీజను-లహో! నిష్ఠల్ వృథా కష్టముల్!

వ్యథయున్ వెల్తియు లేని పూర్ణత అలభ్యం బయ్యెనే కాని—నే
వృథమైపోయిన దేమి, యింతకును?-లోఁ బెంపొందఁడే జీవు?-డీ
మథనన్ బాల్గొను నాత్మసాధకులకున్ మా రుండునే?-కల్పనల్
కథలుం జెప్పిన యంత నాదు కరుణా గాథల్ ప్రబోధింపవే?

పరమాత్మన్ బడియుండలేక-యిటు జీవత్వప్రలోభమ్ము నన్
దరియన్, దూరము వచ్చి చేరితిని వందల్ వేలు జన్మాలుగా!
పురుషార్థావధి దాటి పోని వ్యసనంబుల్ సాలవా, జీవునిన్
మఱియున్ దూరము సేయ?-నింకఁ బరమాత్మన్ జేరు టేనాటికో!

దవ దగ్ధంబు మనస్సు-పై తనువు మాత్రం బున్న దీ యాకృతిన్—
భువనాధారుఁడు రాముఁ డుర్వితనయా బుద్ధిన్ బ్రయాణించు ము,
న్నవరేన్ దాపులనుండి యేగుచును గాలీ రాతిపై మోపి, నా
భవమోక్షాశలు కుప్ప కూల్పకుఁడయా! బ్రహ్మాయువుల్ మీఁకగున్.

# త్రిలోచన పల్లవుడు

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

తెలుగుదేశచరిత్రలోని మిథ్యాపురుషు లనబడు వారిలో త్రిలోచన పల్లవుడను పల్లవవంశపు రాజు ఒకడు. ఇంతవరకు చరిత్రకు తెలిసిన పల్లవ రాజవంశము లనేకము కలవు. వీటిలో కొన్ని మన తెలుగుదేశముననే వేరు వేరు ప్రాంతములందు పరిపాలనము చేసినవి. తెలుగుదేశమున పరిపాలనము నెరపిన పల్లవ వంశజుల సంతతిక్రమము శాసనముల వలన తెలియుచున్నది. కాని అట్టి ప్రాచీన పల్లవరాజ వంశములలో త్రిలోచన పల్లవుడను పేరుగల రాజే తెలియరాడు. పోనీ, ఆపల్లవ రాజులలోనే ఎవరికయినను త్రిలోచనపల్లవుడను నామాంతర మున్నదేమో యనిన నదియు గన్పట్టదు. ఇంకను విశేషమేమన ఆ పల్లవ రాజులలో ఎవ్వరికి నిటువంటి పేరే కనబడదు. స్కందవర్మ, వీరవర్మ, బుద్ధవర్మ, సింహవర్మ, వీరకూర్చవర్మ, విజయస్కంద వర్మ, కుమారవిష్ణు, విష్ణుగోప వర్మ, మహేంద్ర వర్మ- ఇటువంటి పేరులు గల పల్లవరాజులే శాసనముల వలన దెలియ వచ్చెదరు కాని త్రిలోచన పల్లవ, త్ర్యంబక పల్లవ, త్రినయన పల్లవ నామములను ధరించినవారు ఎవ్వరు గనపడరు. ఇటువంటి సందర్భములలో ఈ పల్లవవంశమున త్రిలోచన పల్లవు డెట్లు వచ్చెనో, ప్రాచీన కాలమున దేశమును పాలించిన పల్లవరాజులకు నీతనికి నెట్టి సంబంధము కలదో, ఇతడెక్కడి వాడో, ఏకాలము వాడో ఏమియు దెలియుట లేదు. అందువలన నీతని విషయము చరిత్రకారుల కొక సమస్యయైనది. ఇంతవరకు నీత డొక మిథ్యా పురుషుడనియే ఊహించుచున్నారు. కాని దేశములో వాడుకలో నున్న గాథల ననుసరించి చూచినచో నీతడు చారిత్రక పురుషుడే కాని మిథ్యాపురుషుడు కాడని చెప్పవలసి వచ్చుచున్నది. అందువలన త్రిలోచన పల్లవుడు చారిత్రక పురుషుడు కాని చారిత్రక వ్యక్తియని యెంచవలసి యున్నది. ఈతడు మిథ్యా పురుషుడని కొట్టివేయుటకును వీలులేదు; చారిత్రక పురుషుడని గట్టిగా బల్లగుద్ది చెప్పుటకును వీలు లేదు. అటువంటి విచిత్ర వ్యక్తి ఈ త్రిలోచనపల్లవుడు.

త్రిలోచన పల్లవుని గురించిన విషయ మంతయు స్థానిక చరిత్రముల వల్లను, అతని నుదాహరించు శాసనములవల్లను దెలిసికొన వలసినదే. ఇవియైనను అతని జన్మాదికమునుగురించి తెలుపవు అత డొనరించిన కార్యవిశేషములనుగురించి మాత్రమే తెలుపును. ఇక నీ త్రిలోచన పల్లవుని జన్మమును గురించి, అతని సంతతినిగురించి తెలుపునది కాటమరాజు చరిత్ర. ఇది నెల్లూరు నేలుచుండిన నలసిద్ధి రాజునకును, యాదవాధిపుడయిన కాటమరాజునకును పసులపుల్లరి విషయమున వచ్చిన వివాదము కారణముగా జరిగిన యుద్ధ వృత్తాంతమును దెలియజేయును. నలసిద్ధి రాజు పల్లవ వంశజుడని, భారద్వాజగోత్రుడని, ముక్కంటి సంతతి వాడని, కాటమరాజు చరిత్రలో కలదు. అట్లయిన త్రిలోచన పల్లవుని పేరయినను ఈ చరిత్రమున లేకే, నలసిద్ధి త్రిలోచన పల్లవుని సంతతివాడని కాని, అతని సంబంధియని కాని యెట్లు చెప్పవచ్చునని పాఠకులకు సంశయము తోచుట యుక్తము.

త్రిలోచనుడనగా మూడు కన్నులు గల శివుడు. త్రిలోచన, త్ర్యంబక, త్రినయనపదములు పర్యాయ పదములు. ఈమూటికిని మూడు కన్నులు గల శివుడని యర్థము. వీటికి సమానార్థకమైన తెలుగుమాట ముక్కంటి. ముక్కంటి యన్న మూడు కన్నులు గల ఈశ్వరుడనియే యర్థము. శివుని పేరే పల్లవనృపాలునికి పెట్టుటచేత అతనికి త్రిలోచనపల్లవుడని పేరు కలిగెనని యూహించుట సహజము, సమంజసమును. త్రిలోచనుడు, త్ర్యంబకుడు, త్రినయనుడు అను పేర్లు పెట్టుకొన్నవారందరు శివులని కాని, వారికి శివునివలెనే మూడుకన్నులుండునని కాని యెంచుట అసహజము, అవివేకమును. కాని త్రిలోచనపల్లవుని

# త్రిలోచన పల్లవుడు

విషయములో ఇది విరుద్ధమైనది. తెలుగుదేశమునందలి యడవిని నరికించి చాల ప్రదేశమును జననివాస యోగ్యము కావించి, దేవాలయములను నిర్మించి ఉత్తరహిందూదేశమునుండి, గంగాతీరమునుండి బ్రాహ్మణులను చతుర్థవంశజులను రావించి జనపదములు తీర్పించి బౌద్ధమునణచివైచి హిందూధర్మమును హిందూసంస్కృతిని పునరుద్ధరించిన త్రిలోచన పల్లవుడు కృతజ్ఞతానిబద్ధహృదయులైన హిందువుల దృష్టిలో శివావతారుడే, సాక్షాత్తు మూడు కన్నులు గల శివుడే యైనాడు. అందువలన జనులీతనని ముక్కంటియని ఈతనికి శివునివలెనే మూడు కన్ను లుండెనని విశ్వసించి యాతని కనేక గాథలు ముడిపెట్టిరి ఈ పల్లవరాజు నీకారణమున ముక్కంటి యని, త్రిలోచనపల్లవుడని, త్రినయనపల్లవుడని, త్ర్యంబకపల్లవుడని వ్యవహరించుచు వచ్చిరి పల్లవులు తాము భారద్వాజగోత్రులమని చెప్పుకొన్నారు వీరు సూర్యవంశజు లని కాటమరాజు చరిత్రలో నున్నది కాని అది నిజముకాదు. గాథల ననుసరించి చూడగా పల్లవులు ద్రోణాచార్యుని కుమారుడైన అశ్వత్థామకును నాగకన్యకును జనించిన పల్లవుని సంతతివార లని తెలియవచ్చును. అందుచేత పల్లవులు సూర్యవంశక్షత్రియులును కారు, చంద్రవంశక్షత్రియులును కారు. ఈ కారణమున త్రిలోచనపల్లవుడు ఇనవంశజు డనుట సరికాదు.

ముక్కంటి నామాంతరము గల త్రిలోచనపల్లవుని గురించి, అతని సంతతినిగురించి కాటమరాజు చరిత్రలో నిట్లున్నది:

అల్లధరణికోట అమరలింగమునకు
బ్రాహ్మణకన్యకుఁ బ్రభవించినాఁడు
మూఁడు కన్నులవాఁడు ముక్కంటియనగ
ముక్కంటి మనుమండు మొగి జనోధీరుఁడు
జనోధీరుని కుమారుఁడు మనోధీరుడు
మనోధీరుని కొమారుఁడు మన్మసిద్ధిరాజు
కొండొకసిద్ధిరాజు కొమారసిద్ధిరాజు
కస్తూరి సిద్ధిరాజు గండగోపాలరాజు
తల్లి యేసురు (?) సిద్ధిరాజు డళవాయి భీమన
పట్టభద్రుడు భారద్వాజగోత్రుండు
వరవితరణగుణవంశవర్ధనుఁడు
నవరసాలంకార నవమన్మథుండు
నిలఁగీర్తిగలరాజు నలసిద్ధిరాజు...

ఈ రీతిని నలసిద్ధి ముక్కంటి పల్లవుని సంతతి వాడని కాటమరాజు చరిత్రలో నున్నది. కాని దేశమున వాడుకలోనున్న ఇతరగాథల ననుసరించి చూచినచో ఈ వృత్తాంతము సరియైనది కాదని, కాటమరాజు ప్రఖ్యాతి చోళవంశజుడని తెలియవచ్చుచున్నది.

సరిగా ఇటువంటికథే పోశెట్టి లింగనకవి విరచితమైన చోళచరిత్రమను ద్విపదకావ్యములో ముక్కంటి చోడుని విషయమున జెప్పబడినది. ఆకథ యిది. ఒకప్పుడు కాళహస్తిపురములోని స్త్రీలు కొందరు శివాలయమున కరిగి శివుని పూజించిన యనంతరము తమ మరదలిని చూచి ఎకసక్కెమాడుచు నీ కోమలికి పుత్రు నొసంగిన యెడల పుట్టెడు జలములు తెచ్చి దీపారాధనము చేతుమని దేవునికి మ్రొక్కి దేవుని ప్రసాదము నామెకు కూడ నిప్పించిరి. కాలక్రమమున నామె గర్భము దాల్చుట, కుమారుని గనుట, తల్లిదండ్రులామెను నిందించుట మొదలైన వన్నియు జరిగినవి. ఇంచుమించుగా నిది వేములవాడ భీమకవి జన్మవృత్తాంతమును బోలినదే కాని నవచోళచరిత్రమున నిది చక్కగా వర్ణితము కాలేదు. ఈ కుమారుని గన్న స్త్రీ అవివాహితయో వితంతువోయై యుండవలెను. ఈ విషయ మా కావ్యమున విశదముగా లేదు. పుట్టిన కుమారుడు సామాన్యముగా నందరివలె రెండు కనులతో కాక ఫాలమునందలి నేత్రముతో గలిసి మూడు కనులతో బుట్టెను. అందువలననే ఇతనికి ముక్కంటి చోడుడని పేరు కలిగినది. గ్రంథకర్త ఈ ముక్కంటిని చోడుని జేసెనే కాని అతని కథయంతయు ముందు తెలుపబోవురీతిని ముక్కంటిపల్లవునిదే. ఈతని జన్మవృత్తాంతము కాటమరాజు చరిత్రలోను నవచోళ చరిత్రలోను ఇంచుమించుగా ఒకటే విధమున నున్నది. ఇక వ్యత్యాసమేమన అతడు అమరలింగమునకు బుట్టినట్లు దానిలో చెప్పియుండగా దీనిలో కాళహస్తీశ్వరుని కృపచే గలిగినట్లున్నది. ప్రాయికముగా త్రిలోచనపల్లవుడు శివాంశసంభూతుడని, శివునితో ఇంచుమించుగా తుల్యుడని చెప్పుటకే ఈ విచిత్ర కథాకల్పనము జరిగి యుండ

వచ్చును. మొత్తము మీద వేములవాడ భీమకవివలెనే ఈతడును దైవవరప్రసాద జనితుడు. కాటమరాజు చరిత్రలోను, నవచోళ చరిత్రలోను చెప్పిన ఈతని జన్మవృత్తాంతము కాని కాటమరాజుచరిత్రలో చెప్పిన ఈతని సంతతి క్రమముకాని విశ్వసనీయములైనవి కావు.

దేశమున వాడుకలో నుండిన గాథల ననుసరించి చూచినచో త్రిలోచన పల్లవునికి బలప్రాభవోపేతు లయిన సమకాలికు లిరువురు. ఒకరు కరికాలచోళ మహారాజు. ఇతడు చోడవంశజుడని పేరు ననుసరించి తెలియుచునే యున్నది. రెండవ వాడు చాళుక్య వంశజుడయిన విజయాదిత్య భూపతి.

త్రిలోచన పల్లవుడును కరికాల చోడుడును కూడ పరమమాహేశ్వరులు, పరమశైవులు, మహాశివ భక్తులు. త్రిలోచన పల్లవునివలెనే కరికాల చోడుడును చారిత్రక పురుషుడు కాని పరమాద్భుత చారిత్రక వ్యక్తి. సూర్యవంశోద్భవు లయిన చోళవంశముల కంతరికి కరికాలచోళుడు మూలపురుషుడు. త్రిలోచన పల్లవుడు చారిత్రక వ్యక్తి కాదన్న ఆంధ్రులార కొందరేమో కాని కరికాల చోళుడు చారిత్రక వ్యక్తి కాదన్న తమిళు లందరు కయ్యమునకు కాలు దువ్వుదురు.

కరికాల చోడుని గురించిన కథలు గాథలు ఎన్నియో యున్నవి. అతడొనరించిన మహాఘనకార్యములలో కావేరీనదికి దరులు కట్టుట యొకటి. అతని ప్రస్తావముగల ప్రతి శాసనములోను ఇంచుమించుగా అన్నిటను ఈ విషయమే ప్రధానముగా ఉటంకితమైనది. ఈ కారణముచేతనే ప్రాచీన కాలములో ఏనాడో వచ్చి తెలుగుదేశములో స్థిరపడి పోయిన తెలుగుచోళులని వ్యవహరింపబడుచువచ్చిన ఈతని సంతతిలోని ఒకశాఖవారి ప్రశస్తిలో తప్పక ఈ ఘన కార్య ప్రస్తావముండును. వారీవిషయమును ఘనముగ చెప్పుకొందురు. కరికాలచోళరాజు తనసామంతుల నందరిని పిలువనంపించి వారిచేత మట్టితట్టలు మోయించి కావేరినదికి దరులు కట్టించినాడట. ఆవిధమున కరికాలచోళుడు పిలువనంపిన వారిలో త్రిలోనిచన పల్లవుడు డొకడు. ఇతడు కరికాళచోడుని సామంతుడని యనలేము. సామంతులు కాని కరికాల చోళుని మిత్రు లితర భూవరులుకూడ అతని యాజ్ఞకు బద్ధులై అతడు తలపెట్టిన ఘనకార్యమున సాయము చేసిరని గాథలు తెలుపుచున్నవి. అటువంటి వారిలో త్రిలోచన పల్లవు డొకడేమో. త్రిలోచన పల్లవుడు కూడ కరికాల చోడుని వలెనే సమాన దర్పోద్ధత్యములు కలరాజే. కరికాలు డీతనిని జయించి సామంతుని కావించుకొనెనని చెప్పువారును కలరు. స్థానిక చరిత్రములు కరికాలచోడ త్రిలోచనపల్లవులను రాయలసీమలో కలుపుచున్నవి. కరికాలుడు కాంచీపురమును బట్టుకొని నట్లును, అచ్చటి కాంచీపురాధిపతి పల్లవరాజును జయించినట్లును చోళశాసనములు తెలుపుచు చున్నవి. కరికాలచోడుడు జయించిన పల్లవరాజు త్రిలోచనపల్లవుడని నిశ్చయముగ చోళశాసనములు తెలుపక పోయినను స్థానిక చరిత్రలలోని గాథల ఆధారమున ఈ పల్లవరాజు త్రిలోచన పల్లవుడేయై యుండునని నిర్ధారించుచున్నారు. కాంచీపురము తొండమండలము—తుండీర మండలము—లోనిది. ఈ తొండమండలము చిత్తూరు జిల్లాలోనికి వ్యాపించిన దేశము. కరికాలచోడనరపతి త్రిలోచన పల్లవుని జయించిన విషయ మెంతవరకు సత్యమో చెప్పలేము. కరికాల చోళుని ఘనకార్యములను ప్రశంసించు అతని సంతతి వారుకూడ కావేరికి దరులు కట్టిన విషయమునే ఘనముగ చెప్పుదురుకాని త్రిలోచన పల్లవు నోడించిన విషయమును పేర్కొనరు. ఈ సందర్భమున కరికాలసంతతిలో అతని పేరు వహించినవారు ఇంకను కొందరున్నారను విషయమును మనము జ్ఞాపకముంచుకొనుట యుక్తము. త్రిలోచనపల్లవుడు కరికాలచోడుని సామంతుడైన నేమి, కాకపోయిన నేమి. మొత్తముమీద అతడు కరికాలుని యాజ్ఞను పరిపాలింపలేదు. అందువలన కరికాల నరపతి కుపితుడై అత డెవరో స్మరణకు తెచ్చుకొనుట కాతని రూపువ్రాసి చూపుమని యడిగెనట. అంతట అతని అనుయాయులు త్రిలోచన పల్లవుని రూపు వ్రాసి చూపిరట. అప్పుడు తనయాజ్ఞ పాలింపలేదని ఉగ్రుడైన కరికాలనరపతి తన కాలి బొటన వ్రేలితో త్రిలోచన పల్లవ ప్రతిమ ఫాలనేత్రమును తుడిచి వేసెనట. వెంటనే యిక్కడ త్రిలోచన పల్లవుని మూడవకన్ను పోయినదట. ఇది కాళ్లు చేతులు లేని కట్టుకథ. కాని యిది అరవ చోళగాథలలో లేదు కాని తెలుగు చోళగాథలలో బహుళ ప్రచారములో నుండెను. ఈ గాథకు సాహిత్యములో

# త్రిలోచన పల్లవుడు

స్థావరము కల్పించిన మహాకవి తిక్కనసోమయాజి. ఇతడు తన నిర్వచనోత్తర రామాయణములో కృతిపతియైన తెలుగు చోళనరపాలుడు మనుమసిద్ధి వంశము నభివర్ణించు సందర్భమున ఇట్లు చెప్పియున్నాడు:

'చేసేతం బృథివీశు లందుకొనఁ గాశీ సింధుతో
యంబులం
జేసెన్ మజ్జన, ముంగటంబున హరించెం
బల్లవోర్వీశు ను
ల్లాసం బొందఁగ ఫాలలోచనము, లీలం గట్టెఁ
గావేరి పే
లా సాధ్యాఖిల దిఙ్ముఖుండు కరికాలక్ష్మావిభుం
డల్పుఁడే.!

ఈ పద్యమున తిక్కన సోమయాజి పల్లవోర్వీశుడని పేర్కొన్నవాడు త్రిలోచన పల్లవుడేకాని యన్యుడు కాడు. ఏలన అతనికే మూడు నేత్రము లున్నవని ప్రతీతి.

తెలుగు చోడ భూవరులు తమ ప్రశస్తిలో ఈ విషయమును సుస్థిరముచేసి యున్నారు. 'స్వస్తిచరణ సరోరుహ విహిత విలోచన త్రిలోచన ప్రముఖాఖిల పృథివీశ్వర కారిత కావేరీతీర కరికాలకుల రత్న ప్రదీప' కులమని వారు తమ వంశపు వక్కాణలో దర్పముతో ఈ విషయము నుద్ఘాటించి కరికాలుని సంస్మరించుకొనుచుందురు.

ఇక త్రిలోచనపల్లవునికి సమకాలికుడైన రెండవరాజు చాళుక్యవంశజుడయిన విజయాదిత్యుడు. దక్షిణదేశమును ప్రాచీనకాలములో పరిపాలించిన రాజవంశజు లందరు, పౌరాణిక వాఙ్మయ ప్రభావమున కావచ్చును, ఏ పౌరాణికవంశ గాథతోనో ముడివెట్టుకొని తాము గంగా యమునా నదీతీరప్రదేశములనుండియో ఆర్యావర్త పుణ్యభూమిలోని ఏ యయోధ్యాది నగరప్రాంతములనుండియో వచ్చినట్లు చెప్పుకొనుట ఆచారము. ఆర్యసంస్కృతి యంతయు అక్కడ పుట్టి పెరుగుటవలననే ఆ ప్రదేశమునకు ఘనత వచ్చినది. భారతీయ సంస్కృతికి మూలకందమైన వాఙ్మయ మంతయు అచ్చటిదే. ఆ వాఙ్మయకర్తలైన మేధావు లందరు అచ్చటివారే. ఈ కారణముచేత ఆర్యావర్తమునకు, ఆర్యావర్తగర్భితమైన ఉత్తర హిందూదేశమునకు, ఎక్కడలేని ప్రశస్తియు వచ్చినది. ప్రాచీన రాజవంశములును, తదితరములును కూడ ఘనతకొరకు తాము ఉత్తరదేశమునుండి వచ్చినవారమని చెప్పుకొనుట విలాసమయినది. అదియునుగాక ఉత్తరదేశమునుండి దక్షిణదేశమునకు వచ్చిన ఆర్యజాతులు ఎన్నో యున్నవి. ఈ జాతులవారే ఆర్యసంస్కృతిని దక్షిణాపథమున ప్రాకించిరి. చళుక్య వంశ్యుడయిన విజయాదిత్యుడు విజిగీషువై దక్షిణదేశమునకు వచ్చెనట. ఇతని పూర్వులు ఏబది తొమ్మండ్రు అయోధ్యాపుర సింహాసనము నధిష్ఠించి తత్ప్రాంతదేశమును పరిపాలించిరట. విజయాదిత్యుడు తన పట్టమహిషితోను, పరిజనముతోను దక్షిణదేశమునకు విజిగీషువై వచ్చునాటికి ఈ దేశమును త్రిలోచనపల్లవుడు పరిపాలించుచుండెను. అప్పు డుభయులకు భయంకర యుద్ధము జరిగినది. ఆ యుద్ధములో విజయాదిత్యుడు నిహతుడయ్యెను. గర్భిణియైన అతని మహాదేవి ఆయుద్ధమున నెట్లో తప్పించుకొని పురోహితుని, పరిచారికలను దీసికొని ముడివేము అను అగ్రహారమునకు పోయెను. తదగ్రహార వాస్తవ్యుడయిన విష్ణుభట్ట సోమయాజి యను విప్రుడు ఆమెను తన యింటబెట్టుకొని కన్నకూతురువలె కాపాడెను. ఆమె యతనియింట నుండినకాలముననే నవమాసములు నిండినవెనుక ఒక కుమారుని గనెను. విష్ణుభట్ట సోమయాజి యా శిశువుకు జాతకర్మాది సంస్కారము లన్నియు చేసి యాతనిని యుక్తవయస్సు వచ్చినపిదప సమస్త విద్యలయందును ప్రవీణునిగావించెను. విజయాదిత్యుని మహాదేవి తన కుమారునికి తన ఆశ్రయదాత పేర విష్ణువర్ధనుడని పేరు పెట్టెను. పెరిగి పెద్దవాడయిన విష్ణువర్ధనుడు జరిగిన యాపద్వృత్తాంతమును తన తల్లివలన తెలిసికొని చాళుక్యగిరికేగి యచట గౌరియైన నందాభగవతి నారాధించి కుమారనారాయణ మాతృగణములను సంతర్పితములు గావించి స్వకులక్రమాగతముగ వచ్చుచుండిన శ్వేతాతపత్ర, శంఖ, పంచమహావాద్య, పాలీకేతన, ప్రతిఢక్కా, వరాహలాంఛన, పింఛ, కుంత, సింహాసన, మకరతోరణ, కనకదండ, గంగాయమునాది సామ్రాజ్య చిహ్నములను తెచ్చి, కదంబులు గంగులు మొదలైన భూవరులను నిర్జించి సేతునర్మదా మధ్యస్థమైన సార్ధసప్త లక్షదక్షిణాపథమును పరిపాలించెను. విష్ణువర్ధనుని భార్య పల్లవవంశమున జనించిన మహాదేవి. ఈ యుభయులకు జనించినవాడు (రెండవ) విజయాదిత్యుడు. సముద్రతీరస్థమైన వేంగిదేశమును పరిపాలించిన పూర్వ చాళుక్య భూపతుల పౌరాణికవంశ కథనమిది. మొట్టమొదటి మారిది రాజరాజనరేంద్రుని తండ్రియైన విమలాదిత్యుని శాసనములలోనే కానవచ్చును.

[సశేషము]

# నేను, మాజానకి

## శ్రీ వేదుల లక్ష్మణమూర్తి

అది పట్నంలో విశాలమైన వీథి ఉదయం ఎనిమిది గంట లౌతుంది. నేను నెమ్మదిగా సైకిలుమీద పోతున్నాను. మెల్లగా వీచే చల్లని గాలికి సైకిలు స్వేచ్ఛగా తెరచాపకట్టిన నావలా నడుస్తోంది. సూర్యరశ్మి వెచ్చగా వీపుకి తగులుతోంది. చల్లని గాలి, వెచ్చని ఎండ మత్తును కలుగజేస్తున్నాయి. కూరగాయల కావిళ్లు, పాలు, పెరుగుకంపలు అక్కడక్కడ కనుపిస్తున్నాయి. అటూ యిటూ దిక్కులు చూస్తూ సైకిలు సాగనిస్తున్నాను. తెలవనితెలంపుగా సైకిలుకి బ్రేకు వేశాను. హఠాత్తుగా సైకిలు ఆగింది. ఇంతవరకూ పరధ్యానంగానూ మత్తుగాను ఉన్న కారణంచే ప్రక్కకు వాలిపోయాను. అంతటితో మత్తు వదలిపోయింది. గుండె ఒక్కసారి దడదడలాడింది దిక్కులు చూచే కళ్లు క్రిందకు వాలాయి. ఒక్కసారిగా యేవేవో విషయాలు మనస్సులో గిర్రున తిరిగాయి కళ్లు పైకెత్తడానికి ధైర్యం చాలడంలేదు. సైకిలును క్రిందా మీదా చూచాను. మనస్సు కలవరపడుతోంది. ఆ వీథికి కుడివైపున ఉన్న ఇళ్ళవరుసను చూడగలిగాను కాని ఎడమవైపు వరుసను, తలవంచి కనుకొలకుల్లోనుంచి చూచాను. సందేహంలేదు. నేను అనుకొన్న వ్యక్తియే. ఇటువైపే చూస్తోంది. ఆమె ఇక్కడ ఉండడానికి కారణ మేమో నాకు బోధపడలేదు. విశాఖపట్నంలో ఉన్నారని ఎప్పుడో విన్నాను. బహుశా ఆమె భర్తకు బదిలీ అయియుండవచ్చు. ఎదుటికి వెళ్ళడమా? వెనక్కి పోవడమా? ఏమీ తోచలేదు. ఒక నిమిషం సైకిల్ని పరీక్షించి, ఇంకో నిమిషం బట్టలు సవరించుకొని సైకిలు ఎక్కాను. కళ్లు మాత్రం ఆ వ్యక్తివైపుకి లేవడంలేదు. మరోవైపుకు ధ్యానంతో చూస్తున్నాను. రోడ్డు చాలా ఖాళీగా ఉంది. రోడ్డు బళ్లూ కార్లూ మొదలైనవాటితో రద్దీగా ఉంటే నాకు కొంత సదుపాయంగా ఉండేది. సైకిలు చురుగ్గా నడుస్తోన్నట్టు తోచింది. ఆ యింటికి మరీ దగ్గరగా వచ్చేశాను. ఎదుటికి వెడితే ఆమెను పలుకరించాలి. తరువాత వారి యింట్లోకి వెళ్లాలి. కుశలప్రశ్నలు వెయ్యాలి ప్రస్తుతం నే నున్న బీదస్థితిలో నాకు తగిన గౌరవ మిచ్చి ఆమె మాట్లాడుతుందా? ఆమె భర్తను, ముందుగా నేనే పలుకరించాలేమో! అతన్ని యేమని సంబోధించాలి? వారిద్దర్నీ 'ఏమండీ' అని గౌరవించాలేమో!—అటు చూడకుండా నే ఆ యింటి యెదుటికి వచ్చేశాను. ఆమె పిలువకుండా ఉంటే బ్రతికిపోతాను—అని మనస్సు కోరుతోంది సైకిలు నెమ్మదిగా దొర్లిపోతోంది. ఇల్లు దాటేశాను. ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడిచాను. శరీరానికి బిగియగట్టిన త్రాళ్లు విప్పినటైంది. గాఢంగా గాలిని పీలుస్తూ సైకిలు పెడలు గట్టిగా క్రిందికి తొక్కుతున్నాను. ఇంతలో 'ఏమండోయ్! అనే పిలుపువీపుమీద చరచినట్లు వినిపించింది. సైకిలుబ్రేకు నొక్కి వెనక్కి తిరిగి చూచాను. పది పన్నెండేళ్ల కుర్రాడు నా దగ్గరకు పరుగెత్తుకొని వస్తున్నాడు. సైకిలు దిగక తప్పిందికాదు. వాడు నా దగ్గరకు వచ్చి 'అమ్మగారు పిలుస్తున్నారండి' అన్నాడు. అటు చూచాను. ఆమె అక్కడనే నిలబడి ఉంది. సైకిలు మళ్ళించి వాని వెనకనే వెళ్లాను. ఆమె లోపలికి వెళ్ళింది. సైకిలు అరుగునకు జేరపెట్టి మెట్లు ఎక్కాను. ఆమె గుమ్మంలోపల నిలబడి 'ఏం రామం, మమ్మల్ని మరచిపోయావా?' అంది. ఒకసారి ఆమె ముఖం చూచాను. శాంతంగానూ, గంభీరంగానూ ఉంది. నవ్వుగాని, విచారంగాని ఆ ముఖంలో లేవు. 'అబ్బే! మరచిపోతానా? ఇక్కడున్నారేమిటి? మీ ఆయనకు ట్రాన్స్ఫరైందా? అని ప్రశ్నించాను. 'ఔను, ఒక నెలైంది ఇక్కడికి వచ్చి. రా, లోపలికి' అంటూ లోపలికి నడిచింది. వీథివైపు వున్నది చిన్న పెంకుటి వసారా. అది దాటి ఆధునిక పద్ధతుల్లో కట్టబడిన డాబాలోకి ఆమెవెనుక నే నడిచాను. డాబా చాలా శుచిగానూ ఆకర్షణీయంగాను ఉంది.

## నేను, మా జానకి

హాలులో ఒక రౌండ్ టేబిలు చుట్టూ నాలుగు కుర్చీలు ఉన్నాయి నన్ను కూర్చోమని చెప్పి లోపలికి వెళ్లింది. నేను హాలులో నలువైపులా చూచాను. ఆడంబరమేమీ లేదు గోడలు తెల్లగా మెరుస్తున్నాయి వీధి గుమ్మానికి ఎదురుగా గోడమీద గడియారం, రెండు కేలండర్లు, హాల్లో ఒకమూల రేడియో ఉన్నాయి. రెండునిమిషాల్లో ఆమెవచ్చి కాఫీతో వున్న కప్పు ఎదుట పెట్టింది. 'ఇప్పుడు ఎక్కడ వుంటున్నావ్?' అని ప్రశ్నించింది. నాకు తాగుతూన్న కాఫీ పలమారింది. కప్పు బల్లమీద పెడుతూ దగ్గి గొంతుక సవరించుకొన్నాను 'ఇక్కడే, టౌన్‌లో' అన్నాను. 'ఏంచేస్తున్నావ్?' అని అడిగింది. రెండు గుక్కలు కాఫీ మింగి ఒక క్షణం ఆలస్యంచేసి అన్నాను— 'షావుకారుదగ్గర గుమాస్తా' 'మకాం ఎక్కడ?' 'హోటల్లో'; 'మామయ్యగారి జాడ ఏమైనా తెలిసిందా?' మా నాన్నగారు ఆమెకు మామయ్య. 'లేదు' అని జవాబిచ్చాను.

ఇంతలో కాలిబూటు చప్పుడు వినిపించి అటు చూచాను. వస్తూనే 'ఏమోయ్! ఎక్కడనుంచిరాక?' అని అతనే నన్ను పలుకరించాడు. 'ఇక్కడే టౌన్‌లో ఉంటున్నాను' అని జవాబిచ్చాను. 'ఓ! అలాగా! నువ్వు ఇక్కడ ఉంటూన్నట్లు మాకు తెలియనే తెలియదు!' కొంచెం ఆశ్చర్యాన్ని వెల్లడిస్తూ నాకు ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు. 'నాకూ తెలియదు—మీరు ఇక్కడ వుంటున్నట్టు...' ఇంతవరకూ హాలులో లోపలిగుమ్మాన్ని ఆనుకొని నిలబడి వున్న జానకి—'నేను కూరలకొవిడిమాడ్డానికి అరుగు మీదికి వెడితే ఇతను సైకిలుమీద వెడుతూ కనుపించాడు. మన నాయుడు పరుగెత్తుకొని వెళ్లి తీసుకొచ్చాడు. ఇక్కడే షావుకారుదగ్గర గుమస్తాపని చేస్తున్నాట్ట. మకాం హోటల్లోనట' అని చెప్పి నాకు శ్రమను తగ్గించింది. ఇంతవరకూ వారు నన్ను చేసిన సంబోధనలతో నాకున్న కలవరం చాలవరకు తగ్గింది. నన్ను వారు సంబోధించినట్లే నేనూ వారిని సంబోధించవచ్చు, అనే ధైర్యం కలిగింది.

'అలాగా, షావుకారు జీతమేమిస్తాడు?' అని ప్రశ్నించాడు. 'ముప్ఫై' అన్నాను. 'అరే! ముప్ఫైలోను ఇరవైయైదు హోటలుకే పోతే మిగిలిన అయిదు రూపాయలతోనూ కాలక్షేపమెలా చేస్తున్నావు?' అన్నాడు ఆశ్చర్యంగా. 'నాకు పైఖర్చు చాలా తక్కువ. అవే సరిపోతున్నాయి' అన్నాను.

'నువ్వు స్కూలుఫైనలు క్లాసు పాసయినట్లున్నావు; వేరే మంచి ఉద్యోగమెక్కడా దొరకలేదూ?'

'ఇంటర్ కూడా పాసయాను. ఉద్యోగంకోసం తిరిగి తిరిగి ప్రాణం విసిగిపోయింది. చివరికి ఈ షావుకారు దైవంలా దొరికాడు.'

"అరే! ఈపాటికి యేదో డిపార్టుమెంటులో చేర్చేవాణ్ణి నావల్ల కాకపోయినా నన్నెరుగున్న ఆఫీసర్లు చాలామంది ఉన్నారు. వాళ్ళతో చెప్పేయుందును." నేనేమీ జవాబు చెప్పలేదు. ఇంతవరకూ యీ దంపతుల్ని గురించి నాలో కరడుకట్టిన భావాలు మెల్లగా కరగిపోసాగాయి. వీరికి ధనమున్నదనే గర్వం ఉన్నదనీ, ఆ ధనగర్వంతోనూ, అహంభావంతోనూ లేనివారిని నిర్లక్ష్యభావంతో చూస్తారనీ అనుకొనేవాణ్ణి. కాని ఇప్పుడు ప్రత్యక్షంగా వారి నిరాడంబరత వారి మాటల్లోనూ వేషంలోనూ స్పష్టంగా గోచరిస్తోంది. వారికి ఇతరుల కష్టాలయెడల సానుభూతి ఉండదని తలచేవాణ్ణి. కాని ఇప్పుడు నన్ను గురించి వారు వేసే ప్రశ్నలవల్ల నా తలపులు పూర్తిగా నిరాధారమైనవని నా అంతరాత్మ నాకు ప్రబోధిస్తోంది. నా సంకుచిత మనస్తత్వానికి సిగ్గుపడ్డాను.

"ఇప్పుడేమీ మించిపోయింది లేదుగా. రేపు మీరు ఉద్యోగం యిప్పిస్తే యివేళ సాయంకాలం గుమస్తాగిరీకి స్వస్తిచెప్పి రేపు ఉద్యోగంలో చేరతాడు." అని జానకి నా మనస్సులోని మాటను చెప్పింది.

'ఓ! అలాగే, తప్పకుండా ప్రయత్నంచేద్దాం' అని ఒకక్షణం ఆగి 'నీకు పెళ్ళికాలేదు కదూ?' అని నన్ను ప్రశ్నించాడు.

ఈ ప్రశ్న వానికి చాలా సాధారణమైనది. నా కష్టసుఖాలు తెలుసుకొనే ప్రయత్నంలో ప్రశ్నించి ఉంటాడు. ఆ ప్రశ్న నా మనస్సుమీద యెంతగా పనిచేస్తోందో వానికి తెలియదు. ఈ రోజున వీరిని కలుసుకొనడమే నాకు చాలా బాధాకరమైన విషయం. కాని వీరి సంభాషణా విధానం, నాలో నిరాధారంగా పాతుకొనిపోయిన తప్పుడు భావాల్ని దూరంచేసి నా

మనస్సుకి కొంత ఊరట కలిగించింది. కాని నా పెళ్ళికి సంబంధించిన ప్రశ్న రాగానే నా హృదయంలో మానుతూన్న గాయం రేగింది. ప్రశ్న సద్భావంతో అడిగినదవడంలో సందేహం లేదు. ప్రస్తుతం నేనున్న పరిస్థితిని తెలుసుకోవేందుకు ఈ ప్రశ్న వేయబడిందని అతని ముఖం చూస్తేనే తెలుస్తోంది. ప్రశ్నకు జవాబు చెప్పడం చాలా తేలిక. 'అయింది', 'లేదు' అనే వాటిలో ఒక్క మాట చెబితే చాలు. కాని ఆ ప్రశ్నతో నా మనస్సులో బయలుదేరిన ఆందోళన కారణంగా వెంటనే జవాబు చెప్పలేక పోయాను. ఇంతలో మాకు యెదురుగా గుమ్మంలో నిలుచున్న జానకి— 'లేదు, ఇంకా కాలేదు' అని జవాబుచెప్పి నా మనస్సుకి కొంత బరువు తగ్గించింది. నేను లేచి నిలబడి 'వెళ్ళివస్తాను' అన్నాను.

'ఈపూట మాయింట్లో భోజనం చేసి వెళ్లు' అంది జానకి.

ఆమె మాటతో మాటకలుపుతూ 'నిన్ను ఉద్యోగంలో ప్రవేశపెట్టేవరకూ నీవు మా యింట్లోనే మకాం పెడితే నీ ఉద్యోగాన్ని గురించి నాకు శ్రద్ధ ఉంటుంది. భోజనం చేసి వెళ్లి ఇవాళే హోటలుకి స్వస్తిచెప్పు. నీ పెట్టే బేడా తీసుకొనిరా, అని అంటూ లేచి చొక్కా విప్పుకొన్నాడు.

"అలా చెయ్యి రామం" అంటూ జానకి అతనికి నాకూ స్నానానికి కావలసిన తువ్వాళ్లు ఎదుట బెట్టింది.

ఏం చెప్పాలో, ఏం చెయ్యాలో తెలియని అయోమయంలో పడింది నా మనస్సు. ఒక నిమిషం గడిచాక 'ఇప్పుడు కాదు, మళ్లీ వస్తానుగా!' నా ఉద్యోగాన్ని గురించి నేనే జ్ఞాపకం చేస్తూంటాను, తరచూ వస్తూంటాను. ఈ వీథిని బాకీ పనులు చెయ్యడానికి వచ్చాను. వెంటనే దుకాణానికి పోవాలి అని తొందరగా తడబడుతూ అన్నాను.

"నువ్వు అంతగా మొహమాటపడితే ఎలాగ! మా యింట్లో నువ్వు స్వేచ్ఛగా ఉండొచ్చు. నీకూ నాకూ కూడా మన కష్టసుఖాలు కనిపెట్టే పెద్దవాళ్లెవరూ లేరు. నా తమ్ముడైతే వాని బాధ్యతంతా నేను వహించనూ? నువ్వు పరాయివాడవు కావు. ఈమధ్య జానకి చెప్పగా నిన్ను గురించి విన్నాను" అని శాంతంగానూ గంభీరంగానూ మాట్లాడి నా దగ్గరకు వచ్చి భుజంమీద చెయ్యివేశాడు.

నాకు అప్రయత్నంగా కళ్లు నీళ్లతో నిండాయి. అతన్ని కౌగలించుకొని బావురు మని యేడుద్దామా అనిపించింది. ముఖం ప్రక్కకు తిప్పుకొని దుఃఖాన్ని దిగమ్రింగడానికి ప్రయత్నిస్తున్నాను. అతను జానకిని వివాహం చేసుకోడానికి పూర్వం అతనికీ నాకూ బంధుత్వమేమీ లేదు. వారి వివాహమైన తరువాత అతన్ని కలుసుకొని మాట్లాడ్డం ఇది మూడోసారి. ఈసారి కలుసుకొన్నప్పుడే అతనికీ నాకూ సంభాషణ ఎక్కువగా జరిగింది. అతనితో నాకు స్నేహంకూడా లేదు. ఇంక జానకికి నాకూ బంధుత్వ మేమిటే అంటే వెంటనే చెప్పలేను ఆమె అమ్మగారి యిల్లు మాయిల్లు చేరి దగ్గరగా ఉన్నాయి వాళ్ళ నాన్న మాఅమ్మ అన్నదమ్ముల పిల్లలని ఒకటి రెండుసార్లు మావాళ్లెవరో చెప్పారు. ఆమె నాకు జానకి, నేను ఆమెకు రామం. ఆమెకు పెళ్ళికానంతవరకు మేము ఒక్కపూటైనా యెడబాటులేని సహచరులం. నేను వ్యక్తిని, ఆమె నీడ. లేదా ఆమె వ్యక్తి, నేను నీడ. ఆమెకు పెళ్ళి కానంతవరకూ ఒక్కపూటైనా మమ్మల్ని విడదీయ గల శక్తి నా తలితండ్రులకు కాని ఆమె తలితండ్రులకు గాని లేకపోయింది. కాని పెళ్లయిన తరువాత ఆమెను ఆమె భర్తతోపాటు నేడు మూడోసారి చూచాను. ఇంతకుముందు ఆమెకు నాకు జరిగిన రెండు సన్నివేశాలు రెండు మూడు మాటలతోనే ముగిశాయి. నేటి సమావేశంలో వారిద్దరూ నాయెడల ఇంత ప్రేమాభిమానాలు చూపించడానికి కారణమేమో నాకు బోధపడలేదు. జానకిలోకంటె అతని మాటల్లోనూ ప్రవర్తనలోనూ వెనుకటి సమావేశాలలోకంటె ఇప్పుడు చాలా మార్పు కనుపిస్తోంది. నేను అనాథుణ్ణి అయిన తరువాత వానిలో జాలికలిగి యీమార్పు వచ్చిందా అని అనుకోడానికి కూడా అవకాశం లేదు. మా అమ్మ చనిపోయి మానాన్న విరాగియై నన్ను విడిచి కనుపించకుండా పోయిన తరువాత వారికి నాకు సమావేశం జరిగింది. రెండుమూడు మాటలతో మా పొరుగువాళ్ళ ముఖంచూస్తూ పరోక్షంగా సానుభూతి వెల్లడించారు.

ఏమైనప్పటికీ ఇప్పుడు వారు నాయందు చూపిన ఆదరాభిమానాలు నన్ను తన్మయుణ్ణి చేశాయి.

ఏడెనిమిది సంవత్సరాల క్రిందటి విషయాలన్నీ ఒక్కసారి మనస్సులో గిర్రున తిరిగాయి. లేని దగ్గు తెచ్చుకొని బయటికి వెళ్ళి, ఉమ్మివేశాను, కళ్లు తుడుచుకొన్నాను. లోపలికివచ్చి నీరసంగా కుర్చీలో కూర్చున్నాను.

'స్నానంచేద్దాం, రా!' అని అతను తువ్వాలు తీసుకొన్నాడు. నేనూ మాట్లాడకుండా తువ్వాలు తీసుకొన్నాను. జానకి లోపలికి వెళ్లింది. ఆమె వెనకనే అతనూ నేనూ స్నానాలగది దగ్గరికి వెళ్ళాం. వేడినీరు తోడి కుళాయిదగ్గర పెట్టి జానకి వెళ్ళింది.

'నువ్వు ముందు కానియ్యి' అని అతను లోపలికి వెళ్లాడు. నేను స్నానంచేసి బట్టలు వేసుకొని హాలులోకి వచ్చాను. అతనుకూడా స్నానం చేసిన తరువాత జానకి వడ్డించగా మేమిద్దరం భోజనం చేశాము భోజనం చేస్తూ ఉద్యోగాల్ని గురించి అతను యేవేవో చెప్పుకొని వచ్చాడు. అతను చెప్పే మాటలన్నింటికి తలూపుతూ త్వరితంగా భోజనం ముగించాను. అతను చెప్పిన మాటలు చాలా తక్కువగా నా చెవుల్లో ప్రవేశించాయి ఏయే పదార్థాలు తిన్నానో కూడా తెలియనిస్థితిలో నా భోజనమైంది. జానకి వడ్డించడం నేను తినడం ఎనిమిది సంవత్సరాల తరువాత నేటికి తటస్థించింది. ఆమెకు వివాహం కాకపూర్వం తరచూ టిఫెన్లుచేసి నాకు పెడుతూ ఉండేది. అప్పుడు తిన్న ప్రతిపదార్థం యొక్క రుచి నాకు యిప్పటికీ జ్ఞాపకముంది. కాని ఇవేళ నేనేమి తిన్నానో, వాటిరుచి యేమిటో నాకు తెలియలేదు. భోజనమైన వెంటనే 'వెళ్ళివస్తాను' అన్నాను. 'ఆలస్యం చెయ్యకు, వెంటనే వచ్చెయ్' అని అతనూ జానకీ కూడా చెప్పారు. నన్ను వీధిగుమ్మం వరకూ సాగనంపారు. వాళ్ళ నౌకరు కుర్రాడు లోపల ఉన్న సైకిలు మళ్ళీ బయట పెట్టాడు. వారు చెప్పిన మాటలకి 'ఊం' అని తలూపుతూ సైకిలు ఎక్కాను.

*　　　*　　　*

జానకిభర్తకు 'నా' అన్నవాళ్లెవరూ లేరు, ఆమెతప్ప. అందుచే వివాహమైన వెంటనే జానకి తన భర్తతో విశాఖపట్నం వెళ్లిపోయింది. ఆమె వివాహానికి సంబంధం నిర్ణయమయే ఘడియవరకూ ఆమెప్రవర్తన అంతా చదువు, అల్లరి, ఆటపాటలతో నిండి ఉండేది. ఉత్సాహం ముందుపుట్టి, తరువాత ఆమెపుట్టిందా అన్నట్లుగా తీరిక, విశ్రాంతి లేకుండా, దినమంతా కొన్నిఘడియల కాలంలా గడిపేది. ఆమె భాగ్యవంతులబిడ్డ. నేను సామాన్య సంసారులకు జన్మించాను. ఈ ఆర్థిక తారతమ్యంవల్లనే నేను జానకికి, జానకి నాకూ అందకుండా పోయామని ఆమెకు వివాహమైన కొంతకాలానికి నాకు అర్థమైంది. ఆమెకు వేరే వివాహానికి ప్రయత్నాలు ప్రారంభమయాయి అది మొదలు ఆమెలో అద్భుతమైన మార్పు వచ్చింది. ఆటపాటలు, అల్లరి, తగ్గిపోయాయి. చదువుకు స్వస్తిచెప్పింది. ఆమెకూ నాకూ మిడిమిడి జ్ఞానం వచ్చింది మొదలు పగలూ రాత్రీ ఎప్పుడూ విడిచిఉండే వాళ్లం కాము. చదివినా, ఆడినా, పాడినా, అల్లరి చేసినా, అన్నం తిన్నా కలిసిచేసే వాళ్లం కలసి బడికిపోయేవాళ్లం. రాత్రి తొమ్మిదింటి వరకూ వాళ్ల నడవలో చదువుకొనేవాళ్లం. వాళ్ల అమ్మ మా యిద్దరికీ యేదో చిరుతిండి పెట్టేది. మా యిద్దరికీ మంచాలు వేసి పక్కలు వేసేది. కథలూ గాథలూ చెప్పుకొంటూ పడుండేవాళ్లం. ఇవన్నీ అకస్మాత్తుగా ఆగిపోయాయి. నేను పలుకరిస్తే పరధ్యానంగా ఒకేమాటతో జవాబు చెప్పేది. ఆమె వివాహంతో నా దుర్దినాలు ప్రారంభమయాయి. ఆమె కాపురానికి వెళ్ళిన రెండు మాసాలకు మా అమ్మ గతించడం, మా నాన్న యెవరితోనూ చెప్పకుండా యెక్కడికో వెళ్లిపోవడం, నేను అనాథుణ్ణికావడం తటస్థించింది. అప్పటికి నేనూ జానకీ ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్ష పాసైయున్నాం. పరీక్షలయిన తరువాత వేసంకల్లో ఆమెకు వివాహమైంది. నాకు వచ్చిన దుస్థితి కారణంగా ఒక సంవత్సరం తీరికగా గడచిపోయింది. నేను ఒక చిన్నయింటికి రెండెకరాల భూమికి అధికారినయాను. ఇంక చదువుగాని పని పాటలుగాని లేవు.

జానకి తలిదండ్రులు ఆమెకు వివాహం కొంతవరకూ నన్ను తమ కుటుంబంలోని వ్యక్తిగా చూచుకొనేవారు. తరువాత వారి ఆదరణ క్రమేణా క్షీణింపసాగింది. మా అమ్మ పోయిన తరువాత రెండు మూడు నెలలు వారియింట్లోనే తింటూ తిరుగుతూండే వాణ్ణి. తిండికి మాత్రమే యింటికి వచ్చేవాణ్ని. అది కూడా ఒక్కొక్క పూట సాధ్యపడేదికాదు. కాఫీహోటలు,

సినీమాహాలు, బజార్లోని దుకాణాలు — ఇవీ, నా కాలక్షేపానికి స్థానాలు. సినేమా చిత్రం యేమిటి అనే విషయం యేనాడూ పరిశీలించేవాణ్ని కాను. ఆట మొదలు పెట్టే సమయం, అంతమయే సమయంతో కూడా నాకు పనిలేదు. ఎప్పుడో వెళ్ళడం, గేటుదగ్గర మూడ్పావలా చెల్లించడం, రెండుగంటలో మూడుగంటలో కుర్చీలో కూర్చోడం, తిరిగి పదకొండు, పన్నెండు గంటలకు యింటికి చేరి నడుం వాల్చడం. మా జానకి తల్లిని, తండ్రిని నేను అత్తయ్యా, మామయ్యా అని పిలిచేవాణ్ని. వారు 'ఎక్కడకు వెళ్లావ్ ? ఏం చేశావ్?' అని అడిగితే వారింటిదగ్గర ఉన్నాను, వీరింటి కెళ్లాను, ఎవడో స్నేహితుని యింటిదగ్గర తిన్నాను, అని యేవో సాకు చెప్పేవాణ్ని. ఎన్నడూ సిగరెట్టు చుట్టా మొదలైన వాటిని తాకికూడా యెరుగనివాణ్ని, నాకు రోజూ అయిదారు పెట్టెల సిగరెట్లు నాకు తెలియకుండా తగలడుతూండేవి. ఆ రోజుల్లో నా దుస్థితికి హృదయపూర్వకంగా విచారించి, నా మంచిచెడ్డలు సదా కనిపెడుతూ, నన్ను మంచి దోవలో పెట్టడానికి తన సర్వశక్తులూ ధారపోసినవాడు 'సూర్యం' ఒక్కడే మా గ్రామంలో ఉండేవాడు. సూర్యంగారిల్లు మా యింటికి దగ్గరగానే ఉంది. తరచుగా జానకీ, నేనూ, వాడూ కలసి ఆడుతూ పాడుతూ కాలక్షేపం చేసేవాళ్లం. వాడు మా నాన్నగారికి ప్రియమైన విద్యార్థి. బళ్ళో నే కాకుండా బయటకూడ ఆయన కూడా కూడా తిరుగుతూ ఉండేవాడు. మాతోనే స్కూలుఫైనలు ప్యాసయ్యాడు. కాలేజీలో సీటు దొరకని కారణంచేత ఆ సంవత్సరం కాళీగా ఇంటిదగ్గర ఉండి పోయాడు. ఏ నిమిషంలో నేను ఎక్కడ వుంటున్నదీ, ఏమి చేస్తున్నదీ, కనిపెడుతూ, తరచూ నన్ను కలుసుకొంటూ, నాతో తిరుగుతూ నన్ను మంచిమార్గాన్ని పెట్టడానికి యేవేవో బోధించేవాడు. కాఫీ హోటల్లోనూ, కిల్లీకొట్టులోనూ, ఇంకా యితర పరిచయస్థుల దగ్గర నేను చేసే బాకీలు, నాకు తెలియకుండా తీర్చేసేవాడు. అందుచేత నే నేను అడిగినప్పుడల్లా వారు నాకు అరువు యివ్వడమే గాని నన్ను యెన్నడూ బాకీ అడిగేవారు కారు. వారికి నేను బాకీ ఉన్నాను, దాన్ని తీర్చాలి అనే దృష్టి నాకు చాలా తక్కువగా ఉండేది. మాఅమ్మ పోయిన రెండుమూడు నెలలవరకూ నేను మా అత్తయ్యగారింట్లో నే భోజనం చేస్తూవుండేవాణ్ని. వారి ఆదరణ పూర్తిగా తగ్గిపోయిందని తోచగానే వారింటికి వెళ్లడం మానేశాను అప్పటినుండి సూర్యం, పగలు రాత్రి నేను ఎక్కడవున్నా పట్టి తీసుకొనిపోయి తనతో భోజనం చేయించేవాడు. ఈవిధంగా సంవత్సరం తిరిగింది. కాలేజీలో సీటుకి సూర్యం తనతోపాటు నాచేత కూడా బలవంతముగా అప్లికేషను పెట్టించాడు. వాడేమి ప్రయత్నం చేశాడోగాని మాయిద్దరికీ సీట్లు దొరికాయి. నా పెట్టేబేడా సర్దించి పట్నం తీసుకుపోయాడు. పట్నం వెళ్ళేముందు నాకు నేను చేసిన బాకీలసంగతి జ్ఞప్తికివచ్చింది. సూర్యంతో చెప్పాను. బజారు తీసుకెళ్ళాడు. హోటలు, సిగరెట్లబాకీలు ఐదురూపాయలు మాత్రం ఉన్నాయి. నాకు చాలా ఆశ్చర్యం కలిగి 'ఇంతేనా' అని వారిని ప్రశ్నించాను. 'అంతేనండి, ప్రతీనెలా సూర్యంగారు ఇచ్చేస్తున్నారుగా!' అన్నారు. నేను నివ్వెరపోయి సూర్యంకేసి చూశాను. 'ఆఁ, అంతే' అని అంటూ సూర్యం తన జేబులోనుండి డబ్బుతీసి వారికి ఇచ్చివేశాడు. నేను మాట్లాడకుండా యింటికి వచ్చాను. ఆ సంవత్సరం మా భూములమీద వచ్చిన మక్తాధాన్యం మా మామయ్య వసూలు చేశాడు. ధాన్యం నేను వసూలు చేశానని మాత్రం నాతో చెప్పాడు. వాటిని అమ్మమని గాని ఉంచమనిగాని ఆయనతో నేనేమీ చెప్పలేదు. ఇన్నాళ్లకు వాటివిషయం జ్ఞప్తికివచ్చింది. తిన్నగా ఆయనదగ్గరకు వెళ్లాను. సూర్యం కూడా నన్ను వెంబడించాడు. మా అమ్మ పోయిన రోజుల్లో మానాన్న నిశ్చింతగా దొడ్లో మామిడిచెట్టు క్రింద కూర్చునేవాడు. ఆమె కర్మకు సంబంధించిన సమస్త విషయాలూ మా మామయ్య చక్కబెట్టాడు. అందుకై మాకు డబ్బు పెట్టుబడి పెట్టిన సంగతి నే నెరుగుదును. మాకోసం ఆయన ఎంత ఖర్చుచేసిందీ నేను అడగా లేదు ఆయన చెప్పాలేదు. ఆ తరువాత వారియిల్లు మాయింటిని చేరి వున్నప్పటికీ నేను ఆయనకు చాలా అరుదుగా కనుపించేవాణ్ణి.

ఇప్పుడింక తప్పనిసరియై ఆయనదగ్గరకు వెళ్ళి ధాన్యం ప్రసంగం తెచ్చాను. ఆయన జమాఖర్చు పుస్తకం విప్పి నాయెదుట పెట్టాడు. దాన్ని చూడగా ఆయన మాకై చేసిన ఖర్చునుండి నాధాన్యంవల్ల వచ్చిన సొమ్ము తీసివేయగా ఏభై రూపాయలు ఆయనకు

నేను బాకీపడ్డాను. సూర్యం నా ప్రక్కనే ఉన్నాడు. "నేను మా నాన్నగారు ఉన్న రోజుల్లో అప్పుడప్పుడు వెంకన్న మాస్టరుగారి దగ్గర రెండొందల వరకూ వాడుకొన్నాను. అప్పటినుండీ వారికి యివ్వడం తటస్థించలేదు ఇది వారిబాకీయే గనుక మీకు అభ్యంతరం లేకపోతే యీ యాభై రూపాయలూ నేను చెల్లిస్తాను" అని సూర్యం, మామామయ్యతో ఎక్కువ వినయంగా చెప్పాడు. అందుకు ఆయన 'నీకు ఆయన యందు ఇంతటి భక్తివిశ్వాసాలు ఉండి ఋణం తీరుస్తానంటే నేను వద్దనడం మంచిది కాదు' అన్నాడు. వెంటనే సూర్యం తనజేబునుండి యాభైరూపాయల నోట్లుతీసి ఆయనముందు పెట్టాడు. మా యెదుటనే ఆయన పుస్తకంలో జమ వ్రాసుకొన్నాడు. ఇంతలో మా అత్తయ్య నడవలోకి వచ్చి 'ఏంరా! రాముడూ, కనుపించడం మానేశావు?' అంది. 'ఏమీలేదు, సూర్యంగారి ఇంటిదగ్గర కాలక్షేపం చేస్తున్నాను అత్తయ్యా!' అన్నాను. 'అలాగా' అని నెమ్మదిగా ఆవిడ లోపలికి వెళ్ళిపోయింది. తరువాత మేమిద్దరం ఆయనదగ్గర శెలవుతీసుకొని మా యింటికి వెళ్ళాం. 'మా నాన్నదగ్గర నువ్వు డబ్బుతీసుకోడం నే నెప్పుడూ చూడనేలేదే! నువ్వు ఆయనకి బాకీపడ్డ మేమిటి? నా స్కూలుఫీజుకట్టడానికే ఆయన ఆలస్యం చేసేవారు. నీకు అప్పివ్వడానికి ఆయనకు డబ్బు యెక్కడి నుంచి వచ్చింది?' అని సూర్యాన్ని అడిగాను.

"నా బోటిగాళ్లకు అప్పులిచ్చే అలవాటు ఉండబట్టే మీ నాన్నగారు నీ స్కూలుఫీజు కట్టడానికి యిబ్బంది పడవలసి వచ్చేది. నాకు డబ్బు చేదా, నీకు ఉచితంగా యివ్వడానికి? హోటలు, కిళ్ళీకొట్ల బాకీలు, రమణారెడ్డి, వెంకటేశ్వర్లు, సూరిబాబు దగ్గర నువ్వు చేసిన చేబదుళ్లు తీర్చివేయగా ఈ యాభై రూపాయలు మాత్రం మీ నాన్నగారికి యివ్వవలసి ఉన్నాను. ఇప్పుడు అదికూడా తీర్చివేశాను" అన్నాడు సూర్యం కాని వాడు మా నాన్నగారికి బాకీ పడ్డాడనే సంగతి నాకు నమ్మతగినదిగా లేదు. అబద్ధమని వాడితో వాదించినా ప్రయోజనం లేదు. వాడు నాకోసం ఖర్చుపెట్టిన డబ్బు యిచ్చేద్దామా అంటే నాదగ్గిర యేమీలేదు. ఆ సమయంలో నా జేబులో రెండు మూడణాలు, సిగరెట్టుపెట్టె, అగ్గిపెట్టె తప్ప మరేమీ లేదు. అంచేత వాడు చెప్పినదాని కల్లా ఊకొట్టవలసి వచ్చింది.

"నీ బట్టలూ పుస్తకాలూ వగైరా పెట్టెలో సర్దు. రేపు ఉదయం బయలుదేరి వెళ్లి కాలేజిలో జాయిను కావాలి" అన్నాడు సూర్యం.

"నువ్వు మాట్లాడే మాటలూ, చేసే పనులూ నా కేమీ అర్థం కావడం లేదు. నా స్థితి అంతా తెలిసుండీ కాలేజికి ప్రయాణం కట్టమంటావేమిటి?" అన్నాను చికాకుగా.

అంటే, డబ్బు లేదనేగా? దానికోసం ప్రస్తుతం బాధ పడనక్కరలేదు. నీకు చేలమీద పంటవచ్చే వరకూ నేను పెట్టుబడి పెడతాను. పంట ధాన్యం వచ్చాక అవి అమ్మేసి నా బాకీ తీర్చివేద్దువుగాని. కాలేజిలో చదువుకొనే నాలుగేళ్ళూ నీకు వచ్చే ఆదాయం నాకు ఇచ్చేస్తూఉండు. చదువుకోసం నీకు కావలసిన డబ్బు యావత్తూ నేను పెట్టుబడి పెడుతూ ఉంటాను. నేను స్వతంత్రుణ్ణి. నన్ను అడిగే వాళ్ళెవరూ లేరు. అయినా, మీకు నేను ఉచితంగా యివ్వడం లేదుగా? నువ్వు యెంతమాత్రం సందేహించకు. కాలేజి చదువు పూర్తిఅయి ఒక మార్గంలో పడేవరకూ నేను చెప్పినట్లల్లా చేస్తూ ఉండు." అని దృఢంగా నెమ్మదిగా బోధించాడు.

"నన్ను లేనిపోని చిక్కులలో పెట్టకురా బాబూ! నీకు పుణ్యముంటుంది. నాకు చదువుకోవాలని ఎంత మాత్రం కోరిక లేదు" అని దీనంగా చెప్పాను:

"ఏం? నీకు వయస్సు ముదిరిపోయిందనా, సంసారం బాధ్యత తలపై పడిందనా, డబ్బుకి లోటు వచ్చిందనా, ఎంచేత, చదువుమానుకోవడం? నీ మనస్సుకి శాంతి లభించాలంటే నీ దృష్టిని చదువువైపుకి మరల్చాలి. ఈ సంవత్సర మంతా చదువులేక పోవడం, మీ అమ్మ పోవడం, బ్రతికి ఉండికూడా మీ నాన్నగారు నిన్ను విడిచిపోవడం మూలాన్ని నీ మనస్సు పాడయింది. కష్టాలు యెవరికి రావు? కష్టాలు వచ్చినప్పుడే మన ధైర్యస్థైర్యాన్ని ఉపయోగానికి తెచ్చుకోవాలి. నాకు రాలేదూ, కష్టాలూ? మా నాన్న పోయాక నా పరిస్థితి అయోమయమై పోయిందే! మా అమ్మను చూస్తే వట్టి అమాయకురాలు. ప్రతి విషయానికి నా సలహాను ఆశించేది. అటువంటప్పుడు పై వాళ్లకు లోకువ యివ్వకుండా

జాగ్రత్తగా నేను యింటి వ్యవహారాలన్నీ చక్కబెట్టుకోనక పోతే ఈపాటికి నా యాభైయకరాల భూమికి అయిదెకరాల భూమి కూడా మిగిలి ఉండేది కాదు..నువ్వు లేనిపోని మనోవేదనతో నీ భవిష్యత్తును పాడుచేసుకోకు. నేను చెప్పినట్లా చెయ్యి. ఇంకనువ్వు మారు మాట్లాడ్డానికి వీల్లేదు. లేదా నేనూ చదువు మానేస్తాను. నువ్వు బికారిలా బజారులో తిరుగుతూ ఉంటే నా మనస్సుకి ఎంత బాధగా ఉందో నీకు తెలుసా? నువ్వు నాకు మామూలు స్నేహితుడివే కాదు. మీనాన్నగారి ద్వారా నువ్వునాకు పరమ ఆప్తుడవు. వారికి నేను ఎంతో ఋణపడి ఉన్నాను. ఏడెనిమిది సంవత్సరాలు నాకు విద్యాబుద్ధులు చెప్పి నా జీవితానికి వెలుగుబాట చూపించారాయన. ఏనాటికైనా ఆయన, నిన్నూ నన్నూ చూడ్డానికి వస్తారు. వారి కొడుకువు నువ్వు అనాథుడవై మతి చెడినవాడిలా తిరుగుతూ నీచమైన జీవితాన్ని గడుపుతూంటే నేను చూస్తూ ఊరుకోనా? అనాడు ఆయనకు నేనేం జవాబు చెప్పను?...ఇదిగో రాముం! నువ్వు నేను చెప్పినట్లా చెయ్యకపోతే నీకంటె ముందుగా నేను పాడైపోతాను." అని ఆవేశంతో మాట్లాడి కూర్చున్నవాడు లేచి నిలబడ్డాడు. ఇంతవరకూ దిగమ్రింగుతూన్న దుఃఖం యిక ఆగలేదు. 'సూర్యం' అంటూ బావురుమని యేడుస్తూ వాణ్ణి కౌగలించుకొన్నాను.

మర్నాడు ఉదయాన్నే సూర్యం.. మా ఊరు స్కూల్లో పనిచేస్తున్న మాస్టరుగారు మాయింట్లో అద్దెకుఉండే ఏర్పాటుచేశాడు. ఒక గదిమాత్రం నా సామాన్లకోసం మినహాయించాం. తరువాత పట్నం వెళ్లి కాలేజిలో చేరాం.

జానకివివాహంకానంతవరకు చదువులో నాకుండే శ్రద్ధ, చురుకుదనము మా తల్లిదండ్రుల్నీ చుట్టుపక్కల ఉన్నవాళ్లనీ ఆశ్చర్యపరచేవి. చిన్నప్పటినుంచీ జానకి చదువుకీ ఆటపాటలకీ నేను సహాయకుడనుగా ఉన్న కారణంచేతనే మా మామ అత్త నన్ను తమ పిల్లతో పాటు ఆదరించేవారనీ, ఆమె వివాహమైన తరువాత నా అవసరంగానీ నా సహాయంగానీ అవసరం లేక నన్ను ఆదరించడం మానేశారని కొంతకాలానికి నాకు అర్థమైంది. కాని వివాహప్రసంగం వచ్చిననాటినుండీ జానకిలో మార్పు రావడానికి కారణ మేమో నాకు బోధపడలేదు.

జానకి వివాహం కానంతవరకూ ఆమె నాకు ప్రాణ స్నేహితురాలుగా ఉండేది. ఆమె నన్ను వదిలిపెట్టిన సంవత్సరానికి సూర్యం నాకు పరమ ఆప్తుడయ్యాడని చెప్పక తప్పదు. జానకి చదువుకి, ఆటలకు, పాటలకు నేను మార్గదర్శకుడుగా ఉండేవాణ్ణి ఇప్పుడు ఒక్క చదువు విషయంలో మినహా మిగిలిన విషయాలన్నిటిలోను సూర్యం నాకు మార్గదర్శకుడయ్యాడు. కాలేజీలో చేరిన నాలుగైదు నెలలవరకు నామనస్సును చదువులో లగ్నం చెయ్యడానికి సూర్యం తన చాకచక్యాన్నీ, శక్తిని పూర్తిగా ఉపయోగించాడు. చదువువందు ఆసక్తికలిగి దాని రుచి తెలిసినవాడవడం చేత సూర్యం ప్రయత్నం ఫలించింది. మా క్లాసు పుస్తకాలేకాకుండా లైబ్రరీలోని నవలలూ, నాటకాలూ తెచ్చి సూర్యానికి చదివి వినిపిస్తూండేవాణ్ని. చదువుమీద దృష్టి కలిగినమీదట క్రమేణా నా చేత, సిగరెట్టు కాల్చడం మానిపించాడు. అప్పుడప్పుడు వెనుకటి సంగతులు జ్ఞప్తికివచ్చినా సూర్యం ప్రయత్నంవల్ల మనస్సు స్తిమితపడేది.

కాలేజీ చదువు రెండేళ్లు పూర్తయింది. పరీక్షలయాక శెలవుల్లో యింటికివెళ్ళాం. ఇంటికిచేరిన రెండు రోజులికి సూర్యానికి తీవ్రంగా జ్వరం వచ్చింది. నా మనస్సు పరిపరివిధాల పోసాగింది. రాత్రింబగళ్లు సూర్యందగ్గర ఉండి సేవ చేస్తూండడమే నాపని. మాటామంతీ లేకుండా వళ్లు తెలియని స్థితిలో పది రోజులు పడియున్నాడు. ఊళ్ళో డాక్టరువల్ల తృప్తిలేక పట్నం వెళ్ళి డాక్టర్ని తీసుకొని వచ్చాను. ఆయన రోజూ కారుమీద వచ్చి చూచి పోయేవాడు. జ్వరం నానాటికీ విషమిస్తోందే కాని తగ్గడం లేదు. జ్వరంలో సంధి కూడా బయలుదేరింది. సూర్యం తల్లి "ఏం నాయనా! కాస్తచల్లగా ఉందా వళ్లు?" అని నిమిషనిమిషానికీ అడుగుతూండేది. "పరవా లేదు పిన్నీ, తగ్గుతుందని డాక్టరు గారు చెప్పారు. ఇంతకంటె యెంతో తీవ్రంగా ఉండే అసాధ్యమైన జ్వరాలు ఆయన సునాయాసంగా తగ్గించారు. కొంచెం టైమ్ తీసుకొంటుంది మరి. వెంటనే తగ్గించడానికి ఆయన మాత్రం దేవుడా?" అని యేవేవో కల్పించి ఆవిడకు ధైర్యం చెప్పేవాణ్ణి. కాని నా గుండెలు దడదడ లాడుతూనే ఉండేవి. ఎంత కూడగట్టుకొన్నా ధైర్యం నిలబడ్డం లేదు.

జమే కావచ్చును. కాని సాధారణము కాదు. ఏకవీరలో నట్టి యసాధారణ స్థితిని కల్పించుట కావశ్యకత ఏమి?

అట్టి ఆవశ్యకత యున్నను లేకపోయినను ఆ ప్రత్యేకతను కల్పించుటలో, దానిని స్పష్టముచేయుటలో, అట్టి దానిని పోషించుటలో, రచయితచక్కని నేర్పును చూపించిరి. వాన జల్లులను కొలుచుకొనుచు ఆతాకిడి రక్తప్రవాహముదాటి శల్యములను తాకినట్టి స్పర్శజ్ఞానమామెలో నున్నపుడు ఆమెమనస్సున చిన్ననాటినుండి నిలిచిపోయిన ప్రియుడు తొలిసారిగా నామెను కౌగిలించినపుడు, ఆతాకిడి, ఆకౌగిలింతలోని చల్లదనమామె రక్తములో నరనరములలో వ్యాపించుటలో ఆశ్చర్యములేదు.

కాని రచయిత యుద్దేశించిన ఏకవీర త్వగింద్రియ జ్ఞానములోని యా ప్రత్యేకత చదువరి యూహకందు నంతటి వాస్తవికముగ లేదు. వానజల్లులను కొలుచుకొనుటలోని, శైత్యోష్ణతల పరిమాణములను కొలుచు యంత్రము వలె శరీరము పనిచేయుటలోని విశిష్టత చదువరి కర్థముకాదు. అయినచో నీ విశిష్టతను గుర్తించని వాడు చివరి ఘట్టములో ఏకవీర వీరభూపతి, కుట్టాన్‌ల, పరిష్వంగములందు పొందిన శారీరకస్థితి యెంతవరకు సహజము, యెంతవరకు సమర్థనీయ మను విషయము విచారించదగినది.

యౌవనములో నున్నది, అంతవరకు పురుష స్పర్శ నెరుగనిది, తనలో గూడుకట్టుకొనిన కోరికలతో కృశించినది. తన కలభ్యముగు దానిని గూర్చి నిత్యము చింతించునది, అతి సుకుమారి, చిన్నతనము నుండే వీధినబోవు నొక సుందర యువకుని చూచి ప్రేమించి ఆప్రేమను మనసులో నిముడ్చుకొనలేక యాతనికి ప్రణయలేఖ వ్రాసినట్టి భావోద్వేగము కలదియైన ఏకవీర వంటి జవ్వని తలవని తలంపుగ తిరిగి తానెన్నడును చూడలే ననుకొనిన ఆచిన్ననాటి ప్రియుడు ఒకానొక యద్భుత వేళావిశేషమున కలసికొనినపుడు ఆమె హృదయస్థితిలో నాతని కౌగిలిననుభవించిన నామె శారీరక స్థితి ఎట్లుండును?

వీరభూపతిని కలుసుకొనకముందే ఆమె భామాకలాపమును చూచినది. విప్రలంభావస్థలును, అభిలాష చింతా స్మృతి గుణకీర్తనోద్వేగ ప్రలాపోన్మాద వ్యాధులను నెనిమిదవస్థలనుఅభినయించుటచూచి తానే యాయవస్థలను మానసికముగా ననుభవించినట్టి రసజగత్తులో నాట్యమాడుచున్న దామె హృదయము. అట్టి స్థితిలో నామె వీరభూపతిని చూచినది. అప్పుడామె "మనస్సులో మీనాక్షి లేదు. అది మీనాక్షి యిల్లని లేదు. తానెవరో కూడలేదు. తానున్నది రసజగత్తు. ఆమె నాయిక అందులో. వాసకసజ్జిక నాయకునికొఱకెదురుచూచుచున్నది." 172 వ పేజీ. ఇట్టి మానసికోద్వేగములో నామె తొలిసారిగా నాతని పరిష్వంగ సుఖ మనుభవించినది. అప్పుడామె కన్నులకు చూచు శక్తి పోయినది. ఘ్రాణేంద్రియమున కతని నిశ్వాస పరిమళ మనుభవించు శక్తి పోయినది. జిహ్వేంద్రియ మాతని ముద్దురుచి తెలిసికొనలేదు. అతని స్పర్శ యామెలోని యస్థిసంచయమునకు కూడ దాకినది.

ఆమెకు హృదయసంచలనమునందు మాత్రమే స్థితి. తక్కిన సర్వాణువులయందు ప్రళయము. చక్షుశ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణేంద్రియ జ్ఞానమంతయు త్వగింద్రియమందు లీనమయి యా స్పర్శగుణమతిక్రాంత మర్యాదమై "యామె" యన్న పదార్థవాచ్యమైన సర్వమునందు నిండినది." 175 వ పేజీ. అనగా నామెలో యా పరిష్వంగసుఖము చర్మమును దాటి, రక్తమును దాటి శల్యములను చేరిపోవుట. అట్టి రసానుభూతిలో సర్వేంద్రియములు లీనమై యొక్క స్పర్శ సుఖానుభూతిగా నిలిచిపోయి హృదయమునందు చొచ్చుకొని పోవుట—సహజమైన శారీరక ధర్మమిది.

పైన చెప్పిన 175 వ పేజీలోని శారీరక స్థితిని శారీరకశాస్త్రరీత్యా అర్థము చేసికొనిన దానిని 'షాక్' అనియందురు. ఈ శారీరకస్థితిని కావ్యపరముగా నింత స్పష్టముగా వర్ణించగల్గుట యభినందనీయము. రచయిత యూహ సత్యమునకే ప్రామాణికము. 'షాక్' అనబడు నీస్థితియందు శరీరములోని యింద్రియములన్నిటిశక్తి తాత్కాలికముగా నశించి హృదయ సంచలనము మాత్రము నిలుచును. ఈ స్థితియే తీవ్రరూపము దాల్చినప్పుడు ఆ హృదయసంచలనము కూడా నశించును. అప్పుడది మృత్యువుగా పరిణమించును. ఈతీవ్రరూపమును కూడ తరువాతి ఘట్టములో నద్భుతముగా వర్ణించినారు రచయిత.

వీరభూపతి కౌగిలిలో ఏకవీర యొక్క పారవశ్యము, యొక్క మహదానందము, యొక్క చిత్రమైన స్పర్శ సుఖానుభూతిని హఠాత్తుగా ననుభ

వించుటచే నామె తాత్కాలికముగా నచేతన యైనది. కాని హృదయ సంచలనము నిలిచి యున్నది. కుట్టాన్ తోడి పరిష్వంగమొక విపరీత పరిణామము దెచ్చినది. కుట్టాన్ స్వచ్ఛమైన ప్రేమతో ఆమె కెదురు వచ్చి నప్పటికే జరిగిపోయిన అద్భుత సంఘటన మామెలో నొక విచిత్ర సంచలనము కలిగించినది. ఆమె యొక రకమైన యుద్వేగములో నున్మాదిని యైనది. కుట్టాన్ ప్రేమను సహించు శక్తి ఆమెలో నశించినది. కుట్టాన్ కౌగిలి నామె భరింపలేదు. ఆమె భయపడి వైగైనది వైపుకు పరుగిడినది.

జరుగవలసిన పర్యవసానము—ఏకవీర మరణము. కేవలము దీనిని సాధించుటయే పరమావధి యైనచో ఆమె అట్లు వైగైవైపు పరుగెత్తి ప్రవాహములో బడి కొట్టుకొని పోయినదనినను చాలును. కాని రచయిత ఏకవీరలో అడుగడుగునా ఒక ప్రత్యేకతను చిత్రించి నట్లే ఆమె మరణమునకు కూడ నొక వైలక్షణ్యమును కల్పించినారు.

ఏకవీర పతివ్రత కాదు. విలయన నామె కుట్టాన్ భార్యయయ్యు పరపురుషుని స్పర్శ ననుభవించినది. ఆమె ధర్మము నతిగమించినది. కాని యా యధర్మములో కూడ నొక చిత్రమైన ధర్మమున్నది. ఆమె యొక పురుషుని స్పర్శ ననుభవించినది. ఆ యనుభవ మామెలో జీర్ణించుకొని పోయినది. మరియొక స్పర్శకు తట్టుకొనలేదు. మరియొకని కౌగిలి నామె భరింపలేదు. ఆమె సౌకుమార్య మట్టిది. ఆమె మనో నిశ్చయ మట్టిది.

కుట్టాన్ ఆమె భావమును గమనించలేదు. తపశ్శాలియైన యాత డామె యెడల ప్రేమచే గదలి పోయెను. అత డామెను కౌగిలించెను. ఈ కౌగిలిలో కూడ ఆమె శరీరము తొలినాటివలెనే చిత్రమైన మార్పు చెందినది. కాని ఆ రెండు యనుభూతులలోని ప్రత్యేకత నెంత స్పష్టముగా వివరించిరో గమనించ దగినది. తొలినాడు ఏకవీర హృదయములో సుఖానుభూతి యున్నది. కాని మలినాడు వెగటు తోచినది. తొలినాడు లోకము పూవులన్నియు బూచిన వనము మీది మందమారుతమువలె నామె ఘ్రాణేంద్రియము జూఱగొనెను.

రెండవదినము 'ఆమె ఘ్రాణేంద్రియమునకు గాలిలో నొక వగరువాసన దోచెను'.

ముందుదినము 'ఆమె చక్షుస్సు లతని చక్షుస్సులే చూచుచుండెను'.

రెండవదినము 'కన్నులు చీకట్లను చూచుచుండెను'.

మొదటిదినము 'ఆమె రక్తములో అతని కౌగిలింతయొక్క చల్లదనము ప్రవేశించెను.'

రెండవదినము 'రక్తమంతయు మృత్యుస్పర్శ వలన గలుగు శైత్య మలవరించుకొనినది.'

ఇట్లే కుట్టాన్ కౌగిలిలోని యనుభూతియందలి వెగటు, చీకట్లు ఆ శైత్యము ఆమె హృదయ సంచలనమును నిలిపివేయునంత తీవ్రతరమైనవి ఆమె చనిపోయినది. ఇట్టి ఈ మరణావశ్యకతను కల్పించుటకు ఏకవీరలో నతిశయించిన త్వగింద్రియ జ్ఞానమను నొక వైలక్షణ్యము కల్పించబడినది. కాని ఈ లక్షణమును గుర్తించనినాడు కూడ వీరభూపతి కుట్టాన్‌ల పరిష్వంగానుభూతు లామెలో కలిగించిన శారీరకస్థితి యదార్థమును సహజమైనదియు నని గుర్తింపకతప్పదు. అట్టి స్థితి యామెలో కలుగుటకు వలయు వాతావరణము సహజముగా నేర్పడియున్నది.

ఒక్కొక్క పాత్రకు సాధారణపు టూహ కందని ఒక చిత్రమైన ప్రత్యేకతను కల్పించియు ఆ పాత్రలలో పూర్తి వాస్తవికత యొప్పించుట ఈ రచయితకు క్రొత్తగాదు. అట్లే ఏకవీర పాత్రకూడ చమత్కారముగా పోషింపబడినది.

ఏకవీర చనిపోవుటలో కూడ నొక ఔచిత్య మున్నది. ఇతివృత్తము సనాతన హిందూధర్మమును ప్రాతిపదికగా తీసికొనినదని ముందే నుడివితిని. ఒక్కొక్క వేళావిశేషమున ఒక ధర్మము నశించినను తిరిగి యది యుద్ధరింపబడవలెను. లేదా యా యధర్మము కడిగివేయబడవలయును. అట్లు కానిచో వాతావరణ మంతయు కలుషితమగును. ఏకవీర వీరభూపతుల విచిత్ర సంయోగమువలన ఏకవీరకు కుట్టాన్‌యెడలగల దాంపత్య ధర్మము నశించినది. కాని ఏకవీర చనిపోవుటతో నాయకలుషిత వాతావరణము వైగైనదీ జలతరంగములతోబాటు చీకటి చాటున కొట్టుకొనిపోయినది.

వీరభూపతి యెడల కూడ నీ విషయమే వర్తించును. వీరభూపతికూడ తాత్కాలి కోద్రేకమున తన

ధర్మమును విస్మరించెను. కాని అతడు చనిపోలేదు. అతనిలో ఏకవీరలోగల సౌకుమార్యములేదు. కుట్టాన్ వలె తపస్వి కాదగిన మనోనిగ్రహమును లేదు. అతడు సామాన్యుడు. కావుననే కుట్టాన్ మీనాక్షిని ప్రేమించిన యుదంతము తెలియుటతోడనే యాతనిలో ఈర్ష్య ప్రేరేపింపబడినది. ఆ ఈర్ష్య నిర్దుష్టమైనది. అతిసహజమైనది. తనభార్య తనను ప్రేమింపలేదనుట కంటెను మరియొకనిని ప్రేమించుచున్నదను విషయము పురుషునికి సహింపరాని విషయము. అట్టి ఈర్ష్యచేతనే వీరభూపతి మీనాక్షి యెడ విరక్తుడయ్యెను.

విధివశమున వీరభూపతి యొకనాడు ఏకవీరను కలసికొనెను. ఉద్రేకముతో నాతడామె నాలింగనము చేసికొనెను. కాని చివరకు ఆమెయే తనమిత్రుడు, ఆప్తుడు, తనయెడల మైత్రిచే తపస్వియునైన కుట్టాన్ భార్యయని తెలిసికొనినాడు. కాని వీరభూపతి "నీవు ఋషివి నేను మనుష్యుడనే" అని కుట్టాన్‌తో వచించినట్లు కేవలము మనుష్యుడు. అట్టి విపరీత పరిస్థితులలో సన్యాసి గాక మరేమగును. అతడు సన్యాసియైనాడు.

మీనాక్షిలో విపరీతగుణము లేమియు లేవు. కుట్టానొక మహాబాధ ననుభవించిన పిదప ఆమె యెడల తన మనస్సును మార్చుకొనినాడు. కాని ఆమె యట్టి యవస్థలు లేకుండగనే తన మనస్సును మార్చుకొనినది. కుట్టాన్ హృదయములో తానున్నానని తెలిసికొన్నన్నినాళ్లు ఆమె భర్తను ఆదరించ లేకపోయినది అతడు తనను సోదరిగా ప్రేమించ మొదలిడిన మరుక్షణముననే ఆమె "నమస్కృతితో భర్త పాదములను చక్కగా నిమిరినది" ఇంత సులభముగా నామె యెట్లు మారిపోయినది? కారణమొక్కటే తోచుచున్నది. ఆమె హృదయమునకు లోతులేదు.

మీనాక్షికి ఏకవీర వృత్తాంత మంతయు తెలియును. కుట్టాన్ ఏకవీరల మధ్యగల వైముఖ్యమును తెలియును. అట్లు తెలిసియు స్త్రీజన సహజమైన వాచాలతచేతనైన మీనాక్షి ఏకవీరతో కుట్టాన్ తనను ప్రేమించుట తదుపరి తన యెడల మనసు మార్చుకొనుటను గూర్చి యెన్నడును చెప్పియుండలేదు. ఏకవీరపై మీనాక్షికి ద్వేషము ఈర్ష్య మొదలగు భావములు లేవు—అయినపుడు మీనాక్షి ఏకవీరకు కుట్టాన్ మనస్సు మారినవిధానము చెప్పి ఆమె నూరడింపవచ్చునుగదా. ఏకవీర నూరడించు సహృదయముతో గాని దెప్పిపొడుచు దుష్టశీలతచే గాని మీనాక్షి యట్టి ప్రసక్తి దెచ్చియుండవలసినది. అట్టి ప్రసక్తి దెచ్చినను ఏకవీర దానిని వినిపించుకొనక పోవుటయో ఏవైన పరిస్థితు లడ్డువచ్చి మీనాక్షి ప్రయత్నమునకు భంగము కలుగుటయో జరిగియుండవచ్చును. కాని మీనాక్షి యట్టి ప్రయత్నమే చేయలేదు. మీనాక్షిలోనట్టి స్వభావమునకు కారణము కన్పించుటలేదు.

మీనాక్షికి తన భర్త పూర్వ మొక బాలికను ప్రేమించెనని తెలియుటయే కాక, ఆమె యాతనికి వ్రాసిన ప్రణయ లేఖను చూచినది. ఆతడు గీసిన యామె చిత్రమును చూచినది. ఆ బాలిక పేరును ప్రణయలేఖలో చూచినది. అయినచో కుట్టాన్ భార్యయైన ఏకవీరను చూచినపుడు ఆమె రూపమును బట్టి, పేరునుబట్టి ఆమెయే తనభర్తచే ప్రేమింపబడిన యువతియని పోల్చుకుండుటెట్లు? ఒకటి రెండుసార్లు ఏకవీరను చూచి మీనాక్షి చకితయైనదట. 'ఎక్కడనా ఈమెను చూచితినని'. కాని ఏకవీరయే ఈ యేకవీర యేమో నని అనుమానించనైన లేదు. మీనాక్షిపాత్ర తదితర పాత్రలవలె చదువరికి స్పష్టముగా గోచరించుటలేదు.

ఇట్లీ నవలలోని నల్వురు ప్రధానపాత్రలు కుట్టాన్ ఏకవీరలు, మీనాక్షి వీరభూపతులు ప్రేమ, ధర్మము, మైత్రి, ఈర్ష్యయను నాలుగు ఉద్రేకభావములలో నలిగి చివరకు కాలగతిని విధివిహిత పర్యవసానము నందిరి. ఈ నల్వురును హృదయముచేత జీర్ణించుకొనలేని ఉద్విగ్న ప్రణయమూర్తులే—అయినను నలువురిలో నీ చిక్కుపరిస్థితి వేర్వేరు పరిణామములను తెచ్చినది. ఒకేరకమైన సమస్య విధి విహిత సంకల్ప విధానమైన వేర్వేరు పరిస్థితులలో వేర్వేరు మనస్తత్వములలో నెట్టిపరిణామములను కల్గించునో యిందులో నద్భుతముగా చిత్రింపబడినది. ఈ చిత్రణమే యీ నవలలోని అత్యుత్తమ ప్రాధాన్యము.

చివరి ప్రకరణమునందు ఏకవీర వీరభూపతుల విచిత్ర సంయోగానంతరము ఏకవీర వీరభూపతి నిజస్థితిని తెలిసికొనిన పిదప ఆమెలో నొక విచిత్ర సంచలనము కలిగి ఉన్మాదినివలె వీధులవెంట దిరుగుచు 'నోబిలి' యను క్రైస్తవ మతాధికారిని కలిసికొనె

వనియు అతనితో మతవిషయకమైన చర్చ జరిపి తన మతమును నిలబెట్టుకొనె ననియు నొక యుదంతము చేర్చబడినది. దీనికి ఇతివృత్తముపై గల ప్రభావ మేమియో తెలియుటలేదు. ఏకవీర పాత్ర కొక ప్రాధాన్యము నిచ్చుటకే యిది యుద్దేశింపబడిన యీ యుదంతమువలన ఏకవీర యెడల చదువరికి గల సానుభూతి గాని, ఆమెయం దగపడు సంస్కారము విద్యాజ్ఞానగంధము కాని అతిశయించినటుల కూడ దోచుటలేదు.

కథాకాలము నాటి వాతావరణము చరిత్రకు సంబంధించియున్నది. 'నోబిలి' యను క్రైస్తవమతాధికారి తత్త్వబోధకస్వామి యను పేర సామాన్య జనులను మతాంతరులను చేయుచుండెనను విషయము చరిత్రకు సంబంధించిన సత్యము కావచ్చును. కాని ఇతివృత్తము చరిత్ర సత్యమైనది కాదు. ఇట్టి ఇతివృత్తమును చరిత్రగతమైన మతవిషయిక వాదనతో ముడి పెట్టుటలో గల అంతరార్థము సుబోధకము గాదు.

అంతకంతకు తీవ్రతరమై ఏకముఖముగా ప్రవహించు మహాప్రవాహములో నొక సుడి తిరిగిన ట్లుండు నీ సంఘటన. ఈ సుడిలోని లోతు సాధారణపు దృష్టితో తెలిసికొనవగినంత స్పష్టముగా లేదు.

ఏకవీర పాత్ర యొక్క విలక్షణమైన సృష్టి. అట్టి ఏకవీరతో నా క్రైస్తవ మతాధికారిచే వాదన చేయించుట యను విచిత్ర కల్పన కారణములేకుండ నెట్లు జరుగును? అని ఆలోచించిన ఇతివృత్తము నందిమిడియున్న ప్రధాన సూత్రమే యిందును బంధింపబడినదని తోచును, 'నోబిలి' యను క్రైస్తవమతాధికారి సనాతన హిందూధర్మమును నాశనము చేయుచున్నాడు. హిందువులను మతాంతరులను చేయుచున్నాడు. అవి సుందరేశ్వరుని కళ్యాణోత్సవ దినములు. ఆ పవిత్రమైన వాతావరణ మీ మతాధికారి యుద్బోధనలచే నపవిత్రమై పోవుచున్నది. మనమతము నుద్ధరించుట యనగా మనధర్మము నుద్ధరించుట. అది ఎట్లయిన నుద్ధరింపబడవలెను. ఒక దుష్ప్రభావమునకు లోనై చరిత్ర కళంకిత మగుచున్నపు డట్టిదాని నరికట్టుటకు సామాన్యుని శక్త్యుత్సాహములు, వ్యక్తిగత నైపుణ్యము చాలనివి. అట్టి యవసరమున నేదోయొక దివ్య శక్తి యావేశించి ఆసైల్యమును ప్రక్షాళితము చేయవలయును. మనచరిత్ర, పురాణములలోని అవతారపురుషు లీవిషయమునే స్పష్టము చేయుచున్నారు.

భగవంతుడు సర్వసమర్థుడు. అతడొక్కొక్క వ్యక్తిలోని యొక్కొక్క శక్తిని యొక్కొక్క విధముగా నుపయోగించుకొనును. ఏకవీరలో నొకవిచిత్ర సంచలనము కలిగినది. ఆమె యనుపులోలేని యుద్వేగములో నున్నది. ఆ యుద్వేగములో నెట్టి మహత్తరశక్తియైన యావిర్భవింపవచ్చును. లేదా సర్వనాశనము కావచ్చును. ఏకవీర వ్యక్తిగా సర్వనాశనము కానున్నది. కాని ఆమెలోని అప్పటిశక్తి కొక ఫలితము కల్పించబడకున్నచో నట్టి ఉదాత్తపాత్ర ఊరక నే నష్టమైపోవును. అందుచే నేకవీర కారణజన్మురాలు గావలెనని రచయిత సంకల్పము. దానిని భగవత్సంకల్పముగా భావనచేసి ఆమెలో సుందరేశ్వరుని శక్తి నావిర్భవింపజేసి ఆమెచే సంకులమైపోవుచున్న సనాతన హిందూధర్మమును కాపాడజేసి ఇతివృత్తమున కొక ఐతిహాసికపు లక్షణమును కల్పించినారు.

ఏకవీరలోగాని, ఇతివృత్తములో నే ఘట్టములో గాని యంతవరకులేని మతప్రసక్తి చర్చ ఒక్కసారిగా తీసికునివచ్చుటలో పాఠకుని స్థూలదృష్టికి ఒక క్రొత్తవిషయమును తెచ్చి యతికినట్లగపడును. కాని ఈ సంఘటనలోని యంతరార్థమే ఏకవీర కారణ జన్మురాలని నిరూపించుటలోని చమత్కారము. అదియే ఈ నవల యందలి మహోదాత్త లక్షణము.

ఏకవీరలోని శారీరక మానసిక ప్రవృత్తు లన్నియు రెండు మహాశక్తుల అంతస్సంఘర్షణ ఫలితములు. ఆమెలోని యవ్వనము, ప్రణయము, ఉద్వేగము ఒకరకమైన శక్తిస్వరూపములు. ఆమెలోని యాలోచన, ధర్మచింతన, పాపభీతి మరియొక శక్తికి పాతిపదికలు. మొదటిది బలమైన కోరికలను ప్రబోధించుచుండెను. రెండవది స్థిరమైన ధర్మమును ప్రబోధించుచుండెను. ఈ రెండును ఒకదానికొకటి తీసిపోని విపరీతశక్తులు. ఈ రెండిటిలో నేది వీగిపోయినను ఏకవీర పతనము చెందును. కనుక నే ఆమెలోని రెండు శక్తులును విజయము పొందినవి.

ఆమెలోని ధర్మము నశించి, ఆమెలోని కోర్కెలు చెలరేగి వీరభూపతితోడి సంయోగము

చెందుటలో నొకశక్తి జయించినది. తత్కారణముగా నామెలో యావేశించిన ఉద్వేగమువలన ఆమెలోని రెండవశక్తి విజృంభించి ఆమెచే తనదైన హిందూ ధర్మము నుద్ధరింపచేసినది.

ఇట్లామెలోని మానసిక శక్తులు రెండును ఫలించుటలో నామె కారణజన్మురాలును, సార్థక జన్మురాలును యైనది. ఆమెవలన కొడగిన దేదో పూర్తియైనది ఇంక యామె జీవించుటలో నర్థములేదుగదా! అందుచేతనే ఏకవీర చనిపోయినది. అనగా ఏకవీర మరణము ఏకవీరపాత్ర సృష్టికి ఒక పరిపూర్ణతను సాధించినది.

ఇది చిన్న నవలయైనను ఎంతో గ్రంథము నిముడ్చుకున్నది. కథకు సంబంధించినంతవరకు అవసరమైన విషయములేగాక 300 సం॥ల క్రిందటి సాంఘిక వాతావరణము, అప్పటి రాజకీయములు, చరిత్రతో వానికిగల సంబంధము, అప్పటి రాజులు, రాజ్యపరిపాలనా విధానము, మధురానగరము, అప్పటి యా పురవైభవము, ద్రవిడుల శిల్పద్రవ్య సంపదలు కూచిపూడివారి చరిత్ర భామకలాపము మొదలగు విషయముల నిందు సమయోచిత రీతిని వర్ణించి ఇతి వృత్తమునకు మరింత వన్నె తెచ్చిరి.

చిన్న పిల్లలకు వడగల్లనిన ఎంత యిష్టమో రచయితకు వర్షములనిన యంత యిష్టము. వారి కావ్యములలో వర్షర్తు వర్ణనలు లేనివి లేవేమో అట్లే యిందుకూడ వర్షాశ్రీ శోభలను వర్ణించు పెక్కు నవకాశములు కల్పింపబడెను క్లిష్టసమాస భూయిష్టమై భావగర్భితమైన వీరి వర్ణన లెంత శోభ నిచ్చునో సులభశైలిని చక్కని పదలాలిత్యముతో చదువరి హృదయమునకు సూటిగా తగులు వీరి వర్ణనలు కూడ అంత శోభ నిచ్చును. ఉదా: 128 వ పేజీలో 'ఒక పసరుమొగ్గ యేకవీరపై బడినది..................

162 వ పేజీలో "తెల్లవారితే యెండలు కాచిలోని కాకరపూలు, బీరపూవులు బంగారు నాణెములవలె..................... దొడ్డి యంతయు ధనలక్ష్మి తాండవించిన ట్లయ్యెను.

కుట్టాన్ హృదయములో, ఏకవీర హృదయములో, వీరభూపతి హృదయములో ఆయా పరిస్థితులలో కలిగిన అద్భుత పరిణామములు, విచిత్ర సంచలనములు నిజముగా అద్భుతము కావు, నిజముగా విచిత్రము కావు, అవి నిజజీవితములో సామాన్యము. మిక్కిలి సహజము. కాని ఆ సామాన్యమైన హృదయస్థితిని అంత సహజముగా గ్రంథస్థము చేయుట యసామాన్యము. లౌకికమైన సంఘటనలకు మనస్సుపైగల విచిత్ర ప్రభావములను, విధియను నజ్ఞాత శక్తికి మానవ జీవితముపైగల చిత్రవిచిత్రప్రభావములను ఆధారముగా దీసికొని రచించిన యిట్టి నవల మరియొకటి తెనుగున లేనే లేదేమో!



మహాత్ముని ఆధ్యాత్మికవారసుడు, సర్వోదయోద్యమ సారథి
శ్రీ వినోబా భావే



విలాసిని

చిత్రరచన: ఇండోనీషియా ప్రముఖ చిత్రకారుడు అగుస్ జయ

# సాహిత్యవాహిని

శ్రీ షడ్దర్శనం సోమసుందరశర్మ

మానవ కళ్యాణార్థమై సర్వవిద్యలు, సర్వకళలు ఏర్పడియున్నవి. పరమేశ్వరుని, యంతర్వాణీ ప్రబోధకములుగ, తొలుత వేదములు వెలువడినవి. ఇయ్యవి, అపౌరుషేయములు.

ఆనాటి మానవోత్తములు, తమ మానసికశక్తితో, నీ వేదములను, విని వీనియొక్క యాధిక్యతను, లోకహితార్థమై వెల్లడిచేసిరి. అనంతాకాశములో, నఖండమైన శబ్దబ్రహ్మగ ప్రసరించుచున్న వేదరాశిని, శ్రుతిపేయముగ, తాము వినినామని, వెల్లడించుటకై, ఈ వినిన వేదరాశికి "శ్రుతి" యనియు నామాంతరమిడిరి.

ఈ శ్రుతులను గుర్తించిన మహనీయులకే, ఋషులనియు, మంత్రద్రష్టలనియు, పెద్దలు చెప్పుచుండిరి. ఈ మంత్రద్రష్టలైన మహనీయులు, తాము వినిన వేదవాఙ్మయమును, లోకమున, ప్రచారార్థమై, తమశిష్యప్రశిష్య పరంపరగ, వ్యాప్తిలోనికి తెచ్చుచు మిక్కిలి కృషిచేసిరి.

ఛందోబద్ధముగను, సుస్వరముగను, సలక్షణముగను, సశాస్త్రీయముగను, తమ మేధాశక్తితో, విన్నది విన్నట్లు అనుసంధానమొనర్చుచు, శిష్యాదులకు ఆమ్నాయపరంపరలను గల్పించిరి.

"జ్ఞానస్వరూపము" లేక, "జ్ఞానప్రదాత" యే, వేదమనియు, మానవ కళ్యాణమును, వేదము ప్రసాదించుననియు, సంపూర్ణముగ నమ్మి వానిని ఉదాత్త, అనుదాత్త, స్వరిత, ప్రచయములతో, సుస్వరయుక్తముగ, అధ్యయన మొనర్చుచుండిరి.

"వేదోధర్మమూలమ్" అను గౌతమ మహర్షి వాక్కును సార్థకబరచుచుండిరి. ఇట్టి మంత్రద్రష్టలైన మహనీయులు, లోకహితార్థమై ఈ వేదరాశి ననుసంధాన మొనర్చుటకై కొన్ని నియమముల నేర్పరచిరి.

ఉదాత్తాది స్వరము లెట్లెట్లు, ఉచ్చరించవలసినదియు, వాని సంయోగవియోగములలో గలుగుభేదము లెట్లుండునదియు, సంహితలోను, పదకాలములోను, క్రమము, జటాఘనములలోను, గలుగు స్వరభేదములను సునాయాసముగ గుర్తించుటకై, గ్రంథములను శ్లోకరూపముగ వ్రాసిరి. ఈ గ్రంథములకే "శిక్షలు" అని పేరు. "వ్యాసశిక్ష", "పాణినిశిక్ష", "భారద్వాజశిక్ష" అను పేర్లతో, నీ శిక్షలు వ్యవహరింపబడుచున్నవి. "శిక్షాం వ్యాఖ్యాస్యామః" అను వేదవాక్యాన్ని ఆధారముగ తీసుకుని, ఈశిక్షలు మంత్రద్రష్టలైన, వ్యాస, భారద్వాజాది మహనీయులు అపౌరుషేయమైన వేదరాశిని, ఉచ్చరించు సౌలభ్యమునకై, లోకహితార్థమై వ్రాసిరి. కనుకనే

"శిక్షా ఘ్రాణంతు వేదస్య,
    ముఖం వ్యాకరణం స్మృతం।
జ్యోతిషామయనం చక్షుః,
    నిరుక్తం శ్రోత్రముచ్యతే।
ఛందః పాదౌతు వేదస్య
    హస్తౌ కల్పోఽథ పఠ్యతే।
తస్మాత్ సాంగ మధీత్యైవ
    బ్రహ్మలోకే మహీయతే."

అని పాణినీయ శిక్షలో, వేదాంగములైన, శిక్షలు, ముక్కుగను, వేదరాశి ముఖము, వ్యాకరణముగను, జ్యోతిషము నేత్రములుగను, నిరుక్తము చెవులుగను, ఛందస్సు,పాదములుగను, కల్పములు చేతులుగను, పోల్చబడియున్నవి. ఇట్లు సాంగముతో గూడిన, వేదరాశి నధ్యయన మొనర్చిన బ్రహ్మలోకప్రాప్తి గలుగుననియు, దాక్షీపుత్రుడైన పాణిని మహర్షి వివరించియున్నాడు.

కొందరు మహనీయులు నంతటితో నూరుకొనక, ఆ శబ్దబ్రహ్మరూపకమైన వేదరాశిలోని పదములకు, సంబంధించిన విమర్శనములు లేవదెత్తిరి. అందలి, సంధులు, సమాసములు, వాని రూప నిష్పత్తులు, మొద

లైన శబ్దజాలమునకు, సంబంధించిన విమర్శనలు వ్రాసిరి. వీనినే "వ్యాకరణములను పేరుతో వ్యవహరింతురు. ఈ వ్యాకరణములు, తొమ్మిది భేదములుగ, నుండినవనియు, కనుకనే "నవ వ్యాకరణము" లని, పండితైక వేద్యముగ, జనశ్రుతి యుంటూయున్నదనియు, చెప్పుచుందురు. కాని నేటికి, మన కాలానికి మాత్రము, పాణినీయ వ్యాకరణ మొకటియే, ప్రసిద్ధముగ నున్నది.

ఈయొక్క వ్యాకరణాన్ని నేర్పుటకే సుమారు పది పండ్రెండు వత్సరములు పట్టును. "పాణిని"యను మహర్షి వైదిక పదజాలములకు, లౌకిక పదజాలములకు, గల భేదాఽభేదములను, చర్చించుచు, సూత్రప్రాయముగ, నీ వ్యాకరణమును, వ్రాయగ, ఆదిశేషుని, అపరావతారమైన, "పతంజలి" యను మహనీయుడు, వీనికి భాష్యము వ్రాసినాడు. వీనిపైన, అనేకులైన వ్యాకరణవేత్తలు, వ్యాఖ్యలు, విమర్శనలు, మొదలైనవి, వ్రాసి, ప్రత్యేకమైన ఒక శాస్త్రముగ, నీ భాగమును తయారుజేసిరి.

మనము శ్లోకమును గాని, పద్యమును గాని, గుర్తించుటకై ఎట్లు ఛందస్సు నుపయోగింతుమో అటులనే వేదఋక్కులను, గుర్తించుటకై, ఛందస్సును వాడుదురు. "గాయత్రీ ఛందస్సు, త్రిష్టుప్ ఛందస్సు, జగతీ ఛందస్సు. పంక్తి చ్ఛందస్సు, అనుష్టుప్ ఛందస్సు, అను పేర్లతో నీ వైదిక ఛందస్సులు వ్యవహరింపబడుచుండును.

ఛందోబద్ధముగ వైదిక ఋక్కులను, అనుసంధాన మొనర్చుటకున్ను, ఛందోమయమే, వేదమని, తెలుసుకొనుటకున్ను, సౌలభ్యముగ నుండుటకై, "పింగళుడు" మొదలైన ఛందోవేత్తలు, వీనిని యెరింగించిరి. వేదమును గుర్తించి తెలుసుకొనుటలో, నీ ఛందశ్శాస్త్రమునకు. శిక్షా వ్యాకరణానంతరము, స్థానమిచ్చిరి.

వేదఋక్కులను, అనుసంధాన మొనర్చవలసిన కాలములు, ఫల భూమికలను, పొందదగిన కాల నిర్ణయములు. "అగ్నిర్నః పాతుకృత్తికాః అపపాప్మానం భరణీర్భరంతు" అను, వేదఋక్కులలోని, కృత్తికాది భరణ్యంతము, చెప్పబడిన, నక్షత్రములయొక్క ఆధిక్యతలను, గుర్తించు, విధానములు, "సుకృతాంవా ఏతాని జ్యోతీగ్ంషి నక్షత్రాణి" అనులాగున జ్యోతిస్సుగనున్న నక్షత్ర రాశియొక్క శుభాఽశుభములను, గుర్తించు మార్గములు, కాల విభాగాన్ని, సూర్య చంద్రుల గమనములను, దివారాత్రముల గణనము, "మధుశ్చ మాధవశ్చ వాసంతి కావృతూ। శుక్రశ్చ శుచిశ్చ గ్రైష్మావృతూ। నభశ్చ నభస్యశ్చ వార్షికావృతూ। ఇషశ్చోర్జశ్చ, శారదావృతూ" అనులాగున, వేద ఋక్కులలోని, మాసములను, ఋతువులను, అయనములను, సంక్రాంతులను తెలుసుకొనుటకై, పరాశర జైమిన్యాది మహనీయులు, నీ జ్యోతిశ్శాస్త్రమును, సూత్రప్రాయముగ, రచించి వేదాంగములలో, నేత్ర స్థానముగ, చేర్చిరి:—సిద్ధాంత భాగము, ముహూర్త భాగము, జాతక భాగము, అను భేదములతో కొందఱు విజ్ఞానవేత్తలు, ఈ శాస్త్రాన్ని పరిశోధించి, మానవునకు, ఉపయోగపడు, శుభాఽశుభముల తెరగులు గుర్తించు క్రమములు, విపులముగ వ్రాసి, నీ శాస్త్రమున కొక ప్రత్యేకత నిచ్చిరి.

ఇట్లు వేదరాశియొక్క ఉచ్చారణా క్రమమును శిక్షలవలనను, వేదములయందలి పదములను గూర్చి వ్యాకరణమువలనను, వేదముయొక్క ఛందోరీతులను గూర్చి ఛందశ్శాస్త్రమువలనను, వేదోక్తములైన కర్మానుష్ఠానాది విధానములకు తగిన కాలవిభాగాన్ని గూర్చి జ్యోతిషము మూలమునను, తెలుసుకొనుచు, వేద ఋక్కులను, యేయే కార్యముల కెట్లెట్లు వినియోగించుకోవలసినదియు, ఏయే కార్యములకు వినియోగించుకొనిన యెడల, యేయే ఫలితములు, గలుగునదియు, కొందఱు మహనీయులు, తమ తపోశక్తితోను, వైదిక విజ్ఞాన పరంపరానుసంధానతతోను, తెలుసుకొని లోకహితార్థమై గ్రంథరాజములను వ్రాసిరి. వీనినే కల్పసూత్రములు, అనియు, తంత్రగ్రంథము లనియు చెప్పుచుందురు.

ఆపస్తంబ, ఆశ్వలాయన, హిరణ్యకేశ, ద్రాయహ్యాయణ, బోధాయనాది మహామహులు, ఈ కల్పసూత్రాదిగ్రంథములను వ్రాసి మనకు వేదఋక్కులను వినియోగించుకొను విధానాదులను బోధించిరి. కనుకనే ఆయా కల్పసూత్రములకు సంబంధించిన, మహనీయులను, మనము నిత్యము, మరువక తలంచుచుండుటకున్ను, వారి కల్పసూత్రముల ప్రకారమే, మనము వేదఋక్కులను, వినియోగించుచున్నామనుటకున్ను, గుర్తుగ, ఆపస్తంబ సూత్రీయులమనియు, ఆశ్వలాయన సూత్రీయుల మనియు బోధాయనాది

సూత్రీయుల మనియు, నిత్యము, వ్యవహరించుకొనుచుందురు. పౌరోహితులా సూత్రముల ప్రకారమే, వివాహాదులను, జరిపింతురు.

ఈ ప్రకారము శిక్షా, వ్యాకరణ, ఛందో, జ్యోతిష, కల్పములతో గూడి వేదమును నేర్చుకొనుచు వేదముయొక్క, అర్థాన్ని గుర్తించవలయునను తలంపుతో, "యాస్కాచార్యుడు" అను మహనీయుడు "నిరుక్తము" అను పేరుతో నీ వేదరాశికి అర్థమును చెప్పు విధానమును, వ్రాసి యున్నాడు. ఈ యాస్కాచార్య కృత, నిరుక్తము మూలముననే వేదముయొక్క పదములలోని, విశేషార్థములను గుర్తించ వచ్చునేగాని, లేకుండిన, వైదిక పదములకు, అర్థ వివరణమంత సుగమముగనుండ జాలదు. ఈ యాస్కాచార్య రచితమైన నిరుక్తము, నేడు సమగ్రముగ దొరుకుట దుర్లభమైనది. ఈ నిరుక్తమును గూర్చి, ఇంకెవ్వరు, వ్యాఖ్యలు మొదలైన, గ్రంథరాజములు వ్రాసినట్లు కానము. ఇతర శాస్త్రములవలె నీ నిరుక్తమంతగ, వ్యాపించినట్లు కానము.

అపౌరుషేయములైన వేదములను, తొలుత మహనీయులు గుర్తించి, వానిలోని, గొప్పదనాదులను, గుర్తించుటకై, మనకు షడంగములను, వివరించి, తన్మూలమున, వేదరాశియొక్క స్వరూప, స్వభావాదులను, సులభోపాయముగ, తెలుసుకొదగిన మార్గాలను జూపిరి.

కాని కాలానుసారము, ఈ శిక్షా, వ్యాకరణ, ఛందో, జ్యోతిష, కల్ప, నిరుక్తములతో గూడిన వేద స్వరూపమును, అధ్యయన మొనర్చుటకు, కాలముగాని, ఓపికగాని, స్థైర్యముగాని, లేక చంచల స్వభావముతో, వేదభాగమును, మాత్రము, నేర్చి షడంగములలో, నొకదానిని మాత్రం గుర్తెరింగి, మిగతా వానిలో కేవలము ప్రవేశాదిజ్ఞానమును మాత్రము గలిగియుండిరి. ఇంతకు కొంత ముందు కాలములోని, పెద్దలు.

ఈ షడంగములకు సంబంధించిన మరికొన్ని శాస్త్రములు వెలువడినవి. వేదములో జెప్పిన యజ్ఞయాగాది, క్రతువులను, గూర్చి చర్చించు భాగమునకు, "మీమాంస శాస్త్రము" అని చెప్పిరి. వేదములలోని, జ్ఞానభాగాన్ని గూర్చి చర్చించు శాస్త్రమునకు, వేదాంత శాస్త్రమనియు పేరు బెట్టిరి. ప్రత్యక్షానుమానాది ప్రమాణములతో పరతత్వాదుల నూహించు భాగానికి "తర్క శాస్త్రమని చెప్పిరి. జరామరణాదులనుండి శరీర రక్షణాదుల నొనర్చుకొను భాగానికి, వైద్య శాస్త్రమనియు, వాడుకొనిరి.

వేదములో జెప్పిన యజ్ఞయాగాది క్రతువులను గూర్చి చర్చించుభాగానికి, మీమాంస శాస్త్రమని మనవిజేసి యుంటిని. వేదము నేర్చి, యజ్ఞములకు సంబంధించిన, కల్పసూత్రములు నేర్చియుండిన, (అనగ, శ్రౌతము నేర్చియున్నయెడల, ఈశాస్త్రము సులభముగ బోధపడుచుండును. ఈమీమాంస శాస్త్రమునకు, జైమిని మహర్షి పునాదులు వేసిన దిట్ట. ప్రభాకర భట్టాదులు, వ్యాఖ్యలు రచించిన మహనీయులు. హంపీ విద్యానగర, స్థాపనాచార్యులైన విద్యారణ్యులు, ఈ మీమాంస శాస్త్రాను గుణ్యముగనే, వేదములకు-నాలిగింటికి, భాష్యములు వ్రాసెను. ఆదిశంకరాచార్యుల కన్నా ముందున్నట్టి కుమారస్వామి, అపరావతారమనదగిన, కుమారిలభట్టు అను మహనీయుడు, తనమతాన్ని, ఈ మీమాంసశాస్త్రాను గుణ్యముగనే రూపొందించెను. ఈశాస్త్రమునకే "పూర్వ మీమాంస" యనియు వాడుకొందురు.

వేదాంత శాస్త్రమునకు, ఉత్తర మీమాంస యనియు, జెప్పుదురు. ఈశాస్త్రమునకు ప్రారంభకులు వ్యాసమహర్షి. బ్రహ్మసూత్రములు అను పేరుతో, సర్వఉపనిషత్తులలోని, సారమును, రూపొందించెను. వీని నాధారముగగొని, శ్రీశంకర, రామానుజ మధ్వాచార్యులవారు, తమతమ మతములను స్థాపించుకొనిరి.

భారతములోని, భీష్మపర్వమునందలి కృష్ణార్జున సంవాదరూపమైన, భగవద్గీతయు, బ్రహ్మసూత్రములును ఉపనిషత్తులు జేరి, ప్రస్థానత్రయముగ జెప్పుదురు. భగవద్గీతకు లోకములో ననేకములైన వ్యాఖ్యలు వెలువడినవి. మండనమిశ్రులని చెప్పబడు, సురేశ్వరాచార్యాది కర్మిష్ఠులు తొలుత నీ శాస్త్రమును ప్రతిఘటించియుండి, పిదప అంగీకరించిన వేదాంతులు.

ఎనిమిదవ శతాబ్దములోని, ఆది శంకరాచార్యుల వారు, తొలుత, నీగీతకు బ్రహ్మసూత్రములకు ఉపనిషత్తులకు భాష్యములను రచించి, మండన మిశ్రులు, హస్తామలకులు, తోటపాదులు, పద్మపాదులు, అను

శిష్యులద్వారా, నీ వేదాంతమును వ్యాప్తిలోనికి దెచ్చిరి. ఈశంకరులు బోధించిన వేదాంతమునకే "అద్వైత"మని చెప్పబడుచున్నది.

పదునొకండవ శతాబ్దము చివరభాగాన, రామానుజాచార్యులవారు ఈప్రస్థాన త్రయమునకు, మరొకరీతిని భాష్యములను రచించి, శిష్యప్రశిష్యులకు బోధించి, తనబోధనలకు, విశిష్టాద్వైతమని పేరిడిరి.

పండ్రెండవ శతాబ్దములోని, మధ్వాచార్యుల వారు, తమ బుద్ధికుశలతతో మరలా పై ఇరువురి కన్న భిన్నముగ, ప్రస్థానత్రయమునకు, భాష్యములు రచించి, తమ యనుయాయులకు, బోధించు తన బోధనలకు, ద్వైతము అని చెప్పిరి. ఇట్లు ప్రస్థాన త్రయమైన, భగవద్గీత, ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములకు, శంకర రామానుజ, మధ్వాచార్యుల వారలు, భాష్యములు వ్రాసియుండగ, పలువురు పండితులు పలుపలు విధముల, వానికి వ్యాఖ్యలు, విమర్శనలు, ఖండనములు మండనములు, మొదలైన రీతులతో, గ్రంథములు వ్రాసి, ఈ శాస్త్రమున కొక గొప్పదనాన్ని తెచ్చిరి.

ప్రత్యక్షాను మానాదిప్రమాణములతో, గూఢ పదార్థ విజ్ఞానాన్ని విమర్శించు శాస్త్రమునకే తర్క శాస్త్రమని చెప్పగురు. గౌతముడు, కణాదుడు మొదలైన వేత్తలు, ఈశాస్త్రాన్ని ప్రారంభించిరి. గదాధరుడు మొదలైన బుద్ధిమంతు లీ శాస్త్రాన్ని విరివిగ, వ్యాప్తిలోనికి దెచ్చిరి. ఈ శాస్త్రము నేర్చినయెడల, వాద ప్రతివాదములలో జయ సంపదను బొందదగిన పాండిత్య మలవడును.

జ్యోతిషము మానవ జీవితమున కత్యంత సన్నిహితమైనది. కాలాది విభాగములు, మానవ జీవిత పురోభివృద్ధికై జేయదగిన శాంతికపౌష్టికాది క్రియల కనువైన సమయములు, వాస్తు విధానములు, రాబోవు శుభాశుభములను, సూచించు ఖగోళములోని మార్పులు, సూర్యచంద్ర గ్రహణాది విధానములు, గ్రహ నక్షత్రాదుల చలనములు, జననకాల సమయాన్ననుసరించి, జీవితాది, పద్ధతులు మొదలైన సర్వ విషయములు, నీ శాస్త్రముచే గుర్తించదగును.

జైమిని, పరాశరాది మహనీయులు, ఈ శాస్త్రానికి మార్గము జూపినవారు. వరాహమిహిర, ఆర్యభట్ట, భాస్కరాచార్య సత్యాశ్రయాది విజ్ఞాన వేత్తలు, ఈ శాస్త్రాన్ని విపులీకరించినవారు. సిద్ధాంత భాగమనియు, ముహూర్త భాగమనియు, జాతక భాగమనియు, నీ శాస్త్రము పలురీతులనున్నది.

వేదములో బీజరూపమున, నిమిడి యున్న, అనేకములైన ఖగోళ రహస్యములు, ఈ శాస్త్రరీత్యా తెలుసుకోవచ్చును. కాని కాలానుసారము, ఈ శాస్త్రానికున్న గొప్పదనాన్ని, వేదాంగముగ జెప్పటలో గల ప్రాముఖ్యతను, మరచిపోయి, కేవలము, స్వార్థముకొరకై, వినియోగించ దలంచుకొని, జాతకములు చెప్పటలు, చెప్పించుకొనుటలే పరమ ప్రయోజనముగ భావించి, నీ శాస్త్ర మర్యాదను కించబరచుచున్నారా? యని యనిపించును. జ్యోతిష్కుడు, తనకు జెప్పిన ఫలితములు, నిజమైన యెడల, నీ శాస్త్రము గొప్పదనియు, ఆ చెప్పిన ఫలితములు, వ్యర్థములైన తటిని, నీ శాస్త్రము బూటకమనియు, చెప్పబడు దుర్గతి, ఈ శాస్త్రమునకు దాపురించినది.

వైద్య శాస్త్రము, శారీరక, మానసిక, బుద్ధులకు, సంబంధించిన, రోగముల నివారణాదులకును, ఆరోగ్యాద్యభివృద్ధులకును సంబంధించిన శాస్త్రరాజము. ఆరోగ్యమే మహాభాగ్యమను నియమాన్ని పురస్కరించుకొని, ధన్వంతరి, ఉద్భట, చరకాది మహనీయులు, ఈ శాస్త్రాన్ని వ్యాప్తిలోనికై రాదగిన, సదుపాయాలను గల్పించిరి. క్రమ క్రమముగ పలువురు పరిశోధకులకు నిలయమై, నాగార్జునాది సిద్ధులచే రసభాగాదులలో వ్యాప్తిజెంది యుండియు, నేటికి పలువుర పాశ్చాత్య విద్యావేత్తల విమర్శనలకు పాలుబడియుండియు, వారి విమర్శనాదులకు, నిలువదగిన శక్తి స్తోమతులీ శాస్త్రమునకే గలవనిన సత్యదూరముగాదేమో!

ఇట్లు వేదములయందలి సర్వవిషయములు, వేదాంగముల ద్వారా, శాస్త్ర రూపమున, పలు రీతుల, శాఖోపశాఖలుగ వెలువడి, మానవ కల్యాణమునకై వినియోగింపబడుచున్నవి.

ఈ వేద శాస్త్రములలో జెప్పిన నియమములను, అనుసరించిన వారియొక్క, ఉన్నతగతులు, ప్రతికూలించినవారియొక్క ప్రాతికూల్యములు కర్మ భక్తి జ్ఞాన మార్గాలలో, నడచినవారి తెరగులు, వీనిని వ్యతిరేకించిన వార్లయొక్క, కర్మ విపాకాదులు,

లోకములో ననేకరీతులనుంటూ వచ్చినవి. వీరి చరిత్ర ములనే పురాణములను పేర్లతో, కథల రూపమున వాడు కొందుము:

శాస్త్రములకు వ్యాఖ్యానాది గ్రంథములు ప్రబలకమును పే, ఛందోబద్ధముగ కావ్యరచన సాగినది. వేదమాతయైన, గాయత్రీ మంత్రముయొక్క, అక్షరములు, బీజ రూపమున, అంతర్గర్భితమైయున్న కావ్య రచన పోకడలు ఆది కవి వాల్మీకికి, అప్రయత్నముగ, లోకానికందించినాడు లోకానంద కరమైన, అపూర్వాభిప్రాయాన్ని లోకానికందించువాడు "కవి" యను నియమాన్ని పురస్కరించుకొని, ఋషియైన వాల్మీకి, కవియై, కావ్యాన్ని, ఆనందకరముగ నందించినాడు. అనాటినుండి "నానృషిః కురుతే కావ్యమ్" అనునానుడి, వ్యాప్తిలోనికి వచ్చినదేమో!

ఋషి గానివాడు, కవిగాలేడు గాన, ఋషిత్వ రూపమైన, మనోనిగ్రహము, ఇంద్రియాది సంయమనము, బుద్ధివికాసము, తపాశక్తి, గలవారి ఛందోమయ వాక్కులకే ఆదరణాభిమానములు మెండుగ లోకమిచ్చు చుండినది.

ఋషియైన వ్యాసమహాకవి, అష్టాదశ పురాణములను, సునాయాసముగ సులభశైలిలో జెప్పగలిగినాడు. అఖండమైన వేదరాశిని ఋగ్యజుస్సామాధర్వణములుగ విభజింపగలిగినాడు. షడంగములతో గూడిన, వేదాభిప్రాయాలను సుబోధకరముగ, లోక మెరుంగుటకై అష్టాదశ పురాణములను, పంచమ వేదమని జెప్పదగిన. సర్వ వేద, సర్వశాస్త్ర సర్వపురాణముల సారభూతమైన, మహాభారతమును, వెలువరించెను.

వేదములను అనుసరించువారి సద్గతులు, తృణీకరించువారి దుర్గతులు, నీతి నియమములు, కామ క్రోధ లోభ, మోహ, మద, మాత్సర్యవంతుల విధానములు, మొదలైన సర్వవిషయములు, ఛందోమయ వాణియై, కావ్యఫణితిని, వెలువడి, "పురాణములు" అను పేరుతో, వేదశాస్త్రములు రానివారికి సహితము, వేదశాస్త్రములలోని, భావములను, సుగ్రాహ్యరీతిని, కథలరూపమున, చెప్పెను. "పురాపి — నవం" అను వ్యుత్పత్తి ననుసరించి, ప్రాచీనమైన కథాదులతో నున్నను నానాటికి, క్రొత్తదనమును నిచ్చులాగున, నుండు గ్రంథ రాజములని, చెప్పుభావాన్ని—క్లుప్తముగ, సంక్షేపించి, "పురాణములు" అని, పేరిడినట్లు తోచును.

వేద శాస్త్రములు పఠించిన వారలకు గలుగు ఫలాదులు, ఈ పురాణములు పఠించిన వారలకుగూడ, కలుగులాగున, సర్వవేదశాస్త్రాది మంత్రము లంత ర్గర్భితములై, పఠన, శ్రవణ, మననాదులచే, అపూర్వమైన శక్తిజనకములుగ, నీ పురాణాదులను, వ్యాస మహర్షి లోకహితార్థమై వ్రాసి, వీనికి భారతీయ సాహిత్యములో, నపూర్వస్థానాన్ని యిచ్చిపోయెను.

ఇట్లు వేదమంత్రానుగర్భితములు, వేదధర్మాను గర్భితములు, వేదఫలానుగర్భితములుగ, గీర్వాణ వాణిలో, కవితాకళను ఛందోమయ, వాక్కులతో, ప్రసరింపజేసి, వ్యాసవాల్మీకులు, తారాపథమున, సూర్య చంద్రులవలె, సాహిత్యలోకమునకు, జ్ఞాన కాంతులను ప్రసరింపజేయుచున్నారు.

ప్రభువులవలె శాసించు, వేద ధర్మములకన్నను, మిత్రులవలె బోధించు, శాస్త్రధర్మములకన్నను, ప్రియురాలి మనోహర వాక్కులవలెనుండు, కావ్యాస్వాదమునకు, లోకు లెక్కువ ఆనందించగలరని, కావ్యరచనలకు, వేత్తలు, పూనుకొనగలిగిరి. ఈ తరిని కావ్యరచన పోకడలకు, పలు నియమములు నిర్ణయించిరి.

ఈ కావ్యరచనా నియమములను, తొలుత. భరతమహర్షి తన నాట్యశాస్త్రములో బీజరూపమున, నుడివినట్లు ఆలంకారిక వేత్తలు, అభిప్రాయ పడుచుందురు.

సూత్రప్రాయముగ, "వామనుడు" అను మహానీయుడు ఈ సాహిత్యమునకు నాందీ జరిపినాడేమో! "సాధు శబ్దార్థ సందర్భం, గుణాలంకార భూషితం। స్ఫుటరీతి రసోపేతం, కావ్యంకుర్వీత కీర్తయే" అని వాగ్భటుడు కావ్యస్వరూపాన్ని చిత్రించెను.

ఇంతకన్నను, కావ్యస్వరూపాన్ని రసవంతముగ జెప్పవలయు ననుకొని, "సాలంకార, రసానేక, వృత్తిర్వాక్, కావ్యనామభాక్" అని మరియొకరు కావ్యస్వరూపాన్ని నుడివిరి. "ధ్వన్యాత్మకం వాక్యం కావ్యం" అనుధర్మాన్ని మరియొక మహానీయుడు తెలిపెను. "శబ్దార్థయోః చారుత్వం, సధ్వనిః" అని ధ్వనికి వివరణ దెలిపిరి.

రసప్రాధాన్యవాదులు, "వాక్యం రసాత్మకం, కావ్యం" అని, రసవంతేముగ నుడివిరి. చమత్కారాను ప్రాణితమైన వాక్కే కావ్యమనువారున్ను లేక పోలేదు. ఇట్లు సంస్కృత భాషలో కావ్యమనుటకు తగిన అర్హతలను, రీతి, వ్యంగ్య ధ్వని, రస, చమత్కారాదులను, కల్పించుచు గొప్పవిమర్శనా పూర్వక రచనలను సాగించిరి: వీనికే, "అలంకారిక శాస్త్రము" అను నామకరణ మొనర్చిరి:—వీనిని సమగ్రముగ నెరిగిన వాడే, రశికుడనియు, కావ్య రసాస్వాదన వేత్త యనియు చెప్పుకొనుచుందురు.

ఈ ప్రకారము పలుపోకడలతో, మహనీయులు కావ్య స్వరూపాన్ని నిర్వచించి, ఉత్తమ, మధ్యమ, అధమ, అనహాధమాది, భేదములతో కావ్య విభాగాన్ని నిరూపించి యుండగ కొందరు ప్రబుద్ధులు కావ్య ప్రయోజనాన్ని విస్మరించి, వినోదాదులకు కావ్యరచనాదులను సాగించుకొనుచుండగ పెద్దలు గుర్తించి "కావ్యాలాపాంశ్చవర్జయేత్" అను నియమాన్ని నిర్బంధించిరి. కాని ఉత్తమ కావ్యాలాపాదుల కేమియు క్షతిలేదుగాని, ఉత్తమేతరములైన కావ్యాగుల కీవాక్కు విష వాక్కుగ పరిణమించినది.

ఈ స్వరూప స్వభావాదులను, బాగుగ నాకళింపుజేసుకొనిన, అపర బృహస్పతి యని నుడువదగిన, జపహోమతత్పరుడైన, వాగనుశాసనుడగు, నన్నయ భట్టారకుడు, "విశ్వశ్రేయః కావ్యమ్" అను ధర్మాన్ని పురస్కరించుకొని, పదునొకండవ శతాబ్దిలో, ఆంధ్రభాషకు ప్రాణము బోసినట్లుగ భారత రచనకు బూనుకొని, ఆంధ్రములో, ఛందోమయ వాణిని, వ్యాపింపజేయుటకు, పునాదివేసి, కావ్యరచనకు, శ్రీకారము జుట్టెను. ఆశుభసమయ మెట్టిదియో! ఆ మహనీయుని జపహోమతత్పరతా శక్తియెట్టిదియో! ఆంధ్రకవితా ప్రవంతికి, అవిచ్ఛిన్నమైన, అకుంఠితమైన, ధారాశక్తి, దినదిన ప్రవర్ధమానముగ విరాజిల్లుచున్నది. వేద శాస్త్రములలో, ప్రవేశము లేకుండిన, ఆ మహనీయుని భావగాంభీర్యము లంతగ, నవగతములు గావనవచ్చును. సర్వవేదశాస్త్రముల. అశేష సారభూతమైన' భారత సంహితను, తన సొంత, ఊహలకుగాని, సొంతపోకడలకు గాని, తావివ్వక, వేదశాస్త్రముల కనుగుణ్యముగ, రచనను, సాగించవలయుననిన, సామాన్య విషయము గాదు గదా!

కనుక నే :

"అమలిన తారకా సముదయం
బుల నెన్నను సర్వవేదశా
స్త్రముల యశేష సారము మదం
బున బొందను, బుద్ధిబాహు వి
క్రమమున, దుర్గమార్థ జల గౌరవ
భారత వాహినీ సము
ద్రము, దరియంగ నీదను విధాతృన
కైనను నేరబోలు నే"

భారతము యొక్క గొప్పదనాన్ని నిరూపించినప్పుడు, యిట్టి యాధిక్యతతో గూడిన భారతాన్ని తానుగూడ:

"సారమతిం కవీంద్రులు ప్రసన్న
కథాకలితార్థయుక్తి లో
నారసి మేలునా నితరులక్షర
రమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తి నిధి నన్నయ
భట్టు దెనుంగునన్, మహా
భారత సంహితా రచన బంధురు
డయ్యె జగద్ధితంబుగన్।"

కవీంద్రులకు ప్రసన్న కథా కవితార్థ యుక్తియును, యితరులకు, అక్షర రమ్యతగను, నానారుచిరార్థసూక్తినిధియైన నన్నయ భట్టారకుడు, జగద్ధితముగ, భారతసంహితా రచన బంధురుడాయెను:
ఉత్తమ కావ్యమునందు, వ్యంగ్యార్థమే, యతిశయముగ నుండును. వ్యంగ్యమునకన్నా వాచ్యార్థమతిశయించిన, మధ్యమ కావ్యమని జెప్పిరి. స్ఫోటార్థము స్పష్టముగ లేనిది, అధమకావ్యమని, అలంకారికుల అభిప్రాయము.

వినినను, చదివినను, మనోవికాసాన్ని గల్గించు రామణీయక రచనావిశేషమే, కవిత్వమని చెప్పిరి. తేనెటీగ పుష్పమునందలి మకరందాన్ని మాత్రమే గ్రోలురీతిని, కవి మనంబు వస్తువునందలి సౌందర్య సారము నే గ్రహించును. కాన మకరందము జనించు కవిత్వమే యానందైక ప్రయోజనము.

రసోల్లాసముచే నొక భావము తనంతట బొడమి, ప్రతిభాచాతుర్యము వలన మనోహరాకృతిని బడసి, రచనావైచిత్రిచే లోకోత్తర చమత్కారియై, కావ్యముగ రూపొందవలయును.

ఈ దృష్టితోనే తిక్కనాదులు నానా రసోల్లాసముగ, తమ రచనాసామర్థ్యాన్ని లోకానికందించి, అమరజీవులైనారు.

తిక్కన వ్యాసస్తుతిని జూడుడు:

విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుడు సంయమిప్రకర సంభావ్యాను
భావుండు కృ
ష్ణద్వైపాయనుడర్థిలోకహిత నిష్ఠంబూని, కావించె, ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యము లేఖ్యంబైన
యామ్నాయమున్ ||

సంయమిత్వము, విజ్ఞాన సంపద్విఖ్యాతి, విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశము వ్యాసునిలోనున్నట్లు వర్ణించినను, మహాకవులకి వెల్లయు నుండవలయునను ధ్వని గాని, లేక యట్టి సంపదతోనున్నవాని కావ్యమే లోకహితమును చేకూర్చునను భావగాంభీర్యము గాని యిమిడియుండునా? లేకున్న యీ మూడు విశేషణములతో వ్యాసుని జెప్పుటలో తిక్కన యుద్దేశ్య మేమైయుండును?

నన్నయ జపహోమతత్పరుడు, తిక్కన వైదికమార్గనిష్ఠమగు వర్తన ముండుగ నిర్వహించువాడు. నిత్య సత్యవచనుడు నన్నయ, భేదములేని భక్తిని అతి నిర్మలవృత్తితో నుండువాడు తిక్కన, సత్ప్రతిభాభియోగ్యుడు నన్నయ, ఆత్మసమ్మోదము బొందినవాడు తిక్కన, ఉభయభాషా కావ్యరచనాభిశోభితుడు నన్నయ, కావ్యరసముం గొనియాడుచునుండువాడు తిక్కన, జగద్ధితంబుగ భారతరచన సాగించినవాడు నన్నయ, భవ్యపురుషార్థతరుపక్వఫలముగ, రచన సాగించినవాడు తిక్కన.

ఇట్లు నన్నయ్య, తిక్కనలలోని గుణవిశిష్టతలు, సమాన ప్రతిపత్తితో వెలయుచుండు పదముల కూర్పులలో భిన్నతయే గాని వాని యర్థములు రెండును ఒకటియేనని సహృదయులకు గోచరము గాకబోదు.

నన్నయ్య తిక్కనన్నలు భిన్నకాలానికి జెందిన ఇరువురు వ్యక్తులుగనున్నను, భిన్న భిన్న నామములతో వ్యవహరింపబడు పరమేశ్వరుడే, ఈ ఇరువురి రూపములతోను వ్యవహరింపబడి సారస్వతలో కొన్ని మభ్యపెట్టుచున్నాడా!

ఇట్లు లోకహితనిష్ఠతో, నజ్ఞానతమో భాస్కరముగను, విజ్ఞాన సంపద్విఖ్యాతముగను, విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశముగను, కావ్యము ఒప్పుచుండవలయుననెడి ధ్వని నన్నయ, తిక్కనల అంతరార్థమైయుండునా? సారస్వత వేత్తలు సహృదయతతో సమాలోచించుడని సంప్రార్థింతును.

కావ్యరసాస్వాదనవేత్తలైన సహృదయులు నన్నయ తిక్కనల నొక్కరూపుగనే నారాధింతురు. విమర్శకాగ్రేసరులైన పండితులు, నన్నయ తిక్కనలను భిన్నదృష్టితో, హెచ్చుతగ్గుల నారోపించుచునుందురు. అది వారి సంస్కారము. ఇది వీర సంస్కారము. "లోకో భిన్నరుచిః" ఎవరి నేమనగలము. వైదిక లౌకికములు నన్నయ, తిక్కనలలో, మరికొందరారోపింతురు. వారి రచనలు జూచిన, ఇరువురు వైదికులే, ఇరువురు లౌకికులే, జపహోమతత్పరుడు నన్నయయైతే, తిక్కన వైదికమార్గ నిష్ఠమగు వర్తనములో నుండువాడు, నన్నయ లోకజ్ఞుడైన, తిక్కన అమాత్యశేఖరుడు గాన, వీరిలో హెచ్చుతగ్గులను, ఆరోపించుట మన ప్రతిభాచాతుర్యమును ప్రకటింప ప్రయత్నించుటయే.

వీరికి సరియుద్ది యఱ్ఱాప్రెగ్గడ. భవ్యచరిత్రుడు, సంతతధ్యాన సంసక్తచిత్తుడు, ధర్మైకతత్పరాత్ముడు, గుణగరిష్ఠత నొప్పు ధన్యుడు, సరససారస్వతాంశ ప్రశస్తితో, సాధుజన సిద్ధిగోరి కావ్యరచన సాగించిన మహనీయుడు.

వేదసంప్రదాయములు తెలియని వారికి నన్నయ్య రచనలలోని సొంపు దెలియదు.

"రసో వై సః" "రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వాఽనందీ భవతి" యను వేదవాక్కులకు, ఒరపిడిగ, నవరసోల్లాసముతో కావ్యరచన సాగించి, "యీ దృశంబులగు పుణ్యప్రబంధములు, దేవసన్నిధిం ప్రశంసించుటయు, నొక్కయారాధనా విశేషంబుగ దలంచి అనన్య సామాన్యంబగు పరమధర్మప్రకారంబుగ భావించి, మహాకవిత్వదీక్షావిధితో సమస్త దురితాపహారంబును, అభిమత శుభావహంబుగను, రచనసాగించి, భవ్యపురుషార్థ తరుపక్వ ఫలంబును బొందిన తిక్కన రచనలను శాస్త్రసాంప్రదాయ ధర్మములు దెలియనిదే, యాస్వాదించుటకనువుబడదు.

సరససారస్వతాంశతో గూడ, పౌరాణిక పోకడల నెరుంగనిదే, సముల్లాసోద్భాసితముగ, ప్రబంధ పరమేశ్వరుడైన, యఱ్ఱన కవితాశక్తిని గుర్తింపలేమేమో!

బ్రాహ్మీదత్త వరప్రసాదుడు శ్రీనాథుడు, పలికించెడువాడు రామభద్రుండుండగ, భవహరమునకై పలికినవాడు పోతన. ఈ యిరువురికి, ఉత్తర దక్షిణ ధ్రువములంత తేడాలున్నను, ఇరువురు ప్రకృతి పురుషుల, ఆరాధనా తత్పరులు. ప్రకృతి స్వరూపమైన బ్రాహ్మీదేవి నారాధించి, తత్తపోఫలముగ కావ్యములను పంచిబెట్టి భోగభాగ్యములను చూరగొనినవాడు శ్రీనాథుడు.

ప్రకృత్యతీతమైన పరమపురుషుని ఆరాధించి, అద్వైతస్థితిలో, బ్రహ్మవిద్వరేణ్యుడై, సర్వవేద సారభూతమైన భాగవత నవనీతమును, అందించిన, పరమ తపోవంతుడు, పోతన మహనీయుడనక తీరదు. పుణ్యమూర్తి వెంకటనారాయణరావుగారు నుడివినట్లు భాగవతానికి పునర్జన్మ లేకుండాను, తనకు పునర్జన్మ లేకుండాను, చేసుకొనిన, బ్రహ్మస్వరూపుడు.

ఇట్లు భారత భాగవతాదికవులు పరమ తపోవంతులు, నియమనిష్ఠాగరిష్ఠులు, వేదశాస్త్ర పురాణాదులను, మథించిన, విజ్ఞానఖనులు. వాఙ్మయధురీణులు. మహనీయులు. కనుకనే శాశ్వతముగ, ఆంధ్రజాతికి, దైవశక్తి నందించియిచ్చి పోయినారా అనులాగున, భారత భాగవతాది గ్రంథరాజములను, ఆశీర్వదించి యిచ్చిపోయినారు.

కాన నిర్మలదృష్టితో నా కావ్యములలోని రచనా సౌష్ఠవమును పరికించితి మేని, అప్రయత్నముగ మనలో నొక అపూర్వ చైతన్యము గలిగి రసానందముతో మైమరచుదుము. "రసో వై సః" అను వేదవాక్కులోని, పరబ్రహ్మతత్వ బోధక భావ గాంభీర్యతకు ముగ్ధుల మగుదుము. వీనినే మహాకావ్యములని వేనోళ్ల బొగడుకొనుచుందుము.

ఈ దృష్టితోనే ప్రబంధకవులు కొంతవరకు పో ప్రయత్నించిరి. కాని వారిలోని భోగలాలసతాదులు కానరానట్టి తెరలుగ నిలబడి, భారత భాగవత కవులు గలిగించిన, అపూర్వ చైతన్యమును దూరము నుండియే చూపగలిగిరి కాని, అప్రయత్నముగ మనలో వచ్చి చేరిపోవులాగున చేయలేకబోయిరి.

బుద్ధి వికాసమునకు, పాండిత్యమునకు, రసికతకు యిచ్చిన శోభ, ఆత్మవికాసమునకు, ఇంద్రియ సంయమమునకు, అపూర్వ దైవశక్త్యావిర్భావమునకు, స్థానములివ్వలేకబోయినవి.

భోగలాలసతతో గూడిన మానవ జీవితమంత మంచివిగాదని నిరూపించుచు, నాటి విజయనగర పాలనలోని ప్రజలకు, భోగతృష్ణనుండి వైముఖ్యమును, గలిగించుచు, ఆపత్సమయములో దైవమే రక్షించునను, పరమార్థమును నిరూపించుటకై, ప్రవరుని జీవితాన్ని వైదిక కర్మానుష్ఠానాది, నియమబద్ధముగ చిత్రించి సనాతన ధర్మాన్ని శ్రౌతసంప్రదాయాధిక్యతను పేశలసుధామయోక్తులైన కవితా రచనతో అల్లసాని పెద్దన చిత్రించి, "తుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్" అనియు, "కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్" అనియు నిరూపించుచు, కర్మానుష్ఠానముల ప్రాముఖ్యాన్ని మీమాంస శాస్త్రజ్ఞులు జెప్పు అపూర్వావిర్భావ మహనీయతను ప్రబంధరూపమున ప్రవచింపజేసి ధర్మశాస్త్రములోని దినచర్యను మీమాంసశాస్త్రములోని అపూర్వతను, ప్రబంధరూపములో రసవంతముగ రూపొందింపజేసిన రసమూర్తి ఆంధ్రకవితా పితామహుడు.

చమత్కారవంతముగ, రసవంతమున కావ్యాన్ని చిత్రించినంతనే కవి బాధ్యత తీరిపోలేదు. ఆ కావ్యమువల్ల గలుగు పరమప్రయోజనాన్ని ప్రజలకు కవి యెరిగించవలసియుండును.

కవి సార్వభౌమాది బిరుదాంకితులు రాజశేఖర శతావధానిగారు రాణాప్రతాపసింహ చరిత్రలో కావ్యప్రయోజనాన్ని గూర్చి విదేశీయులెట్లు దలంచినదియు వివరించియున్నారు. చూడుడు :

"జ్ఞానంబునకు మూలసారమా నాత్మ, కా
వ్యకవిశ్వమని, వర్డ్సువర్తునుడివే
సత్యంబునకు సౌఖ్యసంగంబు, చేకూర్ప
జాలిన కళయంచు, జాన్సననియె
నతుల సంగీత రసాత్మకంబయిన భా
వాలాపమనుచు, కార్లైలు దెలిపె
ప్రతిభావిలాసంబు వాక్యదేహంబు
దాల్చిన రూపమనుచు, షెల్లీ వచించె
హాస్సనాదిగ, నెంజరో యాంగ్లకవులు
పద్యకవితకు, గల గౌరవప్రశస్తి
యట్టిదిట్టిదనంగరాదని, సహస్ర
ముఖముల నుతింపవిన మొకో! పూర్వమందు!

జ్ఞానాభివృద్ధి, సత్యసౌఖ్యములు, సంగీత రసాత్మకంబైన భావాలాపము, ప్రతిభ, మొదలైనవి గలి

గించగలిగిననే కావ్యత్వ ప్రశస్తి గలుగునని, పాశ్చాత్యుల అభిప్రాయముగ నున్నట్లు తెలియుచున్నది.

వీరరసతరంగములు తొణికిసలాడునట్లుగ, రాణా ప్రతాపసింహచరిత్ర నొక చారిత్రక మహా ప్రబంధముగ చిత్రించగలిగిన శక్తిసామర్థ్యము లొక రాజశేఖర శతావధానిగారికే గలవని పలువురి పెద్దల అభిప్రాయములు :

"వెలయుజగమ్మున న్విభవవృద్ధికి
మూలము, ధర్మవృద్ధి యా
యలఘువిశుద్ధ ధర్మమున కాశ్రయ
మెక్కుడు, సజ్జనాళియిం
పొలయగ, ధర్మకర్మముల కున్నతి
ప్రాపు కవీంద్రు పల్కులేఁ
దలచెద నట్టి ధర్మనిరతార్య
కవీంద్రుల గార్యసిద్ధికై"

యని 'రామరాజ్య' మహా ప్రబంధములో మహా కవిశేఖరుడు కాండూరి నరసింహాచార్యులు గారు చెప్పిన, "ధర్మ కర్మములకున్నతిప్రాపు కవీంద్రులనుట" ఆంధ్ర కవితా పితామహుడైన అల్లసాని పెద్దన రచనకు, అనుగుణ్యముగనున్నది :

తేనియ లొల్కుపల్కు జిగిదీరిచి,
కబ్బములల్లు నేర్పు, సంధానపటుత్వమున్
సరసతా ప్రతిపాదన శక్తి, రక్తి, యింపును,
కథాచమత్కృతి కవులకుండవలయునని చెప్పెను.

"వలపుల చంద్రికారుచుల,
వాయుతరంగ విలాస వీనులం।
గలికి వనమ్మల న్మధుర గాన,
కుహూరవ కోకిలమ్మలం।
దళతళలాడు క్రొమ్మెరుగు తావులఁ
బుబ్బుల ద్రిప్పవంచు।
నీ వలుగకు, భారతీ!
నకువు మార్య పథమ్మున నాదు వెంబడిన్॥

అని అశోక సామ్రాజ్యములో, నార్య పథమ్మలో భారతీ దేవిని నడిపించిన, మహాకవి శేఖరుడు నరసింహాచార్యులు:

నేటి కవులలో "పుట్టపర్తి" కొక వైశిష్ట్యమున్నది. కవులలో మహాకవి. విమర్శకులలో సవ్యసాచి, బహుభాషా వేత్తలలో నద్వితీయుడు, సంగీత సాహిత్యములను పానముజేసిన సరస్వతీ పుత్రుడు. సర్వతోముఖ పాండిత్యముతో సింహమువలె సంచరించుచు మొనగాడు.

ఉలిలో తేనెల సోనలం జిలికియా,
యొయ్యారి చిత్రించువే,
శిల నా శిల్పికి గన్నగోనలను,
ధారల్గట్టెనేమో! జలంబుల జేనోయి సెమర్చి
యుండునను కొందున్ భావనా వేశభం
గులు పైపై జెలరేగ ముద్దుగొని
యుండున్ ప్రేమ విభ్రాంతుడై॥

అని శిల్పమును గాంచగనే కవిలో వెలువడిన భావావేశపరంపరలను పెనుగొండ లక్ష్మిలో జూడుడు.

చట్రాళ్లలో, జీవ సౌందర్య మహిమంబు,
మూటి నిల్పిన, కళామందిరంబు।
భూత సంతతి చిత్తముల భక్తి దీప ప్ర
భా పుంజములు, నిల్పు పరమసురువు
మతము పేరిట పరస్పర మానసిక బంధ
మును భద్రబరచెడి యినుప గొలుసు।
కనులలోబడని, సూక్ష్మ స్వరూపుని ముందు,
గనగజేసెడు కనుకట్టు విద్య।
తత్వపాంథులకు నహదారి బాట।
పూర్వజన్మ మనః ప్రత్యయమున గుఱుతు
చెనటి కాకోల హృదయు దుష్కృత్యములను।
బాడు వడినది చూడు దేవస్థలంబు॥

అని జీర్ణదేవాలయాన్ని గూర్చి భావావేశముతో జెప్పిన యీ పద్యము, మనుచరిత్రలోని "గృహమేధి" పద్యమును స్ఫురణకు తేకమానదు.

కళయు శాస్త్రము రెండు నైక్యంబు జెందించి యేకరీతిగ నిలిపి, నుడువదగిన సుకవివాక్యమునకు లోకము మోకరిల్లును. ఈరకపు రచనలలో, నేర్పరులైన వన్నెకెక్కిని మహాకవి శేఖరులలో—కాండూరి నరసింహాచార్యులు, పుట్టపర్తి నారాయణాచార్యులు, దుర్భాక రాజశేఖర శతావధానిగారు, అందె వేసిన చేతులై, రాయలసీమకు రత్నత్రయముగ విరాజిల్లుచున్నారు. విరాజిల్లుదురు గాక:—విజ్ఞానమునకు, భాషా సంపదకు, రసపుష్టికి, యీ మువ్వురి గ్రంథములు ప్రామాణికములు.

కావ్య ప్రయోజనాన్ని స్మరించి లోకమునకు చైతన్యమును గలిగించు రచన, సర్వులకు శిరోధార్యము లేగదా!

పింగళి సూరనార్యుడు కళాపూర్ణోదయములో నుడివినట్లు.

"ప్రాసగ ముత్తైపుసరుల్ పోహళించినలీలఁ
దమలోన దొరయు శబ్దముల గూర్చి।
యర్థంబు వాచ్యలక్ష్య వ్యంగ్య భేదంబు
లెఱిగి, నిర్దోషత నెసగజేసి।
రసభావములకు, నర్హంబుగ వైదర్భి
మొదలైన రీతు లిమ్ముగ నమర్చి।
రీతుల కుచితంబులై తనరారేడు,
ప్రాణంబు లిమ్ముగా బాదు కొల్పి।
యమర నుపమాదులును యమకాదులు నగునట్టి
యర్థ శబ్దాలంక్రియలు ఘటించి
కవిత జెప్పంగ నేర్చు సత్కవివరునకు,
వాంఛితార్థంబు లొసగని వారు గలరె।

అని పింగళి సూరనార్యుని ఛందోవాణి ననుసరించి, కావ్యరచనా బంధురుడైనవాడే మహాకవి పథాన్ని సునాయాసముగ నందుకోగలుగును.

పురాణ కథను నితివృత్తముగ గైకొని చమత్కృతికిని, రసపుష్టికిని వలయునటులు స్వతంత్రతతో. కావ్యములు రచించుటయే, ప్రబంధకవుల, ఉత్తమ సంప్రదాయములు. కాళిదాసాది మహాకవిశేఖరులు, ఈ సంప్రదాయము ప్రకారమే, సంస్కృత కావ్యములను రచించి, మార్గదర్శకులైరి. కారణమేమనగ, కావ్య నిర్మాణమునకు ముఖ్య ప్రయోజనము, విశ్వ శ్రేయము. ఉత్తమ పురుషుల చరిత్రములైనచో, యిహ పరసుఖాపాదకములగును.

ఇట్లు వేదములు శాస్త్రములు పురాణములు కావ్యాదులు. సంస్కృతమున. తొలుత వెలువడి, యుంస, వాని నెల్ల సమగ్రముగ జీర్ణించుకొని, సర్వ సౌభాగ్యవంతముగ, నాంధ్రములో భారత, భాగవతాది మహా పురాణములుగను, ప్రబంధాదులుగను, వెలువడినవై మానవ శ్రేయోవిధానములై, అఖండమైన జ్ఞానజ్యోతియగు, పరబ్రహ్మ తత్త్వమున కభిముఖులుగ మనలను, మనం జేయ సమర్థములగుచున్నవి. కనుక నే 'విజ్ఞానం బ్రహ్మేతివ్యజానాత్, విజ్ఞానాద్ధ్యేవఖల్విమాని భూతానిజాయంతే' అను ఉపనిషద్వాక్యము, పరమ ప్రమాణమై చరితార్థమగుచున్నది.

వేదశాస్త్ర పురాణ కావ్యాదుల సమూహ జన్య జ్ఞానమే సారస్వతవేత్తలు సమ్మతింతురుగాక : ఇట్టి సారస్వత వైశిష్ట్య జన్యజ్ఞానమే పరబ్రహ్మ స్వరూపముగ నారాధించి, ఆనందించి న నే వేదశాస్త్రాదులకు చరితార్థము, మానవ కల్యాణమునకు దోహదము, చేకూర్చిన పరమ పావనులమగుదుమని ప్రార్థనాపూర్వకముగ ప్రాజ్ఞులకు మనవిజేతును.

# వీలునామా

నాగభూషణ్

పాత్రలు: రాఘవయ్య, భాస్కరం, ఆనందరావు, బంగారు
అనంతం, సంతానం, సుశీల

## రంగము: 1

రాఘవయ్య : (తెరవెనుక) భాస్కరం! భాస్కరం! ఎంతచెప్పినా, ఎటూకాని వేళ ఆ తలుపులు మూసుకొని, తెరలు వేసుకొని కూర్చుంటావేరా? బంగారు! బంగారు!

బంగారు : సారూ!

రాఘ : వాడికి తెలియకపోతే నీకైనా తెలియదురా? పట్టపగలు ఆఫీసురూము మూసుకు కూర్చుంటాడ్రా? ఆ తెర తియ్. తలుపులు తెరు.

[తెర తొలిగిపోతుంది. కనిపించేది రాఘవయ్యగారి ఆఫీసుగది. గదికి ముందుభాగాన 'పి. రాఘవయ్య బి. ఏ., ప్లీడరు' అనీ, రెండోప్రక్కన 'పి. భాస్కర్ బి. ఏ., బి. ఎల్., అడ్వొకేట్' అనీ వ్రాసిన 'బోర్డులు' వున్నయ్. గదికి వెనుక మధ్యగా ఒకవాకిలి, వాకిట్లోకి మరోవాకిలి వుంటయ్. మరోప్రక్క వీధివైపుకు కిటికీవుంది. గది మధ్యలో ఒక టేబుల్, దానికి మూడు ప్రక్కలా మూడుకుర్చీలు, ఒకమూల పడకకుర్చీ, దూరంగా ఒకబల్ల, దానికి చేరువగా రెండు కుర్చీలు వున్నయ్.]

రాఘ : ఇట్లా నాలుగుగోడలమధ్య కూర్చుండిపోతే, ఇక ప్రాక్టీస్ ఎలా చేస్తావురా?

[భాస్కరం ఆలోచిస్తూ ఉంటాడు]

రాఘ : అంత ప్రపంచాన్ని మరచిపోయే ఆలోచనలేమిట్రా!

భాస్క : అదే!—'మనుష్యులు అనవసరంగా యెందుకు యెప్పుడూ ఆలోచిస్తూవుంటారా?' అని.

రాఘ : ఎందుకాలోచిస్తున్నారా అని నువ్వు ఆలోచిస్తున్నావా? చించు, చించు—

[బంగారు ఏదో చీటీ తెచ్చి రాఘవయ్యగారికిస్తాడు]

ఎవరు? ఆనందరావా? ... పేరు కూడా ఎప్పుడూ వినలేదే!

బంగా : రెండురోజులకిందటే మీకు ఉత్తరం రాశానంటున్నారండి—

రాఘ : ఉత్తరమా! నేను చూడలేదే!

భాస్క : (రూళ్లకర్రను ముక్కుమీద నిలబెట్టడానికి ప్రయత్నం చేస్తూ) నేనూ చూడలేదే!

[బంగారు, భాస్కరంవంక నోరు తెరిచి ఆశ్చర్యంగా చూస్తాడు.]

రాఘ : ఏమిట్రా, తిమింగిలంలా ఆలా నోరు తెరుచుకు చూస్తావ్?

భాస్క : (బంగారువంక చూసి) ఏం బంగారు? అదే అని నీ ఉద్దేశ్యమా?

[అవునన్నట్టుగా తల వూపుతాడు బంగారు]

రాఘ : ఏది?

భాస్క : అదే! మొన్న క్లబ్‌లో బిలియర్డ్స్ మాచ్ వుంది. త్వరగా వెడుతూ వుండగా ఉత్తరాలు యిచ్చాడు బంగారు. ఇచ్చినవాడు వూరుకున్నాడా? అట్లాగే నోరు తెరుచుకుని నిలబడ్డాడు. నాకూ తమాషా చెయ్య

---

జె. యం. బారీ ఆధారంగా

లనిపించింది. కవరు చిన్నదికూడా నేమో, నోట్లో పడేటట్లు విసిరాను. మేం యూనివర్సిటీలో వుండగా ఒక 'గేం, ఆడేవాళ్లం నాన్నా! ఒక గిరిగీసి, ఆ గిరిలో పడేటట్లు అట్టముక్కల్ని విసరడం! కాని, ఏం లాభం? అది కాస్తా మురుగుకుంటలో పడి మునిగిపోయింది.

రాఘు : ఏం బావుండలేదు, భాస్కరం.

భాస్క : నిజమే! కాని ఆ ఆట ఆడటం మానేసి అప్పుడే నాలుగు నెలలయింది.

రాఘు : (చేతిలో చీటీ చూస్తూ, బంగారు వంకకు తిరిగి) ఎట్లా వుంటాడు మనిషి.

బంగా : మనిషికేమండీ! మన ఒంగోలు కోడెలా వున్నాడు. అయితే యేం? మనిషేందో దిగులుగా, సినిమాలో హీరో ఏడుస్తున్నట్టున్నాడండి.

భాస్క : ఆపరా బంగారూ, నీ అలంకారాలు! వీటిని వింటే ప్రబంధ కవులు అమాంతం గుండెలు బాదుకుంటారు.

రాఘు : ఆఁ!...... వుత్తరం అదేనంటావా? లేక పొరపాటు పడ్డాడా?

బంగా : ఆయన అచ్చంగా తన నోటితో సెబితే నే!

భాస్క : పోనీ, మళ్లీ రాయమనకూడదూ?

రాఘు : (విసుగుతో) ఆఁ—

బంగా : కాని, ఆ అమ్మాయి గారు—

భాస్క : ఎవరు?

బంగా : అదేనండీ! ఆయన గారితో రాలా, ఓ అమ్మాయి గారు—

భాస్క : మాకేం తెలుసురా? వచ్చిందా?

బంగా : ఆఁ! వచ్చిందండీ ...... ఆవిడగారు ఏడుస్తోంది.

భాస్క : (ఆదుర్దాగా) ఏడుస్తోందా?...ఎన్నేళ్లుంటయ్?

బంగా : సిన్నదేనండి.

భాస్క : అంటే పదేళ్లుంటయ్యా?

బంగా : పెద్దదేనండి.

భాస్క : అంటే, ఓ యాభైవుంటయ్యా?

బంగా : కాదు బాబూ......ఓ ఇరవై—

భాస్క : ఇరవై!...అందంగా వుంటుందా?

బంగా : కొరుక్కు తినొచ్చునండి.

రాఘు : ఏడిశావు గాని, బెల్ కొట్టగానే వాళ్ళను లోపలకు తీసుకురా.

బంగా : సిత్తం...

భాస్క : బంగారు! ఇహ నెప్పుడూ వుత్తరాలిచ్చి నోరు తెరుచుకు నిలబడకు... తెలిసిందా?

[బంగారు నవ్వడానికి ప్రయత్నం చేసి, విఫలుడౌతాడు. మొహం పాలిపోతుంది] ఏమిటి బంగారు అలా అయిపోయావ్?

బంగా : అబ్బే! ఏముంది?...ఏమీ లేదండి. (అంటూ వెళ్ళిపోతాడు).

భాస్క : బంగారు అలా వున్నాడేం, నాన్నా?

రాఘు : భాస్కరం ఆ సంగతి అలావుంచు...నిన్ను చూస్తేనే నాకు కోపం ముంచుకువస్తోంది.

భాస్క : సహజమేననుకోండి...

రాఘు : ఇప్పుడు వినోదరావు కేమని చెప్పాలి?

భాస్క : వినోదరావు కాదు నాన్నా, ఆనందరావు.

రాఘు : అదే! ఆయన కేమని చెప్పాలి? 'మీ వుత్తరం చదవ లేదండి...మా వాడు ఓ ఘనకార్యం చేశాడు' అనాలి.

భాస్క : ఎందుకు?

రాఘు : ఎందుకేమిటి? ఆయన మన దగ్గరకు ఎందుకు వచ్చాడో మన కేమీ తెలియదని ఒప్పుకోవాలి కదా!

భాస్క : (ఆలోచిస్తూ) ఆ మాత్రం తెలుసుకోలేమా?

రాఘు : (కొంచెం ఆశ్చర్యంగా) నువ్వు తెలుసుకోగలవా?

భాస్క : రెండూ, రెండూ కలిపితే ఎంత అవుతుందో ఇంకా నేర్పాలా నాన్నా?

రాఘు : అంత తెలివిగలవాడవయితే ఈ కేసు నువ్వు నడుపు. చూస్తాను...ఇది నీకు మొదటి కేసు!

భాస్క : (ముందు కొంచెం బిత్తరపోయినా, తెప్పరిల్లుకొని) అలాగే!...తప్పకుండా...(తరువాత, ధైర్యంగా) వాళ్లు లోపలకు వచ్చిన రెండు నిముషాల్లో వాళ్లు ఎవరో, ఎందుకు వచ్చారో తెలుసుకుంటాను, చూడండి.

రాఘు : (పేలవంగా నవ్వుతూ) చిన్నవాళ్ల దగ్గర నుంచి నేర్చుకోవడానికి నే నెప్పుడూ సిద్ధమే! అయితే, ఆ మాత్రం మేమూ కనుక్కోగలం!

భాస్క: ఎలా?

రాఘు : వాళ్ళనే అడిగి తేసరి.

భాస్క: ఆ మాత్రానికి నేను యూనివర్సిటీకి వెళ్లి, వున్నదానికి మరో తోక తగిలించుకురావడం దేనికి?

రాఘు : భగవంతుడికి తెలియాలి...సరే, వాళ్లను పిలవమంటావా?

భాస్క: (కుర్చీలో నుంచి లేచి, తనను తాను సర్దుకొని) యస్...

రాఘు : (బెల్ కొట్టబోయి, ఆగి) ఆ వచ్చినావిడ పేరు కూడా మనకు తెలియదు కదా!

భాస్క: నేను కనుక్కుంటానుగా, చూడండి.

రాఘు : పెళ్ళయిందా?

భాస్క: అదే తెలుస్తుంది...మనకు తెలిసినదల్లా ఆవిడ చిన్నదని అందగత్తె అని, ఏడుస్తోందని—ఆవిడకు పెళ్ళి అయివుంటే, ఆ ప్రక్కనున్నాయన ఆవిడభర్త ఆయివుంటే, భర్త ప్రక్కనవుండి కూడా ఆవిడ ఏడవవలసిన పని ఏమిటి?

రాఘు : వున్నందుకే నేమో?

భాస్క: అందుకయితే ఇంతదూరం ఎందుకువస్తుంది? ఒకవేళ పెళ్ళి కాకపోతే ఈయన ప్రియుడైనా, అన్నయినా కావచ్చు...ఇంతకూ ఆ అమ్మాయి విషయంలో నే వచ్చారని మాత్రం నాకు తోస్తుంది.

రాఘు : బృహస్పతి దిగి వచ్చాడయ్యా! (బెల్ కొడతాడు.)

[మరుక్షణంలో ఓ యువకుడు, ఆయనను అంటుకు పోయిన ఓ యువతి లోపలకు వస్తారు. ఇద్దరూ భయపడుతున్నారు. యువకుడి మొహం పాలిపోయి వుంటుంది. అతను లోపలి ఆతురతను అణుచుకోవడం కోసం, అనుక్షణం దీర్ఘంగా నిట్టూర్పులు విడవడం వినిపిస్తుంది. ఆవిడ విచారం యింకా తగ్గినట్లు లేదు. ఏడవడంవలన ఏర్పడిన చెదిరిన ముంగురులు, చెరిగిన కాటుక మాత్రం మనకు కనిపిస్తూ వుంటయ్]

భాస్క: రండి ఆనందరావు గారూ! మీరు మా నాన్నగారు (ఆనందరావు ఆయనకు నమస్కరిస్తాడు. రాఘవయ్యగారు ప్రతి నమస్కారం మాత్రం చేసి పూరుకుంటాడు) వారు లాయరే!...అయినా ఈకేసు నేను చూస్తున్నాను.

ఆనంద : (తప్పు చేసిన వాడిలా భయపడుతూ) నా ఉత్తరం అందిందనుకుంటాను.

భాస్క: (కొంచెం తడబడుతూ) అవును...అందింది.

ఆనంద : దానిలో అన్ని విషయాలు వివరంగా...

భాస్క: (అవునవును...అవన్నీ నాకు జ్ఞాపకం వున్నయ్...కూర్చోండి (సుశీల వంక ప్రత్యేకంగా చూస్తూ) కూర్చోండి...ఆ... మీ పేరు...మీ పేరు—మరిచిపోయాను.

రాఘు : నువ్వు అడగనే లేదుగా భాస్కరం!

[భాస్కరం దీనికి కొంచెం విసుగుదల కనబరుస్తాడు]

ఆనంద : క్షమించండి...మరచిపోయాను. ఈవిడ సుశీలా ఆనందరావు...నా భార్య.

[భాస్కరం తెల్లమొహం వేస్తాడు, ఓ క్షణంపాటు కనిపించకుండా నవ్వుకుంటాడు రాఘవయ్య గారు]

భాస్క: (తెప్పరిల్లుకొని) అలాగా! చాలా సంతోషం. కూర్చోండి సుశీలాదేవి గారూ!

[సుశీల సిగ్గుపడుతూ కూర్చుంటుంది]

ఆనంద్: సుశీల ఈవిషయమై కొంచెం అదుర్దాగా వున్నదండి.

భాస్క: ఉండదుటండీ మరి!...(స్టేజి ఒక చివరకు వెళ్ళి) అందులోనూ ఈ విషయాలున్నయ్ చూడండి- తాత్కాలికంగా చాలా బాధగా వుంటయ్...కాని, క్రమంగా మరచిపోతాం లెండి.

సుశీల : అదే ఆనంద్ కూడా అంటున్నాడండి.... కాని; నాకే—ఎందుకల్లనో—(తలవంచి,

మెల్లగా) అయినా మా పెళ్ళయి ఇంకా సంవత్సరం కాలేదు.

భాస్క : అవుననుకోండి...అసలు అందువల్ల నే—

ఆనంద : (మాట మార్చడానికి ప్రయత్నం చేస్తూ) అఁ!...మీ ఫీజు! తక్కువే ననుకొంటాను.

భాస్క : నాకుమాత్రం చాలా తక్కువే అనిపిస్తోందండి.

ఆనంద : నాకు చాలా ఎక్కువనిపించిందండి.

భాస్క : అంటె, అంతకంటె ఎక్కువ—

ఆనంద : అబ్బే!

భాస్క : (అయిష్టంగానే) సరే!

సుశీల : నాకూ చాలా ఎక్కువనిపించిందండీ!

భాస్క : (దెబ్బ తిని) ఓ!

ఆనంద్ : ఈ చిన్న విషయానికి ఇంత డబ్బు అనవసర మని సుశీల వుద్దేశ్యం.

భాస్క : సరే! కానివ్వండి...అయితే, ఒక విషయం మనం ముందు ఆలోచించుకోవాలి. ఈ పరిస్థితుల్లో కేవలం సుశీలా దేవి గారి నే ముఖ్యంగా తీసుకొని, ఆవిడమీద నే ఆధార పడడం బావుండదు!...అందువల్ల మనం మరో మార్గ మేదయినా—

ఆనంద్ : (బిత్తరపోయి) మరో మార్గం ఎందుకండి? అంతా ఆ వుత్తరంలో వున్నట్లుగా చేస్తే సరిపోదూ?

భాస్క : అహ...సరిపోదని కాదు—

సుశీల : ఆనంద్!....(కంటతడి పెడుతుంది)

ఆనంద : (ఓదార్చడానికి, బుజంమీద తడుతూ) ఊరుకో, సుస్.

భాస్క : (మరొక త్రోవకు పోయి) నాకు చాలా విచారంగా వున్నది సుశీలా దేవిగారూ! (ఆనందరావువంకకు తిరిగి) కాని సభ్యతగల స్త్రీకి ఇటువంటి ప్రచారం జరగడం—

ఆనంద్ : (ఆశ్చర్యంతో) ప్రచారం! ప్రచార మేమిటండీ?

భాస్క : అదే!...ఆవిడ విషయంలో మనం వ్యక్తుల పేర్లను వదిలి, మిగిలిన విషయాలు మాట్లాడు కోవడం బావుంటుందేమో?

ఆనంద్ : పేర్లు!

సుశీల : (ఇంకా ఏడుస్తూనే) నేనేం చేస్తాను? నేను అంతగా ప్రేమిస్తున్నాను!

భాస్క : (సుశీతో) అయితే, క్షమించి విడిచి పెడదామంటారా?...విషమంగావున్న పరిస్థితుల్ని సౌమ్యంగా అతికే అవకాశమే లేదంటారా?

ఆనంద్ : (కోపంతో) ఏమిటండీ మీరంటున్నది?

రాఘవ : (ఇంతవరకూ ఆనందించినా, ఇక తట్టుకో లేక) అవును భాస్కరం, ఏమిటి నువ్వంటున్నది?

భాస్క : అదే! (ఆనందరావు దగ్గరగావెళ్లి) చూడండి ఆనందరావుగారూ! ప్లీడర్లకు మీరు విషయాలన్నీ వివరంగా చెప్పకపోతే, మేం కేసులను నడిపించడం కష్టమండి.

ఆనంద్ : కేసంటారేమిటి?... నేనేం కోర్టుపక్షి ననుకున్నారా?

భాస్క : అంటే, కేసేమీ లేదా?

ఆనంద్ : నాకు తెలిసినంతవరకు లేదు.

సుశీల : మీరు అనే కేసు ఆనంద్ మీద కాదుగదా! అతను దేవత!

భాస్క : (తప్పుచేసింది ఆవిడైనా కావచ్చునని అనుమానపడి) అయితే, అది మీరు.

సుశీల : (బెదిరిపోయి) నేనా! ఏమిటి నేను?

ఆనంద్ : (కోపంతో, అరుస్తూ) దీని అర్థం ఏమిటి?

భాస్క : అర్థమా! (తాపీగా కూర్చుని, ఏడుస్తున్న సుశీలవంకకు చూపుతూ) తప్పంతా ఈవిడదే నని నేను కలలోకూడా అనుకోలేదు. నాకు చాలా బాధగావుంది. నేను ఈ కేసులో పని చెయ్యలేను.

[కొడుకు ఆత్మవిశ్వాసాన్ని చూసి రాఘవయ్యగారికి ఏడుపూ, నవ్వూకూడా వచ్చినయ్. సుశీల బెదిరి ఒకర్ని విడిచి ఒకరివంక చూస్తూ వుంటుంది ]

ఆనంద : (కుర్చీలో కూలబడుతూ) ఏమిటి!

రాఘ : (గొంతు సవరించుకొని) అయితే, ఈ కేసు నేను తీసుకుంటాను.

ఆనంద్ : (రాఘవయ్యగారిదగ్గరకు వెళ్లి) మీఅబ్బాయి నన్ను అవమానపరచాడు. దీనికి ముందు సంజాయిషీ—

సుశీల : (లేచి, ఆనందరావు మీదకు వాలిపోయి) ఎందుకు ఆనంద్? పద, వెళ్లిపోదాం...

రాఘు : (వారిస్తూ) ఒక్కమాట ఆనందరావు గారూ! మీ ఉత్తరం నేను చూడలేదు కనుక అసలు విషయమేమిటో నాకు చెప్పగలరా?

ఆనంద్ : నా వీలునామా తయారుచెయ్యడానికి మీకు వీలుంటుం దేమో తెలియ చేయ వలసిందని వ్రాశాను.

భాస్క : వీలునామా!...అంతేనా?

ఆనంద్ : అంతే!

రాఘు : ఇప్పుడంతా తెలిసిందికదూ భాస్కరం!

భాస్క : మరి సుశీలాదేవిగారి ఆదుర్దాకు కారణం?

ఆనంద్ : వీలునామా, నా మరణాన్ని ముందుకు తెస్తుందని సుశీలకు భయం.

(సుశీల మళ్ళీ ఏడుపు మొదలు పెడుతుంది. 'సుస్' అంటూ వారిస్తాడు ఆనంద్.)

భాస్క : అదా!

ఆనంద్ : ఇదంతా వుత్తరంలో వున్నది కదండీ!

రాఘు : (నవ్వుతూ) ఏమంటావు భాస్కరం?

భాస్క : ఏముంది?... నాకుమాత్రం చాలా విచారంగా వుంది. (ఇంతలో ఏదో ఆలోచన తట్టినట్లుగా వుంది. రాఘవయ్యగారి వంకకు తిరిగి నవ్వుతాడు.)

నా కిప్పటికీ ఆశ్చర్యంగావుంది. మీ పేరు యస్. విమలానందరావు గారు కదూ?

ఆనంద్ : కాదండీ! ఒట్టి ఆనందరావు నే! ఎ. ఆనందరావు.

భాస్క : ఎ. ఆనందరావుగారా! ... చూశారా, నాన్నా! మనం ఎలా పొరపాటుపడ్డామో?

[ఈ సర్దుకున్న పద్ధతిమాచి రఘుఅయ్య గారు సంతోషిస్తాడు.]

భాస్క : సంగతేమిటంటే సుశీలాదేవిగారూ! ఇవ్వాళే మేం యస్. విమలానందరావుగారని— ఆయనకోసం చూస్తున్నాం. ఆయన వస్తానని వ్రాశారు...ఆయన, ఆయన భార్య విషయంలో ఏదో మాట్లాడాలన్నారు.

సుశీల : ఎంత భయపెట్టారు!

భాస్క : భయంకాదుటండీ మరి! (ఆనందరావుతో) క్షమించండి...మా వృత్తిని దృష్టిలో పెట్టుకొని అంతకంటె ఎక్కువ చెప్పలేం, చూడండి.

ఆనంద్ : మేము మాత్రం అడుగుతామా?...కాని నేను కూడా వుత్తరం వ్రాశానే!

భాస్క : వ్రాసివుండొచ్చు ... వీలునామాను గురించేనా? (అవునని తల తిప్పుతాడు ఆనంద్) అవి నాన్నగారు చూస్తారు...ఇప్పటికైనా ఉత్తరంసంగతేమైనా జ్ఞాపకం వచ్చిందా నాన్నగారూ?

రాఘు : ప్చ్...అందనంలేదు.

భాస్క : అరె! తమాషాగావుందే....అయితే మీరు సరిగ్గా చూచివుండరు.

రాఘు : (కొడుకువంక తృప్తిగా చూస్తూ) కావొచ్చు ...ఆఁ! ఇప్పుడు చెప్పండి ఆనందరావు గారూ!...మీరు వచ్చిన విషయం—

భాస్క : (లేచి) నాన్నా! ఇక నేను వుండనక్కర్లేదు కదూ!

రాఘు : అవసరంలేదు...నువ్వు హాయిగా క్లబ్‌కు వెళ్ళి నీ బిలియర్డ్స్ ఆడుకో...వెడుతూ, వెడుతూ బంగారాన్ని పంపించు...(ఆనందరావు, సుశీలలతో) మావాడు ఇవ్వాళే మొదటి కేసు నడిపించాడు.

[భాస్కరం ఏమీ ఎరగనట్లుగా, పేపర్లు సర్దుతూ వుంటాడు.]

ఆనంద్ : కేసులో గెలుపు వారిదే నేమో?

రాఘు : అనొచ్చు...మొదటంతా పద్మవ్యూహంలా తయారుచేసుకున్నాడు. కాని, దానినుంచి తెలివిగామటుకు బయటకు వచ్చాడు... ఫరవాలేదు భాస్కరం!...నువ్వు మంచి లాయరువవుతావు.

భాస్క : థాంక్స్...(వెళ్ళిపోబోయి, మళ్ళీ లోపలకు వచ్చి) వస్తాను ఆనందరావుగారూ!

క్షమించండి...సుశీలా దేవిగారూ! మీరూ క్షమిస్తారు కదూ!

రాఘు : అందరూ ఏకంగా క్షమిస్తారు. వెళ్లిరా.

భాస్కర్: నమస్తే. (ఆనందరావు ప్రతి నమస్కారం చేస్తాడు.)

రాఘు : ఆఁ! ఇప్పుడు చెప్పండి ఆనందరావుగారూ! [ఆనందరావు, సుశీల చాలా దగ్గరగా కూర్చొని వుంటారు. రాబోయే గాలివానకు తట్టుకొనడానికి తయారు తిసేవాడిలా వున్నాడు ఆనందరావు]

ఆనంద్ : నా వుద్దేశ్యం...వీలునామా అంతా ఒక్క వాక్యంలో వుంటే సరిపోతుం దనండీ... "నాకు చెందిన ప్రతి వస్తువూ నా మరణానంతరం నా భార్య పరం కావాలి."

రాఘు : దానికేం! అందంగావుంది! ఇంతకంటె చెత్తగావున్న వీలునామాలు నేను లక్షలు చూశాను.

(సుశీల వుద్రేకపడుతుంది)

ఆనంద్ : (ఉద్రేకంలో నిట్టూర్చే సుశీలను వారిస్తూ) అలా మాటి మాటికీ వుద్రేకపడకు సుస్.

సుశీల : (అంత బాధలోనూ) ఆ మాటలు చూడు—'నా మరణానంతరం'...అవెందుకు చెప్పండి లాయరుగారూ!

రాఘు : ఆ మాటలు లేకుండానే నేను వీలునామా తయారుచేస్తానమ్మా.

సుశీల : (త్వరగా) బావుందండి అలా చెయ్యండి.

రాఘు : (ఆనందరావుకేసి తిరిగి) అయితే, ఇటువంటి న్యాయసమ్మతమైన వీలునామాల్లో, ఏ విధవకు ఆస్తి చెందుతుందో—

(సుశీల నోట్లో చీర కుక్కుకుంటుంది. ఆనందరావుకు ఓదార్చక తప్పదుకదా!)

ఆనంద్ : సుశీలా!—సుస్—(రాఘవయ్యగారివైపు తిరిగి) ఆ 'విధవ' అనే మాటలేకుండా చెయ్యండి లాయరుగారూ!

రాఘు : అలాగే! అలాగే!! ఈ ముసలివాడికి ఆ విషయం జ్ఞాపకం లేదమ్మా. వూరుకో— [సుశీల మామూలుమనిషై, చిన్నగా నవ్వుతుంది. బంగారు వస్తాడు.]

బంగారూ! మూడు కాఫీ తీసుకురా!— [బంగారు వెళతాడు] ఆ...మీరు చెప్పే విషయాలు రెండూ వ్రాసుకుంటాను (కలం, కాగితం తీసి, వ్రాస్తూ) నాకు తెలిసినంత వరకు ఈ కేసులోవున్న విషయాలు ఇవి ఆనందరావుగారూ! ఇప్పుడే యౌవనంలో అడుగు పెట్టినప్పటికీ, జీవితం శాశ్వతం కాదని—

సుశీల : (వెనకటి వలెనే) ఓ!

రాఘు : (తట్టుకొని) మనల్ని పెద్దవాళ్లు దీవించేటప్పుడు 'శతమానం భవతి, శతాయుః...' అంటారు. అంటే, మనిషి వయస్సు మన దేశంలో వంద సంవత్సరాలన్న మాట. ఆనందరావుగారు అన్నేళ్ళూ తప్పకుండా వుంటారు—కనీసం మీ ప్రేమకోసమైనా వుంటారు. అయినా, వీలునామా పత్రాన్ని ఇప్పుడే తయారుచేసి వుంచడం మంచిదని—కేవలం పత్రాన్ని మాత్రమే—అయన అభిప్రాయం.

సుశీల : సరే!

రాఘు : అమ్మయ్య! ఇప్పుడు కొన్ని వివరాలు చెబుతారా, ఆనందరావు గారూ!

ఆనంద్ : అడగండి.

రాఘు : ముందు మిమ్మల్ని గురించి చెప్పండి.

ఆనంద్ : 'నా' అనేవాళ్లెవరూ నాకు లేరండీ. (సుశీల జాలిగా చూస్తుంది) అదే! ఒక నా సుస్ తప్ప... నివాసం ... సుశీలా సదనం, సత్యనారాయణపురం!

సుశీల : (అదేదో అందరికీ తెలిసిన దన్నట్లుగా) అవునండి. మేం అక్కడే ఉండడం.

ఆనంద్ : ప్రస్తుతం నేనిక్కడ ఒక పెద్ద కంపెనీలో గుమాస్తాగా ఉంటున్నాను. ఆంధ్రదేశంలో పెద్ద కంపెనీ అదేనండి......సంవత్సరానికి 20 లక్షలు లాభాలే పంచిపెడుతుందండి అది.

రాఘు : అవునవును. నాకు తెలుసు......అయితే, వ్యక్తిగతమైన రాబడి ఏమైనా ఉందా? [ఆనందరావు, సుశీల 'ఈ ప్రశ్న ఏమిటా?' అని ఒకళ్ళనొకళ్ళు ప్రశ్నార్థకంగా చూసుకుంటారు.]

ఆనంద్ : అబ్బే! ఏమీ లేదండి.

రాఘు : (వ్రాసుకున్న విషయాలను పరిశీలిస్తూ) ఇది చిన్న వీలునామా నే అవుతుంది.

ఆనంద్ : (అపార్థం చేసుకొని కొంచెం) నాకు వచ్చేది కొంచెం ఎక్కువేనండి

రాఘు : (ఆసక్తితో) ఎంతో?

సుశీల : సంవత్సరానికి బోనస్ కాక, పదిహేను వందలు వస్తయ్.

రాఘు : బావుంది...మీ యిద్దరేగా!

ఆనంద్ : నెలకు ముప్ఫై రూపాయల దగ్గర మొదలు పెట్టానండి. జీవితం...అయితే నేం? ప్రతి సంవత్సరం ఇంక్రిమెంట్లు బాగానే ఇస్తున్నారు. ఈ యేడు ఒక్కసారి ఇరవై రూపాయ లిచ్చారు.

రాఘు : పని చేస్తున్నావ్...ఇస్తున్నారు.

[ఏకవచన ప్రయోగాన్ని గుర్తిస్తాడు ఆనందరావు. దానికి సంతోషించినట్లే కనబడతాడు.]

ఆనంద్ : అయితే, నాకొక ఆశయం మాత్రం వున్నదండి.

సుశీల : (ఆనంద్ కొంచెంసేపు ఆగడం చూచి) ఫరవాలేదు ఆనంద్! ఆయనకు చెప్పు.

ఆనంద్ : (కొంచెం బిడియంగా) ఈ సంవత్సరం చివరకు 3650 రూపాయలు నిలవ చెయ్యాలని వుంది.

సుశీల : (గర్వంగా) అంటే రోజుకు పదిరూపాయలన్న మాట.

రాఘు : (వాళ్ళ అభిలాషకు ఆనందిస్తూ) బావుంది., తప్పకుండా చెయ్యగలవు.

ఆనంద్ : నాకూ ధైర్యం వుంది...కాని మొన్న నే ఇంట్లోకి కావలసిన సామాన్లు మింగినయ్ చాలా డబ్బు.

రాఘు : డబ్బు మింగేవే అవి!

సుశీల : ఉన్న వాటిలో మంచిరకమే మన ఇంట్లో ఉండాలంటాడు ఆనంద్...ఒక్కసారి నా గది చూస్తే నా—

రాఘు : (ఆమోదాన్ని తెలుపుతూ) అవును...

ఆనంద్ : అయినా, మాకు ఒక్క చిల్లిగవ్వ కూడా అప్పు లేదు. ఇప్పటికే రెండు వేలు బాంకులో వుంది.

రాఘు : అదృష్టవంతుడివి...నువ్వు తప్పకుండా ముందుకు పోగలవు.

సుశీల : ఆనంద్ అంటే ఆఫీసులో అందరికీ ప్రాణమండీ!

రాఘు : నీకు! పంచప్రాణాలు! అవునా?

[ఇద్దరూ సిగ్గు పడతారు]

ఆనంద్ : నేను అయిదు వేలకు ఇన్సూర్ కూడా చేశాను.

రాఘు : మరీ బావుంది...ముందే మేలుకున్నావు.

ఆనంద్ : కృష్ణ ఒడ్డునే ఓ బంగళా, ఓ కారు— కనీసం ఇవైనా సుశీలకు వదిలి వెళ్ళాలని నా ప్రయత్నం.

రాఘు : ఏమో! నీ ప్రయత్నం ఫలించ కూడదని ఎక్కడ వుంది?

సుశీల : (బాధతో) ఓ!

రాఘు : అనుకోకుండా వచ్చేసిం దమ్మా! ఏమీ అనుకోకు.

సుశీల : కార్లు, బంగళాలు ఎందుకండీ నాకు, ఆయన లేకుండా?

రాఘు : నిజమే నమ్మా. నిజమే! ఆయన అనే దేమిటంటే—ఆయన మరణానంతరం ... అది సంభవిస్తే—ఆయనకు చెందిన ప్రతి వస్తువూ నీకే రావాలని.

ఆనంద్ : (అనుకోకుండా) అవును ... అదే నా వుద్దేశ్యం.

సుశీల : (అప్రయత్నంగానే) కాదు.

ఆనంద్ : అవును.

సుశీల : కాదు.

[రాఘవయ్య ఇద్దరి వంకా ఆశ్చర్యంగా చూస్తూ వుంటాడు. ఇంతలో బంగారు మూడు కాఫీలు తెస్తాడు.]

రాఘు : (ఇద్దరికీ కాఫీ యిస్తూ) తీసుకోండి.

ఆనంద్ : థాంక్స్...తీసుకో సుస్...ఈ విషయంలో నే మా యిద్దరి మధ్య ఓ చిన్న అభిప్రాయభేదం వచ్చిందండి.

సుశీల : మీరు పెద్దలు కదా, మీరు చెప్పండి.

[రాఘవయ్య ఒప్పుకుంటున్నట్లు తల తిప్పుతాడు.]

ఆనంద్ : నాకు ఇద్దరు అక్కయ్యలు వున్నారు.—పినతండ్రిగారి పిల్లలు—వాళ్లకు కాస్తో-కూస్తో ఇప్పుడూ సహాయం చేస్తున్నామనుకోండి. వీలునామాలో ఎలా చెయ్యగలం చెప్పండి?

రాఘు : నువ్వు ముందు నీ భార్యసంగతి ఆలోచించాలి.

ఆనంద్ : కాని, ఆవిడే వాళ్లకు ఒక్కొక్కళ్ళకు వంద రూపాయల చొప్పున వదిలిపెట్టాలంటున్నది.

సుశీల : (దృఢంగా) కాదు. రెండు వందలు.

ఆనంద్ : వంద.

సుశీల : కాదు ఆనంద్...రెండు వందలు.

రాఘు : పోనీ, నూటయాభై.

సుశీల : కాదండీ. రెండువందలూ ఇవ్వవలసిందే.

ఆనంద్ : సరే! సుశీల యిష్టమే కానివ్వండి... ఇదిగో, వాళ్ల పేర్లు, అడ్రసులు—

రాఘు : (తీసుకుంటూ) ఇంకేమైనా.

ఆనంద్ : అంతేనండి.

సుశీల : ఆ ఇంటివాళ్లనేం చేశావ్ ఆనంద్? (రాఘవయ్యతో) చదువుకొనే రోజుల్లో అక్కడే వుండేవాడండి...వాళ్లెంతో మర్యాదగా చూశారు...ఎంతో మంచిగా వున్నారు.

ఆనంద్ : నిజమేననుకో...కాని—

సుశీల : యాభై రూపాయలు— (రాఘవయ్యవంక చూస్తుంది.)

రాఘు : అంతటితో నీ జాబితా పూర్తయితే, ఈ పద్దు నా కభ్యంతరం లేదు. (ఆనంద్ ఇచ్చిన కాగితాన్ని పుచ్చుకొని, లేచి.) చూడు ఆనంద్! రేపు—ఈ వేళకే—మీరు వస్తే వీలునామా మీ చేతికిస్తాను.

సుశీల : (అయిష్టంగా) అది కాదండి! ఇవ్వాళతో అయిపోతే బాధ వదిలి పోతుందేమోనని.

ఆనంద్ : ఇవ్వాళే పూర్తయ్యేటట్లు చూడలేరా?

రాఘు : దానికేం? ఎంతోసేపు పట్టదు. (గడియారం వంక చూసుకుంటూ) మీరు ఒకగంట అలా వెళ్లి, భోజనం చేసిరండి. ఈలోగా పూర్తి చేసి వుంచుతాను.

సుశీల : నన్నుమాత్రం ఏమీ తినమని అడగకు ఆనంద్!

ఆనంద్ : నేనుమాత్రం తినగలనా?....ఆ దుర్దాలో వున్నప్పుడు ఆకలి వెయ్యదు, చూడండి.

సుశీల : అట్లా షికారుగా, బజారుకు వెళ్లొద్దాం.

రాఘు : ఆ రద్దీలో మొగుణ్ణి వెంటవేసుకు తిప్పుతావా? చూసేవాళ్లు కొంగున కట్టుకున్నావంటారు.

సుశీల : (సిగ్గుతో) కావచ్చు...కాని నాకు ఆనంద్ అంటే అంత యిష్టం.

రాఘు : అవును...నువ్వు కూడా అలాగే వుండాలి ఆనంద్...అందులోనూ పెద్దవాడివయ్యాక ఈ సంగతి బాగా జ్ఞాపకం వుంచుకోవాలి.

ఆనంద్ : ఆ భయం మీ కక్కర్లేదండి. (సుశీలను చూసి ఆప్యాయంగా నవ్వుతాడు.)

సుశీల : దయచేసి, ఆ వీలునామా కాపీని మాత్రం మాకు యివ్వకండి...అది ఇంట్లో లేకపోవడమే నాకు హాయి...వుంటే నిద్రపట్టదు.

రాఘు : అచ్ఛా! అలాగే!...ఓ గంటలో—

[బంగారు ఇంతవరకు నోరు తెరుచుకొని వింటున్నాడు. వాళ్లు లేవటం చూచి, బయటి తలుపులు తీస్తాడు. వాళ్లు ఒకళ్ళ చేతిలో ఒకరు చెయ్యి వేసుకొని ఆనందంగా బయటకు వెడతారు. రాఘవయ్యగారు, కనిపించేటంత వరకు, వాళ్ళనే చూచి, తలపంకించి ఏవో రెండు విషయాలు ఓ కాగితం ముక్కమీద వ్రాసి...]

రాఘు : ఇదుగో! ఈ కాగితం ఇంటిదగ్గర అమ్మాయిగారి కివ్వు. కాగితాలు ఇస్తే, తీసుకురా!... (మళ్ళీ వాళ్లు వెళ్లిన వైపుకే చూస్తూ) బలే దాంపత్యం! బంగారు!

బంగా : సారూ!

రాఘు : ఏమంటావ్?

బంగా : (అతి సాధారణంగా) అవునండి.

రాఘు : ప్రేమకలాపాలు జీవితసుఖానికి నిలయాలు. అందులోనూ వయసులో వున్నారా?—

బంగా : (విచారంగా) అవునండి.

రాఘు : (బంగారువంక చూసి) అట్లా వున్నావేం బంగారు?

బంగా : (నవ్వడానికి ప్రయత్నిస్తూ) ఎట్లా వున్నానండి?

రాఘు : నీ హుషారంతా ఏమైంది?

బంగా : దానికేముండి...బాగానే వున్నానండి... (త్వరగా) ఇంటికి వెళ్లొస్తానండి. (వెళ్లబోతాడు.)

రాఘు : ఆగు!·ఇటురా! ఎందుకు అలావున్నావ్? ఇంకా ఆ విషయాన్ని గురించే బాధపడుతున్నావా? (బంగారు వాలకం అలానే వుంది.) నొప్పి ఇంకా ఎక్కువయిందా?

బంగా : నొప్పి పెద్దగాలేదండి....కాని తిప్పుతున్నట్లుగా వుంది.

రాఘు : (ఓదారుస్తూ) నువ్వనుకున్నది కాదు బంగారు! (జబ్బుపేరు చెప్పదలుచుకోక) ఆసంగతి ఏ మంచిడాక్టరయినా చెబుతాడు.

బంగా : నిన్న మన డాక్టరుగారే చెప్పారండి.

రాఘు : ఏమని?

బంగా : అది—...అదేనండి!—(వెళ్లడానికి వెనుతిరిగి) నాపని అయిపోయింది బాబూ!

రాఘు : (దగ్గరకు వెళ్లి) ఆయన చెప్పింది నిజమై వుండదు...మరో డాక్టరుదగ్గరకు వెళ్లిరా.

బంగా : అక్కర్లేదు బాబూ! చలపతిరావుగారికంటె మంచి డాక్టర్లున్నారా?—ఆయన చెప్పనే చెప్పారు బాబూ!—ఇంకా తొమ్మిది నెలలంట, మహాబతికితే!—

రాఘు : (ఈవిషయం విని, షాక్ తింటాడు. మరో మూలకుపోయి) పోనీ, ఆపరేషన్ చేయిస్తే-?

బంగా : చాలా ఆలస్యమయిందట బాబూ!... మొదట్లో ఎప్పుడో చేయించుకొనివుంటే, కూస్తంత ఆశవుండేదంట!

రాఘు : ఇది నీకు ఎక్కువరోజులనుంచి లేదుకదా!

బంగా : నాకు తెలియకుండానే వుందంట బాబూ! చిన్నప్పట్నించీ—నాలో మచ్చగా, సూదిమొనంత—ఉండి ఉండి, సరిగ్గా ఇప్పుడు—బతికి బట్టకట్టాల్సిన రోజుల్లో, ఇప్పుడు బయటపడ్డావండి.

రాఘు : ఇంత ఎక్కువగా ఒక్కసారే ఎలా వచ్చిందంట?

బంగా : నాకూ తెలవదండి...కాని మనందర్లోనూ, మచ్చ మనకు తెలీకుండా నేవుంటుందంటండీ. నామాదిరిగా జాగ్రత్త లేకుంటే, చివరకు—

రాఘు : కాదు, కాదు—

బంగా : కాదేంటి బాబూ! డాక్టరు బాబుగారు అంత చెప్పినాక ఇంకాఅనుమానమే! ఆయనయినా ఊరికే చెప్పారా? అరిచి మొత్తుకుంటే బయటపడ్డారు. 'రావలసిన జబ్బుకాదు' అన్నారండాయన...కాని వచ్చిందిగా!—నా తరవాత నా పెళ్ళాం—

[చెప్పలేక బాధపడతాడు. రాఘవయ్యగారు ఓదారుద్దామని ప్రయత్నం చేస్తాడు. కాని చెయ్యలేకపోతాడు. ఇంతలో బంగారే తెప్పరిల్లుకుంటాడు ]

బంగా : వస్తా, బాబూ, వస్తా ఇంటికెళ్లి కాగితాలు దెస్తా.

[త్వరగా వెళ్లిపోతాడు.]

[రాఘవయ్యగారు బంగారు వెళ్లిన వైపుకే చూస్తూ, దీర్ఘంగా నిట్టూరుస్తూ వుండగా—తెర.]

* * *

## రంగము: 2

## [ఇరవై యేళ్ల తరువాత]

* * రంగాలంకరణ పూర్వం మాదిరే; కొద్ది మార్పులు మాత్రం చేయబడినయ్. ఇదివరకు లేని గాంధి, నెహ్రూ ఫొటోలు గోడలకు తగిలించబడినయ్.

కొత్త తివాసీ, టేబుల్ మీద టెలిఫోన్. సాయంకాలపు వెలుతురు మసగ్గా లోపలకు వస్తుంది. భాస్కరం ఆలోచిస్తూ అటూ, ఇటూ పచార్లు చేస్తూ వుంటాడు. భాస్కరం ఇప్పుడు నలభైరెండేళ్ళవాడు. మనిషిలో చిలిపితనంపోయి, దర్జాకనిపిస్తుంది.

తిరుగుతున్నవాడు ఆగి, ఫోన్‌తీసి, మళ్ళీ తనలోతాను వితర్కించుకొని, ఫోన్ కింద పెడతాడు. గది మూలకువెళ్లి లైటు వేస్తాడు. అనంతం వస్తాడు. అనంతం భాస్కరందగ్గర కొత్త నౌకరు.

అనంతం: సుశీలా ఆనందరావు గారంటాండి, అని వొచ్చారు, మిమ్మల్ని చూడ్డానికి.

భాస్కరం: ఎవరు అనంతం? ఆనందరావు గారుకదూ?

అనంతం: కాదండి...సుశీలా—

భాస్క: ఓ! నేను ఆనందరావుగారికోసం చూస్తున్నాన్లే...సరే! రమ్మను.

[అనంతం వెళ్లిపోబోతాడు.]

అనంతం! ఏమిటి ఆఫీసులో ఈ అనంతమైన అల్లరి?

అనంతం: గుమాస్తాలు బాబూ! అంతా కుర్రకారు కదూ!

భాస్క: ఇక్కడ కుర్రకారు కావడానికి వీల్లేదు. ఒకవేళ కాదలుచుకుంటే, ఇక్కడ వుండడానికి వీల్లేదని చెప్పు.

అనం : అట్లాగేనండి... (వెళ్లిపోతాడు.)

[భాస్కరం టేబులుమీది పేపర్లు సర్ది డ్రాయర్లో పెడతాడు. సుశీల వస్తుంది. ఆవిడ వయసూ ముప్ఫైయెనిమిది సంవత్సరాలు. దుస్తులు, అలంకరణ భాగ్యవంతురాలని చెబుతున్నయ్. సాధారణంగా ధనవంతులైన యువతుల్లో తరుచూ కనిపించే ప్రయత్నం — పరిగెత్తే వయస్సును పట్టుకొని వెనక్కు నడిపిద్దామన్న—వృధాప్రయత్నం ఈవిడలోనూ కనిపిస్తుంది. ఇదివరకు కళ్లల్లో కనిపించిన అమాయకత్వం ఇప్పుడు లేదు. తనస్థితికి గర్వపడుతున్నట్లు కనిపిస్తుంది. కాని అది ఎదుటివారిని హేళన చేసేటందుకు మాత్రం కాదు ]

భాస్క: (లేచి) నమస్తే...రండి...మీ రాక నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది సుశీలా దేవి!...కూర్చోండి.

[సుశీల ప్రతినమస్కారం చేసి కూర్చుంటుంది]

మీరా దుస్తుల్లో ఉన్నప్పుడు చాలా బావుంటారు.

సుశీల : ఆమాట చాలామంది అన్నారు. (అని, నాలుక కొరుక్కొని) అఁ! ఎటూ కానివేళ యీవిడ యిలా వచ్చిందేమిటి అనుకుంటున్నారుకదూ మీరు!

భాస్క: అబ్బే!...నిజంగా, నేను—

సుశీల : మీరు ఆనందరావుగారి రాకకోసం ఎదురుచూస్తున్నారుకదూ!

భాస్క: (ఏమీ అనలేక) ఆ... (చెప్పవచ్చునో, కూడదోనని అనుమానం!)

సుశీల : మీ లాయర్ల నటనలు ఆపండి, పుణ్యముంటుంది. ఆయన, ఇక్కడే మిమ్మల్ని కలుసుకుంటారని నాకూ తెలుసు. అందుకే నేనూ వచ్చాను.

భాస్క: (ఆశ్చర్యమ్మ అనుకొని) అంటే ఆయనను కలుసుకోవడానికి, ఆయనే మిమ్మల్ని ఇక్కడకు రమ్మన్నారా?

సుశీల : నేనన్నానా?... (పేలవంగా నవ్వుతూ) నేను రావడం ఆయనకు ఇష్టమని కూడా అనుకోను.

భాస్క: (పాలిపోయి) అలాగా!

సుశీల : ఆయన ఎందుకు వస్తున్నారో నాకు తెలుసు. మరో వీలునామా వ్రాయించడానికేగా?

భాస్క: (నవ్వడానికి ప్రయత్నంచేస్తూ) అయినా, మీ వీలునామా వ్రాయడం ఇదే మొదటి సారి కాదుగా!

సుశీల : కాదు...నాలుగోసారి!

భాస్క: ఎటువంటిజీవితం! ఒక మెట్టునుంచి, మరొక మెట్టు—ఉన్నతమైన అంతస్థు—

సుశీల : (తన దుస్తులు సర్దుకుంటూ, అతి సామాన్యంగా) అవును. మేము గొప్పవాళ్ళం అయినాం.

భాస్క: కొస్తా కూస్తానా! ఆంధ్రదేశం గర్వించదగ్గ అయిదారు కుటుంబాల్లోనూ మీది ఒకటి!

సుశీల : (మాట మారుస్తూ) సరే! భాస్కరంగారూ! క్రిందటిసారి వ్రాసిన వీలునామా సరిగ్గా లేదా?

భాస్క: (ఆలోచిస్తూ, సుశీలకు ప్రక్కగా వచ్చి) చూడండి సుశీలాదేవీ! ఇటువంటి విషయాలు మీతో చర్చించడానికి నాకు అధికారం లేదు...అయినా, ఆయన వుద్దేశ్యాలు ఏమిటో నాకు ఆవగింజలో అరవయ్యో వంతుకూడా తెలియవు.

సుశీల : అసలు వుద్దేశ్యాలంటూ వున్నయ్యా అని నా అనుమానం. (కిటికీ దగ్గరకు వెడుతుంది.)

భాస్క: అలాగా!

సుశీల : అందుకే ఇప్పుడిక్కడకు వచ్చింది. ఆయన పొరపాటున ఏమైనా—

[తలుపు తెరుచుకుంటుంది. అనంతం వస్తాడు.]

అనంతం: ఆనందరావుగారు—

భాస్క: (త్వరగా) రమ్మను.

[ఆనందరావు వస్తాడు. మనిషి పూర్వంకన్న కొంచెం లావెక్కాడు. హుందాతనం దర్జా ఉట్టిపడుతూ ఉంటయ్......ప్రపంచానుభవం తాలూకు ముడతలుపడ్డ నుదురు. చీటికీ మాటికీ తలపంకించి, ఓ క్షణంసేపు ఆలోచించే అలవాటు అతనిలో కొత్తగా కనిపించే విశేషం.]

ఆనంద్ : (వస్తూనే) హల్లో భాస్కరంగారూ! కులాసానా?...చూడండి, నా పని యెంత త్వరగా పూర్తిచేస్తే అంతమంచిది. కాలం డబ్బువంటిదండి...డబ్బువంటిది.

[ఇంతవరకు సుశీలను చూడడు. సుశీల ప్రత్యక్షమవుతుంది. ఆవిణ్ణి చూసిన వెంటనే మూర్ఛపోయినంత పనై, చివరకు తెప్పరిల్లుకొని] సుష్!

సుశీల : నువ్వు నన్ను రమ్మనలేదు ఆనంద్...... అయినా, నేనే వచ్చాను.

ఆనంద్ : (బరువుగా) దానికేం?...చాలా బావుంది.

సుశీల : (ఓ ప్రక్కగా కూర్చుంటూ) నాకు తెలియనివ్వకుండా నువ్వు తయారు చేస్తున్న మొదటి వీలునామా ఇదే ఆనంద్!

ఆనంద్ : (తనను తాను నిలవతొక్కుకుని) ఎక్కువ మార్పులేం చెయ్యడంలేదు సుష్. లేకపోతే నీకు చెప్పకుండా మార్చేస్తానా? అదీకాక, దీనివల్ల నీకు కొంతభారం తగ్గిద్దామనుకొంటున్నాను.

సుశీల : అంటే?

ఆనంద్ : అదే!......ఏ మనిషైనా తన వీలునామా వ్రాస్తున్నాడంటే తనకు జీవితంలో చివరి ఘడియలు వచ్చాయని తెలుసుకున్నాడన్న మాట! (భాస్కరంవైపు తిరిగి) ఏమంటారు?

భాస్క: చాలామంది ఉద్దేశ్యం అదే!

సుశీల : కాని మళ్లీ ఈ తతంగం అంతా ఎందుకు? దానికి దీనికి ఏమిటి సంబంధం?

ఆనంద్ : ఏమీ లేదనుకో—

సుశీల : ఇదంతా నీ పిచ్చి ఆనంద్...చీటికీ, మాటికీ నీకు డబ్బు ఎంత వుందో చూసుకోడం నీకు ఆనందమనుకుంటాను.

ఆనంద్ : చూసుకోవడంకాదు. ఇచ్చివేయడం—

సుశీల : దానికేం? నువ్వు ప్రేమించినవాళ్లకు ఎలాగూ ఇస్తావ్!

[భాస్కరం డ్రాయర్లోనుంచి కాగితం తీస్తాడు.]

ఆనంద్ : (కొంచెం విసుగుతో) నే నప్పుడే ఇవ్వడం లేదు... నేను ఆఖరు గడియల్లో వున్నట్లు మాట్లాడుతున్నావ్.

సుశీల : నేనా! అట్లా ఎప్పుడూ మాట్లాడేది నువ్వే!

భాస్క: (డ్రాయర్లోనుంచి తీసిన కాగితాలు ఇస్తూ) క్రిందటి వీలునామా కాపీ ఇది దీన్ని చదివిన తర్వాత మనం మరొకటి వ్రాయడం బావుంటుందేమో?

ఆనంద్ : అనవసరం.

సుశీల : ఎందుకండీ? దాని కాపీ మా యింట్లోనూ వుందిగా! పైగా, దాన్లో ఏముందో మాకు బాగా తెలుసు.

ఆనంద్ : (క్రిందటి వీలునామాను చూపుతూ) దానిలో వున్న దానికంటే ఇంకా ఎక్కువే

నేను ఇప్పుడు వదలిపెడుతున్నాను......
ఎంతో చెప్పుకోగలరా, భాస్కరంగారూ!

భాస్క : ప్చ్......ఊహాకు కూడా అందడం లేదు.

ఆనంద్ : అంతకంటె ముప్ఫై వేలు ఎక్కువ......
మొత్తం లక్షా, ఎనభై వేలు.

సుశీల : అవి, వున్న నాలుగిళ్లు, పొలాలు, స్థలాలు, తోటలు కాక!...మీరు మా కొత్త ఇల్లు చూడలేదు కదూ!...తప్పకుండా చూడాలి.

భాస్క : (మెల్లగా) అవును...విన్నాను.
[కొంచెంసేపు నిశ్శబ్దం. ఎవ్వరూ భంగ పరచడానికి ఇష్టపడరు ]

సుశీల : (చివరకు, మాటలను పెళ్ళగిస్తూ) చెప్పు, ఆనంద్! నన్ను ఈ భాగ్యాలన్నింటినుంచీ దూరం చెయ్యదలుచుకున్నావా?

ఆనంద్ : లేదు, సుస్ లేదు నీకు ఇదివరకటికన్న ఎక్కువే వస్తుంది.

సుశీల : అవును......ఇదివరకటికన్న మనకిప్పుడు ఎక్కువ వుందికదూ!

ఆనంద్ : (ఆవిడనుంచి ముఖాన్ని తిప్పుకొని) కాని--
[చెప్పడానికి జంకుతాడు.]

సుశీల : ఊఁ! చెప్పు ఆనంద్... ..కాని—ఏమిటి? అదంతా నాదేకదూ!

ఆనంద్ : (చెప్పలేక, చెప్పక తప్పక, ముఖం పేల వంగా అయిపోయి) అదే! అక్కడ వీలునామాను కొంచెం సవరిద్దామను కుంటున్నాను.

సుశీల : ఇన్నాళ్లుగా నా అనుమానం నిజమయిందన్న మాట! అందుకేకదూ నువ్వు ఇక్కడకు వచ్చింది......పోనీ, నువ్వు ఎందుకు సవ రించాలనుకుంటున్నావో చెప్పగలవా, ఆనంద్?

ఆనంద్ : అదే! ... సవరించాలనుకోవడం సహజమే కదా! ఇది నాలుగోసారి!

సుశీల : కాని ఈసారి మార్చడం మాత్రం సహజం కాదు.

భాస్క : కాని చూడండి—అవతల పిల్లలున్నారు.

ఆనంద్ : (తాను చెప్పదలుచుకున్నది, భాస్కరం చెప్పినందుకు సంతోషించి) అదే — అదే నా ఉద్దేశ్యంకూడా!

సుశీల : అంటే, నా పిల్లలకు నేను డబ్బు ఇస్తానా, యివ్వనా అనే కదూ మీ అనుమానం!... (ఆనంద్‌తో) ఇంతవరకు వాళ్లను పోషించ డంలో నేనెప్పుడైనా పొరపాటు చేశానా ఆనంద్?

ఆనంద్ : (ఆవిణ్ని శాంతింపచెయ్యటానికి భుజంమీద చెయ్యివేసి, బుజ్జగిస్తూ) లేదు, సుస్ లేదు.
[సుశీల విసుగుతో, విడిలించుకొని, కిటికీదగ్గ రకు పోయి నిలబడుతుంది]

ఆనంద్ : నీకు వాళ్లంటే మమకారం యెక్కువ... వాళ్లకు నీ దగ్గర గారాబం ఎక్కువ. నువ్వు అతిప్రేమవల్ల ఏం చేసినా వాళ్ల జీవితాలు చెడిపోతయ్.

సుశీల : అయితే, వీలునామా మార్చడం ఎందుకు?

ఆనంద్ : అందుకే! ... నేను వెళ్లిపోయిన తర్వాత, నువ్వు అనవసరంగా ఈ విషయాల్లో బాధ పడకుండా ఉండాలనే నా అభిలాష!

సుశీల : నా డబ్బును నేను జాగ్రత్తచేసుకోవడంలో నాకు బాధ ఏమిటి?

ఆనంద్ : (ఇక సహించలేక) కాని, ఇంతవరకు ఇది నాదబ్బే కదా!

సుశీల : నీ మనసులో నువ్వు వూహిస్తున్న దేమిటో నాకు తెలుసు ఆనంద్!

ఆనంద్ : (తనలో తాను అనుకుంటున్నట్లుగా) ఇంత పెద్ద మొత్తం!

సుశీల : జనం ఇదంతా వింటే ఏమనుకుంటారో తెలుసా? ఇదంతా నా స్వంతానికే వాడు కుంటానని నువ్వనుకుంటున్నా వను కుంటారు.

ఆనంద్ : ఇంకా ఏమనుకుంటారో తెలుసా?... నేను వచ్చే వారమే చచ్చిపోతానని నువ్వనుకుంటున్నా వనుకుంటారు.
[నిజానికి ఆనంద్ ఆలోచించి ఆ మాట అనలేదు. ఆవేశంలో అన్నాడు. అయినా ఫలితం మామూలే!]

సుశీల : ఓ!

ఆనంద్ : నేననే దేమిటంటే—(తనలో అనుకుంటున్నట్లు) గుడ్ గాడ్! ఇదంతా నువ్వు ఏదో ఓ వ్యాపారంలో పెట్టి నష్టపోతావనుకో! (డబ్బే తన కిప్పుడు సర్వస్వం అయినట్లుగా) భాస్కరంగారూ! ఇంత కష్టపడి, స్వహస్తాలతో సంపాదించిన ఇంత డబ్బు ఏ వ్యాపారంలోనో చిల్లిగవ్వ లేకుండా పోవడం తలుచుకుంటే, చచ్చిపోయిన తర్వాత కూడా నేను శాంతంగా వుండలే నని పిస్తున్నది.

[భాస్కరం తలమాత్రం తిప్పి, చేతికో కాగితం ఇస్తాడు]

సుశీల : నువ్వు నిన్ను గురించే ఆలోచించుకుంటున్నావు కాని, పిల్లల్ని గురించి ఏమీ ఆలోచించడం లేదు, ఆనంద్.

ఆనంద్ : కానే కాదు.

భాస్క : (అగ్నిలో ఆజ్యం పోసినట్లు) ఆ, అన్నట్లు, మీ పిల్లలు కులాసానా?

సుశీల : గొప్పలు చెప్పడం కాదు. కాని, వాళ్లను చూస్తేనే చాలండి...రాము ప్రిన్సెస్ కాలేజీలో చదువుతున్నాడు...ప్రిన్సెస్ కాలేజీ వంటిది ఇండియాలో ఒక్కటే ఉందండీ!

భాస్క : బాగా చదువుకుంటున్నా డనుకుంటాను.

ఆనంద్ : భూనభోంతరాళాలు బద్దలు చేస్తున్నా నని వుత్తరాలుమాత్రం వ్రాస్తున్నాడు. వాడికి వున్న ఇద్దరు స్నేహితులూ మహారాజుల కొడుకు లేనట!......మొన్న ఆదివారం నాడు వాళ్లు ముగ్గురూ తప్పతాగి క్లాసులోకి వచ్చారట! మరి ప్రిన్సెస్ కాలేజీ కదూ! అటువంటి కాలేజీ ఇండియాలో అకొక్కటే!...ఇంతా చేస్తే వాడి కన్నెల్లో తెలుసా భాస్కరంగారూ! పందొమ్మిది!

సుశీల : నువ్వలాగే చెబుతావులే ఆనంద్.

భాస్క : మీ అమ్మాయి...ఎప్పుడో చూశాను... ఈ సరికి పెద్దదయి వుండాలి.

[ఆనంద్, సుశీల—ఒకరినొకరు సంతృప్తితో చూసుకొంటారు]

సుశీల : భాస్కరంగారికి చెప్పొచ్చు ఆనంద్.

ఆనంద్ : రేఖను పెళ్ళిచేద్దామని ఆలోచిస్తున్నాం భాస్కరంగారూ! మన—

సుశీల : పేర్లెందుకులే ఆనంద్!.........

ఆనంద్ : అవును......అక్కర్లేదు ...ఏమైతే నేం? అమ్మాయి యిహ మనింట్లో వుండదు.

భాస్క : అదా! అట్లా చెప్పవేం? మీరు వీలునామా మార్చాలనుకోవడం అందుకన్నమాట!

ఆనంద్ : ముఖ్యంగా అందుకే భాస్కరంగారూ! దానివల్ల వీలునామాలో చాలా మార్పులు చేయవలసివస్తయ్.

సుశీల : కాని, నువు చేసిన వాగ్దానాలు మాత్రం మరచిపోకు ఆనంద్.

ఆనంద్ : అవే వాటిని గురించే ఆలోచిద్దాం.

భాస్క : ఆఁ! మీరు పూర్వం ఏ సంస్థలకైతే విరాళాలు ఇద్దామనుకున్నారో, వాటికి ఇప్పుడు కూడా ఇస్తారా?

ఆనంద్ : (కుర్చీలో మేనువాల్చి) ఆఁ!.....హాస్పిటల్ కు పదివేలరూపాయలు కదూ?

సుశీల : మనకు ఇర్ని ఖర్చులు వస్తున్నయ్; ముందు ముందు. అది ఇవ్వడం అవసరమంటావా ఆనంద్?

ఆనంద్ : పదివేలు కాదు, ఇరవై వేలు.

సుశీల : ఆనంద్!

ఆనంద్ : నేను నిశ్చయం చేసుకున్నాను సుస్...మన దేశంలో హాస్పిటళ్లు బాగుపడవలసిన అవసరం ఎంతైనా వుంది.

భాస్క : మిగిలిన సంస్థలకు—

ఆనంద్ : మిగిలినవన్నీ ఎప్పటిలాగే వుంచివెయ్యండి.

భాస్క : మీ పిన్నిగారి కూతుళ్లకు—ఒక్కొక్కరికీ సంవత్సరానికి మూడు వందలు.

ఆనంద్ : దాన్ని అలా వుంచితే సరిపోతుందనుకుంటాను, సుస్.

సుశీల : పోనీ, ఒక్కసారే కొంత మొత్తంగా ఇస్తే—మొదట వాళ్లకు ఒక్కొక్కళ్లకు వంద రూపాయలు ఇస్తే సరిపోతుందనుకున్నాం.

ఆనంద్ : అప్పుడు నేను భాగ్యవంతుణ్ణి కాదు, సుస్.

సుశీల : వాళ్లను ఇంతభారం ఒక్కసారి మొయ్యమనడం భావ్యమా? వాళ్లకు ఈ డబ్బు ఎలా ఖర్చుపెట్టాలో కూడా తెలియదు

ఆనంద్ : వాళ్లూ పెద్ద వాళ్ళయినారు.

సుశీల : అందువల్లనే—వాళ్లకు ఏం అవసరాలు వుంటాయ్?...పోనీ, సంవత్సరానికి రెండు వందలు—

ఆనంద్ : వాళ్లు కలిసివుంటే అలాగే సరిపోతాయనుకో. కాని వాళ్ళకు ఒక్కక్షణం సరిపడదే! (భాస్కరంతో) వాళ్ళిద్దరినొక్క పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుం దనుకోండి!

సుశీల : బంధువులు—అందులోనూ అక్కాచెల్లెళ్లు—అలావుండడం మంచిదా? పోనీ ఓ పని చేద్దాం. వాళ్లిద్దరూ కలిసివుంటేనే డబ్బు వాళ్ళకు ముడుతుందని చెప్పండి.

ఆనంద్ : ఇదికొంచెం బాగానేవుంది.

భాస్క : ఇంతకూ సుశీలాదేవిగారి విషయం—

సుశీల : ఇంకా నాసంగతి ఏమిటి? నిశ్చయం అయిపోయిందిగదా!...ఏమంటావ్ ఆనంద్?

ఆనంద్ : (నిస్పృహతో, నిస్సారంగానవ్వి) ఇప్పుడా! ఎప్పుడో అయిపోయింది. (లేస్తాడు)

[కొంచెంసేపు నిశ్శబ్దం]

భాస్క : (వ్రాయడం పూర్తిచేసి) బావుంది...కాని ఈ వీలునామా కూడా మా నాన్నగారే వ్రాద్దామనుకున్నారు ... కాని ఆయన విశ్రాంతికోసం పల్లెకు వెళ్లారు.

సుశీల : (లేస్తూ) కులాసాగా ఉన్నారా?

భాస్క : (తానుకూడా లేస్తూ) ఇదివరకటికన్న బావున్నారు—ఇప్పుడంతా ఆటలు, పాటలు—

ఆనంద్ : గానాబజానాలో ఉన్నారన్నమాట! యేం ఆటలు ఆడతారు?

భాస్క : ఏముంటయ్?...ఏచీట్లపేకో, చదరంగమో—

ఆనం : వారు ఊపిరి పీల్చడానికికూడా టైం దొరకడంలేదండి ... యీ వయస్సులో అలా విశ్రాంతి తీసుకోడానికైనా పెట్టిపుట్టొద్దూ కాని వీలునామా వ్రాసేటప్పుడు చూడాలండి ఆయనను. ఈ వీలునామా కూడా ఆయనే వ్రాస్తే బావుండునని వారనుకున్నది. కాని ఆయన్నింకా బాధపెట్టదలుచుకోలేదు.

భాస్క : ఇప్పటికయినా ఆయన మీ వీలునామా వ్రాయటమంటే చాలా ఆనందిస్తారు.

ఆనంద్ : అవును...నాకు తెలుసు. వ్రాస్తున్నప్పుడు ఆయన చేతులు చూడాలి, ఎలా పరుగెత్తేవో! సంగతులు నేను చెప్పినవే అయినా, తీరా ఆయన వ్రాశాక ఎలా వుంటయ్యోనని భయపడేవాణ్ణి నేను.

సుశీల : నాకేమనిపించేదో తెలుసా? ఆ చేతుల్తోనే మనల్ని కోర్టుల్లో హాజరుపరచగలరు కదా! అని—

ఆనంద్ : (కొంచెం తత్తరపాటుతో) ఛా! అలా ఎన్నడయినా జరుగుతుందా?

సుశీల : నేను అనుకున్నది చెప్పాను ఆనంద్...ఆఁ! నువ్వు ఇంటికి వస్తావా, బజారుకు వెడతావా?

ఆనంద్ : పద......క్లబ్బుకు వెడదాం......వస్తాం భాస్కరంగారూ! మీ నాన్నగారు వచ్చిన తరువాత మా యింటికోసారి రమ్మనండి. ఆయన చూడలేదు...అదీగాక నాకు తీరదేమో!

భాస్క : అలాగే! తప్పక పంపుతాను...ఆయన కూడా చాలా సంతోషిస్తారు....మీరు మొదటిసారి వీలునామా వ్రాయించడానికి వచ్చినప్పుడు—జ్ఞాపకం వుందా?

ఆనంద్ : అవునవును...తలుచుకుంటే చాలా తమాషాగా వుంటుంది.

భాస్క : మీరు వెళ్లినతర్వాత ఏమన్నారో తెలుసా? మీవంటివి దాంపత్యంలోనే తెలియాలట ప్రేమ రహస్యం!

ఆనంద్ : (భాస్కరంతో కరచాలనం చేస్తూ) నిజమే భాస్కరంగారూ! (సుశీలవంకకు తిరిగి) చూశావా సుస్! మన ప్రేమను గురించి ఏమీ తెలియకుండానే ఆయన ఏమని చెప్పారో!

[సుశీల నవ్వుతుంది.]

భాస్క : అవునవును...ఆయనకేం తెలుసు మా ప్రేమ ఎటువంటిదో!

[వాళ్లు వెళ్లిపోతారు. కాని ఒకరి చేతుల్లో ఒకరు చేతులు వేసుకొనికాదు. భాస్కరం వాళ్లు కనిపించేదాకా వాళ్లవంక చూసి, తరువాత ఒక్కసారి డ్రాయరుమీద వున్న వీలునామావంక చూసి, దానిని డ్రాయర్లో వుంచుతాడు. తిరిగి వాళ్లు వెళ్లినవైపుకే తిరిగి తనలో తాను నవ్వుకుంటూవుండగా - తెర.]

## రంగము: 3

### [పదేళ్ల తరువాత]

* * మనుష్యులు మారినా నివాసాలు మారలేదు. స్వల్పమైన మార్పులతో వెనుకటిగదే వెనుక వున్న గాంధి, నెహ్రూ ఫొటోలకు ఇప్పుడు దండలు వేయబడివున్నయ్. కుర్చీల స్థానాన్ని సోఫాలు ఆక్రమించినయ్. ఓ ప్రక్క ఫ్లవర్ వేజ్ పెట్టబడివుంది. టేబుల్ మీద టెలిఫోన్లు రెండు వున్నయ్. గదికి మూల మరొకటి వుంది.

తెర లేచేసరికి గదిలో ఎవ్వరూ వుండరు. ఒక క్షణం తరువాత రాఘవయ్య గారు వస్తారు...మనిషికి, వయసుతోపాటు, దర్పం వచ్చింది. బాగా స్థూలకాయుడైనాడు ......... ప్రతివిషయం ఏదో యంత్రంలా చేసివెయ్యడం తప్ప ఆలోచించడం ఇప్పుడాయనకు పడటంలేదు.

ఆయన వచ్చి గది నలుమూలలా పరీక్షిస్తూ వుండగా సంతానం వస్తాడు. వాడు కొత్త నౌకరు కావడంవల్ల వచ్చి నాయన ఎవరో తెలియదు. అందువల్ల తన అనుమతి లేకుండా ఇలా లోపలికి రావడాన్ని సహించలేక—]

సంతా : సార్!......(రాఘవయ్యగారు వినిపించుకోడు) మీకేనండి, చెప్పేది.

[రాఘవయ్యగారు విని, తల తిప్పుతాడు] ఇంకా బాబుగారు రాలేదండి.

రాఘు : వచ్చానుకదోయ్!...(ఓ క్షణం ఆగి) ఓ! అంటే, భాస్కరంమాటా నువు చెప్పేది?

సంతా : అవును సార్!

రాఘు : ఇంకా రోజూ ఆలస్యమే నన్నమాట!...వ్వ్ చిన్నతనం వదలలేదు......(కొంచెం ఆగి) అవును. పిల్ల లెప్పుడూ పిల్లలే......ఊఁ! బంగారూ!

సంతా : నా పేరు సంతానం సార్!

రాఘు : సంతానమా! నువ్వెవరు?..... బంగారాన్ని పిలు.

సంతా : (చనిపోయినవాళ్లను జ్ఞాపకం చేసుకుంటున్నాడన్న సానుభూతితో) ఆ పేరు కల వాళ్లు ఇక్కడ ఎవ్వరూ లేరుసార్.

రాఘు : (పిరికిగా) లేడా!......అవును......నాకు జ్ఞాపకం వస్తోంది...పాపం! (అయినా తనను తాను నమ్మించుకోలేక) సరే! వచ్చిన తర్వాత నేను రమ్మన్నానని చెప్పు.

[రాఘవయ్య తను వెనకకూర్చుండే కుర్చీ స్థానంలోకి వచ్చి, అక్కడి తన కుర్చీ స్థానే వున్న సోఫామీద కోటు తగిలించి వుండడం చూస్తాడు]

రాఘు : ఈ కోటు ఎవరిది?

సంతా : బాబుగారి—అదే! భాస్కరంగారిది సార్!

రాఘు : అది ఇక్కడ ఎందుకు తగిలించాడు? ఇది నా కుర్చీ అని తెలియదూ?

సంతా : అదేమిటిసార్! ఆయన అక్కడ ఎన్నాళ్ళనుంచో కూర్చుంటూ వుంటే!

రాఘు : కూర్చోడానికి వీలు లేదు...బంగారేం చేస్తున్నాడు? చూస్తూ వూరుకున్నాడా?

[టేబులుమీది వుత్తరాలు ఒక్కొక్కటే చించి చూస్తూ ఉంటాడు.]

సంతా : ఏమిటిసార్! అడక్కుండా గదిలోకి వచ్చింది కాకుండా, ఇంకా వుత్తరాలు చించుతారేమండీ!...అవుత్తరాలు భాస్కరం గారివి.

రాఘు : ఏమిటీ! ఒళ్లు కొంచెం దగ్గర పెట్టుకో! అసలు నువ్వెందు కిక్కడ?...బంగారాన్ని పంపు.

[సంతానం ఏమి చెయ్యడానికి పాలుపోని ఈ పరిస్థితుల్లో భాస్కరం వస్తాడు. మనిషి పాలిపోయి వుంటాడు. తెల్లని జుట్టు, వాకిలి దగ్గరకు వచ్చి, తండ్రినిచూచి, నిర్ఘాంత పోతాడు ]

భాస్క : (ఆశ్చర్యమూ, ఆనందమూ, బాధా ఒక్కసారే ముప్పిరికొంటయ్) మీరా, నాన్నా! (సంతానం వైపుకు తిరిగి, కోపంతో) నువ్వేరా ఆయన నక్కడ కూర్చోపెట్టింది? (సంతానం వణికిపోతూ వుంటాడు.) ఇహ కాఫీ కావాలా అని కాని, అలా పడక కుర్చీలో పడుకోమనడం కాని, లేకపోతే ఇంటికి సరాసరి తీసుకురావడం కాని తెలియదన్నమాట!—ఊఁ...వెళ్లు.

['బ్రతికాంరా దేముడా' అనుకొని వెంటనే వెళ్ళిపోతాడు సంతానం].

రాఘు : (భాస్కరం వంకకే చూస్తూ) నువ్వూ పెద్దవాడి వయినావు భాస్కరం.

భాస్క : ఎప్పుడూ ఒకలానే వుంటామా? (కొంచెం లాలిస్తూ) అయినా మీరు ఇంత శ్రమపడి ఇక్కడి కెందుకు వచ్చారు చెప్పండి... ఆరోగ్యమూ సరిగా లేదాయె! పల్లెలో విశ్రాంతి తీసుకోవడం బావుండేదేమో?... ఎన్ని సంవత్సరాలైంది ఇక్కడకు వచ్చి!

రాఘు : అందుకే వచ్చాను... అనుకోకుండా — షికారుకని బయలు దేరాను. స్టేషనులో రైలు వుంది ఎక్కాను.

భాస్క : ఆగండి...మీతోపాటు ఎవరినైనా ఇంటికి పంపుతాను...విశ్రాంతి తీసుకుందురుగాని—

రాఘు : ఊరుకో భాస్కరం... కొంచెం సేపు ఇక్కడే కూర్చుంటాను.

భాస్క : దానికేం?...పోనీ కాఫీ గాని,—

రాఘు : తాగేవచ్చానులేవోయ్!...

భాస్క : అయితే ఇక్కడ చలిగాలి బాగా తగులుతోంది. ఆ పడకకుర్చీలో పడుకుని నిద్ర కూడా పోవచ్చు. (పడక కుర్చీదాకా నడిపించుకొనిపోతాడు)

రాఘు : నిద్రా!...అవును. నేనిప్పుడు దానికితప్ప మరెందుకూ పనికిరాను ... ఒకప్పుడు — ఏమయితే నేం? ఒకప్పుడు నేను కూర్చున్న కుర్చీలో యివ్వాళ నా కొడుకు కూర్చున్నాడు! ... (భాస్కరం కోటును సర్ది, కుర్చీలో కూర్చుంటాడు) ఆఁ! భాస్కరం. నిద్ర వచ్చేవరకు ఏమైనా సంగతులు చెప్పు. ఆఁ! బంగారు బ్రతికేవున్నాడా భాస్కరం?

భాస్క : (తెలియనట్లుగా) బంగారా?

రాఘు : మన నౌకరు భాస్కరం —

భాస్క : ఓ! వాడా!...ఇప్పుడా! ముప్పైఏళ్ళయింది పోయి.

రాఘు : ముప్పైయేళ్లు!...అంతా నిన్న జరిగినట్లుగా వుంది నాకు.

భాస్క : మీకు ఇప్పటిసంగతులకన్న పూర్వం సంగతులే బాగా జ్ఞాపకం ఉంటున్నాయ్ నాన్నా!

రాఘు : కావచ్చు.

[రాఘవయ్యగారు కుర్చీలో పడుకొని కళ్లు మూసుకుంటాడు. మరుక్షణంలోనే గురక వినబడుతుంది. భాస్కరం ఉత్తరాలు చూస్తూ వుంటాడు...ఓ నిముషం తర్వాత సంతానం వస్తాడు.]

సంతా : రావుబహదూర్ ఆనందరావుగారు వచ్చారు సార్!

భాస్క : (త్వరగా) ఆనందరావుగారా!...రమ్మను..

[ఓ క్షణం తరువాత ఆనందరావు లోపలకు వస్తాడు. ఇప్పుడాయన రావుబహదూర్... తీరని వ్యసనతో క్రుంగిపోయినవాడిలా కనిపిస్తాడు....ప్రస్తుతం కూడా అదే పరిస్థితిలో ఉన్నాడు.]

భాస్క : నమస్తే! ...రండి, ఆనందరావుగారూ! మీరు వస్తారనే అనుకోలేదు...కబురు లేకుండా కూడా ఇలా వచ్చేశారేం?....బావున్నారా?

ఆనంద్ : ఆ ... గొప్పగా ఉన్నాను ... (కొంచెం జోక్యులర్ గా) మళ్లీ వెనకటి పనిమీదే వచ్చాను.

భాస్క : మరో వీలునామా తయారుచేయించడానికా?

ఆనంద్ : అవును...అందుకే!

భాస్క : అవునవును...తప్పదుకదా!

[ఆనంద్ కుర్చీలో పడుకొన్న రాఘవయ్య గారిని చూస్తాడు ]

భాస్క : మా నాన్నగారు!... (మెల్లిగా దగ్గరకు వెళ్ళి) నిద్రపోతున్నారా, నాన్నా!... (ఆనంద్‌తో) అంతేనండీ! ఇలా మాట్లాడుతూ వుంటారు. మరుక్షణంలో మగతలో పడిపోతారు. మనం చెప్పేది వినిపించదు. (ఆయన నుదుటిని అంటి) చూశారా!... ఇహ లేవడం కూడా అనుకోకుండా నే లేస్తారు...చాలా పెద్దవారయారు. ఏ విషయాలూ జ్ఞాపకం వుండవు

ఆనంద్ : (ఆలోచనతో) జ్ఞాపకం వుండవా!...ఎంత అదృష్టం!

భాస్క : (గది మరో ప్రక్కకు వస్తూ) విన్నాను, ఆనందరావుగారూ! చాలా విచారించవలసిన విషయం. అనుకోకుండా జరిగిపోయింది... అంతేనండీ! జీవితమే అంత! జీవిత గమ్యాన్ని చేరుకోవడానికి కలిసిబయలుదేరిన ఇద్దరు బాటసారుల్లోనూ, ఒకరు మధ్యలో నే విడిపోవడం విచారకరమైన విషయమే! అయినా ఏంచేస్తాం? అలా జరుగక తప్పదు.

ఆనంద్ : అవునవును...

భాస్క : (ఇంకా సానుభూతిని సూచించే కంఠంతోనే) చాలా మంచిది...నాకు ఆవిడ అంటే ఎంతో గౌరవం.

ఆనంద్ : (కొంచెం చిరాకు కనబరుస్తూ) సరే! ముందు మన పని కానివ్వండి...ఏమైనా ఆవిడ— మనం అందరం — నే నే ముందు వెళ్ళిపోతా ననుకున్నాం.

భాస్క : అవునవును ... అంతేనండీ! ఎవరుముందో, ఎవరు వెనుకో ఎవరికి తెలుసు?

ఆనంద్ : తెలియనివి ఇంకా వున్నయ్! ... మనం విల్లునుగురించి ఇంత బాధపడేవాళ్ళమా!... ఆ వేళ ఆవిడ—సరే! (కూర్చుంటూ) మరొకటి తయారుచేద్దాం కాని, నేను ఓడిపోవడం మాత్రం జరుగలేదు.

భాస్క : ఏమోనండి! మనం అందరం తలలు వంచవలసిన వాళ్ళమునే నా కనిపిస్తుంది.

ఆనంద్ : అంతేనంటారా? లేదు, వీలులేదు...అలా జరగడానికి వీలు లేదు.

భాస్క : (ఏంచెప్పాలో తెలియక) ఆవిడ వుండగా ఇంత చేసింది! ఆవిడ చెప్పినట్లుగా నే విల్లును—

ఆనంద్ : వీల్లేదు భాస్కరంగారూ! ఆవిడ చేసిందేమీ లేదు...

భాస్క : అంతేనంటారా? ఆవిడరాగానే మీకు సిరి అబ్బిందని, మీకు సంఘంలో గౌరవం, ఉన్నతస్థానం లభించాయని అంటారు... నిజంగా, సుశీలాదేవిగారిని ఆ సిల్కుదుస్తుల్లో చూడాలి—

ఆనంద్ : ఆపండి భాస్కరం గారు! ఆవిడ్నిగురించి నాకు బాగా తెలుసు!...ఆవిడ మొదటి నుంచీ సిల్కుల్లో నే మునిగివుండేదా? సాదా చీరల్లో ఇంతకంటె హాయిగా, ఆనందంగా వుండే రోజులు వున్నయ్...(మనిషి దిగజారిపోతూ, ఇంతలో తట్టుకొని) పరిస్థితులు విషమించినయ్! ఎందువల్ల? ఇప్పుడు జరిగిన ప్రతిసంఘటనకూ ఆవిడే కారణం!— (కొంచెం సేపు ఆగి, మాట మారుస్తూ) పోనివ్వండి ... అవన్నీ తవ్వుకోవడంవల్ల లాభంలేదు...మనపని కానిద్దాం.

భాస్క : (సానుభూతిగా) నిజమే ననుకోండి... అయినా జీవితం మన బాధలకు పరిహారంగా సంతోషాలను కూడా ఇవ్వకపోదు...మీ అబ్బాయి వున్నాడు కదా!

ఆనంద్ : (వ్యథంగా) లేడు.

[భాస్కరం నిర్ఘాంత పోయి, సూటిగా ఆనంద్ కళ్ళలోకి చూస్తాడు.]

అనంద్ : వాడికీ, నాకూ ఎప్పుడో ఋణం తీరింది.

భాస్క : అదేమిటండీ!...ఒక వేళ అతను తప్పే చేసి వుంటే—

ఆనంద్ : తప్పా! వాడు చేసిన పనుల్ని తప్పులని పిలవడం చాలా మృదువుగా వుంటుంది.

భాస్క : అంత—

ఆనంద్ : ఆఁ! అంతగా చెడిపోయాడు—సమూలంగా—వాడిలో ప్రతి అణువూ కుళ్లిపోయింది.

భాస్క : అలా అనకండి.... నాకే బాధగావుంది.

ఆనంద్ : (వ్యంగ్యంగా) నాకంటే ఎక్కువ బాధగా వుంది కాబోలు!...ఏం? (ఇంతలో, వుద్రేకంతో—) ఎలాగైతే నేం, వాడి బాధ వదిలించుకున్నాను. వాడిని ఈ దేశం నుంచి పంపించి వేశాను...చట్టం వాడిమీద విరుచుకుపడ్డది. వాడికోసం కాదు—నా కోసం...నా పరువునూ, ప్రతిష్ఠనూ, కాపాడుకోవడం కోసం...వాడు నాకు కొడుకా?...వాడి మీద ఎన్ని ఆశలు పెట్టుకున్నాను?... అందుకే నాకీ ప్రతిఫలం దొరికింది...ప్రతివాళ్లూ నా వెనుక నే నన్ను చూసి నవ్వుతున్నారు...ఇంకా మా అమ్మాయిని గురించి అడగరేం—!

భాస్క : విన్నాను, విన్నాను...చాలా బాధాకరమైన విషయం.

ఆనంద్ : నీచుడు..లోఫర్..అటువంటి వాడితో—తన కారును నడిపే వెధవతో—

భాస్క : ఏం చేస్తామండి? రోజులు—!

ఆనంద్ : కారు...దీనికంతకూ కారణం కాదంటారా?

భాస్క: ఆవిడే నంటారా?

ఆనంద్ : (ఆ మాట వినడానికి కూడా అసహ్యించుకున్నవాడి మాదిరిగా) ఎవరైతే నేం?... ఇక నాకు ఎవరి సానుభూతీ అనవసరం. వాళ్ళిద్దరికీ నాకూ ఏవిధమైన సంబంధమూ లేదు...(కొంచెంసేపు ఆగి) నేను ఈ సంఘటనలవల్ల సర్వనాశన మైనా ననుకుంటే మీరు పొరబడ్డారు......ఆనంద రావంటే ఎవరో వాళ్లకు చూపిస్తాను...కాగితం తీసుకున్నారా!...ఇది నా ఆఖరి వీలునామా! వ్రాసుకోండి...నా నిశ్చయం చూస్తే మీకే తెలుస్తుంది.

భాస్క : (అనునయిస్తున్నట్లు) అది కాదు ఆనందరావుగారూ! పరిస్థితులు కొంచెం చక్కబడే దాకా ఆగడం—

ఆనంద్ : మీరు వ్రాస్తానంటారా, లేక నా దోవన నన్ను పొమ్మంటారా?

భాస్క : మీరు తప్పదంటే, నేను కాదంటానా?

ఆనంద్ : అయితే వ్రాయండి...(కుర్చీకి వెనుకగా నిలబడి) నేను, సుశీలా సదనం యజమాని ఎ. ఆనందరావును, నా యావదాస్తిని, నా తదనంతరం—

భాస్క : (ఆగిపోయిన ఆనంద్‌ను వ్రాసుకుంటూన్న భాస్కరం తలయెత్తి చూస్తాడు.) ఆఁ—

ఆనంద్ : (తోటక) ఆఁ!...నా తదనంతరం...నా యావదాస్తినీ—

భాస్క : ఆఁ...యావదాస్తినీ—

ఆనంద్ : యావదాస్తినీ...(కంగారుగా) ఏం చెయ్యాలో తెలియడం లేదు భాస్కరం గారూ! (ఏమీ తోచక, ఏదో ఒక నిశ్చయానికి రావాలన్న మనోనిబ్బరంతోనూ, ఎంత ఆలోచించినా తోచని దారితోనూ యుద్ధం చేస్తూంటాడు.)

భాస్క : నిజంగా మీరు—

ఆనంద్ : కొంచెం సలహా చెప్పకూడదండీ భాస్కరం గారూ! (కుర్చీలో కూలబడతాడు.)

భాస్క: మీ పినతండ్రిగారి కూతుళ్లు—బహుశః చనిపోయా రనుకుంటాను.

ఆనంద్ : ఎప్పుడో!

భాస్క: ఇంత డబ్బును చూస్తూ, చూస్తూ—

ఆనంద్ : ఇంత డబ్బును ఈ చేతుల్తో సంపాదించాను. ఆఁ! మీరే తీసుకుంటేనో!...(రాఘవయ్యగారివంక చూస్తూ) ఆయన ఏ దేశాలకో వెళ్ళి విశ్రాంతి తీసుకోడానికి వీలుంటే ఆదుకోవటానికి ఇది వుపయోగించదా? ఇది మీ కిస్తే, మీయిష్టం వచ్చినట్లు బీదకూ, బిక్కకీ పంచగలరా?

భాస్క: ఆనందరావుగారూ!

ఆనంద్ : (జేబులోనుంచి ఒక కాగితం తీసి ఇస్తూ) ఇదుగో! మూడు లక్షలనలభై వేలు, నాలుగు ఇళ్లు, నాలుగుతోటలు, నాలుగు కార్లు—ఇవన్నీ ఈ ఆరుగురిని నోళ్లు కొట్టి

సంపాదించినవే? ..నేను కావాలని చేయలేదు...వ్యాపారంలో ఒకరికి లాభం వచ్చిందంటే, మరొకరికి నష్టం వచ్చితీరాలి. (దగ్గరగా వెళ్ళి, బతిమిలాడుతున్నట్లు) భాస్కరం గారూ? ఈ ఆరుగురికీ ఎంతెంత మొత్తాలు ఇవ్వాలో దీనిలో వుంది... వాళ్ళ ఉసురు నాకు తగలకుండా, వాళ్ళకు నేను చేసిన అన్యాయానికి ప్రతిఫలంగా యివ్వండి మిగిలేది లక్షున్నర దాకా వుంటుంది. అది మీకు—...(త్వరగా) విల్లు తయారుచేసి మా యింటికి తీసుకురండి. సంతకం చేస్తాను.

భాస్క : ఏమిటి, నిజంగానా!...క్షమించండి ఆనందరావు గారూ! నుమాత్రం తీసుకోలేను.

ఆనంద్ : (దృఢంగా నిశ్చయించుకున్న వాడి మాదిరిగా) మీరు కాకపోతే మరొకరు... మొదటి అవకాశం మీది...ఆలోచించుకోండి. ఏమంటారు?

భాస్క : (ఆలోచించి) సరే!

(ఆనంద్ చేతులతో కౌగిలం తీసుకుంటాడు)

ఆనంద్ : అయితే ఈ విషయం పరిష్కారం అయినట్లే!...(లేచి, రాఘవయ్యగారి వంక చూస్తూ) నా మొదటి వీలునామా వ్రాసింది మీరు! చివరి వీలునామా మీ చేతుల మీదుగా తయారు కావడం లేదు!......

రాఘు : ఏమిట్రా భాస్కరం, వీలునామా అంటున్నావ్?

భాస్క : మేలుకొనే వున్నారా నాన్నా!

రాఘు : (పడక కుర్చీలో లేచి కూర్చొని, ఆనందరావును చూచి) మిమ్మల్నెక్కడో—

భాస్క : గుర్తు పట్టలేదా నాన్నా! ఆయన ఆనందరావు గారు—ఇప్పుడు రావుబహదూర్ ఆనందరావు గారూ!

రాఘు : రావుబహదూర్ ఆనందరావు గారా! (ఆనందరావు చేసిన నమస్కారాన్ని అందుకుని) చాలా సంతోషం...కాని మిమ్మల్ని ఇదివరకెక్కడా చూడలేదు.

భాస్క : చూడకపోవడమేమిటి నాన్నా! ఈయన ఆనందరావు గారు!

రాఘు : ఇదివరకు నాకో ఆనందరావు తెలుసు.

భాస్క : అయితే ఈయన—

(భాస్కరం, ఆనందరావులు రాఘవయ్యగారివంక చూస్తూ వుంటారు. ఆయనమాత్రం నిర్లిప్తంగా బయటకు చూస్తూ వుంటారు.)

రాఘు : కాదు, కాదు...అతను కుర్రవాడు. పైకి రావలసినవాడు......అతని భార్య! ఎంత అన్యోన్యంగా వుండేవాళ్లు! ఎన్నో ఏళ్ళకు పూర్వం...వాళ్లిద్దరూ ఇక్కడకు వచ్చారు. వాళ్లకు అంత తక్కువ ఆస్తివున్నా, దాన్నే ఎంత ఘనంగా చూసుకొనేవాళ్లు! ఎంత కులాసాగా, హాయిగా వుండేవాళ్లు!

భాస్క : (వెనుకటి సంగతులు ఆనందరావుకు బాధను కల్గిస్తాయని భయపడి) పోనివ్వండి నాన్నగారూ!......(ఆనందరావుతో) మా నాన్నగారికి ఇప్పటి సంగతికంటె గతించిన సంఘటనలే బాగా జ్ఞాపకం వుంటున్నయ్...

ఆనంద్ : కావచ్చు...ఆయనను చెప్పనివ్వండి.

రాఘు : (క్షణం నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ, మెల్లగా) పాపం! చివరికంతా బాధలతో అంతం అయింది. మీకు తెలుసా?

ఆనంద్ : (అనుకోకుండానే ఆయనకు సమాధానం చెబుతాడు.) నాకు తెలుసు......(కుతూహలంతో) నాకు ఆశ్చర్యం వేస్తుంది—పరిస్థితులు బాధాకరంగా ఎందుకు తారుమారయ్యాయంటారు?...ఎంత ఆలోచించినా నాకు మొదలు, చివర తెలియడంలేదు.

రాఘు : తెలిస్తే బాధ ఏముంది?...అది ఎప్పుడూ మనల్ని వెంటనంటే వుంటుంది......దానికసలు మొదలంటూ వుండదు. ఇదంతా నాకు అతను చెప్పిందే!

భాస్క : నాకేమీ తెలియడంలేదు. ఆయన మరేదో విషయం మాట్లాడుతున్నారు.

ఆనంద్ : (భాస్కరంతో) కాదు. (రాఘవయ్యగారితో) ఏమిటండీ ఆ ఎప్పుడూ వుండేది?

రాఘు : అదే! విచారం, బాధ!...మనోవ్యథ!!! అదొక్కటి లేకుండావుంటే, మనుష్యులు హాయిగా వుంటారు. కాని అదిమాత్రం నిత్యం వాళ్లను అంటిపెట్టుకు వుంటుంది—మాయని మచ్చలాగా—సూదిలా బయలుదేరి, దబ్బనంలా తేలుతుంది. చివరకు జీవితాన్ని సమూలంగా నాశనం చేస్తుంది.

భాస్క : ఆయన మాట్లాడుతోందేమిటో నాకు అగమ్యగోచరంగా వుంది...బహుశః ఏదో ఊహా లోకంలోవుండి, మాట్లాడుతున్నారేమో?

ఆనంద్ : (నిస్సారంగా) కాదు...ఆయనకు ప్రతి విషయం తెలుసు...(రాఘవయ్యగారితో, ఆదరంగానూ, గౌరవంగానూ) మరి ఆ బాధను మాన్పుకోవడానికి వాళ్లేం ప్రయత్నాలు చెయ్యలేదంటారా?

రాఘు : వాళ్లకు తెలిస్తేకదా చెయ్యడం?...వాళ్లు ఊహించనుకూడా లేదు ... అందువల్లనే జాగ్రత్త పడలేదు. అది చివరకు వాళ్ళ జీవితాన్నే నాశనం చేస్తున్నప్పుడుగాని వాళ్లకు తెలిసి రాలేదు...పాపం!

ఆనంద్ : పాపమా!

రాఘు : అది వుండకూడని జబ్బు, తగిన జాగ్రత్త తీసుకోకపోతే ప్రతివాడిపనీ అంతే!

[ఒక క్షణం నిశ్శబ్దం.........మరుక్షణంలో ఆయన మగతలో వుండిపోతారు.]

భాస్క : ఆయన ఏం మాట్లాడారో మీకు తెలిసిందా?...నాకు ఒక్క అక్షరం కూడా తెలియలేదు.

ఆనంద్ : నాకు సర్వమూ తెలిసింది. మా విషయం అంతా ఆయనకు సవిస్తరంగా తెలుసు.

(భాస్కరానికి ఇదివరకు ఇచ్చిన కాగితాన్ని టేబుల్ మీద నుంచి తీసి ముక్కలు ముక్కలుగా చించివేస్తాడు ఆనంద్.)

భాస్క : అమ్మయ్యా! ఇప్పటికి నాకు స్తిమితం చిక్కింది...మీ రలా చెయ్యడం నాకు చాలా ఆనందంగా వుంది.

ఆనం : (అదేం వినిపించుకోకుండా) మాయని మచ్చ!...అది నన్ను నాశనంచేసినట్లే యువకుల్ని, వృద్ధిలోకి రాదగినవాళ్ళని నాశనం చెయ్యకుండా కాపాడుతారు...నా పాపాలకు ప్రాయశ్చిత్తం అదే!...వాళ్లైనా జీవితంలో వెలుగును స్వచ్ఛతనూ చూసి అనుభవించగలుగుతారు.

భాస్క : నిజం! ఇంత జబ్బుతో ఎంతైనా చెయ్యవచ్చు.

ఆనం : (జబ్బు అనేమాటను ఏహ్యంగా అనుకరిస్తూ) హుఁ! జబ్బు!...జబ్బుతో ఏ మాతుందండీ? ...కావలసింది హృదయం!...వస్తాను.

[త్వరగా, వెనుతిరిగి చూడకుండా వెళ్ళిపోతాడు ఆనంద్. కనిపించే టంతవరకూ అటే చూస్తూ తరువాత తనలో తాను నవ్వుకుంటాడు భాస్కరం.]

భాస్క : సంతానం, సంతానం!

సంతా : (వస్తూ) సార్...

భాస్క : నాన్నగారు నిద్రపోతున్నారు...చల్లగాలి వస్తోంది...బయట గోలగావుంది: గాలి తగలకుండా, గోల వినిపించకుండా ఆ తెర వెయ్యి.

సంతా : చిత్తం సార్...

[తెర వేస్తాడు]

# సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతము

శ్రీ చిత్తజల్లు వరహాలరావు

రాజకీయశాస్త్రంలో సుప్రసిద్ధ సిద్ధాంతముగా పరిగణింపబడే 'సోషల్ కంట్రాక్ట్' సిద్ధాంతాన్ని, ఆంగ్ల జిజ్ఞాసువులైన థామస్ హాబ్, జాన్‌లాక్, ఫ్రాన్సు దేశస్థుడైన జాన్ జాక్విస్ రూసో, వివిధ దశలలో వివిధ రూపాలలో ప్రతిపాదించారు.

ఏ సిద్ధాంతాన్నైనా, పరిశీలించవలసివచ్చినప్పుడు ఏ రాజకీయ, సాంఘిక, చారిత్రిక పరిస్థితులలో ఆ సిద్ధాంతం ఉద్భవించిందో మనము గణనలోకి తీసికోవాలి. అలా తీసికొన్నప్పుడే ఆ సిద్ధాంతం ఆ ప్రత్యేక చారిత్రికదశలో ఆ రూపంలో ప్రతిపాదింపబడటానికి కారణము తెలుస్తుంది ఒకటే 'సోషల్ కాంట్రాక్ట్' సిద్ధాంతాన్ని మూడు విభిన్న రూపాలలో మూడు రకాల ఆశయాలను, సాధించేందుకు ప్రతిపాదించడము జరిగింది.

ఆంగ్లరాజైన చార్లెస్ I కి, ఆలివర్ క్రాంవెల్ యొక్క నాయకత్వంక్రింద ఉన్న బ్రిటిష్ పార్లమెంటుకు, 1642 నుండి 1651 వరకు ఘోరమైన అంతర్యుద్ధం జరిగింది. యుద్ధానంతరం పార్లమెంటు రాజునే ఉరికంబానికి ఎక్కించింది విపరీతమైన అరాచకానికి జాతి నిర్వీర్యతకు అంతర్యుద్ధం త్రోవ తీసింది.

1588—1679 వరకు జీవించిన ఆంగ్ల తత్త్వవేత్త థామస్ హాబ్స్ ఈ అంతర్యుద్ధాన్ని, అరాచకాన్ని, రాజాధికార క్షీణతను, ఆంగ్లజాతీయైక్యతా వినాశనాన్ని తన కండ్లారా చూచాడు. ఈ విపత్కర పరిస్థితులనుండి, జాతిని కాపాడేందుకు ఒక మార్గాన్ని వెతికాడు. ఆ మార్గాన్వేషణ ఫలితమే 1651 లో ఆయన ప్రచురించిన 'ది లెవియాథన్' (The Leviathan) అనే గ్రంథము. ఈ గ్రంథంద్వారా ఆయన సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతాన్ని ప్రథమముగా ప్రచారముచేసాడు. తద్వారా నిరంకుశరాజరికాన్ని, కట్టుదిట్టమైన ప్రభుత్వాన్ని ప్రతిపాదించాడు.

ఆంగ్లరాజైన జేమ్సు II ప్రజాభీష్టమునకు విరుద్ధంగా పరిపాలన సాగించినందున 1688 లో పార్లమెంటు పదవీభ్రష్టుని చేసింది. దీనికే ఆంగ్లచరిత్రలో "రక్తరహిత విప్లవం" అనే నామకరణము చేసారు. ఒక్క రక్తపుబొట్టైనా చిందకుండా మార్పు వచ్చింది కాబట్టి దీనిని యీ విధముగా పిలిచారు. 1632-1704 వరకు జీవించిన జాన్‌లాక్ ఈ విప్లవాన్ని కండ్లారా చూచాడు. "దివ్యవిప్లవము"ని దీనిని పిలిచి, 1690 లో ప్రచురించిన 'టు ట్రియటైజెసెస్ ఆఫ్ గవర్నమెంట్' (Two treatises of Government) అనే గ్రంథంలో రక్తరహిత విప్లవాన్ని తాత్త్విక ప్రాతిపదికమీద సమర్థించాడు. ప్రజాభీష్టమునకు వ్యతిరేకముగా — ఏ రాజు, యెంతటి ఘనుడైనా కావచ్చు — ప్రవర్తించితే పదవీభ్రష్టుడు, పతితుడు కాకమానడు — అనేదే లాక్ సిద్ధాంతంయొక్క సారాంశము. తన గ్రంథములో చట్టబద్ధ రాచరికాన్ని, పార్లమెంటరీ ప్రజాస్వామికాన్ని ప్రతిపాదించాడు.

నేటి యుగమునకు సంబంధించిన మానవ చరిత్రలో మహోన్నతములైన మార్పులకు మూలకారణంగా పరిగణింపబడే ఫ్రెంచి విప్లవం 1789 లో భయంకరమైన తుపానులా చెలరేగింది. నాడు, ఫ్రెంచి సామాజికవ్యవస్థ ఆర్థిక, సాంఘిక, రాజకీయ నైతిక రంగాలలో పతనమై శిథిలావశిష్టస్థితిలో ఉంది. ఆర్థికమైన మిట్టుపల్లాలతో నాటివ్యవస్థ కొట్టుమిట్టాడింది. నాటి భూస్వామ్యవ్యవస్థలో గానుగెద్దు జీవితాన్ని గడిపిన రైతు దారుణదారిద్ర్యంలో కృశించిపోయాడు. ఒక్కమాటలో చెప్పాలంటే నాటి ఫ్రెంచి సమాజం క్షయవ్యాధితో, పక్షవాతముతో బాధపడింది. కుళ్లిన కళేబరంలోని లుకలుకలాడే క్రిములు, ఎట్టి విషపూరిత ఫలితాలను యిస్తవో, ఆ విధంగానే తిరుగులేని వ్యాధితో తీసుకొంటున్న ఫ్రెంచి సామాజికవ్యవస్థ

సమస్యల పరిష్కారములకొఱకు మహోద్ధృత ఘోర రూపంలో విప్లవం రానూవచ్చింది. భయంకర రక్తపాతము జరగనూ జరిగింది. మానవ సభ్యతకే చేటును వాటిల్లజేసే జుగుప్సాకరమైన నియంతృత్వం చెలరేగింది.

విప్లవానికి పూర్వం—1712-1778 వరకు జీవించి విప్లవాగ్నికి సమిధనొక్కటి సమర్పించిన, రూసో

"Man is born free and equal
And free and equal he remains"

అనే మహోన్నత సందేశాన్ని యిచ్చాడు. 1762 లో "కాంట్రాక్ట్ సోషల్" ప్రచురణ జరిగింది. కొలది కాలంలోనే లక్షల ప్రతులు అమ్ముడుపోయాయి. రూసోకు తత్ఫలితంగా మాతృదేశములో పుట్టగతులు నశించాయి. ఒక్కుమ్మడిగా యూరప్ ఖండమంతా ఈయన్ని బహిష్కరించింది. అంత ప్రసిద్ధికెక్కిన గ్రంథం ద్వారా సోషల్ కాంట్రాక్ట్ సిద్ధాంతాన్ని భిన్నరూపంలో, రాజరిక నిరంకుశత్వఖండనకు మానవ స్వేచ్ఛా సమానత్వపరిరక్షణకు, తీవ్రతర ప్రజాస్వామ్యస్థాపనకు (Extreme form of democracy) ప్రతిపాదించాడు.

ఒకే సిద్ధాంతాన్ని, హాబ్స్ నిరంకుశ రాజరిక సంస్థాపనకు ప్రతిపాదిస్తే, లాక్ చట్టబద్ధ రాచరిక ప్రభుత్వాన్ని స్థాపించేందుకు ప్రచారముచేయగా, రూసో తీవ్రతరప్రజాస్వామ్యస్థాపనకు ప్రయత్నించడం జరిగింది.

థామస్ హాబ్స్ ఈ సిద్ధాంతాన్ని గూర్చి ఏమి చెప్పాడో, చూద్దాం. అధికారంకొఱకు మానవునికున్న నిరంతరదాహమే, వ్యామోహమే అతనిని కార్యాచరణకు ఉద్యుక్తుణ్ణి చేస్తుంది, అని అంటాడు హాబ్స్. కారణము—మానవుడు ప్రధానముగా స్వార్థపరుడు అహంకారి.

ప్రతివ్యక్తి తనయొక్క వాంఛలను, అధికార వ్యామోహాన్ని, రుచులను తృప్తిపరచుకొనేందుకు ప్రయత్నిస్తాడు. ఇట్టి ప్రయత్నములో అందరి వ్యక్తులకు సమానమైన శక్తి యున్నది. ఈ శక్తితో ప్రతి వ్యక్తి ప్రతి యితర వ్యక్తికి వ్యతిరేకముగా ఆత్మరక్షణకొఱకు అధికార సంపాదనకొఱకు సిద్ధపడతాడు. ఇదే హాబ్స్ యొక్క రాజకీయ సిద్ధాంతాలకూ మానవ మనస్తత్వవాదాన్ని గూర్చి, ఆయన దృక్పథానికి ప్రాతిపదిక. ఒక్కమాటలో చెప్పాలంటే మానవుడు స్వార్థపరుడు, అహంకారి. మానవ ప్రవర్తన కంతటికి ప్రాతిపదిక ఆత్మరక్షణ; ఆత్మరక్షణ అంటే వ్యక్తి తన ఉనికిని తాను భద్రపరచుకొనడం; ఉనికియొక్క భద్రత గూర్చి వ్యక్తికున్న వాంఛకి, అధికార సంపాదనకు, అవినాభావమైన సంబంధమున్నది.

ప్రకృతిదశ (State of Nature): మానవ మనస్తత్వాన్ని గూర్చి హాబ్స్‌కున్న దృక్పథమే ఆయన ప్రతిపాదించిన ప్రకృతి దశకు మూల బీజము. అయితే ప్రకృతిదశ అంటే ఏమిటి? ఆదిమ మానవుడు పశుప్రాయమైన జీవితాన్ని గడుపుతున్న దినాలలో తన భద్రతగూర్చి, అతనికున్న స్వార్థపూరిత మనస్తత్వమే ఈ ప్రకృతిదశకు మూలకారణమైంది. ఆ దశలో ప్రతివ్యక్తి ప్రతి యితర వ్యక్తితో సంఘర్షించేవాడు. ఒక నిరంతరమైన సంఘర్షణ నాడు జరిగింది. ఇట్టి పరిస్థితి నాగరికతకు భద్రతకు వ్యక్తి ఉనికికి, ఆస్తికి ప్రమాదంగా పరిణమించింది. నాటివ్యక్తి "ఒంటరియైన, దౌర్భాగ్యకరమైన" అసహ్యకరమైన పశుప్రాయమైన, అసభ్యమైన జీవితాన్ని గడిపేవాడు. అట్టిదశలో సదసద్వివేక శక్తిని, న్యాయాన్యాయ విచక్షణా జ్ఞానాన్ని కలిగివుండేవాడుకాదు. నాటి వ్యక్తుల ప్రవర్తనను సక్రమ మార్గాన నడిపించు వ్యక్తిగాని, వ్యక్తుల పరిషత్ గాని (an individual or an assembly of individuals) లేక పోవుటయే ఇట్టి ప్రకృతిదశకు కారణమని హాబ్స్ భావం.

ఇట్టి స్థితి తమ భద్రతకు అపాయకరంగా పరిణమించినది కాబట్టి నాటి వ్యక్తులు ధన, ప్రాణ రక్షణకు యోగ్యమైన ఒక సివిల్ సొసైటీని స్థాపించుట జరిగింది. దీనిని స్థాపించేముందు వ్యక్తులంతా కలిసి ఒక ఒడంబడికకు (Contract) వచ్చారు. ఈ ఒడంబడిక చేసికొన్న వ్యక్తులు తమకుహక్కుల నన్నిటినీ ఒకవ్యక్తికో లేక వ్యక్తుల పరిషత్ కో (government) ధారాదత్తం (surrender) చేశారు. తత్ఫలితంగా ఒక రాజ్యము, ఒక సివిల్ సొసైటి ఉద్భవిస్తవి. దీని నే, హాబ్స్ 'లా ఆఫ్ నేచర్' (Law of Nature) అని పిలిచాడు. మానవ స్వభావములో వాంఛ, వివేకము అనే రెండు గుణాలున్నాయి మానవునిలోని వాంఛ యితరుల ఆస్తిపాస్తులను న్యాయరహితముగా స్వార్థకాంక్షతో పొందమని చెబుతుంది.

# సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతము

వ్యక్తిలోని వివేకము తన కెంత కావాలో అంతే సక్రమమార్గములో పొందమని బోధిస్తుంది. 'స్టేట్ ఆఫ్ నేచర్'లోనుండి 'లా ఆఫ్ నేచర్'లోకి ప్రవేశించిన వ్యక్తి వివేకవంతుడుగా హాబ్స్ చేత చిత్రించబడ్డాడు. ప్రకృతిదశ నధిగమించి మానవులు తమ ప్రయోజనానికి ఒక సివిల్ సొసైటిని, ఒక స్టేట్‌ని (రాజ్యాన్ని) నిర్మించుకొన్నారు. వ్యక్తుల ఆస్తిపాస్తులు, ధనప్రాణరక్షణ, వ్యక్తులు చేసికొన్న ఒడంబడిక సక్రమమార్గాన రక్షింపబడవలెనన్న ఒక శక్తివంతమైన ప్రభుత్వము, ఆ ప్రభుత్వాధినేతగా ఒక వ్యక్తియో లేక వ్యక్తులపరిషత్తో ఉండడం అవసరం. వ్యక్తుల పరిషత్ గాక, ఒకే వ్యక్తి సార్వభౌమాధికారాన్ని కలిగియుండటం సమాజశ్రేయస్సుకు భద్రతకు ఉపయోగముగా ఉంటుంది. సమాజమంతా ఒకే వాంఛను, ఒకే అభీష్టాన్ని కలిగియుంటుంది. అది సార్వభౌమాధికారియొక్క అభీష్టం. సమాజానికి సంబంధించిన అధికారమంతా సార్వభౌమాధికారిలోనే కేంద్రీకరించబడి ఉంటుంది. ఈ సార్వభౌమ అధికారము (The authority of the Sovereign) అవిభాజ్యం; నాశరహితం; అపరిమితం; నిరంకుశం; సర్వసమగ్రం; న్యాయానికి చట్టానికి మూలము. (Source of law and justice and above law and justice). ఈ విధంగా స్థాపించబడిన సమాజంలో ఉండే వ్యక్తికి రాజ్యాధినేతకు వ్యతిరేకముగా తిరుగుబాటు చేసే హక్కు ఉండదు. వ్యక్తులు తమ స్వప్రయోజనముకొఱకు ఒక సివిల్ సొసైటీని స్థాపించిననాడే తమ హక్కుల నన్నిటిని సార్వభౌమాధికారికి ధారాదత్తం చేయడం జరిగింది. తత్ఫలితముగా వ్యక్తుల ప్రయోజనాలను రక్షించే ఒక సార్వభౌమాధికారి ఉనికిలోకి వచ్చాడు. అట్టి సార్వభౌమాధికారికి వ్యతిరేకముగా తిరుగుబాటు చేయడం అంటే తాము స్థాపించుకొన్న సమాజాన్ని, రాజ్యాన్ని విచ్ఛిన్నం చేసేందుకు ప్రయత్నము చేయడమే (The dissolution of the society and the state). సమాజ విచ్ఛిత్తి జరిగినప్పుడు ధనప్రాణరక్షణకు అవకాశముండదు. మరల అరాచకం వస్తుంది. ఈ పరిస్థితులు తిరిగి ఏర్పడకుండా ఉండవలెనంటే ఏ వ్యక్తీ సార్వభౌమాధికారికి వ్యతిరేకముగా తిరుగుబాటు చేయకూడదు, అనేది హాబ్స్‌యొక్క తర్కబద్ధమైన వాదన.

నిరంకుశరాజరికసంస్థాపనకు, ఫాసిస్టుప్రభుత్వ పోకడలకు, వ్యక్తిస్వాతంత్ర్య పరిహరణకు, నియంతల అవిర్భావానికి ఈ సిద్ధాంతంలో బీజాలున్నాయి.

1. మానవచరిత్రను శాస్త్రీయ దృక్పథంతో పరిశీలన చేసినట్లయితే ప్రకృతిదశ అనేది అసలు ఉనికిలో ఉన్నట్లు ఏవిధమైన సాక్ష్యములేదు. పశుప్రాయమైన జీవితాన్ని గడిపే మానవులు ఒక కాంట్రాక్టును ఎలా చేసికొన్నారో ఊహించడం కష్టము. అలా చేసికొన్నట్లు చరిత్రలో ఎట్టి ఆధారాలు కనబడవు కనుక హాబ్స్‌యొక్క (State of Nature) 'ప్రకృతిదశ' ఆయన బుఱ్ఱలోనుండి పుట్టిన ఒక పుక్కిటి పురాణం.

2. సమాజాన్ని నిర్మించేందుకు కాంట్రాక్టు చేసికొనేపూర్వం వ్యక్తి స్వార్థపరుడుగా, అహంకారిగా, పశుప్రాయుడుగా హాబ్స్ చేత చిత్రించబడ్డాడు. అదేవ్యక్తి కాంట్రాక్టు అనంతరం, (సమాజస్థాపన జరిగిన తరువాత) స్వార్థాన్ని వదలి సామాజిక వ్యక్తిగా సహకారముతో జీవించినట్లు చిత్రించబడ్డాడు. సమాజ స్థాపన పిదప వ్యక్తికి ఆపాదించబడిన సహకార స్వభావం వ్యక్తిలో సహజంగానే ఉండియున్నట్లయితే ప్రకృతిదశలో అంత పశుప్రాయమైన జీవితాన్ని గడిపివుండేవాడు కాదు. ప్రకృతిదశలో స్వార్థము, అహంకారం, అధికార వ్యామోహాలతో జీవించిన వ్యక్తి సమాజస్థాపన పిదప పరస్పర ప్రయోజనాలకొఱకు జీవించు మానవుడుగా ప్రవర్తించడం అసంభవం, అసాధ్యం, ఊహాతీతం. కాంట్రాక్ట్ అనంతరము సాధుసత్తముడుగా ప్రవర్తించిన వ్యక్తి కంట్రాక్ట్‌కు పూర్వము స్వార్థముతో మూర్తీభవించిన అధమాధముడుగా ఏవిధముగా ప్రవర్తించాడో, ఊహాతీతము. తర్కశాస్త్ర విరుద్ధం. ఒక దశలోని అధమాధముడు, పశుప్రాయుడు అనంతరదశలో సాధుసత్తముడు ఏలాగు అయ్యాడో, ఊహించలేము, హాబ్స్‌యొక్క సిద్ధాంతములో ఇదే తీవ్రమయిన దోషము.

3. సమాజానికి, రాజ్యానికి మధ్య ఏవిధమయిన వ్యత్యాసాన్ని హాబ్స్ గుర్తించలేదు. అదేవిధముగా రాజ్యానికి ప్రభుత్వానికి వ్యత్యాసము గుర్తించలేకపోయినాడు. సమాజమంటే పరస్పర సహకారముతో జీవించేటటువంటి వ్యక్తుల కూడలి. కొంత జనాభా

భూభాగము ప్రభుత్వము, సార్వభౌమాధికారము— ఈ నాలుగు లక్షణాలు గలదే రాజ్యము (State). కాబట్టి రాజ్యానికి, సమాజానికి కచ్చితమైన వ్యత్యాస మున్నది. ఈ వ్యత్యాసాన్ని ఫాసిస్టు నియంత గుర్తించదు. కాబట్టి హాబ్స్ సిద్ధాంతములో ఫాసిస్టు బీజాలు గర్భీకృతమై ఉన్నవి. అదేవిధముగా రాజ్యానికి, ప్రభుత్వానికి కచ్చితమైన వ్యత్యాస మున్నది. ప్రభుత్వం రాజ్యంయొక్క కార్య నిర్వాహకవర్గం మాత్రమే. రాచరికప్రభుత్వంపోయి ప్రజాస్వామిక ప్రభుత్వం రావచ్చును. కాని రాజ్యము మాత్రం విచ్ఛిన్నము గాదు. వ్యక్తి తిరుగుబాటు చేసినట్లయితే ప్రభుత్వముతో బాటు సమాజం, రాజ్యం రెండుకూడా విచ్ఛిన్నమైపోవుననే హాబ్స్ వాదన ఇంగితజ్ఞాన వ్యతిరేకము.

4 హాబ్స్ ప్రకారం సమాజ మంతటికి ఒకే గొంతు, ఒకే అభీష్టం ఉంటుంది. రాజ్యాధినేతయైన సార్వభౌమాధికారి అభీష్టమే సమాజంయొక్క అభీష్టం. సమాజానికి సంబంధించిన అధికార మంతా సార్వభౌమాధికారిలో కేంద్రీకృతమై ఉంటుంది. ఈ విధమైన దృక్పథము ఫాసిస్టు నియంతల ఆవిర్భావానికి దోహదం చేస్తుంది. సార్వభౌమాధికారి అభీష్టము మినహా సమాజములోని వ్యక్తులకు మరోవిధమైన అభీష్టాలు ఉండుటకు వీలులేదు, అనే నియంతృత్వ సిద్ధాంతానికి ఈ దృక్పథము రాచబాట. స్థూలంగా థామస్‌హాబ్స్ యొక్క సిద్ధాంతం దానిలోని దోషాలు యివే.

జాన్‌లాక్ (1632-1704) 1688 లో జరిగిన రక్తరహిత విప్లవానికి పూర్వం రెండవ జేమ్స్ ఆంగ్ల దేశమును పరిపాలిస్తూ ఉండేవాడు. రాజరికము దైవదత్తము (Devine right of kings) అనే సిద్ధాంతాన్ని తు చ తప్పకుండా అమలులోపెట్టి అతి నిరంకుశంగా పరిపాలించినటువంటి మూర్ఖుడు. ఈతని పరిపాలన సహించని ఆంగ్లప్రజలు 1688 లో తరిమివేసి ఒక రక్తపు బొట్టుకూడ చిందకుండా శాంతియుతంగా దేశమునుంచి బహిష్కరించారు. దీని నే రక్తరహిత విప్లవం (Bloodless Revolution) అని చరిత్రకారులు పిలిచారు. ఇది వాస్తవంగా విప్లవమా, కాదా అనే సమస్య ప్రస్తుతము మన కనవసరం. రెండవ జేమ్స్ పిదప ఆంగ్లసింహాసనాన్ని అధిష్ఠించిన రాజు చట్టబద్ధ రాచరికముగా కొనసాగించేందుకు అంగీకరించాడు. కాబట్టి జాన్‌లాక్ యొక్క సోషల్ కాంట్రాక్ట్ సిద్ధాంతం 1688 లో జరిగిన రక్తరహిత విప్లవాన్ని సమర్థించేందుకు చట్టబద్ధ ప్రభుత్వాన్ని ప్రతిపాదించేందుకు ప్రచారం చేయబడ్డది.

లాక్ కూడ హాబ్స్ నమ్మినట్లు ప్రకృతిదశ (State of nature) అంటూ ఒకటి వున్నదని అభిప్రాయపడ్డాడు. ఈ దశలో వ్యక్తికి వ్యక్తికి మధ్య పరస్పరవైరుధ్యాలు ఘర్షణలు లేవు. నాడు జీవించిన వ్యక్తులు శాంతికాముకులై హేతుబద్ధమైన జీవితాన్ని గడిపేవారు. వారి యిష్టం వచ్చినట్లు ఆస్తిపాస్తులను మార్పుచేసికొనేందుకు ఎవ్వరి యభీష్టానుసారము వారు ప్రవర్తించేందుకు సంపూర్ణ స్వేచ్ఛను అనుభవించేవారు. విశ్వాన్ని సృష్టించిన భగవంతుడు మానవుణ్ణి కూడ సృష్టించాడు. అంతేగాక ప్రకృతి శాసనాన్ని (Law of nature) స్థాపించి, మానవులంతా ఈ శాసనాన్ని అంగీకరించేటట్లు దేవుడు చేసాడు. ప్రతివ్యక్తిలో అణుమాత్రమైన దైవస్వభావముంది. ఈ స్వభావప్రేరణవల్ల, ప్రకృతిశాసనాన్ని, ఉత్తమప్రవర్తనకు సంబంధించిన సూత్రాలను,కనుగొనగలుగుతున్నాడు. హేతుబద్ధంగా వర్తించడం మానవ స్వభావంలో యిమిడి వున్న ఒక విశిష్టలక్షణం. ఐతే, ప్రకృతిదశలో యిట్టి ఉత్తమప్రవర్తన కలిగివున్న వ్యక్తి సమాజనిర్మాణాని కెందుకు ఉద్యమించాడు, అన్న ప్రశ్న వెంటనే ఉదయిస్తుంది దీనికి లాక్ సమాధానం—సదుపాయము (Convenience) కొఱకే సమాజనిర్మాణం జరిగింది; రాజ్యం ఉనికిలోకి వచ్చింది. ప్రకృతి శాసనానికి (Law of nature)కి అధికార యుక్తమైన వ్యాఖ్యానం యివ్వడానికే, మానవప్రవర్తనను సక్రమమార్గాన నడిపించేందుకే, వ్యక్తులు, కాంట్రాక్ట్ చేసికొన్నారు.

ఇట్టి ఒడంబడిక చేసికొన్న వ్యక్తులు, తమ సహజమైన హక్కులతో సమాజంలో ప్రవేశిస్తారు· తమ మీద తాము తీర్పు చెప్పుకొనే హక్కునూ, న్యాయాన్ని నిర్వహించే హక్కునూ మాత్రమే వారు సమాజపరం చేస్తారు. హేతుబద్ధమగు శాసనాన్ని (Law of Reason) అమలుపరచేందుకు, వ్యక్తులు, తమలోతాము, ఒక ఒడంబడిక చేసికొన్నారు. తత్ఫలితంగా, సివిల్ సమాజనిర్మాణము, రాజ్యము

# సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతము

ఉనికిలోకి రావటమూ జరిగింది. ఇది మొదటి ఒడంబడిక. దీనిపిదప, వ్యక్తులతో కూడిన సమాజానికీ, ప్రభుత్వానికీ మధ్య రెండవ ఒడంబడిక జరుగుతుంది. హాబ్స్ సిద్ధాంతం ప్రకారం, ఒకే ఒడంబడిక జరుగుతుంది. ప్రభుత్వానికి, ప్రజలకు మధ్య ఏ విధమగు ఒడంబడిక జరుగదు.

కాని, లాక్ సిద్ధాంతంలో రెండవ ఒడంబడిక జరుగుతుంది. అదే ఆయన సిద్ధాంత మంతటిలోనూ విశిష్టత. ఈ రెండవ ఒడంబడికయే, ఆయన ప్రతిపాదించిన సిద్ధాంతానికేగాక, రాజకీయ శాస్త్రానికే తలమానికంగా పరిగణింపబడుతోంది. ప్రభుత్వం ప్రజల జీవితభద్రతను, స్వాతంత్ర్యాన్ని, ఆస్తిపాస్తులను ఎంత వరకు కాపాడుతుందో, అంతవరకే ప్రజలు ప్రభుత్వాధికారాన్ని అంగీకరించి, దాని శాసనాలను శిరసావహించవలసిన అగత్యంఉంది. ప్రజాభీష్టంమీద నే ప్రభుత్వపు టునికి ఆధారపడుతుంది. ఏనాడు ప్రభుత్వం ప్రజలజీవితాన్ని నరకప్రాయం చేస్తుందో ఆనాడే దానిమీద తిరగబడి, దాన్ని మార్చి, మరో ఉత్తమప్రభుత్వాన్ని స్థాపించేందుకు, ప్రజలకున్న హక్కు నాశరహితమైనది. ఈ హక్కునుమాత్రం ప్రజలు ప్రభుత్వానికి ఒప్పజెప్పరు; ధారాదత్తం చెయ్యరు. కాని హాబ్స్ ప్రకారం, ప్రజలకు తిరుగబడే హక్కే లేదు.

లాక్ ప్రకారం, సమాజమే సార్వభౌమాధికారాన్ని తన చేతిలో ఉంచుకొంటుంది. ఐతే, ఈ అధికారం సమాజం చేతిలో నివురు గప్పిన నిప్పులా ఉంటుంది (latent). ప్రజల ధన, ప్రాణ, ఆస్తి, స్వాతంత్ర్యరక్షణార్థము, ధర్మకర్తగా నియోగింపబడిన ప్రభుత్వం తనవిధులనునిర్వర్తించనపుడు గర్భీకృతంగా వున్న ఈ అధికారం ఉనికిలోకి వస్తుంది. సమాజ విచ్ఛిత్తి జరుగకుండగనే, ప్రభుత్వవిచ్ఛిత్తి జరుగుతుంది, అని లాక్ సిద్ధాంతీకరించాడు. ఆయన సమాజానికి, ప్రభుత్వానికి మధ్య కచ్చితమైన వ్యత్యాసముందని గుర్తించాడు. సార్వభౌమాధికారాన్ని సమాజపరం చేసాడు. ప్రజాప్రాతినిధ్యంతో కూడిన శాసనసభను, (Legislature) ప్రతిపాదించాడు. "ప్రజాభీష్టమనే సిద్ధాంతానికి (The theory of consent) శాశ్వతమగుస్థానాన్ని, ఆంగ్ల రాజకీయచరిత్రలో, సమకూర్చాడు." (లాస్కీ) ప్రభుత్వాధికారి (రాజు) శాసనాధికారంకంటె మిన్నగాదు. చట్టబద్ధమగు రాజరికాన్ని, పార్లమెంటరీ ప్రాతినిధ్యంతోకూడిన ప్రజాస్వామ్యాన్ని శాసనజౌన్నత్యాన్ని, ప్రతిపాదించిన ప్రథమ గౌరవం లాక్ కి దక్కింది.

జాన్ లాక్ పిదప, ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించినవాడు జాన్ జాక్విస్ రూసో; ఈయనకూడ మానవుడు ఆదిలో ప్రకృతి దశలో జీవించాడని అంటాడు. మానవుడు సహజముగా వుత్తముడు; దయాస్వభావుడు; జన్మతః, వ్యక్తి స్వేచ్ఛా సమానత్వాలతో పుట్టాడు. కాని, సమాజంలోని సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులు ఆతని స్వేచ్ఛా సమానత్వాలను అరికట్టు సంకెళ్లుగా తయారయ్యాయి. ఆదిమమానవుడు ప్రకృతి దశలో ఆదర్శప్రాయమైన ఆనందాన్ని (Idyllic Happiness) అనుభవించాడు. నాటి మానవులు స్వేచ్ఛను, సమానత్వాన్ని సమపాళ్ళలో అనుభవించారు. క్రమక్రమంగా సమాజంలో సొంత ఆస్తి తలెత్తడంతో, వ్యక్తి సహజస్వేచ్ఛను కోల్పోయాడు.

కాబట్టి ప్రతివ్యక్తియొక్క ఆస్తి పాస్తులను, కాపాడే సంస్థను వ్యక్తి స్థాపించవలసిన అవసర మేర్పడింది. ఈ సంస్థ స్థాపనమువల్ల, ఇరుగు పొరుగు వారితో ఒక వైపునుండి ఐక్య మొందుతూనే, మరోవైపునుండి, ప్రకృతిదశలో అనుభవించిన ఆనందాన్ని పొందవచ్చును. ఇట్టి సంస్థను ఉనికిలోకి తెచ్చేందుకు వ్యక్తులు ఒక ఒడంబడిక, చేసికొన్నారు. తత్ఫలితమే ఒక సివిల్ సొసైటి నిర్మాణము. ఈ ఒడంబడిక, చేసికొనేటప్పుడు ప్రతివ్యక్తి తన హక్కుల నన్నిటినీ సమాజానికి స్వాధీన పరుస్తాడు. తత్ఫలితంగా సమాజమే సార్వభౌమాధికారాన్ని కలిగిన సంస్థగా రూపొందుతుంది. వ్యక్తులయొక్క ప్రయోజనాల దృష్ట్యా సంఘముయొక్క అధికారాన్ని పరిమితం చేయనవసరంలేదు. వ్యక్తుల ప్రయోజనాల రక్షణార్థం ఏర్పరుచబడిన ఈ సంస్థ వారి ప్రయోజనాలకు భిన్నంగా వ్యవహరించదు. సమాజంయొక్క సామూహిక అభీష్టంతో, (General Will) వ్యక్తియొక్క అభీష్టం (Individual will) సంఘర్షించవచ్చు. సామూహిక అభీష్టంలో ఏ వ్యక్తిఐనా

అంగీకరించని పరిస్థితులలో, బలప్రయోగం ద్వారానైనా సామూహిక అభీష్టాన్ని అతను అంగీకరించేటట్లు చేయాలి. అంటే—ఆ వ్యక్తి రాజ్యంయొక్క బలప్రయోగం ద్వారా స్వతంత్రుడుగా చేయబడుతాడు! ( He shall be forced to be free!) శాసనం ప్రజలందరు సమావేశమైన పరిషత్తులో నే చేయబడుతుంది. సమాజానికి సంక్రమించిన సార్వభౌమాధికారం నాశరహితం; అవిభాజ్యం; ప్రాతినిధ్యరహితం. (Sovereign power is inalienable, indivisible and can never be represented or delegated) ఒక శాసనాన్ని చేయవలసి వచ్చినపుడు సమాజంలోని ప్రతివ్యక్తి సమావేశమవవలసినదే. ఇట్టి తీవ్రతర ప్రజాస్వామ్యాన్ని (Extreme form of Democracy) ప్రచారం చేసిన విచిత్రవ్యక్తి రూసో. సార్వభౌమాధికారి శాసనాన్ని నిర్మిస్తాడు. ప్రభుత్వం శాసనాన్ని అమలుపరుస్తుంది. ప్రభుత్వం కాంట్రాక్టు ద్వారా స్థాపింపబడలేదు. కాబట్టి ప్రభుత్వం ఒడంబడికలో భాగస్వామి కాదు. రూసో ప్రకారం ఆదిమ మానవులు ఒకే ఒడంబడికను చేసికొన్నారు.

ప్రకృతిదశలో జీవించిన ఆదిమ మానవులు చేసికొన్న ఒడంబడికయొక్క ఫలితమే రాజ్యం; ఒకే ఒడంబడిక జరిగింది, దానిలో ప్రభుత్వం భాగస్వామి కాదు; వ్యక్తులు తమ హక్కు లన్నిటిని సంపూర్ణంగా, సార్వభౌమాధికారికి, ధారాదత్తం చేసారు; సార్వభౌమాధికారం నిరంకుశం—అనే హాబ్సు సిద్ధాంతంలోని ఈ లక్షణాలు, రూసో సిద్ధాంతంలో కన్పిస్తవి. కాని, ప్రభుత్వం నిరంకుశంగా వర్తించవచ్చు అనే హాబ్సు అభిప్రాయంతో రూసో అంగీకరించలేదు. రూసో ప్రకారం, వ్యక్తి తన హక్కులను, ప్రభుత్వాధికారికిగాక, సమాజానికి ధారాదత్తం చేస్తాడు. ఆ రీత్యా, రూసో ప్రభుత్వానికి, రాజ్యానికి మధ్య వ్యత్యాసాన్ని గుర్తించాడు. సార్వభౌమాధికారంలో భాగస్వామిఐన వ్యక్తి, తనకు కావలసిన శాసనాలను, రాజ్యాంగాన్ని రూపొందించుకునే హక్కును, తానే కలిగివుంటాడనే సిద్ధాంతాన్ని రూసో ప్రతిపాదించాడు. అధికతర ప్రజాస్వామ్య స్థాపనకు ఈయన సిద్ధాంతం, సమగ్రప్రాతిపదికను వేసింది. ఈ భావాలన్నీ, 1789 లో ఫ్రెంచి విప్లవసమయంలో ప్రకటింపబడిన, మానవ హక్కుల ప్రకటనలో (1789—The Declaration of the Rights of man) పొందుపరచబడ్డాయి. ప్రజాభీష్టమే రాజ్యంయొక్క ఉనికికి ప్రాతిపదిక అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

రూసో సిద్ధాంతంలో (The theory of General will) సామూహిక అభీష్టమనేది, అర్థంగాని క్లిష్టవిషయం. ప్రజలంతా ఏవిధమైన స్వార్థప్రయోజనాలు లేకుండా, సమావేశమైన పరిషత్తులో శాసనం చేయబడటం ఎట్లుసాధ్యమో ఊహాతీతం.

సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతాన్ని ప్రాచీన రాజకీయ సిద్ధాంతాలకు సంబంధించిన మ్యూజియంలో భద్రపరచవలసిన అవసరం నేడు ఏర్పడినా, ఆ సిద్ధాంతం కొన్ని పరమసత్యాలను ప్రతిపాదిస్తోంది. ఏ వ్యక్తిగాని, ప్రజాభీష్టానికి వ్యతిరేకంగా నిరంకుశాధికారాన్ని చలాయించలేడు; అలా చలాయించినపుడు ఆ ప్రభుత్వం మూలమట్టం కాక మానదు; దాన్ని నాశనంచేసి మరో ప్రభుత్వాన్ని స్థాపించుకొనేందుకు ప్రజలకు అధికారముంది; మానవుడు స్వేచ్ఛను, స్వాతంత్ర్యాన్ని కోరుతాడు. ఈ సత్యాలను ప్రతిపాదిస్తోంది కాబట్టి, ఈ సిద్ధాంతానికి నేడు కూడా కొంత విలువ వుంది.

## పరిచయం:

# బాలగంగాధర తిలక్

శ్యామకృష్ణ

పులిచంపిన లేడి నెత్తురు పులుముకోలేను
ఖడ్గమృగోదగ్ర విరావం ఆలకించలేను
జగద్ధాత్రి! నీకుమారులమైన మేము
తత్వాల పేర, విప్లవాల పేర
ఒకరి నొకరం హతమార్చుకోలేము.

శాంతికోసం యుద్ధాన్ని ప్రజ్వలింప జేస్తారు
సుఖంకోసం ఆరక్త విప్లవాన్ని తరింప జేస్తారు.
శ్మశాన భూమిని వికసిస్తుంది మీరు నాటినపూలచెట్టు
కాని ఎవరు తుడుస్తారు తల్లీ! నీ కన్నీటి బొట్టు
(కవి వాక్కు)

సుమారు ఒకదశాబ్దం అజ్ఞాతంగా ఉండి, క్రితం, ఎన్నికల సంరంభంలో 'ఆంధ్ర పత్రిక' లో జరిగిన వాదోపవాదాల సందర్భంలో శ్రీ బాలగంగాధర తిలక్ 'కవి వాక్కు' తిరిగి వినబడింది. పార్టీ కక్షలు, సిద్ధాంతాల కృత్రిమ ప్రభావం, యుద్ధావేశాల మధ్య తన స్థానాన్నీ, తన లక్ష్యాన్నీ, మరచిపోతున్న రచయితా ప్రపంచాన్ని హెచ్చరించి వెలుగు దారి చూపించింది 'కవి వాక్కు'. కవి స్వతంత్రుడు ఆ రోజున రాజులకమ్ముడు పోయినా, ఈరోజున పార్టీలకి ఊడిగం చేసినా కవి అస్వతంత్రుడైపోతాడు.'వంచలేను నా యీ శిరస్సు ఏ అధికారం ముందు, ఒప్పలేను మానసిక దాస్యాన్ని ఏ ప్రభుతయందు' అని ముక్తకంఠంతో పలికినాడు. కాని స్వాతంత్ర్యం అంటే స్వైరవిహారం కాదు. పులి చంపిన అమాయకపు లేడి నెత్తురు కవనానికి కావాలనడం కాదు. కవి స్వాతంత్ర్యానికి ఒక నియతి, ఒక గమ్యం ఉన్నాయి. మానవుడైన రచయితకి తోటి మానవుల యెడ ఉండవలసిన సానుభూతి, విశాల దృక్పథం లోపించితే రచయిత రాక్షసుడౌతాడు. అందుకే—

"...................................
వివేకంలేని ఆవేశం విపత్కరమౌతుంది
సంయమం లేని సౌఖ్యం విషాదకారణ మౌతుంది
సమ్యక్ సమ్మేళనములేని తౌర్యత్రికం
కఠోరమౌతుంది
కరుణలేని కవివాక్కు సంకుచితమౌతుంది!"

అని హెచ్చరిక చేశాడు.

1938 వ సంవత్సరములో శ్రీ తిలక్ తొలి రచనలు—బాల్యరచనలు— 'ప్రభాతము—సంధ్య' అనే పేరుతో—పుస్తకరూపంలో వెలువడ్డాయి. ఆ పుస్తకానికి శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు గారు పరిచయం వ్రాస్తూ "ఇంత చిన్నతనంలో నే యిన్ని కళలూ, యింత ప్రతిభా, ఎక్కడనుంచి వచ్చినవా" అని ఆశ్చర్యం చూపించారు. నాటినుంచీ శ్రీ బాలగంగాధర తిలక్ కవితాశక్తి పక్వమై, ప్రతిభావంతమై ఆధునిక సాహిత్యరంగానికి అలంకార సదృశమైంది. శ్రీ తిలక్ ఆంధ్రాంగ్ల సాహిత్యాలు తరచి చూచినవాడు. కొత్తగా వచ్చిన 'ఇజమ్'లనీ, నూతన సారస్వత విధానాల్నీ బాగా ఆకళింపు చేసుకొన్నవాడైనా, ఆ పద్ధతుల్ని మక్కికి మక్కిగా దిగుమతి చేయడమనేది శ్రీ తిలక్ ఒప్పుకోడు. అతని నిశితమైన, హృద్యమైన అభిరుచి అతనిని ప్రక్కదారులు తొక్కనీయలేదు. సారస్వతం పేరున ఈ రోజున సాంకేతిక పరిభాషా సంకీర్ణమైన, అగమ్యగోచరమైన, రచనా పద్ధతి ఈ కవి రచనలలో కనుపించదు. ముఖ్యంగా ఆధునికమైన శ్రీ తిలక్ రచనలలో ప్రసాదగుణం, ఉదాత్తత ఎక్కడా లోపించవు. ఎక్కడైనా సాంకేతికమైన చిత్రణవున్నా అది కేంద్రమైన ఆ అనుభూతికి దోహదం యిచ్చేదిగానే వుంటుంది.

శ్రీ తిలక్ ఇట్లు భాషమీదా, అటు భావం మీదా చక్కని అధికారం కలవాడు. అతని వృత్తాలు మృదుమధుర భావనాయుతములై పక్వమైన శైలికలిగి సహృదయుల మెప్పుపొందాయి 'గోరువంకలు' అనే యీ కవి రచించిన వృత్తసంచయం రమ్యమైన భావనకీ, సౌందర్యస్ఫూర్తికీ ఆటపట్టు.

అభ్యుదయకవులు ఈ కవిని తమవాడనినా, నవ్యసాహితీపరులు శ్రీ తిలక్ తమవాడేనని అన్నా నిజానికి యితని కవిత్వము ఏ ఒక్క పరిధికీ లొంగనిది. నిజానికి అభ్యుదయరచన, అభ్యుదయ నిరోధకరచన అన్న వ్యత్యాసం చాల సంకుచితమైనది. సన్నిహిత కాలసమాజ పరిస్థితుల దృష్ట్యా ఏదో కొంతవరకు యీ భేదాన్ని సమర్థించడం జరిగినా, అనంతమైన కాలమూ, చరిత్రల దృష్ట్యా వీటికి అర్థం లేకపోవచ్చును. చివరకు ఒకానొక రచన ఏ సిద్ధాంతం ప్రతి

పాదించిందీ అన్నది ముఖ్యంకాదు. 'ఏవిధంగా చెప్పాడు? ఏ వ్యక్తిత్వ వైఖరి చూపించాడు? ఏ అనుభూతి కలిగించాడు?' అన్నదే సాహిత్యానికి విలువనిచ్చేదీ, లేనిదీ అవుతుంది. అందువలన ఒకరచన విశిష్ట రసానుభూతిని కలిగించినంతవరకూ అది 'అభ్యుదయ' లేక 'అనభ్యుదయ' రచనయా అన్న ప్రశ్న ఉదయించదు. 'నా కవిత్వం' అన్న యితని గేయాన్ని తిలకించండి.

"నాకవిత్వం కాదొకతత్వం
మరికాదు మీరనే మనస్తత్వం
కాదు స్వేకవాదం, సామ్యవాదం
కాదయ్యా అయోమయం, జరామయం.
..........................
నా అక్షరాలు
కన్నీటి జడులలో తడిసే దయాపావతాలు
నా అక్షరాలు
ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలు
నా అక్షరాలు
వెన్నెలలో ఆడుకొనే అందమైన పిల్లలు"

ఎక్కడ అందముంటుందో, ఎక్కడ మానవత్వం, కరుణ ఉన్నాయో అక్కడ ఈ కవి లేఖిని తాండవం చేస్తుంది. అభ్యుదయవాదుల విప్లవగీతాలలోని 'చంపండి, పొడవండి, నెత్తురుతాగండి' అన్న క్రౌర్య ప్రవృత్తి ఇతని ఉద్దేశ్యంలో పూర్తిగా వర్జనీయము శ్రీ తిలక్ పాతగిలిన సంప్రదాయాలనీ. విశ్వాసాల్నీ, పద్ధతుల్నీ ఎదిరించినవాడే! ఒక విధంగా అతను విప్లవభావుకుడే కాని అందువలన శాశ్వతమైన విలువల్ని తారుమారు చేయాలనే దుస్సంకల్పం శ్రీ తిలక్‌కు లేదు. 'క్రొత్త' అన్నది ప్రతీదీ అతనికి పరిగ్రాహ్యం కాదు. అతని విశాలమానవతా కరుణాహేతువాదానికి నిలబడని ఏ విశ్వాసాన్నీ, సిద్ధాంతాన్నీ అతను నమ్మడు. కాని కరుణ, సౌందర్యోపాసన ఇతని కవితావేశానికి వెనుకనున్న శక్తులు. శ్రీ తిలక్ రచించిన 'మేగ్నా కార్టా' నిజంగా ఆధునికులకు 'హక్కుల పత్రం' వంటిదే నని నా అభిప్రాయం.

'మేం మనుష్యులం
మేం మహాత్ములం
గుండెలోపలి గుండె కదలించి
తీగలోపల తీగ సవరించి
పాట పాటకు లేచు కెరటంలాగ
మాట మాటకు మ్రోగుకిన్నెరలాగ
మేం ఆడుతాం!
మేం పాడుతాం!"
మేం ఉపాసకులం
మేం పిపాసువులం
భూమి అంచుల వెలుగు తెరకట్టి
తారకలగతి క్రొక్క ప్రసుతి పెట్టి
పాటపాటకు వెండిదారంలాగ
మాటమాటకు మంచు దూరంలాగ.
మేం సాగుతాం!
మేం రేగుతాం!
మేం నవీనులం
మేం భావుకులం.
పాతలోకం గుండెలో శతఘ్ని పగిలించి
భావికాలం చంద్రకాంతపు శిలకరగించి
పాటపాటకు సోకు స్వర్గంలాగ
మాటమాటకు దూకు సింహంలాగ.
మేం నిలుస్తాం!
మేం పిలుస్తాం!
మేం మనుష్యులం
మేం మహాత్ములం
మాకు దాస్యం లేదు
మాకు శాస్త్రం లేదు
మాకు లోకం ఒక గీటురాయి
మాకు కరుణ చిగురుతురాయి.
మేం పరపీడన సహించం
మేం దివ్యత్వం నటించం.
గాలి గుర్రపుజూలు విదిలించి
పూలవర్షం భువిని కురిపించి
పాటపాటకు పొంగు మున్నీరులా
మాటమాటకు జారు కన్నీరులా.
.........." [భారతి, అక్టోబరు 1945]

ఈ కవి ఆడుతాడు, పాడుతాడు.

భావకవులు ఎక్కువగా స్వీయబాధా గాథల్నీ, ఊహాసుందరమైన ప్రేయసుల్నీ కవితావస్తువులుగా గ్రహించారు. అలాగే నేటి రచయితల రచనలలో సామాజిక రాజకీయ దృక్పథం మాత్రమే కనపడుతుంది. శ్రీ తిలక్ కవితా లేఖిని సమగ్రమైన వైవిధ్యం కలిగినది. యుద్ధం, సైనికుడి మనస్తత్వం, మురికివాడ, పేదరికం, క్షామం, బుభుక్షవర్తన, వియోగం, విరహం— ఇతని కవితావస్తు సామగ్రిలో చేరుతాయి. జిజ్ఞాసాపూర్వకమైన ఇతని 'సుందరకింశుకవృక్ష' ఒక కోవకు చెందినది.

శ్రీ తిలక్ చిత్రణాలు సరిక్రొత్తగా కవిలో ఉండే అనుభూతిని పాఠకునికి అందజేస్తాయి. ఒక్కొక్క కవి తన అనుభూతి విశిష్టతను తనయొక్క చిత్రీకరణ ద్వారానే సూచించాలి అందుకనే చెప్పేవిధానంలోనూ, చిత్రీకరణలోనూ ఒక ప్రత్యేక వ్యక్తిత్వమూ, ఒక క్రొత్తదనమూ ముఖ్యంగా ఉండాలి. ఉదాహ

ఇంకా ఈ కవి రచించిన 'ముసలివాడు' అనే వచన పద్యంలో—

"కనుబొమలు నల్లనయి
పెనుమోములు చల్లనయి
కీలుకీలున బాధగా
నాడునాడులు లాగగా
చలిగాలి దారులో కసరినటు
చలిచీమ మట్టిలో దొలిచినటు
వచ్చినది, మూగినది, ముసిరినది, ముసలితనము..."

అని 'ముసలితనా'న్ని అతిసహజంగా, క్రొత్తగా చిత్రించాడు.

ఇతని 'వేసవి' చక్కని రచన. వేసవికాలపు అలసత్వాన్నీ, ఉష్ణతనీ, నూతన శైలిప్రతితో రచించినాడు.

"కాలం కదలదు—గుహలో
పులి పంజావిప్పదు—చేపను
గాలంతిగలదు—
చెట్లనీడ ఆవులు మోరగలు
దింపవు—పిల్లిపిల్ల బల్లిని
చంపదు.

కొండమీద తారలు మాడెను
బండమీద కాకులు చచ్చెను...
కాలం కదలదు...
ఎండుటాకులు సుడిగాలికి తిరిగెను
గిరుక—వడగొట్టిన భిక్షుకి అరచెను
వెర్రిగ—
పంకా క్రింద శ్రీమంతుడు
ప్రాణం విడిచెను—గుండెక్రింద నెత్తురు
నడిచెను—.........
..............."

'పంకా క్రింద శ్రీమంతుడు ప్రాణం విడిచెను' అన్నప్పుడు వ్యంగ్యపూర్వకమైన ధ్వని మనకు ద్యోతకమౌతుంది.

ఈ కవి ఒక 'పాడుపోయిన' శిథిలమైన, ఒక కుగ్రామన్ని చూసినపుడు 'ఈ గాలిలోన పూర్వుల శరీరస్పర్శాశైత్యాన్ని' అనుభవించుతూ యిలా అంటాడు—

"...............
కాలిపోయే యిల్లులా జీవితం జరుగుతుంది
ఒక నగటు ఏదో నన్నావరించుకుంది.
కాలం పాడునుయ్యిలా నాకన్నులకు కనపడింది"

ఆ పాడునూతిలో ఎన్ని శతాబ్దాలు, ఎన్ని చరిత్రలు, ఎన్ని కల్పనలు అణగారిపోయినవో!

వంగదేశంలో క్షామం వచ్చింది. రోజుకి కొన్ని వందలమంది వీధులమ్మటా, "పేవ్‌మెంట్ల" మీదా చచ్చిపోతున్నారు. ఒక ప్రక్క విదేశ ప్రభుత్వం తటస్థంగా ఏమీ జరగనట్టు ఊరుకుంది. మరొకప్రక్క షాహుకార్లు విపరీతంగా "బ్లాక్ మార్కెటు" చేస్తున్నారు "భూలోకం" అన్న గేయంలో యీ ధనికవర్గాన్నీ, దరిద్రుల బాధనీ, ఒక మూలజరిగే యుద్ధంవల్ల కలిగే వినాశనాన్నీ చిత్రిస్తాడు.

"అస్థిమూల పంజరాలు
ఆర్తరావ మందిరాలు
ఏలోకం తల్లీ—యిది
ఏవో బాష్పజలాలు"

అని కుమారుడు ప్రశ్నిస్తే తల్లి జవాబు చెబుతుంది.

"కాలు కడుపు యిమ్మన్నది
గాజు మేడ లేదన్నది
అన్నపూర్ణకంటె ముందు
కనపడినది రక్తబిందు

* * *

కూడులేని లోకం యిది
గుండెలోతు తాపం యిది
సోమయాజి శాపం యిది
పెద్దలున్న మిద్దెలున్న పాపం యిది
అడుగుతున్న అడుసుతిన్న లోకం యిది
ఇది "భూలోకం" అబ్బీ!—యిది
అస్థిమూల పంజరాలు
ఆర్తరావ మందిరాలు
పలుకలేని గులకరాళ్లు"

[ప్రతిభ; సంపుటి: 8; సంచిక : 1; 1945]

ఈ నాగరికత, ఈ యుద్ధోన్మాదం పీడితమైన యీ భూమిని ఎటువంటినరకంగా తయారుచేశాయో మనకి ఒక్కసారిగా తెలియవస్తుంది. ఈదారిద్ర్యానికి ఈ నోరులేని జీవాలకి ముక్తిలేదా? ఈ నాగరికత గమ్యం ఏది? కరుణామూర్తియైన కవిలేఖిని ఆక్రోశం ఆలకించండి. 1945 ఏప్రిల్ భారతిలో ప్రచురింపబడిన "ఆర్తగీతం" అనే గేయంలో కవియొక్క తపన మనకి గోచరిస్తుంది "నా దేశం ఔన్నత్యాన్ని గురించి చెప్పకు, "కల్చర్", అభ్యుదయం, నాగరికత మొదలైన పదాలు—వాటి అర్థాలు నాకువద్దు. నాకు కనపడుతున్నది మానవుడుగా నీతోటిమానవుడిపై జరిగే అత్యాచారమూ, నీయొక్క నిర్లిప్తత, నిన్ను కాదన్నట్టు నువ్వు నీ సుఖంలో కోర్కెలలో, నువ్వుండిపోవడం—ఇంకా మానవుణ్ని అనీ, సంస్కారి ననీ నిన్ను నువ్వు ఎలా అనుకోగలవు?" అని తనను తనే ప్రశ్నించుకుంటున్నాడు. మనల్ని ప్రశ్నిస్తున్నాడు.

"పైన దైవమునకు క్రింద మానవునకు జవాబు చెప్పవలసిన వాణ్ణి; రసాతల మంట శిరసు వంచిన వాణ్ణి; రాత్రీముఖ రుదితబాధా కంఠనాళాన్ని..."

"ఈ రోజున నేను చూచినది యేమి? విధి ఇన్ని కత్తులను దూసినది యేమి? జాగృతి హేతువాద రల రేఖిన దేమి?..."

కుంభి ధైర్యం అనే కత్తి కొసను ఎర్రనిరక్తం కనబడింది. 'ఇదంతా ఏమిటి?' అని బాధతో, సిగ్గుతో కుంచుకొని పోతాడు, విసుపోతాడు.

"నేను చూశాను నిజంగా మూర్తీభవత్ దైన్యాల్ని, హైన్యాల్ని; క్షుభితాప్రకల్లోల నీరధుల్ని; గచ్ఛల్ శివాకార వికారుల్ని"

'ఇది ఏ నాగరికతకు ఫలశ్రుతి?'

అని ప్రశ్నిస్తాడు. విమానాలు, ఆకాశాన్నంటే సౌధాలు (Sky.scrappers), సైన్సులో జరిగిన అభివృద్ధి, యివన్నీ ఉన్నా కూడా 'ఈ నాగరికతారణ్య వాసం భరించలేను' అని నిస్పృహ చెందుతాడు. 'ఏ భగవంతుడు వీళ్ళ దుస్థితిని గమనిస్తాడు?' అని వాపోతాడు.

ఘోరమైన యీ విషాద విషమ సమస్యని పాఠకుని మనోనేత్రానికి చూపుతాడు. సమస్యా పరిష్కారము అతను సూచించడు. అది అతని పనికాదు. సామాజిక రాజకీయ వేత్తలాలోచింప వలసిన విషయం అది. కవిత్వముయొక్క ముఖ్య ప్రయోజనమే వేరు. కవి బూజుపట్టి మొద్దుబారిన మన చైతన్యాన్ని దులిపి తిరిగి పదును పెడతాడు. మన అనుభూతుల్ని సువిశాలమూ, సునిశితమూ చేస్తాడు. కేవలం వచన రచనలో పద్యానికున్న శక్తిని తీసుకురావడంలో శ్రీ తిలక్ అందెవేసిన చేయి. అంతర్లీనంగా ఉన్న ఒక విచిత్రమైనగతి ఇతని వచన పద్యాల్ని నడిపిస్తున్నది. ఈ విధమైన రచనలు మన మనస్సులకి దగ్గరగా వచ్చి పలకరించినట్లు అనిపిస్తుంది. 'అర్తగీతం' ఒక ఉత్కృష్టమైన రచన.

సైనికుని మనస్తత్వం 'సైనికుని ఉత్తరం' అనే వచన పద్యంలో హృదయంగమంగా చిత్రించబడింది. యుద్ధం నేటి సమస్యలకి పరిష్కారం అయింది. కాని 'శాంతి' అనేది ఈ భూతలంమీద మృగ్యం అయిపోయింది. ప్రతివాడూ తన దేశానిదే న్యాయం అనీ, విజయం తనదేననీ నినాదమిస్తాడు. కాని ఏ యుద్ధంలోనూ ఏ ఒక పక్షందీ న్యాయంకాదు. చారిత్రక దృష్ట్యా యుద్ధంవల్ల సర్వవినాశనమే ఫలితంగా వస్తోంది. కాని యుద్ధంచేసే సైనికుని మనస్తత్వం విచిత్రమైనది; సానుభూతి చూపతగినది. 'ఎవర్ని చంపుతున్నాడు? ఎందుకు చంపుతున్నాడు?' ఇది అతనికి తెలియ వలసిన అవసరం లేదు. యాంత్రికముగా యుద్ధరంగంలోకి చొచ్చుకొనిపోయి ఒకర్ని చంపడమో, తాను చావడమో చేస్తాడు. అతను స్వీయోన్నతభావాల్ని, ఆత్మనీ నొక్కివేసి, ఆ వాతావరణాని కనుగుణమైన క్రూరత్వాన్ని వహిస్తాడు. అతని మానవత్వం ప్రతి నిముషమూ ఛిన్నాభిన్నం అయిపోతూ వుంటుంది. ఒకవిధమైన మానసిక హైన్యంలోకి దిగజారిపోతాడు.

"...............
అర్ధరాత్రిదాటిందని మ్రోగిన ఒంటిగంట
మంటలా మొహాన్ని కొట్టింది.

నేను, ఇదివరకటి నేనుకాను,
నాకువిలువలు లేవు, నాకనుభూతుల్లేవు
చంపడం, చావడం,
మీసంధ్యావందనంలాంటి అలవాటయింది!

కనిపించే యీయూనిఫారమ్ క్రింద
ఒక పెద్దనిరాశ, ఒకఅనాగరికత
బొడ్డీక్రిందనదిలాగ రహస్యంగాఉంది
వదలలేనిమోసపు ఊబిలాగఉందీ
నేనంటే నాకేఅసహ్యం
అందుకే మరీమరీచంపుతాను
మరీమరీతాగుతాను.."

కాని యీ యుద్ధం సమాప్తి అవగానే 'తిరిగి నా యింటికి వెడతాను' అన్న భావమే యింకా అతనిలో ఆశ రగులుస్తూ వుంటుంది.

"ఇంక తెల్లవారుతోంది
దూరంగా ఆల్ప్స్ మీదమంచు
దుఃఖంలా కరుగుతోంది
ప్రభాతంసముద్రంమీదవెండినౌకలా తేలుతోంది
తిరిగిఎప్పుడు మనవూరువస్తానో, నిన్నుచూస్తానో
అందమైన తెల్లనినవ్వు నీమెడలో
గొలుసుగొలుసులుగా కదలినప్పుడు
అద్భుతమైన చెమ్మగిలిననీచూపు
వెములిరెక్కలా విప్పుకొన్నప్పుడు
ఎన్నాళ్ళకి! ఎన్నాళ్ళకి!

ఈ విధంగా కరుణావ్యగ్రమైన వాతావరణాన్ని కవి కల్పిస్తాడు. లక్షలాది సైనికుల బాధ, ఆందోళన, దైన్యపరిస్థితి మనకు తట్టుతాయి. అయినా ఆ సైనికునికి తన యిల్లు, వాకిలి, పిల్లలమీదవుండే మమతయే అతని భయంకర జీవితానికి శాంతిని కలగజేస్తోంది. చివరికి—

"సెలవ్, అబ్బ! చలి.
చలిగాలిసూదులమీద కత్తిలా తెగింది
నీరూపం నా దేహానికి వెచ్చగాతగిలింది"

అంటూ ప్రేయసీ స్మృతితో వ్యక్తావ్యక్తమైన స్థితిలో లేఖను ముగిస్తాడు.

స్వాతంత్ర్యభావాలకీ, వివిధ కళాపరిణామాలకీ అంతర్జాతీయ కేంద్రమైన ఫ్రాన్సు దేశం పైన 'హిట్లరు' దాడి జరిపినపుడు యీ కవి హృదయం విలవిలలాడి పోయింది. ముఖ్యమైన 'టులాన్' రేవుపట్టణము జర్మనీ చేతులలో పడినపుడు శ్రీ తిలక్ రచించిన 'టులాన్' అన్న రచన ఈ కవియొక్క బాధాతీవ్రతను వ్యక్తం చేస్తున్నది.

"నిశ్శబ్దపు మెత్తని పరుపులపైన
నిగురించినది పట్టణమంతా
కొండ చివర ఎర్రని నక్షత్రం
రాలిపడింది సముద్రపునీలంలో,
చీకటి దుంపటిలో అస్పష్ట భవిష్యత్తు
రాజుకొంటున్నది రవ్వలు రవ్వలై,
చుక్కలు ముక్కలై;
నాలుగు కొట్టింది చర్చిగంట
నిగురించే 'టులాన్' పట్టణపు గుండెలో
పగిలింది జర్మను శతఘ్ని......"

చివరకు నౌకారక్షకులు శత్రుహస్తాల్లో పడకుండా తమ నౌకల్ని అంటించివేశారు.

"ఒక్కొక్కటి ఒక్కొక్కటి యుద్ధనౌకలు
ఒరిగి ఒరిగి సముద్ర నిస్తంద్ర జలతరంగ భుజంగ
పరీరంభమ్ములలో సురిగిపోయినవి
బలియిచ్చిన ప్రాణదీప్తి
జలధిగర్భాంతరిత బడబాగ్నిలో కలసి
శిఖల పఱచి, నాలికలు తెఱచి, నాట్యమాడింది!
'టులాన్' భూమిమీద
ప్రజల వేడికన్నీళ్ళ వాన వాగులై పారింది!
ఒహో టులాన్! ఒహో టులాన్!
మరపురాని స్మృతిపై ఒరిగిపొమ్మ
మా బ్రతుకులలో కొరుచిచ్చు కలనై, అలనై"

ప్రసిద్ధాంగ్ల కవులైన డబ్ల్యు. బి యీట్సు, ఆడెన్‌లలో గల ప్రతిభవంటి ప్రతిభ శ్రీ బాలగంగాధర తిలక్‌లో మనకు గోచరిస్తుందనడంలో అతిశయోక్తి లేదు. ఈ కవి రచించిన 'గుండెకింద నవ్వు' ఎంత ఉదాత్త ఉత్కృష్టభావనా పరిపూర్ణమో చూడండి:

"చేతిలో కలం అలాగే నిలిచిపోయింది
చివరలేని ఆలోచన సాగిపోయింది
ఏదో రహస్యం నన్నావరించుకుంది.
అపుడే నీ నవ్వు నాగుండెకింద వినబడింది.
పడుతూ లేస్తూ పరుగులిడే మహా ప్రజ
పిలుస్తూ బెదురుతూ పోయే కన్నుగవ
కాలి సంకెలల ఘలంఘలల వినబడే రోద
ఏమీ తోచక భయంతో కళ్ళు మూశాను
అప్పుడే నీ నవ్వు నాగుండె క్రింద వినబడింది."

ఈ అనంత విశ్వ రహస్యం కవిని జిజ్ఞాసువును చేసింది. ఈ సృష్టికి గమ్యం ఏమిటో, యీ ప్రాణికోటియొక్క పరిణామావధి యేమిటో యిప్పటికీ దుర్భేద్యంగానే ఉండిపోయింది. కాని యీ సందేహంతో ఆందోళన పడుతూ వున్న కవి గుండెదగ్గరగా నవ్వు వినబడింది 'ఆ నవ్వు అర్థం ఏమిటిది?' అవహేళనా పూర్వకమైన పరిహాసమా? లేక 'నేనున్నాను' అని యీ సృష్ట్యాధారమయిన దివ్యశక్తి తనను తానెరిగించుకొనడమా?

"ఆకాశపు దంపులో అర్ధరాత్రి వెనుక నీ నవ్వు
పాతాళం లోలోతులలో ప్రతిధ్వనించ సాగింది
అంధకారపు సముద్రానికి అవతలి ఒడ్డున నీరూపం
అందుకోలేని నా చూపుకి ఆశఆశగా సోకింది.
రా! ప్రశ్నించే నా మనస్సులో
నీ చల్లని చేతితో నిమురుకో!
రా! కనురెప్ప మాటుగా
నీ మెరపు వీణ మెల్లగా మీటుకో!
క్రమ్ముకుంది నాలో భయంతో కలిసిన ధైర్యం
ప్రవహించింది నాలో తీరని రజితనదం
ఇపుడే, ఇపుడే, నీ నవ్వు
నా గుండె కింద వినబడింది!"

కవికేదో జ్యోతిర్దర్శనం కలిగింది. కవి అభయం కోరుతున్నాడు. బాధలతో, ఆశలతో, లేస్తూ, పడుతూ పోయే యీ ప్రాణికోటికి ఒక ధైర్యము, అవలంబన కావాలి. కవికి స్థైర్యం కలిగింది. ఆ గుండెకిందనవ్వును యిక నిర్లక్ష్యం చెయ్యలేడు.

'గుండెకిందనవ్వు' చాల గొప్ప రచన. ఏ దేశ సాహిత్యానికైనా అలంకార ప్రాయం కాదగినదనడంలో అతిశయోక్తి లేదు.

ఈ కవి రచించిన 'సంజ' అన్న గేయంలో కీట్సు కవి సౌందర్యచ్ఛాయలు గోచరిస్తవి.

"గగన మొకరేకు కన్నుగవ సోకు
ఎరుపెగుపు చెక్కిళ్ళ విరిసినది చెంగల్వ
సంజ వన్నెల బాల రంగు పరికిణి చెంగు
చీకటిని తాకినది, అంచుగా
చిరుచుక్క ప్రాకినది!
వాలు నీడలదారి నీలిజెండా లెత్తి
చుక్క దీపపువత్తి సొగయుబాటలవల్ల
నిదురతూలికనడక గదుము మైకపుకోర్కె
వచ్చు నిశలోకరగి, నవ్వు శశితోకలసి
సంజవన్నెలబాల రంగురంగు రుమాల
విసిరింది; కలలల్లు వెండితోటలమన్య
వ్రాలినది, వ్రాలినది, తావిగా
సోకినది సోకినది."

ఎంత ఆపాతమధురమైన వర్ణన!

శ్రీ తిలక్ వృత్తరచనలలో భాషా, భావమూ రెండూ ఒకదానినొకటి మించిఉన్నవా అనిపిస్తుంది. ఇతని 'గోరువంకలు' మధురమూ, నూతనమూ, నిశితమూ అయిన భావనావైచిత్రిని కలిగినవి. ఏ పద్యాని కాపద్యమే స్వతంత్రము. ఉదాహరణకు:

"పాటను పైటగామలచి భామినిరమ్మ! మదీయ స్వప్నకాం
తాటవిలోనిమేడలకు, త్రావని తే నెలపాత్రలెన్నొ నీ
నీటగు మోవిపై నిలిపి నే కనురెప్పల మంచురేకులన్
చాటుగదింపి త్రోలెదనుచాలని చావని సౌఖ్యలిప్తకై.

ప్రతిదినమేగె బాష్పకణభార నిరోధదిశాంత నేత్రమై
ప్రతివవళ్ళమ్మురాలె శిశిరార్తి దళాంతగళోచ్చ నాదమై
ప్రతితొలివేకువం దొలగిరాలెను తారలు గాజుపూసలై
అతివ! కదల్పకీవయసుటద్దపుమేడ పునాదిగోడలన్."

సౌందర్యోపాసన నేటి సామాజిక రాజకీయ కవిత్వంలో మృగ్యమైపోయింది. కొద్దిమందిని తప్పిస్తే తక్కినవారికి సౌందర్యమన్నది రుచికరమే కాదన్నట్లు స్ఫురిస్తోంది. ఈ క్రింద ఉల్లేఖింపబడిన పద్యాలలోని వైచిత్రినీ, సౌందర్యస్ఫూర్తినీ పరిశీలించండి:

"అవసానమ్మగు రాత్రి కందరములన్ హార్యక్షమే పొంచి వే
కువ పంజాఝళిపించె చాల్నిదుర మేల్కొవమ్మ! మేల్కొమ్మ! ఓ
జవరాలా!"

"ఆ మని స్తబ్ధమై హృదయ మాగిన రోగివలెన్ భయంకరా
శామలినమ్మునై తలపుచాయల సోకును."

ఈ క్రింది 'శిశిరర్తు' నాటి ప్రాతఃకాలవర్ణన ఎంతో అనుపమమైనదిగా వుంది.

"చీకటు లొత్తిగిల్లుతరి చీలినతూరుపు రాచబాటలన్
తాకి ధ్వనింప సూర్యుని శతాంగపు చక్రము, పల్లె పల్లెలో
ప్రాకినమంచుచీర చివరల్ నుసియైనవి కోష్ఠ కోష్ఠవా
త్యాకమనీయ పౌరవలయమ్ములు తీర్చిన భోగిమంటలన్."

'వర్షా!' అని సంబోధిస్తూ ఈ కవి రచించిన పద్యాలలోని వర్ణన మచ్చుకు:

"చందనసుందరాటవుల
చల్లని నిద్దుర దోగి లోయలం
దందు నటించు మేఘవని
తల్ విదళించు మెరుంగుపైట కొం
గందిన అందముల్ వలచి,
కొంతల గందపు పూతచెక్కిలిన్
చిందిన తళ్కులన్మలచు
సేవల రమ్మనిలాంశుకోజ్జ్వలా!"

అదే శీర్షికలో స్వాభావికమైన యీ క్రింది వర్ణన హృద్యంగా ఉంది.

"వానవచ్చినయంత జవ్వాడ నోడలు
ఆటలాడు లేజవ్వను లరిగి రంత,
కంకణప్రభా నిక్వణ క్వాణమలర
దూసికొనిపోవు మెరపుకత్తులను బోలె!"

భావకవులలోవలె ప్రేయసి శ్రీ తిలక్‌కు కేవలము ఊహాసుందరి కాదు. 'ప్లాటోనిక్ లవ్'—ఆధ్యాత్మిక ప్రేమను అధునాతనులు ఒప్పుకోరు. శ్రీ తిలక్ ప్రణయ కవిత్వము శృంగారపరంగా, వింతసౌందర్యంతో విరాజిల్లుతుంది. 'ఆహ్వానము' అన్న పద్యాలలో—

'నీ చికురపాళిక సంపగితావి నిద్రావశవర్తినై మెలగి రాజిలెఏన్ మదిరామదోన్నతిన్' అన్న ఉద్వేగం కనబడుతుంది. విరహాతురుడైన ఈ కవి ఒకసారి.

'ఈవేళ ఏకాదశీ త్రియామయామినీధ్వాంతమీ గొంతులో కొంత అణగినదిలే!' అని తన బాధను వ్యక్తంచేస్తాడు.

'నీకోసమై వేచు నా మేను హర్షవర్ష స్యందిబిందుతుంది లమశోకతరువో!' అని ఆశిస్తాడు. కాని ప్రేయసి జాడలేదు. ఎన్నోయుగాలు గడిచిపోయినట్లున్నాయి! చూడండి! ఎంతచక్కగా అంటాడో యీ కవి!

'మరేమి? అతసీ మధురాంగ మనోజ్ఞ రాజ్ఞి! నీ సన్నని మేనివంపులను జారిన రత్నదుకూల పాళులై!'—ఎన్ని శరత్తులో వెళ్లిపోయినవట!

'విచ్చిన కన్నులన్ నిదుర వెచ్చదనమ్మలె ఆరలేదు, ఆ పచ్చివి జాజి అత్తరులు వాగులుగా ప్రవహింపలేదు'

ఇంతలో నే యీ వియోగం సంప్రాప్తమయింది. అయితే కవి తన ప్రణయతీవ్రత నేవిధంగా తెల్పుతున్నాడో భావనాశబలితమైన యీ క్రింది పద్యంలో!—

"కనుగవపైని కన్నుగవ కల్పితినా—
అటు మిన్నుమన్నులా
నిన చివరల్ స్ఫురింపగ,
వినీలదృగంచల చంచలాసి! నీ
పునుగుజవాది కౌగిళుల
పొందితినా సువిలాసభోగినీ

జనపరి రంభవర్తుల వశంవద
శేషువు లీవిదాల్చుచున్."

శ్రీ తిలక్ రచించిన 'దీక్ష' అనే పద్యాలు అమూల్య భావతరంగితములు. 'నేను దివ్యత్వం నటించను' అని శ్రీ తిలక్ అనినప్పటికీ యితని 'దీక్ష' లో ఒక ఆధ్యాత్మిక భావౌన్నత్యం గోచరిస్తుంది.

సున్నితమూ, సునిశితమూ అయిన కవి హృదయం ఎన్నో బాధలకు లోనయింది. ఎన్నో విపర్యాసాలు కలిగినవి. కాని కవిలోని దీప్తి అకుంఠితమై అతనిని కార్యోన్ముఖునిగా చేస్తున్నది.

"నా తొలిపాటలోన లలనా! వివశమ్మయి
నావుగాని యీ
కాతరమైనజీవనము గాంచగలేదు, ముహుర్ముహుశ్శ్వస
ద్వాతకవోష్ణతన్ వసలి వాడిన కింశుకమాల కంఠమం
దాతురతన్ వియోగ భయదాకుల జానకివోలె
వ్రేలుటన్."

రాబోయే వియోగాన్ని దలచుకుని వియోగ భయదాకుల జానకి, శ్రీరామచంద్రుని కంఠమును పట్టుకొని వ్రేలాడినట్లుగా, వసలి వాడిన కింసుకమాల తన కంఠానికి తగిలియున్నదని యెంత కరుణారమ్యముగా చెప్పినాడో!

'వసంత సుశ్రీకమనీయత' చిరియు తనజీవితంలో 'ఎంత ఎంత బాధా కరుణమ్ము నిల్చినది ధాత్రికి మైత్రికి జీవగర్రయై' అని అంటాడు.

"ఏ పరమార్థ మీయెడద నింతకు నిండినదో-సదా ప్రభా
వ్యాపృతమై కనుంగవల నల్లన చల్లగనొత్తు దేవతా
వేపథుపాణి పంకజము, వెన్నెల నీటినురుంగు
చిమ్మిపోన్
దాపయి ఆడిపోవు హరనాట్య ఘదధ్వని మ్రోయు
నాత్మలో!"

ఈకవి కన్నుగవపైన దేవతలే దిగివచ్చి తమ తమ మృదుహస్తములతో ఒత్తినారు! కేవలము ఆ యీశ్వరుడే యీకవి ఆత్మలో నాట్యమాడుతున్నాడు. ఇంక నిరాశకు, నిస్పృహకు తావులేదు. తాను ఏదో పరమార్థము సాధించుతాడు.

'ఆ మహితాశయమ్ము బలమై నడిపింపగ నీవు నేను న
స్తోమగిరాంపథాకృషిత సుందరమైన మనస్సులన్'
ముందుకు సాగిపోదామని కృతనిశ్చయుడౌతాడు!

శ్రీ తిలక్ కవితావాహనలో—

"రా! కమనీయ మానసతరంగిణి నవ్య నటన్మరాళర
మ్యాకృతి! నిశ్చలాభ్ర రజతాయత పీఠికనిల్చు స్మేరతా
రాకృతి ప్రాతరుజ్జ్వల సరః ప్లవమాన సరోజ పాండురే
ఖాకృతి, రాకవీశ్వరుని కంఠములో దిగజారువెన్నెలై!"

అని ఆహ్వానిస్తాడు. అనేక అమూల్యాభరణాలంకృతయై, అనుపమసౌందర్య అయిన కవితా సరస్వతి యీతని పిలుపు ఆలకించినది.

శ్రీ బాలగంగాధర తిలక్ కథా రచనలో కూడ సిద్ధహస్తుడు. వివిధ పత్రికాముఖంగా యితని కథలనేకం యిదివరలో ప్రచురించబడ్డాయి.

చాలాకాలము క్రితము 'ఆంధ్ర పత్రిక' లో ప్రచురింపబడిన 'కదలే నీడలు' అన్న కథ యిప్పటికీ కథానికలలో అగ్రశ్రేణికి చెందుతుంది. చిన్న చిన్న సంభాషణలద్వారా ఇద్దరు స్త్రీ పురుషుల యుద్ధకాల మానసికాందోళన అతి నేర్పుగా చిత్రించబడింది. 'లిబియా ఎడారిలో' (ఆంధ్ర శిల్పి), 'బాబు', 'సముద్రపు అంచులు,' మొదలైన కథలు ఈ కవి ప్రతిభను చాటుతవి. ముఖ్యంగా 'అద్దంలో జిన్నా' (భారతిలో ప్రకటితము) ఒక మెరపువంటి రచన. దానియం దుపయోగింపబడిన శైలి అనితరసాధారణమైనది ఆ కథ (స్కెచ్) సూచించిన సందేశము ఎప్పటికీ నవనవోన్మేషము. పాకిస్థాన్ విభజనానంతరము 'క్వాయి-దే-అజామ్-జిన్నా' మన స్తత్వ పరిశీలనమే యీ 'స్కెచ్' లోని యితివృత్తము. ఉదాహరణకు :

"జిన్నా కోటుగుండీలు పెట్టుకుంటున్నాడు. 'పోర్టికో' లోకి వచ్చాడు. జనం పాయలుగా విచ్చిపోయారు. జనం మిణుగురులలా ముడుచుకుపోయారు. నీటిమీద వేసిన తారాజువ్వలా జిన్నా ముందుకు వెళ్లాడు. పైన అనంతమైన ఆకాశం వుంది. క్రింద ఎక్కడికో పరచుకొన్న భూమివుంది.

జిన్నా ఆకాశం అంచుకీ, భూమి చివరకీ వ్యాపించాడు. జిన్నాలోని 'అధికారం' గాలిలో కలసి, చెట్లలోని పచ్చదనంగా, మబ్బులలోని నీలిమగా అయిపోయింది. దూరంగా వేలకొలది మహమ్మదీయులు తన కారునిచూసి, చెయ్యెత్తి సలాము చేశారు. వాళ్ళకళ్లు తన్ని చూడగానే జిగేల్మని మెరిశాయి. వాళ్ళకళ్లు ప్రకాశించాయి. వాళ్లకళ్లు ఎర్రబడ్డాయి. వాళ్లల్లోకి తనభావం విద్యుత్తుతో చేసిన కొరడాలా ఒక చరపు చరిచింది. వాళ్లు పరిసరాల్ని, నీతినీ, దేహాన్నీ, సర్వాన్నీ మరచిపోయారు. వాళ్లు తన భావం అయిపోయారు. వాళ్లు జలపాతంలాంటి తన భావంతో మోదబడ్డారు. కల్లువంటి భావంతో నింపబడ్డారు. కత్తులూ, కర్రలూ పైకి తీశారు. జిన్నా కారు వీధిమలుపు తిరిగింది. తన వెనకాల కోటి మనస్సులు మలుపు తిరిగాయి. దేశం యొక్క భవిష్యత్తు మలుపు తిరిగింది."

ఒక వేగం, మెరపువంటి సంచలనం, ఒక విరుపు, ఒక చరుపు, ఈ రచనలో కనబడుతున్నాయి హిందూ ముస్లిం కొట్లాటలో పారిన రక్త ప్రవంతిని చూసి యీ కవి యీ విధంగా చిత్రించాడు.

"ఆ రక్తానికి ఏ జాతీ, ఏ నీతీ లేదు ఏ భేదమూ లేదు. ఆ రక్తం మనిషికన్నా గొప్పది. మనస్సుకన్నా గొప్పది. ఆ రక్తం ఒక పెద్ద నిజం. ఆ రక్తం ప్రపంచమంతా మానవులకింద్లా, సింహములకింద్లా, బల్లులకింద్లా, గొర్రెలకింద్లా, హిందువుల కింద్లా, ముస్లిముల కింద్లా అనేక రూపాలు ధరించింది. ఆ రక్తం ఒక పరమ సత్యాన్ని చాటుతోంది. ఆ రక్తం ఒక పెద్ద అమాయకత్వం. ఆ రక్తం ఒక పెద్ద కరుణ ఆ రక్తం ఒక ఆర్తనాదం. ఆ రక్తం మానవుడి నీరసత్వాన్నీ, బుద్బుదత్వాన్నీ తెలుపుతోంది. ఆ రక్తం మానవుడి పవిత్రతనీ, మానవుడి మానవత్వాన్నీ తెలుపుతోంది."

ఈ నినాదాలు, ఈ 'యిజమ్'లు యివన్నీ వ్యర్థమని ఎంత నిశితంగా చెప్పాడో, తిరిగి మానవత్వాన్నీ, కరుణనీ ఎలా ప్రతిపాదిస్తాడో యీ క్రింది పేరాలలో చూడండి!

"జిన్నా కారు మలబారు హిల్సువైపు వెళ్ళసాగింది. కారు వెనుకనే అరపులు వెంబడించాయి. కారులో జిన్నా వున్నాడు. జిన్నా చాల గొప్పవాడు. జిన్నా తన భావాన్ని వెంబడిస్తున్నాడు. డ్రైవరు అతి వేగంగా కారు నడుపుతున్నాడు. జిన్నా చేతిలో 'న్యూస్ పేపర్' వుంది. 'న్యూస్ పేపర్'లో యిలావుంది. "కలకత్తాలో రెండు వేలమంది మరణం." 'న్యూస్ పేపర్' కలకత్తా అయిపోయింది. 'న్యూస్ పేపర్'లో కలకత్తా వీధులూ, గల్లీలూ, కనబడ్డాయి. పిచ్చిగా, మత్తుగా రేగిన జుట్టుతో ఒకరినొకరు పొడుచుకుంటున్నారు. ఒక భావంకోసం పొడుచుకుంటున్నారు. ఒక మాటకోసం పొడుచుకుంటున్నారు. ఒక మాటకోసం మాటలు మాటల్ని పొడుచుకోవు ఒక మాటకోసం మనుషులు మనుషుల్ని పొడుచుకుంటున్నారు. మాటలు చచ్చిపోవు. మనుష్యులు చచ్చిపోతారు. మనిషి మాటను సృష్టించాడు, మాట మనిషిని బంధించింది.

కలకత్తా, లక్నో, అలహాబాద్, అహమ్మదాబాద్, బొంబాయి, పంజాబ్—ప్రతీ నగరంలో, ప్రతీ వీధిలో, గల్లీలో తాను నిలుచున్నట్టు, ఎవరినో పొడిచినట్టూ, ఎవరి చేతనో పొడవబడినట్టు ఊహించుకొన్నాడు జిన్నా. అతని క్రొవ్వు రేగింది. అతని కోటు గుండీలు వదులయాయి. అతను దోషిలా బాధపడ్డాడు. మనిషిలా జాలిపడ్డాడు. సంఘంలా జలదరించాడు. విశ్వంలా విస్తుపోయాడు. తన భావం కోసం యింత ఘోరం జరిగింది. తనని లోకం అంతా చూస్తుంది ప్రజలందరూ ప్రశ్నిస్తున్నారు. చరిత్ర తన కోటుగుండీలు విప్పి తన లోపల లోపల పరీక్షిస్తుంది. కొందరు తన్ని రక్షించారు. తన్ని ఖండ ఖండాలుగా చీల్చివేశారు. కొందరు తన్ని హేళన చేశారు. తన కోటు తనకి తిరగేసి తొడిగారు. కొందరు తన్ని పొగిడారు. పూలమాలలు వేశారు. 'అల్లాహో అక్బర్!' అన్నారు.

వరండాముందు కారు ఆగింది. రాజకీయవేత్తలూ, భక్తులూ, పత్రికా విలేఖరులూ స్తంభాల్ని ఆనుకున్న స్తంభాలులా వున్నారు వాళ్ళ కళ్ళల్లో కంగారువుంది. చికాకు వుంది. ప్రశ్న వుంది. 'నీ భావం మమ్మల్ని ఎక్కడికి తీసుకువెడుతుంది? తీసుకువెళ్లింది? ఈ రక్తపాతానికీ, నీ భావానికీ సంబంధం ఏమిటి? అమాయకంగా, సుఖంగా వెళ్ళే మా కుటుంబాలలో ఈ హఠాన్మృత్యువూ, భయమూ ఎన్నాళ్లు భరించం?—ఆ ప్రశ్న వాళ్ళల్లో పెద్ద మౌనంలావుంది. ఆమౌనం పెద్ద శబ్దంలావుంది. చచ్చిన జీవుల మౌనం, వాళ్ల భార్యల మౌనం, ఆ వరండాలో, 'పోర్టికో'లో పేరుకుని వుంది. ఆమౌనం ఎలుగుబంటిలా కూర్చుంది. పులిలాగ పంజా దరచింది.

ఒక భావంతో తాను పది కోట్ల మందిని ఒకటి చేశాడు. ఒక భావంతో తాను పది కోట్లమందిని ముప్ఫయికోట్ల జనంనుండి వేరుచేశాడు. అందిరూ చేసేది యింతే! రాజకీయజ్ఞుల పని వేరుచేయడం! ఒక జాతి అంటే తక్కిన మానవ సంఘంతో వేరుపడిన ఒక సమూహం అన్న మాట. బాగా వేరుచేస్తే మరీ పెద్ద నాయకుడౌతాడు. 'ఫాసిజం' అని ఒక దేశం వేరుపడింది. మరొక 'యిజం' అని మరొక దేశం వేరుపడింది. మతం, నీతి, విజ్ఞానం మనిషినీ మనిషినీ వేరుచేస్తున్నాయి. నక్షత్రాన్నీ, నక్షత్రాన్నీ వేరుచేస్తున్నాయి. పువ్వునీ పువ్వు రేకుల్నీ వేరుచేస్తున్నాయి. గుండెకీ గుండెకీ మధ్య ఒక అగాథం తను సృష్టించాడు. ఆ అగాథం తను యిప్పుడు పూడ్చలేడు. దాటలేడు. నిజానికి ఆ అగాథంలోనే తానున్నాడు.'

శ్రీ తిలక్ కవితాసందేశము మానవతాకరుణా సౌందర్య సమన్వితము. శ్రీ తిలక్ లేఖిని సర్వతోముఖ ప్రతిభావంతము. యుద్ధాలతో, భయంతో, ఆదర్శ అవలంబనలు లేని సమాజానికి, మానవునికి యితని సందేశము అమూల్యమైనది.

# కుంపటిలో కుసుమం

శ్రీ మధురాంతకం రాజారాం

"ఏమిటోయ్ అహమద్! ఈవేళ ఎంతకూ బండి స్పీడ్ అందుకోవడంలేదే! అవతల నాకు బోలెడన్ని పనులున్నాయి" అన్నాడు వెనుకసీటుకు చేరగిలబడి సిగరెట్టు కాల్చుకుంటున్న వజ్రపాణి

ఎక్కడో మిషన్ కొంచెం చెడిపోయినట్టుందండీ! ఐనా యింకెంతదూరం దరిదాపుకువచ్చేశాం" అన్నాడు డ్రయివరు

వజ్రపాణి తల కొంచెం పైకెత్తి తలుపుకద్దంగా వున్న గ్లాసులోనుంచి పరిసరాల్ని పరికించాడు. కారు చెరువుకట్టమీద పరుగిడుతోంది. బాలభానుడి స్వర్ణ కాంతుల్లో ఆవైపున కొండకోనలు, ఈవైపున పైరు పచ్చలు మధ్య నిండిన చెరువు మెరసిపోతూ శోభాయమానంగా కన్పిస్తున్నాయి చెరువులో అక్కడక్కడా అల్లి తామరపువ్వులు విరిసి నవ్వుతున్నాయి. తన మనసులాగే ప్రకృతి సైతం ఆనందంలో తృళ్ళిపడుతున్నందుకు వజ్రపాణికి కలిగినతృప్తి, అతడిచేత సన్నగా ఒక ఈలపాట పాడించింది.

పాట పాడుకుంటూనే వజ్రపాణి ఆలోచనలో పడ్డాడు. ప్రసన్న పుట్టినరోజు పండుగకి వాతావరణం చాలా బాగా అమరింది. ఈపాటికి వంటలుకూడా ప్రారంభమై వుంటాయి. ఇక తను వెళ్ళడమూ, తోటలో కుర్చీలు అవీ వేయించడమే తరువాయి. మధ్యాహ్నం దాటిందంటే అతిథులొక్కొక్కరే దిగబడతారు. వాళ్లకు స్వాగత సత్కారాలతోనే తనకు సరిపోతుంది. ఆలోపలే అన్నిఏర్పాట్లు జరిగిపోవాలి.

ప్రసన్న తల్లో కొన్నివిచిత్రపుటూహాలు పుప్పతిల్లడం, వజ్రపాణి కొంచమో గొప్పో వాటి ప్రభావానికి లోనుకావడం అప్పుడప్పుడూ జరిగే విషయమే. వివాహానికి వెనుకటిసంగతి తనకు తెలియదుగాని ఆ తరువాతమాత్రం తను తన చేతిమీదుగా నాలుగుసార్లు ప్రసన్న పుట్టినరోజు పండుగ చేశాడు. అవన్నీ పట్టణంలో, తన స్వంతభవనంలో వందలాది అతిథులమధ్య, నాట్యగానాది వినోదవిలాసాలమధ్య ఎంతో వైభవోపేతంగా జరిగాయి. ఈసారికూడా అలా జరుగవలసిందే! కానీ ప్రసన్నమూలంగా తన నిర్ణయం తల్లక్రిందులైపోయింది.

పుట్టినరోజు కింక పదిరోజులుండనగా, ఒక నాటిరాత్రి ప్రసన్న పున్నమనాటి చేరాజును చూచి పొంగిపోతున్న కదలి కెరటాలను చూస్తూ కూచున్న మనిషి అలా చూస్తూ కూచోక వున్నట్టుండి తల పైకెత్తి "ఈసారి నా పుట్టినరోజు పండుగ మనవూళ్లో జరుపుకుందామండీ" అంది.

"ఆ పల్లెటూళ్ళోనా! అక్కడేం చేయగలుగుతుంది ప్రసన్నా!" అన్నాడు తను.

"కావలిసినవన్నీ యిక్కడనుంచే తీసుకపోదాం లెండి" అంది ప్రసన్న.

"తీసుకపోవచ్చనుకో. కాని అక్కడి కెవరొస్తారు? నువ్వూ, నేనూ, వంటమనిషి, పెట్రోమాక్సులైటు మోయడానికి నారిగాడుతప్పా అక్కడ మరెవరూ వుండరు."

"అదే మరి! ఇక్కడైతే ఇంతకుముందు మన మెప్పుడో వాళ్ళకి ఋణపడినట్టు రిక్షాల్లో, టాక్సీల్లో వచ్చి అసంఖ్యాకంగా వాలిపోతారు. వీళ్ళల్లో ఎందరికి మనపట్ల నిజమైన అంతఃకరణవుందో తెలుసుకోవాలి. పోనీ, యిదొక పరీక్షనుకోండి. రాదలచుకుంటే డెబ్బయిమైళ్ళు ఏమంత దూరప్రయాణం కాదు."

ప్రసన్న వాదం విన్నమీదట తనందుకు అంగీకరించక తప్పలేదు.

ఘుమ్మని సంపెంగపూల వాసన తనదాకా రావడంతో వజ్రపాణి లేచి కూచున్నాడు. కారు తన మామిడితోటకి ప్రక్కన వెళ్తోంది. పట్టణంలో తన కోసం సర్వదా కాచుకునివుండే వెయ్యి వ్యవహారాల బాదరబందీనుంచీ ఎలాగో బయటబడి స్వగ్రామానికి తిరిగి వచ్చినప్పుడల్లా మున్ముందుగా మామిడితోటలో నుంచీ సంపెంగపూల మధుర సుగంధం ఎదురైవచ్చి తనకు స్వాగతవచనం పలుకుతుంది. ఆ తోట, తోటలోపల దిగుడు బావి, బావి చుట్టూ నందివర్ధనం చెట్లు,

వాటి చెంత పండ్లు విరుగగాసే జామచెట్లు, అవన్నీ తన చిన్ననాటి నేస్తాలు. అక్కడ కూచుంటే ఎంతటి చిరాకైనా యిట్టే మాయమైపోతుంది. కానీ ఈ ప్రశాంత వాతావరణంలో తనెంతోకాలం మెలగలేడు. రెండుమూడు రోజుల్లోనే ఈ స్తబ్ధ వాతావరణం తనకు వెగటైపోతుంది. ఉత్సాహంతో వురకలు వేసుకుంటూ ఒక క్షణమైనా ఆగిపోకుండా ముందుకు సాగే జీవితం కావాలి తనకు! అదిక్కడ లభించదు

కారు ఊరి పొలిమేర దాటి పెద్ద వీధిని సమీపిస్తోంది. ఆ వూరికి రాజవీధయినా, బజారు వీధయినా అదే! వజ్రపాణి కొంచెం ముందుకు జరిగి కూచుని ఊరివైపు చూడసాగేడు. తన బంగళా ఊరికవతల పూలతోటలో వుంది. పట్టణంనుంచీ రాకపోకల సందర్భంలో తప్పా మరొకప్పుడు తను ఊళ్ళోకి రావలసిన అవసరం వుండదు. ఒకవేళ తప్పీ దారీ వచ్చినా ఊళ్ళో ఆ బాలగోపాలమూ తనని వింతజంతువులా చూస్తుంది. అదలా వుండగా, కాలినడకతో ఆ పల్లెటూళ్లో తిరగడం తనకి నామోషీగా కనిపించే మాట కూడా నిజం!

కారు పెద్దవీధిగుండా పరుగెడుతోంది. వజ్రపాణి టిన్ను తెరచి మరో సిగరెట్టు పైకి తీశాడు. పెట్టెపైన అగ్గిపుల్ల దరాలున గీచి ముట్టించుకోడానికి పైకెత్తాడు. కానీ వున్నట్టుండి పడిన బ్రేకుతో కారు హఠాత్తుగా వీధిమధ్య ఆగిపోవడంతో, ఆ అగ్గిపుల్ల మధ్యలోనే ఆగిపోయింది.

"ఇక్కడేదో దొమ్మీ జరుగుతోందండీ" అన్నాడు డ్రయివరు.

"వాటికేం తక్కువ! బ్రతకడ మెలాగో తెలియకపోయినా కత్తులుగా చీలి చావబాదుకుని కోర్టుల వెంబడి తిరగడం వీళ్ళకి బాగా అలవాటయింది. నువ్వు త్రోవచేసుకుని కారు స్టార్ట్ చెయ్" అన్నాడు వజ్రపాణి.

కానీ త్రోవచేసుకోడానికి అహమద్ చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. వీధిలో పిన్నా పెద్దా, పిల్లా జల్లా రెండుమూడు వందలమంది పోగయ్యారు. ఆ గుంపులో ఎక్కడ ఎవరు ఎవరిపైన చేయి జేసుకుంటున్నారో అహమద్ గుర్తించలేకపోయాడు "త్రోవ, త్రోవ" అంటూ అతడు తన శక్తికొద్దీ అరవనైతే అరవగలిగాడు గానీ, ఎంతటి అరపైనా మంచి రసపట్టులోవున్న దొమ్మీముందు లవలేశమైనా పని చేయదని అతడూహించుకోలేక పోయాడు.

ఇంతలో కారు చుట్టూ కూడా జనం ప్రోగయ్యారు. కుర్రకారుకు వజ్రపాణి కారు పుష్పక విమానంలా కనిపించివుండాలి మరి వాళ్ళు దాని కానుకుని లోపల ఎంత ఎంతటి వింతలున్నాయోనని తొంగి చూడసాగారు. పోట్లాడుకుంటున్నవారి మధ్య రాజీ కుదర్చడానికి ప్రయత్నిస్తున్న పెద్దల్లో సైతం ఒకరిద్దరు ముందుకు పరుగెత్తివచ్చి "సరిగ్గా సమయానికి వచ్చారు బాబూ! మీకు వెయ్యేళ్ళాయుస్సు. మరేమనుకోకుండా యిక్కడోసారి దిగాలి మీరు" అంటూ చేతులు జోడించారు.

"గొప్ప ఘనకార్యమే చేస్తున్నారు. ఇక్కడ ఆగి వ్యవహారాన్ని ఫయిసలా చేస్తూ కూచోడానికి నాకు తీరికలేదు" అన్నాడు వజ్రపాణి.

ఇరుపక్షాలకూ రాజీ కుదర్చడంలో తలపెద్దను సైతం ఎక్కడో దారబోసుకున్న వృద్ధుడొకడు మరీ ముందుకు వచ్చి "బాబ్బాబూ! మీరే అలాగంటే మేమేం చెప్పాలి? మా కష్టనష్టాలు మేమెవరితో చెప్పుకోగలం బాబూ! పెద్దబాబుగారి హయాంలో గ్రామంలో కిసుక్కుని శబ్దం పైకి రేగేదికాదు. ఆ మారాజు చనిపోయి స్వర్గలోకంలో వున్నారు. ఈ గడుగ్గాయి కుర్రాళ్లు బొత్తిగా మామాట వినిపించుకోడం లేదు. ఏం చేయమంటారు" అన్నాడు.

వృద్ధుడు వినయంగా మనవి చేసుకున్నట్టే కనపడ్డాడు. కానీ ఆ మనవి వజ్రపాణిలో అభిమానాన్ని రెచ్చగొట్టింది. అందుకు ఫలితంగా అతడు చరచరా కారుదిగి "ఏయ్, ఏమిటాగోల!" అంటూ ముందుకు నడిచాడు.

క్షణంలో గగ్గోలు ఉపశమించింది. ఎక్కడివారక్కడే మౌనంగా నిలబడ్డారు. ఛాతీపైన సేలం జరీ కండువ రెపరెపలాడుతుండగా వజ్రపాణి జనసమూహం మధ్యకి నడిచి "అసలు సంగతి చెప్పండి" అన్నాడు.

అసలు సంగతి మరొకరు చెప్పకపోతే వజ్రపాణి ఊహకు తగలనంత క్లిష్ట విషయమేమీ కాదు. ఇంతకూ అక్కడ జరిగింది కారు డ్రయివరు ఊహించినట్టు దొమ్మీ కాదు. దాన్ని దొమ్మీ అనడమే అనుచితం. ఇరు పక్షాలా కొంత బలగం చేరి కర్రలతో కటార్లతో ఒకరితో ఒకరు తలపడ్డం దొమ్మీ అని వ్యవహరింపబడుతుంది. ఇది అలాటిదికాదు. ఇక్కడా ఏడెనిమిదిమంది దృఢకాయులు బాణా కర్రలు, బడితెల్లాంటి శస్త్రసంపత్తితో రంగాన మోహరించి వున్నమాట నిజమే! కానీ రెండో పక్షాన వున్నది

మాత్రం ఒక్కడంటే ఒక్కడు! అతడు నేలపైన బోరగిలబడి లేవడానికి వృథా ప్రయత్నాలు చేస్తున్నాడు. జగడంలో దెబ్బల తాకిడికి చినిగి పీలికలు వాలికలై పోయిన అతడి దుస్తులపైన నెత్తురు మరకలు నీరెండలో నిగనిగలాడుతున్నాయి. కాలిపైన తగిలిన బలమైన గాయంనుంచి యింకా రక్తం ప్రవహిస్తోంది.

కారొకటి వచ్చి వీధిలో ఆగిందనీ, అందులో నుంచి వజ్రపాణి దిగాడనీ తెలియగానే పద్మవ్యూహం పన్ని ఒంటరిపాటున తను చేతిలోపడ్డ ఎదుటివాడి పనిపట్టడానికి కృతనిశ్చయులైన ఆయుధపాణు లందరూ రెండడుగులు వెనక్కి వేశారు. ఒకరిద్దరు వజ్రపాణి దృష్టికి అందకుండా పారిపోజూచారు. కాని వాళ్ళకా అవకాశం దొరక్కముందే వజ్రపాణి రంగంపైకి వచ్చి నిలబడ్డాడు.

"ఎవరు మీరు, ఎందుకిలా చావ బాదేశారు?" అని మళ్ళీ ప్రశ్నించాడు వజ్రపాణి.

"తెలియలేదా అన్నయ్యా! నేనే రంగణ్ణి!" అంటూ బాణాకర్రలకు, బడితెలకు శరీరాన్ని అప్పగించి చిత్తు చిత్తయిన వ్యక్తి తన ముఖాన్ని వజ్రపాణి వైపు త్రిప్పాడు.

కాలిక్రింద పడబోయిన కొదమ త్రాచును చూచి బెంబేలుపడి పారిపోయే పాంథుడిలా రంగడి ముఖం కనబడగానే వజ్రపాణి త్రుళ్ళి పడ్డాడు. వీడు రంగడు. తృణీకారమనే ఏకైక ఆయుధంతో లోకాన్ని నిర్భీతిగా ఎదిరిస్తున్న రంగడు వీడు!

రంగడిపైన వజ్రపాణికి ఏనాడూ సదభిప్రాయం లేదు. బ్రతకడం చేతకానివాళ్ళు, సుఖించడానికి పసలేని వాళ్లు ప్రపంచంపైన తిరగబడ్డం తప్పా మరేమీ చేయలేరని వజ్రపాణి నమ్మకం. అలాటి వాళ్ళలో రంగడు ఒక్కడు మాత్రమే కాదు, అగ్రగణ్యుడని కూడా వజ్రపాణి విశ్వసిస్తాడు.

రంగడిముఖం కనపడిన తర్వాత వీధిలో ఎంతో సేపు నిలబడడానికి వజ్రపాణికి మనస్కరించలేదు. ఈ రంగడెలాటివాడో తన కాదినుంచి తెలుసు. ముంజేతి కంకణానికి అద్దం అవసరంలేదు. ఎంతటి దురాగతం చేసి వుండకపోతే ఒక్కసారిగా వీడు యిందరికి కానివాడౌతాడు! అదీగాక వీధిలో నిలబడి నిల్చున్నపాటున పరిష్కరించడానికి వీలున్న వ్యవహారం కాదిది. పల్లెటూరి రచ్చలకు, రగడలకు బీరకాయ పీచులాంటి మూల కారణాలుంటాయి. వాటిని వింటూ కూచోడానికి యిది సమయంకాదు.

వజ్రపాణి బిరబిరా కారు దగ్గరికివెళ్ళి "రాచకార్యం వెలగబెట్టింది చాలుగానీ ఇక అందరూ యిళ్ళకు వెళ్ళండి. మళ్ళీ ఏదైనా గొడవ జరిగిందని విన్నానంటే పోలీసులకి కబురు పంపిస్తాను. కష్టాల్లోపల కొంతకాలంవుండివస్తేగానీ మీ తిక్క కుదరదు" అంటూ లోపల కూచుని "పోనీవోయ్ అహమద్" అన్నాడు.

లాంఛన ప్రాయంగా ఒకసారి హెచ్చరించి, అంతటితో వజ్రపాణి చల్లగా జారుకుంటాడని అక్కడున్న వాళ్ళెవరూ అనుకోలేదు. అతడలా వెళ్ళిపోవడం చాలమందికి ప్రమోదం కలిగించింది. రంగడు వజ్రపాణికి చిన్నాన్న కొడుకే కావచ్చు. కాని అతడి దృక్పథంలో రంగడు దుర్మార్గుడు. అవినీతిపరుడు. కాబట్టే అతడు సుభావంగా పూనుకోలేక మాటవరుస కొకసారి మందలించి తనదారి వెంబడి తాను వెళ్ళిపోయాడు.

తోటలో విందు పూర్తయ్యేసరికి రాత్రి పది గంటలయింది. అంచనాకంటే ఎక్కువమందే వచ్చారు అతిథులు! రాకేంచేస్తారు! వజ్రపాణి వ్యాపారం అలాటిది. అతడి పెట్టుబడిపైన ఆధారపడి ఒకటి రెండు ఫిలిం కంపెనీలు పనిచేస్తున్నాయి. పెద్ద ఎత్తున ఒక సినిమా పత్రిక నడపడానికికూడా అతడి ఆధ్వర్యాన ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఇట్టి పరిస్థితిలో వజ్రపాణి ఆశ్రితుల సంఖ్య అతని అంచనాని అతిక్రమించడం అంత ఆశ్చర్యపడవలసిన విషయంకాదు. ఒకరిద్దరు రచయితలు అచ్చొత్తించిన పద్యోపాయనాలతో సహా విచ్చేశారు. సాటి నిర్మాతలు, దర్శకులు, ఇంకా మిత్రులు, బంధువులు వచ్చారు. అందరికీ తలమానికంగా ఒక్కసారి కథానాయకుడికి కంఠం అరువిచ్చి ఒక ప్రణయగీతంతో ప్రేక్షక ప్రపంచానికి తన్మయత్వం కలిగించడానికి ఉవ్విళ్ళూరుతున్న గాయకుడొకడు వచ్చాడు. "తమ గానసుధ మధురాతి మధురం! దాన్నింతకంటే సేవించి అరిగించుకోగల శక్తి మాకులేదు." అని అతిథులు విన్నవించుకునేంత వరకూ అతడు తనివితీరా పాడి శ్రోతల్ని రంజింపచేశాడు.

అతిథు లందరూ మేడపైన పడుకున్నారు. అశ్వమేధయాగం సాకల్యంగా నిర్వహించినంత తృప్తితో వజ్రపాణి మేడ ముంగిట ఆరుబయట ఈజీ చైర్లో కూచున్నాడు. వెన్నెల పాలారకాస్తోంది. ఏ క్షణాన్నయినా పిలుపందుకోడానికి సిద్ధంగా నారిగాడు దగ్గర్లోనే నిల్చుకుని అయ్యగారి ముఖంకేసి చూస్తున్నాడు.

ఐదునిమిషాలు ఆలోచనతో గడిపి వేసిన తర్వాత వజ్రపాణి "ఒరే నారిగా! ఇలా దగ్గరికివచ్చి కూచో" అన్నాడు.

నారిగాడు దగ్గరికి వచ్చాడు. అయ్యగారికి తన ఆంతరంగిక కార్యదర్శిత్వం అవసరమైందన్న సంతోషం వాడి ముఖాన చిందులు త్రొక్కుతోంది.

"రంగడి నొకసారి రమ్మని చెప్పావుకదూ?"

"ఇంటికి వెళ్ళానండీ! గాయాలకు కట్లు కట్టు కోడానికని అతడు రామాపురం వెళ్ళాట్ట!"

"ఎవరు చెప్పారు?"

"అతడూ, ఆవిడా తప్ప యింకెవరున్నారండీ ఆ యింట్లో? ఆవిడే చెప్పింది."

వజ్రపాణి వులిక్కిపడి లేచినిటారుగా కూచుంటూ "ఏమిట్రా నారిగా! ఈమధ్య వీడేమైనా కథ నడిపించాడేమిటి! ఆవిడా, గీవిడా అంటున్నావు" అన్నాడు.

ఆ ప్రాంతంలో అందరికీ సుపరిచితమైన రంగడి ప్రణయగాథ. ఇంతవరకూ అయ్యగారి చెవులదాకా వెళ్లనందుకు నారిగాడు విస్తుపోయాడు. ఎంతగా నాగరికత ముదిరిపోయినా యిప్పటికీ అక్కడక్కడా తోటరాముడిలాంటి వ్యక్తి రాకుమారిలాంటి జగదేకసుందరిని వలచీ వలపించుకోగల డనడానికి రంగడి ప్రణయగాథ చక్కని తార్కాణ. రంగడు వజ్రపాణి మామిడితోటకు కొద్ది రోజులపాటు కాపుదారి నిర్వహించాడుకూడా! వాడి హయాంలో, ఆ తోపు, వాడికీ, వాడి నేస్తాలకు క్రీడాస్థలంగా వుపకరించింది. రంగడు భాగ్యవంతుడుగా పుట్టలేదుగాని, వున్నంతలోమాత్రం వాడిది ఎముక లేనిచేయి! కంచె కావల నిలబడి 'బాబూ! ఒక మామిడికాయ యిలా పడేస్తారూ' అని అడగనివాళ్లది పాపంగాని, చిరాకు, కోపం. అహంభావం ఇలాటి వేవీ లేకుండా కాయల్ని తీసి ఆవలికి గిరవాటు వేయడానికి రంగడు సర్వదా సంసిద్ధుడు! అందువల్ల వాడి నిరవాకంలో మామిడితోపుకు కీర్తి ప్రతిష్ఠలు హెచ్చి, వజ్రపాణికి ఆదాయం సన్నగిల్ల సాగింది.

తోట కాపరితనం కాస్తా వూడిపోయిన తర్వాత రంగడు నూలులేని గాలిపటంలా కొంత కాలం దేశమంతా చెడతిరిగాడు. ఎలా తిరిగినా కవళం తిరిగి తిరిగీ నోటిదగ్గరికే రావలసినట్టు రంగడు మళ్లీ మళ్లీ స్వంతవూరికే తిరిగి రావలసివచ్చేది. జననీ, జన్మభూమి స్వర్గంకన్నా ఎక్కువన్నారు మరి! రంగడికి జనని లేదు, జనకుడూ లేడు. జన్మభూమిమాత్రం వుంది.

ఒకసారి రంగడు ఎంత దూరం వెళ్ళాడో, ఏం చేశాడో గానీ వెళ్ళిన మూడు నెలలకు తిరిగి వచ్చాడు. వస్తూ, వస్తూ వాడొక పిల్లనగ్రోవిని తీసుకొచ్చాడు. దానిపైన వాడు చేసిన సాధన చుట్టుప్రక్కల వాళ్ళకందరికీ రిచ్చపాటు కలిగించింది. రాత్రిభోజనమైన తర్వాత భజనగుడి ముందు రచ్చపైన నందీశ్వరుడి కానుకుని కూచున్నాడంటే వాడి వేణుగానం మెల్లమెల్లగా అలలు అలలుగా సాగి పరిసర వాతావరణాన్ని మత్తుతో నింపివేసేది. ఊదుతూ, ఊదుతూ అలాగే నేలపై కొరిగి పిల్లనగ్రోవిని చేతిలో వుంచుకనే రంగడు నిద్రపోయేవాడు.

ఊళ్లోమాత్రం రంగడెంతటి నిరాదరణకి పాత్రుడయ్యాడో, వాడి వేణుగానమూ అంత నిర్లక్ష్యానికి పాత్రమయింది. ఒకరి మెరమెచ్చుల కోసం ప్రారంభించిన కృషికాక పోడంచేత రంగడు అందువల్ల నిరుత్సాహ పడటం సంభవించలేదు. జోలపాటలా వుండవలసిన వేణుగానం రచ్చకు దాపున కాపురమున్న వాళ్ళకి నిద్రాభంగ హేతువుగా పరిణమిస్తోందని తెలిసినప్పుడు గూడా రంగడు ఖేదపడలేదు. తను వాళ్ళకి అయిష్టుడు. తనపట్ల వారికున్న కూరిమి కొద్దిపాటిది. ఆ కూరిమి తను వాళ్ళకి చాకిరీ చేసినంతవరకు మాత్రమే వుండి, తరువాత రంగం పైనుంచి తెర వెనుకకు వెళ్ళిపోయే నాటక పాత్రలా మాయమైపోతుంది. ఆపైన తనుచేసిన ప్రతిపనీ వాళ్లి అవహేళనకీ, అసహ్యతకీ గురౌతుంది. అందుకు చింతించి లాభంలేదు.

లేమిచేత బాధపడుతూ అష్టకష్టాలు ఎదుర్కోవలసిన మనిషికూడా తన జీవితంలో ఎక్కడో ఒకచోట టర్నింగు పాయింటు వుంటుందనీ, ఆ పైన తనకోసం నవజీవనానందం కాచుకుని వుంటుందనీ కలలు కంటాడు. ఆవిశ్వాసంతో బ్రతుకుతాడు. రంగడి కాలాంటి ఆశకూడా లేదు. కాని ఆశ వుద్భవించడానికెంత సేపు కావాలి? ఒక క్షణం చాలు.

ఓ రోజు వుదయం రంగడు కొంచెం ఆలస్యంగా నిద్రలేచి కళ్లు నులుముకుంటూ పాకలోనుంచీ బయటికి వచ్చాడు. అప్పటికి రెండుబారల ప్రొద్దెక్కింది. టముకుపైన కర్ర వేసి ఢణఢణా వాయిస్తూ ఊరంతా చుట్టి యింటికి వెళ్తున్న తోటి లింగమయ్య "విన్నావా రంగయబాబూ! నాటకం వచ్చింది నాటకం! రాయప్ప కంపెనీది" అన్నాడు.

"రానీలేరా! డబ్బు దండుకోడానికేవో వస్తుంటుంది." అన్నాడు రంగడు.

రంగడికైతే నాటకం పట్ల ఆసక్తిలేదు గానీ, ఆ ప్రాంతంలో రాయప్ప కంపెనీ నాటకం పేరు చెబితే కాపులు కూలీలు చద్ది కూళ్లు కట్టుకుని, తిరణాళ్లకు బయల్దేరినట్టు తోదులు తోదులుగా కదలి వస్తారు. కానీ ఖర్చులేకుండా ప్రొద్దుపొడిచి రాచిన

# కుంపటిలో కుసుమం

గొంతుకతో చోపుదారి మంగళం పాడేవరకూ నడి వీధిలో ఆకాశం క్రింద కూచుని వీధినాటకం చూడ్డానికి అలవాటు పడిన ముసలివాళ్ళు 'నాలుగ్గంటల సంబరానికి నాలుగణాలు తగలేయడమేనట్రా! మా కాలంలో మేమెరగమబ్బా ఈ చోద్దాలు" అని మూతి ముడుచుకునేవారు. కాళ్ళల్లో బలముండి సునాయాసంగా నడవగల కుర్రవాళ్ల ధోరణివేరు! వెనవనాలు గణాలు! రెండు రోజులు వక్కాకు, బీడీలు మానుకుంటే పోలా! ఆ కంపెనీలో వున్నారే, యిద్దరు అమ్మాయిలు, వాళ్లు వేసే ఒక్క అడుగుకి, పాడే ఒక్క పదానికి యిచ్చేయవచ్చు నాలుగణాలు!

నిజమే మరి! రాయప్ప మేనగోడళ్లు అడుగు చక్కగానే వేస్తారు పాట బాగా సాగదీసి పాడుతారు. ఆ ఆటా, ఆ పాటా, మగాళ్ళకి తెలియకుండా అదీ యిదీ అంగడిలో పోసి అమ్మలక్కలు నింపుకున్న వక్కాకు తిత్తుల్ని ఖాళీ చేస్తాయి. ఇంటి ఖామందుకు తెలియకుండా తమలపాకులమ్ముకుని రొండిలో దోపుకున్న పాలేరు గుప్తనిక్షేపాన్ని హరిస్తాయి.

అటు వీధి నాటకమూ గాక, యిటు డ్రామానుగాక రెండింటి సాంకర్యం చేత సిద్ధించిన విచిత్ర రూపకాలు రాయప్ప కంపెనీవి అవి డిమాలో, వ్యాయోగాలో, ఈహామృగాలో ఆ దశ రూపకకర్తే చెప్పాలి! వాటిని చూచే ప్రేక్షకులు మాత్రం ఏక కంఠంగా ఒకే మాట చెబుతారు. "నాటకమంటే రాయప్ప కంపెనీ నాటకంరా! అబ్బబ్బ! ఏంసీన్లు, ఏం డాన్సులు: బయస్కోపు ఎందుకురా దీని దగ్గర."

మొదటిరాత్రి కృష్ణలీలలు జరిగాయి రంగడు సగం ఆటలో టికెట్టు లేకుండా కంచెదాటి లోపలికి వెళ్ళి ఓ మూల కూచున్నాడు. అప్పుడు బృందావనంలో గోపికాలోలుడి వేణుగాన వినోదం జరుగుతోంది రంగడు కొంతసేపు విని మరి వినలేక చెవులు మూసుకుంటూ "అబ్బాయబ్బాయ్! అది పిల్లనగ్రోవి కాదు రా బాబూ! చావు మేళంలా వుంది. ఆపు, ఆపు" అని కేకవేశాడు. హార్మోనియం వెనుక నిలబడి ప్రేక్షక లోకంపైన తన నాటకం ఎలా పనిచేస్తున్నదా అని తొంగి తొంగి చూస్తున్న కంసవేషధారి రాయప్ప ఆ మాటతో మండిపడి "ఎవరది, ఎవరది" అంటూ రంగం పైకి వచ్చాడు. అలాటి సమయాల్లో వెనుకాడే స్వభావంకాదు రంగడిది. వాడు పైకిలేచి "నేనే నయ్యా ఆ మాట అన్నది" అన్నాడు.

రాయప్ప ఆగ్రహోదగ్రుడై పోయాడు. "ఏమయ్యో మీరా సాహెబ్! అయ్యా చంద్రయ్యనాయుడూ!" అంటూ నాటకం కంట్రాక్టుదార్లని పిలిచాడు. వాళ్ళకు టికెట్లు అమ్ముకోడంపైన వున్నంత శ్రద్ధ నాటకం జరగాలా, లేదా అన్న విషయం పైన వుండదు. బుకింగ్ ఆఫీసు మూసుకుని వాళ్లే ప్పుడో ఊళ్లోకి వెళ్ళిపోయారు. సభలోనుంచి పది మంది పెద్ద మనుషులు పైకిలేచి "నీకేం తెలుసులే కూచోరా అంటూ రంగణ్ణి మందలించి, రాయప్పని మళ్ళీ తెరవెనక్కి పొమ్మని ప్రాధేయపడి నాటకం సక్రమంగా జరిగేటట్టు చూచారు.

వరుసగా ఐదురాత్రులు నాటకాలు జరిగాయి. ఆరో రోజు సాయంత్రం రాయప్ప సహచరులు కొందరు వెంటరాగా హార్మోనియం మెడకు తగిలించుకుని ఊళ్లో వసూళ్ళకోసం బయల్దేరాడు. పెద్ద వీధి పూర్తయి సందులోకి తిరిగేసరికి రాత్రి ఎనిమిది గంటలయింది. రాయప్ప వున్నట్టుండి ఒకచోట ఆగిపోయాడు. ఆగి "ఎక్కడిదా పిల్లనగ్రోవి?" అన్నాడు.

పాట వింటూ రాయప్పని వెంబడిస్తున్న కుర్రాడొకడు "అదా! ఆవాడు మీ నాటకానికి వంక బెట్టిన వాడిది" అన్నాడు.

రాయప్ప వసూళ్ళమూట కట్టిపెట్టి రంగడి పాక దగ్గరికి వెళ్ళి నిలబడ్డాడు. పాకముందు గంగరావిచెట్టు క్రింద కూచున్న రంగడు "ఏంరాయప్పా! వసూళ్ళకోసం వచ్చావా! నేను యిచ్చేవాణ్ణికాదు, పుచ్చుకునేవాణ్ణి" అని పకపకా నవ్వాడు.

"పోనీ, పుచ్చుకుందువుగాని ఒక పాటపాడి వినిపిస్తావా బాబూ" అన్నాడు రాయప్ప.

రంగడు మళ్ళీ పిల్లనగ్రోవి అందుకున్నాడు.

పాట పూర్తయిన తర్వాత రాయప్ప యింటివైపు చూస్తూ "దీపంకూడా వెలిగించకుండాయిక్కడ కూచున్నావేం బాబూ" అన్నాడు.

"దీపం పెట్టేవాళ్లెవరున్నారు రాయప్పా! ఇది దీపం లేనియిల్లు" అన్నాడు రంగడు.

రాయప్ప రంగడి ముఖంకేసి తీక్షణంగా చూచాడు. సన్నగా పొడుగ్గా పడగెత్తే పాముని తలపించే యౌవన బింకంతో మిసమిసలాడుతున్న ఆకారం! పైగా వీడు నీలమేఘశ్యాముడు! తలలో నెమలిపింఛం లేకపోయినా, మెడలో చెంగల్వ పూలదండలేక పోయినా రంగడు ఆ లేత వెన్నెల్లో రాయప్ప కళ్ళకు సాక్షాత్తు శ్రీకృష్ణుడిలా కనిపించాడు.

పైకి లేస్తూ రాయప్ప "నీతో ఒకమాట చెప్పాలి బాబూ! ఓసారి నాతో వస్తావా" అన్నాడు.

రంగడు రాయప్పని వెంబడించాడు. ఆ మరునాడు రాయప్ప కంపెనీ ఊళ్ళోనుంచీ వెళ్లిపోయింది. వాళ్ళతోబాటు రంగడూ వెళ్ళిపోయాడు.

ఆరు నెలలపాటు అంతర్ధానమైవుండి రంగడొకనాడు మళ్ళీ హఠాత్తుగా ఊళ్ళోవాళ్లకి కనపడ్డాడు. వస్తూ, వస్తూ వట్టి చేతులతో యిల్లు చేరుకునే అల

వాటు రంగడికి లేదు. అతడీసారి రాయప్ప మేనకోడళ్లలో చిన్నదాన్ని వెంట తీసుకొచ్చేశాడు.

రంగడావిడని లేవదీసుకొచ్చాడా, లేక ఆవిడే రంగణ్ణి లేవదీసుకొచ్చిందా అన్న చర్చ ఒకవైపు కొనసాగుతుండగానే, మరొకవైపున రంగడి సమవయస్కులు కొందరు తమకు భూమీపుట్రా, యిల్లూవాకిలీ, డబ్బూ దస్కమూ వున్నా తాము రంగడు చేసినంతమాత్రం పని చేయలేకపోయినందుకు లోలోపల కుతకుతలాడిపోసాగారు. ఆ వ్యథని కప్పిపుచ్చుకోడానికి రంగణ్ణి కించపరచి మాట్లాడ్డంకన్నా వాళ్లకి ఉపాయాంతరం లభ్యంకాలేదు. తిన తిండికే వెరవు లేని రంగడు దాన్ని భరించడమేమిటి? ఐనా నాటకాలాడే మనిషి కాపురం చేస్తుందా? ఈ మూన్నాళ్ల ముచ్చటకే యింత మిడిసిపాటా వీడికి!......ఇలా దుష్ప్రచారం కొనసాగిస్తూ వాళ్లు రంగడినుంచి వైదొలగి వుండడంపోయి, వాడి యింటి చుట్టే ప్రదక్షిణం చేయసాగేరు. ఒకరిద్దరు రంగడింట్లో లేకపోడం చూచి రమణమ్మతో సరాగాలు పోవడానికి కూడా సాహసించారు. మరొకడేమో ఒకానొక పుస్తకంలోంచి ప్రేమలేఖని తూచా తప్పకుండా కాపీచేసి దాన్ని రమణమ్మకి చాకలి ఎల్లి ద్వారా బట్వాడా చెయించాడు. "వెధవ రాస్తే రాశాడులే" అని రంగడు దాన్ని చించి పొయిలో వేశాడు. ఈ లోకువ ఆధారంగా వాడు రమణమ్మని ఒంటరిపాటున బలాత్కారం చేయడందాకా కథని సాగదీశాడు. రంగడికి కోపం సాధారణంగా రాదు. వస్తేమాత్రం వాడు మనిషికాదు. ఆ కోపంతో రంగడు అతణ్ణి నడివీధిలో నిలబెట్టి "నీకు అక్కాచెల్లెళ్లు, పెండ్లాం బిడ్డలు లేరా? వాళ్లనెవడైనా యిలా బలాత్కారం చేస్తే ఊరుకోడానికి నువ్వు వుప్పూ, కారమూ లేని గడ్డి దింటున్నావా" అని అడిగేశాడు. పదెకరాల సేద్యమూ, పదిమంది ప్రక్కబలమూగల ఆ ఆసామి రంగడి పైకి హుంకరించాడు. అతడితోబాటు, అతడి అనుచరులు రంగణ్ణి చుట్టుముట్టారు.

"ఐతే కథ సశేషంగా మిగిలివుందన్నమాట!" అంటూ లేచాడు నారిగాడి ద్వారా రంగడి కథ సాకల్యంగా విన్న వజ్రపాణి.

"ఇదిక్కడ ఆగిపోదు బాబయ్యా! ఇంకా సాగుతుంది" అన్నాడు నారిగాడు.

వజ్రపాణి అప్పుడే ముట్టించిన సిగరెట్టుని క్రింద పారవేసి గబగబా మేడలోకి వెళ్లి తనగదిలో పట్టెమంచంపైన పడుకున్నాడు. అతడు నిద్రపోవాలన్న సదుద్దేశంతో పడుకున్న మాట నిజమే! కాని నిద్ర రాలేదు. ఎంత ప్రయత్నించినా వీధిలో గాయాలు తగిలి పైకి లేవలేక క్రింద కూలబడి పోతున్న రంగడి స్వరూపం అతడి మనోఫలకం మీదినుంచీ మాసిపోలేదు. గట్టిగా కళ్లు మూసుకున్నాడు. తన వ్యాపారంగురించి ఆలోచించుకోడానికి ప్రయత్నించాడు. మూడోజాము కూడా మెలకువతో వుండగానే గడచిపోయింది. తెల్లవారు జామున మాత్రం ఒక చిన్న కునుకు మగతగా వజ్రపాణిని క్రమ్ముకుంది ఆ నిద్రలో కల! కలలో రంగడు మళ్ళీ అతనికి కనిపించాడు.

రంగణ్ని తీవ్రంగా మందలింప దలచుకున్నాడు వజ్రపాణి. "ఒరే రంగడూ! ఋజుమార్గంలో నడవక బ్రతుకంతా డొంక తిరుగుళ్ళతోనే గడిపివేయడానికి నిర్ణయించుకునే వాళ్ళలో నువ్వు మొదటివాడివి. లోకంలో అందరూ మహారాజులే వుండరు. పేద వాళ్ళుకూడా వుంటారు. కాని ఆ పేదవాళ్ళు కూడా బ్రతకడానికి ఏదో ఒక జీవనోపాధి చూచుకుంటారు. నువ్వలాటి బ్రతుకుతెరువు చూచుకోలేదు. నువ్వు తింటే తింటావు. లేకుంటే పస్తుంటావు. పని చేస్తే చేస్తావు. లేకుంటే కాళ్లు బారగిల చాపుకుని పడుకుంటావు. అదీఒక జీవితవిధానమే కావచ్చు. కానీ అంత సులభంగా బ్రతకదలచుకునే వాళ్లకు యితర ఝుంఝూటాలేవీ వుండకూడదు. నువ్వెక్కడెక్కడో నాటకాలాడేదాన్ని తెచ్చి యింట్లో వుంచుకున్నావు. తాను దూరడానికే సందు లేకపోతే, మెడకొక డోలేమిటి! నీ పిచ్చి గాకపోతే. ఆవిడ నీకు కాపురము చేస్తుందా? అప్పుడే ఊళ్ళో ఏదో రగడ బయలుదేరింది. ఈ రచ్చకు కారణం ఆవిడేనని నేను చెప్పడం లేదు. ఊరంతా ఆ మాటే అంటోంది. అడుసు త్రొక్కనేరాదు త్రొక్కేశావు. పోనీ, యిప్పుడైనా కాళ్లు కడుక్కో."

ఇన్ని మాటలూ విని రంగడు వజ్రపాణికి దగ్గరగా వచ్చాడు. వస్తూ మెల్లగా "అన్నయ్యా!" అన్నాడు. వజ్రపాణి వులిక్కిపడి తలపైకెత్తాడు. "నాకు అప్పుడప్పుడూ మంచి మాటలు చెప్పడం నీ కలవాటు. నువ్వు నామీద మోపిన నేరాలన్నీ చాలామట్టుకు నిజమైనవేనని నేను ఒప్పుకుంటున్నాను. నేరస్థుడినిగా నా సంజాయిషీ గూడా నువ్వు దయచేసి వినాలి. మొదటిది: నేనొక బ్రతుకు తెరువు చూచుకోలేదు. ఏపూట కాపూట తిండికోసం వెదుక్కోడమే నా బ్రతుకు తెరువు! నా కొద్దిపాటి చదువు ఏ వుద్యోగానికి పనికొస్తుంది. రెండోది: నేను తిండి తింటాను, లేకుంటే పస్తుంటానన్నావు. నిజమే. దొరికితే తింటాను. లేకుంటే పస్తుంటాను. నేను సోమరివాణ్ణికాను. పనిదొరికితే చేయడానికి నే నెప్పుడూ సిద్ధంగా వుంటాను. పని దొరక్కపోతే కాళ్లు బారగిల చాపి పడుకోక మరేం చేయాలో నాకు తోచదు. అంత సులభంగా బ్రతకదలచుకునే వాళ్లకు యితర ఝుంఝూటాలుండగూడదన్నావు. నీకు తెలియదేమోగాని ఇంటింటికీ తిరిగే బిచ్చగాడి

కొకడికి యిద్దరు పెళ్ళాలు, పదిమంది బిడ్డలూ వుండడం నే నెరుగుదును. ఐనా నేను కోరికోరి ఈ ఝంఝాటాన్ని తెచ్చుకోలేదు. ఆవిడ నన్ను నమ్మింది. ఉన్న చోట వుండడానికి వీల్లేక యిలా వచ్చేశాం. పోలిక కోసం గాదుగానీ యిక్కడొక విషయం చెప్పాలనిపిస్తోంది. నువ్వు కాలేజీలో చదువుతూ ఒకమ్మాయిని పెళ్ళిచేసుకోవాలనుకున్నావు పెదనాన్నగా రందుకొప్పుకోలేదు. కానీ నువ్వు పట్టుబట్టి కూచున్నావు ఆవిడని పెళ్ళిచేసుకున్నావు. నువ్వు వర్ణాంతర వివాహం చేసుకున్నందుకు వెయ్యిమంది నిన్ను పొగిడారు. నన్నలా పొగడవలసిన అవసరం బొత్తిగా లేదు. హేళన చేయకుంటే చాలు. అదీ నాకు పదివేలు! ఇంతకూ నే నావిడని పోషించవలసిన అవసరం కూడా లేదు. ఆవిడా నాతోబాటు ఏపని చేయడానికైనా సిద్ధంగా వుంది. లోకంలో కోట్లకోలది జనం బ్రతుకుతున్నారు. మేమిద్దరం బ్రతకలేకపోము. మాపాటుకు మమ్మల్ని బ్రతకనివ్వడంకన్నా, మాకు యితరులు చేయవలసిన మేలుఏదీ లేదు. నేను అడుసు త్రొక్కానన్నావు. ఎక్కడ త్రొక్కానో నాకు తెలియడం లేదు. నా కాళ్ళకి బురదా లేదు. అందుచేత దాన్ని కడుక్కోవాలన్న ప్రసక్తి అసలే లేదు."

తలుపుపైన ఎవరో దబదబ బాదుతుండడం విని వజ్రపాణి మేలుకున్నాడు. సూర్యకిరణాలు కిటికీగుండా పైకివచ్చి పడుతున్నాయి. నారిగాడు తలుపు కావలినుంచీ "బాబూ, మీ కోసం రంగయ్య వచ్చాడు" అన్నాడు.

"ఇప్పుడు నేను పట్నంవెళ్ళాలి. తీరికలేదు వెళ్ళిపొమ్మను" అన్నాడు వజ్రపాణి.

* * *

మూడు నెలలు గడచిపోయిన తర్వాత వజ్రపాణి మళ్ళీ స్వగ్రామానికి తిరిగిరావడం తటస్థించింది. హేమంతం జరుగుతోంది. ప్రతి సంవత్సరమూ మంచు కాలం రాగానే ప్రసన్న పొడిపొడిగా దగ్గడానికి ప్రారంభిస్తుంది. ఆ పొడిదగ్గుకు పేరుపెట్టడంలో నైతే డాక్టర్లు ఒక్కొక్కరూ ఒక్కొక్క పోకడపోయినా నయం చేయడంలోమాత్రం అందరూ విఫలులై కడకు శిశిర హేమంతాలు నాలుగునెలలు రోగి కంప్లీటు రెస్టు తీసుకోవాలని సలహాయిచ్చారు. 'రెస్టు' అనేది పని అనేచోట పదిహేనుగా పారేస్తే పట్టణాల్లో లభ్యమయ్యే వస్తువుకాదు. అందుచేత ప్రసన్న పల్లెటూళ్ళోనే వుండిపోవలసి వచ్చింది.

కారులోనుంచీ దిగుతూనే వజ్రపాణి ప్రసన్న ఆరోగ్యాన్నిగురించి పరామర్శించాడు. టిఫిన్ తీసుకుని, తోటలోకివెళ్ళి ఒకసారి నల్లువైపులా కలయ చూచివచ్చి, అభ్యంగనస్నానం నిర్వర్తించి, భోజనమైనతర్వాత పడుకున్నాడు. తలగడిగిన నాటినిద్ర, గాఢంగా పట్టింది. టంగుటంగున గడియారం మ్రోగడంవిని లేచి టైంచూచాడు. నాలుగైంది. ఎదుట టేబుల్ పైనవున్న ఫ్లాస్కు తీసి కాఫీ గ్లాసులో పోసుకునిత్రాగాడు. పడకపైనుంచి దిగడానికి మనస్కరించడం లేదు. అక్కడేవున్న న్యూసుపేపరు తీసి పుటలు త్రిప్పుతూ కూచున్నాడు.

హాల్లోనుంచీ అడుగులసవ్వడి వినిపించింది. ప్రసన్న వస్తుందేమోనని వజ్రపాణి తలపైకెత్తాడు. కానీ హాల్లో నడుస్తున్న మనిషి ప్రసన్న కాదు. తెరచిన కిటికీగుండా వజ్రపాణి కళ్ళముందు ఒక క్షణం పాటు మెరపుతీగ పారాడినట్టయింది. అతను మంచం పైనుంచి క్రిందికిదూకి కిటికీదగ్గరికి వెళ్ళి నిల్చున్నాడు. ఒక యువతి! తనకి అపరిచిత! అదొక స్త్రీ మూర్తి గాదు శంపాలతలా వుంది. అవును. అది శంపాలతే! మేడమెట్లెక్కి పైకివెళ్తోంది.

ఎవరీవిడ? వాలకంచూస్తే ఈ యింటితో బాగా పరిచయమున్న దానిలా కనిపిస్తోంది. ప్రసన్న రాగానే అడగాలి. భార్యకోసం ఎదురుచూస్తూ మళ్ళీ మంచం పైన కూచున్నాడు వజ్రపాణి.

ఐదు గంటలకు సరిగ్గా వాహ్యాళికి సిద్ధమై ప్రసన్న గదిలో అడుగుపెట్టింది. వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది. ఇద్దరూ మెల్లగా కొబ్బరితోటవరకూ నడిచారు. ఆవిడెవరు ప్రసన్నా: అన్న ప్రశ్న అలోగా నాలుగైదుసార్లు వజ్రపాణి గొంతువరకూ వచ్చి అక్కడ వెలక్కాయ పడినట్టు ఆగిపోయింది. ఆవిడ పట్ల తనంత కుతూహలం ప్రకటించడం సమంజసం కాదేమో! ఇలా తటపటాయిస్తుండగా ప్రసన్నే ఆ ప్రస్తావన తెచ్చింది.

"ఏమండీ! మీరావిడని చూడలా" అంది ప్రసన్న.

గడసరితనం ఎక్కడికి పోతుంది! "ఎవర్ని ప్రసన్నా?" అన్నాడు వజ్రపాణి.

"మీ మరదల్ని!"

"నా మరదలా!"

"అవునండీ! అలా తెల్లబోతారెందుకూ? మరదలంటే తెలియదూ! తమ్ముడిభార్య" అంది ప్రసన్న.

"తమ్ముడొకడు! తమ్ముడికొక భార్యకూడానా! ఇదేమైనా కథా ప్రసన్నా!" ముఖంలో అమాయకత్వం ఒలికిస్తూ ప్రశ్నించాడు వజ్రపాణి.

"కథగాదండీ బాబూ! వాస్తవం. ఆవిడ మీ రంగడి భార్య."

వజ్రపాణికీసారి కోపం వచ్చింది. "ప్రసన్నా! నువ్వు 'భార్య' అన్నమాటని కలుషితం చేస్తున్నావు.

రంగడు ఆవిడని లేవదీసుకొచ్చేశాడు. ఆవిడ రంగడికేమైనా కావచ్చు. కాని భార్యమాత్రం కాదు."

ఈ తర్కం ప్రసన్నకి అర్థంకాలేదు. "లేవదీసుకొచ్చినమాట నిజమేనండీ! ఐతే ఎక్కడో దేవుడిముందర అతడు ఆవిడచేతిలో చేయివేసి 'యికమీదట నేను మొగుణ్ణి, నువ్వు పెళ్ళానివి' అన్నట్ట అప్పటినుంచీ వాళ్ళిద్దరూ భార్యాభర్తలుగా వ్యవహరిస్తున్నారు."

"బాగుంది, బాగుంది. అంటే తాత్కాలికంగా నన్నమాట!" అంటూ వికావిక నవ్వేశాడు వజ్రపాణి.

"పోనీ ఆవిడ మనయింట్లో ఎందుకుంది అని అడగరేమండీ" అంది ప్రసన్న.

"ఆవిడ మనయింట్లో వుందా! ఐతే యిదొక అద్భుత కథానకమే ప్రసన్నా! నేను ఆవిడ ఏదో పనిమీద మన యింటికి వచ్చిందనుకున్నాను."

"లేదు మన యింట్లో నేవుంది"

"ఎందుకూ?"

"రంగడిప్పుడు ఊళ్ళో లేడుగా!"

"ఏమయ్యాడు?"

"రెండేళ్లు పడింది."

"ఏమిటికి?"

"శిక్ష!"

"అబ్బ కాస్తవివరంగా చెప్పకూడదా ప్రసన్నా! నాకు ఆద్యంతాలే తెలియడంలేదు" ప్రాధేయపడ్డాడు వజ్రపాణి.

"మీరు పట్నానికి వెళ్ళి పదిరోజులు కూడా కాలేదు. ఊళ్ళో మళ్ళీ రగడజరిగింది. రంగడు ఒకడి తల చితగ్గొట్టేశాడు."

"ప్రాణాపాయం లేదుగదా!"

"చావు దప్పి కన్నులొట్టబోయింది. పోలీసులొచ్చారు. రంగణ్ణి అరెస్టుచేసి తీసుకెళ్ళారు."

"తత్ఫలితంగా శిక్షపడింది. అంతేకదూ ప్రసన్నా! నే నప్పుడే అనుకున్నాను. అనుకున్నంతా జరిగింది. ఈ విడని నడివీధులపాల్జేసి వాడు కమ్మిల్లోపల కూచున్నాడు."

"పాపం, రమణమ్మని చూస్తుంటే జాలిగా వుందండీ."

"ఉండదూమరి! నాపట్టివిగా, పాలు బువ్వ పెడతా రామ్మా అని బుజ్జగించలేక పోయావా ప్రసన్నా!"

"మీకంతా ఎగతాళిగానే వుంటుంది. ఈ రెండేళ్ళూ ఆవిడని నాదగ్గరే వుండిపొమ్మన్నాను"

"వాక్యం పూర్తిచేయవు. సుధేష్ణదగ్గర సైరంధ్రిలా అని వుపమానం కలిపితే వాక్యం సర్వాంగసుందరంగా వుంటుంది."

ఆవిడ లేకపోతే నాకీ వూళ్ళో ప్రొద్దేపోయేది కాదేమోనండీ! ఏం చక్కగా పాడుతుందనీ!"

"గగనవీధిని దేలు ఓ మేఘమాలా! జైలుగోడల పైన మసలి వస్తున్నావా! అని పాటని సవరించుకోడం లెస్స. ఐనా మొగుడు జైల్లోవుండగా ఇక్కడీవిడ పాటలు పాడుకుంటూ కూచోవడానికి యిదేమైనా సినిమానా ప్రసన్నా!"

"అబ్బే, నా బలవంతం పైన పాడుతోందండీ! మనిషిని చూచారు గదా! మీ కళ్ళకి ఎలా కనిపించిందో మరి!"

"అచ్చం సెట్ పైకి వెళ్తున్న తారలా కనిపించింది"

ఇద్దరూ కొంత సేపు మౌనంగా కూచున్నారు. మళ్ళీ ప్రసన్నే వుపక్రమించింది.

"ఏమండీ! ఒక మాటంటాను"

"ఏమంటావు?"

"మనకు చేతనైనప్పుడు యితరులకు మేలు చేయడంలో తప్పులేదు గదూ!"

"తప్పేముంది! పరోపకారార్థ మిదం శరీరం గదా ప్రసన్నా!"

"ఐతే నేను చెప్పినట్లు చేస్తారు కదూ!"

"మరీ హిరణ్యాక్ష వరం కాక పోతే సరి!"

"రమణమ్మని సినిమాలో చేర్పిస్తే?"

ఆ ఊహ వజ్రపాణిలో సైతం మెదుల్తోంది. కాని అతడు భార్యమాట కొట్టివేయ బోయాడు. "పాట బాగా పాడడ మొకటే చాలదు ప్రసన్నా వెండి తెరకి! మరికొన్ని అర్హత లుండాలి"

"ఆమెకి నటన కూడా క్రొత్త గాదుగా!"

వజ్రపాణి సీరియస్ గా ఆలోచిస్తూ కూచున్నాడు. ఆలోచించిన కొద్దీ అతడి భావస్రవంతి రెండుపాయలుగా చీలిపోసాగింది. ఒక వైపు రమణమ్మ దుస్థితికి జాలిపడుతూ, మరొకవైపున అతడు ఆవిడ నీస్థితికి తెచ్చిన రంగడి పైన లోలోపల మండి పడ్డాడు. నేడావిడ నిలువనీడ, పట్టుకొమ్మలేని నిరాశ్రయ! నా అన్నవారినుంచి వేరుచేసి పీడామెతలకెత్తిన సిరియిది! వీడెప్పటికైనా చెడిపోవలసిన వాడే! తనతో బాటూ యీడీమెను కూడా అధోగతి వైపు లాక్కెళ్ళ జూస్తున్నాడు. అలా జరుగుతుంటే చూస్తూ వూరుకోడానికి తన మనసొప్పడు. వారి బారినుండి ఈమెని కాపాడాలి. అందుకు ప్రసన్న సూచిస్తున్న విధానం సమంజసంగానే కనబడుతోంది!

[సశేషము]

# కలగూరగంప

## నాగరాజులు

శ్రీ కొత్త భావయ్య చౌదరి

మహాభారత యుద్ధకాలము మొదలు దాదాపు మౌర్యరాజుల కాలమువరకు ననగా (270 B. C) వరకు ఆంధ్రదేశమున నాగులు, యక్షులు, దానవులు మున్నగు తెగలవారు నివసించేవారు. నాగరాజులు ఆంధ్రదేశమున నేగాక, భారతదేశమందంతటను నివసించి పాలించిన దృష్టాంతములు గలవు. ఆర్యులు మన దేశమునకువచ్చి మందరగిరి ప్రాంత మథనకార్యమును సాగించినప్పుడే వాసుకియను నాగరాజు సాయపడి యుండెను. ఆదిశేషుడు, తక్షకుడు మొదలగువారీ వంశీకులే—

జనమేజయరాజు ఇంద్రప్రస్థపురినుండి పాలించుచు నాగులపై దండయాత్ర సలిపెను. అహిచ్ఛత్రము, నాగపూరు, పద్మావతీనగరము మొదలగు ఉత్తరదేశ ప్రాంతములనుండి ఆ కాలమున దక్షిణమునకు కొందరు వలస వచ్చిరేమో యని తోచుచున్నది. తర్వాత వీరికి భోగవతీపురము (బస్తరు) వనవాసి (మైసూరులోనిది) మొదలగు ప్రాంతములవరకు నివాసము లేర్పడి, యచట రాజ్యాధికారములు కూడ పొందినట్లు చెప్పవచ్చును—వీరు వింధ్యవాసినీ దేవత భక్తులని శాసనములలో చెప్పబడినారు. అందుచే మొదట వీరు వింధ్య పర్వత ప్రాంతీయులనుటలో సంశయముండదు. ఆంధ్రదేశమునందుండిన యక్షులు జైనమతావలంబులు కాగా, వీరు బౌద్ధమతావలంబులై యుండిరి. ఇది అశోకచక్రవర్తికి పూర్వమేయైయుండెను. నాగరాజొకడు అమరావతిలోని బౌద్ధ స్తూపమును నిర్మించెను. యక్షులలోని కుబేరకరాజు భట్టిప్రోలు ప్రాంతపు రాజుగానుండెను. యక్షుడొకడు వేదాదులు చక్కగానెఱిగి వానికి వ్యాఖ్యలు రచించిన పండితుడు. తెలంగాణాలోను, కృష్ణకు దక్షిణమునయున్న పలు గ్రామములందును నాగులు నివసించి, తర్వాత నాశనమై కొందరు వలసలకుపోయినట్లు అప్పటి కొన్ని గ్రామముల పేర్లవల్ల తెలియుచున్నది. వారి కప్పుట గల్గిన ప్రసిద్ధినిగూడ యివి రుజువుపరచుచున్నవి. ఈ క్రింది విషయములు వానిలో కొన్ని :

(1) నాగులేరు—ఈ చిన్నయేరు నాగులపేరిట పల్నాటి తాలూకాలో నిప్పటికిని ప్రవహించుచున్నది. పూర్వ నామమేమో తెలియదు.

(2) కొట్రాజుపాడు లేక నాగరాజుపాడు— ఇది తెనాలితాలూకా కొల్లూరు ప్రాంతమందుండెను. దీనిని త్రిలోచనపల్లవుడు నాశనము చేసినట్లు లోకలు రికార్డులు తెలుపుచున్నవి.

(3) తెలంగాణాలో ఒరంగల్లు ప్రాంతమున నున్న నాగులపాడను గ్రామము. ఇది యచట నాగుల యునికిని, వారి నాశనమును తెలుపుచున్నది.

(4) నెల్లూరు జిల్లాయందలి నాగుల వెల్లటూరను గ్రామము. ఇది వారి యునికిని తెలుపును.

(5) ఒంగోలు తాలూకాయందలి నాగులపాడను యూరు. ఇదిగూడ వారి యునికిని, తర్వాత నాశనమును విశదీకరించుచున్నది.

(6) నాగులపాడు — గుంటూరు జిల్లాయందలి పెదనందిపాడు దగ్గరి గ్రామము. పూర్వమిచట నాగులున్నట్లు, తర్వాత నాశనమైనట్లు ఋజువపఱచుచున్నది.

(7) నాగులవలస — నైజాములోని కమ్మంమెట్టు ప్రాంత గ్రామము. దీనినిబట్టి నాగు లొకప్పుడిచటికి వలస వచ్చుటను దెలుపును.

(8) కడపజిల్లాలోని దానవుల పాడను గ్రామము ఇది దనువు వంశీకులగు దానవుల యునికిని, తర్వాత నాశనమును తెలుపును. ఇంకను ఆంధ్రలో గల నాగసముద్రము, నాగవరం, నాగులవరం, సర్పవరం, నాగూరు (కుంట తాలూకా), నాగర్కల్ మొదలైన గ్రామములు ఆంధ్రలోను, కర్నాటక ప్రాంతములను ఉండి వారి పూర్వ ఉనికిని స్పష్టీకరించుచున్నవి. ఇట్లే నాగులు, దానవులు, యక్షులు తెనుగు దేశమున అనగా దక్షిణదిక్కున నివసించి భాషచే తెనుగువారని (దక్షిణదిక్కు వారని) ద్రావిడులని పేరందినట్లు కనబడుచున్నది. ఆంధ్రజాతి, మహాభాగవతము ప్రకారము బలి యను క్షత్రియ వంశీకులై యుండి వింధ్య ప్రాంతమునుండి కారణాంతరములచే దిగువకు వలస వచ్చిన కాలదిని మొదట నాగులతో యుద్ధము లొనర్చివారిలో కొందరిని (రాజులను) పారద్రోలినను, తెనుగుదేశమున స్థిరపడి, నాగులతో సంబంధ బాంధవ్యాలు కల్పించుకొని తమ రాజ్యమును పైతానుం

ధాన్యకటకములందు స్థాపించు కొన్నట్లు భావింప వచ్చును. నాగులలో నూతన నాగులను శాఖీయులు కొందరు లోబడిపోయి శాతకర్ణి రాజులవద్ద సామంతులుగా మెలంగుచు వచ్చిరి. శివస్కంద నాగ శాతక చివరి శాతవాహన రాజువద్ద శాతవాహన రాష్ట్ర ప్రతినిధి పాలకుడుగా నుండెను. ఈ వంశములో హారీతిపుత్ర విష్ణుకుద చూతుకులానంద శాతకర్ణి, యాతని కుమారుడు ధేనుసేన, కుమార్తె నాగ మూలానిక, మనుమడు శివస్కంద నాగశాతకర్ణి యను వారలుండిరి వీరందరును 3 వ శతాబ్దిని వనవాసిలో (మైసూరు ప్రాంతం) పాలకులుగా వసించిరి. శాతకన్న కలలాయ మహారధి, చూతకన్నన మహారధి, చూతకులానంద రాజుల నాణెములు కూడా ఆ ప్రాంతపు త్రవ్వకాలలో లభించినవి. వీనిని బట్టి శాతకర్ణరాజులకు, నూతవంశీయులకు, నాగరాజులకు గల సన్నిహితత్వము వెల్లడి యగు చున్నది.

ఆంధ్ర దేశమున నిట్లు నాగులు ఆంధ్రులలో లీనమగుచుండు కాలముననే మధుర దేశములోని పద్మావతీ ప్రాంతమున వారి రాజ్యములు వృద్ధియయ్యెనన వచ్చును. అచట భీమనాగ, స్కందనాగ, బృహస్పతి నాగ, దేవనాగ, విభునాగ, వ్యాఘ్రనాగ, గణపతి నాగ, యనువారి నాణెములా ప్రాంతమున దొరకినవి. వీరిలో భావనాగ, గణపతినాగ, నాగసేనులు గుప్త రాజుల సామంతులుగా నున్నట్లు కనబడుచున్నది. గుప్తరాజులతో నాగులు సంబంధము లొనర్చిరి. కుబేర నాగ యను నాగకుమార్తెను సముద్రగుప్తుని కొడుకు వివాహమయ్యెను సర్వనాగ యను నతడు అంతర్వేది (తెలుగుదేశము లోనిది కాదు) రాష్ట్ర పాలకుడుగా 465 క్రీ శ. ప్రాంతమున స్కందగుప్తునకు సామంతుడుగా పనిచేసెను. వీరి రాజ్యము క్రమముగా వృద్ధి నొందెను మధుర, పద్మావతి, కాంతిపురి, విదిశ రాజధానులుగా నేలిరి విదిశలో శేషనాగ, భోగినాగ, సదాచంద్రనాగ, రాజులు పాలించిరి. నాగభట్టు, యితనికొడుకు మహేశ్వర నాగరాజులు 4 వ శతాబ్దిని లాహోరు ప్రాంతమున పాలించిరి. వీరు వాకాటక రాజులతో గూడ బంధుత్వములు సల్పుచు వచ్చిరి. ఈ నాగులు శైవమత మవలంబించిరి. అందుచే భారశివ నాగులని పేరువహించి వీరు 10 అశ్వమేధ యాగములు గూడ చేసి మిక్కిలి ప్రసిద్ధి జెందిరి. వీరు కుషానుల రాజ్యమును కూలద్రోసిరి. భవభూతి మాలతీమాధవములో వీరి చరిత్రము కొంత కలదు. పద్మావతిలో 9 మంది నాగరాజులు పాలించినట్లు కనబడుచున్నది.

తెలుగుదేశపు నాగరాజులలో కొందరు భోగవతీపుర (బస్తరు) ప్రాంత పాలకులుగా ప్రసిద్ధి వహించిరి. వీరి విషయము 10 వ శతాబ్దినుండి తెలియుచున్నది. ధారావర్షుడను నాగరాజు కులోత్తుంగచోడ చక్రవర్తి సామంతుడుగా నుండెను. ఈ బస్తరు ఇంద్రావతీనది కిరుప్రక్కల నున్నది. అహిచ్ఛత్రము నందు వీరి రాజ్యము పూర్వముండెను అందలి ధారణేంద్రుడే సింధుజాతి నాగులకు మూలపురుషుడు. కదంబరాజులకు వీరికి సంబంధము లుండెను. బస్తరు దేశము భ్రమరచక్రకోట్యమండల మనబడు చుండెను. ఇచటి నాగరాజులు వింధ్యవాసినిదేవత భక్తులు-కాశ్యప గోత్రులై యుండిరి.

క్రీ. శ. 1065 సం॥ నాటికి ఈ నాగరాజులలో మధురాంతకదేవుడు, సోమేశ్వరదేవుడు అనువారు ప్రత్యర్థులుగా నా దేశమున నుండిరి. ఈ చక్రకోట్యమండలమును వరుసగా క్రీ శ 1111 లో సోమేశ్వర పుత్రుడు కన్నరదేవుడును, తర్వాత రెండవ (వీర) సోమేశ్వరుడును, జిమ్మట నరసింహదేవుడును, తుదుపరి జయసింహదేవుడును, తర్వాత హరిశ్చంద్రదేవుడును 1324 వరకు పాలించిరి ఈ ప్రాంతము తర్వాత కాకతీయ వీరప్రతాప రుద్రరాజు తమ్ముని పాలనలోకి వచ్చినట్లు కనబడు చున్నది. ఈ ప్రాంత నాగరాజుల శాసనములు తెలుగులోను, సంస్కృతమునను ఉన్నవి. వీరి దేశములో కొంతభాగము గోండుభాష యున్నది. వీరిలోని హరిశ్చంద్రదేవుని భార్య, మాణిక్యదేవి భర్త మరణించినపుడు సహగమన మొనరించెను. ఈ యాచారము సర్వత్ర అనుసరింపబడలేదు.

ఆంధ్రదేశములో 3 వ శతాబ్దినుండి నాగుల ప్రతిభ తగ్గి, ఆంధ్రుల ప్రతిభ హెచ్చినకొలదిని దేశమునకు ఆంధ్రపథ మనే పేరువచ్చెను. 3 వ శతాబ్ది లోని ప్రాచీన పల్లవ శాసనాలలో ఈ పేరే యున్నది.

క్రమముగా సింహళ (లంక) రాజ్యమునకు కూడ నాగులు ప్రాకిపోయిరి. వేలకొలది నాగులు పల్లెనాడు నుండి యచటికి వలసబోవుటయే గాక క్రమముగా రాజ్యములు స్థాపింపగల్గిరి. మహావంశము ప్రకారము క్రీ. శ 956-72 మధ్య నాల్గవ మహింద యను నాగ రాజులంకలో పాలించుచు వచ్చినట్లు కనబడుచున్నది. తత్పూర్వము చాలకాలమునుండి యా వంశీకు లిచట పాలింపదొడగిరి.

నాగరాజుల రాజ్యములు నశించినను, నాగశబ్దం తెలుగు దేశమునందు నేటికి విరివిగా వాడబడుచున్నది. నాగానిక, నాగన్న, నాగవర్మ, నాగేంద్ర, నాగమ్మ, నాగరత్నం మున్నగు పేరులు నాటినుండి నేటికి ఆంధ్రులలో వాడుచున్నారు. మగధ రాజ్యములో అశోకచక్రవర్తికి పూర్వమే శిశునాగవంశీకులు పాలించుచు వచ్చినట్లు పురాణములు నుడువుచున్నవి. నాగజాతి ప్రాచీనతకిది యొక గొప్ప దృష్టాంతముగా నున్నది.

# హరివంశ గద్య

శ్రీ కొడవంటి శంకర నరసింహ బ్రహ్మం

సోముని హరివంశ గద్య ఒక విశిష్టఫక్కిలో ఉన్నదనుట యెల్లరెరింగిన విషయమే. అది ఈ రీతిగా నున్నది—"ఇది శ్రీ మదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బయిన శ్రీ మహాభారతానంతరంబున శ్రీమత్సకల భాషాభూషణ...నాచన సోమనాథ ప్రణీతంబైన..." ఈ ప్రకారముగా నాతనికి ముందుగాని వెనుకగాని యెవ్వరును రచించినట్లు తోపదు. ఇతని గద్యలోని ఈ విశేషమును పలువురు గుర్తించినారు, ఇట్టి విధానము నవలంబించుటకు గల కారణము నూహించుటకును ప్రయత్నించినారు. వావిళ్ళవారి ఉత్తర హరివంశ ముద్రణమునకు పీఠిక వ్రాయుచు "సోమనాథుడు తన గద్యమున 'బుధారాధన విరాజి...' అని తిక్కన తర్వాతం దన పేరే పేర్కొనదగిన దన్నట్లు తన యభిప్రాయమును దెల్పుకొన్నాడు గాని విద్వల్లోకము, తిక్కన తర్వాత నెఱ్ఱాప్రెగ్గడ పేరే పేర్కొన్నది; కవిత్రయమని నన్నయ తిక్కన యెఱ్ఱనలకే పేరయ్యెను" అని కీ. శే. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు తమ యభిప్రాయమును బ్రకటించి యున్నారు. శ్రీ చాగంటి శేషయ్యగారు తమ ఆంధ్ర కవి తరంగిణి నాల్గవ సంపుటంలో "ఈ కవికిం దిక్కన సోమయాజి కవిత్వమునందుం జాల గౌరవము కలదనుటకు గద్యలో వ్రాసిన 'ఇది శ్రీమదుభయకవిమిత్ర ..' అను వాక్యములే నిదర్శనములు. తిక్కన సోమయాజి కవిత్వముతో సమానమైన కవిత్వము వ్రాయం గలవాడ నను భావ మీ కవికిం గలిగియున్నట్లే వాక్యములు సూచించుచున్నవి" అని శాస్త్రిగా రూహించిన కారణమునే కాక ఇంకొక దానిం గూడ నిట సంభావించినారు. ఇరువురును తమ గ్రంథముల హరిహరనాథున కంకిత మిచ్చియుండుట కారణముగా సోమన ఇట్టి గద్యము రచించెనని ఇంకొక రూహించినట్లు నాకు జ్ఞాపకము. అందుకు వెంకటనాథ కవి తన పంచతంత్రమున జెప్పుకొనిన 'క. విచనవు గలుగు హరిహర సాచివ్యము నొంద నవ్యజనులకు మది నాలోచింపం దిక్కయజ్వకు నాచన సోమునకు నటియు నాకుగ దక్కెన్' (1. 25) పద్యము కొంతవర కాధారమును కొందును. ఈ పై యూహాలం దేదియు నాకంత సమంజసముగా దోప లేదు.

ప్రతాప రుద్రునితో గాకతీయ రాజ్య మంతరించిన వెనుక నొకవంక విజయనగర సామ్రాజ్యమును వేరొకవంక రెడ్డి పద్మనాయక రాజ్యములును అవతరించినవి. కాకతీయ రాజ్యమునందలి ఉద్యోగులును సామంతులును స్వతంత్ర ప్రభుత్వముల నెలకొల్పినారు. అట్టివారిలో ప్రతాపరుద్రుని గజసాహిణిగా, క్రీ. శ. 1311 నాటి కురిజాలశాసన మాధారముగా సోమదేవ రాజీయ ముపబలకముగా, నిర్ధారితుడైన సాహిణి మారన యొకడు. ఇతడు భాస్కర కవికృత రామాయణమునకు కృతిభర్త. ఎఱ్ఱన హరివంశమును గృతిగొన్న వేమారెడ్డియు క్రీ. శ. 1324 మొదలుగా రాజ్యమొనర్చెను. క్రీ. శ. 1335 సంవత్సరమున సంగమ వంశీయు లయిన హరిహరరాయ బుక్కరాయ సోదరులు విజయనగర నిర్మాణమొనర్చి స్వతంత్ర రాజ్యమును స్థాపించినారు. హరిహరరాయలు క్రీ. శ 1343 లో గతింపగా బుక్కరాయలు రాజయ్యెను. ఇతడు నాచన సోమనాథునకు దానమొనర్చి వ్రాయించిన శాసనమున్నదని చారిత్రకులు చెప్పుచున్నారు. దానిం బట్టి సోమనాథుడు విజయనగ రాస్థానమునకు జెందిన వాడని తెలుసుకొనవచ్చును. ఆ శాసనమున దానకాల మిట్లున్నది 'అలంకృతే శకస్యాబ్దే రసభూ నయనేందుభిః, తారణాబ్దే చైత్రమాసే నవమ్యాం శుక్లపక్షకే,' అని. అనగా శక 1216 అగును అది తారణాబ్దము కాదు అనుట నీ పాఠము దప్పనియు 'రసాబ్ధి', 'రసర్తు' అని పఠించినచో తారణకు సరిపోవుననియు, నట్లైనను 'రసాబ్ధి' అనుటచే నగు శక 1206 సంవత్సరమున కింకను విజయనగర నిర్మాణాదులు సంభవింపకుండుటచే 'రసర్తు' అనునదే సరియైన పాఠము కాగలదనియు కీ. శే. శ్రీ ప్రభాకర శాస్త్రిగారు నిర్ణయించి శాసనకాలమును శక. 1266 కు సరియైన క్రీ. శ. 1344 గా నిరూపించినారు. బహుశః ఈ దానము హరివంశ రచనానంతరమే అయి ఉండవచ్చును. శ్రీ చాగంటి శేషయ్యగారును ఇట్టి అభిప్రాయమునే ప్రకటించినారు. అయితే ఇక్కడ ఒక చమత్కారము నూహించవచ్చునేమో! సోమనాథుని హరిహరనాథ సంబోధనములో దన ప్రభువైన హరిహరరాయలును గర్భితుడనుట కేవల మపోహ గాదనుకొందును. 'వేయు నేటికి నలపాండవ వేయు సాటవ, వీరుడిల లేడు; ప్రతి రఘువీరుడొకడు' అనినప్పుడు విజయవిలాసకారుడు తన ప్రభువైన రఘునాథ నాయకుని లక్షింపలేదా?

భాస్కర యెఱ్ఱన సోమనలు క్రమముగా సాహిణి మారన దేసటి వేమారెడ్డి సంగమ హరిహరరాయల యాశ్రితులు. మూడు సంస్థానములకు జెందినవారు. సమకాలికులు. అట్టివారికి అన్యోన్య స్పర్థలుండ కుండునా? 'ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా' అన్న కవి స్వానుభవోక్తి ఉన్నదే కదా! తత్తదాస్థానములను నూతనోదితములై స్వీయాధిక్య ప్రకటనోన్ముఖములైనచో ఇక చెప్పవలసినదేమి? ఎఱ్ఱన రామాయణ రచన మారంభింప భాస్కరుడును పూని శీఘ్రసమాప్తి నాశించి శిష్యవర్గముచే గొంత చెప్పించుట తటస్థించియుండును. ఎఱ్ఱన రామాయణమునుండి దానిని ప్రత్యేకించుటకే లోకము దానిం భాస్కర రామాయణమన్నది. ఈవంకను విషయమిట్లు సాగగా, హరివంశ రచనారంభమున ఎఱ్ఱనకు సోమునితో పడినది. ఇట్లని ఈ మువ్వురు కవులును తమ తమ రచనలకుముం దితరుల గ్రంథములను చూచియుండురనగాదు. ఆయా రచనలు సమకాలమున సాగియుండును. నాచన సోమనాథుడును ఎఱ్ఱన హరివంశాంధ్రీకరణ ప్రారంభమునుగూర్చి వినియుండును. ఎఱ్ఱన యానాటికి భారతారణ్య పూరణ మొనర్చి భారతకవులలో లెక్క వేయించుకొన్నాడు. హరివంశమును 'భారత పరాంశమని యింపారంగం జెప్పుదురు బుధులు' కాగా భావిజన నిర్ణయ మెట్టెట్టి తీరుల వెలయగలదో? ఎఱ్ఱన కృతి తొలిదనియు దానద్దాని జూచియే మొదలిడెననియు మొదలైన అపోహలకేల తావివ్వవలెను. తాను సాహిత్యరస పోషణుడును సంవిధాన చక్రవర్తియు నవీనగుణసనాథుడును గదా! తన ప్రబంధమెట్లును ఎఱ్ఱన కావ్యమునకన్న సుందరతరమై యుండకతప్పదు. అట్టి పరిస్థితులలో హేతువాదులైన విమర్శకులు సాధారణ కావ్యమునకన్న విశేష కావ్యమావిశేషతయే కారణముగా విశేషతా సంపాదనారంభమూలకముగా నుద్భవించిన యనంతర కృతియని నిర్ణయింపకుందురా? అట్టి ప్రమాద మొదవకుండుట కుపాయము నూహించి సోమనాథు ఒక క్రొంగ్రొత్తమార్గమును ద్రొక్కియుండు నని నేను భావింతును. ఈ సమాధానము తత్కాలపరిస్థితుల సమాలోచనముచే సమంజసమనియు దలంతును. తిక్కన భారతరచనము తరువాత హరివంశము నాంధ్రీకరించినది తానే, అనగా ఎఱ్ఱన తన తరువాతనే యారంభించెనుగాని ముందుగా గాదని తెల్పుకొను మాత్రమే ఇది.

# ఇండొనీషియా దీవులలో భారతీయ శిల్ప సంప్రదాయం

క్రీ. పూ. 2వ శతాబ్దంనుంచీ, క్రీ. శ. 7, 8 శతాబ్దుల వరకూ, భారతదేశానికి పుచ్ఛరూపంలో వున్న ఇండొనీషియా దీవులు, భారతదేశంలోని భాగంగానే వుంటూ భారతీయ ప్రభువుల సామ్రాజ్యభాగాలుగా మహోన్నతస్థితి ననుభవించాయి. ఈ దీవుల నాగరకతపైన సంస్కృత భాషా ప్రభావమూ హిందూ బౌద్ధమతముల ప్రభావమూ ఉత్కృష్టమైనది. ఈ దీవులలో చిరకాలం భారతీయ శిల్పశాస్త్రం శిల్ప సంప్రదాయం విశేష ప్రచారంలో వుండేవి. 7వ శతాబ్దిలో ఈ దీవులపై అధికారం వహించిన శాతవాహన చక్రవర్తి శ్రీ విజయుడు ఈ ద్వీప సముచ్ఛయాన్ని శిల్పారామాలుగా తీర్చి దిద్దటానికి సర్వతోముఖంగా ప్రయత్నించాడు. ఈ దీవుల సాంస్కృతిక జీవితచరిత్రలో శ్రీ విజయుని నామం సువర్ణాక్షరాలలో లిఖింపదగ్గది.



విఘ్నేశ్వరుడు

జకార్తా మ్యూజియంలోని శిల్పం.



చ తు ర్ము ఖు డు
ప్రాంబనంలోని చతుర్ముఖ బ్రహ్మదేవాలయం.



ప ర మే శ్వ రి
జకార్టా మ్యూజియంలోని శిల్పం.



మ హా వి ష్ణు వు
ప్రాంబనం చతుర్ముఖ దేవాలయంలోని ఒకశిల్పం.



ఉమా మహేశ్వరులు
ప్రాంబనం దేవాలయంమీది ఒకశిల్పం.

# గ్రంథ విమర్శనము

## హిందీ సాహిత్యము

[ప్రథమ భాగము]

రచన: శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి; ప్రచురణ: శ్రీ వేంకటేశ్వర హిందీ సాహిత్య పరిషత్తు, తిరుపతి; వెల 3-8-0.

హిందీ సాహిత్యం తెలుగు నాట విస్తృత వ్యాప్తి పొందుతున్నా; హిందీ సాహిత్య చరిత్రను గాని, హిందీ సాహిత్య సంప్రదాయాలను గాని ద్యోతమానం చేసే రచనలు తెలుగులో లేవు. అందుచేత హిందీ సాహిత్యాన్ని అభ్యసించుతున్న తెలుగు వారిస్థితి అయోమయావస్థగా వుంది. ఏ గ్రంథం చేతికి దొరికితే ఆగ్రంథం చదవటం వినా, ఆగ్రంథం యెప్పుడు, ఎట్టి పరిస్థితులలో ఎందుకు వ్రాయబడినదో తెలుసుకుని విమర్శనా దృష్టితో చదివి ఆనందించే అవకాశం లేకుండా వుంది. ఇట్టి విమర్శనా దృష్టిలేని చదువు గ్రుడ్డివాళ్లు ఏనుగును అర్థం చేసుకున్న కథగా పరిణమించుతోంది. హనుమచ్ఛాస్త్రిగారు ఈ అయోమయావస్థను నివారించటానికి పూనుకోవటం ముదావహం.

ఈ ప్రథమ సంపుటిలో హిందీ సాహిత్యంలోని ప్రాచీన భక్తియుగాలను రెంటినీ సమీక్ష చేశారు. అనగా క్రీ. శ. 1700 వరకూ. దీల్లో ప్రాచీన యుగంలోని తొలిభాగం కొంత ప్రత్యేక వ్యాసరూపంలో భారతిముఖాన లోగడ పాఠకులకు అందజేసి వున్నారు.

ఈ సమీక్షలో ఎడనెడా విస్తృతావధిని అనేక ఉదాహరణ లిస్తూ వచ్చారు. అమాత్రికలను పద్యాలను పద్యానువాదములనూ, పదాలను గేయానువాదాలనూ చేసి సంపుటీకరించారు. కొన్నిటికి వచనానువాదాలు కూడా వున్నాయి. ఈ అనువాదాలు ముచ్చటైన సులభశైలిలో వున్నయ్. మచ్చుకు సూరదాసు గేయాన్ని ఒక దాన్ని తీసుకుని దానికి హనుచ్ఛాస్త్రిగారి అనువాదం పరిశీలించుదాం. సూరదాసు గేయం:

" ఖంజననైన రూపరసమాతే
అతి పైచారు చపల అనియారే,
పల్ పింజరా నసమాతే
చలిచలి నికట శ్రవనన్ కే
ఉలటి ఏలటి తాటంక ఫందాతే
'సూరదాస్' అంజనగున అటకే,
నతరు అమ్హి ఉడిజంతే "

శాస్త్రిగారి అనువాదం:

నయన ఖంజనము లానంద మగ్నములయ్యె
రూప రసమును గ్రోవికైపు గొన్నవిస్వామి!
చారు చపలములు సారెకు పర్వెత్తు
పక్ష్మ పంజరములబడియుండ నొల్లవు
శ్రవణ సన్నిధిజేరి చలపట్టి యూపెను
నటనున్న చెవికమ్మ లిటు నటునూగాడ
అంజన గుణ మొక్క ఆధారముగ నిల్చు
బిలబిలబోకున్నె పిట్టలు లేకున్నె.

ఇలా అనువాదాలు యివ్వటమే గాక పోలికలున్నచోట ప్రసిద్ధ సంస్కృతాంధ్ర కవుల శ్లోకాలనూ పద్యాలనూ ఎత్తి చూపి తులనాత్మక విమర్శను సంతరించారు. శ్రీ శాస్త్రిగారు ఆంధ్ర సంస్కృత హిందీ వాఙ్మయాలలో విశేష కృషి చేసినవారు ఇట్టి ప్రతిభావంతులు ఈ కార్యానికి పూనుకోవటం ఒక విశేషం. హిందీ నభ్యసించుతున్న వారికే గాక, హిందీ రాని యితర కావ్యరస పిపాసువులకు కూడా యీ గ్రంథం మిగుల ఆహ్లాదజనకంగావుంది. ఇల్లాంటి విమర్శ గ్రంథాలను సంఘటించటం అనంతమైన శ్రమతో కూడిన పని. అయినా శ్రమకు తగినంతగా గ్రంథం ప్రచారంలోకి రావటం కష్టం. విశేష వ్యయప్రయాసల కోర్చి ఈ తొలిభాగాన్ని ప్రచురించినట్లు రచయిత చెబుతున్నారు. ఆంధ్ర ప్రజలు ఈ తొలి భాగానికి తగిన ప్రోత్సాహమిస్తే రచయిత రెండవ భాగాన్నికూడ త్వరలో మనకు అందజేయ నుద్యమించటానికి సావకాశంగా వుంటుంది.

తె. సూ.

## మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార సాహిత్య కరపత్రం

శ్రీ టి. చంద్రశేఖరన్ గారి సంపాదకత్వమున వెలువడుతున్న సాహిత్య విషయక కరపత్రములలో 9వ సంపుటిలో ఇది ఒకటవ కరపత్రం. వెల 2-0-0; ఇందులో మల్లాణకవి శివస్తుతిని, మునిమోళి, కరుణాకర మాలై అను అరవ గ్రంథములను, శ్రీప్రసన్న వెంకటేశ్వర విలాసము అను తెలుగు కృతిని, చోళరాజ సాంగత్య అను కన్నడ రచనను, పూనా పెట్ కైఫీయతు అను మహారాష్ట్రి కబ్బాన్ని, ఒత్తక్కొల్పిడిత్తం అనే మళయాళీ రచనను, తాజ్కే రాత్-అల్-అన్సాబ్ అన్న ఉర్దూపత్రాన్ని అచ్చువేశారు. ఇవి అన్నీ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో తాటియాకుల మీదగాని, కాగితాల మీదగాని వ్రాసి వున్న వాటి వాటి ప్రతులు ఆధారంగా అచ్చు ఒత్తబడినాయి.

ఇందులో మల్హణుని స్తుతి (శివస్తుతి) సంస్కృత కావ్యం. దీనికి మల్హణస్తవం అనికూడా పేరువుంది. దీనికి దేచయామాత్యుడు టీక వ్రాశారు. భాండాగారం వారు టీకతో సహా ప్రకటించారు. మల్హణుని కవిత్వం ఎంత రసవంతంగావుందో, దేచయగారి టీక కూడా అంతటి అందంగాను వుంది. సంస్కృతం సామాన్యంగా చదువుకున్న వాళ్లకుకూడా అర్థమయ్యే పద్ధతిలో ఈ టీక రచింపబడింది. ఈ దేచయామాత్యుడు నాదిండ్ల గోపన్ననృపతికి మంత్రిగా వుండేవాడు.

ప్రసన్న వేంకటేశ్వర విలాసం దళవాయివంశ ప్రభువర్యుడైన తిమ్మభూపాలుని చేత రచితం. ఇతడు (1700.32) 18 వ శతాబ్దంనాటి వాడు. ఈ దళవాయి వంశజులు రాయదుర్గం పాలకులు. విష్ణుభక్తులు. ఈయన మరీను తాను నాయకగా, రాయదుర్గ ప్రసన్న వేంకటేశ్వరస్వామి నాయకుడుగా భావించి మధుర భావంతో విశిష్టాద్వైతాన్ని ఈ యక్షగానంలో గానం చేశాడు. "ఇందులో జంపె, జాతిజంపె, కుఅదజంపె, త్రిపుట, ద్విపద,ఏల, షట్పద మొదలగు వివిధ దేశీ ఛందోరీతులు, తోడి, కళ్యాణి, శంకరాభరణము, కాంభోజి, బిళహరి, కేదారగౌళ, కన్నడ, పంతువరాళి, భైరవి, సావేరి మున్నగు కర్నాట రాగపూరితములగు పదములు, పాటలతోను సిద్ధహస్తుడైన ఈ కృతికర్త" రచించాడు. దీన్ని సంస్కరించి ప్రకటనకు సిద్ధము చేసిన శ్రీ వి. రా. ఆచార్య మధురభావం ఇందులో పుక్కిలికి వచ్చినట్లు రూపించదలచినారుగాని, నిజం చూస్తే, ఆ భావం ఇందులో పరాకాష్ఠను అందుకో లేదనే చెప్పవలసివుంది. గ్రంథం చదువుతూ వున్నప్పుడు మానవ శృంగారాతీతమైన దైవశృంగారభావం అనుభవానికిరాదు. భాగవతం దశమస్కంధం చదువుతున్నప్పటి పవిత్ర మధురభావం కల్గదు.

హా. శ.

## భారతీ వ్యాసములు

కర్త- శ్రీ బులుసు వేంకటేశ్వరులు; ప్రకాశకులు: బి. వి. & సన్సు, రామారావుపేట, కాకినాడ; మూల్యము రెండు రూపాయలు. గ్లేజు కాకితము. క్యాలికో బైండు మూడు రూపాయలు.

'భారతిలో' శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారప్పుడప్పుడు ప్రకటించిన సారస్వత వ్యాసముల సంపుటమే ఈ గ్రంథం. ఇందులో ఆంధ్ర సారస్వత దృక్పథము, ఆంధ్రకథానక కావ్యములు - భోజరాజీయము, వైయాకరణుని కావ్యగౌరవము, తెనాలి రామకృష్ణుని రమ్ముడు మొదలయిన పన్నెండు సాహిత్య వ్యాసాలు సంకలింపబడినవి. ఆంధ్ర సారస్వతదృక్పథం అన్న తొలివ్యాసంలో నన్నయాది తెలుగుకవుల సారస్వత దృక్పథాలను వారివారి గ్రంథాలనుబట్టి నిరూపించి వివరించడానికి ప్రయత్నం జరిగింది. ఆంధ్రకథానక కావ్యములు, భోజరాజీయము అన్న వ్యాసంలో భోజరాజీయ ప్రబంధానికి సంబంధించిన సమస్తవిషయాలూ సాకల్యంగా చర్చింపబడినవి. కాని ఈ వ్యాసంలో తెలుగులోని సంస్కృత కథానక కావ్యానువాదములను పేర్కొంటూ వాటిలో 'శాలివాహ గాథా సప్తశతి'ని కూడా ఒకటిగా చేర్చడం జరిగింది. శాలివాహన గాథాసప్తశతి కథానక కావ్యంకాదు. అది సంకలన గ్రంథం. సంస్కృత కథానక కావ్యం అనడం మరొక పొరబాటు. జక్కన విక్రమార్క చరిత్ర సంస్కృతానువాదం కాదు. సంస్కృత విక్రమార్కచరిత్రకూ, తెలుగు విక్రమార్క చరిత్రలోని కథలకూ ఎట్టి సంబంధమూ లేదు అసలు ఇందులో కేతన దశకుమారచరిత్ర, కూచిరాజు ఎఱ్ఱయ సకలకథానిధానం, బేతాళపంచవింశతి మొదలయిన కథానక కావ్యాలను గూర్చిన ప్రస్తావనే లేదు. 'ఆంధ్ర సంవాద కావ్యములు' అన్న వ్యాసం తెలుగులో వెలసిన రాధామాధవ సంవాదం మొదలయిన సంవాదకావ్యాల చరిత్ర తెలుపుతున్నది. చివర భాసుని అభిషేక యజ్ఞఫల నాటకములను గూర్చిన విమర్శ వ్యాసములున్నది. సాహిత్య విమర్శకు సంబంధించిన వ్యాసములన్నీ ఒకచోట. దానికి తరువాత ప్రత్యేక కావ్యాలకు సంబంధించిన విమర్శవ్యాసాలు ఆతరవాత సంస్కృత వాఙ్మయానికి సంబంధించిన వ్యాసాలు అన్న క్రమంలో ఈ వ్యాసాలు ముద్రింపబడి ఉంటే బాగుండేది. అలా కాకపోవడంతో పాఠకుడికి రచయిత యేర్పరుచుకొన్న ప్రణాళిక యెట్టిదో బోధపడనిస్థితి యేర్పడ్డది. కాని యిందులో చేర్చబడిన వ్యాసములన్నీ విషయసంపన్నములై సాహిత్యపరిచయక సమర్థములై విజ్ఞానప్రదములై ఉన్నవనడంలో సందేహం లేదు. ప్రత్యేకించి భోజరాజీయము, కవితామృతము, ప్రాచీనాంధ్రశతక పరిశీలనము అన్నవి ఆయా విషయాలకు సంబంధించిన సమగ్ర వ్యాసములు. ఆంధ్రసాహిత్య విద్యార్థుల కీగ్రంథ మత్యంతోపయుక్తం కాగలదు.

కో. రా.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by
S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty
Street, Madras—1. Editor: S. Sambhu Prasad.

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

జూలై 1956

సంపుటము 33 : : సంచిక 7

విడిపత్రిక వెల ఒక రూపాయి



# ఇది నిలబెట్టవలసిన సమస్య...

బైసికిల్‌ను అతిసునాయా
సంగా నిలబెట్టవచ్చు, కాని
బైసికల్ ఖర్చులను భరించటం
అంతసులభం కాదు. వాడినకొద్దీ
ఖర్చు అవుతుంది. సెన్
రాలే వారు ముడిపదార్థాల
ఉపయోగంలో వహించే
అత్యంత శ్రద్ధ ప్రతి విభా
గంమీద కార్ఖానా వారి పర్య
వేక్షణ సెన్-రాలే బైసికిళ్లను
అత్యధమపు రిపేరీలు భాగాల
మార్పులతో దీర్ఘకాలం
మన్నింప జేస్తాయి. ఈ
విధంగా సక్రమంగా
నిలబెట్టగలరు.

# రాలే రాబిన్ హుడ్




SRC-39 TG

# విషయానుక్రమణిక

## జూలై 1956

# అద్వితీయం

శ్రీ బాలగంగాధర తిలక్

నా మీద నీ చూపు చీకట్లు ముసురుకొని
నీ మీద నారూపు వెన్నెలలు పరచుకొని
నా కలల నీ పెన్నెరుల అల లొక్కపరి పొంగి
నీ కనుల నాకాంక్ష లాసజ్యధనువులై వొంగి
నా గుండె నీపాట బాడబమ్మై రేగి
నీ తనువు నా కౌగిలిని తటిద్గానమై సాగి
అటు కాల మిటు విశ్వ మొక్క త్రుటిలో ఒదిగి
ఇటు నా బ్రతుకు కొసల నీవు, నీ బ్రతుకు మొదల నేను
నీవు నా ఆశ కవధివై, నేను నీ స్త్రీత్వమున కాహుతినై
నా బ్రతుకు పచ్చనిగట్ల నీవు మిన్నాగువై చుట్టుకొని
నీ స్త్రీత్వంపు నెత్తురుబొట్ల నేను ఎరుపెరుపు రూపమ్ము దాల్చుకొని
నీ వీ భీకర మధ్యాహ్న ఆతపమ్మున నాలోని పురుషత్వమ్ము వెదకికొని
నే నీ శరత్పూర్ణిమల నీ నగ్నలాలసనిమ్నగల యీదుకొని
ఓ ఋతురాజ్ఞి ! నా తనువెల్ల నీ అనుకూల పవనములు వీచి
ఓ సురతాణి ! నీక్రతుహోమగుండమున నా జీవితమునే వ్రేల్చి
నీలో కొలది కొలది నశించు నాలో తరతరమ్ములు వికసించి
నాలో ఒదిగి ఒదిగి ఆక్రమించు నీలోపల నే కదలి పునరుద్భవించి
ఇది సృష్టి ! ఇది మిథస్సమాశ్లేషచకిత తనుయష్టి ! నే నొక్క పరమేష్ఠి,
నిది నీవు, యిది నేను, యిరువుర మొకటైన యీ నిమేషమ్ము విశ్వరహస్యమ్ము

# ఋగ్వేదములోని ప్రధానఋషులు

శ్రీ రాహుల్ సాంకృత్యాయన్

ఇంద్ర, అగ్న్యాది మానవేతరములు, కల్పితములైన పేర్లను వదలి మిగిలినవి లెక్కించినయెడల మొత్తమీ ఋషుల సంఖ్య 300కి పైగానే ఉంది వీరిలో పూర్వులు అంగిరసుడు, రాహుగణుడు, కుశికుడు అనువారలు. ఇంతకంటె పూర్వీకుల గాథలు కానరావు. వీరితర్వాత చెప్పుకోదగినవారంతా ఒకేఒక సమూహముగ నుండిరి, వారి పేర్లు భరద్వాజుడు, కాశ్యపుడు, గౌతముడు, అత్రి, విశ్వామిత్రుడు, జమదగ్ని, వసిష్ఠుడు. ఋగ్వేదములోని పది ఖండములను వరుసగ చూచినపుడు, రెండవ ఖండములో గృత్సమదుడు, మూడవఖండములో విశ్వామిత్రుడు, నాల్గవ ఖండములో వామదేవుడు, ఐదవ ఖండములో అత్రి, ఆరవ ఖండములో భరద్వాజుడు, ఏడవఖండములో వసిష్ఠుడు, ఎనిమిదవ ఖండములో కణ్వుడు ప్రధానులుగ కానవగుదురు ఒకటవ, తొమ్మిదవ, పదియవ ఖండములలో ఏయొక్క ఋషియు లేక వారి కులగోత్రాలు కాని ప్రధానముగ కానరావు బౌద్ధ "త్రిపిటకము" దీర్ఘనికాయముయొక్క తేవిజ్జసుత్త 1-13 లోను మరియు ఇతరత్రాను, మంత్రకర్తలుగాను, మంత్రప్రవక్తలుగాను, అష్టకుడు, వామకుడు, వామదేవుడు, విశ్వామిత్రుడు, జమదగ్ని, అంగిరసుడు, భరద్వాజుడు, వసిష్ఠుడు, కాశ్యపుడు, భృగుడు మొదలగు ఈ పదిమంది ఋషులే లెక్కింపబడిరి. ఇందులో వామకుడు పేరుగల ఋషి ఋగ్వేదములో కనిపించుటలేదు. కాని మిగిలినవారందరి మంత్రాలు ఋగ్వేదములో లభ్యమగుచున్నవి. వీరిలో ఎక్కువ మంత్రకర్తలు, వసిష్ఠుడు, భరద్వాజుడు, వామదేవుడు, విశ్వామిత్రుడు. క్రమముగ వారి మంత్రాల సంఖ్యావివరములు ఇక్కడ పొందుపరచబడుచున్నవి—వసిష్ఠుడు 103, భరద్వాజుడు 60, వామదేవుడు 5[illegible], విశ్వామిత్రుడు 48, గృత్సమదుడు 40, కక్షీవానుడు 27, అగస్త్యుడు 26, దీర్ఘతముడు 25, గౌతముడు 20, మేధాతిథి 20, శ్యావశ్వుడు 15, కుత్సుడు 14, మధుచ్ఛందుడు 10, ప్రస్కణ్వుడు 9, పరాశరుడు 5, జమదగ్ని 5—తక్కువ వ్రాసినప్పటికి మహత్త్వమైనవి వ్రాసినవారు—కసీషుడు 4, బృహస్పతి 2, హర్యశ్వుడు 1, అపాలా (స్త్రీ) 1, అష్టకుడు 1, కుశికుడు 1, సుదాసు 1.

## ఋగ్వేదములోని ఆర్యుల పురోహితులు, ఆర్యరాజులు, ప్రదేశములు.

| పురోహితులు | ఆర్యరాజులు | ప్రదేశములు |
|---|---|---|
| (1) భృగుడు | దృహ్యుడు | పరుష్ణీ, అసిక్నీల మధ్య |
| (2) అత్రి, గృత్సమదుడు (ఐదవఖండము) | పురూ | విపాశ, శతుద్రిలమధ్య |
| (3) భరద్వాజుడు (ఆరవఖండము) | దివోదాసు<br>సుదాసు (భరత) | పరుష్ణీ, విపాశలమధ్య |
| (4) వసిష్ఠుడు (ఏడవఖండము) | సుదాసు (భరత) | ,, |
| (5) విశ్వామిత్రుడు (మూడవఖండము) | సుదాసు (భరత) | ,, |
| (6) దీర్ఘతముడు, మామతేయుడు | భరత—త్రుత్సుడు | ,, |
| (7) కణ్వుడు (ఎనిమిదవఖండము) | తుర్వశ—యదుడు | పరుష్ణీ అసిక్నీలమధ్య |

అనువాదం: శ్రీ వల్లూరి వీర్రాజు

ఎక్కువ మంత్రాలు రచియించినందువలన నేమి, చారిత్రికముగ నేమి, ఈ ఆర్యజనుల పురోహిత ఋషులకు ఎక్కువ ప్రాధాన్య మివ్వవలసివచ్చినది. వయస్సులో చిన్నా-పెద్దా వున్నా, అంతా సమకాలీనులే వీరిలో భరద్వాజుడు, వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, సుదాసుని దాశరాజ్ఞ యుద్ధ సమయపు వారగుటవలన వారి మాహాత్మ్య మెక్కువగనున్నది. ఈ సంఘర్షణలో వసిష్ఠ, విశ్వామిత్రు లెక్కువగ కలుగజేసుకొనిరి. ఆ యుద్ధకాలము ఇంచుమించు క్రీ. పూ. 1200||లు; ఆర్యులు సప్తసింధులకు క్రీ పూ. 1500 సం|| లకు వచ్చిరి అనగా అప్పటినుండి విశ్వామిత్రుని కాలమువరకు, క్రీ. పూ. 1500 నుంచి 1200 సం|| లన్నమాట. ఇది ఇలా వుండగా యీ ఋషుల పూర్వీకులను చూచిన, వారెవ్వరికి కూడ ముత్తాతకి పూర్వీకుల వివరములు లేవు. భరద్వాజుని తండ్రి బృహస్పతి, తాత లోకనామా, ముత్తాత అంగీరసుడు అంతే కణ్వుని తండ్రి ఘోరుడు, తాత అంగీరసుడు; కాశ్యపుని తండ్రి మరీచుని పేరుమాత్రమే లభ్యముగుచున్నది. రాహుగణునిది కూడా ఒకేతరము, అనగ తండ్రి రాహుగణుని విషయముమాత్రమే తెలియుచున్నది. అత్రి తండ్రిపేరు నిశ్చితముగ లేదు. విశ్వామిత్రునివి నాలుగుతరాలు తెలుస్తున్నవి—తండ్రి గాథి, తాత కుశికుడు, ముత్తాత ఇషీరథుడు; అన్నదమ్ములైన వసిష్ఠ, అగస్త్యుల తండ్రి మిత్రావరుణ దేవతయన్నారు. కాని అతడు మనిషికాక దేవత అయినట్లైతే వారి పూర్వీకుల గాథలు మనకు తెలియరావన్నమాట భృగుని తండ్రి వరుణుడు. ఈ నాలుగు తరాల వారు అనగ క్రీ. పూ. 1300 సం||ల ముందు ఋషుల పూర్వుల గాథలు మనకు కానరావు ఈ ఋషుల పూర్వీకుల గాథలు సురక్షితపరచే ప్రయత్నము లేమైనా చేసినారేమో పరిశీలింతము. తమ పూర్వసంస్కృతులను యెందుకు కాపాడుకోలేదనే ఆశ్చర్యము కలగడము సహజమే. కాని అలా ఆశ్చర్యపడ నక్కరలేదు, ఏమంటే మొదట వారు సప్తసింధు మైదానములో భ్రమణజీవనము గడపియుండిరి. వారప్పటికి జనయుగము, కబీల శాఖల నుండి బయటపడలేదు. ఆవులను, గుర్రాలను, గొర్రెలను పెంచుకొనుటయే వారి ముఖ్యజీవనవృత్తి. కొద్దిమాత్రము వ్యవసాయము చేసేవారేమో ? వారి తిండికి సరిపడే ధాన్యము ప్రోగు చేయుటకు, పరాజితులైన సింధువాసు లుండేవారు సంసారజీవితమునకు కావలసిన వస్తువులను స్వీకరించి, సామంతయుగము నాటి సంస్కృతికి, ఆర్థిక విధానానికి, దూరముగ నెట్లుండగలరు? అదీకాక సామంతయుగము వైపుకి సాగిపోవలయునంటే, జనయుగపు గోడలను, అనగ మార్గనిరోధములను తొలగించవలసిన ఆవశ్యకత ఎంతైనా వున్నది. అంటే బలిష్ఠులైన భిన్న భిన్న ప్రతిభాశాలుర నందరిని ఒకేత్రాటికి గొనిరావలెను. ఈ పద్ధతియొక్క అంతిమపరిణామము దాశరాజ్ఞ యుద్ధసమయమున జరిగినది.

పైన చెప్పబడిన దానిని బట్టి ఋషుల మూడు తరాలవారే మనకు తెలియవచ్చుచున్నారు. అప్పటికుండేవాగా, జనయుగమునుండి సామంతయుగముఖముగ దృఢముగ విజృంభింప మొదలు పెట్టటమే దీనికి కారణమని తెలియుచున్నది ఋగ్వేదములోని ప్రధాన ఋషులకు ముందు 300, సం||ల సంగతి అంధకార యుగముగ నున్నట్లే తరువాత 300 సం||లు కూడ, చారిత్రిక ప్రమాణముల దృష్ట్యా అంధకారమయముగ నుండెను. ఋగ్వేదఋషు లందరూ సప్తసింధు ఋషులే. ఆసమయములో ఆర్యుల నివాసము, ప్రభుత్వ క్షేత్రము కూడా సప్తసింధుమైదానమే. అనగ సరస్వతినుండి సింధులోయ వరకు నుండెను (హరియాణము, పంజాబు, పఖ్తూనిస్తాన్) తరువాత మూడువందల సంవత్సరములకు జెందిన ఐతరేయశతపథాది ప్రాచీన బ్రాహ్మణ గ్రంథములు దొరుకుచున్నవి. ఆర్యుల ప్రభావము, సప్తసింధుమైదానము, ఉక్కుకోటలవంటి కురుపాంచాలములలోనే గాక, (పశ్చిమ ఉత్తర ప్రదేశములు) దక్షిణముగ భోజప్రాంతమువరకు (మధ్య నర్మదాలోయ) వ్యాపించిన సమయపు వారు ఈ బ్రాహ్మణముల ముఖ్యకర్తలు. వీరు ఐతరేయ మహిదాసు, యాజ్ఞవల్క్య లనువారు. ఈ 300 సం||ల విషయము అనగ మూడుతరాల విషయము పూర్తిగా తెలిసిన, ఆర్యులు సప్తసింధుమైదానము నుండి తూర్పున కెట్లు వెళ్లిరో తెలియును. ఆర్యుల సప్తసింధుప్రవేశముగురించికూడా, చారిత్రిక ప్రమాణాలు లేవు. సాహిత్య ప్రమాణాలు లేవు. అందువలననే, యీ విషయములో తులనాత్మక భాషావిజ్ఞాన సహాయము తీసుకొనవలసివచ్చుచున్నది. ఒకేసారిగా 300 సం||ల తర్వాత, మనకు దివోదాసు,

సుదాసు, వారిపురోహితులు, భరద్వాజుడు, వసిష్ఠుడు వారి సంఘర్షణ మొదలగునవి తెలియవచ్చుచున్నవి. దీని తర్వాత, చరిత్ర మరల 300 సం॥లు మౌనము వహించినది. తదనంతరము బ్రాహ్మణముల రూపములో కనిపించుచున్నది. అప్పుడు కురు-పాంచాల సమృద్ధ జనపదములు, రాజ్యములు, కనిపించుచున్నవి. ఇదే సమయములో ఆర్యసమీక్షకులు, ఉపనిషత్తుల రూపములో, తమను జన సామాన్యపు అంతస్తు నుండి పైకెత్తుకొనిరి (పొగడుకొనిరి).

ఈ ప్రధాన ఋషుల రాజకీయజీవితమును గురించి, వారియజమానుల సంఘర్షణల దగ్గర చెప్పియుందాము. వారు కేవలము మతాధికారులు, పురోహితులు, కవులే కారు; తమ తమ రాజుల ప్రధాన మంత్రులు, సేనాధిపతులు కూడను. ముసలితనమువలన స్వయముగ యుద్ధములలో పాల్గొనజాలకపోయినప్పటికీ, వారి, వారి వంశములను పురికొల్పి యుద్ధములలోనికి పంపేవారు. వీరి స్తోత్రములవలనను, దేవతల కృపవలనను, వీరి యజమానులకు విజయము ప్రాప్తించలేదు. వీరి కుటుంబశక్తివలననే కలిగినది. అనగా కుటుంబవ్యాపకమునుబట్టి, వారి సంఖ్యనుబట్టి, విజయప్రాప్తి ఆధారపడి యుండేది. మంత్రముల సంఖ్యను తీసుకొని క్రమముగ కొందరి ఋషులగురించి వ్రాస్తాను.

## వసిష్ఠుడు

ఈతని సూక్తముల సంఖ్య 103. అందరికంటే ఎక్కువ. ఈతని ప్రతిద్వంద్వి భరద్వాజుని సూక్తములు 60. భరద్వాజుని సూక్తములన్నియు దొరకలేదు వ్రాసిన వందసంవత్సరములవరకు ఈ సూక్తములన్నియు, ఒకమాలగ సంపుటీకరింపబడలేదు. తర్వాత కూడా కంఠస్థము చేయబడినవే కాని, లిపిబద్ధము కాలేదు. అనగా క్రీ. పూ. 1000 సం॥ల వరకు యివి కంఠస్థరూపములోనే యుండిపోయినవి. ఇప్పుడు కూడా వేదములను కంఠస్థముచేయు పద్ధతి కలదు. కాని అట్లు కంఠస్థము చేయువారి సంఖ్య తగ్గిపోవుచున్నది. ఇంకొక 200 సం॥ల నాటికి అట్టి కంఠోపాఠకు లసలుండరేమో? యనిపించుచున్నది. వశిష్ఠుని తండ్రి పేరు మిత్రావరుణదేవత యని చెప్పబడుచున్నది. సోదరుడు అగస్త్యుడు. వశిష్ఠుని పుత్రులు, చిత్రమహుడు, మృడీకుడు. వారు రచించిన మంత్రములుకూడా లభించుచున్నవి. కాని వారి పుత్రులలో ప్రధానుడు, పెద్దవాడు బహుశా శక్తియైయుండును. ఈతని యిద్దరు పుత్రులు పరాశరుడు, గౌరవీతికూడా ఋగ్వేదపు ఋషులే పరాశరుని వ్యాసుడు లేక కృష్ణద్వైపాయనునిగా పరిగణించుటకు వీలులేదు బ్రాహ్మణసాహిత్యము తరువాత వెలువడిన భారత రామాయణములలోను, వేదములలోను, ఈ ఋషుల, వారి సమకాలీన రాజుల గురించి చాలా గందరగోళముగ నున్నది చరిత్రకారులు ఆ గందరగోళములో బడి సతమతమగుచుండిరే కాని, ఆ చిక్కులను విప్పజాలకుండిరి.

ఒక్కొక్క మండలమునకు, ఒక్కొక్క ఋషిని ప్రధానునిగ ఎంచుచుండిరి. దీనిని బట్టి ఋగ్వేదపు ఏడవమండలమునకు వసిష్ఠుడు ప్రధానుడు కాని మిగిలిన వారికి వసిష్ఠునకుగల భేదము గమనింపవలసినదే మిగిలిన వారి మండలములయందు వారివారి పుత్ర పౌత్రుల సూక్తములుకూడా నుండగ, వసిష్ఠుని మండలమందు, వసిష్ఠునివి 103, పుత్రుడైన శక్తివి 32, కుమారఋషివి 101-102 సూక్తములు సందిగ్ధముగ చెప్పబడుచున్నవి తత్కాలీన భౌగోళిక, చారిత్రిక విషయముల మీద వీరి సూక్తములలో నున్నంత వివరణ, మిగిలినవారి సూక్తములలో లేదు ఇదే ఈతని విశిష్టత. ఈతని విశ్వాసము "యూయం పాత, స్వస్తిభిః సదా నః" (నీవు స్వస్తితోపాటు ఎల్లప్పుడు మమ్ము రక్షింపుము) దీని నతడు డజనుసార్లకు పైగా నుదహరించెను. మిగిలిన ఆర్యఋషులందరివలె, ఈతనికి కూడా యందరికంటే ముఖ్య ఆరాధ్యదేవత ఇంద్రుడే. ఇంద్రుని తర్వాత, మిత్రులు, సూర్యుడు, అగ్ని, విశ్వదేవుడు, వరుణుడు, అశ్విద్వయము, ఉషా, సరస్వతి మొదలగువారు. మరణానంతరము శైవులు కైలాసమునకు, వైష్ణవులు వైకుంఠమునకు, కృష్ణభక్తులు గోలోకమునకు చేరాలని కోరుకున్నట్లుగానే, ఆర్యులు ఇంద్రలోకప్రాప్తికై ఉవ్విళ్ళూరుచుండిరి. ఋగ్వేదము తర్వాత సామయజురథర్వ వేదములనుండి చారిత్రకదృష్ట్యా మనకే సహాయము లభించుటలేదు. వీటి తర్వాత ప్రాచీన బ్రాహ్మణ గ్రంథముల సంఖ్య వచ్చుచున్నది. ఐతరేయ బ్రాహ్మణము ఋగ్వేద సంబంధమైనది. బ్రాహ్మణ గ్రంథములు బ్రహ్మకు సంబంధించినవే కాని మంత్రములకు వ్యాఖ్యలు చెప్పునవి కావు. వాటి పని

యజ్ఞయాగాదుల విషయములలో జరుగు కార్య వివరణము, మంత్రముల వినియోగము మొదలగునది. ఐతరేయ బ్రాహ్మణములో వసిష్ఠుని గూర్చి ఆరుసార్లకు పైగా చెప్పబడినది. దీనివలన మనకు, ఒక యజ్ఞములో విశ్వామిత్రుడు హోత, జమదగ్ని అధ్వర్యుడు, వసిష్ఠుడు బ్రహ్మ, అయాస్యుడు ఉద్గాతలుగ నుండిరనేది తెలియుచున్నది ఇదే యజ్ఞములో సుయవసుని పుత్రుడు అజీగర్తుడు ఒక పురోహితుడు. దురాశాపరుడైన అజీగర్తుడు 300 ఆవుల లోభమునకు పడి తన పుత్రుడైన శునశ్శేఫుని స్వయముగ కత్తితో నరికి బలియిచ్చుటకు ఒప్పుకున్నాడు. పుత్రుడు, తండ్రి అఘాయిత్యమునుండి బ్రతికి బయటపడుటకు, విశ్వామిత్రుని తండ్రిగ నెంచుకొనగోరెను. విశ్వామిత్రుని యొడిలోనికి పోయి కూర్చుండెను.

అజీగర్తుడు విశ్వామిత్రుని ఇట్లడిగెను : "ఋషీ, నా పుత్రుని నాకిమ్ము."

విశ్వామిత్రు డిట్లు జవాబిడెను :—"ఇవ్వను. దేవుడు వానిని నాకిచ్చెను" అంతేగాక ఆ కుర్రవాని పేరు దేవరాయ విశ్వామిత్రుడుగ మార్చివేసెను.

అజీగర్తుడు పుత్రుని ప్రార్థించెను :—"(తల్లి-తండ్రి) మేమిద్దరము నిన్ను పిల్చుచున్నాము. నీవు ఆంగిరసగోత్రుడైన అజీగర్తుని పుత్రుడవు. ఓ ఋషీ! నీవు నీ తాత తండ్రుల యింటిని వదలకు మాదగ్గరకు వచ్చివేయుము."

శునశ్శేఫుడు :— "శూద్రుడు కూడా ముట్టుకొనని కసాయి కత్తిని మీ చేతిలో చూచితిని. ఓ అంగిరసగోత్రుడా! మూడువందల ఆవులను నాకంటే ఎక్కువగ తలచినారు."

అజీగర్తుడు :—"పుత్రా! నేను చేసినదానికి చాలా చింతిల్లుచున్నాను నేను దానిని నివారణ చేసుకుంటాను నీకు వంద ఆవులను యిస్తాను."

శునశ్శేఫుడు :—"ఒకసారి పాపము చేసినవాడు, రెండవసారి కూడా పాపము చేస్తాడు. మీరు శూద్రత్వమునుండి విముక్తి పొందలేరు మీరు చేసిన పాపము యేవిధముగాను కూడా నివారింపబడదు." విశ్వామిత్రుడు మధ్యలో నందుకొని ఇట్లనెను :— "అవును. నివారింపబడదు. ఈ సుయవసుని పుత్రుడు కత్తి చేతిలోనికి తీసుకొన్నప్పటి దృశ్యము చాలా భయంకరమైనది. కాబట్టి నీవాతని పుత్రుడవు గాక, నా పుత్రుడవుగానే యుండుము"

ఐతరేయబ్రాహ్మణముయొక్క యీ ఉద్ధరణ వలన వసిష్ఠుడు విశ్వామిత్రుడు, జమదగ్ని, అయాస్యుడు అజీగర్తుడు, శునశ్శేఫుడు ఒకేకాలమువారని తెలియుచున్నది. రెండవ వ్యాఖ్యనుబట్టి (7-5-34) ఒక యజ్ఞపు విధిని వసిష్ఠుడు సుదాసునకు చెప్పినట్లు తెలియుచున్నది. ఎనిమిదవ పంజికలో (8-4-21) మాహాత్మ్యపూర్ణమైన సూచన ఒకటి లభించుచున్నది. "ఇంద్రుని మహాభిషేకమే వసిష్ఠుడు సుదాసునకు చేసెను. దీనివలన నతడు పృథ్వినంతా జయించి, అశ్వమేధ యజ్ఞము చేసెను". కాని వీరితండ్రి దివోదాసుకు సమ్మాననీయుడైన భరద్వాజుడు యీ పై చెప్పిన కార్యము నెందుకు చేయలేదు? వసిష్ఠుడెందువలన చేసెను? అను సందేహములు కలుగుట సహజము. దివోదాసునకు ప్రతర్దనుడను మరియొక పుత్రుడు కలడు. కాని యీ ప్రతర్దనుడు, కాశీప్రతర్దనుడు ఒకరు కాదు. కుటుంబ పురోహితుని వదలి, మరియొక పురోహితుని స్వీకరించుటవలన పుత్రులిద్దరిమధ్య తండ్రి సింహాసనముకొరకు పెనుగులాట జరిగినదని తెలియుచున్నది ప్రతర్దనుడు పెద్దవాడవుటవలన భరద్వాజు డతనికి పట్టముగట్టెను. కాని గుప్తవంశములోవలె సుదాసు యోగ్యుడైన పరిపాలకుడు. అన్నదమ్ము లిద్దరిమధ్య కలహము ప్రారంభమైంది. భరద్వాజుడు ప్రతర్దనుని పక్షము, బహుకుటుంబీకుడైన వసిష్ఠుడు సుదాసు పక్షము వహించిరి. ఐతరేయబ్రాహ్మణములో యీ ఋషియే "ఇంద్రుని మహాభిషేకమువలె సుదాసునకు మహాభిషేకము గావించినాడు." అని నిస్సంశయముగ చెప్పబడినది. ఋగ్వేదమందు, సుదాసునకు సింహాసనము సంపాదించుటకై, వసిష్ఠునకు ప్రతర్దనునితో యుద్ధము చేయవలసివచ్చినదని గాని, వసిష్ఠ ప్రతర్దనులమధ్య జగడమైనదని గాని, ఎక్కడా చెప్పబడలేదు, ఐతరేయబ్రాహ్మణమును ఖండించేదేదీ లేదు. ఇదియును గాక దాశరాజ్ఞయుద్ధములో వసిష్ఠుడు సుదాసునకు పురోహితుడుగ నుండి, సుదాసు విజయమునకై తన సర్వశక్తులను వినియోగించుట దీనిని బలపర్చుచున్నది. వసిష్ఠుడు చెప్పినదానినిబట్టి చూచిన, దివోదాసు వంద చిన్నచిన్న బస్తీలను నాశనము గావించినాడు. భారతీయులలో ప్రతాపాగ్ని పెంపొందించడములో తనకు చాలా పాత్ర కలదనే గర్వము వసిష్ఠునియందు

కలరు. "వర్షాకాలలో గోవుల మాదిరిగ మొదట భారతీయులు భయవిహ్వలులై యుండిరి" "వసిష్ఠుడు వారి పురోహితుడు కాగానే వారి ధైర్యము వృద్ధిగాంచినది" (7-33-6) భారతీయుల సఫలత్వమునుగురించి వసిష్ఠుని వర్ణనలు 7-వ మండలములో చాలాచోట్ల కనుపిస్తాయి భారతీయులు పూర్వపు నివాసులను పరాభూతులను గావించిరి. (7-8 4) సుదాసుతో సంఘర్షణలో ద్రుహ్యులు మరియు అణువులు 66 వేలమంది చంపబడిరి. (7-18-14) తృత్సువులు యమునానదీతీరమున నున్న వివిధ తెగలను, అజులను, శిగ్రులను, యక్షులను పరాస్తులను గావించిరి. వీరందరు అనార్యులని తెలియవచ్చుచున్నది. వసిష్ఠుని కథనానుసారము దాశరాజ్ఞయుద్ధము సింధునదీతీరమున జరిగెను. ఇంద్రుడు సుదాసుని రక్షించెను. అనగా సుదాసు విజయము పొందెను (7-33-3) తరువాత పౌరాణిక యుగములో వసిష్ఠుని వేశ్యాపుత్రుడనిరి. దేవకన్యలు సదా కన్యలే. వారి ప్రణయము క్షణికమే గాని స్థాయి గాదు. కాబట్టి వారిని దేవగణిక లనిరి. మైత్రావరుణఊర్వశులకు వసిష్ఠుడు జన్మించినాడనిరి. అప్సరసద్వారా వసిష్ఠుని జన్మ ఉల్లేఖించవలసినదే. వసిష్ఠుని తల్లిదండ్రులు, తాతముత్తాతల విషయము తెలియనందున దేవతల, దేవకన్యలద్వారా జన్మించినాడన్నారనేది యిక్కడ స్పష్టమగుచున్నది. జాదుయాతిన్, యాతుమావన్ ల (7-104 15; 7-1-15) వర్ణనలను వసిష్ఠుడు గావించినాడు. అబద్ధానికి బదులు "దారోగ" శబ్దము యిప్పటికి పారసీభాషలో వుపయోగించబడుచున్నది. వసిష్ఠుడు "ద్రోఘవాచ్" శబ్దమును ప్రయోగించినాడు. వసిష్ఠుడు, అగస్త్యుడు తరువాతి సాహిత్యములో అన్నదమ్ములని చెప్పబడుచున్నారు. ఋగ్వేదమంత్రము (7-33-10) కూడ యీ వాదానికి పుష్టి నిచ్చుచున్నది. వసిష్ఠుని జీవితములో అన్నిటికంటే సఫలమైన ఘటన దాశరాజ్ఞయుద్ధము. అనగ చెదరిపోయివున్న ఆర్యులను ఐక్యపరచినాడు. "పదిమంది రాజులు కలిసి సుదాసుతో యుద్ధము చేసిరి." (7-83-7) తృత్సువుల దేశమున కూడా దాశరాజ్ఞయుద్ధములో సుదాసు యుద్ధప్రావీణ్యముగూర్చి ఉల్లేఖించబడినది.

## భరద్వాజుడు

సూక్తముల సంఖ్యనుబట్టి బృహస్పతి తనయుడైన భరద్వాజుడు ఋగ్వేదఋషులలో ద్వితీయుడు. ఈయన దివోదాసు పురోహితుడు. ఆర్యుల అంతఃకలహములలో వసిష్ఠుడు సుదాసు విజయములకు కారకుడైనప్పటికి, దివోదాసు సఫలత్వమునకు భరద్వాజుడు కూడా యేమియు తీసిపోలేదు దివోదాసు విజయములు వర్ణింపబడిన ఋగ్వేదపు ఆరవమండలము భరద్వాజునిది, అతని వంశీయులదిన్నీ.

దీనిలో ఒక పంక్తి "తరించితిమి, మేము తరించితిమి, నీ రక్షణవలన నే తరించితిమి" (6-1-12, 6-15-15) ఈతని రచనలలో రెండవ వాక్యము మాటిమాటికి చెప్పబడినది. "మేము మంచివీరులతో కలిసి వందతరములవరకు యుండాలి." (7-4-8; 7-24-10) ఈతడు కూడా "అఘ్రోఘవాచ్" శబ్దమును అరడజను చోట్లకు పైగా ప్రయోగించెను (అమిత్రవాద) (6-5-1, 6-6-12 మొదలగు). దివోదాసుగురించి ఈతని రచనలలో అనేకచోట్ల కానవచ్చుచున్నది. కాని సుదాసుగురించి శుభసూచకముగ ఎక్కడా కనిపించదు సుదాసుకు అమంగళకరముగ వ్రాసియుండవచ్చు కాని వాటి సంగ్రహము దొరకుటలేదు. లోభ, ద్వేషములలో పూర్వపు ఋషులు నేటివారికంటే పవిత్రముగ లేరు. కనుక తనను పురోహితస్థానమునుండి, పాలనుండి వెన్నను వేరుచేసినట్లుగ, వేరు చేసిన సుదాసుగురించి భరద్వాజుడు అమంగళకరముగ వ్రాయుడెనని నమ్మదగినది కాదు ఋగ్వేదములో సంగ్రహపరచిన రచనలు ముఖ్యముగా ఋషి - పురోహితుల ఇష్టదేవతల మహిమను వర్ణించేవే భరద్వాజుని దేవత అయోగ్యునిగ నిరూపితమైనది. అయోగ్యుని స్తుతిని సురక్షితముగా నుంచవలసిన అవసరమేముంది? భరద్వాజుని ఆధ్యాత్మికశక్తి యోగ్యముగ లేదు. కావున నాతడు ప్రార్థించెను "అశ్మ భవతు, నాస్తనూః" (మా శరీరములు రాయిలా దృఢముగ నుండుగాక) (6-75-12) ఈతని యజమాని దివోదాసు

ఆర్యులందరికి బద్ధశత్రువైన పర్వతరాజు శంబరుడు. ఈతడు విపాశ్ (వ్యాస్) పరుష్ణీల మధ్యస్థముగనున్న, నేటి కంగడావాలా పర్వతమునకు రాజు. ఇతరత్రా చెప్పినట్లు ఈతడు ద్రావిడజాతి కాదు; మంగోలియనుజాతివాడు 19 వ శతాబ్దము వరకు శత్రువులను ముప్పతిప్పలు బెట్టి మూడు చెరువులనీరు త్రాగించిన కంగడా వంటివి వందపర్వత దుర్గములు ఈతనికుండెను. ఆయసీకి (రాగివంటిది)

బడులుగ అశ్మనీయమయి (రాతివంటిది) నగరముల చర్చకూడ వచ్చినది. ఈ పర్వతదుర్గములు రాతివి గావచ్చు. శంబరుడు కాక, చుమురి, ధుని, పిప్రు, అహి, నముచి పేర్లుగల యితరరాజులను కూడా భరద్వాజుడు ఉల్లేఖించినాడు. వీరుకూడ పర్వతరాజులు, శంబరుని సహయోధులు. అందరిలోకి ప్రబల శత్రువు శంబరుడనేది నిస్సంశయము. భయంకర యుద్ధసమయములో పురోహితుడైన భరద్వాజుడు, కవచము, ధనువు, జ్యా, అమ్ములపొది, రథము, గుర్రములు, గండ్రగొడ్డలి, వంటి సాధనములను వర్ణించుట స్వాభావికమైనదే, అతడు పొలము, అరణ్యముల సంగతికూడా యెత్తెను. అనగా ఆర్యులకు పొలము, అరణ్యములతో కూడా ఉపయోగముండెననేది తెలియుచున్నది. కొంత పొలము బంజరు మరికొంత పొలములో ధాన్యము పండించేవారు. జావ లేక అంబలి కాచుకొని, పెరుగులో కలుపుకొని తినేవారు. కాని వారి ముఖ్య ఆహారము పాలు, మాంసము ఇందునుకరించే వారు యెక్కువగ ఆవులను పెంచేవారు. ఈ విధముగ చూచిన వారికి పొలముకంటే పశుపాలకుల ఆవశ్యకత యెక్కువగనుండేది. గుర్రములు ఈ రోజులలో యుద్ధ పరికరములు గాను, రవాణా పరికరములు గాను ఉపయోగపడేవి. కాని వాటి మాంసము విశేషించి అశ్వమేధయజ్ఞసమయములలో ఉపయోగించబడేది. దివోదాసు పుత్రుడు సుదాసుతో వసిష్ఠుడు అశ్వమేధయజ్ఞము చేయించెను. ఇదే మొదటి అశ్వమేధయజ్ఞ ఉల్లేఖనము. చాయమాన్ అభ్యావర్తి రాజు రెండువేల ఆవులను దానమిచ్చెను ఈ రోజులలో గోదానములు యెక్కువగ జరుగుచుండేవి. ఆర్య ఋషులు, రాజుల గోవులను, అశ్వములను, శుభముగనుండునట్లు దీవించుచుండేవారు. భరద్వాజుడు దివోదాసుతో కలసి సోమపాన గోష్ఠిలో పాల్గొనే వర్ణన కలదు (6-16-3) ఈ రోజులలో సోమపానము దివ్యామృతముని పూజింపబడేది కాదు. సోమపానము సాధారణ విషయమే. దివోదాసు కొనసాగించిన ఐక్యత వాని తండ్రి వధ్ర్యశ్వుడు, ఆర్యులలో కబీలశాహీని హతమార్చి స్థాపించినాడు. ఇందంవరికంటే ముఖ్యవిరోధులు యదు, తుర్వశులను ఆర్యులు. దివోదాసుకు వారిని అణచి వేయుటలో సంపూర్ణవిజయము లభించినది. ఆతడారువేల దాసులను (అసురులు) హతమార్చెను. భరద్వాజుడు ఏడుగురు చెల్లెండ్రుగల సరస్వతిని వర్ణించెను. ఒడ్డులను, ఒరకములను తెగగోయు సర్వతిని విపులముగ వర్ణించెను. దాసుల ఏడు నగరములను పురుకుత్సరాజు ధ్వంసము గావించెను. (6-19-10). భరద్వాజుడు భరతరాజు దివోదాసుకేగాక మిగిలినవారికికూడా కృపాపాత్రుడే యని దీనివలన మనకు తెలియుచున్నది. భరద్వాజుని తండ్రి బృహస్పతి దేవత అనగ వీరి ముందువంశము సంగతి తెలియుచున్నమాట. కాని ఋగ్వేదఋషుల పట్టికనుబట్టి బృహస్పతి లోకనాముని పుత్రుడు; అంగీరసుని మనుమడు. అంగీరసుని మరియొక పుత్రుడు ఘోరుడు. లోకనాముని సంతానమునకు ఎక్కువ ఖ్యాతి లభించినది వత్సుడు, మేధాతిథి, ప్రస్కణ్వుడు, ప్రగాథుడు వంటి ప్రసిద్ధులైన ఋషిపుత్రులు కలిగియున్న కణ్వుడు ఘోరుని పుత్రుడు. ప్రగాథునికి ప్రసిద్ధులైన చాలామంది ఋషిపుత్రులుండిరి. అంగీరసుని ప్రపౌత్రుడైన భరద్వాజుడు కూడ యోగ్యసంతానము కలిగిన భాగ్యశాలి అతని పుత్రులు, గర్గుడు, ఋజిశ్వుడు, శిరిమ్బిఠుడను ఋషులు.

## విశ్వామిత్రుడు

గాథి పుత్రుడు, కుశిక పౌత్రుడు, ఇషీరథుని ప్రపౌత్రుడు. విశ్వామిత్రునికంటే ఎక్కువ సూక్తములను గౌతమపుత్రుడైన వామదేవుడు వ్రాసెను. కాని విశ్వామిత్రుడు వసిష్ఠ, భరద్వాజుల సమాన పంక్తిలోవాడు. కావున వాని నిక్కడ ఉల్లేఖించుచున్నాను. ఈతడు ఋగ్వేదపు తృతీయ మండలపు ఋషి. వసిష్ఠ, విశ్వామిత్రుల విషయము, రామాయణములోనిదానికి, ఋగ్వేదములోనిదానికి ఎక్కడను సంబంధములేదు. రామాయణము, పౌరాణికము, కల్పితమేగాని, సత్యముగాదు. ఈతడు ఇంద్ర వరుణ, బృహస్పతి, పూషా, సంతా, సోమ, మిత్రాది దేవతలను స్తుతించెను. ముప్పైమూడు వేల దేవతలు గాదు, ముప్పైమూడు దేవతలే యని ప్రప్రథముగ నీతడే వ్రాసెను. ఈతడు తండ్రి గాథిని, వంశీయులను వర్ణించెను కుశికులు సంఖ్యలోను, ప్రభుత్వయంత్రాంగములోను ఎక్కువగ నుండిరి. తన కభిషేక మొనర్చి, దాశరాజ్ఞయుద్ధములో తన విజయానికి కారకుడైన వసిష్ఠుని వదలి, విశ్వామిత్రుని తన పురోహితునిగ నొనర్చుకొనుటకు సుదాసునకిదే కారణమై

యుండవచ్చు. ఆ విధముగ కార్యములు నెరవేర్చుకొను రాజునకు ఒక పురోహితుని వదలివేయుట మరొక పురోహితుని స్వీకరించుట సహజమే. ఈ అవకాశవాదాన్ని వసిష్ఠుని పుత్రుడైన శక్తి తీవ్రముగ నెదిరించెను. కాని ఫలితముగ ప్రాణములను పోగొట్టుకొనుటకంటే మరేమి సాధింపలేకపోయెను. నదులను మనుష్యులలోనికి మళ్ళించుటకు వసిష్ఠుడు కూడా ప్రయత్నించెను. కాని దీని శ్రేయస్సంతా విశ్వామిత్రునకే యివ్వవలసివచ్చింది. విశ్వామిత్రుడు వ్యాస, సతిలజులను ముడుపదాగలు గమ్మని, ప్రశ్న-జవాబుల రూపములో చేసిన శాసనము, ఋగ్వేద రచనలలో సుందరమైనవానిలో నొకటి. నదుల హృదయములను కంపించి, కరిగించే కవిత్వము విశ్వామిత్రుడు చేసెను. కాని వసిష్ఠుడు చేయలేడు. ఆ కవిత్వములోని కొన్ని అంశము లిట్లున్నవి —"విపాశ, శుతుద్రీలు జల సహితముగ, పర్వతముల వద్దనుండి, బంధనములనుండి విముక్తి పొందిన అశ్వములవలె అట్టహాసము చేయుచూ, దూడలను నాకు కోరికతో వడి వడిగ వచ్చు పాడిఆవులవలె, సముద్రముపైపుకు పరుగులిడుచున్నవి." "ఓ! నదులారా! ఇంద్ర ప్రేరేపణచే జరుగు పొగడ్తలను వినుటకు నెమ్మదిగులలా, మీరు సముద్రముపైపుకు పోవుచున్నారు. మిమ్మనుసరించు తరంగములచే వృద్ధి జెందుచు, పరస పరసను పోవుచున్నారు. శుభ్రో! నా సౌమ్య వచనములు వినుటకు కొద్ది క్షణములు ఆగండి కుశిక వంశీకుడను, నా మనస్సులోని మాటను చెప్పుటకు మిమ్ముల నాహ్వానించుచున్నాను." (5)

"వజ్రహస్త ఇంద్రుడు పర్వతాలను ఛేదించి మాకై పరిధు లేర్పరచెను. సుపాణి సవితా దేవుడు మమ్ములను తీసుకొనిపోవుచున్నాడు. మేము వాని ఆజ్ఞలో విస్తృతములగుచు వెళ్లుచుంటిమి" (6)

"ఆగండి! చెల్లాయిలూ! కవిమాట వినండి! చాలా దూరము అనస్రతినుండి వచ్చితిని. కొంచెము క్రిందకు దిగి తేలికగ దాటునట్లు తయారుగండి అక్షమునుండి దిగి జలమయముగు సింధుగ తయారుగండి." (9).

"కవీ! దూరమునుండి వచ్చితివి నీమాటలు మేము వినుచుంటిమి. పిల్లకు పాలిచ్చు తల్లిలాగున, పురుషుని కొరకు తపించు యువతిలాగున, మేము నీకొరకు క్రిందకు దిగుచుంటిమి."

"ప్రేమికులారా! గోవులకై యుద్ధములు చేయు, ఇంద్ర ప్రేరితమగు భరతదేశము మిమ్ములను తరింప చేయునప్పుడు, మిమ్ములను నేను యజ్ఞయోగ్యలుగ స్తుతించెదను"

గోమాతను పూజించు భరతజనులు దాటిపల్లిరి. విప్రుడు నదులను చక్కగ పొగడెను. విశ్వామిత్రుడు సుదాసుని గొప్పవానిగ నొనర్చెను (3-5-3-9) సింధు నదిని స్తంభింపచేసెను. సుదాసు విజయములలో చాలా సహాయముజేసెను. ఈయన కూడా తమ సమకాలీన ఋషులవలె మాటిమాటికి నొకవాక్యాన్ని ఉపహరించెను. (3 6-11; 3.15-7; 3-22 5; 3-23-5) "స్యాన్నః సూనుస్తనయో, విజావాగ్నే సాతే సుమతిర్భూత్వస్మే" దీనిప్రకారము పుత్రపౌత్రాభివృద్ధిగ సంతానము గలవారుగను, మంచి బుద్ధి గలవారుగను కావలెనని ప్రార్థన చేయుచుండెను. విశ్వామిత్రుని "భరత వాసులను రక్షించు" యను వాక్యము తమను రక్షించునని భరతవాసుల నమ్మకము (3-5, 3 12) మూడువందల ఆవులకొరకు పుత్రుడైన శునఃశేపుని నరబలికు సిద్ధపడిన అజీగర్తుని వదలి, శునఃశేపుడు విశ్వామిత్రునివద్దకు వచ్చివేసిన విషయము పైనుదహరింపబడినది వామదేవుడు గౌతముని పుత్రుడైనప్పటికి, విశ్వామిత్రుని సూక్తముల నెక్కువగ ప్రచారము చేసినట్లు ఐతరేయబ్రాహ్మణమువలన తెలియుచున్నది.

ఐతరేయ బ్రాహ్మణమునుబట్టి చూచిన విశ్వామిత్రున కందరూ మిత్రులే. కాని పెద్ద పెద్ద యుద్ధములను ప్రేరేపించినవానికి యందరూ మిత్రులెలా అవుతారు? శునఃశేపుని ప్రాణరక్షణ విశ్వామిత్రుని ద్వారా జరుగుటచే, అతడు నరబలికి వ్యతిరేకుడని తెలియుచున్నది. విశ్వామిత్రునికి వందమంది పుత్రులున్నమాట సందేహాస్పదమే. ఈ సంఖ్యలో పుత్రి, పౌత్రి, ప్రపౌత్రాదు లందరు యుండియుండవచ్చు. మధుచ్ఛందుడు, ఋషభుడు, రేణు, ఋతఋషి, ఈతని పుత్రులుగ తెలియవచ్చుచున్నారు. పౌత్రులలో మధుచ్ఛందుని పుత్రులు, అఘమర్షణుడు, జేతా, ఋతఋషి పుత్రుడు ఉత్కీలుడు. వీరందరు ఋషులే. ఐతరేయ బ్రాహ్మణములో యిలా వ్రాయబడినది—"విశ్వామిత్రునకు వందమంది పుత్రులు. మధుచ్ఛందుని కంటె పెద్దవారు 50, చిన్న 49 మందిన్నీ" (శునఃశేపుని పెంపకము పెద్దవారికి నచ్చలేదు)

అప్పుడు విశ్వామిత్రుడు వారిని శపించెను. "మీ సంతానము అభక్ష్య భక్షులగుగాక." ఈ ప్రకారము, ఆంధ్ర, పుండ్రి, శంబర, పులింద, మొదలగు దస్యులు విశ్వామిత్రుని సంతానమని తెలియుచున్నది. కాని మధుచ్ఛందుడు, 49 గురు సోదరులిట్లు చెప్పిరి. "మా తండ్రి చెప్పినది మేము శిరసావహించెదము. మేము నిన్ను (శునఃశేపుని) జ్యేష్ఠునిగ తలంచెదము. మేము నిన్ననుసరించి నడిచెదము." విశ్వామిత్రుడు యీ జవాబు విని ప్రసన్నుడై యీ క్రింది మంత్రములచే పుత్రుల నిట్లు దీవించెను.

"పుత్రులారా! మీరు పాడిపంటలు కలిగి పుత్రపౌత్రాభివృద్ధిగ వర్ధిల్లండి."

"మీరు నేను చెప్పినది విని నా పితృత్వమును నిలిపిరి"

"ఓ! గాథి సంతానమా! దేవరాతుని సంరక్షణలో నీవు సంతానవంతురాల వగుదువు. అతడు నిన్ను సదా సత్యమార్గమున నడిపించును."

"ఓ! కుశిక సంతానమా! నీవు వీర దేవరాతుని పహాచరిగ నుండుము. అతడు నీకు మార్గదర్శకుడు గాను, నీ విద్యలో భాగస్థుడుగను ఉండును." "దేవరాతునితో నున్నటువంటి విశ్వామిత్రుని నిజమైన పుత్రులకు ధన, ధాన్య, కీర్తి యశస్సులు లభించుగాక!" (ఐతరేయ బ్రాహ్మణము, శ్రీ గంగాప్రసాద్ ఉపాధ్యాయ అనువాదము) (7 3 18)

ఐతరేయ బ్రాహ్మణము శునఃశేపుని దేవరాత విశ్వామిత్ర ప్రఖ్యాపతిగా చేయుటకు ప్రయత్నించినప్పటికి ఋగ్వేదములో శునఃశేపుడు అజీగర్తుని పుత్రుడుగనే ప్రసిద్ధిజెందెను.

## వామదేవుడు

గౌతముని పుత్రుడు. వసిష్ఠ, విశ్వామిత్రుల తరువాత తరము వాడు. అయినప్పటికి వారికంటే తక్కువ మాహాత్మ్యము కలవాడేమి కాదు విశ్వామిత్రుని సూక్తములను ఈతడు ప్రసారము చేసిన సంగతి పైన చెప్పుకుంటిమి. ఈతని ఉల్లేఖనమును బట్టి తండ్రి పేరు మామతేయుడని తెలియుచున్నది. వామదేవుడు కూడా, దివోదాసు సుదాసుల విజయములను వర్ణించెను. అతిథిగ్వ దివోదాసు వందనగరములను జయించెను. (4-26-3) ఈ వంద నగరములు 'ఆయసేపు' (4-17-1) దివోదాసుకొరకు వంద అశ్మనమయమైన నగరములను ఇంద్రుడు జయించెను. యుద్ధములో 30 వేల మంది మూర్ఛితులైరి. పరుష్ణీ (భరతులనది రావి) దగ్గర ఇంద్రుడు వాళ్ళమీద దయ చూపించెను. (4-22-2) ఇక్కడ వామదేవుడు భరతుల మరియు వారి రాజుల మాహాత్మ్యమును పొగడెను. సహదేవ పుత్రుడు కుమార సోమకుని, సృంజయరాజు దేవవాతుని, వైదథీ ఋజిశ్వాని, అగ్రుసేయ, కుత్సరాజులను కూడా వామదేవుడు ప్రశంసించెను. వీరిలో కొందరు సమకాలీనులు, కొందరు అభిమానులునై యుండవచ్చు. 50 వేలమంది కృష్ణులను (నల్లని అసురులు) చంపుట కూడా ఈతడుల్లేఖించెను అసిక్నీ (చీనాబ్) ఉల్లేఖనము కూడా ఈతని రచనలలో జరిగినది (4-17-15). ఈ కాలములో ఆర్యులలో నొక సామెత ప్రసిద్ధిలో నున్నది. "ప్రాతఃకాలమున ఉషాదేవి ఆకాశమందు తిరుగుచుండగ, ఆమె వాహనము విపాస (వ్యాస్) నదియొడ్డున క్రిందపడినది. (4-30-11) దాసులలో కొలితరుడు, శంబరుడనువారలను ఈతడుల్లేఖించెను. (4-30-14-15). తుర్వశ, యదులను ప్రతిభాశాలురైన ఆర్యులను కూడ ఈతడుల్లేఖించెను. నాగలితో దున్నుట, పైరు ఫలవంతమగుట మొదలగు వ్యవసాయపు పనులను గూర్చి కూడ ఈతడు వ్రాసెను. చిరునవ్వులు చిందించు సుందరీమణులను ఈతడు వర్ణించెను. వామదేవ, నోధల తండ్రి గోతముడు, పితామహుడు రాహుగణుడు. వామదేవుని పుత్రులలో మూర్ధన్వ బృహద్దిర, బృహదుక్థ యను ఋషుల పేర్లు మాత్రమే దొరుకుచున్నవి.

## గృత్సమదుడు

(5) ఈతడు శౌనకుని పుత్రుడు. శౌనకుని గురించి ఋక్ 2-9-86, 86-87 లలో ఉల్లేఖనము జరిగినది. బహుశా నీతడు అత్రి వంశజుడై యుండును. దివోదాసు, శంబరుల, సంఘర్షణను ఈతడు కూడా ఉల్లేఖించెను. దివోదాసు, 99 కోటలను జయించెను. (2-19-16) శంబరుని వందకోటలు ధ్వంసమయినవి. శత్రువులు కృష్ణయోనులు (నల్ల రంగు గలవారు) (2-20-7) శంబరుడే కాక స్వప్న, శుష్ణ, అశుష, వ్యంస, ప్రిప్ర, నముచి (2-14-5) చుమురి, ధుని (2-15-9) కువయ మొదలగు దాసులైన రాజులను

కూడా ఉల్లేఖించెను. "పర్వత శంబరుని 40 సంవత్స రములలో పట్టుకొనిరి. (2-12-11) 40 సం॥ల వరకు పరాక్రముడైన శంబరుడు ఆర్యుల చేతిక్రిందకు రాలేదు." "గొర్రె వెంట్రుకలతో తయారయిన ఉన్ని వస్త్రములలో ఒడపోసిన సోమరసము పాత్రలలో ఉంచబడినది. (9-86-47) దీనిని బట్టి తెలియునది— సోమరసమును పిండి, రంగరించి, ఉన్ని వస్త్రము లలో ఒడబోసి కలశములలో ఉంచుచుండెడివారని.

## కక్షీవానుడు

(6) ఈతడు దీర్ఘతమ ఔచిత్యుని పుత్రుడు. దీర్ఘతముడు, గోతముడు అనుపేర్లు ఒకరివేనని వెనుకటి చరిత్ర చెప్పుచున్నది. కక్షీవానుడు గోతముని గూర్చి వ్రాసెను. కాని దీనిలో వాళ్ళిద్దరికి సంబంధమున్నట్లు ఎక్కడా కనుపించదు. భరద్వాజుని రెండుసార్లు, అత్రిని రెండుసార్లు ఈతడు ఉల్లేఖించెను. కాని దానిని బట్టి ఈతనిని వారి వంశీకుడనలేము. ఈతడు కూడా దివోదాసుని ఉల్లేఖించెను. సముద్రములో నడుచు ఓడ ఆ రోజులలో సప్త సింధులో నడచిన దని, వంద చుక్కానులు గల నౌక ఉల్లేఖనమును బట్టి తెలియుచున్నది. విష్పల, ఘోష, వంటి మేధావతు లైన ఆర్య నారీమణులను కూడా ఈతడుల్లేఖించెను. సింధుతీరపు రాజు భావ్యుడు పురోహితులకు అనేక దానము లిచ్చెను. (1-126,1-4-7) ఇందులో బహుశా కక్షీవానునికి కూడా కొంత లభించియుండవచ్చు. గాంధార దేశపు గొర్రెల ఉల్లేఖనము వలన ప్రస్తుత పఖ్తూనిస్తాన్ గొర్రెలు తమ కోమలమైన ఉన్నికి బాగుగ ప్రసిద్ధిగాంచినవని తెలియుచున్నది. (1-126-7) గోతమ దీర్ఘతములుఒకరే అయినట్లైతే గోతమపుత్రు లైన వామదేవ, నోధీలతో ఈతని పేరు కూడా రావల సినది.

## అగస్త్యుడు

(7) మిత్రావరుణుని పుత్రుడు, వసిష్ఠుని తమ్ముడు నైన అగస్త్యుడు ఋగ్వేదములో 26 సూక్తముల రచ యిత. ఈతని రచనలు ప్రథమ మండలములో 165-191 సూక్తములుగ నున్నవి తన రచనలలో నీతడు వసిష్ఠుని ఉల్లేఖించలేదు. బహుశా ఈతని భార్య పేరు లోపా ముద్ర అయియుండవచ్చు. (1-119-4) ఈతడు కూడా ప్రసిద్ధిగాంచిన ఆర్యమహిళ విష్పలను, ఉల్లేఖించెను. ఆర్యజనులైన తుర్వశ, యదుల సంఘర్షణలనుగురించి ఈతడేమీ చెప్పలేదు. తుర్వశ యదు మొదలగువారితో సుదాసు చేసిన దాశరాజ్ఞ యుద్ధములో ఈతని అన్న వసిష్ఠుడు సారథ్యము వహించెను. కనుక దాని ధ్వని కొంచెమైన ఈతని రచనలలో కనుపించవలసినదే, కాని అటువంటిదేమి కనుపించుటలేదు కరంభ (సత్తు) మరియు లాభప్రదమైన తృణ, శర, కుశర, దీర్ఘ, మౌంజి మొదలగు వాటి ఉల్లేఖనము కూడ ఈతడు చేసెను. (1-187-10; 1-191 3). అగస్త్యుని పేరుమీద పురాణ ములలో కనుపించే కథలగురించి కొంచెము కూడా ఈతని రచనలలో కనుపించదు. ఈతడు పర్వతవా సుల గురువు. ఆఖరి దశలో ఈతడు దక్షిణాపథము నకు వెళ్ళిపోయెను. తరువాత ఈతని జాడ లేమీ తెలియరావు.

## దీర్ఘతముడు

(8) ఉచథ్యుని పుత్రుడైన దీర్ఘతముడు 25 సూక్తముల రచయిత. ఈతని తల్లిదండ్రుల పేర్లు ఉచథ్య మామతేయులని తెలియుచున్నది. (1-158-2 4) దాసుల, వీరుల, ఉల్లేఖనమువలన ఈతడు కూడా యుద్ధములలో చేయి జేసుకున్నాడని తెలియుచున్నది. గుర్రముయొక్క పక్వ సుగంధిత మాంసము గూర్చి ఈతడు వ్రాసెను. దానిని బట్టి చూచిన అది తినబడు చున్నదని, విశేషించి యజ్ఞసమయములలో గావచ్చు నని తెలియుచున్నది.

## గోతముడు

(9) రాహుగణుని పుత్రుడు, రచన 20 సూక్త ములు. ప్రథమ మండలి రచయిత.

## మేదాతిథి

(10) కణ్వుని కొడుకైన మేధాతిథి 20 సూక్త ముల రచయిత తన వంశీయులను కణ్వవంశము పేర ఈతడు జపించెను. (1-14-2,5) అర్థ నేయవత్సుని భారమంతయు ఈతనిపై నుండెను. (8-3-16) ఈతడు మేధ్యాతిథియని కూడా చెప్పబడుచున్నాడు. (8-3 9-2) మేధాతిథి తాత ఘోరుడు, ముత్తాత ఓగరుడు.

# ఋగ్వేదములోని ప్రధాన ఋషులు

## శ్యావశ్యుడు

(11) 15 సూక్తముల రచయిత. అత్రి పుత్రుడో లేక సంతానమో, అయిన శ్యావస్యుడు కూడా ప్రసిద్ధిగాంచిన ఋషులలో నొకడు. సప్తసింధు భౌగోళిక జ్ఞానమునకు ఈతని రచనలు బాగుగ నుపకరించుచున్నవి. ఈతడు సప్తసింధుకి తూర్పు మూలనుండి ప్రవహించు యమునా నదిని ఉల్లేఖించెను. ఒక చోట సుదాసు పేరుకూడ వచ్చినది. అత్రి వంశస్థులలో ఈతడు ప్రసిద్ధి గాంచిన ఋషి.

## కుత్సుడు

(12) 15 సూక్తముల రచయిత. అంగీరసుని పుత్రుడో లేక సంతానమో. ఈతడు తన రచనలలో కుత్స ఉల్లేఖనము చాలా చోట్ల చేసెను. (1-104 2,1; 106; 6) ఆర్జ్నతి, దాసరాజులైన శుష్ణ, పిప్రు, వృత్ర, శంబరులను ఉల్లేఖించెను. కుయవాను అసురునకు యిద్దరు స్త్రీలుండిరి.

## మధుచ్ఛందుడు

(13) విశ్వామిత్రుని పుత్రుడు తండ్రి భక్తుడైన ఈతనివి 10 సూక్తములు. ముష్టిహత్య ఉల్లేఖనము నీతడు చేసెను. అంతేకాదు, స్వాదిష్టము మాదిష్టము నైన సోమరసమును కూడా వర్ణించెను. (9, 101) ఈతని పుత్రులు జేతా, అఘమర్షణులు. ఒక్కొక్క సూక్తము రచియించి ఋషులైరి.

## ప్రస్కణ్వుడు

(14) కణ్వతనయుడైన ప్రస్కణ్వుడు 10 సూక్తముల రచయిత. తన రచనలలోని సగానికిపైగా సలములలో కణ్వుని ప్రస్తావన తెచ్చెను. అత్రి, అంగీరసుల వంటి ఋషుల, తుర్వశ, శఖవంటి సాధారణ జనుల సంగతికూడ నెత్తెను. ఈతడుల్లేఖించిన దశ్రవజ గోశర్యులు సప్తసింధునకు పశ్చిమ భాగములోని స్థానములై యుండెను. ప్రస్కణ్వుడు తన స్తోత్రముల గొర్రెల, మగ ఆడ మనుష్యుల ఆవుల ఆరోగ్యమును, గోరుచూ వ్రాసెను. (1.47 6) సుదాసు తుర్వశుల వర్ణన నీతడు కూడా చేసెను. సుదాసుతో రక్తపాతమైన సంఘర్షణకు తలపడిన తుర్వశయదులకు కణ్వుడు మరియు ప్రస్కణ్వుడు పురోహితులు. వీరు కూడా తమ యజమానుల విజయమునకై ఇంద్రుని ప్రార్థించి యుండెదరు. కాని విజయము సుదాసుకి లభించుటతో ఆ రచనలను సంగ్రహ పరచవలసిన అవసరము లేకపోయెను.

పది అంతకుపైన వ్రాసిన సూక్తకారులనుగురించి మనము యిప్పటివరకు చెప్పుకొంటిమి ఋషులసంఖ్య 350 వరకు వున్నదని చెప్పుకొంటిమి మిగిలినవారిలో అజీగర్తుని పుత్రుడు శునఃశేపుడు, శక్తి పుత్రుడు పరాశరుడు, అత్రి, ఒక్కొక్కరు 9 దేసి సూక్తముల రచయితలు. వసిష్ఠుని మనుమడైన పరాశరుడు సప్తసింధు ఋషులలో వాడు. ఈతనిని కురు - పాంచాల కాలమునకు తీసుక రాకూడదు. ఘోరుని పుత్రుడు, మేధాతిథి తండ్రియైన కణ్వుడు, మరీచి పుత్రుడు కాశ్యపుడు 8 దేసి సూక్తముల రచయితలు. సోభరీ కణ్వుడు, ప్రగాథవసిష్ఠుడు, జమదగ్ని 5 దేసి సూక్తముల రచయితలు. ఋషులలో ఆర్యనారి అపాలకూడా వున్నది. ఆమెది ఒకే ఒక సూక్తము ఋగ్వేదములో లభించుచున్నది. దేవతలను ప్రార్థించినంతలోనే, వారు ఈమె శరీరమును చర్మరోగమునుండి విముక్తి పరచి, సూర్యునివంటి కాంతి గల శరీరముగ నొనర్చిరి. ఆర్య నారీమణులలో పతులను ద్వేషించే సతులు కూడా కలరు. అట్టివారిని అపాల ఉల్లేఖించినది. (8-80-4) సప్తసింధు యొక్క ఏడునదులను తొమ్మిది శాఖానదులను, తొంబై కాలువలను వర్ణించిన సూక్తము, బుద్ధుని ఉల్లేఖించిన పదిమంది ఋషుల లోను ఒకడైన విశ్వామిత్రుని పుత్రుడైన అష్టకునిది. (10-104-8)

ఋషుల పూర్వీకులైన వరుణ పుత్రుడు భృగునిది ఇషీరథ పుత్రుడైన కుశికునిది, ఒక్కొక్క సూక్తము లభించుచున్నది. కణ్వవంశజుడైన వత్సునిది కూడా ఒక సూక్తము లభించుచున్నది. సప్తసింధు ఋషియైన వత్సుని వాస్తవిక స్థితి 18 19 శతాబ్దముల తరువాత ఎంత అజ్ఞానముగ తయారయినదీ, బాణుని ద్వారా వర్ణించబడిన "హర్ష చరిత" లోని వత్సుని జన్మయొక్క వర్ణనను చదివిన తెలియును.

* శ్రీ సాంకృత్యాయన్ ప్రత్యేకానుమతితో

# మొక్కుబడి

శ్రీ యామిజాల పద్మనాభస్వామి

ఆజన్మసిద్ధః సహజప్రబుద్ధః
కృపాసముద్రః స్థిరయోగనిద్రః
అవేత్వ మే వాఖిల వేదతత్త్వం
జగద్గురో! సంశ్రితదేవతాతరో!

* * *

మొక్కుబడిన్గావించితిఁ
జక్కఁగ నీ వేలు మిద్ది-జగముల యొజ్జా!
చొక్కపు ప్రాఁజదువుల పే
రెక్కినయిలు వెన్నెలుఁపు-నెక్కటి గుజ్జా!
[మొక్కుబడి]

మూడువందల నాలుగు ఋక్కులకు శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు కావించిన అచ్చ తెలుగు పద్యాల అనువాద వివరణ గ్రంథం 'మొక్కుబడి'. అపురూప గ్రంథాలలో మొక్కుబడి ఒకటి. ఈ మొక్కుబడి రచనగురించి దాసుగారు పీఠికలో చాలా వివరించారు. దానినే నేను సంగ్రహించి మామూలుగా నే వ్రాసే భాషలో తెలియపరుస్తున్నాను.

ఇరువదినాలుగు మెట్లుగల తెలుగువీణెమీద వచ్చే ధ్వనులలో మొదటి ఉక్కుతీగెవల్ల పుట్టేధ్వని 'స' అనీ, 'స' కంటె నిమ్మళంగా పలికే తక్కువ ధ్వనికి 'ని' అనీ, 'ని' 'స' ల రెండింటికంటే బిగ్గరై రింగున మ్రోగే హెచ్చుధ్వనికి 'రి' అనిన్నీ పెద్దలు ఆయా ధ్వనులకు గుర్తులు ఏర్పరచి ఉన్నారు. ఈ 'ని, స, రి' అనే మూడుధ్వనులే వేదగానం చేయడానికి ఉపకరిస్తాయి.

వేదగానానికి ని స రి అనే ధ్వనులే ఉపకరించడానికి కారణం పెద్దలు అంటే వేదగాన ప్రయోజనాన్ని తెలుసుకొన్న పూర్వీకులు తమ ఊపిరికొలతనుబట్టి వానిని ఉచ్చరించడమేగాని మరేమీ కాదు. ఈ ధ్వనుల హెచ్చుతగ్గుల ప్రయోజనం చాలా చమత్కారమైనది.

వేసవిలో ఉక్కపెట్టుతూంటే వట్టివేళ్ళ విసనకఱ్ఱతో విసురుకోవడం ప్రకృతి సహజగుణం. ఆ విసురుకోవడంవల్ల వచ్చే చల్లగాలివలె తగ్గురవళియైన 'ని' వినేవారికి జోకొట్టుతూన్నట్లు వినబడుతుంది. ముఱిపించుతూ వచ్చే పిల్లగాలివలె 'స' ఉచ్ఛ్వాస్కారించుతుంది. ఉషఃకాలంలో వచ్చే మలయానిలంవలె 'రి' పారవశ్యాన్ని కలిగిస్తుంది. అంతేకాదు. ని చవినీ, స హెచ్చరికనూ, రి తృప్తినీ చేకూర్చుతాయి. ఈ విధంగా ప్రయోజనకారులైన మూడు ధ్వనులూ ఋక్కుల అంతర్యాన్ని పలికిస్తున్నాయి కాగా ఈ ముత్తీగలైన ధ్వనులలో ఇంకో విశేషం ఉంది.

కూరకి తాలింపువలె పల్కుబడికి ధ్వనుల హెచ్చుతగ్గులు చవిపుట్టించుతాయి ఇది ప్రాచీనుల ఏర్పాటు. ఈ ధ్వనులను సరిగా ఉచ్చరించినప్పుడు, శృంగారాది నవరసాల స్థాయీభావాలు శ్రోతకు కలుగుతాయి అని ఋషులు అంటున్నారు.

అన్నంవల్ల ఆకలీ, నీరువల్ల దాహం తీరినట్లు, పెద్దలేర్పరచిన కట్టుబాటు ప్రకారం ముత్తీగలైన ధ్వనులతో ముచ్చటగా ఉచ్చరిస్తూ వేదగానంతో ముప్పొద్దులూ గడిపే బుద్ధిమంతుణ్ణి వేల్పులు కోరిన కోరికలిచ్చి అనుగ్రహిస్తారు. అంతేకాదు ఆ గాయకుడికి వేల్పులు కింకరులౌతారు.

పాటచేత సిరిసంపదలూ (ఐశ్వర్యం), వాద్యంచేత వేడుకా (ఆనందం), ఆటచేత (నృత్యం) శరీరప్రాణాల బింకమూ వృద్ధి పొందుతాయి.

కనుక తౌర్యత్రికంవల్ల పొందే ప్రయోజనం వేదానికి సంబంధించి ఉందని మనిషి సులభంగా తెలుసుకొంటున్నాడు. వేదగానానికి పలుకుబడి సరిచేసుకోవాలంటే వీణసహాయం ఉండితీరాలి. వీణ లేకపోతే వేదోచ్చారణలో అపస్వరం వస్తుంది. అపస్వరయుక్తమైన గానం ప్రాగ్భవసంభృతమైన పుణ్యాన్ని కూడా నశింపచేస్తుంది. సుస్వరోద్దిష్టమైన శ్రుతిధ్వనిని శ్రుతిహితంగా చెప్పడానికి స్వరశుద్ధికారకమైన వీణ ప్రధానోపకరణం. అదిన్నీ తెలుఁగువీణవల్లనే ఆ ప్రయోజనం సిద్ధిస్తుంది.

కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ, మనోయుక్తులైన మానవుల్ని సర్వదా కాపాడుతున్న దేవతలు పదునొకండుగురు. వారు వరుసగా 1 వరుణః, 2 ఉషః, 3 ఇంద్రః, 4 అశ్వినౌ, 5 బృహస్పతిః, 6 సవితా, 7 అగ్నిః, 8 మిత్రావరుణౌ, 9 సదాః, 10 అదితిః, 11 సరమా.—అని వీరు.

వీరికి దాసుగారు చేసిన నామకరణం వరుసగా, 1 చల్వవేల్పు, 2 వేకువ, 3 వేల్పుఱేఁడు, 4 కవలు, 5 వేల్పుటొజ్జ, 6 ప్రొద్దువేల్పు, 7 వేఁడివేల్పు, 8 కవవేల్పులు, 9 నీటివేల్పు, 10 ఎఱుకువ, 11 రాయబారి'—అని—

# మొక్కుబడి

పై పదునొకండుమంది వేల్పులనూ సేవించే వైతాల్పు తన కోరికలనన్నింటినీ నెరవేర్చుకోగలడు. వేల్పులను లోబరచుకోవాలంటే వారి చేష్టలను (లీలలను) వర్ణించి స్తుతించడంకంటె మించిన మంచి సాధనం ఇంకొకటి లేదు. శీలవంతుడు వేల్పులకు ముద్దుబిడ్డడు ఔతాడు. జనసామాన్యాన్ని సంతోషపెట్టడంకంటె శీలం అనేది ఇంకొకటి వేరే ఎక్కడా దొరికే వస్తువు కాదు.

వేదం పౌరుషేయమా, అపౌరుషేయమా అనే వివాదం మనకు అప్రధానం. దానివల్ల ప్రయోజనం శూన్యం. వేదంయొక్క ఉద్దేశం గురించి తగుదిష్ట మార్గాన సంఘజీవి అయిన మానవుడు నడవడం తద్విధి.

వేద ఋక్కులు దాసుగారు వక్కాణించిన ప్రకారం స్వరోపనిబద్ధములై ఉన్నాయన్నది సర్వులకూ అంగీకార్యమైన విషయం. కనుక స్వరయుక్తంగా వాటిని గానం చేయడం, ఆనందించడం మన కర్తవ్యం. భారతీయసంస్కృతికి మూలాధారం వేదవిజ్ఞానం. ఒకరి అభిప్రాయాన్ని ఇంకొకరికి చెప్పడానికి ఏర్పడిన మొట్టమొదటి ఆంగిక వాచికాభినయ స్వరయుక్తమైన ఒక విశిష్టగీత ప్రబంధం వేదం. లౌకికములైన కొన్ని శాస్త్రాలు కూడా స్వరప్రధానములయే ఉన్నాయి. వ్యాకరణసూత్రాలన్నీ స్వరమూలకములయే ఉన్నవన్నమాట తద్వేత్తలకు తెల్లమే. దానిని సూచిస్తూనే పాణిని మహర్షి స్వరవిభాగాన్ని కూడా చెప్పి ఉన్నారు. అదే:

ఉచ్చైరుదాత్తః, నీచైరనుదాత్తః, సమాహారస్స్వరితః—అని మనం చదివి ఉన్నాము. దానినే సంగీత శాస్త్రం మంద్ర మధ్యమ తారస్థాయీవిభాగంతో స్వరస్థానాలను ఏర్పరచుకొంది. అది కేవలం స్వరప్రధానంగా సంపూర్ణమూర్తియై గాంధర్వవేదం అనే ప్రసిద్ధిని సంపాదించుకొంది.

స్వరప్రాముఖ్యాన్ని చెబుతూ సుప్రసిద్ధ గాయకులైన నా మిత్రులొకరు అపస్వరంగా పాడేకంటె సుస్వరంగా (శ్రుతిలీనంగా) ఏడిస్తే ఇంపుగా ఉంటుందన్నారు. నిజమే. స్వరంయొక్క లాభాన్ని దాసుగారు వివరించిఉన్నదాన్ని బట్టి చూస్తే వేద ఋక్కును స్పష్టంగా ఒక్కదాన్ని పలికితే నాకలోక సుఖం అనుభవించుతాడు అనే పెద్దల సూక్తి ఔనుగాబోలు అనిపించుతుంది. ఇవన్నీ ఆలోచించి ఋక్కులకు స్వరం ఏర్పరచి దాసుగారు తరువాతి వారికి మహోపకారం చేశారని యీ మొక్కుబడివలన మనం తెలుసుకోగలుగుతున్నాము.

దాసుగారు తమ అనువాదం అంతా అచ్చ తెలుఁగు మాటలతోనే చేశారు. వీటికి నాటుపలుకులన్నారు. ఈ ఋక్కులకు దరువుల విభాగంతో అక్షరకాలం. క్రియల పంపకం కూడా ఇచ్చారు. అనువదించిన పద్యాలకు వైనోడు, బడి అని పేర్లు పెట్టారు. అది ద్విపదవిభాగానికి చెందుతాయి. వరుసగా ఆంధ్రీకరణ పద్ధతినీ, వారి అచ్చతెనుగు కౌశలాన్నీ, దానిలో నిరమణీయతనూ, ఋగాంతర్యాన్నీ ఇస్తున్నాను. మొదటిది వరుణస్తుతి:

చల్వవేల్ప (వరుణుఁడు)

(౧ ఒంటి దరువు, వంపులు వడి ౩)

సానీ సనీ సరీ సనీ సరీ ససస సా నిసా ।

యచ్చిద్ధితే విశోయథాప్రదే వవరుణ వ్రతం ।

ని నీస నీస రీససా ।

మనీమసిద్యవిద్యవి —

దీనికి దాసుగారి తెనిగింపు

వైనోడు:— నిన్నుఁ దిన్నఁగఁ గొల్వ నేరనిమమ్ము
మన్నించుము మా రేపురాపును వేల్ప!

* * *

వైదిక సంస్కృతం లౌకికసంస్కృతానికి భిన్నంగా ఉంటుంది. లింగ విభక్తి వచనరూపాలు లౌకికవ్యాకరణానికి లొంగవు. ఇది లౌకికసంస్కృతభాషా మర్యాదలు తెలిసినవారికి అందరికీ విదితపరమే. ఉదాహరణకి 'భద్రంకర్ణేభిశ్శృణుయామదేవాః' అన్నప్పుడు 'కర్ణేభిః' అనే తృతీయాంతం లౌకిక సంస్కృతంలో 'కర్ణైః' అని ఉండాలి ఈలాంటివిరుద్ధప్రయోగాలు వైదికవాఙ్మయంలో కోకొల్లలుగా ఉంటాయి. కొంగా కొన్ని తిఙంతరూపాలకు ప్రాతిపదికలే అనూహ్యాలుగా ఉంటాయి స్వప్నంలో కూడా మనం విని ఉండము వీటిని కొన్నింటిని పాణినిలోని ఉణాది ప్రకరణంలో వివరించివున్నారు. కాని విశ్వవిద్యాలయపాఠ్యప్రణాళిక ననుసరించి ఆ ప్రకరణం పాఠ్యంగా లేకపోవడం విచారణీయంగా ఉంది.

దాసుగారి వైదికవాఙ్మయ ప్రాభవానికి యీ 'మొక్కుబడి' ఉదాహరణగ్రంథం. వేదం అదిభట్ల వారికి పరంపరాగతమైన సొత్తు ఆ విధంగా దాసుగారికి వేదం క్షుణ్ణంగా వస్తే రావచ్చు గాని దగ్గరకురానీయని భాష అది. దానికి సులువుగా అనువాదం చేయడం అనేది అనన్యసాధ్యమైన విషయం—

ఈ వరుణప్రార్థనను తెల్పే పద్యాలు నలభైఒకటి. ఇందులో కొన్ని మహావిచిత్రమైన అర్థాలు కలవై ఉన్నాయి.

ఏడవపద్యం:-

సా నీసా నీసా నిసనీ సరీ సాని సరిసా ।

వేదాయో వీనాం పదమంతరిక్షేణపతతాం ।

సారి నీసా రినీ సరి

వేద నావః సముద్రియః

ఇందులో సముద్రిఅంటే లౌకికసంస్కృతంలో సముద్రే అనే సప్తమ్యంతంగా గ్రహించవలసి ఉంది.

దీనికి దాసుగారి అనువాదం:-

సీ॥ మినుదెసఁ బిట్టలు మెలఁగినజాడ।
కనెదఁ గడలిమీలకదలిక న్వేల్పు

ప్రకృతికి జీవితాధారమైన ఆహారాన్ని యిచ్చే దేవత వరుణుడే అని ఈ పద్యాలవల్ల తెలియవస్తూంది.

[౧౫ వరుస ఒంటిగుర్రపు పంక్తులు ౯, వడి 3 ఉప ౨]

నిస సాసా రినీసాస రీనీసా స నీసా।
ఉత యోమానుషేష్వా యశశ్చక్రే అసామ్యా।
నీసా రినిస నీసా।
అస్మాక ముదరేష్వా।

సీ॥ ఎవఁ డెంచుటకి బుక్క నిడనన్ని చోట్లఁ
దివిలి మా కడుపు నిండ న్గూడుకూఁపు......

వరుణుడు సువర్ణమయవస్త్రధారి. ఆయన వెలుగులే అంతటా నిండుకొంటాయట—చక్కని వర్ణన-

సా రి నీ సా రినీసనీ సరిసా సా సనీ సరీ।
బిభ్రద్ద్రాపిం హిరణ్యయం వరుణో వస్తనిర్ణిజం।
సనీ సనీ సరీసనా।
పరిస్పశో నిషేదిరే।

సీ॥ అంగుగా మా వేలు పంగీ దొడంగె।
బంగరురంగు లేపారె నల్లపల...

ఈ ఋక్కులలో చక్కని ఉపమలంకారాలూ, స్వభావోక్తులూ కూడా ఉండి ఎంతో ఉల్లాసం కలిగిస్తాయి.

[పరువు ౧౬]

సరీ సాసా సనీ సనీ సానీ ససారీ నీ సరీ।
పరామేయం తిథే తయో గావో నగవ్యూతీ రసు।
నీసా రీస నిసా రిసా
ఇచ్ఛం తీరు రుచక్షసం

సీ॥ ఆలఁదోడ్లకు వడి వరుగున ట్లేగు।
వేలుపు దెసకుఁ దవ్వైన్మా తలఁపులు.

సాయంకాలం కాగానే మేతకుపోయిన ఆవులు తమ నివాసానికి రావడం మామూలు. భక్తుని సంకల్పం వరుణదేవుని వంకకు అవిఘ్నంగా పోతుందట.

భక్తుడు ఋణపడి ఉండిపోవడం సహించలేడు. దానికి తన ఆవేదనను వరుణదేవుడితో చెప్పుకొంటూన్నవిధం ఎంతో జాలికలిగిస్తూ, మనస్సుని చెప్ప జాలని ఏదో భావంతో ఊపుతుంది.

[30 వ పద్యం]

బడి॥ ఏమైన నా పెద్దలేని గావించు
నప్పు తీర్పించు నాయంత నంతియును,
ఒకనికి నేనచ్చియున్నంతదనుకఁ
బరకంతయున్లేదు బ్రతుకున సుకము,
కుడుపకు నాకొరులూర్చిన సొమ్ము
నా మంచి గడనచే నన్ను మన్నించుము...

'ఉత్తమం స్వార్జితం విత్తం' అనేది దీనికి సమానార్థకంగా కనబడుతుంది. ఈమాట ఆనాడే వేదం చెప్పేసింది. ఒకరిపై నేను ఆధారపడకుండా ఉండాలి ఒకరిసొమ్ము నాకు అక్కరలేదు. ఎంత రాజసమైన బ్రతుకు కోరుకుంటున్నాడో చూడండి వేదకాలం నాటి మానవుడు!...పారుష్యమూ, కాలుష్యమూ, కృతఘ్నతా, తొందరపాటు, మోసము, దుస్సంకల్పమూ, మాత్సర్యమూ నన్ను చేరనీయకు అని ఆ నాటి మానవుడు వేల్పుని ప్రతిమాలుకుంటూ ప్రార్థిస్తాడు.

'మోటుతనమ్ము, డాబు న్కొల్లు మఱపు
తొందరలు నడువడి తప్పబ్బుమాట
మోసము చెడుతలంపు న్కడ్పగంబు
నలుపు నాకు న్డవ్వ; చల్లని వేల్ప!

ఇలా వరుణ్ణి వర్ణిస్తూ, ప్రార్థిస్తూ తత్పూర్వ ముగింపుతీరు ముద్దుగా ఉంది

[(౪౧) చేదరువు. పంక్తులు ౨౬ వడి ౧]

నీ ససానీ సరి సా నీ సనీ సని రిసాసనీ సరి।
బభ్రుకేశో విషుణః సూనరో యువా ఇట్యం క్తే
హిరణ్యయం।

సీ॥ మెఱుఁగు బంగరు పేరు-మెడఁ దాల్చువాఁడు
సరిగ జేజేలలోఁ—జల్లని వేల్ప—

రెండవ మెరుపు. ఇంద్రస్తుతి: వేల్పుఱేఁడు ౬౬ పద్యాలు.

ఇంద్రస్తుతి ప్రారంభ పద్యమే ఐంద్రీశక్తిని ముక్తసరిగా చెప్పివేస్తుంది.

[(౧) చేదరువు. పంక్తులు ౧౭, వడి 3, ఉప ౧]

సారీ నిస నీరీ నీసరీ నీ
ఇంద్రస్య నువీర్యాణి ప్రవోచం
సారి నిసారి సని సారినీ సా।
యాని చకార ప్రథమాని వజ్రీ!
సనీ సాని సానిసా రిసానీ
అహన్నహి మన్వప స్తతర్ద
సనీ సరీ ససనీసారి సా సా
ప్రవక్షణా అభినత్పర్వతానాం

బడి॥ నలిపినాఁ డెన్నియో చక్కని పనులు
మునుపు వేలుపు జగమునకు మేల్కొరి
కొనియాడుచుందు నా గొప్ప చేఁతలను
పిడికిటవమ్ములు పిడిచి తోడ్తోనఁ
గొరినట్టులు వాన కురియించినాఁడు
కొండలు దొల్చి వాగులు తెచ్చినాఁడు.

-ఇంద్రుడు జీవకోటికి చేసిన మేలు దీనివల్ల సుస్పష్టంగా తెలుస్తూంది.

# మొక్కుబడి

దాసుగారి ఆంధ్రానువాదం ఒకొక్కచోట సంగ్రహపద్ధతినీ, ఒక్కొక్కయెడ వివరణపద్ధతినీ త్రొక్కినట్టు కన్పట్టుతూ నన్నయాదుల గమనాన్నీ, ఉద్దేశాన్నీ అంగీకొన్నట్టు రూపొందింది. పైన ఇచ్చిన ఋక్కులో యథాతథంగా అర్థంగ్రహిస్తే—

'వజ్రియైన ఇంద్రుడు చేసిన మొట్టమొదటి పరాక్రమకార్యాలను వివరించి చెప్పుతున్నాను పర్వతాలను భేదించి భూమిపై నీటిని ప్రవహింపజేసెను అని మాత్రమే వస్తుంది. దానిని దాసుగారు కవితాధర్మంలో చిత్రించి వర్ణించారని అనుకోందాము.

'పిడికిటవజ్రబ్బులు పిడిచి తోడ్తో' అనేది వివరణ చిత్రం కావచ్చు.

అచ్చతెలుగుగా దాసుగారు వాడిన పదాలు కొన్ని సులభంగా అర్థంకావని చాలామంది విసుగు చెందుతారు. ఈ మొక్కుబడి అలాటి విసుగును పోగొట్టుతుంది.

'కమ్మరి చేసిన కత్తి చేఁబట్టి
కొండమీఁద వజ్రబ్బుఁ గొట్టె నా వేల్పు
వడి దొడ్డి కావులు పర్వెడునట్లు
నెగడి యా నీరు మున్నీటికిఁ జేరె.

ఇంద్రసుతి అంతా విశేషజ్ఞుడైన వయోవృద్ధు బాలురకు చెబుతున్న నీతికథలాగుంటుంది. పసిచిప్పి మనస్సులాకొక్క నెస్నేహితుడితో మాటాడుతూన్నట్టుంటుంది.

కఱవు సృష్టిని నానా యాతనలూ పెట్టి పాడి పంటలు లేకుండా చేయడం చూచి ఇంద్రుడు దానిని తెగగొట్టి వర్షం కురిపించుతాడు. చివరంటూ ఇంద్ర స్తుతిలో ఇదే ఇతివృత్తం.

భూతిరాశికి వానకురిసి పాడిపంటలు కలిగించిన వేలుపు ఇంద్రుడు కనుక భక్తుడు కృతజ్ఞతతో ఇంద్రుణ్ణి విందుకు పిలుస్తున్నాడు.

'ఇంద్ర సోమం సోమపతే పిబేమం మాధ్యందినం
సవనం చారు యత్తే।
ప్రపృథ్యాశిప్రే మఘవన్నృజీషి న్విముచ్యా హరీ
ఇహమాదయస్వ।

'పట్టపగల్ తేనె వార్చిన తేఁట
నీవారగించుము, నీ గుఱ్ఱములకు
మేపు కడుపునిండ మిగిలిన పిప్పి
మము హాయి బ్రదికించుమూ వేల్పుఱేఁడ!

ఉషోదేవతను 'వేకువరాణి' అనే పేరుపెట్టి వర్ణించిన స్తుతి ఎంతో హృదయంగమంగా ఉంటుంది. దీనిలో

దశ్వాలు 3౨
'అశ్వావతీ ర్గోమతీర్విశ్వసువిదో
భూరిచ్యవంతవస్తవే
ఉదీరయ ప్రతిమా సూనృతా
ఉషశ్చోదరా ధోమఘోనాం।

దీనికి దాసుగారి తెలుఁగుసేఁత,—

బడి॥ గుఱ్ఱము లావులుఁ గోరిన సిరులు
కమ్మతావుల హాయిగా వీచు గాలి
రాణితీని న్మాకు రప్పించు మెప్పుగు
పేరుకొంగుము నిన్ను వేకువరాణి!

ఈ వేకువరాణి చరిత్ర యెంత మనోజ్ఞంగా ఉందో దాసుగారి అనువాదం అంత అప్రతివాదంగా ఉంది.

'పిపిసావల నెల్లఁ బెంచిన తల్లి!
ముజ్జగముల మెప్పు పొందిన యమ్మ!
మేని తాల్పులనెల్ల మేల్కొల్పు వేల్పు!
వెంచేయుము బంగారు వేకువరాణి!

ఈ అనువాదంలో స్వేచ్ఛానువాదం ఎక్కువ కనబడుతుంది. కొన్ని తు చ. తప్పక ఒప్పుగా వెలసిన పద్యాలు ఉన్నాయి

[౭ దశ్వ. వంతులు ౭, వ౭ ౮, ఉసి 3.]

'నీ సారీ సస నీ సనీ సారీనీ సరినీ సరీ|
విసాయుక్త పరావతః సూర్యస్యోదయనావధి।
ని సాఁరీ సా నిసనీ సా నిసా సరీ నిససా రిసా
శతంరథేభిః సుభగోషా ఇయం వియాత్యభిమానుషాన్

బ॥ ప్రొద్దు కన్న మున్నుముందుగాఁ బోడమి
యెల్లవారల కోర్కు లిడి సిరు లీగతి (౩)
గ్రక్కున విచ్చేసెఁ గన్నుపండువుగ
వేయి కీల్బండ్లతో వేకువరాణి.

ఈ క్రింది చోవగవు దాసుగారి అనువాదపద్ధతిలో భావప్రాధాన్యానికి తార్కాణగా ఉంది.

'ద్యుతద్యామానం బృహతీ మృతేన
ఋతావరీ మరుణప్సుం విభాతీం
దేవీ ముషసం స్వరా వహంతీం
ప్రతి విప్రాసో మతిభిర్జరంతే—

బడి॥ మరియాద తప్పక మంచితేరెక్కి
చెంగావిఱోక కుచ్చెళ్ళ జీరాడ
ప్రొద్దువేలుపు పొందు పావరించు నీకు
వేయి జోహారులో వేకువరాణి!

అచ్చతెలుగుపదాలు ఒకదానితో ఒకటి ఒయ్యారంగా సయ్యాటలాడుతూ పూవాన కురుస్తూన్నట్టుండే అనువాదం ఈ 'వేకువరాణి' నుతిలో రాచబాటలో నడచినట్టుంటుంది.

[౨౭ వ దశ్వ]

'ఉషోరురుచేయువతి ర్న యోషా
విశ్వం జీవం ప్రసువంతీ చరాయై
అభూదగ్నిః సమిధే మానుషాణాం
అకర్జ్యోతిర్బాధమానా తమాంసి।

బ॥ జగమునకు బ్రతుకుజాడ చూపించి
కటిక చీఁకటి నలఁగడఁ బోఁద్రోలి
మగని చెంగటఁ గుల్కు ముసవయుల్లలకు
వినుమానికము చెంత వేడువరాణి'

ఉషాదేవత ముత్తైదువ కనుక ఆమె కృపవల్ల జీవలోకం సౌభాగ్యోత్సేకం అయి వర్ధిల్లుతుందని యీ ఋక్కుల అంతర్యం.

అశ్వినీదేవతలు ఒకభక్తుడి పెద్దకొడుకును సముద్రంలో శత్రుమధ్యంలో చిక్కి ఉండగా రక్షించుతారు. మునిగిపోతూన్న ఓడల్ని తెడ్డున్న అప్పలమీద తేలించుతారు. ఆ భక్తవందనుణ్ణి కాపాడి క్షేమంగా ఇంటికి చేరుస్తారు.

ఇంకో భక్తుడికి ముసలితనం పోగొట్టి, యవ్వనం ఇచ్చి తేజవరాంగ్రమగనిని గావించినారు. వేల్పువైద్యులవైద్యశక్తిని దీనివల్ల తెలుసుకోగలము.

ఒకడికి తల తీసివేసి, వాడికి గుఱ్ఱముయొక్క తల అతికి, వాడిశక్తిని అంతనూ లాక్కొని మళ్లీ వాడితలను అతికి మామూలుజీవిగా చేసేశక్తి కలవారు అశ్వినులు.

పగవారివల్ల కాలు పోగొట్టుకొన్న భక్తురాలికి ఉక్కుకాలిచ్చి, ఆమెచేత పగవారిని గెలిపించారట.

"బ॥ పగవారు తనకాలు పడఁగొట్టినపుడు
మిము వేఁడుకొనియెను మీ బత్తురాలు
ఉక్కుకాలామె కొక్కుమ్మడి నతికి
అని గెలిపించి రారా! కవలారం!

'అవాం రథం దుహితా సూర్యస్య
కార్ష్మేవాతిష్ఠదర్వతా జయంతీ
విశ్వేదేవా అన్వమన్యంత హృద్భిః
సముశ్రియా నాసత్యాసచేథే.'

గుఱ్ఱాల పందెం దేవలోకంలో జరిగింది. ఎవరి గుఱ్ఱం హద్దుకిముందు చేరితే వారికి సూర్యుడు తన కూతురినిచ్చి పెండ్లిచేస్తాడు. ఆ పందెములో అశ్వినీదేవతలు గెలిచారట.

బ॥ ఏర్పఱచిన మేర యెల్లరికన్న
ముందుగా మీ గుఱ్ఱమున్మిఱనిచ్చి
అంచఱు వేల్పు లౌనఁ బ్రొద్దుకన్నె
కవఁగూడినారు చక్కని కవలార!

దేవతలలో దేవవైద్యుల చర్యలన్నీ చాలా చిత్రంగా కనబడతాయి. ఇందులో ప్రతి పద్యమూ వారి మహిమను చెప్పేదే—

బ॥ వడి దప్పిగొన్న మీ బత్తుని ప్రోలఁ
దెప్పించినారు మీఁదికి బావినీరు,
పాడువుత్తవను మొదవుల చనుమొనలఁ
గోరివట్టులు పాలు కురియించినారు,

అంటుంది—ఋక్కు.

జ్యోతిశ్శాస్త్రదృష్టితో చూస్తే దేవగురువైన బృహస్పతికి ఏవేవో కారకత్వాలు కనబడతాయి. ఋక్కులలో కనబడే బృహస్పతి మహాశూరుడూ, వీరుడూ, మహామాధుర్యమున్నూ, దేవసామ్రాజ్యం ఆయువు అంతా బృహస్పతిచేతిలోనే ఉన్నదని భావించవలసి వస్తుంది

"బ॥ సంతోస మిమ్ము ప్రాఁజదువుల పెట్టె!
సాటిలేక వెలుంగు జగము చుట్టంబ!
పగవారి సందడి స్ఫురిమాగ్గ్యు జోద!
మరియాద నొక్కటే మన్నించు రేఁడ!
సరకంతయును నాగ్రట పడని మగండ!
సిగులెల్ల వేలెడు జేజేల రొజ్జ!"

ఇంతకంటే సురగురువైన గురునిగురించి పొగడే ఋక్కుల్ని వేరే ఉదాహరింప నక్కరలేదు. గురుడు సర్వ సురసేనాధిపతిగా ఉన్నట్టు

"తిగ్మ మేకో బిభర్తి హస్త ఆయుధం
శుచి రుగ్రో జలాష భేషజః
"వేలుపుమూఁక నడపించి రక్కసుల
వాలఁక ప్రముందు నేర్పరి వేల్పుటొజ్జ—

అనే ఋక్కువల్ల తెలుస్తుంది.

ఈలా చెప్పాలని అనుకొంటే గ్రంథం చాలా పెరుగుతుంది. ఇంతకూ ఈనాడు దీనిని నేను ఏదో సమీక్ష చేయవలసిన అవసరమూ లేదు. సమీక్షించ డానికి నాకు శక్తి యే విధంగానూ లేదు. ఇంతకూ దాసుగారి లౌకికాలౌకిక సంస్కృతి భాషాపాండిత్యాన్ని కొంచెం చవిచూపడంమాత్రమే నా యీ ప్రయత్నోద్దేశం ఈ పుస్తకంయొక్క ప్రయోజనం తెలుగువారికి ఎంతో ఉందని నా నిశ్చయూహ. ఇంకా సూర్యుడూ, అగ్ని, నదీదేవతలూ మొదలైన వారినిగురించి చెప్పవలసిఉంది గాని అంతకంటే తెలుగువారు ఆ గ్రంథాన్ని స్వయంగా పఠించి కృతార్థులు కావాలని నా మనవి. ఈ గ్రంథంలో చివరిదైన

సరమ—రాయబారం— పద్యం ఒకటి ఇచ్చి యీ వ్యాసం ముగిస్తున్నాను.

సరమ అనే ఒక దేవకన్య పసిడివగల నెత్తుకపోయిన కొందరు రాక్షసుల దగ్గరకు వెళ్లి ఆ వస్తువు లిచ్చివేయుండని చెబుతుంది. ఆ సందర్భంగా ఆ దొంగలకూ ఆమెకూ జరిగిన సంభాషణ రాయబారం అనే పేరుతో దాసుగారు అనువదించారు.

"పనికి మాలిన రాయబార మింకేల
ద్రిమ్మరీ! వచ్చిన తెన్నునఁబొమ్మ"అని రాక్షసులు సరమను బెదరించారు. ఆ బెదరింపు త్రోసిరాజని జంకక ఆమె చెప్పిన సమాధానం ఆదస్యుల కొక సవాలు- వాఁడివాలు :—

"వేల్పులకుం దగు వింత సొమ్ములను
దొంగిలించిరి మీరు దుండగుల్గనుక
దబ్బున వేజేలు తన్నక ముందె
సొమ్ములు విడిచి యెచోటకైనఁ బొండు"—

# నాలందా విశ్వవిద్యాలయము

శ్రీ పోతుకూచి శ్రీరామావధాని

విద్యకు ఆలవాలమై, సంస్కృతికి నిలయమై, మనోవికాసమునకు పుట్టినిల్లయి, విజ్ఞాన ప్రచారమునకు దోహద మొసగజాలినదై వెలుగొందు విశ్వవిద్యాలయము భారతదేశమున అతి ప్రాచీనకాలముననే సుప్రతిష్ఠితము గావింపబడినది. ఆర్యులు గురుకులములలో విద్యావ్యాసంగమున వ్యాపృతులైన కాలమున చైత్యాది సంఘారామములను విద్యాసదనములుగా చేసి విశ్వవిద్యాలయములను స్థాపించినవారు మహాయానబౌద్ధులు. విజయపురి (నాగార్జునకొండ), ధాన్యకటకము (ధరణికోట), సాంచి, సార్నాథ్, బుద్ధగయలలోనేగాక నాలందాలోకూడ మహత్తరమైన విశ్వవిద్యాలయమును నిర్మించి ఉన్నతవిద్యను సహితము నేర్పసాగిన మహాయానికుల కృషి నేటికిని స్మరణీయము.

బుద్ధగయ సార్నాథ్ల వంటి పవిత్రస్థలము కాకపోయినను, నాలందాకు అచటి విశ్వవిద్యాలయమునుబట్టి, అందలి అధ్యాపకులనుబట్టి ప్రాధాన్యము వచ్చినది. నాలందానే భోటదేశీయులు నాలేంద్ర మనెడివారు. నాలందా ఇప్పటి బీహారులోని రాజగడ్ కుత్తరముగ ఏడుమైళ్ళ దూరములోనున్న బర్గాం గ్రామము. నాలందానుగురించి తెలుసుకొనుటకు



నాలందా విశ్వవిద్యాలయ శిథిలములు

కొన్ని తామ్ర, శిలాశాసనములు లభించినవి. ఇచట దొరికిన దేవపాలుడు, సముద్రగుప్తుడు, ధర్మపాలుడు అనువారికి చెందిన తామ్ర శాసనములు కలకత్తా ఇండియన్ మ్యూజియమ్‌లో పొందుపరచబడినవి.

చీనా యాత్రికుడు యువాన్ చ్వాంగ్ మొట్టమొదట నాలందాయందొక సంఘారామమును దర్శించెను. ఆ సంఘారామమునకు దక్షిణముగా నొక చెరువుగలదు ఆ చెరువునే నాగచెరువని పిలచెడివారు. ఆ నాగచెరువు ప్రాంతమునకే నాలందా యను నామము సుప్రసిద్ధమైనది. ఆ ప్రాంతమందు పూర్వమొక ఆమ్రవనము (మామిడితోట) కలదు. ఆ తోటను ఐదువందలమంది వర్తకులు కలసి పదికోట్ల బంగారు నాణెము లిచ్చి కొనిరి. దానిని తరువాత కొద్దికాలమునకు బుద్ధునకు దానమిచ్చిరి. బుద్ధు డచట మూడుమాసములు ధర్మమును, సత్యమును బోధించెను.

బుద్ధుని నిర్వాణానంతరము శక్రాదిత్యుడా సంఘారామమును పోషించెను. అతనినే షి-కియా-లో-ఒ-టి-టో అని యువాన్‌చ్వాంగు అనుచున్నాడు. శక్రాదిత్యుడు ఆ ప్రాంతమందే ఒక సంఘారామమును నిర్మింపబూని కందకములు త్రవ్వ మొదలిడెను. ఆ చోట నాగుడు సమాధియందు తప మొనరించుచుండెను. కందకములు త్రవ్వు సమయమున శక్రాదిత్యుడు ఆ నాగుని గాయపరచెను. ఆ సంఘటనను నిర్గ్రంథులకు సంబంధించిన ఒక వేత్తమూచి అతనితో నిట్లనెను: 'రాజా! మహా తపస్వి, జ్ఞానియగు నాగుని గాయపరచితివి. ఇంతకంటె ఘోర పాప మింకొకటి కలదా? ఈ పని నీవు తెలిసి చేసినది కాదు. కనుక నీ విచట నొక విశ్వవిద్యాలయమును నిర్మించిన, ఈ పాప ముపశమింపగలదు. ఈ విద్యాలయము సంస్కృతికి, మనోవికాసమునకు నిలయము కాగలదు. విదేశములనుండి కూడ విద్యార్థులు రాగలరు. కాని ఈ విశ్వవిద్యాలయము వేయి సంవత్సరములు మాత్రమే శోభిల్లగలదు'. నాగుని సంఘటన మూలముగ నాలందాయందొక విశ్వవిద్యాలయము స్థాపించబడినదని ఒక కథ.

నాలందా విశ్వవిద్యాలయ మెపుడు స్థాపించబడినదో నిర్ణయించుట కష్టము. మహాయాన మతస్థాపకుడు ఆర్య నాగార్జునుడు క్రీస్తుశకము మొదటి శతాబ్దమునాటివాడు. ఆచార్య నాగార్జునుడు నాలందాయందు విద్యనభ్యసించెనని, తరువాత ప్రధానాచార్య పదవిని స్వీకరించెనని పలువురు పలుకుట కలదు. అట్లే నాగార్జునుని ప్రియ శిష్యుడు, తత్త్వవేత్తయగు ఆర్యదేవుడు నాలందాయందుండెనని, పిదప ప్రధానాచార్యు డయ్యెనని చెప్పెదరు.

ఆర్యనాగార్జునుడు విదర్భయందు జన్మించెనని కొందరు భ్రమపడుచున్నారు. నాగార్జునుని, ఆర్యదేవుని జన్మస్థలములనుగూర్చి వివాదము కలదు.

"దక్షిణాపథ వేదల్యాం భిక్షుః శ్రీమాన్ మహాయశాః
నాగాహ్వాయం సనామ్నాతు సదసత్పక్షదారకః"

అని నాగార్జునునిగూర్చి లంకావతార సూత్రమే పలుకుచున్నది. దీనినిబట్టి నాగార్జునుని జన్మస్థలము వేదలియని స్పష్టము కాగలదు. ఆంధ్రదేశమం దిప్పటికిని కొందరి ఇంటిపేర్లు వేదాల, వేదుల యని కలవు. గోదావరి జిల్లాలో వేదులయను గ్రామమొకటి కలదు. అతనికాలమందు ధాన్యకటకమం దొక విశ్వవిద్యాలయము స్థాపించబడెను. అచటనే విద్య నభ్యసించి, పిదప ప్రధానాచార్యుడయ్యెను. నాలందాకు ప్రాధాన్యమొసగుటకుగాను నాగార్జును డచట విద్య నభ్యసించెనని, తరువాత ప్రధానాచార్యత్వమును వహించెనని మొదలుగాగల కథలు అల్లిరి. ఆర్యనాగార్జునుడు ఆంధ్రుడని, ఆంధ్రదేశమునగల వేదలియందు జన్మించెనని, ధాన్యకటక విశ్వవిద్యాలయమందు, ఆ పరిసర ప్రాంతములందు జీవితము గడపెనని స్పష్టము కాగలదు.

అట్లే ఆర్యదేవునిగూర్చికూడా పుక్కిటి పురాణములు కలవు ఈతడు సింహళదేశస్థుడని కొందరి భ్రమ. ప్రస్తుతము ఆంధ్రదేశమున కొన్ని కుటుంబములను 'అయ్యదేవర' అను ఇంటిపేరుతో పిలచుట కలదు. 'అయ్యదేవర' అను నింటిపేరు ఆర్యదేవుని వలన వచ్చెనని చెప్పనగును. ఆర్యదేవుని తండ్రి సింగల లేక సగాలయను ప్రాంతమునకు ప్రభువైన శ్రీఫలుడు. పూర్వము నాగార్జునకొండకు ఉత్తరముగాగల ప్రదేశము సింగల లేక సగాల యని పిలువబడుచుండెడిది. ఆర్యదేవుడు నాగార్జునుని కలుసుకొనుటకై దక్షిణముగా కొలదిదూరమునగల నాగార్జునుని నివాసస్థలమునకు వచ్చెనని ఆచార్య చంద్రకీర్తియే తెలుపుచున్నాడు. సగాలయే మచిలీపట్టణమునకు సమీపమునగల ఇప్పటి శ్రీకాకుళము. ఆర్యదేవుని జన్మస్థలము ఇప్పటి శ్రీకాకుళమని రూఢియగుచున్నది. ఆర్య

దేవుడు కూడ నాగార్జునుని తరువాత ధాన్యకటకమందు ప్రధానాచార్యపదవిని స్వీకరించెను. కనుక ఆర్య దేవుడు ఆంధ్రుడని విశదము కాగలదు.

ఆర్యదేవుని తరువాత బయలుదేరిన దార్శనికులు కొందరు నాలందాకు చనిరి. ఆచార్యదిఙ్నాగుడు వేంగీదేశస్థుడు. నాలందాయందు విద్యనభ్యసించి బౌద్ధమతాభివృద్ధికి తోడ్పడిన వసుబంధువు, శీలభద్రుడు, ధర్మకీర్తి, శాంతిరక్షితుడు మొదలగు వేత్తలు స్మరణీయులు. వీరివలననే చాలవరకు బౌద్ధమతము ఆసియా ఖండములోనే గాక ప్రపంచమంతట వ్యాపించినది.

యశోవర్మదేవుని, విపులశ్రీమిత్రుని శాసనములు ఇచట పరిశీలనార్హములు. యశోవర్మదేవుని శాసనము ప్రకారము అతని మంత్రి కుమారుడగు మాలదా యనునాతడు ఎనిమిదవ శతాబ్దమున బాలాదిత్య నిర్మితమైన సంఘారామమునకు కొన్ని గ్రామములను దానమిచ్చెనని తెలియుచున్నది.

ఏడవ నంబరుగల సంఘారామపరిసరములందు విపులశ్రీమిత్రుని శాసనమొకటి లభించినది. దానిలో తారాదేవాలయము వర్ణించబడినది. వీటికి తోడు కొన్ని శిలాశాసనములు కూడ లభించినవి. చాలవరకు ఈ శాసనములందు ప్రతీత్యసముత్పాదమునుండి కొన్ని వాక్యములు వ్రాయబడినవి. త్రైలోక్యవిజయుని ప్రతిమ వెనుకభాగమున

"ఆకాశ లక్షణం సర్వం ఆకాశం చాప్య లక్షణం (i) ఆకాశ - సమతాయోగాత్ - సర్వాగ్ర - సమతస్ఫుటః (ii) ఉదయభద్రస్య"

అని కలదు. I A—304 నంబరుగల తారా ప్రతిమయందు.

"ఓం తారే తుత్తారే తారే స్వాహా, ఓం పద్మావతీ ఓం కురుకుల్లే స్వాహా, యే ధర్మా..."

అని అసంపూర్తిగా కలదు. ఈ శాసనములన్నియు ఆ కాలమందుపయోగింపబడిన సంధా భాషలో కలవు. సంధాభాష సంస్కృత, ప్రాకృత మిశ్రమము. ఆకాలమందు నాలందా విశ్వవిద్యాలయమందుపయోగింపబడిన ముద్రలు కొన్ని లభించినవి. ముద్రల పైభాగమున :

"శ్రీ నాలందా మహావిహారే - ఆర్య - భిక్షు సంఘస్య"

అని కలదు. దాని వెనుకభాగమున ఇరువైపుల దుప్పులతో కూడిన ధర్మచక్రము కలదు.

నాలందాకు విద్యనభ్యసించుటకై పదివేలమందికి పైగా విద్యార్థులు వచ్చెడివారు. వీరి నివాసమునకు, పోషణకు నాలందాయే ఖర్చును భరించుచుండెడిది. ఈ విద్యాలయమును పెక్కు రాజులు పోషించిరి. గుప్తరాజులలో శక్రాదిత్యుడు, బుద్ధగుప్తుడు, తథాగతగుప్తుడు, బాలాదిత్యుడు, కుమారగుప్తుడు పేర్కొనదగినవారు. క్రీస్తుశకము ఐదవ శతాబ్దమున ఫాహియాన్ అనునాతడు హిందూదేశమును దర్శించెను. ఆ కాలమున నాలందా అంత ప్రసిద్ధికెక్కి యుండకపోవుటచే నాలందానుగూర్చి అతడు ఎచటను ప్రశంసించి యుండలేదు. ఏడవ శతాబ్దమున వచ్చినవాడు చీనా యాత్రికుడగు యువాన్‌చ్వాంగు. ఈతడు చాలా కాలము నాలందాయందు గడిపెను. అతని కాలము నాటికి శీలభద్రుడు ప్రధానాచార్యుడు. యువాన్ చ్వాంగ్ శీలభద్రుని ప్రియశిష్యుడు. శీలభద్రునికడ హేతువిద్య, శబ్దవిద్య, చికిత్సవిద్య, వేదవేదాంగములు చక్కగా పఠించెను.

దేవపాలుని తామ్రశాసనములనుబట్టి రాజఘడ్ జిల్లాలో ఐదు గ్రామములు నాలందా పోషణార్థమై ఇవ్వబడినవని తెలియుచున్నది. ఆచార్యనాగార్జునుని కాలమున 108 మహాయాన, హీనయాన విద్యాలయములను గట్టించెను. ఈ విద్యాలయప్రాంగణమందు పిన్నలు, పెద్దలు కలసి తత్త్వవిచారణ చేసెడివారు. చర్చలలో పాల్గొనని వారిని తుల్యముగా చూచెడివారు. నాలందాయందు విద్య నభ్యసించుటకై వచ్చినవారు సింహద్వారమందుగల ద్వారపాలకుని చేత పరీక్షింపబడెడివారు. ఆ పరీక్షయందు ఉత్తీర్ణులైనవారు మాత్రమే నాలందా విశ్వవిద్యాలయమందు జేర్చుకొనబడెడివారు. నాలందాయందుగల ఇత్తడి సంఘారామము కవిశేఖరుడగు హర్షవర్ధనుని మతాభినివేశమునకు తార్కాణము.

ఇట్టి విశ్వవిద్యాలయములలో ఆనాడు విద్యార్థులు త్రిపిటకములను, మహాయాన సూత్రములను, వేదములను, ఉపనిషత్తులను, షడ్దర్శనములను, వ్యాకరణాలంకారములను అభ్యసించెడివారు. ఈ పాఠ్యక్రమము వైజ్ఞానిక సాంస్కృతికి దోహదమొసగినది. నిష్పాక్షికముగా తత్త్వవిచారణ చేయుచు విద్యాపరిపోషకత్వమున పెక్కు సంవత్సరములు తమ జీవితములను ధారపోసిన అధ్యాపకులు భారతీయ సంస్కృతిని సుప్రతిష్ఠితము గావించి అర్వాచీనులకు మార్గదర్శకులై విలసిల్లిరి.

"యే ధమ్మా హేతుప్పభవా, తేసాం హేతుం తథాగతో ఆహ తేసాం చయో నిరోధో, ఏవం వాదీ మహాశమనో."

కృష్ణ : ప్చ్. తెలివితేటలైతే వున్నాయి కానీ— ఎందుకూ పనికిరాని తెలివితేటలు. ఉత్త యూస్‌లెస్ ఇంటలిజెన్స్, (Useless Intelligence) లోకజ్ఞానం శూన్యంగా కన్పిస్తోంది.

నాగే : శ్రీకృష్ణగారూ!

కృష్ణ : క్షమించాలి ప్రొఫెసర్ శ్రీకృష్ణ—అదే పండిత శ్రీకృష్ణ—ఆర్టిస్ట్ అండ్ డిరెక్టర్-ది విశాలాంధ్రా ఆర్ట్ సొసైటీ, అంటే ఎంతో సంతోషిస్తాను

నాగే : (సందేహంగా) ప్రొఫెసర్ శ్రీకృష్ణ? ప్రొఫెసర్!

కృష్ణ : ఏం సందేహంగా వుందా? సంశయించకండీ! మనసులో వున్నదేమిటో నిష్కర్షగా బయటపెడితే సాధ్యమైనంతవరకూ సర్దుకోనేందుకు ప్రయత్నిద్దాం.

నాగే : అబ్బే! అహ్హా! ఏమీలేదు మీకా "పండిత" బిరుదం ఎవరిచ్చారో తెలీక—

కృష్ణ : మై గుడ్‌నెస్ దీనికేటండీ అంత బిడియ పడ్డారు?

నాగే : తెలీక అడిగినందుకు ఏమీ అనుకోరనే భావిస్తాను

కృష్ణ : అనుకోడమా? ఇంపాజిబుల్. కళాకారులు విశాలహృదయం అలవర్చుకోవాలన్న సంగతి మర్చిపోతున్నారు మీరు. మనం స్వతంత్ర భారతదేశంలో స్వేచ్ఛావాయువుల్ని పీలుస్తున్న మనం, ఇంకా సంకుచితాభిప్రాయాలతో పారతంత్ర్య భావాలతో, రాతియుగ మనస్తత్వంతో జీవిస్తే—ఇంకా యెవరండీ యీ ఆధునికయుగంలో పురోగమించామని చెప్పుకోడానికి హక్కుదారులు?

నాగే : క్షమించాలి. నేను కళాకారుణ్ణి కానూ కాదు, నాకు కళాకారుల జీవితంగురించి తెలీనూ తెలీదు.

కృష్ణ : నాన్సెన్స్. తెలియకపోవడమేమిటి? తెలిసి వుండాలి; తెలిసివుండితీరాలి. నేనీమాట మీద ఇంత స్ట్రెస్ ఈయడానికి కారణమేమిటో తెలుసా?—భారతదేశంలో ప్రభవించిన ప్రతిపురుషుడూ ఒక కళాకారుడే. మాతృదేశ స్వేచ్ఛావాయువుల్ని పీలుస్తున్న ప్రతి హిందూ స్త్రీ ఒక కళాభారతి.

నాగే : ఇంతకూ తమ 'ప్రొఫెసర్ షిప్' గురించి చెప్పారే కాదు.

కృష్ణ : ఓహ్! మాటల సందడిలో మరిచేపోయాను.

నాగే : ఏ విశ్వవిద్యాలయంలో చదువుకున్నారు? విశ్వభారతి!

కృష్ణ : (పెద్దగా, విపరీతంగా నవ్వుతూ) అహ్హహ్హా! అవును. శంఖులోనుండి వస్తేనేకాని తీర్థం కాదట విస్సన్న చెబితేనేకాని వేద మర్థం కాదట. అహ్హహ. చిరుబుగ్గల గులాబికన్నెకు ఎవరు ప్రసాదించారా వింతసోయగాన్ని? ప్రియుల గుండెల్లోకి వెన్నెలబాణాలు విసిరే రేరాజు కెవరిచ్చారా వింత అందాన్ని? ప్రకృతి. నాగేశ్వరరావుగారూ! మానవుని లోని విలువకు సరియైన ప్రతిఫలాన్నిచ్చేది విశ్వవిద్యాలయం కాదు—ప్రపంచం, నీతో కలిసిమెలిసి తిరిగే నీతోటి సహచరులు.

నాగే : విద్యాలయాల్నంత బొత్తిగా తీసివేయకండి కృష్ణగారూ! కళాప్రపూర్ణుల సంగతి మరచిపోయారా? కవి సన్మానాలు మీకు జ్ఞప్తి లేవా?

కృష్ణ : హుఁ! రాలిపోయేనక్షత్రానికి 'రారమ్మంటూ' స్వాగతం ఇచ్చినా వొకటే ఇవ్వకపోయినా వొకటే ఇక సన్మానాల సంగతా? ఒక సంగతి చెబుతాను వింటారూ? నాదగ్గర డబ్బున్నది మీదగ్గర తెలివితేటలున్నాయి. నేచెప్పినట్లు మీరు వింటారు. మీకు కనకాభిషేకం చేయాలని నాకు బుద్ధిపుట్టింది.

నాగే : నాకా? కనకాభిషేకమా?

కృష్ణ : అహ మీరంటే మీరుకాదు. మాటవరుసకు చెప్పాను.

నాగే : బ్రతికించారు!

కృష్ణ : ఏం? జరగకూడదా? ఏమో ఎవరికి తెలుసు. మీకే కనకాభిషేకం జరిపించుకునే యోగం ఉందేమో?

నాగే : నాకా? నాకు!

కృష్ణ : ఆశ్చర్యపడకండి ఎవరిగీత ఎల్లావుందో ఎవరికి తెలుసు? బంపరు ఆఫరులో లక్షరూపాయలు చేజిక్కించుకున్న ఆసామీ ఆవార్త విన్న తక్షణం పరలోకానికి పాస్‌పోర్టుతీసుకోడం లేదూ? అలాగే చెప్పులు కుట్టుకునే ఆసామీకి రాజయోగంపట్టి మహానాయకుడు కావటంలేదా?

నాగే : అదంతా వారివారి అదృష్టంఅండీ! ఎవరో ఏమిటో చేశారని మనమూ అలా చేస్తే— తాటాకులు కట్టించుకోటానికి వేరే ఏమీ అక్కర్లా?

కృష్ణ : లోకులు పలుకాకులన్నారండీ. ఎవరో ఏమిటో అన్నారని మనం, మనంచేసేపనులు మానుకుంటామా? నూనూగు మీసాల మన కుర్రవాళ్లు వేసుకునే అందాల చారల అమెరికన్ జాకెట్లను చూచి ""మస్టాష్డ్ బేబీస్" (Mustached babies) అంటూ ఈ ఆడవాళ్లంతా ఎగతాళి చేయడంలా? అంతమాత్రాన, మనవాళ్లు, 'ఆ వీకర్ సెక్సు'ను దడిసి జాకెట్లు తొడుక్కోడం మానుకుంటారా? నెవర్!

నాగే : ఎల్లా వూరుకోడంలెండి!

కృష్ణ : పర్‌ఫెక్ట్‌లీ కరెక్ట్! (Perfectly correct) అసలెందుకు వూరుకోవాలని?

నాగే : వూరుకోడం సంగతి అటుంచండి. అసలదృష్టం వుండవద్దుటండీ?

కృష్ణ : ఉండకేం చేస్తుంది! మహా మహా వాళ్లకే అదృష్టంఉండగా లేంది మీకులేక ఎక్కడికి పోతుంది? మీ రాజయోగం చూసి తోటి వాళ్లు కళ్లల్లో నిప్పులు పోసుకోనూ పోసుకుంటారు. మీకు కనకాభిషేకం జరిపించుకునే మహాద్భాగ్యం వుండనూ వుంది.

నాగే : అదేమిటి లెండి — బ్రహ్మదేముడు మన ముఖాన రాసిపెట్టి వుండవద్దూ?

కృష్ణ : రాసిపెట్టి వున్నాడో లేదో మీకేం తెలుస్తుంది? తెలిస్తే నాబోటివాడికి తెలియాలి. చెబితే నాబోటివాడే చెప్పాలి?

నాగే : కొంపతీసి మీకు జ్యోతిష్యంగాని తెలుసు కదా?

కృష్ణ : జీవితానికీ, దీనికీ ఏమాత్రం సంబంధం లేదు; మానవమనస్తత్వపరిశీలన, ఇన్నేళ్లుగా జీవితంలో గడించిన అనుభవం – ఇవే నాకాధారాలు— నేనే జడ్జ్‌మెంట్ పాస్ చెయ్యాలన్నా.

నాగే : (ఆశగా) అంతవరకూ బాగానే వుంది. నిస్సారంగా ఉన్న ఈ జీవనయాత్రలో 'ఒయాసిస్సు' వుందని చెప్పడానికి నాలో ఏమంత ప్రత్యేకత కనిపించిందని మీకు?

కృష్ణ : పిచ్చివాడా! పల్లెటూర్న వున్నా నీకేమోయి మొహంలో రాజఠీవి కన్పిస్తున్నది. అణువణువునా గంభీరత తొణికిసలాడుతోంది. 'ఊ' అను. వారంరోజుల్లో కనకాభిషేకం చేయించే బాధ్యత నాది.

నాగే : ............

కృష్ణ : సందేహిస్తున్నావా? మనసులో వున్నదేమిటో మర్మంవిడిచి చెప్పవోయ్.

నాగే : ............

కృష్ణ : ఇన్నేళ్ళొచ్చినా ఇంత సిగ్గయితే ఎల్లాగోయి? సరే, మౌనం అర్ధాంగీకారంగా తీసుకుంటున్నా.

నాగే : ఊఁ!

కృష్ణ : (ప్రేక్షకులకు దగ్గరగా బాగా స్టేజిముందుకు వచ్చి) హు! నా అక్షయతూణీరం ఇంతవరకూ వ్యర్థపోనేలేదు.

నాగే : ప్రొఫెసరుగారూ? ఆకాశాని కెత్తేశారు నన్ను.

కృష్ణ : రావుగారూ! ఇంతవరకూ యీ ప్రొఫెసర్ ఆడినమాటా, విసిరిన బాణం గురితప్పలేదు. ఈనాడు మీకు సన్మానం చేస్తానని వాగ్దానం చేసి భీరువులా పారిపోతాననుకున్నారా? ఈ దేహంలోని రామచిలుక కన్నుమూసేవరకూ జరగదా పని.

నాగే : ఎందుకనో గానీ నాకా నమ్మకం కలగడం లేదు.

కృష్ణ : పెద్ద నమ్మకం. ఇవాళ కాకపోతే రేపు కలుస్తుంది. ప్రస్తుతానికి మాత్రం నే పాడే పాటకు ప్రక్క తాళం వేస్తుండండి చాలు. ఆపై కార్యాన్నంతా గంధర్వులే తీరుస్తారు.

నాగే : ...... .....

కృష్ణ : బావుందండి. ఇంకా మీ మనసులో చీకటి సందేహాలు గూళ్లు కట్టుకుని అగుస్తూనే వున్నాయన్న మాట! సరే. అయితే నా దారిన నే పోతాను.

నాగే : అది కాదండీ...

కృష్ణ : (కృతకంగా) ఏది కాదు? అక్కడికీ ఇక్కడ ఇటువంటివాళ్ళతో మాట్లాడాలంటే ఎంతో 'పేషన్స్' అరువుదెచ్చుకుంటున్నాను. అయినా లాభం లేకపోతోంది. మొన్న ఢిల్లీలో......

నాగే : ఆఁ ఆఁ! మొన్న ఢిల్లీలో! ఏమిటి విశేషం?

కృష్ణ : మొన్నటికి మొన్న ఢిల్లీలో ఆలిండియా ఆర్ట్ ఎగ్జిబిషన్‌కు ఆంధ్ర తరపున రిప్రజెంట్ చేసింది ఎవరనుకుంటున్నారు? ది విశాలాంధ్రా ఆర్ట్ సొసైటీ! ది ఓన్లీ హోప్ ఆఫ్ ఆంధ్రదేశ్!

నాగే : అలాగా!

కృష్ణ : మమ్మల్నిగురించి మీరేం తెలుసుకున్నారు? ఆవగింజలో అరభాగం లేదు. మా మ్యూజిక్ స్కోరు వింటే మీ రదిరిపోతారు—వీణ, హార్మోనియం, ఫ్లూట్, వైలెన్, టూప్ వైలెన్, మృదంగం, క్లారినెట్, ట్రంపెట్—ఇవన్నీ మేం వాయిస్తున్నాం. ఒకసారి ఏం జరిగిందో తెలుసా? ఒక ఫిలింకంపెనీ దర్శక నిర్మాత నాదగ్గరకు వచ్చి "డియర్ బ్రదర్! ఇన్ని వాయిద్యాలలో అశేషమైన ఆంధ్ర ప్రజానీకానికి అమందానందాన్ని కల్గిస్తున్న నువ్వు, సినీ ఫీల్డులో షైన్ కాకుండా మోదుగ చెట్టులా వాడిపోవడం నాకేం నచ్చలేదోయ్. ఎయిటీ థౌసండ్ — అంటే ఎనభై వేలు నీకు అడ్వాన్సుగా ఇచ్చేస్తాను. ఈ కాంట్రాక్టు మీద సంతకం పెట్టు' అన్నాడు. అప్పుడు నేనేం సమాధానమిచ్చానను కుంటున్నావు? మౌనంగా కాసేపు వూరుకుని, వినయమైన ఒక్క చిరునవ్వునవ్వి "థాంక్యూ సర్! మీ ఆహ్వానానికి వందనాలు. కానీ, దాన్ని అంగీకరించలేనందుకు చింతిస్తున్నాను. ప్రేక్షకులతో ప్రత్యక్ష సంబంధం ద్వారా, వివిధాల కళామతల్లి శుశ్రూష చేస్తున్న మేము, ఆ సినీప్రపంచంలో తెరమరుగు మనుషులుగా బ్రతకలేము. క్షమించండి" అంటూ బుజంతట్టి పంపించేశాను. దీని కేమంటావు?

నాగే : చేజిక్కించుకున్న అదృష్టాన్ని కాస్తా జారవిడుచుకున్నారంటాను.

కృష్ణ : అహా అదృష్టాలు. ఇవన్నీ మన కనుసన్నల్లోవేనోయ్! కావాలనుకుంటే కలిసివస్తాయి. లేదనుకుంటే తోకముడుస్తాయి. ఈనాడు నేనే మూడోకన్ను తెరిస్తే, కోటిమంది ప్రొడ్యూసర్లను నీ యింటిముందు క్యూ సిస్టంలో నిలబెట్టలేనూ?

నాగే : అంతదాకా ఎందుకు? కనకాభిషేకం చేయించండి చాలు.

కృష్ణ : కనకాభిషేకమొక్కటే ఏమిటోయి? రత్నాలరాసులే కురిపిస్తాను నీ గపసలో; ఆ! టైమెంతయింది?

నాగే : పది దాటింది.

కృష్ణ : ఛేఛ! కరెక్టు టైముకే వచ్చేశామన్నమాట! లేవండిక భోజనం చేసి మాట్లాడుకుందాం.

నాగే : (గుండెల్లో రాయిపడి) ఆఁ! (కాస్త తమాయించుకుని) క్షమించాలి. మా భోజనాలన్నీ తొమ్మిదింటికే పూర్తి చేసుకుంటాం.

కృష్ణ : దానిదేముంది ఎవరికెల్లా అలవాటుంటే అల్లాగు; బైదిబై మీకు పిల్లలెంతమంది?

నాగే : (ప్రశ్న ఎందుకో అర్థంకాక) ముగ్గురాడ పిల్లలూ, ఒక మగపిల్లవాడూ.

కృష్ణ : జ్యేష్ఠ రత్నం ఆడపిల్లా, కనిష్ఠుడు మగవాడూ కదూ?

నాగే : మీ కెట్లా తెలుసు?

కృష్ణ : (నవ్వి) మనదేశంలో ఇదొక సంప్రదాయం ఎవరినైనా తీసుకో. ఒక సీజనుమారి ఇంకో సీజను వచ్చేసరికల్లా ఇంట్లో ఆడపిల్ల కూని రాగం ప్రారంభం. ఆc! మీ నలుగురూ పిల్లలూ పదేళ్లలోపువారేకదూ?

నాగే : ఔనౌను.

కృష్ణ : కాకపోవడానికి కారణమేదీ? బహుశా పాతిక, ముప్పై మధ్య వుండివుండవచ్చు మీ వయసు. ఉత్పత్తి ప్రారంభించిండి పది హేను, ఇరవై మధ్యకదూ?

నాగే : (కొద్దిగా సిగ్గుతో కుంచించుకుపోయి) ఔను.

కృష్ణ : అంటే మీ నలుగురు పిల్లలూ, మూడు పూటలా సుష్టుగా భోంచేసేవారన్నమాట.

నాగే : ఊ!!

కృష్ణ : కాబట్టి అతిథిఅభ్యాగతులకోసం కొంత స్టాకు నిలవలో వుండడం అసంభవమైన విషయం మేమీ కాదుగా!

నాగే : (అర్థం చేసికొని) భగవాన్!—కానీ, నా కంతగా మనస్కరించడంలేదండీ ప్రొఫెసరు గారూ. అందరూ తిన్నతరువాత పరిశేషాన్ని వడ్డించడం మాకూ అంత శ్రేయస్కరం కాదు.

కృష్ణ : ఇటువంటి చిన్న చిన్న పట్టింపులు నాకు మాత్రం లేవు సుమా! అయినా అతిథి ఆకలితో వెళ్ళిపోవడం మీకూ అంత మంచిది కాదుగా.

నాగే : అది కాదండీ

కృష్ణ : ఏది కాదు?

నాగే : మా ఆడవాళ్ళు రెండురోజులైంది కొజువల్ లీవు పుచ్చుకుని.

కృష్ణ : అయితే బ్రహ్మాండమైన సదవకాశం లభించింది నాకు మా అమ్మగారి తుదిమాట నెఱవేర్చుకోడానికి.

నాగే : (భయంతో) ఏమిటది?

కృష్ణ : చనిపోతూ, చనిపోతూ, నన్ను దగ్గరికి పిలిచి కంటనిండా నీళ్ళు తెచ్చుకుని "బాబూ! ఎవరైనా ఆకలితో నీ యింటికి వస్తే, ఇంట్లో, ఆడవాళ్ళున్నా లేకపోయినా నువ్వే వాళ్లకు మృష్టాన్నం సమకూర్చు లేదా నువే వొకళ్ళింటికి వెడతావు, అర్ధాకలితో తిరిగి వచ్చి అన్యాయంగా ఆ యింటివాళ్లకు ఉసురు తగిలించకు" అని (కాసేపు మౌనంగా వూరుకొని, కర్చీఫ్‌తో కళ్లు తుడుచుకొని) మొదటి కోర్కెను అవలీలగా నెఱవేర్చగలిగాను గానీ, రెండవదానికి మాత్రం ఇంత వరకూ అవకాశం లభించలేదు.

నాగే : (కోపంగా) ఆ కోర్కెను మా యింట్లో నెఱవేర్చదలచుకుంటున్నారా? వీల్లేదు.

కృష్ణ : వీల్లేదంటే ఎలా? అది మా అమ్మగారి కనీసపు కోర్కె.

నాగే : (నవ్వుతూ) భలేవారండీ ప్రొఫెసరు గారూ! ఏదో గమ్మత్తుగా అన్నదాన్ని పట్టుకుని ఎంత రభస చేశారు! ఎంత పట్టుదల గల వారు! పదండి లోపలకు.

కృష్ణ : (అంతకన్నా పెద్దగా నవ్వుతూ) అహ్హహ్హ! రావుగారూ! మీ సంగతి మాత్రం నాకు తెలీనుటండీ! పైకి గంభీరమే కాని లోపల అంతా వెన్నపూసే కదూ? అహ్హహ్హ!!!

## రంగము : 2

[ఇద్దరూ నవ్వుకుంటూ లోపలకు వెళతారు. క్షణంసేపు స్టేజి ఖాళీ. ఇంతలో శ్రీనివాసులు ఓ చిన్నపాట ట్యూను చేసుకుంటూ ప్రవేశిస్తాడు.]

శ్రీని : (వచనంలో ప్రారంభించి) లీలా! మై డియర్ లైలా! (ఒక్కసారిగా భావనా లోకంలోకి వెళ్ళిపోయి)

ఆలపాలన లేని సంభ్రమం
పాలబుగ్గల నిన్ను జూచీ
అలసి సొలసి ఎగసి పడగా
కిలాకిలా నువు నవ్వుతూ నను
పలకరించేవా? ప్రేయసి! ప్రేమసలిపేవా?

లీలా! మై డియర్ లైలా! నీకోసం నీ హృదయంలో స్థానం సంపాదించడంకోసం ఎంతత్యాగం చేశానో అర్థం చేసుకుంటే

ఈ క్షణంలో నా కాళ్లదగ్గర పడిపోయే దానిని. నీ సురుచిర సుందర ముఖపద్మాన్ని వలోకించాలని, బెజవాడ ఉరఫ్ బ్లేజవాడ నుండి ఇంతదూరం పరుగెత్తుకు వచ్చాను. నీ నల్లని కనుపాపల్లో కనుపించే తీయని ఆ స్వప్నాలకు యథార్థ స్వరూపాన్నిద్దామని, వదిలిపెట్టేశాను వె-ధ-వ కాలేజీని. ప్రొఫెసర్ శ్రీకృష్ణట! ఎవడో వాడు? వాడి కంపెనీలో నువ్వెందుకు పనిచేస్తున్నావు లీలా? ఘటోత్కచుడులా నిన్నెత్తుకు పోడు కదా?

నాగే : (లోపలనుండి ప్రవేశిస్తూ) ఎవరండీ మీరు?

శ్రీని : నేనా? ఒకగంట క్రితంవరకూ బెజవాడ కళాశాల విద్యార్థిని. ప్రస్తుతానికి ప్రొఫెసర్ శ్రీకృష్ణగారి నాటకాల కంపెనీలో వేషం వెయ్యాలని ఉబలాటపడుతున్న వాణ్ణి.

నాగే : తమ నామధేయం?

శ్రీని : శ్రీనివాసులు!

నాగే : తమరు మా కుటీరాన్నెందుకు పావనం చెయ్యదల్చుకున్నారో తెలుసుకోవచ్చునా?

శ్రీని : ప్రొఫెసరగారిక్కడికి వచ్చారని తెలిసికొని—

నాగే : ఔనౌను. వచ్చారు.

శ్రీని : అమ్మయ్య. ఎంత చల్లని కబురు చెప్పారు? [దగ్గరనున్న కుర్చీలాక్కొని కూచుంటూ] ఆ మీరూ కూచోండి. ఆఁ! తమ నామధేయం సెలవీయ లేదు—?

నాగే : నాగేశ్వరరావంటారండి.

శ్రీని : మంచిది. మంచిది. చక్కని పేరు పెట్టారు. ప్రేమకు సరిగ్గా సరిపోతుంది.

నాగే : ప్రేమకు సరిపోవడ మేమిటండోయ్?

శ్రీని : ఓహ్! స్టూడెంట్స్ పరిభాషలో మాట్లాడినందుకు క్షమించండి. ప్రేమకు సరిపోయిందంటే—

నాగే : ఊ!

శ్రీని : మనోఫలకంమీద రూపచిత్రణం అచ్చుగుద్దినట్లేర్పడుతుందని భావం.

నాగే : ఏదో లిల్లాయిపప్పనుకున్నాను. అటు చేసి యిటుచేసి బ్రహ్మాండమైన అర్థం చెప్పారే!

శ్రీని : నాదేముందండీ! అందరికీ కనిపించేది ఆ కతాయితనమైనా, నిప్పులుగప్పిన నిప్పులు కదండీ వాళ్ళు.

నాగే : నిజమే మరి.

శ్రీని : సరే గాని—ప్రొఫెసరుగారేం చేస్తున్నారో!

నాగే : నోటికీ, చేతికీ పని కల్పిస్తున్నారు.

శ్రీని : ఎంతసేపవుతుందో!

నాగే : ఏం. వారితో కొంపలు మునిగిపోయే రాచకార్యమేమైనా చర్చించాలా?

శ్రీని : కాకపోతే బెజవాడనుండి ఇంత అర్థాంతరంగా రావలసిన అగత్యం?

నాగే : ఉహూ.

శ్రీని : రేపు రాత్రి భరతనాట్య, గాన, నాటక, వెరైటీ వినోద కార్యక్రమముందట!

నాగే : దానికీ, నీకూ సంబంధం?

శ్రీని : స్పెషల్ ఇన్విటేషన్ మీద వచ్చానండి వాళ్ల ప్రోగ్రాంలో ప్లేబాక్ పాడటానికి.

నాగే : (సీరియస్‌గా) అబ్బాయ్! ఏదో పొరపాటు పడి, మతిచెడి పరుగెత్తుకు వచ్చావు గాని, నే చెప్పిన మాట విని మళ్ళీ వెళ్ళిపోయిగా కాలేజీలో చేరి బుద్ధిమంతుడవై చక్కగా చదువుకో.

శ్రీని : ఏమండోయ్?

నాగే : ఏమిటండోయ్!

శ్రీని : మతి చెడింది నాక్కాదు.

నాగే : అవును కన్పిస్తోనే వుంది.

శ్రీని : డామిట్! గ్రేట్ ఇన్‌సల్ట్!

నాగే : ఇన్సల్టూ లేదు. ఏమీలేదు కానీ వచ్చిన దారినే తిరిగి వెళ్లు.

శ్రీని : మాష్టారూ!

నాగే : ఏం మర్యాదగా చెబితే వినలేవా? రేపు రాత్రి ప్రోగ్రాం లేదు లేదు. లేదు

శ్రీని : లేక ఎక్కడికి పోతుంది? ఇదిగో పాంప్లెట్.

నాగే : త్రో ఇట్ ఇన్ ది వేస్ట్ పేపర్ బాస్కెట్. (Throw it in the waste paper basket)

శ్రీని : (కొస్త తగ్గి) రేపురాత్రి ప్రోగ్రాం ఎందుకు లేదూ?

నాగే : అలా అడిగావు బావుంది. ఇల్లా రా చెబుతాను. రేపురాత్రి—అంటే తెలుసుకదూ రేపురాత్రే మనకు అంటే నాకు కనకాభిషేకం జరగబోతున్నది. ఎవరు చేయిస్తున్నారనుకుంటున్నావు? ప్రొఫెసర్ శ్రీ కృష్ణ! అయినప్పుడు నాటకం ఎల్లా వుంటుంది చెప్పు? ఆవేశంతోపాటు ఆలోచనకూడా కావాలోయ్! ఇంటర్ మీడియట్‌లో లాజిక్ కొదల్లే వుంది నీ గ్రూపు.

శ్రీని : వల్లకాదు. వేయి ప్రోగ్రాం లున్నాసరే ఈ ఐటమ్ కూడా చేర్చితీరాలి. రానీ వారి నే అడుగుతాను.

[ప్రొఫెసర్ శ్రీకృష్ణ లోపలినుంచి ప్రవేశం]

కృష్ణ : ఎవరది? ఎవరది? గంతుకుక్కల్లా కీచులాడుకుంటున్నా రెవరు? (ప్రవేశించి) ఓహో! ఐయామ్ సారీ! మీరా? ఎందుకిలా పోట్లాడుకుంటున్నారు?

శ్రీని : గురువుగారూ!

నాగే : ప్రొఫెసరుగారూ!

కృష్ణ : వన్ ఎట్ ఏ టైమ్ ప్లీజ్! ఒకరి తరువాత ఒకరు చెప్పండి

శ్రీని : అది కాదండీ రేపు మన ప్రోగ్రాం లేదూ?

కృష్ణ : ఎందుకు లేదూ?

నాగే : మరి నా కనకాభిషేకం?

కృష్ణ : అదీ వుంది!

శ్రీని : రెండూ ఒక్కసారే ఎల్లా వుంటయ్యండీ?

కృష్ణ : ఉండకేం చేస్తాయ్?

నాగే : ప్రొఫెసరుగారూ! మీ రేమనుకుంటున్నారో అందరికి అర్థమయ్యేలా విడమర్చి చెప్పండి. ఎందుకీ నానుడుబేరాలు?

కృష్ణ : చెప్పమంటారా?

శ్రీని : చెప్పండీ.

కృష్ణ : రేపు ప్రోగ్రాం వుండడానికీ, వుండకపోవడానికీ, కనకాభిషేకం జరగడానికీ, జరక్కపోవడానికీ అంతా మీ చేతుల్లో వుంది!

శ్రీని :<br>నాగే : } మా చేతుల్లోనా?

కృష్ణ : ఆహా. నిక్షేపంలాంటి మీ చేతుల్లోనే.

నాగే : నా చేతిలో ఏముంది—మన్ను.

కృష్ణ : (ఉగ్రృతంగా) మట్టిబుర్రలు. ఇందుకే మన ఆంధ్రజాతి ఇల్లా అఘోరిస్తోంది. తెలివితేటలు లేవు చాకచక్యం లేదు సూక్ష్మగ్రహణ శక్తి లేదు. కనీసం ప్రపంచంమీద వొక బర్డ్స్ ఐ వ్యూ—అంటే గృధ్రాలోకన మన్నా లేదు వొత్తి హోప్‌లెస్ స్టాక్!

శ్రీని : నిజం. నిజం. బాగా సెలవిచ్చారు.

కృష్ణ : సెలవియ్యడ మేమిటి నీ మొహం. ఉన్న యథార్థమంతే.

నాగే : ఔనౌను.

కృష్ణ : ఏమిటి ఔను.

నాగే : ఉన్న యథార్థమంతే.

కృష్ణ : అఘోరించినట్లుంది జవాబు.

శ్రీని : (ఎకసక్కెంగా) ఔనౌను. ఉన్న యథార్థమంతే.

కృష్ణ : ఆఁ! రామాయణంలో పిడకలవేటలాగా మధ్యలో యీ పిట్టకథ యేమిటి? శ్రీనివాసులూ! రేపురాత్రి నీకు ప్రోగ్రాం కావాలికదూ? అందుకు అన్ని ఏర్పాట్లు పూర్తి చేసుకున్నావా?

శ్రీని : ఆ. ఆ. పూర్తి చేసుకుంటున్నానండి.

కృష్ణ : వెల్—మిష్టర్ నాగేశ్వర్! కనకాభిషేకానికి నువ్వూ సిద్ధంగానే వున్నావు కదూ?

నాగే : ఆహా తమ అనుగ్రహం మామీద ప్రసరిస్తే.

కృష్ణ : మా అనుగ్రహమొక్కటే యేమిటి? ఊళ్లో

అందరి దృక్కులూ మీమీదే పడతాయి రేపువదయానికల్లా ఏం భయపడకండి.

నాగే : భయమా? నాకా! రోజుకు మూడుసార్లు ఆంజనేయదండకం చదువుకుంటున్నాను.

కృష్ణ : ఎందుకైనా మంచిది. ఇంకో మూడుసార్లు ఎక్కువ చదవండి రేపు.

నాగే : ఆహా!

కృష్ణ : (ఫోనుదగ్గరకు వెళ్లి హాల్లో ఫోర్. సిక్స్, వైట్ ప్లీజ్! (కొద్దినిశ్శబ్దం) ఆఁ! సూర్యనారాయణ గారున్నారా? వెల్ కాస్తవారిని పిలుస్తారా? (ఒక్క క్షణం) వారేనా మాట్లాడుతోంది! అబ్బే ఏమీ లేదూ — మన భరతనాట్య ప్రదర్శనానికి 'ఆనందమహాల్లో' అన్ని ఏర్పాట్లు పూర్తిచేయిస్తున్నాను కానీ— వాడులేడూ — ఆ త్రాష్టుడు, అదే ఆహాలు మండావాడు ఎడ్వాన్సు ఫిఫ్టీ ముందే ఇస్తేకాని హాలు బుక్ చేయనని గొడవచేస్తున్నాట్ట, 'వీళ్లంతా వొట్టి స్కౌండ్రల్స్ అండీ! ఏంచేస్తాం అంతా కర్మ. కళాజీవితానికి నడుం బిగించిన వాడికి రోజులు రోజులుగా లేవండీ. బైదిబై మీకు నేను తెలుసననుకుంటాను! కలెక్షను రాకముందు మన పాకెట్స్ ఖాళీ అని. అందుకే వొక్క 'టూహండ్రెడ్' పంపిస్తారూ? ఏమంటున్నారూ — మధ్యాహ్నం పట్టుకుని వస్తామంటున్నారా? చూడండీ — ఇది మీ వ్యవహారం కూడా. ఓకే, ఓకే మీ ఇష్టం. ఎల్లా అయితే అల్లా ఆఁ! ఉంటా! (ఫోనుకింద పెట్టేస్తాడు.)

నాగే : ఎవరండీ ఆ సూర్యనారాయణగారు?

కృష్ణ : సూర్యనారాయణగారు తెలీదా? ఆశ్చర్యంగావుంది. లక్షాధికారి. ఎన్నడో పెద్దలు సంపాదించి గుట్టలు గుట్టలుగా పోసిన ఆస్తి — ఖర్చుపెడదామన్నా ఒక్క వారసుడు కూడా లేకుండా మూల్గుతోన్న ఆస్తి—

శ్రీని : అంత భాగ్యవంతుడా!

కృష్ణ : భాగ్యం! నెలనెలా పెల్లిగ్రాములమీద రెండొందలు తెప్పించుకునే సరికే కళ్ళు జిగేలుమంటున్నాయి నీకు. రోజుకు వందకు తక్కువ ఖర్చుపెట్టకూడదని అతనికో నియమం తెలుసా?

శ్రీని : మై గాడ్!

కృష్ణ : అంతా బాగానే వుంది కానీ వొక్కటే చిక్కు.

నాగే : ఏమిటది?

కృష్ణ : ఏమీ లేదు మధ్యాహ్నం వచ్చి ఇచ్చేస్తానంటున్నాడీయన. క్యాష్ డౌన్ చేస్తేకాని వీల్లేదంటున్నాడా హాలు ప్రొప్రైటరు. అదీ యిప్పుడు ముట్టుకున్న గట్టి సమస్య?

శ్రీని, నాగే : (ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటూ మౌనం)

కృష్ణ : ఏం? ఒక్కసారిగా అలా మొహాలు వేలాడేశారు. అసలు సంగతేమిటో తెలుసుకోండోయ్! తర్వాత చావు బ్రతుకులు మన్య వేలాడుదురుగాని.

శ్రీని, నాగే : (నీరసంగా) చెప్పండి.

కృష్ణ : నాగేశ్వరరావుగారూ! ముసుగులో గుద్దులాటలెందుకు? ప్రస్తుతానికి అర్జంటుగా కనీసం ఓ పచ్చకాయితం కావాలి.

శ్రీని : ఔనౌను, తప్పకుండా కావాలి.

కృష్ణ : మీరూరుకోండి శ్రీనివాసులుగారూ! మీతోనూ తర్వాత మాట్లాడుతాను.

శ్రీని : (గుండెల్లో రాయిపడి) ఆఁ!

కృష్ణ : (ప్రశాంతంగా) ఆఁ (నాగేశ్వర్రావుతో) ఆ పచ్చకాయితాన్ని మీరు పూర్తిచేయాలి.

నాగే : నేనా? రామ రామ! పిల్లా జెల్లా గల్గినవాణ్ణి ఏరోజు కారోజు ఎల్లారా భగవంతుడా అని బాధపడుతున్నవాణ్ణి — నాదగ్గర ఎక్కడిదండీ అంత డబ్బు?

కృష్ణ : అహ్హహ్హా! తాడెక్కేవాణ్ణి తలదన్నేవాడుంటాడని మర్చిపోకండి నాగేశ్వర్రావుగారూ! పాండీబజార్, కింగ్స్ వే, కొరిటిపాడు— లక్షోపలక్షలు తగిలారు మీలాంటి వాళ్ళు, హు నాకే కంగు తినిపించాలనుకున్నారో!

నాగే : హరి హరీ! ఎంతలేసిమాట లంటున్నారండీ! ఎల్లాగోలా కష్టపడి యిద్దామన్నా ఇవ్వాళ ఫస్టు తారీఖు కాదే! భగవంతుడా!

కృష్ణ : పోనీ ఫిఫ్టీ?

నాగే : నామాట నమ్మండీ!

కృష్ణ : మీమీదున్న ప్రత్యేకాభిమానంచేత మరో మెట్టు క్రిందకు దిగుతున్నాను. కనీసం పాతిక?

నాగే : రూపాయలమాట అటుంచి—

కృష్ణ : (కోపంతో) నాకు తెలుసు. ఇటువంటి మీన్ మెంటాలిటీ వాళ్ళతో సంబంధం పెట్టుకుంటే ఇదే చిక్కు. తెలిసికూడా మీ మీదున్న ప్రత్యేకాభిమానం చేత కొంత వీలు కలుగనిచ్చాను.

నాగే : అంతగా ఆగ్రహిస్తే ఎల్లాగండి!

కృష్ణ : పైపెచ్చు ఇదొకటా? ఆప్తమిత్రుడు కదా అని అష్టకష్టాలు పడైనాసరే కనకాభిషేకం చేయిద్దామనుకున్నాను. ప్చ్. ఏం లాభం?

నాగే : కొంతైనా అవకాశం యిప్పిస్తే—

కృష్ణ : అవకాశం? నా చేతుల్లోవుంటే గదుటయ్యా? సన్మానం జరపాలనుకున్నది రేపేనా?

నాగే : పోనీ ఓవారం పోయింతర్వాత పెటుకో గూడదూ?

కృష్ణ : మైడియర్ బ్రదర్! ఎల్లుండి రాత్రికి హైద్రాబాదు వెళ్తున్నానయ్యా! విశాలాంధ్ర రాజధానిలో మన బ్రాంచికి ప్రారంభోత్సవం చేయించవద్దా?

నాగే : ఈ సంగతి ముందే చెబితే! (నిష్క్రమణ)

కృష్ణ : నువ్వెంత ఇయ్యదల్చుకున్నావు?

శ్రీని : నేనా? నేనెందుకు?

కృష్ణ : ఏం అంత అమాయకుడిలా మాట్లాడుతున్నావు—

శ్రీని : నేను కూడా ఎందుకండీ?

కృష్ణ : ఎందుకా? వేలాది ఆడియన్సులో ముందుకు వచ్చి 'నేనూ ఓ మగవాణ్ణో' అని ధీమాగా చాటుకోబోతున్నందుకు. రొమాంటిక్ హీరోలా కులుకుచ నడకతో స్టేజిముందుకు వయ్యారంగా వచ్చి "హా! రాజీవలోచనీ! నా మనోహారిణీ!" అంటూ ఆగనొక్క రాగంలో వో పాటపాడి పేరు ప్రఖ్యాతులు పొందబోతున్నందుకు. వందలాది అభ్యర్థుల్లో నీకు ప్రిఫరెన్సు యిచ్చినందుకు. ఒక్కసారి అలా వెళ్ళిచూడు. ఆడా మగా పిల్లా జెల్లా, చిన్నా పెద్దా అందరూ నా అనుగ్రహంకోసం ఎలా కని పెట్టుకూర్చున్నారో తెలుస్తుంది.

శ్రీని : అలాగా! (కొద్దిగా ఆలోచించి) ఇది వుంచండి. మళ్ళీ తర్వాత చూస్తాను.

కృష్ణ : (పుచ్చుకుంటూ) మంచిది. నీ సంతోషం కొద్దీ ఎంతిస్తే అంతే తీసుకుంటాను. ఆఁ! మా కంపెనీలో లీల తెలుసుకదూ? అదే, మహారాణిపేటలో బీచిప్రక్కన. వెళ్ళి ఈ ఉత్తరం యిచ్చిరా!

శ్రీని : ఆలాగే. మళ్ళీ ఎప్పుడు కలుసుకోమంటారు?

కృష్ణ : నేనే వచ్చి నిన్ను కలుసుకుంటాగా! వెళ్ళిరా! (శ్రీనివాసులు వెళ్ళిపోతాడు.)

నాగే : (ప్రవేశిస్తూ) ఇదిగోనండి.

కృష్ణ : భేష్! అడిగినంతా పట్టుకొచ్చావే!

నాగే : మా ఆడవాళ్లు పెట్లో దాచుకున్నారండి.

కృష్ణ : నాకు తెలుసునోయ్! నువ్వుల డబ్బాల్లో, మెంతుల పెట్టెల్లో ఆడవాళ్ళ దాపరికం మన జీతాన్ని మించుతుంటుంది అప్పుడప్పుడు. ఈ మాటలకేంగాని నీకో పని చెప్తాను చేస్తావూ?

నాగే : అహా.

కృష్ణ : ఏంలేదు. కాన్వాస్ చేసి నాలుగు టికట్లమ్ము రాదూ?

నాగే : తప్పకుండా.

కృష్ణ : అయితే రేపు మళ్ళీ కలుసుకుంటాను. ఈలోగా నీ పనిలో నువ్వుండు.

నాగే : ఆలాగే.

కృష్ణ : వస్తా. ఓ.. కె. టాటా!

## రంగము : 3

[అదేయిల్లు. ఏమీ మార్పు లేదు. అయితే సర్వత్రా పేలవమైన నిశ్శబ్దం]

గోపా : (ప్రవేశిస్తూ) ఏమిటిది? ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది—బాల్ రూము డ్యాన్సు అయిన తర్వాత ఒక్క క్షణం విశ్రాంతి తీసుకున్నట్లు—కొంపతీసి గురువుగారి ప్రభావం ఇక్కడకూడా వ్యాపించలేదుగదా! వెధవ ట్రాజికల్ సస్పెన్స్ (Tragical suspense)! ఎంతసేపు వొక్కణ్ణీ యిలా గొంతు చించుకోవాలి. ఇంట్లో అసలు మనుషులనే పదార్థాలున్నారా అని?

సూర్య : (పక్కగదిలోంచి ప్రవేశిస్తూ) అరె! గోపాలం! నువ్వెప్పుడొచ్చావురా? ఏవో కొనుక్కురావాలని మద్రాసు వెళ్ళినట్లున్నావు?

గోపా : మద్రాసులో ఏముందండి—నా మొహం. ఆంధ్రుల మహాప్రస్థానం జరిగింతర్వాత, ప్రియుడు లేని ప్రేయసిలా, చంద్రుడు లేని రాత్రిలా,—

సూర్య : నీ భావకవిత్వం వింటానికి నేనుతప్ప యింకెవరూ దొరకలేదా తమ్ముడూ! వెళ్లి ఓ బేడ కాసు పారేసి ఎవరికైనా యిన్ని కాఫీ నీళ్ళు పోయించు హాయిగా వో గంటసేపు నిరాక్షేపణీయంగా ఆ దౌర్భాగ్యుడి నరనరాల్లోకి నీ కవిత్వం ఇంజక్ట్ చేద్దువుగాని వెళ్లు వెళ్లు!

గోపా : సూర్యనారాయణగారూ?

సూర్య : ఎవరి హద్దుల్లో వాళ్లుండాలి. కాలం, కర్మం కలిసిరాకపోతే నీ బీదతనం నాకు రావచ్చుగాక. కానీ, నా గొప్పతనం, నా దర్జా, ఇవన్నీ వెయ్యేళ్లు తపస్సుచేసినా నీకు వస్తయ్యా అని. అందుకే ఇబ్సెన్ మహాకవి ఏమన్నాడు!

గోపా : నాకు తెలీదు.

సూర్య : నీకు ఒకటి తెలిసివచ్చుకాబట్టి! అదృష్టవశాత్తూ ఆ సంగీతంలో...

గోపా : అదృష్టవశాత్తూ ఏమిటండోయ్! నాలుగేళ్లు నానా గడ్డీగరిచి నేర్చుకున్నాను యీ విద్యను. అడ్డమైన వాళ్లకాళ్లూ పట్టుకున్నాను...... నే నుపయోగిస్తున్న ఇన్ని వాయిద్యాలు నాకు తెలిసినంతవరకూ ఎవ్వరూ ఏ కాలంలోనూ ఉపయోగించలేదు.

సూర్య : అలాగటోయ్!

గోపా : (బూరలాంటి ఫ్లూట్ నొకదాన్ని చూపిస్తూ) హిందీ సినిమాల్లో సంగీతం అంత బ్రహ్మాండంగా వుండడానికి కారణం యిది; (టాయ్ పియానో చూపిస్తూ) ఇది లండన్‌లో తయారీ; ఈ ఘటవాయిద్యాన్ని చూశారా, అమెరికానుంచి స్పెషల్ ట్రైన్‌లో తెప్పించాను; (డమరుకం మోగిస్తూ) శివుని ప్రళయ తాండవం అంత ప్రసిద్ధం కావడానికి ఈ డమరుకం...

సూర్య : (పెద్దగా) గోపాలం చెప్పుదెబ్బలు తినకుండా మర్యాదగా ఈ ప్రదేశాన్ని వదిలిపెట్టి వెళ్లు. గిలకాయ బూర, కొబ్బరి చిప్పలు, కుండ, గజ్జెలు-ఇవిట్రా నీ వాయిద్యాలు? దరిద్రుడా?

గోపా : అదికాదండీ......

సూర్య : ఏదికాదురా ఫూల్! ముందీ ప్రదేశాన్ని వదిలిపెట్టి వెళ్తావా? తన్నమంటావా?

గోపా : వెళ్తాను. వెళ్లేముందు ఒక్కమాట చెప్పి మరీ వెళ్తాను.

సూర్య : ఏమిటది?

గోపా : మిస్ రాగిణి ఈ ఊరికి రావడం లేదు. నాటకం ఆగిపోయేటట్లుంది!

సూర్య : ఏమిటీ? రాగిణీ! డబ్బు ముందే ఇచ్చేశాంగా!

గోపా : ఆ డబ్బు ఆమెకు చేరలేదు.

సూర్య : చెప్పు గోపాలం. జరిగిందేమిటో చెప్పు. అసలేం జరిగింది? ఇందులో ఏదైనా మోసం? (గోపాలం మొహంలోకి చూసి) అప్పుడే అంత కోపం తెచ్చుకుంటే ఎల్లా గోపాలం? సమయానుకూలంగా రేట్లు మారాలి......

మెదడు కాస్త వేడిగావున్నప్పుడు మాటలు కాస్త వేడివేడిగా వస్తుంటాయి.

గోపా : కోపం కాదండీ! పేదవాళ్లం—

సూర్య : పేదవాడివా? నువ్వా? 'విద్యయొసగును విత్తంబు' విన లేదూ యీమాట. ఇదిగో ప్రస్తుతానికి పదివుంచుకో. ఆ ఇటుచూడు. ఏదీ ఒక్క నవ్వు. ఆ అల్లా నవ్వాలి. ఇక చెప్పు ఏం జరిగింది?

గోపా : ఏముందీ మీరిచ్చిన యాభైరూపాయలూ తన స్వంతఖర్చుకు జమకట్టుకున్నారు గురువుగారు. పైగా—

సూర్య : పైగా?—!

గోపా : పిట్టను చేజిక్కించుకుని పారిపోవాలనుకుంటున్నాడు.

సూర్య : పిట్ట! కొత్తగా పంజరంలో చిక్కిందా?

గోపా : నెల దాటింది.

సూర్య : పేరు రంగు?

గోపా : పంచవన్నెల రామచిలుక. సొగసైన పేరు, లీల!

సూర్య : ఇలా రా. ఒక సంగతి అడుగుతాను నిజం చెబుతావా?

గోపా : నిరాక్షేపణగా.

సూర్య : గురువుగారు తప్ప వేరే గత్యంతరం లేదా నీకు?

గోపా : ఉంటే యీ వ్యాపారంలోకి ఎందుకు దిగుతాను?

సూర్య : ఇంకో ఆధారం దొరికితే?

గోపా : చాలా సంతోషం!

సూర్య : భేష్. ఇట్లా ఈ యాభై వుంచుకో. అర గంటలో ఎక్కడ దాక్కున్నా సరే ఆ దగుల్బాజీని ఇక్కడికి పట్టుకు రావాలి. సరేనా?

గోపా : ఆహా!

సూర్య : మాట తప్పావా?—

గోపా : మీ యిష్టం.

సూర్య : వెళ్లిరా. (గోపాలం నిష్క్రమణం) హుం. నాకే టోపీ పెట్టాలనుకున్నాడు. దొంగల్లో గజదొంగ లుంటారని తెలీదు పాపం!

నాగే : (ప్రవేశిస్తూ) ఏమిటండీ సూర్యనారాయణ గారూ! అలా వున్నారు? వంట్లో బాగా లేదా?

సూర్య : మోసం. పచ్చిమోసం దగా!

నాగే : ఏమిటండీ!

సూర్య : ప్రొఫెసరుగారు—నీకు కనకాభిషేకం చేయిస్తానన్నారు కదూ?

నాగే : ఆఆ రేపు రాత్రే.

సూర్య : పాపం! వారు చెప్పినమాట విని.

నాగే : ఏమైంది?

సూర్య : కొన్నాళ్ళు కూడా చేశావా?

నాగే : ఆ ఆ.

సూర్య : మంచిది. మరీ మంచిది. కాస్త కళ్ళు దగ్గర పెట్టుకో. ఎందుకైనా మంచిది.

నాగే : ఏమిటండీ? ఏం జరిగింది?

సూర్య : అంత ప్రమాదం ఏమీ లేదు కొంతా, కన కొల్లి తీసుకుని ఉడాయించ బోతున్నాడు మీ గురూజీ.

నాగే : ఆఁ!

శ్రీని : (హడావిడిగా ప్రవేశిస్తూ) మునిగిపోయింది. కొంప పూర్తిగా మునిగిపోయింది. నా కొంప నిలువునా దోచేశాడు. దరిద్రుడు. వెధవ ఛండాలుడు.

సూర్య : ఎవరీయన?

నాగే : బెజవాడ కాలేజీ విద్యార్థి.

సూర్య : ఇక్కడి కెందుకు వచ్చాడు?

నాగే : నాటకంలో వేషం వేద్దామని వుబలాటపడి—

సూర్య : కాలేజీ వదిలి పెట్టి వచ్చేశాడు. అంతేనా?

శ్రీని : అవునవును.

సూర్య : సిగ్గులేదూ అవునడానికి. నిక్షేపంగా అమ్మా నాన్నా డబ్బు పంపిస్తుంటే కాలేజీలో చదివి కూర్చోక ఇదేం పాడు బుద్ధి?

నాగే : కొంప మునిగి పోవడమేమిటి శ్రీనివాసులూ?

శ్రీని : లీలను వాడు లేవదీసుకు పోతున్నాడండీ!

సూర్య : లీలను వాడు లేవదీసుకు పోతే నీకేమోయి? ఏమైనా—

శ్రీని : (సిగ్గు).

సూర్య : ఓహో! పోలిగాడు. బంగారక్క ప్రణయమన్న మాట! ఇందుకోసమా తండ్రీ కాలేజీ వదిలి పెట్టింది?

శ్రీని : ఈయ నెవరండీ? శాపాదపీ, శరాదపీ మాట్లాడుతున్నారు.

నాగే : లక్షాధికారి సూర్యనారాయణగారని—

సూర్య : అపవోయ్! శ్రీనివాసులూ- నీదగ్గర డబ్బెంత వుంది?

శ్రీని : (ఏడుస్తున్నట్లుగా) ఏముందీ—ఉన్నదంతా వాడే వొల్చుకుపోయాడు.

సూర్య : కనీసం రైలుఛార్జీకన్నా—

శ్రీని : (లేదన్నట్లుగా తలూపుతాడు)

సూర్య : నీకు నేను సహాయం చేస్తాను.

శ్రీని : (ఆశగా చూస్తాడు.)

సూర్య : నాకూ నువ్వు ఒక సహాయం చెయ్యాలి.

శ్రీని : ఏం కావాలంటే అది చేస్తాను. అగ్నిలో దూకమన్నా సరే.

సూర్య : ఏం లేదు. ఆ దుర్మార్గుణ్ని పట్టుకుని రమ్మని గోపాలాన్ని పంపించాను. నీవూ స్టేషనుకు వెళ్ళి వెదుకు. కావాలంటే నా పేరు చెప్పి పోలీసు సహాయం తీసుకో. కానీ వాణ్ణిమాత్రం ఈ పొలిమేర దాట నివ్వకు.

శ్రీని : అలాగే.

సూర్య : వెళ్లు. త్వరగా వెళ్లు. (శ్రీనివాసులు వెళ్ళిపోతాడు) పెద్దవాళ్లం మనమే వాడిచేతుల్లో కీలు బొమ్మలుగా తయారవుతుంటే యీ చిన్న వెధవ లెంత?

నాగే : ఏం చెయ్యాలి? ఎక్కడ పటినా ఇటువంటి వాళ్లే. ఎవర్నని నమ్మాలి? ఎవరిని దూరంగా వుంచాలి?

సూర : అవునుమరి. పైకి అందరూ పెద్దమనుషులే!

నాగే : ఈ పెద్దమనుషులే జీవితాల్ని నటన క్రింద తీసుకు బ్రతుకుతున్నారు.

సూర్య : (నవ్వులు) ఇంతమాత్రానికే బెదిరిపోకు తమ్ముడూ! ఈ జీవితమే ఒక ఆట- అదృష్టం. అడుగడుగునా అవరోధం కలిగించేది ఈ కళావరు జాకీలే! మణీలా దగ్గరుంచుకో, గెలవటానికి అవకాశం వుంటుంది. లేదూ—

నాగే : తెలుసు. తెలుసు. ఏం జరుగుతుందో!

[తెర.]

# సాహిత్యసమీక్ష

## శ్రీ అనంతకృష్ణశర్మగారి పరిశీలనము

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

ఇటీవల నేను ప్రకటించిన 'సాహిత్య సమీక్ష' యను వ్యాససంపుటిపై* నభిప్రాయ మొసగుచూ, విమర్శకాగ్రేసరులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు నా కోరిక మేరకు ఒక గొప్పవిమర్శ వ్రాసి పంపినారు. అందు వారు నా వ్రాతలో దొరలిన ప్రమాదములను, ఎడనెడ వారికి పొడమిన సందేహములను, అభిప్రాయ భేదములనే కాక ఒకకొన్ని శబ్దముల వ్యుత్పత్త్యర్థములను గురించిన విశేషాంశములను పెక్కు తెలిపియున్నారు. వానిలో కొన్నిటికి నాకు తోచిన సమాధానములు చెప్పికొనుటయు జరిగినది. ఆ యెల్ల విషయములను 'సాహిత్య సమీక్షా' పాఠకులేకాక భాషాప్రియు లెల్లరును గమనించి పరిశీలింపవలసినవే కావున—శ్రీ శర్మగారి యనుమతిమీదనే—వాటి నిచట వెలువరించుచున్నాను.

ఇందు తొలుతటివి శ్రీ శర్మగారి వాక్యములు; పిమ్మటివి నామాటలు.

### ౧ ఆపడ్డ

(పుట. 11) "'ఆపష్ఠ' యే సరి. ఇందలి తొలి పదము 'ఆ'. ఆవు కాదు. ఇందలి 'వు' పూర్ణోకారాంతమై వచ్చినది—గోవు వలె. వేయి, రేయి మొదలగు వానిలోని 'యి' ఇటివే. పాండురంగ మాహాత్మ్యము నందలి 'ఆ వెల్వ పచ్చనెగుగు' (౨. ౧౫౨)లో ఈ 'ఆ' స్పష్టముగా నున్నదని నా యూహ. 'ఆలను వెలుచునది' యని భావము. కనుక సవర్ణదీర్ఘాదులు రావు. కాని 'ఆవు' భాష తెలుగులో నిలిచినది. దానిని ప్రాంతాదిగణమున చేర్చితిమేని 'ప్రాఁదోఁట' వలె, 'ఆఁబోతు—ఆఁదోఁక' వలె 'ఆఁబడ్డ' కూడా సాధువు కాఁగలదు; ఆవు + పష్ఠ—అని విగ్రహించినప్పుడు. కాని అదేమో చెవికింపు గాదు, 'ఆపోతు' వలె.—ఆ వెల్వ పచ్చనెగుగు—'ఆవువదల్చు పన్నెగుగు' (పాండు. 2. 51) అను వాక్యాంతరమునకు రూపాంతరమని నా యభిప్రాయము."

* * *

ఆవులోని 'వు'—గోవు లోని 'వు' వంటి దనుటకంటె, పూవులోని 'వు' వంటిదనుట యెక్కువ సమీచీనమని నా యభిప్రాయము. అప్పుడు 'పూవు'కు 'పూ' వలె — 'ఆవు'కు 'ఆ' రూపాంతరమగుటయు, బ. వ. 'పూలు' అయినట్లు 'ఆలు' అగుటయు సూపపన్నమగును. కాని ఆపక్షమున, శద —"పూ శబ్దమునకును వృత్తియందు ఉకారమునకు

---

* "తమ 'సాహిత్య సమీక్ష' సాంగముగా చదివితిని. ఈ పరిశ్రమ నిలువ నెలుఁగఁగలవారు పలువురు లేరుగదా యని చింతజనించినది. గురితీవ్రమై గంభీరమైన వ్యాసంగ మేదైనను దాని స్వరూప మింతేకదా యను తత్త్వము నాకు కొంత నెమ్మదినిచ్చినది. తెమది నాదము కాదు; శాత్త్వనిర్మితి. నిష్పక్షపాతము లందరును నిజముగా కన్నుల కొత్తుకొనఁగల వస్తువది."

వలె నుగాగమాది కార్యము నెఱుంగవలెను" అని చెప్పి పూఁగొమ్మ, పూటసిదము-అను నుదాహరణల నిచ్చియున్నందున ఈ '–' శబ్దమునందు నుగాగమము కలిగి 'ఆఁబడ్డ' యే కావలసివచ్చును.

వేఁటంటే, కొయ్యెంచె అన్నట్లు—పూగొమ్మ, పూయాసిదము-అనుటకు శాస్త్రము ఒప్పనేమో?

ఇక్కడ ఒక విశేషము — పూ + కొమ్మ = పూఁగొమ్మ - యగునన్న శ. ర. మే, చేఁగు + త్రెడు = చేఁత్రెడు" అన్నది ఇందు నుగాగమ కార్యము లేదు; అరసున్న యున్నది 'గీఁక + పెట్టు = గీపెట్టు' అన్నది ఇందు నుగాగమకార్యమూ లేదు; అరసున్నా లేదు కాబట్టి లుప్తశేషద్రుతకార్య నియమము బహుళమనియు, శ. ర ప్రకారమే — ఆ + పడ్డ (గీపెట్టు - వలె) 'ఆపడ్డ' కావచ్చుననియు చెప్పచున్నది. శ. ర. 'గీపెట్టు' అను పదమును విరను స్వాగముగా చూపి, కంచెలీ కరణమున "గీఁపెట్టు - ఇది ఇటువంటి యుక్తము" అన్నది. కాని చేఁత్రాడు, గీపెట్టు - అను పదములలో అరసున్నలుంచుట సరికాదు. ఎందువల్లననగా బా. వ్యా. సంధి. 36 సూ. ప్రకారము ఆ పదములలోని 'గు' - 'క' వర్ణముల తోపాటు వాటిముందరి అరసున్నలును లోపించును. నుగాగమము లేదు గనుక అచట అరసున్నలు మరల పుట్టవు అందువల్లనే బాం భా. శా. (సంధి ౫౮) 'చేఁదు + త్రాడు = చేఁత్రాడు' అన్న శ. ర. వ్రాత తప్పనియు, చేఁదు + త్రాడు = చేత్రాడు అనుట ఒప్పనియు తీర్మానించింది. ఆ తీర్మానము ప్రకారము- అవు + పడ్డ = ఆపడ్డ కావచ్చును.

ఇక శ్రీ శర్మగారి మతమునందో 'ఆ' లుప్తశేషము కాదు. స్వతంత్ర శబ్దము. కావున ఆపడ్డ యనుట కాక్షేపమే లేదు.

ఇక్కడను ఒక శంక — వారు 'ఆ' - వే, రే లవంటిదన్నారు. అటివంటో నుగాగమము రాక పోయినను గసడదవాదేశము వచ్చి వే + కన్ను = వేగంటి; రే + త్రిమ్మరి = రేద్రిమ్మరి; రే + పగలు = రేవగలు అయినట్లే ఆ + పడ్డ = ఆవడ్డ కావలదా? అనునది శంక

అట్లు కానక్కరలేదు; కై + కొనుట = కైకొనుట; చే + కత్తి = చేకత్తి; వా + తెఱ = వాతెఱ; మై + తాలుపు = మైతాలుపు - అయినట్టే ఆ + పడ్డ 'ఆపడ్డ' కావచ్చునని ఆ శంకకు సమాధానము.

కాబట్టి శ్రీ శర్మగారన్నట్లు 'ఆపడ్డ' యే సరి.

ఆనాడు నాకు 'ఆపడ్డ' లోనిది 'ఆ' యని తెలియదు. తెలియకపోయినను శ్రుతిహితముగా నున్నందున 'ఆపడ్డ' పాఠమే సాధువన్నాను కాని ధైర్యము చాలక 'పెద్ద లింకను విచారించి నిర్ణయింతురు గాక' అని వ్రాసికొన్నాను. (మా పు. 12)

శ్రీ శర్మగారు 'ఆ' యను రూపమును సప్రమాణముగా సాధించి నా వ్రాతకు ప్రాణము పోసినారు. వారికనేక వందనములు.

## 2. చారు

(పుట 17) "'చారు' నా దృష్టిలోను సరియైన రూపము చేరు. చారు, చాఱు కావు తమూహించినట్లు ఇది సారశబ్దభవము. కనుక ఇందు శకటరేఫముంచ వీలు లేదు. 'చారు' ప్రాకృతశబ్దము తమిళు 'శార్' నుండి తెలుగుదేశమునకు వచ్చిన పదము; అర్థముగూడ. నేటికిని తెలుగు వంటలలో చారుకు స్థానము సెకొనలేదు. అరవ కన్నడ దేశములలో అది లేనిది భోజనమే సాగదు గదా. తెలుగులో చ-జ లకు దంత్యాద్యపవాదము లేనిది కాదు. మరియేవిధియు వట్టిది గాదు

* * *

తద్భవములలో శకటరేఫముంచ వీలు లేదని గట్టిగా ననవకాశము లేదు. (చూ. ప్రౌ. వ్యా. సంజ్ఞా. ౯ )

సంస్కృత సార శబ్దమునుండి వచ్చినను, తమిళు 'శార్' నుండి వచ్చినను చారు, చాఱు, చేరు, చేఱు అను రూపములలో నేదొకటి యగును గాని 'చెరు' మాత్రము కాదు అదే యిక్కడ ముఖ్యముగా గమనింపవలసిన యంశము.

## 3. కయ్యము పొడుచు

(పుట 57) "శబ్దముల వ్యుత్పత్తులను గూర్చి తాము చాలా పరిశోధించి వ్రాసితిరి. 'కయ్యముఁబొడుచు' ననఁగూడదు అను తమ నిషేధవిధికి బలము చాలదని కొందురు. తెలుగులో కర్మవాచకము జడమైనప్పుడు ద్వితీయకంటె ప్రథమావిభక్తియే యెక్కువ రాణిం.

చును గదా. 'చెట్టు నెక్కెను' అనుటకంటె (1) 'చెట్టెక్కెను' అనుటయే మన నోటికి సహజమైన పలుకుబడి యైనను. 'ఫలములందెల్ల చిల్కలు భుజింప' (పాండు ౧. ౨౦౮) ఇట్టి ప్రయోగము లెన్నో కలవు కొంత వఱకు సంస్కృత సంప్రదాయము బలము దీనికి హేతువు కావచ్చును. జనకర్మలు కొన్ని వ్యవహార ప్రాబల్యముచే క్రియాపదముతో అవిభాజ్యముగా అనుకొని యుండును గాన అటిచోట్ల ద్వితీయా ప్రయోగము ఆరెంటిని విడఁదీసిందులచే అంతగా మనకు రుచింపక పోవచ్చును. కాని 'పొడుతును గయ్యము' అని వ్యస్తముగా కూడా ప్రయోగము లున్నప్పుడు 'కయ్యము'-పొడుచు క్రియకు కర్మముగా ఏల గ్రహింపరాదో నాకర్థము కాదు (2) భిన్నముగా నున్నప్పుడు గూడ అది కర్మవాచకము కాదని— 'పొడుతు నెల్లఁ బాండుపుత్రులతోఁ గయ్యమేను' అను వాక్యమున 'కయ్యము'ను ఏమిగా గ్రహింపవలయును? కర్మముగా గ్రహించితిమేని—'కయ్యముం బొడుతు' ననఁగూడదు అను నీ విధికి నిదానమేమి? ఇక్కడ ద్వితీయకంటె ప్రథమయే తెలుగు నుడికారము ననుసరించునది యన్నచో నాకును సమ్మతమే కొన్ని శ. ప. క్రియలలో కర్తృకర్మ వాచకములు అవిభాజ్యములై నిలిచియుండును లావు చెవు; కనుగొను— ఇత్యాదులలో వ్యవహార బాహుళ్యము దానికి హేతువు అట్టివానిని విడదీసి కర్తృకర్మ వివక్షు చేయుట అసంప్రదాయకము. అసహ్యము. అంతే. (3) 'వన్నెదన్ని' ఇత్యాదులలో 'వన్నె'కు కర్మత్వము పశింపదు. మొత్తముమీఁద ఇట్టిచోట్ల శాస్త్రముకన్న వ్యవహార వివేకము మార్గదర్శి"

* * *

పొడుచు అను క్రియ 'కయ్యము' అను విశేష్యముతో కూడి శబ్దపల్లవమై 'చేయు' అను విలక్షణార్థము నిచ్చుచున్నది. శ. ర. లో—"పొడుచు· అ. క్రి. ఇది కయ్యము, మేడము అను శబ్దములతోఁ జేరి వచ్చునప్పుడు చేయు అను అర్థము నిచ్చుచున్నది" అని తెలుపబడి యున్నది కావున చెట్టెక్కుటకును - కయ్యము పొడుచుటకును సామ్యము లేదు.

'బొగ్గుఁకై కల్పతరువు పొడుచుట' అన్నచోట తరువు కర్మ; పొడుచు (=నఱకు) క్రియ కావున తరువు ప్రథమలోను - ద్వితీయలోను ఉండవచ్చును.

'కయ్యము పొడుచు' అను ఏకపద క్రియలోని కయ్యము - కర్మ కాదు; పొడుచు - కయ్యమును పొడుచునట్టి క్రియా కాదు కావున కయ్య మెప్పటికిని ప్రథమలోనే యుండును.

'పొడుతు నెల్లఁ బాండుపుత్రులతోఁ గయ్యమేను' అన్నచోట, ఏను, ఎల్లన్ పాండుపుత్రులతోన్, కయ్యము పొడుతున్=పోరాడుదును, యుద్ధము చేతును—అని సమన్వయము. పాండుపుత్రులతో, కయ్యమును పొడుతును - అని చెప్పుచో అర్థశూన్య ప్రసంగమగును. కయ్యము నేమి? పొడుచుటయేమి?

శ. ప క్రియలలోని విశేష్యములను కర్మలుగా గ్రహించుచో నెన్నో అర్థభేదములూ—విపరీతార్థములు కూడా 'కొంపచేయు' అను పదముక్రింద (పుట 38) తెలుపబడియే యున్నది. అయినను ఇంకొక్క యుదాహరణము—

> "ఎవ్వఁడే యవధాన మెఱుఁగక యవ్యవధాన
> మున వాని కించుక ముల్లు నూప"
>
> (చ్రిక. 1 20)

ముల్లునూపు = అతిశయించు. వానికి ముల్లు నూపన్—అంటే వాని నతిశయించుటకు అని యర్థము. ముల్లును కర్మగా తీసికొన్నచో—వాని కేదో యొక ముల్లును చూపించుటయగునే గాని వాని నతిశయించుట కాదు. (తోడు నూపు; పొడనూపు; ఎలుఁగు నూపు; తలయూపు మొదలగు క్రియలన్నియు నిట్టివే)

ఎందుకింత విస్తరము: నిఘంటువులు కయ్యము పొడుచు-ముల్లునూపు వంటి క్రియలలోని విశేష్యములనూ—క్రియలనూ వేరువేరుగా చూపి అర్థము చెప్పియూ, మరల రెంటిని చేర్చి-ఏకపదముగా చూపి అర్థము చెప్పుటకు కారణ మేమో యించుక విచారించినచో ఈ శ. ప. క్రియల తత్త్వ మాకళింపు కాగలదని నా మనవి. ('దూసి' వారి బాల. వ్యాఖ్యానమున

---

(1) చెట్టెక్కు - శ. ప. క్రియ కాదు. అందు చెట్టు - కర్మ; ఎక్కు - క్రియ; (సకర్మకము) 'కయ్యము పొడుచు' శ. ప. క్రియ; ఏకపదము; రూఢము; అకర్మకము—నల్లిపొడుచు, నిలవొడుచు, గదుగుపొడుచు, గుఱుపొడుచు, చిట్టిలు వొడుచు - అను క్రియల వంటిది.

శబ్దపల్లవ లక్షణము చక్కగా వివరింప బడియున్నది. (చూ. క్రియా ౮౩, ౧౧౫)

మరియు, ఈ జాతి క్రియలలోని విశేష్యములను కర్మలుగా భావించువారికి హెచ్చరికగా, శ. ర., 'ఒత్తు' క్రింద,—"చిగురొత్తు ఇత్యాదులందలి ఒత్తు ఇంచుక్క వంటిదని తెలియునది" అనియు, 'చిగురొత్తు' క్రింద—"చిగురొత్తు=చిగురుచు—మనమునఁ గయ్యపు వేడుక, చిగురొత్తి' ఇక్కడ చిగురొత్తి అనఁగా పుటఁగానని యర్థము" అనియు, "చిత్తము చిగురొత్తి అన్నప్పుడు, చిత్తము అనురక్తము కాఁగా అని యర్థము" అనియు వివరముగా ఒత్తి చెప్పి యున్నది.

కావున 'కయ్యము పొడుచు' అను ఏకపద క్రియలోని కయ్యమును వేరుపరిచి కర్మయనుట సంప్రదాయము కాదని నా విన్నపము.

(2) శ. ప. ధాతువులలోని పదములు భిన్నములుగా నేకాదు. తారుమారుగానున్నను వాటి ధాతుత్వము చెడదనియు, పద సమన్వయమున ఆ రెండు పదములను చేర్చి, ధాతువుగా గ్రహించి అర్థము చెప్పికోవలెననియు తెలిపి, 'నోరింతకం బెఁజేయు'—'పట్టెఁ జెఱలు'—'జంగల్ చెంగునన్ గొనన్' ఇత్యాది ప్రయోగము లిచ్చియేయున్నాను. (పు 56; 58). కావున మరల నిక్కడ వివరింపనక్కరలేదు. అయినను విషయ విస్పష్టతకింకొకటి రెండు ప్రయోగములు,—

(1) "చెఱలు మాఱలువట్టు సేఁగి మాన్పు మటన్న
వెసనచే మతియుఁ గావించె దీవు"
(సిం వార. ౪౧)

చెఱలు మాఱలుపట్టు సేఁగి—యనఁగా, చెఱలు పట్టు సేఁగి, మాఱలు పట్టు సేఁగి—యని యర్థము. చెఱలు పట్టు, మాఱలుపట్టు—అను రెండు క్రియలును ఇందు జోడింపబడినవి. చెఱలు=చెఱలను, మాఱలు=మాఱలను, పట్టుసేఁగి=పట్టుకొనునట్టి సేఁగి—అని యర్థము చెప్పరాదు.

'చెఱలు మాఱలు పట్టు' అనునీ ప్రయోగము 'కొంకు కొసరును చేతిప్పగొను' అను ప్రయోగము వంటిది. (చూ పు. 29).

(II) "నిద్రయెన్నఁడుఁబోఁడు" (భాస్కర సుందర. 302).

ఇందు 'నిద్ర'—'పోఁడు' అను పదములు వ్యస్తముగానున్నను, ఎన్నఁడున్, నిద్రపోఁడు—అని యర్థము చెప్పవలెనేగాని, నిద్ర=నిద్రను, ఎన్నఁడున్=ఏనాఁడును, పోఁడు—అని చెప్పరాదు.

(III) "తక్కిన నాయకబలమును
లెక్కింపఁ బితామహుండు లేఁడు"
(భాస్కర. యుద్ధ 435).

పితామహుండున్-లెక్కింపలేఁడు-అని యన్వయము

(IV) "ఉగ్రపు మేనుల యాతుధానులొక్కొక్కని మెచ్చనట్టి భటు లుండుదు రొక్కొక్క వాని వాకిటన్" (,,-,,-16).

ఒక్కొక్క వాని వాకిటన్=వాని ఒక్కొక్క వాకిటన్-అని అన్వయక్రమము.

ప్రౌఢకవుల రచనలలోని ఇట్టి ప్రయోగ విశేషములను భాషా సంప్రదాయమును గమనించి యన్వయింపవలెనేగాని మాటకు మాటగా అర్థము చెప్పనొప్పదనియు, 'పొడుతుఁగయ్యము' అని పదములు వెనుక ముందై యున్నను, కయ్యముపొడుతున్=యుద్ధము చేయుదును అనియే చెప్పవలెననియు 'పొడుతుఁగయ్యము'—'పట్టెఁజెఱలు'—'నోరింతకం బెఁజేయున్' ఇత్యాది వ్యస్తప్రయోగములలోను విశేష్యములు ప్రథమలోనే యుండుట గమనింపదగిన యంశమనియు, 'కయ్యముపొడుచు' శ. ప. క్రియగావునను. అందలి 'పొడుచు' అకర్మకముగావునను 'కయ్యము'ను కర్మగా గ్రహించి 'కయ్యముం బొడుచు' అనుట పొసగదనియు సారాంశము

మరియొక విశేషమేమనగా: సకర్మక క్రియలును శబ్దపల్లవములగునపుడు అకర్మకములగుచుండును —

ఉ —(1) కయ్యమిచ్చు (=సంగరమిచ్చు) = యుద్ధమునకు వచ్చు.
(2) వెన్నిచ్చు=పాఱిపోవు
(3) మొగమిచ్చు=సుముఖమగు
(4) చేట్లుగట్టు=చేటుగా చేర్పడు.
(5) ఎడకట్టు=మానినపుడు మరల గడ్డగా చేర్పడు.

ఇత్యాదులు —

(3) తెనుగు పలుకుబళ్ళు తెన్నులన్నియు కలయఁజూచిన సుప్రసిద్ధ విమర్శక వరేణ్యులు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, జయ-గ్రీష్మ 'పరిశోధన' పత్రికలో 'పలుకుబళ్లు-పదబంధాలు' అను శీర్షిక క్రింద, ఈ శ. ప్ర క్రియల స్వరూప స్వభావములను విశదపరిచి యున్నారు. అందు, వెనుదఱుచు, వెనుతవులు, వెన్నంటు. వెన్నడించు, వెన్నిచ్చు, వెన్నాడు-అను పదములతోపాటు 'వెన్నుదన్ను' కూడా చేరియున్నది ఆవ్యాసము చదివినచో 'వెన్నుదన్ను' అను క్రియలోని 'వన్ను' కర్మయగునో కాదో తెలియగలదు

మరియు,—ఉభయ బలంబులు పురికొని...అ
క్షుభితములై పోరాడెం
బ్రభువులు వెన్నుదన్ని చూడ"
(భా. ద్రోణ. 1.385)

అన్నచోట, — ప్రభువులు, వెనుదన్ని చూడన్ = వెనుక నిలిచి చూచుచుండగా — అనుట యుచితమో, వెన్నులను తన్ని చూచుచుండగా — అనుట యుచితమో విచారించినను ఈ 'వన్నుదన్ను' క్రియయొక్క తత్త్వము తెలియగలదని నా విన్నపము.

శ. ర. లో — "వన్నుదన్ను (వెన్ను + తిన్ను) వెనుకనిల్చు, వెంబడించు" అని చెప్పబడియున్నది.

## ౪ ఉద్దు

(పుట. 107) "ఉద్దు — అనునదే ఏకవచన రూపమనుట యుక్తి సహము. తమిళు ఉళుంగు; కన్నడము ఉద్దు; ఉద్దు. ఆంధ్రదేశమున కన్నడ సామీప్యముగల రాయలసీమలందే దీని వాడుక. ఇతరత్ర ఇది అర్థముకాని పదము మినుము గదా అక్కడి వాడుక కన్నడమందు దీని యొపవిభక్తిక రూపము 'ఉదిన'. తెలుఁగులోను అదే సంక్రమించినదను కొందును — శ. ర. 'ఉద్ది'ని గ్రహించినది గావున మనము దానినే గ్రహింపవలెనని, 'ఉద్దు' తప్పని చెప్పలేమని నా మనవి. శ. ర. లోని శబ్దార్థ స్వరూపము లెన్నోచోట్ల నేడు మనము సందేహింపవలసి యున్నాము గదా."

* * *

సందేహించుట వల్ల నేగదా యిట్లు చర్చింప వలసివచ్చినది. 'ఉద్దు' కన్నడ పదమే. కాదన్నదెవరు? శ. ర. గ్రహించిన 'ఉద్ది' తప్పా? ఒప్పా? అన్నది మన కిక్కడ విచారణీయము. "ఉద్ది చేను — ఉద్దిపప్పు అనియే దేశమున వాడుక" అని తెల్పిన యిద్దరు పండితుల వ్యాసములను (పు. 109లో) ఉదాహరించియే యున్నాను.

మరియు, తెనుగునను - కన్నడమునను పండితులును, కన్నడ దేశమునకు సమీపమున నున్న తెనుగు సీమవారును నైన శ్రీ గో. వాసుదేవశాస్త్రి గారు 'ఉద్ది' అనియే గాని 'ఉద్దు' అను వాడుక లేదని స్పష్టముగా వ్రాసియున్నారు. (చూడండి - పండితాభిప్రాయములలో)

మరియు, మాయింట పనిచేయుచున్న అరవపిల్ల ఇటీవల ఒకనాడు ప్రస్తావవశమున "మినప పప్పును మేము ఉళుంగుపరుప్పు అంటాము; నాటుపురం వాండ్లు-ఉద్దిపప్పు అంటారు" అన్నది. నాటుపురం అనగా అరవము తెలియని తెలుగువాండ్లని ఆమె భావము. అది (హేళనవాదం.)

కావున 'ఉద్ది' తప్పుకాదు; ఒప్పే. తమిళు 'శార్' చారు-అయినట్లే కన్నడపు 'ఉద్దు' తెనుగున ఉద్ది అయినదనియు, తెనుగు నిఘంటువు గ్రహింప వలసినది తెనుగు నాటవాడుకలోనున్న పదమును గాని కన్నడములోని పదమును కాదనియు, శ. ర. గ్రహించిన ఉద్దియే సాధురూపమనియు నా విజ్ఞప్తి.

## ౫ తీరు - తీఱు

(పుట 138) "తీరు-తీఱు ఈ రెంటికి విగల అర్థభేదము తాత్పర్యమే కాని వేఱుకాదని నా విమర్శ. ఇందలి శకటరేఫమును కృత్రిమమే. ఇది 'తీరఇ' అను ప్రాకృతరూప మూలకము. సంస్కృత 'తిర' ధాతువు కనుక ఇందు బండిఱా సహజముకాదు. ఈ రేఫద్వయ సంప్రదాయమే ద్రావిడ భాషలలో అవిచారితరమణీయముగా వచ్చిపడిన బెడదయను భావము నాకు బలియుచున్నది.

* * *

బండిరా భాషకొక పెద్ద బెడదగానే యున్నది. దానికి సరియైన వ్యవస్థయును లేదు. లేకపోయినను

అది యట్లే భాష నంటి పట్టుకొని వచ్చుచునే యున్నది గదా! ఇది విషయాంతరము.

తీగ—తీఁగల కర్థభేదము లేకున్నచో భిన్నార్థములు చెప్పకుండుట మేలు. భిన్నార్థములు చెప్పి విరుద్ధరూపములు చూపుట సరికాదని నా పరామర్శ. అంతే.

## ౬ ఈర్పెన

(పుట. 158) ఈగు + పేను = ఈర్పెన అని మీరు సూచించిన వ్యుత్పత్తి ఇంకను విచారణీయము. ఈర్పెన, దువ్వెన ఈ రెండును, ఈరుబాని, దూబాని అని మాప్రక్క పామర వ్యవహారము 'తీసి వేయునట్టి సాధనము' అను నర్థమును బోధించు దీర్ఘపదమే అంతరించిపోయినదని యూహించుట కష్టము. కాని నే నంతకంటె మంచి వ్యుత్పత్తిని సూచింపలేను — ఈరుబాని—దూబాని లోని 'బాని' లేక 'పాని' కి అర్థము కాని మూలము కాని నాకును ఇంకను బుద్ధికి తట్టలేదు

* * *

మాప్రక్క 'దూబాని' లేదు గాని. ఈరుపేన - ఈగుబేన ఉన్నవి. కాలక్రమమున దీర్ఘము హ్రస్వమగుటయు, వర్ణలోప వర్ణాగమాదులును అసహజములు కావు గదా!

ఈరుపెనకు సంబంధించిన నా వ్రాత సరియైనది కాదని శ్రీ సంపత్ గారు (Special Officer Vocabulary research Institute unit, Rajahmandry.) తమతోనన్నట్లు శ్రీ యే. రా. దయానులు గారు నాకు వ్రాయగా,—అయ్యా తామూహించిన వ్యుత్పత్తి యేమో దయచేసి తెలుపవలసిన—దని శ్రీవారిని కోరితిని. కాని కారణ మేమో ప్రత్యుత్తరము రాలేదు.

ఏమైనను నా వ్రాతలో సత్యము కలదనియే నా నమ్మకము. అందు కాధార మేమనగా: వావిళ్ల నిఘంటువులోను నేను చెప్పిన వ్యుత్పత్తియే యున్నది. ఈ చర్చ ప్రారంభమైన పిమ్మట నేను చూచుట తటస్థించినది. ఎట్టి చేరికయును లేని యిరువుర కొకే భావము తట్టినప్పుడు అందు సత్యముండి తీరునని నా యభిప్రాయము. పెద్దలింకను విచారింతురు గాక.

## ౭ జలపూఁత

(పుట. 165)—(1) జలపూఁత; 'జలపూఁత బంగారు సంసారము' అన్న ప్రయోగము అన్నమాచార్యుని పాటలోనున్నది. ఆ శిల్పములోను 'పోఁత' కంటె 'పూఁత'యే యుక్తమనిపించును—'జలపోఁత'కంటె 'జలపూఁత'యే యెక్కువ న్యాయ్యమని భావింతును. మొలామును పూయుదురు గాని పోయరు గదా! అన్నమాచార్యులపాట రెండుగకముల రేకులలోను 'జలపూఁత' అనియే స్పష్టముగా నున్నది. మరి వింత. ఈ రెండు ధాతువులకును మూలమైన దేశీయ ధాతువు 'పుయ్' అనునది కన్నడమున నున్నది. దానికి 'పోఁత' అర్థము కాని 'పూఁత' కాదు. తెలుగున రూపభేదము వెంట అర్థభేదము వచ్చినది. ఈ సందర్భమున (2) జలపోసనమును గూర్చి కూడ నా సందేహములు మనవి చేసికొందును ఇది దేశ్యమన్నది శ. ర.—కాని దాని రూపము చూడగా అది తద్భవమనుకో దగియున్నది. 'ఆపోశనము' మూలముగావచ్చును. మరి 'భోజనము'—'ప్రోక్షణము' గూడ కావచ్చును. ఎట్లును 'పాలు—క్షీరము' అను శ. ర. మొదటి యర్థము ఎట్లు వచ్చినదో విచార్యము. మఱియు శ ర చూపిన "భూప్రవరుం బోసన మిమ్మ నంగవలెనే" అను భాగవత పద్యమున "భూప్రవరుం డోసన మిమ్మనంగవలెనే" అను పాఠాంతరము కలదు. ఇంక 'యయాతి'లోని 'కెంపు పోసనంబులు దాసనంబులు' అను శ. ర. యుదాహరణము ప్రాసప్రధానము గనుక దాని కేదో గౌణార్థము చెప్పదగును గాన ప్రకరణమును బురస్కరించుకొని 'కాంతి' అను నర్థము అందే ఇయ్యబడినది. భాగవత ప్రయోగమునకు భోజన మర్థము చెప్పవచ్చును. కుస్తీకి ముందు శక్తికై 'దోరకు జెప్పి తిండి పెట్టించుమనవలెనా' అను భావము కావచ్చును. లేదా పోషణ శబ్దభవముగా గ్రహించి కుస్తీకి పూర్వ భావిగా మల్లులు చేసికొను 'తిత్తూరి' అను నర్థమైనను చెప్పవచ్చును అట్లే 'బాస పోసనములు' అను తెన్నాలికవి ప్రయోగమునకు నట్టి మాటమాత్రమైన భోజనమో - పోషణమో అర్థము కాదగును. (3) ఇక 'పైఁడి జలపోసనపు పీఠ'లోని 'జలపోసన' మెట్టి శిల్పమో నే నూహింపలేకున్నాను. వ్రాఁనితో చేసిన పీఠమీఁద బంగారు మొలాము నిలువదు. నేను చూచినంతవరకు బంగారు రేకులను చిత్ర

చిత్రములుగా కత్తిరించి పొదిగింతురు. మరి బంగారు పూఁతకు పనికివచ్చునట్లు ఇంకే యితర లోహముతోను వీణలు చేయరు. చేసినా అది నాద మాధుర్యము లేని మోతదింపుగగా, బొమ్మల వస్తువుగా మాత్రము ఉంచఁ గలదంతే. కనుక పోఁత-పోసనము రెంటికిని పూఁతయే యర్థము కాఁగలదా? అను సందేహము నాకున్నది. తమరు విచారింతురుగా. మన నిఘంటువు లిచ్చు అర్థము లెన్నోచోట్ల ఊహాత్, లక్షణాలక్షణగా చేసికొన్నవి. వానిని ఇప్పటికట్టే అంగీకరింపలేముగదా!

*　　　*　　　*

(1) 'జలపోఁత బంగారు' అను మాటకు పూఁత బంగారు—అనియే అర్థము. కావున 'జలపోఁత బంగారు సంసారము' అన్నను అన్నమాచార్యుని పాటలోని శిల్పమున కేటి భంగమును కలుగదు. మొలామును పూయుదురు గాని, పోయరు. ఆ మాట నిజమే; కాని ఆ పూయుటనే జలపోఁత (=జలపోసనము)—అందురు. అది జాతీయము. జాతీయములకు నుడుల యర్థములు రూఢములు. వాటికి అవయవార్థ కల్పనము చేయుట సరికాదు.

'పోయు' ధాతువు 'జల'తో చేరి శబ్దపల్లవమై 'పూయు' అను నర్థము నిచ్చుచున్నది. విలక్షణార్థ మిచ్చుటయే గదా శబ్దపల్లవ లక్షణము?

ఈ పోయు ధాతువే 'పోఁగు' అను పదముతో కూడినపుడు 'కుట్టు' అనునర్థము నిచ్చును

"పోఁగుపోయు = సంతివక్కై తిన్నగా పోఁగు పాటించి కుట్టు"—'పోఁగుపోఁత = పోఁగుపోయుట" (శ. ర)

మరియు, పాసపోయు - అను క్రియలో 'పోయు' నకు 'ఘటించు' అని యర్థము.

"పాసపోయు = పాసాలు ఘటించు" (శ. ర)

అసుపోయు—అను క్రియలో 'పోయు'నకు, నూలుపోగును అ ప్రక్కకు-ఈ ప్రక్కకు 'పాటించు' యని యర్థము.

కావున 'జలపోఁత'లోని 'పోఁత'కు 'పూఁత' అని యర్థము చెప్పుట తప్పుకాదు; ఒప్పే. ఆ 'పోఁత'ను 'పూఁత'గా సవరించుట మాత్రము ఒప్పుకాదు.

జలపూఁత—అను పదము రాగిరేకులమీద నున్నను—రతి పలకమీద నున్నను సాధువు కాదనియే నా యభిప్రాయము.

(2) 'పోసనము = పోలు' అని శ. ర. చెప్పుట కాధారమేమో, నాకును తెలియలేదు. పోసనము తద్భవముగు నేమో నేను చెప్పజాలను.

(3) జలపోసనము...పూఁతపనే గాని రేకులు పోయుట కాదని యీ క్రింది రచనలవలన నూహింప నగుచున్నది.

(i) పసిఁడి జలపోసనముతోడ నెఱక మెఱుఁగు బిసరుహాసను పుత్రియుఁ గప్పిరపగించి" (హర. 5-65)

(ii) పసిఁడి జలపోసనంబుల పావజోళు" (రాధా మా. 5.145) ఈ పావకోళ్ళ మీద—పుత్రియ మీద జలపోసనము - బంగారు పూఁత కాదు; రేకుల అతికించే ననుకొందము...

తలపుట్టె (యొముక)పై బంగారు రేకు లతుకు పడి నిలువగా వీణె కొయ్యపై బంగారుపూఁత నిలువదా?

మరియు, బంగారు—వెండి సన్నాయి లీనా మున్నవిగదా: అవి మొలాము చేయబడిన కొయ్యలు కావా? అట్లే బంగరుపూఁత వీణెయును నెందు కుండరాదు?

ఇంకొకమాట...బంగరు పూఁత వీణ లోకమున లేకపోవుగాక. కావ్యలోకమున నేల ఉండరాదు? ఈశ్వరుని చేతి పుస్తకకు జలపోసనము ఘటించిన అతిలోక శిల్పులు...కవులు మానవ వీణకు పట్టింపజాలరా?

కావ్యప్రపంచమున బంగారు చుటువాలు, బంగారు బాణములు, బంగారు కమలములు, బంగారు రెక్కల పక్షులు, బంగారు కొండలు నుండఁగా... బంగారుపూఁత వీణయుండుట అబ్బురమా?

"పైపూఁత రుచి గాక ప్రతియే కిన్నెరకాయ
ఒరిది మేగువు తెలయుంప నిశిన" (వసు. 2 42)

ఇందు కిన్నెర యను వీణెకు వేసిన గుబ్బకాయలు పైన పూసిన బంగారుపూఁత గలవిగా చెప్పబడినవి.

వీణె సొరకాయల కతికిన బంగారుపూఁత వీణె కతుకదా? ఇంతియేందుకు: బంగరు పూఁత వేసిన వీణయేకాదు బంగరు వీణయే కలదు. చూడండి—

(a) "ఒకతె దమ్ములమీఁది యురిగి కిన్నెర గాలిఁ
బలుక నింతి చలించి బయలుమీటు."

(వసు. 4 75)

"ఉదిరి కిన్నర=శుద్ధ సువర్ణ(మయ)మైన వీణా విశేషము" అని టీక.

(b) "క్రొత్త ముత్యాలకెంబటు కుచ్చులమరు
పసిడి వీణె కరంబునంబట్టి...వచ్చె సమ్మధుర
వాణి" (రాధామా. 2 50)

(c) "శృంగార కుసుమంబు చిన్నచుక్కల రాజు
పసిడి కిన్నెరవీణె పలుకుడోడు"
(శృం నై. 1 5)

శ్రీనాథాది కవుల మాట యటుండనిండు. 'సంగీత కళారహస్యనిధి' యైన 'వసు' కర్త బంగరు పూతతీగెను—బంగరు వీణెనుగూడ చెప్పియుండగా, బంగరు సన్నాయులు మన కనులయెదుట నే యుండగా, బ్రామవీణపై బంగారు మొలాము నిలువ దనుటయు, బంగరువీణె నాదమాధుర్యము లేని మోత దండుగయనుటయు న్యాయ్యమగునా?

ఇక్కడ ఒక్కమాట జలపోసనమునకు శ. ర జలపోత అన్న యర్థ మొక్కటే చెప్పనది గాని దానికి 'జలతారు' అన్న మరియొక యర్థమును కలదు (చూ. వావిళ్ళ నిఘంటువు)

అంతే కాదు; శ్రీ శర్మగారు తెలిపిన—బంగారు రేకు లతికించుట యన్న యర్థమును ఆ పదానికున్నది.

"జలపోసనము—Gilding with gold leaf" (బ్రౌణ్యము) 'పసిడి జలపోసనపు వీణె' అను మాటకు, బంగారు రేకు లతికిన వీణయనియు, బంగారు మొలాము చేసిన వీణయనియును చెప్పవచ్చునన్నది యిక్కడ సారాంశము.

## లా కిన్నర

(పుట 199)—(1) 'కిన్నర' దేవయోని విశేష వాచకము 'కిన్నరి' వీణా వాచకము. దీని తద్భవము తెలుగులో 'కిన్నెర.' శ.ర. కారుడు గ్రహించిన 'కిన్నరా' శబ్దము నాకెందును గానరాలేదు (2) కిన్నరుల స్వరూపమెట్టిదో మనకు నికరముగా తెలియదు. గంధర్వ కిన్నరులలో ఎవరు వైణికులో, ఎవరు గాయకులో తెలియుట నాకు సాధ్యము కాలేదు. అయినా 'సప్తరాత్ర ప్రయోగేణ కిన్నర స్వరముచ్యతే' ఇత్యాది వ్యవహారముచే కిన్నరులు కంఠమాధుర్యమునకు పేరైనవారని ఊహింపవచ్చును. (3) 'స్త్రీ కంఠమును పురుషుని కంఠముతో పోల్చుటయు సుచితము కాదు' అన్న సంకేతము సార్వత్రికము కాదు. పురుష గానము విన్న భాగుదత్తుడు—భిత్త్యనంతరం యది భవేద్యువతీతి మన్యే' అని స్త్రీ గానముతో పోల్చినాడు. (భాసుని దరిద్ర చారుదత్తము) కనుక మల్లినాథుని టీకలో అనౌచిత్యము నాకేమియు కానరాదు, (4) స్త్రీ గాత్రమునందు తారస్థాయియు, పురుష శారీరమందు మంద్ర మధ్యమ స్థాయులును సుగ్రహముగా నుండును. కొందరు పురుషుల—స్త్రీల దేహతత్త్వములలో ఇది విపర్యస్తముగా నుండవచ్చును. కిన్నరజాతివారి శారీరములో ఈ తారధర్మము ఎక్కువగా నుండెడిదేమో? నేటికిని తక్కిన నారికంటె ఆంధ్రజాతిలో ఈ గాత్రధర్మము ఎక్కువగానుండుట మనము గమనింపగలము. కిన్నరులలోను స్త్రీ పురుష తారతమ్యము గాత్రములో నుండవలెనని యూహించుట సహజమే కాని అనావశ్యకమనుకొందును—ఉపమానోపమేయములను సమాన లింగములుగా కూర్చుటలో కాళిదాసు చాలా శ్రద్ధతీసికొను శిల్పిగదా? అతడుగూడ ఇందుమతి కంఠమును బోల్చుట యందు కిన్నరకంఠమందలి స్త్రీ పుం భేదములను గమనింపలేదనుట నా మనవి."

*　　　*　　　*

(1) 'ఆప్టేలో, —'కిన్నరి—a kind of lute' అని యున్నది. కాని ప్రయోగము లేదు. సూ. ని 'కిన్నరా—విల్యమ్సు' అని సూచించి, 'కిన్నర'ను (శ ర. వలెనే) తప్పనుచున్నది. కాని, అది తత్సమము కాదు తత్తే. కిన్నర = కిన్నర వీణ. (తంత్రీకట్టు వాద్యభేదము) పాల్కురికి—బసవ. (పు. రగ)లో, వీణా భేదములలో,—బ్రహ్మ వీణ, లావణ్య వీణ, కైలాస వీణ, సారంగ వీణ మొదలగు వాటితో—'కిన్నరవీణ' యున్నది.

అంతే, (పు ౧౮౨లో),—
"క్రీడార్థమై మఱి కిన్నరవీణ
వేడుకనొకనాడు వినిపింపదొడగ
...　　...　　...
పరపంగ గిన్నరి బ్రహ్మయ్యవాడ
ధరణిఁ బేర్చి"
అనియు ప్రయుక్తమై యున్నది.

కిన్నరవీణః; కిన్నర బ్రహ్మయ్య—ఇత్యాదిగా సమాసఘటితమై యున్నందున 'కిన్నర' అకారాంత పదమనియు, 'దర్భ'వలె—ము లోపము నిత్యమై—'కిన్నర' గా వ్యవహృతమైనదనియు నా యాశయము.

నా యూహాను ప్రాజ్ఞులు మన్నింతురేని, కిన్నరకంఠి=వీణావిశేషమైన కిన్నరయొక్క స్వరము వంటి కంఠస్వరము కలదియే యగును. కిన్నరుని (పురుషుని) కంఠస్వరమువంటి కంఠస్వరముకలది కానక్కర యుండదు.

వీణ, 'వీణా'యైనట్లు—కిన్నర—యే 'కిన్నెర' యైనదని నేననుకొందును.

సూ. ని. మతమున 'కిన్నెర'—కిన్నరాభవము

'కిన్నెర'—కిన్నరీభవమనుట యుక్తిసహముగా నాకు తోచదు.

(2) కిన్నరుల రూపమెట్టిదైనను స్వరమాధుర్యమున వారిచే అగ్రతాంబూలము గంధర్వులు కిన్నరులుకూడా జంత్రగాత్రముల రెంటను ప్రజ్ఞావంతులే నని నీలకంఠవిజయాది కావ్యములు చెప్పుచున్నవి.

(3) స్త్రీ కంఠమును పురుష కంఠముతో పోల్చుట యుచితము కాదని నేనన్నది భిన్న లింగమన్న భావమున కాదు. పురుషకంఠముకంటె స్త్రీ కంఠమే ఎక్కువ కమ్మగా నుండును. అందువలన ఆ పోలిక యుచితము కాదన్నాను. పురుషకంఠము స్త్రీ కంఠమువలె అంత మధురముగా నుండదనుటను పై చాటువత్తి వాక్యమే తెలుపుచున్నది.

మరియు నీ సందర్భమున ఈ క్రింది పద్యము గమనింపదగియున్నది.

"స్వరము రాగమ్ము పురుషుల సరణిఁ దోఁచు
మధురిమము పూవుఁబోణుల మాద్రి నొప్పు
చాటుగా నాగరత్నము పాట విన్నఁ
బురుషుఁడో లేక కాంతయో యెఱుకపడదు"

—శ్రీ తిరుపతి వేంకటకవులు.

సందర్భమునకు సరిపడి యుండెనేని భిన్న లింగోపమితి దోషము కాదు.

"ఆ ధృతరాష్ట్రుఁ డావలచిన ట్లుఱచెక్" (భా. ఆది. 6. 169) ఇత్యాదిరచనలు కలవు. నేనెఱుగుదును.

(4) నరజాతిలో వలెనే కిన్నర జాతిలోను స్త్రీపురుష తారతమ్యము గాత్రములో నున్నది—మేఘసందేశములో 'త్రిపుర విజయో గీయతే కిన్నరీభిః' (1. 60) అన్నచోట వేదం-పండితులు—'కిన్నరీభిః—స్త్రీలను చెప్పుట కంఠస్వరస్యాతిశయము కొఱకు' అని పదప్రయోజనము చెప్పియున్నారు.

కావున 'కిన్నరులలోను స్త్రీపురుష తారతమ్యము గాత్రములో నుండవలెనని యూహించుట సహజమే. కాని అనావశ్యమనుకొందును' అనుట న్యాయ్యముగా నాకు తోచుటలేదు.

'ఉపమానోపమేయములను సమాన లింగములుగా మార్చుటలో చాలా శ్రద్ధ తీసికొను శిల్పియయ్యును కాళిదాసు ఇందుమతి కంఠమును బోల్చుటయందు కిన్నర కంఠమందలి స్త్రీ పుం భేదములను గమనింపలే' దనుటయు న్యాయ్యమనిపించుట లేదు.

మల్లినాథుని వ్యాఖ్యను సమర్థించుటకై కాళిదాసుని కవితాశిల్పమును వెలితిపరుచుట యొప్పదనియు, 'కిన్నర' శబ్దమును వీణా పర్యాయముగా సాధించి ఆ మహాకవి శిల్పనైపుణ్యమును కాపాడుట ఉత్తమ పక్షమనియు నా విన్నపము.

కిన్నరా శబ్దమును గూర్చియు, కిన్నరకంఠియను సమాసమును గూర్చియు మీ యభిప్రాయ మేమని నేను శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారికి వ్రాయగా వారిట్లు బదులు వ్రాసినారు.

"కిన్నరా పదము విలియమ్సు నిఘంటువులో కలదు. వాచస్పత్యములో లేదు. కిన్నరాకంఠి యగును. కిన్నరవంటి కంఠము గలది అని యర్థము వచ్చును. 'కిన్నరకంఠి'కి ఆ యర్థము రాదు. 'కిన్నరకంఠి' అనగా వీణాస్వరమును బోలిన స్వరముగలది అనునది శబ్దార్థము గాక తాత్పర్య రూపముగాఁ గావచ్చును.—కాళిదాసు ఒకవేళ కిన్నరా పదముతోనే సమాసము చేసి, అకారాంతముగా గ్రహించి, 'కిన్నరకంఠి' అని ప్రయోగించెనేమో? కుమార సంభవమున "రతిదూతి పదేషు కోకిలాం" అని "దూతీ" పదమునకు హ్రస్వముచేసి (4 16) ప్రయోగించియున్నాడు గదా! భుజ-భుజా; ఫణ-ఫణా; వ్రీడ-వ్రీడా; బాధ-బాధా; ఊహ-ఊహా మొదలగు పెక్కు శబ్దములు గలవు. కావున అకారాంతమగు వీణార్థము గల కిన్నర శబ్దము అంగీకరింప వచ్చును.

కిన్నరుని కంఠమువంటి కంఠము గలది అను అర్థము కన్న కిన్నరము వంటి కంఠముగల దనుటయే మంచిదని నా యభిప్రాయము.''

## ౯ చేవెలుఁగు

(పుట. 204) "చేవెలుఁగు ఇంపెరసున్న గలదా? కంచె, ఆవరణము అను నర్థమున "వెలుగు'' నిరను స్వారము గదా?''

*　　　　*　　　　*

ఆవరణార్థమున "వెలుగు'' నిరనుస్వారమే కావున సూ. ని. చెప్పిన యర్థ మొప్పదు. అప్పుడు నేను గమనింప లేదు. అదియే సరియైన అర్థమన్నాను. ఇప్పుడైనను తప్పనుటకు నా మనసొప్పుట లేదు. చేవెలుఁగిడి చూచుట యనగా కంటికి చేయోరచేసి చూచుటయే. కావున ఆ వెలుగు(=ఆవరణము)లోను అరసున్న యున్నట్లు భావించుట యుచితమేమో? అరసున్న కొరకు పోయిన-అసలర్థమే నిండు సున్న యగు నట్లున్నది. ఇది పెద్దలు చక్కగా విచారించి నిర్ణయింప వలసిన విషయము.

## ౧౦ ఒడికపుఁ దనసొబగు

(పుట. 209) "ఒడికపుఁ దనసొబగు - అనురూప మాక్షేపించితిరి. పుంపులకు పరుష సరళములు పరముగ నపుడువచ్చు నుగాగమ కార్య మిం జేలరాదు? అందుకు ఇంపలి "తన'' త్వార్థప్రత్యయము కావలసిన పని లేదు గదా?''

*　　　　*　　　　*

పుంపులకు పరుష సరళంబులు పరంబగు నపుడు నుగాగమంబగుట సమాసమునను, తనంబు పరంబగు నపుడును - అని మాత్రమే బాల. సంధి. సూ. 25, 35 చెప్పుచున్నవి.

"ఒడికపుఁ దనసొబగు''లోనిది "తన'' గాని "తనము'' కాదు గనుకను, ఒడికము "సొబగు''కు విశేషణముగాని "తన''కు కాదు గనుకను,-ఒడికపుఁ దన; ఒడికపుఁ దాను - ఇత్యాదిగా సర్వనామముల తోడి సమాసములు నా కెందును కనబడ వందునను, విశేషణ విశేష్యములకు నడుమ మరియొక పదము చేరిన సమాసములను గాని-అట్టిపట్టున జరుగు వ్యాకరణ కార్యమును గాని వ్యాకరణములు తెలుపక పోవుట చేతను అందు నుగామము రాదని నేననుకొన్నాను.

శ్రీ శర్మగారు నన్ను మందలించినపిమ్మట నేను శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారికి వ్రాసి కొనగా, వారు "అది 'తనము' కానక్కఱ లేదు. అక్కడ షష్ఠము పరమైతే నుగామము రావచ్చును. (ఆం భా. శా. పు. 100, 101) నా మతము ప్రకారము అక్కడ 'నకారాగమము' బహుళము, చేయక పోయినా తప్పలేదు. అంతేకాని 'ఒడికపుఁ దనసొబగు' తప్పనరాదు'' అని దయతో బదులు వ్రాసినారు. పెద్దల శాసనమును శిరసావహించు చున్నాను.

కాని, ఉన్నతపుఁదనమేష ఉన్నతపుఁ దనవారి మేష సరసపుఁ దనతీనయుని పాట-అనుట సమంజసముగా నా యంతరాత్మ అంగీకరించుట లేదు. కారణము భ్రాంతియే కాబోలు!

ఒడికపుఁదనసొబగు—వంటి యీ క్రింది రచన నా కిటీవల కనబడినది.

"గుత్తపుఁ దను దన్ను గుబ్బల కస్తూరి"
(రాధా మా. I-113)

## ౧౧ పంజు

(పుట. 257) "పంజు—ఇది దివిటీ అను నర్థమున 'పాంజు' గా మా ప్రక్క వ్యవహారము. పుంజ శబ్దభవమేమో? కాంతిపుంజ, తేజఃపుంజ శబ్దముల సంగ్రహము గానోపును. కన్నడమున పంజు అనియే కలదు. దివిటీ అను నర్థ మొకటే ఆ భాషలో. తెలుగులో ఎన్నో అర్థాలు. ఇన్ని యెట్లు వచ్చినవి? 'పాలకీ దండెలు' అను నర్థము ఇంకను విచారింపఁ దగును. ప్రకరణమును బట్టి అర్థమూహించుట సత్సంప్రదాయమైనను దానికి ప్రామాణికత తక్కువ."

*　　　　*　　　　*

పుంజ శబ్దభవముగా భావింపదగిన 'పుంజము' అను పద మొకటి యిక్కడ వాడుకలో నున్నది. శ ర. లోను ఉన్నది. 'పంజు' కూడా పుంజ శబ్దభవమే నన నగునో పదునో — పడదో! 'పాంజు' కాంతిపుంజ — తేజః పుంజములకు సంగ్రహ రూపముగా నాకు తోచుటలేదు.

ఆ ప్రక్క 'పంజు'ను 'పాంజు' అన్నట్లే, ఈ ప్రక్క పప్పును 'పాప్పు' అనుటయు, పగడమును 'పాగడము' అనుటయు పామరసంఘమున కలదు. కాని ఆ వ్యవహారము శబ్ద స్వరూప నిరూపణాదుల కెంతవరకు పనికివచ్చునో!

తెనుగున 'పాంజు' అను విశేష్యము లేదుగాని, క్రియయున్నది.

"పాంజు=పోఁజు" (శ. ర.)

'పంజు'కుగల అర్థాలన్నియు లోకమునుండే వచ్చినవని నా మనవి.

శబ్దసిద్ధికిని—అర్థసిద్ధికిని లోకమేగదా ఆధారము?

## ౧౨ దునియు

(పుట. 275) "దునియు — అను ప్రత్యేక ధాతు వున్నదని నే ననుకోను. దున్ను—దును గా ఉచ్చారణ లాఘవమున మారును. అప్పుడు దుని యెదవు—దనియెదవు—అను రూపము సహజముగా నేర్పడును."

*　　　*　　　*

'దునియు' ప్రత్యేక ధాతువుగా నేను భావించుట ముమ్మాటికిని తప్పే. ఆ తప్పు, శ్రీ శర్మగారి వాక్యము చదువువరకును నా మనసుకు రాలేదు. తప్పును తెలియజెప్పినందుకు వారికనేక కృతజ్ఞతా వందనములు.

## ౧౩ అధమనము

"పుట. 311 లో — 'దానాధమన వినిమయ విక్రయాగులు' అన్న వాక్యమున్నది. ఇందలి రెండవ శబ్ద మేది? దాని యర్థమేమి? 'దానా...విక్రయ' ఇత్యాది వ్యవహారము విచిత్రముగా నున్నది. అధమనము ఆధానము కావచ్చును. దాని రూపాంతరములే అధి; ఆహి మనలో కలవుగదా. లేదా అధమర్ణ శబ్దము దాని మూలమా? రూపసామీప్య మున్నదిగాని అర్థము చాల డొంకతిరుగుడుగా నుండును.

*　　　*　　　*

గుంటూరు మండలములో విక్రయ దస్తావేజులలో—'ఈ భూమిని దానాధమన వినిమయ విక్రయాది సర్వహక్కులతో నీ వనుభవించవలసినది' అని వ్రాయుటకలదు. నేనా సమాసము నట్లే గ్రంథమున కెక్కించినాను. అధమన మనగా తాకట్టు పెట్టుట యని నా చిన్ననాటి వినికి. అంతేగాని ఆ శబ్దమును గూర్చి నేనెన్నడును విచారించినది లేదు. శ్రీ శర్మగారు తొలుత నన్నడిగినప్పుడీమాటతో వారికి వ్రాసితిని.

మరల వారు 'దానా...విక్రయ' ఇత్యాది వ్యవహారము విచిత్రముగా నున్నదన్న తరువాత నాకేమియు పాలుపోక ఆందోళన పడుచుండగా—శబ్దము అధమనమై యుండునా యనిపించి, వెంటనే అందుబాటులో నున్న శబ్దార్థ చంద్రిక నెత్తి చూడగా, అందు 'అధమనము=తాకట్టు' అని యున్నది. బ్రతుకు జీవుడా అనుకొన్నాను. అధమనము శ. ర. లో, వా. ని. లోను లేదు. సూ. ని. లో ఉన్నది.

## ౧౪ అంగుళము

(పుట 320) అంగుళశబ్దము సంస్కృతభాషలో నున్నదా? తత్పురుష బహువ్రీహి సమాస ఘటితమైనప్పుడు అంగుళీ శబ్దము అకారాంతము గాఁగలదు. కాని స్వతంత్ర ప్రయోగము వెదకవలసి యున్నది. శబ్దార్థచంద్రికలో ఉన్నమాట నిజమేగాని ప్రమాణమును ప్రయోగమును చూపలేదు.

*　　　*　　　*　　　*

అంగుళ శబ్దమును, ఇతర కవులమాట యటుండ- తిక్కనయే పలుమారు విడిగా వాడుటయేకాక 'అంగుళాగ్రముల్' అని సమాసమునను వాడియుండగాఁ (మా. పు. 322) ఆ శబ్దమును గూర్చి యింకను విచికిత్స యేల? సంస్కృత రచనలలో స్వతంత్ర ప్రయోగ మగపడకున్నను సోమయాజిగారి ప్రయోగమును శిరసావహించవలసినదేగాని తప్పనజాలముగదా!

సంస్కృతగ్రంథములలోను అంగుళము కలదేమో పండితులరయుదురుగాక.

## ౧౫ కవిత-కావ్యము

(పుట 320) "కవిత-కావ్యము ఈ రెంటికిని అర్థభేద మున్నదా? కవితారసము, కావ్యరసము ఇత్యాది ప్రయోగము లున్నవి. కవితా కావ్య శబ్దములకు తాత్పర్యభేదమున్నది. అర్థభేదము నాకు గానరాదు. సముదితమైన గ్రంథమునకు-అది యొకముక్తకమైనను గావచ్చును—కావ్యమనియు, దాని

రచనా క్రియకు కవిత్వమనియు నేడు వాడుచున్నాము. ప్రాచీన వ్యవహారములో రెండును భేదము లేకయే వాడఁబడినవనుకొందును. శబ్దవ్యుత్పత్తి ప్రకారము కావ్యము కవి భావ కర్మలు రెంటిని, కవిత కవి భావమును మాత్రమే తెల్పునుగదా! క్రియా రూపముగా తోపని భావము దురవగాహము గనుక భావకర్మలకేకత్వము నే వ్యవహారమందు గ్రహించినాము.—

"ఏకైక కవితా నృణాం। గ్రామా
యాశ్వాయ హస్తినే
అంత తోన్నాయ వస్త్రాయ।
తాంబూలాయ చ కల్పతే."

అని నీలకంఠ దీక్షితుఁడు కవితా శబ్దముచే కావ్యము నే చెప్పుచున్నాడు. తెన్నాలి రామకృష్ణుఁడు—'నలు దెఱంగుల నెన్నఁగల కావ్య ధారలు' అని వాడినాడు గదా. మీరు భావించినట్లు ఇందు 'కావ్యధారలు' కవిత్వ ధారలుగా నుండవలదా?"

*　　*　　*

నేడు మనము సముదితమైన గ్రంథమును కావ్యమనియు, దాని రచనాక్రియను కవిత్వ మనియు వాడుచున్నాము గనుక నే, నేను కవిత్వమును కావ్యమనుట సరికాదన్నాను.

కవిత్వము చెప్ప నేర్చిన ప్రతివాఁడును కావ్య కర్త కాఁడు. అందుచేత నే,—

"ఆశుకవిత్వంబు లల్లితే నేసరా?
చిత్రప్రబంధముల్ చేయవలదె?"

అన్నది ముద్దుపళని. (రాధికా. 3. 14)

కవిత్వము ఈశ్వరానుగ్రహ లభ్యము (పుట్టుతోనే రావలసినది). కావ్యము కవితాసాధ్యము.

"గాంధర్వంచ కవిత్వంచ। శూరత్వం దానశీలతా
అభ్యాసాన్నోపలభ్యంతే।
చత్వారస్సహజాగుణాః"—కదా!

కవులు కవితాశబ్దముచేత కావ్యమును, కావ్య శబ్దముచేత కవితను చెప్పుటయు, పఠితలు సందర్భము ననుసరించి తత్తదర్థములను గ్రహించుటయు సంప్రదాయముగా నున్నను, మనము కవిత్వమును, కావ్యమును విడఁబరిచి వివక్షించుచుపట్టున—అందును నిఘంటువులో — కవిత్వమును కావ్యమనుటయు — కావ్యమును కవిత్వ మనుటయు చెల్లదని నా మనవి.

చతుర్విధ కవితలను చతుర్విధ కావ్యములనియు, పంచకావ్యములను పంచకవితలనియు పేర్కొనుట కీనాటిలోక మంగీకరింపదని నేననుకొందును.

'చిత్రము' కవితాభేదముగాని కావ్య భేదము కాదు—

అప్పకవి, చిత్రబంధ గర్భకవిత్వ తత్త్వమును చెప్పుచోట—

"అనులోమ విలోమము—
ఆదిగాఁగొన్ని పద్యంబులెల్ల,
క్షితినిఁ జిత్రకవిత్వప్రసిద్ధనామ,
ధేయములచేతఁ బెంపొందు" నన్నాఁడు.
(4. 363)

'చిత్రకావ్య' మనగా చిత్రకవితా కలితమగు కావ్యమగును. అట్లే విలోమ కవితామయకావ్యము-విలోమకావ్యము ఉ:—రామకృష్ణవిలోమకావ్యము.

కావ్యరస మనగా కావ్యగత కవితారసమనియు, కావ్యధారలనగా కావ్యముఁకు సంబంధించిన ఆశుధారా—చాటుధారాది కవితాభేదములనియు, కవితా కావ్యశబ్దముల కర్థభేదము కలదనియు నా భావన.

సూ. ని, "కవిత=కవిత్వము, కైత." — "కావ్యము=కవికృతియగు గ్రంథము, కబ్బము" అనియే చెప్పినది.

నా పరామర్శ తుదను సారియే.

## ౧౬. మడవక

(పుట. 324) "మడవక — మడఁగు ధాతు రూపాంతరమనుకొందును. మడఁగు=వంగు — అను వాచ్యార్థమునకు 'వెనుదీయు' అను గౌణార్థము లభించుట సహజము. — మడవు ధాతువునకు నికరమైన అర్థమేమో మీరు చెప్పలేదు. రూపాంతరము లేవియు లేని క్రియకు ఒక శ. ర. ను నమ్మి అర్థ నిర్ణయము చేయుట యుపయోగకారి కాదని నా తలపు నన్నయ ప్రయోగమువంటి చోట్ల అది (మడవక) వట్టి యాతపదమే.

*　　*　　*

మడఁగు ధాతువుకు లేని 'వెనుదీయు' అను క్రొత్త యర్థమును డొంక తిరుగుడుగా కల్పించియైనను

'మడవు' మడఁగుకు రూపాంతర మనవలసిన అక్కర యేమో నాకు తెలియ లేదు. కావ్యములలో 'మడవక' అనియే గాని, నేను చూచినంతలో 'మడఁగక' అని ఒక్క చోట నయినను కనబడలేదు ఒక్క నన్నయయే యీ క్రియను 'ఆది'లో మూడుమార్లును, 'సభ'లో ఒక మారును వాడియున్నాడు. ఈ క్రింది ప్రయోగము నా కిటీవల కనబడినది —

"మడవక పవనజుఁడు నూఱుమాఱులువీచెఁ"

(ఆది. 6 217)

భాగవతములో రెండుచోట్లను 'మడవక' అనియే యున్నది శ్రీనాథుడును 'మడవక' అనియే వాడెను గదా! కవులెల్లరును వాడినరూపము నే శ. ర. కర్త గ్రహించినాడు. అది యుక్తమే కదా!

ఆ క్రియకు 'మడవక' అన్న వ్యతిరేకక్త్వార్థక రూపమే గాని ఇతర రూపములు లేవు లేకపోవుగాక. వాటితో మనకేమి? వ్యవహారమున నున్న రూపమే మనకు గ్రాహ్యము. చూడండి—

ఊఱు (=లక్ష్యపెట్టు) అను క్రియకును 'ఊఱక', 'ఊఱఁడు' అని వ్యతిరేకమునందే ప్రయోగములున్నవి. ఇతరములు లేవు. అంతమాత్రమున ఆ క్రియను కవులు వాడమానిరా?

మడవక-అను క్రియకు 'తప్పక' అని యర్థము చెప్పికోవలెనని నేను వ్రాసియేయున్నాను. ఊఁత పదములకు నికరమైన యర్థము చెప్పుట నాకే కాదు, మరి యెవ్వరికిని వలనుపడదు.

## ౧౭. చిడిపి

(పుట. 327) "చిడిపి-చిలిపి ఒక చేప. చిల్లర అని యర్థము. శ. ర. 'చిడిపి'కి చెప్పిన 'పరుషము' అను నర్థము ఊహాసిద్ధము మాత్రమే 'కొంచె బండలు' అని తాము వ్రాసినది యుక్తిసహము గాదు. గుడ్డలో మూట గట్టినవి చిల్లర రాళ్ళకును గాని బండలు గాఁజాలవుగదా? ఇది (చిడిపి) శిల్పభవము కాఁబోలు. 'చిదిపి'యు దీని రూపాంతమే కావచ్చును.

*          *          *

'కొన్ని జీవులు చిడిపిడాల్గాడికి బ్రదుకు' అను పద్యములోని 'చిడిపి'కి శ. ర. చెప్పిన 'పరుషము' అను అర్థము సరియైనదనే నా యభిప్రాయము.

బహుగవాడు పాతగుడ్డలో బండలు కట్టుకొని రాజాలడనియే నా వ్రాతలోని భావము.

చిడిపి; చిదిపి శిల్పశబ్దభవములే యగునేమో?

చిలిపి - అను పదమునకు 'కొంటె' అను నర్థ మొకటి యున్నది —

'వాడివన్నీ చిలిపిచేష్టలు'—'ఆ పిల్ల చిలిపిగా నవ్వినది' ఇత్యాదిగా వ్యవహారము.

## ౧౮. దొమ్మరిది

(పుట. 338)—(1) "దొమ్మరిది - అను వ్యవహార రూపము అప్రామాణికమని దృఢముగా చెప్ప లేము. కాఁపుది, చాకలిది ఇత్యాది స్త్రీవాచక వ్యవహారము సహజము- న్యాయ్యమునని నేను తలఁచెదను. దొమ్మరిది; కాఁపుది- ఇత్యాది రూపములను గూర్చిన నా నమ్మకలివి.- తెలుగుభాషలో స్త్రీ వాచక ప్రత్యయములు అమహద్వాచకములకంటె భిన్నముగాలేవని, దానిచే ఒకానొక కాలమున ఈ జాతి స్త్రీజడములను సమానముగా భావించినదని - భావించువా రున్నారు. కాని అది సత్యముకాదని నా తలపు. దొమ్మరిది, చాకలిది ఇత్యాదులలోని స్త్రీ ప్రత్యయము 'అది' యును 'ఇది' యును గాదు. మరి 'ఇతి'. ఇది స్త్రీశబ్ద ప్రాకృత రూపమైన ఇత్థీ. తెలుగు 'ఇంతి' ఇదే. కన్నడమున దీనిరూపము, ఇత్తి; ఇతి. తెలుగున తి, త, తె, తు, తుక- ఇట్లు మారినదిగదా. వీనిలో మొదటి రూపమగు 'ఇతి' ద్రవిడభాషా సహజమైన సరళాదేశము గలిగి 'ఇది'గా మారినదని నా యూహ. దీనితో తర్వాత అది—ఇది అను సర్వనామ రూపములు—అమహత్తువి కలిసి పోయినవి వైయాకరణులు స్థితగతి చింతకులు గావున ఏదో యొక రీతిగా ప్రకృతి ప్రత్యయములను విడదీసి చూపి తృప్తులగుదురు. (లేఖలో) మీరుదాహరించిన పట్టాభిరామ పండితీయమున (2) బాపనది — బాపనయది — ఇత్యాదిగా రెండురూపములును అంగీకరింపబడినవిగదా. అందు రెండవ రూపము—అచ్చులోపింపనిది, వ్యవహారమున గాని, వాఙ్మయమున గాని యెందైన నున్నదా? నా యెఱుకలో లేదు — (3) అంటలిది అది—ఇది రెండును గాదు. మరి 'తి'. ఉచ్చారణలో 'ది' గా మారినది. పొలతి—గరిత ఇత్యాదులలో దీని రూపమున్నది. 'వెలది'లో 'ది' గా మారినది. కన్నడ

మున నేటికిని 'డొంబరితి'—'కుంచారితి' అనియే రూపము నిలిచినది.

* * *

(1) దొమ్మర స్త్రీని 'దొమ్మరది' యనవలెను; 'దొమ్మరిది' అనరాదు — అన్న నా వ్రాత యీనాటి తెనుగు వ్యాకరణము ననుసరించినది — 'దొమ్మరిది' అనవచ్చు నన్న శ్రీ శర్మగారి సవరణ అసలు వ్యాకరణమునే సంస్కరించునది. కావున ఆ విషయమును వ్యాకరణశాస్త్ర పండితులును, వ్యాకరణ కర్తలును విచారింతురుగాక.

(2) శాస్త్రమునుబట్టి యేర్పడు రూపములను చెప్పుట శాస్త్రకర్తవిధి. కావున ఆ పట్టాభిరామ పండితుడు 'బాపనయది' అనియును నగునని చెప్పినాడు. ఆ రూపము నేడు వ్యవహారమున నున్నను—లేకున్నను అందలి సర్వనామము 'అది' యన్న సంగతి మనకు స్పష్టముగా తెలియవచ్చినది. మనకు ప్రకృతము కావలసినది అదే.

(3) బాఁపనది - అనుపదమునందలిది అది - ఇది కాక 'ది' యగునేని బాఁపన+ది=బాఁపనది, అట్లే దొమ్మర+ది=దొమ్మరది యగునేగాని బాఁపనిది, దొమ్మరిది యగుటెట్లు? ఆ రూపములు ప్రామాణికములగుటెట్లు?

'దొమ్మరిది' అన్న వేదం పండితులే తమ ఉత్తర రామచరిత ఉపోద్ఘాతమున 'బాపనది' అన్నారు.

"కామందకి బౌద్ధ పరివ్రాజిక. ఆమె బాపనదనం ప్రమాణములేదు" అని అక్కడి వాక్యము. (పు. ౨౩).

మరియు, కాఁపు+ది=కాఁపుది - అయినది సరే 'కాఁపది' యెట్లయినది?

నేను (పు. 338 లో) కాఁపు స్త్రీని 'కాఁపుది' అనగూడదన్నాను. పొరపాటు. కాఁపుస్త్రీనీ, కాఁపువాని వస్త్రాదికమును కూడా 'కాఁపుది' యనవచ్చును. కాని కాఁపువాని వస్త్రాదికమును 'కాఁపది' యనగూడదు. కాఁపది-కాఁపుజాతి స్త్రీయే యగును.

(కాఁపు+అది) కాఁపది-యన్న రూపమును బట్టియు, ప్రథమేతర విభక్తులయందలి-కాఁపుదానిని, దొమ్మరదానికి ఇత్యాది వ్యవహారమును బట్టియు ఆ పదములందలి ప్రథమా విభక్తి రూపము 'అది' గాని 'ఇది' కాదనియు, దొమ్మరిది, చాకలిది అను వ్యవహారము ప్రామాణికము కాజాలదనియు నా నమ్మిక.

## ౧౯ ఉప్పర

(పుట. 339) "ఉప్పర శబ్దార్థము—ఖనకుఁడు ఇత్యాది నాకు తృప్తికరముగాదు. మా సీమలో ఉప్పరవారు ఉప్పు తయారుచేయువారు. ఉప్పుమంటిని పెద్ద పెద్ద దిబ్బలుగా మా సీమలో నేఁడును చూడవచ్చును. 'ఉప్పరమాడలు' అని వాని వ్యవహారము. ఉప్పుకార్య, కన్నడములో ఉప్పార తెలుగులో ఉప్పర. వారి వృత్తి ఇంగ్లీషు రాజ్యము ఉప్పుపనిని స్వాధీనము చేసికొన్న తరువాత శిథిలమై నశించినది. వారు చేసిన ఉప్పును మన్నుప్పు అనియు నందురు. ఆంధ్రభాషార్ణవపు 'ఖడ్యాదికారి' విచార్యమైన అర్థమే. మట్టి—గోడల పనిచేయు వారిని మా ప్రక్క వడ్డెవారని పిలుతురు."

* * * *

ఈ ప్రాంతమున ఉప్పరవాండ్రు (ఉప్పరులు) బావులు—చెరువులు త్రవ్వువారేగాని ఉప్పుచేయువారు కారు. వావిళ్ల నిఘంటువు 'ఉప్పరి (ఉప్పర+ఇ) ఉప్పరవాఁడు' అని యర్థము చెప్పి—"ఒక్క బావిఁద్రవ్వింతముంటము నుప్పరులఁ బిల్వఁగఁబంచి" యన్న ప్రయోగమును గూడా ఇచ్చియున్నది. కావున ఆం. భా. 'పరఁగుఁ ఖడ్యాదికారి యుప్పరి యనంగ' అని చెప్పుటలో తప్పులేదు.

నేటి నిఘంటువులు 'ఉప్పరి'కి ఖడ్యానికారి యను అర్థముతోపాటు—ఉప్పుచేయువాఁడు—అన్న యర్థమున్ను చెప్పి, మైసూరు ప్రాంతమున ఉప్పుచేయు వారిని ఉప్పరు లందురు—అని వివరించుట యుచితమని నా యభిప్రాయము.

మట్టి-గోడల పనిచేయువారిని 'వడ్డెవాం'డ్లనుట యీ ప్రాంతమునను కలదు. (వడ్డెరవాండ్లనియు నందురు) శ. ర. గ్రాంథికత కొరకు 'ఒడ్డె (ఒడ్డియ)=ఒడ్డెవాఁడు' అన్నది. 'ఒడ్డెర' ను గ్రహించలేదు. సూ. ని. లోను ఒడ్డెరలేదు.

ఉప్పర, కంచర, కమ్మర, కుమ్మర, గొడగర-అను పదములవలెనే 'ఒడ్డెర' యును జాతివాచకమే.

* * *

బహుభాషా కోవిదులును-బహుశాస్త్ర వేత్తలును-విమర్శవిద్యా విశారదులును - సహృదయులును నైన శ్రీ శర్మగారు పైవిధముగా శబ్దార్థాది చర్చ చేసి చేసి చివరకు "వ్యవహారములోని సరస్వతీ విలాసములివి. అన్ని హేతువాదాలకును అతీతమైనవి" అని పరమసత్యమును, అమోఘమును నైన యొక వాక్యమును వాక్రుచ్చినారు. నిజముగా ఈ సరస్వతీవిలాసములనంతములు. వీనిని సమగ్రముగా నెఱుఁగుటకును, ఇదమిత్థమని తత్త్వనిర్ణయము చేయుటకును ఎంతటి విద్వాంసునకైనను ఒక్కనికి తరముగాదు.

ననుకంటివారి వ్రాతలు పండితులను కదలించి విమర్శరంగములోనికి దింపుటకు పనికివచ్చునవేగాని సిద్ధాంతములు కాజాలవు. కాకపోయినను భాషారాధనమే గనుక పెద్దలమన్ననకు పాత్రములు కాకపోవని నా విశ్వాసము.

# నీవు పిల్చితివి

శ్రీ సి. నారాయణరెడ్డి

నీవు పిల్చితివి మరింత
నిశ్శబ్దమ్ములమి కొనగ.

నాయెడంద అంజనాద్రి
యై, అంధతమోగుహాయై.
కాలోరగ విష సమూర్ఛ
ర్ఛాలసమై యున్నవేళ
నీవు పిల్చితివి మరింత
నిశ్శబ్దమ్ములమి కొనగ.

నీ పిలుపున తేనియ వీ
ణియలు మ్రోగుననుకొంటిని
నీ పిలుపున పికీ గళ
వ్యాపృతిగలదనుకొంటిని.
ఎలనాగల కన్నుల దా
రులలో మెత్తగ నడచెడు
కలల కాళ్ల సవ్వడి నీ
పిలుపున గలదనుకొంటిని.
కాని నీవు పిల్చితి విం
కా నిశ్శబ్దత పెరగ.

మ్రోసి మ్రోసి పారవశ్య
మును పట్టగలేక తెగిన
నటస్వామి దక్షిణ చర
ణ నూపురమునైనగాను.

# నీవు పిల్చితివి

పలికి పలికి తారాధ్వ
ప్రసారిత స్వరమై మది
చెదరి మూర్ఛపడిన విపం
చీ తంత్రికనైనగాను.
ఇపుడపుడే మ్రోయుదు నని
ఎడదను కిన్నెరగ మలచి
స్వర నిర్ణయ శంకా ని
స్తబ్ధజీవనుడనైతిని.
గుండె నిండ శబ్ద బ్ర
హ్మాండమ్మును నింపుకొనక
ముందుగనే నీరవతా
ముద్రితాత్మకుడనైతిని

మరల నీవు పిలువుము హిమ
గిరి వీపు చురుక్కుమనగ
తురగలించు తరుణ సూర్య
కిరణకశాగ్రమ్ము వోలె.
మరల మరల పిలువుము ఉ
న్మత్తాంభోద ద్వీప మ
స్తముల నెచ్చరించు విద్యు
దంకుశాగ్రధారవోలె.
మరల నీవు పిలిచిన పి
మ్మట చూడుము నాయెదంద
ఏకకాలమున డమరుక
మై కచ్ఛపినై మ్రోగును.

# కుంపటిలో కుసుమం

శ్రీ మధురాంతకం రాజారాం

### * గతసంచిక తరువాయి

ప్రొద్దుపోయి, ఊరంతటా దీపాలు వెలిగి, వీధుల్లో జనసంచారం ఎక్కువైన ఓ సంధ్యాసమయాన రంగడు హైరోడ్డు వెంబడే నడువసాగేడు. ఆరోజు మధ్యాహ్నమే అతడు కటకటాల్లోంచి బయటికి వచ్చాడు. తనకారోజు విముక్తి లభిస్తుందని రంగడికి తెలియదు. అతడు తేదీలు, నెలలు గుర్తుంచుకోడానికి ప్రయత్నించలేదు. పది యిరవై రోజులైతే వాటిని లెక్కించుకోనూ వచ్చు, అవి ఒక్కొక్కటిగా గడచి పోతున్నాయని ఆనందించనూ వచ్చు. తను జైలులో గడపవలసిన రోజులు ఏడు వందలకు పైచిలుకు! ఈ సుదీర్ఘమైన చీకటిబ్రతుకు నెలాగడపడమన్న చింత లోపలినుంచి చెట్టును తొలిచివేసే వేరుపురుగులా రంగడి హృదయాన్ని దహించి వేయసాగింది. అతడు తన చుట్టూవున్న రాతిగోడని చూచేవాడు. ఆగోడకు తల బాదుకుంటే మనోవేదన కొంత చల్లారుతుందేమో ననుకునేవాడు. కమ్ముల్ని చూచేవాడు. చేతులు చాచి వాటిని వంచి విరిచి నుగ్గునూచ చేసి వేద్దామనుకునేవాడు. కమ్ముల్లోనుంచీ చెట్లు, వాటిపైన ఆకసంలో ఎగిరిపోతున్న పక్షులు కనిపించేవి. తనూ ఒక పక్షై వాటితో కలిసి రివ్వున పరతెంచి తన రమణి చేతుల్లో వ్రాలినట్టు ఆమె తనని హృదయానికి హత్తుకుని ముద్దాడినట్టు భావించేవాడు. అంతలో మళ్ళీ తన నిజపరిస్థితి తెలిసి వచ్చేది. "అంతా భ్రమ! ఇవి కమ్ములు, ఇవి గోడలు, ఇది జైలు, నేను పక్షిని కాలేను. రమణిచెంతకు పోలేను" అనుకుంటూ కుమిలిపోయేవాడు.

రంగడు జైల్లో మనిషిలా బ్రతకలేదు. యంత్రంలా బ్రతికాడు. యంత్రానికి పనిచేద్దామని గానీ, మానుకుందామని గానీ వుండదు. మర యిటు త్రిప్పితే పనిచేస్తుంది. అటు త్రిప్పితే మానుకుంటుంది. రంగడూ అంతే చేశాడు. పైవాళ్ళు లేవమంటే లేచాడు. పడుకోమంటే పడుకున్నాడు. తినమంటే తిన్నాడు. లేకుంటే పస్తున్నాడు. యంత్రం పనిచేసినన్ని రోజులూ చేస్తుంది. ఎక్కడో ఒక కీలు విరిగినప్పుడు టక్కుమని ఆగిపోతుంది. రంగడిగతీ అంతే అయింది. ఓరోజు పాతాళగంగని పైకితోడుతూ అతడు చేంతాడు మధ్యలో విడిచిపెట్టి దభీలున క్రిందపడిపోయాడు. కాపలావున్న రక్షకభటుడు పరుగెత్తివచ్చి రంగడిపైన చేయివేసి చూచాడు. జ్వరం నూటికిపైన కాస్తోంది. పై అధికారికి, కబురువెళ్ళింది. జ్వరంతోవున్న ఖైదీచేత పనిచేయించినందుకు అతడు కాపలావాళ్ళపైన మండిపడ్డాడు. తనకు జ్వరమని రంగడు చెప్పుకోలేదు. అడగందే అమ్మయినా బువ్వపెట్టదు. ఖైదీకి జ్వరమని గ్రహించి, వాడికి సపర్యచేయవలసిన అవసరం పోలీసు వాడికి లేదు. క్రిందపడినతర్వాత తనకు స్మృతి రావడానికి ఎన్నిరోజులుపట్టిందో రంగడికి తెలియదు. లేచి తనపై పైకసారి చూచుకున్నాడు. తను మునుపటి రంగడు కాడు. అస్థిపంజరంపైన చర్మపు తొడుగులావున్న యిదేనా తనశరీరం? కాదు. రమణితో బాటూ తన రూపసంపదని సైతం ఎవరో కాజేశారు!

జ్వరం నిమ్మళించినతర్వాత రంగడు మళ్ళీ ఖైదీగా కటకటాల్లోపలికి వచ్చాడు. రోగశయ్యపైన అతడి మనసు నావరించుకున్న నిస్తబ్ధత, తేరుకున్న తర్వాత కూడా అలాగేవుండిపోయింది. జీవితోత్సాహం చిదికిపోయిన ముసలివాడిలా అతడు ఎక్కడ కూచుంటే అక్కడే కూచునివుండిపోయేవాడు. పని చేస్తూ చేస్తూ వుండి అలసిపోయి దుప్పగా నేలపైన కూలబడేవాడు. తా ననుభవించవలసిన రెండేళ్ళశిక్ష ఎప్పుడో పూర్తయినట్టు, అయినా తన నిస్సహాయతని గుర్తించిన అధికారులు మరి కొంతకాలం తనచుండి చాకిరీ చేయించుకుని తనని చిత్తు చిత్తుజేసి వదలిపెట్టనున్నా రనుకుని అతడు అర్ధరాత్రప్పుడు ఘోరున విలపించేవాడు. కాని

అది అపోహని అతడికి అచిరకాలంలోనే తెలిసు వచ్చింది. చింతలతో వంతలతో కుములుతున్న వాళ్ళకు నిముసమే యుగంగా కన్పిస్తుంది. రంగడికి తన రెండేళ్ల శిక్ష ఒక మహాకల్పంగా గోచరించడంలో వింతలేదు. ఆరోజు ఉదయం తలుపు తెరుస్తూ కాపలా వాడు "నీ శిక్ష పూర్తయింది" అన్నాడు.

రంగడు మళ్ళీ ప్రపంచంలో పడ్డాడు. మెల్లగా కాళ్లీడ్చుకుంటూ రైల్వేస్టేషను వరకూ నడిచాడు. అతడెక్కవలసిన రైలు అరగంట క్రితం వెళ్లిపోయింది. మళ్ళీ రాత్రి పన్నెండుకుగాని బండి లేదు. రంగడు టౌనువైపు దారితీశాడు. త్రోవలో ఒక బంకుదగ్గర ఆగి బీడీకట్ట కొనుక్కున్నాడు. కాలుతున్న టెంకాయ పురిలో ఒక బీడీ అంటించి ఎండిన అధరాలకు కొంచెం పదునెక్కించి ముందుకు నడవ సాగేడు.

రంగడలా రెండు ఫర్లాంగుల దూరం నడిచి వుంటాడు. అక్కడొక చిన్నవీధి హైరోడ్డుతో కలుస్తుంది. రంగడా వీధి మొగసాల్లో ఆగాడు. అతడక్కడ ఆగిపోవడానికి కారణం ఒక సినిమా బొమ్మ. ఆ బొమ్మలో ఒక కొమ్మ నడివీధిలో నవ్వుల జడివాన కురిపిస్తోంది. రంగడు గోడకి అతికించబడి వున్న ఆ బొమ్మని చూడ్డం హఠాత్తుగా తటస్థించింది. ఆ చూచిన క్షణాన రంగడి శరీరం కొయ్యబారి పోయింది. అతడు కొయ్యబొమ్మలా ఆ బొమ్మని చూస్తూ నిలుచుండిపోయాడు.

ఆ నవ్వు రంగడికి సుపరిచితం. ఆ నవ్వు రంగడి బీడుబ్రతుకుపైన తొలకరి వానలా కురిసింది. ఆ నవ్వు కోసం, ఆ అరుణరాగరంజితాలైన పెదవులపై నుంచీ వచ్చే ప్రియవచనాలకోసం కాకపోతే రంగడు మరెందుకు బ్రతుకుతున్నాడు!

'బొంయ్, బొంయ్' మంటూ హైరోడ్డునుంచి వీధిలోకి మళ్లిన కారుక్రింద పడబోయి వెంట్రుక వాసిలో తప్పించుకుని ముందుకుపరుగెత్తాడు రంగడు! ఆ ఆందోళనలో అతడికి వీధిమధ్యలోనుంచి వైదొలగి ఏఅరుగుమీదయినా నిల్చుంటే, మరి ప్రాణాపాయ ముండదని స్ఫురించలేదు. ఆపరుగుతో అతడు వీధి చివరిదాకా వెళ్లాడు. ఒగర్చుకుంటూ అక్కడ ఆగి మళ్ళీ గోడవైపు చూచాడు. అక్కడ మరోబొమ్మ కనిపించింది. బొమ్మవేరైనా అందులోని కొమ్మ మాత్రం అదే! అదేయువతి మరో ఫోజులో! ఈసారి ఆవిడ ఒక మగవాడితో జంటగా ఊయలూగు తోంది.

రంగడు గట్టిగా కళ్లు మూసుకున్నాడు. తన మనోవీధిలో పొడమిన అనుమానాంకురాన్ని సమూలంగా నాశనం చేయడానికి ప్రయత్నించాడు. ఈవిడ రమణికాదు. కావడానికి వీల్లేదు. తన రమణి పరాయి వాడితో బాటు ఊయల్లో కూచుని ఊగదు. తనెవతెనో చూచి రమణి అని భ్రమిస్తున్నాడు!

"తప్పుకో, తప్పుకో" అంటూ పరుగెత్తివస్తున్న రిక్షావాడికేకవిని ఉలిక్కిపడి రంగడు మరికొంతదూరం నడిచాడు. అతడు నడుస్తున్న రోడ్డు అక్కడ మరొక రోడ్డుతో కలుస్తుంది. ఆ వీధికెదురుగా రోడ్డు కటు వైపున ఒక పెద్దహోటలు, ఆ హోటలుపైన పెద్ద సైజులో ఒక సినిమాపోస్టరూ చూచి రంగడు మళ్ళీ ఆగిపోయాడు. ఆబొమ్మలో ఇదివరకటి చిత్రాల్లోలా ఆయువతి నవ్వడమూ లేదు. ఊయలూగడమూ లేదు. వీణ వాయిస్తోంది. అదేయువకుడు వెనుకనుంచీ ఆమె జడలో ఒక గులాబీపువ్వు వుంచుతున్నాడు.

రంగడి హృదయవీణపైన ఎవరో చేయి వేసి చరాలున తంత్రుల్ని తెంపివేసినట్టయింది. ఇందుగలడందు లేదని ఎందూ కనిపిస్తున్న ఆ బొమ్మలబారినుంచీ తప్పించుకోడానికి అతడు కాలికొద్దీ అటూ, యిటూ పరుగుతీశాడు. ఎంతగా నిమ్మళపడుచుకోబోయినా అతడి మనసు పట్టుసడలి మళ్ళీ మళ్ళీ అదే అనుమానానికి గురికాసాగింది. వేయిమందిలో వున్నా రమణిని తను గుర్తుపట్టగలడు. ఈవిడ రమణే! మరొకరైతే తన హృదయాని కింత అఘాతం కలిగివుండదు... కాదు. ఈవిడ రమణికాదు. తను నేరస్థుడుగా యిల్లు విడిచిపెట్టిన తర్వాత రమణి దిక్కూ, మొక్కూలేని ఏకాకి. ఆమె ఎక్కడో ఒకచోట చాకిరీచేసి పొట్టబోసుకుంటూ తన రాక కోసం ఎదురు తెన్నులు చూస్తుంటుంది. తారాపథంలో మిలమిల మెరసిపోతున్న ఈవిడ, తన సంపర్కంవల్ల సుఖశాంతుల్ని గోల్పోయిన అభాగ్యురాలు రమణి ఒక్కరే కావడం కల్ల!

రాత్రి ఎనిమిదిగంటలు దాటి వుంటుంది. దూలాల్లా ఊరిపోయి బరువెక్కిన కాళ్ళనీడ్చుకుంటూ

# కుంపటిలో కుసుమం

నడవలేక రంగడు ఒక చెట్టుక్రింద కూచున్నాడు. అక్కడే పడుకుని కాసేపు నిద్రపోతే ఎంత బాగుండు ననిపించిందతనికి! కానీ దౌర్భాగ్యుడెక్కడికి పోయినా దురదృష్టం వాడివెన్నంటే వుంటుంది! అక్కడికి చేరువగా విద్యుద్దీపాల వెలుగులో ఒక సినిమాహాలు పూలతెప్పలా రంగడికి కనిపించింది. ఆరి పోతూ మళ్ళీ వెలుగుతున్న ఎలక్ట్రిక్ బల్బులమధ్య రమణి ఆకారం అంతలో కనిపించి, అంతలో మాయ మైపోతోంది. ఆ చిత్రం చూస్తూ, చూస్తూ రంగడు పైకిలేచాడు. లేచి పది అంగల్లో హాలుదగ్గరికి వెళ్ళి అర్ధరూపాయ కిటికీలోవిసరి "టికెట్టు, టికెట్టు" అన్నాడు. ఎనిమిదిగంటల వేళప్పుడు సినిమాకి బయ ల్దేరివచ్చిన విచిత్రవ్యక్తిని ఓరకంటితో చూస్తూ బుకింగుక్లర్కు ఒక నేలటికెట్టు చించి రంగడిచేతిలో వుంచాడు.

ఏ బలీయమైన ఆకర్షణలవల్లనైతే ప్రేక్షకులు ఆ చిత్రాన్ని విరగబడి చూచారో ఆ రసవత్తర ప్రణయ సన్నివేశాల్ని రంగడు అయిదారు నిమిషాల కంటే ఎక్కువసేపు చూడలేకపోయాడు. అతడు హాల్లో అడుగుపెట్టేసరికి వెండితెరపైన నాయకీ నాయ కుల మధ్య ఒక చిన్న ప్రణయకలహం సాగుతోంది. నాయకుడు ఆఫీసునుంచి తిరిగిరావడంలో కొంత విలంబనం జరిగింది. ఈ టీకప్పులో తుపాను కదే కారణం! ఆమె ముఖాన్ని ముకుళితపద్మం చేసు కుంది. అతడు వెయ్యివిధాల బుజ్జగించాడు. కడకు కాఫీటంబ్లరు ఆమె పెదవులకందిస్తూ "నువ్వు నారాణీ వైతే ఈ కాఫీ కళ్ళుమూసుకుని త్రాగేయాలి" అన్నాడు. త్రాగకపోతే నువ్వు నారాణీవు కావు పొమ్మంటాడని భయమేమో, ఆవిడ నాలుగు గుక్కల్లో కాఫీ పూర్తిచేసి "చూచారా! నేను మీరాణినే!" అన్నట్టు భర్తవైపు ఓరకంటితో చూచింది. ప్రేక్షకులు ఆ శృంగారఘట్టాన్ని అప్రీషి యేట్ చేస్తూ చప్పట్లు చరిచారు. ఆ కరతాళాలు రంగడితలపైన సమ్మెట వ్రేటుల్లా మారుమ్రోగాయి. ఇంతలో నాయకి మళ్ళీ ఒక ప్రత్యేక ప్రణయ పార వశ్యాన్ని అభినయించింది. ఉన్నట్టుండి ఆవిడ భర్త వైపుతిరిగి "చూడండి, ఆలస్యంగా వచ్చినందుకు మిమ్మల్నేంచేస్తానో" అంటూ అతడి రొమ్ముపైన రెండుచేతుల్తోనూ గుద్దులు కురిపింపసాగింది. ప్రియు రాండ్ల పాదతాడనాల్ని సైతం సైరించిన కథానాయ కుల కోవకు చెందిన వాడేమో, అతడు పెద్దపెట్టున నవ్వసాగేడు. అతడితోబాటు ప్రేక్షకులూ నవ్వారు. ఆ నవ్వుల సుడిగాలిలో రంగడి హృదయం శుష్క పత్రంలా గిరవాట్లు కొట్టింది. అతడికి లోకు లందరూ ఒక్కుమ్మడిగా తనని అవహేళన చేస్తున్నట్టు తోచింది. నవ్వుతున్న ప్రేక్షకసమూహాన్ని చురచుర చూస్తూ అతడు ఎలుగెత్తి "ఆపండి, ఆపండి" అని కేకవేశాడు. ఒక క్షణంపాటు అక్కడ కూచున్న వాళ్ళ కళ్ళన్నీ రంగడివైపు తిరిగాయి. ఆ చూపులు రంగణ్ణి యిట్టే పిచ్చివాడుగా తేల్చివేశాయి. వస్తాదు ల్లాంటివాళ్లిద్దరు పైకిలేచి రంగణ్ణి బయటికిలాక్కొచ్చి సింహద్వారం చూపించారు.

గమ్యస్థానమంటూ లేక రంగడు వీధుల్లో తిరుగ సాగేడు. పదిగంటలకు సినిమానుంచీ యిళ్ళకువెళ్తున్న వారితోనూ, రెండో ఆటకు పోతున్నవారితోనూ వీధుల్లో మళ్ళీ రద్దీ ఎక్కువైంది. ఆ జనసమూహం మధ్యనడుస్తున్న రంగడికి, అతడికవసరమైన భోగట్టా కొంత లభించింది. ఎవరో యిద్దరు ముగ్గురు చిత్రం బాగోగుల్నిగురించి మాట్లాడుతుండగా నాయకి నటనకి సంబంధించిన ప్రస్తావన వచ్చింది. తరువాత చర్చ నాయకి వ్యక్తిగత జీవితంవైపు మళ్లింది. అదృష్టం అంటే అలా వుండాలట! ఎక్కడో నాటకా లాడుకుంటున్న మనిషి ఎవడినో లేవదీసుకుని వెళ్ళి పోయింది. వాడిది కాపురంచేసి ఏడ్చే మొహంకాదు. ఆవిడని నట్టేటిలో పుట్టిలా విడిచి వాడెక్కడికో వెళ్ళిపోయాడు. ఎవరెవరి నోము ఎప్పుడు పండు తుందో ఎవరు చెప్పగలరు? ఆమె కెలాగో సినిమావాళ్ళ ప్రాపకం దొరికింది. అవకాశం దొరకడమేమిటి, చిటారు కొమ్మలో మిఠాయి పొట్లంలా వెలిగిపోవడ మేమిటి, ఒక్కసారిగా జరిగాయి.

రంగడి అనుమానం కొస్తా బలపడింది. పూర్తిగా బలపడిందని చెప్పవచ్చుకూడా! కానీ రంగడి కప్పటికీ ఒక సందేహం వుండిపోయింది. తన చెవులూ, కళ్ళే తనని మోసగిస్తున్నాయేమో!

పదినిమిషాల తర్వాత రంగడు తలపైకెత్తి చూశాడు. ఎదుట రైల్వేస్టేషను కనిపించింది. ప్లాట్‌ఫారం దగ్గర పొగవిడుస్తూ రైలు నిలబడివుంది. తలుపు తెరచి రంగడు బండిలో అడుగు పెట్టాడో లేదో, అతడి

కోసమే అక్కడికి వచ్చి, అత డెక్కగానే యింక తన కక్కడ పని తీరిపోయినట్టు రైలు కదిలింది.

* * *

పత్రికల్లో ఒకవార్త పడింది. చిత్రమైన వార్త. పువ్వుల అంచులకు మధ్య 'తారకాసురుడు' అన్న శీర్షిక క్రింద వార్త ప్రచురింపబడింది. "ఊరూ, పేరూ లేని దేశద్రిమ్మరి ఒకడు ఒక ప్రఖ్యాత సినిమాతార యిల్లెక్కడో వాకబు చెసుకుంటూ పట్టణంలో తిరుగుతున్నాడు. వాలకం చూస్తే నాలుగేళ్లు ముక్కు మూసుకుని హఠయోగం చేసిన బైరాగిలా కనిపిస్తున్నాడు. సదరు సినిమాతారనొక్కసారి చూడ్డం తప్ప తన కెలాంటి దురుద్దేశమూ లేదని అతడు చెప్పకుంటున్నాడు."

ఈ వార్త ప్రచారితం అవుతుండగానే ఆ సినీతార యింటి ముందు ఓ సంఘటన జరిగింది.

రెండంతస్థుల మేడ ప్రక్కనుంచీ రోడ్డువరకూ వ్యాపించివున్న పూలతోటకు మొదట వేపచెట్టుక్రింద సుఖాసీనుడయ్యే ఘూర్ఖావాడి కథనం ప్రకారం, ఒకరోజు వుదయం ఆ సినీనటి కోసం వచ్చిన వాడొక 'లోఫపోకిరి.' ఘూర్ఖా వాడెక్కడ పుట్టి ఎక్కడ పెరిగాడో ఎవరికీ తెలియదు. అతడికి తెలుగు, అరవం, ఇంగ్లీషు భాషల్లో ఏదీరాదు. రావాల్సిన అవసరం కూడా లేదు. అతడిపని గేటు దగ్గరికి వచ్చిన వాళ్ళని వెళ్ళిపొమ్మనడం. ఆ వెళ్ళిపొమ్మనడానికి కావలసిన పదాలన్నీ అతడికి క్షుణ్ణంగా తెలుసు.

రూక్షవీక్షణాలు, కర్కశ కంఠస్వరమూ ఘూర్ఖావాడి సొత్తులని రంగడికి తెలియదు. అతడికి తెలిసిందల్లా ఆ ఘూర్ఖావాడు గూడా తనలాటి మానవుడేనని. ఆ నమ్మకంతోనే అతడు ఘూర్ఖాని సమీపించాడు.

"ఎవరు నువ్? ఏం కావాలి?" అన్నాడు ఘూర్ఖావాడు.

రంగడికి భయం వేసింది. ఐనా చల్లకువచ్చి ముంత దాచినందువల్ల లాభంలేదు అతడు జేబులోనుంచీ నాలుగు బీడీలుతీసి ఘూర్ఖావాడి చేతిలో వుంచబోతూ "మరేమనుకోవద్దు బాబూ! నేనొకసారి లోపలికి వెళ్ళాలి" అన్నాడు.

"లోపల్కి వెళ్ళాలా? అదే పైత్యం! పోడా దూరమా!" గర్జించాడు ఘూర్ఖా.

"ఒకటి రెండు నిమిషాల్లో పని చూసుకుని మళ్ళీ వచ్చేస్తాను బాబూ!" ప్రాధేయపడ్డాడు రంగడు.

ఘూర్ఖావాడి కళ్ళు చండ్రనిప్పుల్లా మెరిసాయి. అతడిచేయి తోలుపటకాపైకి పోయింది. అరక్షణంలో రంగడి కళ్ళముందు నాగుబాము పడగలాంటి తెల్లటి బిచువా మెరిసి పోసాగింది.

గుండె జేజారెత్తి రంగడు నాలుగు బారలు పరుగెత్తి ప్రాకారకుడ్యానికి ఆనుకున్నాడు. క్రిమినీ, కీటకాన్నీ చూచినట్టు ఘూర్ఖావాడు రంగణ్ణి చూడసాగేడు.

రంగడు ఘూర్ఖాని కాస్త మెత్తపరచడానికి సాధనాంతరాలు అన్వేషింపసాగాడు. తన దగ్గర డబ్బులేదు ఉంటే వున్న డబ్బంతా వాడి పాదాలముందు పోయడానికి తను వెనుకదీయడు. ఐనా ధోరణి చూస్తుంటే వీడు డబ్బుకు పాలుమాలే వాడులా కనిపించడం లేదు. ప్రతిమాలుకుందామంటేనా, దగ్గరికి వెళ్ళేసరికే మండిపడుతున్నాడు. ఇంక ఏం చేయాలి?...రంగడు ప్రాకారం వైపుచూచాడు. ఊహూ, లాభంలేదు. గోడ ఎత్తుగా వుండడం మాత్రమే గాదు. పైన దట్టంగా గాజు పెంకులు కూడా వున్నాయి.

రోడ్డుపైన వస్తున్న కారొకటి వున్నట్టుండి బంగళావైపు తిరగడంతో రంగడి ఆలోచనలకు బ్రేక్ పడింది. కారు శరవేగంతో ముందుకు వస్తోంది. రంగడు ఒకడుగు ముందుకు వేశాడు. అతడొకటి రెండు క్షణాలకన్నా ఎక్కువసేపు కారులోపలికి చూచివుండడు. ఐనా తనరమణిని పోల్చుకోడానికెంతసేపు కావాలి! అతడా నిమిషాన తనకీ రమణికీ వున్న అంతరాంతరాల్ని మరచిపోయి "రమణీ, రమణీ" అంటూ ముందుకు పరుగెత్తాడు.

మేడ ముందు ఆగిన కారునుంచి క్రిందికిదిగుతూ రమణి డ్రయివరుతో "గేటుదగ్గర ఎవరో కారు వెంబడి పరుగెత్తి వచ్చినట్టుంది కదూ!" అంది.

"అలా గాండీ! నేను చూడలేదు" అన్నాడు డ్రయివరు.

"నువ్వు కారుని షెడ్‌లోకి తీసుకెళ్లు" అంటూ రమణి వెనుదిరిగి గేటు దాకా నడిచింది. గూర్ఖా వాడు లేచి నిలబడి సెల్యూట్ చేశాడు.

# కుంపటిలో కుసుమం

"ఎవడా మనిషి? ఎలా వెళ్ళిపోయాడు?" అంది రమణి.

"వాడాండీ! ఒక వేగబాండ్! ఇంకచస్తే యింటిపక్క రాడు—పోలీసు పట్టుకెళ్ళారు"

రమణి తలవంచుకుని మళ్ళీ మేడవైపు నడవసాగింది. మధ్యలో వజ్రపాణి ఎదురై "ఎక్కడికి వెళ్లావు రమణీ ఎండలో" అన్నాడు.

"అబ్బే, ఎక్కడికీ లేదు. ఆ పొదరింట్లో కాసేపు కూచుందామని" అంది రమణి

"ఐతే పొదరింటికి వెళ్లవలసిన దారి యిది కాదు. అది" అంటూ నవ్వాడు వజ్రపాణి

రమణిలో అప్పుడప్పుడూ పరధ్యానం శృతిమించి రాగాన పడుతుండటం వజ్రపాణి గమనించక పోలేదు. ఆపరధ్యానానికి మూలకారణమేమో అతడికి తెలుసు. ఎంతగొప్ప అంతస్థు అందుకోగలిగినప్పటికీ, ఒక్కొక్కప్పుడు మానవులదృష్టి అధోలోకాలవైపు ప్రసరిస్తుంటుందెందుకో అని వజ్రపాణి రమణి పరధ్యానంగా వున్నప్పుడల్లా తర్కించుకుంటాడు.

రమణిని చిత్రరంగంలో ప్రవేశపెడుతూ వజ్రపాణి ఆమెపైన గొప్ప ఆశలేవీ వుంచుకోలేదు. ఉదరపోషణ కామెకొక వరవు చూపించినందుకు అతడికి సంతృప్తి కలిగిన మాట మాత్రం నిజమే! కాదంటే ఆ సంతృప్తితోబాటూ తనలో పరోపకార పారీణత లేక పోలేదనే విశ్వాసం సైతం అతడికి కలిగింది. కాని రమణిపట్ల అతడు వేసుకున్న అంచనా కొద్దికాలంలోనే తారుమారయింది. ఆమెలో వృద్ధికిరాగల లక్షణాలు మాడ నేర్చిన నారి కళ్ళకు గోచరించాయి. వాళ్ళు మట్టినుంచి మణుల్ని పైకి తీసే యింద్రజాలాన్ని వజ్రపాణికి అంటగట్టి అతణ్ని నేలపైనుంచీ నాలుగు బారలు పైకెత్తేశారు. అప్పటినుంచీ వజ్రపాణికి రమణిపైన శ్రద్ధ యినుమడింపసాగింది. ఆమెని పైకి తీసుకరావడంకోసం ఆలోచించడం అతడి నిత్యకృత్యాలలో ఒకటై కూర్చుంది.

ఆరునెలల క్రిందటి సంగతి. అప్పుడప్పుడే రమణికి చిత్రరంగంలో ప్రాబల్యం కలుగుతోంది. షూటింగులతో ఆమెకి రేయింబవళ్లూ తెమలడంలేదు. ఓరోజున ఉదయం వజ్రపాణి ఆమెని ఔట్‌డోర్ షూటింగుకి బయలుదేరదీస్తుండగా, పోస్టుమెన్ ఆమెకో ఉత్తరం తెచ్చాడు. రెండు వారాలకుముందు పోస్టులో పడిన ఆ వుత్తరం రమణిని అన్వేషిస్తూ దేశమంతా ఒక ప్రదక్షిణం చేసుకుని వచ్చింది. వజ్రపాణే వుత్తరం చించి చదివాడు. రంగడు చావుబ్రతుకుల మధ్య వున్నాడనీ ఆత్మీయులెవరైనా వుంటే వచ్చి చూచి పోవచ్చుననీ జైలు అధికారులు వ్రాశారు.

"ప్రోగ్రాం కాన్సిల్ చేయించండి. నే నక్కడికి వెళ్లిరావాలి" అంది రమణి.

వజ్రపాణికి చిర్రెత్తుకొచ్చింది. పెద్ద ఎత్తున ప్రారంభమైన షూటింగులు వదిలిపెట్టి ఆ రంగణ్ణి చూచిరావాలని చెప్పడానికి రమణి కెలా నోరాడిందో అతడికి అర్థం కాలేదు.

"మీకేనండీ చెప్పడం! నా కెలాగైనా నాలుగు రోజులు సెలవిప్పించండి" అంది మళ్ళీ రమణి.

వజ్రపాణి రమణి ముఖంలోకి చూచాడు. ఆమె నిశ్చితాభిప్రాయం అతడికి అవగతమైంది. అది కాస్తా అవగతం కావడంతో అతడు తన ధోరణి మార్చుకుని "చూడు రమణీ! రంగడు నా తమ్ముడు. వాడిపైన నీకెంత అక్కరుందో నాకూ అంత అక్కరుంది. ఇక్కడ కొన్ని వేల రూపాయలు నష్టపరిచి నువ్వు వాడిని చూచి వచ్చినందువల్ల ఒరగబోయేదేముంది? నీ బదులు నేను వెళ్ళొస్తాను. వీలుంటే అధికారులతో మాట్లాడి అతణ్ణి తీసుకొచ్చేస్తాను కూడా! సరేనా!" అన్నాడు.

రమణి కొంతసేపు ఆలోచించి సరేనంది.

తన జీవితంలో బొత్తిగా తన కిష్టంలేని పనేదైనా వజ్రపాణి చేసివుంటే అది రంగణ్ణి చూడ్డానికి వెళ్లడం. తీరా అతడు వెళ్ళేసరికి రంగడు స్మారకం తప్పి మంచంపైన పడివున్నాడు.

"రోగి పరిస్థితి ఎలా వుందండీ?" అని వజ్రపాణి నర్సుని అడిగాడు.

"అబ్బే. ఏం బాగుండలేదండీ! ఇలాటి కేసులు నేను చాలా చూచాను. నూటికొకరిద్దరు బ్రతికితే హెచ్చు" అంది నర్సు.

వజ్రపాణి డాక్టరు దగ్గరికి వెళ్లి మళ్లీ అదే ప్రశ్న వేశాడు. "గోడమీద పిల్లి వాటంగా వుంది కేసు. ఇటూ చెప్పలేము. అటూ చెప్పలేము. మొత్తంమీద పరిస్థితి ప్రమాదకరమే" అన్నాడు డాక్టరు.

"ఇటువంటి కేసుల్లో ఒకటి రెండుకంటే ఎక్కువ నయం కావంటారండీ! మీకు తెలియని విషయం గనుకనా!" అన్నాడు వజ్రపాణి

"ఎవరామాట చెప్పింది?" డాక్టరు కొంచెం కటువుగా ప్రశ్నించాడు.

"ఆవిడేనండీ! ఆ లావుపాటి నర్సు" అన్నాడు వజ్రపాణి

"నూటికి పది పదిహేను కేసులు కూడా నయమౌతాయి. ఆవిడకి తెలియదు" అన్నాడు డాక్టరు.

ఎందుకో గాని వజ్రపాణికి డాక్టరుకంటే నర్సే అనుభవజ్ఞురాల్లా కనిపించింది. పోనీ డాక్టరు అభిప్రాయాన్నిబట్టి చూచినా రంగడు మామూలు మనిషి కాగలడనడానికి అట్టే అవకాశం కనిపించడంలేదు. పది పదిహేనుమందిలోకన్నా, ఎనభై ఎనభైఅయిదు మందిలో రంగణ్ణి కలిపివేయడం వజ్రపాణికి సమంజసంగా తోచింది.

ఆరోజు సాయంత్రమే వజ్రపాణి పట్నానికి తిరిగి వచ్చాడు. ముఖం చిన్నబుచ్చుకుని "మనకి రంగడు లేడు రమణీ" అని చావుకబురు చల్లగా చెప్పేశాడు. రంగ డెలాగా పదిరోజుల్లో చనిపోబోతున్నాడు గనుక ఈ అబద్ధం చెప్పడం మరేమంత కొంపమునిగిపోయే అపరాధం కాదని కూడా వజ్రపాణి తన అంతరాత్మకి నచ్చజెప్పుకున్నాడు.

* * *

ఉన్నట్టుండి ఆశ్లేషాపిక్చర్స్‌వాళ్ళకి బిచ్చగాళ్ళు కావలసివచ్చారు. వాళ్ళకప్పుడప్పుడూ రాజులు కూడా కావలసివస్తారు. కానీ రాజులతో వాళ్ళకట్టే చిక్కుండదు. మెడకాయపైన తలకాయవున్న సాధారణ మనిషి కెవడికైనా సరే చెమ్కీ గుడ్డలు తొడిగి, గాజుపూసల దండలు రెండువేసి, వలెవాటు గిరజాలు కైసేసి రాజుగా నిలబెట్టగల సామర్థ్యం వాళ్ళకుంది. బిచ్చగాళ్ళకలాంటి అలంకారాలు పనికిరావు. వీలయినంత మాసి, చినిగిన దుస్తుల్లో బాగా వికారంగా కనిపిస్తే తప్ప వీడు బిచ్చగాడేనని ప్రేక్షకులు నమ్మరు. ప్రేక్షకులు సామాన్యంగా సంశయాత్ములు.

ఐనా ఒకరిద్దరు బిచ్చగాళ్ళని తయారుచేయడం ఆశ్లేషా పిక్చర్స్‌వారికేమంత కష్టమైన పనిగాదు. గేట్ కీపరునుంచీ కథానాయకి వేలువిడిచిన తమ్ముడివరకూ ఎవరో ఒకరు బొచ్చె చేతబట్టుకుని అపర బిచ్చగాళ్ళలా సాక్షాత్కరించి అవసరం గడుపుకోడానికి ఉపకరిస్తుంటారు. కానీ వచ్చిన చిక్కల్లా ఏమిటంటే ఆశ్లేషా పిక్చర్స్‌వాళ్ళకి దాదాపు నూరుమంది బిచ్చగాళ్ళు కావలసివచ్చారు. అందులోనూ వాళ్ళందరూ నిజమైన బిచ్చగాళ్ళే అయితే ఆ ఘట్టంలో సహజత్వం ఉట్టిపడగలదని విజ్ఞులు కొందరు సలహా యిచ్చారు.

నిర్మాత డైరక్టరు ముఖం చూచాడు. డైరక్టరు ప్రొడక్షన్ మేనేజరు ముఖం చూచాడు. ప్రొడక్షన్ మేనేజరు పేవ్‌మెంట్ల వెంబడే పరుగులు తీశాడు. మరునాటి ఉదయం తెల్లవారేసరికి రెండు లారీల నిండుగా బిచ్చగాళ్ళు హాజరు పరచబడ్డారు.

కలకలలాడుతున్న పూలతోట మధ్య రాజమహలు బిచ్చగాళ్ళకు నేత్రపర్వంగా కనిపించింది.

"అబ్బబ్బ ఏం మహలు! ఏం మహలు!" అంటూ విస్తుపోయాడు ఒక అమాయకపు బిచ్చగాడు.

"గొప్ప మహలే లే! వట్టి అట్టముక్కలు" అన్నాడొక తెలివైన బిచ్చగాడు.

"ఐతే యింత పైకి పటారమే నన్నమాట" అంటూ మరొకడు కిసుక్కున నవ్వాడు.

"ఇక్ మాట్లాడకూడదు. మీరందరూ ఒక్కొక్కరుగా ఈ దారంట పైకి వెళ్ళాలి. ఆ మలుపు తిరగ్గానే ఆర్చి దగ్గర మహారాణి నిలబడివుంటుంది. ఆమె దగ్గర దానాలు పరిగ్రహించి అందరూ ఒక్కొక్కరుగా ఆవైపునుంచే తిరిగి వచ్చేయాలి" అన్నాడు దర్శకుడు.

ఒక సందేహప్రాణి డైరక్టరుకు అడ్డంతగిలి "ఐనా మహారాణిగారికి ఈరోజింత దయ కలగడానికి కారణమేమండీ?" అన్నాడు.

"ఓహో! అదా మీ సందేహం! అలా అడగాలి. మహారాజుగారు పొరుగు దేశంపైకి దండెత్తారు. యుద్ధం జరుగుతోంది. ఓహ్ భయంకరమైన యుద్ధం. రాజుగారి విజయాన్ని కోరుతూ మహారాణి బీదలకు దానధర్మాలు చేస్తోంది."

బిచ్చగాళ్ళు ఒక్కొక్కరే పైకి వెళ్ళి, అవతలి వైపునుంచి క్రిందికి వచ్చేయసాగేరు.

"ఇంకా ఎందరున్నారండీ?" అన్నాడు కొంచెం విసుగుతో కేమెరామెన్.

"ఇదిగో కడపటివాడు" అన్నాడు డైరక్టరు.

బిచ్చగాడు మహారాణిముందు నిలబడ్డాడు. మహారాణి చెలికత్తె అందించిన నూత్న వస్త్రాల్ని చేతికి తీసుకుంది. బిచ్చగాడు చేతులు ముందుకు చాచాడు. మహారాణి బిచ్చగాణ్ణి చూచింది. బిచ్చగాడు మహారాణిని చూచాడు. బిచ్చగాడు "రమణీ! రమణీ!" అన్నాడు. మహారాణి "రంగా రంగా" అంటూ బిచ్చగాణ్ణి కౌగలించుకుంది.

కంగారుతో డైరెక్టరు "కట్ కట్" అన్నాడు.

# వాసిరెడ్డివారి చరిత్ర

శ్రీ వాసిరెడ్డి పార్థసారథి

వాసిరెడ్డి వంశమని అనటంతోనే, వేంకటాద్రి నాయుడుగారు, వారిని బట్టి బ్రాహ్మణ అగ్రహారాలు, నూటొక్క శివాలయాల ప్రతిష్ఠ, దేవాలయ మాన్యాలు, మంగళగిరి గాలిగోపురము, అమరావతీ పట్టం జ్ఞాపకమొస్తవి బ్రాహ్మణభక్తి, దైవభక్తి గల ఈ వంశనామం, వినటంతోనే చాలామంది ఇప్పటికీ, ఏదో పవిత్రనామం, విన్నప్పుడు పరవశులైనట్లు అవుతారు. 'వాసిరెడ్డి' చాలా చరిత్రాత్మకమైన వంశం. కాని, సరియైన పూర్తి చరిత్ర లభించటం లేదు. మా తండ్రిగారైన వాసిరెడ్డి వెంకటసుబ్బానాయుడుగారు వాసిరెడ్డి వంశ చరిత్ర అనే గ్రంథాన్ని వ్రాశారు ఇది మనుచరిత్ర అంత వుంటుంది దీనిలో చరిత్రకన్న పురాణపు పోకడ ఎక్కువగా వున్నది. ఇందులో వాసిరెడ్డి వంశనామము పుట్టికనుండి లేదు కమ్మవారి చరిత్రను పరిశోధించేటప్పుడు, కీ. శే. గూడవల్లి రామబ్రహ్మంగారు ఇందులో కొంత చరిత్రను సేకరించారు. రామబ్రహ్మంగారు ఆ చారిత్రక విషయాలను నాకు కొన్ని తెలిపారు. తర్వాత నేను కొన్ని సేకరించాను. ఈ విషయాలనన్నిటినీ క్లుప్తంగా మనవి చేస్తాను.

వాసిరెడ్డి వంశము కమ్మవారిలో ఒక చరిత్రాత్మకమైన శాఖ వాసిరెడ్డి అనే పదానికి, చివర రెడ్డి అని వుండుటచే చాలామంది, వీరిని రెడ్డికులస్థులుగా భావిస్తారు. ఈ రెడ్డి అనే పదమునకు చరిత్ర వున్నది. వాసిరెడ్డి చరిత్రను తెలిసికొనుటకు ముందు, కమ్మవారి చరిత్రను తెలిసికోవాలి.

కమ్మవారి చరిత్ర ఇప్పటికీ అగమ్యంగావున్నది. ఆంధ్రుల చరిత్రలో శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారు కమ్మవారిని గురించి కొంత వ్రాశారు. మధ్యాంధ్ర రాష్ట్రమును పదవ శతాబ్దంలో కర్మకరాష్ట్రమనీ కమ్మరాష్ట్రమనీ పిలిచేవారు. చాళుక్యులు ఇక్కడ రాజ్యం చేసి, ఇతరరాష్ట్రములకు వెళ్లినప్పుడు, చాళుక్యులను, వారి ఉద్యోగులను కమ్మ రాష్ట్రం నుండి వచ్చినందున కమ్మవారని పిలిచేవారు. వీరిని మొదట కమ్మరెడ్లనీ, కమ్మవారనీ అనేవారు. ఇట్లా పిలువబడిన కమ్మవారిలో అనేక కులాలున్నవి. ఇందులో వైశ్యులు, కాపులు, రెడ్లు మొదలైన కులాలవారున్నారు. ఈ కులాలన్నీ కలిసి కమ్మవారైనారు. కమ్మవారు మొదట జైనులు; తర్వాత వీర శైవమతావలంబులైనారు.

శ్రీ మల్లింపల్లి సోమశేఖరశర్మగారు ఇంకా కొన్ని విషయాలను (1949 సంవత్సరము, మే నెల 'కిన్నర') బహిరంగ పరిచారు. కమ్మకులంలో బ్రాహ్మణులు, విశ్వబ్రాహ్మణులు కూడా వున్నారు. ఇందుకు కొన్ని శాసన దృష్టాంతములను చూపించారు. కమ్మకులోద్భవులైన బ్రాహ్మణులు, కమ్మకులోద్భవుల్ భరద్వాజగోత్రులని, క్రీస్తుశకము పదవ శతాబ్దంలో పూర్వ చాళుక్యుడైన రెండవ అమ్మరాజు విజయాదిత్యుని తామ్ర శాసనంలోను, క్రీ. శ. 1158 నాటి మరియొక శాసనంలో వ్రాయబడివున్నది.

కమ్మకులజులైన బ్రాహ్మణులని వుండుట విరుద్ధంగా వున్నది కమ్మవారూ, బ్రాహ్మణులూ రెండూ కులాలే. ఇట్లుండుట కొంత అగమ్యంగా వున్నది. లేక కమ్మనాటిలోని బ్రాహ్మణులని వున్నయెడల అర్థం వుండేది. కులాల్లో అంతరకులాలు, ఆనాడున్నవేమో తెలియదు. ఇప్పుడు కమ్మవారిలో అనేక శాఖలున్నవి కాని, కమ్మకులంలో బ్రాహ్మణులని, వైశ్యులని లేరు. లేక కాలవాహినిలో బ్రాహ్మణ వైశ్యులంతా కమ్మవారిలోనే కలిసిపోయి, ఇందులో అనేక శాఖలుగా నిలిచినవో తెలియదు ఇప్పుడు కమ్మవారిలో ఎవ్వరికీ ద్విజత్వం లేదు. చతుర్థ వర్ణము క్రిందనే పరిగణించబడుతున్నారు. సామాన్యంగా ఒక దానినుండి ఇంకొక దానిలోనికి మారేటప్పుడు, ప్రథమంలో వున్న దాని కన్నా లాభంగా వుంటేగాని మారరు. జైనబౌద్ధమతముల నుండి, ఇట్లా మారారని అంటారు. జైన బౌద్ధమతా

లలో, కులభేదాలు లేవు జ్ఞానమే అందరికి పరమావధి. ఇప్పుడు శూద్రుల కట్టుగాదు. సమానత్వంలో నుండి, న్యూనతలోనికి మారుట, జ్ఞానంనుండి అజ్ఞానంలోనికి మారుటే ఇది. హిందూమతములో శూద్రులు వేదము లను చదువరాదు. బ్రాహ్మణక్షత్రియ వైశ్యులకు తెలియుటంతో నే వదులుచేసి, మానవునికి జ్ఞానమే పరమావధియని తెలుపుతారు. వీరిలో నే కాక, అన్ని మతాల్లో ఇట్లున్నది. మహమ్మదీయ క్రైస్తవ మతా లలో కూడా జ్ఞానస్నానములిచ్చి మానవుని పరమావధి బోధిస్తారు. శూద్రుల కట్టుగాదు. శూద్రులకు ఎంత వరకూ ఇహసౌఖ్యనే గాని, పరము తెలుపరు. కనుక హిందూమతంలోనికి, వేరే మతంనుండి కమ్మవారు వచ్చిరన్న వాదన సమ్మతి శక్యంగా లేదు హిందూ దేశంలోనికి అనేకమంది విజాతీయులు, వచ్చి చేరారు. రాజపుత్రుల వంటివారు కూడా ఇట్లా వచ్చినవారే. ఈ రాజపుత్రులే, కొంతకాలానికి, రెడ్డికులస్థులైనా రని చరిత్ర చెప్పుతుంది. కమ్మవారు కూడా ఇట్లా వచ్చిన జాతియేమో నని నా అభిప్రాయం. మొదట కమ్మరెడ్లని వున్నట్లు, కాలక్రమాన, కమ్మ, రెడ్డి రెండుగా మారినట్లుగా కూడా చెప్పుతున్నారు. కమ్మ కులమనే శబ్దము ఆరవశతాబ్దంలోనే, వున్నదని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వ్రాశారు. ఆనాడు బౌద్ధమతము బాగా వృద్ధిలో వున్నది. ఈ ఆంధ్ర భూమియందు అప్పుడు జైన, బౌద్ధమత పురాణాలు, శాస్త్రాలు కూడా ఎక్కువగానే వుండినవుంటవి ఆనాటి గ్రంథములన్నీ ఏమైనవో తెలియదు. మనకు భాగవత, భారతరామాయణాలు దక్కినవి కాని, పైవి మాత్రం అదృశ్యమైనవి. ఇవి ఏటిబెట్టు, చీనాదేశాల్లో నైనా వున్నవేమో తెలియదు. ఆనాటి, 6, 10 శతాబ్దముల నాటి కమ్మవారి చరిత్ర సమగ్రంగా తెలిసికోవాలంటే, నాటి జైన బౌద్ధ గ్రంథములు ఆధారములు కాగలవు.

వాసిరెడ్డివారు కమ్మకులస్థులు. ప్రస్తుతానికి కమ్మవారిలో అనేక కులాలున్నవని చెప్పుకోవాలి. ఇందులో ఏ కులానికి ఈ వాసిరెడ్డి చెందుతుందో తెలియాలి. ప్రథమదశకు చెందిన శాసన ఆధారాలు లేవు. కాని ఆచార వ్యవహారములవల్ల కొన్ని నిర్ణ యాలు చేయవచ్చు. కాకతీయులు కమ్మరెడ్లని పిలువ బడేవారు. తర్వాత వీరే కమ్మవారుగా, రెడ్లుగా మారి నారు. వాసి-రెడ్డి కలిసి వున్నందున, వీరుకూడా ఇట్టి కమ్మరెడ్లేమో నని ఊహించవలసివుంటుంది. పైగా కాకతీయులలో కొందరకు వల్లెట్లగోత్రం వున్నది. వాసిరెడ్డి వారిదీ వల్లెట్లగోత్రమే. కాకతీయులు శైవ మతస్థులు. వాసిరెడ్డివారు శైవమతస్థులు. కాకతీయుల వలె, వీరికి ఆరాధ్యులు గురువులు. కాకతీయ పట్టంలో వీరభద్ర ఉత్సవాలు జరుగుతూ వుండేది. అందులో నారసాలు వగైరా ఉపయోగిస్తూండేవారు. వాసిరెడ్డివారికి వీరభద్రుడు ఇలవేల్పు వీరికి ఈ నార సాలు వీరపూజ వున్నది కనుక, వాసిరెడ్డివారు కాక తీయులై ఉండవచ్చు. ఇదిఒక వాదం.

వాసిరెడ్డివారు 14 వ శతాబ్దములో పిఠా పురంలో వున్నట్లు శాసనాధారము లున్నవి. పిఠా పురము పూర్వ చాళుక్యులరాజధానీ నగరము. వాసిరెడ్డి వారికి చాళుక్యనారాయణా అనే బిరుదువున్నది. చాళుక్యులవలె వాసిరెడ్డి వారికీ రాజకీయమే జీవనము. కనుక వీరు చాళుక్యులై వుందురని కొంత బలమైన మరొక వాదం వున్నది.

14 వ శతాబ్దములో మహాంధ్ర రాజ్యలక్ష్మి రాజమహేంద్రవరములో పీఠము వేసి కూర్చున్నది. అన వేమారెడ్డి ప్రభువుగా వున్నాడు. కొందరు సామంతులు ప్రభువుకు ఎదురుతిరిగి కప్పం కట్టలేదు. కనుక యుద్ధము తప్పలేదు. రాజూ మంత్రి, సామం తులూ యుద్ధభూమిలో నిల్చారు. కాని కొందరు శాంతి ప్రియులు యుద్ధాన్ని ఆపుటకు ప్రయత్నించారు. రాజు ఒక వస్తాదునూ, సామంతులొక వస్తాదునూ ఎన్నుకోవాలి. వీరిద్దరూ కలియబడగా ఎవరు గెలిస్తే ఆ పక్షం గెలిచినట్లుగా ఎందుకోవలె నన్నారు. అందరు సరేనంటే సరేనన్నారు. సామంతులలో బాగా కసరత్తు చేసినవారున్నారు. రాజుగారి పక్షంలో అట్టి వారు కనుపించలేదు. కనుక రాజుగారికి సంకట పరిస్థితి కలిగింది. లేదంటే ఆడి తప్పినట్లవుతుంది ఇట్టి స్థితిలో ఒక్క వ్యక్తి వచ్చి ప్రభువు ఎదుట నిలిచాడు ప్రభువు సెలవిస్తే నేను వెళ్లుతానన్నాడు. రాజు సరేనన్నాడు. ఇతనే వాసిరెడ్డి సదాశివుడు. కాని ఇప్పటివరకు వాసిరెడ్డి, అనే నామం పుట్టలేదు. ఈ సదాశివుడు పిఠాపురములో రాజుగారి సామంతుడుగా వుంటు న్నాడు. పోట్లాటకు ఒక అలవ ఏర్పరచారు. జోడా అందులో ప్రవేశించింది. 'లడాయి' ప్రారంభమైంది. సదాశివుడు మొదటి దెబ్బతోనే, ఎదిరి అభ్యర్థిని చంపి

వేశాడు. రాజు సంతోషించాడు. కాని సదాశివుని ఉత్సాహం ఆగలేదు, ఇంకా కొందర్ని పట్టుకు రమ్మన్నాడు. వచ్చినవారినల్లా చంపివేశాడు. ఈ విధంగా ఒక్క చేతిమీదుగా ఎనిమిదిమంది వస్తాదులను పరిమార్చాడు. ప్రభువు పరవశుడైనాడు. ప్రభువుకు పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్లయింది సామంతుల విప్లవంవల్ల పోనున్న రాజ్యం చేజిక్కింది. తనకు చేతనైనంత గౌరవం ఈసదాశివునికి చేశాడు. రెడ్డి రాజ్యం యొక్క వాసిని నిలిపాడాయన. అందువల్ల వాసిరెడ్డి అనే బిరుదాన్ని ఇచ్చాడు. అది సదాశివుని వంశం ఉన్నంతవరకు, అతని వంశానికి ఈ బిరుదు వుంటుందని సెలవిచ్చాడు. ఇంకా జగనొబ్బగండ బిరుదమును, భీమనగోర్భేదక భేరులను సదాశివున కిచ్చి గౌరవించాడు.

మంచెళ్ల వాసుదేవ కవి తన గంధవహము నే గ్రంథంలో ఇట్లా వ్రాశాడు.

మ॥ ఘన కీర్తుల్, జగనొబ్బ గండ బిరుదుల్ గంభీర
భాంకార భీమనగోర్భేదక భేరులిచ్చి యన వేమా
రెడ్డియుక్ వాసిగా గనియెక్ గావున వాసిరెడ్డి
యన నాఖ్యం జెంద నే ధార్మికావనినాథాగ్రణి
వంశనాథు డతనిక్ వర్ణింపగా శక్యమే॥

అమరవాది రామయకవి తన ద్రౌపదీ పరిణయంలో ఇట్లా వ్రాశారు.

తే॥ వాసి రెడ్డికి నిలుపుట వలన నాట
బట్టి ధాత్రి సదాశివ ప్రభుని కతని
వంశమున బుట్టువారికి వాసిరెడ్డి
వారనెడు పౌరుషాలయాహ్వయము కలిగె.

అప్పటినుండి, ఈ ఆరువందల సంవత్సరముల పర్యంతం, వారి వంశమువారికి వాసిరెడ్డి అనే పేరు వస్తూ ఉన్నది. ఈ సదాశివుడే పిఠాపురములో విష్ణు, సూర్య, విశ్వేశ్వర, గౌరి, కుక్కుటేశ్వర దేవాలయములు అయిదింటిని ప్రతిష్ఠించాడు. వాటికి మాన్యములనిచ్చి, శాసనాలను వ్రాయించాడు. ఇతనే వాసిరెడ్డి వారి మూలపురుషుడు. ఇతను ధైర్య సాహసములు గల వీరుడు. దైవభక్తి గలవాడు.

కనుక వాసిరెడ్డి అనే దానిలోని రెడ్డి అనేది కులనామం కాదని తేలింది. వీరు కమ్మవారు. రెడ్డి బిరుదునామం. ఆకాలాన రాజులను, అధికార్లను రెడ్డి అనేవారు. అట్టిదే ఈ రెడ్డి. వీరిది కమ్మలో ఏ కులమో ఇంకా చర్చలోనే ఉన్నది. పైన తెలిపిన దానివల్ల కాకతీయులు, చాళుక్యులై ఉందురని తెలుస్తుంది. కాకతీయుల నాటికి కమ్మకులం ఒకటిగానే ఉండి కమ్మరెడ్లనే వారనీ అనుకోవచ్చు. కాలక్రమాన కమ్మ రెడ్డి అనే కులాలు రెండుగా మారిఉంటవి. ఇందులో అనేక అంతరకులాలు కూడా క్రమంగా ఏర్పడి ఉంటవి.

తర్వాత 200 సంవత్సరములు, వాసిరెడ్డి వారు ఎక్కడ ఉన్నదీ తెలియదు. 16 వ శతాబ్దంలో ఆంధ్ర రాజ్యలక్ష్మి విజయనగరము చేరింది. అప్పుడు జగత్ప్రఖ్యాతుడు శ్రీ కృష్ణదేవరాయల వారు రాజ్యం చేస్తున్నారు. అప్పుడు నెల్లూరు జిల్లాలో వాసిలి అనే పట్టణమునకు వాసిరెడ్డివారు దుర్గాధిపతులుగా ఉన్నారు. దుర్గాధిపతి వాసిరెడ్డి మల్లికార్జునుడు. ఇతని భార్య రావెళ్ళవారి ఆడపడుచు. పార్వతమ్మ. పార్వతమ్మ తండ్రి రావెళ్ళ మల్లినీడు. వీరు కృష్ణదేవ రాయలవారి వద్ద సేనా నాయకులుగా ఉన్నారు. నైజాం, రాయలవారి భూముల సరిహద్దుల దగ్గరలో వున్నదీ వాసిలి. అందుచే ఎప్పుడూ యుద్ధం తాకిడి ఉండేది. కుల్లీ కుతుబ్షా నైజాం ప్రభువుగా ఉన్నాడు. ఇతని కుమారుడు హైదరుఖాను. ఈ హైదరుఖాను క్రీ. శ. 1516 సంవత్సరములో బెల్లంకొండ, కొండవీటి దుర్గములను పట్టుకున్నాడు. ఇవి సరిహద్దులందున్న కోటలౌటచే, సంతత యుద్ధాలు, తరుచూ చేతులుమార్చి జరుగుతూ ఉండేవి. ఈ సమయంలోనే హైదరుఖాను వచ్చి వాసిలి కోటను ముట్టడించాడు. తనకు మూడులక్షలు డబ్బు ఇవ్వవలసి వున్నదనీ ఇస్తే ఊరుకుంటానని చెప్పిపంపాడు. వాసిరెడ్డివారికి బలం తక్కువగా వున్నది. ఈ విషయాన్ని చర్చించుటకు రాజ్యసభ జరిగింది రాజుహితైషులంతా ఖానుని, ఎదోవిధంగా సంతోషపెట్టి పంపితే మంచిదన్నారు. కాని మల్లికార్జునుడు వప్పుకోలేదు. వాసిరెడ్డి వారిలో న్యాయమందు పట్టుదల సాహసము ఇవి సహజగుణాలు. ఖానునికి నిజంగా డబ్బు ఇవ్వపనిలేదు. కనుక అన్యాయంగా నేను అతనికి లొంబడనన్నాడు ప్రభువు. అపయశస్సుకన్నా మృత్యువునైనా వరిస్తానన్నాడు. కనుక యుద్ధం తప్పలేదు. నాలుగురోజులు యుద్ధముజరిగింది. నాల్గవనాడు మల్లికార్జునుడు వీరస్వర్గం చేరాడు. భార్య పార్వతమ్మ పరిస్థితులను తెలుసుకున్నది. దాసీ లక్ష్మిని పిలిచింది. తనకు ఒక్కగానొక్క కుమారుడు. ఇతని పేరు సదాశివుడు. ఇతను

అప్పటికి ఏడేండ్ల పిల్లవాడు. ఇతనే వాసిరెడ్డి వంశాంకురము. లక్ష్మి చేతులలో ఈ పిల్లవాణ్ణి పెట్టింది. నేను కనటమైతే కన్నాను, కాని పెంచిందంతా నీవు కనుక ఈ బిడ్డను నీవు ఉత్తరభూములకు తీసుకువెళ్ళవలెను. నేను నా భర్తతో సహగమనం చేయబోతున్నాను. మహమ్మదీయులు పగతో వున్నారు. ఈ బిడ్డ చిక్కితే చంపుతారు. నీవు ఏవిధంగానైనా ఈ కుర్రవాణ్ణి తీసుకువెళ్ళి పెంచి పోషించవలెను. మా వంశమర్యాదలు, విద్య ఇతనికి చెప్పించవలెను. ఇకనుండి ఇతనికి నీవే తల్లివి, కంట తడిపెట్టింది. కాలబలంవల్ల తల్లీపిల్లడూ విడిపోవలసి వచ్చింది. పార్వతమ్మ సహగమనం చేసింది.

క్రీ. శ. 1520 సంవత్సరమున, దాసీలక్ష్మి సదాశివుని తీసుకుని బయలుదేరింది. దారిలో ఈ పిల్లడు తన పిల్లడనే చెప్పింది. కొన్ని రోజుల తర్వాత, కృష్ణవేణీ నదీతీరం చేరింది. ఇక్కడ ఆ కాలంలో, నూతక్కి గొప్ప గ్రామంగా ఉండేది. ఆ నూతక్కిలో శివాలయంవున్నది. ఈ లక్ష్మి, వాసిరెడ్డి సదాశివుడు, ఈ నూతక్కి గ్రామంలోని, శివాలయంలో ప్రవేశించారు. అక్కడే నివాసంగా వుంటున్నారు. కాలానికి ఎంతబలం వున్నది. ఎన్ని మార్పులను చేస్తుంది! తల్లి బిడ్డలకు ఎడబాటుచేస్తుంది. ఉత్తరాన్నుండి దక్షిణానికి, దక్షిణాన్నుండి ఉత్తరానికి పరుగులెత్తిస్తుంది. వాసిరెడ్డివారు ఉత్తరాన గోదావరీనదీమ తల్లివద్ద జన్మించి, దక్షిణాన నెల్లూరు పెన్నానదివద్ద పెరిగి, తిరిగి మధ్యనున్న కృష్ణతల్లి ఒడికి చేరవలసి వున్నది. ఈ వంశవృక్షము కృష్ణానదీ ఛాయలలో పెరిగి పెద్దదై తన శాఖలను కృష్ణా, గుంటూరు జిల్లాలలో వ్యాపించవలసి వున్నది. ఇది దైవసంకల్పము. పార్వతమ్మ తన కన్నబిడ్డను వీడి, సహగమనం చేసేటప్పుడు దుఃఖించాము. కాని ఈ కారణంగా, ఈ మొలక కృష్ణా నదీతీరానికిజేరి తిరిగి విజృంభించి, కొంత చరిత్రను నిర్మించవలసిన విధి వున్నది.

లక్ష్మి సదాశివునికి అన్నివిద్యలు చెప్పించింది. ఈత, సాము, స్వారి, ఖడ్గ విద్యలు నేర్పారు. పెళ్ళీడువచ్చింది. అప్పుడు నూతక్కిలో కోడాలి రామయ్యగారు సంపన్నులు. శివుడు రామయ్యగారి కలలో కనిపించి, సదాశివుని వంశము, ముందు ముందు వృద్ధికిరానున్నదనీ, తన కుమార్తెనిచ్చి వివాహం చేయమనీ చెప్పాడట. అట్లే రామయ్యగారు తన కుమార్తెనిచ్చి పెళ్ళి జరిపాడు. లక్ష్మి తానున్న శివాలయములోనే వివాహము జరగాలని పట్టుపట్టింది. ఇట్లే రామయ్యగారు తన కుమార్తెనిచ్చి శివాలయం వెనుక పెళ్ళిచేశాడు. వీరభద్ర పళ్ళెము పట్టారు. ఇప్పటికి ఈ వివాహం జరిగి 400 సంవత్సరాలు అవుతుంది. ఇప్పటికీ, వాసిరెడ్డివారి వంశములో ఎక్కడ పెళ్ళిజరిగినా, తర్వాత దేవాలయం వెనుక పెళ్ళి చేయాలి దీనినే అంగడి తలంబ్రాలంటారు. అప్పటి నుంచి ఇప్పటివరకూ ఇది ఆచారంగా వస్తున్నది. దీనితో వీరభద్ర పళ్లెంపట్టాలి. పూర్వం వాసిరెడ్డివారు ఖడ్గజీవులు. అందువల్ల వీరు వీరపూజ చేస్తారు. వీరభద్రపళ్లెంలో ఖడ్గపూజ వున్నది. వాసిరెడ్డివారు శైవులు. రౌద్రాన్ని ఆరాధిస్తారు. ఆనాటి జీవనం అది.

సదాశివునికి ఇద్దరు మగపిల్లలు. ఈ మగపిల్లలకు సంతానం కలిగింది. వీరు నైజాం ప్రభుత్వంలో సౌతుదార్లుగా వుండేవారు.

వీరిలో చినపద్మనాభరాముడు ఉద్దండుడు, చారిత్రక పురుషుడు. ఇతనంటే నైజాం ప్రభువుకు కొంత కంటకంగా వుండేది. ఇతనిని అణచివేయవలెనని ప్రయత్నించాడు. ఒకరోజున నైజాం ప్రభువు దర్బారు తీరాడు. అందుకు మన చినపద్మనాభరామన్ననుకూడా పిలిచారు. వచ్చాడు. ఇతను, నాటి వీరుల వలె కుస్తీయందు, ఈతయందు, సామునందు, స్వారియందు అందెవేసినచేయి. స్వారీలో మొనగాడని ప్రఖ్యాతి. ఇతనిని స్వారీలో హతమార్చవలెనను కున్నాడు నవాబు. సభ్యులను చూచి ఇట్లా అన్నాడు. మావద్ద ఒక మకురుగుఱ్ఱం వున్నది. అది సామాన్యులకు వశంకావటంలేదు. మీలో అశ్వవిద్యలో మంచి నిపుణులున్నారు. దానిని స్వారిచేయగల ధీరులెవరైనా వుంటే తెలుపమని అన్నాడు. స్వారిచేయువానిని, గుఱ్ఱాన్ని ఎక్కగలవా అనుట, అతనిని అమర్యాద చేయుటే. వాసిరెడ్డివారికున్న సాహసమువల్లగాని, పౌరుషంవల్లగాని, చినపద్మరామన్న నేను స్వారీ చేస్తానన్నాడు. రెండవరోజు స్వారికి నిర్ణయించబడ్డది.

ఈ గుఱ్ఱము ముందుకొస్తే కరవటం, వెనుకకు పోతేతన్నటం వున్నది. దగ్గరకు ఎవరినీ రానీయదు, వచ్చినా, ఎక్కనివ్వదు, ఎక్కినా కూర్చోనివ్వదు, స్వారిచేయనివ్వదు. ప్రణానికైనా తెగించాడు చినపద్మనాభుడు. స్వారి ఏర్పరచబడ్డది. పెద్దలంతా వచ్చారు. చినపద్మనాభరాముడు, వచ్చిరావటంతోనే, అశ్వానికి, సావకాశంఇవ్వకుండానే, ఎగిరి ఎక్కికూర్చున్నాడు. ఎక్కినవానిని చీలమండపట్టి కిందకు

లాగవలెనని తల త్రిప్పింది. ఒక ఇనుపగూటంతో పొడిచాడు పళ్లువూడేట్టు. రెండోవైపునా ఇదే జరిగింది. పాముగాని, ఎద్దుగాని, గుఱ్ఱంగాని మనిషిసత్తా అంతలోనే కనుక్కొంటుంది ఇతను గుఱ్ఱాన్ని మెసలనివ్వలేదు. రౌతుసంగతి గ్రహించింది. లాభంలేదనుకుని దారినపడ్డది. దానికి గొప్పవచ్చేవరకు స్వారిచేశాడు. ఒకపూటల్లా తిరిగిరాలేదు దర్బారుకు. దర్బారులో, గతంలో గుఱ్ఱం చేసినట్లే, ఇతన్నికూడా చంపివేసిందనుకుంటున్నారు. ఇంతలోనే, ముందు చినపద్మనాభరాముడు, వెనుక, ఈ గుఱ్ఱమూ వచ్చారు. ప్రభువు దిగ్భ్రమచెందాడు. అక్కన్న మాదన్నలు సంతోషించారు. ప్రభువు ఇతనిని తగినట్లుగా సత్కరించి, మెచ్చుకున్నాడు.

క్రీ. శ. 1651 సంవత్సరములో నైజాం నవాబు చినపద్మనాభరామన్నకు ఖమ్మంమెట్టు, నందిగామ, వినుకొండ, కొండవీటి పరగణాలలో అయిదువందల గ్రామాలిచ్చాడు. ఆనాటి బిరుదులు, మర్యాదలు కూడా ఇచ్చి సత్కరించాడు.

ఈ రాజ్యాన్ని, వాసిని వృద్ధిపరచి, షోడశకళలను తెచ్చిన, లోకమాన్యుడు వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు. అనేక రాజులు ఇంతకంటె ఎక్కువ సంపన్నులై వుండవచ్చు, కాని ఇతనివలె విద్వత్పోషణ, బ్రాహ్మణ సత్కారణ, దానధర్మాలు, దేవాలయ గోపుర నిర్మాణములు గ్రామపట్టణ ప్రతిష్ఠలు చేసినవారు తక్కువ. విద్వత్పోషణచేసి అపరభోజుడని పేరు పొందాడు. వంద గ్రామాలను బ్రాహ్మణులకు అగ్రహారాలుగా ఇచ్చి, పండితులను, మంత్రవేత్తలను, పోషించాడు. ఒక్క ముహూర్తంలో నూటొక్క శివాలయాలను ప్రతిష్ఠించాడు. అనేక దేవాలయాలను కట్టించి మాన్యాలిచ్చాడు. అనేక గ్రామాలను, పట్టణాలను కట్టించాడు. అమరావతిలో శాసనాలను త్రవ్వించాడు. అమరావతి పట్టణాన్ని తిరుగ, తీర్చి కట్టించాడు. అమరావతిని కైలాసంగాను, మంగళగిరిని వైకుంఠంగాను చేయించాడు. మంగళగిరిలో శ్రీలక్ష్మీనృసింహస్వామివారికి గొప్పగాలి గోపురాన్ని కట్టించాడు. తాజ్ మహల్ మొగల్ పాదుషాల కీర్తిని చెప్పుచున్నట్లు, ఈ మంగళగిరి గాలిగోపురం, అది వున్నంతవరకు వాసిరెడ్డి వెంకటాద్రినాయుడిగారి వాసిని చెపుతూ వుండగలదు. వెంకటాద్రినాయునికి ధనం ఎక్కువగా త్రవ్వకాల్లో దొరకినదని, దానిని ఈ ఆలయాలకు వినియోగించాడని ప్రతీతి. నాయుడుగారు బ్రాహ్మణులనే గాక పంచములను కూడా తనవద్ద ఉన్నత అధికారములిచ్చి ఆదరించాడు. పంచములైన, కొలకలూరు భుజంగరావనే వ్యక్తి నాయుడిగారి వద్ద అధికారంలో వుండేవాడట. ఇతనికి ఒకసారి తొడమీద గడ్డలేచిందట. ఇతని మర్యాద కనుక్కోవలెనని భుజంగరావుని తొడగడ్డ ఎట్లావుందో చూపమన్నాట్ట. ధోవతిని పైకితీసి చూపిస్తాడేమోననుకున్నారంతా. కాని, రెండు చేతులతో ఆ గడ్డవద్ద వున్న పంచెను చించి, గడ్డను చూపాడట. ఇతని విజ్ఞతకు అందరూ దిగ్భ్రమ చెందారట. భుజంగరావు ఎప్పుడూ పావుకోళ్లమీదే నడిచేవాడట. నాయుడుగారు తన ప్రజలనందరినీ తక్కువ ఎక్కువని చూడక, సమత్వంతో చూచారు. తన రాజధానిని చింతపల్లినుండి అమరావతికి మార్పించారు. అమరావతిని అనేక విధాల వృద్ధిలోకి తెచ్చాడు. ఇంద్రునివలె అమరావతీ పురాధీశ అనిపించుకున్నాడు. రత్నాలను, వజ్రాలను, ఎక్కువగా సంపాదించి, పరరాజులకన్న మిన్న అనిపించుకున్నాడు. బంగారు తులాభారం తూగి సువర్ణగోగర్భం ప్రవేశించాడు. వీరి చరిత్ర వ్రాస్తే గొప్ప గ్రంథమౌతుంది.

ఈ విధంగా నడి ఆకాశాన దేదీప్యమానంగా ప్రకాశించిన వాసిరెడ్డి భానుడు బ్రిటిషు వారి ఇనుపహస్తంతో అస్తమించాడు. రాజ్యంతోపాటు, చేతిలో ఖడ్గమూ పోయింది. జీవితవిధానంలోనే పూర్తిగా మార్పువచ్చింది. కాని వాసిరెడ్డి అనే ఇంటిపేరు మాత్రం మిగిలింది. ఈ వంశము వారికి ఇప్పటికీ ఈ నామము ధ్రువతారగా ఉంటుంది. కాలవశాన దారి తప్పినా, తప్పు దిద్దుకోమని దారిచూపుతుందీ నామము.

సంయుక్త పరగణాల గవర్నరైన కె. యం. మున్షీగారు ఒక గ్రంథంలో అన్నమాటలు తలుపుకొస్తున్నవి. మున్షీగిరి అనగా ఆ కుటుంబంవారికి, ఢిల్లీపాదుషాలు, గ్రామానికింతయని డబ్బు వసూలు చేసికొమ్మని ఇచ్చిన ఉద్యోగము. ఈ ఉద్యోగనామమే, ఈ డబ్బు వసూలు చేసుకునే కుటుంబీకులకు మున్షీలని వచ్చింది. దీనినిగురించి ఇట్లా అన్నారు. మా పూర్వీకులకు మున్షీగిరి ఇచ్చిన ఢిల్లీ పాయగాళ్లు పోయినా మామున్షీగిరి కూడా కాలప్రవాహంలో పోయినా, మా మున్షీగిరితో మేము గర్వపడుతుంటాము. మా మున్షీగిరి, మా మున్షీకుటుంబీకులకు సంకట పరిస్థితులలో, ధ్రువతారవలె దారిచూపిస్తుంది. మా కది ధైర్యసాహసాలను వితరణను ప్రసాదిస్తుంది. ఇది వాసిరెడ్డి వంశం వారికి కూడా చక్కని సందేశము. ఈ నాడుకూడా వాసిరెడ్డి వారిలో తప్పు చేస్తే, వాసిరెడ్డి వారట్లా చేశారా అంటారు. దీనితో వీరికి ఉరిశిక్ష వేసినంతౌతుంది. ఇది వారిని తప్పుదోవను పోనివ్వకుండా కొంత వరకు నడుపుకువస్తున్న శక్తి. కాలానుగుణంగా మానవులు మారుతుంటారు. కాని ఇంకా వాసిరెడ్డి వారిలో కొన్ని ఆ గుణాలు వీడకుండా వున్నవి.

# చరణదాసులు

శ్రీ పురాణం సూర్యప్రకాశరావు

బైట వాన హోరుమంటూ ఒకటే రొద. వాన చినుకులు మూసిఉన్న కిటికీ రెక్కల్ని బలంగా మొత్తుతున్నాయి. పక్కింటివాళ్ళ గేదె తాడు తెంపుకుని రెండిళ్ళమధ్యా కాస్త నామమాత్రంగా అడ్డుగాఉన్న తాటాకు దడిని కుమ్మేస్తోంది. దాని కెందుకో ఆ దడిమీద కసి. వదలటం ఆలస్యం. వచ్చి దడిమీద పడిపోతుంది.

మధ్యగదిలో "ఏమేవ్! నిన్నే నే! వెధవ బండ నిద్రా నువ్వూను. అవతల ఆ వెధవగేదె దడికాస్తా నాశనం చేసేస్తోంది. ఒసేవ్!!" అంటూ మంచం నడుంఎక్కి సావకాశంగా పేకాట ఆడుకుంటూన్న పరంధామయ్యగారు చేతిలో ముక్కలు విసిరి నేలకేసి కొట్టారు.

భార్య కామాక్షమ్మ వంటగదిగుమ్మంమీద తల ఆనించి చీర చెరగు ముఖంమీదికి కప్పుకుని నిద్ర పోతూంది. చిన్నగా గుఱ్ఱు కూడా పెడుతూంది. భర్త గొంతువిని మెలకువవచ్చి "పిలిచారా" అంది కళ్ళు నులుపుకుంటూను.

"నా పిండాకూడు. అవతల దడి నాశనం అయి పోతుంటే ఇప్పుడు లేచి 'పిలిచారా' అంటున్నావా?" ఈ చివరి పిలిచారా అన్న ముక్క భార్య అన్నట్టే సాగదీసుకుంటూ వెక్కిరింపు ధోరణిలో అనబోయి గొంతులో ఏదో అడ్డుపడ్డట్టయి దగ్గుతో ఊపిరి తిప్పుకో లేకపోయారు పరంధామయ్యగారు.

అప్పటికి నిద్రబద్ధకం పూర్తిగా వదిలిపోయింది కామాక్షమ్మకి. "అంతమాత్రానికే ఇలా ఇదయిపోతా రేవిటండీ. ఇంకా ఏవిటో అనుకుని హడలిచచ్చాను. చాకిరీ చేసిచేసి ఉన్నానేమో మంచి నిద్రపట్టింది. ప్రాణం ఎక్కడికో పోయింది." అంది చీరచెరగుతో ముఖం తుడుచుకుని లేస్తూను.

"అయితే పిలవగానే లేవక్కర్లేదన్నమాట?"– పరంధామయ్యగారు భరించేవ్యక్తి హోదాతో సూటిగా అడిగారు చేతిలో కలుపుతున్న ముక్కల్ని క్షణం ఆపి.

ఇటువంటి ధోరణికి సరయిన మందు ఈ ఇంట్లో తనకొక్కతికే తెలుసునని కామాక్షమ్మ అభిప్రాయం. ఆ మందే ఇప్పుడు ప్రయోగించింది. అదేవిటంటే ఆయ నేమన్నా నోరుమూసుకుని పడిఉండటం. కొంత మంది స్త్రీలు తమ సాంసారిక జీవితాల్లో సుఖాన్ని దూరం చేసుకోవటానికి కారణం నూటికి నూరుపాళ్ళూ ఈ ఓర్పు, సహనం అలవర్చుకోకపోవటమే అని కామాక్షమ్మ అభిప్రాయం. ఎప్పుడైనా పదిమందీ కలిసి మాట్లాడుకునేటప్పుడు ఈ విషయం వస్తే కామాక్షమ్మ ధోరణి ఇలాగే ఉంటుంది. మరీ ఆశ్చర్యకరమైన సంగతేవిటంటే చాలామంది ఆడవాళ్ళు ఈ అభిప్రాయాన్నే బలపరిచేవారు. కామాక్షమ్మకి ఇప్పుడు ఏభైఏళ్ళు! ముప్ఫైఅయిదు సంవత్సరాలనుంచీ కాపరం చేస్తూంది. ఓకొడుకూ, ఓ కూతురూ ఇద్దరే సంతానం. కామాక్షమ్మ పదిమందిలోనూ సగర్వంగా చెప్పుకుంటుంది. "నేను ఇన్నాళ్ళనుంచీ కాపరం చేస్తున్నా ఒక్కనాడు నా ధర్మాన్ని నే తప్పలేదంటే నమ్మండి. బ్రతికున్నన్నాళ్ళూ కోడరికం పెట్టినా చనిపోతూ మా అత్తగారేమందో తెలుసా? నా రెండు చేతులూ పుచ్చుకొని నిన్ను అర్థంచేసుకోలేక పోయాను కామాక్షీ! క్షమించు" అంది. ఇన్నేళ్ళొచ్చాయి ఇప్పటికీ ఆయన మాటకి ఎదురుచెప్పటం అంటే భయం. అలా ఉంటేనే ఆడదాని అందం. చీటికీ మాటికీ కయ్యాలు తెచ్చుకుంటే అసహ్యం కదూ" అని. కామాక్షమ్మ చెప్పింది నిజమే! అత్తగారు ఓనాడు చీపురుతీసుకుని గొడ్డును బాదినట్టు బాదింది. అప్పుడు భర్త ఇంట్లో లేడు. వచ్చిం తర్వాతైనా కామాక్షమ్మ అతనిదగ్గర ఆ విషయం ఎత్తనే లేదు. మరోనాడు అట్లకాడ కాలేసి ఏదో పొరబాటున తగిలినట్టుగా కోడలి చేతికి అంటించింది. కళ్ళుమూసుకుని ఊపిరి బిగబట్టి కిక్కురుమన

లేదు కామాక్షమ్మ. భర్త ఎందుకు కన్నీరు కారుస్తున్నావంటే తలంటు పోసుకుంటుంటే కంట్లో నలుసు పడిందని చెప్పింది. ఇల్లాంటివి తరుచు ఏవో జరుగుతూనే వుండేవి. ఒకనాడు లేనిపోని కల్పనలు చేసి పొరుగింటి వాళ్ళబ్బాయితో తనకేదో సంబంధం ఉందని సృష్టించి, అత్తా భర్తా ఇద్దరూ ఏకమై ఓ రాత్రి చీకటిన్ని వీధిలోకి గెంటేసారు. రాత్రల్లా వీధి గుమ్మంలోనే ఏడుస్తూ పడుకుంది. అయితే కేవలం ఈ అనుమానాన్ని, అబద్ధాన్ని నమ్మి తన జీవితం పాడు చెయ్యనందుకు భర్తకి ఎంతో కృతజ్ఞురాలనంటూ వెయ్యిదండాలు పెడుతుంది కామాక్షమ్మ ఇప్పటికీ. అనేక తెరలలో తోకలాగ అత్త బ్రతికున్నన్నాళ్ళూ నానా అవస్థా పడింది.

"ఇప్పుడీ ఇరవై ఏళ్లనుంచీ నా జీవితం హాయిగా వెళ్ళిపోతూంది" అంటుంది కామాక్షమ్మ. ఆవిడ దృష్టిలో సుఖం అంటే మరేమీ లేదు. వెనకటి అట్లకాడ వాతలూ, చీపురుదెబ్బలూ తప్పాయని. అంతే! ఇంకా సత్యసన్నిహితంగా చెప్పాలంటే, ఇతర స్త్రీల సానుభూతిని పొందే అవసరం ఇప్పుడావిడకు లేదు. తోటిస్త్రీల జీవనస్థాయి తనూ అందుకుంది. "ఇక స్త్రీకి ఇంతకంటె ఏం కావాలి?" అనుకుంటుంది కామాక్షమ్మ. ఆవిడ దృష్టిలోనుంచి కాకుండా మనదృష్టిలో నుంచి ఆవిడ జీవితాన్ని పరిశీలిద్దాం. కొడుకు ప్రసాదానికి పెళ్లయింది కాని కోడలు యింకా కాపరానికి రాలేదు. కూతురు విశాలాక్షి కాపరానికెళ్లి రెండేళ్ళయింది. కాబట్టి కామాక్షమ్మకు ఇంకా ఇంటి బాధ్యతలు పంచుకునే ఆడదిక్కు లేదన్నమాట. కూతురు విశాలాక్షి పదిహేడు సంవత్సరాలు ఇంట్లో ఉన్నా అతిగారం. ఇక్కడి వస్తువు అక్కడ పెట్టమంటే పెద్ద గొడవ జరిగిపోయేది. గట్టిగా కసురుకుంటే "పోదూ! ఆడపిల్ల ఎన్నాళ్ళని మనింట్లో ఉండిపోతుంది. పరాయివాడి ఇంటికి పోయేపిల్ల. దానికి వయస్సొస్తే అదే తెలుసుకుంటుంది. దాన్నేమి అనకు" అంటూండేవారు పరంధామయ్యగారు. ఆయన ఇలాగంటుంటే నిజంగా కూతురు అత్తవారింటికి వెళ్లిపోతున్నట్లే అనిపించి విశాలాక్షిని గుండెలకి హత్తుకుని కన్నీరు వలవలా కార్చేసేది కామాక్షమ్మ. తొందరపడి ఏదో అన్నందుకు తన్ని తాను ఒంద తిట్టుకునేది. తన్ని సుఖపెట్టవలసిన బాధ్యత కూతురుకంటే కోడలు మీద ఎక్కువుందనే విశ్వాసంతో ఆ శుభసమయం కోసం ఎదురుచూసి చూసి చివరికి కొడుక్కి పెళ్ళి అయిందీ అనిపించింది. ఇంకా కోడల్ని కాపరానికి తీసుకురాలేదు. ఇంతకీ చెప్పవచ్చే దేమంటే కామాక్షమ్మకి వయస్సు దాటుతున్నా ఇంతవరకూ చేతి ఆసరా లేకపోయింది. చిన్నపని దగ్గర్నుంచీ పెద్దపని వరకూ అన్నీ ఆవిడే చూసుకోవాలి. తెల్లవారుఝాము ఏ నాలుగింటికో లేస్తే రాత్రి పదింటివరకూ నడుం వాల్చే ఆస్కారం లేదు. ఆ యింట్లో అందరికీ సమిష్టిగా ఉండే అవసరాలు తీర్చటమే కాకుండా విడివిడిగా కూడా ప్రతివ్యక్తీ ఆమెమీదనే ఆధారపడతారు. పరంధామయ్యగారు!—ఈయన దినచర్య చాలా వరకూ కామాక్షమ్మ సహాయం మీదే ఆధారపడివుంటుంది. పొద్దున్నే లేవగానే ముఖం కడుక్కుందుకు సరంజామా అంతా ఆవిడ అమర్చిపెట్టాలి. ఆయన బావి దగ్గర కాని స్నానం చెయ్యరు. ఇక ఆ స్నానానికి ఒక అంతూ పొంతూ ఉండదు. పాతిక చేదలు తక్కువ కాకుండా కామాక్షమ్మ తోడి పొయ్యాల్సిందే. ఇక ఆయనకి మొక్కలంటే ప్రాణం! కాబట్టి వెనకా ముందూ పెంచిన మొక్కలన్నిటికీ నీళ్లు పొయ్యాల్సిన బాధ్యత కూడా ఆవిడదే. ఆయన కూర్చున్న చోటు నుంచి లేవకుండానే ముక్కుపొడుండబ్బాదగ్గర్నుంచి, కట్టుకునే గోచీవరకూ అన్నీ ఆవిడ అందివ్వాల్సిందే. ఇదంతా కాకుండా వంటపని ఉండనే ఉంది. అలా నడుం వాల్చేందుకు ఆస్కారం ఉండదు. ఒకవేళ ఆవిడకి ఏమాత్రం విశ్రాంతి దొరికినా అది అనుభవించే అవకాశం ఆయన ఇవ్వరు. పెరట్లో దడిని గేదె కుమ్ముతుంటే దాన్ని తోలడానికి నిద్రపోయే భార్యని లేపకపోతే తనేం చేస్తున్నట్టు? తనెందుకు ఆ పని చేయకూడదు? ఉహు! అలా కాదు. ఆడది తను చెప్పిన పని చెయ్యాల్సిందే అని ఆయన ఉద్దేశం. కామాక్షమ్మ కూడా ఇందుకు విరుద్ధంగా ఏమీ అనుకోదు. అలా సేవ చెయ్యగలిగినప్పుడే తన జన్మ సార్థకమవుతుందనే ఆమె నమ్మకం.

"చాలా మంది మొగవాళ్లకి మల్లే తన భర్త తన్ని ఎక్కువగా చెయ్యిచేసుకోడు. ఎప్పుడో రెండు మూడు సార్లు కాబోలు కొట్టారు. ఒకమారు జుట్టుపుచ్చుకునీ, రెండు మార్లు దవడమీద కొట్టారు. అంతే! మళ్ళీ ఎప్పుడూ చెయ్యి చేసుకోలేదు." అనుకుని తృప్తి పడుతూంటుంది కామాక్షమ్మ.

కామాక్షమ్మ లేచి పెరట్లోకి వెళ్ళి ఒళ్లంతా తడుపుకుని పక్క ఇంటి వాళ్లని పిలిచి నాలుగు చివాట్లు పెట్టి "క్షమాపణ చెప్పించుకుని మరీ లోపలికి" వచ్చింది.

"గేటుని కట్టారా లేదా?"

"మనం మనం దెబ్బలాడింతర్వాత కట్టకేం చేస్తారు"

ఇంకా దీపాల వేళ కాకపోయినా బయట ముసురువల్ల చీకటయిపోయింది. దీపం వెలిగించి కొంకికి తగిలించి కామాక్షమ్మ వీధి గదిలోకి తొంగి చూసింది. కొడుకు ప్రసాదం కిటికీ వారగా కూచుని వానలోకి చూస్తున్నాడు—ఏదో ఆలోచిస్తూను. చల్లటిగాలి విసురుగా తోసుకొచ్చింది గదిలోకి. ప్రసాదం మరింత దగ్గరగా ముడుచుకున్నాడు కామాక్షమ్మకి చప్పున ఏదో స్ఫురించినట్టయింది భర్త దగ్గరగా వెళ్లి "నామాట కాస్త వింటారా?" అంది.

పరంధామయ్యగారు ఆటధ్యానంలో పలకలేదు.

"మిమ్మల్నే"

"ఏవిటంట ! గొడవ"—తనెంతో ఉత్సాహంగా ఆడుకుంటూన్న ఆటమధ్యని కామాక్షమ్మ జోక్యం ఆయనకి మహాచిరాకెత్తించింది.

"ఇన్నేళ్లొచ్చాయి ఇంకా అలా తిడతారేవిటండీ. ఎవరన్నా వింటే అసహ్యంగా ఉండదూ" అంది కామాక్షమ్మ.

"సర్లెద్దూ! అసలు విషయం ఏవిటో చెప్పు" అన్నారాయన.

"అహఁ ఏవీ లేదు. త్వరలో ముహూర్తాలున్నాయి కదా. అబ్బాయికి అది కాస్తా అయిందనిపిస్తే బాగుంటుందని" అంటూ నసిగింది.

"సరే చూద్దాంలే"

"అలా చూద్దాం అంటూనే ఏడాది గెంటేసారు. ఇంకా ఎన్నాళ్లు?"

"అలాగే అన్నానుగా"

"సుందరమ్మగారబ్బాయి మనబ్బాయి ఈడువాడే. వాడికీ వీడికీ ఒకసారేగా పెళ్లయింది. వాడికప్పుడే ఇద్దరు పిల్లలు. చంకని పిల్లాణ్ణేసుకుని ఒక చేత్తో ఎడ పిల్లవాణ్ణి నడిపించుకుంటూ ఆపిల్ల మనింటికొస్తే చూడముచ్చటవుతుంది."

"అంటే నీ ఉద్దేశం ఆయన తెలివైన వాడనీ, నేను చవటననీను. అంతేగా?"

"ఛా! అలాగన్నానా నేను"

"పిల్లలకేం తక్కువ. కావల్సినంత మంది పుడతారు. తొందరపడకు"

కామాక్షమ్మ వంటగదివైపు నడుస్తూ "పెద్దవాళ్లం అయిపోతున్నాం. మీ బాధ్యత కొడుకు పంచుకున్నాడు. మీరు హాయిగా విశ్రాంతి తీసుకుంటున్నారు. మరి నా బాధ్యత పంచుకునే వాళ్లు రావద్దూ— నేను విశ్రాంతి తీసుకోవద్దూ?" అనుకుంది అర్థస్వగతంగా.

ఆ రాత్రల్లా కామాక్షమ్మకి ఒకటే కలలు కోడలు ఇంట్లో మసులుతున్నట్టూ, మనవణ్ణెత్తుకొని తను ముద్దులాడుతున్నట్లు—ఇలా సాగిపోయాయి.

## 2

మ. రా. శ్రీ. నాన్నగారికి నమస్కారాలు,

మీరు రాసిన ఉత్తరం, శుభలేఖా అందాయి. చాలా సంతోషం. అన్నయ్య కార్యానికి నామటుకు నాకు రావాలనే ఉంది. నా మనసంతా అక్కడే ఉంది. కాని ఏం చెయ్యను, రావటంపడదు నా ముఖాన భగవంతుడు అలా రాసిపెట్టాడు. మీరు మటుకు ఇటువంటి వాళ్ళఇంట్లో అమ్మాయిని పడేస్తున్నాం అని కలగన్నారా? ఇక మీ ఉత్తరంచూసి ఇక్కడ పిల్లిమాటలు వినితీరాలి భరించలేక పోయానంటే నమ్మండి వేళాకోళాలు, ఎత్తిపొడుపులూ, ఎద్దేవాలూ ఒకటేమిటి నానా కూతలూ కూసారు. నేనేమో సమాధానం చెప్పబోతే కొట్టినంతపని చేశారు. నిత్యం ఏ పిల్లిమీదో నక్కమీదో పెట్టి నన్ను తిడుతూనే ఉంటారు నన్ను తిడితే అంత బాధలేదు. మిమ్మల్నికూడా నానా అవాకులూ చవాకులూ పేల్తున్నారు. అదే మరీ బాధగా ఉంటుంది. నేను మాట్లాడినా తప్పే, మాట్లాడకపోయినా తప్పే. మావగారున్నారన్నమాటేగాని ఆయ నెందులోనూ కలగజేసుకోరు. మా అత్తగారు ఒక్క పనీ చెయ్యదు. ఎప్పుడూ ఎవళ్లతోనో. సోదివేసు కూర్చుంటుంది. ఇంటెడు చాకిరీ నేనూ, చినవాడబడుచూ చేసుకుంటున్నాం. నేనొచ్చింతర్వాత పనిమనిషిని కూడా మాని

పించేసింది. వీధిలో కుక్కలా బ్రతుకుతున్నానంటే సరిపోతుంది. ఈ సంసారంలో యేం సుఖముంది నాకు. అటు అత్తగార్ని చూస్తే అటువంటి దయిపోయింది. ఇటు భర్తని చూస్తే ఆయనకు నేనున్నా ఒకటే, లేకపోయినా ఒకటే. ఆయన కిష్టం ఉంటే ఇంటికి వస్తారు. లేకపోతే అదీలేదు రాత్రి ఒంటి గంటవుతుంది ఇంటికొచ్చేసరికి. అదేమని అడుగుతే నీకనవసరం అంటారు. ఒక్కొక్క రోజు యింటికే రారు. ఈ కొడుకంటె ఆవిడకి గారం! పల్లెత్తుమాట అనలేదు. ఇలాగయిపోయింది నా బ్రతుకు మీరెవరైనా వస్తే పంపిస్తారేమో అని ఆశ! అమ్మకి నా నమస్కారాలు. అన్నయ్యని అడిగానని చెప్పండి. ఉంటాను. నాగురించి దిగులుపడి మనసు పాడు చేసుకోకండి. శలవు

మీ విశాలాక్షి.

ఉత్తరం చదవటం పూర్తిఅవగానే కామాక్షమ్మ భోరుమని ఏడ్చేసింది. పరంధామయ్యగారు ఎంత ఓదార్చినా ఆమె దుఃఖానికి అంతులేకుండాపోయింది. తను కొత్తగా కాపరానికొచ్చినరోజులు జ్ఞాపకానికొచ్చాయి. "నేనంటూనే ఉన్నాను. పిల్లనిచ్చు కునేవాళ్లం కాస్త వంశం, మంచీ, మర్యాదా వాకబు చెయ్యండీ అంటే విన్నారుకారు. ఇంత కట్నంపోసి చివరి కిలాంటిసంబంధం తెచ్చారు. నాకూతురుగొంతు నిలువునా కోసారు. ఇప్పుడిక అందరం కలిసి గంగలో దూకుదాం" అంటూ నిష్ఠూరాలాడింది భర్తని. పరంధామయ్యగారు కిమ్మనలేదు. కూతురు సంసారం గురించి బాధపడుతున్న పరంధామయ్యకి ఈ మాటలు మరింత నొప్పి పుట్టించాయి అయినా ఏమీ అనలేకపోయారు.

"ఇంతకీ ఏం చేద్దాం" అన్నారాయనే.

"మీరు వెళ్లిరాకూడదూ" అంది కామాక్షమ్మ కళ్లు తుడుచుకుంటూను.

"పోనీ అబ్బాయిని పంపిద్దాం"

"వాడు కుర్రకుంక. వాడివల్ల నేమాతుంది. అందులో వాళ్లు జగజ్జంత్రీలాయె" అంది కామాక్షమ్మ.

ఈ సమస్యని ప్రసాదం పరిష్కరించేశాడు. "ఎందుకు నేవెళ్తానులే" అన్నాడు. అక్కడ కార్యం సానుకూలపడ్డానికి రావటం ముఖ్యమంటూ కామాక్షమ్మ వాళ్ళతో మెలగవలసిన విధానాలూ, మాట్లాడవలసిన తీరూ అన్నీ నచ్చచెప్పింది "ఒరే అబ్బాయ్! నువ్వసలే కోపిష్టివి! వాళ్లేదైనా అన్నా మనకి పని సానుకూలపట్టం ముఖ్యం! కాస్త శాంతంగా మసులుకో! తెలిసిందా" అంటూను.

చెల్లినితీసుకురావటానికంటూ వెళ్లటం ప్రసాదానికి ఇదే మొదటిసారి. అవతలవాళ్ళ గురించి చెడుగా చాలావినివున్నాడు. ప్రసాదం రైలు ఎక్కిందిమొదలు ఆవూళ్లో అడుగు పెట్టేవరకూ ఆలోచనలు చాలా గజిబిజిగా సాగిపోయాయి. చెల్లాయి ఉత్తరం అతన్ని చాలా ఆశ్చర్యపరిచింది. అమ్మ తన చిన్ననాటి సంగతులు చెబుతున్నప్పుడు అతనిలో కలిగిన సంశయాలే ఈ ఉత్తరం కూడా కలిగించింది. అనుకున్నట్టు కాకుండా రైల్లో ఇబ్బంది లేకుండా కూచుండుకు చోటు దొరికింది. కిటికీ వారగా కూర్చుని పరుగెత్తే పొలాలవంకా, తన మనసులో మాటల్ని వెక్కిరిస్తున్నట్టుగా ధ్వనించే చక్రాల రొదనీ, చూస్తూ, వింటూ అతను అనుభవ శూన్యమైన, అసందిగ్ధమైన ఆలోచనలు చేయసాగాడు. లోకంలో ఇటువంటి మనుష్యులుంటారా? లేకపోతే గోరంతని కొండంతలు చేసే స్వభావం వీళ్ళలో ఉందా? చెల్లిమటుకు తరుచు రాసే ఉత్తరాల్లో తన అత్తగారిని, ఆడబడుచుని, మొగుణ్ని ఇలాగే చిత్రిస్తూంటుంది వాళ్ళల్లో ఎక్కడా మానవత్వం లేనట్టు కనిపించింది. కారణరహితంగా తోటి మనుష్యుల్ని హింసించి ఎలా ఆనందించగలుగుతారో నమ్మశక్యం కాకుండా ఉంది. కొంతమందికి ఎదుటి వాళ్ళని భయపెట్టగలిగే శక్తి ఎలా కలుగుతుందో? నాయనమ్మ అమ్మని చాలా బాధపెట్టిందట. 'ఓమారు అట్లకాడ ఎర్రగా కాల్చి వాతపెట్టిందట. మరోమారు జుట్టుపట్టుకుని చీపురుతీసుకుని వీపుమీద అట్లుతేలేలా బాదిందట! ఓమారు వీధిలోకి గెంటేసిందట. చేతిలో ఏ వస్తువుంటే అదల్లా అమ్మమీదికి విసిరేసేదిట. అలా ఆవిడ చేస్తూంటే తనే కనక అయితేనా? ఆవిడ అంతు తేల్చేశాడు.

"ఏ ఊరు వెళ్తున్నావు నాయినా?" అన్నాడు పక్కనే కూచున్న బుంగమీసాలాయన.

"వాల్తేరు"

"ఏం చదువుకున్నావు"

ఈ ధోరణి ప్రసాదానికి చిరాకు కలిగించింది. "ఎందుకండి?" అనేవాడు.

"అహా, మరేమీ లేదు. మనం ఎక్కడున్నా, ఏ పని చేస్తున్నా దానిమీదే లక్ష్యం ఉండాలి. పరాకు పనికిరాదు నీ చేతిలో ఉన్నది వార్తాపత్రిక. కాని నీ మనసు మాత్రం దానిమీద లేదు అంతేనా?"

అవునన్నట్టుగా తల ఊపాడు ప్రసాదం.

"నీలో నువ్వేదో మాట్లాడుకుంటున్నావు. నవ్వుకుంటున్నావు కోపంగా కళ్ళెర్రచేస్తున్నావు విచారంగా ముఖం ముడుచుకుంటున్నావు, చేతులు ఊగిస్తున్నావు నేనేకాదు చాలామంది నిన్నే గమనిస్తున్నారు చూడు" అన్నాడాయన నవ్వుతూ చుట్టూతా కలయ చూస్తూ.

ప్రసాదం ముసలాయన చెప్పింది నిజమని నిర్ధారించుకున్న తర్వాత సిగ్గుపడిపోయాడు. ఆ తర్వాత మాటలు మరి పెరగలేదు. ముసలాయన భార్యతో గట్టిగా ఏదో వాదులాడుతున్నాడు. వాళ్ళిద్దరికీ ఎదురుగుండా నిడుపైన బల్లమీద ఆయనకూతురు కూచుని ఉంది ఇరవైఏళ్లుంటాయి. తల్లితండ్రుల అభిప్రాయభేదాల్ని బాగా వింటోంది. మధ్యమధ్య విననట్టు నటిస్తోంది.

ఆ కంపార్టుమెంటులో ఉన్నది చాలా కొద్దిమంది. తనకి ఎదురుగ్గా కార్నర్ సీటులో బట్టతలాయన పేపరు చదువుకుంటున్నాడు. అవతల నలుగురు కూచున్నారు. వాళ్ళేదో వ్యాపారవిషయాలు మాట్లాడుకుంటున్నారు. బట్టతలాయన పేపరు చదువుతూ మధ్యమధ్య గట్టిగా మాట్లాడుతున్న ముసలి దంపతులవంక చూస్తున్నాడు.

దీపాలు వెలిగాయి. బట్టతలాయన క్షణం పేపరు మూసి ఏదో అస్పష్టంగా గొణుక్కుంటూ నమస్కారం పెట్టారు. తిరిగి పేపరు చదవటంలో మునిగిపోయారు. బయట ప్రకృతి అంతా చీకటి ముసకలో మునిగిపోతూంది. బండి కుదుపులో ప్రసాదానికి చిన్న నిద్రపట్టింది. తిరిగి లేచేసరికి తన పక్కగా తన్ని బాగా ఆనుకుని ఓ యువకుడు కూచుని ఉన్నట్టు గమనించాడు. అంతేకాదు. కంపార్టుమెంటంతా కిటకిటలాడిపోతూంది. చెవులు చిల్లులుపడే గొడవ. చోటుకోసం ఎదురుగుండా ఇద్దరు దెబ్బలాడుకుంటున్నారు. నానామాటలూ అనుకుంటున్నారు. చివరికి నువ్వు వెళవ్వంటే నువ్వు వెళవ్వనేవరకూ వాళ్ళ సంఘర్షణ పెరిగింది. ప్రసాదం పక్కనున్న యువకుడు చిన్నగా నవ్వుతూ "మూసారా చోటుకోసం వాళ్ళిలా దెబ్బలాడుకుంటున్నారో. ఇప్పుడిలా అరుచుకుంటారా తెల్లవారి చూడండి తమాషా" అన్నాడు.

ప్రసాదం "ఏమిటా తమాషా" అన్నాడు.

"చూస్తారుగా మీరు మరి. ఉదయంవరకూ ఈ బండిలో ప్రయాణం చేస్తారో లేదో"

"చేస్తాను"

"అయితే సరే. మీరే చూస్తారు. రైలుప్రయాణాలు చాలా విచిత్రంగా ఉంటాయి మనిషిలోని మంచీ, చెడూ రెండూ పూర్తిగా విజృంభించేది ఇక్కడే"

ఎదురుగుండా దెబ్బలాడుకున్న వాళ్ళు మాట్లాడకుండా మూతులు కోపంగా బిగించుకుని కూచున్నారు. బట్టతలాయన్ని ఎదురుగుండా నిలబడ్డ ముసలమ్మ తన మనవడికి కూర్చునేందుకు కాస్త చోటు ఇమ్మని బ్రతిమిలాడుతోంది. ఆయన చికాకుపడుతున్నాడు. చివరికి ఎలాగో కాస్త ముడుచుకుని చోటు ఇచ్చాడు. ముసలమ్మ మనవణ్ణి కూచోబెట్టి బట్టతలాయనకి కృతజ్ఞత చెప్పుకుంది. ఆమె మాత్రం కిందనే కూచుంది మనవణ్ణి ఓ చేత్తో పట్టుకునే. వాడికి తొమ్మిదేళ్ళుంటాయి.

బుంగమీసాలాయన రుసరుసలాడుతూ, "నోరుముయ్యి! ఆట్టే వాగకు. బండిలో గొడవచెయ్యకు," అంటూ భార్యని కసురుతున్నాడు. యువకుడు ప్రసాదంవైపు తిరిగి "నేను చాలాసేపటినుంచీ వాళ్ళ వాగ్వాదం వింటున్నాను. మీరూ వినే ఉంటారు. మీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు ఉన్నట్టుండి. ఏమంటే ఎటు తిరుగుతుందో అని, ప్రసాదం "మీ ఉద్దేశం?" అని ఎదురుప్రశ్న వేసాడు.

"వాళ్లు జీవితంతో చెలగాటం ఆడుతున్నారు. ఆ జీవితం తనకు కానట్టుగా ఆ అమ్మాయి నిర్లిప్తతగా వింటుంది. భర్త పారిపోయాడు. అత్త కఠినురాలు. అటువంటి ఇంట్లో ఆ అమ్మాయిని తీసుకెళ్ళి పడేస్తానని ముసలాయన అంటుంటే ఆవిడ కాదనడంలో తప్పు లేదంటాను. ఆయన లోకంకోసం భయపడి మనుకొ

రాన్ని దంపుకుంటున్నాడు. తన్ని నరకంలోకి తోస్తున్నారని ఆ అమ్మాయికి తెలుసునో తెలవనో మనసు తెలియదు. ఇది దారుణంగా లేదూ" అన్నాడు యువకుడు.

దప్పున చెల్లాయి జ్ఞాపకంవచ్చింది ప్రసాదానికి. అవ్యక్తంగా అతని మనసు కుమిలిపోయింది. కొద్దిగా భయంకూడా వేసింది. ఆ యువకుడి ధోరణి జలపాతంలా సాగిపోతుంటే ప్రసాదం ఆశ్చర్యంతో వినసాగాడు.

"ఆడవాళ్లు భర్తలకు ఉత్తరాలు రాయడం చాలా విచిత్రంగా ఉంటుంది. 'శ్రీవారి పాద సన్నిధికి తమ చరణదాసి అనేక నమస్కారములు చేసి' అని నా భార్య నన్ను సంబోధిస్తుంది. అలా రాయవద్దనీ తన్ని తాను అలా హీనపరుచుకోవద్దనీ నేను అనేకమార్లు నచ్చచెప్పాను. కాని వినిపించుకోదు. తెల్లవారి లేవగానే ముందర నా పాదాలు పట్టుకుని కళ్ళ కద్దుకుంటుంది నేను మెలకువగా ఉంటే వారిస్తూంటాను. అందుకని ఆమె నే లేవకుండా నే లేచి పాదపూజ చేసుకుంటోంది. ఇక నేనేం చేసేది. చక్కని పుస్తకాలు తెచ్చి ఆమెని చదవమంటాను. అవేవో బూతు పుస్తకాలయినట్టు ఆమె వాటిని పొయ్యిలో వేసి కాల్చేసింది. పాతివ్రత్యంలో ఆమెకి గాఢమయిన నమ్మకం. ఈ దేశంలోని స్త్రీజాతి కంతా నా భార్య ప్రాతినిధ్యం వహిస్తోందనుకోండి. అప్పుడు నా అభిప్రాయాలు ఇంకా బాగా బోధపడతాయి. ఆమెని ఎలా దారిలోకి తీసుకురావాలో బోధపట్టం లేదు"

ప్రసాదం ఈ గాథని ఆశ్చర్యంగా వింటున్నాడు. తనూ అటువంటి ఆడవాళ్లనే చూస్తున్నాడు. తన తల్లికూడా ప్రతిరోజూ ఉదయం లేవగానే తండ్రి పాదాలకి నమస్కారం పెట్టడం తను అనేకమార్లు చూసాడు. అటువంటప్పుడు తనకి చక్కని ఊహలు సాగిపోతుంటాయి. ఆ తండ్రిస్థానంలో తను ఉన్నట్టూ తన భార్య తన పాదపూజ చేస్తున్నట్టూ ఊహించుకుని మహా సంబరపడి పోతూంటాడు. భార్య అంటే భయభక్తులతో ఎంతో ఒద్దికతో భర్తపట్ల మెలగవలసిన యంత్రంగా మటుకే ప్రసాదానికి ఓ అభిప్రాయం ఉంది ఇంతవరకూ. అయితే ఇప్పుడు ఈ యువకుని మాటలు ప్రసాదాన్ని కొంత కిందుమీదు చేసాయి. యువకుడు తిరిగి చెప్పుకుపోతున్నాడు.

సర్వసాధారణంగా యువతీయువకులు తమ సాంసారిక జీవితానికి తమ తల్లితండ్రుల్ని ఆదర్శంగా తీసుకుంటారు జంతువుల్లో పొంచి మీదపడి ఎరని పట్టుకుని పొట్టని పెట్టుకునే నేర్పు తల్లిని చూసి పిల్లలు నేర్చుకుంటాయి. అలాగే ఆడదాన్ని చరణదాసిని చేసుకునే నేర్పు తమ తల్లితండ్రుల్ని చూసి యువకులు నేర్చుకుంటున్నారు. అయితే శత్రువును తప్పించుకుందుకు సాధ్యమైనంతవరకూ పెనుగులాడే జీవితేచ్ఛ జంతువులోనైనా ఉంది కాని వ్యక్తిత్వంమీద అభిలాష స్త్రీజాతిలో ఏకోశానా లేదు పైపెచ్చు ఎంతో ఒడుపుగా మొగవాడి పైశాచిక హస్తాలలో చిక్కుకుని గర్వంగా నవ్వుకుంటుంది."

ప్రసాదానికి ఈ సత్యం బోధపడలేదు. నవ్వి ఊరుకున్నాడు. తర్వాత ఆ యువకుడు నిశ్శబ్దంగా బయట చీకటిలోకి చూస్తూ కూచుండిపోయాడు. ముసలమ్మ నిద్ర బరువుతో తూగుతూంది మనవడు కళ్లు నులుపుకుంటున్నాడు. బట్టతలాయన అనుకూలమయిన కార్నరు సీటులో హాయిగా నిద్రపోతున్నాడు. బుంగమీసాలాయన భార్య మన్యా, మన్యా కన్నీరు తుడుచుకుంటూంది.

అలాగే అవస్థపడుతూ, నిద్రకి తూలుతూ, మెలకువలో ఆలోచిస్తూ, దిక్కులు చూస్తూ ఆ రాత్రంతా గడిపేశాడు ప్రసాదం. నిద్ర లేచేసరికి పక్క యువకుడు ముఖం కడుక్కుంటున్నాడు. తనూ ముఖం కడుక్కుని కాఫీకోసం ఎదురుచూస్తూ కూచున్నాడు.

"వాళ్ళకేసి చూడండి" అన్నాడు యువకుడు ఉన్నట్టుండి.

ప్రసాదం అటువైపు చూసాడు. తెల్లబోయి మళ్లీ యువకుడి ముఖంలోకి చూసాడు. "నిన్న రాత్రి కాస్త చోటుకోసం మానవత్వం మరిచి నానా తిట్లూ తిట్టుకున్నారు. ఇప్పుడు ఏమీ జరగనట్లే ఇద్దరూ నవ్వుకుంటూ ఒకళ్ళ అభిప్రాయాన్ని ఒకళ్లు మన్నిస్తూ ప్రపంచం అంతా చుట్టబెట్టేస్తున్నారు. చూసారా విచిత్రం?" అన్నాడతను.

"అవును. తమాషాగానే ఉంది" అన్నాడు ప్రసాదం.

బండి ఓ చిన్న స్టేషన్లో ఆగింది. బట్టతలాయనకీ ముసలమ్మకీ ఘర్షణ ప్రారంభం అయింది. ప్రసాదం శ్రద్ధగా వినసాగాడు. ఆ తొమ్మిదేళ్ళ మనవడ్ని బండిదిగి వెళ్ళి కాఫీ పట్టుకురమ్మంటున్నాడు బట్టతలాయన.

'వాడు కుర్రకుంక! వల్లకాదు' అంటుంది ముసలమ్మ.

"వీళ్ళకి కృతజ్ఞత ఉండదండీ. పెద్దది బతిమిలాడుతోందని రాత్రి నేను నానాఅవస్థపడి వాడికి చోటు ఇచ్చాను. కాస్త కాఫీ పట్టుకురమ్మంటే వల్లకాదంటోంది. చూడండి." అంటూ ఆయన పక్కవాళ్ళతో ఫిర్యాదు చేశాడు. వాళ్లు ఎటూ చెప్పకుండా తల ఊగించి ఊరుకున్నారు.

"ఏం! వెళ్లి తీసుకువస్తావా లేదా?" అన్నారు బట్టతలాయన పట్టుదలగా.

ముసలమ్మ వీల్లేదంటూ గొణిగింది. బట్టతలాయన ఆ కుర్రాడ్ని రెక్కపుచ్చుకుని బల్లమీంచి నెట్టెయ్యబోయాడు. ముసలమ్మ మనవణ్ని దగ్గరగా తీసుకుని హృదయానికి హత్తుకుంది.

ప్రసాదం అయోమయంగా యువకుడు ముఖంలోకి చూసాడు. యువకుడు చిన్నగా నవ్వి "మనవల్ల ఉపకారం పొందినవాళ్లు మనకి శాశ్వతంగా కృతజ్ఞులై ఉండాలనీ, అలా లేకపోవటం క్షమార్హమైన విషయం కాదనీ భావిస్తూ అలా ఉంటున్నారా లేదా అని క్షణంక్షణం పరీక్షించి చూసుకుని తృప్తిపడుతూంటారు వీళ్లు. ఏపాటి చిన్న చిన్న తిరస్కారాన్నయినా సహించలేరు. ఎదుటి మనిషి వ్యక్తిత్వంగురించి ఆలోచించనే ఆలోచించరు." అంటూ వ్యాఖ్యానించాడు.

అర్థం కాని పదానికి నిఘంటువులాగ ప్రతిసన్నివేశాన్నీ తరచి తరచి వ్యాఖ్యానించే ఈ యువకుడు ఓ విచిత్రమయిన విషయంలా తోచాడు ప్రసాదానికి. అయితే అతనికి మల్లే తనెందుకు అలా మాట్లాడలేకపోతున్నాడు? ఇలా మాట్లాడటం అతనెలా నేర్చుకున్నాడు? తనూ విద్యావిహీనుడు కాదు. ఇంటరువరకూ వెలగబెట్టాడు. తనూ అనేకగ్రంథాలు చదివాడు. అయినా ఇలా మాట్లాడటం తనకిరాదు.

"మీ రేం చదివారు?" ఉండబట్టలేక అడిగేశాడు ప్రసాదం.

"అలా అడుగుతున్నారేం?"

"ఊరికే నే."

"స్కూల్ ఫైనలు పాస్ అయాను. ఇకపైన చదవలేదు. ప్రస్తుతం ఉద్యోగం చేస్తున్నాను."

ప్రసాదం నోట మాట పెగల్లేదు. ఒకమెట్టు తనే ఎక్కువైనా అతను మాట్లాడుతుంటే తనకి బోధపట్టంలేదు. ప్రసాదానికి చాలా చిన్నతనమనిపించింది.

బండి సాగిపోతూంది. జనం పల్చబడ్డారు. యువకుడు చేతిగడియారం చూసుకుని ఏడయిందనుకున్నాడు. బుంగమీసాలాయనా, భార్యా కూతురు విషయంలో మళ్లీ ఘర్షణ ప్రారంభించారు. ఈ మారు బుంగమీసాలాయన తన వాదాన్ని ఏకరువు పెడుతూ ప్రసాదం పక్కనున్న యువకుడ్ని న్యాయం చెప్పమన్నాడు.

"నా మటుకు నేను ఆమె నిలా తీసుకెళ్ళి అత్తవారింట్లో వదలటం భావ్యంగా లేదంటాను. అవతల ఆమె తాలూకుమనిషి లేడాయె. అత్తగారు మంచిది కాదంటున్నారు. అటువంటి వాతావరణంలో ఆ పిల్ల ఏం సుఖపడుతుంది. నా మాటవిని ఆమెని ఇంటికి తీసుకుపొండి."—

ఆ పిల్ల తల్లి ముఖం వికసించింది. ముసలాయన అనుకోని ఈ సమాధానానికి కొంత బాధపడ్డాడు. ఇంతవరకూ ఏమీ సంబంధం లేనట్టుగా కూచున్న అమ్మాయి ఉన్నట్టుండి యువకుడివైపు తిరిగి "అవసరం లేదు. నా ధర్మం నాకు తెలుసు. మీ జోక్యం అనవసరం. నాన్న చెప్పినట్టు నేను అత్తగారింటికే పోతాను." అంది.

యువకుడు క్షణం నిర్విణ్ణుడైపోయాడు.... తర్వాత ప్రసాదంవైపు తిరిగి "ఆమె ఉద్దేశం బోధపడిందా? తను సుఖపడినా కష్టపడినా అత్తవారింట్లోనే ఉండాలనీ, అది తన ధర్మం అనీ ఆమె నమ్మకం." అన్నాడు.

ప్రసాదం అనేకమార్లు రైలు ప్రయాణాలు చేశాడు. అప్పుడప్పుడు ఇటువంటి తరహాల మనుషులు తారసపడుతూనే ఉంటారు. కాని ఇటువంటి యువకుడుమటుకు ఎప్పుడూ తగలలేదు. ప్రతి రహస్యాన్నీ అతను ఇట్టే పసిగడుతున్నాడు. గలగలా మాట్లాడేస్తున్నాడు.

గాలి చల్లగా తగులుతున్నా ఎండ చుర్రుమని పాకిపోతూంది. బండి వాల్తేరుస్టేషన్లో ఆగింది. ముందు ఉత్తరం రాసినా అనుకున్నట్టుగానే ప్రసాదాన్ని ఆహ్వానించటానికి ఎవరూ స్టేషనుకు రాలేదు. ప్రసాదం విచారించలేదు. చెల్లెలు ఇంటిదగ్గరున్నా మనసుమటుకు తనరాక నపేక్షిస్తూ ఈ ప్లాటుఫారం మీదే ఉంటుంది. అంతకంటే తన కింకే ఆహ్వానం కావాలి? యువకుడివగ్గర శెలవు తీసుకున్నాడు.

స్టేషను వదలి ఇవతలికివచ్చి బండిఎక్కి పోనిమ్మన్నాడు. నిలువెత్తున దుమ్ము లేపుకుంటూ వీచే సుడిగాలికి తప్పుకుంటూ బండి ఊళ్ళోకి సాగిపోయింది. బండిచక్రాల గడగడలు తన హృదయంలోనే ప్రతిధ్వనిస్తున్నాయి. స్టేషన్లో రైలుకూత కుంయ్‌మంటూ వినిపించింది.

రైలు కదిలింది!!!

# 3

ప్రసాదం ఇల్లు కనుక్కొందుకు ఎక్కువ ప్రయాసపడలేదు. బండివెళ్ళి నేరుగా గుమ్మంముందు ఆగింది. ఒకచెంప చెల్లెల్ని చూడబోతున్నాననే ఉత్సాహం ఉబుకుతున్నా మరొకచెంప అదటుగానే ఉంది. మరేమీలేదు. వాళ్ళు తన్నిమీదపడి రక్కుతారనీ కాదు; పీకుతారనీకాదు. అవమానిస్తారేమోనని భయం! మనసు దిటవు చేసుకుని సామాను వెనకాల బండివాణ్ణి తీసుకురమ్మని గేటుతీసుకుని లోపలికి నడిచాడు ప్రసాదం. ఇల్లు బాగా లోపలికి ఉంటుంది. ఇంటిముందు లంకంత పెరడు. అక్కడక్కడ చిన్నచిన్న కూర పాదులు మినహాయించి ఎక్కువభాగం ఖాళీగానే ఉంది. ప్రసాదం దృష్టి ముందు ఇంటిమీదికి మళ్ళి క్షణం నిలబడి పెరడంతా కలయతిరిగింది. అతని హృదయం ఒక్కమారు ఎవరో పిండినట్టయిపోయింది. గోడవార చెత్తాచెదారం ఏరి పోసుచేస్తూ విశాలాక్షి కనిపించింది. ఆమె తన్ని గమనించలేదు. జుట్టు ముడివీడి బుజాలమీదా నుదుటిమీదా పడుతూంది బాగా చిక్కిపోయి మెడకొంకులు బయటకొచ్చి, చిదకదవడలు పడ్డాయి. విశాలాక్షి బయటపడ్డ ముందు పళ్ళతో అస్థిపంజరంలా కదుల్తూంది. కట్టుకున్న చీరకూడా మాసిపోయింది.

"చెల్లీ!" అన్నాడు నూతిలోంచి మాట్లాడినట్టుగా. అతని గొంతు పూడిపోయింది.

విశాలాక్షి తలెత్తింది. క్షణం అలా చూస్తూ నిలబడిపోయి తర్వాత దగ్గరగా వచ్చింది చేతులు దులుపుకుంటూ.

"వచ్చావా అన్నయ్యా. దా! లోపలికిపోదాం" అంది.

"ఉత్తరం అందలేదా?"

"లేదే. రాసావా?"

"బయల్దేరేముందు రాసాను".

ముందుగా గుమ్మంలో ఎదురయింది విధవాడబడుచు. "కులాసాగా ఉన్నారా! ఇదేనా రావటం" అంటూ వెనకాల అత్తగారు పలకరించింది.

ప్రసాదం సమాధానం చెప్పాడు. ఆతర్వాత మాటలు మరి పెరగలేదు. విశాలాక్షి కాళ్ళు కడుక్కొందుకు నీళ్ళు తెచ్చిఇచ్చింది. విశాలాక్షి మావగారు "అయితే చెల్లిని తీసుకువెళ్ళటానికి అన్నయ్యగారే స్వయంగా వచ్చారన్నమాట. బాగుంది." అన్నారు నవ్వుతూనే.

విశాలాక్షి బెదురుగా అత్తగారి ముఖంలోకి చూసింది. లిప్తలో ఆవిడ ముఖంలోని నవ్వు మాయం చేసుకుని చరచరా లోపలికి వెళ్ళిపోయింది. విశాలాక్షి గుండెలు దడదడలాడాయి. ప్రసాదం చూసీచూడనట్టుగా ఇదంతా గమనిస్తూనేఉన్నాడు. చెల్లెలువైపు తిరిగి "బావ ఇంట్లో లేడా ఏమిటి?" అంటూ ప్రశ్నించాడు.

"లేరు. ఇప్పుడే అలావెళ్ళారు. వస్తారు. గదిలోకిపోయి కూచుందాం పద" అంటూ విశాలాక్షి లోపలికి నడిచింది. ప్రసాదం ఆమెను అనుసరించాడు.

"ఇక్కడ నీ పెళ్ళి ఫొటో ఉండాలి. ఏది చెల్లీ?"

"అవును ఉండేది"

"మరి ఇప్పు డేమయింది"

"తీసేసాను"

"ఎందుకు?"

"ఆయన తీసెయ్యమన్నారు"

"కారణం?"

"ఏమో........."

ప్రసాదం ఈ ప్రస్తావన ఇక పొడిగించదల్చుకో లేదు. అతనికి చాలావరకూ అర్థంఅయింది.

"ఇంతగా చిక్కిపోయావేం చెల్లీ!"

"ఏం చిక్కాను? బాగా సేఉన్నాను"

"ఏమీబాగాలేవు బాగా నీరసించిపోయావు"

"అలా కనిపిస్తున్నానుకాబోలు"

"అవునుగాని ఆ ఉత్తరం అలారాసావేమిటి? అమ్మ ఎంత ఏడ్చిందో తెలుసా?

"అనుకుంటూనే రాసాను. తర్వాత బాధపడ్డాను ఎందుకు రాసానా అని. కాని ఉత్తరం రాయటం మొదలు పెడితే నా ఒళ్ళు నాకు తెలిసిందికాదు"

అయిదు నిమిషాలు కూచుందో లేదో విశాలాక్షి ఏదో పొరబాటు చేసినట్టుగా నాలిక కొరుక్కుని కంగారుగా లేచి "బోలెడంత పని ఉంది. ఇప్పుడే వస్తా"నంటూ బయటికి నడిచింది. ప్రసాదం లోపల్నించి విశాలాక్షి అత్తగారి గొంతు విన్నాడు. విశాలాక్షి నే కాబోలు దెప్పుతోంది. వెధవాడబడుచుకూడా ఏదో సణుగుతోంది. ప్రసాదం చేతి గడియారం చూసాడు. పదకొండవుతోంది. గోడలకేసి చూస్తూ గడపటం కష్టంగానే వుంది. ఈ సాయంత్రం ఎలా గయినా చెల్లెల్ని తీసుకుని బండెక్కాలి. ఈ ప్రస్తావన ఎవరిదగ్గర ఎలా తీసుకురావాలో, వాళ్లు వల్ల కాదంటే ఏం చెయ్యాలో ఎలా పని సానుకూలపర్చుకోవాలో అతను ఆలోచించసాగాడు. కిటికీలోంచి బైటికి చూసాడు. విశాలాక్షి నీళ్ళు తోడుతోంది. కొద్దిదూరంలో అత్తగారు పొదులు పెడుతున్నారు. ఆడబడుచు అవి మొక్కలై తీగలై కాయలుకాస్తే ఎవరెవరికి ఎన్నెన్ని పంచిపెట్టాలో, కూర ఎలావండుకోవాలో చెప్పుకొస్తోంది. మధ్య మధ్య పగలబడినవ్వుకుంటున్నారు. విశాలాక్షి మటుకు యంత్రంలా తన పని తను చేసుకుని పోతూంది. వాళ్ల సంభాషణలో ఆమె జోక్యం చేసుకోవటం లేదు. అక్కడ ఆమె ఉన్నదనే ధ్యాసే వాళ్లకు లేదు.

"అయితే ఒదిన పుట్టింటికి వెళ్లడం ఖాయం అన్నమాట" అంది ఆడబడుచు.

విశాలాక్షి గతుక్కుమంది. ఆడబడుచు కోరి ఈ ప్రస్తావన తీసుకురావటంలో అంతర్యం ఆమెకి తెలుసు. అత్త తన్ని నాలుగు మాటలని మనసు నొప్పించటానికి బాగా పనికివస్తాయి. అనుకున్నంతా అయింది.

"ఎవరెక్కడికి పోతే నాకేం. అయ్యో! ఇది నా యిల్లు, నా సంసారం అనే అభిమానం ఉండాలి గాని ఎప్పుడు పోతామా అన్నట్టుగా ఉంటే ఇక ఆ కాపరం ఏం అందంగా ఏడుస్తుంది. ఎల్లకాలం పెద్దవాళ్ళం మేం బ్రతికుంటామా, ఎవరి కాపురాలు వాళ్లు అభిమానించుకోవాలి ఎవరి బాధ్యతలు వాళ్లు తెలుసుకోవాలి. ఎక్కడుండాల్సిన వాళ్లు అక్కడుంటే లాభం. ఊరికే పుట్టిల్లు పుట్టిల్లు అనుకుంటూ ఎగబడితే వాళ్లేం ఒళ్లంతా బంగారం చేస్తారా, నాకు తెలియక అడుగుతాను" అంటూ ఓ తట్టెడు సణుగుడు చేసేసింది.

విధవాడబడుచు ఓరగా విశాలాక్షిని పరామర్శించింది. విశాలాక్షి నోరు మెదపలేదు. అమ్మ చిన్నప్పుడు అత్తవారింట్లో పడ్డపాట్లు విశాలాక్షికి ఇటువంటప్పుడు గుర్తుకు వస్తూంటాయి కాని ఇలా సూటిపోటి మాటలనేకంటే నలుగురూ కలసి నాలుగు కొట్టినా బాధ లేదనిపిస్తుంది. ఎప్పుడయినా పుట్టింటికి వెళ్ళుపుకోవాల్సిందే కాని తనగోడు వినేవారెవరూ లేరు. భర్తకి తనంటే అసహ్యం! తను తిన్నదో, ఉన్నదో ఆయనకి అవసరం లేదు. ఆయన కెంతసేపూ పేకాటలూ...... తాగుతాగనీ, అప్పుడప్పుడు అలా సందుల్లోంచి,గొందుల్లోంచి సానివాళ్ళకొంపల్లోంచి రావటం చూసామంటూ అనేకమంది అనేకవిధాల చెప్పుకోవటం తను వింది. ఆ తర్వాత తనుచేసిన పరీక్షలవల్ల అది నిజమని నిర్ధారణకూడా అయిపోయింది. కాని తనేమీ చెయ్యలేక పోయింది. కాళ్లు పట్టుకుని ఏడ్చింది. "అబ్బే ఏమీ లేదు. అంతా అబద్ధం! ఎవరో గిట్టనివాళ్లు చెప్పి వుంటారు." అనేసి తప్పించుకుని వెళ్ళిపోయాడు. రెండోమారు గట్టిగా అడుగుతే కసురుకున్నాడు. మూడోమారు బ్రతిమిలాడుతూ ప్రాధేయపడితే చెయ్యి చేసుకున్నాడు. నాలుగోమారు తల గోడకేసి కొట్టుకుంది విశాలాక్షి. "ఇంకా గట్టిగా బాదుకో. నాఇష్టం వచ్చినట్టు నేచేస్తాను" అనేశాడు. రోజుల తరబడి ఏడ్చింది. వీధిలోకి చూస్తే అందమైన జంటలు అటూ యిటూ తిరుగుతూంటాయి. పొంగివచ్చే దుఃఖాన్ని బలవంతాన అణుచుకుని, గుండెలు చిక్కబట్టుకుని మంచంమీద పడి బాధగా మూలుగుతుంది. ఆమె చిన్ననాడు కన్న కలలన్నీ ఇలా బుగ్గయిపోతున్నాయి.

ఒక్కొక్కప్పుడు ఏ నూతిలోనన్నా దూకితే బాగుండు ననిపిస్తూంటుంది కాని నీరుని చూస్తే విశాలాక్షికి అమిత భయం.

మళ్ళీ కనిపిస్తానన్న విశాలాక్షి పదకొండున్నరయితే గాని గదిలోకి రాలేదు చేతులు తుడుచుకుంటూ "అన్నానికి లే అన్నయ్యా! ఆయన ఒచ్చేటప్పటికి చాలా పొద్దుపోతుంది" అంది.

ప్రసాదం ఈ ఇంట్లో తనకి జరుగుతున్న మర్యాద కొలిచి చూసుకుంటే మనసు చాలా కష్టం వేసింది. గబగబా వెళ్ళి హోటల్లో భోజనం చేసి వస్తే బాగుండు ననిపించింది. కాని విశాలాక్షిని ఇరకాటంలో పెట్టినట్టవుతుందని ఆ సంకల్పం విరమించుకున్నాడు. "బావరానీ ! వచ్చాక ఇద్దరం కలిసి తింటాం" అన్నాడు.

"ఆయన ఇప్పుడప్పుడే రారు. చాలా ఆలస్యం అవుతుంది"

"ఫర్వా లేదులే"

విశాలాక్షి వెళ్ళిపోతూ "ఇవ్వాళ వంట తొందరగా చేశాను. అత్తగారూ, మావగారు ముందు భోజనం చేస్తారు. వాళ్ళకి వడ్డించేసి వస్తాను" అంది.

ప్రసాదం మరో గంట రైలు ప్రయాణంలో అనుభవాలని నెమరుకు తెచ్చుకుంటూ గడిపాడు. కిటికీలోంచి దూరంగా స్టేషనూ, ప్రయాణీకులూ కనిపిస్తున్నారు. వేపచెట్టు మీద కాకి దంపతులు గూడు కట్టుకుంటున్నాయి. వీధి కుక్కలు విస్తరాకుల కోసం దెబ్బలాడుకుంటున్నాయి మధ్య గదిలోంచి గడియారం గంటలు కొడుతూంది. చేతిగడియారం చూశాడు. పన్నెండున్నరయింది. "సాయంత్రం నాలుగ్గంటలకి బండి ఉంది. ఆ బండిలో వెళ్ళిపోవాలి."

విశాలాక్షి గదిలోకి వచ్చి "ఇంకా ఎంతసేపని కూచుంటావు ఒచ్చేసెయ్యి" అంది.

ప్రసాదం ముఖం ముడుచుకునే అభిమానం చంపుకోవటంవల్ల పొందే బాధతో చెల్లెలు వెనకాల వంటగదిలోకి నడిచాడు. దేముడి పటం ముందు కూచున్న అత్తగారు ఇటువైపు దృష్టి మళ్ళించి తిరిగి చూడనట్టు నటించింది. ఆమె మర్యాదకోసమైనా రమ్మనమని ఆహ్వానించలేదు. భోజనం చేస్తున్నంతసేపూ ఆ గదిలో నిశ్శబ్దం దుర్భరంగా ఇనుమడించింది. పీటమీద నిప్పుమీద కూచున్నట్టే కూచుని అయిందనిపించాడు. చెల్లెలు కన్నీరు చాటుగా తుడుచుకోవటం అతను గమనించక పోలేదు. మజ్జిగ కలుపుకుంటూ "చెల్లెల్ని తీసుకు వెళ్దామని వచ్చాను" అన్నాడు.

ఆవిడ ముఖంమీంచి పుస్తకాన్ని తప్పించి "నాకేం ఉంది, వాళ్ళాయన ఇష్టం" అంది.

ప్రసాదం చేతులు కడుక్కుని గదిలోకి వచ్చేసరికి వీధిగదిలో బూట్ల టకటకలు వినిపించాయి. వెనక్కి తిరిగేసరికి భద్రం వస్తున్నాడు. పెళ్ళినాటి మనిషి ఇప్పుడు సగం అయిపోయాడు. ముఖంలో జీవకళ లేదు. ప్రసాదం నవ్వుతూ "ఇంత ఆలస్యంగా వచ్చావేం?" అంటూ పలకరించాడు.

"ఎప్పుడు రావటం? అంతా కులాసా?" అన్నాడు భద్రం బూట్లు విప్పుతూను.

"పదింటికి వచ్చాను"

అంతకంటె సంభాషణ పెరగలేదు. అతను స్నానానికి వెళ్ళగానే విశాలాక్షి గదిలోకి వచ్చి "ఇప్పుడు రాగానే అడుగు మళ్ళీ వెళ్ళిపోతారు" అంది రహస్యం చెబుతున్నట్టుగా.

ప్రసాదం భద్రాన్ని అడిగాడు. సమాధానం అనుకూలంగా రావటంతో అన్నా చెల్లెళ్లు ఇద్దరూ కొంత ఆశ్చర్యపడ్డారు.

భర్త భోజనానికి వెళ్ళిం తర్వాత "అత్తయ్యగారితో కూడా చెప్పు" అంది విశాలాక్షి.

ఆవిడతో చెబితే "మీ ఇష్టం" అంది. ముఖం మటుకు ముటముట లాడుతూనే ఉంది. కొడుకు ఇంత సులువుగా ఒప్పుకుంటాడని ఆమె అనుకోలేదు.

విశాలాక్షికి చప్పున ఏదో స్ఫురించినట్టయింది. గబగబా గదిలోకి వచ్చి "అన్నయ్యా నాకేదో భయంగా ఉంది" అంది.

"ఎందుకు?" అన్నాడు ప్రసాదం

"ఏమిటో"

"ఏమీ లేదు. బట్టలు సర్దుకో"

విశాలాక్షి బట్టలు సద్దుకుంటూ మళ్లీ, "నాకు భయంగా ఉందిరా అన్నయ్యా" అంది.

"ఎందుకే?" అన్నాడు ప్రసాదం చిరాగ్గా.

భర్త ఇంతసులువుగా అంగీకరించటంలో రహస్యం గురించి విశాలాక్షి ఊహించి మనసుపాడు చేసుకుంటూంది. ఏమీ లేదని ఎంత సద్దుకుందామన్నా మనసు శంకిస్తూనే ఉంది.

అత్తగారికీ, మామగారికీ చెప్పి బండి ఎక్కుతూ కూడా విశాలాక్షి కన్నీరు బొటబొటా కార్చేసింది. కోడల్ని సాగనంపటానికి వీధి గుమ్మంలోకి ఎవరూ రాలేదు. చివరికి బండిఎక్కి రైలుకూత కూసి బయల్దేరే వరకూ కూడా వెళ్లటమా మానటమా అని మనసు పీకుతూనే ఉంది విశాలాక్షికి. చివరికి ఒక పరిస్థితికి వచ్చేసరికి ఆమె తన ఉనికినే మరిచి బొటబొటా కన్నీరు కార్చి రెండు చేతుల్తోనూ ముఖాన్ని కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్చేసింది.

ప్రసాదం కంగారుగా "ఎందుకు ఏడుస్తున్నావు చెల్లీ" అంటూ ఆమె ముఖంమీద చేతులుతీశాడు. విశాలాక్షి కళ్లు తుడుచుకుని "ఇక నేను బ్రతికిఉన్నా చచ్చిపోయినా ఒకటే అన్నయ్యా" అంది.

ప్రసాదం ఒళ్ళు ఝల్లుమన్నది. నోటమాట పెగల్లేదు. అతని రెండు కళ్ళూ అశ్రుపూరితాలయిపోయాయి. ప్రయత్నంమీద అవి ధారకట్టి చెంపలు చెరువైపోకుండా అణుచుకుని చెల్లెలకు ధైర్యం చెప్పాడు. ఆమె సంసారం తిరిగి కుదుటపడుతుందనీ, ఇటువంటి సంసారాలు తను చాలా చూశానని ఉదాహరణలు తీసుకొచ్చి నచ్చచెప్పాడు.

బండి వేగంగా సాగిపోతూంది పెట్టెలో జనం చాలా పల్చగా చెదురువాటుగా అక్కడా అక్కడా కూర్చున్నారు. విశాలాక్షి దుఃఖంతో పొంగిన ముఖాన్ని కిటికీవైపుకి తిప్పి బయటి ప్రపంచాన్ని గమనిస్తూంది. చారికలు కట్టిన ఆమె బుగ్గలవైపు చూస్తూ ప్రసాదం ఆలోచనలో పడ్డాడు. చప్పన అతనికి వచ్చేటప్పుడు రైల్లో కలిగిన అనుభవాలు జ్ఞప్తికి వచ్చాయి. తన హృదయాన్ని సూటిగా నాటుకున్న అనుభవం ఇరవై ఏళ్ల అమ్మాయి నిర్భయంగా, నిస్సంకోచంగా నరకాన్ని కోరుకోవటం. విశాలవైపు చూస్తుంటే ఆ ముఖంలో ఆనాటి యువతి కనిపించింది. అయితే తన చెల్లెలి జీవితంకూడా అలాగే...!!! ఊహామాత్రంగానైనా అతను భరించలేక కళ్లు గట్టిగా మూసుకుని కిటికీవైపు ముఖం తిప్పేశాడు.

"ఒక్క మాట అడుగుతాను చెబుతావా అన్నయ్యా?"

"ఏమిటది?"

"ఏమీ లేదు లే"

"చెప్పు చెల్లీ. ఏమిటామాట"

"మొదట్లో ఆయన గురించి విని చాలా బాధపడ్డాను. ఏడ్చాను. కాళ్లా వేళ్లా పడి నా కన్యాయం చెయ్యవద్దని బ్రతిమాలాను. తిట్లు తిన్నాను, దెబ్బలు తిన్నాను, ఎన్ని అవమానాల్నయినా సహించాను. చివరికి గుండె రాయిచేసుకున్నాను. ఆదరించకపోయినా కనీసం ఆయనకి సేవచేసే భాగ్యమైనా నాకు దక్కలేదు. ఆయన పాదాలు ముట్టుకునే యోగ్యతకూడా నాకు లేదా? అబ్బ!..." విశాలాక్షి మనసు మళ్లించుకుందుకోసం సంచీలోంచి పుస్తకంతీసి చదవసాగింది. చదివిన పంక్తులే మళ్లీ మళ్లీ చదివినా మనసులో నిలవటంలేదు. భారంగా నిట్టూర్చి పుస్తకం మూసేసింది. క్లబ్బులో సిగరెట్ల పొగలమధ్య, పేకదస్తాలు కలుపుతూన్న భద్రం ఆమె కంటిముందు మెదుల్తున్నాడు "ఎవరో కుర్రాడు వచ్చి ఏదో తెచ్చి ఇచ్చాడు. అందరూ తలో గ్లాసూ అందుకుని తూలుతూ ఆప్యాయంగా తాగేస్తున్నారు. ఏమిటది? మంచినీళ్లా? కాదు. ఖరీదైన ద్రావకం. అవును! అదే!!!" విశాలాక్షి కళ్లు తిరిగిపోతున్నాయి. ఆమె మనసు ఆమె అదుపులో లేకుండా పోయింది. అలా ఊహాచిత్రాల్ని చిత్రిస్తూనే ఉంది. మురికి సందులు, సందుల్లో పందులు, మురికికాలవల్లో పొర్లుతున్న పందులకి పక్కగా గుమ్మాలకి కట్టిన గోనుగుడ్డల్ని ఒత్తిగిలించి తొంగిచూసే పడుపుకత్తెలు. సిగరెట్టు పీలుస్తూ గోనుగుడ్డల్ని తప్పించుకుంటూ లోపలికి అడుగుపెడుతున్నదెవరు? తన పెనిమిటా? అవును. ఆయనే! విశాలాక్షి తల వెళ్లి కిటికీకి కొట్టుకుంది. తల దిమ్మెక్కిపోయింది. బొప్పికట్టింది కూడాను. ప్రసాదం ఇదేమీ గమనించటం లేదు. అతను పుస్తకం చదవటంలో నిమగ్నుడైపోయాడు.

బండిలో లైట్లు వెలిగాయి. చీకట్లు దట్టంగానే ముసురుకుంటున్నాయి. ఆకాశం బాగా మబ్బేసింది.

విశాలాక్షి చీరచెంగు నెవులమీంచి శరీరమంతా కప్పుకుని దగ్గరగా ముడుచుకుని తల కిటికీకి భారంగా ఆన్చి మధ్య మధ్య కంపించే పెదవుల్ని పళ్ళతో నొక్కి పడుతూ తలపుల తెరలలోపడి అతలాకుతలమై పోతోంది.

"ఈ పరుగెత్తే రైలులోంచి దూకేస్తే—ఈపాడు ప్రాణం మీద ఎందుకింత తీపి? ఈ శరీరం మీద ఎందుకింత మమకారం? అసలా మమకారమే లేకపోతే చనిపోవక్కరలేదు. బ్రతికుంటే సుఖపడొచ్చేమో! ఏమో ఎలాగయినా కానీ ఈ బ్రతుకును అప్రతిష్ఠ పాలు చెయ్యకు భగవంతుడా! నా జీవితం అవమానాలపాలు చెయ్యకు!"—మెదడు ఆలోచనలతో అలిసి అలిసి నిద్రపోయింది. విశాలాక్షికి తిరిగి మెలకువ వచ్చేసరికి సగం రాత్రయిపోయింది. పెట్టెలో చాలామంది నిద్రపోతున్నారు, ప్రసాదం ఒదిగి కిటికీకి తలఆనించి పడుకుని ఉన్నాడు. ఇద్దరు ముగ్గురు మెలకువగానే ఏవో మాట్లాడుకుంటున్నారు. ఆకాశం మబ్బులు లేలిపోయి తెరపిచ్చింది. నక్షత్రాలు మినుకుమినుకుమంటుంటె వాటి వైపు చూస్తూనే తిరిగి నిద్రకి జారుకుంది విశాలాక్షి. తెల్లవారి ప్రసాదం లేచే వరకూ ఆమెకు మెలకువ రాలేదు. ముఖం కడుక్కుని ఇద్దరూ టిఫిను తెప్పించుకుని తిన్నారు. రాత్రల్లా ప్రసాదానికి అపపా తపపా నిద్ర మెలుకువ వస్తూనే ఉండటంవలన కాబోలు తెల్లారే సరికి ముఖం నిగారించి ఉంది. మరో గంటలో వాళ్లు దిగవలసిన స్టేషను రానే వచ్చింది.

ప్రసాదం సామాన్లు భద్రంగా దింపించి చెల్లెల్ని తీసుకుని స్టేషను దాటి ఇవతలికి వచ్చిం తర్వాత ఏదో పెద్ద బరువు దించినట్టుగా నిట్టూర్చాడు. విశాలాక్షి ముఖంలోకి చూశాడు. నుదుటి మీద ముంగురుల్ని వెనక్కి తోసుకుని తలవంచుకుని నడుస్తూంది. బండి మాట్లాడుకున్నారు.

## 4

శుభకార్యం కాస్తా ముచ్చటగానే జరిగిపోయింది. ప్రసాదం ఈ వారం రోజులలోనూ చెల్లెలు గురించే ఆలోచించలేదు. అతని ప్రపంచం అతనిది. అందులో తనూ, అనూరాధా తప్పించి మరెవరికీ చోటు లేదు. సూది మోపే చోటు కూడా అక్కడ ఇతరులకి అవకాశం లేదు. ఒకళ్ళకొకళ్లు కొంత పాత బడి తిరిగి ఈ ప్రపంచంలోకి రావటానికి ఎక్కువ కాలం పట్టలేదు అప్పటికి తన హద్దు లేమిటో అతను తెలుసుకోగలిగాడు. ఆమెని హృదయానికి హత్తుకునే ఏకాంతంగా అనేక విషయాలు మాట్లాడాడు. ప్రణయ కవిత్వానికి స్వస్తి చెప్పాడు. ఆమె ఈ ఇంట్లో ఎలా మసులుకోవాలో, ఆమె బాధ్యత లేమిటో నచ్చ చెప్పాడు. ఆమె అవన్నీ శ్రద్ధగా విన్నది. "నేను మీ ఇష్టప్రకారమే నడుచుకుంటాను. నా బాధ్యతలు నేను నిర్వర్తిస్తాను" అని ఆమె ప్రమాణం కూడా చేసింది. అలా ప్రమాణం చేస్తున్నప్పుడు తనేదో మహా గొప్ప పని చేస్తున్నట్టే ఆమె గర్వపడింది.

ప్రసాదం తన అదృష్టానికి ఉబ్బితబ్బిబ్బవుతూ అనూరాధని గట్టిగా హృదయానికి హత్తుకుని 'అనూరాధా' అని స్పష్టంగా గొణిగాడు.

అనూరాధ "మా నాన్న ఏదో లోటు చేశారని పెళ్ళిలో కొంత గల్లంతు జరిగింది. ఆయనకి కోపం వచ్చి తొందరలో ఏదో అనేశారు. అదేమీ మనసులో పెట్టుకోకండి. ఆయన్ని క్షమించండి" అంది.

"నీకేమైనా పిచ్చి పట్టిందా. ఆ సంగతి నేనెప్పుడో మర్చిపోయాను."

"నాన్న ఎన్ని ఉత్తరాలు రాసినా సమాధానం ఎందుకు రాయలేదు.?"

"ఏదో పని తొందరలో ఉండి రాయలేదు"

"నాన్న కూడా అలాగే అనుకున్నారు లెండి"

క్షణం మౌనంగా గడిచిం తర్వాత అనూరాధే అడిగింది. "ఒదిన కాపరం గురించి చాలా విన్నాను. ఎంత వరకు నిజం?"

ప్రసాదం భార్య దగ్గర చెల్లెలు దుస్థితి ఎత్తటానికి కించపడ్డాడు. బాధపడుతూనే "ఎవరు చెప్పారు?" అన్నాడు.

"ఎవరో చెప్పుకుంటూంటే విన్నాను నిజమేనా?"

ప్రసాదం తలవంచుకునే "అవును నువ్వు విన్నది నిజమే. ముందు తెలుసుకోలేక పోయాను. చివరికి దాని బ్రతుకిలా అయిపోయింది." అన్నాడు.

"నేనూ ఎంతో బాధపడ్డాను. దేముడి దయవల్ల ఆవిడ కాపరం కుదుటపడితే మనందరికీ కావల్సిందేముంది?"

నిజానికి కోడలు రాకతో కామాక్షమ్మ ఎంతో సంబరపడాల్సినమాట. ఈ సంసారానికి ఆమె ముప్ఫై అయిదేళ్లు తాపత్రయపడింది. నడుం విరుచుకుని చాకిరీ చేసింది సుఖపడటంకోసం ఎదురుచూసి చూసి చివరికి ఆ ఘడియ వచ్చేసరికి మనసులో మరో సమస్య చిక్కుకుంది. అది కూతురు కాపరం సంగతి. ఆమె కిప్పుడు అస్తమానూ అదే దిగులు. పరంధామయ్యగారు భార్యను ఓదారుస్తూంటాడు.

అనూరాధ కాపరానికొచ్చిన కొత్తలోనే అత్త కామాక్షమ్మ తన అధికారాన్ని ఓమారు వినియోగించుకుంది. ఒకరోజు మధ్యాహ్నం కామాక్షమ్మ భోజనాలదగ్గర "ఒసే అనూరాధా! వెళ్ళి విశాలాక్షి పక్కన కూచోక పోయినావా" అంది. అయితే అప్పటికే సగం భోజనం అయిపోయింది. రాత్రి కడుపులో నొప్పిగా ఉండి భోజనమే చెయ్యలేదు. 'ఆవిడ పక్కన కూచుని భోజనం చెయ్యటం నా మోక్షికాబోలు' అంటూ కామాక్షమ్మ తనకి వినిపించేటుగా కూతురుదగ్గర గొణిగింది. అందుకనే రాత్రి భోజనం మానిందని ఆవిడ అనుకుంది. అనూరాధ మనసులో కష్టం వేసినా తమాయించుకుంది. ఉదయంనించి అత్తదగ్గిర్నించి అడిగిన వాటికి క్లుప్తసరిగా, అయిష్టంగా వచ్చే సమాధానాలకి కారణం ఇప్పుడామెకి బోధపడింది. ఆ పూట భోజనాలదగ్గర విశాలపక్కనే కూచుంటే సరిపోతుందనే నిర్ణయానికి వచ్చింది.

కాని ఆ పూట ఒంట్లో బాగులేదని విశాలాక్షి భోజనమే చేయ్యలేదు. ఆ రాత్రికి కొద్దిగా జ్వరం కాసింది. డాక్టరు వచ్చి చూసి వెళ్ళాడు. మూడో రోజుకి కొంత తగ్గుముఖం పట్టింది. ఆరు లంఖణాలు పడ్డాయి. అసలు దిగులతో చిక్కి శల్యమైన విశాలాక్షి ఈజ్వరంతో పూర్తిగా నీరసించి గుర్తుపట్టడానికి వీల్లేకుండా మారిపోయింది.

## 5

కూతుర్ని గట్టిగా గుండెలకి హత్తుకుని బావురుమంది కామాక్షమ్మ. "అసలే అది లంఖణాలు చేసి దిగులుపడి ఉంటే మనసుని ఉత్సాహపరచాలిగాని ఇలా బెంబేలెత్తిస్తే అదేమైనా బ్రతకాలా" అంటూ పరంధామయ్యగారు భార్యని మందలిస్తున్నాడు. ప్రసాదం గదిగుమ్మంవద్దే నిలబడి చూస్తూండి పోయాడు. అనూరాధ అయోమయంగా అందరి ముఖాలూ గమనిస్తూ నిలబడింది.

చేతిలో ఉత్తరం అలాపట్టుకునే రాయిలా కూలబడిపోయింది విశాలాక్షి. ఆమె నోట మాటయినా రాలేదు. కనీసం కన్నీరైనా రావటంలేదు. తల్లి మటుకు గుండెలు బాదుకుని ఏడుస్తూంది. పరంధామయ్యగారు బాధనంతా అణచుకుంటున్నారు. ప్రసాదం మనసులోనే బావ భద్రాన్ని చితక తంతున్నాడు. పళ్లు పట పట కొరుకుతున్నాడు. మొత్తానికి కామాక్షమ్మ గొంతు తగ్గించి మిగతా వారంతా నిశ్చేష్టులై కర్తవ్యమూఢులై నిశ్శబ్దంగా ఉండి పోయారు.

భద్రం రాసిన ఉత్తరం ఇలాగుంది :

"మామగారికి తమ అల్లుడు అనేక నమస్కారాలు చేసి వ్రాయునది:—

ఎన్నాళ్ళనుంచో ప్రయత్నం చేస్తున్నాను ఉత్తరం రాయాలని. ఇవాళ పడింది. బహుశః ఈసరికే మీ అమ్మాయిని తిరిగి ఇక్కడికి తీసుకువస్తే ఉద్దేశంలో ఉండిఉంటారనుకుంటాను. నామాట విని ఆమెని అక్కడే ఉంచండి ఇక్కడికి తీసుకువచ్చినా ప్రయోజనంలేదు. మా అమ్మ బొత్తిగా మంచిదకాదు. చచ్చే చాకిరీ చేయించుకుంటుంది. ఇక నేనంటారా? నా దారి వేరు. విశాలాక్షికీ నాకూ ఏ విధమైన సంబంధమూ లేదనే నా అభిప్రాయం. ఇక ఆమె దారి ఆమెదీ, నాదారి నాదీను. ఎందుకని అడక్కండి నా మనసు అలా అయిపోయింది. ఇక ఈ మనసు మారుతుందనే విశ్వాసంలేదు. ఒక వేళ మారితే అప్పుడు నేనే మీ ఇంటికి వస్తాను. అంతవరకూ ఈ జీవితాలు ఇలా సాగిపోవల్సిందే. నేను హఠాత్తుగా ఇవాళ ఇలాగయిపోలేదు. మీ అల్లుణ్ని కాకపూర్వమే ఇలా అయిపోయాను. మీకు తెలియక బురదలో అడుగేశారు. పోనీలెండి. ఏం చేస్తాం! నేనిక ఇంటికి పోదల్చుకోలేదు. రెండు రోజుల్లో దేశాటనం బయల్దేరదామనుకుంటున్నాను. విశాలాక్షిని నేను ప్రేమించలేకపోతున్నాను. అభిమానించలేకపోతున్నా. బహుశః మీ అమ్మాయిద్వారా నా గురించి అంతా వినేఉంటారు. వినకపోతే అడిగి తెలుసుకోండి. అడిగినా చెప్పకపోవచ్చు. నేనే చెబుతాను వినండి. నాకు అబ్బని దురలవాటు లేదు. తాగు

తాను. వ్యభిచరిస్తాను. జూదం ఆడతాను. ఇక నేను బాగుపడతాననే ఆశ ఏమైనా ఉందా మీకు? నా మనసు నా స్వాధీనంలో ఉండదుగా. ఆ అడుగు అలా జారిపోతుంది. ఇక నన్ను అంతా మరిచిపొండి. మరిచిపోతే సుఖపడతారు. లేకపోతే కష్టాలు పడతారు నాకోసం మీరెవరూ రావద్దని మరీమరీ రాస్తున్నాను నన్ను మీరెవరూ మార్చలేరు. నేను మామూలు మనిషిని అవటం అసంభవం! మీరు వృథాగా శ్రమపడకండి నేను ఈ ఊరువిడిచి వెళ్లిపోతున్నాను. ఎక్కడికి వెళ్ళేదీ, ఎప్పుడు వచ్చేదీ ఎవరికీ తెలియదు ఎవరికీ చెప్పదల్చుకోలేదు ఉంటాను."

అంతే! కింద సంతకం కూడా లేదు. ఆ దస్తూరీ మటుకు ఆయనదే అనటంలో సందేహం లేదు. కొద్దిసేపు ఆదస్తూరీ అతనిది కాదేమోనంటూ పరంధామయ్యగారు తన అనుమానాలన్నీ ఏకరువు పెట్టారు. ఎవరైనా ఏడిపించటానికి ఇలా రాశారేమో అన్నాడాయన.

"అబ్బే ఆ దస్తూరీ ఆయనదే" అంది విశాలాక్షి దుఃఖం దిగమింగుకుంటూను.

"మరి సంతకం ఎందుకు పెట్టలేదు?"

"ఏమో"

"వీడు మనిషి కాడు. జంతువైనా నయం. దేనికైనా భయపడుతుంది. వీడికి హృదయం లేదు." అంటూ తిట్టిపోస్తూంది కామాక్షమ్మ

"పోనీ నువ్వేమారు పెళ్లిగారాదూ" అన్నాడు ప్రసాదం కామాక్షమ్మ కూడా ఇదే అభిప్రాయం వెలిబుచ్చింది. పరంధామయ్యగారు ఆ సాయంత్రం బండిలోనే వెళ్ళిపోవాలని నిశ్చయం చేసుకున్నారు. కామాక్షమ్మ ఏడుస్తూనే మధ్య గది స్తంభానికి చారబడి కూచుంది. ఇరుగుపొరుగువాళ్లంతా గుమ్మాల్లోంచీ, కిటికీల్లోంచీ తొంగిచూట్టం ప్రసాదానికి కోపం వచ్చటం లేదు. తెగించి ఏమైనా అనటానికి నోరు రావటం లేదు. కామాక్షమ్మ ఊరుకోమంటే ఊరుకోదు. బయటివాళ్లు ప్రవాహంగా లోపలికి రావటం మొదలెట్టారు. వచ్చిన వాళ్లంతా తలో ప్రశ్న వేస్తున్నారు. ఏడుస్తూనే కామాక్షమ్మ సమాధానాలిస్తోంది. వీళ్లంతా తనపట్ల చూపుతున్న జాలి, సానుభూతి భరించలేక విశాలాక్షికి ఒళ్లంతా కంపరమెత్తిపోతూంది "ఏమిటే పాడుపీడ! అసలే ఏడుస్తూంటే" అంది అన్నయ్యగదిలోకి వెళ్ళి. ప్రసాదం బయటికివచ్చి బలవంతాన తల్లిని లోపలికి తీసుకెళ్లిపోయాడు. వ్యాఖ్యానాలు, విమర్శలూ చేసుకుంటూ ఎక్కడివాళ్లక్కడ తప్పుకున్నారు. ఆ సాయంత్రానికే ఆ కుటుంబ విషయం నడివీధికెక్కి ఊరుఊరంతా పాకిపోయింది. 'చెల్లిని జాగ్రత్తగా చూస్తూండు' అంటూ ప్రసాదం చెల్లి రక్షణభారం అనూరాధపైన వేశాడు. అనూరాధ విశాలాక్షిని అంటిపెట్టుకునే తిరుగుతూంది.

పెరట్లోకి వెళ్తూ వెంబడిస్తున్న వదినను "నే నేమీ ఆత్మహత్య చేసుకోనులే. నీకెందుకింత అనవసరపు శ్రమ" అంది విశాలాక్షి.

"అబ్బే అందుక్కాదు. ఊరికే నే"

"ఊరికే నే ఎవరైనా కూడాకూడా ఎందుకు తిరుగుతారమ్మా"

అనూరాధ మాట్లాడలేదు. ప్రతినిముషం తన జీవితం గురించే మథనపడే విశాలాక్షితో మాటలు ఎలా కలపాలో, ఎలా ఆమె మనసు మళ్లించగలదో అనూరాధకి ఎంత ఆలోచించినా తట్టటంలేదు అడిగిన ప్రతి ప్రశ్నకీ సమాధానాలు చాలా ముక్తసరిగా, అయిష్టంగా వస్తున్నాయి.

ఆ రోజల్లా ఇంటెడు చాకిరీ అనూరాధ నెత్తిమీద పడింది విశాలాక్షిని ఓకంట కనిపెడుతూండాలి అత్తగారు మధ్యగదిలో కూచుని శాపపెడుతూంది. పరంధామయ్యగారు బండికెళ్ళే ప్రయత్నంలో ఉన్నారు. ఆయనకి తొందరగా వంటచెయ్యాలి. ఆయన ప్రయాణానికి ఏర్పాట్లన్నీ చూడాలి. అవనీ ఇవనీ ప్రసాదం ఏదో ఒకటి పురమాయిస్తూనే ఉంటాడు. ఆ పూట ఇంట్లో ఎవరికీ కోపం రాకుండా సద్దుబాటు చెయ్యాల్సిన బాధ్యత అనూరాధ నెత్తిమీద పడిందన్నమాట!

పరంధామయ్యగారు ప్రయాణం అయివెళ్ళారు. ప్రసాదం గదిలో కూచుని చదువుకుంటున్నాడు. కామాక్షమ్మ కొంగుపరుచుకుని గడపమీద తల ఆన్చి పడుకుంది. విశాలాక్షి గదిలో కిటికీ వారగా కూర్చుని జరగవల్సిన దానిగురించి ఆలోచిస్తూంది. అనూరాధ వంటగదిలో ఊపిరిసలపని పనిలో ఉన్నా మధ్య మధ్య వచ్చి చూసిపోతూ ఉంది. చీకటిపడుతూంది. ఇవాళ విశాలాక్షి తలదువ్వుకోలేదు. అనూరాధ దువ్వబోతే వేయించుకోలేదు. జుట్టు రేగి ముఖంమీద పడుతూంది. నుదుటిమీద బొట్టు కరిగిపోయింది. కళ్ళు నీరసంగా,

భారంగా మెదుల్తున్నాయి. ఉండి ఉండి ఎక్కడికో జారిపోతున్నట్టుగా కడుపులో తిప్పుతోంది. తాను ఎటువంటి పరిస్థితినైతే ఊహించుకుని ఇక్కడికి రావటానికి భయపడిందో ఆ పరిస్థితే ఇప్పుడు ఎదురైంది. తను అనుకున్నంతా అయిందన్నమాట. తను బాధపడుతుంటే తండ్రి ఓదార్చాడు "నీవేమీ దిగులుపడకమ్మా నీ కాపరం కుదుటపడేదాకా కంటికి రెప్పలా చూసుకుంటాం," అంటూను. తల్లికూడా అలాగే అంది. అన్నయ్యా అలాగే ధైర్యం చెప్పాడు. 'సహృదయుడైన భర్త సాన్నిధ్యంలో స్త్రీ పొందే స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు, ఆ జీవితం, తల్లిదండ్రులు ఎంత మంచివారయితే మటుకు ఎక్కణ్ణుంచి లభిస్తాయి' ఆమె ఇటువంటి అనాథల్ని ఎంతమందినో చూసింది. ఎన్నో విన్నది. వింటున్నప్పుడు తనలో జాలికంటె భయం ఎక్కువగా ఆవహించేది. అప్పటికే తన భర్త నీతి నిజాయితీలు తెలియనే తెలిశాయి. తన జీవితం అప్పటికే బుగ్గయిపోయింది. ఇలాంటి గతి పట్టటం ఈనాడు కాకపోతే రేపైనా సంభవం అని తను అనుకుంటూనే ఉంది. ఇది హఠాత్తుగా తిన్న దెబ్బకాదు. తను వచ్చేటప్పుడు భయపడుతూనే బండిఎక్కింది. ఇక వీళ్ళపిచ్చిగాని ఆయన దొరుకుతారా? ఈ సరికి ఊరువిడిచి వెళ్ళిపోయిఉంటారు. తను స్కూలు ఫైనలువరకూ చదివింది. ఇంకా నాలుగయిదేళ్ళు శ్రమపడితే ఆ చదువు రాణింపుకొస్తుంది. ఆ తర్వాత అదృష్టం బాగుంటే ఉద్యోగం దొరకాలి. ఇదంతా పూర్తయితేగాని ఈ జీవితం ఓ గాడిన పడదు. "—భారంగా నిట్టూర్చింది విశాలాక్షి. బయటవీథిలో దీపాలు వెలిగాయి. సందుకావటంవల్ల జనం సందడి హెచ్చులేదు. అనూరాధ వంటగదిలో పనిచేసుకుంటూంది. కామాక్షమ్మ లేచి కూతురుదగ్గిరికి వచ్చి నేలమీద చతికిలబడి కన్నీరు గ్రుక్కుకుంటూ "ఎరక్కపోయి చేశామే. గొంతుకోశాం తల్లీ. నిన్ను నిలువునా గంగలోముంచాం" అంటూ ఏడవటం మొదలుపెట్టింది. విశాలాక్షి ముఖాన్ని రెండు చేతుల్లోనూ కప్పుకుని వలవలా ఏడ్చేసింది.

"ఈ పాపిష్టివాడు నీకోసం పుట్టాడే. మేం అంతా గుడ్డివాళ్ళం అయిపోయాం" అంది కామాక్షమ్మ ఏడుస్తూనే.

ఇద్దరి దుఃఖస్వరాలూ విన్న ప్రసాదం, అనూరాధా గబగబా ఇవతలికి వచ్చారు.

"నువ్విలా దాన్ని దెప్పికొట్టటం మానవు ఇలాగయితే..." కామాక్షమ్మ కొడుకుమాట పూర్తవకుండా "ఎలా సహించగలనురా? హాయిగా కాపరం చేసుకుంటూ పిల్లా జల్లాతో సుఖపడుతుంటుందనుకుంటే ఇలా బుగ్గయిపోతే ఎలా సహించగలనురా" అంటూ గుండెలు బాదుకుంది. ప్రసాదం చప్పున అడ్డుపడుతూ తల్లిని రెక్కపట్టుకుని అవతలికి తీసుకుపోయాడు. ఆవిడ ఏడుపుమటుకు మానలేదు.

ప్రసాదం ఉన్నట్టుండి "అలా చూస్తూ నిలబడకపోతే అమ్మదగ్గిర కూచోకూడదూ. ఆమాత్రం తెలియదన్నమాట" అన్నాడు భార్యనుద్దేశించి.

అనూరాధ తలవంచుకునే "వంటచేస్తున్నాను" అంది.

"ఏడిచావలేక పోయావ్!"

అనూరాధ కిక్కురుమనకుండా అన్నిపన్లూ చేసుకుపోతూంది. కాసేపు అత్తగారి దగ్గరకూర్చుని కబుర్లు చెప్పింది. మధ్య మధ్య విశాలాక్షిని గమనిస్తూనే ఉంది. ఓ చెవి భర్త చదువుకునే గదివైపు వేసింది. ఆరోజు మరీ నిప్పులమీద నడిచినట్టయిపోయింది అనూరాధకి.

విశాలాక్షి కిటికీరెక్కలు మూసి మంచంమీద వాలి నిశ్శబ్దంగా దుఃఖించటం అనూరాధ గమనించి దగ్గరగావచ్చి మీద చెయ్యివేసి "ఇలా బాధపడితే ఎలాగమ్మా కాస్త ఓర్చుకోవాలి" అంది.

ఈ ఒక్కమాటతో విశాలాక్షి కుతకుతలాడిపోయింది. "ఓర్పు, సహనం గురించి ఇవాళ ఒకళ్ళ దగ్గర కొత్తగా నేనేవీ తెలుసుకోనక్కర్లేదమ్మా. అదే లేకపోతే ఏనాడో ఈ జీవితం అంతం అయిఉండేది" అంది.

ఆ కంఠంలోని తీవ్రతకి అనూరాధ మొదట్లో జంకినా తర్వాత చిన్నబుచ్చుకుంది. "అవునమ్మా! నువ్వన్నమాట నిజం! నీకంటే చిన్నదాన్ని. కొత్తగా కాపరానికి వచ్చినదాన్ని. నేను నీకు నీతులు చెప్పటం పొరబాటే. క్షమించు" అంది.

విశాలాక్షి మంచంమీద లేచి కూర్చుని "నేను బొత్తిగా మూర్ఖురాల్ని. కాకపోతే తన క్షేమం కోరే వాళ్ళని కసురుకోడానికి ఎంత సాహసం కావాలి. నువ్వే నన్ను క్షమించువదినా!" అంది.

వదిన చెంపలమీద కారే కన్నీరు తుడుస్తూ, "ఇందులో ఒకళ్లని ఒకళ్లు క్షమించుకోవటానికేమీ లేదు. నీ బాధ నాకు తెలుసు. కాని ఏంచేస్తాం. కాస్త ఓపిక పట్టటం తప్పించి..." అర్ధాంతరంగా ఆపివేసింది అనూరాధ. గుమ్మంలో నిలుచుని ఇదంతా వింటూన్న భర్త కనిపించటంతో అనూరాధ నోటికి తాళం పడ్డట్టయిపోయింది.

"అన్నయ్యా నా గురించి ఏం ఆలోచించావు?"

అనూరాధ వంటగదివైపు వెళ్లిపోయింది.

"ఏం చేద్దాం అనుకుంటున్నావు?"

"సగం చదివిన చదువు పూర్తిచేసుకుని, ఆ తర్వాత ట్రెయినింగు చదువుకుంటే ఆ తర్వాత..." విశాలాక్షి గొంతుక పూడిపోయింది. మాట పెగల్లేదు.

కన్నీరు తుడుస్తూ "నువ్విలా నీరు కారిపోతే లాభంలేదు దేనికైనా ధైర్యం కావాలి" అన్నాడు ప్రసాదం.

అనూరాధ గుమ్మందగ్గర నిలబడి "వంటయింది. భోజనానికి లేవండి" అంది.

## 6

భోజనాలు పూర్తయి ఎంగిళ్ళూ, విస్తళ్లు ఎత్తుకుని ఎక్కడివక్కడ సద్దుకుని, ఇల్లు కడుక్కుని అనూరాధ బయటపడేసరికి పది దాటిపోయింది. చేతులు తుడుచుకుంటూ గదిలోకి తొంగిచూసింది. అత్తగారూ విశాలాక్షీ పడుకుని ఉన్నారు. తలుపులన్నీ వేసి భర్తదగ్గిరకివచ్చి "నిద్ర పోతున్నారా?" అంది.

ముఖంమీంచి చెయ్యితీస్తూ "అంత సులువుగా నిద్రపడుతుందా" అన్నాడు ప్రసాదం.

"ఏం చెయ్యను. ఇంతవరకూ తెముల్చుకోలేక పోయాను."

"పోన్లే. ఇప్పుడు మటుకు మునిగిపోయిందేముంది?"

అనూరాధ అతని పాదాలవైపున కూర్చుని, "ఇవాళ వళ్ళంతా పచ్చి పుండయిపోయిందండీ" అంది ఆవులిస్తూను.

"ఫర్వాలేదు. కొద్ది సేపేగా. నేనూ నిద్ర పోగానే నువ్వూ పడుకుందువుగాని."

అనూరాధ కమ్ముకు వస్తున్న నిద్రని అణుచుకుంటూనే భర్త పాదాలమీద చేతులు వేసింది.

ప్రతి రోజూ ప్రసాదం కాళ్ళు పట్టించుకుంటేనేగాని నిద్రపోడు. రాత్రి పదయినా పన్నెండయినా అనూరాధకి ఆ పని తప్పదు. ఒక వేళ ఏనాడైనా తప్పినా అనూరాధ ఆనాడు తనవల్ల భర్తకేదో లోటు జరిగిపోయినట్టే బాధపడిపోతుంది. భర్త ఏది పురమాయించినా ఆమె ఎదురుచెప్పదు. అలా చెప్పిననాడు ఆమెలో జరిగే సంఘర్షణకి ఒక అంతంటూ ఉండదు. భర్త పాదాలు పట్టుకుని "క్షమించాను" అనే వరకూ వదలదు. అంతవరకూ ఆమెలో శాంతి ఉండదు. తన కర్తవ్య పాలనలో ఏ లోటూ లేకుండా ఉండాలనే తాపత్రయంలో ఆమె మహా గర్విస్తూంటుంది. తన తల్లి ఎలా మసులుతుందో ఆమె పదిహేడు సంవత్సరాలు చూసింది. తనకున్న తెలివితేటలన్నీ ఆమె జీవిత విధానాన్ని అర్థం చేసుకోవటంలో బాగా పనికి వచ్చాయి. చిన్నప్పుడు చదివిన పుస్తకాలనుంచిగాని, పెద్దలనుకునేవాళ్లు చెప్పిన నీతులనుంచిగాని ఆమె నేర్చుకున్న సందేశం స్థూలంగా ఇది, "నీ భర్త పాదపద్మాలే నీకు శరణ్యం. వాటిని ఏ పరిస్థితుల్లోనూ వదిలిపెట్టకు. వాటిని పూజించు. దాసిస్త సేవచేసి, అటు మెట్టినింటికీ, ఇటు పుట్టినింటికీ ఖ్యాతి తీసుకురా" ఇలాగే అందరూ ఆమెకి చెప్పారు. ఈ శబ్దాలు అనూరాధ చెవికి చాలా ఇంపుగా వినిపించాయి. ఒళ్లు పులకరించింది.

అనూరాధ తెల్లవారి లేవగానే భర్త పాదాలకి మొక్కుతుంది. "మీ మనసుకి కష్టం కలిగించే ఎటువంటి పరిస్థితినీ నేను కల్పించకుండా అవసరమైన ఓర్పు, శాంతం, సహనం, ప్రసాదించి ఈ దినం దుర్దినం కానివ్వకండి" అనికూడా ఆమె మనసులో అనుకుంటుంది.

ఓనాడు భార్యాభర్తల మధ్య చిన్న అభిప్రాయభేదం వచ్చింది. "నోరుముయ్. అట్టే వాగావంటే తన్నులు తినగలవు." అన్నాడు. భర్తకి ఇంతకోపం వస్తుందని అనూరాధ అనుకోలేదు. చప్పున నోరుమూసుకుంది. ఆ రాత్రి భర్త పాదాలమీదపడి ఏడ్చేవరకూ అతను క్షమించలేదు. అతను క్షమించేవరకూ ఆమె ఏడుస్తూనే ఉంది.

ఆడదానికి ఏమాత్రం లోకువ ఇవ్వకూడదని ప్రసాదానికి నిశ్చితమైన అభిప్రాయం ఒకటి ఉంది. అందుకనే అనూరాధని ఎంతదూరంలో ఉంచాలో అంతదూరంలోనే ఉంచాడు. ఆ హద్దుదాటి ఆమె ఏమాత్రం చొరవ తీసుకున్నా వెంటనే తగినశిక్ష ఆమె అనుభవించాల్సిందే. ఆ వినయమైన తర్ఫీదులో అనూరాధ ఇరుగుపొరుగువాళ్ళ అభిమానాన్నే కాక, అత్తగారి అభిమానాన్ని కూడా చూరగొంది. అందరూ ఆమెని ఆదర్శమైన ఇల్లాలుగా ముక్తకంఠంతో మెచ్చుకుంటున్నారు. అనూరాధ వంటగదిలో చేసే గొడ్డు చాకిరీ అంతా ఈ ఒక్క ప్రశంసతో తీరినట్టు అనుభూతి పొందుతూంటుంది.

ప్రసాదం మనసులో సంతోషిస్తాడు పైకి మటుకు "దానిమొహం అది బొత్తిగా మన్నుతిన్న పాము" అంటాడు:

అనూరాధ ఈ ప్రశంసలు తనకి గిట్టవన్నట్టుగా "బాగా చెప్పారు" అని భర్తకి తాళం వేస్తుంది.

అనూరాధ కాపరానికి రాగానే అత్తగారి బాధ్యతలు తన వంతు మేరకు కాకుండా అతి ఔదార్యంతో కొద్ది ఎక్కువగానే భాగం పంచుకుంది. ఏపనీ ఆమె ప్రమేయంలేకుండా జరగదు. చీకటి ఉండగానే లేచి పనిపాటలు చేసుకుంటుంది ఒక్క నిముషమైనా కూచున్నట్టు కనిపించదు రాత్రిపదయ్యేసరికి జైలులోంచి విడుదలైన ఖైదీలా వంటగది వదిలిపెడుతుంది. పనిపాటల విషయంలో కొత్తగా ఈ ఇంటికొచ్చి ఆమె నేర్చుకున్నదేమీ లేదు. చిన్నప్పట్నించీ తగిన శిక్షణ తల్లి వద్దలో అనూరాధ పొందింది. అనూరాధ కాపరానికి వచ్చింతర్వాత భార్యని పూర్తిగా తన ఆధిపత్యంలో ఉంచుకుని హామేషాగా సేవలు చేయించుకునే అవకాశం ఎక్కువగా లభించింది పరంధామయ్యగారికి. ఆ విధంగా ఆయన సుఖపడుతున్నారు. కామాక్షమ్మకి కూడా భర్తకి సంపూర్ణమైన సేవచేయగలిగే భాగ్యం ఈనాటికి లభించిందికదా అని ఆదంతా భగవంతుడు తనపట్ల చూపిన ప్రత్యేకశ్రద్ధగా పొంగిపోతూంది.

అనూరాధ మధ్యగదిలోకి రాగానే అత్తగారి గొంతు వినిపించింది. "అమ్మాయ్ అనూరాధా" అని పిలిచింది.

"ఏం అత్తయ్యా".

"పడుకున్నావా అమ్మా. ఏమిటో నిద్రపట్టేసింది. ఒక్కతివీ చేసుకుంటున్నావు ఈ చాకిరీ అంతా."

"ఫర్వాలేదులే అత్తయ్యా ఏ మంత పెద్దపని" అంది అనూరాధ వినయంగా.

"ఆ మెళ్ళోవి తీసి అలమారులో దాచి తాళం వేసి మరీ పడుకో".

"అలాగే".

తలుపులన్నీ సరిగా వేసి ఉన్నాయోలేదో చూసి మధ్యగదిలో దీపం చిన్నదిచేసి గదిలోకివెళ్లి పడుకుంది అనూరాధ. శ్రమించి కుక్కలు గొంతులు చించుకుని మొరుగుతున్నాయి. అరిచేతులూ, పాదాలూ చూసుకుంటూ "ఎందుకో నీరసంగా ఉంటుంది. వచ్చినప్పటికంటె బాగా చిక్కిపోయాను కూడాను. ఏదైనా మందు పుచ్చుకుంటే బాగుండును" అనుకుంది అనూరాధ.

# 7

రెండురోజులు వాళ్ళ తరుఫు కాళ్ళకి బలపాలు కట్టుకుని తిరిగి తిరిగి పరంధామయ్యగారు ముఖం వేళ్ళాడవేసుకుని విషణ్ణవదనంతో తిరిగి వచ్చేశారు. కామాక్షమ్మ ఆతృతగా లక్షప్రశ్నలు వేసింది. కాని సమాధానం మట్టుకు ఒక్కటే. బలవంతాన కన్నీరు ఆపుకుంటూ కూతురుముందు ఏం చెప్పటానికీ సంకోచిస్తూ నానుస్తూ "కాస్త మనం ఓపిక పట్టాలి" అన్నారంతే.

ఆ తర్వాత భార్యతో వివరాలన్నీ చెప్పారు. అంతవరకూ ఎవరెన్ని ప్రశ్నలు వేసినా సమాధానం మటుకు పొందలేకపోయారు.

కామాక్షమ్మ భోరుమని ఏడుస్తూ మధ్యగదిలోకి వచ్చి దబ్బిలబడిపోయింది. ప్రసాదం "ఏమిటది?" అంటూ ఆతృతగా బయటికి వచ్చాడు గదిలోంచి. అనూరాధ వంటగది గుమ్మం దగ్గర నిలబడి పోయింది. పరంధామయ్యగారు భార్యవైపు ఒక చెత్తో చూస్తూ "పొరబాటున నీ చెవిని వేశాను నువ్వు నిలువునా కొంప ముంచేటున్నావు" అన్నారు.

కామాక్షమ్మ హృదయవేదన కట్టలు తెంచుకుని పొంగిపోయింది. విశాలాక్షి రెండు చేతుల్లోనూ

ఆలోచనతో అతలాకుతలమైపోతున్న తలని అదిమి పట్టుకుని మంచంమీద చతికిలబడిపోయింది. భర్తని గురించి ఆమె తండ్రిని ఏమీ అడగదల్చుకోలేదు. తన జీవితంగురించి ఒక నిర్ణయానికి ఆమె రాకపోయినా ఇక తన కాపరం బాగుపడుతుందనే ఆశని మనసులో పెంచుకోలేదు. అలాగని పూర్తిగా ఆ తలంపే లేకుండా నిశ్చింతగానూ ఉండలేకపోతూంది. "ఏమిటీ అవస్థ!!! లోకంలో స్త్రీలంతా సుఖంగా కాపురాలు చేసుకుంటూంటే తన ఖర్మం ఇలా కాలిపోవాలా?" ఆమె కిటికీలోంచి దూరంగా కాలవగట్టుమీద ముతకబట్టలతో తిరిగే పల్లెస్త్రీ పడుచుల్ని చూస్తూ, తన జీవితాన్ని తలుచుకుంటూ, బాధపడుతూ, ఆశపడుతూ, నిరాశానిస్పృహలతో నిట్టూర్పులు విడుస్తూ నీరసించిపోతూంటుంది.

పరంధామయ్యగారు లోలోపల పూర్తిగా దిగాలుపడిపోయినా పైకి గంభీరంగా మసులుకుంటున్నారు. ఆయనగారు ఆపూరుపల్లి తెలుసుకున్నదిది! అల్లుడు పూర్తిగా చెడిపోయాడు. ఇక అతను ఆ ఊళ్లో లేడు కూడాను ఎక్కడికిపోయాడో ఎవరికీ తెలీదు. ఎప్పుడు తిరిగి వస్తాడో అది కూడా తెలియదు. ఊరంతా బాకీలు పెట్టేశాడు. ఆ ఉంపుడుకత్తె ఏది కావాలంటే అది ఆ క్షణం అక్కడికి తీసుకు రావల్సిందే. అంటే వాడికంత వ్యామోహం! దాని కోసం వాడు తగలేసిన డబ్బుకి ఒక లెఖ్ఖా జమా లేదుట. ఆయన మరోమాట కూడా విన్నారు అది వినగానే గుండెలు పగిలిపోయినట్టయింది.

"వాడిక ఎందుకూ పనికిరాడండీ"

"అదేం?" అన్నారు పరంధామయ్యగారు.

"రోగాలతో మనిషి కుళ్ళిపోయాడు. అందుకనే పారిపోయాడు ఈ ఊర్నుంచి."

"అయితే ఆ ఉంచుకున్నదాన్ని..."

"దాన్నీ ఒదిలేసి వెళ్ళాడుగా."

తల గట్టిగా పట్టుకుని వికలమైన మనస్సుతో బండి ఎక్కి తిరిగి వచ్చేశారు. ఆ విషయం కూతురికి తెలిస్తే ఇక దాని ప్రాణంమీద దానికి మమకారం ఉండదనే ఉద్దేశంతో ఆయన ఆ రహస్యాన్ని బయటికి పొక్కకుండా ఎక్కువ శ్రద్ధ తీసుకుంటున్నారు. తరుచు భార్యని హెచ్చరిస్తూ ఓ కంట కనిపెడుతూనే ఉన్నారు.

కామాక్షమ్మ కూతురు కాపరం గురించే బాధపడుతూ తరుచు ఉపవాసాలు చెయ్యటం విశాలాక్షి కూడా సహించలేకపోయింది. "నా కంటె ఎక్కువ బాధ ఎవరికుంటుందమ్మా నాకు నువ్వు ధైర్యం చెప్పటంపోయి నేనే నీకు ధైర్యం చెప్పటం వింతగా ఉంది. నాకే సిగ్గు వేస్తూంది." అంది

ఈ సమస్యతో ఈ చిన్ని సంసారం ఓ గాడిపొయ్యిలా తయారయిపోయింది అందరి మనసుల్లోనూ ఈ అభాగిని గురించిన ఆలోచనలే మెదుల్తున్నాయి ఎవరికీ ఏమి చెయ్యటానికీ పాలుపోవటం లేదు. ఆమెని ఉత్సాహపరిచి వినోదపరుద్దామని పిల్లవాడు కూడా ఆమె ముఖంలోకి చూస్తూంటే కడుపు తరుక్కుపోయి కన్నీరు కారుస్తారు. ఆమె స్వరంలోని బరువులు, ముఖంలోని అసహాయత, ఆ కనురెప్పలు వాల్చటంలో నిరాశ, మూర్తీభవించిన విషాదమూర్తిలా విశాలాక్షి ఆ మంచంమీద కిటికీ వారగా కూర్చుని దూరంగా ప్రకృతిలో స్వేచ్ఛగా విహరించే పక్షుల్ని, కాలవగట్టుమీద తిరిగే మనుషుల్ని గమనిస్తూ, అత్తగారూ, మామగారూ, చిన్నవాడు బాబూ, ఎప్పుడూ ధామ్‌ధూములు చేసే భర్తా, ఆప్యాయతకి ముఖం వాచిపోయిన ఆ పరిసరాలు అన్నీ తలపుకు తెచ్చుకుంటూ నిట్టూర్పులతో నీరసిస్తూ స్తబ్ధుగా ఉండిపోతుంది.

'అనూరాధ అదృష్టవంతురాలు. అభిమానించే అత్తమామలూ, అనురాగంతో ఆదరించే భర్తా ఆమె జీవితానికేలోటూ లేదు. మనసు తెలుసుకుని మసులుకునే నేర్పు ఆమెలోనూ ఉంది. అన్నయ్య సహృదయుడు. ఒక్కనాడు తను ఇట్టి సౌమనస్యం చవిచూడలేకపోయింది. అత్తవారింట్లో అడుగుపెట్టిన నాటినుంచీ ఆ కొంపలో ఆదరణ ఎవరిదగ్గరా మచ్చుకైనా చూడలేదు. ఎవరిమటుకు వారు ఏదో పురమాయిస్తూ అవసరాలు తీర్చుకుందుకు ఉపయోగించుకునే దాసీ దానిమల్లేనే చూశారు. అటువంటిదానికి భర్త అనురాగమే దూరమైతే ఇక కొరతగిందేముంటుంది. అనూరాధ అలా కాదు. ఆమె అదృష్టవంతురాలు! తను? దురదృష్టవంతురాలు! అభాగ్యురాలు' విశాలాక్షికి గుండెలుపగిలిపోతున్నాయనూ అనిపించింది. తల వేడెక్కిపోయింది.

తలుపు తీసుకుని పెరట్లోకి వెళ్లి మల్లెపందిరివార నిలబడింది. రెండు మొగ్గల్ని కోసి కసితీరా నలిపి గిరవాటేసింది.

హృదయం దొలిచే బాధ! ఆకాశంలో మినుకు మినుకుమనే చుక్కలమధ్య చంద్రబింబంవైపు చూసింది. జాలిలేని జాబిలి తన్ని చూసి నవ్వుతున్నట్టే అభిమానపడింది. క్షణం మేఘాల చాటుకెళ్ళి తిరిగి ఫక్కుమన్నాడు. కవ్విస్తున్నాడు! దోబూచు లాడుతున్నాడు. చరచరా బావివైపు నడిచి నీళ్ళలోకి తొంగి చూసింది. నిశ్చలమైన నీళ్ళలోకి తొంగి చూస్తున్నాడు చందమామ. చేతిలో గులకరాయి నీళ్ళల్లో వేసింది. చందమామ అలుముకుపోయాడు. నుదుటిమీద చెమట చెంపలమీదికి జారిపోయింది. ఆలోచనల వేడి!!

చప్పున ఏదో స్ఫురించినట్లయి వెనక్కి చూసింది. ఎవరూ లేరు. ఆమె గుండెలు కుదుటపడ్డాయి అసలు తనెందు కిలా బావిదగ్గర నిలబడటం? ఎవరైనా చూస్తే? అమ్మో! ఎంత అల్లరైనా చేస్తారు చచ్చి సాధిద్దామనే ఉద్దేశం తనకి లేదని ఎంత చెప్పినా ఎవరూ నమ్మరు. గబగబా గదిలోకి నడిచింది. దీపం పెద్దదిచేసి పుస్తకం తీసి చదవాలనుకుంది. కళ్ళు మసకేసినట్టయి అక్షరాలు అలుముకుపోతున్నాయి పుస్తకం మూసేసింది మధ్య హాలులోకి చూసింది. కామాక్షమ్మ ఆవులిస్తూ భర్త పాదాలు పడుతూంది.

"అనూరాధ హాయిగా భర్త ముందు కూర్చుని కబుర్లు చెబుతూ, చందమామ వెన్నెలలోకి చూస్తూ..." విశాలాక్షి గుండెలు రాసుకుంటూ లేచి నిలబడింది. అనూరాధ ఎప్పుడూ నవ్వుతున్నట్టే కనిపిస్తుంది నవ్వులబండి. తను హృదయంవిప్పి నవ్వి ఎన్నాళ్ళయింది! అనూరాధ ఇప్పుడు ఏం చేస్తూంటుంది? భర్త హృదయంమీద తల ఆన్చి తియ్యని కలలు కంటూ, మేఘాలమీద తేలిపోతూ..."అనూరాధ తన్నిగురించి జాలిపడుతుంది. తన్ని చూసి కన్నీరు పెట్టుకుంటుంది. అబ్బ! ఈ సానుభూతి భరించటం కష్టం! గుండెలు పగిలిపోతాయి!" విశాలాక్షి మధ్యగదిలోకి వచ్చింది. అన్నయ్య గదిలో దీపం వెలుగుతూంది.

"దేనికే అమ్మాయి" అంది కామాక్షమ్మ.

"మంచినీళ్ళు కావాలి."

వంటగది గుమ్మంలో నిలబడిపోయింది విశాలాక్షి. తను ఊహించినట్టుగా అనూరాధ భర్త వక్షంమీద తల ఆన్చి కలలు కనడంలేదు; వంచిన నడుం ఎత్తకుండా ఇల్లు కడుగుతూంది.

ముఖంమీదికి పడుతున్న జుట్టును వెనక్కి నెట్టుకుంటూ గుమ్మంలో నిలబడ్డ ఆడబడుచుని చూసి "ఏం కావాలమ్మా" అంది అనూరాధ

"ఏమీ అక్కర్లేదు"—విశాలాక్షి రెండుకళ్ళూ చెమ్మగిల్లాయి క్షణం పోయింతర్వాత "ఇప్పటిదాకా ఏమిటీ చాకిరీ?" అంది.

"మీ అన్నయ్య ఇప్పుడే వచ్చారు."

"ఎక్కడి కెళ్ళారు?"

"సినిమా కెళ్ళారేమో."

ప్రసాదం గదిలోంచి చరచరా ఇవతలికి వచ్చి "తెలిసీ తెలియని వాగుడు వాక్కు. నేను సినిమా కెళ్ళానని నీ కెవరు చెప్పారు? నే వెళ్ళింది స్నేహితుడింటికైతే సినిమా కెళ్ళానుట. ఈవిడగారు చూసింది కాబోలు" అంటూ ఎగిరి పడ్డాడు.

"పోనీ లేరా! అంతమాత్రానికి అంత కోపం దేనికి" అంది విశాలాక్షి

అనూరాధ చిన్నబుచ్చుకుని వంచినతల ఎత్తకుండా నిలబడిపోయింది. భర్తకి కోపం రావటానికి గల కారణం అనూరాధకి ఇప్పుడు స్పష్టంగా అర్థం అయింది. 'కాపరం కాలిపోయిన అభాగ్యురాలు ఇంట్లో కుళ్ళికుళ్ళి ఏడుస్తుంటే నేను వినోదాలూ, విలాసాలూ, సాగిస్తానా?' అన్న అర్థం భర్త అన్నమాటల్లో వ్యక్తం అయింది.

"ఇకపడుకో అనూరాధా" అని గదిలోకి వచ్చి మంచంమీద పడుకుంది విశాలాక్షి. కొన్ని నిముషాల క్రితం తను ఆలోచించిన విధానం తల్చుకుంటే విశాలాక్షికి చాలా సిగ్గువేసింది. "ఎన్నడూ లేనిది ఇంకొకరిమీద అసూయపడే పాడుబుద్ధిరి కూడా పుట్టించావా దేముడా! ఏమిటీ దురవస్థ! !—" ఆమె చెంపలన్నీ తడిసి చెమ్మవై పోయాయి.

# 8

విశాలాక్షికి పదిహేను రోజుల కొకమారు వాళ్లే రులో తన పొరుగింటి స్నేహితురాలు అన్నపూర్ణ దగ్గర్నించి ఉత్తరాలు వస్తూంటాయి.

ఒక సంవత్సరం గడిచిపోయింది.

కాని అలుడి జాడ మటుకు తెలుసుకోలేక పోయారు పరంధామయ్యగారు. అనూరాధ పండు లాంటి కొడుకుని కని అత్తవారింటికొచ్చింది. మనిషి బాగా నీరసించిపోయింది. ప్రసాదానికి తీరిక వేళల్లో వాడితో పరిపాటోంది

విశాలాక్షి ఈ విడాదిలోనూ గుర్తుపట్టటానికి వీల్లేకుండా మారిపోయింది. శరీరంలో మాంసమంతా హరించుకుపోయి ఎముకలు బయటపడ్డాయి ఒక్క పూటమటుకు భోజనం చేస్తుంది ఇష్టం ఉంటే స్నానం చేస్తుంది. లేకపోతే రెండు రోజులైనా ఒళ్లు తడపదు. తలకి నూనె రాసుకోవటం మానేసింది. జడ వేసుకోవటం మాని ముడివేసుకుంటూంది. మాటల్లో తడబడుతూంటుంది. పరాకు ఎక్కువైంది. ఒక విషయం మాట్లాడుతూ తెలియకుండానే మరొక విష యంలోకి వెళ్ళిపోతూంటుంది. ఇదివరకు అద్దంముందు కూచుని తీర్చి బొట్టుపెట్టుకునే విశాలాక్షి ఇప్పుడు ఎవరన్నా గుర్తుచేస్తే ఇంత కుంకం వేసి మెత్తు కుంటుంది.

పిల్లాడికి పాలిచ్చి వాణ్ణి నిద్రపుచ్చి అనూరాధ పెరట్లోకి వచ్చింది. మల్లెపందిరి నానుకొని నిలబడి ఉంది విశాలాక్షి.

"ఇక్కడేం చేస్తున్నావమ్మా."

కంగారు కప్పిపుచ్చుకుంటూ "ఏమీ లేదు వదినా ఊరికే నిలబడ్డాను" అంది విశాలాక్షి.

అనూరాధ దగ్గరగా వచ్చి "అవును గాని ఇలా సత్యాగ్రహంచేసి ఏం సాధిద్దా మనుకుంటున్నావో చెప్పు" అంది.

"ఏదో సాధిద్దామనే ఉద్దేశమూ లేదు; ఉన్నా సాధించనూ లేను. నేనేం చెయ్యగలను వదినా అసలు దాన్ని."

భర్తమీద అచంచలమైన భక్తిప్రపత్తులుకల ఏ ఆడదీ ఈ ప్రపంచంలో సాధించలేనిదంటూ ఉంటుం దంటే అనూరాధ ససేమిరా ఒప్పుకోదు. అందుకనే ఆమె "భగవంతుడు మన్ని దయదల్చాలి" అంది.

విశాలాక్షి చీకట్లోనే నవ్వింది.

"ఎందుకమ్మా. నవ్వుతున్నావు?"

"ఏమీలేదు."

"ఇప్పుడు దేముడంటే నమ్మకం పోయిందా?"

విశాలాక్షి బాధగా ముఖం చిట్లిస్తూ "నా కిప్పుడు ఎవ్వరిమీదా నమ్మకంలేదు వదినా ఎ...వ్వ ...రి...మీ...దా...లే...దు"

ఇక మాట్లాడలేకపోయింది అనూరాధ. పిల్లవాడి గొంతు వినిపించి లోపలికి వెళ్తూ "ఇక పడుకోవమ్మా. పొద్దుపోతూంది" అంది.

*　　　　*　　　　*

ఆమర్నాడు వాల్తేరునుంచి అన్నపూర్ణ వ్రాసిన ఉత్తరం వచ్చింది.

విశాలా,

భగవంతుడు నీపక్షాన ఉన్నాడని ఇంతవరకూ అనుకున్నాను కాని నిజానికి అదంతా మన తృప్తి కోసం అనుకునే మాట. కాకపోతే నీకు జరిగిన అన్యాయం ఏమిటి చెప్పను. మీ ఆయన ప్రస్తుతం ఈ వూళ్ళోనే ఉన్నాడు. కాని ఇక అతను దాంపత్య జీవితానికి పనికిరాడు ఇంతకంటె ఏం రాయను.

అన్నపూర్ణ.

విశాలాక్షి గుండెలు ఆగిపోలేదు. కనీసం వేగంగా నయినా కొట్టుకోలేదు. ఉత్తరం చదవటం పూర్తిచేసి ముక్కలు ముక్కలుగా చింపేసింది. గట్టిగా పగలబడి నవ్వాలనిపించింది. గుండెల్ని నవిలే కసీ, పగా తీరినట్టనిపించింది. ఇన్నాళ్లకి శాంతి లభించినట్టయింది.

ఆ రాత్రిల్లా ఆమె సుఖంగా నిద్రపోయింది. మళ్ళీ కొద్దిరోజుల్లోనే విశాలాక్షి పూర్తిగా కోలుకుంది శరీరానికి పూర్వపు నిండుతనం పచ్చదనం మళ్లీ వచ్చాయి. అలంకరణ విషయంలో ఇప్పుడామె ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకుంటూంది.

ఓ నాడు తెల్లవారు ఝామున కామాక్షమ్మ ఆత్రుతగా ఇల్లంతా తిరగటం మొదలుపెట్టింది. ఆమె మనసు ఆమె స్వాధీనంలో లేదు. ఇంట్లోపాటి లేచారు. నలుగురూ నాలుగువైపులా వూళ్ళోకి పోయారు. రోజుల తరబడి ఎదురు చూశారు.

కాని విశాలాక్షి జాడ మటుకు ఎవరికీ తెలియ లేదు.

నాలుగు సంవత్సరాలు పోయిం తర్వాత అనూరాధ పేర ఓ ఉత్తరం మటుకు వచ్చింది. విశాలాక్షే రాసింది.

వదినా!

కావాలని నీ పేరనే ఉత్తరం రాస్తున్నాను. అందర్నీ అడిగానని చెప్పు. బాబులుకి నా ముద్దులు. నేను చేసినపని మిమ్మల్ని చాలా ఆందోళనపరిచి ఉంటుందని నాకు తెలుసు. కాని అంతకంటె మరో మార్గాంతరం లేకపోయింది. మళ్లీ సంసారం - సారం లేని సంసారం! నీకు తెలిసే ఉంటుంది. అటువంటి మనిషితో కాపరం ఏం చేస్తాను. వాళ్లు పడేసే నాలుగు మెతుకుల కోసం వాళ్ళింట్లో దాసీపని చెయ్యలేను. ఎన్నాళ్లని మీ దగ్గర మటుకు ఉంటాను. ఇప్పుడేదో స్వయంగా పదిమంది పిల్లలకు చదువు చెప్పి నాలుగు డబ్బులు సంపాదించుకుంటున్నా. సాగినన్నాళ్లు సాగుతుంది.

ఒకప్పుడు నిన్ను చూసి అసూయపడ్డాను. తల్చుకుంటే ఇప్పుడు సిగ్గువేస్తుంది. ఆ పదాన్ని గురించి ఏమని చెప్పను వదినా. ఒక స్త్రీని చూసి మరొక స్త్రీ సానుభూతి చూపిస్తుంది. నిజానికి అంతా ఒకటే చీకటి కొట్లో ఊపిరాడక ఉక్కిరి బిక్కిరౌతున్నాం. ఒకరికంటె మరొకరు ఏ విధంగానూ మెరుగైన స్థితిలో లేరు. ఉదాహరణకి మనిద్దరం ఉన్నాం. ముఖం చూస్తే అసహ్యించుకుని, కొట్టి, తిట్టి, న్యూనతపరచి 'నువ్వంటే నాకు అభిమానం లేదు. నీ ముఖం చూడను' అని వదిలేసాడు నాభర్త నన్ను. ఇదొరకం స్త్రీ జీవితం. వేళకింత తిండిపడేసి కట్టుకుందుకు గుడ్డ ముక్కలు నాలుగిచ్చి, అవసరం తీర్చుకుందుకు రాత్రి హృదయంలో కాస్త చోటు ఇచ్చి, తను ఇవ్వలేని గౌరవం తనకి ఇవ్వాలనే నమ్మకంతో, నీ శరీరంలోని జీవశక్తినంతా పీల్చి పిప్పి చేసే నీ భర్తకోసం దాసీదానిలా నువ్వు బ్రతుకుతున్నావు. అనేక సంసారాలు చూశాను. నే తెలుసుకున్న సత్యం ఒక్కటే. ఈ ఆడవాళ్ళంతా చరణదాసులు! నువ్వు నీ భర్తని ఎంతైనా ప్రేమించు, ఎంతయినా గౌరవించు, ఎంతైనా సేవ చెయ్యి. నీ హద్దులు దాటి నువ్వు ఒక్క అడుగైనా అవతల వేశావా నీ భర్త నిన్ను క్షమించడు.

నిన్ను మీ ఆయన 'ఒసేవ్' అని సంబోధిస్తాడు కదూ! నువ్వు 'ఏవండీ' అంటావు. నువ్వూ 'ఒరేయ్' అని చూడు. ఏమౌతుందో చూద్దాం. నీ భర్త గీసిన హద్దు గీతలకి ఇదొక చిన్న ఉదాహరణ మాత్రమే. ఏమిటిలా రాస్తోందని ఆశ్చర్యపోతున్నావు కదూ?

నా కంటె నువ్వు ఏ విధంగా మెరుగని నన్ను జాలిపడుతావు వదినా? ఇంతకంటె నువ్వు పుట్టించే విషయం మరొకటేదైనా ఉందా? ఎన్నాళ్లు అమాయకంగా ఈ జాతి ఇలా మోసపోతుంది!!!

ఆ ఉత్తరం చదివి అనూరాధకు ఎంతో కోపం వచ్చింది.

రాత్రి భర్తపాదాలు పడుతూ "అదేమిటండీ ఆ ఉత్తరం అలా రాసింది" అంది.

"దానికి మతిపోయిందిలే" అన్నాడు ప్రసాదం.

# శహాజీ ప్రబంధములు

శ్రీ యస్వీ జోగారావు

తంజావూరు మండలమును కొంతకాలము ఆంధ్ర నాయకరాజులును అటుపిమ్మట భోసలవంశ మహారాష్ట్రులును పరిపాలించిరి. ఆనాడా మహారాష్ట్రప్రభువులును ఆంధ్రనాయకరాజులవలె ఆంధ్ర వాఙ్మయమును పోషించియుండుట, పోషించుటేకాదాంధ్రమున స్వయముగ గ్రంథరచన చేసియుండుట చరిత్రలో నొక అపూర్వ సన్నివేశము 1 అట్టివారిలో ప్రాతఃస్మరణీయుడు శహాజీ. ఇతడు ఛత్రపతి శివాజీ సవతి తమ్ముడగు ఏకోజీ పుత్రుడు. ఇతని రాజ్యకాలము క్రీ. శ 1684-1712*. ఇతడతి మాత్ర గీతి సాహితీప్రీతి గలవాడు. నాట్యకళాకోవిదుడు. బహుభాషావైదుషి గలవాడు. విశేషాభిమాని. తంజావూరు సరస్వతీమహాలు గ్రంథభాండాగారములో తత్సంపాదితమై యిప్పటి తాళపత్ర సంపుటములుగా పడియున్న సంగీత లక్ష్యలక్షణ గ్రంథకోశము, తదంకితములుగా గాక తత్పజ్ఞములుగనే కన్పట్టుచున్న యిరువది ప్రపరిణత యక్షగాన ప్రాయములైన తెనుగు రచనలే అందుకు ప్రబల నిదర్శనములు కాగలవు.

అతని కృతులన్నియు నముద్రితములు. ఆ యిరువదింట నాల్గు ప్రబంధములనియు, పదునారు నాటకములనియు పేర్కొనబడినవి. ఆ నాటకములన్నియు నొక యెత్తు, అతని ప్రబంధము లొక యెత్తు. నాటకములు సంవాదశైలీప్రచురములు; కేవలము నాట్యాత్మకములు. ప్రబంధములనగా అవి మన మనుచరిత్రాదుల వంటివి కావు. నృత్యోద్దిష్ట గీతిబంధ ప్రకృష్టములైనవి. అవి యింత మన వాఙ్మయచరిత్రలోను అత్యపూర్వములు, అపురూపములు నైనవి. ఆ ప్రబంధముల అసలు స్వరూపమును పండితుల ఉపయోగార్థమై సోదాహరణముగా వీలైనంత విపులముగా నిట నిరూపింతును.

ఈ ప్రబంధములలో పల్లకిసేవాప్రబంధము లనునవి యొక విశిష్ట సంప్రదాయమునకు చెందునట్టివి. శహాజీ అట్టివాని రెండు రచియించియుండెను.

## విష్ణుపల్లకి సేవా ప్రబంధము†

విరహావిహ్వలయగు లక్ష్మి విష్ణుదేవుని పాలికి మంజుభాషిణి ప్రియంవద లను చెలికత్తెలను బుత్తెంచును. అనంతర కథాక్రమము: వారలతని కొలువును గొనిపోవుట, దేవి మనవి విన్నవించి తనకు స్వామి సముఖము చేయింపుడని విష్వక్సేన నారదగరుడాదులను వేడుట, వారందుల కియ్యకొనమి వారిని గట్టిగా నాల్గు చివాట్లు పెట్టి తామే స్వయముగా స్వామికి విన్నవించుట, స్వామి సమ్మతించి సపరివారుడై పల్లకిపై బయలుదేరుట—

అక్కడ పడకటింటి వర్ణన:

దరువు

పడకటింటిని జూడు| పడతి నిక్కముగాను
తడనుక మహాలక్ష్మి| తాండవమాడుచున్నది||
గగనమగునిం దిం| నగరికిం దెమ్మని
జగతీసతి పంచిన| చిగురుబోడులో యన
మగరాల నిగరాల| తగిన జగతులను
మగవల నీడం| మిగులంబా శొభిలి||
చెంగి తలిదండ్రుల| సేవింప మనువాక
తిలకించి దివినుండి| దిగివచ్చెనో యన
కలువలరాయని| కళలు సోకినపుడె
నెలతాలగోడలు| జలములూరి జారిని||
కనకగర్భుం డరసి| కలసింగారము దెచ్చి
పోసర నించినయట్టి| వింతవస్తువులను
దనరుచున్నది చాలా||

---

1. (వివరములకు) చూ. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి 'తంజావూరి మహారాష్ట్ర భూపతులు—ఆంధ్రసాహిత్యము' అను వ్యాసము—భారతి, డిసెంబరు, 1953 & జనవరి, '54.

*See—'Maratha Rule in the Carnatic' By Sri C. K. Srinivasan.

† తం|| స|| మ|| కే. నం. 618-619.

తరువాత విష్ణుస్తుతి—అవతార వర్ణన; స్వామి కారగింపు—(వివిధ పదార్థములు పేర్కొనబడినవి), స్వామి పవళింపు, మేలుకొలుపు, శోభనపాటను. సరి.

రచన: ఒకమాదిరి. ఇందు దరువులు, ద్విపదలు, పద్యములు, సూత్రధారవచనములేగాక, దరువులుగాఁ బాడుట కనువగు కందములు, తోదక వృత్తములు, వృషభగతిరగడ, మయూరగతిరగడ, చూర్ణిక, లయగ్రాహి, లాలిపాట, ఆరతులు, అష్టకము, ధవళశోభనములు, మేలుకొలుపుపాటలును గలవు.

## విశేషములు :

ఇందలి మయూరగతిరగడ ప్రసిద్ధములగు నవవిధ రగడలలోఁ జేరదు. క్రొత్తది.

ఉదా :

'సారమణి వల్లవసుమారమణి మోదం
బారఁ గరుణింపను మయూరగతిరో (తో) నీ
తేర మది నిన్ననిటు దీర్ఘముగ దండెన్
భారముగ రాజిలెడు పల్లకియు వచ్చెన్॥'

ధవళము సాధారణముగ జయశబ్దాదిగా నుండును. ఇందట్లు లేదు.

ఉదా :

'దయసేయుము వనమాలి'
దయసేయుము గుణశాలి...,

మేలుకొలుపు దేశాక్షి, మలహరి, దేవగాంధారి, భైరవి—అను నుదయరాగములలో నున్నది.

## శంకరపల్లకిసేవాప్రబంధము*

ఇందొకరితో నొకరు చెప్పుచున్నట్లు శివుని కొలువు చెలువువర్ణనతోఁ గథారంభము.

'చలిగట్టుపట్టి నాథుని
వలపునఁ దెమ్మన్న నిందు వచ్చితి మిసుగో
కొలువున వెలయుచు నుండెను
జిలువలదొరతాల్పు చెలువు గనుఁగొనవమ్మా'.

ఇది కథ యెత్తుగడ మొదటిపద్యము. దీనినిబట్టి విష్ణుపల్లకిసేవాప్రబంధమున లక్ష్మివలెనే యిందు గౌరియుఁ బ్రియునిపాలికి చెలికత్తెలను బుత్తెంచిన ట్లున్నది. శివసభావర్ణన చేసినవారు వారే కావలయు. వారు స్వామికి గౌరీదేవి మనవి నివేదింప గంగను, మృగమును, కుండలీంద్రుని, గోరుదురు.

'సుర(ఋ)వక చందమామ వినుమా,
యిది నీకొక భారమా, రమా
తరుణిసమాన మా గిరిజ,
తాగుసమా, చలమేల, మానుమా,
కరముల మ్రొక్కు మా మనవిఁ
గైకొనుమా, హరుతోనఁ దెల్పుమా,
పర(ఱ)వికఁ జూడుమా మదిని
వీథివిటంకశిఖాంకరత్నమా!'

అని 'మేను తెలియనివాని మేనమామను' గూడ వేడికొని లాభములేక గంగాదులను జీవాట్లుపెట్టి స్వయముగనే స్వామి సముఖముచేసికొని గౌరి మనవి వినిపింతురు. శివునాజ్ఞయైనపై పల్లకి వచ్చును తద్వర్ణన :

దరువు : శంకరాభరణము

శృంగారంపు పల్లకి, చెలువు జూడవె
సంగీత మేళముతోన, దనుదెంచీని దేవుని॥
జిగిమించు జలపూత, జీని పన్నాంగము
బిగువునించు బురుస, బింజామరయు
నిగనిగయని పచ్చపగడంపు చంపియ
మగఱాల నిగతాల, మంచి చట్రముగల ॥౧॥
॥శృంగారంపు॥

చిలుకపచ్చలగచ్చు చేసిన తిబికిని
కురువిందముల గీలు,కొను గుబ్బలు
సరిగెకండె నల్లిన । జమిలివాలి దిండులు
ఒలుగుబిల్లలుపట్టు । బిరుదుబిల్లలుగల ॥౨॥
సరిజీనికుట్టుల । సగళాతిసెత్తలు
హరినీలములను కత్తెరకోలలు
హురుముంజిపూసల । నొరపైన కుచ్చులు
పరగు కురాళము । పట్టుతోరములుగల ॥౩॥

అనుగు లొక్కకరు కాళాంజి, సురటి, గొడుగులు, పడిగెలు, పావడలును బట్టి స్వామిపల్లకి లేవనెత్తుదురు. 'కదలించకరోయి! కదలనీకరోయి' అని బోయీలకు హెచ్చరికలు పల్కుదురు.

పల్లకి గౌరి నగరి మొగసాల దిగఁగానే 'జయ సకల గీర్వాణ వందిత సుందర పాదారవిం' దేత్యాదిగా నంది యొక చూర్ణిక నందుకొనును.

తరువాత పటకటింటి వర్ణన, పార్వతీదేవి సింగారము, శివుని యారగింపు. ఆయా సందర్భములందు

*తం॥ స॥ మ॥ కే. సం. 620-624.

వివిధ వస్తుచయము. ఆభరణ భోజన పదార్థ విశేషములును పేర్కొనఁబడినవి.

ఇఁక బవళింపుసేవ — చెలికత్తె లష్టకములు చదివి, పార్వతికిఁ బడకటింటి మెలకువలు దెలిపి, యయ్యవారి కప్పగింత నెట్టుట జాముజామునకు వాకిలి కావలివారల హెచ్చరికలు - నాల్గవజాము గడచుటంతె బార్వతీ పరమేశ్వరులకు మంగళహారతులు —

ఇందలి రచన చక్కనిది. నిన్న మొన్నటివఱకుఁ దంజాపుర పరిసర శివాలయములం దుత్సవసందర్భములం దీ శంకరపల్లకి సేవా ప్రబంధమును బ్రదర్శించుటొక యాచారమై యుండెడిదని శ్రీ పి. సాంబమూర్తిగారనుచున్నారు.

ఈ పల్లకి సేవా ప్రబంధముల ప్రదర్శన పద్ధతిని గూర్చి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారిట్లు సెలవిచ్చియున్నారు. *

"పల్లకిసేవాప్రబంధములు చిత్రమైన కల్పనతో గూడిన నాట్యాధిక్యప్రధానములైన నాటకములు... నాట్యకళా ప్రవీణలైన తిరుణోణులు పల్లకి బోయీల పాత్రలను ధరించి స్వామి పల్లకిసేవ చేయుదురు. ఇందు నిమిత్తము పల్లకి బోయీలలో ముందువారు, వెనుకవారు రెండు గుంపులుగ నేర్పడి కథ వినిపింతురు. చిత్రమైన పరికల్పన మిది..."

## త్యాగవినోద చిత్రప్రబంధము †

ఇది తం॥ స॥ మ॥ గ్రంథ వివరణికలో 'త్యాగరాజ వినోదచిత్రప్రబంధ నాటకము' అని పేర్కొనఁబడినది. ఇది ప్రబంధమైనను నాటకశబ్ద వాచ్యము నగుటకు గ్రంథావతారికలో నొక సూత్రధార వచనమున గ్రంథ నామాంతర సూచనగానున్న 'శంకర కాళీనటన వాద మహానాటక'‡ మను మాటలే తార్కాణము. అదికాక ఇది షడంకములుగా వింగడింపఁబడినది. ప్రత్యంకాంతమందును గ్రంథకర్తృ నామసూచకములుగా నున్న గద్యలన్నిట నిది 'త్యాగవినోద చిత్రప్రబంధ'మని మాత్రమే పేర్కొనఁబడినది.

ఇందుపక్రమోపసంహారములందే (గ్రంథావతారికాంకాంత గద్యలందు) విపులముగా నచ్చపు సంస్కృతము ప్రయుక్తమైనది. మధ్య నంతట సంస్కృత శబ్ద బహుళముగా మహారాష్ట్రభాష వాడఁబడినది. ఎడనెడ తెనుగునకును ప్రసక్తి గలదు. అందుచేతనే దీని కిట ప్రసక్తి గల్గినది.

విఘ్నేశ్వరాగమనముతో గ్రంథారంభము. ఇందలి కథతో వినాయక పాత్రకుఁ బ్రసక్తి లేదు. కాని శహాజీ కృతులలో తరచు గ్రంథారంభమున వినాయక ప్రార్థనయే కాక పాత్రప్రవేశము గూడ చూపట్టెడి.

### కథావిషయము

ప్రథమాంకము :

ప్రచండుఁ డను కటికమువాఁడు భద్రకాళి యాగమనము దెల్పి సభాసజ్జీకరణ మొనరించును. దేవి సభకు వచ్చినది. నారదుఁ డామె దర్శనార్థము వచ్చినాఁడు. దేవి 'నాట్యాది విద్యానైపుణ్యమునందు నా యంతవా రెవరైనఁ గలరా?' యని విట్టసించును. కల రని చెప్పి కలహప్రియుఁడు 'శాహేంద్రపాలిత చోళదేశ'మందలి 'శ్వేతారణ్య' వాస్తవ్యుఁడైన త్యాగేశ్వరస్వామికడకు వెంచేసి భద్రకాళి గర్వోక్తులు తెలియఁజేసి, పంతమున కతనిఁ బురికొక్కించి మఱల దేవి కక్కడి మాటలు తెలియఁజేయును. ఆమె త్యాగేశుని కడకు వచ్చినది. ఇరువురకును దీర్ఘముగా సంవాదము జరిగినది. వాదాంతమునఁ గాళి పరమేశ్వరునిచే "శివనాట్య రాజనాట్య దేశనాట్యేషు యాత్ర తవ పరిశ్రమోఽస్తి?" యని ప్రశ్నింపఁబడి, 'శివనాట్య పరిశ్రమస్తు। దేవలోకే ఏవ రోచ్యతే। అత్ర భూలోకే రాజనాట్య మేవ। ప్రశస్త మితి మన్యతే జనః। అత ఏవ రాజనాట్యం బహువిధ మస్తి। తన్మధ్యే రాజశేఖరః। శ్రీ త్యాగరాజప్రీతయే। భోసలవంశ సుధాంబుధౌ। ఏకోజాధిపాంచాత్మజేన। శ్రీ శాహమహారాజేంద్రేణ విరచిత నానాభాషాభూషిత। త్యాగేశ నామాంకిత త్యాగేశ ప్రీతయే సంగీత సాహిత్య దుగ్ధాంబుధి మథిత్వా నవనీతవత్। సారతర త్యాగ వినోద చిత్రప్రబంధ లీలాం విరచితవాన్। తాం దర్శయిష్యామి పశ్యత్వేతత్॥" అనును.

---

* చూ. వారి వ్యాసము – భారతి, డిసెంబరు, 1953

† తం॥ స॥ మ॥ కే. నం. 530-534.

‡ ఆంధ్రవాఙ్మయసూచికలో నిది కాళీతాండవ నాటకమని పేర్కొనఁబడినది.

పరమేశ్వర వచనమ్॥ 'భవ త్తస్మిన్ ప్రబంధేపి । మను
　　పరిచయోఽస్తి । అవస్య ద్భవద్భిశ్శి ప్రదర్శ
　　నీయాం । మయాపి ప్రదర్శ్యతే॥'

సూత్ర॥ 'ఏవం పరమేశ్వర వచన మాకర్ణ్య కాళి నిజ
　　తౌర్యత్రికం ప్రకటయతి॥'

ఇక్కడినుండి కొంత దూరము నారద శిష్య సంవాదము సాగును. అది యీ గ్రంథమునకుఁ బునరవతారికా ప్రాయముగా నున్నది. సూత్రధారుఁ డేదో ప్రసంగము గ్రంథముగురించి మహారాష్ట్రభాషలోఁ గావించును. శిష్యుఁడు నారదు నదియేమని యడుగుట, గురువుగా నద్దాని కాంధ్రవివరణము చేయును.

త॥ కవి స్వభావతో నిష్టదైవతమునకు మానస పూజా సమర్పణము గావించును. అంతటి దేవునకుఁ గృతినిచ్చుటకుఁ దన యర్హతను గర్హించుకొనును.

త॥ ధ్రువ మఠ్య రూపక ఝంప త్రిపుట అట ఏక అను సూళాది సప్తతాళములు విస్తరించుచు గౌళ రాగ ప్రభేదములగు నారాయణకన్నడ మాళవ రీతి పూర్వచ్ఛాయా కేదారగౌళలం దేడింట మరాటీ దరువులు రచించెను. త॥ 'కవి శ్రీరామచరిత్రను, ఆధ్యాత్మానుభవమును నొక పదంబున సంపుటించి చమత్కరించెను.' తదుపరి శివస్మరణతో నీయంకము ముగియును.

ద్వితీయాంకము :

గురుశిష్య సంవాద మింకను నడుచుచున్నది. కవి విఘ్నేశ్వర హరిహరాదుల స్తుతులు చేసినాఁడు. 'ఇప్పుడు నడచే నాటకంబులో అంతర నాటకంబు చమత్కరించె' నఁట. ఈ యంకమునందుఁ గథ కొక క్రమ పరిణతి యున్నట్లు తోఁచదు. సంగీతము చిత్రచిత్ర రీతుల విస్తరింపఁబడుట కానవగును. స్వరజతితో సప్తతాళములందు నొక గీతము, విద్వత్ప్రశ్న లీలా, పామరబుద్ధి లీలా, ముక్తపదగ్రస్త లీలా, పరభామ కాత్యుక్తి శబ్దచిత్రలీలా, రాగమాలిక మొదలగున వీ యంకమునందలి రచనా విశేషములు. ఇందు లీలా యనున గోకరకము మరాటీ దరువు కొంబోలు. విద్వత్ప్రశ్నాదు లాయా దరువులలోని విషయమును సూచించును. విషయ మేదో వేదాంతమువలె నున్నది.

తృతీయాంకము :

ఇందు మరల విఘ్నేశ్వరస్తుతి గలదు. 'ఏకశబ్ద భిన్నార్థంబుగా దేవీస్తోత్రంబు' గలదు. అంకమంతయు లీలామయము. ఇందలి నిరోష్ఠ్య లుప్తాక్షర నిందాస్తుతి మణిప్రవాళాది విశేషములతో కవి రచించిన లీలా పదము లతని చిత్రకవితా ప్రతిభను చాటగలవు

చతుర్థాంకము :

ఇందు మఱల విఘ్నేశ్వర స్తుతి గలదు త్యాగేశ స్తుతి విశేషము. షడ్భాషా భిన్న చరణలీలా మొ॥ చాల గలవు సవ్యాపసవ్యసముపదలీలా దగువనున దొకటి తెలుఁగున రచింపఁబడి యుండుట విశేషము. అది :

రేగుప్తి॥ ఆది

నగుతదిటిగి తగున । మగువగు లోగు వగుచు
కనగు తీగ తీయుక । నెనగు పోను పోగునసె
మెంచితి నీర నీతలమె । కలయు నానునా యటక
చేడియరాగు రాయడిచే । పోడిమిగాని గామిడిపో
వాడే శాహోశా దేవా । రా దేవ రావదేరా...

ఇందు 'అంతుతాళా' లను పేర తురంగలీల, రాజచూడామణి, మదన, వీరవిక్రమ, హంసనాద, అనంగ, జయశ్రీ అనునవి యుదాహరింపఁబడినవి.

పంచమాంకము :

ఇందుఁ గథాపరిణతి కొంత సూచింపఁబడినది. 'వాదజయార్థముగాను భద్రకాళి' శివునితో 'పరాకు స్వామి విను నటశిఖామణి! మీరు వినుపించిన తెనుఁగు శృంగార పదంబు సంస్కృతమందు భక్తిపరంబుగా వినుపించెదను...మీరు వినుపించిన సంస్కృత భక్తి దరువు పదభంగంబున తెనుఁగు శృంగారపదంబు చేసెద'నని ప్రతిజ్ఞ చేయును. కాని ప్రతిజ్ఞాపాలనము నకుఁ దార్కాణమైన రచనావిశేష మిందుఁ గన్పట్టదు. ప్రత్యంతరము లెందైనఁ గలవేమో!

ఈ యంకమునందలి రచనా విశేషములు:

ఏక ద్వి త్రి చతుః పంచాక్షర దరువులు, సంగీత సాహిత్య ప్రయాసలీలా (స్వరకల్పనతో నున్నది. ఆ పేరు గమనింపఁదగినది), 'సరళగతియందు భాషా ద్వయం, అర్థద్వయం, రాగద్వయం, స్వర మొక్కటి' గా లీలాదరువులు, సర్వశబ్దార్థ తాళ త్రింశన్న వరత్న ప్రబంధలీలా.

ఇందు పేర్కొనఁబడిన మఱికొన్ని రాగతాళ విశేషములు:

రాగ॥ సింహలీల, హంసలీల, మల్లికామోద, అంతరక్రీడ, తురంగలీల, దీపకము.

తా॥ చతుస్తాళము, వర్ధమతాళము, కుధక్క, క్రీడతాళము, ఉదీక్షణ, ముకుందతాళము, లఘుశేఖరము, వీసనతాళము, చచ్చపుటము, చాచపుటము, షట్పితాపుత్రము, సంపక్వేష్టము, ఉద్ఘటితము, వనమాలి, బసవశంకరము, హనుమత్కుంభము, పంచఘాతమత్యము —

షష్ఠాంకము :

ఇందు మొదట శ్రీమూర్తిస్తుతి చేసి, పిదప 'ఉక్తవక్ష్యమాణ త్యాగేశసభాసుధా సేచన వర్షిష్యమాణ కవితాలతా సుమామోద ప్రకటన లీలా సమర్పించెనట యేటువలెను' అని కవి తన ప్రస్తుత రచన నొకపరి సింహావలోకనము చేసికొనును. అది—

బిలహరి — ఆది

మాటలు కొన్ని త్యాగేశ విను చే
మాటలు గట్టి యుంచినా నిందూ
నాటి నేటికి జగములనూ
నరులాడు చునుండే నోట ॥మాటలు॥

కరములా కూ తాగలా కొ - కన్నులా కూ లాగా కొ
ధరచల్లని తెమ్మెర-కరణిని నుండె నోటి ॥మాటలు॥

రూపరహితమూలై చాలా - రూఢిగా దిశాలనూ
వ్యాపించుమామా మేటివిగులవాసనావంటి నోటి ॥మా॥

సకలావర్ణాత్మకమై సరసాకృతి గోచరమై
ప్రకటాతారా త్యాగ-పరాత్పరావస్తువంటి నోటి ॥మా॥

ఇందలి రచనా విశేషములు:

సంపూర్ణపాటక యమకలీలా, జ్ఞానాజ్ఞానైక శబ్దభిన్న నామ కల్పనాలీలా, అనేక కోశ శబ్దార్థ గ్రహణ పదార్థలీలా, కవి భావ నిగూఢ వ్యంగ్యార్థలీలా, కవి ఖండిత వ్యంగ్యోక్తి భావదశ రూపక ప్రకటనలీలా, ఆద్యస్వరాక్షర ఘటితలీలా, అంత్యస్వరద్వయ సమవర్ణార్థలీలా, సవ్యాపసవ్య భాషాద్వయ, దరుద్వయ, తాళద్వయ లీలా మొ॥ అందుఁ గొన్ని వేదాంతవిషయ ప్రతిపాదకములైనవి.

తెలుఁగున క్రమసప్తస్వర వర్ణార్థలీలా పేర నొక్కటే పదువు తోడి, కల్యాణి, ఖామి, శంకరాభరణము లను నాలుగు రాగములందుఁ బ్రవర్తింపఁజేయననువైనది గలదు.

తదుదాహరణము :

అటతాళము

సరిగామా పధ-నీ వింక పైడిక (?)
తరుణు లెవ్వరు-దాని సరిగా రీ
అలినీలవేణులు-అబ్జనిభాస్యలు
కలకంఠులు-దాని సరిగా రీ
జలజవిశాక్షులు-సరసబింబోష్ఠులు
మెలఁత లెవ్వరు-దాని సరిగా రీ॥

గ్రంథము చివరిభాగమున జక్కిణి దరువులను నింకొక రచనావిశేషము గలదు.

ఉదా! బిలహరి — ఆది

ఇందు కళాధర-సుందర వదన పు
రందరవందిత చరణాగ్ర
కుందరదన యర। విందనయన శిర (?)
నందిత శాహేంద్ర అ। నందరూప త్యాగేశా॥

తా॥ తంధిను తధికిట తరికిటతక
ధీం గిణాంగు తక। దళాంగు తద్ధిమి
తక్కిణాం తక కిణాం కిటతరి
తక ఝళాంగు తక। ధాణకు తకధిత్తా॥

స్వరము॥ సారిగ గారిస। రిగ ప పామ్మగ
గపధప సనినిధ। రీ సని; ప మగ
పధస నిధ పధని। పధ మగ గా రిరిసా॥

తదుపరి త్యాగ బృహదీశ స్తుతి గలదు.

గ్రంథాంతము :

కవివచనము॥ "సకల భాషాభూషిత సకలార్థ విరాజిత సకల చిత్రసాహిత్ సంగీత భరిత సంభరిత విద్వద్భ్రమర చాతురీ మాధురీ సుధాప్రద త్యాగ వినోద చిత్ర ప్రబంధం సంపూర్ణమ్"

తె॥ వసంతభైరవిలో మంగళము.

తె॥ అంకాంత గద్య 'ఇతి శ్రీ సకల భువనైక పూజ్య ప్రాజ్య సామ్రాజ్య లక్ష్మీకటాక్ష సకలరాజాగ్రణీ (భో) సజ్జ్ఞాన విదక్షణైక రాజదీపాంబికాత్మజ శ్రీ శాహమహారాజ విరచిత త్యాగవినోద చిత్ర ప్రబంధే షష్ఠాంకః (షష్ఠాంకః)'॥

సమీక్ష

గ్రంథము త్యాగేశాంకితము. త్యాగేశుఁడు కవి కిష్టదైవతము. గ్రంథ ప్రతిపాద్య విషయము తన్మాహాత్మ్యము. అనఁగా నాట్యకళానైపుణ్యమునఁ దనయంత

వారు లేరని విఱ్ఱవీగెడు భద్రకాళి గర్వ మణుపఁ దలఁచి నారదుఁ డుండులకు నటరాజ మూర్త్యంతరమగు త్యాగేశునిఁ బురికొల్పుట. వారలిద్దఱకు వాదోప వాదములు నడచుట, అవి వివిధ నృత్యప్రక్రియల ద్వారా ప్రదర్శన రూపము దాల్చుట, తుదకు భద్రకాళి యోడుట, త్యాగేశుఁడు విజయసూచకముగాఁ దత్పూర్ణప్రాయముగు కాళీపాణిగ్రహణము చేయుటయు నిందలి విషయము.

గ్రంథము పెద్దది. విషయము స్వల్పము. కాని రచనావైచిత్రి రమణీయము, చమత్కారావహము, ఆశ్చర్యకరము. కవి తన సంగీత సాహిత్య భరతవిద్యా నిపుణత్వము నిరూపించుకొనుటకు రచించినట్లున్నది. అక్షరములతో నాటలాడినాఁడు. శబ్దజాలముతో నింద్రజాలము చేసినాఁడు. బహుభాషాభణితులతో తదర్థగతులతో హల్లీసము లాడినాఁడు. సంగీతసాగరములో రాగతాళ సంగతులను తరంగములతో అచి సాచి బారలు వైచి యీదినాఁడు. ఇట్టి చిత్రచిత్ర ప్రక్రియ గలది కనుకనే యిది చిత్రప్రబంధమైనది.

గ్రంథము గీత ప్రచురమైనది. అక్కడక్కడ సంస్కృత శ్లోకము లున్నవి. ప్రసిద్ధ రాగతాళ మేళన మనేకధా ప్రదర్శింపఁబడినది. సంస్కృతమునందును దరువులు రచింపఁబడినవి. తెలుఁగునందు కొద్ది. మరాటీ 'లీలా' దరువు లధికము. సూళాదితాళవిస్తరణ, గౌళరాగ ప్రభేద ప్రస్తారము, ఒక్క దరువులోఁ జతుర్విధ రాగానుకూల్యమిముడ్చుట, భిన్న భావలు, నందులో శ్లేషలు, శబ్దాలంకారములు, అనులోమ విలోమాది ప్రక్రియలును గలవు. దరువులకుఁ బదముగా స్వరకల్పన (స్వరజతి), తాళక్రమము (స్వరచొల్లు జతి) నుదాహరింపఁబడినవి. సంగీత సాహిత్యములతో శతావధానము చేసినాఁడు శహాజీ. కవిమాత్రుఁ డిట్టి గ్రంథము రచింపఁజాలఁడు. ఇట్టి గ్రంథము రచించిన శహాజీ నిస్సందేహముగ మహావిద్వాంసుఁడైయుండునని చెప్పవలెను. అతని కృతులందే కాదు యావద్దక్షిణాంధ్ర యుగవాఙ్మయమునందు నిది యతి విశిష్టమైన కృతి. అయితే పూర్తిగా తెలుఁగుకృతి కాకపోయినదన్న దొక్కటే కొదవ.

## పంచరత్న ప్రబంధము

ఇందొక కథగాని సన్నివేశముగాని లేవు. పరమేశ్వరుని కొలువునకు వరుసగా కొందరు బిరుదు మిటారులు, నవసిద్ధజోగి యనువాఁడొకఁడు, ఒక చెంచు నట్టువోజు, ఒక బిగుదుబంటు, కొందఱు 'సాపనకాండ్లు'ను వచ్చి నాట్య ప్రదర్శనములు నెరపుదురు. రత్నముల వంటి నటపంచకము యొక్క నృత్య ప్రబంధ ప్రదర్శనము వస్తువగుటచే గ్రంథమున కాపేరు వచ్చియుండును. ఇందును నాట్యోపయోగి గీత ప్రబంధ విశేషము లనేకము. భాష తక్కువ. స్వరతాళముల విన్యాస మెక్కువ. శాస్త్ర ప్రక్రియ మరీ కేవలముగా ప్రయోగింపఁబడిన దిందు.

కొన్ని యుదాహరణలు :—

### ౧. మోహారం

తత్తక్కారం | ఝుంఝుం | తత్తి తత్తి తాందత్తిత్తా |
తోధికితాం తంనందాం | తాంగత్తోకిట తకధరికిట |
తంనంధతాంద్దితక్క | తోంధోం గత్తోం
ధిక్కతక్క | తోంతక తకధికి తంనతాం||
తీరుమానం :—తందక | తకతక | తంనక | తకతక
తందక | తకతక | ధళాంగుతోం||
ధింధికి | ధికిధికి | ధింధికి ధికిధికి
ధింధికి | ధికిధికి | ధీంగణతోం||
................
తకఘళాంగు తక ఘళాంగు | తధింగిణతోం||

### ౨. గణపతి కవుత్తం

ధీత్తిత్తై | ధీత్తిత్తై | తత్తాదిద్దితోనం తా |
ఘక్కిట్ట ధిక్కిట్ట తక్క | ధిగుగుణుతాం తోంగ
ధీంనత్తి ధీందత్తి ధీందధీం దత్తిక్క |
తధిమిధిమితతక్క | ధిగుగుణుతాం తోంగ
తా తా ధిత్తా దిక్కిట తకధిక్కిత్తాం దత్తి
దిక్కిట కిటతక | ధిక్కిట కిటతక
తోంగుణ కిటతక | నంగిణ కిణతక
కరిముఖ హర సుర | వర కమలజ నుత |
వరపాశాంకుశయుత | చరణం తే శరణం
తక్కిట ధిమికిటతోం | తకతోం
తధిక్కిట తకధిమికిట్ట తోం || సతతం ||

### 3. నెలకట్టు

తెయితెయిందత్తి | తాహత్తి తెయితెయిం |
దత్తితత్తి | తెయితెయిందత్తితాహత్తి|
తెయితెయిం | దత్తితత్తి | తద్దిందత్తా ధింనత్తా |

ధింతత్తా | తత.తధి | తత తధి తకధింతత్తా |
ధింతత్తా | ధింతత్తా | తత తధి | తత తధి ||
...తధింగిణతోం ||

### ౪. సాల్లుకట్టు

తాంధి తద్ధిమి తక ఝుం గణక ఝుగ।
తత్తోంగుకు। తకతోంగుకు ధిమికికు।
తాంధి తాంధితక ధణం త్తకిణ ఝుక। తతోంగతకధోంగ॥
తోంతోంగ। తకతక ఝుకణకఝు॥

### ౫. జతి

తాంధి ధి తాం దాం। ధిద్ధి తాం దాం।
ఢిద్దితాం దాంతక। తోంతోంతోం గతోంతోంగ॥

### ౬. ప్రబంధదరువు

బిలహరి - ఆది

ఇందుకళాధర। సుందరవదన పు
రందర వందిత చరణాగె।
కుందరదన యార। చిందనయన కర
నందిత శాహేంద్ర నందరూప త్యాగేశ।
యెలిలాం యెల్లాంలె। దేవాదిదేవ
యెలిలాం యెల్లాంలె॥

తాం తక తక। యెల్లిల్లాం। తద్దిమి తద్ది తక ధరికిటతక
ఢీంగుణాంగు తక। తళుంగు తకధిమి తక్కిణాం।
తకకిణాం। కిటతరి। తక ధళాంగు
ధణకు తకధిత్తా। యెలిలాం యెల్లాంలె॥

### ౭. త్రికాలస్వరం

సారిగ గారిస। రీగప పామ్మగ। గపధప సానినీధ।
రీసరీస ధాపమగ। పధసా నిధ పధని।
పధధప మగరిగ। సరిగ పామాంగ।
పధనిధ ధాప మాగ రిరిస। యెలిలాం యెల్లాంలే।
తాహాంగతక ఝుణుతాం। కిటతక తరి ఝుణుతాం,

### ౮. పదాభినయముదరువు

సావేరి - ఆది

దేవ దేవేశ నమస్తుభ్యం। గావు మహేశ।
కాముని బోరిగొన్న సామివి నీవా। దాగు
కావన జనులకు గాముడ వీవా॥

### ౯. వర్ణత్రికాలసాల్లు

ధిమిధిమికిట। తకఝుణు తతకిట।
కిటతరి కిటతధిమిత తక ఝుణు।
ఝుణుత ధణ తకతక। కిణ తకధిమి।
తకధికి తక। తోంగుతక దధింగిణతోం॥
యెలిలాం యెల్లాం॥

### ౧౦ 'సాదనకాండ్ల' సలాము పదము*

సల్లాము సల్లాము సల్లాముకే మీకీ

..................

జనులను రక్షించు సాహేబు నీవే
మూడా మాకెల్లా బడే సులతాను నీవే
ఆడా యీడా నుండు అల్లావు నీవే
మరునుని గొట్టిన మహామూదు నీవే। అరె।
గిరము ఖాణ జేసిన కరతారు నీవె
అబ్బవు నీవె మా ఆబీబు నీవె

[ఇందు నుదాహరింపబడిన మోహరం మొదలైన వాని గురించి నా కెట్టి నిశ్చయమైన పరిజ్ఞానమును లేదు. అందు లకే వాని తత్త్వమును గురించి వ్యాఖ్యానింప జాలనైతిని. శాస్త్రవేత్తలగు పెద్దల పరిశీలన కుపయోగపడునని యుదాహరించితి నంతే]

విశేషములు : ఇందాయి త్తమును నింకొక సంగీత శాస్త్ర ప్రక్రియ గూర్చక పేర్కొనబడినది కాని యుదాహరింపబడలేదు. పదసిద్ధి భోగి ప్రసంగ సందర్భ మున మరాఠీ భాషలో దరువులు గలవు. ఈ గ్రంథము 'ఘననాట్యశాస్త్ర ప్రముఖులను మించునట్టిది' యని కలదు. ఇది శహాజీ నాటకములవలె నే 'ఉదార వేష భాషా భూషితంబగునట్టి' దనియు పేర్కొనబడినది. శహాజీ యితర కృతులు కొన్నిటియందువలె నిందును అవతారికలో సూత్రధార ప్రసంగము (గ్రంథకర్తృ) ప్రశస్తి గలదు. అందుండి ఇట పేర్కొనదగిన శహాజీ విశేషణములు : "కలిత సంగీత తాన శ్రుతి స్వరస్థాన రాగాంగ గానక్రియా స్థాయి గమక ప్రబంధ సహిత గాయక గుణ తతానద్ధ ఘనసుషిర గాత్రభేద క్రియా గ్రహజాతి మార్గతాళ దేశితాళ తత్త్వజ్ఞుండును, సర్వగుణ భరిత సకలభాషా చతుర్విధ సాహితీ నిర్వాహ కుండును..." ఆ విశేషణములకు ప్రమాణభూతములుగా నున్న దీ ప్రబంధసంచయము ఇట్టి కృతులందిప్పటి కొక్కటియు ముద్రితము గాకుండుట మిగుల శోచనీయము

---

* ఇందిందరు మ్లేచ్ఛకులదేవతలు పేర్కొనబడుట చూడ సాదనకాండ్లనగా సాయబు నట్టువ కాండ్రని యూహింపనగును.

# కోయిల

శ్రీ రాయప్రోలు సుబ్బారావు

౧

వచ్చావె కోవెలా! పచ్చికొమ్మల దరికి
వచ్ఛందముల నాడి కచ్చించి కవ్వింప
వచ్చావె కోవెలా! పచ్చికొమ్మల దరికి—

పచ్చగిల్లిన మరుల పల్లవింపగ తరులు
వన్నె లద్దిన వసుధ పమిటికొంగుల నంటి
వచ్చావె కోవెలా!...

మావి మోవిని కొఱికి మత్తిల్లి మైమఱచి
రంగనాథునిమీద రాగాలు తీయగా
వచ్చావె కోవెలా!...

ఇచ్చకాల పదాలు గ్రుచ్చి కామస్వామి
మచ్చికల కోవెలకు తెచ్చావె కాన్కగా
వచ్చావె కోవెలా!...

బాలలను మురిపింతు పడుచులను వెఱపింతు
దరహాసమో మెఱయు పరిహాసమో కురియు
వచ్చావె కోవెలా!...

పదినెలలు కనరాక పల్లెత్త కెసవోయి
పుట్టింట గయ్యాళి పోకిళ్లు చూపగా
వచ్చావె కోవెలా!...

పలుకవే కోవెలా పదును తేనెలు చింద
చెప్పవే సిగ్గడచి చిన్నమంతటి మాట
వచ్చావె కోవెలా!...

## కోయిల

మధువు కన్నెరికమో మరులు గొల్పెనో నిన్ను
నీ పిలుపుతో మావి నిలువెల్ల పూచిందో
వచ్చావె కోవెలా పచ్చికొమ్మల దరిసి.

౨

ఎన్ని నెలలాయెనే యెలరాణి కోయెలా !
నిన్నుంచుకొని రెవరు నీ పాటలకు మురిసి
ఎన్ని నెలలాయెనే......

తుంబురుడు శ్రుతిచేసి తోడిరాగం బెత్తి
ఆలకింపు మటంచు యాచింప నాగావా
ఎన్ని నెలలాయెనే......

నారదుడు తన వీణె దారాలు చిక్కుపడ
సవరించుకొనుదాక స్వరజతులు పాడావా
ఎన్ని నెలలాయెనే......

వార్ధకంబున బ్రహ్మ భణితిభంగిమ చెదర
నిను నిలిపెనో శ్రుతుల నిజరూపముల నెఱుగ
ఎన్నాళ్ల కొచ్చావె......

రాధ మెచ్చని వచ్చి రాగాలు దిద్దగా
బాలకృష్ణుడె నిన్ను బ్రతిమాలి నిలిపాడొ
ఎన్నాళ్ల కొచ్చావె యెలమంచి కోయిలా

కసటనక తింటాము పసిమామిడి చిగుళ్ల
నేర్పవే యెసవోని నీకలశ్రుతి మాకు
ఎన్నాళ్ల కొచ్చావె యెలరాణి కోయిలా
కొన్నాళ్లు మాదండ కుదిరి కూర్చుండవే.

# కలగూరగంప

## సయాం, జావా, బర్మా సైనిక వ్యూహాలు

శ్రీ జి. కృష్ణ

సైనిక వ్యూహాలు అనేకం ఉన్నట్లు మన పురాణాలు చెబుతున్నాయి కౌటిల్యాదు మొదలైనవారు వీటిని వర్ణించారు—వీటి ప్రయోజనాలను వివరించారు. కానీ సయాం, జావా, బర్మా దేశాలలో వీటి చిత్రాలు కూడా లభించాయి. భారతదేశంలో ఈ వ్యూహాలతో యుద్ధాలు సాగించటం ఆగిపోయిన తర్వాత, పైమూడు దేశాలలో ఇవి వాడకంలోకి వచ్చాయని చరిత్ర చెబుతున్నది. అయితే భారతీయ వ్యూహాలకూ, ఈ దేశాల వ్యూహాలకూ కొన్ని తేడాలున్నాయి; పేర్లు ఒకటి అయినా రూపాలు (మొహరింపులు) విభిన్నమైనాయి.

వర్ణనలలో అతిశయోక్తులు ఉండవచ్చు. కాని ఆ మొహరింపు పద్ధతిని చిత్రించిచూస్తే, అది ఎంతవరకు ఆచరణ సాధ్యమో, ఎంతవరకు సానుకూలమో తేలుతుంది.

వ్యూహాలు కొన్ని ప్రత్యక్షపోరాటానికి వేసేవారు. చాలాభాగం, మోసపు శత్రువును కొంతవరకూ రానిచ్చి పట్టివేయడానికే ఉద్దేశించినవి

అణు యుగంలో ఈ వ్యూహాల ప్రసక్తికి, పురాతన వస్తుప్రదర్శనశాలలకు ఉన్న ప్రాముఖ్యమే ఉంటుంది.

కుట్రలు, గూఢచారి చర్యలు, విధ్వంసాలు, అన్ని దేశాల్లోనూ యుద్ధకాలాల్లో మామూలుగా జరిగే పనులే. కాని వ్యూహాలు కేవలం భారతీయమైనవి మాత్రమే. ఆగ్నేయాసియా దేశాలు ఈ వ్యూహరచనను అనుకరించాయి అసలు వ్యూహాలు ఆ రాజ్యాలకు వలస వెళ్ళిపోయినట్లు కనిపిస్తుంది.

'త్రాము పీచాయ్ సోంగ్రాం' అనే సయాం గ్రంథంలో అనేక వ్యూహాల చిత్రాలున్నాయి బర్మాలో కూడా 'సేనాంగ వ్యూహ' అనే గ్రంథంలో అనేక వర్ణనలు, చిత్రాలు వివరంగా లభిస్తాయి. జావాలోనూ చరిత్రకారులు వ్యూహాల చిత్రాలనూ, యుద్ధతంత్రాంగ వివరాలనూ సేకరించారు.




మకర వ్యూహం

ఈ గ్రంథాలలో ప్రతి వ్యూహానికీ సరి అయిన వివరణలు చిత్రాలు లభించవు. కొన్నిటిని ఉదాహరణయుక్తంగా వివరించారు.

మకరవ్యూహం: ఇది నదులు దాటేటప్పుడు అవలంబించే పన్నుగడ. తరలి వెళ్ళేటప్పుడు వ్యూహం మకరాకారంలోనే నడుస్తుంది. యుద్ధంలో మాత్రం వంగి అడకత్తెర లాగా మోహరిల్లుతుంది. జావాలో మకరవ్యూహం, తోక ఉన్న ఎండ్రకాయ ఆకారం దాల్చింది. ముందు ఉండే రెండు డెక్కలూ అడకత్తెర లాగా పనిచేస్తాయి. డెక్కల భాగాలలో పదాతిదళాలు, తలలో మంత్రులూ సేనాపతి సామంతులూ ఉంటారు.

చక్రవ్యూహాన్ని కొండలమీదా గుట్టలమీదా పన్నుతారు. చుట్టూగుట్టలున్న చోటకాదు—మైదాన ప్రదేశంలో ఉన్న కొండలు గుట్టలపై మాత్రమే చక్రాకారపు మోహరింపు.

పద్మవ్యూహం మైదానాల మీద పన్నుతారు—దగ్గర్లో గుట్ట ఉండడం ఉత్తమం. శత్రువును వ్యూహం దాకా రానిచ్చి దెబ్బతీయటానికి ఉద్దేశించిన మోహరింపు. సయాం రాజు నరేసోన్ 1592 లో బర్మా సైన్యంతో పోట్లాడడానికి 'ప్రాథుం పాయుహా' (పద్మవ్యూహం) పన్నాడు. ఉత్తరాన ఒక పెద్ద చెట్టు, దక్షిణాన ఒక గుట్టా ఉన్నాయి. అదనుకోసం




గరుడవ్యూహం




సహస్రాంశువ్యూహం

కాచుకొని కూర్చున్నారు. ఇంతలో సయాంభూషచాగులను తిరుముకుంటూ బర్మాసైన్యాలు వచ్చి, గుడ్డిగా పద్మవ్యూహంలో చిక్కుపడ్డాయి. సయాం సైనికులు వారి సంహరినీ తుదముట్టించారు. పద్మవ్యూహాన్ని మండల వ్యూహం అనికూడా అంటారు. మరి సయాం గ్రంథం చూపే (ప్రాథువ్యూహా) బొమ్మ వికసిత పుష్పాకారంలో గాక మొగ్గలాగా ఉంది. పద్మవ్యూహంలో వ్యూహముఖం, పార్శ్వాలు కేంద్రం - అన్నీ క్రిక్కిరిసి ఉంటాయని చెప్పారు.

క్రౌంచవ్యూహం — ముందు మూడు గడుల్లో పదాతిదళాలు—వెనక శ్రేణులు గా ఐదేసి గడులచొప్పున ఇతర సైన్యాలు (అందుల్లో బల్లెములుగల దళాలు, మధ్యన సేనాపతి)—చివరకు వెనక మూడు గడుల్లో బల్లెములున్న దళాలు. ఇదిచాలాశక్తివంతమైనపన్నుగడ.




సూర్యవ్యూహం

ఇరుకైన లోయ ద్వారా వెళ్తున్నప్పుడు రూపొందించే మోహరింపు. అంటే సైన్యం త్రికోణంలాగా నడుస్తుంది.

ప్రేతవ్యూహం:— పైశాచిక పద్ధతి పన్నుగడ. నాలుగు మూడేసిగడుల శ్రేణులు. అడవుల్లో మోహరింపు.

సింహవ్యూహం:— మూడేసిగడులుగల ఆరు శ్రేణులు. కోటలను ముట్టడించడానికి మోహరింపు.

సూర్యవ్యూహం — సహస్రాంశువ్యూహం:— మైదానం మధ్యన మిట్టమధ్యాహ్నంవేళ పోట్లాట కోసం పన్నుగడలు.

పైవ్యూహాలన్నీ శత్రువు వచ్చిపడినప్పుడు ఉపకరించేవి. శత్రువుపై విరుచుకుపడటానికి ఈక్రింది మూడు వ్యూహాలూ చెప్పారు.

గరుడవ్యూహం: పెద్దసైన్యాన్ని ఢీకొనే పన్నుగడ. గుట్టమీదనుంచి దిగుతూ ఢీకొనే సైన్యానికి మహా వీలు.

శ్యేనవ్యూహం: గద్దఆకారంలో పన్నుగడ — దాదాపు గరుడవ్యూహంలాంటిదే — చాలా చిన్నది — దారుణాయుధాలు గల పదాతిదళాలు ముందు ఉంటాయి. చిన్న సైన్యాన్ని ఎదుర్కోవడానికి వీలు అయింది.

మహిషవ్యూహం: సైన్యంలో ముఖ్యభాగం ముందు, దున్నపోతుమాదిరి ఆకారంలో నిలిచి, ఇటూ అటూ కొమ్ములుగా ఇతర సైన్యాలు మోహరిల్లుతాయి బుగప సేనలో హం చెదిరినప్పుడు వాడే మోహరింపు.

వ్యూహాలు పన్నడంలో ప్రకృతి పరిస్థితులు, కాలం, శత్రుసైన్యబలం, ప్రాదేశిక ప్రాంతాలు.

అయితే కొన్ని కొన్ని వ్యూహాలను ఛేదించడానికి కూడా వ్యూహాలున్నాయి. ఉదాహరణకు సూచీవ్యూహం (సూది ఆకారంలో మోహరింపు) — అలాగే నాగలేక సర్పవ్యూహం: పెద్ద పెద్ద వ్యూహాలను ఛేదించడానికి వజ్రవ్యూహం, అంటే పెద్ద సూచీవ్యూహం; వ్యూహముఖం పెట్టెగా ఉంటుంది.

చిన్న చిన్న వ్యూహాలలో అగ్రభాగంలో సైన్యాలు దారుణాయుధాలను వాడుతాయి. సేనాపతి ఆయుధాల నిర్ణయంలో చాలా శ్రద్ధ వహిస్తాడు. శత్రుసైన్యాన్నిబట్టి ఆయుధాలను, పన్నుగడను నిర్ణయించాలి.




పద్మవ్యూహం

ఈ క్రింద ఇచ్చిన వివరణ వ్యూహాల్లో చూపిన సంఖ్యల ప్రాముఖ్యాన్ని తెలుపుతుంది.

1. సేనాపతి.
2. ముఖ్య సైన్యం.
3. పదాతి రక్షక దళాలు.
4 డాలులు, శూలములు ధరించిన పదాతిదళాలు
5. పదాతులు (ఆయుధాలు అప్పటి కప్పుడు నిర్ణయించుతారు)
6 వివిధనానా శాస్త్రాలు గల విలుకాండ్ర పదాతి దళాలు.
7. పదాతి దళాలు—శూలధారులు.
8 పదాతి దళాలు—శూలములు, ఖడ్గములు గలవారు.
9. పదాతులు- డాలులు, కృపాణములు గలవారు.
10. విలుకాండ్రు.
11. అశ్వికదళాలు—సామాన్య శస్త్రముల ప్రయోగింపదగినవారు.
12 అశ్వికదళాలు-ఖడ్గపాణులు.
13 గజదళం.
14. గజదళం-శూలములు ధరించిన ఆరోహకులు గలది.
15 అగ్రగామిదళం.
16 పుచ్ఛబలం.
17. మూలబలాలు (Reserves)
18. అస్త్రదళం.
19. శతఘ్నిదళం.
20. రథికులు.



# ఛందోదర్పణము: కొన్ని విశేషములు

శ్రీ భట్టాచార్య

అనంతుఁడు ప్రాచీనాంధ్రకవులలోఁ బ్రసిద్ధుఁడైన లాక్షణికకవి. ఈతనికి సాహిత్యలోకమునందు ఒక ప్రత్యేకస్థానము కలదు. ఈ మహాకవి భోజరాజీయము, ఛందోదర్పణము, రసాభరణము అను మూఁడు విలక్షణ గ్రంథములు రచించియున్నాఁడు (1) భోజరాజీయము పద్యకావ్యము (2) ఛందోదర్పణము లక్షణ గ్రంథము (3) రసాభరణము అలంకారశాస్త్రము.

అప్పకవీయము తరువాత చెప్పుకోదగిన ఛందశ్శాస్త్రములలో ప్రసిద్ధమందినది యనంతుని ఛందోదర్పణము. దీనివెనుక బయలుదేరిన లక్షణ గ్రంథకర్తలందఱు నీ గ్రంథము నుదాహరించినవారే. కవిచింతామణి కాక ఛందోదర్పణమును వ్రాసిన వెల్లంకి తాతంభట్టు, కవిసంజీవని వ్రాసిన ముద్దరాజు రామన, సులక్షణసారము వ్రాసిన లింగముగుంట తిమ్మకవి, అప్పకవీయము రచించిన అప్పకవి మున్నగు సుప్రసిద్ధ లాక్షణికులెల్లరు అనంతుని పేర్కొనినవారే. పేర్కొనుటయే కాక తిమ్మకవి, అప్పకవి మున్నగువారు తమ లక్షణ గ్రంథములందు నానా విషయములను, ఆయా పద్యములను జేర్చికొనియుండిరి. దీనిని బట్టి యనంతుని ఛందోదర్పణ మెట్టి యున్నతస్థానమును బొందియున్నదో తెల్లము గాఁగలదు.

ఇట్టి ప్రశస్త లక్షణగ్రంథమును తొలుదొలుత శ్రీ వావిళ్ళవారు శ్రీ గిడుగు వెంకటసీతాపతిగారి విపుల పీఠికతో 1921 సం॥ ప్రకటించియుండిరి. తదుపరి వావిళ్లవారే గిడుగువారి, నిడుదవోలు వెంకటరావు

గారి విపుల పీఠికలతో 1947 లో పునర్ముద్రణము గావించియుండిరి.

ఈ యుభయుల పీఠికలతో నున్న ఛందోదర్పణమును ఆంధ్ర యూనివర్సిటీవారు భాషాప్రవీణ ప్రిలిమినరీ పరీక్షకు పాఠ్యగ్రంథముగా 1948 సం॥నుండి పెట్టిరి.

ప్రథమ ముద్రణమునందలి కొన్ని తప్పులు ద్వితీయ ముద్రణమునందు సవరించి ప్రకటించియున్నప్పటికి విశేషముగా నింకను సందు దోషములు గనపట్టుచున్నవి. లాక్షణిక గ్రంథములు చక్కగాఁ బరిష్కరించి దోషరహితముగాఁ బ్రకటించనియెడల చదువరులు చాల బాధపడుదురు. ఇట్టి దోషములు మన యాంధ్రగ్రంథములందు విశేషముగాఁ గనిపించుచుండును. హిందీ, ఇంగ్లీషు మొదలైన యాంధ్రేతర లక్షణ గ్రంథములందు మచ్చునకొక్కటియు దోషము కనిపింపదు. ఇందుకు గారణము పరిశీలనాభావమనియే చెప్పవలయును. గ్రంథముద్రణాపకులు లక్షణగ్రంథములైనను మువ్వురు నల్వురు ఉద్దండపండితులచేఁ జక్కగాఁ బరిష్కరింపఁజేసి ప్రకటించుట బాగుండును.

అనంతుని ఛందోదర్పణమును గూర్చి పండితప్రకాండులు కొందఱు పరిశ్రమచేసి వినూత్న విషయములు వెలువరించి యాదర్పణమునకు మెఱుఁగుపెట్టిరి. కాని కొన్నిమాత్రము దోషభూయిష్ఠముగానే యున్నవి. మేమీ ఛందోదర్పణమును విమర్శనాదృష్టిని బరికింప కొన్ని నిగూఢవిషయములు పొడకట్టినవి. వానినెల్ల వివరింపఁ బూనుకొంటిమి. మే మాయా విషయముల వివరించుపట్ల తత్సంబంధ పూర్వవిమర్శనలుగూడ దృష్టియందుంచుకొని రచించుచుందుము.

ఛందోదర్పణములు రెండున్నవి. ఒకటి అనంతామాత్యకృతము. రెండవది వెల్లంకి తాతంభట్టు కృతము. దీనినిగూర్చి శ్రీ నిడుదవోలు వెంకటరావుగారును ద్వితీయ ముద్రణ పీఠికయందుఁ దెలిపియున్నారు. ఇఁక రావూరి దొరస్వామి శర్మగారు "అనంతామాత్య కృతమగు ఛందమునకు ఛందోదర్పణమని, అనంతుని ఛందమని రెండు పేరులు గలవు. అట్లున్నను గొందఱవి భిన్నములని భ్రమపడుచుండిరి. అప్పకవీయమున పూర్వ గ్రంథనామ సంగ్రహమున 'అనంతామాత్య చ్ఛందంబును, ఛందోదర్పణంబును' అని పృథక్కుగా లిఖింపఁబడియున్నది. ఇది లేఖక ప్రమాద జనితంబు గానోపు. ఇవి రెండు నొక్కటియేయని యెఱుంగవలయును" అని వ్రాసిరి. అప్పకవి గ్రంథములో "అనంతామాత్యచ్ఛందంబును, ఛందోదర్పణంబును" అని యుండుట లేఖక ప్రమాద జనితంబు కాదు అయ్యది యప్పకవి స్వయముగా వ్రాసినదియే. లోకములో నిద్దఱి పేరులు ఒకటిగాయున్నప్పుడు గుర్తించుటకు ఒకని పేరు ముందు వాని తండ్రి పేరుంచుట ప్రసిద్ధము. ఒకే గ్రంథమును అనేకులు వ్రాసినప్పుడు తద్రచయితల పేరులు ముందుంచుటయు నాచారమే. అట్లే వెల్లంకి తాతంభట్టు ఛందోదర్పణమును, అనంతుని ఛందోదర్పణమును వేరుచేయుటకు అనంతామాత్యచ్ఛందమని చెప్పబడినది. అంతియే కాని ఆ రెండు గ్రంథములు ఒకటి కాదు

—: త్రిప్రాసము: —

గీ॥ సంఖ్యఁ బలుకు త్రికారంబుఁ జనుఁ దకార
సహితమై త్రికార ప్రాసమందు గలిగి
యాత్రి విక్రముఁ డఖిలాధిపతి యనంగ
నా త్రిపథగోర్జ్వలులు విష్ణుభక్తులనఁగ.

ఛందో: ప్ర. ఆ. ప 45

అని త్రిప్రాసము ననంతుఁడు చెప్పియున్నాఁడు. సంఖ్యను జెప్పునట్టి 'త్రి' అనునది తకారముతో సమానమై ప్రాస చెల్లుననియు నది త్రిప్రాసమని చెప్పబడుననియు గలదు. మొదటి రెండుపాదములు త్రిప్రాస లక్షణముఁ జెప్పినవి. దీని కుదాహరణముగా మూఁడు నాలుగుపాదము లీయఁబడినవి (మూఁడవ పాదమునందు 'అత్రి' అని యున్నది. 'ఆత్రి' అని యుండవలయును) ఆత్రి—(ప) దాత. వాక్త్రి—ఖడ్గ" అని ప్రాసలు చెల్లినవి. ఇక ఈ త్రికారము తకారముతో నెట్లు ప్రాసచెల్లునో హేతువు చెప్పుచున్నాఁడు. చూఁడుఁడు.

"ఈ త్రికారంబునకుఁ ద్వితీయ మెసఁగఁ గ్రింది
రేఫ సంప్రసారణమున బుత్వమగుఁ ద్వి
తీయ యగు, నీ త్రికార మర్థించి మాడ
నా తకారంబునకుఁ బ్రాసమయ్యె నదట.

ఛందో ప్ర. ఆ. 46 ప.

ఈ పద్యమునందలి మొదటిపాద మచ్చు పుస్తకమునందు నట్లే యున్నది. కాని యట్లున్న అది యర్థరహితము కాగలదు. ఇందున్న పొరపాటును గుర్తింపక శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు.

"ఈ త్రికారంబునకుఁ ద్వితీయ మెసఁగఁ గ్రింది— ఇందు షష్ఠి విభక్తి కువర్ణకము పరంబగునపుడు నగాగమము నిత్యముగా వచ్చి 'త్రికారంబునకు' అని యుండవలయును గాని నగాగమము చేర్చిన గణభంగము సంభవించును. "నకారా" అని చింతామణి. కొందఱు భారతమున సభాపర్వమున "సహదేవనకుల వాసవసుత

భీములఁ గ్రమమున నలువురఁ గౌరవేంద్రు కొక్కొ
క్కయేటున నుక్కివంబుననొడ్డి, యోడి తన్నును
నొడ్డి యోటువడిన" అను ప్రయోగము కలదందురు.
'కౌరవేంద్రు నొక్కొక్క' 'కౌరవేంద్రుఁడొక్కొక్క'
అను పాఠాంతరములును గనఁబడుచున్నవి. భారత
విషయము సందిగ్ధముగా నున్నను ననంతునికి బూర్వ
కవులు నగాగమనిరహితముగా వాడియున్నారు.
చూడుఁడు:

కమలాసన! విను నా విక్రమమునకు నెల వెట్టిదేని
—నిర్వచనోత్తర రామాయణము
సంకరమునకు నుత్సవము కెగెను క్రియ.(ఉ.హ)
రామాయణము ద్రచించి ప్రాచేతసకున్ (భా.రా.)
ఒక కోమటికి న్నిషధేంద్రు బచ్చుకున్ (నైషధము)

మీఁదు మిక్కిలి మనయనంతామాత్యుఁడే తొలుతఁ దారచించిన భోజరాజీయమున "బలవంతిపుఁ బాపముఁ దెచ్చుకొంటి వేలా నసబాటు కోర్చి" అని నగాగమ రహితముగా బ్రయోగించినాఁడు. కనుక నగాగమము విభాష నగునని యే గ్రహింపవలయును" (ఆంధ్ర సా. ప. పత్రిక సంపుటము 32 సంచిక 3.4) అని పై 46 వ పద్యమునందలి "త్రికారంబునకు" అనురూపమును దీసికొని యందు నగాగమ రహితమును గూర్చి సుదీర్ఘముగా వివరించి ఋవర్ణకము పరమగు నపుడు నగాగమము వికల్పముగా నుండవచ్చును అని తేల్చిరి. ఇఁక దీనిపై మా విమర్శనముఁ బరికింపుఁడు.

"నఃకా" అని చింతామణి 'ఋవర్ణకంబు పరంబగునపుడుకార ఋకారంబులకు నగాగమంబగు" అని బాలవ్యాకరణము. చెప్పుటచేత 'త్రికారంబునకు' అను ననంతుని ప్రయోగము తప్పు కావలసి వచ్చుచుండ శ్రీ శర్మగారు పూర్వకవి ప్రయోగములను, చివరకు ననంతుని ప్రయోగమును జూపించి "త్రికారంబునకు" అనునది తప్పుకాదని ఋవర్ణకము పరమగు నపుడు నగాగమము వికల్పముగా నగునని నిర్ధారించిరి. కాని శ్రీ దొరస్వామి శర్మగారు 46 వ పద్యమునందలి "ఈ త్రికారంబునకుఁ దృతీయ మెసఁగ" అనునది యట్లే యుంచి యెట్లర్థము సెప్పికొనిరో బోధపడకున్నది. ముందు నందలి యర్థముఁ జెప్పికొని తరువాత "త్రికారంబునకు" అనునది తప్పా, ఒప్పా, అని విమర్శించవలయును. అట్టి ప్రయత్నము సేసినట్లు కనిపించదు. కనుక శర్మగారు చేసిన విమర్శన యంతయు వృథా ప్రయాసతోఁ గూడినది. కారణ మేమన "ఈ త్రికారంబునకుఁ దృతీయ మెసఁగఁ గ్రింది"-అను పాదమునందు పొరపాటున్నది. ఆ పొరపాటు నట్లే యుంచి శర్మగారు వ్యాకరణవిషయమును గూర్చి వ్యాఖ్యానించిరి. కాని 'యీ త్రికారంబునకుఁ తృతీయమెసఁగ' అంటే యేమిటి త్రికారంబునకు దృతీయవచ్చుట అసందర్భము.

శర్మగారు నగాగమరహిత రూపములు అనంతునికి నిష్టమైన వేయని చెప్పుటకుఁ గాఁబోలు 'త్రికారంబునకు' అను రూపమును దీసికొని బహుదీర్ఘముగా జర్చించిరి. ఈ నగాగమరహిత రూపముల విషయమును శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులుగారు తన ప్రౌఢ వ్యాకరణమునందు "ఋవర్ణకము పరంబగునపుడు కవిత్రయము వారి ప్రయోగంబులందక్కఁ దక్కిన మహాకవి ప్రయోగంబులందును గొన్నియెడల నగాగమము చూపట్టదు" అని చెప్పి పెక్కు ప్రయోగములు చూపించియున్నాఁడు. అనంతుని 'త్రికారంబును' అను ప్రయోగముయొక్క సాధుత్వాసాధుత్వములు నేను ముందుఁ దెలిపినట్లు ఆ పాదము సరియైనదా' సరిపాఠమును జూపి 'త్రికారంబును' అని యున్నపుడు ఆ పదప్రయోగచర్చ యావసరము, చర్చ చేసినను లెస్సగా నుండును అర్థరహితమైన పాదమును తీసికొని చర్చించుట యర్థరహితమే కాఁగలదు. దానికి సరియైన పాఠము తెలుపుచుంటిమి చూడుఁడు.

ఈ త్రికారంబునకుఁ దృతీయ మెసఁగ గ్రింది. (తప్పు) ఈ త్రికారంబునకుఁ దీయ మెసఁగ గ్రింది. (ఒప్పు).

అనంతుఁడు 'తృతీయ' అను రూప మెట్లైనదో యీ 46 వ పద్యమునందుఁ దెలుపుచున్నాఁడు ఇది సిద్ధాంతకౌముది ప్రక్రియ ననుసరించి చెప్పఁబడినది. కౌముదిలో 'ద్వేస్తీయ' పతోపవాదః ద్వయోపూరణో ద్వితీయ. 'త్రేఃసంప్రసారణంచ' తృతీయః అని పాణిని ద్వితీయ, తృతీయ పదస్వరూపముల నిరూపించియున్నాఁడు. అనంతుఁడు 'ద్వేస్తీయ, త్రేఃసంప్రసారణంచ' అను సూత్రముల దీసికొని తన ఛందోదర్పణమునందు వివరించియున్నాఁడు. చూఁడుడు

గీ॥ 'ఈ త్రికారంబునకుఁ దీయ మెసఁగఁ గ్రింది
రేఫ సంప్రసారణమున ఋత్వమగుఁ దృ
తీయ యగు'— ఛందో ప్ర. ఆ. 46 ప.

అనఁగా త్రికారమునకు "తీయ" ప్రత్యయమును త్రికారమునందలి రేఫకు ఋత్వమును వచ్చి 'తృతీయ' అను రూపము అగునని భావము. ఇప్పుడు మేము చూపించిన యీ సరియైన పాఠమునందు నగాగమ విషయము లేనేలేదుగదా. కనుక శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు 'త్రికారంబును' అను పదము మీఁద చేసిన విమర్శయంతయు వ్యర్థముగదా. పండితులు పరికించి యది యనాలోచితమైనదో కాదో నిర్ణయింపుడు.



## కీ. శే. వాల్టర్ డి లా మేర్

ప్రసిద్ధ ఆంగ్ల సాహిత్యవేత్త వాల్టర్ డిలా మేర్ గత జూన్ 22 వ తేదీన, ట్వికెన్‌హామ్‌లోని తమ స్వగృహంలో స్వర్గస్థులయారు. ఈయన వయస్సు 83 సంవత్సరాలు. గద్యపద్యరచనలో సిద్ధహస్తుడైన డిలా మేర్ అర్థ శతాబ్దిపైబడి నిరంతర సాహిత్యసేవ జేసి అధునాతనాంగ్ల సాహిత్యరంగంలో ప్రసిద్ధులైన డబ్లియు. హెచ్. ఆడెన్ మొదలైన అనేకమంది ప్రముఖ రచయితలకు మార్గదర్శియై ఆనతులు పొందినవాడు. బాలసాహిత్యరంగానికి ఈయన సేవ అపారం. 'సాంగ్స్ ఆఫ్ చైల్డ్‌హుడ్' అనే బాలగేయాల సంపుటి వారి తొలి ప్రచురణ. మానవుని విజ్ఞానాన్ని గురించి యీయన అభిప్రాయం:

'తెలియవలసినదాంట్లో మనకు తెలిసింది అణుమాత్రం.'

# గ్రంథ విమర్శనము

## కవికోకిల గ్రంథావళి (౪) - వ్యాసములు

కర్త—కవికోకిల దువ్వూరి రామిరెడ్డి, ప్రచురణ కర్తలు—కవికోకిల గ్రంథమాల, పెమ్మారెడ్డిపాళెం-ఎల్లాయపాళెం (పోస్టు) నెల్లూరుజిల్లా. మూల్యము మూడురూపాయలు.

సాహిత్యవిమర్శకు సంబంధించిన శాస్త్ర గ్రంథాలు తెలుగులో ఇటీవలనె వచ్చినవి. మొన్న మొన్నటిదాకా కూడా విమర్శ అంటే దోషోద్ఘాటన మన్న అభిప్రాయమే కాని సరియైన దృక్పథంతో శాస్త్రీయంగా విమర్శించవలెనన్న భావం మనకు కొత్త. ప్రాచీన లక్షణగ్రంథాలు గుణదోష విచారం, అలంకారం, ఛందస్సు రసం వీటిని నిరూపించడంలో చూపిన శ్రద్ధలో శతాంశంకూడా కవిత్వతత్వ నిరూపణలో కానీ సాహిత్య విమర్శవిధాన చర్చలో కానీ చూపలేదు. ఎక్కడైనా ఏకొద్దిపాటైనా ఉన్నా అది సంస్కృతలాక్షణికుల మార్గాన్ననుసరించిన అనువాదవిషయమే కాని స్వతంత్రంగా తెలుగు లాక్షణికులు సాహిత్య విమర్శకు సంబంధించి యేమీ చెప్పలేదు. ఇంగ్లీషులో హడ్సను, వించెస్టరు, మొదలయినవారు సాహిత్య విమర్శకు సంబంధించి ప్రత్యేకగ్రంథాలే వ్రాశారు. నేటికీ మన విమర్శకులకవేగతి కావడం మన దురదృష్టం!

కట్టమంచి రామలింగారెడ్డిగారి కవిత్వతత్వ విచారంలో కళాపూర్ణోదయ కావ్య విమర్శ ప్రధాన విషయమైనా గ్రంథారంభంలో శ్రీ రెడ్డిగారు చాల విపులంగా కవిత్వతత్వ విచారణచేశారు. తెలుగులో అలాంటి ప్రయత్నానికి అదే ప్రారంభం. ఆ తరవాత బసవరాజు అప్పారావుగారి ఆంధ్ర కవిత్వ చరిత్రలో కొంత తత్వవిచారం జరిగింది. ఇటీవల అనేకులు ఆధునికులు సాహిత్యవిమర్శ పేరుతో కవుల కావ్యాలను గూర్చి,కవిత్వాలనుగూర్చి అప్పుడప్పుడూ విమర్శలువెల యిస్తున్నా వారెవ్వరూ కూడా కవిత్వ తత్వం, కావ్య జీవితం, కవిత్వ ప్రయోజనం, కావ్యము, నీతి, కవిత్వ శిల్పం—అనుకరణ, అన్న శాస్త్రీయ విషయాలను గూర్చి తత్వ విషయాలను గూర్చి చర్చించలేదు.

ఈ దృష్టితో చూచినపుడు కీ. శే. కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారి యీ సారస్వతవ్యాసముల సంపుటికి తెలుగు సాహిత్య విమర్శచరిత్రలో సముచితస్థానం కలదని గట్టిగా చెప్పవచ్చు. శ్రీ రెడ్డిగారు చక్కని కవులు, విజ్ఞానశాస్త్ర పరిశోధకులు మాత్రమే కాక సాహిత్య విమర్శకులుకూడ అనడానికి ఈ గ్రంథమే చాలు తార్కాణం. ఆంగ్ల భాష

పాండిత్యంవల్ల అబ్బిన విమర్శపాటవంతో తన అపార సాహిత్యానుభవాలను జోడించి వారు వ్రాసిన విమర్శ వ్యాసాలు విషయవైవిధ్యంతో విస్పష్ట దృక్పథంతో వారి బహుముఖ పాండిత్యాన్ని, ప్రజ్ఞాపాటవాన్ని చాటుతున్నవి.

ఈ ముద్రణలో ఇంతవరకు గ్రంథస్థములు కాని వైన మరికొన్ని శ్రీ రామిరెడ్డిగారి వ్యాసములు చేర్పబడ్డవి. తెలుగు కవితలో క్రొత్త తెన్నులు, అభినవ ఆంధ్ర సాహిత్యము, చిత్రలక్షణము, సాహిత్యములో రమ్యత, నేటి కవిత—ప్రకృతిపూజ మొదలయినవి క్రొత్తగా చేర్చబడిన కొన్ని వ్యాసాలు. వీటిలో తెలుగు కవితలో క్రొత్త తెన్నులు అన్న వ్యాసం వారి అసంపూర్ణ రచన. 'షిడేలు రాగాల డజన్'కు శ్రీ శ్రీ శ్రీ గారు వ్రాసిన పీఠికలోని కొన్ని విషయాలను విమర్శిస్తూ వ్రాసిన వ్యాసం అది. కవిత ఛందోబద్ధముగా ఉన్నప్పుడే రమణీయంగా ఉంటుందన్న తమ అభిప్రాయాన్ని శ్రీ రెడ్డిగారా వ్యాసంలో ఉద్ఘాటించారు. ఆ సందర్భంలో వారు రాజకీయ విషయములలో 'డెమాక్రసీ' ప్రవేశించి జనసామాన్యమునకు మేలు చేసినది. అట్లే వాఙ్మయము లోనికినీ ప్రవేశించినది. ఉపకారమునకంటె అపకారమే చేసినది. ఎందుచేత? రాజకీయమైన డెమాక్రసీ నియమబద్ధమూ వాఙ్మయములోని డెమాక్రసీ విశృంఖలమూ. ఆ డెమాక్రసీ తప్పుత్రోవ త్రొక్కినప్పుడు అధికారము గల ప్రజాప్రతినిధుల చేతిలో కళ్లెమున్నది. సరియైనదారికి త్రిప్పగలరు. వాఙ్మయములోని డెమాక్రసీ తప్పుదారి పట్టినప్పుడు దానిని మరలించు కళ్లెము చేత పట్టుకొన్న ప్రతినిధులు లేరు. అందువలన ఈ డెమాక్రసీ యింతవరకు విశృంఖలముగానే ఉన్నది' అని ఆందోళన ప్రకటించారు. కాని వారంత ఆందోళన పడనవసరం లేదు. ప్రజాదరణ అనే కళ్లెం ఎప్పుడూ ప్రజల చేతుల్లోనే వుంటుంది. ప్రజాదరణ కోల్పోయిన ఉత్తర క్షణంలోనే ఆ పద్ధతికి పతనం తప్పదు. చిత్రలక్షణం అన్న వ్యాసం బౌద్ధ వాఙ్మయానికి సంబంధించినది. బెర్తోల్డు కాఫర్ అనే జర్మనీ పండితుడు టిబెట్టు దేశంలోని 'తాంజూర్' గ్రంథమాలనుండి "రెమొ యీశాస్య" లేక 'చిత్ర లక్షణం' అనే ఒక శిల్ప శాస్త్రాన్ని స్వను అనువాదంతో కొన్ని సంవత్సరాలకు పూర్వం ప్రకటించారు. ఆ గ్రంథంలోని విషయాలకు సంగ్రహమే ఈ వ్యాసం. చిత్రలక్షణాలకు సంబంధించిన ప్రాచీన సంప్రదాయా లీ వ్యాసంలో సంగ్రహంగా తెలుపబడినవి. 'అభినవాంధ్ర సాహిత్యము' అన్న వ్యాసంలో వారు వ్రాసిన యీ వాక్యములు యథార్థములని అందరూ అంగీకరింపక తప్పదు.

'ఈ కాలమున వ్రాయబడునదంతయు చెత్త యని తృణీకరించుట యెంత అసమంజసమో, ఈనాటి రచన లన్నియు మహోత్కృష్టములని ప్రశంసించుటకూడ నంత అవిచార మూలకమె. బాగోగులు ఒక వర్తమాన కాలమునకే సంబంధించినవి కావు. చెత్త వ్రాసినవారు పూర్వముకూడ కలరు. అయితే ఆ చెత్తకును మనకును నూరుల కొలది సంవత్సరముల అంతరమున్నది కావున ఆ చెత్త యంతయు కుళ్ళి కాలప్రవాహమున కొట్టుకొని పోయి అంతస్సారముగల యే కొన్ని కావ్యములో నిలిచినవి. ఎచ్చటనో దాగియుండిన చెత్తలు పురాతనము లన్నంత మాత్రముననే అచ్చొత్తింపబడినవి యిప్పటికిని మనకు దొరకుచునే యున్నవి. ఈ కాల

# గ్రంథ విమర్శనము

మున వ్రాయబడిన దంతయు బ్రతికి యుండునని యెవరు చెప్పగలరు? ఈ సంశయము కాలమే తీర్ప గలదు. ప్రతిభావంతులగు కవులు ఏ కాలమందైన నుందురు! నిష్పాక్షికములయిన మాటలు ప్రాచీనాధునిక కవిత్వాభిమానుల కుభయులకూ అంగీకార్యములే అన డానికి ఎలాంటి సందేహం లేదు.

ఇటీవల నవ్యసాహిత్యం విస్తారంగా వెలువడినా నవ్యకవితా ప్రక్రియలనూ, పద్ధతులనూ శాస్త్రీయంగా వివరించి తెలిపి అందులో మేలేర్చి చూపే ప్రయత్నం జరగవలసినంతగా జరగలేదు. ఈ సంపుటిలో కొత్తగా చేర్చబడిన వ్యాసాలు ఆ కొఱతను చాలావరకూ తీరుస్తున్నవి. సాహిత్యములో రమ్యత, నేటికవిత-ప్రకృతిపూజ, సాహిత్యంలో వైచిత్ర అనే వ్యాసాలు పరిమిత వ్యాసాలే అయినా అందులో ఆధునిక కవితా లక్షణ పరామర్శ శాస్త్రీయంగా, చేయబడ్డది. సాహిత్యాభిలాషులకు నవకవితా సమీక్షగా ఉపయోగపడగలవనే ఉద్దేశంతో ఈ సంపుటిలో చేర్చినా మనిన ప్రకాశకుల ఉద్దేశం చాలావరకూ నెఱవేరుతుందనే ఆశించవచ్చు. సాహిత్యవిమర్శ ప్రధానంగాగల శాస్త్రీయ గ్రంథాలు తెలుగులో ఇకముందే వెలువడవలసి ఉన్నవి అలాంటివి వెలువడానికి శ్రీ రామిరెడ్డిగారి యీ గ్రంథం వంటివి మార్గదర్శకాలు కాగలవు. కో. రా.

## గృహాలంకరణ : ముగ్గులు

రచన : శ్రీ గొల్లపల్లి వెంకటేశ్వరరావు; ప్రాప్తిస్థానం : గ్రంథకర్త, 20/389, ఏలూరు రోడ్డు, గవర్నరుపేట, విజయవాడ-2; వెల రు. 2-0 0.

గ్రంథ నామం, ఏదో ముగ్గుల నమూనాలు ముద్రించిన సామాన్య కరపత్రము కాబోలుననే అపోహను ఉదాసీనతను కల్గించటానికి ఆస్కారంగా వుంది. తీరా గ్రంథాన్ని తెఱచి విషయాన్ని పరిశీలించితే అబ్బురపాటు కలుగుతుంది. రచయిత యీ గ్రంథానికి ఇంతకంటే ఆకర్షవంతమైన నామకరణం ఏదైన వుంచితే బాగుండేది.

వీరు పరిశోధనకు తీసుకున్నది గృహాలంకరణలో ఒక భాగమైన ముగ్గుల విషయం. ఇది సామాన్య విషయంగా కనిపించుతుంది. కాని వీటి పరమార్థాన్ని ప్రతిపాదించే ప్రయత్నంలో వీరు భారతీయ విజ్ఞానానికీ కళా సంప్రదాయాలకూ సంబంధించిన సమస్త శాస్త్ర గ్రంథాలనూ అవలోడన చేసి విడిచారు. మన దైనందిన జీవితంలో సామాన్యమై పోయిన ఈ కళా విన్యాసానికి యింత పరమార్థముందని ఈ గ్రంథము చదవకపోతే మనం ఊహించలేము.

(1) జాతి జీవనమునకు ప్రతిబింబము కళ; (2) కళలు : చిత్రలేఖనము; (3) చిత్రలేఖనము అంద) శాఖలు; (4) గోమయము: ముగ్గు; (5) ముగ్గులు తీర్చు విధానము-అందుపయుక్తములగుపరికరములు; (6) ముగ్గుల లోని వైవిధ్యము - వానిని తీర్చునపుడు తీసుకొనవలసిన జాగ్రతలు; (7) అలికిన యింట్లో ఒలికిననూ అందమే; (8) ముగ్గులు - ఆచార వ్యవహారములలోని సంప్రదాయములు; (9) సంక్రాంతి ముగ్గులు-వివాహ వేళ నాకబలి ముగ్గులు వాని విశిష్టత; (10) ముగ్గుల యందలి వర్ణములు—వాని ప్రత్యేకత—అనే పది శీర్షికలలో ఈ గ్రంథం సంఘటించారు. ఈ ముగ్గుల వెనుకగల సంప్రదాయాదికాలను వ్యక్తంచేస్తూ అనేక శాస్త్రీయ విషయాలను అనేక ఉద్గ్రంథాలనుంచి క్రోడీకరించారు ఈ గ్రంథం కేవలం స్త్రీలకొరకు ఉద్దిష్టమైనదని భావించకూడదు. కళా సాంస్కృతిక విషయ జిజ్ఞాసువులైన సర్వజనులు చదివి తీరవలసిన గ్రంథం. గ్రంథంలో 20 వరకు చిత్రాలున్నాయి ఈ గ్రంథం భారతప్రభుత్వ బహూకృతిని పొందింది. 14 ప్రాంతీయ భాషలలోకి అనువాదం చేశారు స్త్రీ పురుషులు ప్రతి ఒక్కరూ చదువవలసిన గ్రంథం.

## నవకాళీ యాత్ర

పద్యకావ్యము: రచయిత శ్రీ దాసి బసవయ్య; ప్రాప్తిస్థానము: శ్రీ కావూరి వేంకట్రామయ్య చౌదరి, నాగాయలంక (కృష్ణాజిల్లా); వెల రూ 0-12 0.

చారిత్రాత్మకమై వెలసిన మహాత్ముని నవకాళీ యాత్రను వస్తువుగా సేకరించి రచయిత ఈ కావ్యాన్ని సంఘటించారు రచయితకు, ప్రాచీన కవుల ధోరణిలో హుందాగా కావ్య నిర్మాణం చేయగలతాహతు ఉంది.

ఉదాహరణకు:

"రెండుశతాబ్దముల్ ప్రబిసేష
 రేని హయామున బానిసత్వ మం
దుండె; సమస్తమైన విభ
 వోన్నతులెల్లను గోలుపోయి భూ
మండలి దీనురాలయిన
 మా జననీ నిజవాంఛితార్థముల్
పండినవన్న హర్షప్రప
 భాతము చేతము చల్లజేసెడిన్"—

* * *

అది స్వరాజ్యకాంక్ష నసువు లర్పించిన
 ప్రాణికోటికి నెల్ల పర్వదినము
అది దుర్భగత్వ ధాయాసపీడితజీవి
 తములకు దివ్యామృతంపుసోన
అదిపరాధీశుల నదలించి యెదిరించి
 సాగనంపిన యహింసాబలంబు

అది తపించి కృశించినట్టి హృత్సీమలన్
చిగురింప జేసిన జీవగఱ్ఱ
నాల్గు పదికోట్ల భరతజనంబునకును
వన్నెవాసియు కూర్చు సౌభాగ్యరేఖ
పెద్ద కాలముకన్న స్వాప్నిక సుకన్య
నిజకరంబుల కౌగలించిన దినంబు;

రూపచిత్రణలో రచయితగారి ప్రతిభ ఎట్టిదో, నవకాళీ రుద్రభూమిలో వచ్చి వ్రాలిన గాంధిజీని వర్ణించిన ఈ పద్యం చాటిచెప్పుతున్నది.

"చెప్పుల కాళ్లు; పైనొక
చేలము; చేతికఱ్ఱ; చంకలో
నొప్పగు గీతతో డవన
యున్నతి చిన్నదియైనరీతి మో
మొప్పుచునుండ శీఘ్రగతి
నూరట జెందక వంగ భూమిలో
నిప్పుల మన్య వ్రాలెను జ
నించిన జ్వాలలరూపుమాపగన్.

ఎన్నడో అదృశ్యుడైన గాంధిజీని రచయిత తిరుగ మనకన్నులముందు యింద్రజాలమువలె కనుపింప జేయుచున్నాడు.

## నవయుగ ధర్మప్రతిష్ఠాపకురాలు

రచన : శ్రీ గుంటూరు వెంకటసుబ్బారావు; ప్రకాశకులు : వసంతా ఇన్‌స్టిట్యూట్, గుడివాడ. (దివ్యజ్ఞాన సమాజమందిరము). అమూల్యం

ఇది అంతర్జాతీయ దివ్యజ్ఞానసమాజ స్థాపకులలో ఒకరైన మాడెం హెచ్. పి బ్లవట్స్కీ జీవితచరిత్ర. (బ్లవట్స్కీ జననం 12-8-1831 నిర్యాణం 8 5-1891) బ్లవట్స్కీ చాలా విచిత్రమైన మనస్థితిగల్గిన వ్యక్తి. 252 పేజీల అవధిని నడచిన ఈ చరిత్రలో ఏ ఘట్టానికి ఆ ఘట్టం మనకు విచిత్రంగా కనుపించుతుంది. ఈమెకు అణిమాది అష్టసిద్ధులూ వున్నట్టు రచయిత పేర్కొన్నారు ఈ సిద్ధులవిషయం హేతువాదజీవులమైన అధునాతనులం మనం నమ్మలేకపోయినా ఈ విచిత్రవ్యక్తిమానసిక స్థితి హేతువాదులైనమానసికశాస్త్రవేత్తలయినా గమనించి తీరవలసిన విషయం. ఈ చరిత్రలో ఆనాటి అడయార్ దివ్యజ్ఞాన సమాజపరిస్థితులు సమాజ సభ్యులైన అనేకమంది ప్రముఖ స్త్రీ పురుషుల విషయాలూ కూడా ఉల్లేఖింపబడినై నాటి సమాజ పరిస్థితులను అవగతం చేసుకుంటే, ఆ సభ్యులు అనేక మత్సితాలతో కుళ్ళిపోయిన సామాన్య మానవ సంఘమంటే విసికి విముఖులై, పరిమితావధిలో, మధురమూ అమాయకమూ అయిన ఒక ప్రత్యేక సమాజాన్ని సృష్టించుకుని దాల్లో హాయిగా బ్రతకటానికి ప్రయత్నించారా అనిపిస్తుంది. అట్టి సమాజం కేవలం ఊహా కల్పితమే అయినా, అది వారందరికీ హృదయానందాన్ని యిచ్చినట్టు అవగతమౌతుంది. దివ్యప్రపంచాలున్నాయా లేవా, అలౌకిక జీవులూ, శక్తులు వున్నాయా లేవా అనేది మనలాటి సామాన్యులు తేల్చరాని విషయం. కాని ఉన్నాయని విశ్వసించి తమ జీవితాలను గడుపుతున్న వ్యక్తుల జీవితాలు మనకు గమనార్హాలై వున్నాయి వాటిని అర్థం చేసుకోవలసిన పనిలేదని త్రోసివేయటానికి ప్రయత్నించితే, సత్యాన్ని చూడటానికి భయపడి పారిపోతున్నవారమవుతాం. ఆ దృష్ట్యా ఈ గ్రంథాన్ని తత్వజిజ్ఞాసువులెల్లరూ పరిశీలింపవలసివుంది.




Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

ఆగస్టు 1956

సంపుటము 33 : : సంచిక 8

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1956

# వే కు వ రా ణి

కీ. శే. శ్రీ అజ్జాడాదిభట్ల నారాయణదాసు

*

ఉషోదేవత నభినందించు ఋగ్వేద
మంత్రములకు తెలుగు సేత

*

తెలివిమీఱఁగ మాకుఁ దెల్లవాఱించు
పగటివెలుఁగు దొర్లఁబరపి యెల్లపుడు
పాడిపంటల కల్మి బ్రబలించు మీవు
వింటికహారిమి బిడ్డ! వేకువరాణి!

గుఱ్ఱము లావులు కోరిన సిరులు
కమ్మతావుల హాయిగా వీచుగాలి
రాచఠీవిన్మాకు రప్పించు మెపుడు
వేడుకొందుము నిన్ను వేకువరాణి!

వెలయించితివి తొల్లి వేడుకమీఱ
నెన్నియో లేఁబ్రొద్దు లిప్పఁటి వలెను,
అరదము లోడలు హాయి నడ్పితివి
విన్ను మన్నలరించు వేకువరాణి!

పేదసాదలనెల్లఁ బెంచిన తల్లి
ముజ్జగంబుల మెప్పు బొందినయమ్మ
మేనితాల్పులనెల్ల మేల్కొల్పు వేల్పు
వేంచేయు బంగారు వేకువరాణి!

పూఁటపూఁటకుఁ బాయముం బొడిగించి
వాసిగాఁ బిట్టలం బై కెగిరించి
మేలైన యిల్లాలు మెలఁగు చందమున
వేంచేయు బంగారు వేకువరాణి!

# భా ర తి

జగమునకు న్మేల్మిచాయ చేసెదవు
ఎగిరించెదవు మింటికెల్ల పిట్టలను
మెలఁకు వన్నెని వాండ్రమేలు కొల్పెదవు
వేడుక ల్సమకూర్చు వేకువరాణి!

ప్రొద్దుకన్నున్మను ముందుగాఁ బొడమి
యెల్లవారల కోర్కులిడి సిరుల్మీఱి
గ్రక్కున విచ్చేసెఁ గన్నుపండువుగ
వేయి కీల్బండ్లతో పేకువరాణి!

కదలిక యూపిరి కలుగు నిన్నుండి
చెలువుగా జగమునఁ జీఁకటిం బాపి
వెలుఁగు చుందువు గాన బిఱబిఱ రమ్మ
వింత సిరులరాణి! వేకువరాణి!

గుఱ్ఱము లావులు న్గోరిన గొప్ప
చదువు, తనివి కొనసాగించు మీవు
వేల్పులనెల్లమా విందారగింప
బిఱబిఱ న్దోడ్తెమ్మ వేకువరాణి!

పెద్దలు పొగిడి నిన్బిల్చిరి తొల్లి
కోరిక లీడేర్చు కొనుట కింటింట
వేడుకన్మా మన విన్గూడ వినుము
వేంచేయు మిచటికో వేకువరాణి!

ఎల్లవన్నెలయావు లెన్నిన సిరులు
కోరిన కూడు నెక్కొను మంచిపేరు
పగవారలన్గెల్చు బల్మిమాకిమ్మ
వెలలేని బంగారు వేకువరాణి!

# వే కు వ రా ణి

మరియాద తప్పక మంచితేరెక్కి
చెంగావికోక కుచ్చెళ్ల జీరాడ
ప్రొద్దువేలుపు పొందు పొనరించు నీకు
వేయి జోహారులో వేకువరాణి !

పులుగడిగిన ముత్తెపుండాలు మెఱయ
నాకసప్పుం గూఁతురా ! తానమాడి
పొడకట్టు కన్నుండువుగఁ దూర్పునందు
విదలించు చీఁకటి న్వేఁకువరాణి !

చలువ తెమ్మెరపాట జగము మేల్కొల్పి
బ్రతుకులకు స్వాంత వన్నియుం బెట్టి
వెల్లగుజ్జము ప్రొద్దు వేల్పునెక్కించి
వేంచేసె బంగారు వేకువరాణి!

ఉండుము మాకడ నోసిరిమూట !
మాపగ వారలన్మాకు దప్పించు
మా వెఱపులమాన్చి, మముహాయిఁబెంచు
వెలలేని బంగారు వేకువరాణి !

అలరించు మా బ్రతుకన్ని కోరికలు
వెలయించి నూఱేండ్లు వేకువరాణి !
ఇల వేల్పు నీవు మా కెల్లప్డు కనుక
వెలయించు మాకల్మి వేకువరాణి !

* మొక్కుబడి నుండి

# వైదికసాహిత్య పాశ్చాత్య రచయితలు

శ్రీ పి. యస్. ఆచార్య

వైదిక ధర్మము సార్వభౌమధర్మము, అనేక వేల సంవత్సరములవరకు నీ వైదికధర్మమే ప్రపంచమునకు సర్వ ప్రధానధర్మముగ నుండెను. ఒకప్పుడీ వైదికధర్మమే సుమత్రా, జావా, బోర్నియో, ఏషియామైనరు, మెసపొటేమియా, యూరప్పు, (హరివర్షము) అమెరికా మున్నగు దేశములయందు ప్రచలితమై యున్నట్లు పురాతత్వాన్వేషణములవలన స్పష్టముగ విదితమగుచున్నది. ఇచటి ఆచార్యులే సర్వత్ర ధర్మ, కర్తవ్య శిక్షణను గరపుచుండిరి. కాని యిప్పటికివి యన్నియు స్వప్నావస్థవలె పరిణమించెను. భారతీయులు కేవలము "వేదము-వేదము" అని వల్లించుచున్నారేగాని వేదాధ్యయన మొనర్చి వానిపై విచారణ సలిపి తత్సంబంధ గ్రంథములను ప్రకాశపరచుటకు కావలసినదానిలో నూరోవంతైనను చేయుట లేదు. కాని పాశ్చాత్యులు, వైదికధర్మావలంబులు గాకపోయినను, తమ బుద్ధి విచారముల ననుసరించి వేదసంబంధమున వారుచేసిన, చేయుచున్న కృషి వాస్తవముగా ఆశ్చర్యకరముగ నున్నది.

గత ౧౫౦ సంవత్సరములలో యూరప్పు, అమెరికా మొదలగు పాశ్చాత్య విద్వాంసులు వైదిక సాహిత్యమునందుకూడ మిగుల ప్రశంసనీయ కార్యము లొనర్చిరి. వానిని సవిస్తరముగ వివరించినచో నొక పెద్ద గ్రంథమగును. కావున అతి సంక్షేపముగ వాని దిగ్దర్శనము మాత్రమే ఇచట చేయబడుచున్నది. వైదిక సాహిత్యమున పరిశ్రమచేసిన విద్వాంసుల సంఖ్య నూరింటకి పైగా నున్నది. అందు కొందఱు విద్వాంసులు తమ జీవితమంతయు వేదానుశీలనమునందును, వైదిక సాహిత్య రచనయందును గడపియుండిరి.

పాశ్చాత్యదేశములయందు వేదాధ్యయన కార్యము ముఖ్యముగ క్రీ శ. ౧౮౦౦ లో ప్రారంభమయ్యెను. దీనికి ౫౦ సం. ల పూర్వముకూడ కొంత చర్చ జరిగియుండెను. దీనినికూడ కలిపినచో రెండు వందల సంవత్సరముల యొక్క మనోరంజక చరిత్ర యగును. ఈ పాశ్చాత్య వైదిక రచయితలలో జర్మనీ, ఫ్రెంచి, ఆంగ్లేయులు ముఖ్యులు. వీరికి తరువాత వారు అమెరికనులు, ఇటలీ, రష్యనులు. కావున యథా సంభవముగ నట్టి విద్వాంసుల నామముల, వారి కార్యక్రమముయొక్క పరిచయమును ఐతిహాసిక క్రమముగా అత్యంత సంక్షిప్తముగ నీక్రింద వివరించబడుచున్నది.

ఈ విద్వాంసులయొక్క రచనలలో కొన్ని అప్రాప్యము కొన్ని దుష్ప్రాప్యము, కొన్ని ప్రాప్యము. ఆ గ్రంథములన్నియు లభించగల గ్రంథాలయములు భారతదేశమున చాల తక్కువ. అట్టి గ్రంథము లధికముగ కాశీయందు గవర్నమెంటు సంస్కృత మహావిద్యాలయమునందును, కాశీ హిందూ విశ్వవిద్యాలయమునందును, కాంగడీ గురుకులమునందును, పంజాబు దయానంద కళాశాలయందును, గోకుల, బృందావన గురుకులమునందును కొంతవరకు కలవు. కాని భారతీయులయొక్కయు, పాశ్చాత్యులయొక్కయు, వైదికసాహిత్య గ్రంథములన్నియు లభించగల "వైదిక గ్రంథాలయ" మొక్కటియును భారతదేశమునందు లేకుండుట మిగుల శోచనీయము.

## ౧౭ వ శతాబ్దము

౧—ఫాదర్ పేన్సు. మొట్టమొదట క్రీ. శ. ౧౬౪౦ లో నీ ఫ్రెంచి క్రైస్తవ ఫాదరీ తన లేఖల ద్వారా స్వదేశీయులకు వేదములనుగూర్చి కొంత పరిచయమును కలుగజేసెను.

---

ఈ క్రింది గ్రంథవిక్రేతలదగ్గఱ పాశ్చాత్యులు రచించిన గ్రంథములు కదాచిత్తుగా లభించుచున్నవి.

శ్రీ మోతీలాల్ బనారసీదాస్—
పోస్టుబాక్సు, ౬౫ బనారసు.

మాస్టరు ఖేలాడీలాల్ అండ్ సన్సు,
సంస్కృత బుక్ డిపో. బనారసు.

చౌఖంబా సంస్కృత గ్రంథమాలా
కార్యాలయము. బనారసు.

ఓరియంటల్ బుక్ ఏజెన్సీ—
౧౫ శుక్రవారపు పేట. పూనా.

గవర్నమెంటు సెంట్రల్ బుక్ డిపో. కలకత్తా.

Otto Harrssowitz, Leipzig, Germany.

B H. Blackweii Ltd., 50/S, Broad Street, Oxford, England.

W. Heffer & Sons, Ltd, Cambridge, England.

Truhner & Co, Oriental Book-Sellers London.

౨—రాబర్టు డి, నోబిలీ * క్రీ. శ. ౧౭౫౦ లో ఫ్రెంచి పాదరి యొక కల్పిత యజుర్వేదమును నిర్మించెను. అది పురాణముల గాథలతోను క్రైస్తవులయొక్క కపోల కల్పిత కథలతో నింపియుండెను. అది ఫ్రెంచిభాషయం దనువదించబడెను. క్రీ. శ. ౧౭౭౫ లో దానిపై పెద్ద లేఖలు బయలుదేరెను తుదకు దాని రహస్యమును మాక్సుమిల్లరు వెల్లడించెను.

౩—వాల్టాయరు ఈ ఫ్రాన్సు విద్వాంసుడు కూడ పై యజుర్వేదమును "Essai Sur Les moers etc. espart des nations" అను తన లేఖయందు బాగుగా ప్రశంసించి స్వదేశీయులయొక్క ఉత్సుకతను వేదములపై పునకు మరల్చెను. క్రీ శ ౧౮౭౮ లో నది ముద్రితమై జర్మనుభాషయం దనువదించబడెను. ఈ వత్సరమే వాల్టాయరు స్వర్గస్థుడయ్యెను.

౪—ఫాదరు కొల్ మెట్. ఈయన ౧౮ వ శతాబ్దములోనే—

ఇన్ద్రం మిత్రం వరుణ మగ్ని<br>
మాహురథో దివ్యః ససుపర్ణో గరుత్మాన్<br>
ఏకం సద్.విప్రా బహుధా<br>
వద న్త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః"

ఇత్యాది మంత్రాధారములతో వేదములయందొక్క పరమాత్మవర్ణనయే కలదని స్వదేశీయులకు తెలియజేసెను.

## ౧౯ వ శతాబ్దము

౫—హెన్రీ టామస్ కోల్ బ్రుక్. ఈ ఆంగ్లేయ విద్వాంసుడు మొట్టమొదట క్రీ. శ. ౧౮౦౧ లో "హిందువుల ధార్మిక సంస్కారములు" ౧౮౦౫ లో "వేదములపై నిబంధన" అను గ్రంథములను రచియించి పాశ్చాత్యులకు వేదముల—వైదిక సాహిత్యముయొక్క పరిచయమును కలుగజేసెను. కాని ఆయనయొక్క ఈ వ్రాతలు అధికోత్సాహమును కలుగజేయలేకపోయెను.

౬—ఫ్రెడరిక్ రోజెన్. ఈ జర్మను వైదిక పండితుడు ప్రప్రథమమున యూరపునందు క్రీ. శ. ౧౮౩౦ లో ఋగ్వేదముయొక్క ప్రథమాష్టకమునందు కొన్ని సూక్తములను మాత్రమే లాటినుభాషయందనువదించి ప్రకాశపఱచెను. ౭ సం॥రములు పరిశ్రమచేసి ౧౮౩౭ లో ప్రథమాష్టకము (౧౨౧ సూక్తముల)ను. లాటినుభాషయందు శబ్దశః అనువదించెను. కాని ఆ వత్సరమే ఆయన కాలధర్మము నొందెను. తదనంతర మొక వత్సరమునకు ౧౮౩౮ లో నీ పుస్తకము "Rigveda Samhita Liber Primus, Sanskrite it Latine" అను పేరుతో ముద్రిత మయ్యెను.

అపుడీగ్రంథముయొక్క సహాయముతో పోప్. లాసేను. బెన్ఫే, రుహావర్ మున్నగు పండితులు తులనాత్మక భాషావ్యాకరణమును వ్రాయగలిగిరి.

౭—ఇమెజెన్ బర్నఫ్ ఈయన ప్రథమమున ఫ్రెంచిభాషలో వేదములకు వ్యాఖ్య వ్రాసెను. ఫ్రాన్సు 'కాలేజీ డిఫ్రాన్సు'లో వేదవ్యాఖ్యాతగ నుండెను క్రీ. శ ౧౮౪౫ లో నితడు మాక్సుమిల్లరు రాథ్ మొదలగువారికి, రోజెన్ ఋగ్వేద సంహితయొక్క ఆధారముతో మిగుల నుత్సాహపూర్వకముగా వేదము చెప్పుచుండెను. మఱియు గోరేషియా, నేబీ, గోల్డ్ష్టకర్, సెంటుహిలేయర్ బార్థెలీ మున్నగువారు కూడ నీ బర్నఫ్ దగ్గఱనే వేదాధ్యయన మొనర్చిరి.

౮—ఎచ్. ఎచ్. విల్సన్. ఈయన ఋగ్వేద సాయనభాష్యమును ఆంగ్లమునం దనువదించి ప్రకటించెను. మొదటిభాగము క్రీ శ ౧౮౫౦లో ముద్రితమయ్యెను. ౧౮౮౮ వరకు భాష్యమంతయు 6 భాగములుగ ముద్రితమయ్యెను. ఈయన సాయణుని సమర్థకుడు.

౯—ప్రొబేసన్ ఈయన విల్సనుకు సహాయకుడుగ నుండెను.

౧౦ ౧౧—డా. స్టీవెన్సన్. డా. రోర్. ఈ ఇరువురు క్రీ, శ. ౧౮౫౦ కి పూర్వమే ఋగ్వేదముయొక్క ప్రథమాష్టకమునందలి కొంతభాగమును ఆంగ్లమునం దనువదించి కలకత్తాయం దచ్చువేయించిరి.

౧౨—ఎస్. ఏ. లాంగ్లోవా. ఈ ఫ్రెంచి విద్వాంసుడు క్రీ.శ ౧౮౪౮నుండి౧౮౫౧వరకు ఋగ్వేదమునకు సంపూర్తిగా ఫ్రాన్సుభాషలో వ్యాఖ్యానము వ్రాసి ౪ భాగములుగ ప్రకటించెను.

౧౩—మాక్సు మిల్లరు. † వైదికమునందు ప్రసిద్ధ విద్వాంసుడైన ఇతడు బర్నఫ్ శిష్యులలో నందఱకంటె చిన్నవాడైనప్పటికిని ఆయనకు ముఖ్యశిష్యుడు. ఇతడు సాయణుని "గ్రుడ్డివాని కఱ్ఱ"గా '(Blind-man's Stick) విశ్వసించి సమర్థించెను. ఇతడు తన

---

* ఈ ఫాదరి హిందూమతము నవలంబించి యజ్ఞోపవీతమును ధరించి, పిలక నుంచి, పెండెకట్లు ధరించి, యజుర్వేద బ్రాహ్మణుడు, ఆచార్య తత్త్వబోధస్వామి యను పేరుతో వ్యవహరించుచు తన యజుర్వేదసిద్ధాంతములను శిష్యులకు బోధించుచు ప్రచారము చేయసాగెను. ఆ యజుర్వేదము ఫ్రెంచి భాషయం దనువదించబడి సుప్రసిద్ధ విద్వాంసుడైన వాల్టాయరునకు పాండుచేరినుండి ఫ్రాన్సు పంపబడెను. (3)

† ఈయన పక్కా పరిణామవాది. డార్విను పరివర్తిత సంప్రదాయానువర్తి. "హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే" అను నీ మంత్రమునగల "హిరణ్యగర్భ" శబ్దమునకు "గ్రుడ్డు" అని అర్థము వ్రాసెను. (లే).

జీవితమునందు ౫౦ సం॥ ములకు పైగా వినియోగించి యీ క్రింది గ్రంథముల సంపాదన, నిర్మాణ మొనర్చెను.

(౧) ఋగ్వేద సాయణ భాష్యము యొక్క ప్రథమసంస్కరణమును క్రీ శ. ౧౮౪౯నుండి ౧౮౭౫ వరకు (౨౬ వత్సరములు) పరిశ్రమచేసి ౫ భాగములలో ౭ వేల పుటలకు పైగా ప్రకటించెను ద్వితీయ సంస్కరణమును ౧౮౯౦ - ౯౨లో నాలుగుభాగములుగ లండను నుండి ప్రకటించెను. ఈ ఋగ్వేదభాష్యభూమిక యందు దీనిగూర్చి వ్రాసికొనెను.

"శర్మణ్య దేశ జాతేన, శ్రీ గోతీర్థ నివాసినా,
మోక్షమూలరభట్టేన, గ్రన్థోఽయం పరిశోధితః,

(౨) ఋగ్వేద మూలము క్రీ శ ౧౮౭౩ లో.

(౩) ఋగ్వేదప్రాతిశాఖ్యము ౧౮౫౩ ౬౯లో జర్మనుభాషానువాదసహితముగ.

(౪) వైదికపురాణ విజ్ఞానము

(౫) వైదిక హిమ్సు (S B E. ౩౨ ఇంగ్లీషులో)

(౬) సాయణకృతసర్వానుక్రమణి క్రీ. శ. ౧౮౮౬ లో ఆక్సుఫర్డునుండి

(౭) బృహద్దేవతా. (ఇంగ్లీషుసంపాదనవాదము) ౧౮౫౪ లో.

(౮) హిస్టరీ ఆఫ్ ఏన్షియెంట్ సంస్కృత లిటరేచర్. ౧౮౫౯ లో.

౧౪—రుడాల్ఫ్ రాథ్. ఈయన మాక్సుమిల్లరు నకు సహపాఠియైనప్పటికిని సాయణుని విషయమున నితని విచారధార మాక్సుమిల్లరుకంటె భిన్నముగ నుండెను ఈయన సమాలోచనాత్మక వ్యాఖ్యానశైలిని ప్రవేశపెట్టుచు "వేదార్థమును వేదముతోనే చేయ వలయు"నని నిర్ణయించెను ఇది యీయన ముఖ్యనియమము. "Les von Sayana"(సాయణుని బహిష్కరించుము)! విజయనగర-సాయణుడొక రాజ్యమునకు ముఖ్య మంత్రి యగుటవలన కార్యవ్యవస్థుడై యుండియుండ వచ్చును. అందువలన మనవలె వేదాధ్యయనమునందు అధిక పరిశ్రమ చేయుట కవకాశము లభించకపోవ చ్చును. ఆయనదగ్గఱ ఆధునిక తులనాత్మకభాషా శాస్త్రముగాని పురాణ విజ్ఞానాది సాధనములు గాని లేకపోవచ్చును. కావున ఆయన భాష్యముకంటె నా భాష్యము అధిక ప్రామాణికము కాగలుగుచున్నది.

ఇతనియొక్క అర్థప్రక్రియ విల్సన్, మాక్సు మిల్లరులు చెప్పినదానికంటె యుక్తియుక్తమగును మహార్షియాస్కదయానందులు చెప్పినదానికి చాల దగ్గఱగనున్నది. ఈజర్మను వైదికమహారథికూడ తనజీవితమంతయు వైదికసాహిత్యమునందే వినియోగించెను.

(౧) క్రీ. శ. ౧౮౫౨ నుండి ౧౮౭౫ వరకు ౨౬ సం. రములలో నీతడు వైదికశబ్దములయొక్క సంస్కృత జర్మను మహాకోశమును "సెంటు పీటర్సు బర్గు డిక్షనరీ"ని నిర్మించెను. ఇది ౭ భాగములు ౧౦ వేల పుటలు గలిగియుండెను. ఇది యొక గొప్పనిఘంటువు ఇందు ప్రతిశబ్దము సంపూర్ణ వైదికసాహిత్యమునందెచ్చటెచ్చట ఏయేఅర్థమున ప్రయోగించబడినది తెలియజేయుటకు పరిపూర్ణప్రయత్నము చేయబడెను. దీనివల వేయిరూపాయలు వేదప్రేమియులీ గ్రంథమును, గవర్నమెంటు సంస్కృత కళాశాల కాశీ యందు గాని, గోకుల బృందావన గురుకులమునందు గాని చూడవచ్చును.

(౨) నిరుక్తమును క్రీ. శ. ౧౮౫౨ లో నాటింగునుండి ప్రకటించెను.

(౩) వైదికసాహిత్య ఇతిహాసమును, ౧౮౪౬ లో ప్రకటించెను

(౪) హ్విట్నీతో కలసి క్రీ శ. ౧౮౫౬ లో బెర్లిననుండి శౌనకీయ అథర్వవేద సంహితను సంపాదన మొనర్చెను.

౧౫—ఓటో బెహ్ట్లింక్. ఈయన జర్మను వైదిక విద్వాంసుడైన రుడాల్ఫ్ రాథ్‌నకు ముఖ్యసహాయకుడు. సహాయుడైయుండెను ఉపర్యుక్తకోశము యొక్క సంపాదనయందితడుకూడ సాహాయ్యకుడుగా నుండెను. ఆ వైదికకోశ నిర్మాణమునందే జీవితము యొక్క బహుఅమూల్యాంశమును వినియోగించెను. క్రీ శ. ౧౮౮౯ లో ఛాందోగ్యోపనిషత్ బ్రాహ్మణమును ప్రకటించెను.

౧౬ ౧౭ వార్థెలిమి. ఈయనకూడ బర్న్‌ఫ్ శిష్యులలో నొకడు. ఈయన ఇతని సహచరుడైన, సెంటు హిలేయరుతో కలసి, క్రీ. శ. ౧౮౭౦ ౭౧ లో జర్నల్ డెడ్ సవైన్టన్‌తో వైదికకాల సమాలోచనమును ప్రకటించిరి.

౧౮—మ్యూర్. ఇతడు క్రీ శ ౧౮౫౮ లో లండనునుండి "ఒరిజినల్ సంస్కృత టెక్స్ట్స్"లో కొన్ని సూక్తములకు వ్యాఖ్య వ్రాసి ప్రకటించెను.

౧౯—ఎ వెబర్. ఈయనకూడ జర్మను విద్వాంసుడే. ఈయన క్రింది గ్రంథముల సంపాదన నిర్మాణ మొనర్చెను.

(౧) క్రీ శ ౧౮౪౭ లో యజుర్వేద మైత్రాయణీసంహితను సంపాదన మొనర్చెను (౨) క్రీ. శ. ౧౮౪౯-౧౮౫౩ లో బెర్లిను నుండి మహీధరభాష్య సహితముగ యజుర్వేదమును సంపాదన మొనర్చెను. (౩) ౧౮౫౨ లో యజుర్వేదకాణ్వసంహితను సంపాదన మొనర్చెను. (౪) క్రీ. శ. ౧౮౫౫ లో బెర్లినునుండి శతపథబ్రాహ్మణమును సంపాదన మొనర్చి; ౧౯-౨౪ లో సాయణ, హరిస్వామి, ద్వివేద

గంగ మన్నగువారి టీకలను సంక్షేపముగ ప్రకాశపఱచెను. (౫) క్రీ. శ ౧౮౫౮ లో బెర్లినునుండి అద్భుత బ్రాహ్మణమును జర్మనుభాషానువాద సహితముగ ప్రకటించెను. (౬) క్రీ. శ ౧౮౫౯ లో కాత్యాయన శ్రౌతసూత్రమును (౭) ౧౮౭౧ ౭౨లో తైత్తిరీయ సంహితను, వంశబ్రాహ్మణమును, వాజసనేయ ప్రాతిశాఖ్యమును ౮ భాగములుగ వైదికఛందస్సు (ఇండిషెన్ స్టుడియన్)ను సంపాదన మొనర్చెను. (౮) క్రీ శ. ౧౮౬౨ లో వైదిక నక్షత్రజ్యోతిషమును (౯) క్రీ శ. ౧౮౮౨ లో హిస్టరీ అఫ్ ఇండియన్ లిటరేచర్" ద్వితీయ సంస్కరణమును జర్మను భాషయందు ప్రకటించెను.

౨౦—థియొడోర్ ఆఫ్రెక్ట్ ఈయన జర్మను దిగ్గజ విద్వాంసుడు. మాక్సుమిల్లరునకు పూర్వమే సుమారు ౧౨ వత్సరములు పరిశ్రమించి రోమను లిపి యందు క్రీ శ. ౧౮౬౧-౧౮౭౨ లో మొదటి సంస్కరణము (౧) ఋగ్వేదమును ప్రకటించెను దీని రెండవ సంస్కరణమును క్రీ శ. ౧౮౭౭ లో "బాన్" నగరమునుండి ప్రకటించెను (౨) క్రీ శ. ౧౮౭౯ లో ఐతేరేయ బ్రాహ్మణమును, సాయణభాష్యము యొక్క ఉపయోగాంశ సహితముగ ప్రకటించెను.

౨౧—హాగ్. ఈయన ఐతరేయ బ్రాహ్మణమును ఆంగ్లమున ననువదించి రెండు భాగములుగ క్రీ. శ. ౧౮౬౩ లో ప్రకటించెను.

౨౨—జి స్టివెన్‌సన్. ఈయన క్రీ. శ. ౧౮౪౨ లో లండనునుండి రాణాయనీయశాఖ సామవేద సంహిత ప్రథమ సంస్కరణము ఆంగ్లానువాద సహితముగ ప్రకటించెను.

౨౩—థియొడోర్ బెన్ఫే ఈయన క్రీ శ. ౧౮౪౮ లో లైబజిగ్ నగరమునుండి కౌథుమశాఖీయ సామ సంహితను ప్రకటించెను.

౨౪—డబ్ల్యు. డి. హ్విట్నీ. ఈయన క్రీ. శ. ౧౮౫౬ లో రుడాల్ఫ్ రాథ్‌తో కలసి (౧) అథర్వవేద సంహితను జర్మను భాషయందు ప్రకాశపఱచెను. (౨) క్రీ. శ. ౧౮౭౧-౭౨లో తైత్తిరీయ ప్రాతిశాఖ్యమును (౩) అథర్వవేద ప్రాతిశాఖ్యమును జర్మనుభాషయందు ప్రకటించెను. (౪) క్రీ. శ. ౧౮౭౯ లో లైబజిగ్ నగరమునుండి సంస్కృత వ్యాకరణముయొక్కయు (౫) అథర్వ వేదము యొక్కయు ఆంగ్లానువాదమును గ్రిఫిత్ అనువాదమునకు పూర్వమే చేసెను. కాని అవి ఆయన మరణానంతరము ౧౯౦౫ లో లెన్ మెన్ ద్వారా ప్రకటించబడెను.

౨౫—ఎ. రింజే. (ఎ. రెగ్నియర్) (Regnior) ఋగ్వేదమున మాక్సుమిల్లరునకు సహాయకుడుగ నుండెను. ౧౮౫౫ లో ప్యారిసునుండి — Etu de sur L' ibiome ses Vedas et les origines de Langue Sanscrite — ప్రకటించెను ఈయన సాయణపక్షపాతియైన ఫ్రెంచి విద్వాంసుడు. క్రీ శ ౧౮౫౭ నుండి ౧౮౫౯ వరకు "ప్రాతిశాఖ్య ఋగ్వేద"మును ౩ భాగములుగ ప్రకటించెను.

౨౬—హెచ్. గ్రాస్‌మెన్-ఈ జర్మను విద్వాంసుడు విల్సను ఆంగ్లానువాదమునకు, లాంగ్‌లోవా యొక్క ఫ్రెంచి అనువాదమునకు తరువాత సంపూర్ణ ఋగ్వేదమును పద్యరూపముగ జర్మనుభాషయందు రోమనులిపిలో క్రీ శ. ౧౮౭౬-౭౭ లో లైబజిగ్ నగరమునుండి రెండు భాగములుగ ప్రకటించెను. ఈయన రాథ్ శిష్యుడగుటచే సాయణపక్షావలంబి కాడు. ౧౮౭౩—౭౫ లో ఋగ్వేద వైదికకోశమును కూడ ప్రకటించెను.

౨౭—ఎల్ఫ్రేడ్‌లుడ్విగ్. ఈయన క్రీ. శ. ౧౮౭౬ నుండి ౧౮౮౮ వరకు నీ ౧౨ సం॥రములలో జర్మనుభాషయందు సంపూర్ణ ఋగ్వేదమునకు విపుల వ్యాఖ్య వ్రాసి ౬ ఖండములుగ ప్రాగ్‌నగరమునుండి ప్రకటించెను. 'ఈ వ్యాఖ్య వ్రాయుటలో భారతీయ శైలిని కూడ నుపయోగించి మధ్యమార్గము ననుసరించెను. ఈయన ప్రాగ్ జర్మనీ యూనివర్సిటీలో సంస్కృతశాఖ ప్రొఫెసరు. ౧౮౭౫ లో వైదిక కాల విషయముపై సమాలోచనాత్మక లేఖకూడ వ్రాసెను.

౨౮—౨౯—కార్ల్ ఎఫ్ గోల్డనర్, ఎడాల్ఫ్ కాయేజీ—ఈ ఇరువురు రాథ్ సిద్ధాంతానుయాయులు. కాయేజీ "The Rigveda the oldest literature of Indians" అను గ్రంథమును క్రీ. శ ౧౮౮౧ లో జర్మనుభాషయందు వ్రాసెను. ఇరువురు క్రీ. శ. ౧౮౭౫ లో ట్యూబింగ్‌నుండి ఋగ్వేదముయొక్క ౭౦ సూక్తములను అనువదించి ప్రకటించిరి గోల్డనర్ కొన్ని సూక్తములను ౧౯౦౭ లో అనువదించెను. (౩) "వైదికధర్మము—బ్రాహ్మణధర్మము" అను గ్రంథమును వ్రాసెను. (౪) ౧౯౧౩ లో జర్మను భాషయందు "Die Indis che Balladendi chtung" అను గ్రంథమును వ్రాసెను. ౧౯౨౩ లో ౪ మండలములను జర్మనుభాషయందనువదించి ప్రకటించెను. ఋగ్వేదముయొక్క మహత్వపూర్ణమగు క్రొత్త అనువాదమును పూర్తిగా ప్రకటించుటకు పూర్వమే క్రీ. శ. ౧౯౨౯ లో మరణించెను.

౩౦—ఆర్. టి. హెచ్. గ్రిఫిత్. * ఈ సుప్రసిద్ధ ఆంగ్లేయ వైదిక విద్వాంసుడు కాశీ గవర్నమెంటు సంస్కృత కళాశాల ప్రిన్సిపాలుగా నియమించబడి తనయొక్క ౧౦—౧౫ సం॥రముల కాల

---

* ఈయన గర్భాదాన ప్రక్రియను, ప్రసవ విద్యను అశ్లీలమని ప్రకటించెను.

మును నాలుగు వేదములను ఆంగ్లమున పద్యములుగ అనువాదము చేయుటలో వినియోగించెను. అవి కాశీ నుండియే ప్రకటితమయ్యెను. (౧) ఋగ్వేద ఆంగ్ల పద్యానువాదము రెండు భాగములు క్రీ. శ ౧౮౮౯-౧౮౯౨ లోను. (౨) సామవేద ఆంగ్ల పద్యానువాదమును ౧౮౯౩ లోను, (౩) అథర్వవేద ఆంగ్ల పద్యానువాదమును ౧౮౯౫-౧౮౯౬ లో రెండు భాగములుగను వ్రాసెను. (౪) శుక్ల యజుర్వేద ఆంగ్ల పద్యానువాదమును ౧౮౯౯ లో ప్రకటించెను.

౩౧—ఏ. మెకడానల్. ఈసుప్రసిద్ధ ఆంగ్లేయ వైదిక విద్వాంసుడు అనేక గ్రంథముల సంపాదన, రచన యొనర్చెను (౧) కాత్యాయనకృత సర్వానుక్రమణీ షడ్గురుటీక, వేదార్థ ప్రదీపికా సహితముగ క్రీ శ. ౧౮౮౬ లో ఆక్స్‌ఫర్డునుండి ప్రకటించెను. (౨) శౌనకకృత బృహద్దేవతా ద్వితీయ సంస్కరణమును ఆంగ్లభాషానువాదసహితముగ ౧౯౦౪ లో ప్రకటించెను. (౩) వైదికమతము (౪) వేదిక్ ఇండెక్సులను కీథ్‌తో కలసి ౧౯౧౨ లో రచియించెను. (౫) వైదిక వ్యాకరణమును ౧౯౧౦ లో జర్మనీనుండి ప్రకటించెను. ఇది సర్వోత్తమమైన వైదిక వ్యాకరణము విద్యార్థుల కుపయోగించు దీని సంస్కరణ కూడ ౧౯౧౬ లో ఆక్స్‌ఫర్డునుండి ప్రకటితమయ్యెను. (౬) వైదికపురాణ విజ్ఞానము ౧౮౯౭ లో స్ట్రాస్‌బర్గు నుండి ప్రకటితమయ్యెను. (౭) 'ఏ వైదిక రీడర్' (సూక్తముల సంగ్రహము) ౧౯౧౭ లో ఆక్స్‌ఫర్డు నుండి ఇంగ్లీషులో ప్రకటించబడెను. (౮) సంస్కృత సాహిత్య ఇతిహాసము లండనునుండి ౧౯౦౦ లో ప్రకటితమయ్యెను (౯) ఇండియన్ పాస్టు ౧౯౨౭లో ఆక్స్‌ఫర్డునుండి ప్రకటితమయ్యెను. (౧౦) 'హిమ్స్ ఫ్రం ది ఋగ్వేద' ఇంగ్లీషులో.

౩౨—మారిస్ ఫిలిప్స్. ఈయన "ది టీచింగ్స్ ఆఫ్ ది వేదాస్" "రెలిజియన్ ఆఫ్ ఇండియా" అను గ్రంథములను వ్రాసెను.

౩౩—జే. వాకర్ నాగెల్. ఈయన గాటింగ్టన్ నగరమునుండి జర్మనుభాషయందు క్రీ. శ. ౧౮౯౬ లో మహత్వపూర్ణముగు "వైదిక వ్యాకరణము"ను వ్రాసెను.

౩౪—ఎల్. వాన్ ష్రోడర్. ఈ జర్మను విద్వాంసుడు లైబజిగ్ నగరమునుండి క్రీ. శ. ౧౮౮౧—౮౬ లో మైత్రాయణీ సంహితను నాలుగు భాగములుగ ప్రకటించెను. (౨) క్రీ. శ. ౧౮౮౭ లో "ఇండియన్ లిట్రేచర్ అండ్ కల్చర్"ను. (౩) ౧౯౦౦—౧౯౧౦ లో కాఠక సంహితను నాలుగు భాగములుగను, (౪) ౧౯౦౮ లో "మిస్టీరియమ్ అండ్ ది మయిమ్స్ ఇన్ ఋగ్వేద"మును ప్రకటించెను.

౩౫—ఆర్. పిశెల్. ఈ జర్మను విద్వాంసుడు గోల్డ్‌నర్‌తో కలసి ఋగ్వేదమును బాగుగా సంస్కరించెను ఈ ఇరువురు క్రీ.శ. ౧౮౭౯ నుండి ౧౮౯౭ వరకు నీ ౧౩ సం. రములలో జర్మనుభాషయందు స్టటుగార్టు నగరమునుండి మూడు ఖండములుగ "వైదిక స్టడీ" అను గ్రంథమును ప్రకాశపఱచిరి; ౧౯౦౬ లో బెర్లినునుండి "ది ఇన్‌డిశ్చె లిట్రేచర్" అను గ్రంథమును ప్రకటించిరి.

౩౬—హెర్మన్ ఓల్డెన్‌బర్గు. నూతన వేదాంతమున శ్రీ శంకరాచార్యులవారి నామము ప్రసిద్ధమై యున్నటులే వైదిక సాహిత్యమున జర్మనీయందు ఈ విద్వాంసుని కార్యము ప్రశంసనీయముగ నున్నది. ఈయన బెర్లినునుండి (౧) క్రీ. శ. ౧౮౮౮ లో ౫ వందల పుటలలో వైదిక ఛందాదుల వివేచనమును, (౨) ౧౮౯౪ లో బెర్లినునుండి "వైదికధర్మము"ను (౩) వైదికహిమ్స్ (ఆంగ్లమున S. B. E 46) (౪) ఋగ్వేదమునకు సంబంధించిన ౨౦ ఆఖ్యాన సూక్తములను, (౫) క్రీ శ ౧౯౦౧ నుండి ౧౯౧౨ వరకు బెర్లిను నుండి అద్వితీయ ఋగ్వేదభాష్యమును రెండు భాగములుగను, (ఇది ఋగ్వేదముయొక్క సంపూర్ణ సర్వోత్కృష్ట భాష్యముగ చెప్పబడు చున్నది) (౬) "వరల్డ్ వ్యూ ఆఫ్ బ్రాహ్మణ్స్" జర్మనుభాషయందు ప్రకటించెను.

౩౭—ఏ. హిలే బ్రాంత్. ఈ జర్మను వైదిక విద్వాంసుడు విశేష పరిశ్రమచేసి వైదికపురాణ విజ్ఞానముపై నీ క్రింది గ్రంథములను వ్రాసెను.

(౧) శాంఖాయన శ్రౌతసూత్రము (సంపాదితము) (౨) తులనాత్మక వైదిక పురాణవిజ్ఞానమును ౩ ఖండములుగ బ్రసెల్సునుండి జర్మనుభాషయందు క్రీ శ. ౧౮౯౧ నుండి ౧౯౦౨ వరకును, (౩) క్రీ శ. ౧౯౧౩ లో వైదికసూక్తములను జర్మను భాషయందనువదించి "సం హిమ్స్ ఫ్రమ్ ది ఋగ్వేద" అను పేరుతో వాషింగ్టను నుండియును ప్రకటించెను. మఱియు, వైదిక డిక్షనరీ ౩ భాగములుగ ప్రకాశపరచెను. ఈయన అపరకాల కర్మకాండ అత్యంతావశ్యకమని తెలియజేసెను.

౩౮—రైగోజిన్. ఈయన క్రీ. శ. ౧౮౯౫ లో "వైదిక ఇండియా" అను గ్రంథమును లండను యందుండి వ్రాసెను.

౩౯—వార్థ. ఈయన క్రీ. శ. ౧౮౯౯ లో ప్యారిసునుండి "వైదికధర్మ ఇతిహాసము" అను గ్రంథమును. ఫ్రెంచిభాషయందు ప్రకటించెను. దీని ఆంగ్లానువాదము "The religions of India" అను పేరుతో బోస్టనునుండి ప్రకటితమయ్యెను.

౪౦—బి లిండనర్. ఈయనచే సంపాదితమైన కౌషీతకీ బ్రాహ్మణము క్రీ శ ౧౮౮౭ లో జేనా నగరమున ముద్రితమయ్యెను. (సశేషము)

# నాగహృదయం

రమణశ్రీ

'ఏదేవరో దేవ తెలిసిందట. గుడి గట్టిత్తన్నారు భాగ్యవంతులు.'

ఇటికలతట్ట నెత్తికెత్తుకుంటూ అంది నాగి...

కొత్తగా పనిలోకొచ్చిన దుర్గప్ప నాగికళ్లలో నాట్యమాడే అందాలు చిందరవందరగా చూస్తూ, 'ఏ దేవత? ఎలా తెలిసింది?' అన్నాడు.

'పొలం గొని, దున్నుత్తన్నారంట! యేదో యిగ్గరహం నాగేటికర్రుకు కడ్డంబడి దుగ్గి సాగనిచ్చింది గాదంట! ఆరేత్రి ఖామందుకల్లో గనబడి గుడి గట్టించమందంట! నేకపోతే వొంసం నాసనమైపోయి, దరిద్రం సుట్టుకొంటాదని, పలుకు సెప్పిందంట...ఆ యిగరహం కాళ్ళసుట్టూ పాములూ, ఆడమనిషిబొమ్మ ఉంది... దాన్నే నాగదేవత, నాగేటిదేవతా అని కొలుపులు దీరుత్తున్నారు'...

నాగికళ్లలో చిన్న ఆవేశం తొణుకులాడింది! భక్తితో ఆపాదమస్తకం జలదరించింది!

దుర్గప్ప నమ్మలేకండా నవ్వుతూ, 'ఆ ఖామందు సందాలు పోగుసేశాడా! ఏదో యిగ్గరహం దొరికితే దాన్ని బట్టకొని, గుడి గట్టించడమేటి?....డబ్బున్నవాళ్లేసే యెత్తు....'

'సందా ఐదారేలు పోగడినాది...పూనుకొని పని సేయిత్తన్నాడు దర్మప్పెబువు...'

గుడి కడుతోన్న మేస్త్రీల కేకవిని ఉలిక్కిపడ్డారు. కిందకు దింపుకొన్న తట్ట మళ్ళీ నెత్తికెత్తుకొని పరుగెత్తింది.

'యెదవ పెపంచకం! అంతా మోసం!' అంటూ పళ్లు బిగబట్టాడు దుర్గప్ప.

మళ్ళీ నాగి సున్నంకోసం వచ్చింది.

'ఎవర్నైనా మనువు సేసుకొన్నావా?'

'ఇంకా నేదు! తగినోడు తగిలి కావొద్దు?' అంది దుర్గప్ప కండలు దిరిగిన భుజాలమీద చూపులు నిగిడిస్తూ.

దళసరిపాటి ఇనుపరేకుని కొలిమిలో కాల్చి వంపులుదీర్చినట్టున్న వక్షస్సునిండా ఊపిరి పీల్చుకొని 'నీకెవరైనా ఉన్నారా? గుడిసెక్కడున్నాదీ?' అన్నాడు దుర్గప్ప.

'ఎవరూ నేరు. నేనూ ముసిలవ్వా. అంతా కలరా దగిలి పోనారు'

సున్నం దీసుకొని, పోతోంది.

పోయిన దిక్కే చూస్తూ, దుర్గప్ప ఏదో మధురబాధ గుండెలో నెమరుకు తెచ్చుకొంటున్నాడు.

నాగిలాంటి పిల్లనే మనువు చేసుకొన్నాడు. బోలెడంత ఓలిపోసి, బాహువుల్లో చిక్కించుకొని, వయస్సు సార్థకం చేసుకోబోయాడు. నెల్లాళ్ళు కాపరం చెయ్యకండానే, గూడెంలో ఎవడితోనో లేచిపోయింది. అప్పట్నుంచీ వెదుకులాడుతూ ఇక్కడ పనిలోకొచ్చాడు. నాగిని చూసినప్పట్నుంచీ, వెనకటి దానిమాట మర్చిపోవాలనిపిస్తోంది.

నాగి నిచ్చెనెక్కి ఇటికలందిస్తోంది. మేస్త్రీల పరాచికాలకీ సరాగాలకీ సమాధానం చెప్పుతోంది. దుర్గప్ప దూరంనించి, చూపందుకొన్నాడు. అక్కణ్నుంచి కాల్జారిపడితే, అమ్మో....ఒక్క ఉదుటన ఎగిరివెళ్ళి చేతులుచాసి, చేతుల్లో ఇరికించుకొని, గుండెలకి హత్తుకొంటు చాలీజీవితానికి!...ఊహల్లో మెరుపులు కురుస్తూ, మళ్ళీ ప్రత్యక్షమైంది!

తట్ట నేలకేసికొడుతూ కూలబడింది.

'దొంగనాయాళ్లు! నోటికొచ్చినట్టు కూత్తన్నారు. వాళ్ల నోట పురుగులబడ...'

మేస్త్రీలని తిట్టి పోగులు పెడుతోంది!

'ఏటి సంగతి?' అన్నాడు దుర్గప్ప మెల్లగా.

'అక్కా....మేస్త్రీలు ... కొరుకూతలు కూస్త న్నారు.' అంటూ కళ్ళంట నీళ్లు తిప్పుకొంటోంది....

'నవ్వొండించు. నే నెల్తా...' అన్నాడు దురప్ప. దుర్గప్పకేసి జాలిగా చూసింది కళ్ళల్లో కనుకుతోన్న కాంతి చెక్కిళ్ళమీదనుంచి జాలువారుతోంది.

దుర్గప్ప గుండెకి ఆ చూపులు ఉప్పెన కలిగించి నయ్! అక్కణ్ణుంచి నాగి తట్ట నెత్తి కెత్తుతోంటె దుర్గప్పే అందించి వచ్చాడు.

మధ్యాహ్నంవేళ ఇద్దరూ అన్నాలు ఒకేచోట కూర్చుని తిన్నారు. 'ఈడెవరో దేవ తెలిసింటంట' నాగి మునివాక్కులు జ్ఞాపకంలో గిలగిల్లాడుకుంటు న్నయ్! నాగి తన హృదయదేవాలయంలో దేవతై వెలిసినట్టుంది! అంత అందంగా స్వాభావికంగా నవ్వుతూ ప్రేలుతూ తన గుండెలో దేవాలయం కడు తోన్న నాగి.

తట్ట నెత్తికెత్తుతున్నప్పుడు కళ్లలో ఏదో వెది కేది. దిష్టి తగిలేలా వంపులు తిరిగిన శరీరంవైపు చూసేది. ఏదో పారేసుకొన్నదానిలా వెదుకులాలేది. వ్యక్తావ్యక్తంగా నవ్వేది. చిరునవ్వు పెదవుల చివర త్రుంచి పారేసి, ఏదో వేళాకోళమాడేది.

'ఇయ్యాల కూడెవరొండారు?' అంది నాగి.

'నేనే'

పక్కున నవ్వింది.

'గొంతు దిగజారే, జానవాగ సంకటి సేసు కొన్నావే?' అని మేలమాడింది.

దురప్పకి, ఆ నవ్వూ, వేళాకోళం ఏవో అజ్ఞాత సౌందర్యశక్తుల పూర్వాపరాల్ని ఉపదేశించి, బాంధ వ్యానికి అట్టులు చాచాయి. అన్నం తిన్న ముంతలూ గిన్నెలూ రెండూ తనే కడిగి తెచ్చిపెట్టింది. ఆడుతూ పాడుతూ, పని చకచకలాడుతూ పూర్తి చేసేసరికి చీకటి పడబోతోంది.

మేస్త్రీలు రెండు రూపాయల నోటిచ్చి, మార్చుకోమన్నారు. నాగి దుర్గప్ప మొహంకేసి చూసింది.

దుర్గప్ప వెనకాలే నాగి బయల్దేరింది ఊళ్ళోకి! మెలికలు తిరుగుతూ పోతున్న పాములా కాలుదారి ఊళ్లోకి త్రోవదీస్తోంది. దారికి పదిబారల దూరంలో ఉన్న పుట్టవైపుకి వేలెట్టి చూపిస్తూ అంది నాగి:

'సూశావా? ఆ పుట్టనో బారెడు తాసుపా మున్నాది. అదే మా పాములుమావని కాటేసి పొట్టబెట్టుకొంది! ఆడినించి, ఆ పుట్టంటే బయం నాకు!'—

పుట్టలో ఏదో కదిలినట్టనిపించింది.

బారెడు నాగు...

నాగి నున్నని భుజాలమీంచి కేరుతూ జారు తున్న జడవైపు చూశాడు. బారెడు నాగు.

'ఐతే పాము నెవరూ సంప నేదూ?' అన్నాడు.

'అమ్మో! దేవుణ్ణి సంపడమే!...నాగరాజు... వొంసం నాశమైపోదూ?... ఇల్లంతా పాములు పాములైపోయి, విషం కక్కి కక్కి, పగ తీరుసు కొంటాయి.

ఆ రోజు రేతిరికే, పాములుమావకీ నాకూ పెళ్ళి గావాల...ఊరినించి కావాల్సిన సరుకులూ గుడ్డముక్కలూ కొనుక్కొంచి వస్తన్నాడన్నమాట! సన్నగా సీకటడతంది—పుట్టదరి కొచ్చేసరికి బయం బుట్టిందంట! గుసగుసల్నాగ బుసబుసలినిపించినా యంట! పడగెత్తి పారాడుతూ, కోరాడుతా వస్తంటే కళ్లు బయిర్లుగమ్మినయ్యంట...తరవాత సుహాదప్పి పడిపోనాడు...ఆ దారి నొస్తన్నావోళ్లు ఊళ్లోకి మోసుకొచ్చినారు. ఆకిరికి ఏఱికయ్యా మంత్రంగూడా పని సేసిందిగాదు. ఎన్ని మంత్రతంత్రాలు సేసినా, నాగరాజు కాటుకి బలయిపోనాడు.'

నాగి గొంతులో తడియారి వణికిపోయింది. కళ్ళలో కమ్ముతోన్న చీకట్లు కాటుకతో కరిగి చెక్కిళ్లమీద చారలు కడుతోన్నట్టు అస్పష్టంగా చూశాడు దుర్గప్ప.

'మనువు సేసుకోడానికెవరూ రా నేదా? తరాత?'

'నన్ను సేసుకొన్నావోళ్ళని పాము కరుత్తా దని ఉళ్ళోళ్ళవాళ్లు సెప్పుకుంటుండేవారు. అణ్ణించి ఎవరూ రా నేదు'—

దుర్గప్ప కళ్ళలో ఆశ్చర్యం మెరిసింది.

'మాయమ్మ రోజూ దణ్ణం బెట్టుకొనేదంట, ఈ దారిని పోతా యీ పుట్టకి—అప్పుడికింకా పిల్లలు బుట్టక, దిగులు పడుండేదంట!...పుట్టకు దణ్ణాలెట్టి

న్నాటినించి, ఏదో కొత్తూపిరొచ్చినట్టుండేదంట!... నన్ను గన్నాది తరాత.'

'నాగరాజు వరానబుట్టా వన్నమాట....అందుకే నీపేరు నాగి' అన్నాడు దుర్గప్ప అప్రయత్నంగా...

'అందుకే నాగి పేరెడత!... నేను కన్ను దెరిసిన నెల్లాళ్ళకి మా యమ్మ కన్నుమూసిందంట!...... ఆణ్ణించి మా మామ్మె సాకొచ్చింది...తల్లిని పొట్ట నెట్టుకొన్నావని తిడతావుంట దిప్పటిగ్గూడా?

'మీ అయ్యెవరో నీకు తెలుసా?' అన్నాడు దుర్గప్ప.

'ఎవరో తెలవదు.' అంటూ సిగ్గుతో తల వంచింది.

'ఓహో! అనుకొన్నట్టూహుకొన్నాడు దుర్గప్ప.

'మీ మామ్మయినా నాగరాజుకి కొలుపులు దీరిసిందా?'

'అమ్మో! కొలుపులే! అంత పెచ్చేవనించొస్తది!'

'అందుకే నిన్ను నేసుకోబోయేవాణ్ణే కాటేస్తంది?

నాగి దుర్గప్ప కళ్ళలోకి సూటిగా చూసింది. 'నిజమేనా?' అన్నట్టు.

కిరాణా కొట్టుదగ్గర చిల్లర మార్చుకొన్నారు.

నాగి కావలసిన సామాను కొనుక్కొని వెళ్ళిపోయింది.

దుర్గప్ప నెమ్మదిగా పాడుపడిన గుడిలోకి చేరుకొన్నాడు.

* * * *

చెట్టుకింది పక్షి దుర్గప్ప. నా అనే వాళ్ళు, బంధాలూ బంధువులూ లేని ఒంటరి పక్షి. ఎక్కడికి వెళ్ళినా ఱెక్కలు గొట్టుకొని బతకాలిసిందే! ఊరూరూ తిరుగుతూ ఈ నాడిక్కడి కొచ్చిపడ్డాడు. దేవతలాంటి నాగి హృదయాన్ని తియ్యని ఊపిరితో పూరిస్తోంది. ఎక్కడో చిక్కని ఆనందానుభూతిని అందిస్తోంది. నాగి వాడిచూపులు ప్రతి క్షణం వెంటాడుతునే వున్నయ్!...

నాగిని తన లోలోపల ఐక్యం చేసుకోనేందుకు ప్రయత్నిస్తూ, నిద్రాదేవి కౌగిలిలో ఒరిగిపోయాడు.

చెల్లు చల్లగా వీవనలు విసురుతున్నయ్. చంద్రుడు వెన్నెల ధారపోస్తున్నాడు. చుక్కలచీరల మేఘకాంతలు చంద్రుడితో దోబూచు లాడుకొంటున్నయ్ మిణుగురులు గుంపులు గుంపులుగా కిందికి దిగివచ్చిన నక్షత్రంపిల్లల్లా ఆడుకొంటూ, సంగీతం పాడుకొంటున్నాయి.

దూరంలో పద్మాకారంలో వెలుస్తోన్న గుడి, వెన్నెల పాలకి తడిసి నానిపోతోంది...దారిలో పెద్ద పుట్ట...బంగారపు పుట్ట...నాగరాజు పడగెత్తి నాగస్వరానికి ముగ్ధమోహనంగా నర్తిస్తుంటే, ఆ పడగపైన నాగి......నాగకన్యలా అపురూపసౌందర్యతరంగాలు పొంగువారుతోన్న సాగరంలాంటి నాగి...

పాము పడగల బుసబుసల మధ్య నాగి...

ఆ నాగిని చేతుల్తో పట్టుకొందామని ప్రయత్నిస్తోన్న తను...అందకండా ఏ లోకలోకాలకో తేలిపోతోన్న నాగకన్య...సర్పాల పహారాలో సాగిపోతోన్న నాగి...

అడుగులు ముందుకు పడుతున్నయ్!...

పుట్టదగ్గర పడుతోంది...

పడగల బుసబుసలు విసవిసల సరంభం...

నాగినెవరో అందుకు పోతున్నారు...

చేతులు చాచి కాళ్ళందుకోబోయాడు......

పాదాలు గడగడ వణకసాగినయ్?.....త్రాళ్ళతో కట్టి వేసినట్టు...కాళ్ళ నిండా నెత్తురు...కొన్ని వేల కాట్లు. విషవహ్నికీలలు... నాగి ఎగిరెగిరి గుడిమీద తేలింది.

పద్మాంచలాలమీద మహోద్వేగంతో నర్తిస్తోంది...పరుగెత్తాడు. కాళ్ళలో సత్తువ తేలిపోతోంది..

నాగి కాలుజారి అతని చేతిలో మెత్తని మాంసం ముద్దలా, నెత్తురుగడ్డలా పడింది.

గుండెలను హత్తుకొని...

కెవ్వున కేక వేశాడు...

కేకలకి చెట్లమీద పక్షులు ఱెక్కలారుస్తూ ఎగిరిపోయాయి. కాళ్ళవైపు చూసుకొన్నాడు. ఒక వెచ్చని నిట్టూర్పు ముఖాన్ని మేఘంలా అలుముకొంది!

కలను కన్నాడు.

భయం గుండెల్ని పిండిపారేస్తోంది!

నాగి శక్తిలా కనిపించింది.

నాగిని చేసుకోవటమంటే మాటలా?

అంతశక్తి నీకుందా? అన్న ప్రశ్న వేస్తోంది కల..

ఏవో పూర్వాపరాలు స్మృతిపథంలో తేగాయి.

తెలతెల్లగా తెల్లవారింది.

పనిలోకి బయల్దేరాడు. అప్పటి కప్పుడే నాగి పనిలోకి వచ్చి సిద్ధంగావుంది. నాగిని చూసేసరికి ఏదో కొద్దిపాటి భక్తి, ఆవేశం కలిగించుకోబోయాడు—

నవ్వుతూ పేలుతూ నాగి పలకరించింది, నిన్నటి చనువు మరింత వృద్ధి చేసుకొంటూ.

'నీతో పలకరిస్తే అపకారమేమో? నాగరాజూరుకొంటాడూ?'

దుర్గప్ప వేళాకోళం చేశాడు.

'ఇంకా నయం! పాముల్నిగానీ నేనుసేసుకోబోతన్నానా?' అంటూ మూతి ముద్దుగా ముడుచుకొంది!

'ఊరికనే అన్నాన్లే నాగీ! యేరే బ్రెమెట్టుకోకు'

దుర్గప్ప ఊరడింపుకి కరిగి ప్రవహించింది నాగి. ఈ మనువుకూడా ఆ తాచుపాము మూలంగా చెడిపోతుందేమో అనే భయం లీలగా గుండెచుట్టూ తిరగసాగింది.

నిన్నటిలా చనువు ప్రదర్శించడంలేదు దుర్గప్ప.

విషవాసన తగిలినట్టు దూరదూరంగా తప్పుకుపోతున్నాడు. కలలకీ జీవితానికి సంబంధమేమిటి? అంత పిరికితన మెందుకు తనలో? రకరకాలుగా వ్యతిరేకంగా ఊహించుకొంటూ ఎడమొగం పెడమొగం పెట్టి పనిచేస్తున్నాడు.

మేస్త్రీలు ఎగతాళిచేస్తూ, 'ఒకరోజుకే బెడిసిగొట్టేసిం దేటి యెవ్వారం?' అన్నారు దుర్గప్పని!

కాస్తంత ధైర్యం చిక్కించుకొని, 'మూతి ముడుచుకొన్నావేం? నాగీ! నా మీద కోపమా?'– దుర్గప్ప నాగిలో అసహనం పారదోలడానికి ప్రయత్నిస్తూ అన్నాడు.

మొహంమీద ఎరువు చిరునవ్వు తెచ్చిపెటుకుంటూ అంది. 'నాకేం కోపం! నీ మనసెవరో యిరిచేసినట్టు, ముంగినా మాటాడకపోతే, ఎలాగుంటది సెప్పా?'

దుర్గప్ప భావతరంగాల్లో ఒడ్డు చేరుకొనే ప్రయత్నంలో వున్నాడు. మధ్యాహ్నం అన్నాలు తినేటప్పుడు తను తెచ్చుకొన్న పచ్చడేదో పెట్టబోయింది. ఆ పచ్చడి చిత్రంగా కనిపించింది. విషవాసన తగిలినట్టు తగిలింది వద్దని వారించాడు. మళ్ళీ కథ మొదటికొచ్చింది.

'సింతకాయ పచ్చడికేం?' అంది మొహం ముడుచుకొని...

'అదేవో తిలకాయ సిరగ్గొట్టిన పచ్చడిలా వుంది గాని, సింతకాయపచ్చడినా లేదు...అయ్యేటి పచ్చగా మెరుస్తున్నాయ్?' పచ్చడివైపు చూపిస్తూ అన్నాడు.

పకపక నవ్వింది, 'మిరబగాయ ముక్కలు మెరవడ మేంటి?' అంది అమాయికంగా...

దుర్గప్ప కళ్ళ కెక్కడచూసినా పాముల మెలికలే! పాము కుబుసాలే! బయటికి పొడుచుకొస్తోన్న నాలికలే! ఏ రంగుచూసినా విషంలాగే! ఈ విపరీతానికి భయపడిపోయాడు. గుండెదిటవు దేహద్రఢిమా కల తన నిబిభ్రమపెట్టేందుకు ప్రయత్నిస్తున్నాయ్. ఇంతటి వైపరీత్యానికి కారణం నాగికళ్ళు! ఆ కళ్ళలో ప్రతిఫలిస్తోన్న జ్వాలాతరంగం...నవ్వుతూ ప్రేలుతూ తనచుట్టు వలయాలు తిరుగుతోన్న జ్వాలాతరంగం...

ఐనా భావోన్మాదంతో ప్రవర్తించకండా ఆటుపోటుకి నిలబడి పనిచేశాడు. నాగిని చూసేసరికి పూర్తి ఏవగింపు కలిగింది.

చిరుచీకటి పడింది!

పని కట్టిపెట్టి బయల్దేరారు.

పుట్టవైపుదారి మానేసి, అడ్డత్రోవ బయల్దేరాడు. నాగికూడా నిశ్శబ్దంగా బయల్దేరింది అతని వెంట. ఉన్నట్టుండి ఆకాశాన మేఘం క్రమ్ముకొంది. చీకటి మరింత చిక్కబడింది!

దారిలో 'దుర్గయ్యమావా!' అంది నాగి. గొంతు పూడిపోయింది.

కళ్ళలో ఏదో వెల్తురు దారి చూపుతోంది!...

నేత్రాంచలాల్లో కాంతు ప్రేలాడుతోంది భయంగా.

అనునయంగా దుర్గణ్ణి చుట్టబెట్టుకోబోయింది.

పాము తన శరీరాన్ని చుట్టబెట్టుకొన్నట్టు అనుభూతి పొందాడు. చల్లని గాలి విసిరింది. వెచ్చని

ఊర్పులు మొగాన్ని పెదవుల్ని నరనరాల్ని ఉద్రేకిస్తున్నయ్!...రక్తం తరంగమయంగా ప్రవహిస్తోంది ఆపాదమస్తకం...

'నాగీ!'

ఉద్రేకం కేక వేసింది!

జలజల మేఘం వర్షించింది!

నాగి ఉలిక్కిపడింది.

దగ్గర్లో పాడుపడిన గుడి...

గుడిదగ్గరికి చేరుకొనే సరికి గాలివాన...

ఆ గాలిలో వానలో ఏదో రహస్య ప్రణ(ళ)య భయంకర సందేశం!

దట్టంగా కమ్ముకున మేఘాలు వర్షిస్తున్న ధారలో తడిసిపోయారిద్దరూ...వర్షలోకం లోంచి ఊడిపడ్డ మానవాతీతశక్తుల్లా ఉన్నారు!

'నే నిక్కడే నిద్దరోతాం'—దీపం వెలిగించి, అన్నాడు దుర్గప్ప చలికి వణికిపోతూ.

వంటిమీంచి వర్షబిందువులు ముత్యాల్లా తూలి పడుతున్నయ్! నాగి ముఖంమీద ఉంగరాలు తిరిగిన ముంగురులు రింగురింగున ఊగుతూ ముత్యాలు రాలుస్తున్నయ్!...

'పురుగూ పుట్రా ఉండే చోటు, ఇక్కడేనా నీ నిదర?' అంది.

దుర్గప్ప కళ్లలో తేరుకు చూశాడు. కంఠంచుట్టూ తడిసి వానిపోతోన్న అందం, భుజాలకిందుగా బాహువుల్లోకి జారుతోంది!... మైకం కమ్ముంది. ఏం చూస్తున్నదీ చేస్తున్నదీ అతని చైతన్యంలో లేదు.

'అపరాత్రం...పొద్దుణ్ణించీ, నీ కళ్లలో మెదుల్తోన్న పాము మెలిక లేమిటి?'

లోలోపల ఘోష!

వినిపించలేదు అతని చెవులకి! గుడ్డిదీపం ఇద్దర్నీ చూసి రహస్యం దిగమింగుతోంది!

గాలికి రెపరెపలాడిపోయి అస్తమించింది వెల్తురు. నాగి పాములా మెలికలు తిరిగిపోయింది అశనిచుట్టూ పెనుగులాడుతూ. మెరుపు మెరిసింది. మేఘం అరిచింది...ఎక్కడో ప్రణయదేవాలయం వాకిళ్లు తెరుస్తున్న చప్పుళ్లు...

గంటలో విపరీత పరిణామంతో శాంతించింది ప్రకృతి. మెల్లిగా బయటకొచ్చారు...

'దుర్గయ్య మావా!'-

హోరున సముద్రం పొంగినట్టు ఏడ్చింది అతని గుండెల్లో తలదాచుకొని...

'ఛా... ఎందుకూ ఏడుపు? నువ్వే నా మనువు. నిన్నే మనువు చేసుకొంటా!' దుర్గప్ప మాటల్లో విశ్వాసం ఏడుపుని అరికట్టింది.

మెల్లిగా చీకట్లో దారి తడుముకొంటూ, తడుముకొంటూ సాగిపోయింది నాగి!...

గుడ్డిదీపం వెలిగింది దుర్గప్ప కళ్లలో.

స్తంభందగ్గర ఏదో చరచర పాకినట్టయింది! త్రుళ్లిపడి చూశాడు. ఏం కనిపించలేదు. వట్టిభ్రమ.

అక్కణ్ణుంచి ఆూచి ఆంపాన పెట్టసాగింది మనసు. అంత గుండెదిటవూ నీరుకారిపోయింది. ప్రాణాల్ని ఉగ్గబట్టుకొని ఊపిరి విడిచాడు. ఎండుగడ్డి మంటబెట్టాడు. చలికి వంకరదీరిన నరాలు సాగాయి. రక్తం రవరవ పాకింది. మెదడులో శిలాద్రవం కరిగింది

మంటలో జ్వాలల నాలికలమీద నాగి నృత్యం చేస్తోన్నట్టు కనిపించింది. పాములు మెలికలు తిరుగుతున్నట్టున్నయ్ కీలలు! మంట ప్రక్కనే వెలుగుతూన్నా హృదయంలో వణుకు పోలేదు. భయం పీల్చిపారేసిన పిప్పిలా ఉన్నాడు మనిషి.

నాగితో ఎంత అపచారం చేశాడు? 'దాని ఫలితమే అనుభవిస్తున్నావ్! గుడ్డిదీపం మిణుక్కు మిణుకుమంటూ సాక్ష్యమిస్తోంది! పాడుపడిన గోడలు ఛాయాచిత్రాలు తీసుకొని, తిరిగి ప్రదర్శిస్తున్నట్లనిపించింది! ప్రకృతిలో ఇంత విపరీత పరిణామాలు నమ్మలేకపోయాడు!...

ఏనాడూ కంటనీరు పెట్టనివాడు భయంతో ఏడ్చాడు.

'వెంటనే పారిపో'

లోలోపలి ఘోష!

నాగితో మనువో?

'నీ ప్రాణంకంటె ఎక్కువా? పాము పగబట్టి కాటేస్తే?'

...............

పాముకాటుకు నురగలు గక్కుతూ, పొగలు

చేస్తూ చొంగలు కారుస్తోన్న మరణముఖం కనిపించింది!

* * *

'దుర్గయ్య మావా!'

పాడుబడి ప్రతిధ్వనించింది — 'శిథిలాలయమ్ముల్లో శివుడు లేడోయి' అని — నాగి గొంతు సుడి దిరిగిపోయింది.

అతను లేడని, ఆక్రోశించి చెపుతోంది వాతావరణం.

'పనిలోకి గానా యెలాడేమో!'

కుడిసగ్గరికి పరుగెత్తింది. 'ఇయ్యాల పనిలేదే నాగీ! దుర్గప్ప గానా గనబడితే సెప్పు'

మేస్త్రీ అన్నాడు సున్నంగుట్ట బాగుచేస్తూ.

'ఎవరితోనూ చెప్పడం? మొండిగోడల్తోనా? పాడుపడినగుడిలో విగ్రహంతోనా? ఎవరితోనూ చెప్పడం?...'

దుఃఖం గుండెలో దిగదొక్కుకుంటూ పుట్ట దారిపట్టి పరిగెత్తింది! ఒక్క ఊపున గుడిసెలో కుక్కి నులకమంచంమీద ఎగిరిపడింది.

బారెడు నాగుత్రాచులాంటి జడ పడగవిప్పి బుస గొడుతున్నట్టుంది. విషవహ్నిజ్వాలల్లో పెదవులూ, ముఖం, కళ్లు తేలిపోతున్నట్టున్నయ్!

'ఏటే నాగీ! అంతిపరీతంగా వున్నావ్?' అని ముసలవ్వ సమాధానంకోసం ఎదురుచూసింది!

దుర్గప్ప మనువుసంగతి తడబడుతూ చెప్పేసింది.

'ఇకేం! దగా చేశాడన్నమాట! నీ బతుకు సెణంలో కాల్సుకతిన్నాడు'

ముసలవ్వ మెటికలు విరిచింది.

నాటినించీ, అలా బతుకుతూ వచ్చింది నాగి. దిగులుగా, నీరసంగా మసిలింది. ఆడిగుల్లో నీరసం లోనే, నెల అని తేలింది. అంతులేని ఆవేదన... దుర్గప్ప తన కడుపులో చిచ్చుబెట్టి, ఎక్కడికో పారిపొయ్యాడు!...

'ఎడకీ పారిపోలేదు...దుర్గయ్యమావఁ నాకడుపులో సిక్కడిపోనాడు' అనేది ముసలమ్మతో పిచ్చిగా. పిచ్చిపిచ్చివేషాలేసేది. వాగేది. పాడేది.

'అదుగో! దురగయ్యమావఁ పొట్టలోంచి వత్తన్నాడు. పుట్టమీది కెక్కుతున్నాడు...పడగిప్పిన నాగరాజు, పగబట్టిన నాగరాజు మాటేసి కాటేశాడు'—

తొమ్మిదినెలలూ కంటికిరెప్పలా కాపాడుకొచ్చింది ముసలవ్వ. పదోనెల పైబడుతోంటే, నాగి కడుపు పండి, శిసువును కంది. అప్పుడే కుబుసం విడిచిన పాములాంటిబిడ్డ...చేతిలో పాములా మెలికలు తిరిగిపోతున్న బిడ్డ...తల్లిపాలు తాగడానికి బుసలుగొడుతున్న బిడ్డ...

పాములా పక్కమీదపాకిపొయ్యేవాడు పాము చారలు...పడగలా తల!...ముసలవ్వ బిడ్డణ్ణి చూసి మురిసిపోయింది! 'పాములూ' అని పేరుపెట్టింది! పాము చెవులే! ఎక్కడే శబ్దంవిన్నా ఉలిక్కిపడేవాడు. కొడుకుని పొత్తిళ్లలో పొదువుకుని పెంచుకొంటోంది నాగి...దిగులు మరిచిపోయింది. వంట్లో బాలింతరలి చాయ మెరుగులుదీరింది. 'చక్కనమ్మ చిక్కినా అందమే' అన్నట్టుంది!

ఊరంతా ఈ 'పాముల్ని' చూడ్డానికొచ్చారు. జాతిమత వివక్షత లేకుండా.

పూర్తిగా పాము కడుపున పుట్టినట్టున్నాడన్నారు. బుసగొట్టడం విని, గతుక్కుమన్నారు... పాము నాలికల్లాంటి నాలిక చూచి విస్తుపోయారు... పడగలాంటి తలచూసి ఝడుసుకొన్నారు! నాగిపేరు పత్రికాప్రపంచంలోకి కూడా వెళ్ళిపోయింది. దానితో దిక్కులు మారుమ్రోగినయ్...మనిషికి పాము పోలికల్తో, బుసల్తో బిడ్డపుట్టాడని....

నాటినుంచి, ఆపల్లెటూరు తీర్థమైపోయింది. క్రిక్కిరిసిపోయింది. దారిలో పుట్ట ఆవుపాలతో తడిసి నానిపోయింది. పసుపు కుంకుమల్తో ఎఱుపూ పసుపుల కొండలా దూరానికి కనిపించింది!

'పాములు' బుసవిని, నాలికలుచూచి ప్రపంచం నాగలోకంవైపు భ్రమించిపోయింది!

దూరాన పద్మాకారంలో వెలిసినగుడిలో దేవత, పుట్టవైపు ఈర్ష్యగా చూసింది! పుట్ట నానాటికి పెద్దదైపోతోంది నాగలోకమంతా భూతలంమీద మొలుస్తుందా అన్నట్టు!...ఈ వేడుకలూ, తీర్థప్రజా, ప్రచారం అంతా నెల్లాళ్ళలో పొంగులా అణిగిపోయింది.

ఈ పొంగులోనైనా దుర్గప్ప ఎక్కడైనా తేలి కనిపిస్తాడేమో అని చూసింది. కళ్లు ప్రతిఫలించలేక

పోయాయి. తీరని ఆశమాత్రం మిగిలింది!...ఆఆశతో ఎప్పటికైనా కొడుకుకోసమైనా రాకపోతాడా? అని బతుకుతోంది నాగి!

కాలం గిరగిర తిరిగి యేడాది దాటింది.

'పాములు' పాకిపోతున్నాడు ఎక్కడికైనా సరే!...

ఒకరోజున ఎవరో వింతవ్యక్తి పాముల్ని బయట్నుంచి లోపలికి తీసుకొచ్చి; 'బండికిందబడి నెత్తురై పోవలసింది బిడ్డ...బయటికి రానీకొకండి' అని నాగి కప్పజెప్పాడు.

జీబురుగెడ్డం... పెద్దబూచి లావున్నాడు...... ముఖం నిండా గాట్లు, ముకికీ మాలిన్యం వంటినిండా.... చూడ్డానికీ వింతా, రోత...కళ్లలో అసహ్యం...

నాగి ఏవగింపుగా చూసింది...ఆబూచి తాలూకు వంటిమీద మాలిన్యం బిడ్డకంటుకొంటదేమో అని తల్లి తల్ల డిల్లిపోయింది.

'ఎవరు బాబూ నువ్వు?'

ఆవిడ కళ్ళలో ప్రశ్న.

'నువ్వు నన్నెరుగుదువనుకొంటున్నావా?

అని తిరిగి ప్రశ్న.

'ఎక్కడో ఏదో అనుబంధం అనుకొంటూ'

విసిగిపోతోన్న ఆకళ్ళు.

'నీకు బాగా జ్ఞాపకమేనా? గుర్తించావా?'

విసిగిపోతోన్న ఆకళ్ళ రెపరెపలు భూతకాలాన్ని చప్పుడుచేస్తున్నట్టున్నయ్...

వింతవ్యక్తి బయటికొచ్చేశాడు.

నాగి గుమ్మంలోనించి తొంగి చూసింది.

పాడుగుడివైపు నడకసాగిస్తూన్న వింతవ్యక్తి...

నాగికళ్ళు ఏదో పూర్వాన్ని దృశ్యీకరించుకొంటున్నయ్!

చిరుచీకటి పడుతోన్నప్పుడే నాగికాళ్ళక్కడికో ప్రయాణం తలపెట్టాయి. ముసలవ్వకి చెప్పకండా, పాముల్ని చంక వేసుకొని బయల్దేరింది.

ఏనాడో చూసినగుడి!...ఎవరో ఉన్న అలికిడి ...అడుగుల సవ్వడికి, లోపల్నుంచి కేక.

'ఎవరూ వస్తే?'

నాగి చప్పుడు చెయ్యకండా లోపలికి తొంగి చూసింది. పాములు కళ్ళు మిటకరించుకొని, వాలిక వెళ్ళబెట్టి చూశాడు. పాముల్ని నేలమీద వదిలింది నాగి స్తంభం పక్కనుంచి చరచర పాకుతూ, బుస గొడుతూ వెళ్ళాడు.

వింతవ్యక్తి నిజంగా పామనే అనుకోవాలి! 'పాము...పాము...' అని కేక వేశాడు కళ్లు మూసుకొని కిటికీ ఎక్కి కూచున్నాడు.

నాగి కళ్ళముందు కనిపించింది!

'నువ్వా?' అన్నాడు అప్రయత్నంగా. పాముల్ని చేతిలోకి తీసుకొంది మెలికలు తిరిగిపోతున్నాడు. భయంతో వణికిపోతున్నాడు.

'పాము...పామనుకొన్నాను'

'పామంటే అంత భయమేం?' అంది నాగి రెట్టించి.

'సిన్నప్పట్నుంచీ భయమే!' అన్నాడు తడబడుతూ.

'సిన్నప్పట్నుంచీనా? మద్దెనించా? నువ్వెవరివో? తెలిసిందా?

నేనెవర్నో నాకు తెలీకండా ఉంటుందా? నిన్ను మాత్రం పొద్దుట పుర్రాణ్ణప్పజెప్పేటప్పుడు చూశాను. నేను అడుక్కుని తిని బతికేవోణ్ణి! నాదగ్గరేవుంది? ఎందుకొచ్చావు ఇక్కడికి?'

'రెండేళ్ళ క్రితం ఇక్కడేం. జరిగిందో జ్ఞాపకం నేదూ నీకు? నిన్ను పసిగట్టే యెంటబడ్డాను. యేసం మారినా గొంతుమారందే! వందమందిలోఉన్నా నీ గొంతు సిటికిక్కన పసిగడతా! ఈ పాముల్ని సూడు ...ఈడు తండిరిలేని బిడ్డ...దిక్కులేని బిడ్డ...నా మానాన నన్నొదిలేసి, పారిపోనాడు తండ్రి. ఈబిడ్డ కోసం బతికాను...నాగరాజు వోరాన పామైపుట్టింది బిడ్డ...ఈణ్ణి సూడ్డానికి పెపంచం ఇరగబడి వచ్చింది. అప్పుడేనా తండిరినని సెప్పుకొంటూ వత్తాడేమో అని సూశాను. ఎవ్వరూ రాంకే?...ఈపొద్దు సూశాను... నమ్మనేకపొయ్యాను. మనిసి మారినా సూపు మారదుగందా! గొంతు మారదుగందా!...యెయ్యిమందిలో ఉన్నా ఇట్టే పసిగట్టాల్సిన సూపూ, గొంతూ' నాగి గొంతు పూడిపోయింది.

మొహంలో మాలిన్యం కరుగుతోన్నట్టుంది ఆ వ్యక్తికి. కళ్ళలో ఏదో మెరుపు మెరుస్తోన్నట్టుంది!

అతని మొద్దుబారిన జాలిలేని పెదవులు, పొగ

మూసిన గోడల్లాంటి పెదవులు, గతాన్ని బలవంతంగా చప్పరిస్తున్నట్టున్నయ్!

'నాగీ' అన్నశబ్దం పాడుపడిన దేవాలయం గోడల్ని కూల్చి పారేసింది. రెండేళ్ళక్రితం వేసిన కేక ఇప్పుడు వినిపించినట్టుంది! ఈ రెండు సంవత్సరాల దీర్ఘకాలం గ్రక్కదిలిపోయినట్టయింది! నాటి నుంచి నేటివరకు, 'నాగీ' అన్న దీర్ఘాక్షరాల్ని సాగదీసి అతికినట్టుంది!

'నాగి నా దేవత ఆ దేవతకి ద్రోహం చేశాను— పాముకాటుకి భయపడి'—అన్నాడు ఆచిత్రవ్యక్తి.

నాగికళ్లలో నీరు గుక్కుకొంటూ నిలిచిపోయింది. నోట్లోంచి, ఆవేశం అంతరించింది ఏనాటి నించీ కాపాడుకొస్తోందో జవసత్త్వం ఒక్క ఉదుటున కూలబడిపోయింది. పాములు వింతవ్యక్తికేసి చూస్తూ, బుసగొడుతున్నాడు.

'ఈడే నీకొడుకు'

'నాకొడుకా' అన్నాడు. ఆశ్చర్యంతో పెనవేసుకొన్నాడు పాముల్ని.

'నిజంగా పామేనే నాగీ! పామంటే ఎంత భయపడేవాణ్ణో, అరోజున, పాములు నాకళ్లల్లో మెలికలు తిరిగిపోయాయంటే నమ్ము... చివరికి నాభయం భయంనాగ నీకడుపున పడ్డది'

అలా ఎంతసేపు గడిచిపోయిందో; మౌనంగా భావగర్భితంగా, నాగికి అంతుపట్టలేదు!

నాగిలేచి, 'యెల్తాను' అని సెలవు తీసుకొంది.

పాముల్ని ముద్దులాడి యిచ్చేశాడు.

'నేనొచ్చి దిగబెట్టనా?' అన్నాడు.

'వద్దులే! ఎవరేనే చూస్తే బాగోదు' అంటూ దారితీసింది.

ఏదారిన పోతోందో తనకే తెలియలేదు. చుట్టూ నల్లగా మాడిపోయి ప్రవహిస్తున్న చీకటి. భయం గుండెల్ని పిండిపారేస్తోంది. రోజూ నడిచేదారే! ఐతేనేం?...ఏదో అనూహ్యమైన భీతి...గజగజ వణికిపోయింది. పాములు బుసలు గొడుతున్నాడు. అల్లంత దూరంలో చిన్న కొండలాంటి పుట్ట... పుట్టలో ఏదో కదిలింది. కొంతివాకలా నెత్తురు జలజల కురుస్తోంది పుట్టమీద. నాగి చేతులెత్తి నమస్కరించింది. పాములు కిందకి జారిపోయాడు. భక్తిలో ఆవేశంలో తూగిపోయింది. పాములింకా చేతిలో వున్నాడనే భ్రమలో వుంది! పాములు మెల్లగా నల్లగా సాగిపోయ్యాడు ఎక్కడికో ఆవిడాది పసిపాపకే అంతుపట్టదు! చైతన్యంతో చేతుల్లో నడుము దగ్గర చూసుకొంది. ఏంవుంది? శూన్యం...కెవ్వున కేక వేసింది ... ఎలుగెత్తి పిలిచింది. పుట్టలోంచి పాములు మిఃమిఃతొంగి చూశాయి. జలజల కదిలాయి. పాములా పుట్టలోకి సాగిపోతున్న పాప...ఏదో బారెడు పదార్థం కళ్లుబైర్లు క్రమ్మిస్తూ,నక్షత్రాల వెలుతురులో, 'పాములు' కాళ్లని చుట్టిబెట్టుకొని, పెదవుల్ని ముద్దుబెట్టుకొంది—

ఒక్క ఉదుటున నాగి పరిగెత్తుకెళ్లింది.

'పాములు' బుసకొడుతూ వున్నాడు జోగుతూ వున్నాడు. నురగలు గక్కుతూ పొగలు లేస్తూ యమయాతన కళ్లలో ప్రతిఫలిస్తున్నాడు. ఆచీకటిలో, గుడ్డివెల్తురులో. 'ఎంతఅన్యాయం?...ఎంతఘోరం!...' ప్రకృతి ఘోషించింది నాగి గొంతులోంచి...

'పసిపాపే, నీ ఆకలికి దొరికిందా నాగరాజా! వయస్సులో పొంగులువారుతూ, జలజల రక్తంతో సంగీతంపాడే నరాల్ని విష కలుషితం చేసి. నావయస్సు మీద పడి నాట్యమాడలేక పోయ్యావా? నాశరీరాన్ని పెనవేసుకొని, చిత్తమొచ్చిన చోట కాటువేసి ముద్దులాడలేకపోయ్యావా?'...అని...

నాగి చింతచెట్టు కిందకి ఆప్రాణంలేని కట్టెతో చేరుకొంది. తెల్లవారులూ కన్నీళ్లు ప్రవహించింది. చివరికి స్పృహతప్పి పడిపోయింది.

గుడిగంటలు మోగుతున్నయ్!

సొమ్మసిలి పడిపోయిన నాగి గుండెలో ఘంటానినాదం ఏలోకంనించో మేల్కొల్పింది! పరుగుపరుగున ఆ నల్లని విషవహ్నికీలాతప్తమైన పాముల్ని చేతిలో ఇరికించుకొని, దేవాలయం ముందు వాలిపోయింది!

పూజారి అడ్డగించాడు.

'ఈగుడి నేనే గట్టాను!... గుళ్లో దేవతని నేనే ముందు చూశాను. ఇందులో అడుగెట్టడానికి నాకర్హత లేదా? ఇదేం నాయం దేవుడా?.... నేను గడితే పనికొచ్చిన గుడిలో నన్నడుగెట్టనీరూ?' అని నాగి మెట్లమీద పడి ఆక్రోశించింది.

గుడిలోంచి దుర్గప్ప బయటికొస్తున్నాడు. నాగిని చూసి గతుక్కుమని పోయాడు.

చేతిలో విషంతో మాడిపోయిన నల్లనిపాముల్ని చూసి బిత్తరపోయాడు. 'దురగయ్య మావా!' అంటూ నాగి అతని కాళ్లముందు పాముల్ని కన్నీటితో అభిషేకిస్తూ వాలిపోయింది.

గుడిగంటలు ఘణఘణ మోగాయి!

# సత్తి పెళ్ళి

శ్రీ కంచి శేషగిరిరావు

## ఏకాంకిక

* * బీదవాని యిల్లు; విరిగిపోయిన కుర్చీలు; పాతబల్ల; మాసినబట్టలు వగైరా. సుబ్బయ్య, సత్యవతి; జిఱ్ఱబొచ్చు, నిక్కరు, చారల బనీనుతో సుబ్బయ్య మొరటుగా కనిపించుతూ వుంటాడు.

సత్య : ఎన్నిసార్లు చెప్పేదినాన్నా నీతో ! చెప్పి చెప్పి నోరు నొప్పిపుతోంది

సుబ్బ : (పరధ్యానంగా వున్నవాడల్లా కూతురుకేసి తిరిగి) ఏందది సతీ! మల్లా సెప్పు. నోట్లో గొణుకుకోకపోతే గట్టిగా ఏడవరాదూ ?

సత్య : ఏమీటి నాన్నా! ఎప్పుడూ కసురుకుంటావు- మంచి చెబుతున్నా అంతే.

సుబ్బ : కసురుకోకపోతే బతిమాలుకోమంటావా ఏంటి? నువ్వేమైనా కలకటేరువా?

సత్య : కలకటేరు కాదు. ఉప్పుటేరూ కాదు.

సుబ్బ : మరీ? —

సత్య : అదుగో! అట్లా గదమాయిస్తే నేను చెప్పేది లేదు బాబు. అమ్మ పోయినప్పటినుంచీ యిట్లాగే వేపుకుతింటున్నావు (కంట తడి పెట్టుకొనును.)

సుబ్బ : ఈ ఆడంగులతో వచ్చిన సావే యిది. గట్టిగా పలుకాడితే యిట్టే ఏడుస్తారు. (మెత్తబడి గొంతుక తగ్గించి) అయితే నువ్వు సెప్పేదేటో గబుక్కున సెప్పెయ్

సత్య : రంగయ్యమావయ్య నీతో చెప్పమన్నాడు...

సుబ్బ : ఏమని ?......తనకివ్వాల్సిన ఏభైనాణేలు పంపించమనా?

సత్య : నాణేలు కాదు, నగలూ కాదు.

సుబ్బ : మరేటి ?

సత్య : ఇవాళ పెళ్ళికొడుకు చూసుకోడానికి వస్తాడుట. నిన్ను మంచిబట్టలు కట్టుకుని సిద్ధంగా వుండమన్నాడు.

సుబ్బ : ఎవడా పెళ్ళికొడుకూ, మనువుకొడుకూను! ఏడనుంచి వత్తున్నాడాడు?

సత్య : అదిగో! అట్లా బండమాటలు మాట్లాడొద్దని కూడా మావయ్య చెప్పమన్నాడు.

సుబ్బ : మరి మీ మావ తీనెమాటలు మాట్లాడతాడా యేం? "బాకీ తీర్చలేదేం యింకా" అని నిలేసి అగినప్పుడు సూడాలి ఆడి మాటవరస. మిరపకాయ నమిలినట్టుంటదిలే !

సత్య : నామాట వినిపించుకో నాన్నా! మావయ్య చెప్పమన్నదంతా చెప్పనియ్యి.

సుబ్బ : సెప్పేదేటో గబుక్కున సెప్పెయ్. సెవి కోసిన మేకలా అరుత్తున్నావు.

సత్య : నీళ్లు పోసుకుని, మంచిబట్టలు కట్టుకుని నిన్ను సిద్ధంగా వుండమన్నాడు. కాఫీ, ఉప్మా తయారుచేసి నన్ను సిద్ధంగా వుండమన్నాడు. తను యిప్పుడే వస్తానన్నాడు.

సుబ్బ : పెళ్ళికొడుకు నా బట్టలు చూసి పెళ్లిచేసుకుంటాడా ఏటి? ఆడికి కావల్సింది పిల్లేగా? నేనెట్టా వుంటే ఆడికేం?

సత్య : పెళ్ళికొడుకు నీ బట్టలు చూసి పెళ్ళి చేసుకోడులే. కాని నీ మాటలు వింటే వెనక్కి తిరిగి పారిపోతాడు

సుబ్బ : (కోపంగా లేచి) ఎవడా యెదవ నా కొంక పెట్టేది, అట్టాటి సమ్మంధం పోవాల్సిందే.

సత్య : నీకు శుభం, అశుభం, మంచిచెడ్డా తెలియవు నాన్నా. నోటికెంతొస్తే అంతవాగుతావు.

సుబ్బ : నాకు కిరెక్కు తేనా, నేను మనిసిని కాను.

సత్య : మావయ్య వచ్చే వేళవుతోంది. చెప్పినట్టు చేస్తావా?

సుబ్బ : మీ మావ సెప్పినట్టు నేను సెయ్యాటం ఎందుకు? అయినా మావ తెచ్చే సమ్మంధం నీ కెందుకే సత్తీ నీకు మా రాజులాంటి సమ్మంధం నేను తెస్తాలే.

సత్య : ఆ! తెచ్చావులే! "చెట్టులాగ ఎదిగిన కూతురుకు పెళ్ళి చెయ్యకుండా సుబ్బయ్య కులాసాగా కూర్చుంటున్నాడు" అంటూ మన వాడకట్టంతా నిన్నూ, నన్నూ నానా మాటలు అంటుంటే నీకు చీమ కుట్టినట్టయినా వుందీ? వాళ్ళ మాటలు వినలేక నా మనసెంత బాధపడుతోందో నువ్వెప్పుడయినా గ్రహించావూ? నీగొడవే నీది. ఇంటి సంగతి పట్టించుకుంటేనా? అమ్మ బతికి వుంటే ఇట్లా వూరుకోనిచ్చేదా? ఈపాటికి పెళ్ళిచేసి అత్తారింటికి పంపించి వుండేది.

సుబ్బ : నేను మటుకు వూరుకున్నానేమిటి సత్తీ. మా పెద్దత్త కొడుకును తెస్తే వద్దు పొమ్మన్నావు. నేనొప్పుకోను మొర్రో అన్నావు.

సత్య : మీ పెద్దత్త కొడుకు నా కంటే 20 ఏళ్లు పెద్ద. పైగా రెండో పెళ్ళివాడు. పెళ్ళి అయి కాపురం చేస్తున్న నా అంత కూతురు. అతన్ని ఎల్లా చేసుకునేది?

సుబ్బ : అయితే ఏం తక్కువా అంటా? నాలైక రాల మాగాణి వుంది. పైగా యిస్కూలు మాట్టరు పనిసేత్తున్నాడు. కట్టం కానీ కూడా అక్కర్లేసన్నాడు. మరి యిన్నావూ?

సత్య : రెండో పెళ్ళి సంబంధం నాకొద్దు బాబు!

సుబ్బ : దాంతో నాకు రేచిక్క ఏసుకొచ్చింది. తండ్రిమాట యినని కూతురు సంగతి నాకెందుకు. నాకేం పట్టింది. ఇక సమ్మందాలు ఎతకడం మానేశా.

సత్య : అయిందేదో అయిపోయింది. ఇంక మావయ్య వూనుకున్నాడు...అదుగో మావయ్య వస్తున్నాడు. జాగ్రత్తగా మాట్లాడు మావయ్యతో ...రా! మావయ్యా!

[ప్రవేశం రంగారావు. బుర్రమీసాలు, చెవికి దుద్దులూ వుంటాయి.]

సుబ్బ : రావయ్యా బావయ్యా రా! మా సత్తి నీమాటే సెబుతోంది యిందాకటి నుంచీ.

రంగ : ఏమే సత్యం! నేను చెప్పమన్న మాటలు అన్నీ మీ అయ్యతో చెప్పేవా?

సత్య : ఇందాకటినుంచీ చెబుతుంటే. రాద్ధాంతం సిద్ధాంతం చేస్తున్నాడు.

రంగ : "అమ్మ పెట్టనూ పెట్టదు, అడుక్కు తిననివ్వదు" అట్లా వుంది మీ నాన్న సంగతి.

సుబ్బ : మహా తెచ్చావులేవోయ్ మనువులు మద్దెన మేనమామకు కావలిసొచ్చింది దాని సంగతి. ఇంత గొడవెందుకు, నువ్వే సేసుకోకపోయావ్?

రంగ : నేను వయసులో వుంటేనా, తప్పకుండా చేసుకునేవాడినే ఈ రత్నాన్ని. ఏమంటావే సత్యం?

సత్య : అబ్బ వూరుకో మావయ్యా, వేళాకోళాలు.

సుబ్బ : కబుర్లకేంటిలే! కట్టందిట్టంగా లాగకుండా నేసుకు నేవాడివా ఏంటి దాన్ని.

రంగ : కట్నం పుచ్చుకోని పెళ్ళికొడుకు నే సంపాదించాలే.

సుబ్బ : ఇంత కష్టమూ వూరికే పడతావా రంగయ్యా? ఏదో వుందిలే ఎవ్వారం.

సత్య : ఊరుకో నాన్నా! మామయ్యకేమొచ్చింది యిందులో డబ్బు ఖర్చు తప్ప.

రంగ : ప్రతిదానికీ నేనేదో స్వలాభం చూచుకొందే ఏపనీ చేయననుకుంటావు నువ్వు, అంతేనా?

సత్య : ఊరుకో మావయ్యా, నాన్నమాటల కేమిటి, ఎప్పుడూ అట్లాగే అర్థం లేకుండా మాట్లాడుతూ వుంటాడు.

రంగ : లేకపోతే ఏమిటి? ఒక్కగా నొక్క పిల్ల, తల్లి లేనిబిడ్డ, ఈడేరిన ఆడకూతురు. దానికి పెళ్లి చేసి ఒక యింటిదానిని చేయకుండా, డబ్బు లేదని, కట్నం యిచ్చుకోలేనని నిన్ను మీ అయ్య రొష్టు పెడ్తుంటే, చూస్తూ వూరు

కోలేక నేను నీ పెళ్లికి పూనుకుంటే, నా కొచ్చే పొద్దా యిది?

సత్య : ఊరుకో మావయ్యా! ఏమీ కష్టపెట్టుకోకు. నాన్న తీరు అందరికీ తెలిసిందేగా. అమ్మ పోయినప్పటినుంచీ అదేమిటో చిత్రంగా యిట్లా మారిపోయారు.

సుబ్బ : నిన్ను నేనేమీ అనటం లేదులే రంగయ్యా బావయ్యా. సమ్మందంసంగతి ఏమిటో చెప్పు.

రంగ : చక్కటి సంబంధం తెచ్చేగా. ఇప్పుడేవస్తున్నాడు ఆ పెళ్లికొడుకు పెళ్ళి చూపులకు.

సుబ్బ : పెళ్లికొడుకు ఎవరూ అంటా?

రంగ : వస్తున్నాడుగా, చూద్దువుగాని.

సుబ్బ : అదుగదుగో నీ దాపరికం మాటలు మా నేవు కాదు. పెళ్లికొడుకు యివరాలు సెప్పకుంటే నీలుగుతా వెందుకు.

రంగ : తొందరపడకు సుబ్బయ్యా, తొందరపడకు. మంచి బుద్ధిమంతుడిని, ఉద్యోగస్థుడిని గంగిగోవులాంటివాడిని వెదికి తెచ్చానుగా.

సుబ్బ : అరి భేష్! భలేవోడివే సంపాయించావన్న మాట. ఇంకేం! పాలు పితుక్కోవచ్చు.

సత్య : ఏమిటి నాన్నా; ఇదంతా నీకు వేళాకోళంగా వుంది. మావయ్య మనకోసం ఎంత కష్టపడుతున్నాడో నీకు తెలియటం లేదు.

రంగ : మీనాన్న నాతో వెటకారంగా మాటాడకుండా వున్నది ఎప్పుడు చెప్పవే సత్యం.

సుబ్బ : ఉండవయ్యా బావయ్యా! అంత హైకలాస్ సమ్మందం తెచ్చేవంటే నాకుతే పోయింది. ఏదో అనేశా. ఊ! చెప్పు యింకా.

రంగ : సత్యం! నువ్వు లోపలికిపోయి కాఫీ పలహారల సంగతి చూసుకో. అతను వచ్చే వేళవుతోంది. అప్పుడు ఆలస్యం చేస్తే బాగుండదు.

[సత్యవతి లోపలికి వెడుతుంది]

సుబ్బ : పర్వాలేదులేవయ్యా ఆలస్యమయినా వచ్చినోడు తినకుండా ఎల్తాడేమిటి. సరేలే! పెళ్ళికొడుకు సంగతిచెప్పు. బుద్ధిమంతుడు గేద, కాదు ఆవులాంటివోడు. ఊ! ఇంకా.

రంగ : బుద్ధిమంతుడు చదువుకున్నవాడు. స్కూలు ఫైనలు ప్యాసయినవాడు. యువకుడు.

సుబ్బ : బలే! బలే! బాగానేవుందే కత.

రంగ : కవికూడాను.

సుబ్బ : కవేంటి?

రంగ : మాట అర్థంకాకపోతే వూరుకో. కవంటే, కథలు పాటలు పద్యాలు రాసేవాడు.

సుబ్బ : మరిగయితే, కామమ్మకతరాసింది యీడేనా?

రంగ : చప్! బుద్ధితక్కువగా మాట్లాడకు. అతను చాల చక్కగా పాటలు పాడుతాడు. మొన్న మనవూరి స్కూలు వార్షికోత్సవంలో ఎంత చక్కగా పాడేననుకున్నావు పాటలు.

సుబ్బ : నన్నుకూడా పిలవకపోయావ్? వచ్చి వినేవోడిని.

రంగ : ఆపాటలు అర్థంకావులే నీకు. సారానీసా పాట, పచ్చబొట్టుపాట అనుకున్నావా ఏమిటి పాడింది.

సుబ్బ : అయితే గుమ్ గుమాగుమ్ పాటలు యీడు పాడలేడూ? ఓస్ యింతేనా.

రంగ : నీఅల్లుడయ్యాక నేర్పుదువుగానిలే.

సుబ్బ : సరేలే! ఆడుచేసే ఉద్యోగం ఏమిటి?

రంగ : రాజాలాంటి ఉద్యోగం చేస్తున్నాడు. నెలకు 60 రూపాయలు సంపాదించుకొంటున్నాడు.

సుబ్బ : ఎక్కడ?

రంగ : ఇక్కడే మనవూళ్ళోనే మందులషాపులో.

సుబ్బ : సెప్పేవుకాదు! అందుకనేనేంటే, వారం రోజులనుంచీ ఆమందులబజారులో కాలు కాలినపిల్లిలాగ తిరుగుతున్నావు మాయింట్లో ఎవరికో రోగమొచ్చిందనుకున్నా.

రంగ : ఛీ! నోరు మూసుకో. అశుభం మాటలూ నువ్వూను.

సుబ్బ : మందులషాపులో నాకు తెలియని మనిషి ఎవడంటా?

రంగ : కొత్తిగా రాలా? కాంపౌండరు. వెనుక గదిలోవుండి మందులు కలిపి యిస్తుంటాడు.

సుబ్బ : అరకులు కలిపిస్తే ఆడా? ఛు! ఆడంగి మొగం ఆడూనూ. గిరజాలూ పేడిమూతి, కళ్ళజోడు. ఆడంగిమాటలూ ఆడూను.

రంగ : నోటికి వచ్చినట్లుగా పిచ్చివాగుడు వాగకు. ఇంతమంచి సంబంధం వస్తున్నాదంటే ఇంక జన్మజన్మాలకు యిటువంటిది దొరకదు.

సుబ్బ : నాకెందుకులే! పీటలమీద ఆడిప్రక్క నేను కూకుంటేగా. అయితే యీ అరకులు కలిపేవాడి పేరేంటి?

రంగ : రజనీకాంతికుమార్.

సుబ్బ : ఓరయ్యో! పేరు కూడా మాపొడుగ్గా వుందే.

రంగ : కవులపేర్లు అట్లాగే వుంటాయిలే.

సుబ్బ : అదిగదీ! (వేళ్లు లెక్క పెడుతూ) బుద్ధిమంతుడు. గేద...కాదు! కాదు! ఆవులాంటి వోడు. చదువుకున్నవోడు. పాటలు పాడే వోడు. బారెడు పేరు గలవోడు...మరి కట్నం లేకుండా మాసత్తిని పెళ్లి చేసుకోడానికి ఎట్టా తయారయ్యాడంటా? భలే సిత్రంగా వుందేయిది. మాసత్తి ఆడికళ్లకు రంభలాగ కనబడ్డదా యేంటి? లేకపోతే... లేకపోతే... ఏమైనా...వంకలు...

రంగ : ఛీ! వూరుకో! లక్షణమైన సంబంధం కాకపోతే నేను తెస్తానా ఏమిటి?

సుబ్బ : అయితే మరి ఎందుకు సిద్ధమయ్యాడంట? అదే నాకు పట్టుకుంది.

రంగ : కవులసంగతి నీకు తెలియదులే! వాళ్లకు కావలసింది కట్నాలు కాదు, కాంతలు. వాళ్లఊహాలకు నచ్చినపిల్ల దొరికిందంటే ఠక్కీమని పెళ్ళికి తయారవుతారు. తెలిసిందా?

సుబ్బ : మరి యీ రజనీకుమారుడుగారు మాసత్తిని చూసుకోకుండా పెళ్ళికి ఎట్టా తయారయ్యాడు?

రంగ : మందులు కొనడానికి షాపుకు వెడితే ఒకటి రెండుసార్లు చూశాడుట.

సుబ్బ : సరే! అప్పుడు చూశాడుగదా, మల్లీ ఇప్పుడు చూపులెందుకు, చకాలికే పెళ్లి సేసుకోక.

రంగ : అప్పుడు సరిగా చూడలేదుట. అయినా పెళ్లికొడుకు చూపులకు రావడం, పిల్లచేత పాటలు పాడించటం ఇవన్నీ లాంఛనమని తెలియదూ నీకు.

సుబ్బ : అయితే రజనీఅయ్యా కేంపని?

రంగ : అయ్యా లేడు. అమ్మ లేదు. మేనమామ వున్నాడు. మున్సబుపని చేస్తున్నాడు. కారు. నౌకర్లు, ఓ! బలేహోదాగా వుందిలే ఆయన ఉద్యోగం.

సుబ్బ : మునసబుకు వెట్టివోడు, పాలేళ్లు వుంటారు కాని, నౌకర్లు, కార్లు ఎందుకుంటాయయ్యా బావా?

రంగ : అబ్బ! పల్లెటూరిమున్సబు కాదయ్యా బాబూ! నీకంతా అడవి మేళం; కోర్టు మునసబు అంటే జడ్జీ అన్నమాట.

సుబ్బ : అదిగదీ! అట్టా సెప్పు. మామ మున్సబీ అయితే, అల్లుడు అరకులు కలిపెట్టుంటాడా! భేష్! మరి అల్లుడికి పొలం పుట్రా ఏమైనా వున్నాయా?

రంగ : పొలం, స్థలం, యిల్లు, రొక్కం యివేమీ లేవు. మంచి ఉద్యోగం. మంచి గుణాలు వున్నాయి. ఇంకేం కావాలి?

సుబ్బ : అయితే మామకు తగ్గ అల్లుడొస్తున్నాడన్నమాట. (నవ్వుతాడు)

రంగ : నవ్వు ఆపేసి, స్నానం చేసి సంచే చొక్కా కట్టుకుని రా. (వాచి చూచుకుని) అప్పుడే తొమ్మిదవుతోంది. ఈపాటికి అతను బయలుదేరి ఉంటాడు.

సుబ్బ : రానియ్యి.

రంగ : నువ్వు సిద్ధం కావయ్యా.

సుబ్బ : సిద్ధంగానే ఉన్నానుగా.

రంగ : ఆ నిక్కరూ, అబనీనూ, ఆ దుబ్బ జుట్టూ చూశాడంటే ఎవరో నౌకరనుకుంటాడు నిన్ను.

సుబ్బ : (కోపంగా నిలబడి) నౌకరనుకుంటాడూ! అనుకోటానికి ఎన్నిగుండెలాడికి. అనుకోమను. అప్పుడు చూపుతా నాతడాఖా. సుబ్బయ్య అంటే ఎవరో తెలుస్తది. పాటలూ గీటలూ పనుగత్తాల.

# సత్తి పెళ్లి

రంగ : ఇష్! తమాయించవయ్యా బాబూ! నీకు మర్యాదా తెలియదు, మంచీ తెలియదు. నువ్వు ముందు ఇక్కడినుంచి లేచి స్నానం చేసి బట్టలుమార్చుకుని రా...ఊఁ! లే!

[ప్రవేశం సత్యవతి]

సత్య : ఇవిగో నాన్నా! నీ పంచె, చొక్కా; రెండూ ఇస్త్రీచేయించాను. చొక్కాకు గుండీలుకూడా పెట్టేను! అద్దం దువ్వెన్నా యివిగో (అన్నీ బల్లమీద పెడుతుంది)

సుబ్బ : నాపంచె, చొక్కా చూసి ఆడు నిన్ను పెళ్లిసేసుకుంటాడా? సేసుకునేది నిన్నూ, నన్నా? నేనెట్టా వుంటే ఆడికెందుకు.

రంగ : అబ్బబ్బ! మొదలెట్టావయ్యా మళ్ళీ సతాయింపు. నీకు కావలసినవన్నీ అది యింకెన్నాళ్లు అమర్చిపెడుతుందిలే? పాపం! మా చిట్టితల్లికి మూడుముళ్ళూ పడేంత వరకే. ఆతర్వాత దానిదోవను అది పోతుంది. అప్పటినుంచీ అన్నీ పనులూ నువ్వే చేసుకోవాలి.

సుబ్బ : అరె! (కూలబడి) అప్పుడే అత్తారింటికి మా సత్తి నన్నిడిచిపెట్టి ఎల్లిపోతుందా?

రంగ : వెళ్ళిపోక ఎన్నాళ్లు కూర్చుంటుంది పెళ్లి అయిన పిల్ల నీ యింట్లో. వెళ్తేనే మంచిదిలే. నీ తిట్లూ సాధింపులూ తప్పుతాయి. అసలీపాటికే నువ్వు దానిపెళ్లి చేసివుండాల్సింది. ఎందరు చెప్పినా వింటేనా? డబ్బులేదని ఒకటేగోల.

సుబ్బ : నన్నడిగతే డబ్బులేనోడికి ఆడకూతురు పుట్టకూడదంటా. నెత్తిమీద నాలుగెంటికలున్న ప్రతి నాయలూ, వెయ్యిత్తావా, రెండువేలిత్తావా అని అడుగుతుంటే నేనెక్కడినుంచి తెచ్చి గుమ్మరిత్తా అంతడబ్బు.

రంగ : ఫ్యాక్టరీలో మేస్త్రీ పని, 60 రూపాయలు జీతంకదా నీకు. ఈ ఇంటికి మీరిద్దరేకదా. జీతంలో కొద్దిగా వెనుక వేస్తూ కొంత అప్పు చేసి పెళ్లి చేయడానికి ప్రయత్నం చేశావ్?

సుబ్బ : డబ్బు మిగిలిసచ్చిందేమిటి సెయ్యడానికి.

రంగ : ఎట్లా మిగులుతుంది? సారా దుకాణం జావ్యాప మానితేగా!

సుబ్బ : కాకినాడలో పనిచేసేటప్పుడే రంగ వెళ్లిపోతే బాగుండేది. ఈ పాటికి యేలు సంపాయించి మా సత్తికి యింద్రవైభోగంగా పెళ్లి సేసేవోడిని.

రంగ : అవని దానికి అనుకోవడం ఎందుకులే. ఇన్నాళ్లు కష్టపెట్టేవు ఒక్కగానొక్క సంతానాన్ని. పాపం! మా సత్యం ముత్యంలాంటిపిల్ల. ఎప్పుడూ కసురుకోడం, క్రుగునడం, అది లేదని యిది లేదని అలకచేయడం, నిషాలో వుంటే రెండు మూడు సార్లు కొట్టేవుకూడాను. ఇన్నాళ్లకు కష్టాలు గట్టెక్కి దానిదోవను అది పోబోతుంటే యింకా అడ్డొస్తావెందుకు?

సుబ్బ : (కళ్ళనీళ్లు పెట్టుకుంటూ దీనంగా) నిజమే బావయ్యా, నువ్వు సెప్పిందంతా నిజమే. ఎందుకూ పనికిరాని యెదవను నేను. సత్తెకాలపుపిల్ల మా సత్తి దాన్ని బాధపెట్టేను. పాపాత్ముణ్ణి ఇప్పుడేం సెయ్యమంటావు.

రంగ : నేను చెప్పినట్టువిను. లే! నీళ్లు పోసుకుని యీ బట్టలు కట్టుకో. అతడొచ్చాక మర్యాదగా మాట్లాడు. తక్కిన సంగతంతా నేను చూసుకుంటా.

సుబ్బ : (మౌనం)

రంగ : నీ అల్లరితో యీ సంబంధం చెడగొట్టేవంటే, వెయ్యేళ్ళు తపస్సుచేసినా మళ్ళా యిల్లాంటి సంబంధం దొరకదు. ఇంక నేను కలుగజేసుకోను. నీ మూలాన నీ కూతురు జీవితమంతా పెళ్ళిగాకుండా వుండవలసి వస్తుంది. ఆలోచించుకో.

సుబ్బ : సరేలే. నాకు తెలిసొచ్చింది. నువ్వు సెప్పినట్టే సేత్తా.

రంగ : ఇక పద. లోపలకు వెళ్లు. (చొక్కా, పంచె భుజంమీద పడవేసి సుబ్బయ్యను లోపలకు తోస్తాడు) ఇదుగో అమ్మాయి సత్యం! కాఫీ ఫలహారాల సంగతి చూసుకుంటున్నావా?

సత్య : మొదలు పెట్టేను మావయ్యా.

రంగ : కమలాఫలాలు తెప్పించావా?

సత్య : ఆ.

రంగ : మా యింటినుంచి గాజుగ్లాసులు, కప్పులు సాసర్లు పంపించాను అందేయా?

సత్య : అందాయి. ఇప్పుడే రాము తెచ్చియిచ్చింది.

రంగ : అయితే నీ పని నువ్వు చూసుకో.

[సత్యవతి లోపలికి వెడుతుంది.]

[ప్రవేశం సుబ్బయ్య. భుజంమీద పంచె, చొక్కా, తువ్వాలు, చేతిలో సబ్బుబిళ్ళ.]

సుబ్బ : అయితే రంగయ్యబావా! సత్తి కాపురాని కెళితే, నాగతేంకావాలి?

రంగ : నీకేం తక్కువ సారాదుకాణం, పేకాట, రౌడీస్నేహితులు వున్నారుగా.

సుబ్బ : అబ్బ ఉండవయ్యా! నా బాధ నేను పడు తుంటే కాకిని పొడిచినట్టు పొడుస్తావు.

రంగ : అవునులే. ఎంత చెడ్డా తండ్రివిగా. నీకు మటుకు బాధవుండదా ఏం?

సుబ్బ : నేనుకూడ మా సత్తితో అల్లుడింటికి ఎల్లొచ్చా?

రంగ : బాగుంది నువ్వెందుకు అక్కడికి? వాళ్లిద్దరిని రోజూ సతాయించడానికా?

సుబ్బ : మరి అంతేనంటావు.

రంగ : లేకపోతే. మూట సంపాదించు, మూట మూటకోసం రమ్మంటాడు అల్లుడు.

సుబ్బ : దీని దుంపతెగ! అన్నిటికీ యీ డబ్బే! అంత డబ్బు నేనెట్లా పోగుచేస్తా?

రంగ : డబ్బులేకపోతే అంతే.

సుబ్బ : మరి నేనొక్కడిని యీ యింట్లో లింగు లింగుమంటూ కూకోవాలా? వంటా గింటా నేనే సేసుకోవాలా?

రంగ : అంతే మరి; కాని సుబ్బయ్యా! నేను నీకొక సహాయంచేస్తా, కావాలంటే. నీ జీతం డబ్బు లలో యిరవైరూపాయలు, పాతికో నాకియ్యి. ముప్పూటలావచ్చి మా యింటికి మాతో బాటు భోజనంచెయ్యి. మిగతా డబ్బు నీ ఖర్చుకు జాగ్రత్తగా వాడుకో. (తలుపు వేపు చూచి) అడుగో! పెళ్లికొడుకు వస్తున్నాడు! ఇంకా నువ్వు ఇట్లాగే వున్నావు. నీళ్లు పోసుకోవద్దులే సబ్బుతో కాళ్లు సేతులు మొగం కడుక్కొని బట్టలు మార్చుకుని త్వరగారా. పద లోపలికి (వీపు పట్టుకుని లోపలికి సుబ్బయ్యను నెట్టుతాడు)

[సుబ్బయ్య నిష్క్రమణ]

రంగ : (తలుపుకు ఎదురుగా నడుస్తూ) రండి కాంపౌండరుగారూ! రండి మీకోసమే ఎదురుచూస్తున్నాం.

[ప్రవేశం రజనీకాంతకుమార్. వయస్సు. 25 సం॥ లాల్చి, పైజమా, పైన వల్లెవాటుగా ఉత్తరీయం, కళ్ళజోడు. ఒక చేతిలో చేతిరుమాలు, మరొక చేతిలో పుస్తకం]

రంగ : (కుర్చీ చూపిస్తూ) రజనీకాంత్ గారూ! ఈ కుర్చీలో కూర్చోండి.

రజ : (కుర్చీ రుమాలుతో చాలాసేపు తుడిచి కూర్చుంటాడు)

రంగ : సరిగ్గా టయిముకు వచ్చారండి మీరు.

రజ : (వాచి చూసుకుంటూ) "పంక్చుయాలిటీ" అంటే నాకు అతి పట్టుదలండీ రంగయ్య గారూ! ఆరు నూరయినా సరే టంచన్ గా టైముకు రావాల్సిందే. నాకు అలవడిన యింగ్లీషువాళ్ల అలవాట్లలో యిది ఒకటి (కళ్లజోడు సరిచేసుకుంటూ పోజు పెడ్తాడు.)

రంగ : అది చాల మంచి అలవాటండీ.

[ప్రవేశం సుబ్బయ్య సైడ్‌వింగుదగ్గరనుంచి మెల్లగా అడ్డదిడ్డంగా పంచె కట్టుకుని, చొక్కా కాలరు లోపలికి వేసుకుని, గుండీలు పెట్టుకోకుండా, తడిమొగంతో—జుట్టుమీదనుంచి నీళ్లు కారుతూ వుంటాయి]

సుబ్బ : ఏయ్‌సత్తీ! తువ్వాలు ఎక్కడ తగలేశావ్? నిన్నే, యినపట్టంలా? (పెళ్లికొడుకుని చూచి, కంగారుపడి, ఒకటి రెండడుగులు వెనుకకు వేసి గొంతుక తగ్గించి) పోనీలే. ఫర్వాలేదులే పంచెతో తుడుచుకుంటాలే! [సైడ్‌వింగ్‌లో నుంచి సత్యవతి తువ్వాలు సుబ్బయ్యమీదకు విసరి వేస్తుంది. అతను

తువ్వాలుతో మొగం తుడుచుకుంటూ బల్ల దగ్గరకువచ్చి తువ్వాలు రజనీ కూర్చున్న కుర్చీమీద పడవేసి, బల్లమీద నున్న అద్దం దువ్వెన తీసుకుని తల దువ్వడం మొదలు పెట్టి నీళ్లు తక్కినవాళ్ళ మీదకు విదలుస్తూ వుంటాడు ]

రంగ : ఏమిటే అఘాయిత్యం సుబ్బయ్యా? తల జాగ్రత్తగా దువ్వుకో ప్రక్కన పెద్ద మనుష్యులు కూర్చుంటే కనపడటంలా?

రజ : ఈయన ఎవరండీ?

రంగ : ఈయనేనండీ మీకు కాబోయే మామగారు మా బావమరదే లెండి. పేరు సుబ్బయ్య

సుబ్బ : దీని సిగ తరగా! జట్టు బలేగా చిక్కు పడింది! (జుట్టుతో కుస్తీ పట్టుతుంటాడు).

రంగ : మా సుబ్బయ్యది కొంచెం పల్లెటూరు వాలకం లెండి. పట్నం మర్యాదలు మాటలు తెలియవు. అతని స్వభావమే అంత. ఏమీ అనుకోకండి.

రజ : "నో మేటర్" మరేం ఫర్వాలేదులెండి. స్వభావసిద్ధంగా వుండే వాళ్లు అంటే నాకు యిష్టం. అబ్బే! అకువుమాటలు ఎగువు పలుకులు అంటే నాకు తలనొప్పండీ!

రంగ : చిత్రం! తమరు మానవ స్వభావాన్ని బాగా అర్థం చేసుకుంటారండి.

రజ : కవులకు వుండవలసిన మొదటి లక్షణం అదే అనుకోండి నిజంగా మీ బావగారు సాన బట్టని వజ్రం అనుకోండి.

సుబ్బ : (కోపంగా రంగయ్యవేపుతిరిగి) నా గురించి ఏమిటే అనుకుంటున్నారు.

రజ : ఏమీ లేదు సుబ్బయ్యా! నువ్వు రవ్వలాంటి వాడివని రజనీకాంత్ కుమారుగారు చెబుతున్నారు.

సుబ్బ : ఓస్! అంతేనా ఇంకేమిటో, అనుకున్నా.

రజ : మామగారూ రంగయ్య గారూ! మా మున్సబు మామ కూడా యింతేనండి. ఇల్లు కూడ కోర్టే అనుకుంటాడు. జడ్జిమెంటు యిచ్చినట్లు మాట్లాడుతాడు.

సుబ్బ : (తల అడ్డదిడ్డంగా దువ్వుకుని పంచె సరిచేసుకుంటూ) అబ్బ! దీని సిగ తరగ. ఈ పాడు పంచె ఎగదోస్తే దిగజారుద్ది. ఎట్టా విడిసేదంట. నాకు అలవాటు లేదు మొర్రో అంటే. కట్టుకో, కట్టుకో అని సంపుతారు. కట్టుకుంటేనే గాని మర్యాద కాదేటి?

రంగ : (సుబ్బయ్యవేపు కళ్లురుమిచూస్తాడు)

సుబ్బ : (గొంతుక తగ్గించి వినయంగా రజనీవేపు తిరిగి) పంచె అలవాటు లేదండి రజనీ గారూ అందుకనే యీ తిప్పలు.

రంగ : (లోపలకు నిష్క్రమించుతాడు )

రజ : దానికేమిటండీ! మరేం ఫర్వాలేదు. మీరు యింకా అంతవరకైనా కట్టుకున్నారు నాకు అదీ చేతకాదు. రాత్రింబగళ్లు పైజమామీదే వుంటా; మా మున్సబు మామా అంతే.

రంగ : (లోపలినుండి స్టేజిమీదకు వచ్చి, చేతులో నున్న కమలాఫలాలు వలుస్తూంటాడు) రజనీ కాంత్ గారూ యీ కమలాఫలం తొనలు కొంచెం రుచిచూడండి.

రజ : ప్రొద్దున్నే కమలాఫలం తొనలేమిటండీ? సయించవు.

రంగ : మంచి నాగపూర్ కమలాలండీ. రెండు తొనలు సేవించండి.

సుబ్బ : (చొక్కా కఫ్సతో తికమకలు పడుతున్న వాడల్లా కోపంతో) కమలాఫలాలా? ఏమే సత్తీ! పావలా డబ్బులు పెట్టి కమలాఫలం ఎవరు తెప్పించమన్నారే (రంగయ్యవేపు చూసి సంభాషణ మార్చుతూ రజనితో) పావులా పెట్టి కమలా తెప్పించే బదులు అర్ధ రూపాయి పెట్టి ఆపుల్ పండు తెప్పించ మన్నానండి.

రజ : (తొనలు కొరుకుతూ) మా మామ యింట్లో ప్లేట్లనిండా కమలాలు ద్రాక్షలు, ఏపుల్స్ ...ఓ ఎక్కికి తక్కిగా వుంటాయండి.

సుబ్బ : (రజనితో) కాంపౌండరుగారూ! సదువు కున్నోరుగందా! ఈ తొనలలో గింజలు దేముడు ఎందుకు పెట్టేడో సెప్పండి.

రంగ : అబ్బ వుంచేవయ్యా! అర్థం లేని ప్రశ్నలూ నువ్వూను.

రజ : (సుబ్బయ్యతో) రైట్! మంచిప్రశ్న వేశారు. దానిని కవిత్వంలో చెప్పాలంటే పెద్ద గ్రంథం అవుతుంది మూడు ముక్కల్లో చెబితే తిండికి గింజ ఆధారం—అంతే.

సుబ్బ : అదరక్! మా బాగ సెలవిచ్చారు. మరి అయితే ఒంటికి కమలాలు మంచివా, బత్తాయిలు మంచివా సెప్పండి.

రజ : రెండూను.

సుబ్బ : మరేమో మా ఫాక్టరీ డాక్టరుగారు బత్తాయే ఒంటికి మంచిదంటా రేమండి.

రజ : ఆరోగ్యవిషయం కాదు నేను చెప్పింది; తినే విషయం తినడానికి రెండూ మంచివే.

[తొనలన్నీ తినేస్తాడు.]

రంగ : రజనీకాంత్ గారూ! ఇక మనము వ్యవహారానికి వద్దాం.

రజ : ఓ! వద్దాం! దానికేముంది అయినా సబబైన ప్రశ్నలు వేసినప్పుడు వాటికి జవాబు చెప్పవలసిన బాధ్యత మా కాంపోజరుల మీద, కవికుమారులమీద ఉంది. మాట్లాడ్డం నేర్చినప్పటినుంచి నేను మా మామను ప్రశ్నలు తెగవేసేవాడిని. ఆయన వాటి కన్నిటికి చక్కగా జవాబిచ్చేవాడు

రంగ : నిజమేనండి. అందుకనే మీరు అన్ని కథలు, పాటలు, పుస్తకాలు రాశారు. మొన్న స్కూలులో మీ పాట విని చాలా ఆనందించానండి.

రజ : పాటలు పద్యాలు రాయడం, వాటిని కోకిల స్వరంతో గానం చేయడం చేతగాకపోతే వాడు కవే కాడనుకోండి పువ్వు పుట్టగానే పరిమళించునట్లుగా, నేను పుట్టగానే నా ఏడుపు తన చెవులకు వీణానాదంలాగా వినిపించిందని మా మునసబు మామ ఇప్పటికీ చెబ్తూంటాడు.

రంగ : మాబాగా సెలవిచ్చారు.

సుబ్బ : ఏదీ ఒక పాటపాడండి. ఇంటాను.

రంగ : పాటకు తొందరేమొచ్చింది సుబ్బయ్యా: లోపలకువెళ్ళి అమ్మాయిని తీసుకువచ్చి చూపించు. ఆలస్యం ఎందుకు పద.

(సుబ్బయ్య నిష్క్రమణ)

రజ : తొందరేమొచ్చిందండి. ఇవాళ ఆదివారం కూడను ఇక్కడుంటే నిజంగా స్వగృహంలాగా వుందనుకోండి

రంగ : అంతా మీదయ స్వగృహమే చేసుకోండి.

రజ : రంగయ్యగారూ! మీ బావగారికి ఆస్తిపాస్తులు ఏమున్నాయండి?

రంగ : రజనీకాంత్ గారూ! మీ కావిషయం ఇదివరకే చెప్పేనుగదండీ నాదగ్గర దాపరికాలు లేవు సుబ్బయ్యకు ఫ్యాక్టరీలో మేస్త్రీగా పనిచేస్తే వచ్చే 60 రూపాయిల నెలజీతంతప్ప యింకే చరస్థిరాస్తులు లేవు

రజ : బ్యాంకులో నిలవఏమైనా......

రంగ : అరవైరూపాయిల జీతంలో యీరోజుల్లో అప్పుచేయకుండా జీవిస్తే అదే పదివేలు. మా మేనకోడలు తెలివైనపిల్లగాబట్టి, సంసారపక్షపుది గాబట్టి ఆ అరవై రాళ్ళతో పొదుపుగా సంసారం నిర్వహించుకువస్తోంది.

రజ : అంతేఅంటారు! మరి మీ సంగతి?

రంగ : ఏదో కొద్దిగా వ్యవసాయం చిన్నయిల్లు, వున్నాయి కాస్తో, కూస్తో రొఖ్ఖం వడ్డీకి తిరుగుతోందనుకోండి. అయినా మిగిలిచస్తుంది. గంపెడు సంతానం మరి మీ సంగతి?

రజ : నేనుకూడా మీకిదివరకే చెప్పేనుకదండీ, విద్యాభూషణంతప్ప వేరే భూషలు లేవని. మగవాడికి ఇంతకంటే ఏంకావాలండీ. సుబ్బయ్యగారూ, నేనూ ఒకేవిధంగా వున్నాం.

రంగ : మరి మా అమ్మాయికి నగలు?

రజ. : కట్నం నేను పుచ్చుకోను నగలు పెట్టేది లేదు.

రంగ : బాగా సెలవిచ్చారు.

రజ : కవనంతో ; గానంతో ఆంధ్రావనిని రసవంతం చేస్తున్న నా ప్రతిభ విని పరమేశ్వరి

పిక్చరున్నవారున్నారు చూశారూ, వాళ్ళు నన్ను కవిగా రమ్మనమని కబుర్లు పంపుతున్నారు.

రంగ : ఇంకేం! చెప్పేరు కాదు.

రజ : రేపోమాపో మద్రాసు వెళ్ళడం ఆ కంపెనీలో చేరడం తథ్యం. అప్పుడు నెలకు అయిదువందల రూపాయలకు తక్కువగా జీతం వుండదనుకోండి.

రంగ : మీ ప్రతిభ అంతా ముందు వుంది మా సత్యం చాల అదృష్టవంతురాలు.

రజ : అప్పుడు కావలసినన్ని నగలు చేయిస్తాననుకోండి అయినా ఫలాని కవిగారిభార్య అంటే ఎంతగొప్పండి నగలతోబాటు పేరుకూడాను

రంగ : ఇంకా ఏమిటో ననుకున్నాను. మీకు చాలా పెద్ద ప్లానులే వున్నాయి.

రజ : మీతో దాపరిక మెందుకు? చెబుతున్నా వినండి. పేరుకు నేను కవినేగాని పిక్చర్ డైరక్షన్‌లోకూడ నా ప్రాధాన్యత చాలా వుంటుందనుకోండి.

రంగ : మిమ్మల్ని పెళ్ళిచేసుకుంటే మా సత్యం ముమ్మాటికీ అదృష్టవంతురాలే

[సత్యవతిని వెంటబెట్టుకుని సుబ్బయ్య ప్రవేశం]

రంగ : రంజనీకాంత్ గారూ! అమ్మాయిని యిదివరకు సరిగా చూడలేదన్నారు. ఇప్పుడు చూసుకోండి.

రజ : (పోజ్ పెట్టి కొంచెం సేపు చూస్తాడు) అమ్మాయి పాడుతుందని చెప్పేరు కదూ.

రంగ : సినిమా పాటలన్నీ అద్భుతంగా పాడుతుందండి. ఏదమ్మా సత్యం, ఒక పాటపాడు. (సత్యవతిదగ్గరకు వచ్చి) పాడమ్మా పాడు ఒక చక్కని పాట......అమ్మాయి సిగ్గు పడుతోందండి.

సుబ్బ : ఏమే! పాడవే! అడిగిన కొద్దీ గింజుకుంటావేటి, పెద్దమనిషి పాడమంటుంటే.

రజ : పోనీలెండి. "నో మేటర్"! ఫర్వాలేదు. ఎందుకండీ బాధపెట్టడం. "లెట్ హెర్ గో" లోపలకు తీసుకువెళ్ళండి.

సుబ్బ : ఎందుకు పాడవో చూస్తా! పొద్దస్తమానం కుంయ్ కుంయ్ మంటూ పాడతావ్! మరిప్పుడు పాడమంటే నోటికి తాళమేసుకుంటావ్! నీకే చెప్పేది. పాడే పాడు.

రంగ : వుండు సుబ్బయ్యా! వుండు! గదమాయించకు. ఇవాళ కాకపోతే రేపైనా రజనీకాంత్ గారు పాటలు వినకపోతారాయేం? ఇక దాన్ని యింట్లోకి తీసుకువెళ్ళు

[సుబ్బయ్య మొరటుగా రెక్కపుచ్చుకుని సత్యవతిని లోనికి తీసుకువెళ్తాడు.]

రంగ : కాంపౌండరుగారూ! అమ్మాయి ఎట్లా వుందంటారు?

రజ : ఇదివరకే చెప్పేను కదండీ అందుకు భిన్నంగా వుంటుందా యిప్పుడు. తొలకరిలోని తటిల్లతవోలె మెరసి పరిగెత్తిందప్పుడు. ఇప్పుడో, ఓ శ్రావణమాసపు మేఘపంక్తివలె, శరత్కాలపు జాబిల్లివలె, సుధామధుర ముగ్ధమూర్తివలె గోచరించిందండి.

రంగ : ఏదో కవిత్వం చెప్పేస్తున్నారు. కొంచెం మా భాషలో సెలవివ్వండి.

రజ : మూర్తీభవించిన వనదేవతలా, ఆకాశం నుంచి అవతరించిన అప్సరసలా, కవుల ఊహాపథంలో విలసిల్లే కాంతారత్నంగా ఆవిర్భవించిందంటే నమ్మండి.

రంగ : ఇంతకీ మరి అమ్మాయి మీకు సమ్మతమేనా?

రజ : పిల్లకేం నిక్షేపంలాగ వుంది. (పెదవి విరుస్తూ) కాని.........

రంగ : కాని ఏమిటి? ఏదో సందేహపడుతున్నారు?

రజ : అమ్మాయి విషయంలో అభ్యంతరం లేదనుకోండి, ఎటొచ్చీ.........

రంగ : కట్నం మీద ఆశ కలిగిందా?

రజ : అబ్బెబ్బె! ఎంతమాట! కట్నం పుచ్చుకోనని చెప్పేను కద. మానధనుడనైన నేను ఆ మాట మీదే నిలబడుతా. అయితే.....

రంగ : (రజనీదగ్గరకు వచ్చి) బాబూ! ఇటు చూడండి. మీ సంకోచం ఏమిటో సెల విప్వండి.

రజ : ఏమీలేదండి కట్నం వద్దని ముందే చెప్పే శానుగదా! ఇకపోతే లాంఛనాలయినా సక్రమంగా జరుగుతాయో లేదో అని........

రంగ : లాంఛనాలా? ఏం కావాలంటారు?

రజ : ఆ! ఏమున్నాయండి. అందరూ మామూలుగా యిచ్చేవే ఏవో వెండికంచం అని వెండిచెంబు అని వుంటాయికదండీ...

రంగ : చిత్రం! చిత్రం! సెలవివ్వండి

రజ : ఈ రిస్టువాచి వుంది చూశారూ ఇది చాల పాతది. కొత్తది ఒక 'సాండో రిస్టువాచి' అలకపాన్పునాడు...

రంగ : ఊ! చెప్పండి.

రజ : పాపుకు రెండుపూటలూ ఎండలో రావాలంటే కష్టంగా వుంటోందండి ఒక ర్యాలీ సైకిలు. ఈ నాల్గు. ఇంతేనండి. నేను అల్ప సంతోషిని.

రంగ : అయ్యా కాంపౌండరుగారూ! నా సంగతి మా సుబ్బయ్యసంగతి మీకు ముందే విన్నవించుకున్నా. పెళ్ళి అయిందనిపించి పంపించడంకంటే అధికంగా ఏమీ చెయ్యలేమంటే నమ్మండి. ఒకరోజు రెండురోజులు భోజనాలు మేమే సర్దుబాటు చేసుకుంటాం అనుకోండి.

[ప్రవేశం సుబ్బయ్య]

రజ : అవుననుకోండి.

రంగ : మావాడిది బీద సంసారం. ఈ పెళ్ళి ఖర్చంతా నేనే భరాయించబోతున్నా. మరి మీరు మా పరిస్థితికూడ కొంచెం ఆలోచించాలి.

రజ : సరేలెండి. ఇంత బీద సంసారపుపిల్లను చేసుకునే సంగతి కూడా నేను ఆలోచించవలసి వుంటుంది.

సుబ్బ : (ముందుకు వచ్చి) ఏమిటయ్యోవ్! బీదా గీదా అంటున్నావు. నా సంగతి నీకు...

[వీథిలోనుంచి అయ్యా! కాంపౌండరు గోరూ అంటూ కేక.]

రంగ : నువ్వు ఇక్కడకు రాకు సుబ్బయ్యా! లోపలికి పో! రజనీకాంత్ గారు ఉదారస్వభావులు. అయినా నేను ఒక సమ్మతానికి వస్తాములే.

[ప్రవేశం నౌకరు అంజయ్య]

అంజ : అయ్యా! కాంపౌండరుగోరూ! సావుకారు గోరు మిమ్మల్ని పిలుచుకు రమ్మన్నారండి.

రజ : (విసుగ్గా) ఏం? పుట్టి మునిగిందా ఏమిటి? ఆదివారం కూడా పని చెయ్యాలా ఏం? రానని చెప్పు.

సుబ్బ : గవర్నమెంటోరు యిచ్చిన సెలవ వుందని సావుకారుకు తెలియదూ?

అంజ : అదికాదండయ్యా! తాసిల్దారు గారింటికి అర్జంటుగా అరకు కలిపి పంపాలంట. వెంటనే మిమ్మల్నివచ్చి మందు కలిపి ఎల్లిపొమ్మన్నారండి. ఇదిగో తాళంసేతులు. ఇదిగో సీసా, ఇదిగో చీటీ.

రజ : మైగాడ్! ఏదో ఒక అవాంతరం. పానకంలో పుడకలాగ వీడొకడు. రోగాలూ జ్వరాలు కూడా ఆదివారంనాడు సెలవుతీసుకోకూడదూ, నన్ను చంపకపోతే! రంగయ్యగారూ వెళ్ళివస్తానండి.

రంగ : రజనీకాంత్ గారూ వెళ్ళిపోతే ఎల్లాగండి. ఇంకా మన వ్యవహారం ఫైసలవందే. కాఫీ, ఫలహారాలు వున్నాయి. అవి యింకా మేము తీసుకురాలేదు. మందిచ్చి మీరు వెంటనే తిరిగిరావాలి.

సుబ్బ : కాఫీ, ఉప్మాయా తిని ఎళ్లండయ్యా.

రజ : అల్లాగే లెండి.

రంగ : లెండి అంటేకాదు, రావాలి. నేను కూడా మీతో వస్తా.

రజ : నేను వస్తానని చెప్పేనుకదండీ. మాట తప్పతానా నేను. (సుబ్బయ్య ఒకసారి లోపలికి వెళ్ళివస్తాడు.)

సుబ్బ : బావయ్యా మాట

రంగ : రజనీకాంత్ గారూ మీరు నమస్తుంమంచి. రెండంగల్లో వచ్చి మిమ్మల్ని కలుసుకుంటా.

[రజనీ, అంజయ్యలు నిష్క్రమణ]

రంగ : ఏమిటి?

సుబ్బ : కాఫీ రెడీగా వుందిట. ఉప్మా మాడిపోయిందిట వచ్చేటప్పుడు ఏమన్నా తెమ్మని సత్తి నీతో చెప్పమంది.

రంగ : ఏడిసినట్టేవుంది. ఇక్కడి వ్యవహారం కూడ మాడినట్టేవుంది.

సుబ్బ : (ఆదుర్దాగా) ఏం? ఏమయింది! ఏమన్నాడు పెళ్లికొడుకు.

రంగ : పెళ్లికొడుకు ఈ సంబంధానికి ఇష్టపడటంలా.

సుబ్బ : ఇదిగోనయ్యోవ్! ఇందులో నాతప్పేలేదు బావయ్యా. నువ్వెట్టా వుండమంటే అట్టా వున్నా. నువ్వేం సెయ్యమంటే అది సేశా.

రంగ : కాంపౌండరుకు కావాల్సింది నీ సంగతి కాదయ్యా బాబూ!

సుబ్బ : మరి ఇంకేటి? కట్నమా?

రంగ : అదీకాదు! వెండికంచం వెండిచెంబు రిస్టువాచి, సైకిలూ ఈ లాంఛనాలు కావాలిట. మన ప్రయత్నం అంతా దండుగ అయ్యేటట్టుంది.

సుబ్బ : ఆరి యీడి తస్సాదియ్యా! ఇయన్నీ కావాలా యీడికి. ఇన్ని అరాయించుకో గలడా అంటా.

రంగ : గోలచెయ్యకు! ఇవ్వగల్గితే ఇవన్నీ ఇయ్యి. లేకపోతే తూర్పుగా తిరిగి దణ్ణం పెట్టు.

సుబ్బ : నాదగ్గరేముంది? మట్టి మశానం డబ్బునోన్ని గా! ఆ కరుసుకూడా నువ్వే పెట్టుకో కూడదా ఏం?

రంగ : పుణ్యానికి పోతే పాపం ఎదురయిందిట. పెళ్లిఖర్చు పెట్టకుంటే చాలదూ. లాంఛనాలుకూడ నా నెత్తినే రుద్దాలీ నా వల్ల కాదు.

సుబ్బ : పోనీలేవయ్యా! మా సత్తెం పెళ్లి కాకుండా అట్టాగే వుండిపోతదిలే.

రంగ : అప్పుడే కొంపమునిగిపోలేదులే! నేనెట్లాగో అతన్ని ఒప్పిస్తానుగా. ఇప్పుడే తీసుకువస్తా అతన్ని. (రంగయ్య నిష్క్రమణ)

సుబ్బ : (వెనుకనుంచి కేక) రెండు కిల్లీలు కూడ అమ్మాయి తెమ్మందయ్యోవ్ బావయ్యా!

సుబ్బ : (నడుస్తూ) డబ్బు! డబ్బు! పాడుడబ్బు! అన్నిటికీ డబ్బే నాదగ్గరే కనుక డబ్బుంటేనా వాచీ గీచీ కొని ఆడి మొగాన్నేసి కొట్టివుండేవోడిని (కుర్చీలో కూలబడుతాడు.)

[ప్రవేశం నాగేశ్వరరావు]

నాగే : ఏమండోయ్ సుబ్బయ్యగారు! కుశలమా?

సుబ్బ : ఎవరబ్బాయ్ నువ్వు?

నాగే : నేనే నండి నాగేశ్వరరావును, అప్పుడే మరచిపోయారా నన్ను.

సుబ్బ : (నిదానించి చూచి) ఎక్కడో సూసినట్టే వుంది. సరిగ్గా గాపకం రావటంలేదు.

నాగే : జ్ఞాపకం లేదండీ? కాకినాడలో మీరూ మేమూ, పక్క పక్క యిళ్లలో కాపురముండేవాళ్ళం. మీరూ మా నాన్నగారూ హార్బరులో పనిచేస్తుండేవాళ్లు.

సుబ్బ : ఆరి నువ్వట్రా నాగేశీ! ఆంజనేయులు కొడుకువా నువ్వు! ఎంతలో ఎంత మారిపొయ్యావు. లొట్టికాయంత వుండేవోడివప్పుడు.

నాగే : అవునండీ! ఇప్పటి సంగతా? 10,12 ఏళ్ళ క్రిందటి సంగతి అది.

సుబ్బ : నాగేశీ! మీ నాన్న ఏం సేత్తున్నాడ్రా? బాగున్నాడా? తక్కినవోళ్లు?

నాగే : అందరం క్షేమంగానే వున్నామండి. నేను ఏలూరు రిజిస్ట్రార్ ఆఫీసులో ఉద్యోగం చేస్తున్నా.

సుబ్బ : అదృష్టవంతుడివిరా! జీతంరాళ్లు ఎన్ని వత్తాయి?

నాగే : 80 రూ॥లు యిస్తారు. గవర్నమెంటు ఉద్యోగం. ముందు ఇంకా పెద్ద జీతమొచ్చుతుంది.

సుబ్బ : అదుగదీ! అట్టా సెప్పు. అందుకే ఈ విసం, ఈ డాబూను.

నాగే : సత్యం ఎట్లావుందండి. ఇంకా అల్లరి చేస్తోందా? పెళ్ళిఅయి అత్తారింటికి వెళ్ళిపోయిందా?

సుబ్బ : డబ్బులేనోడి కూతురికి పెళ్లి ఎట్లా అవుతుందిరా నాగేసు?

నాగే : మరి పెళ్లి చెయ్యకుండా అట్టేపెట్టామా?

సుబ్బ : సమ్మందాలు సూత్తానే వున్నాం. ఇయ్యాలే వచ్చాడు ఒకబ్బాయి సూసుకోడానికి.

నాగే : నిశ్చయమయిందా?

సుబ్బ : వాచీలు, ఎండి కంచాలు యింకేటో కావాలంట ఆడికి, ఏడనుంచి తెచ్చి యిస్తా యిని బీదముండా వోడినిగందా.

నాగే : మా తాలూకు సంబంధం ఏమన్నా చూసి పెట్టమన్నారా?

సుబ్బ : దీని సంగతి తేలనీ. మా బావయ్య ఏంటో సేస్తున్నాడు నిర్వాకం. ఆఁ...మరసిపోయా, నువ్వు మా వూరు వచ్చేవేం? టాన్సుఫరు అయిందా?

నాగే : లేదండి. మాఅమ్మమ్మకు నేనంటే యిష్టం. తనకున్న నాలుగు ఎకరాలభూమి—అంటే 8 వేల రూపాయల ఆస్థి—నా పేరన రాసేసింది ఆ పొలాలు యీ వూళ్లోవున్నాయి వాటి సంగతి చూద్దామని వచ్చానండి

సుబ్బ : నాకూడా ఎవరైన అత్తి రాసి పారేత్తే బాగుండేదే! ఆ రజనీగాడిని లొంగదీసేవోడిని (ఆలోచించి) ఆ! అదీ! అదుగదీ!

[చివాలున లేచి చిటికలు వేస్తూ]

నాగే : (విస్తుపోయి) ఏమిటండోయ్! ఏమిటది.

సుబ్బ : ఒకేయ్ నాగేశీ! నువ్వు నాకొక్క సాయం చేసి పెట్టాలి.

నాగే : నేను చేసే సహాయం ఏముంటుందండీ. అఫీసుపనా?

సుబ్బ : కాదురా, కాదు. కష్టంలేదు. ఆ చిన్నపని చేసిపెడితే నీకు పున్నెముంటాది.

నాగే : నాకు పెళ్లయిపోయిందండి.

సుబ్బ : ఆఁ ఛే! నీ పెళ్ళిసంగతి కాదురా. మా సత్తి పెళ్లికి నువ్వు సాయం సెయ్యాలి.

నాగే : నా సంపాదనలో మిగిలేది కొంచెంకూడ లేదండి.

సుబ్బ : ఆస్! నీ డబ్బు నా కక్కర్లేదురా. మాట సాయం కావాలిరా, మాట సాయం.

నాగే : ఓస్! అదా! దానికేముంది తప్పక చేస్తా. చెప్పండి.

సుబ్బ : నీతో ఆడుకున్న నీ నేస్తం సత్తికి నీ వామాత్రం సాయంపడకపోతే ఎట్టా.

నాగే : చేస్తానన్నాగా చెప్పండి.

సుబ్బ : సెబుతున్నాగా యిను. ఒక తమాసా చెయ్యాలి నువ్వు.

నాగే : అంటే (సుబ్బయ్య అన్నిపక్కల చూసి తలుపులు దగ్గరవేసి నాగేశ్వరరావు చెంతకు వస్తాడు.)

సుబ్బ : నాకూడా అమ్మమ్మో, నాయనమ్మో, తాతయ్యో, లేకపోతే యింకెవడో సచ్చినోడు అత్తి రాసిపారేసినట్టు నీవు తమాసా సెయ్యాలి.

నాగే : ఓస్! అదా అట్లా నాటకం ఆడుతా కాని ఆ తర్వాత యిదంతా అబద్ధం అని తెలిస్తే.

సుబ్బ : తెలిస్తే తెలిసిందిలే. ఎప్పుడో సంగతిగందా. ఈ లోపుగ పెళ్లి అయిపోతాది.

నాగే : అదా సంగతి. నేనీ తమాషాచేస్తే మీ అమ్మాయి పెళ్ళి అవుతుందన్నమాట.

సుబ్బ : అదేరా నాగేశీ. నువ్వీపని సేశావంటే దాన్నొక యింటిదాన్ని సేసినోడవవుతావు.

నాగే : వెయ్యి అబద్ధాలు ఆడి అయినా యిల్లునిలపమన్నారు. తప్పకుండా చేస్తా. కాని దీనిమూలంగా ఎవరికైన నష్టం......

సుబ్బ : నట్టం ఎవడికిరా? డబ్బులేని సమ్మందం వద్దంటూ గింజుకుంటున్న ఆ కొంపాండరు

గాడు ఎత్రివేసాలుమాని తకీమని పెళ్ళికి ఒప్పుకుంటాడు.

నాగే : నన్నెవరైనా గుర్తుపడతారేమో?

సుబ్బ : నిన్నెవరు ఎరుగుండార్రా యిక్కడ, నేను మా సత్తితప్ప. అయినా నీరూపు కానా మారిందిలే.

నాగే : మరి వివరాలేమిటో చెప్పండి.

సుబ్బ : వివరాలు నాకేం తెలుస్తాయి అంతా నీకే వదిలేశా.

నాగే : సరే లెండి. ఆ సంగతంతా నేను చూసుకుంటా.

సుబ్బ : జాగరత్త నాగేశీ. ఎట్టా చేత్తావో! రక్షించే భారం నీది.

నాగే : మరేం ఫర్వాలేదండి. కాలేజీలో నాటకాలు వేసే అలవాటుంది. అంతా నాకు వదిలేయండి. మీ అమ్మాయి పెళ్ళి అయిందని ధైర్యంగా ఉండండి.

సుబ్బ : ఏమో నాయనా, నీ ఋణం తీర్చుకోలేను.

నాగే : ఆ కాస్త సహాయం చేయకపోతే ఎందుకండీ నేను; మీరు చూస్తారుగా.

సుబ్బ : ఇంకెల్లు, ఆళ్ళొచ్చే వేళయింది.

నాగే : మరి సత్యాన్ని చూపలేదే.

సుబ్బ : నూద్దుగానిలే, యిప్పుడొద్దు. మద్దినాల నుంచి రా. మాపుటికి భోజనానికి కుందువు గాని.

నాగే : అయితే సరే. పావుగంటలో వస్తా.

[నాగేశ్వరరావు నిష్క్రమణ]

సుబ్బ : (హుషార్‌గా అటు యిటు తిరుగుతూ) ఇప్పుడు తెలుత్తాది సుబ్బయ్య సత్తా అంటే ఏటో. (చిటిక వేసి) ఒక్కతిప్పా వేశాను. పోయే సమ్మందాన్ని యిట్టే నిలేశా. పెళ్లి ఎవడిమూలాన అవుతాదో మా రంగయ్యకు తెలుస్తేనా (నవ్వుతూ). ఆ రజనీగాడు ఎందుకు సేసుకోడో నూస్తా. నూపెడ్తా నా మజా.

[ప్రవేశం, రంగయ్య, రజని కాంత్ కుమార్]

రంగ : (చేతిలోవున్న పొట్లాలు సుబ్బయ్యకు యిస్తూ, సుబ్బయ్య యింట్లోకి యివి తీసుకు వెళ్ళి. గ్లాసులు, ప్లేట్లతో కాఫీ ఉప్మాలు తీసుకురా.

సుబ్బ : ఓ! అల్లాగే! (సుబ్బయ్య నిష్క్రమణ)

రంగ : దోవలో మనం మాట్లాడుకోడానికి సరిగ్గా వీలులేకపోయింది. వాళ్ళు వీళ్లు ఎదురుతగులుతుంటే మాట్లాడేది ఎట్లా?

రజ : అయినా మాట్లాడడానికి ఏముందండి యిందులో.

రంగ : ఇంకా వ్యవహారం ఫైసలవందే.

[సుబ్బయ్య ట్రేలో కాఫీ, ఉప్మా కిల్లీలు మంచినీళ్ళ గ్లాసులు పెట్టుకుని తయారవుతాడు, ట్రే బల్లమీద పెడ్తాడు).

రంగ : (ఉప్మా ప్లేటు రజనీ కాంత్‌కు అందిస్తూ) ఉప్మా కాస్త సేవించండి.

రజ : ఉప్మా వద్దండీ కాఫీ చాలు.

రంగ : (రెండు గ్లాసుల కాఫీ రజనీకి, సుబ్బయ్యకు యిచ్చి మూడో గ్లాసు తాను తీసుకుంటాడు)

సుబ్బ : (కాఫీ కొంచెంతాగి) అబ్బ! సచ్చా! నాలుక ఊడిపోయింది. ఇంత ఏడి కాఫీ ఎవరిమ్మన్నారంట దీన్ని. ఉప్మాయా ఏమో మాడబెట్టిందీ, కాపీ ఏమో మరగబెట్టిందీ సావాలనుకుందా బతకాలనుకుందా.

[కాఫీ గ్లాసు దడాలున బల్లమీద పెట్టగా కాఫీ చిందుతుంది]

రంగ : నీ యిలు బంగారంకాను, వుండవయ్యా సుబ్బయ్యా! కాఫీ వేడిగావుంటే ప్లేటులో పోసుకు తాగరాదూ. దీనికింత అల్లరి చెయ్యాలా? కొంచెంవుంటే కాఫీ అంతా యీాయనమీద దిమ్మరించేవాడివి.

సుబ్బ : నాలిక కాలిపోతే ఏం సేయమంటావు. 'పులేటు' ఏదీ (ప్లేటు తీసుకుంటాడు).

రజ : (కాఫీ తాగుతుంటాడు).

రంగ : కాఫీ బాగా వేడిగా వుందిట. ప్లేటు తీసుకోండి.

రజ : కాఫీకి వేడేమిటి? ఎంత వేడిగా వుంటే అంత బాగుంటుంది అంత తాపీ గా తాగొచ్చు.

[సుబ్బయ్య కాఫీ జుర్రుతూ మోతచేస్తూ త్రాగుతూ వుంటాడు.]

రంగ : (రజనీతో) పంచదార, పాలు, డికాషన్ ఏమయినా కావాలా?

రజ : వద్దు! దివ్యంగావుంది కాఫీ బుర్రతో పని చేసే వాళ్ళకు కాఫీ అమృతసమానం అనుకోండి. 'ఫ్లాస్కు' నిండా వేడి వేడి కాఫీ పోసుకుని కొద్దికొద్దిగా తాగుతూ నాలిక తడుపుతూంటే నేగాని నాకు కలం నడవదు కద. ఒక కప్పు స్ట్రాంగ్ కాఫీ తాగివచ్చి అప్పుడిస్తాడు జడ్జిమెంటు మా మున్సబు మామ.

రంగ : అయ్యా కాంపౌండరు గారూ, అయితే మీ ఉద్దేశం ఏమిటో జడ్జిమెంటులా గా చెప్పెయ్యండి.

[సుబ్బయ్య కాఫీ వంటిమీద ఒలకపోసుకుంటాడు ]

అదేమిటి సుబ్బయ్యా! ప్లేటుతో తాగడం నీకు అలవాటు లేనట్టుంది. లోపలకుపోయి చొక్కా కడుక్కురా.

[సుబ్బయ్య నిష్క్రమణ]

రజ : స్వల్పమైన నా కోర్కెలు యిందాకే చెప్పేనుకదండీ అవి తీర్చడానికి ఒప్పుకుంటే పెళ్ళికి నా అభ్యంతరం ఏమీ లేదు.

రంగ : ఇందాకటినుంచి ప్రాధేయపడితే చివరకు మీరు చెప్పేది యిదా. కొంచెం ఒక మెట్టు దిగండి.

రజ : "మాట తిరుగలేరు మానధనులు" అన్నాడు బలిచక్రవర్తి. మానం, అభిమానంగల నేను ఇప్పుడొకమాట అప్పుడొకమాట చెప్పే అవమానపు పనులు చేయను.

రంగ : వీలునుబట్టి మెల్లి మెల్లిగా మీరు కోరినవన్నీ అమర్చుతాము. సరేనా! ఇక ఒప్పుకోండి.

రజ : "ఇవాళ సంగతి ఇవాళే. రేపటి సంగతి ఆలోచించవద్ద"న్నాడు ఓమర్ ఖయామ్.

నేను కావాలన్నవాటి కన్నిటికీ ఇవాళే ఒప్పందం యివ్వాల్సి వుంటుంది.

రంగ : అయితే అంతే నంటారా?

[బయటనుండి సుబ్బయ్యగారూ అని కేక]

రజ : ఇంతే గదండీ (4 వేళ్లు చూపిస్తూ) అల్ప సంతోషిని నేను.

[ప్రవేశం నాగేశ్వరరావు — చేతిలో ఫైలు వుంటుంది.]

నాగే : (అథార్టీగా) రామవరపు సుబ్బయ్యగారి యిల్లు యిదేనా?

రంగ : (ముందుకువచ్చి) అవునండి, ఇదే. వారితో మీకు ఏం పని?

నాగే : అబ్బ! చచ్చిపోయానండి ఇల్లు కనుక్కోలేక. ఎవ్వరూ చెప్పిచావరే. చివరికి ఎల్లాగో కనుక్కున్నా. ఒకసారి సుబ్బయ్యగారిని పిలవండి

రంగ : సుబ్బయ్య లోపలవున్నాడు. వారి బావగారిని నేను. మీరు నాతో చెప్పవచ్చు.

నాగే : అట్లా కాదండి. సుబ్బయ్యగారితోనే చెప్పాలి. ఇతరులతో చెప్పకూడదు.

రంగ : (ఆదుర్దాగా) ఏం కబురండి — అది. చెడు వార్త కాదుకదా.

నాగే : (నవ్వి) అబ్బే! కాదండి. చాలా శుభవార్త. పిలుచుకురండి వారిని.

రంగ : (హడావిడిగా లోపలకు వెళ్తాడు).

[ప్రవేశం సుబ్బయ్య, రంగయ్య; సత్యవతి లోపలినుంచి తొంగిచూస్తూ వుంటుంది.]

రంగ : వీరే సుబ్బయ్యగారు.

సుబ్బ : అయ్యా నేనేనండి సుబ్బయ్యను.

నాగే : (ఆఫీసరు ఠీవితో) మీ పెదనాన్నగారి పేరేమిటో చెబుతారా?

సుబ్బ : గంగయ్యగారండి.

నాగే : రైట్! వారెక్కడ వుండేవారో ఏంచేసేవారో మీకు తెలుసా?

సుబ్బ : చిన్నప్పుడే యింట్లోంచి పారిపొయ్యారండి. చానారోజులవరకు వారి ఆచూకీ తెలియ

లేవండి. చిన్నపట్నం చేరుకున్నారని అక్కౌంటు చేస్తున్నారని మీ బోటి గాళ్ళు చెబితేయిన్నాం. అంతే.

నాగే : రైట్! గంగయ్యగారు మా యిన్సూరెన్సు కంపెనీలో పెద్ద మొత్తానికి భీమాచేశారు. వారు పాపం రెండునెలల క్రితం కాల ధర్మం చేశారు.

సుబ్బ : అయ్యో! అయ్యో! మాకు తెలియనైనా తెలీదే సూసి ఎన్నేళ్లయిందో.

నాగే : వారికి సంతతిలేదు. వారసు లెవరూ అని వెతకగా వెతకగా దగ్గరవారు మీరు అని తెలిసింది.

సుబ్బ : నిజంగానా అండి?

నాగే : పూర్తిగా నిజం. చూశారా! మా ఇన్సూరెన్సు కంపెనీయొక్క గొప్పతనం మా కంపెనీలో పాలిసీ తీసుకున్నవాళ్ళ వారసులు దేశంలో ఎక్కడున్నా గాలించి వెదికి పట్టుకుని వాళ్లి యిన్సూరెన్సు డబ్బు అంద జేసే పెద్దభారం కూడా మా కంపెనీ భుజాల మీద వుంది.

రంగ : ఎంతకు యిన్సూరు చేశారండి గంగయ్య మామగారు.

నాగే : పదివేలకు.

రంగ : (ఆశ్చర్యంగా) పదివేలకా?

నాగే : అంత ఆశ్చర్యం ఎందుకు? గంగయ్యగారి కేం? ఆయన మద్రాసులో పెద్ద వ్యాపారం చేసేవాడు. 10 వేల రూపాయలకు మా కంపెనీలో పాలసీ తీసుకున్నారు.

సుబ్బ : పదియేలే! (నోరు తెరచుకుని చూస్తూ వుంటాడు).

నాగే : దీనికేనా? ఏభై వేలకు, లక్షరూపాయలకు యిన్సూరు చేసినవాళ్లు మా కంపెనిలో బోలెడుమం దున్నారు.

సుబ్బ : అరి నా సామిరంగా! పదియేలే! బలే యిచిత్రంగా వుందే యిదంతా.

నాగే : పదివేలు ఒక్కసారివచ్చి చేతిలో పడటం ఆశ్చర్యం కాదండీ?

సుబ్బ : సత్తెన్నారాయణ పమాణంగా నిజమే?

నాగే : అక్షరాల నిజం! పదివేలు నేనే లెక్క పెట్టి మీ చేతుల్లో పెడతా.

సుబ్బ : అయితే యిప్పుడే యిస్తారా?

నాగే : (నవ్వి) అప్పుడేనా? అంత త్వరగా రాదు. మీదగ్గర నుంచి, తాహసీల్దారు దగ్గరనుంచి, స్టేటుమెంటులు, సర్టిఫికేట్లు వగైరా కావాలి. అవన్నీ అయ్యాక వసుంది డబ్బు.

సుబ్బ : రావడానికి ఎన్ని రోజులు పడ్తాది?

నాగే : మామూలుగా అయితే 2 నెలలు పడ్తుంది. కాని నేను మద్రాసు వెళ్ళగానే మీ పనే చూసి నెలలో వచ్చేటట్టు చేస్తా.

రంగ : (సుబ్బయ్య వీపుతట్టి) బలే అదృష్టవంతుడివి సుబ్బయ్యా. ఇక నీ కష్టాలు గట్టెక్కాయి.

సుబ్బ : (నాగేశ్వరరావుతో) అయ్యా! మీరు నిజంగా దేముడులాగ వచ్చి రక్షించారండీ. ఇల్లు నిలిపిన పుణ్యం కట్టుకున్నారు.

నాగే : ఇళ్ళూ వాకిళ్ళూ, కొంపలూ కుటుంబాలూ నిలపడానికేనండీ యిన్సూరెన్సు కంపెనీలు భూమిమీద అవతరించాయి.

సుబ్బ : (దణ్ణం పెడుతూ) మీ ఋణం జల్మజల్మాలకు తీర్చుకోలేనండీ.

నాగే : మా కంపెనీలో ఏ రెండు వేలకో, మూడు వేలకో యిన్సూరుచేయండి, ఋణం తీర్చుకున్నట్టు అవుతుంది.

సుబ్బ : మీ రేది చేయమంటే అది చేత్తా.

నాగే : ఇక నేను వెళ్లి వస్తా. మళ్లీ వచ్చేటప్పుడు డబ్బుతో వస్తా.

రంగ : కొంచెం కాఫీ ఫలహారాలు పుచ్చుకుని వెళ్ళండి.

నాగే : వద్దండి. ఖాళీ లేదు. కంపెనీ డబ్బుతో హోటల్లో పూటుగా పట్టించా. వస్తా. నమస్తే!

[నాగేశ్వరరావు నిష్క్రమణ]

రజ : (ఆశ్చర్యంగా, తన్మయత్వంతో చూస్తూ) రంగయ్యగారూ! మాట. ఒకసారి ఇలా రండి.

రంగ : (కనుబొమలూ, ముక్కూ విరచి, కొంటెగా నవ్వుతూ) ఏమిటండీ రజనీకాంత్ కుమార్ గారూ?

రజ : నా పూర్తి సమ్మతి తెలియజేస్తున్నా. పెళ్ళి ఖాయం చేసేయండి. ముహూర్తం పెట్టేయండి.

రంగ : లాంఛనాలు మీ రడిగినవి యివ్వలేని వాళ్లం కదండీ

రజ : వాటికి లోంచి రేమొచ్చిందండి. బ్యాంకులో వున్నాయి. తర్వాత చూసుకుందాం లెండి.

రంగ : 'మాట తిరుగలేని మానవను'లకు మాట తప్పడం అవమానం కదండీ.

రజ : 'వారిజాక్షులందు వైవాహికములందు' మాట తప్పవచ్చని శుక్రాచార్యులవారు చెప్పనే చెప్పేరు కదండీ

రంగ : ఇవ్వాళే సంగతి ఇవ్వాళే అన్నారుగా?

రజ : సమ్మతించడం కూడా ఇవాళే సంగతేగా!

రంగ : సరేలెండి ఆలోచిద్దాం!

సుబ్బ : రంగయ్యబావయ్యా! రజనీగారు ఏమంటున్నారు.

రంగ : ఏమంటారు? పెళ్ళికి రెడీ అంటున్నారు.

సుబ్బ : అయితే బాపన్నణ్ణి పిలిచి యెంటనే పెట్టేయ్యండి లగ్గం.

రంగ : రజనీకాంత్ గారూ! ఇక పోదామా?

రజ : అప్పుడే!

రంగ : వచ్చినపని అయిపోయిందిగా. మిగతా సంగతులు తర్వాత మాట్లాడుదాం లెండి.

[రంగయ్య, రజని నిష్క్రమణ]

సుబ్బ : (మీసం మెలివేస్తూ, జబ్బ చరచుకుంటూ, ఈల వేస్తూ). కొండెక్కి కూకున్నా ఓసెల్లా ఒకేమని దిగొచ్చాడు. ఇందాక వాచీలు, గోచీలు కావాలని గింజుకున్నాడు. రేపటి నుంచీ పెల్లి చేస్తావా సెయ్యవా అంటూ ఆడే తిరుగుతాడు. మంచి లగ్గం చూసి యిట్టే పెల్లి చేసేస్తా. పెల్లి అయినాక డబ్బురా లేదు అని తెలిసికొని ఏడిస్తే ఏడిశాడు... నేనే గనక యీ సిట్కా వెయ్యకపోతినా, మా సత్తికి పెల్లి అవుద్దీ? తనేదో మా చెడ్డ కష్టం పడ్డానని అనుకుంటాడు మా రంగయ్య. మనువు కుదిరేటట్టు చేసింది ఎవరంటా? నేనా—ఆడా?

[ప్రవేశం ఒక మూలనుంచి సత్యవతి. మరొక మూలనుంచి రంగయ్య]

సుబ్బ : ఇంకెక్కడికి పోతాడు రంగయ్యబావయ్యా, కాంపౌండరుగోడు. (నవ్వుతూ) పెలి చేస్తే కాని నిద్రపోనిస్తాడా? మనం ఎట్టా చెబితే అట్టా యింటాడు గీర తిరిగింది అయ్యరు.

రంగ : (గొప్పగా) పంపించేశా. మా అమ్మాయి మీద ఆశ పెట్టుకోవద్దని యింకోపిల్లని చూసుకొమ్మని ఖండితంగా చెప్పేశా.

సత్య : మావయ్యా! నేనూ అదే అనుకుంటున్నా.

రంగ : కోతలరాయుడు—మావ గొప్ప తప్ప వీడి గొప్ప ఏముంది.

సత్య : ఉత్తికబుర్లరాయుడు. పెట్టేవన్నీ ఊదేశాడు.

సుబ్బ : (తెలపోయిన వాడిల్లా తెప్పరిలి) ఏం? ఏమొచ్చింది? ఏం తక్కువయింది?

సత్య : ఆ గతిమాలిన సంబంధం నా కొద్దునాన్నా.

రంగ : పదివేలు వచ్చి పడుతుంటే ఆ దిక్కుమాలిన సంబంధమే కావల్సివచ్చిందా సుబ్బయ్యా! దర్జాగా, రెండువేల రూపాయలు కట్నం యిచ్చి...అన్ని లాంఛనాలతో, గొప్పగా, సలక్షణంగా మా సత్యంకు పెళ్లిచేస్తా. ఇంక ఆ కాంపౌండరు ఎందుకు. అందుకనే పొమ్మన్నా, తిరిలేశా. రాజా లాంటి సంబంధం తెస్తా.

సత్య : నా ఉద్దేశమూ అంతే మావయ్యా.

సుబ్బ : అరి భగవంతుడా! (తల రెండు చేతులతో పట్టుకుని కుర్చీలో కూలబడుతాడు).

[తెర]

# జీవుని వేదన

శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి

ఆధునిక కవులలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు రచించిన కావ్యములు పరశ్శతములు. ఈ యన్ని కావ్యములందును ననుస్యూతిగా గనవచ్చు నాయన కవితాగుణములను పలుమంది పలురీతుల నుగ్గడించిరి. కొందరాయన రచనా శిల్పమునుగురించి, కొందరు కథా నిర్మాణమునుగురించి, కొందరు వర్ణనా నైపుణ్యమునుగురించి, కొందరాయన లోకజ్ఞతను గురించి ప్రకృతి పరిశీలనమునుగురించి పాత్ర నిర్మాణమునుగురించి సంభాషణాచాతుర్యమునుగురించి బహువిధములుగా వ్యాఖ్యానించిరి. అనంతమైన యాయన ప్రతిభ యనేక మార్గముల విజృంభించినది. ఒకరొక రొక్కొక్క త్రోవను పట్టుకొని దాని స్వరూప నిరూపణ మొనర్పుటకు ప్రయత్నించిరి. ఎంతమంది యెన్నిరీతుల వ్యాఖ్యానించినను నాయనలో చెప్పదగిన ముఖ్యాంశ మేదియో చెప్పబడక మిగిలిపోయినట్లే కన్పించును. ఆయన కవితలో నెక్కడపట్టిన నక్కడ పాఠకుని మహావేగమున నాకర్షించి సుడిపెట్టు మహాగుణ మొకటున్నది. ఆ మహాగుణము రచనాశిల్పము గాదు కథాకథనము గాదు వర్ణనానైపుణ్యము గాదు. లోకజ్ఞత, ప్రకృతిపరిశీలనము పాత్రనిర్మాణము మొదలైన వేవియు గాదు. వీనియన్నిటిని మించి యా మహాగుణ మాయన సర్వకవితయందు ముద్రితమై మహాకవియను భావమును వ్యక్తీకరించుచున్నది ఆ మహాగుణమేమి? అది యాయన యతిలోకమైన యనుభూతి. నిరంతరము నగ్నివలె జ్వలించుచున్న జీవుని వేదన.

ప్రధానముగా సత్యనారాయణ గారిని కవిని జేసిన దీ జీవుని వేదనయే.

వ్రాసిన రామచంద్రు కథ
వ్రాసితి వంచనిపించుకో, వృథా
యాసము గాక కట్టు కత
లైహికమా పరమా యటంచుఁ దా
జేసిన తండ్రి యాజ్ఞయును
జీవుని వేదన రెండు నేకమై
నా సకలోహవైభవస
నాథము నాథ కథన్ రచించెదన్"

అని యాయన తన రామాయణమునందు జెప్పుకొన్నాడు సత్యనారాయణ గారే యననేల? అచ్చమైన కవి యెవ్వడైనను నీ జీవుని వేదనవల్లనే కవియైనాడు. రెండు విధముల కవులున్నారు. ఒకడచ్చమైనకవి. లోపలనుండి కవియైనవాడు. రెండవవాడు బయటి మెఱుగులు సంతరించుకొని కవి యనిపించుకొన్నవాడు. ఆ మొదటివాడు కవిత్వము వ్రాయనిచో వాని ప్రాణములు నిలువవు. ఈ రెండవవాడు కవిత్వము వ్రాయునది లోకములో నూరేగుటకు. ఆ మొదటివాడు వేయియేండ్లకొకడున్న నదిగొప్ప. ఈ రెండవజాతి నేకాలమందైనను లెక్కకట్టుటకు నాదిశేషుడు చాలడు.

"యేనాస్మిన్నతి విచిత్రకవిపరంపరావాహిని సంసారే కాళిదాసప్రభృతయః ద్విత్రాః పంచషా వా మహాకవయ ఇతి గణ్యంతే" అని యానందవర్ధనాచార్యుడు చెప్పెను.

ఈ నల్గురైదుగురు కాళిదాసాదుల జీవసంపుటి యందు వారు విశిష్టకవులు గావలసిన లక్షణ మున్నది కావున వారు మహాకవులైనారు. ఈ లక్షణమే జీవుని వేదన. ఈ జీవుని వేదన నిరంతర జాజ్వల్యమానమై వారి జీవసంపుటియందుఁ బరిపక్వతను సంతరించినది. ఆ పరిణతియే వారి వాక్కులందు నిండియున్నది. "శబ్దబ్రహ్మవిదః కవేః పరిణతాం ప్రాజ్ఞస్యవాణీమిమాం" అన్నాడు భవభూతి. మహాకవుల వాక్కులు అంతరమగు నీ జీవుని వేదనయన్న యగ్నిలోఁదప్తమై తప్తకాంచనమువలె బయటికి స్రవించును. కావున నీ జీవుని వేదన సర్వకవితా నిర్మాణమునకును మూలకందము.

ఇట్టి జీవుని వేదన తీవ్రము గాగలవాఁడు శ్రీ సత్యనారాయణగారు. ఆయన సర్వకావ్యము లందును నీ వేదన నిండియున్నది.

"కాయనిలాఖ్య మెల్ల నినదించెడి మువ్వల మ్రోత దూరమై
పోయినగోతతిం బిలచుపోలిక నేదొ వినిస్వనించెడిన్
రాయిడిపొందుచున్ దలచరాక నగర్భి పురాను భూతముల్
తీయని భావముల్ దలపుతెచ్చుకొనన్ వలవంతఁ గుందెడిన్"

శృంగారవీధియను కావ్యములో సాక్షాత్కారము ఖండికలోని తొలిపద్యమిది. ఆకసమంతయు మువ్వలమ్రోత నిండి మ్రోగుచున్నది. ఆ మ్రోత దూరముపోయిన గోవులను జేరఁబిలుచు చున్నట్లు నేదియో యవ్యక్తమైనయర్థమును జెప్పుచున్నట్లున్నది. ఆ మ్రోత విని నా మనస్సు ఏదియో స్పష్టముగాని, తీయని పూర్వానుభవములను గుర్తు తెచ్చుకొనుటకు బాధపడుచున్నది. ఇది పద్యార్థము. ఆకసమంతయు మువ్వలమ్రోత నిండి మ్రోయుచున్నదట. ఆ మ్రోత నెంతమంది విన్నారు? విని ఎంతమంది బాధపడ్డారు? పైగా నా మ్రోత దూరముపోయిన గోవులను బిలచుచున్నట్లున్నదట ఇచ్చట గోవులనగా నావులనియు శబ్దములనియు నర్థము. మువ్వలమ్రోత పరమేశ్వరుని పిలుపు. తన వాక్యములు పరమేశ్వర భావరహితములై లోకమార్గము పట్టినవి ఈలోకమార్గము పట్టిన వాక్కులను మువ్వలధ్వని చేసి తనవంకకుఁ బిలుచుచున్నాఁడా ప్రభువు? ఆ పిలుపు విని యేవియో స్మృతులు మధురమైన యస్పష్టమైన స్మృతులు కదలినవి. ఆ కదలిక ఇదమిత్థమని చెప్పరాని యొక బాధ కల్గించుచున్నది. ఈ బాధయే జీవుని వేదన. ఒక మధురమైన సవ్వడి విన్నప్పుడు, ఒక రమ్యమైన రూపమును జూచినప్పుడీ జీవుని వేదన ప్రజ్వరిల్లి యేకవి సర్వ నిర్మాణమును మూలముట్టుగ గదలించివేయునో వాడచ్చమైన కవి. సత్యనారాయణగారట్లు కదలిపోయినారు.

ఒకసారి నాలోన నూహించియేమేమొ
స్త్రీవోలె సిగ్గుపొందెదను నేను
ఒకసారి యెదపొంగి యూగించి కవివోలె
మృదుకంఠమెత్తి పాడెదను నేను
ఒకసారి హృదయమూరక బాధపడి కంటి
తుదలందు నీరు జార్చెదను నేను.
ఒకసారి వీతహేతుకముగా సౌఖ్యమ్ము
విరిసిపడ్డట్టు నవ్వెదను నేను
ఏ మహాభావమో వచ్చి హృదయ మావ
రించి నా సంధులను గదలించి పైపైని
నా మహాభావ మరసెద నన్న కొలది
నా విలోచన పథమెల్ల నల్లనయ్యె."

జ్వలితమైన జీవుని వేదన సిగ్గుపొందుటలుగా గంఠమెత్తి పాడుటలుగా కంటితుదలందు నీరు జార్చుటలుగా సౌఖ్యము విరిసిపడినట్లు నవ్వుటలుగా నభివ్యక్తమైనది. లోపలనుండి కవియగుట యనగా నిట్టిది. అంతరముగాఁ గవియైనవానికి నీ జీవుని వేదన నిరంతరము జ్వలించుచునే యుండును. దాని యభివ్యక్తి యనేక రూపములు. ఒకప్పుడది శృంగారముగను మఱియొకప్పుడు కరుణముగను మఱియొకప్పుడు రౌద్రముగను నిట్లే యనేకవిధములుగాఁ బరిణమించును. ఈ జీవుని వేదనను నిరంతరము జ్వలితమొనరించుటకుఁ గవి వేయు సమిధలను బట్టి దానిరంగు మారుచుండును. ఆ రంగును వదలి చూచినచోఁ దక్కిన జీవుని వేదనయంతయు నొక్కటే. ఇట్లు నిరంతర జాగరూకమైన యీ జీవుని వేదన దాని యంతట నది పైకి నభివ్యక్తమగుటకుఁ బ్రయత్నము చేయుచుండును. దాని ప్రబోధముననే సత్యనారాయణ గారు నిరంతర కావ్యవ్యాపారమునందుఁ బ్రవృత్తులగుట.

"అస్మదీయ కంఠమున యందాడుచుండె
నొక యెహోగీతి బయటికి నుబికిరాదు
చొచ్చుకొని లోనికింబోదు వచ్చిపోయె
నా హృదయమిా మహాప్రయత్నమ్మునందు.

అచ్చమైన జీవునివేదన యస్పష్టముగా బయటపడుటకుఁ బ్రయత్నించిన దిచట. కవి దానికొక వాహికను సంతరించలేదు. మొదటఁ జెప్పినట్లు దాని స్వరూప మస్పష్టము. మనసులోని యడుగుపొరయైన చిత్తమునందది కదలినదిగాని సంకల్ప వికల్పాత్మకము పైపొర కది యుచితమైన వాహిక లేక రాలేదు. ఆ కదలిన కదలిక చిత్తమునందే గిరికీలు కొట్టుచున్నది.

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధ పూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని"

అని కాళిదాసు చెప్పుచున్నాడు.

జీవి సుఖముగా దిని కూర్చున్నాడు. దుఃఖకారణ మేమియు లేదు. రమ్యమైన రూపములనే చూచినాడు మధురమైన శబ్దములనే విన్నాడు. పర్యుత్సుకుడైనాడు. పర్యుత్సుకత్వ మనగా తీయని బాధ. ఇట్టి తీయని బాధ పొందుటకుఁ గారణమేమి? కాళిదాసు చెప్పిన కారణ మిది. ఆ సమయమున నతనికిఁ జిత్తమునందు జన్మాంతరీయకములైన కొన్ని సంస్కారములు పూర్వాపరసంబంధ శూన్యములై స్మరణకు వచ్చినవి. సంబంధములు తెల్లముగాని సంస్కారముల చిత్రమునందలి కదలికయే యీ పర్యుత్సుకమట. ఈ శ్లోకమునందు "చేతసా స్మరతి" యన్నది ముఖ్యమైన యంశము. చిత్తమునందు స్మరణ యనగా దానికి స్పష్టప్రతిపత్తి యుండదు. కావున స్మరణ కాదు స్మరణ మెప్పుడును సాపేక్షకము, స్పష్టము. పైన జెప్పిన చిత్తమునందలి స్మరణ యిట్టిది కాదు గావున నచట స్మరణ శబ్దమున కాంతరమగు బోధ లేక వేదన యని యర్థము చేయవలయును. ఇదియే జీవుని వేదన మరియు వివరించిన విషయము గహనమగును గావున వివరింపను.

ఉచితమైన వాహిక యున్నచో నీ జీవుని వేదన పైకభివ్యక్తమగును. వాహిక యనగా వస్తువు. ఏదేని యొక వస్తువు నాశ్రయించి జీవుని వేదన బహిర్గతమగును. అస్మదీయ కంఠేత్యాది పద్యమునందలి జీవుని వేదన కట్టి వాహిక యుపలభ్యమానముగా లేదు గావున నది కంఠగతమై పైకి రాక లోపలికి బోక హృదయమును వ్రచ్చిపోఁజేయుచున్నది. "ఈ మహాప్రయత్నమ్మనం" దన్నచోట నా ప్రయత్నము కవిది కాదు. ఆంతరమైన జీవుని వేదన యచ్ఛముగా బయట పడుటకుఁ జేసిన ప్రయత్నమది. కావున నది విఫలమైనది. అయ్యో—

"విఫలిత పునఃపునః కృత వివిధయత్న
భావిత ప్రచండబాధా తథాఁ విదారి
తాస్మదీయ హృదంతరంబందుఁ దోఁచె
స్ఫురిత సంఫుల్ల నవజపా శోణ సంధ్య"

ఈవిధమున పునః పునః ప్రయత్నములు విఫలితమైనకొలది జీవుని వేదన సంధుక్షితమైనది. ఈ సంధుక్షమే స్ఫురిత నవజపాశోణసంధ్య. ఇచట నిది రూపకాతిశయోక్త్యలంకారము. వేదనాధిక్యవ్యంజకము. ఈ సంధుక్షమునుండి సత్యనారాయణగారి సరస్వతీ ప్రవాహము పుట్టినది.

ఈ మహాసంధ్యలో శారదామయూరి
రమ్యకింకిణీ కిణికిణి రభసపాద
మంజుల విలాసనృత్య సామ్రాజ్యలక్ష్మి
యనుచుఁ గచ్ఛపీ మృదుగీతు లనుసరించు

కచ్ఛపి సరస్వతి వీణ. జీవుని వేదన పొంగిన హృదయములో సరస్వతి యన్న నెమిలి కచ్ఛపీ గీతముల ననుసరించుచు నృత్యము సేయుచున్నదట. బిల్హణు డన్నాడుగదా

"జయంతి తే పంచమనాదమిత్ర
చిత్రోక్తి సందర్భ విభూషణేషు
సరస్వతీ యద్వదనారవిందే
వ్యాభాతి వీణామివ వాదయంతీ"

వారి వాక్య సందర్భములు కోకిల కంఠముతోఁ జెలిమిసేయును. వారు మాటాడుచుండగా సరస్వతి వారి ముఖమున కూర్చుండి వీణ వాయించుచున్నట్లుండును. వారు సర్వోత్కృష్టులై వెలయుచుండురు.

ఈ శ్రేణిలో లెక్కింప తగ్గవాడు సత్యనారాయణగారు. ఆయన ముఖమునుండి యా సరస్వతీ నృత్యము, ఆ కచ్ఛపినాదము బహిర్నిస్సృతమై యాయన కావ్యజాలముగాఁ బరిణమించినది. ఈ మూడు పద్యములు 'గిరికుమారుని ప్రేమగీతాలు' అను గ్రంథములోని ప్రథమ ఖండిక. ఈ మూడు పద్యములను నాయన జీవుని వేదనలోని గాఢత్వమును బట్టియిచ్చుచున్నవి. ఇంత లోతైన వేదన గలవాడు కావుననే యీయన కావ్యము లెచ్చటఁ జదివినను జన్మాంతరీయక దుఃఖసముద్రములు పోటెత్తినట్లుండును. ఆయన యెట్టి వస్తువును దీసికొన్నను నీ జీవుని వేదనయందు దానిని కాచి బంగారమును జేయును. ఆ వేదనయొక సంగీతమై ఆయన ప్రతికావ్యమునందును తొలుకాడుచుండును.

"అచటి కిన్నెరసాని నా యాత్మయందు
నిప్పటికి దాని సంగీత మే నదించు"

నిజమున కా యాత్మయందు నదించు సంగీతము కిన్నెరసానిది కాదు. కిన్నెరసానియందు గన్పించు నా సంగీతము జీవుని వేదనా స్వరూపమైనది. ఆత్మయందు నదించినది.

ఆత్మయందు నదించుట యనగా నేమి? ఆత్మ ప్రకాశముచే దీపితమైన దని చెప్పవలయును. నదించుటయనగా ధ్వనించుట ధ్వనవ్యంజన రసనాది శబ్దములు ప్రతీతి పరములని యభినవగుప్తపాదుల పరిష్కారము. ప్రతీతియనగా స్వసంవేదన గోచర మగుట యని యర్థము. స్వశబ్దమున కాత్మయనియు సంవేదన శబ్దమునకు ప్రకాశనమనియు నర్థమును గ్రహించుట యాలంకారిక సంప్రదాయము. ఫలిత మేమన? కిన్నెరసానియందు గన్పించు సంగీత మాత్మ ప్రకాశదీపితమైన జీవుని వేదనాస్వరూపమని.

ఉన్నతమైన యీ యనుభూతిని సత్యనారాయణగారు స్పష్టముగా జెప్పనే చెప్పెను.

"మీలితోత్తుంగమై సెజ్జ మెదలుచుండఁ
దెలివి పొలముల సొగసు టెల్లలకుఁ దగిలి
నా మనసు, నేదో యొక్క యజ్ఞాతపూర్వ
మైన యనుభూతి గలిగె నాయంతరాత్మ"
"అనిమేషార్థమున భాసమయ్యె నాకు
గత విభావరీ సుఖదుఃఖ ఘటనలెల్ల
స్వాప్నికములని సత్ప్రకాశమున నింకఁ
బోదు నని పులుఁగడిగిన ముత్తెమట్లు."

మనసు తెలివి పొలముల యెల్లలకు దగిలినది అంతరాత్మయం దజ్ఞాత పూర్వమైన యనుభూతి కలిగినది. సుఖదుఃఖములు స్వాప్నికములు సత్ప్రకాశమున బోవుదునని భాసించినదన్నాడు.

మనసు తెలివి పొలముల యెల్లలకుఁ దగులుట యనగా దన్మయమగుట. లేక సమాధి పొందుట లయ మగుటయని యర్థము. ఆ యెల్లలు సొగసుగానున్న వనుటలో మనసు సమాధి పొందు నవస్థలోని మాధుర్యము చెప్పఁబడినది. ఆ మనసు సమాధి పొందినది. ఇంక దాని కేమియు దెలియదు. అందుచేతనే తెలివి పొలముల యెల్లలు దాటినది. మనసు విషయమును గ్రహించుట దాటి పోయిన యవస్థ నందుటచే నింక నది పనిచేయదు. ఆ స్థితికే మనోలయమనియు మనస్సమాధి యనియు పేళ్లు. ఆ స్థితిలో నొక యనుభూతి కలిగినది. అది యజ్ఞాత పూర్వమట. అజ్ఞాత పూర్వమను మాటకు రెండు విధములగు నర్థములు చేయవలయును. మొదటిది యిట్టి యనుభూతి పూర్వ మెప్పుడు నెఱుగనని. రెండవది దీనిపూర్వ మేదియో తెలియబడలేదని. కాళిదాసు "రమ్యాణి వీక్ష్యేత్యా"ది శ్లోకములోని అబోధపూర్వం అనునదియు నీ యజ్ఞాతపూర్వమను నదియు నొక్కటియే. మొదటియర్థ మిట్టి యనుభూతి మానసిక దశను దాటినదని చెప్పను. రెండవ యర్థము ఈ యనుభూతి స్వపర సంబంధ శూన్యమైనదని చెప్పను. పర్యవసానమున రెండు నొకటే స్వపరసంబంధము మనస్సున్నంతవఱకు కుండును ఆ మనస్సు లయ మొందిన తర్వాత కలుగు ననుభూతి నిరపేక్షమైనది, యపరిమితమైనదియు. ఇట్టి యనుభూతి యెచట గల్గు ననగా "కలిగె నాయంతరాత్మ" నని సమాధానము. అంతరాత్మలో గలిగినది కావుననే సత్ప్రకాశ రూపమైనది. ఈ సత్ప్రకాశానుభవము నందిన తర్వాత సుఖదుఃఖ ఘటనలెల్ల స్వాప్నికములగుట సంప్రదాయ సిద్ధమైన విషయము.

ఇచ్చట జీవుని వేదన సుఖదుఃఖాది రూపమగు లౌకిక కోటిని దాటినది. కావున నిది యలౌకికము. దీనినే రసమని యాలంకారికులు వ్యవహరించిరి. ఇట్టి రసానుభూతిని పొందుటకు సహజ సిద్ధమైన యాకూతి సత్యనారాయణగారి జీవ సంపుటి యందున్నది. ఈ జీవుని వేదనను మన మిప్పుడు రెండు విధములుగా విభజించుకొనవలయును. అనగా దీనియందు రెండు దశ లున్నవి. మొదటిది రసాకూతి, రెండవది రసానుభూతి. రసాకూతి దశయందు జీవుడు రసానుభూతికై తహతహ చెందును. ఈ తహతహ యందుండి రసస్థితి చెందుటలోని నీ జీవుని వేదనా ప్రయత్నమే కావ్యముగా రూపొందును. ఈ ప్రయత్న మొక యగ్నివంటిది. ఈ యగ్నియందు కవి మనస్సు కాచబడి మాలిన్యమంతయు నశించి పరిశుద్ధమగును. అందుచేతనే "శుచి ర్వి ప్ర శ్శుచిః కవిః" అని శ్రుతి. విశ్వనాథ సత్యనారాయణగారు ఇంత శుచియైన కవి. ఆయన తన జీవుని వేదనయందు దన కావ్యవస్తు సర్వస్వమును హోమముచేసిన హోత. ఆ యగ్నియందు దన మనస్సును తుకతుక నుడుకబెట్టుకొన్నవాడు. అనగా గవిత్వమును దపస్సుగా సాధించినవాడన్న మాట. "కవితా రూప తపస్సు చేసెను శ్రీకంఠా" అన్నాడు. ఈజీవుని వేదనాగ్నిలో తెన్నగా కాచబడ్డని కావుననే యాయన కావ్యజాలమంతయు, దళతళ లాడుచుండును. ఆ తళతళ లొకచోట పద్యరచన, ఒకచోట కథా కథనము—ఒకచోట పాత్రల

తీర్పుదల. ఒకచోట సంభాషణా వైదగ్ధి, వర్ణనా నైపుణి ఇట్లనంత గుణభూయిష్ఠమై గోచరించును. దీని కంతకు కారణము ప్రజ్వలితమగు జీవుని వేదన.

"అస్మ దజ్ఞాతపూర్వ దివ్యత్వ మెప్పు
నీ పునీతావనీఖండ మిట్లు నిలిచి
యస్వతంత్రత దొరలు నా యాంధ్రశక్తి
నన్ను గంపింపఁజేయుచున్నది భృశమ్ము."

ఇచ్చట కవిని గంపింపఁ జేసినది నిజముగా నాంధ్రశక్తిగాదు మఱి జీవుని వేదనయే. కాని దాని బహిర్నిస్స్పృతి యాంధ్రశక్తిగా రూపొందినది ఈ యాంధ్రత్వమునకును లోని జీవునకును న్యాయ్యమునకు సంబంధములేదు. ఆ సంబంధ మేదైన నున్న నది బాహిరమే కాని యాంతరము గాదు. కాబట్టి యిక్కడ కవిని గంపింపజేసినది యాంతరమైన హేతువు ఆంధ్ర శక్తి బహిరుపాధి

"వ్యతిషజతిపదార్థా నాంతరః కోపి హేతుః
న ఖలు బహిరుపాధీన్ ప్రీతయ స్సంశ్రయన్తే"

అన్నాడు భవభూతి మహాకవి. ఈ యాంతరమైన హేతువేమి? అదియే జీవుని వేదన.

"ఏ పరజన్మమందరయ
నే నొకతల్లియు బిడ్డయైతిమో
నా పయి నీ ధరాస్థలికి నాటిన
ప్రేమ మదెంతయోకదా
తేపకు వంశధార పరతెంచి
దిశాఖిల మార్గరోధియై
యీ పయనమ్ము నన్ను జన
నీయక నిల్పుకొనెన్ తనంతటన్."

"త చ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని"

అన్న సిద్ధాంతమును పట్టించి చూచినచో గాని యీ పద్యము బోధపడదు. లోకమును జూచి యిట్టి యనుభూతి పొందినవాడొక్కడు వాల్మీకి మాత్రమే. తక్కిన వారి యనుభూతి యంతయుఁ గావ్యములు చదివికొని పొందుననుభూతి.. కావ్యాత్మరసమని చెప్పుటకు నిందుచేతనే యానందవర్ధనుడు వాల్మీకి నుదాహరించినాడు.

'కావ్యస్యాత్మా స ఏవార్థః తథా చాదికవేః పురా
క్రౌంచద్వంద్వ వియోగోత్థః శోకశ్శ్లోకత్వమాగతః'

కాళిదాసు కూడ
"నిషాద విద్ధాండజ దర్శనోత్థ శ్లోకత్వ మాపద్యత యస్య శోకః" అన్నాడు. అట్టిదైన కవి కానివాని శోకము శ్లోకత్వ మందదు శోకము శ్లోకత్వ మందు స్థితి యెప్పుడు గల్గును? మనసు తెలివి యెల్లలు దాటినప్పుడు గల్గును. జీవుని వేదన రెండవదశ నందినప్పుడు అనగా నాత్మప్రకాశ గోచరమైనప్పుడు గల్గును—తచ్చేతసాస్మరతి యన్న సిద్ధాంతము వాల్మీకి "మానిషాద" ఇత్యాది శ్లోకమునందును సత్యనారాయణ గారి పై పద్యమునందును తుల్యముగా నన్వయించును. అంత పరాకాష్ఠ పొందిన జీవుని వేదన యాయనది

"పాడిన గీతమే పాడఁ బాడెద"
"ఇది వినిపింతునందు మది నెంచెద"

ఈ మొదలైన పద్యములందు జీవుని వేదన లోతెన్ని నిలువులో? తెలుగు కవులలో నింత పరాకాష్ఠ పొందిన కవులిద్దరే యిద్దరు ఒకడు పోతన్న గారు రెండవవాడు సత్యనారాయణగారు. ఇద్దరును నాంతరమైన యీ జీవుని వేదనయందు తపించి కవులైనవారే. నామటుకు నాకు సత్యనారాయణగారి యందు పోతనతోడి సాజాత్య మెక్కువ కన్పించును. నా యుద్దేశ్యములో సత్యనారాయణగారికి మేలుబంతి పోతన్నగారు.

"అతిడె తోడుగల్గినను నచ్చముగా గలకండలచ్చులం
బోతలు పోసియుండెదను పోతనగారి విధాన"

అని చెప్పికొన్నాడాయన. కాని జీవసంపుటి లోని భేదమునుబట్టి వారి మార్గములు భిన్నములైనవి. ✓
ఈ మార్గభేదములను మీరి చూచినచో

"అదె నంద నందనుం డంతర్హితుండయ్యె
పాటలీ తరులార! పట్టరమ్మ"

మొదలైన పద్యములలోని జీవుని వేదనతో

"వేణువు బ్రహ్మగీతము చెవింబడెనో"

మొదలైన పద్యములలోని జీవుని వేదన సజాతీయమని తోచకపోదు. పై పద్యములలో మార్గములు వేరైనను నార్తియొక్కటే. పోతన్నగారు ఈ యార్తి నొక మధురమైన మెత్తని పోతగా బోసినాడు. సత్యనారాయణగారి పోతయందు ప్రౌఢి యెక్కువయైనది. మఱియొక భేదమనగా పోతనగారి వలెనే సత్యనారాయణగారు కూడ సహజ పాండిత్యాభిరాములు. పాండిత్యమనగా జ్ఞానము—ఈ జ్ఞానము రెండు విధ

ములు. సహజమైనది, శాస్త్రీయమైనది. శాస్త్రీయమైన జ్ఞానము సహజ జ్ఞానమును బుట్టించి చరితార్థమగును. సహజజ్ఞానమనగా నాత్మబోధ. ఈ యాత్మబోధ మజ్ఞానముచే పిహితము కాగా నీయజ్ఞాన ధ్వంసన మొనర్చుటకు నీ శాస్త్రజ్ఞాన మవసరము.

అజ్ఞానధ్వంసన మొనర్చుటతో శాస్త్రజ్ఞానము చరితార్థమగును. అనగా నజ్ఞానముతో బాటు శాస్త్రజ్ఞానమును నశించును తరువాత సహజమగు నాత్మజ్ఞానము దానియంతటనది ప్రకాశించును సహజపాండిత్యమనగా నీ స్వతస్సిద్ధమగు నాత్మజ్ఞానము. ఇట్టి యాత్మజ్ఞానము పోతనగారు జీవుని వేదనవల్ల పొందెను. సత్యనారాయణగారును జీవుని వేదనవల్లనే యిట్టి స్థితిపొందెను కావున నద్దరియందును నీ యాత్మానుభవము రసానందమైనది పరబ్రహ్మానందమును కంటె నొకమెట్టు క్రిందిదైనది. ఈ రసానందము సవికల్పక సమాధిసిద్ధము సవికల్పకసమాధియందలి జీవుని వేదనయే యీ రసానందము. తన పాండిత్య మట్టిదని సత్యనారాయణగారు కూడ పోతనవలెనే చెప్పికొన్నారు.

"అస్మత్ప్రశంసలఘుస్వాను
రసావతార ధిషణాహంకార
సంభారనోహల బ్రాహ్మ
మయమూర్తి"—నని

ఆయన ధిషణ రసమునుండి యవతరించినది అందుచేత వైదికసంప్రదాయానుబంధినియైనది. ఎవని యందద్వైత తత్త్వము దీపించునో వాడు నిశ్చయముగా సంప్రదాయ మార్గానుగామియగును.

"బుద్ధాద్వైత సతత్త్వానాం యథేష్టాచరణం యది
శునాం తత్త్వదృశాంచైవ కో భేదః"...

ఈ సంప్రదాయానుబంధితయే సర్వధర్మమూల బీజము—కారణ మేమన నీ సంప్రదాయము జీవుని యాంతరపరిణతికి సంబంధించినది. అట్టి పరిణతి పొందినవానికిగాని తెలియనిది. అందుచేతనే "నారాయణ సమారంభాం"- సంప్రదాయము పుట్టినది ఆత్మానుభవమునుండి. అట్టి యాత్మవేత్తలచేత ప్రవర్తితమైనది. సత్యనారాయణగారు రసస్థితి నందిన జీవుని వేదన కలవాడగుటచే మహాకవి సంప్రదాయ ప్రవర్తకుడైనాడు. ఈ మహాకవి సంప్రదాయము వాల్మీకినుండి సమారంభమైనది. అందుచేతనే—

"ఈ సంసారమిదెన్ని జన్మలకు
నేని మాని వాల్మీకి భా
షా సంక్రాంత ఋణంబు
తీర్పగలదా సత్కావ్య నిర్మాణ రే
ఖా సామగ్రి ఋణంబు
తీర్పగలదా"....అన్నాడు.

ఈ మహాకవి సంప్రదాయజ్ఞత ఆయనను వైదిక ధర్మసంప్రదాయానుబంధిని చేసినది. "సర్వధర్మ మూలబీజంబగు నవిచ్ఛిన్న సంప్రదాయార్థినై" యని యాయన చెప్పికొన్నాడు.

ఇంత పరిణతి పొందిన జీవుని వేదన తండ్రి యాజ్ఞతో మేళవించి రామాయణ రచనమునకు సత్యనారాయణగారిని ప్రవర్తింపజేసినది. అందుచేతనే యది "సకలోహావైభవసనాథము" ఈ యూహావైభవమంతయు నెక్కడనుండి పుట్టినది? ఆంతర పరిణతిపొందిన జీవుని వేదననుండి పుట్టినది. గుణాలంకారములు భావనాజనకములని యుపపాదుకు నెలవిచ్చినాను. భావన యనగా రసాకూతి దశనుండి రసానుభూతి దశ పొందువరకు జీవుని వేదన చేయు ప్రయత్నము ఇట్టి భావనానైరంతర్యమును కొనసాగించు జీవుని వేదనకున్న బలమే ప్రతిభ యని చెప్పబడుచున్నది. ఈ ప్రతిభ యెంత బలముగా నుండునో కవియొక్క రసాకూతి రసానుభూతు లంత బలముగా నుండును అనగా కవి ప్రతిభా వైశిత్యమును బట్టి జీవుని వేదనలోని లోతును కొలువవచ్చునన్నమాట. ఈ ప్రతిభయొక్క బహిరూపమే యూహావైభవము. ఈ యూహ యొకచోట గుణాలంకార రూపముగను నొకచోట కథాకథన రూపముగను నొకచోట పద్యరచనా రూపముగను నిట్లు పెక్కుచోట్ల పెక్కురూపములుగ నుండును దాని యీ వివిధ రూపము లన్నియు జీవుని వేదనలోని లోతులను వ్యంజింప చేయుటయందే చరితార్థము లగును. ఇదే యూహా వైభవమునకును జీవుని వేదనకు నున్న సంబంధము. ఇట్టి జీవుని వేదనతో నవిచ్ఛిన్న సంబంధము గల సకలోహావైభవముతో సనాథమైనది యాయన రామాయణము. అందుచేత ప్రాతకథయన్న ప్రశ్నయే లేదు.

"దృష్టపూర్వా అపిహ్యర్థాః
కావ్యే రసపరిగ్రహాత్

# జీవుని వేదన

సర్వే నవా ఇవా భాంతి
మధుమాస ఇవ ద్రుమాః"

వస్తువులు ప్రాతవైనను జీవుని వేదనతో నిండి యుండుటవలన వసంతకాలములోని చెట్లవలెఁ గ్రొత్తవియై ప్రకాశించును నవీనత నవీనతయనగా నది కాలమునకు సంబంధించినది గాదు కాలముద్రలేని యనుభూతివలన సమకూడునది. ఈ యర్థమునే

"మఱల నిదేల రామాయణం బన్నచో
నీ ప్రపంచక మెల్ల నెల్ల వేళఁ
దినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్ళు
తన రుచి బ్రదుకులు తనవి గాన
చేసిన సంసారమే సేయుచున్నది
తనదైన యనుభూతి తనది గాన
తలచిన రామునే తలచెద నేనును
నా భక్తి రచనలు నావి గాన"

అని చెప్పినాడాయన.

అన్నము తినుటయందును, సంసారము సేయుట యందును నెల్లవాడును గ్రొత్తదనము ననుభవించుచునే యున్నాడు. దీనికిఁ గారణమేమి? ఎవనిరుచి వానిది యొవని యనుభూతి వానిది గాబట్టి, అట్లే తనభక్తి తనదిగాన తాను రామాయణమును వ్రాయుచున్నాడు. ఇందు గూఢమైన మఱియొక సమాధానమున్నది. ప్రపంచకములో నెల్లవాడును తిన్న యన్నమే యేల తినుచున్నాడు? చేసిన సంసారమే యేల చేయుచున్నాడు? దీనికి గారణ మజ్ఞానము అజ్ఞానమువల్లనే యొవని రుచి వానిది యొవని యనుభూతి వానిది యైనది. ఇచట యనుభూతి పదమునకు సుఖదుఃఖములని యర్థము. ఎంతవఱకును నీ యజ్ఞాన ముండునో యంతవఱకును భక్తియొక్క యవసరముండనే యున్నది. కావున సంసార మున్నంతవఱకు రామాయణముయొక్క యవసర ముండును. రామాయణ భాగవతాది గ్రంథములు సంసారతారకములు. ఆ కథల యందు స్వతస్సిద్ధముగా నార్తిని కలిగించు నొక మహాగుణమున్నది అందుచేతనే యాది "యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే, తావద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి"

ఇట్టి సమాధానమునే భవభూత్యాదులును చెప్పికొన్నారు.

భవభూతి:

"పాప్మభ్యశ్చ పునాతి వర్ధయతి చ శ్రేయాంసి
సేయం కథా। మాంగల్యా చ మనోహరా చ జగతో
మాతేవ గంగేవ చ। తామేతాం పరిభావయన్తు"

అనియును

మురారిభట్టు:

"యదిక్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్య చరితం
గుణైరేతావద్భిః జగతి పునరన్యో జయతి కః"

అని చెప్పికొన్నాడు.

సత్యనారాయణగారు "నా భక్తి రచనలు నావి గాన" అని చెప్పికొన్నారు. పై భవభూతి మురారి భట్టుల వాక్యముల ననుశీలించినచో వారుగూడ నిట్టి భక్తితోడనే రామాయణ రచనమునకు పూనుకొన్నారని విశదమగుచు? ఈ భక్తియొక్క స్వరూపమేమి? ఇది "పూజ్యేష్వనురాగః" అను నిర్వచనమునకు విషయమైనది గాదు శ్రీ శంకరులు చెప్పిన "స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే" అన్నది. ఇచటఁ గల యొక స్వశబ్దమునకు నాత్మ యనియు, రెండవ దానికీశ్వరుఁడనియు నర్థము ఆత్మయందు నీశ్వరత్వారోపణము చేయుట భక్తి అనగా నుపాసనా మార్గములోనిది. సవికల్ప సమాధి విషయమైనది. రసాకూతి దశనుండి రసానుభూతిదశకు పరిణతి చెందిన జీవుని వేదనారూపమైనది.

# పునర్జన్మ

విజయ — రాఘవ

గడియారం మూడు గంటలు కొట్టింది.

మధు తలెత్తి చూశాడు.

పెండ్యులం బరువుగా వూగుతోంది.

మధు ఒక్క నిట్టూర్పు బరువుగానే వదిలాడు. ఎలాగో గతాన్ని విస్మరించి, మళ్ళా పనిమీదకు ధ్యాస పోనిచ్చాడు.

ఇంతలోనే ట్రేలో మరికొన్ని కాగితాలొచ్చి పడ్డాయి.

మధు వాటి వంక చూస్తూ కుదేలుమన్నాడు. "టపాకు పోవలసినవి, అర్జంటుగా యెన్నివున్నాయి!" అని భయం వేసింది.

ఆ భయాన్ని అలాగే అణగార్చుకొని ఒక్క వుత్తరాన్ని సగం టైపు చేసేటప్పటికి—నిష్కారణంగా కలరా తగిలి చనిపోయిన తల్లి గుర్తొచ్చింది మధుకి. రెండు కళ్ళూ అశ్రుపూరితాలయినయి చేతి వ్రేళ్లలో బలంతగ్గి, నీరసంతో ఆగిపోయినయి.

మరపురాని అనుభూతులు ఒకదాని తరువాత మరొకటి తోసుకొస్తున్నాయి—

"రాత్రింబవళ్లు ఆఫీసర్ల మెప్పుకోసం, నానా అవస్థలు పడి, పీనుగులాగా మొగంపెట్టుకొని యింటికొచ్చేటప్పటికి, తనపై సానుభూతిగా, జాలిగా—ప్రేమగా—వాత్సల్యంగా — తననిపల్కరించి,—వేన్నీళ్లు తోడిచ్చి, వేడి వేడిఅన్నంపెట్టి, కడుపులో దాచుకొనే తల్లి! ప్రాణంలో ప్రాణమై, దేహంలో దేహమై, చూపులో చూపై. మాటలో మాటై, పెంచింది. చదువు చెప్పించింది — డబ్బుగలవాళ్ల యిండ్లలో వంటలు చేసిపెడుతూ, నీళ్ళు తోడిపెడుతూ.

వాళ్లనే మాటలన్నీ, తనకోసం, తన బాగుకోసం బాధ్యురాలై భరాయించింది. ఎంత గడ్డితిని, తనని బ్రతికించినా, తనకీ వుద్యోగం వచ్చేటప్పటికి పట్టరానంత ఆనందం కట్టలు తెంచుకొని పార్లింది.

ఎన్నోవిధాల తన్ను ఆమె దీవించింది

మధు యింకా మరిచిపోలేదు. ఎలా మరుస్తాడు? తనకు బుద్ధి తెలిసినప్పటినుంచి యీ లోకంలో ఆత్మబంధువుగావుంది అమ్మ ఒక్కతే. ఆ వొక్కతీ యీ నాడు రుద్రభూమిలో నిద్రపోతోంది.

మధు మాత్రం జీవచ్ఛవంలాగా యీ ఆఫీసులో రెమింగ్టన్ ముందు ఒడిపోయిన రౌతు మొగం వేసుకొని కూర్చున్నాడు.

ఆలోచనలు క్రమేపి విడిపోతున్న సమయంలో మధు చేతివ్రేళ్లు చూసుకొన్నాడు.

అవి సమ్మెచేస్తున్నట్లుగా వున్నాయి

ప్రయత్నించి చూసాడు కొద్ది నిముషాలు.

అర్థంకాని మాటలు పడ్డాయి. చివాట్లు తప్పవనుకున్నాడు మేనేజరుతో. ఇవాల్టితో యీవుద్యోగానికి స్వస్తియేమో! అనుకొన్నాడు. ఎంతో ప్రయత్నించాడు. మనస్సుని సరిగ్గా తిప్పుకొంటానికి యేం ప్రయోజనం లేకపోయింది ఈ ప్రయత్నాన్ని పురికొల్పేబదులు బాధాకరమైన ఆ ఆలోచనల్లోనే చాలాహాయి వున్నట్లు తోచింది మధుకి. నరాల సత్తువ సన్నగిల్లింది. తన అశక్తికి తానే నిందించుకొన్నాడు. టైపుమిషన్ మీద నుదురు పెట్టి యేడ్వటం ప్రారంభించాడు.

ఈ యేడుపు హఠాత్తుగా ప్రక్కనే వున్న మూర్తిని కంగారు పెట్టింది. అతను మధుని తట్టుతూ, "ఎందుకురా! యేడుస్తున్నావ్" అన్నాడు. జేవురించిన మొగంతో మధు తలెత్తి చూశాడు. కూర్చుంది ఒక ఆఫీసులో. ఆఫీసులో యింటికష్టాల్ని గురించి, వ్యక్తి సంబంధమైన బాధల్ని గురించీ, తల్చుకోకూడదని, తన బ్రతుకంతా సర్వదా యీ టైపుమిషన్‌కి బానిసగా వుండి పోవడమేనని జ్ఞాపకానికి వచ్చింది. యిరవై అయిదు సంవత్సరాలువున్న తను, యెంతో అనుభవం గడించుకొని, అనేక విధాలుగా కష్టనష్టా



కీ. శే. బాలగంగాధర తిలక్

గత జూలై 23 వ తేదీన లోకమాన్యుని శతవార్షిక జయంతి మహోత్సవాలు ఆసేతుహిమాచలమూ అత్యంతవైభవోపేతంగా జరిగినాయి. భారత స్వరాజ్యసమరవీరునకు యావద్భారతప్రజలూ వినయ వినమితాంగులై జోహారు లర్పించారు.



**కీ. శే. జార్జి బెర్నార్డ్‌షా**

గత జూలై 26 వ తేదీన ప్రసిద్ధాంగ్ల నాటకకర్త బెర్నార్డ్‌షా శతవార్షిక జయంతి మహోత్సవాలు ప్రపంచావధిని సర్వసారస్వతప్రియులూ జరుపుకున్నారు. ఆయన ప్రతిభాసంపదను సంస్మరించారు.

లతో బ్రతుకుతూ వస్తున్న తన వ్యక్తిత్వం సామాన్యుని మేక్పుకన్నా హీనంగా వున్నా, యింతమంది వున్న ఆఫీసులో యేడ్వటం, మధుకి తీరని అవమానమనిపించింది. తన కష్టాలు గురించి చెప్పితే యెవడు వింటాడు యీ లోకంలో? తనలాంటివాళ్ళు యెంతమందిలేరు' తనకన్నా గొప్పవాళ్లే వున్నారు. ఈ యేడ్పుకి యే విధంగానూ అర్థంలేదనిపించింది. ఎందువల్లనంటే, కాలం మారిపోయింది. నాగరికతకు అంతస్థులు పెరిగినయి సభ్యతకు కావలసిన గౌరవ ప్రతిష్ఠలు యీనాడు సంఘంలో లభ్యంకావటం లేదు — అందువల్ల "ఒకరి కష్టాలు మరొకరికి ఆనందం — మరొకరి నష్టాలు వేరొకరికి బ్రహ్మానందం." —

పంచె కొంగుతో కారిన కన్నీళ్లను తుడుచుకొంటూ "ఏం లేదురా" — అన్నాడు మధు.

"అదేమిటిరా...అలా నీళ్లు కారుతుంటే!" —

"వేడి చేసిందిలే — అన్నాడు మధు. తనలోని బలహీనత యెక్కడ బయటపడిపోతుందో అని, సభ్యతకులో యెక్కడ దాపురిస్తుందో అని మూర్తికి చిన్న నవ్వువచ్చింది. అది యెంతో సేపు నిలుపుకోకుండానే తన పనిలోకి తానుచొచ్చుకు పోయ్యాడు.

ఇన్నాళ్లు భారమనిపించని జీవితం — జీవనం మధుకి ఒక్కసారిగా విసుగుని — చిరాకుని కలిగించాయి. ఆ పూటకు పనిమీద ధ్యాసపోయింది తల్లి మూర్తి కన్నులముందు లాస్యం చేస్తున్నట్లుగా వుంది. అట్టే ఆలోచిస్తున్న కొద్దీ యీ లోకమే వెగటనిపించింది.

సన్నివేశాలు — సంఘటనలు — సమాలోచనలు చాలా వరకు జీవితంలో మార్పుని తేస్తూ వుంటయి కాని, వీటిని గురించి ముందుగా చాలా ఆలోచిస్తాం. యిది తెప్పించే చెరుపు — బాధ — విచారమూ — ఫలించనప్పుడూ, కుదురనప్పుడూ మరీ దుర్భరంగా వుంటుంది హృదయం.

కలరావచ్చి చనిపోయినతల్లికి దహనక్రియలు జరిపి అయిదారు నెలలు కావస్తున్నది. కాని మధు దృష్టిలో యీవిషయం జరిగింది కొద్ది గంటల క్రితమే అన్నట్లు వుంది.

ఇటువంటి అవిరళమైన ఆలోచనలే అతని హృదయాన్ని పీల్చి పిప్పిచేస్తున్నయి. చీటికి మాటికి మలేరియాజ్వరం అతని ఆరోగ్యాన్ని రుచిమాసి పోతూ వుంటుంది.

అటువంటప్పుడు సలసల కాగిపోతూ వుంటుంది శరీరం. మృదువుగాతాకి, జ్వరాన్ని ఉపశమింప చేయడానికి అనువైన కోమల హస్తాలు తన కీలోకంలో కరువైపోయినాయేమో!" అని మధు మదనపడుతూ వుండేవాడు.

ఇంతలో గడియారం నాలుగున్నరను సూచిస్తూ ఒక గంట కొట్టింది.

మధు అదిరిపడ్డాడు.

మానవుడు కోరుకొంటున్న కనీసపు కోర్కెల్లో కూడా తనకేవిధంగానూ అనుకూలించని భాగ్యంతోలగిపోయింది."

కన్నీరు ఆపుకున్నా ఆగటం లేదు.

ఇంతలో ప్యూన్ వచ్చాడు మధు దగ్గరికి.

"ఏమిట"న్నట్లు చూశాడు మధు,

"మేనేజరు పిలుస్తున్నారు?" అన్నాడు ప్యూన్.

మధు పిల్లిలాగా, చొక్కాతో ముఖం తుడుచుకొని మేనేజరు గదిలోకి ప్రవేశించాడు. ఎదురుగా వెళ్లి వంగి నమస్కారంచేసి నీఱబడిన మధుని చూసి —

"ఎప్పుడూ అదోమాదిరిగా వుంటావేమిటోయ్?" ఉషారుగా వుండవేమిటి? ఏమైనా జబ్బుగా వుందా, అని ఎక్కిరి తక్కిరిగా ప్రశ్నించాడు మేనేజరు.

మధుకి గొంతుకలోకి యేడ్పు ముంచుకొచ్చింది.

"మలేరియా తీవ్రంగా వొస్తోంది...ఆరోగ్యం కూడా చెడిపోతోంది. దయచేసి ఒక పదిహేను రోజులు సెలవిప్పిస్తే మీపుణ్యముంటుంది బాగుపడతా!" అని మధు ప్రాధేయపడ్డాడు.

మేనేజరుకి యిదేమీ సుతరామూ గిట్టలేదు.

"నీకు పదిహేను రోజులు సెలవిచ్చి, నీస్థానంలో మరొకణ్ని వేసి, మళ్లా నువు రాంగానే వూడబెరికితే వాడేమైపోను — ?" ప్రశ్నార్థకంగా అన్నాడు మేనేజరు.

మధుకి యేదో సమాధానం నిశ్చలంగా — దృఢంగా చెప్పవలెననిపించింది.

రెండడుగులు ముందుకి వేస్తూ — "అయితే నాఆరోగ్యం చెడగొట్టుకో మంటారా?" — అన్నాడుదీనంగా — అందులోని వాస్తవాన్ని మేనేజరు యేమీ గుర్తించలేకపోయాడు.

"అదంతా నాకేం తెలియదు. నేను సెలవు యివ్వను. ఇష్టముంటే యీ వుద్యోగం చెయ్యి—లేకపోతే నీయిష్టం..." అని మిగతా భాగం మధుకి వదిలివేసి మేనేజరు ప్రక్కగదిలోకి లేచిపోయాడు.

మధు యివతలికి వచ్చాడు కాసేపు చేతివ్రేళ్లు జుట్టులోకి దూర్చి, యేదో ఆలోచించాడు. ముందు ముందు కష్టాలెటువంటివి తన జీవితానికి అడ్డు తగులుతూంటయ్యో అతని కేమీ వూహలో తట్టలేదు—వంగిపోయిన తలను విసురుగా ఒక్కసారి "మేనేజరు" అన్న యింగ్లీషుబోర్డు వంకకుతిప్పి—" ఇంతేగా నువ్వు చెయ్యగల్గింది. కాని. అంతమాత్రానికి నేనేమీ నాశనంకాను. ఈ రోజునుంచి నీ ఆఫీసుకు, నీ రెమింగ్టన్ మిషన్‌కి నీళ్లొధార వదులుకొంటున్నా" అని దీనంగా సమాధాన మిస్తూ ఆఫీసుమెట్లు దిగి బజార్లోకి పడ్డాడు.

రణగొణధ్వనుల మధ్య మధుకి మతిపోతున్నట్లు అనిపించింది. గానుగెద్దులాగా కాళ్లీడ్చుకొంటూ సరాసరి యింటికొచ్చి చేరాడు — అయిదునిముషాలనంతరం గదిలోకి వెళ్లి పడుకొన్నాడు. "ప్రపంచంలో ప్రతి వస్తువు తన్నుచూసి హేళన చేస్తున్నట్టనిపిస్తుంది! ఎందు కనపించదు మరి! ఎవరైనా నా 'అనేవాళ్లుంటేగా! తనకు కల్గుతూంటే కష్టాలలోగల దుఃఖాన్నీ, సుఖాలలోగల ఆనందాన్నీ తనకున్న వొక్క హృదయమే భరించాలి. తను ఏకాకి.

జరిగిపోయిన మధురక్షణాలు అనేకం స్మృతిలో మెదిలినయి—

చనిపోయిన తల్లి వెతికి వెతికి ఒకమ్మాయిని, తెచ్చి పెళ్లి చేసుకోమని కోరింది. ఆ కోరికను చెల్లించవలసిన బాధ్యత తనకుంది. ఆమె సంతోషమేగా తన సంతోషం! అమ్మ మాటకు ఎదురు చెప్పకుండా అంగీకరించాడు. శుభముహూర్తం నిశ్చయించకముందే మాయదారి కలరాకు అమ్మ బలి అయిపోయింది. తరువాత పిల్లవాళ్లు తన కివ్వడానికి తిరస్కరించారు. ఒకందుకు తనకిది మంచిదనే భావించాడు మధు. రోజులు నానాటికి గడుస్తున్నకొద్దీ యీ లోకానికి తనెంత పనికిరాని వెధవైపోయాడో తెలిసివచ్చింది.

ఉద్యోగం తన అప్రయోజకత్వంతో వూడిపోవడం, బ్రతకడం అంటే బరువుని భుజాలమీదకు ఎత్తుకుని బ్రతికినంతకాలం మోయడం, అతన్ని అయోమయం చేసినయి. ఉద్యోగం దొరికిన క్రొత్తలో యావజ్జీవితం తల్లి పాదాలకు అంకితం చేదామనుకొన్నాడు. కాని మధుపట్ల విధి దురదృష్టాన్ని వ్రాసిపెట్టిపోయాడు. దాని ప్రభావంవల్ల నేమధు జీవితంలో బొమ్మజెముడు మొక్కలు మొలిచినయి. నెలరోజులూ కష్టపడినదంతా ఒకటవ తారీఖున ఫలించేది. ఆ సాయంత్రానికే, హోటల్ మేనేజరు, చాకలివాడూ, యింటి అద్దెవాడూ గుంజుకొనేవారు ఆ కాస్త ఫలితాన్ని. తరువాత చేతులు ఖాళీ అయి చల్లబడిపోయేవి.

జీవితంలో అసలు సంతోషమూ, ఆనందమూ, యెప్పుడూ — యెన్నడూ వుండవు. వాస్తవంగా ప్రతిదీ నాదనుకునే యీ లోకంలో మోయలేని భారాన్ని మోస్తున్నప్పటికి, అది క్రమేపీ చప్పబడుతూ వుంటుంది. తనవంటి మానవునికన్నా పక్షులూ - జంతువులూ చాలావరకు నయమేమో ననిపిస్తుంది. ఒకరికన్నా మరొకరు బాగా బ్రతుకుతున్నారనుకొంటాం. ఎవర్ని ఉద్ధరించడానికి?

ఇలా వుద్యోగం పోయిన రెణ్నెల్లకు మధులో వివిధ రకాల భావాలు చెలరేగుతూ వస్తున్నయి. వీటికి యెక్కువగా దోహదక్రియలు జరిపింది అతన్ని వెంటాడుతున్న మలేరియా జ్వరం. దానిమూలంగా మధు మొగం పాలిపోయి, కళావిహీనంగా తయారైంది. తినాలనుకున్నంత దొరకదు. తింటే హరాయించుకొనే శక్తి లేదు. ఉచితంగా మందు లిచ్చి పోయే ప్రాణాన్ని నిలిపే డాక్టర్లు తన కెవ్వరూ లేరు. ఉన్నా వాళ్ల దగ్గరకు వెళ్లడానికి సాధ్యంకాదు. రోజురోజుకి తనలో 'చావు' అనే అభిప్రాయం బలిసిపోతూ వస్తోంది. యెప్పుడది హఠాత్తుగా వచ్చి తన్ను ఆలింగనం చేసుకొంటుందో మధుకి పాలుపోవడం లేదు. తనకుతానై చావడం సుఖంగా కనిపించదు! చచ్చిపోవడానికి యీలోకంలో చాలా మార్గాలున్నాయి. రైళ్లూ, కార్లూ, ఎలక్ట్రిక్ తీగలూ — ఉరిత్రాళ్లూ వగైరా. కాని అవి అనుకున్నంత తేలిక పనులుకావు. మను చావులోకూడా సుఖం కావాలని కోరుకున్నాడు. ఇది యెలా సాధ్యం? యెప్పటికైనా అంకిత మివ్వక తప్పదు. చివరకు కోరేద అది తను. అందుకని సుఖముగా చావాలని కోరుకోవడంలో మధుకి కనిపించిన తప్పేమీ లేదు. ఒక చోట వుండి, మరొక చోట వుండే హాయిని, సౌందర్యాన్ని, కోరుకోవటం మానవుని సహజ లక్షణాల్లో ఒకటి. దీనికి యెడతెగని

ఆలోచనలు పుట్టుతూ వుంటయి, తరిచి, తరిచి ఆలోచిస్తాం. అలాగే ఆలోచించాడు మధు. చివరకు చావంటే యిష్టము నేని ఒక్కొక్కసారి సన్నగిల్లిపోయింది. అందుకని యెక్కువగా ఆ ఆలోచనల్ని తప్పుకోలేదు మధు. ఒక్కసారిగా బెలుపలికి వచ్చాడు గదిలో నుంచి.

లోకం అంతా కొటుకవంటి చీకట్లో మునిగిపోయి మూల్గుతోంది. గదికి గట్టిగా తాళం వేశాడు. సుమ్మల్ని దాటి పెద్ద రోడ్డెక్కాడు — జనం రద్దీ అంత బాగా లేదు.

మెల్లగా తలవంచి నిర్భయంగా అడుగులో అడుగు వేసుకొంటూ నడుస్తున్నాడు. "చావాలి" అన్నమాట హృదయంలో తలెత్తి వింతగా నవ్వుతోంది. "ఎలా చావాలి"? మధుకి పరిష్కారం కావటం లేదు. "ఎలాగైనా సరే! చావు కోరుకుంది. మధు పిచ్చి కుక్కలాగా తలెత్తి యెదురుగా చూసాడు. ఒక చిన్న కారు వడిగా—వడివడిగా, త్రాచుపాములాగవస్తోంది. దానిముందు లైట్లు తన కళ్ళలో సూదులు పొడిచినట్లు పొడుస్తున్నాయి.

గుండె రాయిగా యిదివరకే మారిపోయింది. వెనక్కి కట్టుకున్న చేతులు వూడిపోయి స్వస్థానంలోకి వచ్చి చేరాయి.

పిక్కల్లో వున్న సత్తువవంతా ఉపయోగించుకొని మధు, ఆవస్తున్న కారు ముందు చక్రాలక్రింద మెత్తగా పడుకుందామని, అడ్డంగా ఉరికాడు.

క్షణంకాలం వులిక్కిపడి లేచింది.

చిన్నకారు బ్రేకుపడి రోడ్డుప్రక్కగా పెట్టబడివుంది. దూరంగా వున్న కొంతమంది దగ్గరగా వచ్చిచేరారు. అప్పటికే ఆ చిన్నకారులోంచి దిగిన ఒక యువతి, యువకుడు మధు ప్రక్కగా నిలబడి కంగారుగా వున్నారు. యేమిటో చూస్తున్నారు.

"అలా చూస్తే యేం లాభం...ఆస్పత్రికి పట్టుకెళ్లక" అన్నాడొక పెద్ద మనిషి యింతలో.

"నెంబరు నోట్ చేసుకోక వదిలి పెడతావేరా!" అంటున్నాడొక యువకుడు ప్రక్క వాడితో.

"కళ్లు పోయినయ్యా! నాయనా! చూసి తోల్లేవు" అన్నగొక ముసలి కవ్వలాంటి అవ్వ.

"యెందుకు నాయనా! అలా అనుకొంటారు... డ్రైవరు తప్పేముంది ... ఇంకా నయం జాగ్రత్తగా ఆపగల్గాడు"...అందా యువతి.

యువకుడు మధువంక చూస్తూ—ఒక నిట్టూర్పు విడిచాడు.

"యెలా వున్నాడు?" అందాయువతి, యువకుని వైపు చూస్తూ.

"ఫర్వాలేదు...కొద్దిగా గాయాలు తగిలినయి" అన్నాడా యువకుడు.

"ఇంటికి తీసికెళ్ళితే"—

"అలాగే..."అంటూ యువకుడు ముందుకొచ్చాడు-యువతి అతని దగ్గరగా వస్తూ—

"డాక్టర్ ... తప్పకుండా బ్రతుకుతాడా!" అంది జాలిగా—

"నువ్వేం అదుర్దాపడకు! నేనున్నానుగా!" అంటూ ఆమెను ఓదార్చాడు.

ప్రక్కనవున్నవాళ్ల సహాయంతో మధుని కార్లో కెక్కించుకొని యింటికి తీసుకొచ్చింది ఆయువతి.

## 2

డాక్టర్ రఘు మర్నాడుదయమే వచ్చి, గుడ్డలు మార్పించి, కట్లు గట్టాడు.

క్రమంగా అతనిమొగంలో స్పృహాఛాయలు కనిపిస్తున్నాయి. బాధకు ఒళ్లంతా కదలిపోతోంది. మూలుగుతూ — ముక్కుతూ — కళ్లు తెరుస్తూ, మూస్తూ ఉంటున్నాడు.

సరోజని మధు ప్రక్కనే కూర్చొని, అతన్ని అవలోకిస్తూ ఉంది—

రఘు చేతులు కడుక్కొని, తుడుచుకుంటూండగా-

"ఇంజక్షన్ ఇచ్చారా! ఈపూట స్పృహ వస్తుందా!" అన్నది సరోజని.

రఘు ఆమె కళ్లల్లోకి చూస్తూ—

మరేం భయంలేదు సరోజనీ, నేనున్నానుగా! ప్రమాద మేమీ లేదు. మళ్లీ రేపొస్తాను. అంతగా కావాలంటే నర్సునిసహాయంపంపమంటావా!" అన్నాడు.

"అంతగా మరేం అవసరం లేదు. నేనిక్కడే వుంటాగా—" అంది సరోజని.

రఘుకి జాలి వేసింది—

"క్రిందటి రాత్రి కూడా నువ్వు నిద్రపోకుండా మేల్కొన్నావ్. ఈ పూటకూడా అలావుంటే నీ ఆరోగ్యం యేమౌతుందో తెలుసా!" అన్నాడు.

"ఫర్వాలేదులే రఘూ! ఒక ప్రాణికోసం ఈ మాత్రం ఉండలేకపోతే యెలా!" రఘు దీర్ఘంగా ఆలోచించాడు. ఏం చెప్పలేకపోయాడు – చివరకు లేచి వెళుతూ–"నీయిష్టం రోగి లేచినప్పుడల్లా యేం కావాలంటే అది, అంటే పళ్ళూ, రొట్టె, పాలు యిస్తూండు — చెప్పాగా మందు యెప్పుడెప్పుడివ్వాలో. మరి యిక వెళ్లనా!" అంటూ సరోజనిని తృప్తిగా చూసి మందుల సంచితో రఘు మెట్లుదిగి వెళ్ళిపోయాడు.

మధుకి, రఘు వెళ్ళిన గంటకు తెలివి వచ్చింది. అక్కడక్కడా తగిలిన దెబ్బలవల్ల బాధ తెలుస్తూనే ఉంది. అదే చావాలనుకోవడం అనుకొన్నాడు మధు. 'చావు', ముందు అలా ప్రారంభమవుతుందనుకొన్నాడు.

పూర్తిగా చావకముందే ఒక్కసారి ఆ చావెలా వుంటుందో బాగా కళ్లు తెరచివుండి చూద్దామనుకొన్నాడు. కాని భయం కాని భయంయేదో వీపుమీద తట్టుతోంది.

"ఇంత బాధపడే ముందుగా, ప్రాణం యెందుకు ఎగిరిపోకుండా వుంది?"—మధుకి యీ సందేహం తట్టింది. ప్రాణం పోవడం ఒకసారి, బాధను అనుభవించడం మరొకసారి అయినట్లయితే తనీ విధంగా చావుని కోరుకొనేవాడు గాదేమో! అనుకొన్నాడు మధు. అసలు మధు కిప్పుడు బ్రతికటంకంటే కూడా చావడమే కష్టమనిపించింది.

స్పృహవచ్చి, తనెక్కడ వున్నాడో తెలియని అధోగతిలో వున్న ఆత్మను యేవో శక్తులు ఈ చావుకి పురిగొల్పాయి. భరించలేని యమబాధ దానికితోడు అదే పనిగా కళ్లుతెరచి అటూ-యిటూ వొత్తిగిల్లకుండా బల్లపరుపుగా పడుకొని వుండటం చావుకన్నా కష్టమనిపించింది మధుకి.

ఇంతలో ఎదురుగుండా వున్న గడియారం రెండు గంటలు కొట్టింది.

మధుకి యీ లోకంలో పడ్డట్టనిపించింది. కట్లు కట్టబడిన చేతి వ్రేళ్లతో కళ్లు నులుముకొన్నాడు. రకరకాల వస్తువులతో అలంకరించబడిన పెద్ద గది రివ్వున తిరిగే 'ఉషా' పంకాలూ — గోడకు పెద్దపెద్ద ఫోటోలు—రెండు నిలువుటద్దాలు—ఒక పుస్తకాల బీరువా—ఒక డ్రాయరు—దాని చుట్టూ రెండూ—మూడు కుర్చీలూ—దాని ప్రక్కగా ఒక రేడియో సెట్టు—ఇవన్నీ మధుకి స్వర్గాన్ని గుర్తు చేసాయి. ఇలాగే వుంటుందని మధుకి గుర్తు కూడా. ఇంతలో కాలు వెళ్ళి గోడకు తగిలి, నరక బాధను జ్ఞప్తికి తీసుకొచ్చింది.

మధు మామూలు మనిషి అయినాడు—ఈ స్వప్నంలో స్వర్గాన్ని చూసి కలవరించిన తరువాత మళ్లా బాధ మధుని పీడించడం మొదలెట్టింది. సన్నగా మూల్గక తప్పడంలేదు—కళ్లు మూసే మధు తనకితాను తిట్టుకొంటూండగానే—సరోజని చల్లనిచేయి, అతని బుగ్గల్ని స్పృశించుతూ నుదురు మీదకు వెళ్లింది—.

చనిపోయిన తల్లి గుర్తుకొచ్చింది—

మధు బరువుగా కళ్లు తెరచాడు.

సరోజని అమృతాన్ని కురిపిస్తూ తన వైపే చూస్తోంది. దేవకన్య కన్నా విపరీతమైన సౌందర్యంతోనూ, అమ్మ తరువాత అమ్మకన్నా యెక్కువగా చూసుకొనే వ్యక్తిగానూ, సరోజని మధుకి కనిపించింది.

ఒక్క క్షణం కన్నా యెక్కువసేపు సరోజనిని చూడలేకపోయాడు.

"బాధపుతోందా!" అంది కోమలంగా సరోజని.

"ఊఁ" అంటూ మూల్గాడు బాధనంతా వ్యక్తం చేస్తూ. సరోజనిచేయి ఫాలభాగం మీదనుంచి జారిపోతూండగా—మధుకి అందిన హాయి యేదో హఠాత్తుగా పోతోందనిపించింది." ఇంకా కాసేపు అలాగే వుంచమని" ప్రాధేయపడదామనుకొన్నాడు మధు. కాని యెట్లా అంటాడు. ఆమె అతని మొగం మీదకు తన మొగాన్ని దగ్గరగా వుంచుతూ—

"కాస్త కాఫీ యివ్వనా!" అంది—

మధు మాతృహృదయంలోకి చొచ్చుకొని పోయినట్లుగా భావించాడు.

ఆకలి జ్ఞాపకానికి వచ్చింది. క్రిందటి రోజున ఉపవాసం—యీ వాడు......!"

"అబ్బా!" అన్నాడు మధు.

ఆమె లేచి విచారంగా అతన్ని చూసింది. అతను తన బాధను, నెమరు వేసుకొంటున్నాడేమో నని సంశయపడ్డది...కాని అలాగే సరోజని యెక్కువ సేపు నిల్చోలేదు.

ఆమె గాజుల చప్పుడు యెప్పుడైతే అక్కడనుంచి మటుమాయమైందో—మధుకి పూర్వపు ఆలోచనలు కదిలినయి.

"తాను చదువుకొంటున్న రోజుల్లోనూ—ఉద్యోగం చేస్తున్న రోజుల్లోనూ, ఎంతోమంది అందమైన ఆడవాళ్ళను చూడగలిగాడు. వాళ్ళందరి అందం—ఆనందం, సరిగ్గా ప్రపంచంలో వినియోగించుకోబడిందా! యెన్ని విపరీత పరిణామాలకు దోహదం కాలేదూ!—తన విషయంలో మాత్రమే సఫలమైంది. చావుని కోరి బయలుదేరిన నాకు, స్వర్గ సౌఖ్యాల్ని అనుభవించే భాగ్యం లభ్యమవటమేమిటీ! నేను పడిన కోరుకి, చంపడంచేత కాదేమో! ఎన్నిసార్లు తన నిరాశను చంపుకొన్నాడు హృదయంలో వుండే క్షోభను యెన్నివందలసార్లు అణచుకొన్నాడు! అయినా బ్రతికి సాధించగల్గేదేమిటి? చివరకు మృత్యు కంపల్లోకి కూడా పోలేని అసమర్థత తనలో పుట్టుతుందేమో! యెలాగైనా బ్రతకాలని కోరకూడదు. ఈ మొండి ప్రాణికి సానుభూతి - జాలి - దయ - మాప కూడదు. ఈ సారికి యీ బాధను పెంచుకొన్నానా. శాశ్వతంగా కావాలనుకొనే చావు సంప్రాప్తమవుతుంది. ఎవరితోనూ, తనే విధంగానూ సంబంధం పెట్టుకోకూడదు. బ్రతకడానికి ఆశించే విషయాల వైపుకి మనస్సుని పోనివ్వకూడదు. చావుకి ముందు, తనమీద యెందుకీ సానుభూతి యీ అందగత్తెకు? అసలీమె యెవరు? తన ప్రాణానికి యెందుకిలా సేవలు చేస్తోంది నేను చావాలనుకొంటే, నన్ను ఆపి యేవో పనులు చేస్తోంది—చివరకు సుఖంగా చావనీయరు—ఏడ్వనీరు—అయినా, నాతో యీమెకేం పని. ఇలా నాదగ్గర కెందుకొస్తోంది?—తనకేంపని... సరోజనిదగ్గరగా వచ్చి కూర్చుంటూ.

"కాఫీ కలిపి తెచ్చాను. త్రాగుతావా!" అంటూ బుజ్జగిస్తూ అడిగింది.

"అక్కర్లేదన్నట్లు తలూపాడు.

"ఫర్వాలేదు త్రాగండి. లేకపోతే శోషొస్తుంది!" అంది. నుదురు తడుముతూ—

మూల్గుతూ "నాకొద్దు" అన్నట్టు తలూపాడు. మనస్సులో యేవో భావాలు నిద్రకొస్తున్నాయి. "తాను చూపే సానుభూతికి, యితనేమీ బాధ్యుడు కానట్లుగా ఉంటాడేమిటీ!" అని ఆశ్చర్యపడుతుందేమో అని మధు ఈనాటి నాగరికతాలోకాన్ని తడిమి చూశాడు. ఆమె అల్లాగే తన కళ్లల్లోకి, కళ్లు పెట్టి చూస్తోంది. ఏవో భావాలు రంగరించి, యేదో మను తను గుర్తుచేస్తూ, తన బాధకు ఉపశమనం కలిగించే సానుభూతిని, సంకేతాన్ని తన చూపులద్వారా అందచేస్తోంది. మధు ఆ చూపుల్లో గల అంతరార్థనివహాన్ని గ్రహించుకోలేక, కంటనీరెట్టుకొన్నాడు.

సరోజనికి హృదయం ద్రవించింది మృదువుగా అతని తలనిమురుతూ — "ఊరికే బాధపడకు. అదే తగ్గిపోతుంది. కాస్త కాఫీ త్రాగండి" అని బ్రతిమిలాడినట్లు మాట్లాడింది.

"అబ్బ! నన్ను యిట్లా ఉండనీయండి. ఊరికే చంపబోకండి. నన్ను యెలాగోలాగు యేడ్చుకోనీయండి "మీరు యిక్కణ్నుంచి అవతలికి వెళ్ళిపోండి! యింగల్గా పీక్కుతినకండి! నా యెముకలు కొరక్కండి! ఎట్లాగొట్లా ఛస్తాగా" అంటూ మధు గొణుగుతూ — నుదుటిమీద చెయ్యి పెట్టుకొని, గుండెను యెగరవేస్తున్నాడు

సరోజనికి మతిచలించినట్లయింది—అర్థంకాని భయమేదో ఆమెను వరించింది. మందుసీసాలోని మందు నిజమైన మందేనా! అంతా అయోమయంగా తోచింది. రోగికి మతి చలించలేదుగదా! ఏమో! సరోజనికి అనుమానం వేసింది. కాసేపు అలాగే పల్కరిస్తాడనే ఆశతో నిలబడే ఉండగల్గింది. మధు యేం మాట్లాడ్డంలేదు. సరోజని అతన్ని విసిగించకూడదనుకొంది. చేతిలో కప్పుని అలాగే ప్రక్క బల్లమీద వుంచుతూ - వెనక్కి తిరిగింది. సరోజని వెళ్ళిపోయిన అరగంటలోపే మధు కళ్లు తెరచిచూశాడు. ఆమె లేదు. టేబిల్ మీద కాఫీకప్పువుంది. మంచి వాసన కూడా వేస్తోంది. త్రాగాలని జిహ్వ కోరింది. మధుకి చావాలనివుంది త్రాగితే చావు వాయిదాపడుతుంది. ఎందుకు వాయిదా పడేసుకోవాలి. చచ్చిపోవాలని నిశ్చయించుకొన్నవాడు, బ్రతికించే వస్తువుల్ని అసలు కోరకూడదనిపించింది ఎదురుగా వుంటే యీ కోరిక బలిసిపోతుందనుకొని మధు ఆ కప్పుని బల్లమీద నుంచి తోసిపారవేశాడు.

గది వెలుపల గోడప్రక్కగా నిలబడివున్న సరోజనికి యీ శబ్దం వినిపించింది. నిశ్చేష్టురాలైపోయింది. స్పృహ తెలిసివుండీ యిలా ప్రవర్తిస్తున్నాడని సరోజని గ్రహించింది. ఎందుకింతకోపం? ఆమె కర్థంకాలేదు. తెలుసుకొంటానికి అవకాశం కల్గటం కష్టం యిప్పుడు! నెమ్మదిగా మధు దగ్గరకొచ్చి నిలుచుంది. అతను కోపంగా పగిలిన పింగాణీ పెంకులవంక చూస్తు

న్నాడు. సరోజని మాట్లాడించాలని ప్రయత్నించి—,
"మందివ్వమంటారా! వేళయిందికూడా!" అంది.
మొగం చిట్లించి, పరీక్షగా చూశాడు సరోజనివంక.
తనతో చదువుకొన్నవాళ్ళలో ఒకమ్మాయి యిలాగే వుండేది అచ్చంగా.
ఆ అమ్మాయేనా యీ అమ్మాయి—
ఏమో!
అంతగా యీ ఆలోచననునుసరించి బాధపడ తల్చుకోలేదు మధు. ఏదైనా—ఒకప్పుడు పరిచయముండేదాన్ని జ్ఞాపకం తెచ్చుకోటంకూడా యీ సందర్భంలో అనవసరమనిపించింది.
మధు పరీక్షగా చూసి, తలతిప్పుకోవడంలో, సరోజని అతని భావాన్ని కించిత్ గ్రహించినదానిలాగా—
కుర్చీలో కూర్చొని—
"గుర్తుకొచ్చానా! లేదా!" అంది.
మధు మూగవాడిలాగా వూరుకొన్నాడు. బాధగా కళ్ళు మూసుకొన్నాడు.
మధు యీసారికూడా యేం జవాబివ్వకుండా వూరికే వున్నాడు.
ఆమె సాహసించి మందు గ్లాసులో పోసింది. అతను ఆమె భుజాన్ని ఆసరాగా చేసుకొని లేచాడు. పెదవులు విప్పి తాగుదామనుకొన్నాడు. కాని "చచ్చేవాడికి మందులేమిటి" అనిపించింది. తన దౌర్భాగ్యానికి తానే నవ్వుకొన్నాడు.
అంతలోనే ఆ మందుమీద కచ్చి పుట్టుకొచ్చింది. ఆమె చేతిలోంచి మందుగ్లాసు లాక్కొని బలవంతంగా గోడకు విసరికొట్టాడు.
ఆమె విశాలనేత్రాలు ఆశ్చర్యపడ్డాయి
అతని వికృతాకారం సరోజనికి భయాన్ని కలిగించింది.
కాసేపటికి తెప్పరిల్లి—
"ఏమండీ!" అంది మెల్లగా—
ఏమూలనో దాగివున్న నిరర్థకమైన దుఃఖం అతని గొంతుకలోంచి బయటికి కొత్త కొత్త రాసాగింది.
అతని మనస్తత్వాన్ని ఆమె గ్రహించాలనుకొని చాలా ప్రయత్నించింది. చివరకు యేం తోచలేదు. యెక్కువసేపు అలా కూర్చోవాలనిపించలేదు. మెల్లిగా లేచి గది యివతలికి వచ్చేసి కూర్చుని ప్రకృతిలోకి చూడటం మొదలెట్టింది — మధ్యమధ్య మూల్గులు—
గొణుగుడు మాటలు ఆమె నిశ్చలాలోచనల్ని భంగపరుస్తున్నాయి.
అప్పటికి నాలుగు గంటలు దాటింది. మధు మూల్గటం లేదు.
సరోజని దగ్గరగా వేసిన తలుపుల్ని కొద్దిగా తెరచి చూసింది
నిద్ర పోతున్నట్లుగా వున్నాడు—
ఆమెకు కూడా శ్రమ యేదో కాసేపు నిద్ర పొమ్మని సెలవిచ్చింది—
అలాగే యిద్దరూ ఆ సాయంత్రం పూట చిన్నకునుకు తీసారు

## 3

చీకటి పడింది.
మధు నిద్రపోతూనే వున్నాడు.
సరోజని కళ్లు నులుముకొని, లేచి కూర్చుంది.
జరిగిన సంఘటనంతా గుర్తుకు రాసాగింది.
సరోజనికి మధుపట్ల యెలా సానుభూతిని, జాలినీ చూపించాలో తెలియలేదు.
ఒక్కసారి మధునిచూసి నిర్వేదించింది.
ఇంతలో బూట్లచప్పుడు ఆమెని కదిలించాయి.
రఘువచ్చాడు.
సరోజని లేచి నిలబడింది.
"ఎలా వున్నాడు?" అని అడిగాడు రఘు.
సరోజని రఘుని యివతలికి పిల్చి, మధుచేసిన తతంగమంతా పూసగుచ్చినట్లు చెప్పింది. అతనుపిచ్చిగా నవ్వాడు
సరోజనికి ఆ నవ్వు వింతగా తోచింది.
"నేచెప్తే విన్నావ్! నీలాంటివాళ్లకు రోగులపట్ల ఎలా వుండాలో యేం తెలుస్తుంది. ఈశ్రమ నీవు పడలేవనే నర్సుని పంపుతానంది విన్నావ్ కావు. రోగుల మనస్తత్వాన్ని అర్థం చేసుకోవడమంటే, కూరగాయలు తరగటమనుకొన్నావా!
"అతను చివరకు మందూ—తాగలేదు కాఫీ కూడా రుచి చూడలేదు—విసిరిబుచ్చుకొని పారవేశాడు"—
అంది నిర్జీవంగా సరోజని.
"అదంతా నే చూసుకొంటాగాని, నువ్వేం బెంగపెట్టుకోకు. అసలింతా ఒక విద్య ఇంకా నువ్విది చదువుకోవాలి." అంటూ రఘు మధువంక చూసాడు. అతడు యీ సందర్భంలో మేలుకొవటానికి కారణం వాళ్ళిద్దరి మాటల సందడే.

మేల్కొని మూలుగుతున్నాడు. మధ్యమధ్య ఊపిరి సలపకుండా యెక్కిళ్ళు వొస్తున్నయి.

రఘు మధు దగ్గరకు చేరి అతని మొగాన్ని తనవైపుకు త్రిప్పుకొన్నాడు-మందు యివ్వబోతున్నాడు మధుకి ఆశ్చర్యాన్ని కలిగించింది — ముఖంలో ఆ ఛాయలు ద్విగుణీకృత మయినాయి.

“మళ్ళీ వచ్చారు. నా ప్రాణానికి యమభటుల్లాగా— సిగ్గులేదురా? వద్దంటే ఎందుకొస్తారు! చంపాలనుకొంటే ఒక్కసారి చంపరాదు! యెందుకిట్లా కొస్త కొస్తగా యేడిపిస్తూ, చంపుతారు!” అని మధు, రఘుని విదిల్చిపారేశాడు. రఘు ఒక క్షణం ఆలోచించాడు.

“దేనికింత శ్రమపడుతారు. త్వరగానే తగ్గిపోతుంది గా కొస్త మందు త్రాగండి! యేం గాబరాపడకండి!”—

“నాకు బ్రతకాలని ఆశలేదు. మీరు నన్ను అర్థంచేసుకోలేక పోతున్నారు. నాకు మీరేం ఉపకారం చేయక్కర్లేదు. చేయదల్చుకుంటే, త్వరగా చచ్చే ఉపాయం చెప్పండి — చావడానికి యే మందిచ్చినా హాయిగా తాగుతా!”

సరోజిని, రఘు గొంతుకలు ఆ మాటలు విన్న తరువాత మూగ పోయినవి. నిరాశ పెరిగినా, జీవితానికి ఆశ నశించదు ఒక ప్రక్క ప్రాణంపోతూ వున్నా, బ్రతకాలనే ఆకాంక్ష అనుకున్నంత తేలిగ్గా మాసిపోదు. “చావాలి — చావాలి” అనుకొన్నప్పటికీ ఆ కొస్త క్షణం వచ్చేటప్పటికి బ్రతికి యేదో సాధించాలని బుద్ధి పుడుతుంది. అది జీవికి లక్షణం. కాని యితని ప్రవృత్తిలో చాలా వరకు ఆనూచనలు యెక్కువగా కనిపించడం లేదు. వికృతమైన మనస్తత్వం దాని పరిణామంలో గల అంతరార్థం రఘుకి బోధపడటం లేదు.

రఘు తరువాత చాలా సేపు బ్రతిమిలాడాడు.

“పాపం చాలా కష్టాలు పడినట్టున్నారు. అందుకనే జీవితం అంటే విసుగుపుట్టింది. నిరాశను బలపర్చుకొన్నారు—” అన్నాడు రఘు మధువంక చూస్తూ.

“అవును. ఏం......తప్పా!” మధు గంభీరంగా అన్నాడు.

“ప్రస్తుతం మీ కటువంటిదేం వుండకూడదు...మీ ప్రాణానికి యేం ఫర్వాలేదు. తప్పకుండా యీ వ్యాధి నయమవుతుంది—మీ రిలా అనుకొంటూ వుంటుంటే యెలా నయమవుతుంది!”

“నా కసలు బ్రతకాలని లేదు. తెలుసునా!”—రఘు యేం మాట్లాడలేదు.

“నాకు తెలుసు. చావు అనుకున్నంత తేలిక కాదని”- అందుకే దానికోసం మందివ్వమంటున్నా!”

ముందు పంటితో క్రింద పెదవి కరచుకుంటూ రఘు యేమో ఆలోచిస్తూన్నాడు

సరోజని నిశ్చల నిరీహ నేత్రాలతో మధుని చూస్తోంది. రఘు సరోజని వంక తర్వాత నెమ్మదిగా చూస్తూ “సరోజా! నాకేం తోచటంలేదు. ఇతని మతిభ్రమణం చూస్తుంటే, ముందు నాకు మతిపోయేటట్టు వుంది”— అన్నాడు.

సరోజని అతన్ని గదినించి అవతలికి తీసికెళ్ళి కూర్చోపెట్టింది.

అతను ఒక సిగరెట్ తీసి కాలుస్తూ—ఆమె కళ్ళల్లోకి చూసాడు.

సరోజిని మృదువుగా - అంది:

“అతనికి స్పృహావుండే యిలా అంటున్నాడు. ఇంత మొండిగావుంటే మీ రెలాగూ మందివ్వలేరు. అమృతం యిచ్చినా, హాలాహల మవుతుంది శారీరకంగా కుదర్చడం చాలాకష్టం. అందుకని మానసికంగా ముందు ప్రయత్నిస్తే యీ నిర్భాగ్యుడు యేమైనా లొంగవచ్చు..”

రఘు సావధానంగా విని—

“అయినా నీ కెందుకొచ్చిన బెడద. నువ్వు వొప్పుకొంటే యీ పాళాన తీసికెళ్లి ఆ జనరల్ ఆస్పత్రిలో పారేస్తే నీపీడా, నా పీడా పోతుందా” అన్నాడు విసుగ్గా. ఆమాట వినంగానే సరోజనికి కళ్ళల్లో నీళ్లు తిరిగినయి.

రఘుకి విస్మయం కలిగింది.

“సరోజా! యేమిటది?”

“ఏముంది, యింతా చేసి అతనికి ద్రోహం చెయ్యటం కన్న యేమైనా ఉందా!” ఎండుకుపోతున్న గొంతుకలోనుంచి వినబడే మాటల్లాగ వున్నయి అవి రఘుకి.

“అతను వాస్తవంగా నిర్భాగ్యుడే. అతన్ని చూసినప్పుడే నాకు యింతజాలి ఎందుకుకల్గిందో తెలియదు. పైగా నాతో చదువుకున్న వాడు. చాలా బీదవాడు కూడా. అతని జీవితం యెటువంటిదో నాకు బాగా తెలుసు. వారాలు చేసుకొని కొన్నాళ్లు చదివాడు. జీతాలు కట్టుకోలేని స్థితిలో నేనే చాలా సార్లు సాయపడ్డాను. జీవితంలో మనం యెవ్వరమూ యెరుగని

కష్టాల్ని నష్టాల్ని చవిచూచాడు. సరిగ్గా యీ వాడు మన కారు క్రింద పడే ప్రాణాలు తీసుకొంటానికి ప్రయత్నించాడు. యేదేమైనా, నా యింట్లో, నా కళ్ళముందు నిష్కారణంగా అతని ప్రాణాలు పోవటం యిష్టంలేదు. ఎంత ఖర్చయినా, భరాయిస్తాను అతని ప్రాణం నిలబెడతాను. యెలాగైనా అతను బ్రతికే ఉపాయం చూడండీ!" అంటూ సరోజని తన బాధను—ఆదుర్దానూ— మమకారాన్నీ - స్నేహాన్నీ వ్యక్తపరిచింది. రఘు ఆమె ఉద్దేశ్యం తెలుసుకొని ఆశ్చర్యపడ్డాడు. సరోజను ప్రేమిస్తూ, పెళ్లి చేసుకోవాలని ప్రయత్నిస్తున్నాడు రఘు. ఈ ప్రయత్నం యిప్పటికి సంవత్సరంబట్టీ ఉధృతంగా జరుగుతోంది. ఆమె అంగీకారం కోసం తాను పడేపాట్లు యింతా అంతా గాదు ఎలాగైనా సరోజను సంతోషపెట్టి, తన అనురాగాన్ని ఆమె హృదయంలో పాతుకొని పోయేటట్లు చేయాలని భగీరథప్రయత్నాలు జరుపుతున్నాడు.

ఇప్పుడు యీ రోగి విషయంలో అతను తగినంత శ్రద్ధ చూపాలనుకొన్నాడు, సరోజనికోసం. యీ సరోజనే తనకు తటస్థపడక పోయినట్లయితే యీ రోగి - అందరి రోగుల్లాంటి రోగే - కొత్తదన మేమీ యీతనిలో రఘుకి కన్పించలేదు. సరోజనికి గల శ్రద్ధ, పట్టుదల రఘుని ఉన్మత్తి పరచినయి.

రఘు చాలాసేపు సరోజని చెప్పిన విషయాలను గురించి తలపోశాడు - ఆలోచించాడు.

తర్వాత మెల్లిగా అన్నాడు.

"సరే...నువ్వింతగా కోరుతుంటే నే కాదనలేను. నాకు మాత్రం మానవులంటే దయ — జాలీ—లేకపోలేదు. అందులో యితను బీదవాడు — తెలివిగలవాడు—చదువుకొన్నాడు. అన్నిటికన్నా ముఖ్యమైంది నీకిష్టమైనవాడు. అందుకని నాశాయశక్తులా ప్రయత్నించి యితన్ని బ్రతికిస్తా. దానికి ఒక్కటే ఉపాయంవుంది — అయితే అది చాలా కష్టమైంది" రఘు సరోజని వంక చూశాడు యీమాటని.

"అయితే అయింది. ఏమిటది?" అంది తేలిగ్గా.

"అతనికున్న 'నిరాశ' 'విసుగు' 'నా' అనేవాళ్లు లేకపోబట్టే యింతగా పెరిగినయి. అతని కిప్పుడు 'నా' అనేవాళ్లు కావాలి. మనస్సులో మనసై మెలగాలి, అతనికిగల అభిరుచుల్ని గ్రహించగలగాలి, సరిగ్గా అలా నటించాలి—మరి నువ్వు యివన్నీ చేయగలవా!" అన్నాడు రఘు—

సరోజనికి "యేం చెయ్యాలో తోచలా"—

"ప్రేమిస్తున్నట్లుగా నటించు — లాలిస్తున్నట్లుగా మాట్లాడు — అతన్ని నీ ప్రియుడిగా భావించు — ఆభావాన్ని అతను గ్రహించుకోగల్గాలి — నువ్వు ఆత్మబంధువుగా అతనికి కనబడాలి — ఎంతో ఓర్పు చూపాలి — అతనేమన్నా నువ్వు పడాలి — చాలా ప్రసన్నవదనంతో అతనికి కనబడుతూండాలి—నీమీదే అతని జీవితాశయాన్ని వుంచుకొనేటట్లుగా ప్రవర్తించాలి—తెలియని ఆశలు అతనికి చూపెట్టు. స్త్రీకి లొంగని పురుషులెవరు చెప్పు! అందులో నీలాంటి అందకత్తెకు సాధ్యంకాని పనేముంది? ఇది తేలిగ్గా చేయగల్గితే అతను బ్రతుకుతాడు. మానసికంగా యింతకన్నా చేయగల్గింది లేదు"—అన్నాడు రఘు. సరోజకు యివన్నీ త్వరగా అర్థం కాలేదు. చాలా సేపటివరకు ఆలోచనలు విడిపోలేదు చివరకు ఎలాగో ఒక నిర్ణయానికి వచ్చి —" జీవితంలో నాటకమాడాలన్న మాట"—అంది.

"అవునుమరి. కాకపోతే యితను నువ్వనుకొన్న వాడు కాకుండా పోతాడు తెలుసా!" అన్నాడు రఘు.

"ఇది సాధ్యమవుతుందా!"—అంది సరోజని సందేహంగా—

"ఏదికాదు సరోజా! నిత్యమూ మనజీవితంలో మనకు తెలియకుండా యీవిధంగా జరిగిపోవటంలా. అనుకొంటే యీ తేడా కనిపిస్తుంది. యిష్టంలేక తిట్టుకున్నప్పటికీ—ఆ వ్యక్తి కనపడితే — అనుకొన్నదంతా గుండెలో దాచుకొని, పైకి మామూలుగా మాట్లాడుకోవటం లేదూ! జీవితమంటే నానిర్వచనం ఒక్కటే! 'నటన' అని"—

"నటన"—సరోజకు తనజీవితం జ్ఞాపకం వచ్చింది. ఏదో క్రొత్తవిషయం. నేర్చుకోవాలి కలలోమాదండీ, తలవంచీ ఈవిషయం.

రఘు మాటల్ని బాగా అర్థం చేసుకొంది. దొంగనటన, మధుపట్ల చేయడానికి నిశ్చయురాలైంది. తను చేస్తున్నది తప్పయినా, మధుపట్ల చేయకతప్పదు. అతను ఆరోగ్యవంతుడు కావాలి. లేకపోతే తన ఆత్మకు శాంతిలేదు. పెద్దవాళ్ళకన్నా చిన్నవాళ్లు యీ విషయాల్లో చాలా తేలిగ్గా చెసివేస్తారు. ఎందుకంటే వాళ్లకిన్ని ఆలోచనలు వుండవు. అసలుకలగవు.

"ఏమంటావ్ ?" అన్నాడు రఘు గట్టిగా—
"చూస్తూ చూస్తూ చేయక తప్పుతుందా !" అంది.
"ఔను మరి. కాకపోతే యెలా అతను బాగుపడు తాడు, నువ్వు చెయ్యబోయే పనికి నటనకూడా అక్క ర్లేదు నీ హృదయం అతనికి అర్పించే స్థితిలో వుండాలి. అతని అభిరుచులకి నువ్వే బాధ్యురాలివి అతనిదృష్టిలో నువ్వు 'ప్రేయసి'వై - నీ దృష్టిలో అతను ప్రియుడై వుండగల్గితే, అతను నీవాడు. నీవు చెయ్యగల్గింది అక్షరాలా అవుతుంది. తరువాత పనంతా నే చూసుకొంటా మరి వెళ్ళిరానా !" అంటూ రఘూ వెళ్ళిపోయాడు.
అతను వెళ్లిన దిశవంక చూస్తూ - సరోజని చాలాసేపు యేవో ఆలోచించింది - అతను అన్న మాటల్లో సత్యం యేదో వుందని ఊహించింది. తనకి పట్టివున్న బాధ్య తను తానే కోరకురాలనుకొంది - ఒక్కసారి తలుపు తీసి మధువంక చూసి చిన్నగా నవ్వింది.

## 4

ప్రస్తుతం యేంచేయాలి ?
సరోజకు తట్టింది చేస్తే యెలా చేయాలి.
అందులో నటన. అనుకొన్నంత తేలిగ్గాదు తాను ఒకర్ని ప్రేమించాలి ఇంతకు ముందెప్పుడూ యెవర్నీ ప్రేమించలేదు. తనని ప్రేమించాలనే చాలామంది కుర్రాళ్లు చదువుకొనే రోజుల్లో ప్రయత్నించి వ్యర్థులై నారు. ఎన్నోసార్లు ప్రణయగాథలు చదివిందే గాని, ప్రణయాన్ని యెవ్వరిపట్ల యింతవరకు ప్రదర్శించే యోగం పట్టలేదు. కాని యీనాడది అవసరమైంది. యెవరికోసమోగాదు తనకోసమే— సరోజకు కొంచెం ధైర్యంవచ్చింది.

రఘు విషయం సింహావలోకనం చేసుకొంది. అతను తనతో స్నేహాన్ని పెంచుకొని, చివరకు ప్రేమికునిలా మారిపోయి పెళ్లి చేసుకొందామనే వుద్దేశ్యంలో వున్నాడు. కాని తాను ప్రేమించలేనే అంతయినిగా— ప్రేయసిలాగా ప్రవర్తించడం అంటే దానికి సహజత్వం కొంతయినా వుండాలి.
సరోజని ఉద్దేశ్యం రఘుకి యేమాత్రం తెలియదు. చదువుకొన్న రోజుల్లో తనంటే కాలేజీ కుర్రాళ్లు పడే తహతహను తల్చుకొంది. ఎందుకలా అవగలిగారా అనిపించింది. లోకం పోకడ ఆలోచించినకొద్దీ సరోజకు బాగా అర్థమవుతూ వచ్చింది.
ప్రేమించి వున్నట్లయితే, అంత బాధనిపించేదిగాదు. ప్రత్యేకంగా ప్రేమించా లనుకొంటే అది సవ్యంగా జరగటం చాలాకష్టం.
"మధుకి - తనకి యేమిటీ సంబంధం - ఏమైనా తమ్ముడా ! బంధువా ! కేవలం స్నేహితుడు. కాకపోతే తనతో చదువుకొన్న బీదవాడు— తెలివిగలవాడు. ఇంతగా శ్రమ అతనిపట్ల యెందుకు తీసుకోవాలి" ఊరుకుంటే బాగుండేదికాదా! సరోజని గుండె యీమాట అను కోగానే ద్రవించింది నీరులాగా !
ఇంతదయ - జాలీ - సహాయం చేయకుండా, చూప కుండా వున్నటయితే అతనీపాటికి యెక్కడుండే వాడో! అతగాడే, అంతగా బతికి కేసు పెట్టించి నట్లయితే వెయ్యి రూపాయలతో వాడిని సంతృప్తి పరచి, నాదారిన నేను వచ్చేదాన్ని. కాని అంత నీచురాల్నని యెలా అనిపించుకోను. మందూ, మాకు లేకుండా, మాని పోయే రోగానికి సరియైన ఔషధం తినే వుండగా, వేరొక ఆస్పత్రికి యెందుకు తీసికొని వెళ్లాలి.
మానవుడికోసం తోటిమానవుడు ప్రాణాలు సైతం ధార పోస్తున్న యీనాటి నాగరికలోకంలో ఒక్క ప్రాణిని, తనతో చదువుకొన్న వాణ్ణి, సౌమ్యుణ్ణి, నిర్భాగ్యుణ్ణి, తనకున్న డబ్బుతో తనకు చేతనైన సహా యంతో అతన్ని బ్రతికించలేకపోతే యెందుకనిపిం చింది సరోజకు. ఒక జీవికోసం తన జీవితం త్యాగం చేస్తూంటడం తప్పా! ఇంతపేరు ప్రఖ్యాతులు గడించు కొన్న భారతదేశంలో ఒక్క అల్పప్రాణం నిష్కా రణంగా అరిపోతూంటే, తనలాంటి శ్రీమంతుల బిడ్డ చూస్తూ వూరుకోవడం తగనిపని" అని నిశ్చయించు కొంది సరోజ.

కేవలం అతని ప్రాణాల్ని నిలబెట్టటం కోసం - అతని బ్రతుకు ఫలించడం కోసం ప్రపంచంలో తానుకూడా ఒక మనిషిననిపించుకోడానికికోసం తానేంచేస్తే మాత్రం తప్పేముంది? తను చేయబోయే పని తనకు అన్నివిధాలా మంచిదనిపించింది. హృదయం ఉప్పొంగిపోయింది. కళ్లల్లో నవ్యకాంతులేవో తిరు గాడుతున్నట్లుగా తోచాయి. ప్రతి అవయవంలోనూ ఉత్సాహం, ఆనందం ఉరకలువేస్తోంది. మధు ప్రాణంతో తనప్రాణానికి యేనాడో సంబంధం వున్న ట్లుగా - దాన్ని యిప్పుడు బలపరచేటందు కేమో అన్నట్లు సరోజ అమితానందంతో మధు గదిగి చేరు కుంది.

## 5

మధు నిర్జీవ శిలాప్రతిమలాగా వుండటం సరోజకు యేంతోచలేదు. పెదిమల చివరలనుండి, చొల్లు కారుతోంది. తలంతా చెరిగిపోయింది. అతను అనుభవించే బాధయొక్క స్వరూప మేమిటో కచ్చితంగా సరోజకు తెలియటంలేదు. ఎలా నటిస్తే సంతోషిస్తాడో - లేకపోతే బాధను పెంచినదాన్నౌతానేమో నని జంకింది. నిరాశలో మునిగిపోయిన ఆత్మను తేల్చి, సంతోషసాగరంలో అభిషేకం చేయించాలని సరోజకు మెల్లగా తట్టింది.

కాసేపు అలాగే అతనికెదురుగా నిలబడింది. అతనింకా కళ్లు తెరువలేదు. సరోజ మనసులో యేమో ఆలోచనలు ముసురుకొని వుక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. ఎక్కువసేపు నిలబడలేక, వెనగ్గా వున్న కుర్చీని దగ్గరగా లాక్కొని మధుకు అందుబాటులో కూర్చుంది. ఏదో బరువు కనురెప్పల్ని లేవనీయకుండా అణచివేస్తోందా అనిపిస్తోంది - సరోజకు. వేడి నీరు ఊరికే ధారాపాతంగా కనువివరలనుండి కారుతోంది - సరోజకు నటించబోతున్న పాత్రకు యిదే మొదటి పని కాబోలనుకుంది. అందుకే అతనిదగ్గరగా జరిగి, తన పమిటిచెంగుతో కారుతున్న కన్నీళ్ళను సున్నితంగా తుడిచింది.

మధు ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు.

సరోజ రూపం స్పష్టంగా కనిపించలేదు.

మరింత ప్రయత్నంతో బాగా కనులు విప్పి చూశాడు. ఆ చూపుకి సరోజ కళ్లు చెమర్చినయి. ఇది నటనకాదు నిజంగా వాటంతటి కవే చెమర్చినయ్.

మధుకి, అంతినీరసంగా వున్నా సరోజను చూడగానే, ఆమె చర్యను అనుభవించంగానే ఒక్కసారిగా ఆశ్చర్యం కలిగింది.

అలాగే—దీనవదనంతో—బాధగా సరోజ కళ్లలోకి చూడసాగాడు.

సరోజ ఆచూపుకి కంపించింది—

మధు దృష్టిలో ఆమెను దేవతగా భావించి చూస్తున్నాడు.

తన కనుకొలకువెంట దిగజారిన నీటి బిందువులను సరోజ తన మునివ్రేళ్ళతో తుడుచుకొంది—

అవ్యక్తమైన మధుర భావనలో, అనిర్వచనీయమైన సుందరమూర్తిని అవలోకించినప్పుడు పలకరించాలనే ఆశకలిగినట్లుగా భావించి—

"సరోజనీ..." అన్నాడు మధు.

సరోజని—అతని మొగంలోకి చూస్తూ, తియ్యగా "ఊ"—అంది.

ఆ సమాధానంతో మధుకి బ్రతకాలనిపించింది. "తనమీద దయ చూపించే హృదయాలు యింకా వున్నయ్యనుకున్నాడు. ఉండి కూడా చావుకు తాను పురోగమించటం తనకే చిన్నతనమనిపించింది. యిన్నాళ్లూ యీ లోకం న్యాయం—దయ—జాలీ - లేక గొడ్డుపోయిందనుకొన్నాడు. జీవితమంటే నిరాశాపూరితమైనదనే అనుకున్నాడు. ఈ సృష్టంతా మాయ అని, బ్రతుకంతా అశాశ్వతమని నమ్మాడు. కాని, యీ క్షణంలో, ప్రతీదీ శాశ్వతమనీ, ఆనందించ తగ్గది యింకా చాలా వుందని ఊహించాడు. చనిపోతున్నా ఆశ మానవుణ్ని వెంటాడుతుంది. నరకానికి పోవడం యిష్టంలేక స్వర్గాన్ని కోరుకుంటాడు. దానికోసం పుణ్యకార్యాలు చేయడం మొదలెడతాడు. ఆశే యీ విధంగా మానవుణ్ణి లోబరుచుకొంటుందని మధు భావించాడు" మళ్ళా నిరాశ అతన్ని బెదిరించింది.

"అసలీసరోజని ఎవరు? చావాలని కోరుక్రింద పడ్డప్పుడు చంపకూడదు! తన హృదయంలోని దయను, సానుభూతిని రంగరించి తనకి యెందుకు పులుముతోంది? నా ప్రాణాల్ని నిలబెట్టి ఏం కీర్తి సంపాదించుకోదల్చింది! ఈ వేళ సరోజని తనకు మనస్ఫూర్తిగా సేవచేస్తోంది! ఎందుకని? ఆపదలో వున్నాననేగా! ఇది కాస్త తప్పిం తరువాత సరోజని చేతులు తుడుచుకోకుండా వుంటుందా! మళ్లా తను రోడ్లవెంటా—దుమ్ములోనూ — పాదుక్కల్లోనూ— ఆకలి దప్పుల్లోనూ — ఆశల ఉరిత్రాళ్ళలోనూ— చిక్కి, బక్కపీనుగైపోక తప్పదుగా! యెందుకొచ్చిన ముచ్చటలు! యెందుకింతశ్రమ! నన్ను బాగుచేద్దామని యీమె ప్రయత్నించడమేగాని, వాస్తవంగా తన బ్రతుక్కి హాయి, స్వేచ్ఛ, సమకూరుతాయా! ఒకవేళ యీమె పుణ్యంవల్ల బ్రతికినా, సాధించేదేముంది?"

మధులో యింత ఆలోచన విభిన్నరూపాల్లో, వింత వింతచర్యగా సాగిపోతుంటే—సరోజని తనని పరీక్షగా చూస్తూ!—

"కాస్త మందు పుచ్చుకొంటారా!"—అంది.

సరోజని, తనను బ్రతిమలాడి, బుజ్జగిస్తున్నట్లుంది. ఇంతవరకు తనతల్లి పోయినతరువాత, యిలా వినటం యిదే మొదటిసారి తనకి.

మనిషి, మనిషిని ప్రేమిస్తాడు. హృదయంలోని భావా లన్నింటిని, యెదుటివ్యక్తికి పరిస్థితుల్ని బట్టి ధారపోస్తాడు. అభిమానం చూపుతాడు. ఆలింగనం చేసుకుంటూంటాడు. తన కళ్ళను యెదుటివాని కళ్లతో కలుపుతాడు. తను నమ్ముతాడు. ఎదుటివాణ్ని నమ్మిస్తాడు. తనునవ్వుతాడు—నవ్విస్తాడు— అన్నీ మానవునిలోని భావాలే. అంతా మానవత్వంలోని మహాత్వమే! ప్రకృతిలోని ప్రతి గొప్పవిషయమూ, ప్రతి చిన్నవిషయమూ, ప్రతి సన్నివేశంలోనూ, ప్రతిసమ్మేళనంలోనూ వ్యక్తీకరిస్తూనే వుంటాడు— బయటపెట్టుతూనే వుంటాడు. ఇది దాచినా దాగదు. ఇలా దాగని వస్తువుల్నే తనమీదవేసి రుద్దుతోందని మధు భావించాడు. ఈభావనకు బాధ్యురాలు మధు దృష్టిలో 'సరోజనే' స్ఫుటంగా కనిపిస్తోంది. కను రెప్పలు అల్లల్లాడిస్తూ సరోజనివంక చూశాడు.

"ఏంకావాలి" అన్నట్లు సరోజని ఆతృతగా చూస్తోంది. పేరు పెట్టి పిలిచాడు మధు.

"ఊ!"—అంది సరోజని వంగుతూ—

"ఇదంతా యేమిటో నీకు తెలుసా!" వేదాంతిలాగా అన్నాడు మధు.

సరోజనికి నమ్మిన కాళ్లక్రింద భూమి క్రుంగిపోతున్న ట్లనిపించింది.

"ఇదంతా వృథాశ్రమ—నా అప్రయోజకత్వం—నా నిరాశ—నా బాధ—నా కష్టాలు—నువ్వనుకున్నంత తేలిగ్గాపోవు — అవి నాకు సన్నిహితాలైనాయి. నువ్వెంతకష్టపడి పరిచర్యలు చేసినా అవి నన్ను విడిచి వెళ్లలేనంతటి మమకారాన్ని నావద్ద దాచుకుని బ్రతుకు తున్నయి"—మధుమూల్గుతూ—ఆగి—ఆగి అన్నాడు.

సరోజనికి అతని మాటల్లో గల నిస్పృహ—మరిగి పోయిన విహ్వలత - పట్టుదల - గాఢంగా వున్నట్లు కనిపించాయి. వాటిని గురించే తానూ దీర్ఘంగా ఆలోచిస్తోంది. కాని అతనితో వాటిని చర్చించడానికి ఆమె పూనుకో దల్చలేదు.

ఏం చెపితే అదివిని వూరుకోవడమే ప్రస్తుతా నికి మంచిదని ఊహించింది.

"నాకు బ్రతకాలని లేదు. చావుని కోరుకొంటు న్నాను. యేదైనా నీకు ఉపకారం చేయాలనివుంటే- అది చావుని త్వరలో తెప్పించేదిగా వుండనియ్యండి. నా చావుకి అడ్డుతగలొద్దు"—

సరోజని ప్రక్కనే వున్న నెమిలి విసనకర్రతో విసురుతూ—ఆ మాటలు వింది.

అతని మీదవున్న దుప్పటి కుడిచేత్తో సర్దుతూ—

"మధూ! యేమిటి యింత నిరాశ చెప్పు!" అంది తియ్యగా—

"నా కెవరున్నారు ?" — "యిదివరకు మా అమ్మ వుండేది!"

"ఇప్పుడు?"—అతను ప్రశ్నార్థకంగా చూసాడు.

"నే లేనూ! మధూ!"—

"నువ్వా!" అతను వెకిలిగా నవ్వాడు. ఆ నవ్వులో జీవంలేదు. ఎండిన తాటాకు నవ్వులావుంది.

"ఉద్యోగం - ఆరోగ్యం - అమ్మ—" అన్నీ పోయి నయి. యింకా నాకేం మిగిలింది? నే నెవరికోసం మిగిలివున్నా!"—మధు కళ్లలో నీళ్లు తిరిగినయి.

సరోజ అతని నుదురురాస్తూ—

"నాకోసం మధూ! నువ్వేం కంగారు పడకు! అంది.

అతనికి ఆమాటలు నమ్మకంగా కనిపించలేదు.

"నీ కోసమా!"—

"అవును...మరి..."

"ఎంత చిన్నపిల్లలాగా అంటున్నావ్! నీలో యింకా అమాయకత్వం పోలేదు. నిరాధారుడైన యీ నిర్భా గ్యునిమీదనా! నీకు తీరని దయ. అందుకని బ్రతికించ దల్చావా!"—

"మీరలా అనకండి! మీ కోసం సర్వవిధాలా శ్రమ పడి బ్రతికించుకుంటాను. మీ కోసం నాసర్వస్వం వెచ్చించి మీ ప్రాణాల్ని నిలబెట్టుకుంటాను"—

"సరోజనికి తెలియకుండా నే సరోజని హృదయంలో నుంచి ఈ మాటలు బయటికి వచ్చేసినై.

"ఎంత ధైర్యంతో అంది! యిదంతా సత్యమేనా! యింత బాధ్యత తనపట్ల యెలా తీసుకోగల్గింది! యింతగా హృదయాన్ని తనజీవితం చిగురింప చేసేం దుకు త్యాగంచేస్తుంటే, తన ఆత్మకు ఆనందాన్ని కూర్చ తల్చుకొంటుంటే.—నే నెందుకు ఆమెకోసం బ్రతక్కూడదూ?" అనిఅనిపించిందిమధుకి—వెంటనే "సరోజా!"—అన్నాడు.

ఆ మాటలో సరోజకు యెంతో ఉత్సాహం కన్పిం చింది.

అతను చిన్నగా నవ్వాడు ఆమెవంక చూసి.

సరోజకు ఆత్మ వికసించింది.

"నువ్వంటే నాకెందుకో నమ్మకంగా వుందిసరోజా!"

"మంచిదేగా!"—

"ఏది మంచిది?"—

"మీరు నన్ను నమ్మటం"—

"అదికాదూ! నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా!"—

సరోజకు తన 'నటన' మీద విశ్వాసం - నమ్మకం కుదురుతోంది.

"యోగ్యుడైనవాడు యెప్పుడూ ప్రేమించబడతాడుగా మధూ"—అంది సరోజ.

ఆ మాట అంటూంటే సరోజకు కన్నులు మురిసినయి

మధుకి మధువుని నాకినట్లనిపించింది.

"ప్రేమకు ప్రత్యేకంగా కారణాలేమీ వుండవనుకొంటా! అసలు ప్రేమించడమనేది మనం ప్రయత్నిస్తే అయ్యేది కాదు"—

"నిజమేనేమో"—అనిపించింది మధుకి.

"ఇంతకీ నేను బ్రతుకుతానా?"

"అదేమిటి - తప్పకుండా!" - అంది సరోజని మృదువుగా. మధుకి బ్రతుకుమీద ఆశ—విశ్వాసం కల్గింది—

"నే చెప్పినట్లు వింటే మరి..."

"నువ్వు నాపట్ల దైవస్వరూపిణివి. క్రొత్త జీవాన్నేదో నాలో ప్రవేశపెట్టావ్"—అన్నాడు మధు కృతజ్ఞతతో. ఇంతలో పనిచేసే మనిషి కాఫీ తెచ్చింది. సరోజ మధుకి త్రాగమని అందించింది. కాస్త చప్పరించి తృప్తిపడ్డాడు.

తరువాత సరోజ నెమ్మదిగా లేచి, మేడమెట్లు దిగి క్రిందకు వెళ్ళింది.

సరోజ తండ్రి ఎదురుచూస్తూ కూర్చున్నాడు అప్పటికి.

"రెండు రోజుల్నుంచీ నువ్వు రాకపోయేటప్పటికి నేనే వచ్చానమ్మా!" అన్నాడు తండ్రి.

సరోజ తండ్రి వెంకట్రావు టి. బి. వల్ల పూరవతిల ప్రశాంతంగా ఒకచోట డాబాలో వుంటున్నాడు. అప్పుడప్పుడు సరోజ రఘూను వెంటతీసుకొని, తండ్రిని చూడ్డానికి వెడుతూవుండేది ఇలా ఒకనాడు వెళ్ళి వస్తూండగానే మధు సరోజ కారుక్రింద పడటం జరిగింది.

ఈ విషయాన్నంతా సరోజ తండ్రికి తెల్పింది. వెంకట్రావు మధుని గురించి విని, జాలిపడ్డాడు. ఒక్కగానొక్క కూతురైనప్పటికీ, ఆమె చూపిన దయకు—సానుభూతికి మెచ్చుకొని, మధుని చూడటానికి పైకివచ్చాడు—

మధుని పరిచయం చేసింది సరోజ.

అతను కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరించాడు. వెంకట్రావు అతని నమ్రతకు, గౌరవానికి తృప్తిపడి కాసేపుండి, ఆ మధ్యాహ్నం స్వస్థానానికి వెళ్ళిపోయాడు.

## 6

వారం రోజులు యిట్టే గడిచిపోయాయి.

మధుకి సరోజను చూస్తూ, తృప్తిపడటం ఒక కళాభ్యాసంగా మారిపోయింది.

ఆ రోజు సాయంత్రం వచ్చి డాక్టరు రఘు 'ఎలా వున్నావు'—

"మీ దయవల్ల"—అంటూ నమస్కరించాడు.

"తప్పకుండా నయమవుతుంది. భయంలేదు" అన్నాడు రఘు.

మధుకి తేలికనిపించింది బ్రతుకంటే.

"నిరాశపడకుండా చూసుకో!" అని సరోజకు చెప్పి రఘు వెళ్ళిపోయాడు.

మధుకి లేచి తిరగాలనిపించడం మొదలెట్టింది.

ఈ వారంరోజులబట్టీ సరోజని చేస్తున్న సేవకు మధుకి బ్రతుకుమీద మమకారం—ఆశ పుట్టినయి

సరోజ తీరిక వేళల్లో మధు దగ్గరగా కూర్చొని, యేవో కబుర్లు చెప్పుతూవస్తోంది—అతను అన్నింటికి బద్ధుడై సరోజ సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ యేవో కలలు కంటున్నాడు.

ఆరోజు రాత్రి సరోజ, అతను నిద్రపోయింతరువాత, తన 'నటన' గురించి తానే సమీక్షించుకొంది. తనంతో యిలా జరగటం, అతనిపట్ల అపచారమేమో! అని భయపడింది. కాని అతనిమీద వున్న ఆశే, తన నిట్లా చేయిస్తోందని ఆమెకు మనసులో తేలిగా తోచింది.

తెల్లవారింది.

సరోజ మామూలుగా కాఫీ అందించింది.

"నే నెప్పుడు లేచి తిరుగుతానని చెప్పాడూ డాక్టరు?" అన్నాడు మధు.

సరోజ నవ్వింది. జీవితమంటే భయపడి చావుకి దారి తీసిన నిర్భాగ్యుడు. నిరాశాపూరితుడు—బ్రతుకు

విలువ తెలుసుకోలేక భయపడినవాడు. ఈ ప్రపంచంలో ఇంతకాలం ఇంకా వుంటటం, ఆమె నవ్వుకి కారణం?

"డాక్టరు తిరగమనంటే తిరగడానికి వీల్లేదు!" అంది శాసనపూర్వకంగా—

"ఎందుకని"—అన్నాడు మధు.

"ఎందు కేమిటి!—అంతే"—

"అదేమిటి! నాలో తిరిగే శక్తివుంటే తిరక్కూడదా!" మంకు పట్టుదలతో అన్నాడు మధు.

ఇంతలో రఘు వచ్చాడు.

"ఎలా వుంది—మధూ!" అన్నాడు.

"నేను తిరగొచ్చా!" అని అడిగాడు.

"ఇంకా నాలుగైదు రోజులు ఆగిన తర్వాత—"

"అంతవరకూ యేం చెయ్యను?"

"సరోజ వుందిగా—" అంటూ సరోజవైపు చూశాడు రఘు.

ఆమె ముచ్చటగా నవ్వింది.

మధు ఆమెవంక చంటిపిల్లవాడిలాగా చూస్తూ!—

"నువ్వు యెక్కడికీ వెళ్లకు సరూ! యేదైనా చదివి కథలు చెప్పాలి — లేకపోతే నాకేంతోచదు"—అన్నాడు.

"అలాగే—మధూ"—అంది సరోజని.

మధు లేచేవరకు ఆమె అన్నట్లుగా సేవ చేసింది—మధు యేవో ఉబుసుపోకగా అడిగేవాడు. ప్రేమసీ పల్కులకన్నా తియ్యగా సమాధానాలు యిస్తూండేది మధుకి.

మధు హృదయం సరోజ సల్లాపాల అమృతంతో నిండిపోతోంది.

ఒకనాటి రాత్రి మధు ఒంటరిగా లేచి గదిదాటి వసారాలోకి వచ్చి, కుర్చీలో చతికిలపడి కూర్చొన్నాడు.

అప్పుడు సరోజ యేదోపనిమీద క్రిందకు దిగివెళ్లింది. అరగంటయిన తర్వాత సరోజ వచ్చిచూసింది.

మధు, విరియగాసిన వెన్నెల్లో—కదలని రమ్యమైన ప్రకృతిని, అవలోకిస్తూ యేదో పునశ్చరణ చేసుకొంటున్నాడు.

సరోజ అడుగులచప్పుడికి మధు చలించి చూశాడు. ఆమె నవ్వుతూ మగుండగ్గరగా వచ్చినిల్చుంది — ఆమెకళ్లల్లోకి, మధు చూస్తూ—

"యెక్కడికెళ్లావు సరోజా!" అన్నాడు—

"మీకు కాఫీ తేవాలని వెళ్లా"నంది—

"త్రాగి త్రాగి నోరంతా చేదెక్కిపోయింది. కాఫీ అంటే విసుగ్గూడా పుట్టింది. దాని పేరెత్తితే చిరాకెత్తుతోంది"—అన్నాడు ముఖం చిట్లించుకొంటూ.

"పోనీలెండి. ఇప్పుడు త్రాగద్దులే"—అంది అతని అయిష్టాన్ని గ్రహించి—

మధు ఒక్కసారి ఆమె స్వరూపాన్ని బాగా చూశాడు.

"పండువెన్నెల్లో తనకోసం కలలుగనే సరోజ రేగిన ముంగురుల్లో రోజామలాటి కోలమొగం, నవ్వితే బుగ్గన చొట్టబడే నవయవ్వనం—" మధుని వుక్కిరిబిక్కిరిచేసినయి అలాగే చూస్తూండటంతో, సరోజకు యేదో అనిర్వచనీయమైన మధురభావం కొట్టింది—

"యేమిటలా చూస్తున్నారు!" అంది—చిరునవ్వుతో.

"యేమీ లేదు."—

"ఏమీ లేకపోతే యెందుకట్లా చూస్తారు నా మొగాన్ని"

"సరోజా!"—

"ఊ—"

"ఇలా కూర్చో! ఒక్క మాట!"—

సరోజ ప్రక్కనేవున్న కుర్చీలో కూర్చుంది—

"ఏమిటది?"

"నీ సౌందర్యం నన్ను మళ్ళా బ్రతికించింది. విసుగెత్తిన లోకానికి మళ్ళా విందు చేస్తున్నా! ఆశతో పెనవేసుకొన్న హృదయానికి నీ ప్రేమవల్ల నీరాంజనాలు సమర్పిస్తున్నా!"

"ఏమిటే కవిత్వం చెబుతున్నారు?"—అంది.

"కవిత్వం కాదు సరోజనీ, ఒకప్పుడు మనిద్దరం కాలేజీలో నాటకం వేశాం గుర్తుందా! అందులో నా పోర్షన్‌లోని యీ మాటలు యింకా నేమర్చిపోలేదు. ఈ రోజు మళ్ళా జ్ఞాపకానికి వస్తున్నయి నిన్ను చూస్తుంటే"—

"ఒక్కరే లేచి యేలా వచ్చారు."—

"నిద్రపట్టలేదు యెంతసేపు కళ్ళుమూసినా! ఇంత వెన్నెల వృథాగా మరిగిపోవడం నాకెంతో చిన్నతనమనిపించింది.

సరోజని శరీరం ఒక్కసారిగా పులకరించింది. అణగివున్న కోరికలు చిగురులెత్తాయి. ఆమని కోయిలతినలో మధుర రాగాలాపన చేసినట్లనిపించింది. నవవసంత సుమమాలనైపోయా ననిపించింది — మధు చూస్తున్న

చూపుల్లో ఆమెకు అర్థంకాని అనుభూతులు గోచరించాయి-పల్కరించాయి-ద్రవించాయి.

"రఘు లేవద్దంటే యెందుకు లేచారు?" అంది పైకి.

"అలాగే అంటారు లేవడానికి యిష్టంలేక—వాళ్ళకేం తెలుస్తుంది రోగిబాధ—అవస్థ"—

"అలా అనకండి! డాక్టరు చెప్పినట్లు వినాలి"—

"వింటే—యింకా యేడిపిస్తారు....ఓపిక వున్నప్పుడు యెలా పడుకోను."

"ఇంత పెంకితనం—పనికిరాదు!"—

"నీకు తెలియదు సరోజా! బాధ వ్యక్తిని పరీక్షిస్తుందనుకొంటారు డాక్టర్లు. కాని నాకేమో అదంటే ప్రస్తుతం నమ్మకం లేదు సుమా!"—

సరోజ అతని మనస్తత్వం యింకా గ్రహించలేదేమో!

మధు నిశ్చింతగా — నిర్మలంగా—నిష్కల్మషంగా చూస్తున్నాడు సరోజను.

ఆమె కేదో సిగ్గు వచ్చింది.

"ఎందుకలా చూస్తారు?" అంది.

"నా కిష్టమైంది అదొక్కటే"—అన్నాడు మధు.

"ఏమిటో మరీను!"—సిగ్గు బాధ మితిమీరింది.

"ఏముంది—చాలా చిక్కిపోయావు నామూలంగా!"—అంటూ ఆమె బుగ్గల్ని స్పృశించాడు తన మునివేళ్ళతో—

ఆమెకు నవనాడలూ జలదరించాయి

మంచు మూలంగా—యిద్దరి శరీరాలు చల్లబడ్డాయి.

"నిద్ర రావటంలేదా!" అంది—

"జోల పాడితేగా"—సరోజ ప్రియుడంటే యిలాగే మాట్లాడుతా డనుకొంది.

ఆరాత్రి మధు సుఖంగా సరోజను చూస్తూ నిద్రపోయాడు.

## 7

తెల్లవారింది.

రఘు మామూలుగా వచ్చాడు.

సరోజ జరిగిన విషయమంతా చెప్పింది.

ఆశ్చర్యపడ్డాడు రఘు.

చావుబ్రతుకుల సమస్యలు చాలావరకు రోగిమీదే ఆధారపడివుంటా యనుకొన్నాడు. తన మందువల్ల బ్రతికినాడనుకోవటం కంటే, సరోజని ఉపచర్యవల్ల తేరుకోగల్గాడని, తృప్తిపడటం సమంజస మనిపించింది. ఆరోజే రోగిని అన్నం తినిపించాలనుకొన్నాడు రఘు.

సరోజని 'సరే' అంది.

మధు ఉర్రూత లూగిపోయాడు.

తన నటన, నాస్తిక జీవితానికి నాంది ప్రస్తావనగా అవుతుందని సరోజని కలగనలేదు. కల నిజమైంది. మధు హృదయాన్ని నమ్మించినందుకు, అతను తనవల్ల పునర్జన్మ యెత్తినందుకు, తన ప్రేమకు అంతస్థులు లేకపోవటంవల్లనూ, జీవితంలో మధుతోబాటు సహకరించడానికి సంసిద్ధురాలై, వెంకట్రావుతో మధు విషయాన్ని, అతనిపట్ల తన మనోభిప్రాయాన్ని, వెల్లడించుకొంది—

వెంకట్రావు సరోజ మాటల్లోగల యథార్థాన్ని అవగాహన చేసుకొని కాదనలేకపోయాడు—

మధు నేత్రాలలో సరోజ హృదయం పుప్పొడి రాల్చింది.

రఘు చేసిన ఉపకారానికి సరోజని ప్రతిఫలం సమర్పించుకొంది—కాని, తనపట్ల సరోజని యీ విధంగా సత్కరించి, గౌరవించుతుం డనుకోలేదు—ఆమె పంపిన ప్రతిఫలాన్ని పరీక్షగా చూస్తూ, అందుతున్న హాయిని జారవిడుచుకొన్న వాడిలాగా మొగం పెట్టి నిర్వేదించాడు.

# వేమన మనీష

శ్రీ చిత్రజల్లు వరహాలరావు

పోటెత్తిన సముద్రంలాగా సమాజంలో చెలరేగిన నైతిక విశృంఖలత్వం, దగా, సంగిపూజ, దొంగభక్తి, వేషధారితనం, కుట్రా కుహకాలతో నిండిన దంభపు జీవనం, మంత్రతంత్రాలు, చెదపురుగులాగా సంఘాన్ని తింటున్న వర్ణ వ్యవస్థ, మత విద్వేషం మహామారిలా విజృంభించిన కాలంలో వేమన జన్మించాడు.

వేమన పుట్టుపూర్వోత్తరాలనుగూర్చి ఎన్నో వాదనలున్నాయి. క్రీ. శ. 1328—1428 వరకు పాలించిన రాచవేమారెడ్డికి, వేమన తమ్ముడని కొందరి అభిప్రాయము. వీరి ప్రకారం, వేమన తండ్రి కొమరగిరి వేమారెడ్డి, తల్లి మల్లమ్మ, వదినె నరసాంబ. వేశ్యాలోలత్వంలో మునిగి తేలే వేమనకు, వదినెయుక్తివల్ల ఆ జీవితంపై రోత పుట్టి, లంబికాశివయోగివలన ఉపదేశంపొంది, జ్ఞానియై, సర్వసంగపరిత్యాగంచేసి, యోగిగా జీవించి, కటార్లపల్లెలో సమాధి అయ్యాడట ఈ వాదానికి ఎట్టి చారిత్రిక నిదర్శనాలు లేవు. ఇదొక పుక్కిటి పురాణం మాత్రమే.

పైడిపాలకోడిది రెడ్డివంశానికి, కనుగోళ్ళ గోత్రానికి చెందిన కొండవీటివాడని మరో వాదన. ఈ వాదన ప్రకారం ఇతని మొదటి పేరు పుల్లారెడ్డి. అన్నతో పోట్లాడి, రాయలసీమలోని కదిరి సమీపాన వున్న "నల్లచెరువు"కు తల్లితో వచ్చి సేద్యం చేస్తుండగా, ఒకరోజు యితనిపై పిడుగు పడ్డదట! మరణించాడు. తల్లికి కలలో కన్పించి ఎనిమిదోరోజున మరల జీవిస్తానని చెప్పాడు. ఎనిమిదో రోజున సజీవుడవగా "ఏం పుల్లారెడ్డీ ఎట్లా ఏడురోజులు చచ్చి, తిరిగి బ్రతికావని అడుగగా" నా పేరు పుల్లారెడ్డికాదు, వేమనఅని జవాబిచ్చాడట! నాటినుండీ భూమిపై సంచరించ ప్రారంభించాడట. చచ్చి బ్రతికిన వేమన, మరల ఎప్పుడు చనిపోయాడో, ఈ పిట్టకథను సృష్టించిన వారికే తెలియాలి.

ఐతే, వేమన పుట్టుక, తేదీ, కులం, చావు మున్నగు విషయాలను సాధ్యమైనంతవరకు ఆయన పద్యాలద్వారా తెలిసికొనవచ్చును. సాధ్యమైనంతవరకని ఎందుకు వాడినానంటే, ఆయన పద్యాలు, ఆయన జీవితాన్ని గూర్చి సమగ్రమగు సమాచారాన్ని యివ్వవు.

"కలియుగమునమున్న కాపు కులానకు
వేమన తన కీర్తి విక్రయించె."

ఈపద్యంద్వారా వేమన కాపు కులజుడని స్పష్టము. "ఎవర మెరుగనట్టి వృత్తిజీవులు," కాయకష్టంపై ఆధారపడి, రెక్కాడితేనేగాని, డొక్కాడనివారు, మాయ మర్మాలు తెలియనివారు అయిన కాపువారి కుటుంబంలో వేమన పుట్టినాడు.

రెడ్డిరాజులలో చివరివాడైన రాచవేమారెడ్డికి, తమ్ముడైనపక్షంలో వేమనకవిత్వంలో రాచనగరి వాసన, రాజ జీవితమందలి భాగ్యభోగ్యాలు, వైభవ విలాసాలు, తప్పక ప్రతిఫలించి తీరాలి. కాని వేమన పద్యాలనన్నిటినీ కూలంకషంగా, విమర్శనాదృష్టితో చదివిన ఎవ్వరూ, వేమన రాజవంశానికిచెందిన వ్యక్తి అనే నిర్ణయానికి రాలేరు.

"వేమనపద్యములందెల్ల స్వానుభవమును కవితా ధర్మం తొంగిచూచుచుండును." (వేమనవ్యాసాలు—రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.) వేమన ఒకరి భావాలను, వర్ణనలను, శిల్పాన్ని కాపీకొట్టలేదు; కొట్టలేదు కూడా. అది అతని స్వభావానికే విరుద్ధం. షేక్స్పియర్ గ్రామర్ పాఠశాలలో, గ్రీకులో పొందిన జ్ఞానం, వేమన వీధిబడిలో పొందిన విజ్ఞానం, రెండూ సమానమే.

"ఎంత సేవజేసి యే పాటు పడినను
రాచమూక నమ్మరాదు రన్న
పాముతోడి పొందు పదివేలకైనను,"

అని అన్న వేమన రాజవంశానికి ఎట్లా చెందుతాడు? రెడ్డిరాజుల వంశమువాడైన వేమునకు రాచమూకను నమ్మవలసిన అగత్యం ఏం వచ్చింది? రాజసేవ చేయ వలసిన గతి ఏంపట్టింది?

వేమనకు అతి సామాన్యమగు జానపదజీవితం లోని వాస్తవాలు, అనుభవాలు పూర్తిగా తెలుసు. తిని, తాగి, తిరుగమరగిన యువరాజులకు, అందు లోనూ రెడ్డిరాజసం పుట్టిపడే రాచరికపువారికి సామాన్య రైతుజీవితంతో సంబంధం వుండటం అసంభవం కాకపోయినా, కష్టతరం. వేమన తాను ఏంచూచాడో, చేసాడో, చెప్పాడో, అనుభవిం చాడో, అదే ఆయన కవిత్వంలో నిండుటడంలోని, నీటలాగ అతి స్పష్టంగా గోచరిస్తుంది. ఆయన కవి త్వంలో రాచనగరివాసన, చంద్రకాంత శిలానిర్మిత సుందర భవనాలలో భాగ్యభోగ్యాలను అనుభవిస్తూ, వెన్నలాంటి పరుపులపై విరహంలో జాగపడే, సొక్కి సోలిపోయే, అంగనామణులు కన్పించరు.

"పుంజు గూటనుండి ప్రొద్దెఱింగియె కూయు"

అనే జానపదు లెఱింగిన సత్యం వేమనకు తెలుసు.

"కడుపునిండ తిరుగు గంపలో బెట్టక
చన్ను ముట్టనీదు కొన్న బఱ్ఱె"
"పాలలోన పులుసు బీలతో గలసిన
విఱిసి తునకలగును విఱివిగాను"
"దొమ్మ తెగులు చేత తూలిన గేదకు
వాత వేయ బ్రతికివచ్చు"
"గడ్డివేసిన పోట్లగొడ్డు కొమ్మాడించు"
"కుండ చిల్లిపడిన కుడ్డ దోపగవచ్చు"
"పచ్చి కుండలో నీళ్లు పట్టిన నిలువవు"
"పుక్క యిల్లు సొచ్చి కుండలు వెతకుట"

ఇత్యాది విషయాలు—జానపదుల యిళ్లలో, వారి జీవితాలలో అనుదినం, జరిగేవి—వేమన అనుభ వించాడు; చూచాడు; చేసాడు. "పండిన చేలోని పల్లేరుగాయలు" త్రొక్కాడు. సామాన్య రైతు జీవితంలో వచ్చే కష్టనష్టాలను అనుభవించాడు. నడి వయస్సు వచ్చేసరికి, బ్రతుకుపై రోతపుట్టి, భోగి ఐన వేమన యోగి అయ్యాడు. తెలుగునాడంతా సంచరించి పద్యాలద్వారా బోధించి, నాటి సమాజంలోని సర్వ రూపాల్లో ఉన్న దోషాల్ని దుయ్యబట్టాడు. అవసానకాలంలో, పామూరివద్ద ఉన్న కొండ గుహలో ప్రవేశించాడని సంప్రదాయం చెపుతోంది.

"వేమన మహమ్మదీయులు ప్రభువులుగా కడప సీమ యుండున్న కాలమున, అనగా 17-వ శతాబ్దం కడపటి భాగంలో వుండివుండును." (బ్రౌన్‌దొర.)

"నాకు జూడగా 18-వ శతాబ్ది ఆదియందె వేమన్న ఉండెనని యూహించుట యనుకూలముగా దోచుచున్నది." (రాళ్లపల్లి. అ. కృ)

శేషాద్రి రమణకవులు ఈయన జీవితకాలం క్రీ. శ. 1540-1600 వరకు నని అభిప్రాయపడ్డారు. ఏది ఎలావున్నా, ఇతడు రాయలసీమకు చెందినవాడై అనంతపురం కడపజిల్లాలలో ఏదో ఒక ప్రదేశానికి చెందివుండవలయును. కదిరి తాలూకా కటార్లపల్లెలో ఇతడు సమాధినిష్ఠుడై యుండవచ్చు. పీటన్నిటికితోడు వేమనకు కొండవీటితో ఏదో రూపంలో సంబంధం వుండివుండవలెనని సర్వులూ అంగీకరిస్తున్నారు. వాస్తవమగు నిదర్శనాలు దొరకువరకూ ఊహాలు ఊహాలుగానే వుంటవి.

ఐతే మనకి ముఖ్యమైనవి, వేమన పుట్టుపూర్వో త్తరాలు మాత్రమే గావు. ఆంధ్ర వాఙ్మయంలో వేమన స్థానం ఏమిటి అనేదే మనందరికీ కావలసిన విషయం. తెలుగు సారస్వతంలో వేమనకు విశిష్టమగు స్థానం వుంది. వేమన మహాకవి; ఉత్తమ సంస్కర్త; విమర్శకుడు; మానవ జీవితంలోని గంభీరములగు నిగూఢ రహస్యాలను ఎఱిగిన మన స్తత్వశాస్త్రజ్ఞుడు.

చాలా కాలంవరకు పండితప్రకాండులు, వేమ నను కవిగా గుర్తించలేదు. నవ్యాంధ్ర ప్రతాళికుడుగా, సంఘసంస్కరణకు, తెలుగుజాతి మహోజ్వల భవి ష్యత్తుకి, జీవితాన్ని అంకితం చేసి, జాతిని గాఢనిద్ర నుండి మేల్కొలిపి విధవావివాహాలను చేసేందుకు, నానా అగచాట్లుపడ్డ కందుకూరి వీరేశలింగం పంతులు గారు కూడ "తలలు బోడులైన తలపులు బోడులా?" అని ప్రశ్నించిన వేమనకు, తాను వ్రాసిన ఆంధ్రకవుల చరిత్రలో కవిగా స్థానం యివ్వకపోవటం ఆశ్చర్య కరం.

20 వ శతాబ్దం మొదటిభాగంలో వేమనకూడ అతి సామాన్యకవి యని పండితులు దప్పరించారు. కీర్తిశేషులు కట్టమంచివారు తాము వ్రాసిన కవిత్వ

తత్త్వవిచారంలో వేమన ఉత్తమకవి అనే అభిప్రాయం వెలిబుచ్చారు. ఆంగ్లేయులోని కవిపండితులు, వాఙ్మయచరిత్రకారులు వేమనపై దృష్టిని ప్రసరింపజేసి పరిశోధించడం ప్రారంభించారు. ఆశ్చర్యకరమగు విషయ మేమిటంటే, విదేశీయుడగు బ్రౌన్‌దొర, వేమనపద్యాలను ఇంగ్లీషులోకి అనువదించువరకు, తెలుగుదేశంలోని పండితులకు వేమన కవిత్వంలోని, విశిష్టత, తియ్యదనము తెలియకపోవుటయే. వేమన స్త్రీపై వ్రాసిన పద్యాలను ఒక పుస్తకంలో ప్రత్యేకంగా వ్రాసుకొని, దానికి లాటిన్ భాషలో పీఠిక వ్రాసి దగ్గర వుంచుకొన్నాడంటే బ్రౌన్‌దొర, వేమన కవిత్వానికి ఎంత ముగ్ధుడయ్యాడో కదా! ఒక కవి యొక్క సిద్ధాంతాలను, తత్త్వాన్ని, స్వభావాన్ని, సహృదయంతో అర్థం చేసికోవాలంటే, ఆ కవి ఏ సామాజిక, ఆర్థిక, నైతిక, మతపరిస్థితులలో జీవించాడో తెలుసుకోవాలంటే, ఆ పరిస్థితులు తిరిగి అతనిపై ఎట్టి ప్రభావాన్ని చెలాయించినవో; ఆ ప్రభావానికి అతడెంతవరకు లొంగి, దాన్ని ఎంతవరకు అధిగమించగలిగాడో, మున్నగు విషయాలను కొంతవరకు నిర్ణయించేందుకు వీలవుతుంది.

వేమన 17 వ శతాబ్ది చివరిభాగంలో జీవించాడు. నాటి తెలుగుదేశంలోని రాజకీయపరిస్థితులు అరాచకంగా వున్నాయి. దక్షిణాపథాన్ని ఏకచ్ఛత్రాధిపత్యం క్రింద ఏలిన విజయనగర సామ్రాట్టులు 1565 లో కళ్ళికోటయుద్ధం పిదప, తురకల కరకు కత్తులకు ఎర ఐపోయారు. పుట్టకొక్కులవలె ఎన్నో స్వతంత్రరాజ్యాలు తలెత్తాయి — నాడు పన్నులిచ్చుటవరకే ప్రజల బాధ్యత. పుచ్చుకొనుటే రాజుల పని. ఇదే నాటి పాలకపాలితుల మధ్య వున్న సంబంధం.

లెక్కలేనన్ని మతాలు ఉద్భవించాయి ఎంబెరుమతం, శైవమతం, వీరశైవం; లాంటి మతాలు; ద్వైత అద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతాలు, వీటన్నిటికి సంబంధించిన కర్మకాండ, మనిషికి మనిషికి మధ్య కంచుగోడలను గట్టినకుల వ్యవస్థ, మతంపేర మోసకారులు చేసిన దుర్మార్గ కృత్యాలు, వేమన జీవించిన సమాజంలో ప్రత్యక్ష సత్యాలు. గ్రామదేవతలకు పూజలు, బలులు జంగాల పాదతీర్థాలు, ఉండేవి. పరమత ద్వేషం, వేషధారితనం, దంభపు జీవనం, నాటి సమాజాభివృద్ధికి అడ్డంకు లయ్యాయి.

రాజు బలహీనుడై, మతగురువులు ధర్మచ్యుతి నొందినపుడు జీవితంలో నీతి అనేది కరి మింగిన వెలగపండు ఔతుంది. అపుడు విషయవాంఛలు కట్టలు తెంచుకొని పాదరసంలా ప్రవహిస్తాయి. వేశ్యల వునికి నాటి సమాజంలో మరో నగ్నసత్యం. పెట్టుబడి లేని వ్యాపారం కదా వేశ్యావృత్తి. ఊరి కొక దేవాలయం. ఆలయాని కొక దేవదాసి. ఒక దాసి చాలదన్నట్లు శైవవైష్ణవ మతాలకు చెందిన బసివిరాండ్రు. వీరితోపాటు యిరుగుపొరుగు పడతులలో చెలరేగిన అవినీతి. ఇది కూడ చాలదన్నట్లు యింటివద్ద ఇల్లాలుగా వుండి సంతలో సానివృత్తిచేసే "సంతబసివిరాండ్రు" అనే సంతసానులు, దొమ్మరిసానులు వుండేవారు. ఈ లక్షణాలన్నీ నాడు అగ్నికి ఆజ్యంవలె, నైతికవిశృంఖలత్వానికి సహాయపడ్డవి.

పరస్త్రీ సంబంధము, వేశ్యాసంపర్కము పాపమైనప్పటికీ క్షంతవ్యమైన నేరమనీ, వ్యభిచారం నాగరికానికి లక్షణమనీ ఏకపత్నీవ్రతం చాతగానితనమనే భావాలు, నిర్భయంగా చలామణీ అయ్యే రోజులవి.

ఎంత జిజ్ఞాసువైనా, ప్రతిభావంతుడైనా, వేమనపై కూడా కొంత కాకపోతే కొంతైనా, పై పరిస్థితుల ప్రభావం పడింది.

అందుకనే గావును—

"ఆడుదాని జూపె నర్థంబు జూపెగ
బ్రహ్మకైన పుట్టు రిమ్మతెగులు."

ఆపరిస్థితులలో బ్రతికిన వేమన మగజాతికే కాకుండా ఆడుజాతి కంతటికీ జారత్వం ఆరోపిస్తున్నాడు. చూడండి—

"మగడు చక్కనైన వజ్రాల గనియైన
తళుకు మెరపువంటి తత్త్వమున్న
అన్యపురుష వాంఛ ఆడుదానికి నుండు,"

బ్రహ్మవంటివాడికే ఆడుదాన్ని జూస్తే రిమ్మతెగులు పుట్టగా మానవమాత్రునికి పుట్టడం ఒక వింతా అని వేమన ప్రశ్న! అంతేకాదు. వజ్రాలగనిలాంటి ధనవంతుడు, సుకుమారుడు ఐన భర్త వున్నా ఆడుదానికి పరపురుషునిపై వాంఛ వుంటుందని, స్త్రీజాతికంతటికీ

జారత్వం ఆరోపించే స్థితికి వచ్చాడంటే, నాటి సమాజంలో ఇంద్రియ లోలత్వం ఎంతటి దశ నందుకొందో ఊహించవచ్చు. నాటి పరిస్థితుల ఫలితమే వేమనలో జనించిన స్త్రీ ద్వేషం, స్త్రీపై అనుమానం, అతనికి అలవడిన పరస్త్రీ సహవాసం; స్త్రీ స్వభావాన్ని కొన్ని విషయాల్లో బాగానే అర్థం జేసికొన్నా, కొన్ని విషయాల్లో తప్పుడు నిర్ణయాలకు కూడా వచ్చాడు. అన్నవస్త్రాలకు లోటులేని మధ్యతరగతి కుటుంబంలో జన్మించిన వేమన జీవిత ప్రథమ దశ శాంతంగానే గడిచిపోయింది.

"సద్ది మిగులనింట సంసారమేలరా"

"పప్పులేనికూడు పరుల కసహ్యము."

అని చెప్పిన వేమన సుఖమయ జీవితాన్నే గడిపి వుంటాడు.

గాలి, ఆకులు తిని యమపకచ్ఛడాలు బిగించిన మునులే సౌందర్యలలాముల చేతుల్లో బానిసలవగా, ఉప్పూ కారం తింటూ, ఊరిలో పెత్తనం చెలాయిస్తూ జేబులో డబ్బు, శరీరంలో యౌవనం బలిసిన వేమన, వేశ్యాలోలుడగుటలో విచిత్రం లేదు. అంతేకాదు. వేమన జన్మతః శృంగార ప్రియుడు. భోగి. దీంతోపాటు నాటి పరిస్థితులు అవినీతికరజీవితానికి అనుకూలంగా వున్నవి. తత్ఫలితమే, వేమనలోని వేశ్యాలోలత్వం. వేమనలాంటి వేదాంతికి వేశ్యాసంపర్కం వుండదని తలచుట వెఱ్ఱితనం. కారణం—వేమన కూడా మానవుడే. యౌవనంలో తిరిగినా తల నెరసిన పిదప తత్త్వజ్ఞాని యగుటలో విచిత్రం లేదుకదా. ప్రపంచంలో ఎవడూ రాముడుగా గాని, రావణుడుగా గాని వుండడు, వుండలేడు. అవినయము జడాత్మకమగు యాంత్రిక దృక్పథం వాస్తవ మానవ జీవితానుభవానికి విరుద్ధం.

సుందరములగు గులాబీల్లాంటి ఈ క్రింది పద్యాలు చూడండి. సాని స్వభావాన్ని, దాని తల్లి స్వభావాన్ని, "పొరుగింటి పుల్లకూర మరగిన దాని" స్వభావాన్ని ఎంత చక్కగా, శక్తివంతంగా, సంగ్రహంగా చెప్పాడో—

"లంజ లంజకాని లావెల్ల గొనియాడు
లంజతల్లి వానిలజ్జ గదుగు
తల్లి గలుగులంజ దగులుట చీకాకు."......

అంతేకాదు—

జార పురుషునకును జాజి పూవుల తోడ
పాన్పు వేయునయ్య పాతలంజ
సొంత మగనిమీద చింతనిప్పులు జల్లు."......

వేశ్య కలవారల కలికి. లేనివారి మొహాలను లాభసాటి కాదంటూ, ఆస్యమెత్తి చూడబోదు. ఇది దాని నైజం. సాని దృష్టిలో, "శ్రీ"ని హరించు శ్రీహరి (దానితల్లి) దృష్టిలో పసిడిగల్లువాడు కురూపి ఐనా, రోగి యైనా, చివరికి ముసలి వగ్గయినా, మన్మథుడే. కాసులేనివాడు కొబ్బరిపీచుకన్నా ఏడు వీసాలు తక్కువ. జేబులోని డబ్బు గాలిలోని కర్పూరంలా వేశ్యాసంబంధంవల్ల కరిగిపోయినప్పుడు, సాని కాదు, దాని తల్లి కాదు, కనీసం కాపలాకుక్కైనా గుమ్మంలోకి రానీయదు. ఎందరో యిల్లాండ్ర పుస్తెలను, పుటుక్కున తెంపి చరిత్ర నిర్మించిన సుప్రసిద్ధ వేశ్య మాతలచేత, తన్నులూ తాపులూ తిని, మెడబట్టి గెంటబడి, ఉన్న కొంచెం సిరి, పరపతీ వీథిలో కడిగించుకొని విసిగి వేసారిన వేమన విశ్వంలోని విటులకు—

"తల్లిగలుగు లంజ తగులుట చీకాకు"

అనే ప్రఖ్యాత సిద్ధాంతం ప్రతిపాదించి, బోధించాడు!

ఇంటిలోని పోరుతోను కొరవిలాంటి కొడుకుల తోను దారిద్ర్యభారంతోనూ వేమన విసిగివుంటాడు. కాబట్టే—ఈ క్రింది పద్యం—

"సతుల గవయ నేల సుతుల పొందగ నేల
వెతల జెంద నేల వెఱ్ఱితనము
నేలమీది రాయి నెత్తి కెత్తినయట్లు—"

భోగి ఐన వేమన యోగి అయ్యాడు. విశాలవిశ్వంలోకి కాలు పెట్టాడు. జీవితంతో విసిగి వేసారి, తుదకు ఏదో మారుమూల మఠంలో తిష్ఠవేసి పక్కా వేదాంతాన్ని బోధించలేదు. అవినంగా జీవించివున్నట్లైతే, ఆయనను గూర్చి తలచటం అనవసరం. ఉత్తమ బోధకుడుగా, నాటి సమాజంలోని దగాను, దంభాన్ని కడిగినవాడుగా, తద్వారా తెలుగుజాతి మహోన్నతి భవిష్యత్తుకు, మార్గం చూపిన అద్వైత తత్త్వవేత్తగా, మహాకవిగా, నేడు ఆయనను మనం పరిగణిస్తున్నాము.

ధర్మచ్యుతి, నైతిక జీవిత పతనం, నామధారి మతస్థులు (ఎంగిలి మతస్థులు) లింగ మతస్థులు చేసే

వంచన, "బూడిదజేసి జడలు భస్మంబు పూతల"తో వున్న కపట సన్యాసుల వేషధారితనం; ఎంబెరు మతమని చెప్పి, ప్రసాదం పేరుతో మాంసం తిని, తీర్థమను మారుపేరు పెట్టి మధువు త్రాగి, "వావివరుసలు దప్పి వలికి పాలయ్యే" మతగురువులు, ప్రజల అజ్ఞానం యివన్నీ వేమనను, ఆకర్షించాయి.

అన్ని మతాలు ప్రారంభంలో ఉత్తమాశయాలతోనే ప్రారంభింపబడుతవి. భగవద్ధ్యానంకొరకు, ఉత్తమ నైతిక జీవితసాధనకొరకు మతాలు ఆవిర్భవిస్తాయి. క్రమక్రమంగా ఆ మత సిద్ధాంతాలను అవలంబించు వ్యక్తులు దౌర్భాగ్యులైనపుడు, సహజమైన ఇంద్రియ లోలత్వం బలిసి, వ్యక్తులు తమ తప్పులను మత సిద్ధాంతాలకు అంటగట్టి, ఆ మత సిద్ధాంతాల పేరిట, తమ అవినీతిని కొనసాగిస్తారు. అపుడా మతం, మతగురువులు పతితులౌతారు ఈ సత్యం, వజ్రయాన బౌద్ధం భారతదేశంలో వర్థిల్లిన కాలంలో బౌద్ధభిక్షుకీభిక్షువుల నైతికపతనానికి, మార్టిన్ లూథర్ కాలంలో రోమన్ కాథలిక్ మతంలోని "నన్స్" (ఆడగురువులు) "మాంక్స్" (మగగురువులు) గడిపిన అవినీతికరజీవితానికి, ఎంబెరుమతంలో వావివరుసలు తప్పి సంచరించు అయ్యవార్లకు వర్తిస్తుంది.

వేమన జీవించుకాలంనాటికి ద్వైత అద్వైత మతాలమధ్య విద్వేషం పుట్టింది. పంగనామాలను గోపీచందనంతోనా, లేక తిరుమణితో ధరించవలెనా అను సమస్యపై మాధ్వులకు రామానుజీయులకు వైరం వచ్చింది. బూడిదజేసి జడలు పెంచుకొని కావిబట్టలు గట్టిన ప్రతిసన్యాసి ప్రజలు తనను పూజించాలని విశ్వసించాడు. అట్టి దాంభికులనుగూర్చి వేమన ఏవిధంగా, ఎంత కఠోరంగా, విమర్శిస్తున్నాడో చూడండి—

"బూడిదజేసి జడలు భస్మంబు పూతలు
మఱునితోడ మాఱు మలయగలదు
ముంజికోకలెల్ల లంజకోకలకాయె"......

"పొడుగుగల్గునట్టి పులితోలు భూతియు
కక్షపాలలు పది లక్షలైన
మోతచేటె కాని మోక్షంబు లేదయా"......

"మతపు వేషదార్లు మహిమీద బదివేలు
మూఢజనుల గలప మూగుచుంద్రు"......

"సర్వోపాయ పరిభ్రష్టా వేశ్యా భవతి తాపసీ" (అన్ని ఉపాయాలు విఫలమైనపుడు వేశ్య తాపసి ఔతుంది) ఎందుకూ పనికిరాని తిండిపోతులు, పరాన్నభుక్కులు, బతుకు దెరువులేని బడుగులు, సిద్ధులమనీ విరక్తులమనీ నాడు వేషాలు వేసేవారు. ఇలాంటి వేషధారులందరూ వేమన విమర్శకు గురియైనవారే. అంతేకాదు. వేమన ఆశీర్వాదాలను నాటి మతాలన్నీ రుచిమాచినవే. ఈ క్రింది పద్యాలు చూడండి—

వైష్ణవమతాన్ని గూర్చి—

"పట్టుబట్ట గట్టి పట్టెనామము బెట్టి
పట్టి భ్రాంతి జెంది వైష్ణవుడయి
లొట్టి దాగి నతడు లోకుల జెఱచురా"......

"ఎంబెరుమతమని నెసగ మాంసము దిని
మాఱు పేరు బెట్టి మధువు త్రావి
వావి వరుస దప్పి వలికిపాలౌదురు"......

జిజ్ఞాసువు, వివేచనాపరుడగు వేమన, హిందూ దేవుళ్ళను, విగ్రహారాధనను, పూజాపురస్కారాదులను ఖండించాడు. వేమనకు ఏ దేవునియందు నమ్మకం కుదిరినట్లు కన్పించదు. ఉపనిషన్మార్గసారమే-శంకరాచార్య ప్రతిపాదితమగు అద్వైతసిద్ధాంతమే మహోన్నత సిద్ధాంతంగా, వేమన పరిగణించాడు. దేవుళ్ళలో కూడా, మానవమాత్రులలో కొన్పించు బలహీనతలు కన్పడినవి. మనం అంగీకరించినా, అంగీకరించకున్నా, ఈ క్రింది పద్యాలలోని వాదనాపటిమ, తార్కిక దృష్టిని చూడండి—

బంగారు లేడిరూపంలో వచ్చిన మారీచుని గుర్తించలేక సీతను విడచిపెళ్ళిన (శ్రీరాముడు) "తెలివిలేనివాడు దేవుడెట్లాయెరా?" అని అడుగుతున్నాడు—

"కనకమృగము భువిని కద్దు లేదనకుండ
తరుణి విడచిపోయె దాశరథియు
తెలివిలేనివాడు దేవుడెట్లాయెరా?......"

"అగ్ని బాణముచేత అంబుధింకినపుడె
రాము డవలికేగ లావుమరచె
వరుస కొండలుమోసి వారధేటికి గట్టె?..."

సర్వశక్తిమంతుడగు శివుడు, "కంటి మంటచేత కాముని దహియించి" నా, కామమునను కడకు గౌరిని

పెళ్ళాడాడు. కాబట్టి "ఎట్టివారికైన పట్టు ప్రారబ్ధము," అని అంటాడు!

ఈ క్రిందిపద్యంలో, వేమన భావపరిపక్వత ఉన్నతహిమాలయశిఖరాలనుఅంసుకొంది. చూడండి—

"పునుగుపిల్లి కేల పుట్టించె వాసన
కనకము తిన కేమి కల్ల జేసె
బ్రహ్మచేతలెల్ల పాడైన చేతలు"...

వెరవది, పునుగుపిల్లికి అంత పరిమళం కలిగించకపోతే, అమూల్యమగు పసిడికే ఆ తావిని కలిగించితే, బంగారానికే పరిమళం అబ్బేదికదా? ఇంతచేసీ, బ్రహ్మ యెంతలో పొరబడ్డాడురా, అని మనఃనపడే వేమన భావపరంపర, వర్ణనాతీతం, అపూర్వం.

చరాచరప్రపంచానికి మూలకారకుడు, ఆదిమధ్యాంత రహితుడు ఐన పరమాత్మ లంచాలు పుచ్చుకోడని చెప్తూ, ఏమంటాడో చూడండి—

"రాతిబొమ్మల కేల రంగైన వలువలు
గుళ్ళు గోపురములు కుంభములును
కూడుగుడ్డ దాను గోరునా దేవుడు"...

నాటి మతాచారాలపై యింత దారుణమగు విమర్శను తెలుగుజాతిలో పుట్టిన ఏ వేదాంతి చేయలేదేమో. ఇట్టి విమర్శ నాస్తికుడుగా గాక, ఆస్తికుడుగా చేసాడు. స్వార్థం బలిసి, కుళ్ళు పేరుకపోయి దంభం, వగాలతో నిండిన నాటి సామాజిక ఆచారాలను, సహృదయంతో సంస్కరించి, ఉన్నత సామాజిక జీవిత సాధనకు యత్నించాడు. ఇదే వేమన సంస్కర్తగా మహాకవిగా, తెలుగుజాతికి చేసిన పరమోత్కృష్టసేవ. ఏకేశ్వరోపాసన, ఉత్తమ జీవన సాధన—యివే తెలుగువాడికి, వేమన యిచ్చిన మహోన్నత సందేశాలు.

"బ్రాహ్మణులకు సకల భాగ్యంబు లీవచ్చు
గౌరవింపవచ్చు గోరివారు
జ్ఞానమొసగి జనుల గడతేర్ప గలిగిన"...

అని అన్న వేమన, బ్రాహ్మణుల ప్రముఖ స్థానాన్ని గుర్తించాడు. వారు ప్రజలకు జ్ఞానమొసగి, కడతేర్ప వలెనని వేమనభావన.

ఇక, తత్త్వజ్ఞానిగా వేమనను పరిశీలిద్దాం. సృష్టిలోని చావు పుట్టుకలకు, పుణ్యపాపాలకు కారణం, ఏమిటి? ఈ చరాచర ప్రపంచాన్ని ఎవరు ఎందుకు సృష్టించినట్లు? ఈ ప్రశ్నల పరంపర తరపరంపరవలె వచ్చి వేమనను బాధించాయి. పండితులు పారిభాషిక పదాలలో యిచ్చిన జవాబులు అతనికి సంతృప్తినివ్వలేదు.

"చావు దెలియలేని చదువేటి చదువురా?"

ఈ ప్రశ్న వేమనను విపరీతంగా బాధించింది. ఈ విషయంగూర్చి అతితీవ్రంగా విచారణచేసిన ఉమర్ ఖయ్యాం, ఏమంటాడో చూడండి—

"చిక్కుముడుల గోకింత మృత్యువను ఈ ముడి మెల్లగలన్ని తీసిన." (మధుకలశం-రాయప్రోలు)

ఉమర్ లాగానే, వేమనకూడా చావుబ్రతుకుల ముడిని విప్పేందుకు మార్గాన్ని శోధించాడు.

'భక్తిగలుగ ముక్తి బడయుట సులభంబు"

అని నమ్మి భక్తితో భగవానుని ప్రార్థించాడు. ఆ భగవంతుడు పలుకలేదు.

"పలుకకున్న నేల పలుకకయున్నావు
పలుకు నన్నుజూచి ప్రబలముగను
పలుకవయ్య నీవు పలుకు నే నెఱిగెద..."

మనసలోనలకన్న దివ్యమైన తెనుగులో, బాసతో, దైన్యంతో, చేంతనంతో, అణకువతో, దేవుని పలుకరించ యమునూతినలు పడ్డాడు, ఆ తత్త్వజ్ఞుడు. ఇట్టి తత్త్వజిజ్ఞాసలో వున్న కాలంలో ఆయనకు యోగవిద్యతో సంబంధం ఏర్పడింది.

"ఏ పథమున మనుజు డెఱుగు నిన్నును దన్ను?"

అనే ప్రశ్నకు—

"తన్నుఁదా నెఱిగెనఁ దా నెపో బ్రహ్మంబు"...

అనే జవాబు లభించింది. "అహం బ్రహ్మాస్మి" అనే సిద్ధాంతాన్ని నమ్మి, అద్వైతసిద్ధి పొందాడు.

"బ్రహ్మమన్నిటను పరిపూర్ణమై యొప్పు" అను నిర్ణయానికి వచ్చింతరువాత, ఆసనాలు, హఠవిద్యను తిరస్కరించాడు.

చివరికి, మనం కవిగా వేమనకు ఆంధ్ర సాహిత్యంలో ఎట్టి స్థానముందో పరిశీలిద్దాం. పదులను పొగడేందుకు గాని, పాండిత్యప్రదర్శనకు గాని వేమన కవిత్వం వ్రాయలేదు. ఎంతోమంది పద్యాలు వ్రాస్తారు. దాంట్లో కవిత్వం కంచుకాగడాపెట్టి గాలించినా కన్పించదు. అలాంటి రసదరిద్రులను చూచి, జాలిపడేకంటే చేసేదేమీ లేదు.

తను నేటికంటె, భవిష్యత్ లో తెలుగుజాతి యింకా అధికంగా గుర్తిస్తుంది. మానవత్వంలో మాలిన్యం తప్ప మాలతనం లేదని గుర్తించి లోకానికి చాటిన దెంత మంది? సమాజాభ్యుదయానికి, మానవకళ్యాణ మంటప సీమలో తను కావ్య కుసుమాలను తోరణాలుగా కట్టిన దెంతమంది కవులు? ఇంట్లో, వంటింట్లో, పడకగదిలో నడిపొత్తిలో ఏ భాషను తెలుగువాడు మాట్లాడినాడో, మాట్లాడుతాడో, జీవిని తెలుగుతల్లి ఒళ్ళో, తెలుగు బళ్ళో నేర్చుకొన్నాడో, సామాన్య తెలుగువానిసి ఏ భాషను మాట్లాడుతాడో, ఆ సజీవము, వాస్తవమును నిక్కంపు తెలుగుభాష, కంపుగల తియ్యని తెలుగు జాతీయాలు, వేమన కవిత్వసామ్రాజ్యానికి ప్రాతిపదిక. అతని పదజాలం, విశ్వకోశంలాంటి సైమంగానుంచి గాని నిఘంటువుల నుంచిగాని తెచ్చుకొన్న భాష కాదు నిజమైన జాతి తెలుగు వేమన భాష. ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో వేమన ప్రథమ తెలుగుకవి అనేది సాహసంగా అనే మాట కాదు. ఆయన నాటి తెలుగుజాతి మనస్తత్వాన్ని నిండుటద్దంలోని నీడలా తన కవిత్వంలో ప్రతిబింబింపజేసాడు. నాటి తెలుగు భాషకు, తెలుగు మనస్తత్వమునకు, తెలుగు ఆచార వ్యవహారాలకు, తెలుగు జాతీయాలకు, వేమన కవిత్వం మహోన్నతమగు భాండాగారం

ప్రబంధకవి యింట్లో కుండలు డింకీలు కొట్టునాళ్ళ, మల్లెల మొల్లల పావలనదము సన్నలాంటి పుష్పాదుల మెత్తలపై పరుండి విరహబాధను ఓర్వ జాలని కన్యను వర్ణిస్తాడు. కాని వేమన మాత్రం ఆ కోవకు చెందిన కవి కాడు.

ఆయనకు మానవ జీవితమే ఒకపాఠశాల. దానిలో ఆయన ఎన్నో సత్యాలను గ్రహించాడు. అనుభవం సంపాదించాడు. తనకు తెలిసిన తప్పును, ధైర్యంగా నిర్మొగమాటంగా విమర్శించుటే వేమనలోని లక్షణము. నచ్చినదాన్ని పొగడినాడు. నచ్చనిదాన్ని తెగడినాడు. ఒకరి అనుగ్రహానుగ్రహాలపై వేమన ఆధారపడలేదు

కాళిదాసు మందాక్రాంత, భవభూతి శిఖరిణి, తిక్కన కందము, శ్రీనాథుని సీసము, షేక్స్పియర్ సానెట్, కీట్స్ ఓడ్, వేమన ఆటవెలది, చరిత్ర ప్రసిద్ధాలు.

వేమన ఆటవెలదిలోని తియ్యందనము భాషని భావాన్ని అధిగమించింది. వజ్రాన్ని వజ్రంతో నే సానబెట్టాలి. వేమన ఆటవెలదిలోని తీపిని, ఆయన భాషలో నే వర్ణించాలి. పనసతొనలకన్న, పంచదారల కన్న జుంటితేనెకన్న జున్నుకన్న, చెఱకు రసముకన్న, చెలిమాటలోని తీపికన్నా తియ్యగా వుంటుంది వేమన ఆటవెలది. వేమన తన హృదయాంతరాలను ఎంత భావయుక్తంగా మాట్లాడాడో, అంత లయబద్ధంగా ఆటలాడిన వెలది, వేమన ఆటవెలది.

విశ్వసాహిత్యాన్నా పరిశీలించి చూస్తే, బైబిల్ లోని ఓల్డు టెస్టమెంట్ లోని జెరిమియా స్వరంలోని పరమోన్నత ప్రసంగములోను, మైత్రియే మూర్తిభవించగా తల్లి ఉపదేశాలందు తల్లి నెల్లే పసిపిల్లడి అమాయకత్వం, వేమన ఆటవెలదిలో కన్పిస్తాయి. పాషాణాలకు ప్రాణం పోసి శిల్పహస్తం మలచిన శిల, జీవంతో తొణికిసలాడినట్లు, వేమన మలచిన ఆటవెలది సుమనోజ్ఞ సుందరంగా రూపుదాల్చింది. చురకత్తిలాంటి కవితాశక్తితో నిరర్గళంగా పద్యాలు విసిరాడు. మొదట, పండితులు యీయాన్ని గుర్తించలేదు. ఈతను పండితులకొరకు పద్యాలు చెప్పినట్లూ కన్పించదు!!

"కుండ కుంభ మన్న కొండ పర్వత మన్న
నుప్పు లవణ మన్న నొకటి గాదె
భాష లిట్టి వేరు"—...

అని, శబ్దాడంబరానికంటె అర్థ గాంభీర్యానికే చోటిచ్చాడు. పండితులు తననుగూర్చి ఏమైనా అనుకోనిమ్మని, నల్లేరుమీద బండి తోలినట్లు తన మార్గాన తాను పోయినాడు.

"వేమన పద్యములు చిటుకలో ముగింపగల చిన్న పలుకులు. అద్భుతమగు పద్యపు నడక. గుండు దెబ్బవలె గురితప్పని చక్కని చెక్కిన మాటలు; నోరు గల తెలుగువారందరును నేర్వవచ్చును. (రా. శ్రీ. అనంతకృష్ణ శర్మ— వేమన)

"నిఘంటు పండితులును, వ్యాకరణ పండితులును ఏమనుకొన్నను ఇతని కాంధ్రదేశమందుగల మర్యాదకు, ఇతని బోధలింకను చెడక, తెలుగువారి హృదయముల నాటుకొనియుండుటకును, ఇతని పలుకులయందు గల కవితా వైశిష్ట్యమే ముఖ్యకారణమనుట నిస్సందేహము." (రా. అ. కృ. శ.)

# వేమన మనీష

వాస్తవికత, నవుగరాలాంటి భావోద్రేకం, సంగ్రహశక్తి పాదరసంలాంటి ప్రతిభ, కండగల తియ్యని తెనుగు జాతీయాలు సుందరమగు పదముల కూర్పు, స్వానుభవం, నిశితమగు తార్కికదృష్టి, కడుపుబ్బ నవ్వించు హాస్యం – యివి, వేమన కవిత్వమందలి లక్షణాలు.

వేమన కవిత్వపు విలువలనుగూర్చి విచారించబోయే ముందు కవిత్వంయొక్క తత్వాన్నిగూర్చి విచారించవలసి వుంది.

"రమణీయార్థ ప్రతిపాదక శ్శబ్దః కావ్యమ్"
జగన్నాథుడు.

"వాక్యం రసాత్మకం కావ్యం" -విశ్వనాథుడు.

"Poetry is Criticism of life"—
మాథ్యూఆర్నాల్డ్.

ఒక విశిష్టవిషయాన్నిగూర్చి వ్యక్తిలో కలుగు భావాలను భాషమూలంగా పరుల హృదయాల్లోకి ప్రవేశింపజేయటం కవిత్వం. ఈ కవితాశక్తికి ఉద్రేక మత్యంత అవసరం. ఈ పని ఎంత శక్తివంతంగా జరిగితే, దాన్ని అంత ఉత్తమ కవిత్వమని మనం అనవచ్చు.

కొందరు ఆలంకారికుల మతంప్రకారం కవిత్వమంటే సుందరములైన వస్తువులను సుందరంగా వర్ణించటం వావిళ్ళ రామస్వామి శాస్త్రులవారు ప్రకటించిన వేమన పద్యాలకు పీఠిక వ్రాస్తూ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు పై అభిప్రాయాన్నే ప్రకటించారు. కాని, ఆ పిదప, వారు వేమనపై వ్రాసిన వ్యాసాలలో ఈ అభిప్రాయాన్ని మార్చుకొన్నారు.

కవితకు అనర్హమైన దేదీ లేదంటూ శాస్త్రకారుడు ఏంజెప్పాడో చూడండి—

"రమ్యం జుగుప్సితముదార మథాపి నీచం
ఉగ్రం ప్రసాది గహనం వికృతంచ వస్తు
యద్వాప్యవస్తు కవిభావుక భావ్యమానం
తన్నాస్తి యన్న రసభావముపైతి లోకే."

తానే సాక్షాత్తుగా కవిత్వం చెప్పునపుడు కవికి సుందరములగు ప్రేమ, కరుణ, అణకువ, మున్నగు భావాలే వుండాలిగాని, జుగుప్స, ఉగ్రత, ద్వేషం, క్రోధం మున్నగు భావాలుండరాదని, అవి కవిత్వలక్షణాలకు విరుద్ధమని, కొందరు లాక్షణికులు తలుస్తారు, ఇది పొరపాటేమో. కవిత్వానికి అనర్హమైంది ఏదీ లేదు. కావాలసింది కవిత వేశమే గాని రసదారిద్ర్యం మాత్రం కాదు. సౌందర్యమే కళకు పరమావధి అనడం, కవియొక్క భావాలకు అడ్డుకట్టలు కట్టేందుకు జరిగే ప్రయత్నమే. ప్రత్యేకంగా వేమన వంటి ప్రతిభావంతుడగు కవిని పై సిద్ధాంతాల కొలబద్దలతో కొలుచుట ప్రమాదమే కాదు, పొరపాటు కూడా. కారణం? వేమనముట్టనివిషయం అంటూ లేదు.

"కడుపు నిండ తవుడు గంపలో బెట్టక
దున్న ముట్ట నీదు కొన్న బఱ్ఱె"—

అను జానపదుల జీవితానుభవానికి చెందిన విషయం దగరనుండి

"సొంత మగనిమీద చింతనిప్పులు జలు"
అనే జారకాంత స్వభావ వర్ణనా,

"చెఱకురసముకన్న చెలిమాట తీపురా"
అనే మానవస్వభావంలోని వాస్తవాలదగ్గరనుండి,

"తన్ను దానెఱిగిన దానెపో బ్రహ్మంబు"
అనే అద్వైతసిద్ధాంతందాకా, వేమన పద్యాలలో కన్పిస్తవి. అతడు మానవ జీవితానికి సంబంధించిన విషయాలలో తడవకుండా వొదిలింది ఒక్కటిలేదు జారత్వం, స్వార్థం, లోభితనం, మోసం, దంభం పరపురుష వాంఛ, విగ్రహారాధన, వేశ్యాస్వభావవర్ణన, మూఢాచారాలు, జానపద జీవితం, యోగ రహస్యాలు, అమూల్యములగు తాత్వికసిద్ధాంతాలు—యివన్నీ వేమన తడివాడు ఒక్కమాటలో చెప్పాలంటే, వేమన తడవకుండా, పరిశీలించకుండా, వదలిన విషయం—మానవ జీవితానికి సంబంధించినవరకు ఏదీ లేదేమో.

వేమన పద్యాలలో, సుందరములైన విషయాలతో నిండిన అందమైన పద్యాలు గ్రహించి, ద్వేషం, క్రోధం, మున్నగు భావాలతో నిండిన పద్యాలను తిరస్కరించటంకన్న రసదారిద్ర్యం మరొకటి వుండదేమో. మనకు కావాలసింది ఆ భావాన్ని—అది ప్రేమ కావచ్చు—ద్వేషం కావచ్చు—కవి ఎంత శక్తివంతంగా, మహోజ్వలంగా చెప్పగలిగాడా అనేదే; అదే రస నిర్ణయానికి అంతిమ పరీక్ష. తెలుగు సాహిత్యంలో ఎందరో మహాకవులు జీవితంకంటె ప్రియమైన ప్రేయసిని, దాని మాటలలోని తీపిని, చిత్రబంధ కవిత్వాలలో పెట్టి అనుప్రాస, యమక శ్లేష

ఉతో వర్ణించారు. పామరుడైన వేమన, పండితుడు కాని వేమన, నిఘంటు జ్ఞానం లేని వేమన, ప్రేయసి మాట లోని తీపిని, ఎంత సుందరంగా, జిలేబీపాకంలో గులాబీలాంటి పద్యంలో చెప్పాడో చూడండి—

"పనస తొనలకన్న పంచదారలకన్న
జుంటి తేనెకన్న జున్నుకన్న
చెఱకురసముకన్న చెలిమాట తీపురా"...

జార కాంతను గూర్చి—

"మగడు మదనుడైన మంచి కాపురమైన
సహజమేల మాను జారకాంత"—

"వేమన కవిత్వమందలి యసాధారణ గుణము లలో ముఖ్యమైనది భావముల తీవ్రత. అవి యంత తీవ్రముగా నుండుటకు కారణము ఆ భావము లతనివే కాని, యితరులవి కాకపోవుట" (రా. అ. కృ. శ) (వేమన—194 పేజి)

ఎప్పుడు భావం సొంత దౌతుందో, అప్పుడు భాషకు బిగువు దార్ఢ్యం వస్తుంది. అప్పుడు భావమూ, భాష, రెండూ తోక తొక్కిన త్రాచుల్లాగ ఉవ్వెత్తున లేస్తవి "ఈ వేగమును నిరోధించుటకు ఛందస్సు, యతిప్రాసలు, మొదలగు ఏ నిర్బంధముల కును చేతగాదు. ఇవి వానికి (వేమనకు) లొంగి సర్దుకొనవలసినవే కాని, యవి వీనికి లొంగి కుంటుచు నడవ నేరవు. (రా. కృ)

"ఆటవెలదియందు యితడు చూపినంత ప్రౌఢిమయు మాధుర్యమును, శ్రీనాథుడు సీసమందు గాని, తిక్కన కందమందు గాని చూపలేదనుట యతిశయోక్తి కాదు ............ఆటవెలది కన్న తెనుగున చిన్నవృత్తము వాడుకలో లేదు. అందును నాల్గవపాద మంకితముతో ముగియును. తక్కిన మూడు పాదముల నడుగడుగునకు యతినియమము వదలదు. యతియందును తిక్కనాదులు వాడునట్లు పదమధ్యవిచ్ఛేదము గాదు. యతి స్థానమునకు సరిగా పదమును అనేక స్థలముల భావమును, గత్తరింప బడినట్లు, తునకలై పడును. అట్లని యధికపదము లేమైన గలవందమా? మందునకును దొరకవు. ఐనను కుంతి కడుపునుండి కర్ణునివలె, సద్యోగర్భముచే, సహజాలంకృతమై, యాటవెలది వేమన నోటినుండి క్రిందికి దూకుచున్నది. హృదయమునందు భావ సంయోజనము, నోటి పదముల రచన ఉచ్చారణయు నేక కాలమందే యొకటితో నొకటి మాటలాడు కొని కుప్పించుచున్నవో యని యాశ్చర్యపడునట్లు చేయు పద్యరత్నము లింక నేకములు గలవు (రా. అ. కృ. శ)

ఈ క్రింది పద్యాలు చూడండి—

"చెప్పులోని రాయి చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు కాలి ముల్లు
ఇంటిలోని పోరు యింతింత కాదయా..."

"పంది పిల్ల లీను పదునైదు నొకటిని
కుంజరంబు ఈను కొదమ నొకటి
నుత్తమపురుషుడు ఒక్కడు చాలడా?..."

ఛందస్సు, యతిప్రాసల నిర్బంధాలను కొన్ని చోట్ల తెగించి వ్రాసినా, "[illegible] నిర్బంధములను కల్పించుకొని [illegible] గా వ్రాసి వేమన విచిత్రమైన [illegible] చూపుతున్నాడు."

ఆటవెలదిలో ప్రాసాన్ని చేర్చి, యతి తప్పకుండా వేమన చేసిన గమ్మత్తు చూడండి—

"పగవులందు పాపి మిత్రులందును స్త్రీలు
పెదవులందు రాజ్యపదవులందు
ఆశ లుడిగినట్టి యయ్యలు [illegible]"......

"ఋషులన్ని తిన్న మేకపోతుల కేల
కాక పోయెనయ్య కాయసిద్ధి?
లోకులెల్ల [illegible]"......

ఈ క్రింది పద్యం ఎంతటిది ఆంధ్రసరస్వతికి అమూల్య భూషణం తెలుగుభాషాసంద్రాన్ని మధించి అమృతాన్ని జుర్రి, మనకు యింత సుందరమూ లలితమూ, మనోహరమైన పద్యాన్ని అందించాడు—

"కలువపూలవంటి కన్నులుండిన నేమి
చిలుకపలుకు లట్లు పలుక నేమి
తెలివి బలిమి కలిగి తేజరిల్లగ నేమి
తులువగామి నేరు నెలత వేమ.

ఈ విధంగా, ఆటవెలది హిమాలయోన్నత గౌరీశిఖరాలను అందుకొని, మహోన్నత పరిపక్వతను పొందింది. శైలిలో, భాషలో, భావంలో అతని కతడే సాటి. ఇలాంటి ఆటవెలది నభూతో న భవిష్యతి యతిని, ప్రాసని, సంగ్రహతను, పదసౌకుమార్యాన్ని భావగాంభీర్యాన్ని సాధించిన అమరకవీశ్వరుడు వేమన.

# వేమన మనీష

వేమన, "యతి కిచ్చిన మర్యాద, అందము అద్భుతమైనది. ఆంధ్రవాఙ్మయములో యతిని పరస్పరవిరుద్ధముగా విచిత్రముగా వాడినవారిద్దఱు మొదటివాడు తిక్కనసోమయాజి; యతి కావలసిన వారు ప్రయత్నముగా నితని కవిత్వమందు వెదకి చూడవలసినదే కాని యది తప్పక యందుండినను, సామాన్యముగ చేతికి జిక్కదు......... నేనెఱింగినంతవరకు వేమన్న యొక్కడే ఈ విషయమున తిక్కనకెదురు తిరిగినవాడు. ఎక్కడికి యతియుండవలయునో, యక్కడికి పదమే కాదు అభిప్రాయమును తెగనీడుచును. వెంటనే ఆద్యక్షరావృత్తియు, తెనుఁగునకు నక్కఱలేక స్పష్టముగా దాపురించును. వేదాప్రాసము సిద్ధము." (రా. అ. కృ. శే. వేమన)

"కడుపు భోగించి కన్నులు గుటకరించి
ఒళ్లు విరుసుకున్న ధీనయోగి
యముని బారి గొట్టి యతడేమి సేయును?"

"వాసకుతికి తిట్టు వలదన్న మెట్టు
ముందు మగని తిట్టు ముసుకు బెట్టు
గడుసురాలు మగని గంపఁబెట్టున్నగా"...

"తేనె పంచదార తియ్యమామిడి పండు
తిన్నగాని తీపి తెలియరాదు
కన్న నింపుపుట్టు కామిని యాకారంబు"...

ఇలాంటి పద్యశిల్పపు పలుకులు, గుంచి ముత్యాలు, పునుగు పరిమళం గుబాళించు ఇంద్రనీల మణులవంటి సుందరమగు పద్యాలు, వేనకువేలుగా వేమన కవిత్వంలో కన్పిస్తాయి. ఇగిని భావం ఎంత సహజమో భాషకూడా అంత సహజమే. ఇదే నిజమైన తెలుగుభాష. నిగూఢములు గంభీరములగు యోగాది తాత్త్విక విషయాలు చెప్పినప్పుడు కూడా, పద్యాలలోని బిగువు, శక్తి, ధార, పిసాగ్రం కుంటుపడలేదు. వేమన చెప్ప ప్రతి వాక్యానికి ఒక ఉపమాన ముంటుంది. ఆ ఉపమానములు పూర్వ కావ్యాల నుండి ఎఱవు తెచ్చుకొన్నవి కావు. నిత్యజీవితంలో వేమన, చూచినవి, చేసినవి, అనుభవించినవి గాబట్టే వానికి అంత సొగసు, మరింత వాస్తవికత అబ్బినవి.

చూడండి —

"నిక్కమైన మంచినీలమొక్కటి చాలు
తళుకు బెళుకు రాళ్లు తట్టెడేల?"

"గంగ పాఱు మందు కదలని గతితోడ
ముఱుగువాగు పాఱు మ్రోతతోడ"...

"గంగిగోవుపాలు గంటెడైనను చాలు
కడివెడైన నేమి ఖరముపాలు
భక్తిగలుగ కూడు పట్టెడైనను చాలు"...

"ఇంటి యాలి విడిచి యిల జారకాంతల
వెంట దిరుగువాడు వెఱ్ఱివాడు
పంట చేను విడిచి పరిగ యేరిన యట్లు"...

ఇంత తీపి, శక్తి, సౌందర్యం, ధార, పరిపక్వత ఉన్నప్పటికినీ, వ్యాకరణశాస్త్రజ్ఞులు వేమనభాషలో శుద్ధమైన శబ్దప్రయోగము కన్పించదని విమర్శిస్తారు. కావ్యాలను వ్రాయాలనే కాంక్షతో ఏ గురువువద్దా యితడు పరిశ్రమించలేదనే విషయం, వారు గుర్తించుకోవాలి.

"వ్యాకరణమునకు భంగము కలిగించిన నేమి? వచనమున వ్రాసిన నేమి? వ్యాకరణము, యతి ప్రాసలు, అన్నియు తప్పక కుదిరినను భావశక్తి లేని గుణహీన వట్టి పాండిత్యము జీవములేని యాకారము వలె జడంబుగ కాన్పించును......లేయుండవలెను వ్యాకరణములను, నిఘంటువులను ప్రాచీన కావ్యములను, వల్లించుచుండుట చేత నూతన సృష్టియే గాని కవితను బుట్టింపలేరు." (కవిత్వతత్త్వ విచారము — సి. ఆర్. రెడ్డి).

వ్యాకరణకారులు అంగీకరింపని వ్యవహారమందలి కొన్ని పదాలు వేమన కవిత్వంలో కలవు. వినా వ్యాకరణం అంగీకరించని పదాలు, మహాకవుల కావ్యాలలో కూడా ప్రయోగింపబడ్డవి.

ఈ విషయం, "ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజం"లో మహాపండితులగు గిడుగు వారిచే సోదాహరణముగా నిరూపింపబడినది

విశ్వనాటకీయ సారస్వతములో అమరమగు ఖ్యాతి నార్జించుకొన్న షేక్స్పియర్ వ్యాకరణానికి సంబంధించిన తప్పులను ఎన్నో చేయలేదా? కొమ్ములు తిరిగిన మహాకవులు వ్యాకరణానికి సంబంధించిన తప్పులను చేశారు. కాబట్టి, ఒక మహాకవి కావ్యాన్ని వ్యాకరణసూత్రాల కొలతబద్దలతో కొలుచుట సాహసమే.

"నిఘంటు పండితులును, వ్యాకరణ పండితులును, వినుకొన్నను ఇతని కాంగ్రెసేశమందుగల మర్యాదకు, యితని బోధ లింకను చెడక తెలుగువారి హృదయముల నాటుకొని యుండుటకును, ఇతని సలుకులయందుగల కవితా నైశిత్యమే ముఖ్యకారణమనుట నిస్సందేహము." (రా. అ. కృ. శ) ఐతే కొందరు పండితులు వేమన కవిత్వానికి, మనుచరిత్రకు, వసుచరిత్రకు, కళాపూర్ణోదయానికి, పాండురంగ మాహాత్మ్యానికి యిచ్చిన గౌరవాన్ని యివ్వరు. కొల్లలు కొల్లలుగా పుట్టిన పిల్లవసుచరిత్రలకు, నానార్థరత్నమాలను ముందు పెట్టుకొని, శ్లేషాలంకారంఘూయిష్టమైన రసాభాసకు త్రోవతీసిన, రామాభ్యుదయంవంటి కావ్యాలకు సాహిత్యచరిత్రలో స్థానమున్నపుడు వేమన పద్యాలకు అట్టి కావ్య గౌరవం ఎందుకు లేదో దురూహ్యం. అనుప్రాస, యమక శ్లేషాదులచే భావ పరిపక్వత నందుకొనని, బడాయిశైలితో రసధ్వనికి భంగమును గూర్చి, శబ్దాలంకారముల డాంబికమును ప్రకటించుట వేమన కవిత్వంలో మందుకైనా కనపడదు. మనుచరిత్రవంటి ప్రబంధమును వేమన రచింపలేదు. ఐతే ప్రబంధాన్ని రచిస్తేనే మహాకవి గౌరవం దక్కుతుందా? ఆ పరిస్థితులలో, రసికజన మనోభిరామానికి, రామాభ్యుదయానికి, మహాకావ్యాలకిచ్చే గౌరవం యివ్వగలమా? కళయందు గ్రాహ్యమగు ఇతివృత్తం ఎప్పుడూ ఒక్కటి కాదు, కాకూడదు కూడా. సంప్రదాయాన్ని గుడ్డిగా అనుసరిస్తే, వందలకొలది పిల్లవసు చరిత్రలు పుట్టి, సాహిత్యదివాళాకోరుతనానికి త్రోవతీయటం జరుగుతుంది. నవ్యతకు, నూత్న భావ విజృంభణకు అవకాశం వుండదు. ఇదే సత్యాన్ని నోబెల్ బహుమానగ్రహీత ఐన, టి. యస్. ఇలియట్, ఈ విధంగా చెప్తున్నాడు—

"Yet if the only form of tradition, of handing down, consisted in following the ways of the immediate generation before us, in a blind adherence to its successes, "tradition" should be positively discouraged. We have seen many such simple currents soon lost in the sand; and novelty is better than repetition. He (the poet) must be aware of the obvious fact that art never improves but the material of art is never the same."

"సౌరభమిచ్చు గంధవహు సంపదనుంగా
బ్రకటింపజేసి యిం
పారెడు పల్కులం బసిడి, నవ్యులు కల్
సరిగ్రుచ్చువట్లుగా జేయుచు సేవగాదెయదియు......"

ఇట్టి శక్తి తిక్కనపిదప వేమనలో కన్పించుచున్నదని అంటే తొందరపాటుమాత్రం కాదు. నన్నయాదులు పాలసంద్రాన్ని మథించినట్లు వేమన తెలుగు భాషాసంద్రాన్ని మథించాడు. కంపుగల తియ్యని తెలుగు జాతీయాలనే అమృతాన్ని మనకు ప్రసాదించాడు. మనలను ... సదా ... అందించాడు. వేమన కవిత్వం, వేలాదివేల తెలుగు జాతీయాల పుట్ట. చూడండి—

"కొట్టు మనుజునికి చిరమిన బోళ్ళనా?"
"పక్క తోకబట్టి గోదావరీదువా?"
"మాట వినని యాలు మగనికి మరగాలు."
"ఉన్నదాని బొంకు గోడకట్టిన సున్నము."
"నారకొంటె తెగుజు నాగుగా యగులాడు."
"బట్ట చెప్పవాడు నట్టి తేనెకాదా?"
"మంత్రజలముకన్న మంగలిజల మెచ్చు"
"పేడ పరబ్రహ్మ పనుపనుస్తా కూ.
"నంపినంబు గునకు పంది ఏ మెరుగును?"

సజీవమైన తెలుగు జాతీయాలతోపాటు, వేమనపద్యాలకు పసిడి మెఱుగులు దిద్దినది కమ్మని వచ్చిన హాస్యము. ఇది నవ్వుకొన్న హాస్యం కాదు. ఈ హాస్యానికితోడు విచిత్రమగు వాదనాపటిమ, తార్కికదృష్టి, మరింత సొగసును చేకూర్చినవి. ఈ క్రింది పద్యాలు చూడండి—

"సకలతీర్థములను సకల యజ్ఞంబుల
తలలు గొరుగుకున్న ఫలము లేదు
మంత్రజలముకన్న మంగలిజల మెచ్చు......"
"పుణ్యాలలోన జొచ్చి గుణముల పరికింప
ఘోరమృగముకంటె గౌరవిలిన
ముక్తిమార్గమదియె ముందుకు జూపురా!......"

వాదనను అంగీకరించకపోయినా, పద్యంలోని హాస్యానికి నవ్వకుండా ఉండలేము. "అండజ ... కిని దెలిసిన సామాన్యన్యాయము నే గంభీరముఖముతో రెండు పాదములలో చెప్పి మూడవపాదములో దానిని తలక్రిందులుగా త్రిప్పి త్రోసి ... తిటాలన

త్రిప్పి చెప్పటం," వేమన కవిత్వంలోని మరో ప్రత్యేక లక్షణం ఈవిధంగా తన మధుర కవితామృతంచే, తెలుగు సారస్వతాన్ని పునీతం చేసాడు అమర కవీశ్వరుడు వేమన. మానవ స్వభావమందలి గభీరమగు లోతుపాతులను, తిక్కన పిదప, వేమనవలె గుర్తించిన వ్యక్తి, మరొకడు, తెలుగు కవులలో లేడు.

వేమన పద్యాలపేర 5 వేల వరకు ముద్రితాలైనవి. నిర్జీవ పద్యాలెన్నో, యితరులచే రచింపబడి, విశ్వదాభిరామ మకుటం తగిలించబడి, వేమనపద్యాలలో కలసిపోయాయి ఇవన్నీ కేవలం వేలకు వేలు పాపంలా పెరిగినయ్. వేమన కవిత్వంలోని లక్షణాలను, ఆయన హృదయాన్ని ఎరిగిన సమర్థులైన సంపాదకులు శ్రమకోరిస్తే, సిసలైన వేమనపద్యాలను ప్రకటించవచ్చు. సీసం, మత్తేభం, ఉత్పలమాలలతో సహా, వేమన పద్యాల్లో వున్నవి. వాటి ముఖాన్ని బట్టే అవి అతనిచే రచింపబడినవి కావని స్పష్టము. సహృదయులగు పండితులు, వేమన పద్యాలను, వాటికి సరైన వ్యాఖ్యను వ్రాసి ప్రకటించితే, ఆంధ్ర సాహిత్యానికి వ్యావహారికాంధ్రవాఙ్మయానికే, గాక, తెలుగు మానిసి మేధాసంపదకు తిరుగులేని మేలుగా రూపొందుతవనేది సత్యం.

సుమతీశతకం, పెద్దబాలశిక్షలతోపాటు వేమన పద్యాలను కూడా పిల్లలచే కంఠతా పట్టిస్తారు ఇదే తెలుగువారు వేమన కిచ్చిన స్థానం!

వేమన పద్యాలను ప్రకటించే పండితులు ఈ క్రింది విషయాలను దృష్టిలో పెట్టుకోవటం అవసరమేమో. ఎందుకంటే, వేమన పద్యాలు, ఎవరి చేతిలో పడితే, వారి మనస్తత్వానికి అనుకూలంగా వ్రాయబడ్డవి. ఉదాహరణకు—ఈ పద్యాలు కంసాలి పండితుని చేతిలోపడగా—

"కంసలికిని మించు కడజాతి లేదయా" అన్న వాక్యం—"కంసలికిని మించు ఘనజాతి లేదయా" అని దిద్దబడివుంది! తమ వ్యాకరణజ్ఞానంతో, ఉన్నవి తొలగించి లేనివి కలిపే దిద్దుబాట్లవల్ల వేమన ఏమి వ్రాసాడో, యితరులేమి కలిపారో, నిర్ణయించేందుకు వీలుగాకుండావుంది. అవకాశం వచ్చినప్పుడల్లా వేమన పద్యాలు చెప్పాడుగాని, ఒకచోట తీరికగా కూర్చుని, చందస్సు చట్రంలో వేమన పద్యాలను బిగించలేదు. పండితుల దిద్దుబాట్లు అసలుకే మొసలంటిచ్చే స్థితిలోకి వచ్చాయి.

ఆటవెలదులలో తొంబదైదు పాళ్ళు, అతనివే కాని మనకు కన్పించే కందాలు, గీతాలు అతడు వ్రాసాడనేనమ్మకం నాకులేదు. పోతే కందాల్లో, పనోపాతికో, యోగవిషయాలను చెప్పేటపుడు వ్రాసి వుంటే వుండవచ్చునేమో. వేమనపద్యాలకు ఎందరో వ్యాఖ్యానాలు వ్రాసారు. దానిలో "కాళిదాసు కవిత్వం నాపైత్యం" అన్నట్లు, ఎక్కువభాగం తమ పైత్యాన్ని యిరికించారు. దాంతో, అయ్యవారిని చెయ్యబోతే, కోతైన సామెతగా, తయారయింది వ్యాఖ్యానం. ఉత్తమ సంస్కర్త, విమర్శకుడు, మహాకవి ఐన వేమన నిండుహృదయాన్ని దృష్టిలో వుంచుకొని వ్యాఖ్యానం వ్రాయటం అవసరం.

వాటి తెలుగుజాతి మనస్తత్వానికి యితని కవిత్వం ఒక మహోజ్వల దృష్టాంతము. అంతేకాదు. నిక్కమైన తెనుగులో మొట్టమొదటగా కవిత్వం చెప్పిన మహాకవి వేమనయే నాటి తెనుగు జానపదుల జీవితాన్ని, వారి మనఃప్రవృత్తిని ప్రతిబింబింపచేసినవాడు వేమన. కాబట్టే, వేమనను, తిక్కన, పోతన, పింగళి సూరన, పెద్దనవంటి మహాకవుల సరసన కూర్చోబెట్టడం. ఈ సత్యాన్ని కొందరు పండితులు అంగీకరించకపోవచ్చు. వారు ఎన్నిటినో అంగీకరించలేదు. అటువంటపుడు వారిని వదలి సమాజాన్ని, తెనుగు భాషను జీవితంకంటె ప్రియంగా ప్రేమించే ప్రతివారూ వేమనను మహాకవిగా గుర్తించాలి; గుర్తిస్తారు కూడా.

"చుక్కలవలె కర్పూరపు ముక్కలవలె
నీదుకీర్తి ముల్లోకములన్, క్రిక్కిరిసి,
పిక్కటిల్లెను"................

(అడిదం సూరన)

# నానార్థ నిఘంటువు

శ్రీ చేకుమళ్ల కామేశ్వరరావు

తెలుగు నానార్థ నిఘంటువు అను పేరు గల చిన్న పద్య నిఘంటువు ఉన్నదను విషయం బి. సుబ్రహ్మణ్యం అను విద్యార్థి మిత్రుడివల్ల నేను విని, ఇది అముద్రితం కావచ్చు అని తలచి, దాని సంపాదనకోసం ప్రయత్నం చేసేను. గుడియాత్తం (ఉత్తర ఆర్కాటు జిల్లా) సమీపంలో ధనకొండపల్లె నివాసులైన వి. యన్. మునిరత్నంగారి దగ్గర ఈ చిన్న పుస్తకం తాలూకు కాగితాల ప్రతి ఉంది.

ఈ పుస్తకంలో నూరు పద్యాలు మాత్రమే ఉన్నాయి. చివర గద్య లేదు. చాలవరకు కందపద్యాలు, ఆటవెలదులు. గద్య లేదు కాబట్టి పుస్తకం ఇంకా ఉందనే భ్రమ కలుగకపోదు.

ఈనిఘంటుకర్తపేరు లక్షణమంత్రి అని 'లలితోజ్వల కావ్యకర్త లక్షణ మంత్రిన్' (ప. 4) అను చరణంనుండి తెలుస్తూంది. ఇతని ఇంటిపేరు వగైరాలు తెలియవు. మంత్రి అని చెప్పుకోడంచేత నియోగిబ్రాహ్మణుడని గ్రహించవచ్చు. ఇతను అష్టభాషలను నేర్చిన పండితుడని 4 వ పద్యాన్నిబట్టి ఊహించవచ్చు. కవిస్తుతిలో తెలుగు కవులపేర్లు ఎత్తకపోడంచేత కాలనిర్ణయం సులభంకాదు.

తెలుగు వాఙ్మయంలో పద్యనిఘంటువులు కొన్ని ఉన్నాయి. పైడిపాటి లక్ష్మణ కవి, అడిదము సూరకవి, కస్తూరి రంగకవి, గణపవరపు వెంకటకవి మొదలైనవారు అట్టి నిఘంటువులను వ్రాసేరు. వాటిలో కొన్ని అచ్చయేయి.

తెలుగు నానార్థ నిఘంటుకర్త లక్షణమంత్రియొక్క పేరులో పొరపాటుందా?

ఇట్టి గ్రంథాలు వ్రాసినవారిలో కొందరు తాము లక్షణకవులము అనగా లక్షణములను చెప్పినవారము అని వ్రాసుకొన్నారు. సాంబనిఘంటువు రచించిన కస్తూరి రంగకవి తననుగురించి—

క. సిస్తుగ లక్షణ కవి యగు। కస్తురి రంగాఖ్యుడను పుట (28)

క. నిస్తుల లక్షణ కవి యగు। కస్తూరీ రంగ సుకవి పుట (108)

అని చెప్పుకొన్నాడు.

వెంకటేశాంధ్రమును రచించిన గణపవరపు వెంకటకవి గద్యలో 'నిఖిల శుభ లక్షణకవి వేంకటపతి'నని అని చెప్పుకొన్నాడు. కాబట్టి వీరు లక్షణ కవులమని తెలుభ

కొన్నారు. తెలుగు నానార్థ నిఘంటుకర్త 'లక్షణకవి' యనిగాక 'లక్షణమంత్రి' అని తెలుపుగోన్నాడు.

పైడిపాటి లక్ష్మణకవి ఆంధ్రనామ సంగ్రహం రచించేడు. ఇతని తండ్రి పేరు ఏకామ్రమంత్రి. పైడిపాటి లక్ష్మణకవి పేర మరొక పద్యనిఘంటువు ఉంది. అది* ఆంధ్రభాషా రత్నాకరము. ఈ పుస్తకంలో అతని తండ్రి పేరు అమరనామాత్యుడు అని కొంచెం భిన్నంగా ఉంది. పైడిపాటి లక్ష్మణకవులు ఇద్దరో, ఒక్కరో పరిశీలన అవసరం. అడయారులోని 'థియసాఫికల్ సొసైటి' వారి తాళపత్ర గ్రంథాలయంలో ఏకామ్ర నాథుని పుత్రుడైన పైడిపాటి లక్ష్మణకవి రచించిన నిఘంటువు ఒకటి, పేరు తెలియని నిఘంటువు మరొకటి ఉన్నాయి. వీటిని కూడ పరిశీలించాలి.

పైడిపాటి లక్ష్మణకవి ఆంధ్రభాషారత్నాకరంలో కందపద్యాలను, ఆటవెల దులను వాడేడు. కాని దీనిలో ఉండే చిత్రమేమంటే ఈ ఆటవెలదులకు గీతపద్యాలని పేరు పెట్టబడింది. ఇది వ్రాయసకాని పొరపాటని మాత్రమే చెప్పవచ్చు. అట్లే తెలుగు నానార్థనిఘంటువులోకూడ ఆటవెలదులకు గీతాలు† అని చెప్పబడింది. ఈ పొర పాటు రెండు గ్రంథాలలోకూడ సమానంగా ఉంది.

తెలుగు నానార్థనిఘంటువుకర్త లక్షణమంత్రి పేరులో పొరపాటు ఉన్నట్లు తోస్తుంది. పైడిపాటి లక్ష్మణమంత్రి పేరును వ్రాయసకాడు పొరపాటున లక్షణమంత్రి అని వ్రాసినాడేమో. అదే నిజమయితే ఈ నిఘంటువు ఆంధ్ర భాషారత్నాకరంలోని ఒక ఆశ్వాసం కావచ్చు. నిఘంటువులలో దేవవర్గు, మనుష్యవర్గు మొదలైనవి చెప్పి, చివర నానార్థవర్గు చెప్తారు. కాబట్టి ఈ నానార్థనిఘంటువు ఆంధ్రభాషారత్నా కరంలోని ఆఖరి ఆశ్వాసం కావచ్చు. మూలగ్రంథంలో మొదటి నాలుగు పద్యాలకు సంఖ్యలు ఈయబడలేదు. అటుతర్వాతివాటికే ఒకటి, రెండు అని వరుస సంఖ్య లీయ బడ్డాయి. బహుశా మొదటి నాలుగు పద్యాలు గ్రంథాదినుండి ఎత్తబడి నానార్థ పద్యాల ముందు చేర్చబడి ఉంటాయి. కాని నేను ఈ పద్యాలన్నిటికి వరుస సంఖ్యలను ఇచ్చేను.

పైడిపాటి లక్ష్మణకవి క్రీ. శ. 1700 ప్రాంతంవాడు, కాబటి తెలుగు నానార్థ నిఘంటువు అదేకాలంది కావచ్చు.

ఈ పుస్తకాన్ని 'కథాప్రసంగవరవైఖరిని' రచిస్తాను అన్నాడు కవి. కాబట్టి హనుమంతుడు ఈ నిఘంటువును ఇతరులకు చెప్పినట్లుగా మొదలుపెట్టేడు.

ఈ కవి కొన్ని సంస్కృతపదాలకు, తెలుగు మాటలకు కూడ నానార్థాలను వ్రాసేడు. ఈ మాటలను అచ్చునిఘంటువులలో చూడగా ఈ కవి ఇచ్చిన నానార్థాలు

---

* A Triennial Catalogue of Manuscripts Vol III Part III 1916-17-18-19 R. No. 399 (b).

† ఈ పొరపాటును సవరించి ఇక్కడ ఈ పద్యాలను ప్రకటిస్తున్నాను.

చాలవరకు కనబడవు. అయితే అతను తక్కిన అర్థాలను ఎక్కడినుండి సంపాదించేడు? ఆ అర్థాలు గల నిఘంటువు ఎక్కడయినా ఉందా? 4 వ పద్యాన్నిబట్టి చూస్తే కవి ఎనిమిది భాషలలోని అర్థాలను చెప్పేడనిపిస్తూంది. కొన్ని అర్థాలు కన్నడనిఘంటువులో దొరుకుతున్నాయి తెలుగు మొదలైన భాషలలోని, ప్రాంతీయభాషలలోని మాటలను విరివిగా అర్థాలుగా గ్రహించేడా?

నిఘంటు రచనలో కవి కొన్ని సొంత నియమాలను పెట్టుకొన్నాడు. మాటలలో లింగమును సూచించే విభక్తులను పాటించలేదు. కాబట్టి 'అజము' అను మాటకు బ్రహ్మ, విష్ణువు అను అర్థాలను, 'రావణుడు' అను పదానికి హంస అను అర్థాన్ని చెప్పేడు. సందర్భాన్నిబట్టి విభక్తులను మనం వేసుకోవాలి. నిర్మాణ సౌలభ్యంకోసమే ఇట్టి స్వేచ్ఛను అనుసరించేడని చెప్పవచ్చు. ఈ పుస్తకంలో 'పేరు' అను మాటను అర్థం అను భావంలో కూడ వాడేడు. సీలము(ప. 62)లో శీలిరంగుగల వస్తువులను గుచ్చెత్తేడు. ఇవి నానార్థాలు కావు. కాబట్టి ఇట్టి మాటలు అక్కడక్కడ ఉంటాయని ఊహించవచ్చు.

ఈ పుస్తకంలో వ్రాయసకాని లోపాలు అధికం! తప్పులని తోచినచోట్ల, అర్థంకాని కొన్నిచోట్ల మాత్రమే ప్రశ్న గుర్తును వేసేను, కొంచెంగా సవరించ ప్రయత్నించేను. మరొక మంచిప్రతి లభిస్తే పని సులువవుతుంది. ఏదయినా ఈ పుస్తకం పండితుల కొక పెద్ద సమస్య అనే విషయం స్పష్టమవుతూంది. పండితులు అష్టభాషలను, వాటి ప్రాంతీయభాషలను పరిశీలించి ఈ పుస్తకంయొక్క విలువను నిర్ణయించ గోరుతున్నాను.

ఉ. శ్రీ కమలాకళత్ర! సరసీరుహ నేత్ర!
  యమాత్ర (?) గోత్ర! స
దీక్షకర వజ్ర దైత్యకులభేదన! సన్మురి
  చిత్తసంగ! ర
త్నాకర గర్వసంహరణ! అబ్జభవాజ (?)
  కపర్దిసన్నుతా!
నీకు నొసర్చి వందనము నెమ్మి నుతించెద
  సత్కవీంద్రులన్. 1

క. భాసురముగ వాల్మీకుల,
భూసురహిత కాళిదాస పుణ్యుల కరుణన్
జేసెద నానార్థంబును
వాసించు కథాప్రసంగవర వైఖరినిన్. 2

క. కనుగొని హనుమంతుని చే
వినగోరెను జాంబవంతు విభు, సంగిరసున్
ముసు లనుకొన్నవి మాటలు
కనుగొని నే బ్రస్తుతింపగలనో లేనో! 3

క. తెలుగుల మరాఠుల, సంస్కృతి
కలనముగల యష్టభాషగల శబ్దములన్
తెలివిగ జెప్పెను ధరపై
లలితోజ్వల కావ్యకర్త లక్షణమంత్రిన్, 4

గీ. కొంచె పేరు లక్ష్మి, కొమరొప్ప బంగారు;
కొండపేరు విల్లు, కొంచె గొడుగు;
కొంచె రథము, గిరిజ, కుతలంబు, జల మంద్రు;
కొంచె హరియు, బుట్టు కోటజానకు (?) 5

క. సారంగము రథసారథి;
సారంగము శౌరి లేడి, సరసీరుహమున్;
సారంగ మతివయు, నలుడు (?)
[1]సారంగము దంతి, చిలుక, డవళవిభూ! 6

---

1. ఈ చరణంలో గణాలు సరిపోలేదు. యతిలేదు.

# నానార్థనిఘంటువు

క. ఘృత మనగ నేయి, నీళ్లును;
ఘృత మనగా పాలు, చల్ల, కుగ్గిల, మిసుమున్;
ఘృత మనగ తేనె, నెత్తురు;
ఘృత మన సంసారసుఖము, కలగిరు లయ్యెన్ 7

క. జీవనము వనము, మేఘము;
జీవనము పెండ్లి, నోము, క్షితి నైష్ఠవమున్;
జీవనము...మారుతి;
జీవనము ప్రాణికోటి శేషము పేరున్. 8

క. అజ మనగ బ్రహ్మ, విష్ణువు;
అజ మనగా గౌరి, శివుడు, నాత్మయు గంధిన్;
అజ మనగ నిలుపు, మెలుపును;
అజ మనగా మేక, మూక, యాకస మయ్యెన్. 9

క. గజ మనగ సింగు, చంద్రుడు;
గజ మనగా గంగ, తుంగ, గణపతి, శివుడున్;
గజ మనగ రేల, తంగెడు;
గజ మనగా పాము, కప్ప, కమలము, కణమున్. 10

క. కొకము ఫణి, కర్కటము మను;
కొకము గృధ్రంబు, ముసలి, కరి, సూకరమున్;
కొక మన కొక, గౌతమి;
కొకము నీలంబు, కుసుమ కొంచనఫలమున్. 11

గీ. పుండరీకము తెల్పు, పులియంద్రుడు, ఎలుగంద్రుడు;
పుండరీకము కుసుమ, పుట్టుపాప;
పుండరీకము పూష్ట(?) పురుహూతనిభమంద్రుడు;
పుండరీక మెజ్జ(?) పుణుక (?) జలధి. 12

క. వేదా యన నొక నాలుగు;
వేదా యన పితిహోత్ర; వేదా సురభిన్;
వేదా విప్రులు, వరితిలు;
వేదా శ్వానంబు, హాయము, వేదాశూద్రుల్. 13

గీ [2]వేరు పేరు పాము వేయింట గల దంద్రు;
వేరు పేరు తులసి, వేదరాశి;
వేరు పేరు జలధి, విష్ణు పాదంబును;
వేరు పేరు పేళ్లు విశ్వమునను. 14

క. తారలు నక్షత్రంబులు;
తారలు ముత్యాలు, కసుమ తాంబూలంబున్;
తారలు తెలియక్షుంతలు;
తారలు వస్త్రాలు, కృపులు, దశగణపంక్తుల్. 15

క. గోపాలుడు సహదేవుడు;
గోపాలుడు గొల్లచల్ల, గోష్యపుదదువుల్;
గోపాలుడు భూపాలుడు;
గోపాలుడు కృష్ణు డరయ కుంభినిలోనన్. 16

క. కేకి కొక్కెర, వృషభము
కేకి పోరాదిలాది కేకీయు రఘన్ (?)
కేకీ నాద మయూరము;
కేకీగంగంబు పేరు కెంగా ర్పంద్రుడూ (?) 17

శా. గంధా బాహుతి కల్పవృక్షము, సభా
కంపంబు, తాంబూలమున్
గంధా కన్యక, దంతి, వేము, రమణిన్
కస్తూరి, కర్పూరమున్;
గంధా పుష్పాడి, సాయకంబు, రసమున్,
గంగంబు పుష్పంబులున్;
గంధా కుంకుమ, తేను, తుమ్మెద, పతిన్
దక్షుంబు ప్రాణాహుతుల్. 18

మ. మధు వేదం బమృతంబు, తేనియలును
న్మద్యంబు, పానీయమున్;
మధు[3] వేమాసము, నిక్షుదండరసమున్,
మత్తేభమున్, పద్మమున్;
మధు వే క్షీరము, నమృతసార రసమున్
మత్తద్విరేపావళుల్;
మధు వే యిద్ధర నెంచి చూడగ మహా
మందారవారావళిన్(?). 19

క. ధృతి వజ్రనిభము; భస్మము;
ధృతి నేత్రము, తమ్మికంటి, దిగ్గజపంక్తుల్;
ధృతి బ్రహ్మ మస్త్రి, భువనము;
ధృతి కంఠము, శూలి, గంగ, తిరు మణిశూలన్ (?) 20

గీ. పుట్ట పేరు కొంప, భుజగంబు, మెనసాలు
పుట్ట యముడు, బ్రహ్మ పునుక, సరసి(?);
పుట్ట వేదవ్యాసభుజా డకు(?) వాల్మీకి;
పుట్ట సుతులు, సతులు, పుణ్యగతులు. 21

క. తోడనగ సాక్షి పలుకుట;
తోడనగా గొడ్డు[4]పడ్డ, తోగ, బ్రహ్మత్యన్(?);
తోడనగ భద్రగజములు(?);
తోడనగా నవనిసురులు, ధృతియజ్ఞములున్. 22

---

2 మూలంలో నాలుగు చరణాలలోను వేరు వేరు అని ఉండగా మార్చితిని. ఈ పుస్తకంలో పేరు అను మాటకి అర్థం అని అర్థం.

3. మాంసము అని మూలం.

4. బడ్డ అని మూలం.

క. ఈ గనగ శూలి కప్పెర;
యీ గనగా నమృత, చిలుక, యిందిరవిభుడున్;
యీ గనగ త్యాగ, భోగము;
యీ గనగా సుకులపాట, యిల కుంజరముల్. 23

క. నవనీత మమృతధారలు
నవనీతము పువ్వుదోట, నవమన్మథుడున్;
నవనీత మరటిఫలమును;
నవనీతము వెన్న, రంకు, నవయవ్వనమున్. 24

క. రావణు డనగా హంసయు;
రావణు డన మొసలి, మేఘ రథమున్ నవమున్;
రావణు డన రజతాద్రియు;
రావణు డన గౌరి, హస్తి, రావణుడు భువిన్ 25

క. భూతము బలి భోజాదులు;
భూతము దైవంబు, పిడుగు, భూతేశ్వరుడున్;
భూతము జేగురు, చిక్కూరు(?)
భూతంబా పవన సర్వభూతాత్మ లనన్. 26

క. భూతంబు ననగ సత్యము;
భూతం బన నల్పమొక్క బుద్ధియు, తనువున్;
భూత మన పంచవిషయము;
భూత మన నభోముఖాదిభూతము లయ్యెన్. 27

క. పిచ్చిక శంభుడు కాడా(?)
పిచ్చిక శేషంబు, కోతి, పిండాన్నంబుల్;
పిచ్చిక వరుషము (?), చిగురులు;
పిచ్చిక యొక చందమామ, పిడుగులు, గంగన్ 28

ఆ వె. ఘటము నుయ్యి కోట, గానుగ గుళ్లెము;
ఘటము కడవ, కుంభకర్ణుతోలు;
ఘటము బొంది, కుప్పకంబు(?)ను, లంకిణి;
ఘటము కన్య, కడుపు; ఘటము చెరువు 29

ఆ. వె. కుక్క పేరు గుదియ, గురుభామ, సింధుండు;
కుక్క చక్రిపురము, కుంభిమాను;
కుక్క కడుపు, ముడుపు, కుశ, దర్భ, శ్వానంబు;
కుక్క డొక్క, వేశ్యకులము రండ. 30

క. చింతామణి పతు లందురు;
చింతామణి రావిరేక, చిల్లర సరుకుల్;
చింతామణి రసగ్రంథము;
చింతామణి సానరాయి, శ్రీపతి పేరున్. 31

ఆ. వె. కుశలంబు వేదంబు; కుశలంబు మోదుగు;
కుశలంబు ఫణిరాజు కుశల మవని;
కుశలంబు వేడుక; కుశలంబు క్షేమంబు;
కుశలంబు క్షితి, వాన, గోపురవళి. 32

క. రంభనగ రాజహంసయు;
రంభనగా నరటిచెట్టు, రథమును పేరా;
రంభనగ నబల, యశ్వము;
రంభనగా భూతి, క్రతువు, రమణికి పేరా. 33

క. భీముడు గద, భల్లూకము;
భీముడు ఓంకారశక్తి, పిడుగుల రవళిన్;
భీముడు నార్పులు, రణమును;
భీముడు భీముండు నంత పేరును బరగున్. 34

ఆ వె. గాలిపేరు శక్తి, గగనంబు, మేఘంబు;
గాలిపేరు మొసలి, కారుచిచ్చు;
గాలిపేరు బిడుము (?) కపి, వైనతేయుండు;
గాలి శరధి మోత కరము సంద్రము. 35

ఆ. వె. రాగి పరుస వేది, రత్నాలపోగులు;
రాగి వేణునాద రవము, పాట
రాగి యోగాభ్యాసరంధ్రంబు, మిరియంబు;
రాగి రావిచెట్టు, రభము (?) కుండ 36

ఆ. వె. భగము మానితోత్ర, బడబాగ్నిశిఖ యండ్రు;
భగము పెట్టక్రోవి, భాను డండ్రు;
భగము 5యింద్రు హరి, పరమేష్ఠి, శివు డండ్రు;
భగము గోరి పేరు పరపు (?) తోడ. 37

ఆ. వె. వామనంబు పొట్టి వలసిన కార్యంబు;
వామనంబు మందు, వరుష (?) మండ్రు;
వామనంబు పుట్ట, వలరాజుతూపులు;
వామనంబు తెలుపు వగరు చిగురు. 38

ఆ వె. తొడిమ శివుడు, రాయి, తోయంబు, తొలకరి;
తొడిమ గర్వచిహ్న, దోసకాయ;
తొడిమ వగరుకాయ, తోరంబు మెరుపులు;
తొడిమ పువ్వుదోట, తొడిమ మొయిలు. 39

ఆ. వె. 6కోడె బాణగాడు, కుమ్మరి దరచెడి (?);
కోడె చక్రవర్తి, కొట్టువెన్న;
కోడె కోడెపోతు, కొమరొప్ప యింద్రుండు;
కోడె కొలిమితిత్తి; కోడె చేయి. 40

---

5 మూలములో యింద్రుడు అని ఉంది. గణవిభజనకు సరిపోదు.

6. మూలములో నాలుగు చరణాలలోను కోడి అని ఉండగా, కోడె అని దిద్దితిని.

ఆ వె. గోవు పాదరసము, కృష్ణుండు, నమృతంబు;
గోవు పంచదార, గొల్లవారు(?)
గోవు యాముడు, దుఃఖ, కుశలంబు, రవి పేరు;
గోవు మందవాడు, గోవు పేరు. 41

క. పొన్నలు పొరుగులు, సరుగులు;
పొన్నలు తాబేలు, 7మత్స్యభోగుల పేరున్;
పొన్నలు నిడుదమొగుంగులు:
పొన్నలు భ్రమరములు, కురులు, పూదోటలునున్

క వట మనగ చెఱకు, వృక్షము;
వట మనగ మహేశ్వరుండు, వజ్రాయుధమున్
వటము బ్రహ్మదేవ వృషభము;
వట మనగా మఱ్ఱిచెట్టు, వసగంధ్రేంద్రున్. 43

క. కూతలు 8మ్రోతల వేతలు;
కూతలు చిగురాకుబంటి క్రోతల్ (?) మేతల్;
కూతలు శేషపు శబ్దము;
కూత ఘనంజేసి బ్రహ్మకువలయ 9మమరున్. 44

క. తాళము కప్పెర చిప్పలు;
తాళము కరకత్తి, మేఘు, తప్పెట రవళిన్;
తాళము వ్యోమ నినాదము;
తాళము చప్పట్లు; 10తాళవృక్షము ధరణిన్. 45

ఆ. వె కప్ప యీతె, పుప్పి, గదిరిన యిరుసెత్తె (?)
కప్ప యాయుధంబు, కొలికుంటు;
కప్ప రాయి, యిప్ప, కఱకోల, మేఘంబు;
కప్ప వసిసె, రమణి, కప్ప పేరు. 46

క. నీరాట చెర్వు, కూపము;
నీరాట మునీశ్వరుండు, నీరాహకమున్;
నీరాట మంచి రం(?)బగు
నీరాటము కప్ప, మొసలి, నినుమును, తొట్టిన్. 47

క. కిట్టుట ముట్టులు, తిట్టుట;
కిట్టుట మృతిమాట; చెట్టు క్రిందటమాటల్;
కిట్టుట పెట్టుట; కట్టుట;
కిట్టుట తెగు తగనిపనులు, గీతప్రబంధల్. 48

క. కినుచుట మరచుట పరచుట;
కినుచుట తగు తగని గుణుల కిన్నరకాయల్;
కినుచుట హాస్యపు పనులును;
కినుచుట ఘోరంబు పేరు, కీర్త్యన బరగున్. 49

ఆ. వె. శీలంబు సింహంబు, సురులు, శార్దూలంబు;
శీలంబు నవనియు, చింతచెట్టు;
శీలంబు కోడియు, రవభూతి, దూర్జాలి;
శీలంబు వ్రతమును, సిగలు, నోము. 50

ఆ. వె తాత ధరణి పేరు, తలయును, హరియును;
తాత తండ్రిగారు, ధర్మరాజు;
తాత వహ్ని పేరు, తర్కంబు, శివుచంద్రుడు;
తాత పేరు పూర్వతలపు కాలక (?) 51

క. 11చింపురుగుడి జిల్ల నదగు;
చింపురు ముటాట వెంట చింబులు, జిగురున్
చింపురు గల్గును (?) గానుగ;
చింపురు నోరంగ్రము, పింట చింపురు పేరున్. 52

క. కాకర కరమును మ్రోతియు;
కాకర వసనాభి, మృత్యు కాకోదరమున్;
కాకర రజపుని పేరట;
కాకర మన యోగి, తరువు, కాకర పేరున్. 53

క. నవ్వులు నలు కా కాయలు;
నవ్వులు విరహాగ్ని, చదువు నాట్యము చిహ్నాన్;
నవ్వులు బర్హాలు, కళలును;
నవ్వులు...హాస్య లంగ్రము, నాదము గాలిన్ 54

క. పుడిసిలి రాహువు కోరలు;
పుడిసిలి గుడిరథము, బండి, పురుషామృగమున్;
పుడిసిలి పుడమి, సముద్రము;
పుడిసిలి, కపి, వాలి, గాలి; పుడిసిలి చేయిన్. 55

క. ముక్కన్న నారికేళము;
ముక్కన్నను తొటినుంబా, మునిమార్కండున్;
ముక్కన్న శివుడు, హరియును;
ముక్కన్న మహేంద్రశాలి, ముదితయు గంటన్.

క. కవి 12రథికుల సన్నాహము;
కవి శుక్రుడు, మెల్లకన్ను, కరిబృందంబున్;

---

7. మూలంలో మచ్ఛపోగులు అని ఉంది.

8 మ్రోతలు వేతలు అని మూలం.

9 అమరన్ అని మూలం.

10 తాటవృక్షము అని మూలం.

11 చింపురు అనునది చీపురు యొక్క ఉచ్చారణ గుడియాత్తం ప్రాంతంలో అట్లే ఉండును. ఈ పద్యంలోని వెంట (వేట), పింట (పీట) ఇట్టిపదాలే కావచ్చు. శబ్దార్థ చంద్రిక నిఘంటువులో వెంట అనగా వేట అని అర్థం చెప్పబడింది.

12 రథికులు అని మూలం.

కవి మంత్రి, జ్యోస్యు డనలుడు;
కవి విప్రుడు, రణము, సురభి కవివరు పేరున్.

ఆ. వె. [13]కండ్రచీమ పేరు గణనాథు డని యండ్రు;
కండ్రచీమ పేరు గరుడు డండ్రు;
కండ్రచీమ పేరు కరకంఠు డని యండ్రు;
కండ్రచీమ యిప్పకండ్ర మండ్రు. 58

ఆ. వె. పావకంబు వీణె భావంబు చెఱకండ్రు;
పావకంబు [14]సుద్ధ బంక వాడు;
పావకంబు చెవుడు, పగవాడు, మార్జాలి;
పావకంబు కోతి, బ్రహ్మములము. 59

ఆ. వె. పుష్పకంబు చిలుక, పులితోలు, చింబాయి(?);
పుష్పకంబు రథము, పొన్నమాను;
పుష్పకంబు కొండ, పొదరిల్లు, పాలిండ్లు;
పుష్పకంబు మేడ, పొలతి, వేట. 60

ఆ. వె. తాడుపలుపు, రాయి, దైవంబు, తలయేరు;
తాడు పోతురాజు, ధరణి, కత్తి;
తాడు చబుకు, పాము, తడబడు పోరాట;
తాడు గాళియండ్రు, తగులు, బయలు. 61

ఆ. వె. నీలంబు గరళంబు; నీలంబు వరుషంబు(?)
నీలంబు గిరిపేరు, నీల మండ్రు;
నీలంబు కృష్ణుండు; నీలంబు గగనంబు
నీలం బనంగను నింద్రు పేరు. 62

క. విశ్వస్త భగము, పెలిమిడి,
విశ్వస్తయు దామరయును, విశ్వంభరుడున్;
విశ్వస్త రజకు పేరట;
విశ్వస్తన రాగి, వెండి, విశ్వేశ్వరుడున్. 63

ఆ. వె. భాండ మన్న కుండ, బడబాగ్ని, నభ మండ్రు;
భాండ మనగ అమ్మ, పవన, భూమి;
భాండ మన్న భాను, నావండ్రు, బ్రహ్మండ్రు;
భాండ మన్న రవళి, బాణ, గోపి, 64

ఆ. వె. చిలుక రమణి పేరు శ్రీగంధ, కస్తూరి;
చిలుక మోవి(?)కొమ్మ, చిగురు, పువ్వు;
చిలుక నవ[15]నీతంబు, చిలుకండ్రు, చెఱకండ్రు;
చిలుక రావిరేక, చెలిమి పేరు. 65

ఆ. వె. ముత్యంబు పుష్పంబు, ముత్యంబు వజ్రంబు;
ముత్యంబు నీరండ్రు, మొల్ల చెట్టు;
ముత్యంబు చుక్కలు, మోహంపు [16]పల్వరుస;
ముత్యంబు ముక్కెర, ముగ్గు పేరు. 66

ఆ. వె. అళులపేరు కురులు, అధికారి, చీకటి;
అళులు కువకమండ్రు, అహిరి పేరు;
అళులు తెప్ప, వాన, ఆకటె(లి), వడగండ్రు;
అళులు తుమ్మెదలును, అగ్నిశిఖలు. 67

ఆ. వె. పులిపేరు కరకటు(?) పాలుపైన చంద్రుండు;
పులిపేరు మేఘంబు పొరలు, బయలు;
పులిపేరు యినకండ్రు(?) పావరింప్లు, సింహంబు
పులిపేరు క్రొన్నెల, పొలతి, యెరుక. 68

ఆ. వె. దివ్య అగ్ని పేరు దీపన ముత్యంబు;
దివ్య సూరు, చుక్క, తెలుపు నండ్రు;
దివ్యశశియు, పువ్వు, దేహంబు, అమృతంబు;
దివ్యవిష్ణు, లక్ష్మి, తేజ, మశ్వం(?) 69

ఆ. వె. రుద్రాక్షు నభమండ్రు, రుద్రాక్షు రుద్రాక్షు;
రుద్రాక్షు భద్రాక్షు, రుహము పేరు;
రుద్రాక్షు విన వేము, రుద్రాక్షు రుద్రాక్షు;
రుద్రాక్షు రక్షుంద్రు రుద్రు పేరు. 70

ఆ. వె. రామ దుప్పి, యగ్ని, రాజ్యంబు, వనమును;
రామ చిలుక, మొలక, రమణి సుతుడు;
రామ నల్పు, తెల్పు, రక్తంబు, కలహంస;
రామ నల్లనదియు, రాము డగును. 71

క. దోమనగ పర్వతంబును;
దోమనగా కంపతోడుగు, తువ(?)గచ్ఛాయన్;
దోమనగ దుక్కి, చిక్కును;
దోమనగా హిమము, మద్ది, దోమయునయ్యెన్ 72

గోవింద మనగ పడుసము;
గోవింద మనగ తొల్లి గొల్లడు గురియన్(?)
గోవింద మనగ కృష్ణుడు;
గోవింద మనగ పిల్ల గోపియు నయ్యెన్. 73

క. పద్మ మన శివుని కెంజడ;
పద్మం బన జపము, తపము, బంధ(?)నమయ్యెన్;
పద్మ మన రాణివాసము;
పద్మం బన పద్మజుండు, భానుడు, గజమున్, 74

క. హేమం బన కరి, మకరియు;
హేమం బన పర్వతంబు, హేమము పసిడిన్;

---

13 కండచీమ = కండ్రచిమ.
14 సుద్ధ అని మూలం.
15. 'నవనీ' అనగా గణము కుదరదు.
16. మోహంబు అని మూలం.

హోమ మన బ్రహ్మదేవుఁడు;
హోమం బన నుభయకాల హోమము నయ్యెన్.75

క. అమృత మన మోక్ష మబ్ధియు;
అమృతం బన పాలు, నీళ్లు, అంబుజ మిత్రుం
డమృత మన పులియు, సింహము;
అమృతం బన నాకసంబు,హ స్తియునయ్యెన్.76

క. స్వర్గ మన నాకసంబును;
స్వర్గం బన దేవలోక స్వభవము, అప్పి (?) న్
స్వర్గ మన నిజము, త్యాగము
స్వర్గము దాస్యంబు, మిగుల చతురతనయ్యెన్ .77

క. వజ్రమన భూమి......
వజ్రంబన దిక్కు, రస్మి, వాక్కును, 17గన్నుల్
వజ్ర మన స్వర్గ మెముకయు;
వజ్రం బన సాయకంబు, వజ్రము నయ్యెన్. 78

క. శ్రీపర్ణ మనగ తామర
శ్రీపర్ణం బనగ పక్షి, శివుఁడును, హరియున్
శ్రీపర్ణ మనగ తెలుపును;
శ్రీపర్ణము నాగచర్మ సింధుర మయ్యెన్. 79

క. కరుణ యన వెలయు నశ్వము;
కరుణయన స్త్రీయు నర్క కోమము, కృపయున్
కరుణ యన గుణ ప్రవేశము;
కరుణ యనన్ తథ్య మెరుపులగా మట నయ్యెన్ 80

క. సంస్కృతము లక్షణోత్తము;
సంస్కృత మన గతియు, కృతియు, సర్వము భూమిన్;
సంస్కృతి మన చెడనిపదవియు;
సంస్కృతి మన పక్షి,పండు,సభ మొదలయ్యెన్.

ఆక్రంద మనగ మ్రోతయు;
ఆక్రందం బనగ 18 నేడ్పు నతిభయమెందున్;
ఆక్రంద మనగ వేడుట;
ఆక్రందం బనగ పక్షి, నశ్వము నయ్యెన్. 82

అర్థ మన ధనము, పనిజీయు;
అర్థం బన ఫలము, వస్తు మాగము, యాధిపున్
అర్థ మన మనుట యర్థము
అర్థం బన నిత్యకర్మ మతిశయ మయ్యెన్. 83

క. యోగము కలిమి, యుపాయము;
యోగం బన వేగువాడు, యుద్ధముఖంబున్,
యోగ మన చిత్తవృత్తియు;
యోగం బన జాతకర్మ డుత్తము డయ్యెన్. 84

క. భోగ మన పాము పడగయు;
భోగం బన సుఖము, కీర్తి పొందుట, మానున్;
భోగ మన పదము, భవనము;
భోగం బన మేనమామపుత్రుడు నయ్యెన్. 85

క. అవ్యక్త మనగ కృష్ణుడు;
అవ్యక్తం బనగ సింహ, మగ్నియు, లేడిన్;
అవ్యక్త మనగ చంద్రుడు;
అవ్యక్తం బనగ సత్య మంబుధి యయ్యెన్. 86

క వృత్తాంత మనగ ప్రస్తుతి;
వృత్తాంతం బనగ క్రొత్త19వారను పేరున్;
వృత్తాంత మనగ నుపమయు;
వృత్తాంతం బనగ వార్త యుభయము నయ్యెన్ 87

క. శక్తి యన నీవిలావును;
శక్తి యనన్ గట్టిగుణము, సమరసమూర్తిన్;
శక్తి కుమారస్వామియు;
శక్తి యనన్ నండు వేల్పు, సమరస మయ్యెన్. 88

క. స్థాణు వన గోరడు, కొక్కెర;
స్థాణువు గిరి తరువు, స్యంద స్తంభేరంబున్;
స్థాణు వన హరియు, హరుడును;
స్థాణువు ఘనమోహనంబు,తండ్రియు నయ్యెన్.

క. హేతి యన...నుడు రాక్షసి;
హేతి యనన్ రస్మి,భస్మ,మింద్రుడు,చంద్రున్;
హేతి యన వెంట (?) మంటయు;
హేతి యనన్ ఆయుధంబు, హేతువు నయ్యెన్.

క. శ్రుతి యనగ చదువు శాస్త్రము;
శ్రుతి యనగా వేదమాత, జుంటెగయకన్;
శ్రుతి యనగ బ్రహ్మపాపడు;
శ్రుతి యనగా చెవియు, శుభము, సూత్రము నయ్యెన్.

క. భూతి యన గౌరి, గణపతి;
భూతియు నైశ్వర్యపదము, భుక్తియు, ముక్తిన్;

17 గనుక అని మూలంలో ఉంది. గణం సరి పోదు. కాబట్టి గన్నున్ అని మార్చాను.
18 యేడ్పు నతి భయమందున్ అని మూలం.
19 వారును అని మూలం.

భూతి యన లక్ష్మి, సంపద,
భూతి యన న్నిజము బ్రహ్మ భూతియు నయ్యెన్.

క. భూత మన వసుట ? సత్యము;
భూత మనన్ అల్పుడొక్క బుద్ధియు, తినువున్,
భూత మన పంచవిషయము:
భూత మన నభోముఖాదిభూతము లయ్యెన్. 93

క. తృణ మనగ పున్నిమ వస; ?
తృణ మనగా వ్యర్థ, మొక్క సంజ్ఞయు, తెరువున్;
తృణ మనగ కొంచవ్యర్థము;
తృణ మనగా బంటు బసుగు, కృణము నూత్రమున్.

క. గుణ మనగ సత్యసంపద;
గుణ మనగా రమణి, వింటి కొప్పును, నారిన్;
గుణ మనగ ప్రాయ మించుక;
గుణ మనగా ధైర్యమాదిగుణములు నయ్యెన్ 95

క. రణ మనగ రాజు, భూమియు;
రణ మనగా యుద్ధవేళ, రమణియు, భరణిన్;
రణ మనగ భేదనుండుము;
రణ మనగా రశ్మృత వింత రభసం బయ్యెన్ 96

క. హరిణ మన లేడి, యిట్టియు;
హరిణం బన నలుపు, తెలుపు, హరుడును, హరియున్;
హరిణ మన మీను, మిడతయు,
హరిణం బన పర్వతంబు, నందయు నయ్యెన్. 97

క. 20ప్రామాణ్య మనగ నెమికయు;
ప్రామాణ్యం బనగ పక్షపాటయు నమరున్;
ప్రామాణ్య భూతి శాస్త్రము,
ప్రామాణ్యం బనగ కోదె ప్రస్తుత మయ్యెన్ 98

క. హైరణ్య మనగ బెంగ్లియు,
హైరణ్యము నినుము, వెండి, యినుకయు, దదువున్
హైరణ్య మనుట పాషాట;
హైరణ్యము పైడి, సుమతి, హిమమును, హరుసున్.

క. 21సంవిత్తు నెరుక, యుద్ధము;
22సంవిత్తినకోపమును ప్రాప్తిసోదము, తెలువున్
సంవిత్తు నిజము, భూషణ
సంవిత్తన కౌరవపుణ్యసద్భరం బయ్యెన్. 100

---

20. అన్ని చరణాలలోను ప్రామాణమని మూలంలో ఉంటెగా ప్రామాణ్యం అని మార్చేను.

21. అన్ని చరణాలలోను సంవిత్తని మూలంలో ఉంటెగా సంవిత్తు అని దిద్దేను.

22. ఛందస్సు సరిగా లేదు.

# జానకి

శ్రీ వి. యస్. చెన్నూరి

రామ్మూర్తి స్కూలు ఫైనల్ పాసయి, మేనమామ గారి ప్రోత్సాహంతో, పై చదువులకి గాను, మద్రాసుకి పయనమయ్యాడు.

రామ్మూర్తిని సాగనంపడానికి జానకి స్టేషన్ దాకా వెళ్ళింది. రామ్మూర్తి జానకిదగ్గర సెలవుతీసుకుని అతికష్టంతో రైలెక్కాడు.

ఎప్పుడూ లేడిపిల్లలా గెంతుతూ, నవ్వుతూ, చలాకీగా వుండే జానకి, ఆరోజు అదోలా వుండడం రామ్మూర్తిని కలవర పెట్టింది. రైలు కదిలేప్పుడు జానకి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. జానకి ఎంత ప్రయత్నించినా, రామ్మూర్తి కంటబడకుండా దాచుకోలేకపోయింది. రామ్మూర్తి శిలాప్రతిమకి మల్లే నిశ్చేష్ప గించి చూస్తూ వుండిపోయాడు.

రైలు శరవేగంతో దూసుకుపోతోంది. రైలు కంటే వేగంగా రామ్మూర్తి బుర్రలో పిచ్చి పిచ్చిగా, ఆలోచనాతరంగాలు సాగిపోతున్నయ్.

రైలు సెంట్రల్ స్టేషన్ చేరుకుంది. రామ్మూర్తి కళ్ళల్లో జానకి మెదులాడుతూనే వుంది.

మద్రాసులో అంతా కొత్త వాతావరణం. అందరూ కొత్తి నేస్తాలు. ఏదో వింతలోకంలో వున్నట్టనిపించేది రామ్మూర్తికి.

తనతో తిరిగేవాళ్ళందరూ కలిగినవాళ్ళ పిల్లలు. భోగాలకీ విలాసాలకీ ఘరానాగా ఖర్చుపెట్టేవాళ్ళు.

పాపం, తన కలాసాగదు. మేనమామ భాగ్యవంతుడు కాడు. అతడి సంపాదన తినడానికే చాలదు. కాని, కష్టంలో కష్టం, ఎలాగో, అప్పో సప్పో చేసి, పంపిస్తున్నాడు. రామ్మూర్తి పైకి ఘరానాగా అవుపించినా డబ్బు మాత్రం అతి పొదుపుగా వాడుకునేవాడు.

రామ్మూర్తికి కొత్త వాతావరణంలో—కొత్త నేస్తాలతో కాలం సరదాగానే గడిచిపోతోంది.

ఎప్పుడో, ఏకాంతంలో వున్నప్పుడు మాత్రం జానకి జ్ఞాపకానికొచ్చేది. గుండెలు బరువెక్కేవి. ఏదో పోగొట్టుకున్నవాడికి మల్లే దిగులుగా కూచుండిపోయేవాడు.

సంవత్సరం రోజులు దొర్లిపోయాయి. సెలవుల్లో విద్యార్థులందరూ తమ తమ ఇళ్ళకు వెళుతున్నారు. రామ్మూర్తికూడా మామగారికి ఉత్తరంరాసి బయలుదేరాడు. రైలు కదిలింది.

'జానకిని చూచి సంవత్సరం అవుతోంది. ఈ సంవత్సరం వ్యవధిలో ఎంతగా మారిపోయిందో!

నే నొచ్చానని తెలిస్తే తప్పకుండా పరుగెత్తుకొస్తుంది. నేను చూడనట్టేవుండిపోతాను. పలకరించను. తాను పలకరించడానికి బిడియపడుతుంది. కాస్త ఉడికించి పలకరిస్తాను.

"మద్రాసునించి నాకేం తెచ్చావ్?"—అని అడుగుతుంది.

"అబ్బే, నే నేం తేలేదే"—అంటాను. చిన్నబుచ్చుకుంటుంది.

మెల్లగా వొక్కొక్కటే జేబులోంచి, తీసి ముందు పెడతాను. జానకి సంతోషిస్తుంది.

మద్రాసులో నా అనుభవాలు గోరంతలు, కొండంతలు చేసి చెబుతోంటే నోరు తెరుచుకు వింటుంది'—రామ్మూర్తి యేవేవో పిచ్చి పిచ్చిగా కలలు గంటున్నాడు.

రైలు, స్టేషన్లో ఆగింది. పెట్టె, బెడ్డింగూ కూలీ నెత్తి కెక్కించి, హుషారుగా, కాలినడకనే బయలుదేరాడు.

మామగారింటికి పోయేదార్లోనే జానకి ఇల్లు. డాబా మీద కనిపిస్తుందేమోనని చూచాడు. కనిపించలేదు.

"ఎందుకు తొందరః?—నే నొచ్చానని తెలిస్తే అదిడే పరుగెత్తుకురాదూ?"—అని నవ్వుకున్నాడు.

రామ్మూర్తి ఇల్లు చేరుకున్నాడు...అప్పటికే రెండుమూడు రోజులు గడిచిపోయినై. ఊళ్ళోని స్నేహితు లందరూ, ఒక్కొక్కరే వచ్చి పలకరించి పోతున్నారు జానకిమాత్రం అవుపించలేదు. కారణం వూహించుకోలేక పోయాడు. జానక్కి తెలీదేమో ననుకున్నాడు.

కాని, ఊరంతా తెలియగా, జానక్కి తెలియకపోవడమేమిటి?—రామ్మూర్తికి జానకిమీద కోపమొచ్చింది.

'ఎంతగర్వం!'—అనుకున్నాడు. కాని, అలా అనుకుని గప్‌చిప్పున వుండలేకపోయాడు.

'నేనే ఎందుకెళ్ళకూడదు వాళ్ళింటికి?'—అనుకున్నాడు. అనుకున్నదే తడవు. లేచి బయలుదేరాడు.

గుమ్మం దాటుతూనే జానకి తండ్రి సీతారామయ్యగారు ఎదురై పలకరించకుండానే చరచరా వెళ్ళిపోయాడు. రామ్మూర్తి లెక్కచెయ్యలేదు. 'ఆయనగారి తరహా అంతే'—అనుకుంటూ ముందుకి నడిచాడు.

జానకితల్లి రామలక్షుమమ్మ మాత్రం—"యెప్పుడొచ్చావు నాయనా?—కులాసా?" అని పలకరించి, దొడ్లోకి దారితీసి, అరగంటదాకా తిరిగిరాలేదు.

జానకి అవుపిస్తుందేమోనని వెతికాడు. కనిపించలేదు. డాబామీదికి వెళ్ళి చూచాడు. డాబామీది గది తాళం వేసివుంది.

"జానకేమైంది?"—అని అడుగదామనుకుంటే, నౌకరువెధవకూడా అవుపించలేదు.

ఏమీ తోచక అలా కూచుండిపోయాడు.

ఎంతసేపని అలా కూచోగలడు?—తిన్నగా దొడ్లోకెళ్ళి, మల్లెపాదులికి నీళ్లుపోస్తున్న రామలక్షుమమ్మగారివద్ద సెలవుపుచ్చుకుని, ఇంటివేపు నడిచాడు.

నడిదార్లో అవుపించిన నౌకర్ని పిలిచి అడగ్గా జానకి వూళ్ళో లేదనీ మేనమామగారింటికి వెళ్ళిందనీ తెలిసింది. రామ్మూర్తి ఆశ నిరాశయింది ఆ వూళ్ళోవున్న నాలుగురోజులూ అతికష్టంతో గడపాలిసి వొచ్చింది. దిగులుగా ఏమీ తోచేదికాదు ఎవరితో మాట్లాడుతున్నా—ఏపని చేస్తున్నా జానకి జ్ఞాపకానికొచ్చేది.

మరో సంవత్సరంరోజులు దొర్లినయ్.

పరీక్షలు దగ్గరపడుతున్నయ్. పరీక్షలవగానే సెలవులు. సెలవుల్లో యింటికెళ్ళొచ్చు. జానకిని చూడొచ్చు రామ్మూర్తి అందరి విద్యార్థులతోబాటు పరీక్షలకి తయారవుతున్నాడు.

ఇంతలో మామగారికి సీరియస్‌గా ఉందని ఇంటివద్దనుండి ఉత్తరం వొచ్చింది. ఉత్తరం అందగానే ఎకాఎకిని బయలుదేరి వెళ్ళాడు.

మామ చావుబ్రతుకుల్లో ఉన్నాడు డాక్టరు పెదవులు విరిచారు. రామ్మూర్తి గుండెల్లో బండపడ్డట్టయింది.

వారంరోజులపాటు సేవ చేయించుకున్న మామగారు, ఓనాటిరాత్రి పన్నెండుగంటలకి, ఇహలోకయాత్ర చాలించారు. మామగారికి కర్మక్రతువులయ్యేవరకూ, రామ్మూర్తికి క్షణం తీరిక లేకపోయింది. కనీసం, జానకిని కలుసుకునేందుక్కూడా వ్యవధి దొరకలేదు.

ఆరోజు ఇంట్లో వాతావరణం కాస్త ప్రశాంతంగా ఉంది. వచ్చిన చుట్టాలందరూ వొక్కొక్కరే వెళ్లిపోయారు. మేనమామగారి బావమరది, అతని తాలూకు బంధువులూ తప్ప మరెవ్వరూ లేరు మేనమామగారి ఆస్తిగురించీ—అత్తగారి పోషణ గురించీ వాళ్లల్లో వాళ్లికి మాటలు జరుగుతున్నయ్.

రామ్మూర్తికి వీలు దొరికింది. తిన్నగా జానకి ఇంటివేపు నడిచాడు.

జానకి ఇంటిముందు కారు ఆగివుంది. ఎవరో బంధువులొచ్చినట్టున్నారు. ఇంట్లో అంతా హడావిడిగా ఉంది.

ఎవరో పెళ్లిచూపులకని వచ్చినట్లు నౌకరు ద్వారా తెలిసింది.

అబ్బాయి ఎం ఏ. పాసయ్యాట్ట. కాలేజీలో ట్యూటర్‌గా పనిచేస్తున్నాట్ట. పిత్రార్జితం బోలెడంత వుందిట. అందగాడూ, గుణవంతుడూనట. జానక్కి ఈ సంబంధం ఇష్టమేనట

రామ్మూర్తి గుండెల్లో గతుక్కుమంది. మనసు మనసులో లేదు. పిచ్చిపిచ్చిగా ఆలోచించుకుంటూ ఇంటివేపు నడిచాడు.

ఆ మరునాటి సాయంత్రం. డాబామీద జానకి ఒక్కర్తే కూచుని, దూరంగా ఆకాశంలో ఎర్రగా నిట్టూరుస్తూ, పడమటి కొండల్లో కృంగిపోతున్న సూర్యుని పసిడికిరణాలతో ధగధగా మెరిసిపోతోన్న ప్రకృతిని, చూస్తూ యేవేవో తియ్య తియ్యని కలలు కంటోంది.

ఆమె కట్టుకున్న తెల్లని వాయిలుచీరా, తెల్లని సిల్కు చోళీ, వొదులుగా అల్లుకున్న జడలో తురుముకున్న మల్లెపూలూ, సంజకాంతుల వింతవెలుగుల్లో ధగధగా మెరిసిపోతోన్నయ్.

పచ్చగా, పసి నిమ్మపండులా, వయసుతో వచ్చిన వయ్యారంతో అప్పుడే దిగివచ్చిన అప్సరసకి మల్లే వుంది జానకి.

'రెండేళ్ళకే ఎంతగా మారిపోయింది!

అడవాళ్లెంత త్వరగా ఎదిగిపోతారు!'—అనుకున్నాడు రామ్మూర్తి.

ఆ మారడం ఒక్క శారీరకంగానే కాదు—మానసికంగా కూడా—అన్న విషయం తెలుసుకునేందుకు ఎంతో కాలం పట్టలేదు రామ్మూర్తికి.

జానకిని మాటల్లోకి దింపి, మెల్లగా తన మనస్సులోని విషయాన్ని బయట పెట్టాడు.

జానకి పకపకా నవ్వేసింది.

"క్షమించు రామూ, నువ్వు అంపని పళ్ళకి అర్రులు చాస్తున్నావ్"

"నిజంగానా?"

"అవును. ఆడది ఎప్పుడూ అధికమయిన సుఖాల్ని—ఐశ్వరాన్ని కోరుతుంది. కాని దారిద్ర్యాన్ని కోరి తెచ్చుకోదు. బాధల్ని వరించదు."

రామ్మూర్తి స్థాణువులా నుంచుండిపోయాడు.

"జానకీ! ఆడదానికి కావలిసింది ఐశ్వర్యం ఒక్కటేనా?"

"కాకపోవచ్చు; కాని, ఐశ్వర్యంతో కొనుక్కోలేని దేమీ లేదు"

"ప్రేమని కూడానా?"

"ప్రేమా?—ప్రేమ?—అవన్నీ పుస్తకాల్లోని మాటలు మూర్తీ! వాస్తవిక జీవితానికి కావలసింది డబ్బు!—ప్రేమ కాదు."

రామ్మూర్తి పలకలేదు.

నిజమేనా—ఆడదానికి కావలసింది ఐశ్వర్యం ఒక్కటేనా?—కోరిన నగలూ, చీరలూ, అందమైన మేడా, మంచి కారూ, దాసదాసీలూ వుంటే చాలా?—ప్రేమకి అర్థంలేదా?

రామ్మూర్తి ఆలోచిస్తూ వుండిపోయాడు.

జానకి మారిపోయింది—ఆ వునికిలో ఠీవి—ఆ మాటల్లో హుందాతనం—ఆ కళ్ళల్లో గర్వం—జానకి నిజంగా మారిపోయింది.

"నిజం జానకీ, అర్థంలేని ప్రేమకోసం ఆశల్ని చంపుకోవడం ఆవాంతరాలని తెచ్చిపెట్టుకోవడం వెర్రితనమే కావచ్చు. ఇప్పటికయినా నీహృదయం విప్పి చెప్పినందుకు నా ధన్యవాదాలు. సెలవ్ జానకీ!—వెళ్ళొస్తా!"—రామ్మూర్తి జవాబు కోసం ఎదురు చూడకుండానే చరచరా మెట్లుదిగి వెళ్ళిపోయాడు.

జానకి అతగాడివేపు చూచి నవ్వుకుంది.

'పిచ్చివాడు!'—అనుకుంది.

* * *

జానకి, ఆ వూళ్లో పేరు ప్రఖ్యాతులు గడించిన డాక్టరు సీతారామయ్యగారి ఏకైక పుత్రిక. లేక లేక పుట్టిన సంతానం కావడంచేత అల్లారుముద్దుగానే పెరిగింది. సీతారామయ్యగారు జానకికి ఎందులోనూ లోటు జరగనిచ్చేవాడు కాదు. గారాబంగా పెరగడం మూలాన మాటంటే పట్టంగానీ—మనసులోని విషయాన్ని దాచుకోవడంగానీ ఎరగదు. ముక్కుకి సూటిగా ప్రవర్తించేది.

పచ్చగా, పసినిమ్మపండులా వయసుతో వచ్చిన వయ్యారంతో విరియబూసిన గులాబీ పూవులా ఎప్పుడూ నవనవలాడుతూ వుండేది.

జానకికి, స్కూలు వదలక పూర్వమే రామ్మూర్తితో పరిచయమైంది. వందలాది విద్యార్థుల్ని సూదంటు రాయిలా ఆకర్షించి, తనచుట్టూ తిప్పించుకుని, కాపలా కాయించుకుని, గర్వంగా తనలో తాను నవ్వుకునే జానకి, రామ్మూర్తిచేత ఆకర్షింపబడిందంటే, రామ్మూర్తిలోని విశిష్టత తెలుసుకోవాలి.

రామ్మూర్తి అందగాడు. తెలివిపరుడు. గుణవంతుడు.

జానకి అప్పుడు నాలుగోఫారం కాబోలు చదువుతోంది. స్కూలు వార్షికోత్సవాల సందర్భంలో, విద్యా

ర్థుల చేత ప్రదర్శింపబడ్డ నాటికలో 'హీరో'గా నటించిన రామ్మూర్తి, ప్రథమ బహుమతిని పొందడమే గాకుండా, జానకి హృదయాన్ని కూడా చూరగొన్నాడు. ఆ మరుసటియేడు విద్యార్థుల, 'లలితకళా సంఘాని'కి కార్యదర్శిగా రామ్మూర్తి, సహాయకురాలుగా జానకి ఎన్నుకోబడ్డంతో సన్నిహితులయ్యారు. ఈ సాన్నిహిత్యమే సినిమాలకీ, షికార్లకీ కూడా తిరిగేంత స్నేహానికి దారితీసింది.

జానకీ రామ్మూర్తులు ఒకరి అంతరంగాలు మరొకరికి చెప్పుకునేవారు. కష్టసుఖాలు పంచుకునేవారు. గంటల తరబడి యేవేవో చర్చించుకుంటూ కూచునేవాళ్లు, ఎవరూ వాళ్ళ నివారించే వాళ్లు కారు.

ఇద్దరూ స్కూలు ఫైనల్ పరీక్షల్లో కృతార్థులయ్యారు. జానకి పై చదువులకి వెళ్ళడం యిష్టంలేక అంతటితో ఆగిపోయింది. రామ్మూర్తి మామగారి ప్రోత్సాహంతో మద్రాసుకి వెళ్లాడు.

రామ్మూర్తి మద్రాసులో వున్న రెండేళ్ళ కాలంలోనూ జానకి బాగా మారిపోయింది తండ్రి సీతారామయ్యగారి దశ మారింది ఎప్పుడో ఒకటి రెండూ దంపగమారి కేసులు తప్ప కళ్ళమాడని డాక్టరుగారికి, డిమాండు హెచ్చింది ఇప్పుడు రెండు చేతులా ఆర్జిస్తున్నారని అందరూ అంటున్నారు. ఈమధ్య ఓ కారు కూడా కొన్నారట దీంతో జానకి అంతస్తూ పెరిగింది. గొప్పబుద్ధులూ, గొప్ప అలవాట్లూ, గొప్పవారితో స్నేహం, అలవడ్చుకుంది. అభిరుచులు మార్చుకుంది బజారు కెళ్ళాలన్నా కారులో వెళ్లాలి. చీర కట్టుకునేప్పుడు కూడా దాసీది పక్కనుండాలి.

జానకి బాగా మారిపోయింది—ఆవిడ దృక్కోణం మారిపోయింది.

గొప్పగొప్ప సంబంధాలు జానకి కోసం ఎగబడుతున్నాయి.

అందం తక్కువనో—ఐశ్వర్యం తక్కువనో—చదువు తక్కువనో — ఉద్యోగం లేదనో వంకలు పెడుతోంది జానకి. చివరికి, మద్రాసునించి ఓ సంబంధం వొచ్చింది. అతగాడికి అందం, ఐశ్వర్యం, చదువూ ఉద్యోగం అన్నీ వున్నయ్. జానకి యీ సంబంధాన్ని వొప్పేసుకుంది. వరుడు కట్నం రూపేణా చిల్లికానీ ముట్టనని చెప్పడంచేత, సీతారామయ్యగారు కూడా ఈ సంబంధం చేసుకునేందుకు వొప్పుకున్నారు.

జానకిప్పుడు యేవేవో వూహించుకుంటూ, తియ్యతియ్యగా కలలుగంటోంది

ఆమెకిప్పుడు కావలిసింది అర్థంలేని ప్రేమ కాదు. కీర్తి!—హబ్బు!—హోదా!......

* * *

అత్తగారిని పుట్టింటికి సాగనంపి, రామ్మూర్తి మద్రాసుకి బయలుదేరాడు. పరీక్షలయిపోయినై. సెలవులిచ్చారు. అప్పటివరకూ రామ్మూర్తికి, తన భవిష్యత్తుని గురించి ఆలోచనే రాలేదు.

అత్తగారు పుట్టిల్లు చేరుకుంది మామగారీ ప్రపంచంలోనే లేరు.

'ఇప్పుడు నాకెవరు దిక్కు? — చదువుకి డబ్బెవరంపుతారు?—కనీసం తిండెవరు పెడతారు?—నాకీ ప్రపంచంలో ఎవరున్నారు?

తల్లి పోయింతరువాత, తల్లి తోబుట్టువు కాబట్టి ఆదరించాడు. అతడూ దాటుకున్నాడు. ఇహ, ఆదరించేవాళ్లెవరున్నారు?

తండ్రికి ఉత్తరం రాస్తే?—ఛీ!—అన్నం పున్నెం ఎరుగని తల్లిమీద అభాండం మోపి, పుట్టింటికి తరిమేసి భోగంముండతో కులికే తండ్రికా?—అంతకంటే అడుక్కు తినొచ్చు.

అవును, నేనేం అవ్యక్తుణ్ణి కాను. నాపొట్ట నేను పోషించుకోగలను చదువుకున్నాను ఎక్కడో నౌకరీ చేసి బ్రతుకుతాను.'—రామ్మూర్తి చదువుకి స్వస్తిచెప్పి, ఉద్యోగంకోసం ప్రయత్నించడానికి నిశ్చయించుకున్నాడు.

పెట్టెబేడా సర్వస్వం అమ్మి అంతకుపూర్వం చేసిన చేబదుళ్లు తీర్చేసి, గది ఖాళీచేసి, ఉద్యోగాన్వేషణకు బయలుదేరాడు.

కాని, ఉద్యోగాలు సంపాయించడం అనుకున్నంత తేలికయినపని కాదని తెలుసుకునేందుకు ఆట్టే కాలం పట్టలేదు.

ఆఫీసులూ — ఫ్యాక్టరీలూ — మిల్లులూ — దుకాణాలూ అన్నీ గాలించాడు. ఎక్కడైనా ఖాళీవుందని విన్నా అక్కడికి పరుగెత్తాడు. కన్నవాడి కాళ్ళల్లా పట్టుకున్నాడు. కాని ప్రయోజనం కనిపించలేదు.

రోజూ, కాళ్ళరిగేలా వూరంతా గాలించి, సాయంత్రానికల్లా ఉసూరుమంటూ 'రామసామి సత్రం' చేరుకునేవాడు. అరటిపళ్లు ఆరగించి, పంపు నీళ్లు పట్టించి, అరుగుమీదికి చేరుకునేవాడు. సత్రం అరుగులమీద బసచేసే అభాగ్యుల్నీ, అనాథల్నీ చూస్తూ—'జీవితమంటే ఇంత భయంకరంగా వుంటుందా?'—అనుకునేవాడు.

'అందుకనే కాబోలు, జానకి ప్రేమని తృణీకరించి, ఐశ్వర్యం వేపు మొగ్గింది.'—అనుకుని బాధగా నిట్టూర్చేవాడు.

ఆరోజు, అర్ధరాత్రి వేళ మద్రాసు మహానగరం విద్యుద్దీపాల నీలికాంతుల్లో దేదీప్యమానంగా వెలిగిపోతోంది. పగలంతా కార్లతో—రిక్షాలతో తీరికలేని విశాలమైన తారురోడ్లు విశ్రాంతి తీసుకుంటున్నాయ్

ఐలెండ్ గ్రౌండ్సుపక్కగా, పేవ్‌మెంటుమీద ఒక్కడే కాళ్లీడ్చుకుంటూ—బిక్కు బిక్కుమంటూ నడుస్తున్నాడు, సత్రంవేపు రామ్మూర్తి

బట్టలు బాగా నలిగిపోయినై క్రాపు చెరిగిపోయింది. గడ్డం మాసిపోయింది. జేబులో చిల్లిగవ్వ లేదు రేపట్నించీ, ఆరగించడానికి అరటిపళ్ళుగ్గూడా లేవు. ఆఖరుకొణీ స్టార్ సిగరెట్టుగూడా వెలిగిపోతోంది. రామ్మూర్తి దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. అతనిముందు భవిష్యత్తు భయంకరంగా నర్తిస్తోంది కోరలువిప్పి.

ఏదో చప్పుడయితే వెనక్కి తిరిగి చూశాడు. రోడ్డుమీద వెళుతోన్న రిక్షా ఆగిపోయింది ఎవరో ఇద్దరు ఎదురెళ్లి ఆపారు అందులో ఒకడు చేతిలోని కత్తిని ఝళిపిస్తున్నాడు. మరొకడు రిక్షాలోని బెంగాలీ ఆసామిని దింపి, అతగాడి జేబులు తడుముతున్నాడు. రిక్షావాడూ—ఆసామీ నిస్సహాయంగా నుంచుండిపోయారు.

ఈదృశ్యం చూచేసరికి, రామ్మూర్తిలోని ఉడుకురక్తం కుతకుతలాడిపోయింది. మద్రాసులోని దుండగుల మోసాలు రామ్మూర్తికి తెలియందికాదు. రామ్మూర్తి చూస్తూ వూరుకుండలేకపోయాడు.

వెంటనే వెనక్కి తిరిగి, సింహంలా, కత్తి పట్టుకున్న వాడిమీదికి ఉరికాడు. అంతవరకూ నిస్సహాయంగా నుంచున్న ఆసామీకూడా రెండోవాడితో కలియబడ్డాడు. కొంతసేపు పెనగులాడింతరువాత దుండగులిద్దరూ పారిపోయారు.

ఆసామీ మనసు కుదుటబడింది. ఏ అత్యాచారమూ జరక్కుండా—జేబులోని పాతిక వేల రూపాయలూ చెక్కు చెదరకుండా సమయానికి దేవుళ్లాగా ఆదుకున్న రామ్మూర్తిని ఎంతగానో అభినందించాడు. రామ్మూర్తిని తనతోబాటు తన లాడ్జికి తీసుకుపోయి, అతని స్థితిగతులు విచారించి, తనకి చేసిన మేలుకు కృతజ్ఞతగా తనతోపాటు కలకత్తా వొస్తే, తప్పకుండా యేదేనా వుద్యోగం యిప్పించగలనని హామీ ఇచ్చాడు. రామ్మూర్తి బెంగాలీ ఆసామీతోబాటు కలకత్తా వెళ్లడానికి నిశ్చయించుకున్నాడు.

మరుసటిరోజు, కలకత్తా మెయిల్లో బెంగాలీ వాలాతోబాటు, రామ్మూర్తి కూడా ప్రయాణమయ్యాడు.

* * *

బండ్లు ఓడలవుతాయ్—ఓడలు బండ్లవుతాయ్. ఏదుర్వ్యసనమూ ఎరగని డాక్టరు సీతారామయ్యగారు తాగుడుకీ రేసులకీ అలవాటు పడతారనీ, ఉన్న సర్వస్వం రేసుల్లో పెట్టి, హటాత్తుగా గుండెలాగి పరలోకయాత్ర సాగిస్తారనీ ఎవరూ అనుకోలేదు.

డాక్టరుగారి మరణంతో అప్పులవాళ్లు యీగలు మూగినట్లు మూగి, మిగిలిన కాస్తకూడా పంచుకుపోయారు. భార్యాబిడ్డలు తలదాచుకోడానికి ఇల్లుకూడా మిగల్లేదు.

రామలక్ష్మమ్మ కూతురు జానకితోబాటు తమ్ముడిల్లు చేరుకోవలసి వచ్చింది. జానకి అంతస్తు దిగిపోయింది. సినిమాలూ షికార్లూ బందయినై. ముతక బట్టలే కరువైనై.

రాగిదువ్వ కట్నం అడక్కుండానే పెళ్ళికి ఒప్పుకున్న పెద్దమనిషి డాక్టరుగారు చెల్లుకునేసరికి పాతికవేలు కట్నం చెల్లించందే పుస్తె కట్టనని కూచున్నాడు. అంతా 'సెటిల్' అయి పెళ్లిపీటలదాకా వచ్చిన పెళ్లి అలా తెల్లారిపోయేసరికి, రామలక్ష్మమ్మగారి గుండెల్లో బండపడ్డట్టయింది. డాక్టరుగారు బ్రతికుండగా ఎగబడుతోన్న సంబంధాలు చనిపోయింతరువాత ఒక్కటీ దిగరావడంలేదు

"చెరువులో నీళ్లుండేవరకే కప్పల బెకబెకలు" అని ఎంతగానో వగచింది జానకి తల్లి రామలక్ష్మమ్మ.

జానక్కి అంతా అయోమయంగా వుంది.

"నాకు పెళ్ళొద్దు! చదువుకున్నాను. ఉద్యోగం చేసుకు బ్రతగ్గలను. నాకోసం మీరేమీ బెంగపెట్టుకో వద్దు" అని అన్నది జానకి.

"అదేంటిచే పిచ్చిపిల్లా! ఆయనగారు పోయి ఇప్పటికే కాపురం వీధిన బడిందిచాలక, నీవుకూడా సంపాయించాలా మగరాయుడికిమల్లే పెళ్లీ పెటాకు ల్లేకుండా" అని కంటనీరు పెట్టకున్నది రామ లక్షువమ్మ.

తల్లికేం జవాబు చెప్పాలో తోచక బిక్క మొహం వేసింది జానకి.

పెళ్లిపీటలదాకా వచ్చిన పెళ్లి ఆగిపోయేసరికి, జానక్కి లోకంమీద చెడ్డ చిరాకేసింది.

"ఛీ! ఏం మనుషులు!—డబ్బుకోసం ఏమైనా చేస్తారు. ఎన్ని అబద్ధాలయినా ఆడుతారు. ఎంత నీచానికయినా దిగుతారు—వీళ్లు మనుషులేనా?—వీళ్లకి హృదయాల్లేవా?—అనుకున్నది జానకి.

వెంటనే రామ్మూర్తి జ్ఞాపకానికొచ్చాడు. ఆమె హృదయం బరువుగా—బాధగా క్షోభించింది. కళ్ళు చెమ్మగిల్లాయి

'మానవులు యేగాలికాచాప ఎత్తుతారు. ఏసమయానికామాట మాట్లాడతారు. నేను మాత్రం యేం చేశాను?—డబ్బుకోసం రామ్మూర్తి ప్రేమని తృణీకరించలేదూ?—రామ్మూర్తి హృదయం యెంతగా క్షోభించిందో.

రామ్మూర్తి ఇప్పుడిక్కడుంటే?—నాకన్నీటి ధారతో అతనిపాదాలు ప్రక్షాళనంచేస్తే?—క్షమించమని ప్రార్థిస్తే?—జానకి హృదయం తల్లడిల్లింది.

జానకి ఎప్పుడూ, ఏకాంతంలో, ఏదో ఆలోచించుకుంటూ గడపడం రామలక్షువమ్మకి బాధగా వుండేది.

జానకి మేనమామ రంగారావు లౌక్యుడు. వ్యవహారశాలి. తిమ్మిని బమ్మిని చెయ్యగలడు. బమ్మిని తిమ్మినీ చెయ్యగలడు. అతడు తలుచుకుంటే చెయ్యలేని పనంటూ ప్రపంచంలో వుండదని రామలక్షువమ్మకి బాగా తెలుసు. అంచేత ఆకాస్తయినా ధైర్యంగా వుండగలుగుతోంది.

రంగారావు కూడా వూరుకుండడంలేదు. తన శాయశక్తులా ప్రయత్నిస్తూనే వున్నాడు. తెలిసిన సంబంధాలన్నీ విచారిస్తూనే వున్నాడు.

ఇంతకీ కాలం కలిసిరానప్పుడు ఎవరుమాత్రం యేం చెయ్యగలరు?

రోజులు దొర్లుతున్నాయ్.

ఉన్నట్లుండి ఓనాడు, రంగారావు గారింట రామావధాన్లు సాక్షాత్కరించారు.

రామావధాన్లని ప్రత్యక్షంగా చూడని వాళ్ళుంటే వుండొచ్చుగాని, ఆప్రాంతంలో కనీసం అతగాడిపేరు కూడావినని వాళ్ళుంటారంటే మాత్రం నమ్మడానికి వీల్లేని విషయం.

భార్యలేని మగాళ్ళకి భార్యల్ని—భర్తలేని పిల్లలకి భర్తల్నీ యేరి, కూర్చి వాళ్ళని ఓయింటి వాళ్ళనిచేసి, అక్షతలుచల్లి, ఆశీర్వదించి, దక్షిణ తాంబూలాలు, పట్టుపీతాంబరాలు స్వీకరించడం ఆయనగారి ఉద్యోగం. ఆప్రాంతంలో ఎంతమంది బ్రహ్మచారులున్నారో—ఎంత మంది కన్నెపిల్లలున్నారో, ఆస్తి, వయసు, వర్ణం, గోత్రాలతో సహా వారికి కంఠస్థం.

రామావధాన్లు అంత అకస్మాత్తుగా రంగారావు గారింట సాక్షాత్కరించారంటే, తప్పకుండా యేదో విశేషం వుండితీరుతుందని ఇంటిల్లిపాదీ అనుకున్నారు.

భోజనానంతరం తాంబూలం సేవిస్తూ, అవధాన్లుగారు తాము విచ్చేసిన అసలుకారణాన్ని బయటపెట్టారు. పెళ్ళికుమారుడి వివరాలు తెలుసుకున్న రంగారావుగారు, ఎగిరి గంతేశారు.

"అంత కంటేనా?—శుభస్యశీఘ్రం" — అని కూడా మాట యిచ్చేశాడు.

"మీరామాట అంటారని నాకూ తెలుసు, నిక్షేపంలాంటి సంబంధాన్ని ఎవరు వద్దంటారు? నామాట మీరు తోసేయరనే ముహూర్తం కూడా పెట్టుకొచ్చాను. అబ్బాయికీ అమ్మాయికీ అన్నిపొంతనలూ సరిపోయినై. రేపురాత్రికే ముహూర్తం, మీరు కట్టుబట్టల్తో బయలుదేరితే చాలు—అన్ని యేర్పాట్లూ చేయించేశాను"—అని అంటూంటే రంగారావుగారు పరమానంద భరితులైయారు.

"అక్కయ్యా! జానకి చాలా అదృష్టవంతురాలే. లేకపోతే యిలాంటి సంబంధం ఇంటికి వెతుక్కు రావడ మేమిటి? —దాని ముఖంలోనే వుంది ఆలక్ష్మీ కళ!"—అని అంటోంటే, రామలక్షుమమ్మ కేమీ అర్థంకాలేదు.

"అదేవిటే, అలా చూస్తూ నుంచుంటే ఎలా?—తయారుకావాలి. ఇప్పుడే ప్రయాణం. ప్రొద్దుటికల్లా అక్కడుండాలి ఊఁ—తయారుకండి. బండి మాట్లాడుకొస్తా—ఆలస్యంలేదు" —అంటూ కంగారుగా బండ్లకోసం పరుగెత్తాడు రంగారావు

ఈ సంబంధం రంగారావు ఎరిగిన సంబంధమేననీ, అమ్మాయి అదృష్టవంతురాలు కాబట్టే కట్నాలు కానికలు అవసరంలేకుండా, అన్ని ఖర్చులూ వాళ్ళే భరించి పెళ్లిచెయ్యడానికి ఒప్పుకున్నారనీ, వాళ్లను ఒప్పించడానికి తానుపడ్డ శ్రమ యింతా అంతా కాదనీ, రామావధాన్లు చెప్పగా తెలుసుకున్న రామలక్షుమమ్మగారి కళ్లల్లో ఆనంద బాష్పాలు రాలాయి.

ఈ శుభసమయంలో 'ఆయనగారు' లేకపోయారుకదాఅని, ఆనందబాష్పాలు అశ్రుబిందువులుగా కూడా మారాయి.

జానకిక్కి యిదేమీ అర్థంకాలేదు.

అబ్బాయిని చూడకుండానే, తన అంగీకారం లేకుండానే, తనకి పెళ్ళేమిటి?—అనుకుంది. కాని, తన శ్రేయస్సుకోరే తల్లి, తల్లితోబుట్టువూ, ఆమాత్రం ఆలోచించకుండా వుంటారా? — అని కూడా అనుకుంది.

ఆడ పెళ్ళివారి బళ్లు వూరుచేరుకునేసరికి, మగ పెళ్లివారు ఎదురొచ్చి, విడిదిగృహానికి తీసుకెళ్లారు.

విశాలమయిన భవంతి. అందమైన ఫర్నిచర్‌తో విద్యుద్దీపాలతో చక్కగా అలంకరించి వుంది. భోజన వసతులూ, మర్యాదలూ వగైరాలు సక్రమంగానే జరిగినై.

ఏం మర్యాదలు జరుగుతున్నా, రామలక్షుమమ్మ గారికి యేదో కొరతగానే వుంది. పెళ్లికుమారుణ్ణి గూర్చి పూర్తి వివరాలు తెలుసుకోవాలి — పెళ్ళి కూమారుడి వయసెంత?—ఏం చదువుకున్నాడు?—ఎంత ఆస్తివుంది?—ఎలా వుంటాడు?—గుణవంతుడేనా?—తల్లిదండ్రులున్నారా? — రామలక్షుమమ్మ గారి బుర్రలో ప్రశ్నల పరంపర, వరసగా ఒకదాని వెంబడి ఒకటి పుట్టుకొస్తున్నవి.

రామలక్షుమమ్మగారి ప్రయత్నం ఫలించింది.

ఓ నౌకరుద్వారా విషయాలు తెలిసినవి. పెళ్ళి కుమారుడు అందంగానే వుంటాట్ట. ఆట్టే చదువు సంధ్యలు లేకపోయినప్పటికీ, వెనక బోలెడంత ఆస్తి వుందిట. వందెకరాల మాగాణీ—అద్దెలొచ్చే అయిదు మేడలూ,—సాలుకి పాతిక వేలు దాకా ఆదాయం వచ్చే, పొగాకు వ్యాపారంవుందిట. వెనక వారసులూ గీరసులూ ఎవరూ లేరట. 'ద్వితీయం' అని పేరేగాని వరుడికి ఆట్టే వయసు కూడా లేదట.

ఆ చివరివాక్యం వినేసరికి రామలక్షుమమ్మగారి కడుపులో గతుక్కుమన్నది. కాని, వెంటనే—'అయితేమాత్ర మేం? బోలెడంత ఆస్తి వుందిట'—అనుకుంది.

జానకిక్కి పెళ్ళే కాదేమోనని బెంగపెట్టుకున్న రామలక్షుమమ్మ కిది సంతోషకారణమే అయింది.

తన్ను రెండో పెళ్ళివాడి కివ్వబోతున్నారని వినేసరికి జానకి మండిపడింది. తన యిష్టాయిష్టాలతో నిమిత్తంలేకుండానే పెళ్ళి యెలా జరుగుతుందో చూద్దాం, అనుకుంది పౌరుషంగా.

కాని, ఎదురుగుండా — విద్యుద్దీపాలతో అందంగా అలంకరింపబడ్డ అందమైన మేడా— మేడ నిండా దాసదాసీలూ కంటబడేసరికి జానకి కళ్ళు బైర్లు క్రమ్మినయ్.

ఒంటినిండా ఆభరణాలూ, పెట్టెనిండా బట్టలూ, చేతినిండా డబ్బు, అందమైన కారూ, కీర్తి! హోదా!—ఐశ్వర్యం !—ఇంతకంటే యేంకావాలి? జీవితంలో సుఖపడ్డానికి?

ఏవేవో తియ్య తియ్యగా—విందులూ, విహారాలూ, సభలూ, సన్మానాలూ—కళ్లముందు కరిగిపోసాగినయ్.

"ఎంత అదృష్టవంతురాల్ని!" — అనుకుంది. వెంటనే ఆమె అంతస్తు పెరిగిపోయింది. ఆమెకళ్లల్లో గర్వం!—ఉనికిలో హుందాతనం! తొణికిసలాడింది.

"ఇప్పుడు రాముర్తే వుంటే?—ఈర్ష్యతో ఎంతగా కుమిలిపోయేవాడు!—పాపం, పిచ్చివాడు?" అని నవ్వుకుంది. అతనిమీద జాలి కూడా కలిగింది జానకిక్కి.

పెళ్లి సర్వమర్యాదలతో సలక్షణంగానే జరిగిపోయింది.

భర్త కంటపడినప్పుడల్లా, జానకి గుండెలు తెలికి తెలీకుండానే ఝల్లుమనేవి.

కట్టుడుపళ్లు...కోరమీసాలు—రంగు వేసిన వెంట్రుకలు-బట్టతల—ముడుతలదవుడలూ—మొరటు సరసం—జానకిక్కి అసహ్యాన్ని కలిగించేది.

వెంటనే, ఐశ్వర్యం—ఆభరణాలూ...అందమైన మేడా—కారూ—పరిచారికలూ కళ్ళముందు కనిపించి, యేదో మైకంలోకి లాక్కుపోయేది.

అప్పటికి పెళ్ళయి వారం రోజులు గడవలేదు నోట్లో జామిచెట్టుకింద కూచుని దంతధావనం చేసుకుంటోన్న జానకిక్కి, పక్కవాటాలో వున్న లక్ష్మందేవమ్మకీ ఎదురింటి రామాయమ్మకీ జరుగుతోన్న సంభాషణ, చెవిని పడింది.

"అవును పాపం! అభం శుభం యెరగని అర్భకురాలు! కాకపోతే యీ పెళ్ళి కెలా వొప్పుకుంటుంది?—బంగారు బొమ్మలాంటి పిల్ల."

"అంతే లే లక్ష్మవమ్మా, దేవుడెవరికి యెట్టా రాశాడో అట్టా జరిగిపోవలిసిందే. కాకపోతే ఎవర్ననుకుంటే ఎవరు పడ్డారో చూశావు ముసలాడికి? ఇంతకీ శశి—అదృష్టవంతురాలు."

"అయినా ఆడపిల్లంటే అదీ. నాకీ పెళ్లి వొద్దని మారాం చెయ్యలేదుట. మారాం చేస్తే మారుతల్లి వొప్పుకోదని తెలుసు. గప్ చిప్పున తన పని తాను చేసి వూరుకుంది. ఇంతకీ ఏమైందో! ఎక్కడుందో!—పాపం దాని తల్లుంటే, దాని బతుకలా నడివీధి పాలవుతుందా?"

"ఆఁ దానికేం? చదువుకున్న పిల్లట, ఎక్కడికెళ్ళినా ఏ ఉద్యోగమో సద్యోగమో చేసుకు బ్రతికగలదు."

"అయినా జానకెలా పడిందంటావ్?"

"ఏముంది? అవధాన్లుగారి పుణ్యం, రాత్రికి రాత్రి పెళ్లి నిశ్చయం చేసుకొచ్చాడుట, ముసలాడి బ్రతుకు అభాసుపాలవుతుందని"

"అయినా కన్నతల్లెలా వొప్పుకుందో!"

"డబ్బమ్మా, డబ్బు!—డబ్బు చూపిస్తే చచ్చే పీనుగలేచి కూచుంటుంది."

"పాపం, అందరూ చేరి దాని నెత్తిన నిప్పులు పోశారు."

జానకి కడుపులో గతుక్కుమంది.

'ఏమిటి—నా నెత్తిన నిప్పులు పోశారా? డబ్బుకాశపడి నా జీవితాన్ని నాశనం చేశారా?'

జానకి కూర్చున్న చోటే కూలబడిపోయింది.

'ఎవరా శశి?—ఏం చేసింది?—నాకీ పెళ్లొద్దని ప్రతిఘటించిందా?—ఇంట్లోంచి పారిపోయిందా?—ఎందుకు పారిపోయింది?—ఎందుకు వొద్దంది?—ఆలోచిస్తూ వుండిపోయింది.

ఆ యింట్లో జానకిక్కి యేమీ తక్కువలేదు. అనుభవించడానికి ఐశ్వర్యంవుంది. అధికారం చెలాయించడానికి దాసదాసీలున్నారు.

కాని, జానకిక్కి ఏదో అసంతృప్తిగా—ఏదో వెలితిగా—ఏదో కొరతగా వుండేది.

ఆ యింట్లో అందరూ తన్ను జూచి భయపడేవాళ్లే—తన్ను గౌరవించేవాళ్లే కానీ—ప్రేమతో పలకరించేవాళ్లు లేరు. తన కష్టసుఖాల్ని పంచుకునేవాళ్లు లేరు. తన్ను సానుభూతిగా చూచేవాళ్లు లేరు.

భర్త, వీరవరహావతారం; వ్యాపారంమీద పొరుగూరు వెళ్లాడంటే, ఒకొక్కప్పుడు వారంరోజులయినా ఇంటికిరాడు. ఇల్లంతా యేదో బావురుమంటోన్నట్టు, ఇంట్లో ప్రతివస్తువూ తనవేపు జాలిగా చూస్తోన్నట్టు, అనిపించింది.

ఏదో అశాంతి—ఏదో అసంతృప్తి తన్ను వెంటాడుతోన్నట్లు బాధపడేది.

రామ్మూర్తి!...శశి!—జ్ఞాపకొచ్చేవారు. గంటల తరబడి, జానకి ఏకాంతంగా గదిలో కూలబడి ఆలోచిస్తూ వుండిపోయేది.

* * * *

రామ్మూర్తి కలకత్తాలో ఓ ఇంగ్లీషు ఫరంలో గుమాస్తాగిరీ చేస్తున్నాడు.

హోటలుతిండీ—గదిలో నిద్రా—కొత్తకొత్త నేస్తాలు—సరికొత్త వాతావరణం—యే చీకూ చింతా లేకుండా రోజులు గడిచిపోతున్నయ్.

రామ్మూర్తి కొద్దికొద్దిగా బెంగాలీకూడా నేర్చుకున్నాడు.

ఆరోజు రామ్మూర్తి అప్పుడే ఆఫీసునుంచి గదికి వచ్చాడు. గది తాళం వేసివుంది. నౌకరు కుర్రాడు అవుపించలేదు.

'ఈపాటికి గది తాళాలు తెరిచి, గది శుభ్రం చేసి, స్నానానికి నీళ్ళు సిద్ధంచేయవలసినవాడు. ఇంకా రాలేదేం చెప్మా!'—అనుకుంటూ వీధివరాండాలోనుంచుని, చూస్తున్నాడు. ఎదురింటి డాబా మీది గదిముందు వరాండాలో, ఎవరో దాసీపిల్లతో పరాచికాలాడుతూ కనిపించగానే—"అతిథేనా,"—అని తనలో తాను నవ్వుకున్నాడు.

ఇదివరకు నాలుగయిదుదఫాలు ఇలా జరిగాయి కాని, రామ్మూర్తి వాళ్ళవిషయమై పట్టించుకోలేదు.

ఇంతలో పచ్చగా, సన్నగా, ఓ అందమయిన బెంగాలీ యువతి, తెల్లని దుస్తులు ధరించి, నల్లని ముఖమలు స్లిప్పర్సుతోడిగి, వానిటీబ్యాగుతో గుమ్మంలో ప్రత్యక్షమయింది. ఆవిడ్నిచూచి పరాచికాలాడుతోన్న 'జంట' పరారయింది.

ఇంతకాలంగా రామ్మూర్తి ఆ గదిలో వున్నా ఆవిడ్నెప్పుడూ చూడలేదు.

రామ్మూర్తి ఆవిడ వేపు చూస్తూ అలానుంచుండిపోయాడు. ఆవిడ్ని చూచేసరికి 'జానకి' జ్ఞాపకానికొచ్చింది.

ఆరిపోయిన పుండుని ఎవరో కెలికినట్టయింది.

మరచిపోయిన విషాదగాథ మళ్ళీ స్మృతిపథంలో విలయనృత్యం చెయ్యసాగింది.

బహుశా గా నుంచున్నచోటే కూలబడిపోయాడు.

"అదేటిబాబూ, అలా కూలబడిపోయారు?"—అని నౌకరు కుర్రాడడిగేదాకా, రామ్మూర్తి యీ లోకంలో లేడు.

రోజూ రామ్మూర్తి నిద్రలేచి లేచేసరికి, ఆవిడ కిటికీవద్ద తలదువ్వుకుంటూనో, జడల్లుకుంటూనో, తిలకం దిద్దుకుంటూనో, పూలు ముడుచుకుంటూనో కనిపించేది.

రామ్మూర్తి గుండెలు బరువెక్కాయి.

రామ్మూర్తి కాలకృత్యాలు తీర్చుకుని, స్నానం చేసి, ముస్తాబై గది బైటకొచ్చేసరికి ఆవిడకూడా గుమ్మంవద్దనో, వీధిలోనో తయారయ్యేది. రామ్మూర్తి బాధగా ఆవిడవేపు చూస్తూ నడిచేవాడు. మళ్ళీ బస్సులోనో బస్సుస్టాపింగ్ వద్దనో తారసపడేది రామ్మూర్తి గుండె దడదడలాడేది.

'ఎవరీవిడ?—ఈమెకెవరూ లేరా?—ఒంటరిగా ఈ మహాపట్నంలో యేంచేస్తోంది?—చదువుతోందా?—ఉద్యోగం చేస్తోందా?'—రామ్మూర్తి తనకి తెలీకుండానే ఆమెనిగురించి ఆలోచించేవాడు.

ఆమెని మరిచిపోవాలన్నా సాధ్యమయేది కాదు.

ఆరోజు రామ్మూర్తి, ఆఫీసులో కూచుని, యేవో ఫైలు తిరగేస్తున్నాడు ఇంతలో ఆఫీసుకుర్రాడు వచ్చి, మేనేజర్ పిలుస్తున్నాడని చెప్పాడు. రామ్మూర్తి లేచి, మేనేజర్ రూములోకి వెళ్ళగానే, అక్కడ కూచున్న ఓ అమ్మాయిని తనకి పరిచయం చేస్తూ—"ఈమె మిస్ రేఖ మనసేల్సు డిపార్టుమెంటులో పనిచేస్తూవుండేది. చాలా శ్రద్ధగా పని చేస్తుంది మీకు పని అధికంగావుందని ఈమెని ఇక్కడికి రప్పించాను. ఈమె యికమీదట మీకు సహాయం చేస్తుంది"—అని మేనేజర్ చెబుతోంటే రామ్మూర్తి ఆవిడవేపు చూచాడు. వెంటనే కొయ్యబారిపోయాడు.

ఎవర్నుంచి రామ్మూర్తి తప్పించుకు తిరగాలని ప్రయత్నించేవాడో—ఎవర్ని గూర్చి అనుకోకుండానే ఆలోచించేవాడో—ఆవిడే!—ఆ బెంగాలీవనితే!

ఏమిటిదంతా?—నేనీమెనుంచి తప్పించుకు తిరగలేనా?—ఇంటిదగ్గరా, ఆఫీసులోనూ ఎక్కడా ఆమెసమక్షంనుండి తప్పించుకోవాలనుకోవటం వృథా ప్రయాసేనా?—అనుకున్నాడు.

వెంటనే రామ్మూర్తికి నవ్వుకూడా వొచ్చింది.

'నేనెందుకీమెనుండి, దూరంగా వుండాలని ప్రయత్నిస్తున్నాను?—ఈవిడేం దయ్యమా?—భూతమా?'

రేఖ రామ్మూర్తి వేపు వింతగా చూస్తోంటే, మేనేజర్ రామ్మూర్తిని రేఖకి పరిచయం చేశాడు.

ఆ సాయంత్రం, ఆఫీసు అయిపోయినతరువాత బస్ స్టాపింగ్‌లో ఆమె రామ్మూర్తినడిగింది తెలుగులో—"మీరూ తెలుగువాళ్ళేనా" అని.

రామ్మూర్తి ఉలిక్కి పడ్డాడు.

"మీరూ తెలుగు వాళ్ళేనా?"—రామ్మూర్తి ఆమె అడిగిన ప్రశ్నకి జవాబు చెప్పకుండానే తిరుగు ప్రశ్న వేశాడు.

"కాకపోతే మిమ్మల్ని తెలుగులో ఎలా ప్రశ్నించ గలను?"—రేఖ అందమయిన లేతగులాబీ పెదవులమీద చిరునవ్వు చిందులాడింది.

రామ్మూర్తి ఆశ్చర్యంగా నోరు తెరిచాడు.

"నేను తెలుగు వాణ్ణని మీ కెవరు చెప్పారు?"

"మీ చేతిలోని పుస్తకం!"

రామ్మూర్తి నవ్వుకున్నాడు అవును, చేతిలో తెలుగు పుస్తకం పెట్టుకుని, నేను తెలుగువాణ్ణికానని, యెలా బుకాయించడం?—అనుకున్నాడు.

బెంగాలీ పౌరులలో—బెంగాలీ మిత్రులతో—బెంగాలీ వాతావరణంతో బాగా విసిగిపోయిన రామ్మూర్తికి తెలుగుమాటలు వినిపించే సరికి అమృతపు సోనలు కురిసినట్టయింది. మాతృభూమిని సందర్శించి నట్టయింది. ఆత్మీయులతో మాట్లాడు తున్నట్టయింది. ఇద్దరూ మాట్లాడుకుంటూ ఇళ్లు చేరుకునే సరికి, రామ్మూర్తి గది వరాండాలో, నౌకరు కుర్రాడూ, దాసీ కుర్రదీ, తిష్ఠవేసి పరాచికాలాడుతూ కనిపించారు.

"రామ్మూర్తి గారు! మీ నౌకరు కుర్రాడికి కాస్త భయం పెట్టాలి సుమండీ అమాయకప్పిల్ల దాంతో యేంచిటా పరాచికాలు?"—రేఖ చిరుకోపం నటిస్తూ రామ్మూర్తి కళ్లలోకి చూచింది.

"అబ్బే, మీ పిల్లే మావాణ్ణి పాడుచేస్తోంది. నిక్షేపంలాంటి కుర్రాడు. ఏమవుతాడోనని భయంగా వుంది"—రామూర్తి ఓలిపిగా జవాబిచ్చాడు.

"ఏంచిటీ?—అలాగా?అంత భయంగా వుంటే గదిలో కట్టేసుకోక పోయారా?"

ఇద్దరూ నవ్వుకున్నారు.

పరాచికాలాడుతోన్న జంట పరారయ్యారు.

రేఖా రామ్మూర్తులు ఎవరి గదులకి వాళ్లువెళ్లారు.

రేఖా రామ్మూర్తుల పరిచయం స్నేహంగా మారింది. ఆఫీసుకి యిద్దరూ కలిసే వెళ్లేవారు. కలిసే వొచ్చేవారు.

ఆ రోజు ఆదివారం ఆఫీసుకి సెలవు. నౌకరు కుర్రాడింతకీ రాక పోయే సరికి రామ్మూర్తి తనే గది శుభ్రం చేసి, స్నానం చేసి, కాఫీ ముగించుకొని యీజీ చేర్లో కూలబడి పేపరు తిరగేస్తూ నౌకరు కోసం ఎదురు చూస్తున్నాడు.

ఎవరో వొస్తోన్నట్టు మెట్లమీద చప్పుడయితే తిరిగి చూచాడు

"రామ్మూర్తి గారూ! మీ మీద దావా వేస్తున్నాను"—అంటూ రేఖ ప్రవేశించింది. ఆమె కళ్లు మెరుస్తున్నయ్ ఆమె కట్టుకున్న రక్తవర్ణం సిల్కు చీరా—అదే రంగు చోళీ కళ్లల్లో మెరుపులు మెరిపిస్తోంది. తల్లోమల్లెలు కమ్మని సౌరభాన్ని వెదజిమ్ముతున్నయ్ ఆమె రామ్మూర్తి గదికి అంత చొరవగా రావడం అదే ప్రథమం

"ఎందుకూ?—" రామ్మూర్తి కుర్చీ చూపుతూ ఆమెకళ్లలోకి చూచాడు

"ఎందుకా?—మీకు తెలీదేంటి?"—రేఖ కొంటెగా అతగాడి కళ్లల్లోకి చూచింది.

రామ్మూర్తి తెలీదన్నట్టు తల అడ్డంగా వూపాడు.

"అయితే చెబుతున్నా వినండి మరి, మీ నౌకరు కుర్రాడు మా దాసీ దాన్ని లేపు కెళ్లాడు"

"నిజంగానా?"—రామ్మూర్తి రేఖ కళ్లలోకి చూచాడు. అతగాడి కళ్లలో యేదో వింత వెలుగు ప్రకాశించింది.

"మంచిపని చేశాడు"—అని పకపకా నవ్వేశాడు. రేఖ సిగ్గుతో తలవొంచేసుకుంది, ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ

"పోనీలెండి. పై ఆదివారం నా పుట్టింరోజు పండగ మీరు మా ఆతిథ్యాన్ని స్వీకరించాలి."

"చపాతీలు—బంగాళాదుంపలూ తినిపిస్తాం?"

"అబ్బే, తెలుగుభోజనం"

తెలుగుతిండి అనేసరికి రామ్మూర్తికి ప్రాణం లేచి వచ్చినట్టయింది.

"మీ దాసీది లేదు గా?"

"అగుంటే మాత్రం తెలుగు వంటకాలు దానికి తెలుసేంటి?"

"అయితే వంటెవరు చేస్తారు?"

"ఇంకెవరు?—నేనే"

"మీకు వంటచేతవునా?"

"మాబాగా అడిగారు. చేపపిల్లకి ఈతొచ్చా అన్నట్టుంది, మీ ప్రశ్న."

ఇద్దరూ నవ్వుకున్నారు.

* * * *

రామ్మూర్తి ఆదివారంకోసం ఎదురుచూస్తున్నాడు. యెదురుచూస్తున్న ఆదివారం రానే వచ్చింది.

తెలుగువంటకాలు — అందులో రేఖ స్వయంగా వండిన వంటకాలు, రామ్మూర్తికి అమృత ప్రాయంగా ఉన్నయ్

తెలుగు ఉప్పు — తెలుగు కారం చవిచెడి మొద్దుబారిన నాలుక్కి చురుకుదనం కలిగించింది.

"అబ్బ! యెంతకాలమైంది, తెలుగుతిండి తిని! నాలుక్కి పట్టిన తుప్పు కాస్తా వొదిలిపోయిందీ రోజుతో" — అన్నాడు రామ్మూర్తి తింటూనే.

రేఖ నవ్వుకుంది.

"రోజూ ఇలాంటి తిండికోరికి తే ఎంత బావుంటుంది!" — రామ్మూర్తి నిట్టూర్చాడు.

"దానికి కూడా లేదుగా, స్వయంపాకం తప్పదు! మీకభ్యంతరం లేకపోతే రోజూ తిండికిక్కడికి రావొచ్చు."

"ఎక్కడమోమాట పడ్డా తిండికాడ మోమాట పడ్డం మన చేతికాదు"

"అయితే మరీ మంచిది, త్వరగా తినండి, బజారుకెళ్ళి వెచ్చాలు పట్టుకురావాలి"

"ఏమిటిది, అప్పుడే సంసారం నెత్తిన పడేలాగుందే!" — రామ్మూర్తి కొంటెగా నవ్వాడు.

రేఖ సిగ్గుతో తలవొంచేసుకుంది

రోజూ రేఖ వంటచేస్తోంది. రామ్మూర్తి రేఖకి సాయంచేసేవాడు. పదింటికల్లా భోజనం తయారయ్యేది. ఇద్దరూ భోజనం చేసి ఆఫీసుకు వెళ్ళేవారు.

ఇద్దరూ ఒకే ప్రాంతంవారని తెలుసు. కాని, వొకరి పుట్టు పూర్వోత్తరాలింకొకరికి తెలియవు. ఒకరి అంతర్యాలింకొకరికి తెలియవు. కలకత్తా చేరకా కలసిన అవసరమేమొచ్చిందో వొకరికొకరు చెప్పుకోలేదు. కాని, చాలా సన్నిహితులయిపోయ్యారు. వారిక్కావలిసింది గత చరిత్రలు కావు. నిష్కల్మష హృదయాలు!

రేఖతో స్నేహం ఏర్పడ్డం తర్వాత జానకిని పూర్తిగా మరిచిపోగలిగాడు రామ్మూర్తి. రేఖ సాన్నిహిత్యంలో ఏలాంటి కష్టాలయినా మరిచిపోగలడు రామ్మూర్తి.

రామ్మూర్తిని క్షణం చూడకపోతే రేఖకి యేమీ తోచేదికాదు.

రోజులు దొర్లుతున్నయ్.

ఆరోజు రేఖాదేవి చాలా హుషారుగా ఉంది. రామ్మూర్తి తనకీ రేఖకీ కొత్త బట్టలు కుట్టించుకొచ్చాడు. ఆసాయంత్రం ఇటు రేఖ మిత్రురాలు నిర్మల భర్త భాస్కర్‌తోబాటు దిగింది. అటు బెంగాలీ ఆసామీ సకుటుంబంగా వేంచేశాడు. రామ్మూర్తి అందర్నీ ఆహ్వానించాడు.

మరుసటిరోజు, స్థానిక మిత్రుల సమక్షంలో, నిర్మలాభాస్కర్ల అధ్వర్యాన బెంగాలీ దంపతుల సాయంతో, రేఖారామ్మూర్తుల వివాహం ఆధునిక పద్ధతుల్లో జరిగిపోయింది. అందరూ నవదంపతుల్ని ఆశీర్వదించి, తమ తమ యిళ్ళకి వెళ్ళిపోయారు. బెంగాలీ దంపతులూ — నిర్మలా భాస్కర్లూ రెండురోజుల పాటు, రేఖారామ్మూర్తుల ఆతిథ్యాన్ని స్వీకరించి తమవారిని తాము వెళ్ళిపోయారు

రేఖారామ్మూర్తులు దంపతులయ్యారు.

సంసార రథానికి సారథ్యం వహించారు.

అనతి కాలంలోనే రేఖ గర్భందాల్చి, ఓసుముహూర్తాన చక్కని ఆడశిసువును తీర్థమాడింది. రేఖ యిప్పుడు ఉద్యోగం చెయ్యడంలేదు ఇంట్లోనే వుంది, పాపాయిని చూసుకుంటోంది.

* * * *

జానకి అప్పుడే క్లబ్బునుండి ఇంటికి వొచ్చింది. మనసంతా యేదో చికాగ్గా వుంది. ఈమధ్య తన మనసేమీ బావుండడంలేదు.

ఇరుగుపొరుగు అమ్మలక్కలు తనవెనుక చెవులు కొరుక్కుంటారు. క్లబ్బులో మిత్రులందరూ తనవేపు అదోలా చూచి నవ్వుకుంటారు.

"ఎందుకు? — ఏమి టిదంతా? — వీళ్ళకి వేరే పనేలేదా? —

ఏమిటీ చెవులు కొరుక్కోడాలు? — ఏమిటా పకపకలూ ఇకఇకలూ?

ఒకరు బాగుపడితే చూళ్ళేరు — ఒకరు చెడిపోతే చేరదీరు. ఎవరెలాపోతే వీళ్ళకేం? — నీచలోకం!" — జానకి కోపంతో గజగజలాడిపోయింది.

ఇల్లంతా యేవో గజిబిజిగా వున్నట్టు అవుపిస్తే నౌకర్లని బాగా చీవాట్లు పెట్టింది

కుర్చీలో కూలబడి, నిలువుటద్దంలో చూసుకుంది. మెళ్లో ఆభరణాలు తన్ను చూచి నవ్వుతున్నట్టూ—ఎగతాళి చేస్తున్నట్టు అవుపిస్తే, గబగబా వొలిచి (డ్రాయర్లో పడేసింది.

బాధగా అశాంతిగా కళ్లు గట్టిగా మూసుకుంది

క్రింద యేదో దభేలున శబ్దమయితే ఉలిక్కిపడి కళ్లు తెరిచింది నౌకర్లందరూ క్రిందికి పరుగెత్తుతున్నారు కంగారుగా. జానకికూడా లేచి, క్రిందికి వెళ్ళింది.

భర్త వీరవరహావతారంగారు మేడ దిగుతూ దిగుతూ కాలుజారి క్రిందపడి, కాలు విరుచుకున్నారు. రక్తం కారుతోంది ముసలాడు బాధతో మూలుగుతున్నాడు. క్షణంలో డాక్టర్లు మూగారు. కట్టుకట్టి మంచమెక్కించారు.

వీరవరహావతారంగారిది అసలే వృద్ధాప్యం. ఈ గాయాలతో బాధపడుతోంటే జానకి చూళ్ళేకపోయేది.

కాలు కుళ్ళిపోయింది. కాలు తీసేయకపోతే చాలా ప్రమాదం జరగవొచ్చన్నారు డాక్టర్లు. జానకి అనుమతితో వీరవరహావతారంగారి కాలు కాస్తా తీసేయడం జరిగింది.

జానకిక్కి ఇప్పుడు క్షణం తీరిక లభించడంలేదు. ఎప్పుడూ రోగిష్టి భర్తను కాచుకూర్చోవలసి వచ్చింది. జానకి క్షణం అవుపించకపోతే ముసలాడు కలవరించేవాడు జానకి నిద్రాహారాలు మాని భర్తకి సేవచేస్తోంది. రాత్రిళ్లు రోగిమంచం వద్దనే కూచుని, అతనివేపే చూస్తూవుండిపోయేది.

పీక్కుపోయిన కళ్లు—ముడుతలుబడ్డ దవడలు బొక్కినోరూ—బట్టతలా—గుబురుగా ఎదిగిన తెల్లని గడ్డం—మొండి కాలూ—చూచి భయంతో గజగజలాడిపోయేది.

అప్పుడప్పుడే విజృంభించే యౌవనంతో, నవనవలాడుతూన్న తనఅందాన్నీ—అవయవ పరిపుష్టినీ—నిలువుటద్దంలో చూసుకుని బరువుగా నిట్టూర్చేది.

ఈ వయసూ, ఈ అందం, ఇలా అడవికాచిన వెన్నెల్లా వృథా కావలసిందేనా?—అనుకునేది.

వెంటనే రామ్మూర్తి స్మృతిపథంలో మెదిలేవాడు. ఆమెగుండె బరువుగా జారిపోయేది. దిగులుగా కుర్చీలో కృంగిపోయేది.

ఆమెకి తెలీకుండానే, కళ్ళల్లోంచి అశ్రువులు జారిపోయేవి

ఈ వార్తవిన్న రామలక్ష్మమ్మ గుండెలాగి చనిపోయిందన్న వార్త, జానకిని మరీ కృంగదీసింది.

మేనమామ రంగారావుగారు అక్కయ్య మరణానంతరం, సకుటుంబంగా విజయంచేసి, జానకి యింట్లోనే మకాం పెట్టి, జానకికి చేదోడు వాదోడుగా వుంటున్నారు.

డాక్టర్లకీ—మందులకీ వేలు ఖర్చుపెడుతున్నా, రోగం తిరుగుముఖం పట్టడంలేదు రోజులుగడిచేకొద్దీ రోగం ప్రమాదస్థితికి తీసుకుపోతోంది.

జానకికి నిద్రాహారాలులేవు. మనశ్శాంతి అసలే లేదు ఎప్పుడూ, ఏదో ఆలోచిస్తూ కూచుండి పోయేది.

మేనమామగారి కుటుంబం తనకి సాయంగా వుండడానికి బదులు, గుదిబండగా తయారయింది నౌకర్లమీద అధికారం చెలాయించడానికి—దొరికింది దొరికినట్టు కాజెయ్యడానికి—తయారయ్యారు.

జానకిమీద సానుభూతి చూపేవాళ్ళు లేరు. ఆమెనిగూర్చి విచారించేవాళ్ళు లేరు.

వీరవరహావతారం గారి మరణానంతరం, వ్యాపారాన్ని ఎవరు నడపాలి?—అద్దెలు ఎవరు వసూలు చెయ్యాలి?—వ్యవసాయంమీద ఎవరు అజమాయిషీ తీసుకోవాలి?—కారు అమ్మెయ్యాలా? ఉంచుకోవాలా?—వీరవరహావతారం తరువాత యీ ఆస్తికి వారసులెవరు?.........ఇదీ వాళ్ళధ్యాస! ఈ విషయమై వాళ్ళు చర్చించుకొంటుండగా రెండు మూడు దఫాలు జానకి విన్నది కూడాను.

'వీళ్ళకొక్క వలిసింది నాభర్త జబ్బు నయంకావడంకాదు. — నా పసుపుకుంకుమ పదికాలాలపాటు చెరిగిపోకుండా వుండడంకాదు.

డబ్బు! —— ఆస్తి! ——. అజమాయిషీ! —— ఐశ్వర్యం! —— ఛీ! ఏం మనుషులు?"—అనుకునేది జానకి లోలోపలే కృంగిపోయేది.

*　　　*　　　*

రామ్మూర్తి ఆఫీసులో కూర్చుని, అప్పుడే పోస్టుమేన్ డెలివరీ చేసిన ఉత్తరాన్ని విప్పి చదువుకుని, బరువుగా నిట్టూర్చి, మడిచి జేబులో పెట్టుకున్నాడు. ఇంతలో ఆఫీసుబోయ్, బయట తనకోసం ఎవరో కాచుకుని వున్నారని చెప్పగా, లేచి వెళ్ళాడు.

నల్లగా—బక్కపలచగా—ఓ వయసుమళ్ళిన వృద్ధుడు నుంచుని వున్నాడు. రామ్మూర్తి అతణ్ణి గుర్తుపట్టలేకపోయాడు.

"ఏంబాబూ, నేను తాతయ్యని"—అంటూ సన్నగా నవ్వాడు.

"తాతయ్యా, నువ్వా? ఎంతకాలానికి కనిపించావ్?"—అని అంటూ అమాంతం కౌగిలించుకున్నాడు పెల్లుబికిన ప్రేమతో.

"నువ్వు మారలేదు బాబూ!—అచ్చం తల్లి పోలిక. కల్లాకపటం యెరుగని మనసు"—అంటూ తాతయ్య చెమర్చిన కళ్ళు తుడుచుకున్నాడు.

"ఆతల్లి మాటంటే నే గుండెలు కరిగిపోతున్నయ్. భోగంముండ మోజులో పడి, అన్నం పున్నెం ఎరుగని అమాయకురాలి నెత్తిన అభాండం మోపి, తల్లిగారింటికి తోలేశాడు మహారాజు. అనుభవిస్తున్నాడు. ఆతల్లి దీవెనతో మంచమెక్కి ఏడు తిరక్కముందే చెల్లుకుంది. మహాయిల్లాలు"—తాతయ్య కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"పోనీలే తాతయ్యా, జరిగిపోయిందానికి చింతించి ప్రయోజనం లేదు."

"మామయ్యకూడా దాటిపోయారుటగా?"

"ఆయనగారుంటే నాకీ ప్రవాసం తప్పేపోను"

"అవును, ఆయనగారే లేకపోతే మీరేమైపోయేవారో"—తాతయ్య బరువుగా నిట్టూర్చాడు.

"ఉత్తరం చేరిందా బాబూ?"

"ఇప్పుడే చేరింది తాతయ్యా"

"వెంటనే, మనం బయలుదేరాలి బాబూ. ఆలస్యం చేస్తే వ్యవహారం ముదిరిపోవొచ్చు"

"అలాగే తాతయ్యా. ఇప్పుడే మేనేజర్ తో మాట్లాడి సెలవు గ్రాంటు చేయించుకొస్తా"—అంటూ వెళ్ళి, పదినిముషాలకల్లా తిరిగొచ్చి—"ఇహ పద తాతయ్యా. ఇంటికెళదాం"—అన్నాడు.

ఇద్దరూ నడుస్తున్నారు.

"పెళ్ళి చేసుకున్నారటగా బాబూ"

"అవును తాతయ్యా, పాపకూడా"

"అలాగా, పద బాబూ త్వరగా పద, పాపని చూడాలి" ఇద్దరూ ఇల్లు చేరుకున్నారు.

రామ్మూర్తిని చూస్తూనే తల్లి చేతిలోని పాపాయి చేతులు చాస్తూ మీదికొచ్చింది. రామ్మూర్తి పాపని అందుకుని, తాతయ్యకందిస్తూ—"తాతయ్యా, మమ్మల్నెత్తుకుని ఆడించావ్. మనిమనుమరాల్ని కూడా ఆడించు"—అన్నాడు.

తాతయ్య ఆత్రంగా అందుకుంటూ—"అంతకంటేనా బాబూ? మీ వుప్పుకారంతో పెరిగిన శరీరం బాబూ ఇది"—అని అంటూ రేఖ వేపు చూచాడు.

"ఏమిటే—నువ్వా తల్లీ?"—అంటూ ఆశ్చర్యపోయాడు తాతయ్య

"మిమ్మల్నెక్కడో చూచినట్టు జ్ఞాపకం"—అంటూ రేఖ అంటోంటే రామ్మూర్తి ఆశ్చర్యంగా నోరు తెరిచాడు.

"రేఖని మీ రెరుగుదురా తాతయ్యా"—అని ప్రశ్నించాడు.

"ఎరక్కేం బాబూ, ఎరుగుదును. ఆమే నన్నెరగదు"

"అలాగా?"—అంటూ రేఖకూడా ఆశ్చర్యపోయింది.

"పోనీ గాని, అమ్మగారెవరో మీ రెరుగుదురా? చెప్పండి"

"ఊఁ హూఁ"—రామ్మూర్తి తల అడ్డంగా వూపాడు.

"పోనీ, మీరు చెప్పండమ్మా, అయ్యగారెవరో మీ రెరుగుదురా?"

"తెలీదు"—రేఖకూడా తల అడ్డంగా వూపింది.

"బాగానే వుంది బాబూ. అంతా భగవల్లీల బాబూ, భగవల్లీల"

"ఎవరు తాతయ్యా రేఖ?"

"అంతా దార్లో చెప్పుకుందాం బాబూ. ముందు బయలుదేరండి. రైలుకి ఆట్టే వ్యవధికూడా లేనట్లే వుంది"

"అలాగే తాతయ్యా"

భోజనాలు ముగించుకుని, బండి కట్టించుకుని బయలుదేరారు అందరూ రైలుస్టేషనుకి.

రైలు శరవేగంతో దూసుకుపోతోంది. రెండవ తరగతి పెట్టెలో ఓ వేపు రామ్మూర్తీ, రేఖా—మరో వేపు తాతయ్యా పాపాయీ కూచున్నారు.

రామ్మూర్తి తాతయ్యవేపు చూచి—"ఇక చెప్పు తాతయ్యా ఎవరు రేఖ?"—అని అడిగాడు.

తాతయ్య రామ్మూర్తి వేపు అదోలా చూచి నవ్వి,—చెప్పాలా బాబూ, చెబుతా. చెప్పేముందు ఓ చిన్న కథ కూడా చెప్పాలి. తాపీగా వింటానంటే చెబుతా"—అన్నాడు.

"కథా? చెప్పు తాతయ్యా, చాలరోజులయింది నువ్వు కథ చెప్పగా విని"—రామ్మూర్తి సర్ది కూచున్నాడు.

తాతయ్య చిరునవ్వు నవ్వి—"అప్పుడు చెప్పిన వన్నీ కల్లబొల్లి కథలు బాబూ. ఇప్పుడు చెప్పబోయేది యథార్థగాథ—చెప్పమంటావా తల్లీ!"—తాతయ్య రేఖ వేపు చూచి సన్నగా నవ్వాడు.

"చెప్పకపోతే వా రూరుకుంటారు గనకనా, చెప్పండి తాతయ్యా"

"ఆఁ—ఇహ కథలోకి దిగుదాం"—తాతయ్య గొంతు సర్దుకుని కథ ప్రారంభించాడు.

"అనగనగా ఓ రైతు. ఆ రైతు పేరు...ఆఁ... యేదో వోహ పేరు—ఆఁ—సాంబయ్యనుకుందాం. ఆ సాంబయ్యకి లేకలేక ఓ అమ్మాయి పుట్టింది. ఆఅమ్మాయి అందాలరాశి, సుగుణాలకుప్ప. ఆ అమ్మాయిని చూచుకుని ఆ దంపతులు మురిసిపోయేవారు. ఆపాప ముద్దుమాటలు వింటూ—చిలిపిచేష్టల్ని చూస్తూ తమ కష్టాలు మరిచిపోయేవారు.

ఆపాప, శుక్లపక్ష చంద్రునికి మల్లే దిన దినాభివృద్ధి చెందుతూ ఇంతపాప అంతై ఐదేళ్ల పాపయింది.

ఓ మంచి ముహూర్తం చూచి, పాపకి అక్షరాభ్యాసం చేయించారు. పాప చాలా హుషారుగా, తెలివిగా చదువుకుంటోంది.

ఇంతల్లో ఆమె తల్లి కాస్తా, అకస్మాత్తుగా [illegible] జబ్బుతో మరణించింది. ఆమె మరణించేప్పుడు పాపకి పన్నెండేళ్లుంటుందేమో. అప్పుడు, పాప నాలు గవఫారం కొబోలు చదువుతోంది."

రామ్మూర్తి అడ్డొచ్చి అడిగాడు.

"ఆపాప పేరేం తాతయ్యా"

"పేరే?—పేరు పాపే అనుకుంటూ. అయినా పేర్లతో మనకేం అవసరం బాబూ, మనక్కావలిసింది కథ కాని..."

"అలాగా?—సరే, తరువాత?"

"తరువాత—పాపం, తల్లి మరణంతో పాప జీవితం కష్టాలపాలయింది. అల్లారు ముద్దుగా పెరిగిన పాప అష్టకష్టాలూ పడవలసి వచ్చింది. తండ్రి సాంబయ్య రెండో వివాహం చేసుకున్నాడు. ఆతల్లి మహాగయ్యాళి. పాపని నానా హింసలూ పెట్టింది.

పాప స్వతహాగా చాలా తెలివయింది. మారుతల్లి ఎన్ని కష్టాలు పెట్టినా యెవరికీ చెప్పుకునేది కాదు. పదిగంటలవరకూ మారుతల్లికి చాకిరీచేసి, పదింటికి బడికి వెళ్ళేది. బడినించి ఇంటికి రాగానే పాపకోసం బండెడు చాకిరీ కాచుకుని వుండేది యింట్లో. ఇంటి చాకిరంతా చేసి, అందరూ పడుకున్న తరువాత గానీ, పాఠాలు చదువుకునేందుకు గూడా వ్యవధి చిక్కేది కాదు. ఎప్పుడు నిద్రపోయేదో. మళ్ళీ పొద్దు పొడవగానే మేలుకునేది.

సాంబయ్యగారుకూడా పడుచుపెళ్లాం మోజులోపడి కూతురి యోగక్షేమాలు విచారించేవాడే కాడు. కాని పాపం, పాప యెప్పుడూ చింతించలేదు.

పాపకి ఆత్మవిశ్వాసం మెండు. ఎప్పుడూ ఎవరి మీదా ఆధారపడేది కాదు. తన కష్టసుఖాలు ఎవరికీ, చెప్పుకునేది కాదు. చెప్పుకున్నా ప్రయోజనం శూన్యం అని ఆమెకి తెలుసు.

పాప స్కూలుఫైనల్ పూర్తి చేసింది.

పాపకి పై చదువులు చదవాలని వున్నప్పటికీ మారుతల్లి కిష్టంలేకపోవడంతో, అంతటితో ఆగిపోవలసి వచ్చింది. పాప కించిత్తుకూడా విచారించలేదు.

ఒహనాడు పొరుగూరినుంచి ఓమోతుబరి రైతు వ్యాపారంమీద ఆవూరొచ్చాడు. ఆ రైతు సాంబయ్యగారింటనే దిగడం సంభవించింది.

వయసొచ్చిన పాపని చూచేసరికి, ఆ రైతు మనసు మెరమెరలాడింది. తన యిాప్సితాన్ని సాంబ

య్యకు తెలియపరిచాడు. అప్పు డతగాడి వయసు యాభైయేళ్ళకి తక్కువుండదు భార్యలేదు. బోలెడంత ఆస్తివుంది. కాని కన్నకడుపుకదా, సాంబయ్యకి మనసురాలేదు మాటివ్వడానికి. కాని పడుచు పెళ్ళాంమనసు ఆస్తిమీదికి పోయింది. వొప్పేసుకోమని పట్టుబట్టింది. పడుచు పెళ్ళాంమాట కాదనలేక సాంబయ్య గంగిరెద్దులా తలూపాడు.

అతగాడు సంతోషంతో చంకలుకొట్టుకున్నాడు. సాంబయ్య తన కివ్వాలిసిన మూడువేల రూపాయలూ అప్పటికప్పుడే రద్దుచేసేశాడు. బ్రాహ్మడొచ్చాడు. ముహూర్తం పెట్టుకున్నారు. అంతా క్షణంలో జరిగిపోయింది.

తన యిష్టాయిష్టాలతో నిమిత్తంలేకుండానే తన పెళ్ళి నిశ్చయమైనందుకు—తిన్న వయసు మళ్ళిన ముసలివాడికి ముడిపెట్టబోతున్నందుకు— పాప, కించిత్తు కూడా చింతించలేదు. తనకీ పెళ్ళొద్దని యెదిరించలేదు. మారాం చెయ్యలేదు. అలాచేసినా ప్రయోజనముండదని పాపకి తెలుసు. అన్నీ తలొంచుకు వొప్పుకుంది.

ముహూర్తం దగ్గరపడింది. మగపెళ్ళివారినుండి పిలుపొచ్చింది. పాపని పెళ్ళికూతుర్ని చేసి, బాజా బజంత్రీలతో బయలుదేరారు రైలుస్టేషన్ కి.

వాళ్లు వెళ్ళాలిసిన బండీ, కలకత్తా మెయిలూ రెండూ ఆ స్టేషన్ లోనే క్రాసింగవాలి

బండికోసం కాచుక్కూచున్నారు. కాచుక్కూచున్న బండి రానేవొచ్చింది. కలకత్తా మెయిలు కదిలింది తమ బండీ కదిలే వేళయింది. గార్డు విజిల్ వూదాడు. మరుగుదొడ్డికెళ్ళిన పెళ్ళికూతురు ఎంతకీ బయటికిరాదు. అమ్మలక్కలు కంగారుగా లోపలికెళ్ళి గాలించారు. పెళ్ళికూతురు జాడలేదు. ఏమైందో యేమో! అంతర్ధానమైపోయింది. ఎక్కడెక్కడో వెతికారు. ఆమె కనిపించనేలేదు. ఇంకా వెతుకుతూనే వున్నాడు సాంబయ్య"

ఇంతలో రేఖ అడ్డొచ్చి—"అప్పుడు మీరక్కడున్నారా?"—అని అడిగింది.

"ఉండకపోవడమేమిటి తల్లీ, అసలు పిలుపు కెళ్ళినవాణ్ణి నేనే"

"నువ్వా?"—రామ్మూర్తి ఆశ్చర్యంగా నోరు తెరిచాడు.

"తరువాత, పాపేమయింది?"

"ఏమో, నాకేం తెలుసుబాబూ, రేఖమ్మకి తెలియాలి"—అంటూ తాతయ్య రేఖవేపుచూచి సన్నగా నవ్వాడు.

"ఏమవుతుంది? కలకత్తా మెయిలెక్కి కలకత్తా చేరుకుంది. తనకోసం స్టేషన్లో ఎదురుచూస్తోన్న స్నేహితురాలు నిర్మలతో కలిసి వెళ్ళిపోయింది. నిర్మల సాయంతోనే ఉద్యోగం సంపాయించింది. ఓ యువకుణ్ణి ప్రేమించి పెళ్ళాడి, ఓ పాపాయిని కనుక్కుని హాయిగావుంది"—రేఖ కథ పూర్తిచేసింది.

రామ్మూర్తి కళ్లు వింతగా మెరిసినయ్

"తాతయ్యా నీదో పొరబాటు, అసలు ఆ అమ్మాయి పేరు 'పాప' కాదు రేఖ"—రేఖ కళ్లల్లోకి కొంటెగా చూస్తూ అన్నాడు రామ్మూర్తి.

"తాతయ్య ఫక్కున నవ్వేశాడు. పప్పులో కాలేశావ్ బాబూ! ఆ యమ్మాయిపేరు రేఖకాదు శశిరేఖ!"

నిజంగానా—అన్నట్టు రేఖ కళ్లల్లోకి చూచాడు రామ్మూర్తి.

రేఖ సిగ్గుతో తలవాల్చేసింది సన్నగా నవ్వుతూ.

ఇంతలో వాళ్లు దిగాలిసిన స్టేషనుకూడా వొచ్చేసింది.

"నాకథ చెప్పారు. వారికథ చెప్పనేలేదు"—శశిరేఖ తాతయ్యని అడిగింది.

"అదేంటి తల్లీ, తినబోతూ రుచులడగడమెందుకు? ఇహ వుండేదల్లా వారికథే. చెప్పడమెందుకు? కళ్ళారా చూడబోతుంటేను."--తాతయ్య లేచి, పెట్టె బెడ్డింగూ క్రిందికిదించి, కూలీ నెత్తికెక్కించాడు. అందరూ స్టేషన్ బయటికి నడిచారు.

* * *

జానకి గదిలో వొంటరిగా కూచుని, కిటికీలోంచి నూన్యంలోకి చూస్తూ ఆలోచిస్తోంది.

చక్రాల్లాంటి ఆమె కళ్లు జ్యోతుల్లా మండుతున్నాయి ముఖంలో యేదో గంభీరతా—విరక్తి—విచారం దోబూచులాడుతున్నయ్. గాలికిముఖం మీద జీరాడే ముంగురుల్ని సవరించుకోను సైతం ఆమెకి తోచడం లేదు.

ఏదో దీర్ఘంగా ఆలోచిస్తోంది.

అప్పుడే వానకురిసి వెలిసినట్టుంది వాతావరణం. చీమ చిటుకు మన్నా వినిపించేంత నిశ్శబ్దం.

'ఇదేనా జీవితమంటే?—మూన్నాళ్ళ ముచ్చట కోసం ఏం విరగబాటు?—తుచ్ఛమయిన భోగాల కోసం ఏం పాకులాట?

ఆయనేం పట్టుకెళ్ళాడు తనతో?

ఎంత త్వరలో—కనురెప్పపాటులో ఎంత జరిగి పోయింది?—

జానకి బరువుగా నిట్టూర్చింది.

మేనమామ రంగారావుగారి బొంగురు గొంతు అవతలి గదిలోంచి వినిపిస్తుంది. చచ్చినవాడి ఆస్తిని కాస్తా చేజిక్కించుకునేందుకు ఏమైనా అడ్డదార్లు న్నాయేమోనని అన్వేషిస్తున్నాడు. వకీలుతో సంప్ర తిస్తున్నాడు.

'ఛీ! ఏం మనుషులు?—ఎంత కుళ్ళు—ఎంత కుళ్ళు—ఎంత స్వార్థం!...వీళ్ళ కొంపలిసింది కోటీ మానవుడు సుఖ పడ్డం కాదు. డబ్బు!—హోదా!—అంతస్తు! వీటికోసం ఏమయినా చేస్తారు. ఎంత నీచానికయినా వొడికడతారు. ఎన్ని అబద్ధాలయినా ఆడతారు. ఏ కూడయినా కుడుస్తారు ఎందరు అభాగ్యజీవులనయినా నాశనం చేస్తారు.

మనుషులేనా? వీళ్లు!

వీళ్ళకి హృదయాల్లేవా?'—

జానకి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ఎవరో గుమ్మంవద్ద వస్తున్నట్టు చప్పుడయితే, కళ్లు తుడుచుకుని, పమిట సర్దుకుంది.

దాసీది గుమ్మంలోంచి—"అమ్మగారూ తాతయ్య వొస్తున్నాడు"—అని చెప్పింది.

"ఏమిటీ తాతయ్యొస్తున్నాడా?—చినబాబుని వెతికి పట్టుకుని వొస్తున్నాడా?—చినబాబు లేకుండా వొంటరిగా వొస్తున్నాడా?"

"చినబాబు కూడా వొస్తున్నారండి"

"ఏమిటి చినబాబు కూడా వొస్తూన్నాడా?—ఎంత విశ్వాసపాత్రుడు తాతయ్య?—ఎంత నిస్వార్థమైన జీవితం తాతయ్యది!—చినబాబుని వెతికి పట్టుకొస్తున్నాడా?

చినబాబు? భర్త వొదిలిపెట్టిన తల్లితో, అష్ట కష్టాలూ అనుభవించి—జీవితపు విలువలు తెలుసుకున్న చినబాబు!—తన ఐశ్వర్యాన్ని తాను అనుభవించడానికి వొస్తున్నాడా?"—అనుకుంది.

"అమ్మగారూ! కోడలుగారు కూడా వొస్తున్నారు—అదేమిటీ, శశమ్మ గారండి"—దాసీది ఆశ్చర్యంగా నోరు తెరిచింది.

ఏమిటీ—శశా?—శశి నా కోడలా?—నాస్థానే అత్తగా వుండాలిసిన శశి—కోడలుగా వొస్తోందా? ఎంత అదృష్ట వంచనలు!—జానకి ఆశ్చర్యపోయింది.

"అవును, ఏది సౌఖ్యమో ఏది సౌఖ్యమో—ఏది శాశ్వతమో ఏది అశాశ్వతమో నీకు తెలుసు శశీ—సత్యాన్ని సత్యంగా నే చూడగలవు—నీ కాళ్ల మీద నువ్వు నుంచోగలవ్ నీ కోసం నువ్వు పోరాడగలవ్. కష్టాలని నిర్భయంగా ఎదుర్కోగలవ్. నీవు ధైర్యశాలివి. నీకు వ్యక్తిత్వముంది. కాబట్టే అత్తగారవ వలసిన దానివి కోడలుగా వొస్తున్నావ్—' అనుకుంటూ జానకి బరువుగా గుమ్మం వేపు నడిచింది.

ముందు తాతయ్య, వెనక చినబాబూ, ఆ వెనక శశిరేఖా వొస్తున్నారు.

జానకి చినబాబు వేపు చూచింది.

ఆమె కళ్లు గిర్రున తిరిగాయి. భూమ్యాకాశాలు తల్లక్రిందులయి నట్టయింది.

"మూర్తీ!"—అని వో పొలికేక వేసి, మేడ మెట్లమీంచి కాలుజారి క్రిందికి దొర్లిపోయింది జానకి.

తాతయ్యా, శశీ, రామూ, నౌకర్లూ అందరూ పరుగెత్తుకొచ్చారు.

రక్తపు మడుగులో స్పృహతప్పి పడిపోయిన జానకి, కళ్లు తెరచే వేళకి, డాక్టరు కూడా వొచ్చేశాడు.

జానకి కళ్లు బరువుగా తెరుచుకున్నాయ్.

రామ్మూర్తి బాధగా అరిచాడు—"జానకి!"—అని.

"తప్పు బాబూ! తప్పు నేను జానకిని గాను. పిన్నిని. ఏదీ శశి చెయ్యేదమ్మా, రామ్మూర్తీ నీ చెయ్యేలా తే"

జానకి ఇద్దరి చేతులూ కలపి, తృప్తిగా నిట్టూర్చింది.

"ఏదీ పాపాయినిలా తే,—ఏం పేరమ్మా శశీ"

"జానకండి"

"జానకా?—జానకి?—ఆ పేరెవరు పెట్టారు? చెప్పు శశీ, నిజం చెప్పు, రాము కదూ?"

"అవునండి"

"అవునా రామూ? ఏదీ—వోమారు పిలూ, నే వినాలి!"

రామ్మూర్తి పాపాయిని పేరు పెట్టిపిలిచాడు.

"అబ్బ ఎంత హాయిగా వుంది. ఎంత కాలానికి విన్నాను?"—అని అంటూ హాయిగా కళ్లు మూసింది—జానకి; ఇంటిల్లపాదీ గొల్లుమన్నారు.

# స్వర్ణయుద్ధం

జాన్. హెచ్. లిష్బ్లో

పశ్చిమ రాజ్యాలతో పోటీగా, రష్యా క్రొత్తగా ఆర్థికరంగంలో ప్రారంభించిన సంరంభాలను గురించి అనేక సమీక్షలూ, వాదప్రతివాదాలూ విస్తృతావధిని జరుగుతూనే ఉన్నాయి. ఆసియా, పశ్చిమ యూరప్, లాటిన్ అమెరికా ప్రాంతాలలో పలుకుబడిని సంపాదించటానికి ఇటీవలగా రష్యా నెత్తి కెత్తుకుంటూన్న యీ ఆర్థిక బాధ్యతల నన్నిటినీ సమర్థించుకోగలదా అనేది ప్రధాన సమస్య. సమర్థించగలదనే చెబుతున్నారు. కాని ఆ సమర్థించటానికి రష్యాకు గల బలమేమిటి అన్నది మాత్రం యెవరూ ప్రవచించకుండా ఉన్నారు. ఈ బలమేమిటి?—రష్యా చేతిలో ఉన్న బంగారు నిల్వలు! ఇన్నిరోజులుగా రష్యా ప్రపంచవాణిజ్యపు పోటీలో కలుగ జేసుకోకుండా ఉన్నా, ఇప్పుడు ఒక్కసారి రంగంలోకి విజృంభించి ప్రపంచ ఆర్థిక పరిస్థితులను తలక్రిందులు చేసి వేయటానికి ఈ బంగారు నిల్వల ఆయుధం ఒక్కటిచాలు.

రష్యా కరెన్సీకి బంగారం మదుపుధనం కాదనేది నిజమే. అందుచేత ప్రపంచ వాణిజ్య రంగంలో బంగారం విలువలో వస్తూవుండే వృద్ధిపతనాలవల్ల రష్యా ఆర్థికవ్యవస్థలో ఎట్టి మార్పూ రాదనేదీ నిజమే. కాని ప్రపంచరంగంలో బంగారానికి గల విలువను లెనిన్ ఏనాడో గుర్తించాడు. బంగారు నిల్వలను పెంచాలని ఆకాంక్షించాడు. రష్యా పరిపాలకులు అక్షరాలా అతని ఆదేశాన్ని శిరసావహించి నడుచుకున్నారు. బాగా తెలిసినవారు రష్యా దగ్గిర ఇప్పుడు దాదాపు 1000 కోట్ల డాలర్ల విలువగల బంగారం నిల్వ ఉన్నదని చెబుతున్నారు. స్టెర్లింగ్ ప్రాంతపు బంగారు నిల్వలూ, డాలరునిల్వలూ అన్నీ కలిసి 125 కోట్ల డాలర్ల విలువను మించిలేవు. ప్రపంచ మంతటిలోకి పెద్ద నిల్వ అని చెప్పుకుంటున్న అమెరికా బంగారు నిల్వలు 2200 కోట్ల డాలర్ల విలువను మించిలేవు. కాగా, యిప్పుడు రష్యా నిల్వలు ఆయేటి కాయేడు మరింత త్వరితగతిని అభివృద్ధి చెందుతున్నాయి. రష్యాగనుల నుంచి ఇప్పుడు ఏటేటా 120 లక్షల ఔన్సుల మేలిమి బంగారం ఉత్పత్తి అవుతోంది. ప్రపంచోత్పత్తిలో ఇది మూడోవంతు. బంగారు ఉత్పత్తిలో ప్రపంచ మంతటిలో ప్రథమస్థానం వహించుతున్న దక్షిణాఫ్రికా ఉత్పత్తులకు ఇవి ఇంచుమించు పోటీగా వున్నయ్.

బోల్షివిక్కులకు ఈ బంగారం జార్ ప్రభుత్వం నుంచి సంక్రమించింది గాదు. 1928 లో అంటే మొదటి పంచవర్షప్రణాళిక ఆరంభదశలో రష్యా సాలుసరి బంగారు ఉత్పత్తులు 10 లక్షల ఔన్సులకు మించిలేదు. 1939 వచ్చేటప్పటికి ఈ సాలుసరి ఉత్పత్తులు 50 లక్షల ఔన్సులకు పెరిగినవి. అనంతర దశలో ఇంతకు రెట్టింపయినవి.

రష్యా ప్రారంభించిన ఆర్థిక సమర సంరంభాలకు ఈ బంగారం ఎలా సహాయపడగలదు? రష్యా ఆర్థిక విషయిక పత్రికలలో ఇటీవలగా వెలువడుతూన్న కొన్ని వ్యాసాలను పరిశీలించితే దీని సంగతేమిటో కొంతకు కొంత బోధపడుతూనే వుంది. పెట్టుబడిదారీ ప్రభుత్వాలు, మొదటి ప్రపంచ యుద్ధసమయంలో వదిలివేసిన బంగారు నాణాల చెలామణిని తిరిగి తప్పనిసరిగా చేపట్టవలసి వస్తుందని రష్యా దృఢంగా విశ్వసించుతోంది. అందుచేత అంతర్జాతీయ చెలామణీలో బంగారం ప్రధాన స్థానం వహించబోతున్నది. అల్లాంటి స్థితిలో తప్పకుండా

రష్యాది పైచెయ్యి అవుతుంది. రష్యా చేతినిండా అవసరానికి మించి బంగారు నిల్వలున్నాయి ఈ నిల్వలు తరిగిపోయినా ఆంతరంగికంగా రష్యా ఆర్థిక వ్యవస్థలో వచ్చే మార్పేమీ వుండదు ఈ బంగారంతో రష్యా అంతర్జాతీయ వాణిజ్యరంగంలో విచ్చలవిడిగా విజృంభించి లావాదేవీలు పెంచుకోగలదు

ఈ బంగారు యుద్ధానికి ఉపక్రమించటానికి, రష్యా, బంగారు నాణాల చెలామణీ దశ వచ్చేదాకా ఆగవలసిన పనికూడా లేదు ఆగలేదు కూడా; అప్పుడే సన్నసన్నగా కార్యరంగంలో ప్రవేశించనే ప్రవేశించింది. రష్యా ఒకపని చేస్తుంది — వెనకబడిన దేశాల నుంచి, తనకవసరం వున్నా లేకపోయినా వ్యవసాయికోత్పత్తులూ, ఖనిజాలూ కొని నిల్వచేస్తుంది. తనకు ఆంతరంగిక ఆర్థికవ్యవస్థలో ఎట్టిప్రయోజనము లేని ఈ బంగారం వుంది గనుక, రష్యా ఈ దిగుమతులకు వాటిని వ్యయం చేయవచ్చు ఈ బంగారం చేతిలో వుంది గనుక ఎగుమతులద్వారా వచ్చే డబ్బుతోనే ఈ దిగుమతులు చేసుకోవాలనే బెంగ రష్యాకు లేదు. ఇంతో అంతో ఎగుమతులు తీసుకుంటే గాని దిగుమతులు చేసుకోమని బేరాలాడే పాశ్చాత్యదేశాల బాదరబందీ లేకుండా సరుకు అమ్ముకోవటానికి వీలున్న రష్యావైపు మిగతా దేశాలు మొగ్గతాయంటే తద్వారా వాణిజ్యరంగంలో రష్యా పలుకుబడి పెరుగుతుందంటే ఇందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు ఇంకో విచిత్రమేమిటంటే, ఔన్సు 35 డాలర్ల వంతున, లభించిన బంగారాన్నంతా అమెరికా కొంటూ వున్నంతసేపూ రష్యానుంచి బంగారం స్వీకరించటానికి ఏ దేశానికి ఎట్టి వెనుకంజా వుండదు కొసకు ఇదంతా యేమౌతుందన్న మాట? రష్యా "స్వర్ణయుద్ధ" సంచాలనానికి కావలసిన పెట్టుబడినంతా పరోక్షంగా అమెరికాయే స్వయంగా పెట్టి కొనసాగించే దుర్గతిపడుతుంది. పారిశ్రామికంగా వెనుకబడివున్న ఈ దేశాలన్నీ, పత్తి, బియ్యం, పంచదార వగైరా సరుకులు రష్యాకు అమ్మి, తద్వారా లభించిన బంగారంతో అమెరికా డాలర్లు సంపాయించి, అమెరికానుంచి కావలసిన యంత్రసామగ్రి నంతా ఏర్పాటు చేసుకుంటాయి.

ఇంతేకాదు రష్యా ఈ బంగారంతో విపరీతంగా కొనుగోళ్లు చేసి అంతర్జాతీయావధిని ప్రధాన వస్తువుల అభావాన్ని కలుగజేయవచ్చు. గతసంవత్సరం ఇలానే చేసింది, ఆగ్నేయాసియాలో ఉత్పత్తి అయిన రబ్బరు యావత్తూ హఠాత్తుగా ఒక్కసారి కొనేసి, ఇతర దేశాలకు రబ్బరు దొరకకుండా చేసివేసింది. దూరప్రాచ్యంలోనూ మధ్యప్రాచ్యంలోనూ ప్రజలకు బంగారమంటే యెంత మోజువుందో, తరతరాలుగా తమకుటుంబాలకు బంగారం సేకరించటానికి ఎలా తాపత్రయ పడతారో క్రెమ్లిన్‌కు బాగా తెలుసు. గత సంవత్సరం ఏదో పాతబాకీ చెలామణీక్రింద రష్యా ఇరాన్‌కు ఒక పెద్దమొత్తం బంగారం పంపించేసరికి దాన్నిచూసి స్థానిక పత్రికలన్నీ ఎంతో ఆప్యాయతను ప్రకటించాయి దానిముందు అంతకంటే అధిక మొత్తంలోవున్న అమెరికా ఆర్థిక సహాయం వాళ్ల దృష్టిని ఆకర్షించలేకపోయింది.

రష్యా విస్తృతావధిని యీ స్వర్ణయుద్ధాన్ని యింకా ప్రారంభించలేదన్న మాట నిజమే కాని అలాంటిదాన్ని ప్రారంభించటానికి వాళ్ళకు స్తోమతు వుంది; ప్రారంభించాలనే కృతనిశ్చయం కూడా వున్నదని బాహాటంగా తెలుస్తోంది. ఇటీవలి రష్యా చర్యలన్నీ ఇందుకు సూచకంగానే వున్నాయి ఆంగ్లో-సోవియట్ వాణిజ్య సరఫరాలను 9 కోట్ల డాలర్ల నుంచి 60 కోట్ల డాలర్లకు పెంచుకోవటానికి ఒప్పుకుంటామని కృశ్చేవ్ లండన్‌లో ప్రకటించాడు. ఇది పరిశీలించదగిన విషయం. ఇంత అవధిని బ్రిటిష్ ఎగుమతులతో తులదూగగల ఎగుమతి సరుకులు రష్యాకి ఎక్కడున్నాయి? నిజానికి హృదయపూర్వకంగానే కృశ్చేవ్ ఈ వాగ్దానం చేసివుంటే ఈ బంగారాన్ని దృష్టిలో వుంచుకునే ఆయన మాట్లాడి వుండవచ్చు. బ్రిటన్‌నుంచిగాని, బ్రిటిష్ వలసలనుంచిగాని బ్రిటిష్ అధినివేశాలనుంచిగాని సరకులు కొనుగోలు చేసుకోవటానికి రష్యా యిప్పటికే లండను మార్కెట్‌లో చాలా బంగారాన్ని అమ్ముతూవుంది. తిరిగి ఈ బంగారంతో, బ్రిటను, డాలరు ప్రాంతంనుంచి కావలసిన వస్తువులను దిగుమతి చేసుకోవటానికి సావకాశం యేర్పడుతోంది.

బంగారం, పశ్చిమ రాజ్యాలకు, తమ ఆర్థిక వ్యవస్థలను చక్కదిద్దుకోవటానికి ఒక సాధనం. వారు సంప్రదాయంగా వస్తూన్న కొన్ని ఆచార సూత్రాలను అనుసరించి దీన్ని వాడుకుంటూ వుంటారు. కాని యీ సూత్రాలను పాటించవలసిన బాదరబందీ కమ్యూనిస్టులకు లేదు. ఈ సూత్రాల నన్నిటినీ ఛిన్నాభిన్నం చేసి వాళ్లు పశ్చిమదేశాల ఆర్థిక వ్యవస్థను తిరిగి కోలుకోకుండా గట్టిదెబ్బ తీసివేయగలరు.

"న్యూలీడర్" సౌజన్యంతో.

# గ్రామోద్యోగవ్యవస్థ

## శ్రీ బుద్ధవరపు వేంకటరత్నం

ఇటీవల పత్రికలందు ప్రచురింపబడుచున్న వార్తలను బట్టి గ్రామోద్యోగులు ఆంధ్రరాష్ట్ర గ్రామోద్యోగీయ సంఘము ద్వారా తమ కష్టనష్టముల నివారణకు గాను పెద్దపెట్టున యాందోళనము చేయుచున్నట్లు తెలియుచున్నది. ఇప్పట్లు వీరు గ్రామోద్యోగులా? లేక గ్రామపాలకులా? లేక మరికొన్ని ప్రభుత్వ ప్రతినిధులుగ నుదహరింపబడుచున్నటు గ్రామసిబ్బందియా? వీరి పుట్టుపూర్వోత్తరము లేవి? యను వాటిని గురించి కొంచెము పునశ్చరణము గావించుకొనుట యప్రస్తుతము కాదేమో యనిపించుచున్నది.

నేడు మన గ్రామములలో ప్రభుత్వము వారివలన తృణమో పణమో వేతనము బొందుచు గ్రామోద్యోగులని పిలువబడు వారిలో సాధారణముగ మన కగుపడువారు ముగ్గురుందురు. గ్రామమునసబు, మణియము గారు లేక రెడ్డి (విలేజి హెడ్మను) అని పిలువబడు నతడు— ఈయన గ్రామ మేజిస్ట్రేటు గాను, గ్రామాధికారి గాను పని చేయును. ప్రభుత్వమునకు చెల్లు పన్నులు వసూలు బాధ్యత యీయనదే. రెండవది కరణము. "కరణము లెక్కలు వ్రాయును" అనెడు లోకోక్తి ప్రకారము గ్రామమునకు సంబంధించిన యావత్తు లెక్కలను వ్రాయుట, మణియము గారునకు గుమాస్తాగా యుండుట, రిపోర్టులు తదితర కాగితములు వ్రాయుట యీయన చేయుచుండును. మూడవది తలియారునిది. ఈతడు గ్రామపోలీసై గ్రామమును కావలి కాయుచుండును. పన్ను రైతులవద్దనుండి వసూలు చేసి తీసికొనివచ్చుట, వసూలైన డబ్బులను తాలూకా ఖజానాకు యిర్సాలు చేయుటకు తీసికొని పోవుట యీతని ముఖ్యవిధులు. విస్తీర్ణము హెచ్చుగా నుండి, ప్రభుత్వమునకు విపరీతముగ పన్ను చెల్లుచుండి, జాలాధారముల పని మిగిలియుండుచోట్ల అసిస్టెంటు కరణములు, వెట్టియానులు, తోటి, నీరుగంట్లు యిత్యాది యుద్యోగులు గూడ నాయా గ్రామములలో నియమింపబడి పని చేయుచున్నారు. ప్రస్తుతము వీరికి చెల్లింపబడు వేతనముల ప్రమాణము ప్రకారము మునసబునకు నెలఒకటింటికి పదునాల్గు రూప్యములు, కరణమునకు తొమ్మిది లేక పదునేడు లేక యిరువదిమూడును, తలియారునకు పదునారు రూకలును లభించుచున్నవి.

ఈనాడున్న రూపములో లేకున్నను గ్రామోద్యోగుల వ్యవస్థకు ఏనాడో భారతదేశమున బీజారోపణ జరిగినది. పురాణయుగము మాట నటుంచి చరిత్రనే తీసుకొన్నను క్రీస్తుపూర్వ మారవ శతాబ్ది నాడే పరిపాలనా యంత్రాంగమునకు పంచాయితీ ప్రాతిపదిక యైయున్నట్లు, గ్రామపంచాయితీయందు గ్రామోద్యోగి సముచిత బాధ్యత నిర్వర్తించినట్లును సాక్ష్యములున్నవి. నాడు వీరు గ్రామోద్యోగులు గాక గ్రామపాలకులై ప్రభుత్వకార్యముల నిర్వహించుటే గాక న్యాయశాఖను గూడ పాలించి గ్రామముయొక్క సర్వాంగీణయౌన్నత్యమునకు బునాదిశిలలై వెలుగొందిరి. పాటలీపుత్రము మొదలుకొని కాస్పియను మహాసముద్రతీర పర్యంతము విస్తరించిన మౌర్యసామ్రాజ్యమును నడిపించినది అమాత్య చాణక్యులవారి చెక్కుచెదరని పరిపాలనా

యంత్రమని చెప్పవచ్చును — కౌటిల్యుని యర్థశాస్త్రము ప్రకారము సామ్రాజ్యమందు సర్వాంసహా చక్రవర్తియగు ప్రభువునకు, రాజ్యాంగయంత్రమున నతిక్రింది స్థానము నాక్రమించు గ్రామపాలకునకు మాత్రమే వంశపారంపర్యపు హక్కు సంక్రమింపజేయబడినది. గుప్తుల కాలమునను, శ్రీహర్షుని పాలనయందును రాజ్యమునుసరించి గైకొనబడు సర్వ నిర్ణయములందును, వాటిని రూపొందించుటలో గ్రామ పాలకులతో విధిగ సంప్రదింపులు జరుపబడుచుండెడివి. విదేశీయుల పాలనలో సైతము నీ వ్యవస్థ గౌరవపాత్రమై విలసిల్లినది. తోడరుమల్లుని సలహాతో సంస్కరింపబడిన యక్బరుని భూమి శిస్తు వసూలు విధానమునందు గ్రామము ప్రమాణముగాను, తద్విధినిర్వహణమున గ్రామోద్యోగి ప్రధాన వ్యక్తిగాను నంగీకరింపబడినది. ఈ చరిత్రాత్మక ప్రాశస్త్యమును గుర్తించియే బ్రిటిషువారు కూడ గ్రామోద్యోగుల వంశపారంపర్యపు హక్కును కాపాడుచు శాసనము చేసినారు.

కాని గ్రామోద్యోగ వ్యవస్థను ప్రస్తుతము మనము చూచు దుర్భరస్థితికి గొనివచ్చుటకు తెల్లదొరల పాలనమందే ప్రయత్నములు విరివిగా జరిగినవి. ఈ వ్యవస్థ పటిష్ఠముగను, సుదృఢముగను నున్నచో నెప్పటికైన జాతీయోద్యమకారులు మిక్కిలిగా నున్న గ్రామీణులను గూడగట్టగల గ్రామ పాలకుల కృషితో తమ ప్రభుత్వమునే పునాదులకంట కదల్చివేయుదురేమో యను భయముతో నింగ్లీషువారు "విభజించి పాలించు" అనెడి తమ కుటిల నీతితో దీనిపై గొడ్డలిపెట్టు పెట్టిరి. గ్రామపాలనను మునసబు కరణముల మధ్య విభజించిరి. లెక్కలు తయారు చేయుట, కాగితములు వ్రాయుట మొదలగు గుమాస్తా పనులు మాత్రమే కరణము చేతనుంచి గ్రామమందు కర్రపెత్తనము చెలాయించు నధికారము మునసబు చేత నుంచిరి. అనేక గ్రామములలో నీనాడు మునసబు కరణముల మధ్యనున్న తీవ్ర వైరములు గ్రామమును కక్షలుగ చీల్చి పల్లెటూరి సౌభాగ్యమును భస్మమొనర్చుచున్నవి

ఈ వ్యవస్థకు తెల్లదొరలు గావించిన దారుణ కృత్య మింకొకటి యున్నది. అనాదినుండియు ఈ గ్రామోద్యోగుల ననుభవించుచు నీతిమార్గము దప్పకుండ విధులు నిర్వహించు గ్రామపాలకుల భూములకు పన్నుగట్టిరి. ఆనాడు వీరిని బుజ్జగించుటకు మీరు దానవిక్రయాది సంపూర్ణ స్వాతంత్ర్యముతో స్వేచ్ఛగా సుఖాన ననుభవించవచ్చుననిరి. కాని కాలము గతించినకొలది సంసారములు పెరిగి గ్రామోద్యోగులు తమ భూముల నమ్ముకొని రాను రాను చేత నేగానిలేక కుటుంబపోషణకుగాను విధిగ నవినీతి మార్గము నవలంబించి తద్వారా గ్రామీణుల యాగ్రహమునకు పాత్రులైరి. ప్రభుత్వమువారు తొమ్మిది, పదునేడు, లేక యిరువదిమూడు రూప్యములను గౌరవ వేతనముల నిచ్చినను గంపెడుబిడ్డల సంసారులకది యేమూలకు రాక కటకటపడుచున్నారు.

గ్రామలెక్కలను ఇరువది నాలుగింటిని మాన్యువలు ప్రకారము పేర్కొనినను నాటికి "ఏ" గుర్తు "బి" గుర్తు, "సి" గుర్తు ఇత్యాదిగా యొక్కొక్క లెక్కకు నాలుగైదు తోకలను చేర్చి నాడే హెచ్చు చేసిరి. ఇవిగాక, అప్పుడప్పు డధికారులు చెప్పుచుండు పనులుకూడ చేయుచుండవలెనని శాసనమందు నక్కాణించిరి ఈ విషయములోని కధికారి చెప్పు నే పనినైనను తెచ్చుకొనవచ్చును. అంటే తమ పాలనాధికారమును విభజించి ఇటు తమ యుపాధిని నాశనము చేసి పరదేశప్రభుత్వము గ్రామ సమైక్యతను భగ్నపరచి దమ కుచ్ఛిత రాజకీయమును సాగించినది.

దేశమంతటను జాతీయోద్యమము ముమ్మరముగ సాగినపుడు వందలాది గ్రామోద్యోగులు సైతముఅందు భాగస్వాములైరి సుమారు పదునేడేండ్ల వరకు బర్తరఫులో (కొందరు కారాగృహములందు గూడ నుంపబడిరి.) నున్నవారు గూడ లేకపోలేదు. దేశ స్వాతంత్ర్యముతో బాటు తమ వ్యవస్థకు గూడ సుముఖమగు భవిష్యత్తు రాదా యని కలలు గనిరి.

ఆ కాలమునందే యింకొక బెడద గూడ వీరి నెత్తిన బడినది. 1937 వ సంవత్సరమునుండి యెన్నియో యదనపు పనులు వీరిపై రుద్దుట ప్రభుత్వము నిర్దయతో సాగించినది. సర్వే, సెటిల్మెంటు పని చేయించినారు. పరప్రభుత్వమునకు దాసులగుటచే చేయునది లేక గ్రామోద్యోగులు పెరిగిపోవుచున్న విధులను కిమ్మనకుండ చేయవలసిన దుర్గతి పాలైరి.

# కలగూరగంప

1947 సంవత్సరము మనకు స్వేచ్ఛ వచ్చినది. స్వాతంత్ర్య ప్రాప్త్యనంతరమున కూడా వీరి వ్యవస్థ మారలేదు. వీరిని పాలించు చట్టములే యుండినోయి నది అదనపుపను లింకను మీరినవి. రేషనింగు, ప్రొక్యూర్మెంటు పనులు చేయించిరి. ఓటరుల జాబితాలు జనాభా లెక్కలు, పశువుల గణితి, ల్యాండు సెన్సను, ఇనాము లెక్కలు వ్రాయించిరి ఋణముల వసూళ్ళు చేయించిరి. ఇప్పుడు సర్ చార్జీ లెక్కలు వ్రాయమని యొత్తిడి చేయుచున్నారు ప్రజా ప్రభుత్వము గదా! నేడు గాకున్న రేపైన నాగోడు వినరా యనెడు సంపూర్ణ సహన భావముతో నీ విధుల నన్నింటిని గ్రామోద్యోగి చేయుచున్నాడు. తుదకు విసిగిపోయి యదనపుపనుల భారము మోయలేక సర్ ఛార్జీ లెక్కల తయారీ నిలుపుదలతో తన తీవ్రమగు నసంతృప్తిని ప్రభుత్వమునకు తెలియజేసినాడు.

వీరి యవస్థ నిప్పటికైన ప్రభుత్వము గుర్తించిన దన్నది ముదావహము గ్రామోద్యోగులకు కొన్ని సదుపాయములను ప్రభుత్వము చేయనున్నటు రెవెన్యూ మంత్రి హామీ యిచ్చి". కాని వేతనముల నెంత మాత్రము పెంచ వీలుపడదని సెలవిచ్చిరి. వేతనముల మాట యెట్లున్నను ప్రభుత్వము వారు గ్రామోద్యోగుల ప్రధానమైనకోరిక యగు సమగ్ర శాసనము విషయమై శ్రద్ధ వహించుట ముఖ్యము. స్వరాజ్యము వచ్చినది. స్వరాష్ట్రము గూడ సిద్ధించినది. రేపు విశాలాంధ్ర యవతరించనున్నది కనుక నీ సమయమందైనను మంత్రివర్గము చర్చించియు, శాసనసభలలో తర్కించియు ప్రభుత్వమువారు గ్రామోద్యోగుల విధులు, బాధ్యతల నిర్వచించుచు, వారి భృతి, తదితర విషయములను తేటతెల్లముగను, సమగ్రముగను ప్రదర్శించు నొక శాసనము చేయుటవసరము. ఈ సంస్కరణ మచిరకాలముననే జరిగి గ్రామోద్యోగులు తొల్లిటియట్లు గ్రామసేవకులు, గ్రామపాలకులునై పల్లెటూళ్ళకు అపారముగ సేవ చేసి గ్రామీణ జీవితమును తద్వారా జాతీయజీవితము నవనవోన్మేషముగ, సౌభాగ్యవంతముగ దీపింప జేయుదురు గాక!

# ఛందోదర్పణము

## శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

త్రిప్రాసము.

గీ. సంఖ్యఁ బలుకు త్రికారంబుఁ జనుఁ దకార
సదృశమై త్రికారప్రాస సంజ్ఞ గలిగి
యత్రి విక్రముఁ డభయప్రదాత యనఁగ
వాక్త్రిపథగోజ్జ్వలులు విష్ణుభక్తు లనఁగ. (1-45)

గీ ఈ త్రికారంబుకుఁ దృతీయ మెసఁగఁ గ్రింది
రేఫ సంప్రసారణమున ఋత్వముఁ దృ
తీయ యగు నీ త్రికార మర్థించి చూడ
నా తకారంబునకుఁ బ్రాసమయ్యె నచట. (1-46)

ఈ రెండు పద్యములలోని రెండు తప్పులను చూపి శ్రీ భట్టాచార్య - అను వారు కడచిన నెల (జూలై) భారతి - పుట. 94 లో సవరణలు తెలిపియున్నారు.

తప్పులు : సవరణలు.

(1) 'అత్రి' అనునది తప్పు.
ఆత్రి — అని సవరణ.

ఆత్రి — లోని 'త్రి,' దాత — లోని 'త' ప్రాసాక్షరములు కావున ప్రాస పూర్వాక్షరమైన 'ఆ' — 'దా' వలెనే దీర్ఘముగా నుండవలెనని వారి వివరణము.

(2) 'ఈ త్రికారంబుకుఁ దృతీయ మెసఁగ' — అనునది తప్పు.

'ఈ త్రికారమునకుఁ దీయ మెసఁగ' అని సవరణ.

"త్రికారంబుకుఁ దృతీయ మెసఁగ — అంటే ఏమిటి? త్రికారంబునకుఁ దృతీయ వచ్చుట అసందర్భము — త్రికారమునకు "తీయ" ప్రత్యయమును త్రికారము నందలి రేఫకు ఋత్వమును వచ్చి 'తృతీయ' అను రూపము అగునని భావము" అని వారి వివరణము.

సవరణలూ — వివరణలూ సమంజసములనియే నా నమ్మకము మరి యిక్కడ నా మనవి యేమనఁగా :

ప్రత్యయము 'తీయ' గాని 'తీయము' కాదు. పద్యములో 'తృతీయ యగు' — అనియే యున్నది. తృతీయమగు — అని లేదు శ్రీ భట్టాచార్యులవారును — 'తీయ' ప్రత్యయము వచ్చును; 'తృతీయ' అను రూపమగును — అనియే వ్రాసియున్నారు. కావున, —

'తీయ మెసఁగ'

అని యుండుటయును సరికాదనియు, తీయ యెసఁగ — అని యుండవలెననియు 'మె' అచ్చు తప్పనియు నా యూహ.

ఈ యూహ ఒప్పో — తప్పో విచారింపఁ బండితలోకమునకు మనవి చేసికొన్నాను.

# గ్రంథ విమర్శనము

## పండ్లతోట

కవికోకిల గ్రంథావళి — 6 వ భాగం; మూలం: పారశీక మహాకవి సాదీ; అనువాదం: కీ. శే. దువ్వూరి రామిరెడ్డి; ప్రాప్తిస్థానం: కవికోకిల గ్రంథమాల, పెమ్మారెడ్డిపాళెం, యల్లయపాళెం పోస్టు, నెల్లూరు జిల్లా; వెల: రు 3-8-0.

పారశీక వాఙ్మయానికి 13 వ శతాబ్ది ఒక స్వర్ణయుగం. ఆ యుగకర్తలైన సాహిత్యకారులలో మహాకవి 'సాదీ' నామం జగద్విదితం. ఆయన రచించిన 'గులిస్తాన్,' 'బోస్తాన్' అనే రెండు మహాగ్రంథాలూ, అంతర్జాతీయరంగంలోని, ఇంచుమించు అన్ని భాషలలోకీ అనువదింపబడి బహుళప్రచారంలో వున్నయ్. ఈ రెండూ కూడా చిన్నచిన్న కథలతో మానవధర్మాలను ఉద్బోధించటానికి ఉద్దిష్టములైన రచనలు: సాదీ మధురవాక్కులు 'కవికోకిల' క్రమగానంగా ఆంధ్రుల కందించబడినవి. ఇందు 'గులిస్తాన్' (గులాబితోట) అనువాదంపై సుదీర్ఘమైన సమీక్ష భారతి గత ఏప్రియల్ సంచికలో వెలువరించబడినది. రచనాశిల్పంలో ఈ రెండు గ్రంథాలకూ గల తారతమ్యాన్ని అవగతం చేసుకోవటానికి పాఠకులు ఆ సమీక్షను కూడా తిరిగి తిలకించవచ్చును.

ఈ 'బోస్తాన్' (పండ్లతోట) రచనలో అనుసరింపబడిన శిల్పం 'గులిస్తాన్' రచనతో పోల్చిచూస్తే అంత విశిష్టమైందిగా కనుపించదు. ఇది నిర్వచన కావ్యంగా సాగిపోతుంది కథ తరువాత కథ చెప్పుకు పోవటం మధ్య మధ్య నీతిబోధకు ఉపక్రమించటంగా వుండి, కొంత విసుగుపుట్టిస్తున్నది.

'గులాబితోట'లో అలా కాదు. ముందు వచనంలో ఒక చిన్న కథ చెప్పి దానిమీద వ్యాఖ్యానంగా పద్యరూపంలో కవి ఒక మెరుపు మెరుస్తాడు. ఆ వెలుగులో విషయమంతా తేజోమయమై ఇట్టే పాఠకుని హృదయంమీద ముద్రపడుతుంది ఏదిఏమైనా 'గులాబితోట'తో పోల్చకపోతే, ఈ గ్రంథం ఉత్తమగ్రంథంగా వెలుగొందటానికి తగిన విషయసంపదను కలిగివుంది. 'సాదీ' కి గల మహత్తరమైన లౌకికజ్ఞానం అనన్య సామాన్యమైనది. దాన్ని యావత్తూ కావ్యధారలుగా సాదీ పాఠకునికి అందజేస్తాడు. కవికోకిల ఈ గ్రంథాన్ని తేటతెలుగు ద్విపదలలో అందించారు. ఈ గ్రంథనిర్మాణాన్ని గురించి ఉపోద్ఘాతంలో సాదీ ఇలా వివరించారు:

'తలచితి మిసరులో కలకండ దెచ్చి
హితులకు నుపహారమిచ్చెద నంచు;
కరమున కండచక్కెర లేదు గాని
అంతకన్నను తీయనైన కావ్యంబు
గలదు; సామాన్యమా కలకండ గాదు

# గ్రంథ విమర్శనము

జ్ఞానవంతులు పుస్తకంబుల పుటల
పదిలంబుజేసిన భావసంపత్తి.

వృషభసౌధమా దీని నిర్మించునపుడు
ఘటియించితి దశ శిక్షాద్వారములను;
తొలుత యధ్యాయంబు దెలుపు న్యాయంబు
పటువివేచన మభిప్రాయ నిర్ణయము
దైవభీతియు ప్రజాదరపాలనంబు
ఆవల రెండవదానియందు సల్పెదను

భూరి ననుగ్రహలబ్ధి మూలబంధనము
దైవకృపావృష్టి దనిసిన యర్థు
లను దినంబు కృతజ్ఞులై సంచరింప
మూడవయధ్యాయమున సంతరింతు;
హృదయార్తి మత్తత సదమల ప్రేమ
పంచేంద్రియాత్మక ప్రణయంబుగాదు;
నాల్గవదాన వినమ్రతకూర్తు;
నైదింట సంతుష్టి ఆరింట దృష్టి
పరులైన ధన్యుల వర్తింతు; సప్త
మాధ్యాయమందు విద్యాశిక్షణంబు;
అష్టమంబున సౌఖ్యమారోగ్యమిచ్చు
సర్వేశునకు కృతజ్ఞత దెల్పుకొనుట;
తొమ్మిదింటను సరిత్రోవ బట్టుటయు
పదిగ పశ్చాత్తాపపడుట; పదింట
ప్రార్థనముంగూర్చి పరిగణించుటయు,
గ్రంథోప సంహారకథనంబు గలదు.'

మానవ జీవనపథంలో వెలుగుచూపే 'గులాబి తోట' 'పండ్లతోట' అనే ఈ రెండు గ్రంథాలూ సర్వమానవులకూ అవశ్యపఠనీయాలు. ఈ రెండు గ్రంథాలను అనువదించి అందజేసిన కీ. శే. రామిరెడ్డిగారికి ఆంధ్రులు ఋణపడివున్నారు. ప్రతిభావంతులైన మహాపురుషులు 'కాయము వాసియు చిరజీవులు'!

## పునర్జన్మ

నాటిక; రచన: శ్రీ బెల్లంకొండ రామదాసు; ప్రచురణ: ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ: వెల 1-4-0.

నాటకవస్తువు పాతదే— పతితస్త్రీసముద్ధరణ: కాని శ్రీ రామదాసు శిల్పంలో ఇది ఒక నూతనత్వాన్ని సంపాదించుకున్నది.

మానవసమాజంయొక్క సంపూర్ణమైన పరిజ్ఞానం లేని అమాయికత్వంలో పొరపాటున కాలుజారి పతితురాలై జీవితాన్ని నాశనం చేసుకున్న శ్యామలను, డాక్టరు వివాహంచేసుకుని తిరిగి శ్యామలకు పునర్జన్మనిస్తాడు. కాని అనంతరదశలో సమాజపుదాడిని తట్టుకోలేక గజగజలాడి ఆ పిరికితనంలో తిరిగి శ్యామల జీవితాన్ని అఘాతంలోకి త్రోసివెయ్యటానికి ఉద్యుక్తుడౌతాడు. ఆ ఘట్టంలో, డాక్టరు తండ్రి, జనార్దనరావు, జీవితపులోతులు తరచి విశిష్టమైన అనుభవాన్ని గడించుకున్న మహాపురుషుడు, కుమారునిలో సంఘాన్ని జయించగల సాహసాన్ని పురికొల్పి శ్యామల జీవితం పాడుగాకుండా పరిరక్షించుతాడు. ఈ పాత్ర ఈనాటకానికి జీవం.

రంగవిభజన, పాత్రల ప్రవేశనిష్క్రమణాలు మొదలైన శిల్పసాంకేతిక విషయాలలో రచయిత అత్యంతమైన ప్రతిభను ప్రదర్శించారు. సంభాషణలు కూడా చాలా మప్పిదంగానే వున్నాయి ఇందులో రాంకుమార్ (విలన్) పాత్ర చాలా కృత్రిమంగా వుంది దీన్ని రచయిత షేక్స్పియర్ ఇయాగో పాత్రను దృష్టిలోవుంచుకుని చిత్రించినట్లు తోస్తుంది— అందుచేత సహజంగా కృత్రిమంగా తయారైంది. శ్యామల చివరలో రాంకుమార్‌ను హత్యచేయటం అనవసరమైన కల్పన. ఏదిఏమైనా గుణబాహుళ్యంలో ఈ అల్పదోషాలు పరిగణించదగినవి కావు. ప్రదర్శనయోగ్యమైన ఉత్తమశ్రేణి నాటిక.

1955 ఆంధ్రనాటక కళాపరిషత్ పోటీలలో ప్రథమ బహుమతిని పొందింది.

## శ్రీ జానకీజాని శతకము

రచన: శ్రీ మైలవరపు సూర్యనారాయణ మూర్తి; ప్రాప్తిస్థానం: రచయిత, కృష్ణంపాలెం, జేవరపల్లి పోస్టు, పశ్చిమగోదావరిజిల్లా. మూల్యం. రు. 0-4-0 ఆధునికులలో శతకములు రచించినవారు ఎందరో లేరు. వచ్చిన శతకములలో కూడ చెప్పుకోదగినవి లేవు.

భాషాపటిమయందేమి, పద్యనిర్మాణమునందేమి, భక్తిపారవశ్యతయందేమి శ్రీ సూర్యనారాయణ గారి రచనావిధానం మమ్మూర్తులా పోతన రచనకుదీటై హృదయాహ్లాదిగా నున్నది.

ఉదాహరణకు :

"భానుకులాబ్ధి పూర్ణహిమ
  భానుడు మానికులాంబుజాతి స
మ్మానద బాలభానుడు, దవి
  మత్త నిజాశ్రిత భక్త హృత్తమో
భానుడు, చండభాను దఘ
  పల్వల మార్పగ; నట్టి జానకీ
జానకి రామచంద్ర మహి
  జానికి సాటి విభుండు లేడిలన్.

తానము సిద్ధికిన్, శ్రితవి
  తానము నమ్మిన సుప్రసన్న సం
తానము, మూలమున్ శ్రుతివి
  తాన మెఱుంగని తాన మాజి సం
తానము, ముక్తి కైక్యమగు
  తానము దానయినట్టి జానకీ
జానికి రామచంద్ర మహి
  జానికి సాటి విభుండు లేడిలన్."

## బాలల బొమ్మల భాగవతము

కథారచన: శ్రీ బూరెల సత్యనారాయణమూర్తి; చిత్రరచన: శ్రీ బి. పి. రాజు; ప్రకాశకులు: సి యన్. శ్రేష్ఠి, చార్‌కమాన్, హైదరాబాదు - 2, సిద్దంబర్ బజార్ - 1; వెల రు 1 8-0.

దీల్లో భాగవతంలోని 14 గాథలను సేకరించి బాలబాలికలకు ఉపయోగార్థం చిన్న చిన్న కథలుగా అందజేయటానికి ప్రయత్నించారు. కాని వీరు వాడిన భాష బాలబాలికల కనువైనదిగాలేదు. ఉదాహరణకు:

"ఓ కమలాక్షా! ఆర్యరక్షకా! శత్రువులను ద్రుంచువాడా! భక్తపాలనా! దేవా! నీయొక్క మహత్తును జూపి నన్ను కనికరించు'—ఇత్యాదిగా బైబిలు తెలుగు ధోరణిలో వుంది. 'భక్తపాలనా!' వగైరా అప్రయోగాలు పట్టించుకోని రచయిత యింతకంటే సరళమైన వ్యావహారికాన్ని వాడటానికి ఎందుకు సందేహించారో బోధపడదు. చిత్రాలు సొగసుగా వున్నాయి.

## జి. యం. యస్. వార్షిక సంచిక

ఇది హనుమకొండలోని ప్రభుత్వ మాధ్యమిక పాఠశాల వార్షిక సంచిక; అమూల్యం ఈ సంచికలో రచయితలందరూ విద్యార్థులే అయినా, రచనలన్నీ చాలా ముచ్చటగా వున్నాయి. అధునాతన యుగంలో విజ్ఞాన వికాసాలు పాడైపోతున్నాయని కాకిగోల చేసేవారు నిజానికి యీ సంచికను తప్పక తిలకించవలసి వుంది. మైసూరు యాత్రా చిత్రాలతో, సంచిక ముద్దులుమూటగడుతోంది. విద్యార్థులకు పత్రికా నిర్వహణలో ఇలాంటి ఉత్తమాభిరుచిని అలవాటు చేస్తూన్న సంపాదకవర్గంలోని ఉపాధ్యాయులను అభినందించవలసి వుంది.

## వైతరణి

చిన్న నవల: సాంఘికం; రచన: శ్రీ శార్వరి; ప్రచురణ: బాబావలీ పబ్లిషర్స్, తెనాలి, వెల 0-12.0.

## పిచ్చిలోకం

నాటిక; రచన: శ్రీ శార్వరి; ప్రచురణ: బాబావలీ పబ్లిషర్స్, తెనాలి, వెల 0-8-0.

## గీతార్థసారము

[ప్రథమ భాగము]

గేయరచన: కర్త: శ్రీ వేగునూరి గంగాధరం; ప్రాప్తిస్థానం : రచయిత టౌన్‌హాలీస్ లైన్ రామకృష్ణ స్కూల్, రాజమహేంద్రవరం; వెల: 0.8.0.

## ఆకారాలు

కథల సంపుటి; రచన: శ్రీ వల్లభ్; ప్రచురణ: వినోదా ప్రచురణలు, విజయవాడ-2; వెల 0-12.0.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

సెప్టెంబరు 1956

సంపుటము 33 : : సంచిక 9

విడిపత్రిక వెల ఒక రూపాయి

# ఇది నిలబెట్టవలసిన సమస్యం...



బైసికిల్‌ను అతిసునాయా
సంగా నిలబెట్టవచ్చు, కాని
బైసికల్ ఖర్చులను భరించటం
అంతసులభం కాదు. వాడినకొద్దీ
ఖర్చు అవుతుంది. సెన్
రాలే వారు ముడిపదార్థాల
ఉపయోగంలో వహించే
అత్యంత శ్రద్ధ ప్రతి విభా
గంమీద కార్ఖానా వారి పర్య
వేక్షణ సెన్-రాలే బైసికిళ్లను
అత్యుధమపు రిపేరీలు భాగాల
మార్పులతో దీర్ఘకాలం
మన్నింప జేస్తాయి. ఈ
విధంగా సక్రమంగా
నిలబెట్టగలరు.

## రాలే
## రాబిన్ హుడ్




SRC-39 TG

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1956

# ఆ శ లు

శ్రీ సి. నారాయణరెడ్డి

ఆశలు మరాళగరుదంచలములై —
అవనిపై జారిపడినట్టి శప్తాప్సరల
అలసిపోవని కటాక్షాంచలములై —
నను ఎగురవేసి వెంటనె క్రిందబడద్రోసె.

పొడమె నొక వింత అనుభూతి; నాతనువెల్ల
యెడదగా రూపొందురీతి.
కడకొక్క విరినైన గాకయే నను నేనె
విడిపోయి పరిమళమునైతి.

దెసల నాసికలందు ప్రసరింతునా, లేక
దివిగుండెలోన గొండిలిసేతునా
కసిదీర అప్సరోగజగామినుల యెదల
మసలి ఉన్మాదాన్ని మండింతునా

అదలింపబడితినే నాశాసువర్ణశై
లారోహణము సేయునపుడు.
ఈహాపరాఙ్ముఖుడ స్వాహాంగ్రవాసఖుడ
నేమందురో చూతునిపుడు.

తొలిమబ్బు రాచకన్నెల కొప్పులూపి రా
ల్తును చుక్కలనెడు మల్లెలను
మెఱపు దొరసానులను వెఱపింతు దోతునని
మేని బంగారు టొల్లెలను.

పారిజాతాంగనల పట్టితెచ్చి పలాశ
వీరులకు పెండ్లిసేయింతు.
సెలయేటి సొగసుకత్తెలు మేరుగిరిపతికి
గిలిగింతలిడ సంతసింతు.

ఆశలను దిగద్రావినట్టి వాడే తావి
యంతస్వేచ్ఛగ ఎగిసిపోవు.
బ్రతుకును పరిమళ ప్రతిగా మలచుకొన్న
వాని కేపరిధులును లేవు.



# రష్యా బలం ఏమిటి?

ఆల్సాప్ సోదరులు

గత వేసవిలో, టూషినో విమానకేంద్రంలో, సోవియట్ విమాన విన్యాస మహోత్సవం జరిగింది. ఆ తరుణంలో, ఈ రచయితలలో ఒకరు మాస్కోలో వుండి, ఆ మహోత్సవాన్ని ప్రత్యక్షంగా చూడటం తటస్థించింది. ప్రదర్శనం యేర్పాట్లు చాలా ఆటోపంగానూ, పల్లెటిదిక్కు సంతలాగా వినోదకరంగానూ వున్నా, సోవియెట్ 'మీడియం రేంజి', 'లాంగ్ రేంజి' జెట్ బాంబర్లూ, పెద్ద పెద్ద 'బాడ్జర్ విమానాలూ' 'బైసన్ విమానాలు' సంరంభంగా గగనపథాన సంభ్రమించుకున్నా, ఆ విన్యాసాలు మాత్రం ఏమంత చెప్పుకోదగ్గవిగా లేవు. 'బాడ్జర్లూ' 'బైసన్లూ' మొదలైన ఈ బృహద్యంత్రాలు ప్రజల నెత్తిమీద గగనపథాన యెగురుతున్నప్పుడు, అమెరికా రాయబారవర్గంలోని సైనికశాఖ ఉద్యోగి ఒకరికి, ఒక విచిత్రమైన సర్దా కలిగింది. చేతిలో ఉన్న దుర్భిణిని సోవియట్ అగ్రనాయకులున్న వేదికవైపు తిప్పి వారి చర్యలు గమనించాడు. కృశ్చేవ్, బుల్గానిన్, మొదలైన ప్రముఖులంతా ఆ వేదికమీద వున్నారు. ఆ దుర్భిణిలో కనుపించిన రంగం, చాలా చిత్రమైంది. ఫ్రాన్సు పతనమై పోయిందన్న ఆనందోత్సాహంలో హిట్లర్ ప్రదర్శించిన ఆనందతాండవం ఛాయాచిత్రాన్ని మీరు చూసే వుంటారు. ఆ చిత్రం ఎలాటి అభిప్రాయాలను మనకు కలిగించుతుందో దుర్భిణిలో ఆ తరుణలో ద్యోతమానమైన ఆ రంగం అదే అభిప్రాయాన్ని రేకెత్తించుతుంది. ఆ కొత్తరకం బాంబర్లు అలా ఒక్కసారి పైన ఎగిరేసరికి, ఇక అగ్రనాయకులు ఆ మహానందాన్ని అణచుకోలేకపోయారు. చిరునవ్వుల చిద్విలాసాలతో వారి ముఖాలు మెలికలు తిరిగిపోతున్నాయి. ఆనందావేశవివశుడై పోయిన కృశ్చేవ్, ఒకొక్క విమానం అలా ఎగిరినప్పుడల్లా, ఒకొక్క ఎగురెగిరి కల్లోలమైపోతున్నాడు. ఆయన కంటే నిగ్రహంగల ఆయన సహచరులుకూడా ఉల్లాసంగా ఒకరితో ఒకరు కరచాలనం చేస్తూ, ఒకరి వీపు ఒకరు తట్టి పరస్పరం అభినందించుకుంటూ పట్టపగ్గాలు లేకుండా వున్నారు.

బహిరంగంగా కాకపోయినా నిగూఢంగానూ తీవ్రతరంగానూ సాగుతున్న ద్వంద్వంలో, అమెరికాను ఓడించివేశామనే తమ ఆనందాన్ని సోవియట్ అగ్రనాయకులు ఇలా బడిపిల్లల తంతులో ప్రదర్శించారు.

అసలు ఈ ద్వంద్వం యెప్పుడు ప్రారంభమైంది? జపానుమీద తుదియుద్ధం జరుగుతున్న తరుణంలో అమెరికా బి-29 రకం విమానమొకటి త్రోవతప్పి, తప్పనిసరై, సైబీరియాలో దిగిపోవలసి వచ్చింది. దాన్ని చూసి రష్యావాళ్ళు ఒక నమూనా తయారు చేసుకున్నారు. అమెరికా అంతవరకూ విమాననిర్మాణంలో ఎంతో త్వరితగతిని ముందడుగై పురోగమించుతోంది. రష్యా, ప్రథమదశలో, ఈ పోటీని అధిగమించింది. అనంతరదశలో, ఖండాంతరాలకు మహాయానం చేయగల భారీరకం జెట్ బాంబర్ల నిర్మాణానికి ఉపక్రమించి ఈ 'బైసన్' విమానాన్ని రూపొందించింది. వాటితో సరిపోల్చదగిన అమెరికన్ బి-52 విమానాన్ని రూపొందించడానికి అమెరికా వ్యయం చేసిన కాలంలో సగంకాలంకూడా అక్కర్లేకుండానే అమెరికా దీన్ని నిర్మాణం చేసింది. ఇప్పుడు అమెరికా బి-52 విమానాలను ఏ అవధిని ఉత్పత్తి చేస్తున్నదో అంతకు మూడు రెట్లు రష్యా "బైసన్" ఉత్పత్తులు సాగుతున్నయ్. నెలకు 17 బి-52 లను తయారుచేసే ఆదర్శస్థాయిని అందుకోవటానికి అమెరికా ప్రయత్నించుతున్నది. రష్యా నెలకు 20 బైసన్లను తయారు చేసే స్థాయిని అందుకోవటానికి ప్రయత్నించుతున్నది. అమెరికా తన ఆదర్శాన్ని అందుకోగలగటానికి ఎంతో ముందుగానే రష్యా తన ఆదర్శాన్ని అందుకోబోతున్నది. కృశ్చేవ్

ఆనందంతో చిందులు త్రొక్కడంటే ఆశ్చర్యపడ వలసిందేమీ లేదు.

ఈ జెట్ విమానాల ఉత్పత్తిలో అమెరికా పురోగతిని త్రోసిరాజనటమొక్కటే గాదు. ఈ మహాయంత్రాల నిర్మాణం మరొక మహత్తర విషయాన్ని కూడా వ్యక్తం చేస్తున్నది సోవియట్ యుద్ధ పరిశ్రమ, అత్యంత నవీనమైన ఒక మహాశక్తిగా పరిణామం చెందిందనే విషయం విస్పష్టమైపోతోంది.

సోవియట్ యుద్ధ పరిశ్రమ యిలాంటి మహాశక్తిగా ఎలా రూపొందింది అనే విషయాన్నే ఈ వ్యాసంలో వివేచన చేస్తున్నాం ఇది సర్వులూ తక్షణం పరిగణింపతగిన సమస్య కావటమే గాక అనేక విభ్రాంతులు కలుగటానికి సావకాశం గావుంది పశ్చిమదేశాలవారందరికి ఇది ఎలా సాధ్యమైందా అని ఆశ్చర్యంగా వుంది. ఈ ఆశ్చర్యాన్నే, ఆనాడు టూషినోలో వున్న అమెరికా రాయబారవర్గ యుద్ధ శాఖకు చెందిన మరొక పెద్దమనిషి ఇలా వెల్లడించారు:

'అత్తేరీ! పింగాణీ బొచ్చెలు కూడా తయారు చేసుకోటం చేతగానివాళ్లు ఈ బైసన్లైలా తయారు చేశారు!'—

'నిజానికి రష్యా జనానికి సరియైన పింగాణీ బొచ్చెలు కూడా లేనిమాట వాస్తవమే ఈరకం వస్తువుల అభావంవల్ల వాళ్ళ జీవనస్థితి ఎంతకనిష్ఠ ప్రమాణంలో వుందో మనకు బోధపడుతుంది. రష్యాప్రజల జీవనప్రమాణం కనిష్ఠావధిలో వున్నదనే విషయం జగమెరిగిన విషయం ఉదాహరణకు: గత 25 సంవత్సరాల యీ మధ్య రష్యన్లు గరిష్ఠ సుఖశాంతు లనుభవించిన సంవత్సరం 1955. అయినా ఆ సంవత్సరంలో కూడా రష్యాపౌరుని జీవనభృతి, అమెరికన్ పౌరుని జీవనభృతిలో అయిదోవంతుకూడా లేదు.

పశ్చిమరాజ్యాల ప్రజల జీవనప్రమాణానికి రష్యాప్రజల జీవనప్రమాణానికి వున్న ఈ వ్యత్యాసాన్ని గమనించే, ఊహాగానంచేసే పశ్చిమరాజ్యాలవారు కొందరు, రష్యా ఇలాగే సర్వరంగాల్లోనూ చాలా బలహీనంగా వున్నదని అపోహపడుతున్నారు. ఈ కారణంచేతనే రష్యా అణుబాంబు తయారుచేయటం మొదలుగా అడుగడుగునా విభ్రాంతు లవుతున్నారు.

నిజానికి రష్యాప్రజానీకం అంత దరిద్రస్థితిలో వున్నారు కాబట్టే సోవియట్ ప్రభుత్వం ఇంతబలంగా వుంది.

సోవియట్ ప్రభుత్వం ఒక బ్రహ్మాండమైన పారిశ్రామిక వ్యవస్థ ఇదీ అదీ అని లేకుండా అది సర్వవస్తువులనూ ఉత్పత్తి చేస్తుంది. ఏ విషయానికీ యితరులమీద ఆధారపడేది లేదు కార్మికసంఘాలకు కావలసిన ఆహారపదార్థాలను సహితం తనే ఉత్పత్తిచేసి నిలవ చేస్తుంది ఇవన్నీ చేస్తున్నమాట నిజమే, కాని జాతీయసైనికశక్తిని పెంపొందజేయగల యుద్ధసామగ్రిని తయారుచేయటం దాని ప్రధానాశయం 'జనరల్ మోటార్స్' కంపెనీకి 'బ్యూయిక్స్' "చివర్లెట్లు" "కాడిలాక్స్" తయారుచేయటం ఎలా ప్రధానాశయమో, బైసన్, బాడ్జర్ జట్‌బాంబర్లు తయారుచేయటం సోవియట్ యూనియన్‌కు అలాంటి ప్రధానాశయం

"సోవియట్ యూనియన్ కంపెనీ లిమిటెడ్" యాజమానులు, ప్రతిభావంతులేకాక, దాక్షిణ్య రహితులు. సోవియట్‌కు వున్న కార్మిక సందోహం అనంతమైంది. వారి క్రమశిక్షణ తీవ్రతరమైంది. అందుచేత సమ్మెలు వగైరాల ఆలోచనకే అస్కారం లేదు. ముడి సరుకులు పుష్కలంగా వున్నాయి ఇప్పటికే దాని పారిశ్రామిక కర్మాగారం విస్తృతతరమైంది. అయినా సోవియట్ యజమానులు దీన్ని యింకా బ్రహ్మాండవ్యాపిగా తయారుచెయ్యటానికి బద్ధకంకణులై వున్నారు. ప్రపంచంలో తమకు పోటీఅంటూ లేకుండాపోయే అవధిని అందుకునేవరకూ వీరు ఇలా పారిశ్రామికరంగాన్ని పెంచుకుపోతూనే వుంటారు. ఈ పారిశ్రామికాభివృద్ధికి కావలసిన పెట్టుబడిని ఎవరిదగ్గిరా అప్పుతెచ్చి యిబ్బందులలో చిక్కుకోరు. ఈ పెట్టుబడిని సేకరించటానికి, యితరులు యాజమాన్యంలో జోక్యం కలుగజేసుకునేందుకు అస్కారంగా కంపెనీ వాటాలను యితరులకు అమ్మరు. బలవంతాన ప్రజలనందరినీ దరిద్రస్థితిలో వుంచేసి కావలసిన పెట్టుబడినంతా సేకరించుతారు

పెట్టుబడిని సేకరించటానికి యీ కంపెనీకి తేలిక మార్గాలున్నాయి. కార్మికుల కూలీని తగ్గించివేయటం, వారి కుటుంబవ్యయాన్ని పరిమితం చెయ్యటం ఇత్యాది చర్యలతో నిర్వహణ వ్యయాన్ని నేలమట్టానికి తగ్గించి

# రష్యా బలం ఏమిటి?

వేయవచ్చు. కార్మిక సంఘాలకు అందజేసే పదార్థాల ధరలను రెట్టింపు చేయవచ్చు. కార్మికుల వినిమయానికి ఖర్చు చేసే సాలుసరి వ్యయపట్టీలో మరికొంత కర్తనం చేయవచ్చు. ఈ చర్యల ద్వారా పనివాళ్ళు బాధలకు లోనైనా, ఈ "సోవియట్ కంపెనీ" తన అభివృద్ధి పథకాలకు కావలసిన ధనాన్నంతా సేకరించుతూ వుండగలదు.

సోవియట్ పారిశ్రామిక వ్యవస్థ సాగుతున్న యీ పద్ధతిని దృష్టిపథంలో వుంచుకుంటే సోవియట్ ఆర్థిక వ్యవస్థయొక్క పరిస్థితి యావత్తూ మనకు తేటతెల్లమౌతుంది. మన పశ్చిమ రాజ్యాలవారు, ఉత్పత్తులను లెక్క వేసేటప్పుడు వెయ్యి పౌనుల విలువగల ఉక్కుకూ, వెయ్యి పౌనుల విలువగల ముఖం మెరుగు డబ్బాలకూ. వెయ్యి పౌనుల విలువగల పెట్రోలుకూ వెయ్యి పౌనులు విలువగల ఆలీవునూనెకూ, వెయ్యి పౌనులు విలువగల విమానాలకూ, వెయ్యి పౌనులు విలువగల గ్రామీణవసతి నిర్మాణాలకూ ఒకే ప్రాధాన్యత నిస్తారు. ఇటీవల ఎన్‌కౌంటర్ పత్రికలో జరిగిన వాదప్రతివాదాలలో, కాలిన్ క్లార్క్, విమానాల ఉత్పత్తికంటే గృహవసతుల నిర్మాణానికే యెక్కువ ప్రాధాన్యతవుండాలని వాదించారు ఆయన ప్రత్యర్థి పీటర్ వైల్సు కూడా యీ వాదాన్ని సవాలు చేయలేదు. సోవియట్ ఆర్థికాభివృద్ధిని గోరంతలు కొండంతలు చేసి చెబుతున్నారని క్లార్క్ నిసితంగా విమర్శించిన అమెరికన్ ప్రవీణులు కూడా యిదే పద్ధతిని లెక్కలు కట్టి మాట్లాడుతూ వుంటారు.

కాని పైన వివరించిన పరిస్థితులు దృష్టిలో వుంచుకుని ఆలోచించితే సోవియట్ పారిశ్రామిక వృద్ధి ఫలితాలు ప్రజల స్థితిగతులమీద ఆధారపడి వుండలేదని విస్పష్టంగా తేలుతోంది. అందుచేత ప్రజల స్థితిగతులను దృష్టిలోవుంచుకుని సోవియట్ పరిశ్రమను గురించి ఆలోచించితే ఎట్టి ప్రయోజనమూ వుండదు. జీవనపరిస్థితులు బాగా లేవని కార్మికులు యజమానులకు ఎదురుతిరగటంగాని, బైఠాయింపు సమ్మెలు చేయటంగాని, యితరత్రా ఉత్పత్తి కార్యక్రమాలకు విఘాతం కలిగించి యజమానులకు కనువిప్పు కలిగించటానికిగాని అక్కడ ఆస్కారం లేదు. ఉదాహరణకు ఫిరంగులు తయారుచేసే ఉత్పత్తిదారు కార్మికుల వేతనాలు సగానికి తగ్గించి పరిశ్రమను రెట్టింపు పెద్దది చేశాడనుకోండి. ఈ అభివృద్ధి విధానాన్ని క్లార్క్ వంటివారు కంటగించుకున్నా, ఉత్పత్తులు నూటికి నూరుపాళ్లు పెరుగుతాయనే విషయాన్ని మటుకు కాదనలేరు.

సోవియట్ యూనియన్ పరిస్థితులను గురించి అందుతున్న భోగట్టా పైన మేము వివరించిన విషయం యథార్థమని రూఢి చేస్తున్నది. కార్మికుల దైనందిన వినిమయంకోసం కార్మిక సంఘాలకు సరఫరా చేసే సరుకులమీద నూటికి 60 వంతుల చొప్పున ఉత్పత్తి పన్నును విధించుతున్నారు. విచిత్రమైన ఈ ఉత్పత్తి పన్ను ద్వారా, సాలుసరి కార్మిక వేతనాల ఖర్చు పట్టీలో అధికభాగం తిరిగి రాబడుతున్నారు. ఇంతే గాదు; ఈ రకం పరోక్షమైన ఆదాయపు పన్ను మూలంగా ప్రత్యక్షాదాయపు పన్నును 19వ శతాబ్దపు స్థాయిలో అలాగే వుంచేసి పెద్ద జీతాలుతీసే పారిశ్రామిక నిర్వాహకవర్గానికి ప్రోత్సాహమిస్తున్నారు

ఇంకా యీ విధానంలో వుండే లోటుపాటులన్నీ మాకు సమగ్రంగా తెలుసునని చెప్పటానికి సందేహంగానే వుంది. కారణం ఏమిటంటే. మేము రష్యా విషయాలన్నింటా ఎరిగిన విజ్ఞానవేత్తలంగాని, ఆరితేరిన ఆర్థికశాస్త్రవేత్తలంగాని కాము సామాన్య రాజకీయ సమీక్షకులం; పరిస్థితిని ఉల్లేఖించే పత్రికాగులలో కూడా చెయ్యితిరిగిన వాళ్ళం కాము కాని మాకు లభించిన వివరాలనుబట్టి, తన సైనికశక్తిని పెంపొందజేసుకోవటానికి సోవియట్ ప్రభుత్వం అనుసరించుతున్న ఈ పెట్టుబడిసేకరణ విధానం గొగ్గిపన్నులా పైకే విస్పష్టంగానూ అసహ్యంగానూ కూడా కనుపించుతోంది. అత్యంత కనిష్ఠప్రమాణంలో వున్న సోవియట్ పౌరుని జీవనప్రమాణానికీ, సోవియట్ యుద్ధపరిశ్రమయొక్క తీవ్రాభివృద్ధికీ ఎట్టి సంబంధమూ కనుపించటం లేదు. ఈ సర్వతోభివృద్ధికి కేంద్రీకృత ప్రణాళికా నిర్వహణ కొంత కారణమనే విషయం నిజమే రష్యాకుగల ఖనిజసంపదా, ముడి సరుకుల బాహుళ్యం కూడా లెక్కలోకి తీసుకోదగ్గవే. కాని వీటినన్నిటినీమించి మాకు విస్పష్టంగా కనుపించుతున్నది రష్యన్ ప్రజల కనిష్ఠ జీవనప్రమాణం. ఇది ఒక కారణంమాత్రమే కాదు మనకు లభించుకున్న వివరాలనుబట్టి ప్రధానకారణంగా కనుపించుకున్నది. అయితే ఆ వివరాలేవిటి?

స్టాలిన్ నూతన పారిశ్రామిక విధానానికి ఉపక్రమించి, 1928 లో మొదటి పంచవర్ష ప్రణాళికను ప్రవేశపెట్టడంతో అసలు ఈ 'ఆర్థిక విజయచరిత్ర' అంటూ ఒకటి ప్రారంభమైంది అదృష్టవశాత్తూ, అప్పటికి, విప్లవంతో ప్రారంభంఅయిన పదును సంవత్సరాలు అంతమయినాయి ఈ నూతన ఆర్థిక విధానం ప్రజల జీవనస్థితిని, చెప్పుకోదగినంత కాకపోయినా భరించటానికి తగిన అవధికి తేగలిగింది. కాని యీ నూతనవిధానంవల్ల పారిశ్రామికరంగంలో పెద్దఅభివృద్ధి కనుపించలేదు. 1928 లో కూడా పారిశ్రామికోత్పత్తులు 1913 జార్ ప్రభుత్వ దినాల అవధికి నకలుగానే వున్నాయి అందుచేత ప్రథమ పంచవర్ష ప్రణాళిక అమలు జరుపవలసి వచ్చింది. దాంతో ప్రజల జీవన ప్రమాణం అర్థాంతం దిగజారిపోయింది.

ఈ దారిద్ర్యాన్ని కిక్కురుమనకుండా సహించేట్టు చేయటానికి సోవియట్ ప్రభుత్వం ప్రజలమీద ఇంచుమించు ప్రత్యక్షయుద్ధాన్నే ప్రకటించవలసి వచ్చింది. ప్రాచీనకాలంలో స్పార్టన్ అధికారులు వ్యవసాయ బానిసలమీద ఎలా వార్షికంగా దాడులు జరిపేవారో అదేపద్ధతి అమలుజరిపారు రైతుల హత్యలతో ప్రారంభమైన సమష్టి వ్యవసాయోద్యమం, ఈవిధంగా, జాతీయ వ్యవసాయోత్పత్తుల్లో అధికభాగం పంజి ప్రభుత్వ పెట్టుబడులను సేకరించటానికి ఉద్దేశించి కావాలని బలవంతాన అమలు జరిపించే. ఈ విధానంద్వారాను. ఇతరత్రానూ కూడా ఎక్కువభాగం సంక్రమింప జేసుకున్న కారణంగా ప్రజలకు మిగిలేది బహు స్వల్పమైపోయింది.

ప్రభుత్వం ప్రజలమీద నెరపిన ఈ యుద్ధకాండలో ఎందరో నశించిపోయారు ఆర్థికంగా జరిగిన దుబారా కూడా ఇంతింతకాదు దుబారా జరిగితే ఆ అనర్థాన్ని ప్రజలు భరించారు కాని ప్రభుత్వం ఆ యుద్ధంలో విజయం సాధించింది పంచవర్ష ప్రణాళికల పరంపరలో ఉద్దేశించిన పారిశ్రామిక యుద్ధశకులు రెండూ, ద్వితీయ ప్రపంచ యుద్ధ ప్రారంభంవరకూ (1938-39) నిరాటంకంగా సాగిపోయినై. మొరటుగా వున్నా రాక్షసావధిని పెంపొందించిన ఈ పరిశ్రమలు నాడు తేలికగా యుద్ధావసరాలను తీర్చగలిగాయి. తుపాకులూ, ఫిరంగులూ. టాంకులు ఇతర ఆయుధసామగ్రీ కోట్లకొల్లలుగా తయారుచేసి పోశారు యుద్ధకాలం మొత్తమంతటిలో అమెరికా బ్రిటన్ దేశాలు రెండూ కలిసి యెంత మందుగుండు సామగ్రిని తయారు చేయగలిగాయో అంత మొత్తం మందుగుండుసామగ్రిని ఎర్రసైన్యం ఒక్క బెర్లిన్ మీదనే ప్రయోగించింది. హిట్లరు పతనంతో అక్కడి కాంక్ష ఆగలేదు. అనంతరదశలో కూడా రష్యా నాయకులు, ఇదే విధానాన్ని అనుసరించి, ఇంకా తీవ్రతరమైన పద్ధతిలో ఈ పారిశ్రామికాభివృద్ధిని నేటివరకూ సాగించుతూ వచ్చారు; సాగించుకుపోతున్నారు.

ఈ సైనిక పారిశ్రామికశక్తులను అభివృద్ధి చేయటానికి తన ప్రజలమీద అలా దాడిచేయవలసి వస్తుందని స్టాలిన్ మొదట ఊహించగలిగాడో లేదో మనకు తెలియదు. కేవలం "బోల్షివిక్ ప్రణాళికా రచనతోనూ, బోల్షివిక్ సాహసోత్సాహాలతోనూ, ఈ కార్యాన్ని సాధించవచ్చునని ఆయన అనుకుని ఉండవచ్చు. రాజకీయరంగంలో ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క కొత్త విధానం పుట్టుకురావటముంటే, ఒక్కొక్క బుర్రలో కార్యకారణజ్ఞానానికి అతీతమై సహజజ్ఞానంగా అలా ఒక్కొక్క భావం హఠాత్తుగా పుట్టుకువస్తూవుంటుంది. ఇలాంటి సహజజ్ఞానంతో కొత్త విధానాన్ని అమలులోకి తెచ్చినవారిని అందుకు అభినందించి తీరవలసి ఉంటుంది మనమిప్పుడు పరిశీలన చేస్తున్నది సోవియట్ నైతికసూత్రాలపరమం కావనీ, సోవియట్ యుద్ధశక్తినిగురించి అని అంగీకరించినట్లయితే— "ప్రజల దారిద్ర్యాన్ని ప్రభుత్వశక్తిగా పరిణమింపచేయవచ్చు" అనే అత్యనూతన రాజకీయసూత్రాన్ని ప్రపంచించిన మహాప్రవక్తగా స్టాలిన్ను మనం అభినందించితీరవలసివుంది

స్టాలిన్ ఈ మహాసూత్రాన్ని బహిరంగంగా వెల్లడించకపోయినా, యుద్ధానంతరవిధానాన్ని వ్యక్తంచేస్తూ 1946 లో ఆయనచేసిన చారిత్రాత్మక ప్రసంగం ఈ విషయాన్ని సుస్పష్టంగా వెల్లడించుతూనే ఉంది. ఒకచెంప రష్యన్ ప్రజలు అప్పటికి ఇంచుమించు అర్థాకలితో అలమటించే పరిస్థితిలో వున్నా. స్టాలిన్ ఆ విషయాన్ని ఖాతరు చెయ్యలేదు ప్రజల స్థితిగతులను బాగుచెయ్యటానికి ఉపకరించే కార్యక్రమానికి కాకుండా, రష్యాకున్న అవకాశాల నన్నిటినీ, తిరిగి యుద్ధపరిశ్రమల శక్తిని ముమ్మరంగా అభివృద్ధిచెయ్యటానికి ఉపయోగించాలని ఆదేశించాడు. ఒక్క పంచవర్ష ప్రణాళికకు కాదు— వరుసని మూడు పంచవర్ష ప్రణాళికలకు ఉత్పత్తి లక్ష్యాలు నిర్ణయించబడినై ఆ లక్ష్యాలను అందుకోగల స్థాయిచిక్కేవరకూ ప్రజల జీవనప్రమాణాన్ని యుద్ధం పరిసమాప్తమైన నాటిదశలోనే ఉంచివేశారు.

రష్యా పరిపాలకులు లక్ష్యశూన్యంగా ప్రవర్తించే ఉన్మాదులుగారు. స్టాలిన్ చివరిదశలో దౌర్జన్యంకొరకే దౌర్జన్యం అనే ఉన్మాదస్థితిగా వ్యవహరించి వుండవచ్చు కాని అదీనుకూడా రష్యన్ ప్రజలను అంతకాలం దారిద్ర్యంలో అట్టేపెట్టింది కేవలం లక్ష్యశూన్యమైన కసిచేతగాని ఉన్మాదంచేతగాని కాదు. రష్యా మొత్తం ఉత్పత్తులు త్వరితగతిని అభివృద్ధి చెందినకొద్దీ ప్రజల జీవనప్రమాణాన్ని కూడా క్రమేపీ వృద్ధిచేశారు. జీవనప్రమాణాన్ని పెంచటమంటే మొత్తం ఉత్పత్తులు ఏ శాతంలో పెరిగాయో ఆ శాతంలో పెంచటంగాదు. ఉత్పత్తులు ఎంత పెరిగినా దాంతో నిమిత్తంలేకుండా, అందులో ఏదో స్వల్పభాగంతీసి ప్రజలకు పంచారు. మామూలుకన్నా ఏదో మరికొంత లభించిందన్న సంతృప్తి కార్మికులకు కూడా ఏర్పడ్డది. ఈ సంతృప్తిని రష్యా పరిపాలకులు చక్కగా వాడుకున్నారు. జనంచేత బండచాకిరీ చేయించటమెలాగో వాళ్లకు బాగా తెలుసు: 'అదనపుపని అదనపు బహుమానం— పని యెగవేస్తే మక్కెలిరగేయటం'—దవుడుతీస్తే దాణా

# రష్యా బలం ఏమిటి?

దొరుకుతుందన్న ఆశవున్న కట్టిం మొరాయించి మోటుకంచీ పరాచికాలకెందుకు పాల్పడుతుంది.

ఇంతకూ పర్యవసానమేమిటంటే, సోవియట్ యూనియన్‌లో ప్రజాస్థితి 1930 ల దశలోవలెనూ, యుద్ధానంతర ప్రథమ సంవత్సరాలలోవలెనూ అంత హీనంగా లేదు. మొరటుదైనా పుష్కలంగా దొరుకుతోంది. చలికాలంలో శరీరరక్షణ చేసుకోవటానికి కావలసినంత మాత్రం గుడ్డలు దొరుకుతున్నాయి. తలదాచుకోవటానికి తగిన వసతులు యేర్పడినాయి — నాటి విస్తీర్ణం, బాగా అభివృద్ధి చెందని అమెరికన్ ఖైదుగదుల మేరకు లేకపోయినా. అగ్రవర్గాలు — పరిపాలనాధికారులూ, సైనికాధికారులూ, పారిశ్రామిక నిర్వాహకులు, శాస్త్రవిజ్ఞానవేత్తలూ, సాంకేతిక నిపుణులూ, విజ్ఞానవేత్తలూ, కార్మిక ప్రోత్సాహకవర్గాలూ, ఈ మొత్తం కోటియుండీ, తమ స్థితిగతులు తమకు బాగానే వున్నాయనే ఆత్మవిశ్వాసంతోనే వున్నారు. ఈ వర్గాలను తృప్తిపరచివుంచటం ఆర్థికరంగంలో ఎంతో ప్రయోజనకరం. అందుచేత ఈ వర్గాలకు రిఫ్రిజిరేటర్లు వగైరా విలాసభోగాలు విరివిగా అందజేయబడుతూనే వున్నాయి. ఇంకా మరీ తలకట్లుగా వుండేవారికి కార్లు కరాముతూకూడా అందుతున్నాయి

ప్రజాజీవన ప్రమాణంలో స్థూలంగా ఇలాంటి అభివృద్ధి కనుపించుతున్నా, యిది నామమాత్రమైనదే. ప్రభుత్వ పెట్టుబడులకు కావలసిన పెట్టుబడినంతా సేకరించగా మిగిలిన లేశమాత్రం ఇలా ఖర్చు చేస్తున్నారు. అనగా ఇప్పుడుకూడా స్టాలిన్ రూపొందించిన మహాసిద్ధాంతం యెట్టి మార్పూ లేకుండా యథాతథంగా సాగిపోతోంది. నేడు రష్యాను పాలించుతున్నవారుకూడా ఇదే పంథాలో దేశాన్ని నడుపుతున్నారు. తనహయాములో మాలెంకోవు, సైనికపరిశ్రమలకంటే వినిమయవస్తువుల పరిశ్రమలకు యెక్కువ ప్రాధాన్యత వుండాలని వాదించాడు. దాంతోనే అతను తలక్రిందులై కృశ్చేవ్ పై చెయ్యి అయ్యే సావకాశం కలిగింది. ఈ దృష్ట్యా చూస్తే యిటీవల జరిగిన కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెస్ వ్యవహారం ఒక మహాప్రహసనంలా కనుపించుతుంది. సోవియట్ పారిశ్రామికోత్పత్తులు బాగా పెరిగివుండటం చేత, పని గంటలను, వారానికి 48 గంటలనుంచి 42 గంటలకు తగ్గించటానికి వీలు కలిగింది. కార్మికోత్సాహాన్ని చూరగొనటానికి వీలుగా వున్న ఈ ప్రకటనను చేసే అవకాశం కృశ్చేవ్ స్వయంగా అందజేసుకున్నాడు. పాపం! పరాజితుడైన మాలెంకోవ్ తన పూర్వపు తప్పిదాన్ని సవరించుకుని, 'ప్రజాసౌఖ్యంకంటే ప్రభుత్వ బలానికి ప్రాధాన్యత వుండాలి' అనే నినాదాన్ని స్వయంగా ప్రచారం చేస్తూ వుండవలసిన పరిస్థితికి వచ్చేశాడు.

సోవియట్ జాతీయ ప్రణాళిక ఉత్పత్తులను మూడు భాగాలుగా విభజించుకున్నది మొదటి భాగం పెట్టుబడి అభివృద్ధులకు వినియోగించుతారు. అంటే స్థూలంగా యంత్రపరిశ్రమల అభివృద్ధి; రెండవ భాగం యుద్ధశక్తిని పెంపొందజేయటానికి వినియోగించుతారు. అంటే దీంట్లో అమెరికా రక్షణ వ్యయంలో వుండే అన్ని అంశాలూ — అణుశక్తి దగ్గర నుంచి ఆర్థికసహాయందాకా అన్నీ చేరివుంటాయి. మిగతా భుక్తశేషం జనానికి వదులుతున్నారు ఈ మూడు భాగాలూ యేయే నిష్పత్తిలో వుంటాయనేది వైజ్ఞానిక నిపుణుల వాదప్రతివాదాలకు తేలకుండా వున్న విషయం తనకున్న అవకాశాలలో పారిశ్రామిక యుద్ధశక్తుల అభివృద్ధికి ఎంత భాగం వినియోగించుతున్నారో ఈ నిపుణులలో చాలామంది సరిగా అంచనా వేయలేకపోతున్నారని మా అభిప్రాయం. అందుచేతనే యీ రంగంలో రష్యా సాధించిన అభివృద్ధిని చూసి వీరు విభ్రాంతులౌతూ వుండటం తటస్థించుతూ వున్నది. అందుచేత బాగా తెలిసినవారి బోగట్టానే మనం సేకరించవలసివుంది. అలాంటివారిలో ఒకరు ఇలా చెబుతున్నారు: సోవియట్ ప్రభుత్వం తన మొత్తం ఆదాయంలో నూటికి 25 వంతులు పారిశ్రామిక పెట్టుబడులకు వినియోగించుతోంది మరొక 25 వంతులు యుద్ధోత్పత్తులకు ఉపయోగించుతోంది మిగతా 50 వంతులు మాత్రం ప్రజావినిమయానికి ఉపయోగించుతున్నారు. రష్యా సాంకేతికనిపుణులు ఈ విషయాన్ని విస్పష్టంగా చెబుతూనే వున్నారు. జాతీయాదాయంలో, సోవియట్ ప్రభుత్వం రణపారిశ్రామిక రంగాల పెట్టుబడులకు వినియోగించే భాగం పాశ్చాత్య దేశాలు తమ జాతీయాదాయాలలో ఈ రంగాలకు వినియోగించే భాగంకంటే ఎక్కువ నిష్పత్తిలో వున్నదని చెబుతూనే వున్నారు. ఇంతింత మొత్తాలను ఈ రంగాలకు వినియోగించాలంటే ప్రజల జీవనప్రమాణాన్ని కృత్రిమంగా కనిష్ఠప్రమాణంలో వుంచితే తప్ప సాధ్యం కాదు. ఇట్లా సేకరించిన అంతులేని మొత్తాలను గుప్పివేస్తున్నారు. గనుకనే సోవియట్ యుద్ధపరిశ్రమ ఇంత త్వరితగతిని ఇట్టి మహాశక్తిగా అభివృద్ధి కాగలిగింది.

[సశేషము.]

# ఆత్మలోని అరుణరేఖ

శ్రీమతి ఉన్నవ విజయలక్ష్మి

డిసెంబరు ఆఖరు. కాలేజి సెలవ లిచ్చారు సాయంత్రం 'లాన్'లో కూర్చుని పేపర్లు దిద్దుకుంటున్నాను. ఇంతలో రెండో 'పోస్ట్' వచ్చింది. ఒకే ఒక కవరు వచ్చింది. బరువుగా వుంది పేపర్లు ప్రక్కకు నెట్టి కవరు చించాను. విశ్వనాథరావు వ్రాశాడు. నాకు ఉత్తరాలు చదవడంలో వున్న ఓపిక వ్రాయడంలో వుండదు. విశ్వనాథరావు అదోక తరహా మనిషి. ప్రత్యుత్తరాలకు నిరీక్షించకుండానే పదేసి పేజీల వుత్తరాలు వ్రాయగలడు. సావకాశంగా చదివాను. అతనీ మధ్య రఘునాథరావు దగ్గరకు వెళ్లాడట. ఆ విశేషాలన్నీ వ్రాశాడు. మేము ముగ్గురం బి.యే లో సహాధ్యాయులం. రఘునాథరావు, నేను యం. ఏ కూడ కలిసే చదివాము ఇంగ్లీషులో. యం. ఏ పూర్తి అయ్యాక రఘునాథరావు 'లా' కూడా చదివాడు. నా జీవితం సగం గడచిపోయింది. రఘునాథరావు జీవితంలో ప్రవేశించి రెండేళ్లే అయింది. అతడు చదువు ముగించాక 'సిలోన్' వెళ్లాడు. జాఫ్నాలో ఏదో ఉద్యోగం వచ్చిందంటూ! అందరికీ ఆశ్చర్యమేసింది. కలవారిబిడ్డ ఉద్యోగానికని కానిదేశం పోయాడేమా అని! ఎంచేతో నాలుగేళ్లయాక తిరిగి వచ్చేశాడు. ఆ తర్వాత నాలుగు నెలలకే అతని పెళ్లయింది ఇప్పుడు కాకినాడలో న్యాయవాదిగా పనిచేస్తున్నాడు. ఇదివరకోకసారి వ్రాశాడు నన్ను రమ్మని! నాకూ తీరికా, ఓపికా లేకపోయాయి! యీ మధ్య భార్యతోపాటు దేశమంతా తిరిగి వచ్చాడుట. విశ్వనాథరావు వ్రాశాడు. "వాళ్లిదరా! సంసారమంటే! ఎంత అన్యోన్యమనుకున్నావు" అని. నవ్వు వచ్చింది. వెళ్లి చూడాలనిపించింది. మరునాడే ప్రయాణమై వెళ్ళాను.

రైలుస్టేషన్నుంచి జట్కాలో వెళ్తున్నాను. దారిలో మెడికల్ షాప్ కనపడింది. గొంతులో ఏదో గరగరగా వుంటే 'లాజెంజెస్' కొనుక్కుందామని దిగి వెళ్ళాను. అక్కడ ఎవరో ఒకమ్మాయి మందులు కొంటోంది సన్నగా, తెల్లగా వుంది చాలా నాజూగ్గా, అందంగా కనపడింది కట్టు, బొట్టు తీరు చాలా అధునాతనంగా కనుపించింది. బిలు చూసి డబ్బిచ్చేసి వెళ్ళి బైటవున్న కారులోకి ఎక్కింది వెళ్తూ వెళ్తూ నన్ను జూసింది 'చాల చురుకు చూపు' అనుకున్నాను. తరువాత రఘునాథరావు ఇంటికెళ్లేసరికి బైట, మెడికల్ షాప్ దగ్గర కనపడిన కారు కనపడింది. అనుమానిస్తూ లోపలికి వెళ్లాను 'రఘునాథం' అన్న నా పిలుపుతో వాకిట్లోకి వచ్చాడు రఘునాథరావు. నన్ను చూడగానే బలంగా నా భుజాలు, చేతులు నొక్కివేస్తూ 'అరెనీ! ఇదేమిటిరా! ఎట్లా వచ్చావు? గాలితోనైనా కబురంపలేదే! ఇల్లెలా తెలుసుకున్నావ్' అంటూ ఆప్యాయంగా పల్కరించాడు. "ఏమిటి యిలా వున్నావేం! ఒంట్లో బాగా లేదా" అన్నాను. 'ఊ! మొదలెట్టావా! ఇంత నల్లబడ్డావేం! గుర్తే పట్టలేక పోయాను. అయ్యో! ఎలా వుండేవాడివి! అనరా—అను. సందేహ మెందుకు?—పరామర్శిస్తున్నాడీ మూర్ఖ పరమమిత్రుడు!" అని పకపక నవ్వుతూ చెయ్యి పట్టుకుని లోపలికి తీసికెళ్లాడు! లోపలనుంచి హిందుస్థానీ రాగ మొకటి సన్నగా వినవచ్చింది. "మా అరుణ బాత్ రూమ్ సింగర్ లే—అన్నట్టు నీవసలు చూడనే లేదుకదూ" అన్నాడు రఘునాథరావు ఇంతలోనే అతని భార్య వచ్చిందక్కడకు. మెడికల్ షాప్లో కనపడిన అమ్మాయే! అప్పుడే స్నానం చేసిందేమో, చాల శుచిగా కనపడింది. లేత మబ్బురంగు స్విట్జర్లెండు వాయిల్ చీర కట్టుకుంది. తెల్లని సిల్కు 'బ్లౌజు' వేసుకుంది. వెన్నెల రాత్రిలాగ కళ్ళకు చల్లగా వుంది ఆమె వస్త్రధారణ! ఆమె నావంక తెల్లపోయి జూచింది మా యిద్దరి తొట్రుపాటూ గమనించిన రఘునాథం 'అరుణా, యీయన నీకిదివరకు తెలుసేమిటి? "అన్నాడు. 'ఊహూ' అన్నట్టు. తలపంకించింది. 'ఇందాక మెడికల్ షాప్లో కనపడ్డారు' అన్నాను. 'అదా! అరుణా—

# ఆత్మలోని అరుణరేఖ

వీడే ప్రభాకర్ అంటే నేను చెప్పానుగా నీకు ఇప్పటికి తీరింది వీడికి మనింటికి రావడానికి' అని నన్ను పరిచయం చేశాడు భార్యకు. ఆమె చిన్నగా నవ్వి నమస్కారం చేసింది నాకు. నేను తిరిగి నమస్కారం చేశాను. 'మీరు రాలేదని చాలసార్లనుకున్నారు వారు' అన్నది నాతో! తీగ మీటినట్లుంది కంఠం "అనుభవాలతో మాసిపోని సరిక్రొత్త జీవితం మీది. అందుకని మీ వద్దకు త్వరగా రావటానికి మనసొప్పలేదు" అన్నాను నవ్వుతూ! నా నెరిసినజుట్టు మరింత తెల్లనయినట్లు విచిత్రమైన అనుభూతి పొందాను. "అబ్బాయీ! అది మమ్మల్నేమీ అభినందించటం కాదు అవకాశాలు లభించనంతవరకూ అనుభవమెలా కల్గుతుంది" అన్నాడు రఘునాథరావు.

ఆ డ్రాయింగ్ రూమ్, ఆఫర్నిచర్, వాటిమీద పరచిన ఎంబ్రాయిడరీ సరుకు- అంతా అరుణ కళాకౌశలాన్ని తెల్పుతున్నాయి 'ఫ్లవర్ వేస్'లో రకరకాల పూలు, రంగు రంగుల పట్టుచీరలు కట్టుకుని పేరంటానికి వెళ్ళి, దగ్గరగా చేరి కబుర్లాడుతూ నవ్వుకునే ఆడవాళ్ళలా వున్నాయి మధ్యాహ్నం భోజనాలయాక, అరుణ 'ఫోటోల ఆల్బమ్' తెచ్చిచూపింది. నా ప్రక్కనే కుర్చీలాక్కుని కూర్చుంది. అరుణ వస్తుతః ముద్దరాలై యుండికూడ, కాలేజి చదువు ఇత్యాది సంస్కార విశేషాలవల్ల మగవాళ్ళంటే బెరుకుపోయిందో లేక, విచిత్రమైన కృత్రిమ నాగరికత వాసన సోకని అడవి మల్లెలాంటి అచ్చమైన ప్రకృతి కలదో తెలియలేదు. మనకు పకపకనవ్వే ఆడవాళ్ళకంటే- మందహాసాలుచేసే మగువలంటేనే ఇష్టం! పూర్తిగా వికసించిన గులాబిపువ్వుకన్న అరవిచ్చిన గులాబులే అందమైన వంటాము అందుకే, మన ఆడపిల్లలు కోయపడుచుల్లాగ నోరువిప్పి నవ్వరు. మనం పెంచే గులాబులు అరవిచ్చి అలానే కాసేపుండి మన్ని మురిపిస్తాయి'. అడవిపూలకు 'మొగ్గతనం' పోయి 'పూవుతనం' రాగానే పూర్తిగా విచ్చుకుని పక పకా నవ్వుతాయి బహుశః అరుణ ప్రకృతి ఇటువంటిదేమోనని తోచింది. వాళ్ళిద్దరూ ఆ మధ్య దేశమంతా తిరిగి వచ్చినప్పటి విశేషాల ఫోటోలు చూపుతోంది. తాజ్ మహలు చూపించినప్పుడు అరుణ భర్తకేసి చూచి 'చెప్పనా' అని నవ్వింది. తలెత్తి రఘునాథాన్ని చూచాను, 'చెప్పు' అని నవ్వినట్లే నవ్వాడు అందమైన అతని కళ్లు, పెదవులు నిజంగా నవ్వాయనే ఆమె అనుకుంది. ఆ కళ్ళ అడుగు లోతుల్లో, ఆ పెదవుల వంపులలో నిగూఢంగా సుడి తిరిగిపోయిన విచారరేఖలను గుర్తించటానికి అరుణ సంస్కారం చిన్నదైపోయింది నాకాశ్చర్యం వేసింది. ఆ నవ్వు, నవ్వే కాదనిపించింది నేను నవ్వేసి 'ఏమిటో చెప్పండి అనుజ్ఞ తీసుకున్నారుగా' అన్నాను. 'అనుజ్ఞ' అనేమాట రుచించనట్టుగా అరుణ ఒకసారి కనుబొమలు దగ్గరగాదీసి ముడివేసి మళ్ళా వూడదీసింది "వీరే...తాజ్ మహల్ చూచి బైటనే నిలబడిపోయారు లోపలికి రానన్నారు బలవంతంగా లాక్కెళ్ళాను. ఎక్కువసేపుండలేక పోయారక్కడ పైగా ఏడ్చేశారు. నిజంగా! కావాలంటే అడగండి అబద్ధమేమో! ఎందుకూ అంటే' 'వూరికే ఏడుపు వచ్చింది' అన్నారు ఆరాత్రి మళ్లీ వెన్నెల్లో తాజ్ ను చూడటానికి రమ్మన్నాను రానన్నారు నేనొక్కతెనే ఇంకెవరినో తోడుతీసుకొని వెళ్లాను. మళ్లీ వచ్చి చూద్దును కదా. 'రూమ్'లో ఏడుస్తున్నారు. మగవాళ్లట పైగా మీరు అడగండి పోనీ!" అంటూ పకపక నవ్వింది పసిపిల్లలాగ! నేనూ నవ్వేశాను. రఘునాథం నవ్వాడు.

ఆ తర్వాత రఘునాథం 'సొంత' ఆల్బమ్ అంటూ తీసుకొచ్చింది అంటే పెండ్లికిముందు రఘునాథరావు సేకరించిన ఆల్బమ్ అని ఆమెభావం పెళ్లయ్యాక 'స్వంతం' అనేది అందరికి నశిస్తుందా? వీడికేనా? అనుకున్నాను మొదటి పేజీలు చాలా దాటేశాను. అవన్నీ నాకు తెలిసినవే! ఆ పేజీలనిండా మేమే! తరువాత జాఫ్నాలో అతని జీవితం ఎలావుండేదో చూదామని పేజీలు నెమ్మదిగా తిప్పుతున్నాను. ఏవో ఫోటోలు. ఆడవాళ్లవి, మగవాళ్లవి చాలా కనుపించాయి కాని అందరూ చాలా పెద్దమనిషి 'పోజ్' ఇచ్చినవారే! వెనుక పేజీల్లోవున్న మాలాగా, జంతువులలాగా స్వేచ్ఛగా వున్న ముఖం ఒకటీ కనపడలేదు ఒక పేజీలో ఏదోఒక 'ఫామిలీఫోటో' చూపింది అరుణ. అందులో ఒకమ్మాయిని చూపి యీమె వీరి 'కొలీగ్' అట. 'పొయిట్రీ' లెక్చరర్ అని కదండీ చెప్పారు అని భర్తకేసి చూసింది. 'ఊఁ' అన్నాడు రఘునాథం. 'వీరు వాళ్ళ అమ్మ నాన్న, చెల్లెలూ, తమ్ముడూనట' అని పరిచయం చేసింది. 'ఇంగ్లీషు

డిపార్ట్ మెంటే' నన్నమాట? ఎవరేమిటి వీళ్ళు?' అన్నా. 'మళయాళీలు. అసలువూరు కాలికట్' అన్నాడు రఘునాథం-అతనిముఖం చాలా తమాషాగా మారింది.

'మీరు చెప్పండి యీమె బాగుందా, యీమె చెల్లెలు బాగుందా' అని అరుణ నన్నడిగింది ఫోటో కేసి చూపిస్తూ! ఒకమ్మాయి, అమ్మాయిల అందం గురించి అంతగా పరిచయంలేని నాతో ప్రస్తావించటం-క్రొత్త అనుభవం! సందేహంలేదు. అరుణ అడవి మల్లెలాంటదే! నే నేమీ చెప్పకముందే "నేను చెల్లెలే బాగుంటుం దంటాను. వీరు ఒప్పుకోరు" అన్నది "అంటే అక్క బాగుంటుందనేగా అర్థం! ఏరా?" అని రఘునాథాన్ని పరాచిక మాడాను. వాడు నవ్వాడు. ఇందాకటిన వ్వే! అది నవ్వుకాదు. నాకు తెలుసు

మరునాడు ప్రొద్దెక్కి లేచాను ఇంట్లో ఎవరూ కనపడలేదు. 'గెస్ట్ రూమ్'లో నే వున్న 'బేసిన్'లో ముఖం కడుక్కుని బైట తోటలోకి వచ్చాను. దూరంగా రఘునాథం పచార్లుచేస్తూ, సిగరెట్ కాలుస్తూ, పత్రిక చూస్తున్నాడు. 'స్లిప్పర్లు' తొడుక్కుని తోటలోకి వెళ్తున్నాను ఒకప్రక్కన సన్నజాజి పందిరిదగ్గర అరుణ నిలబడి పూలు కోస్తోంది! తలంటి పోసికున్నట్లుంది. జుట్టు వీపుమీద పరచుకుని వుంది. పొడుగ్గాలేవు వెంట్రుకలు! చివర్లు మెలికలు తిరిగి నీరు కారుతున్నాయి! సన్న జరీఅంచు పట్టుచీర కట్టుకుంది. చేతిలో పూలసజ్జ కనపడింది. నా నడక అలికిడికి వెనుతిరిగి నన్ను చూచి నవ్వింది. ఎఱ్ఱటి బొట్టు, నల్లటి కాటుక కొట్టొచ్చినట్టు కనబడ్డాయి! అలలుతీరిన ఆమెజుట్టు ముఖాన్ని సగం కప్పి, సగం కప్పనట్లున్నది. అప్పటి అరుణముఖం కంటే, రఘునాథానికి వార్తాపత్రిక ఎలానచ్చిందో ననుకున్నాను. రఘునాథం నన్ను జూచి 'పద, కాఫీ తీసుకుందాం' అన్నాడు. ఇద్దరం వస్తున్నాం. అరుణ మమ్మల్ని చూచింది. 'మీరుకూడారండి', అన్నాను. 'నా కాలస్యముంది-మీరు వెళ్లి తీసుకోండి' అన్నది.

"ఇవాళ శుక్రవారంగా! ప్రొద్దున్నే తలస్నానం ఆపైన పూజ! ఆ వ్యవహారం తొమ్మి, తొమ్మిది న్నరయితేగాని తెమలదులే" అన్నాడు రఘు ఆ మాటల్లో ఏమీ విసుగు ధ్వనించలేదు. నా స్నేహితుడుగా వాడించే 'పాత' రఘు గుర్తువచ్చి ఆశ్చర్యమయింది. అరుణ ఇంట్లోకి వచ్చింది. పూలసజ్జ నిండివుంది. పూజగదికాబోలు చిన్నరూమ్ కేసి వెళ్ళింది పసుపు రాసుకుందేమో, కాళ్లు పచ్చగా కనుపించాయి. 'స్లిప్పర్లు' లేకుండా తోటలో తిరిగిందేమో—గులకరాళ్లు గుచ్చుకొని కందిపోయి కొంత, ఎఱ్ఱమట్టి తాలూకు ఎఱ్ఱదనం కొంత కారణాలుగా ఆమె పాదాలఅంచులు ఎరుపెక్కినాయి.

ఆరోజు ఊరిలో అక్కడక్కడ తిరిగివచ్చాం మువురమూ! ఆ మధ్యాహ్నం రఘునాథం భార్యను చూచి 'యీరోజు, నీవెళ్లి మీపార్వతిని చూచి రారాదూ! ప్రభాకర్ వున్నాడుగా నాకుతోడు" అన్నాడు "నిజమే నేవెళ్ళివస్తా! పాపం దానికి జ్వరం తగ్గిందో లేదో, అప్పుడు టైఫాయిడ్ అనుకుంటున్నారు వాళ్లు" అన్నది. చీరేఅదీమార్చుకుని వాళ్లెవరింటికోపోతూ నాతో చెప్పింది. "వీరిని చల్లగాలికి తిరుగనీకండి" అని ఆమె మాప్రేశద్ధకు నా ఒళ్ళు గగుర్పొడిచింది అప్పుడు గుర్తొచ్చింది. నిన్న ఉదయం మెడికల్ షాపులో అరుణను చూచినమాట! "ఈమధ్య ఏమైనా మంచమెక్కా వేమిటి?" అన్నాను. "ఆ! ఏంలేదు నాలుగురోజుల జ్వరం. ఊరికే ఆర్భాటం చేస్తుంది" అన్నాడు రఘు

అరుణ వెళ్లగానే, ఇద్దరమూ తోటలోకి వెళ్లాం! చాలారకాల పూలు. ఢాలియాలు, పాపీస్, డైయాథస్ లు, యాస్టర్లూ, వయొలాలు, కనకాంబరాలు! నేల కానుకున్నట్లున్న చిన్న మొక్కలకూ పూలే! మనిషి ఎత్తున వున్న పెద్ద మొక్కలకు పూలే! వేరే పనేమీ లేనట్టు పంతాలేసుకుని, విరబూసి మంతనాలాడుతున్నాయి ఇక గులాబులు, మల్లెలు, జాజులు- వీనికి లెక్కలేదు "ఆమెకు మొక్కలంటే చాల శ్రద్ధనుకుంటానే" అన్నాను "శ్రద్ధేమిటి? పిచ్చి! నాకీతోటలో తిరగటమంటే తలనొప్పి. తిరిగినా వీటి కేసి చూడను ఇన్నిరకాల పూలు, ఇన్నిరకాల అందాలు, దేన్నీ మెచ్చుకోలేం!" అన్నాడు. నేను ఆశ్చర్యంగా చూశాను. ప్రక్కనే నాభుజానికి తాకిన ఢాలియా కొమ్మ పట్టుకుని, ఎఱ్ఱగా విచ్చిన ఆ పువ్వు జూపి "దీన్ని చూడు ఎలా వుంది?" అన్నాను. పట్టలేనంత అందంగావుంది. అది వాడిపోకముందే, గుండె చీల్చుకుని లోపల దాచుకోవాలని వుంది" అన్నాడు.

భార్య లేనప్పుడు ఇంత ఉద్రేకంగా మాట్లాడుతున్నాడే అనుకున్నాను అయినా, అందమూ, అనురాగమూ తనలో నింపుకున్న 'అరుణ' అందుబాటులోనే వున్నప్పుడు, ఇంకా 'అందం దాచుకోటం' (అనుభవించటం కాదు), "పంజె చీల్చుకోటం"- అనటం చూస్తే, "ఎందుకు వీడు పరితపిస్తున్నాడా" అనుకున్నాను ఇంతకు మించిన వారిపైన వీడికి వాంఛ వున్నదా ఏమో! అమావాస్యరోజున చంద్రుడు కనపడలేదని విచారించేవాడు, నీలాకాశమూ, రోజుకన్న ప్రస్ఫుటంగా మెరిసే చుక్కలు - వీటి అందాన్ని ఆస్వాదించలేరు ఆలోచనలు తెముల్చుకుని "ఏమిట్రా అలా వున్నావు? చాల మారిపోయావ్. అసలు సంగతేమిటి?" అన్నాను.

ఏదో — చెప్పబోయేదానికి నాంది అన్నట్లుగా, నా చేతులు తన చేతుల్లోకి తీసుకొని నెమ్మదిగా నొక్కాడు, అక్కడే పచ్చిక పైన కూలబడ్డాం!

"నేను జాఫ్నాలో వుండగా మా డిపార్ట్‌మెంట్‌లోనే, ఒకమ్మాయి వుండేది పేరు రంజని" "పొయిట్రీ" లెక్చరర్ అంటూ మొదలెట్టాడు. కేనిట్లాంటిదేదో వుంటుందని వూహించాను.

"ఇందాక నీ భార్య చూపించే, ఆ ఫోటోయేనా" అన్నాను. అప్పటి రఘు ముఖకవళికలు గుర్తుకువచ్చి! "ఆ! — ఆమె అంటే మొదటినుంచి నా కదో విధమైన......" మాట దొరక లేదతనికి. అతను నవ్వి. "ప్రేమా, గీమా" అనకు సుమా! ఏదో చెప్పలేను గాని" అన్నాడు. అతను చెప్పలేకపోయినది నేను చెప్పలేను గాని, వూహించ గలిగాను. "అంత అందమైన దేనా?" అడిగాను. మనుష్యుల వర్ణన — పుస్తకాల్లో, కథల్లో అంటే ఏదో వ్రాసేయ వచ్చు కాని, ఒక స్నేహితుడి దగ్గర అమ్మాయిల అందం గురించి నిజం "నిజం" గానే చెప్పాల్సివస్తే కష్టమే! వాడు ఆలోచించిన ట్లాలోచించి "రంజని అందం గురించి నీకు చెప్పాలంటే నాకేమీ స్వంతమాటలు లేవురా! ఎప్పుడో చదివాము గుర్తుందా!..." "పది నిముసాలామె వంక తేరిపార చూచినా, ఆమె అందకత్తె ఔనో, కాదో తేల్చుకో లేకపోయాను. ఎందుకో ఆమె నన్ను చూచి నవ్వింది. వెంటనే అనిపించింది — ఆమె చాల అందమైనదని ఇదే నా ప్రథమానుభవం కూడ!" అని క్లుప్తంగా ముగించాడు. "తర్వాత?" అన్నాను. చిన్నప్పుడు దయ్యాల కథలు, పేదరాశి పెద్దమ్మ కథలు విన్నప్పుడుండే ఉత్సాహం, తొందర మళ్లా కనబర్చాను.

"మొదట్లో నేను ఎక్కువగానే మాట్లాడేవాడిని రంజనితో! ఆమె చాలా ముక్తసరిగా జవాబులు చెప్పేది ఒక ఏడాది గడిచాక, నా మనస్సు ఆమెకు మరీ దగ్గరవ్వాలనుకోటం మొదలెట్టింది. ఆలోచనల తర్వాత బుద్ధితో మనస్సుకు కళ్లెం వేశాను. మాట్లాడటం చాలా తగ్గించేశాను. సాధ్యమైనంతవరకు ఆమెను కలుసుగోటం మానేశాను! క్లాసు లైపోగానే 'రూమ్' కెళ్ళిపోయేవాడిని. కొన్నాళ్ళ తర్వాత ఒకనాడు ఆ అమ్మాయి, చెల్లెల్ని వెంటబెట్టుకు నా 'రూమ్'కు వచ్చింది. ఆశ్చర్యపోయాను అక్కడింకెవరియింటికో వచ్చినట్లు, దారిలో వుంది కనుక నా రూమ్ కేసి తొంగిచూసినట్లు చెప్పింది. కాని అంతా అబద్ధం నిజమేనాడు తెలిసింది నాకు తెలియని అభిమానంతో నిజాన్ని దాచివేసింది. కావాలనే నా రూముకు వచ్చిందారోజు. లోకంకోసం చెల్లెల్ని వెంట తీసికొచ్చింది. చాలా స్వేచ్ఛగా మాట్లాడింది. నా మనస్సు మళ్లీ కొంచెం పట్టుతప్పింది. ఆ తర్వాత ఆ అమ్మాయి రోజూ కొంతసేపైనా నాతో మాట్లాడేది. బాగా నవ్వేది. ఆమె మాట్లాడే మాటల్లో, చాల వాటికి ఏమీ అర్థం వుండేది కాదనే గుర్తు. నాలోపల 'వాంఛ' విజృంభిస్తుంటే, దాన్ని జయించి నిర్వికారంగా ఆమెతో మాట్లాడాలంటే చాల కష్టమయ్యేది. ఆమె నవనడి నాశీల ప్రవర్తనలపై సవాలు చేస్తోందా — అనుకుని చిరాకుపడేవాడిని చాలా సార్లు. కాని రంజనిపైన ఎప్పుడూ కోపం వచ్చినట్లు జ్ఞాపకం లేదు. ఆశ్చర్యమేమిటంటే, నేను మాట్లాడటం తగ్గించిన కొద్దీ, ఆమె మరింత పలుకరించేది ఇలా కత్తిమీద సాముగా ఇంకో ఏడాది గడిపాను. నాకు పిచ్చెక్కేంత పని అయింది. పోనీ అడిగేద్దామా అంటే భయం! లోకువవుతానేమోనని! ఇక ఆ వాతావరణం భరించలేక వేసవి సెలవల కింటికొచ్చిన వాడిని మళ్ళీ తిరిగి వెళ్ళకుండా ఉద్యోగాని రాజీనామా ఇచ్చేశాను ఆ తర్వాత నాల్గు నెలలకే అరుణను పెళ్లి చేసుకున్నాను. జాఫ్నాలో నా 'కొలీగ్స్' అందరికి ఆహ్వానాలు పంపాను. చాలమంది దగ్గర నుంచి వుత్తరాలు, వైర్ లూ వచ్చాయి రంజనివద్ద నుండి ఏమీ ప్రత్యుత్తరం రాకపోయేప్పటికి ఆశ్చర్యపోయాను. కాని, క్రమంగా ఆమెను మర్చిపొమ్మని

ప్రోత్సహించే 'బుద్ధి' ఇదీ మంచికే లెమ్మంది— మనస్సు రవ్వంత బాధపడినా! ఆ తర్వాత అరుణ మంచితనాన్ని చాలా అనుభవించాను. ఇప్పటివరకూ నేనుకూడా ఆమె కెటువంటి అసంతృప్తినీ కలిగించలేదనే అనుకుంటున్నాను. ఒక ఏడాది ఏ చింతా లేకుండా వున్నాను. తర్వాత ఒకనాడు జాఫ్నానుంచి ఒక కవరు వచ్చింది. అదృష్టం! అరుణ ఆనాడింట్లో లేదు. చింపి చదివితే రంజని వుత్తరమయింది.

"నీవు అరుణను ప్రేమించానన్నావుగదా, రంజని సంగతి ఆమెవద్ద ఎందుకు దాచావు" అని అడిగాను.

రఘునాథం ఆశ్చర్యంగా "మన కష్టాలు, మనం ప్రేమించేవాళ్ళకైనా సరే చెప్పకునేటప్పుడు-ఎక్కువగా ఆలోచించాల్సింది వాళ్ళ మంచితనం కాదురా, కావల్సింది గుండెనిబ్బరం. విని భరించగలరా! అని-అందుకనే అరుణకు చెప్పలేదు" అన్నాడు. వాడు తన కథంతా నాకెందుకు చెప్తున్నాడో అర్థమైంది. నా మంచితనంమీద నాకు ఒకవీసమెత్తు నమ్మకం తగ్గింది. "సరే-రంజని ఏం వ్రాసింది" అన్నా. "నేను ఆమెకు పంపిన ఆహ్వానపత్రిక చేరలేదు కాబోలు! "నా ప్రేమ నీవు తెలుసుకున్నావు కనుకనే, నీ పెండ్లికి నన్ను పిలవ సాహసించలేక పోయావు! ఈ వార్త యితరులవల్ల తెలిసినప్పుడు నే నెంత క్రుంగిపోయానో-ఎలా వ్రాయను? ఏడాది ఓర్చుకున్నా నీబాధ ఒంటరిగా. ఉపశాంతికొరకు యివాళ వ్రాస్తున్నా నీకు. నీయందు పూర్తినమ్మకము లేనందువల్లే, నేను నా ప్రేమ బాహాటంచేసి భిక్షగోర లేదు. కాని దురదృష్టం! నా మనస్సు నీవు గ్రహించావు నా అభిమానం దెబ్బతిన్నది. నేను ఓడిపోయాను. అందు కేమీ ప్రతిఫలంలేదు నాకు. నీ మనస్సులో నన్నెంత తేలిక చేసినా, కనీసం నాపై, నీ సుఖాన్ని కోరే వ్యక్తిగా పూర్తి నమ్మకముంచు" అని వ్రాసింది. "అంతే! మేఘాలను దూసుకొనిపోయే విమానం హఠాత్తుగ నేలకూలడం లాంటి అనుభూతి యిది" అన్నాడు రఘునాథం.

"నీవు జవాబు వ్రాయలేదా" అన్నా!

"ఆహ్వాన పత్రిక తనకుకూడ పంపినట్లు వ్రాశాను. నాపై తన కున్న కోరిక నా కీషణ్మాత్రమైనా తెలియదని చెప్పాను. ఆశలూ, అనురాగాలూ అంత గోప్యంగా గుండెల్లోనే దాచుకుని అణగారిపోవటానికి నేనేమైనా ఆకాశ కుసుమాన్నను కున్నావా?' అని ముగించాను. అంతకంటే ఏం వ్రాయను?" అతని గొంతే కాదు—శరీరముకూడ కొంచెం కంపించినట్లు సంధ్యవెలుగుల్లో గుర్తించ గల్గాను.

"ఆ తర్వాత మళ్ళీ ఆమె వ్రాయలేదా" అన్నాను.

"ఊహూ! ఏమీ వ్రాయలేదు. కాని నా ప్రేమ ప్రతిబింబాన్ని నేను గుర్తించలేదని తెలిశాక, ఎండిపోయిందనుకున్న ఆమెపై నాకున్న ప్రేమ క్రొత్త చిగురేసింది! ఏమీ చేసేస్థితిలో లేను నేను నా కాలు చేతులు నేనే విరగ్గొట్టుకున్నా ననిపిస్తుంది అరుణ అమాయకురాలు మరీ సుకుమారమైన జాజిపువ్వు లాంటిది. జాగ్రత్తగా చూసుకోవాలి! ప్రేమ ఒక చోట, దాని ప్రకటన మరొకచోటగా బ్రతుకుతున్నాను" అన్నాడు. ఇప్పుడర్థమైంది నాకు! రఘునాథం అరుణపై చూపేది ప్రేమకాదు.—అది లాలన, దయ, ఆదరణలాంటిది! ఇంతలోనే కారు చప్పుడైంది! అరుణ వచ్చింది!

"చీకటయిపోయింది ఇంకా తోటలోనే వున్నారేం? ఇంట్లోకి పదండి మంచుకురుస్తోంది" అన్నది. రఘునాథం నవ్వు తెచ్చుకొని లోపలికి వచ్చాడు. చాలా ఆప్యాయంగా అరుణను, ఆమె స్నేహితురాలి ఆరోగ్యవిషయం విచారించాడు. నిజమే! అలా బ్రదకటం రఘునాథానికే చేతనయింది!

మరునాడు ప్రయాణం కట్టాను స్టేషన్‌కు వచ్చారిద్దరూ; రైలు కదలబోతుంటే రఘు నా చేయి నొక్కుతూ "ఎవ్వరితో అనకేం!" అన్నాడు. నాకంటే రాతిగుండె కలవాళ్ళు మా మిత్రబృందంలో మరెవ్వరూ లేరని రఘునాథం అభిప్రాయం కాబోలు!

రైలు, రైలుతోపాటు చెట్లూ, చేలూ, పైన మబ్బులూ, నా ఆలోచనలూ, అతి వేగంగా పరిగెత్తుతున్నాయి. అన్నింటికి ఒక్కసారే 'బ్రేకు' పడినట్లు మావూరి స్టేషన్ వచ్చింది. ఆ రాత్రి పడు కున్నాను. రఘునాథమే మెదులుతున్నాడు మనస్సులో! ప్రపంచంలో అక్కడక్కడ నిర్లిప్తమై యున్న కరుణ, సహనము, అభిమానము ఇత్యాది ఉత్తమ భావాలకు అందమైన శరీరం కనిపించగానే, దానిలో లీనమైపోవాలనే కోరిక కలుగుతుంది కాబోలు. లేకపోతే, రఘువంటి వ్యక్తిని మనం కలుసుకోలేము!

# టిబెట్ దేశము

శ్రీ వాసిరెడ్డి పార్థసారథి

భారత భూమిలో బౌద్ధయుగాన్ని స్వర్ణయుగమన్నారు. మన దేశము కళలలో గాని, వ్యాపారములో గాని, శాస్త్రాలలో గాని, మతాలలో గాని, యోగములో గాని, పరిశ్రమలలో గాని, సుఖశాంతులలో గాని ప్రభుత్వాలలో గాని, ఆనాడు ఉచ్ఛస్థితి నందుకున్నది. ఆనాటి కళలు కొన్ని మనకు ఇప్పుడు దక్కినా, శాస్త్ర గ్రంథములు, చాలావరకు నశించిపోయినవి. దండయాత్రల వల్ల దొంగలుపడ్డ కొంపవలె అయింది మనదేశము. రాళ్లు రప్ప తప్ప చాలావరకు కొల్లగొట్టబడాయి. మహమ్మదీయుల దండయాత్రల నాటికి, కాశీ, నవద్వీప, నలంద, తక్షశిల విశ్వవిద్యాలయాలున్నవి. అందులో గొప్ప పుస్తక భాండాగారములు ఉన్నవి. వీటిని చాలావాటిని మహమ్మదీయులు తగులబెట్టారు. కొందరు బుద్ధిమంతులు చాలా గ్రంథాలను టిబెట్టుకు చేరవేశారు. టిబెట్టు దేశీయులు కూడా జ్ఞానార్జనకు మనదేశం వచ్చి అనేక సంస్కృత గ్రంథాలను తీసుకువెళ్ళి, వారి భాషలోనికి తర్జుమా చేసుకున్నారు. మనదేశీయులు కూడా బౌద్ధ, తంత్ర మతాలను వ్యాపింప చేయుటకు టిబెట్టుకు వెళ్లారు. వీరితో చాలా గ్రంథాలను తీసుకువెళ్లారు. ఏటయినా, ఇప్పుడు మన పూర్వగ్రంథాలు టిబెటు లామాల వద్ద కుప్పలుగా ఉన్నవి. ఈ కనుపించేవే కాక, ఇంకా గుప్తంగా కూడా వుండవచ్చు. ఇందుకొక ఉదాహరణ ఉన్నది. సర్దారు పణిక్కరు మన మాజీ చీనా రాయబారి తన రెండు చీనాలు అనే గ్రంథంలో ఈ విషయాన్ని తెలిపారు. తాము చీనా గోబీ ఎడారి చూడటానికి వెళ్ళారట. అక్కడ ఒక గొప్ప కొండ గుహను చూచారట. అంతకు పూర్వము దాని ద్వారము ఒక రాతితో కప్పబడి ఉన్నది. చూచుటకు, అందొక గుహ ఉన్నదని ఎవరికీ తెలియనట్లున్నది. ఒక బౌద్ధసన్యాసి ఎట్లో దానిని కనిపెట్టాడు. కష్టపడి, ఆ ద్వారం తెరవగా, అదొక గొప్ప గ్రంథాగారము. వ్రాతగ్రంథాలు ఇంటెత్తున పోగుచేసి వున్నవట. ఈ సన్యాసి తనకు తానై అధికారినని అక్కడే ఉన్నాడట. కొంత కాలానికి ఒక ఫ్రెంచిదేశీయుడు, కొన్ని గ్రంథాలు ఇవ్వమని అడిగాడు. కాని ఇతను నిరాకరించాడు. ధనాన్ని చూపాడు లొంగలేదు. చివరకు ఒక యుక్తి పన్నాడు. తాను హ్యూయనిత్సాంగ్ అంశమన్నాడు. హ్యూయనిత్సాంగే తానుగా పుట్టానన్నాడు. తాను సంపాదించిన గ్రంథరాజములన్నీ వృథా అవుతున్నవనీ, అందుచే తనకు చాలా బాధగా ఉన్నదన్నాడు. వీటిని అనుభవంలో పెట్టుటకే, ఈ జన్మలో తానిక్కడికి వచ్చానన్నాడు. ఈ యుక్తి బాగా పారింది. అయిదు వందల రూపాయలిచ్చి, తనకు కావలసిన సంస్కృత గ్రంథాలను, ఒక బండెడు గ్రంథాలను తీసికొనివెళ్ళాడు. ఇది తెలిసి ఆంగ్లేయుడు వచ్చాడు. కొన్ని పోయెనే అని విచారపడ్డాడు. ఇంకా కొన్ని గ్రంథాలను ఇతను తీసుకొని తనదేశానికి వెళ్ళాడు. ఇది చాలా హృదయ విదారమైన విషయమన్నాడు పణిక్కరు. ప్రజలకు దూరంగా ఇన్ని గ్రంథాలను ఆనాడు ఎట్లా తెచ్చారోనన్నాడు. ఏకాంతంగా తమ సాధనకు అనుకూలమయిన చోటని ఇక్కడ మఠాన్ని ఏర్పరచుకున్నారు. కాని ఇక్కడ నుండి ఎందువల్ల ఎప్పుడు వెళ్ళారు? ఇట్లా ఎందువల్ల గుప్తపరచవలసి వచ్చిందోనన్నాడు పణిక్కరు. ఎటయినా చీనా, టిబెట్, భారతభూములలో ఉచితమైన గుప్తస్థానము, గుప్తవిద్య, గుప్తగ్రంథ భాండాగారములుండి ఉంటవి

మన స్వాతంత్ర్యంతో పాటు అనేక అమూల్య శాస్త్రాలు పోయినవి. ఈనాటికి మనము స్వతంత్రులమైనాము. ప్రతిదానిలోను ప్రపంచదేశాలతో పాటు మనము ముందుకు నడవాలి. శాస్త్ర పరిశోధనలు చేయాలి. యోగవిద్యా రహస్యాలను సంపాదించాలి. ఇవి ఇప్పటికీ టిబెట్టు దేశంలో వున్నవని చూచినవారు చాలామంది చెబుతున్నారు

మన ఆంధ్రదేశంలో కూడా బౌద్ధయుగం, బంగారుపంట పండించింది. మహాయానమును కనిపెట్టిన నాగార్జునాచార్యుడు మన దేశంలోనివాడే. ఇతను మతము, వేదాంతము, యోగములనే గాక, రసాయనశాస్త్రములనుకూడా వ్రాశాడంటారు. వీరితో పాటు అమరావతీ విశ్వవిద్యాలయంలో తెలుగువారు యెన్నో శాస్త్రములను వ్రాసివుంటారు. ఆనాటి మన బౌద్ధగ్రంథములన్నీ మనకు మిగలలేదు. టిబెట్టులో నాగార్జునుని పూజిస్తారు. ఇతని శాఖీయులే టిబెట్టువారు. నాగార్జునుని గ్రంథాలెన్నో టిబెట్టులో వున్నవని చూచినవారు వ్రాస్తున్నారు. మనదేశంలో

పుట్టిన మన గ్రంథాలను మనము టిబెట్టులో చూడగలము. అందులో ఎన్నో రససిద్ధులు యోగసిద్ధులు, వేదాంత సూత్రాలు, బౌద్ధసూత్రములను అనేక రహస్యాలను మనము తెలిసికోగలము. ఇప్పటి ఉత్తరదేశీయులు లోకరు టిబెటువెళ్ళి కొన్ని గ్రంథాలను తెచ్చారని వింటున్నాము. తెలుగు యువకులు కూడా ఈ అన్వేషణకు బయలుదేరాలి. అయితే, ఇది సుఖప్రదమైన పనికాదు; చాలా కష్టము, టిబెటు చేరుట. ఆ దేశీయుల అనుమతి పొందుట చాలా కష్టమే. ఇంతవరకూ టిబెట్టు ఒక గుప్తభూమిగా వుంటున్నది ఈ శతాబ్దము తొలిదశలో కూడా బయటివారి నెవరినీ తమ దేశంలోనికి రానీయలేదు. అనేకులు అనేక వేషాలతో వెళ్ళారు. కొందరు వారి చేతుల్లో చనిపోయినారు. అదృష్టవంతులు తప్పించుకొన్నారు. ఇతరులను రానీయకుండా ఎంత కట్టుదిట్టం చేశారో జపాన్ బౌద్ధ సన్యాసియైన కవాగుచీ వ్రాసింది చదివితే తెలుస్తుంది. శరత్ రాయ్ అనే డార్జిలింగు నివాసి, టిబెట్టుభాష, బౌద్ధగ్రంథాలను చదువుకొనుటకని టిబెట్టు వెళ్ళాడు. ఎట్లో ఒక లామావద్ద ఆశ్రయం పొందాడు. కొంతకాలం చదివి ఇంటికి తిరిగి వెళ్ళాడు. తర్వాత ఇతను బ్రిటిషువారి వేగులవాడని అనుమానించారు. ఇతనికి ఆశ్రయం ఇచ్చిన లామా పేరు సెంగ్ చెన్ డోర్ జె. ఈ లామాను, టిబెటుప్రభుత్వం విచారించి, మరణశిక్షను విధించింది. ఇతనిని బ్రహ్మపుత్రానదిలో, ప్రాణంపోయేవరకు ముంచి చంపమన్నది. ఆజ్ఞాపాలకులు ఇతనిని నదివద్ద కూర్చోపెట్టి, తాళ్ళుకట్టారు ఈ లామా పద్మాసనంలో కూర్చున్నాడు బౌద్ధపవిత్ర గ్రంథాన్ని తీసికున్నాడు. నేను మూడుసారు చెయ్యెత్తిన తరువాత, నన్ను, నీటిలో ముంచమన్నాడు. భయపడలేదు, తొణకలేదు. ప్రశాంతవదనంతో పవిత్ర బౌద్ధ గ్రంథరాజమును పఠించాడు మూడుసార్లు చేయెత్తాడు, కాని ఆజ్ఞాపాలకులకు చేతులు లేవలేదు. అట్టే చూస్తూ నిలబడిపోయినారు. లామా తను విధిని నిర్వర్తించమని హెచ్చరించాడు. వారిని వత్తిడిచెయ్యగా, లామాను ఒకసారి ముంచారు. ప్రాణంపోలేదు; 2వ సారి ముంచారు ప్రాణంపోలేదు నిర్విణ్ణులై చూస్తూ నిలబడ్డారు. లామా తన కొనప్రాణాలను కూడదీసుకుని, వారిని ఇట్లా ప్రబోధించాడు. నా కర్మలు ఇంకటితో నశిస్తవి. నేను బుద్ధునిలోకంకు వెళ్లుతాను. బౌద్ధమతం ప్రపంచమంతటా వ్యాపించుగాక యన్నాడు. తమకు చెప్పిన కార్యాన్ని నిర్వర్తించమన్నాడు. ఈ దినులు మూడవసారి నీళ్ళలో ముంచారు. దీనితో ఆ లామా ప్రాణాలు ఎగిరిపోయినవి టిబెటువారి ఆచారంప్రకారము ఈ లామా కాళ్ళు చేతులు, మొండెము నరికి, ఆ నదిలో పారవేశారు. ఇందులో లామాల బౌద్ధమతి విశ్వాసం యెంత గాఢమైందో తెలుస్తుంది. వారి దేశాన్ని ఎంత కఠినంగా, ఇతరులు ప్రవేశించకుండా చేశారో తెలుస్తుంది కాని సర్ యంగ్ హస్ బెండ్ అనే అతన్ని టిబెట్టుమీద దండయాత్రకు 1887 లో బ్రిటిషు ఇండియా ప్రభుత్వం పంపింది. మళ్ళీ 1903 లో కూడా పంపి, టిబెట్టు వారివద్ద కొన్ని వ్యాపారసౌకర్యాలను పొందింది. కాని విదేయులంటే, వారు నమ్మలేకపోయినారు. ఇప్పటికి కొంత మారుతున్నారు. ఎట్లయినా ఇది సాహసకార్యమే

టిబెట్టును, మన దేశీయులు త్రివిష్టపమంటారు. అంటే స్వర్గమని అర్థం ఇది మనదేశపు ఉత్తరపు ఎల్లయైన హిమాలయ పర్వతములకు ఆవలనున్నది టిబెట్టుకు ఉత్తరాన చీనాదేశం, దక్షిణాన నేపాల్, సిక్కిం, భూటాను దేశాలున్నవి నేపాలును హిందూ రాజున్నాడు. టిబెట్టుకు బౌద్ధమతము. మనకు బౌద్ధమే కాని తాంత్రికసంబంధం ఎక్కువ. పూర్వాచారపరాయణత్వం ఎక్కువ. అనుమానాలు, మూఢనమ్మకాలున్న బీద దేశము. కాని ప్రపంచమున్ననెల గొందిన మౌంట్ యవరెస్టు, మానస సరోవరము లా దేశంలో వున్నవి. భారతదేశీయులకు ఇవి ప్రాణప్రదములు. ఇవిగాక, టిబెటు మన సరిహద్దులందున్న, మన పొరుగుభూమి. ఇందుకైనా మనము ఆ దేశమునుగురించి తెలిసికొనుట చాలా ముఖ్యము ఇది తెలియనిచో మనకు అనేకవిధాల ముప్పుకలుగుతుంది ఇప్పుడు టిబెట్టు చీనా ప్రజారాజ్యంలో భాగంగా వున్నది దీనికి రాష్ట్రస్వాతంత్ర్యం మాత్రం వున్నది చీనావారి సేన టిబెట్టు ముఖ్యపట్టణంలో వుంది

టిబెట్టు మంచుకొండలలో వున్నందున దారి చాలా కష్టసాధ్యము. కొందరు డార్జిలింగు మీదుగా, కొందరు కాశ్మీరదేశంమీదుగా వెళుతూంటారు. మనవారు మానససరోవరాన్ని దర్శించవలెననుకుంటే, ఇంటివద్ద అన్నీ సర్దుకుని, వీలునామా కూడా వ్రాసి పోయేవారట. చాలామంది తిరిగిరావటం వుండదు. అంటే దారిఅంత కష్టము, భయంకరమైనది. కొండలు గోడలవలె ఎత్తుగా వుంటవి. నదులు అతివేగంగా ప్రవహిస్తుంటవి. అంతలో యెండ, అంతలో బొమికలు కొరికే చలివేస్తుంది అక్కడ యెండ తెల్లగా వుండి కన్నులు మిరుమిట్లుగొలుపుతుంటుంది. ఈ తెలుపును చూడలేక, అక్కడివారు ఉన్ని ఉండలను కళ్ళకు అడ్డం పెట్టుకుంటారు. ఇప్పుడు ప్రకాశంగా వున్నట్లుంటుంది ఇంకొంచెముసేపటికే ప్రచండమైన తుపాను వీస్తూంటుంది అమెరికా జడ్జి డగ్లసు, ప్రశాంతంగా వున్నదిగదా యని టిబెట్టుకు కొండలలోగుండా వెళ్ళుతున్నాడట. అంతలో నే మబ్బులు పట్టుకువచ్చి చీకట్లు క్రమ్ముకుపోయినవట. ప్రచండమైన గాలితో తుపాను ప్రళయతాండవం చేసిందట. డగ్లసు, ఈ

తుపానులో తాను చనిపోయినాననే అనుకున్నాడు. కాని అంతలోనే తగ్గిపోయింది. ఇసుక తుపానులు కూడా ఇట్లే భయంకరంగా వుంటవట. గాలిమోతలతో హోరుమంటూ వీస్తుంటుందట సుడులు లేచి గిరగిర తిప్పుతుందట. ఇక్కడి నేల గొయ్యి చేసి, అవతల పర్వతాన్ని చేస్తుంది. జపాన్ సన్యాసి కవాగోచీ ఒకసారి ఈ తుపానులో గొంతువరకు పూడిపోయినాడట. ముక్కు చెవులు కళ్ళనిండా ఇసుకనిండి ప్రాణావశిష్టుడైనాడు. ఇట్లే మంచుతుపానులు కూడా ప్రళయతాండవము చేస్తాంటవట. తామసికమూర్తులైన పార్వతీ పరమేశ్వరులు ఆ మంచుకొండలమీద వున్నారన్నందుకు, ఇది సార్థకంగా కనిపిస్తున్నది. పార్వతీదేవి త్రిలోకసుందరి. ఆ మంచుకొండలందు, మానస సరస్సులందు ఆ అందం ప్రతిబింబిస్తుంది. ఆ తల్లి కోపం తాల్చినప్పుడు, చేసే ప్రళయనృత్యం ఈ తుపానులలో కనపిస్తుంది. ఇవిగాక ఒకోచోట కొండ రాళ్ళు మంచుపర్వతాలమీదకు జారి అనేకమందిని పొట్టను పెట్టుకుంటవి కొన్నిచోట్ల నీరు దొరకదు. కొన్నిచోట్ల గుఱ్ఱాలకు గడ్డి దొరకదు విపరీతమైన చలివల గుఱ్ఱాలు ముక్కుల వెంట నెత్తురు కక్కుకుంటవి. శరీరాలు చల్లబడిపోతవి పొట్ట వుబ్బిపోతుంది మనుష్యులు కూడా వూపిరాడక, శ్వాస తగ్గి చాలా కష్టపడతారు. కాళ్లు చేతులు నమ్ముపడుతవి. కళ్లు రక్తమయములై నీరు కారుతవి పెదవులు వాస్తవి. గోళ్ళపక్క చర్మం పగిలి నెత్తురు కారుతుంది. అవే చివరి ఘడియలా అని భయం వేసేటట్లుంటుంది. అట్టి సమయాల్లో నిప్పునోరికి, సెగ కాచుకుంటే తేరుకో కలుగుతారు.

అడవి యతిమృగాల భయంకూడా వుంటుంది ఇది చిన్న ఏనుగంత వుంటుంది వీటి కొమ్ములు 5 అడుగులు పొడవు దాని బుస రైలుబుసవలే వుంటుంది దాని కళ్ళు అతి భయంకరాలు, దాని నాలుకను బయటకు విడిచి, మనుష్యులను నెంటాడుతుంది డాక్టరు స్వేన్ హిడెన్ దళమును ఈ అడవి మృగము వెంబడించిందట. అది యెంత భయంకరమైనదో, తను నెట్లు వెంటాడి ప్రాణావశిష్టులను చేసిందో అతను తన గ్రంథంలో వ్రాశాడు. వీటికి తోడు ఎలుగుగొడ్లు చిరుతపులులూ కూడా వుంటవి. ఇవి, తరచు మీద పడి ప్రాణాలు తీస్తవి. టిబెట్టులో దారిదోపుళ్లు కూడా ఎక్కువే. అన్నీ కొండలూ నదులూ ఎక్కడ యేముందో తెలియదు. అందువల్ల ఎక్కడో పొంచుండి మీదకు వస్తారీ దొంగలు. వీలు కాదనుకున్నప్పుడు యేదైనా ఇస్తువున్నదాయని అడుగుతారు. వీలు చిక్కితే వున్నదంతా దోచుకుంటారు. అక్కడి దొంగల కొక ధర్మం వున్నదట. రెండురోజులు ఆహారం వదిలిపెట్టుతారట.

కవాగుచీ ఈ దొంగలకు చిక్కాడు. అతన్ని సర్వం దోచుకున్నారు కాని ఎక్కడో బంగారు నవరసులను దాచుకోగలిగానన్నాడు. దోపిడి చేసి, గుఱ్ఱాలమీద పక్షులవలె పర్వతాలలో అంతర్ధానం అవుతారు. వీరి వల్ల ప్రాణభయం కూడా వుంటుంది. కుక్కలుకూడా భయంకరంగా వుండి గ్రామాల్లో మీదకొస్తవి. మనిషిని అవలీలగా చీల్చి వేయుచట్లుంటవట ఇవిగాక దొంగఊబిలుంటవి తెలియనివారు నడవలేరు చాలా అపాయకరం. ఇవిగాక, విదేశీయులకు ప్రాణభయం ఎప్పుడూ వెన్నంటే వుంటుంది. టిబెట్టు పట్టణాలల్లో వున్న అక్కడి ప్రజలకు ఏమాత్రం అనుమానము తగిలినా, అవలీలగా మనిషిని చంపివేస్తారు. కవాగుచీ తాను జపాన్ దేశీయుడనని చెప్పలేదు. తాను చీనా భాషను బాగా మాట్లాడగలడు టిబెట్ భాషను చదువుకున్నాడు కొన్నిసార్లు చీనావాడినని చెప్పకున్నాడు. అడుక్కునేవాళ్ళు స్వేచ్ఛగా తిరుగుతూ వుంటారు. ఇతనూ వారితో కలిసి చాలాకాలం తిరిగాడు మూడు ఏండ్లు, టిబెట్టులో అతి ఒప్పు. నెప్పులతో వుండగలిగాడు. వారి పవిత్ర బౌద్ధగ్రంథాలను చదివి, సేకరించాడు చివరకు రహస్యం బయటపడగా అతి మెలకువగా తప్పించుకుని బైటపడ్డాడు. తనకు బుద్ధభగవానుని రక్షణ వున్నదని అంటాడు.

ఇన్ని భయంకర కాళరాత్రులను, తుపానులను, అడవులను, కొండలను, నదులను, దొంగఊబులను, అడవిమృగాలను, దుర్మార్గులైన దారిదోపిడీగాళ్ళను, దాటి ప్రాణావశిష్టులమై చివరకు మానస సరోవరమును చేరుతాము మానస సరోవరము టిబెట్టులో వాయవ్య దిశనున్నది. నేపాలుకు దగ్గరగా వున్నది మానస సరోవరము రెండు పర్వతముల మధ్య వున్నది. దీనికి వాయవ్యాన కైలాస శిఖరము, దక్షిణాన గుర్లిమాంధాత పర్వతము వున్నది ఈ సరస్సు సముద్రమట్టమునకు 15.500 అడుగుల ఎత్తున వున్నది. అందువల్ల ప్రపంచపు జలములలోకల్లా, ఇది మహాస్వచ్ఛమైన జలమంటారు. డాక్టరు స్వెన్ హిడెన్ దీని లోతు 203 అడుగులుంటుందని అన్నాడు. దీనియొక్క అందము చెప్ప శక్యం కాదంటారు. ఇక్కడికి చేరుటకు, పడరాని పాటు పడవచ్చు. కాని ఈ ప్రకృతి సౌందర్యం చూచినతర్వాత, ఆ కష్టాలొక లెక్కనిపించవు పాశ్చాత్యుడైన డాక్టర్ స్వెన్ హిడెన్ దీనిని చూచిన తర్వాత, భూమిమీద కాక ఏ ఆకాశానో, స్వర్గానో వున్నాననిపించిందన్నాడు. ఆధ్యాత్మికదృష్టితో చూచే భారతీయులకు, ఈ దృశ్యం చెప్పనలవి కాదు. మన పురాణాల్లో కైలాసపర్వతం మీద పార్వతీ పరమేశ్వరులున్నారని వున్నది. బౌద్ధగ్రంథాల్లో, దీని మీద బుద్ధుడున్నాడని వున్నది. ఈ చక్కని ప్రశాంతస్థలంలో మన ఋషులు తపస్సు చేసు

కుంటూ సిద్ధిపొందింది, ధన్యులై వుంటారు ఇక్కడ ఋషులు తపస్సు చేసుకుంటున్నారని ప్రతీతి. కాని స్వామీ ప్రణవానందులవారు, తాను అక్కడ ఏ ఋషులను చూడలేదని వ్రాశారు ఎట్లయినా, మహాఋషులకు, యోగసాధకులకు కావలసిన ప్రకృతి సౌందర్యము, ఏకాంతము, చలదనము, స్థలమాహాత్మ్యము అక్కడ వున్నది. బౌద్ధులు అక్కడ కొన్ని మఠాలను కట్టారు వారి అనుయాయులు అక్కడ వుంటుంటారు. యాత్రికులూ వస్తూంటారు. టిబెట్ వారు దీనిని మఫాం యుంట్సో అంటారు. బౌద్ధమతంలో దీనిని అనవతప్త అంటారు అనగా వేడి, కష్టము లేనిదని అర్థము దానిలో స్వర్గమంత పద్మమున్నదని, ఆ పద్మంలో బుద్ధుడు, బోధిసత్వులు కూర్చుని వుంటారంటారు. వారు భూలోకంలో వున్న బౌద్ధస్వర్గం ఇదేనని నమ్ముతారు. కైలాస పర్వతం మీద కూడా బుద్ధుడు అయిదు వందల అర్హతులతో వుంటుంటాడని అంటారు. మానస సరోవరములో ఒక వృక్షమున్నదని, దాని ఫలములు మానవరుగ్మతులను నయంచేస్తవని బౌద్ధులంటారు. ఆ వృక్షమును జంబూవృక్షమంటారు. దాని ఫలం పండి నీటిలో పడేటప్పుడు జంబ్ అనే నినాదం కలుగుతుందట అందువల్ల జంబూ వృక్షమన్నారు దానిని. కవాగు చీ ఆ దృశ్యాన్ని చూచి, తాను బుద్ధుని దర్శనం పొందినంత ఆనందపడ్డాడు. హిడెన్ దానిమీద రాత్రిళ్లు పడవలో ప్రయాణించాడు ఆ సరస్సుమీది ఆకాశాన్ని ఇట్లా వర్ణించాడు: తలలో వజ్రముల నలంకరించుకున్న నిశారాణి అన్నాడు. ఆ మహాప్రశాంతసమయంలో గుర్లా మాంధాతమీద వారికి అనేక జ్యోతులు కనుపించినవన్నాడు నీలివెలుగు, మెరుపులు మెరుపులుగా మెరిసిందట. కొంచెము సేపున్న తర్వాత జ్యోతిస్సముద్రమే ముంచెత్తినట్లుగా వెలుగుతో నిండిపోయిందట ఇట్లా ఒకదానివెంట ఒకటి, ఆకాశాన మేఘాలలో మెరిసినట్లు, మెరుస్తుండేవట ఆ పర్వతసానువులపైన. కొన్ని ఆకాశమెత్తువరకూ లేచి అదృశ్యమయ్యేవట. ఈ వెలుగుల వెలుతురులో తను, తనతోడి మనుష్యుల ముఖాలు చూడగలిగానన్నాడు. నడిరేయి గడచుటతోనే, ఆకాశము రంగులను మారుస్తుందట. కటిక చీకటి, లేత నీలిరంగుగా మారుతుంది ఆకాశాన ఎగురుతున్న మేఘమాలికలు గులాబిరంగు తాలుస్తవి అప్పుడు తూర్పు దిక్కున దిననాథుని వెలుతురు కనుపిస్తుంది. ముందు మాంధాతపర్వతంమీద సూర్యకిరణాలు పడతవి. ఆ పర్వతాలన్నీ బంగారు ములాం చేసినట్లుంటవి అప్పుడు తెల్లవారుతుంది. తాను మానస సరోవరము మధ్య నిలబడి, అడుగుకు చూడగా అడుగు బాగా కనుపించిందన్నాడు. ఈ సరస్సు శీతాకాలం గడ్డకట్టుకు పోతుంది. వేసవిలోనే నీరు చల్లగా వుంటుంది. కైలాసగిరి ప్రపంచమంతటిలోనూ ఎత్తయిన పర్వతము. ఈమధ్యనే దానిని అధిరోహించ కలిగారు.

ధవళగిరుల మధ్య, తెబేరాకారంలో వున్న ఈ మానససరోవరం చూచి పావనులైనని కోరుకుంటాడు ప్రతిప్రాచ్యదేశీయుడు. అందువల్ల అనాది నుంచీ, నేటివరకు దీనికివున్న విలువ తెలుస్తుంది ఈ పర్వతమునుండే బ్రహ్మపుత్ర, గంగా మొదలైన నదులు పుట్టుతున్నవి. ఇవి భారతభూమిని, బంగారుభూమిగా చేస్తున్న పుణ్యవాహినులు.

టిబెటు ప్రకృతిసీమ గొప్ప రామణీయకమైనది. ప్రజలు అందుకు వ్యతిరేకంగా వుంటారు. వారు శుభ్రంగా వుండరు. ఇందుకు వారి మూఢనమ్మకాలు కారణం వారు నూతన వస్త్రములనైనా మసి చేతులకు పూసుకుని ధరిస్తారు. కొందరు జన్మాంతము స్నానమెరుగరు. జన్మాంతమూ ఒకే దుస్తులను ధరించువారున్నారు చీలికలైనా వాటినే ధరిస్తారు వారు శరీరాన్ని కడిగితే, దానితో వారి సుఖం కూడా పోతుందని అంటారు, మురికిగా వున్న ఆడపిల్లనే, ఎక్కువగా కోరుకుంటారు ఆడపిల్ల శుభ్రంగా వుంటే, ఆమె అదృష్టము పోయినట్లు వారు భావిస్తారు వారి గుడ్డలు, ఎండిన చర్మాలవలె వుంటవి. సంపన్నులు కొందరు ముఖప్రక్షాళన చేస్తారు. అదీ వికృతంగానే వుంటుంది. నీటిని నోటిలో పోసుకుని, అరచేతులతో ఉమ్ముకుంటారు ఆ నీటిని. ఈ అరచేతులలోని నీటతో ముఖము చేతులను కడుక్కుంటారు. ఇదే వారు ముఖం కడుక్కొనుట తతిమ్మా శరీరమంతా నల్లగా మకిలిపట్టి వుంటుంది. వారు టీని కొయ్యగిన్నెలలో త్రాగుతారు. ఆ గిన్నెలను ఎన్నడూ కడగరు వారు టీ నీటిలో వెన్న ఉప్పు వేసుకుంటారు. వెన్నవల్ల జిడ్డుగా వుంటుంది. ఎవరైనా విదేశీయులు గిన్నెను కడగమని అడిగినప్పుడు వారి వంటిమీది గుడ్డలను పెట్టి తుడిచి ఇస్తారు. సామాన్యజనము చాలా బీదతనంలో వుంటారు భోజనము దొరకనప్పుడు, టీ త్రాగి వుంటారు. ప్రతివారూ లామాలు కావలెనని ఆపేక్షిస్తారు.

ఆడపిల్లలకన్న, మగపిల్లలనే ఎక్కువ కోరుకుంటారు. నామకరణోత్సవము మగపిల్లలకు చేస్తారు. కాని, ఆడపిల్లలకు చాలా అరుదు మనవలె, శిశువు జన్మించుటతోనే, నీటితో కడుగరు. వెన్న పూస్తారు రెండురోజుల కొకసారి. నామకరణమునకు పూజలు చేస్తారు. పురోహితుడు మంత్రములను చెప్పి, నీటిని శిరస్సుమీద చల్లుతాడు. పుట్టినరోజును

# టిబెట్ దేశము

బౌద్ధ పేరు పెట్టుతారు. ఆదివారమునాడు జన్మించినవారికి న్యిమా అని పేరు పెట్టుతారు. దీనికి టిబెట్ భాషలో భానుడని అర్థము. సోమవారము నాడు పుట్టినవానికి చంద్రుడనే అర్థం వచ్చు దావా అని, శుక్రవారము పుట్టినవారికి శుక్రుడనే అర్థం వచ్చు పాసాంగ్ అని, శనివారమున పుట్టినవారికి శని అనే అర్థం వచ్చు పెంబా అని పేరు పెట్టుకుంటారు. ఈ పేర్లలో తికమకలు కలుగకుండా వుండుటకై వారి వారి వంశనామంతో కలిపి పిలుస్తారు. కుటుంబాని కొకర్ని లామాలుగా పంపుతారు. అప్పుడు పేర్లు మారుస్తారు ఎనిమిదేళ్లు వచ్చిన తరువాత విద్యాభ్యాసం చేస్తారు. ఇందుకు కూడా పండుగ చేస్తారు. చదువు చాలించి, ఉద్యోగంలో ప్రవేశించబోవునప్పుడు కూడా ఉత్సవాలు చేస్తారు. విందులు చేసుకుంటారు. పురోహితుడు కూడా వస్తాడు.

ఆడపిల్ల రజస్వల అయినప్పుడు ఉత్సవములూ విందులూ చేస్తారు. రజస్వల అయ్యేవరకు జంత్రుకలు ముడివేసి రజస్వలైన తర్వాత జుట్టుముడి వేసి, చివరు నాలుగు జడలుగా అల్లి వదిలి పెడతారు ఆప్తులు బహుమతుల నిస్తారు.

సంబంధాలు పెద్దలే నిర్ణయిస్తారు. లగ్నం వచ్చే వరకూ పెళ్లికూతురుకు తెలియదు. కొందరు ఆడపిల్లలు తన పాత ఇంటిని తల్లిదండ్రులను నేస్తులను వదిలి పోలేక చాలా ఏడుస్తారు. ఈ పెళ్లికూతురు, పెళ్ళి కుమారుల భవిష్యత్తుని గురించి పురోహితులు ఆలోచిస్తారు. వీరిద్దరకు కలిసివచ్చే వివాహాలగ్నం ఏర్పాటు చేస్తాడు పురోహితుడు. రెండురోజులు పెళ్ళికుమార్తె యింటివద్ద విందులు జరుగుతవి చుట్టాలు పక్కాలు విందుకు వస్తారు బహుమతులను పెళ్లికుమార్తెకు ఇస్తారు. పెళ్లికుమారునివారు, పెళ్లికూతురు వారికి కొంత వోలి ఇస్తారు. పెళ్లికుమార్తెకు ప్రధానములో కొన్ని సొమ్ములనుకూడా తెస్తారు. కట్టుకునే వస్త్రాలు, చీనా చెప్పులు, ఆభరణాలను ఇస్తారు. వీటిని ఈమె వివాహమప్పుడు అలంకరించుకుని తీరాలి. వివాహమప్పుడు పెళ్ళికుమార్తె నొసటన వుండేటట్లు ఒక రత్నమున్న ఆభరణాన్ని పెళ్లి కుమారుడు కడతాడు మనలో మంగళసూత్రం వంటిదిది. ఇదివున్న స్త్రీకి వివాహమైనట్లు భావించాలి. దీనిని నెత్తిమీద కనుపించేట్లు పెట్టుకుంటారు. భార్యా భర్తలకు పడనప్పుడు విడాకులు తీసికోవచ్చు. భర్తకు ఇష్టం లేనప్పుడు ఈ రత్నమును లాక్కొని పోతాడు. దీనికి తిరుగులేదు. దీనితో ఆ స్త్రీ పురుషులకు ఇక ఏ సంబంధం లేదు. స్త్రీ, తాను ఇతరులను తర్వాత పెళ్ళి చేసికోవచ్చు. దేవాలయంలో వివాహమైన తర్వాత పెళ్ళికుమారునింటికి వెళ్లుతారు. అక్కడ కూడా విందులు యాక్ మృగ మాంసంతో జరుగుతవి. తిని, త్రాగి, నృత్యం చేస్తారు. పెళ్లికుమారునివారు ఇప్పుడు ఎక్కువ త్రాగరు. పెళ్లికుమార్తెవారు ఏదైనా వస్తువును, పెళ్లికుమారుని వారి ఇంటిలో కనుపించకుండా తీసుకువెళ్లుతారు. దానిని, పెళ్లికుమారుని వారికి చూపించినప్పుడు, చూపినవారికి కొంత డబ్బు ఇచ్చుకోవాలి

టిబెట్టులో విపరీతమైన ఆచారము, ఒక స్త్రీ, తన భర్తసోదరులనందరను వివాహం చేసుకొనుట. ఇష్టమున్నా లేకపోయినా, కొంతకాలము తన భర్త యొక్క ప్రతి సోదరునివద్ద వుండాలి. వారికి పిల్లలను కనాలి టిబెట్టును ఆనుకొనివున్న నేపాలులో ఇందుకు వ్యతిరేక ఆచారం వున్నది. ఒక పురుషుడు అనేకమంది స్త్రీలను చేసుకుంటాడు. టిబెట్టులో ఇంటి అధికారమంతా భార్యది. మగవారు కష్టించి, ఆర్జించిన డబ్బును భార్యచేతి కివ్వాలి కష్టపడక, డబ్బు ఆర్జించినప్పుడు భార్యతీవ్రంగా కోప్పడుతుంది. తన భర్తలమీద మగవారికి డబ్బు కావలసినప్పుడు, భార్యను ప్రాధేయపడాలి ఆమె దయాదాక్షిణ్యం మీద వారికి కావలసినడబ్బు దొరుకుతుంది.

టిబెట్టుప్రజలు రెండు తరగతులుగా వుంటారు ఒక తరగతితో ఇంకొకరికి సంబంధబాంధవ్యాలు గాని, సహపంక్తులు గాని వుండవు. మొదటిది ఉన్నత కుటుంబీకులు, 2 వది తక్కువ తరగతులు. ఉన్నత తరగతులలో నాలుగు శాఖలున్నవి అందులో (1) ప్రభువులు, (2) మంత్రవేత్తలు, (3) అనాది మతంవారు, (4) పూర్వపు నాయకులు వుంటారు ప్రథమశాఖలో మాజీ రాజకుటుంబీకులు, గొప్ప లామా కుటుంబీకులు, మంత్రుల వంశాలవారు వుంటారు. పూర్వపు రాజవంశీకుని గొప్ప లామా సరసన కూర్చోనిస్తారు, కాని అతనికి ఎందులోను అధికారంలేదు మంత్రులు కాదగిన కుటుంబాలు వేరే వుంటవి. వారిని యాబ్షీ లంటారు. ప్రధానమంత్రులను వీరినుండే తీసికుంటారు. అందుకు తగిన విజ్ఞానం వున్నప్పుడే తీసుకుంటారు. రెండవ శాఖ మంత్రవేత్తలు వీరిని నాగ్‌పో లంటారు. వీరు సామాన్యంగా బీదవారుగా ఉంటారు. వీరియందు మంత్రములున్నందున వీరిని అందరూ అధికంగా గౌరవిస్తారు. వీరు తిడితే, తగులుతుందనిభయం. ప్రభువులు కూడా, వీరు ఎదురైనప్పుడు, గుర్రాన్ని దిగి వీరికి నమస్కరించి వెళ్లుతారు. వీరు తమవద్ద మంత్రశక్తి వున్నదని అహంకారంతో వుంటారు. ప్రజల మీద తుపానుపన్ను వసూలు చేస్తారు. గోధుమ పండి వున్నప్పుడు తుపానులు వచ్చి పైర్లను నాశనం చేస్తవి. ఇది, దెయ్యాల భూతాల పని అని వారి నమ్మిక. తుపానులు వచ్చినప్పుడు వీరు పెద్ద తతంగం చేస్తారు. వీరు గడ్డాలూ మీసాలు పెంచి, పెద్ద తలగుడ్డలు చుట్టి,

క్రిందివరకు పెద్ద కోటును తొడుక్కొని భయంకరంగా వుంటారు. తుపాను వచ్చినప్పుడు మంత్రాలను చెప్పుతూ, వడ్లగింజలను మేఘాల మీదికి విసురుతూ నృత్యం చేస్తూ ఎగురుతారు. తర్వాత వీరావేశం ఎక్కువైతే, తమ గుడ్డలనే పీలికలుగా చించి, మేఘాలమీదకు విసురుతారు. చివరకు ఎట్లాగో తుపాను ఆగితే, ఇదిగో మా మహాత్మ్యం అంటారు. లేనియెడల వారే ప్రజలకు అపరాధం ఇచ్చుకోవలసి వుంటుంది.

మూడవశాఖను బాకబో అంటారు బౌద్ధమతం టిబెట్టుకు రాకపూర్వం, ప్రజలంతా ఈ బాకబో మతస్థులే. ఇప్పటికీ వూరికి ఇద్దరూ, ముగ్గురూ వంతున వీరు వుంటూవుంటారు. కాని వీరు ఈ మతము హిందూమతమే నంటారు. వీరు దేవతలను అర్చన చేస్తుంటారు. పెళ్లిళ్లప్పుడు దేవాలయాలలో ప్రార్థనలు పూజలు వీరిచేత చేయిస్తారు. అనాదిమతం కనుక, వీరికికూడా ప్రజలలో గౌరవం వున్నది. వీరు కొన్నిచోట్ల న్యాయపాలకులుగానూ వుంటుంటారు.

నాల్గవశాఖను షాలంగో అంటారు. వీరు వైశ్యులవంటివారు. భూమి, డబ్బు వీరి అధీనంలో వుంటవి. సంపన్నులగుటచే పలుకుబడి ఎక్కువ.

తక్కువ తరగతులలో కూడా శాఖలున్నవి. చేపలు పట్టేవాళ్లు, కమ్మర్లు, పడవలను నడిపేవారు, కటిక వారు క్రింది తరగతివారు. వీరిలో కూడా అంతర్వివాహాలుండవు. వీరినుండి లామాలను తీసుకోరు. కొన్నిచోట్ల రహస్యంగా కొందరు చేరుతుంటారు లామాలల్లో.

వీరుగాక ఇంకొక తక్కువ తరగతి ఉన్నది. ఏ ఉన్నత కుటుంబీకుడైనా, తనకుతగని స్త్రీతో ఉండకూడదు. అలావుంటే అతనిని వెలివేస్తారు. ఇట్లు వెలివేయబడిన వారంతా, ఒక తక్కువకులంగా వుంటారు. వీరిని తక్కువకులాలకన్నా చాలా తక్కువగా చూస్తారు.

అడుక్కునే కులాలు కూడా వేరేవుంటవి. వీరికి వంశానుక్రమంగా అడుక్కునే వృత్తి వుంటుంది. ఈ వృత్తివల్ల వారి ముఖాలలో ఒక దీనత్వం కనిపిస్తూ ఉంటుంది.

టిబెట్‌లో మంచి కస్తూరి దొరుకుతుంది. కస్తూరి, మగమృగంవద్దే దొరుకుతుంది. కస్తూరి పౌర్ణమికి ఎక్కువగా దొరుకుతుంది. అమావాస్యకు తగ్గిపోతోంది. ఈ మృగం పిల్లికి మూడు రెట్లు ఎత్తుగా వుంటుంది. దీనిని తుపాకితో కాల్చి చంపి కస్తూరి తీస్తారు కస్తూరి ఎక్కువగా చీనాకు ఎగుమతౌతుంది. ఉప్పు, యక్‌మృగాలతోకలు (వింజామరలు), ఉన్నిని ఇక్కడనుండి నేపాలు, ఇండియాలకు ఎగుమతిచేస్తారు. ఇండియానుంచి ఊలువస్త్రాలు తీసుకుంటారు. వీటిని దేవాలయాల మఠాలలో అలంకరించుటకు ఉపయోగిస్తారు. పట్టు చేతిరుమాళ్ళు, బనారసువస్త్రాలు, తెల్లనూలు వస్త్రాలు ఎక్కువగా ఇండియానుండి తీసుకుంటారు. టీఆకును కూడా చాలా తీసుకుంటారు. ఒకప్పుడు చీనానుండి ఈ టీ ఆకు ఎక్కువగా వచ్చేది గుర్రాలను, టీఆకును, పంచదారను, ధాన్యాన్ని భారతదేశంనుంచి తీసుకుంటారు. వీటికి బదులు వస్తుమార్పిడి పద్ధతిని వెన్న, వింజామరలు, ఉన్ని, ఉప్పు, గొర్రెలను ఇస్తారు. టిబెట్టులో డబ్బు చాలా తక్కువ ఉన్నా లెక్కపెట్టుకొనుట చాలామందికి బాగా తెలియదు. ఇందుకై జపమాలల వంటివాటిని ఉపయోగిస్తారు వ్యాపారం చాలావరకు సరుకు మార్పిడి పద్ధతిమీద జరుగుతుంది.

యక్‌మృగం, టిబెట్ దేశంలో చాలా ప్రాముఖ్యత వహిస్తుంది. నడిచలికాలాల్లో ఆహారం దొరకని రోజుల్లో వీటి మాంసం అక్కరకు వస్తుంది. వీటిని పెంచుతారు. వీటితో నాగలి దున్నుతారు. వీటి వీపుల మీద సామాను లుంచి ప్రయాణం చేస్తారు. వీటి పేడను చాలా జాగ్రతగా ఉంచుతారు. దీనితో నిప్పు చేసుకుంటారు వీటిని చంపి వీటి మాంసము, నెత్తురు ఆహారంగా ఉపయోగిస్తారు. ఇంటివద్ద వీటిని చంపుటకు భయపడతారు ఊరంతా కలిసి ఒకచోట వీటిని చంపుతారు. అందుకు కూడా పురోహితుడు రావాలి. ఇతను వచ్చి మంత్ర తతంగంచేసి, తమ పవిత్ర గ్రంథాన్ని, జపమాలికను ఆ మృగం నెత్తిన ఉంచుతారు. తర్వాత ఆ మృగాన్ని ఒక్కదెబ్బతో తల నరుకుతారు. ఈ తతంగమువల్ల చంపేవానికి పాపముండదనీ చంపబడే మృగము ఉత్తమ లోకమునకు పోతుందని వీరు నమ్ముతారు. చంపినప్పుడు ఆ రక్తాన్ని వేరే తీసి వండుతారు ఇది వారికి చాలా రుచికరంగా వుంటుందట. బ్రతికివున్న మృగాలకుకూడా గొంతు వద్ద నరంకోసి రక్తంతీస్తారు. ఈమృగాలు వేసవి కాలంలో బాగా తినిబలుస్తవి. అందుచే వేసవిఅనంతరం మాంసము బాగావస్తుందని వీటిని అప్పుడు చంపుతారు. వీటిని చంపి, వీటి మాంసమును యెండపెట్టుతారు. ఇట్లా యెండపెట్టినమాంసమంటే వారు చాలా ఇష్టపడతారు. చలికాలంలో ఈమాంసము, వారి ఆహారంగా చాలా అక్కర కొస్తుంది. అందువల్ల ఈ యెండిన మాంసమున్నవాళ్లు గర్విస్తూ వుంటారు. అడవి యక్‌మృగాలు చాలా భయంకరమైనవి. వాటి నాలుక ఆకురాయివలె వుంటుంది. ఈ నాలుకను, గుర్రాలను మాలిష్ చేయుట కుపయోగిస్తారు.

గొర్రెలను కూడా పెంచుతారు. చలికాలం వస్తుందనగానే వారి పశువులను వెంటపెట్టుకుని, దక్షిణభూములకు తోలుకువెళ్ళి, చలికాలం గడచిన తర్వాత, తమ గ్రామాలకు చేరుతారు. అంతవరకు ఆ గ్రామాలలో తలుపులు తాళాలు

# టిబెట్ దేశము

వేసివుంటవి ఇట్లు తిరుగుతూ వారు వ్యాపారంకూడా చేస్తుంటారు. వీరితో కొన్ని వస్తువులను తీసుకు వెళ్లి, వాటిని తమకు కావలసినవాటికి మార్చుకుని, గ్రామాలకు వస్తుంటారు.

టిబెటులో, మానస సరోవరము, కైలాస శిఖరము తర్వాత మనము చూడదగ్గవి మఠాలు. వీటిని పర్వతాలు, నదులవద్ద, ప్రకృతి అతి రమణీయంగా వున్నచోట కట్టుతారు. ఈ మఠాలనుంచి చూస్తుంటే, ప్రకృతి అందమంతా కనుపిస్తుంది. చలికాలంలో మంచు కప్పుకున్న ధవళగిరులూ, వేసవిలో పచ్చని పచ్చికపట్టాలూ, వర్షాకాలంలో వర్షం యొక్క తాండవనృత్యం కనుపిస్తవి

మఠాలలో మంత్రోచ్చరణ దివ్యంగా వుంటుంది. అది సంగీతంవలె, లయప్రధానంగా వుంటుంది. ఆ సన్యాసులంతా కలిసి పాడుతుంటారు. ఒకప్పుడు చిన్నగాను, ఒకప్పుడు పెద్దగాను లయతో పాడుతుంటారు. ఇవి సముద్రతరంగాలు లేచి తగ్గినట్లుంటుంది. అందరు పాడినా, ఒక్కని స్వరంవలె వుంటుంది మధ్య మధ్య లాసో లాసో అంటుంటారు.

శాక్యమఠము ముఖ్యమైనవాటిల్లో ఒకటి భాగ్యవంతమైనదికూడా. అక్కడి వ్యాపారము, భూమి అంతా మఠం క్రిందనే వుంటవి. ఈ మఠములోని స్తంభాలు, కప్పు అంతా బంగారుములాంతో కప్పబడ్డవి. అందులో 300 చిల్లర విగ్రహాలున్నవి. వీటి నన్నిటినీ, బంగారంతో అలంకరించుతారు మధ్య హాలులో శాక్యబుద్ధుని విగ్రహం వున్నది ఈ విగ్రహము 35 అడుగుల ఎత్తునవున్నది ఈ విగ్రహం బురదతో చేయబడి, బంగారముతో కప్పబడివున్నది. ఈ విగ్రహం జీవతామూర్తివలె వుంటుంది.

ఈ హాలు వెనుక. ఇంకొకహాలు వున్నది. ఇది 60 అడుగుల ఎత్తున, 240 అడుగుల వెడల్పునా వుంటుంది. ఈ మందిరంలో అనేక వ్రాతగ్రంథాలున్నవి. ఇందులో విలువ కట్టుటకు వీలులేని, ఉత్తమగ్రంథములున్నవి. పూర్వపు బౌద్ధశాస్త్రం, పురాణాలన్నీ ఇక్కడవున్నవి. నలని కాగితంమీద, బంగారుమలాముతో వ్రాయబడ్డవి గ్రంథములు. ఇందుకు ఎంతో ఖర్చుపెట్టివుంటారు ఇందులో కొన్ని తాటాకు గ్రంథాలున్నవి. ఈ గ్రంథాలలో చాలా సంస్కృతంలో వ్రాయబడ్డవి ఇవన్నీ భారతభూమినుండి కొనిపోయినవే. ఈ మఠస్థాపకుడు, అతని తర్వాత అధికారులూ వీటిని సేకరించారు. వీరు అనేకమందిని భారతభూమికి పంపి, భారతభూమి నంతటినీ అన్వేషించి, ఈ గ్రంథములను తెప్పించారు. వీటిని టిబెట్ భాషలోనికి కూడా తర్జుమాచేసి వ్రాయించారు.

టిబెట్టువారు అదృశ్యశక్తులను ఎక్కువగా నమ్ముతారు. వారు బుద్ధుని రక్షకుడుగా ప్రార్థిస్తారు. వారికి ఏదిచెప్పినా బుద్ధుని కలిపి చెప్పితేనేగాని నమ్మరు. అమెరికావారు లక్షల డాలర్లు ఖర్చుచేసి క్రిస్టియన్ మతం ప్రచారంచేస్తున్నారు. కాని క్రైస్తవమతంలోకి మారినవారు బహుకొద్దిమంది. వీరికైనా ఇంట్లో బుద్ధవిగ్రహం ముందు నేతిదీపం వుండవలిసిందే. వీరు కర్మసిద్ధాంతమును ఎక్కువగా నమ్ముతారు. అందువల్ల పునర్జన్మ వున్నదని భావిస్తారు. వీరి మతావేశంలో కొన్ని లోపాలున్నా వాటివెనుక చాలా అమూల్యమైన విశ్వాసములున్నవి వీరు ప్రకృతిని కూడా చూచి చాలా ఆనందిస్తారు. వేసవిలో పువ్వులుపూచినప్పుడు పండుగలు చేసుకుంటారు. దీనిని లింగ్ అంటారు. అప్పుడు పిల్లా పెద్దా అంతా అడవులకుగాని, లేక పుష్పోద్యానములకుగాని వెళుతారు. అక్కడ గుడారములు వేసుకుంటారు. అక్కడ రుచ్యపదార్థములను తిని ఆడుకుంటారు.

మనవలె, వారికీ, దీపావళిపండుగవున్నది ఇది నవంబరు చివర్లోవస్తుంది. అప్పుడు ప్రతిఇంటిని, ప్రతి దేవాలయమును మఠమును దీపాలతో అలంకరిస్తారు. ఈ పండుగను శాంగ్ జో అంటారు అప్పుడు పిండివంటలు చేసుకుని తిని త్రాగుతారు. పాటలుపాడుతూ నృత్యంచేస్తూ ఆనందిస్తారు. దేవాలయాలను సున్నం కొట్టి బాగా అలంకరిస్తారు. ఆ నడిరేయియందు వారి మతగ్రంథపఠనం రాగంతో చేస్తారు ఇది వినుటకు చాలా ఆనందంగావుంటుంది. పూర్వం టిబెట్టులో కొన్ని సంస్కరణలు ప్రవేశపెట్టిన శాంగ్ జో అనే సంస్కర్త చనిపోయినరోజున చేస్తారు దీనిని. వారు చేసుకునే గొప్పపండుగలలో సంవత్సరాది పండుగ కూడా గొప్పదే. ఇది ఫిబ్రవరి మొదట్లోవస్తుంది. దీనిని లోసార్ అంటారు బుద్ధుడు మారుని గెలిచినందుకు ఈ పండుగ చేస్తారు దీనిని 15 రోజులు చేసుకుంటారు. వ్యాపారివ్యాపారమును, కూలివాడు కూలినీవదిలి పెడ్తారు. ఇళ్లకు సున్నములుకొట్టించుకుని అలంకరించుకొంటారు. దేవాలయ మఠాలను కూడా అలంకరించి, గొప్పగా ఉత్సవం చేస్తారు. అప్పుడు ప్రజలంతా దేవాలయములకు వెళ్లుతారు. పిండివంటలు చేసుకుని తిని త్రాగి విందులు చేసుకుంటారు. ఇందుకు ఆప్తులను పిలుచుకుంటారు. చుట్టాలు స్నేహితులు బహుమతులను విరివిగా ఇస్తారు. లామాలున్న మఠాలలో ఈ పండుగ తతంగం జరుపుతారు. ప్రతివారూ మఠానికి వెళ్ళి వారి తారతమ్యం ప్రకారం కూర్చుంటారు. ముందు పెద్ద బాకా వూదుతారు. దీనితో మంత్రోచ్చారణ ప్రారంభిస్తారు—తర్వాత తప్పెట్లు వాయిస్తారు. ఇది మఠాధిపతి పెద్దలామా తన రాచనగరు వదలి ఇక్కడి

వస్తున్నాడని గుర్తు. తర్వాత ముఖ్యలామాలంతా పట్టు వస్త్రాలతో వస్తారు. తర్వాత మఠాధిపతి, రాచఠీవితో నెమ్మదిగా నడచివస్తాడు. వచ్చి తన సింహాసనంమీద పద్మాసనంలో కూర్చుంటాడు. వీరి ముఖంమాత్రం అందరికీ కనుపించేటట్లు తెర వుంటుంది. తర్వాత ఇద్దరు భయంకరవేషాలలో వచ్చి నృత్యం చేస్తారు. తర్వాత తెల్లటి వస్త్రాలను ధరించిన సన్యాసులు, చేతులలో బంగారు గిన్నెలతో వస్తారు తర్వాతగొప్ప తప్పెట్లు పిల్లనగ్రోవులు, తాళాలు, మద్దెలవాళ్ళు వస్తారు. వీరంతావచ్చి ఒకపక్కన కూర్చుంటారు. అప్పుడు, ఒకపైపునవున్న తెర యెత్తగా అర్ఘాం అనే మంత్రవేత్త వస్తాడు. ఇతని చేతిలో గొర్రె రక్తపు గిన్నె వుంటుంది. ఇతను నృత్యంచేస్తూ చేతులు తిప్పుతూ ఈ రక్తాన్ని ఆ మెట్లమీద చిలకరిస్తాడు. ఈలోగా కొందరు ఆ రక్తాన్ని తుడిచివేస్తారు తర్వాత శాగ్చాం అనే అతను, భయంకరమైన దెయ్యపువేషంలో వస్తాడు అతను అక్కడ నృత్యం చేస్తాడు. ఇతనిని పదకొండుగురు లామాలు అనుసరిస్తుంటారు వీరి చేతులలో కొరడాలు జండాలుంటవి. తర్వాత మళ్లీ తెర తొలగుతుంది చోజాల్ యుం అనే అతను ప్రవేశిస్తాడు. ఇతను స్త్రీ వేషంలో వుంటాడు. అతని చేతిలో త్రిశూలము ఉంచుకుని, పైమెట్లుమీద నృత్యం చేస్తాడు. చివరకు లామాలు నృత్యం చేస్తారు వీరు భయంకరవేషాలతో వుంటారు. భయంపుట్టేకళ్ళూ నొసలు దంష్ట్రలు వుంటవి అప్పుడప్పుడు, పురోహితుడు గంట కొడుతూంటాడు. అప్పుడు వున్న వాయిద్యాలన్నీ మ్రోగుతవి. ఇవి తాళయుక్తంగా వుంటవి. నృత్యం జరుగుతుంటుంది. మేళముల ననుసరించి, ఒకోసారి పెద్దగా, ఇంకోసారి చిన్నగా నెమ్మదిగా, ఇంకోసారి అతి వేగంగా ఆడుతారు. ఇట్లా ఆడి, ఆడి చివరకు మఠాధిపతికి ఎదురుగా సాష్టాంగనమస్కారం చేస్తారు.

తరువాత ఒక అగ్ని చేయబడుతుంది ఇద్దరు సన్యాసులు ఒక కాగితాన్ని తీసుకుని వచ్చి ఆ అగ్నిమీద పట్టుకుంటారు. దానిమీద, వచ్చే సంవత్సరము ఏకీడులు రాకుండా రక్షణ కోరుతారో, దాన్ని వ్రాస్తారు తరువాత లామా ఒకచేతితో మంత్రదండం ఒకచేతిలో గిన్నె వుంచుకుని వస్తాడు: ఆ కాగితము మీద అతను మంత్రములను చెపుతూ తంతు జరుపుతారు. తర్వాత గిన్నెలో వున్న దానిని అగ్నిలో పోయగా అగ్ని ఒక్కసారి భగ్గున ప్రజ్వరిల్లి ఆ కాగితాన్ని నాశనం చేస్తుంది. దానితో అంతా చప్పట్లు కొట్టారు తమ కీడు అంతా పోయినట్లు సంతోషిస్తారు. చివరకు మఠాధిపతి లేచి వెళ్లుతాడు. ప్రజలంతా మహా సంతోషంతో ఇళ్లకు చేరుతారు—పై పూజ అంతా తాంత్రికసంబంధంగా వుంటుంది. ఇది వామమార్గీయమై వుండొచ్చు.

టిబెట్టు జాతీయమతము, లామా మతము వీరు మన సన్యాసులవలె, తల గొరిగించుకుని, వస్త్రాలు కప్పుకుంటారు. ఈ లామాలు రెండు శాఖలుగా వున్నారు. ఒకటి పూర్వపు లామామతము, రెండవది నవీన లామామతము, పూర్వశాఖీయులు నెత్తికి ఎర్ర టోపీని ధరిస్తారు నవీన శాఖవారు పచ్చటోపీని ధరిస్తారు అనాదిశాఖను సృష్టించినవారు ఒక తాంత్రిక ఉపదేశకుడు. ఇతని పేరు బనిపద్మసంభవ్ అంటారు. పద్మంలో పుట్టినందున పద్మసంభవుడంటూ రిబిరిని. కాబూలునదవున్న ఉర్ కెన్ అనే పట్టణంలోని, రాజతోటలో పుట్టెనంట ఈ పద్మం. ఉర్ కెన్ బహుశ ఉజ్జయిని అయివుండొచ్చు. వీరి గ్రంథాల్లో, ఈతని జీవితమంతా చాలా అద్భుతాలతో నింపివున్నది. చాలా అలౌకిక క్రియలను పొందిన సిద్ధుడని వున్నది. ఇతను తంత్రవాది. సంసుకారాలను స్వీకరిస్తాడు. బుద్ధత్వం సామాన్యయోగంవల్ల పొందుట చాలాకష్టం, చాలాకాలం పడుతుందంటాడీయన. అందువల్ల తంత్రక్రియలవల్ల చాలా సులభంగా, వేగంగా బుద్ధత్వం పొందవచ్చునంటాడీయన. ఈయనసిద్ధాంతమంతా వామమార్గమే. 600 సంవత్సరముల క్రిందటి వరకూ ఈ మతము టిబెట్టులో చాలా వృద్ధిలోవుండేది. వీరు మద్య మాంస స్త్రీలోలులైపోయినారు. నీతి నియమం దేశంలో లేకుండాపోయింది అప్పుడు ప్రజలు కన్నులు తెరచారు. ఇందువల్ల చాలా కష్టాలు పొందవలసివుంటుందని, మతమును సంస్కరించ ప్రయత్నించారు. ఈ పూర్వపు శాఖలో, ఇంకా ఉపశాఖలున్నవి. శాక్య. కార్మపాడుక్పాజోడి చేశ్పా మొదలైనవి వున్నవి, వీరంతా వామాయులే. తాంత్రిక గ్రంథాలు టిబెట్టులో చాలా వున్నవి. భారతభూమిలో సంస్కృతంలో వ్రాయబడ్డ గ్రంథాలివి. వీటికి టిబెట్టుదేశీయులు అనేకమంది అర్థములు వ్రాశారు. ఒకొక్కశాఖవారు వారికి అవసరమైనట్లు, మూలగ్రంథములకు అర్థములు వ్రాసి, అపార్థములు కల్పించారు. చివరకు మూలగ్రంథమునకు, ఈ అర్థముకు వ్రాయబడిన గ్రంథాలకు ఏమీ సంబంధం వున్నట్లు లేదట. కవాగుచీ ఈ గ్రంథాలను చాలా సేకరించాడట ఇందులోని అసభ్యవ్రాతలవల్ల, తన పెట్టెలోనుంచి, వీటిని ప్రపంచముకు చూపించలేకపోతి నన్నాడు ఈ జపాన్ శ్రమణకుడు అందువల్ల టిబెట్టులో 11వ శతాబ్దంలో ఈ మతముపై వ్యతిరేకత ప్రబలింది. అప్పుడే భారతభూమినుండి, ఒక ఉపదేశికస్వాములవారొచ్చారు వారి పేరు పాల్ దాన్ అటిశా. వీరు పూర్వ

మతాన్ని సంస్కరించి, నవీన శాఖను ఏర్పరచారు. తరువాత 3 శతాబ్దముల అనంతరము టిబెటు దేశీయుడే ఒకరు ఈ నవీనశాఖను వృద్ధిచేశారు ఇతని పేరు జె-సాంగ్-ఖా-పా అంటారు ఇతను ఉత్తర టిబెట్టులో, అమ్‌డో అనబడుచోట ఉల్లిపాయల మడిలో పుట్టాడు. పాతశాఖీయులు ఎంత నైచ్యంలోనికి దిగజారింది చూచి విచారించాడు; పాతమతాన్ని చాలా సంస్కరించాడు మతాధిపతులు, సన్యాసులు నీతి మీద ఆధారపడవలెనని బోధించాడు. నీతి లేనివాడు ప్రజలు కూడా యమలోకానికి వెళ్లవలసివస్తుందని బోధించాడు. ఇతడు ప్రజలకు చేసిన మేలువల్లనే, ఇతను పరలోకగతుడైనదినమందు, టిబెటీయులు ప్రతి సంవత్సరము దీపావళిపండుగ చేసుకుని ఆనందిస్తారు. లామాలు ఇప్పుడు మత, ప్రభుత్వాల అధికారులై వున్నారు. కాని పూర్వం మాత్రం లామాలు ఒక్క మత, ఆధ్యాత్మిక అధికారులే అప్పుడు దేశమంతా, 13 కుటుంబాల అధికారం క్రింద వుండేది అప్పుడు మంగోలియా నాయకుడు, టిబెట్టుమీదకు దండయాత్రకు వచ్చాడు. ఇతని పేరు శ్రీ గాడ్మీ జెంఘిజ్ చోగ్యాల్. ఇతను పూర్వపు 13 కుటుంబాలవారిని తొలగించి వారి అధికారాన్ని నాశనం చేశాడు. అనేకుల క్రిందవున్న టిబెట్టు అధికారాన్ని ఒక్క పెద్ద లామాకు స్వాధీనం చేశాడు. అప్పటినుండి మతంతోపాటు రాజ్యంకూడా లామాల అధీనంలో వున్నది. లామాలు కర్మసిద్ధాంతాన్ని నమ్ముకుంటారు. అందువల్ల పునర్జన్మ వున్నదని నమ్మి, దానిని ఆచరణలో పెట్టుతారు వీరు చనిపోయిన 49 రోజుల తర్వాత, ఈ లోకంలో జన్మిస్తారని నమ్ముతారు. ప్రతిలామా ప్రజోద్ధరణకై తాము మళ్ళీ జన్మిస్తామంటారు

నాలుగు శతాబ్దముల క్రింద ఈ లామాల పునర్జన్మ సిద్ధాంతాచరణ విచిత్రంగా ప్రారంభమైంది. గెన్‌డెన్‌టబ్ అనే లామా చనిపోతూ, తాను మళ్ళీ జనిస్తాను. ఆ జన్మించిన తనను తీసుకువచ్చి మళ్ళీ తన లామా స్థానంలో ఉంచమని చెప్పిపోయినాడు అప్పుడు దేశమంతా వెదకగా ఈతని గుర్తులున్న పిల్లడు కనుపించాడు. ఆ పిల్లడు తానే ఆ లామానని చెప్పాడట. ఇంకేం. ఆ పిల్లవానిని తీసుకునివచ్చి, పూర్వపు లామా స్థానంలో వుంచారు తర్వాత కొంతకాలానికి సోదిని కనిపెట్టారు. సోదివాళ్లు సమస్తం చెప్పవచ్చంటారు. లామా చనిపోయినప్పుడెల్లా పురోహితుని సోది అడుగుతారు. ఈ సోది చెప్పుటకు నాలుగు మతాలున్నవి. ఇవి, నేచంగ్, శామ్యే, లామో, గాటూంగ్. సోది అడగటము, చాలా తతంగం జరుగుతుంది. మతాధిపతులలో ఒక లామా, పై నాలుగు మతాలలో ఒకదానివద్దకు వెళ్లుతాడు. సోది అడిగేటప్పుడు, ఇతనికి అనుయాయులుంటారు. వీరంతా తప్పెట్లు తాళాలు కొట్టుకుంటారు సోది చెప్పే ఆయన బాగా అలంకరించుకుంటాడు. తలపాగా చుట్టుతాడు. సోది అడిగిన తరువాత ఆ మతదేవతను తనమీదకు పూనకం తెచ్చుకుంటాడు. కొంతసేపటికి ఊగటం ప్రారంభిస్తాడు. పూనకం ఎక్కువైనకొలదీ ఎగరటం, పడటం వుంటుంది. పూనకం పూర్తిఅయిన తర్వాత సోది చెప్పతాడు ఫలాని తాలూకాలో, ఫలాని గ్రామంలో, ఫలాని కుటుంబంలో, ఫలాని పిల్లడున్నాడని చెప్పతాడు ఒకోసారి, ఈ సోది కుదరనప్పుడు, నాలుగు మతాలవారు చేరి, తలో పేరు చెప్పతారు ఈ పేరులన్నీ కాగితాలమీద వ్రాసి, లాటరీగా తీస్తారు. ఆ వచ్చిన అతనిని అధికారిగా స్వీకరిస్తారు అమెరికా జడ్జి, డగసు దీనిని గురించి ఇట్లా వ్రాశాడు హెమిన్ లామా చనిపోయిన తర్వాత, సోది అడుగగా ఇతనికై, ఒక పిల్లవాణ్ణి తీసికోమని చెప్పారట చనిపోయిన లామా చేతికి, చేతిగడియారం వుండేదట. కాలివద్ద మచ్చ వున్నదట ఈ చెప్పినబిడ్డకు కూడా యెడమచేతిన మచ్చ, కాలినమచ్చలు వున్నవట ఈబిడ్డ లడక్, లడక్ అంటూవుండేవాడట ఇతనిని, ఆ మఠంలోనికి తీసుకుని పోగా, అందులో కొన్నిటిని గుర్తుపట్టాడట ఈ పిల్లడు. ఆ బిడ్డ పాలుత్రాగుతుంటే, తలిదండ్రులే వుంచుతారు కొంతకాలమైన తరువాత, మఠంలోనికి తీసుకువెళ్లి, వారికి తగు విద్యాబుద్ధులు గరపుతారు. ఈ పిల్లడు పెద్దవాడైనదాకా ఇతర లామాలు అధికారంలో వుంటారు. సోదిచెప్పేవారికి చాలా అధికారం వుంటుంది. రాజకీయ వ్యవహారములకు కూడా టిబెటులో సోది అడుగుతారు. ఒక మంత్రి తప్పుచేసినప్పుడు, కూడా సోది అడుగుతారు-మంత్రుల తలలు కూడా వీరి చేతిలో వుంటవి

ప్రజలు లామాల ఆశీర్వచనముకై ఎగబడతారు. ఏ జబ్బుచేసినా, కష్టంవచ్చినా తాయత్తులను తీసుకుంటారు. వీరి ఆశీర్వచనము నాలుగు విధాలుగా వుంటుంది. తమ సరివారు వచ్చినప్పుడు, తమ భ్రూస్థానమును ఎదుటివారి శిరస్సునంటుంచి, ఆశీర్వదిస్తారు. పెద్దమనుష్యులు వచ్చినప్పుడు, లామాల రెండు చేతులు, ఎదుటవారి శిరస్సునవుంచి ఆశీర్వదిస్తారు క్రిందివారు వచ్చినప్పుడు ఒక్క చేతిని, శిరస్సునవుంచి ఆశీర్వదిస్తారు. తక్కువవారు వచ్చినప్పుడు, లామాల చేతిలోని బెత్తమును ఎదుటివారి తలయందు వుంచి ఆశీర్వదిస్తారు.

అనేక యోగగ్రంథాలు, గుప్తవిద్యలుకల గ్రంథాలు టిబెట్టులో వున్నవని తెలుసుకున్నాము. ఇవి దొరకే పుస్తకవిద్యా, అనుభవవిద్యా అని తెలుసు

కోసవలెను. వారి సిద్ధులనుగురించి, ఒక ఫ్రెంచి వనిత విపులంగా, తను చూచినవాటినిగురించి వ్రాసింది. ఈమె పేరు అలెగ్జాండ్రా డేవిడ్ నీల్. టిబెట్టులో చాలామంది అష్టసిద్ధులను పొందినవారున్నారనీ, తను చూచానని వ్రాసింది. గాలిలో తేలియాడుతూ ఒకరు వెళ్లుతుండగా తాను చూచానని వ్రాసింది. తన సంగతి, ఒక సాధువు చెప్పాడని, భవిష్యత్తు చెప్పాడని, భవిష్యత్తు అతను చెప్పినట్టుగా జరిగిందని ఇతరుల ఆలోచనలను తెలుసుకొనుట, తమ వార్తలను దూరదేశములకు పంపుట తాను చూచానని చెప్పింది. భూమికలుతినే కటకచలిలో కొందరు దిగంబరులుగా వున్నారట. వీరికి చలివల్ల ఏబాధ లేదట. ఈ విధానాలనుకూడా తన పుస్తకంలో వ్రాసింది

ఆకాశగమనమునకు టిబెటీయులు ఈ క్రింది విధంగా సాధన చేస్తారు. పద్మాసనంలో కూర్చుంటారు. తర్వాత ప్రాణాయామం ప్రారంభిస్తారు. వాయువును బహు నెమ్మదిగా లోనికి పీలుస్తారు. లోనికి పీల్చేటప్పుడు వారి శరీరమంతా ఆ గాలితో నిండిపోతుందని భావిస్తారు తర్వాత కుంభకం చేస్తారు. అప్పుడు నాడీప్రకోపం కలుగుతుంది ఇందువల్ల సాధకునికి ముందు వణుకు వస్తుంది. తర్వాత కప్ప ఎగిరినట్లు ఎగురుట ప్రారంభమౌతుంది. తర్వాత పైకిలేచి పరుగు వస్తుంది. ఈ సాధన చాలాకాలం చేసిన తరువాత, శరీరము, దూదివలె చాలా తేలిక అవుతుంది. కొందరు చాలా ఎత్తు లేస్తుంటారు. తరువాత ఆకాశగమనం వస్తుంది. ఇందులో, లం, గం, అంటుంటారు— ప్రణవోచ్చారణవలె. సాధకుడు తాను వెళ్లవలసిన చోటు జ్ఞాపకముంచుకోవాలి. వెళ్లేటప్పుడు ఈలోక స్పృహ వుండదు. తాను చేరవలసిన చోటు చేరిన తరువాత ఈ స్పృహ కలుగుతుంది.

చలిలో, అగ్ని లేకుండానే, వేడిని తెచ్చుకుంటారు. యోగసాధనవల్ల. దీనిని ట్యూమో అంటారు. దీనిని ఇళ్లల్లో చేయరు. పొగ, వాసనలు ఈ సాధనకు ఆటంకాలు. సాధన చేయబోవునప్పుడు భోజనం చేయకూడదు. మంచులో దిగంబరులుగా కూర్చుంటారు. పద్మాసనంతో కూర్చుంటారు. నెమ్మదిగా, రేచక, పూరక, కుంభకాలను చేస్తారు మనస్సును ప్రశాంతంగా వుంచుకుంటారు. తన బొడ్డునందు, మణిపూరక చక్రమును భావించాలి. ఇది జఠరాగ్ని వున్నచోటు. ఇందులో ప్రకాశవంతమైన సువర్ణపద్మము వున్నదని భావిస్తారు. ఈ పద్మంలో రం, అనే బీజాక్షరముంటుంది. ఇది సూర్యునివలె ప్రకాశిస్తుంది. రం మీద, మా అనే బీజాక్షరముంటుంది. డోర్జీ నాల్ జోర్మా అనే స్త్రీ దేవత, ఈ మా అనే బీజాక్షరము నుండి ప్రకాశిస్తుంటుంది రం అనేది అగ్ని బీజాక్షరము. ఈ అక్షరమును శాస్త్రోక్తంగా ఉచ్చరించినయెడల, అగ్ని ఉద్భవించును దీనిని ధ్యానతో కలిపి ఉచ్చరిస్తూ ప్రాణాయామం చేయాలి కుంభకసిద్ధిపొందిన అగ్ని ప్రజ్వరిల్లును మనలో సుషుమ్నను కూడా అగ్ని నాడి అంటారు. సుషుమ్నా నాడిలో వాయువు ప్రవేశించినప్పుడు కుండలిని మేల్కొల్పును ఇది అగ్ని పుట్టించును. సాధకుడు తన మనస్సుతో జ్యోతిని (అగ్నిని) ధ్యానించాలి. ప్రారంభంలో సుషుమ్నా నాడి వెంట్రుకవాసిగా వున్నప్పటికీ, తాను చేయు ప్రాణాయామంలోని వాయువు వత్తిడివల్ల, సుషుమ్నా నాడిలోని అగ్ని ప్రజ్వరిల్లుచున్నట్లు భావిస్తారు తరువాత ఈ నాడిని అంగుష్టమాత్రంగా భావిస్తారు ఇది అరచేతి ప్రమాణం అయినట్లు భావిస్తారు ఈ సుషుమ్నా నాడి శరీరమంతా నిండిపోతుంది. శరీరమంతా, జ్యోతులు వాయువులతో నిండుతుంది ఈ నాడి ప్రపంచమంతా వ్యాపిస్తుంది. అందులో సాధకుని శరీరం కనుపించదు. కొంతసేపటికి, ఈ తుపాను వాయువు జ్యోతిసముద్రము తగ్గి, సాధకుని శరీరంలో లీనమైపోతవి నాడి ఎటూ పెద్దదైందో, అట్లే తగ్గిపోతుంది. ఈ విధంగా వారు అగ్ని పుట్టించి, ప్రజ్వలింప చేసి, తగ్గించి వేస్తారు.

సాధకులు ఎక్కువగా మౌనంగా వుంటారు. టిబెట్టులోని ప్రజలు చాలా తక్కువ అందువల్ల చిత్తవృత్తుల వత్తిడీ చాలా తక్కువగా వుంటుంది అయినప్పటికీ సాధకులు ఏ పర్వతప్రాంతముకో పోయి, ఏకాంతంగా వుంటారు. సాధకులకు విరివిగా మఠాలు వున్నవి ఇందులో సాధన చేస్తూ ఏళ్ళు తరబడిని వుండవచ్చు. సాధన సంధ్యవేళల, రాత్రిళ్లు చేస్తారు. పగలు చేయరు సాధకుడు ఎప్పుడూ చీకటినే కోరుకుంటాడు ఈ చీకటిలో వారికి అనేక విచిత్ర దృశ్యాలు కనుపిస్తుంటవి. చిన్నవి, పెద్దవి జ్యోతులును కనుపిస్తవి. మాట్లాడవలసి వస్తే, స్పష్టంగా మాట్లాడుతారు లేనియెడల పలకమీద వ్రాస్తారు. సాధకునికి మౌనవ్రతనియమం సామాన్యంగా సంవత్సరం వుంటుంది శాస్త్రప్రమాణము, ౩ సంవత్సరముల, ౩ నెలల, ౩ రోజులంటారు. కొందరు తీవ్రసాధకులు దీనికి రెండు, మూడు రెట్లు చేస్తారు. కొందరు మరణాంతము మౌనవ్రతులై వున్నారని స్వెన్ హెడెన్ వ్రాశాడు. వీరికి ఒక గది ప్రత్యేకంగా వుంటుంది. సాధకుడు దానిలోనికి వెళ్ళిన తరువాత, ఆ గది వాకిలిని, రాతితో అడ్డంగా గోడకట్టుతారు. ఆ సాధకునికి అన్నం ఇవ్వటానికి, ఒక కంతమాత్రం వుంటుంది. ఇకను ఎటూ వెలుతురు పోదు లోనికి అన్నము రోజూకు

# టిబెట్ దేశము

ఒకసారి తీసుకుని వచ్చి, ఆ కంతలో ఉంచుతారు లోని సాధకుడు ఆహారాన్ని తీసుకుని, తాను తిన్నన్నిటి పళ్లెమును బయటకు నెట్టతాడు. రోజుకొక్కసారిమాత్రం ఇతను భోజనం చేస్తాడు. ఆరురోజులకొకసారి టీ త్రాగుటకు ఇందుకు టిబెట్ వారు సామగ్రి ఇస్తారు ఇంతకన్నా అతనికి బయటిప్రపంచంతో పనిలేదు. అతను లోపల మతగ్రంథపఠనం చేస్తాడు మంత్రోచ్చారణ చేస్తుంటాడు కొంతసేపు మౌనంతో కాలం గడుపుతాడు. 7 రోజులవరకు అతని అన్నపుపళ్లెం బయటకు రానియెడల, ఇతను పరలోకగతుడైనాడని అర్థము. అప్పుడు ఆ గది వాకిలి అడ్డుగోడ పగలగొట్టి అతని శవాన్ని బయటకు తీస్తారు. టిబెట్ దేశీయులు చనిపోయినవారికి చాలా కర్మకాండ చేస్తారు మనవలె అగ్నిసంస్కారంగాని, భూనిక్షేపంగాని చేయరు. కాళ్ళు, చేతులు, తల నరికి నదిలోగాని, కొండలమీదగాని పడవేస్తారు పక్షులు పీక్కుతింటవి చనిపోవునప్పుడు మనలో నారాయణ, నారాయణ అన్నట్లు వారు మణిపద్మమంత్రాన్ని జపించుతారు.

మణిపద్మమంత్రము, మన గాయత్రీమంత్రము వంటిది. టిబెట్టువారు దీనిని ఎప్పుడూ స్మరిస్తుంటారు. తాయత్తులలోను దీనినే వ్రాస్తారు గోడలమీద, చెట్లమీద, పర్వతాలవద్ద, దార్లలో ఈ మంత్రమే కనుపిస్తుంది. జండాలమీద వ్రాసి ఎగురవేస్తారు. దీనిని శాస్త్రోక్తంగా ఉచ్చరించేయెడల అష్టసిద్ధులు లభిస్తవని వారి నమ్మకం. ఈ మంత్రం పూర్ణస్వరూపము 'ఓం మణిపద్మేహూం' ఇది సంస్కృతభాషా మంత్రము. దీని అర్థము పద్మములోని మణి అని. కొందరు దీనికి హృదయపద్మంలో మనస్సు అనే మణి అనీ, కొందరు పద్మంలోని బుద్ధుడనే జ్యోతియని, కొందరు పద్మంలో జ్ఞానజ్యోతియని అర్థం చెప్పుతారు ఈ మంత్రములోని ఆరు అక్షరములకు ఆరు రంగులు, అధిష్టానము లున్నవంటారు. (1) ఓం, తెల్లగావుండే దేవతతో సంబంధించింది. (2) మ, నీలిరంగుగా వుండే దేవతలు కాని వారితో సంబంధించింది. (3) ణి పసుపుపచ్చగా వుండి, మానవసంబంధమైనది (4) పద్ ఆకుపచ్చగా వుండి, జంతుసంబంధమై వున్నది. (5) మే, ఎర్రగా వుండి అమానవత్వంతో సంబంధించింది. (6) హూం, నల్లగావుండి, సాధకులకు సంబంధించింది. శత్రువులతో హూం యుద్ధనాదము.

ఎర్రటోపీ సాధకులు, తాంత్రికులు ఇంకొక మంత్రాన్ని జపిస్తారు. ఇది 'ఓం వజ్ర గురు పద్మ సిద్ధిహూం' అని వారు జపిస్తారు దేవతలముందు ఎప్పుడూ ఈ మంత్రోచ్చరణ చేస్తుంటారు. వీరికి సారాని దాహంగా ఇస్తారు. కొన్ని దేవాలయాలలో సెరా వంటిచోట కూడా మాంసాహారాన్ని ప్రసాదంగా ఇస్తారు ఇతర సాధకులు వీటిని ఎక్కువ సేవిస్తారు. రోజుకొక్కసారి బార్లీ ఆహారాన్ని భుజిస్తారు.

ప్రాణాయామంవల్లనే అష్టసిద్ధులను పొందవచ్చునంటారు. మనస్సును స్వాధీనం చేసుకొనుటకు శ్వాసను ముందు స్వాధీనం చేసుకోవలెనంటారు. శ్వాస గుఱ్ఱం, దానిమీద స్వారిచేయునది మనస్సని అంటారు.

ఉడ్యాణ, నౌలి కర్మలను కూడా సాధకులు చేస్తారు. అతని పొట్టవంక చూచి, ఆ సాధకుని సాధన అప్పుడే గ్రహిస్తారు. ఇందువల్ల ఆకాశగమనము, సమాధిసిద్ధి కలుగుతుందని అంటారు

మనోసాధనలను కూడా అనేకవిధాలుగా చేస్తారు ప్రారంభకుడు ఏకాంతంగా కూర్చుని తన మనోవృత్తులను చూస్తుంటాడు ఈ మానసిక చిత్రములను ఆప ప్రయత్నించడు. దారినపోయేవార్ని చూచినట్లు చూస్తుంటాడు తర్వాత ఈ నాటకాన్ని ఆపుటకు ఏకాగ్రతను ప్రయత్నిస్తాడు అతను ఏ వస్తువును ధ్యానిస్తాడో, అతను ఆ వస్తువుని భావిస్తాడు. తర్వాత దేవతను కన్నుఆర్పకుండా చూస్తాడు. కళ్లు మూసుకున్నప్పుడు, తాను చూచిన దేవత కనుపించాలి హారతి కర్పూరమును వెలిగించి, దీనినికూడా ధ్యానిస్తాడు. తర్వాత తన శరీరంలోని చక్రాలను ధ్యానిస్తాడు. సాధనలో అనేక విదర్శనములు కనుపిస్తవి. సాధనా సంగతము గురువు శిష్యునికిట్లా బోధిస్తాడు. ఈ ప్రపంచమంతా మిథ్య ఇదంతా మానసికకల్పన మనోనాశనంతో నిర్వాణసిద్ధి కలుగుతుంది.

మనోబలంతో వారు అనేకచిత్రాలను చేస్తుంటారు జలమును, విభూతిని మంత్రించి మనోబలంతో అనేక చికిత్సలు చేస్తుంటారు. ఆరితేరిన సిద్ధులు' దేవతలను, దెయ్యాలను కూడా కనుపించేట్లు సృష్టించగలరు. కొన్ని సమయాల్లో సృష్టికర్తకు, ఆ సృష్టించబడ్డ భూతాలకు పోరు జరుగుతుంటుంది. లామాలు తాము కోరుకున్నప్పుడే చనిపోగలరు. చనిపోయిన తరువాత వారి జీవులు అందరికి కనుపిస్తుంటారు; బ్రతికివున్నప్పటివలెనే వుంటారట.

---

NB జపాన్ దేశీయ శ్రమణకుడు కవాగుచీ, స్వీడెన్ దేశీయుడు స్విన్ హిడెన్, అమెరికా జడ్జి డగ్లస్, ఫ్రెంచివనిత అలెగ్జాండ్రా డేవిడ్ నీల్. స్వామి ప్రణవానంద రచనల ఆధారంగా వ్రాశాను.

# ఆకుజోడు

"శండిల"

"ఆకుజోడు చూస్తారా తల్లీ! చెమ్కీ తాపి కుట్టానండి. గట్టి అట్టలు - కొరికెయ్యా గట్రా లేవండి" అంటూ ఒక పడుచుపిల్ల పాదాలముందు పడేశాడు గడ్డెయ్య "అత్తయ్యా! పుచ్చుకోమంటారా?" అని ఆమె తన వెనకాల నేవున్న వితంతువునడిగి ఆవిడ ఆమోదానికైనా ఆగక తన సున్నితమైన చరణాల్ని చెప్పుల జంటలోకి పోనిచ్చింది

"అమ్మగారూ! చక్కగా అమిరాయండి. మంచి పనితనం ఒకటి తీయించండి" చిరునవ్వు చిలికే కళ్ళతో అన్నాడు గడ్డెయ్య కొత్తజోడులు క్రొత్త జోడులో పాదాల్ని అటూ ఇటూ జరిపి "ఎంతేమిటి?" అనడిగింది

"రెండున్నరండి" అన్నాడు మాదిగ.

మళ్ళీ ఆ పిల్ల "ఏం?" అన్నట్లు ప్రశ్నార్థకంగా అత్త మొగంలోకి చూసింది. "ఏం సురతాణి పోకడలమ్మాయివీ?" అన్నట్లుగా ఆమె మూతి ముడిచింది ఇదిచూచిన గడ్డెయ్య ముఖం నిరాశతో ముడుచుకుపోయింది. "పట్టుకెళ్ళబ్బీ! ఇప్పుడొద్దులే" - అయిష్టతను గొంతులో స్ఫుటీకరించి జోడును వదిలేసింది ఆ లేత యిల్లాలు.

ప్రొద్దుటినుంచీ యిప్పటిదాకా ఎన్ని తిరస్కారాలు తిన్నాడో గడ్డెయ్య, దిగాలుపడ్డ మనస్సుతో ఆ జత తీసుకుని బుజమ్మీది గుడ్డపాతతో తుడిచి తట్టలో పెట్టుకున్నాడు. అందులోవుంటాయి దాదాపు పదింటికిపైగా ఆకుజోళ్ళ జతలు-అన్నీ ఆడవాళ్ళు తొడుక్కునేవే. ఇంక ఘడియకో, అరకో ప్రొద్దు క్రుంకుతుంది గోదావరి స్టేషనుమీద. శ్రావణమేఘాలు వున్న కొస్త వెలుగునూ మబ్బులో దాచుకుంటున్నాయి. తుషారంకూడా మొదలయింది మెయిలుకు. వెళ్ళే జనంతో ప్లాటుఫారమంతా కిటకిటలాడుతోంది. అటు ఇటు ఆడువారున్న స్థలాలన్నీ అప్పటికి నాలుగైదు సార్లు తిరిగిన గడ్డెయ్య "ఏంచేస్తాను-ఈ పూటకూడా పస్తే రాశాడేమో-ఇది మూడోరోజు యింటిల్లిపాదీ గంజిదాగడం మానేసి" అనుకొని స్టేషను వదిలిపెడుతున్నాడు మళ్ళు మొగంపట్టిన వాడు బిక్కపోయి ఏమీ తోచనట్టు మళ్ళీ స్టేషనునాకనూ, ఓవర్‌బ్రిడ్జి మూలలను నిలుచున్న వనితలవైపు "ఏ తల్లికన్నా కరగలేదే" అనుకుంటూ చూస్తూ, అడ్డొచ్చిన జనాన్ని తప్పించుకొని వచ్చేస్తున్నాడు. అలా గబగబ వేసుకుంటున్న గడ్డెయ్య ఆడవాళ్ళ వెయిటింగు రూమ్ముందు ఆగాడు

మధ్యాహ్నంనుంచీ చాలాసార్లు చూచిన గదినే మళ్ళీ చూశాడు. అక్కడ ఏమీ మార్పు అంతగా అవుపించలేదు అయితే ఒక చిన్న భేదం అతన్ని ఆకర్షించింది. అప్పటిదాకా లోపల పేము పడకకుర్చీలో వున్న నవయౌవన లావణ్యవతి ఒకామె బయటకు వచ్చి గుమ్మందగ్గర నిలబడడమే అది. తుమ్మెదరెక్కల్ని మరపించే నీల కుంతలాలతో, తలపై తురుముబడ్డ మల్లెపూలదండతో, గుమ్మని వాసనలు చిమ్మే సెంటు తలనూనెతో, వదనంపై పులుముబడ్డ పౌడరు తెలుపుతో, శ్రావణ సంధ్యారాగంలో మెల్లగా వీచే చల్లగాలికి రెపరెపలాడే వాయిలు చీరెలో పొంగుపరుపబడివున్న ఆ పడుచు—విద్యార్థినిగా లేమో గూడా—ఈ ఆకుజోడులో పాదాలిముడుస్తుందా? ఆమె ఎత్తు మడమల స్లిప్పర్లు గానీ వాడదేమో! అనే అనుమానం మళ్ళీ మెదిలింది వాడి యెదలో. అయినా ప్రయత్నిద్దాం అనుకొని "అమ్మ - జోడు జూస్తారా" అని ఆమెలో ఔత్సుక్యాన్ని రేకొల్ప ప్రయత్నిస్తూ దీనంగా ప్రస్తావించాడు.

"ఏం జోడూ—ఏదీ" అని ఆమె అయిష్టం ప్రకటిస్తూనే అడిగింది.

ఏదో నా దుగ్ధ తీరక అడిగానే గాని యీమె నిజంగా పుచ్చుకుంటుందా—అనుకుంటూనే తుప్పరకు గానీ తడిసిపోతాయేమో అనే బెంగతో తన

పైపడ్డ కప్పిన తట్టలో వున్న జోళ్లు అలాగే చూపించాడు గడ్డెయ్య. ఆమె ముఖం వంచి వాటిని జాలిగా చూచింది. కరుణరసం ప్రస్ఫుటం చేస్తూనే "వద్దులే" అనేసింది. ఉదయంనుంచీ తనను తాకిన ఏ తిరస్కారం వలెనూ ఇది లేదు. వాటిలో ఒక్క దానిలోనూ ఆశ లేశమైనా లేదు. దీనిలో గడ్డెయ్యకు ఏదో వెర్రి ఆశ కనుపించింది ఆమె వాణ్ణి నఖశిఖపర్యంతమూ పరీక్షించి కళ్లల్లోకి అదోకలాగ చూసింది గడ్డెయ్య ప్రక్కకు తప్పుకున్నాడు మెయిలు ఎంత లేటో అనుకుని విసుక్కుంటున్నట్లు ప్రయాణీకులు విసుగ్గా తచ్చాడుతున్నారు. చీకటి వచ్చేస్తోంది గోదావరిమీది నుంచి రైయ్యిమంటూ గాలి చల్లదనంతో జనం పైకి దాడి వెడలింది. అందరితోబాటు, కొంచెమించుమించు హాయిగానే కావచ్చు గడ్డెయ్య వణకాడు. తలుపు వారనుంచి ఆ పడుచు ఇంకా వాణ్ణి, వాడిలో ఆశను బలీయం చేస్తూ, చూస్తూనే వుంది. ఇంతలో ఉరిమింది ఆకాశం టపటప ప్లాటుఫారమ్మీది ఆస్బెస్టాస్ రేకును చప్పుడు చేసింది జడి దూరాన దానవాయిపేట అవతలి జీడిమామిడిచెట్లతోటదగ్గర వున్న గుడిసె, అందులో మూలకి వొదిగి కూర్చున్న తనభార్య యారీ, కొడుకు బుడ్డిగాడూ, కూతురు మాలీ వణుకుతూ మెదులుతున్నారు, కడుపు లాకలితో చేతబట్టుకుని—చినుకులు హెచ్చై వానగా మారిపోతూంటే ఎదుటివైపు కుమాసే గడ్డెయ్య స్మృతిపథంలో—మాయవాన అలా గంత సేపు కురిసిందో—

ఆఖరుసారిగా అతిదీనంగా ప్రయత్నించి "అమ్మా—గొప్పోరిలా వున్నారు ఒక జత తీయించండి మూడునాళ్లనుంచీ గంజిలేక మాడుతున్నాం ఇంటిల్లిపాది మీని—మీకు పుణ్యముంటాది. రెండు న్నరజోడు రెండుకే యిస్తా"—ప్రార్థించాడు. ఆమె కదిలింది. ఎదలో ఏమో మెదిలి వుండాలి యీ యమ్మకు నాపై కనికారం అనుకొని గడ్డెయ్య గంపె డాశతో గంప ఆమె ముందుంచాడు. చొరవగా ఆ పడుచు ఎదుటి ఎలక్ట్రిక్ దీపపు వెలుతురులో మహా కొనే దానిలాగా చకచక జోళ్ళ నన్నింటినీ తీసి చూసింది. దాదాపు అన్నింటిలోను కాలుంచి యిటు అటు ఆడించింది. "వదులయి పోవూ?" ఎందుకో అడిగింది.

"చలనం లేని పనితనం. వాడితే మీకే తెలుస్తుంది" గడ్డెయ్య మదుపు చేశాడు. ఆమె గంపంతా చిందరవందర జేసినా కావాలిసినట్టు జోడు కుదిరింది గాదు. "అబ్బే—వద్దులే" అనేసింది విస్పాటంగా. వర్ణింపనలవి కాని నిరాశ ముసిరింది గడ్డెయ్య ముఖమ్మీద "చాలు తల్లీ- చాలు. ఆకాడికివన్నీ కలి పెయ్యాడ మెందుకండీ" అని రుసరుసలాడాడు. వాడి స్వాభిమానానికి ఆమె అదోకలాగున నవ్వుకుంది. జోళ్ళు గంపలో సర్దుకొని "అంటే కోపమొస్తుంది తమకి ఇందులో ఏజత నప్పలేదమ్మా?" అన్నాడు ఎత్తుకొంటూ—

"కాదు — నప్పాయి అన్నీ — కానైతే నచ్చొద్దూ" ఆమె మళ్లీ నవ్వింది.

"మంచిదే లెండి" అని కదులుతున్నాడు ఆమె ముఖంలోకి ఎలక్ట్రిక్ లైటు వెలుతురులో మళ్ళీచూసి. అయితే గడ్డెయ్య సాహసించి వెళ్లిపోలేక పోతున్నాడు. ఆవిడ తన్ను పరీక్షిస్తోందా అనిపించింది. మనిషిలో ఆశ అంత చెడు యింకేమీ వుండదు ఇంతలోకే మనసు తిరగేసుకున్నాడు

ఎదురుగా వంతెన క్రిందనుంచి మీదనుంచీ రొద చేసుకుంటూ సాగిపోయే కార్లు, బళ్లు, మనుషుల సొదను భేదిస్తూ, చెవులను దద్దరిల్ల చేసేలా గర్జిస్తూ కూతబెట్టుకుంటూ మద్రాసు మెయిలు వచ్చి పడబోతోంది. ప్రయాణీకుల రద్దీ యెక్కువయ్యింది. "పోర్టర్— పోర్టర్" గట్టిగా అరచింది ఆమె కూలీజాడ అవుపడ లేదు. మెయిలు వచ్చేసింది అట్టేసేపు ఆగదు— "ఒరే అబ్బీ! కూలీ ఎక్కడ చచ్చేడో ఏమో—ఈ పెట్టె బెడ్డింగూ పట్టుకుని ఆడవాళ్ల పెట్టెలో ఎక్కించు అని ఆజ్ఞాపించింది గడ్డెయ్యను. గడ్డెయ్య గంప వాకవారనవుంచి చటుక్కున పైబడ్డ దుట్టికుదురుగా వుంచి ఉంచండి అన్నాడు. ఆమె, అతని ఆసరాతోనే పెట్టెనెత్తి కెత్తింది చేత్తో బెడ్డింగు పట్టుకున్నాడు. చర చర నడుస్తోంది. ఈమె అడుగులు నా ఆకు జోడులోంచి పడితే ఎంత ఆనందంపొంగేవాడినో" అనుకుంటూ ఆమెను అనుసరించాడు.

ఆడవాళ్ల పెట్టెముందు ఆగింది ఆమె. గడ్డెయ్య లోపలికెక్కి ఖాళీగా వున్న బల్లమీద పెట్టే, బెడ్డూ వుంచాడు. ఆమె చిల్లరకోసం చేతిరొక్కం సంచి తడిమి "చిల్లర లేదే" అంది. "అమ్మగారూ - కనికారంవుంచి ఒక జత బుచ్చుకోండి" అన్నాడు. ఆమె హృదయం

జాలితో కదలిపోయింది. "సరే పట్టుకురా" అనిమాత్రం అనగలిగింది. అంతులేని సంతోషంతో ఒకే ఒక్క గెంతున వెయిటింగురూం వార గంపవద్ద వాలాడు గడ్డెయ్య.

గార్డు విజిలూదాడు. ఎర్రదీపాన్ని పచ్చదీపంగా మార్చేసి వూపుతున్నాడు. చీకటిలో ఆమె వున్న పెట్టి వైపు వెర్రిగా పరుగుతీస్తున్నాడు గడ్డెయ్య. టూరెన్తో ఇంజను వాడికుండెలు బద్దలయ్యేటట్టు గాండ్రించి ఒక్క లాగులాగింది మెయిలును ఆ లగువులోనే వేగం అనింది, వేగంగా గుండెలు కొట్టుకునే గడ్డెయ్యకు. వాడు అట్టే శ్రమపడనక్కరలేకుండానే ఆమె పెట్టె ఎదురయ్యింది. మెయిలుతో గంప చేతబట్టుకొని పరుగెడుతున్నాడు. ఆమె సాహసించి ఒక జత వంగి లాక్కుంది తట్టలోంచి—రెండు కాగితాలు వాడిచేత వుంచి. తొక్కిడిలో అవి నలిగిపోయాయి. మెయిలు సాగింది. వేగంగానే సాగింది.

త్రుటిలో ఆగిపోయింది మెయిలు. ఎవరో ఎక్క వలసిన ప్రయాణీకులుండి లోపలివారు గొలుసులాగి వుంటారు. ఏదో ప్రమాదం జరిగిందన్నట్లు గార్డు ఎర్ర దీపం చూపించాడు. గడ్డెయ్య ఆ అవకాశం పురస్కరించుకొని ఆపదనుండి తప్పుకొన్న ప్రాణి పొందే ఆనందాన్ని చిందించే ముఖంతో ఆమె నిలుచున్న పెట్టెవద్దకు పరుగున వచ్చాడు. అపుడే ఆ పెట్టె ప్లాటుఫారం దాటింది. కొన్ని గజాల దూరంలో గోదావరి వంతెనమీదినుంచి మెయిలు యింజను చీకటిలో చిక్కగా కలిపేసి పొగను వదిలేస్తోంది, తగ్గుముఖం పట్టిన వానలోంచి ఆకాశంలోకి.

"ఏం రా మళ్లీ వచ్చావ్?" గడ్డెయ్య వైపే చూస్తున్న ఆమె అడిగింది. "దేవుడు మేలు జేశాడండి. అమ్మా - రెండు రూపాయలనుకొని మూడిచ్చారండి. ఇదిగో ఇవి రెండు రూపాయల కాయితమండి. ఇది రూపాయినోటు. మరి నేను రెండు రూపాయలకే యిచ్చేస్తానన్నాను. ఈ రూపాయి వుచ్చేసుకోండి" అన్నాడు. వాడి నిజాయితీకి ఆశ్చర్యపడి ఆమె చిన్న బుచ్చుకుంది ముఖం.

"నే తెలిసే ఇచ్చాను"

"అదేంఖండీ?"

"నీకు జోడు కిమ్మత్తు రెండున్నరా వుచ్చుకో. సామాను తెచ్చిపెట్టినందుకు అర్ధ రూపాయి మూడు రూపాయిలూ సరిపోయిందిగా?"

"వద్దండమ్మా అంతిమొత్తం"

"ఛా-తీసుకో" గార్డు మళ్లీ విజిలూదాడు—మెయిలు ఇంక ఆగనన్నట్లు కోపంగా కదిలింది.

"తల్లీ-మీ ఋణం మేం చర్మంతో చెప్పులు కుట్టి తీర్చుకోలేం" అంటూ చేయెత్తి నమస్కరించాడు కనులు మోడ్చి గడ్డెయ్య. మరి ఆ యువతి వాడి విన్నపం అందుకుందో లేదో.

గడ్డెయ్య కళ్లుతెరచి చూసేసరికి మెయిలు అప్పుడే చాలాదూరం వెళ్లిపోయింది వంతెనమీదికి. ఆకుపచ్చకాంతిని ప్రసరించే రెక్క స్తంభంమీది దీపంకూడా ఎర్రబడింది. వాన వల్లబడింది. గంపపై గుడ్డ కప్పుకుని గడ్డెయ్య చకచకా బజారులోకి నడిచాడు.

నోట్లు మార్చుకుని త్వరత్వరగా బియ్యమూ, మిరపకాయలూ, చుట్టలూ కొనుక్కుని సంతోష పారవశ్యంతో నిమిషాలమీద వచ్చినట్టు గుడిసె ముందు వాలాడు. జరిగినదంతా బుడ్డిగాడితోటి, యీరితోనూ చెప్పి ఆ యమ్మను పొగిడాడు. గంజి గాచుకు త్రాగి మళ్లీ కుటుంబమంతా ఆ తల్లికి నమస్కరించి నిద్రపోయారు. హాయిగా. తిరిగి మూడు రోజుల దాకా చీకూ చింతా లేనన్న ధైర్యం వారినెంతో తృప్తిపరిచింది.

మరునాడుదయం—బాలారుణకిరణాలు వాళ్ల గుడిసెముందు వెలుగుపరిచి విచ్చాయి—దినవృత్తికి సామాను సర్దుకుంటూ "ఒరే! బుడ్డిగా! తడిశాయను కుంటా జోళు ఆరబెట్టు" అని ఆజ్ఞాపించాడు కొడుకుని గడ్డెయ్య. బుడ్డిగాడు చిందర వందరైన ఆకు జోళ్లను ఒక్కొక్క జత నే తుడిచి వరుసగా వాకిలిలో ఆరబెడుతున్నాడు—ఒకటి, రెండు, మూడు...పదిదాకా లెక్క పెట్టాడు. పదకొండో జత చూస్తూ విస్తుపోయిన కొడుకు ఒక్కదూకు లోపలికి దూకి "ఒరే బాబా-చూశావా?" అన్నాడు. గడ్డెయ్య యివతలికొచ్చి చెప్పులజోళ్లు పదకొండు జతలూ జూసి "ఏం" అన్నాడు నిర్లక్ష్యంగా. "ఏం-అంటావేట్రా?—చూడిది!" అని ఆ పదకొండో జత మళ్లీ చూపించాడు కుర్రాడు. "ఔను—దానికేం" మళ్లీ విస్సాటమే ధ్వనించింది తండ్రిస్వరంలో—"మతిగానా పోయిందేట్రా నీకు. ఇయి రెండూ ఎడంకాలి చెప్పులుగావూ?" అన్న ప్రశ్నను విని, ఆ పదకొండో జోడు తన్ను వికృతంగా చూసి వికటాట్టహాసం చేస్తున్నట్లనిపించి నిలబడ్డ పళ్లంగా నిర్ఘాంతపోయాడు గడ్డెయ్య!!

# కొన్ని ధ్వనులు

## అమృత్

ధ్వనులు అన్నీ ఆనందవర్ధనాచార్యులవారే సమగ్రంగా దుర్వార సుస్థిరంగా నిరూపించి స్థాపించారు. ఇప్పుడు ప్రత్యేకంగా కొన్ని ధ్వనులంటూ ఎవరూ కనిపెట్టలేరు. ఐతే ఈమధ్య ప్రబలంగా అందర్నీ గాకపోయినా, కొందరినైనా మోహపరచిన కొన్ని శబ్దవిలాసాల్ని—(శబ్దవిలాసం అనటం అశాస్త్రీయమే; సంఘటనా నైపుణీవైచిత్ర్యం వల్ల సిద్ధించే శబ్ద సౌందర్యాన్ని, ఇట్లా పిలవదలుచుకొన్నాను; నాట్యాయమానత, వికటత మొదలైన ఆలంకారిక పారిభాషికపదాలచేత వ్యక్తమయే భావమే గాక ఇంకా కొన్ని భావాల్ని కూడా చెప్పటానికి, సుబోధంగా ఉండొచ్చునని పై శబ్దాన్ని ఎన్నుకొన్నందుకు పాఠకులు తప్పుగా భావించరని ఆశ)-ఆ మోహగ్రస్తులు ధ్వనులుగా గ్రహించి ఆ పేరుతోనే పిలిచి, ఆధ్వనులే పారవశ్యాన్ని కలిగిస్తున్నట్లు ఆనందించటంవల్ల—వాటిని "కొన్ని ధ్వనులు"గా పేర్కొనవలసివచ్చింది.

సంస్కృతాంధ్రభాషల్లో కవులు, అనేక సందర్భాల్లో అనేక విధాలైన సమాసాలు చిన్నవి, పెద్దవి వాడారు.

ప్రతి పదానికి అర్థం ఉంటుంది గాబట్టి, పద సముదాయాలైన సమాసాలకీ అర్థం ఉంటుంది—కొంచెం పెద్దగా. ఐతే, ఈ పెద్ద అర్థం అంతా, వేరు వేరుగానే పదాలు రచిస్తే రాదా? సరదాగా చదివేవాణ్ణి ఊపిరి బిగపట్టించాలని కాకపోతే, దేనికా హడావుడి? వేరు వేరు పదాలుగా వ్రాసేదానిలో కంటె సమాసంగా రచించటంలో సంక్షిప్తత సిద్ధించవచ్చు. సిద్ధిస్తుందికూడా. ఆ భాషల్లో ఆ సౌలభ్యం ఉంది గాబట్టి, ఆ అడ్డదారిన పరుగెత్తారందామా? అట్లాగే అనుకొందామనుకొంటే, వాల్మీకివంటి సర్వకవి లోకపూజ్యుడు, సమాసాలజోలికి పోలేదు. పోయినా, చిన్న చిన్న సమాసాలేగాని, దీర్ఘసమాసాలు లేవు. వీలైన అడ్డదారి ఉంటే, చుట్టూదూరం సమాసరచన సాగించినవారు, కథమీద దృష్టిలేక, అసహజంగా కాలహరణంచేసి శ్రమపడినవాళ్లు కావాలి. ఇప్పుడు మనం ఏం అనుకొన్నా, వాళ్ళుమాత్రం కాలం సద్వినియోగం చేస్తున్నామనే విశ్వాసంతోనే శ్రమపడి ఉంటారు. ఆ సమాసరచన శ్రమాపాదకం అని వాటిని చూస్తేనే తెలుస్తుంది. దీన్ని నిరూపించటానికి ఏతర్కబుద్ధో అవసరంలేదు సాధారణ అనుభవమే స్పష్టీకరిస్తుంది ఎందుకు ఆ శ్రమ?

సమాసరచన అంతగా చేయని మహాకవులూ ఉన్నారు. చేసినవాళ్లలోనూ మహాకవులు ఉన్నారు. కొంతమంది సమాసరచన చేసినా, ఇష్టం ఉండి కావాలని చేసినట్లు కనబడదు. కొంతమంది ఎంతో మోజుపడి నగిషీలు చేసి తెచ్చి ముందు పెట్టినట్లు తోస్తుంది. దీర్ఘ సమాసరచన అసహజం అని అసహ్యించుకొన్నవాళ్ళు కూడా పాల్కురికి సోమన మాదిరిగా, దానికే పాల్పడినట్లు తోస్తుంది. మొత్తం మీద సమాసాలు వాడనివాళ్ళు లేరు. ఇష్టం ఉన్నవాళ్లు, లేనివాళ్లు అంటూ కనబడుతున్నారేగాని ఇది వాల్మీకి మొదలైన ఆద్యకవులను వదిలేస్తే మిగిలినవాళ్ళ సంగతి ఆ ఆద్యకవుల అభిప్రాయం యేమిటో తెలీదు.

ఈ సమాసరచనమీద అందులో నగిషీలమీద ఇష్టంఉన్నవాళ్ళు—ఆ దీర్ఘసమాసాలకోసం పూర్వకవులు పడినశ్రమను చూపించే కారణమే ప్రస్తుతం ఈ వ్యాసంయొక్క చర్చనీయాంశం. ఆ సమాసరచనలోనే ధ్వని ఉందంటారు. ఆ ధ్వనికోసమే ఆ మహాకవులు ఆ శబ్దవిలాసాల్ని చూపారంటారు. ఒక దీర్ఘ సమాసం వాడితే, అక్కడి సందర్భం ఏదో దీర్ఘత్వాన్ని, ఏదో గాఢత్వాన్ని ప్రదర్శిస్తున్నదంటారు. వాడిన సమాసం కఠినపదాలతో ఉంటే, ఏదో కాఠిన్యం, లలితపదాలతో ఉంటే, ఏదో లాలిత్యం ఉన్నట్లు చెబుతారు. సమాసరచన వికృతంగా ఉంటే అక్కడేదో వికారం, పేలవంగా ఉన్నట్లుంటే, ఏదో

పేలవత్వం, ఇంకా ఎన్నిరకాలో, తోచినన్ని—ఇవి ధ్వనులంటారు. ఇవి నిజంగా ధ్వనులేనా అని విచారించటమే ఈ వ్యాస ప్రయోజనం.

ఈ "ధ్వనుల్ని" కొన్ని వర్గాలుగా విభజించవచ్చు.

(1) ఇప్పటికే అనుకొన్న రకం — సమాసం చెవికి తగిలే తీరునిబట్టి ధ్వని చెప్పటం. "జలధి విలోల వీచివిలత్కలకాంచిసముంచితావనీతలవహన క్షమం బయిన దక్షిణహస్తమునన్ ..." అని దీర్ఘదీర్ఘంగా చెవికి తగులుతున్నది గాబట్టి, ఆ చేయి అంత దీర్ఘమని, మహారాజ లక్షణమైన అజానుబాహుత్వం, చెప్పకుండానే ఉన్నట్లు, వాచ్యం చేయకుండానే ధ్వనిస్తున్న దనటం. ఇందులో రెండు విషయాలు గుర్తించవచ్చు. మహారాజుకి అజానుబాహుత్వం శాస్త్రప్రసిద్ధం, కవి సంప్రదాయం అనేది ఒకటి. ఆ బాహువుని వర్ణించే సమాసం దీర్ఘంగా ఉండటంవలన ఈ ధ్వనిని ఊహించే వారి మనస్సులోఉండే రాజుగారి అజానుబాహువు, దీర్ఘత్వ సామ్యంవల్ల— స్ఫురించటం — రెండో విషయం. తెలిసినదానిలో (సమాసం) తెలీనిదానిలో (బాహువు) ఒకే గుణం (దీర్ఘత్వం) కనిపించటంవల్ల— ఈ తెలిసినదానివల్ల తెలియనిది తెలిసింది అనుకోటం— సారాంశం. అలా అనుకోటాని కవసరం—దానివల్ల కలిగే ఆనందం; ప్రయోజనమూ అదే

(2) ఉచ్చరించటంలో కలిగే ఆయాస, సౌలభ్యాలవల్ల ఆయా సందర్భాల్లో ఏదో కష్టమో, సుఖమో ధ్వనిస్తున్నదనటం. ఉచ్చరించింది చెవికి తగలకుండా ఊరుకోదు. చెవికి తగిలినవన్నీ కూడా ఉచ్చరించినవే కాబట్టి ఈ వర్గాన్ని కూడా పై దాంట్లోనో, దాన్ని కూడా దీంట్లోనో చేర్చెయొచ్చు. ఐతే, పై వర్గంవి ఎట్లా ఉచ్చరించినా వాటి దీర్ఘత్వాది పరిమాణాలు స్పష్టమౌతుంటయ్. ఈ వర్గంలో ఏదో ధోరణిగా ఉచ్చరిస్తే, విషయం బోధపడదు. మామూలుగా ఆ పారాయణచేసేవాళ్లు ఆ ధ్వనిని కనిపెట్టలేక పోవచ్చు. అవసరమైనవిధంగా ఉచ్చరించి, ఇదిగో ఎట్లా ఆ భావం స్ఫురిస్తున్నదో చూడమని, ఎవరో వచ్చి చెప్పవచ్చు. "అడిగెదనని కడువడి జను..." అన్న పద్యం గజేంద్రమోక్షం ప్రతిదినమూ, పారాయణ చేసేవారికి సాధారణంగానే ఉండొచ్చు చదివే వాడు చదివి "ఆహా, లక్ష్మీదేవి తడబాటు అంతా, పద్యం నడకలోనే తెలుస్తున్నది" అంటే అందరి ముఖాలు ఆ కాసేపు విప్పారుతయ్. ఇక్కడకూడా ఒక సామ్యమే పనిచేస్తున్నది

(3) పై రెండువర్గాల్ని అని 'ధ్వనించే' వస్తువునుబట్టి ఒక్కొక్కటి, రెండు రెండు వర్గాలుగా తిరిగి విభజించవచ్చు ధ్వనించే విషయం ఆ శబ్దాలే వాచ్యంచేసి ఉండటం ఒకటి "పరిష్వనిష్ఠురకుచక్లిష్టాంగు జేసెం దుదన్" అన్నప్పుడు, ఆ స్తన కాఠిన్యం "నిష్ఠురకుచ" అనటంలో స్పష్టంచేసినప్పటికీ, ఆ సమాస గతిలోకూడా ధ్వనించటం. సందర్భోచితమైన అభిప్రాయాల్ని, సమాసాన్నిబట్టి దీర్ఘబాహువును చెప్పినట్లుగా, చెప్పటం రెండు.

(4) పై విధాల 'ధ్వనుల్నే' కేవలం సమాసాలకి. ఎక్కువపదాలకి కాకుండా, ఒక్కపదం ఉన్న దాన్ని ఉచ్చారణనిబట్టిచెప్పటం "దేవయాని, శర్మిష్ఠలు వలువలు వీడ్వడి" ధరించిరి అంటే ఆ 'ష' కారం (కింద వకారం వలన వస్త్రాలు, చుట్టలు చుట్టుకుపోయినయ్, మెలికలు వేసుకుపోయినయ్ అనటం.

(5) ఛందస్సులోఉన్న విషయాలవల్ల విశేషాల్ని ఊహించటం. ప్రాస అక్షరం మార్చరానిది గాబట్టి, ప్రాసలో ఏదన్నా ఒక పదంఉంటే ఆ అభిప్రాయం మార్చరానిదిగా, వదలలేనిదిగా విన్నో చెప్పటం "నిగ్రహ నున్నవాడ..కీర్తిప్రియ..." అన్నప్పుడు కీర్తిని ఏ పరిస్థితుల్లోనూ వదలలేనివాడివి గాబట్టి, నన్ను రక్షించి కీర్తిని పొందమని 'ధ్వని'. అట్లాగే యతిస్థానం దగ్గర ఆగటం, విరవటం "పాతరలాడు...చేతము తాండవింప మరచెన్......" అన్నచోట 'మరచెన్' అనేది యతిస్థానంలో ఆగటంవలన యతి అంటే విశ్రాంతి కాబట్టి, నిజంగా, ఎంతో ఎక్కువగా, స్పష్టంగా మరిచిపోయాడని 'ధ్వని'. ఈ విధంగా ఇంకా కొన్ని విభాగాలు చేసినా చేయొచ్చు. ఏదోకొంత స్పష్టతకోసంగాని, లేకపోతే, ఏవిభాగమూ అవసరములేదు. సరే, ఈ 'ధ్వను'లన్నీ నిజంగా ధ్వనులేనా ? అన్నదే మొదటిది, చివరిది— ప్రశ్న.

ధ్వని అంటే ? వాచ్యార్థం పదిరినతర్వాత, ఆ వాచ్యార్థంకంటె విలక్షణమైన అర్థం, ఆ వక్తనిబట్టి, సందర్భాన్నిబట్టి పుట్టేది. వివరించాలంటే ధ్వన్యా

# కొన్ని ధ్వనులు

లోకం అంతా, వ్రాయవలసివస్తుంది. పైన ధ్వనులను కొన్నివాటి సందర్భంలో—అక్కడి శబ్దాలకి అర్థం కుదురుతూనేఉంది. వేరే అర్థంకూడా చెబుతున్నారు. కాబట్టి ధ్వని అనొచ్చా? అనకూడదు. ఎందుచేత? ధ్వని ఎప్పుడూ వాచ్యంలోనించి పుడుతుంది అవయవనిష్ఠమై ఉండికూడా, తద్భిన్నమూ, తదతీతము ఐన లావణ్యం మాదిరిగా, వాచ్యార్థం (లేక లక్ష్యార్థం) వల్ల, పుడుతూకూడా దానికి అతీతమై ఉంటుందని ధ్వన్యాలోకం. ఇక్కడ వాచ్యార్థం నుంచి పుట్టటం అనే ప్రసక్తేలేదు గాబట్టి ఇది ధ్వని కాదు. అక్కడ శబ్దాల ధ్వనివల్ల (మోత) ఈ ధ్వని స్ఫురిస్తున్నదని, ఇది శబ్దశక్తిమూలక ధ్వని అని ఎవరూ అనబోరు శబ్దానికి రెండు అర్థాలు ఉండటం వంటి సందర్భాల్లో ఆ శబ్దమే ప్రాముఖ్యం వహించి, ధ్వనికి హేతువైతే అప్పుడు—శబ్దశక్తిమూలక ధ్వని అవుతుంది. ధ్వనిసిద్ధాంతంతో పరిచయంఉన్నవారికి ఈ విషయం వివరించవలసిన అవసరం లేదు.

ఈ 'ధ్వను' లను ధ్వన్యాలోకంలో ఎక్కడా చెప్పలేదు. ఐతే రసధ్వనినిగూర్చి చెబుతూ, ఒక్కొక్కరసాన్ని అభివ్యక్తం చేయటానికి, కొన్ని వర్ణాలు బాగా ఉపయోగిస్తయ్ అన్నారు. శ, ష, ర మొదలైనవి, శృంగార రసాభివ్యక్తికి ఎక్కువ అనుకూలం. అట్లాగే, మాధుర్యగుణం కలిగిన శృంగార, విప్రలంభ, కరుణ రసాలలో, దీర్ఘసమాసాలు ఉండకూడదని, అక్కడ వైదర్భీరీతినే అనుసరించాలని—ఈ విధంగా ధ్వన్యాలోకం కొన్ని నిర్ణయాలు చేసింది. రసస్ఫురణకు అనుసరించవలసిన రచనావిధానాన్ని అక్కడ నిర్దేశించారేగాని, ఆ శబ్దంలో ఆ విరుపువలన, ఈ మలుపువలన ఇంత అర్థం వస్తుంది, అంత అర్థం బయలుదేరుతుంది—అని ఎక్కడా చెప్పలేదు

పోతే, రసధ్వని కొన్ని కేవలం ఏ అర్థంలేని శబ్దాలవల్లకూడా ఒక్కొక్కసారి కలుగుతూంటుందన్నారు. దీనికి ఆంధ్ర ధ్వన్యాలోకంలో ఇచ్చిన ఉదాహరణ, ఆంధ్రపాఠకులకు అనుకూలంగా ఉంటుందనుకొంటాను — "తెలియనివన్ని తప్పులని.......... సరసా విరసా తుసా బుసా" ఇందులో తుసా, బుసాలకు ఏ అర్థమూ లేదు. కాని అది విన్నప్పుడు ముఖ్యంగా వాటివల్లనే హాస్యరసస్ఫురణ కలుగుతున్నది. బహుశః ధ్వన్యాలోకంలో చెప్పిన ఈ అంశం మన ప్రస్తుత "ధ్వని" వాదులకి కొంత ఆధారంగా కనిపించవచ్చు. కాని, ఇక్కడ విషయం—కేవలం అర్థశూన్యమైన శబ్దాలను గూర్చి. మన ధ్వని వాదులు" చెప్పే శబ్దాలు అర్థశూన్యమైనవి కావు. వాటి అర్థం వాటికుండగా, వాటి ధ్వని (మోత)ని బట్టి ఏవో ఊహించటం. ఇక రెండోది ధ్వన్యాలోకంలో చెప్పింది రసధ్వని విషయం వీరు చెప్పేది—ఏవో అలంకార వస్తుధ్వనులు కాబట్టి వస్తువులోను ప్రయోజనంలోను రెంటికీ సంబంధమే లేదు ధ్వన్యాలోకం ఈవాదానికి ఏ ఊపిరీ పోయదు.

పోతే, ఆలంకారికులు కొందరు శబ్దవికటత్వ, నాట్యాయమానత అని ఒక లక్షణం చెప్పారు. శబ్దాలు తమ అర్థాన్ని, కేవలం శ్రవణతాడనం చేతనే స్ఫురింపచేసినట్లు ఉంటే—అది వికటత్వం దీన్నే ఆంగ్లంలో 'సౌండ్ ఇకోయింగ్ సెన్సు' అని అంటారు. ఈ లక్షణం మన 'ధ్వని' వాదులకు ఆనందదాయకం కావచ్చు.

"పరిష్వ నిష్ఠుర కుచ క్లిష్టాంగః జేసెం దునన్" మొదలైన సందర్భాలుగా మనం పైన విభాగించుకొన్న వీరు చెప్పే రెండవ రకం 'ధ్వను' లన్నీ ఈ జాతివి. ఇదొక్కటీ ఆలంకారికులు, పాశ్చాత్య విమర్శకులు కూడా అంగీకరించిన విషయం.

ఐతే ఒకటే దురదృష్టం—ఇది అసలు ధ్వనే కాకపోవటం (ధ్వని అనే మాట కొంత స్థూలార్థంలో వాడుతున్నాను. వ్యంగ్యం వాచ్యాతిశాయి ఐ ప్రాధాన్యత వహిస్తే ధ్వని అవుతుంది కాని ప్రస్తుతం ఏదో వీలుగా ఉంటుందని, వ్యంగ్యం మొత్తానికి ధ్వని అని వాడుతున్నాను.) వాచ్యార్థానికి వేరైన అర్థం ఉంటే ధ్వని. ఇక్కడ ఆ వాచ్యార్థమే, వేరే అర్థప్రయోజన అవసరం లేకుండా, కేవల శ్రవణతాడన వల్లనే స్ఫురిస్తున్నట్లుంటుందని చెప్పారు. కాబట్టి అది ధ్వని కాదు.

పూర్వ ఆలంకారికులు అంగీకరించవచ్చు, లేకపోవచ్చు మనమే ఇందులో వున్న సత్యాన్ని చూసి, ధ్వనులుగా ఇప్పుడు ఏర్పరచుకోకూడదా? ఏర్పరచుకోవచ్చు. కానీ అందులో సత్యం ఎంతవరకు వుంది? సత్యం ఏమిటి? సాహిత్యంలో సహృదయుడి హృదయమే ప్రమాణము. సహృదయుడైనవాడు ఈ ధ్వనుల్ని

అనుభూతిలోకి తెచ్చుకోగలము. సహృదయుడు ప్రతికరణశుద్ధిగా వీటి సౌందర్యాన్ని ఆస్వాదిస్తున్నప్పుడు, కాదని అనటం ఎట్లా ?

కాదనటం కష్టమే ఈ రచయితే కొన్ని అటువంటి 'ధ్వనుల్ని' కనిపెట్టి, మనస్సులో వెన్నెల విరిసినట్లు ఆనందపారవశ్యం అనుభవించాడు ఆ ఆనందం నిజంగా ఆనందమూ కాదా అనేది వేరే ప్రశ్న. ఏదో మనస్సు తేలికైనట్లు, తేలిపోయినట్లు ప్రత్యక్షంగా అనుభూతిని పొందిన పిమ్మట కాదనటం ఎట్లా? "ఉన్నతినుచ సముదంచ పవననందను డాయన్" అని హిడింబను నన్నయగారు వర్ణించినప్పుడు "ఉన్నత"లోని నకారద్విత్వంవల్ల రొమ్ము విరిచి ఏదో చిత్రంగా, ఏదో పొగరుగా నడిచినట్లు కొంతమంది యువతులు కనబడుతుంటారే, అట్లా హిడింబ వచ్చిందన్నమాట, అనుకొని ఆనందించాడు చాలామందికి, ఇటువంటివి చాలా అనిపించవచ్చు

ఏ అనుభూతి తప్పో, ఏది ఒప్పో నిర్ణయించటం కష్టం. ఎవరు చెప్పేది వాళ్లకు నిజం అని అన్నింటికీ తలవంచుకు ఊరుకొంటే ఏ ఇబ్బందిలేదు కాని ఇటువంటి ఇబ్బందులకు భయపడితే విజ్ఞానమే లేదు. నిర్భయంగా నిష్పక్షపాతంగా సాధ్యమైనంతవరకు సత్యాన్వేషణ సాగించాలి

ఈ ధ్వనుల్ని అంగీకరించవచ్చు అనటానికి చెప్పదగినవాదాల్ని వరుసగా పరిశీలిద్దాం.

1. అది ప్రత్యక్షంగా అనుభూయమానమౌతున్నది. దీనికిఖండన—ఆ అనుభవం అంతా భ్రమ; ఇక్కడ ఇద్దరి వాదాల్లోనూ నిజం కనిపిస్తుంది. అవి ధ్వనులో, ఊహలో, పిచ్చులో, ఏమిటో అనుభవంలో ఉన్నమాట మాత్రం నిజం ఏ భ్రమ అయినా అనుభవిస్తున్నంతకాలం నిజంగా భాసించటమూ నిజమే.

2 ఏవో ఊహలైతే నిజమైన ఆనందం కలగదు. కానీ ఈధ్వనులవల్ల పట్టలేని సంతోషం కలుగుతున్నది.

ఖం॥ కావచ్చు ఊహలైతే నిజమైన ఆనందం కలగకపోవటానికి కారణం అవి ఊహలని అబద్ధాలని మనస్సులో జ్ఞానం ఉండటమే కాని ఇక్కడ ఊహని పూర్తిగా నిజం అనుకొంటూ ఊహించటంవల్ల, అది నిజం మాదిరి అనుభవాన్నే ఇస్తున్నది. ఒక డోలు 'ఢాం' అని మోగితే, అందులో దయ్యం ఉండి అరుస్తున్నదనీ పసిపిల్లవాడు భయపడతాడు. ఆ భయం అబద్ధమా? కళ్లున్న ప్రతివాడికీ కనపడుతుందే వాడు వణికిపోవటం అది అబద్ధమా? అంతమాత్రాన డోలులో దయ్యం నిజమా ?

3 పసివాడి భయానికి ఈ అనుభూతికి పోలికే లేదు పసివాడికి ఏదో కారణంచేత మనస్సులో ఏర్పడినభావాలు, అప్రయత్నంగా భయోత్పాతాన్ని కల్గిస్తయ్ ఇక్కడ జ్ఞానవంతులైన పెద్దలు ప్రయత్నపూర్వకంగా గ్రహించి ఆనందిస్తారు.

ఖం॥ అదే వచ్చిపడింది ఇబ్బంది ఈ పెద్దలకి కూడా, మనస్సులో ఏర్పడిన భావాలవల్లే, ఈ ఊహలన్నీ కలుగుతున్నయ్ ప్రయత్నపూర్వకంగా గ్రహించటం" వల్ల మరింత ఆనందభ్రమ కలుగుతున్నది. చీకటిలో పోతూ ఏ తాటిచెట్టునో చూసి, పెద్దవాళ్లు కూడా భయపడతారు చెట్టుఆకులు కదుల్తుంటే, దయ్యం 'దొరికావురా' అని వికారంగా తలకాయ ఆడిస్తున్నట్లు ఏవేవో ఊహించుకొని, చెట్టులాంటి మనిషికూడా మూర్ఛపోవచ్చు. అతని మూర్ఛకి దయ్యాలమీద అతని కేర్పడిన నమ్మకమే మొదటి కారణం. ఊరికే గుండె కొట్టుకోటంతో ఆగకుండా మూర్ఛదాకా రావటానికి, ఒకదాని కొకటి అతడు కల్పించుకోవటం హేతువు.

4 అట్లా అనుకొంటే అంతా కల్పనే అవుతుంది. మనస్సుకు ఏదినిజమో, ఏది అబద్ధమో తెలుసుకొనే శక్తిఉంటుంది. లేకపోతే ఒకటి నిజం ఒకటి అబద్ధం అవటం అంతా మిథ్య అవుతుంది. మొట్టమొదట తప్పుగా ఏదో అభిప్రాయం ఏర్పడినా, ఆ అభిప్రాయం మీదనే, ఫలానా శబ్దసంఘటనకి ఎలాంటి 'ధ్వని' అనుకొంటూ ఆలోచిస్తుంటే-ఏదో ఒకభావం స్పష్టంగా ఎందుకు తోస్తుంది? అక్కడ ఏమీ లేకపోతే ఆలోచించినకొద్దీ అస్పష్టమై అయోమయం కావద్దా?

ఖం॥ మనస్సుకి ఏదినిజమో ఏది అబద్ధమో నిర్ణయించగలిగే శక్తిఉంటే, మానవజాతి వందల వేల సంవత్సరాల పురోగమనం తర్వాత ఏదినిజం, ఏదిబద్ధం అంటూ ఈ నాటికి ఎటుచూచినా ప్రశ్నార్థకాలు ఎందుకు కనిపిస్తయ్? సత్యనిర్ణయతృష్ణ, సత్యనిర్ణయశక్తికన్న ఎక్కువగా ఉంది. ఎక్కడికక్కడ

# కొన్ని ధ్వనులు

మనస్సు నిర్ణయాలు చేస్తుంటుంది. అందుకనే ఎవరి ఊహలు, అభిప్రాయాలు వారికి పరమసత్యాలుగా కనబడటం. ఒక అభిప్రాయం మార్చుకోవాలంటే వ్యక్తిగాని, జాతిగాని ఎంతో కష్టపడటం అందుచేతనే. కాని అభిప్రాయాలు మారుతుంటయ్ కొత్త భావాల్ని గ్రహించే శక్తిఉంది మనస్సుకు. ఏదో ఒక నూతనాభిప్రాయం రాగానే, అంతకు ముందున్న నిర్ణయాన్ని దాంతో సమన్వయపరిచి, అవసరానికి వీలైన మరో నిర్ణయాన్ని చేసి కూర్చుంటుంది మనస్సు. ఎప్పటికప్పుడు, ఒక్కొక్క, విషయంలో ఉన్న భావ సంఘాతంతో సామరస్యపూర్వకంగా సానుకూల నిర్ణయాలు తయారుచేసి పడేస్తుంటుంది మనస్సు. ప్రస్తుతవిషయంలోను ఏదో ఉంటుందని మనస్సుని ఆలోచిస్తే, మనస్సులోపలి ఒక భావానికి ఒక భావానికి ఉన్న చిత్రమైన సంబంధాల్ని (ఎసోసియేషన్ ఆఫ్ ఐడియాస్) పురస్కరించుకొని, ఇదిగో ఉన్నదని చెబుతుంది. ఈ పనిఅంతకి నరాలుపడే బాధ ఆ నిర్ణయం మూడగానే వదిలిపోతుంది గాబట్టి, ఎంతో హాయి, ఏదో తేలిక అనిపిస్తుంది. అంతేగాని ఇవేవీ ధ్వనులు కావు.

5. చాలా బాగుంది. ఇవి ధ్వనులే అనటానికి అవసరమైన వాదసామగ్రి అంతా కాదనే చేత్తోనే అందించినట్లయింది. ఏ ధ్వనివిషయంలోనైనా జరిగేది అదేగా. అప్పటికిఉన్న భావసంఘాతం ఆధారంగానేగా ఆ వివిధ ధ్వనులు పుట్టేది. అక్కడకూడా నరాలబిగువు వదలటంవల్ల, భావనాశక్తి సంతృప్తమవటంవల్లనేగా ఆనందం. అందుకనేగదా అలంకారవస్తుధ్వనుల్లో గుప్తత అవసరం అనటం సరే రసానికి వాచ్యదశ అంటూ లేనేలేదు ఆ ఆనంద విచారం ప్రస్తుత చర్చనీయాంశానికి అతీతం పోనీండి. ఏదైనా ఈ "ధ్వనులు" ధ్వనులేనని మీరే నిరూపించారు.

ఖం|| భలే మొదటికి దిగజారి ఏదో శిఖరం ఎక్కామనుకొంటున్నారే. ధ్వన్యాలోకంలో ధ్వనులన్నీ అర్థం మీదినించి వచ్చేవి. కావ్యానికి అర్థమే ప్రధానం. సర్వం మీరుచెప్పేది కేవలశబ్దం-నాదం. దాని వ్యవహారం అంతా సంగీతశాస్త్రానికి సంబంధించింది.

6. కావ్యానికి నాదంకూడా ముఖ్యమే. కేవల అర్థరహితమైన "తుసా, బుసా"లకు ధ్వని ఒప్పుకొన్నారు. శబ్దవికటత అనేది ఒకటితెచ్చి ఉత్తధ్వనులే (మోతలు) అర్థాన్ని సూచిస్తున్నట్లుంటయ్ అన్నారుగా. వీటినిబటి ఉత్తధ్వనులకు (మోతలు) ధ్వనుల్ని చెప్పుకోవచ్చని పరోక్షంగా ఒప్పుకొన్నట్లు కాలేదా. కావ్యానికి అర్థమే ముఖ్యమేమిటి? శబ్దం అర్థం విడదీయరానివిగదా "వాగర్థావివ సంపృక్తౌ" అనటం అందరికీ తెలిసిందే కాగా, రమణీయార్థప్రతిపాదకశబ్దమే కావ్యమనిగదా ఆలంకారికమూలీభూతమతం. అటువంటప్పుడు శబ్దంవల్ల ఆవిర్భవించే సొగసుల్ని కూడా పుణికిపుచ్చుకొన్ననాడు కావ్యం నిలువు నిలువునా మెరుగుల మొలకలై మురువుకుల కదా? కాదనటం ఎంతవిరసం. ధ్వన్యాలోకం చెప్పినా లేకపోయినా, మనం చెప్పుకొందాం. ఒప్పుకొందాం.

ఖం|| సరి వాదం వదిలేసి కవిత్వంలో పడ్డారు కావ్యానికి అర్థమే ముఖ్యం శబ్దంకూడా ముఖ్యమే అనటం, దానివల్ల వచ్చే మెరుగుల్ని పుణికిపుచ్చుకోవాలనటం – అదంతా అవిచారితరమణీయం. శబ్దము అర్థము విడదీయరానివి కాబట్టి, ఏ అర్థం కావాలన్నా శబ్దరూపంగానే మనస్సులో గాని, వ్యవహారంలో గాని మనం చూస్తున్నాం గాబట్టి- అంతవరకు శబ్దంగూడా ముఖ్యమే అనొచ్చు. ఇటువంటి వ్యవహారాన్ని పురస్కరించుకొని శాస్త్రనైశిత్యంకోసం రమణీయార్థప్రతిపాదక శబ్దం కావ్యం అన్నాడు జగన్నాథుడు. ఉత్తశబ్దం అనలేదే. అక్కడ ఆ రమణీయార్థమే ముఖ్యం. "వాగర్థావివ సంపృక్తౌ" అనేది మీకే గండకత్తెర అవుతుందని గ్రహించలేకపోతున్నారు. వాక్కు అంటే శబ్దము, అర్థము, వివిధంగాను విడదీయలేమని గదా దాని అర్థం. అటువంటప్పుడు ఈ 'ధ్వను'లంటూ ఎట్లాపుడతయ్? ఆ శబ్దానికి ఆ అర్థం నియతం మళ్ళీ ఈ అర్థం, ఈ ధ్వని కాని ధ్వని వీటన్నిటికి ఆస్కారం ఎక్కడ? ఆస్కారం ఉంటే వాగర్థాలు విడదీయరానివి అనటం అబద్ధం కదా, ఇక తుసా, బుసాల విషయం వెనకనే చూశాం. వాటికే అర్థం లేదు మీరు చెప్పేవాటికి నియతమైన అర్థంఉన్నది. ఊహగా పైన ఏదో చెప్పటం అశాస్త్రీయం. ఇక శబ్దవికటత అంటారా? దానిసంగతీ వెనకనే చూశాం. ఐనా అదొక పెద్ద కావ్యలక్షణంగా ప్రత్యేకించి చెప్పలేదు. శబ్దాలు అట్లా కనబడు

తున్నయ్ అన్నారు. అంతకన్న దాన్ని గురించి ఆలోచించవలసింది లేదు గాబట్టి ఆమాట అని వదిలేశారు

7 ఎందుకో ఒకదానికి వదిలేశారు ఆలోచించవలసింది లేకనే వదిలేశారని ఎట్లా అంటాం? అది ఏమైనా కాని ఇప్పుడు మనం గ్రహిస్తే కవిత్వానికి ఏం అపచారం? స్పష్టంగా అపచారంవంటిది లేకపోతే, దానివల్ల వచ్చే సౌందర్యాన్ని కొంతకు కొంత అందరూ ఒప్పుకుంటున్నారు గాబట్టి, గ్రహిద్దాం.

స్పష్టంగా అపచారంగా కూడా కొంత జరుగుతుంది. చూడండి:—

ఇటువంటి 'ధ్వనుల్ని' కొంతమంది కవుల రచనలలో ఎక్కువగా చూపించవచ్చు. వారు ఇతరత్రా మహాకవులైతే, వారి కవిత్వాతిశయానికి ఇది కూడా ఒక గుణంగా చెప్పుకోవచ్చు. చెప్పుకొంటే పెద్దగా ఇబ్బంది లేదు. కాని ఈ ధ్వనులు గాని ధ్వనులమీద దృష్టి ఎక్కువైతే ఏది విన్నా, ఏం చూసినా, వీటికోసమే వెతుకులాడటం అలవాటైపోతుంది. అప్పుడు కవులకు, కవిత్వానికి తనకు కూడా అపచారం చేసుకొంటాడు.

కవుల్లో ఇటువంటి 'ధ్వనుల'కు ఆస్కారమైన రచన చేసినవాళ్లు, చేయనివాళ్లు ఉన్నారు. ఆ యిద్దరిలోను మహాకవులు, ఒకపాటి కవులు ఉన్నారు. ఈ నాలుగు రకాల కవుల్ని నాలుగువిధాల అపార్థం చేసుకొంటాడు.

1. మహాకవులై ఇటువంటి 'ధ్వనుల'కాస్కారం కలిగించే రచన చేసినవాళ్ళను—వారి మహాకవిత్వానికంతకూ ఈ 'ధ్వనులే' మూలంగా, అదే కవిత్వతత్త్వం, సర్వంగా భావించి, వారిలో ఉండే, నిజమైన రససృష్టి చాతుర్యాన్ని గ్రహించలేకపోవచ్చు

2 మహాకవులై, రసభరితంగా కావ్యరచనచేసిన వాళ్లు, ఇటువంటి ధ్వనుల కాస్కారం కలిగించే రచన చేయనివారు — మహాకవులు కాకుండా పోవచ్చు. వారిని అందరూ నెత్తిన పెట్టుకొంటుంటే, కాదంటే బాగుండదని వినేవాళ్ళుండరని, ఏదో పక్కదెబ్బలో, వెనకపోటులో పొడిచేరకంగా తయారుకావచ్చు. ఇది అన్నింటికన్న దుస్సహమైన ఘోరాపచారం. ఉదాహరణకు తిక్కన మహాకవిని తీసుకొందాం. ఆయన్ని కేవలం అవతారపురుషునిగా పూజించేవాళ్లు ఉన్నారు. ఆయన కూడా ఒక మహాకవి అనేవాళ్ళూ ఉన్నారు. ఆయన మహాకవి కాడనేవాడు పిచ్చివాడికింద లెక్క. అయితే ఆ మహాకవి, ఈ విచిత్ర ధ్వనులకు ఆస్కారమైన రచన చేయలేదు. ఆయన దృష్టి రససృష్టి. సరే ఈ 'ధ్వని'వాదులకి ఆయన కవిత్వం సారవంతంగా కనిపించదు. ఆయన్ని ప్రత్యక్షంగా తిట్టలేక, తిక్కన పలుకువెనక వాడితనం లేదనో, ఆయనను శబ్దబ్రహ్మ వశం కాలేదనో—ఏవో మాట్లాడుతారు.

3 సాధారణకవులై ఈ 'ధ్వనుల'కు ఆస్కారమైన రచన చేసినవాళ్ళను, ఈ 'ధ్వనుల్ని' మాత్రమే చూసి మహాకవులక్రింద జమచేసి, వారికి ఈయరాని లేనిపోని గౌరవాన్ని ఇచ్చి కూర్చోపెడతారు

4 సాధారణకవులై ఈ 'ధ్వనుల'కు ఆస్కారమైన రచన చేయనివాళ్ళను, బొత్తిగా తోటకూరలో పురుగు వేరినట్టు ఏరి పారేస్తారు. వారికి రావలసిన న్యాయమైన గౌరవాన్ని కూడా దక్కనీరు

ఈవిధంగా కవులందరికీ అపచారం జరుగుతుంది. ఈయరాని గౌరవం ఈయటం కూడా నైతికంగా అపచారమే. మహాకవులకు అపచారం జరగటానికి కవిత్వానికి ద్రోహం జరగటానికి భేదం లేదు. నిజమైన రసమయకావ్యాన్ని ఆస్వాదించే యోగ్యతను, ఈ 'ధ్వని' వ్యామోహం చేజేతులా గొంతు నులిమేస్తుంది. ఆవిధంగా వీరు తమకు తామే ద్రోహం చేసుకొంటారు

ఈ 'ధ్వనికి' అనుకూల ప్రతికూల వాదాల్ని చూశాం. ఎంత నిష్పక్షపాతంగా ఎంత సానుభూతితో ఆలోచించినా వీటిని అంగీకరించలేం. ఇవి ధ్వనులనటం అశాస్త్రీయం. ఇందులో ఆనందం ఉన్నదనటం ఆలోచనారహితం. భ్రమమాత్రమైన ఆ ఆనందం కూడా కావ్యజగత్తుకి అసంబద్ధమైంది. ఇవి కొలతబద్దలుగా కవుల తారతమ్యం ఎంచబోవటం అవివేకం. ఆ పని కవిత్వానికీ అన్యాయం, తనకీ అపచారం.

ఈ శబ్దవిలాసాల మోహంలో పడి తాము తప్పుదారిని పోవటమే గాక, ఎన్ని లేతమనస్సుల్నో తప్పుదారులకు కొంతమంది పెద్దలే ఈమధ్య ఈడ్చారు. సాహిత్యవిమర్శ శాస్త్రంలో వెలిసిన ఈ మాయాద్వారంగుండా పోబోయి, మయసభలో దుర్యోధనుడి మాదిరిగా, తల బొప్పి కట్టించుకోక, ముందుగానే సహృదయులు మేల్కొనటం శ్రేయస్కరం.

# వైదికసాహిత్య పాశ్చాత్య రచయితలు

శ్రీ పి. యస్. ఆచార్య

### * గత సంచిక తరువాయి

౪౧—ఏ. సీ. బర్నెల్. ఈయన క్రీ శ. ౧౮౭౨ లో (౧) సామవిధానమును సాయణభాష్య సహితముగ లండను నుండియును, (౨) క్రీ శ. ౧౮౭౩ లో వంశదేవతాధ్యాయమును, (౩) ౧౮౭౬ లో ఆర్షేయ (జైమినీయ)మును, (౪) ౧౮౭౭ లో మంగళూరు నుండియును, సంహితోపనిషత్తును సంపాదన మొనర్చి ప్రకటించెను. ఇవన్నియు సామ వేదీయములే.

౪౨—డబ్ల్యు. క్యాలెండ్. ఈయన (౧) జైమినీయ శాఖ సామవేదమును. (౨) ఆర్షేయ బ్రాహ్మణమును, సంపాదన మొనర్చెను. (౩) క్రీ. శ. ౧౮౯౬ లో వైదికధర్మముపై జర్మను భాషయందొక గ్రంథమును వ్రాసెను. (౪) బోధాయనశ్రౌతసూత్రమును. (౫) కాఠకగృహ్యసూత్రమును సంపాదన మొనర్చెను. (౬) కాణ్వశాఖీయ శతపథ బ్రాహ్మణమును ఆంగ్లమునం దనువదించెను. (౭) వైతానసూత్రమును. (౮) క్రీ శ. ౧౯౨౨ లో జైమినీయ గృహ్యసూత్రమును సంపాదన మొనర్చెను. (౯) హాలండునుండి అథర్వవేదమును ప్రకటించెను.

౪౩—స్టెన్ కోనో. ఈయన (౧) క్రీ. శ. ౧౮౯౩ లో సామవిధానబ్రాహ్మణమును ఆంగ్లమునం దనువదించి హాల్ నగరమునుండి ప్రకటించెను (౨) ౧౯౨౧ లో "ది ఆర్యన్ గాడ్స్ ఆఫ్ మిత్ అండ్ పీపుల్" అను సుప్రసిద్ధ గ్రంథమును వ్రాసెను.

౪౪—పీటర్ పీటర్సన్. ఈయన బొంబాయి ఎల్ఫిన్‌స్టన్ కాలేజీలో నొక ప్రొఫెసరుగ నుండి విద్యార్థుల నిమిత్తము క్రీ. శ ౧౮౮౮లో సాయణ భాష్యమును, ఆంగ్లానువాద సహితముగ నొక సూక్త సంగ్రహమును (Hymns from Rigveda) ప్రకటించెను. దీని రెండవ సంస్కరణము ౧౮౯౬ లో ప్రకటించబడెను భారతీయ విద్యాలయములయం దీ గ్రంథము కొన్ని వత్సరములవరకు సంస్కృత ఎం. ఎ. లకు పఠనీయగ్రంథముగ నుండెను.

౪౫—జె. [illegible]హోర్. ఈ ఫ్రెంచి విద్వాంసుడు క్రీ శ ౧౮౮౮ లో ప్యారిసునుండి ఫ్రెంచి భాషయందు "హిస్టరీ ది లా లిట్రేచర్" అను వైదిక కాలీన చరిత్రను ప్రకటించెను.

౪౬—హెచ్. జిమర్. ఈ జర్మను విద్వాంసుడు ఋగ్వేదకాలీన సామాజిక వ్యవస్థలపై బెర్లినునుండి క్రీ. శ. ౧౮౭౯లో "ఆల్టిన్ డిస్ హెస్ లెబెన్" Altin dis hes leben'' అను గ్రంథమును వ్రాసెను.

౪౭—హెచ్. బ్రుక్ హోపర్. ఈ జర్మను విద్వాంసుడు క్రీ. శ. ౧౮౮౨ లోను ఆపైన కొన్ని వత్సరములపాటు వైదికవిషయములను గూర్చి పత్రికలలో ననేక వ్యాసములు వ్రాసెను. ఇతడు వైదిక కవిత్వమును భారద్వాజపక్షి (లార్కు) యొక్క ఉషఃకాల గానముతో పోల్చెను.

౪౮—ఎబెల్ బర్గెను ఈ ఫ్రెంచి విద్వాంసుడు వైదికధర్మవిషయములనుగూర్చి ఫ్రెంచి భాషయందు క్రీ. శ ౧౮౭౮ నుండి ౧౮౮౩ వరకు ౩ ఖండములుగ "La Religion Vedique dapres les hymns du Rigveda'' అను మహత్త్వపూర్ణగ్రంథమును ప్రకటించెను జర్మను భాషయందు "రిసర్చి ఎబౌట్ ఋగ్వేద" అను గ్రంథము ౨ భాగములుగ వ్రాసెను

౪౯—పాల్ డ్యూసన్ * ఈయన క్రీ. శ. ౧౮౯౪ లో జర్మను భాషయందు లైబజిగ్ నగరము

---

* ఈయన తన గ్రంథములయందు భారతవర్షమున దర్శనశాస్త్రముల వికాసమును నిరూపించుటకై "వేదములయందు ప్రాకృతికశక్తుల పూజయున్నదనియు ఆ శక్తులు ప్రభావము గలవని విశ్వసించబడుచుండె ననియు, దార్శనికవిచారము లంకురించ మొదలిడె

నుండి వైదికదర్శన సంబంధమున "ఫిలాసఫీ డేస్ వేదాన్" అను గ్రంథమున ప్రకాశపరచెను.

౫౦—ఈ. హార్డీ. ఈయన క్రీ శ. ౧౮౯౩ లో ధర్మముపై "Die Vedis che Brahmanis che Periode des religion des Alten Indiens గ్రంథమును ప్రకటించెను.

౫౧—ఈ. డబ్ల్యు హాపకిన్సు. ఈయన క్రీ. శ ౧౮౯౫ లో హార్ట్ఫర్డ్ నగరమునుండి ఆంగ్లమునందు "ది రెలిజియన్స్ ఆఫ్ ఇండియా" అను ప్రసిద్ధ గ్రంథమును ప్రకటించెను.

౫౨—హెచ్. డబ్ల్యు. వాలిస్. ఈవిద్వాంసుడు క్రీ. శ. ౧౮౮౭ లో ఆంగ్లమున లండనునుండి "కాస్మాలజీ ఆఫ్ ది ఋగ్వేద" అను గ్రంథమునందు ఋగ్వేద వర్ణితసృష్టి మీమాంసపై విచారణ సలిపెను

౫౩—ఎల్. షేర్ మెన్. ఈ జర్మను విద్వాంసుడు స్ట్రాస్‌బర్గునుండి క్రీ. శ. ౧౮౮౭ లో జర్మను భాషయందు "ఫిలాసఫి శ్చే హిమెన్ అండ్స్ డేర్ ఋగ్ అండ్ అధర్వవేద సంహితా" అను గ్రంథమునందు ఋగ్వేద అధర్వవేదదార్శనిక సూక్తములపై విచారణ సలిపెను.

౫౪—సిల్‌వెన్ లెవీ-ఈ ఫ్రెంచివిద్వాంసుడు ఋగ్వేదముయొక్క ౨౦ ఆఖ్యాన సూక్తములకు సంబంధించిన ఆల్డెన్‌బర్గు సిద్ధాంతముల (ఈ సూక్తములు మొదట గద్య పద్యరూపమున నుండెను)ను ఖండించుచు నీ సూక్తముల నాటకమును పూర్తిగ వివరించెను. ఇతనియొక్క "థియేటర్ ఇండియా" అను గ్రంథము ప్యారిసునుండి క్రీ. శ. ౧౮౯౦ లో ప్రకటితమయ్యెను

౫౫—రుడాల్ఫ మేయర్ క్రీ శ. ౧౮౭౮లో బెర్లిన్ నగరమునుండి "ఋగ్విధాన" మను గ్రంథమును సంపాదన మొనర్చెను. ఈ గ్రంథమునందు మంత్రోచ్చారణవలన కలుగు శక్తిని వివరించెను. మరియు వేదములకు సంబంధించిన లేఖ లనేకము వ్రాసెను.

౫౬—డి. కుల్యికోవ్స్కిజ్. ఈ రష్యను విద్వాంసుడు క్రీ శ ౧౮౮౭ లో సోమరసము మరియు శ్యేనాఖ్యానముపై "రాజబోర వేదిజ్స్కాగో మిఫీ ఓసొక్కలే ప్రిమేనేమ్ ఇథటోక్‌స్తోనీ" అనునొక ప్రసిద్ధ గ్రంథమును రష్యా భాషయందు వ్రాసెను

౫౭—పి రేనో. ఈయన 'లే ఋగ్వేద అట్లాస్ ఆరిజింస్ డె లా మెథాలజీ, ఇండో యూరోపియన్" అను నొక గ్రంథమును ఫ్రెంచియందు క్రీ శ ౧౮౯౨ నుండి ౧౯౦౦ వరకు ప్రకటించెను

౫౮—బెన్ట్లే. ఈ విద్వాంసుడు వైదిక కాల నిర్ణయముపై క్రీ. శ. ౧౮౨౩ లో "హిస్టారికల్ వ్యూ ఆఫ్ ది హిందూ అస్ట్రానామి" అను గ్రంథమును వ్రాసెను.

౫౯—హార్మన్ జెకోబి. ఈయన క్రీ. శ. ౧౮౯౩—౯౪ లలో అనేక లేఖలద్వారా జ్యోతిషముయొక్క ఆధారముతో వైదికకాలనిర్ణయ మొనర్చెను.

౬౦—క్రిశ్చియన్ లెసేన్. ఈ జర్మనువిద్వాంసుడు క్రీ శ. ౧౮౪౩ నుండి ౧౮౬౨ వరకు నాలుగు భాగములుగ Indis che altert umy Kunde" అను వైదిక సాహిత్య ఇతిహాసమును వ్రాసెను.

---

ననియు, విశ్వముయొక్క ఏకత్వ విచారములు ప్రారంభము కాసాగిననియు "కస్మైదేవాయహవిషా విధేమ" ఇత్యాది మంత్రములద్వారా ఈశ్వరుని నామము లన్వేషించుటకు ప్రయత్నములు జరుగుచుండెననియు, ప్రజాప్రతి నామము అన్వేషించబడెననియు, నీ విచారవికాసముతో పాటు ప్రజాపతిస్థానమును ఉపనిషత్తులలో బ్రహ్మ, ఆత్మ ఆక్రమించెననియు "అయమాత్మా బ్రహ్మ" యని వ్రాసెను ఇంతియగాక ఆస్తిక్య సిద్ధికై ఇతడు శ్వేతశ్వతరోపనిషత్తులోనిదని ఈ ఋగ్వేదమంత్రము నుదహరించెను:

ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం
వృక్షం పరిష స్వజాతే తయో రన్యః పిప్పలం
స్వాద్వత్త్య శ్నన్నన్యోఽభిచాకశీతి......
(ఋగ్వే. ౧. ౧౬౪. ౨౦)

శ్వేతశ్వతరాది ఉపనిషత్తులో ప్రమాణముగ నుదహరించబడిన నీ మంత్రమును బట్టుకొని డ్యూసన్ వేదములయందు ప్రకృతిశక్తుల పూజగలదని నిరూపించగసాగెను. అట్టి సిద్ధాంతమును బట్టుకొని భారతీయులు ప్రాకులాడుచుండిరి. (శ)

Ref: Out-lines of Indian Philosophy by Deussen.

# వైదికసాహిత్య పాశ్చాత్య రచయితలు

౬౧—ఎఫ్. రోసెండర్. ఈయన "ఋగ్వేద అండ్ అడ్డా" అను గ్రంథమును ౧౮౯౩ లో వ్రాసెను.

౬౨—ఎ. హెచ్. సాయసే. ఈ విద్వాంసుడు వాషింగ్టనునుండి క్రీ. శ. ౧౮౯౧ లో "ప్రిమిటివ్ హోమ్ ఆఫ్ ది ఆర్యన్స్" అను గ్రంథమును వ్రాసెను

౬౩—కె. క్లెమ్ ఈ విద్వాంసుడు క్రీ. శ ౧౮౯౪ లో "షడ్వింశ బ్రాహ్మణము"ను సంపాదన మొనర్చెను.

౬౪—ఆర్. డబ్ల్యు. ఫ్రెజర్. ఈ విద్వాంసుడు క్రీ. శ. ౧౮౯౮ లో లండనునుండి "లిటరెరీ హిస్టరీ ఆఫ్ ఇండియా" అను గ్రంథమును ప్రకటించి వైదిక సాహిత్యపరిచయమును కలుగజేసెను

౬౫—వి. హేనరీ. ఈ ఫ్రెంచి విద్వాంసుడు ప్యారిసునుండి ఫ్రెంచి భాషయందు క్రీ. శ ౧౮౯౮ లో వేద సంబంధ విశిష్టగ్రంథమును, మరియు ౧౯౦౪ లో వైదిక సాహిత్య ఇతిహాసమును ఫ్రెంచి భాషయందు ప్రకటించెను. మరియు, డబ్ల్యు. కేలండ్‌తో కలసి "అగ్నిష్టోమ"మును జర్మనీయందు వ్రాసెను.

## ౨౦. వ శతాబ్దము

౬౬—ఎం. వింటర్నిజ్. ఈ ప్రసిద్ధ జర్మను విద్వాంసుడు మాక్సుమిల్లరుయొక్క ఋగ్వేద ద్వితీయ సంస్కరణము నందాయనకు చాల తోడ్పడెను. ఈయనయొక్క వైదికసాహిత్య ఇతిహాసము లైప్‌జిగ్ నగరమునుండి క్రీ. శ. ౧౯౦౪ లో ౩ ఖండములుగ ప్రకటితమయ్యెను. దీని ఆంగ్లానువాదము కూడ "హిస్టరీ ఆఫ్ ఇండియన్ లిటరేచర్" అను పేరుతో భారతమునందత్యంత లోకప్రియమయ్యెను. అనేక విశ్వవిద్యాలయములలో ఎం. ఏ లకు పాఠ్య గ్రంథముగ నియమించబడెను. క్రీ. శ ౧౯౨౫ లో నీయనయొక్క "ఏన్‌ష్యంట్ ఇండియన్ వెలెడ్ పార్టొటీ" అను గ్రంథము ప్రకాశితమయ్యెను. ఆపస్తంబగృహ్యసూత్రమునుకూడ సంపాదనమొనర్చెను.

౬౭—ఏ. బి కీథ్. ఈ ఆంగ్ల విద్వాంసుడు మెకడానల్ శిష్యుడు. (౧) ఈయన ౧౯౧౪ లో కృష్ణ యజుర్వేద తైత్తిరీయ సంహితను ఆంగ్లమునందనువదించి దానికి ౨ వందల పేజీల మహత్తర భూమిక వ్రాసెను. (౨—౩) ౧౯౨౦ లో అమెరికన్ సీరీస్‌లో వంద పేజీల పీఠిక సహితముగ ఐతరేయ కౌషీతకీ బ్రాహ్మణములను ఆంగ్లమునందనువదించి ౧౦ భాగములుగ ప్రకటించెను (౪) ౧౯౨౨ లో "హిస్టరీ ఆఫ్ ఇండియా" యను గ్రంథమును ప్రకటించెను. (౫) ౧౯౨౫ లో "రెలిజియన్ అండ్ ఫిలాసఫీ ఆఫ్ ది వేదాస్ అండ్ ఉపనిషద్స్" అను గ్రంథమును రెండు ఖండములుగ ౭౧౬ పుటలలో ప్రకటించెను (౬) మెకడానల్‌తో కలసి "వైదిక ఇండెక్సు" అను గ్రంథమును రచించెను. (౭) శాంఖ్యాయన ఆరణ్యకమును ఆంగ్లమునందనువదించెను (౮) "హిస్టరీ ఆఫ్ సంస్కృత లిటరేచర్" అను గ్రంథమును రచించెను

౬౮—ఆర్. గార్బే. ఈయన క్రీ. శ ౧౮౮౧ నుండి ౧౯౦౨ వరకు ౨ భాగములుగ ఆపస్తంభశ్రౌత సూత్రమును సంపాదనమొనర్చెను. మరియు బ్లూమ్ ఫీల్డ్‌తో కలసి అథర్వపైప్పలాదీయశాఖను రచించెను.

౬౯—డి. గాస్ట్రా. ఈయన ౧౯౦౬ లో జైమినీయ గృహ్యసూత్రమును డచ్ (హాలండు) భాషయందు అనువదించెను. ౧౯౧౯ లో లేడన్ నగరమునుండి గోపథబ్రాహ్మణమును ప్రకటించెను.

౭౦—ఎం. (మారిస్) బ్లూంఫీల్డ్. ఈ సుప్రసిద్ధ వైదిక విద్వాంసుడు అనేక మహత్వపూర్ణవైదిక గ్రంథములను ప్రకటించెను. (౧) క్రీ. శ. ౧౯౦౭లో జర్మనీనుండి గార్బేతో కలసి శారదాలిపియందు వర్తమాన కాశ్మీరునుండి లభించిన పైప్పలాదశాఖీయ అథర్వవేదముయొక్క హస్తలిఖితప్రతిని ౫౪౦ ఫొటో ప్లేటులలో నాలుగు భాగములుగ ప్రకటించెను. (౨) పిప్పలాదశాఖను ౧౯౧౧ లో ఆంగ్లమునందనువదించెను. (౩) అథర్వవేదీయ కౌశికసూత్రమును ౧౮౯౦ లో ప్రకటించెను. వైదిక కాంకార్డెన్సు (మంత్రమహాసూచీని) ను ౧౯౦౬ లో హార్వర్డ్ ఓరియంటల్ సీరీస్‌లో ౧౦ ఖండములుగ రోమను లిపియందు ప్రకటించెను. (౪) ౧౯౦౮ లో ఆంగ్లమునందు "రెలిజియన్ ఆఫ్ ది వేదాస్"ను ప్రకటించెను. (౫) ఋగ్వేదిక్ రిపిటిషన్సు"ను (పునరుక్త మంత్రసూచీని) ౧౯౧౬ లో రెండు ఖండములుగ ప్రకటించెను.

౪౧—వి ఎఫ్. స్టెన్జలర్. ఈయన ఆశ్వలాయన పారస్కరగృహ్య సూత్రాదులను సంపాదన మొనర్చెను.

౪౨—హెచ్. అర్టల్. ఈయన ౧౯౨౨ లో జైమినీయ ఉపనిషద్ బ్రాహ్మణమును ఆంగ్లమునందనువదించి ప్రకటించెను.

౪౩—వె. యఫ్. క్నాడెయర్. ఈయన మానవ శ్రౌత సూత్రాదులను సంపాదన మొనర్చెను.

౪౪—సి ఆర్. లెన్ మెన్. ఈ విద్వాంసుడు హ్విటన్‌యొక్క అథర్వవేద పూర్ణానువాదమును పూర్తి చేసి టిప్పణులతోసహా అమెరికానుండి రెండు ఖండములుగ ౧౯౦౫ లో ప్రకటించెను.

౪౫—జె. ఎగ్‌లింగ్. ఈయన శతపథబ్రాహ్మణమును ఆంగ్లమునందనువదించి గొప్ప పీఠికసహితముగ ౫ ఖండములలో ప్రకటించెను

౪౬—ఈ వి ఆర్నాల్డ్. ఈయన ౧౯౦౫లో "వైదిక మీటర్ ఇన్ ఇట్స్ హిస్టారికల్ డెవలప్‌మెంటు" అను గ్రంథమును రచించి ఋగ్వేదఛందస్సులను విస్తృతముగ వివరించెను.

౪౭—షెఫ్ట్ లో విట్స్. ఈయన ౧౯౦౬ లో బ్రెసెల్సునుండి ఋగ్వేద ఖిల సూక్తముల విడిసంస్కరణమును జర్మనుభాషయందనువాదసహితముగ ప్రకటించెను.

౪౮—ఈ. జె. థామస్—ఈయన లండను నుండి ౧౯౨౩ లో "వైదికహిమ్స్" (సూక్తసంగ్రహము) ను ప్రకటించెను

౪౯—ఈ. డబ్ల్యు. ఫ్రే: ౧౯౦౭ లో విభిన్న పత్రికలయందు వేదములకు సంబంధించిన వ్యాసములు వ్రాసెను.

౫౦—డిలా వాలీ పౌసిన్. ఈ ఫ్రెంచి విద్వాంసుడు ౧౯౦౯ లో "లా వైదిజ్మ" అను గ్రంథమును వ్రాసెను.

౫౧—హ్యూగో విం క్లర్. ఈ జర్మను విద్వాంసుడు ౧౯౦౨లో ఏషియా మైనరు ప్రాంతమున పురాతన కాలమునాటి ఇటుకలపైన ముద్రితమైన వైదిక దేవతలయొక్క నామముల ఆధారముతో వైదిక కాలాన్వేషణము చేసెను.

౫౨—ఈ. అర్బమెన్. ఈ జర్మను విద్వాంసుడు ౧౯౨౨ లో "వైదిక మైథాలజీ" పై నొక ప్రసిద్ధ గ్రంథము వ్రాసెను

౫౩—హెచ్. డి గ్రిస్‌వోల్డ్. ఈయన ౧౯౨౦ లో "గాడ్ వరుణ ఇన్ ది ఋగ్వేద" అను గ్రంథమును, ౧౯౨౩ లో "ది రెలిజియన్ ఆఫ్ ది ఋగ్వేద" అను గ్రంథమును వ్రాసెను ఈయన క్రైస్తవమత పక్షపాతి. వైదికధర్మ విరోధి.

౫౪—జె ఎన్. ఫర్కుహార్. ఈయన ఇంగ్లండు నుండి ఇంగ్లీషునందు "హిందూ ధర్మ, వైదిక ధర్మ, ధార్మిక సాహిత్యము" మున్నగు వానిపై ౧౯౧౨-౧౯౧౫,౧౯౨౦ లలో ౪ గ్రంథములు వ్రాసెను. న్యూయార్కునుండి "మాడరన్ రెలిజియస్ మూమెంట్సు ఇన్ ఇండియా" అను గ్రంథమును పక్షపాతపూర్ణముగ వ్రాసెను.

౫౫—ఎ. వి. క్లేటన్. ఈయన మద్రాసునందుండి వ్రాసిన "ఋగ్వేద అండ్ వైదిక రెలిజియన్" అను గ్రంథమును ౧౯౧౩ లో ప్రకటించెను. ఇదియును పక్షపాత సమన్వితముగనే యున్నది.

౫౬—జాన్ హర్టెల్. ఈయన ౧౯౨౧ లో జర్మను భాషయందు "ఇండిశ్చే మార్చెన్" అను గ్రంథమును వ్రాసి ప్రకటించెను.

౫౭—ఈ. సీజ్. ఈ జర్మను విద్వాంసుడు ౧౯౦౨ లో జర్మను భాషయందు స్టాట్ గార్డు నుండి "Die sageus taffe des Rigveda und die Indis che Itihasa tradition" అను గ్రంథమును వ్రాసి ప్రకటించెను.

౫౮—జె. కార్పెంటియర్. ఈయన ౧౯౨౦ లో జర్మను భాషయందు 'ఆఖ్యాన సూక్త గేయ కావ్య' విషయముపై నొకగ్రంథమును వ్రాసెను.

౫౯—లిబిష్. ఈయన ౧౯౧౯ లో జర్మను భాషయందు ఋగ్వేదీయ శాకల్యకృత పద పాఠమును వివేచన మొనర్చెను.

౬౦—ఎఫ్. ఈజర్టన్. ఈయన బ్లూమ్‌ఫీల్డుతో కలసి ౧౯౩౦ లో వైదిక పాఠభేదము మరియు పునరుక్తిపై "వైదిక వేరియన్ట్స్" అను ప్రసిద్ధ గ్రంథమును వ్రాసెను.

# వైదికసాహిత్య పాశ్చాత్య రచయితలు

౯౧—ఆర్. ఎన్. ఆల్‌బ్రాయిడ్. ఈయన ౧౯౨౭ లో ఇంగ్లీషునందు ఫిలడెల్ఫియానుండి వైదిక వ్యాకరణముపై "The Vedic declensions" అను గ్రంథమును వ్రాసి ప్రకటించెను

౯౨—డబ్ల్యూ. బున్. ఈ జర్మను విద్వాంసుడు ౧౯౨౬ లో వైదిక ఇతిహాసమునకు సంబంధించిన గ్రంథమును "Vonn Gest Alten del des Rigvedisches Dichtstils" అని లైబెజిగ్ నుండి ప్రకటించెను.

౯౩—బి. జె. రేలే. ఈయన ౧౯౩౧ లో "వేదిక గాడ్స్ యాస్ ఫిగర్స్ ఆఫ్ బయోలజీ" అను గ్రంథమును వ్రాసి అందు వేద ప్రతిపాదిత సమస్తదేవతలు విశేష మస్తిష్కాంగము గల మానవులని సిద్ధాంత పఱచెను.

౯౪—కె. రోత్—ఈయన ౧౯౨౭ లో "త్రితఆప్త్య" అను గ్రంథమును ప్రకటించెను

౯౫—ఆర్. సైమన్. ఈయన ౧౯౦౮ లో జర్మనీయందు పంచవిధ సూత్రప్రకాశితమును సామవేద పుష్పసూత్రమును, జర్మనుభాషయందు సంపాదిత మొనర్చెను.

౯౬—జి పర్టూమ్. ఉపలేఖసూత్రమును సంపాదన మొనర్చెను.

౯౭—ఏ. బెన్ను ఈయన "ఎన్సైక్లోపీడియా ఆఫ్ ఇండో ఆర్యన్ రిసర్చి" అను గ్రంథమును వ్రాసెను.

౯౮—నీసెర్. ఈయన ఋగ్వేదకోశమును నిర్మాణమొనర్చెను.

౯౯—స్మిట్. ఈయన వైదికకోశమును రచించెను.

౧౦౦—లూయి రేనోం. ఈ ఫ్రెంచి వైదిక విద్వాంసుడు ఫ్రెంచిభాషయందు ప్యారిసునుండి ౧౯౨౫ లో "వైదికసూక్తములలో పరోక్షభూతము యొక్క స్థాన"మను విషయముపై నొకగ్రంథమును, ౧౯౩౧ లో వైదిక సాహిత్య ఇతిహాసమునుగూర్చి "బిబిలియోగ్రాఫీ వైదికా" అను మరియొకగ్రంథమును వ్రాసెను. ఇందు వైదికసాహిత్యముపై ప్రపంచభాషలలో వ్రాయబడిన గ్రంథములను వివరించెను. ఇది ౯ భాగములుగ నుండెను.

౧౦౧—జె. క్రిస్టే. ఈయన హిరణ్యకేశీయ (సత్యాషాఢ) గృహ్యసూత్రమును సంపాదన మొనర్చెను.

౧౦౨—జె. ఎం. గిల్డుమెర్. ఈయన "మానవ శ్రౌత సూత్రచయన" మను గ్రంథమును సంపాదన మొనర్చెను.

౧౦౩—జె డబ్ల్యూ సాలోమన్. ఈయన భారద్వాజగృహ్యసూత్రమును సంపాదన మొనర్చెను.

౧౦౪—హెచ్. ఎఫ్. ఎల్‌సింగు ౧౯౦౮ లో నీతడు షడ్వింశబ్రాహ్మణమును సంపాదన మొనర్చెను.

౧౦౫—జె ఎన్. రూటర్. ఈయన ద్రాహ్యాయణ శ్రౌతసూత్రమును సంపాదన మొనర్చెను.

౧౦౬—౧౦౭—జి. ఎం వాలింగ్; ఏ. వి. నెగలిన్. ఈ ఇరువురు జర్మనుభాషయందు ౧౯౧౦లో అథర్వవేదముయొక్క పరిశిష్టగ్రంథమును ప్రకటించెను.

౧౦౮—జె. గ్రిల్. ఈయన "హండ్రెడ్ లెసన్స్ అండ్ లెక్చర్స్ ఆఫ్ అథర్వవేద" అను గ్రంథమును వ్రాసెను

౧౦౯—పి. యి డ్రెబ్యూమండ్. ఈయన ౧౯౨౭ లో ఫ్రెంచియందు "లా అశ్వమేధ" మను గ్రంథమును వ్రాసెను

౧౧౦—జి. బుహ్లర్. ఈయన రెండుభాగములుగ "సేక్రేడ్ లా ఆఫ్ ది ఆర్యన్స్" అను గ్రంథమును వ్రాసెను.

ఇత్యాది పాశ్చాత్య విద్వాంసులలో మాక్సమిల్లరు, రాథ్, గోల్డ్‌స్టకర్, విల్సన్, మ్యూర్, మెక్‌డానెల్, వేబరు, గ్రిఫిత్, హ్విట్నీ, డ్యూసన్ మున్నగు విద్వాంసులు సాయణ, మహీధర, ఉవ్వటాదిభాష్యముల నాధారము చేసికొని నిశ్చింతగా వేదముల నిందించియే వ్రాసిరి.

మాక్సుమిల్లరు మహర్షి దయానందుని సమకాలీనుడే. అయినను సాయణ భాష్యముయొక్క ఆధారముతో వేదములందు పశుబలి, నరబలి, గలవని విశ్వసించుటయే గాక వేదములందు పిల్లల ఆలోచనలవంటి విషయము లధికముగ కలవని తెగించి వ్రాసెను.

# భాగోతం

శ్రీ నండూరి వెంకటసుబ్బారావు

శంఖున పడెడుదాక జలము పావనమా ?
ఎంకిని కనెడుదాక అంద మనుభవమా ?

సత్యభామను వేచు
సంతాపమున కేను
జాలిపడు మునె—ఎంకి
జడముడుచు నను జూచి...
శంఖున...

హంగుల యల వయారి
సంగీతమున కేను
భ్రమతపడు మునె—ఎంకి
బొమముడుచు నను జూచి...
శంఖున...

సరస హాస్యపుటయ్య
సంబారమున కేను
పగలబడు మునె—ఎంకి
నగవడచు నను జూచి...
శంఖున...

సత్యపదముల సామి
సత్కారమున కేను
చినవోవు మునె—ఎంకి
మనుగుడుచు నను జూచి...
శంఖున...

భాగోతమే ఎంకి
నేగాథొ తలపించు.—శంఖున...

## సీరియల్:

# విచిత్రజీవులు

**హితశ్రీ**

పాత్రలు: విద్యాపతి, సుందర్రావు, సీతారామారావు, సన్యాసిరాజు, ధర్మారావు, కూర్మావతారం, లక్ష్మీపతి, ఇన్‌స్పెక్టర్ దండయ్యానాయుడు, వరహాలు, కళ్యాణి, మల్లిక

### రంగము: 1

* అంతగా జనసంచారం లేని ఒకవీధి. సమయం సాయంకాలం. తెర లేచేసరికి రంగం మీద ఎవరూ ఉండరు. ఆ వీధికి దగ్గరగా ఉన్న మైదానములో బహిరంగసభ జరుగుతున్నట్లు కోలాహలం వినిపిస్తూంటుంది. పట్టంనించి మైదానానికి వెళ్లేదారుల్లో ఆ వీధి ఒకటి. సభ జరిగే స్థలం అక్కడికి చేరువగానే ఉండటం వల్లా లౌడ్‌స్పీకర్లు పని చేస్తూ ఉండటం వల్లా ఉపన్యాసం స్పష్టంగానే వినిపిస్తూంటుంది. రంగస్థలానికి ఎడమ వైపు మైదానానికి వెళ్లేదారి.

అధ్యక్షుడు: అయ్యా, అందరూ నిశ్శబ్దంగా ఉండాలి. ఇందాకటినుంచీ మీరు ఎంతో ఓపికతో ఎదురుచూస్తున్న అంశం ఇప్పుడు ప్రారంభము కాబోతోంది. శ్రీ కోటి సూర్యప్రకాశ రావుగారు ఉపన్యసించబోతున్నారు. వారినిగురించి నేనుమీకు కొత్తగా చెప్పాలిసిం దేమీ లేదు. వారు సాక్షాత్తూ కోటి సూర్యుల ప్రకాశాన్ని మూర్తీభవింపచేసుకున్నవారు. వారినిగురించి ఏమైనా చెప్పటమంటే సూర్యుణ్ని దివిటీతో చూపించటమే జగమెరిగిన బ్రాహ్మణుడికి జంధ్యమెందుకు, చెప్పండి. వారు అతిరథ మహారథుల కోవకి చెందినవారు. స్వాతంత్ర్య యోధులు. రాజకీయ బాధితుడు—పోరపాటు—నాయకుడు. రాజనీతి శాస్త్ర పారంగతులు. ఆదర్శవాది. విప్లవమూర్తి. వివేకశీలి. వినయ వినమిత గాత్రులు. సంఘసేవకులు, సంఘ మిత్రులు. వారిని గురించి చెప్పాలంటె మాటలు దొరకటం లేదు. అన్నట్టు వారినిగురించి చెప్పటం అనవసరం అంటూనే చెబుతూ ఉన్నట్టున్నాను. (సభలో నవ్వులు) వారి ప్రసన్న వదనం చూస్తుంటే ఏదో అలా మాట్లాడేయాలనిపిస్తూంది. సరే, ఇక ఆపేస్తాను. అయ్యా, అందరూ నిశ్శబ్దంగా ఉండాలి. మన ప్రఖ్యాత నాయకుడు శ్రీ కోటి సూర్యప్రకాశరావుగారు ఇప్పుడు మాట్లాడబోతున్నారు. వారి ఉపన్యాసం మనం శ్రద్ధగా వినటమే వారిపట్ల మనకి గల గౌరవాదరాలకి నిదర్శనం. దేశసేవలో, సంఘసేవలో వారి తల నెరిసింది.

["అబ్బే, ఇంకా నా తల నెరవలేదం"డి అన్న కోటి సూర్యప్రకాశరావు మాటలు అస్పష్టంగా వినిపిస్తాయి.]

ఏమిటే ళ్ళ...(నవ్వి) రావుగారు ఇంకా తను తల నెరవలేదం టున్నారు. ఇంత చిన్న వయసులోనే ఎంతో సేవ చెయ్యగలిగి నందుకు వారిని మీ అందరి తరఫున నే నభి నందిస్తున్నాను వారి అమోఘమైన సేవ మీ రందరూ ఎరిగినదే ఈ మధ్యనే బీదలకి వారు చేసిన వస్త్రదానం—

[అస్పష్టంగా కేకలు : "రుమాళ్ల దానం"]

వారం వారం వారుచేసే ధాన్య దానం—

[అస్పష్టంగా కేకలు: గుప్పెట్లో సగం - గుప్పెట్లో సగం]

నెల నెలా వారుచేసే ధనదానం—

[అస్పష్టంగా కేకలు : దమ్మిడీ, దమ్మిడీ]

వీటన్నిటిని గురించీ ఎరగనివా రెవరు? తృణమో, పణమో-భక్తితో పెట్టినదిప ట్టెడైన వేమి? హృదయం ప్రధానం గాని పరిమాణం ప్రధానం గాదు సరే, కాలాతీతమై పోతోంది. మీ అమూల్యమైన కాలం వృథా చేయటం నా కిష్టం లేదు. అదుగో—మన కోటిసూర్య ప్రకాశరావుగారు మైక్ దగ్గిరికి వొచ్చేస్తు న్నారు - సెలవు.

కోటిసూర్యప్రకాశరావు: అధ్యక్ష మహాశయా, సోదర సోదరీ మణులారా! ఈరోజు ఇలా మీ ముందు నిలబడే అవకాశం దొరకటం నిజంగా నా అదృష్టం. నన్ను గురించి అధ్య క్షులవారేదో చాలా చెప్పారు. (నవ్వుతూ) ఆయన మాటలు మీరు నమ్మకండి... అంటే, అధ్యక్షులవారు అబద్ధాలకోరని నా అభిప్రాయం కాదు సుమండీ! ఏదో అభిమానంకొద్దీ వారలా అన్నారు మీరం దరూ కూడా నామీద అభిమానంతో అలాగే అనుకుంటారని నాకు తెలుసు. పోతే,ఇవాళ మాట్లాడాలిసిన విషయం గురించి.

సోదర సోదరీమణులారా! ఒక్కసారి మన ఆర్థిక, సాంఘిక రాజకీయ వ్యవస్థల్ని గమ నించండి. అన్ని రంగాల్లో మనిషిని మనిషి పీడిస్తున్నాడు. విలువలన్నీ నశిస్తున్నాయి మనిషిని మనిషి అడుక్కుంటున్నాడు 'భిక్షాం దేహి' యాచనే యుగధర్మం ఐపో యింది. "రెండురోజుల్నించీ తిండిలేదు దొరా, ఒక్కకానీ ఇప్పించండి మారాజా"; "ఇల్లూ వాకిలీ లేనోళ్ళం, తలదాచుకో నివ్వండి బాబూ", "తిండి గింజలకి చాల టంలేదు మరో నాలుగురాళ్లు జీతం పెంచండి స్వామీ"; "స్కూల్లో పేరు కొట్టేశారు, ఏమైనా సహాయం చేస్తారా?" "అంత కట్నం ఇచ్చుకోలేను. దయవుంచి తగ్గించండి బాబుగారూ" — మహా జను లారా! ఇదీ వరస. అయినా మనం ఇంకా మనల్ని నాగరికులమనే పిలుచుకుంటున్నాం రకరకాల కుక్కమూతిపిందెల్ని వేస్తోంది మన సమాజవృక్షం. 'చెట్టు చెడు కాలమునకు కుక్కమూతి పిందెలు పుట్టును' అని సెల విచ్చారు పెద్దలు

[హేళనగా కేకలు : కుక్కమూతి పిందెలు! కుక్కమూతి పిందెలు. హ.హ.హ. కుక్క మూతి పిందెలు! వీధిలోని మునిసిపల్ విద్యు ద్దీపం వెలుగుతుంది.]

స్వార్థమనే వేరుపురుగుపట్టి మన ప్రస్తుత సమా జం అనే చెట్టు అతిచిత్ర విచిత్రమైన కుక్క మూతి పిందెల్ని వేస్తోంది. ఈ వేరుపురుగుని సమూలంగా నాశనం చెయ్యటం...

[మైక్ ఫెయిలవుతుంది]

మన అందరి విధ్యుక్త ధర్మం ఇందుకు మీ రందరూ నడుం కట్టాలి.

['మైక్ -మైక్ 'అని కేకలు]

అధ్యక్షుడు: (గట్టిగా) సోదర సోదరీమణులారా! దుర దృష్టవశాత్తూ మైక్ చెడిపోయింది. బాగు చేస్తున్నారు. అది బాగుపడేవరకూ ఓపికతో నిశ్శబ్దంగా ఉండాలని ప్రార్థన

[రంగం ఎడమవైపునించి పోలీస్ ఇన్స్పె క్టర్ ప్రవేశం. యూనిఫారంలో వుంటాడు. ఓ చేతిలో లాఠీ ఉంటుంది. రెండో చేతిలో ఓ 'ప్లాకార్డ్' ఉంటుంది చిన్న తడికకి కర్ర తగిలించబడి పోస్టర్ అంటించబడ్డది. ఇన్స్పెక్టర్ రంగంమధ్యకివొచ్చి 'ప్లాకార్డ్'

విద్యుద్దీప స్తంభానికి జేరవేసి దానివైపు చూస్తూవుంటాడు అదే సమయంలో సీతారామారావు రంగం కుడివైపునించి ప్రవేశిస్తాడు. ఇరవైయేళ్ల యువకుడు. ఖరీదైన పాంట్, అమెరికన్ జాకెట్, చలవ కళ్లజోడు ధరిస్తాడు. కెమెరా బెల్టు భుజానికి తగిలించుకొని ఉంటాడు ]

సీతా : (చదువుతూ) "నేటి సాయంత్రం ఆరుగంటలకు మైదానంలో బహిరంగసభ. శ్రీ కోటి సూర్యప్రకాశరావుగారు ఉపన్యసిస్తారు. శ్రీసన్యాసిరాజుగారు అధ్యక్షత వహిస్తారు." ఈయనకి అధ్యక్షపీఠాలమీది మోజు ఇంకా తగ్గలేదన్నమాట (ఇన్‌స్పెక్టర్ తో) చూస్తే మీరు పోలీసు ఇన్‌స్పెక్టర్లలే వున్నారు.

ఇన్ : అల్లే ఉండటమేమిటి? నేనేమైనా ఫాన్సీ డ్రెస్ వేశాననా మీ అభిప్రాయం? ముమ్మూర్తులా, సాక్షాత్తూ పోలీస్ ఇన్‌స్పెక్టర్నే నేను.

సీతా : ఇన్‌స్పెక్టర్ గారూ, ఇలాంటి మీటింగులు జరక్కుండా మీరేమీ చెయ్యలేరూ?

ఇన్ : మీ అభిప్రాయం?

సీతా : ఈ డబ్బా చప్పుళ్లు వినలేక చెవులు దిబ్బెళ్లు కడుతున్నాయి

ఇన్ : డబ్బా చప్పుళ్లా? అంటే మీ అభిప్రాయం?

సీతా : ఏదో లెండి చూడండి, మీ పేరేమిటి?

ఇన్ : ఎందుకూ? ఇన్‌స్పెక్టర్ దండయ్యనాయుడు.

సీతా : ఓ! ఇన్‌స్పెక్టర్ దండయ్యనాయుడు! సాక్షాత్తూ ఇన్‌స్పెక్టర్ దండయ్యనాయుడుగారే. మైగాడ్!

ఇన్ : ఏం? మీరేమీ నేరం చెయ్యలేదుగద? అలా దిగ్భ్రాంతులౌతున్నారు!

సీతా : ఎంత అదృష్టం ఇన్నాళ్లూ మీ పేరు వినటమేగాని మిమ్మల్నెప్పుడూ ప్రత్యక్షంగా చూడలేదు. మీరిపూరు వచ్చినప్పటినించీ చిన్న చిన్న చోరీల దగ్గర్నించి పెద్ద పెద్ద దొంగతనాల దాకా అన్నీ బంద్ అని అందరూ చెప్పుకోవటమేగదండీ. ఇన్‌స్పెక్టర్ దండయ్యనాయుడంటే ఊరంతా హడల్ హడల్. సామర్థ్యమంటే అలా ఉండాలి. అసలు మీ ఠీవి, మీ విగ్రహం చూస్తే మీరే ఐ ఉంటారనుకున్నాలెండి.

ఇన్ : (పొంగిపోతూ) ఇంతకీ తమరెవరో సెలవిచ్చారు కారు బహుశా కరస్పాండెంటయి ఉంటారు.

సీతా : ఎవర్నయితే ఏం లెండి మీలాంటి వ్యక్తిత్వం కలవాణ్ణి కాను.

ఇన్ : మిమ్మల్ని చూస్తుంటే చాలా తీక్ష్ణబుద్ధి కలవారని తోస్తోంది

సీతా : హ! హ! ఏదో అభిమానంకొద్దీ అంటున్నారు.

ఇన్ : ఎంత మాట! ఒక్క క్షణం కిందట రాకపోయారా సార్! మిమ్మల్ని సాక్షిగా వేసుకుని వాడిపని పట్టేవాడిని.

సీతా : వాడంటే ఎవరు?

ఇన్ : వాడే ఆ ఉప్పరపోలాయ్.

సీతా : వాడిని గురించి నేనెప్పుడూ వినలేదే.

ఇన్ : నేను మాత్రం విన్నానేమిటి!

సీతా : అయితే వాడేం చేశాడు?

ఇన్ : నన్ను చూడలేదు కాబోలు ఇదిగో, ఈబోర్డు చేతపట్టుకుని పరుగుతీశాడు 'ఎవ్రడా!' అని ఒక్క పోలికేక పెట్టేటప్పటికి వెనక్కి తిరిగి నన్ను చూసి హడలిపోయి కూలబడిపోయాడు.

సీతా : అరెరె!

ఇన్ : దగ్గిరికెళ్లి 'ఏమిట్రా ఆ పని?' అని అరిచేటప్పటికి 'ఎంఎం బాబూ, మీ పాదాలట్టుకుంటాను' అని నెమ్మదిగా జారుకున్నాడు. 'పోనీలే, సాక్ష్యం కూడా లేదు గదా' అని వొదిలేశాను.

సీతా : కాని ఇది వాడికేం ఉపయోగం?

ఇన్ : ఏది కనిపిస్తే అదే, వెధవ కక్కుర్తి పుల్లలేరుకోటానికి బద్ధకించి ఉంటాడు.

సీతా : పొయ్యికిందికన్నమాట.

ఇన్ : మరే. చదువుగాని మూర్ఖుడు. వాడికేం తెలుసు దీని ఉపయోగం.

సీతా : వాడికే బాగా తెలుసేమో!

ఇన్ : (ముఖం చిట్లించి) మీ అభిప్రాయం?

సీతా : ఏదైతే ఏం లెండి!

ఇన్ : (కొంచెం ఆలోచించి) ఓ! మీ కరెస్పాండెంట్లున్నారే, మహా అసాధ్యులండి చూస్తే మీరు నా పేరు పేపర్లోకి ఎక్కించేసేట్టున్నారే! 'విధ్వంసకుల చర్యలు అరికట్టటంలో పోలీస్ ఇన్‌స్పెక్టర్ శ్రీ దండయ్య నాయుడి ప్రతిభా విశేషాలు' అని పత్రికల్లో రాసెయ్యగుగద!

సీత : ఒక వేళ నేను రాస్తేమాత్రం ఎవరు వేసుకుంటారండీ?

ఇన్ : కరెస్పాండెంట్ రాస్తే వేసుకోరా?

సీతా : నేను కరెస్పాండెంటునని ఎవరు చెప్పారు మీకు?

ఇన్ : (ఆశ్చర్యంగా) కాదా?

సీత : ఎబ్బె కాదు నా వేషభాషల్ని బట్టి ఈపాటికే మీరు గ్రహించి ఉండాలిసింది. నా కున్నంత తీక్షబుద్ధి మీకు లేనట్టుందే!

ఇన్ : (కోపంగా) ఏమిటీ?

సీతా : అహాఁ! ఊరికే, మాటవరసకి అంటున్నాను.

ఇన్ : ఆ కెమెరా చూసి మీరు విలేకరేమో అనుకున్నాను. ఇందులో నా తప్పేముందీ?

సీత : మిమ్మల్ని మోసగించటం నాదే తప్పులెండి. కాని నేను మోసపోలేదు, చూశారూ?

ఇన్ : యూనిఫారంచూసి ఎవరైనా ఊహించగలరు

సీతా : మరి నేను తీక్షబుద్ధినని మీరే అన్నారే.

ఇన్ : ఏదో అనుకున్నాను. అదంతా పైపటారమే కాగూడదూ?

సీతా : మీకు బాగా కోపం వచ్చినట్టుంది.

ఇన్ : అందుకు నేను బాధ్యుణ్ణి కాను. మీరెవరో పెద్దమనిషనుకున్నాను. ఇంకా సాక్షిగా కూడా వేసుకుందామనుకున్నాను

సీత : మీరు వేసుకుంటే మాత్రం నేను ఒప్పుకోవొద్దూ?

ఇన్ : రూల్ ప్రకారం ఒప్పుకోవాలిసిందే.

సీత : అయితే అబద్ధం ఆడేస్తాను.

ఇన్ : ఏమిటీ!

సీత : సరదాగా అబద్ధాలాడేవాడికి ఓ ఇల్లు నిలపటంకోసం అబద్ధమాడటం ఓ లెక్కా?

ఇన్ : చిత్రంగా మాట్లాడుతున్నారే.

సీతా : ప్రపంచం చిత్రంగా లేదూ? ఇప్పటికిప్పుడే ఓ చిత్రం చూశారుగా.

ఇన్ : మీ అభిప్రాయం?

సీతా : ఆలోచిస్తే మీకే తెలుస్తుంది:

ఇన్ : మిమ్మల్ని చూస్తుంటే కోర్టుకి రప్పించాలని సరదాగా ఉంది. కేవలం మీ కోసమైనా ఆ ఉప్పర పోలాయ్‌మీద కేసు పెడతాను. ఊఁ. మీ పేరు? (నోట్ బుక్ తీసి రాయటానికి సిద్ధమౌతాడు.)

సీతా : సీతారామారావు.

ఇన్ : వయస్సు?

సీతా : ఇరవై.

ఇన్ : తండ్రి పేరు?

సీతా : లాండ్‌లార్డ్ అండ్ బ్యాంకర్ సన్యాసిరాజుగారు.

ఇన్ : (ఆశ్చర్యంగా) ఏమిటీ! మీరు సన్యాసిరాజుగారి కుమారులా?

సీతా : స్వయానా!

[ఇన్‌స్పెక్టర్ నోట్ బుక్ జేబులో పెట్టేస్తాడు] అదేమిటి? పుస్తకం మూసేస్తారేం? రాసుకోండి.

ఇన్ : వద్దులెండి.

సీతా : ఏం? తరవాత ఎలాగూ కొట్టేసుకోవాలనా?

ఇన్ : (నవ్వి) మొదటే గ్రహించి ఉండాలిసింది. ఇంకొకరైతే అసలు ఇలా మాట్లాడగలరా! ఇంతకీ, మీ వృత్తిఏమిటో చెప్పారుకాదే!

సీతా : సౌందర్యాన్వేషణ.

ఇన్ : (తెల్లబోయి) అంటే?

సీత : అందంకోసం వెతకటం.

ఇన్ : (కొంచెం హేళనగా) అదిఎక్కడ దొరుకుతుందో!

సీత : నవనవోన్మేష సౌందర్యాన్ని పుణికి పుచ్చుకున్న పుత్తడిబొమ్మల్ని ఎప్పుడూ చూడలేదా మీరు?

ఇన్ : బొమ్మలు చూసేకేం!

**సీతా** : బొమ్మలు కొంటయ్యా స్వామీ బంగారు బొమ్మల్లాంటి మరువ్వాలేశిరోరత్నాలు

**ఇన్** : రత్నాలు చూసే భాగ్యమే ఉంటే ఈ ఉద్యోగంలో ఎందుకుంటాను?

**సీతా** : రత్నాలంటే రత్నాలు కొదయ్యా. మహాను భావా! రత్నాల్లా రాణించే రాజీవదళా క్షులు చిరునవ్వుల వెన్నెలలు వెదజల్లే పదారుకళల చంద్రబింబసమాన వదనలు. తెలిమబ్బుల్లో తేలిపోయే హంసగమనల తల దన్నే భూలోక సుందరీమణులు.

**ఇన్** : ఓహో! అలా చెప్పండి. ఆ చివరిమాట ముందే చెబితే సరిపోయేదిగా. అలాంటి వాళ్లని చాలామందిని చూశానుగానీ, అంత మూర్ఛపోవాలిసిన అవసరం నాకెప్పుడూ కలగలేదు.

**సీతా** : దురదృష్టం. పరమ దౌర్భాగ్యం. తుంటరి చెరకు విలుకాని కుసుమశరాలు మీ ఎదలో ఎప్పుడూ నాటుకోలేదన్నమాట వలపు తలపులు మీలో మొలకలెత్తనే లేదన్నమాట మీ హృదయం వట్టి బీడు, ఇసకపర్ర, ఊసర క్షేత్రం అందుకే సౌందర్యమంటే ఏమిటో మీకు తెలీదు ఆతృష్ణ మీలో లేనేలేదు.

**ఇన్** : అదంతా మృగతృష్ణ సీతారామారావుగారూ

**సీతా** : ఏమిటీ!

**ఇన్** : ఎండమావుల్లో ఎవరైనా నీళ్లు తాగుతారా?

**సీతా** : ఓ! అదా! హృదయం వట్టి ఎడారైతే కనిపించేవి ఎండమావులే. ఓ వసంతో దయ శుభసమయంలో శుక పిక శారికా గీతికా సంగీతంతో శ్రుతికలుపుతూ మీ హృదయవీణని మోగించండి. ప్రేమిం చండి. ఇన్‌స్పెక్టరుగారూ, ప్రేమించండి. అందం, ప్రేమ—ఇవి రెండే ఈ అశాశ్వత ప్రపంచంలో శాశ్వతాలు అందాన్ని ఆరా ధించండి, ప్రేమించండి, ప్రేమ! (ఆకాశం వైపుచూస్తూ, సర్వం మరిచి) ప్రేమ! ఆ మాటలోనే ఎంత అందం ఉంది! ప్రేమకి అందం ఆలంబనమైతే అందానికి ప్రేమ ఆభరణం. ఓహో! (తన్మయుడౌతాడు.)

[ఇన్‌స్పెక్టర్ అతనివైపు విచిత్రంగా చూసి, ఒకటి రెండుసార్లు పిలిచి ప్రత్యుత్తరం రాక బుర్రగోక్కుని రంగం ఎడమవైపుకి నిష్క్రమి స్తాడు. ఇంచు మించు అదే సమయంలో ఆ వైపునించే విద్యాపతి ప్రవేశం. ఇరవై ఏళ్ల యువకుడు ఇన్‌షర్టు వేసుకునివుంటాడు. చొకదుస్తులు, బీదరికం అతని ముఖంలోంచి తొంగిచూస్తూంటుంది అందమైన విగ్రహం జుట్టు దువ్వలేదు. అతని కదలికల్లో, మాటల్లోకూడా ఓ విధమైన నైరాశ్యం ప్రస్ఫుటమౌతుంది. ఏదో వస్తువు పోగొట్టు కున్నట్టు, ఆశగా దానికోసం వెతుకుతున్న ట్టుగా ఉంటాయి అతని చూపులు సీతా రామారావు భంగిమచూసి ఆశ్చర్యంగా అతని వైపుచూస్తూ సమీపిస్తాడు విద్యాపతి ]

ప్రేమా! నువ్వు నిజంగా అందాల పాల వెల్లివే! కాని నీకు ప్రేమ అనే ఆభరణం లేదు. అయినా నీ అందం ప్రకాశిస్తూనే ఉంది. కాని... కాని నువ్వు ఎడారిపువ్వువి. వర్షించని మేఘానివి. నీకు హృదయసౌంద ర్యంలేదు. ప్రేమా! ఉ హ్.

[అతని భుజంమీద చెయ్యేస్తాడు విద్యా పతి. సీతారామారావు ఉలిక్కి పడతాడు ]

ఓ! నువ్వేనా! విద్యాపతీ! ఎవరో అనుకుని ఉలిక్కిపడ్డాను.

**విద్యా** : నే నే లే! ఏమిటి నీలో నువ్వు మాట్లాడుకుంటు న్నావు?

**సీతా** : లేకపోతే నాసోద ఎవరు వింటారు? (చుట్టూ చూసి) ఇన్‌స్పెక్టర్ గారు ఎప్పుడో జారు కున్నారే!

**విద్యా** : ఇన్‌స్పెక్టరెవరు?

**సీతా** : పోలీసు ఇన్‌స్పెక్టర్ దండయ్యనాయుడు.

**విద్యా** : పరిచయస్థుడా?

**సీతా** : ఇప్పుడే పరిచయం అయింది పాపం, ఆయ నకి లాఠీభాష తప్పితే ఇంకేమీ తెలియదు.

**విద్యా** : అంటే నీ ఉద్దేశం నీలా కనుసైగలతో మాట్లాడ్డం చేతకాదనేనా?

**సీతా** : ఏమాత్రం రసపిపాస లేదోయ్.

విద్యా : తీరిక లేదేమోలే.

సీతా : తీరిక చూచుకుని అలవాటు చేసుకుంటే అబ్బేదా కళాహృదయం? పిచ్చివాడా!

విద్యా : పోనీలే ఏదో ఉద్యోగం చేసుకుంటూ నిట్టూర్పులు లేకుండా హాయిగా బతుకుతున్నాడు.

సీతా : నిట్టూర్పులు లేని జీవితంకూడా ఓ జీవితమేనా? వెచ్చటి నిట్టూర్పులే పచ్చటి జీవితానికి నాంది. విద్యాపతీ, చీకటి పడితే కదుటోయ్ చంద్రబింబం కనిపించేది?

విద్యా : ఔనౌను. అయితే, నిన్ను తప్పక అభినందించాలిసిందే!

సీతా : ఎందుకూ?

విద్యా : ఇంతకి ముందే కదూ నువ్వు నిట్టూర్పులు విడిచావు!

సీతా : ఓ ఔనౌను. (జాలిగా) నిట్టూర్చాను.

విద్యా : కారణం తెలుసుకోవచ్చా?

సీతా : నీకు తెలీకూడదూ?

విద్యా : తెలిస్తే ఎందుకడుగుతాను?

సీతా : నా నోటివెంట వినాలని—

విద్యా : ఎబ్బే! నా కటువంటి సరదాలు లేవు.

సీతా : నిజంగా నీకు తెలియదా?

విద్యా : ఉఁహుఁ.

సీతా : (కొంచెం ఆశాభంగం చెంది) ఆశ్చర్యంగా ఉందే!

విద్యా : ఏం?

సీతా : అందరికీ తెలుసు నన్ను ఎరగనివాళ్ళకి కూడా.

విద్యా : వింతగా ఉందే.

సీతా : ముఖ్యంగా మన కాలేజీలో—

విద్యా : మన కాలేజీ కాదు నే నీయన్య కాలేజీ మానేశానుగా.

సీతా : (ఆశ్చర్యంగా) మానేశావా? ఎప్పటినించీ?

విద్యా : ఈటరమ్ మొదటినించీ.

సీతా : ఎందుకూ?

విద్యా : సరదా వేసి.

సీతా : సరదా?

విద్యా : ఉఁహుఁ—విసుగు పుట్టి—

సీతా : విసుగా?

విద్యా : అహఁ—కోపం వచ్చి.

సీతా : కోపమా?

విద్యా : కాదులే. తెలివిమీరి.

సీతా : ఏమిటి నీ గొడవ?

విద్యా : ఏముంది? డబ్బెక్కువైందిలే.

సీతా : (విద్యాపతిని ఎగాదిగా చూసి) అంతడబ్బు—(చప్పున స్ఫురించి) ఓ—డబ్బు లేక మానేశానంటావేం? (నవ్వి) డొంకదారి పట్టించి దుంప తెంపేశావే.

విద్యా : తిమురంత బహుపరాక్ చిత్రగిస్తుంటే నే నేం చెయ్యను?

సీతా : పరాకు కాకేమిటి, సర్వసం పోయింతరవాత?

విద్యా : ఏమిటీ!

సీతా : నా సర్వస్వం పోయిందోయ్ విద్యాపతీ?

విద్యా : సరిగా చెప్పు.

సీతా : నా ఆస్తిని కోల్పోయాను.

విద్యా : ఎలా?

సీతా : దొంగతనం. ఎలా ఏమిటి!

విద్యా : ఎక్కడ?

సీతా : కాలేజీలో.

విద్యా : కాలేజీలో దొంగతనమా?

సీతా : తొంగలి రెప్పలు తొలగించి ఆచెలి తొలిసారి చూచిన వాలుచూపులే నామనసునీ, హృదయాన్నీ—సర్వస్వాన్నీ దోచుకున్నాయి.

విద్యా : (నవ్వి) ఓహో పుష్పబాణవిలాసమా! మరేమిటో ననుకున్నాను

సీతా : వంకలేదోయ్ ఆ అందానికి. హద్దు లేదోయ్ ఆ విలాసానికి. నా మనసులో వెన్నెలజల్లులు కురిశాయి. కోరికల పంటలు పండాయి. హృదయంలో ప్రణయ ఝురులు పొంగి పొర్లుతూ పారాయి.

విద్యా : ఐతే నిట్టూర్పు లెందుకు?

సీతా : స్వేచ్ఛగా జలజలా సాగిపోయేనదికి ఆనకట్ట కడితే ఏమౌతుంది?

విద్యా : ప్రజలు బాగుపడిపోతారు.

సీతా : విద్యాపతీ మనసారా ప్రేమించాను. కాని ప్రేమ అది అర్థంచేసుకోలేదు. వింటున్నావా?

విద్యా : ఎవరూ అర్థం చేసుకోలేనిది ?

సీతా : ప్రేమ.

విద్యా : (సీతారామారావు వైపు నఖశిఖ పర్యంతం చూసి) ప్రేమా ?

సీతా : అవును ప్రేమ. అదే ఆ అమ్మాయి పేరు.

విద్యా : ఓ. ఆ అమ్మాయి పేరా !

సీతా : మూడు రాత్రులు ఏకధాటిగా ఆలోచించి ముచ్చటగా మూడు పంక్తులలో నా మనసంతా ఇమిడ్చి లేఖ రాశానోయ్.

విద్యా : పోస్ట్ చేసి కొంపతీశావా ?—సారీ—కొంప తీసి పోస్టు చేశావా ?

సీతా : ఆహా. రెండూ జరిగాయి.

విద్యా : అయిందీ !

సీతా : నిర్మల ప్రేమ ఓటమి ఎరగదోయ్ ప్రేమ నన్ను కాలేజీనించి సస్పెండు చేయించినా, డిబార్ చేయించినా నేనామెని ప్రేమిస్తూనే ఉంటాను.

విద్యా : ఇంతకీ సస్పెండు చేశారా నిన్ను ?

సీతా : ఆ

విద్యా : పోనీలే. అంతటితో ఆగింది శిక్ష.

సీతా : డిబార్ చేస్తానని బెదిరిస్తున్నాడు ప్రిన్సిపాల్.

విద్యా : మరయితే ఏం చేసేట్టు ?

సీతా : ప్రేమకంటే ఎక్కువటోయ్ కాలేజీ ?

విద్యా : పోనీ, ఆ ప్రేమేమిటో కొంచెం వాయిదా వెయ్యకపోయావా సీతారామారావ్ ?

సీతా : (విద్యాపతిని తీక్షణంగా చూసి) ఎంతరసహీనంగా మాట్లాడావు ! నువ్వు నిజంగా పేదవాడివోయ్ విద్యాపతీ.

విద్యా : అది నా ముఖం చూస్తేనే తెలుస్తోందిగా.

సీతా : ప్రేమ ! ఆ మాట తలుచుకుంటేనే ఎంత ఆనందంగా ఉంటుంది. మహోన్నతము, మహోదాత్తము, మహాద్భుతము, ప్రేమ. అది అంచులులేని ఆకాశమంత, సరిహద్దులు లేని సాగరమంత, లోతులు తెలియని అగాధమంత. ప్రేమించటంలోనే దేవత్వం సిద్ధించి మానవత్వం ఆఖరిదశ అందుకుంటుంది. తెలుసుకోవోయ్, విద్యాపతీ, ప్రేమతత్వం.

విద్యా : నిన్ను చూస్తే తెలుస్తూనే ఉందిలే.

సీతా : భగ్న హృదయుడనైనా ప్రేమిస్తూనే ఉన్నాను. ఆ అందాలరాణి నన్ను నిరసించినా, విసిరికొట్టినా, కసురుకున్నా నవనవోన్మేషంగా నా ప్రేమలత చిగురిస్తూనే ఉంది. ప్రేమ నిర్మలం, నిశ్చలం, అజరం, అమరం, అవ్యాజం, అవ్యయం.

విద్యా : నిష్ఫలం నిరర్థకం—

[రంగం కుడివైపునుంచి ధర్మారావు ప్రవేశం. నడివయస్సు మనిషి. నల్లటి విగ్రహం. కొంచెం ముతక దుస్తులు. బుజంమీద జరీ కండువా ఉంటుంది. ధర్మారావు సమీపిస్తుండగా చూసి తటాలున వెనక్కి తిరిగి మాటలు మధ్యలోనే ఆపేసి విద్యాపతి గభాలున సీతారామారావు చలవకళ్లజోడు లాక్కొని పెట్టుకుంటాడు. అతను తెల్లబోయిచూసి ఏదో అనబోతుంటే సంజ్ఞతో మాట్లాడవద్దని సూచిస్తాడు విద్యాపతి. ధర్మారావు ఇదంతా చూస్తూనే ఉంటాడు.]

ధర్మా : కళ్ళజోడు పెట్టుకుని కళ్లు కప్పుదామని చూస్తున్నావా? ఏమిటయ్యా ఈ వెధవ్వేషం!

విద్యా : అబ్బెబ్బె! వేషం ఏముందీ?

ధర్మా : వేషం కాకపోతే మరేమిటీ?

[కళ్ళజోడు లాక్కుంటాడు.]

విద్యా : ధర్మారావుగారూ! కొంచెం మర్యాదగా ప్రవర్తించండి.

ధర్మా : చెప్పొచ్చావు లేవయ్యా మహా, మర్యాదట—మర్యాద! మర్యాదగల మనిషివైతే ముప్ఫై రూపాయల బాకీకి మూడు చెరువుల నీళ్ళు తాగిస్తావా?

విద్యా : ముప్ఫైయా? పాతిక రూపాయలే గదండి మీ కివ్వాలిసింది?

ధర్మా : వడ్డీ ఏ గంగలో కలుపుతావు?

విద్యా : అంత వడ్డీనా?

ధర్మా : అంత గడువా అని అడగవేం? సంవత్సరం నించీ తిప్పుతున్నావు, ముష్టి ముప్ఫై రూపాయలకి.

సీత : ముష్టి ముప్ఫై రూపాయలేగా. పోనీ వదులు కోకూడదూ అంత అవస్థపడకపోతే!

ధర్మా : వదులుకోవాలీ? ఎవరి తాత సొమ్మనీ?

విద్యా : ఎవరిదో అయితే మీరు తప్పకుండా వదులుకునేవారే, పాపం.

సీత : ముష్టి ముప్ఫై రూపాయలు!

విద్యా : ఓ రోజు మీరు ముష్టివేసినంత లేదండీ, ధర్మారావుగారూ.

సీత : పోనీ, చందా ఇచ్చినంత

విద్యా : ఎవరికి?

సీత : వరద బాధితులకి, తుపాను బాధితులకి, కూడూ గుడ్డా లేని దీనజనులకి, దరిద్ర నారాయణులకి.

విద్యా : ఛ ఛ ధర్మారావుగార్ని తక్కువ చేసి మాట్లాడుతున్నావు. ముప్పై-కేవలం-ముప్ఫై రూపాయలా వారు చందా ఇచ్చేది?

సీత : పోనీ, బెనిఫిట్ డ్రామా టిక్కెట్టు కొన్నంత

విద్యా : కొంటే వందరూపాయల టిక్కెట్టుకి తక్కువ టిక్కెట్ కొంటారనుకున్నావా ధర్మారావుగారు!

సీత : ఐతే ఓ నెల మామూళ్లిచ్చినంత.

విద్యా : ధర్మరావుగారి ఆశ్రితుల సంఖ్య నీకు తెలీదన్నమాట!

సీత : అంత గొప్పవారా ధర్మారావుగారు?

విద్యా : వేరే చెప్పాలా; అరడజను దుకాణాల్ని వారు అవలీలగా పరిపాలిస్తున్నారు.

ధర్మా : చాలించండయ్యా మీభట్రాజు పొగడ్తలు నాకు తెలుసు వాటి అర్థం ఏమిటో. ఆ బాబ్బి సంగతేమిటో తేల్చవయ్యా, విద్యాపతీ! అలా గుడ్లు మిటకరించి చూస్తావేం?

విద్యా : నే నెప్పుడైనా ఇవ్వనన్నానా?

ధర్మా : ఎందుకంటావూ! ఇచ్చేదుంటేగా! ఇకా ఈఆటలు సాగవు. అదేదో ఇవాళ తేల్చి పారెయ్యి.

విద్యా : రోడ్డుమీద ఇలా నిలదీస్తే ఎలాగండీ?

ధర్మా : నిలదీస్తానా, చెవులు మెలేస్తానా? నీబతుకేమిటో నలుగురిలో పడెయ్యకుండా ఉంటానా ఇవాళ.

విద్యా : మాకెలాగూ మర్యాద, గౌరవం లేవు. మీ గౌరవంఅయినా దక్కించుకోండి. నలుగురిలో అల్లరిపెట్టటం మీకే నష్టం నవ్వుల పాలౌతారు.

ధర్మా : నవ్వేవాళ్లిస్తారా ముప్ఫై రూపాయలు? చూస్తా—ఆ నవ్వేవాళ్లెవరో చూస్తా.

విద్యా : ముప్ఫైరూపాయలపాటి చెయ్యదా మీ గౌరవం?

సీత : ముష్టి ముప్ఫైరూపాయలు!

ధర్మా : ఇదిగో ఆఖరిసారి చెబుతున్నా — ఈఆటలు నాదగ్గర సాగవు ఉఫ్ ఉఫ్ మని సిగరెట్ మీద సిగరెట్ ఊదేసినా పోయిందయా ఈ తెలివి? సిగరెట్లు నాకేం ఊరికే వొచ్చాయా? దమ్మిడీకి గతిలేదుగాని ఏగాని తువరంట. మింగమెతుకు లేదుగాని మీసాలకి సంపెంగనూనె. స్టూడెంటుట పైగా స్టూడెంట్. ఇంటిపేరు కస్తూరివారూ ఇంట్లో గబ్బిలాల కంపూ. నాకదంతా ఎందుకు? ఇస్తావో, ఇవ్వవో చెప్పు. అడుక్కు తెస్తావో, అప్పు తెచ్చుకుంటావో, దొంగలిస్తావో నాకనవసరం. నాముప్ఫై రూపాయలూ నాక్కావాలి... ఏం మాట్లాడవేం?

[విద్యాపతి షర్టు కాలర్ పట్టుకుంటాడు. కుడిపైపునించి అడ్వకేట్ కూర్మావతారం వడివడిగా ప్రవేశం—ముప్ఫయి ముప్ఫయి రెండు మధ్యవయస్సు. గ్లాస్కోపంచె, కాలర్ లేని షర్టు, కళ్లజోడు ధరిస్తాడు. హాఫ్‌బూట్ వేసుకుంటాడు.]

కూర్మా : ఏమిటేమిటి? ఏంజరిగింది? ఆగండి. ఆగండి. (విద్యాపతిని విడిపిస్తాడు) ఏమిటిదంతా?

ధర్మా : (కోపంగా) మధ్యన మీరెవరు?

కూర్మా : నేనా? నేను అడ్వకేట్ కూర్మావతారాన్ని. కె. కె. అవతారం, ఎం. ఏ. ఎల్. ఎల్. బి. నంబర్ టెన్, కాలనీ.

ధర్మా : మీజోక్యం మాకక్కర్లేదు

కూర్మా : అక్కర్లేకపోవచ్చు. కాని పబ్లిక్ రోడ్‌మీద గలాటా చేస్తే ప్రాసిక్యూట్ చేస్తారని తెలియచెప్పటం నావిద్యుక్తధర్మం.

ధర్మా : సరే. ఇహ మీరు వెళ్లొచ్చు.

కూర్మా : పదండి, అందరం కలిసేవెళ్దాం. అవతల మీటింగు జరుగుతోంది.

[సీతారామారావు, విద్యాపతి కదుల్తారు]

ధర్మా : ఏమయ్యోయ్ విద్యాపతీ, ఆగు, ఆగు! నా ముఫైరూపాయల సంగతీ తేల్చి మరీపో.

కూర్మా : ముఫైరూపాయలేమిటి?

సీతా : (వెటకారంగా) ముప్ఫై ముప్ఫయి రూపాయలు!

ధర్మా : ఇతను నాకు ముఫైరూపాయలు బాకీఉన్నాడండి.

కూర్మా : ఏమండీ. నిజమేనా?

విద్యా : నిజమే.

ధర్మా : ఆ బాకీ సంవత్సరంనించీ ఎగెయ్యాలని మాస్తున్నాడండి

విద్యా : అబద్ధం.

కూర్మా : ఏమిటి అబద్ధం?

సీతా : సంవత్సరంనించీ కాదండి!

విద్యా : అసలు ఎగెయ్యాలని నాకు ఏకోశానా లేదండి.

కూర్మా : మరయితే ఎందుకివ్వలేదు?

విద్యా : డబ్బు లేక నేనండి. గడువు ఇవ్వమంటే గొడవ చేస్తున్నాడాయన.

కూర్మా : పోనీ, గడువిచ్చిమాడండి.

ధర్మా : బాగా నేఉంది సిఫారసు ఎన్నాళ్లియ్యి గడువిచ్చేది?

కూర్మా : అతనిదగ్గిర లేకపోతే ఏంచేస్తాడు?

ధర్మా : ఇటువంటి వ్యవహారాలు చాలా చూశాం

కూర్మా : అందరూ మీకు డబ్బు ఎగ్గొడుతుంటారా?

ధర్మా : చెముడా లెక్కడీమనూ!

కూర్మా : ఇంతకీ. ఇప్పుడేం చేసేటు?

ధర్మా : మీదారిన మీరుపొండి మేమేనో చూసుకొంటాం.

కూర్మా : (విద్యాపతితో) మీ పేరేమిటన్నారు?

విద్యా : విద్యాపతి.

కూర్మా : ఈ వివాదానికి పరిష్కారం ఒక్కటే కనిపిస్తోంది. విద్యాపతిగారూ, మీ బాకీ మొత్తానికి ప్రామిసరీనోటు వ్రాసివ్వండి. ఏం?

విద్యా : అలాగే.

ధర్మా : నా కెందుకయ్యా నోటు?

కూర్మా : మరేం కావాలి?

ధర్మా : డబ్బు. రొక్కం!

కూర్మా : చిక్కే వొచ్చిందే

విద్యా : నించున్నపాళాన డబ్బెక్కడినించి వొస్తుందండీ?

కూర్మా : అవును. మరి. (ఆలోచించి) చూడండి ఈ డబ్బు తీసుకుని ఎన్నాళ్లయిందీ?

విద్యా : ఓ సంవత్సరం.

కూర్మా : అంతేనా! లిమిటేషన్ పట్టలేదన్నమాట!

[ధర్మారావు అతనివైపు కొరకొరమాస్తాడు.]

చూడండి! ఈ బాకీ స్వభావం ఎలాంటిది? చేబదులా?

విద్యా : కాదండి (నసుగుతూ) సిగరెట్లు...తాలూకు-బాకీ

కూర్మా : ఓ కాతాబాకీ అన్నమాట తీసుకున్నప్పుడల్లా సంతకం పెట్టారా?

విద్యా : లేదండి

కూర్మా : మొత్తానికి ఒక్కసారే సంతకం పెట్టారా?

విద్యా : అసలు సంతకం ఎప్పుడూ పెట్టలేదండి.

[ధర్మారావు కొంచెం బెరుగ్గా మాస్తాడు]

కూర్మా : సంతకం లేదూ! మైగాడ్ !!

ధర్మా : (కొంచెం భయంగా) ఏం లేకపోతే, కాతా బాకీయేగా!

కూర్మా : రుజువుందా?

ధర్మా : మా కొట్టుగుమాస్తా, పనికుర్రాడు, కాతా పుస్తకం చాలు.

కూర్మా : వాళ్లంతా మీవాళ్లేగా?

ధర్మా : అయితే.

కూర్మా : ఏంలేదు. సాక్ష్యం బలంగా లేదు. సంతకం అంతకంటే లేదు.

ధర్మా : (కోపంగా) ఆయనే ఒప్పుకుంటుంటే ఇంకా సాక్ష్యమేం కావాలండీ?

కూర్మా : ఆయన ఒప్పుకోకపోతే?

ధర్మా : ఎందుకొప్పుకోడు? (తిగ్గి) ఏం, విద్యాపతి గారూ?

విద్యా : ఊఁ

సీతా : నువ్వొప్పుకోకు విద్యాపతీ.

[విద్యాపతి అతనివైపు చూస్తాడు].

కూర్మా : ఒప్పుకుంటే బాకీ ఉంటుంది. లేకపోతే లేదు.

[విద్యాపతి అతనివైపు చూస్తాడు]

విద్యా : తరవాత చూద్దాంలెండి పదండి ధర్మారావు గారూ.

ధర్మా : తరవాత చూసేదేమిటండీ? ఇప్పుడే నలుగుర్లో బాకీ ఉన్నానని చెప్పండి

సీతా : నువ్వు చెప్పొద్దు విద్యాపతీ.

ధర్మా : విద్యాపతిగారు అబద్ధమాడతారా? అసలా మాట ఆయన నోటంట వొస్తుందా? తిండికి పేద ఐతే గుణానికి పేదా వారు! నేను నమ్మను

కూర్మా : పరిస్థితుల ప్రభావం ఎలా ఉంటుందో మనం చెప్పలేం లెండి.

సీత : బాకీ లేదనవోయ్ విద్యాపతి రోడ్డుమీద ఈ పీడ వొదుల్తుంది

విద్యా : (నెమ్మదిగా) అబద్ధమా!

సీత : మరేం ఫరవాలేదు. వారిజాక్షులందు వైవాహికములందు ప్రాణవిత్తమానభంగము లందు బొంకవచ్చు!

కూర్మా : చెప్పండి, విద్యాపతిగారూ, మీరు ఈయనకి బాకీ ఉన్నారా?

విద్యా : (నవ్వుతూ) లేదని సాక్ష్యం నిరూపిస్తోంది.

ధర్మా : అన్యాయం. అన్యాయం నీ మనస్సే నీకు సాక్షి.

కూర్మా : హుష్! గొడవ చెయ్యకండి. మనస్సుకి కోర్టు వారి సమన్లు జారీకావు పరిస్థితి మీకు ఎదురు తిరిగింది.

ధర్మా : మీలాంటి వాళ్లుంటే తిరక్కేం చేస్తుందీ? ఘోరం, దుర్మార్గం. పోనీ ప్రామిసరీ నోటయినా రాయించి ఇప్పించండి

కూర్మా : సమయం మించిపోయింది.

ధర్మా : మించిపోయిందీ! కలికాలం! విద్యాపతీ, నువ్వెలా బాగుపడతావో నేను చూస్తా, అబద్ధాలాడతావూ! కళ్లలో దుమ్ముకొడతావూ! నా ముప్పై రూపాయలూ కొట్టేస్తావూ!

(గభాలున విద్యాపతి షర్ట్ కాలర్ పట్టుకుంటాడు. కొంచెం గలభా జరుగుతుంది. ఎడమవైపునించి పోలీస్ ఇన్స్పెక్టర్ దండయ్యనాయుడు దడదడా ప్రవేశం- బిగిల్ ఊదుతూ, లాఠీ ఊపుతూ.)

ఇన్ : డిస్పర్స్, డిస్పర్స్. ఏమిటీ గలటా? రోడ్ మీద న్యూసెన్స్, పక్కకిపోండి... ఓ! అసాల్ట్! (గబగబవొచ్చి ధర్మారావుని రెక్కపట్టుకుని లాగేస్తాడు.) అంతా పెద్ద మనుషుల్లాగే ఉన్నారు. జుట్టూ జుట్టూ పట్టుకుంటారేమండి? పదండి, పదండి.

(ధర్మారావుని తీసుకుని కుడివైపుకి నిష్క్రమణ)

సీతా : హమ్మయ్య పీడ వొదిలింది.

విద్యా : కృతజ్ఞులం, కూర్మావతారం గారూ!

కూర్మా : హాఁ హాఁ దటీజ్ ఆల్ రైట్...దటీజ్ ఆల్ రైట్.

సీతా : (కళ్ళజోడు సవరించుకోబోయి) అరె - నా కళ్ళజోడు...

విద్యా : అరెరె. ఆ ధర్మారావు చేతిలోనే ఉంది. కొట్టేశాడు. పరిగెత్తు

(సీతారామారావు కుడివైపుకి పోతాడు)

కూర్మా : అప్పిచ్చినవాడిని తప్పించుకు తిరగటం ఓ పెద్ద కళ ఎగ్గొట్టే ధైర్యం లేకపోతే అసలు అప్పే తీసుకోకూడదు.

విద్యా : ఎగ్గొట్టే అలవాటు నాకు లేదండీ.

కూర్మా : లేకపోతే నేర్చుకోండి.

విద్యా : నేను గర్భదరిద్రుడినే అయినా, నాకు నిజాయితీ ఉంది.

కూర్మా : నిజాయితీ! అంటే?

విద్యా : న్యాయం.

కూర్మా : దృక్పథాన్ని బట్టి న్యాయం మారుతూ ఉంటుంది మీకు న్యాయం అనిపించేది నాకు కాకపోవచ్చు.

విద్యా : శాస్త్రసమ్మతమైన న్యాయం అని నా అభిప్రాయం.

కూర్మా : శాస్త్రాలు మారవూ?

విద్యా : మార్పు అన్నిటికీ సహజమే.

కూర్మా : అదే - అదే నేను చెప్పేది. కాలానుగుణంగా మనుషులూ, వాళ్ల భావాలూ

కూడా మారిపోవాలి. అందరూ కాల చక్రముతో పాటు గిర్రున తిరగాలిసిందే.

విద్యా : తిరుగుతారు కూడా.

కూర్మా : అప్పుడు అందరికీ సమ్మతమైనదే ప్రపంచంలో నిలుస్తుంది.

విద్యా : (కొంచెం అనుమానంగా) అవును.

కూర్మా : అది ఎలా జరుగుతుందో అడక్కండి. ఎలాగైనా జరగొచ్చు. ఈలోపల మాత్రం ఎవరికి వారే జనాన్ని నెట్టుకొని, తోసుకుని ముందుకు పోవాలిసిందే.

విద్యా : (అంతగా అర్థంకాక) నిజమే.

కూర్మా : విలువల్ని గురించి ఆలోచిస్తుంటే పుణ్యకాలం దాటిపోవొచ్చు. బ్రతుకు సౌఖ్యం ముందు ముఖ్యం!

విద్యా : బాగా చెప్పారు... బ్రతుకు సౌఖ్యం ముందు ముఖ్యం.

కూర్మా : వేమన ముప్పై రూపాయలకి అతనెంత గొడవ చేశాడో చూడండి.

విద్యా : చాలా తలవంపులుగా ఉంది.

కూర్మా : అసలే చిక్కుల్లో ఉన్నట్టున్నారు.

విద్యా : చాలా చిక్కుల్లో ఉన్నాను.

కూర్మా : చదువుకుంటున్నారా?

విద్యా : ప్రస్తుతం మానేశానండీ.

కూర్మా : ఏం చదివారు?

విద్యా : బి. ఏ. మొదటి సంవత్సరం అయింది. రెండో సంవత్సరం చదుతూ మానేశాను, డబ్బు లేక.

కూర్మా : ఉద్యోగం చేస్తున్నారా?

విద్యా : లేదు. ప్రయత్నించాను. కాని యెక్కడా దొరక లేదు.

కూర్మా : ఏం? ఖాళీలు లేవా?

విద్యా : ఉన్నాయి కొన్ని. కాని నాకివ్వకున్నారు.

కూర్మా : ఏం?

విద్యా : నేనెవర్నీ ఎరగను.

కూర్మా : ఎరక్కపోతే ఉద్యోగమివ్వటానికేం?

విద్యా : సిఫారసు ఎవరు చేస్తారు?

కూర్మా : లేకపోతే ఏం? క్వాలిఫికేషనుందిగా.

విద్యా : (ఆశ్చర్యంగా) సిఫారసు లేకుండా ఉద్యోగమా!

కూర్మా : ఓహో! పోనీ, కొన్నాళ్లు నాదగ్గిరో ఉద్యోగం ఉంది, చేస్తారూ?

విద్యా : (సంతోషంగా) అంతకంటేనా!

కూర్మా : కాని మీరు చెయ్యలేరేమో.

విద్యా : మీ కా సందేహం వొద్దు. తప్పకుండా చెయ్యగలను. కావాలంటే ఏమైనా ప్రశ్నలడగండి. సమాధానాలు చెబుతాను.

కూర్మా : ఏ సందర్భంలోనైనా చక్కగా అతికేటు నిమిషాలమీద కథ అల్లగలరూ?

విద్యా : (కొంచెం నిరుత్సాహంగా) నేను రచయితని కానండి.

కూర్మా : శతక దండక వాఙ్మయమూ, సహస్రనామావళీ వొచ్చా?

విద్యా : నేర్చుకోలేదండీ.

కూర్మా : అవసరం వొస్తే శతగోపురం పెట్టటం చేతనవునా?

విద్యా : ఉహు! (అనుమానంగా చూసి.)

కూర్మా : తివిరి ఇసుమునుం తైలంబు తీయగలరా?

విద్యా : (అర్థమై, నవ్వుతూ) ఆ అర్హతలు నాకు లేవండీ.

కూర్మా : మరి ఏకెలా వొస్తారూ? పోన్లెండి. అయినా మీకు ఉద్యోగం ఇస్తున్నాను. నెలకి ముప్పై అయిదు రూపాయలు.

విద్యా : కృతజ్ఞుణ్ణి.

కూర్మా : ఏం ఉద్యోగం చేస్తావయ్యా నువ్వు? పైన ఎంతొస్తుందని కూడా అడగవేం? సరే, రేపటినించీ ప్రవేశించు. ఏం?

విద్యా : అలాగేనండి.

కూర్మా : వొస్తా, మరి.

(విద్యాపతి బుజంతట్టి ఎడమవైపుకి నిష్క్రమిస్తాడు. చీకటి ముసురుకోటంవల్ల విద్యుద్దీప కాంతి మాత్రమే రంగంమీద ప్రసరిస్తూంటుంది విద్యాపతి ఆలోచనగా అటూ ఇటూ పచార్లు చేస్తూంటాడు. సీతారామారావు కుడివైపునించి ప్రవేశం.)

విద్యా : ఏమైందోయ్?

సీతా : ఏమాటుంది! కళ్లజోడు నీకేనని సాక్ష్యం ఎక్కడుందయ్యా పో పొమ్మన్నాడు.

విద్యా : అంత మాటన్నాడూ? అయితే ఏం చేద్దాం?

సీత : ఏంచేస్తాం! పోతే పోయిందిలే. అడ్వకేట్ అవతారంగారు నేర్పిన పాఠం ఫలితం.

విద్య : ఆయన నాకు ఉద్యోగం ఇచ్చాడోయ్, పాపం.

సీత : ఓ! అందుకో, ఇవే నా అభినందనలు.

విద్య : కాని నాకా ఉద్యోగం చెయ్యాలని లేదోయ్.

సీత : ఏం?

విద్య : దరిద్రుడికి కోరిక లెక్కువట. ఎంతో పెద్ద చదువు చదువుకోవాలని నాకు చిన్నప్పటి నించీ ఎంతో ఉబలాటం. కనీసం బి. ఏ. పూర్తిచెయ్యాలని విశ్వప్రయత్నం చేస్తున్నానోయ్.

సీత : మంచిదే.

విద్య : కాని నా ప్రయత్నాలేవీ ఫలించలేదు.

సీత : ప్రయత్నించవోయ్. కృషితో నాస్తి దుర్భిక్షమ్.

విద్య : అడగలేక అడుగుతున్నాను. నువ్వేమైనా అప్పివ్వగలవా?

సీత : ఉన్న సంగతి నీతో చెబుతున్నాను, విద్యాపతీ! మా నాన్నకి నేను చెడిపోతానని చెడ్డభయం. దమ్మిడీకిగిన్నించి లెక్క చూసి ఇస్తాడు. ఇహ నేనేం ఇవ్వగలను నీకు.

విద్య : నువ్వంటే నువ్వుకాదు. మీ నాన్నగారితో సిఫారసు చేసి అప్పు ఇప్పించలేవూ? ఎంత! ఓ వెయ్యి రూపాయలలోపు చాలు. వాయిదాలమీద తీర్చుకుంటాను.

సీత : నేను సిఫారస్ చేస్తే అది వ్యతిరేకంగా పని చెయ్యటం నిస్సందేహం. నువ్వే అడుగు.

విద్య : లాభం ఉంటుందా?

సీత : అడిగితే నష్టమేముంది? ... (అకస్మాత్తుగా విద్యాపతి భుజంతట్టి) అటు చూడు—అటు చూడు, విద్యాపతీ.

[ఎడమవైపునించి కల్యాణి ప్రవేశం. నాజూకు విగ్రహం. అందమైన ముఖం. వాయిల్ చీర కట్టుకుని ఎర్రచోళీ వేసుకుంది. ఎడమచేతికి చదరబారు రిస్టువాచీ ఉంది. చేతిలో ఓ చిన్న నోట్‌బుక్ ఉంది. తల కొంచెం వాల్చి చదువుతూ ఉంటుంది]

రంభ! ఊర్వశి! మేనక! తిలోత్తమ! కాదు. సౌందర్యమే నడిచివొస్తోంది. సౌందర్యం!

[కల్యాణి సమీపిస్తుండగా గభాలున కెమెరా తీసి 'క్లిక్' చేస్తాడు. ఆ 'ఫ్లాష్' వెలుగులో కల్యాణి మెరుపులా మెరుస్తుంది. ఒక్క క్షణం ఆమె బిత్తరపోయి, తేరుకుని సీతారామారావువైపు నిప్పులు కురిసేట్టు చూస్తుంది. అతను గబగబ ఆమె ఎదిరికి వొస్తాడు. విద్యాపతి మాత్రం దూరంలో నే నుంచుని చూస్తూ ఉంటాడు.]

క్షమించండి....ఓహ్! పద్మాలయలో కాల్చి ధిక్కరించే అపురూపసౌందర్యం! మేఘసంఘర్షణలో భూమికి జారిన విద్యుల్లతో, ఆకాశంనించి రాలిన నక్షత్రమో, ప్రకృతిని మరిపించి వచ్చే నవవసంతలక్ష్మో అనిపిస్తున్నారు. ఓహ్!

[కల్యాణి ముఖం చిట్లించుకుని ముందుకు పోబోతుంది ]

క్షమించండి. నన్నపార్థం చేసుకోకండి. ఆ సౌందర్యం కనుమరుగౌతుందని భయపడి అలాచేశాను. సౌందర్యారాధనే నా జీవిత లక్ష్యం. చంద్రుణ్ణిచూసి పొంగేసముద్రంలా అందాన్నిచూసి ఉప్పొంగి పరవశించిపోతాను. ఆ ఉన్మత్తతలో ఏంచేస్తానో, ఏం మాట్లాడుతానో కూడా నాకు తెలీదు. నా జీవితంలో ఎప్పుడూ ఇంత అందం చూడలేదు.

[కల్యాణి తప్పించుకుపోవాలని చూస్తుంది. కాని దారికడ్డం నిలబడతాడు సీతారామారావు. ఆమె కేమీతోచక చుట్టూచూసి విద్యాపతిని గమనిస్తుంది. మరో వ్యక్తి ఇదంతా చూస్తున్నాడని తెలియటంతో ఆమె ముఖం మరీ జేవురిస్తుంది.]

కాళిదాస మహాకవి రూపకల్పన కళ్లముందు గోచరిస్తోంది. (ఆమె కళ్లలోకి చూస్తూ) ముఖాంభోజంలోని ఆ ఇందీవరద్వయం!-

కల్యాణి : (కోపంగా) ఇడియట్!

[ఛెళుక్కున అతని చెంపమీద దెబ్బ వేసి చరచర వెళ్ళిపోతుంది కల్యాణి చెంపమీద చెయ్యి వేసుకుని ఆమె వెళ్ళినవైపే చూస్తూంటాడు సీతారామారావు విద్యాపతి అతన్ని సమీపిస్తాడు]

విద్యా : (కొంచెం అవహేళనగా) గట్టిగా తగలేదు కద!

సీతా : (సిగ్గుపడక) "పేరలుకన్ చెందిన యట్టి కాంత లుచితవ్యాపారముల్ నేర్తురే!"

విద్యా : దిగులుపడకు. "క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్!"

సీతా : అబ్బ సౌందర్యమంతా మూర్తీభవించిందోయ్ ఆమెలో.

విద్యా : పెంకితనం కూడా.

సీతా : ఒక్క చూపుతోనే నా సర్వస్వం అపహరించిందోయ్.

విద్యా : నీ సర్వస్వం ఇదివరకే పోయిందిగా.

సీతా : అది భ్రమ ఇది నిజం. సందేహంలేదు. ఆమెని మళ్ళీ చూసేదాకా నిద్రపట్టదు. ఆమె ఎవరో తెలుసుకోవాలోయ్.

[కుడివైపుకి పోతాడు. అతడు నిష్క్రమిస్తుంటే విద్యాపతి కాసేపు అలాగే జాలిగా చూసి, ఏదో ఆలోచిస్తూ, ఎడమవైపు చీకట్లో ఓమూలకి పోతూ ఉంటాడు. అదేసమయంలో ఎడమవైపునించి లక్ష్మీపతి ప్రవేశిస్తాడు లక్ష్మీపతి యాభైఏళ్ల మనిషి. సన్నగా పొడుగ్గా ఉంటాడు. చవకరకం ధోవతీ, షర్టూ, కండువా ధరిస్తాడు. అలిసిపోయిన ముఖం. కష్టాల బరువు మొయ్యలేక కొంచెం వంగినట్లుగా ఉంటుంది నడుము; ఆ చీకట్లో సరిగా కనిపించక విద్యాపతిని ఢీకొని కింద పడతాడు. వెంటనే విద్యాపతి వొంగి అతన్ని లేవనెత్తుతాడు. ఆ చీకటిలో ముఖాలు సరిగా కనిపించవు]

విద్యా : ఏదో ఆలోచిస్తూ నడుస్తున్నాను. చూడలేదు. క్షమించండి.

లక్ష్మీ : పరవాలేదులెండి. (నెమ్మదిగా నిష్క్రమిస్తాడు)

[విద్యాపతి ఆగి, జేబులోంచి సిగరెట్ పాకెట్ తీసి ఓ సిగరెట్ తీసుకొని, పెట్టె జేబులో పెట్టి నిప్పుపుల్ల వెలిగించి సిగరెట్ ముట్టించి, నిప్పుపుల్ల కిందికి పారేస్తూ అకస్మాత్తుగా ఉలిక్కిపడతాడు మరో నిప్పుపుల్ల వెలిగించి కిందికి చూసి నేలమీదనించి ఓ పర్సు తీస్తాడు. రంగం మధ్యకివొచ్చి పర్సు తెరిచిచూస్తాడు. వందరూపాయల నోట్లుంటాయి లెక్కపెడతాడు, పది ఉంటాయి.]

విద్యా : (కుడివైపుకి చూస్తూ చెయ్యెత్తి) ఏమండోయ్.

[హీనస్వరంతో కేకేస్తాడు విద్యాపతి. కాసేపు అలాగే చూసి ఇంకోసారి కేక వేయబోయి కటాలున మనసు మార్చుకుని చుట్టూ చూసి పర్సు జేబులో పెట్టుకొని గబగబ ఎడమవైపుకి నిష్క్రమిస్తాడు. కొంచెం సేపాగి కుడివైపునుంచి లక్ష్మీపతీ ఇన్‌స్పెక్టర్ దంశయ్యనాయుడూ ప్రవేశం]

లక్ష్మీ : (తను పడినచోటు చూపిస్తూ) ఇక్కడే, ఇక్కడేనండీ ఇన్‌స్పెక్టర్ గారూ!

ఇన్ : పబ్లిక్ రోడ్‌మీద పర్సు పారేసుకుని మళ్ళీ వెతకటానికొచ్చేవాడే సిసలైన ఆశావాది

[ఇన్‌స్పెక్టర్ టార్చిలైట్ వేసి చుట్టూ చూస్తాడు]

లక్ష్మీ : ఇంకెక్కడ దొరుకుతుందండీ? కావాలనే ఢీకొట్టి పర్సు కొట్టేశాడండీ పరమలుచ్చా! మర్యాదగా లేవదీస్తే ఎంత మంచివాడో ననుకున్నాను. ఇంత దగుల్బాజీ అనుకోలేదు. ఎంత ఎత్తువేశాడండీ ఇన్‌స్పెక్టరు గారూ! నన్ను రక్షించండి దేవుడల్లే సమయానికి కనిపించారు. నా డబ్బు కొట్టేసినవాడిని పట్టుకొని జైల్లో తొక్కి నా డబ్బు నాకిప్పించండి. ఒకటా, రెండా! వెయ్యి. వెయ్యి రూపాయలండీ!

ఇన్ : చోరీ జరిగినట్టు స్టేషన్లో రిపోర్టివ్వండి. అదృష్టం బావుంటే దొరకొచ్చు.

లక్ష్మి : దొరక్కపోతే ఎలాగండీ! సర్వనాశనమై పోయినట్టే. ఇల్లు తాకట్టుపెట్టి తీసుకున్న డబ్బండీ. అమ్మాయి పెళ్లి చేద్దామని గంపెడాశతో ఉన్నాను. కట్నం ఇహ ఎక్కడి నించి తెచ్చేదండీ.

ఇన్ : మీ పేరేమిటి.?

లక్ష్మి : లక్ష్మీపతి.

ఇన్ : లక్ష్మీపతి గారూ, అధైర్యపడకండి. దండయ్యనాయుడు ఇలాంటి కేసులెన్నో పట్టుకున్నాడు.

లక్ష్మి : ఎవరండీ వారు?

ఇన్ : ఇన్‌స్పెక్టర్ దండయ్యనాయుడినే ఎరగరూ?

లక్ష్మి : చిత్తం, ఎరగనండి.

ఇన్ : ఈ లాఠీ ఆయనదే.

లక్ష్మి : అయితే తమరికెలా వొచ్చిందండి?

ఇన్ : ఈ టోపీ ఆయనదే.

లక్ష్మి : తమరే ఆయనకారుగదా!

ఇన్ : వాడే వీడు.

లక్ష్మి : ఓహో! ఎంతఅదృష్టం. (చేతులు జోడించి) నన్ను రక్షించండి ఇన్‌స్పెక్టర్ గారూ, భారమంతా మీమీదే వేశాను.

ఇన్ : మరేం ఫరవాలేదు, పదండి.

[ఇద్దరూ కుడివైపుకి నిష్క్రమిస్తారు. మైక్ బాగుపడుతుంది ]

కోటి : సోదర సోదరీమణులారా! అదృష్టవశాత్తూ ఇప్పటికైనా మైక్ బాగుపడ్డది. ఇప్పటికే కాలాతీతమైపోయింది. నా ఉపన్యాసం త్వరగా ముగించేస్తాను. నే చెప్పే దేమిటంటే, రావలసిన సాంఘిక, ఆర్థిక విప్లవాలకిముందు భావవిప్లవం రావాలి, అది రావాలంటే ఎంతో ప్రచారం జరగాలి యువకులు ముందుకు రావాలి. అందర్నీ ఒక్క తాటిమీద నడిపించే నాయకుడు కావాలి. అతడు మంచి అనుభవజ్ఞుడై ఉండాలి. "సర్వేషాం సమస్త సన్మంగళాని భవంతు" అని మనస్ఫూర్తిగా కోరుకుని స్వార్థ రహితుడై ఉండాలి. అంతో ఇంతో దేశానికి మేలు చేస్తున్నవాడై ఉండాలి. అంచేత మీరేపని చేసినా స్వార్థం విడిచి ఆలోచించి మరీ చెయ్యాలని మనవి. కాలాతీతమై పోయింది. ఇక నేను విరమిస్తాను. లోకాస్సమస్తా స్సుఖినో భవంతు. సర్వేషాం సమస్త సన్మంగళానిభవంతు! ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

[చివరిమాటలు వినిపిస్తుండగా తెర]

[సశేషం]

# శ్రీహర్షుడు

శ్రీ చదలువాడ జయరామశాస్త్రి

శ్రీ మహాకవి, శ్రీహీరుఁడను పండితుని పుత్త్రుఁడు. ఈయన తల్లి మామల్లదేవి యను సాధ్వీమతల్లి. జితేంద్రియుఁడై మహనీయుఁడు. ఈయన చింతామణి సరస్వతీమంత్రము నుపాసించి ఆ మంత్రసిద్ధికి ఫలముగ నైషధీయచరిత మను మహాకావ్యమును శృంగార రసోజ్జ్వలముగ రచించిన వాక్సిద్ధుఁడు. తనతండ్రి కవిరాజని నైతము చెప్పికొనియున్నాఁడు. చూడుఁడు. నైషధకావ్య ప్రతిసర్గాంతమునఁ గల శ్లోక మిది :

శ్రీహర్షం కవిరాజరాజ
ముకుటాలంకార హీరః సుతం
శ్రీహీరః సుషువే జితేం
ద్రియచయం మామల్లదేవీ చ యం
తచ్చింతామణి మంత్రచింతన
ఫలే శృంగారభంగ్యా మహా
కావ్యే చారుణి నైషధీయ
చరితే సర్గోఽయ మాదిర్గతః.

మఱియు నీ సారస్వత సామ్రాజ్య దీక్షా ధురంధరుఁడు, కవితార్కిక చూడామణి ఖండనఖండఖాద్యమను గ్రంథమును సర్వశాస్త్రసిద్ధాంతముల ఖండించుదాని అద్వైతసిద్ధాంతము గాపించుదాని రచించిన సర్వజ్ఞుఁడు ఇంకను ఈ కవిచంద్రుఁడు కాన్యకుబ్జేశ్వరుఁడగు జయంతచంద్రునివలన తాంబూల ద్వయమును బడయుచు ఉన్నతపీఠ మధిష్ఠించి ఆ ప్రభు వాస్థానమునకు శోభ గూర్చుచుండినవాఁడు వెండియు సమాధినిష్ఠయందు బ్రహ్మమును సాక్షాత్కరించుకొన్నవాఁడు ఈ వాగ్విదుని వాక్కు తర్కకర్కశుల నోరుమూయించెడిది ఈయన నైషధకావ్యము మధువర్షి యని చెప్పియున్నాఁడు. ఈ యర్థమును గనఁబఱచు శ్లోక మొండు ఖండనఖండఖాద్యము, నైషధము అను గ్రంథములఁ గడపటఁ గన్పట్టుచున్నది:

"తాంబూలద్వయ మాసనం
చ లభతే యః కాన్యకుబ్జేశ్వరాత్
యః సాక్షాత్కురుతే సమాధిషు
పరబ్రహ్మ ప్రమోదార్ణవమ్
యత్కావ్యం మధువర్షి
ధర్షిత పరా స్తర్కేషు యస్యోక్తయః.
శ్రీశ్రీహర్ష కవేః కృతిః కృతి
ముదే తస్యాభ్యుదీయా దియమ్"

ఇంకను ఈ కవిప్రభువు, పైని పేర్కొన్న నైషధము, ఖండనఖండఖాద్యము అను గ్రంథములు రెండును సామాన్యులకు అభేద్యములనియు, తాను గావలయునని యే ధీగుల శేముషీ నికషోపలములుగ (కఠినముగ) వాని రచించితిననియు, ఇవి నారికేళపాకమున నొక్కొకచో మాత్రము గన్పట్టినను దక్కినచోట్ల సారస్యము ప్రసృగించుచున్న వనియు ప్రాజ్ఞంమన్యుఁ డెవ్వఁడీ గ్రంథముల హరించి బఠింపఁ గూడదనియు శ్రద్ధతో గురుల నారాధించి గ్రంథముల దృఢగ్రంథు లన్నియు సడలించుకొన్న సజ్జనుఁడు మాత్రమే ఈ కావ్యరసోర్ముల నోలలాడుచు సుఖింప నర్హుఁడనియు అట్టివాఁడే ఖండనగ్రంథమును బోధపఱచుకొనుటకు యోగ్యుఁడనియు ఖండితముగ ఆ గ్రంథాంతములఁ జెప్పియున్నాఁడు. చూడుఁడు:

"గ్రంథగ్రంథి రిహ క్వచి
త్క్వచి దపి న్యాసి ప్రయత్నా న్మయా
ప్రాజ్ఞంమన్యమనా హఠేన
పఠతీ మాస్మిన్ ఖలః ఖేలతు
శ్రద్ధారాద్ధగురుః శ్లథీకృత
దృఢగ్రంథిః సమాసాదయ
త్వేతత్కావ్యరసోర్మి
మజ్జన సుఖ వ్యాసజ్జనం సజ్జనః"

ఇట్టి కవిమల్లుని దేశకాల జీవితముల నెఱుంగుట పురోభివృద్ధికి దోహదము గావున నిటఁ గొంత వీరిని గూర్చి ముచ్చటింతును.

# శ్రీ హర్షుని జన్మము

పూర్వము గోవిందచంద్రుఁడను రాజు కాన్యకుబ్జము నేలుచు వారాణసి లోనగు పుణ్యక్షేత్రములకు సైత మధిపతియై యుండెను. ఈ నృపాలుని పుత్రుఁడు విజయచంద్రుఁడు. ఈ విజయచంద్రుని తనూజుఁడు జయంతచంద్రుఁడు. ఈయనకు జయచంద్రుఁడను సంగ్రహనామము గలదు. ఈజయచంద్రుని కుమారుఁడు మేఘచంద్రుఁడు. ఇతఁడు తాను సింహగర్జనము గావించి సింగముల డీకొని వాని భంజించునంతటి ధైర్య శౌర్య సాహసోపేతుఁడు. మదపుటేనుంగుల మదమడంచువాఁడు. జయచంద్రుఁ డేడువందల యోజనముల మేరగల పృథివీసామ్రాజ్యమున కేలికయై యుండెను. ఈ రాజన్య సైన్యము గంగాయమునల జలములఁ గ్రోలుచు నుండెడిది. ఈ ప్రభువతంసము దాసి గోమతి అఱువదివేల గుఱ్ఱపుఁబౌజు నడిపి మూర్ఖుర గడగడ లాడించినది. ఇట్టన్ని విషయముల కొఱంతలేని ఈ జయంతచంద్రునికి మోదమునకు పూర్ణత ఆవహిల్లెనని చెప్పవలయునా. ఇతని కాలము క్రీ. శ. 12 వ శతాబ్దమని ఈయన దానశాసనములవలనఁ దెలియుచున్నది.

ఈ ప్రభువు వారాణసి యందు నివసించుచుండెను. ఈయన ఆస్థానిఁ బలువురు విద్వాంసులు, కవులు నుండిరి. వారిలో శ్రీహర్షుని తండ్రియైన శ్రీహీరుఁ డొకఁడు.

ఈరాజు నోలగమున నొకప్పుడు శ్రీహీరునికి రాజుపక్షమువాఁడగు నొక గొప్పపండితునితో వాదము ఘటిల్లెను. (ఇతఁడు న్యాయకుసుమాంజలి కర్త ఉదయనాచార్యుఁడని కొందఱు. దానిని పైన విమర్శింతము.) ఆ పండితుఁడు రాజుసమక్షమున వాదమున శ్రీహీరు నోడించి యవమతికి లోనుజేసెను. అంత శ్రీహీరుఁడు నోరు మెదల్ప నేరక లజ్జాపంకమున దిగఁబడి వైరభారము తన్నుఁ గ్రుంగఁదీయ, మనశ్శల్యము గ్రుచ్చుచుండ బాధపడుచుండెను.

ఇట్లు సంతాపమున నేమియుఁ దోఁపక శ్రీహీరుఁడుండి దీనజనశరణ్యా, కరుణామయి యగు దుర్గ నుపాస్తి యుంచెను. ఆ పండితుభక్తికి మెచ్చి కొంతకాలమునకు భగవతి దుర్గాదేవి కనఁబడి "ఓయి విప్రవరా! నీయెడఁ గరుణగలదాననై నిన్ననుగ్రహింప నేతెంచితి. నీకోర్కె నేనెఱింగితి. ఇఁకఁ గొంత కాలము నీవు నీధర్మపత్నియగు మామల్లదేవియందొక పుత్రుఁడు జనించును. అతఁడు సకల దుర్వాదిమతముల ఖండించి నీమనశ్శల్యముఁ బాపువాఁడు. విశ్వవిఖ్యాతి గనువాఁడు కాఁగలఁడని వరమిచ్చి దేవి యంతర్హితయయ్యెను.

ఆయంబ చెప్పినట్లు మామల్లదేవికి సుతుఁడుద్భవిలెను. అతనికి శ్రీహర్షుఁడని పేరుగలిగెను. బాల్యమునందె శ్రీహర్షుఁడు మహామేధావి కాఁగలఁడన్న సూచనలు గన్పట్టుచుండెను. తండ్రి శ్రీహీరుఁడు ఆ పరాజయము హేతువుగ నానాటికిఁ జిక్కి వ్యాధికి లోనై కడకు మరణశయ్య నుండెను అప్పుడొకనాఁడు శ్రీహీరుఁడు తనపుత్రుని శ్రీహర్షుని దగ్గఱకుఁ బిలిచి తనప్రక్కఁ గూర్చుండఁబెట్టుకొని యిట్లనియెను:

"నాయనా నేనెందుల కీ యపమృత్యువువాఁతఁ బడుచున్నానో నీకుఁ దెలిసినదియే నన్నానాఁడా పండితుఁడు వాదమున నోడించి పరాభవించుటయే దీనికిఁ గారణము. దానికివగచి పలువురిలోఁ దలయెత్తలేక లోలోఁ గుమిలికుమిలి యీ దుఃఖముననే నేను పరలోకమునకుఁ బోవుచున్నాను నాకు నీవు పుత్రుఁడవైనందులకు నిన్నొకటి చేయ నాజ్ఞాపించుచున్నాను అది యేమంటివేని నిజముగా నీవు నా సత్పుత్రుఁడవైతేని నన్ను వాదమున నోడించి యవమానించిన యాపండితుని రాజసమ్ముఖముననే వాదమున నోడించి నీవు జయముగొంటివేని అదియే స్వర్గముననున్న నాకు ఆత్మశాంతి కూర్పఁగలదు. ఏమి తండ్రీ ఈపని నాకై చేయఁగలవా చెప్పుమనవుడు శ్రీహర్షుఁడు, తండ్రీ! నేను తప్పక నీయాజ్ఞ నెరవేర్తును. నిన్నానాఁడు జయించిన పండితుని జయించి కాని ఇచ్చటివారి మొగమింకఁ జూడను. నాయనా! ఇదే నా ప్రతిన. నీపాదములంటి ఇదే ప్రమాణము చేయుచున్నాను, అని దృఢముగఁ జెప్పినంతనే శ్రీహీరుఁడు కుమారుని మాటలకు తనవైరి విజితుఁడైనట్లు భావించి కొంత మనశ్శాంతి నొంది కొంత తడవునకు కాలధర్మము నొంది స్వర్గ మలంకరించెను

శ్రీహర్షుఁడిప్పుడు తండ్రివియోగమునఁ బెల్లు కుందెను దిక్కులేనివాఁ డయ్యెను బంధువులు సైతమీబాలునికి సాయపడ వెంటనే రారైరి. ఎన్నైనఁ గష్టములు దక్కినా. కర్తవ్య మాలోచింపవలెఁ గాని.

# శ్రీహర్షుడు

కావున శ్రీహర్షుఁడు తండ్రికిఁ బారలౌకికము పుత్రకార్య మెట్లో యొకభంగి కష్టముమీఁద నెఱవేర్చి తనకు మిక్కిలి సమీపస్థులగు బంధువులఁ బ్రార్థించి తన కుటుంబభారమును వారి కొప్పఁజెప్పి తాను తపము సేయ నిశ్చయించుకొనెను. ఏలయన తపముగదా అఘటనఘటనాచణము కాని పితృవియోగజమగు దుఃఖమొకవంక ఆయన యవమానంపుదుఃఖ మొక ప్రక్కఁ బట్టి లాగుచుండ నొక కొంతతడవేమియు చేయ నేరక నిర్విణ్ణుఁడైయుండి కడకు కుంఠితయు డింగుపఱచి. తండ్రిమాట నెరవేర్చు సాధనమైన విద్య నభ్యసింపఁ దొడంగెను. కొన్ని శాస్త్రముల సైతము అభ్యాసము సేసెను ఇంతలో నొక సద్గురువు తటస్థపడి యాయనకుఁ జింతామణి మంత్రముపదేశించెను అంత శ్రీహర్షుఁ డతి నియమనిష్ఠలతో ఆమంత్రానుష్ఠాన మొక యేటిదరిం జేరి యచ్చోనున్న త్రిభువనజనని, భగవతియు నగు శ్రీగౌరీదేవి దేవాలయ మొండొంటి నందు వసించి యా దేవీమూర్తియందు బద్ధాదరుఁడై యొక్క వత్సరకాలము దీక్షతో సాగించెను

ఇట్లెడతెఱపి లేక మంత్రమనుష్ఠించి మరియుఁ దపోనిష్ఠ సాగింప మొదలిడ నాతని కైదాఱువత్సరము లట్లే గడిచిపోయెను. అంత గౌరీదేవి శ్రీహర్షుని దృఢభక్తికి మెచ్చుకొని ప్రసన్నురాలై కన్పట్టి, వత్సా నీ తపస్సునకు ఉపాసనకు సంతసిల్లి నిన్ననుగ్రహింప వచ్చితిని. వరము వేఁడుమన, తల్లీ నాకు నీవు వరమిచ్చు నటు ప్రసన్నవైతేని నాకు సంపూర్ణమగు విద్యాప్రదానముతో నన్ననుగ్రహింపు మనియె భగవతి సంతుష్టయై యాతఁ డర్థించిన కోర్కెయట్ల వరమను గ్రహించి పోయెను

అంత దుష్ప్రాప్యమైన వరముఁ బ్రాపించి శ్రీహర్షుఁ డచిరకాలమునన తర్కాలంకారములందును వేదవేదాంగములందును సంగీతజ్యోతిషములందును మణిమంత్రాగులందును జక్కని విజ్ఞానము సంపాదించెను ఈయన వైదుష్య మనన్యసామాన్యమైనదయ్యెను ఆ పాండిత్యగరిమ ప్రభావమునఁ దర్క సంబంధమైన జల్పకథయందు ఈయనవాణి సర్వోత్కృష్టమై స్ఫురించెను రాజాస్థానములందీ మహనీయు పలుకుబడి పండితవరులు సైత మెఱుంగ సమర్థులు కాలేదు

పదంపడి శ్రీహర్షుఁడు లోకోత్తరమగునట్టి విద్యాప్రాభవమున నలంకృతుఁడయ్యె తినవాఁగి లోకుల కజ్ఞాతమై పోనకు రాకపోగా ఈ అతివిద్య అవిద్యయైనదని మరల భారతి నుపాసించెను. తర్వాత వాగ్దేవి ప్రత్యక్షమై వత్సా! అతిప్రజ్ఞ నీకు దోషమే యైనది. కావున నీవు నిశీథివేళ శిరముఁ జన్నీటఁ దడిపి తడిశాలతోఁ బెఱుగ్రాతి నిద్రింపుము దాన నీకు గొంత కఫప్రకోప మావహిల్లి కొంత బుద్ధిమాంద్య మేర్పడును. పండితులు నీవాక్కు నంగీకరింపఁగలరనెను.

అతఁడటు గావించి పూర్ణమనోరథుఁడై కాశీ పట్టణమున కేతెంచి అపురివెలుపలి గవనునందు నిలిచి రాజగు ఆ జయంతచంద్రునికి నేనన్ని విద్యలఁ గఱచి గడిదీఱితినని చెప్పిపంపెను కాన్యకుబ్జేశ్వరుఁ డామాట విన్నంతనే తాను గుణైకపక్షపాతి యగుట శ్రీహీర పండితు నోడించిన పండితుని వెంటబెట్టుకొని నాలుగు వర్ణములవారగు పరివారము దన్నుఁ బరివేష్టింప శ్రీహర్షుడున్న తావునకువచ్చి అటఁ గొంతసేపు సభఁ గావించి శ్రీహర్షు గౌరవపురస్సరముగ నాదరించి సుఖాసీనుం జేసెను.

అప్పుడు శ్రీహర్షుఁడు జయంతచంద్రునిట్లు వర్ణించెను.

"గోవింద నందన తయా చ వపుః శ్రియా చ
మాస్మిన్ నృపే కురుత కామధియం తరుణ్యః
అస్త్రీకరోతి జగతాం విజయే స్మరః స్త్రీ
రస్త్రీ జనః పున రనేన విధీయతే స్త్రీ

ఓ తరుణులారా! ఈ జయచంద్ర నృపాలుఁడు గోవింద నందనుఁడనియు సొగసైన మేని సిరి గలవాఁడనియు ననుకొని యీ నృపునిఁ గాముఁడను బుద్ధి నుంపకుఁడు. ఏలయన జగముల గెల్చి విజయము గొనుటయందు స్మరుఁడు (మన్మథుఁడు) స్త్రీలను అస్త్రీలనుగా (అస్త్రములుగా) చేయుచున్నాఁడు. అనఁగా యువకుల మోహింపఁజేయుటకై యువతుల నస్త్రములుగాఁజేసి వారిని మోహపెట్టుచున్నాఁడు ఈ నృపతియన్ననో జగములు జయించుటకు, అస్త్రీజనమును స్త్రీలు గానివారిని (అస్త్రములుగల వీరుల ననుట) స్త్రీజనముగా అబలలుగాఁ జేయుచున్నాఁడు. అనఁగా ఓడించుచున్నాఁడు.

అనునర్థముగల యీ శ్లోకము నుచ్చైస్స్వరమున గంభీరముగ వ్రాక్కుచ్చి వివరించెను. అప్పుడు ప్రభువు, పరివారము ఆ పండితుఁడు (తండ్రివైరి) ఆ శ్లోకార

మునకు మిగుల సంతసించిరి. శ్రీహర్షు నెల్లరు మిక్కిలి శ్లాఘించిరి.

తర్వాత శ్రీహర్షుఁడు తనతండ్రి నవమానించిన పండితు నోరగంటఁ గాంచుచు నీక్రింది శ్లోకము చెప్పెను.

> సాహిత్యే సుకుమారవస్తుని
> దృఢన్యాయగ్రహగ్రంథిలే
> తర్కే వా మయి సంవిధాతరి
> సమం లీలాయతే భారతీ
> శయ్యా వాస్తు మృదూత్తర
> చ్ఛదవతీ దర్భాంకురైరాస్తృతా
> భూమిర్వా హృదయంగమో
> యది పతిస్తుల్యా రతిర్యోషితాన్.

మృదుమధురమైన కథావస్తువుగల కావ్యసాహిత్య రసవిచారమునందుఁ గాని చొరవ లేనివారికిఁ బెడదూర్పులను గాక ప్రమాణాదివాద కర్కశమైన న్యాయదర్శనము తర్కించుటయందుఁ గాని సన్నద్ధుఁడనై ప్రవర్తించు తఱి నాయెడ భారతి లీలావిలాసమున నే చరింపఁగలదు (అనఁగా సాహిత్య తర్కములరెంటను దాను నిరాఘాటముగ వాదము చేయఁగలననుట.) ఎట్లనఁగా మెత్తని లేఁత చిగుళతోను దర్భ మొలకలలో మృదువుగ నుండునట్లు పఱచిన శయ్యగాని కఱకురానేలగాని యేది పతికి మనోజ్ఞమౌనో అదియె కదా అంగనకు రతికూర్చునది.

ఈ శ్లోకము విన్నంతనే శ్రీహర్షుని తండ్రివైరి వెఱఁగంది శ్రీహర్షుఁ డజేయుఁడని యెంచి ఓ వాగీంద్రా నీవు భారతీసిద్ధుఁడవు. నీకు సముఁడెవఁడు గలఁడన్న నిఁక నీకంటె నధికుఁ డెవఁడున్నాఁడు.

> హింస్రాః సంతి సహస్రశోఽపి
> విపినే శౌండీర్య వీర్యోద్ధతా
> స్తస్యైకస్య పునః స్తునిమహే
> మహః సింహస్య విశ్వోత్తరమ్
> కేళిః కోలకులైర్మదో మదగజైః
> కోలాహలం గోహలైః
> సంహార్షో మహిషైశ్చ యస్య
> ముముచే సాహంకృతే హుంకృతే.

కాననమందు మిగులబల్లిదములైన ఘాతుకమృగములు వేనవేలుగలవు గాని లోకోత్తరమైన పరాక్రమముగల సింహము నొక్కదానినే మనము స్తుతించెదము. మృగరాజ మెంతవనుక అహంకారముతోడి తన హుంకారము గావింపదో వరాహములక్రీడ మదగజముల మదము ఎలుఁగుబంట్ల కలకలము కాఱుదున్నల సంతోషము అంతవఱకే.

అని పితృవైరి తన్ను శ్లాఘించి తన తక్కువఁదనము ప్రకటించుకొనుసరికి శ్రీహర్షుని కా పండితునెడఁ గ్రోధము శమిల్లెను. పగవీడెను.

తర్వాత జయచంద్రుఁడు శ్రీహర్షుం గాంచి పండితోత్తమా మీయెడఁ బ్రతివాదులు చెప్పఁదగిన మాట ఇదియే. అంత నితనిం గాంచి ఓ శ్రీహీరవైరీ నీవెంత చక్కని సమయోచిత మెఱింగితివి. ఎంత ప్రయోజనము సాధించితివోయి. యన్నంత శ్రీహర్షుఁడు తండ్రి విరోధిపై నీసు పూర్తిగ వీడుకొనెను పండితు లిరువురు గాఢాలింగనము చేసికొని నెయ్యురైరి. అట్లు ప్రభువు వారి నిరువురఁ గలిపి తోడ్కొనిపోయెను. పిదప శ్రీహర్షునకు సుధాంశునవశేఖరుగు సోమెందు మంగళప్రదములగు స్తుతిమంత్రములతో దానమిచ్చెను. శ్రీహర్షుఁడు దానిం బ్రతిగ్రహించెను. మఱియు భూపాలుఁడు మహామేధావికి లక్ష దీనారములఁ గూడ నొసంగెను. శ్రీహర్షుఁ డంతట నా మేడ నివసించుచు మనశ్శల్యము విడిపోవ శాంతచిత్తుఁడై సుఖజీవనము గడుపసాగెను.

ఒకనాఁడు జయంతచంద్రుఁడు శ్రీహర్షుం గని కవిచంద్రా! వాదీంద్రా? నీవేదైన నొక యపూర్వ ప్రబంధమును రచింపుమా అనెను. శ్రీహర్షుఁడు రాజు ప్రార్థనము మేరకు నైషధమను మహాకావ్యమును (నిషధదేశపు రాజగు నలమహారాజు చరిత్రమును) కల్యాణాంతముగను, శృంగారాద్యుత్తమ రసోల్బణముగను, మహా గూఢార్థముల వ్యంగ్యభావమునఁ బ్రకటించునదిగను, సారవత్తరమును ప్రభునకుఁజూపెను. రాజా నైషధీయ చరితమును జూచి సంతసించి కవి సార్వభౌమా ఈ కావ్యము లోకోత్తరము, అపూర్వమనుటలో సందియము లేదు. కాని దీని నీరసింపఁ బలువురు ప్రతిపక్షులు నెమకుచుందురు కావున నట్టి యవకాశ మిట్టి పురోభాగులకుఁ గలుగనీక తామీ మనోజ్ఞమగు ఈ కావ్యమును కాశ్మీరమునందలి శారదాపీఠమునఁ బండితుల ప్రోల వినిపించి చూపి వారి మెప్పు వడసి ఆవిషయ మా రాజ్ఞాముఖమున లేఖ వ్రాయించు.

కొని రండు, పొండు అనెను. మఱియు నెవ్వరే నే గ్రంథమేని తమ రచించినదున్న నది, లెస్సగనున్న దనుటకుఁ దార్కాణముగ ఆ శారదాపీఠమునందు వెలసి యున్న భారతీమూర్తి హస్తమునందు తమ గ్రంథము నుంతురు. ఆ విగ్రహమున సరస్వతీదేవి సాక్షాత్తుగ మూర్తీభవించి యుండుట దగుటంజేసి ఆ గ్రంథము సత్ప్రబంధమైనచోఁ దఁయూపుట ద్వారా బాగుగ నున్నదని సూచించును అది యసత్ప్రబంధమైనచోఁ దక్షిణపు హస్తమునుండి విసరిపాఱవేయును. కవుల కావ్యముల బాగోగుల కిది యొకపరీక్ష. కాన తామట్లు చేయుట తమకు, నాకు, లోకమునకు శ్రేయమని నాతలంపనెను.

శ్రీహర్షుఁ డందులకు సమ్మతించి రాజు తనకు దారిబత్తెమునకుఁ గావలసిన వస్తుసామగ్రి, రెండెడ్ల బండి నొకటియు వలయు సహాయులను సిద్ధముచేసి యీయ వానితో నెల్లోపోయి కాశ్మీరముం జేరెను. మఱి యా శారదాపీఠముం జేరి యచ్చటి పండితులకుఁ దన ప్రబంధము గనఁబఱచి వారు సమ్మతింప ఆ పీఠమున నిత్యసన్నిహితయై తేజోమూర్తియై వెలుఁగుచున్న సరస్వతీదేవి హస్తమునఁ దన ప్రబంధము నుంచెను. ఉంచియునుంచకమునుపే సరస్వతి యా కావ్యమును విసరికొట్టెను.

శ్రీహర్షుఁ డదిగని ఏమి దేవీ, నీవు ముదుసలివైనందుననా ఏమి? నీకు మనస్సు చలించినట్లున్నది. నేను రచించిన ప్రబంధమునా నీవు పాఱవైచుట, ఏమి ఈ విచిత్రసరణి? ఏల నన్నిట్లవమానపఱచెదవు? అనినంత ఓయీ! పరుల మర్మములఁ బ్రకటించి భాషించువాఁడా! నీకుఁ దలంపునకు రాలేదా! నీ కావించిన పని. భద్రదచితమైన యీ కావ్యమునఁ బదునొకండవ సర్గమున నన్నుఁ గూర్చి యేమి చెప్పితివి. అఱువదాఱవ శ్లోకము జ్ఞప్తికిఁ దెచ్చికొమ్ము, దమయంతీ స్వయంవరమునకు వచ్చి ముచ్చటించుచున్న నన్ను:

"దేవీ పవిత్రితచతుర్భుజవామభాగా
వాగాలపత్పునరిమాం గరిమాభిరామాం
ఏతస్య నిష్కృపకృపాణసనాథపాణేః
పాణిగ్రహాఽనుగృహాణ గుణం గుణానామ్"

చతుర్భుజు వామభాగమును పవిత్రము చేసిన వాగ్దేవి యని వర్ణించి నన్ను విష్ణుపత్నిగఁ బ్రకటన చేసి లోకమునందు నిరూఢమైన నాకవ్యాత్వ్యమునకు భంగముగావించితివి.

యాచకో వంచకో వ్యాధిః
పంచత్వం మర్మభాషకః
యోగినా మప్యమీ పంచ
ప్రాయేణోద్వేగకారకాః॥

యాచకుఁడు, వంచకుఁడు, వ్యాధి, మరణము, మర్మములంట భాషించువాఁడు అను నాయైదు యోగులకు సైతము ఉద్వేగకారకములు అన్నదాని ననుసరించి నన్ను మర్మభేదముగ మాటాడి యవమానించితివి గదా. అందువలనఁ బాఱవైచితి ననెను.

అప్పుడు శ్రీహర్షుఁడు వాగ్దేవి వాక్కొన్న మాట విని దేవి! నీ వొక యవతారమునందు నారాయణుని పతిఁ జేసికొంటివి ఇట్లే పురాణములందు నీవు విష్ణుపత్నివిగ తెలియఁబడుచున్నావు కావున నేనున్న సత్యముఁ దెలిపితివి. నిజము చెప్పిన నన్ను నీవేల కోపింతువు నీ కోపించినంతమాత్రమున నీకలంకము వైదొలఁగునా ఏమమ్మా! అనెను.

అంత శారదాదేవి శ్రీహర్షు ధీరతకు మెచ్చుకొని యతని గ్రంథమును తాను స్వయముగ గ్రహించి యా సభామధ్యమున ఆ మహాకావ్యము సర్వాంగసుందరమని శ్లాఘించెను శ్రీహర్షుఁ డామాటపై ఆ పండిత బృందము గాంచి అయ్యలారా! ఈశారదాంగీకారమును మీ రాజగు మానవదేవునకుఁ జెప్పి యీ గ్రంథమును జూపింపుఁడు. మఱియు మీరు నీ గ్రంథము బాగుగ నున్నదని రాజునకుఁ జెప్పి యిది నిర్దుష్టము స్తుత్యర్హమన్న భావముతో నొక లేఖ మా జయంతచంద్రునకు మీ రాజుచే నిప్పింపుఁడని వారిని గోరెను.

భారతీదేవి కభిమతమైన దా కావ్యమని తెలిసినను నిజముగ సరస మా కావ్యమని తమకు నచ్చియున్నను ఆపండితులు లీసుగొన్నవారై కావ్యము లెస్సగ నున్నదని తమ రాజుతో జెప్పరు; లేఖ నిప్పింపరు సరిగదా రాజునుసైతము దర్శింపఁజేయరు.

ఇఁక నేమిచేయుటకు శ్రీహర్షునకుఁ దోఁచ లేదు. ఇంకను జూఁతముగదా యని కొన్నిమాసము లచ్చటనే యుండెను. తాఁదెచ్చుకొన్న బత్తెమంతయు వ్యయమాయెను. సహాయులు ముందుగనే మరలి పోయిరి. బండిని, ఎడ్లను గూడ విక్రయించి ఆవిత్తమున

కొంతకాలము గడపెను. ఇంకఁ గొన్నిదినములకు మాత్రమే భుక్తి జరుగునంత రొక్కము మిగిలియుండెను. ఎంత గొప్పవాఁడును కాలము గానప్పు డేమి చేయఁగలఁడు. కుజనుఁడు కుందును. సజ్జనుఁడు విధివైపరీత్యమని భగవంతుని స్మరించును గాదే.

అట్లు యొకనాఁ డా కవితల్లజుఁ డచ్చటి నదీ తీరమును జేరి యచ్చట నొక దేవాలయము సమీపమున కూర్చుండి రుద్రజపము చేసికొనుచుండెను. అచెంత నొక బావియుండ దాన నీరు తోడికొనుటకు ఊరి నుండి యిరువురు చేటికలు (పరిచారికలు) మిగుల త్వరతో వచ్చిరి. నీరు చేఁదుకొనుటలో నేముందు నేముందని పంతులు వేసికొనిరి. అందుపై వారికి వాదులాట యేర్పడెను. అది కొసకు ముదిరి తిట్లాటకునై పండి కొట్లాటయైనది. వా రొకరొకరి శిరోజములఁ బట్టికొని చేతులతో బాదుకొనిరి బాగుగ వ్రేటులు దిని కినుక హెచ్చి రోసముతోఁ బోయి రాజకులమున నభియోగము గావించిరి.

రాజు మాధవదేవుఁడు వారిం గని మీరు కలహించునప్పు డట సాక్షి యెవఁడైన నున్నాఁడా అని ప్రశ్నించెను. వారు విప్రుఁడొకఁడు జపతత్పరుం డచ్చట నుండుట యెఱిగించిరి. రాజు వార్యగుఁ బంపి వానిఁ దోడితెండన వారుపోయి శ్రీహర్షుఁగొని తెచ్చిరి. నృపాలుఁ డా మహామేధావిం గాంచి ఆర్యా వీరితగవు తీర్పవలసియున్నది. వీరిలో నెవరిది తప్పు, ఎవరిది యొప్పు అను విషయము మీరు దయచేసి చెప్పెదరా అని కోరెను.

అంత శ్రీహర్షుఁడు గీర్వాణభాషలో భాషించుచు ప్రభూ, నేను వైదేశికుఁడను. నాకు ఈ దేశభాష రాదు. కాన వీరి నయానయముల నేర్పరించి చెప్పవలంతిని గాను. కాని ఈ చేటిక లిరువురు వివాదపడి మాట్లాడుకొన్న ప్రాకృతభాషాశబ్దము లెట్లట్లు మీకు నివేదింతును. దానిపై మీరు తీర్పు సెప్పుఁడని, ఆ పరిచారికల కలహభాషణమును, ఆ శబ్దములఁ గొన్నివందల సంఖ్య వాని మొదలుతుదల క్రమము దప్పక యొప్పగించెను. దానికి రాజచ్చెరువడి ఎవరవయ్యా నీవు యింత మేధావివి? ఏమి నీప్రజ్ఞ! అని శ్లాఘించి ఆదాసీద్వయమును దప్పొప్పుల నిర్ణయించి వారికిఁ దగుశిక్ష విధించి వారిఁ బంపివైచెను.

తర్వాత ఈయన యుదంతమంతయు నెఱుంగ వేడి మరల శ్రీహర్షుంగాంచి మహానుభావా నీవెవఁడవు. పండితశిరోమణివిగ నున్నావనన శ్రీహర్షుఁడు తన కథయంతయుఁ బూసగ్రుచ్చినట్లు రాజునకు నివేదించి, ప్రభూ! మా శారదాపీఠ పండితు లాచరించిన దౌర్జన్యమునంజేసి యీ పురమున నిట్లు దుఃఖ మనుభవించుచున్నా ననెను. ఆ క్రమమంతయు నెఱింగి రాజా పండితుల రప్పించి మీరేమి మిక్కిలి మూఢులుగ నున్నారు. ఇట్టి పండితచంద్రుఁడు గన్పట్టినంత నే స్నేహము చూపకున్నారు?

వరం ప్రజ్వలితే వహ్నౌ వహ్నాయానే హితం వపుః
న పున ర్గుణసంపన్నే కృతః స్వల్పోఽపి మత్సరః
వరం సా నిర్గుణావస్థా యస్యాం కోఽపి న మత్సరో
గుణయోగేతు వైముఖ్యం ప్రాయః సుమనసామపి.

గుణవంతునెడ స్వల్పముగఁ గావించు మత్సరము కంటె మండుచున్న నగ్గిలోఁబడి శరీరము ద్రోయుట మేలు. మంచి మనస్సుగలవారికి తఱచుగా గుణముగల వానిపై వైముఖ్యము చూపుటకంటె మంచి చెడ్డ లంటని నిర్గుణావస్థ లెస్సగాదా. కావున మీరెల్లరు నిజముగ దుష్టులు. ఇఁకనైన మీ దోషమువీడి పశ్చాత్తాప మొంది ఈ మహనీయునిఁ గవిచక్రవర్తిని మీ గృహములకుఁ బిల్చుకొనిపోయి యొక్కొకరును సత్కరింపుఁడని యానతిచ్చెను అంత మన శ్రీహర్షుఁడు.

"యథా యూన స్తద్వత్పరమ రమణీయాఽపి రమణీ
కుమారాణా మంతఃకరణహరణం నైవ కురుతే
మదుక్తి శ్చేచ్ఛేతో మదయతి సుధీభూయ సుధియః
కిమస్యా నామ స్యా దరసపురుషానాదరభరైః"

యువకుని కంటికి మిగుల సొంపుగూర్చు చెలువ బాలుర డెంద మెట్లానందపఱుపఁగలఁదు. నా వాణి మంచి బుద్ధికైనచో అమృతమై మనస్సు మత్తిలఁ జేయును. ఆనావాణి అరసికులగు పురుషుల నారాధింప నాసక్తులైన వీరి నెట్లు సంతోషపెట్టఁ గలుగును?

అని అను శ్రీహర్షవాక్యములు విని వానియందు లక్ష్యముంచి రాజు నానతి శిరసావహించి మహాకవిని తమ గృహములకుఁ గొంపోయి యొక్కొక్కరును జక్కఁగ సత్కరించి తమ చెట్టసేఁతకు సైరింపుఁడని కవీంద్రునిఁ బ్రార్థించి యాయన సంతసింపఁజేసి రాజసమ్ముఖమునకుఁ దోడుకొని వచ్చి నిల్చిరి.

మాధవదేవుఁడును శ్రీహర్షుని ప్రబంధము చక్కఁగ నున్నదని జయంతచంద్రునికి లేఖ వ్రాసియిచ్చుచు

మహాకవినిఁ బూజించి ధనాదికమున గౌరవించి పంపెను. శ్రీహర్షుఁ డాభంగి తనకోర్కె నేరవేర వచ్చి తనరాజును జయచంద్రుని గాంచి లేఖ యొసంగెను. ఆ నృపుఁడు కవివలన సంగతియంతయు విని మిక్కిలి సంతసిల్లెను. అదిమొదలు నైషధీయచరితము లోకమునందు ప్రచారము హొందెను.

శ్రీహర్ష కవిచంద్రుఁ డా జయచంద్రునికడనే యుండి ఖండనఖండఖాద్యాది గ్రంథముల రచించుచుండెను. అట్టితఱి యొకప్పుడు జయంతచంద్రుని ప్రధానులలో నొకఁడు పద్మాకరుఁడను వాఁడు బుద్ధిశాలి శ్రీ అణహిల్లపురమునకుఁ బోయియుండెను. పురము వెలుపల నొకసరస్తీరమున వస్త్రలుదికి చాకివాండ్రు ఆఱ వేసియుండిరి. వానిలో నొకపట్టువలువపైఁ గుమ్మెదలు మొగలిపూవునందు వలె వ్రాలియుండుటం జూచి యా దుకూలము పద్మసుగంధ మగుట యెఱింగి దీని ధరించు చేడియ తప్పక పద్మినీజాతిదై యుండునని యూహించి యా చాకలిం గొంత ధనాదికమున నలరించి యా వలువ ధరించు నింతిని నాకుఁ జూపుమా యని యడిగెను. రజకుఁ డందుకు సమ్మతించి నాటిసంజవేళ నామంత్రిం దోడుకొనిపోయి యొక హర్మ్యమున వసించు శాలాపతిపత్నిని (సాలెవనిత) పతినియుక్తను ఎలజవ్వనమున వెలయుదాని నంచచందముల నెంతేని దాని సూహదదేవి యను పేరుగలదానిఁ జూపి చనెను. పద్మాకరుఁ డా సురూపతోఁ గొంత ముచ్చటించి యిట్టి వనితె మన ఱేనికొంతిగ నున్నఁ జాల మేలుగ నుండును అని తలంచి యామెను సమ్మతింపఁజేసి యా ప్రోలి నేలు దొర కుమారపాలితుని కా సంగతిఁ జెప్పి యాయన యనుమతింపఁ దాను సోమనాథపురయాత్ర పూర్తి చేసికొని వచ్చువాఁ డామెం దోడ్కొని వచ్చి జయంతచంద్రునకు భోగకాంతఁ గావించెను. రాజా సూహదదేవియం దుద్వేలమగు ననురాగమున వర్తిలుచుండెను.

ఆ సూహదదేవి సకలశాస్త్రములందు విజ్ఞానము గడించి చక్కని వైదుష్యము సంపాదించి కలాభారతి యన్న బిరుదమున జగత్ప్రసిద్ధిఁ జెందియుండెను. మఱియు నా విదుషీమణి మిక్కిలి గర్వితయై యుండెను. మన శ్రీహర్షకవి నైషధము నరభారతి యన్న పేరు వహించియుండెను. ఈ మహనీయుని కా బిరుదముండుట సూహదదేవికి సహింపరానిదయ్యెను. ఒక్కనాఁ డామె శ్రీహర్షుని పిలిపించి లెస్సగ సత్కరించి సంతుష్టుంజేసి నీవెంతటివాఁడ వనెను. నేను కళాసర్వజ్ఞుఁడ ననెను. అంత నాభామిని నీవట్లు సర్వజ్ఞుఁడ వైనచో నాకు కాలిజోడు కుట్టి తెమ్ము, మాతముగా నీ ప్రజ్ఞ యనెను. కాలిజోడు కుట్టుట తెలియదన్నచో తనసర్వజ్ఞత్వమునకు భంగము వచ్చి అజ్ఞతాదోషము తన్నంటుకొనును. వాని నిర్మించెదనన్న బ్రాహ్మణధర్మమునకు నీచత ప్రాపించును. తన్నిట్టి నీచంపుఁబనికి నామె వినియోగించుచున్నదని యాయన తలంచిగూడ నెఱుంగఁడు. సరి కానిమ్మని యా చెలి యానతి నంగీకరించి శ్రీహర్షుఁడు చెట్టుపట్టలతోను నారతోను ఒక చక్కని పాదరక్షలజత సిద్ధము చేసి చేతఁబట్టుకొని యా సూహదదేవి నగరివాకిటికి వచ్చి యామెకుఁ జెప్పపంపెను. ఆమె నిజాయతితో వచ్చి నిలువంబడుడు శ్రీహర్షుఁడు తనకన్నులు నలువంకల బెదరుచూపులు చూచుచు చలించుచుండ దేవీ నీకిదె చెప్పులజత కుట్టి తెచ్చితిని. కాళ్లం దొడిగికొనుము, అని వాని నట నుంచి ఇట్టి పనిసేఁతకు నేను మాదిగవాఁడ నైతిని, నేను నిల్చినచోట నీరు చల్లింపు డని చెప్పుచు మరలిపోవుచు జయంతచంద్రు దివాణమున కేఁగి రాజా నీ ప్రియురాలి కొంటిచేష్ట యిట్టిది నాపైఁదగిలెను. నేనిక నిటనుండ నురవు గాదు. నీకు జ్ఞప్తికిఁ దెచ్చితినని చెప్పి పోయి గంగయొడ్డు సేరి సన్యాసము గ్రహించెను.

## సూహదదేవి పగసాధింపు

## జయంతచంద్రుడు రాజ్యభ్రష్టుఁడగుట

రాజశేఖరుఁడను మహాకవి (క్రీ. శ. 1348) పదునాల్గవ శతాబ్దమున నున్నవాఁడు. తన ప్రబంధకోశమున పైవృత్తమే గాక ఈ క్రిందఁ జెప్ప విషయమును గూర్చి వ్రాసియున్నాడు.

ఆ సూహదదేవి జయచంద్రుని తనవశము చేసి తానే మహారాజ్ఞియై రాజ్యవ్యవహారములందుఁ బాల్గొనుచుండెను. ఆమెకు కాలక్రమమున నొకకుమారుఁడు గలిగి వర్ధిల్లి యౌవనముం బ్రాపించి గుర్తయపరుఁడై యుండెను. ఈ జయంతచంద్రునికి విద్యాధరుఁడని మంత్రి యొకఁడు గలఁడు. అతఁడు చింతామణి, వినాయకుల నుపాసించి వారియనుగ్రహమున స్పర్శవేధి (అన్నిలోహముల బంగారు చేయునది) యను నొకశిలను ప్రసాదముగఁ బడసియుండెను. దాని ప్రభావమున

నాతఁడొక్కప్రతి 8800 మంది విప్రులకన్నప్రదానము
గావించి అపరయుధిష్ఠిరుఁడన్న ప్రఖ్యాతి నొందెను.
ఇట్లే యాతఁడు జీవితకాలమున అన్నదానము నిరంత
రము సేయువాఁడు. ధర్మపరుఁడు గావున రాజున కతని
యెడ గౌరవము మెండు. ఒకనాఁడు రాజు తనరాజ్య
మెవ్వరికిఁ బట్టము గట్టవలెనని యీ విద్యాధరుని
సలహా అడిగెను. ఆ మంత్రి రాజుతో రాజా ఎవరికిత్తు
నని నీవేల సందేహింప? నీపుత్త్రుఁడగు మేఘ
చంద్రునకు రాజ్యముపట్టము గట్టుమనెను రాజందు
లకు సమ్మతించి మేఘచంద్రు సామ్రాజ్యమున కధి
పతిం జేయఁ బ్రయత్నించుచుండెను

ఈ యుదంతము సూహాదదేవి చెవి కెక్కెను
ఆమెగడు క్రుద్ధయై తనకొమరునికి రాజుపట్టము గట్టక
పోయెను గదా యని యీసు వహించి యెట్లయిన
మేఘచంద్రునికిఁ బట్టము గట్టనీకుండ చేయవలెను,
రాజును పదభ్రష్టుని జేయవలెనని సంకల్పించుకొనెను.
తాను మహారాజ్ఞి, ధనాఢ్య, స్వతంత్రస్వేచ్ఛాప్రవర్తన
యైయున్నందునను కోపమినుమడింపఁ దనప్రధానుఁ
బిలిచి తక్షశిలాధిపతి యగు సురత్రాణుని కాశిపై
దండెత్తి రావలసినట్లు చెప్పఁబంపినది. అతనికి ప్రతి
మజిలీకి సపాదలక్ష (లక్షయిరువదియైదు వేలు) దీనా
రములఁ జెల్లింతు మని చెప్పి దండయాత్ర దరలి రమ్మని
చెప్పిపంపెను వారట్లుపోయి యా సురత్రాణు యుద్ధ
సన్నద్ధుం జేసికొని కతిపయ ప్రయాణములఁ గాశి
ముట్టడింపఁ జనుదెంచుచుండిరి. ఈ సంగతి యెట్లో
విద్యాధరునకుఁ జారుల మూలమున దెలియరాగా
రాజుంగని యాతఁడు సూహావదేవి నిన్ను నీకుమారుని
హతమార్ప పన్నుగడ పన్నినది. అది క్రియోన్ముఖమై
సురత్రాణుఁడు నీపై దండెత్తి వచ్చుచున్నాడుఁ నీవు
జాగరూకుఁడ వగుమని ప్రబోధించెను. రాజు, దేవి
నాకువల్లభ, అట్టిపనికిఁ జేయదనియు నీవుచిన్నది
అసత్యమని కూడ ననెను. పైగా తన్ను తిరస్కరించెను.
ఎంతఁ చెప్పినను రాజు వినఁడయ్యెను. అప్పుడు,
మంత్రి విద్యాధరుఁడు చేయునదిలేక అక్కటా రాజింత
మూఢుఁడయ్యెనే. రాణిని జూతమా బలవతి, అవి
వేకిని, పలుకుబడిగలది. ఈయమ చేయునపుడ రాజు
మరణము తప్పదు రాజుమృతికన్న నేను ముందుగనే
ఈ శరీరమీఁగుట మేలుగదా యని వచ్చి యారాత్రి
నింటనెట్లో గడపి మరునటిదినమునఁ బ్రొద్దుటివేళ
రాజవీథిముంగఁ జనుచుండెను ఆ విద్యాధరమంత్రికి
ఎదుర నొకపిండిముద్దను జేపట్టినవాఁడు వచ్చెను. ఆ
పిణ్యాకము దినఁగోరిక కలిగి కొంతదాని గ్రహించెను.
మఱికొంతదూరము పోవునరికి చీలిన సెనగల గంప
నుండి సెనగలు రాలుచుండెను. వానిం జూచెఁ దినవలె
నని మంత్రికి నోరూరెను. ఈరెండు గోర్కులును
దనకు చేటుమూడునని నిశ్చయించుకొని రాజుంజేరి
రాజా నాకుజీవితముపై నాస వీడినది. నేను గంగాజల
ములఁ బడి చత్తును, నీసెలవుకోరి వచ్చితి ననెను. అంత
నోయీ మంత్రి నీవు చస్తవేని మేము గోయిగ సుఖపడె
దము మా చెవులు చిల్లులనోవకుండును పోపొమ్ము
అనెను. హితవచనము వినమి, చెడుదారి పోక, మంచి
వానిఁ జెట్టఁగాంచుట, గురుజనుల నవమానించుట
అనునవి కదా మృత్యువుయొక్క పూర్వరూపములని
రాజునెడ ప్రీతివదలుకొని మంత్రి విద్యాధరుఁడు
గంగాజలములందు దిగి నిలువంబడి తనకులపురోహితుం
బిలిచి దానమిత్తునమ్మనెను. అతఁడు చేయిఁజాపినంత
అస్పృశ్యవేధి పాషాణమును (జ్యోతిని) పురోహితు చేత
నిడి మంత్రి జలముల మునింగి మృతిజెందెను పురో
హితుఁడా శిలాతత్త్వ మెఱుంగక మంత్రి యీరాయి
దానము చేసినాఁడేమి యని విసుగుకొని జ్యోతిని ఆ
గంగాంబువుల బాఱవైచి యేఁగెను.

తర్వాత సురత్రాణుఁడు చండప్రచండఘోరసైన్య
ములతో కాశీనగరము ముట్టడించి జయచంద్రుని జెర
పట్టెను కాశీనగరము యవనుల వశమయ్యెను. తర్వాత
జయచంద్రుఁడు హతుడయ్యెనో మృతిచెందెనో మనకు
దెలియరాదు. ఇది జయచంద్రుని తప్పుగాదు. "వినాశ
కాలే విపరీతబుద్ధిః" అనికదా ఆర్యులందురు. అందుచే
సరిగనే ఈతఁడు ప్రవర్తించెను.

## శ్రీ హర్షుని కాలము

ఈ జయంతచంద్రుఁడు. విక్రమశకము 1243 వ
సంవత్సరమున ఆషాఢశుద్ధ సప్తమి భానువాసరము
నాఁడు వారణాసియందు గంగలోఁ గ్రుంకులిడి హరి
హరులఁ బూజించి దేవర్షిపితృతర్పణములఁ దాను తన
పెద్దలు కృతార్థులగుటకు, కామాలియను గ్రామమును,
భారద్వాజగోత్రుఁడును, రావుత అడలే పౌత్రుఁడు
రావుత శ్రీ ధుండా పుత్రుఁడును నగు దోడా రావుత
అణంగుఁడను విప్రునకు దానముచేసి యున్నాఁడు.

# శ్రీహర్షుడు

కాబట్టి ఈ ప్రభుని కాలమే శ్రీహర్షుని కాలముగు చున్నది. కాఁబట్టి శ్రీహర్షుఁడు క్రీస్తుశకము (1187 వత్సరము) పంన్రెండవ శతాబ్దము ఉత్తరార్ధమున నుండెననుట స్పష్టము గుచున్నది.

ఇది యిట్లుండఁ బలువురు విమర్శకులు శ్రీహర్షుఁడు 8 వ శతాబ్దమువాడగు శంకరభగవత్పాదులకు వారి శిష్యులకు సమకాలికుఁడని సమర్థింపఁ జూచుచున్నారు. మఱికొందఱు వాచస్పతిమిశ్రుఁడు, ఉదయనాచార్యుఁడు, మమ్మటభట్టు, లోనగువారికి సమకాలికుఁడనియు వ్రాయుచున్నారు. వాని సత్యాసత్యము లటుండ వారు చెప్పునట్టి యుక్తులు చదువరులకు వినోదముగ నుండునని యిట వ్రాయుచున్నాను—

వీరిలో ఆదిశంకరుల కాలము క్రీ॥ శ॥ 8 వ శతాబ్దమని పెక్కురు సిద్ధాంతము చేసియున్నారు.

శ్రీ శంకరాచార్యులవారు భారతదేశము సంచారము చేసి దుర్మతముల ఖండించి అద్వైతమతస్థాపనము చేసిరి. ఇది జగద్విదితము. వీరి చరిత్రమును ఆనందగిరి, మాధవవిద్యారణ్యులు లోనగువారు శ్రీశంకరవిజయమను పేర వ్రాసియున్నారు. ఈ మాధవవిద్యారణ్యులు శంకరవిజయము వ్రాయలేదనియు, ఇప్పుడు వారి పేరఁ గన్పట్టు శంకరవిజయము వ్యాసాచలకవి యను ఉద్దండపండితుఁడు వ్రాసెనదనియు నిట్లు మన కుదాహరణీయముగు శంకరవిజయ కర్తృత్వము నేతగాదా యున్నది. అది యటుండనిండు. ప్రస్తుతము మనకు ఆ శంకరవిజయములో శంకరాచార్యులు శ్రీహర్షుని వాదమున నోడించెనని తెల్పు నొక శ్లోకము గలదు. చూడుఁడు:

> పటుయుక్తినికృత్తసర్వశాస్త్రం
> గురుభట్టోదయనాదికైరజయ్యం
> సహి ఖండనకారమూఢదర్పం
> బహుధా వ్యాఖ్య వశంవదం చకార॥
>
> (శంకరవిజయం సర్గ 15, శ్లో॥ 157)

తన యుక్తిపాటవమున సర్వశాస్త్రముల సిద్ధాంతముల ఖండించినవాఁడును, పూర్వమీమాంసాప్రవర్తకులగు కుమారిలభట్టు, ప్రభాకరుఁడు లోనగువారికిని న్యాయదర్శన పారంగతుఁడగు ఉదయనాచార్యులకును అజయ్యుఁడును (జయింపరానివాఁడనుట) (మీమాంసా దర్శనమును, న్యాయదర్శనమును ఈ శ్రీహర్షుఁడు ఖండించియున్నాఁడని అని భావము) ఖండనఖండఖాద్యమను గ్రంథమును రచించినందున మెండుకొన్న గర్వముగలవాఁడు నగువానిని (శ్రీహర్షుని అధ్యాహార్యము, అనెడి వ్యాఖ్యాతలు) మిక్కిలి వాదమున వాదించి వశపఱచుకొనెను. (ఆదిశంకరులు కర్త), ఇది ఆ శంకరవిజయకర్త కావ్యవినోదమునకై వ్రాసినట్లే కన్పట్టుచున్నది. ఇట్లే పెక్కుమతస్థులను (కలికాలమున లేనివారిని) జయించినట్లు చెప్పినారు. కాని యది ఆయా మతప్రవర్తకులగువారి శిష్యప్రశిష్యులను శంకరులు జయించి వారి మతముల ఖండించి తమ మతముల నెలకొన్న విషయమే ఇట ప్రధానముగాని వేరుగాదు. కావున నట్లా సందర్భమున సరిపెట్టుకొన్న దోషము లేదు.

శంకరుల శిష్యులు శ్రీహర్షుని సమకాలమువారి నిఁగా జేసి కొంద ఱీ యుక్తి నొకదానిఁ జెప్పుచున్నారు.

ఒకప్పుడు శ్రీ శంకరుల శిష్యులు శ్రీహర్షునితో వాదము సేయఁబోయిరి. వారు పోయిన సమయమున శ్రీహర్షుఁ డెత్తైన మేడపై నొక తూఁగుటుయ్యెలలో నుండి యూఁగుచు వారిఁజూచి లేచి వారిని గౌరవింపవయ్యెను అట్లు శ్రీహర్షుఁడు తమ్ము మర్యాదతోఁ జూడకుండుటఁజూచి శంకరుల శిష్యులు గినుకఁబొంది "అత్యుచ్ఛ్రియః పతనహేతుః" (పైనుండుట క్రింద పడుటకే) అనిరట. అందులకు శ్రీహర్షుఁడు, "ధ్రువే అవ్యాప్తిః (కారణము మీరన్నది ధ్రువునందు అన్వయించదు. అనఁగా ధ్రువుఁడు (ధ్రువనక్షత్రము) సూర్య చంద్ర సప్తర్షి నక్షత్రమండలముల కన్నింటికి పైనుండునది.) అట్లు మిగుల నెత్తుననున్నను క్రిందఁబడదు గదా అని అనెనట అందులకు వారు "ప్రళయే తస్యాపి పతనసంభవః" ప్రళయమునందు అతనికి (ధ్రువునికి) గూడ పతనము సంభవించును అనిరట. అందుమీద శ్రీహర్షుఁడు "తదా సర్వేషాం పతనమేవ" అప్పు డన్నింటికి (ఉచ్చనీచలులేకనుట) పతనమే కదా అని వారి నిరుత్తరులఁ జేసెనట ఇది వారికి సమకాలము అనుట. మఱి వాచస్పతిమిశ్రునకు శ్రీహర్షుఁడు సమకాలమువాఁడనువారు కొందఱు

ఈ వాచస్పతిమిశ్రుఁడు ఘనపండితుఁడు. ఈతఁడు షడ్దర్శనములందును ముఖ్యగ్రంథముల వ్రాసియు

న్నాఁడు. శంకరాచార్యులవారు వ్రాసిన బ్రహ్మసూత్ర భాష్యమునకు భామతి యనుపేర నొక సుప్రసిద్ధమైన కూలంకషమగు స్వతంత్ర వ్యాఖ్య వ్రాసిన మహానీయుఁడితఁడు. ఈయన భామతి వ్యాఖ్యకు, కల్పతరు, పరిమళాది వ్యాఖ్యానము లుద్భవిల్లియున్నవి. ఈయన, గౌతముని న్యాయదర్శనమునకు (సూత్రములు) ఉద్యోతకరుఁడను పండితుఁడు వ్రాసిన వార్తికములకు న్యాయవార్తిక తాత్పర్య టీక అను వివరణ గ్రంథమును నిర్దుష్టముగ వ్రాసియున్నాఁడు. ఈ గ్రంథమునకే ఈయన కించుక యీవలివారగు ఉదయనాచార్యులవారు తాత్పర్యపరిశుద్ధియను వివరణ గ్రంథము వ్రాసియున్నారు. ఈ వాచస్పతిమిశ్రుఁడు, న్యాయసూత్రములకు న్యాయసూత్ర సూచీ నిబంధనము అనుదాని రచించుచు దాని రచనాకాలమును, దాని కడపట:

న్యాయసూచీ నిబంధోయ మకారి విదుషాం ముదే
శ్రీవాచస్పతిమిశ్రేణ వస్వంక వసువత్సరే.

అను శ్లోకమునఁ దెల్పియున్నాఁడు కాఁగా ఈయన కాలము శాలివాహనశకము 898 వ సంవత్సరమగుచున్నది. దీనింబట్టి ఈయన కాలము క్రీ శ పదియవ శతాబ్దము (976) అగుచున్నది. ఇంకను మఱియొక విశేషమేమనఁగా శ్రీ వాచస్పతిమిశ్రుఁడు శ్రీహర్ష రచితమగు ఖండనఖండఖాద్యమును ఖండించినట్లు చెప్పుచున్నారు. కావున శ్రీహర్షుఁడు శ్రీ వాచస్పతిమిశ్రునికి సమకాలమువాఁ డందురు. ఇది పొసఁగుటలేదు. చూడుఁడు: శ్రీహర్షుఁడే తన ఖండనఖండఖాద్యము చతుర్థపరిచ్ఛేదమున వాచస్పతిమిశ్రుల మతము నుద్ఘాటించి విమర్శించియున్నాఁడు. కావున 10 వ శతాబ్దమువారగు వాచస్పతిమిశ్రునకు శ్రీహర్షుఁడు 12 వ శతాబ్దమువాఁడు సమకాలీనుఁడగు నట్లు లేదు.

పైగా ఉదయనాచార్యులకు శ్రీహర్షుఁడు సమకాలమువాఁడని కొందఱు చెప్పుదురు. ఈ ఉదయనాచార్యులవారు వాచస్పతిమిశ్రులకు కొంచెము ఈవలివారని ముందే చెప్పియున్నాను. ఈ మహానీయుఁడు న్యాయదర్శన పారంగతుఁడు. ఆ కాలమున నింతటి పండితుఁడు లేఁడన్న నది అతిశయోక్తి కాదు. ఈయన న్యాయకుసుమాంజలి యను చార్వాకాది దుర్మతముల ఖండించు గ్రంథమును రచియించియున్నారు. ఇంతియగాక లక్షణావళి లోనగు పెక్కు గ్రంథముల రచించిరి. వీరు తమ లక్షణావళియను గ్రంథమున దాని రచనాకాలము విస్పష్టముగా వివరించియున్నాఁడు. కనుఁడు:

తర్కాంబరాంక ప్రమితే
ష్వతీతేషు శకాంతతః ।
వర్షేషూదయనశ్చక్రే
సుబోధాం లక్షణావళీం॥

దీనింబట్టి వీరి కాలము శాలివాహనశకము 906 వ సంవత్సరమగుచున్నది. కావున క్రీస్తుశకము 10 వ శతాబ్దము కడపట (984) వీరి యునికియని తెలియుచున్నది. ఈ యుదయనాచార్యులవారే శ్రీహర్షుని తండ్రియగు శ్రీహీరపండితుని వాదమున నోడించి యవమానించినవాఁడని చెప్పుచున్నారు. అట్లయని యొప్పుకొందమన్న శ్రీహర్షుఁడు ఉదయనాచార్యుల న్యాయకుసుమాంజలిని తన ఖండనఖండఖాద్యమున బహుధా ఖండించియున్నాఁడు. ప్రథమ పరిచ్ఛేదమున ఉదయనకృతలక్షణఖండనము పేరుఁ గలవాని దగు దీనింబట్టి శ్రీహర్షునికిఁ బూర్వుఁడే ఉదయనాచార్యుఁడని తెలియఁగలదు సమకాలముననే ఖండనాదులు గ్రంథముల కెక్కుటయుఁ గలదన్నను సరిపడదు

ఇంకను శ్రీహర్షుఁ డుదయనుని గెలిచికొన్నప్పుడు వారి కిరువురకు జరిగిన సంవాద మీ శ్లోకముని యొక శ్లోకము నుదాహరించుచున్నారు

కింగవి గోత్వ ముతాగవి గోత్వం
యది గవిగోత్వం నహిమయి తత్త్వం
అగవిచ గోత్వం తవయది సామ్యం
భవతు భవత్యపి సమ్మతి గోత్వమ్॥

ఓ యీ గోవునందు గోత్వము (గోవుధర్మము) గలదా. అగోవునందు (గోవుగాని దానియందు) గోత్వముగలదా? గోత్వము గోవునందున్న దంటివేని ఇఁక నీయం దీతత్త్వము నుండదు. మఱి అగోవునందు గోత్వమున్న దందువేని నీయందు సైతము గోత్వము సిద్ధముగుచున్నది.

ఇట్లు చెప్పి యుదయనాచార్యులకు శ్రీహర్షుఁడు సమకాలమువాఁడని నిరూపింతురు. కొందఱు కావ్యప్రకాశిక వ్రాసిన మమ్మటభట్టునకు శ్రీహర్షుఁడు సమ

# శ్రీ హర్షుడు

కాలీనుఁడనుచున్నారు. ఈ మమ్మటభట్టు క్రీ. శ. పదు
నొకండవ శతాబ్దము పూర్వభాగమునందుండిన భోజ
రాజునకు సమకాలమువాఁడు (1020). ఒకప్పుడు
శ్రీహర్షుఁడు తన నైషధీయచరితము తీసుకొని పోయి
అలంకారికులలో నుత్తమశ్రేణికిఁ జెందినవాఁడైన యా
మమ్మటభట్టునకుఁ జూపెననియు, అతఁడందుమీఁద
శ్రీహర్షా కొంతముందుగ ఈ నీ కావ్యమును నాకుఁ
గనఁబఱచియుండిన నా కావ్యప్రకాశికయందలి దోష
ప్రకరణములోని లక్ష్యములకుఁ బ్రబంధములను వెదుక
వలసినంత శ్రమయుండెడిది కాదుగదా అని నైషధము
మీఁదఁ దన అభిప్రాయమును వెలిఁబుచ్చెనట అనఁగా
శ్రీహర్షు నైషధమంతయు దావాపు తప్పులతడకలతో
నిండియున్నదని చెప్పెనని భావము ఇది ఎంతవఱకు
నమ్మఁదగినదో శ్రీహర్ష నైషధ మామూలాగ్రముగఁ జది
విన బండితులు పై మమ్మటుని వాక్యము విశ్వసింతురా?
ఇది యొక కల్పితగాథ యనిపింపకపోదు.

మఱియు అహమ్మదాబాదు సమీపమునందలి
డోలకగ్రామనివాసి చాండూపండితుఁ డొక్కఁడు
నైషధమునకు మొదట వ్యాఖ్యవ్రాసినవాఁడుగఁ
గన్పట్టుచున్నాఁడు. ఆయన వ్యాఖ్యరచనా కాలము
విక్రమశక 1353 వ వత్సరమని తెలిపియున్నాఁడు.
మఱియును నైషధకావ్యము నవ్యమనియు వక్కా
ణించి యున్నాఁడు. దీనిఁబట్టి ఈయన కాలము క్రీ శ
1275 వ సంవత్సరమగుచున్నది కాఁబట్టి శ్రీహర్షుఁడు
12 వ శతాబ్దము చివరనున్నాఁడని తలంచుటకుఁ దగి
యున్నది. ఈయన రచించిన శ్లోకము:

శ్రీ విక్రమార్క సమయాచ్ఛరదా
మన త్రిపంచాశతసమధికే...ష్విలేషు
లేషు త్రయోదశసు భాద్రపదే చ శుక్లే
పక్షే త్రయోదశతిథౌ రవివాసరేచ.
శ్రీమాన్ డోలిగపండితః స్వపద
యా విఖ్యాతసర్వాశ్రమ
శ్చాండూపండిత సంజ్ఞితం
ప్రసుషు లే శ్రీగౌరిదేవీచ యమ్
బుద్ధ్వా శ్రీమునిదేవసంజ్ఞ విబుధా
త్కావ్యం నవం నైషధం
వ్యాలింకేద సపద్మ నే వితరణం
సర్గేచ చక్రే క్రమాత్.

కొందఱు అదిశూరుఁడు పిలువఁబంపిన నాలుగు
బ్రాహ్మణ కుటుంబములలో శ్రీహర్షుఁడొక కుటుంబము
వాఁడని చెప్పి వంగదేశము వాఁడని నిర్ధారింప యత్నించు
చున్నారు వంగదేశమునుగూర్చి కాని ఆ దేశాధిపతి
అదిశూరునిగూర్చి శ్రీహర్షుఁడెచ్చటను బ్రస్తావించి
యుండకపోవుటవలన వారియుక్తి నిలువనేరదు. ఇంతకు
శ్రీహర్షుఁడు 12 వ శతాబ్దము ఉత్తరార్ధమువాఁడను
టయే, తేలిన సారాంశము—

## శ్రీ హర్షుని గ్రంథములు

(1) నైషధము, (2) ఖండనఖండఖాద్యము అను
గ్రంథములే గాక శ్రీహర్షుఁడు, (3) అర్ణవ వర్ణనము,
(4) శివశక్తిసిద్ధి, (5) నవసాహసాంకచంపువు, (6)
ఛందఃప్రశస్తి, (7) విజయప్రశస్తి, (8) గౌడోర్వీశకుల
ప్రశస్తి. (9) ఈశ్వరాభిసంధి, (10) స్థైర్యవిచారణ
ప్రకరణము, అను గ్రంథములు గూడ రచించినట్లు తన
నైషధకావ్యమునందలి సర్గాంతముల వెల్లడించి
యున్నాఁడు పై నైషధ ఖండనఖండఖాద్య గ్రంథ
ములు రెండుతప్ప తక్కినవి యేవియు నిప్పటికిఁ గాన
రాలేదు. అట్టి మహాకవి తాను వ్రాయకయే వ్రాసితి
నని అసత్యమేల చెప్పియుండును. ఆ గ్రంథములు కాల
గర్భమున నడఁగిపోయినవేమో కొందఱియన్నియు
నైషధము విశేషవర్ణనములఁబట్టి యేర్పడియుండు
నందురు అది చింత్యము.

చూడుఁడు.

నైషధము. 4 వ సర్గము చివర. స్థైర్యవిచారణ
ప్రకరణభ్రాతరి అనియు

5 వ సర్గాంతమున. తస్య శ్రీవిజయప్రశస్తి"
6.........ష్ఠః ఖండనఖండతో ఽపి......
7.........గౌడోర్వీశకులప్రశస్తి"

9 వ సర్గాంతమున "నంధ్యబ్ధార్ణవ వర్ణనమ్ అనియు
17 ,, "సుసదృశి ఛందఃప్రశస్తే ,,
18 ,, యాతో ఽస్మిన్ శివశక్తిసిద్ధిభగినీ,,
మఱి ఖండనఖండఖాద్యము ప్రథమపరిచ్ఛేదమునందు
102 వ విషయమున, శ్రుతిప్రమాణమందు
శ్రుతిప్రామాణ్యం సిద్ధాన్త ప్రామాణ్య శ్చేశ్వరాభి
సంధౌ సాధయిష్యే అని యిట్లు చెప్పియున్నాఁడు.

### శ్రీ హర్షుఁడు తన్నుగూర్చి

1 కవికులాదృష్టాధ్వ పాంథుఁడు, = కవులెవ్వరు
గానని దారిని నడచిన బాటసారి,

2. తర్కములందసమ్రముఁడు,

3. మాతృచరణాంభోజాళిమౌళి = వాగ్దేవి యుపాసకుఁడు.

4. నవార్థ ఘటనా పటిష్ఠుఁడు = క్రొంగ్రొత్త యర్థములఁ గూర్చువాఁడు,

5 సత్కవి సూక్తుల హర్షించువారెక్కువగలవాఁడు.

అని చెప్పికొనియున్నాఁడు.

మఱి తన నైషధ మహాకావ్యము

1 శృంగారామృతశీతగువు = శృంగారరసమను అమృతము నొసంగుటలో చందమామవంటిది.

2. స్వాదూత్పాదభృతము = సహృదయ హృదయాహ్లాదదాయి :

3. శరదిజ జ్యోత్స్నాచ్ఛసూక్తి = శరత్కాలము నందలి వెన్నెలవలెఁ దెలనగు సుందరమైన మాటలుగలది.

4. కృశేతరరసాస్వాదము = అల్పముగాని (బహుళమైన) రసముల నాస్వాదింపఁ జేయునది

5. విశుద్ధశవిద్యాలంకారి లేటివిశారదులచేఁ బూజింపఁబడినది.

6 అన్యాక్షుణ్ణరసప్రమేయభణితి = ఇతరకవులెవ్వరు చెప్పని శృంగారాది రసములు, సమాసములు, శబ్దములు, ఉత్ప్రేక్షలోనగు అలంకారములు గలది.

7. అతినవ్యము.

8 మధుపర్షి = తేనియ జాలువార్చునది.

అని చెప్పియున్నాఁడు.

## నైషధకావ్య వ్యాఖ్యలు

ఈ నైషధమహాకావ్యమునకు వ్యాఖ్యలు వ్రాసిన వ్యాఖ్యాతలు 23 గురు అని తెలియవచ్చెడు.

నారాయణీయవ్యాఖ్య మల్లినాథవ్యాఖ్యలోనగు వ్యాఖ్యలు కొన్ని లభ్యము లగుచున్నవి.

ఇట్టి మహాకావ్యము విమర్శించి నిగ్గుదేల్చి చూపుట సామాన్యజిజ్ఞాసువులకు లోకమునకు శ్రేయము.

## ఖండనఖండఖాద్యము

ఈ గ్రంథమునకు ఖండనఖండఖాద్యము, ఖండనఖండము, ఖండనఖాద్యము, ఖాద్యఖండనము, ఖండనము అని పేరులు పెక్కులు లోకమునఁ బ్రసిద్ధి కెక్కియున్నవి. అవి సంగ్రహమునకై యేర్పఱుపఁబడినవి. కాని దీనిసంపూర్ణనామము ఖండనఖండఖాద్యమనియే.

ఖండనఖండఖాద్యమనఁగా : ఖండన = పదార్థ ఖండన రూపమైన, ఖండ=శర్కరాఖండము యొక్క (కలకండతోఁ గూడిన) ఖాద్యము=పకొన్నొక భక్ష్య విశేషము – అని యొక అర్థము

ఖండన=పదార్థఖండన రూపమైన లక్షణముచే ఖండ=ఖండితములైన ఖ+ఆద్యము=ఆకాశములోనగు పదార్థములు గలది అని రెండవ అర్థము.

ఖండనఖండఖాద్యము = ఖండన రూపమైన ఖండఖాద్యము. (వైద్యశాస్త్రమునందు) రసాయన విశేషము గలదు.

మొత్తముమీద మీమాంసాతర్కాది దర్శనములఁ బండితులైనవారికే ఈ గ్రంథము చాలా సొంపుగనుండి సిద్ధాంతము దెలుపునది అని భావము.

దీనిలోని విషయము :— ఈ ఖండనఖండ ఖాద్యమునందు గౌతమ న్యాయదర్శనమునందుఁ గన్పట్టుచున్న ప్రమాణము లోనగు షోడశపదార్థముల ఖండించి మీమాంసాప్రవర్తకులగు కుమారిలభట్టు, ప్రభాకరుఁడు, లోనగువారి మతముల ఖండించుటయు ముఖ్యముగా ఉదయనాచార్యుల న్యాయకుసుమాంజలి విమర్శ ఖండనములును, చార్వాకాదిమతముల ఖండనములు అను విషయములు గలవు ఇట్లన్ని శాస్త్రముల సిద్ధాంతముల ఖండించుటవలననే ఈ గ్రంథమునకు ఖండనఖండఖాద్యమను పేరు వచ్చినది. పేరు పెట్టఁబడినది గూడ.

మఱి యిందు అన్నీ ఖండనములే కావు. శ్రుతి ప్రామాణ్యముతో అద్వైతసిద్ధాంతము చేయఁబడినది.

ఇట్టి యపూర్వ గ్రంథ విమర్శనము జరుగవలసి యున్నది దీని సారముఁ గూడ లోకమెఱుంగుట మంచిది.

---

ఈ వ్యాసరచనమునకుఁ దోడ్పడినవి (ముఖ్య గ్రంథములును)

(1) ఖండనఖండఖాద్యమునకు – శ్రీ ద్రావిడ లక్ష్మణశాస్త్రి గారు వ్రాసిన భూమిక, (చౌఖాంబా ప్రెస్, కాశి)

(2) శ్రీహర్ష నైషధమునకు శ్రీ శివదత్త శర్మ గారు వ్రాసిన ప్రస్తావన – నిర్ణయసాగర ప్రెస్, బొంబాయి.

(3) ప్రబంధకోశము. రాజశేఖర సూరి విరచితము. –చౌఖాంబా ప్రెస్, కాశి.

(4) శృంగారనైషధమునకు కీ. శే. కళాప్రపూర్ణులు శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారు వ్రాసిన యవతారిక.

(5) శ్రీ విద్యారణ్యుల శంకరవిజయము.

పై రచయితలకెల్ల కడుంగడు కృతజ్ఞుఁడను.

# చీకటి తెర

శ్రీ ఆర్. యం. చిదంబరం

ఆకాశం మబ్బులముసుగు కప్పుకుంది. కత్తులు ఝుళిపిస్తున్నట్లు మెరుపులు. మధ్యమధ్య గుండె అదిరేటట్టు ఉరుములు. మూడురోజులుగా వర్షం నిరంతర వాహినిగా కురుస్తోంది. రేడియో సరిగ్గా పలకటంలేదు. గడబిడ తగ్గిద్దామని వాల్యూం తగ్గించాను. చలిగాలి జివ్వున వీస్తుంటే తలుపులు వేసేద్దామని కిటికీ దగ్గరకు వెళ్లాను. పక్కనేవున్న శాంతా క్రూజ్‌లో దిగటానికి, శత్రుసైన్యాన్ని చీల్చుకుపోతున్న వీరుడులా, ఎదురు తిరుగుతున్న ప్రకృతిని చీల్చుకుంటూ వెళ్తోంది ఒక విమానం.

రోడ్డుకు వారగా పసుప్పచ్చటాక్సీ ఆగింది.

కిటికీతలుపులు వేయటం మానేసి ఎవరు దిగుతున్నారా అని చూస్తున్నాను. అమ్మాయేఅయుండాలి. మొహానికడ్డంగా తెచ్చిన గొడుగుండటంవలన గుర్తు తెలియటంలేదు. కాళ్ళకు ఎర్రటి స్లిప్పర్లున్నాయి. చీర కుచ్చెళ్లు ఎత్తిపట్టుకుని నడుస్తోంది. వెనకాల డ్రైవరు సామాను తెస్తున్నాడు.

ఓనిమిషం గడిచాకకాని ఆమె ఫస్టుఫ్లోరుకే వస్తోందని, అందులోనూ నాగదిలోకే వస్తోందని నాకు తెలియలేదు.

'నమస్కారమండి! నేను గుర్తున్నాననే అనుకుంటా' అంటూ డ్రైవరుకు డబ్బిచ్చి పంపింది.

'జ్ఞాపకంలేకేం శారదా!' అంటూ రేడియో వాల్యూం పూర్తిగా తగ్గించాను. హేండ్‌బాగ్‌లోంచి టవల్ తీసి ముఖంమీదున్న నీటిబిందువుల్ని తుడుచుకుంది. మూడురోజుల ప్రయాణంతాలూకు బడలిక ముఖంమీద స్పష్టంగా కనిపిస్తోంది. సరిగ్గా పదమూడు నెలల క్రితం చూసిన శారదకూ — ఈ శారదకూ — చాలా వ్యత్యాసాలు కనిపించాయి. చిదిపితే ప్రణయరసం చిమ్మే చెక్కిళ్లు — అరడజనుమంది సంతానాన్ని కన్న తల్లిలా తయారయ్యాయి. రెండుజడలు వేసుకుంది. నుదుటిమీద అర్ధచంద్రాకారపు బొట్టు— బొంబాయివస్తూందని తనకుమాత్రం తెలియదా ఏమిటి? ముఖంలో ఇదివరకున్న కాంతి — మమకారం — కామం — ఇప్పుడు దర్శనమివ్వటం లేదు. ఉరుముల్లో — పిడుగుల్లో వర్షం కురిసి వెలిసినట్టుగా వుంది.

'చాలా సామానువుందే!' అంటూ నవ్వటానికి ప్రయత్నించాను. కాని శారదరాక నాలో భయాన్ని రేకెత్తించింది. నలుగురిలో చెప్పుకునేందుకు సరోజ నాకు దూరపుచుట్టమైనా కాదు—

'అబ్బబ్బ!...ఏం వర్షం!...నాకు ప్రకృతి కూడా చక్కటి స్వాగతం పలికింది.' శారద నవ్వి గుప్పెట బిగించి లోకానికి చూపుతూ అందులో ఏంవున్నదీ కనుక్కోమన్నట్టుగా వుంది.

'చాలా అలిసి పోయుంటావు. స్నానం చేస్తావా? అదే బాత్‌రూం.' ఆమెకు టవలు యిద్దామనుకుంటుంటే ట్రంకులోంచి మరోటి తీసుకుంది. చీర - జాకెట్టూ తీసుకుంది.

రేడియో వాల్యూం కొద్దిగా హెచ్చించాను. ఏదో హిందీ రికార్డు - సగం చదువుతూ వదిలేసిన 'రెబెకా' తీశాను కొత్తగా వచ్చిన మిసెస్ డీవింటర్ పరిస్థితుల్ని చూసి జడుసుకుంటోంది కిటికీలోంచి జల్లు కొట్టింది - అకాలవర్షం కూడా.

శారదకూ నాకూ వున్న పరిచయం నాలుగేళ్ళ కాలపరిమితిలోకి వస్తుంది. కాలేజిలో శారద చదివేటప్పుడు ఆమెకు ఉపాధ్యాయుణ్ణి - ఆమె బి. ఏ. పూర్తవగానే నేనిక్కడకు రావటం తటస్థించింది. ఆమె ప్యాసయిందీ లేనిదీ కూడా నాకు తెలియదు. 'అంతకంటె ఎక్కువ పరిచయం వుందా?' అనే ప్రశ్న వేస్తే నలుగురికీ తెలియకుండా వుండటంకోసం అవునని తలవూపక తప్పదు. ఆ ప్రశ్నకు నిజమైన సమాధానం కావాలంటే నా అంతరాత్మను విమర్శించుకోవాలి. అందుకు నాకే యిష్టం వుండదు. ఆ ప్రశ్న స్ఫురించగానే దాన్ని బయటకు నెట్టివేస్తాన

గడచినదానికీ - ప్రస్తుతానికీ మధ్య అగాధాన్ని సృష్టించుకుంటేనే కాని సుఖపడలేను. అదంత తేలిగ్గా జరిగేదికాదు. జరిగిన ప్రతీక్షణం మర్చిపోయే సహజ తత్వం మనకుంటే అనూయలు - వైషమ్యాలు - ప్రతీకారాలు వుండవు. అయినా శారద ప్రతీకారం చేయడంకోసమే వచ్చిందని ఎందుకనుకోవాలి!

శారద స్నానం చేసి వచ్చింది బోర్డర్ లేని గులాబీరంగు చీర - తెల్లటి వాయిల్ జాకెట్టు - కడిగిన ఆణిముత్యంలా వుంది.

'చాలా ఆకలిగా వుందనుకుంటాను. నేను హోటలు పక్షిని' అంటూ రెండురోజుల క్రితం కొన్న షాంగ్రిలా బిస్కట్లు ప్లాస్టిక్ ప్లేట్‌లో వుంచి ఆమె ముందు వుంచాను. అదృష్టవశాత్తూ అరగంట తరువాత రుచిచూద్దామనుకున్న అరటిపళ్లు కూడా అవసరానికి ఆదుకున్నాయి. ఫ్లాస్కులో వున్న పాలుకూడా ఆమెముందు వుంచాను.

'ఇదే భోజనమనుకోవాలి.'

'థాంక్స్. మీకు చాలా శ్రమకలిగిస్తున్నాను. అసలు మీకు శ్రమకలిగించటానికే ఇక్కడికొచ్చాననుకోండి' అంటూ నిర్లక్ష్యంగా నవ్వింది.

'బెజవాడ నుంచేనా?'

'ఆ... నేను ఆర్నెల్ల క్రితం పంపిన శుభలేఖ మీకు అందేవుంటుంది. కాని మీరుమాత్రం ఆశీస్సులు పంపలేదు మీరు దీవించివుంటే నాజీవితం మరోలా వుండేది.'

శారద ఆరోపణలో నిజం లేకపోయినా ఆమె మనసులో ఏదో వుంచుకుని మాట్లాడుతోందని నాకు అర్థమయింది.

'నిజానికి నీ శుభలేఖ అందేసరికి నేనిక్కడ లేను. నేను తిరిగివచ్చి చూసుకున్నాను. అప్పటికి మీ పెళ్ళై ఆరురోజులయుంటుంది.'

తుపానుకు ముందు సముద్రం ప్రశాంతంగా వుంటుందట!

'శంకరం బాగున్నాడా? ... అతన్నికూడా టాక్కు రాలేకపోయావా?'

'మేష్టారూ!...మీ హృదయంలో వుండే ఆరాటం నాకుతెలుసు—నేనెందుకువచ్చానని?—ఎల్లా అడగాలో మీకు తెలియటంలేదు—మనసులో కుద్దులా బెంగకు? నేను శంకరాన్ని వదిలివచ్చాను—పెళ్ళై ఆర్నెల్లవగానే ఏమిటీ అఘాయిత్యమని మీరడుగుతారు. నా తత్వం మీకు కొత్తకాదు.'

బయట ఆకాశం ఉరిమింది. ఆ పిడుగు నా నెత్తిన పడ్డట్టే వుంది. రేడియో సంగీతం కర్ణకఠోరంగా వినిపించింది. కట్టేశాను. అయితే ప్రతీకారం ఆరంభమైందన్నమాట!

'శంకరంలో నాకెలాంటి లోపాలూ కనపడలేదు. అతన్తో నీకు మనస్పర్థ ఎట్లా ఏర్పడిందా అని నేను ఆశ్చర్యపోతున్నా. ఇంతకీ కారణం?'

శారద తలవంచుకుని సమాధానం చెప్పింది.

'క్షమించండి మాస్టారూ!... నేను చెప్పలేను. శంకరంమీద మీకున్న సదభిప్రాయాన్ని మార్చుకోవద్దు.'

'పొరబడ్డావేమోనని— మళ్ళీ ఆలోచించుకో—'

ఈ మాటకు శారద ఆకులు రాలినట్టు నవ్వింది.

'కళ్ళున్నా — చెవులున్నా నమ్మకూడదనుకుంటే పొరపాటే అవుతుంది. శంకరానికీ—నాకూ మధ్య తర్కం జరిగింది. ఆర్థికపుటుచ్చుల్లో వున్నా మానవుడు కొంతవరకు నైతికజీవితాన్ని గౌరవించాలి. నా ఆత్మను చంపుకోలేను—ప్రపంచం నాకు అర్థమవుతూంది.'

'శారదా!...ఏ పరిస్థితుల్లో అతన్ని వదిలించుకువచ్చావో నాకు తెలియదు. అటువంటప్పుడు నువ్వు డొంకతిరుగుడుగా ఎన్ని చెప్పినా జరిగింది వూహించుకునే శక్తిగాని—విమర్శించి నిజానిజాలు నిర్ణయించే ఆత్మవికాసం కాని నాకు లేవు.'

మరో విమానం దగ్గరగా ఎగిరిపోయింది.

'పోనీండి—నా కీలోకంలో మీరు తప్పించి మరెవరూ లేరు. నన్ను మీరు కేవలం విద్యార్థినిగా భావించి మాట్లాడుతున్నారు కాని మనకున్న పూర్వ పరిచయాన్ని మర్చిపోతున్నారు. నేను కొత్తజీవితం మొదలుపెట్టదల్చుకున్నాను. జరిగినదంతా పీడకల—దాంతో నాకు ప్రమేయంలేదు. ఇక్కడ నాకేదైనా ఉద్యోగమిప్పిస్తే మీకు బోలెడు పుణ్యం. నాకు టైప్‌రైటింగు చేతనవును. హయ్యర్ గ్రేడు పరీక్షకు వెళ్ళాను కాని ప్యాసుకాలేదు. రెండోది—ఉండటానికి క్వార్టర్సు.'

# చీకటి తెర

'అమ్మబాబోయ్!...శ్రీమన్నారాయణమూర్తిని ప్రత్యక్షం చేయిస్తానుకాని అద్దెకు ఆవగింజంత పోర్షనైనా సంపాదించటం నావల్లకాదు. ఉద్యోగం మాటంటావా? ఆడవాళ్ళకి లోటేమిటి? కళ్ళకద్దుకు నిస్తారు. నువ్వు కొత్తజీవితం ప్రారంభించదల్చుకుంటే ఇదే అనుకూల వాతావరణం. ఇక్కడ ఒకరి గొడవ మరొకరి కనవసరం—ఎవరికివారే యమునాతీరే! నీ కభ్యంతరం లేకపోతే నువ్విక్కడే వుండొచ్చు. ఆఖరుసారిగా నేననుకునేది—నువ్వు శంకరాన్ని అపార్థం చేసుకున్నావేమో నని.'

శారద జవాబు చెప్పలేదు. తెల్లగావున్న గోడకేసి చూసింది.

టైప్‌రైటింగ్ తెలియకపోతే శారద కింత త్వరగా వుద్యోగం దొరక్కపోను. అందులోనూ జీవితాన్ని కొద్దిగా అర్థం చేసుకున్నదేమో, ఇంటర్వ్యూలో బాస్‌ని మెప్పించేసింది. జీతం నూటపాతికైనా నిరాశపడ నవసరంలేదు. గుడ్డిలో మెల్ల—నా వాటాకు ఇరుప్రక్కలా వున్నవారు మా యిద్దరి అనుబంధం గురించి ప్రశ్నించారు. దూరపు బంధువని, వరసకు చెల్లెలవుతుందని చెప్పాను. నేనేమీ తప్పు చేయనప్పుడు నిజం ఎందుకు చెప్పలేకపోతున్నానో అర్థం కాలేదు. వాళ్ళు ఏమైనా అనుకుంటారు—నాలోని బలహీనతకు నవ్వొచ్చింది.

శారద వచ్చిన నాలుగు రోజులకే చాలా మారింది. మొహంలో ఏదో కొత్త కళ వచ్చినట్టైంది. తనకు వివాహమే అవనట్టు ప్రవర్తించింది. చుట్టుపక్కల వారితో స్నేహం కుదుర్చుకుంది. తనూ శంకరం పెళ్ళి అయిన కొత్తలో తీయించుకున్న ఫోటో నూ పెట్టింది. వాళ్ళ మొహాల్లోవుండే చిరునవ్వు—స్వచ్ఛత ఇట్లా విషాదాంతమవుతాయని ఎవరూ వూహించలేరు.

'ఆ ఫోటో గోడకి తగిలించకూడదూ?' అనడిగాను.

'వద్ద'ని పెట్టె అడుగున దాచేసి తతిమ్మా సామానుతో పెట్టించేసింది. పొరపాటునైనా ఆ ఫోటో తనకు కనపడకూడదని ఆమె అభిప్రాయం.

శారద వచ్చి వారంరోజులు దాటింది. ఈ ఏడు రోజుల్లో ఆమె గతాన్ని త్రవ్వటానికి ప్రయత్నించలేదు. భగవంతుడికి నమస్కారమనుకున్నాను. కాని ఎనిమిదోనాడు రాత్రి నాకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. గడియారం పన్నెండు కొట్టింది. యథాలాపంగా నాకు మూడుగజాల దూరంలోవుండే శారద పక్కకేసి చూశాను. అది ఖాళీగావుంది. నా తలవైపునున్న కిటికీదగ్గర ఎవరో వున్నట్టు అనుమానం కలిగింది. చప్పుడు కాకుండా తిరిగిచూశాను. శారద! కిటికీలోంచి బయటకు చూస్తోంది. ఆమె తల్లోవున్న మల్లెపూలు పరిమళాన్ని వెదజల్లుతున్నాయి. శారద నాలుగైదుసార్లు నన్ను పూలు తెమ్మంది.

'నువ్వే తెచ్చుకోకూడదా?' అనడిగాను నాకు లోపల బాధగానేవుంది. భర్తను వదిలేసింది. ఇంకా పూలకోసం పాకులాటెందుకు?

'ఫోర్టులో మంచివి దొరకవు. మీ కాలేజీకి దగ్గరున్న మార్కెట్టులో అప్పుడు కోసినపూలు దొరుకుతాయి' అని సమాధానం ఇచ్చింది.

ఈ మాటలంటూ శారద విసిరిన చిరునవ్వు నేను ఎనలైజ్ చేసుకుంటే నాకు భయం వేసింది. నా నిర్ణయం సరైంది కాకపోవచ్చు. అయినా శారద తన భావిజీవితాన్ని గురించి ఏమని నిర్ణయించుకున్నట్టు? ఆ ప్రశ్న అడగాలనుకున్నప్పుడు నాలుక చివరదాకా వచ్చి ఆగిపోయేది. ఆఖరుకు మా బిల్డింగులో వున్న వాళ్ళందరికీ పూలు తెచ్చేవాడితో తనకూ కూడా తెచ్చేట్టు ఏర్పాటు చేసుకుంది.

శారద లైటు వేసింది.

'మీకు నిద్ర పట్టలేదని నాకు తెలుసు...అంతా నటన! చిత్రం! గంటక్రితం గుర్రు కూడా పెట్టారు!' అంటూ గో జడను ముందుకు లాక్కుంది.

'ఆ బాధ అనుభవించేది నువ్వు! నాకేలాంటి మానసికబాధలూ లేవు...వెళ్ళి పడుకోరాదూ! నిశిరాత్రి దాటింది. రేపు టైపుమిషనుముందు కునికిపాట్లు పడతావు'

ఈమాటలంటున్నానుకానీ నా దృష్టి శారద చీరమీద వుండిపోయింది. సాయంత్రం సాదారంగు నేతచీర కట్టుకున్నట్టు జ్ఞాపకం. ఇంతట్లో గులాబీరంగు వాయిల్‌లోకి ఎప్పుడు మార్చిందీ ఎందుకు మార్చిందీ అర్థంకాలేదు. 'మగవారంతా స్వార్థపరులు. అవసరం తీరాక మర్చిపోతారు. క్షణానికో బుద్ధి.

అయినా నేను వుద్యోగం మానేసినా మీరు పొమ్మంటారేవిటి?' ఈసారి నాముందువచ్చి నిలబడి తన ప్రశ్నకు సమాధాన మిమ్మన్నట్టుగా చూసింది.

శారద ఎందుకీమాట లంటున్నదీ నాకు కొద్దిగా అవగాహనైంది. అయినా ముందే చెప్పాను గడచిన జీవితంగురించి తల్చుకోటమంటే నాకు చాలాభయం. ఎవరితోనూ చెప్పను. దీని పర్యవసానం మంచిగా పరిణమించదనీ తెలుసు. అయినా పరిస్థితుల్ని ధైర్యంగా ఎదుర్కోలేను. పిరికివానిలా వెనక్కి పారిపోనూలేను. అది హృదయ దౌర్బల్యం కావచ్చు. బాణాల్లా దూసుకుపోతున్న శారద చూపులు—

అయినా ఒకటిమాత్రం అందరూ అంగీకరిస్తారు అభిప్రాయాలు, నమ్మకాలు స్థిరంగా ఉండవు పరిస్థితుల కనుగుణంగా మారిపోతాయి పదమూడు నెలల క్రితం నాకు స్త్రీ మీద గౌరవం లేకపోవచ్చు ఆట వస్తువుగా భావించి అందిన అవకాశాన్ని జారవిడువక పోవచ్చు—కాని అభిప్రాయాలు—జీవితంమీదుండే దృక్పథం మారటానికి పదమూడు నెలల కాలవ్యవధి చాలదా అని నా అనుమానం.

'అయినా ఆ చీకట్లో అర్థరాత్రి చూడవలసిన సౌందర్యమేముంది?

'మీకు పాతబడిపోవచ్చు. కాని నాకుమాత్రం కొత్తే!' అంటూ శారద లైటుఆర్పేసి పడుకుంది. శారదచెయ్యి నాముఖానికి తగిలింది. అది అనుకోకుండా నే - పొరపాటున జరిగుండాలని నన్ను నేను తృప్తిపర్చుకున్నాను.

ఆ మర్నాడు శారద యథాలాపంగానే వుంది చిత్రమేమిటంటే మా ఇద్దరి హృదయాల్లో రహస్యాలు బోలెడున్నాయి. అవి ఎవ్వరికీ చెప్పలేం సరికదా- మాలో మేమే అనుకోలేం- పక్క నేవున్న జూహూ బీచ్ కి వెడదామని శారద వారంరోజులుగా పోరు పెడుతోంది. ఆదివారం కావటంమూలాన సరేనని బయలుదేరాం.

ప్రపంచంలో వున్న అశాంతిని వెలిగక్కుతున్నట్టు సముద్రపుటలలు ఎగిరిపడుతున్నాయి కొందరు ఆంగ్లో ఇండియన్ అమ్మాయిలు జలక్రీడ లాడుతున్నారు. 'వీళ్ళెప్పుడూ ఆనందంగా వుంటారుకదా!... వీళ్ళకు మానసికబాధలుండవా?' అనేది నా అనుమానం. నిజానికి కొందరిజీవితాల్ని సూక్ష్మంగా పరిశీలించాలనివున్నా అవకాశం చిక్కటంలేదు. శారద ముందుకు వెడుతోంది. ఓచేత్తో చీరతడవకుండా కుచ్చెళ్ళు ఎత్తిపట్టుకుంది కెరటాలు కాళ్ళను చుట్టి వేస్తున్నాయి అంతూ - దరీ లేకుండా పొంగి పొరలి పోతూన్న సముద్రాన్ని చూసేసరికి నాకు భయం వేసిందికూడా! వెనక్కి తిరిగి ఇసకలోకి నడిచిపోయాను. మోచెయ్యి తలగడగా వుంచుకుని పడుకుంది.

'మేష్టారూ!....నాకు జీవితంమీద ఎలాంటి అభిప్రాయంవున్నదీ చెప్పనా?...మీరు వప్పుకోరను కోండి. ఉండేది నాలుగురోజులని పెద్దలే అన్నారు కదా! చేతికందినంతవరకూ ఆనందమనుభవించటమే ఉత్తమ మార్గం అంతేకాని ఆచారాలు - అర్థంకాని పట్టింపులూ - నీతీ న్యాయం - అంటూ గోడలుకట్టుకూర్చుంటే అదో విషాదగీత మవుతుంది. ఒమర్ ఖయ్యాంతత్వం మీరు చదువలేదూ!... మందమతిని. బి. ఏ లో పొయిట్రీకి మీరేగా వస్త! కొన్ని సవరణలు చేస్తే అదే వుత్తమమైనదంటాను. సవ్యాపసవ్యాలు విచారిస్తూ కూర్చుంటే ఆవులించినట్టు కాలం తుర్రుమంటుంది. ఏమంటారు?'

శారదకు చెప్పవలసిన సమాధానంగురించి నేను ఆలోచించలేను. ఈమాటలు బ్రౌనింగ్ వింటే ఏం చేస్తాడని. విపరీతపు టాలోచన మొదలు పెట్టాను నెత్తీ నోరూ బాదుకుంటాడా? అమాంతం ఆ మాటలన్నవాడి మీద విరుచుకుపడతాడా?...... లేక ఆ వాదాన్ని ఖండిస్తూ మరోవంద పేజీలు రాస్తాడా?......

'మాట్లాడరేం?...ఆలోచన తెమిలిందా?' అంటూ లేచికూర్చుని బద్ధకంగా వళ్ళువిరుచుకుంది. తల్లో వున్న ఎర్రరిబ్బను గాలికెగురుతోంది. పసిఫిక్ మహాసముద్రం ఎంతలోతు వుంటుందో మర్చిపోయాను.

'నన్నడిగితే జీవితంమీద దృక్పథం ఏర్పరచుకోవటం అనేది అర్థంలేని వాక్యం. క్షణక్షణానికి అభిప్రాయలు-నమ్మకాలు మారుతూంటాయి. ఇవేళ నీకు దేవుడిమీద నమ్మకం లేకపోవచ్చును. పరిస్థితులు రేపు నిన్ను నమ్మించవొచ్చు 'బిహేవియరిజం' అంటూ ఓ సైకాలజీ వుందన్న సంగతి నువ్వు మర్చిపోయావు'

శారద కలుక్కుమంది.

# చీకటి తెర

'డొంకతిరుగుడుగా వున్నా చక్కగా సెలవిచ్చారు. బసవయ్యగారి బండి సమయానుకూలంగా నడుస్తూంటుందని వెనక ఎక్కడో విన్నాను. మరొకటి చెప్పనా?...సమయానుకూలముగా రూల్సు మార్చబడును. కాంప్లిమెంటరీలు చెల్లవు' అంటూ విరగబడి నవ్వింది. కళ్ళు సగం మూతపడి ముఖానికింకా అందం చేకూరింది. సూర్యకిరణాలను పంచరంగులుగా విభజిస్తున్న నీటితుంపరల కేసి చూస్తూవుండిపోయాను. ఎక్కడో గనివుందని నలుగురూ అనగానే తవ్వటం మొదలుపెట్టారు కాని అంతు చిక్కటంలేదు.

'నాలో వున్న లోపం చెప్పమంటారా? నాకు బాధ కలిగించినవాళ్లను కాని-నాకు ద్రోహం చేయదల్చుకున్న వాళ్లను కాని, నిలదీసి అడగలేను శంకరం విషయంలో అంతే. ఇద్దరిమధ్యా అభిప్రాయభేదం ఏర్పడగానే అతనన్నాడు: 'అయితే నువ్వు వెళ్లొచ్చు అదైనా నీనిర్ణయంమీద ఆధారపడి వుంటుంది' అని. నేను నిలదీసి జీవితభరణం పుచ్చుకోవలసింది.'

'నమస్కారం మేష్టారూ!' అన్నమాటలు విని వెనక్కి తిరిగి చూశాను. శారద మాటల్లో వున్న లోతుపాతుల్ని గురించి ఆలోచిస్తూ సతమతమవుతున్న నాకు శంకరంరాక మరింత ఆశ్చర్యాన్ని కలిగించింది. అతను వస్తాడని నేనెప్పుడూ వూహించలేదు:

'హలో శంకరం!' అన్నాను 'బాగున్నావా?' అనడుగుదామనుకున్నా పక్కన శారదవుంది. అలా గడుగుతే అతనెలా ఫీలవుతాడో యేమో! పక్కన కూచున్నాడు. శారద ఎటోచూస్తూ దోసిట్లో ఇసిక ఎగరబోస్తోంది. శంకరం రాకను గమనించిందా లేదా? అన్న అనుమానం కూడా కలిగింది ఆమె పరధ్యానం చూస్తే.

'ఎప్పుడు వచ్చావ్ బొంబాయికి?'

'వారంరోజు లయిందండి. ఫోర్టులో మా వేలువిడిచిన మేనమామవున్నాడు. అతను కబురంపితే వచ్చాను. నాకిక్కడ వుద్యోగం కూడా దొరికిందండోయ్!'

శంకరం నేనిదివరకు చూసినట్టే వున్నాడు. ఎటొచ్చీ ఈమధ్య హైరోడ్డు క్రాఫింగు మొదలు పెట్టినట్టున్నాడు. మెడ చుట్టూ సిల్కుమఫ్లరు చుట్టాడు. అతని డ్రెస్సింగులో అది ప్రధానాంశం. తరవాత ఎన్నో విశేషాలు చెప్పుకుపోయాడు. బొంబాయిలో తనకు నచ్చినవీ నచ్చనవీ-గుజరాతీ అమ్మాయిలు బాగున్నారా? మరాఠీ అమ్మాయిలు బాగున్నారా? సబర్బన్ ట్రెయిన్సులో ప్రయాణం చేసేదానికంటే తెల్లవారుజామున బయలుదేరి నడిచి వెళ్ళటం మెరుగన్నాడు.

'శారద వచ్చి రెండు వారాలు కావస్తూంది.' అని అతని సమాధానంకోసం చూశాను అతనది వినిపించనట్టు తన ధోరణిలో సాగిపోయాడు. ఈ మాటలు శారద ముఖంమీద ఎలాంటి మార్పు తీసుకువస్తాయో చూద్దామనుకున్నాను కాని ధైర్యం చాలిందికాదు.

'నాకు తలకాయ నెప్పిగా వుంది. పోదాం పదండి' అంది శారదలేచి నిలబడి

'మరి నేను సెలవు తీసుకుంటానండి. బహుశా నా మాటలు మీకు తలనెప్పిని కలిగిస్తాయి మరోమనవి. ఇది నా ఎడ్రసు మీరు వీలైతే రండి... నేనే వస్తాను లెండి' అంటూ చిన్న కాగితం ముక్క నాకిచ్చి వెళ్ళిపోయాడు. శారద మళ్ళీ కూర్చుంది.

'ఇంతకీ నీ భావిజీవితంగురించి ఏమిటి నిర్ణయించుకున్నావు?' అనడిగాను ఇద్దరికీ సంధి చేద్దామన్న అభిప్రాయం మనసులో వుంది కాని దాన్ని బహిర్గతంచేస్తే శారద విరుచుకుపడుతుంది. 'ఇలాగే వుంటాను...' ఏం? మొగుడొదిలేసిన ఆడది వుందనుకోండి. ఏంచేస్తుంది? చేసుకునేవాళ్లుంటే తిరిగి వివాహం-లోపం వొస్తూందికదూ మీకు? దగ్గర్లో వెలుగున్నా-చీకటిని వెతుక్కుంటూ వెళ్లేవారు సంఘానికి విద్రోహులు...అదీకాక మీరెంత బాధపడుతున్నారో నాకు తెలుసు. నేనిలా మీ దగ్గరుండటం నలుగురిమధ్య మిమ్మల్ని విమర్శకు గురిచేస్తుంది. పోనీ నన్ను తిరిగి శంకరం దగ్గరకువెళ్ళి ఏలుకోమని కాళ్లావేళ్లా పడి బ్రతిమాలుకోమంటారా?'

రెండు వాన చినుకులు మీద పడ్డాయి.

'వర్షం వచ్చేట్టుంది. పోదాంపద-మళ్ళీ బస్సు అందుకోవాలి' అంటూ శారదకు సమాధానం యివ్వకుండా తప్పించుకున్నాను.

శారద వాస్తవికతతో తృప్తిపడేరకంకాదు. ఆమెలో చంద్రగ్రహం, అంగారకగ్రహాల్లో వుండే వింతలు - ఆకాశాన్ని చీల్చే కోరికలు - వున్నాయని

నాకు తెలుసు. కాని అగ్నిపర్వతం బద్దలవటమే ఆలస్యం. దాన్ని అడ్డగించటం అసంభవం-

రెండు రోజులు గడిచాక ఏదో పబ్లిక్ హాలీడే వచ్చింది. శంకరం మా యింటికి రాడని ఎలాగూ తెలుసు. ఆ వుదయమే బయలుదేరి వెళ్లాను

అతను వుండేది కుర్లాస్టేషనుకు దగ్గరగా ఒక్కటే గది. చుట్టూ బోలెడంత మురికి-నీటి సదుపాయంకూడా లేదు నన్ను చూడగానే చదువుతున్న పుస్తకం మూసేశాడు. ఎలక్ట్రిక్ స్టౌమీద అన్నంగామోలు - ఉడుకుతోంది. పక్కమీది పుస్తకం తీసి చూశాను శివానంద సరస్వతి రచించిన పుస్తకం. షెల్ఫ్ కేసి చూశాను- ముందు కనిపించింది భగవద్గీత! పదమూడు నెలల క్రితం అతను సినిమాపత్రికలు - సెక్సు పత్రికలూ తప్పించి మరేవీ చదివేవాడు కాదు. కాలేజీ డిబేట్లలోకూడా వేదాంతం నిజాల్ని కప్పిపుచ్చే మత్తుమందని, కంటికి కనిపించని దేవుణ్ణిగురించి ఆలోచించటం పొరపాటని వాదించేవాడు. నన్ను కుర్చీలో కూర్చోమని తను కాఫీ పెట్టాడు.

'ఈమధ్య చిక్కినట్టున్నావ్?' అన్నాను అతన్ని గమనిస్తూ.

'అవునండి. రెండురోజులక్రితం జ్వరంవచ్చింది. అయినా ఈమధ్య నాఆరోగ్యం బొత్తిగా బాగుండటం లేదండి.'

"కొంతసేపు భగవద్గీత చూస్తూ కూర్చున్నా. శంకరం కాఫీగ్లాసు ముందు వుంచాడు.

'థాంక్స్...సరేకాని నీకు విజయవాడలో చక్కటి వుద్యోగం వుండగా అది వదులుకుని ఇంత దూరం రావలసిన ఖర్మేమొచ్చిందని?'

'మీరన్నీ తెలిసే అడుగుతారు. సరే—కానీండి. అక్కడ నా జీవితం విషాదగీతంలా పరిణమించింది. ఎందుకో ఆ ప్రదేశాలు—ఆయిళ్లు—అన్నీ చూస్తుంటే గడిచిన జ్ఞాపకాలువచ్చి భరింపరానిబాధ కలిగేది. ఇంక దాన్నివదిలి దూరంగాపోయి కృత్రిమజీవితాని కలవాటుపడకపోతే నేనో న్యూరోటిక్ పేషంటుగా తయారవుతానన్న భయం కలిగింది. మా మేనమామ కూడా రమ్మన్నాడు. వచ్చేశాను.'

ఓ నిమిషంసేపు నిశ్శబ్దత తాండవించింది.

'అది సరేకాని ఓచిన్నవిషయం అడుగుతాను చెప్తావా?'

శంకరం నవ్వాడు

'మీరడగబోయే ప్రశ్న నాకు తెలుసు శారదకూ నాకూ మధ్య జరిగిన ఘర్షణగురించి—అవునా?' అవునన్నటు తలూపాను

'క్షమించండి—ఆవిషయం ఇతరులకు తెలియకూడదనుకున్నాం అందుచేత చెప్పలేను' అన్నాడు తలవంచుకుని—

ఇంక ప్రయత్నించి లాభంలేదనుకున్నా.—అసలు నేను పనికట్టుకువచ్చింది అందుకే!

'నీకస్తమానం జ్వరం వస్తూందికదా!...మా యింటికి రాకూడదూ? నిన్నక్కడ చూసేదవరూ? మీ మేనమామ ఫోర్టులో వుంటాడు నువ్విక్కడుంటావు. ఎట్లా ఆదుకోగలడు?'

శంకరం రెండుమూడు నిమిషాలు మాట్లాడలేదు నామాటల్లో వుండే అంతరార్థం అతను వూహిస్తున్నాడనుకుంటాను.

'సరే వస్తానండి నాకంటే అనుభవం వున్నవారు. మీ మాటెందుకు కాదనాలి?...రేపు సాయంత్రానికి సామానుతో దిగుతాను.' మరో అరగంట గడిచాక తృప్తిగా తిరిగివచ్చాను. శారదతో ఆమాటలు చెప్పాను. ముఖం పాలిపోయింది. దాన్ని పైకి కనబడనీయకుండా ముఖకవళికలు మార్చుకని నవ్వింది.

'మీరువెళ్లి చేసుకొచ్చిన ఘనకార్యమిదన్నమాట!...బలంవున్న వాళ్ళదే రాజ్యం—అతనిక్కూడా వండుకునేబాధ తగ్గుతుంది. సుఖపడతాను. మరో పెళ్ళి చేసుకునేదాకా అనుకోండి.'

'ఎవరి పెళ్ళయ్యేదాకా?' అంటూ నవ్వేశాను. శారద కూడా నవ్వింది.

మర్నాడు సాయంత్రం శంకరం సామానుతో దిగాడు. శారద అతనిముందు కాఫీ వుంచింది. ఇద్దరూ గజం దూరంలోవున్నా ఒకరినొకరు చూసుకోటం లేదు శంకరం పెట్టెలోంచి తన పెళ్ళినాటి ఫోటో తీసి గోడకి తగిలించాడు. అతనెందుకలా చేసిందీ నాకర్థం కాలేదు నా సమస్య యిది. శారద కనక తన తప్పిదానికి (ఆమె తప్పు చేసివుంటే) క్షమాపణ చెప్పుకుంటే శంకరం తిరిగి ఏలుకుంటాడా? శారద

# చీకటి తెర

మీద అతని కనురాగం వుందా లేదా? కేవలం పట్టింపు కోసం తన మనోభావాల్ని - ఆత్మను అణచివుంచాడేమో! అందుకే అతన్ని సూక్ష్మంగా పరిశీలించవలసి వచ్చింది. నిజానికి అతనన్న ప్రతీమాటకు - అతని నవ్వుకు - విపరీతార్థాలు కల్పించుకునేవాణ్ణి. రాత్రి భోజనందగ్గర వడ్డించేటప్పుడు కూడా శారదను గమనించాను. పొరపాటునైనా అతనికేసి చూడలేదు

'మేష్టారూ!...ఇంకొంచెం నెయ్యి కావాలి' అన్నాడు నాకేసి తిరిగి శారద నెయ్యి వడ్డించింది. ఆక్షణంలో శారద చిరునవ్వును బలవంతాన వారించుకుని గంభీరంగా వుండటానికి ప్రయత్నిస్తున్నట్టనిపించింది. నాలో విజయచిహ్నాలు తలెత్తాయి కూడా.

నేనెంత వారించినా అతను వినకుండా బయట పడుకున్నాడు. నాకు చాలా బాధకలిగింది 'శంకరం నన్ను నుమానిస్తున్నాడా?' అనిపించింది. అగ్నిసాక్షిగా పెళ్లిచేసుకున్న మొగుడూ, పెళ్లాం, వేర్వేరుగా వుండటం—పరాయివాణ్ణి నేను మధ్యవుండటం—పోనీ వీధి తలుపు తీసివుంచుదామనుకున్నా-దొంగలభయం ఎక్కువ. —అందుకని తలుపు మూయక తప్పిందికాదు. అతను బయట—నేనూ శారదా లోపల—ఛీ...ఛీ...అతనేమనుకుంటాడో! రాత్రి పన్నెండుదాకా నిద్ర పట్టలేదు. శంకరం రెండు మూడుసార్లు కిటికీదగ్గరకు వచ్చి లోపల నే వున్నానో లేదోనని చూసినట్టు అనుమానం కలిగింది. అది భ్రమే కావొచ్చు.

మర్నాడు సాయంత్రం నేను ఆఫీసునుంచి వచ్చేసరికి శంకరం ముసుగు తన్నిపట్టి పడుకున్నాడు. శారద నోమూల కూర్చుని ఏదో నవలగాబోలు—చదువుతోంది.

'ఏమిటి సంగతి?' అనడిగాను శంకరందగ్గరకు వెళ్ళి

'మళ్ళీ జ్వరం వచ్చిందండి—అందుకే నేను వంటరిగా వుండటం మంచిదంటాను వృధాగా మీకు బాధ కలిగించి నామీద మీకున్న అభిమానాన్ని చంపుకుంటున్నాను.' అతని కంఠం అప్పుడే ఐస్ టబ్‌లో మునిగినట్టుగా వుంది.

'అబ్బే...అలాంటిదేం లేదు. జ్వరం అందరికీ వస్తుంది. అంతమాత్రంచేత బాధపడి లాభంలేదు. కాఫీ తాగావా?' నుదుటిమీద చెయ్యివేస్తూ అడిగాను.

'ఊఁ...' అంటూ మూలిగాడు

కిందవాటాలోవున్న డాక్టరును తీసుకువచ్చాను. పరీక్షించి చూశాక మందుసీసా తీసుకురమ్మన్నాడు. రేపటికి తగ్గకపోతే ఇంజక్షను ఇవ్వొచ్చన్నాడు.

ఆ మర్నాడు పొద్దున్న జ్వరం తగ్గినట్టే కనిపించింది. కాని సాయంత్రానికి మళ్ళీ ఎక్కువైంది. డాక్టరు ఇంజక్షనిచ్చిపోయాడు. రాత్రి ఏడుదాటినా శారద రాలేదు. నాకు భయమేసింది. నేను శంకరాన్ని తీసుకువచ్చానని ఎక్కడికైనా పోయిందేమో! ...లేక విసుగెత్తి ఆత్మహత్య చేసుకుందా?....ఛీ.... శారద ఎప్పుడూ అలాని చెయ్యదు మరో పందముంది మగాళ్లను ఏడిపించుకు తింటుంది అదామెకో సరదాయేమో!...ఓనాడు ఫ్లోరా ఫౌంటెన్‌దగ్గర ఓ పడుచు కుర్రాడితో నవ్వుతూ పోతున్న శారదను చూశాను. మరోనాడు వి. టి లో ఆమెకు వీడ్కోలిస్తూ చేతి రుమాలు వూగిస్తున్న మరో యువకుణ్ణి చూశాను. ఇవన్నీ మళ్ళీ కళ్ళయెదుట ప్రత్యక్షమై నన్ను కలవరపరిచాయి

శారద ఇల్లు చేరుకునేసరికి ఎనిమిదైంది. రాగానే విసుగ్గా హేండ్‌బాగ్ టేబిలుమీద విసిరికొట్టింది.

'ఆలస్యమెందేం?' అనడిగాను. అడగటానికి హక్కు లేకపోయినా—

'ఆ...మేనేజరుకీ నాకూ మధ్య ఘర్షణ—ఫలితం—నా వుద్యోగానికి రాజీనామా యిచ్చేయటం; హేండ్ డెలివరీ-' అంది.

శారద ఇదివరకోమాటు అననే అంది. తను ఉద్యోగం మానేస్తే నేను పోషించకుండా వుంటానా అని—

మరో వెర్రినమ్మకం కూడా కలిగింది. శంకరానికి సపర్యచేసి అతని అనురాగాన్ని తిరిగి పొందటానికోసం—మధ్య అడ్డంకుగా ఉంటున్న ఈ నౌకరీని కావాలనే వదుల్చుకుందా?....ఇక్కడ శారదే శంకరంతో పోట్లాడిందని. శంకరం నిరపరాధని నేనెందుకనుకుంటున్నానో తెలియదు బహుశా అది సహజతత్వం కావచ్చు.

'ఏమిటా ఘర్షణ?'

'ఏముంది? పడుచుపిల్ల కనపడగానే నోటికి తొందరైపోతుంది మగవాళ్లకు ఒక్కోరకం భావం

స్ఫురిస్తుంది. అంతే—ఇంక దాన్ని వ్యాఖ్యానించమని నన్నడక్కండి.'

'అడిగాను కాని జార్జి తీసుకువచ్చాను. అతనికొంత జావ కాచివ్వగలవా?'

'నాకంటె ముందు వచ్చారుకదా!...స్టౌ వెలిగించలేకపోయారా?' అంటూ వంటింట్లోకిపోయింది. శారద సమాధానం విన్నాక కొద్దిక్షణాల క్రితం నాకు స్ఫురించిన అభిప్రాయం సరైంది కాదేమో ననిపించింది.

శారద రాజీనామా చేసినందుకు ఒకవంక సంతోషంగా వున్నా మళ్ళీ ఉద్యోగప్రయత్నం చేస్తుందని మరోవంక బాధగావుంది. కొంచెం ఇంచుమించు శారద నాతోపాటే ఆఫీసుకువస్తుంది. నాకంటె పావుగంటముందుగా తిరిగి వస్తుంది. అందుచేత వాళ్ళిద్దరూ తమతమ పొరపాట్లను సరిదిద్దుకోటానికి - ఒకరొన్నొకరు అర్థంచేసుకోటానికి అవకాశం లేదనుకుంటూ - ఇప్పుడా పరిస్థితులు దైనికంగావచ్చాయి.

మర్నాడు పొద్దున్న పక్కవాటాలో వున్నాయన నన్నుపిలిచి శారదగురించి - శంకరంగురించీ అడిగాడు. మంచివాడు కనక నిజం చెప్పాను. నాగురించి ఆ బిల్డింగులో వున్నవాళ్ళు ఏమనుకుంటున్నదీ ఆయన వివరించాడు. నేను వ్యభిచారిననీ - శారదను నేనే తీసుకువచ్చానని చిలవలుపలవలుగా కథలల్లి చెప్పుకుంటున్నారట అయితే నేం?......ఆ చుట్టుపక్కల వున్నవాళ్ళందరిదగ్గరా సత్యనారాయణ పూజకి చందా వసూలు చేసేటప్పుడు నాదగ్గరకూడా వచ్చారు. నేను రూపాయివ్వగానే నన్ను చాలాపొగిడారు. నాకు దైవచింతె ఎక్కువని-పూజకూడా వచ్చి దాన్ని విజయవంతంగా నిర్వహించవలసిందని క్రిందవాటాలోవున్న మరాఠీ ఆయన ప్రశంసించాడు. మానవనైజంమీద అల్లిబిల్లిగా అల్లుకుంటున్న అభిప్రాయాలు ఇప్పుడు సరైనతోవలో పడ్డాయి రూపాయిస్తేచాలు - ఎంతైనా గౌరవాన్ని - ప్రశంసల్ని అందుకోవచ్చు. అయిదు రూపాయలు - కాదు వంద రూపాయలిస్తే? అమ్మో! అప్పుడు పొగడ్తలకు అసలు తట్టుకోలేం.

'నేనుకూడా మిమ్మల్ని నమ్మలేకపోతున్నాను. సుమండి - మానవతత్వం అలాంటిది. ఏమీ అనుకోకండి- అంతమాత్రంచేత మీమీద నాకు విరోధంకాని - చెడు అభిప్రాయంకాని లేదుసుమండి.' అన్నాడాయన.

'అది సరేకాని మీరు నాకోచిన్న ఉపకారం చెయ్యాలి. వాళ్ళిద్దరూ ఎడమొహం పెడమొహంగా వున్నారు. నేనులేనప్పుడు ఏమైనా మాట్లాడుకుంటున్నారేమో గమనించండి. నాకూడా యిది మిస్టరీగా వుంది' అన్నాను. ఆయన సరేనన్నాడు.

శంకరానికి వచ్చినజ్వరం మలేరియా అయ్యుంటుందని డాక్టరు సూచించాడు. విపరీతంగా జ్వరం లేనప్పుడు శంకరం సరదాగా మాట్లాడేవాడు.

'జ్వరంవచ్చిందికదా అని నాకెంతమాత్రం భయం లేదండోయ్ అది శరీరాన్ని - ఆత్మను పవిత్రం చేస్తుంది. అందుకే దాన్ని నేనాహ్వానిస్తాను' అంటాడు. అతనికి మందివ్వటం - జావకాచివ్వటం - నారింజరసం పిండివ్వటం - అంతా శారదే చూసుకునేది వాళ్ళిద్దరూ ఎప్పట్లాగే వుంటున్నారని పక్కింటాయనన్నాడు. భవిష్యత్తుమీద నమ్మకం లేకపోతే బతకలేం - మనం తల్చుకున్నది, అనుకునేది జరగదని అసంభవమైనదని తెలిసినా ఆ అభిప్రాయాల్ని వదిలించుకోలేం - నెత్తిమీద పిడుగుపడుతున్నా పడకపోవచ్చుననే వెర్రిపూహ చివరిదాకా వుంటుంది. నీటిలో మునిగిపోతున్నవాడికి గడ్డిపరక దొరగ్గానే పట్టుకుంటాడు, అది తన్ను రక్షిస్తుందని కొనవూపిరిలాంటి ఆశ. నాపరిస్థితికూడా అలాగే వుంది.

నాలుగు రోజులు గడిచాక జ్వరం తగ్గింది. కొద్దిగా నడవటం మొదలెట్టాడు డాక్టరు అది మలేరియా కాకపోవచ్చునన్నాడు. మరో మూడురోజులు గడిచాయి

సాయంత్రం నేనురాగానే పక్కింటాయన పరుగెత్తుకొచ్చాడు. తలుపులు మూసివున్నాయి.

'ముందిలారండి...' అంటూ తనవాటాలోకి తీసుకుపోయాడు.

'వాళ్ళిద్దరూ ఇవేళ పోట్లాడుకున్నారు. కారణం సరిగ్గా అర్థంకాలేదు. శంకరం మీగురించి ఏదో అసందర్భంగా పేలాడనుకుంటాను. అదైనా అతను ఇంగ్లీషులో అనటంవలన నాకు తెలిసింది. ఆ అమ్మాయి నతను పాచిపెట్టి కొట్టాడు.' ఆయనకు గుజరాతీ తెలుసు

కాని తెలుపరాదు. ఆయనకు అభివందన చెప్పి తలుపుతట్టాను: శారద తలుపుతీసింది. శంకరం మంచం మీద కూర్చున్నాడు. శారద రెండుకళ్ళూ ఎర్రగా వున్నాయి

'ఏంజరిగింది?' అనడిగాను, చుట్టూ పిశాచాలు నృత్యంచేస్తున్నట్టుంది నాకు శారద మాట్లాడలేదు.

'మా యిద్దరిమధ్యా వాదనరేగింది. నేను ఉద్రేకాన్ని ఆపుకోలేక ఆమెను దవడమీదకొట్టాను.' అన్నాడు.

'దీనికంతా మీరే కారకులు— నేను వదలించుకు వద్దామనేవచ్చాను ఇంక నేనే.ఎవరికీ తెలియనిచోటుకు పోతాను' అంది శారద ఈ అపవాదును ఖండించినా ప్రయోజనం వుండదు. జరగాల్సిందెలాగూ జరిగింది. దీంతో అటోయిటో తేల్చేయడం మేలనుకున్నాను. నాకున్న అధికారంతో శంకరాన్ని నిందించాను.

శంకరం లేచి నిలబడ్డాను.

'మేష్టారూ...మీ దారికి నేనడ్డురాను. కాని మీరు వృథాగా అందర్నీ బాధపెట్టేదానికంటే మీ మనసులోవున్నట్టు చేయండి. మా యిద్దరిమధ్యా విరోధం ఎందుకు కలిగిందో కూడా చెప్తాను శారద నన్నెప్పుడూ ప్రేమించలేదు. శారద మిమ్మల్ని ప్రేమించింది. మీకూ ఆమెమీద అనురాగం వుందన్న సంగతి నాకు తెలుసు కాని మా పెళ్లి జరిగేటప్పటిది నాకు తెలియదు. మా పెళ్ళికి పూర్వం మీకూ శారదకూ వున్న సంబంధం నాకు తెలుసు మీరు శారదను కన్యగా వుంచలేదనీ నాకు తెలుసు. అది శారదకూడా వొప్పుకుంది. అనురాగం లేని యిల్లాలుతో నాకు ప్రమేయంలేదు జరిగినదంతా పీడకల. ఈ మాటు శారదను ఇదివరకటిమల్లే ఉపయోగించుకోకుండా పెళ్ళిచేసుకోండి. రిజిష్టర్ మేరేజీ పెద్దవారు. మీకు నా సలహా అనవసరం—' శంకరం మొహం అటు తిప్పుకున్నాడు.

నా కాళ్ళకింద భూమి చీలిపోతున్నట్టనిపించింది. అయితే శంకరం నిజం కనుక్కున్నాడన్న మాట... పెళ్ళికాని ఆనందాన్ని వంచించిన నన్ను అథముడిగా తూచి మాట్లాడాడు. ఇంకెందుకు? నేను ఎన్నో విధాల దాన్ని అణచివుంచాలని ప్రయత్నించాను. మీరు కూడా శంకరం ఈ రహస్యం బయట పెట్టేవరకూ నామీద సదభిప్రాయం కలిగివుంటారు. నీతికి భయపడేవాణ్ణని, సంఘం నన్ను వృథాగా కష్టపెడుతోందని అనుకునివుంటారు. మొదట్లో నే చెప్పా. గతంలోకి వెళ్ళటం నాకు భయమని. శంకరం నా నెత్తిన ఈ పిడుగుపడ వేయకుండా వుంటే నా కథ—నా సత్ప్రవర్తన మీరు నమ్మివుందురు కాని కథ అడ్డం తిరిగింది...శారదకేసి చూశాను. ఏవీ మాట్లేదు. గుజరాతీ ఆయన బయట నిలబడి ఏవీ అర్థంకాక అయోమయంగా చూస్తున్నాడు. 'రెబెకా' లోని ఘట్టం జ్ఞాపకమొచ్చింది. ఫేవెల్ 'నువ్వు ఖూనీ చేశావు' అన్నాడు: మాక్సిం ఇరకాటంలో పడ్డాడు..

శంకరం పగలబడి—విరగబడి నవ్వుతున్నట్టనిపించింది. శారద యిదివరకు విసరిన చెణుకుల కర్థం ఇప్పుడు సరిగ్గా అవగాహనవుతూంది. నాకు పాత అనుభూతులు పాతబడిపోయినా తనకు కొత్తేనట! ఆ రాత్రి శారద కావాలనే తన చెయ్యి నాముఖానికి తగిలించిందేమో! తిరిగి నాలో అవినీతిని రగుల్కొల్పటానికి. మైలురాయిలాంటి అభిప్రాయాలనైనా మార్చటానికి పదమూడు నెలల అవధిచాలు! ఫోర్టులో మల్లెపూలు మంచివి దొరకవు!...అందుకని నేనే తేవాలి.

ఘటుక్కున నాకో ఆలోచన తట్టింది. అది పారితే అపవాదంతా శంకరంమీదికి తోసేయవచ్చు. నేను నిర్దోషినవుతాను. కాని అది కూడా ఇంకెవరూ నమ్మరు—వృథా ప్రయత్నం

మళ్ళీ శంకరం అట్టహాసంగా నవ్వుతున్నట్టనిపించింది.

# "కుక్కపిల్ల దొరికింది"

శ్రీ రావి కొండలరావు

పాత్రలు: చిదంబరం. సీను, అబ్బాయి, కంట్రాక్టరు, కోదండం, చతుర్భుజం.

* * పరిశుభ్రంగా అలంకరించబడిన ఒక గది. ఒకమూల టెలిఫోను వున్నది. గోడకు ఎదురుగా పటాలు, కాలెండర్లూ వున్నై. కాలెండరుకు దిగువగా కుక్క వున్నది జాగ్రత! ("Beware of dog") అనే బల్ల వ్రేలాడుతు న్నది. తెర లేచేసరికి స్టేజిమీద మనుషులెవరూ లేరు. కాస్సేపటికి టెలిఫోన్ మ్రోగింది. ఇంట్లోంచి నౌకరు 'సీను' అనే కుర్రాడు వచ్చాడు. వచ్చి ఫోనుతీసి:

సీను : ఎవరండీ...ఆఁ...అయ్యా లేరండి...అవు నండి....అయ్యగారు లేరు ... తెలీదండి... తెలీదండి... ఏదీ తెలీదండి .... (కాస్సేపు విని, కుక్కపిల్లకు అన్నంపెట్టే ఒక గిన్నె ఒకమూలవుంటే వెళ్ళి దానికేసి దీనంగా చూస్తున్నాడు. ఫోను మళ్లీ మ్రోగింది. (సీనువెళ్ళి తీసి) ఎవరండీ?... నే నేనండి ... అయ్యా-అయ్యగారూ తమరా!...ఎక్కడ నుంచి మాట్లాడుతున్నారు? .... ఈ ప్రక్క నుంచే!...చిత్తం దొరక లేదండి...లేదండి తమరు రండి...తమరు రావాలంటాను ... మాటిమాటికీ తమరట్లా 'దొరికిందా దొరి కిందా' అంటే ఎట్లా?...ఐదునిమిషాలకింద టేగా అడిగారు—అవును అడిగారు లేద న్నాను...అవునండీ లేదన్నాను ... చిత్తం (విసిగిపోయినట్టు తపీమని పెట్టాడు. అటూ ఇటూ చూసి గబంతా సర్దుతున్నాడు. బయటనుంచి కాస్సేపటిలో యింటి యజ మాని చిదంబరం హడావుడిగా వచ్చాడు. 50 సంవత్సరాల ప్రాయం. సూటు వేసు కున్నాడు. వస్తూనే నెత్తిమీది టోపీ తీసి బల్లమీద విసిరాడు)

చిదం : అబ్బబ్బబ్బ...రామచంద్రా...శ్రీ రామచం ...(ఆగి, గోడకు తగిలించివున్న "Beware of dog"బోర్డుకేసి చూసి) ఈబోర్డు ఇక్కడ తగిలించడంలో నీ వుద్దేశం? (ఆగి, చూస్తూ) ఈ బోర్డు ఇక్కడ తగిలించటంలో ఏమిటి నీ ఉద్దేశమూ అని అనుగుతున్నాను— చెప్పు సమాధానం - చెప్పూ!

సీను : ఉద్దేశం ఏముంటుందండీ?

చిదం : ఈబోర్డు 'ఇక్కడ' ఎందుకు తగిలించావురా వెర్రిపీనుగా?

సీను : ఊండిపోయిందిగదా అని—

చిదం : అంతేనా?

సీను : అంతేనండి!

చిదం : అంతే గద!...ఇంతకూ, దాని అర్థంఏమిటో నీకు తెలుసా? అదే - ఆ బోర్డుమీద వున్న ఇంగ్లీషు అక్షరాలలోని గూఢార్థం? (సీను తెలీదని తల వూపబోగా) 'తెలీదని' తల వూపక్కర్లేదులే—నాకు తెలిసిందిలే నీకు తెలీదని! "ఇక్కడో కుక్క వుంది-జాగర్త!" అని దాని అర్థం. దాని అర్థం నీకు తెలీదు కాబట్టి—ఆ బోర్డు ఇక్కడ కట్టినందుకు వూరుకుంటున్నాను. లేకపోయినా "ఇక్క

డోకుక్క వుంది - జాగ్రత్త" అనే బోర్డు తెచ్చి ఈ గదిలో పెడితే మనిద్దరిలోనూ ఆ కుక్క ఎవరం అని నీ అభిప్రాయంరా? ...మాట్లాడకు ... మాట్లాడకుండా దాన్ని అక్కడనుంచి తీసెయ్యి ... అసలెందుకు తెచ్చిపెట్టావు దాన్నిక్కడ?

సీను : అర్థం తెలీక నేనండి... తెలిస్తే లోపల మీ గదిలో నే వుంచేసేవాడిని కదండీ!

చిదం : నాగదిలో ఉంచేవాడివా—లేక గోడకు వేలాడగట్టేవాడివా?

సీను : రామ రామ! అర్థం తెలిసిన తర్వాత ఇప్పుడెందుకు చేస్తానండీ ఆపని?

చిదం : ఇంతకుపూర్వం ఐతే అదికూడా చేసేవాడివే నన్నమాట!

సీను : అనుకున్నానండీ మీగదిలో నే పెట్టేస్తే జాగ్రత్తగా వుంటుందిగదా అని—

చిదం : ఏడిశావ్ గాని—దాన్నితీసి బల్లక్రింద పెట్టు పెద్దమనుషు లెవరన్నా వస్తారు. (సీను తియ్యటానికి పోబోతున్నాడు) ఆబోర్డును అసలు అక్కడనుంచి ఎందుకు కదిలించావ్?

సీను : కుక్కపిల్ల లేదుకదా దాని బోర్డుమాత్రం ఎందుకని?

చిదం : అటువంటప్పుడు తెచ్చి పడెయ్యక గోడకు ఎందుకు తగిలించావ్?

సీను : పోనీ ఏదో పటాలమాదిరి అదీ వుంటుంది కదా అని—దానికీ వేలాడతియ్యటానికి తాడొకటివుంది మరీ—

చిదం : సరే, తీసేయ్. (సీనుతీసి బల్లమీద పెట్టాడు) బోర్లించు. (బోర్లించాడు) దానిమీద ఏదన్నాకప్పు. (అటూయిటూ చూసి సీను కొత్త వార్తాపత్రిక తెచ్చి కప్పబోయాడు) ఉండుండు—అట్లా కప్పితేనే అనుమానం. ఒకటిచెయ్యి—టేబిల్ క్లాత్ క్రింద పెట్టు సరిపోతుంది. (సీను టేబిల్ క్లాత్ క్రింద పెట్టాడు) ఏదో ఎత్తుగావున్నట్టు కనుపిస్తోందిరా. నామాట విను. ఇక్కడినుంచి లోపలకు తీసుకుపోయి- నాగదిలో—నాగదిలో వొద్దు—అవతలగదిలో పడేయ్—జాగ్రత్త. దానిఅవసరం ఐపోలేదు. (సీను వెళ్లాడు. చిదంబరం కోటు తీసేసి చిరాగ్గా కూలబడ్డాడు. సీను వచ్చాడు) ఏమయిపోయిందిరా మన కుక్కపిల్ల? దొరకనట్టే? ఇల్లంతా చిన్నబోయిందిరా—ఎంత ముద్దు! నన్ను చూస్తే ఒక్క నిమిషం వదిలేదికాదు. యెంత దూరంలోవున్నా ఇట్టే ఆనవాలుపట్టి, తోక వూపేది... నేను బిస్కట్లు తీసుకురాకపోతే వెధవకెంత కోపం- పాపం...ఎక్కడుందో ....ఏమయిందో!

సీను : విచారించకండిసార్! మన కుక్కపిల్ల మనకు దొరికితీరుతుంది. కాని—అది లేకపోతే నాకేం తోచటంలేదుసార్! (అమాయకంగా) ఎంత మంచి కుక్కపిల్లసార్ అది! ఎవ్వర్నీ ఏమీ అనేదికాదు. దొంగల్ని చూసినా ఎంతసేపూ అరిచేదేకాని కరవటానికి దానికి నోరే వచ్చేదికాదు సార్...అరిచేకుక్క కరవదంటారని—అరుపు తగ్గిద్దామని ఎంతో ప్రయత్నించాను. అరుపు తగ్గించేది! ఐతే 'ఒకర్నికరిచి బాధిస్తానా' అన్నట్టు నోట్లో చెయ్యిపెట్టినా విడిలించుకుని పారిపోయేది!

చిదం : సీనూ! ఆకుక్కపిల్ల మనకు ఎట్లావచ్చిందో తెలుసురా నీకు?

సీను : తెలీదుసార్!

చిదం : చెబుతావిను. బెంగుళూరునుంచి వస్తూంటే ఆమధ్య ఒకస్నేహితుడు నాకు బహూకరించాడు. అంతకుపూర్వం కుక్కపిల్లకోసం తెగ ప్రయత్నించాను. చిన్నప్పట్నుంచీ కుక్కపాతాలు తెగచదవటంవల్ల, కుక్కలమీద బాగా మక్కువకలిగింది. ఏంచేస్తాం? మానాన్నగారికి కుక్కలంటేకోపం-భయం! ఎంచాతంటే ఆయన తండ్రిగారు కుక్కకాటువల్ల చచ్చిపోయారట. ఆభయంవల్ల మా నాన్నగారు ఇంట్లో కుక్క 'బొమ్మ'ను కూడా వుంచేవాడుకాదు. గ్రామఫోను పాటలకోసం రికార్డులుకొంటే "వెధవా ఈ 'హిజ్ మాస్టర్స్ వాయిస్' రికార్డులు కొనవద్దని చెప్పానా లేదా" అంటూ అవన్నీ తీసుకెళ్ళి బయట పారేశేవాడు. నీళ్లుపోసి-

ఆబొమ్మను వూడదీసి రికార్డులు ఇంట్లోకి తెచ్చుకు నేవాడిని. వీధిలో కుక్క అరుస్తే నౌకర్ని పంపి ఆకుక్కను వూరవతలిదాకా తరుముకుపోయొచ్చి ఇంట్లో కాలు పెట్టను నేవాడు! అంత చాదస్తపుమనిషి! నాకా చాదస్తమూ లేదు. భయమూ లేదు సరికదా— అదేమిటో ఆయన 'వద్దు' అంటున్నకొద్దీ నామనస్సు కుక్కలమీదికేపోయేది! "కుక్క విశ్వాసంగల జంతువు" అనేమాట నా మెదడులో ఎప్పుడూ పనిచేస్తూవుండేది. అంచాత- బెంగుళూరునుంచి వస్తున్నప్పుడు నా స్నేహితుడిని ఆ కుక్కపిల్లను నాకు బహూకరించమన్నాను. ఆ బహూకరణతో పాటు ఓ కాయితం కూడా యిచ్చాడు. "ఆకలి వేస్తున్న కుక్కకు అన్నం పెడితే అది నిన్ను కరవదు—కుక్కకూ మనిషికీ వుండే పెద్ద భేదమల్లా ఇదొక్కటే!" అని 'మార్క్ ట్వేన్' అనే మహానుభావుడి కొటేషన్ ఆ కాయితంమీద రాశాడు. ఎంత మంచివాక్యం అనుకున్నావు...ఆ కాయితం మాత్రం పెట్లో మిగిలిపోయింది

సీను : ప్చ్...ఏం చేస్తామండీ—ఖర్మ!

చిదం : కర్మమిట్టా నీ మొహం! (ఆగి) అసలు నువ్వే కారణం అది పోవటానికి—

సీను : నేనాండీ?

చిదం : అవును నువ్వే. ఆ కుక్క కోసం దానిపోషణ కోసం నిన్ను ఏర్పాటు చేశాను—దానికి తల్లీ తండ్రీ అన్నీ నువ్వే అనుకోమని చెప్పాను—'వూఁ వూఁ' అని దాన్ని వొదిలేశావ్!

సీను : నాకు తెలీదు సార్! తెలిసి తెలిసి ఎందుకొదిలేస్తానండీ?

చిదం : వెధవా—ఇరవై నాలుగ్గంటలూ దాన్ని నువ్వు కనిపెట్టుకుని కూచోవద్దూ?

సీను : అది మన ఇల్లు కాయాలని వీధిలో వుంచారు. దాన్ని కాస్తూ నేనూ అక్కడే కూచోనా?

చిదం : ఏం—నువ్వు వెధవపనులు చెయ్యకుండానూ పారిపోకుండాను నేను నిన్ను కాస్తున్నాను కానూ?...ఐనా నిన్ను అనేం లాభం? నీ వంటి తెలివితక్కువ దద్దమ్మను నౌకరీగా వుంచుకున్నందుకు నా బుద్ధిననాలి!...... అసలు ఎట్లా పోయిందిరా కుక్కపిల్ల?

సీను : నేను చూడలేదు సార్!—మొన్న రాత్రి మామూలుగానే అన్నం తిన్నది.

చిదం : సరిగ్గానే తినేసిందా?

సీను : మరి కాస్త ఎక్కువపట్టే పట్టింది- ఎట్లాగూ పోతాను కదా అని. అన్నంతిన్నాక గొలుసుతో స్తంభానికట్టాను. మామూలుగా నేను నిద్రపోయాను సగం రాత్రికే లేదు! గొలుసుమాత్రం వుండిపోయింది.

చిదం : ఆ గొలుసు ఓసారి తీసుకురా. (సీను లోపలికి వెళ్లి గొలుసు తెచ్చాడు చిదంబరం పరీక్షగా చూసి) గొలుసు కొరుక్కుని పారిపోలేదు...విప్పేసి వుంది. అంటే ఎవరో విప్పేశారన్న మాట! నువ్వసలు మెడకు గట్టిగా కట్టావా?

సీను : గట్టిగానే కట్టానండీ—ఇంకాస్త బిగిస్తే గుటుక్కుమనేటంత గట్టిగా కట్టాను

చిదం : ఐనా పారిపోయింది—ఏ దొంగ వెధవో ఎత్తుకుపోయాడు! దాని మానాన అది పోయి ఉంటుందని నేను అనుకోను. నిన్న పత్రికల వాళ్లకు ప్రకటన ఇచ్చాను. పోలీసు స్టేషన్లో గంటసేపు కూచున్నాను-ఊరంతా వెతికాను: కనిపించిన స్నేహితులందర్నీ అడిగాను- మాకు తెలిసంతవరకు తెలిసినవాళ్లే గాని 'మాకాం' అని ఒక్కడైనలేదు—ఇంకెందుకూ వెధవ స్నేహితులు?

సీను : పోలీసులు ఏమన్నారండి?

చిదం : నీ మొహం అన్నారు. 'మీ కుర్రాడిచాత వెదికించండి' అన్నారు. నువ్వు వెతికి దాన్ని వాళ్లకు వప్పజెప్తే—అప్పుడు నా చేతికిచ్చి 'మేమే పట్టుకున్నాం' అని గొప్పగా చెప్పకోటానికి కాబోలు! "మీ కుక్క ఏదన్నా దొంగతనం చేసిందా?" అని వో పోలీసు అడిగాడు. 'లేదు' అన్నాను. 'ఐతే మాకేం సంబంధం లేదు—దొంగతనం చేస్తే ప-

కనే బాధ్యత మాది' అంటాడు. ఇంకోడు- 'ఎవర్నైనా చంపి పారిపోయిందా?' అంటాడు. నా మొహం! అది కరవనే కరవ దంటున్నావు నువ్వు! అది దొంగతనం చేసి పారిపోయుంటేనూ, ఎవర్నైనా హత్యచేసి పారిపోయుంటేనూ వాళ్లు నిమిషాలమీద వెళ్ళి పట్టుకుని ఉందురట! "మోసగాళ్ళను కూడా పట్టుకుంటారు కదా మీరు!" అనడిగాను. "ఓ" అన్నారు. ఐతే నా దగ్గర నమ్మకంగా వుంటూ, నన్ను మోసం చేసి ఓ కుక్కపిల్ల పారిపోయింది......పట్టుకో మన్నాను నన్ను చూసి వాళ్లంతా ఒకటే నవ్వు! "కుక్కపిల్లల్నికూడా మేమెక్కడ వెతగ్గలం?" అంటాడు ఒకడు. నాకు వళ్లు మండి—"కుక్కపిల్లను వెతికి పట్టుకోడం కూడా మీకు చాతకాదు—పోండి" అని వాళ్లి మొహం మీద అనేసి పారిపోయొచ్చాను.

సీను : మీ వెనకాల పరుగెత్తి రాలేదు సార్ పోలీసులు?

చిదం : ఏమో! గభాలున ఆ పక్కనే ఓ సందుంటే అందులో దూరిపోయాను.

సీను : మంచిపని చేశారు సార్! లేకపోతే ఏమయిపోయారోనని మిమ్మల్నికూడా వెతుక్కునే స్థితికి వచ్చేవాడిని!

చిదం : నిన్న రాత్రంతా ఒకటే కల! దాన్ని ఎవరో ఎత్తుకు పోయినట్టూ, కొడుతున్నట్టూ! పెద్ద పెద్ద కుక్కలన్నీ దాన్ని కరుస్తున్నట్టూ! అబ్బ—భయం వేసిందిరా!......పాపం... ఇప్పు డెక్కడుందో, ఏం చేస్తోందో... చిన్న వెధవ...ఎవడైనా తిండి పెడుతు న్నాడో లేదో—'కుంయ్ కుంయ్' మని మూలుగుతుంది గాని మాటాడలేదు కదా—నోరులేని జీవం!

సీను : సార్! ఆమధ్య మీ స్నేహితుడొకాయన అడిగారు కదండీ?

చిదం : అవును అడిగాడు—అతను మంది అడిగారు.. ఏం?

సీను : ఆయనగాని...

చిదం : ఆఁబ్బే. కుక్కను ఎవడు ఎత్తుకుపోతాడ్రా? ఈ యింట్లో దానికి స్వాతంత్ర్యం లేదనో, ఇక్కడ సుఖంలేదనో అర్థరాత్రివేళ పారిపోయుంటుంది. ఎవరికన్నా దొరకదా?... అన్నట్టు పత్రికలో ప్రకటన వేశారా?

సీను : వేశారు సార్—మీరు రాగానే చూపిద్దామనుకున్నాను—మరిచేపోయాను (పత్రిక తెచ్చి యివ్వబోయాడు)

చిదం : నువ్వే చదువు

సీను : (చదువుతూ) "కుక్కపిల్ల కనబడుటలేదు. తెల్లని రంగూ, కోలముఖమూ, కుచ్చువంటి పొట్టి తోకగల కుక్కపిల్ల కనబడుటలేదు. మెడలో తోలుపటకా యున్నది వెతికి తీసుకు వచ్చిన వారికి నూటపదహారు రూపాయలు బహుమానమిచ్చెదను జి డి యస్. చిదంబరం..."

చిదం : (ఆపుతూ) ఏమిటేమి టేమిటి.....మళ్ళీ చదువు (సీను మళ్ళీ చదివాడు. చిదంబరం జాగ్రత్తగా విన్నాడు). 'కుక్కపిల్ల కనబడుటలేదు—'మళ్ళీ చదువు—(సీను గడగడా చదివి, చిదంబరంకేసి చూసి మళ్ళీ మొదలెట్టబోయాడు.) చాలుచాలు—మరి చదవఖర్లేదు—ఆ ప్రకటన చాలు. నూటపదహారురూపాయల బహుమతికోసం ఎవడైనా వెతుకుతాడు!

సీను : కుక్కపిల్ల ఖరీదు అందులో నాలుగోవంతు వుంటుందా సార్?—

చిదం : పోరా వెర్రిమొహం—నూటపదహారు కాదు—రెండు నూటపదహార్లిస్తే మాత్రం అటువంటి కుక్కపిల్ల మనకు మళ్ళీ ఎక్కడ దొరుకుతుంది?—మన అడ్రసంతా 'క్లియర్'గా వుందా పేపర్లో?

సీను : వుంది సార్.

చిదం : చూదాం—నాలుగు రోజులు ఓపికపడదాం......కాస్త కాఫీ తీసుకొచ్చి యిస్తావూ?

[సీను లోపలకుపోయి ఫ్లాస్కు, గ్లాసు తెచ్చి కాఫీ పోస్తున్నాడు.]

సీను : నిన్నట్నుంచీ కాఫీమాటే మరిచిపోయారు సార్ మీరు.

చిదం : నిన్నట్నుంచీ ఆ కాఫీ అందులో నే అట్లా వుందా యేమిటి?

సీను : అబ్బే......నిన్నటిది అప్పుడే ఐపోయింది సార్. అహఁ...చెబుతున్నాను—మీకు ఎంత మనస్థిమితం లేకుండా పోయిందో నని!

చిదం : కాదురా ఎరీ—కుక్కపిల్ల ఐతేనా త్రేం—మనింట్లో ఓ పిల్లగా వుంటూ మన చెంత తిరుగుతూ—మనం అంటే ప్రాణం పెట్టే పిల్ల - కనిపించకపోతే మన స్థిమితం వుండక పోవటం యేమిటి—పిచ్చెత్తాలి! (కాఫీ తాగుతున్నాడు.)

సీను : (సంశయిస్తూ) సార్ ....

చిదం : ఏమిట్రా?....

సీను : ఏంలేదుసార్—చిన్న కోరిక...

చిదం : కోరికా! కోరిక అడిగితే తీర్చే దేవుణ్ణి అనుకుంటున్నావేమిట్రా—తీరా ఎదుట ప్రత్యక్షమయితే దేవుడే తీర్చడు!... అడుగు—

సీను : ఏంలేదుసార్...మా నాన్న రెండో పెళ్లి చేసుకుంటాడట.—వో వందరూపాయ లిప్పించాలి సార్—

చిదం : ఏమిటీ!—మీ నాన్న రెండో పెళ్లి చేసుకుంటే నేను వందరూపాయ లివ్వాలా? మీ నాన్నకు రెండో పెళ్లేం—అఖర్లేదు వూరుకోమను!

సీను : అది కాదుసార్—నా జీతంలో విరక్కొసుకుంటానండి!

చిదం : నాన్సెన్స్—మీ నాన్నకు రెండో పెళ్లి నువ్వు డబ్బెట్టి చేయిస్తావా—మతి లేదురా నీకు? డబ్బుపోసి సవతితల్లిని కొనుక్కుంటావురా వెధవా?

సీను : పోనీండిసార్—మా అన్నయ్య చేసుకుంటాడు ఇవ్వండి సార్!

చిదం : పోరా ఇడియట్-తమాషాలు! ఐనా-కుక్కపిల్ల పోయి నే నేడుస్తూవుంటే, నీవళ్ళో వందరూపాయలు సమర్పించటానికి నేనేమన్నా 'బ్యాంక్' అనుకున్నావా-వెళ్ళు అవతలకు వెళ్లు!

సీను : పోనీండి-కుక్కపిల్ల దొరికిన తర్వాతన్నా...

చిదం : ఆలోచిస్తాలే—

[సీను నెమ్మదిగా బయటకు వెళ్లాడు. పత్రిక తీసి చిదంబరం ప్రకటన చూశాడు ఏదో ఆలోచిస్తున్నాడు. సీను బయటనుంచి వచ్చి]

సీను : ఎవరో ఒక అబ్బాయి వచ్చాడుసార్!

చిదం : మనింటికా?

సీను : అవునుసార్.

చిదం : మనింట్లో కుర్రాళ్లెవరూ లేరు పొమ్మను.

సీను : కుర్రాళ్లకోసం కాదుసార్—తమకోసం!

చిదం : (ఆలోచిస్తూ) నాకోసం?...కుర్రాడు?... రమ్మను!

[సీను బయటకువెళ్లి ఓ కుర్రాడిని తీసుకొచ్చాడు. ఆ అబ్బాయికి 14, 15 ఏళ్లుంటాయి అబ్బాయి వచ్చి కూచున్నాడు. పత్రిక అడ్డుపెట్టుకుని చదువుకుంటున్న చిదంబరాన్ని గమనించలేదు.]

అబ్బా : (సీనుతో) పిలవ్వేయండి-ప్లీజ్—

సీను : ఎవర్నండీ?

అబ్బా : చిదంబరం గార్ని.

చిదం : (పత్రిక పక్కకు పెట్టి చూసి) నేనే- నేనే చిదంబరాన్ని. ఏం కావాలి?

అబ్బా : మీరేనా చిదంబరం గారు!

చిదం : నేనమ్మ-ఎప్పుడూ నా ఫోటో అన్నా పేపర్లో చూడలేదా నువ్వు?

అబ్బా : మీ ఫోటో నా- చూడలేదే. మీరు బ్రతికే వున్నారుగా-ఎవరి ఫోటోలన్నా చచ్చిపోయిన తర్వాతే పేపర్లో పడతాయట. మా నాన్నగారంటారు.

చిదం : మీ నాన్నగారి పేరు?

అబ్బా : అదెందుకుగాని— నేను మీతో పనుండి వచ్చాను.

# "కుక్కపిల్ల దొరికింది"

చిదం : (అయోమయంగా అబ్బాయికేసి చూసి) చదువుకుంటున్నావా?

అబ్బా : స్కూలు ఫైనల్.

చిదం : అబ్బో-సరే ఐతే. పాస్ ఐనతర్వాత వస్తే కాలేజీలో చేరటానికి ఒకటో రెండో సాయంచేస్తాలే. పో (తిరిగి పత్రిక చూడటంలో పడబోయాడు!)

అబ్బా : (బల్లమీద చేత్తో చరిచి) నాన్సెన్స్! ఒకటో రెండో సాయం చేస్తారా? ముష్టెత్తుకోడానికి రాలేదు. నాసొమ్ము నాకివతల పారెయ్యండి.

చిదం : (ఆశ్చర్యంగా చూసి) అబ్బాయ్—నీకేమన్నా పిచ్చా...?...

అబ్బా : పిచ్చయితే నేం – కాకపోతే నేం – అదంతా మీ కనవసరం నా డబ్బు నాకిచ్చి మాట్లాడండి.

చిదం : నీడబ్బేమిటి – అది నాదగ్గరవుండటమేమిటి? నువ్వేమో చూస్తే వేలెడు లేవు 'డబ్బు డబ్బు' అని ఒకటే పోరేస్తున్నావు. నాకేం అర్థం కావటంలేదు!

అబ్బా : నేను వేలెడు లేకపోయినంతమాత్రాన నా డబ్బు నాకివ్వరటండీ?... నేను ఎవరనుకున్నారు? అన్యాయంగా నన్ను మోసగిస్తున్నారని పోలీస్‌కు ఫోన్ చేస్తాను. (ఫోన్ దగ్గరికి వెళ్లబోయాడు)

చిదం : అబ్బాయ్...అబ్బాయ్ ... వుండుండు... ఆ ఫోను పనిచెయ్యదు.

అబ్బా : పనిచెయ్యదా?...పనిచెయ్యనప్పుడు మీకెందుకండీ అంత ఆదుర్దా? (ఫోనుతీశాడు)

చిదం : సీనూ సీనూ ... (వెళ్లి ఫోన్ తీసుకుని) నీ డబ్బిస్తాను. రా-కూచో.

అబ్బా : (కూచున్నాడు)

చిదం : చూడూ, నేను కొన్ని ప్రశ్నలడుగుతాను. సమాధానం చెప్పావా-నీ డబ్బు నీకిచ్చేస్తాను.

అబ్బా : లేకపోతే ఇవ్వరా?

చిదం : ఇస్తాలే-చెప్పు. మీ యిల్లెక్కడ?...చెప్ప డకు—చెప్పు-ఫరవాలేదు. మీ యిల్లు ఆసుపత్రిలా ఉంటుందికదూ-అక్కడ కొందరు మనుషులు కేకలు వేస్తూ అరుస్తూ వుంటారు కదూ?

అబ్బా : అర్థమయింది. పిచ్చాసుపత్రి మా యిల్లా? (ఆలోచిస్తూ) అంటే పిచ్చాసుపత్రినుంచి నేను వచ్చేనని మీరు అనుకుంటున్నారా – (గట్టిగా) నేను పిచ్చివాణ్నా?

చిదం : కాదు కాదు-కూచో!

అబ్బా : ఆఖరుసారి అడుగుతున్నాను. డబ్బిస్తారా ఇవ్వరా?

చిదం : ఎంతివ్వాలి?

అబ్బా : ఎంత యివ్వాలీ? ఏమని వేశారు పేపర్లో?

చిదం : పేపర్లో వేశానా?

అబ్బా : అహా! తెలిసింది. మీకే పిచ్చి. ఈ రోజు పేపర్లో వెయ్యలేదుటండీ నూట పదహార్లు ఇస్తానని–

చిదం : అవునవును. మా కుక్కపిల్లను వెతికి తీసుకొచ్చినవారికి నూటపదహారు రూపాయలు బహుమానరూపంగా ఇస్తానని ప్రకటించాను గాని వూరికే నే కాదు.

అబ్బా : వూరికే నే ఇమ్మనటానికి నే నేం పిచ్చివాణ్ని కాదు. నానా శ్రమలూ పడ్డాను—మీ కుక్కపిల్లను వెతికాను—తీసుకొచ్చాను.

చిదం : తెచ్చావా—ఏదీ—ఆ మాట మొట్టమొదటే చెప్పలేదేం? ఏదీ—ఏదీ నా కుక్కపిల్ల?

అబ్బా : తెస్తాను. ముందు నాకుమాటివ్వండి.

చిదం : ఏమని?

అబ్బా : నా డబ్బు నాకు అణా పైసలతో సహా వెంట నే ఇచ్చేస్తానని!

చిదం : ఎందుకివ్వను బాబూ! తప్పకుండా ఇచ్చేస్తాను. కుక్కపిల్లను తీసుకురా.

[అబ్బాయి ఆదోకలాగా చూసి బయటకు వెళ్లాడు. నల్లగావున్న కుక్కపిల్ల మెడకు తాడొకటి కట్టి బరబరా లాక్కొచ్చాడు.]

అబ్బా : (వస్తూనే) ఇదిగో—ఇదిగో మీకుక్కపిల్ల!

చిదం : (తెల్లబోయి చూస్తూ) ఇదా!...ఇది నా కుక్కపిల్ల కాదు...!

అబ్బా : కాదూ (కూచుని కుర్చీకి తాకుకట్టాడు) ఆ మాట అనొద్దని మొదటే చెప్పాను. తప్పించుకోటానికి ఎత్తులు వెయ్యకండి నన్ను క్రాడిరి చేసి నాటకం ఆడారంటే జాగ్రత్త! ఎంత కష్టపడ్డాను దీన్ని వెతకటంకోసం! తిండి, నిద్ర, చదువూ అన్నీ మానేశాను. మా నాన్నగారు తిడుతున్నా సరే, యెండలో బయల్దేరి వూరంతా తిరిగి పట్టుకున్నాను. ఇది మీది కాకుండా యెట్లా వుంటుంది? తీసుకుని డబ్బివ్వండి. నేను త్వరగా వెళ్ళాలి?

చిదం : అబ్బాయ్—కుక్కపిల్ల ఏదో ఒకటి తీసుకొస్తే డబ్బిస్తానని నేనేం రాయలేదు నా కుక్కపిల్ల రంగు వేరు - జాతి వేరు - ఎబ్బే అది ఇట్లా ఇంత అసహ్యంగా వుండదు!

అబ్బా : మరి తిండీ తిప్పలూ లేక ఎండలో మాడితే అసహ్యంగా కాక ఎట్లా వుంటుంది! నేను ఎండలో తిరిగి యింటికి పోగానే మా నాన్నగారూ ఆ మాటే అన్నారు- కొట్టబోయారు కూడా!

చిదం : దాని మాటకేం గాని—ఈ కుక్కపిల్ల నాది కాదు - తీసుకుపో.

అబ్బా : తీసుకుపోనా? ఏం మాట!...సరే - డబ్బివ్వక్కరలేదులెండి. మీ కుక్కపిల్లను మీరే వుంచుకోండి- వెళుతున్నాను.

చిదం : బాబూ! నువ్వు చూస్తే భూమికి జానెడు లేవు నీ మాటలూ నీ చేష్టలూ చూస్తూంటే నాకు మతిపోతోంది. నువ్వు వెళ్లు. కుక్కపిల్లను కూడా తీసుకువెళ్లు. ఎక్కడ తెచ్చావో అక్కడే వొదిలెయ్యి

అబ్బా : సరేనండీ! ఐతే ఈమాత్రం దానికి ప్రకటన వేసి మోసంకూడా ఎందుకు చేశారు? వెళ్తున్నాను. (కోపంగా కుక్కను తీసుకుపోతూ, మళ్ళీ తిరిగివచ్చి) ఈ కుక్కపిల్లను దాని తల్లి దగ్గిర ఒదిలిపెట్టాలంటే నేను నానా శ్రమా పడాలి..మంచి బాగా చేశారు...'థాంక్స్' ...పోనీండి—కాలేజిలో చేరాక వస్తే ఒకటో రెండో సహాయం చేస్తానన్నారు—అప్పుడొస్తే అదన్నా యిస్తారా—ఇట్లాగే పొమ్మంటారా?

చిదం : లేదులేదు—తప్పకుండా యిస్తాను. ఇప్పుడు వెళ్లు. (అబ్బాయి సీరియస్ గా చూసి, గొణుక్కుంటూ బరబరమని కుక్కపిల్లను లాగుతూ బయటకుపోతాడు. బయట కుక్కపిల్ల 'కుంయ్' మనే అరుపు వినిపించింది. చిదంబరం 'ష్' అని కూలబడి, లేచి)

చిదం : ఒరే సీనూ.. సీనూ...ఎక్కడ చస్తున్నాడో—సీనూ!... (ఫ్లాస్కులోంచి కాఫీ పోసుకుని తాగుతున్నాడు. ఇంకో వ్యక్తి ప్రవేశించాడు ఆధునిక పద్ధతిలో వున్నాడు)

వ్యక్తి : (నమస్కారం చేసివస్తూ) ఈ యింటికి యజ మీరేనా—

చిదం : ఆహా! సాక్షాత్తూ ఈ యింటికి యజమానిని నేనే, ఏం సెలవు

వ్యక్తి : (కూచున్నాడు) ఎబ్బే—ఓ చిన్న పనిమీద వచ్చాను

చిదం : సెలవుగాని వుండండి. (కాఫీ పూర్తిగా తాగేసి, గాసు వుంచేస్తూ) ఏం పనిమీద వచ్చారంటారు ?

వ్యక్తి : ఈ యిల్లు ఏ సంవత్సరంలో కట్టారండి—బయట చాలా 'హోప్లెస్'గా వుంది. (పైకి చూసి) అరే, సీలింగ్ అంతా పూర్తిగా పాడయిపోయింది!

చిదం : పాడయితే పాడవనివ్వండి ఈ యింటిని మీకు నేనేం ధారాదత్తం చేసెయ్యటం లేదు!

వ్యక్తి : అందుకొచ్చానండి—ఇంట్లో కాలుపెట్టిన తర్వాత ఇల్లు కళకళ్లాడకపోతే ఎందుకు చెప్పండి! ఈ వూళ్ళో చాలా ఇళ్లు చూశాను. పట్టి మురికికూపాలు. మళ్లీ మహా మహా ఎంజినీర్లు కట్టినయిళ్ళు, వేలూ లక్షలూ పోసి కట్టించిన ఇళ్లు!...ఇల్లు—కట్టించిన మర్నాటికే ఇంటికి పూసిన రంగంతా వెలాతెలాపోటం ప్రారంభిస్తుంది—ఇంట్లో ఎక్కడ చూసినా సున్నం రాలిపోతూ వుంటుంది—అసలున అంతా బీటలువారిపోతూవుంటుంది.అదంతా కట్టేవాళ్ళల్లో వుంటుందండీ—ఎంజి

# "కుక్కపిల్ల దొరికింది"

నీర్లు ఏం చేస్తారు పాపం! వాళ్ళంతా జాగ్రత్తగానే ప్లాన్ వేసి కట్టిస్తారు. ఏంలాభం! కట్టిన తాపీపనివాళ్లు సరిగ్గా పనిచెయ్యరు. అదంతా వీళ్ల చేతుల్లోనే వుంటుంది. వీళ్లు సరిగ్గా కట్టాలిగాని ఎంజినీర్ ఏం చేస్తాడు? "ఇల్లు కట్టిన ఇంజనీరు కాదోయ్—దానికి ఇటుకలు పేర్చి, తాపీ చేసిన పనివాడెవ్వడు?" అని మా స్నేహితుడొకరు గేయాలు రాశారు అంచాత— చెప్పొద్దూ—'పనివాడిలో' పసవుండాలి. లేకపోతే మీ యిల్లులాగానే తయారవుతుంది!

చిదం: ఇంతకూ మీ రెవరో ఏంపనిమీద వచ్చారో చెప్పారు కాదు.

వ్యక్తి: నేను ఇళ్లకు మైనర్ రిపేర్స్ (Minor repairs) చేయించే కంట్రాక్టర్నండి. నా కింద అమోఘమయిన పని చెయ్యగల్గిన పనివాళ్లు నలభైమందివున్నారు. ఆ రోజుల్లో శ్రీరామచంద్రుడేం కట్టించాడండీ-వారధి?...ఐదు నిముషాల్లో మా వాళ్లు అటువంటివి తొంభై తొమ్మిది కడతారు చూస్తారా!......ఐతే మేము ప్రస్తుతం అంతా మైనర్ రిపేర్స్ మీదే ఎక్కువగా కృషి చేస్తున్నాం. ఊరికే పెద్దయిళ్లు కడతామని ఎగబ్రాకటం-చెయ్యలేకపోవటం-సరే, అదంతా ఎందుకు-ప్రతి యింటికీ మరమ్మతులు చేయించటం ఎంతో అవసరం. ఆ పనివల్ల యింటికి గట్టితనం, ఓ హుందా అవన్నీ వస్తాయి.

చిదం: ఐతే ఏమంటారు మీరు?

కంట్రా: అనటానికేముందండి! మీ యింటికి అవతల వీధిలోవున్న రేణుకమ్మగారి యింటిని మరమ్మత్తు చేశాం. వాళ్లింటిప్రక్కనవున్న రాజారావుగారి యిల్లూ చేశాం. తర్వాత...... చైర్మన్ గారూ వాళ్ళూ ఆర్డరు ఇచ్చారు. (సంచిలోంచి 'ఆర్డర్ బుక్' తీసి చూపుతున్నాడు)

చిదం: చైర్మన్ గారు తనయింటికే యిచ్చి వూరుకున్నారన్నమాట! ఆ స్కూలు పడిపోటానికి సిద్ధంగావుందికదా - దానికో ఆర్డరు వేయించుకోలేకపోయారా?

కంట్రా: ఇస్తారు సార్ అదీ యిస్తారు. ఎల్లాగేమండు తన యిల్లు చక్కబెట్టుకునికదా రెండో యింటికివెళ్లాలి! (పుస్తకం చూపుతూ) చూడండి-ప్రస్తుతం ఎనిమిదిళ్లు కాంట్రాక్టు తీసుకున్నాను. పని జరుగుతున్నది నాలుగిళ్లు. లోగడ చేసిన పనికూడా...(కాయితాలు వెనక్కి తిప్పుతున్నాడు).

చిదం: అఖ్ఖర్లేదులెండి..అం...మీరు కేవలం ఇళ్లే మరమ్మత్తు చేస్తారా ఇంకేమన్నాకూడా మరమ్మత్తు చేస్తారా?

కంట్రా: (గడగడా) ఇళ్లూ భవనాలూ, వంతెనలు, రోడ్లూ సైను కాలవలు......

చిదం: ప్రస్తుతం నా మెదడు చాలా ఒడిదుడుకుల్లో వుంది. దాన్నేమన్నా మరమ్మత్తు చెయ్యగలరా?

కంట్రా: (తెల్లబోయి, సర్దుకుని నవ్వి) చంపేశారు. మీరట్లా అడిగితే నేనేం చెప్పేది? దాన్ని 'రిపేర్' చెయ్యటానికి ప్రత్యేకం హాస్పిటలూ, డాక్టర్లూ వుంటారుగాని...

చిదం: ఐతే ఓ గొడ్డలి తీసుకుని ముందు నాయిల్లంతా ఇవాళ పగలగొడతాను. మీరు రేపురండి — మరమ్మత్తు చెయ్యొచ్చు.

కంట్రా: మీరు చాలా చిత్రంగా మాట్లాడుతున్నారు. మీ ఇల్లు మరమ్మత్తు కోరుతోంది కదా అని అన్నాను. ఒక్కసారి వీధిలోకి వెళ్లి చూడండి. గోడలన్నీ ఎంత పాలిపోయి వున్నాయో! ఎంతో అవదు - చాలా చిన్న మొత్తం! రోజుకు మీకయ్యే కాఫీ ఖర్చు.

చిదం: నాకు రోజుకయ్యే కాఫీ ఖర్చు రెండణాలు. ఇదిగో (ఇస్తూ) తీసుకుని, చెయ్యవలసిన మరమ్మత్తేదో చేసుకోండి.

కంట్రా: (చాలా విచిత్రంగా చూశాడు).

చిదం: క్షమించండి - నేను చాలా చిక్కుల్లో వున్నాను. అవయ్యాక రిపేర్ విషయం ఆలోచిద్దాం. ఇప్పుడు నన్ను మరి కొరుక్కుని తినేయకండి!

కంట్రా: ఏమిటి - అంత మనోవ్యధలో వున్నారా?

చిదం: మీకు పత్రికలు చదివే అలవాటులేదా?

కంట్రా: చంపారు! న్యూస్ పేపర్ చదవటం నాకో వ్యసనంలాంటిది. ఏరోజు పేపర్ లేక పోయినా మరి నాకు నిద్రపట్టదు

చిదం: చూడండి - పేపర్ చదివితే కేవలం మీ రాజకీయాలే కాదు - ఇతర ప్రకటనలు కూడా చూడాలి. ఈ రోజు పేపర్లో ఓ ప్రకటన ఇచ్చాను. మాయింట్లో ఓ పిల్లలాగా తిరుగుతూ నా ప్రేమకు పాత్రురాలయిన ఓ కుక్కపిల్ల 'రోజా' కనిపించకుండ పోయింది. నాకు మతికూడా పోయింది. అది దొరికేదాకా నాకు తోచదు. వెతికి తీసుకు వచ్చినవారికి నూటపదహారు రూపాయల బహుమానం యిస్తానని ప్రకటన వేశాను (పత్రిక చూపాడు)

కంట్రా: (చూసి) అలాగా - చిదంబరం గారంటే మీరే అన్నమాట! పాపం! ఎంత కష్టం అండీ - నిజమేనండీ - ఇంట్లో తిరుగుతున్న కుక్కపిల్లే కాదు - నాలుగురోజుల్నుంచీ యింట్లోవున్న ఓ చిన్న చీపురు కనిపించక పోయినా అదేమిటో మనసు బాధపడు తుంది - మీ రెట్లా తమాయించుకోగలిగారో ఏమిటో!

చిదం: ఏం చెయ్యమంటారు - చచ్చినట్టు బాధపడు తున్నాను. నిన్నంతా తిరిగాను - ఇవాళ తిరిగాను - ఎక్కడా కనిపించలేదు ఏమ యిందో ఏమిటో!... సీనూ!... పాపం - నా నౌకరు కూడా దానికోసం బెంగపెట్టు కొని కృశించిపోతున్నాడు. వాడే దానికి తల్లీ తండ్రీ!

కంట్రా: బహుమానంకోసం కాదు కానీండి— నేనూ ప్రయత్నిస్తానండి. ఎక్కడ కనిపించినా తీసుకొచ్చి మీకు అప్పజెబుతాను గుర్తులన్నీ తెలిశాయి కదా— ఆ మధ్య ఇట్లాగే మా అబ్బాయి తప్పిపోయాడు. పేపర్లో ప్రకటన వెయ్యలేదుగాని— దొరికాడు. దొరుకుతుం దండీ— మనసొమ్ము ఐనతర్వాత మనకు దక్కకుండా పోతుందా!

చిదం: సొమ్ము అంటారేమిటి? అది నా ప్రాణంతో సమానం. మీకు కనిపిస్తేమాత్రం తీసుకొచ్చి అప్పజెప్పండి— మీ మేలు మరిచిపోను.

కంట్రా: ఎంతమాటన్నారండీ— ఇందులో పెద్ద మేలు ఏముంది? పనికట్టుకుని కూడా వెతుకుతాను ...నన్ను...ఏమంటారు?

చిదం: చిత్తం-మీరు వెళ్ళిరండి. కుక్కపిల్ల దొరికిం దనగానే ఎట్లాగా పంపించేస్తాను— ఇంటి రిపేర్ చేయించక తప్పదు అంతవరకూ మాత్రం నన్ను బాధపెట్టకండి. ఇన్నాళ్ళూ లేనిది ఈ రెండురోజుల్లోనూ ఈ కొంపకూలి పోతుందనే భయం నాకేంలేదు!

కంట్రా: సరే, వస్తానండి కాని 'రిపేర్స్' చేయిం చటంవల్ల లాభం మీరే తెలుసుకుంటారు. ఎంతో అవసరం మీకు! ఒకవేళ కర్మంచాలక మీ కుక్కపిల్ల దొరక్కపోయినా ఇల్లు మర మ్మత్తు చేయించటంమాత్రం మరిచిపోకండి. అది కాకపోతే మరో కుక్కను కొను క్కుంటాం గాని— కలకాలం నిలబడా ల్సింది 'ఇల్లు'!

చిదం: చేయిస్తానని చెప్పానుగదండీ! మీరు మరీ ఇన్నాళ్ళెన్నాళ్ళిల్లాగా నా ప్రాణాలు తీసేస్తే నా శక్యమా? చేయిస్తాను. ఈ ఒక్క ఇల్లేనా మరో నాలుగయిదిళ్ళు చేయిద్దాం!

కంట్రా: సెలవు (వెళ్ళి మళ్ళీ వచ్చి) మీ రోజా డీటైల్స్ చెప్పండీ కొద్దిగా!

[చిదంబరం పత్రిక ఇచ్చాడు. కంట్రాక్టరు చూసుకొని, 'థ్యాంక్స్' అని వెళ్ళాడు]

చిదం: (అటూయిటూ చూసి ఫోనుతీసి) హాలో... ఆఁ... నేను చిదంబరాన్ని మాటాడు తున్నాను...ఆఁ ? ... దొరకలేదు...నీకూ దొరకలేదా...ప్రయత్నించమని చెప్పా... ప్రయత్నించమనీ ... చెప్పా—...దాని ఫోటో లేదయ్యా— నేనూ అదీ కలిసి తీయించుకున్నది ఒకటుంది గాని నా మొహం కనిపిస్తున్నంతబాగా అది కనపించటంలేదు. ...అది పనికిరాదులే.. ఐనా ఫోటో ప్రక టించాలిసిన అవసరంలేదులే. వివరాలన్నీ పూర్తిగా ఇచ్చాంగా — ఆఁ...అందుకే పిల్చాను...ఏం భోజనం నా మొహం!... వుంటాను మరి! (రిసీవర్ పెట్టి సీనును పిలి చాడు. సీను వచ్చాడు) దొరికిందిరా సీనూ?

## "కుక్క పిల్ల దొరికింది"

సీను : వీధిలో పోతున్న కుక్కపిల్లలన్నిటినీ పట్టి పట్టి మరీ చూశాను సార్—దేనికీ మన రోజీ పోలికలన్నా లేవు!

చిదం : ఏం—అదెందుకు?

సీను : పోనీ అందాకా దాంతోనన్నా కాలక్షేపం చెయ్యొచ్చుగదా అని. అదీగాక, కుక్కపిల్ల లేకపోతే నాకీ ఇంట్లో పని వుండదు. అది లేదని నా వుద్యోగం లాగేసి పొమ్మంటారని నా భయం!

చిదం : నీకా భయం ఏమీ అక్కర్లేదు ఏం— ఇవాళ కాకపోతే రేపటికన్నా దొరకదా?

సీను : దొరక్కపోతే మాత్రం నాకోసమన్నా ఓ పిల్లను కొనాలి సార్!

చిదం : నోరుముయ్యరా. మన పిల్ల మనకు దొరక్క ఏమవుతుంది?

సీను : దొరుకుతుందండీ—దొరికేదాకా నాకు మరి మతి బాగుపడదు ఏదో వాగేస్తూంటాను అమతి మనవుల్ల — కోప్పడకండి సార్!

చిదం : అవునురా—ఆ ప్రేమ అట్లా అనిపిస్తుంది... అన్నట్టు ఇందాక ఓ కుర్రాడొచ్చాడు చూశావా—వాడో నల్లటిపిల్లను లాక్కొచ్చి, నా యెదాన్నికొట్టి "ఇదే నీకుక్కపిల్ల తీసుకో—తీసుకొని నా డబ్బు నాకివ్వు" అని ఒకటే గోల పెట్టాడు.

సీను : పోనీ—అందాకా దాన్నన్నా తీసుకొన్నారు కారు!

చిదం : ని మొహం, దాన్ని చూస్తే డోకొచ్చింది. అసహ్యంగా వుంది. వాడెవడో దేవాంతకుడులాగా వున్నాడు. చూట్టానికి పది హేనేళ్లన్నా లేవు—కబుర్లు మాత్రం ఆకాశానికంటేటట్టు చెప్పాడు! తను చాలా శ్రమపడి వెతికి తీసుకొచ్చాట్ట—పో పొమ్మన్నాను.

సీను : మంచిపని చేశారు. నాతో చెప్పారు కారు- ఒకటిచ్చుకుని బయటకు తోసేద్దును.

చిదం : పోనీ పోయాడు లే— నేను మరొక్కసారి, అట్లా బయటకుపోయి చూసివస్తాను. నువ్వు జాగ్రత్తగా—కుక్క కోసింకా జాగర్తగా- ఇల్లు చూస్తూవుండు వస్తాను. ఎవరన్నా నాకోసం వస్తే వుండమని చెప్పు. (కోటు వేసుకుని బయటకు పోబోతూ వుండగా, సన్నగా పొడుగ్గా వున్న ఓ వ్యక్తి (ప్రవేశించాడు)

వచ్చిన మనిషి : మీరేనండీ చిదంబరంగారు?

చిదం : నేనే

ఆయన : నమస్కారం, నా పేరు కోదండం. నేను తమతో పని వుండివచ్చాను

చిదం : తమరు ఇళ్లకు మేజర్ రిపేర్స్ చేయించే కంట్రాక్టరా — లేక ఏ కంపెనీకన్నా ఏజెంటా?

ఆయన : క్షమించండి, నేను ఒకాసుపత్రిలో కాంపౌండరు ఉద్యోగం చేస్తున్నాను.

చిదం : ఏ ఆసుపత్రిలో? (షాక్ తిన్నట్టు).

కోదం : ప్రయివేట్ హాస్పిటల్ లెండి డాక్టర్ రమేశ్ గారికి కుడిభుజంవంటివాడిని.

చిదం : నేను మీ డాక్టరు దగ్గిర ఎప్పుడూ మందు తీసుకోలేదు—మీ బిల్లులు నేనేం ఇవ్వక్కర్లేదు. నాకు పనుందివస్తా (వెళ్లబోయాడు)

కోదం : ఆవుండండీ. కాంపౌండర్లెంతసేపూ బిల్లులు వసూలు చెయ్యటానికే వస్తారనుకుంటున్నా రేమిటి?—ఐనా, నా రాక వేరు. నేను వేరే పనిమీద వచ్చాను. వూరికే మీకు తెలియాలని నా ఉద్యోగ్యం చెప్పాను.

చిదం : ఆప నేమిటో త్వరగా తేల్చండి. అవతల నాకో అర్జంటుపని వుంది.

కోదం : ఇటువంటి పరిస్థితులలో అర్జంటు పనేమిటండీ? ఓమూల కుక్కపిల్ల పోయిందని ప్రకటన యిచ్చారుగదా — ఇంకోమూల విచారంతో క్రుంగిపోవలసిన సమయంలో మీకు అర్జంటుపనా?

చిదం : నా ప్రకటన చూశారా యేమిటి? నిజమే. విచారంతో బాధపడుతున్నాను. ఏం చెయ్యను? ఇప్పుడు అర్జంటుపనంటే అదే. ఆపనిమీదే వెళ్తున్నాను.

కోదం : శునకాన్వేషణేనన్నమాట! అక్కర్లేదు. మీ రింక బయటకు పోనక్కర్లేదు. మీ కుక్కపిల్ల మీకు లభిస్తోంది.

చిదం : యేమిటి—(కూలబడుతూ) మీకు జ్యోతిషం కూడా తెలిసినట్టుంది. దయచెయ్యండి. కూచోండి. (కుర్చీ చూపాడు)

కోదం : (కూచుని) జ్యోతిషం కాదండీ—యథార్థమే! మీ కుక్కపిల్లను అతి శ్రమపడి—

వెతికి—విసిగి వేసారి— తిరిగి వెతికి వెతికి-పట్టుకుని, తీసుకొచ్చాను.

చిదం : ఏదీ?—

కోదం : కుక్కపిల్ల ఇంట్లో ఎందుకుంటుందీ—బయట—వానిచోటులో అది కట్టబడివుంది.

చిదం : నిజంగా! సీనూ—వెళ్ళి తీసుకురా. (సీను పరుగెత్తాడు) చాలా థాంక్స్. మీ ఋణం తీర్చుకోలేము పాపం— ఎంత శ్రమ పడ్డారో—అసలది కులాసాగా వుందా?

కోదం : నిక్షేపమల్లేవుంది. దానికేం — ఐతే మొదట కొద్దిగా డీలా ఐపోయినట్లు కనిపించింది. కాంపౌండర్ని కదా—దాని వ్యాధి కనిపెట్టి—ప్రథమచికిత్స చేసి కొద్దిగా మందిచ్చి—పాలుపట్టి జాగ్రతగా తీసుకొచ్చాను అయినా—ఆ పాలఖర్చూ మందుఖర్చూ మీరేం ఇవ్వఖ్ఖర్లేదనుకోండి!

చిదం : ఎంతమాట! మీ ఋణం వుంచుకుంటానా చెప్పండి మాస్టారా అదంటే నాకు ప్రాణం. దాన్ని పోగొట్టుకున్నాక నా మనస్సు ఎంత బాధపడిందో తెలుసా?

కోదం : పాపం—ఆఁ...నాకు చెక్కిస్తారా—కాష్ ఇస్తారా?

చిదం : దేనికి? ఓహో—మీ బహుమానం సంగతా! చెక్కు యిమ్మంటారా?

కోదం : వద్దండీ. అర్జంటుగా సొమ్ము అవసరంకూడా వుంది. ఇప్పుడు బ్యాంకీ మూసేసివుంటారు రొక్కంగా యిప్పించారంటే ఉచితంగా ఇచ్చినట్టుంటుంది. రేపటిదాకా ఆ చెక్కు మార్చుకునే దాకా ఆగటం కష్టం—కొన్ని అర్జంటు ఖర్చులున్నయ్.

చిదం : చంపారే—అంత మొత్తం రొక్కం నా దగ్గిర లేదు. మీ పని చక్కబెట్టుకోటానికి 50 ఇస్తాను—మిగిలింది చెక్కు రాస్తాను.

కోదం : అట్లా అంటారా...మీ యిష్టం...

చిదం : (చెక్కుపుస్తకంతీసి) మీ పేరు...?

కోదం : యం. కోదండం—

చిదం : యం. కోదండం (రాయబోయాడు)

సీను : (చివాలున కుక్కపిల్లతో వస్తూ) సార్ సార్ మన రోజా కాదు సార్ ఇది!

చిదం : (షాక్ తిని) ఆఁ!

సీను : చూడండి—ఇదేదో చవట కుక్క. వీధిలో తిరిగే వట్టి చెత్త రకం.

చిదం : (చూసి) ఎంత పని!...ఇది నాది కాదండి!

కోదం : ఏమన్నారు మీరు పేపర్లో? తెల్లనిరంగూ కుచ్చువంటి పొట్టితోకా గల కుక్కపిల్ల అన్నారు. ముఖం కోలగా వుంటుం దన్నారు. దీని మొహం ఏమన్నా గుండ్రంగా వుందా? తెల్లనిరంగు అన్నారు కుక్కపిల్ల తప్పిపోయిన సమయానికి అది తెల్లగానే వుండేది. ఈ ఎండల్లో తిరిగితిరిగి నల్లబడి పోయింది. కుచ్చువంటి పొట్టితోక అన్నారు. పొట్టితోక కాక ఇదేమన్నా పొడుగు తోకా?...కుచ్చు అంటారా—అది నా తప్పే లెండి ఏమంటే నాకు నచ్చక కత్తెరతో కత్తిరించి పారేసాను కావాలంటే ఆ...(జేబులు తడుముకున్నాడు)

సీను : మా రోజా మెళ్ళో బెల్టు వుండాలి

కోదం : బెల్టు వుంటుందేటండీ వీధిలో కొచ్చిన కుక్క మెడలో? అదెవడో కొట్టేశాడో! పోనీండి—బెల్టు ధర ఆరణాలు. ఆ ఆరణాలూ కొట్టేసుకుని, నూట పదిహేను రూపాయల పది అణాలూ ఇప్పించండి—ఏంచేస్తాం!... దానిసరించి నేను పెట్టిన ఖర్చు ఎట్లాగూ అడగలేదు!

చిదం : చూడండి కోదండం గారూ—నా కుక్కపిల్ల కోసం నేను నానా శ్రమా పడుతున్నాను. అది దొరికిందంటే నాకు పరమానందమవుతుంది. నేను ప్రమాణంచేసి చెబుతున్నాను. ఇది నా కుక్కపిల్ల కాదు. మీరు లక్ష చెప్పండి. కోటి చెప్పండి. దాన్ని పెంచి పెద్దచేస్తున్న మా సీనుగాడు-వీడే సాక్ష్యం!

కోదం : అయ్యా-మీరు 'కాదు' అని కొట్టిపారేస్తే నేనేం చేసేది? మీరు పత్రికలో ప్రకటన వెయ్యగానే చూశాను. ఆసుపత్రీ, డాక్టరు గారూ, పేషెంట్లూ అందర్నీ వొదిలి వూరి మీద పడ్డాను. ప్రతీచోటా చూశాను. తోటలూ, వీధులూ, పార్కులూ, రోడ్లూ-అవీ-ఇవీ-ఒక టేమిటి! ఇంటింటికీ తిరిగాను. ఆ తిరగటంలో ఎంత శ్రమపడ్డానో మీకు నోటితో చెబితే తెలీదు. అంత శ్రమపడ్డాను. అక్కడ డాక్టరుగారు తిడుతున్నా, పేషెంట్లు ఏడుస్తున్నా, నా యింట్లో నా భార్యా పిల్లలు నాకోసం కలవరిస్తున్నా అవన్నీ లక్ష్యపెట్టక పరోపకారబుద్ధితో - కేవలం పరోపకారబుద్ధితో - ఎండనక వాననక తిరిగాను. మీరే ఆలోచించండి. దారిలో ఓ లక్షపిల్లలు కనిపించినై, అవేవీ మీవికావు.

ఆ మాత్రం పోలికపట్టలేనా-ఎంత కొంపోంటి ర్నయితే మాత్రం! ఆఖరుకు పట్టుకున్నాను.

చిదం : బాగా పోలికపట్టారు! నా కుక్కపిల్ల కోసం మీరు పడిన శ్రమను నేను మరిచిపోను. ఈ కుక్కపిలను తీసుకువెళ్ళండి (సీను బయటకు కుక్కతో వెళ్ళాడు) ఇది మాత్రం నాదికాదు! నా కుక్కపిల్లను తీసుకురండి-నిమిషాలమీద సొమ్మిచ్చేస్తాను.

కోదం : మంచి పెద్దమనిషేనండోయ్ మీరు! నిన్నట్నుంచీ శ్రమపడి వెతికి తీసుకొస్తే కాదు పొమ్మని-పైగా మళ్ళీ వెదకాలా? బావుంది బావుంది. నా కవతిల పనీ పాటూ లేదనుకున్నారా - నేనేమన్నా కేవలం కుక్కల్ని వెదకే పెద్ద వుద్యోగంలో పనిచేస్తున్నాననుకున్నారా?

చిదం : అదంతా నాకేం తెలీదు మీకవతిల పనీపాటూ లేదని నేనేం అనలేదు. ఆ పనంతా మానుకుని కుక్కపిలను వెతికి తీసుకొస్తేనే గా, నూటపదహార్లిస్తానన్నది!

కోదం : బాగా ఇచ్చారు. ఇంతమోసం ఎక్కడా చూడలేదండి అరునెల్లక్రిందట పిల్లవాడొకడు తప్పిపోతే, వెతికి పట్టిచ్చి రెండు వందల రూపాయలు పుచ్చుకున్నాను. ఆయన ఏమన్నా ఇటువంటి పేచీమనిషయితే దచ్చివుండును. 'నా కుర్రాడు కాదు పొమ్మన్నాడా?' ఎంత మర్యాదచేశాడు - ఎంత ఆదరించాడు! కుర్రాడు నాకు ఏలూరు ప్లాటుఫారం మీద దొరికాడు. ఏలూరు నుంచి సెకండుక్లాసులో తీసుకొస్తే ఆ ఖర్చు కూడా యిచ్చి వాళ్ళింట్లో నాలుగు రోజు లుండమని మరీ బతిమాలాడు, ప్చ్!- మనకెందుకు మన కర్మం ఏదో మనం నిర్వర్తించాం. వాళ్ళ అబ్బాయిని వాళ్ళకు వప్పగించాం. అంతే!

చిదం : ఆ అబ్బాయి వాళ్ళవాడు కాబట్టే ఆయన మీ ఋణం వుంచుకోలేదు. ఈ కుక్కపిల నాదికాదు. ఇదేదో ఊరిమీద తిరిగేరకం. మీరు డబ్బుకోసం ఆశపడి తీసుకొచ్చి ఇస్తున్నారు - దయచేసి వెళ్ళండి!

కోదం : (ఉగ్రుడై) ఏమండోయ్! ఇదేం మర్యాదగాలేదు. మిమ్మల్ని మోసగించి మీ దగ్గిర డబ్బెత్తుకు పోవాలనే దుష్టఉద్దేశంతో వచ్చాననుకుంటున్నారా? కావలిస్తే మీకు కావలసినంత డబ్బు గుమ్మరిస్తాను. పోనీ గదా అని పనీపాటూ మాని, ప్రాణం పోతున్నా లక్ష్యపెట్టక కుక్కను వెతికి తీసుకొస్తే కాదు పొమ్మని కొట్టిపారేస్తారా? ఇదేనా పెద్దమనిషితరహా?

చిదం : (విసిగి, కోపంగా) ఇది నా కుక్కపిల్ల కాదు మహాప్రభో — నీకు శతసహస్ర నమస్కారాలు, వెళ్ళు కుక్కపిల్ల దొరక్క నానాబాధా పడిపోతున్నాను నాదైతే తీసుకోటానికి తెగులా? నిక్షేపంగా తీసుకొంటాను. వెళ్ళు-వీలయితే నా రోజాను తీసుకురా!

కోదం : ఏమండోయ్-ఇక లాభంలేదు అంతాదగా. మోసం! మీ మీద పోలీసు రిపోర్టు ఇస్తాను.

చిదం : ఏమని ఇస్తారు రిపోర్టు?

కోదం : ఏమని యిస్తాను? ఫలానా చిదంబరం అనే ఆసామీ కుక్కపిలను వెతికి తీసుకొస్తే నూటపదార్లు ఇస్తానని ఆశపెట్టి తీరా తీసుకొచ్చాక డబ్బివ్వక అల్లరి పెట్టాడని. తెలిసిందా?

చిదం : (చిరాగ్గా చూసి) ఇవ్వవయ్యా ఇవ్వు-రిపోర్టు ఇవ్వుకో. అదిగో ఫోన్-వూం... చెయ్యి ఫోన్ చెయ్యి!

కోదం : (తెల్లబోయి, సర్దుకుని) అంతేనన్నమాట! అనవసరంగా చిక్కుల్లోపడిపోతారు ఫోన్ చెయ్యలేక వూరుకోటంకాదు. బావుండదు-మీ పెద్దమనిషితనంపోతు మన్నారావటం నాకిష్టంలేక వూరుకుంటున్నాను.

చిదం : మంచి పనిచేశావ్—'నా కుక్కపిల్ల కాదూ' అని కొట్టుకుంటూ వుంటే ఆ దిక్కుమాలిన వెధవ కుక్కను నా నెత్తిన రుద్దాలనుకుంటున్నావు గదా-నువ్వేమన్నా పెద్దమనిషివి? నీమీద నేను మాత్రం పోలీస్ రిపోర్టు ఇవ్వలేనూ? ఇస్తే నువ్వేమవుతావో తెలుసా? డబ్బుకోసం మోసంచేసి, నన్ను పీడిస్తున్నాడంటే పోలీసులు వాయువేగ మనోవేగాలతో వస్తారు. సబ్ఇన్స్పెక్టర్ నాకు దగ్గర స్నేహితుడు కూడానూ!

కోదం : అయ్యా! మనకూ, మనకూ భేదాభిప్రాయాలెందుకు? ఈ వెధవ కుక్కతిరూ పోలీసులదాకా ఎందుకు? నిజం చెప్పండి...నిజంగా ఇది మీ కుక్కపిల్ల కాదా?

చిదం : ఇంతసేపూ చెప్పినదంతా విని మళ్ళీ మొదటికొస్తారేం—

మూడుసార్లు చెబుతున్నాను వినండి మరి ప్రశ్న వెయ్యకండి. మీకు నమ్మకం లేక

పోతే ఇదిగో ప్రమాణం కూడా చేస్తున్నాను. (తలమీద చెయ్యి పెట్టుకుని) ఇది నా కుక్కపిల్ల కాదు—ఇది నా కుక్కపిల్ల కాదు—ఇది—నా—కుక్క పిల్ల—కాదు (చెయ్యితీసి) సరా?

కోదం : మీరంతగా చెబుతూ వుంటే నేనేం చెయ్యను? కాని మీ ప్రకటన చూసిన దగ్గర్నుంచీ నేనెంత కష్టపడ్డానో—ఎంత బాధ పడ్డానో మీ రెరుగరు!

చిదం : ఎరక్కేం—ఇంతసేపూ పడుతూనే వున్నాంగా.

కోదం : క్షమించండి బీదవాణ్ని. దీన్ని వెతకటం కోసం నాకెంత డబ్బు ఖర్చయింది. శ్రమమాటకేం—తిరుగుళ్ళ ఖర్చులు యిప్పించారంటే....

చిదం : బావుందయ్యా—ఒక వేళ అది నా కుక్కపిల్ల ఐనప్పటికీ నేనా ఖర్చు ఇవ్వను గదా—కాకుండా ఖర్చు కూడా ఇవ్వాలా? వెళ్ళు వెళ్ళు—నన్ను మరి విసిగించకు!

కోదం : మీకో నమస్కారం పెడతాను! పిల్లలుగల వాణ్ని. ఎదిగిన పిల్లకు పెళ్ళి చెయ్యాలి—రెండో వాడు చదువుకుంటున్నాడు.—మూడో పిల్ల...

చిదం : ఉద్ధరిస్తోంది! నా దగ్గిర 'పంచ' ప్రాణాలున్నాయ్. నీక్కావాలంటే ఒకటో రెండో పట్టుకుపో గాని—నన్ను వేధించకు!

కోదం : అమ్మమ్మమ్మ...ఎంత మాట—ఎంత మాట! వెధవడబ్బుకోసం మీ ప్రాణం తీస్తానా?

చిదం : ఇంకా ఏం తియ్యాలయ్యా రామచంద్ర ప్రభో! ప్రాణం పట్టుకుపోయే యముండు యమకింకరులన్నా 'ఇంత' బాధ పెట్టరా బాబూ! ముక్కకు ముక్క చొప్పున కొరుక్కుతి నేస్తున్నావ్.

కోదం : మీకు ఇంత బాధ కలిగిస్తున్నానని నేను అనుకోలేదు. ఆఖరుసారిగా మనవి చేస్తున్నాను...ఒక్క పాతిక రూపాయలిప్పించారంటే...

చిదం : అబ్బబ్బబ్బ...సీనూ...సీనూ...!...వెళ్ళవయ్యా వెళ్ళు పాతిక రూపాయలు కావాలా ఎక్కడున్నా ఎత్తుకొచ్చి యిస్తాను. వెళ్ళు. నమ్మకం చాలకపోతే ఈరాత్రి నాతో కూడా రా.

కోదం : పోనీ ఇరవై రూపాయలన్నా ఇప్పించండి.

చిదం : ఇదేం ఖర్మం వచ్చిందిరా ఇవాళ భగవంతుడా?...ఎట్లానా పోలీసుకు ఫోన్ చెయ్యమన్నావా? చెప్పు!

కోదం : (కాళ్ళమీద వాలుతూ) నన్ను చంపెయ్యకండి. మీ సహాయం మరిచిపోను. పిల్లలుగల వాడిని. మీ కెంతోస్తే అంతిప్పించండి. మీకు జన్మజన్మాలు బానిసనై పడివుంటాను. అనవసరంగా నాకు ఖర్చయిపోయింది. ఎట్లా చెప్పండి. అది నేను మళ్ళీ సంపాయించాలంటే సులభం కాదు. కటాక్షించండి మీ కెంతోస్తే అదిప్పించండి. వెంటనే వెళ్ళిపోతాను.

చిదం : (ఆలోచించి) వెంటనే పోతావుగదా!

కోదం : ఒక్క నిముషంకూడా నిలబడను!

చిదం : (పర్సుతీసి ఏరుస్తూ, నోట్లిస్తూ) మాట్లాడకుండా ఇది తీసుకుపో... మరింకేమీ వేధించకు ... వెళ్ళు ... [illegible] బేరం సారం చెయ్యకు...వెళ్ళు వెళ్ళు....

కోదం : (నోటు జేబులో పెట్టుకుంటూ, నీరసంగా) కానీండి—ఏంచేస్తాం సమయం అట్లావుంది. ఏం చేస్తాం... సెలవు (వెళ్తున్నాడు)

చిదం : నీ కుక్కపిల్లను కూడా తీసుకుపో. మరిచిపోయి ఇక్కడ వదిలిపెట్టేవు గనక!

కోదం : అదెక్కడ దొరికిందో అక్కడే వొదిలి పెట్టాలంటే నాకు మళ్ళీ పదరూపాయల ఖర్చు... ఈ ప్రక్క సందులో పారేస్తాను! (వెళ్ళాడు)

చిదం : ఏదో ఏమోవ్—(కూలబడి) ఛ..రామ రామ ... ఒరే సీనూ ... సీనూ ... (సీను వచ్చాడు) వాడు పోయాడా?

సీను : పోయాడు సార్—కుక్కపిల్లను తీసుకునే పోయాడు సార్.

చిదం : ఇంతసేపూ నువ్వెక్కడ చస్తున్నావ్?

సీను : చావటం ఖర్మం ఏమిటండీ—అవతల కూడా మరి కుక్కపిల్లను ఆడిస్తున్నాను

చిదం : ఆ వెధవ కుక్కనే!

సీను : ఏదో ఒకటి అలవాటయిపోయిందిసార్—కుక్కతో ఆడుకోటం!

చిదం : చూశావా—వూరిమీద తిరిగి తిరిగి, అదిక్కుమాలిన కుక్కపిల్లను తీసుకొచ్చి మనదే నంటాడు ఆ వెధవ! 'కొడుకా పోరా యమధర్మరాజా' అంటే ప్రాణాలు పీక్కుతిని ఇరవైరూపాయలు పట్టుకుపోయాడు!

# "కుక్కపిల్ల దొరికింది"

సీను : మీరు మరీనండీ! ఆ మాత్రం దానికి 5 రూపాయ లిచ్చేశారా! పెళ్ళికోసం అడిగితే లేవన్నారు!

చిదం : (చిరాగ్గా) ఇస్తానన్నాను కాదురా...ఇస్తానులే...(తలుపు తోసుకుని భీకరంగావున్న మనిషి ఒకతను వచ్చాడు. అతని పేరు చతుర్భుజం చేతిలో కుక్కపిల్ల వుంది. దాని తోకకు సన్నముక్క చుట్టబడివుంది రక్తం కారిన మరకలు ఆ గుడ్డమీద కనిపిస్తున్నై).

చతు : (కుక్కపిల్లను బల్లమీద పారేసి, సీరియస్ గా) ఇదిగో మీకుక్కపిల్ల-ఇవ్వండి... నా మాట పదహారు రూపాయలూ. వెంటనే ఇవ్వండి. (రుమాలుతో మొహం వొత్తుకున్నాడు)

చిదం : (తెల్లబోయి చూశాడు)

చతు : అట్లా చూస్తారేం—తీసుకోండి మీ పిల్లను.

సీను : (కుక్కనుతీసి) ఇదీ మన రోజా కాదు సార్!

చతు : నువ్వూరుకోవయ్యా — నీకెందుకూ—ఇది మీ రోజా కాదూ? రోజా కాకపోతే దాని 'బాబు'!...త్వరగా యివ్వండి—వెళ్లాలి!

సీను : ఈ తోకకు రక్తం యేమిటి?

చతు : ఏమిటో ఎవరికితెలుసుతావ్. ఏమండీ చిదంబరం గారూ-ఇవ్వండి పోవాలి!

చిదం : ఎక్కడికి పోతారు?

చతు : మా యింటికి — (తనను చూపుకుంటూ) చతుర్భుజం గారిల్లు అంటే అందరికీ తెలిసిందే!....కష్టపడి మీ కుక్కను వెతికి తీసుకొస్తే మర్యాదా మంచీ లేకుండా మాట్లాడతారేం—కమాన్—నా డబ్బు!

చిదం : మీ కుక్కపిల్లను తీసుకెళ్ళండి. ఇది నాది కాదు.

చతు : ఏమిటే — కాదూ! మీ షరతుల ప్రకారం పొట్టితోకా—ఇదిగో పొట్టితోక!

సీను : పొడుగుతోకుంటే కత్తితో తెగేసి పొట్టి చేశాడు సార్!

చతు : నోరుముయ్యి! మనకా గతిపట్టలేదు. తిండిలేక ఆకలితో మాడిపోతూ, ఏమీ దొరక్కపోతే, అదే దాని తోకలో చిన్న ముక్క కొరుక్కు తినేసి వుంటుంది! ఇంకా నయం. నేను గనక కట్టుకట్టాను ఆ తర్వాత - తెల్లరంగు అన్నారు మొదట్లో ఇది తెల్లగానే వుండొచ్చు బురదలో మట్టి కొట్టుకుని ఇట్లా తయారయింది.

చిదం : అసలది నా కుక్కపిల్లే కాదు తీసుకెళ్ళండి!

చతు : వాహ్వారె ఎత్తూ! మంచి ఎత్తువేశారు! ఏదీ (కుక్కను తీసుకుని, కూచుని) ఆ ఎత్తులేం మనదగ్గిర పనిచెయ్యవు. మర్యాదగా కుక్కను తెచ్చి యిస్తున్నాను మర్యాదగా నా డబ్బివ్వండి.

చిదం : (కోపంగా) ఇవ్వకపోతే ఏం చేస్తావయ్యా- తంతావా-కొడతావా-నరుకుతావా?

చతు : ఎందుకవన్నీ! గోటితో పోయే వ్యవహారం!... మీ కుక్కపిల్లను జాగ్రత్తగా వుంచాలి. ఎక్కడ దానిచోటు? (బయటకు పోయి కుక్కను వుంచేసి, వచ్చి సీనుతో) గొలుసుతో కట్టేసి రావయ్యా - అట్లా చూస్తావేం దొంగవెధవను చూసినట్టు!... పో...(సీను భయంగా వెళ్లాడు) ఏమండీ-మాట్లాడరేం?...

చిదం : కుక్కపిల్ల పోయినమాట వాస్తవమే - దానికోసం నేను బెంగపెట్టుకున్న మాటా వాస్తవమే-అది దొరికేదాకా నేను భోజనం ముట్టుకోనన్నదీ వాస్తవమే! ఐతే ఇది నా కుక్కపిల్ల కాదు. ఇంతకు పూర్వం ఇట్లాగే ఇద్దరొచ్చారు అవి నా కుక్కపిల్లలు కావంటే వెళ్ళిపోయారు!

చతు : నేనట్లా పోవాల్సినవాడిని కానండీ! ఈకుక్కపిల్ల మీది కానప్పుడు నాకు ఒక్క దమ్మిడీ ఇవ్వవద్దు. 'మీదే' అని నిదర్శనాలు చూపించాను అన్నీ సరిపోయినై...మీరు నాశ్రమ వుంచుకుంటే అనుభవిస్తారు!

చిదం : ఇంకా ఎప్పుడో అనుభవించటం దాకా ఎందుకు—అనుభవిస్తూనే వున్నాను. (ఫోన్ మోగింది. చిదంబరం తీసి) ఎవరు?...ఆఁ ...ఏఁవయ్యా— లేదయ్యా!...ఇద్దరు ముగ్గురొచ్చి చూపారు గాని, వాటిల్లో మనది లేదు...నీకూ దొరకలేదా......చేస్తానులే భోజనం మాటకేం—ఎట్లాగన్నా వెతికి పట్టుకో!...కొద్దిగా శ్రమపడు...అది లేకపోతే నాకు నిమిషం తోచదు...దొరికిన వెంటనే పిలిచి చెప్పు! ..ఆఁ...(ఫోన్ వుంచి, ఏదో గుర్తొచ్చినట్టు చరచరా లోపలకు పోయాడు. బయటనుంచి ఇళ్ళ కంట్రాక్టరు వచ్చాడు. వేషం మారివుంది. మీసాలు, తలపాగా వున్నయ్ భుజాన సంచీ వున్నది)

కంట్రా: చిదంబరంగారు లేరా?

చతు : లేనట్టే—

కంట్రా: అంటే?

చతు : ఉన్నా ఆయన ఎవరితోనూ ఇష్టంగా మాటాడరు. చాలా నిరుత్సాహంగా వున్నారు!

కంట్రా: కుక్కపిల్ల దొరక్కేనా?

చతు : దొరక్కేం - దొరికింది!

కంట్రా: దొరికిందా?

చతు : దొరికింది!

కంట్రా: ఎట్లా దొరుకుతుంది! అదేదో ఇంకో పిల్ల ఐవుంటుంది. అసలు కుక్క మాత్రం అది కాదు

చతు : ఎవరయ్యా మీరు - వూరికే అట్లా మాట్లాడతారు! అసలు కుక్క అది కాదంటే మీ రేమన్నా చూశారా!...అసలు యింతకూ మీ రేం పనిమీద వచ్చారు?

కంట్రా: వారితో వ్యక్తిగతంగా పనుండి వచ్చాను — మీ రెవరో తెలుసుకోవచ్చా?

చతు : నేనా! నేనూ ఓ పని మీద వచ్చాను. నా పని ఐతర్వాత మీరొస్తే బావుంటుంది అందాకా అవతల బెంచీ వుంది చూశారా- దానిమీద కూచోవచ్చు. ఏమీ అనరు!

[చిదంబరం వచ్చాడు]

చిదం : (వస్తూనే కంట్రాక్టరును చూచి) ఎవరది?... ఏమిటయ్యా...నువ్వా వో కుక్కపిల్లను తీసుకొచ్చావా— వెళ్లు - నాకేం చూపించకు!

చతు : అతను కుక్కపిల్లను తీసుకురాలేదండీ!

కంట్రా: తీసుకురాలేదూ —ఇంకా నయం!

చిదం : తెచ్చావూ — వద్దు లే పో...కుక్క పిల్లను నాకు చూపించకుండా నే వెళ్లు.

కంట్రా: మీ కుక్కే సార్ ఇది! (సంచిలోంచి తియ్యబోయాడు.)

చిదం : సంచిలో కూడా పెట్టావూ? తియ్యకు నీ పుణ్యం వుంటుంది. నామాట వినండి మిమ్మల్ని బతిమాలుకుంటాను - వెళ్ళండి!

కంట్రా: కుక్కపిల్లను చూడనన్నా చూడకుండా వెళ్లమంటా రేమిటండీ! ఇది మీ కుక్కపిల్లేనండి!

చిదం : అవును నాకుక్కపిల్లే......కాలవ ప్రక్కను పారుతూవుండే ప్రతీ వెధవకుక్కా నా రోజా నే! నారోజా కాదంటే మీకు కోపం కూడా వస్తుంది. అదంతా ఎందుకు...మీరు ముందు దయచెయ్యండి!...వెళ్లండి!...... (ముందుకొచ్చి తరమబోయాడు.)

కంట్రా: చూడండి సార్-ఇది మీ దేనండి.... (వెనక్కు నడుస్తూ) మీకుక్కే...పొట్టితోకా-అవును తెల్లని రంగూ-

చిదం : (ముందుకు నడుస్తూ) కోలముఖమూ, కుచ్చుతోకా— అవును-అదే! అదే నాకఖ్ఖర్లేదు వెళ్లండి!

కంట్రా: వినిపించుకోండి- చూడండీ!

చతు : వెళ్ళవయ్యా—వద్దో అంటూవుంటే వినిపించదూ? అది కాదు వారి కుక్కపిల్ల అవతల గుమ్మంలో వుంది చూసుకో!

కంట్రా: (బయటకుపోయి వచ్చాడు)

చిదం : (కుర్చీలో కూలబడ్డాడు)

చతు : చెబుతూవుంటే వినిపించుకోకుండా ఒకటే గోల! కుక్కపిల్ల దొరికినా కూడా 'మీదే మీదే' అట! ఎక్కడ వూడిపడ్డాడో దయ్యంలాగా-పాపం! చాలా బాధపెట్టాడు మిమ్మల్ని! (విసనకర్ర తీసుకొని విసురుతున్నాడు)

కంట్రా: (బయటనుంచి వచ్చాడు చేతిలో అతను తెచ్చిన కుక్కపిల్ల వుంది. తలపాగా జారిపోయివుంది-మీసం వూడిపోయివుంది వెనకనుంచి సీనుకూడా వచ్చాడు) అది మీకుక్కపిల కాదు సార్. ఇదిగో ఇదీ మీది!

చిదం : ఇదేమిటి-మిమ్మల్ని చూసినట్టుంది. ఇళ్ళకు రిపేర్లు చేసే వ్యక్తి ఎవరన్నా మీకు అన్నదమ్ముడా?

కంట్రా: కాదండి— నేనే ఆవ్యక్తిని!

చిదం : ఇదొకటి-ఇదో మోసం!

కంట్రా: కాదండి. నే నేనండి ఆకంట్రాక్టరును. ఇంతకు ముందే మీదగ్గరకొచ్చానుగా—గుర్తించారా-ఇదిగో 'ఆర్డర్ బుక్' (సంచిలో చెయ్యిపెట్టి తియ్యబోయాడు)

చిదం : మిమ్మల్ని కంట్రాక్టరు కాదని నే నేం అనలేదు. మీరు కంట్రాక్టరే కాని మీరు మరో వేషంలో వచ్చినందుకు మోసం అంటున్నాను.

కంట్రా: అది వూళ్లోవాళ్లు ఏమన్నా అనుకుంటారేమో అని గాని!...సరే. ఇదిగో మీ కుక్కపిల్ల!

చిదం : (చూసి) ఇందాకే చెప్పాను వెళ్లమని! ఇది నాదికాదు నన్ను మరి వేధించకండి!

కంట్రా: మీదే సార్, జాగ్రత్తగా చూడండి! ఇదిగో తెల్లనిరంగూ - ఇదిగో కోలముఖమూ- (సీనుతో) నువ్వు చూడబ్బాయ్!

## "కుక్కపిల్ల దొరికింది"

సీను : (తీసుకుని వేలితో తాకి) ఇది తెల్లని కుక్క కాదుసార్ - నల్లకుక్క మీదే సున్నం పూశారు

కంట్రా: సున్నం పూశారా-నువ్వు వళ్లు దగ్గిరపెట్టుకునే మాటాడుతున్నావా-సున్నం పూశారట సున్నం... ఇది మీదేనండి! ఇందాకా మీ దగ్గిర గుర్తులన్నీ తీసుకున్నాను-నా సాయశక్తులా వెతికి తీసుకొస్తానని చెప్పాను-తీసుకొచ్చాను-మీ కుక్కపిల్లను మీరు తీసుకుని నా డబ్బు నాకివ్వండి!

చతు : ఇంకా ఏం కుక్కపిల్లయ్యా-ఎక్కడ ఎత్తుకొచ్చావ్ దాన్ని-ఒరే అబ్బాయ్-దాన్ని తీసుకెళ్ళి బయటపారేయ్... వూఁ-చూస్తావేం-పో (సీను కుక్కను తీసుకుని పోయాడు!)

కంట్రా: ఒరే-అబ్బాయ్! పారేశావంటే వుద్యోగం వూడింపనే లెక్క వేసుకో. అది మీదేసార్-నేను అబద్ధం చెప్పటం లేదు.

చిదం : మీరు నిజమే చెబుతున్నారు- నేనే అబద్ధం ఆడుతున్నాను నేను వట్టి మోసగాడిని... దొంగను-సరా-ఇహ దయచెయ్యండి. (చరచరా లోపలికి పోయాడు)

చతు : అవునయ్యా-నీకేం మతీ సుతీ లేదూ - ఊరిమీద తిరిగే ఆ చెత్త కుక్కపిల్లను తీసుకొచ్చి ఆయనదేనంటూ ఇవ్వజూపుతావా-మాం-ఛి గాడివేనయ్యా!

కంట్రా: అవతల కట్టివున్న కుక్కను నువ్వు తెచ్చావల్లే వుంది!

చతు : కాక?

కంట్రా: ఐతేమరి- నువ్వు మోసంచేసి ఏదో కుక్కపిల్లను తెచ్చి ఆయనదే అని అంటగనున్నావ్-నిజంగా చెప్పు-అది ఆయన కుక్కా?

చతు : నువ్వు నిజంగా చెప్పు-నువ్వు తెచ్చింది మాత్రం ఆయన కుక్కా?

కంట్రా: నిజంగా నేను తెచ్చింది ఆయనకుక్కే పోలికలు చూసుకో.

చతు : నాదయ్యా అసలు కుక్క - నా మాటవిని దాన్ని నువ్వు తీసుకుపెళ్లు!... నా మాట వినవా!

కంట్రా: బావుంది. నీతో నాకేమిటి మధ్య!... ఏమండీ చిదంబరంగారూ!... మీ కుక్కపిల్లను తీసుకుని, బాబ్బాబూ! నా డబ్బిచ్చి పంపేద్దురూ!

చతు : అయ్యా చిదంబరంగారూ-నేను వెళ్లాలి. త్వరగా నా డబ్బివ్వండీ!

కంట్రా: అవతలఅర్జంటు పనులున్నాయండీ - అవన్నీ వదిలిపెట్టివచ్చాను. (చతుర్భుజంతో) ప్రస్తుతం ఎనిమిది తొమ్మిదిళ్లు మరమ్మత్తు చేయించాలి. చిదంబరంగారు కుక్కను తీసుకుంటే ఈఇల్లుకూడా చెయ్యాలి. (పైకి చూస్తూ) నా డబ్బిచ్చేసి ఎంతకూ పంపరు!

చతు : (చురచుర చూసి) నోట్లు లెక్కపెడుతున్నారేమో — కాస్సేపాగూ!... లేకపోతేనూ—నా డబ్బట—"నా డబ్బు!"

కంట్రా: నాది డబ్బుకాదు—నీదే డబ్బు! నువ్వే తెచ్చావు కుక్కపిల్లను. (లేస్తూ లోపలకు చూస్తూ) చిదంబరంగారూ—

చతు : చిదంబరంగారూ ... (చరచర లోపలకు వెళ్ళాడు. కంట్రాక్టరుకూడా వెనకాలే వెళ్ళాడు.)

చిదం : (ఆత్రుతగా లోపల్నుంచి వచ్చి కూర్చున్నాడు)

చతు : (వస్తూ) ఏమండిసార్! ఏమిటిది?

కంట్రా: మీరు జాగ్రత్తగా పరీక్షించి మీ కుక్కను నిర్ణయించుకోండి సార్!

చతు : నిర్ణయిస్తారుండవయ్యా—ఏమండీ...

చిదం : ఏమిటి—ఏమిటి మీ వుద్దేశం .... (మండిపోతూ) పోలీస్‌కు ఫోన్ చేస్తాను (లేవబోయాడు)

చతు : (కూచోపెడుతూ) అఁ—ఎందుకండీ అంత పని-ఈమాత్రం దానికి వాళ్లిదాకా ఎందుకు!

చిదం : ఎందుకేమిటి — లేకపోతే ఏమిటీ అల్లరి! ఇంకాస్సేపుపోతే పిల్లిపిల్లల్ని కూడా తెచ్చి "మీ కుక్కేనండీ" అంటారు పోతారా? పోలీసును పిలవమంటారా?

కంట్రా: కుచోండిసార్! (ఫోన్ వెనక్కి జరిపి, పత్రిక కప్పాడు.)

చతు : అయ్యా క్షమించండి. ఇది మీ కుక్కపిల్ల కాదని మీ రొక్కమాటతో కొట్టిపారేస్తే మేమెట్లా బతగ్గలం? మేం దొంగలం కాము-దోచుకోము.. చాలా కష్టపడి వెతికి తెచ్చాను.

కంట్రా: నేనూ చాలా కష్టపడ్డాను. మీరు కనిపెట్టండి—ఎవరిదెంత కష్టమో!

చిదం : మీ కష్టాలమాట నేనెరుగను. నన్ను నానా కష్టాలు పెట్టి—ఇంతా అంతా బాధ పెడుతున్నారా మీరు!...ష్...ఏం గోలవచ్చిందిరా భగవంతుడా! వెధవకుక్క నేరక తప్పింది....సీనూ...సీనూ... పోతేపోయింది కుక్కపిల్ల—నాకు మరి అక్కర్లేదు. మీరిద్దరూ వెళ్తారా వెళ్ళరా? (లేచాడు)

చతు : తమరు ఒక కంట చూడాలి!...లేకపోతే చచ్చిపోతాను.

చిదం : ఏమంటావయితే?

కంట్రా: అనటానికేముందండీ—ఏదో మా శ్రమకుతగ్గ ప్రతిఫలం...

చిదం : (సీరియస్ గా, విసుగ్గా చూసి పర్సుతీసి చెరో 5 రూపాయల నోటు యిస్తూ) వెళ్లండి... మాట్లాడకండి...(ఇద్దరూ సంశయిస్తూ ఒకరి మొహం ఒకరు చూసుకుంటున్నారు చిదంబరం ఈపాటికే పూర్తిగా విసిగిపోయి వున్నాడు ఆయాసపడుతున్నాడు. విసుగూ, కోపం హెచ్చిపోయినై ) చాలదూ! తీసుకోండి....పర్సులో వున్నది ఇదే!—గుల్ల చెయ్యండి పొండి. (రెండయిదులూ ఒకడికిచ్చి, 10 రూ॥ల నోటు ఇంకోడికిచ్చి పర్సు దులిపాడు ) పొండి...మీ కుక్కలూవద్దు-నక్కలూ వద్దు - వెళ్లరేం!

[ఇద్దరూ నడుస్తున్నారు. కంట్రాక్టరు ఆగి, వెనక్కు తిరిగి ఇంటికప్పుకేసి చూస్తూ జాలిగా చిదంబరాన్ని చూశాడు. చిదంబరం కూడా చూసి, నుదుటిమీద కొట్టుకుని కూలబడ్డాడు. ఇద్దరూ పోయారు.]

చిదం : (తేరుకుని) సీనూ...(గట్టిగా) సీనూ—(చూస్తూ) దిక్కుమాలిన వెధవ—దిక్కుమాలిన వెధవా అని!

సీను : (రొప్పుతూ వచ్చి) అదెవడోసార్ అవతల వించుతున్నాడు. కాదంటే వినడు, పెద్ద కుక్కను తీసుకొచ్చి మనదేనంటాడు—ఎంత పొమ్మన్నా పోడు!

చిదం : (ఛటుక్కున లేచి, ఆత్రుతగా) చంపావ్ రా ఏడీ! వస్తున్నాడా కొంపతీసి! నువ్వు త్వరగా ఆ తలుపువెయ్... గడియవేసెయ్ (నమస్కరిస్తూ) అక్కర్లేదు—కుక్కపిల్ల అక్కర్లేదు—ప్రాణాలతో మరి వుండనిచ్చేట్టు లేరు. (సీను తలుపువేసివచ్చాడు) చూడూ—కాస్సేపు పోయినతర్వాత వెళ్ళి "కుక్కపిల్ల దొరికింది" అనిరాసి—బోర్డు గుమ్మానికి కట్టు!

సీను : దొరికిందా సార్ (సంతోషంగా )

చిదం : కట్టరా వెర్రిపీనుగా—బాగాదొరికావ్!

సీను : (ఇంట్లోకి పోతాడు.)

చిదం : (ఫోన్ తీసి విసుగ్గానే) హలో...ఆఁ... ఎడిటర్ గారున్నారా — మీరేనా...సరే చూడండి..."కుక్కపిల్ల కనబడుట లేదు" అని ఈరోజు మీపత్రికలో ప్రకటన వేశారు. ఆఁ ఆఁ....ఆ ప్రకటన నేనే ఇచ్చాను—అవును చిదంబరాన్నే...ఈరోజు పేపర్లో ఆ 'కనబడుట లేదు' అన్న "కుక్కపిల్ల "దొరికింది" అని వెయ్యండి!...అవును దొరికింది...నమస్కారం...ఎవరో తెచ్చి యిచ్చారు ధర్మాత్ములు...బాబ్బాబూ... వెంటనే వేసిపెట్టండి! "కుక్కపిల్ల దొరికినది" అని పెద్దక్షరాలలో వేసి—'ఫలానా చిదంబరంగారి పోయిన కుక్కపిల్ల దొరికింది' అని వెయ్యండి—దొరికిందని వెయ్యటం ఎందుకంటారా?—వెయ్యండి — నా స్నేహితులు చాలామంది ఆతురతపడుతున్నారు...దొరికిందంటే సంతోషిస్తారు. ఎంత డబ్బయినా సరే—పంపిస్తున్నాను... దొరికిందని మాత్రం వెంటనే వెయ్యండి—థాంక్స్

[ఫోన్ క్రిందపెట్టి, నిస్సారంగా కుర్చీలో కూలబడ్డాడు. సీను ఈలోగానే లోపల్నుంచి ఒక బల్లా సుద్దముక్కా తెచ్చాడు. పెద్ద అక్షరాలలో "కుక్కపిల్ల దొరికింది" అని రాయటం ప్రారంభిస్తాడు.

[తెర]

# కలగూరగంప

## శాతవాహనులు ఆంధ్రులేనా?

"తంగిరాల"

"శాతవాహనులు ఆంధ్రులేనా? వారు మొట్టమొదట ఆంధ్రదేశంనుండే అధికారంలోకి వచ్చారా? వారి రాజధాని ఏది?"—ఈ మూడు విషయాల్లోనూ చరిత్రకారుల మధ్య తీవ్రమైన అభిప్రాయ భేదాలున్నాయి. వివిధ అభిప్రాయాలను వివరించి, చర్చించి, శాతవాహనులు ఆంధ్రులేననీ, వారు ఆంధ్ర దేశంనుండే అధికారంలోకి వచ్చారనీ, వారి రాజధాని 'ప్రతిష్ఠానపురం' అనీ సిద్ధాంతీకరించడమే ఈ వ్యాసం యొక్క ముఖ్యోద్దేశం!

శాతవాహనులు ఆంధ్రులేనని కొందరు చరిత్రకారులు, శాతవాహనులు వేరు, ఆంధ్రులు వేరు అని మరికొందరు చరిత్రకారులు భావిస్తున్నారు. పశ్చిమ దక్కనులో లభించిన 'నానఘాట్ శాసనాలు' 'నాసిక్ శాసనాలు' శాతవాహన రాజుల పేర్లను కొన్నిటిని సూచిస్తున్నాయి. ఈ రాజుల పేర్లు, వారు సింహాసనానికి వచ్చిన క్రమం, వాయుపురాణం మత్స్యపురాణాల్లో పేర్కొనబడిన ఆంధ్రరాజుల పేరతో ఎక్కువగా ఏకీభవిస్తున్నాయి. దీనినిబట్టి కొందరు చరిత్రకారులు శాసనాల్లోని 'శాతవాహనులు', పురాణాల్లోని 'ఆంధ్రులు' ఒక్కరేనని వాదిస్తున్నారు. కాని మరికొందరు చరిత్ర పండితులు ఈ వాదాన్ని వ్యతిరేకిస్తున్నారు. ఏ శాసనంలోనూ, ఏ నాణెంమీదా శాతవాహనులు 'ఆంధ్రులు' గా పేర్కొనబడియుండలేదు. అట్లే ఏ పురాణంలోనూ ఆంధ్రులు 'శాతవాహనులు' గా పేర్కొనబడియుండలేదు. ప్రతీ శాసనంలోను, ప్రతీ నాణెంమీద "శాతవాహనులు" అనిమాత్రమే వ్రాయబడిఉంది ప్రతి పురాణంలోనూ "ఆంధ్రులు", "ఆంధ్రభృత్యులు", అని మాత్రమే వ్రాయబడిఉంది కాబట్టి శాతవాహనులు వేరు, ఆంధ్రులు వేరు అనే అభిప్రాయాన్ని వెలిబుచ్చుతున్నారు.

శాతవాహనులు - ఆంధ్రులు ఒక్కరే అని అభిప్రాయపడేవారు:—

(1) శ్రీ "ఆర్. జి భండార్కర్":—ఈయన శాతవాహనులనుగూర్చి పరిశోధించిన వారిలో ప్రథములు. పురాణాలలో పేర్కొనబడిన 'ఆంధ్రభృత్య వంశము', శాసనాల్లోని "శాతవాహన వంశము" ఒక్కటే అని ఈయన అభిప్రాయము. "ఆంధ్ర భృత్యులు" అనే శబ్దానికి "ఒకప్పుడు భృత్యులుగా ఉండిన ఆంధ్రులు" అని ఈయన అర్థం చెప్పారు. శాతవాహనులు మొదట మౌర్యచక్రవర్తులకు సామంతులుగా ఉండేవారు. "శ్రీముఖు"ని నాయకత్వాన వీరు స్వతంత్రులయ్యారు భండార్కర్ ఉద్దేశ్యంలో "ధాన్యకటకము" (లేక ధరణికోట) శాతవాహనుల తూర్పు రాజధాని.

(2) డాక్టర్ బోగ్లస్ : — శాతవాహనులు ఆంధ్రులేనని, వారి రాజధాని మొదట మచిలీపట్నా దగ్గరఉన్న "శ్రీకాకుళము"ని, తర్వాత 'ధాన్యకటకా'నికి మార్చుకున్నారని, ఇతని అభిప్రాయం.

(3) వి. ఏ స్మిత్ : శాతవాహనులు ఆంధ్రులేనని, వారి రాజధాని శ్రీకాకుళమని ఇతని అభిప్రాయం. "ఇ జె. రాప్సన్" కూడా ఇదే ఉద్దేశ్యంతో ఉన్నాడు.

(4) డాక్టర్ ఎల్. డి. బార్నెట్ : శాతవాహనుల రాజధాని మొట్టమొదట "శ్రీకాకుళము," తర్వాత "ధాన్యకటకము," క్రీ॥ శ॥ ఒకటవ శతాబ్ది నాటికి పశ్చిమరాష్ట్రిలమధ్య నున్న "ప్రతిష్ఠాన పురము"—అని ఇతడు భావిస్తున్నాడు.

(5) ప్రొఫెసర్ పి. టి. శ్రీనివాసఅయ్యంగార్: ఈయన, శాతవాహనులు ఆంధ్రులేనని ఒప్పుకున్నారు కాని శాతవాహనులు తూర్పు ప్రాంతంనుంచే (అంటే ఆంధ్రదేశం నుంచే) అధికారంలోకి వచ్చారనే విషయాన్ని అనుమానిస్తున్నారు.

ఇక శాతవాహనులు వేరు ఆంధ్రులు వేరు-అనే అభిప్రాయం కలవారు :—

(1) డాక్టర్ సూక్తాంకర్ : శాతవాహనులు-ఆంధ్రులు భిన్నులని వాదించేవారిలో ఈయన ప్రథముడు ఈవాదానికి కారణాలు : (ఎ) ఆకాలపు శాసనాల్లో ఎక్కడా కూడా శాతవాహనులు ఆంధ్రులని పిలవబడలేదు. (బి) ఆకాలపు సమకాలిక శాసనాలైన "హాతిగుంఫ" "గిర్నార్" "థలగుంప" మొదలైన శాసనాల్లో కూడా "శాతవాహనులు" అనే పేర్కొనబడ్డారుగాని, "ఆంధ్రులు" అని ఎక్కడా వ్రాయబడలేదు. (సి) శాతవాహనుల ప్రాచీన శాసనాలు, నాణెములు పశ్చిమ దక్కన్‌లోనే లభించాయి

కాబట్టి శాతవాహనులు ఆంధ్రులై ఉండరనీ, వారు పశ్చిమాన్నుండి తూర్పుకు వచ్చి ఆంధ్రులతో కలిసి నివసించారని "సుక్తాంకర్" యొక్క అభిప్రాయము, ఇతడు "ఆంధ్ర భృత్యులు" అనే శబ్దాన్ని "ఆంధ్రుల యొక్క భృత్యులు (సామంతులు)" అని షష్ఠీ తత్పురుషలో అర్థం చేసుకున్నాడు. కాబట్టి ఆంధ్రుల యొక్క సామంతులు, ఆంధ్రులే అయివుండనక్కరలేదు! ఏజాతివారైనా కావచ్చు!!

(2) కె. పి. జయస్వాల్ : ఆంధ్ర-శాతవాహన ఏకత్వాన్ని ఈయన ఒప్పుకోలేదు శాతవాహనులు అశోకుని శాసనాల్లో పేర్కొనబడిన "శాతేయపుత్రులు" అని ఈయన వాదన.

(3) ప్రొఫెసర్ రాయ్‌చౌదరి: ఇతడు కూడా సూక్తాంకర్ అభిప్రాయాన్నే బలపరుస్తున్నాడు. "ఆంధ్ర" అనే పేరు శాతవాహన వంశంలో ఆఖరి రాజులకు వచ్చి ఉంటుందని ఇతని అభిప్రాయం.

(4) డాక్టర్ కె. గోపాలాచారి : పడమటి ప్రాంతం (అంటే మహారాష్ట్రప్రాంతం) నుండి శాతవాహనులు అధికారానికి వచ్చి క్రమంగా ఆంధ్రదేశాన్ని కూడా ఆక్రమించుకున్నారనే వాదాన్ని ఈయన బలపరుస్తున్నారు. కాని శాతవాహనులు జాతి సాంకర్యమునుపొంది ఆంధ్రులయ్యారని నమ్ముతున్నారు.

ఏ శాసనంగాని, ఏ నాణెముగాని శాతవాహనులను ఆంధ్రులుగా పేర్కొనని మాట వాస్తవమే! శాసనాలలో కుటుంబం పేరు వ్రాయడం ఆనాటి ఆచారము. శాలంకాయనులు, బృహత్ఫలాయనులు, విష్ణుకుండినులు మొదలయినవారంతా ఈ విధంగానే తమ తమ కుటుంబాల పేర్లనే శాసనములలో వ్రాయించారు. పురాణాలలో "ఆంధ్రులు" అని వ్రాయబడిందంటే అది వారి జాతి పేరుగా గ్రహించాలి. కాబట్టి ఆ చక్రవర్తులు శాతవాహన కుటుంబానికి చెందిన ఆంధ్ర జాతివారు అంటే వారి ఇంటిపేరు (Family name) "శాతవాహనులు" జాతి పేరు (Name of the tribe) "ఆంధ్రులు". పురాణాలలో వ్రాయబడిన "ఆంధ్ర భృత్యులు" అనే శబ్దం ఒకప్పుడు భృత్యులుగా ఉండిన ఆంధ్రులు" అనే అర్థాన్ని సూచిస్తోందనడమే సముచితము కాబట్టి శాతవాహన కుటుంబీకులు ఆంధ్ర జాతికి చెందినవారని సిద్ధాంతీకరింపవచ్చును

అయితే శాతవాహనులు మొట్టమొదట ఏ ప్రాంతంనుండి అధికారంలోకి వచ్చారు?అనేది గొంతైన ప్రశ్న! ఆంధ్రదేశంనుండే తమ రాజకీయ జీవితాన్ని ప్రారంభించారని కొందరు చరిత్రకారులు, పశ్చిమ ప్రాంతం (మహారాష్ట్రదేశం) నుండి అధికారానికి వచ్చారని మరికొందరు చరిత్రకారులు భిన్నాభిప్రాయాల్ని వెలిబుచ్చుతున్నారు.

శాతవాహనులు పశ్చిమ దక్కనునుండి అధికారం లోకి వచ్చారనడానికి ఆధారాలు :—

(1) శాతవాహనుల శాసనాలు పడమటదక్కను లోని "నానఘాట్", "నాసిక్" ప్రాంతాల్లోనే లభిస్తున్నాయి గాని, ఆంధ్రదేశంలో లభించడం లేదు.

(2) కళింగదేశాన్ని పాలించిన "ఖారవేలుడు" అనే రాజుయొక్క శాసనంలో అతని సమకాలికుడైన శాతకర్ణి రాజ్యం కళింగకు పడమటి దిక్కుగా ఉన్నట్లు సూచింపబడింది ఆంధ్రదేశం కళింగదేశానికి దక్షిణదిశగా ఉంది కాని పశ్చిమ దిశను లేదు.

(3) గౌతమీపుత్ర శాతకర్ణి తల్లియైన "గౌతమీ బాలసిరి" వ్రాయించిన శాసనాల్లో ఆమె కుమారుని రాజ్య సరిహద్దులు పేర్కొనబడ్డాయి. అవి ఆంధ్రదేశంలోని ఒక్క ప్రాంతాన్ని కూడా సూచించడం లేదు.

(4) ఆంధ్రదేశంలో లభించిన మొదటి శాసనాలు గౌతమీపుత్రుని తరువాతి రాజైన వసిష్ఠీపుత్ర శ్రీపులుమావి" పాలననే సూచిస్తున్నాయి. కాబట్టి

# కలగూరగంప

మొట్టమొదట శాతవాహనులు పశ్చిమ దక్కనులోనే అధికారంలోకివచ్చి క్రమంగా ఆంధ్రదేశాన్ని కూడా ఆక్రమించుకున్నారు.

కాని పై వాదనంతా ఏవో కొన్ని శాసనాలిచ్చే అసంపూర్తి అంశాలమీదే ఆధారపడిఉంది. ఆ వాదనంతా పూర్వపక్షం చేసే అంశాలెన్నో ఉన్నాయి.

(1) శాతవాహనుల ప్రాచీన శాసనాలు పడమటి దక్కనులోనే లభించినవన్నమాట నిజమే కాని లభించిన శాసనాలు రెండు మాత్రమే! గౌతమీపుత్ర శాతకర్ణికి పూర్వం పాలించిన శాతవాహన రాజులు ఇరవైమంది అయితే రెండు శాసనాలమీదే ఆధారపడి వాదించడం శోచనీయం. మిగిలిన శాసనాలేవైనా మునుముందు ఆంధ్రదేశంలో లభించవచ్చునేమో!

(2) ఖారవేలుని శాసనం, శాతకర్ణి రాజ్యము కళింగకు పడమటి దిక్కున ఉన్నట్లు మాత్రమే సూచిస్తోంది కాని, శాతకర్ణి రాజ్యానికి ఆంధ్రదేశానికి ఏవిధమైన సంబంధం లేదని తెల్పడం లేదు

(3) ప్రాచీన చక్రవర్తియైన శాతకర్ణి యజ్ఞయాగాదులనేకం చేసినట్లుగాను, "దక్షిణాపథపతి" అనే బిరుదాన్ని గలిగియున్నట్లుగాను 'నానఘట్' శాసనాన్ని బట్టి తెలియవస్తోంది ప్రాచీన శాతవాహన రాజులు (అంటే గౌతమీపుత్ర శాతకర్ణికి పూర్వ రాజులు) ఆంధ్రదేశాన్ని పాలించి ఉండనట్లైతే "దక్షిణాపథపతి" అనే బిరుదు ఎలా సార్థకమౌతుంది?

(4) "పెరిప్లస్" గ్రంథకర్త "దచ్చినబైడ్స్" (Dachinabides), "లిమిరైక్" (Limyrike) ప్రదేశాల్లో ఉన్న వర్తక పట్టణాలనుగురించి వ్రాశాడు. 'దచ్చినబైడ్స్' అంటే దక్షిణాపథము 'లిమిరైక్' అంటే తమిళదేశము. ప్రాచీనాంధ్ర దేశంలో వర్తకానికి ప్రసిద్ధికెక్కిన పట్టణాలెన్నో ఉన్నాయి!

(5) శాతవాహన చక్రవర్తియైన 'హాలుడు' "గాథాసప్తశతి" అనే గ్రంథాన్ని రచించాడు. ఆ గ్రంథంలోని ఒక గాథలో ఈ విధంగా పేర్కొనబడింది: "సిరిసంపదలలోను, నీతిలోను శాతవాహనుల రాజభవనాలతో తులదూగే మరొక రాజభవనం, గోదావరినది పుట్టి, ప్రవహించి, సాగరంలో కలిసిపోయే విశాలదేశంలో ఎక్కడాలేదు!" అఖండ గోదావరి పరవళ్లు త్రొక్కే దేశం ఆంధ్రదేశం కాక మరేదేశం?

(6) "లీలావతీ పరిణయము" అనే ప్రాకృత గ్రంథంలో "సప్తగోదావరీ" తీరాన "హాలుడు" 'లీలావతిని' వివాహం చేసుకున్నట్లు ఒక కథ ఉంది. "సప్తగోదావరి" అనేది నేడు తూర్పుగోదావరి జిల్లాలోని దాక్షారామంవద్ద ఉన్న ఒక చెరువుతో పోలుస్తున్నారు.

కాబట్టి శాతవాహనులు ఆంధ్రదేశంనుండి అధికారంలోకి రాలేదనడం మిక్కిలి సత్యదూరం! ఆంధ్రదేశానికి శాతవాహనులకీ సంబంధమే లేదనడం కేవలం పొరపాటని వేరే చెప్పనక్కర్లేదు!! పడమటను క్షాత్రపులు బలవంతులైనపుడు, శాతవాహనులు పశ్చిమతీర ప్రాంతాన్ని కోల్పోయారు. కాని గౌతమీపుత్రుడు క్షాత్రపుల నోడించి పశ్చిమప్రాంతాన్ని తిరిగి సంపాదించాడు. అందుచే అతని పుత్రుడు "పులుమావి" తిరిగి "దక్షిణాపథేశ్వరుడు" అనే బిరుదాన్ని వహించాడు. అందుచేత, శాతవాహనులు ఆంధ్రదేశంతోసహా దక్షిణదేశాన్నంతటినీ పాలించిన చక్రవర్తులనేది నిస్సందేహమైన విషయం!

ఇక మిగిలిన వివాదాంశ విషయం శాతవాహనుల రాజధానిని గురించినది. శాతవాహనుల ముఖ్యపట్టణం "శ్రీకాకుళము" అని కొందరు, "ధాన్యకటకము" (లేక 'ధరణికోట') అని మరికొందరు, "ప్రతిష్ఠాన పురము" (లేక 'పైథాన్') అని కొందరు భావిస్తున్నారు. 'శ్రీకాకుళము' రాజధాని అవడానికి కేవలం కథలే ఆధారం కాబట్టి దానిని నమ్మలేము. బహుశా, 'ధాన్యకటకము' మొదటి రాజధానిగా ఉండిఉండేది శాతవాహన రాజులు మహారాష్ట్ర దేశాన్ని జయించిన తర్వాత, విశాలదేశాన్ని పాలించడానికి తూర్పున ధాన్యకటకం ఒక్కటే చాలదు కాబట్టి, మరొక రాజధాని కూడా ఆవశ్యకమై ఉండిఉంటుంది. అప్పుడు ప్రతిష్ఠానపురాన్ని పశ్చిమ రాజధానిగా చేసుకుని ఉంటారు విదేశీయుల దండయాత్రలు, ముఖ్యంగా గ్రీకుల దండయాత్రలను అరికట్టడానికి, శాతవాహనులు ప్రతిష్ఠానపురాన్ని శాశ్వతరాజధానిగా చేసుకుని ఉంటారు.

పురాణాల్లో పేర్కొనబడిన "ఆంధ్ర భృత్యులు" అనే శబ్దానికి "ఒకప్పుడు భృత్యులుగా ఉండిన ఆంధ్రులు" అనే అర్థమే సముచితం. దీనినిబట్టి శాతవాహనులు మొదట మౌర్యులకు సామంతులుగా ఉండేవారని తెలుస్తోంది! అశోకుని ఒక శిలాశాసనంలో (Asokas Rock edict—18) శాతవాహనులు మౌర్యులకు సామంతులుగా పేర్కొనబడ్డారు. అశోకుని నిర్యాణానంతరం, శాతవాహనులు "శ్రీముఖుడు" అనే వాని నాయకత్వాన స్వతంత్రులయ్యారు!! ఆంధ్రుల మహోజ్జ్వలచరిత్రకు నాందీ ప్రస్తావన జరిగింది!!

# కుమారసంభవ సంస్కరణము

శ్రీ నే. వెంకటరమణయ్య

శ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రిలవారు నన్నెచోడుని కుమారసంభవములోని పద్యములను కొన్నిటిని సంస్కరించి వెంకటేశ్వర ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్ త్రైమాసిక, సం 2 సంచి 1 (తెనుగు పుట-13) లోఁ బ్రకటించియున్నారు. అందు కొన్ని సంస్కారము లావశ్యకములా యను సంశయము పొడమినది. కలిగిన సంశయములను నివర్తి చేసికొనుటకై వాని నిచ్చట తెలియపఱచుకొను చున్నాఁడను.

శ్రీ శాస్త్రిలవా రిట్లు వ్రాసియున్నారు: "కవి హృదయము... గోచరింపఁగా నాకది నాకుఁ గనకాభిషేకము చేసినాఁడన్న సంతోషమునఁ దోఁగినాఁడను. మఱికొన్ని;

ఆయవనీరుహోద్గత ల
    తాంతవినిర్గతసౌరభప్రవా
హాయతసాంద్రమై ఫలిత
    మై యొగి బర్విన డాయఁబోవఁగం
టాయనురాక చుటి మధు
    ప వ్రజమాలికలుం డెనొప్పి పు
ష్పాయుధు కోలఁజుట్టు మగు
    డాయసవప్రము వెట్టినట్టిదై.

వ (?) తమాశ్వాసము 298 ప

"దీనికి నా సంస్కరణము:

ఆయవనీరుహోద్గత ల
    తాంతవినిర్గతసౌరభప్రవా
హాయతిసాంద్రమై ఫలిత
    మై యొగిఁబర్వినడాయఁబోవనుం
టాయనురాక చుట్టి మధు
    ప వ్రజమాలికలుం డెనొప్పి పు
ష్పాయుధశాలఁజుట్టు మధుఁ
    డాయసవప్రము వెట్టినట్టులై.

"పుష్పాయుధశాల కధికారియైన వసంతుఁడా యాయుధశాలలోని కెవరికిని రాకపోకలు వీలు లేకుండుటకు చుట్టును నినుపకోట పెట్టినట్లు భృంగమాలికలు పూలచెట్లను జుట్టియున్నవి—పూచిన చెట్లు పుష్పాయుధశాలలు—మధుఁడు తదధినేత — ఇందులోఁ బుష్పాయుధు కోల్మ మగఁడు ఉండుట యసంగతము."

సంస్కరించుటకై శ్రీ శాస్త్రిలవా రుదహరించిన పద్యము శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి ముద్రిత ప్రతినుండి గ్రహింపఁబడినది. కాని కవిగారి ముద్రిత ప్రతిలో నీ పద్యముయొక్క రెండవపాదము 'హాయతసాంద్రమై ఫలితమై మొగిఁబర్విన' అని ముద్రితమై యుండఁగా దానిని 'యొగిఁబర్విన' అని శాస్త్రిలవా రేల యుదాహరించిరో తెలియదు. వ్రాతప్రతియందును? మొగింబర్విన' అని యే కానవచ్చుచున్నది. 'యొగిం బర్విన అనుపాఠము శ్రీ శాస్త్రిగారి కెచట లభ్యపడెనో? ఇది 'నా సంస్కరణము' కాదుగదా. పుష్పాయుధుకోల' యసంగతమని 'పుష్పాయుధశాల' అని సవరించినారు 'పుష్పాయుధుకోల' పుష్పాయుధుని యొక్క అనఁగా మన్మథునియొక్క కోలయని గ్రహింపవలసియుండెను. కాని ఈ సంస్కరణమువలన కవియొక్క భావము తెల్లము గాదు. ఈ సంస్కరణము పైని వ్యాఖ్యయందు శ్రీ శాస్త్రిలవారు చెప్పినట్లు 'పుష్పాయుధశాల' (అనఁగా పుష్పములనెడు ఆయుధములను నిక్షిప్తము చేసియుంచిన శాల) అని సవరింపవలయును. మఱియు, 'మగఁడు' ఉండుట యసంగతమని చెప్పి 'మగఁడాయసవప్రమును', 'మధుఁడాయసవప్రము' అని మార్చి, తమ మార్పును సమంజసమని రుజుసేయుట కిట్లు వాదించియున్నారు. పుష్పాయుధశాల కధికారి మధుఁడు, 'పూచిన చెట్లు పుష్పాయుధశాలలు, 'మధుఁడు తదధినేత' కావున యతఁ డాయసవప్రము వెట్టెననుట యుక్తము అని. మధుడు మరుని ఉపవాయి కాని యాయుధాగారాధ్యక్షుడు గాడు అట్లని యనుటకు ప్రమాణమేమియును గానరాదు. సేనాపతిత్వమును వాయుధాగారాధ్యక్షత్వమును వేర్వేరు పనులు గాని యొక్కటి కావు. ఇట్లని యర్థశాస్త్రగ్రంథములవల్ల తెలియవచ్చుచున్నది. 'పుష్పములను' ఆయుధములుగ బ్రయోగించువాఁడు మరుఁడు—వానిని సంరక్షించుకొనవలసినవాఁ డతఁడు. కావున తన యాయుధశాలకు మగఁడాయసవప్రము వెట్టెననుట సుసంగతముకాని యసంగతము గాదు.

ఈ పద్యమును సంస్కరించి సవ్యాఖ్యానముగఁ బ్రకటించిన శాస్త్రిలవారు దీని ద్వితీయపాదమందలి 'ఫలితమై' యను మాటయొక్క సందర్భోచితిని విశదీకరించి యుంచిన పాఠకుల కృతజ్ఞతకు బోధకముగ పాత్రులయ్యుండెడివారు. ఫలితమైన దెద్ది? 'ఆయవనీరుహోద్గతలతాంతవినిర్గతసౌరభప్రవాహాయతి'యా? సౌరభప్రవాహాయతి సాంద్రమగుట యొప్పును? ఫలితమగుట యెట్లు? ఒకవేళ అగునని తలఁచినను అర్థమేమి? సాంద్రమగుటచే డాయఁబోవ సాధ్యపడదయ్యె—ఫలితమగుటచేఁ బాయఁజాలక పోయెనని కదా చెప్పవలయును. ఇది యెట్లు పొసఁగును? మధు

# కలగూర గంప

పములు గంధ లుబ్ధలనియు మధుగ్రహణమునకై విక
సిత లతాంతములకు మూగుననియు సుప్రసిద్ధి—ఫల
ముల నారగించుట కొండె రసాస్వాదనము కొండె
చెట్లు కవి మూగునని యెంగును గాన గాదు ఇక 'ఫలి
తమై' యను మాట నిచట నెట్లర్థము జేసికొన
వలయును?

మఱియొక పద్యమునందు గూడ శ్రీ శాస్త్రిల
వారి సంస్కరణ మనావశ్యకమని తోఁచుచున్నది.
కుమారసంభవ ప్రథమాశ్వాసము 2 వ పద్యమున
వినాయక వర్ణన ఇట్లు కానవచ్చుచున్నది.

తను వసితాంబుదంబు సిత
  దంత యుగం బచిరాంశు లాత్మగ
ర్జన మురు గర్జనంబు గర
  స్రుచి శక్రశరాసనంబునై
చనమదవారి వృష్టిహిత
  సస్య సమృద్ధిగ నభ్ర వేళనాఁ
జనుగణనాథుఁ గొల్తునని
  తంబు నభీష్ట ఫలప్రసిద్ధిగాన్.

ఇది సరికాదని శ్రీ ప్రభాకరశాస్త్రిగారి యభి
ప్రాయము—తమ యభిప్రాయమునకు గారణము నిట్లు
వివరించియున్నారు "విఘ్నేశ్వరుఁ డేకదంతుఁడు.
కాన 'సితదంతయుగం' బనియుండరాదు. అచిరాం
శువు=మెఱుపు అది ఉపమానము కాన యప్పుడప్పుడు
మాత్రమే కన్పడునదిగా నుండవలెను 'సితదంతముఖం
బనుటలో నోరు తెఱచినప్పు డగపడుచు మూసినప్పు
డగపడకుండుట దంతాగ్రమునకు కలిగి యచిరాంశు
సామ్యము సిద్ధించును." కావున, "దీనికి నా సంస్క
రణము.

తను వసితాంబుదంబు సిత
  దంతముఖం బచిరాంశువాత్మగ
ర్జన మురుగర్జనంబు గర
  స్రుచి శక్రశరాసనంబునై
చన మదవారి వృష్టిహిత
  సస్య సమృద్ధిగ నభ్రవేళనాఁ
జను గణనాథు గొల్తునని
  తంబు నభీష్ట ఫలప్రదాతగాన్.

'కవి హృదయము' నెఱింగి 'తెలుఁగు కూర్పు
మెఱుఁగు'లను దెలిసి శ్రీ శాస్త్రిలవారు చేసిన మార్పు
లనావశ్యకములని చెప్ప సాహసించుచున్నాఁడ.
మొదట విచారించఁదగినది "దంతముఖము". "దంత
ముఖం బనుటలో నోరు తెఱచినప్పు డగపడుట మూసి
నప్పు డగపడకుండుట దంతాగ్రమునకు కలిగి యచి
రాంశు సామ్యము సిద్ధించును" అని వచించిరికదా
శ్రీ శాస్త్రిలవారు. విఘ్నేశ్వరుఁడు గజాననుఁడుగదా
ఏనుఁగు నోరు తెఱచిన నేమి మూసిన నేమి? దంతము లెప్పు
డును మఱుఁగుపడకుండుట ఎల్లరు నెఱింగినవిషయమే.
ఇక దంతముఖమునకచిరాంశుసామ్య మెట్లు సిద్ధించును?
రెండవది ఏకదంత విచారణ: విఘ్నేశ్వరున కేకదంతుఁ
డని పేరుండుట నిశ్చయమే. ఎవ్వరను గాదనలేరు.
అజన్మప్రభృతి యెల్లప్పుడు నితఁ డేకదంతుఁడుగనే
యుండెనా? లేక కారణాంతరములవలన నేకదంత
త్వము నన్న సిద్ధించెనా యనుట విచారణీయాంశము.
పౌరాణిక గాథలను పరిశోధించి చూడఁగా గజాననుని
కన్నియేనుఁగులవలె మొదట రెండు దంతములుండె
ననియు కాలక్రమమునం దొకటి భగ్నముకాగా
తత్కారణమున నేకదంతుఁడను పేరు వచ్చెననియు
దెలియుచున్నది. ఒకానొకప్పుడు పార్వతీ పరమేశ్వ
రులు రహస్యక్రీడ వర్తించుచు విఘ్నేశ్వరుని నెవ్వరిని
లోనికి రానీయకుండుటకై ద్వారమున కాపరిగ
నియమించిరట. అప్పుడు పరమేశ్వరుని దర్శించుటకై
పరశురాముఁడు వచ్చి విఘ్నేశ్వరుఁడు ద్వారము
నరికట్టఁగా కోపించి తన పరశువుచే నతనిదంతమును
ఛేదించెననియు నాటినుండియు నతఁ డేకదంతుఁ
డాయెననియు బ్రహ్మాండపురాణమునందు జెప్ప
యున్నది ఇంతకంటె సుప్రసిద్ధమైన కథ మఱియొకటి
యన్యత్ర కానవచ్చుచున్నది ఒకానొకప్పుడు
వినాయకుఁడు పొట్టనిండ మోదకాదులను భుజించి
పోవుచుండఁగా మార్గమధ్యమున కాలుజాఱిపడెననియు
దత్కారణమున మోదకభరితమైన పొట్టపగులగా
కుడుములను పోనీయక చేతితో పిగిలిన పొట్టనుబట్టుకొని
తండ్రికడ కేగుచుండఁగా చూచి చంద్రుఁడు నవ్వె
ననియు నందులకు గినిసి విఘ్నేశ్వరుఁడు దనదంతముల
యం దొకదాని కొనవిఱిచి చంద్రునిపై వీచెననియు
దెలియుచున్నది. ఈ రెండవ యైతిహ్యమును బట్టి
చూడఁగా ఏకదంతుఁడను పేరు కలిగినను నతనికి
రెండుదంతములు లేకపోలేదనియు రెండవది
భగ్నమైనను సంపూర్ణముగ విఱుగలేదనియు
దెల్లమగుచున్నది. ఈ కథయే భారతదేశమునం దెల్ల
యెడలను ప్రాచీనకాలమునుండియు వాడుకయం
దుండెనని మన దేవాలయములయందును అన్యస్థలముల
యందును గానవచ్చెడు విఘ్నేశ్వర ప్రతిమలు రుజువు
చేయుచున్నవి ఏకదంతముగల విఘ్నేశ్వర ప్రతిమ

యెంచునగానరాదు. అన్నియు దంతయుగళము తోడనే చెక్కఁబడియున్నవి; కాని యందొకటి సంపూర్ణమైనది; మరియొకటి చివర తునిసినది కావున నన్నెచోడదేవుఁడు 'సితదంతయుగం' బని చెప్పుట తప్పుకాదు. దీనిని సంస్కరింపవలసిన యవసరము లేదు

మఱియొక సంస్కరణము. కుమారసంభవము ఆ ౧ ప ౪౧ ప్రాతప్రతియందిట్లు కానవచ్చుచున్నది

మదమున.... కావ్యము
నదరంగ విలుగొని పట్టినమ్ములనుం బరహృ
ద్భిదమై తలయూపింపని
యది కావ్యమె మరి పట్టినదియుఁ గరమే

శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారీపద్యము నిట్లు సంస్కరించి ముద్రించిరి.

మదమున సత్కవికావ్యము
నదరఁగ విలుగొని పట్టినమ్ములను బరహృ
ద్భిదమై తల యూపింపని
యది కావ్యమె మలిపట్టినది యుంగరమే.

ఈ సంస్కరణము శ్రీ ప్రభాకరశాస్త్రిలవారికి నచ్చలేదు. "దీనికి నా (అనఁగా, ప్రభాకర శాస్త్రిల వారి) సంస్కరణము" ఇట్లు:

మదమునఁ గవికృత కావ్యము
నదరున విలుగొని పట్టినమ్ములను బరహృ
ద్భిదమై తలయూపును, బెఱ
యది కావ్యమె చెప్పఁ, బట్టినదియుం శరమే

మొదటి చరణములోని లుప్తభాగముఁ 'గవి కృతి' యనుమాటలను జేర్చి 'కవికృతి కావ్యము' అని చరణమును బూర్తి చేసిరి — 'కృతి' యనుమాటకు గావ్యమను నర్థముగలదని యందఱు నెఱింగిన విషయమే — 'కవికృతి కావ్యము' ఇందువలన పునరుక్తి దోషదూషితమగుచున్నది — 'సత్కవి' యను రామకృష్ణకవిగారి సంస్కరణమె సమంజసమని తోఁచుచున్నది — మఱియు నన్నెచోడఁడు ౧. ౩౭ వ పద్యములో

"పరఁగ సువర్ణ బంధ మృదు
భావముగల్గియు లోనుమాఱఁగా
బొరపగు చిత్రరూపమును
బోలెనసత్కవికావ్య మిమ్మహిన్
బరఁగు సువర్ణ బంధమృదు
భావవిశేష......లన్
సరియగు రత్నపు
త్రికయు సత్కవికావ్యము నొక్కరూపమై.

"అసత్కవికావ్యము" "సత్కవికావ్యము" అని ప్రయోగించియున్నాడు. కావున "మదమున...... కావ్యము" అను కందపాదములోని గ్రంథపాతమును "మదమున సత్కవికావ్యము" అను రామకృష్ణకవిగారి సవరణ నన్నెచోడని రచనాపద్ధతి ననుసరించి చేయబడినదగుటచే యుక్తమని యెంచదగియున్నది మఱియు శ్రీ శాస్త్రిలవారు సంస్కరణ వ్యాజమున నీ కంద పద్యముయొక్క ఉత్తరార్థము నన్నెచోడని రచనను దొలగించి తమకవిత్వమును జొప్పించిరి — ప్రాతప్రతిని బట్టి ముద్రితమైన పద్యము చక్కఁగనే యన్వయమగు చున్నదే — ఇందు "పరహృద్భిదమై తల యూపింపని యది" అను వాక్యము కావ్యమునకును శరమునకును సామాన్యము — "మదమున సత్కవికావ్యము, పర హృద్భిదమై తల యూపింపని యది, కావ్యమె?" "అదరఁగ విలుగొని పట్టినమ్ము, పరహృద్భిదమై తల యూపింపని యది, శరమే (అమ్మె) ?" సంగ్రహీకరణము అనఁగా చెప్పఁదలఁచిన విషయమును కొద్దిమాటలతో జెప్పుట చోడనికి గరము ప్రియము. కావున శ్రీ శాస్త్రిలవారి సంస్కరణ యనావశ్యకమని చెప్పవలసి వచ్చినది కాని ఈ కందపద్య చతుర్థపాదము ముద్రితగ్రంథమున నిట్లు కలదు: యది కావ్యమె అలరిపట్టినది యుంగరమే" ప్రాతప్రతియందీపంక్తి 'యదిగావ్యమెమరిపట్టినది యుంగరమే' అని యున్నది. ఇచ 'మరి' మధ్య 'ల' కారమును జొప్పించి 'మలరిపట్టినది యుంగరమే' అని శ్రీ రామకృష్ణ కవిగారు సంస్కరించి ముద్రించిరి. "మలగు" శబ్దమున కీ సందర్భమున నేమి యర్థమో వారు తెలుపరైరి — 'మలగు' అను క్రియాపదము కల దేమో తెలియదు — అన్యత్ర ప్రయోగము కానవచ్చుటను గానరాదు — నిఘంటువులయందు జెప్పుటను లేదు - 'మరి' అను మాటను 'మలరి' అని సంస్కరించుటకంటె 'మఱియు' అని సంస్కరించుట యుక్తము - 'కరమే' యనుట కంటె 'శరమే' యనుట సాధ్యము — ఈ సవరణను ఇంతకుముందు కొందఱు పండితులు జేసి యున్నారు. ఇప్పుడు శ్రీ శాస్త్రిలవారి యాదరణ కది పాత్రమైనది.

# గ్రంథ విమర్శనము

## ఆంధ్ర తులసీరామాయణము

[బాలకాండము]

రచన: శ్రీ మైలవరపు సూర్యనారాయణ మూర్తి, ప్రాప్తిస్థానము: రచయిత, కృష్ణంపాలెం, ఎర్నగూడెం పోస్టు, పశ్చిమగోదావరి జిల్లా, మూల్యం రు. 2-8-0.

"హిందీ భాషలో వున్న సాహిత్యమేమిటి?" అని హిందీ ప్రచారవ్యతిరేకులు యెవరేనా ప్రశ్నించగానే వెంటనే ప్రచారకులనుంచి వచ్చే తుపాకి గుండులాంటి సమాధానం—"తులసీదాసు రామాయణం చదివావా?"—ఆ ఒక్క సమాధానంతో హిందీ భాషకు మహత్తరమైన సాహిత్య సంప్రదాయముందని ఒప్పుకు తీరవలసివస్తుంది. ఉత్తర హిందూస్థానంలో వాల్మీకి రామాయణాని కంటే తులసీ రామాయణానికి ఎక్కువ వ్యాప్తివుంది. హిందీ మాతృభాష గాగల ప్రతి ఒక్కరూ తులసీరామాయణం తమదని చెప్పుకుని గర్వపడతారు. ఇంటింటా యీ గ్రంథాన్ని నిక్షేపించుకొని పూజించి పఠింమతారు తెలుగు జాతిలో పోతన గారి పద్యాలు ఎలా ఆబాలగోపాలంలోనూ వ్యాపించి ఉన్నాయో, హిందీప్రజానాకంలో తులసీదాసు రామాయణ కీర్తనలు అలా వ్యాపించి వున్నాయి ఈ సామ్యాన్ని గమనించే శ్రీ మైలవరపు సూర్యనారాయణమూర్తి గారు పోతన గొంతుతో పద్యానువాదంగా తెలుగు ప్రజలకు అందజేయ ప్రయత్నించారా అనిపిస్తుంది. నిజానికి ఈపద్యరచన పోతన గొంతువలెనే వినిపించుతోంది. అందుకు శ్రీ సూర్యనారాయణ మూర్తి గారిని అభినందించవలసివుంది. కాని తులసీదాసుగారు 'రామచరిత మానసము'ను సోరఠా, చౌపాయి, దోహా మొదలైన గేయఛందస్సులలో, స్త్రీబాలవృద్ధులు కలసి రామచరితను బృందగానం చేసి ఆనందపరవశులు కావటానికి అనువుగా రచించారు. అలాంటి అవకాశంవుండేలాగు శ్రీ సూర్యనారాయణ మూర్తి గారు ఈ గ్రంథాన్ని అలాంటి గేయఛందస్సులలో ఎందుకు అందించారు కాదా అని ఒకింత కించ కలుగుతోంది. శ్రీ సూర్యనారాయణమూర్తిగారు ప్రతిభాసంపన్నులనే విషయం ఈ గ్రంథమే విస్పష్టం చేస్తోంది. అందుచేత వారు గేయరచనగా దీన్ని రచించదలచివుంటే అది వారికి కష్టసాధ్యమైన పనిగాదు ఏది యేమైనా మూర్తిగారికి అట్టిసంకల్పమేలనో కలుగలేదు. దానికి వగచి ప్రయోజనంలేదు. వారు అందజేసిన అనువాదంయొక్క గుణాగుణాలనే పరిశీలించి మనం సంతృప్తులం కావలసివుంది.

వాల్మీకి రామాయణానికీ, తులసీ రామాయణానికీ చాలా వ్యత్యాసముంది. రామచరితను సృష్టించటంలో వాల్మీకి దృష్టి వేరు. శ్రీరాముని వాల్మీకి ఆదర్శప్రాయుడైన ఆర్షప్రభువునుగా వ్యక్తీకరించటానికి ప్రయత్నించినంతగా, భగవదవతారంగా వ్యక్తి

కరించటానికి ప్రయత్నించలేదు. దర్మవీరానికి యిచ్చి నంత ప్రాధాన్యత భక్తిసంప్రదాయానికి యివ్వలేదు. గుహుడు, శబరి మొదలైనఘట్టాలలో తప్పభక్తిరసం మన స్సును ముంచెత్తదు. వాల్మీకిరచన మానవహృదయాన్ని ధర్మాచరణ సంపన్నము చేయటానికి ప్రయత్నించు తుంది. వాల్మీకి ఆర్ష ధర్మప్రచారకుడు. తులసీదాసు గారు పరమభక్తుడు. ఆయన హృదయం భక్తిరసాన్ని మధురవాహినులుగా వెలార్చుతుంది. అందుచేత నే తులసీదాసుగారు 'రామచరితమానసమును' వాల్మీకి స్త్రోతను గాక అధ్యాత్మరామాయణపంథాలో నడి పారు. ఆంధ్ర వాఙ్మయంలో తులసీదాసుతో పోల్చ దగిన భక్తిరసపరవశుడు పోతన. రచనకూ జీవితానికీ కూడా పోతనను లక్ష్యప్రాయునిగా ఎంచుకున్నవారు శ్రీ సూర్యనారాయణమూర్తిగారు పోతనవలె నేచిన్న పల్లెటూరులో కర్షకవృత్తి నవలంబించి నిరాడంబరంగా జీవించుచున్నారు. పూర్వజన్మసంస్కారంగా లభిం చిన కవితాప్రతిభను భగవచ్చరితమును గానంచెయ్య టానికివినియోగించి, రామచరిత మానసము ఏడుకాండ లనూ ౭ వేల పద్యాలలో సంఘటించిచరితార్థులయారు. 14 వందల పద్యాలకు పైబడిన ఈబాలకాండ ఇప్పుడు ప్రకటించి అందజేశారు. ఆంధ్ర ప్రజల ఆదరాభిమా



నాలతో మిగతా కాండలు కూడా త్వరలో వెలువడ గలవని ఆశించుచున్నాము.

ఇప్పటికి 30 సం॥రాలకు పూర్వం శ్రీ భాగవతుల నరసింహశర్మగారు ఈ తులసీ రామాయణానికి స్వేచ్ఛానువాదం చేసి ప్రకటించారు. ఆ గ్రంథానికి పీఠిక వ్రాస్తూ కీ. శే. నాగేశ్వరరావు పంతులుగారు: 'మూలానుసారముగగూడ ననువదించిన తులసీదాసుని యభిప్రాయములను యథాతథముగ దెలిసికొనుటకు వీలుండెడిది' అన్నారు. శ్రీ సూర్యనారాయణ మూర్తి గారి అనువాదం పూర్తిగా మూలాన్ని అనుస రించుచూ వుండటంచేత ఆ కొరత తీర్చుతున్నది.

ఉ॥ చల్లని తండ్రి కూతురకు
చల్లనితల్లి నొకర్తు సాకె యిం
జల్లనిపల్లె నింకొకతె
సమ్మతి నోచలదాల్చి, భూమిగా
జల్లనకెల్ల యొల్లయగు
చందురు దాల్చి, కృపారసంబు పై
నెల్లెడ జల్లునల దర
మేసుడు చల్లనికంట జూచుతన్.

ఉ॥ నల్లనివాడు నాభినళి
నమ్మున బమ్మను గన్నవాడు, జా
బిల్లియనుంగు జెల్లెలిని
జేర్మి యురమ్మున గొన్నవాడు, నా
పెల్లగు పాలవెల్లిపయి
వేయిమొగంబుల పాపపాన్పునం
జల్లగ బండి లోకముల
సాకెడు నా హరి మమ్ము బ్రోవుతన్.

ఉ॥ అమ్మకునమ్మ, యమ్మరుని
యమ్మ జగమ్ముల బ్రోచుకొమ్మ, లో
కమ్ముల పట్టుకొమ్మ రఘు
కాంతుని కూరిమి ముద్దుగుమ్మ, సీ
తమ్మ హితమ్ము గూర్చి యన
యమ్మనయమ్ము లడించి బ్రోవుతన్.

ఇష్టదేవతాస్తుత్యాదికములోని పైమూడు పద్యా లనూ తిలకించితే శ్రీ సూర్యనారాయణ మూర్తిగారు పోతన రచనావిధానాన్ని ఎలా పుణికిపుచ్చు కున్నారో బోధపడిపోతుంది.

"నా శబ్దాడంబరలాలస యొక్కొకచో మానసా మృత పిపాసుల రసాస్వాదనమున కడ్డు తగిలి, వారి స్వాంతప్రశాంతికి భంగము సేయవచ్చును. అట్టి నా యన భిజ్ఞతాదోషములు మూలకారున కాపాదింపక నాకే విడిచెదరుగాక యని మానసాభిజ్ఞుల వేడికొందును' అని శ్రీ సూర్యనారాయణమూర్తిగారు విన్నపములో తెలి పారు ఈ వాక్యాలు రచయిత వినయ సౌశీల్యానికి తార్కాణములుగా గ్రహించదగినవే గాని వేరుకాదు.

# గ్రంథ విమర్శనము

శబ్దార్థములను బంధించుటలో రచయిత సిద్ధహస్తుడు. రస దరిద్రుడైనవాని శబ్దాడంబరలాలస వెకలితనంగా పరిణమించుతుంది గాని రసద్రష్టయైన కవి వాక్కు శబ్దజాలంగా వెల్లివిరిస్తే అందుకు ఆక్షేపణ యేముంది? ఒక్క సంస్కృత శబ్దజాలాన్ని చాలనం చెయ్యటంలో నేగాదు, తెలుగు నుడికారాన్ని కూడా ముత్యాల పేరులుగా సంతరించుకురాగలరు. పరమేశ్వరుణ్ణి ప్రేమించుతున్న పర్వతరాజపుత్రిని మహర్షులు ఎకసక్కె మాడుతున్న ఈపద్య మెంత ముచ్చటగావుంది!

"ఉండ కొంపలేను, పండ పాన్పును లేదు
బండతో లు చుట్టుబండకాని
బుస్సకొట్టు విసపుబురువు సొమ్ములవాడు
దిసమొలావు, కాటి దిరుగువాడు."

తులసీరామాయణం భక్తిభావ ప్రచారానికి ఉద్దేశింపబడిన గ్రంథం గనుక భాగవతంలోని భగవల్లీలల వర్ణనాలలో దీల్లోకూడా అలాంటివి అనేకం ఉల్లేఖించారు. బాలకృష్ణుడు యశోదకు చూపినట్లే శ్రీరాముడు కౌసల్యకు విశ్వరూపం చూపిన ఘట్టం వుంది. పోతన విశ్వరూపవర్ణన చవిజూచి ఆనందించిన పాఠకులకు మూర్తిగారి విశ్వరూప వర్ణనను కూడా చవి చూపాలని ఉత్సాహంగా వున్నది:

'అంతం గన్గొనె గోసలేశసుత పు
త్రాస్యంబునన్ భూమిభృ
త్కాంతార క్షితి సింధులన్ రవిశశాం
క బ్రహ్మ శర్వాళి సం
తంతిన్ భీతిని జేతులొగ్గుకొను మా
యన్ మాయ కాధీనుడౌ
భ్రాంతాత్ముండగు జీవునిన్ భ్రమము జి
త్రిం బొత్తరింపగ మదిన్'

కాంచెను కాలకర్మముల
గాంచె గుణంబు స్వభావముందునన్
గాంచెను జీవమాయలను
గాంచెను గాంచనగర్భ ముఖ్యులం
గాంచెను జీవు మాయయను
కట్టెడిబాపుమ బ్రోచు భక్తినిం
గాంచెను మున్నెవండు బొడ
గాంచి యెఱుంగని చిత్రజాలమున్.'

ఆంధ్ర తులసీరామాయణం పోతన భాగవతం వలెనే ఆంధ్ర ప్రజల ఆదరాభిమానాలను చూరకొన గలదని విశ్వసించుచున్నాము. తె. సూ.

## యాత్రామార్గదర్శి
### [ద్వితీయ భాగము]

రచన: శ్రీ రాగం వెంకటేశ్వర్లు; ప్రకాశకులు: శ్రీ సీతారామనామ సంకీర్తన సంఘము, గుంటూరు, అనుబంధములతో సహా 500 ల పుటలుగల గ్రంథం; వెల 4-0-0.

లోగడ వారు ప్రకటించిన యాత్రామార్గదర్శి దక్షిణ భారత యాత్రలకు పరిమితమైన ప్రథమ భాగం, ఆంధ్ర ప్రజల ప్రశంసల నందుకున్నది. ఇప్పుడు ఉత్తర భారత యాత్రలకు సంబంధించిన విషయాదికాలుగల ఈ ద్వితీయభాగాన్ని కూడా ప్రకటించి యావద్భారత పుణ్య, చారిత్రక ప్రదేశాల వివరాల నన్నిటినీ అందజేసి కృతకృత్యులైనారు. ఈ గ్రంథములను రచయిత కేవలం యాత్రామార్గదర్శిగా గాక, యావద్భారత సాంఘిక చరిత్రవలె నిర్మించారు. అనేక కష్టనష్టాలకు ఓర్చి సేకరించిన విషయబాహుళ్యం గల ఉద్గ్రంథం. ఆ సేతుహిమాచలపర్యంతమూ భారత దేశ సమగ్రమైన స్వరూపాన్ని అవగతం జేసుకోవటానికి ఈ రెండుభాగాలనూ ప్రతి ఒక్కరూ చదివి తీరాలి. ప్రతి గ్రంథాలయంలోనూ భద్రపరుప వలసిన ఉపయోగకరమైన గ్రంథం.

## గే య మం జ రి

ఖండకావ్యసంపుటి; రచన: శ్రీ కందుకూరి రామభద్రరావు; ప్రాప్తిస్థానం: కందుకూరి పుండరీకాక్షుడు, లెక్చరర్, యస్. కె బి ఆర్. కాలేజ్ అమలాపురం. తూర్పు గోదావరిజిల్లా; మూల్యం: రు. 0-12-0.

ఈ సంపుటికి పరిచయ వాక్యాలు రచించిన శ్రీ జిల్లెళ్లె వెంకటభానోజీరావుగారు, ఈఖండకృతులలో, జీవితంలో ఎదుర్కొనే వివిధ సంఘర్షణలు, సమస్యలూ వీటి అనుభూతులవల్ల కలిగిన వేదనయిలాంటివేవో వున్నట్టు వ్రాశారు. రచయితకు అలాంటివేవీ వున్నట్లు కనుపించవు. రచయిత హృదయం జగత్తుతో నిమిత్తం లేకుండా తనయిష్టం వచ్చిన రంగురంగుల పూలు పూసే అమాయికమైన పూలమొక్క. పసందైన పదాలతో జిలిబిలి పోకడలు పోతారు.

మావిగొమ్మల్లార
ఏవి తెచ్చిర చివుళ్లు?
కట్టండి తోరణాల్
కమ్మతావులు చిమ్మ.

మాలతీ తీగలార!
మల్లితీవల్లార!
పూలమాలలు గ్రుచ్చి
వేలాడగట్టండి.

వేసవూ దేవియలు
తీసి నెరకలు కలిపి
ఆమోదాలు పండంగ
లేవలారా రండి!'

ఇదీ ఈ రచయితపోకడ. ఈ సంపుటిలో, కులాసాగా పాఠకుని ఆనందింపజేసేందుకు తగిన పాటలు: 'గిరియ నిమ్మ' 'తెలుగుతోట' 'ఉగాది', కళాసుందరి, జీవితవల్లి, గంగమ్మ, శిశువు, తెప్పతిరునాళ్లు, పాట, మల్లెపూవు, మాలతి, కోకిల, పాపాయి, మొదలైన శీర్షికలలో 15 వరకూ వున్నాయి. మచ్చుకు 'కృష్ణమ్మ' పాట.

'నా చిన్నికృష్ణమ్మ నడిపించు ముచ్చట్లు
లోకమ్ము మురిపించు నాకమ్ము తిలపించు

ఎత్తుకొన కృష్ణమ్మ ఎలనగవు నవ్వినా
పడిన ముత్యాలతో ఒడి కొంగు నిండించు

అలకచాలులలోన ఒలుకునీలాలెల్ల
దరహాస చంద్రికల తళతళని మెరపించు.'

---

భారతి సచిత్ర మాసపత్రిక
ప్రకటన రేట్లు

కవరు పేజీలు

| | క్యాజువల్ | కంట్రాక్టు |
|---|---|---|
| 4-వ కవరు పేజి | | |
| 2 లేక 3 రంగులు | రు. 125/- | రు. 100/- |
| 2 లేక 3-వ కవరు పేజి | | |
| ఒకే (నలుపు) రంగు | 90/- | 75/- |
| లోపలి పేజీలు | | |
| పూర్తి పేజి | 70/- | 60/- |
| అర్ధ పేజి | 35/- | 30/- |
| పావు పేజి | 20/- | 15/- |

ప్రత్యేక స్థానములకు 25% అదనం.
సం॥నకు వరుసగా 12 ప్రకటనలు చేయు వారికే కాంట్రాక్టు రేటు వర్తించును.
కవులు, కళాకారులు, రచయితలు మొదలైన వారి ప్రకటనలు ఒక కాలం ఇంచికి లేపకు రు. 2/- చొప్పున ప్రకటించబడును.

మేనేజరు, భారతి.
మద్రాసు-1.

---

### వి జ్ఞ ప్తి

ప్రకటింపబడని రచనలను తిరిగి తెప్పించుకొనగోరువారు రచనలతోపాటే తగిన పోస్టేజి స్టాంపులు పంపవలసివుంటుంది. అనంతరం ఎప్పుడో స్టాంపులు పంపి ఆ రచనలకొరకై ఉత్తరములు వ్రాసి ప్రయోజనం వుండదు. రచయితలు గమనింప ప్రార్థన.

సంపా.

---

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

అక్టోబరు 1956

సంపుటము 33 : : సంచిక 10

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## అక్టోబరు 1956

# ఎంకి వరం

శ్రీ నండూరి వెంకటసుబ్బారావు

నోరు మాటాడ తన నొసలు వేటాడు
ఏరికోరీతీరు ఎంకి రాపాడు

కామిష్టట మా కిట్టు
సాములే భామలటు——
గోపికల గోపనము
దీపికల దాసరమె——
నోరు మాటాడ....

కోపియట ముక్కంటి
సాఫె ఉమ కాపురము——
పశుపతికె రతిపతిని
నుసిసేయు కనికరము——
నోరు మాటాడ....

లోభె బంగరు బొజ్జ
రొఖ్ఖమే వాణి పని——
తనకు నాల్గవసరము
మన కొకటేడుపె కరము——
నోరు మాటాడ....

మూటికి ముడియమైచు
మొనగాడు నేనయట
ఎకసకెమె ఒక వరము
ఎంకె నా కిహపరము——
నోరు మాటాడ....

1955 లో రష్యా 105000 యూనిట్ల పని ముట్లను తయారు చేసిందనీ, అసంవత్సరం అమెరికా 88000 యూనిట్ల పనిముట్లను మాత్రమే తయారు చేయగలిగిందనీ అమెరికా ప్రభుత్వం స్వయంగా అంగీకరించింది. స్వయం చోదక పరిశ్రమలోని బాల్ బేరింగ్ శాఖలో సోవియట్ కనుగొన్న నూతన నిర్మాణ విధానం చూచి బీన్ మెచ్చుకున్నాడు. "ముచ్చటగా వుంది" అన్నాడు. ఆ రకంలో అమెరికాలో యే ప్రాంతంలో తయారయేవి వీటితో తులదూగ లేవన్నాడు. ఈ అన్ని అనుభవాలనూ పురస్కరించుకుని, పరిశ్రమలన్నిటినీ స్వయంచోదక సంపన్నములుగా పరివర్తనం చెందించాలనే నూతన పంచవర్ష ప్రణాళిక లక్ష్యాన్ని సోవియట్ ప్రభుత్వం సాధించ గలదని ఆయన చెప్పివేశారు. సోవియట్ పరిశ్రమలో బీన్ విమర్శకు గురియైన విషయాలు కూడా అనేకం వున్నయ్. అమెరికన్ కర్మాగారాలలో సామానులు ఇక్కడనుంచి అక్కడికీ అక్కడినుంచి యిక్కడికీ జారవెయ్యటానికి మనుష్యులను వాడరు. పరిక్రమణ యంత్రాలను (మూవింగ్ మెషిన్సు) వాడతారు కాని రష్యాలో, నాటుపద్ధతిన, ఇంకా కూలీలనే వాడుతున్నారు. రష్యా పారిశ్రామిక పరిణామంలో ఇలా యీ నాటు పద్ధతులు కొంతకాలం అనివార్యం కావచ్చు ఏ విధమైన శిక్షణా ఎరుగని ఈ నాటు కూలీలను యీ విధంగా వాడుకోవటం సోవియెట్ కు లాభదాయకం కావచ్చు. ఈ నాటు కార్మికుల పాత తరం అంతమైపోయి, సోవియెట్ సాంకేతిక శిక్షణ కేంద్రాలలో దళాలు దళాలుగా శిక్షణ పొందుతున్న కొత్తతరం సాంకేతిక దళాలు చేతికందితేనే గాని, పరిక్రమణ యంత్రాలు సోవియెట్ కు లాభదాయకం కావు.

ఇంకా కొన్ని నాటుపద్ధతులు వున్నాయి ఉదాహరణకు; ఒక్కొక్క పరిశ్రమ తనకు కావలసిన యావత్తు చిల్లర సామానూ, 'బోల్టులు' దగ్గర నుంచీ తనే స్వయంగా తయారు చేసుకుంటుంది. ఇలాంటి వాటి అన్నిటికీ యితర కేంద్రాలమీద ఆధారపడితే అవాంతరాలూ, ఆలస్యాలూ జరుగుతాయనే భయం కొంత యిందుకు కారణం కావచ్చు.

కాని ఒక విషయం మటుకు గమనించవలసి వుంది. సోవియట్ లో యితర పరిశ్రమలలో అనుసరింపబడుతున్న సాంకేతిక విధానాలకంటే యుద్ధ పరిశ్రమలో అనుసరింపబడుతున్న విధానాలు ప్రతిభావంతమైనవి సాధారణ వినిమయ వస్తువుల పరిశ్రమలలో ప్రయోగించే సాంకేతిక విధానాలు, ఆలనా పాలనా లేకుండా ఆ పరిశ్రమల పరిస్థితి యెలావుందో, అదే ప్రకారం చాలా కనిష్ఠ ప్రమాణంలో వున్నాయి.

దీన్నిబట్టి చూస్తే ఈ నూతన పంచవర్ష ప్రణాళికలో సోవియెట్ ప్రభుత్వం రెండు లక్ష్యాలను సాధించవలసి వున్నట్లు కనుపించుతుంది పరిశ్రమల నన్నిటినీ స్వయంచోదకములుగా పరివర్తన చెందించడం, నాటు విధానాలను అన్నింటినీ అంతంచేసి ఆధునాతన పద్ధతిలో పునర్నిర్మాణం చెయ్యటం. రెండవది అధికోత్పత్తులవల్ల కార్మికులకు లభించే అధిక భాగంలో తిరిగికొంత సేకరించి, వినిమయవస్తు పరిశ్రమలను అభివృద్ధికి తేవటం ఇందుకు సరుకటి పెట్టుబడి విధానాన్ని మార్చవలసిన పనేమీ లేదు. సోవియెట్ పరిశ్రమకు కార్మికశక్తి యిప్పటికే చాలీచాలని స్థితికి వచ్చింది. అందుచేత స్వయంచోదక విధానాన్ని తక్షణం అమలు జరపి తీరవలసిన అవసరం యేర్పడ్డది. ప్రభుత్వావసరాలు పోగా మిగిలిన పెట్టుబడిని వినియోగించుతారు గనుక వినిమయ వస్తు పరిశ్రమ అభివృద్ధి కూడా లాభదాయకమే అవుతుంది ఈ కార్యక్రమాన్ని అమలు జరపటానికి ఉద్యుక్తులై వున్నారు. గనుకనే, సోవియట్ నిర్వాహకులు. లోగడ అనవసరం అనుకున్న రంగాలలో కూడా, ఇప్పుడు పాశ్చాత్య దేశాలు అనుసరించుతున్న విధానాలేమిటో తెలుసుకోవటానికి యిప్పుడు తీవ్రంగా ప్రయత్నించుతున్నారు.

ఈ విషయాన్నంతా అవగతం చేసుకొన్న తరువాత బీన్ తుది హెచ్చరికను కూడా మనం గమనించవలసి వుంటుంది.

"సోవియట్ దేశం ఇప్పుడు ఒక మహత్తరమైన పరిణత సాంకేతిక యుగంలో అడుగుపెడుతున్నది - నిజంగా ఆలోచించితే యిది మనం భయభ్రాంతులం కావలసిన విషయం" ఈ హెచ్చరిక యెంతవరకు సమంజసమైనదనే విషయాన్ని చర్చించటానికి ఈ వ్యాసం ఉద్దేశింపబడ్డది.

స్థూల దృష్టితో విచారించితే అంత భయభ్రాంతులం కావలసిన విషయమేమీ యిందులో కనుపించదు. సోవియెట్ ఆర్థిక విధానం యెంత అభివృద్ధి చెందినా, అమెరికా స్తోమతుకు ఇంకా చాలా వెనుకబడే వుంది. అట్లాంటి స్థితిలో పాశ్చాత్య మిత్రరాజ్యాలన్నిటికివున్న అవకాశాల నన్నిటినీ సమన్వయించుకుని, సోవియెట్ సామ్రాజ్యావకాశాలతో పోల్చి చూస్తే పాశ్చాత్య దేశాలదే చాలా పై చేయిగా కనుపించుతుంది. ఉదాహరణకు; 1955 లో అమెరికా ఉక్కు ఉత్పత్తులు 11 కోట్ల 70 లక్షల టన్నులు, సోవియట్ ఉత్పత్తులు 4½ కోట్ల టన్నులు. ఈ రంగంలో 35 సంవత్సరాల క్రితం అమెరికా ఉత్పత్తులు యే ప్రమాణంలో వున్నాయో ఈ వేళకూడా రష్యన్ ఉత్పత్తులు ఆ ప్రమాణంలోనే వున్నాయి. అమెరికా

# రష్యాబలం ఏమిటి?

ఉత్పత్తుల నన్నిటినీ, వ్యవసాయికోత్పత్తుల నేఖీలూ కలిపి విలువకడితే 38700 కోట్ల డాలర్ల విలువ వుంది. ఈ 1955 లో రష్యా సర్వతోముఖోత్పత్తులూ ఇందులో మూడోవంతు లేవు.

ఈ అంకెలు పాశ్చాత్య దేశాలు కొంచెం బుజాలు యెగరవేసుకోవటానికి వీలుగా కనుపించుతూవున్నా, యిందులో గమనించవలసిన ప్రధాన విషయం ఒకటి వుంది. సోవియట్ ప్రజల సుఖసౌఖ్యాలకు అక్కడ ప్రాధాన్యత లేదనీ, సోవియట్ ప్రభుత్వ బలాన్ని అభివృద్ధి చేయటమే వారి ప్రధానాశయమనీ మనం మరచిపోగూడదు. ప్రజల స్థితిగతులను అదే కనిష్ఠ ప్రమాణంలో వుంచేసి, సోవియెట్ అధికారులు, లభించిన ధనాన్నంతా తిరిగి పెట్టుబడికి వినియోగించుతున్నారు. ఈ విధంగా తమ పారిశ్రామిక సామ్రాజ్యాన్ని విస్తరింపజేస్తున్నారు. ఈ విధంగా యిప్పటికి పారిశ్రామిక రంగంలో బ్రిటన్ జర్మనీలను అధిగమించి పోయారు. అమెరికాతో తులదూగే దశను అందుకోవటం ఇంకా యెన్నో నాళ్లు పట్టకపోవచ్చు. వారి గమనం యెంత దురితంగా వుందో తెలుసుకోవటానికి గత యెనిమిది సంవత్సరాల లెక్కలూ ఒకసారి తిరగవేస్తే సరిపోతుంది.

ఈ 8 సంవత్సరాల అభివృద్ధి చరిత్రా నిజంగా గమనింపదగివుంది ఎందుచేతనంటే, అతః పూర్వం, అంటే 1948 కి పూర్వం, సోవియెట్ ప్రభుత్వం తన పారిశ్రామిక రంగానికి బలమైన పునాదిని వేసుకోవటానికి మాత్రమే ప్రయత్నించుతోంది. ప్రయోగ కార్యక్రమం ద్వారా ప్రణాళికా నిర్వహణలలో వచ్చే సాధక బాధకాల నన్నిటినీ అవగతం చేసుకుంటోంది. 1941 నుంచి 1945 వరకూ దేశాన్ని సర్వనాశనం చేసివేస్తున్న యుద్ధ భీభత్సాన్ని యెదుర్కొనే కార్యక్రమంలో నిమగ్నమై వుంది. 1945 నుంచి 47 వరకూ పునరావాస కార్యక్రమం సరిపోయింది.

అనంతర దశలో 1948 నుంచి 1955 దాటేసరికి, సోవియట్ ఉక్కు ఉత్పత్తి 100-కి 143 వంతుల చొప్పున పెరిగింది. అమెరికన్ ఉత్పత్తి ఈ అవధిలో 48 వంతులకు మించలేదు. రష్యా పెట్రోలు ఉత్పత్తి 100-కి 141 వంతులు పెరిగితే, అమెరికా ఉత్పత్తి 100-కి 22 వంతులు మాత్రమే పెరిగింది. రష్యా విద్యుచ్ఛక్తి అభివృద్ధి 158%, అమెరికా అభివృద్ధి 85%; సోవియట్ బొగ్గు ఉత్పత్తి 86% పెరిగితే అమెరికా ఉత్పత్తులు ఉన్నదాంట్లో 22% దిగజారింది. 1950-51 అవధిలో సోవియట్ మొత్తం ఉత్పత్తులు 70% పెరిగాయి. ఈ అవధిలో అమెరికా ఉత్పత్తులు 25% మాత్రమే పెరిగాయి.

స్థూలంగా చెప్పాలంటే, గత పంచవర్ష ప్రణాళిక కాలంలో సోవియట్ పారిశ్రామికాభివృద్ధి అమెరికా పారిశ్రామికాభివృద్ధికి మూడు రెట్లు. ఈ విషయాన్ని గమనించితే, రష్యా అమెరికాకు ఉన్న పారిశ్రామిక ప్రమాణాన్ని అందుకోవటానికి యిక ఎంతో వ్యవధి అక్కర్లేనట్లు కనుపించుతుంది. కాని ఈ వ్యత్యాసం అంత తేలికగా అధిగమించవగింది కాదు. ముందు ముందు సోవియట్ అభివృద్ధికి ఇంత త్వరితగమనం ఉండటానికి అవకాశం లేదు. ఆర్థిక రంగం విస్తృతమైనకొద్దీ అభివృద్ధి నిష్పత్తి సహజంగా తగ్గుతుంది. నూతన పంచవర్ష ప్రణాళికలో రష్యా ప్రభుత్వం సాధింపదలచిన ఉక్కు ఉత్పత్తుల మొత్తం పూర్వాంకంకంటే పెద్దదే; కాని ఆ క్రితం ఉత్పత్తులపైన క్రిందటి ప్రణాళిక సాధించిన ఉత్పత్తి పెంపుదలతో, ఈ క్రొత్త ప్రణాళికలో ఉద్దేశించిన అభివృద్ధిని పోల్చిచూస్తే, ఇది చాలా తక్కువగా వుంది. ఎందుచేతనంటే ఉత్పత్తిచేయవలసిన పరిమితి ఇప్పటికే అతిక్రమించిందిగా వుంది. గమనించదగిన విషయం మరొకటి కూడా వుంది. సోవియట్ ఉత్పత్తులకు సర్వతోముఖాభివృద్ధి లేదు. ఒక పార్శ్వం తోంట. పారిశ్రామికాభివృదికి సంబంధించినంతవరకూ త్వరితగమనమే కనుపించవచ్చు. కాని ప్రజాక్షేమానికి అవసరమైన వ్యవసాయ, గృహనిర్మాణాది ఇతర సర్వ రంగాలలోనూ రష్యా అమెరికాకంటే చాలా వెనుకబడివుంది. అందుచేత రష్యా అనతికాలంలో పారిశ్రామికరంగంలో అమెరికాతో బరోబరిగా లేవగలిగినా మొత్తం జాతీయోత్పత్తులదృష్ట్యా అమెరికాతో తులతూగలేదు.

రష్యా ఆర్థికవ్యవస త్వరితగతిని అభివృద్ధిచెందుతున్నదన్న విషయం సర్వులూ అంగీకరించుతున్నదే. కాని ఈ త్వరితగతి ఏ ప్రమాణంలో వున్నది అనే విషయంలోనే తీవ్రమైన వాదోపవాదాలు వున్నాయి కాని ఈ వాదోపవాదాల తీవ్రతలో అభిజ్ఞులు ఒక ప్రధాన విషయాన్ని విస్మరించుతున్నారు. అభివృద్ధి ప్రమాణమెంత అని కాదు ఆలోచించవలసింది. అభివృద్ధి స్వభావమెట్టిదనేది అత్యంత ప్రధానమైన విషయం. త్వరగా పెరిగినా, ఆలస్యంగా పెరిగినా, పావురాయికి పెరిగేది అందమైన పుచ్ఛం. డేగకు పెరిగేవి ఉక్కుగోళ్లు. పారిశ్రామికరంగంలో అమెరికాకు అందమైన పుచ్ఛం పెరుగుతోంది. రష్యాకు ఉక్కుగోళ్లు పెరుగుతున్నాయి.

1955 లో అమెరికా దాదాపు 80 లక్షల మోటారుకార్లను తయారుచేసింది. ఈనాడు అమెరికా ప్రజల జీవనవిధానమే సమగ్రంగా మారిపోయింది.

స్వంత కారు లేనివారు ఎక్కడికీ పోలేరు, ఏ పనీ చెయ్యలేరు. అలా అలవాటైపోయింది లేదా పరిస్థితులు అలా మారాయి. అందుచేత అమెరికన్ పరిశ్రమ ఏటేటా లక్షలాది మోటారుకార్లను తయారు చేయటం అనివార్యమైంది. ఈ మోటారుకార్ల నాగరికత వృద్ధికాకుండా మొదటినుంచీ అదుపుచేస్తూ వస్తే ఏమయ్యేది? ఇతర రంగాలలో ఉత్పత్తులు పెరిగే సావకాశం వుండేది.

ఇదే కారణంగా ఇప్పుడు రష్యా మోటారు పరిశ్రమను మరుగుజ్జు స్థితిలో ఉంచారు. రష్యా ప్రజలు ప్రయాణసౌకర్యాలు కన్నిటికీ రైలుమార్గాల మీదా దూరపు ప్రయాణాలకు కాలువలమీదా ఆధారపడి జీవిస్తున్నారు. రష్యన్ మోటారుపరిశ్రమ సంవత్సరానికి 3,50,000 ట్రక్కులూ, 80,000 కార్లుమాత్రం నిర్మించుతుంది వాటిలో పైని కావసరాలకు పోను మిగిలినవాటిని మాత్రమే పట్టణ సంఘాలు బస్సులకు వినియోగించుతారు. సాధారణ ప్రజానీకమంతా జనం క్రిక్కిరిసివుండే ఆ బస్సుల్లో ప్రయాణం చెయ్యాలి, లేదా కాళ్లకు బుద్ధిచెప్పాలి. ఏ అగ్ర నాయకులకో తప్ప, అక్కడ స్వంతకారులో ప్రయాణంచేసే అదృష్టం సామాన్యులెవ్వరికీ పట్టదు.

ఇందువల్ల కలిగే ప్రయోజనమేమిటి? అమెరికాకు మల్లే, రష్యాలో మొత్తం ఉక్కు ఉత్పత్తులలో నూటికి 20 వంతులు ఈ మోటారులు మింగివేయటం లేదు. ఇదికాక, బృహత్ ప్రమాణంలో రబ్బరు, గాజు, తేలికలోహాలూ, ప్లాస్టిక్ సంపదా, వీటన్నిటి నిమించి—సాంకేతిక పరిజ్ఞాన సంపన్నమైన విశేష కార్మికశక్తి—యిందుకింద వ్యయమైపోవటం లేదు. పెట్రోలు ఉత్పత్తులలో మూడవవంతు రోడ్లమీద ఆవిరైపోవటం లేదు. మోటారు పరిశ్రమ వార్షికాభివృద్ధి పథకం ఏటేటా నూరుకోట్ల డాలర పెట్టుబడిని మ్రింగటంలేదు ఇప్పుడు ఇప్పుడు, ప్రధాన రహదార్ల మీదవున్న రద్దీని తగ్గించటానికి, ఒక 5 కోట్ల డాలర్లు ఖర్చుపెడితే ఎలావుంటుంది. అని సోవియెట్ ప్రభుత్వం ఆలోచించుతోంది. సోవియెట్ సరఫరా సౌకర్యాల నిర్మాణమంతా కాలువలను రైలుమార్గాలనూ దృష్టిలో పెట్టుకు ఏర్పాటు చేశారు. అందుచేత ప్రధాన రహదారులని అమెరికావారు అనుకునేలాటి రహదార్ల అవసరం అక్కడేమీ లేదు ఇలా పొదుపు చేసిన ధనాన్నంతా ప్రధాన పరిశ్రమలనూ, యుద్ధపరిశ్రమలనూ బలవత్తరంగా నిర్మించుకురావటానికి వినియోగించారు.

అమెరికా సాలుసరి పెట్టుబడులలో 3/5 వంతులు ప్రజావినిమయోత్పత్తులకు గాను ఖర్చవుతున్నది. జాతీయశక్తిని పెంపొందించే భారీ పరిశ్రమలకు 2/5 వంతులు మాత్రమే వినియోగించుతున్నారు.

సోవియెట్ ప్రభుత్వం మొత్తం పెట్టుబడిలో 4/5 వంతులు ఈ భారీ పరిశ్రమలక్రింద ఉపయోగించుతోంది. ఇంతేకాక మొత్తం ఉత్పత్తుల విలువలో రష్యా పెట్టుబడిక్రింద సేకరించే మొత్తం, అమెరికా మొత్తం ఉత్పత్తులనుంచి సేకరించే మొత్తంకంటే నూటికి 60 రెట్లు ఎక్కువగా వుంది అందుచేత రష్యా సర్వతోముఖోత్పత్తులు అమెరికా ఉత్పత్తులలో మూడోవంతు లేకపోయినా, అమెరికాకంటే యెక్కువ పెట్టుబడిని జాతీయశక్తిని పెంపొందించే ఈ భారీ పరిశ్రమలక్రింద వినియోగం చేయగలుగుతున్నారు. 'జాతీయశక్తి పెంపొందటం ప్రధానాశయం—ప్రజల యోగక్షేమాలు తరువాత ఆలోచించదగ్గవి'— అనే ఈ సూత్రం సోవియెట్ సర్వరంగాలలోనూ వ్యాపించి అనేక ఫలితాలను ఇస్తున్నది.

పై సూత్రాన్ని ఆధారం చేసుకుని సోవియెట్ ప్రభుత్వం ఒక బలవత్తరమైన సిద్ధి గాగలిగింది ఈ అవధిలో అమెరికా పారిశ్రామికోత్పత్తుల పురోగమనం కంటే రష్యన్ ఉత్పత్తుల పురోగమనం చాలా అధికమైంది. ఇదికాక పెట్టుబడుల విధానాన్ని బట్టి, అమెరికన్ పరిశ్రమ ప్రజాసౌఖ్యాభివృద్ధి మార్గాల పురోగమించితే రష్యా పరిశ్రమ జాతీయశక్తిని పెంపొందించే మార్గాన పెంపొందింది. ఈ జాతీయశక్తి విషయంలో రష్యా అమెరికాతో పోటాపోటీ దశదాటి అధిగమించే స్థితికి వచ్చింది. సోవియెట్ యుద్ధశాఖలో వచ్చిన పరిణామాలను పరికించితే ఈ విషయం ఇంకా విస్పష్టంగా బోధపడుతుంది.

కొన్ని విషయాలలో ఆదినుంచీ అమెరికా యుద్ధశాఖకంటే సోవియెట్ యుద్ధశాఖది పైచేయిగానేవుంది జీవన ప్రమాణంలో వున్న వ్యత్యాసం కారణంగా, అమెరికా సైనికదళాల నిర్వహణవ్యయం, సహజంగా ఎన్నో రెట్లు అధికంగా వున్నది. ఒకొక్క సైనికునిక్రింద అమెరికా వార్షికంగా 7,700 డాలర్లు ఖర్చుపెడుతోంది రష్యన్ సైనికుని ఖర్చు ఇందులో 10 వ వంతు వుంటుంది. ఇదే కారణంగా, మొత్తం సైనికశాఖనుంచి అమెరికాకు లభించే యుద్ధనిర్వహణ దళాలు బహు పరిమితం. సైనికశాఖలో 72000 మంది యూనిఫారం ధరించినవారంటే వారిలోనుంచి 1 డివిజన్ యుద్ధదళాన్ని సేకరించగలగటం అక్కడికి గగనం. రష్యా 72 వేల మందికి సునాయాసంగా 8 డివిజన్లను సేకరించగలదు అందుచేత సోవియెట్ పదాతి దళాలు అమెరికా దళాలకంటే ఎప్పుడూ అధికంగానే ఉంటూ వచ్చినై. ఇటీవల కొంతమందిని తగ్గించి

# రష్యాబలం ఏమిటి?

చినా ఇంకా ఈ తేడా అలాగే వుంది. ఇప్పుడు సోవియెట్ సాయుధదళాల మొత్తం 3,500,000, అమెరికన్ దళాలు 3000,000. ఈ వ్యత్యాసం ఇలావుండగా యితఃపూర్వం అమెరికాది పయిచేయిగావున్న పారిశ్రామిక సాంకేతిక రంగాలలో కూడా ఈ అయిదేళ్లలోనూ త్వరిత గతిని పురోగమించి అమెరికాను త్రోసి రాజనే స్థితికి వచ్చింది.

ఎర్రసైన్యాన్ని ఇప్పుడు సమగ్రంగా సంస్కరించుతున్నారు. ఈ పెట్టుబడులలో కొంత భాగాన్ని తగ్గించి, యితరత్రా వినియోగించుకున్నారు. సోవియెట్ సాయుధసైన్యంలో 60 దళాలను అణ్వాయుధ సంపన్నం చేసే ఉద్దేశంతో సైన్యాన్ని కూడా కొంత తగ్గించుకున్నారు. ఈ స్థితిలో అమెరికాకు వున్న 18 దళాలూ ద్వితీయ సంగ్రామంనాటి నాటు ఆయుధాలతోనే వున్నారు. ఇప్పుడు మనం అణ్వాయుధ సంపన్నములుగా చేయ దలచిన దళాలు 5 మాత్రమే. సైనికశాఖ ఇతరరంగాలలో కూడా ఇలానే వుంది. విమానశాఖకు 1949 1954 మధ్య 15000 MIG.15 యుద్ధ విమానాలను అందజేసింది. ఇప్పుడు వీటన్నిటినీ పనికిరాని తుక్కు క్రింద లాగిపారవేసి 'ఫార్మర్' (పగటివేళ దాడిచేసేవి) 'ఫ్లాష్ లైట్' (రాత్రిపూట దాడిచేసేవి) విమానాలను త్వరితగతిని ప్రవేశపెడుతోంది. ఈ అవధిలో మనం 'F.86' విమానాలను 2800 మాత్రం ఉత్పత్తిచేశాం. మనం సృష్టించిన ఉత్తమ తరగతి యుద్ధవిమానాలేవీ ఇంకా విస్తృతావధిని ఉత్పత్తి కావటం లేదు.

మొత్తంమీద సోవియట్ సైనికదళాలు విస్తృతమైనవి కావటమేగాక వాళ్ళు బలవత్తరములైన ఆయుధాలను సేకరించటానికి కూడా యత్నం చేస్తున్నారు. ముఖ్యంగా, అణ్వస్త్రాలు గల విమాన దళాలు పేర్కొనదగినవి. ఈ వ్యాసం తొలిభాగంలో పేర్కొన్నట్లు సోవియెట్ విమానాలు శక్తిసామర్థ్యాలలో అమెరికా విమానాలకేమాత్రం తీసిపోవు పైపెచ్చు మీడియమ్, లాంగ్ రేంజి జట్ బాంబర్ల విషయంలో అమెరికాకంటె రష్యా ఎంతో ముందుకుపోయింది. అణ్వస్త్రాలనిల్వలు యిప్పుడు రష్యాకంటే అమెరికాకే యెక్కువవున్నయ్ కాని రష్యా నిల్వలు త్వరితగతిని పెరుగుతున్నయ్. అనతికాలంలో అవసరమైన, బలవత్తరమైన, అవధికి పెంపొందగలవు. దూరప్రాంతాలను ధ్వంసం చేసే స్వయంచోదకమారణాయుధాల విషయంలో రష్యాసాంకేతిక పరిజ్ఞానం అమెరికా సాంకేతిక పరిజ్ఞానాన్ని మించివుంది. 1500 మైళ్ల దూరానికి పరిక్రమించగల మారణాయుధాన్ని రష్యా అప్పుడే పరీక్షకు పెట్టడానికి సిద్ధంగా వుంది. అమెరికా ఇలాంటి ఆయుధాన్ని తయారు చేసేవిషయంలో ఇంకా నమూనా చిత్రాన్ని గీసుకునే స్థితిలోనే వుంది.

ఇదికాక, అమెరికా వైమానిక యుద్ధశక్తి యావత్తూ, సముద్రాంతరాలలో వున్న విమాన స్థావరాల మీద ఆధారపడివుంది. ఈ విదేశస్థావరాలు అమెరికా అధికారంలో లేవు అంతేగాక యివన్నీ రష్యా 1500 మైళ్ళ స్వయంచోదక మారణాయుధాల ప్రమాదానికి గురిఅయ్యే స్థితిలో వున్నాయి. ఈ పరిస్థితికి భిన్నంగా రష్యా తన స్థావరాలను తను యేర్పాటు చేసుకుని 'లాంగ్ రేంజి' అణ్వస్త్రాలను నిర్మించుతోంది ఇంతకూ చెప్పవచ్చిందేమంటే కళ్ళు తెరిచి అమెరికా తన పద్ధతులను మార్చుకోకపోతే, అనతి కాలంలో ఒక ప్రమాదకరమైన పరిస్థితి యేర్పడుతుంది. అమెరికా తన శక్తితో కేవలం యుద్ధప్రమాదాన్ని కలుగజేయగలిగితే రష్యా మొత్తంగా హత్య చేయగల స్థితికి వస్తుంది. పోనీ ఇతర మిత్రరాజ్యాల ఆయుధశక్తిని కలుపుకుని అమెరికా ఈలోటును భర్తీ చేసుకోగలదా అంటే ఆ ఆస్కారం కూడా కనుపించటం లేదు. చైనా, ఉత్తరకొరియా ఉత్తర వీట్నామ్, సోవియెట్ ఉపగ్రహదేశాలైన యితర యూరపియన్ దేశాల సాయుధబలాన్నీ అంచనా వేస్తే, అమెరికాను మినహాయించి తక్కిన యూరపియన్ మిత్రదేశాల సాయుధశక్తికి అయిదింతలు వుంది. బ్రిటన్ అటం ఆయుధాలను మినహాయించితే పదింతలు వుందని చెప్పవచ్చు.

మరొకవిషయమేమిటంటే కొత్త మారణాయుధాలు వచ్చినతరువాత, యిప్పుడు యుద్ధప్రమాదం అంటూ తటస్థించితే, విజయం—వెంటనే దెబ్బ తీయగలశక్తి యెంత వున్నదీ అన్న విషయంమీద ఆధారపడివుంటుందిగాని—వెనకటికి మల్లే, యుద్ధం వచ్చినప్పుడు, మామూలు పరిశ్రమలను యుద్ధపరిశ్రమల క్రింద మార్చుకుని ఆయుధనిర్మాణానికి చల్లగా పూనుకునే ఆస్కారం వుండదు. 1939 నాటి నెవెలీ చాంబర్ లేన్ విధానాలు యిప్పుడు పనేమీ రంజించవు.

ఈ పరిస్థితులలో, రష్యా బలహీనతలని ఏవేవో ఊహించుకుని కలలుగంటూ కూర్చుని లాభం లేదు. నిజానికి రష్యాకు వ్యవసాయాది రంగాలలో కొంత బలహీనత వున్నమాట వాస్తవమే, కాని ఈ బలహీనతలు మన పాశ్చాత్య మిత్రరాజ్యాల బలహీనతల ముందు ఏపాటి? వీటి అన్నిటి ఆర్థిక వ్యవస్థా, సంపూర్ణంగా యితర దేశాలమీద ఆధారపడివుంది! ముఖ్యంగా తన బ్రతుకు తెరువుకు అంతకూ అస్తవ్యస్తంగావున్న మధ్యప్రాచ్య దూరప్రాచ్య దేశాలపైన ఆధారపడివున్న బ్రిటన్ భవిష్యత్తు ఎలాఉంటుందో ఏమి చెప్పగలం? ఇది ఇలావుండగా తన ఆయుధాలనూ, పారిశ్రామిక వస్తువులనూ వస్తుమార్పిడి పద్ధతిని బర్మా, ఈజిప్టు లాంటి దేశాలకు అమ్ముకుని రష్యా తనకు కావలసిన ఆహార పదార్థాలనూ ముడి సరుకులనూ కొనుగోలు చేసుకోగల స్థితికి వచ్చింది. ఇందువల్ల రాజకీయ రంగంలో నేకాక వాణిజ్యరంగంలో కూడా పాశ్చాత్య దేశాలకు చాలా ఇబ్బందికలిగే పరిణామాలు అనేకం రాగలవని సర్ రాబర్ట్ షోన్ స్పష్టీకరించుతున్నారు.

ఇప్పటికి ఇంకా పరిస్థితి చెయ్యిమించిపోలేదు. పశ్చిమ రాజ్యాలు తిరిగి చూచుకోవటానికి ఇంకా కొంత సావకాశం వుంది. అయితే యీ సమస్యనుంచి బయటపడేమార్గ మేమిటి?

నిజానికి, అమెరికాకూ, అమెరికా మిత్రదేశాలకూ వున్న అవకాశాలు రష్యాకూ రష్యా ఉపగ్రహ దేశాలకూ ఉన్న అవకాశాలకంటే చాలా విస్తృతతరమైనవి. ఈ పశ్చిమదేశాలు తమకున్న ఈ సంపదను వినియోగం చేసుకుంటున్న విధానంవల్లనే ఈ చిక్కు యేర్పడుతున్నది. తమ జాతీయ రక్షణశాఖ పెట్టుబడులను మరికొంత పెంపొందింప జేయాలి. సాంకేతిక విద్యారంగానికి ఇంకా కొంత ఖర్చు పెట్టాలి. మామూలు యితర పెట్టుబడులను కొంత పరిమితం చేసుకోవాలి. ఇంతమాత్రం చేస్తేచాలు ఈ పరిస్థితి నుంచి బయటపడవచ్చు. ఇట్లా చేయగలమా అన్నది కాదు, ఇప్పుడున్న ప్రశ్న. ఇలా చేయటానికి మన సాధ్యమౌతుందా అన్నదే ప్రశ్న. ఇలా చేసుకోగలిగితే, కమ్యూనిస్టు దేశాలలో యేదో మార్పు దానంతటికది వచ్చి వారి విధానాలు మంచి పద్ధతులకు మారేవరకూ, వాటితో పోటాపోటీగా నిలచి జీవించి వుండగలం. అలా చేసుకోక ఈపరిస్థితి యథాతథంగా ఇంకా కొంత కాలం సాగితే, మనచరిత్ర మనకుతగిన గుణపాఠం నేర్పే స్థితి వచ్చేయవచ్చు. ఆ గుణపాఠం పాతపద్ధతులలో ఆలోచించే స్వాతంత్ర్య ప్రియులైన మన మిత్రులకు దుఃఖ హేతువుగా పరిణమించవచ్చు.

(కాపిరైట్)

# బలిపశువులు

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

## పాత్రలు

| | | |
|---|---|---|
| అన్నామార్కోవ్నా | కెర్బేష్ | టమారా |
| జెన్నీ | యార్చెంకో | జోయా |
| లూబ్కా | బోరిస్ | లికోనిన్ |
| మంకా | ప్లాటోనోవ్ | పెట్రోవస్కీ |

తెరతొలగగానే 'అన్నా మార్కోవ్నా' ఇంట్లోని, నలుచదరంగా విశాలంగావున్న హాలు కనుపిస్తుంది. గోడకు ప్రక్కన క్రమపద్ధతిలో కొన్ని కుర్చీలూ, గోడమీద 'మాకొవస్కీ,' తైలచిత్రాల నకళ్లు 'బోయర్ల విందుభోజనం', 'స్నాన సౌందర్యం' చిత్రాలూ చక్కగా అమర్చబడివున్నాయి. ఇంటి తలుపులు మూసివుండి కిటికీలకు తెరలు వేసివుండడంవల్ల హాలంతా మసక మసకగావుండి చిన్నబోయి దీనంగా కనుపిస్తున్నది. గతరాత్రి జరిగిన సంగీత నృత్యచిహ్నాలు, విటుల కామవికారాల గుర్తులూ ఇంకా మాసిపోలేదు.

అన్నా మార్కోవ్నా, కెర్బేష్ ఏదో మాట్లాడుకొంటున్నారు. అన్నామార్కోవ్నాకు సుమారు అరవైయేళ్ళ వయసు వుంటుంది. చాలా పొట్టిగా లావుగావుంటుంది. చిన్న తల. మెదమెదలాడుతున్న వొళ్ళు. సీలంకళ్లు. నోరుమాత్రం పెద్దదిగా వుండి ముసలితనాన్ని స్పష్టం చేస్తుంటుంది. కెర్బేష్ మంచి బలిష్ఠుడు. పలుచని గడ్డం, ఎర్రని వెంట్రుకలతో మెఱుస్తుంటుంది. ఇతనికి నగరంలో పోలీసుపని. ప్రక్కనే పెట్టివున్న కాఫీని ఏదో మొహమాటం కోసం బలవంతాన త్రాగుతున్నట్లు నటిస్తున్నాడు. అప్పటికి మధ్యాహ్నం మూడు గంటలైంది.

కెర్బేష్: (కాఫీకప్పు కిందపెడుతూ) వ్యాపారం బాగా సాగుతున్నదనుకుంటాను?

అన్నా : (విపరీతంగా నవ్వుతూ) బాగానా? ఆహా చాలాబాగా సాగుతున్నది! అటు డబ్బు రావడం, ఇటుబ్యాంకులో వేయడం అంతే చేయవలసింది - ఇంకేమీ లేదు. (కాస్త తీవ్రంగా) కెర్బేష్! చెబితే నమ్మరు మీరు. దినదినగండం నూరేళ్లాయుష్షుగా వుంది

---

సుప్రసిద్ధ రష్యన్ రచయిత అలెగ్జాండర్ ఇవానోవిచ్ కుప్రిన్ (1870-1938) వ్రాసిన నవల 'యామా ది పిట్' ఆధారంగా

చూపని మీబోటివారేమో మాయింటి చాయల కూడా కనిపించకుండా వున్నారేమిటి?

కె : ఔనౌను. అన్నామార్కొవ్నా ఇంట్లో మేమెల్లా కనిపిస్తాం? లక్షాధికారులు గాని.

అ : (మోహం ఎఱ్ఱబడి) ఎందుకెగతాళి చేస్తారు? ఈ ఇంట్లో రెండూ రూబుల్సుకే ప్రవేశం దొరుకుతుందని ఈవూర్లోవారందరికీ తెలుసు. ఇందులో దాపరికం లేదు. అవహేళన చేయవలసిన అవుసరం కూడా లేదు.

కె : అదికాదు...

అ : అవును. మాదీ వొక వ్యాపారం. మీరు డబ్బిస్తారు. ఆనందాన్ని కొనుక్కుంటారు. ఇందులో అంతగా విచారించవలసింది కూడా ఏమీ లేదు.

కె : నేను కాదనలేదు?

అ : మరి మీరిన్నాళ్ళనుంచీ కనిపించకపోవడానికి కారణం?

కె : ఏంచేయను? ఎన్ని చిక్కుల్లో పడ్డానో చూస్తున్నారుగదా? నేనొక పోలీసునౌకరీ చేస్తున్నవాణ్ని. మీరేమో ఆపిల్లను ఈ రొంపిలోకి దించారుగదా...

అ : మేమా?

కె : ఆహా! ముమ్మాటికీ.

అ : కెర్చెవ్! రహస్యాలు తెలీవనుకోకండి?

కె : రహస్యాలా? మాకేమున్నాయి?

అ : జ్ఞాపకం తెచ్చుకోండి.

కె : అవసరంలేదు.

అ : అలాగా! సరిగ్గా ఇప్పటికి నెలరోజుల క్రితం, సరిగ్గా యిటువంటి సమయంలోనే ఓ అమ్మాయిని వెంటబెట్టుకుని మాయింటికి వచ్చారు మీరు. జ్ఞాపకముందా?

కె : లేదు.

అ : ఎందుకుంటుందీ? వుండదు. కాని ఆ అమ్మాయికి తెలుసు తన నీ పడుపువృత్తిలోకి బలవంతంగా ఎవరు దించారో...

కె : నిజమే ఆ అమ్మాయికి తెలుసు ప్రస్తుతం తనెంత హాయిగా నరకవాసమనుభవిస్తున్నదీ...

అ : ఏమిటి?

కె : ఈ ఇంట్లోవాళ్ళ సంగతి నాకు తెలీదనుకోకు మార్కొవ్నా? నిర్దాక్షిణ్యంగా, నిర్భయంగా ప్రతిరోజూ గొడ్లను బాదినట్టు వాళ్ళను మీరు హింసించడం ఎప్పటికప్పుడు నాకు తెలుస్తూనేవుంది.

అ : ఈ మాత్రానికే వాళ్ళేం చచ్చిపోరు.

కె : ఇంతకన్నా మరణమే నయ్యం.

అ : అవునవును. అందుకోసమే గామోసు [illegible] పంపేశారు.

కె : (నిర్ఘాంతపోయి) ఏమిటి? ఏమంటున్నావు? నేనా! నేను పంపేశానా? ఎవరిని?

అ : (వ్యంగ్యంగా) నటన కూడా చేతకాదు మీకు. ఒక సంవత్సరంక్రితం ఒక పోలీసు అధికారి [illegible] నవయువతిని పెళ్ళి చేసుకున్నాడు. డబ్బుకోసం కాదు సుమా? ప్రేమ! ప్రేమ - పెళ్ళి జరిగిపోయింది. కానీ సంవత్సరమైనా తిరక్కముందే ఆమెను గొంతుపిసికి చంపేశాడు.

కె : (పాలిపోయి) ఇది నీకెలా తెలుసు?

అ : లోకులు గానీ కాకులు గాదండీ

కె : అయితే...

అ : ఏమీ లేదు. పాపాలు, అకృత్యాలు అంతో యింతో అందరం చేస్తున్నవాళ్ళమే, అందుకోసం స్నేహంగానే వుందాం ఈ బెదిరింపులూ, బూటకాలూ ఇది గుర్తుంచుకుని మళ్ళీ.

కె : నేనేం బెదిరించానుగా?

అ : మా అధికారంక్రింద వున్న ఆడవాళ్ళను కొట్టవలసినప్పుడు కొడతాం, తిట్టవలసివచ్చినప్పుడు తిడతాం. ఆదరణ చూపించవలసివస్తే ఆదరిస్తాం కూడా.

కె : అలాగా?

అ : ఆఁ!

కె : అన్నామార్కొవ్నా ఎన్ని నీతులు చెప్పినా ఇది "యామాకూప" మన్న సంగతి ఎవరూ మరిచిపోలేరు. ఆపిల్ల ఈ పాపపు పద్మవ్యూహంలో చిక్కుబడ్డది. ఆపిల్ల తలిదండ్రులు ఆపిల్లకోసం పోలీసుల ద్వారా ఇల్లిల్లూ వెతికిస్తున్నారు. అప్పుడేం జరుగుతుంది. ఇక్కడే దొరుకుతుంది. అప్పుడు నేనేం చేయను?

అ : ఆపిల్లకు మైనారిటీ వెళ్ళిందికదూ?

కె : నాకు తెలీదు.

అ : వెళ్ళింది. పైగా తన ఇష్టమీదనే తనకు తానై ఈ వృత్తి నవలంబించానని కాగితం కూడా వ్రాసియిచ్చింది.

కె : అయివుండవచ్చు.

అ : ప్రమాణంచేసి చెబుతున్నాను. ఆపిల్లను నాకన్నకూతురతో సమానంగా చూచుకొంటున్నాను.

కె : నేనావిషయం కాదు మాట్లాడేది?

అ : మరింకే విషయం?

కె : ఇప్పుడు నేనేం చేయాలి? మీరే ఆలోచించండి. నాడ్యూటీ నేను నెఱవేర్చవద్దూ?

అ : (తేచి తలుపు దగ్గరకు వెళ్ళి) ఎప్పుడూ డ్యూటీ, వ్యవహారాలేనా కెర్బెష్? ఇటు చూడు. ఈయిల్లు కొంచెం విశాలంచేసి క్రొత్తక్రొత్త అలంకారాలు కొన్ని చేయా లనుకుంటున్నాను. అప్పుడెలా వుంటుంది?

కె : ఓ! దానికేం-నిక్షేపంలా వుంటుంది

[ఆమె లోపలికి వెళుతుంది. అతనొక్కడే మిగిలిపోతాడు. ఏదో ఆలోచించుకొంటుంటాడు. తపీగా సిగరెట్టు ముట్టించుకొని]

అన్నా : (తిరిగివచ్చి పచ్చనోటునొకటి అతనికిస్తూ) మొన్న నెందుకో కావాలన్నారు?

కెర్బెష్ : (పుచ్చుకొని) ఏం చెప్పను? ఏవో అవసరాలు. అయినా, ఎంత నిజాయతీగా వుందామనుకుంటున్నా లంచాలు పుచ్చుకొంటున్నా మన్న అపవాదుమాత్రం తప్పటంలేదు.

అన్నా : ఆఁ! ఇవేం లంచాలు...ఇక్కడ లంచాలు ఇవ్వడానికి మాత్రం ఏమంత ఉన్నాయి గనుక.

కెర్బె : నిజమే. వేలెడంత లేడు; ఆ పాల్ నాదగ్గరికొచ్చి "నాన్నా! నాన్నా! బళ్ళో పిల్లలంతా నన్ను తిడుతున్నారు. నీవేమో పాడుపోలీసునౌకరీ చేస్తున్నావట. రోజూ తనిఖీలకని 'యామా' లోకి వెళ్లి అక్కడ ఆడవాళ్లదగ్గర లంచాలు పుచ్చుకొంటున్నావట" అంటూ కాకిగోల ప్రారంభించాడు. చెడామడా తిట్టి వళ్లు వాయగొట్టాను. ఇప్పుడా వెధవాయి నాతో మాట్లాడ్డం గూడా మానేశాడు. అయితేమాత్రం వదలిపెడతానా?

అ : ఈకాలపు పిల్లలంతా ఈలాగే పాడయిపోతున్నారు. అందుకనే మా చిన్నపిల్ల 'బెర్లిను' పట్నంలో కాస్త గౌరవనీయుల సంరక్షణలోవుంచి చదివిస్తున్నాను కదూ?

కె : ఏమిటో విప్లవం తీసుకొస్తారట-విప్లవం! వీళ్లేనా ఆపనిచేసేది? సంఘమంతా పతిత మౌతున్నది. అవినీతి, లంచగొండితనం ఎక్కడపట్టినా స్వైరవిహారం చేస్తున్నాయి. ఈ ప్రవాహానికి ఎవరుమాత్రం ఎదురీదగలరు గనుక?

[బయటినుంచి తలుపు చప్పుడు]

కె : ఆఁ! ఇహ వెళ్ళొస్తాను మార్గో వ్నా. నాకూ పనుంది. వెళ్ళొస్తానూ. ఆఁ!

అ : అప్పుడప్పుడూ వస్తూ వుండండి

కె : ఎందుకైనా మంచిది ఆ అమ్మాయిని తక్షణం ఇక్కడినుంచి మరోచోటుకు పంపేయండి. (వెళ్ళిపోతాడు)

అ : (అతనుపోయినవైపే చూస్తూ) వెధవ! రెండువేపులా లంచాలు కొడుతున్నాడు!

[ఇంతలో జెన్నీ లోపలకు వస్తుంది. చాలా తెలివైనదీ అందమైనదీ కూడా! సన్నగా పొడుగ్గా తీగెలా వుంటుంది. చక్కనికళ్ళు. ఆకళ్లలో ఏదో ఆకర్షణ. గర్వం, మితభాషిత్వం తెలిపేలా చిన్ననోరు. బుగ్గల మీదమాత్రం అసహ్యంగా కొంచెం మచ్చలు.]

జెన్నీ : అన్నా మార్కోవ్నా!

అ : (ఉలిక్కిపడి) ఎవరది? ఓ...నువ్వా? ఏం జెన్నీ—యిల్లా వచ్చావు?

జె : పాషాకింకా తెలివిరాలేదు. పరిస్థితి ఏమీ బాగులేదు.

అ : అయితే—

జె : ఈ రాత్రికి ఆ అమ్మాయికి కాస్త విశ్రాంతి నిస్తే బావుంటుందని అంతా అనుకుంటున్నారు.

అ : అంతా అంటే?

జె : ఈ యింట్లో వున్న వారందరు.

అ : ఎవరెవరు?

జె : నేను, జోయా, మంకా, టమారా, లూబ్కా, న్యూరా—అందరం.

అ : ఊహూ, అయితే పెద్దలందరూ ఒకచోటికి చేరారన్నమాట! ఏ విప్లవం తీసుకొస్తారో యీ యింట్లో?

జె : నవ్వకండి అన్నా మార్కోవ్నా. మా కష్టాలు గూడా విచారించండి. రాత్రిల్లా యమయాతన పడుతున్నాం. కాదనకుండా వచ్చిన ప్రతివాడి అభీష్టాన్నీ నెరవేరుస్తున్నాం. దయతలచి వాళ్ళిచ్చిన డబ్బులో సగానికి పైగా మళ్ళీ మీకే ముట్టచెబుతున్నాం. ఒక్క రాత్రి-వొక్క రాత్రి, అదీ అందరం కాదు, మాలో వొక్క దానికి మాత్రం—పాషాకు కాస్త విశ్రాంతి కల్గించమంటున్నాం. ఆ అమ్మాయికి ఈరాత్రి కూడా కష్టం కలిగిస్తే ఇక బతికేనా? అసలే చిన్నపిల్ల.

అ : నేనేం చేసేది జెన్నీ? ఒక్క రాత్రి పోయిందంటే ఎంత నష్టమో నీకు మాత్రం తెలీదూ?

జె : కానీ మా అందరికోసం ఈమాత్రం చేయలేరా?

అ : జెన్నీ! నాకుమాత్రం హృదయం లేదనుకున్నావా? రాత్రి అప్పటికప్పుడు సుగంధపాల ఇయ్యాలేదూ?

జె : కాని ఏం లాభం? కొంచెం తేరుకోగానే మళ్లా...

అ : అవును. అది వ్యాపారలక్షణం.

జె : వ్యాపారం! మా రక్తాన్ని పీల్చుకొంటున్న వ్యాపారం! ఒక్క రాత్రికి విశ్రాంతి ఇవ్వమంటే వ్యాపారం! మేం లేకపోతే మీ వ్యాపారం సాగుతుందా? మేం లేకపోతే ఒక్క క్షణం మీరు బ్రతకగలరా? కానీ మళ్ళీ మా మెడలకే ఉచ్చు బిగిస్తున్నారు.

అ : లాభం లేదు జెన్నీ! నువ్వేమన్నా పాపా మాత్రం ఈ రాత్రికి వూరికే వుండడానికి వీల్లేదు. (వెళ్ళిపోయింది.)

[ఆమె అటు వెళ్ళగానే ఇటు మంకా, లూబ్కా, టమారా, జోయా ప్రవేశిస్తారు. అందరి మొహాలూ తెల్లగా పాలిపోయి వుబ్బి వుంటాయి. మంకా, లూబ్కా ఇద్దరూ అందమైనవాళ్ళు. లూబ్కా చిన్నపిల్ల.]

టమారా: అంతా తెలుసులే జెన్నీ. నీవేం చెప్పనక్కర లేదు. ఈ జీవితమే వొక సినీమా.

జె : అవును. లౌకికం నేర్చినవారంతా ఇలానే మాట్లాడుతారు.

లూబ్కా: చాలా విచిత్రమైనదానివి టమారా నువ్వు. మా అందరికన్నా ఎక్కువ ఆదాయం కదా నీది ఏం చేస్తున్నావసంతా?

మంకా : శంకాకోసం ఖర్చు పెడుతున్నది.

జోయా : దానంలో గూడా పాత్రాపాత్ర విచక్షణ వుండాలి.

జె : (కోపంతో) నీవల్ల వాడు స్వర్గసౌఖ్యం అనుభవిస్తున్నాడు.

ట : నిజమే!

జె : అమాయకురాలివి! నీకు నువ్వే లొంగిపోయి వచ్చినవారిని నీ ఆదరణతో సుఖపెడుతున్నావు నీ అంశం నాకున్నట్టయితే... ఈ మగవారిని మూర్ఛితుల్ని చేసి ముక్కుకు తాడేసి ఆడించేదాన్ని.

ట : ఎవరి కెంత ప్రాప్తో అంతే జెనుష్కా. అందం మాత్రమే గాక ధైర్య సాహసాలు గూడా నీకు వున్నాయి. అయినా మన కర్మకాలి ఇద్దరికీ యీ కర్కోటకురాలి అడుగులకు మడుగులొత్తాల్సిన గతి పట్టింది.

జోయా : అది కాదు జెన్నీ! మన జీవితా లెందుకూ అని? పుస్తకా లమ్ముకునే కోల్కానూ, ఆ కంట్రాక్టరు వెధవనూ ఎవరో ఆంటోనూ, ఆతరువాత కార్కానూ అందరినీ ప్రేమిస్తున్నాం. ఇక ప్రేమించని దెవరిని? ఇదీ మన బ్రతుకు.

జె : నిజం. అందరం అంతే. ఆత్మగౌరవం లేదు. ఒక వ్యక్తిత్వం లేదు. యుక్తాయుక్త విచక్షణ లేదు. ఏమీ లేదు. అందరం జీవచ్ఛవాలం. బ్రతికినా చచ్చినవారితో సమానం. ఎవరో వో అనామకుడు వస్తాడు. గంట ప్రసూనానికి ధర మాట్లాడుకొంటున్నాడు. ఛీ! ఛీ!

మంకా : (మెల్లగా) జెన్నీ! జెన్నీ! అదిగో అన్నా వస్తున్నది

జె : ఏం భయపడనక్కరలేదు. ఈరోజు రాత్రికి మనమంతా కలిసికట్టుగా వుంటే ఈ ఇంట్లో విలయతాండవం ఎల్లా జరుగుతుందో నేను చూస్తాను.

అ : (ప్రవేశిస్తూ) ఏమిటో అందరూ ఒక్క చోట సమావేశమైనారు. ఏమైనా రహస్యాలోచన సాగిస్తున్నారా? జాగ్రత్త. సాక్షిగా జీవితాలు గడపదల్చుకుంటే మాత్రం ఆ పని చేయకండి. (బయట ఆగి గంటలు కొట్టిన శబ్దం) ఆఁ! అమ్మాయిలూ ఇకనంతా మొదటి గదిలోకి పదండి. త్వరగా.

జె : మేం రాదల్చుకోలేదు.

అ : కాపలావాడు సెమన్‌ను పిలిచేదాకా కదిలేటట్లు లేరు మీరు. ఏం పిలవమంటారా?

మంకా : అబ్బే! వద్దు. వద్దు.

జె : భయపడకు మంకా! మేమంతా ఇక్కడే వున్నాం.

అన్నా : నాకు తెలుసు మంకా మంచిపిల్లని. ఆఁ! అసలు సంగతి చెబుతాను వింటావా మంకా? కొద్దిసేపటిక్రితమే కెప్టెన్ వచ్చి లంచం క్రింద నూరు రూబుల్సు పట్టుకుపోయాడు. మరి ఆ డబ్బంతా మళ్ళీ ఎల్లా వస్తుంది చెప్పు మీరిలా సమ్మెలు చేస్తుంటే?

జోయా : వా డెందుకు వచ్చాడు?

అన్నా : వీరాకోసమని. (కొద్ది నిశ్శబ్దం) వీరా ఇక్కడ లేకపోతే మనకందరికీ ఎంత కష్టం?

లూబ్కా: అవును. చాలా నష్టం..

జెన్నీ : ఇక్కడినుంచి వీరా వెళ్ళిపోయి వుంటే నే సుఖపడివుండేది.

అన్నా : (కోపంతో) నిజమే—సుఖపడివుండేది? ఈ కొంపనుంచి బయటికి అడుగుపెట్టిన తక్షణం వీధి.వీధీ అడుక్కొంటూ కుక్క బతుకు బతకవలసివుంటుందని తెలుసా? ఆ— ఇదంతా ఎందుకు గానీ...ఏం అమ్మాయిలూ! మీరు సవ్యంగా వస్తారా? సైమన్‌ను పిలవమంటారా?

మంకా : వద్దు. వద్దు. నేను వస్తున్నాను.

జెన్నీ : (పెద్దగా) మంకా?

అన్నా : ఆఁ! నువ్వు లూబ్కా?

లూ : వస్తున్నాను.

జో, ట : సరే! మేమూ వస్తాం!

జెన్నీ : ఛీ! ఛీ! ఒక్కరికీ ధైర్యం లేదు. ఎందుకీ బ్రతుకు? [తెర]

## 2

* * అర్ధరాత్రి దాటి, తెల్లవారుఝాము కావస్తోంది. కాపలావాడు గుమ్మానికి తగిలించిన ఎర్రదీపం చివరి శ్వాసపీల్చుకుంటున్నది. కిటికీ రెక్కలు బార్లగా తీసివున్నాయి. కిటికీలకు కట్టిన తెరలు గాలికి మెల్లగా అటూ యిటూ ఊగుతున్నవి. లూబ్కా, మంచి ముదురయిన నీలిరంగు చీర, మొఖమలు తెల్లరవిక తొడుకొని కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నది. రవిక ముందువైపు వదులుగా పొట్టిగా వుంది. హాల్లో వున్న వొకరిద్దరు ఆడవాళ్లు పాపం! ఆసమయంలో కూడా చెమటలు పోస్తున్నందున బాధపడుతూ విశ్రాంతి తీసుకొంటున్నారు. వాళ్ల కళ్లు కూరుకు పోతున్నాయి. ఇంతలో కొందరు విద్యార్థులు, ఒక ప్రొఫెసరు, స్థానిక పత్రికలో పని చేసే ఒక రిపోర్టరును వెంట బెట్టుకుని ఆ యింట్లో ప్రవేశించారు. అన్నా వీళ్లందరినీ చూచింది కొద్దిగాసంతోషంకనబడిం దామె వదనంలో

అన్నా : టమారా! టమారా! అదుగో ఎవరికోసం అహోరాత్రాలు కలవరిస్తున్నావో ఆవ్యక్తి. వెళ్ళు వెళ్ళు. మంకా! నువుకూడా ఊఁ! త్వరగా. (లోపలకు వెడుతుంది)

మంకా : బోరిస్! ఎంతకాలమైంది మనం కలుసుకొని!

యార్చెంకో : (విసుగ్గా) ఏమిటీ ఆదరణ? ఒక్కరూ సరిగా పలకరు! మా కందరికీ ప్రత్యేకం ఓ గది కావాలి.

జెన్నీ : మీకేం కావాలి ప్లాటొనోవ్?

బోరిస్ : ఈయనే కదూ ప్రెస్ రిపోర్టరు?

యా : అవును.

బో : మీకేం కావాలి మిష్టర్ ప్లాటొనోవ్? దూరంగా నిల్చున్న ఆ నీలికళ్ళమ్మాయి, తెల్లరవిక తొడుక్కున్న ఈభీతహరిణేక్షణ-ఎవరు కావాలి?

ప్లా : క్షమించండి నేనిందుకోసం రాలేదు

యా : ఓ! ఇప్పుడు నాకర్థమైంది. ఈ పాపపు జీవితాలను పరిశోధించి విషయ సంగ్రహణ చేస్తున్నారు కదూ? బహుశా ఓ మహాగ్రంథాన్ని వ్రాయాలనుకుంటున్నారల్లుంది!

బో : ఆ పుస్తకంలో పడుపుకత్తెల విషాదజీవితం వర్ణిస్తారు కాబోలు!

టమారా: (బోరిస్ దగ్గరకు వెళ్ళి రహస్యంగా) అనవసరంగా ఆయనను కదిలించకండి కొరివితో తల ముట్టించుకోవడమే!

బో : (కోపంగా) అంటే? అతగాడు—నీ ప్రి...యు...డా?

ట : మీ రాయనను గురించి దురభిప్రాయపడుతున్నారు. దైవసాక్షిగా చెబుతున్నాను. క్షణిక సౌఖ్యంకోసం మనోనిగ్రహం వదులుకొనేవాడు కాడు ఆయన.

బో : ఏమిటీ వాగుడు? అతనంటే మీ అందరికీ ఎందు కింత అభిమానం? చూడబోతే ఈ యామాలో వున్నవారంతా అతన్ని వలచి వలపింపజేసుకొన్నారులా కనిపిస్తున్నారు.

ట : అది కాదండీ. ఆయన స్వభావమే అంత. ఎవరితోనూ కలిసేవాడు కాడు.

లికోనిక్ : కాస్తమర్యాదగా మాట్లాడు బోరిస్! ఆఁ— మీ పుస్తకాన్ని గురించి తెలుసుకోవాలని వుంది చెప్పండి ప్లాటొనోవ్?

ప్లా : అబ్బే! అలాటి దేమీ లేదు కూడా, నేను పుస్తకం వ్రాయడం లేదు. వీరెలాటి బ్రతుకు బ్రతుకుతున్నారో దూరంనుండి వూరికే చూస్తున్నాను అంతే!

యా : చెప్పండి రిపోర్టరుగారూ! అందరికీ అన్ని విషయాలూ తెలిసి వుండవనేది అందరికీ తెలిసిన నగ్నసత్యం.

ప్లాటో : ప్రొఫెసర్ యార్చెంకో! ఏం చెప్పేది? నాకు తెలిసింది కూడా చాలా స్వల్పమే! కానీ ఈ పతితల జీవితాలను గురించి తెలుసుకోవాలంటే మాత్రం చాలావుంది. నిజంగా వీరి బ్రతుకులలో ఏదో పరమసత్యం దాగివుంది ప్రొఫెసర్. మొదటినుంచీ చివరివరకూ ఒక గీతంలా, సంగీతంలా వుంటుంది. దాన్ని వింటూ, చూస్తూ అనుభవిస్తూ వుంటే ఏ మానవుడికైనా నరనరాలూ స్పందిస్తాయి. తీయని భయంతో గుండె బరువెక్కిపోతుంది. ఈ స్త్రీలంతా తమ జీవితాలను తివాచీల్లా

పరిచారు. వాటిమీద ఎందరెందరో పురుషులు స్వేచ్ఛగా నడిచిపోతున్నారు ఏదో హాయి, ఆనందం అనుభవిస్తున్నారు. ఇదొక అనంతమైన యాత్ర. ఇది ఎక్కడ మొదలు పెట్టిందో, ఎక్కడ అంత మవుతుందో ఎవరూ చెప్పలేరు... ఈ వ్యభిచారం పట్టణాల్లో పుండుమాదిరి పుట్టింది... మానని పుండు... మందులేని పుండు... వేల వేల హస్తాలు ఈ వ్రణాన్ని కెలుకుతున్నాయి ... అబ్బ! దుర్భరమైన బాధ! భయంకరం! చివరి కిదొక వ్యాపారంగా తయారైంది. దేశంలోని వ్యాపారాలకువలెనే ఇదీ స్వేచ్ఛగా, సాఫీగా సాగిపోతున్నది...... చూచారా? ఆడవాళ్ళ సంత...ఆడవాళ్ళ అంగడి

లి : నిజం! ముమ్మాటికీ నిజం!

ప్లా : కొందరు వేశ్యలను గురించి మరీ క్రూరమైన గాథలున్నాయి వీరు గర్భవతులవుతుంటారు. కానీ పాపం! భ్రూణహత్యలు తప్పవు. డాక్టర్లు, మంత్రసానులు వీరి యీ పాప కార్యానికి కావలసినంత సహాయం ఇస్తూ వున్నారు. నిజమాలోచిస్తే ఈ పసుపుగ్రైల రక్తాన్ని పీల్చే జలగలు వీళ్లు. ఇలాటి గాథలు...బాధలు...ఎన్నో...ఎన్నెన్నో... కాపలావాడు సైమన్‌ను చూచారా? వాడు చేసిన ఘోరాలు నేను వర్ణించలేను. స్త్రీలను బలాత్కారంగా ఈ మురికికూపంలోకి తీసుకొస్తాడు. వాళ్ళ కష్టాన్ని దోచుకుంటాడు. భయంకరంగా కొడతాడు. అవసరమైనప్పుడు ఖూనీచేస్తాడు కూడా! ఇన్ని చేసినా ఆ నీచుడు మళ్ళీ మహా వేదాంతి. దైవభక్తుడు. మతాన్ని గురించి, దేవుణ్ని గురించీ చర్చిస్తాడు.

లి : అవును. అలాంటి దుర్మార్గులు దైవప్రార్థన చేస్తూనే క్షణంలో ఎవడి గొంతో కోసేసి, చేతులు కడుక్కొని మళ్ళీ దీపం వెలిగిస్తారు. నీచులు!

ప్లా : నిజంగా అంతే. చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం ఈ మతచర్చల్లోనే దొరుకుతున్నది.

యా : మీరు తప్పకుండా ఇలాటి పాపపు జీవితాలు పరిశీలించవలసిందే.

ప్లా : ఏం పరిశీలించను? ఆ యజమానురాలు అన్నా మార్కోవ్నా వుంది చూచారా? ఆమె కొక్కతే కూతురు. ఆపిల్లకోసం అన్నా పడేబాధలు అన్నీ యిన్నీ కావు. ఆమె శివమెక్కిన సివంగి. రక్తంతాగే రాక్షసి. అయితే యేం? ఇదంతా తన ముద్దుబిడ్డకోసమే చేస్తున్నది. ఆపిల్ల భావిజీవితం ఒక నందనవనం కావాలని కోరుకుంటున్నది. తన కూతురు సుఖంకోసం ఆమె ఎలాంటి నీచానికి ఘోరానికి వొడిగట్టిందో చూచారా? మన చెల్లెళ్లు, కూతుళ్ళవంటి అమాయకులైన ఆడపిల్లలను కొనుక్కొని వాళ్ల శీలాన్ని నడిబజారులో పెట్టి వేలం వేస్తున్నది. ఈ వేశ్యలంతా దుర్భరమైన సుఖవ్యాధులతో బాధపడుతున్నారు. ఈ అంటువ్యాధులు వీరినుండి మనకూ, మన సంతానానికీ సంప్రాప్తమవుతున్నాయి. కాని యీ నరరూపరాక్షసి ఆపని ఎందుకు చేస్తున్నది? బిడ్డపైనున్న మాతృప్రేమ ఆమెను పిచ్చిదానినిగా రాక్షసిగా మార్చివేసింది.

బో : ఏమిటి? అన్నాను కూడా అందరుతల్లులతో పోలుస్తున్నారా?

ప్లా : క్షమించండి. నా ఉద్దేశం అది కాదు. ఈ జీవితాలకు వెనుక దాగియున్న సత్యాన్ని వెల్లడించాను. అంతే!

తి : మిగతా వివరాలుకూడా చెప్పండి? ఎంతో కుతూహలంగా వుంది.

ప్లా : పుస్తకం వ్రాయాలనే ఉద్దేశంతో కాదు నేను వీరి జీవితాలు పరిశీలిస్తున్నది. వీరి విచిత్ర జీవితాలు నన్నెంతో ఆకర్షించాయి. వారి జీవితాల వెనక ఏదో వొక అదృశ్యశక్తి వున్నట్టు గోచరిస్తున్నది వీరి జీవితాలో ఏదో ఒక్క సంఘటన తీసుకున్నా అదొక పెద్ద సత్యమై నిత్యమై వుండిపోతుంది.

తి : ఈ యువతుల జీవితాలు అంత విచిత్రమైనవా?

ప్లా : యువతులు! వారినప్పుడు చూడండి పరీక్షగా చూడండి. అంతా పసిపిల్లలవలె కనిపిస్తారు. పదకొండేళ్ళ బాలికలవలె కనిపిస్తారు. విధి వీరందరినీ ఈవృత్తిలోకి తరిమింది. అప్పటి నుండి విచిత్రంగా, వక్రిగా, కృత్రిమంగా అమాయకులై, మూర్ఖులై పిచ్చివాళ్ళయి, బొమ్మరింటిలో వున్న బొమ్మల మాదిరి పడున్నారు. వీరి మనస్సులు వికసించినవి కావు. పరిపూర్ణమైన జీవితానుభవాలు వీరికి లేవు. అయితే ఒక విషయం! పతితమై, వ్యాధిగ్రస్తులై, వికలమై విరిగి, కాంతి తరిగిన వీరి హృదయాల్లో అసహాయత, జాలి బాధ, ప్రేమ, వేదన, ఇవిమాత్రం ఇంకా అంతరించలేదు. క్షమించండి,...అనవసరంగా వాగుతున్నట్టున్నాను.

యా : అయితే!—ఈసమస్య మీ హృదయానికి ఇంత గాఢంగా హత్తుకొని వేధిస్తున్నప్పుడు ఒక పుస్తకం ఎందుకు వ్రాయకూడదూ?

ప్లా : ప్రయత్నించి చూచాను ప్రొఫెసర్! కాని ప్రయోజనం లేకపోయింది. వర్ణనలు వివర్ణమైనాయి. మాటలు చల్లగా జారిపోయాయి. అయినా ఈ పతితుల జీవితం, వారి ఆత్మవేదన ఏనాడో ఓనాడు బయల్పడక తప్పదు. కాని నేనుమాత్రం దీనికి సమర్థుణ్ని.

[ఇంతలో కళ్లు మిరిమిట్లు గొలిపేలా నారింజ పండు రంగు దుస్తులు ధరించిన జెన్నీలోపలకు వచ్చింది]

ట : అతను వెళ్ళిపోయాడా జెన్నీ?

జెన్నీ : ఆఁ వెళ్ళిపోయాడు.

[జెన్నీ మొహంమీద చెమటలు పోస్తున్నాయి ఆమె బుగ్గలమీద ఎర్రగా కందిన గాట్లు కనిపిస్తున్నాయి పెదవులు వణుకుతున్నాయి]

ప్లా : ఏం జెన్నీ? ఏమైనా జరిగిందా?

జె : ఎబ్బే? ఏమీలేదు మీ రేమీ ఆలోచించకండి. ఏవో మా ఆడవాళ్ళ గొడవలు! (రహస్యంగా మాట్లాడుకొంటారు)

యా : ఏమిటి ప్లాటోనోవ్ ఆపిల్ల మాట్లాడుతున్నది?

జె : ఏంలేదు మీకు సంబంధించింది కాదులెండి ఏవో మా సంసార విషయాలు! (ప్లాటోనోవ్ ఎక్కడికో వెళ్లిపోతుండడం చూచి) వద్దు! వద్దు! మీరు వెళ్లకండి. ఈ విషయాన్నింతటితో వదిలేయండి

ప్లా : ఏం? ఎందుకు వెళ్లగూడదూ? అవసరమైతే పాషాను ఇక్కడికే తీసుకువస్తాను... కావాలంటే ఆ డబ్బు మీ యజమానురాలి మొహాన నేనే పారేస్తాను. ఆ అమ్మాయి ఇక్కడ సోఫామీద పడుకొని విశ్రాంతి తీసుకుంటుంది. మంకా—వెళ్ళి ఓ దిండు పట్టుకురా (లోపలకు వెడతాడు)

బోరి : ఏమిటీ వెధవగోల? మనమంతా ఇక్కడ హాయిగా గడుపుకొందామని వస్తే మధ్యలో ఈ త్రాష్టు డెవడు? ఏమిటీ పీడ? అసలతనికీ మనకూ ఏమిటి సంబంధం? దీనికంతకూ కారణం నువే లిఖోనిన్! నీ చనువు చూచుకునే అతనిలా ప్రవర్తిస్తున్నాడు.

లి : అతని విషయం నీకెందుకు బోరిస్?

బో : ఎందుకేమిటి? అసలు వీడికీ, మనకూ స్నేహమేమిటి?

యా : ఏమిటా మాట్లాడడం? మర్యాద నేర్చుకో. ఎందుకైనా మంచిది.

బో : ఏమిటో ఆ యిది? లోకాన్నంతా జయించినవాడికిమల్లే మాట్లాడుతున్నాడు అక్కడికి వాడేమో గురువైనట్లు మనమంతా కుంకలమైనట్లు.

జె : ఏమిటి? అతనంత అక్కసుగా వున్నాడా? రాని చెప్తాను.

బో : ఇలాంటివాళ్లను చాలామందిని చూశాను.

ది : బోరియా! అనవసరంగా గొడవలు తీసుకురాకు. మనమంతా స్నేహితులం. ఇక్కడ హెచ్చు తగ్గులెవరికీలేవు. అంతా మనమే.

[ఇంతలో మంకా తలగడ తీసుకువచ్చి సోఫాలో పెట్టింది]

బో : (పెద్దగా అరుస్తూ) ఏమిటది? అదింకు అక్కణ్నుంచి తీసివేయ్! ఇదేం శయన మందిరం అనుకుంటున్నారా?

జె : (సౌమ్యంగా) ఎందుకండీ అంతకోపం? ఇద్దరం, చల్లగా, హాయిగా, కులాసాగా మాట్లాడుకొందాం ఇటు రండి.

[ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలు పెద్దగా తగిలాయి మంచులా కరిగిపోయి]

బో : జెన్నీ అంటే నువ్వేనా? అబ్బ-ఎంత ఉద్రేకం నీకు! ఎంత మంచిదానవు!

[ప్లాటోనోవ్, పాషాను వెంటబెట్టుకుని గదిలోకి వచ్చాడు. పాపం ఆ పిల్ల పరిస్థితి మరీ ఘోరంగా వుంది మొహమంతా నల్లగా కప్పు వేసినట్లు మాడిపోయివుంది. కళ్ళు సగం మూతలు పడివున్నాయి. తెరచివున్న ఆమె పెదవులు చీలిన ఎర్రగుడ్డ పేలికల్లా వున్నాయి. వాటిమీద ఏదో వికృతమైన చిరునవ్వు. ఆమె నడవలేకపోతున్నది. కాళ్ళు మెలికలు పడుతున్నాయి. వచ్చి మెల్లగా సోఫాలో పడుకుంది.]

ప్లా : టమారా! ఈమెకు కొంచెం కాఫీ, బ్రెడ్ త్వరగా పట్రా. వెళ్ళు

బో : (పిచ్చికోపంతో) హు! నీ పేరేమిటి? ఈ పిల్ల నీ ప్రి...యు...రా...లా?

ప్లా : ఏమిటీ?

బో : పోనీలే—నీ వామెకు ప్రియుడివేమోలే! కాకపోతే ఎందుకిలా అవస్థపడతావు? సరే గానీ-వాళ్ళ సంపాదనలో ఎంతభాగం... నీకు?

ప్లా : (తీక్షణంగా) వచ్చినప్పటినుంచీ చూస్తున్నాను నిన్ను. చీటికి మాటికి కయ్యానికి కాలు దువ్వుతున్నావు. జాగ్రత్త! నీ స్నేహితుల మొహం చూచి నిన్ను వదలిపెడుతున్నాను. జ్ఞాపకముంచుకో-మళ్ళీ ఇల్లా మాట్లాడావూ అంటే మనిషివే

మిగిలావు...ఎందుకైనా మంచిది. ఆ కళ్ళజోడు తీసి అవతల పెట్టు.

బో : ఎందుకూ?

ప్లా : మొహం పగిలేట్టు తంతే ఆ అద్దాలొచ్చి నీ కళ్ళల్లో గుచ్చుకొంటాయని ఫూల్!

బో : (భయపడి) ఎవరు ఎవర్ని కొట్టేదీ ఇప్పుడే తేల్చి వేయగలను. కాని నీలాంటి పనికిమాలిన వాళ్ళమీద చేయి చేసుకొని నన్ను నేను కించపరచుకో దలచలేను (వెళ్ళిపోతాడు.)

మంకా : వెళ్ళిపోయాడు! (అంతా కొద్దిసేపు నిశ్శబ్దం. అందరూ ఆలోచనలో మునిగివుంటారు. 'అన్నా' ప్రవేశం)

అన్నా : ఆఁ! మంకా - ఈలారా. (రహస్యంగా మాట్లాడుతుంది.)

మంకా : జెన్నీ! ఆ పెద్దమనిషికి నాతో అవసరం వచ్చిందట. ఇప్పుడే వస్తాను. (వెళ్ళిపోతుంది)

పెట్రో : మిత్రులారా! నేనూ బోరిస్‌తో పాటే వెళ్ళిపోతున్నాను. న్యాయాన్యాయ విచారణ సలా వుంచండి పరాయిస్థలంలో ఈ అపరిచితుల మధ్య మన మిత్రుడికి అవమానం జరుగుతుంటే మనకేమీ సంబంధం లేనట్లూరుకోవడం, నాకుమాత్రం నచ్చలేదు. మీ యిష్టం. ఏమైనా చేసుకోండి. నేనూ వెళ్ళిపోతున్నాను.

లికో : ఇదేమిటి పెట్రో! వాకౌటు చేయడానికి ఇదేమైనా రాజకీయసభ అనుకున్నావా? వచ్చిన లగాయతు చాలా అసహ్యంగా ప్రవర్తించాడు బోరిస్! అటువంటి పిచ్చివాణ్ని మనమెందుకు సమర్థించాలి?

పెట్రో : అంతే! అంతే! (వెళ్ళిపోతాడు.)

జె : ఇద్దరూ కట్టకట్టుకుని అఘోరించండి. [మళ్ళీ నిశ్శబ్దం. ఆలోచనలు]

అన్నా : (బయటినుంచి) జెన్నీ! జెన్నీ! ఇటురా ఒక్కసారి.

జె : నాకు తెలుసు. ప్లాటానోవ్—వస్తాను! (వెళ్ళిపోయింది.)

యార్చ : నేనుమాత్రం వుండి ఏం చేయాలి? ఇప్పుడే వస్తాను. ప్లాటానోవ్! [రంగస్థలంమీద వున్న ఆడవారూ, మగవారూ అందరూ వెళ్ళిపోతారు. లికోనిన్, ప్లాటానోవ్ మాత్రం మిగిలిపోతారు.]

ప్లా : ఒక్కడివీ మిగిలిపోయావు లికోనిన్!

లి : నన్ను పొరపాటుగా అర్థంచేసుకున్నారు. నేను ఈ పని చేయలేను. చేయను. వ్యభిచారం అపచారం అనీ కాదు. ఆదర్శంకోసం అంతకన్నా కాదు. ఏమిటో నాకాసక్తి లేదు. ఎందుకనో జుగుప్స ఏర్పడింది. చిత్రం!

ప్లా : నాకూ అంతే! ఒకోసారి బాలికతో రాత్రిళ్ళుకూడా ఇక్కడే పడుకొంటాను. కాని స్త్రీసౌఖ్యం ఎరగను.

లి : నిజంగా?...ఒక్కసారిగూడా?

ప్లా : ఓ అయిదేండ్లక్రితం నాకిలాంటి అనుభవం కలిగింది. కాని ఎంతో అసహ్యంగానూ, దుర్భరంగానూ కనిపించింది. స్త్రీయెదుట సిగ్గు, బిడియం, భయం, అనుమానం కలిగాయి. ఇందులో పరస్పర తృప్తి ప్రేమ అనేదిలేదు ద్వేషం, కన్నీళ్ళు, రక్తపాతం, బలిదానం ఇవే ఇందులో వున్నవి. వీళ్ళు కోరేది కామవికారం కలిగించే మాటలు కాదు. కామవికారం కలిగించే చేష్టలు.

లి : నమ్మటం కష్టంగా వుంది. రోజులతరబడి ఇక్కడే గడుపుతూ స్త్రీసాంగత్యం చేయకుండా వుండటం సాధ్యమేనా చెప్పండి ప్లాటానోవ్? పైగా మీరు రచయితలు కూడా కాదని చెప్పారు నిర్లిప్తత నలవర్చుకొనడానికి.

ప్లా : అవును. నేను రచయితను కాదు.

లి : అయినప్పుడు మీరిక్కడ వుండటంలో అర్థం లేదు. దుర్గుణాల కాలవాలమై, దుర్గంధభూయిష్ఠమైన ఈ నరకంలో వుండడానికి కారణం ఏమిటో కనుపించడం లేదు.

ప్లా : ఏలా సమాధానం చెప్పమంటారు మీ ప్రశ్నకు? ఇక్కడ ఎందుకున్నానంటారా? వీరి జీవితంలోని భయంకరమైన నగ్నసత్యం నన్నాకర్షించింది. సత్యాన్ని దాచే ముసుగు లేదిక్కడ. అబద్ధాలు, మోసాలు, ఆడంబరాలు ఇవేమీ లేవిక్కడ. ప్రతిస్త్రీ "నేనొక పడుపుకత్తెను. అందరికీ ఉపయోగకరమైన పాత్రను. కాని ఒక విషయం: మీరు పొందే ఈ అమూల్యానందానికి ప్రతిఫలం, డబ్బు, దెబ్బ, అవమానం, అసహ్యం ఇవిమాత్రం ఇచ్చిపోవాలి" అంటుంది. వీరి బ్రతుకులో భ్రాంతి, పటాటోపం, ఇవేమీ లేవు. తత్కారణంగా నే...క్షమించు లికోనిన్ నీకు విసుగు కలిగిస్తున్నాను.

లి : పర్వాలేదు. చెప్పండి.

ప్లా : అసలు ప్రశ్న అలాగే వుండిపోయింది. ఏం చెప్పను? మానవుడు ఆనందం అనుభవించడం కోసం పుట్టాడు. ఈశ్వరప్రసాదితమైన ఈ అనంతసృష్టిలో అతనే ప్రేమమూర్తి. కాని ఆ మానవుడే అబద్ధంతో మోసంతో కుట్రతో, ద్వేషంతో జీవయాత్ర సాగి

స్తున్నాడు. ఇదంతా ఎందుకు జరుగుతున్నది లికోనిన్? ఎందుకు జరుగుతున్నది? జీవితాన్ని ప్రేమించాను. జీవితం తీయగా, దేవతలా వుంటుందనుకున్నాను. ఆ ఉద్దేశంతోనే విధి ఎక్కడకు తీసుకువెడితే అక్కడకు వెళ్లాను

[లోపలనున్న వ్యక్తులందరూ బయటికి వచ్చారు. వారి మొహాలుచూస్తే జబ్బుమనుషులవలె కనిపిస్తున్నారు. ఆడవారూ, మగవారూ కూడా తూలుతూ, తేలుతూ నవ్వుతున్నారు. వీడ్కోలు చెప్పుకొని వెళ్ళిపోతున్నారు ]

ప్లా : లికోనిన్! చూడండీ! మీ ప్రొఫెసరు ఎక్కడికి వెళుతున్నాడో!

లి : ఇదేమిటి? 'ట్రెపెల్స్' మరో సానికొంపదానిలోకి వెళుతున్నాడు!

ప్లా : అందులో ఆశ్చర్యపడవలసినది ఏమీలేదు. ఈ మనుషుల తత్వాలు నాకు బాగా తెలుసు.

[ఇంతలో లోపలనుంచి ఇద్దరు అమ్మాయిలు వచ్చారు. ఒకామె జెన్నీ. పడుకోనే సమయంలో వేసుకోనే రవిక తొడుక్కున్నది. రెండవ ఆమె లూబ్కా. లూబ్కా మౌనంగావచ్చి సోఫాలో పడుకొని మాగన్నుగా నిద్రపోవడం ప్రారంభించింది. మరో కుర్చీలో జెన్నీ వొళ్ళంతా కుంచించుకుని కూర్చునివుంది.

లి : ప్లాటొనోవ్! మీరెన్ని సమాధానాలు చెప్పినా ఈ ప్రశ్నకు మాత్రం జవాబు లేకుండావుంది ఈ పశుప్రవృత్తి ఏమిటి? ఎందుకు వచ్చింది? అంతువుందా దీనికి? ఏమిటి- చెప్పండి ప్లాటొనోవ్?

ప్లా : వ్యభిచారం ఎప్పుడు నశిస్తుందో ఎవరూ చెప్పలేరు లికోనిన్! సోషలిస్టులు, కమ్యూనిస్టులు అంతా స్వర్గాన్ని నిర్మిస్తామంటున్నారు. కాని ఆ కలలు నిజమయ్యేదెన్నడు? బహుశా విశ్వమానవ సౌభ్రాతృత్వం, ఏక కుటుంబ విధానం మనగలిగినపుడు ఈ వ్యభిచారం రూపుమాసిపోవచ్చును. లేక మానవుడు యోగియై, మహర్షియై, పవిత్రుడై, పాపరహితుడైనప్పుడు ఈ వ్యభిచారం నశించవచ్చు. ఇప్పుడో?

ప్లా : చేయగలిగింది ఏమీలేదు. స్వంత ఆస్తులు వున్నంతవరకూ దారిద్ర్యం, వైవాహిక వ్యవస్థ వున్నంతవరకూ వ్యభిచారం ఈ రెండూ తప్పవు.

లి : అంతేనా ప్లాటొనోవ్? ఇదొక బడబాగ్ని. దేశాన్ని మానవజాతినీ దహించివేస్తున్నది. దీనిని చల్లార్చేమార్గం కావాలి? అదే నా ప్రశ్న.

ప్లా : కాని ఒక మనిషివెళ్ళి దోసెడు నీళ్లు పోసినంతమాత్రాన బడబానలం చల్లారుతుందా?

లి : కనీసం ఒక్క నిప్పుకణిక అయినా చల్లారవచ్చు

ప్లా : అయితే ఒక పతితను ఉద్ధరిస్తానంటావు? అంతేనా?

లి : అవును శాయశక్తులా ప్రయత్నించి చూస్తాను సాధ్యంకాకపోతుందా?

ప్లా : కానీ ఆ అమాయకురాలు మళ్ళీ ఈ యమకూపంలోకి వస్తుంది.

జె : అవును. తప్పదు. వచ్చితీరుతుంది.

లి : (గభాలున లేచి జెన్నీ దగ్గరకు వెళ్ళి) జెనీచ్కా!... ఏమంటావు? అపార్థంచేసుకోకు. నిన్ను నా సోదరిగా, స్నేహితురాలిగా చూచుకొంటాను ప్రయత్నిద్దాం ఏం జరుగుతుందో?

జె : (కోపంతో) మిమ్మల్ని బాగా ఎరుగుదును నేను. మనుషులంటే ఏమిటో, ఎలాంటివాళ్ళో నాకు బాగాతెలుసు దాసీదానిలా చప్పచాకిరీ చేయమంటావు. తరువాత మెడబట్టి బయటికి గెంటేస్తావు. నీజాతి, నీతి, కులం, గోత్రం, పరువు, ప్రతిష్ఠ అన్నీపోయాయని ప్రతిరోజూ నన్ను దెప్పిపొడుస్తావు. అవునా?

లి : (కంగారుగా) లేదు జెన్నీ. అలాటిపని ఎప్పుడూ చేయను. నిన్ను నా సోదరిలా చూచుకొంటాను.

జె : సోదరి! ఈ అభిప్రాయం మొదటిరోజు మాత్రం. మరునాటినుంచీ యథాప్రకారం పాశవికప్రవృత్తుల విలయతాండవం. ఛీ! ఛీ!

ప్లా : ఏం లికోనిన్? ఇప్పుడేమంటావు? ఆదర్శాలకేం? ఆచరణలోనే దెబ్బతింటాం మనం. ఈ వ్యవహారంమూలంగా నువ్వు చెడిపోవడమేగాకుండా ఆ పిల్ల జీవితాన్ని కూడా మరీ పాడుచేస్తావు.

లి : (కళావిహీనుడై) కాదు. మీరు చెప్పినట్లు జరగడానికి వీల్లేదు. అయినా లూబ్కా నడుగుతాను. లూబ్కా! లూబ్కా!

లూ : (చేత్తో పెదవులు తుడుచుకుని, ఆవులించి, ఓ చిరునవ్వు నవ్వి) నిద్రపోవడంలేదు

లి : (చెయ్యిపట్టుకొని) లూబ్కా! నీవైనా చెప్పు. నాతో రావడం నీకిష్టమేనా? ఇది నీ జీవితంలో మంచికోసం వచ్చిన మార్పు. మళ్ళీ ఈ కొంపలో అడుగుపెట్టవద్దు.

లూ : పోదురూ! నాతో ఎందుకు వేళాకోళాలు?

జె : (వణకుతున్న స్వరంతో) ఎగతాళికాదు. లూబ్కా. అతను నిజంగానే చెబుతున్నాడు.

లి : నామాట నమ్ము మాట తప్పను.

జె : లికోనిన్! అది నాలాంటిదికాదు. ఇంకా ఈ నరకవాసానికి అలవాటుపడలేదు. ఏమే లూబ్కా? ఏంచెబుతావో చెప్పు? ఆయనతో వెడతావో లేదో చెప్పు?

లూ : నీ సలహాయేమిటి జెనీచ్కా?

జె : ఓసి మొద్దూ! నా సలహాయేమిటి? నీ జీవితం నీకు తెలీడం లేదూ? ఈ నరకంనుంచి విముక్తి పొందాలని లేదూ? గౌరవంగా బ్రతకాలని లేదూ? ఈలా అడిగినందుకు వారికి కృతజ్ఞత తెలుపుకో. మాట్లాడకుండా వారి వెంట వెళ్లు.

లి : ఇప్పుడు నాకెంతో సంతోషంగా వుంది. లూబ్కా! వెళ్ళి మీ యజమానురాలితో చెప్పిరా. వెళ్లు. త్వరగా.

జె : వద్దు వద్దు. అది కాదు సరైనమార్గం. లికోనిన్! మీరొక పదిరూబుల్సు ఖర్చుపెట్టలేరూ?

లి : నిరభ్యంతరంగా.

జె : అయితే ఒకపని చెయ్యండి. లూబ్కాను నీ గదికి తీసుకు వెడుతున్నావని మా యజమానురాలితో చెప్పు. ఆ డబ్బు ఆమె మొహాన పారవెయ్యి. తర్వాత రేపువచ్చి అన్ని వివరాలు పరిష్కారం చేసుకోండురుగాని. లూబ్కా. వెళ్లి అన్నాతో చెప్పిరా పో. వెళ్లు (లూబ్కా లోపలకు వెళ్తుంది. ఆమెను లికోనిన్ అనుసరిస్తాడు. కొద్దిసేపట్లో తిరిగి వస్తారు)

ప్లా : నువ్వుమాత్రం తెలివిగలపని చేయడం లేదు లికోనిన్. కానీ నీ ధైర్యానికీ, మంచితనానికీ మెచ్చుకుంటున్నాను. ఆదరణలో చూపించు నీ ఆదర్శాన్ని.

జె : జీవితాన్ని సుఖంగా కొత్తపంథాలో ప్రారంభించండి.

లికో, ల్యూబ్కా : వస్తాం జెనీచ్కా! వస్తాం ప్లాటొనోవ్! (వెళ్లిపోతారు)

[రిపోర్టరు జెన్నీ వంక చూచాడు. ఆమె కళ్లవెంబడి నీళ్లు కారడంతో నివ్వెరబోయాడు]

జె : భగవంతుడు ఆమెకు మేలు చేస్తాడు.

ప్లా : ఏమిటి జెన్నీ? మనసు బాగాలేదా? దిగులేమైనా నా? నా సహాయం కావాలా?

జె : అవసరమైనపుడు ఉత్తరం వ్రాస్తాను. ఎక్కడికి వ్రాయాలి?

ప్లా : మామూలు అడ్రస్ కే 'ఎకో' పత్రికకు.

జె : (పసిపిల్లలా ఏడుస్తూ) నేను... నేను... నేను ...(మొహాన్ని కప్పుకొని) జాబువ్రాస్తానులెండి.

ప్లా : జెన్నీ! ఏమిటి జెన్నీ! జరిగిందేమిటో చెప్పు జెనీచ్కా! [తెర]

## 3

** అన్నా ఇంట్లోవున్నవారంతా అలవాటు ప్రకారం జెన్నీ గదిలో పోగయ్యారు. ఈరోజు జెన్నీ చాలా వింతగా ప్రవర్తిస్తోంది. ఏదో చెప్పలేని ఆవేదన, బాధ, ద్వేషం, ఆమె కళ్ళల్లో కనిపిస్తున్నాయి. బయట తెరపిలేకుండా సదానంగా, నిండుగా జల్లుపడుతున్నది. జెన్నీ మనసు గూడా ఆ వర్షం మాదిరిగానే వుంది. జెన్నీ ప్రక్కమీద ఆమెను ఆనుకుని టమారా కూచుని వుంది. ఆమె భుజంమీద చెయ్యివేసి వంగి రహస్యంగా యిలా అంది!

టమారా: అలా వున్నావేమిటి జెన్నీ? ఏదో బాధపడుతున్నట్లున్నావు. అసలు రహస్య మేమిటో చెప్పవూ? నాతో చెప్పవూ?

జెన్నీ : ఏమీ లేదు!

ట : జెనీచ్కా! నీ మనసు నొప్పించడం నాకిష్టం లేదు కానీ—

జె : (నిర్ణయానికి వచ్చిన దానిలా) సరే! రా. ఆ కిటికీదగ్గరకు వెళదాం. ఒక్క క్షణం అక్కడికి వెళ్లి నిలబడదాం. అంతా నీతో చెబుతాను. ఎంతకాలమని దాచుకోను. నీతో కాకపోతే మరెవరితో చెప్పుకోను? పద! (ఇద్దరూ కిటికీదగ్గరకు వెళతారు)

ట : ఇక చెప్పు జెన్నీ!

జె : (మెల్లగా) మీ నుండి వీడ్కోలు పుచ్చుకోవాల్సిన సమయం ఆసన్నమౌతున్నది.

ట : ఎందుకని?

జె : భయంకరమైన అంటువ్యాధు లుంటాయని తెలుసా?

ట : విన్నాను.

జె : ఎవడో దుర్మార్గుడు యీ పుణ్యం మూటకట్టుకున్నాడు.

ట : ఆఁ! ఏమిటి? ఓ! ఎంత దురదృష్టవంతురాలివి! చాలా కాలం అయిందా?

జె : జ్ఞాపకముందా? కొందరు విద్యార్థులు వచ్చి ప్లాటొనోవ్‌తో దెబ్బలాడారు......ఆమరునాటి మధ్యాహ్నమే మొదటిసారిగా నేనిది కనిపెట్టాను.

ట : ఆలాగా! ఒకనాటి సాయంత్రం ఒక గాయకురాలు వచ్చింది. మనదగ్గరకు మన పరిస్థితులు తెలుసుకొందామన్న కుతూహలంతో. ఎందుకనో గాని నువ్వామె కాళ్ళమీదపడి వెక్కి వెక్కి యేడ్చావు. ఆమె చెవుల్లో గుసగుసలాడావు. అప్పుడే ఏదో కీడుమూడిందని వూహించాను. సరే! జరిగిందేదో జరిగింది. కానీ ఇప్పుడైనా ఏదో మందో, మాకో తిని జాగ్రత్తపడరాదూ?

జె : ఆహా! వీల్లేదు. (ఆలోచిస్తూ) మీరేమీ భయపడవలసిన అవసరం లేదు. నామూలంగా ఎవరూ నాశనం కారు. గమనించావో లేదో ...కొన్నివారాలబట్టీ నేను మీ అందరితో కలిసి భోజనం చేయడంలేదు. తినడానికి కడగడానికి వేరే గిన్నెలు పెట్టుకున్నాను ప్రాణస్నేహితురాలు మంకాను కూడా దగ్గరకు రానీయడంలేదు. ఇహ ఈ మగవాళ్లు - ద్విపాదపశువులు — వీళ్ళ సంగతా? నేను బుద్ధిపూర్వకంగా వాళ్లకేమీ అన్యాయం చేయడంలేదు. వారంతట వారే ఈ జబ్బును మూటగట్టుకుపోతున్నారు.

ట : జెనీచ్కా! నిజంగా అంతఘోరం చేయదల్చుకున్నావా?

జె : అవును నాకు పాపభీతిలేదు. దయాదాక్షిణ్యాలు లేవు నా తెలివితేటలతో, ధైర్యసాహసాలతో అద్భుతంగా నటించి వీళ్ళను మోహించి, కామించి పిచ్చికుక్కలనుచేసి వదిలిపెడతాను. మీరే చూద్దురుగాని! ఆనందిస్తారు. ఆశ్చర్యపోతారు. (ఒక్క క్షణం ఆగి) టమారా! ఈ విషయం ఎక్కడా బయట పెట్టవుకదూ?

ట : ఆలాగే! ఎవరితోనూ చెప్పను.

[పెట్రోవస్కీ ప్రవేశం అతన్ని చూడగానే మిగిలిన ఆడవారంతా చడీచప్పుడూ చేయకుండా బయటికి వెళ్ళిపోతారు. ఒక్క జెన్నీ మాత్రం మిగిలివుంది. అత నేమీ సంకోచించకుండా వచ్చి, ఆమె మంచంమీద ఆమె ప్రక్కనే కూచున్నాడు.]

పె : ఏమిటి జెన్నీ—అలా వున్నావు?

జె : ఏంలేదు. కొంచెం తలనొప్పిగావుంది. అంతే.

పె : దానిమీద దృష్టి వుంచుకోకుండా వుంటే సరి. అదే తగ్గిపోతుంది.

జె : ఏం ఫర్వాలేదు. మీరు ప్రక్కన వుంటే నాకిప్పుడెంతో హాయిగావుంది. సరేగానీ— ఇంతకాలంబట్టీ, దర్శనం అపురూపమైపోయింది.

పె : ఏం జేయను. విశ్రాంతి దొరకడంలేదు.

జె : ఎంత కష్టపడుతున్నారు! నిజంగా చెబుతున్నాను మీలాంటి తమ్ముడొకడు నాకు వున్నట్లైతే అతనికోసం సర్వస్వం త్యాగం చేసేదాన్ని.

పె : ఎంత మంచిదానవు! నీదగ్గర ఇల్లాగే కల కాలం వుండాలని ఎంతో కుతూహలంగా వుంది.

జె : ఉండండి.

పె : కానీ—ఇంటికి వస్తానని చెప్పివచ్చాను.

జె : అంత ఆప్తులయినవారు ఎల్లాగూ కనిపెట్టకుని వుంటారు. ఆ! ఈ దీపం ఇలాగే వుంచనా? లేక తగ్గించనా?

పె : డియర్ జెన్నీ!

జె : (అపవారింపుతో) ఉండండి. ఓపికపట్టండి. ప్రయాణానికేమి తొందర? ఇటు చూడండి. (అతని అణువణువూ ఆమె నిశితంగా చూచింది)

పె : ఏమిటి జెన్నీ వావైపు అలా చూస్తావు? ఏమిటి నీ ఆలోచన?

జె : పెట్రో నామీద కోప్పడకుండా వొక్క సారి గట్టిగా కళ్ళు మూసుకోండి కాదు గట్టిగా మూసుకోవాలి. ఇంకా గట్టిగా. ఈ వొక్కమాట నా సరదా తీర్చండి. ఆ... అలాగా...అంతే. ఇప్పుడు చూడండి. అద్భుతంగా వున్నారు. అపనిపూవు మాదిరి.! (తనలో) ఇతను కూడా నాశనమౌతాడు!!! పెట్రో, కళ్ళు తెరవండి!

పె : ఏమిటి జెన్నీ ఇదంతా?

జె : ఒక్కమాట అడుగుతాను నిజం చెప్పండి పెట్రో. మీరు...మీరు మా దగ్గరకు, మాలాటివారి దగ్గరకు రావడానికి కారణం ఏమిటి?

పె : ఎంతి పిచ్చిదానవు. అందరూ ఎందుకు వస్తారు. స్త్రీ అవసరం.

జె : అవసరం! కేవలం అవసరం!

పె : కాదు. కేవలం అవసరమే కాదు (మంద హాసం చేస్తూ) నీ మీద నా కిష్టం నిన్ను నేను ప్రేమిస్తున్నాను.

జె : అయితే పెట్రో నాకు ఇచ్చే విషయంలో మీ ఉద్దేశ్యం ఏమిటి? ఈ దౌర్భాగ్యపు రెండు రూబుల్సు నా మొహాన పారేయటం నా ప్రేమకోసమేనా? ఇలా చేస్తున్నందుకు సిగ్గువేయడంలేదూ చెప్పండి?

పె : (కోపంగా) ఏమిటి ప్రశ్నలు? అంతా ఇచ్చిస్తున్నారు. నేను ఇస్తున్నాను. ఇందులో వింత ఏముంది?

జె : మీరెప్పుడైనా, ఎవరైనా ప్రేమించారా? ఏ పిల్లకయినా పూలు తెచ్చియిచ్చారా? చెట్టాపట్టాలు పట్టుకుని పౌర్ణమినాటి అందం దాన్ని పంచుకున్నారా?

పె : ప్రతివాడూ తన యౌవనంలో యిటువంటి పిచ్చిపనులు అనేకం చేస్తాడు. అందులో ఆశ్చర్యపడవలసినదీ లేదు. ఆలోచించవలసినదీ లేదు

జె : మీరెన్నడైనా ఒక్కక్షణం మీ కుటుంబం సంగతి ఆలోచించారా? మీ సంసారానికి అకస్మాత్తుగా దరిద్రంపట్టి మాలాగే పతనమై పోతారనుకోండి అప్పుడేం చేస్తారు?

పె : నాన్సెన్స్. అర్థంలేని వాగుడు. అలా ఎన్నటికీ జరగదు. జరగడానికి వీల్లేదు ఇకచాలు. నే వెళుతున్నాను.

జె : వెళ్ళండి. సుఖంగా వెళ్ళిరండి. వెళుతూ వెళుతూ ఎదురుగా ఆ చిన్న పెట్టెలో వున్న పదిరూబుల్సు కూడా పట్టుకువెళ్ళండి. ఆ ఆ డబ్బు పెట్టి మీ అమ్మగారికి కళ్ళజోడు, మీ పిల్లలకు బొమ్మలు కొనుక్కొని వెళ్ళండి. చచ్చిపోయిన ఒక అనాధకులాలి జ్ఞాపకార్థం ఇవి తీసుకొచ్చానని వారితో చెప్పవచ్చు. వెళ్ళిరండి.

(ఆమె కళ్ళలో నీళ్ళు నిండాయి ఆకన్నీళ్లకు అతను మరింత కరిగిపోయాడు.)

జె : మనకు తగవు లెందుకు జెన్నీ?

జె : (గాద్గదికంగా) పెట్రో! రోగాలను చూచి భయపడ్డావా? నీ వన్నడైనా?

పె : అవును. రోగాలంటే నాకు మహాభయం, భగవాన్! నువ్వు...నువ్వు...

జె : (మాట్లాడలేదు దూరంగా వెళ్ళి నిల్చున్నది.)

పె : నిజమేనా? నువ్వు...నువ్వు...నా జెన్నీ... కాదు జెనీచ్కా...రోగిష్టిదా! భగవాన్!

జె : పెట్రో! ఈ ఒక్కమాట వినండి మీరు అదృష్టవంతులు. అందువల్లనే ఒక నీతిగల స్త్రీదగ్గరకు వచ్చారు. మేము పతితులం. భ్రష్టులం. వింటున్నారా? ఈనాడు మీ

జీవితాన్ని నాశనం చేసి వుండేదాన్ని. కానీ ఆలా చేయలేదు. వదిలిపెట్టాను.

పె : (అకస్మాత్తుగా మంచంమీద కూలబడ్డాడు. రెండు చేతులతో మొహాన్ని కప్పుకొని వెక్కి వెక్కి యేడ్చాడు.) భగవంతుడా! ఎంత ఘోరం! ఎంత దారుణం! కానీ... కానీ...నన్ను రక్షించావు.

జె : (మెల్లగా అతని దగ్గరకు వెళ్ళింది. అతన్ని ఉద్దేశిస్తూ (క్రాస్ చేసుకొంది) దేవుడు నిన్ను రక్షిస్తాడు బాబూ!

[ఇద్దరూ విచారంగా ఒకరివంకనొకరు చూసుకున్నారు]

పె : నన్ను క్షమించు. నన్ను క్షమిస్తావా జెన్నీ?

జె : నన్ను కూడా మీరు క్షమించాలి...మళ్ళీ మనం ఒకరినొకరం కలుసుకోకపోవచ్చు.

పె : ఆలాగే! ఆలాగే జెన్నీ! నన్ను క్షమిస్తావు కదూ? (వెళ్ళిపోతాడు)

[క్షణకాలం నిశ్శబ్దం. విచారం. ఆవేదన. అంతా జరుగుతున్న ఓపీడకలలా గోచరిస్తుంది. ఇంతలో లూబ్కా లోపలికి వచ్చింది ఆమె మొహం వివర్ణమైపోయింది. విపరీతమైన బాధతో కుమిలిపోతున్నట్లు కనిపించింది. నిలబడడానికి కూడా శక్తి వున్నట్లు లేదు]

జెన్నీ : లూబ్కా! ఇదేమిటి? ఈసమయంలో! ఇక్కడకు వచ్చావేమిటి? అసలేం జరిగింది? చెప్పరాదూ?

లూ : వెళ్ళగొట్టాడు!

జె : ఎవరూ—లికోనిన్ వెళ్ళగొట్టాడా!

లూ : అవును నమ్మడానికి కష్టంగానే వుంటుంది. కానీ వెళ్ళగొట్టాడు. పగలంతా ధర్మపన్నాలు ఏవేవో చెప్పేవాడు. కాని—

జె : అనుకున్నంతా జరిగిందన్నమాట.

లూ : జెన్నీ—ఇక నాగతి ఏంకావాలి? నేను నీ మీదనే ఆశ పెట్టుకున్నాను. ఇక్కడివారంతా ఎలాగైనా నిన్ను గౌరవిస్తారు... నాకు సహాయం చెయ్యవూ?...దయచేసి అన్నాతో మాట్లాడి మళ్ళీ నన్ను చేర్చుకోమని చెప్పవూ?

జె : సరేగానీ—ఇవాళ భోజనం చేశావా?

లూ : లేదు. ఇవాళా నిన్నా కూడా లేదు.

జె : ఏమిటది? ఎందుకని?

లూ : అంతా నాదురదృష్టం జెనీచ్కా! నా కోసం వేరే గదొకటి తీసుకున్నాడు. ఇంటి పెత్తనమంతా నెత్తిన వేసుకున్నాడు. చదువు చెప్పడంకోసమని కొందరు స్నేహితులను పరిచయం చేశాడు. కానీ—

జె : చివరకు ఆపరిచయమే ప్రణయంగా మారింది కదూ?

లూ : లేదు. లేదు జెన్నీ! వాళ్ళ మాటలకు సుతరామూ వొప్పుకోలేదు నేను కానీ ఆయన లికోనిన్ అనుమానపడ్డాడు. వారం రోజుల నుండీ ఇంటిచాయలకు కూడా రావడం మానేశారు.

జె : సరే! ఇక నువు స్వైరవిహారం అలవాటు చేసుకోవలసివచ్చింది కదూ?

లూ : ఊc! (ఇలా చెబుతూ కన్నీళ్ళు కారుస్తూ ఆమె కుప్పలా కూలిపోయింది)

జె : ధైర్యం తెచ్చుకో లూబ్కా! ఇలా దుఃఖించి ఏం ప్రయోజనం?

లూ : జెనీచ్కా! నీ వెలాగైనా తెలివైనదానివి. సాహసం కలదానివి అన్నాతో చెప్పి ఏలాగైనా మళ్ళీ నన్ను పనిలో జేర్పించు.

జె : ఎవరు చెప్పినా ఆదుష్టురాలు వినేరకం కాదు. మరి ఏం చూసుకొని ఎందుకూ పనికిరాని ఏమీ చేతకాని అమాయకుడివెంట వెళ్ళావు?

లూ : నువే వెళ్ళమని సలహా యిచ్చావు.

జె : నేనా? సరేలే. ముందు లోపలికి పద.

[అన్నా ఒక్కసారిగా గాలివిసురులా లోపలికి వచ్చింది.]

అ : ఏమిటది? నిన్ను మళ్లీ మాకొంపలోకి తీసుకోవాలా? బుద్ధిలేనిదానా! ఇన్నాళ్ళనుండి పరువూ, మర్యాదా లేకుండా బ్రతికి చివరకు మళ్లీ ఇక్కడకు చేరావు. వెళ్ళు వెళ్ళు. ముందిక్కణ్ణుంచిపో.

లూ : (వెక్కి వెక్కి ఏడుస్తూ, ఆమె కాళ్లమీద పడి) నన్ను కొట్టకండమ్మా! కొట్టకండి. మీకు పుణ్యముంటుంది. ఇక నెప్పుడూ

యిటువంటి పనులు చేయను. చేయనంటే చేయను. మామ్మాటికీ చేయను అమ్మా! అమ్మా!

జె : (పట్టరాని కోపంతో) అన్నా! మర్యాదగా లూబ్కాను వదిలిపెట్టు. గౌరవంగా బ్రతకాలంటే ఈ పని చేయబోకు

అ : సైలెన్స్!

లూ : వద్దు వద్దు ఆరాతుసుజ్ఞి పిలవవద్దు మీరు చెప్పినట్లలా చేస్తాను. మీ చెప్పులు కుట్టమన్నా కుడతాను. మీరేం చేయమంటే ఆ పని చేస్తాను.

అ : లోపలకు పద! అక్కడ ఆలోచిస్తాను.

లూ : అమ్మా! అమ్మా!

అ : పద! పద!

[వాళ్లు వెళ్ళిన కొద్దిసేపటికి ప్లాటోనోవ్ లోపలికి వచ్చాడు. అతన్ని చూచి చెదరిన తన భావాలను సరిచేసుకోవాలని జెన్నీ ఎంతగానో ప్రయత్నించింది ]

ప్లా : ఏం జెన్నీ—కులాసాగా వున్నావా? చాలా కాలమైనట్లుంది నిన్ను చూచి! ఎంతో సంతోషంగా వుంది!

జె : (పేలవంగా) నాకూ అలాగే వుంది.

ప్లా : ఇదేమిటి? ఏమిటి జెన్నీ అలా వున్నావు? ఏమన్నా జరిగిందా?

జె : లూబ్కా తిరిగి వచ్చింది.

ప్లా : నిజం?

జె : నిజమే!

ప్లా : అందరూ కార్యవాదులు కాదు జెన్నీ—

జె : అలా అని ఒక స్త్రీ జీవితంతో చెలగాట లాడడం భావ్యమేనా?

ప్లా : కాకపోవచ్చు. కానీ ఈలోకంలో పశుత్వం వున్నంతవరకూ ఇటువంటివి తప్పవు

జె : తప్పవు? నిజమే! ఇప్పుడు నా జీవితం కూడా నాశనం కాబోతున్నది. ఈ నాశనం తప్పదు.

ప్లా : కలవరపడకు జెన్నీ. పరిస్థితి ఏమిటో చెప్పు? నీకు కావల్సినవాణ్ణనీ, నీ కుటుంబంలో ఒక మనిషిననీ భావించుకో.

జె : చూడండి ప్లాటోనొవ్... నేను జబ్బుతో వున్నాను....అర్థమైందా?...భయంకరమైన వ్యాధి.

ప్లా : చెప్పు జెన్నీ?

జె : ఓ నెలరోజుల క్రిందట తెలుసుకున్నాను సరిగా ట్రినిటి పండుగ ఆదివారం నాడు.

ప్లా : ఆ ఇద్దరు కుట్టివాళ్ళూ వచ్చిన రోజు కదూ? పాపం! జెన్నీ—ఆ తర్వాత వారిద్దరూ నరక మనుభవించారు.

జె : నేనే కారణం అయివుండవచ్చు.

ప్లా : పాపం! చనిపోతూ, చనిపోతూ ఆత నేమని చీటీ రాశాడో తెలుసా? 'సౌందర్యం: సన్మార్గం: సచ్ఛీలత! ఇవే జీవితానికి సంపూర్ణమైన సుఖాన్ని కల్గిస్తాయి ఈ వ్యాధి వచ్చినందున నేనిక మనిషిని కాదు ఒక శవాన్ని! క్షణికమైన సుఖానికీ, వ్యసనానికీ బానిసనై నిర్దాక్షిణ్యంగా ప్రేమ అనేది లేకుండా డబ్బు పారేసి ఒక అబల శరీరాన్ని కొనుక్కున్నందుకు నాకీ శిక్ష జరగవలసిందే!" పాపం! ఇందువలనే అప్పుడప్పుడు అతని మీద జాలి కలుగుతుంటుంది.

జె : నాకుమాత్రం, కొంచెమైనా విచారం లేదు.

ప్లా : పొరపడుతున్నావు. ఆత్మహత్యలంటే నాకూ నమ్మకం లేదు. కాని ఒక మహోత్తమమైన—ఆదర్శంకోసం ఆత్మార్పణం చేసుకొన్న వ్యక్తి నిజంగా అసాధారణమైన వాడైనా అయివుండాలి లేక మహానుభావుడైనా అయివుండాలి అందుకనే అతనిముందు తలవొంచడం.

జె : ఆశ్చర్యంగా వుంది. నా కండ్లలో గొప్పదనం గాని ప్రత్యేకతగాని ఏమీ కనిపించడం లేదు. మూర్ఖులు, మేధావులు, పడుచువాళ్లు, వృద్ధులు, నీతివంతులు, అవినీతిపరులు అంతా నాకు వొకటే. ఇప్పుడు అందరినీ నే ద్వేషిస్తాను. కారణం ఆలోచించండి ప్లాటోనోవ్! అస్పృశ్యమైన కళ్ళలాన్ని!— అందుకనే వీరందరినీ నేను అసహ్యించుకుంటాను. ద్వేషిస్తాను.

ప్లా : ప పాణివి.

జె : కాదు ప్లాటోనోవ్! నాలోనూ సాత్విక భావాలే వుండేవి ఇదివరలో. నన్ను కన్నతల్లి నన్ను లోకానికి అమ్మింది. నే నందరికి

చెందినదాన్ని! అందరి వస్తువునూ నేను! అందరికీ నామీద హక్కువుంది. చైతన్య రహితమైన మొద్దులా, గడ్డిలా, ధూళిలా, పిగిలిపోయిన తొడుగులా నన్ను భావిస్తారు. ఓహో! అర్థం చేసికోండి ప్లాటూనోవ్! నేను పడేబాధ మరెవరూ పడరు.

ప్లా : నీవు చెప్పింది యథార్థమే! కాని ఆ సంకేహమే నిన్నొక అగాధంవద్దకు తీసుకుపోతున్నది. నీ కెవరూ తోడు దొరకరు.

జె : అయినా మీ ఒక్కరిమీద నే నాకు విశ్వాసం వున్నది.

ప్లా : అసలు సంగతి చెప్ప నేలేదు?

జె : ఇది నా అంత్యదశ అనుకుంటున్నాను. కలిగిన నష్టానికి పరిహారం కలిగించనుకుంటున్నాను. ఎవరి నీచమైన సుఖాలకోసం అహుతి అయానో వారి నే సర్వనాశనం చేయాలనుకుంటున్నాను.

ప్లా : కాని — నీదేశ ప్రజల నేకగు జెన్నీ ను వు నాశనం చేయదలచుకొన్నది?

జె : అవును నాకు భేదాలు తారతమ్యాలు లేవు. మిత్రుడు, శత్రువు అనే విచక్షణ లేదు. మీరే చెప్పండి ప్లాటూనోవ్? ఒక పసిబిడ్డను, అన్నెం పున్నెం ఎరుగని పసిపాపను ఒకడు నడివీధిలో చిత్రహింస చేస్తాడనుకోండి. అప్పుడు మీ రతన్ని ఏం చేస్తారు? ఏం శిక్ష విధిస్తారు? చెప్పండి?

ప్లా : నాకు తెలీదు? (అతని మొహం పాలిపోయింది)

జె : మీ రతన్ని నిస్సందేహంగా చంపేస్తారు. ఇటు చూడండి — మే మందరం పసిబిడ్డలం, బలిపశువులం. పతితులైనవారలం మూర్ఖులం. అమాయకులం. గుడ్డివాళ్లం. ఈ బరువును దించుకోలేకుండా వున్నవాళ్ళం ప్లాటూనోవ్! దీనికి కారణం మీరు — మగవాళ్ళు. అందుకనే ప్రతీకారం తీర్చుకుందామనుకొన్నాను. ఇది మంచిదా? చెడ్డదా? చెప్పండి?

ప్లా : నిజంగా నాకు తెలీదు జెన్నీ. నీవు అడిగిన దానికి జవాబు చెప్పలేను చెప్పడానికి సాహసించలేను

జె : ఈలా చేస్తున్నందుకు నాకు బాధలేదు పశ్చాత్తాపం, దయ, జాలి ఇవేమీ లేవు. కాని ఓ గంటక్రితం వొక కుఱ్ఱవాడు నన్ను చూడడానికి వచ్చినప్పుడు అతన్ని మోసగించలేక పోయాను అతని డబ్బు అతని కిచ్చేశాను. నాలోని బలహీనతను చూపించాను ఎందుకలా చేశానో నా కిప్పడేమీ అర్థం కావడంలేదు ప్లాటూనోవ్! మీరు ఎంతో గొప్ప మేధావంతులు. అనుభవం గడించిన వారు. నాకో మార్గం చూపించండి చూపించండి ప్లాటూనోవ్!

ప్లా : (ఆలోచిస్తూ) నాకు తెలీదు జెన్నీ? నీకు సలహా చెప్పడానికి బిడియపడి కాదు. నిజంగా నాకేమీ తెలీడంలేదు. అర్థం కావడంలేదు. ఇది నా శక్తికి అతీతమైన విషయం. ఈ విషయాన్ని నా ఆత్మగాని బుద్ధిగాని గ్రహించలేకపోతున్నాయి. ఈ సమస్యకు పరిష్కారం నాకు తెలీదు.

జె : నాకూ అర్థం కావడం లేదు. నేను అనుకున్నదీ, ఊహించిందీ అంతా తప్పని మాత్రం తెలుస్తున్నది. అందు చేత ఇక నిష్కృతి చేయగలిగింది...... మిగిలిందీ .... ఒక్కటే.

ప్లా : (ఆవేశపడి) వద్దు. వద్దు. అంత ఘోరం తలపెట్టకు జెన్నీ!

జె : ఇక నాకు మిగిలిందల్లా... ఉరిపోసుకు చావడం.

ప్లా : జెన్నీ!

జె : ఆలోచించాను. నాలో శూన్యం తప్ప మరేమీ లేదనిపిస్తున్నది. జీవితమే నన్ను మోసగించింది. సరే! ఇక మీరు వెళ్లిరండి ప్లాటూనోవ్! ఏం చేయదల్చుకున్నానో అది చెప్పాను. అంతకన్నా ఇంకేమీ చేయలేను కూడా.

ప్లా : అటువంటి పిచ్చిపనులేమీ తలపెట్టకు జెన్నీ. నిన్ను ప్రతిమాలుకుంటున్నాను. ఆలాటి

పని ఏదో చెయ్యను. ఏదీ చేయనని ప్రమాణం?

జె : ఎందుకండీ ఈ ప్రమాణాలు? మనసులో వున్నదంతా వెల్లడించాను. ఇహ వెళ్ళిరండి.

ప్లా : సరే! కాని మళ్ళీ నిన్ను బతిమాలుకుంటున్నాను. అటువంటి తెలివితక్కువపని ఏదీ చెయ్యవద్దని.

జె : ఆఁ! ఈ వొక్క ప్రశ్నకు సమాధానం చెప్పిపొండి ప్లాటొనోవ్. దేవుడున్నాడా? లేదా? ఈ ఒక్క విషయం చెప్పండి.

ప్లా : ఏంజవాబు చెప్పను. ఈ విషయం నాకే తెలీదు. దేముడున్నాడనే నేననుకుంటున్నాను. కాని మనం వూహించుకొంటున్న విధంగా మాత్రం లేడు. అంతే నే చెప్పగలిగింది.

జె : పోతే మళ్ళీ జన్మలో ఏం జరుగుతుంది? అంటే మరణానంతరం? అది స్వప్నాలు లేని, అంధకారబంధురమైన శూన్యమేనా?

ప్లా : నాకు తెలీదు నీతో అబద్ధాలు చెప్పడం నాకిష్టం లేదు.

జె : సరే! ఏం చేస్తాం! వెళ్ళిరండి కానీ ఈ దీనురాలిని మాత్రం జ్ఞాపకముంచుకోండి. మీరు సుఖంగా వుండాలని మాత్రం మనస్ఫూర్తిగా వాంఛిస్తున్నాను. అంతే.

ప్లా : జెన్నీ! జెన్నీ! ఆ పనిమాత్రం తలపెట్టకు జెన్నీ! అంతే నే కోరేది! (వెళ్ళిపోతాడు)

జెన్నీ : బలి పసువులం! ఇంతకన్నా ఏం చేయగలం? ఏదీ ముక్తి? పతితలం! మరణమే మా కాశ్రయం లూబ్కా! లూబ్కా! (పిచ్చిగా అరుస్తూ లోపలికి వెళ్ళిపోతుంది)

[తెర]

# కరిఖలం

"శిఖిముఖి"

చతురశ్ర క్షేత్రంలో ప్రతిపక్షుల క్షాత్రం. సైన్యానికి చుక్కెదురుగా ఒక సైన్యం... చతురంగాలు ... షోడశ స్వరూపాలు... చతుష్షష్టి స్థానాలు. చతుష్టయ గుణితపు, క్షేత్ర గణితపు పరిణామాని (Progression) కది చరమ సోపానం.

శితీ, గతివిశేషాలూ సితాసితాలకి సమానధర్మాలుగా శోభిల్లేయి. సామ్యాని కంతటితో స్వస్తయింది.

పగా, జిగీషా ప్రతిద్వంద్వాలకి ప్రేరణశక్తు లయ్యాయి. అంతటితో పోలిక అంతమయింది.

శ్వేతస్కంధావారం సంహతంగా (serried) గా విడిసింది. ఎదిరించి, ఉజ్జీగా వ్యూఢమయిన నల్లబలం నీలోత్పలచయం లాగ నప్పి వుంది.

ఆమే, అతడూ అభిముఖంగా ఉ-3 కాపురంలాగ కూర్చున్నారు. పనిచెరుపునీ, పప్పుముద్ద భోజనాన్నీ కలిపి పలికించిన డెల్ఫిక్ ఆరెకిల్ (Delphic Oracle) వంటి తెలుగు సామెత ఉపశ్రుతిగా ఉపయోగపడలేదు. ఫలితం కాయా, పండా? అన్న విషయాన్ని చూళికాప్రాయంగా నయినా సూచన చెయ్యలేదు.

కదనం కవిసమయాల కిది అదను కాదంది. వైరుల విరోధం అలంకారాల వరకూ వ్యాపించింది. షోడశకళాపూర్ణమయిన శుక్లపక్షం కువలయానందకరం కాలేదు. పరంతప విక్రమార్కుడు పడతి ముఖపద్మానికి ప్రీతిని కనుపరచలేదు.

తమ నెలవులు తప్పక పోయినా మిత్రుడు శత్రువు కావచ్చునని శతకానికి సవరణగా సుమతికి కొత్తసుద్దులు చెప్పాలనుకుంది సుదతి.

కైరవాలు తీర్చిన తమ్ములతో సారసాస్య జ్ఞాతివైరం పెట్టుకుంది. శుక్లపక్ష విన్యాసాలతో విక్రమార్కుడు సహజవైరం పెట్టుకున్నాడు.

పాణినే పణంగా ఒడ్డిన పణ్యాంగన పైయెత్తు కాయత్తపడింది. పరంతపుడి పరా

---

**టిప్పణి:**

1 డెల్ఫిక్ ఆరెకిల్—టూకీగా చెప్పాలంటే, ఇదమిత్థమని ఖచ్చితంగా విషయాన్ని తెలియ జెయ్యని గ్రీకు సోది

2 ఫ్యాఙ్కెటో—చదరంయొక్క ఐమూలల (long diagonals) ను శకటు కాపలాలో ఉంచే ఎత్తు. (B-N2)

3 ట్సుగ్ ట్స్వాంగ్—ఏ యెత్తు వేసినా అపాయం తప్పని పరిస్థితి.

4. మనదేశపు ఆట ప్రకారం రాజుకి కోట కట్టడమనే (castling) ఎత్తు లేదు. దానికి బదులు ఒక గుర్రపుగంతు వెయ్యవచ్చును.

5. ఆన్‌ప్రీజ్—మరణావస్థ (చదరంగం పరిభాషలో)

క్రమాన్ని భంగపరచాలన్న పట్టుదలతో సర్వతోభద్రబంధంవంటి చదరాన్ని సింహావలోకనం చేసింది. గడికొక అక్షరంగా గణించి అప్పకవినుంచి ఎరువు తెచ్చుకున్న వృత్తంలో ప్రథమ పాదాన్ని విలోమ (Palindromic) ప్రార్థనగా పఠించింది: "వందే సదా దాసదేవం." సంతుష్టుడయిన ఛాందసుడు రెట్టించి పంక్తికి పదహారక్షరాల "అశ్వగతి"ని స్ఫురణకు తెచ్చేడు.

ఆ వృత్తపు సూచన నంగీకరించిన అతివ పంచధారా ప్రావీణ్యాన్ని ప్రదర్శించే పారశీకాన్ని పురికొల్పింది. కైజా మోరనెత్తిన తేజి విద్యావిహీనుడిలాగ, ద్వాపర ధర్మంలాగ పాదద్వయం మీద గెంతింది. అధర్మాభ్యుత్థానంలాగ మరో ఖురయుగాన్ని పైకెత్తి, గాలిలో కయ్యానికి రెండు కాళ్లు దువ్వింది.

అశ్వప్లుతం, స్త్రీచిత్తం కూడా అవగాహన కాలేదారాతివీరుడికి, సంగతిసందర్భాలు కనుక్కోమని శకటును సిద్ధం చేసేడు. పగవారి ప్రక్కలో బల్లెం వంటి ఫ్యాన్జ్‌కెటో (fianchetto) లో నిలబడిన అరదం ఆకేకరంగా అనుపానులు చూసుకుంది.

ఉచ్చైశ్శ్రవం పట్టపగ్గాలూ పగవారూ లేని మేధాశ్వంలాగ ముందు దురికింది, తత్తడి హుళక్కి అన్న తప్పటూహాలు చెల్లాచెదరయ్యేటట్లు హేషించింది. రథరక్షణలోనున్న రహదారికి రెండుగళ్ళవతల వాలింది. దూరానికి దుమికిన అశ్వాన్నడ్డుకోవడానికి అరద మశక్తమయింది. బండి ఓడవలసిన పరిస్థితి వచ్చింది. శేషం వంటి శకటం ఆచ్చివడిపోయింది.

అపారిశ్రమయిన వారువంతో వారణం ప్రక్రీడలకు తలపడింది. కరి సరికట్టడానికి శివనీ...ఈ...ఘోషహరాలయిన సాని సామజ - దానవ - భేదక దంష్ట్రకాన్ని పఠించగా చతురోపాయం తోచింది.

ఆదిలో ఏకవచన ప్రయోగాని కలవాటుపడ్డ భటులిద్దరు "తానుత్తమ" అన్నంత పురుషకారంతో అహమహమిక కనుసరచేరు హయరక్షణకి భార్గవప్రణ్ణంకానికి పిలిచేటంత బింకంతో ఒక బంటు పారశీకానికి బాసటగా నడిచేను. నడచెనా గంధ గండక బంధ ధుర్య వేదండ తుండను నటుంచుండు మనెను. దానితో ద్విపానికి ధైర్యం వికోల మయింది. ప్రస్థానత్రయ భాష్యకారుణ్ణి సైతం భయపెట్టగలిగిన గజం పలాయనం తథ్యమనుకుంది...

సమరం తుములమయింది. పణ్యాంగన పణంగా ఒడ్డినదే పైచేయిగా ఆట నడిపించింది. తెలుపుల ఘాటకి తాళలేని కలువలు కసలిపోయాయి. ఝూళ్యవంటి జాణముందు తన టూరాలు సాగక ఖిన్నుడయ్యాడు పరాతప్పుడు. "టరకారా ఖేదకారా (దుస్సభో ధస్త్వకాంతి కృత్)"... వగైరా అక్షరగుణ విచక్షణ చేసిన వివేకుల కావిషయం ఆశ్చర్యాన్ని కలిగించలేదు.

వేశ్య సామాన్య కాదని స్వీయానుభవం మీద తెలిసివచ్చేటప్పటికే ఖిన్నుడికి కాలం మించిపోయింది.

(Zugzwang) ట్సగ్ ట్స్వాంగ్

* * *

వీగిపోయే బలాలని వేళాకోళం చెయ్యడం ద్వారా మోమోటమిని మరుగు

పరచుకో దలచేడు మగరాయడు. పుణ్యాహవాచనం కలశను మూసిపట్టుకో బోయేటట్లు చెయ్యి ముందుకు చాపి, మరణావస్థలోనున్న మంత్రిని ముట్టుకున్నాడు. బహుపరాక్ పలికే గొంతుతో ఘోషించినట్లన్నాడు:

"రాణీసాహెబా*"

ఉలిక్కిపడ్డ కలికి కళ్ళెత్తి చూసింది.

"ద్వాత్రింశన్మంత్రులూ సాలభంజికా సంఖ్యకి సరిపోయేరు. అదనపు అమాత్యులను జేర్చి ఆ సామ్యాన్నంతం చెయ్యాడమెందు కనిపించింది."

చదరంగం గళ్ళలో కదనం చేసే సాలభంజికలకే కాక సింహాసనం మెట్లమీద కథలు చెప్పే సాలభంజికలకి కూడా సంఖ్యా సామ్యం వర్తించిం దనుకుందామె

"అయితే?"

"కాకపోతే, 'కరణేషు మంత్రీ' అని రాణిని వజీరుగానే వ్యవహరించి ఉండేవాణ్ణి."—ఆమె నుదుటి ముడతలు చదును చేసి, బొమముడి విప్పేటట్లు విశదీకరించేడు.

"మంత్రి" అని మనమూ, "రాణి" అని విదేశీయులూ వాడే పారిభాషికపదాలకి ఆటలోనే కాకుండా ఆరోక్తి ద్వారా కూడా అభేదాధ్యవసాయం జరిగిందన్న సంగతి గ్రహించి విస్తుపోయింది, వేశ్య.

"వాగ్మివి, పో!" అని మెచ్చుకుంది. కాని వజీరన్నందుకు వేళాకోళం చేసింది.

"రంభ వంటి దానివి జంభాసురారి ప్రయోగాలని పరిహాసించవచ్చునా?" అని, అనువదించే డతడు: "...కదలుడు చాటి చెప్పు డెరుగం దెరగంటి వజీర్ల కీ మొహర్ అని పలికి యంత్రిపురికిం జనె సురపతి."

రన్ ఆన్ వర్స్ (Run on-verse) లాగ నడచిన రెండు వృత్తాల తుదా-మొదళ్ళనీ వేరుచేసుకుందామె. కాని పద్యా లే ప్రబంధంలోనివో చప్పున జ్ఞాపకం రాలేదు. కందాన్ని కడదాకా చదివిస్తే, కవిపేరు తలపుకు రాకపోదన్న ఆశతో అడిగింది:

"శేషం—?"

"వెంకటపతి!"—వక్రోక్తిలో సూటిగా సమాధానపరిచే డామె అడగని ప్రశ్నని.

ఆటనే మరపించే మాటసొంపుకు ముగ్ధురాలయింది మగువ. మరులుగొన్న మనసులో మనసిజవికార మంకురించింది.

మానసంలో కూడా.

కొండనంటే కొండకొన నున్న కోనేటిలో గ-గ-న కుసుమాలవంటి రా-జీవములు గగ్గోలుపడ్డాయి. మకరంద మాధుర్యమును గ్రోలు మధుపంబుబోయె నే మదన శరాసన పూర్వి కావడానికి! అని వాపోయిం దొక వనరుహం. మాయురె భృంగమా! అంది మరొక అరవిందం. వెనుకటి గుణ మేల మాను? నంది వేరొక వారిజం.

గుణం అర్థాంతరాని కనుగుణంగా చంచరీకాలు ఝుంకారానికి బదులు వెనుకటి టంకారం చేసేయి. నీరజనాయకత్వం వదిలి వెనుకటి నారిగా మారేయి.

* పాశ్చాత్యులు చదరంగంలో "మంత్రి"ని "రాణి" అంటారు.

ఎడబాటు కోర్వలేని అబ్జాలాశు గమనంతో అళులను జేరుకున్నాయి. అంబకాలయ్యాయి. విరహానికి గురికావడానికి బదులు విరహిణులను గురికొన్నాయి

కాముడు కటకాముఖ హస్తంతో కమలాలని సంధించేడు.

వేయని బాణాలూ, తీయని బాధలూ వనితను వెతబెట్టేయి. పణంగా ఒడ్డిన పాణి నప్పనంగా అభిముఖుడి కిమ్మని ప్రేరేపించేయి. ఆట నోడిపోవాలన్న అభిప్రాయం కలిగిం దబలకి.

కాని అభిమానం మనోరథానికి శల్యసారథ్యం చేసింది. క్షణకాలంపాటు స్త్రీబుద్ధి ప్రణయాంతక మయింది. అతని చెక్కిళ్లతో సరసాలాడే చూపులు చదరంమీదికి దిగజారేయి.

దృష్టి తగిలిన నలుపులు దద్దరిల్లేయి. కోట కట్టుకోలేని రాజు రాహుతుపై గంతు వేసేడు. అవాంతరాన్ని తొలగించుకొని ఐరావతం తెరచి రాజంది స్వామిభక్తిని కనుపరచి శకటడ్డుపడింది. కామికాజీ (Kamikaje)* గమనంతో కదలివచ్చిన సామజం బండిని బరిగొలోసికి పంపింది. ఆ సాహసానికాశ్చర్యపడ్డాడు రాజు. గత్యంతరంలేక గజాన్ని సంహరించేడు. పడతి పన్నుగడ ఫలించింది. పగరాజు పరివారానికి దూరమయ్యేడు. రక్షణలేని రంగం మధ్య చిక్కుకున్నాడు. ఒంటరి రాజును వెల్లబలాలు వెన్నంటి తరిమేయి.

కాందిశీకు డయిన కువలయాధిపుడు గడి-గడి గండంగా గడచి ఆరాతి రాజు కారవ ఈతిబాధంత ఆసన్నమై నిలబడ్డాడు. విజయవిలాసం వెల్లివిరిసేటట్లు కలికి ముఖారవింద మల కళ్యాలరాయని తోసి రాజనన్. ఆ తుది సంరంభంతో అతని ఆట కట్టింది.

* * *

పొడుపుకథవంటి సామెత పూర్వార్థం అర్థం విడింది. అభిముఖుడూహించిన (కాబోయే కాపురం) పరిణామం ఆరు మూడయింది.

* * *

అమాత్యుడు ఆన్ ప్రెస్ (en prise) అయిన క్షణంనుంచీ ఓటమి తప్పదని నిస్పష్టగా తెలుసుకున్న విజ్ఞుడు నిశ్చింత నభినయించేడు. ఆట పోయినా, అపహాస్యానికి గురి కాకూడదనుకున్నాడు. ఎత్తుల నవలోదనం చేసుకోగా బంతికళ్ళంతలేసి రెండు తప్పులు కళ్ళకికట్టినట్లు కనబడ్డాయి. సంకట పరిస్థితులలో సహాయపడని శకట్ల పొరపాట్లవి. వేశ్య వేళాకోళాలకి పూనుకుంటే, ముందుగా తన బళ్ళ మీదికే "బళ్లు తోలుతుం"దని గ్రహించి, సమాధానాలకి సిద్ధపడాలనుకున్నాడు.

తాను తలచినటే సాక్షి తలచింది. బళ్లనిచూసి పకాలున నవ్వింది "రొండుకి రొండే కొండప్పా!" అన్నట్లున్నాయి," అంది. "రాజును రక్షించబోయి శతాంధాః" అన్నట్లు నడిచి చచ్చిన శకటొకటీ, సైంధవాన్ని శిక్షించలేక స్తంభించిపోయిన శకటొకటీ!...

"అచ్చతెన్గు లీరీతిగ," అని హేళనగా కొసిరింది. "పోతే గుజ్జెద్దులాగ పోతుం

* కామికాజీ=ప్రభుకార్యార్థమై ఆత్మ వినాశానికి ఉద్యుక్తులయే జపాన్ విమానచోదకులు.

దొంకటీ, పోలేక రాయిలాగ పడుంటుం
దొంకటీ!"

"సంస్కృతంబు పచరించినపట్టున,"
అన్నాడు చిన్నబుచ్చుకోదలచుకోని చతు
రుడు. "గచ్ఛతీతిగాః; నగచ్ఛతీతి నగః!"

క్షణక్షణమయిన జవరాలిచిత్తం జల్లు
మంది. జిగీష తెచ్చిన అగచాట్లను తలచు
కుని తల్లడిల్లింది, మాటసొంపుకు మరులు
గొన్న మనసు మళ్లీ మన్మథ బాధ పడింది.

బలంబులు రెండును గెల్వనేర్చునని
భ్రమపడ్డ పడతి, పాపం అతడు తనను
జయిస్తే, తానతణ్ణి జయించవచ్చునని
ఆశించిన అతివ, పాపం. మోమోటమి
కోర్వలేక, ఆటగెలిచి తెచ్చుకున్న అప
జయాన్ని తలచుకుంటే ఉప్పెనగా దుఃఖం
వచ్చింది. సాని సానుభూతికోసం సఖిదగ్గ
రకు జేరింది.

"తన్నోడి నన్నోడెనే!" అని నిర్జి
తుణ్ణి నిందించి ఏడ్చింది.

ఆమె కష్టాన్ని తొలగించడానికి
చెలికి సామాన్యమయిన ఉపాయంతోచింది.
పరాజితుణ్ణిపరిహసించి, రెచ్చగొట్టి, రెండవ
ఆట నాడించాలనుకుంది. మానిని అభిమా
నాన్ని మాన్పి, ఆమె చాతుర్యానికి తన
చేతగానితనాన్ని చేదోడువాదోడు చేసి,
ఆట నోడించి అతణ్ణి గెలుచుకునేటట్లు
చెయ్యదలచింది. ఆ ఆలోచనతోటే అత
డున్నచోటికి సానిని వెంటబెట్టుకుని వచ్చింది.

ఒంటరితనంలో ఊసుపోకకి అతడం
గుష్ఠమధ్యమాలమధ్య బళ్ళని తలక్రిందుగా
పట్టుకొని బొంగరాలు తిప్పుకుంటున్నాడు.
కాలి అలికిడికి కళ్ళెత్తి చూడగా చెయ్యి
జారిన శకట్లు చతికిలబడ్డాయి.

కొత్తమనిషిని చూసి చిరునవ్వు
నవ్వేడతడు అక్కరకురాని యరదము
లంటూ బళ్ళని "పరాసికం"గా పరిచయం
చేసేడు.

They toil not, nor do they spin —
"కాయకష్టము నాస్తి కదురొడక సుస్తీ"
అన్నా డదే ధోరణిలో.

పరాజితుడి బడాయిపలుకు పడతికి
నచ్చలేదు. "భంగపడ్డ బళ్ళకి "బైబిలు"
అనువాదంకూడా ఎందుకూ?"

"బిషప్పులు కనుక."*

హాస్యాన్ని లక్ష్యం చెయ్యక, ఆమె
వచ్చినపనికి పునాది వెయ్యడానికి పూను
కుంది. ఆట మళ్లీ ఆడడాని కుసికొల్పేటట్లు
ఘాటైన మాటల్ని వాడింది.

"ఆడదాని చేతిలో ఓడిపోయేరు.
పేరు పోగొట్టుకొని పైగా పరిహాసా లాడు
తున్నారు. మీ ఒంట్లోది నెత్తురా, నీరా?"

చెలి నుడి-కారాల కతడు మండి
పడి వెళ్ళిపోతాడేమోనని భయపడింది,
సాని. స్వయంగా క్షమాపణలు చెప్పుకో
బోయింది.

"నీరు!" అన్నాడంతలోనే, అతడు
నిర్లక్ష్యంగా. "జీలంజలం. పేరు పురుషో
త్తముడు, పోయిందేమీ లేదు."

జవాబుకి సాని గుండె జల్లుమంది.
సఖిమాత్రం చిర్రుమంది.

* బిషప్పులు = శకటులు

"చింత చచ్చినా పులుపు చావదుట! పరాజితులయినా బింకపుమాటలు మానక పోవడంలో విశేషమేముంది లెండి!"

"సామెతకయితే అలంకార ప్రాయముగా సరిపోయింది కాని విశేషం నా మాటల కెలా నప్పుతుంది?"

ఆ చమత్కారాన్నర్థం చేసుకుందుకు చంద్రాలోకాన్ని చింతన చేసుకుంటూ చెలి కిమ్మనకుండ ఊరుకుంది. అవకాశాన్ని వినియోగించుకుని అత డెదురుదాడి సాగించేడు.

"నువ్వనువదించిన విశేషాలంకారం కంటే స్వీయాంతమయిన నిరుక్తికమే అందంగా ఉంది."

"నిరుక్తికం?" అందామె, పుస్తకం పునశ్చరణ నాపుచేసి. "అటువంటి అలంకార మెప్పుడూ విన లేదు."

"వినబడక పోవడమే దాని విశిష్టత. విభూషణం మాన..."

"సిగ్గు! సిగ్గు!"

"అదుంటే అలంకారా లక్కర్లేదు."

"భర్తృహరి సుభాషితాలు బాగా వంటబట్టేయే?"

"భర్తృహరికి," అని తప్పుదిద్దేడతడు, చిలిపిగా. "జీర్ణమంగే సుభాషితం అన్నవి శతకకర్త మాటలు."

పెడర్థాలూ, పిడివాదాలూ-అనుకుని విసుగెత్తిన చెలి విరమించింది.

సఖి చాలించిన సంభాషణను సాని సాగించదలచింది, మాటల్ని మాటుపెట్టి మరికొంత కాల మతణ్ణాపుచేస్తే, ఈ లోపులో ప్రవర్తించేవకుండా వరుణ్ణి దక్కించుకునే ఉపాయం తోచకపోదన్న ఆశతో. ఏ విషయాన్నెత్తుకోవాలో తోచక నలువంకలా కలయజూసేటప్పటికి శుభశకునంవంటి నెలవంక చీకట్లని చీల్చుకుంటూ వచ్చి కనబడింది.

చదరంగంలో పావొక్కటే పందెం గెలిపించింది గనుక గోష్ఠి నుపక్రమించడానికీ అదే ఎత్తు వాడవచ్చని, చంద్రుణ్ణి చూపుతూ అంది:

"అంకం కేసి చూడండి రే!"

"చీకటి తప్పది!"—సోజరు జవాబు లాగ అన్నాడతడు.

నిజానికి నూలుపోగంత చంద్రుడిలో సిరి పీతాంగ తమస్సు కనబడటం లేదు. అయితే, దోషాకరుడి తప్పును తలపుకు తెచ్చే ప్రస్తావన నెందుకు తెచ్చిందని అతని కనుమానం కలిగింది. ఆలోచించగా అర్థమయింది, అది తన సిగ్గుమానాన్ని నిరోధించడానికి నెపం మాత్రమేనని.

ఆకూతజ్ఞత అతనిలో అంతకుముందు కలగని ఆశలు కంకురార్పణ చేసింది. పందెం పట్టుదలకేగాని ప్రణయానికి తావు లేదనుకున్న పడతి మనస్సులో పంచశరుడి ప్రభావం పడిందని గ్రహించేడు. చదరంగానికి లోబడని పాసని చమత్కారాలతో జయించదలచేడు.

నీ నవురు సన్నము గానూ! అన్న నీలాసుందరి శాపం తగిలి చిక్కిన చంద్రుని వైపు చెయ్యి జాపేడు. వృద్ధి క్షయాల విషయాన్నెత్తుకోకుండా, తిట్టి దీవించిన ట్లన్నాడు:

"దిన దిన ఖండం, దీర్ఘాయుష్షు."

"జైవాతృకుణ్ణి వర్ణించడంలో చూపిన చతురత శుక్లపక్షాన్నోడించడంలో కనుపరిస్తే జితాస్మి అని ఉందునుగదా!" —పొరపాటున ప్రకాశమయిన స్వగతంలా అనుకుందామె

సాని తనమీదికి తోసిన తప్పు నాడు దైవజ్ఞులమీదికి తోసి తప్పించుకోదల్చేడు.

"సిద్ధాంతులు పూర్వపక్షమే బలీయమని గణించి పడేసేరు. పరం నాపరమయింది. నా చతురంగ బలం పంచాంగ బలంముందు పనికిరాలేదు. ఆనందాది యోగాలు కూడి రాకపోతే ఆట నెగ్గడ మెవరితరం?"

అతని అపహాస్యాల కక్కసు తీర్చుకునేటందు కదను దొరికిందని సంతోషించిన చెలి ఔచితిని లెక్కచేయకుండా గీర్వాణంగా అంది:

"నిందతి కంచుక మేవ ప్రాయ శ్శుష్క..."

"పూర్ణయౌవనయితే ప్రియంవదనో అనసూయనో నిందిస్తుంది," అన్నాడతడు, ఆమె నోరర్థోక్తిలో మూత పడేటట్లు. "ఉన్నదానికీ లేనిదానికీ ఇతరుల్ని నిందించడం అతివలకే సహజం."

మాటపడ్డ వేశ్య మగవారి తప్పులెన్ని తీరాలనుకుంది. పాతకోపాలని జ్ఞాపకంచేసుకుని పరుషంగా అంది:

"అతివల నయినవాటితోటీ కాని వాటితోటీ పోల్చడం పురుషుల ప్రకృతయినట్లు!"

"త్రిమూర్తులనీ కాదని తన్వంగిని స్తుతించిన అమరుణ్ణి తలుచుకుంటే అలా అని ఉండవు," అన్నాడతడు తాపీగా.

"ఆయనకేం, కవి రమకః," అని ఒప్పుకుందామె. "అలం కమల జన్మనా అని ప్రారంభించిన పెద్దమనిషి మాట?"

"అతని అపరాధ మేమిటి?"

"కృత్యాద్యవస్థలో కైచాపులు చేసి కడకి కలికిని క్రతోటీ, కాలకూటంతోటీ పోల్చడమే.

"ఉత్పల కాంగయష్టిం...ట! 'నమత' అన్న నోటితో యోషని యష్టిగా ఎట్లా వర్ణించగలిగేడో!-అవమానోత్తర పద కర్మదారయవు సమాసం అనాలి కాబోలు దీనిని!"

ఆమె కోపానికి నవ్వుకున్నాడతడు.

"కొమ్మా అంటే చెడని కోమలత్వానికి యష్టి అంటే నష్టమొస్తుందా?" అన్నాడనునయించేటట్లు. "పైగా ఎంతటి చిగురుబోడి కయినా ప్రమాన్పడిపోవడం మన్మథావస్థ."

చక్షుఃప్రీతిగా చూసిందామె, సమర్థనకు సంతసించి.

"అది సరే," అంది, కొంత శాంతించి. "కాని, అద్యాపి నో జ్ఝతి హరః కిల కాలకూటం అనడం సరసమయిన సామ్యమేనా? ధ్వని అవాచ్యం! అలంకారం విషమ-యం..."

ఆమె ఆఖరిమాటతో ఉపాఖ్యానం జ్ఞాపకం వచ్చిందతనికి. సమర్థించడానికి

వీలు లేని పరిస్థితిలో చమత్కారమే శరణను కున్నాడు.

"కాలకూటాన్ని కళ్యాణప్రదంగా మార్చుకున్న కలికి కథ తలుచుకుని గర్వ పడడానికి బదులు సామ్యాలకి జడుసు కోవడం జాణతనమేనా?" అన్నాడు. "విషం మింగవలసిన గళానికి విషయానందాన్ని లభింపజేసిన వనితవృత్తాంతం తెలియదూ?"

చంద్రహాసుడి పెళ్ళిధర్మమా అని చాయంగల విన్నపాలై తెరిపిని పడ్డాడు.

ఆమె హృదయంలో కవిమీద కోపం మాటకారిమీద మోహానికి తావిచ్చి తప్పుకుంది. ఉండబట్టలేని మనస్సు ఊరుకో నియ్యలేదు, నీళ్లు నమిలితే లాభంలేదనుకుని సుదతి నోరువిప్పి అంది:

"మాటలతో మనస్సు సహహ రించేవు చేతలతో చేతిని స్వీకరిస్తే చౌర్యం సబబుగా ఉండిపోను. పందెం గెలిచి పణంగా ఒడ్డిన పాణిని గ్రహించి పాలించ డానికి బదులు బాధలకి గురిచేసేవు."

"మాటలకి మనసిచ్చేవా? నా చేత గాని తనానికి చేతిని స్వీకరించు. చౌర్య మేమీలేదుగాని సబబు మాత్రం మాతుంది."

"మరి నా వరతుమాట?" అందామె ఆశల్ని చెదిరిపోకుండా అదిమిపట్టుకుని. "పందెం గెలిచిన వానికే పాణి నిస్తా నని వ్రతం పట్టేను."

"వరతు లిద్దరికీ సమానమే. చేతుల నొడ్డుకున్నాము. జయించేవు. గెలుచుకున్న కరాన్ని గ్రహించడమే నీకు కర్తవ్యం!"

తీరని ధర్మసందేహంనుంచి తెరిపిన పడిందామె. పైచేయిగా ఆటను నడిపించిన చేతిని పందెంగా గెలుచుకున్న చేతితో పెనవేసింది. అభిముఖులైన పది చేసుకున్నారు.

కసిగా ఆరంభమయిన ద్యూతం కరిఖలంగా ఆఖరయింది.

* * *

ఆ రెకిల్ వంటి సామెత ఉత్తరార్థానికి (పప్పుముద్ద భోజనానికి) అర్థం పెళ్ళని తెలిసింది.

ఆసు మూడు కాపురం పప్పుముద్ద భోజనం అన్న ఉపశ్రుతి చూళికా ప్రాయంగా సూచించిన ఫలితం కాయా పండూ కూడా నని చివరికి బోధపడింది.

* * *

సఖి చదరంగం బల్లమీద సాల భంజికలని పక్కకి పదహారేసి చొప్పున పేర్చి, పాణిగ్రహణం చూడడానికి పేరంటా ళ్లని పిలుచుకువచ్చింది. బొమ్మల నోము చేసుకుని భర్తను సంపాదించుకున్న అతివ నంతా అభినందించేరు. గెలుపోటములు లేని కరిఖలం కథను విని నోములోని భాగాన్ని నెమరుకు తెచ్చుకున్నారు.

"చూస్తీ చూస్తీ; ఏంచూస్తీ; దేవీ దేవరా చూస్తీ; దేవీ దేవరా ఏం చేస్తున్నారు? ముత్యాలూ రత్నాలూ ముందుపోసుకుని జూదమాడుతున్నారు. ఎవ రోడేరు ఎవరు గెలిచేరు? ఇద్దరూ ఏకసమానమే. అందు కెవరు సాక్షి? నందిసాక్షి, నాగుబాము సాక్షి ఎడనున్న ఎల్లమ్మసాక్షి కడనున్న గంగమ్మ సాక్షి..."

# విచిత్రజీవులు

హితశ్రీ

## రంగము: 2

* * మర్నాటి ఉదయం. లాండ్ లార్డ్ అండ్ బ్యాంకర్ సన్యాసిరాజు గారి ఇంట్లో డ్రాయింగ్ రూమ్, సోఫాలు, మధ్యన రౌండ్ టేబిల్ ఉంటాయి. టేబిల్ మీద ఓ చిన్న కుక్క తల-శిల్పం-ఉంటుంది. రంగం కుడివైపున ఉన్న తలుపు ఓ గదిని సూచిస్తుంది. ఎడమవైపు తలుపు బయటికి వెళ్ళేదారి. రంగం మధ్యన ఉన్న తలుపుకి కర్టెన్ వేసిఉంటుంది. ప్రేక్షకులకి ఎదురుగా సోఫాలో సన్యాసిరాజు కూర్చుని టేబిల్ మీద ఉన్న అరడజను తాళాల గట్టితనం పరిశీలిస్తూ ఉంటాడు. నడివయసు మనిషి, బట్టతల, సిల్కు లాల్చీ, గ్లాస్గో దోవతి ధరిస్తాడు. సోఫాకి జేరగిలవేసి ఉంటుంది చేతికర్ర - కుక్కమూతి పిడిగలది.

సన్యా : వరహాలూ! ఎక్కడ తెచ్చావురా ఈ చచ్చు తాళాలు? వొఠ్ఠి సన్యాసిరకం. వరహాలూ!

[సుందర్రావు ప్రవేశం. పాతికేళ్ళ వ్యక్తి. కొద్దిగా గిరజాలుంటాయి. ఆర్టిస్ట్ అనిపించే విధంగా దుస్తులు ధరిస్తాడు. చేతిలో జిప్ బాగ్ ఉంటుంది.]

సుంద : నమోన్నమః, సన్యాసిరాజుగారూ!

సన్యా : (తలెత్తి ఎవరా అన్నట్టుగా చూస్తూ, అభివాదం స్వీకరించి) కూర్చోండి.

సుంద : తమరు నన్నెరగరు. కాని తమర్ని నేనెరుగుదును.

సన్యా : అలాగా! మీ పేరు?

సుంద : దగ్గరవాళ్లు సత్యం అంటారు. కొంచెం దూరం వాళ్లు శివం అంటారు. స్నేహితులు సుందరం అంటారు. తమలాంటి పెద్దలు సుందర్రావు అని వ్యవహరిస్తారు.

సన్యా : సత్యశివసుందర్రావు అన్నమాట.

సుంద : మరే అద్భుతంగా పసికట్టారు. మిమ్మల్ని గురించి నేను విన్నది అక్షరాలా నిజం.

సన్యా : నన్ను గురించి ఏం విన్నారు?

సుంద : చెబితే అనవసరంగా పొగుడుతున్నానంటారు.

సన్యా : అయితే అందరూ నన్ను పొగుడుతున్నారన్నమాట.

సుంద : ఎంత సూక్ష్మంగా ఆలోచిస్తారండీ!

సన్యా : కాని కారణం?

సుంద : కారణం! ఏం చెప్పను! కొందర్ని చూస్తే ఊరికే పొగిడేయాలనిపిస్తుంది, నమ్మండి. నమ్మకపోండి. దానికితోడు అన్నిరంగాల్లో ప్రముఖంగా పైకొస్తుంటే ఇంక చెప్పాలా! ఈ టౌన్ మొత్తంలో ఎవరికుందండీ మీకున్నటువంటి వ్యవహారదక్షత? ఓ ఫ్యాక్టరీ పెట్టి పట్టుమని పదిరోజులు నడిపించిన మొనగాడెవడండీ? పదివేలమంది జనం మూగిన మీటింగులో బల్లగుద్ది ఖంగున

గొంతెత్తి కాళ్లు వణక్కుండా అనర్గళంగా మాట్లాడే సత్తా ఎవరికుందండీ! నిన్న అధ్యక్షోపన్యాసంలో మీరు విసిరిన చెణుకులు విని మురిసిపోని మనిషి ఎవడైనా ఉన్నాడా?

సన్యా : అంత బాగా మాట్లాడానా?

సుంద : బాగా? చెప్పాలంటే మాటల్లేవు. నమ్మండి, నమ్మకపోండి.

సన్యా : హా. హా. ఏదో లెండి. చాతైనట్టు మాట్లాడాను.

సుంద : ఎంత అణకువగా అన్నారు! ఏమీ లేనివాళ్లే ఎగిరెగిరిపడుతుంటే మీలాంటివాళ్లు అలా మూలమూలల్లో ఉంటే ఎలా చెప్పండి. జమాయించి ముందుకొచ్చి సవాలుచేసి మరీ నెగ్గకురావొద్దండీ! నిన్న మీ అధ్యక్షోపన్యాసం విన్న తరవాత ఎప్పుడెప్పుడు మిమ్మల్ని కలుసుకుని మాట్లాడతానా అని ఉవ్విళ్ళూరానంటే నమ్మండి.

సన్యా : హా. హా. మీ అభిమానం అల్లాంటిది.

సుంద : మనలోమాట. ఉన్న సంగతి చెప్పొద్దూ! కోటి సూర్యప్రకాశరావుగారి ఉపన్యాసం మీ ఉపన్యాసంముందు దూదిపింజలా ఎగిరిపోయిందంటే నమ్మండి.

సన్యా : నిజం?

సుంద : నా అభిప్రాయం అదీ.

సన్యా : ఆయనకి పరపతి ఉందండీ

సుంద : లేదన్నానా?

సన్యా : ఇంతకీ మీరు వచ్చిన పని చెప్పలేదే.

సుంద : ఒక్క చిన్న ప్రార్థన.

సన్యా : ఏమిటది?

సుంద : మీరు అన్యథా భావించకూడదు.

సన్యా : చెప్పండి.

సుంద : ఒక్క నిమిషం-అలా కదలకుండా కూర్చోండి-ఆఁ-అదీ-అంతే.

సన్యా : ఎందుకూ?

సుంద : చెబుతా. (జిప్‌బాగ్ తెరిచి కాగితం పెన్సిల్ తీసి గీతలు గీస్తాడు) చూశారా? ఎలా ఉంది?

సన్యా : మీరు బొమ్మలు గీస్తారా?

సుంద : ఎంత అమాయకంగా అడిగారు. అరడజను చిత్రాలకి ఆర్ట్ డైరెక్షన్ నిర్వహించిన వ్యక్తిని పట్టుకుని ఎంతమాట అడిగేశారు!

సన్యా : ఏమిటీ? మీరు ఆర్ట్ డైరెక్టరా!

సుంద : (కొంచెం కోపంగా) లేకపోతే ఎవడో కూటికి లేని భట్రాజు ననుకున్నారా? దారిన పొయ్యే దానయ్య ననుకున్నారా?

సన్యా : నాకు తెలియదు సుమండీ! నేను సినిమాలు చూడను. మరేం అనుకోకండి.

సుంద : ఇందులో అనుకునేందు కేముందిలెండి. మీకు మొదటే చెప్పకపోవటం నాదే తప్పు.

సన్యా : (బొమ్మ చూస్తూ) మరేం అనుకోకండి. పోలిక బాగా వచ్చిందంటారా?

సుంద : అది ఆర్టిస్ట్ స్కెచ్ లెండి. అలా చూస్తే మీకేం తెలుస్తుంది. వంకర టింకర గీత లనుకుంటారు.

సన్యా : కేవలం నా బొమ్మ గియ్యటాని కిక్కడికి వొచ్చారా?

సుంద : ఏం వొస్తే? రాకూడదా? మిమ్మల్ని చూస్తే మీ బొమ్మ గీసుకోవాలనిపించి వొచ్చాను-అంతే. కళాకారుడికి ముఖ్యం కళేనండీ!

సన్యా : ఔనౌను.

సుంద : (చుట్టూ చూసి కొంచెం నిరాశాపూరితంగా) మిమ్మల్ని చూడగానే మీలో ఎంతో కళాభిరుచి ఉందనుకున్నాను.

సన్యా : ఉందండి. ఎందుకులేదు! మొన్నెవరో చిత్రకారుడు ఏవో బొమ్మలు తెస్తే పది రూపాయిలిచ్చి మూడు బొమ్మలుకూడా కొన్నాను.

సుంద : కాని... ఈ గదిలో నేను ఆశించిన అలంకారం లేనేలేదు.

సన్యా : (ఆదుర్దాగా) ఏమిటది?

సుంద : మీలాంటి ధనికులు, మీలాంటి ప్రముఖులు, మీలాంటి కళాభిమాని ఇలా నిర్లక్ష్యం చేస్తారనుకోలేదు.

సన్యా : ఏమిటది?

సుంద : (లేచి నిలబడి, ఆవేశంగా) సన్యాసి రాజుగారి నిలువెత్తు తైలవర్ణ చిత్రం ఏదీ?

సన్యా : (ముఖం నల్లబడి) నిలువెత్తు తైలవర్ణ చిత్రమా?

సుంద : వెయ్యి పదివందల రూపాయలకి మీరు లోభించారనుకోను.

సన్యా : పది వందలా!

సుంద : ఇది గొప్ప లోపమేనండీ సన్యాసిరాజు గారూ.

సన్యా : కాని... కాని.

సుంద : వెయ్యి చెప్పండి, లక్ష చెప్పండి. నాకు తృప్తిలేదు. ఓ రెండు వందలు అడ్వాన్సు ఇలా పారెయ్యండి. ముందు రంగులు కొనుక్కొచ్చి పని మొదలు పెడతాను. తరవాత సంగతి చూద్దాం.

సన్యా : రెండు వందలా!

సుంద : (కొంచెం వింతగా చూసి) మీరు వొద్దన్నా సరే, చందాలు వేసిఅయినా మీ కా బొమ్మ బహూకరించకుండా ఉండను.

సన్యా : అబ్బే. చందాలెందుకూ? (పర్సు తీసి డబ్బు ఇస్తూ) ఇదిగో, ఉంచండి.

సుంద : (తీసుకుంటూ) పోనీ, బొమ్మ పూర్తయిం తరవాత ఇవ్వొచ్చులెండి, మొత్తం ఒక్కసారే.

సన్యా : ఎందుకూ! ఉంచండి. ఓ రసీదుముక్క రాసిస్తారూ? కాగితంమీద ఉండడం ఉభయులకీ మంచిది. మరేం అనుకోకండి.

సుంద : (రాసిస్తాడు) బొమ్మ పూర్తయిం తరవాత చూసి మూర్ఛపోతారంటే నమ్మండి. విశాలమైన నుదురూ, కొనదేలిన ఆ ముక్కూ, తీక్ష్ణమైన ఆ కళ్లూ—ఓహ్! వయసులో మీరు మంచి రసికులై ఉండాలి.

సన్యా : (చిరునవ్వుతో) ఆమధ్య నేనో అధ్యక్షోపన్యాసం ఇస్తుంటే ఎవరో నా బొమ్మ అయిదు నిమిషాల్లో గీసి బహూకరించారండీ. నిమిషానికొకటి చొప్పున అయిదు రూపాయలు నేనూ బహుమానం ఇచ్చాననుకోండి.

సుంద : వెనక మహాకవులకి మహారాజులు అక్షర లక్షలిచ్చినట్టు!

సన్యా : (కొంచెం ఇదయి) కాలం మారిందికదండీ.

సుంద : ఔనౌను. అదే నా అభిప్రాయం.

సన్యా : ఆ సమయంలో ఎవరో ప్రెస్ కరెస్పాండెంట్ కెమెరా క్లిక్ చేశాడండీ.

సుంద : పత్రికల్లో ప్రముఖంగా అచ్చేసి ఉంటారు ఆ బొమ్మ!

సన్యా : (కొంచెం చిన్నబోయి) ఏదో పొరపాటు జరిగిఉంటుందండీ, లేకపోతే వేసేవాళ్లే.

సుంద : ఏమిటే, మీ బొమ్మే పత్రికలో వెయ్య లేదూ!

సన్యా : పోన్లెండి. వెయ్యకపోతే ఏం? డబ్బు పారేస్తే వాళ్లే వేస్తారు.

సుంద : ఆశ్చర్యంగా ఉందే! వేసే ఉంటారండీ, మీరు చూడలేదేమో!

సన్యా : చూడకపోవట మేమిటి? రోజూ కొన్నాళ్లు పత్రికంతా గాలించి చూస్తే. (చప్పున నాలిక కొరుక్కొని) అదే, రోజూ ఆ కరెస్పాండెంట్ పత్రికే నేను తెప్పిస్తాను. అంచేత, వేస్తే నాకు కనిపించకుండా ఎలా ఉంటుందీ!

సుంద : (కొంచెం కోపంగా) పోన్లెండి. వెయ్యకపోతే మీ కొచ్చిన నష్టమేం లేదు. ఆ పత్రికే పెద్ద సైజులో మీ బొమ్మ వేసి, పతాక శీర్షికలతో మీ సుభాషితాల్ని అచ్చుకొట్టే రోజు ఎంతో దూరంలో లేదు.

సన్యా : మీవంటివాళ్ళ అభిమానం ఉంటే అదే చాలు.

సుంద : టాప్ తీసేసిన కార్లో కోటి సూర్యప్రకాశ రావుగారి పక్కన మీరు నిలబడి మేళ తాళాలతో పట్టణంలోని పెద్ద బజార్లో ఊరేగుతుంటే ఎన్ని కెమెరాలు క్లిక్ మంటాయో! ఎన్ని పోజుల్లో మిమ్మల్ని పత్రికల్లో చూస్తామో!

సన్యా : ఆఁ! ఎప్పుడూ?

సుంద : ఎప్పుడోనా? దగ్గిర పడటం లేదుటండీ కోటి సూర్య ప్రకాశరావు గారి సన్మానం!

సన్యా : కోటి సూర్యప్రకాశరావు గారి సన్మానమా? ఎవరు చేస్తున్నారూ?

సుంద : మీకు తెలియదూ? అయితే ఆ సన్మాన సభకి మిమ్మల్నే అధ్యక్షులుగా వరించారనే సంగతి కూడా మీకు తెలియదన్నమాట.

సన్యా : (ఆశ్చర్యంగా) నాకేమీ తెలీదండీ.

సుంద : చిత్రంగా ఉంది. ఈమధ్య నాదగ్గిరికి కొంతమంది యువకులువచ్చి కోటి సూర్య ప్రకాశరావుగారికి సన్మానం చెయ్యాలని సంకల్పించాం. దయచేసి మీరు ఆహ్వాన సంఘాధ్యక్షుడుగా ఉండాలన్నారు. నా కెక్కడ తీరుతుంది, చెప్పండి. 'అబ్బాయ్, దయచేసి మరొకర్ని వేసుకుందురూ' అన్నాను. వాళ్ళు వొదిలితేనా? సరే, ఏం చేస్తాను. ఒప్పుకున్నాను.

సన్యా : అలాగా!

సుంద : 'సన్మానసభకి అధ్యక్షుణ్ణి ఎవరినైనా సూచించండి' అన్నారు. 'మరొకరూ, మరొకరూ ఎందుకయ్యా, సన్యాసిరాజుగారు ఉండగా, ఆయన్ని వెళ్లి అడగండి' అన్నాను.

సన్యా : అలాగా! వాళ్లు నాదగ్గిరికి రాలేదండీ. బహుశా మరొకర్ని వేసుకుంటారేమో! (బిక్కముఖం వేస్తాడు)

సుంద : అంత సాహసమే మాట అన్నానంటే జరిగి తీరాలిసిందేనండోయ్ సన్యాసిరాజుగారూ. లేకపోతే ఆహ్వాన సంఘాధ్యక్షు పదవికి వెంటనే రాజీనామా పారెయ్యనూ?

సన్యా : అయితే అధ్యక్షుపదవి నాకు తప్పదంటారా?

సుంద : ఊహుం. తమరు అంగీకరించితీరాలిసిందే.

సన్యా : నన్నెందుకు బాధపెడతారు చెప్పండి.

సుంద : క్షమించాలి మరి. నా ప్రార్థన మన్నించరూ!

సన్యా : (అయిష్టంగా ఉన్నట్టు ముఖం పెట్టి) సరే, కానివ్వండి, మీరంత బలవంతం చేస్తుంటే ఏం చెయ్యనూ? అయితే సన్మానం ఎప్పుడూ?

సుంద : త్వరలోనే ఏర్పాట్లన్నీ చేస్తున్నాం. చందాల లిస్టు మీద అధ్యక్షులు తమరే శ్రీకారం చుట్టాలి. మీహస్తవాసి తెలియందెవరికి?

[సుందరరావు జేబ్‌బాగ్‌లోంచి, కాగితం కలం తీసి ఇస్తాడు]

సన్యా : ఎంత వెయ్యమంటారు?

సుంద : ఎంతోనా! నూట పదహార్లు చాలండీ.

సన్యా : (అయిష్టంగా) అరనూటపదహార్లు చాలవూ?

సుంద : తమరే అలా అంటే ఎలా? డబ్బు తరవాత ఇవ్వొచ్చు లెండి. అంకె వేస్తే చాలు, ప్రస్తుతం.

[సన్యాసిరాజు కాగితం మీద రాసి తిరిగి స్తాడు సుందరరావుకి]

కృతజ్ఞుణ్ణి. మరి నాకు సెలవిప్పించండి. నమోన్నమః

[ప్రత్యభివాదం స్వీకరించి, సుందరరావు జేబ్‌బాగ్ సోఫా మీదనే మర్చిపోయి నిష్క్రమిస్తాడు.]

సన్యా : (తాళాలు మళ్ళీ పరిశీలిస్తూ) వరహాలూ, వరహాలూ.

[వరహాలు ప్రవేశం]

వర : అయ్యా అయ్యా.

సన్యా : ఎక్కడ తగలడ్డావురా ఇందాకట్నించీ?

వర : చిత్తం బజార్లోనండి

సన్యా : ఏం వెలగబెడుతున్నావ్?

వర : తమరి పనేనండి

సన్యా : ఏమిటా పని?

వర : దిరమూర్తావుగారికి కబురెట్టమన్నారుగదండి

సన్యా : ఓ! ఔను ఏమన్నాడు? వస్తానన్నాడా?

వర : చిత్తం, కాగితం రాసిచ్చారండి. (ఇస్తాడు.)

సన్యా : (చదివి) ఏం కాగితంరాయిది? సంతకమేదీ?

వర : అయ్యబాబోయ్. సంతకమే! దిరమూర్తావుగారే. తెలవనట్టుగుంతారేంటి బాబూ!

సన్యా : అఘోరించినట్టే ఉంది.

వర : పొట్టిపాపిష్టికాలం బాబూ.

సన్యా : ఏం? ఏమైంది?

వర : గుమాస్తాగారు బాబూ,

సన్యా : ఏ గుమాస్తారా?

వర : మన గుమాస్తాగారేనండీ. లక్ష్మీంపతిగారు.

సన్యా : ఆఁ ఏం? ఆయనకేమైంది?

వర : ఆయనకేం కాలేదండి. ఆరిడబ్బు ఎవరో కొట్టేశారండి.

సన్యా : ఏ డబ్బూ?

వర : నిన్న తమరిదగ్గర ఇల్లు తాకట్టుపెట్టి డబ్బు పట్టికెళ్లలేదండీ ఆ వెయ్యిరూపాయలూ—

# విచిత్ర జీవులు

సన్యా : (గాభరాగా) ఎలాపోయాయి?

వర : జేబు కొట్టారండీ.

సన్యా : అరెరె. పాపం.

[అకస్మాత్తుగా ఏదో ఆలోచనతట్టి లోపలికి గబగబపోయి ఓ కాగితంతో తిరిగొస్తాడు.]

వర : బీదోళ్లకే అన్నీ వొస్తాయి బాబూ.

[సన్యాసిరాజు చదవటానికి కళ్లజోడు పెట్టుకోబోతుండగా కాగితం కిందపడుతుంది]

సన్యా : హరి. అడుగులో హంసపాదన్నట్లు అన్నీ అపశకునాలే. ఈ దెబ్బ కొస్తా గంగలో కలిసేట్టుంది.

వర : (కాగితం అందిస్తూ) ఏంటిబాబూ, స్టాంపు కాయితమల్లే ఉంది.

సన్యా : దస్తావేజురా. లక్ష్మీపతిగారు రాసిచ్చిన స్థిరాస్తి అస్వాధీనపు తాకట్టు దస్తావేజు.

వర : రిజిష్టరయిందిగా బాబూ?

సన్యా : అయితేఏంరా, తిమ్మిని బ్రహ్మినీ, బ్రహ్మిని తిమ్మినీ చేసే నల్లకోట్ల అడ్వకేట్లు లేరూ! (చదువుతూ) తాకట్టుయుంచిన ఇల్లూ స్థలముకు హద్దులు-తూర్పున సర్కారువారి రైల్వే స్థలం, పడమర రెవిన్యూవారిస్థలం, దక్షిణం మునిసిపల్ రోడ్డు, ఉత్తరం సత్రంగోడ— ఈ నాల్గు హద్దుల మధ్యగల 200 చ. గ. స్థలమున్నూ—అందులోని రాతిగోడల పూరి ఇల్లూ, తలుపులూ, ద్వారబంధములతో సహా. (ఆలోచించి) కొంపమునిగింది. ఫలవృక్షములతో సహా అని రాయలేదురా వరహాలూ!

వర : అవ్వి అసలు అరిదొడ్లో లేనేలేవండి.

సన్యా : (ఆలోచించి) బావిరా బావి దానిసంగతి కూడా లేదు.

వర : ఆరి స్థలంలో బావేదుందండీ!

సన్యా : నిధినిక్షేప పాషాణాదులతో సహా అనికూడా రాయలేదురా.

వర : నిక్షేపాలు తేరగా దొరుకుతయ్యంటండీ!

సన్యా : దొరకటంకాదురా. అవన్నీ రాయకపోతే ఏమైనా చిక్కులొస్తయ్యేమోనని.

వర : నాను తెలీకడుగుతాను బాబూ. ఇన్నేళ్లనుంచీ ఆయనగారు తమరిదగ్గిర పనిచేస్తా ఉన్నారుగదా! ఈ రాతలూ, కోతలూ మనిషి ఇశ్వాసంకంటె ఎక్కువా బాబు?

సన్యా : ఏడిసినట్టుంది. మరి కోయిశెం కనిపెట్టింది దేనికిరా.

వర : ఏమోబాబూ! అంతా ఇసిత్రం.

సన్యా : చదువా, సంధ్యా? నీకేం తెలుస్తుందీ!

వర : అయ్యా

సన్యా : అయ్యా, కొయ్యా, అయ్యగారూ అనరా అని ఎన్నిసార్లు చెప్పాలి?

వర : అయ్యగారూ!

సన్యా : ఊఁ

వర : ఇయాల నా పుట్టినరోజు పండగండి.

సన్యా : ఊఁ. అయితే?

వర : వారంరోజుల కిందటే అడిగానండి.

సన్యా : ఏమిటి?

వర : మామూలు, బాబూ! ఈసారి నుంచి ఈనాం ఇస్తానన్నారండీ తమరు.

సన్యా : ఓ ఔను మర్చిపోయాను ఉండు.

[లోపలికెళ్లి డవాలుతో తిరిగి ప్రవేశించి స్వయంగా వరహాలుకి డవాలు వేస్తాడు]

ఎలా ఉందిరా!

వర : (తెల్లబోయి) ఇదేంటి బాబూ!

సన్యా : డవాలురా ఫస్టుగా ఉంది.

వర : ఇదెందుకు బాబూ?

సన్యా : ఆ డవాలుమీద ఏం రాసుందో తెలుసా? లాండ్‌లార్డ్ అండ్ బ్యాంకర్ సన్యాసి రాజు.

వర : అట్లా అయితే ఎవురన్నా తెలవనివాళ్లు నేనే సన్యాసిరాజుగారనుకుంటారేమో బాబూ.

సన్యా : ఛీ దాని అర్థం నువ్వు సన్యాసిరాజుగారి డవాలా జవానువి అని. వరహాలూ, నాకు ఓ డవాలా బంట్రోతు కావాలని చాలా రోజుల్నించీ మనసుగా ఉందిరా. ఇహనించీ నువ్వు ముందు వెళుతుంటే నేను వెనక వొస్తుంటే—ఓహ్ జనం హడిలి పోరూ?

వర : అనకూడదు కాని తమరికి కళ్లు కనిపించటం లేదనుకుంటారేమో నండి.

సన్యా : ఛీ. మూర్ఖుడా!

వర : చిత్తం మరి నా ఎనకాలెందుకండీ తమరు?

సన్యా : పోదాం! పోదా! (ఠీవిగా నిలబడి) ఏదీ ఓ రిహార్సలు వేద్దాం. ఇలారా (రెండు సార్లు అటూ ఇటూ తిరుగుతాగా ఇంతలో. [బయటినించి కేక : సన్యాసిరాజు గారూ] ఎవరో లోపలికి పంపించు

[వరహాలు నిష్క్రమిస్తాడు. విద్యాపతి ప్రవేశం.]

విద్యా : నమస్కారమండి!

[కూర్చోమని సంజ్ఞ చేస్తాడు సన్యాసిరాజు]

నా పేరు విద్యాపతి. మీ పూర్వస్నేహితులూ, ఇప్పుడు కీర్తిశేషులూ అయిన నరసింహంగారి కుమారుణ్ణి.

సన్యా : అలాగా! ఏం కావాలి మీకు?

విద్యా : కొంచెం డబ్బు అవసరమైందండి.

సన్యా : అప్పుకావాలా?

విద్యా : అవునండి.

సన్యా : ఎంత?

విద్యా : వెయ్యి రూపాయలండి. కొంచెం తక్కువైనా చాలు.

సన్యా : ఏవరతుమీద?

విద్యా : వాయిదాలమీద తీర్చుకుంటానండి.

సన్యా : అదిసరే ఆస్తితాకట్టు ఉందుతారా?

విద్యా : లేదండి. ఆస్తేఉంటే ఎప్పుడో అమ్మేసేవాడిని.

సన్యా : బంగారంగాని, వెండిగాని తాకట్టు పెడతారా?

విద్యా : అవేవీ నాదగ్గర లేవండి.

సన్యా : అయితే వ్యక్తి జామీనుమీద కావాలి కాబోలు. జామీనుదారెవరు?

విద్యా : నేనెవర్నీ అంతగా ఎరగనండి.

సన్యా : (ఎగాదిగా చూసి) మరి!

విద్యా : నోటురాసిస్తానండి.

సన్యా : (హేళనగా) రాసిస్తావూ! ఇంకా నయం. చేబదులిమ్మని అడగలేదు తాకట్టులేకుండా అప్పివ్వటమే!

విద్యా : ఆ తాకట్లన్నీ నమ్మకంకోసమేగదండి.

సన్యా : అవునూ. అయితే!

విద్యా : నన్ను నమ్మలేరూ?

సన్యా : దివాలా తియ్యటానికా?

విద్యా : వెయ్యిరూపాయల్లో నే దివాలా తీస్తారా?

సన్యా : ఊరికే అప్పులిస్తుంటే మరేమవుతుందీ!

విద్యా : మీ ఐశ్వర్యంలో వెయ్యిరూపాయలు ఎన్నోవంతు! దయాపూర్వకం అప్పు అడుగుతున్నాను. నా మనసుని గ్రహించగలిగితే తప్పక అప్పివ్వగలరు. కాని... కాని ఆ విద్య మనుష్యులకి రాదు. మీరిస్తార నే నమ్మకంతో నేను రాలేదు. కాని ఆశ మనిషిని కుక్కలా ఆడిస్తుంది. (బల్లమీద కుక్కల శిల్పం చూసి, చేతిలోకి తీసుకుని, విషాదంగా చిరునవ్వు నవ్వి) మనిషిని కుక్కలా ఆడించేది డబ్బు అని అందరూ అనుకుంటారు, కాదు ఆశ! (తాళాలు చూసి) తాళాలూ, ఇనప్పెట్టెలూ, దస్తావేజులూ. హుఁ-ఇనప్పెట్టెల్లో, దస్తావేజుల్లో మిమ్మల్ని బంధించి బయటికి రాకుండా తాళాలు వేసి కాపలా కాస్తోంది మీ ఆశ. ఇదుగో, ఇదే మీ ఆశకి ప్రతిరూపం. (కుక్క తల చూపించి బల్లమీద పెడ్తాను.)

సన్యా : పిచ్చివాడివల్లే ఉన్నావే! నీతో మాట్లాడ్డానికి నాకు తీరిక లేదు. వెళ్లు. వెళ్లు.

[సన్యాసిరాజు రంగం వెనక భాగంలోగల ద్వారంలోనుంచి నిష్క్రమిస్తాడు; సీతారామారావు ప్రవేశం ఎడమపక్క నుంచి]

సీతా : ఓ. విద్యాపతీ నువ్వా! నుంచున్నావేం కూర్చో.

విద్యా : ఎందుకూ, వెడుతున్నాలే. వొచ్చిన పనయింది.

సీతా : డబ్బడిగావా, మా నాన్నని?

విద్యా : అడగటం లేదనటం రెండూ జరిగాయి.

సీతా : నేను అనుకుంటూనే ఉన్నాలే.

విద్యా : నీ విషయం ఏమయిందీ?

సీతా : ఏ విషయం?

విద్యా : ఆ అమ్మాయి ఎవరో తెలుసుకున్నావా?

సీతా : (ఉస్సురని) లేదోయ్. వెనక్కి తిరిగి నన్ను చూసి తొందరగా రిక్షా ఎక్కి పారిపోయింది.

# విచిత్ర జీవులు

విద్యా : పారిపోయిందీ?

సీతా : చేజిక్కినట్టు చిక్కి జారిపోయిందోయ్.

విద్యా : ఎక్కడికీ పోలేదులే. ఆ అమ్మాయెవరో నాకు తెలుసు.

సీతా : (ప్రాణం లేచివచ్చినట్లయి) ఎవరూ?

విద్యా : అడ్వకేట్ కూర్మావతారం లేడూ?

సీతా : ఆఁ—ఆఁ.

విద్యా : ఆయన టైపిస్ట్.

సీతా : నీ కెలా తెలిసింది!

విద్యా : తెల్లవారినట్టే ఉంది నీ తెలివి. నా కాయన ఉద్యోగం ఇవ్వలేదూ! పొద్దున ఆఫీసుకి వెళ్ళేసరికి ఆ అమ్మాయి ప్రత్యక్షం.

సీతా : ఆఫీసునించి అప్పుడే వొచ్చేశావేం?

విద్యా : మొదటిరోజు కదూ. పనేం లేదు. మళ్ళీ వెళ్ళాలి

సీతా : నీ ఉద్యోగం నాకు దొరికితే ఎగిరి గంతేసేవాడినోయ్ ఓ సహాయం చేస్తావూ?

విద్యా : చెప్పు

సీతా : నీ తెలివితేటలతో ఆమె మనసు నామీదికి తిప్పలేవూ?

విద్యా : నా కలాంటి విద్యలు రావే.

సీతా : విద్యాపతీ. ఈ సహాయం ఎలాగైనా చేసి పెట్టవోయ్. ఆమె నన్ను ప్రేమించేట్టు చేస్తే నీకు వెయ్యిరూపాయలు బహుమతిగా ఇచ్చేస్తాను. అప్పుకోసం నువ్వు బాధ పడక్కర్లేదు.

విద్యా : నీ దగ్గిరెక్కడిది?

సీతా : నా అవస్థేదో నేను పడతాగా.

విద్యా : స్వార్థం ఎంతపనైనా చేయిస్తుందిలే.

సీతా : చేతిలో చెయ్యివేస్తాను. (చెయ్యిపట్టుకుని) ఏమంటావ్?

విద్యా : చూద్దాం. సరే, నేను వెళ్లాలి. (నిష్క్రమిస్తాడు)

సీతా : (జేబులోంచి ఫొటో తీసి చూస్తూ తన్మయత్వం చెంది) ఆహా! ఎంత చక్కదనం! (రాగయుక్తంగా)

"—జాళువాతళుకులా చెక్కిళ్లు డాల్?
సింగిణీ విండ్లా కనుబొమల్?
ఇంద్రనీల మణులా
వేణీ రుచుల్? తమ్మితే
దూండ్లా బాహువుల్?
ఇంత చక్కదనమెందున్
గాన మీ జవ్వనిం
బెండ్లాడం గలవాడు చేసినది
సుమ్మీ భాగ్య మూహింపగన్."

[లక్ష్మీపతి ప్రవేశం]

లక్ష్మీ : ఏమిటి బాబూ అలా పరవశులై పోతున్నారు?

సీతా : లక్ష్మీపతిగారా!! రండి రండి. కన్నుల పండుగ అనేమాట ఎప్పుడైనా విన్నారూ?

లక్ష్మీ : వినకేం?

సీతా : ఆ పండుగ చేసుకోవాలంటే ఈ ఫోటో చూడండి."

లక్ష్మీ : ఎవరిది బాబూ ఆ ఫోటో?

సీతా : సురగరుడోరగ కిన్నర భామినీమణుల్ని తలదన్నిన సుందరీమణిది. మూర్ఛపోనని ధైర్యముంటేనే చూడండి (ఫోటో చూపిస్తాడు) ఎలావుంది?

లక్ష్మీ : (ముఖాన కత్తివాటుకి నెత్తురుచుక్క లేకుండా తెల్లబోయి) ఆఁ! ఇది మీ కెక్కడిది?

సీతా : వివరాలు అడక్కండి ఎలావుందో చెప్పండి అంతే (ఫోటో చూస్తుంటాడు)

[పిడికిలి బిగించి లక్ష్మీపతి సీతారామారావు వైపు తీక్షణంగా చూస్తూ కుడివైపునవున్న గదిలోకి నిష్క్రమిస్తాడు.

సీతా : (ఫోటో చూస్తూనే), మాట్లాడరేం లక్ష్మీపతిగారూ? (తలెత్తిచూసి నవ్వుతూ) వర్ణించటానికి మాటలు దొరక్క చల్లగా జారుకుంటున్నారా? నిఘంటువులు తిరగెయ్యండి.

[వరహాలు ప్రవేశం]

ఒరే, వరహాలూ!

ర : అయ్యా, ఏంటిబాబూ? తిరిగెయ్యమంటున్నారూ!

సీతా : నీకు అందమంటే ఏమిటో తెలుసూ?

వర : ఎందుకు తెలవనండి?

సీతా : ఎక్కడైనా చూశావూ?

వర : చిత్తం మన మేడ బలే అందంగుంటాదండి.

సీతా : ఇళ్లు కావురా!

వర : పద్దుటాల మంచుతుప్పర్లు పడతా ఉన్నప్పుడు పువుగా ఎదిగిన వోరిచేను సూస్తుంటే బలే పసందుగా ఉంటుందండి.

సీతా : నీమొహం నీ కెంతసేపూ కొంపా, తిండీ— మనుష్యులా మనుషులు!

వర : తమరు అందంగానే ఉంటారు బాబూ.

సీతా : (సంతోషంగా) నిజంగానా వరహాలూ?

వర : చిత్తం. ఆ చిలుకు గుడ్డలూ, సూటూ, బూటూ—అచ్చం దొరలాగుంటారండి.

సీతా : (ఫొటో చూపించి) ఎలా ఉందిరా ఈ పిల్ల?

వర : (కొంచెం ఆశ్చర్యంగా సీతారామారావు వైపు చూసి) లచ్చిమిలాగే ఉందండి మా తల్లి.

సీతా : ఈ అమ్మాయికి ఈడూజోడూగా ఉంటాను కదురా నేను?

వర : ఛ ఛ. అదేంమాట బాబూ?

సీతా : (చిన్నబోయి) అదేమిట్రా, వరహాలూ?

వర : ఆ అమ్మాయెక్కడ, తమరెక్కడ బాబూ!

సీతా : నేనుకూడా బావుంటానని ఇప్పుడేకదురా నువ్వన్నావు?

వర : అదికాదు బాబూ. తమరు మారాజులూ, ఆ అమ్మాయి లేనోళ్ల పిల్ల.

సీతా : ఏమిట్రా, అంతా తెలిసినట్టు మాట్లాడుతున్నావు. కొంపతీసి ఈ అమ్మాయిని నువ్వెరుగుదువా?

వర : ఎందుకెరగనండీ? కల్యాణమ్మగారు కదు బాబూ?

సీతా : కల్యాణా? కల్యాణి! ఎంత మధురాతి మధురమైన పేరు! నీ కెలా తెలుసురా, వరహాలూ?

వర : మనలక్షింపతిగారమ్మాయికదండీ ఈ తల్లి?

సీతా : (విసుగు పడినట్టుయి) లక్ష్మీపతిగారమ్మాయా?

వర : చిత్తం.

సీతా : నువ్వు పొరపాటుపడ్డావురా.

వర : నేను రోజూ చూట్టంలేదంటండీ ఆ అమ్మాయిగార్ని?

సీతా : కొంపతీశావురా, వరహాలూ.

వర : చిత్తం. తమరికి తెలవదా బాబు? అందుకే కులగోత్రాలు ముందే ఇశారించాలన్నారు బాబూ పెద్దలు.

సీతా : ఏడిశావులేరా, నువెళ్లు.

వర : చిత్తం. (వెళ్లబోతూ వెనక్కి తిరిగి దగ్గిరకొచ్చి రహస్యంగా) ఎవ్వారం ఏం జరప మాకండి బాబూ, లక్ష్మింపతిగారు మా చెడ్డ కోపదారి (వీపు తడుముకుంటాడు నవ్వుతూ.)

సీతా : సరే లేరా, నువ్వెళ్ళు.

[వరహాలు నిష్క్రమణ సీతారామారావు కొంచెం బెరుగ్గా లక్ష్మీపతి ఉన్న గదివైపు చూస్తూ రంగం వెనకభాగం ద్వారంలోంచి నిష్క్రమిస్తాడు. అదే ద్వారంలించి సన్యాసిరాజు ప్రవేశించి సోఫాలో కూర్చుంటాడు ]

సన్యా : వరహాలూ! లక్ష్మీపతిగారొచ్చారేమో చూడు.

లక్ష్మీ : (ప్రవేశించి) చిత్తం వొచ్చానండి నమస్కారం.

సన్యా : (ఓదార్పుగా) వొచ్చారూ. ప్చ్. ఎంత దారుణం జరిగిపోయిందండీ. ఒకటా, రెండా! వెయ్యి రూపాయలు.

లక్ష్మీ : నా దురదృష్టం. (నుదురుమీద చెయ్యి పెట్టుకుంటాడు.)

సన్యా : పోలీస్ రిపోర్ట్ ఇచ్చారా?

లక్ష్మీ : ఇచ్చానండి. ఏం జరుగుతుందో! ఆ భగవంతుడిమీదే భారం వేశాను.

సన్యా : నోట్ల నెంబర్లు ఇచ్చారా?

లక్ష్మీ : ఆ ఇచ్చానండి. మీ దయవల్ల ఆ జాగ్రత్త ముందే తీసుకున్నాను.

సన్యా : కాలం మంచిది కాదండీ.

లక్ష్మీ : పిల్లకి పెళ్లిచేద్దామని వెయ్యి రూపాయలు అప్పు చెయ్యడమేమిటి! అది ఇల్లు చేరకుండా మధ్యలోనే గల్లంతు కావటమేమిటి.

అంతా కర్మ. ఇహ దాని పెళ్ళి ఎలా అవుతుందో!

సన్యా : పోనీ, కట్నం లేకుండా చేసెయ్యరాదూ?

లక్ష్మి : కట్నం లేకుండా పెళ్ళా! ఎందుకండీ హాస్యాలు. పెళ్ళికొడుకు లేకుండా పెళ్ళి కావొచ్చుకాని కట్నం లేకుండా పెళ్ళా! హుఁ బొమ్మల పెళ్ళికూడా కట్నం లేకుండా కాదే!

సన్యా : మాటవరసకి అన్నాలెండి మీరూ. అంటే, ఫర్మా రావుగారికి కబురుచేశాను ఆ బాకీ ఇలాగే ఏడుస్తోంది. కాస్త ఆ ఫైల్ చూడండి. ఇదిగో తాళాలు (తాళాలు ఇస్తాడు. లక్ష్మిపతి గదిలోకి వెళ్ళి ఓ కాగితంతో తిరిగి ప్రవేశించి, తాళాలు ఇచ్చి, కాగితం తిరగేస్తూ ఉంటాడు.)

సన్యా : ఇంతవరకూ దమ్మిడీ వడ్డీ అయినా ఇవ్వలేదు. సాలుసరి కాంపౌండు వడ్డీ కట్టి అసలు ఫాయిదాలు మొత్తం ఎంతయిందో తేల్చండి. చెవులు పిండి వసూలు చేస్తాను.

లక్ష్మి : (దీనంగా) అయ్యబాబోయ్ : ఇంక వొక్క దమ్మిడి కూడా అడగటానికి మనకి హక్కు లేదండీ!

సన్యా : (నిర్విణ్ణుడై) ఆఁ!

లక్ష్మి : నోటుకి లిమిటేషన్ పట్టింది. హరీ హరీ

సన్యా : (తడబడుతూ) లి...లి...మిటే—షనా? లిమిటేషనే!

లక్ష్మి : వెయ్యిరూపాయల ప్రాంసరీనోటు చిత్తు కాగితంతో సమానమైన పోయింది. ఖర్మ దశ!

సన్యా : (దీనంగా) సరిగా చూడండి లక్ష్మిపతి గారూ.

లక్ష్మి : చూసేందుకేముందీ? నిన్నటితోనే గడువు తీరి కాలదోషం పట్టింది.

సన్యా : కాలదోషం పట్టిందీ! (కోపంగా) అంత శుద్ధిగా ఎలా ఉన్నావయ్యా?

లక్ష్మి : చిత్తం. లిమిటేషన్ వగైరా వ్యవహారాలన్నీ తమరే చూచుకుంటున్నారు.

సన్యా : అయితే నువ్వేం చేస్తున్నావయ్యా!

లక్ష్మి : వడ్డీలు కట్టటం, కాతాలు రాయటమే గదండి మీరు నాకిచ్చినపని?

సన్యా : అయితే మటుకు యజమానికి నష్టం కలుగుతుంటే చూస్తూ ఊరుకుంటావుటయ్యా?

లక్ష్మి : చూస్తే ఊరుకుంటానా?

సన్యా : అఘోరించినట్టే ఉంది. బాధ్యత ఎరగని వాడివి నువ్వేం గుమాస్తావయ్యా?

లక్ష్మి : క్షమించాలి. నా తప్పేం లేదు.

సన్యా : లేదూ?

లక్ష్మి : లేదండి.

సన్యా : ఆ పప్పు లుడకవ్. ఆ నోటు బాపతు మొత్తం నువ్వే ఇచ్చుకోవాలి.

లక్ష్మి : నేనా?

సన్యా : అవును, నువ్వే. ఎందుకయ్యా మరి నీకు నెల నెలా జీతమిచ్చేది? అణాపైసలతో ఆ బాకీ నువ్వు తీర్చాలిసిందే. లేకపోతే కోర్టులో దావా పడేస్తాను.

లక్ష్మి : ఖర్చులు దండగ మీరు గెలవరు.

సన్యా : గెలవనూ? చూస్తా.

లక్ష్మి : ఎలా గెలుస్తారు? నేను చేయాల్సిన పనేమిటో పూసగుచ్చినట్టు మీరు రాసిచ్చారు.

సన్యా : రాసిచ్చానూ?

లక్ష్మి : చిత్తం. (ప్రతిదీ కాయితాల్లో ఇరికించటం తమకి అలవాటేగా!

సన్యా : (కోపంగా) నిన్ను డిస్మిస్ చేశానుపో.

లక్ష్మి : డిస్మిస్ చేసేముందు నేరం ఆరోపించి, సమాధానం వినటం అవసరం.

సన్యా : అన్నీ అయినయ్.

లక్ష్మి : నామీద నేరం ఆరోపిస్తూ నాకేమీ కాగితం ఇవ్వలేదే.

సన్యా : నేర్చావు లేవయ్యా మహా, డిస్మిస్ చేశాను పొమ్మంటుంటే.

లక్ష్మి : (కొంచెం ఆలోచించి) సరే వెళతాను. డిస్మిస్ చేసినట్టు కాగితం ఇవ్వండి. లేకపోతే నా అంతట నేనే మానేశానని మీరే అంటారు తరువాత.

[సన్యాసిరాజు కొంచెం కోపంగా చూసి. కాగితం తీసుకుని రాస్తుంటాడు.]

కారణం కూడా రాయండి. లేకపోతే చెల్లదు.

సన్యా : ఎందుకురాయనూ ? ఉన్నది ఉన్నట్టు చడామడా రాసిపారేస్తాను.

[రాసి కాగితం ఇస్తాడు లక్ష్మీపతికి]

లక్ష్మీ : ఇవాళ లేచినవేళ మంచిదికాదు. సెలవు. (నిష్క్రమణ)

[సన్యాసిరాజు తీక్షణంగా కాసేపు ఆలోచించి చిటికె వేస్తాడు. ధర్మారావు ప్రవేశం.]

ధర్మా : నమస్కారం, సన్యాసిరాజు గారు.

సన్యా : (లేచి ఎదురువెళుతూ) ఓ! ధర్మారావు గారా ! దయచెయ్యండి-ఇటు. ఇలా కూర్చోండి. ఒరే వరహాలూ—వరహాలూ ఆ సోఫా తుడవరా (వరహాలు ప్రవేశం) పెద్దమనిషి ఇంటకొస్తే ఆమాత్రం తెలియదేంరా ? (వరహాలు కుర్చీ దులుపుతాడు) కూర్చోండి ధర్మారావుగారూ. వరహాలూ, స్ట్రాంగ్ కాఫీ తెచ్చిపెట్టరా ధర్మారావు గారికి. (వరహాలు నిష్క్రమణ)

ధర్మా : (ఈ మర్యాద అర్థంకాక) అహఁ(హఁ ఎందుకండీ ఇప్పుడు ?

సన్యా : మొహమాటపడతారేమండీ, నేనెవరో కొత్త వాణ్ణి అయినట్టు. నే నివ్వకూడదా, మీరు తీసుకోకూడదా ?

ధర్మా : ఎంతమాట. తమరెందుకో అర్జంటుగా రమ్మన్నారని చెప్పాడు వరహాలు. చేస్తున్నపని అలాగే వొదిలేసి వొచ్చేశానండీ.

సన్యా : అలాగా. చూశారా, నేనంటే మీకంత అభిమానమన్నమాట.

ధర్మా : ఏదైనా వ్యవహారమా ?

సన్యా : ఆఁ— పెద్దవ్యవహారమేనుండీ. నే నే వొద్దామనుకున్నాను. ఎక్కడ — తీరికేదండీ?

ధర్మా : తమరికి బోలెడుపనులూ—

సన్యా : కాదుమరీ. ఆఁ, అసలువిషయం. మన కోటి సూర్యప్రకాశరావుగారు లేరూ, వారికి సన్మానం చేద్దామనుకుంటున్నాం. మీ సలహా కావాలి.

ధర్మా : తమరు తలుచుకుంటే ఇంక అడ్డేముంది ? కానియ్యండి.

సన్యా : మీ సహాయం బోలెడంత కావాలి, మరి.

ధర్మా : (ముందుజాగ్రత్తతో) నావల్ల అయేది మాట సాయమేగా. దానికేం; భాగ్యమూ, బంగారమూ?

సన్యా : ఆహ్వానసంఘంలో మీ పేరు వేయించేస్తున్నాం.

ధర్మా : (ఉబ్బి) నా పేరే!

సన్యా : మీరు లేకపోతే పనేమవుతుందండీ ! ఏమంటారు ?

ధర్మా : మీరు ఆజ్ఞాపించటమూ, నేను కాదనటమూనా ? మీ చిత్తం.

సన్యా : మరయితే ఆలస్య మెందుకూ? విజ్ఞప్తిమీద సంతకం పెట్టెయ్యండి.

[ప్రాంసరీ నోటు వెనక్కి తిప్పి దగ్గరగా వొచ్చి నిలబడి కలం అందిస్తాడు.]

ధర్మా : అయ్య బాబోయ్ సంతకమే!

సన్యా : అదేమిటి? అలా అన్నారు?

ధర్మా : (సర్దుకుని)అహఁ...ఏంలేదు...కొంచెం... చెయ్యి వొణుకుతుంటేనూ.

సన్యా : ఇక్కడికి వొచ్చినప్పుడు బాగానే ఉందే.

ధర్మా : అప్పుడప్పుడు అకస్మాత్తుగా అట్టా వొస్తుందండీ.

సన్యా : కొంచెం ఓపిక చేసుకొని పెట్టేసెద్దురూ.

ధర్మా : అహఁ—సంతకం ఎందుకండీ?

సన్యా : మీసంతకం లేకపోతే ఎలాగండీ? నలుగురూ చూసి ఓహో మన ధర్మారావుగారు కూడా పట్టారే అని ధైర్యంగా చందా వెయ్యాలంటే మీ సంతకంలేకపోతే ఎలా చెప్పండి.

ధర్మా : పోనీ, నా సంతకం కూడా మీరే పెట్టెయ్యకూడదు?

సన్యా : ఫోర్జరీ?

ధర్మా : ఆఁ—ఇదేమయినా నోటా—ఫోర్జరీ అనటానికి—

సన్యా : కాదు లెండి. మీరు సంతకం పెట్టండి నా మాట విని.

ధర్మా : పెట్టినట్టే అనుకోండి.

సన్యా : (విసుగ్గా) సరే, మీ ఇష్టం. (ధర్మారావు చూడకుండా నోటు జేబులో పెట్టుకుని) మాట అన్నారుగా, అదేచాలు.

ధర్మా : అంతే, అంతే. నా సంగతి మీకు తెలీదూ? నేను మాటంటే ఒకటీ, కాగితం మీద రాసిస్తే ఒకటీనా? నా పేరు కూడా అచ్చేసుకోండి.

సన్యా : అబ్బే సంతకం లేకుండా అచ్చు వెయ్యటం ప్రమాదం కదండీ. నేనంటే మీ స్నేహితుణ్ణి గాని, మిగతా సభ్యులు ఒప్పుకోవొద్దూ?

ధర్మా : అయితే ఆహ్వానసంఘంలోంచి నన్ను తీసేస్తారా?

సన్యా : పైగా ఆఅభాండం నామీద వేస్తున్నారూ?

ధర్మా : (అయిష్టంగా) సరే, ఇలా తెండి మరి, తప్పేదేముంది.

సన్యా : (సంతోషంగా) అంతకంటేనా!
[దగ్గిరికొచ్చి కలం ఇచ్చి ఫలానాచోట సంతకం పెట్టమంటాడు. వొణుకుతున్న చేత్తో ధర్మారావు కలం పట్టుకుని భయంగా కాగితంవైపు చూస్తాడు]

ధర్మా : ఏం రాశారేమిటి? (వెనక్కి తిప్పి చూడటానికి ప్రయత్నిస్తాడు.)

సన్యా : (గభాలున చెయ్యి అడ్డం పెట్టి) ఆఁ ఏముందీ? మామూలుపాటే. సంతకం పెట్టెయ్యండి— తరవాత తీరిగ్గా చదువుదురుగాని.

ధర్మా : అటువైపు ఖాళీలేదూ?

సన్యా : ఉంటే ఇటు తిప్పటం దేనికీ?

ధర్మా : నాది ఎన్నో నెంబరూ?

సన్యా : ఎన్నోదైతే ఏముండీ?

ధర్మా : పీకలమీదికి రాదుగదా?

[గభాలున వెనక్కి తిప్పి చదువుతాడు].
"...ముల్లెల బైరాగిరాజుకుమార్డు సన్యాసిరాజు అనే నీకు, బేరాల విశ్వాసరావు కుమార్డు ధర్మారావు అనే నేను వ్రాసి ఇచ్చిన ఆన్ డిమాండ్ ప్రామిసరీ నో..."

సన్యా : అయ్యో. నా తెలివి తెల్లారా—ఒకటనుకుని ఒకటిచ్చాను కాబోలు. (నోటు గభాలున లాక్కుంటాడు) విజ్ఞప్తి ఎక్కడుందో (కాగితాలన్నీ వెతుకుతూ) ఆ సుందరరావుగారు పట్టుకుపోయారు కాబోలు. తరవాత పంపిస్తాలెండి ధర్మారావుగారూ.

ధర్మా : (షాక్ నించి తేరుకుని, నోటుకి లిమిటేషన్ పట్టినట్టు గ్రహించి) అలాగే, మరి నాకు సెలవిప్పించండి. (లేవబోతాడు.)

సన్యా : ఒక్కక్షణం. ఎలాగూ రానేవొచ్చారు. ఇప్పుడే పాతకాగితాలన్నీ తిరగేస్తూంటే మీ నోటు కనిపించింది. చూడండీ, నోటుమీద చెల్లులేమీ లేకపోతే బావుండదు. ఏమైనా చెల్లు వెయ్యరాదూ?

ధర్మా : దానికేంభాగ్యం. అలాగే. ఇప్పుడు డబ్బేమీ తేలేదు. రేపు చెల్లువేస్తాను.

సన్యా : మీ మీద ఆ మాత్రం నమ్మకం లేదంటారా నాకు? (నోటుకాగితం ముందు పెడతాడు.) సంతకం పెట్టండి. డబ్బు తరవాత మా వరహాలచేత పంపవచ్చు.

ధర్మా : చెయ్యి కొంచెం వొణుకుతోందండీ.

సన్యా : నేను పట్టుకుంటాగా.

ధర్మా : అసలే నోటు చూడండి. వొణుకు చేత్తో సంతకం పెడితే బావుండదు.

సన్యా : ఫరవాలేదులెండి. అశ్రద్ధచేస్తే మళ్లీ లిమిటేషన్ పట్టిపోతుంది.

ధర్మా : పడితేమాత్రం ఏముండీ? మాటచాలదూ?

సన్యా : అహాఁ - కాగితంమీదుంటే ఎందుకైనా మంచిది. ఓ సంతకం పెట్టేసుకూ.

ధర్మా : (చెయ్యి ఎత్తిబోయి) అబ్బ- చెయ్యి లేవటం లేదండీ. పడిపోయినట్టుంది.

సన్యా : (వొళ్లుమండి) చాల్లెండి, మీ ఎత్తులు.

ధర్మా : ఎత్తులేమిటీ?

సన్యా : లేకపోతే నల్లరాయిలా ఉన్న మనిషికి చెయ్యి పడిపోయిందీ! నోటు లిమిటేషన్ పట్టిందని చూసి ఎగేద్దామనుకుంటున్నావా? ఏం పెద్దమనిషివయ్యా నువ్వూ?

ధర్మా : నాకు వొంకపెడ్తున్నావు. నీ పెద్దమనిషి తరహా ఏమిటయ్యా. మోసంచేసి సంతకం

పెట్టిద్దామని ఎంత ప్లాను వేశావయ్యా సన్యాసి రాజూ! మరొకడైతే దఖీమని పడిపోయి వుండును. (వెళ్ళిపోతాడు)

సన్యా : నా డబ్బక్కడ పెట్టి కదులు.

ధర్మా : ఏమిటయ్యా నీ దౌర్జన్యం? లిమిటేషన్ పట్టిన నోటుకూడా బెదిరింపే!

సన్యా : ఎవడనుకుంటున్నావో ధర్మారావు! కోర్టు చుట్టూ తిప్పి మూడు చెరువుల నీళ్లు తాగిస్తా- జాగ్రత్త.

ధర్మా : అబ్బో! చాలామందిని చూశాం.

సన్యా : చెవులుపిండి ఈ బాకీ నీ దగ్గిర్నించి వసూలు చెయ్యకపోతే నా పేరు సన్యాసిరాజు కాదు. ఖబడ్దార్.

ధర్మా : చిత్తు కాయితంలా ఈ నోటుని ప్రగున చింపించకపోతే నా పేరు ధర్మారావు కాదు. నే నేనా అంత తీసిపోయిందీ (కుడిచెయ్యి పిడికిలిబిగించి చూపిస్తూ నిష్క్రమణ.)

[స్టేజి వెనకభాగంనించి కాఫీ కప్పుతో ప్రవేశిస్తూ ఈ గొడవచూసి, తటపటాయించి తిరిగి వెనక్కి వెళ్ళిపోతాడు వరహాలు]

సన్యా : (తల చేతుల్లో పెట్టుకుని, సోఫాలో కూలపడి) హారి, దుర్మార్గుడా! ఎంతపని చేశావు!

[సుందరరావు తిరిగి ప్రవేశం]

సుంద : అలా ఉన్నారేం, సన్యాసిరాజుగారూ.

సన్యా : (తలెత్తి చూసి) ఓ, మీరా! రండి.

సుంద : (సోఫాలో బాగ్ చూసి) అమ్మయ్య ఇక్కడే ఉందిగద! ఇందాక ఇక్కడ నా బాగ్ మర్చిపోయి వెళ్లానండీ.

సన్యా : (వినిపించుకోక) ఎంత అవమానం జరిగి పోయిందండీ.

సుంద : ఎవరికీ?

సన్యా : ఎవరికో అయితే నాకెందుకూ ఏడుపు?

సుంద : మిమ్మల్నీ అవమానించటమే! ఎన్నిగుండెలతో! ఎవడండీ వాడు?

సన్యా : ధర్మారావు అనే ఓ దగుల్బాజీ. పరమ లుచ్ఛా, ఫుండాకోర్.

సుంద : శాంతించండి - శాంతించండి. ఏం చేశాడు?

సన్యా : అప్పుతీసుకుని ఎగ్గొట్టాడు.

సుంద : ఎగ్గొట్టాడూ? వాడికి పుట్టగతుల్లేవు.

సన్యా : కొంచెం అశ్రద్ధవల్ల లిమిటేషన్ పట్టిపోయిందండీ నోటు. అది పసికట్టి తొక్క ఝాడించాడండీ దౌర్భాగ్యుడు. పైగా నానామాటలూ అన్నాడు. చిత్తు కాగితంలా నోటు ప్రగున చింపిస్తానన్నాడండీ.

సుంద : ఏడిశాడు.

సన్యా : వాణ్ణి కోర్టుకి ఈడ్చుకుపోతే నాకు మనశ్శాంతి లేదండీ సుందరరావుగారూ.

సుంద : జుట్టుపట్టి మరీ ఈడ్పించండి.

సన్యా : ఎలా? లా పాయింటు మనకి అనుకూలంగా లేదే.

సుంద : (ఆలోచించి) పోనీ, వాడి సంతకం మీరే పెట్టేస్తే?

సన్యా : ఫోర్జరీ!

సుంద : సింగినాదం.

సన్యా : నాకు చేతకాదండీ.

సుంద : ఎలా మరి?

సన్యా : ఏదో ఉపాయం ఆలోచించి నన్ను రక్షించండి. మీమీదే భారం వేశాను.

సుంద : ఏమీ తోచటం లేదే!

సన్యా : స్నేహితులు గనుక ఓ మాటడుగుతాను. ఏమీ అనుకోరుగదా!

సుంద : అడగండీ దానికేం?

సన్యా : నాముఖం ఉన్నదున్నట్టు కాగితంమీద గీశారు గదా! వాడి సంతకం చూసి ముద్ర కొట్టినట్టు ఎడం చేత్తో - ఇలా - గీసిపారెయ్యటం మీకో లెఖ్ఖా!

సుంద : నేనా?

సన్యా : (చేతులుపట్టుకుని) ఇది మీవల్ల కావలసిన పనే.

సుంద : ఫోర్జరీ!

సన్యా : ఇవి చేతులు కావు కాళ్లు.

సుంద : (అయిష్టంగా) సరే, కానివ్వండి. ఆపదలో ఉన్నవాళ్ళని ఏం చేసైనా సరే ఆదుకో మన్నారు.

[నోటుమీద ఫోర్జరీ చేస్తాడు]

సన్యా : మీ ఋణం తీర్చుకోలేను సుందరరావుగారూ ఇప్పుడే వొస్తా, ఉండండి.

[వెనుకభాగంలో ఉన్న ద్వారంలోకి నిష్క్రమణ అదే ద్వారంలోనుంచి సీతారామారావు ఫోటో చూస్తూ ప్రవేశం]

సీతా : (సుందరరావుని చూసి) మీరెవరు?

సుంద : మీరు?

సీతా : నేను సన్యాసిరాజుగారి పుత్రరత్నాన్ని.

సుంద : నేను వారి స్నేహితరత్నాన్ని.

సీతా : మీ పేరు?

సుంద : మీ పేరు?

సీతా : సీతారామారావు.

సుంద : నా పేరు సుందరరావు

సీత : మీరేం చేస్తుంటారు?

సుంద : మీరు?

సీతా : సౌందర్యాన్వేషణ.

సుంద : నేనూ అదే.

సీతా : (ఆశ్చర్యంగా) ఏమిటీ? నిజం?

సుంద : అవును నేను ఆర్టిస్టుని.

సీతా : అందాన్నిగురించి రెండుముక్కలు చెప్పండి.

సుంద : అనంతమైన ఆనందాన్నిచ్చేది అందం. అది అనిర్వచనీయం.

సీతా : (తన్మయుడై) మనసుని పలకరించి, హృదయాన్ని మీటి దివ్యమైన అనుభూతి నిచ్చే అద్భుతపదార్థమే అందం.

సుంద : అది నిరుపమానం వర్ణనాతీతం. ఊహాతీతం.

సీతా : ఓహ్. ఎంత గొప్పగా అన్నారు. సుందరావుగారూ! ఈ సౌందర్యానికి వంక పెట్టండి, చూద్దాం. (ఫోటో చూపిస్తాడు)

సుంద : (సీతారామారావు వైఖరి కనిపెట్టి) యీ నగుమోము చంద్రబింబంలా ఉందని అనలేను. ఎందుకంటే చందమామకి మచ్చ వుంది.

సీతా : (భుజంతట్టి) రత్నంలాంటి మాట అన్నారు. ప్రేమనిగురించి ఓముక్క చెప్పండి.

సుంద : ఏం చెప్పాలి? అందం, ప్రేమా—యివే కదండీ ఈ ప్రపంచంలో కనిపించేవి.

సీతా : (ఆరాధనాపూర్వకంగా చూసి) సహృదయులండీ సుందరావుగారూ. నాకో చిన్న సలహా ఇవ్వగలరూ?

సుంద : నిరభ్యంతరంగా.

సీతా : ఈ కల్యాణి సౌందర్యం చూసి ముగ్ధుడినై ప్రేమించానండీ

సుంద : ప్రేమించండీ శుభం.

సీతా : ఆ అమ్మాయి మనసు మారగొనాలంటే ఏం చెయ్యాలో కొంచెం చెవిని వేయండి; పుణ్యం వుంటుంది.

సుంద : ఇంతేకదా! చూడండీ సీతారామారావు గారూ. మనస్సుని ఆకర్షించాలంటే ముందు కళ్లని ఆకర్షించాలి కళ్ళు జిగేల్ మనిపించే మాంచి మాంచి బహుమానాలు వర్షంలా కురిపిస్తే ఆ అమ్మాయి గుమ్మయిపోయి మీ సొమ్మయిపోతుందంటే నమ్మండి.

సీతా : (ఆశ్చర్యంగా) ఆఁ?

సుంద : నమ్మండీ.

సీతా : నిజమే నా మట్టిబుర్రకి అది తోచలేదండి. మీ కెంతో కృతజ్ఞుణ్ణి. వొస్తా.

[బయటికి నిష్క్రమిస్తాడు. సన్యాసిరాజు ప్రవేశం]

సన్యా : (కొన్ని కరెన్సీనోట్లు సుందరావుకి ఇస్తూ) ఉంచండి అవసరానికి ఉంటుంది.

సుంద : (ముఖం ఎర్రబడేసుకుని) ఏమిటి! లంచం ఇస్తున్నారా? స్నేహధర్మంలో చేసిన త్యాగాన్ని ముష్టిడబ్బుతో కొలుస్తున్నారా? ఛీ. ఇంతేనా మీకర్థమైంది? ఎంత అవమానం! ఛీ.

[నోట్లు పర్రున చింపబోయి మానేసి బల్లమీద కొట్టి గబగబ వెళ్ళిపోతూంటాడు]

సన్యా : (తెల్లబోయి) సుందరావుగారూ, సుందరావుగారూ. (వినిపించుకోకుండా సుందరావు వెళ్ళిపోతాడు). [తెర]

[సశేషము]

# తిక్కన నిర్వచనోత్తర రామాయణము

శ్రీ విన్నకోట మాధవరావు

నన్నెచోడుని తరువాత ద్విపదలకుఁ బ్రాముఖ్యము నెలకొనెను. చంపువులు జాతీయానుసరణములు గావని కవులు వానిని నిరసించినట్లుఁ దోఁచెడిని. వాఙ్మయము సాధర్మ్యముగా గ్రహింపక మతావేశముచే శివకవులు, భవకవులు పరస్పర ద్వేషభావము గలిగి యుండిరి. దేశికవిత జాను తెనుఁగు అనుపలుకుల మ్రోత వినబడు టెక్కుడాయెను. కాని వాని యావశ్యకత యెంతవరకో అవి యెంతవఱకు గ్రాహ్యములో గ్రహించినవారు తక్కువగనుండిరి జాను తెనుఁగు నెపమున సంస్కృతమునుఁ బరిహరింపఁదలచిన వారియెడ గీర్వాణ పండితులకును, సంస్కృతాభిలాషులయెడ జాను తెనుగభిలాషులకు నిరసనభావ మేర్పడినది. వారు వీరికి తెనుగు మీఱినదనియు వీరు వారికి గీర్వాణము బలిసినదనియు హేళనముఁ జేయసాగిరి.

అట్టిసంధి కాలమున నిర్వచనోత్తరరామాయణ రచన సాగినది తిక్కనకుఁబూర్వమే రంగనాథ రామాయణము ద్విపదకావ్యముగ విలసిల్లినది. ధీరోదాత్తుఁడయిన రాముని చరిత్రము రంగనాథునికి బలెఁ దిక్కనకుఁ గూడ లోభనీయమైనది. కాని యాతని ద్విపదరచనా పద్ధతి మాత్రమితనికి నచ్చలేదు. ద్విపదరచన జాతీయమే, సుబోధకమే. అయినను విసువుదల కొంతవఱకైనఁ గొల్పునని కాబోలయును తిక్కన దానిని పరిహరించెను. దీనిని నిర్వచనముగ రచింతునని యాయన ప్రతిజ్ఞఁజేయుటయు చంపూపద్ధతి నచ్చనివారిని మెప్పించుటకే జాను తెనుఁగు నభిమానించువారికి గీర్వాణ పండితులకుఁగూడ సమ్మతమగునటుల తనరచన సాగించి యుభయకవిమిత్రుఁడాయెను. ఈ కావ్యరచన నాటికే యాతనికి సాహిత్య స్థిరధర్మము లేర్పడినవి. కొన్ని సాహిత్యనియమముల గ్రంథాదినే యాతఁడు పేర్కొనినాఁడు. ఇవి చూడుఁడు:

ఉ॥ భూరి వివేకచిత్తులకుఁ
బోలునవం దలపన్ దళంబులన్
సౌరభ మిచ్చు గంధవహు
చందమునం బ్రకటంబుఁజేసి యిం
పారెడు పల్కులం బదియ
నప్పలుకు ల్సరిగ్రుచ్చునట్లుగా
జేరుప నేరఁగావలయుఁ
జేసిన నేఁ గృతి యన్న వారికిన్

చం॥ పలుకుల పొందు లేక రస
భంగము సేయుచుఁ బ్రాతవట్టినా
టఁడు నేర్పు జూపి యొక
టన్ వ్యవసాయంబలరింపలేక యో
పాలమును గాని యట్టిక్రమ
ముందము మెచ్చుగ లోక మెల్లన
వ్వులబోరయుం జరించు కుక
వుల్ ధర దుర్విటులట్లు చూడఁ గాన్

కం॥ తెలుఁగు కవిత్వము చెప్పం
దలచినకవి యర్థమునకుఁ దగియుండెడు మా
టలు గొని వళులుం బ్రాసం
బులు నిలుపక యొగిని బులిమిపుచ్చుట చదురే.

కం॥ అలవడ సంస్కృత శబ్దము
తెలుఁగుబడి విశేషణంబు లేటపడం గాఁ
బలుకు నెడ లింగ వచనం
బులు భేదింపమికి మెచ్చు బుధజనము కృతిన్

మ॥ అమలోదాత్తమనీష, వేనుభయ కా
వ్యప్రౌఢిఁ బాటించు శి
ల్పమునం బారగుఁడన్ గళావిదుఁడ నా
పస్తంబ సూత్రుండ గౌ
తమగోత్రుండ మహేశ్వరాంఘ్రి కమల
ధ్యానైక శీలుండ న
న్నమకుం గొమ్మన మంత్రికిన్ సుతుఁడఁ
దిక్కాంకుండ సన్మాన్యుడన్

కం॥ లలితపదహృద్య పద్యం
బులఁ గథార్థంబు ఘటితపూర్వాపరమై

# తిక్కన నిర్వచనోత్తర రామాయణము

ఎలతి యెలతి తునియలు గా
వలసంధించిన విధంబు నమరగ వలయున్

నిర్వచనోత్తర రామాయణ రచనపాటికే తిక్కన తన యాత్మ శక్తియందు బూర్ణముగ విశ్వాసము గలవాఁడని దోఁచుచున్నది. తిక్కనకుఁ బూర్వులైన కవులలో నీగుణముల పాటింపకఁబోవుట యొక్కొక్కరిలో నొకవిధముగ గానవచ్చుచున్నది. పూర్వకవులయందు భక్తిగలిగిన ఈకవి విమర్శకుఁడగుటచే వారివారి కవితలలోని మంచి చెడుగులు గ్రహించి యార్వాచీనులైన యాంధ్రకవుల కుత్తమ మార్గము నిర్దేశించువాఁడై పైపద్యముల రచించెనని భావించవచ్చును.

ఇచ్చటననువాద సాహిత్యంబునుఁ గూర్చి యొకమాట. పురాణాదుల నాంధ్రీకరించుటలో నాంధ్రకవులు, కథాసందర్భము మాఱకుండునట్లు పాటించుచు వచ్చిరి. అయినను మూలమునున్న ప్రతి పదమునకు సరియగు తెలుఁగు పదమే యిరికింపవలయునని గాని, మూలములో లేని వర్ణనాదులుండ కూడదని గాని భావించలేరు. ఈ కారణముల వారి యనువాదములు సహితము స్వతంత్ర రచనలుగాఁ దోఁచుచున్నవి. శ్రీనాథాదులరచనలిట్టులనేయున్నవి. తిక్కనయు వాల్మీకి యుత్తరకాండమునందలి, కథ నాధారముగ గ్రహించి యందు ప్రక్షిప్తములనియు, నసందర్భములనియుఁ దనకుఁదోఁచిన భాగములు వదలి గ్రహించినవానిని గూడ శిల్పభంగముఁ గాకుండ సంకుచితముఁ జేసి సర్వత్ర మూలమునకుఁ జెక్కు మఱుంగుల మెఱుగిడగల రచనతో స్వయంసంపూర్ణముగ, మంగళాంతముగ, స్వతంత్ర కావ్యముగ నిర్వచనోత్తరరామాయణము రచించెను. మూలమునగల రామనిర్యాణగాథ యిందువదలివేయఁబడినది. మూలమునలేని పూర్వరామాయణ గాథయంతయు సంక్షేపరూపమునఁ బ్రథమాశ్వాసమునఁ జెప్పఁబడినది. ఈ రెండు హేతువుల నీకావ్యము మంగళాంతమును స్వయం సంపూర్ణమునైనది.

పూర్వరామాయణమున రంగనాథుఁడు రామునకు మిక్కిలి దేవతాంశము నారోపింపగాఁ దిక్కన యీ యుత్తరభాగమున నాతనికి నుత్తమ మానవత్వమారోపించెను. క్లిష్టదశయందతనికిని మనవలె నే హృదయసంక్షోభము మొదలగు వికారములుండుట సహజమని యాతనికట్టి స్థితినిఁ గల్పించెను. సీతారాముల ప్రణయమును వర్ణించుటయందు తరుణదంపతుల స్వచ్ఛమైన స్నేహభావము నే తిక్కన చూపెను గాని మనబుద్ధికి గోచరము గాని లక్ష్మీనారాయణుల దాంపత్య వైభవమును బ్రదర్శింపలేదు. ఇట్టికల్పనచే లోకాతీతుఁడయిన కావ్యనాయకుఁడు జనాదరణపాత్రుఁడాయెను. (He thus created human interest in the superhuman man) ఈదృష్టితోఁ జూచిన నిర్వచనోత్తర రామాయణమున హ్రస్వదృష్టికి దోషములుగఁ గన్పట్టునవన్నియు సమర్థనీయములును, కావ్యదృష్టిలో నతిసహజములు గనుఁ దోఁచును.

ఈ కావ్యమునకు నాయకుఁడు రాముఁడు. ఈ పాత్రను కవియెట్లు చిత్రించెనో విమర్శించి చూచుటెంతయు నావశ్యకము. మూలగ్రంథమునందలి పాత్రలోని సుగుణములన్నియు నట్టుండ వానియందలి యలౌకికాంశములనుఁ దొలగించి, స్వాభావికముగనుండు నటుల చిత్రించుట యీకవి చేసిన సంస్కారము. ఎట్టిధీరుఁడయ్యును, సంకటావస్థలయందు చిత్తసంక్షోభము బొందువాఁడే యనియు, నెంత యసంగుఁడయ్యు ధర్మప్రణయమునందు రసావిష్టుఁడే యనియు నీకావ్యమువలన స్పష్టముగ గోచరించుచున్నది. లోకాపవాదభీతుఁడై భార్యను వదలవలసివచ్చినప్పుడు రాముని హృదయమున లేచిన భావవిప్లవము అతి సహజముగ నున్నది. సీతను విడిచి యేకాంతమున రాముఁడు విలపించిన విధముఁ జూడుఁడు.

కం|| మనమునఁ బాయని ధరణీ
తనయ వలని వగల నేకతంబ పొగిలి, య
మ్మనువంశదీపకుం డి
ట్లను ధైర్యము పల్లటిల్లి యలుగులు పడుచున్.

సీ|| నీకకా యకట పినాకిబాణాసనం
బగ్నతంబుగ సభ నట్లు సేసి
జనకానుమతిఁ దపంబునకు నక్కట నీవు
ననుగమనంబు సేయంగ నరిగి
పాసియు మగుడ నిన్ బడయుదు నను నాస
నక్కట ప్రాణంబు చిక్కఁబట్టి
యక్కడ సేతుబంధాద్యుపాయముల నా
నందనం బయిన నీ పొందు గాంచి

గీ|| యింపొసంగ నీ యర్మిలియొల్ల నమ్మ
గాగ దుదిపోయి నిన్నిట్లు గావపాలు

సేసి యాఱడిఁ బుచ్చితిఁ జెప్పఁ జిట్ట
ఱయ్యొ నామను వేమన సంబుజాక్షీ.

ఉ॥ అచ్చట లోకమంతయును
నక్కటికంబున నుమ్మలింప నీ
విచ్చొరంగఁబోక మది
చిక్కఁదనంబున నియ్యకొన్న నా
కిచ్చటఁ దెచ్చి నిన్ విడుచు
టెంతటి పెద్ద, జఘన్యవృత్తికే
నచ్చట రచ్చకెక్కుటకు
నా ఱడిపోకకు నోర్తు మైథిలీ.

ఆ॥ అని దురంతశోకమునఁ బొంది సెజ్జపై
మేనువైచి కన్నుగోనలందు
నిడుదు నశ్రువారి చెవులకొలంకుల
నింప నిట్టు లను విభుండు మఱియు.

ఉ॥ నీట దురాత్ములైన యవి
వేకులు గొంద అనింద్యమైన య
జ్జోటి చరిత్ర మంగనల
జొప్పుగ సంశయ మంది యాడు పె
న్మాటలకేల యీ దురభి
మానము ప్రాణితి వాని నేల నే
గీటునఁ బుచ్చనైతిఁ బరి
కింపక చేసితి నింతిఁ బాసితిన్.

ఉ॥ లోకమువారి మెచ్చునకు
లోల విలోచనఁ బాఱనైచితిం
బో కొఱగామి యంతటనె
పోయెనె దీనికి నింకఁ గొంద లో
పాకృపమాలి చేసె నిది యొప్పగు
పొమ్మని దుర్వినీతిగాఁ
గైకొనిరేని వారి మది కంగున
కెయ్యది గందు దైవమా.

మరియు సీతారాముల ప్రణయ మెంత స్వాభావికముగ నుండెనో గమనింపుఁడు.

కం॥ రమణీయ స్థలముల హృ
ద్యములైన పదార్థములఁ బ్రియాసహిత విహా
రము సలుపు నుచితి పరివా
రము నాగరికంబునను సరస మధురముగాన్.

ఉ॥ వేడుక నెత్తమాడుచుఁ బ్ర
...క్షీణతమై గరువంపుఁ బన్నిదం
బాసఁ జూచి యొండొరుల
యంగకముల్ మది మెచ్చి యుల్లసం
బాడు నెపంబు నెట్టుకొని
యాడుచుఁ బున్నల ప్రేమలాడుచుం
జేసె ముదంబుల్ విభుండు కల
సిల్లిరి హాస్యములెల్ల ముచ్చికన్.

సీ॥ కలశంబు లభినవ గంధంబులుగఁ గూర్చి
తనువల్లిఁ గలయంగఁ దాన యలఁదుఁ
బుష్పంబు బహువిధంబుగఁ గట్టి ముడిచి, కొక
భంగిగా నెత్తల నట్టె యిచ్చు
హారముల్ మెలుసు నొయ్యారంబుగా గ్రుచ్చి
యందంబు వింతగా నలవరించు
మృగమదపంకంబు మృదువుగా సారించి
తిలకంబు నట్టె నెచ్చెలికిఁ జూపు

ఆ॥ జనకరాజతనయ మనమున దలిరొత్తంగ
వివిధ నిపుణలీల సేవ సేసి
చతురముగ నొనర్చు సౌభాగ్యసౌరభి
రామమూర్తి యగుచు రామవిభుఁడు.

ఉ॥ అల్లన లెస్స పుష్పములని యందని
గుత్తుల దిక్కు చూపి తా
నల్లన చేరి చేను నెగయన్నిను
నెత్తెదఁ గోయుమందు భూ
వల్లభుఁ డాదరంబు బొదలి
వామవిలోచన నెత్తెఁ దత్తనూ
వల్లిక తోన మైఁ బులకవర్గము
కొమ్ముఁడు వారు వోయగన్.

కం॥ ఇమ్మెయి నిష్టవినోదము
లమ్మదిరాయుఁ దాను రఘుకులాధీశుఁడు చి
త్తమ్ములఁ జిగురొత్తఁగ, ని
త్యమ్మును సలిపె ననురాగ తత్పరవృత్తిన్.

ఇట్లు రామునిపాత్రను సంస్కరించుటలో నతి లోకపురుషుని కేవలము ప్రాకృతుని జేసి హేళనము గలిగించలేదు. సీతాపరిత్యాగమునకు అవ్యవహిత పూర్వముగా నాదంపతులు విహరించిన యుద్యాన వర్ణనమతి యుచితముగ నున్నది. సామాన్య కావ్యములలో వర్ణనకొఱకే చేయబడు అష్టాదశ వర్ణనలవలెఁ గాక, ఒక ప్రత్యేకదృష్టితోఁ జేయబడినది. ఇది సీతాపరిత్యాగమునకు నుపాధిగా (Back ground)

రచింపఁబడినది. సీతా పరిత్యాగము నందలి కావ్య
మును గతితరముగఁ జూపుటకును సీతారాముల ప్రీతి
యోగమునందలి యకలుష భావమునుఁ బ్రదర్శించు
టకు నీ యుద్యానవన విహారవర్ణన యెంతయు నావ
శ్యకమైనది. సందర్భోచితవర్ణన యనగ నిట్టిదియె.
కావ్యమునందుఁ బ్రకృతి వర్ణనాదులు యథాస్థానమున
నుండి కథాకథనమునకుఁ నడ్డురాక దోహదకారులై
యుండవలయును. స్థానవివేకము లేక యసందర్భ వర్ణ
నల నీ కవి యెప్పుడును జేయఁడు. ఎందునుఁ
జేయలేదు.

నిర్వచనోత్తర రామాయణము ప్రౌఢగ్రంథము
కాదనువారునుఁ గలరు. వారు దీని రచనను భారత
రచనతోఁ బోల్తురు. ఇది సరియగు పద్ధతి గాదు
ఈ రెండు కావ్యముల రచనలకు మధ్యకాలమునఁ
దిక్కన సంపాదించిన విజ్ఞాన మపారము. రామాయణ
రచననాటి కాతఁడు లౌకికుఁడు, ఉభయకవిమిత్రుఁడు.
భారత రచననాటికి సిద్ధుఁడు, కవిబ్రహ్మ. కావున
దీనిని ప్రత్యేక కళాదృష్టితోఁ జూడవలయును.
భారతమునఁ గానవచ్చు తిక్కన యాత్మీయత తెక్క,
తిక్కన శిల్పవిశేషము లన్నియు నిందు గలవు

శబ్దౌచితి, అర్థౌచితి పాటించి, ఎచట ఏవిధ
ముగ శబ్దముల పోషింపవలయునో గమనించి కావ్య
రచన సాగించెను. సంవాద సంపోషణ విషయమున
నీ గ్రంథ మసమానము. ఈ గ్రంథమునందలి ప్రతిసంవా
దము స్వయంసంపూర్ణము. మఱియొక మాట, కావ్య
రచనయందు వచనము లోపించుటవలన లోప మెద
టను గానంబడదు. పాత్రల మనః ప్రవృత్తులఁ జిత్రిం
చుటలోఁ దిక్కన సిద్ధహస్తుఁడు. భద్రుఁడు సీతనుఁ
గూర్చి నివేదించిన పిమ్మట రాముని మనఃప్రవృత్తి
యెటుల చిత్రిత మాయెనో గమనింపుడు :

ఉ॥ నావుడు మూర్ఛ వచ్చిన మ
నంబునకున్ ధృతి యూత యిచ్చి సం
భావన వారి బోఁ బరిచి
పార్థివముఖ్యుఁడు దల్లడంబునన్
దావుకొనంగ లేక తన
తమ్ముల నప్పుడు పిల్వఁబంచి నా
నావిధ చింతముట్టుకొని
నన్ వెగడందుచు నార్తమూర్తియై.

ఇటులనే రంభా రావణ గాథలోఁ గూడ రంభా
మనఃప్రవృత్తిని యతి సహజముగఁ జిత్రించెనని
సహృదయులకుఁ దోచక మానదు. అనాయాసముగ
పాత్రోన్మీలనముఁ జేయుటలోను, భావనయు
భాషయు స్వభావవిరుద్ధము గాకుండుటయు తన
కాలమునఁ బ్రచారములోనున్న భాష నే వాడుటయు
మొదటినుండి చివరవఱకు పరువము సడలకుండ
రచన సాగించుటయు సాధ్యమైనంతవఱకు వ్యర్థపద
ములు వాడకుండుటయు, అతియలతి పలుకులతో
హృద్యములగు పద్యముల నిబిడార్థయుతముగ రచించు
టయు మొదలగు నియమముల నీ కవిబ్రహ్మ గమనించె
ననిఁ దోచును. మరియుఁ నితరుల చేతులలో నిరుప
యోగమై చేయిజారిపోవు పాదములందలి తుదియక్ష
రములు తిక్కనచేతిలో నర్థవంతములును పద్యమునకు
ప్రాణభూతములు నగుననుటకీ గ్రంథమం దెన్నియో
నిదర్శనములు కలవు.

ఒక పాత్రయొక్క వాచకాభినయమును, మఱి
యొక పాత్రయొక్క సాత్త్వికాభినయముతో
జోడింపఁబడినది. నిర్వచనోత్తరరామాయణము ప్రౌఢ
మనుటకు నిదర్శనము లిట్టివి యెండో పకంఠములు గలవు.
కవికి నిర్వచనోత్తరరామాయణము నెడ మిక్కిలి
యభిమాన మేమో! ఇందు స్థిరపడిన భావములు, గనఁ
బడు వర్ణనలు పలుకుబడులు, జాతీయములు, నీ గ్రంథ
మున నున్నవి యున్నయట్లే భారతమున జొప్పింపఁబడి
నవి. ధార్మికవిషయములఁ గూడ ఈ రచన నాటికే
తిక్కన స్థిరీకరించినాఁడు. ఈ గ్రంథము భారతమున
కుపోద్ఘాతమువలె గానవచ్చుచున్నదని విమర్శకు
లందురు. భారతమునందలి ధర్మప్రతిపాదనము, శిల్ప
విమర్శనము ఈ కావ్యమునందుఁ గానబడును.

పూర్వరామాయణమున గానబడని రాముని సంసార
స్థితి యీ యుత్తరభాగమున ప్రదర్శితము. సంసార
మున నున్నవాఁడు సంకటావస్థల ననుభవింపక తీరదను
విషయ ముత్తర రామాయణమున వర్ణింపబడినది. సంసార
బాధ రామునంతటి మహావీరునకుఁ దప్పలేదు. ఇది
సంసారులకు సహజము. ఇది సమబుద్ధులగువారికే
సాధ్యము. ఈ దృష్టితో రాముని భగవదవతారునిగఁ
గాక సకల సద్గుణ సమోపేతుఁడుగను మానవులకు సహ
జములగు కష్టసుఖముల కతీతుఁడు గాక, ధీరోదాత్తుఁ
డగు పరిపూర్ణ మానవునిగ కవిబ్రహ్మ చిత్రించినాఁడు.

ఇట్టి యుత్తమ గ్రంథమున సీతాపరిత్యాగ ఘట్టమెంతయు నార్ద్రమై సహృదయానందదాయకమై యొప్పుచున్నది. ఇది సీతారాముల ప్రణయమునకు గీటురాయి. వారి శీలములకు పరీక్షాస్థానము. ఇందు వాల్మీకి సీత నూరార్చు విధము ప్రత్యేక ప్రశంసకుం దగినది.

ఆదర్శమానవుఁడే గాక ఆదర్శప్రభువు రాముఁడు "యథా రాజా తథా ప్రజా" అను సూక్తి నెఱింగినవాఁడు. ఆబాలగోపాలము సన్మార్గమున తన ప్రజలు చరింప వలయునని కోరినవాఁడు. ప్రజల హృదయముల, అనుమానము, సందేహము, అసంతృప్తి ప్రభువు నెడగాని, పరిపాలనయెడగాని యుండ గూడదని భావించినవాఁడు. సీతకుఁ గలిగిన అపవాదము నిర్హేతుకమనియు, సత్యేతరమనియు మనసార నమ్మినవాఁడు ఇటు చూడుఁడు.

ఉ॥ వేవుర నేల నేను పృథి
వీసుత చిత్తము పెంపెఱుంగనే
భూవలయంబు సంచలతఁ
బొందిన వారధి మేర దప్పినన్
దేవనగంబు ప్రాఁతగిలి త్రెళ్ళిన
నందొక కీడు గల్గునే
యావనజాక్షి నిట్లు సెడనాడిన
నక్కట నోరు ప్రువ్వనే॥

లోకమును మాయ మాకుఁడు లేదనియు "నడికంటె చావు మేలనియు" "వర్తనంబు గౌరవం బొకయించుకయైన విడువ దుస్సహంబనియు" దలంచినాఁడు. ఈ మిథ్యాపవాదము వేఱొక తెఱంగున మాపికొనుట సంకటముగ భావించినాడు. నిరంకుశుఁడగు ప్రభువునకే మార్గమైనను గోచరించును. అన్నియు ధర్మమార్గములు గనె గాన్పించును. ప్రజానురంజకుఁడును, ప్రజల ఇహపరలోకసౌఖ్యముల నాలోచించు ధర్మప్రభువటు లన్యమార్గముల నాలోచింపఁడు. "విశుద్ధ చరిత్రము దుఃఖహేతువే" అనినాఁడు. లౌకిక సంబంధమైన దుఃఖము బాధాహేతు వయినటుల అలౌకికమైన దుఃఖము ఆనందదాయకమని భావించిన రసమూర్తి. 'మానము కన్న సిరిసంపదలు ప్రాణము' ఎక్కువా? యని యడిగినాఁడు. ధర్మవర్తనుఁడగు ఆదర్శప్రభువు, సీతాపరిత్యాగము ప్రాణాపాయకరమనియు నెఱుంగును; ధీరోదాత్తుఁడు గాన తమ్ములముందుఁ గన్నుల నీరు పెట్టలేదేమో! గంభీరముగ తన అచంచల నిర్ణయము తెగించి చెప్పెనాఁడు; మారు మాటాడవలదని తనమీద యానగా వారిని నిషేధించినాఁడు. మఱునాఁడుదయమున సౌమిత్రి విషణ్ణముఖపద్మముతో, రథముతో సిద్ధమయినాడు. సమయజ్ఞుఁడగు రాముడు లక్ష్మణుని వాలకముఁ జూచినాఁడు అతని బాధ గ్రహించినాఁడు వ్యాకుల హృదయమున లక్ష్మణుడు సత్యము బయలుపెట్టునో సీతయే లక్ష్మణుని మాచి యాతని విచార కారణముల బృచ్ఛజేయునోయని మునుముందు రాముఁడు లక్ష్మణుని దైన్యమునకుఁ గారణముఁ జెప్పెనాఁడు. ఆకారణము సత్యమే అయియుండవచ్చును. సీతను ఒంటరిగ కాననసీమ కంపు టనుచితమని సౌమిత్రి యడ్డుపెట్టి బోరిత మాచరించి యుండవచ్చును. ఒక క్లిష్ట సందర్భము నుద్ధరించుటకు (To avoid an unpleasant situation) రాముఁ డటు లనియుండవచ్చును. రెండును సహజమే. అసహజమేమియు లేదు. ఇవ్విధంబునఁ దన తలం పించుకంతయైన జానకి కెఱుకపడకుండ సీతను వీడ్కొని "రాఘవుం డుల్లంబు నొచ్చి మరలె". లౌకికుఁడగు తిక్కన యీ సందర్భ మెటుల సమర్థించెనో ఆలోచింపుడు.

సీత రూపు దాల్చిన సచ్చరిత్ర. సాధ్వీమతల్లులకు ధ్రువతార. "మహి దేవుఁడున్ మునులు దేవగణంబులు" మెచ్చిరి. సర్వభక్షకుఁడగు, అగ్నిదేవుఁడు గూడ నామె నంటఁజాలఁడయ్యె. రాముని కామెయందు మిక్కిలి ప్రేమ. ఆమెయం దచంచల విశ్వాసము. 'భూవలయంబు సంచలత బొందిన వారిధి మేర దప్పినన్ దేవనగంబు ప్రాఁతగిలి త్రెళ్ళినను" సీతయందు కీడు గలుగదని గాఢవిశ్వాసము గలవాఁడు. సీతయు, రాముఁడు తన కెడుగడయనియు, నాతని పంపుఁ జేయుటయే ప్రాథమమనియు నమ్మిన యమాయిక హృదయమై యతని సేవించుచుండెను. రాముఁడును సీత కోరినంతమాత్రమున మునికాంతలనుఁ జూచుట కనుమతించినాఁడు. ఆమెయె "అక్కట నాదు వేడ్క కుచితానుచితంబులు సూడకే విభుం డొక్కతలంపువాడయి సముత్సుకతన్నను దవ్వుపుచ్చగా నిక్కమ యయ్యెనో లరయ నెయ్యము తియ్యము గాదె" యని భావించి చకితయయినది. తన తనువునన్, మార్గమధ్యంబునను గన్పడిన దుర్నిమిత్తంబులఁ గాంచి "అంత

రంగముం ద్రిప్పకోనం దొడంగెఁ బతి దిక్కైన బంధుల వెంట్లు, భృత్యులం దొప్పమి యేమి వాటిలుటకో" యనిన దయార్ద్రహృదయ. లక్ష్మణునిచే తన పరిత్యాగ వార్త వినినంతనే "దిగులు గుండె ప్రవయ్యగదిరిసన్" గీలెడపిన జంత్రము క్రియ నేలపయింబడెయె మేదినీ తనయ. తరువాత ఏమనినది?

ఆ॥ సందియంబు వడ విచారంబునకు జొర
మాలువలుక నొంకు మాడ్కి సేయ
వెరువుగాక పిడుగుఁ బ్రేసిన యట్లైన
మాట కియ్యకొనుచుఁ బోటిపలుకు.

మనోవాక్కాయ కర్మముల భర్తనే దైవముగా నెంచిన తా నాతని పనుపుఁ జేయుటయే న్యాయమనియు, అన్న యానతి నెఱవేర్పుట లక్ష్మణుని ధర్మమనియు ననగలిగిన సహృదయ. అట్టి కష్ట సమయమున సహితము తనభర్తయం దోషమునుఁ గాంచలేదు. ఆరోపింపలేదు. తన యభాగ్యమనియే తలంచినది. కష్టము లనుభవించుటకే జన్మించితినని భావించినది తెలిసియో తెలియకయో పూర్వజన్మమున ఇతరుల బెట్టిన బాధలకుఁ బ్రతిఫలమనుభవించుచున్నానని భావించినది. రాముఁడు తనను పరిత్యజించినందుకు మిన్నగ లోకాపవాద మునకుఁ జింతించినది. మరణమే శరణ్యమనియు ఆత్మహత్య పాపమయినను 'జాహ్నవీ సలిలసేవన మూర్ధ్వగతిప్రదంబనియు భావించినను, "భూపతి వంశము నిల్పుట ప్రధానమనియు, అంత దనుక దురంత దుఃఖముల నోర్చుట మేలనియుఁ దలంచినది. అతిభక్తితో నత్తలకు మ్రొక్కి" తన గర్భస్థ రామసంతతి శోభనమంద గచ్ఛపస్థితి దలంపవలయునని కబురంపినది. తనభర్తకుఁ గష్టముగలిగిన దాని నివారణోపాయము భర్త తనకు ముందుగాఁ జెప్పిన లోను గానాయని యడిగినది. భర్త దుఃఖమునుఁ దొలగించుటయే భార్య ధర్మమని భావించినది.

"పతియె చుట్టంబు పక్కంబు పతియె చెలియుఁ
బతియె తల్లియుఁ దండ్రియుఁ బతియె గురుఁడు
పతియె దైవంబు గావున నతని పంపు
నర్చు టరయ కాదె ధర్మంబు నాతి కనుచుఁ
—దలంచినది.

సీత యొంటరిగ గంగానదీతీర పరిసరప్రాంతముల విడువబడినది. భర్తచే పరిత్యక్తయగుటకుఁ గుందుచున్నది. అంతకు మిన్నగ లోకపువార లనుమానము లేక యాడిన తులువమాటలకు బెగ్గడిల్లినది. ఆ యపవాద మెటులబోవునో యెఱుంగ దా సాధ్వి. వాల్మీకాశ్రమముఁ జేరుదమన్న, అచటివారు తానొంటరిగ నాస్థితిలో వచ్చినందు కేమనుకొందురో! ఏమని యడలించెదరో! ఏమడిగెదరో! తానేమని సమాధానముఁ జెప్పగలదు? దోషము తనదేనని చెప్పవలయునా? దోషము తనది కాదే, తానెటు లామాట చెప్పగలదు? భర్తదోష మనవలయునా! పతివ్రత భర్తయెడ తప్పవెట్టునా; ఏమార్గము లేదే! దుఃఖమినుమడింప దుస్సహపరితాపమున భరింపలేక "యిసిలి యేడ్చుచున్న యవసరమున" మునికుమారులు చూచిరి. నిష్కల్మష హృదయులు అమాయకులు. ఈ లోకము నందలి కష్టసుఖముల వలన గలుగు మానసిక సంక్షోభము నెఱుంగరు. వారి లేతహృదయములు చలించినవి. వారి కటజనకాళ్లు రాలేదు. మునికుమారులుఁ గాంచిన యా శోకమూర్తి రూపము చూడుఁడు. రంగురంగుల కుంచెలతో చిత్రకారుఁడు గూడ నా దుస్సహ దురవస్థ చిత్రింపలేడే. కవిబ్రహ్మ సువర్ణంబుల పోహళింపుచే కరుణరస ముట్టిపడునట్లు శోకమూర్తిని చిత్రించినాఁడు. చదివినంత మాత్రమున వినినంత మాత్రమున కన్నులు చెమ్మగిల్లుచున్నవే! ఇక ప్రత్యక్షముగఁ జూచిన మునిబాలకులకు కాళ్లాడకపోవుటలో నాశ్చర్యమేమి? వారి లేతహృదయము లెంతగ రెపరెపలాడినవో! పాపము, వెంటనే గురువర్యులగు వాల్మీకినిఁ జేరి యేమనిరో చూడుఁడు.

మ॥ ఒకనారీ తిలకంబు కాననములో
నుద్దామ శోకార్తయై
వికలాలోకన మశ్రుధారలను బ్రు
ద్ధ్వరేణు లిప్తాంగమున్
బ్రకటాక్రందనమున్ విశీర్ణకబరీ
భారంబు వక్త్రాబ్జశో
షక నిశ్వాస గమోహమ్ముయుం గలయవ
స్థం బొందగా నయ్యెడన్ ॥

వారికి 'యే మహాభాగ సతియో' యని తోచినదట. అంతటి దుస్సహ దుఃఖావస్థయందును గూడ ఆమె మహనీయత మసిగ్రమ్మిన మణివలె ప్రకాశించినది. అట్టిది యా సతీమతల్లి పాతివ్రత్య మహిమ.

వాల్మీకి మహనీయబుద్ధిని యామె రఘువంశవరేణ్యు దేవిగా నెఱింగినాడు. "మహితార్ఘ్యపాత్రచేఁగొని రభసంబునం జనియె" ఇచట కవిబ్రహ్మ చాతుర్యము గమనింపుఁడు. "లోకమున నెద్దియేనియు నెఱుంగరానిది" వాల్మీకికి లేదట. ఉత్తములు మహానుభావులను గాని అర్ఘ్యపాద్యాదులచే సమ్మానింపరు. వాల్మీకి యర్ఘ్యపాత్రతో సీతను జూడ వెడలెననుటలో సీత మహాసాధ్వియనియు, వాల్మీకాది మహాఋషులకు సహితము పూజనీయ యనియు ధ్వనించినాఁడు కవిబ్రహ్మ. ఈఘట్టమున కవిబ్రహ్మ లోకజ్ఞత విశేషించి గన్పడును. వాల్మీకి యర్ఘ్యపాత్రముతోఁ జని సంతర్పణ వాక్యపూర్వముగ నూరార్చి, గద్గదికా నిరుద్ధవచ

నుండై ఆడినమాటల కెఱిఁగరయ్యెఁడు. "వనితలతో నిన్ను నెన్నవచ్చునె సాధ్వి" అని సంబోధించినాఁడు. ఆసాధ్వి అని సమయోచితముగ వాడబడినది. ఆ మాట సీత కూరటగలుగుటకు నంకురార్పణ మయినది. వాల్మీకికి తన సాధ్వీత్వమునం దెట్టి యనుమానము లేదని సీతకుఁ దెలియఁ బరచినాఁడు. "ఆమెవచ్చిన తెఱంగును" భావించి, "ఆమె పావనచరితం బెఱింగి" ఆపెకు నిర్హేతువుగ గలిగిన లోకాపవాద కళంకము గుందితివని చెప్పినాఁడు. మహనీయ దృష్టిగల తన కెఱుఁగంగ రానిది లేదని చెప్పినాఁడు. రాముని దే పొరపాటనినాఁడు. ఇదె మన యాశ్రమ మనినాఁడు. తపస్వినులు ప్రియంబొదవ పరమాదర వృత్తి నెల్లవిధంబుల నాడిగ మొనర్తు రనినాఁడు. ఇటనొక విశేషము గలదు. ఊడిగముఁ జేయుట సాధారణము ద్రవ్యాసచే నెవరైన చేయవచ్చును. ఇది లోకసామాన్యము. ఆదరవృత్తి చేయుటకు నొకరి ప్రాపకముగాని సిఫారసు (Recommendation) గాని యవసరము. ఇట వాల్మీకి ప్రాపకమున ఆదరము గలుగ వచ్చును. అటుల చేయుట తప్పదు గనుక చేయ వచ్చును. ఇదియు లోకసామాన్యమే. ప్రియంబొదవ జేయుదురనుటలో నే విశేషమున్నది. ప్రియం బొదవ జేయుటకు ఊడిగముఁ జేయించుకొనువారు, చేయువారి ప్రేమ చూరగొనవలయును. అనగ ఇట మునికాంతలకు సీతయందు ప్రియభావముండు ననుట. ఈ మాటతో సీత హృదయమునం దింతవఱకు మునికాంత లేమందురోయని గలిగిన సందేహము నివృత్తి యగుటకు మార్గమేర్పడినది. అంతతో నూరకొనినాఁడా యా తపస్వి? ఇది నీ గృహమనినాఁడు. నీగర్భమభ్యుదయ మందుననినాఁడు. భూతభవిష్యద్వర్తమానములు తెలిసినవాఁడు గదా మహాత్మ. నీ దుర్యశము బోవుఁ బసంపడి యనినాఁడు చూడుఁడు! ఎంత సౌమ్యముగ, సౌహార్దముగ ఎంత కలుపుగోలు తనముగ, ఎంత వాత్సల్యముతో పెద్దవాఁడు, మంచి చెడ్డలు కష్టసుఖములు తెలిసినవాఁడు, కష్టము లందున్నవారిని మామూలుగా నూరార్చినటుల సమాశ్వాసించెనో. మన యాశ్రమ మట, నీ గృహమట తెనుఁగు తన ముద్దెట్టి బసుచున్నది. సీత గ్రహించినది ఊరడిలినది. ఆ మునీశ్వరుని సాకతమున యాపె శోక వహ్ని శాంతత బొందినది. తెలిసి యర్ఘ్య మందుకొనినది. సీతను ఆశ్రమమునకుఁ దోకొని వెళ్లినాఁడు. మునికాంతలు మాటలాడుటకయిన వ్యవధి నీయలేదు లోకజ్ఞుఁడగు వాల్మీకి. ఆ సమయమున నెవరెట్టి ప్రశ్నలు వేసినను సీత హృదయమున గలిగిన గాయము కలకవేయును. అందుచే ముందుగనే జాగ్రత జూపినాఁడు. సీతను వారికి నప్పగించుచు నేమనెనో గమనింపుఁడు:

చ॥ జనకుని కూతు రార్యగుణ
శాలిని, రాముని దేవి సీత యా
తని కొఱగామి నిర్దయ్యపెడుఁ
దాపసవృత్తి జరింప వచ్చె య
వ్వనితకు నెల్లకృత్యము ది
వానిశముం జరికించి భాంధవం
బు నెఱపఁ జేయుఁడీ యని తి
పోధన సత్తముఁ డప్పగించినన్.

ఇటుల, మహామునులకు గూడ పూజనీయుఁడైన రాజర్షి యగు జనకుని కూతురనుట మొదలగునవి సూచించుటచే సీత యెంత మహనీయురాలో, యెంత యాదరణీయురాలో మునికాంతలకు తెలుపఁ జెప్ప నక్కరలేదు ఇచటనొక ధర్మమును ప్రతిపాదించినాఁడు వాల్మీకి రూపమున కవిబ్రహ్మ. భర్తృపరిత్యక్తకు మరణమే శరణ్యము అనివార్య కారణముల నది కానపుఁడు తాపసవృత్తియే యాచరణీయము. వేఱొండు తెఱంగు ధర్మశాస్త్ర మొప్పదు. సీతకు మరణించుటకు అధికారము లేదు ఇక తాపసవృత్తియే మిగిలినది అందులకే ఆ ఆశ్రమమునకు వచ్చినదని వాల్మీకి సూచించినాఁడు. సాధ్వికి పతిచే పరిత్యక్త యగుట మరణ సమము. ఈ ప్రపంచానుభవములు నాసనలు పరిత్యక్తములు. సర్వసంగపరిత్యాగముగ తాపసవృత్తియే గ్రాహ్యము. ఈ కాలమున సతి భర్త మీదనలిగి పుట్టింటికి బోవుట ధర్మముగా నెంచబడలేదు శాస్త్రముల.

వాల్మీకియందు కవిబ్రహ్మ అప్రతిమాన లోకజ్ఞత, ప్రతిభ ధర్మశాస్త్ర నిరూపణ, మాటనేర్పరితనము, సమయస్ఫూర్తి మనము చూచుచున్నాము. ఇటుల ప్రతివిషయమును పరిశీలించిన, భారతరచనా ప్రాగల్భ్యము జూపిన కవిబ్రహ్మకు నిర్వచనోత్తర రామాయణ కర్తయగు నభినవ కవిమిత్రునకు ప్రతిభావ్యుత్పత్తులలో భేదము లేదనియు, నిర్వచనోత్తర రామాయణము కొంద అపోహపడునటుల, అప్రౌఢ కావ్యము కాదనియు సహృదయులు గ్రహింతురు. ప్రబంధ పరమేశ్వరునితో మన మేకీభవింతము.

మ॥ తన కావించిన సృష్టి తక్కొరుల
చేతం గాదు నా, వేముఖం
బున దాబల్కిన పల్కు లా
గమములై పొల్పొందు నా, వాణికిన్
త్తను నీతం దొకరుండు నా జను
మహత్త్వ ప్తిం గవి బ్రహ్మనా,
వినుతింతుం గవి తిక్కయజ్వ
నిఖిలోర్వీ దేవతాభ్యర్చితున్.

# మయసభ

శ్రీ మధురాంతకం రాజారాం

బోంయ్. బోంయ్‌మని సూర్యం హారన్ మ్రోగించాడు. హారన్ మ్రోత వినబడగానే పిలుపందుకుని తోటమాలి రాముడు పరుగుపరుగున వచ్చి యినుపకమ్ముల గేటు తీయడం మామూలు. బహుశా మేడకు వెనుకవైపున అరటిచెట్లకు నీళ్లు చేది పోస్తున్నాడేమో, రాముడికి హారన్ శబ్దం వినిపించినట్టులేదు. సూర్యం చిరాకుతో అటూ, యిటూ చూచాడు. ఆ చూచిన క్షణంలోనే మొండిచేతి ముసలివాడొకడు కొత్తగా సూర్యం జీవితంలో ప్రవేశించడం సంభవించింది.

నల్లటి, తెల్లటి వెంట్రుకలు సమపాళంగా వున్న జీబుగడ్డమూ. బాగా వెలసిపోయిన కనుబొమలు, అగాధమైన లోయల్ని తలపింపజేసే ఆ కళ్లు, కొంచెం కొమ్ములా పైకి లేచిన ఆ నాసిక, చవిటి పర్రలా ఎండిపోయిన పెదవులు, పగటిపూట చూస్తే రాత్రివేళ కలలో కనిపించే ఆకారం అది! వేషం కూడా అతని ఆకారానికి తగినట్టే అమరింది. కాషాయాంబరంగా రూపొంది ఎంతకాలమైందో అంచనాకు అందని నాలుగుమూళ్ళ పంచ ఒకటి అతడి మోకాళ్ళదాకా వ్రేలాడుతోంది. చిరుగుల్లో ఎండిన మామిడాకులాంటి శరీరచ్ఛాయను ప్రదర్శిస్తున్న పాతకోటొకటి అతడి శరీరాన్ని అంటిపెట్టుకుని వుంది.

కారు సరాసరి లోపలికి వెళ్ళిపోయివుంటే సూర్యం ఆ ముసలివాడిని అంత పరిశీలనగా చూడ్డం జరిగేదికాదు. నిజానికది అడ్వొకేటు సూర్యనారాయణ బికారుల్ని, బిచ్చగాళ్ళనీ చూచి సానుభూతి వ్యక్తం చేయడానికి సమయమూ కాదు. అవతల అతనికి బోలెడన్ని పనులున్నాయి. సరిగ్గా పదకొండు గంటలకు కోర్టులో అతడికోసం కేసొకటి కాచుకుని వుంది. ఆ లోపల స్నానమూ, భోజనమూ కానిచ్చి నాలుగైదు రిఫరెన్సులు కోట్ చేసి పెట్టుకోవాలి. ఇంతపనితొందరకు తోడూ చంద్రశేఖరంగారు సతీసమేతంగా తీర్థయాత్రకు వెళ్ళదలచుకున్న యాత్రాస్పెషలుకు ప్రయాణ ముహూర్తం కూడా వుదయం ఎనిమిదిగంటలకు కుదిరింది. వాళ్ళని స్టేషనులో దిగవిడిచి ఎంతత్వరగా యిల్లు చేరదలచుకున్నా మీనాక్షి సూర్యాన్ని విడిచి పెట్టిందికాదు. చెప్పిందే పదిసార్లు చెప్పడం ఆమె వాడుక. నీరజకు యింటి పనులతోనే సరిపోతుంది గనుక పాపనెత్తుకోడానికి ఒకకుర్రాణ్ణి పెట్టుకోమని ఆమె రెండుగంటలవ్యవధిలో పదిపదిహేనుసార్లు హెచ్చరించింది. రైలు కదలగానే సూర్యం హుటాహుటిగా యింటికి బయల్దేరాడు. కారు డ్రయివు చేస్తున్నాడన్నమాటేగానీ అతడి ఆలోచనలన్నీ కేసుపైన్నే వున్నాయి. తను వాదమిలా ప్రతిపాదిస్తాడు, అందుకు ప్రతివాదమిలా వుంటుంది. అప్పుడు తను ఫలానా పీనల్ కోడ్‌నుంచి ఫలానా సెక్షన్ వుదహరిస్తాడు...పరధ్యానంలోనుంచి వులిక్కిపడి సూర్యం కారుకు సడన్ బ్రేక్ వేశాడు. అప్పటికే కారు గేటుకు ఢీకొని రెండుబారలు వెనక్కువచ్చి మరికదలకుండా నిలిచిపోయింది. ఎలాగైతేనేం, అదృష్టవశాత్తు ప్రమాదం తప్పింది!

హారన్ మ్రోగిస్తూ సూర్యం కాలువ ప్రక్కన తూమురాయికి ఆనుకుని నిల్చునివున్న ముసలివాడిని చూచాడు. పరిస్థితుల్ని అర్థంచేసుకుని అతడు తనకు తానే గేటు తెరుస్తాడనికూడా సూర్యం అనుకున్నాడు. కానీ అలాటిదేమీ జరుగలేదు. అదేం చిత్రమోగానీ ఆ వృద్ధుడు ఈ విశాలప్రపంచంలో మునుపెన్నడూ మానవమాత్రుణ్ణి చూచి ఎరుగనట్టు సూర్యం కేసి అబ్బురంగా, కౌతుకంతో పరీక్షగా చూస్తూ నిలుచున్నాడు.

ఇదిగో నిన్నే! ఆ గేటుకాస్త తెరువగూడదూ అన్నాడు సూర్యం.

ముసలివాడు కారుకు దగ్గరగావచ్చి కుడిచేయి పైకెత్తి చెవికడ్డంగా తిప్పుతూ తనకు మాటలు వినబడవని సూచిస్తూ సైగ చేశాడు.

"పైగా యిదొకటా! బాగుంది. బాగుంది" అనుకుంటూ సూర్యం జేబులో చేయి వేశాడు. ఒక నాలుగణాలకాసు పైకి వచ్చింది. "తీసుకో, తీసుకో" అంటూ సూర్యం చేయిచాచాడు.

అయాచితంగా లభించిన నాలుగణాల రూక కోసం ఆతురతగా దోసిలి పట్టవలసిందిపోయి ముసలివాడు ప్రపంచ పటంలో ఏనోమారుమూలపట్టణాన్ని వెదుకుతున్న కాలేజి విద్యార్థిలా సూర్యం ముఖంలోకి తీక్ష్ణంగా చూస్తూవుండి పోయాడు!

సూర్యానికి చిర్రెత్తుకొచ్చింది. కారుదిగి తనే స్వయంగా గేటు తెరుచుకోడం కన్నా గత్యంతరం లేదనిపించి అతను పైకి లేవబోయాడు. ఇంతలో కిర్రుమని శబ్దం చేస్తూ గేటు తెరచుకుంది 'జామచెట్టుకు అంటుగడ్తున్నానండీ! హారన్ వినిపించలేదు. అమ్మగారు పిలిచిచెప్పారు" అంటూ రాముడు క్షమాపణ చెప్పుకున్నాడు.

దీన్ని తీసుకుని అతణ్ణి వెళ్ళిపొమ్మని చెప్పి "రాముడూ మరీ ఈ బిచ్చగాళ్ళకు ఆశ ఎక్కువై పోతోంది; ఎంత యిచ్చినా మరికొంత రాబట్టాలనే చూస్తారు" అంటూ సూర్యం నాలుగణాల కాసును రాముడి చేతిలో వేసి మళ్ళీ కారు స్టార్టు చేశాడు.

*   *   *   *

ఆరోజు కేసులో సూర్యానికి అత్యద్భుతంగా విజయం చేకూరింది. ప్రతివాదితరఫు వకీలు న్యాయవాద వృత్తిలో తలనెరసిన మనిషి. సూర్యం కనిపించినప్పుడల్లా అతడు పిల్లకాకికేం తెలుసులే వుండేలు దెబ్బ అన్న భావాన్ని వ్యక్తం చేస్తూ నిర్లక్ష్యంగా ఓ చిరునవ్వు అతడిపైకి సంధించేవాడు. సూర్యానికా చిరునవ్వు కంటే రంపపుకోత నయమనిపించేది. అలాటి వకీలు ఈనాటికి ఈకుర్ర లాయరులోనూ కొంత సరుకు లేక పోలేదని గుర్తించగలిగాడు. అంటే ఏమన్నమాట! ఉజ్వలమైన భవిష్యత్తుకు తనీరోజున సుదృఢమైన పునాది వేసుకున్నాడన్నమాట! ఎంత గుండెలుతీసిన బంటయినా యిక తనంటే జంకక తప్పదు...విజయ గర్వంతో సూర్యం వాలు కుర్చీలో కూర్చుని నీరజచేతి కాఫీ తాలూకు మాధుర్యంలో వివశుడై పోసాగాడు.

తామరతూడులాంటి చల్లటి చేతిని సూర్యం భుజంపైన వేసి "ఏమండీ! ఈరోజు అదోలా వున్నారు" అంది నీరజ.

సూర్యం కుర్చీలోకి బాగావాలి "ఏంలేదు నీరజా! నిద్రలేవగానే నిలువుటద్దంముందు నుదుట కుంకుమ బొట్టు పెట్టుకుంటున్న నిన్ను చూచానా! అప్పుడే అనుకున్నాను, ఈరోజు మనమూ జీవు తిరుగులేదని! అది కోర్టు కాదు, కురుక్షేత్రమనుకో! కురువృద్ధుడొకడే, ప్రతిద్వంద్వి రామారావు గారొకడే కాదు. ఆ మాననోటకి తాళంపడిందంటే, యిక చూచుకో" అంటూ నీరజను తన ఒడిలోకి లాక్కోబోయాడు.

చేతిని విడిపించుకుంటూ నీరజ కుర్చీదగ్గరకు లాక్కుని 'మీ కేంబాబూ! కోర్టుకు వెళ్తారు కుస్తీలు పడ్తారు అలాగే క్లబ్బుకు వెళ్ళి ప్రొద్దంతా పోగొట్టుకుని రాత్రి ఏ ఎనిమిదికో తొమ్మిదికో యింటికి వెంచేస్తారు. ఈ యింట్లో నేను ఒక్కదాన్ని ఒక్కర్తెనూ ఈగలు తోలుకోవాలి" అంటూ అప్పటికి తనేదో పెద్దచిక్కులో యిరుక్కుపోయినట్లు బుంగమూతి పెట్టుకుంది.

భార్యనెలా అనునయించాలో తోచక సూర్యం "పిన్ని చెప్పినట్టు పాపనెత్తుకోడానికి ఒకమ్మాయిని కుదుర్చుకుందాంలే నీరజా! నీకు తోడుగానూ వుంటాడు" అన్నాడు.

"ప్రాణాంతకంగా వుంది మీరు మరీనూ! అందులోనూ మనింట్లోనా! ఎక్కడివస్తువు అక్కడే వుంటాయి. ఆ వచ్చేకుర్రాడు కొంచెం చేతివాటు మనిషైతేసరి, కొంపగుల్లైపోతుంటుంది. అదీగాక పాపగూడా నాదగ్గర లేకపోతే నాకేం తోచదండీ" అంది నీరజ

"ఐతే నీవుద్దేశమేమిటి? స్పష్టంగా చెప్పరాదూ" అన్నాడు సూర్యం. అసలీ ప్రసంగమే అతడికి నచ్చడం లేదు. ఆడవాళ్లు ఎంత చదువుకుంటే నేమి, వాళ్ళకు అంతర్జాతీయ రాజకీయ వ్యవహారాలకన్నా యింటిగొడవలే గొప్పవిగా కన్పిస్తాయని నీరజ కాపురానికివచ్చిన నాలుగైదేళ్ళలో సూర్యానికి ఒక నిర్దుష్టమైన అభిప్రాయం కలిగింది.

"బజారుకనీ, మార్కెట్టుకనీ రోజు కైదారు సార్లయినా రాముడు వూళ్ళోకి వెళ్ళిపోతుంటాడు. వంటావిడ రెండుపూటలావచ్చి ఒకటి రెండుగంటల్లో తనపని పూర్తిచేసుకుని వెళ్ళిపోతుంది. ఒంటరిగా యింట్లోవున్నప్పుడు—మీరు నవ్వుతారు, నాకు

తెలుసు. పగలుగూడా ఏం దొంగలభయం మనికి మీధీమా. కానీ నాకేమో భయంగా వుంటుంది. పట్టపగలే దోపిడీ జరిగినట్లు పేపర్లో వార్తలొస్తున్నాయి. మీకు పుణ్యముంటుంది. పోతేపోతుంది ఒక యిరవైరూపాయలు మనవి కావనుకోండి. గేటుదగ్గర కాపలా వాడుంటే నాకేం దిగులుండదు"

ఈ సరికొత్త సలహానిగురించి సూర్యం పూర్తిగా ఆలోచించుకోకమునుపే నీరజ మళ్ళీ ప్రారంభించింది. "మీతో ఎన్నిసార్లు చెప్పినా లాభముండదు. రాముడితో ఒకసారి చెప్పానోలేదో అప్పుడే ఒకమనిషిని తీసుకొచ్చి చూపించాడు."

"అలాగా" అంటూ ఆశ్చర్యం ప్రకటించాడు సూర్యం

"చెబితే మీరు నమ్మరు! భూతమనుకోండి మాటలెందుకు! నేనూ ఎందరో ఘూర్ఖావాళ్ళని చూచాను. వాళ్ళితడిముందు దిగదుడుపుకైనా పనికిరారు. అలావుంటాడు మనిషి! అంతే కాదండోయ్, యింకొకవిచిత్రం! వాడికి రెండుపూటలా యింత తిండి పడేస్తేచాలట! ససేమిరా జీతం వద్దంటే వద్దంటాడు. పోనీ ఎందుకైనా పనికొస్తుంది, అయిదో పదో తీసుకుందువు లెమ్మన్నాను."

"ఏమైనా యింటి విషయాల్లో నీకున్నంత శ్రద్ధ నాకులేదు నీరజా!" అంటూ సూర్యం తనకుకించపడుచుకున్నట్లే భార్యని కొంచెం పైకెత్తేశాడు

"వరొక్కటండీ పాపం! ఆముసలాడికి ఎడమచేయి మోచేతివరకూ లేదు. ఏమైపోయిందని అడిగాను. అక్కడెక్కడో రైస్‌మిల్లులో రెండునెలలు పనిచేశాట్ట. చేయి చక్రంలో యిరుక్కుని నలిగిపోయింది. ధర్మాసుపత్రిలో మోచేతివరకూ తీసేశారన్నాడు. అంతటితో అయిందనుకున్నారూ! ఊహూ ఒకసారి మలేరియా వస్తే ఐనక్వినైను మాత్రలన్నీ మింగాడట. దాంతో తీరని చెముడొకటి సంక్రమించింది. చూస్తుంటే గుండెలు తరుక్కుపోతాయండీ ఎవడో గానీ!"

"నిజమే, నిజమే" అంటూ గాఢంగానిట్టూర్చాడు సూర్యం.

"ఐతే మీరూ అతణ్ణి చూచారటండీ?" విస్తుపోతూ ప్రశ్నించింది నీరజ.

"ఉదయం స్టేషనునుంచీ తిరిగొస్తూ చూచాను. మళ్ళీ కోర్టుకి వెళ్తూ రాముడితో మాట్లాడుతుంటే చూచాను ఇంతటి పట్టణంలో వాడే మనకు దొరికాడా లేక మనమే వాడికి దొరికామా అని సందేహంగా వుంది. అలాటివాళ్లని వున్నట్టుండే నమ్మడానికి వీల్లేదు నీరజా! పోనీలే. నువ్వతడికి వుద్యోగం కల్పించి యిచ్చావు. యింతలోనే వెళ్ళిపొమ్మనడం ఏం బాగుంటుంది?" అన్నాడు సూర్యం.

"అదేమిటండీ! చూడ్డానికి మోటుగావున్నా అతడు మీరనుకున్నట్టు దుర్మార్గుడుగా కనపడ్డంలేదు!

అతడు దుర్మార్గుడు కాదనే అనుకుందాం నీరజా ప్రస్తుతానికి! నాలుగు రోజుల్లో అదే తెలిసొస్తుంది. పాప అప్పుడే నిద్రపోయిందేమిటి? లేపి అన్నంతినిపించు. నేనయిదునిమిషాలు రెస్టతీసుకుని లేచిభోంచేస్తాను" అని చిటికెవేస్తూ ఆవులించి కళ్లు మూసుకున్నాడు సూర్యం.

*　　　*　　　*

మరునాడు ఆదివారం. ఎవరో ఒకరిద్దరు క్లయింట్సువచ్చి మాట్లాడి వెళ్లిపోయారు టిఫిన్ అయిన తర్వాత సూర్యం పాపను తీసుకుని మేడపైకి వెళ్లాడు. మేడపైన పడమటివైపు గదిలోకి కిటికీ తెరిస్తే రోడ్డులో తిరుగుతున్న కార్లు బస్సులు, రిక్షాలు అన్నీ స్పష్టంగా కనిపిస్తాయి పాప చువ్వల్ని పట్టుకుని కిటికీలో కూచుంది. సూర్యం ఏదో వారపత్రిక తిరగవేస్తూ పాపకడ్డంగా కుర్చీలో కూచున్నాడు.

"నాన్నా, నాన్నా! అడుగో గడ్డాంతాత! చూడూ" అందిపాప.

సూర్యం తలపైకెత్తాడు. గేటు మూసివుంది. స్టూలుపైన కూచున్న ముసలివాడు యినుపకమ్మల్లోనుంచి ఆక్రితంరోజులాగే అదే వేషంతో, అదే పిచ్చి వాలకంతో కనిపిస్తున్నాడు.

"మన గేటు దగ్గర గడ్డాంతాత కూచోడమెందుకు నాన్నా?"

పాపకు సందేహాలు కలిగితే ఆతిరువాత తన చదువు కొనసాగదని సూర్యానికి బాగా తెలుసు. అతడు పుస్తకం మూసిపెట్టి "తెలీదూ నీకూ! అతడు మన యింటికి కాపలావాడన్నమాట. ఎప్పుడూ ఆగేటు దగ్గరుంటాడు. మంచివాళ్ల నిమాత్రం లోపలికి

రానిస్తాను. దొంగలెవరైనా వస్తే అతణ్ణిమాచి భయపడి అలాగే వెళ్లిపోతారు" అన్నాడు.

"దొంగలు పోలీసాళ్లకే భయపడరు. గడ్డాం తాతంటే వాళ్లకొక లెక్కేమిటి! పోనాన్నా నువ్వు! నీకేం తెలీదు" అంటూ నవ్వసాగింది పాప.

సూర్యం తెల్లబోతూ "ఈదొంగలసంగతులన్నీ నీకెలా తెలిసాయి పాపా" అని ప్రశ్నించాడు

"అమ్మ చెప్పింది గా!

'చెబుతుంది, చెబుతుంది' అనుకుంటూ విసుక్కున్నాడు సూర్యం. పుత్రాళ్లకు వీరగాథలు చెప్పి ధైర్యం, పౌరుషం కలిగించవలసింది పోయి దెయ్యాల కథలు, దొంగలకథలు చెప్పి తమనీడని చూచి తామే బెదిరిపోయేట్టు చేయకూడదని నీరజకు తను వెయ్యిసార్లు చెప్పేవుంటాడు. కానీ ఆవిడ వింటేగా! చెప్పేదంతా చెవులా విని తను వీధిలోకి పోగానే పాపని పిలిచి "మరి మావూళ్లో, అంటే మా అమ్మమ్మగారివూళ్లో అంభోఁరగిడ్డడని ఒకడుండేవాడు. అబ్బ, అబ్బ, ఎంత పెద్దదొంగనుకున్నావు" అంటూ ఓకథని యితిహాసంలా ప్రారంభిస్తుంది.

ఇంతలో పాప మరొక కొత్త సందేహాన్ని వెలిబుచ్చింది. "గడ్డాంతాత ఎప్పుడూ అక్కడే వుంటాడన్నావే నాన్నా! మరి అతగాడికి ఆకలేయదూ?"

"ఆకలైనప్పుడు. యింటికొచ్చి అన్నంతిని, మళ్ళీ అక్కడికే వెళ్ళిపోతాడు."

"అప్పుడు దొంగలు లోపలికొచ్చేస్తే?"

సూర్యం నిరుత్తరుడైపోయాడు. వాదంలో అడ్వొకేటు రామారావుగారినైనా జయించవచ్చుగానీ పాపకు అసందిగ్ధంగా ప్రత్యుత్తరాలివ్వడం కష్టం.

సూర్యం పాపను క్రిందికి దించి "నువ్వుగోడ్డు నైపు చూచింది చాలుగానీ, హాల్లోకి వెళ్ళి బొమ్మలతో ఆడుకో పాపా" అన్నాడు.

పాప లోపలికి వెళ్ళిపోయింది. సూర్యం పత్రికను టేబిల్ పైకి విసరి గేటువైపు చూడసాగాడు. ఆలోచనంటూ ఒకటి పెట్టుకోకపోతే ఏమీ లేదుగానీ, అది మనసులో రగలసాగితే మటుకూ తనకూ పాపకు కలిగినట్టే ఎన్నో సందేహాలు కలుగుతాయి. చిన్నటివరకూ ఈ ముసలివాడు తనకు అపరిచితుడు.

ఈ పట్టణంలో శాశ్వతంగా మకాం ఏర్పరచుకున్న దివ్యగాళ్లు కొందరున్నారు. వారు ఏవిషయాల్లో ఎక్కడెక్కడ ప్రత్యక్షమౌతారో తనకు బాగా తెలుసు. కానీ యితణ్ణి మాత్రం యింతవరకునూ చూచిన జ్ఞాపకంలేదు. బహుశా యితడు కొత్తగా ఈ ప్రాంతాలకు విజయంచేశాడేమో! పూర్వాశ్రమంలో యితడెక్కడున్నట్టు? ఏం చేసినట్టు? బ్రతుకుతెరువుకోసం కష్టపు చేతబట్టుకుని యిలా వచ్చి వుంటాడని సరిపెట్టుకుందామనుకున్నా, యితడు తనకు భయానకమైన ప్రతిఫలం వద్దంటున్నాడెందుచేత? ఆవునవ్వను బొంతమైన చూపు నిలిపిన ఆసాంఘికహతుడు గడ్డిపోటలు పనికిరావు

తోటలోనుంచి గదిలోకి వస్తున్న ప్రభాత వాయువులు శరీరానికి సోకనూ, సోకనూ సూర్యం కళ్లు మూతపడ్డాయి. కూర్చున్న కుర్చీలోనే అతడు పదిపదిహేను నిమిషాలపాటు కునికిపాట్లుపడి ఆతరువాత లేచి ప్రక్కనేవున్న మంచంపైకి మేను చేరవేశాడు. ఇల్లంతా ప్రశాంతంగా వుండడం మూలాన సూర్యానికి సునాయాసంగానే నిద్రపట్టింది

నిద్రలో ఒక కలగన్నాడు సూర్యం. చిత్రమైన కల! ఎందుకో ఎక్కడికో తెలియడంలేదు. ఖడ్గహస్తుడై తనొక దుర్గమారణ్యంలో పరుగెడుతున్నాడు. అప్పుడప్పుడు భయంకరమృగాలు, భీకర పన్నగాలు ఎదురౌతూవున్నా వాటిని తను సరకుచేయడంలేదు. అకస్మాత్తుగా ఒక శిథిలదేవాలయం దృగ్గోచరమైంది. దేవాలయాంతర్భాగంలో ఒకచేత ఆసవపాత్రనూ, మరొక చేత మానవకపాలాన్నీ ధరించి కళ్లుమూసుకుని కాపాలికుడొకడు 'ఓం, హ్రీం' అంటూ మంత్రం జపిస్తున్నాడు. అతడికెదురుగా ప్రూచిన కడిమిచెట్లు రెండున్నాయి. వాటికి ఓ యిరవైఏళ్ల యువతి, ఓ నాలుగైదేళ్ళ అమ్మాయి తీగలతో బంధింపబడివున్నారు. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే ఆకాపాలికుడెవడో కాదు. తనయింటి కాపలావాడు. బంధితులెవరో కాదు. ఒకతె నీరజ మరొకతె పాప!

ఆ కోపంలో తను ఖడ్గాన్ని పైకెత్తి ఒక్కవేటుతో కాపాలికుణ్ణి తెగవేయనుంకించాడు. కానీ యింతలో ఆ నరఘాతకుడు కళ్లుతెరచి తనవైపు చూడు. 'హీనుడా! చూడు నిన్నేంచేస్తానో' అంటూ మంత్రదండంతో తన తలపైన ఒక్కవేటు

వేశాడు—ఆ దెబ్బతో సూర్యానికి నిద్రాభంగం కలిగింది. అతడు వులిక్కిపడి కళ్లు తెరచుకున్నాడు. ఆదుర్గమారణ్యం, శిథిలాలయం, ఆ కాపాలికుడు అంతా తన భ్రమ! పగటిపూట కళ్లుమూస్తే కలతనిద్రలో, లేనిపోని పాడుకలలన్నీ వస్తాయి. ఐనా యిటు జాగ్రదవస్థలోనూ, అటూ స్వప్నావస్థలోనూ తన తలపులన్నీ ఆ ముసలివాడిపై కెందుకిలా ప్రసరిస్తున్నాయి? వాడెవడు? తనెవడు? లోకంలో ఆలోచించుకోడానికెన్నో బృహత్తర విషయాలుండగా మాటిమాటికీ ఈ బికారివాడినిగురించి ఆలోచిస్తూ తన మనసును పాడుచేసుకోడమెందుకు? ఎవడోగానీ ఈముసలివాడు తనకొక పీడలా దాపురించాడు!

చిరాకుతో పైకిలేచి సూర్యం అప్రయత్నంగా మళ్ళీ కిటికీదగ్గరికే వెళ్ళి నిలబడ్డాడు!

ఈసారి ముసలివాడి భంగిమ మారింది. అతను గేటుకు ఆనుకుని తోటలోపలికి చూస్తున్నాడు. అంతగా తోటలో అతణ్ణి ఆకర్షిస్తున్నదేమో తెలియక సూర్యం విస్తుపోయాడు. ఇంతలో నందివర్ధనం చెట్లచాటునుంచి పాప బయటికి వచ్చింది. ఏమాత్రం జంకు గొంకులు లేకుండా పువ్వులు కోసుకుంటూ ఆమె గేటుకు సమీపంగా వెళ్తోంది

ఆక్షణాన సూర్యం బుర్రలో ఒక కొత్తసంశయం పొడసూపింది. దాని తాకిడికి అతను నిలువునా కంపించిపోయాడు ఒకవేళ ఈముసలివాడు కుర్రాళ్ల నెత్తుకొని పారిపోయే దొంగేమో! ఐతే కావచ్చు! ఎవరు చూశారు? లేకుంటే కొరికి తినేద్దామన్నంత ఆకాంక్షతో అతడెందుకలా పాపను చూస్తున్నాడు? చూడ్డమేమిటి! కళ్ళల్లోనుంచి చేయిచాచి అతను పాపను దగ్గరికి రమ్మని పిలుస్తున్నాడు

సూర్యం ఎలుగెత్తి 'దొంగ, దొంగ' అని అరుద్దామనుకున్నాడు. కానీ నోరు పెగల్లేదు క్రిందికి దిగి పరుగునావెళ్లి పాప నింటికి తెచ్చుకుందా మనుకున్నాడు. కానీ ఆలోపలే ముసలివాడు పాప నెత్తుకుని పారిపోతే? ఏంచేయడానికీ పాలుపోక సూర్యం కిటికీ దగ్గర అలాగే నిలుచుండిపోయాడు.

కాని సూర్యం అనుకున్నంతటి అవాంతరమేదీ సంభవించలేదు. ముసలివాడికేసి విచిత్రంగా చూస్తూ పాప గేటుదగ్గరికి వెళ్లిపోయింది. అమాయకంగా అతడి నేదో ప్రశ్నించింది. ప్రశ్నకు జవాబులేదు. ముసలివాడు తనకోటు జేబులోనుంచి ఓ చిన్న అరటిపండు పైకితీసి పాపచేతిలో వుంచాడు. కిలకిలానవ్వి పాప వెనుదిరిగి గంతులు వేసుకుంటూ యింటివైపు రాసాగింది. దూరమైపోతున్న పాపను చూస్తూ ముసలివాడు విగ్రహంలా అక్కడే నిలబడివున్నాడు.

* * *

నాలుగైదు రోజులు గడిచిపోయాయి. ఓరోజు వూళ్ళోకి కొత్తగా ఓ సినిమా వచ్చిందని కాస్త ప్రొద్దుండగానే యిల్లు జేరుకోమని నీరజ పురమాయించినందువల్ల సూర్యం కోర్టునుంచీ నేరుగా యింటికి వచ్చేశాడు. కాని సినిమా ప్రోగ్రామునుగురించి సుతరామూ మరచిపోయినట్టు, టేబిల్ క్లాత్ పైన ఏదో కుట్టుకుంటూ కుర్చీలో కూర్చున్న నీరజ ప్రత్యక్షమయ్యేసరికి సూర్యం ముఖంలో చిరుకోపపు ఛాయలు క్రమ్ముకున్నాయి.

"ఐనా నీ కోరికేనేది నీరజా! నన్ను త్వరగా రమ్మనడమేమిటి? నువ్వీ రాచకార్యంలో లీనమైపోవడమేమిటి?" అంటూ చిరాగ్గా వాలుకుర్చీలో కూలబడ్డాడు సూర్యం.

"మీరింత తొందరగా వస్తారని నాకేం తెలుసండీ! మరచిపోవడాలు మీకు మామూలే గదా! ఐనా నా ముస్తాబు కేముంది! ఐదునిమిషాల్లో రెడీ అయిపోతాను. చూడండి" అంటూ నీరజ గబగబా లోపలికి వెళ్లింది.

ఎంత త్వరగా తెమిలినా థియేటరు చేరుకునేసరికి ఆలస్యం కావడం, 'అయ్యో, యింక కథ అర్థం కావడమెలాగని విచారించడం నీరజకు పరిపాటే! ఇప్పుడూ అదే జరిగింది. కానీ సూర్యానికి మాత్రం కథ అర్థంకావాలని అంత పెద్దపట్టింపేమీ లేదు అర్థమైతే కావచ్చు కాకపోతే అందుకతడు చింతించడు. ఎంతగా వెండితెర అని ఉత్ప్రేక్షించినా అది కేవలం ముల్లుగుడ్డే కదా అని సూర్యం విశ్వాసం! ఎంతగా కథ సూర్యాన్ని తనవైపుకు ఆకర్షించుకోజూచినా, బలవత్తరమైన సంఘటనల వల్ల కలిగిన పతాక పరిణామం ఎంతగా హృదయాన్ని ఉద్విగ్నం చేసిపారవేసినా అయినా యిది కల్పితగాథేనని మననం చేసుకుని మళ్ళీ మామూలు మనిషైపోతుంటాడు సూర్యం. సూర్యందీ ఆదినుంచీ అతివాస్తవిక దృష్టి!

కాని ఈసారిమాత్రం సూర్యం అంత నిర్లిప్త భావంతో సినిమా చూడలేకపోయాడు. ఆచిత్రంలో సాత్వికుడైన ఒక నిరుపేద యువకుడు పరిస్థితుల ప్రాబల్యంవల్ల నికృష్టస్థితికి ఎలా దిగజారిపోయాడో నచ్చజెప్పడానికి కథకుడు తీవ్రంగా ప్రయత్నించాడు. ఒకవైపు యిళ్ళకు కన్నంవేస్తూ, మరోవైపు ఆసొమ్మును దీనులకూ, హీనులకూ వెదజల్లుతున్న కథానాయకుడి ద్వంద్వవ్యక్తిత్వం చూపరులకు విభ్రమంగొలుపుతోంది. ఓరోజురాత్రి ఆగజదొంగ భద్రవేషంతో పురవీథుల్లో విలాసంగా షికారు బయల్దేరాడు. అతనికో మేడ నిర్జనంగా కనిపించింది. దొంగ అక్కడ కొంతసేపు ఆగాడు. తరువాత వున్నట్టుండి ప్రాకారకుడ్యం పైకెక్కి చివాలున ఆవలికి దూకాడు. మేడకు పదిగజాలదూరంలో వున్న గంగరావిచెట్టుపైకెగబ్రాకి, కొమ్మ చివరదాకా వచ్చి కుప్పించి రెండో అంతస్థులోకి దూకాడు!

"ఇదిగో నీరజా! ఇంటిదగ్గర రాముడు కూడా వున్నాడు కదూ!" నీరజవైపుకు వ్రాలి మెల్లగా ఆమె చెవిలో ప్రశ్నించాడు సూర్యం.

"రాముడా! నాలుగ్గంటలకే వెళ్ళిపోయాడే! వాచ్ మేన్ ఒకడుండగా మళ్ళీ రాము డెందుకండీ యింటిదగ్గర?"

కొంప మునిగిందనుకున్నాడు సూర్యం. మారువేషంలో ఈగజదొంగ ఎలావున్నాడో, తమ యింటికి కాపలాకాసే ముసలివాడు కూడా యించుమించు అలాగే వుంటాడు. ఇక్కడ దొంగ కెలాటి అవకాశమైతే లభించిందో, అక్కడ ముసలివాడికీ సరిగ్గా అలాటి సదవకాశమే లభించింది. నీరజది ఎలాగైనా ఆడపుట్టుక! అత్యవసర సమయాల్లో తప్పా మిగిలినప్పుడల్లా ఆడవాళ్ళబుద్ధి చురుకుగా పనిచేస్తుంది. కానీ తనుమాత్రం ఏమంత ప్రయోజకత్వాన్ని వెలగబెట్టినట్టు! దొంగకు(అతడు దొంగకాడని నిదర్శన మేదీ!)యిల్లప్పగించి తను థియేటరులో కుషనుకుర్చీలో సుఖాసీనుడై నిమ్మకు నీరెత్తినట్టు సినిమా చూస్తున్నాడు! ఒక మనిషిని మరొకమనిషి విశ్వసించడం మంచిదే! కాని అలా విశ్వసించడానికి ముందు ఈ మనిషి ఆమనిషి తత్వాన్ని అవగాహనచేసుకుని వుండాలి. ఏనాటి వాయసమో, పంచతంత్రంలో కాబోలు, కులమూ శీలమూ తెలియకుండా క్రొత్తవాళ్ళని నమ్మరాదంటుంది.

తటాలున పైకిలేచి "కళ్ళెందుకో తిరుగుతున్నాయి నీరజా! కాసేపు బయటవుండి వస్తాను" అని చరచరా థియేటరునుంచి బయటికి వచ్చేశాడు సూర్యం.

అప్పుడప్పుడే సన్నగా చినుకులు జారుతున్నాయి. ప్రగాఢనీలవర్ణం పైవేసికొన్న మేఘమాలికలు ఆకాశాంతాలు అవధులుగా లోకాన్ని ముట్టడించివేస్తున్నాయి. సూర్యం రోడ్డుపైకి వచ్చేసరికి ఓవైపున మెరుపొకటి ధగధగా మెరిసింది. వెనువెంటనే ఒక ఉరుము పెళపెళా వురిమింది. రోడ్డులో అతను నాలుగడుగులు వేశాడో లేదో జల్లుజల్లున జడివాన కురవసాగింది.

వర్షం వస్తోందని వెనుకడుగు వేయడానికి సూర్యానికి మనస్కరించలేదు. నిర్జనమైన మేడ. కాకిని వ్రేలాడగట్టినట్టున్న మేఘాలక్రింద చిక్కగా క్రమ్ముకుంటున్న కారుచీకటి, పైగా జడివాన! దొంగతనం చేయడానికి యింతకంటే అమూల్యావకాశం ఎప్పుడు దొరుకుతుంది? కారులో బయల్దేరితే ఎట్లా లేదన్నా రోడ్డుపైన యింటికి ఒకటి ఒకటిన్నర మైళ్ళ దూరముంది. సందుల్లో దూరివెళ్తే నాలుగు ఫర్లాంగులకన్నా ఎక్కువుండదు. అదీగాక రోడ్డులో కారు కనబడేసరికి దొంగకాలికి బుద్ధిచెప్పడానికి అవకాశముంటుంది. కాదు, కాదు ఎంతవాన కురిసినా సరే తను నడిచే పదినిమిషాల్లో యిల్లు చేరుకోవాలి!

పల్లాల్లోనిలిచిన బురదనీరు పైకెగిరి [illegible] చెరగని దుస్తుల్ని ఖరాబుచేస్తున్నా లెక్కచేయకుండా సూర్యం సందుల్లోపడి నడవసాగాడు. వానలో తడుస్తూ నడిచే అనుభవం సూర్యానికి క్రొత్త! అందులోనూ ఏటవాలుగా పడుతున్న వానచినుకులువడగళ్ళలా ముఖాన్ని మొత్తుతున్నాయి. అధోముఖంగా శరవేగంతో వస్తున్న వర్షధారలమాటకేంగాని, అంతకంటే వేగంగా సూర్యం మనసులో ఆలోచనలు పరుగెత్తసాగాయి. ఐదారు నిమిషాల్లో తను గేటు తెరచుకుని లోపలికి వెళ్తాడు. మేడను సమీపిస్తాడు. సింహద్వారానికి తను వేసుకుని వచ్చినతాళం ఈపాటికి వూడదీయబడివుంటుంది. నాన్నగారొక రివాల్వరు టేబిల్ సొరుగులో దాచివుంచడం మంచిదయింది. ఒకచేత టార్చిలైటు, మరొకచేత రివాల్వరు పట్టుకుని తను సరాసరి మేడపైకి వెళ్తాడు. తూర్పువైపుగదిలో దొంగ యినప్పెట్టె

తలుపు విడదీసే ప్రయత్నంలో నిమగ్నుడై వుంటాడు. మెరుపులా తను గదిలో ప్రవేశించి, టార్చిలైటును దొంగమీదికి ఫోకస్ చేసి 'హాండ్స్అప్' అని గర్జిస్తాడు. 'ఊఁ నడువెనక్కి' అంటూ వాడిని హాల్లోకి తీసుకొస్తాడు. స్విచ్ వేసి, పరుపు చుట్టుకునే త్రాడు వూడబెరికి దొంగని కంబానికి బంధిస్తాడు!

ఆక్షణంలో సూర్యం తను సూర్యమే నన్న విషయం మరచిపోయాడు. తనిప్పుడు తిమింగిలాలకు భయపడకుండా, తుపానుల్ని పరకు చేయకుండా సాగరాంతరాళంలోనికి చొచ్చుకుని వెళ్ళి ముత్తెపు చిప్పల్ని వెలికిదీసే సాహసికుడు! హిమపాతానికి వెరవకుండా, అలసటను లెక్క చేయకుండా అందుకో వలసిన ఆదర్శంపై చూపునిలిపి వడివడిగా నడక సాగిస్తున్న పర్వతారోహకుడు!

సందులోనుంచి సూర్యం మళ్ళీ రాజవీధిలోకి వచ్చేశాడు. అక్కడనుంచీ గేటుదగ్గిరికి నూరుగజాలు కూడా వుండవు. సూర్యం మేడవైపోసారి చూచాడు. జడివానలో చూపానడం లేదు. తీక్ష్ణదృక్కులతో గేటువైపు చూచాడు. అక్కడ మనిషివున్న పోలికవే కనిపించడం లేదు. ఆ ఉద్వేగంలో సూర్యం పిడికిలి మూసి చేతినిపైకెత్తి తన దృఢముష్టినోసారి చూచుకున్నాడు.

కానీ సూర్యంచేయి అప్రయత్నంగా క్రిందికి వ్రాలిపోయింది. పిడికిలి తనంతటదే విచ్చిపోయింది. నిశ్చేష్టుడై అతడు గేటుకావలనుంచి వ్యాపించివున్న రావిచెట్టు కొమ్మలక్రింద నిలబడిపోయాడు. ఒకటి రెండు నిమిషాలపాటు తనచుట్టూరా వానకురుస్తోందనీ, వానలో తను బాగా తడిసిపోయాడని అతడు మరచిపోయాడు. అతడిశరీరంలోని ప్రతి రక్తబిందువులోని ప్రత్యణువునా తనఎదుట స్టూలుపైన నిశ్చలంగా కూచునివున్న ముసలివాడి పరిదీనస్వరూపమే ప్రతిబింబించింది. చీకటిలో కలిసి చీకటై, తడిసిముద్దైపోయి కూడా విసురుగా వీస్తున్న ప్రభంజనంలో, కుంభవృష్టిలో కదలకుండా, మెదలకుండా కూచునివున్న ఈ ముసలివాడినేనా తను దొంగఅని అనుమానించడం!

ఐదడుగుల పదంగుళాల పొడవున్న తనశరీరం ఆ వృద్ధుడి ధీరోదాత్తతముందు రెండడుగులమేరకు కుంచించుకపోయినట్టు తోచింది సూర్యానికి! అందుకతడు చింతించలేదు. ఆ ముసలాడి మహోన్నత వ్యక్తిత్వం ప్రోల తను మరుగుజ్జయిపోవడమే న్యాయం!

మళ్ళీ ఈలోకంలో పడ్డాక సూర్యం వృద్ధుడికి దగ్గరగావెళ్ళి "తలనొప్పిగావుంటే అమృతాంజనం రాచుకుందామని వచ్చాను" అన్నాడు. తీరాఅన్న తర్వాత అలాఅన్నందుకు కించపడ్డాడు. అమృతాంజనంకోసం జడివానలో తడుస్తూ థియేటరునుంచి తనింతదూరం నడిచివచ్చాడంటే ఎవరు నమ్ముతారు? ఐనా తనిప్పుడెందుకు సంజాయిషీ చెప్పుకోవాలి? నిజానికది సంజాయిషీ కానేకాదు. తనచెవులకే అది క్షమాపణలా ధ్వనించింది...అంతలో సూర్యం తేరుకున్నాడు. ఏమయితేనేం! ముసలివాడికి తనమాటలు వినిపించివుండవు!

సూర్యం గేటుతెరుచుకుని లోపలికివెళ్ళి ఐదు నిమిషాల్లో దుస్తులు మార్చుకుని తిరిగివచ్చాడు. అప్పటికి వాన దాదాపు వెలిసిపోయింది. ఐనా రావిచెట్టు కొమ్మల్లోనుంచి నిర్విరామంగా యింతింత నీటిబొట్లు క్రిందికి రాలుతున్నాయి. బాహ్య వాతావరణంలో మార్పువచ్చినా ముసలివాడుమాత్రం నిర్వికారంగా సమాధిగతుడైనట్లు అలాగే కూచునివున్నాడు. సూర్యం కళ్ళల్లో నీళ్లు గిర్రునతిరిగాయి. చేతిగుడ్డతో కన్నీళ్లు తుడుచుకుంటూ సూర్యం క్షణక్షణానికీ మారిపోతున్న తన చిత్తపరివర్తనకు తానే తెల్లబోయాడు. గడచిన ఏడెనిమిదిరోజులుగా తనీముసలివాడినిగురించి యించుమించు రోజు కొక్క నిర్ణయానికి వచ్చాడు. అనుమానించాడు. అసహ్యించుకున్నాడు. జాలిపడ్డాడు. కడకిప్పుడు కంట తడిబెట్టుకున్నాడు. తనలో యిన్ని పరిణామాలు కలుగుతున్నా ఎదుటి మనిషిలోమాత్రం కించిత్తు మార్పయినా కనిపించడం లేదు. ఇది ఎండిపోయిన మ్రోడు. భూగర్భంలో దీని వేళ్లు చివికిపోయాయి. పైనుంచి క్రిందికి కొమ్మలు క్రమక్రమంగా ఎండిపోతున్నాయి. ప్రకాండంలో తొర్రబడింది. ఈదుస్థితికి వెనుక ఎలాటి బలవత్తరమైన కారణం నిక్షిప్తమైవుందో తనకు తెలియదు. అథవా తెలిసినా తను చేయగలిగిందేమీ లేదు. దేన్ని గురించి విచారించి లాభంలేదో దాన్ని గురించి ఆలోచించడం వృథాప్రయాస!... సూర్యం రెండు పొడిబట్టల్ని ముసలివాడిపైకి విసరి, కట్టుకోమని సైగచేసి మళ్ళీ థియేటరువైపు వెళ్ళిపోయాడు.

మరునాటి ఉదయం, యిదివరకెప్పుడో నిర్ణయమైన ప్రోగ్రాంప్రకారం పూరీలోవున్న చంద్ర

శేఖరంగారికి సూర్యం జాబు వ్రాశాడు. 'పూజ్యులైన తండ్రిగారికి నమస్కారాలు' అంటూ ప్రారంభించి, సౌభాగ్యవతి నీరజ, చిరంజీవి పాప క్షేమంగా వున్నారని పేర్కొంటూ పిన్ని తృప్తికోసం ఆకుశలవార్తకు మరి నాలుగైదు వాక్యాలు జోడించాడు "రోజుకొకటి రెండుసార్లు రాముడే పాపను షికారుకు తీసుకెళ్తున్నాడు. అందుచేత ఆమె నెత్తుకోడానికి ప్రత్యేకంగా నౌకర్ని పెట్టుకోవలసిన అవసరమేమీ కనిపించడంలేదు. మరొక విశేషం. మనకిప్పుడు నమ్మకస్తుడైన వాచ్‌మేన్ దొరికాడు. పాపం, వాడిస్థితి హృదయవిదారకమైంది. చెవులు వినిపించవు. ఒక చేయి మొండిచేయి. సంవత్సరాలతరబడీ తిండికి నోచుకోనివాడిలా కనబడుతున్నాడు. రెండుపూటలా యింతతిండి పడేస్తే మరేధ్యాసలేకుండా ఆ ముసలివాడు మన యింటిదగ్గరే వుండిపోయేటట్టున్నాడు. వాడు గేటుదగ్గరవుండడంవల్లనే నేను క్లబ్బునుంచి రావడానికి కొంచెం ఆలస్యమైనా నీరజ మరేం కంగారుపడడంలేదు, ఈవిషయం పిన్నితో చెప్పండి"

* * * *

పది పదిహేనురోజులు మెల్లగా దొర్లిపోయాయి. ఈవ్యవధిలో సూర్యం రెండు మూడు పెద్దకేసులు వకాల్తా పుచ్చుకున్నాడు. వాయిదాలు దగ్గరలోవున్నాయి. తిండిశాస్త్రం ముగించి న్యాయశాస్త్ర ఉద్గ్రంథాలముందు కూర్చుంటే ఒక్కొక్కప్పుడు అర్ధరాత్రికూడా మీరిపోతోంది. అప్పుడు పడుకుంటే ఏ ఎనిమిదికో, తొమ్మిదికో మెలకువవస్తుంది. అప్పటికి స్నానపానాలు ముగించుకొని కోర్టుకు చేరుకునేసరికి పార్కులో టవర్ క్లాక్ పదిగంటలు చూపిస్తుంది.

ఇంతలో సూర్యం ఊపిరి తిప్పుకోడానికి వీలుగా వేసవిసెలవులు వచ్చాయి. ఫైళ్ళన్నీ కట్టగట్టి బీరువాలోకి విసిరి సూర్యం విశ్రాంతిగా కాలం గడపసాగాడు. పనిచేస్తే చురుగ్గా చేయడం, బద్ధకిస్తే అత్యవసరమైతే తప్ప రేయింబవళ్ళు పడక పైనుంచి లేవకపోవడం సూర్యం అలవాటు. లేకుంటే రాజకీయాలపైన వున్న పిచ్చివ్యామోహంవల్లనైతేనేమి, చేబట్టిన వృత్తిద్వారా లభ్యమైన వాక్కండూతిచేతనైతేనేమి సూర్యానికి క్లబ్బుకువెళ్ళి మిత్రులతో చర్చాపూర్వకమైన వాగ్వివాదానికిదిగకపోతే మరేంతోచేదిగాదు! అలావెళ్ళివస్తున్నప్పుడు గేటుదగ్గర ఆగి ముసలివాడిని పలకరిద్దామని సూర్యం చాలాసార్లు అనుకున్నాడు. ఆగి పలకరించేవాడే! కానీ మాటాడానికి ఆముసలాడు ఎంతమాత్రం సుముఖంగా కనబడలేదు. పైగా పనిలో చేరినప్పటికీ, యిప్పటికీ అతడు బాగా చిక్కిపోయాడు. వానలో తడిసిన నాటినుంచీ అతనికి కొత్తగా దగ్గొకటి సంక్రమించింది. ఉండి, వుండీ ఒక్కసారి దగ్గితే ఆపకుండా ధారావాహినిగా పది పదిహేను నిమిషాలదాకా ఏకస్థాయిలో కొనసాగేది.

"పన్నెండుగంటలకోసారి మేలుకున్నాను. అప్పుడు ముసలివాడి దగ్గు వినిపించింది" అనేవాడు తెల్లవారగానే సూర్యం.

"నేను తెల్లవారుఝామున మేలుకున్నానండీ! అప్పుడు కూడా ముసలాడు దగ్గుతూనే వున్నాడు" అనేది నీరజ.

"వాడిని నేనెం మాట్లాడించినా మాట్లాడడు. తనకు ఒళ్ళెలావుందని చెప్పుకోడు. ఏమిటోమరి! వీడు మనకొక సమస్యయిపోయాడు."

"దగ్గిదగ్గి వాడిక్కడే కన్నుమూసుకపోతాడేమోనండీ! ఎక్కడ పుట్టాడో, ఎక్కడ పెరిగాడో వాడికి భగవంతుడు ఇక్కడ చావు వ్రాసి పెట్టినట్టున్నాడు!"

ఆఖరకు సూర్యం రాముణ్ణి పిలిచి ముసలివాడి కెలావుందో తెలుసుకోమన్నాడు. అవసరమైతే హాస్పిటలుకు తీసుకెళ్ళి మందిప్పించమన్నాడు.

కాని వెళ్ళిన రాముడు వెళ్ళినట్టే తిరిగి వచ్చి "ఆతగాడు తనకు మందూ గింధూ ఏమీ ఒద్దంటున్నాడు బాబూ" అన్నాడు.

"ఏం! ఎందుకని?" ఆశ్చర్యంతో ప్రశ్నించాడు సూర్యం.

"ఒంటిపైన చెయ్యివేసి చూశాను. కాలిపోతోంది లేచి నిలబడడానికైనా ఓపికం వున్నట్టు లేదు. 'హాస్పిటలుదాకా రా! మందిప్పిస్తాను' అన్నాను"

"అందుకేమన్నాడు?"

"వెళ్ళిపో అన్నట్టు చెయ్యూడిస్తాడు బాబూ! ఇంకేమీ అనడు."

"ఒకవైపు ప్రాణం పోతున్నా మనయింటి దగ్గర కూర్చుని సత్యాగ్రహం చేయడానికి వాడికి మనమేం

# మ య స భ

అపచారం చేశావట్రా రాముడూ! వెళ్లు. ఒక బండి తీసుకొచ్చి వద్దు వద్దన్నా వాడినందులో పడద్రోసి హాస్పిటలుకి లాక్కెళ్ళు. స్థితి అపాయకరంగా వుంది గనుక తప్పకుండా బెడ్ యిస్తారు. తక్షణం వాడిని హాస్పిటల్లో చేర్చి యింకోకపని చూడు, వెళ్ళు" అన్నాడు సూర్యం

ఆరోజు మధ్యాహ్నానంతరం సూర్యం ముందు వాల్లోనుంచి రోడ్డువైపు చూచాడు. ఇనుపకమ్ముల గేటుదగ్గర కాపాలావాడు లేడు! లోలోపల ఏదో అవ్యక్తమైన బాధ బాణంలా హృదయాన్ని గుచ్చుతున్నా పైకిమాత్రం తలపైన పెద్దబరువు తగ్గిపోయినట్టు 'అబ్బా' అని నిట్టూర్చాడు సూర్యం.

ఆకులకు సున్నం రాస్తున్న నీరజ సూర్యం లోపలికి రావడం చూచి "ఉదయం మీకొచ్చిన వుత్తరాల్ని టేబిల్ పైన వుంచానండీ" అంది. "నాన్నగారు వ్రాశారేమిటి?" అంటూ సూర్యం జాబుల్ని చేతికి తీసుకుని మంచంపైన పడుకున్నాడు. వాటిల్లో నాలుగైదు కార్డులు, ఒక కవరుమాత్రమున్నాయి. చంద్రశేఖరంగారెప్పుడు వ్రాసినా ఒక కార్డులో ముక్తసరిగా మూడు మాటలు మాత్రం వ్రాస్తారు. ఆనాలుగు కార్డుల్లో మూడు క్లయింట్ల దగ్గరినుంచే వచ్చాయి. ఒకటి చందా గడువు మీరిపోతోందని హెచ్చరిస్తూ ఒకానొక పత్రికాకార్యాలయం నుంచి వచ్చింది. నాన్నగారు జాబు వ్రాయలేదేమా అనుకుంటూ సూర్యం మిగిలిన కవరుపైకి తీశాడు. బహుశా ఎవడో క్లయింటు కేసుకు సంబంధించిన పత్రాలు పంపివుంటాడని కవరు చించాడు. కాగితాలు పైకి తీశాడు. ఉత్తరమంతటా నాన్నగారి అక్షరాలే వున్నాయి నాన్నగారు సుదీర్ఘమైన వుత్తరం రాయడానికి యిదే ప్రథమం. ఒకవేళ యాత్రానుభవాల్ని గురించి వ్రాశారేమో!

నాలుగైదు పేరాలు మాత్రం చదివి సూర్యం కాగితాల్ని చేతిలోవుంచుకునే పైకప్పుకేసి చూస్తూ ఆలోచనలో పడ్డాడు. ఆవుత్తరమంతా అదోతరహాగా వుంది! చెప్పవలసిన విషయమంతా ముందే వుండగా అందుకు పీఠికాప్రాయంగా వ్రాసుకపోతున్నారు నాన్నగారు. "ఇదంతా యిప్పుడెందుకు చెప్పవలసి వచ్చిందని నీకు సందేహంకలగవచ్చు. ఇంతకాలంగా నా అంతరాంతరాల్లో నిగూఢంగా దాగివుండిన ఈ రహస్యం నిన్ను మూలముట్టంగా కదిలించివేయవచ్చు! కాని సూర్యం! నాలో ఏన్నో తర్కవితర్కాలు జరిగినమీదటే ఈవాస్తవాన్ని నీకు తెలియబరుస్తున్నానని నువ్వు గుర్తించాలి"

సూర్యం యించుమించు కొయ్యబారిపోయాడు. రహస్యమా? ఏమిటది? అది తనని కదిలించివేసే వాస్తవమా! అలాటి దొకటుంటుందని అనుకోడానికైనా అవకాశంలేదే! నాన్నగారేదైనా కథ వ్రాసి పత్రికకు పంపించడానికి బదులు తనకు పంపించేశారా! కాదే. పైన చిరంజీవి సూర్యానికి శుభాశీస్సులని స్పష్టంగా వ్రాశారే!

సూర్యం మళ్ళీ ఉత్తరాన్ని చూడసాగాడు. తరువాత ఒకటి రెండు పేజీలవరకూ జాబు వింతగా వేదాంతధోరణిలో సాగిపోతోంది.

"నీకు తెలుసు సూర్యం, నేనూ నీలా న్యాయవాద వృత్తి అవలంబించిన వాణ్ణి. పదేళ్ళపాటు న్యాయమూర్తిగాకూడా పనిచేశాను. అముప్పై, ముప్పైయిదేళ్ళ అనుభవంలో నాకవగతమైన సత్యమొక్కటే! న్యాయాన్ని నిర్ణయించడం కంటే ఈ ప్రపంచంలో అసిధారావ్రతం మరొకటిలేదు ఉదాహరణకి నీకీరహస్యం చెప్పడం న్యాయమా కాదా అని నేనీ పది, పదిహేను రోజుల పాటునా వితర్కించుకున్నాను పూరీలో జగన్నాథుణ్ణీ, కలకత్తాలో కాళీమాతను, కాశీలో విశ్వనాథ శివుణ్ణి దర్శించుకున్నప్పుడు కూడా ఈ సందేహమే నాలో కొట్టుమిట్టాడింది. కడకు ఈ విషయాన్ని నీకెరిగించడమే న్యాయమన్న నిర్ణయానికివచ్చాను. ఈ జాబు వ్రాస్తున్నది నేను బృందావనంనుంచి! నిన్నసాయంత్రం ఈ రహస్యాన్ని ప్రకటించడానికి కావలసిన ఆత్మసంయమనాన్ని ప్రసాదించమని నేను కృష్ణభగవానుణ్ణి వేడుకున్నాను.

నా పరిస్థితిలో వున్నవాడు మరెవ్వడైనా అయితే నీకీ విషయాన్ని చెప్పేవాడు కాడేమో! కానీ అలాటివాడు నా కాదర్శం కాడు. నేనులోకం మెరమెచ్చులకోసం ఆశించకుండా నాకు న్యాయమని తోచిన కార్యాలు కొన్ని చేశాను. వాటిల్లోయిది ఆఖరుదిగావుండనీ! ఇదే నాకోరిక.

మీ పిన్నికి కథలపిచ్చి ఎక్కువ. కనిపించిన పత్రికలన్నీ కొని తెమ్మని మొదట కథల్ని మాత్రం

చదివేయడం యిప్పటికీ ఆవిడ అలవాటు. అందులోనూ ఎక్కడో అరుదుగా కనిపించే విచిత్రమైన మానవ ప్రవృత్తి యథాతథంగా చిత్రింపబడే కథలంటే ఆమెకు ఎక్కువ అభిమానం. అలాటి కథల్ని ఆమె చదువగా నువ్వూ, నేనూ అప్పుడప్పుడూ వింటుండే వాళ్ళం. నీకు జ్ఞాపకం వుందో లేదో గాని ఒకసారి ఆమె ఒకథ చదివింది. రాక్షసుడిలాంటి మనిషి ఒకడుంటాడు, వాడు చేయని కిరాతకకృత్యాలు లేవు తను చేసినవన్నీ దుష్కార్యాలేనని వాడికీ తెలుసు. కానీ వాడెందుకు పశ్చాత్తాపపడడు పైగా వాడెన్ని ఘోర కృత్యాలు చేసినా లోకుల్లో వాడి అంతస్థు నానాటికి పెరిగిపోతుంటుంది. కడకు తనూ కొంత వరకూ ప్రపంచాన్ని వుద్ధరించినట్టు ఆత్మసంతృప్తితో వాడు చనిపోతాడు. ఈకథ అసహజంగా వుందని నువ్వూ, మిగిలిన్నీ వాదించారు. నేను మాత్రం యిది సహజమేనని మీకు నచ్చజెప్పబోయాను. కారణం, మీకంటే నేనులో కొన్ని ఎక్కువగా చూచినవాణ్ణి. అదే పనిగా మానవుల్ని హతమార్చిన హంతకులు కొందరు పాప పరిహారార్థం రెండు అశ్రుబిందువుల నైనా ధారబోయకుండా ఉరికంబాన్ని సమీపించడం నేనెరుగుదును. వాళ్లు రాక్షసులు! వాళ్ళతో మనకు ప్రసక్తి లేదు.

ఐతే మానవులసంగతేమిటి? నా ఎరుకలో ఒక మనిషివున్నాడు. వాడిని నేను దాదాపు నాలుగు దశాబ్దాలనుంచీ చూస్తున్నాను. వాడు సంఘానికి చీడ పురుగుగా బ్రతికాడు. మానవతుల శీలానికి ముప్పుగా బ్రతికాడు. నిరంతర దుర్వ్యసనాల్లో ఆస్తిని గుల్ల చేసి పారేశాడు. చిప్పచేతి కొచ్చింది. కాని వాడు మానవుడు మాత్రం కాలేదు. మానవుడైతే వాడికి పశ్చాత్తాపం కలగదా అనుకున్నాను. వాడిక మానవుడు కాలేడను కున్నాను. కాని నువ్వింతలో ఆ మొండి చేతి ముసలి వాణ్ణి గురించి జాబు వ్రాశావు. అంతటితో నా అంచనా తారుమారయింది.''

సూర్యం త్రుళ్లిపడ్డాడు. అక్కడికీ, యిక్కడికీ వచ్చి ఈ మొండిచేతి ముసలివాడు తనకథలో నే ప్రవేశిస్తున్నాడు!

"ఇప్పటికే నాయీలేఖ నిన్ను చీకాకు పరుస్తోంది గదూ సూర్యం! లేకుంటే అసలు విషయాన్నిక దొంకతిరుగుళ్లు లేకుండా నా చేత నయినంతవరకూ సంగ్రహంగా వ్రాయడానికి ప్రయత్నిస్తాను. ఏకాంతంగా కూచుని తీరిగ్గా చదువుకో.

సూర్యం ఉత్తరాన్ని జేబులో వుంచుకుని చరచరా మేడపైకి వెళ్ళాడు గదితలుపులు మూసి కుర్చీలో కూచుంటూ మళ్లీ కాగితాల్ని పైకి తీశాడు.

*　　　　*　　　　*

"అవి నేను క్రొత్తగా కాలేజీలో చేరిన రోజులు. కాని అప్పటికే ఈప్రపంచం అనందధామమేమీ కాదని, కావడానికన్ని కష్టనష్టాలకిక్కడ కొదవలేదనీ నాకు బాగా తెలుసు. మానాన్నగారు నన్నలా పెంచారు. అందుకాయన్ని లాభం లేదు. పిత్రార్జితంగా దక్కిన ఆస్తిపాస్తులంతగా లేకపోయినా ఆయన అంతవరకూ సంసారాన్ని లాక్కురావడమే గొప్ప విశేషం. బాగా చదివి, డిగ్రీలు సంపాదించి, నేను పెద్దఉద్యోగం చేస్తుంటే ఒకసారి చూచి చని పోవాలని నాన్నగారప్పుడప్పుడూ అంటుండేవారు. ఆయన కోరికలోని పూర్వాపరభాగాల్లో మొదటిదైతే నెరవేరింది గానీ రెండోది నెరవేరకముందే ఆయన శాశ్వతంగా కళ్ళు మూసుకున్నారు.

ఉన్నవూళ్ళోనే హైస్కూలుండడం మూలాన స్కూల్ ఫైనల్ వరకూ నా చదువు మానాన్నగారికి బరువుగా తోచలేదు. చదువుకోవడం చూడకుండా రెండువందల రూపాయలు అప్పుచేసి ఆయన నన్ను కాలేజికి పంపించారు. ట్రంకు చేతో పట్టుకుని అనంతపురం స్టేషనులో దిగాను. ఆవూరికి సుఖం చుద్దానికి అదే తొలిసారి కాలేజి ఎక్కడవుందో నాకబు చేసుకుంటూ వచ్చాను. ప్రిన్సిపాలుగారు సాదరంగా మాట్లాడి ఈవూళ్లో ఎక్కడుండదలచుకున్నావు" అని అడిగారు. "అదే తెలియడంలేదండీ" అన్నాను. ఆయన చీటీలో ఒక పేరు వ్రాసియిచ్చి అక్కడికి వెళ్ళమన్నారు.

అది రంగమ్మ హోటలు! ఆరోజుల్లో ఆచుట్టు ప్రక్కల భోజనప్రియులందరికీ రంగమ్మ ఆరాధ్య దేవత. హోటలని పేర్కొంటున్నారు గనుక అక్కడ కుర్చీలు, బల్లలు, పటాలు, పంకాలు, సర్వర్లూ క్లీనర్లూ వుంటారనుకున్నాను, కాని అక్కడ అలాంటి గందరగోళ మేమీ లేదు పొరుగూళ్ళనుంచి వచ్చి చదువుకుంటున్న కాలేజి కుర్రాళ్ళు చాలా మట్టుకు అక్కడే భోంచేస్తారు. పైగా చూపిస్తే చాలు,

రంగమ్మకు పోయిన ప్రాణంకూడా చక్కా లేచి వస్తుందని లోకంలో ఒక ప్రథ వుండేది. నూటికి తొంభైమందికి సర్వసామాన్యంగా వర్తించే ఆమాటకేంగానీ రంగమ్మ పరిచర్యలతోనూ, అంతకంటే మాటలతోనూ వాడుగ్గా తినేవాళ్ళకందరికీ స్వర్గాన్ని మరపించేది నాలుగైదు రోజులు ఆ హోటల్లోనే ఓగదిలో మకాంపెట్టి చూచాను. బొత్తిగా చదువుకోడానికి వీలుగా వుండలేదు ఎప్పుడూ ఎడతెగని జనం. ఇలా కాదనుకుని ప్రత్యేకంగా వున్న ఓ గదికోసం అన్వేషణ ప్రారంభించాను.

ఆనాటికి అనంతపురం యిప్పుడున్నంత పెద్ద బస్తీకాదు. నాలుగైదు ముఖ్యమైన వీథుల్ని మినహాయిస్తే మిగిలిన వూరంతా వట్టి మట్టిమిద్దెల మయం. ఈ మంటిమిద్దెలు డిటెక్టివు నవలల్లో అప్పుడప్పుడూ అపరాధపరిశోధకులకు తటస్థించే భూగర్భగృహాల కంటే ఒకించుక మెరుగ్గా వుండేవంతే! ఒకటి రెండు అంకణాల వెడల్పున ఈవీథినుంచి ఆవీథివరకూ నూరు నూటయాభై గజాల పొడుగునా వ్యాపించివున్న ఈ మంటిమిద్దెలకు ఏవైపునగానీ ఓకిటికీవుండదు. ఉత్తర ధృవంలో మానవులకు ఆరునెలలు పగలు, ఆరునెలలు రాత్రి అని భూగోళం చెబుతుంది. కాని ఈ మట్టిమిద్దెల్లో మనుషులు మాత్రం సంవత్సరమంతా చీకటిలోనే బ్రతుకుతారు. జీవించడమే కష్టసాధ్యమైన ఈయిళ్ళల్లో యిక చదువుకోవడమేం కుదురుతుంది?

నాలుగురోజులు అదేపనిగా తిరగ్గా, తిరగ్గా కడకు ఓమారుమూలవీథిలో గది దొరికింది. పెంకుటింట్లో వీథివైపు గది. గదిలోపలికి గాలీ వెలుతురూ వచ్చే అవకాశాలున్నాయి. మాటి మాటికీ గదిలోకి వచ్చి అల్లరిచేయడానికి ఆ యింట్లో కుర్రాళ్లుకూడా లేరు. కుర్రాళ్ళే ఏమిటి, మగవాళ్లుకూడా లేని ఆ యింట్లో యిద్దరు ఆడవాళ్లు మాత్రం వున్నారు. ఊత కర్రసాయంతో ముసలావిడ రోజుకొకటి రెండు పార్లయినా వీథిగడపదాకా వచ్చి నన్ను పలకరించి వెళ్ళేది. ఆవిడకు పగలుమాత్రం ప్రపంచం మసకమసకగా కన్పిస్తుంది. రాత్రులు అదీలేదు! పెరట్లోకి ప్రత్యేకంగా దారిలేకపోవడంచేత ముఖం కడుక్కోడానికీ, స్నానం చేయడానికీ యింటిలోపలి నుంచే వెళ్లవలసి వచ్చేది. లోపలికి వెళ్లినప్పుడల్లా నడవలో మంచంపైన పడుకునివున్న ముసలావిడ "ఎవరూ, ఎవరూ" అంటూ కంగారుగా ప్రశ్నించేది. "నేనేనవ్వా! చంద్రాన్ని" అనేవాణ్ణి. "ఒసే జానకీ! అబ్బాయికి నీళ్లు కావాలేమో, తొట్లోవున్నాయేమో చూడు" అంటూ ఆవిడ కూతురికి పనిపురమాయించేది. ఆ అమ్మాయి తొట్లోనీళ్ళువుంటే వున్నాయనేది. లేకుంటే మారుమాట చెప్పకుండా నీళ్లుచేది పోయడానికి గజ్జెలగుర్రంలా నడుస్తూ పెరట్లోకి వెళ్ళిపోయేది. ముక్కూ మొగం ఎరుగనివాళ్ల చేత పనులు చేయించుకోడానికి నాకు బొత్తిగా మనస్కరించేది కాదు. ఐనా అడ్డుచెప్పలేక జానకి నీళ్లుచేది పోసేంత వరకూ ముసలావిడతోనే మాట్లాడుతూవుండి ఆ తరువాత పెరట్లోకి వెళ్ళేవాణ్ణి.

ఓరోజు నేను కాలేజినుంచీ రావడానికి ఆలస్యమైంది నాకోసం వీథిగడప దగ్గరే కాచుకునివున్న ముసలావిడ "ఏం నాయనా, ఈరోజింత వేళమీరి వచ్చావు" అంది కారణం చెప్పాను. ఏమో బాబూ! రోజూ ప్రొద్దుండగానే యిల్లు చేరుకునే వాడివి. ఈ రోజు రాకపోయేసరికి దిగులేసింది. ఇది మగదిక్కులేని యిల్లయిపోయె! ఏఅమ్మకన్న బిడ్డవో నువ్వూ మాలో ఒకడివిగా మసలుకుంటున్నావు. ఈ రోజు మాఅబ్బాయికి తిథి నేడాను. బ్రతికుంటే వాడీపాటికి ఒకయింటివాడై జానక్కికూడా పెళ్ళిచేసి వుండేవాడు. రోగమా, రొష్టా? ఏమీ లేదు. ఆ దేముడికి కళ్ళు కుట్టినయ్. తీసుకెళ్లిపోయాడు. వాడికి జానకంటే పంచప్రాణాలు. అమ్మా లేకపోయె, అన్నా లేకపోయె, నేనున్నా లేనిదానిక్రిందే జమ. దాని అభం, శుభం ఎవరు చూస్తారు?"

జీవిత ప్రవాహంలో అనేక సుడిగుండాల్లోపడి మునిగి తేలి గుక్కతిప్పుకున్న ఆముసలావిడను నేనేమని ఓదార్చగలను! ఐనా ఆమె తృప్తికి "అవును, పాపం, నిజమే మరి" అంటూ నిట్టూర్చాను.

"బ్రతికుంటే వాడు తన అత్తగారింటికి వస్తే వాడికి ఏరికోరి వంటకాలు చేసిపెట్టవలసింది జానకి. వాడి కేదది యిష్టమో నాకంటే దానికి బాగా తెలుసు. పిచ్చిపిల్ల! వద్దన్నా ఈరోజు అవన్నీ చేసింది. దాని పిచ్చిగానీ, వాడొచ్చి తినబోతాడా బాబూ!"

ఈ ఆవేదన ఉపశమించడానికి ఏంచెప్పాలో నాకు తర్జించుకున్నా స్ఫురించలేదు.

"పోనీ ఈపూట నువ్వు హోటలుకు వెళ్ళక పోతే నేం బాబూ! ఇక్కడే భోంచేయ కూడదూ!"

"దానికేం అవ్వా! తప్పకుండా భోంచేస్తాను" అన్నాను.

ముసలావిడ మెల్లగా లేచి గోడవెంబడే వసారాలోకి వెళ్ళి మంచం పైన కూచుంది. నేనూ వసారాలో నే భోజనానికి కూచున్నాను. జానకి పళ్ళెంలో అన్నం తెచ్చింది.

"మహారాజు, ఆయన చనిపోయినా మాకంతో యింతో మిగిల్చి పోయాడు. ఈయిల్లూ, వాకిలీ గాక నాలుగైదెకరాల పొలముంది. కాలుమీద కాలు వేసుకుని యింట్లో కూచున్నా సాలుకు అయిదొందల రూపాయల ఆదాయం వొస్తుంది. ఇది గాక వున్నదగ్గా నట్రా వుండనే వుంది. సంబంధం కుదిర్చి పెట్టి ముందు నిలిచి శుభకార్యం చేసేవాళ్ళే లేంది!"

"ప్రాప్తమొస్తే సంబంధం తనంతటవే వెదుక్కుంటూ వస్తుంది" అని ప్రయత్నించి ఓమాటన్నాను.

కొంతసేపు పరధ్యానంగా వుండిపోయిన తర్వాత ముసలావిడ "అన్నం కెంకావాలో చూస్తున్నావా జానకీ" అంది.

"ఆకులో మొదట వేసిన అన్నం యింకా అలాగే వుంది" అంది జానకి, అప్పటికి నేనేదో అపరాధం చేసినట్టు.

"ఇది మరీ బాగుందవ్వా! జానకిని వృకోదరుడు లాంటి వాడికెవరికైనా కట్టబెట్టాలి! లేకుంటే అతగాడు మొదట వేసిన అన్నమైనా పూర్తిగా తిని నిభాయించుకోవడం కష్టం" అన్నాను

జానకి కిలకలా నవ్వుతూ రెండో దఫా పళ్ళెం నిండుగా అన్నం తెచ్చింది.

జానకి అంత పొడుగరి కాదు. పొట్టి కాదు. నీటి కెద్దడి లేని బావి క్రింద, పుష్టిగా సత్తువ గలిగిన నల్లరేగడ పొలంలో గుమ్మటంలాగా పెరిగే అరటిచెట్టులాంటి అంగసౌష్ఠవం ఆమెది! నిజానికి జానకి దేమంత అపురూపమైన సౌందర్యం కాదు. అంతమాత్రం రూపవతులు మనకెక్కడైనా కనిపిస్తారు. సౌందర్యం కన్నా ప్రధానంగా ఆమె చూపుల్లోనూ, మాట్లాడే తీరులోనూ ఎదుటివారికి కొట్టొచ్చినట్లు కనిపించేది ఆమె అమాయికత్వం. హృదయంలోనుంచి పెల్లుబికిన భావాన్ని గళంలోనే మింగి, మొగవులా హఠాత్తుగా ప్రస్ఫుటించే దరహాసాన్ని పెదవులపైకి వచ్చీరాకముందే అణచిపెట్టి తెచ్చికోలు ఆభిజాత్యంతో కృత్రిమంగా ప్రదర్శించడం జానకికి చేతగాదు. ఆమె ఏమాట చెప్పినా అది హృదయాంతరాళంలోనుంచి అప్రయత్నంగా పైకి ప్రసరించే జలధారలాగా, స్వచ్ఛంగా రమణీయంగా ధ్వనిస్తుంది. ఎంతమాత్రం హాస్యోక్తి కయినా ఆమె గలగలా నవ్వేస్తుంది. ఆనవ్వు శరత్కాల కౌముదిలా చల్లగా, తెల్లగా విరిసి ఎదుటివారికి హాయిహాయి అనిపిస్తుంది. పదిపదిహేను రోజులకు ముందు జానకి నాకు క్రొత్త. నేను జానకికి క్రొత్త. కాని ఆమాట, ఆనవ్వూ ఈ స్వల్ప వ్యవధిలో క్రొత్తదనాన్ని మటుమాయం చేసి పారేశాయి

"అమ్మాయీ, జానకీ!" అని సంబోధించే వాణ్ణి తరువాత.

"ఏమండీ అన్నయ్యగారూ!" అంటూ జానకి వాగ్వాదానికి సిద్ధమయ్యేది.

"మరేం లేదు. ఈరోజింకా పెళ్ళి సంబంధం చూడానులే" అంటూ ఆమె ఎలా ప్రసన్న మౌనం వ్యక్తపరుస్తుందోనని నిలువెల్లా కళ్ళు చేసుకుని ఆమె వైపు చూస్తూ వుండిపోయేవాణ్ణి.

"చూస్తారు, చూస్తారు! చూడకేం! అవ్వో, సణ్ణోసేసి తినున్నంత దూరం పంపించింది యిక్కడ ఎవరికో పెళ్ళి సంబంధాలు చూడ్డానికి కాదు. బుద్ధిగా చదువుకోండి"

"అది కాదు జానకీ! మరినీకు నేను చూచిన వరుడున్నాడనుకో, అతను అమాంతం నీకెలకా యంత యింత యంతును యిరవై బారల దూరానికి విసిరి పారేస్తాడు! వాడి ఛాతీ వుందిరా బాబూ, పిరంగులు పెట్టి కాల్చుకోనీ చెక్కు చెదరదు. అంతేకాదులే జానకీ! వాడి భోజన పరాక్రమం కూడా చెప్పుకో దగ్గదే! నువ్వు ఒకదానివెంబడి ఒకటిగా ఐదు విస్తర్లు వేసినా ఊఁ అఁ అనకుండా అన్నీ ఖాళీ చేసి గానీ లేవడు."

చిరుకోపం ముఖంలో పరవళ్ళు ద్రొక్కగా, ఒక్క విసురున పైకిలేచి ముందుకు పోయి ఈ భుజం మీదినుంచీ ఆభుజంమీదికి విల్లులా పడుతున్న పొడుగాటి జడను వెనక్కి తీసుకుంటూ జానకి తల్లి దగ్గరకు

వెళ్ళి, "చూడవే అమ్మా! అన్నయ్య ఎవణ్ణో బకాసురుణ్ణి తీసుకరాబోతున్నాడు" అంటూ ఏడుపు ముఖం పెట్టేది.

"అదేమోనమ్మా! మీ అన్నా నువ్వు పడండి, లేవండి! నాకు తెలియదు. అతను బకాసురుణ్ణి తెచ్చినా సరే, భీముణ్ణి తెచ్చినా సరే నువ్వు పెళ్ళి చేసుకోవలసిందే" ముసలావిడ తనతీర్పు తేల్చి చెప్పేసేది.

"చేసుకుంటాలే మీరు మాద్దురుగానీ! ముందు అట్లకాడ పొయిలో పెట్టి నాలుగువాతలు తీస్తాను. ఎంతభీముడైనా ఒళ్ళు కాలి నోరు మూసుకుంటాడు."

ఓరోజు సాయంత్రం ప్లేగ్రౌండునుంచి యింటికి వచ్చి, స్నానం చేయడానికి పెరట్లోకి వెళ్ళాను. తొట్టిలో నీళు లేవు. నాకెందుకో కోపం వచ్చింది! చేదను బావిలో వేసి చేంతాడు జారవిడుస్తున్నాను. చేదనీళ్లకి తగిలిన శబ్దం వినిపించిందేమో, జానకి లోపలినుంచీ పరుగెత్తుకుని వచ్చింది.

"అదేమిటి ? ఎప్పుడూ లేని వాడుక !

నేను వెనుదిరిగి చూడలేదు నాపాటుకు నీళ్ళు తోడి తొట్లో పోస్తున్నాను.

"పోసింది చాలు. ఇకస్నానం చెయ్యొచ్చు" అంది జానకి.

చేత చెంబు తీసుకుని తొట్లో ముంచబోయాను. వట్టిగాల్లో చెంబేం మునుగుతుంది! తొట్లో ఒక్క చుక్క నీళ్ళుకూడా లేవు.

"అబ్బాయిగారికలాగే కావాలి! కోపమొస్తే మాత్రం క్రింద తూము మూసిందీ లేందీ చూచుకోవద్దూ" అంటూ జానకి మొహంట తూముమూసి తిరువాత చేద చేతికి తీసుకుంది.

"నా కొకరిమీద కోపమెందుకొస్తుంది?" అన్నాను.

"ఎందుకొచ్చిందో చేదనడిగితే తెలుస్తుంది. పాపం, అది కుయ్యో, మొర్రో అని మొత్తుకుంటుంటే పరుగెత్తొచ్చాను"

"ఐతే నువ్వు చేద ఏడుస్తోందని పరుగెత్తొచ్చావు గానీ, నేను బాధపడుతున్నానని కాదు."

"అయ్యో ఎవ్వారమా! ఇవేం ఎత్తిపొడుపులమ్మ! ఇలా రాచిరంపాన బెడితే ఆ రాబోయే వదినగారిగతి ఏం కావాలో ఏమిటో!"

రాబోయే వదినగారినిగురించి మాట్లాడ్డమంటే జానకికి సరదా! ఆమె నోటంట ఆ మాటలు వినడానికి నాకూ సరదాగానే వుండేది! అసలు జానకిని చూచినతర్వాతనే ననుకుంటాను, నాకు పెళ్ళి చేసుకోడం కూడా ఒకమంచిపనేనన్న అభిప్రాయం కలిగింది. జానకిలాంటి సహధర్మచారిణి దొరికితే ఎలాటి దుర్గమపథంలోనైనా సునాయాసంగా ప్రయాణం చేయవచ్చు. కానీ జానకిలాంటి అమ్మాయి దొరకడమే దుస్తరం! అలాటివాళ్ళు నూటికీ కోటికీ ఒకరుంటారో, వుండరో!

దసరాలోనూ, క్రిస్‌మస్‌లోనూ రెండుసార్లు ఊరికి వెళ్ళివచ్చాను. వారానికోసారైనా జానకి వూరికి వుత్తరం వ్రాసేది. క్రిస్‌మస్ సెలవుల చివరి రోజుల్లో జానకిదగ్గరినుంచీ ఓవుత్తరం వచ్చింది. అందులో ఈసారి నేను అనంతపురం వచ్చినమీదట హోటలుతిండి మానేయాలని, అలామానకుంటే గదైనా ఖాళీచేసేయాలనీ తనతల్లి నిక్కచ్చిగా చెబుతున్నట్టు ఆమె వ్రాసింది. ముసలావిడ అలాటి నిర్ణయానికి రావడంలో ముప్పాతికమువ్వీసం బాధ్యత జానకిదై వుంటుందని నాకు తెలుసు. కానీ నేనెందుకో చొరవతీసుకుని ఆ తల్లీకూతుళ్ళు చెప్పినట్టు చేయలేకపోయాను. "ఎలాగా వారానికి రెండుమూడు పూటలు యిక్కడే భోంచేస్తున్నాను. ఇక స్నానపానాదులన్నీ మీరే చూచుకుంటున్నారాయె. ఐనా నాకేం అభ్యంతరం లేదు. కాని నా మూలంగా ఒకరికి శ్రమకలిగితే ఒప్పుకోరు" అని వాళ్ళకు నచ్చజెప్పుకున్నాను.

మార్చినెలసమీపం కావస్తోంది. చదువుల గొడవలో మునిగిపోయినందువల్ల మునపటిలా జానకితో మాట్లాడ్డానికి తీరికయ్యేదిగాదు కాని వీలు చిక్కినప్పుడల్లా జానకి గదిలో కేవచ్చేసేది. ఆయింట్లో కుర్రాళ్ళు లేనందువల్ల నెమ్మదిగా చదువుకోవచ్చునని మొదట నేనాశించాను కానీ మాటల్లోనూ, చిలిపితనంలోనూ ఒక్క జానకే పదిమంది కుర్రవాళ్ళపెట్టు! "బొత్తిగా తెగడ లేదన్నయ్యా! ఈ పుస్తకం తీసుకుపోతున్నా" అంటూ ఆవిడ నాయిండియన్ హిస్టరీ వాల్యూమును చేతికి తీసుకునేది. "పరీక్షలొచ్చేస్తున్నాయి జానకీ, నీకు పుణ్యముంటుంది. దాన్నక్కడపెట్టి వెళ్ళు" అని ప్రాధేయపడేవాణ్ణి.

"ఇన్ని పుస్తకాలున్నాయే, యివన్నీ చదివితే చాలదూ" అంటూ జానకి కిటికీకి ఎదురుగా కూచునేది. నేను పుస్తకం మూసిపెట్టి "వంటాగింటా మాని నువ్విక్కడి కెందుకొచ్చావో, ఒకటిరెండు మాటల్లో చెప్పెయ్ జానకీ! నేను చదువుకోవాలి" అనేవాణ్ణి.

"ఇన్ని పుస్తకాలు చదువుతావు గదా! ఒకకథ చెప్పగూడదూ పోనీ"

"వీటిల్లో కథలుండవు జానకీ! అంతా చరిత్ర"

"పోనీ ఆచరిత్రే కొంచెం చెప్పన్నయ్యా! వింటాను"

నేను పక్కున నవ్వేసేవాణ్ణి. జానకి నాతో బాటు నవ్వేది. వీధంట వెళ్ళేవాళ్లు మమ్మల్ని ఆశ్చర్యంగా చూచేవాళ్లు. ఇరుగింటి,పొరుగింటివాళ్లేమను కునేవారో నాకు తెలియదు. కాని జానకి ఎవరినీ లెక్కపెట్టేది కాదు.

ఆ తల్లీకూతుళ్లని చూస్తుంటే ఆకుటుంబానికి, మిగతా ప్రపంచానికి మధ్య లంకె లెప్పుడో విచ్ఛిన్నమై పోయినట్లు తోచేది. ఒక విధంగా వాళ్లది ఒంటరి జీవితం. జానకి మేనత్తగారు ఆవూళ్ళోనే వున్నారు. ముసలావిడ మాటల్లో ఒక్కొక్కప్పుడు వూళ్లో నాలుగో వీధిలోనే వున్న ఆబంధువులని గురించి ప్రసక్తి వచ్చేది. వాళ్లు కొత్తగా కారుకొన్నారు. మేడకట్టించారు. పెద్దవ్యాపారం సాగుతోంది. ఆమేనత్తకు ఒకే ఒక కొడుకున్నాడు. కాపురాలు రెండూ ఒకే పాయలో వున్నప్పుడు అతడికి జానకిని చేసుకోవాలని వాళ్ళు చెబుతుండేవారు. నడిమంతరపుసిరిలో ఆ బంధుప్రేమ మండుటిసుకలో జలకణంలా యింకి పోయింది. వాళ్ళిప్పుడీ వూళ్లో బంధువులున్నారని భావించడంలేదు.

"వాడిని నువ్వూ, ఎప్పుడైనా చూచేవుంటావు చంద్రం; మరేంపనిలేదు. వీధుల్లో తిరుగుతుంటాడు. వాడిసంగతి నేను చెప్పడం బాగుండదు. ఊళ్ళో ఎవర్నడిగినా నీకు తెలుస్తుంది. వాడు వస్తున్నాడంటే ఇక వయసు ఆడపడుచులు యిళ్లల్లో దూరి గడెవేసుకుంటారు" అనేది ముసలావిడ.

"ఎవరెట్లాపోతే మనకేమే అమ్మా! అతగాడైనా ఈమధ్యనేగా యింత అధ్వాన్నంగా తయారైంది! ఐపా ముక్కుడ్డాడు. లేకపోతే కోడెదూడ చెప్పిన మాట వింటుందీ?" అంటూ చర్చలో పాల్గొనేది జానకి.

"ముకుదాడుకేం! నువ్వున్నావుగా! నీకంటే మంచి ముకుదాడు ఎక్కడ దొరుకుతుంది జానకీ! నేను చెబుతున్నా నమ్మ, అక్కడను ఈముకుదాడు తగిలిస్తే పొగరణిగిపోతుంది" అంటూ నేను వుచితంగా సలహాయిచ్చేవాణ్ణి.

"నేనైతేనా! చెవులుమలిమి గదిలో కూలదోసి అతగాడిచుట్టూ గిరిగీసేదాన్ని! వినుకున్నావా?"

అదేం ఆత్మవిశ్వాసం! ఈ ప్రపంచంలో తనకు అసాధ్యమైన పనంటూ ఒకటి లేనే లేదనుకుంటోందా ఈ జానకి! ఏమో, నా కర్థమయ్యేది కాదు.

ఆత్మవిశ్వాసం సంగతలావుంచగా ఆమె యితరుల్ని గూడా అంత దృఢంగానే విశ్వసిస్తుంది.

అదే ఆమెకొంప ముంచింది.

సంక్రాంతి పండుగతర్వాత నాలుగ్గురోజులై వుంటుంది. ఆరాత్రి బాగా ప్రొద్దుపోయేంతవరకూ చదువుతూవుండిపోయాను. తాలూకా కచ్చేరీలో జవాను పన్నెండు గంటలు కొట్టాడు. నాలుగింటికి అలారం పెట్టి, దీపం చిన్నదిచేసి నాపక్కైన పడు పడుకున్నాను. ఇంకా తల్లో గ్రీకుల రాజకీయ కల్లోలాలు, ఆంగ్లేయుల గులాబీపూల యుద్ధాలు, హిందూదేశంలో మహమ్మదీయ దండయాత్రలు కలగాపులగంగా సుళ్ళు తిరుగుతున్నాయి. నిద్రాదేవి పూనకంలో క్రమక్రమంగా బుర్ర వేడి తగ్గుతోంది. ఇంకొక అయిదునిమిషాల్లో గాఢంగా నిద్రపట్టి వుండేదేమో! వీధిమెట్లపైన ఏదో శబ్దం వినిపించింది. ఎవరిదో పదధ్వని! అదేవీధిలో అప్పుడప్పుడూ దొంగతనాలు జరుగుతుంటాయి. కొస్తా జాగ్రత్తపడటం ఎందుకైనా మంచిది. దీపం హెచ్చించడానికి చేయిచాచాను. కానీ లాంతరు చేతికింకా ఒక మూరదూరంలో వుండి పోయింది.

నేను పడుకున్న గదికిఎదురుగా వరండావుంది. వరండాలో గదికిప్రక్కగా పాతకాలంనాటి నగిషీ పనులద్వారబంధమూ, గడ్డపారలకైనా భయపడని తలుపూ వున్నాయి. సింహద్వారానికి అటుఇటు వున్న రెండుగజాల్లో లోపల గదివైపు తెరచుకునే రెండు తలుపుల కిటికీ ఒకటివుంది. కిటికీకి బలమైనకమ్ము

లున్నాయి. కిటికీవైపునుంచి దొంగ యింట్లో ప్రవేశించడం అసాధ్యం. కంగారుపడి అవచ్చిన దొంగను బెదరగొట్టడ మెందుకని దీపం పెద్దది జేసే ప్రయత్నం మానుకున్నాను.

గదిలో పడుకునే, వరండాలో ఏం జరుగుతోందో తెలుసుకోడానికి నాకు గుడ్డిదీపం కూడా కొంత సహకరించింది. మూడు చెక్కలతో బిగింపబడిన గది తలుపులో చెక్కకూ చెక్కకూ నడుమ సందులున్నాయి. ఆ సందుల్లోనుంచి దీపపు వెలుగు వరాండా చివరవున్న గోడపైన పడుతోంది. ఉన్నట్టుండి ఆ కాంతికిరణాలకు అవరోధం తటస్థించింది. సందేహం లేదు, అదొక మానవాకారం!

కిటికీదగ్గర నిలబడి కళ్ళల్లోనుంచి గదిలోపలికి చూస్తున్నాడు. ఎవరో? ఎందుకో? నాకవగతం కాలేదు.

"జానీ! జానీ!" పిలుపు చాలా తేలిగ్గా వినిపించింది.

ఐతే వాడెవడో జానకికి పరిచితుడేనన్నమాట! ఎవడు వాడు? వాడిగొంతు నులిమేస్తే బాగుండును. ఎముకలువిరిచి వాడి శరీరాన్ని ముద్దజేసి ఫుట్‌బాల్లా ఆకాశానికి ఎగురతంతే యింకా బాగుండును

ఇంతలో గాజులు గలగలమన్నాయి

"ఏమిటిది? ఎందుకూ?" జానకి గొంతు.

"తలుపుతియ్—"

"ఎందుకో చెప్పవేం"

"తియ్, చెబుతాను"

తలుపుదగ్గరికి జరిగాను. కనుమరుగైపోయే లోపల వాడిముఖాన్నొకసారి స్పష్టంగా చూడాలని నా ఆదుర్దా. చూచి నేను చేయగలిగిందేమీ లేదు. ఐనా వాణ్ణి చూడ్డానికి ప్రయత్నించాను. గుడ్డివెలుగులో వాడి ముఖం నాకు ఒక్క క్షణంమాత్రం కనిపించింది. ఆవ్యవధిలోనే నేను వాణ్ణి పోల్చుకున్నాను.

వాడు ద్వారబంధాన్ని సమీపించాడు. తలుపు మెల్లగా తెరచుకుంది. వాడు నీడలా లోపలికి జారిపోయాడు. తలుపుకు గడియపడింది. ఎంతజాగ్రత్తగా వేసినా కీచుమనడం ఆగడియ అలవాటు.

ఆ అర్ధరాత్రివేళ నాహృదయంలో ఎలాటి తుపాను ఘూర్ణిల్లిందో నేను చెప్పలేను. నాకళ్ళకు ప్రపంచంగిర్రున తిరుగుతున్నట్టుతోచింది. నేనింతవరకూ స్వర్గంలో వున్నట్టు భ్రమించాను. కాదు. ఇదినరకం. స్వర్గమన్న అపోహతో నేను నరకలోకంలో పరిభ్రమిస్తున్నాను. అబ్బ, ఏంబాధ యిది! సలసల కాగుతున్న తైలంలో పడవేసి నన్నెందుకు మాడ్చివేస్తున్నారు? సూదులు తాపడంచేసిన యంత్రఫలకాల మధ్య నిలబెట్టి నన్నెందుకు చిత్రహింసకు గురిచేస్తున్నారు? నే నేంతప్పు చేశానని?

తప్పుచేసింది నేనుగాదు! జానకి. ఆమె తప్పు చేస్తోందని నే నెందుకు బాధపడాలి? ఆమె ఎవతె? నే నెవణ్ణి? నేను త్రాచుపాముని పుష్పహారమనుకున్నాను. నిజం ఈనాటికి తేలింది. పడగలా పైకి లేచిన యౌవన దురహంకారంతో కళ్ళుకానకుండా ప్రవర్తిస్తున్నావా జానకీ! ప్రవర్తించు నువ్వేమైపోయినా నాకు చింతలేదు!

దీపం పెద్దది జేశాను. కూజాను పైకెత్తి ఒక చుక్క నీళ్ళనైనా మిగల్చకుండా గుటగుట త్రాగేశాను. నిద్ర వచ్చే అవకాశం దాటిపోయింది. ఈ రాత్రికి జాగరణే! చేతికి తగిలిన పుస్తకాన్ని పైకి తీశాను.

కాని మనసు పుస్తకంలో లీనంకావడం లేదు. అది కళ్ళెంలేని గుర్రంలా ఎంత ప్రయత్నించినా పది పదిహేను రోజులక్రితం జరిగిన సంభవంపైకే ప్రసరిస్తోంది.

ఆ రోజు ఆదివారం రాత్రి పదిగంటలవేళ. నాటకంనుంచి ఒక మిత్రుడితో బాటు యింటికొస్తున్నాను.

బజారు నట్టనడుమ ఒక పెద్దగుంపు ప్రోగైవుంది.

"ఏం జరిగింది?" మిత్రుణ్ణి ప్రశ్నించాను.

అతను జనంలోదూరి అసలు దృశ్యాన్ని చూచి వచ్చి "త్రాగుబోతు, త్రాగి మత్తులో ఒళ్ళు తెలియక క్రిందపడిపోయాడు" అన్నాడు.

"ఎవడువాడు"?

"చూచిరా, వాడికథ చెబుతాను"

మనుష్యుల్ని ఒత్తిగించుకుంటూ ముందుకువెళ్ళాను. నిజంగా అది చూడవలసిన దృశ్యం! క్రిందపడివున్న వాడు ముసలీ ముతకా కాదు. వాడివయస్సు పాతికేళ్ళకు లోబడి వుంటుంది మంచి స్ఫురద్రూపి. తెల్లటి

గ్లాస్గోమల్లు పంచమీద సిల్కు జుబ్బా తొడు
క్కున్నాడు. దొరలు కాల్చుకునే సిగరెట్ల తాలూకు
టిన్ను ఒకటి అతడి జేబులోనుంచి క్రిందపడి మూత
వూడిపోగా సిగరెట్లు వీధిలో చెల్లాచెదురుగా పడి
వున్నాయి నలుగురైదుగురు ఆ సిగరెట్లనే ముట్టించు
కుని జీవం వుందో లేదో తెలుసుకోవడానికి కాబోలు
వంగి ఆ పడిపోయి వున్నవాడి ముఖంమీదికే పొగ
వదులుతున్నారు !

గుండెలు బరువెక్కగా గుంపులోనుంచి బయ
టికి వచ్చి స్నేహితుణ్ణి కలుసుకుంటూ "వాడికథ చెబు
తానన్నావే" అని జ్ఞాపకం చేశాను.

"వాడి దీవ్పూరే. నేనూ వాడూ ఒక సంవత్సరం
పాటు ఒకే డెస్కులో కూచుని చదువుకున్నాం. ఆ
తరువాత నేను పైతరగతికి వెళ్ళిపోయాను. వాడా
తరగతిలోనే, ఆడెస్కులోనే వుండిపోయాడు. అంతెం
దుకు ? వాడి చదువు ఆతరగతిలోనే పూర్తయిపోయిం
దని చెబితే ఒకమాటతో సరిపోతుంది."

"బాగా డబ్బున్నవాడేమిటి ?"

"డబ్బూ వుంది. డబ్బుతోబాటు అబ్బిన దుర్వ్యస
నాలూ వున్నాయి. తండ్రి లేడు. తల్లి వుంది. ఆమె
గారికి వీడంటే చెప్పరానంత ముద్దు! వీడు తాగి
తందనాలాడినా, ప్రొద్దుమాటునక్కా ముందేసందుల్లో
షికారు తిరిగినా ఆవిడకు తప్పుగా తోచదు డబ్బుంది
గనుక ఆడబ్బుతో సాధ్యమైన ఆనందాలను వీడనుభ
విస్తుంటే చూడలేక లోకం కళ్ళల్లో నిప్పులు పోసు
కుంటోందని ఆమె అనుకుంటుంది."

"అయ్యో గ్రహచారమా !" అంటూ విస్తు
పోయాను.

"దురాచారాన్ని, వ్యభిచారాన్ని గ్రహచార
మని నువ్వు సరిపెట్టుకోజూస్తే, నాకేం చింతలేదు.
కానీ వీటివల్ల చిట్టచివరకు మిగిలేదిమాత్రం విచారం,
లేకపోతే వినాశం" అన్నాడు మిత్రుడు ఒక సత్యాన్ని
సిద్ధాంతీకరించినట్టు.

"ఇంతకూ వీడిపేరు చెప్పావుకావే" అన్నాను.

"లక్షణమైన పేరు. వాసుదేవమూర్తి. సంగ్ర
హంగా వాసు అని వ్యవహరింపబడుతాడు"

తలదిమ్మ తిరిగింది ! వీడేనా వాసు ? వీడేనా
జానకి మేనత్త కొడుకు ?...అప్పటికింతే అను
కున్నాను. కానీ యింతలోనే ఈ రాత్రివేళ ఒంట
రిగా గదిలో కూచుని, జానకి తలుపుతీయగా యింట్లో
ప్రవేశించిందికూడా వీడేనా అని వితర్కించుకుంటు
న్నాను. కళ్ళతో ప్రత్యక్షంగా చూచిన తర్వాత
కూడా సందేహమేమిటి ? వాడే వీడు !

ఎప్పుడు తలగడ పైకి వాలిపోయానో తెలియదు.
అది నిద్ర అని చెప్పడానికి వీల్లేదు. మనసూ, బుద్ధీ,
మెదడూ అన్నీ శ్రమించి యిక శక్తిలేక శోషిల్లిపోయి
నప్పుడు కలిగే ఒక విచిత్రావస్థ. కళ్ళు తెరిచేసరికి సూర్య
కిరణాలు కిటికీగుండా చాపపైన పడుతున్నాయి.
దీపం పెద్దదిగా వెలుగుతూనే వుంది.

తలుపు తెరుచుకుని పెరట్లోకి వెళ్ళాను. జానకి
బావిదగ్గర అంట్లు తోముకుంటోంది. ఆమె ముఖంలో
చింతాకంత విచారమైనా వ్యక్తం కావటంలేదు.

"అదేమిటన్నయ్యా ! రెండు నెలలు పడకబడిన
వాడిలా తయారైవున్నావు" పరామర్శించింది జానకి.

"రాత్రి నాకు పిచ్చిబట్టింది" అన్నాను.

"దెయ్యం పట్టలేదుగదా !"

"ఆ పట్టేదెయ్యమేదో నిన్నే పట్టింది" అందా
మనుకున్నాను. అనబోయాను. కాని అనలేదు.

ఆ రోజు హోటలులో భోంచేస్తూ "నాకొక గది
చూచిపెడ్తావా రంగమ్మత్తా" అని అడిగాను.

"ఏం ! ఇప్పుడున్నదానికేమొచ్చింది ?" అంది
రంగమ్మ.

"ఏమో, నాకు సరిపడ్డంలేదు"

"ఆ అమ్మా కూతుళ్ళు నిన్ను సొంత మనిషికి
మల్లే చూచుకుంటుంటే సరిపడలేదంటావేమిటి? ఐనా
ఎండాకాలం సెలవులు రానీ వుండు, ఎక్కడైనా గది
ఖాళీ అయితే చెబుతాను."

పెరట్లోకి వెళ్ళి చెయి కడుక్కుంటూ వుండగా
రంగమ్మత్త దగ్గరగావచ్చి "ఏం చంద్రయ్యా ! ఉన్న
ట్టుండి గది మార్చేయాలంటున్నావు. ఏం జరిగిం
దేమిటి ?" అని ప్రశ్నించింది.

ఆవులిస్తే ప్రేవులు లెక్కబెట్టే వాటకం రంగ
మ్మది ! అనుమానమంటూ ఒకటి కలగాలేగాని దాని
కలయాపు తెలుసుకోడానికి ఆవిడకు వెయ్యి వుపా
యాలు చేతనౌను. ఆమె నాలుగు గోడలమధ్య

వుంటూనే తీగను కదిలిస్తుంది. అంతటితో పట్టణం, పట్టణమంతా డొంకలా కదిలిపోతుంది.

"అబ్బే, విశేషమేమీ లేదు. ఆగది కాలేజికి కొంచెం దూరంగా వుండంతే" అన్నాను.

వేసవి సెలవులు మార్చి మూడో వారంలో ప్రారంభమౌతాయి. ఈ ఏడెనిమిది వారాలూ పిల్లైనంత వరకూ గదివైపు వెళ్ళకుండా కాలహరణం చేయ దలచుకున్నాను. కంబైండ్ స్టడీ అని పేరుబెట్టి మేం నాలుగైదుమంది సహపాఠకులం కాలేజీలోనే ఓ గదిలో చదువుకోసాగాము. అప్పుడప్పుడూ పుస్తకాల కనీ, బట్టలకనీ గదిదగ్గరికి వెళ్లవలసి వచ్చేది. వెళ్ళినప్పుడల్లా ముక్తసరిగా ముసలావిడతో మూడు మాటలు మాట్లాడి బయటికి వచ్చేయాలని అనుకునేవాణ్ణి. కాని జానకి విడిచిపెట్టేది కాదు. "వేళకు స్నానం చేయడం లేదు, ఇంటికి రావడం లేదు. చదివి చదివీ కళ్లు లోపలికి పోయాయి, ముఖం పీక్కుపోయింది. మనిషిని క్రుంగదీసే చదువు చదివేం, చదువకేం" అంటూ సాధించేది.

ఈ జానకినిగురించి నేనేమనుకోను? తను చేస్తున్నది తీవ్రమైన తప్పిదమని ఈమెకు తెలియదా? లేక తెలిసీ చేస్తోందా? దీనివల్ల ఎలాంటి విషమపరిణామాలు ఏర్పడ్డానికి అవకాశముందో ఈమె బుద్ధికి తట్టడం లేదా? ఏమో, జానకింతా అయోమయం! నా పాలిటి కామె ఒక చిక్కువిడని సమస్య.

చక్కటి కౌటికేలోపుగా క్రుంకిపోమే ప్రొద్దుతోనూ, ఎంతకూ అంతంగాని రాత్రులతోనూ యిరవై ఎనిమిది రోజుల ఫిబ్రవరినెల శరవేగంతో గడచిపోయింది. పరీక్షలు వ్రాసి, పెట్టెబేడా సర్దుకుని వీడ్కోలు తీసుకోడానికి యింటి లోపలికి వెళ్లాను. మంచాన్నంటిపెట్టుకపోయిన ముసలావిడ ముఖంలో క్రమేపీ జీవకళ నీరసించిపోతోంది. జానకి ముఖంలో సైతం ఎన్నడూ లేంది ఒక విచారరేఖ నాకారోజున స్పష్టంగా పొడగట్టింది. అది నేను వెళ్ళిపోతున్నందుకు గలిగిన విచారమా? లేక స్వయంకృతాపరాధాన్ని హఠాత్తుగా గుర్తించినందువల్ల కలిగిన పశ్చాత్తాపం గుండెల్లోనుంచి పొంగి ఆమె ముఖాన్ని వివర్ణం చేసి వేస్తోందా?

"వెళ్లొస్తాను జానకీ" అన్నాను.

వంట చేసుకుంటున్న జానకి నాకేసి తిరిగింది. ఆమె కళ్లల్లోనుంచి కన్నీరు ధారలుగట్టి ప్రవహిస్తోంది.

"ఎందుకేడుస్తావు జానకీ?" అది వూరడింపు కాదు. ఊరికే నిర్లిప్తంగా ప్రశ్నించాను.

అమ్మస్థితి యిలా దిగజారిపోతోంది నాకు అన్నతమ్ముళ్లు లేరు. అక్కచెల్లెళ్లు లేరు."

"అవును నిజమే" అన్నాను.

"ఈ దిక్కులేనిదాన్ని మరచిపోతావా అన్నయ్యా!"

ఒక్కసారిగా నేను హృదయానికి బిగించుకున్న ముళ్ళన్నీ పుటుక్కున తెగిపోయాయి. కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. ముఖాన్ని మరోవైపుకు తిప్పుకుంటూ "ఎలా మరచిపోగలను జానకీ! నువ్వింతటి మంచిదానివి గాకపోతే మరచిపోయేవాడినేమో! మనుషుల కింత మంచితనం పనికిరాదు. మనుషుల్లో పశువులున్నారు. వాళ్ళు తేనెపూసిన కత్తుల్తో తడిగొంతుకలు కోస్తారు. ఐనా నీకే భయంలేదు. భగవంతుడు నిన్ను రక్షిస్తాడు" అన్నాను.

బహుశా నామాటలు అర్థమై వుండవు. జానకి నివ్వెరపోతోంది.

"అవును జానకీ? ఇవి నేను చెప్పిన మాటలు కావు. ఎవరో నాచేత పలికించారు" అంటూ పెట్టె తీసుకుని బయటికి వచ్చాను.

జానకి గది గుమ్మంవైపు చూస్తూ "మళ్ళీ వస్తావు గదూ అన్నయ్యా! ఈసారి నువ్వు వచ్చేంతవరకూ ఈతలుపు యిలాగే వుంటుంది నువ్వే వచ్చి తీసుకోవాలి" అంది.

"అలాగే జానకీ! జాబులు వ్రాస్తుంటావు గదూ!" అప్రయత్నంగా నే అడిగాను.

జానకి కంబానికి ఆనుకుని వ్రాస్తా నన్నట్టు తలాడించింది. నేను తలవంచుకుని వీథి వెంబడి నడవసాగాను....

*   *   *

"ఏమండీ! ఏమండీ!" తలుపుపైన చప్పుడుతో బాటు పిలుపు వినిపించింది.

"ఎవరూ? ఏమిటి? ఎందుకూ?" అంటూ పైకి లేచాడు సూర్యం

"అయ్యో రామ! అదేం కంగారు బాబూ! అదే పనిగా టెలిఫోన్ మ్రోగుతుంటే పిలుద్దామని వొచ్చాను" అంది నీరజ.

తలుపు తెరుస్తూ సూర్యం "ఎవరో అడగలేక పోయావా" అన్నాడు.

"అడక్కేం! 'మాట్లాడుతున్నది డాక్టర్ చెట్టియార్. అవసరం. అత్యవసరం' అని గోలపెడుతున్నాడు"

సూర్యం ఒకసారికి మూడేసి నాలుగేసి మెట్లుగా క్రిందికి లంఘించి రిసీవరు చేతికి తీసుకున్నాడు.

"హలో డాక్టర్! నేను సూర్యనారాయణని ఏం జరిగింది.

"ఉదయం మీరు పంపించారే ఆ ముసలాడు..."

"ఏమయ్యాడు?"

"అతడి స్థితి చాలా అపాయకరంగా వుంది"

"ఉంటుంది. ఎందుకుండదు? వాడు సంఘానికి చీడ పురుగ్గా బ్రతికాడు. మానవతుల శీలానికి ముప్పుగా బ్రతికాడు. ఈమాట నేను చెప్పడంలేదు మా నాన్నగారు చెబుతున్నారు. పాపాలు వూరికే వదుల్తాయా డాక్టర్? పాములు కప్పల్ని తరుముతాయి పాపాలు మనుషుల్ని వెంటాడుతాయ్. వెంటాడనీ. అందుకెవరేం చేయగలరు? మీరు...మీరు..."

చేతిని సూర్యం నోటికి కడ్డంగా చాచి "ఏమిటండీ మీ గగ్గోలు" అంటూ అపహరించింది నీరజ

సూర్యం కొంత తమాయించుకుని నీరజ చేతిని అవతలికి తోసివేస్తూ "మీ చేతనయింది మీరు చేయండి డాక్టర్? అంతకంటే నే నేం చెప్పగలను" అన్నాడు.

"ఆల్ రైట్. ప్రయత్నిస్తాను" అంది అవతలి కంఠం. సూర్యం రిసీవరును యథాస్థానంలో వుంచి మేడమెట్లకేసి తిరిగాడు.

"కానీవుండండి కాఫీ తీసుకెళ్దురు గానీ" అంటూ నీరజ వంటగదికేసి వెళ్ళింది

చేతివేళ్లను క్రాఫింగులో దూర్చి కణతల్ని గట్టిగా అదిమి పట్టుకుంటూ కళ్లు మూసుకుని సూర్యం కుర్చీలో కూచున్నాడు. నీరజ ఎప్పుడు వచ్చిందో సూర్యానికి తెలియదు. పెదవులకు వేడి కప్పు తగిలి చురుక్కు మనగా వులిక్కిపడి అతడు కళ్లు తెరిచాడు.

"త్రాగండి కాఫీ" అంది నీరజ.

సూర్యం కప్పును చేతిలోకి తీసుకుని ముఖం పైకెత్తి ఓ గ్రుక్కెడు కాఫీ నోట్లోకి పోసుకున్నాడు.

"అదేమిటండీ కాఫీని మంచినీళ్లలా తాగేస్తున్నారు!" విస్తుపోయింది నీరజ.

కప్పును టేబిల్ పైకి జారవిడిచి సూర్యం అలాగే పైకిలేచాడు. కుడ్యానికి అలంకారప్రాయంగా అమర్చి వున్న పెద్దసైజు ఛాయా చిత్రాన్ని చూస్తూ ముందుకు నడవసాగాడు. "సౌభాగ్యవతి జానకి"

పటంక్రింద ఎవరు వ్రాసారో గానీ ఆ అక్షరాలు ముత్యాల్లా మెరిసిపోతున్నాయి.

"మీ వాలకం చూసినా, చూడనా నాకు మతిపోతోందండీ బాబూ! అది మీ అమ్మగారి ఫోటో. ఈరోజు కొత్తగా అందులో ఏం కనబడిం దేమిటి?" అంది విస్మయంతో నీరజ

సూర్యం దిక్కులు తోచని వాడిలా నీరజమాటలు విన్నాడు. మళ్ళీ ఛాయా చిత్రాన్ని చూచాడు. మేడమెట్ల దగ్గరికి దూకాడు. మరుక్షణాన మేడపైన గదిలో వున్నాడు.

* * * *

"పట్నాల్లోనైతే కాలం విద్యుల్లతలా పరుగులు తీస్తుంది పల్లెటూళ్లలో అంచనడకలు నడుస్తుంది. ఊళ్ళో మూడు నెలల వేసవి సెలవులూ మూడు యుగాల్లా గోచరించాయి. పదిగంటలకల్లా స్నానం చేసి సుష్టుగా అన్నంతిని నిగనిగలాడే నీరెండలో తెంకాయతోపు దగ్గరికి నడుస్తుంటే ఎప్పుడెప్పుడు మంచం పైన వాలిపోదామా అనిపించేది. చల్లటినీడలో పడుకొని పుస్తకం తెరిస్తే మనసు ఎక్కడెక్కడికో వుచ్చులు తెంచుకుని ఎగిరిపోయేది ఎందుకో అర్థం కాని కాలేజిచదువులు, ఉన్నా వూడినా హృదయాన్ని కదిలించలేని విద్యార్థుల సాహచర్యాలు, రుచిగానే వున్నా నాలుగుపూటలు వరుసగా తినేసరికి ముఖం మొత్తే రంగమ్మభోజనం, ఈ తలపుల చిట్టచివర జానకి! వల్లమాలిన ఆత్మవిశ్వాసం, అతిక్రమించిన అమాయకత్వంలాంటి నిరుపయోగకరమైన ఆయుధ సామగ్రితో జీవిత రణరంగంలో నిస్సంశయంగా ప్రవేశిస్తున్న నిస్సహాయ జానకి! ఏమైవుంటుందో జానకి!

ఏమో! నాకు తెలియదు. మూడు నెలలుగా ప్రతిరోజూ తపాలా వాడికోసం ప్రతీక్షించాను,

వచ్చాను. వెళ్ళిపోయాను. జానకిదగ్గరనుంచి మాత్రం వుత్తరంలేదు.

నా చదువుకోసం నాన్నగారప్పటికే ఐదారు వందలు అప్పుచేసి పెట్టారు. ఇంకా మూడేళ్లు చదువు కొందే నా చదువుకు రాణింపులేదు. అత్తగారింటి నుంచి వచ్చే ఆడబిడ్డలకు సారెసారెకూ సాగెలుపెట్టి పంపాలి. అప్పుచేయడానికిమాత్రం యింకా బోలెడన్ని అవసరాలున్నాయి. కాని ఒక్కబొంకులోనైనా పది రూపాయలు చెల్లువేయగల అవకాశం కనుచూపు మేరలో కనిపించటంలేదు. సమయానికి మా నాన్నగారికొక మార్గాంతరం స్ఫురించింది. ఆయన నన్ను పెళ్లిళ్ల మార్కెట్టులో పెట్టారు. తెలివి, చదువు, అందం మొదలైన నా యోగ్యతల్ని గురించి పరిచితులద్వారా బంధువులద్వారా ప్రచారంచేశారు ఏతత్ఫలితంగా నాకో సంబంధంవచ్చింది. అమ్మాయి యింకా చిన్న పిల్ల. నా చదువుకికవాళ్ళే పెట్టుబడిపెడ్తారు పెళ్ళి ఒక సంవత్సరం తెరువాతజరిగినా పరవాలేదు ఈ షరతులతో కాబోయే నా వివాహానికి యిటు మా నాన్నగారికి అటు అమ్మాయి తండ్రికి ఒప్పందాలు కుదిరాయి.

రేపు కాలేజి తెరవబోతున్నా రనగా ఈరోజు మధ్యాహ్నం పన్నెండు గంటలకు అనంతపురంలో దిగాను. రంగమ్మ హోటలు స్టేషనుకు చేరువలోనే వుంది రైల్లోకూచుని నరాలు పట్టుకపోయిన కాళ్ళు ఈడ్చుకుంటూ రోడ్డుమెంబడి నడుస్తున్నాను. జరుగుతున్నది ఎండాకాలం గాకపోయినా ఎండలిప్పుడు చెరిగిపోస్తోంది. గడచిపోయిన వేసవిలోనైనా ఇలాటి మండుటెండలు లేవు. పైగా మే నెల పొడుగునా ముసురుబట్టి జడివానలు కురిశాయి. చైత్రవైశాఖాలు వసంత మనుకుంటాను. కొన్ని చెట్లు చైత్రం రాకముందే చిగురిస్తాయి. కొన్ని చెట్లు వైశాఖం తర్వాత చిగురిస్తాయి కాలం నేపట్టకంలో ఋతుధర్మాలే వక్రీభవనం చెందుతున్నాయి ఇక మానవస్వభావాల మాటేమిటి!

"బాగున్నావా నాయనా!" అంది రంగమ్మత్త నేను కనపడగానే

"ఏదో, యిలావున్నాను" అంటూ నేలపైన చతికిలపడ్డాను.

రంగమ్మ యిచ్చిన స్వాగతం నాకు రుచించింది గాదు. మరికొంత ఆప్యాయంగా ఆమె నన్ను పలకరించి వుండవలసింది. ఒకటి రెండు నెలల తర్వాత మనిషి కనబడితే రంగమ్మ వాడికి స్వాగతమిచ్చే తీరే వేరు. గబగబా వాడిదగ్గరకువచ్చి కనుకొప్పు పెద్దవి కాగా నిలువునా పరికిస్తూ "ఇదేమిటయ్యోవ్! బాగా చిక్కిపోయావే" అనో, "ఉర్లగడ్డలా ఊరిపోతున్నావే అల్లుడా! పెళ్ళి తలపెట్టుకోగూడదూ" అనో నవ్వుతూ పరామర్శించడం రంగమ్మ అలవాటు. నాకలాటి మర్యాద జరగలేదు. జరక్కపోయినందుకు కాదు నా చింత! రంగమ్మ కెందుకో నాపైన కినుక గలిగింది. కారణమేమిటి? అదే నా ఆలోచన.

హోటల్లో భోంచేస్తున్నవాళ్లు ఒక్కొక్కరుగా లేచిపోయారు రెండో బంతికి నేనొక్కణ్ణే మాత్రం మిగిలాను హోటల్లోకొత్తగా చేరిన అబ్బాయి ఒకడు వడ్డిస్తున్నాడు. రాత్రి భోజనానికి వంకాయలు తరుక్కోవడంకోసం కత్తిపీట పైన కూర్చుంటూ రంగమ్మ ఒకసారి నన్ను తీక్ష్ణంగా చూచి "మట్టి గుర్రాన్ని నమ్మి గోదావరిలో దిగకూడదు" అంది.

సుమారుపాటి పిడుగొకటి తలపైన పడినట్టయింది నా పని అన్నం తింటున్న విషయం కూడా మరచిపోయి తెల్లబోతూ రంగమ్మకేసి చూడసాగాను.

"ఒక సంవత్సరంపాటు ఆ యింట్లో వున్నావు' వాళ్ళు నిన్నక్కడే తినమన్నారు కూడా! అంతగా నువువాళ్ళకి కావలిసినవాడివయ్యావు. ఈ ప్రపంచకంలో వాళ్లకు నువుదిక్కంటూవుంటే నువ్వొక్కడివే! ఐతే నువు చేసిన పనేమిటి?"

"ఏం చేశాను?" నిజానికి నే నేమీ తప్పు చేయలేదు కాని నేనెందుకో భయంతో వణకిపోతున్నాను. బహుశా ఆ క్షణాన నా ముఖం పాలిపోయి వుంటుంది.

"ఇంకేం చేయాలి? ఆ ముసలావిడ ప్రాణం గుటుక్కు మన్నప్పుడు నువు రావలిసింది! పాపం, ఆ పిల్ల ఏం చేస్తుంది? పైగా వట్టిమనిషి గూడా గాకపోయే!"

"ఏమిటీ!"

నా ఆకతాయితనాన్ని అవహేళన చేస్తున్నట్టుగా ఓసారి లేలిగ్గానవ్వి "ఏమిటో నీకే తెలియాలి బాబూ! మాకేం తెలుస్తుంది?" అంది రంగమ్మ.

"నాకేం తెలియదు" అన్నాను. ఆవేశమేమిటి, వీధిలోకి వినిపించేట్టు అరిచాను. అది స్వగృహం

కాదు. అయివుంటే ఆరోషంలో నేను అన్నాన్ని వలుమూలలకు వెదజల్లేవాణ్ణి. నా కంత కోపం తెప్పించినవాళ్ల పైకి టంబ్లర్ గిరవాటు వేసివుండే వాణ్ణి.

"నీకేం తెలియదూ? నువ్వేపాపమూ ఎరుగవూ?" నిలదీసి ప్రశ్నిస్తోంది రంగమ్మ.

"అవును. నాకే పాపమూ తెలియదు. కావలిస్తే తినబోతున్న అన్నాన్ని చేతబట్టుకుని ప్రమాణం చేస్తాను" అన్నాను.

రంగమ్మ విచిత్రమైన మనిషి ఒక క్షణంలో ఆవిడ కోపం నాపైన అసహ్యంగా మారిపోయింది "తప్పు చేయకపోతే నీకెందుకు కోపం వస్తుంది? దోషం నీలో లేకపోతే నానోట మాట వచ్చీ రాకముందే నువ్వెందుకు ప్రమాణకాలకు దిగుతావు?"

ఇదేం కుతర్కం! రంగమ్మకు నేనేం సంజాయిషీ చెప్పుకోగలను? ఎలా చెబితే ఈమెకు నమ్మకం కలుగుతుంది? లోకులు కాకులు. ఆ కాకులకు ప్రాతినిధ్యం వహిస్తున్న మనిషి రంగమ్మ. రంగమ్మ కాఁకాఁ అంటోంది. ఇక కాకులన్నీ అరుస్తాయి. నా చెవులు చిల్లులుపడిపోతాయి. నేను వినలేను. నేను భరించలేను. వినలేక ఆబాధను భరించలేక నేనేం చేయగలను?

విస్తరిలో అన్నాన్ని అలాగే వదిలిపెట్టి పైకి లేస్తూ "నువ్వేదో మంచిదానివనుకున్నాను. నువ్వు గోడ్రాలివి. నీకు కొడుకులుంటే వాళ్ళపైన ఎవరైనా యిలాంటి నీలాపనిందలు వేసి వుంటే, అప్పుడు నాబాధ నీకర్థమై వుండేది" అంటూ తొట్లో చెయి కడుక్కున్నాను.

"ఇంతమాత్రం నాకొడుకైతేనా? ఇటూ అటూ నాలుగు లెంపకాయలు వాయించి రెండు నెలల క్రితమే ఆపిల్లను వాడికి ముడిపెట్టి వుండేదాన్ని."

వీధిమెట్లు దిగుతూ ఆమాటలు విని ఆగాను. ఇక రంగమ్మతో వాదించి లాభంలేదు. తల వంచుకుని మెల్లగా వీథిలోకి వచ్చేశాను.

నడుస్తున్నాను గానీ గమ్యస్థానమేదీ! మనసిచ్చి నా మాటల్ని అర్థం చేసుకోగలిగిన వాళ్ళెవరున్నారు. ఒక్క జానకి తప్ప! అపరాధం చేయమాచేసి, అవమానాన్ని నాపైన వదులుతుంటే పులుక్కుండా పల కుండా పరిణామాలకోసం ఎదురు చూస్తున్న జానకి! ఈజానకిని ఏంచేసినా పాపంలేదు. పెళ్ళి పెటాకులూ కావలసినవాణ్ణి. నలుగురిలో తల ఎత్తుకుని తిరగవలసిన వాణ్ణి. తనని తోబుట్టుగా తప్ప మరొక దృష్టితో చూచిన పాపాన పోనివాణ్ణి. నన్నిలా నగుబాట్ల పాలుచేసి నాలుగుగోడల మధ్య కూచుంటుందా జానకి! సత్యాన్ని వెలిబుచ్చవలసిన అవసరం కలిగినప్పుడు దాన్ని ప్రకటించకుండా మౌనంగా వుండటం కన్నా ఘోరమైన అపరాధంలేదని జానక్కి తెలియదు కాబోలు. అడుగుతాను. నిలదీసి అడుగుతాను. నేనసమర్థుణ్ణి గాను. సత్యమేదో కక్కించి ఈలోకుల నోళ్లు మూయడం నా చేతనౌను.

ఈ నిర్ణయానికి వచ్చినప్పుడు పట్టణంలో ఏ భాగంలో వున్నానో నాకు తెలియదు తరువాత అయిదు నిమిషాలకు "జానకీ, జానకీ" అని పిలుస్తూ తలుపు దబదబా బాదేస్తున్నాను.

ఇరుగుపొరుగు వాళ్లు కొందరు అప్పుడే నా రాకను పసిగట్టేశారు. నా తెంపరితనానికి విస్తుపోతూ నోళ్లు నొక్కుకుంటున్నారు. కళ్ళతోనే నన్ను గురించి మాట్లాడుకుంటున్నారు.

తలుపు మెల్లగా తెరచుకుంది. లోపల ప్రవేశించాను. కళ్లు పైకెత్తి జానకిని చూడ్డానికి మన సొప్పకోడం లేదు. పెడముఖంతోనే నడవలోకి వెళ్ళి మంచం పైన కూచున్నాను.

"ఊరినుంచీ ఎప్పుడొచ్చావు అన్నయ్యా?"

అప్రయత్నంగా తల పైకెత్తి జానకివైపు చూచాను. ముఖంలో కాంతిలేదు. విరిసీ విరియని వేయిరేకులపద్మానికి కాడదగ్గర కాటు పడింది. ఆ కాటు లోకానికి కనపడ్డంలేదు. కాని పువ్వు వాడిపోతుండడంమాత్రం లోకం రూక్షవీక్షణాలతో చూస్తోంది. కడకది వాడి వత్తై కుళ్ళి నశించిపోడాన్ని కూడా లోకం నిర్లిప్తంగా చూడగలుగుతుంది.

కూలిపోయిన రాజప్రాసాదంలో ఏపుగా పెరుగుతున్న బొంతజముడుపొదలా జానకి హృదయంలో ఆవేదనలు చెలరేగుతున్నాయని ఎవరికి తెలుసు? వానలేక బీటలువారిపోయిన మాగాణి పొలంలా ఆమె మనసు వికలమైపోతోందని ఎవరికి

తెలుసు? లేకంటే ఆమె అడుసులో కాలు వేసిందని అందరూ తెలుసుకున్నారు. ఆమె పతితురాలై పోయిందని చెవులు కొరుక్కున్నారు.

"మధ్యాహ్నం బండికొచ్చాను. నేరుగా హోటలుకు వెళ్ళి భోంచేసి వస్తున్నాను."

"అన్నం తిన్నట్టు కనపడ్డం లేదే!?"

"తినాలనే కూచున్నాను. కానీ తీరా మారా తినలేకపోయాను."

"ఎందుకూ?"

"ఎందుకేమిటి? మీ అమ్మ చనిపోతే ఓ కార్డు ముక్క వ్రాయడానికైనా ఓపిక లేకపోయిందా జానకీ నీకు? అవసరం లేనప్పుడు వారానికో వుత్తరం వ్రాసేదానివి. ఏమిటో మరి! ఆడవాళ్ళ మనస్తత్వాలెవరికి అర్థమౌతాయి?"

"నేను మనుషులా వున్నానా అన్నయ్యా? లేను. చెడిపోయాను. ఇప్పుడు నేనేం చేసినా లోకానికి తప్పుగానే కనిపిస్తుంది. అందుకనే జాబు వ్రాయలేదు."

జానకి యింత స్పష్టంగా తప్పొప్పులు తేల్చి మాట్లాడివేస్తుందని నేననుకోలేదు! ఆమె అపరాధం చేయడంలో ఎంత ధైర్యం ప్రదర్శించిందో దాన్ని ప్రకటించడంలోనూ అంతే ధైర్యం ప్రదర్శిస్తోంది.

బయట వడగాడ్పు యింకా తగ్గలేదు ఐనా యింట్లో చల్లగావుంది. ఎండలో కాగికాగి బరువెక్కిన తల నాకు తెలియకుండానే సుందంకోసు పైకి ఒరిగిపోయింది. కళ్ళుమూసుకుని ఆలోచనలో పడ్డాను. నేను జానకిని తీవ్రంగా మందలించాలనుకున్నాను. ఏదీ! ఎప్పుడు మందలించాను? లేకంటే ఆమె జాబు వ్రాయకపోవడం ఒక నేరంగా ఎత్తి చూపించగలిగాను. ఆమె జాబు వ్రాసివుంటే సెలవుల్లో నేనొకసారి యిక్కడికి వచ్చివుంటే ఆ సంఘటనవల్ల లోకుల అనుమానం మరింత బలపడివుండేది. ఇక జానకితో నాకు అవినీతికరమైన సంబంధముందని లోకులనుకుంటున్నారంటే అందుకు బాధ్యత జానకిదిమాత్రమే కాదు నేనీ యింట్లో ఏడెనిమిది నెలలు అద్దెకున్నాను. కాని నే నద్దెకున్నానని ఎవరనుకున్నారు? నా ప్రవర్తన హద్దులుమీరింది. అప్పట్లో జానకినీ, నన్ను చూచిన వాళ్ళు ఎంతవరకైనా వూహించుకోడానికి అవకాశముంది. వాళ్ళ కలాటి అవకాశం యివ్వడంలో జానకిదెంతతప్పో, నాదీ అంతతప్పే! నిజం యిలావుండగా జానకిని నేనేమని మందలిస్తాను?

జానకి యిప్పుడు వట్టిమనిషి కాదు. రంగమ్మ చెప్పివుండకపోయినా ఈ విషయం నాకీపాటికి తెలిసివుండేది. ఇప్పుడు జానకి లజ్జాభిమానాలు వదిలి తననీ స్థితికి తెచ్చినవాడెవడో లోకానికి ప్రకటిస్తే నేనీ పద్మవ్యూహంనుంచి బయటపడగలను. కాని తను అనుమానాలు, ఆధారాలు మరొకవిధంగా వుండగా ఆ సత్యాన్ని లోకం తర్కవితర్కాలు లేకుండా నమ్మేస్తుందని నమ్మకమేమిటి? నేనూ జానకీ కూడబలుక్కుని ఈ అపనిందను మరొకడితలపైన రుద్దుతున్నామని వాళ్ళనుకుంటే?

"లేచి ముఖం కడుక్కో అన్నయ్యా! నాలుగు మెతుకులు ఎంగిలిపడ్డువుగానీ" అంది జానకి దగ్గరగా వస్తూ.

"నీకు జ్ఞాపకముందా జానకీ! ఆనాడు నేను బల్లగుద్దినట్టు చెప్పాను" అంటూ లేచి కూచున్నాను. "మానవుల కింత మంచితనం పనికిరాదు మనుష్యుల్లో పశువు లుంటారు. వాళ్ళు తేనెపూసిన కత్తుల్తో తడిగొంతుకలు కోస్తారు."

"నిజమే అన్నయ్యా" అంది జానకి. ఆమె కంఠం గద్గదికమైపోయింది. "మోసపోయాను తప్పకుండా పెళ్ళి చేసుకుంటానన్నాడు. నేను గనుక ఒప్పుకుంటే దుర్వ్యసనాలన్నీ వదులుకుంటానన్నాడు. ఇలా మోసం చేస్తాడని నాకు తెలియదు."

నేనాక్షణాన వూరుకోవలసింది. ఒకప్పుడు ఉచితానుచితాలు ఎరగకుండా నోరు జారవిడవడం నాకేకాదు, మానవుల కందరికీ పరిపాటి. అసలే అగ్నిజ్వాల అందులో నేనాజ్యం పోశాను.

"ఇలా మోసం జరుగుతుందని నాకాదినుంచీ తెలుసు జానకీ! ఆరోజు ఉదయం నేను లేచి పెరట్లోకి వచ్చాను. అదోలావున్నావేమని నువ్వు పలకరించావు. రాత్రి నాకు పిచ్చిపట్టిందన్నాను. నువ్వు దెయ్యంపట్టలేదుగదా అన్నావు. అప్పుడే అరదామనుకున్నాను. ఆ పట్టేదయ్యమేదో నిన్నే పట్టిందని. కానీ అనలేదు."

"మన కెందుకని పూరుకున్నావు గదూ?" సూటిగా ప్రశ్నించింది జానకి.

"అవును" అన్నాను.

"నిజమే. నీ చెల్లెలైవుంటే నువ్వాక్షణంలో నే సరిదిద్దుకునేవాడివి. ముక్కలు విరగవన్ని గదిలో వేసి తాళం వేసేవాడివి. నే నెవతెని? నే నేమై పోయినా నీకేం చింత? ఈలోకంలో న్యాయమింతే అన్నయ్యా! అదీ యిప్పుడే తెలిసింది".

నాకు నిజంగానే పిచ్చి పట్టిందేమో ననిపించింది! ఒక గంటక్రితం నా దృష్టిలో జానకి దోషి. కాని యింతలోనే వ్యవహారం తలక్రిందులైంది నేను ముద్దాయినైపోయాను. జానకి నా మీద నేరం ఆరోపిస్తున్నది.

"అదంతా యిప్పు డెందుకన్నయ్యా! నువు భోంచేద్దువులే" అంది జానకి.

లేచి ముఖం కడుక్కొని గదిలోనికెళ్ళి పీటపైన కూచున్నాను. అన్నంవడ్డిస్తూ అంది జానకి. "అమ్మకు పదిరోజులు జ్వరం కాసింది. నాలుగురోజులు ఒంటిమీద స్మారకం లేదు"

"మందిప్పించలేదూ?" అన్నాను.

"డాక్టరొచ్చాడు. రెండు సూదులు వేశాడు. గుణం కనిపించలేదు. పెదవివిరిచి వెళ్ళిపోయాడు. జ్వరం వచ్చినకొత్తలో అమ్మ చంద్రానికైనా జాబు వ్రాయకూడదా జానకీ అంది."

"ఏమన్నావు?"

"ఎవరొచ్చిమాత్రం చేసే దేముందని వూరుకున్నాను. ఇక రెండురోజుల్లో స్మారకం తప్పిపోతుందనగా అమ్మ నన్ను దగ్గరకు రమ్మంది. మంచంపైన కూచోమంది. నా తలను రొమ్ము కానించుకుని 'ఈ లోకంలో ఎలా బ్రతగ్గలవు జానకీ' అని అడిగింది. దేవుడున్నాడులే అమ్మా అన్నాను. రాత్రులు బొత్తిగా నిద్రపట్టేది కాదు. ఏ వేళకంటే ఆ వేళకు లేచి పాలు త్రాగించేదాన్ని. ఓపరికం వున్నంతవరకూ గుక్కెడు గుక్కెడుగా పాలుమింగింది. ఆతర్వాత పోసినపాలు యిట్టే వచ్చేసేవి. ఓరోజు రాత్రి తెల్లవారుఝామున లేచి కుంపట్లో పాలుకాచి మంచం దగ్గరకు తీసుకెళ్లాను. అమ్మ వులకలేదు. పలకలేదు. చనిపోయింది."

జానకి వెక్కి వెక్కి ఏడుస్తోంది. "అమ్మేకాదు జానకీ! మన మందరమూ చనిపోవలసిన వాళ్ళమే" అంటూ లేచి చెయికడుక్కున్నాను. జానకి విస్తరి తీసుకెళ్ళి పెరట్లో పారవేసి లోపలికి వస్తోంది.

"ఒకసారి నేను వాసుతో మాట్లాడి చూస్తాను జానకీ" అన్నాను నడవలోనుంచి ఆకాశంవైపు చూస్తూ.

జానకి రెండు క్షణాలు ద్వారంవద్దర ఆగింది. తర్వాత మౌనంగా వంటగదిలోకి వెళ్ళిపోయింది. ఆ పరిస్థితిలో మౌనంగా గాక మరొకవిధంగా జానకి ఎలా అంగీకారాన్ని వెలిబుచ్చగలుగుతుంది?

తలుపుతీసుకుని చరచగా వీధిలోకి వచ్చేశాను. వాసుదేవమూర్తి ప్రత్యేక నివాసగృహాన్ని నేనొకటి రెండుసార్లు చూచాను. కానీ అతను యింటిపట్టున పడివుండే మనిషికాదు. అదృష్టవశాత్తు ఆరోజు సాయంత్రం యింటి దగ్గరే కనిపించాడు. చూచిచూచి దాన్ని యిల్లని పేర్కొనడం బాగుండదు. అది పాశ్చాత్యుల అర్ధరాత్రి క్లబ్బులాటిది. హాలునిండా గ్రీకు దేవతల నగ్నశిల్పాలు, గోడలకు లోక్లాసు మంగలిషాపుల్లో వుండదగిన బూతు చిత్రాలూ వున్నాయి. వాసును ఒంటరిగా కలుసుకోవాలనుకున్నాను. ఆ అవకాశం మాత్రం లభించింది కాదు. మిత్రులతో కలిసి అతను 'మీనాఫ్' ఆడుతున్నాడు. నన్ను చూడగానే జూదగాళ్లలో ఒకడు "ఆడ్డానికి వచ్చావా" అని అడిగాడు. "కాదు, ఆయనతో మాట్లాడ్డానికి వచ్చాను" అంటూ వాసును చూపించాను. నాకేసి విచిత్రంగా చూచి "నాతో మాట్లాడాలా?" అన్నాడు వాసు. అవునన్నాను. "ఇక్కడే మాట్లాడవచ్చు" అన్నాడు. "ఎంతోసేపు పట్టదు. అయిదునిమిషాలు. ఆ గదిలోకి వెళ్దాం" అన్నాను. వాసు నాలుగాటలు ఆడి, మళ్ళీ పైకి లేచాడు. గదిలో కూచుని చెప్పవలసిన విషయం సంగ్రహంగా చెప్పేశాను. కావ్యానంతరం ఫలశ్రుతిలా ఆడవాళ్లని నమ్మించి మోసగించడం చాలా సులభమనీ, కాసుకు కొఱగానివాడుకూడా అలాటి పనిని నిర్విఘ్నంగా నెరవేర్చగలడనీ, చేసిన తప్పును సరిదిద్దుకోడం యిహపరాలకు రెంటికీ మంచిదనీ నచ్చజెప్పబోయాను. "ఆ అమ్మాయి తరఫున వకాల్తా పుచ్చుకోడానికి నీకూ, ఆవిడకూ వున్న సంబంధమే

మిటో తెలుసుకోవచ్చా ?" అన్నాడు వాసు. ఐదు నిమిషాలసేపు ధారాపాతంగా అతడు మాట్లాడిన మాటల్లో సభ్యప్రపంచం వినదగినదేదైనావుంటే యిదొక్కటే! మనిషికి సౌశీల్యం అవసరమన్న మూల సిద్ధాంతంలోనే నమ్మకంలేనివాడు అంతకన్నా మెరుగ్గా మాట్లాడ్డం సాధ్యంకాదేమో!

తిరిగి వస్తున్న నాకు గదిలోనుంచి పకపకలు, వికవికలు వీడ్కోలిచ్చాయి. బరువుగా అడుగులు వేసుకుంటూ చీకటి గుయ్యారాల్లా వున్న వీధుల్లో నడుస్తున్నాను. ఇంటికి వెళ్ళి నేను జానకితో ఏం చెప్పాలి? ఆశ చాలా మొండిది. ఎలాంటి విషమ పరిస్థితుల్లోనైనా అది నేనున్నానని పైకి పొడసూపుతుంది. నా వేడికోలును అతడు మన్నిస్తాడనీ, తన బ్రతుకు తోటలో వసంతాలు వెల్లివిరిసే అవకాశం లేకపోలేదని ఆశిస్తుంటుంది జానకి! ఈ ఆశాజ్యోతికూడా ఆరిపోతే ఆమె బ్రతుకేంగావాలి?

ఇల్లు చేరుకునేసరికి గంట ఎనిమిదిన్నరయింది. ఆ పాటికి జానకి మూల ముసుగు పెట్టుకుని కంటికి కడివెడుగా ఏడుస్తుంటుందని నేననుకున్నాను. కానీ నా అంచనా తారుమారయింది. గదులన్నిటిలోనూ దీపాలు వెలుగుతున్నాయి నడవలో చాప వేసుకుని జానకి అద్దం ముందు ముస్తాబు చేసుకుంటోంది. కురులు నున్నగా దువ్వి సొంపుగా జడ అల్లుకుని సిగనిండుగా ఆమె మల్లెపువ్వులు పెట్టుకుంది. కళ్ళకు కాటుకద్దుకుంది. ఈమె నేను రెండుగంటల క్రితం చూచిన జానకి కాదు! ఇప్పుడామె ముఖం విచారమేఘాచ్ఛన్నం కాదు. అలాగని ఆ ముఖంలో నాకు మరేభావమూ ద్యోతకం కాలేదు. అది చిత్రాకృతిలా నిర్వికారంగా వుంది.

"ఏమైందన్నయ్యా నువ్వు వెళ్ళినపని?" తనకు తానుగా జానకే ప్రశ్నించింది.

"పండు కాదు జానకీ! కాయే" అని నిట్టూర్చాను

"ఇలా అవుతుందని నాకు తెలుసు" అంది జానకి.

కొండలు పిండిజేసి అలసిపోయిన వాడికిలా నాకా రాత్రి ఎక్కడలేని నిద్ర వచ్చింది. ఎప్పుడు మంచం పైన మేను వాల్చానో, ఎప్పుడు నిద్రపట్టిందో నాకు తెలీదు. ఉన్నట్టుండి ఎవరో తట్టిలేపినట్లు మేల్కొన్నాను. వెన్నెల పాలార కాస్తోంది. ఇంట్లో చీమ చిటుక్కుమనడం లేదు. దాహంతో నాలుక పిడచ గట్టుకపోతోంది. "జానకీ, జానకీ" అని పిలిచాను. బదులులేదు. జానకి ఎక్కడ పడుకున్నట్టు? గది తలుపు తెరచి చూచాను. చాప ఖాళీగావుంది. నా గుండెల్లో రైళ్లు పరుగెత్తాయి. చేజేతులా జానకిని మృత్యుదేవతకి అప్పగించిన పాపంనుంచి నేనెలా తప్పించుకోగలను? ఇటూ, అటూ చూచాను. వీధిలోకి పోదామనుకున్నాను. వీధి తలుపుకు వేసిన గడియ వేసినట్లేవుంది. ఐతే జానకి పెరట్లోకి వెళ్ళిందన్నమాట! నాలుగంగల్లో పెరట్లో పడ్డాను. బావికి పది బారల్లో ఓ గంగరావిచెట్టు వుంది. జానకి చెట్టుక్రింద నిలబడి శూన్యంగా కొమ్మల కేసి చూస్తోంది.

"ఇంత రాత్రివేళ యిక్కడేం చేస్తున్నావ్ జానకీ?" అన్నాను. కాదు ఆక్రోశించాను.

"అది కాదన్నయ్యా! నేనొకమాట అడుగుతాను. నేను బ్రతికి మాత్రం లాభమేముంది చెప్పు" అంది జానకి.

"లాభ నష్టాల బేరీజులు నాకు తెలియవు జానకీ! ఈ ప్రాణాలు మనం సంపాదించుకున్నవి గావు. ప్రాణాల్ని ధారపోయడానికి మనకు హక్కులేదు"

"బ్రతికితే లోకం నవ్వుతుంది"

"కానీ చస్తే లోకం ఏడవదు. బాధపడితే కళ్ళజూపని, చెడిపోతే చేరదీయని గుడ్డిలోకంతో మనకు ప్రసక్తిలేదు."

"నువ్వు పిచ్చివాడివి అన్నయ్యా!" అంది జానకి.

"నాకు కాదు జానకీ! ప్రపంచానికి పిచ్చి మనం అన్నా చెల్లెళ్లలా ప్రవర్తిస్తే ప్రపంచం ఏమనుకుంది? ఏమైనా సరే జానకి, నేను లోకుల్ని లక్ష్యపెట్టను. ఈ క్షణంనుంచీ నువ్వు నాచెల్లెలివి ఎన్ని కష్టనష్టాలెదురయినా నీకు నేను బాసటగా నిలుస్తాను. ఐతే నువ్వొకమాట యివ్వాలి"

"మాటా అన్నయ్యా?"

"అవును. ఏ పరిస్థితుల్లోగానీ నువ్వు ఆత్మహత్యను తలపెట్టకూడదు."

జానకి పెదవులపైన హాసరేఖ ఒకటి స్పష్టాస్పష్టంగా భాసించింది. ఆకసంలో చందమామ కద్దు వస్తున్న దూదిపింజల్లాంటి మబ్బులు అప్పటికప్పుడే

తేలిపోతున్నాయి. పూచిన సంపంగితో పెరడంతా గుబాళిస్తోంది. ఇద్దరమూ ఇంటి లోపలికి వెళ్లాము. జానకి గదిలో పడుకుంది. శృంఖలాలు తెగిపోయి బంధ విముక్తి పొందిన ఖైదీకీలా నాకు నిశ్చింతగా నిద్రపట్టింది. నిద్రపోతుండగానే తెల్లవారి ప్రొద్దు ఏడెనిమిదిబారలెక్కింది. నేనే ఆలస్యంగా నిద్ర లేచాననుకుంటే జానకి యింకా నిద్ర పోతోంది. లేపి "నిన్న సాయంత్రం ఎప్పుడో తిన్నది తింటి జానకీ! కడుపులో కొక్కులు తిప్పుతున్నాయి" అన్నాను. జానకి ఆదరాబాదరా గిన్నెలూ చెంబులు కడుక్కు రావడానికి పెరట్లోకి వెళ్ళింది......

* * *

"బాబుగారూ, బాబుగారూ!"

"ఏం, ఏమొచ్చింది?" అన్నాడు సూర్యం.

"ఆ ముసలాడు మిమ్మల్నొకసారి చూడాలంటున్నాడు" అన్నాడు రాముడు.

"ఎందుకూ?" అంటూ సూర్యం గది తలుపు తెరిచాడు.

"ఆమాట చెప్పడం లేదు. అసలు మన యింటికి వచ్చినప్పటినుంచి వాడికి ఒంట్లో బాగులేనట్టుందండీ! మందూ, మాకూ లేదేమో ఈనాటికి రోగం ముంచు కొచ్చేసింది"

"ఇప్పుడు నాకు తీరిక లేదు. వీలైతే రేపువయం వచ్చి చూస్తానని చెప్పు" అని సూర్యం తలుపు వేసేయ బోయాడు.

"నాన్నా, నేనొస్తున్నాను" అంది మేడమెట్ల పైనుంచి పాప.

"వద్దు. క్రిందికి వెళ్ళిపో. రాముడూ! పాపను తీసికెళ్లు" అన్నాడు సూర్యం.

"ఊహు. నేను క్రిందికెళ్ళను. అమ్మ నీదగ్గరి కెళ్లమంది" అంటూ పాప పైకొచ్చేసింది.

"అమ్మాయి గడ్డంతాత ఏమయ్యాడని అమ్మ గార్ని వేధిస్తోంది బాబూ! అందుకామె మిమ్మల్ని అడిగమన్నట్టుంది" అన్నాడు రాముడు.

"సరేసరి! అందరికీ ఆముసలాడి గొడవే కావలిసి వస్తోందిగాని నువు పాపని తీసుకెళ్ళు. నాకు

రాముడు పాపనెత్తుకుని క్రిందికి వెళ్ళిపోయాడు.

* * *

"జానకికి నవమాసాలు నిండాయి. హాస్పిటల్లో చేర్చాను. సుఖప్రసవం జరిగింది మగబిడ్డ. తల్లినీ, బిడ్డనూ చూడ్డానికి చాలా కొద్దిమంది వచ్చారు. వాళ్లల్లో రంగమ్మ ఒకతె "నీ కాపురాన్ని నిలబెట్టింది నేను" అని రంగమ్మ జానకితో సగర్వంగా చెప్తూ వుంది బిడ్డను చేతుల్లోకి తీసుకుని ముద్దుగా. మొగమూ పరీక్షగా చూచి "బిడ్డ అంతా చంద్రం పోలికే" అంది. నేను నవ్వాను. జానకి నవ్వలేదు. ముఖాన్ని పమిట చెరగులో కప్పుకుని దుఃఖోద్వేగాన్ని దాచుకోడానికి ప్రయత్నించింది.

ఊళ్ళో వున్న నాన్నగారికి కబురు అందించాను గానీ ఆయన రాముబాబాంటి [illegible] ఉత్తరం వ్రాశారు. "నువ్వు చేసిన ఘనకార్యాన్ని గురించి ఎంతో సంతోషించాను. ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకుని నువ్వీ జాబు చేరిన తక్షణం వచ్చి యిల్లు చేరుకుంటే మంచిది, లేకుంటే నేను తండ్రినీ గాను, నువ్వు కొడుకువీ కావు"

కాలేజిలో సెకండీ టెర్మ్ జీతం కట్టవలసిన వ్యవధి దాటిపోవస్తోంది. చేతిలో పైసా లేదు ఫీజు చెల్లించకపోతే పేరు తీసేస్తారు. కాలుగాలిన పిల్లిలా యిల్లు, కాలేజి, హాస్పిటళ్ళమధ్య తిరుగుతున్నాను. జానకి నావాలకాన్ని పసిగట్టి "ఏమిటన్నయ్యా! హోటల్లో భోజనం సరిపట్టంలేదా?" అంది.

"భోజనం సంగతి కాదు జానకీ! చదువు మానేసి ఏదైనా వుద్యోగంలో చేరదామనుకుంటున్నాను," అన్నాను.

"ఎందుకూ?"

"ఎందుకేమిటి? డబ్బు అవసరంగదా!"

"చదువు మానేస్తే నామీద ఒట్టే అన్నయ్యా! ఆరు నూరుగానీ, నూరు ఆరుగానీ నువు చదువు మానుకో గూడదు అమ్మ నాకీ చైను మిగిల్చిపోయింది దీన్ని తీసుకెళ్ళి అమ్మేయి. మూడొందల రూపాయలు చేతి కొస్తాయి. ఈ సంవత్సరం గడిచిపోతుంది. ఆ తరువాత దేవుడున్నాడు. అంతగా అవసరమైతే ఉన్న పొలంలో కొంతకుకొంత అమ్మేస్తే సరిపోతుంది" అంది జానకి.

"నీనగల్నీ, నీపొలాల్నీ అమ్మి చదువుకోమంటావా జానకీ! అదికూడా లేకపోతే నీగతీ- నీబిడ్డగతీ ఏంకావాలి?" అన్నాను.

"వీడు నాబిడ్డని నేననుకోడం లేదన్నయ్యా! వీడికి నువ్వున్నావు నేను లేను. లేనులేదంటే వీడు పాలు మరచిపోయేంతవరకైనా నేను బ్రతుకుతానో, బ్రతకనో."

"అలా అనకు జానకీ! నేను వినలేను" అంటూ ముఖం మరోవైపుకు త్రిప్పుకున్నాను. కానీ ఏ సంఘటనకు సంబంధించిన మాటనయితే నేను వినలేకపోయానో, అదే సంఘటనని రెండేళ్లు తిరక్కుండానే కాళ్లారా చూడ్డం తటస్థించింది. ఆ రెండేళ్లీ యిహ జీవనంలో నేను జానకిలో జానకిని చూడలేను! మూర్తీభవించిన వైరాగ్యాన్ని చూచాను.

ఆరోజు పూర్ణిమ. ఐనా నాకు అమావాస్య. ఉదయగిరిపైన అరుణరాగం అలముకుంటోంది. జానకి అస్థిపంజరంలా మంచాన్ని అంటిపెట్టుకుపోయివుంది. నేను బాబునెత్తుకుని మంచం ప్రక్కన నిలబడ్డాను. జానకి నన్ను తలగడదగ్గర కూర్చోమంది కూచున్నాను. తన తలను పైకెత్తి నా ఒడిలో పెట్టుకోమంది. "అన్నయ్యా! మనం బాబుకింకా పేరు పెట్టలేదు. ఏమని పిలుస్తావు?" అంది.

"ఏమని పిలవమంటావు జానకీ" అన్నాను

"మా నాన్నగారి పేరు సూరయ్య. బాబుని సూర్యనారాయణ అని పిలుస్తావా అన్నయ్యా?"

"పిలుస్తాను జానకీ! తప్పకుండా పిలుస్తాను"

కొంతసేపు మౌనం. మళ్ళీ జానకి నోరు తెరిచింది.

"అన్నయ్యా! నువు తప్పక పెళ్లి చేసుకుంటావు గదూ."

ఏం చెబుతాను నేను! మునిపళ్లతో పెదవి గట్టిగా కొరుక్కుంటూ సజలనయనాలతో జానకిని చూస్తున్నాను.

"ఇంకొక్క మాట మాత్రమే అన్నయ్యా!..."

"చెప్పు జానకీ" అన్నాను.

"నాకు తెలుసు వాసుకెప్పటికైనా బుద్ధొస్తుంది. అతిగాడు ఆస్తిని గుల్ల చేసేస్తాడు. చిప్ప చేతికొస్తుంది. అప్పుడు మనిషిగా మారుతాడు. అందాకా నువ్వతణ్ణి క్షమించొద్దులే అన్నయ్యా! అప్పుడైనా అతణ్ణి క్షమించవూ?"

"ఇదేం విచిత్రమైన కోరిక జానకీ! ఈ ప్రపంచంలో అతణ్ణి నీకంటె ద్వేషించవలసిన వాళ్లెవరూ లేరు. నువ్వే అతణ్ణి క్షమిస్తున్నావు. ఇక నాదేముంది?"

బాబును తనదగర పడుకోబెట్టమంది జానకి. శక్తివున్నంతవరకూ శుష్కహస్తాలతో వాడి ఒళ్లంతా నిమిరింది క్రమక్రమంగా ఆమె కళ్లు మూసుకపోయాయి. నేను గదిలోకి వెళ్లి పళ్లరసం తెచ్చాను. బలవంతాన నోరుతెరచి రెండు చుక్కలు త్రాగించాను. మూడో చుక్కకు జానకి తెలకళ్ళు వేసింది నోరు బిగుసుకపోయింది. నా చేతిలోనుంచి గ్లాసు టంబ్లరు క్రింద పడి ముక్కలయింది.

జానకి చనిపోయింది!

జానకి జీవితం ఒక విషాదగీతం! కాని అది అపాతమధురమైన విషాదగీతం వింటుంటే ఏదో అనిర్వచనీయమైన విషాదానుభూతి కలుగుతుంది. కానీ ఎంతసేపు విన్నా యింకా వినాలనే వుంటుంది.

కథ అయిపోయింది సూర్యం! జానకి చనిపోయి యిరవైయెనిమిదేళ్లు కావస్తున్నాయి నీకిప్పుడు ముప్పైయేళ్లు.

బి. యల్. చదువు పూర్తిచేసి పెళ్ళిచేసుకున్న కొత్తలో ఓసారి నేను అనంతపురం వెళ్లాను. ఒకానొక మారుమూల హోటల్లోనుంచి బయటికొస్తూ వాసు కనిపించాడు. మనిషి చిక్కిపోయాడు. కళ్ళు లోతుకుపోయాయి. పాదాలదగ్గర చిరుగులు పడ్డ పైజమాపైన మాసిన పొట్టిచేతుల చొక్కా వేసుకున్నాడు. పెదవులమధ్య బీడీ కాలిపోతోంది.

ఒక స్నేహితుడుద్వారా తెలిసింది, వాసు ఆస్తిపాస్తులన్నీ పేకాటలో, త్రాగుడులో, మిగిలిన దుర్వ్యసనాల్లో కర్పూరంలా హరించుకపోయాయని!

ఓసారి తిరుపతినుంచి ధర్మవరానికి ప్రయాణం చేస్తున్నాను కదిరిస్టేషనులో రైలు యింజనుకు నీళ్ళు పోసుకోడానికి పదిహేను నిమిషాలపాటు ఆగింది. మసకమసకగా సంజచీకట్లు క్రమ్ముకుంటున్నాయి ప్లాటుఫారంపైన బీడీలు, సిగరెట్లు, ఆకులూ వక్కలూ

అమ్ముకుంటూ ఒకడు నడుస్తున్నాడు. బాగా పరకాయించి చూచిగాని గుర్తుపట్టలేకపోయాను. గడ్డం పెరిగివుంది. గుండీల్లేని చొక్కాలోనుంచి బొక్కరొమ్ము కనబడుతోంది. వెంట్రుకలప్పుడే నెరసిపోతున్నాయి.

నాలుగేళ్ళ క్రితం అనుకుంటాను మండు వేసంగిలో ఒక మధ్యాహ్నం హిందూపురం బస్ స్టాండులో చింతచెట్టు క్రింద నిలబడి బస్సుకోసం నిరీక్షిస్తున్నాను. ఒక వృద్ధుడు దగ్గరికి వచ్చి చేయి చాచాడు. "బాబూ! ముండివాణ్ణి" అన్నాడు. నిజమే. ఎడమచేయి మోచేతివరకూ లేదు. కానీకోసం జేబులో చేయివేస్తూ బిచ్చగాడి ముఖంలోకి చూచాను. జీబురు గడ్డంతో, చింకిపేలికల ఆచ్ఛాదనతో, కృంగి కృశించిపోయిన ఆ ఆకారంలో కలలో కనిపించినట్టు నాకు లీలామాత్రంగా ముప్పై యేళ్ళనాటి వాసు కనిపించాడు.

"ఇదిగో– నీపేరేమిటి?" అని అడిగాను.

వాసు నన్ను పోల్చుకున్నాడు. చాచిన చేతిని వెనక్కి తీసుకుని వెనుదిరిగి చూడకుండా బూడిదుమ్ములో నడుస్తూ దూరంగా వెళ్ళిపోయాడు.

చివరిసారి. ఎనిమిది గంటలకు కదలబోతున్న యాత్రాస్పెషలుకు రాహుకాలం వస్తుందని మనం యింటిదగ్గర అయిదున్నరకే బయలుదేరాము. నేనూ, మీపిన్నీ కారులో వెనుక సీటులో కూచున్నాము. నువ్వు కారు డ్రయివు చేస్తున్నావు. నువ్వు చూచావో లేదో నాకు తెలియదు. కారు గేటుదాటుకుని రోడ్డులోకి రాబోతోంది. దారిప్రక్కన వాసు కాలపురుషుని కుంచెలో అనేక మార్పులకులోనైన వికృతిస్వరూపంతో మళ్ళీ నాకు కనిపించాడు......

* * *

కాగితాల్ని అలమారలోకి విసరి సూర్యం తటాలున పైకి లేచాడు. తలుపు తెరుచుకుని క్రిందికి పరుగెత్తాడు. మేడమెట్లదగ్గర నీరజ ఎదురై "మీకోసం పైకొస్తున్నాను. మనం అనుకున్నంతా అయింది. హాస్పిటల్లోనుంచి యిప్పుడే ఫోను చేశారు" అంది.

"అదీ అయిపోయిందీ!" అంటూ సూర్యం కుప్పకూరలా వాలుకుర్చీలో కూలిపోయాడు.

# విశ్వజీవి గాంధిజీ

## సర్ ఎర్నెస్ట్ బార్కర్

నేటి ప్రఖ్యాత రాజనీతిజ్ఞులలో సర్ ఎర్నెస్ట్ బార్కర్ ప్రముఖుడు. ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాల్లో రాజకీయశాస్త్రాన్ని ప్రబోధించిన గురూత్తముడు. కొన్ని సంవత్సరాల క్రితమే వీరు అరిస్టాటిల్ వ్రాసిన 'రాజకీయం' అనే అపూర్వ గ్రంథాన్ని ఆంగ్లభాషలోకి అనువదించారు; ఈ అనువాదం లోకోన్నతి పొందినది. వీరి శిష్యుడే, సామ్యవాద తత్త్వవేత్తగా బ్రిటిష్ లేబర్‌పార్టీకి జీవితాన్ని అంకితం చేసిన ప్రొఫెసర్ హెరాల్డు లాస్కీ. గాంధీనిగురించి డాక్టర్ రాధాకృష్ణన్ సంకలించిన వ్యాస సంపుటిలో సర్ ఎర్నెస్ట్ బార్కర్ వ్రాసిన వ్యాసానికి స్వేచ్ఛానువాదం ఇది.

గాంధీని గురించి నాకు రెండు విషయాలు జ్ఞాపకం ఉన్నాయి. మొదటిది : 1931 వ సంవత్సరంలో రౌండు టేబుల్ సమావేశానికి ఇంగ్లండు వచ్చిన సందర్భంలో ఒకనాడు—అది శీతాకాలపు రాత్రి—గాంధీ మాయింటికి విచ్చేశాడు. రెండవది: 1937 వ సంవత్సరం, డిసెంబరు 15 వ తారీకు — ఆప్రాంతాన్ని ఒకనాటి ఉదయమే నా స్నేహితుడొక భారతీయుడు గాంధీదగ్గరకు నన్ను తీసుకువెళ్లాడు. బొంబాయి నగరానికి కొంచెం ఉత్తరంగా ఉంది ఒక విశ్రాంతి భవనం. తాటిచెట్ల ఆకులు గాలికి టపటప కొట్టుకుంటున్నాయి గాంధీ జబ్బుపడి లేచాడు. అప్పుడే తేరుకుంటున్నాడు.

ఆయన కేంబ్రిడ్జి రావడం నాకు బాగా జ్ఞాపకం. ఆయన గదిలోకి మిస్ స్లేడ్‌తోకూడా నేనూ ప్రార్థనకి వెళ్లేవాణ్ణి సాయంత్రం భోజనానంతరం మేం కూర్చునే గదిలోకి వచ్చేసేవాడు—రాట్నం తిప్పుతూంటే సంభాషణ సాగిపోయేది. మేంమాట్లాడుకున్న విషయాల్లో కొన్ని సామాన్యమైనవే. (మాటవరసకి—నాకు ఇంకా జ్ఞాపకం వస్తుంది—ఇంగ్లీషువారు ఈ దేశంలో ఫుట్‌బాల్‌కి ఎటువంటి ప్రాముఖ్యత నిచ్చిందీ—రగ్బీ ఆటకూ ఎసోసియేషన్ ఆటకూ సమాజతరహాలో ఇక్కడ ఉన్న విచిత్రమైన వ్యత్యాసాన్ని గురించీ—ఇలాటి ఆయనతో నేను ముచ్చటించడం; నేను చెప్పిందంతా ఆయన శ్రద్ధతో వినేవాడు) కాని గంభీరమైన సమస్యల మీదకే మా మనస్సు మొగ్గింది. అలాగ చర్చించిన విషయాల్లోదే ప్లేటో తత్త్వం కూడా. రాజ్యము—పరిపాలన వీటి ప్రసక్తి వచ్చినప్పుడు ప్లేటో భావాలకీ గాంధీభావాలకీ చాలా సామరస్యం ఉన్నట్టుందని నేను అనుకున్నాను. పరిపాలకులు, అధికారులు మానవసేవ చెయ్యడానికి వారికి దొరికిన అవకాశానికి సంతసిస్తూ, వారికి సామాన్యంగా వచ్చేదానితో జీవితసరళి సాగిస్తూ అధికంగా ఏమీ అభిలషించకూడదని గాంధీ అంటాడు; దీనిలో గాంధీ ప్లేటోలు ఒకేలాగ భావిస్తున్నారా అని అనిపించింది. నేను అనుకోవడం, పరిపాలన, అధికారంతో కూడుకున్నది. అధికారం సాగడానికి శీలం, స్థితి అవసరం. ఇది గాంధీ చెప్పేటంత సులభమైన విషయం కాదని నేను వాదించాను. మేమిద్దరం ఎప్పుడూ ఏకీభవించినట్లు నాకు జ్ఞాపకం లేదు. అయితే—గాంధీ కన్న తక్కువతరహాలో ఉండి మాట్లాడుతున్నానన్న సంగతిమాత్రం నాకు తెలుసు ఇంకొక విషయం కూడా మేము ప్రస్తావించినట్లు నాకు గుర్తు భారతదేశం యొక్క రక్షణవిధానం ఏవిధంగా ఉండాలని నేను ప్రశ్నించాను. ప్రజలు సురక్షితంగా ఉండడానికి

అనువాదం : వి. వి. రమణమూర్తి

దేశంలో శాంతి అవసరం కదా. ఇందుకు దోపిడి గాళ్ళ భయం ఉండకూడదు. శత్రువు లెవరైనా దోపిడి చెయ్యవచ్చు—దానికికూడా సిద్ధపడి ఉండాలి. వీటికోసం సైనికదళం అవసరం. ఇక సైనికదళానికి అయ్యే ఖర్చుల నిమిత్తం—భారత దేశంలోని శాసన సభ్యులపై ఆధారపడడం కన్న—శాశ్వతంగా చట్ట రూపేణా ఏర్పాటు చెయ్యడం ఉత్తమం. (సైనిక దళానికి శాసనసభ్యుల పూచీ ఉంటే—ఒక్కొక్క సారి శాసనసభ ఖర్చులను త్రోసివెయ్యవచ్చు—లేకపోతే కావలసినంత మంజూరు చెయ్యకపోవచ్చు—లేదా మరొకసారి మరొక విధమైన అడ్డం కలగడానికి సావకాశం ఉంది) ఈ విషయాలని ఎలా పరిష్కరిస్తారని గాంధీని అడిగాను. గాంధీ ఒక అలంకారం విసురుతూ సమాధానం ప్రారంభించాడు "ఒక గ్రామం ఉందనుకోండి చుట్టూ ఉన్న అడవిలోని జంతువులు గ్రామంలోకి తరచువస్తూ, అంతా చెల్లాచెదరు చేసి ధ్వంసం చేస్తున్నాయనుకుందాం కనికరించే ప్రభుత్వం గ్రామీయుల్ని యీ ఒత్తిడినించి రక్షించడానికి, వారి ఆస్తిపాస్తుల్ని భద్రంగా ఉంచడానికీ, గ్రామం చుట్టూ గోడనొకటి కట్టడానికి పూనుకుంటుంది. ఆ గోడ కట్టడం నిమిత్తం పన్నులు విపరీతంగా హెచ్చు చెయ్యవలసి వస్తుంది. ఆపన్నుల్ని భరించడం దుర్లభం అవుతుంది. గ్రామీయులకి. ఒకవేళ గోడ కట్టడం పూర్తి అయినా—గోడ పూర్తి అయేటప్పటికి గోడ ఉన్నందువల్ల కలిగే లాభంకన్న ప్రజలు భరించవలసిన పన్నుల బాధ ఎక్కువ అవుతుంది. గ్రామనివాసులు అప్పుడు ఏంచేస్తారో ఒకసారి మనం ఆలోచిద్దాం. 'మా రక్షణకి మమ్మల్ని వదిలెయ్యండి. మా కష్టాలు మేం ఎలాగో పడతాం. అందుకోలేని ఆహార విహారాదులకి అల్లాడిపోవడంకన్న మేం ఎలాగ ఉన్నామో అలాగ ఉండడమే మాకు మేలు. కష్టాలు వచ్చినప్పుడు—ఏవిధంగా ఎదుర్కోవాలో—మాకు తెలుసు. గోడకట్టి మమ్మల్ని రక్షించడం ఇంక మానుకుని భద్రతనుగురించిన విషయం మాకు వదలండి."

మేము ప్రసంగించిన రెండు విషయాలూ—గాంధీ ఉపదేశించిన రెండు విషయాలనీ—నా మనస్సుకి హత్తుకు నేటట్టు చేశాయి వాటిలో ఒకటి ప్రేమ, ప్రేమపూరితమైన సేవను గురించింది. మరొకటి అహింసకి సంబంధించినది. నా ఎదుట ఒక ప్రవక్త ఉన్నాడనీ — ఆయనతో నేను ముఖాముఖీని మాట్లాడుతున్నానని నాకు తెలుసు. కాని ఇంగ్లాండు దేశంలోని తూర్పుభాగాన్నుంచి పౌరునికి పుట్టుకతోటే ఆచారసిద్ధంగా వచ్చిన సంప్రదాయాలను (బహుశా ఏ ప్రాంతానికి చెందినా, ఆంగ్లేయ పౌరునికి వచ్చే సంప్రదాయాలు అన్నీ అలాంటివే అనుకుంటాను) మాత్రం నేను కాదనలేకపోయాను. సత్కార్యానికి సత్ఫలం ఉండాలనీ. ఫలాపేక్ష లేనిదే సత్కార్యానికి ప్రవృత్తి ఉండదనీ మన నమ్మకం. ఇలాంటిదే మరొకటి కూడా చూడండి. యుద్ధం అక్రమం అని తెలుసు; ఈ అక్రమాన్ని ప్రతిఘటించందే శాంతీ భద్రతలు అవతరించవు ఇందుకోసం రక్షణ విధానాలు వాటి సన్నాహాలలో అవి ఉండాలి. ఈ నమ్మకాలని వీటినీ నేను తిరస్కరించలేకపోయాను. అయితే నాముందు నా నమ్మకాల్ని మించిన శక్తి ఏదో ఉందని మాత్రం నేను అంగీకరించకుండా ఉండలేక పోయాను మానవులు ఆశక్తిని అంగీకరించడానికి సంసిద్ధులయి ఉంటేనా? (అలాగ సంసిద్ధులయి ఉన్నారని ఎవరైనా ఒకరు నిశ్చయించుకొని, తక్కినవారిని ఆ నమ్మకంవైపు తిప్పుకు నేటట్టు చేస్తే బహుశా—వారు సిద్ధంగా ఉన్నారని ఋజువవుతుందేమో. ఇంత మట్టుకు నేను ఒప్పుకున్నాను కాని నా నమ్మకాన్ని దానికిమించి తీసుకువెళ్లడం నాకు కష్టం అయింది) గాంధీ వెళ్ళిన తరువాత ఆయనలో విభిన్నమై కనిపించినా, నిజానికి ఏకైకంగా మిళితమైపోయిన ప్రవృత్తులనుగురించి ఆలోచిస్తూ ఉండిపోయాను. మొట్టమొదట చెప్పుకోవలసింది—సర్వసామాన్యమైన బీదబ్రతుకు నే కోరుకుని, సృష్ట్యాదిసంతతినీ సమన్వయించుకొని, సమస్తావనిలోని సర్వభూతాలనీ ప్రేమించిన—సెంట్ ఫ్రాన్సిస్, తరువాత—తీవ్రమైన వాగ్వివాదంలో ఉంటూ, తత్త్వరహస్యాలెన్ని ఉంటే అన్నిటినీ అవలోడించగల సునూక్ష్మగ్రాహి, తత్త్వవేత్త అయిన థామస్ అక్వైనస్. ఇంతటితో సరికాదు. దైనందిన జీవితసరళిలో నిగ్గుతేరిన లౌక్యాన్ని కూడా లేకపోలేదు. అంటే ప్రాపంచిక విషయాన్ని తీర్చిదిద్దగలవాడు; న్యాయశాస్త్ర సంబంధమైన అనుభవశాలీనూ. ఉన్నత శిఖరాలనుంచి పచ్చిక బయిళ్ళకి దిగి వచ్చి ప్రాపంచిక విషయాలని చతురతతో చక్కబెట్టగలవాడు కూడా. మనలో అనేకమైనవి కలసి నందువల్ల మనమందరమూ మిశ్రమమై ఉన్నాము. మనందరిలో కన్నా ఈ మిశ్రమ స్వరూపం గాంధీలో



## విశ్వశాంతిప్రదాత

శాంతికాముకులైన దేశదేశాల ప్రజలూ అక్టోబరు 2వ తేదీన మహాత్ముని జన్మదినోత్సవం జరుపుకుని యుగపురుషుడుగా ఆయనకు జోహారులర్పించారు.

కనిపించింది నాకు. ఆయనకు క్లిష్టమైనదీ, ప్రగాఢమైనదీ అయిన వ్యక్తిత్వం ఒకటి ఉంది. ఆయన ఒక్క సెంట్ ఫ్రాన్సిసే అయివుంటే అది సామాన్యమైన విషయమై ఉండి ఉండును. అప్పుడు అంత చెప్పుకోవలసిన విషయమై ఉండి ఉండేదా? అంటే తనతోటి ప్రజకే, ప్రపంచానికే ఉపయోగపడేటంత ప్రాముఖ్యత దానికి ఉండేదా? ఈ విషయాన్ని నేను ఆలోచించినప్పుడు "ఉండదు" అనే జవాబు ఇవ్వడానికే నేను సిద్ధపడతా ననుకుంటాను. ఇందులో ముఖ్యమైంది మిశ్రమము. ఆయన ప్రపంచానికి ఏమిటో, ప్రపంచానికి ఏలాంటిసేవ చేయగలవాడో — ఈ విషయాలు ఆయన ఏ ఒక్కటిగానో ఉండిపోక, అనేకమైనవిగా ఉంటూ, వాటిని మిళితం చేసుకోవడం అన్న విషయం మీద ఆధారపడి ఉన్నాయి.

ఇంక ప్రధానమైంది ఆఖరున నేను చెప్పదలచుకున్న విషయందగ్గరికి వద్దాం. ప్రాపంచిక విషయాలలో ఆరి తేరి, న్యాయవాదిగా అనుభవం సంపాదించిన మానవునిలో సెంట్ ఫ్రాన్సిస్, సెంట్ థామస్ మిళితమై ఉన్నారని వెనుక చెప్పాను. న్యాయానికి ఇంకా సూటిగా చెప్పాలంటే — ఈ సమ్మేళనం — భారత దేశంలో అనాదిగా వర్ధిల్లిన ఒక మహోన్నత భాగవత సంప్రదాయానికీ, పాశ్చాత్యలోకంలో ఉంటూన్న పౌరుడికి సామాజిక జీవితంలో వస్తూన్న స్వాతంత్ర్యం స్వగౌరవం వీటికి సంబంధించిన సంప్రదాయానికీ - మధ్య యేర్పడిన సమ్మేళనం అని చెప్పి ఉండవలసింది. ఈ సమ్మేళనం ఆయనలో ఉండబట్టే గాంధీ ఒక వారధిగా అయ్యాడు. ఆయన దేశప్రజల ముందు రాజకీయాల్ని కేవలం లౌకికానుబంధంతో కాక, వారి మతాచారాలకి అనువుగా ఉండేటట్టు గాంధీ చూపించ గలిగాడు. అందువల్ల తనదేశీయులకు ఆయన పట్టి రాజకీయ వాదిగా కాకుండా, అంతకన్న అతీతుడుగా కనిపించాడు. జాతీయ సమస్యని కేవలం రాజకీయ సంచలనంగానే కాక అంతకన్న అతీతమైనదిగా ఆంగ్లదేశీయులకి నచ్చ చెప్పగలిగాడు. ఈ విషయంలో ఇలాగ సేతువుగాను, సమీకరించే సన్నిహితుడుగాను ఏ ఒక్క భారతీయుడో — ఏ ఆంగ్లేయుడో గాంధీ ఉండిపోలేదు. పాశ్చాత్యలోకంలోని మానవాళి సంతతినీ ఆకర్షించి వారిని సమ్మోహితులని చేశాడు. లౌకికము-అలౌకికము — వీటియొక్క స్వరూపాన్ని గ్రహిస్తూ, వీటి తాత్పర్యాన్ని మాత్రం అద్వితీయంగా సమన్వయించిన వ్యక్తి.

అందుచేత గాంధీని ప్రస్తుతించవలసినప్పుడు ఆయనలోని యీ సమ్మేళనాన్ని స్తుతించాలని అనుకుంటాను. భూలోక సువర్లోకాలలో ఒకేసారి ఆయన సంచరిస్తున్నా, ఆయన మూర్తి ఎక్కడికి అక్కడ అతి స్పష్టంగా గోచరిస్తుంది. ఇంకా వివరించి చెప్ప వలసివస్తే, గాంధీ ప్రాక్పశ్చిమ ఖండాల మధ్య నున్న సేతువు అని కూడా చెప్పుకోవాలి ఇందువల్ల అంతర్జాతీయరంగంలో సుహృద్భావాన్ని పెంపొందించడానికి సాధించగలిగిన మహోత్కృష్టమైన కార్యాన్ని గాంధీ సాధించగలిగాడు. దేశంలో తన జాతి జీవితానికి అవసరమైన వాటిని — సాధారణమైనవే — ఆసక్తితో అర్థం చేసుకుని, ఉద్ఘాటించ గలిగిన గాంధీని నేను మరచి పోలేను. అతిథ్యానికి సూచనగా ఉంటుంది ఆయన దగ్గర. భారత దేశంలో ఒక పల్లెను చూస్తే, (భారతదేశం నిజానికి ఇలాంటి పల్లెలతో నిండిఉన్న ఒక ఖండం ఏమో) గ్రామీణులకు వారి శక్తులేవీ వృథా కాకుండా, అన్నీ వినియోగపడే సమగ్రమైన జీవితాన్ని చేకూర్చడం ఎంతఅవసరమో అర్థమవుతుంది. పరిశ్రమలని గ్రామాలలోకి తీసుకు రాగలిగితే (బొంబాయిచుట్టూ నూలు బట్టలను తయారు చేసే మిల్లులనూ, కలకత్తాకు తూర్పుగా జనపనారని తయారుచేసే మిల్లులనూ స్థాపించడంతో సరి కాదు) గ్రామాలకు విముక్తి కలుగుతుంది. నాలా మటుకు భారతదేశం అంతా — ఇదే భారతదేశం అని చెప్పకు నేటంత — గ్రామాలు కొల్లలు కొల్లలుగా ఉన్నాయి అందుచేత అప్పుడే యావత్తు భారత దేశానికి, ఆర్థికంగా దైనందిన జీవిత విధానంలో విముక్తి. అలాంటి విముక్తికోసం గాంధీ పాటుబట్టే విషయం ఆయన దేశానికి చేసిన గొప్పసేవలలో ప్రధానమైనదిగా ఎప్పుడూ పరిగణింప బడుతూవుంటుంది.

గాంధీని గురించి నేను చూసిందాన్ని బట్టీ, విన్నదాన్ని బట్టీ, నాకు యీ భావాలు ఉన్నాయి. ఇంతకన్నా ఎక్కువగా తెలిసి ఉంటే బాగుండును. కాని నాకు తెలిసున్నదాన్ని బట్టి ఇంతే చెప్పగలను. గాంధీ తన దేశీయులకీ, వారిద్వారా మానవకోటికీ — మూడు విషయాలను ఉపదేశించడానికి కృషి చేశాడని మాత్రం చెప్పితీరాలి: ప్రేమతో జీవించడం, ప్రేమ కొఱకే జీవించడం కూడా; హింసని త్యజించి కృషి చెయ్యడం. మనస్సులాంటి ఏ ఒక్క అవయవంతోనే కాకుండా, ఇతర అవయవముల నన్నింటినీ ఉపయోగిస్తూ, మనకున్న శక్తులన్నీ సార్థకం అయేటట్టు సమగ్ర జీవితాన్ని సాధించడం.

జార్జ్ ఎలెన్ అండ్ కంపెనీవారి ప్రత్యేకానుమతితో

# ముహూర్త శాస్త్ర ప్రయోజనము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

సత్యమును విచారించితిమేని, జాతక శాస్త్రము కంటె ముహూర్తశాస్త్రమే లోకకల్యాణమునకు హెచ్చుగా పనికివచ్చునని తప్పక తేలును. జన్మకాలిక గ్రహస్థితులను అనుసరించి వ్యక్తికి ఏఏవయసున శుభమో, అశుభమో కలుగునో సూచించుట జాతకశాస్త్రము యొక్క ఇప్పటి ప్రయోజనము. అనేక సమయములలో, ఇట్టి సూచనలు జాతకులకు అహితకరముగనే పరిణమించుచుండుట చూచుచున్నాము. ఫలానా కాలములో ఉద్యోగములో గొప్ప అభివృద్ధి వచ్చునను ఫలితమును విని ఉబ్బిపోయిన వ్యక్తి ఆవిషయమున విశేషమైన కృషి కాని చేయక జాతకముద్వారా రానున్నది రాకమానదని ఊరకకూర్చుండి యుండినచో, సదవకాశమును పోగొట్టుకొనుట అసంభవము కాదు. అట్లే, ఫలానా కాలములో అనారోగ్యము వచ్చు సంభవమున్నదని తెలుసుకొన్న జాతకుడు తద్విషయముగా తగు జాగ్రత్త తీసుకొనక రానున్నది రాకమానదు అను యద్భవిష్యసిద్ధాంతమును ఆశ్రయించుటచే హెచ్చుక్లేశముపాలగుటయూ సంభవమే. రానున్న కీడును తెలుసుకొన్న దుర్బలహృదయులకు మరింత హృదయదౌర్బల్యము హెచ్చి హాని కలుగును. అట్టివారు భావి ఫలములను తెలుసుకొనకుండుటయే శ్రేయస్సు. జాతకశాస్త్రమును ఉపదేశశాస్త్రముగ భావించక విధాయకశాస్త్రముగ నమ్ముటచే కలిగిన దుష్పరిణామ మిది.

దైవముయొక్క అనుకూల్యప్రాతికూల్యములను గ్రహగతి మూలముగ తెలుపునట్టిది జ్యోతిశ్శాస్త్రము. దైవము అనగా పూర్వార్జిత కర్మఫలమే.

"పూర్వజన్మార్జితం కర్మ దైవ మిత్యభిధీయతే" అనిరి పెద్దలు.

ఈ కర్మఫలము పరిపక్వము అగు కాలమును గమనించి తెలుపువాడు దైవజ్ఞుడు. కాని, మనకు వచ్చు ఫలములు కేవల దైవశక్తివలననే వచ్చునవి కావు. దానికి, అనగా దైవమునకు, పురుషకారము తోడు కావలసియున్నది. అప్పుడే ఫలము.

"దైవే పురుషకారే చ కర్మసిద్ధి ర్వ్యవస్థితా"
"న దేశకాల వ్యవసాయ వర్జ్యం
భవే త్ఫలాప్తిః సతి చాపి దైవే"

మున్నగు వాక్యములు ఈ పరమార్థమునే స్పష్టముగా బోధించుచున్నవి.

కటికి చీకటిలో కూర్చొన్న మానవునికి తనచుట్టుపట్ల ఏ వస్తువులున్నవో, అవి ఎట్టివో, తెలియదు. తడవులాడుకొనుచూ పోయినచో, చేతికి పండైనా దొరకవచ్చు; లేదా, పామైనా చుట్టుకొనవచ్చు. ఇట్టి పరిస్థితిలో; ప్రకాశవంతమైన ఒక దీపము వచ్చెనను కొందము. చీకటి మాయమై, చుట్టునున్న వస్తువులన్నియూ అపుడు స్పష్టముగా కనపడగలవు. ఆవస్తువులన్నియూ అచట ఉండినవే. వానిని ఆ దీపము సృష్టి చేయలేదు; తెచ్చిపెట్టనూలేదు. కాని, వెలుగు వచ్చినంతనే, ఏ వస్తువెందున్నదో, ఏపదార్థపు స్వభావమెట్టిదో, ఏది స్వీకరించదగునో, ఏది స్పృశించరాదో, మనకే సులభముగా బోధపడగలదు. దీపము మనకేమియునూ చెప్పదు; మాటలాడదు. వస్తువులను చూపుట మాత్రమే దాని పని. క్లేశకరములగు వస్తువులను గాని, హితకరములగు పదార్థములను మాత్రమే ఉపయోగించుకొనుట సామాన్య మానవస్వభావము. మనకు జాతకశాస్త్రమువలని ప్రయోజనము. మొత్తము మీద ఇట్టిదే. మన క్షేమముకొరకై భగవంతుడు దయతో నిర్మించిన ప్రదీపగోళములే ఈ గ్రహములు. వాని తేజస్సును శాస్త్రసహాయమున గమనించినచో, మన అజ్ఞానాంధకారము నశించి మన ప్రారబ్ధము ఎట్లు పరిపక్వము కానున్నదో, దానిమార్గము లెట్టివో, పరిణామము హితకరమో కాదో, తెలుసుకొనగలుగుదుము. ఆపరిస్థితులను విమర్శించి, గమనించి, వివేకముతో మనయోగ్యతకు, జ్ఞానమునకు, సంసారమునకు, శక్తికి, తగినరీతిగా ప్రవర్తించి జీవితమును సద్వినియోగపరచుకొనుటే మనకర్తవ్యము ఇది మన పురుషకారపు పని. ఈ సత్యమునే మహనీయుడగు వరాహమిహిరాచార్యుడు ఎంతో రమ్యముగా వచించెను.

"య దుపచిత మన్య జన్మని,
శుభాశుభం తస్య కర్మణః పక్తిం,
వ్యంజయతి శాస్త్ర మేతత్, తమసి
ద్రవ్యాణి దీప ఇవ"

ఈ క్రింది వశిష్ఠ వాక్యము సైతము పై అర్థమునే బోధించుచున్నది.

"యదా హ్యేక చక్రేణ రథస్య నగతి ర్భవేత్
తథా పురుష కారేణ వినా దైవం నసిధ్యతి"

ప్రమాణము లిట్లుండినా, వాడుక వేరుమార్గమునకు పోయినది. కన్యక జాతకమును జ్యోతిష్కునికి చూపి "ఈ కన్యక వివాహ మెప్పుడు కాగలదు? వరు డెట్టివాడు రాగలడు? ఏదిక్కునుండి వచ్చును?" అని అడిగెడువారే కాని, ఏ కాలములో కన్యకు వివాహము చేయుట శుభకరమని కాని, ఎట్టివరునికై ప్రయత్నించుట హితమని కాని, అడుగువారే సామాన్యముగా కానరారు. "వచ్చే మాఘములో వివాహము జరుగును. బహుశః పశ్చిమదిక్కునుండి వరుడు రాగలడు" అని జ్యోతిష్కుడు చెప్పినచో, ఇతర దిశలలో కానవచ్చిన వరులను గమనించక, ఆ సమయమునకు పశ్చిమదిశలో కానవచ్చిన ఏ దామోదరునితో కన్య నంటగట్టువారున్నారు.

జాతకశాస్త్రముయొక్క ప్రయోజనము ఇట్టి స్థితికి వచ్చుటచే, లోకకల్యాణము సమకూర్చు విషయమున దాని ఉపయోగము చాలవరకు తగ్గిపోయినది. ఇప్పటి కాలమున నవనాగరికు లనేకుల దృష్టిలో ఇది ఒక నిరర్థమైన ఉబుసుపోక.

అది యట్లుండనీ. ముహూర్తశాస్త్రముయొక్క ఉద్దేశము, దాని ప్రయోజనమును, వేఱు. ఎట్టి గ్రహస్థితి గల కాలములో ఏ కార్యము చేసినచో దానిలో శుభఫలము చేకూరునో, ఎట్టి గ్రహస్థితిలో అదే కార్యము చేసినపుడు దాని పరిణామము క్లేశకరమగునో, తెలుపునది ముహూర్తశాస్త్రము. జన్మకాలమునందలి గ్రహస్థితి, మంచిదో చెడ్డదో, దానిని మనము మార్చలేము. కాని, తగిన యోగ్యతగల జ్యోతిష్కుడు ప్రశంసలోనున్న వ్యక్తికి, అతడు తలపెట్టిన కార్యమునకు, ఏ కాలములో ఏ ముహూర్తము అభివృద్ధి సూచకమో నిర్ణయించి చెప్పగలుగుట సాధ్యము. శుభకాలములో చేసిన కార్యము సత్ఫలదాయక మగునని మహర్షులు చెప్పిరి

మన పురాకృతకర్మఫలము అంతయూ అశుభముగనే ఉన్నయెడల, మనకు మానవజన్మమే వచ్చియుండదు. శుభఫలము, అశుభఫలము, రెండునూ కొంత తారతమ్యముతో, మన ప్రారబ్ధములో మిళితమై యుండగలదు. శుభకాలమునందు కార్యములు జరిపినచో, ఆ కార్యముల సందర్భమున మన ప్రాచీన కర్మఫలసముదాయములో శుభఫలము మాత్రమే అనుభవమునకు వచ్చుననియూ, అశుభఫలము దానిలో ప్రవేశించుటకు అవకాశము రాదనియూ, మహర్షులు విశ్వసించిరి.

"శుభక్షణ క్రియారంభ
జనితాః పూర్వసంభవాః.
సంపదః సర్వలోకానాం;
జ్యోతిశ్శాస్త్ర ప్రయోజనం"

అనుసూక్తిని గమనింపుడు.

కావుననే, లోకకల్యాణకాంక్షులగు మహనీయులైన వశిష్ఠ, శౌనక, నారదాది మహర్షులు ముహూర్తశాస్త్ర సూత్రములను వ్రాసియుంచిరి. మంచి ముహూర్తము సాధించి వానిలో శాంతిక పౌష్టిక కార్యములు జరుపవలెనని మహర్షులు శాసించుటచే, పురుషకారమునకు వెలయున్నదనుటే వారి నిశ్చితాభిప్రాయమని తెల్లము కాగలదు. "ఏ కాలములో కావలెనో, అప్పుడు తనంతనే కాగలదు" అను సంప్రదాయము మహర్షి సమ్మతమైనచో, వారింత ముహూర్తశాస్త్రమును వ్రాయుటయు, దానిననుసరించి శుభముహూర్తములను సాధించుకొని జనులు కార్యములు జరుపవలెనని శాసించుటయూ, పొసగదు. పురుషకారమునకు వెలయే లేదనువారు వశిష్ఠాది మహాతపోధనుల జ్ఞానమును, వివేకమును, శంకించినవారగుదురు.

మన ప్రాచీనులు ఈ ముహూర్తశాస్త్రసూత్రములనుగూర్చి గొప్పశ్రద్ధను చూపిరి. వానిలో ముఖ్యమైన కొన్నింటిని స్మృతికారులు ధర్మశాస్త్రములలో సైతము చేర్చినారు. ఎంతో విమర్శ, ఉపజ్ఞ గల గ్రంథము లెన్నియో వ్రాయబడినవి. ముహూర్తశాస్త్రపు విషయమున మన ప్రాచీనులు చేసినంతకృషి ఖండాంతరముల జ్యోతిష్కులు చేయలేదనుటే, మన ప్రాచీన మహర్షుల లోకకల్యాణ కాంక్షకు తార్కాణము. కావుననే, ముహూర్తశాస్త్రపు విలువ హెచ్చినది.

కాని, వాడుకలో నేటికాలమున ఇది సైతము అధోగతిపాలయినది. తాతలనాటి ఆచారమును మానలేక, ముఖ్యముగా వివాహమునకు, ముహూర్తమును పెట్టించుకొను శుష్కమైన అలవాటుమాత్రము నిలచినది. అది శాస్త్రముపైన శ్రద్ధవలన కాదు. ముహూర్తఫలముపై విశ్వాసము సైతము లేదు. ఈ విషయమున సామాన్యజనులే కొంతనయము. ఆధునిక విద్యావంతులలో ఈ అశ్రద్ధ మరింతఅధికము. సెలవు సంపాదించుకొను కష్టము లేకయే, కార్యము నిర్వహించుటకో, పిల్లలు చదువు పాఠశాలలు మూయుటకో, మరి దేనికో, అనుకూలమైన కాలమును తామే ముందుగా నిర్ణయించుకొని, డిసెంబరు నెల కడపటి వారములోనో, దసరా నవరాత్రములలోనో, ముహూర్తము పెట్టుమని జ్యోతిష్కుని కోరుట నవనాగరిక విద్యావంతులకు పరిపాటి అయినది. కోరిన కాలములోనే ముహూర్త

మును జ్యోతిష్కుడు ఎట్లు సృష్టిచేయగలడు? మన ఇష్టానుసారముగా, కోరినపుడు గ్రహములు శుభస్థానములలోనికి రాగలవా? సృష్టినియమములవలన, ఖగోళశాస్త్ర సూత్రముల ననుసరించి, ఏకలక్ష్యముతో క్రమముతప్పక గ్రహములు తమతమ కక్ష్యామార్గములలో సంచరించునే కాని, మనకొఱకై, మనముహూర్తము కొఱకై, అవి భిన్నమార్గము నాశ్రయించునవి కావు. వాని సంచారక్రమముపై ఏ మౌహూర్తికునకైనా అధికారము లేదు. తగినస్థానములలో గ్రహములు వచ్చుదాక సుముహూర్తమును కోరువారు కాచియుండవలసినదే. రైలుబండిలో ప్రయాణము సాగింప దలచినవారు స్టేషనులో బండివచ్చువరకు కాచక తీరదు. కాని, అంత ఓపిక, అంత శ్రద్ధ, మన నాగరికులకు లేదు. వారు నిర్ణయించుకొన్న అవధిలోగా, ఏదో ఒక దినమున ముహూర్తమును జ్యోతిష్కుడు నిర్ణయించి ఇచ్చి పీడ తొలగించుకోవలసిందే. ఇంతేకాదు. అనేక సందర్భములలో ఇట్టి ముహూర్తములను నిర్ణయించి ఇచ్చువాడు సిద్ధాంతవేత్త కాడు, మరి ఇంటి పురోహితుడే. పౌరోహిత్యవిద్యలో ఎంత యోగ్యత ఉండినా, ఇపుడు లభించు పురోహితులలో అనేకులు

"వారాన్ కేచిత్, గ్రహాన్ కేచిత్
కేచిదృక్షాణి జానతే,
త్రితయం యే విజానంతి,
తే వాచస్పతయః స్వయం"

అను తరగతికి చెందినవారే అనుట అనుభవసిద్ధమగు విషయము. వీరు నిర్ణయించి ఇచ్చు ముహూర్తములు ఎంత శోభాయమానముగా ఉండగలవో, పాఠకమహాశయుల ఊహకు మించినది కాదు.

ముహూర్తశాస్త్ర సూత్రములను మూడువిధములుగా విభజించవచ్చును :—

## 1. సామాన్య విధులు.

పంచాంగశుద్ధి, శుభగ్రహోదయము, పాపగ్రహముల త్రిషడాయస్థితి, షష్ఠాష్టరిష్ఫ చంద్రదోషము, భృగుషట్కము, అశుభగ్రహదృష్టి, పాతదోషము, సగ్రహదోషము, తిథిత్యాజ్యము, విషనాడి, మొదలగునవి ఈజాతికి చేరినవి.

## 2. విశేష విధులు.

ఇవి ఉద్దేశించిన కార్యమునకే ముఖ్యముగా సంబంధించినవి. వివాహవిషయమున, జామిత్రశుద్ధి, చంద్రజామిత్రశుద్ధి, లగ్నసప్తమాధిపతుల శుభదృష్టి, నరరాశి లగ్ననవాంశలు, పుష్యమీనక్షత్రదోషము, మొదలగునవి.

## 3. ప్రత్యేక విధులు.

ప్రశంసలోనున్న కన్యావరుల జాతకములకు వైయక్తికముగా అనుకూలించు నియమములకు సంబంధించినవి:—చంద్రబలము, తారాబలము, గోచారసౌకర్యము, అష్టమరాశిదోషము, అష్టమాధిపతిదోషము, వైనాశిక నక్షత్రము, జన్మకాలిక పాపగ్రహోదయము, మొదలగునవి

ఈ మూడువిధముల నిబంధనలలో, మొదటి రెండు మాత్రమే పంచాంగకర్తలు గమనింపగలరు. తమ బాధ్యతను గుర్తెరింగిన సమర్థులైన సిద్ధాంతులు వైదికుల ననుసరించి సుముహూర్తముల నేర్పరచి పంచాంగములలో ప్రకటింతురు. ఇక మూడవ తరగతికి చెందిన విధులు ప్రశంసలోని వ్యక్తులకొఱకై వివాహముహూర్తము నిర్ణయించు మౌహూర్తికులు గమనించవలసినవి. ప్రతినెలలో శుభముహూర్తములు చూపట్టురీతిగా, సమృద్ధిగా ముహూర్తముల పట్టికను ప్రకటించు పంచాంగములే సాధారణముగా సామాన్యజనులలో అభిమానపాత్రము లగుటంజేసి, వ్యాపారరహస్యములలో ఆరితేరిన పంచాంగకర్తలు కొందరు నానావిధ దోషములు కలవైనా, పెక్కు ముహూర్తములను పంచాంగములలో సూచించుట వాడుక అయినది. ఇక, వైయక్తిక నియమములను గమనించు మౌహూర్తికులే అరుదైనారు. ముహూర్తనిర్ణయము కొఱకై, కన్యావరుల జాతకములను శోధించువారే సామాన్యముగా కానరారు. కన్యావరుల నక్షత్రములనో, నామనక్షత్రములనో, విచారించుకొని శాస్త్రార్థముగా తారాబలము చూచుటతప్ప ఇతరదోషముల ప్రస్తావనకే వీరు పోరు. ముహూర్తము మంచిదైనా, వైయక్తికముగా కన్యావరులకు దుష్ఫలమును ప్రసాదించునట్టి లగ్నములే అనేక సందర్భములలో సమకూడుచున్నవి. ఇది మిక్కిలి శోచనీయమైన పరిణామము.

సామాన్యముగ ముహూర్తములలో ఏదో ఒక రాశిని లగ్నమనుటతో మౌహూర్తికులు తృప్తి చెందుచున్నారు. లగ్నకాలమును భాగలలోనైనా నిర్ణయించి ఇచ్చు మహనీయులు అరుదు. భావములను సాధించు అభ్యాసమే నశించినదనవచ్చును. గ్రహస్ఫుటము మాట వారి జ్ఞాపకమునకే రాదు.

"యాత్రా వివాహోత్సవజాతకాదౌ,
ఖేటైః స్ఫుటైరేవ ఫలస్ఫుటత్వం"

అను శాస్త్రము నిరాదరింపబడినది. గనుకనే ఇప్పటికాలపు రంగురంగుల లగ్నపత్రిక లనేకములలో ముహూర్తము ఉ॥ 9-0 మొదలు 10-30 వరకు అనియో, 11-0 మొదలు 12-45 గంటలలోగా

అనియో, వ్రాయబడుట సర్వసాధారణముగా చూచుచున్నాము. రమారమి నాలుగునిమిషముల కాలములో భచక్రము ఒకభాగ తిరుగుచుండగా, ముహూర్త కాలము ఒకటి, రెండు గంట లనుకొని అమృత కాలమున, యథావకాశముగా, ఎప్పుడో తీరినప్పుడు శుభకార్యము జరిపినచో, లగ్నములో ఉన్నాడనుకొన్న బృహస్పతి చల్లగా వ్యయభావమునకు జారుకొనుటో, షష్ఠ భావములో నుండవలసిన అంగారకుడు మీసములు మెలివేయుచు కళత్రస్థానమునకు పోవుటో, సంభవించితే వింతలేదు. ముహూర్తముల పట్ల ఇట్టి అవిచారపరత మౌహూర్తికునకు కాని పురోహితునికి కాని, నష్టము లేకపోయినా, పదికాలములపాటు చల్లగా ప్రశాంతముగా గృహస్థాశ్రమమును నిర్వహించవలసియున్న అమాయకులగు కన్యావరుల విషయమున మాత్రము ఘోరమైన అన్యాయము. మహాదోషములు గల దుర్ముహూర్తములలో పెండ్లి చేసినచో, "ఆజన్మాంతము మీరు సుఖదూరులై క్లేశమనుభవించండి" అని వధూవరులను శపించుట కాక మరి ఏమి? కోరిన అరణమునిచ్చి వేలకొలది వ్యయము చేసి, నానావిధ శ్రమప్రయాసలకోర్చి, శుభముహూర్తములో వివాహము జరుపక దుర్ముహూర్తములో జరిపినపుడు, గొప్ప వెలపోసి దుఃఖమును కొనితెచ్చి కన్యలకు కొంగుముడి కట్టినట్లగును. వియోగము, విరహము, వైమనస్యము, బంధుద్వేషము, సంతాన నాశనము, శాశ్వతరోగప్రాప్తి, మొదలగు దుష్ఫలములలో కొన్ని అయినా అట్టి వివాహములలో "మీ ప్రభావము చూపుడు" అని ప్రాచీన దుష్కర్మ ఫలములను మంగళవాద్యములతో, మంత్రాక్షతలతో, మనమై మనము ఆహ్వానించుటయే ఇది.

ఇంతేకాదు. భావస్ఫుటము చేసి ముహూర్తపు లగ్నమును నిర్ధరించరాదా, అని అడిగినప్పుడు "అది మా సంప్రదాయము కాదు" అని నిస్సంకోచముగా ప్రతి ఇచ్చు 'సిద్ధాంతి' మహాశయులు కలరు. కన్యక యొక్క జన్మాష్టమరాశిలో వివాహలగ్నమును నిర్ధరించి ఇచ్చిన ఒకానొక జ్యోతిష్కునితో ఆక్షేపయమై ప్రస్తావించగా, స్త్రీలకు ప్రథమ రజోదర్శన కాలమునకు గుణించిన జాతకములే ఫలించుననియు, అవి లభించనప్పుడు జననకాల జాతక కుండలులను చూచుట ప్రయోజనము లేదనియూ, అతడు చల్లగా ప్రతిఇచ్చి జారుకున్నాడు.

"వివాహమేకం పరిత్యజ్య పుష్యే
సర్వాణి కార్యాణి కరోతు సిద్ధ్యై"

అని శాస్త్రము ఘోషించుచుండగా, పుష్యమీ నక్షత్రమున జామిత్రశుద్ధిలేని ముహూర్తమును నిర్ణయించినారే, అని ఒక పురోహితుని ప్రశ్నించగా "గురువు మహారాజుగా లగ్నములో నున్నాడు.

'లక్షమేకం తు దోషాణాం గురుః కేంద్రే వ్యపోహతి' అన్ని దోషములకు ఇది పరిహారము అని అతడు తడుముకొనకుండా ఆర్భటించినాడు.

వీరి కథ ఇట్లుండగా. నాగరికవరులకు కాని, వారి పెద్దలకు కాని, ముహూర్తకాలమునకు సరిగా శుభకార్యము జరిగించవలెనని ఆస్థ, పట్టుదల, ఉండుటే అరుదు. సరియైన లగ్నకాలమును ఏర్పరచి ఇచ్చి యున్ననేమి, అరణద్రవ్యపు హెచ్చుతగ్గుల పంచాయతీలలోనో, వరోపచారవస్తువుల గుణాగుణ విమర్శలలోనో, జరుగవలసిన మర్యాదల లోపాలోపముల చర్చలలోనో, నిర్ణీతకాలము దాటిపోవుచున్నదను విషయము వారి గమనమునకే రాదు. ఈలోగా, భచక్రము కొన్ని రాసులో, అథవా భాగలో, ముందుకు నడచి గ్రహభావస్థితిని తారుమారు చేసియుండు ననుట వీరి మనస్సునకు గోచరించదు. ఇట్టి వివాహములలో కొన్ని వెనువెంటనే, అకారణముగనో, ఈషత్కారణముగనో, కోపతాపములు, బంధుద్వేషములు తెచ్చిపెట్టి విరసప్రసక్తికి చోటిచ్చుచున్నవి. మరికొన్ని అచిరకాలములోనే వియోగాదులకు అస్పదము

నకు దారితీయుచున్నవి. ఎట్లైననేమి, ముహూర్త ఫలము ముసుగులో దాచినా దాగునదికాదు.

ఈ సందర్భములో మరియొక్క విషయము చెప్పవలసియున్నది. ఖగోళశాస్త్ర పరిశోధనల ఫలముగా కొన్ని వింశత్రింశ పాశ్చాత్యశాస్త్రజ్ఞులచే కనుగొనబడిన ఇంద్ర (Neptune) వరుణ (Uranus) యమ (Pluto) గ్రహములు సైతము జాతకముహూర్త చక్రములలో ఇతర గ్రహములవలె ఫలసూచకములని అనుభవము తెలుపుచున్నది. ఖండాంతరములలోని జ్యోతిశ్శాస్త్రజ్ఞులు విపులముగా పరిశోధించి వాని ఫలములను గూర్చి కొన్ని అమూల్యమగు సూచనలుచేసి యున్నారు. ఏవో పాశ్చాత్యుల గ్రహములివి అని, వాటిని స్పృశించుట సంప్రదాయవిరుద్ధమని, మన జ్యోతిష్కులు వానిని కుండలులలో చేర్పరు మన పంచాంగకర్తలు వానిని బహిష్కరించినారు. ఈ కారణమున వివాహముహూర్తమునకు కొన్ని గొప్ప చిక్కులు దాపురముగుచున్నవి. మన మాహూర్తికు లను కన్నుగప్పి ఈ గ్రహములు విషమస్థానములలో చేరుటవలన, ఉన్నదనుకొన్న సప్తమశుద్ధి లేక పోవుటో, ఒంటరిగా నిలిచినాడనుకొన్న చంద్రునికి ప్రబల సగ్రహదోషము పట్టుటో, లగ్నము క్రూర గ్రహ సంయోగమును సంపాదించుటో. అష్టమ భావము క్రూరగ్రహవేధచే భయంకరముగా ఏర్ప డుటో, కళత్రకారకుడగు శుక్రుడు క్రూరగ్రహవేధ పాలగుటో, అనేక సందర్భములలో సంభవించు విషాద కరమైన సంఘటనము. అక్కరలేదని మనవారు వద లినా, ఆ గ్రహములు మాత్రము మనలను వదలునవికావు వియోగప్రియుడగు వరుణగ్రహము సప్తమభావములో నుండగా చేసిన వివాహములు, చంద్రజామిత్రములో మాయలమారి ఇంద్రగ్రహము కలదినమున ఏర్పడిన మను వులు, ముందుగనవి విపరిణామమును చూపుచున్నవో నిష్పక్షపాతముగా గమనించితిమేని ఈ గ్రహము లను నిరాదరించి ముహూర్తములను నిర్ణయించినవారి భావములు ఎంత అవిచారరమణీయములో మనము సుల భముగా గ్రహించగల్గుదుము. సామాన్యదృష్టికి చక్కని ముహూర్తములుగా చూపట్టినవానియందు జరిగిన వివాహములలో, కొన్ని ఆకస్మికముగా అనర్థ ములపాలై క్లేశదాయకములుగా పరిణమించిన సందర్భ ములు అందరును చూపట్టుచున్నవి. ఆముహూర్తము లను పరిశీలించితిమేని, ఈ నూతనగ్రహముల శక్తిని మనవారు నిర్లక్ష్యము చేయుటవలన కలిగిన ఫలమిది యని స్పష్టముగా ఏర్పడగలదు.

ముహూర్తశాస్త్రమునకు మాతృభూమి యగు భారతదేశములో, ఈ శాస్త్రమునకు ఇప్పుడు పట్టిన దశ ఇట్టిది! అన్నివిధములైన శాస్త్రములు, విద్యలు, నానాముఖముగా అభివృద్ధికి వచ్చుచున్న ఈకాల ములో, లోకకల్యాణమే ప్రధాన లక్ష్యముగా గల ఈ ప్రాచీనవిజ్ఞానమునకు పట్టిన అధోగతి మనదేశము నకు తీరని కళంకముగా ఉన్నదనుట అతిశయోక్తి కాదు.

ఈవిషయమున ఎన్ని దృష్టాంతములైనా చూప వచ్చును వానిని మరియొక్కసారి పాఠక మహాశయు లకు నివేదింతును.

"దైవం జన్మఫలం ప్రోక్తం,
కర్మాంగం ఫల ముచ్యతే,
ఉభయోః సానుకూలత్వే
ఫలం సిధ్యతి నాన్యథా"

# కలగూరగంప

## కుమారసంభవ సంస్కరణము

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

గడచిన సెప్టెంబరు నెల భారతిలో సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు డాక్టరు వేటూరి వెంకటరమణయ్య గారు నన్నిచోడుని కుమారసంభవములోని కొన్ని పద్యములలో గురువర్యులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు కావించిన సంస్కారములను గూర్చి విపులముగాఁ జర్చించి యందుఁ గొన్ని యనావశ్యకము లని వ్రాసియున్నారు. మదరాసు విశ్వవిద్యాలయము వారి కోరికపై శ్రీ ప్రభాకరశాస్త్రిగారు కుమారసంభవములోని యుత్తరభాగమును బరిష్కరించుచుండిన కాలమున వారికడ నంతేవాసిగా నుండిన వాఁడనగుటను వారాయాయి పద్యముల పరిష్కరణమునఁ బడిన పరిశ్రమ మెట్టిదో నాకుఁ గొంత తెలియును. తదుపరి కుమారసంభవములోని మొదటి రెండాశ్వాసములకును విపుల మగు వ్యాఖ్యానమును రచించి తరువాతి యాశ్వాసములకు నట్టి వ్యాఖ్యానమును వెలయింపఁ దలఁచుచున్న నాకు శ్రీ వేటూరి వెంకటరమణయ్య గారి వ్యాసము ప్రోత్సాహజనక మయినది 'కలిగిన సంశయములను నివర్తి (?) చేసికొనుటకై' వారా వ్యాసమును వ్రాసి యుండుటచేత నాయాయి పద్యముల యర్థవిచారమున నాకుఁ దోచిన యంశములను మనవి చేసికొనుచున్నాఁడను.

అందు వారు ప్రస్తావించిన మొదటి పద్యము శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించిన కుమారసంభవమున నిట్లు కలదు.

ఉ॥ ఆయువనీరుహోద్గత లతాంత వినిర్గత సౌరభప్రవా
హాయతి సాంద్రమై ఫలితమై యొగిఁ బర్విన డాయఁబోవనుం
బాయను రాక చుట్టి మధుపవ్రజమాలిక లుండె నొప్పి పు
ష్పాయుధు కాలఁ జుట్టు మరుఁడాయసవ్రపము నట్టినట్టిదై.

నవమాశ్వాసము 298 ప.

ప్రాఁతప్రతిలో 'పుష్పాయుధ కాల చుట్టు' అని యుండఁగా శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు 'పుష్పాయుధ కాల' యనునది వైరిసమాస మగుట తప్పని తలఁచి దానిని 'పుష్పాయుధు కాల' అని 'ధ'ను 'ధు' గా దిద్ది-'కాలచుట్టు' అన్నచో 'కాల్' అనునది ద్రుతప్రకృతిక మగుటచేత 'కాలఁ జుట్టు' అని యుండవలయునని తలఁచి యీరీతిని సరిదిద్దిరి. ఈ సవరణ వల్లనే పద్యార్థము మఱింత క్లిష్ట మయినది. అందుఁ గొన్ని సవరణలు సూచించి పద్యార్థమును, కవి యుద్దేశించిన భావమును బూర్తిగాఁ గాకపోయినను గొంతవఱకయినను సుగమము గావించిన శ్రీ ప్రభాకరశాస్త్రి గారి సంస్కారము లనావశ్యకము లని యాక్షేపించిన శ్రీ వెంకటరమణయ్యగారికి రామకృష్ణకవి గారు పరిష్కరించిన పద్య మెట్లర్థ మయ్యెనో దురూహ్యము. ఏఁటి కయినను శ్రీ ప్రభాకరశాస్త్రిగారి సవరణఁ గైకొనకయే యున్నదున్నట్లుగా నా పద్యమునకు శ్రీ వెంకటరమణయ్యగా రర్థము తెలుపఁ గలుగుదురేని సంతోషమే! కాని, తెన్ను తెలియక కొట్టుమిట్టాడుచుఁ జీఁకటిలోఁ దడవులాటగాఁ బద్యభావము తెలియక, సూచనగానైన స్ఫురింపక యున్న స్థితిలో నా పద్యభావమును సుగమముచేయు మార్గ మొకటి యేర్పడినప్పుడు, అది కంటకావృత మార్గమే యగుఁగాక-అతని హృదయ మెంత తేలిక యగునో? అతఁ డెంత యానందము ననుభవించునో యనుభవించిన వానికిఁ గాని తెలియదు. కొంత పట్టు చిక్కినప్పుడాక్షేపించుట కేమి? ఎవరయినను జేయవచ్చును. 'కవి హృదయము గోచరింపఁగా నాకవి నాకుఁ గనకాభిషేకము చేసినాఁడన్న సంతోషమునఁ దోఁగినాఁడను' అని శ్రీ శాస్త్రిగారు వ్రాసిన వ్రాఁతలో నతిశయోక్తి యావంతయు లేదు.

ఈ పద్యమున శ్రీ శాస్త్రిగారు చేసిన ముఖ్యమయిన సంస్కారములు మూఁడు. వానిలో మొదటిది- పద్యభావ మిట్టిది కాఁబోలు నని తొలిసారిగా సుపక

రించునది - 'పుష్పాయుధశాల' యనునది. వ్రాఁత ప్రతిలో 'పుష్పాయుధకాల' యని యున్నది. 'పుష్పాయుధుకాలఁ జుట్టు' అనునది శ్రీ రామకృష్ణకవిగారు చేసిన సంస్కారమని యిదివఱకే తెలిపితిని. 'కా' యను నక్షరమును శాగా సంస్కరించుటచే-వ్రాఁతలో 'కా', 'శా' యనునవి యొకదాని కొకటిగా భ్రమించు నవకాశము కలదనుట యెల్లరెఱిఁగిన విషయమే. పద్యార్థ మిట్టిది కాఁబోలు నని శ్రీ శాస్త్రిగారికి స్ఫురించినది దానితో వారు నిజముగానే కనకాభిషేక మందినంతగా ననుభవించిన సంతోషమునకు మేర లేదు. తక్కిన రెండు సంస్కారములును దొలి సంస్కారము నాధారము చేసికొని చేయఁబడినవే. 'ఆయవనీరుహోద్గత లతాంతవినిర్గత సౌరభప్రవాహ యతి సాంద్రమై ఫలితమై మొగిఁ బర్వెన........' అని యున్నది కదా! అటు పర్వినది (కర్త) యేది? అని ప్రశ్నించుకొని దానికి సరియయిన సమాధానము ఉపస్థితకవిపాఠములో దొరకనందున-కొంత స్వతంత్రించియే - 'ఆయవనీరుహోద్గత లతాంత వినిర్గత సౌరభ ప్రవాహోయతి సాంద్రమై ఫలితమై మొగిఁ బర్వెన' అని 'త'ను 'తి'గా సంస్కరించిరి లేఖకుల వ్రాఁతలో 'త', 'తి' యనునవి సాధారణముగా నించుమించొకే రూపమున నుండి యనుభవమున్నవారికేని భ్రమఁ గలిగించుననువిషయము విద్వాంసులకు విదితమే. ఈ సవరణతో సాంద్రమైనది, ఫలితమైనది, పర్వినదియేదో తేలినది దీనితోఁ బద్యార్థము మఱింత సుగమము కాఁగా మరుఁ డాయపవ్రము వెలె ననుటకన్న నది వసంత వర్ణనసందర్భమగుటచేత నాకర్తృత్వము మధునికుండుట యభ్యుచితము, సందర్భోచితము నని భావించి మరుఁ డనుపదమును మధుఁ డని సంస్కరించిరి. ఈ రెండు సంస్కరణములకును దారి చూపినది, మూలమయినది 'పుష్పాయుధశాల' యను సవరణ మని పాఠకులీసరికి గుర్తింపఁగలరు. తరువాత 'ముదమున సత్కవికావ్యము' అను పద్యమును కూర్చి వ్రాయుచు శ్రీ వెంకటరమణయ్యగారందు 'కరమే' యనుటకంటె శరమే యనుట సారస్యము. ఈ సవరణను ఇంతకు ముందు కొందఱు పండితులు (?) జేసి యున్నారు. ఇప్పుడు శ్రీ శాస్త్రులవారి యాదరణ కది పాత్రమైనది' అని వ్రాయుచు కరమే యనుచో శరమే యని సవరించిన కొందఱు పండితుల సవరణను మెచ్చుకొనిన వారిక్కడ శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చేసిన యట్టి సంస్కారమునే యేల మెచ్చుకొనఁజాలకపోయిరో దురూహ్యము. పయి పెచ్చు 'పుష్పాయుధుకాల యసంగతి మని పుష్పాయుధశాల అని సవరించినారు. పుష్పాయుధు(?) శాల-పుష్పాయుధుని యొక్క అనఁగా మన్మథుని యొక్క శాల యని గ్రహించవలసి యుండును. కాని యీ సంస్కరణమువల్ల కవియొక్క భావము తెలియ రాదు' అని వ్రాసిరి ఈ సంస్కరణము వలనఁ దెల్లము కాకపోయినచో నంతకు మునుపున్న పాఠమువలన వారి కేమి తెల్లమయినదో వారు తెలుపవలసియుండెడిది. లేదా మఱొక సంస్కరణము నయినను - కవియొక్క భావమును తెల్లము చేయు దానిని-సూచించి యుండవలసినది ఏదియుఁ జేయక యాక్షేపము మాత్రము చేసినఁ దీరదు. ఇంతకు శ్రీ శాస్త్రిగారు చేసిన సంస్కారమువలననే పద్యార్థ మెట్లు సుగమము కాఁగలదో తరువాత మనవి చేసికొందును.

దీనికంటెను వారు చేసిన యాక్షేపము మఱొకటి యున్నది అది పద్యములోని ద్వితీయ పాదము నందలి 'ఫలితమై' యనుమాటకు శ్రీ శాస్త్రిగారు సందర్భోచితిని విశదీకరింప లేదనుట. ఆ యాక్షేపమునే వివరించుచు ఫలితమైన దెద్ది? ఆయవనీరుహోద్గత లతాంత వినిర్గత సౌరభ ప్రవాహోయతి యా? సౌరభ ప్రవాహోయతి సాంద్రమగుట యొప్పును. ఫలిత మగుట యెట్లు? ఒకవేళ యగు నని తలఁచినను అర్థ మేమి? సాంద్ర మగుటచే డాయఁబోవ సాధ్యపడదయ్యె - ఫలిత మగుటచేఁ బాయఁజాలక పోయెనని కదా చెప్పవలయును. ఇది యెట్లు పొసఁగును? మధుపములు గంధలుబ్ధ (?) లనియు మధుగ్రహణమునకై వికసిత లతాంతములకు మూఁగునవియు సుప్రసిద్ధ ఫలముల నారగించుట కొండె రసాస్వాదనము కొండె చెట్ల కవి మూఁగు నని యెందును గానరాదు. ఇఁక 'ఫలితమై' యనుమాట నిచట నెట్లర్థముఁ జేసికొనవలయును?' - అని వ్రాసి యధిక్షేపించిరి. నిజమున కిది చక్కని యధిక్షేపమే. శ్రీ శాస్త్రిగారును నీపద్యమునఁ దమకు స్ఫురించిన తొలి మూఁడు సంస్కారములకే ముగ్ధలయిపోయి. యా సంస్కారముల మూలమునఁ బద్య భావము నేవోరీతిని నప్పటికిఁ గుదుర్చుకొని తరువాత నాలోచించుకొనవచ్చునని తలఁచిరి అట్లు తలఁచిరన్నంతమాత్రమున వారింతకుమును చేసిన సంస్కారముల యోగ్యతను ద్రోసిపుచ్చినట్లు కాదు. మన తత్త్వశాస్త్రప్రకారము చూచిన నెవని పరిస్థితి యయినను నంతే. వస్తులాభము సమకూడినపు డాయానందమునఁ దోగియుండి యాతఁ డితర విషయ చింతను విసర్జించును అటి పరిస్థితియే యిక్కడఁ గూడ నేర్పడియుండు ననుట తప్పు కాదు.

ఇటీవల నీపద్యముతోఁ బాటు కుమారసంభవము లోని మఱికొన్ని పద్యములకు సంబంధించి మిత్రులు, 'పరిశోధన' పత్రికాసంపాదకులు నగు శ్రీ తిరుమల రామచంద్రగారితో నర్థవిచారము చేయుచుండఁగా ననేకాపూర్వ విషయములు గోచరించినవి. వానిలో

నీ పద్యార్థ మిట ప్రస్తుతము. శ్రీ శాస్త్రిగారు చేసిన సంస్కారము లావశ్యకములే యని తలఁచి వాని యాధారముతోఁ బద్యభావము నొకరీతిగాఁ గుదుర్చుకొని యాపై నాపద్యభావము సుగమ మగుటకు మఱికొన్ని సవరణ లేవేని నం దావశ్యకము లేమో చూతము.

ఈ పద్యము నవమాశ్వాసములోని వసంత వర్ణనము నందలిది. ఉమామహేశ్వరు లారామక్రీడావలోకనాసక్తులై లీలోద్యానంబున కరుదెంచిరి. అంతకు మున్నే వసంత సమయ మాసన్న మయినది. అక్కడి 'తరుపల్లలతానీకంబు లొండొంటికి మీఱిన యనూన ప్రసూన వికాస ప్రసవాభిరామము' లయినవి. అప్పు డాపూవులనుండి పూఁదేనె స్రవించి వెల్లువయై ప్రవహింపఁ దొడఁగినది వెల్లువ యడ్డుపడుటచేత 'డాయఁబోవనుగా రాక'-పుష్పాసవము నానవలె ననెడి తమి చేత 'పాయను రాక' మధుప్రజనూలిక లాచెట్లను జుట్టి యుండినవి. అట్లా చెట్లకు జుట్టి యుండిన తుమ్మెదల గుం - పెట్లుండె ననఁగా వసంతుఁడు మన్మథుఁ కొఱకై తాను దయారు చేసిన పూవు లనెడి యాయుధము లున్న యాగారముచుట్టును నినుపకోట నొక దానిని నిర్మించినట్లుండెనఁట! ఇక్కడఁ బూచిన చెట్లు పుష్పాయుధశాలలతోను, అందలి పుష్పాసవముకొఱకై మూఁగిన తుమ్మెదల మొత్తము - నల్లగా నుండుటచే - వసంతుఁడు తాను దయారుచేసిన యాయుధముల ఇతరులనుండి రక్షించుటకొఱకై నిర్మించిన యినుపకోటతోను బోల్పఁబడినవి. తుమ్మెదలు పూవులమీఁద వ్రాలక చెట్లచుట్టును మూఁగి నిలిచియుండుటకు నా పూవులనుండి వెలువడిన పూఁదేనె వెల్లువయై ప్రవహించుచు మార్గమునకంతరాయము కల్పించుటయే కారణము. అయిన నేల తాము వచ్చినచోటికే మఱలి పోలే దనఁగాఁ బూఁదేనె నానవలెననెడి తమిచే వెల్లువ యడఁగునేమో యని యందే నిలిచియున్నవి ఇంతటి రమణీయభావము నీ పద్యములో నూహించినాఁడు కవిరాజశిఖామణి నన్నిచోడఁడు!

ఇఁక నీ భావమును బద్యములో సాధించుట యెట్లనునదే పెద్దసమస్య. అది తీరినచోఁ బద్యభావము కుదిరినట్లే. దీనికి నొండు రెండు చిన్న సవరణలు చేయవలసి యున్నవి. శ్రీ వెంకటరమణయ్యగారు 'ఫలితమై' యనుమాట నిచట నెట్లర్థము చేసికొనవలయునని ప్రశ్నించిరి. తంజావూరిలోని కుమారసంభవ ప్రతికి శ్రీ శాస్త్రిగారు మక్కికి మక్కిగా—శ్రీ రామచంద్ర గారిచే శిథిలభాగములలోఁ గనిపించుచున్న కొమ్ములు, గుణింతములతోఁ గూడ తమ సొంతమునకు వ్రాయించుకొనిన నకలు ప్రతిలో నిక్కడ 'పలితమై' యని యున్నది. దానిని ముద్రించునపుడు శ్రీ రామకృష్ణకవిగారు చెట్లు, పూవులు, సౌరభము అను విషయము లుండుటచే నది 'పలితమై' కాదు 'ఫలితమై' యయి యుండునని యూహించి తదనుసారముగా దిద్దివేసినారు. దానితరువాత నాపద్యమున కర్థముఁ జెప్పుటకుఁ బ్రయత్నించిన శ్రీ ప్రభాకర శాస్త్రిగారును వెల్లువ యడ్డుపడుటచేఁ 'డాయఁబోవనుం రాకయు' ఫలితమై యుండుటచేఁ 'బాయరాకయు' నుండె ననుటను స్థూలముగా భావించి దానిని సంస్కరించుటకు బ్రయత్నింపరైరి. ఆతరువాత దానిని ముద్రించిన మద్రాసు విశ్వవిద్యాలయమువారును దాని నట్లే ముద్రించిరి. దానిని సవరింపవలెనని వారికిని దోఁచినది కాదు. శ్రీ శాస్త్రులవారు 'ఫలితమై' యనుమాట యొక్క సందర్భోచితిని విశదీకరించియుండిన పాఠకుల కృతజ్ఞతకితోధికముగ పాత్రు ల(?)య్యుండెడివారు' అని వ్రాసిన శ్రీ వెంకటరమణయ్యగారికి 'ఆయవరీసుహోద్గత లతాంతనిర్గత సౌరభప్రవాహోన్నతి యనఁగా నర్థమేమి? సౌరభప్రవాహ మేమి? సౌరభము ప్రవాహముగాఁ బ్రవహించునా?' యను సందేహము లేల కలుగలేదో తెలియదు. కాని వారు దానిని ప్రస్తావింపకుండుటనుబట్టి 'సౌరభ ప్రవాహోన్నతి'ని వారు సమ్మతించినట్లే—ఆ సమాసమునకు వారి కర్థము కుదిరినట్లే మనము భావింపవచ్చును. సౌరభము ఘ్రాణేంద్రియగ్రాహ్యము. అనఁగా ముక్కుతో వాసనచూడఁదగినది. చక్షురింద్రియగ్రాహ్యము కాదు. కన్నులతో చూచుటకు వీలయినది కాదు. గంధము ఘ్రాణేంద్రియగ్రాహ్యమని తర్కశాస్త్రమునఁ గలదు! సేనాపతిత్వము నాయుధాగారాధ్యక్షత్వమును వేర్వేఱు పదవులు గాని యొక్కటి కాదని యర్థశాస్త్రగ్రంథములను గాలించి తెలిసికొనిన శ్రీ వెంకటరమణయ్యగారికి తర్కశాస్త్రమునకు సంబంధించిన యీసామాన్య విషయము కూడఁ దెలియకపోయిన దనుట యాశ్చర్యముగాన్నది.

ముద్రిత ప్రతులలోనున్న 'ఫలితమై' యను మాటను 'పలితమై' యని సవరించుకొనవలయును. వ్రాఁతప్రతిలో పలితమై యనియే కలదు. వ్రాఁతలో ప, ఫలు తారుమారగుచుండుట, యొకటి వేఱొకటిగా లేఖకుల ప్రమాదము మూలమున వ్రాయఁబడుచుండుట సర్వసామాన్యమే. 'పలితమై' యని యున్న పదమున కర్థము తెలియక యాలేఖకు డెవఁడో సందర్భము ననుసరించి యించుమించుగా సరిపోవుచుండుటచే-అర్థము కుదురకున్నను—దానిని ఫలితమై యని వ్రాసికొనియుండును. అందులోని యొత్తును జాఱవిడిచి తంజావూరు ప్రతి లేఖకుఁడు 'పలితమై' యని శుద్ధిగా వ్రాసికొనియుండెను. దాని తరువాత సంస్కరించినవారును దిరిగి ఫలితమై యనియే సంస్కరించుట

# కలగూరగంప

వింత! ఇట్లు 'వలితమై' యను పదము రూపు చెడి 'ఫలితమై' అని యయినది. వలితము అనుపదమునకు శబ్దరత్నాకరములో 'చుట్టఁబడినది' అని యర్థము కలదు. ఆయర్థ మిక్కడ మిక్కిలి పొంకముగా సరిపోవుచున్నది. ఇఁక 'సౌరభప్రవాహాయతి' యేమి? అని విచారింతము. ఇంతకు మును చెప్పిన విధముగా సౌరభము ప్రవాహము కాదు కదా! ఇఁక దాని కెటులర్థముఁ జెప్పికొనవలెను? అని యాలోచించినచో నది సౌరభప్రవాహాయతి కాదనియు, 'సారఘప్రవాహాయతి' యనుటను ప్రమాదముగా లేఖకులు దాని యర్థము తెలియక చెట్లు, పూవులు ననువిషయములకు సంభవించిన పద్యమగుట నా పదము 'సౌరభ' మయి యుండుననిసులభముగా దిద్దివేసి యుందురనియుఁ దోఁచుచున్నది. కాని యదియే మన కొంప ముంచినది. పద్యార్థావగాహన కంతరాయమై నిలిచినది. ఈ 'సారఘ' సంస్కారమును సూచించినవారు శ్రీ తిరుమల రామచంద్రగారు. 'సారఘము' అనఁగా తేనె. నేయివంటి వర్ణముగల తేనె యని శబ్దరత్నాకరములోఁగలదు వ్రాఁతలో సా, సౌ లు భ, ఘ లు తారుమారగుట వింతకాదు. ఇంతకును నది లేఖకుల కర్థముకాక చేసిన సవరణ! ఇప్పుడు పై పద్యమునకుఁ బ్రతిపదార్థము చెప్పుకొందము.

ప్రతి పదార్థము—

ఆయవనీరుహా...హాయతి— ఆ అవనీరుహా = ఆ చెట్లనుండి, ఉద్గత = పుట్టిన, లతాంత = పూవులనుండి, వినిర్గత = వెలువడిన, సారఘ = పూఁదేనెయొక్క, ప్రవాహ = వెల్లువయొక్క, ఆయతి = అతిశయము, సాంద్రము ఐ = దట్టమై లేక చిక్కనై, వలితము ఐ-చుట్టఁబడినదియై (పూఁదేనె స్రవించి చిక్కనై చెట్లచుట్టును వెల్లువగాఁ బర్విన దనిభావము); ఒగిన్ = క్రమముగా, పర్వినన్ = వ్యాపింపఁగా, డాయన్ పోవనున్ = సమీపించుటకును, పాయనున్ = వీడిపోవుటకును, రాక = వీలులేక, చుట్టి = (ఆ వెల్లువకు వెలుపలఁ జెట్లచుట్టును) చుట్టుకొని, మధుపవ్రజమాలికలు = మాలికలు మాలికలుగా మూఁగియున్న తుమ్మెదమొత్తములు, పుష్పాయుధశాల చుట్టు = పూవులనెడి యాయుధములను నిక్షిప్తము చేసియుంచిన యింటి చుట్టును, మధుఁడు = వసంతుఁడు, ఆయసప్రము = ఇనుపకోట, పెట్టినట్టులు ఐ = నిర్మించిన విధమున, ఒప్పెడుండెన్.

తాత్పర్యము—

ఆవృక్షములలోని పూవులలోని తేనె స్రవించి చిక్కనై యా చెట్లచుట్టును వెల్లువగట్టి ప్రవహింపఁ దొడఁగినది. ఆ చెట్లలోని పుష్పాసవము నానఁ దలఁచి వానిమీఁదికి మూఁగి వచ్చిన తుమ్మెదలు తమకు ముందున్న పూఁదేనె వెల్లువనుఁజూచి ముందునకుఁ బోలేక పోయినవి. పూఁదేనె నానవలెననెడి తమి పెలిదముచే నాచోటును వీడి చనఁజాలక యందే నిలిచిపోయినవి. అట్లు నిలిచియున్న యా తుమ్మెద మొత్తములు వసంతుడు తాను మన్మథునికొఱకై తయారుచేసిన పుష్పాయుధములు నిక్షిప్తము చేసియుంచిన శాలచుట్టును దదాయుధరక్షణమునకై యొక యినుపకోట నిర్మించినాఁడా యేమి యనునట్లుండెను.

'సారఘ' మను పదమునకుఁ దేనెయని యర్థము కలదనుటకుఁ బ్రాచీనకవి ప్రయోగముల నీక్షింప నొసఁగుచున్నాఁడను. శబ్దరత్నాకరమున 'సారఘము = నేయివంటి వర్ణముగల తేనె' యని మాత్రమే కలదు. అట్లనుటకుఁ బ్రమాణముగాఁ బ్రాచీనకవి ప్రయోగమేదియు నందొసఁగఁ బడలేదు. 'సరఘా మధుమక్షికా' అని యమరము. సరఘ యనఁగా తేనెటీఁగ. వానిచేఁ జేయఁబడినది గాన తేనె సారఘము. కాళిదాసు రఘువంశములో 'సరఘా' యనుటకుఁ బ్రయోగ మిట్లు కలదు.

'తస్యార సరఘావ్యాప్తైః
సక్షౌద్రపటలై రివ'

'సారఘ' మనుటకు భాగవతములోని ప్రయోగము;

'పీత్వా ముకుందముఖసారఘమక్షిభృంగైః
తాపం జహుః విరహజం వ్రజయోషితోఽహ్నః'

దశమ స్కంధము. 16 అధ్యాయము 43 శ్లోకము.

శ్రీనాథుని శృంగార నైషధములోఁ గూడ నీపదము ప్రయోగింపఁ బడియున్నది. చూడుఁడు—

మ॥ అనుచున్ సారఘ సారసారణికి
నెయ్యంబుం బెలింబోని తి
య్యని వాక్యంబున బోటి భీమసుత
మాశ్లేషించి బల్కన్
మన మాహ్లాదముఁ బొందుచుండఁగను భూ
నాథుండు గంభీరతన్
వినఁ డయ్యెన్ సురరాజకార్యఘటనా
విఘ్నంబు వాటిల్లుటన్.

చతుర్థాశ్వా-ము 102 వ పద్యము.

పయిపద్యమునకు వ్యాఖ్య వ్రాయుచు శ్రీ వేదము వెంకటరాయ శాస్త్రి(గారు 'సారఘసార సారణికిన్ = తేనెయొక్క (సరఘలనఁగా తేనెటీఁగలు-వానిచేఁ జేయఁబడినది గాన తేనె సారఘము) శ్రేష్ఠాంశము యొక్క చిఱుతయేటికి ('సారణీ స్వల్పసరిత్' విశ్వ) అని వ్రాసిరి. దీనిఁబట్టి 'సారఘ' మను పదము తేనె యను నర్థమునఁ బ్రసిద్ధమయి యుండునట్లు తేలినది.

*  *  *

ఇఁక శ్రీ వెంకటరమణయ్యగారు చేసిన మఱొక యాక్షేపమునకు సమాధానము చెప్పవలసియున్నది. శ్రీ శాస్త్రిగారు వ్రాఁత ప్రతిలోను, ముద్రిత ప్రతులలోను గల 'మకుఁడు' అను పాఠమును 'మఘుఁ' డని మార్చుట యసంగత మని శ్రీ వెంకటరమణయ్యగారి వాదము. కాని యిట్టిపట్టుల సందర్భములను, సంప్రదాయము ననుసరించియే మన మర్థము చేసికొనవలసి యున్నదని వారు గ్రహింపవలెను. అది వసంత వర్ణన సందర్భము. వసంతాగమముచే నొక నూతన చైతన్యము, నొక నూతనశోభ యావనమున నేర్పడినదని యీ ఘట్టమున వర్ణిత మగుచున్నది. ఇది కాక—

పుష్పాయుధములను ప్రయోగించువాఁడు మన్మథుఁడే యగుఁగాక— చెట్లు చిగుర్చుట, పూచుట— మొదలగునవి వసంతుని కార్యములు. మన్మథుని కొఱకై పుష్పాయుధములను దయారు చేసిన వసంతుఁడే దానిని భద్రపఱచుట కుచిత మయిన దర్యను- ఇనుపకోటను నిర్మించుటలోఁ దప్పేమున్నది? పుష్పాయుధములను ప్రయోగించువాడు మన్మథుఁ డయినంత మాత్రమున నాతఁడే తనయాయుధాగారమును సంరక్షించుకొనవలెయు నను నియమ మెక్కడ నున్నది? అతని పరివారములోని మఱొకఁడు దాని రక్షణకార్యభారమును వహించుటలోఁ దప్పేమున్నది? ఇంతకు వానిని దయారు చేసినవాఁడును నాతఁడే యయినప్పుడిట్టిసందేహమునకే తావుండరాదు. సేనాపతిత్వమును, ఆయుధాగారాధ్యక్షత్వమును వేర్వేఱుపదవు లగుట యిట నెంత మాత్రమును బాధకము కాజాలదు. ఇంతకు నతఁడాయుధాగారాధ్యక్షుఁ డని యెచ్చటను జెప్పి యుండ లేదు. అతఁ డాయసవప్రము పెట్టినాఁడని మాత్రమే కలదు. పెట్టినాఁ డనఁగా నతఁడే పెట్టినాఁ డని కాదు. తనసేవకులచేఁ బెట్టించినాఁ డనవచ్చును. అయినప్పుడు సేనాపతి తన యాయుధాగారమునకు రక్షణము నెలకొల్పుటలో విప్రతిపత్తియేమున్నది?

కుమార సంభవములోనే చతుర్థాశ్వాసములో నొకచోట మన్మథుఁడు వసంతునిఁ బిల్చి యాకానన మెల్ల వసంతశోభ తలిర్చుదానిగాఁ జేయుమని యాజ్ఞాపించినట్లు వ్రాసియున్నాఁడు. ఈ క్రింది పద్యమును జూడుఁడు:

మ॥ వలరాజామనిఁ బిల్చి వేగమెయి నీవాసంతికానందదో
హల మీకాననలక్ష్మికిమ్మనుడు నాహ్లాదంబుతో నెయ్యమ
గ్గల మైయుండ వసంతకుండు దమపైఁ గన్పిడ్డఁ గారాకు గం
డలిరా కయ్యోనో నాఁదలిర్చె వడిఁ గాంతారాంత రోర్వీజముల్
4. ఆ 85 ప

ఈపద్యమునుబట్టి మన్మథుని యాజ్ఞచే వసంతుఁడు చెట్లను జిగుర్పఁ జేసినాఁ డని తెలియుచున్నది కదా! సేనాపతి యయినవాని కీపని నెందులకు మన్మథుఁడు నియమించును? అదికా దిక్కడ విషయము. చెట్లను చిగుర్ప జేయువాఁడు, పుష్పింపఁ జేయువాఁడు వసంతుఁడు సేనాని కనుక తన రాజగు వలరాజునాయుధములకు గూడ నాతఁడే రక్షణము కల్పించుకొనుటలోఁ దప్పు లేదు. పయిపెచ్చు మన్మథుఁడు తన యాయుధములను సంరక్షించుకొనుటకై తానే కోటను గట్టుకొనినాఁడు అనుట కన్న అతనిపరివారములోని వాఁడగు మఘుఁడు నిర్మించినాఁ డనుటయే మన్మథుని రాజత్వమునకు గౌరవప్రదము కాఁగలదు. కాళిదాసు కుమారసంభవము చూచినను నీవిషయము తెల్లము కాఁగలదు. కనుకఁ బయిన నూపిన కారణములను బట్టి శ్రీ ప్రభాకర శాస్త్రిగారు చేసిన 'మఘుఁడు' అన్న సంస్కారము సుసంగతమే యగుచున్నది కాని యసంగత మెంత మాత్రమును గాఁజాలదు. శ్రీవెంకటరమణయ్యగారు దీనిని సావధానముగా జిత్తగింపవలయు నని ప్రార్థించుచున్నాఁడను.

మఱియొక సంగతి. శ్రీశాస్త్రిగారు తమ సవరణలో 'పుష్పాయుధశాల' అని స్పష్టముగా నొసఁగి యుండఁగా—అట్లని వారే యుదాహరించిరి-పాఠకులను దప్పుదారిని బట్టించుటకై-'పుష్పాయుధుశాల'- పుష్పాయుధుని యొక్క అనఁగా మన్మథునియొక్క శాల యని గ్రహించవలసి యుండును అని వారిచ్చిన పాఠము దప్పుగా నుదహరించి యర్థము వ్రాసిరి. కాని వారి సంస్కారముతోడి పాఠము "పుష్పాయుధశాల' యనియే దానికి పుష్పములనెడు నాయుధంబులను నిక్షిప్తము జేసియుంచిన శాల యని యర్థము చెప్పుకొనుట నిర్వాహము కాఁగలదుకదా!

ఇఁక శ్రీప్రభాకరశాస్త్రిగారి కడ నున్న వ్రాఁత ప్రతియందు 'మొగి' యన్నచోట 'యొగి' అనియే కలదు. అది యచట సందర్భోచితముగా నే యుండుట చేతను, మొగియను ముద్రిత గ్రంథములోని పాఠము అక్కడ నర్థమునకుఁ జక్కఁగా నతుక కుండుటచేతను శ్రీశాస్త్రిగారు ముద్రిత ప్రతిపాఠమును బరిహరించి తమ వ్రాఁత ప్రతిపాఠము నే పరిగ్రహించిరి. మొగి అను పదమునకు శబ్దరత్నాకరములో పూనిక, మొత్తము అను నర్థములు కలవు. అవి రెండును అక్కడ నర్థమునకు సరిగా నతుకవు ప్రవాహము పర్వుటకు దానికిఁ బూనిక యెక్కడిది? ప్రవాహము మొత్తముగాఁ బర్వుట యనఁగా నెట్లు? అని యాలోచించి 'ఒగిన్' అను పాఠమును వారు స్వీకరించిరి. పూదేనెవెల్లువ క్రమముగా సాంద్రమై. చుట్టువారి పర్వెనది యనుట కుదురుచుండుటచేత మొగి అని ముద్రితపాఠమున

## కలగూరగంప

కంటెను శ్రీ శాస్త్రిగారు స్వీకరించిన 'ఒగి' యను పాఠమే శ్రేష్ఠతర మని యెన్నవలసియున్నది.

శ్రీ వెంకటరమణయ్యగారి యాక్షేపమునకు పాత్రమైన మఱొక పద్యము విశ్వవిద్యాలయమువారి ముద్రణములో నిట్లు కానవచ్చుచున్నది.

"తను వసితాంబుదంబు సిత
దంతియుగం బచిరాంశు లాత్మగ
ర్జన మురుగర్జనంబు కర
స్రగుచి శక్రశరాసనంబు నై
చిన మదవారివృష్టి హిత
సస్య సమృద్ధిగ పృథివేల నాఁ
ఘనగణనాథుఁ గొల్తు నని
శంబు నభీష్టఫలప్రపాతిగాన్.

ప్రథమాశ్వాసము. 2 వ పద్యము.

ఇది కుమారసంభవ కృత్యవతరణికలోని యిష్టదేవతాస్తుతిలో వినాయకు నభివర్ణించుపద్యము. ఇందు శ్రీ ప్రభాకరశాస్త్రి గారు సూచించిన సంస్కారము 'సిత దంతయుగం' బను మాటను 'సితదంతిముఖం' బనవలయు నని. దానికి వారిచ్చిన వివరణ మిట్లు కలదు 'విఘ్నేశ్వరుఁ డేకదంతుఁడు. కాన సితదంతయుగం బని యుండరాదు. అచిరాంశువు=మెఱుపు అది ఉపమానము కాన యప్పుడప్పుడు మాత్రమే కన్పడు నదిగా నుండవలెను 'సితదంతిముఖం' బనుటలో నోరు తెఱచినప్పు డగపడుట, మూసినప్పు డగపడకుండుట దంతాగ్రమునకు కలిగి యచిరాంశు సామ్యము సిద్ధించును" అని.

శ్రీ వెంకట రమణయ్యగారు శ్రీ శాస్త్రిగారు చేసిన పయి సంస్కారము నాక్షేపించుచు విఘ్నేశ్వరుఁడు గజాననుఁడు కదా! ఏనుఁగు నోరు తెఱచిన నేమి? మూసిన నేమి? దంతము లెప్పుడును మఱుఁగు పడకుండుట యెల్లరు నెఱిఁగిన విషయమే. ఇఁక దంతిముఖమున కచిరాంశుసామ్య మెట్లు సిద్ధించును? అని వ్రాసిరి. అంతటితో నూరకుండక విఘ్నేశ్వరుని యేకదంతత్వ విచారము సల్పి తుదకు వినాయకుని కేకదంతుఁడని పేరున్నను నాతని ప్రతిమలు దంతియుగళము తోడనే చెక్కఁబడి యున్న వనియు, నందుచేత నన్నిచోట దేవుఁడు సితదంతయుగం బని చెప్పుట తప్పు కాదనియు సిద్ధాంతీకరించిరి! తమవాదమున కుపబలకముగా వినాయక కల్పమునకు సంబంధించిన యైతిహ్యములను రెంటిని వివరముగాఁ జేర్కొనిరి. సర్వసామాన్య మయిన యీ యైతిహ్యములు కూడ బహుగ్రంథరచనాధురంధరు లయిన శ్రీ ప్రభాకర శాస్త్రి గారికిఁ దెలియ వని శ్రీ వెంకటరమణయ్యగారి యభిప్రాయము కాఁబోలు! 'దీనిని సంస్కరింప వలసిన యవసరము లేదని ఖండితముగా వ్రాసిన శ్రీ వెంకట రమణయ్యగారు' ముద్రిత పాఠమగు 'సితదంతయుగం' బునకు అచిరాంశుసామ్య మెటు సిద్ధించునో విశదీకరించి యుండిన-వారే మఱొకచో నన్నట్లు-పాఠకుల కృతజ్ఞత కితోధికముగాఁ బాత్రులయి యుండెడివారు. అట్లు చేయక 'సితదంతయుగం' బనుటయే సరియనుట సమంజసము కాదు.

అసలు శ్రీ ప్రభాకర శాస్త్రిగారు 'సితదంత ముఖం' బని దాని సంస్కరించుటకుఁ బ్రధానకారణ మొకటి కలదు. వారికడ నున్న వ్రాఁతప్రతిలో 'సితదంతయుగం' బనుచోట 'సితదంతముగం' బని యుకు మాఱుగా ము కలదు. ఇట్టి గ్రంథముల పరిష్కరణ సందర్భమున సూక్ష్మసూక్ష్మతరాంశముల నైతము జాగ్రత్తగా గమనించు నభ్యాసము కల శ్రీ శాస్త్రి గారు వ్రాఁతప్రతిలోఁ గల ము యను నక్షరము సులువుగాఁ ద్రోసిపుచ్చఁ దగినది కాదనియు యుగం బనుటయే ముగం బని వ్రాయఁబడి యుండు నని సమాధానము చెప్పుకొనఁ దగిన సందర్భము కాదనియుఁ దలఁచిరి. వినాయకుఁ డేకదంతుఁ డనుట కూడ 'సితదంతియుగం' బనుపాఠము తప్పను వారియభిప్రాయమున కూడివచ్చినది. వ్రాతప్రతిలోని పాఠమునకును, నర్థనిర్ణయమునకును జక్కని పొందిక కుదురుచుండు టచేత 'యుగం' బను దానిని, 'ముఖం' బని సంస్కరించిరి. వారు పై సంస్కారమును జేసినప్పటి వారి యభిప్రాయ మది.

ఇఁక శ్రీ వెంకటరమణయ్యగారు 'ఏనుఁగు నోరు తెఱచిన నేమి?' అని చేసిన యాక్షేపమునకు సమాధానము చెప్పవలసి యున్నది. శ్రీ శాస్త్రిగారిని పై విధమున నాక్షేపించిన శ్రీ వెంకటరమణయ్యగారు 'సిత దంతియుగము చిరముగా స్థిరముగాఁ గానవచ్చుచుండును గదా! 'సితదంతియుగం బచిరాంశులు' అన్నప్పుడు అవి యచిరాంశు లెట్లగును? సితదంత యుగమున కచిరాంశుసామ్య మెట్లు సిద్ధించును?' అని యే విద్యార్థియేనిఁ బ్రశ్నించినచో నేమి సమాధానము చెప్పుదురో? శ్రీ శాస్త్రిగారి నింత సూక్ష్మముగా నాక్షేపించిన వారు 'శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం' అని యున్నదికదా. తను వసితాంబుదంబు అని కవి వ్రాయుటలో నేమి సబబు కలదు? అని నన్నిచోటని నేల యాక్షేపింపరు?

అసలీ పద్యమున కర్థము చెప్పుకొనునపుడు నిశ్చలముగా యోగాసనమునఁ గూర్చుండియుండు విఘ్నేశ్వరుని మూర్తిని కవి వర్ణించినాఁ డని కాని-లేక శ్రీ వెంకటరమణయ్యగా రన్నట్లు - మన దేవాలయముల యందును, నన్యస్థలముల యందును గానవచ్చు విఘ్నేశ్వర ప్రతిమను దృష్టిలో నుంచుకొని వర్ణించినాఁడని

కాని మనము భావింపరాదు. ఎట్టయెదుట సజీవముగా దొండము నిటునటు నాడించుచు, నేలపై నున్న వస్తువు నెత్తిఁ బోవుచుఁ గుంభస్థలము మీఁదికిఁ దొండము ను జాచుచు, నిరుప్రక్కల నున్న దంతములో - లేక యొక దంతమో మాయఁబడునట్లు తొండము కదల్చుచు నున్న యేనుఁగను జూచి వినాయకమూర్తిని మనస్సున భావించి భావించి యట్టిరూపమును దన మనోనేత్రము నెదుట సాక్షాత్కరింపఁ జేసికొని కవి యీపద్యమును వ్రాసినాఁ డూహింపుడు ఏనుఁగు నెదుట నిలిచి యొకింత సేపు దాని కదలికలను, చేష్టలను పరిశీలించిన వారికిది సత్యమని గోచరింపక మానదు. కళాత్మకదృష్టితో నద్భుత శిల్పము నభ్యూహించి నన్నిచోడఁడు చిత్రించిన యీయక్షర రూప శిల్పము నుత్తమ కళోపాసకులు, కవిహృదయ మర్మజ్ఞులు నయిన శ్రీప్రభాకర శాస్త్రిగారు గుర్తించియే యీ సంస్కారమును జరిపిరి. తొండము నిటునటు కదల్చునపు డది యవటి దంతముపైఁ బడి సగమో, సగమునకింకను నెక్కువభాగమో యావరించి వేయుగాఁ - దక్కిన దంతాగ్రముపై - దంతముఖముపై - పలుఁగుపడి నప్పు డది తళతళ మెఱయుచు మెఱపువలెఁ గానవచ్చును. తిరిగి తొండమును దిప్పునప్పు డది పూర్తిగా మఱుగుపడి పోవును. ఇట్లు దంతముఖమున కచిరాంశు సామ్యము సిద్ధించుచున్నది. నోరు తెఱచుట, మూయుట యన్నప్పుడు శ్రీ శాస్త్రిగారు భావించిన భావమిదియే. దంతియుగ మున్నను దంతముఖ మన్నను నచిరాంశుసామ్యత్వము సిద్ధింపవలయు ననుటయే వారి తాత్పర్యము. కాని దంతముఖ మనియే దాని సంస్కరించుటకు వారికి మఱొక కారణము కూడఁ దోఁచినది. తనువు - అసితాంబుదంబు; ఆత్మ గర్జనము - ఉరుగర్జనంబు; కరసద్రుచి - శక్రశరాసనంబు; మదవారి - వృష్టి - ఇత్యాదిగా నేకవచనాంతములగు నుపమానోపమేయములను జెప్పిన నన్నిచోడఁడు తనశిల్పమునకు విరుద్ధముగా 'దంతియుగం బచిరాంశులు' అనునాయనియు వారికి సంశయము ప్రొడమినది. అందుచే 'దంతముఖం బచిరాంశువు' అని సంస్కరించి నన్నిచోడని శిల్పమర్యాదను మన్నించినవారైనారు.

పయి సంస్కారమే సరియగుట కా పద్యము నందేకల మఱొక పోలిక తోడ్పడుచున్నది. నన్నిచోడఁ డాపద్యమున 'కరసద్రుచి శక్రశరాసనం' బని చెప్పి తొండమును నింద్రధనుస్సుతోఁ బోల్చినాఁడు. స్థూల దృష్టికి నల్లగానున్న తొండమును బలువన్నెలుగల యింద్రధనుస్సుతోఁ బోల్చుటయేమి? యని విపరీతముగాఁ దోఁపవచ్చును. కాని యించుక సూక్ష్మముగా నాలోచించి చూచినచో నన్నిచోడఁ డాపోలిక నెంత సముచితముగా సంభావించెనో తెలియఁగలదు. తొండముపై నల్లగానే కానవచ్చినను దాని యడుగు భాగము బూడిదవన్నె, తెలుపులోఁ జిగురుపు యెఱుపు కలిసినవర్ణముతోఁ గానవచ్చుననుట జూచిన వారికెల్లరకు విదితమే. వినాయకుఁడు తన తొండము నటునిటు కదల్చినపుడు, దంతముమీఁదికిఁ ద్రిప్పి యాడించినపుడు నా యడుగుభాగము మనోహరమై యింద్రధనుస్సుయొక్క స్ఫూర్తిని గలుగఁ జేయు ననుటయే నన్నిచోడఁడు భావించిన భావము. దీనిఁబట్టిచూడ వినాయకుఁడు తనతొండము నటునిటు నాడించుచుండెనని యన్నప్పుడు కన్నులకు నగపడుచు, మఱుగుపడుచునుండెడి దంతాగ్రము మెఱపువలెఁ గానవచ్చుచుండెనని తెలుపుటలోను, శ్రీ ప్రభాకర శాస్త్రిగారు సముచితముగా - తమ వ్రాఁతప్రతిపాఠమునకు దగ్గఱగా - సంస్కరించుటలోను దప్పులేదని తెలియుచున్నది

ఇంతదక్కఁగాఁ బద్యభావము నూహించి వ్రాసిన నన్నిచోడుఁడు 'తను వసితాంబుదంబు' అని యేల చెప్పెనో పరిశీలింపవలసి యున్నది వినాయకవర్ణన సందర్భమున - నాటినిమూర్తిని భావించుచుండిన నన్నిచోడునికి నాతని యేనుఁగుమొగము, తొండము, దంతము వలన గజస్ఫూర్తి కలిగి యాతని శరీరమునుగూడ గజశరీరమువంటిదిగానే భావించుట యేర్పడినది. అది యాతని యప్పటి వర్ణనమునకు జక్కఁగ సరిపడినది. అందులకే 'తను వసితాంబుదంబు' అనినాఁడు. విఘ్నేశ్వరుఁడు నల్లనివాఁ డనుటకుఁ బ్రమాణ మేదేని గలదేమో శ్రీ వెంకటరమణయ్యగారు తెలుపవలసియున్నది.

వినాయకుఁ డేకదంతుఁడే యనుటకు మాఘము లోని యీక్రింది శ్లోకమును జూడుఁడు:—

'విలాసినీ విభ్రమదంత పత్రికా
విధిత్సయా నూనమనేన మానినా
నజాతు వైనాయక మేక ముద్ధృతం
విషాణ మద్యాపి పునః ప్రరోహతి'

శ్రీ వెంకటరమణయ్యగారు దీని కేమందురో!

ఇట్లు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చేసిన 'సిత దంతముఖం' బను సంస్కార మావశ్యకమే యనియు శ్రీ వెంకటరమణయ్యగా రన్నట్లు అనావశ్యకము కాదనియుఁ దెలియుచున్నది.

'సితదంతముఖం' బను సంస్కారమునుగూర్చి యింతదూరము చర్చించినవారు తామిచ్చిన పద్య పాఠములోని 'అభీష్ట ఫలప్రసిద్ధిగాక్' అను పాఠము 'అభీష్ట ఫలప్రదాతిగాక్' అను సంస్కారములోని

# కలగూరగంప

బాగోగులనుగూర్చి జర్చించియుండిన బాగుండెడిది! కాని వారికది సంస్కారముగా నేనిఁ దోఁపలేదో లేక వారి పరిమర్శదృష్టినుండి యది తప్పిపోయినదో తెలియదు.

శ్రీ వెంకటరమణయ్యగారు చర్చించిన మఱొక పద్యమునుగూర్చి పరిశీలింతము. వ్రాతప్రతియం దాపద్య మిట్లు కానవచ్చుచున్నది

క॥ ముదమున... కావ్యము
సదరంగ విలుకాని పట్టినమ్ముయుం బరహృ
ద్భిదమై తల యూపింపని
యది కావ్యమె మరి పట్టినదియున్కరమే.

శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు ఆ పద్యము నిట్లు సంస్కరించి ముద్రించిరి.

క॥ ముదమున సత్కవి కావ్యము
సదరఁగ విలుకాని పట్టినమ్మును బరహృ
ద్భిదమై తల యూపింపని
యది కావ్యమె మఱి పట్టినదియుం గరమే.

ఇందు శ్రీ రామకృష్ణకవిగారు చేసిన సవరణలు రెండు ఒకటి శిథిలభాగమును 'సత్కవి' యను పదముతోఁ బూరించుట, రెండవది మరియని యున్నచోట 'మఱి' యని ఱ యను నక్షరమును మధ్య చేర్చి గణభంగము లేకుండ సరిదిద్దుట

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వెలయించిన సంస్కారములతో నాపద్య మిట్లు కలదు.

క॥ ముదమున కవికృత కావ్యము
సదగన విలుకానిపట్టి నమ్మును బరహృ
ద్భిదమె తల యూపుదు, బెఱ
యది కావ్యమె చెప్పఁ, బట్టినదియున్ శరమే.

శ్రీ రామకృష్ణకవిగారును, శ్రీ ప్రభాకరశాస్త్రిగారును బయిపద్యమునందుఁ జేసిన సంస్కారములలోని బాగోగులను జర్చింపఁదలఁచుకొనుటకుఁ బూర్వమా పద్యమునకు మూలమయిన సంస్కృతశ్లోకమును బేర్కొనవలసియున్నది.

"కిం కవేః తస్య కావ్యేన
కిం కాండేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం
న ఘూర్ణయతి యచ్ఛిరః"

పయి శ్లోకములోని భావమునే నన్నిచోడఁడు తనపద్యములో ననువదించుకొనినాఁడు. ఇఁక శ్రీ వెంకటరమణయ్యగారి యాక్షేపమును బరిశీలింతము. ఇందలి మొదటిపాదములో శ్రీ శాస్త్రిగారు చేసిన 'ముదమున గవికృత కావ్యము' అను సంస్కారము నాక్షేపించి శ్రీ రామకృష్ణకవిగారి 'సత్కవి' యన్న పూరణమే చక్కగా నున్నదని తెలుపుచు శ్రీ వెంకటరమణయ్యగా రిట్లు వ్రాసిరి. 'కృతి' యను మాటకుఁ గావ్యమను నర్థము కలదని యందఱు నెఱింగిన విషయమే. 'కవికృతి కావ్యము' ఇందువలన పునరుక్తి దోషదూషితమగుచున్నది— 'సత్కవి' యను రామకృష్ణకవిగారి సంస్కరణమే సమంజసమని తోఁచుచున్నది.

కాని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు 'సత్కవి' యను శ్రీరామకృష్ణ కవిగారి పాఠమును ద్రోసిపుచ్చి 'కవికృత' యని దానిఁ బూరించుటలోఁ బ్రయోజనము లేకపోలేదు మూలశ్లోకములో 'కిం కవేః తస్య కావ్యేన' అనుచో 'కవేః' అను పదముమాత్రమే యుండుటను శ్రీ వెంకట రమణయ్యగారు చిత్తగింపవలయును. అక్కడ 'సత్కవేః' అని కాని, వేరేదేని నుపసర్గముతో గాని యాపదము లేదు. కేవలము 'కవేః' అనిమాత్రమే కలదు. మూలములో నట్లున్నంతమాత్రమున నన్నిచోడఁడును నట్లే యనువదింపవలయు ననునియమ మెక్కడఁగలదు? ఛందస్సౌకర్యముకొఱకై యాతఁడు 'సత్కవి' యను మాట నచట నెందుకుఁ బ్రయోగించి యుండరాదని శ్రీ వెంకట రమణయ్యగారు ప్రశ్నింపవచ్చును. కాని దానికిని సమాధానము కలదు. 'కవి' కావ్యము పరహృద్భిదమై తల యూపించినపుడే యది కావ్యము కాఁగలదు. లేకున్న నది కావ్యమనిపించుకొనదు. అట్లుచో 'సత్కవి' యనుచో నాతని కావ్యము పరహృద్భిదమై తలయూపించుననియే యనుకదా! కనుక 'సత్కవి' కావ్యము అనుటలో నర్థము లేదు. ఇదికాక రెండవ పాదములో 'విలుకాని పట్టినమ్మును' అనియే యున్నది కాని యా విలుకాని కెట్టి విశేషణమును బ్రయోగింపఁబడి యుండలేదు కదా! మేటి విలుకాఁడని విశేషణ యుక్తప్రయోగ మట కానరాదు గదా! అట్లుచో నిక్కడమాత్ర మీ యధికవిశేషణ మెందులకు? ఇట్లూహించి శ్రీ శాస్త్రిగారు ద్వితీయ పాదమున 'విలుకానిపట్టి నమ్ము' అని యుండుటచేత దానికి సమానముగా నుండునట్లు 'కవికృత కావ్యము' అని యా శిథిలభాగమును బూరించి పద్యమును సంస్కరించిరి. మూలమునందుకంటెను నన్నిచోడఁడు తన పద్యములో సాధించిన గుణవిశేష మొకటి కలదు. అది శ్రీ వెంకటరమణయ్యగారు గుర్తించిరో లేదో! కావ్యము, బాణమునను నవి రెండును 'పరహృద్భిదమై తల యూపించునవి'యే యైనను నందుఁ గావ్యము 'ముదమునను' బాణము 'అదరున'ను నాపనుఁ జేయును. ఆసారస్యమును గుర్తించిన శ్రీ ప్రభాకర శాస్త్రిగారు రెండవపాదములో నాయర్థము నస్పష్టముగా మాత్రమే స్ఫురింపఁజేయుచున్న 'అదగగ' అన్నపదమును 'అదరున' అని మార్చి సంస్కరించిరి. 'అదరఁగన్' అన్నను నాయర్థమే చేసికొనుటకు నవ

కాశము లేకపోలేదు. కాని తొలిపాదములోని 'ముదమునన్' అనుపదము తృతీయాంతమై యుండుటచేత ద్వితీయపాదములో తత్సమానపదము కూడఁ దృతీయాంతముగా నుండుట శిల్పమునకు మెఱుఁగనియు, భావస్పష్టతకుఁ దోడ్పడుననియు దలఁచి యావిధమున దాని సంస్కరించిరి కనుక నన్నిచోటఁ డాపద్యములోని తొలి రెండుపాదములలోఁ దొలుత వ్రాసిన 'ముదమున' 'అదరుఁగ' అనునవి పాదపూరణపు వ్యర్థపదములు మాత్రమే యని మనము త్రోసిపుచ్చరాదు. మూలములోని యర్థమునకు మెరుఁగు పెట్టుచున్న సారస్యమందు గలదు.

పయి పద్యములోని యుత్తరార్థమున శ్రీ శాస్త్రి గారు చేసిన సంస్కారముల నాక్షేపించుచు శ్రీ వెంకటరమణయ్యగారు శ్రీ శాస్త్రులవారు సంస్కరణ వ్యాజమున నీ కందపద్యముయొక్క యుత్తరార్థమున నన్నెచోడుని రచనను దొలఁగించి తమకవిత్వమును జొప్పించిరి. వ్రాఁతప్రతిని బట్టి ముద్రితమైన పద్యము చక్కఁగనే యన్వయ మగుచున్నదే' యని వ్రాసిరి.

నిజమునకు శ్రీశాస్త్రిగారా భాగమును గొంత స్వతంత్రించి సంస్కరించినమాట వాస్తవమే. కాని శ్రీ వెంకటరమణయ్యగారు ప్రభాకరశాస్త్రిగారి కట్టి సంస్కారములఁ జేయవలసిన యక్కఱయేల కలిగెనో గమనింపలేదు. "ముద్రితమైన పద్యము చక్కఁగనే యన్వయ మగుచున్నదే" యని యేవో యన్వయము కుదిరినట్లుగా నే చెప్పి డబాయించిన శ్రీ వెంకటరమణయ్యగారికి ప్రభాకరశాస్త్రిగారా పద్యమున కన్వయము కుదురక పడినబాధ యర్థము కాకపోవుటలో వింతలేదు. పయి పద్యమున కన్వయము కుదుర్చుచు వారు "ఇందు-పరహృచ్ఛిదమై తల యూపింపని యది-అనువాక్యము (?) కావ్యమునకును శరమునకును సామాన్యము-ముదమున సత్కవి కావ్యము పరహృచ్ఛిదమై తల యూపింపని యది కావ్యమె? అదరఁగ విలుకొనిపట్టినమ్ము పరహృచ్ఛిదమై తల యూఁపింపనియది శరమే (అమ్మె)?' అని వ్రాసిరి. అన్వయము కొంత డొంకతిరుగుడుగా నే యున్నను-వారు చెప్పినయన్వయము తొలివాక్యము నందు మాత్రమే సరిపోవుచున్నది. రెండవవాక్యము నందు-అన్వయము కుదురదని గుర్తించియే కాఁబోలు-పద్యములోని కొన్నిమాటలను తప్పించి యన్వయము కుదుర్చుటకు ప్రయత్నించిరి. తొలివాక్యమునకు వారు చెప్పిన యన్వయము ప్రకారమే రెండవ వాక్యమునకు నన్వయము చెప్పుకొనినచో నా వాక్య మిట్లుండవలయును. 'అదరఁగ విలుకొనిపట్టినమ్ము పరహృచ్ఛిదమై తల యూపింపనియది పట్టినదియున్ శరమే' అని యగును. ఇందు వారు విడిచినమాట "పట్టినదియున్" అనునది.

అది యీవాక్యములో నున్నయెడల నన్వయము కుదురదని, పునరుక్తియై ప్రతిబంధకముగా నిలుచునని వారికిఁ దెలియును. తెలిసియే యన్వయము చూపునపుడు బుద్ధిపూర్వకముగానే దానిని వదలివేసిరి అట్లువారు చేయలేదను కొన్నను "పట్టినదియున్" అనునది దేనితో నన్వయించునో వారు చెప్పవలసి యుండెను. కనుక దీనిని బట్టి శ్రీ వెంకటరమణయ్యగారి కాపద్యమున కన్వయము కుదురలేదనియే తలఁప వలసియున్నది. శ్రీ ప్రభాకరశాస్త్రిగారికిని బద్యాన్వయము విషయమున నట్టిసంశయమే కలిగెను? పద్యమును రెండు వాక్యములుగాఁ జేసికొని యర్థము చెప్పుకొనుటకన్న మార్గాంతరము కలుగుటలేదనియే వారట్టిసాహస సంస్కరణములకుఁ బూనుకొనిరి. కాని యన్ని సవరణలు చేయు నవసరము లేకయే యొకచిన్న సవరణతో నీపద్యమును సంస్కరించుకొని యన్వయము కుదుర్చుకొన వచ్చును.

క|| ముదమునఁ [గవికృతి] కావ్యము
నదరుగ విలుకొని పట్టినమ్మును బరహృ
చ్ఛిదమై తల యూపని [యెడ]
నది కావ్యమె మఱియుఁ బట్టినదియున్ శరమే.

ఇది తక్కువ సంస్కారముతో - నన్వయము కుదిరి-మూలశ్లోకభావమునకు సరిపడియున్నది, "ఏది పరుని హృదయమునందు లగ్నమై శిరస్సునూపింపదో యాకవియొక్క కావ్యముతో నేమి? ఆవిలుకానియొక్క యమ్ముతో నేమి (ప్రయోజనము)? అని కదా మూలశ్లోకమున కర్థము. కవిచే రచింపఁబడిన కావ్యమును, విలుకాఁడు పట్టిన యమ్మును పరహృచ్ఛిదమై తల యూపనియెడల [కావ్యశరములకు రెంటికిని సమానము. అయిన నొకటి ముదమున - నొకటి అదరుగ నా కార్యములు చేయుచున్నవి] నది కావ్యమా? అతఁడు పట్టినది శరమా? అని యీపద్యమునకుఁ దాత్పర్యమగుచున్నది. ఇది మూలశ్లోకభావమునకు దగ్గరగా నుండుటను పాఠకులు గుర్తింపఁగలరు. కాని యిందును 'పట్టినదియున్' అనునది పునరుక్తిగా వచ్చుచునే యున్నది. "కనుక నీయసందర్భమును దొలఁగించుకొనుటకే శ్రీ శాస్త్రిగారు ఆపద్యములోని యుత్తరార్థము నందే మూఁడుసవరణలు చేయవలసి వచ్చినది. అందుచేతనే శ్రీ వెంకటరమణయ్యగారి కది "తమ కవిత్వమును జొప్పించిన"ట్లయినది శ్రీ శాస్త్రిగారి కందుఁ దమ కవిత్వమును జొప్పింప వలయునను నభినివేశ ముండవలసిన యవసర మేమియు లేదు. వా యన్వయము కుదుర్చుటకే వారది చేయవలసి వచ్చిన దని శ్రీ వెంకటమణయ్యగారు గుర్తింపవలసియున్నది. పాఠప్రవచన సందర్భమున నధ్యాపకుడు విద్యార్థులకు తృప్తికరమయిన యన్వయమును గుదిర్చి సంతోషపెట్ట

# కలగూరగంప

వలసిన యవసరముండుటచేతను - ఏదో యీ పద్యమున నన్వయము తికమకగానున్నది, భావము కదా మనకు ప్రధానమని సులభముగాఁ దప్పుకొను తత్త్వము శ్రీ ప్రభాకరశాస్త్రిగారికి లేకపోవుటచేతను వారా సంస్కరణములు చేయవలసి వచ్చినది. నిజమునకా సంస్కారములు స్వతంత్రించి చేసినవే కావచ్చును. స్వతంత్ర సంస్కారములతో నయినను బద్ధాన్వయము కుదురుట ప్రధానమా? కవి తప్పటడుగు వేసెనేమో? ఇట్టి యనన్వితమగు పద్యమాతఁడు వ్రాయునా? యను సంశయమునకుఁ దావిచ్చు పాఠమునకైనను గుదుర్చుకొని సంతృప్తి నందుట ప్రధానమా? శ్రీ వెంకటరమణయ్యగారే దీనికి సమాధానము చెప్పుకొనవలసియున్నది.

ఇఁక శ్రీరామకృష్ణకవిగారి "సత్కవి" పాఠమును సమర్థించుచు వారు నన్నిచోడని 'సరస సువస్తుబంధ మృదుభావము'... అను పద్యమును బేర్కొని యందు సత్కవికావ్యము, అసత్కవికావ్యము అని యుండుటచేత నీపద్యములో శిథిలభాగమున 'సత్కవి" యనియే యుండవలయునని వాదించిరి. కాని వారుదాహరించిన పద్యములోని పూర్వార్థవిషయము "సత్కవి" కావ్యమునకు సంబంధించినది ఉత్తరార్ధములోని విషయము 'అసత్కవి' కావ్యమునకు సంబంధించినది. అందుచే నచ్చట సత్కవి, అసత్కవి యను పదములు విధిగా-తప్పనిసరిగా - ప్రయోగింపఁబడవలసియున్నవి. కాని యీ పద్యమునకును దానికిని నెట్టిపోలికయు లేదు ఇందులోఁ బ్రథమపాదమున కవి - ద్వితీయపాదమున "విలుకాఁడు" ప్రస్తుతులు కావలసినవారు. కనుక నట "సత్కవి" యనియే యుండవలయునను నియమముండ వలసిన యవసరము లేదు. వారిచే నుదాహరింపఁబడిన పద్యములోవలె "అసత్కవి' విషయము తరువాత నెప్పుడైనను వచ్చునపుడు కదా యిట "సత్కవి" యని యుండవలసినది. దీని, బట్టి వారి సమర్థనము సమంజసము కాదని, తేలినది.

తరువాత చతుర్థపాదములోని 'మలరి" యను పాఠమును గూర్చి వ్రాయుచు వారు "మలరు శబ్దమున కేమి యర్థమో వారు (శ్రీరామకృష్ణకవిగారు) తెలుపరైరి. 'మలరు' అను క్రియాపదము కలదేమో తెలియదు. అన్యత్ర ప్రయోగము. లెచ్చటను గానరావు. నిఘంటువులయం దెచ్చటను లేదు. 'మరి' అను మాటను 'మలరి' అని సంస్కరించుటకంటె "మఱియు" అని సంస్కరించుట యుక్తము అని వ్రాసిరి. శ్రీరామకృష్ణకవిగారు "మలరి" యనియే దాని సంస్కరించుటలోఁ గొంత న్యాయము లేకపోలేదు శ్రీ వెంకటరమణయ్యగారన్నట్లుగా నది "మఱియు" ననియే యయి యుండినయెడల "యు" లోపించిన దనుకొన్నను దాని ప్రక్కన నర్థానుస్వారస్థానీయముగా దాళపత్రములందు వ్రాయబడు నిండుసున్న కూడ శిథిలమైన దనుకొన్నను "పట్టినదియుఁగా" అనుచోట ప కాక బ యుండి యుండవలెను. అటులేని యచట ప అని మాత్రమే యుండుటవలన నంతకుముందు లోపించిన యక్షరము గురుతాంతము కాదని తలఁచి, యక్కడ సంస్కారము చేయుమాని మధ్యలకారమును జొప్పించి స్థితమునకు గతి కల్పించిరి. "మలరి" క్రియాపదము లేదనుకొని నపుడు "మఱియు" అని మార్చుకొనుటయే శ్రేయము, కాని యిందుఁ గూడ వ్రాతప్రతిలో లేని శకటరేఫము, యు, దాని ప్రక్కన నరసున్న, దాని తరువాతి పను బ గా మార్చుట యనుమూఁడు సవరణలున్నవి కదా! కాని యివి యంత పెద్దసవరణగాఁ గన్పడు నది కాదని శ్రీ వెంకటరమణయ్యగారు తలఁచిరేమో? "మలరి"అని సంస్కరించుటకంటె "మఱియు" అని సంస్కరించుట యుక్తము" అని వ్రాసినారు. మఱియు అను సంస్కరణము తమదిగానే ధ్వనింపఁ జేసిరి. కానిపై "మఱియు" అను సంస్కరణము మదరాసు విశ్వవిద్యాలయమువారు ప్రకటించిన కుమారసంభవ ముద్రణమునఁ గలదు. కనుక దానిని సంస్కరించినవారు శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారో కోరాడ రామకృష్ణయ్యగారో యగుదురు.

తరువాత 'కరమే యనుటకంటె శరమే యనుట సారస్యము' అని తెలిపి 'ఈ సవరణను ఇంతకుముందు కొందఱు పండితులు చేసియున్నారు. ఇప్పుడు శ్రీ శాస్త్రులవారి యాదరణ కది పాత్రమైనది' అని వ్రాసిరి. కొందఱు పండితులెవరో యట్లు సంస్కరించుటకును, శ్రీ శాస్త్రులవారి యాదరణ కది పాత్రమగుటకును మూలశ్లోకములలోని కింకర్వే స్తస్య కార్యేణ కింకాండేన ధనుష్మతః అనుటలోఁగల "కాండేన" అనుపదమే యాధారము ఆశ్లోకమే యాధారముగాఁ బద్యమును సంస్కరించిన శ్రీ శాస్త్రులవారి యాదరణకు "శరమే" యను పాఠము మూలానుసారి యగుటచేఁ బాత్రమగుట వింత కాదు.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు కుమారసంభవములోని కొన్ని పద్యములలోఁ గావించిన సంస్కారము లనావశ్యకము లని శ్రీ నేటూరి వెంకటరమణయ్యగారు తెలిపిన యాక్షేపముల కిందు సమాధానము చెప్పుటకుఁ బ్రయత్నించితిని. నేనును నీవిషయమున జిజ్ఞాసువు నే యగుట వారు కాని యితరులు కాని యీ పద్యముల విషయమై నా యెఱుకకందని విషయములు, తప్పుగా భావించిన యంశములు నేవేని యున్నచో, దెలిసిన సంతోషముతో స్వీకరింతునని వినయముతో మనవి చేసికొనుచున్నాడను.

# గ్రంథ విమర్శనము

## బొబ్బిలి యుద్ధ కథ

పరిష్కర్తలు: శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ; ప్రచురణ: మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, మదరాసు, వెల రూ 2.14.0

'బొబ్బిలి కథ' పేర ప్రసిద్ధమైయున్న ఈ వీర గీతాన్ని తెలుగునాట ఆబాలగోపాలమూ వినే ఉంటారు. ఈ గీతాన్ని రచించిన పెద్దాడ మల్లేశకవి యెప్పటి వాడో మనకు స్పష్టంగా తెలియదు.

ఆంధ్ర జానపదగేయ సాహిత్యంలో ఈ కథకు అగ్రస్థానం వుంది. బహుళవ్యాప్తిలో వున్నా, యింత వరకు ఈ రచన నిర్దుష్టంగా ముద్రితం కాలేదు శ్రీ సోమశేఖర శర్మగారి పరిష్కరణతో ఇది శంఖున బోసిన తీర్థమై ఆంధ్రప్రజల కందటం ముదావహం. గ్రంథవిషయం అలావుంచి బొబ్బిలి యుద్ధంనాటి ఆంధ్రదేశపు పరిస్థితులను వివరించుతూ, పీఠికా రూపంలో శ్రీ శర్మగారు వ్రాసిన చరిత్ర తనంతటిదా రసవత్తరమైన వచన కావ్యంలా వుంది. వీరాధి వీరుల పురిటిగడ్డయి కూడా అనైక్యత కారణంగా అనాటికే యీ దేశానికి ఎట్టి దుర్గతి పట్టిందో ఈ వివరణ వల్ల ద్యోతమౌతోంది. అనంతమైన త్యాగాలతో మహాంధ్రను తిరిగి సంపాదించుకున్న ఈ తరుణంలో కూడా, గత చరిత్రను విస్మరించి తిరిగి పాతపంథాలో మనవారు నేడు ఆడుతున్న రాజకీయపు కోడి పందేల పోకడలకు ఇది చెంపపెట్టుగా వుంది.

ఈ రచనలో వాడబడిన తురక మాటలన్నిటికీ శ్రీ శర్మగారు, అర్థవివరణను సమకూర్చారు.

పరిష్కరణ విషయంలో ఒక చిన్న బాధ కనిపించుతున్నది. ఇది కథగా చెప్పటానికి వ్రాయబడిన రచన. గీతం విసుకెత్తకుండా మధ్యమధ్య 'చూర్ణిక' వంటి ముచ్చటైన వచన రచన చొప్పించబడివుంది. వీటిని విడిగా ముద్రించి వుంటే బాగుండేది. అల్లాంటి రచన తగిలిన కొన్ని చోట్ల శ్రీశర్మగారు ఇది వచనంలావుంది అని సూచించారు ఇంకా అలాంటి రచన చాలా చోట్ల వున్నట్టు కనుపించుతోంది.

మరొకటి గేయంలో అక్కడక్కడ మిశ్రంలా గురితంగా నడిచే చరణాలు కొన్ని వున్నయ్. వాటిని కూడా విడదీసివుంటే బాగుండేది ఇవి పాడుకునే వారికి సంబంధించిన విషయాలు. సాహిత్యానికి సంబంధించినంత వరకూ శ్రీశర్మగారు దీనికి ఒక నిర్దుష్ట రూపంయిచ్చారు.

* * *

## స్నేహితుడు

కథల సంపుటి: రచన: శ్రీ అందే నారాయణ స్వామి; ప్రచురణ: నవరస గ్రంథమాల, మంగళగిరి; వెల 1-0.0

లోగడ ఒక దశలో, ఆంధ్ర కథాశిల్పం ఒక మహోన్నతదశను అందుకున్నది. ఆనాడు కథా రచన

# గ్రంథ విమర్శనము

యితలు బహుళ సంఖ్యలో లేకపోయినా, ఉన్న కొలది మంది కథకులు, ఎంతో జాగ్రత్తగా కృషిచేసి తీర్చిదిద్ది తాము నిర్మాణం చేసే ప్రతి కథనూ ఒక సుందర శిల్పంలో రూపొందించటానికి ప్రయత్నించేవారు. అందుచేతనే వారు స్వయంగా ప్రసిద్ధులు కావటమే గాక ఆంధ్రకథారచనకు భారతీయ వాఙ్మయంలోనే కాక అంతర్జాతీయ వాఙ్మయంలో కూడా విశిష్ట స్థానాన్ని స్థాపించగలిగారు. కాని ఇటీవల వెలువడుతున్న తెలుగుకథల ధోరణి చాలా అధోగతిగా కనుపించుతున్నది. కథకులు వందలాది సంఖ్యలో బయలుదేరారు-మంచిదే కథలుకూడా నెలనెలా వేలాది సంఖ్యలో రచింపబడుతున్నయ్. కాని యీ కథకులలో ఏ కొలదిమందినో మినహాయించితే మిగతావారు వ్రాస్తున్నదంతా వట్టి చెత్త. అసలు కథ అనే దాన్ని ఒక శిల్పరూపంలో నిర్మాణం చెయ్యాలనే ప్రాథమిక సూత్రమే వారిదృష్టిలో వున్నట్టు లేదు. తమకు తెలిసీ తెలియని విషయాలన్నిటినీ అడ్డదిడ్డంగా చర్చించుతూ పేజీల తరబడి ఏవో చెత్త వ్రాసి దానికి కథానిక అని పేరు పెట్టడం పరిపాటి అయిపోయింది. రెండవది యువతీ యువకుల రైల్వే ప్లాట్‌ఫారం ప్రణయాన్ని ఊహించటం వినా, యీ కథకులకు యితర ప్రపంచ జ్ఞానం లేదనేది ఈనాడు గూడ్సుబళ్ళతరబడి రవాణా అవుతున్న కథా నామక సాహిత్యపు బేళ్ళలో గమనించవగిన ముఖ్యవిషయం. నిజానికి, అనవసరంగా పేజీలు పెంచి పాఠకుణ్ణి 'బోర్' చేసే యే రచయితా క్షంతవ్యుడు కాడు. ఇలాంటి బాధలతో విసుగెత్తిపోయివున్న పాఠకులకు యీ సంపుటిలోని కథలు తప్పక ఆహ్లాదజనకములు కాగలవు

ఇలాంటి బాధలు పెట్టకుండా మన్ని రక్షించినందుకు, శ్రీ నారాయణస్వామిగారికి మనం తొలుదొల్తగా కృతజ్ఞత తెలుపవలసి వుంది.

ఈ సంపుటిలో స్నేహితుడు, గాలిలో దీపం, వ్యత్యాసాలు, చేతులు కాలాక ఆకులు, శిల్పి, కొత్త మేష, నువ్వు కాదూ?, జీవకారుణ్యం, మద్ది రకం.

సృష్టితేడా, పుణ్యాత్ములు అనే శీర్షికలలో 12 కథలున్నాయి.

ఈ పన్నెండు కథలలోను దేనికది ఒక ప్రత్యేక వ్యక్తిత్వం గలది. రచనాశిల్పం మాట అటుంచి, ఈ కథలు తెలుగు గ్రామీణప్రాంతాల పరిస్థితినంతా అద్దంలో మాదిరి చూపుతున్నాయి స్నేహితుడు అన్న కథలో గ్రామంలో ముఠాలూ, అజ్ఞానంగా ఆలోచించి తగాదాలు పెంచుకుని తలకాయలు పగలగొట్టుకోవటానికి సిద్ధమయ్యే పద్ధతీ చక్కగా వ్యక్తం చేశారు

దినదినం వాటి రక్తాన్ని ధారపోసి మనల్ని పోషించుతున్న ఎద్దుల నుగురించి మనం ఎప్పుడూ ఆలోచించం. పైపెచ్చు అజ్ఞానకారణంగా నిష్కారణంగా వాటిని ఎంతో హింసపెడుతూ వుంటాం. 'నువ్వు కాదూ...' అన్న కథ చదివితే మన రాతుసమేమిటో మనకు బోధపడుతుంది.

'జీవకారుణ్యం' అనే కథనుగురించి వ్యాఖ్యానించుతూ, పీఠికలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఇలా వ్రాశారు:

'దయాగుణముయొక్క యర్థము బుద్ధిహీనుడైన మానవునకు దెలియుటలేదు. ఒకవైపున కబేళాలకు లక్షలు వ్యయపరచుచు గోవధ నిషేధము చేయలేక బుద్ధ జయంతులు చేయుచున్నట్లు, మార్వాడీ తాను వేయి అప్పిచ్చి దానిమింజుమలే పదివేలు తీసుకొని యింకనూ వడ్డీ బాపతు వేయి రావలయునని బాకీదారును చెఱసాలకు బంపించుటలో వానికంటె పరమరాక్షసుడు వాడే. బోయవాడు పిట్టనుబట్టి చంపబోవుచున్నాడు. పావలా యిచ్చి దానిని వదలించుము. ఈ మానవుని యొక్క దయాగుణము దయాగుణముకాదు. దీనిని యాసలో 'ఖయాలీ' యందురు. ఇంగ్లీషులో Whim విమ్ అందురు. మానవునకు ఏగుణమును నిజముగా లేదు. ఒకానొకగుణము విచారణాజనితమై, సుష్ఠుగా నూహాశాలితతో నాచరణలో బెట్టవలసినదిగాని యేదో యెప్పుడో తోచినప్పుడు చేయుటగాదు. అట్టి గుణములను సద్గుణముల క్రింద లెక్కబెట్టుటకు వీలులేదు. ఈ మహావిషయము మీకథాగత తాత్పర్యము'—

'పుణ్యాత్ములు' అన్న చివరికథను రచయిత మరింత చిత్రంగా రూపొందించారు. కథనంతా చెప్పి చివరివాక్యంతో పాఠకునకు విభ్రమం కల్గించటం ఇందులో వాడిన శిల్పం.

కథానిర్మాణంలోనూ, భాషాచాలనంలోనూ కూడా రచయిత యీ కథలలో ఎంతో చాకచక్యం చూపించారు

## జలపాతం

కథాసంపుటి; రచన: శ్రీ పులిపాక జగన్నాథరావు; ప్రచురణ: జ్యోత్స్న సమితి, గుంటూరు వెల 0-4-0.

రచయితకు "ఉజ్వల భావుక" 'దార్శనిక కథక' ఇత్యాది బిరుదులున్నటు ఉల్లేఖించారు "దార్శనిక కథక" అంటే యేమిటో మనకు సరిగా బోధపడకుండా వున్నా, అదేదో గొప్ప సంగతే అయివుండవచ్చు. అలాంటి గొప్ప విషయమేదీ ఈ కథలలో కనుపించక పోవటం ఆశ్చర్యజనకమైన విషయం. రచయితలో స్వోత్కర్షవున్నంత ప్రతిభ లేదు. పదిమాటలు చెప్పేకంటే, 'ఎడారి జీవితం' అనే శీర్షికతో రచయిత వ్రాసిన ఈ పది పంక్తుల కథను ఉదహరించితే, మన కథాసాహిత్యానికి పట్టిన దుర్గతి యేమిటో పాఠకులకే సులభంగా బోధపడుతుంది:

'ఎక్కడ చూచినా కనుచూపు మేరలో ఇసుక. ఇసుక తుపానులు!! కణకణలాడుతూ, నిప్పులు గ్రక్కే యెండ!!! ఎడారి సంస్కారం ఎడారి సంగీతం లాగా ఉంటుంది. ఎక్కడో ఓయాసిస్సు తప్ప దప్పికకు నీరు దొరకదు. ఒంటెనుకోసి దాని పొట్టలోని నీరు త్రాగవలసిన దుర్గతి ఓదుర్దినాన దర్శితకరంగా వాటిల్లుతుంది. ఎండమావులు తరచుగా తిరిగి సాక్షాత్కరిస్తాయి. సితారా తీసి, నాదంతో గాత్రం జతగలిపితే గొంతు పెల్లుబికి పలుకదు. జీవనతార మెరయని బ్రతుకు. జీవన స్రవంతి లేక సుందర స్వప్నాలు కల అవుతవి. బరువు బ్రతుకు మిగులుతుంది!'

ఇది మొత్తం కథ—దీనిపై ఇక వ్యాఖ్యానం అనవసరం.



Printed & Publishe For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.

# భారతి

సాహిత్య మాసపత్రిక





సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

నవంబరు **1956**

సంపుటము 33 : సంచిక 11

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## నవంబరు 1956



## త్రివర్ణ చిత్రము

"మడిసీళ్లు"—చిత్రకారుడు : శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి.

గత ఆగస్టుమాసంలో గుంటూరులో జరిగిన ఆంధ్రచిత్రకళాపరిషత్ ప్రదర్శనంలో ప్రథమ చిత్రంగా ఎన్నికై గవర్నర్ త్రివేదీ స్వర్ణపతకాన్ని అందుకున్న చిత్రం.

## భారతి సచిత్ర మాసపత్రిక

### ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | |
|---|---|---|
| 4 వ కవరు పేజి | కాజువల్ | కంట్రాక్టు |
| 2 లేక 3 రంగులు | రు. 125/- | రు. 100/- |
| 2 లేక 3 వ కవరు పేజి | | |
| ఒకే (నలుపు) రంగు | 90/- | 75/- |
| లోపలి పేజీలు | | |
| పూర్తి పేజి | 70/- | 60/- |
| అర్ధ పేజి | 35/- | 30/- |
| పావు పేజి | 20/- | 15/- |

ప్రత్యేక స్థానములకు 25% అదనం.

సం॥నకు వరుసగా 12 ప్రకటనలు చేయు వారికే కాంట్రాక్టు రేట్లు వర్తించును.

కవులు, కళాకారులు, రచయితలు మొదలైన వారి ప్రకటనలు ఒక కాలం ఇంచికి తేపకు రు. 2/- చొప్పున ప్రకటించబడును.

మేనేజరు, భారతి,
మద్రాసు-1.

# ఆహ్వానము

## శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

శ్రీమదఖండాంధ్రమహీ
స్వామిని! త్రైకోటికంఠ జయరావమధు
శ్రీ మంజులకీర్తిపతా
కా! మంగళములు, జనని! నవాభ్యుదయమునన్!

తొలి నమస్కారంబు తెలుగుమేధాదీప్తి
బ్రహ్మమూర్తికి యాజ్ఞవల్క్య ఋషికి
యాజుషీకల్ప సూత్రార్థభారతికి యా
పస్తంభ మౌనికి ప్రణుతిశతము
కర్మసిద్ధాంత ముఖ్యమతి కుమారిల
భట్టులకు పదాభివందనములు
అభివాదనములు బ్రహ్మవిదగ్రగణ్యులు
స్వామి విద్యారణ్య శంకరులకు
పూర్వమహదాంధ్ర దేవతాపురుషులార!
ఆంధ్రఖండముల్ సంయుక్తమైన వేళ
తిరిగి వేంచేయుడయ్య మీ తెనుగుధరకు!
దీవనములిండు ఆంధ్రజ్యోతిస్సునకును!

జయజయ! మగధదేశ విజయ! త్రైలింగ
చక్రి! కాకుళపతి! జయము జయము
జయజయ! నహపాన సౌరాష్ట్రమహాళి దే
శనిహితపాదాబ్జ! జయము జయము
జయజయ! శ్రీ హర్ష చతురంగబల చతు
స్సాగరవేలాభ! జయము జయము
జయజయ దక్షిణాశా సార్వభౌమ! వి
జయనగరాంధ్రేశ జయము జయము
జయము జయము! పూర్వాంధ్ర రాజన్యులార!
ఆంధ్ర ఖండముల్ సంయుక్తమైన వేళ
తిరిగి వేంచేయుడయ్య మీ తెనుగుధరకు!
దీవనములిండు ఆంధ్రజ్యోతిస్సునకు ॥

'పైశాచి'రూప పూర్వాంధ్రభాషాబ్రహ్మ
ఆంధ్రరత్నంబు గుణాఢ్యసుకవి
ఆంధ్రహృదయ కరుణార్ద్రితాసంస్కృతి
కృతకీర్తి భవభూతిగీస్స్వరూపి
ఆంధ్రసాహిత్య భావాంతర రసవేది
ప్రథిత జగన్నాథపండితుండు
ఆంధ్రసంగీతవిద్యాపూర్ణపుంవపు
రాఢ్యసరస్వతి త్యాగరాజు
మా పురాంధ్ర సాహిత్యస్రష్టులార !
ఆంధ్రఖండముల్ సంయుక్తమైన వేళ
తిరిగి వేంచేయుడయ్య మా తెనుగుధరకు !
దీవనము లిండు ఆంధ్రజ్యోతిస్సునకును !

శ్రీదములై కవిత్వరస
 రీతులకున్ దొలిబీజమూర్తులై
వేదపు క్రొంజివుళ్ల ప్రభ
 వించిన దివ్యమహాశరీర మ
ర్యాదను స్వీకరించిన మ
 హాత్ములు—ఆంధ్రకవిత్రయంబు వి
ద్యాదయితుల్ ప్రమాణ కవి
 తాత్ములు—మాకు ప్రసన్నులయ్యెడిన్ !

ఐతరేయ బ్రాహ్మణంబు శాంఖ్యాయనంబు
లాశ్వలాయనమండలములతోడ
తైత్తిరీయశతపథములు వాజసనేయ
కణ్వశాఖావిభాగములతోడ
తాండ్యషడ్వింశ విధానవంశాదులు
ద్రాహ్యాయణాది సూత్రములతోడ
వ్యాకరణనిరుక్త జ్యోతిషకల్ప శి
క్షా ఛందసుల ప్రాతి శాఖ్యములుగ
ఋగ్యజుస్సామములు సన్నిహితములగుచు
తా మహాంధ్రప్రదేశావతరణ వేళ
మంగళాశిష ప్రారంభ మహిమలగుత!!
"స్వస్తి సర్వసన్మంగళావాప్తిరస్తు !!

# కలంపోటు

శ్రీ కొవ్విడి రామం

"ఊరెయ్యది"

"చీపురుపలి"

"పేరో ?"

"సూరన"

"ఇంటిపేర్"

"అడిదము వార్"

"మీ రాజు ?"

"విజయరామ మహారాజు"

"అతడేమి సరసుడా ?"

"భోజుడయా"

"తమరేనా సూరకవిగారు. ఈ రోజు చాలా సుదినం. ఇదివరకు మీ పేరు వినడమేగాని మీ దర్శన భాగ్యం కలగడంలేదు. ఇదంతా ఒకపద్యం వరసలో ఉన్నట్టుంది.

సూరన: మీరు ఊరెయ్యది అని గ్రాంథికంలో ప్రశ్నించేరు గనుక, నేను కూడా పద్యపాదాల్లోనే జవాబిచ్చేను.

భక్త: అగ్రహారం భక్తులంబాబూ! పంచించుకోడం. తినడం, వేదంముక్కలు వల్లించుకోడమే గాని మాకు కవిత్వాలూ కావ్యాలు తెలియవు. అయితే యిదేం పద్యంబాబూ!

సూరకవి: పై సంభాషణ ఓ కందపద్యంలో నడిచింది.

భక్త: చాలా సంతోషం! చీపురుపల్లిలో మా దూసికృష్ణుడు చదువుతున్నాడా ?

సూరకవి. దూసి కృష్ణుండు చదువంటే దుఃఖపడును.

భక్త: బాబూ! ఆ మురపాకవా రబ్బాయో ?

సూరకవి: ధీరుడైనిల్చె మురపాక సూర, సుకవి.

భక్త: బాబూ! తెలిసో తెలియకో మీతో స్వచ్ఛంగా మాటాడుదామని ఊరెయ్యది అని అడిగేను. అంతమాత్రాన మీ రిలా పద్యాల వర్షాలు కురిపిస్తే అర్థంచేసుకోడానికి నాతరమా! తమ రెక్కడినుండి దయచేస్తున్నారో చెప్పండి బాబూ!

సూరన: విజయనగరంనుంచి వస్తున్నాను.

భక్త: ఏమిటిబాబూ-అక్కడి విశేషాలు?

సూరన: చాలా వున్నాయి. మొన్న విజయదశమినాడు అక్కడ కోటకట్టడానికి శంకుస్థాపన చేసేరు. చుట్టుప్రక్కలున్న మన్నెదొరలలో చాలా మందిని ప్రభువుగారు యుద్ధంచేసి లోబర్చుకున్నారు. ఆంగ్లేజమీందారు మొదలైనవారు శ్రీవారి సఖ్యాన్ని అర్థించేరు. అందేత వారికి "మన్నెసుల్తాన్" అనే బిరుదాన్ని శంకరపీఠాధిపతులైన జగద్గురు సత్యజ్ఞానానంద స్వాములవారు ప్రసాదించేరు.

భక్త: చాలా సంతోషం బాబూ! కాని మహారాజు గారికి సాయబుకి మధ్య వ్యవహారం కొంత చెడిందని అనుకుంటున్నారు. అదెంతమట్టుకు నిజం బాబూ!

సూరన: మన కెందుకయ్యా రాజకీయాలు?

* * * *

కాలచక్రం పరిభ్రమించింది. 1712 వ సంవత్సరంలో విజయదశమినాడు శంకుస్థాపనచేసిన కోట "ఇంతింతై మరియింతయై మరియు దానంతై నభోవీధిపై అంతైన"వామనుని చందాన శోభాయమానంగా తయారయింది. అతి విశాలమైన ప్రాకారం, సర్వాంగ సుందరమైన మోతీమహాలు, దానికి ముందుగా కట్టబడిన నగారాఖానా, అన్నీ ఎంతో దివ్యంగా వున్నాయి. విజయనగరరాజులు ఉపయోగించే కవచాలతోనూ, బాణలతోనూ, డాలులతోనూ ఆయుధాగారం నిండిపోయింది. ఒకనాటిరాత్రి శ్రీవారు ఏకాంతంగా ఆలోచనా మందిరంలో కూర్చున్నారు

వారి ఆసనానికి ముందున్న స్ఫటికశిలాఫలకంపైన ఏవో తాళపత్రాలు కనబడుతున్నాయి. శ్రీవారి దృష్టులు ఒకసారి ఆ తాళపత్రాలమీద మరొకసారి ఎదురుగా వున్న సింహద్వారంవైపు ప్రసరిస్తున్నాయి

అప్పుడే ఆ రాత్రి పన్నెండు గంటల నగారా ఆగింది. నిద్రాదేవి ప్రజలందరినీ స్వప్నలోకంలోకి తీసుకుపోయింది. కోటలో మాత్రం అక్కడక్కడా 'పారాహుషార్' అనే కేకలు వినబడుతున్నాయి. మేలిముసుగు వేసుకున్న ఒక వ్యక్తి స్వారీచేస్తూ రెండవ దేవిడీవరకూ వచ్చేడు. పారా సిపాయికి అతనేదో ఒక ఆజ్ఞాపత్రం చూపించి త్వరితగతిని యింకా ముందుకు సాగిపోయేడు. క్షణంలోనే గుఱ్ఱందిగి నిశ్శబ్దంగా మేడమెట్లెక్కి ప్రభువువారి సన్నిధిని తలవంచి, చేతులు జోడించి పక్కగా నిలబడ్డాడు అతని హావభావ విలాసాలను సులువుగా పోల్చుకోడానికి వీలులేకుండా వుంది. రహస్యమైన రాజకీయ వ్యవహారాలలో నిమగ్నుడైన వ్యక్తిలా కనబడుతున్నాడు. మాటలతో పరిస్థితిని చెప్పలేక, తను రహస్యంగా దాచియుంచిన ఒకజాబును ఏలినవారి కందించేడు. మహారాజులుంగారు లేఖను చిత్తగించి కొంతసేపు దీర్ఘాలోచనలో మునిగిపోయేరు.

రాజు : ఈ బాదుల్లాఖాన్ యెవడయ్యా ?

ముసుగుమనిషి : చిత్తం! మనవి చేసుకుంటున్నాను. సన్న 1156 వ ఫసలీ, 1746 సం॥ లో జఫరల్లీకి అనువజాగా యితనిని నిజాము శ్రీకాకుళం సర్కారుకు నవాబు చేసేడు- మనిషి చాలాక్రూరుడు- జమాబందీలోగాని పేష్కష్ వసూలు చెయ్యడంలోగాని రవంతయినా అనుభవంలేదు- ఉర్దూ చదవడం, రాయడంరాదు- తెలుగు తెలియదు. జోరీగలు ముసరిన గొడ్డులాగుంటాడు-

రాజు: మన ద్విభాషి జరిగిన సంగతంతా చెప్పలేదూ!

ముసుగుమనిషి: మనద్విభాషి ఉన్న సంగతులన్నీ పూసగ్రుచ్చినట్టు చెప్పేడు. ఆ సంగతులన్నీ వింటే ఉక్కుకన్నా కఠినమైన గుండె అయినా నీటికన్న పల్చగా ద్రవించి స్రవించివుండును- మూడు సంవత్సరాలు వర్షాలు పూర్తిగా ఎత్తిగట్టేసేయని, దేశంలో క్షామదేవత తాండవం చేస్తోందని, యిటువంటి పరిస్థితులలో ప్రస్తుతం వున్న పేష్కష్ చెల్లించడమే కష్టంగా వుంటే దాన్ని రెండింతలు చేయడం కేవలం అన్యాయమని మన ద్విభాషి యెన్నోవిధాల నచ్చచెప్పేడు- కాని లాభం లేకపోయింది-

రాజు: అసలు సంగతి కనిపెట్టావూ!

ముసుగుమనిషి: ఏలినవారే సెలవియ్యాలి.

రాజు: జఫరల్లీ వున్న దగ్గర్నుంచి వాళ్ళకీ మనకీ వ్యవహారం రగుల్తూనే వుంది - ఫ్రెంచి సేనాని బుస్సీకి మనయెడల ఎక్కువ మోజుగా వుండటం మన చుట్టుప్రక్కల వున్న మన్నెదొరలసహాయంతోనూ, బుస్సీ ప్రోద్బలంతోనూ, నిజాము మీదకే ఎదురుతిరుగుతామేమో అన్నభయం వాళ్ళందరికీ వున్నది. అందుచేత మన ఐశ్వర్యంలో చాలా భాగం నజరానాల మూలంగాను పేష్కష్ మూలంగానూ రాబట్టాలని ప్రయత్నిస్తున్నారు- ఇంతేకాదు- కొంతమంది నిజాము మనుష్యులు మారువేషాలతో పల్లెలలో ప్రవేశించి మన రహస్యాలు తీస్తున్నారు- మన హవల్దారు భీమసింగు ఆ బాపతు మనుష్యుల్నిద్దరిని అప్పుడే పట్టుకున్నాడు- దానికి సంబంధించిన కాగితాలే ఆ బల్లమీద వున్నాయి-

ముసుగు మనిషి : అయితే యిది రాజకీయపుటెత్తే!

రాజు : అందుకభ్యంతరమా ?

ముసుగు మనిషి : ఐతే యిప్పుడేమిటి బాబూ కర్తవ్యం ?

రాజు : కర్తవ్యానికేముంది? సామ దాన భేద దండోపాయాలు ఉండనే వున్నాయికదూ !

ముసుగుమనిషి: సామానికి లొంగేగ్రహాలా అవి?

రాజు: అయితే దండానికే లొంగుతాయి- 'దండం దశగుణంభవేత్'

ముసుగుమనిషి: ముసుగుతీసి బాకు చూపిస్తూ వికటాట్టహాసం చేస్తాడు-'రామరాజ్! ఈడు జఫరలీ కాదు-బాదుల్లాఖాన్-ఈడంటే పిట్టలు నీళ్లు తాగవ్- నీదండం —గిండం యిక్కడ పనికిరాదు ఈ బాకు నీ రక్తాన్ని రుచిమాసివుండును-కాని మా బాదుల్లా యుద్ధంలో నీ తలకాయి యెగరగొట్టి నిజాముప్రభువుకి నజరానాగా ఇస్తానన్నాడు-అందుచేత తిరిగి బాకు

ఒరలోకి దిగుతోంది"—అని ఆ ముసుగుమనిషి ఆనిశి రాత్రి మాయమైపోయేడు.

విజయరామరాజుగారు దిగ్భ్రమ చెందేరు-ఆయన కళ్లనే ఆయన నమ్మలేకపోయేరు-ఎంత మోసం జరిగింది? చారుని వేషంలో పరాయివాడు తన కళ్ళల్లోనే దుమ్ముకొట్టేడు- గుట్టు తీసుకుని పారిపోయాడు- ఇంతలో, తను అంతవరకు ఎదురుచూస్తున్న బద్దన్న వచ్చేడు.

రాజు : ఎవరది? బద్దన్నా!

బద్దన్న : చిత్తం ప్రభూ!

రాజు : (గంభీరంగా) ఏమిటి విశేషాలు?

బద్దన్న : ప్రభువులకి తెలియని విశేషాలేమిటి వున్నాయ్ బాబూ! నా కన్నముందర నా వేషంలో పగవాడి దూత తనతోనే పరిహాసం చేసేడు. శ్రీకాకుళంలో యెక్కడ చూసినా సాయెబుల యుద్ధసన్నాహాలే కనిపిస్తున్నాయి. పరిస్థితి శ్రుతిమించి రాగాన పడింది.

రాజు : సరే నువ్వెళ్లు!

మర్నాడు మబ్బుకొండమీనుంచి ఉదయభానుడు తొంగిచూస్తున్నాడు అయ్యకోనేటికి నీళ్లకు వచ్చిన అమ్మలక్కలు గతిరాత్రి కోటలో జరిగిన గలాటాగురించి కథలు గాథలుగా చెప్పుకుంటున్నారు. బొంకుల దిబ్బమీదనున్న బండివాడి మొదలు రాజమహలులో పనిచేసే ఉన్నతోద్యోగివరకు విజయనగర రాజ్యానికి సంబంధించిన రాజకీయాలనే ముచ్చటించుకుంటున్నారు.

* * *

ఒకరు : బాబూ నిజమేనా!

రెండవవారు : ఇలాంటివి నిజం గాక అబద్ధమౌతాయండీ! ఊరంతా కోడై కూస్తూవుంటే యింకా నమ్మకంటూ వేమయ్యా! అసలు ప్రభువువారే రణస్థలంనుంచి తిరోగమిస్తున్నారు.

ఇంకొకరు : ఎంత దుర్దినం!

ఒకరు : మెల్లిగా అంటావేమిటి! క్షామంతో పాటు యింకొక అరిష్టం. ఈ ప్రాంతాలలోకల్లా చెప్ప గలిగిన మొనగాడు మన రాజుగారే. ఆయనే తలవంచితే యిక బాదుల్లాకు పట్టపగ్గాలుంటాయా!

ఇంకొకరు : అవిగో! అవి మన సర్దార్ల గుఱ్ఱాల లాగ వున్నాయి. వాటి వెనక ప్రభువువారుకూడా వున్నట్టున్నారు.

ఉదయం పది గంటల సమయం. ఎవ్వరి ముఖానా కత్తివేస్తే నెత్తురులేదు. గోడమీద చిత్తరువులలాగ సేవకులు రాజబంధువులూ, ఉద్యోగులు నిశ్శబ్దంగా వున్నారు! ప్రభువులు నెమ్మదిగా మెట్లెక్కి రాజమహలు ప్రవేశించేరు. వందిమాగధులు లాంఛనప్రకారం జయవిజయీభవ, దిగ్విజయీభవ, మన్నెసుల్తాన్ అని యేమేమో చెప్పబోతున్నారు: రాజుగారు పళ్లు పటపట కొరికి వారివైపు ఎర్రగా చూసేరు. ఏదో గట్టిగా చెప్పా లనుకుంటున్నారు కాని, ఆయనావేశించిన ఆగ్రహం ఆ మాటను పైకి రానీయలేదు: 'హుం' అనే సింహగర్జన వంటి కఠోర గంభీరమైన ధ్వని ఆయన గళంలోనుంచి వెలువడింది: సభ్యులంతా భయకంపితులైనారు. ఆయన అనుచరవర్గం అంతా గడగడలాడి పోతున్నారు- ఎవరేం చేయాలో ఎవరికీ తెలియకుండా పోయింది- ఆ సమయాన ఒక మూల కూర్చున్న సూరకవి కొంచెం ముందుకు వచ్చేడు. ఆ క్రొవ్వాడి కోర మీసం, విశాలమైన ఫాలభాగం, ఒరలోని గంటం ఒకవైపు రాజ ఠీవిని మరొకవైపు పాండిత్య ప్రతిభనూ ప్రదర్శిస్తున్నాయి- సూరకవి సభ్యుల హృదయాలకి ముళ్ళకన్నా వాడిగా గ్రుచ్చుకునేటట్లుగా—

గీ. మెత్తనైనట్టి యరటాకు మీదగాక
మంటమీదను చెల్లునే ముంటివాడి
బీదలైనట్టి సరదార్ల మీదగాక
కలదె క్రొవ్వాడి బాదుల్లఖానుమీద?

సీ. గరిడీలలోపల గంతు వేయుటకేమి
ఈటెబట్టి యరిపై దాటవలెను
సొగసుగ మొలకత్తి బిగియ జెక్కుటకేమి
వెఱవక వైరుల నఱకవలెను
మాటి మాటికి పెద్ద మాటలాడుటకేమి
యవలించి రిపుల జెండాడవలెను
బొమ్మన నెత్తిగంధమ్ము బూయుటకేమి
గాయంపు నెత్తురుల్ గ్రమ్మవలెను

గీ. గాని లేకున్న సత్కీర్తి కాంతగలదె?
పూసపాటి కులాంభోధి పూర్ణసోమ
సమర జయభీమ గజపతి సార్వభౌమ
విమల సద్గుణధామ శ్రీ విజయరామ!

ఆ పద్యాలు సభ్యుల చెవుల్లో పిడుగులు పడ్డట్టుగా పడ్డాయి — అవనత శిరస్కులైన భటులందరూ కత్తులూ, యీటెలూ సర్దుకోవడం ప్రారంభించేరు. ఉత్తర క్షణంలో ఏం జరిగేదీ పరమేశ్వరుడికీ, భావికాలానికీ మాత్రమే తెలుసును. రాజుగారి ఉష్ణీషం స్వేద బిందువులతో చెమ్మగిల్లింది. చెక్కిళ్లు కెంపు బారేయి. కళ్ళు అగ్నివర్షం కురిసినట్లుగా ఉన్నాయి. 'అవధాగ్' అని ఉఱుము ఉఱిమినట్టుగా కేక పెట్టేరు. ఆ గర్జనతో కోటంతా దద్దరిల్లిపోయింది — 'విజయమో వీరస్వర్గమో, మళ్ళండి రణస్థలానికి' అనే గంభీర వాక్కులు శ్రీవారి గళసీమనుండి వెలువడ్డాయి. ఒక్క క్షణంలో సేనావాహిని పట్టపగ్గాలు లేకుండా రణస్థలం వైపు నడిచింది. నగారాఖానాలో జయభేరి మారు మ్రోగింది. సభ్యులంతా నూరకవి వేపు తెల్లబోయి చూసేరు. అతనిది సాహసకృత్యమని, రాజును నిండుసభలో గర్హించడం అనుచితకార్యమని కొందరు విమర్శించేరు. కత్తిపోటు కన్న కలంపోటు బలీయమయినదని నూరకవి యీ నాటికి నిరూపింపగలిగేడని మరికొందరు మెచ్చుకున్నారు. లోకంలో అనేక రకాల భావాలు గలవాళ్లుంటారు. వాళ్ళందర్నీ మెప్పించడం యెవరి తరం? నూరకవి మారు మాటాడలేదు. శ్రీవారు యుద్ధభూమికి తరలి వెళ్ళగానే మౌనముద్ర అతని ముఖాన అవతరించింది. ప్రభువుల జయసిద్ధికోసం తన యిష్టదైవమైన రామచంద్రమూర్తిని ప్రార్థిస్తూ కాలం గడుపుతున్నాడు.

వారంరోజులు కాలగర్భంలో లీనమయిపోయేయి. రణస్థలంనుంచి వచ్చే వార్తలకోసం ప్రజలంతా ఉవ్విళ్లూరుతున్నారు. ఏ క్షణంలో ఏం సంభవిస్తుందోనని ప్రముఖులైన రాజోద్యోగులందరూ ఎక్కువ ఆతృతతో పరిస్థితిని గమనిస్తున్నారు. ఆనాటి మధ్యాహ్నం రెండు బాకుల చిహ్నంగల విజయనగర రాజుల పతాకాన్ని విజయసూచకంగా ఎగర వేస్తూ ప్రతీహారి తొందరగా సింహద్వారంవైపు వస్తున్నాడు. అతని మందస్మితం, ఉత్సాహ పరివృతమైన ముఖం విజయవార్తను అతని కన్నముందే చెప్తున్నాయి:

నాటిసాయంకాలం శ్రీవారు బాదుల్లాఖానుపైన సాధించిన విజయాన్ని అభినందించడానికి గాను ప్రత్యేకమైన సభ ఏర్పాటు చేయబడింది. సభకు పుర ప్రముఖులు, పండితులు, రాజోద్యోగులు మొదలైనవారంతా వచ్చేరు — రంగవల్లికలతో, ఆకుపచ్చని తోరణములతో, సువాసినుల మంగళహారతులతో, శ్రావ్యమైన మంగళవాయిద్యాలతో సభామందిరం విజయశ్రీకి ఆలవాలమైవుంది — శ్రీ విజయరామ మహారాజులుంగారు సింహాసనాన్ని అధిష్ఠించేరు. ఆంధ్ర మొదలైన మన్నెజమీల అధిపతులు ప్రభువు సన్నిధిని ఉచితాసనాలలో ఆసీనులయ్యేరు. దర్బారులోని సంస్కృత పండితులు శ్రీవారికి గీర్వాణభాషలో సన్మానపత్రం సమర్పించారు.

అనంతరం ప్రభువువారు లేచి యీ విధంగా ప్రసంగించేరు — "మీరందరూ మా రాజవంశీయుల యెడల చూపిన ఆదరభావానికి చాలా సంతోషం. ఇది కేవలం నేను వ్యక్తిగతంగా సాధించిన విజయం మాత్రమే గాదు. ఇది ధర్మం అధర్మంపైన సాధించిన విజయం; విజ్ఞత మూర్ఖత్వంపైని సాధించిన విజయం; పౌరుషం దురహంకారంపైన సాధించిన విజయం; దేశాన్ని కిరాతులైన దుష్ట ప్రభువుల బారినుండి తప్పించే ప్రయత్నంలో మన సేనావాహిని కృతకృత్యురాలయింది. కాని ఆ సేనావాహినికే జీవం పోసి ఆపత్సమయంలో దివ్యజ్యోతిని చూపించిన మహాపురుషుడు, మీలో నే నిరాడంబరముగా ఆమూల కూర్చున్నాడు — ఆనాటి నూరకవి వాక్కులే బాదుల్లాఖానుని ఓడించడానికి నిశితమైన శరాలకంటె కోటిరెట్లు ఎక్కువగా పనిచేశాయి. మొదట నేను కత్తిపోటుతో సాధించలేని విజయం నూరకవి కలంపోటు మూలంగా సాధించగలిగేను. నేను విజయశ్రీని చేపట్టడానికి కారకుడు ఆ నూరకవి. కనుక ఆయన యీ ఆగ్రాసనాన్ని అలంకరించాలి" అని ప్రభువులు తిరిగి సింహాసనంమీద కూర్చున్నారు. నూరకవి చిరునవ్వుతో లేచి

శా॥ ఢిల్లీలోపల గోలకొండపురి నిం
డెన నీ ప్రశంసల్ గురాల్
బల్లెం బోడిసించి హుమ్మని యర
బ్బానెక్కి పైకొంచు బా
దుల్లాఖానుని బారదోలితివి నీ
దోశ్శక్తి నూబాలకున్
మళ్ళింపం దరమౌనె శ్రీ విజయ రా
మా మండలాధీశ్వరా!

అని ప్రభువును ఆశీర్వదించాడు. దర్బారు గాయకుల శ్రవణపేయమైన వీణావాద్యంతో నాటి సభ జయప్రదంగా ముగిసింది.

# స్వర్ణయుగము

కీ॥ శే॥ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

దక్షిణ హిందూస్థానమునందు రాయల రాజ్యకాలము సకలవిధములను ప్రజాజీవనమునందు జ్ఞానకాంతులను ప్రసరింపజేసినది. సాహిత్య నిర్మాణములు ప్రాచీనాచారసంప్రదాయ పాశబంధముల నతిక్రమించి నూతనమార్గముల నవలంబించినవి. ప్రజల సాహసకార్యములకు రణరంగములు సాధనములైనవి. దిగ్విజయములు దేవాలయ మందిర గోపురాది నిర్మాణములకును విజయసంకీర్తనములకును సాధనములైనవి. జలాశయము లూసరక్షేత్రములను సుక్షేత్రములను జేసినవి. దేశమునందంతటను శృంగార వీర భక్తిరసములు తాండవమాడి నవీన కావ్యనిర్మాణము లుద్భవిల్లినవి. శాంతియుతమైన సామ్రాజ్యమునందు లలిత కళలు, ధర్మమీమాంసలు, విద్యాగోష్ఠులు, మఠములు, ఆశ్రమములు ప్రబలినవి. సామ్రాజ్యమునం దంతటను సప్తసంతానములు శరపరంపరగను ప్రసరించినవి. ఆ మహోత్సవసమయమునం దాంధ్రహృదయమునందు చైతన్యము తాండవమాడినది.

శ్రీకృష్ణదేవరాయలు క్షాత్రధర్మమునందువలెను మానవధర్మమునందును ధర్మారాధనమును చేయుటకు సమకట్టిన విధమును విష్ణుచిత్తీయ కావ్యార్థము పరిస్ఫుటము చేయుచున్నది. శ్రీకృష్ణదేవరాయలు స్థాపింప సమకట్టిన నిత్యధర్మము వర్తమాన యుగమునందు నూతన దేశకాలావరణమునందు ప్రపంచమునం దంతటను మహాపరివర్తనమును గలుగజేయుచున్నది. శ్రీకృష్ణదేవరాయలు స్థాపించిన స్వాతంత్ర్యధ్వజము వర్తమానయుగమునందు పునరుద్ధరణ మగుచున్నది. స్వాతంత్ర్యధ్వజోద్ధరణమున కా కాలమునందువలెను వర్తమానకాలమునందును స్వాతంత్ర్యప్రియులైన వీరులు, ధీరులు, కవులు, గాయకులు, కళోపాసకులు సాధకులుగ నున్నారు. ఆ కాలమునకును నేటికిని సాధనములు వేరైనను మానవ ధర్మాభ్యుదయము సాధ్యము, సమానము.



ఆంధ్రోద్యమసారథి దేశోద్ధారకుడు

# విశాలాంధ్రము

## శ్రీ దివాకర్ల వేంకటావధాని

మ॥ చిరవాంఛా పరిపూర్తి నేటికి లభించెన్ దెన్గు మాగాణి సో
దరు లేకంబయి రాత్మభాగముల చింతల్మాని, యిందన్ నం
దరు మాతృప్రియ పాదపూజ నొక చెంతన్ జేయు భాగ్యంబు చే
కురదయ్యెన్ గద? యింక శ్రేయములు గల్గున్ దల్లి యాశీస్సు చే.

సీ॥ గోదావరీ పావనోదకమ్ముల మున్గి
యనఘు మార్కండేయు నంఘ్రి కెఱఁగి
యావలఁ గృష్ణామహాంబువులం దోగి
దుర్గామహాదేవి దోయిలించి
యావెన్క నోరుగల్లరిగి విశ్రుతుండైన
శ్రీరామచంద్రుని సేవనలిపి
తరువాతఁ దుంగభద్ర జలమ్ము సేవించి
హంపీ విరూపాక్షు నాశ్రయించి

గీ॥ పిదపఁ జిల్లర దేవుళ్ళ పీఠములకు
శివమునంచి నమస్కృతుల్ జేసికొనుచు
నేటి కొక సుస్థిరంబైన నిలయమునకుఁ
దరలివచ్చిన యాంధ్రమాతకు! జోహారు!

మ॥ జనమాన్యత్వముగన్న బౌద్ధమతమున్ సాధించి సంస్కార మొ
య్యనఁ గావించిన దాంధ్రుఁడే కద! స్వరాజ్యం బబ్బ సత్యాగ్రహం
బున వెన్జూపని దాంధ్రుఁడేకద! జయంబున్ గాంచె నిప్పట్ల నా
తని సంస్కారమె రిత్తవోవునె పవిత్రంబైన సిద్ధాంతముల్.

మ॥ ఇలు జూడన్ వలెనన్నచో మొదటఁ దా మిల్లాలి నీక్షింపఁగా
వలెనంచున్ మన పెద్దలందరు సుమీ! వారింపు మున్ముందుగాఁ
దలిరుం బోడుల కష్టనష్టములు మీదన్ దామె సిద్ధించు నీ
కలఘు ప్రాభవ భోగభాగ్యము లవశ్యం బాంధ్ర! మేల్కాంచుమా!

# విశాలాంధ్రము

మ॥ తెలుఁగుందల్లికి నన్నపూర్ణయను పేర్దీపించె నీ ఖ్యాతి య
న్యులకున్ లేదులవమ్ము, దాని కిక ముందున్ లోటులేకుండఁ బు
ష్కలమౌ రీతిని సర్వవస్తువులతో సాధించి భాండారముల్
నిలువన్ జేయుము నీ నదీ జలములే నిత్యంబు తోడయ్యెడిన్.

మ॥ ఒకనాఁ డాంధ్రుని కీర్తి సౌరభము సర్వోర్వీజనాహ్లాదియై
కకుబంతంబులనిండ నిండినది; సంకల్పించి పూర్వోన్నతిన్
బ్రకటింపన్ వలె నేడుగూడ మన సౌభాగ్యంబహో మార్గద
ర్శకమై తక్కిన భారతంబునకు నాపాదించుఁ గల్యాణముల్.

సీ॥ చిన్నకుఱ్ఱని రాజ శీర్షావతంసుఁగాఁ
బెంచిన తిమ్మరుసు ప్రేమగుణము
మనుమసిద్ధి నృపాలు మనుపఁగాఁ జని సిద్ధి
గాంచిన తిక్కన్న కౌశలంబు
బంధనంబునబడ్డ ప్రభువును విడిపించు
కొన్న యుగంధరు పన్నుగడలు
అపచార మొనరింప నాత్మజుఁడనుకోక
దండించు మాదన్న ధర్మపరత

గీ॥ సప్త సంతానములచేఁ బ్రశస్తిగాంచి
వరలిన పురాతనామాత్య వైభవములు
మరల మనమంత్రులందు సంభవముగాంచి
యాంధ్ర మొక భూతలస్వర్గమగునుగాక!

గీ॥ వేంకటేశ్వరు సత్కృపావీక్షణములు
నారసింహుని చందనార్ద్రప్రవృత్తి
కలవురక్షింపఁబూర్వమే ఘనయశమ్ము
బ్రాపుకొందుము మనకు శ్రీరామరక్ష.

మ॥ తరుణంబీయది కావునన్ భవదుదాత్తంబైన త్యాగమ్ముచే
నిరవొందెన్ మునుముందు రాష్ట్రమటుపై నీరీతి నాంధ్రావనీ
పరమార్థంబని పొట్టివంశజుని దేవత్వంబు గైకొన్న సో
దరు శ్రీరాముని, గేలుమోడ్చి మనసాధ్యానింతమా! పేర్మిమై.



ఆంధ్రప్రదేశ్ శాసనసభా భవనము

# ఆంధ్ర రాజధానులు

శ్రీ వాసిరెడ్డి పార్థసారథి

వానలు వెనుకపట్టినవి. పరిశుద్ధాత్ముని మనస్సువలె, ఆకాశము నిర్మలమైనది. శరత్కాలము ప్రవేశించినది. 1956 నవంబరు 1వ తేదీనాటికి శరదృతువు నిండు యౌవని. జాబిల్లి తన వెండి వెన్నెలలను తెలుగు నేలలందు వర్షిస్తున్నాడు. కవులకు రసికులకు ఇది పంట కాలము. ఆంధ్రలక్ష్మి పచ్చని పైరు చీరను శృంగారించుకున్నది.

ఇట్టి శుభసమయమందు ఆంధ్ర రాజ్యలక్ష్మి హైదరాబాదు సింహాపీఠమునందు వేంచేయుచున్నది. ఇది ఆంధ్ర పుత్రునికి ఆహ్లాదకర ముహూర్తము.

రాజకీయవేత్తలు ఆమెకు వింజామరలు వీస్తున్నారు. కవి గాయకులు వినుతించుచున్నారు. వంది మాగధులు ఆంధ్ర రాజ్యలక్ష్మిని స్తోత్రం చేస్తున్నారు.

ఈ తల్లి ఇంతవరకు అనేక రాజధానీ నగరములలో వాసం చేసింది. ఆ యా కాలములను బట్టి, ఈ తల్లి ఆ యా చోట్ల దివ్యజ్యోతియై ప్రకాశించింది. ఈయమ, ఏ ఏ కాలములందు, ఏ ఏ రాజధానీ నగరములందు తన దివ్య తేజమును ప్రసరింప చేసినదో అద్దానిని నా చేతనైనంతవరకు గద్యపాఠము చెప్పవలెనని నా ఉత్సాహము.

ఈయమ ఆంధ్రలక్ష్మి. అంధ్ర, ఆంధ్ర, తెనుగు, తెలుగు అనే నామములతో పిలుస్తూవుంటారు. అనాదికాలమందు, ఈ ప్రదేశము కీకారణ్యమై, చీకటి భూమిగా వుండేది. అందుచే అంధభూమి అన్నారని ఒక వాదము. విశ్వామిత్ర సంతతిలో అంధ్రుడనేవాడున్నాడట. ఇతనివల్ల, ఈ పేరు కలిగిందని మరొక వాదము.

తెలుగు దేశమని పేరు అనాదియందు లేదు. ఇటీవల వచ్చిందీపేరు. మన దేశంలో, ప్రధానమైనవి మూడు శివక్షేత్రము లున్నవి. ఇవి ద్రాక్షారామము, కాళేశ్వరం, శ్రీశైలము. ఇవి మూడు, మూడు దిక్కుల వున్నవి. ఈ మూడుశివలింగక్షేత్రముల మధ్య వున్న దేశమును త్రిలింగ దేశమన్నారు. ఇదే తెలుగు తెనుగుగా మారినది-ఇదొక వాదము. కళింగ దేశము మూడు రాష్ట్రములుగా వున్నది. ఉత్తర కళింగ ఒకటి దీనినే ఉత్కళ అంటారు. రెండవది మధ్య కళింగ. మూడవది, త్రికళింగ. త్రికళింగే, కాలక్రమేణా త్రిలింగ అయిందంటారు. ఇదొక వాదము.

ఇవేకాక, ఈ భూమిని మంజీరమని, వజ్రభూమి అని పిలిచేవారట. మంజీర గోదావరి నదికి ఉపనది. ఈ మంజీరా నది ప్రక్కల, ప్రజలు వుంటూ వున్నందున, మంజీరదేశమన్నారు. కృష్ణానది ప్రక్కల వజ్రములు ఎక్కువగా దొరికేవి అందువల్ల, ఈ భూమిని వజ్రభూమి యని పిలిచేవారు.

రామాయణ కాలమునకు పూర్వమే, ఈ ప్రాంతమరణ్యమయమైయున్నా, కొన్నిచోట్ల ప్రజలు జీవిస్తూ వున్నారు. ఈ దేశమునకు దండకారణ్యమని పేరున్నది. ఇక్కడ అనాదికాలమందు దండుడనే రాక్షసరాజు రాజ్యం చేస్తుండినాడు. ఇతను తన గురువు కూతురును మోహించి బలాత్కరించాడు. కులగురువు శుక్రాచార్యులు ఇందుకు ఆగ్రహించి, శపించాడు. ఏడుగోజులు మట్టివాన కురిసి, దేశం నాశనమౌగాక యని అన్నాడు. అట్లే జరిగింది. అప్పుడు ఇక్కడ భూకంపమో, అగ్నిపర్వతమో, మంచు తుపానులో వచ్చి, దేశమును సర్వనాశనం చేసి వుంటవని, హెచ్. జి. వెల్సు పూర్వం మంచుతుపానులు వచ్చి అనేక నాగరిక రాజ్యములను భూస్థాపన పెట్టుకున్నవని వ్రాశాడు. ఇట్లే ఇక్కడ కూడా జరిగి వుంటుంది. ఇందుకొక సాక్ష్యం తెలంగాణాలో వున్న రాక్షస బొగ్గు. ఎంత అటవీప్రదేశం నాశనం కానిది, ఈ గనులు ఏర్పడి వుంటవి?

రఘువంశములో, రఘు మహారాజు తూర్పు సముద్రపు వైపుగా కావేరీ వరకు దండయాత్రకు వచ్చినట్లు వ్రాయబడినది. ఇతను వంగదేశమును జయించి, ఉత్కళులను,కళింగులను జయించి కావేరీ

నదవద్దకు వెళ్లాడు. రఘు మహారాజు కళింగులను జయించాడు. గోదావరికి ఉత్తరమున వున్న భూమి కళింగ భూమి. కనుక, ఆనాటికే ఇక్కడ జనావాసం వున్నది. కళింగులే ఆంధ్రులు.

మహాభారత యుద్ధంలో ఆంధ్రులు కూడా వున్నారు. కనుక, ఆ రోజులలో ఆంధ్ర రాజ్యం వున్నది. ఐతరేయబ్రాహ్మణంలో ఆంధ్ర ప్రసక్తి వున్నది. ఇది భారతయుద్ధం తర్వాత వ్రాయబడ్డదట. అనగా మూడు వేల సంవత్సరముల క్రిందట, ఆంధ్రులు పట్టణ గ్రామములను కట్టుకుని నివసిస్తూ వున్నారు.

ఇక్కడ, రెండు వేల అయిదు వందల సంవత్సరములకు పూర్వమే నాగుల నే జాతి వున్నారు. వీరు ధాన్యకటకమును రాజధానీ నగరంగా రాజ్యం చేశారు. వీరే ద్రావిడులకు ఆది పురుషులు. వీరు మాట్లాడింది ద్రావిడ భాష. ఈ భాష స్థల కాలముల మార్పుల వల్ల తెలుగు, కన్నడము, అరవము కేరళ భాషలుగా మారింది. తర్వాత మన దేశమునకు అనేక భాషలవారు వచ్చి, రాజ్యం చేస్తూ, మనలో కలిసిపోయినారు. వీరు కలిసినట్లే వారి భాషలు కూడా, మన భాషలో లీనమైనవి. ప్రాకృతము, సంస్కృతము, మహారాష్ట్రము, హిందూస్తాని, ఆంగ్లేయము మొదలైన అనేక భాషలు మన భాషతో కలిసి, తెలుగుభాష సంపన్నమైనది. నాగులు నగములలో వుంటూ, నాగములను పూజించినందువల్ల నాగులైనారు. వీరు విగ్రహారాధనకు ప్రథములు. వీరిని చూచి బౌద్ధులు, వారిని చూచి హిందువులు విగ్రహారాధకులైనారు. నాటి సర్పపూజలు, నేటికికూడా నాగులచవితిగా మనలో వున్నవి. వారి పేర్లు నాగయ్య, నాగమ్మలు ఇప్పటికీ మనం పెట్టుకొంటున్నాము. వీరికీ ఉత్తర హిందూస్తానపు వారికి సంతతయుద్ధాలు జరిగేవి. పాతాళ లోకంలో నాగులు వుంటున్నట్లు మహాభారతంలో వ్రాయబడ్డది. పాతాళలోకమనగా, దిగువ దేశమై యుండాలి. లేక అడవులూ, కొండలమధ్యవుండి పాతాళలోకము వలె వుండివుండాలి. అర్జునుడు నాగకన్యను వివాహమాడినట్లు, పరీక్షిత్తును నాగుడు చంపినందున, జనమేజయుడు నాగుల సంహారం చేసినట్లు మహాభారతంలో వున్నది. కనుక మహాభారత కాలం నాటికే వీరు ప్రబలులై రాజ్యములు చేస్తూవున్నారు. వారు బలవంతులు. పెద్దపెద్ద సువర్ణ ఆభరణములను అలంకరించుకునేవారు. స్త్రీలు అత్యంత సుందరులు. వీరికి శిల్పవిద్య తెలుసు. వీరు తక్షశిలనుండి ఈ దేశం వచ్చివుంటారు. అనాది ఆంధ్రులు వీరే. వీరి చిత్రములు ధాన్యకటక స్తూపములందు చిత్రించబడ్డవి.

ఆంధ్రరాజుల ప్రథమ రాజధానీనగరము శ్రీకాకుళము. దీనిని కాకులమనికూడా అంటారు. ఇది కృష్ణ వద్దనవున్నది ఇక్కడ ఆంధ్రవిష్ణువనేరాజు రాజ్యం చేశాడు ఇతను లోకప్రఖ్యాతుడు. ఇతనిని గురించి పురాణములలో వ్రాయబడ్డది. ఈయనను భగవంతుడుగా ఆరాధించారు. కృష్ణదేవరాయలవారు శ్రీకాకుళమువచ్చి ఈ ఆంధ్రవిష్ణువు నారాధించారు.

తర్వాత ఆంధ్రసామ్రాజ్యమునకు రాజధానీ నగరముగా ధాన్యకటకమున్నది ఇప్పుడు కృష్ణవద్దన వున్న అమరావతి అనే పట్నంవద్దవున్న ధరణికోటే ఈ ధాన్యకటము ఇక్కడె ఆంధ్రరాజ్యలక్ష్మి బహుకాలం నివసించింది. ఈ కాలంలో నే లక్ష్మియై బంగారు పంటలనిచ్చి కటాక్షించినది. సరస్వతియై విద్యావినయముల నిచ్చినది. మహిషాసుర మర్దనియై అరిరాజులను పరిమార్చినది. ఇక్కడె శాలివాహనులు 450 సంవత్సరములు రాజ్యం చేశారు. ఈ శాలివాహనుల చరిత్రవిన్న ప్రతి ఆంధ్రుని హృదయం పులకాంకితమౌతుంది. వీరు ధాన్యకటక రాజధానీ నగరమునుండి క్రీస్తు పూర్వము 225 నుండి, క్రీస్తుతర్వాత 225 వరకు రాజ్యం చేశారు. వీరు ఆంధ్రదేశము నేగాక, ఉత్తరమునవున్న మగధదేశమును జయించి పాలించారు. వీరి రాజ్యము ఉత్తరమున మగధవరకునూ పడమట మహారాష్ట్ర కర్ణాటదేశములకు వ్యాపించింది. వీరి రాజప్రతినిధులు, పైఠాన్‌లో వుండేవారు. వీరిలో శాలివాహనుడు గొప్పవాడు. ఇతని కాలంలో మధ్యాసియానుండి శక, పల్లవ, యవనమూకలు భారతభూమిమీదకు దండెత్తివచ్చినవి మహమ్మద్ ఘజనీ, బాబరునాటి వలె గాక, ఇతను వారిని ఎదిరించి పారద్రోలినాడు. అందుకో అఖండశక్తులు చూపించినందువల్లే ఇతనిని శకారి అన్నారు. ఈ కారణమువల్ల నే శాలివాహన శకమును నిర్ణయించారు. ఆనాటినుండి, ఇప్పటివరకు, అనగా రెండు వేలసంవత్సరములుపై చిలుకు ఇతని నామమును, దక్షిణాపథము వాడుతున్నాము. క్రీ శ. 78 సంవత్సరముల తర్వాత ఈ శకము ప్రారంభమైనది. ఎన్నో శకములు పుట్టినవి గిట్టినవి. కాని ఈ శాలివాహన శకం మాత్రం మనలో జీవనదిగా వుంటూనే వున్నది. ఇతని తర్వాత యజ్ఞశ్రీ

# ఆంధ్ర రాజధానులు

అనేవాడు గొప్పవాడు. ఇతనిపేరు రోము, అయి
గుప్త, పర్షియా, చీనా, జపాన్, కొరియా, సుమిత్రా,
జావా లంకభూములందు కూడా వ్యాపించినది. చీనీయులు
ఇతనిని యగ్నాయ్ అనేవారు. ఆనాడు పై దేశీయు
లతో మనకు రాజకీయ, మత, వ్యాపార, విద్యాసంబం
ధములుండెడివి. ఈ నాడు భారతభూమికి ఢిల్లీ నగర
మెట్లో ఆనాడు ధాన్యకటకము భారతదేశము నంత
టికిని అట్లున్నది. విద్యార్థము, మతార్థము హ్యూయాని
త్సాంగ్ చీనానుండి, అనేక యడారులను, పర్వతా
లను, నదులను, కొండలను దాటివచ్చాడు రోమునాణె
ములు ఆనాడు ఇక్కడ చలామణి యౌతుండేవి. శాత
వాహనుల నాణెములు రోములో చలామణి అయేవి. వీరి
నాణెములమీద ఓడ చిహ్నమున్నది. ఆనాడు నౌకా
వ్యాపారము, భూవ్యాపారం పూర్తిగా జరుగుచున్నది

కృష్ణనుండి అనేక నావలు చీనా, జావా, జపాన్
రోముల వరకు వెళ్ళి వచ్చేవి భూమిమీద కూడా
అరణ్యములను నరికి, కొండలను తొలిచి రస్తాలను
ఆనాడు వేశారు. ధాన్యకటకమునుండి నాగార్జున
కొండమీదుగా గుజరాతు రాష్ట్రంలోని బ్రోచివరకూ
రస్తా వుండెడిదట. దీనిమీద వ్యాపారము విదేశములకు
జరుగుచుండెను. ఆంధ్రభూమి, భారతదేశం మధ్యలో
వున్నది. అందువల్ల యుద్ధరీత్యా, వ్యాపారరీత్యా
మనకు అనేక సదుపాయాలున్నవి. ఆనాడు శాలివా
హనులు వీటిని ఉపయోగించుకుని, విశాల సామ్రాజ్య
మును స్థాపించారు. బౌద్ధమతం ఆనాడు వృద్ధియైనది.
ధాన్యకటకములో అనేక చైత్యారామములు స్తూపములను
నిర్మించారు. 18 వ శతాబ్దములో ధరణికోట అమరా
వతీ ప్రఖ్యాతులు విని రాజా వాశిరెడ్డి వెంకటాద్రి
నాయుడు వారు, తన రాజధానిని చింతపల్లినుండి అమ
రావతికి మార్చుకున్నాడు. కోట గోడలు, నగర నిర్మా
ణములకు ధరణి కోటలో పడుబడి వున్న రాళ్ళు
తీయించాడు. అట్టి సమయంలో కన్నింగాం వచ్చాడు.
అందులో బయల్పడిన స్తూపము ఈయన కంటబడ్డది.
ఆశ్చర్యమున్నదైనాడు. ప్రభుత్వం వారికి తెలుపగా,
ఇది త్రవ్వించి, శిల్పములన్నిటిని తీయించారు. ముఖ్య
మైనవాటిని ఇంగ్లండుకు చేరవేశారు. ఇక్కడ బుద్ధుని
పన్ను వున్న స్తూపమున్నది. దాని చుట్టూ రాతి
స్తంభములతో ఒకదానితర్వాత వకటిగా రెండు ప్రాకా
రములున్నవి. ఈ స్తంభములమీద చిత్ర నిర్మాణ
ములు అద్భుతంగా వున్నవి. ఆనాటి రాజకీయ
సాంఘిక, మత, విద్యా, వ్యవసాయ విషయములన్ని
టినీ ఈ రాళ్ళమీద చిత్రించారు. ఇందువల్ల ఆకాల
పరిస్థితులను మనం గ్రహించగలము ఈ స్తూపములలో
ఎక్కువ తక్కువ జాతులనక, అందరూ సమంగా
వచ్చి పూజలు చేస్తుండేవారు. ప్రజలలో బౌద్ధమతము
బాగా జీర్ణించినది. విద్యా వ్యాపారములు వృద్ధినొందినవి.
అందువల్లే ఆకాలమును స్వర్ణయుగమన్నారు.

ధాన్యకటకమును, ధనకటకమని ధాన్యవతీ పుర
మని ఆనాడు పిలిచేవారు. టిబెటీయులు, ద్పల్-
ల్దాన్-(బ్రాస్-స్పూంగ్)యుక్కాసు, అని పిలిచేవారు.
అనగా ధాన్యరాసులు ఎక్కువగా దొరికే పట్నమని
అర్థము. ధనికటకమనికూడ అన్నందువల్ల ధాన్యరాసులే
గాక ధనరాసులు కూడా దొరికేవి. ఈ విధంగా ఈ
పట్నము 5 శతాబ్దములు ప్రపంచమున్ననలను పొంది
నది. కాలక్రమేణ బౌద్ధ బ్రాహ్మణ మతములకు కక్ష
లేర్పడినవి. ఈ కారణము ధాన్యకటకమునకు నాశన
హేతువైనది. అయిదవ శతాబ్దములో పశ్చిమ
చాళుక్యరాజైన, వాతాపిపాలకుడు, పులకేశివల్లభుడు
ఈ పట్నమును నాశనము చేశాడు. నాటితో, ఆంధ్రుల
గర్వకారణమైన ధాన్యవతీపురము మరుగున పడి
పోయినది.

దేశములో కలిగిన కలతలవల్ల 3 వ శతాబ్దమున
ఆంధ్రరాజ్యం చితికిపోయినది. అప్పుడు పల్లవులు
రాజ్యానికి వచ్చారు. వీరు పశ్చిమదేశంనుండి వచ్చిన
పల్లవులు. శాలివాహనుల కాలంలో అణగిమణగి
వుండి, ఇప్పుడు పైకివచ్చారు. వీరు మద్రాసుకు దక్షి
ణంగావున్న కాంచీపురమును రాజధానీ నగరంగా
చేసికున్నారు. వీరు క్రీస్తుశకము 225 నుండి 340
వరకు రాజ్యం చేశారు. వీరు బ్రాహ్మణమతమును
వృద్ధిపరచారు. వీరు అగ్నిష్టోమ, వాజపేయ, అశ్వమేధ
క్రతువులను చేశారు. విద్యను పోషించారు.
సంస్కృత విద్యను, వీరి రోజులలో గడుపుకొనుటకు
కాంచీపురమునకు విద్యార్థులు వచ్చేవారు. అనేక దేవా
లయములను నిర్మించి, దానధర్మాలు చేశారు. వీరు
కాంచీపట్నముమండి ఉత్తరమున గుంటూరు జిల్లా
వరకు రాజ్యం చేశారు. ఇక్కడకు చీనానుండి
కూడా యాత్రికులు వచ్చారు.

3 వ శతాబ్దమునుండి కృష్ణ దిగువను పల్లవులు
రాజ్యం చేస్తుండగా, కృష్ణ గోదావరి నదుల మధ్య
దేశమును సాలంకాయనులు రాజ్యంచేశారు. వీరు
వేంగీ అనే పట్నమును రాజధానిగా రాజ్యం చేశారు.
వేంగీ ఏలూరుదగ్గరవున్నది. వీరు ఈ రాజధానిలో
క్రీస్తుశకము 275 నుండి 450 వరకు రాజ్యం చేశారు

వీరు సంస్కృతమును వృద్ధిపరిచారు. ఈ 3, 4 వ శతాబ్దములలో ఆంధ్రభాషలోనికి సంస్కృత శబ్దములు కొల్లలుగా ప్రవేశించినవి. వీరు బ్రాహ్మణ మతావలంబులు. వీరికాలంలో బౌద్ధమతము క్షీణింపసాగింది. వీరూ అశ్వమేధాది యజ్ఞములు చేశారు. వీరు వేంగి పట్నంలో సూర్యదేవాలయాన్ని కట్టించారు. అనేక ఆలయములకు దానధర్మములను చేశారు.

మూడవ శతాబ్దంలో రాజ్యం చేసినవారిలో ఇక్ష్వాకులు కూడా వున్నారు. వీరు కృష్ణా గుంటూరు సీమ పడమటి భూములమీద రాజ్యం చేశారు. వీరి రాజధానీనగరము విజయపురము. ఇది కృష్ణఒడ్డున నాగార్జునకొండవద్ద వున్నది. వీరు ఇక్కడ క్రీస్తుశకము 250 నుండి 340 వరకు రాజ్యం చేశారు. మగవారు బ్రాహ్మణ బౌద్ధ మతములను సమంగా చూచారు. అనేక యజ్ఞములను చేశారు. రాణులు బౌద్ధమతమునకు విశేషసహాయం చేశారు. అనేక బౌద్ధారామములను నిర్మించి, దానధర్మములను ఇచ్చారు. ఈ కాలంలోనే, ఈ విజయపురములో నాగార్జునాచార్యులు నివశించారు. ఈయన జగత్ప్రఖ్యాతుడు. మహాయానసృష్టికర్త. ఈయన, రస, వైద్య, వేదాంత, మంత్రశాస్త్రములలో నిధి. వీరికాలంలో చీనా సుమత్రా మొదలైన దేశములనుండి యాత్రికులు ఇక్కడకువచ్చి వెళ్ళేవారు. సముద్రయానం కూడా జరుగుతుండేది. నావలు కృష్ణానదిద్వారా నాగార్జునకొండ వద్దకు వచ్చేవి. ఇక్కడ అవి ఆగుటకు రేవు కట్టబడి వున్నది. విద్య, మతము, వేదాంతాన్వేషకులను, ఈ పట్నం ఎక్కువగా ఆకర్షించినది. వీరిలో వాశిష్ఠీపుత్ర శ్రీశాంతమూలుడు అశ్వమేధయాగం చేశాడు. పూర్వం ఇక్ష్వాకులవలె, ఇతనూ అశ్వమును వదలిపెట్టాడు. వీరిని ఏ రాజైనా యెదిరించ తలచిన, ఆ గుఱ్ఱాన్ని పట్టుకోవాలి. అప్పుడు యుద్ధం జరుగుతుంది. కాని ఎవరు ఈ గుఱ్ఱాన్ని పట్టుకోలేదు. అందువల్ల ఇతనికి చక్రవర్తి అనే బిరుదు వచ్చింది.

సాలంకాయనులను పోద్రోలి, విష్ణుకుండినులు రాజ్యానికి వచ్చారు. వీరి రాజధానీనగరము తెందులూరు. ఇదే ఇప్పటి దెందులూరు. ఇది సాలంకాయనుల వేంగీపట్నంలో ఒకభాగం. వీరు బ్రాహ్మణ మతావలంబులై క్రతువులను చేశారు.

ఇక్ష్వాకులు సన్నగిల్లిన తర్వాత, పల్లవులు ఇంకొకసారి ప్రబలులై, రాజ్యానికి వచ్చారు. వీరు క్రీస్తుశకము 340 నుండి 640 వరకు రాజ్యం చేశారు. వీరు ఈ 3 శతాబ్దములు కాంచీపురమును రాజధానీ నగరంగా చేశారు. అందువల్లే కంచి మన సాహిత్యంలో స్థానం ఏర్పరుచుకున్నది. కథ పూర్తి కావటంతోనే కంచికి పడుతుంది. ఆనాడు విద్యాలయములు కంచిలో ఏర్పడినవి. ప్రతి విద్యార్థి, పండితుడు అక్కడకు వెళ్ళేవారు. వీరు బ్రాహ్మణమతావలంబులై యజ్ఞములను చేశారు. అనేక దేవాలయములను నిర్మించి దానధర్మముల నిచ్చారు.

గోదావరికి ఉత్తరముగా వున్న దేశమును మహానది వరకు కళింగులు రాజ్యం చేశారు. వీరిది అనార్య వంశము. ఆంధ్రులను కూడా కొంతకాలం కళింగులన్నారు. వీరు క్రీస్తుపూర్వము 160 నుండి, క్రీస్తు తర్వాత 1530 వరకు రాజ్యం చేశారు. వీరు సింహపురము, నరియా పల్లి రాజధానులుగా రాజ్యం చేశారు. వీరు పదిహేడువందల ఏళ్ళు ఏకధాటిగా రాజ్యం చేశారు.

సాలంకాయన, విష్ణుకుండినుల రాజ్యం తర్వాత పశ్చిమ చాళుక్యులు రాజ్యమునకు వచ్చారు. వీరితో మహారాష్ట్రం మొదలైన శబ్దములు మనభాషలోనికి వచ్చినవి. వీరూ వేంగినే రాజధానీనగరముగా చేసికొని 7 వ శతాబ్దములో రాజ్యం చేశారు. వీరిలో పృథ్వీవల్లభ మహారాజు కళింగ దేశంలో కొంత జయించి పిష్టపురమును రాజధానీ నగరంగా రాజ్యం చేశాడు. పిఠాపురమే ఇది. ఇది చాళుక్యుల అనాది రాజధాని.

వీరితర్వాత తూర్పుచాళుక్యులు రాజ్యానికి వచ్చారు. వీరు క్రీస్తుశకము 630 నుండి 1127 వరకు రాజ్యం చేశారు. బహుకాలం రాజ్యం చేసి, ఆంధ్రులలో లీనమై పోయిన వారు వీరు. వీరు ప్రథమములో వెంగీపట్నమును రాజధానీనగరంగా చేసుకున్నారు.

తూర్పు చాళుక్యులను ఆంధ్రచాళుక్యులనవచ్చు. వీరు ఆంధ్రులతో కలిసి, ఆంధ్రుల అభ్యున్నతికి అనేక మహత్కార్యములు చేశారు. వీరిలోని అమ్మరాజ విష్ణువర్ధనునికి రాజమహేంద్రుడనే బిరుదున్నది. ఇతనిబిరుదు మీదనే గోదావరి ఒడ్డున రాజమహేంద్రవరమును నిర్మించారు. ఇక్కడ బలిష్ఠమైన కోటలను, బురుజులను కట్టారు. వెంగి తర్వాత 11 వ శతాబ్దములో రాజమహేంద్రవరము రాజధానీనగరమైంది. ఇది రాజరాజనరేంద్రుని రోజులలో, కృష్ణదేవరాయల రోజులలో విజయనగరము ఎన్ని విధాల వృద్ధిలోనికి వచ్చిందో అన్ని విధాల వృద్ధికి వచ్చింది. తూర్పు చాళుక్యులు, ఆంధ్రులలో లీనమై ఆంధ్రభాషకు మహోపకారమును చేశారు. రాజమహేంద్ర పురములో మహాభారతమును తెలిగించుటకు ప్రారంభం చేయబడ్డది. అప్పుడు.

# ఆంధ్ర రాజధానులు

ఇక్కడ ఆంధ్ర, కర్ణాట, తమిళ విద్యలు వృద్ధి చెందినవి. ఇప్పటి వరకు భారతమును ఎవరూ తెనిగించ సాహసించలేదు. భారతము పంచమ వేదము. ఈ వేదమును తెనిగించిన యెడల పాపమని, తాము నశించెదమని భయం ఏర్పడ్డది. ఈ నాటికి కూడా భారతమును గృహములందు చదువుట అపాయకరమనే భావమున్నది. అట్టి పరిస్థితిలో రాజరాజనరేంద్రుడు భారత ఆంధ్రీకరణమునకు ప్రయత్నించడం, వీరికి నన్నయభట్టు, నారాయణభట్టు సహాయపడ్డారు. అనిష్టము కలుగకుండా వుండుటకు, నన్నయ భట్టుచేత యజ్ఞం చేయించి, భారత ఆంధ్రీకరణమును ప్రారంభించారు. కాని వీరు పూర్తి చేయలేక పోయిరి. ఈ ఆంధ్రచాళుక్యులు కావ్యప్రియులు. విద్యాగోష్ఠి జరిపేవారు. వీరు బ్రాహ్మణ మతావలంబులు. అనేక దేవాలయములను కట్టించారు. దేవాలయములకు, పండితులకు అనేక దాన ధర్మాలను చేసి, బ్రాహ్మణమతాన్ని పోషించారు. ఆనాడు రాజమహేంద్రపురంలో బౌద్ధుల పోరు కూడా వుండేది. బ్రాహ్మణుల బౌద్ధుల మధ్య తీవ్రకలహములు జరుగుచుండెడివి. రాజు బ్రాహ్మణ మతావలంబి. భారతమును ఆంధ్రీకరించి, మతమును ప్రజాసామాన్యమునకు దగ్గర చేశాడు. ఇది నాడు గొప్ప విప్లవము. ఇందుచే బౌద్ధులు రాజరాజ నరేంద్రుని మీద అనేక అపవాదాలు సృష్టించారు. సారంగధరుని కథను ఈ రాజరాజనరేంద్రునికి అంటకట్టారు. రాజరాజనరేంద్రునికి సారంగధరుడనే కుమారుడు గాని, చిత్రాంగి అనే భార్యగాని లేరు. ఇదంతా కల్పన. ఇప్పుడు రాజమహేంద్రవరంలో చిత్రాంగి దిబ్బ వున్నది బౌద్ధులు విరోధంతో నమ్మేట్టు సృష్టించారీ కథను. రాజరాజనరేంద్రుని భార్య పేరు అమ్మంగదేవి, కుమారుడు కులోత్తుంగ చోడదేవుడు. కాంచీపురరాజు చోళరాజు కూతురు ఈ అమ్మంగదేవి. ఈ రాజుకు వేరే పుత్రసంతతి లేనందున కులోత్తుంగ చోడదేవుడు తాతగారింటే వున్నాడు. అందువల్ల ఆంధ్రరాజ్యం బలహీనమైనది.

తరువాత కాకతీయులు రాజ్యానికి వచ్చారు. వీరు చాళుక్యులకు సామంతులుగా వుండేవారు. చాళుక్యుల సంతతి కాంచీపురములో వుండి అరవదేశమునుండి రాజ్యం చేశారు. అందువల్ల ఇక్కడ విప్లవం జరిగింది. కాకతీయులు రాజ్యమాక్రమించారు. వీరు మొదట హనుమకొండ రాజధానీ నగరంగా రాజ్యం చేశారు. అక్కడినుంచి ఓరుగల్లుకు రాజ్యం మార్చారు. స్వచ్ఛమైన తెనుగబిడ్డ, నడిబొడ్డుమీద రాజ్యం చేసింది కాకతీయులు. వీరు ఓరుగల్లును రాజధానీ నగరంగా క్రీస్తుశకము 1089 నుండి 1323 వరకు రాజ్యం చేశారు. వీరు ఉత్తరాన కళింగదేశమునుండి, దక్షిణాన కాంచీపురమువరకు, పడమట శ్రీశైలం వరకు రాజ్యం చేసి, చక్రవర్తులని బిరుదుపొందారు. వీరి కాలంలో మహమ్మదీయ దండయాత్రలు దక్షిణాపథంమీదికి రాజొచ్చినవి. గణపతి రుద్రుని కుమార్తె రుద్రమదేవి. ఈమె ప్రచండ పరాక్రమంతో మహమ్మదీయులను పారద్రోలింది. ప్రతాపరుద్రుడు అనేక దేశాలను జయించాడు. కాని నాడు జైన శైవ ద్వేషాలు ప్రబలంగా వున్నవి. చక్రవర్తులు శైవభక్తులు. జైనులు కోపించి రాజ్యంగుట్టును ఇతరులకు చేరవేశారు. రెడ్డిరాజులు సహాయం చేయనందున, జైనుల రాజద్రోహంవల్ల ఓరుగల్లు పతనమైంది. గణపతి రుద్రచక్రవర్తి కాలంలో విద్య, వ్యాపారము, వ్యవసాయముల వృద్ధికై, ఓరుగల్లు రాజ్యమందు అనేక రస్తాలు వేయించి, మోటుపల్లి మొదలయిన రేవులను వృద్ధి పరచి, చెరువులను త్రవ్వించి, వైద్యశాలలను, పాఠశాలలను ఏర్పరిచారు. ఈ పట్నమందు సంగీత, నాట్య, సాహిత్యాదులు వృద్ధైనవి. ఈ కాలంలో శైవవాఙ్మయం వృద్ధైంది.

ఒక్కరాతిమీద కట్టబడ్డది కనుక ఓరుగల్లు అన్నారు. ఒంటిమిట్టని, ఒరంగల్లని, ఏకశిలానగరమని దీనికి పేర్లున్నవి. భాగవతకర్త పోతన్నది ఈనగరమే నని కొందరి వాదన.

ఈ నగరము చుట్టూ మూడు ప్రాకారాలున్నవి. కంపకోట, మట్టికోట, రాతికోట అనే కోటలున్నవి. మధ్య ఆంధ్రచక్రవర్తి రాజనగరు. దాని చుట్టూ రాతికోట దానిచుట్టు మట్టికోట. దాని చుట్టూ కంపకోట వుండేది. బైటికోటలో మైలసంత జరిగేవి. లోపల మడి సంతలు జరిగేవి. బైట తక్కువ కులస్థులుండేవారు. మైల సంతలో మాంసాదులు విక్రయిస్తుండేవారు. మడిసంత అనగా బ్రాహ్మణసంత. ఇక్కడ ఉన్నత కులాల వారికి కావలసినవి దొరికేవి. రాజబాటలందు గజ తురగ సేవలు తిరుగుచుండేవి. కనుక, ప్రజలు సందుగొందుల వెళ్ళవలసి వచ్చేది.

క్రీడాభిరామమనే వీధి నాటకంలో ఏకశిలానగరమునుగురించి వ్రాయబడ్డది. దీనిని వల్లభామాత్యుడు వ్రాశాడు. కాని దీనిని శ్రీనాథుడు వ్రాసి, ఇతని పేరు పెట్టాడని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సిద్ధాంతీకరించారు. ఇది వివాదగ్రస్తమైన విషయం.

ఓరుగంటిలో అనేక ప్రసిద్ధ దేవాలయములున్నవి. భైరవాలయము, చముడేశ్వర మహాశక్తి ఆల

యము, వీరభద్రేశ్వరాలయము, పాండవుల గుడి, బౌద్ధ విహారము, ముసల్మానులమసీదులున్నవి. అందులో శ్రీ కేశవ స్వయంభూ ఆలయం ప్రఖ్యాతిమైనది. ఇది గొప్ప పర్వతమువలె ఎత్తుగా కట్టబడ్డది. ఆకాలంలో ఇక్కడ భైరవార్చన మైలారుదేవుని పూజలు గొప్పగా జరుగుచుండేవి. వీరేగాక ఏకవీరామహాదేవి ఉత్సవములు బ్రహ్మాండంగా జరిగేవి. ఈమె జమదగ్ని భార్య, పరశురాముల వారి తల్లియైన రేణుకాదేవి. పరశురాముని తల్లి కీనాడు ఉత్సవములు ఆంధ్ర భూమిలో జరుగుచుండేవి. వీరుల ఆరాధనలు గూడా జరిగేవి. అప్పటివే, నేటి వీరుల పూజలు. వీరికి గుళ్లు కూడా కట్టించారు. ముఖ్యంగా పల్నాటి వీరులకు దేవాలయములున్నవి. పల్నాటి వీరచరిత్రలు గానంగా పాడేవారు. అక్కలతిరుణాళ్లుకూడా వైభవంగాజరుగు చుండెడివి. జక్కులస్త్రీలు నృత్యనాట్యములు చేసే వారు. కోళ్లపందెములు, పొట్టేళ్ళ యుద్ధములు జరుగు చుండేవి. ఇవిచూచి ఆనందించుటకు దూరదేశ, గ్రామములనుండి ప్రజలు ఎగబడేవారు వీరికి భోజనములుపెట్టుటకు పూటకూళ్ల ఇళ్లుండేవి. ఇక్కడ వక్క రూకఇచ్చిన, తృప్తియైన భోజనంపెట్టేవారు. లక్ష్మణయొజ్జఇంట భోజనములు రూకకు పెట్టేవారు. కప్పురభోగివంటకము, గోధుమపిండి వంటలు, పంచదార గుప్పెడు, అప్పుడుకాచిన ఆవునెయ్యి, పెసరపప్పు, అరటిపండ్లు, పెరుగు, నాలుగైదు నంజుళ్లు ఆ భోజనంలో పెట్టేవారు. పూటకూటి ఇళ్ళు కాముకులకు విలాస స్థానములుగా వుండేవి.

నాడు గొప్పవారు చెస్తే యుద్ధమో, రాచకార్యములో వుండేవి. లేనియెడల ప్రబంధగోష్ఠి జరిపేవారు. లేనియెడల వేశ్యాసంగతులైవుండేవారు. అక్కడ సంగీత, నృత్య, నాట్యములు జరిగేవి. జాయపసేనాని సంగీతముమీద గ్రంథమును ఇక్కడే వ్రాశాడు. పెద్ద లేదారిని నడచిన పిన్నలుకూడా ఆ దారినే వెళ్లేవారు. కనుక సామాన్య ప్రజకూడా వేశ్యాలోలులై వుండేవారు. ఆనాడు భోగకాంతల సేహ్యం ప్రబంధ గోష్ఠి పురుషార్థములుగా ఎంచేవారు. ఈ దురభ్యాసం ఎంతదూరం పోయిందనగా, ఇందుకై జారధర్మాసనములను ఏర్పరిచేటంతవరకుపోయింది. వేశ్యలు విటులను మోసంచేస్తుండేవారు. అట్టివారిని ఈ జారధర్మాసనములలో విచారించేవారు. తప్పుచేసిన వారికి కఠిన శిక్షవేశేవారు. తలగొరిగించో విరూపినో చేశేవారు. ప్రతాపరుద్రునికి భోగకాంతవున్నది. ఈమె పేరు మాచల్దేవి. ఈమె మందిరము రాజమందిరమువలె వుండేది. అందులో అనేకశిల్పములు చిత్రములుండేవి. ఈమె అందములోను, ఐశ్వర్యములో ఆదిలక్ష్మివలె వుండేదట.

వారాంగనలు అద్దంచూచుట అనే ఉత్సవము జరిపేవారు. దీనినే ముకురవీక్షణంటారు. ఇది గొప్పవారిచేత చేయించేవారు. ఆంగ్రేయుల మోసాలపై ఘటికాయంత్రం ఉండేది. ఘడియ, ఘడియకు గంటలు కొట్టేవారు.

శివదేవయ్య యను ఆరాధ్యులు చక్రవర్తికి మంత్రిగాను, గురువుగాను వున్నారు. ఈ పాలన వరకు విశ్వబ్రాహ్మణులకు, బల్జివారికి, కరణము ఉద్యోగాలుండేవి. వీరు జైన మతావలంబులై, ఓరుగంటికి ద్రోహకంటకులైనారు అందువే, వీరికరణీకములను లాగివేసి, నందవరీకులకు ఇచ్చారు. ఇటువంటి కక్షలవల్ల ఓరుగల్లు పడిపోయినది.

కాకతీయులు పతనమైన తర్వాత, ఓరుగంటి పట్నమును నాశనంచేసి పదివేలయేనుగులు, ఒంటెల మీద సువర్ణ ఘన రాసులను మహమ్మదీయులు తీసుకు వెళ్ళారట.

ఈ కాలమందే, కొందరు, చోళుల నే మాండలిక ప్రభువులు ఏర్పడ్డారు. పలనాటిచోళులకు చందవోలు రాజధానిగావున్నది. ఇది రేపల్లెతాలూకాలో వున్నది. తెలుగుచోడులు నెల్లూరుజిల్లాలో రాజ్యంచేశారు. వీరికి నెల్లూరు (సింహపురము) రాజధానిగా వుండేది. మనుమసిద్ధి యుద్ధాలు ఈ కాలమందే జరిగినవి. ఖడ్గతిక్కన, కవితిక్కన ఈ నెల్లూరివారే. నాడు నెల్లూరు పాడిపంటలతో తులతూగుతుండేది. ఈ రాజులు విద్యనుకూడా పోషించారు.

రెడ్డిరాజులు మధ్యాంధ్రదేశాన్ని క్రీస్తుశకము 1323 నుండి 1450 వరకు రాజ్యంచేశారు. వీరి రాజధానీ నగరము కొండవీడు. ఇది రణనీతి ప్రకారము, కొండమీద కట్టుదిట్టంగా కట్టబడ్డది. దీనిమీద కోటను శత్రువులకు దుర్భేద్యంగా నిర్మించారు. యుద్ధవిశారదుడైన, కృష్ణదేవరాయలువారే, ఈ కోటను జయించుటకు, అనేక నెలలు వేచివున్నాడు.

రెడ్డిరాజులు కూడా కావ్యప్రియులు. విద్యాగోష్ఠులు జరిపి, కవులకు అనేకవిధాల సహాయంచేశారు. వీరిలో దానకర్ణుడు వేమమహీపాలుడు. దేశం నలువైపులనుండి కొండవీటికి రస్తాలు వేయించారు. చెరువులు త్రవ్వించారు. కొండవీటినుండి నావలమీద

విదేశీ వ్యాపారములు జరిగేవి. కొండవీటి సీమలో ఆనాడు వసంతోత్సవములు జరుగుచుండేవి.

కొండవీటి రెడ్డిరాజులలో కొందరు, రాజమహేంద్రవరము రాజధానీ నగరంగా కొంతకాలం రాజ్యంచేశారు. వీరిలో కాటయ వేమారెడ్డి గొప్ప సంస్కృత పండితుడు. ఈయన కొన్ని గ్రంథములను వ్రాశాడు. శ్రీనాథుడీ పట్నమునందు కొంతకాలం వుండి, విద్వద్గోష్ఠివల్ల రాజులను, ప్రజలను సంతోషపరిచేవాడు. ఇతను గొప్పకవి. శృంగారమందు ఈయనకు మక్కువ. అనేక చాటుపద్యములను చెప్పాడు. ఈ పద్యములవల్ల ఆ యానగరముల పరిస్థితులు మనకు తెలుస్తున్నవి. ఆ నాటివారు కావ్య, వారాంగనారసికప్రియులు. ఆ నాడు తృప్తిరైన భోజనము, ఆడంబరమైన వస్త్రములు, విలువయైన నగలను ధరించేవారు. వంటికి కస్తూరి గంధములు పూసుకునేవారు. అప్పుడు కస్తూరి మొదలైన సుగంధ ద్రవ్యములు విదేశాలనుండి నావలమీద వస్తుండేవి. ప్రతి యువకుడు, శ్రీనాథునివలే వుండవలెనని ముచ్చట పడేవాడు. ఆకాలపు ప్రతిబింబము శ్రీనాథుడు. సంస్కృత, ఆంధ్రభాషలు వృద్ధియవుచున్న కాలమది. ఆనాటి పచ్చిశృంగారమునకు కొందరు బుద్ధిమంతులు రోయకపోలేదు. ఇదే వేమనయోగి ఉద్యమం. క్రీస్తుశకము 1450 తో రెడ్డిరాజుల రాజ్యరమ అస్తమించింది. దీనితర్వాత విజయనగర భానుడు ఉదయించి, మిట్టమధ్యాహ్నపు సూర్యునివలె భాసించాడు. కర్నాట ప్రభువులకు విజయనగము రాజధానీ నగరమైనది. కర్ణాటాంధ్ర రాజ్యలక్ష్మికి ఈ నగరము క్రీస్తుశకము 1336 నుండి 1565 వరకు ఆట పట్టయినది.

హరిహరరాయలు ఈ ప్రదేశంలో వేటకు వెళ్లాడట. అప్పుడు, ఈ పట్నమున్నచోట కుందేలొకటి వేటకుక్కకు ఎదురుతిరిగిందట. దీనినిచూచి రాజు ఆశ్చర్యపడి, ఇది స్థానబలమనుకున్నాడు. ఈ విషయమును విద్యారణ్యస్వాములవారికి నివేదించాడు. వారువిని, ఆ స్థలం, పోతుగడ్డని, అందు పట్నం నిర్మించమని సెలవిచ్చారు. అందుకు వారు లగ్నము కూడా నిశ్చయంచేశారు. ఈ నగర నిర్మాణము క్రీస్తుశకము 1336 లో జరిగింది. దీనికి సరియైన, ధాతనామ సంవత్సర, వైశాఖ శుద్ధసప్తమీ, పుష్యమీ నక్షత్రమందు, సింహలగ్నమునకు స్తంభముహూర్తము పెట్టారు. కాని, స్థాపకులు, త్వరపడి కర్కాటక లగ్నంలో శంఖుస్థాపన చేశారు. స్థిరలగ్నమైన సింహలగ్నం, బదులు చరలగ్నమైన కర్కాటకంలో జరిగిందీ స్థాపన. ఆచంద్రతారార్కముగా వుంటుందని పెట్టినలగ్నమందు జరుగలేదు. కనుక షుమారు రెండుశతాబ్దములు పైచిలుకే ఈ పట్నము వర్ధిల్లినది. విద్యారణ్యుల వారు గొప్పఅద్వైతి. హిందూమతోద్ధారకుడు. ముసల్మానుల ముప్పును తప్పించుటకై, ఈ నగర నిర్మాణం చేశాడు. వీరు పంచదశి మొదలైన అనేకగ్రంథాలు వ్రాసిన మహనీయుడు. ఈ బ్రహ్మజ్ఞాని పేరిటే, ఈ నగరమునకు, విద్యానగరమని పేరు పెట్టారు. ఈ మహనీయుని శక్తివల్లనే, కొంతకాలమైనా, ఈ పట్నము కర్నాటాంధ్ర రాజ్యలక్ష్మికి నివాసమై, పున్నమనాటి చంద్రునివలే, పదహారు కళలతో ప్రజలను ఆనందపెట్టింది.

ఈ విజయనగరము తుంగభద్రా నదీతీరమందు కట్టబడ్డది. ఇప్పటి హంపీ శిథిలములే, నాటి విజయనగర పట్నరాజము. యుద్ధనీతిరీత్యా, శత్రువులకు దుర్భేద్యంగా ఈనగరనిర్మాణంచేశారు. చిన్న చిన్న గుట్టలమీద కట్టారు ఈ నగరమును. ఒక వైపున తుంగభద్రానది అగడ్తవలే వున్నది. కొన్ని వైపుల కొండలు కోటగోడలవలె వున్నవి. వీటిమధ్య ఈ పట్నము పొడవు 12 మైళ్ళు, వెడల్పు 10 మైళ్ళు వున్నది. రామాయణంలోని, కిష్కింధానగర శిథిలములమీదే, ఈ నగరమును నిర్మించారని చరిత్రకారులైన శ్రీ భండార్కర్, రైస్‌ల అభిప్రాయము. పట్నము మహావైభవంలో వుండగా 30 లక్షల జనాభా వుండేదట. అనగా ఈనాటి లండన్, న్యూయార్కు నగర రాజములవలె, నాడు ఆ నగరము ప్రపంచ ప్రఖ్యాతికలిగి, రాజకీయ, వ్యాపార, మత, విద్యా, యాత్రలకు ఆలవాలమై వుండేది. నాడు రోమ్ దేశంనుండి నికోలాకాంటి, పర్షియా దేశంనుండి అబ్దుల్ రజాక్, పోర్చుగీస్ దేశంనుండి పియస్‌లనేవారు ఈ పట్నముకు వచ్చారు. వీరు ఈ రాజులచే మర్యాద చేయబడ్డారు. నెలలకొలది ఇక్కడవుండి ఈ పట్న సౌభాగ్యమును చూరగొన్నారు. ఇటలీదేశీయుడు, తను రోమ్ పట్నముకన్నా, ఇది మిన్న అని వ్రాసుకున్నాడు. ఆనాటి వారి వ్రాతలు, మనకు ఈ నగర చరిత్రకు ఆధారములైనవి. రాణులు సువర్ణ రత్నాభరణముల బరువులవల్ల, నడవలేక నడుస్తున్నారని వ్రాశారు. సామాన్యపు దొమ్మరి స్త్రీవద్ద కూడా బంగారునగలుండేవట. బజారులలో సువర్ణ, వజ్ర, రత్నములు రాసులు పోసుకుని వ్యాపారం చేస్తుండేవారట. శరన్నవరాత్రులకు అమ్మవారికి అలంకరించే కిరీటం, నాటి సామంతుల ఆస్తులకన్న ఎక్కువ ఖరీదనదట. వేశ్యలవద్దకూడా, విపరీతంగా బంగారు, రత్నాభర

ణము లుండేవట. బీదస్త్రీలు కూడా కాళ్లకు, చేతు లకు సువర్ణాభరణములు లేకుండా తేరట.

విజయనగర రాజులలో శ్రీకృష్ణదేవరాయలు ప్రపంచ విఖ్యాతుడు. సర్వశక్తి సమన్వితుడు. ఇతను అనేక రాజ్యరములను లోగొన్నాడు. మహమ్మదీయ ప్రవాహమును అరికట్టాడు.

కృష్ణదేవరాయలు కావ్యప్రియుడు. అందుచే ఈతని ఆస్థానములందు అష్టదిగ్గజములనే, కవిరాజు లుండేవారు. వీరికి, ఏ రాజు చేయని గౌరవములను చేశాడు. కవి వతంసకులకు, ఈ చక్రవర్తి స్వహస్త ములతో, కాళ్లకు గండపెండేరము తొడిగి, కవి పల్లకిని తాను స్వహస్తంతో ఎత్తాడు. ప్రబంధములకు ఈ నాడు సువర్ణయుగము. అందును పెద్దన్న గారిని, మను చరిత్రను మరువలేము. నాడు విజయనగరము, విదేశ స్వదేశ రాయబారులతోను, సామంతులతోను, పండిత ప్రకాండులతోను, సంగీత, నృత్య నాట్య విద్యావతంసులతోను, వ్యాపార శ్రేష్ఠులతోను, వారాంగనలు, విటులతోను, గజ, తురగ సేనావాహి నులతోనూ కళకళలాడు చుండెడిది.

ఆనాడు గజయుద్ధములు గుఱ్ఱపు స్వారీలు, మల్ల యుద్ధములు, ప్రబంధ గోష్ఠులు, నృత్య నాట్యములు అనేక వేడుకలు జరుగుచుండెడివి. అనేక దేవాలయ ములను నిర్మించి మాన్యము లివ్వబడ్డవి. వీటిమీద చూడచక్కని చిత్రములను నిర్మించారు. జాతర్లు ఉత్సవములు కూడా జరిగేవి. వీటన్నిటికై బయటి ప్రజకూడా, తిరునాళ్ల ప్రజగా వచ్చేవారు. ఇట్టి పట్టణ రాజము తళ్ళికోట యుద్ధంతో సర్వనాశనము అయింది. క్రీస్తు శకము 1565 సంవత్సరమున ఆంధ్ర భానుడు మరుగున పడ్డాడు. రాజ్యం ఛిన్నా భిన్నమైనది. యుద్ధంలో ఓటంతోనే, నిలిచిన నాయకుడు లేడు. పట్నమును రక్షించుటకు రక్షక భటుడు లేడు. ప్రాణాలను అరచేతుల పెట్టుకుని ఎటువా రటు పారిపోయినారు. 3 రోజులు ఎరుకల ఏనా దులు దోయగా, మూడు నెలలు మహమ్మదీయులు దోచారు. అమూల్యములైన రత్నరాసులను, సువర్ణ మును ఎత్తుకువెళ్లారు. నాడు రాజుగారి ఖజానాలోనే 85 కోట్ల సువర్ణ వరహాలున్నూ, అనేక వజ్రవైడూర్య రాసులున్నవట. ఇవిఅన్ని పరులపాలైనవి. దేశము బీదదైపోయి నాటినుండి కరువులు కాటకాలు దరిద్ర ములకు ఆటపట్టయినది.

పోయినవిపోగా, ఇప్పుడాపట్నంలో నాటి దేవా లయములు, దసరాదిబ్బ, ఏనుగులశాల, రాతిరథము, రాణుల స్నానమందిరములున్నవి. ఇందులో విఠా పాతు దేవాలయం గొప్పది. దీని గోపుర నిర్మాణము ఇప్పటికీ ఆశ్చర్యానికి కారణమవుతుంది. ఈ ఆలయ మంటపములో అనేక చిత్రములను వ్రాశారు. వాటి రంగు ఇప్పటికీ చెదరలేదు. ఈ ఆలయమును కృష్ణదేవ రాయలవారు నిర్మించారు. ఆలయం వెనుక ఒక విగ్రహ మున్నది. అది విద్యారణ్యులవారి విగ్రహమై వుంటుం దంటారు. దీనితర్వాత చెప్పుకోతగ్గది విఠలస్వామి ఆల యము. దీనిశిల్పము అద్భుతం. దీనిలో మూలవిగ్రహం లేదు. కొందరు మహమ్మదీయులు ఎత్తుకువెళ్ళా రంటారు. ఈ ఆలయ స్తంభములమీద వ్రేలితో మీటిన స, రి, గ, మ, శబ్దములు పుట్టును. ఈ ఆలయమందే రాతిరథమువున్నది. ఇరుసు మొదలైనవన్నీ రాతితోనే చేసి, సున్నం లేకుండా బిగించబడివున్నది. హజార రామాలయమును రాణివాసంకొరకు కట్టించారంటారు. ఈ రామాలయం గోడలమీద, రామాయణకథను, చిత్ర ములుగా చెక్కారు. శిల్పము అద్భుతంగా వున్నది. ఉగ్రనృసింహాలయంకూడా గొప్పదే. దానిలోని నర సింహస్వామి విగ్రహము 8 గజములు ఎత్తువున్నది. అంతఃపుర స్నానమందిర నిర్మాణంకూడా గొప్పదే. చుట్టూ కట్టడము, మధ్య నీళ్లకు సరస్సును నిర్మించారు.

రాజుగారు కొలువుదీరే రాజసభవున్నది. భువన విజయమనే ప్రఖ్యాత మహామందిరమిది. ఇక్కడే అష్ట దిగ్గజములు కవితామృతమును వర్షించినారు. రాయ బారులకు, సామంత ప్రభువులకు దర్శనమిచ్చింది ఇక్కడే. ప్రదర్శనములను దసరాదిబ్బమీద జరిపే వారట. ఇక్కడ హిందూరాజుల రివాజుప్రకారము దసరా ఉత్సవములు జరిపేవారు. దీని గోడలమీద, అద్భుత చిత్రనిర్మాణమున్నది. ఏనుగులు, ఒంటెలు, గుఱ్ఱాలు, వసుసలు తిర్చి పరిగెత్తుతున్నట్లు ఇందు చిత్రించబడ్డవి. ఇక్కడ మల్లవిద్యా ప్రదర్శనములు, నాటకములు ప్రదర్శించబడేవి. వేలకొలది ప్రజలు ఇందు కూర్చుని చూచుటకు వీలుగా నిర్మించారు. దీనిక్రింద, చిన్నగదిలో భేతాళవిగ్రహమున్నది. శరన్నవరాత్రి ఉత్సవములందు, రాజులవారు, ఈ భేతాళునకు పూజలు సల్పి, పై ప్రదర్శనములకు వెళ్ళేవారట. ఆనాడు రాజులు కొందరు, సువర్ణ రత్నములతో తులాభారం తూగేవారు.

# ఆంధ్ర రాజధానులు

ఈ ద్రవ్యమును ప్రజలకు పంచిపెట్టేవారు. ప్రభువును మోచిన ఆ త్రాసు పూర్తిగా రాతితో చేయబడ్డది వున్నది. దండెము, కొక్కెములు, సిబికలు అన్నీ రాతితోనే చేయబడ్డవి. ఇవి ఆనాటి పనివాని, పనితనం తెలుపుతున్నది.

తల్లికోట పతనానంతరము, ఆంధ్ర రాజధాని, పెనుగొండకు, అక్కడినుంచి చంద్రగిరికి, అక్కడి నుండి రాయవేలూరుకు మారినవి. ఈ మూడుపట్నములు రాజధానీనగరములుగా క్రీస్తుశకము 1565 నుండి 1675 వరకు వున్నవి. ఈ మూడుచోటులందు, శత్రువు చొరవీలుకానట్లు కోటలను నిర్మించారు. చంద్రగిరికోట తిరుపతికొండలందు కట్టారు. ఈ కోట నిర్మాణము అనేక మైళ్ళు వెడల్పున వున్నది. అందు నాటి మేడలు ఇప్పటికీ చెక్కుచెదరక వున్నవి. కొయ్యదూలాలు లేకుండా, అంతా రాతితోనే నిర్మించారు. అందువల్ల ఆ మేడలు చెడకుండా, ఇప్పటికీ నిలిచివున్నవి. ఇక్కడినుండే ఆంగ్లేయులకు మద్రాసుపట్నము కట్టుకొనుటకు స్థలము ఇవ్వబడ్డది. రాయవేలూరు కోట కూడా ఇప్పటికీ వున్నది. దానిఅగడ్తలు, వెడల్పయిన కోటగోడలు, దేవాలయము, బైటికివెళ్లుటకు రహస్య బాటలు అద్భుతంగావున్నవి. విజయనగరరాజులనాడు శిల్పికి పంటకాలము, సువర్ణయుగము. అతనికి కడుపు నిండా, వంటినిండా ఇచ్చి రాజులు పోషించారు. నాటి ఆంధ్రశిల్పి తన తెలివినంతటినీ రాతిమీదచూపి, చిరంజీవియై, ప్రపంచప్రఖ్యాతినందాడు. విజయనగర పతనానంతరము విద్య, వ్యాపారము, వ్యవసాయములు కుంటుపడ్డవి. మహమ్మదీయుల మూకలవల్ల దేశం అరాజకమై స్థిమితం తప్పింది.

చంద్రగిరి, రాయవేలూరులనుండి రాజధానీ నగరలక్ష్మి గోలకొండకు ప్రవేశించినది. తల్లికోట యుద్ధంలో గెలిచిన బహమనీ రాజ్యము, 5 భాగాలైనది. అందులో గోల్కొండ భాగము క్రిందకు ఆంధ్ర రాజ్యం వెళ్ళింది. వీరు గోలకొండ రాజధానిగా రాజ్యంచేశారు. కొందరు తెలుగు కవులను పోషించారు. అక్కన్న మాదన్నలనే తెలుగువారే మంత్రులుగా ఉండి, ఇక్కడ రాజ్యచక్రమును తిప్పారు. దేశీయులతో మంచిగా ఉండవలెనని ప్రయత్నించారు. ఇక్కడ మహమ్మదీయ వంశములుకూడా మారినవి. వీరు భద్రాద్రిరామునికి, ఖజానాడబ్బు ఖర్చుపెట్టాడని రామదాసుగార్ని జయిలులో పెట్టారు. ఆ ఖైదు ఇప్పుడు గోల్కొండలో ఉన్నది. నాడు రామదాసుగారు రాముని పూజించుటకు, గీచిన గీతలున్నవట ఆ జయిల్లో. గోలకొండలో ఉర్దూభాష రాజభాషైనది మహమ్మదీయుల వేషభాషలు మనలో ప్రవేశించినవి. 19వ శతాబ్దంలో నవాబులలో అన్నదమ్ముల తగూ రాగా, దానిని ఆంగ్లేయులు ఫ్రెంచివారు సద్వినియోగం చేసికున్నారు.

ఉత్తర సర్కారులను నవాబు ఫ్రెంచివారికిచ్చాడు. ఫ్రెంచివారు మచిలీపట్నంలో ఉండి 7 సంవత్సరములు రాజ్యంచేశారు. కాని ప్రజా మతి, దేవకంటకులైనారు. ఘోరకృత్యములుచేసి బుస్సీ; మన పిల్లలకు దయ్యమైనాడు.

ఆంగ్లేయులు ఫ్రెంచివారిని ఓడించారు. అందువల్ల నైజాము ఉత్తర సర్కారులను, రాయలసీమను ఆంగ్లేయులకిచ్చాడు. ఇప్పటినుండి 1953 వరకు ఆంధ్ర రాజ్యలక్ష్మికి మదరాసు నివాసమైనది. చంద్రగిరి రాజు వెంకటపతి రాయలు, తన తండ్రి చెన్నప్ప పేరిట కటమని, మదరాసు స్థలమును ఆంగ్లేయులకిచ్చాడు. అందువల్లే ఆ నగరమునకు చెన్నపట్నమని పేరు ఉన్నది.

1953 అక్టోబరు 1 తేదీన, ఆంధ్ర రాజ్యలక్ష్మి చెన్నపట్నంనుండి కర్నూలుకు వచ్చింది. ఇందుకు పొట్టి శ్రీరాములుగారు చేసిన త్యాగము చిరస్మరణీయం. ఇక్కడే ఆంధ్ర రాజ్యలక్ష్మి 3 ఏళ్లు రాజ్యం చేసింది. ఇక్కడ మహత్తరమైన నాగార్జునసాగర నిర్మాణమునకు ప్రారంభం జరిగింది. దీనితో ఆంధ్ర సీమ సంపూర్ణ సస్యశ్యామల యగును.

ఈ నవంబరు 1 వ తేదీ దీపావళి దివ్యదినం ఆంధ్ర జాతికి మహా పర్వదినం. శతాబ్దాల తరబడి ఛిన్నాభిన్నమై అనేక నిష్ఠురాల ననుభవించిన ఆంధ్ర జాతి నేడు సమైక్యమై తిరిగి ఏక జాతిగా ఆవిర్భవించుతోంది; శిథిల శిథిలమైపోయిన ఆంధ్ర భూమి తిరిగి ఏక ఖండమై అఖిల భారతావనియందునూ ప్రధాన సీమయై పునరుద్భవించినది. ఆంధ్ర రాజ్యలక్ష్మి నేడు భాగ్యనగర (హైదరాబాదు) సింహాపీఠి పట్టాభిషిక్తయైనది. ఆంధ్రుడు నేడు సంపూర్ణకాముడైనాడు.

జయ విజయీభవ!



హనుమకొండ దేవాలయంలోని నందీశ్వరుడు

# మన నౌకానిర్మాణ కళ

శ్రీ తటవర్తి సూర్యనారాయణమూర్తి

ఇతిహాసములలో, పురాణములలో అన్య ప్రాచీన సాహిత్యములలో పెద్ద పెద్ద నౌకలను గూర్చి మనకెన్నియో యుదాహరణములు లభించుచున్నవి. రామాయణమున అయోధ్యాకాండములో నిట్టియోడలను గూర్చి చెప్పబడియున్నది. వందలకొలది కైవర్త యోధు లందులో సిద్ధముగ నుండెడివారు.

"నావాం శతానాం పంచానాం కైవర్తానాం శతం శతం
సన్నద్ధానాం తథా యూనామ్ తిష్ఠన్త్వి త్యభ్యచోదయత్॥"

మహాభారతములో యంత్ర సంచాలిత నౌకా వర్ణనము కలదు.

"సర్వవాతసహాం నావం యంత్రయుక్తాం పతాకినీం"

సముద్రమార్గమున వివిధ దేశములలో వాణిజ్యము జరుగుచుండెడిది. వారాహ పురాణములో గోకర్ణుడను వణిజుడు విదేశములలో రత్నవర్తకము చేయుచుండెనని కథ కలదు.

"పునస్త త్రైవగమనే వణిగ్భావే మతిర్గతా
సముద్రయానే రత్నాని మహాస్థౌల్యాని సాధుభిః॥"

దండి ప్రణీత దశకుమారచరిత్రములో రత్నోద్భవుడను వైశ్యుని నౌక పాట్లనొందుచు మునిగిపోయెను.

"తతః సోపర విలోకన కుతూహలేన రత్నోద్భవః కథం చిద్భూర మనునీయ చపలలోచన యా సయా సహ ప్రవహణ మారుహ్య, పుగ పుర మభిప్రతస్థే। కల్లోలమాలికాభిహతః పోతః, సముద్రాంభ స్యమజ్జత"

మిత్రగుప్తుడను నింకొక వణిజుడేదో ద్వీపము జేరెను. అచ్చట నాతనియోడను శ్వానములు వరాహమును జుట్టుముట్టడించునట్లు యవనుల నావలు ముట్టడించెను.

"తావదతి జవా నౌకాః శ్వాన ఇవ
వరాహ మస్మత్ పోతం పర్యరుత్సత॥"

దుస్తర సముద్రము దాటుటకు పోతము నుపయోగించు మని భర్తృహరి చెప్పియుండెను.

"పోతో దుస్తర వారిరాశి తరణే"

కౌటిల్యుని అర్థశాస్త్రములోని "నావధ్యక్ష" ప్రకరణములో "నౌసేన" రాజ్యము తరఫునుండి నావల యేర్పాటును గూర్చిన వివరణము గలదు.

ఈనావ-యోడల నిర్మాణకళపై జ్యోతిషాచార్యుడగు వరాహమిహిరుని "బృహత్సంహిత," భోజకృతమగు "యుక్తికల్పతరువు"లో విపులీకరణముగలదు. వృక్ష ఆయుర్వేదమును బట్టి వృక్షములలో నాల్గుజాతులు గలవు. సులభముగ అతుకుకొను లఘు-కోమల కాష్ఠము బ్రాహ్మణజాతిది. తేలికగను దృఢముగను నుండునది క్షత్రియజాతిది. "ఇది ఇతరవిధము లగు కర్రలతో కలుపబడజాలదు." వైశ్యజాతి కర్ర కోమలముగను బరువుగనుండును. శూద్రజాతిది దృఢముగ బరువుగనుండును. రెండుజాతుల గుణములుగలది "ద్విజాతి."

"లఘు యత్కోమలం కాష్ఠం సుఘటం
బ్రహ్మజాతి తత్
దృఢాంగం లఘుయత్కాష్ఠ మఘటం క్షత్రజాతి తత్
కోమలం గురుయత్కాష్ఠం వైశ్యజాతి తదుచ్యతే
లక్షణద్వయ యోగేన ద్విజాతిః కాష్ఠసంగ్రహః॥"

క్షత్రియ జాతి కాష్ఠముతో నిర్మితమయిన నౌక సుఖ సంపత్ప్రదమని భోజుని మతము.

"క్షత్రియ కాష్ఠైర్ఘటితా భోజమతే
సుఖ సంపదం నౌకా॥"

ఇట్టి నౌక వికట జలమార్గమున నుపయోగించును.

"అన్యే లఘుభిః సుదృఢై
ర్విదధతి జల దుష్పదే నౌకాం॥"

ఇతర జాతి కర్రతో నిర్మితమగు నౌకలు మంచి గుణములు గలవి కావు. అట్టివానిలో సుఖశాంతులుం

డవు. అవిఅంత మన్నికగానుండక నీటిలో చిదికి నాని పోవుచుండును. ఏ మాత్రము చిన్న దెబ్బ తగిలినను బద్దలై మునిగిపోవును.

"విభిన్న జాతి ద్వయ కాష్ఠ జాతా
న శ్రేయసే నాపి సుఖాయనౌకా
నైషాం చిరం తిష్ఠతి పద్యతే చ
విభిద్యతే సరితి మజ్జతే చ॥

భోజునింకను వ్రాసెను—ఓడల యడుగు భాగమున కొయ్యపలక లతుకుటలో నినుము నుపయోగించరాదు. సముద్రములో నెటనైన నయస్కాంతములున్నచో నది ఇనుము నాకర్షించును. అట్టివేళల ఓడల కపాయము.

"నసింధు గాద్యార్హతి లౌహబంధం
తల్లౌహకాంతై ర్హ్రియతే చ లౌహం.
విపద్యతే తేన జలేషు నౌకా
గుణేన బంధం నిజగాద భోజః॥

'యుక్తికల్పతరువు'లో ఆకార ప్రకారము—పొడవు వెడల్పుల బట్టి నౌకా భేదములు చెప్పబడెను. నౌకలు మొదట ద్వివిధములు. సామాన్యములు విశేషములని. సాధారణ నదులమీద నడచునవి. సామాన్యములు. సముద్రయాత్రకుపయోగించునవి విశేషములు.

"సామాన్యశ్చ విశేషశ్చ నౌకాయా లక్షణ ద్వయం॥

పొడవు వెడల్పు ఎత్తునుబట్టి నౌకలు పదివిధములు—అవి క్షుద్ర, మధ్యమ భీమ చపలపటల భయ దీర్ఘ పత్రపుట గర్భర మంథర అనునవి సామాన్యనావలు. క్షుద్రపొడవు 16 వెడల్పు 4 ఎత్తులేక లోతు 4 మూరలుండవలెను. ఇట్లే అన్నింటి కొలతలు చెప్పబడినది. మంథర-పొడవు 120 వెడల్పు 60 ఎత్తు 60 మూరలు. అన్నింటికిని వెడల్పు—ఎత్తు సమానము.

"రాజహస్తమితాయామా తత్పాదపరిణాహినీ
తావదేవోన్నతా నౌకా క్షుద్రేతి గదితాబుధైః
అతఃసార్ధమితాయామా తదర్ధపరిణాహినీ
త్రిభాగే నోత్థితా నౌకా మధ్యమేతి ప్రచక్షతే
క్షుద్రాథమధ్యమా భీమా చపలా పటలాభయా
దీర్ఘా పత్రపుటాచైవ గర్భరామంథరా తథా।
నౌకా దశకమిత్యుక్తం రాజహస్తైరనుక్రమం
ఏకైక వృద్ధైః సార్ధైశ్చ విజానీయాత్ ద్వయం ద్వయం॥
ఉన్నతిశ్చ ప్రవీణాచ హస్తా దర్ధాంశే లక్షితా॥

విశేషము కూడ ద్వివిధము. దీర్ఘ—ఉన్నత. దీర్ఘనుండి—దీర్ఘిక—తరణి—లోల. గత్వర-గామిని తరి-జంఘాల-ప్లావిని-ధారిణి-వేగిని అని పదిభాగములు చేయబడెను. ఇందు పొడవధికముగను వెడల్పు కొంచెముగను ఎత్తు అంతకంటె తక్కువ నుండును. వేగిని పొడవు 176 వెడల్పు 22 ఎత్తు 17 3/5 మూరలు.

"రాజహంస ద్వయాయామా అష్టాంశ పరిణాహినీ
నౌకాదీర్ఘికా నామ దశాంశేనోన్నతాపిచ
దీర్ఘికా తరణిర్లోలా గత్వరా గామినీ తరిః
జంఘాలా ప్లావినీచైవ ధారిణీ వేగినీ తథా
రాజహస్తైక వృద్ధ్యా నౌకానాం ... దశ
ఉన్నతిః పరిణాహశ్చ దశాష్టాంశవిభాగతః॥"

ఉన్నతనుండి ఊర్ధ్వ - అనూర్ధ్వ - స్వర్ణముఖి గర్భిణి-మంథర అని అయిదుభాగములు చేయబడెను. ఇందు మంథర ఎత్తు 48 మూరలవరకుండబడెను.

"రాజహస్తద్వయమితా తావత్ప్రసరణోన్నతా
ఇయమూర్ధ్వేతి నౌకానాం విశేషాః పంచకీర్తితాః।
ఊర్ధ్వానూర్ధ్వా స్వర్ణముఖీ గర్భిణీ మంథరా తథా
రాజహస్తైకవృద్ధ్యా నావః పంచ ప్రకీర్తితా"

ఇక నౌకల యలంకారమును గూర్చి మనోహర వర్ణనము గలదు. కనక రజత తామ్రములు మూడింటిని కలిపి యుపయోగింపవలెను. చతుశ్శృంగపోతము ధవళముగను త్రిశృంగము రక్తవర్ణముగను ద్విశృంగము పీతము ఏకశృంగము నీలముగను అలంకరింపవలెను. (శృంగమనగా తెరచాప కొయ్యా?) ఇక నౌకల ముఖములు-సింహ, మహిష, సర్ప, హస్తి, వ్యాఘ్ర, పక్షి భేకాకృతులుగ జేసి మనుష్యాకృతిగ యుండవలెను.

"ధాత్వాదీనామతో వక్ష్యే నిర్ణయం తరిసంశ్రయం
కనకం రజతం తామ్రం త్రితయం వా యథాక్రమం
బ్రహ్మాదిభిః పవిత్రస్య నౌకా చిత్రణకర్మణి
చతుశ్శృంగా త్రిశృంగా ద్విశృంగా చైకశృంగిణీ
సితరక్తాపీతనీల వర్ణాన్ దద్యాద్యథాక్రమం
కేసరిమహిషోనాగో ద్విరదో వ్యాఘ్ర ఏవచ
పక్షిభేకో మనుష్యశ్చ ఏతేషాం వదనాష్టకం
నావాం ముఖే పరిన్యస్య ఆదిత్యాది ... నాం॥"

నౌకల పైభాగమున చిన్న పెద్దగదుల నిర్మాణమును బట్టి మూడురకములు. సర్వ మధ్యాగ్ర మందిరములు.

# మన నౌకా నిర్మాణ కళ

"సగృహా త్రివిధా ప్రోక్తా సర్వమధ్యాగ్ర మందిరా"

ఈ చివరనుండి యా చివరవరకు మందిరము నిర్మింపబడియున్నచో అది సర్వమందిరము.

"సర్వతో మందిరం యత్ర సాజ్ఞేయా సర్వమందిరా।
రాజ్ఞాం కోశాశ్వనారీణాం యాన మత్ర ప్రశస్యతే॥"

ఇట్టివి మహారాజులకోశము, అశ్వములు, అంగనలు పయనించుట కుపయుక్తములు.

మధ్యను మందిరముగలది.

"మధ్యతో మందిరం యత్ర సాజ్ఞేయా మధ్యమందిరా
రాజ్ఞాం విలాస యాత్రాది వర్షాసుచ ప్రశస్యతే॥"

ఇట్టివి భూపతి విలాసయాత్ర కుపయుక్తములు వర్షాకాలమున అధికోపయోగకరము.

అగ్రభాగమున మందిరముగలది అగ్రమందిరము.

అగ్రతో మందిరం యత్ర సాజ్ఞేయా
త్వగ్రమందిరా
చిరప్రవాస యాత్రాయాం రణే కాలే
ఘనాత్యయే

ఇట్టివి దీర్ఘప్రయాణమునకును యుద్ధకార్యమున కుపయుక్తములు.

మహమ్మదీయ పరిపాలన సమయమందు కూడ మన దేశములో పెద్ద పెద్ద నౌకలు నిర్మింపబడుచుండెడివి. పదునారవశతాబ్దమున భారతదేశమునకు వచ్చియున్న "మార్కోపోలో" అనునతడిట్లు వ్రాసెను:- ఓడలకు జంటకొయ్య పలక లతికింపబడి కొయ్యశలాకలతో వాటిని సుదృఢముగ చేయుదురు. రంధ్రముల నొకవిధమైన జిగురుతో గప్పెడివారు. మూడువందల వరకు నావికులు కావలసిన పెద్దయోడలుగూడ గలవు. ఒక్కొక్కయోడపై అయిదారు వేల బస్తాలు బరువుతో నింపెడివారు. ఇందులో పైభాగమున నివసించుటకు గాను సమస్త సౌకర్యములతో కూడిన గదుల నొకలుండెడివి. అడుగుభాగము పాడయి పోయినప్పుడు దానిపై ఇంకొక క్రొత్తపలక అతికింపబడెడిది. ఇట్లే యొక్కొక్కప్పుడు ఆరు వరుసలవరకు అడుగు భాగమున కొయ్యపలక లతికింపబడెడివి.

పదునైదవ శతాబ్దమున "నికోలో కాంటి" అను నతడు మన దేశమునకు వచ్చెను. అతడు వ్రాసెను —
"భారతీయ నౌకలు మననౌకలకంటె పెద్దవి. వాటి యడుగు భాగము మూడువరసల కొయ్య పలకలతో దిట్టమై భయంకరములగు తుపానుల నెదుర్కొనజాలు నంతటి దృఢమైనది. ఒక భాగము పాడయిపోయి నిరుపయోగమై పోయినను మిగిలినవాటితో పని జరుగు నౌకలుగూడ గలవు."

"వర్థమా" యను పేరుగల యాత్రికుడు "కాలికట్టు" లోని నౌకా నిర్మాణమును గూర్చి యిట్లు వ్రాసియున్నాడు — కొయ్య పలకల కూర్పు (అతికింపు) చాలదృఢమై నీరేమాత్రమును లోనికి రానీయకుండును. ఓడలలో నెప్పుడును రెండు తెరచాపలుండియుండును. ఆ నూలుబట్ట చాపలు గాలిని బాగా నింపుకొనును. అప్పుడప్పుడు రాతిలంగరులు కూడ నుపయోగింప బడెడివి. ఈరాన్ నుండి కన్యాకుమారి చేరుటకై ఎనిమిది దినముల సమయము పట్టును."

సముద్ర తటవర్తి భూపతుల యొద్ద పెద్ద పెద్ద యోడలసమూహ ముండెడిది. దేశములోని నదులలో దిగుటకై వేలకొలదిగ నావ లుండెడివి. అక్బరు యొక్క నౌకాశాఖాధ్యక్షుడు 'మీర్ బహార్' అని పిలువబడెడివాడు. ఛత్రపతి శివాజి అధీనమున కూడా నౌకా సమూహముండెడిది. దాని అధ్యక్షునికి 'దరియా సారంగ్' అని పేరు. డా॥ రాధాకుముద ముఖర్జీ తన "ఇండియన్ షిపింగ్" అను గ్రంథములో ప్రాచీన భారతీయ నౌకా చరిత్రమును విపులముగ సప్రమాణముగను వ్రాసియున్నారు.

ఇక నిప్పుడా ప్రాచీన కళయెట్లు నష్టమై పోయినదో విచారింతము.

పాశ్చాత్యులు ప్రప్రథమున మన దేశమునకు వచ్చినప్పు డిచ్చటి నౌకలను గాంచి తెల్లబోయిరి. 17వ శతాబ్దము వరకు యూరపునౌకలు అధికముగ 600 టన్నుల మాత్రమే యుండెడివి. కాని వారు మన దేశములో గోఘా యను నౌకలు 1500 టన్నుల కంటె గూడ నెక్కువగనున్నవని (గోఘా) చూచి విస్మయ మందిరి. యూరపు కంపెనీ లీ నౌకల నుపయోగించుకొన జొచ్చెను. నిపుణులగు హిందూ కార్మికుల ద్వారా నౌకా నిర్మాణమునకై వారు కొన్ని కర్మాగారములను గూడ నెలకొల్పిరి. క్రీ. శ 1811 సం॥ రము లెఫ్టినెంటు వాకరు అనునతడిట్లు వ్రాసెను —
బ్రిటిషు వారి నౌకాశ్రయములోని ప్రతి నౌకను ప్రతి పండ్రెండు వత్సరములకు మరమ్మతు చేయవలసి వచ్చెడిది. కాని సాగౌన్‌తో తయారు చేయబడిన భారతీయ నౌక లేబది సంవత్సరములు పైగడచినను మరమ్మతు గూడ చేయనవసరములేకుండనే పని చేయుచుండెను."

ఈస్టియిండియా కంపెనీయొక్క "దరియా దౌలత్" అను నౌక 87 సం|| రముల దనుక ఉపయోగములో నుండెను. క్రీ. శ. 1811 లో వాల్టజర్ సాల్విన్సు అను ఫ్రెంచియాత్రికుడు తన "లే హిందూ" అను గ్రంథములో నిట్లు వ్రాసెను—ప్రాచీన కాలమున నౌకానిర్మాణకళయందు హిందువులగ్రగణ్యులై యుండిరి. ఇప్పుడు కూడా వారు యూరపునకు పాఠము నేర్పగలరు. కళాన్వేషణ కుశలులగు ఆంగ్లేయులు హిందువులకడ నౌకానిర్మాణ పద్ధతు లనేకము నేర్చియుండిరి. సౌందర్యములో - ఉపయోగములో భారతీయనౌకలు ప్రసిద్ధి గాంచినవి హిందువుల చాతుర్యము, ధైర్యమున కివి యుదాహరణములు.

బొంబాయి కర్మాగారములో క్రీ. శ 1736 నుండి 1863 వరకు 300 నౌకలు నిర్మింపబడినవి అందులో చాల నౌకలు ఆంగ్లేయ రాజు నౌకాశ్రేణిలో చేర్చబడినవి. ఇందులో "ఏషియా" అనునౌక 2289 టన్నులది. అందులో 84 ఫిరంగు లమర్చబడియుండెను. బెంగాలులోని హుగ్లీ, సిల్హట్, చిటగాంగ్, ఢాకా మున్నగు చోటులయందు నౌకానిర్మాణమునకు కర్మాగారములు గలవు. క్రీ శ 1781 నుండి 1821 వరకు 1, 22, 693 టన్నుల 272 నౌకలు ఒక్క హుగ్లీలోనే నిర్మింపబడెను.

బ్రిటిషు నౌకా వ్యాపారులు భారతీయుల యీ ఉత్కర్షనుజూచి యోర్వజాలక పోయిరి. అందుచే ఈస్టియిండియా కంపెనీపై భారతీయనౌకల నుపయోగింపవలదని యొత్తిడితెచ్చిరి. చాలసారు లీవిషయమై పరీక్ష చేయబడెను. క్రీ. శ. 1811 లో కర్నలు వాకరు చూపిన లెక్కలలో—భారతీయ నౌకలకు తక్కువ వ్యయము కాని ఎక్కువ దృఢముగనుండు ననియు అందుచే బ్రిటిషు నౌకాశ్రయములో కేవలము భారతీయ నౌకలనే చేర్చుకొనినచో చాలధనము మిగులగలదనియు స్పష్టపరచినాడు. కాని నౌకానిర్మాతలగు ఆంగ్లేయ నిపుణ కార్మికులకు వర్తకులకి హృద్బరి పీడా జనకమయ్యెను. డా. టేలరు—"హిందూదేశపు వస్తువులతో నిండిన భారతీయ నౌక లండన్ హార్బరులో ప్రవేశించుట జూడగనే పెద్ద ఆందోళనము గలిగెను. శత్రువుల నౌకాసమూహము దాడిచేయుటకై థేమ్సునదిలో ప్రవేశించినదా యన్నట్లు ఆంగ్లేయ నౌకా వ్యాపారులు కార్మికులు మొట్టమొదట వెలార్చిరి. మా పనులన్నియు పాడగును. మా కుటుంబము లాకటిచే మాడిపోవు"నని వారు వాపోవసాగిరి. ఈస్టియిండియా కంపెనీయొక్క పరిపాలకమండలి (Court of Directors) మొత్తుకొనిరి—"హిందూ కళాసులు మన సామాజిక జీవితము గాంచినచో ఇదివరలో మన జాతి యాదరణముపై వారికిగల గౌరవము, భయము సన్నగిల్లును. స్వదేశమునకు తిరిగిపోయిన పిమ్మట మన యాచార విధానములను ప్రభుత్వము చేయుచున్న మన జాతి శక్తి సామర్థ్యమును దుష్ప్రచారము చేసి ఇదివరలో మనకుగల గౌరవమును పాడు చేయుదురు. తత్ఫలిత మెంతయు హానికరము."

దీనిపై పార్లమెంటు 'సర్ రాబర్టుపీలు'ను వాని ఆధిపత్యమున ఒక కమిటీని నియమించెను ఇందుపై సభ్యులలో విభిన్నాభిప్రాయములు గలిగినను ఈకమిటీ రిపోర్టు ననుసరించి, క్రీ శ 1814 లో ఒకశాసనము చేసిరి. తదనుసారముగ—

"భారతదేశపు కళాసులకు బ్రిటిషు నావికులగుట కధికారము లేకుండెను. భారత నౌకలపైగూడ కనీసము నాలుగువంతులలో మూడువంతులవరకు ఆంగ్లేయులే కళాసులుండి తీరవలెను. ఆంగ్లేయు డధికారిగా లేని యే నౌకకును లండన్ హార్బరులో ప్రవేశించుట కధికారము లుప్తమయ్యెను. ఇంగ్లండులో పాశ్చాత్యులు నిర్మించిన నౌకలలోనే బయటినుండి సామగ్రి రాగలదని నియమము గావింపబడెను. కొన్ని కారణములచేత నీశాసనము కార్యాన్వితమొనర్చుటలో కొంత శైథిల్యత సంభవించెను గాని క్రీ శ 1863 నుండి యిది బాగుగ కట్టుదిట్టమై స్థిరపడెను. అదియును గాక ఇచ్చట భారతదేశములోని నౌకా పరిశ్రమ పూర్తిగ ధ్వంసమగుటకు శాసనములుకూడా వచ్చిపడెను. భారతీయ నౌకలలో నింపబడిన సామగ్రిపై సుంకము పెంచబడెను. ఇట్లే యీపరిశ్రమ పూర్తిగా క్షీణించుటకు వెదకి వెదకి మార్గములు కనుగొనబడి శాసనరూపమున వచ్చెను. సర్ విలియం డిగ్బీ కథన మెంత సత్యమైనదో చూడుడు—"పాశ్చాత్య ప్రపంచ రాణి ఇట్లు ప్రాచ్యసాగరరాణిని వధించివేసెను"

భారతీయ నౌకాపరిశ్రమ విచ్ఛిన్నమైపోవుటకు గల కారణములలో నివి కొన్నిమాత్రమే.

[కళ్యాణ్ పత్రికకు కృతజ్ఞతతో]

సీరియల్:

# విచిత్రజీవులు

హితశ్రీ

## రంగము: 3

* * ఉదయం సుమారు తొమ్మిది గంటలసమయం. అడ్వకేట్ కూర్మావతారంగారి కన్సల్టింగ్ రూమ్. సోఫాలసెట్టూ, రౌండ్ టేబిలూ ఉంటాయి. టేబిల్ మీద టెలిఫోన్ ఉంటుంది. దానిపక్కన ఓ వార్తాపత్రిక ఉంటుంది. దగ్గర్లోనే ఉన్న రివాల్వింగ్ షెల్ఫులో 'లా' పుస్తకాలు కొన్ని ఉంటాయి. రంగానికి వెనకభాగాన మధ్యగా స్క్రీన్ ఉంటుంది. స్క్రీన్ వెనకాలనించి కనిపించే ద్వారం హాల్లోకి వెళ్లే దారిని సూచిస్తుంది. కుడివైపున రెండు విడివిడి గదుల్ని సూచిస్తూ రెండు ద్వారాలు ఉంటాయి. ఎడమవైపున ఉన్న ద్వారం బయటికి వెళ్లేదారి. కుడివైపున ఉన్న గదుల్లో లోపలగా ఉన్న గదిగోడమీద ద్వారానికి పక్కగా 'టైపిస్ట్' అనీ, రెండో గది గోడమీద 'ఆఫీసు' అనీ సైన్ బోర్డులు ఉంటాయి. తెర లేచే సరికి కల్యాణి 'టైపిస్ట్' గదిలోనుంచి ప్రవేశించి టేబిల్ మీద టైపు చేసిన కాగితాలు కొన్ని సర్ది పెట్టి వాటి మీద పేపర్ వెయిట్ ఉంచి వెనక్కి వెళ్లిపోతుండగా తెరలోనుంచి 'మల్లెపూలు మల్లెపూలు' అని కొంచెం దూరంగా కేకలు వినిపించటమూ, తర్వాత ఆ కవ రాబోదరాగా స్క్రీన్ వెనకనించి 'కల్యాణీ! కల్యాణీ!' అని అంటూ మల్లిక ప్రవేశించటమూ జరుగుతాయి. మల్లిక పద్ధెనిమిదేళ్లపడుచు. కొంచెం బొద్దుగా ఉండటంలో వయస్సుకి మించి కనిపిస్తుంది. చామనచాయ. అనాకారికాదు. అవయవాల పొందిక అంతగా రాణించక పోయినా, వివరంగా చూస్తే అందం తొంగిచూస్తూనే ఉంటుంది. కాని చూడగానే మనసుకి హత్తుకునేరూపం కాదు. ఏమాత్రమూ అణకువ లేని ప్రవర్తనా, హుందాతనం లేనినడకా, విలాసశూన్యమైన అంగవిన్యాసమూ, అతిఅలంకరణాలోని [illegible]

హాజత్వమూ ఉన్న అందాన్ని కాస్తా మరుగు పరుస్తూఉంటాయి. చేతుల్లో ఎంబ్రాయిడరీ ఫ్రేము ఉంటుంది.

మల్లిక : కల్యాణీ—కల్యాణీ—ఇక్కడే ఉన్నావా? ఆవిద్యాపతిగారు రాలేదూ? విద్యాపతి గారూ, ఏమయ్యోయ్.

['ఆఫీసు' గదినుంచి విద్యాపతి ప్రవేశం పర్టూ, ధోవతీ ధరించి ఉంటాడు. విద్యాపతిరావటం చూచి కల్యాణి వెళ్ళిపోతూ ఉంటుంది.]

వొచ్చారూ, ఇంకా రాలేదనుకుంటున్నా. కల్యాణీ—కల్యాణీ—నిన్నే నమ్మోయ్.

[కల్యాణి దగ్గిరికి వొస్తుండటంచూసి విద్యాపతి వెళ్ళిపోబోతాడు.]

విద్యాపతీ, విద్యాపతీ. అబ్బబ్బ. ఇద్దరూ ఇద్దరే. గుమాస్తాకితగ్గ టైపిస్టు, టైపిస్టుకితగ్గ గుమాస్తా.

విద్యా / కల్యా : (ఇద్దరూ ఆగి) ఏంకావాలండీ?

మల్లి : ఇద్దరూ ఒక్కసారే అడిగితే ఏంచెప్పను? నాముఖం కావాలి.

విద్యా : (జ్ఞాపకం తెచ్చుకున్నట్లు ముఖం పెట్టి) ఓ— అద్దం కావాలన్నారు కదూ? రోజూ మర్చిపోతున్నానండీ. రేవు తప్పక తెచ్చి పెడతాలెండి [కల్యాణి నవ్వుతుంది]

మల్లి : అద్దం. నాముఖం. మల్లెపూలయ్యా - మల్లెపూలు. ఎన్నిసార్లు చెప్పాలి. మల్లెపూలు నాకు ప్రాణం నాపేరే మల్లిక. కేక వినబడగానే పిలవ్వయ్యా అని వందసార్లు చెప్పాను.

విద్యా : నాకు వినబడ లేదండీ

మల్లి : ఎందుకు వినబడుతుందీ! ప్లీడర్ గారి చెల్లెలంటే అంతలోకువ నీకసలు కంటికన్పిస్తున్నానూ?

విద్యా : ఎంతమాట. కనిపించకుండా ఉండటానికి మీరేమైనా నల్లపూసా?

[కల్యాణి నవ్వుతుంది.]

మల్లి : నిలబడి అలా జవాబు చెప్పక పోతే కాస్త ఆమల్లెపూలు పిలవకూడదూ? అరిగిపోతావా?

విద్యా : ఎందుకరిగిపోతానండీ. చెప్పాలనుకున్నా యిగా. (నిష్క్రమణ.)

మల్లి : చూశావా కల్యాణీ? ఇంతమంది గుమస్తాల్ని చూశాను కాని ఇటువంటివాణ్ణి ఎప్పుడూ చూడలేదు.

కల్యా : వాళ్ళకి ఈయనకీ పోలికే లేదండి.

మల్లి : పాపం, పాత గుమాస్తా చేతులు నలుపుకుంటూ తిరిగేవాడు. ఇంతెందుకూ? నువ్వెప్పుడైనా ఒక్కమాటైనా బదులు చెప్పావూ?

కల్యా : డబ్బుకి బదులుగాని, మాటకి బదులెందుకండీ

మల్లి : (అర్థంకాక) సరేగాని, కొత్తరకం చోళీ ఎంబ్రాయిడరీ డిజైన్ తెస్తానన్నావు. తెచ్చావూ?

కల్యా : మర్చిపోయానండీ. రేవు తప్పక తెస్తాను.

మల్లి : నువ్వెప్పుడూ ఇంతే. ఉలెన్ హాండ్ బాగ్ కూడా ఇంకా అల్లలేదు కదూ?

కల్యా : ఆఫీసు పని కొంచెం ఎక్కువగా ఉందండీ.

మల్లి : నాపని నీకక్కర్లేదన్నమాట

కల్యా : అదికాదు.

మల్లి : నేనంటే అంత అలక్ష్యం అన్నమాట.

కల్యా : అలా అనుకోకండి

మల్లి : ఎందుకనుకోనూ?

[విద్యాపతి ప్రవేశం.]

విద్యా : మల్లెపూలు ఎక్కడా కనిపించలేదండీ.

మల్లి : అవును. ఎందుకు కనిపిస్తాయి? నేనంటే అందరికీ లోకువే. మంచివాళ్ళని చూస్తే ఎవరికైనా అంతే. ఈరోజుల్లో గుమాస్తాలు గుమాస్తాలా? టైపిస్టులు టైపిస్టులా? తాహతు తెలుసుకోలేని అడ్డమైన వాళ్ళనీ చేర్చుకోబట్టే ఈఆఫీసు ఇలా అఘోరిస్తూంది. ఎవరికర్మం వాళ్ళదీ, నాకెందుకు మధ్య.

[కోపంగా ఫ్రేము బల్లమీదకొట్టి నిష్క్రమణ.]

విద్యా : (తేరుకుని) టైపిస్ట్ గారిమీద కోపానికి కారణమేమిటో?

కల్యా : (బల్లమీద ఫ్రేమ్ తీసుకుని డిజైన్ కుడుతూ) అల్లిక పనిలో కొంచెం అశ్రద్ధ జరిగిందండీ.

విద్యా : (పత్రిక చూస్తూ) అల్లిక, కుట్టుపనుల్లో అరితేరిన ఒక మంచి టైపిస్ట్ కావలెను.

# విచిత్ర జీవులు

కల్యా : (కొంచెం ఆసక్తిగా) ఎవరికండీ?

విద్యా : ఏం? ఎవరికైతే మీకెందుకూ?

కల్యా : ఊరికే తెలుసుకుందామని.

విద్యా : మంచి అనుభవము కలిగియుండవలెను. గడియారము వంక చూడరాదు. దరఖాస్తుతో యోగ్యతాపత్రములు జతపర్చవలెను.

కల్యా : జీత మెంతండీ?

విద్యా : ఏం? మీరు దరఖాస్తు పెడతారా?

కల్యా : వీలుగా ఉంటే

విద్యా : ఇక్కడ ఉద్యోగం చెయ్యటం ఇష్టంలేదా?

కల్యా : అది కాదు.

విద్యా : చిరునామా—కె. మల్లికాంబ.

కల్యా : మల్లికాంబ!

విద్యా : కేరాఫ్ కె. కె. అవతారం. అడ్వకేట్.

కల్యా : (తెలబోయి) ఆఁ! అయితే నన్ను తీసేస్తారన్నమాట. నేనేం తప్పు చేశానండీ?

విద్యా : తప్పొప్పుల పట్టిక మల్లికాంబగారి దగ్గిర ఉంటుంది.

కల్యా : నేనేం ఎరగనండీ

విద్యా : అయితే అసమర్థత కారణంగా తీసేసి ఉంటారు.

కల్యా : నాకు టైపులో మంచి స్పీడు ఉందండీ.

విద్యా : మీకు అల్లిక రాదు.

కల్యా : వొచ్చండీ

విద్యా : వొచ్చినా అందులో శ్రద్ధలేదు.

కల్యా : నేను టైపిస్టుని.

విద్యా : తాహతు తెలుసుకోండి

కల్యా : (తెల్లబోయి) ఆఁ!

విద్యా : అందుకే ఈ ఆఫీసు ఇలా అడుక్కు తింటోంది (నవ్వు ఆపుకుంటాడు.)

కల్యా : (అతనివైపు అనుమానంగా చూసి పేపరు లాక్కుని చూస్తూ) సర్వసమర్థురాలైన ఒక ఆఫీసు మేనేజర్-గుమస్తా-నౌకరు అర్జంటుగా కావలెను.

విద్యా : ఏమిటి?

కల్యా : ఒక మేనేజర్-గుమస్తా-నౌకరు.

విద్యా : (నవ్వి) గడుసువారండీ.

కల్యా : ఎంత హడలగొట్టేశారు. నిజంగా నే ఉద్యోగం పోయిందనుకున్నాను.

విద్యా : వెధవ ఉద్యోగం. ఉంటే ఎంత పోతే ఎంతండీ?

కల్యా : అవును మీకేం?

విద్యా : అలా అనకండి. మీబాగు కోరే వాళ్లలో నేను ముఖ్యుణ్ణి. మీరేమీ అనుకోకపోతే, ఓ చిన్న సలహా ఇవ్వాలని ఉందండీ

కల్యా : ఇవ్వండి.

విద్యా : సలహా ఇచ్చేముందు కొన్ని ప్రశ్నలు అడగటం రివాజు.

కల్యా : అడగండి

విద్యా : మీ పేరు కల్యాణి కదూ?

కల్యా : ఊఁ.

విద్యా : చక్కటి పేరు. మీవయస్సెంత? ఓ. క్షమించండి. ఆ ప్రశ్న అడక్కూడదు. మీరెంతవరకు చదివారు?

కల్యా : స్కూల్ ఫైనల్ ప్యాసయ్యాను.

విద్యా : ఎప్పుడు?

కల్యా : రెండేళ్ళ క్రితం.

విద్యా : ఇప్పుడేం చేస్తున్నారు?

కల్యా : ఉద్యోగం.

విద్యా : జీతం ఎంత?

కల్యా : నెలకో యాభై.

విద్యా : అవివాహితలే కదూ?

కల్యా : ఊఁ.

విద్యా : తండ్రి పేరు?

కల్యా : లక్ష్మీపతి గారు.

విద్యా : వయస్సు?

కల్యా : యాభై పైన. ఉద్యోగం షావుకారు గుమాస్తా.

విద్యా : ఆస్తి వుందా?

కల్యా : ఉంటే ఈ ఉద్యోగాలేం కర్మం?

విద్యా : మీ జీవితాదర్శం ఏమిటి?

కల్యా : చెప్పదగిందేమీ లేదు.

విద్యా : కనీసం ఓ వంద సిల్కు చీరలు సంపాయించాలని లేదూ?

కల్యా : ఊహుఁ.

విద్యా : హంసతూలికల్లాంటి మృదువైన విలువైన చక్కటి పట్టుచీరల సింగారం మీకెప్పుడూ కావాలనిపించలేదూ?

కల్యా : ఊహుఁ.

విద్యా : లేదూ ? ధగధగిత మై తళుక్ తళుక్కుని మెరిసే వజ్రఖచిత కంఠాభరణాల ఉజ్జ్వల కాంతితో చూసేవాళ్ల కళ్లు మిరుమిట్లు గొల్పాలని మీరు రహస్యంగానైనా ఎప్పుడూ కోరుకోలేదూ ?

కల్యా : లేదు.

విద్యా : లేదా ? మిలమిల మెరిసే సరికొత్త సొంత కార్లో కూచుని సిమెంటు కాంక్రీటు రోడ్డు మీద జరజర్రుగున జారిపోతూ సరళ సమాంతర రేఖలు కలిసే చోటికి ప్రయాణించాలనే గాఢవాంఛ మీకు తప్పకుండా కలిగే ఉంటుంది

కల్యా : లేదండీ. కార్లో ప్రయాణం చేస్తే నాకు కళ్లు తిరుగుతాయి.

విద్యా : (బుర్రగోక్కుని) మీసొంత ప్యాస్ బుక్ లో ఆరంకెల సంఖ్య చూడాలని లేదూ ? నిజం చెప్పండి

కల్యా : (జాలిగా) లేదండీ. పెద్దసంఖ్యలు చూస్తే నాకెప్పుడూ తలనొప్పే.

విద్యా : (విసుగ్గా) రామచంద్రా ! మీలాంటి వాళ్లని నేనెక్కడా చూడలేదే.

కల్యా : మనుషులందరూ ఒక్క మాదిరిగానే ఉంటారా, చెప్పండి.

విద్యా : మీలాంటివాళ్లు కంచుకాగడా వేసి వెతికినా కనిపించరు. మన స్త్రీత్వం మీద ఓ ప్రశ్న అడుగుతాను. జవాబు చెప్పండి. సర్వసాధారణంగా ఆడవాళ్లు ముఖ్యంగా కోరుకునేదేమిటి ?

కల్యా : (ఆలోచించి) తెలియటం లేదండీ

విద్యా : పోనీ, నేను చెబుతాను. ఎంత చదువుకున్నా ఏ ఉద్యోగం చేస్తున్నా స్త్రీలకి సొంత ఇంటిమీద మక్కువ ఎక్కువండీ

కల్యా : అవును. అద్దె ఇళ్లయితే చాలా పేచీలుంటాయి.

విద్యా : ఇల్లంటే నాలుగ్గోడలమధ్య ప్రదేశంఅని కాదు నా అభిప్రాయం. ఇంగ్లీషులో 'హోమ్' అంటారు చూడండి. అదీ. ఇప్పుడు నా సలహా చెప్పేస్తున్నాను. మీరు ఈ టైపిస్టు ఉద్యోగానికి వెంటనే రాజీనామా ఇచ్చేయండి.

కల్యా : రాజీనామా ?

విద్యా : అవును

కల్యా : ఇచ్చేసి—?

విద్యా : పెళ్లి చేసుకుని హాయిగా కాపురం చెయ్యండి.

కల్యా : ఇదా మీ సలహా ! ఇంకేదో గొప్ప సలహా చెబుతారనుకున్నాను

విద్యా : నా మాట వినండి [illegible] సంబంధం చెబుతాను.

కల్యా : పెళ్లిళ్ల పేరయ్యలా ఉన్నారే.

విద్యా : మీమీద అభిమానంకొద్దీ చెబుతున్నాను.

కల్యా : థాంక్స్. పెళ్లి [illegible] పని చూసుకోండి. (వెళ్ళబోతుంది)

విద్యా : కల్యాణి గారూ ! ఒక్క నిముషం. [illegible] సన్యాసిరావు గారి పేరు మీరు వినే ఉంటారు.

కల్యా : సన్యాసి రావుగారా ! [illegible] నాన్నగారు [illegible] గం చేశారు.

విద్యా : (ఆశ్చర్యంగా) అలాగా ! [illegible] ఏకైక పుత్రుడను [illegible]. [illegible] వారసుణ్ణి. చక్కగా [illegible]. [illegible] వాణ్ణి. చాలా మంచివాణ్ణి.

కల్యా : ఎందుకండీ [illegible] ? [illegible], పురుషార్థమా ?

విద్యా : (వినిపించుకోక) [illegible] మిమ్మల్ని మనసారా ప్రేమించాను. ప్రతి నిముషం మీ ప్రతిబింబాన్ని చూసుకుంటూ జీవచ్ఛవంలా బతుకుతున్నాను.

కల్యా : నా ఫోటో అతని కెక్కడిది ?

విద్యా : స్వయంగా (నాలిక కొరుక్కుని) ఓ సందర్భంలో స్వయంగా నే తీసుకున్నాడండీ.

కల్యా : ఘనకార్యం చేశారు లెండి. (కోపంగా వెళ్లిపోతోంది)

విద్యా : మీరు అపార్థం చేసుకోకండి. మీ సౌందర్యానికి ఆకర్షితుడై అతనలా చేశాడు. అందుకు నేనే సాక్ష్యం.

కల్యా : (జ్ఞప్తికి తెచ్చుకుంటూ) ఓ అతనా !

విద్యా : అవును. వాడే – వాడే. సీతారా[illegible]. వాడికేం లోటు చెప్పండి. అదీకో

పద్యంలో చెప్పినట్టు - "యక్షు లెనయేందు జయంత వసంత కంతులన్ చక్కదనంబునన్ గెలువజాలినవాడు." ఏదో గ్రహపాటున పొరపాటు చేశాడే అనుకోండి. క్షమించ లేరూ? నిజమైన సౌందర్యానికి ముగ్ధులు కాని వాళ్లెవరు? ఆమాటకొస్తే నేను (చప్పున ఆగుతాడు)

కల్యా : ఊఁ. చెప్పండి ఆమాటకొస్తే మీరు?

విద్యా : ఆమాటకొస్తే... ఆమాటకొస్తే...అహఁ - అందరూ అంతేనని చెబుతున్నాను.

కల్యా : ఏదో చెప్పబోయి దాస్తున్నారే.

విద్యా : దాచటానికేముందీ? కల్యాణిగారూ, నా సలహా వినండీ.

కల్యా : వినకుండా నేను చెవులు మూసుకున్నానా?

విద్యా : అయితే ఒప్పుకోరు మరి?

కల్యా : క్షమించండి.

విద్యా : తొందర లేదు. ఆలోచించుకోండి.

కల్యా : అక్కర లేదు.

విద్యా : (విసుగ్గా) మృదూనికుసుమాదపి, కఠోరాణి వజ్రాదపి అని ఎవరన్నాడో గాని గొప్పగా అన్నాడండీ. (నిస్పృహగా నిట్టూర్పు విడుస్తాడు) ఆశలన్నీ అడుగూసలయాయి.

కల్యా : ఇదంతా స్నేహ వాత్సల్యమేనా?

విద్యా : స్నేహంలోని గొప్పతనం మీకేం తెలుస్తుంది?

కల్యా : ఈ సలహా మీరు మనస్ఫూర్తిగా ఇవ్వటం లేదని నాకు తెలుసు.

విద్యా : (చకితుడై) ఎలా తెలుసు?

కల్యా : మిమ్మల్ని చూస్తేనే తెలుస్తోంది.

విద్యా : నన్ను చూస్తేనా? అబద్ధం. నా విషయం మీకేమీ తెలీదు.

కల్యా : మీ స్నేహితుణ్ణి గురించి తెలుసుకోవాలంటే ఓ నిమిషం చాలనుకోండి. ఓ వారం రోజుల పరిచయంతో అయినా మీ విషయం తెలియదా?

విద్యా : (కొంచెం భయంగా) అయితే నన్ను గురించి మీరు చెడ్డగా ఏమీ అనుకోటం లేదుగదా!

కల్యా : (నవ్వి) లేదులెండి.

విద్యా : ఎందుకో మీ ముఖం చూస్తుంటే నాకు అసలు విషయం చెప్పెయ్యాలనిపిస్తోంది.

కల్యా : (ఆసక్తిగా) కృతజ్ఞురాల్ని.

విద్యా : సీతారామారావుని గురించి నాకేమీ చెడ్డ అభిప్రాయం లేదనుకోండి. కాని అతని కంటె మంచి సంబంధం మీకు రావాలని నాకు అంతరాంతరాలలో ఉంది. కాని మిమ్మల్ని ఒప్పిస్తే నాకు వెయ్యి రూపాయలు బహుమానం ఇస్తానన్నాడు.

కల్యా : (కొంచెం బాధగా) వెయ్యి రూపాయల బహుమానం!

విద్యా : అవును మీకది నీచంగా కనిపిస్తుందని నాకు తెలుసు నాకూ అంతరంగంలో బాధగానే ఉంది. అది మీరెలాగో పసికట్టారు. కాని, వెయ్యి రూపాయలు! అబ్బ నా జీవితాన్ని గుప్పిట్లో ఇరికించి ఊపిరి ఆడనివ్వటం లేదు. కల్యాణిగారూ, చదువు పూర్తి చేస్తేగాని నాకు మనశ్శాంతి లేదు. పై చదువు ఆశ అణిచివేసుకున్నా కనీసం గ్రాడ్యుయేటు కావాలనే కోరిక ఆరిపోని దీపంలా వెలుగుతూ ఉత్తేజపరుస్తోంది. పిచ్చి పట్టుదల ఎక్కువౌతోంది. ఇదంతా మీకు మూర్ఖంగా కనిపించవచ్చు. కాని నా పరిస్థితి మీకు తెలియదు. ఈ విశాల ప్రపంచంలో ఒక్క వెయ్యి రూపాయలు సంపాదించలేక ఉత్సాహాన్ని, శక్తిని అణిచివేసుకోటం ఎంత కష్టం

కల్యా : సంపాదించలేక మీరు బాధపడుతున్నారు. కాని అంత మొత్తం చేజేతులా పోగొట్టుకొన్న వాళ్ళు మనసెలా ఉంటుందో ఊహించండి

విద్యా : (ఉలిక్కిపడి) ఎవరి సంగతి మీరు చెప్పేది?

కల్యా : మా నాన్నగారి సంగతే.

విద్యా : మీ నాన్నగారా?

కల్యా : అవును, అప్పు చేసి వెయ్యి రూపాయలు తెస్తుంటే దారిలో ఎవరో జేబుకొట్టేశారు.

విద్యా : (పాలిపోయి) ఎన్నాళ్లయింది?

కల్యా : సుమారు ఓ వారం రోజులవుతుంది.

విద్యా : (అశాంతిగా) లక్ష్మి ఎంత చంచల!

కల్యా : అది అలా ఉండగా అనుర్నాథ్ ఉద్యోగం కూడా పోవటంలో మరీ దిగులు గా ఉన్నారు.

విద్యా : ఎంత దురదృష్టం! (ఆమె వైపు ఓసారి చూచి చప్పున ముఖం దాచుకుంటాడు)

కల్యా : రోజులు మంచివి కావు.

విద్యా : ఇలాంటి పరిస్థితులలో మీరు నా సలహా పాటించ కూడదూ?

కల్యా : క్షమించి ఆ విషయం వొదిలెయ్యండి.

విద్యా : మీ స్వార్థం మీరు చూసుకుంటున్నారు గాని మీ నాన్న గారి విషయం ఆలోచించటం లేదు.

కల్యా : పరిస్థితు లన్నీ నాకు తెలుసు.

విద్యా : ఏం ప్రయోజనం? అవకాశాన్ని వినియోగించు కోలేక పోతున్నారు.

కల్యా : నా కర్తవ్యాన్ని నన్ను నిర్ణయించుకోనీండీ.

విద్యా : (అనుమానంగా) చూస్తే, మీ మనసు అది వరకే ఎవరికో అర్పించినట్లున్నారు...
[కల్యాణి ముఖం ఎర్రబడుతుంది]
ఎవరో అపుణ్యాత్ముడు.
[కల్యాణిముఖం పక్కకి తిప్పుకుంటుంది]
సీతారామా రావు కంటే అన్ని విధాలా గొప్ప వాడై ఉండాలి.

కల్యా : (కోపం అభినయిస్తూ) ఆఫీసులో మాట్లాడే మాటలు ఇవేనా? ప్లీడర్ గారు వింటే ఇద్ద రికీ ఉద్వాసన చెబుతారు. వెళ్ళి మీపని చూసుకోండి. ఎంబ్రాయిడరీ ఫ్రేంబల్ల మీద పడేసి (వెళ్ళబోతూంది.)

విద్యా : (అకస్మాత్తుగా ఆలోచన తట్టి) ఓ అదృష్ట వంతుడు కొంప తీసి అడ్వకేట్ కూర్మావ తారం కాదుగద!
[చరాలున వెనక్కి తిరిగి జేవురించిన ముఖంతో విద్యాపతి వైపు చూస్తుంది కల్యాణి]
కాదుగద ఏమిటి, నాముఖం! గుడ్డివాడిని కాక పోతే ఎప్పుడో గ్రహించి ఉండాలి సింది. వలపన్నటం ఆడవాళ్లకి వెన్నతో పెట్టిన విద్యకదూ!

కల్యా : (ఆవేశంగా, వ్రేళ్ళు మురిచి) ఛీ!

[ఏదో అనటానికి పెదవులు కదిలించబోయి మాటలు రాక నిశ్చేష్టగా నిలబడి, రోషంగా చూస్తూ రొప్పుతుంటే కన్నీళ్ళు గిర్రున తిరుగుతాయి]

విద్యా : (పశ్చాత్తాపంతో, బాధగా) క్షమించండి. దుర్మార్గుణ్ని. మీ మనసు కష్ట పెట్టాను.
[ఒక్కక్షణం తటపటాయించి రుమాలుతో కన్నీళ్లు తుడుస్తాడు]
క్షమించరూ?
[పరిస్థితి గ్రహించి కల్యాణి చప్పున వెనక్కి తగ్గుతుంది. అదేసమయంలో చేతిలో ఓ ప్యాకెట్ తో సీతారామా రావు ప్రవేశం. ఆ దృశ్యం చూసి ఓ క్షణం స్తంభీభూతు డౌతాడు]

సీతా : ద్రోహం. మోసం. వంచన అన్యాయం. విశ్వాసఘాతుకం.
[కల్యాణీ, విద్యాపతీ దిగ్భ్రమచెంది అతని వైపు చూస్తారు]
కలిసి మెలిసి తిరుగుతూ గోతులు త వ్వే కపట స్నేహితుడి వనుకోలేదోయ్, విద్యాపతీ.

విద్యా : సీతారామా రావ్!

సీతా : (విచారంగా) నీ తప్పేముంది! మహామహులే సౌందర్యానికి దాసులైనారు. నువ్వుకూడా కల్యాణిని ప్రేమిస్తున్నావా, విద్యాపతీ?

విద్యా : (ఆశ్చర్యంగా) నేనా? కల్యాణినా?
[అప్రయత్నంగా కల్యాణి వైపు చూస్తాడు. ఆమె కళ్ళు పక్కకి తిప్పుకుంటుంది]

సీతా : ప్రేమ సార్వజనీనం. సర్వోత్కృష్టం. ఈ ప్రజాస్వామిక యుగంలో ప్రేమించటం ప్రతివాడికీ జన్మహక్కు. ప్రేమించు, విద్యాపతీ, ప్రేమించు, కాని క్యూలో నిలబడు. ఆలస్యంగా వొచ్చిన పెద్ద మనిషి క్యూలో ముందుకి జొరబడ కూడదు.
[ట్రాఫిక్ కానిస్టేబిల్ పోజ్ లో ద్వారం వైపు చెయ్యి జాపుతాడు.]
థాంక్యూ.
[విద్యాపతి ఇద్దరి వైపూ ఓసారి చూచి 'ఆఫీసు' గదిలోకి నిష్క్రమిస్తాడు.]

కల్యాణిగారూ, మనసులో భావాలు పోటీలు పడుతున్నాయి ఏం మాట్లాడాలో తెలియటంలేదు. 'లౌ ఎట్ ఫస్ట్ సైట్'. తొలిచూపులో ప్రేమించేవాడే ప్రేమికుడు. అనంతంగా క్షణక్షణ ప్రవర్థమానమయేది ప్రపంచంలో ప్రేమ ఒక్కటే. ప్రేమ విలువ గుర్తించండి. నా హృదయంలోకి తొంగి చూసి నా బాధని అర్థం చేసుకోండి

కల్యా : ఎవరినైనా డాక్టర్ని చూడండి. ఇది అడ్వకేట్ గారి ఆఫీసు.

సీతా : ఆఫీసైనా ఆసుపత్రి ఐనా మీరున్న చోటే స్వర్గం మీరు నన్ను అవమానించినా, అభిమానించినా నేను మాత్రం మిమ్మల్ని ఆరాధించకుండా ఉండలేను. చందమామకో నూలుపోగు. ఆ సహజ సౌందర్యానికి ఈ చిన్ని కానుక ఏమైనా వన్నె తెస్తే సముద్రంలా ఉప్పొంగిపోతాను (పాకెట్ చింపి చీరఇస్తూ) స్వీకరించి నన్ను ధన్యుణ్ణి చెయ్యరూ ?

కల్యా : (తిరస్కరిస్తూ) దయచేసి హద్దులు దాటకండి.

సీతా : ప్రాసిక్యూట్ చేయిస్తారా ? కల్యాణిగారూ, మీరు స్వీకరిస్తేగాని నేనిక్కడినుంచి కదలను.

[కల్యాణి కోపంగా చీరలాక్కొని విసురుగా ద్వారంవైపుకి గిరవాటు వేస్తుంది. అదే సమయంలో ప్రవేశిస్తున్న సుందర్రావు చేతుల్లో అది పడుతుంది. అది చూసి కల్యాణి నాలిక కొరుక్కొని త్వరగా టైపిస్ట్ గదిలోకి వెళ్ళిపోతుంది ]

సీతా : (విచారంగా) వాసనలేని పువ్వు ;

[తల వంచుకుని నిష్క్రమిస్తుంటే సుందరావు జాలిగా అతనివైపు చూస్తూ లోపలికి ప్రవేశిస్తాడు. ఆ సమయంలోనే అడ్వకేట్ కూర్మావతారం ప్రీన్ వెనకనుంచి ప్రవేశం ]

సుంద : నమస్కారమండి ప్లీడర్ గారూ.

కూర్మా : నమస్కారం కూర్చోండి.

సుంద : (కూర్చుని) నేను ఆర్టు డైరెక్టర్ సుందరావుని.

కూర్మా : అలాగా ! మిమ్మల్ని కలుసుకోవటానికి ఎంతో సంతోషంగా ఉంది.

సుంద : థాంక్స్. తమరు సన్యాసిరాజు గార్ని ఎరుగుదు రనుకుంటాను.

కూర్మా : ఎరక్కేం !

సుంద : వారు నాకు చాలా ఆప్తులు.

కూర్మా : అలాగా !

సుంద : మన ప్రముఖస్థానిక నాయకుడు కోటి సూర్యప్రకాశరావు గారున్నారు చూశారూ, వారికి ఘనసన్మానం చెయ్యాలని మేం కొందరం సంకల్పించాం.

కూర్మా : దేనికి ?

సుంద : మనవాళ్లని మనం సన్మానించకపోతే పైవాళ్లు సన్మానిస్తారా ?

కూర్మా : ఉన్న సంగతి చెప్పారు.

సుంద : మనం పదిమందిమీ కలిసి ఓహో, కోటి సూర్యప్రకాశరావుగారు ! అంటే అందరూ ఓహోహో అంటారు.

కూర్మా : ప్రజాస్వామ్యం !

సుంద : ఉట్టిమీదనుంచి స్వర్గానికి ఎగిరితే ఉట్టిని మర్చిపోగలరా ఎవరైనా ?

కూర్మా : (నవ్వి) ఎలా మర్చిపోగలరూ ?

సుంద : అందువల్ల ఈ ప్రయత్నం సఫలం కావాలని తమరు ఆశీర్వదించాలి.

కూర్మా : అవశ్యం.

సుంద : వట్టి ఆశీర్వచనమే కాదు. మీ సహాకారం అడుగడుగునా కావాలి.

కూర్మా : అలాగే.

సుంద : మరి తమ తాంబూలం... ?

కూర్మా : ఎంత ?

సుంద : ఎంతెండీ ! ఓ నూట పదహార్లు, అంతే !

కూర్మా : ఊళ్ళో చందాలు వసూలు చెయ్యటం లేదూ ?

సుంద : చేస్తున్నామనుకోండి. తమలాంటి పెద్దల పేర్ల పక్కన పెద్ద మొత్తాలు కనిపిస్తేగాని

ప్రజలకి ధైర్యంగా ఉండదు. (కాగితం ఇస్తూ) ప్రస్తుతం అంకె వెయ్యండి. చాలు. తరవాత ఇవ్వొచ్చు. (కూర్మావతారం కాగితంమీద రాస్తాడు) కృతజ్ఞులం. (నవ్వుతూ) పెట్టుబడి కింద ఖర్చు రాసుకున్నట్టే లెండి.

కూర్మా : సన్మానం ఎప్పుడూ ?

సుంద : ఎప్పుడో నా ! అంతా ఓ వారంరోజుల లోపే అన్నట్టు తమరు ఇంకో చిన్న సహాయం కూడా చెయ్యాలి

కూర్మా : ఏ సహాయం ?

సుంద : మన మునిసిపల్ కౌన్సిల్ హాల్లో సన్మానసభ ఏర్పాటు చేద్దామనుకుంటున్నాం. పర్మిషన్‌కి దరఖాస్తులు దాఖలు చెయ్యాలి. తమరు ఆనమూనా కాస్త ఇప్పిస్తే.

కూర్మా : ఓ. దానికేం. (గట్టిగా) విద్యాపతీ ('వస్తున్నానండీ' అంటూ విద్యాపతి ప్రవేశం) వీరు ఆర్టు డైరెక్టర్ సుందరరావుగారు. వీరో దరఖాస్తు దాఖలు చెయ్యాలంటున్నారు. కాస్త వారి పని చూడు. (సుందరరావుతో) కొంచెం పనుంది, వస్తానండీ.

సుంద : సెలవు. (నమస్కారం చేస్తాడు.)

[కూర్మావతారం బయటికి నిష్క్రమణ ]

విద్యా : మీ పేరేమిటన్నారు ?

సుంద : సుందరరావు. సత్యశివసుందరరావు.

విద్యా : అలాగా ?

[అతని పక్కన సోఫాలో కూచుని పరకాయించి అతని ముఖం చూస్తాడు]

మిమ్మల్ని ఎక్కడో చూశానండీ.

సుంద : ఎక్కడ చూశారు ?

విద్యా : (ఆలోచిస్తూ) అదే జ్ఞాపకం రావటం లేదండీ.

సుంద : (విద్యాపతిని దీక్షగా చూసి) ఎబ్బే- ఎక్కడా చూసి ఉండరు. పొరపాటు పడ్డారు.

విద్యా : పొరపాటు కాదండీ.

సుంద : అయితే నాపోలిక ఉన్నవాళ్ళని చూశారేమో లెండి.

విద్యా : అయి ఉండొచ్చు. మీ పనేమిటో చెప్పండి. మీతో ఇలా బాతాఖానీ వెయ్యటం మామల్లి కాంబగారు చూస్తే బ్లాక్‌మార్క్ వేసేస్తుంది.

సుంద : మల్లికాంబగారెవరు ?

విద్యా : ప్లీడర్ గారి ప్రియసోదరి, అవిడకక్కర్లేని గొడవంటూ లేదు.

సుంద : అలాగా ?

విద్యా : ఈ భూగోళాన్ని తన భుజస్కంధాలే మోస్తున్నాయని ఆవిడగారి ఉద్దేశం.

సుంద : కలవారి ఆడబడుచు కదండీ.

విద్యా : మహాతల్లి ఎవరిల్లు మెట్టి పావనం చేస్తుందో గాని వాళ్లు తరించారనుకోండి ఇంతకీ, మీ దరఖాస్తు ఏ విషయం గురించి ?

సుంద : మునిసిపల్ కౌన్సిల్ హాల్లో కోటి సూర్యప్రకాశరావుగారి సన్మానసభ ఏర్పాటు చేయటానికి పర్మిషన్ కోసం దరఖాస్తు పెట్టాలండీ

విద్యా : ఓహో ! (గట్టిగా) మిస్ కల్యాణి.

[చేతిలో నోటుబుక్‌తో కల్యాణిప్రవేశం ]

కల్యా : మీరేనా ! అడ్వకేట్ గారేమోననుకున్నాను.

విద్యా : (సీరియస్‌గా) దరఖాస్తు ఒకటి రాసుకోండి,

కల్యా : (చిరునవ్వుతో) రెడీ.

విద్యా : మహారాజశ్రీ కమీషనర్ గారి దివ్యసముఖమునకు,

ఘనమైన అయ్యా,

(సుందరరావుతో) తేదీ చెప్పండి.

సుంద : తేదీఖాళీ వొదిలి పెట్టండి. తరవాత వేద్దాం.

విద్యా : సరే, రాసుకోండి (వొత్తి పలుకుతూ) ఘనమైన అయ్యా,

ఫలానా- తేదీన మునిసిపల్ కౌన్సిల్ హాల్లో శ్రీ కోటి సూర్యప్రకాశరావు గారి సన్మానసభ ఏర్పాటు చేసుకొనుటకు మాకు పర్మిషన్ ఇప్పించ ప్రార్థన.

(వొత్తిపలుకుతూ) దివ్య చిత్తమునకు తేవలెను.

ఇట్లు

జతపర్చబడినవి. విధేయులు.

1. పౌరులకు విజ్ఞప్తి.

2 ఆహ్వానము.

డ్రైవ్ చేసి తీసుకురండి. అయిదు నిమిషాలో కావాలి.

కల్యా : అలాగే (నిష్క్రమణ)

విద్యా : ఒక్క అయిదు నిమిషాలు కూర్చుంటారు కదూ? నేను వెళ్ళి పనిచూసుకుంటాను ఈ పేపరు చూస్తూ ఉండండి. (నిష్క్రమణ - ఆఫీస్ గదిలోకి) మల్లిక స్క్రీన్ వెనుక నించి ప్రవేశం)

మల్లి : కల్యాణీ, నా ఎంబ్రాయిడరీ ఫ్రేమ్ ఏదీ? (సుందరరావుని సరిగా చూడక) నువ్వేం కుమాస్తావయ్యా విద్యాపతీ, తీరిగ్గా కూచొని పేపరు చదువుకుంటున్నావు?

[సుందరరావు ఆమె వంక చూస్తాడు]

అమ్మో. మీరెవరూ? విద్యాపతి అనుకున్నా పొరపాటున.

సుంద : (వినయంగా) నా పేరు సత్యశివసుందర రావండి.

మల్లి : అదేం పేరూ?

[బల్లమీద ఉన్న ఎంబ్రాయిడరీ ఫ్రేమ్ తీసుకుంటూ, మల్లి సుందరరావు వైపు చూస్తోంది. అతనలా ఆమె వైపే రెప్పవాల్చకుండా చూస్తుంటాడు.]

అదేమిటి? అలా చూస్తారేం;

సుంద : (తన్మయత్వంతో తల ఊపుతూ) ఆహా! ఓహో!

మల్లి : ఆఁ!

సుంద : లెనార్డో, రాఫేల్, టిటియన్, డ్యూరర్, రూబెన్స్ రెంబ్రాండ్, ఇన్‌గ్రిస్. డిగాస్, బోన్, రామారావు మొదలైన మహామహుల చిత్రాలెన్నో చూశానుగాని, ఈ రేఖా సౌందర్యం నభూతో నభవిష్యతి.

మల్లి : వాళ్ళందరూ ఎవరు?

సుంద : ప్రపంచ ప్రఖ్యాత చిత్రకారులు.

మల్లి : పాఠం చదివినట్టు వాళ్ళందరి పేర్లూ చదివారెందుకూ?

సుంద : ఆ రేఖల సోయగం చూసి ఉత్సాహో ద్రేకాల్ని ఆపుకోలేకపోయాను.

మల్లి : ఏ రేఖలూ?

సుంద : ఓహో! ఏమా వదనబింబ సౌందర్యవైభవం! ఆ చేపల్లాంటికళ్ళూ, పసిడిమెరుపుల చెక్కిళ్ళూ సంపెంగ మొగ్గలాంటి నాసికా అనిమిషంగా చూడకుండా ఏ చిత్రకారుడుండగలడు!

మల్లి : నన్ను గురించే ఈ మాటలన్నీ!

సుంద : క్షమించండి. ఆవేశంలో అనేశాను మీ పేరు తెలుసుకోవచ్చా?

మల్లి : మల్లిక. నవమల్లి కొంబ.

సుంద : ఎంత చక్కటి పేరు, బొండుమల్లియలాంటి ఆ అందానికి సరిపోయింది.

మల్లి : ఇప్పుడు మీరన్న మాటలన్నీ నిజమేనా?

సుంద : నిజమా! మనసులో అనుకున్న దానిలో ఎన్నో వంతు పైకన్నాను!

మల్లి : మరి మా వాళ్ళందరూ నేను బావుండనని చెప్పి పోదుస్తారేమండీ!

సుంద : వాళ్ళలో కళాజ్ఞానం లేదన్నమాట. అలా అన్నానని మరేమీ అనుకోకండి.

మల్లి : నేను లావుగా ఉంటాననీ, బావుండననీ అందరూ అంటే నిజమేననుకు నేదాన్ని. కాని చాటుగా అద్దంలో చూసుకుని బాగానే ఉన్నానని తృప్తి పడేదాన్నండీ

సుంద : మీరు అందంగా లేరని అన్నవాళ్ళకి అందం అంటే ఏమిటో తెలీదు. ఆ చక్కటి ముక్కు చూస్తుంటే ముక్కు తిమ్మన పద్యం జ్ఞాపకం వొస్తోందండీ.

మల్లి : ముక్కు తిమ్మన ఎవరూ?

సుంద : తెలీదూ? ఉన్నాడు లెండి ఒకాయన. ఎందుకూ? నేనే ఆశువుగా ఓ పద్యం అల్లేస్తాను.

మల్లి : మీరు పద్యాలు రాస్తారా?

సుంద : (అవునన్నట్టు సంజ్ఞచేసి)

"నానానూన వితానవాసనల నానందించు సారంగమేలా నన్నొల్లదటంచు గంధఫలి బల్కాకం దపంబంది యోషానాసాకృతి దాల్చి సర్వసుమనస్సౌరభ్య సంవాసియై

పూసెం, (బేక్షణ మాలి కామధుకరీ పుంజంబు ఓహో
లిర్వంకలన్."

మల్లి : నాకేం బోధ పడలేదు గానీ, ఎంతబాగా చదివారండీ

సుంద : మీ ముక్కు సంపెంగ మొగ్గలా ఉందని భావం. అంతే

మల్లి : ఈ పద్యం మీరే రాశారా?

సుంద : రాయట మేమిటి! ఇప్పటి కిప్పుడు ఆశువుగా అల్లేస్తే!

మల్లి : కవులన్న మాటలు నమ్మక తప్పదండీ.

సుంద : అన్నవాడు కవీ, చిత్రకారుడూ కూడా ఐతే?

మల్లి : మీరు బొమ్మలు కూడా వేస్తారా?

సుంద : బొమ్మలా! నేను ఆర్టుడైరెక్టర్ నండీ. అరడజన్ చిత్రాలకి ఆర్ట్ డైరెక్షన్ నిర్వహించాను.

మల్లి : ఏ చిత్రాలండీ అవి?

సుంద : (తికమకపడి) మీరు తెలుగు చిత్రాలు చూస్తారా, హిందీ చిత్రాలు చూస్తారా?

మల్లి : నాకు హిందీరాదుగా.

సుంద : మరి నేను పేర్లుచెబితే మాత్రం ఏంలాభం? మీకు తెలియదుగా.

మల్లి : పోన్లెండి కొంచెం కాఫీ తెచ్చిస్తానండీ?

సుంద : కాఫీ! వెధవ కాఫీ! ఆ సౌందర్యం అలా కొద్ది క్షణాలు చూడనివ్వండి. అదేచాలూ

[బాగ్ లోంచి స్కెచ్ పేపరు తీసిపట్టుకొని]

కొంచెంసేపు అలాగే నిలబడండి. కదలవద్దు అబ్బె - అలాకాదు. తలకొంచెం అటు తిప్పండి. ఊఁహూ.

మల్లి : ఎందుకూ - బొమ్మగీసేస్తారా?

సుంద : లేకపోతే ఇంకా నాకెందుకూ? బూడిదలో పోసిన పన్నీరే - ఏదీ కొంచెం - ఇలా చూడండి-అలాకాదు.

[దగ్గరికెళ్లి స్పృశించబోయి ఊరుకుని పోజుసూచిస్తూ సంజ్ఞలు చేస్తాడు]

మల్లి : అబ్బ. నాకు చేతకావటం లేదండీ. పోన్లెండి బొమ్మ లేకపోతే.

సుంద : ఒక్క నిమిషం.

[తటాలున చుబుకం పట్టుకుని తలపైకెత్తి కళ్లలోకి చూసి]

: బ్రహ్మాండంగా ఉన్నారు.

(కాగితంమీద స్కెచ్ గీసేస్తాడు.)

చూడండి. ఎంత అద్భుతంగా ఉన్నారో.

మల్లి : (బొమ్మచూసి పొంగిపోతూ) నిమిషంలో గీసేశారండీ ఎంత గొప్పవారు!

సుంద : ఆఁ! ఇదికూడా ఓ గొప్పతనమే. మీకు రంగుల్లో మీ ముఖం అచ్చు కొట్టినట్టు చిత్రించింతరవాత ఆ మాట అనండి మీ కిష్టమైతే. మల్లికాదేవిగారూ, మీరేమీ అనుకోకపోతే నాదో చిన్న ప్రార్థన

మల్లి : ఏమిటది?

సుంద : మీకో చిన్న బహుమానం ఇవ్వాలని ఉందండీ

మల్లి : ఎందుకూ?

సుంద : మిమ్మల్ని చూస్తుంటే నామనసులో వెన్నెల జల్లులు కురుస్తున్నాయి.

మల్లి : మీభాష నాకర్థంకాదు.

సుంద : ఓ స్నేహితురాలికి వివాహం జరుగుతుంటే బహూకరిద్దామని ఈ చీర తీసుకున్నాను. (చీరతీసి ఆమెకిస్తూ) కాని ఇది మీకు కానుకగా ఇవ్వాలని మిమ్మల్ని చూచినప్పటినించీ నా మనసులో మరీమరీ కోరికగా ఉంది.

మల్లి : నాకా?

సుంద : అవును. కాదనకండి, మీ ప్రియ-స్నేహితుడు ఇచ్చే కానుక మీరు స్వీకరించ కూడదూ? మీరు స్వీకరించకపోతే నా హృదయంలో తీరనిబాధగా ఉంటుంది.

మల్లి : మీకు బాధకలిగించటం నా కిష్టం లేదండీ.

సుంద : ధన్యుణ్ణి (చీర ఇస్తాడు)

మల్లి : (తీసుకుంటూ) మా అన్నయ్య. ఏమైనా అంటాడేమో.

[అదృశ్యం అప్పుడే ప్రవేశిస్తున్న కల్యాణి చూస్తుంది.]

సుంద : పరవాలేదు లెండి.

[కల్యాణి సుందర్రావు దగ్గరికొచ్చి అతనికి టైపు చేసిన కాగితం ఇస్తుంది.]

కల్యా : ఇదిగోనండీ మీదరఖాస్తు.

సుంద : (తీసుకుని) థాంక్స్. వొస్తావండీ, మల్లికాదేవిగారూ. (నిష్క్రమణ.)

(అతను వెళ్ళినవైపే చూస్తూంటుంది మల్లిక.

కల్యా : (ఇద్దరివైపూ, చీరవైపూ చూసి) మల్లికాంబ గారూ...మల్లికాంబగారూ.

మల్లి : (ఉలిక్కిపడి) నువ్వింకా ఇక్కడే ఉన్నావూ! ఎందుకూ ?

కల్యా : ఆ సుందర్రావు గారి ప్రవర్తన కొంచెం అనుమానాస్పదంగా ఉందండీ.

మల్లి : ఏం ? నిన్నేమైనా అన్నాడా ?

కల్యా : నన్ను కాదు.

మల్లి : అయితే ఎవర్ని ?

కల్యా : నేను మాట్లాడేది మీ విషయమే.

మల్లి : (కోపంగా) ఈ సి. ఐ. డి. పని నీకెవ రిచ్చారూ ?

కల్యా : మీ రలాఅనుకుంటే సరే.

మల్లి : అనుమానానికి కారణం ?

[కల్యాణి జవాబు చెప్పదు ]

మాట్లాడవేం ? అంత ఈర్ష్య పనికిరాదు కల్యాణీ.

కల్యా : నాకెందుకూ ఈర్ష్య ?

మల్లి : లేకపోతే అనవసర విషయాల్లో నీ జోక్యం ఎందుకూ ? నువ్వు టైపిస్టువి. నీపని నువ్వు చూచుకో.

[కోపంగా స్క్రీన్ వెనక్కి నిష్క్రమిస్తుంది ]

విద్యా : (ప్రవేశించి) ఆసుందర్రావుగారు వెళ్లారా?

కల్యా : ఆఁ ఇప్పుడే.

విద్యా : ఇంతకిముందు ఆయన్ని ఎక్కడో చూశా నండీ.

(ఆలోచనగా) ఎక్కడ చూశానూ ?

(నడుస్తుంటే కాలికి కేపర్ తగుల్తుంది)

ఈ కేపరేమిటండీ ?

కల్యా : ఏమో.

విద్యా : ఇందాక ఇది అక్కడ ఉన్నట్టు లేదే.

కల్యా : ఏమో.

విద్యా : జ్ఞాపకశక్తిలో ఇద్దరం ఒకటల్లేనే ఉందే. నాకు మంచితో డే దొరికారు అన్నిట్లో.

కల్యా : అన్నిట్లోనా ? (చప్పున ఏదోస్ఫురించి సిగ్గు పడి ముఖం దాచుకుంటుంది.)

విద్యా : కోపం వొచ్చినట్టుంది. నాకంటే మీ రన్నిట్లో గొప్పవారేలెండి. ఇంతకీ ఈ సుందర్రావుని ఎక్కడ చూశానూ ?

(ఆలోచనగా అతను పైకి చూస్తుంటే అతని వైపోసారి చూసి బయటికి నిష్క్రమిస్తుంది కల్యాణి.) ఏ్ఫ జ్ఞాపకం రావటం లేదండీ.

[చుట్టూచూసి కల్యాణి కనిపించక]

కల్యాణిగారూ, కల్యాణిగారూ!

(బయటినించి కూర్మావతారం ప్రవేశం)

కూర్మా : ఆవిడవెళ్లి, అరగంటైతే అలా అరుస్తా వేమిటయ్యా, విద్యాపతీ ? ఏంకావాలి ?

విద్యా : (సిగ్గుపడి) అహఁ, ఏం లేదండి.

కూర్మా : ఈ కేపరేమిటీ (అతని చేతిలోనుంచి తీసు కొనిచూస్తూ) ఓ కార్‌స్టోర్ ! ఏమిటిగిరాకీ ? అడ్వాన్సుగా తీసుకున్న నెలజీతం హారతి పట్టేశావా ?

విద్యా : లేదండి

కూర్మా : మరి ఇదేమిటే ?

విద్యా : నేలమీద పడిఉంటే చూస్తున్నాను.

కూర్మా : నేలమీద పడిఉంది ? నిజమేనా ?

విద్యా : నిజమేనండి.

కూర్మా : (అనుమానంగా విద్యాపతివైపూ కల్యాణి గదివైపూ చూసి) వ్యవహారం ఏమీ జరపటం లేదుగద !

విద్యా : రామరామ.

కూర్మా : నాకు తెలుసులే నువ్వు బుద్ధిమంతుడివే. అలా కూర్చో. (విద్యాపతి కూర్చుంటాడు) నీ ట్రెయినింగు ఎంతవరకొచ్చింది ?

విద్యా : ముఖ్యమైనవన్నీ తెలుసుకున్నట్టేనండి.

కూర్మా : నోట్లు, రసీదులు, తాకట్లు, విక్రయదస్తా వేజులూ, ఎగ్రిమెంట్లూ, వాయిదా పిటీషన్లూ, దరఖాస్తులు, చార్జీలు, అర్జీలు, రిజిష్టర్డు నోటీసులు, రాజీనామా వీలునామాలు నమిలి మింగేశావా ?

విద్యా : (నవ్వి) యథాశక్తిని.

కూర్మా : ఏదీ, ఓ రిజష్టర్డునోటీస్ నమూనా చెప్పు.

విద్యా : (గొంతు సవరించుకొని)

కె. కూర్మావతారం ఎం. ఏ , ఎల్ . ఎల్ బి. అడ్వకేట్ గారి దగ్గర్నుంచి—

ఫలానావారికి,

ఇందుమూలంగా మీకు తెలియచేసేదే

మంటే మీదొడ్లోని మామిడిచెట్టు తాలూకు రెండుకొమ్మలు మాక్లయింటు పెంకుటింటి మీదికివాలి సదరు ఇంటికి నష్టము కలిగిస్తూ మాక్లయింటు హక్కులకు భంగము కలిగించుటవలన ఈనోటీసు అందిన తక్షణం సదరు కొమ్మలుకొట్టించి నష్టపరిహారం ఇవ్వవలెను. లేనిచో కోర్టుమూలంగా తగుచర్య తీసుకొనబడునని గ్రహించవలెను.

కూర్మా : భేష్. కాని ఒక్కచోట అనుసులో కాలు వేశావోయ్.

విద్యా : ఎక్కడండీ.

కూర్మా : మామిడి చెట్టుకొమ్మలు వాలితే క్లయింటుకే లాభంకదుటోయ్. అందుకని అవతలవాడు ఎలాగూవాటిని స్వయంగా నే కొట్టేస్తాడు. ఇక నోటీసెందుకూ ?

విద్యా : నిజమేనండి వేపచెట్టుకొమ్మలు అని సవరణ.

కూర్మా : అదీ వాస్తవికత అంటే; అర్జీరాయటంలో ముఖ్యంగా గమనించాలసిన అంశం ఏమిటి ?

విద్యా : 'మహారాజశ్రీ ఫలానావారి దివ్యసముఖమునకు, ఘనమైన అయ్యా' అని ప్రారంభించి 'దివ్యచిత్తమునకు తేవలెను, ఇట్లు విధేయుడు' అని ముగించాలి

కూర్మా : ఫలితం అనుకూలంగా లేనప్పుడు ఆక్షేపణ తెలియచేయాలంటే ?

విద్యా : ఫలానావారికి అని ప్రారంభించి 'దివ్యచిత్తమునకు తేవలెను' అనేది కొట్టిపారేసి 'గమనించవలెను' అని రాయాలి.

కూర్మా : అప్పుతీసుకున్న పెద్దమనిషి సకాలంలో తీర్చలేకపోతే-

విద్యా : పెద్దమనిషి కాడు.

కూర్మా : పైపై సభ్యత చెడకుండా కసితీర్చుకునే దెలా ?

విద్యా : మొదటి రిమైండర్లో మహారాజరాజశ్రీ అని సంబోధించి తరవాత ఒక్కొక్క రిమైండర్లో ఒక్కొక్క బిరుదూ క్షౌరంచేయాలి మహారాజరాజశ్రీ, మహారాజశ్రీ, శ్రీ—చివరికి మిగిలేది అసలు పేరే.

కూర్మా : భేష్. చాలా సూక్ష్మబుద్ధివోయ్ విద్యాపతీ. [illegible] ఘటికుడి వనుకోలేదు.

విద్యా : తమరు నేర్పిన విద్యయే.

కూర్మా : నువ్వు లాయరు కావలసినవాడివోయ్

విద్యా : అవకాశాలు అందరకు దొరుకుతాయా ?

కూర్మా : నీ తెలివితేటలన్నీ ఇలా అజ్ఞాతంగా ఉండిపోవటం నాకిష్టంలేదోయ్. నిన్నెలాగైనా పైకి తీసుకురావాలని ఉంది

విద్యా : ఆ అభిమానమే చాలండీ

కూర్మా : లా చదవటం నీకిష్టమేనా ?

విద్యా : డబ్బు ఉండాలిగాని చదవటానికేం ?

కూర్మా : ఈ ఆఫీసులో పనిచేస్తుంటే నీకుకూడా సొంతంగా ప్రాక్టీసు పెట్టాలని లేదూ ?

విద్యా : కోరికలే గుర్రాలైతే స్వారీచెయ్యని వాళ్లెవరు ?

కూర్మా : ఎగతాళిగా 'సినిమాలో వేషం వేస్తావా' అంటే మా మల్లికకూడా అలాగే అంటుందోయ్

విద్యా : మల్లికాంబగారా ?

కూర్మా : ఊఁ. మా మల్లికను చూశావూ ?

విద్యా : చూడకేమండీ ?

కూర్మా : దాన్నిగురించి నీ అభిప్రాయం ఏమిటి ?

విద్యా : చాలా మంచివారండీ.

కూర్మా : నిజంగానా ?

విద్యా : (అయిష్టంగా) నిజమేనండి.

కూర్మా : అది ఉత్త అమాయకురాలోయ్.

విద్యా : అవునండి.

కూర్మా : నేనంటే ఎంతో గౌరవం. నే నెంత చెబితే అంతే.

విద్యా : అలాగండి ?

కూర్మా : ఎన్నో సంబంధాలు వస్తున్నాయిగాని నాకేది నచ్చటం లేదోయ్.

విద్యా : కష్టమేనండి.

కూర్మా : అన్నట్టు, మా మల్లిక ఎలా ఉంటుం దంటావ్ ?

విద్యా : నిక్షేపంలా ఉంటారండి.

కూర్మా : నిజం ?

విద్యా : నిజమేనండి !

కూర్మా : పోనీ, నువ్వేదాన్ని చేసుకోరాదుటోయ్, విద్యాపతీ ?

విద్యా : (ఆశ్చర్యంగా) నేనా !

కూర్మా : నువ్వే. ఏం? నచ్చినట్టే మాట్లాడావుగా ?

విద్యా : (పచ్చివెలక్కాయగొంతున పడ్డట్టు అయి) నేను తగనండీ.

కూర్మా: ఏం? నీకేంతక్కువ? తెలివితేటల్లేవా? రూపంలేదా? గుణంలేదా? నిక్షేపంగా బి. ఎల్. చెప్పిస్తాను. రేపీపాటికి ప్యాసై వొస్తావు. నాదగ్గిరే జూనియర్ గా వేసుకుంటాను. నువ్వుకోర్టులో ఆర్గ్యుమెంట్ చెబుతుంటే కోర్టుహాలు దద్దరిల్లి పోదూ? క్లయింట్లు హడిలిపోరూ? పేరుకు జూనియరే గాని విద్యాపతి సీనియర్ ప్లీడర్లని తలదన్నాడని అందరూ మెచ్చుకోరూ? లీడర్ ఆఫ్ దిబార్ అయిపోవుటోయ్ అయివాకళ్ళలో! నీకేంతక్కువోయ్ విద్యాపతీ? ఏం. ఏమంటావ్?

విద్యా : (ఉక్కిరిబిక్కిరై) నాకేమనాలో తెలియటం లేదండీ.

కూర్మా: పోనీ నావకాశంగా ఆలోచించుకో. అంత తొందరేంలేదు. తెలివిగలవాడివి, అభివృద్ధిలోకి తీసుకొద్దామనే అభిమానంతో అడిగాను గాని మామల్లికకి సంబంధం దొరక్క కాదు.

విద్యా : ఎంతమాట!

[చేతిలో కొన్ని కాగితాలతో ధర్మారావు ప్రవేశం]

ధర్మా : నమస్కారం ప్లీడర్ గారూ.

కూర్మా: నమస్కారం కూర్చోండి మీ పేరు ధర్మారావు గారు కదూ?

ధర్మా : (కూర్చుంటూ) తమరికి బాగా జ్ఞాపకం ఉందండి. మర్చిపోయారేమో ననుకున్నాను. (విద్యాపతిని చూసి) నువ్వుకూడా ఇక్కడే ఉన్నావయ్యా, విద్యాపతీ. నాముప్ఫై రూపాయలూ ఎగ్గొట్టావుకదూ?

విద్యా : (నవ్వుతూ) ఎగ్గొట్టను లెండి. ఉన్నప్పుడు ఇస్తాను.

కూర్మా: మీరు వచ్చిన పనేమిటి?

ధర్మా : తమతో కొంచెం రహస్యంగా మాట్లాడాలండీ. [విద్యాపతి వైపు చూస్తాడు అది గ్రహించి విద్యాపతి చిరునవ్వు నవ్వుతో నిష్క్రమిస్తాడు.]

లాండ్ లార్డ్ అండ్ బ్యాంకర్ సన్యాసి రాజు అనే ఆయన ఉన్నాడు చూశారూ, ఆయన నామీద దావా వేశాడండీ (కాగితాలు ఇస్తాడు)

కూర్మా: (కాగితాలు చూస్తూ) ఊఁ- చెప్పండి.

ధర్మా : నోటు రాసి ఆయన దగ్గిర వెయ్యి రూపాయలు అప్పుతీసుకున్నానండీ. ఇప్పుడా నోటు లిమిటేషన్ పట్టిపోయింది.

కూర్మా: (ఉత్సాహంగా కాగితాలు బల్లమీద కొట్టి) లిమిటేషన్ పట్టిందీ! కంగ్రాట్యులేషన్స్. (చెయ్యిపట్టి ఊపుతాడు.)

ధర్మా : కాని లిమిటేషన్ పట్టకుండా చెల్లువేసినట్టు ఫోర్జరీ చేసి దావా వేశాడండీ. చెల్లుతుందంటారా?

కూర్మా: చెల్లదు చెల్లదు చెల్లదు కాని అది ఫోర్జరీ అని నిరూపించాలి. తగిన సాక్ష్యం ఉందా?

ధర్మా : తమదగ్గిరికి సాక్ష్యం లేకుండా వొస్తానా? (ఆ కాగితాల్లో ఓకాగితం తీసి ఇస్తూ) ఇది చదవండి

కూర్మా: (చదివి) అజాగ్రత్తగా నోటుకి కాలదోషం పట్టించి నందువల్ల లక్ష్మీపతి అనేసుమస్తాని డిస్మిస్ చేశాడా సన్యాసి రాజుగారు! ఓహ్ అద్భుతమైన సాక్ష్యం. (ఉత్సాహంగా) గెలిచారండీ, కేసు.

ధర్మా : (సంతోషంగా) గెలిచానూ?

కూర్మా: ఇంకా సందేహమా! కాని ఈ కాగితం ఎలా సంపాదించారు?

ధర్మా : లక్ష్మీపతిగారి దగ్గిర కొన్నాలెండి. అవసరమైతే ఆయనగారు కోర్టుకి కూడా వొచ్చి మన తరఫున సాక్ష్యం చెబుతారు.

కూర్మా: ఇంకేం ఫస్టూ. వకాలత్ ఇస్తారా?

ధర్మా : చిత్తం.

కూర్మా: (గట్టిగా) విద్యాపతీ, వకాలత్ నామా ఫారం తీసుకురావోయ్.

ధర్మా : లాపాయింటు తమరికి తెలిసినట్లు మరొకరికి తెలీదండీ. ఆరోజు ఇట్టేబోల్తాకొట్టించేశారు నన్ను. అందుకే తమదగ్గిరి కొచ్చానండి.

కూర్మ : అప్పుడు మువ్పై రూపాయలు ఎగ్గొట్టించినా ఇప్పుడు వెయ్యిరూపాయలు ఇప్పిస్తాలెండి. (నవ్వుతాడు.)

ధర్మా : తమదయ.

[విద్యాపతి వకాలత్ ఫారం తెస్తాడు]

కూర్మ : సంతకం చెయ్యండి ధర్మారావు గారూ!

ధర్మా : అయ్యబాబోయ్. సంతకమే!

కూర్మ : అదేమిటీ? అలాభయపడతారేం.

ధర్మా : అహాఁ. చెయ్యి...కొంచెం... వణుకు తుంటేనూ.

ధర్మా : ఇప్పటి దాకా బాగానే ఉంది గదండీ.

ధర్మా : అకస్మాత్తుగా అప్పుడప్పుడు అలా వొణుకు వొస్తుందండీ.

కూర్మ : చెయ్యి పట్టుకోవోయ్ విద్యాపతీ, కొంచెం. (విద్యాపతి చెయ్యి పట్టుకుంటాడు) ఊఁ. సంతకం చేసెయ్యండి.

ధర్మా : చెయ్యి...పడిపోయినట్టుందండీ.

కూర్మ : చెయ్యిపడి పోతే కేసు ఓడిపోతారు.

ధర్మా : చెయ్యాలిసిందే! పీకలమీదికి రాదుగదా! (కాగితం తేరిపార చూస్తాడు.)

కూర్మ : రాగులెండి అలా చూస్తారేం? త్వరగా చేసెయ్యండి.

భయంలేగు. (కలంఇస్తాడు)

[ఇద్దరూ వొణుకుతున్న ధర్మారావు చెయ్యి పట్టుకొని సంతకం చేయిస్తుండగా తెర.]

## రంగము: 4

* * ఉదయం; సన్యాసిరాజు గారి ఇంట్లో డ్రాయింగు రూమ్. డవాలు వేసుకొని వరహాలు సోఫాలు దులుపుతూ ఓసారి అటూఇటూ బెదురుగా చూసి ఓ సోఫాలో కూలబడి పరవశిస్తాడు. ఇన్‌స్పెక్టర్ దండయ్యనాయుడు ప్రవేశం.

ఇన్ : (వరహాల్ని వింతగా చూస్తూ) సన్యాసి రాజు గారూ!

(కళ్లు మూసుకున్ని, అలవాటుగా) దయచెయ్యండి.

(చటుక్కున స్పృహకలిగి దిగ్గునలేచి) దణ్ణం బాబూ. (చేతులు నలుపు కుంటాడు)

ఇన్ : (నవ్వుతూ కూర్చొని) ఎలా ఉందిరా సోఫా?

వర : బుద్ధి గడ్డితింది బాబూ! చమించండి. (లెంప లేసుకుంటూ.)

ఇన్ : ఎందుకురా! సోఫాలు మనుషులు కూర్చోటానికి కాదూ?

వర : చిత్తం. తమలాంటోళ్ళకి గాని మాలాంటోళ్ళకా బాబు?

ఇన్ : ఏం? నువ్వు మాత్రం మనిషివి కావూ?

వర : చిత్తం. డవాలా జవాన్నిగా బాబూ.

ఇన్ : పనుల్లో తేడాలుంటే ఏంరా? మనుషులంద రికీ సమాన హక్కుల్లేవూ?

వర : అంతే నంటారా బాబూ?

ఇన్ : కాదు మరీ!

వర : అయితే తప్పులేదంటారా బాబూ ?

ఇన్ : మనుషులంతా ఒకటే ఐనప్పుడు తప్పేముందిరా!

వర : (ఇన్‌స్పెక్టర్ పక్కన కూచుంటూ) తమరు మామంచోరు దొరా!

ఇన్ : (దిగ్గున లేచి లాఠీ నేలకొట్టి) ఓరివెధవా! బుద్ధిలేదూ? చనువిస్తే నెత్తి కెక్కుతావా? నీ అంతర మెక్కడ నా అంతర మెక్కడ?

వర : (దిగ్భ్రాంతుడై) పొరపాటు. పొరపాటు. చమించండి బాబూ. మీపాదాలట్టుకుంటాను.

ఇన్ : (తగ్గి) అహాఁ-అదికాదురా! కూచో కూడదని కాదు. మనిషి కాస్త శుభ్రంగా ఉండద్దూ?

వర : అదా బాబూ!

ఇన్ : అదేరా! మీఅయ్యగారులేరూ?

వర : ఉన్నారండి.

ఇన్ : ఏంచేస్తున్నారు.

వర : పూజలో ఉన్నారు బాబు.

ఇన్ : పూజా! మీ బాబుగారు పూజలు చేస్తారా?

వర : చిత్తం. రోజూపొద్దుటాలే దనలక్ష్మి పూజ చేస్తారండి.

# విచిత్ర జీవులు

ఇన్ : ఇంకెంత సేపటికి కౌతుంది పూజ ?

వర : అయిపోయి నట్టేనండి. ఇంక వొచ్చేస్తారు.

ఇన్ : అయితే మీ అయ్యగారికి ధనలక్ష్మి ప్రత్యక్షమైందిట్రా ?

వర : అయిందనే అంటారు బాబూ కనపడీ కనపడగానే తపీమని ఇనప్పెట్టెలో బిగించి తాళం వేశేశారంటారండి జఁం

ఇన్ : అయితే మీ అయ్యగారికి బాగా డబ్బుందంటావా ?

వర : అమాట తమరు వేరేఅడగాలా ?

ఇన్ : భూములు బాగా ఉన్నాయా ?

వర : ఒకప్పుడు బాగా ఉండేవండీ ఆమధ్దినే చాలామటుకు అమ్మేసి డబ్బుచేసుకున్నారండి.

ఇన్ : ఎందుకూ ?

వర : 'దున్నేవాడిదేభూమి' అంటున్నారు కదండి తీరాచేసి సరైన డబ్బియ్యకుండా భూములు కొట్టేస్తారేమోనని ఆపని చేశారండి.

ఇన్ : డబ్బంతా బ్యాంకుల్లో వేశారా ?

వర : మొదట వేశారుగాని తరవాత ఆమధ్దిని కొన్ని బ్యాంకులు దివాలా తీసేసరికి బయమేసి తీసేశారండి.

ఇన్ : తీసేసి ?

వర : ఇళ్లుకొన్నారండి.

ఇన్ : అయితే మీ అయ్యగారికి ఇళ్లున్నయన్నమాట.

వర : ఇప్పుడయ్యేవి లేవండి. ఆటితో ఇబ్బందులు పడి అయినకాడికి అమ్మేశారండి.

ఇన్ : అమ్మేసి ?

వర : బంగారం చేసుకున్నారండి.

ఇన్ : అంతా ఇంట్లోనే దాచారా ?

వర : చిత్తం.

ఇన్ : రోజులు మంచివికావుగోయ్. కొంపతీసి ఎవడికన్నా నాపడితే ఫైసల్.

వర : ఏంటి బాబూ, తమరే అట్టంటారు. (గర్వంగా తాళాలు చూపిస్తూ) సూడండి. అట్టాటిట్టాంటివి అనుకున్నారేమో. ఒక్కొక్కటే చూపిస్తూ కలకత్తా, బొంబాయి, చెన్నాపట్నంనించి మంచి స్ప్రింగుతాళాలు కొత్త కొత్త రకాలన్నీ ఈడకు రావాల్సిందే. పైగా ఇద్దరు గూర్ఖాలు కాపలా. రెండు జాగిలాలు హామేషా ఆడే ఉంటాయి. చీల్చిపారెయ్యవు ? హే?

ఇన్ : మంచి జాగ్రత్తలోనే ఉన్నారన్నమాట.

వర : చిత్తం. అందులో నేను డవాలేసుకు నిలబడితే ఇంటివైపు ఎవరన్నా కన్నెత్తిచూడటానికి ధైర్యంచేస్తారా!

ఇన్ : నువ్వు ప్రైవేట్ నౌకరువి కదా! నీకు డవాలెందుకురా?

వర : హోదాగా ఉంటుంది ఏసుకోమన్నారండి సన్యాసిరాజుగారు. ఈ బిళ్ళ తళతళ మెరుస్తుంటే దీన్ని చూసిన కాడినించీ మాబుడ్డోడికి మా మనసుగా ఉందండి.

ఇన్ : అదేం మనసురా?

వర : బుడ్డోడు కదండి.

ఇన్ : అయితే మాత్రం.

వర : చిత్తం. "పెద్దయింతరవాత మా రాజులు ఎట్టాగూ ఏస్తారు. ఇప్పటి నించీ దేనికశా?" అని కూకలేశానండి.

ఇన్ : మంచిపని చేశావుగాని నేనో విషయం అడుగుతాను సమాధానం చెబుతావూ?

వర : చిత్తం. అడగండి.

ఇన్ : మీ అయ్యగారు మంచివారేనా?

వర : కాకేం బాబూ!

ఇన్ : పోట్లాటలూ, కొట్లాటలు—ఇలాంటి వాటి జోలికి పోరూ?

వర : నాతో ఎప్పుడూ పేచీ పెట్టకోలేదు బాబూ. జీతం పెంచమని అడిగితే మాత్రం ముక్కుమీద వేలేసుకుంటారండి (అభినయిస్తాడు) ఇంక గప్ చిప్.

ఇన్ : సామాన్యంగా మీ అయ్యగారు ఏం చదువుతారు?

వర : పేపరండీ.

ఇన్ : భర్తృహరి సుభాషితాలూ, సుమతీశతకం ఎప్పుడూ చదవరూ?

వర : ఆరి మాటేమోగాని మా బుడ్డోడు సుమతీ శతకం వొల్లేసేశాడండి. (చేతులు కట్టుకుని

కొంచెం రాగంతీస్తూ)
"అడిగిన జీతం బియ్యని
మిడిమేలపు దొరనుగొల్చి మిడుకుట కంటెన్
వడిగల ఎద్దులగట్టుక
మడిగున్నక బ్రతుకవచ్చు మహిలో సుమతీ"

ఇన్ : భేష్. చూశావ్గా, అలా అన్నాడేగాని అడిగిన జీతం ఇయ్యకపోతే సమ్మెలు చేసి గొడవ చేయమన్నాడా ?

వర : (తెల్లబోయి) లేదు బాబూ.

ఇన్ : అందుకేనోయ్ సుమతీశతకం అంటే నాకు ఇష్టం మా తాణాలో ప్రతిఖైదీకీ—వింటున్నావా ? ప్రతిఖైదీకి రోజూ లాఠీచూపించి మరీ నూరినూరి పోస్తున్నానోయ్ ఈ పద్యాలు. చిన్నప్పుడు మా అయ్యవారు బెత్తం పట్టుకుని అవన్నీ నాచేత పప్పచెప్పిస్తేనే నేనీనాడు ఈ ఇన్స్పెక్టర్ పదవి వెలగబెడుతున్నాను.
(జేబులోంచి సుమతీశతకం తీసిచూస్తూ)
ఆహాహా !
శ్రీరాముని దయచేతను
నారూఢిగ సకల జనులు ఔరా ! యనగా
ధారాళమైన నీతులు
నోరూరగ చవులుపుట్ట నుడివెద సుమతీ.
[చివరపంక్తి వరహాలు కూడా అంటాడు]
(సన్యాసిరాజు మధ్య ద్వారంనించి ప్రవేశం)

సన్యా : నమస్కారం 'ఇన్స్పెక్ట'రు గారూ.

ఇన్ : నమస్తే, సార్, నమస్తే.

సన్యా : సుమతీశతకం తిరగేస్తున్నారే.

ఇన్ : ఏదో కాలక్షేపం.

సన్యా : ఆపద్యాలంటే నాకూ తగని అభిమానమండి.

ఇన్ : (సంతృప్తిగా) అలాగాండి?

సన్యా : చిన్నప్పుడు వీధిబళ్ళో సుమతీశతకం యావత్తూ మంచినీళ్ళ ప్రాయంగా ఏకరువు పెట్టే వాణ్ణి. అందుకే గదండీ ఇప్పుడీమాత్రం నిశ్చింతగా బతుకు తున్నాను
(ఆకపోత్రుగా)
తప్పులుగ చెరువు నిండిన

కప్పలు పది వేలు చేరుగదరా సుమతీ.
ఆ హా హా! ఏం హెచ్చరిక!

వర : (అందుకుంటూ) ఎప్పుడు సంపదగలిగిన అప్పుడు—

సన్యా : హుమ్. ఇన్స్పెక్టరుగారు ఏదో పనిమీద వచ్చినట్టున్నారు.

ఇన్ : మరేనండి
[వరహాలు పద్యం తనలోనే చదువుకుంటూ వెళుతూ మధ్యలో ఆగి వెనక్కి సన్యాసి రాజు వైపు చూస్తాడు]

వర : లక్ష్మీంపతి గారికి కబురెట్టమన్నారు గదండి బాబూ! సన్యాసి రాజుగారు నుంచున్న పళాన రమ్మన్నారని చెప్పొచ్చానండి.

సన్యా : ఏమన్నారు?

వర : నువ్వుపద. నీ ఎనకాలే వొస్తున్నాలే అన్నారండి. మడిసి మాదిరులుపడిపోయారండి. అయితే, ఇనస్పెట్టరు బాబూ. తెలీకడుగుతాను, ఆరిడబ్బు మళ్లీ దొరుకుద్దంటారా?

సన్యా : (అందుకుని) ఆఁ ఇంకేం దొరుకుతుంది! పుస్తకం, వనితా, విత్తంపరహస్తంగతంగతం.

ఇన్ : (రోషంగా) అయితే పోలీసుడిపార్టుమెంటు ఎందుకండీ!

సన్యా : మనుషుల్లో నిజాయితీ లేకపోతే పోలీసు వాళ్ళేం చేస్తారూ?

ఇన్ : (కొంచెం సంతోషించి) ఉన్న మాట చెప్పారు. అందుకే (సుమతీశతకంచూపిస్తూ) ఈ శ్రమ. (పుస్తకం జేబులో పెట్టుకుంటూ) ప్రతివాడూ చక్కగా చదువుకుని బాగుపడకూడదూ?

వర : కొంటానికి డబ్బుండొద్దు బాబూ?

సన్యా : ఏడిచావులేరా. నువ్వొళ్లు.
[వరహాలు బుర్రగోక్కుంటూ నిష్క్రమణ తమరి పనేమిటో సెలవిచ్చారు కారు.

ఇన్ : మరేంఅనుకోకండి. తమర్ని కొన్ని ప్రశ్నలు అడగాలి.

సన్యా : ఏ విషయం?

ఇన్ : ధర్మారావుగారి బట్టలకొట్టు లూటీ విషయం

సన్యా : (ఆశ్చర్యంగా) ధర్మారావుగారి బట్టలకొట్టు లూటీ? లూటీ జరిగిందా?

ఇన్ : (ఆశ్చర్యంగా అతని వంక తదేకంగా మాసి) మీకు తెలియదూ?

సన్యా : మీరు చెప్పేదాకా నాకు తెలీనే తెలియదండీ. మా వరహాలు కూడా చెప్పలేదే. వాడికి తెలీనివిషయమే ఉండదు. ఎప్పుడు లూటీ చేశారు?

ఇన్ : రాత్రి.

సన్యా : పాపం (కసిగా) బాగాజ్ఞా...(తప్పుకుని) నష్టపోయాడా?

ఇన్ : ఒక్క గుడ్డముక్క కూడా లేకుండా లూటీ చేసేశారండీ

సన్యా : (తృప్తిగా) అయింది! కాకేం చేస్తుంది! అనకూడదు కాని అంతే కావాల్లెండీ.

ఇన్ : ఏం?

సన్యా : వొట్టి పరమ నీచుడు అనకూడదు కాని—

ఇన్ : ఏం చేశాడూ?

సన్యా : వొట్టి వెధవపని చేశాడండీ పరమదౌర్భాగ్యుడు అనకూడదు కాని—

ఇన్ : ఏం చేశాడో చెప్పరేం?

సన్యా : లుచ్ఛాపని కదండీ. అనకూడదు కాని—

ఇన్ : (విసుగ్గా) అపాదుపనేమిటో చెబితే ఇద్దరం కలిసి తిడదాం.

సన్యా : నోట్ సంతకం పెట్టకుండా—అదే బాకీ ఎగ్గొట్టాలని చూశాడండీ.

ఇన్ : అలాగా!

సన్యా : దగుల్బాజీ కదండీ.

ఇన్ : మళ్ళీ అనకూడదు కాని, ఈమాటలన్నీ ఆయనగూడా మిమ్మల్ని అన్నాడండీ.

సన్యా : (కోపంగా) అన్నాడూ? వాడిపని పట్టకుండా వొదుల్తానా!

ఇన్ : చూస్తే మీఇద్దరికీ బాగా కక్షలున్నట్టున్నాయి.

సన్యా : కాని పనులు చేస్తే కక్షలుండవు టండీ?

ఇన్ : ఆ కక్షతో మీరే దుకాణంలూటీ చేయించారంటున్నాడు.

సన్యా : (తెల్లబోయి) ఆc—నేనా? రామరామ.... ఎలా కూశాడండీ ఆకూతి?

ఇన్ : నేనే అడిగానండి—అనుమానం ఎవరిమీదైనా ఉంటే చెప్పమని.

సన్యా : (కోపంగా) సాక్ష్యం?

ఇన్ : అదీ అడిగాను ఆధారాలున్నాయా అంటే. అదంతా నాకు తెలీదు బాబూ ఆధారాలు వెతకటం పోలీసువారి పనే నన్నాడు.

సన్యా : (హఠాత్తుగా తట్టి) కొంపతీసి మీరుకూడా నన్ను అనుమానించటం లేదు కద! నేనే పాపం ఎరగనండోయ్.

ఇన్ : పెద్ద మనుషులు, మీరిలాంటి వాటిలో ఎందుకు దిగుతార్లెండి. ఉద్యోగ ధర్మంలో ప్రశ్నలడగాలని వొచ్చాను. అంతే.

సన్యా : బతికించారు. (ఆలోచించి) చూడగా చూడగా నాకోఅనుమానం తడుతోందండీ

ఇన్ : ఏమిటి?

సన్యా : ఇందులో ఏదో మోసం ఉందండీ.

ఇన్ : మోసమా?

సన్యా : ఇన్ని కొట్లుంటే ఒక్క ధర్మారావు కొట్లోనే లూటీ ఎందుకు జరగాలి? కాపలావాళ్ళేమైనారూ? రాత్రికిరాత్రి ఎవరికంటా పడకుండా సరుకు ఎలా జేరేశారూ?-వొట్టిది. వొట్టిది. వొట్టిదండీ. ఇన్స్పెక్టరుగారూ లూటీ జరగనే లేదు.

ఇన్ : జరక్కపోవటమేమిటి? నేను కళ్లారా చూస్తే!

సన్యా : జరుగుతుంటే చూశారా?

ఇన్ : జరిగింతరవాత.

సన్యా : ధర్మారావే సరుకంతా ఎక్కడో దాచి నామీదికి నెట్టాలని చూస్తున్నాడండీ.

ఇన్ : (ఆశ్చర్యంగా) తమాషాగాఉందే! ఎక్కడ దాచాడంటారు?

సన్యా : ఎక్కడదాచాడో మీరే వెతికించాలి. ఇల్లూగిల్లూ అంతా సోదా చేయించండి. బయట పడకపోతే నన్నడగండి. కొట్టువెనకాల్నించి దొడ్డిదమ్మంగుండా ఇంట్లోకి జేరవేసిఉంటాడండీ! హరిధర్మారావ్!

[ఇన్స్పెక్టరు ఆలోచిస్తూ ఉంటాడు. సుందరావు ప్రవేశించి ఇన్స్పెక్టర్ వైపు రెండు మూడు సార్లు చూస్తాడు.]

సుంద : నమస్కారం సన్యాసిరాజుగారు.

సన్యా : రండి. రండి. కూర్చోండి.

ఇన్ : సరే నేను వస్తానండి.

[ఇన్స్పెక్టర్ లేచి వెళ్లిబోతూ సుందరావు]

వైపు యథాలాపంగా చూసి, మళ్లీ పరకా యించి చూసి సన్యాసిరాజు వైపు చూస్తాడు. ]

సన్యా : వీరు సుందరరావుగారు. నాకు చాలా ముఖ్య స్నేహితులు. (సుందరరావు నమస్కారం చేస్తాడు )

ఇన్ : మిమ్మల్నెక్కడో చూశానండీ

సుంద : రోడ్డుమీద యథాలాపంగా చూశారేమో లెండి.

ఇన్ : కాదండీ · అలాంటి పరిచయం కాదు! ఎక్కడో చూశాను మీది ఈ ఊరేనా?

సుంద : నాకో ఊరేమిటి;

ఇన్ : మీరేం చేస్తున్నారు?

సుంద : (నవ్వుతూ) ప్రస్తుతం కోటి సూర్యప్రకాశ రావుగారికి సన్మానం చేద్దామని ప్రయత్ని స్తున్నాను. (ఇన్‌స్పెక్టర్ బుర్రతడుముకుని కొంచెం తటపటాయించినిష్క్రమిస్తాడు.)

సన్యా : చూశారా సుందరరావుగారూ? తన బట్టల కొట్టు లూటీ చేయించానని ధర్మారావు నా మీద అభాండం వేశాడు.

సుంద : లూటీ !

సన్యా : ఆఁ-అసలు లూటీ కాలేదని నా అనుమానం. అదో పన్నాగం-మనమీద కక్ష తీర్చుకో టానికి.

సుంద : తాటాకు చప్పుళ్లకి కుందేళ్లు బెదుర్తాయి టండీ?

సన్యా : (నవ్వి) అంతే...అంతే.

సుంద : హనుమంతుడి ముందరా కుప్పిగంతులు !

సన్యా : వెధవని పల్టీలు కొట్టించనూ?

సుంద : ప్లీడర్ గార్ని మళ్ళా కలుసుకున్నారా?

సన్యా : ఆ. వాడు కొంచెం పెద్ద ఎత్తుమీదే ఉన్నా డని లోపాయికారిగా తెలిసిందండీ. లక్ష్మీ పతిగారిని సాక్ష్యం వేసుకుంటాట్ట.

సుంద : ఆయనెవరూ?

సన్యా : మాపాత గుమాస్తా అండీ. అజాగ్రత్తగా నోట్ లిమిటేషన్ పట్టించాడని డిస్మిస్ చేశాన్లెండి.

సుంద : ఆయన సాక్ష్యం చెబుతానన్నాడా?

సన్యా : ఆ. విశ్వాస ఘాతకుడండీ.

సుంద : మీవైపు తిప్పుకోలేరూ?

సన్యా : మన ప్లీడర్ గారూ అదే అన్నారండీ. ఆయ నది చాలా బలమైన సాక్ష్యంట. పైగా తెలివి తక్కువగా ఫలానా కారణంవల్ల డిస్మిస్ చేశానని కాగితంకూడా ఇచ్చాను.

సుంద : ఏదో ఎరచూపించి మీ పక్షానికి తిప్పుకోండి.

సన్యా : అందుకే కబురు చేశాను బహుశా వొస్తూ ఉంటాడు. ఏదో విధంగా ఆ ధర్మారావుని సాధిస్తేగాని నాకు మనశ్శాంతి లేదండీ సుంద రరావుగారూ. ఎంత డబ్బయినా సరే.

సుంద : సాధించకేమండీ! మీ లాంటి పెద్దమనిషి ఫోర్జరి చేశాడంటే నమ్మేదెవడు? అందులో రెండురోజుల్లో మీ పరువు పదిరెట్లు పెరగ బోతుంటే?

సన్యా : ఎలాగండోయ్?

సుంద : కోటి సూర్యప్రకాశరావుగారి సన్మానసభకి మీరే అధ్యక్షులనే సంగతి మర్చిపోయారా?

సన్యా : ఓ! అదా! అన్నట్టు సన్మాన ప్రయత్నా లెంతవరకు వచ్చాయి?

సుంద : అవన్నీ నేను చూసుకుంటున్నాగా. మీ కెందుకు శ్రమ! ఎల్లుండికి అంతా రెడీ చేసే బాధ్యత నాది.

సన్యా : చందా లేమాత్రం వసూలయాయి?

సుంద : ఆఁ!-ఎవరండీ ఇచ్చేవాళ్లు!

సన్యా : అదేమిటి అలా అంటారు? చాలా మంది నూటపదహార్లూ అర్ధ నూటపదహార్లూ ఇచ్చా మని నాతో చెప్పారే?

సుంద : కాగితంమీద అంకె వేస్తే ఏం లాభమండీ? ఇవ్వొద్దూ?

సన్యా : ఇచ్చామని చెప్పారండీ.

సుంద : సరే, ఇస్తే రసీదులు ఉండవూ?

సన్యా : అవునండి. నాచేత నూటపదహార్లు ఖర్చు పెట్టించారు గదా!

సుంద : ఖర్చు పెట్టిందాని కిబ్బడి రాదుటండీ అలా అంటారేమిటి? వీధుల్లో, పేపర్లలో, రేడి యోలో మీ పేరు మోతమోగిపోదూ?

సన్యా : (ముఖవికాసం దాచుకుంటూ) ఏమిటో లెండి. నా కంతకీర్తి దాహంలేదు.

సుంద : మీకుందని నేనన్నానా ?

సన్యా : ఎందుకండీ వెధవ కీర్తి ? కూటికా, గుడ్డకా?

సుంద : సరిగ్గా అదేమాట కోటిసూర్యప్రకాశరావు గారుకూడా అన్నారండి.

సన్యా : అలాగా ?

సుంద : 'అదేమిటండీ కోటిసూర్యప్రకాశరావు గారూ, అలా అంటారు ? కీర్తి వొస్తేగాని పదవి రాదు, పదవి వొస్తేగాని కీర్తి రాదు. ఈ రెండూ వొస్తేగాని ప్రజాసేవకి వీలుండదు. ప్రజాసేవ చేస్తేగాని ఈ రెండూ రావు. ప్రజాసేవ చేస్తే మీకు రెండూ ఉన్నట్టే. కాని ఆ కిరీటంలేని పదవినించి అసలు పదవి స్వీకరిస్తేకాని నిజమైన ప్రజాసేవకి వీలుండదు' అని ఒక్కదమ్మున అనేసేటప్పటికి ఆయన 'సరే కానివ్వండి, మీ ఉత్సాహాన్ని ఎందుకు ఆపాలి' అన్నారండీ

సన్యా : ఐతే ఈసన్మానంతో ఆయనకి బాగా పేరొస్తుం దంటారా ?

సుంద : కోటి సూర్యప్రకాశరావుగారూ ఆ ప్రశ్నే అడిగారండి. "పేరేమిటండీ, వెధవపేరూ ? మీకీర్తితో నిండిపోయి ప్రపంచాలన్నీ తెల్లటి తెలుపైపోతే, ఆ తెలుపులో కలిసిపోయిన పాలసముద్రాన్ని విష్ణుమూర్తీ, ఐరావతాన్ని ఇంద్రుడూ, హంసని బ్రహ్మదేవుడూ, కైలాసాన్ని శివుడూ, చంద్రుణ్ణి రాహువూ వెతుక్కోలేక నానా అవస్థలూ పడతా"రని ఉత్ప్రేక్షించేసరికి గుమ్మయిపోయి "ఎంత గొప్పగా అన్నారండీ ! రేపు సన్మానంలో నామీద పంచరత్నాలు చదివేస్తున్నారే !" అన్నాడండీ సన్యాసిరాజు గారూ.

సన్యా : నా మీదకూడా ఓ పద్యం రాసి చదువుదురూ.

సుంద : పద్యం ! పంచరత్నాలండీ ! పంచరత్నాలు! మీమీద కాకపోతే ఇంకెవరిమీద రాస్తానూ?

సన్యా : ఒక్కొక్క పద్యానికి ఒక్కొక్క దుశ్శాలువ. ఏమంటారు ?

సుంద : కానివ్వండీ, మీ ఇష్టం. కోటి సూర్యప్రకాశరావుగారు కూడా అలాగే అంటే ఎం. పి. అయిం తరవాత ఇద్దురు గాన్లెండి. అన్నాను.

సన్యా : ఎం. పి. అవుతా డంటారా ?

సుంద : ఆదే ఆయనా అడిగారు. ఎం. పి ఏమిటండీ, హనుమంతుడు సముద్రాన్ని అవలీలగా లంఘించినట్టు ఎం పి నించి ఎంబాసడరైపోయి ఆ సముద్రాలన్నీ మీరుకూడా లంఘించరూ ? ఆయన విమానం లేకుండా వెళ్లాడు. మీరు విమానంలో వెళ్తారు. అంతే తేడా. అనే సరికి కోటి సూర్యప్రకాశరావుగారు సర్వంమరిచి ఆకాశంలోకి చూశారండీ.

సన్యా : (నవ్వి) ఏమిటో లెండి. ఆయన గొప్పవాడైపోతే మనకేం లాభం ?

సుంద : అన్నీ తెలిసిన మీరే అలా అంటారేమండీ ఆయన గొప్పవాడైతే మీరుమాత్రం గొప్పవారు కారూ ?

బజార్న పోతున్నప్పుడు 'కోటి సూర్యప్రకాశరావుగారూ' అని నోరార పిలిస్తే ముక్కూ మొహం ఎరగని ముష్టివాడైనా సరే 'ఎలా తెలుసురా నా పేరు ?' అని ఓ దమ్మిడీ ఇచ్చి 'తమరెన్నరగని వాళ్లెవరుదొరా ?' అని వాడు రెండో చెయ్యి జాపితే రెండో దమ్మిడీకూడా ఇచ్చేస్తారే ఇహ మీరే నోటినిండా 'కోటి సూర్యప్రకాశరావు గారూ' అనిపిలిస్తే ఏపని చెయ్యమంటే ఆపని చెయ్యరండీ ?

[లక్ష్మీపతి ప్రవేశం]

సన్యా : రండి రండి లక్ష్మీపతి గారూ...

లక్ష్మి : నమస్కారమండి

సన్యా : ఇలా కూర్చోండి.

లక్ష్మి : చిత్తం. ఇలా నుంచుంటాలెండి.

సన్యా : పరవాలేదు. కూర్చోండీ పెద్దలు....వీరు సుందర్రావుగారు గొప్ప అర్థశాస్త్రవేత్త(?) రెక్టరు. నాకు చాలా ముఖ్యులెండి.

లక్ష్మి : అలాగా ? సంతోషం. (కూర్చుంటాడు.)

సన్యా : ఆ పోయినడబ్బు దొరికేసూచన ఏమైనా కనిపించిందాండి.

లక్ష్మి : ఇంకేం దొరుకుతుందండీ. దాని కెప్పుడో నీళ్లొదులుకొన్నాను.

సుంద : పోయిన డబ్బేమిటి ?

లక్ష్మి : ఆమధ్య కొంతసొమ్ము పోగొట్టుకున్నానండీ

సుంద : అరెరె ఎంత ?

లక్ష్మి : ఎంతయితే ఏంలెండి ? ప్రాప్తం లేకపోయినప్పుడు. ఎందుకండీ సన్యాసిరాజుగారూ, కబురుచేశారు ?

సన్యా : చూడండీ. అప్పుడేదో కోపంలో ఏదో అన్నానే అనుకోండి. వెంటనే మీరునోట్యాగంగా చేసి వెళ్ళిపోవటం సబబేనా చెప్పండి.

లక్ష్మి : మీరుపొమ్మంటే ఏం చెయ్యను ?

సన్యా : నేనంటే అంతఅభిమానంగా ఉండేవారు కదా ! కాస్త ఉదారంగా నన్ను క్షమించలేరూ ?

లక్ష్మి : ఎంతమాట !

సన్యా : మీరంటే ఎంతసరి, ఎంతగౌరవం లేకపోతే ఆఖాళీ భర్తీ చేయకుండా అలాగే ఉంచుతాను చెప్పండి.

లక్ష్మి : (ఆశ్చర్యంగా) ఎవర్నీ వేసుకోలేదూ ?

సన్యా : ఉఁహుఁ. నావల్లకాదు. ఆఉద్యోగం మీరు చెయ్యాలిసిందే.

లక్ష్మి : నేనా ?

సన్యా : అతురాలామీరే. నామీద ఆమాత్రం గౌరవం చూపించలేరూ ?

లక్ష్మి : ఎంతమాట. అంతకంటేనా ?

సన్యా : మీరొప్పుకుంటారని నాకు తెలుసులెండి. మనిషి మనసు ఆమాత్రం కనిపెట్టలేనూ ? అన్నట్టు, లక్ష్మీపతిగారూ, ఈసంగతి విన్నారా ? ఆనర్మ్మరావు ఏంకూస్తున్నాడో మీదాకా వొచ్చిందా ?

లక్ష్మి : ఏ విషయంగురించి ?

సన్యా : మిమ్మల్నే బోల్తాకొట్టిద్దామనుకుంటున్నాడు, వాజ. వాడిముఖానికి తోడు వాడితరఫున మీరు సాక్ష్యం చెపుతారట. వెనక పుకారు లేవదీశాడండీ

సుంద : లక్ష్మీపతిగారి సంగతి వాడికేం తెలుసండీ ! అంతా తనమోస్తరే అనుకుంటాడు.

లక్ష్మి : తమరు దయచేసి క్షమించాలి, సన్యాసిరాజుగారూ. అప్పట్లో ఆ అగ్రహారంమీద అతనితో అలా నే నన్నమాట వాస్తవమేనండి.

సన్యా : వాస్తవమా !

లక్ష్మి : చిత్తం.

సన్యా : పోనెండి. గతంగతః.

లక్ష్మి : అంతేనండి. అంతే.

సన్యా : నోటులిమిటేషన్ పట్టిందనిమాసి సంతకం పెట్టకుండా పరమనీచంగా తప్పించుకుపోయాడండీ

లక్ష్మి : ఆఁ ! అయితె ఫోర్జరీమాట నిజమేనా ?

సన్యా : మీరుకూడా అలా అంటారేమండీ ? ఫోర్జరీ, గీర్జరీ, బాకీ ఎగ్గొట్టటం బావుందీ ?

సుంద : కుక్కకాటుకి చెప్పుదెబ్బ అంతే !

సన్యా : నోటులిమిటేషన్ పట్టలేదని మీరొక్కమాట అన్నారా అంటే—

లక్ష్మి : అబద్ధపు సాక్ష్యమా ?

సుంద : అబద్ధం, గిబద్ధం. అబద్ధంఅనేమాటకి నిర్వచనం చెప్పండి

లక్ష్మి : క్షమించండి. నా అంతరాత్మ ఒప్పదండీ నేనబద్ధం చెప్పలేను.

సుంద : అబద్ధం చెప్పటానికేముండీ ? నిజం చెప్పాలంటే భయపడాలిగాని,

సన్యా : నాపరువు నిలబెట్టండి లక్ష్మీపతిగారూ. మీరేం చెయ్యమంటే అదిచేస్తాను

లక్ష్మి : అబద్ధం ఆడాలిసిందే ?

సన్యా : న్యాయంకోసం, నాకోసం ఒక్కచిన్న అబద్ధం ఆడండి (చేతులు పట్టుకుంటూ) ఇవి చేతులుకావు కాళ్ళనుకోండి

లక్ష్మి : సరే కానివ్వండి. తప్పేముంది.

సన్యా : (సంతోషంగా) ఒప్పుకున్నారూ ? మీమేలు మర్చిపోలేనండీ మీఋణం ఎలా తీర్చుకోవాలో !

లక్ష్మి : తీర్చదలుచుకుంటే మీరు తప్పకుండా తీర్చగలరు ?

సన్యా : ఎలాచెప్పండి ? (చెవులుదగ్గిర చేతులు పెట్టుకొని శ్రద్ధగా ముందుకి వంగుతాడు.)

లక్ష్మి : చెప్పమంటారా ? తరవాత కాదంటారేమో.

సన్యా : ఛ. ఛ. ఎందుకంటానూ ? (కొంచెం బెరుగ్గా) వెయ్యిరూపాయల బాకీరద్దు చెయ్యమంటారా ?

(అయిష్టంగా ముఖం పెడతాడు)

# విచిత్ర జీవులు

లక్ష్మి : నేను డబ్బుకోసం అబద్ధం ఆడతానటండీ?

సన్యా : (తేరుకుని) మరి ఏమిటో వెంటనే చెప్పేసెయ్యండి

లక్ష్మి : మనం పెద్దవాళ్లమైపోయాం. మనకి కావలసింది మనపిల్లలు సుఖపడటమే కదండీ.

సన్యా : కాదుమరి.

లక్ష్మి : మీ అబ్బాయి సీతారామారావు ఉన్నాడే, అతను మా అమ్మాయి కల్యాణిని ప్రేమించాట్టండీ.

సన్యా : మా వాడా?

లక్ష్మి : చిత్తం.

సన్యా : ప్రేమా?

లక్ష్మి : మరేనండి.

సన్యా : నిజమే?

లక్ష్మి : నిజమేనండి. నా కళ్లారా స్వయంగా చూశాను వరహాలుకూడా చెప్పాడు.

సన్యా : వెధవని రానీండి. ముఖం వాచేట్లు చీవాట్లు పెడతాను.

లక్ష్మి : ఎవర్ని?

సన్యా : వాడినే, మా సీతారాముణ్ణి.

లక్ష్మి : ఎందుకండీ, పాపం?

సన్యా : మీ రూరుకోండి. మీకు తెలీదు. వాడికి అహంబుద్ధి అంట! పెద్దమనుషులతో వ్యవహారం అనుకున్నాడా లేకపోతే—

లక్ష్మి : (తెల్లబోయి) నా ఉద్దేశం అది కాదండీ.

సన్యా : మరేమిటి?

లక్ష్మి : పాపం కుర్రవాడు, మనసుపడి ప్రేమించాడు. ఈ రోజుల్లో అది సహజమే కదండీ. అభ్యుదయ భావాలకి కరువేమిటి. శుభ్రంగా ఇద్దరికీ మంచి ముహూర్తం చేసి పెళ్ళి చేసెయ్యండి.

సన్యా : ఆఁ! పెళ్లా!

లక్ష్మి : చిత్తం. వాళ్లని వేరుచేస్తే ఏ లైలా— మజ్నూలో ఐపోతారు. నా సలహా వినండి.

సన్యా : (కోపంగా) ఇదేదో చదరంగపుటెత్తల్లే ఉందే!

లక్ష్మి : చిత్తం. తమరిదగ్గర నేను ఎత్తులు వెయ్యగలనా?

సన్యా : నేర్చావులేవయ్యా మహా.

లక్ష్మి : సరే మీ ఇష్టం వెడతా మరి (లేవబోతాడు.)

సన్యా : (ఆలోచనగా) కూర్చోండీ అంత తొందర పడతారేం! సాక్ష్యం చెప్పమన్నానని ఆ అవకాశాన్నిలా దుర్వినియోగం చేసుకుంటారా చెప్పండి.

లక్ష్మి : మీరలా అపార్థం చేసుకుంటున్నారు గాని నేను కానికోరిక కోరానా? మీరు ధనవంతులూ, నేను పేదవాణ్ణీ అనుకోండి. కాని ఈరోజుల్లో ఆ తేడాలు ముఖ్యమా చెప్పండి. హృదయాలు ప్రేమించుకుంటే అడ్డుపడటం నాగరికతా లక్షణమా?

సన్యా : (సుందర్రావువైపు చూస్తూ) వింటున్నారుగా. ఏమంటారు?

సుంద : కానివ్వండీ. తథాస్తు.

సన్యా : మీమాటే నెగ్గించుకున్నారు. సరే కానివ్వండి.

లక్ష్మి : మీ హృదయ వైశాల్యం నాకు తెలియునుటండీ. మీ ఋణం తీర్చుకోలేనండీ సన్యాసిరాజు గారూ.

సన్యా : (కొంచెం కసిగా) సాక్ష్యం చెబుతున్నారుగా.

లక్ష్మి : (ఏదో జ్ఞాపకం వొచ్చినట్టు) అన్నట్టు, మర్చిపోయాను ఓ చిన్న పొరపాటు జరిగిందండీ. మీరు రాసిచ్చిన బర్తరఫ్ కాగితం బుద్ధి గడ్డితిని ఆ ధర్మారావుకి ఇచ్చానండీ. అది ఇప్పుడు అడ్వొకేట్ కూర్మనాథం గారి దగ్గర ఉన్నదిటండీ. అదెలాగో తమరు సర్దుబాటు చేయించాలి.

సన్యా : కొంప తీశారే!

సుంద : మరేం పరవాలేదులెండి ఏదో చేద్దాం.

లక్ష్మి : ఆపని కాస్త చేయించండి. మీకు పుణ్యం ఉంటుంది. మరి నాకు సెలవిప్పిస్తారా?

[సెలవుతీసుకుని నిష్క్రమిస్తాడు లక్ష్మిపతి]

సన్యా : హారిపిడుగా! మూడుముళ్లూ వేస్తేగాని సాక్ష్యం చెప్పేట్టులేదు. ఉద్దండుడు. ఏమిటో అనుకున్నాను. అందితే అందరూ జుట్టుపట్టుకునేవాళ్ళే.

సుంద : (నవ్వుతూ) మీరుమాత్రం తీసిపోయారా?

సన్యా : సరేగాని ఆ కాగితం మన కెలావొస్తుంది?

సుంద : తెప్పిస్తే రాకేం చేస్తుంది ?
సన్యా : ఎలా తెప్పించటం ?
సుంద : (నవ్వుతూ) పత్రం, పుష్పం, ఫలం, తోయం.
సన్యా : (పరిపెట్టు మన్నట్టు) కొద్దిలో పోనివ్వండి.
సుంద : చూద్దాం. అతన్ని కదిలించాలి.
సన్యా : ఎవర్నీ ?
సుంద : కూర్మావతారం గారి దగ్గిర సమస్తా విద్యాపతి. అతను నాకు కొంచెం తెలుసులెండి
సన్యా : (ఆలోచనగా) విద్యాపతా ? ఎక్కడో విన్నట్లున్నా నా పేరు. అతను మనమాట వింటాడా ?
సుంద : డబ్బుకి కొండమీదికోతి దిగివాగుటుండీ.
సన్యా : ఇతను ఆ కోతిలాంటి వాడో కాదో !
సుంద : ప్రయత్నిద్దాం. (డబ్బు కావాలని సంజ్ఞ చేస్తూ) ఏదీ ?
సన్యా : (దిగులుగా) ఎంత ?
సుంద : వందనించీ బేరం చేస్తాను. వెయ్యి దాట నివ్వను లెండి.
సన్యా : వెయ్యి రూపాయలే !
సుంద : లేకపోతే ఆఫీసుకాగితం తస్కరించటమే
సన్యా : గట్టిగా బేరం చెయ్యండీ.
సుంద : ఆమాట మీరు ప్రత్యేకించి చెప్పాలా ? ఓ వెయ్యిఇస్తే మిగిలింది మళ్లీ మీకిచ్చేస్తాను.
సన్యా : తప్పదూ ? ఇవ్వాలిసిందే?
సుంద : డబ్బు ముఖ్యమా, పరువు ముఖ్యమా ?
[సన్యాసిరాజు నడుందగ్గిర తాళాలు తీసుకుని స్టేజిమధ్య ద్వారంనించి నిష్క్రమిస్తాడు.
కొద్ది క్షణాల తరవాత అదే ద్వారంనించి సీతారామారావు ప్రవేశం, చేతిలో ఫోటో చూస్తూ.]
సీతా : (ఫోటో చూస్తూ)
కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీమూర్తి వర్ణించు జిహ్వజిహ్వ.
సుదతీమణిని చూచు చూడ్కులు చూడ్కులు—
సుంద : ఏదో కవిత్వం అల్లుతున్నారే సీతారామారావుగారూ!
సీతా : (సుందరరావుని చూసి) ఓ! మీరా! ఎంత చెత్త సలహా ఇచ్చారండీ. చీర ప్రజంటు చేస్తే విసిరి కొట్టింది కల్యాణి.
సుంద : మీలాంటి వారు ప్రజంటు చెయ్యాలిసింది బేవార్సు చీరల్టండీ! ఇంకానయం! ఏ రోల్డుగోల్డు నెక్లెసో ఇవ్వలేదు!
సీతా : (ఆలోచనగా) దవళ బహుమానం అని తోసేసిందా!
సుంద : కాక పోతే మరేమిటే? చక్కటి ఆభరణం ఇవ్వండి. ఆ మేలిమి బంగారంలో ఆమె ముసిముసి నవ్వులు ప్రతిబింబించక పోతే నన్నడగండి.
సీతా : నిజమేనంటారా ?
సుంద : అక్షరాలా.
సీతా : కాని నన్ను చూస్తేనే ఆమె బుసలు కొడుతోంది. ఇహ ప్రజంటు ఎలా ఇవ్వనండీ?
సుంద : పోనీ, నా చేతికివ్వండి. మీతరపున నేనిస్తాను. నెమ్మదిగా దారిలోకి తెచ్చుకోవాలిగాని, అలా విచారపడితే ఏంలాభం ?
సీతా : మీరిస్తే తీసుకుంటుందా ?
సుంద : నాసంగతి ఇంకా మీకు బాగా తెలియదల్లే ఉంది.
సీతా : (ఆలోచించి) అయితే ఉండండి. ఇప్పుడే వొస్తా.
[ఎడమవైపు గదిలోకి నిష్క్రమించి కొద్ది క్షణాల్లో తిరిగి ప్రవేశం. చేతిలో చిన్న నెక్లెస్ కేస్ ఉంటుంది ]
సీతా : (కేస్ సుందరరావు కిస్తూ) మీరు చాలా తెలివిగలవారని విన్నాను. కొంచెం శ్రమ తీసుకొని ఈ సహాయం చేస్తే మీ మేలు మర్చిపోను.
సుంద : అదెంత భాగ్యమండీ! (జేబ్‌బాగ్‌లో నెక్లెస్ పెట్టుకుంటాడు.) నాశాయశక్తులా తంటాలు పడతాగా.
సీతా : థాంక్సు—ఈ దెబ్బతో ప్రేమించేస్తుందంటారా?
సుంద : ఎవరి కోసం? మిమ్మల్నీ చూసి కాకపోయినా మీగొప్పతనాన్ని చూసి అయినా ప్రేమించదూ?

సీతా : నాగొప్పతనాన్ని చూశా?

సుంద : ఇంత గొప్ప బహుమానం ఇవ్వటంలో మీ గొప్పతనం, మీ ప్రేమలోని గొప్పతనం అద్దంలో కనిపించినట్టు కనిపించటం లేదు టండీ.

సీతా : అవధులు లేని ప్రేమసముద్రంలో మునిగి పోయాను సుందరావు గారూ! (నిట్టూర్పి) సర్వం కల్యాణి మయంగా కనిపిస్తోంది.... కల్యాణీ! (బయటికి నిష్క్రమిస్తాడు.)

(సన్యాసిరాజు ప్రవేశం)

సన్యా : (కరెన్సీనోట్లు ఇస్తూ) ఇదిగో, సుందరావు గారూ. మొత్తం వెయ్యిరూపాయలు. సాధ్య మైనంత తేలికలో పోనివ్వండి.

సుంద : తప్పకుండా. (నోట్లు జేబులో పెట్లుకుం టాడు.)

సన్యా : లెక్క పెట్టుకోండి.

సుంద : ఇంకానయం. దొంగనోట్లేమో చూసుకో మన లేదు.

సన్యా : (నవ్వి ఓ కాగితం చూపిస్తూ) ఓ సంతకం గీకి పారేద్దురూ.

సుంద : ఒకటేమిటీ? ఎన్ని కావాలంటే అన్ని. సంత కాల కేంభాగ్యం! (సంతకం పెట్టేస్తాడు.) ఇంక నాకు సెలవిప్పిస్తారా?

సన్యా : క్షేమంగా వెళ్ళి లాభంగా తిరిగిరండి. ఆ నోట్లు అలా జేబులో పెట్టుకున్నారు. ఎవ డన్నా కొట్టేస్తాడేమో జాగ్రత్త.

సుంద : నాదగ్గిరా!

సన్యా : ఎందుకైనా మంచిది. బాగ్‌లో పెట్టుకో రాదూ?

సుంద : అది ఎక్కడన్నా మర్చిపోతే?

సన్యా : అయితే ఆజేబు గట్టిగా పట్టుకొని మరీ వెళ్ళండి. జాగ్రత.

[సుందరావు నవ్వుతూ జేబులో చెయ్యి పెట్టు కొని నిష్క్రమిస్తాడు. కొద్దిక్షణాలు అలాగే నిలబడి సన్యాసిరాజు ఎడమవైపు గదిలోకి నిష్క్రమించి కొంచెం సేపట్లో నే [గాభరాగా తిరిగి ప్రవేశిస్తాడు]

సన్యా : వరహాలూ. ఒరేవరహాలూ. ఎక్కడున్నా వురా! కొంపమునిగిందిరా.

(గాభరాగా వరహాలు ప్రవేశం)

వర : ఏమైంది బాబూ, ఏమైంది?

సన్యా : నెక్లెస్‌రా - గోల్డు నెక్లెస్ - పో-పోయింది. తాకట్టు సొమ్మురా. పరువు నట్టేట్లో కలిసి పోయింది అలా చూస్తావేంరా? పరిగెత్తి ఇన్ స్పెక్టర్ గార్ని పిలుచుకురారా!

వర : చిత్తం ఏంచెప్ప మన్నారండి ఇనస్పెక్టరు బాబుతో? పోయింది పరువా, తాకట్టాబాబు?

సన్యా : రెండూరా. పోరా. (వరహాలు గబగబ నిష్క్రమిస్తాడు)
హారిభగవంతుడా! ఎవడి పనిరా ఇది?
(సోఫాలో కూలబడతాడు.)
ఆంజనేయస్వామీ, నా సొమ్ము నాకు దొరి కితే నీకు వంద టెంకాయలు కొట్టిస్తా. వెంకటేశ్వరస్వామీ! నన్ను రక్షించు. నీ కటాక్షం వల్లే దొరికిందని ఋజువైతే వెండి తొడుగు తొడిగిస్తా. బంగారు కిరీటం చేయిస్తా. వజ్రపు టుంగరం కొనిస్తాను. (ఆలోచనగా) అఁ- ఇవన్నీ చెయిస్తే అసలు ఖరీదు దాటిపోదూ? (బేరం ఆడుతున్నట్టు) సర్వాలంకరణార్థం అక్షతాం సమర్పయామి.
[చేతులు జోడిస్తుండగా తెర.]

# విజయవాడ రైల్వే డివిజన్

'చక్రధర్'

భారత దేశంలోని రైల్వేలు ప్రభుత్వ యాజమాన్యంలోకి వచ్చాక అవి వివిధమండలాలుగా యేర్పరచబడ్డాయి. తదనంతరం వచ్చిన ముఖ్యమైన మార్పు, యీ రైల్వే మండలాలలో "డివిజనల్" పద్ధతి ప్రవేశపరచే నిర్ణయం. ఆనిర్ణయం అప్పుడే దక్షిణ రైల్వేలోను, సెంట్రల్ రైల్వేలోనూ కొంతవరకు అమలు పరచబడినది. క్రమేణా యితర నాలుగు మండలాలలోనూ "డివిజన్స్" యేర్పాటు చేయబడగలవు.

ఈ "డివిజన్" పద్ధతిని అవగాహన చేసుకోవాలీ అంటే—ముందు పూర్వం వుండిన వ్యవస్థ, "డివిజన్స్" నెలకొల్పబడిన వెనక రూపొందగల వ్యవస్థ, యీ నూతన పరిణామం వలనకలిగే లాభనష్టాలు—వీటి గురించి తెలుసుకోవలసి వుంటుంది.

ఉదాహరణకి "డివిజన్స్" యేర్పడక పూర్వం దక్షిణరైల్వేలో పరిపాలనా వ్యవస్థ మూడంతస్థులుగా విభజించబడి కాస్త సంకీర్ణమై వుండేదనే చెప్పుకోవాలి. అడుగున రైల్వే జిల్లాలు, ఆపైన ప్రాంతీయ ఆఫీసులు, ఆపైన కేంద్రాధికార కార్యాలయం (మద్రాసు) వుండేవి. జిల్లా కార్యాలయాలకు, కేంద్ర కార్యాలయానికి నడుమ వాస్తవానికి ప్రాంతీయ కార్యాలయాలు అనవసరమధ్యవర్తులుగా వుండేవి. జిల్లా అధికారులు, కేంద్రాధికారుల మధ్యనడిచే వుత్తర ప్రత్యుత్తరాలన్నీ ప్రాంతీయ కార్యాలయాల్లో "మజిలీ" వేయడంతో ముఖ్యనిర్ణయాలకు విలంబన జరిగేది అప్పుడప్పుడు. అదీగాక ప్రాంతీయ అధికారులకున్న అధికారాలు కూడా పరిమితంగా వుండేవి. దీనికి పర్యవసానంగా ప్రజానీకంతో కూడిన వ్యాపార విషయాలలోనైతే నేమి, రైల్వేవుద్యోగులకు సంబంధించిన వ్యవహారాలలోనైతే నేమి, కొంతవరకు కాలయాపన జరుగుతూ వచ్చిన మాట యథార్థం—పైగా యిందు మూలంగా పరిపాలనా సౌష్ఠవానికి ముప్పు యేర్పడే ప్రమాదం పొడసూపేసరికి, రైల్వే పరిపాలకవర్గంవారు దాన్ని అరికట్టడానికి అధికారవికేంద్రీకరణ చేయాలని తలపోశారు.

ఈ "అధికార వికేంద్రీకరణ" నిర్ణయం, "డివిజనల్" పద్ధతి స్థాపనతో కార్యరూపం తాల్చింది. ప్రాంతీయ కార్యాలయాలు (Regional offices) మాయమయ్యాయి "డివిజన్స్" నుంచి కేంద్రానికి సరాసరి సంప్రదింపులు జరుగుతున్నాయి. ముఖ్యంగా, ప్రజానీకంతో సంబంధించినంతవరకు వ్యాపారాది విషయాలలోనూ, రైల్వేవుద్యోగుల సమస్యలలోను, డివిజనల్ అధికారి (సూపరింటెండెంట్)కి తన డివిజన్‌కు సంబంధించినంతవరకు దాదాపు సంపూర్ణాధికారాలొసగబడినవి. అంటే శ్రీ అలగేశన్ నిర్వచించినట్లు, డివిజనల్ సూపరింటెండెంట్సు "ఛోటా జనరల్ మేనేజర్స్" కాగలరు ఇందుమూలంగా చీటికి మాటికీ కేంద్రంతో సంప్రతించకనే-పాలసీ వ్యవహారాలలో మినహా - స్వయం నిర్ణయాలు వీరు చేయవచ్చు. ఈ పద్ధతిమూలంగా అటు ప్రజలు 'వార్ఫజీ', 'డెమరేజి,' 'క్లెయిమ్స్' మున్నగు వ్యాపారక విషయాలలో శీఘ్రపరిష్కారం ఆశించవచ్చు; అటు వుద్యోగులు తమ సాధకబాధకాలను త్వరితంగా నివారించుకోవచ్చును.

ఇవిగాక మరో ముఖ్యలాభం వున్నది. "డివిజనల్" పద్ధతికి పూర్వపు వ్యవస్థలో వివిధ డిపార్టుమెంటులు (ట్రాఫిక్, యింజనీరింగ్. మెకానికల్ యిత్యాది) ఏకోన్ముఖంగా వ్యవహరించేవిగాని సాన్నిహిత్యం చెప్పుకోదగినంతగా వుండేదిగాదు. ఆలోపం నిర్లక్ష్యించదగినదిగాదు, అనుకున్నారు. డివిజనల్ పద్ధతిలో యీ డిపార్టుమెంటులన్నీ వొకే వొక వున్నతాధికారి (డివిజనల్ సూపరింటెండెంట్) అజమాయిషీలో పనిచేస్తాయి గనక సమన్వయం

# విజయవాడ రైల్వే డివిజన్

వుండితీరాలి. ప్రతి డిపార్ట్‌మెంట్ దక్షతతో పని చేస్తుండప్పుడు తన్మూలంగా బళ్ళవేగం, రవాణా సౌకర్యాలు, యినుమడించ గలవు వొక్క ముక్కలో చెప్పాలంటే డివిజన్ స్థాయిలో భిన్నత్వంలోంచి ఏకత్వం సాధించబడగలదు.

ఈ స్వరూపాశయాలతో "డివిజనల్" పద్ధతి దక్షిణ రైల్వేలో మున్ముందుగా ప్రవేశ పెట్టబడినది. ఈ మండలంలో యెనిమిది డివిజనులు యేర్పరచ బడుతవి. అవి—తిరుచినాపల్లి, మధుర, బెజవాడ, మద్రాసు, వోలవకోట్, గుంతకల్, మైసూరు, హుబ్లి డివిజనులు.

వీటిలో మొదటగా బెజవాడ, తిరుచినాపల్లి డివిజనులు మే నెల పదహారో తారీఖున స్థాపించ బడ్డాయి. బెజవాడ డివిజన్ ప్రారంభోత్సవం దక్షిణ రైల్వే జనరల్ మేనేజర్ శ్రీ టి. యం. జోసెఫ్ గారు జరపడం విశేషం. ఈ వ్యాసం అచ్చయేనాటికి మిగిలి వుండగలవి మైసూరు, హుబ్లి డివిజనులు. ఆరు డివిజనులు రూపంలోకి వచ్చిన వన్నమాట.

ఇక పోతే, బెజవాడ డివిజన్ వివరాలు పరిశీలిద్దాం. దీని రైలుమార్గ విస్తీర్ణం రమారమి 810 మైళ్లు. ఈ డివిజన్‌లోని వివిధ సెక్షన్‌లు యివి :—

(1) గుమ్మిడిపూండి (మినహా) నుంచి వాల్తేరు (మినహా)

(2) నర్సాపురం నుంచి నిడదవోలు

(3) గుడివాడనుంచి భీమవరం

(4) బెజవాడ నుంచి బందరు

(5) రేపల్లె నుంచి తెనాలి మీదుగా గుంటూరు.

(6) బెజవాడ నుంచి దొనకొండ

(7) గుంటూరు నుంచి మాచెర్ల.

పూర్వపు బెజవాడ జిల్లాలోని ఎన్నూరు నుంచి గుమ్మిడిపూండి వరకు (19 మైళ్లు) వున్న లైను వేరు చేయబడి, కొత్త డివిజన్‌కు 9.7-56 తేదీన గుంతకల్లు జిల్లాలోని మంగళగిరి-దొనకొండ, గుంటూరు—మాచెర్ల శాఖలు అనుబంధించ బడినాయి. (ఈ రెండు లైనుల నిడివి మొత్తం 172½ మైళ్లు) పూర్వపు బెజవాడ జిల్లాలోని ఉద్యోగుల సంఖ్య దాదాపు పన్నెండు వేలన్నరకు మించి వుండగా, కొత్త డివిజన్‌లో దాదాపు 18,900 మంది వున్నారు. ఆ విధంగానే ఆఫీసరుల సంఖ్య 11 నుంచి 24 వరకు పెరిగినది. ఇంతే గాక జీత భత్యాల చెల్లింపులో ఉద్యోగుల సౌకర్యార్థం, అక్కౌంట్స్ శీఘ్రంగా తనిఖీ చేసే సదుపాయం నిమిత్తం, మద్రాసునుంచి అక్కౌంట్స్ ఆఫీసులోని కొందరు-అంటే నూటికి పైగా-గుమాస్తాలు తరలి రాబోతున్నారు, అనతి కాలంలో.

మార్పు అనేది జరిగినప్పుడు ప్రారంభ దినాలలో మంచితోపాటు కొంత చెడుకూడా సహజంగా మిళితమై వుంటుంది. క్రమానుగతంగా ఆ 'చెడు' నివారించబడుతుందని వేరే చెప్పనవసరంలేదు అంటే అట్టి 'చెడు' కి సంబంధించిన వాటిని బాలారిష్టాలుగా జమకట్టవచ్చు, అవి కలకాలంవుండవు గనుక. ఆవిధంగానే కొత్తగా యేర్పడిన బెజవాడ డివిజన్‌లో కొన్ని లోపాలుజరగాయనేది నిర్వివాదాంశం-ఆలోపాలు, న్యూనపరిచే వుద్దేశంతో గాక సవరించబడాలనే కోరికతో వివరించడం అత్యవసరం.

మొట్టమొదటిలోపం బెజవాడ డివిజన్‌స్థాపన విషయంలో ప్రచారం లోపించడం అందువల్ల కొంతమంది వర్తక సంఘీయులకు తప్ప, జనబాహుళ్యానికి 'డివిజన్' అంటూ వొకటి యేర్పడిందనీ, దానివలన ప్రజలకు కలిగే సౌకర్యాలేమిటో, చాలవరకు తెలియదనే చెప్పాలి. అధికారులు యీ విషయంలో ప్రెస్ సహకారం అభ్యర్థించడంలో ప్రమత్తత యెందుకు వహించారో బోధపడడంలేదు మరి.

ఆఫీసు భవనాల యేర్పాటు చూచినా తృప్తికరంగా లేదు. గదులన్నీ ఫైళ్లు, బల్లలు, కుర్చీలలో గుమాస్తాలతో క్రిక్కిరిసి వున్నయ్. కాలుకదపడానికే కష్టంగా, సహజమైన వెలుతురూ గాలీ లేకుండా అవి ఆరోగ్య సూత్రాలకు విరుద్ధంగా నిండిపోయి వుద్యోగులకు క్షేమకరంగా లేవు. ముందు ముందుకొత్త భవనాలు కడతామనే కంటే, డివిజన్ యేర్పాటు నిర్ణయం, దాని ఆచరణల నడుమ తగినంత వ్యవధి వున్నది గనక, డివిజన్ ప్రారంభోత్సవం నాటికి నవీనభవనాలను నిర్మించి వుంచవలసిందేమో! దీనికి తోడు యితర ప్రాంతాలనుంచి వచ్చిన ఉద్యోగులు గృహవసతికి చాల యిక్కట్లకు లోనయారు.

ఈ సందర్భంలో అన్యప్రాంతాలనుంచి వచ్చినవారికి మరో అన్యాయం జరిగింది. అలావచ్చిన

వారిలో కొందరు 'అఫీషియల్'గా బదిలీ చేయబడిన వారు; మరికొందరు ఐచ్ఛికంగా బెజవాడ డివిజన్‌కు వచ్చినవారు. మొదటి వర్గం వారికిమాత్రం యింటి అద్దె అలవెన్సు అంటూ నెలకు ముప్ఫయ్ అయిదు రూపాయలు మంజూరుచేసి, రెండోవర్గం వారికి నిరాకరించారు. వారు తమకై తాము కోరుకుని వచ్చారు అనే నెపంతో! బెజవాడలో గృహవసతిలోపం సర్వ విదితం కాబట్టి యీ విచక్షణ హర్షించలేము. అధికారులు తారతమ్యం చూపకుండా యీ వ్యవహారంలో జౌదార్యంతో ప్రవర్తించి వుండవలసింది. ఇంకో అసలు సమస్య కొస్తే, బెజవాడలోయెన్నో యేళ్ళనుంచి రైల్వే క్వార్టర్స్ (గృహాలు) లేక శక్తికి మించిన అద్దెలభారంతో యెంతో వ్యయప్రయాసలకు లోనవుతున్నవారి మాటేమిటనే ప్రశ్న వస్తుంది. ఈలాంటి విషయాన్ని సాకల్యంగా పరిశీలించి సదృష్టితో కూడిన నిర్ణయం అధికారవర్గాలు చేయగలరనే ఆశిద్దాము.

ఈ లోపాలన్ని తీరిపోతేనే సమర్థనిర్వహణ, పటిష్ఠమైన పరిపాలనా యంత్రాంగాలు యేర్పడగలవు. రెండోపంచవర్ష ప్రణాళిక విజయవంతం చేయడంలో రైల్వేపాత్ర గురుతరమైనదే గనక, ఉద్యోగులలో అటువంటి సమర్థత, సహృది ప్రోత్సాహాలు అత్యంత వాంఛనీయాలు! ఇతర డివిజన్‌లలో వలెనే బెజవాడ డివిజన్‌లో ముఖ్యమైన అభివృద్ధికార్యక్రమాలు తలపెట్టబడినయ్. అందులో యెన్నదగిన కొన్ని యివి:-

(1) బెజవాడ, రాజమండ్రి స్టేషనుల, యార్డుల పునర్నిర్మాణ విపులీకరణలు.

(2) మీటర్ గేజ్ వీలైనంత తగ్గించాలనే సూత్రానుసారంగా బెజవాడనుంచి బందరు, గుడివాడ నుంచి భీమవరం సెక్షన్‌లను బ్రాడ్ గేజ్ లోకి మార్చడం.

(3) గూడూరునుంచి బెజవాడవరకు పూర్తిగా జంటమార్గం వేయడం.

(4) సామర్లకోట, రాజమండ్రి సెక్షన్‌లోకూడా జంటమార్గం యేర్పరచడం.

ఈకార్యక్రమాల మూలంగా రైలుబళ్ళ వేగం హెచ్చడమేగాక, ప్రయాణీకుల సంఖ్య, రవాణా సౌకర్యాలు యితోధికంగా వృద్ధిపొందగలవు. ఇదిగాక లోగడ ఆంధ్రప్రభుత్వం సూచించినట్లుగా కాజీపేట నుంచి నెల్లూరుకు, ఒంగోలునుంచి కడపకు కొత్త రైలుమార్గాలు వేయడానికి రైల్వేవారు కృషిచేయగలిగితే, రైలుమార్గాలు తక్కువగాకలిగివున్న రాయలసీమకు తోడ్పడినవారవుతారు.

ఈ వ్యాసం ముగించేముందు, నూతనంగా అవతరిస్తున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వస్థాపనకి ఒకవిషయం తేవడం అత్యంతావశ్యకం. ముక్కోటి ఆంధ్రులకలలు నిజమైన యీనాడు,ఆంధ్రభూభాగంలోని రైల్వేలన్నీ కలిసి ఒక సమగ్రమైన మండలంగా యేర్పడితే పరిపూర్తి సిద్ధిస్తుందిగదా అనేదిశ సహేతుకం కాదనలేము. ఎందువల్లనంటే ఆంధ్రప్రాంతంలోని రైల్వే ఉద్యోగాలకు యెన్నుకోబడే ఆంధ్రులసంఖ్య హీనంగా వుంటున్నది (దాదాపు 40%). ఇది అభాండం కాదు, యథార్థం. దైనందిన కార్యకలాపాల్లో ప్రయాణీకులు, వ్యాపారస్థులు తమ భాషతెలియని ప్రాంతీయేతరవుద్యోగులతో వ్యవహరించడం చాల యిబ్బంది. ఆ యిబ్బందే పరిపాలనా వ్యవహారాల్లో యెన్నో అవకతవకలను తెచ్చిపెడుతుంది. ఇలాంటి ఉద్యోగాలకు తగినంతగు సమర్థులైన ఆంధ్ర అభ్యర్థులు లేరని యెవరూనమ్మలేరు. ఈలోటు సరిదిద్దడానికి సమగ్ర ఆంధ్ర రైల్వేమండలం, దానికి ప్రత్యేక రైల్వే సర్వీస్ కమీషన్, యెంతగనో సాయపడగలవు.

ఈదృష్టితోచూస్తే బెజవాడ డివిజన్ స్థాపన ఒక మహత్తరకార్యక్రమంలో ప్రథమదశగా భావించవచ్చు. ఆ ఆశయసాధనలో ఆంధ్రప్రజల అభినివేశం, నూత్నప్రభుత్వశ్రద్ధ యేమాత్రం కుంటువడకూడదు. ఈలోగా దక్షులైన అధికారులు, చురుకైన వుద్యోగుల సమిష్టికృషితో బెజవాడ డివిజన్ చిరులోపాలను అధిగమించి పురోభివృద్ధి గాంచగలదని హృదయపూర్వకంగా కాంక్షిద్దాం.

# విద్యా జగన్నాథులు

శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ

విద్యానాథుడు, జగన్నాథు డిద్ద రాంధ్రులు విద్యాధికారులు. సాహితీవిద్యాస్వరూపతత్త్వములను సహృదయుల కందించిన పాండిత్య వైదగ్ధ్యాద్వైతమూర్తులు. విద్యానాథుడు కాకతీయ సామ్రాజ్య జగమేలిన సారస్వతేయుడు. విద్యానాథునకు గిరాందేవత విద్యాకైరవ కౌముది. సారస్వత ప్రక్రియా బీజన్యాసభూస్వామియై కవితానాట్యము నిర్దేశించిన సుకృతి విద్యానాథుడు ప్రతాపరుద్ర యశోభూషణము పేరిట అలంకారశాస్త్ర సర్వస్వ సంగ్రహముగా కావ్యాలంకార సంగ్రహము రచించినాడు. ఆంధ్రానాంధ్రావనులందంతట నది యలంకార ప్రథమాంతేవాసుల కారాధ్యమయినది.

"రసప్రధానాః శబ్దార్థాః
గుణాలంకారవృత్తయః
రీతయశ్చేయతీశాస్త్ర
ప్రమేయం కావ్యపద్ధతిః"

అని యని కావ్యమువలని కర్తవ్యతాధీ సరసమని రసికుడై యనినాడు. కాంతాసమ్మితి కావ్యశ్రీ సరసత నాపాదించుననినాడు. ఉత్తమపురుష చరిత నిబంధనము లేకున్నచో కావ్యము పరిత్యాజ్యము. అందుననె "కావ్యాలాపాంశ్చ వర్జయే" త్తని పెద్దలనిరట.

విద్యానాథుని నిగమన మిట్లున్నది. "రసమహనీయ కావ్యమునకె గుణాలంకార విలసనము. అదియు విశిష్ట శబ్దార్థముల హృదయానంది యగును. అమృత మాధుర్య సుభగమయిన శబ్దార్థముల యున్మేషమును పుణ్యశ్లోక చరిత నిబంధనమున రాణించును" అని.

ఇట్లనిన నాథుడును శబ్దార్థములు కావ్యమని సంప్రదాయ మనుసరించితినని యాత్మభావనము చేసికొనెను. కావ్యసంపద కాంతాసంపద. జీవితము వ్యంగ్య వైభవము. విద్యానాథుడు తాను గుర్తించిన సాహిత్య మర్యాదలను పొదిపి పొదిపి యందించినాడు. "రచన రసవ్యంజకము. రసానుగుణవర్ణ రచన దోషమనినారుకదా! రసావస్థానసూచకములు నాలుగు వృత్తులు రచనాశ్రితములై యుంట రసమార్గము వైదర్భ్యాదిరీతులు శబ్దగుణాశ్రితము లర్థవిశేష నిరపేక్షములు సందర్భములోని సౌకుమార్య ప్రౌఢత్వములనె చూచునని వామనుడు వినకుండునట్లు పలికినాడు. వైదర్భి గౌడి పాంచాలి రీతులె చెప్పినాడు. "ఆంధ్రమును విదర్భులు గౌడులు పాంచాలురు పంచుకొనుడు!" అని తనకు తానై యనలేదు. కాని తాను కవితానాట్యములో "ఆంధ్రరీతి" సూచించినాడు.

పదముల పరిమైత్రిని శయ్యగాజేసి యర్థగంభీరిమతో పాకము హృదయంగమ మొనర్చినాడు. శబ్దాలంకార ప్రధానములు నాథుని దృష్టిలో క్షుద్ర ప్రబంధములు. తాలసంబద్ధములు, వాసచిత్రములు, విభక్తి భక్తికములు, విభక్త పునరాకృష్ట శబ్దములు, వాక్యాడంబరసంయుక్తము లాలంకారిక విద్యానాథునకు క్షుద్రములు. రూపకములు చెప్పవాని భేద ప్రభేదములు నిర్దేశించి, సంధి సంధ్యంగములను వివేచించి, రూపక రచనాసామర్థ్యము నిరూపించుటకై యత్నించిన విద్యానాథుడు సర్వప్రబంధములకు రసము జీవితమని నిర్దేశించినాడు.

రసము నాయకాశ్రయమె నటుడు నిపుణముగా ప్రదర్శించినచో సామాజికులు సాక్షాత్కరించుకొందురు. భావించి సంభావింతురు. రసము వారలకు నిరతిశయానందజననము అని యనినాడే కాని సామాజికాశ్రయత్వమే చెప్పినాడు. నటుడు ననుకరణమాత్రపరుడు. రసాశ్రయయోగ్యత వానికి లేదని యనినాడే కాని నటునకును భావకత్వ మంగీకరించినాడు. నటుడును భావకుడయినచో వాడు సమాజికుడు. నటుడు శిక్షాభ్యాసపాటవమున సర్వము ఘటింపగలడు. ఇది రసకథ. రసములలో పరస్పర విరోధమున్నను కవి ప్రౌఢుడై సమావేశింప జేయగలడట. రసమున రస ముదయించునని శృంగారతిలకుల భావమాభాషించినను భారతీయ ప్రక్రియ ననుసరించి రసమొక్కటియే అని విద్యానాథుడు చెప్పకతప్పలేదు.

విద్యానాథుడు భావించిన రసరీతి నవము కాదు. అనవమును కాదు. భావవిభవమొక్కటి గుణాలంకారప్ర

పరిష్కృతమై ప్రాదుర్భవించి వేద్యాంతర మంతయు పోగొట్టును. సహృదయునం దది పూర్ణరసఘనమై పరిణమించి అమందానందాత్మక మగును. భావములె క్రమముగ పరస్పర విభవము కలవై రసీభావము పొందుచున్నవి. రసము వాక్యార్థము. విభావాది భావనలు పదార్థములు. అవి రసమున సముచిత విశ్రాంతి పొందును. రత్యాది స్థాయి వర్ధమానమై యుండగా భావములు పొంగి చల్లారును. నిజాస్వాదాతిశయమై రసమై సామాజికుని సరసీకరించుచున్నది. ఇట్టి నాథుని రసపథముచూచి మల్లినాథుని కుమారుడు కుమారస్వామి సోమపీథి —

"యా స్థాయిభావ రతి రేవ నిమిత్త భేదాత్
శృంగార ముఖ్య నవనాట్య రసీభవంతి
సామాజకాన్ సహృదయాన్ నటనాయకాదీన్
ఆనందయేత్ సహజపూర్ణ రసోస్మి సోహమ్"
అనుకొనినాడు.

రసము చెప్పుటతో నాథుడాగలేదు. గుణములు వివేచింపవలయునని తలచినాడు. దోష నిరూపమున్న గాని గుణ వివేకము కలుగదు. శబ్దార్థ గోచరములయిన దోషములు కావ్యాపకర్ష నాపాదించును. వాని దూరీకారమూరీకరింపవలయును. ఇంక నెన్నెని దోషముల నూహింపవచ్చునట. రసభావములకు స్వశబ్దవాచ్యత దుష్టమే. ఇది నాథరీతి.

ఇరువదినాలుగు గుణములు ధ్వనిపథికులు పలుకరు కదా! విద్యానాథుడు ధ్వని పథ్యాలో సంచరించి తన భోజుని గౌరవించుటకు గుణముల నన్నిటి జెప్పినాడు. డెబ్బదియై దలంకారములను నిరూపించి తన గ్రంథమొక యలంకారశాస్త్రగ్రంథమయిన దనిపించుకొనినాడు. అలంకారములను వర్గీకరించి రుద్రకుని సూత్రమును జయరథుని విమర్శనమును పట్టిపట్టి తాను చేయవలసినంత చేసినాడు. విద్యానాథుడు మనవాడు. ఆంధ్ర తరణమునకు తానొక యలంకారశాస్త్రమిచ్చి మావారందరు చదువవలెను. అని భావించి యుండును. సంస్కృతముఖులందరొకనాడు ప్రతాపరుద్రీయము పఠించిరి. అంతటితో కొందరాగిరి. మతి కొందరింకను సాగిరి. ప్రతాపరుద్రీయములోని పద్యములు మనోజ్ఞములని" "రత్నశాణము" పలికినది.

"విద్యానాథః కథమపి బహూన్
రకరాత్ శాస్త్ర జాలాత్ |
సంజగ్రాహ ప్రకృతి కఠినే
రత్నజాలం కరంఢే||"

రత్నముల నెన్నిటినో కూర్చినాడట. అట్టి దిది తెలుగు లాక్షణికులకు సుబోధము కావలెనని భట్టుమూర్తి గట్టి చేసినాడు. కాని సన్నిధానము సర్వము సన్నిధానములో నుంచుట విద్యానాథునకు నిధానమయినది. ప్రతాపరుద్రీయ మలంకారశాస్త్రము నవ్యుల కందరకు దివ్యవాణీపుష్టి, తుష్టి, సంపాదించునది కావలయునని "నవ్య సాహిత్య పరిషత్" వ్యాఖ్యాగత సర్వ విషయములతో సవిస్తరముగా ననువదింపజేసి యందించినది. ఆనాడు విద్యానాథునకు ఓరుగల్లు పాలకుడు నేనున్నా ననినాడు.

జగన్నాథుడు పండితరాజ జగన్నాథుడు. ఆతడే జగన్నాథ పండితరాయలు. ప్రతాపరుద్రీయ విద్యాకర్త నవవిద్యావంతుడు కాగా రసగంగాధర రచయిత, రసజగన్నాథుడయినాడు. ఢిల్లీ పట్టణములో మొగలాయీ చక్రవర్తి షాజహాన్ దర్బారులో "దారాషుకో" ఛత్రచ్ఛాయలో పండితరాయలై జగన్నాథుడు విద్యాజగములో నాథుడయినాడు. ఒకనవకాదంబిని అతని మతిమంబనము చేసినది. సర్వవిద్యాధరుని కుమారుడాతడు. అతని తండ్రి పేరు భట్టు. లీలచే పాషాణము పీయూషము పిండెడిది. మననిమగ్నుడై లలిత రసగంగాధరమును తెచ్చిన జగన్నాథుడు సచేతసుల హృదయము నలంకరింపజేసినాడు. ఇకయితరాలంకారములకు గర్వ మెట్లుండును. సహృదయధురీణులు కొందరు అర్ధపరిష్కార మొనరించిన ఏమాయెను జగన్నాథుని శ్లేశము గతార్థము కాదు స్వయము నిర్మాణదక్షుడై మనన తరతీవ్ర విద్యార్థివుడై జగన్నాథ పండితనరేంద్రుడు కావ్యమీమాంస యొనర్చినాడు. "రమణీయార్థ ప్రతిపాదక శబ్దము" కావ్యము లోకోత్తరాహ్లాద మనుభవసాక్షికము. కావ్యకారణము కేవల ప్రతిభ యొక్కటి. ప్రతిబంధకములు లేకున్నచో చక్కని కావ్య ముదయించును. ఉత్తమోత్తమ కావ్యము ధ్వని. ఉత్తమ మధ్యమాధములు తరువాతివి. కొన్నిటిలో వ్యంగ్యము చక్కగ గోచరింపదు. నాగరికేతర నాయికలు కల్పించిన కాశ్మీరరాగ విగీర్ణమయిన నిజాంగగౌరిమవలె వ్యంగ్యము స్ఫురింపదు. వివాచ్యమేని ప్రతీయమానము స్పృశింపక రమణీయత సాధించజాలదట. పండితరాయల రస నిర్వచనము అతని కావ్యమీమాంసను "రసగంగాధరము" చేసినది. కావ్యానందము లౌకిక సుఖాంతరసాధారణ కాదు. భగ్నావరణచైతన్యమై

# విద్యాజగన్నాథులు

రసము. ఇదే జగన్నాథ రసరథము. రసమీ ప్రపంచమున పరమాహ్లాదియై రమణీయత నాదానించును.

జగన్నాథు లున్నారు. పండిత జగన్నాథు లున్నారు. పండితరాజ జగన్నాథు డున్నాడు. అతడే ఈతడు. కావుననే వీర భేదములలో పాండిత్యవీరము జగన్నాథుని గణనములోనికి వచ్చినది. గిరాంపతి పలుకని, వాచాదేవి వాకొనని, నేనున్నాను అనువాడు పండితరాయ లొక్కడే! రసగంగాధరము రచనామర్యాదలు చూపి ప్రౌఢపరిష్కారము లిచ్చినది. అక్షర తపస్వి జగన్నాథుడు వర్ణముల వర్ణములు గుర్తించినాడు. అనుకూలప్రతికూల వర్ణములు వానికే తెలిసినవి. సుధా మధురమయిన నిర్మల వాచాశిక్షణము జగన్నాథుని సొత్తు. అనర్ఘవీచులు సుపరిష్కృతము లొనరింపని కొన్నిటిని వారి పక్షమువహించి పరిష్కరించినాడు అటునుండి ఇటు కావ్యరచనాపటు ప్రజ్ఞు లెవరో! వారేరీ! పలుకుడు! పృద్వీకామసృణ రసమాధురీభాగ్యముకల వాచామాచార్యత నావలె ననుభవింపగలవా డెవ్వడు. నేను నేనే యని వాడే వాకొనెను. పండితరాయల దృష్టిలో వ్యంగ్యమష్ట మూర్తి ధరమై భాసించినది. రసగంగాధర మాతనిది ధ్వనిభాష్యము. వ్యాకరణములో పతంజలిభాష్యమున్నది. వేదాంతములో శంకరభాష్యమున్నది. సాహిత్యదర్పణములో జగన్నాథ భాష్యమున్నది. ఆలంకారిక తంత్రము స్వతంత్రమని పండితరాజు బాజా వాయించినాడు. పీయూష యూష కల్పమయిన అల్పమయిన నాకు నేని త్రావిన వారికి జగమున నేమియు ఇష్టము కాదు.

"మద్వాణి మాకురు విషాద మనాదరేణ
మాత్సర్యమంద మనసాం సహసా బలానాం
కావ్యారవింద మకరంద మధువ్రతానాం
ఆస్యేషు మాస్యసి సతాం విపులం విలాసం"

కొందరున్నారు వారనుసరింతురులె! అని జగన్నాథుడు భావించినాడు.

నేడు లోకములో సాహితీ తంత్రీనాదములు సుస్వరములతో సుశ్రుతులతో నుండుటకు పండితరాజ పదారాధనము కావలయును. రసగంగాధరము నవరసగంగాధరముగా, నవతరించినది. రసగంగాధరమణి వచ్చినది. ఇంక నెన్నో రావలసియున్నవి. ఇది జగన్నాథ రసపదవి. విద్యానాథ జగన్నాథులు విద్యాజగములో నాథులయినారు. మనము సనాథులమయినాము. సాహితీ నాథులు నవసృష్టి సంపాదించుటకు విద్యాజగన్నాథావశ్యకత ఎంతేని యున్నది.

# రాయసామ్రాజ్యము: హిందూసంస్కృతి

నేలటూరి వేంకట రమణయ్యగారు

14 వ శతాబ్ద ప్రారంభముతో దాక్షిణాత్య హిందూ రాజ్యములకు ప్రళయకాలము సంఘటిల్లినది. అప్పుడు దక్షిణ భారతమున వర్ధిలుచుండిన రాజ్యములు ఐదు. పశ్చిమమున దేవగిరి ద్వారసముద్ర యాదవరాజ్యములు రెండు; తూర్పున ఓరుగంటి కాకతీయరాజ్య మొకటి, దక్షిణమున మధురపాండ్య రాజ్య మొకటి. ఈ నాల్గును ప్రధానమైనవి. ఇవి గాక కర్ణాటాంధ్రముల కూడలియందలి కంపిలి రాజ్యము. విస్తీర్ణమందు కడు చిన్నదైనను పరాక్రమాతిశయము వలన పై నాలుగు రాజ్యముల సంగతిని పేర్కొనదగి యున్నది. మహమ్మదీయుల యాగమున మీ రాజ్యముల కన్నిటికిని ముక్కవాలైనది; వారి తాకున కాగజాలక అవి యొకదాని వెంట నొకటి సత్వరముగ గూలిపోయినవి. 1314 వ సంవత్సరమున దేవగిరి యాదవ రాజ్యమును, 1323 వ సంవత్సరమున కాకతీయ పాండ్య రాజ్యములును, మరి మూడేండ్లు గడచిన వెనుక కంపిలి రాజ్యమును మహమ్మదీయులకు హస్తగతము లాయెను. ద్వారసముద్రపాలకుడైన ముమ్మడి బల్లాళదేవుడు మాత్రము మహమ్మదీయుల కరిగాపై వశవర్తియైచరించుటవలన తన ప్రభుత్వమును నిలుపుకొనగలైను. అంతట నాసేతు శీతాచలపర్యంతవ్యాప్త సమస్త భారతావనియు యవనాక్రాంతమైపోయినది. హిందూ స్వాతంత్ర్య మెల్లయెడల నడుగంటిపోయినది.

మహమ్మదీయుల యాగమనముచే విధ్వస్తమైపోయినది హిందూస్వాతంత్ర్య మొక్కటియె కాదు; స్వాతంత్ర్యముతో పాటు సనాతన హిందూ ధర్మమును, సంస్కృతియు నధోగతి జెందినవి. స్వాతంత్ర్యమె సంఘక్షేమ సౌభాగ్య పురోవృద్ధులకు పునాది. ఆ స్వాతంత్ర్యము నష్టమైపోయిన పిమ్మట దానిపై నాధారపడి యుండు స్వధర్మసంస్కృతులు వినాశమగుట సహజమె కదా. స్వాతంత్ర్య నాశముకంటె హిందూ ధర్మ సంస్కృతుల చేడ్పాటునకు మరియొక ప్రబలకారణము కలదు. ఇది మహమ్మదీయుల పరధర్మ ద్వేషము, తమ మతమె సత్యాత్మకమనియు, పరమతములు కైతవములనియు, గావున వానిని రూపుమాపి సత్యస్వరూపమైన నిజమతమును అభివ్యాప్తినందించుట విధ్యుక్తకర్మయనియు వారి దృఢవిశ్వాసము; కావున వారే జనపదమును జయించినను నా జనపదవాస్తవ్యులకు మహమ్మదీయ మత దీక్ష నొసగుటకు సర్వవిధముల ప్రయత్నించెడివారు. సామ మార్గము ఫలవంతము గానిచో నిర్బంధముమీదనైన కడకను నెరవేర్పుకొనెడివారు. ఈ క్రింది గీతమున వారి స్వభావము చక్కగ వివరింపబడి యున్నది:

సామూల శెవులట్టి నామాలు నాకేసి
నీ మాలుపోగొట్టి నామాజ్ శేస్తాం
అయ్యాల ముక్కట్టి రొయ్యాలు దిన్పించి
సయ్యేద్ సాహెబ్ చేసి సాపు చేయిస్తాం

నిక్కు గుబ్బెతల తక్కులు సల్పించి
అక్కడి కక్కడే నిక్కా చేస్తాం
రాణీవాసామూలా మానాముగా దెచ్చి
కానీ కా సర్దార్ జనానా కిత్తాం.

వీరి రాకవలన ఆంధ్రదేశ మెట్లు బాధింపబడి యలమటచెందెనో అప్పటి శాసన గ్రంథకర్త యొక్కడిట్లు వర్ణించియున్నాడు.

కేచి ద్ధనాఢ్యాః పరిబాధ్యమానా
ధనాయ పాపై ర్వివిధై రుపాయైః
కేచి న్నిరీక్ష్యైవ చ పారశీకాన్
పయ్యన్ త్యజన్ ప్రాణ నభస్వతోఽన్యే॥

ద్విజాతయ స్త్యాజిత కర్మ బంధా
భగ్నాశ్చ దేవ ప్రతిమాస్సమస్తాః
విద్వద్వరిష్ఠై శ్చిరకాల భుక్తా
సర్వేఽప్య పారిప తాగ్రహారాః॥

ఆత్తే కర్షణ లాభే పాపై
  ర్యవనై ర్బలాత్కారాత్
దీనా దీనకుటుంబాః కృషీవలా
  నాశ మాపన్నాః
ధన దారాదికే నృణాం
  కస్మిన్ శ్చిదపి వస్తుని
స్వాయత్తతా మతిర్నాభూ
  ద్భువి తస్యాం మహాపది॥
పేయాస్సురా గో పిశితం చ భోజ్యం
  లీలావిహారో ద్విజఘాత నంచ
అశ్రాన్త మాసీ ద్యవనాధమానాం।
కథం ను జీవే ద్భువి జీవలోకః॥
ఇత్థం తై ర్యవనభటైః
ప్రబాధ్యమానం తైలింగ
ధరణీతలం సురారి కల్పైః।
త్రాతారం కమపి హృదా
ప్యవిందమానం సంతేపే
వన మివ దావవహ్ని జుష్టం॥

ఇట్లు మహమ్మదీయుల రాకవలన దేశీయ జనతయు ధర్మశ్రీయును సంభవించిన దొక యాంధ్రావని యందు మాత్రమె కాదు, దక్షిణభారతమంతయు వారి దౌర్జన్యమును సహింపజాలక అల్లలిపోయినది. ద్రావిడ స్థితిని గంగాదేవి మధురా పురంధ్రిచే నిట్లు వివరింప జేసినది.

దక్షిణాశాదిశ యదక్షిణాశాదిశ యయ్యె
సుందరేశ్వరు డసుందరేశ్వరు డయ్యె
మధురాపురి యమధురాపురి యయ్యె.

ఇప్పు డప్పురి వ్యాఘ్రపురి యనుటకు దగి యున్నది; శ్రీరంగనాథుని యాలయము పాడుపడి శిథిలమై కూలిపడ సిద్ధమై యున్నది. ఇటుకలు రంగశాయిపై బడునని భయము జెంది ఆదిశేషుడు దన పడగలను గప్పి సంరక్షించుచున్నాడు; ఇక చిదంబర కనక సభాపతి స్థితి నేమనుదాన, సాలెపురుగుల గూండ్లా దేవునికి మొలకట్లైనవి; గజదైత్యుని సంహరించి నందుల నడవి యేనుగులు కినిసి తమ కర్కశ దంతము లతో గ్రుమ్మి తమ కులము పగదీర్చుకొనుచున్నవి శివ కేశవులకె ఈ దుర్గతి పట్టినప్పుడు చిల్లర దేవతల మాట వేరుగ విచారింపవలయునా? వారి ఇక్కట్టులు గూడ 'కవాట సంపుట ప్రతతుల బుశ్వలు చేరి తొల్వ గృహ సంఘులగడ్డిపట్టి గర్భతలము లెల్లెడ న్వీరిగి పైబడనున్న దశను తలచుకొనిన దుఃఖము నాపుటకు శక్యము గాక యున్నది. మున్ను మృదుమృదంగధ్వానములు మారు మ్రోగుచుండిన దేవకులములు నేడు నక్కల యూళల కాశ్రయములైనవి. ఇక ద్విజాతుల గతి నాలకింపుడు: హోమధూమసౌరభములచే నావృతములైన బ్రాహ్మణాగ్రహారములందు వేపుడు మాంసముల గదుసుకంపు గుబులుకొనుచున్నది; వేదవాదములు ప్రతిధ్వనించు చుండిన చోట్ల తురుష్కుల వికృత సింహనాదంబులు జెలగుచున్నవి. ఎచ్చట నారీమణుల యందెల రవళి చెవుల కింపుగొల్పుచుండెనో అచ్చట ద్విజాతుల కాలి సంకెలల చప్పుడు కర్ణవిదారణము సేయుచున్నది స్త్రీల మైపూత గంధముచే వాసితమైన తామ్రపర్ణీ పూరము తురుష్కులు అనుదినము చంపు గోసహస్రముల రక్తధారలచే నెఱ్ఱనై రక్తస్రవంతియై పరిణామ మందినది.

"అంతర్హితంబయ్యె నకట వేద విరావ
  మడగిపోయె నపో నయంబు శంబు
ధర్మశ్చృత్తింబార। దారిలేనిద యయ్యె
  జారిత్ర పరిశుద్ధి చదలగలసె
సుకృతాభిధేయంబు సొదజొచ్చె నద్దిరా
  యాభిజాత్యం బస్తమయము నందె
వెనుకటివలె దేవవిభుడు వర్షింపడు
  వసుధ యీ నేరదు వసుసమృద్ధి
యవనులు హరింప మిగిలినయట్టివారి
  శమనుడు హరింపజొచ్చె ననయమనక"—

అని యెంగలార్చెనది మధురాపురాధి దేవత.

ఉదాహృతమైన సమకాలిక శాసనగ్రంథ సాక్ష్యమువలన మహమ్మదీయులచే హిందువు లప్పుడెట్లు హింసింపబడినదియు దెల్లము కాగలదు; కాని ఈ దురవస్థ చిరస్థాయి కాలేదు; స్వల్పకాలముననె మహమ్మదీయుల యధికారము కూలబడినది. వారు పెట్టు ఈతిబాధలకు దాళజాలక ఆంధ్రులు తిరుగుబాటు చేసి ముసునూరి నాయకుల యాధిపత్యము క్రింద ఘోరముగ పోరి వారిని వెడలనడచి దేశమును మహమ్మదీయ దాస్యమునుండి విడిపించి జాతీయ స్వాతంత్ర్యమును పునరుద్ధరించిరి; ఆంధ్రదేశ చరిత్రయందది మహోజ్వలతమమైనఘట్టము. భరతఖండము నందు జరిగిన ప్రథమ జాతీయ స్వాతంత్ర్య సంగ్రామ

మిదిరెను. ఖైబరునుండి కామరూపము వరకును శీతాచలమునుండి సేతువుదాకను హిందూప్రజ సమస్తమును తురకల కాటువడి, జాతీయ స్వాతంత్ర్యమును గోలుపోయి యధోగతిపాలయి నవయుచుండిన కాలమున ఆంధ్రులు మొండిధైర్యముతో వారి నెదిర్చి పారదోలి తమ స్వాతంత్ర్యమును పునరుద్ధరించుటయె కాక దాక్షిణాత్య భారతీయ పారతంత్ర్య విముక్తికి మార్గదర్శకులగుట సంస్తవనీయాంశమే కదా. వారి జాత్యభిమానమును శౌర్యపరాక్రమాదులను తలంచి వారి సంతతి వారమైన మనము గర్వపడుట సహజమే కదా. ఇట్లు అసామాన్య పరాక్రమమును ప్రదర్శించి జాతీయ స్వాతంత్ర్యమును పునరుద్ధరించినను దానిని స్థిరముగ నిలుపుకొనజాలక పోయిరి దీనికి ప్రబలమైన కారణము వారి యనేకత్వమే. ఆంధ్రజాతియొక్క సహజగుణములం దైకమత్య మొక్కటి కాదు 'ఎవరికివారే యమునాతీరే' యను లోకోక్తిలోని సత్యము వారికి సంపూర్ణముగ నన్వయమగుచున్నది. కుల ప్రత్యేకతల మాటల నటుండ నిచ్చి రాయలసీమ, తెలంగాణ సర్కారులు మున్నగు ప్రాంతీయ ప్రత్యేకతలను నిలబెట్టుకొనుట కొరకు కొట్లాడుచుండు మనకు ఇది విపరీతముగా గన్పట్టరాదు. నాటికిని, నేటికిని మన జాతి స్వభావము మారక యట్లె నిలిచియున్నది. శత్రుముఖమున ఆంధ్రులెల్ల గూడిమాడి యేకమై పోరాడి స్వాతంత్ర్యము నార్జించినను ఆ శత్రువు తొలగిపోయిన పిమ్మట నైకమత్యమే బలమనుటను విస్మరించి ముసునూరు నాయకుల యేకాధిపత్యము నొల్లక స్వాభిమానపరులైన దొరలు పెక్కండ్రు పోరాడదొడగిరి. వీరిలో నద్దంకి కొండవీటి రెడ్లును రాచకొండ వెలమనాయకులును ప్రముఖులు. వీరికి ముసునూరివారి యాధిపత్యము గిట్టలేదు. కావున వారి యాధిపత్యము నెట్లయిన గూలద్రోసి స్వతంత్రులగుటకు ప్రబల ప్రయత్నములు సేయదొడగిరి. రెడ్లకంటె వెలమలె ముసునూరివారికి ప్రక్కలోని బల్లెమువలె బాధింప నారంభించిరి యుక్తాయుక్తములను పరిగణింపక హిందూజాతికి సహజ శత్రువులైన మహమ్మదీయులతో జెలిమిచేసి వారి సహాయము వలన ముసునూరి కాపయ నాయకుని వధించి యోరుగంటితోకూడ తెలింగాణమును సర్వము నాక్రమించుకొనిరి. తాత్కాలికముగ లాభకరమైనను తురకలతోడి పొందు కాలక్రమమున ననర్థకారియై వెలమల నాశనమునకె కాక తెలింగాణ దాస్యమునకును దారి చూపినది. కాపయ నాయకుని మరణముతో దేశైక్యభావము మంటగలిసిపోయినది. ఏకాధిపత్యమునకు బదులు బహునాయకత్వమైనది మాత్స్యన్యాయము ననుసరించి బలవంతులు దుర్బలులను హింసింప గడగిరి. తుదకు తెలింగాణమున వెలమ రాజ్యమును తీరస్థాంధ్రమున రెడ్డిరాజ్యమును విజయవంతములై నిలిచినవి. వీనితోగూడ ఆంధ్ర కర్ణాట సంయోగ ప్రదేశమున వెలిసిన విజయనగర రాజ్యమునుగూడ చేర్కొన వలసి యున్నది. దాని చరిత్ర ఇంచుక భిన్నమైనది. విజయనగరమునకు కంపిలిరాజ్యము కుదురు. ఆ రాజ్యము మ్లేచ్ఛాక్రాంతమైనప్పుడు అచటి రాజకీయోద్యోగులలో ప్రముఖులను ఢిల్లీ సుల్తాను బందీకృతులను గావించి తనతోగూడ కొనిపోయి వారికి బలాత్కారముగ మహమ్మదీయమతము నొసగి చెంత నుంచుకొని యుండెను. తీరస్థాంధ్రమున స్వాతంత్ర్యోద్యమప్రాబల్యమువలన మహమ్మదీయుల యధికారము నశించుట జూచి కంపిలి ప్రజలుగూడ విజృంభించి సుల్తాను యొక్క ప్రతినిధిపై తిరుగబాటు చేసి యతని నానెగొందినుండి వెలుపలికి రానీయక యరికట్టిరి. వారికి సహాయులై తూర్పున తెలంగాణమునుండి చాళుక్య సోమదేవరాజును పశ్చిమమున కర్ణాటకమునుండి హొయ్సలముమ్మడి బల్లాళరాయలును వచ్చి రాష్ట్రమును జాలభాగము నాక్రమించుకొనిరి. ఈ వర్తమానము దెలియవచ్చినంతటనె సుల్తాను కంపిలి రాజ్యమును సంరక్షించుటకొరకు పూర్వము తాను ఖైదుగొనితెచ్చి నిర్బంధమం దుంచియుండిన యుద్యోగిజనులను బంధనము వాపి వారిలో ప్రధాన పురుషుని కంపిలికి ప్రతినిధిగ నియమించి కొంత సైన్యమునిచ్చి యంపెను. అతడు కంపిలి రాజ్యమును ప్రవేశించినంతటనె బల్లాళరాయునితో యుద్ధమున కారంభించెను. కాని జయలక్ష్మి యతని వరింపదాయె; రణమున సైన్యము ఛిన్నాభిన్నమైపోయెను. అంతట చేయునదిలేక తుంగభద్రాతటమున పంపాక్షేత్రమున తపము సేయుచుండిన విద్యారణ్య యతీశ్వరుని యాశ్రమమునకుబోయి యతని సహాయము నర్థించెను. రెండు నియమములకు అతడొప్పుకొను పక్షమున సహాయ మొనర్తునని విద్యారణ్యులు వాక్రుచ్చిరి. ఒకటి, అతడును అతని తోడి

వారును మహమ్మదీయ మతమును త్యజించి మరల హిందూధర్మమును స్వీకరింపవలయును; రెండవది, పంపాపతి విరూపాక్ష దేవుని రాజ్యమున కొడయునిగ నంగీకరించి తాను ఆ దేవుని ప్రతినిధియై రాజ్యము సేయుట కొప్పుకొనవలయును. ఈ నియమముల కాతఁ డొప్పుకొనెను. విద్యారణ్యస్వామి యాతనికి ధనమిచ్చి శత్రులనోడించు మార్గమును చూపెను. అతఁడంత శత్రువులను జయించి పారద్రోలి కంపిలి రాజ్యమును సర్వమును స్వాధీనపరచుకొని యానెగొంది రాజధానిగ ప్రజాపాలనము సేయఁగడఁగెను. అచిరకాలముననె విద్యారణ్యస్వామి, ఆరాజ్యముయొక్క భావిగరిష్ఠతను గ్రహించి యానెగొంది దానికి తగిన రాజధాని కాదని నిశ్చయించి తుంగభద్ర యొక్క యవ్వలి గట్టున విరూపాక్ష స్వామివారి యాలయపరిసరమున విజయనగరము నూతన నగరమును నిర్మించి దానిని ఆనూతన రాజ్యమునకు రాజధానిగ నొనర్చెను. విద్యారణ్య నిర్మితమగుట వలనను సమస్త విద్యల కిరవగుట వలనను దానికి మొదటినుండియు విద్యానగరమని నామాంతరము గలిగినది. ఆ పురము పేరిట దాని క్రింది రాజ్యమును విజయనగర సామ్రాజ్యముగా ప్రసిద్ధి కెక్కెను.

ఈ విస్మృత రాజ్యముల మాట ఇప్పుడింత దూరమేల చెప్పవలసి వచ్చినదనగా నవి హిందూసంఘమునకు జేసిన మేలును విశదపరచుట కొరకె. వానికృషి మూలముననె ఆర్య ధర్మములు ఉత్తర హిందూస్థానమునందు వలె సంకరము గాక నేటి వరకును దక్షిణభారతమున వర్తిలుట. దేశైక్యము విచ్ఛిన్నమై పెక్కు చిన్న సంస్థానముల కెడమిచ్చినను ధర్మోద్ధరణ కార్యము సర్వత్ర చక్కగనే సాగినది. ముసునూరి నాయకులును వారితోపాటు రెడ్లును, వెలమ దొరలును, తక్కిన సంస్థానాధిపతులును జీర్ణమై పోవుచుండిన ధర్మమునకు ప్రాణముపోసి సంరక్షించిరి. వారు సంరక్షింప నడుముగట్టిన ధర్మమునకు దేవబ్రాహ్మణ ధేనువులు ముఖ్యచిహ్నములు, ఈ మూటిని సంరక్షించి పెంపొందించిన లోకకల్యాణముగలుగునని వారియభిప్రాయము. కావున వారు మహమ్మదీయుల దుండగముల వలన సంభవించిన దురవస్థను తొలగించి హిందూ సంఘమును పూర్వపు స్థితికి దెచ్చుటకు దమ యావచ్ఛక్తిని వినియోగించిరి. శిథిలమైన దేవాలయములను బాగు పరచిరి; నూతనముగ పెక్కింటిని నిర్మించిరి; తురకలు హరించిన బ్రాహ్మణాగ్రహారములను వారికి మరల తీసియిచ్చుటయే కాక క్రొత్త బ్రహ్మదేయములను గల్పించి యజ్ఞాది క్రతువులు సల్పుటకును, వేదాధ్యయనము సేయుటకును సకల శాస్త్రములను విద్యలను అభివృద్ధి సేయుటకును తగిన వసతులేర్పరచిరి. ఇట్లు అన్ని రాజ్యముల ప్రభువులును ధర్మము నుద్ధరించి సంరక్షించుటకు శక్తి వంచన లేక ప్రయత్నము సల్పినను విజయనగర చక్రవర్తుల వలె పట్టుదలతో నా కార్యమును నెరవేర్చియుండలేదు. ఉపపత్తి లేనిమాట నటుండనిచ్చి వానికి విజయనగర సంస్థానము వలె ధర్మోద్ధరణ సంరక్షణలు పరమావధి కాదు. విజయనగర రాజ్య మన్య రాజ్యములవంటిది కాదు అది దేవస్వము; దానికొడయఁడు మనుజుఁడు కాఁడు; పంపాపతి విరూపాక్షుఁడే దాని కధినాథుఁడని మీఁద ఉగ్గడించి యున్నాఁడను; దాని పాలకులు ఆదేవుని యొక్క పారుపత్యగాండ్రు; ఆయన పేరనే వారు సమస్తకార్యములను నిర్వహింపవలసియుండినది. ప్రత్యేకము ధర్మోద్ధరణ కొరకె యారాజ్యముప్పతిల్లిన దగుట చేత తత్కార్య నిర్వహణమె పంపాపతి కార్యకర్తలైన యారాజ్యపాలకులకు ముఖ్యకర్తవ్యమాయెను. ధర్మోద్ధరణ కంటె ధర్మ సంరక్షణమె బహుకష్టతరమాయెను. ధర్మ సంరక్షణార్థము విజయనగర సామ్రాజ్య పాలకులు 1336 మొదలు 1650 వరకు మూడు శతాబ్దులకు పైబడిన కాలము ఎడతెగక మహమ్మదీయులతో పోరాడవలసి వచ్చినది రక్కసి తంగడి సంగ్రామమునకు బయలువెడలు నప్పుడు అళియరామరాయ లాడిన మాటలీ పట్టున జ్ఞప్తికి దెచ్చుకొనదగి యున్నవి. 'ఈ దేశమున్నదో ధర్మదేశము. ఈ ధర్మ సంస్థానము దేవ బ్రాహ్మణుల పాలికి వచ్చినది. దేవస్థానములును పుణ్యక్షేత్రములును విద్యావంతులును గలిగిన ఈసింహాసనము మీద వారి(మహమ్మదీయుల) యాజ్ఞ నడవ వలసిన కారణమేమి?...సకల సైన్యయుక్తముగ నడచిపోయి శత్రువులను పొడిచి నాశనము చేయుచున్నాను, అనిపలికి హిందూ ధర్మద్వేషుల నెదుర్కొనుటకై యుద్ధభూమికి నడచినవాడు. ఇట్లు కంటిని రెప్పవలె విజయనగర పాలకులు హిందూధర్మమును సంరక్షించినందువలననె దక్షిణదేశము పుణ్యభూమియను ప్రసిద్ధిజెంది భారతీయుల కెల్ల యాత్రాస్థానమాయెను. ఆ (విజయనగర) రాజ్యములోను దేవాదాయ

బ్రహ్మాదాయం పుణ్యతీర్థములు, పుష్కరిణులు గలిగి యున్నది; ఇదిగాక విష్ణువు ప్రత్యక్షమై వెంకటాచలమున నున్నారు; ఆ రాజ్యములో వుండే స్వామికి. కడమ రాజ్యములలో పెద్దలు, బుద్ధిశాలులు, బ్రాహ్మలు, యతీశ్వరులు, మతాధిపతులు రాజులు మొదలైన వార లందరున్ను కానుక కప్పమును కొంచు బోయి స్వామికి సమర్పించి వచ్చుచున్నారు. కర్ణాటక (అనగా విజయనగర) సింహాసనాధిపతులు పుణ్యశ్లోకులు మన మత సాంప్రదాయములను కులాచార మర్యాదలను సాంఘిక వ్యవస్థలను ఇరువదియవ శతాబ్దారంభము వరకును మారక పూర్వస్థితియందె వర్థిలుటకు విజయనగర చక్రవర్తుల కృషియే ముఖ్య కారణము.

ఇంతవరకు మహమ్మదీయుల యాగమనము వలన దక్షిణదేశమందు హిందూ ధర్మ సంస్కృతు లెట్లు క్షీణదశకు వచ్చెనో; ఆంధ్రులు వారి నెట్లు పారద్రోలి నష్టమైపోయిన నిజజాతీయ స్వాతంత్ర్యమును పునః ప్రతిష్ఠించిరో; దేశైక్యము ఎట్లు భగ్నమై కొండవీడు, రాజుకొండ విజయనగర రాజ్యము లుత్పత్తిలినవో, ఇతర సంస్థానములవలె కాక విజయనగరమునకు హిందూధర్మోద్ధరణ సంరక్షణాదులు విలముఖ్య కర్తవ్య మాయెనో స్థూలముగ సూచించినాడను. ఇక విజయనగర చక్రవర్తులు తమ కర్తవ్యమును ఏయే మార్గముల నవలంబించి యెట్లు తృప్తికరముగ నిర్వర్తించిరో కను గొందము.

(1) ధర్మోద్ధరణ సంరక్షణ కొరకు విజయనగర రాజులు మహమ్మదీయులతో మూడు వందల యేండ్లకు మించిన కాలము యుద్ధ మొనర్చిరని ముందు చెప్పి యున్నాను. ఈ మహమ్మదీయులు రెండు తెగలకు జెందినవారు (1) ఉత్తరమున భామినీ సుల్తానులును వారివంశ మంతరించిన పిమ్మట స్వాతంత్ర్యము వహించిన వారి సామంతసర్దారులును విజయనగరమునకు గర్భశత్రులు. వారు విజయనగర సామ్రాజ్యము నెప్పుడెప్పుడు కబళింతమాయని సమయమును వేచి యుండిరి. వీరితో యుద్ధము విజయనగరాధీశ్వరులకు తప్పని సరి యాయెను. (2) దక్షిణమున మధురాపురి తురుష్కులు. 1323 వ సంవత్సరమున ఢిల్లీ సుల్తాను మహమ్మద్ బిన్ తుగ్లక్ మధుర పాండ్య రాజ్యమును నిర్మూల మొనర్చి సేతుబంధ రామేశ్వరము పర్యంతము వ్యాప్తమైన దేశమునంతటిని తన రాజ్యమున గలుపుకొని దానిని పాలించుటకొక మండలాధికారిని నియమించెను. ఇతడు 1334 లో సుల్తానుపై తిరుగుబాటుచేసి స్వతంత్రుడాయెను. ఇతని నే ఆంధ్ర కావ్యకర్తలు దక్షిణ సురత్రాణుడని పేర్కొని యున్నారు. ఇతడును ఇతని తరువాతి వారును క్రూరస్వభావులు, జనహింస వారికి కరము ప్రియమైన క్రీడ; వీరి దుండగములు ఇంతకు పూర్వ ముదాహృతమైన గంగాదేవి కృత మధురా విజయమునందు వివరింపబడి యున్నది. దానిని ఇచ్చట మరల తెలుపవలసిన యావశ్యకత లేదు. ఈ విపత్తు నుండి దాక్షిణాత్య హిందూ ప్రపంచమును గాపాడ నిశ్చయించి 1365 నుండి 1377 దాక విజయనగరమును పాలించిన మొదటి బుక్కరాయలు తన పుత్రుడైన కుమారకంపరాయల నాయకత్వము క్రింద మధుర మహమ్మదీయులపై నొకదండయాత్ర నంపెను. కుమార కంపరాయలు తండ్రి యాజ్ఞానుసారము దండు నడుపుకొనిపోయి 1371-72 వ సంవత్సరమున మధుర తురుష్కులను నిర్మూలనము గావించి రామేశ్వర పర్యంతము వ్యాప్తమై యుండు యావద్దక్షిణ దేశమును విజయనగర చక్రవర్తి యేలుబడి క్రిందికి తెచ్చెను.

మహమ్మదీయుల యాటోపమును డిందుపరచి దేశమంతటను శాంతిభద్రతలను నెలకొల్పి విజయనగర ప్రభువులు ధర్మోద్ధరణకార్యమునకు బూనుకొనిరి. తమ పూనికను నెరవేర్చుట కొరకు వారవలంబించిన మార్గములు మూడు. దేవాలయ జీర్ణోద్ధరణము మొదటిది. ఇది సామాన్యకార్యము కాదు. శాసనములనుబట్టి చూడగా నప్పుడు తురుష్కులచే విధ్వస్తములైన దేవాలయముల సంఖ్య నూరారులని తెలియవచ్చు చున్నది. విధ్వస్త దేవాలయములు సామ్రాజ్యమునందెల్ల యెడలను గానవచ్చుచుండినను ద్రావిడ దేశమునందు బహుళమై యుండినవి; కావున దేవాలయజీర్ణోద్ధరణ కార్యమచ్చట విశేషముగ జరుగవలసి వచ్చినది. జీర్ణోద్ధరణ మనగా నిడిసిపోయినట్టిగాని శిథిలావస్థ నుండునట్టిగాని దేవాలయములను బాగుసేయుట మాత్రము గాదు. నిత్యనైవేద్యపూజాపురస్సరాది దైనందిన కార్యకలాపమును నిర్వర్తించుటకును, నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, వర్షోత్సవాదులను తగురీతిని నడపుటకు ఏర్పాటులను గావింపవలసి యుండెను. పేరుగల దేవాలయము లన్నింటి యందును స్వామివారి సేవకు రాదనగరియందువలె డెబ్బది రెండు **నియోగము**

లుండెడివి. దేవాదాయములను మాత్రమే కాక ఈ డెబ్బదిరెండు తెగల పరిచారకుల వృత్తులను సయితము మహమ్మదీయులు హరించి యుండినందున దేవాలయములందు కొలువులు యథాపూర్వము నడచుటకు నష్టమైపోయిన దేవాలయములతో పాటు సమస్త పరిచారకుల వృత్తులను మరల సమకూర్పవలసి యుండెను. కుమార కంపరాయలును నతని గొలుచు చుండిన మంత్రి సామంత దండనాథాది అధికారవర్గమును ఈ కార్యము నెటు నెరవేర్చిరో వారి శాసనములను బరిశీలించి చూచిన తెల్లము గాగలదు. జీర్ణోద్ధరణము తోపాటు నూతన దేవాలయ నిర్మాణమును ప్రారంభమాయెను; కాని తుళువ వంశీకులు రత్నసింహాసనము నధిష్ఠించు నందాక ఈ కార్యము విపులముగ సాగలేదు. వీరిలో కృష్ణరాయాచ్యుతులు ముఖ్యముగ స్మరింపదగినవారు, రాజధాని విద్యానగరమందు కృష్ణరాయలచే గట్టింపబడిన కృష్ణస్వామి యనంతశయనాలయములును విఠ్ఠలేశ్వరాలయ భాగములును కంచి కాళహస్తి తిరువణ్ణామల శ్రీరంగాది క్షేత్రములందు మంటప గోపుర ప్రాకారాదులును, ద్రావిడమండలమున పెక్కుతావులలో నగోరలై నిలచియుండు రాయగోపురములును పేర్కొనదగినవి; అచ్యుతరాయలు విజయనగరమున నిర్మించిన పట్టాభిరామ అచ్యుతరాయస్వామి యాలయములు ప్రసిద్ధిజెందినవి. తుళువ వంశజుల తీర్థయాత్రాభినివేశము ప్రస్తుతింపదగియున్నది. నరస నాయకుడు మొదలుకొని సదాశివరాయల వరకు అందరు రాజులును పెక్కుమారులు తీర్థయాత్రలు చేసి షోడశ మహాదానములను గావించి నట్లు చెప్పుకొని యున్నారు.

'కాంచీ శ్రీశైల శోణాచల కనక సభా వేంకటాద్రి ప్రముఖ్యే
ష్వావర్త్యావర్త్య సర్వేష్వ తనుత విధివ
ద్భూయసే శ్రేయసే శ్రేయం
దేవస్థానేషు తీర్థేష్వపి కనకతులాపూరుషాదీని నానా
దానాన్యేవోపదానై రపి సముముఖలై రాగమోక్తాని తాని.'

అందరును తీర్థయాత్రాసక్తులైనను కృష్ణరాయలు తక్కినవారి నధఃకరించినాడు. సింహాచలమునుండి సేతువుదాక ఉభయసముద్రమధ్యస్థ దక్షిణ భారత వసుంధరలో ఆ మహారాజు సేవింపని ముఖ్య దేవస్థానము లేదు. భూ, ధన వస్తు వాహనాదులను సమర్పింపని దేవుడు లేడు—కాని తుళువవంశజులు తీర్థయాత్రలు సేయుటతోడను, దానము లిచ్చుటతోడను తృప్తి జెందియుండలేదు; ప్రతిదినమున సభాస్థానమున కొలువుదీరిన వెంటనే, 'స్థలాంతరాలనుంచిన్నీ వచ్చిన అయ్యంగార్లనున్ను ఆరాధ్యపీఠంవారలనున్ను ఉచితాసనములందు కూర్చుండ నియమించి అష్టస్వయం వ్యక్తం శ్రీరంగం శ్రీముష్ణం వెంకటాచలం సాలగ్రామం తోతాద్రి నైమిశారణ్య పుణ్యక్షేత్రం ఇది మొదలయిన స్థలములకు సురక్షితము గలదా? పృథివ్యాప స్తేజో వాయురాకాశాత్మకమైనయేకామ్రనాథ జంబునాథ, అరుణాచలేశ్వర, కాళహస్తీశ్వర, చిదంబరం మొదలయిన డెబ్బైరెండు దేవస్థలాలనున్ను పదునెనిమిది శక్తులకున్ను నిండుపడితరములు గలిగి నిత్యోత్సవములు గలిగి వున్నవా? అని విచారించువారు. అయ్యంగార్లను ఆరాధ్యపీఠాలవారును చెప్పెడి సమాధానములను విని యనంతర మితర విషయములను పలికించెడివారు' రాయపీఠాధిపతులు స్వయముగ దేవాలయాదుల స్థితి ననుదినమును విచారింప గడగిన నవి యభివృద్ధినంది యేల పెంపొందక పోయెడిని?

రెండవది బ్రాహ్మణ సంరక్షణ—నేడిది విపరీతముగ గన్పట్టవచ్చును. అప్పటివారి మూఢ మత విశ్వాసమే దీనికి కారణమని చెప్పువారు కలరు. చారిత్రక దృష్టితో పరిశీలించి చూచిన ఇట్టి తలంపున కవకాశము కలుగదు. అప్పుడు బ్రాహ్మణుల నాదరించి పోషించిన ప్రభువులు కేవలము మూఢ విశ్వాస సంపన్నమనస్కులై యట్లు చేయలేదు. తెలివితేటలయందును యుక్తాయుక్త వివేకమునందును మన పూర్వీకులు మన కేవిధమునను దీసిపోయినవారు కారు. సంఘపురోవృద్ధికి బ్రాహ్మణుడు ప్రధానుడని వారు గుర్తించిరి. ఇప్పటివలెనే అప్పుడును బ్రాహ్మణులు జీవయాత్రను సాగించుటకొరకు అనేక మార్గముల నవలంబించుచుండినను ఇప్పటి బ్రాహ్మణులవలె నప్పటివారు తమ కులధర్మములను త్యజించి కేవల బ్రాహ్మణాభిధేయమాత్రులై యుండలేదు. ఆయుధోపజీవులైనను వర్తకులైనను రాజకీయోద్యోగ నియుక్తులైనను వేదాధ్యయనమును నిత్యనైమిత్తిక కర్మలను వర్జించినవారు కారు. సర్వశాస్త్రములును విద్యలును, కళలును వారి వశమై యుండినవి. విజ్ఞానాభివృద్ధి వారిపై నాధారపడి

యుండినది. తపస్స్వాధ్యాయనిరతులై ఐహికాముష్మిక ధర్మముల నెరిగి పరమార్థచింతయందె కాలము గడుపు వారి సంఖ్య బహుళము. కావున విద్యలను బెంపొందించి విజ్ఞానము నభివృద్ధిచేసి ప్రజాశ్రేయమును సమకూర్ప బెట్టిన రాజులందరును బ్రాహ్మణుల నాదరించి పోషింపవలసి వచ్చినది; కావున భరతఖండమును పాలించిన రాజన్యులెల్లను బ్రాహ్మణుల నాహ్వానించి భూదానాదికము లిచ్చి యగ్రహారముల నేర్పరచి వారి గ్రాసవాసములకును సుఖజీవనమునకు దగిన వసతు లేర్పరచి; యజ్ఞాది వైదికకర్మలను నిర్వర్తించుటకును, వేదాధ్యయ నాధ్యాపనములు సల్పుటకును బ్రోత్సాహము సేయువారు. తత్కారణమువలన బ్రాహ్మణాగ్రహారములెల్ల విద్యాలయము లయినవి. విద్యాభివ్యాప్తికొరకు ప్రత్యేక పాఠశాలలు కళాశాలలు విశ్వవిద్యాలయములు లేని కాలమునం దీయగ్రహారములెట్టి ప్రాముఖ్యమును వహించియుండెనో సులభముగ గ్రహింపవచ్చును. మరియొక విశేషము; ఆ కాలమున న్యాయపాలనకై ప్రత్యేకమైన ఏర్పాటులెవ్వియును లేవు. వ్యవహారములను విచారించి తీర్మానించుటకును నేరములను శోధించి నేరస్థులను దండించుటకును రాజ్యాధిపతులు ప్రత్యేక న్యాయశాఖలు కోర్టులు మున్నగు వానిని స్థాపించువారు కారు. న్యాయపరిపాలన యంతయు చాలవరకు ధర్మాసనముల మూలమున నె సాగునది. ఈ ధర్మాసనములు స్థిరమైన న్యాయస్థానములు గావు. వ్యవహారము కలిగినప్పుడు వాదిప్రతివాదులు రాజుయొక్క గాని అతని ప్రతినిధియొక్క గాని యాదేశము చొప్పున నేదేని యగ్రహారమునకు ధర్మమునకు బోవువారు. అప్పుడా యగ్రహారికులు ధర్మశాస్త్రవిశారదులైన మహాజనులను తీర్పరులుగ నియమించి యొక సభను గూర్చువారు; ఈ సభకే ధర్మాసనమని పేరు. ధర్మాసనమువారు చేయు తీర్పును రాజుగాని యతని యధికారులుగాని అమలులోనికి దెచ్చెడివారు. ఇట్లు బ్రాహ్మణాగ్రహారములు న్యాయస్థానములై రాజ్యాంగవిధానమున తావుకొనినవి. కావుననే మహమ్మదీయులను బారదోలి జాతీయ స్వాతంత్ర్యమును పునఃప్రతిష్ఠ గావించిన ముసునూరినాయకులేమి వారి యనంతరము రెడ్డివెలమ రాజులేమి, బ్రాహ్మణుల నాదరించి పోషించిరి. ఇక వేదమార్గ ప్రతిష్ఠాపకులైన విద్యానగరభూమీశ్వరుల మాట చెప్పవలెయునా? వారిచ్చిన యగ్రహారముల బాగోగులను విచారించుటకై రాయసంస్థానమున నొక ప్రత్యేక పాలనశాఖ యుండెడిది దీనికి ధర్మశాఖ యని పేరు; వీరనరసింహరాయల కాలమున నీ శాఖ కధ్యక్షుడు ధర్మాసనము ధర్మయ్య. ప్రతిదినమును రాయలవారు కొలువుదీరిన పిమ్మట దేవాలయముల స్థితిగతులను విచారించిన తరువాత ద్రావిడ రాజ్యములో అగ్రహారములకును, ఆంధ్రదేశం, హొయిసల దేశం, మొరసునాడు, మొల్నాడు, కరాటం, ఘట్టసీమ చేర చోళ పాండ్య మగధ మళయాళ ఆదిగాగల అగ్రహారములకున్ను అవధి ఆటంకములు లేక బ్రాహ్మణులు నిత్యకర్మానుష్ఠానపరులై ఋగ్యజుస్సామాధర్వణ పారీణులయి, షట్శాస్త్రపారీణులయి, పంచయజ్ఞ పరాయణులయి అతిథి సంతర్పణలు జేసుకొని నిర్విచారపరులయి యున్నారా యని యడిగెడివారు. బ్రాహ్మణపోషణయం దిట్లు నరపతి చక్రవర్తులు శ్రద్ధ చూపినందువలననె దేశము తురకాణ్యమున గలియునందాక వర్ధిల్లినవి; దక్షిణ భారతమున హిందూ ధర్మ సంస్కృతులను సుస్థిరముగ బాగుకొల్పినవి.

మూడవది విజ్ఞానపోషణము—ఈ సందర్భమున మొట్టమొదట స్మరింపదగిన విషయ మొక్కటి కలదు. రాయసంస్థానము హిందూధర్మ సంరక్షణకొరకె యుత్పన్నమయినను రాయ సింహాసనాధ్యక్షులు తమ రాజ్యపాలన పద్ధతులను సంకుచిత దృష్టితో నేర్పరచుకొనలేదు. సామ్రాజ్యమందలి సకల సముదాయముల ప్రజలను సమైకదృష్టితో బరిపాలించుటయే పరమోత్కృష్టమైన పద్ధతియని వారు గ్రహించిరి. మొదటి బుక్కరాయలు సామ్రాజ్యమునందు పెక్కుతావులలో జైనులకును, వైష్ణవులకును గలిగిన మత వివాదములను దీర్మానము జేయుచు జైన, వైష్ణవ దర్శనములకు భేదము లేదనియు నొక దర్శనమున కాపాదించు కీడు మేళ్లను మరియొక దర్శనమునకు గూడా కీడు మేళ్లుగ బరిగణింపబడవలయు ననియు వైష్ణవులు జైనులకు జేసిన యన్యాయమును దాను సహింపజాల ననియు దెలియజెప్పి వారిని సమాధానపెట్టెను, బుక్కరాయలతరువాత రాయపీఠము నధిష్ఠించిన రాజపుంగవులందరును అతనిచే ప్రతిపాదింపబడిన జైన వైష్ణవ దర్శన సమత్వమును సర్వసముదాయములయెడను అనువర్తింపజేసిరి. రాయపీఠాధిపతులు తాము స్వయమే

మతము నవలంబించినను అన్యమత పరాఙ్ముఖులు గాక అన్ని మతములను ఆదరించి గౌరవించుచు వచ్చిరి శివకేశవాదులకువలెనె తీర్థంకరాది జైన దైవతములకును ఆలయములను నిర్మించుటకును నందు నిత్యనైవేద్య పూజాపురస్కారాది దైనందిన కృత్యములను నడపుటకును ఖండస్ఫుటిత జీర్ణోద్ధరణాది నవకర్మలను సాగించుటకును భూదానాదికముల నిచ్చి తగు వసతులను గల్పించువారు. దేవరాయాచ్యుతరాయాళియ రామరాజాదులు పరమతద్వేషులయిన మహమ్మదీయులయెడ కూడ సౌహార్దము జూపి వారి యుపయోగార్థము మసీదులను గట్టించియిచ్చిరి. రాయపీఠస్థుల హృదయవైశాల్యమును సర్వసమానదృష్టియు వ్యక్తమైనది యొక్క మతవిషయమునందుమాత్రమె కాదు. విజ్ఞాన పరిపోషణయందును నిట్టి విశాలదృష్టితోడనె జాతిమతవర్ణభాషావిభేదములను పాటింపక విద్వజ్జనములకు ఆశ్రయమొసగి వారిని సారస్వతసేవకు బురికొల్పిరి. కవులను పండితులను శాస్త్రవేత్తలను కళాభిజ్ఞులను జేరదీసి పోషించుటయే కాక విద్వత్సభలను సమకూర్చి సమాగత నానాదేశ విద్వత్ప్రకాండులచే శాస్త్రవాదములను జేయించి గౌరవించువారు. దక్షిణాధీశుని ముత్యాలశాలయు, సాహితీ సమరాంగణ సార్వభౌముని ప్రతి వసంతోత్సవ కవిపండిత సమావేశములును నీపట్టున స్మరింపదగినవి. రాయల విద్యాభిమానము పెంపునను కవిపండిత పక్షపాతము వలనను విజయనగరమునకు విద్యానగరమను నామాంతరము సార్థక మాయెను

ఇక రాయల యాశ్రయమున విజ్ఞాన మెట్లభివృద్ధి యాయెనో యెక్కించుక తెల్పుట యుక్తము. మొట్ట మొదట విచారింపదగినది వైదికవిద్య. మహమ్మదీయులచే వేదాధ్యయనపరులైన బ్రాహ్మణు లెల్లయెడలను వధింపబడి యుండిన కారణమునను, గ్రంథాలయములు లూటుమట్టుగ నాశము గావింపబడియుండుటవలనను దేశమునందు వైదికవిద్య యణగారిపోయెను, వేదార్థమును గ్రహించి వివరింపగల విద్వాంసుల సంఖ్య సన్నగిలెను. కావున విద్యారణ్యయతీంద్రుల యాదేశానుసారము సనాతన ఆర్యధర్మములను ఉద్ధరింప కంకణముగట్టుకొని వేదమార్గప్రతిష్ఠాపకులను బిరుదు వహించిన విద్యానగర చక్రవర్తులు వేదార్థమును వెల్లడిసేయుట తమ ప్రథమ కర్తవ్యమని నిశ్చయించి తత్కార్యమును నిర్వహించుటకు తమ కుల గురువైన మాధవాచార్యుల తమ్ముడయిన సాయణాచార్యులను నియమించిరి. ఆయన వేదవిద్యా విశారదులైన విద్వాంసుల సహాయమున వేదములకు నూతన భాష్యమును విరచించెను—దీనికి సాయణ భాష్యమని పేరు. సాయణాచార్యుల మార్గము ననుసరించి రాయల ప్రేరణవల్లను రాజకుమారుల ప్రోత్సాహమువల్లను పెక్కండ్రు విద్వాంసులు గృహ్య శ్రౌతధర్మ సూత్రములమీద వ్యాఖ్యానములు రచించిరి; అందు దేవరాజను నతడు యాస్కాచార్యుల నిరుక్తముమీద వ్రాసిన నిఘంటు వ్యాఖ్య ప్రసిద్ధికెక్కినది కొన్ని స్వతంత్ర రచనలు కూడ బయలువెడలినవి. చౌండపాచార్యుని ప్రయోగరత్నమాల స్మరింపదగినది వైదిక గ్రంథ పరిశోధన క్రీ. శ 15వ శతాబ్దాంతమువరకు సాగినది వేదములతోపాటు షడ్దర్శనములు కూడ పండితుల పరిశోధనకు గురియాయెను. అన్నిటికంటె వేదాంత మత్యధికముగ నభివృద్ధి జెందెను. మాధవ విద్యారణ్యుల దరువాతి కాలమునందప్పయ్య దీక్షితులు మున్నగు తత్త్వవిద్యా విశారదులు అద్వైత వేదాంతమునుగూర్చి పెక్కు సుప్రసిద్ధ గ్రంథములను రచించిరి. వేదాంతదేశికులు పిళ్లైలోకాచార్యులు మనవాళ మహామునులు లక్ష్మీకుమార తాతాచార్యులు కందాళదొడ్డయాచార్యులు మున్నగువారు విశిష్టాద్వైతమును గూర్చియు నక్షోభ్యతీర్థులు బ్రహ్మణ్యతీర్థులు, వ్యాసతీర్థులు రాఘవేంద్రతీర్థులు మొదలైనవారు ద్వైతమును గూర్చియు ననేక గ్రంథములను వ్రాసిరి. వీరి కృషికి ఫలితముగ పై మూడు సమయముల సిద్ధాంతములును జనసామాన్యమునకు సుపరిచితము లాయెను వేదవేదాంగ వేదాంతములవలె సారస్వతము గూడ సర్వతోముఖముగ నభివృద్ధి జెందెను. కావ్యము చంపువులు, గద్యకావ్యములు, నాటకములు, శాస్త్రగ్రంథములు ప్రత్యేకంశములుగ వెలువడినవి. గంగాదేవియొక్క మధురావిజయము మొక్కటె దప్ప పేర్కొనదగిన శ్రేష్ఠకావ్య మేదియు విరచింపబడలేదు. మధురావిజయము చరిత్రాత్మకమైన కావ్యము. అందు గంగాదేవి తన భర్తయైన కుమారకంపరాయలు మధురా సురత్రాణుని జయించిన వృత్తాంతమును వర్ణించినది. ఆమె మార్గము ననుసరించి డిండిమ కవులును దరువాత నాయకయుగమున

రామభద్రాంబయు సాళువాభ్యుదయాచ్యుతరాయాభ్యుదయ రఘునాథాభ్యుదయాది కావ్యములను రచించిరి. ఇవి చరిత్ర రచయితల కత్యంతోపయుక్తములైనను సాహిత్యవిమర్శకుని కివి సామాన్య రచనలని తోచకపోవు. వేదాంతదేశికుల యాదవాభ్యుదయ, హంససందేశము లుత్తమ కావ్యములని ప్రసిద్ధికెక్కినవి. యాదవాభ్యుదయమున కప్పయ్యదీక్షితులవంటి మహనీయుడు వ్యాఖ్యానము రచించుటయే దాని యుత్కృష్టతను నిరూపించుచున్నది. చంపువులలో ముఖ్యమైనది యోగువ తిరుమలాంబయొక్క వరదాంబికా పరిణయము. ఇదియు చారిత్రాత్మక గ్రంథమే. గద్యకావ్యములలో శ్రేష్ఠమైనది. వామనభట్ట బాణుని వేమభూపాలచరితము. వామనుడు విద్యారణ్యుల శిష్యుడు. బహుగ్రంథకర్త. భట్టబాణుని రచనలకు సదృశమైన గద్యకావ్యమును నిర్మింపవలయునని వేమభూపాల చరిత్రను రచించెను. కొంచె మెంచు మించు నితని గద్యభట్టబాణుని రచనకు చేర్వగుచున్నదని విమర్శకు లభిప్రాయపడుచున్నారు. నాటకము లనేకము వెలువడినవి. కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయము ననుసరించి విశిష్టాద్వైతపరముగ రచించిన సంకల్పసూర్యోదయము గణుతికెక్కినది. వామనభట్టబాణుడు రఘునాథచరిత కనకలేఖాకల్యాణములను రెండు నాటకములను రచించెను. విరూపాక్ష మహారాయలు నారాయణీయ విలాసమను నాటకమును ఉన్మత్తరాఘవమను ప్రేక్షణికమును రచించెను, కృష్ణదేవమహారాయలు జాంబవతీపరిణయమును వ్రాసెను. ఇంక నెన్నో సంస్కృత నాటకములు రాయల యుగమున రచించబడినవి కలవు; కాని యీ నాటకము లెవ్వియు పూర్వకృతులతో బోల్పదగినవి కావు. నాటకములతోబాటు భాణములును ప్రహసనములుకూడ నప్పటివారి యాదరమునకు పాత్రములైనవి. వామనభట్టబాణుని శృంగారభూషణ భాణమును అరుణగిరినాథ డిండిముని సోమవల్లీయోగానంద ప్రహసనమును ఆయాతరగతి రచనలలో ప్రశంసాపాత్రములైనవి. రాయలయుగమున శాస్త్రపరిశోధన చక్కగ సాగినది. గాంధర్వ నాట్యాలంకార వైద్యశాస్త్రములు ముఖ్యముగ నిచట పేర్కొనదగినవి. విద్యారణ్యులవారు సంగీతశాస్త్రముపై నొక గ్రంథమును రచించెనని చెప్పుదురు. అది ఇంతవఱకు ఉపలబ్ధముగా లేదు. శార్ఙ్గదేవకృత సంగీతరత్నాకర మీ యుగమును సంగీత విద్వాంసుల పరిశోధనకు గురియైనది. తెలుగుదేశమున మొట్టమొదట నీ పరిశోధనకు పునాది వేసినవాడు రాచకొండ ప్రభువు సర్వజ్ఞసింగభూపతి. ఇతడు సంగీతరత్నాకరముపై నొక వ్యాఖ్యను రచించెను. ఇతనివలెనె ముమ్మడి ప్రౌఢరాయల యాస్థానము నలంకరించిన కల్లరసు మరియొక వ్యాఖ్యానమును వ్రాసెను. కల్లరసుని వ్యాఖ్య కర్ణాటక సంగీతమునకు పునాదియని సంగీత విద్వాంసులు చెప్పుదురు. కృష్ణదేవరాయల యాస్థాన విద్వాంసుడైన బండారు లక్ష్మీనారాయణ సంగీతసూర్యోదయమును అచ్యుతరాయల కాశ్రితుడైన సోమదేవుడు తాళాధ్యాయమును అళియ రామరాయల ప్రధానియైన వాగ్గేయకార రామయామాత్యుడు స్వరమేళకళానిధిని రచించిరి. నాయకరాజుల యుగమున కనుబంధమని చెప్పవచ్చును. విద్యానగర పతనానంతరము తంజావూరు సర్వవిద్యలకు నెలవాయెను. రఘునాథుడును నాతని మంత్రియైన గోవిందదీక్షితుడును, దీక్షితుని పుత్రుడైన యజ్ఞనారాయణదీక్షిత వేంకటాధ్వరులును సంగీతవిద్యావిచక్షణులు. వారిచే విరచింపబడిన సంగీతసుధ చతుర్దండీప్రకాశికల నెఱుంగని సంగీతవిద్వాంసుడుండడు. నాట్యశాస్త్రము, సంగీతమునం దొక భాగముగ పరిగణింపబడుటచేత దాని గూర్చి ప్రత్యేకగ్రంథములు వెలువడలేదు. కాని విజయనగర సంస్థానమున గాకపోయినను కొండవీటిలో నది ప్రభువంశముల ప్రత్యేకాదరాభిమానములకు పాత్రమాయెనని వసంతరాజీయ నాట్యచింతామణ్యాది గ్రంథములవలన తెలియవచ్చుచున్నది. అలంకార శాస్త్ర పరిశోధన ఆంధ్రదేశమున కాకతీయయుగమునందె ప్రారంభమాయెను; విద్యానాథుని ప్రతాపరుద్రయశోభూషణము దీనియొక్క ప్రథమఫలమని చెప్పవచ్చును. సర్వజ్ఞ సింగభూపాలుని రసార్ణవసుధాకరమును, విశ్వేశ్వరుని చమత్కారచంద్రికయు దీనికి తరువాత విరచింపబడిన యుత్తమగ్రంథములు. విజయనగర సామ్రాజ్యమున వెలువడిన యలంకార రచనలలో భోగనాథుని యలంకారసుధానిధి మొదటిది. భోగనాథుడు మాధవవిద్యారణ్య సాయణాచార్యుల కనుజుడు. క్రీ. శ. 1౩౫౫ ప్రాంతమున నెల్లూరు రాజ్యమును పాలించిన రెండవ సంగమరాజులయొక్క నర్మసచివుడు. అలంకార సుధానిధి ఇంకను ముద్రితము గాలేదు. ఆ కాలమున విరచింపబడిన యలంకార శాస్త్ర గ్రంథములలో దాని స్థాన మున్నతమైనదని

వాఙ్మయవిమర్శకుల యభిప్రాయము. తరువాత రాయరాజ్యమున వెలసిన యలంకారశాస్త్రజ్ఞులలో నెల్ల నప్పయ దీక్షితులు వాసికెక్కినవాడు. అతని చిత్ర మీమాంస లక్షణావళులు సుప్రసిద్ధ గ్రంథములు; అతని కువలయానందము జయదేవుని చంద్రాలోకమునకు వ్యాఖ్యయైనను స్వతంత్ర గ్రంథమువలె విరాజిల్లుచున్నది. రాయరాజ్యమున వర్ధిలిన అలంకారశాస్త్రవేత్తలెందరో కలరు. వారి నిచ్చట పేర్కొనుటకైన వీలుపడదు. పరహిత బిరుదాంకితమైన వైద్యకుటుంబ మొకటి రెడ్డిరాజుల యాశ్రయమున వర్ధిల్లినట్లు శాసనములవలన దెలియుచున్నది; కాని పరహిత సంహిత రచయిత కా కుటుంబముతో నెట్టిదేని సంబంధము కలదో లేదో తెలియదు. ఇమ్మడి బుక్కరాయల ప్రాణాచార్యుడైన లక్ష్మణాచార్యుడు వైద్యరాజవల్లభమను గొప్ప గ్రంథమును రచించెను. ఇది యింకను ముద్రితము గాలేదు

సంస్కృతమును బోలి దేశభాషలను గూడ విజయనగరాధీశ్వరు లాదరించి పోషించిరి; కాని దేశభాషలన్నిటిని వారు సమానదృష్టిని జూడలేదు. ద్రావిడముకంటె నధికముగ గన్నడమును, గన్నడముకంటె నతిశయముగ నాంధ్రమును వారాదరించి మన్నించిరి. రాయపీఠాధిపతులలో దమిళ రచయితలను జేరదీసి గౌరవించిన ప్రభువు కృష్ణరాయలొక్కడే; కన్నడమునకు సంగమవంశ కాలమునను కృష్ణరాయల కాలమునను గొంతకొంత రాయల యాస్థానమున బ్రాపు గల్గినది; కాని తెనుగునుబోలి వానికి రాయసంస్థానమున బ్రాధాన్యత లభింపలేదు. మొదటి హరిహరరాయల కాలమునుండి ముమ్మడి వెంకటపతిరాయల కాలమువరకు తెలుగుకవుల కాశ్రయ మిచ్చి వారిని గ్రంథరచనకు బ్రేరేపింపని రాయలు లేరు; రాయలమార్గము ననుసరించి సామంతామర నాయకాది సమస్తాధికారవర్గమును దెలుగుభాషయెడ నాదరము చూపుటవలన దాని ప్రాబల్యమతిశయమై దక్షిణభారతమందెల్లయెడలను రాజభాషయై నాగరతకు ముద్రయై పెంపొందెను. రాయల యుగమున ఆంధ్ర సారస్వతి మెట్టభివృద్ధి నందెనో యక్షరాస్యులైన యాంధ్రులందరెరిగిన విషయమే; దానినిగురించి యిప్పుడు నేను విస్తరించి చెప్పవలసిన యావశ్యకత లేదు. కాని పండితులును విమర్శకులును సామాన్యముగ దృష్టింపక విడిచిపెట్టు విషయమొక్కటి కలదు. దాని నిప్పుడు స్మరింపక తప్పదు. అన్యభాషల కవులవలె ఆంధ్రకవులు స్వతంత్ర రచనలను దలపెట్టక సంస్కృతగ్రంథములను దర్జుమా సేయుటతో దృప్తినందిరి. రామాయణ మహాభారతాది సుప్రసిద్ధ దేశీయేతిహాసములనే కాక అష్టాదశ పురాణములను ఉపపురాణములను స్థలపురాణములను, కావ్యనాటకాది వివిధ సంస్కృతగ్రంథములను దెనిగించిరి. దీనికి కారణమేమి? స్వతంత్ర గ్రంథరచనకు శక్తి చాలమిచేననికొందరు సమాధానము చెప్పుదురు. ఇది సరియైన సమాధానము గాదు. ఏలనగా వారు తెనిగించినవి 'తు' 'చ' తప్పని భాషాంతరీకరణములు గావు. స్వతంత్రనిర్మాణసామర్థ్యము వారికి గలదని ఋజువుసేయగల సాక్ష్యము వారి తెనుగుసేతలందు కలదు. వారట్లు సంస్కృతగ్రంథముల ననువదింపగడగుటకు వాస్తవమైన కారణము వారి పోషకులను దృప్తిపరచుటకొరకే సంస్కృత భాష నెరుగనివారి కా భాషయందు గుప్తమైయుండు మతసిద్ధాంతములను నైతికవిశేషములను ఎరుకపరచుటకు ఆకాలపు రాజులును సామంతులును దమ యాస్థానమందలి కవులను నియోగించిరి. వారి యాంధ్రీకరణముల మూలమున ఆర్యసంస్కృతి యాంధ్రులకు సంక్రమించినది సంస్కృతభాషా పరిచయము లేకపోయినను నేటి యాంధ్రులకు సంస్కృతవాఙ్మయ విశేషములు కరతలామలకమగుట ఆరాజుల ప్రసాదమువలననె ఇదియే విజయనగర రాయలు మన సంస్కృతికి జేసిన ప్రధానసేవ.

# విగ్రహవ్యావర్తని

ఆర్య నాగార్జునుడు



## పూర్వపక్షము

సర్వభావ సమితి సర్వత్ర నిఃస్వభా। వమ్ము యయిన, నిఃస్వభావమగుచు
వఱలు మీ వచస్సు స్వాభావ్యవినివర్తి। న క్రియా సమర్థ నమ్ము కాదు.

పైగ మీవాక్కు సస్వభావమ్మటంచు। నాలకించి మీదు ప్రతిజ్ఞ హానినిఁబొందె;
వైషమిక దోషమద్దాన బ్రాప్తమయ్యె; కాన హేత్వంతరమ్ము వక్తవ్యమగును.

మాటలాడకు మన్నట్టి మాడ్కి-యిదియు। నగు నటన్నది మీ బుద్ధి యగున యేని,
అదియ యుక్తమ్ము; సత్తైన పదము చేత। పొడమ నున్నట్టి శబ్దమ్ము కెడయగలదు.

ప్రతిషేధ ప్రతిషేధ్యం।బు తెఱఁగు నిట్టిద యటంచు బొడసూపిన, నే
చితికది దూరం; బిటు మీ। ప్రతిజ్ఞ లాక్షణిక దోష పరతం బోవున్.

భావములను బ్రత్యక్షానబడసి పరిని।వర్తితమ్ముల గావించు వాడ వేని,
ఆ ప్రమాణమ్ము లేనిదే యగును గాన। భావములు దేనిచేత లభ్యమ్ము లగును?

ఐంద్రియకము చే ననుమాన మాగమోప।మానములు మూడు ప్రత్యుక్తిమానితములు;
త దనుమానాగమ ప్రసాధ్యమగు నర్థ।సమితి దృష్టాంతమున గూడ సాధ్యమగును.

ధర్మతత్త్వజ్ఞులు కుశల ధర్మతత్త్వ।కలన, లోక స్వరూప విజ్ఞానులీ ప్ర
పంచ సంస్థితి నంగీకరించువారు; శేష ధర్మసంస్థితి నిట్లె చెప్పవలయు.

నైర్యాణిక ధర్మంబు, లనైర్యాణిక ధర్మములు, న నైర్యాణికమున్
నైర్యాణికమ్ము తత్త్వ మ్మార్యాగ్రేసరుల చేత నాదిష్టంబుల్.

ధర్మములకు స్వభావమ్ము తనర దేని, నిఃస్వభావమ్మనకు పేరు నెగడరాదు;
అభిధ సస్వభావమునకే యమరుచుండు; వస్తుహీనమ్ము నామమ్ము పరగు టెట్లు?

---

అనువాదము : శ్రీ జి. వి. కృష్ణరావు

---

# విగ్రహవ్యావర్తని

ధర్మమునకంటే వేఱుగా దనరునేని। యభిద, యదియు నేతద్ధర్మమందు నుండ
బోదు; ధర్మమ్మునకు నన్య భూతమగుచు। నున్నచో నది యుపదేశ నర్హమగును.

ఉన్నదానికే ప్రతిషేధ మొప్పుచుండు—। నిలయమున బాత్ర లేదని పలుకుచుందు;
మట్టులే స్వభావ మ్మున్న యపుడ కాన। బడునుగాదె యద్దాని వ్యావర్తనమ్ము.

ధర్మముల్ నిఃస్వభావత దనరునేని। ఏది మీమాటచే బ్రతిషేధనుందు?
ధర్మముల్ ప్రతిషేధ్యముల్ తనరునేని। యవియ సద్వాక్కున బ్రతిషేధ్యమ్ము లగును.

మూఢమతి మృగతృష్ణికాంబువుల గ్రాహ। మెట్లు ప్రతిషేధ్య మగుచున్న, దట్లె నిఃస్వ
భావతా భాసమాన ధర్మావలోకిత। మ్మసత్య తత్త్వము నివర్తనము పొందు.

అనుట యుక్తమ్ము కాదు; గ్రాహాదికములు మూఁడు, ప్రతిషేధ మాదిగా బొలుచు త్రిపుటి
కలసి యాఱు ధర్మమ్ములు గ్రాలు చున్న వనుచు నంగీకరించుటే యగును జుమ్ము.

గ్రాహ మది లేని దగునేని, గ్రాహ్యముల్లె। యల గ్రహీతయు లేనివా డగునయేని,
వానితోపాటు ప్రతిషేధ భావ మాది యైన త్రితయమ్ము లేవిదే యగును జుమ్ము.

ప్రతిషేధ ప్రతిషేధ్య। ప్రతిషేద్ధలు గల్గరేని, భావము లెల్లన్
స్థితిమై సిద్ధించును; వా।ని తత్త్వ మీకై వడి పరినిష్ఠంబొందున్.

అందుచేత హేతువసిద్ధమగును; నిఃస్వభావతను నేది హేతువై పరఁగఁగలదు?
హేతు రహితమ్ముగా నర్థ మెసగునేని, అర్థమయ్యదెట్లు ప్రసిద్ధి నందగలదు?

భావ నస్వభావత్వ నివర్తనమ్ము। హేతుహీనత సిద్ధి నీ కెనయునేని,
భావ నస్వభావత్వమ్ము వఱలుచుంట। హేతు హీనత సిద్ధి నా కెనయగలదు.

హేతువున కున్కి, భావ సంఘాతమునకు। నిఃస్వభావత్వ కలనమ్ము నిశ్చయించు
వాదమెట్లు గన్న ననుపపన్నమగును; వర్తిలను నిఃస్వభావ భావమ్ము జగతి.

ప్రథమమున ప్రతిషేధ, మాపైని దాని। విషయ ముండు నన్నను, కాక వీనివ్యత్య
యమ్ము చెప్పికొన్నను సిద్ధి యగుటలేదు; ఒక్కతఱి నున్న స్వాభావ్య మున్నదగును.

సశేషము

# ఆంధ్ర పురోగమనం

## ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

శ్రీ పి. వి. ప్రసాదరావు

ప్రథమ పంచవర్ష ప్రణాళిక పరిసమాప్తికావటంతో ఆ కాలంలో గడించిన అనుభవాలను పురస్కరించుకొని, ప్రజల అవసరాలను వారి సహకారాన్ని దృష్టిలో ఉంచుకొని ద్వితీయ పంచవర్ష ప్రణాళికను రచించడం జరిగింది. ఇది 1956 ఏప్రియల్ 1వ తేదీన అమలునకు వచ్చినది. ఇది వెనుకటి దానికన్నా అన్ని విధాల విశిష్టమైనది. ఎందువలనంటే జిల్లాల వారీగా గల పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని దీన్ని రచించారు. అనగా అడుగునుంచి ఈ ప్రణాళికను తయారు చేసుకుంటూ వచ్చారన్నమాట.

ప్రజల అవసరాలను తీర్చటమే లక్ష్యంగా పెట్టుకున్న ఈ ప్రణాళికలో, రాష్ట్రంలో వ్యవసాయోత్పత్తిని పెంచడానికి ఉద్యోగావకాశాలను విస్తృతం చేయటానికి, వెనుకబడిన తరగతుల వారిని ఉద్ధరించడానికి, జీవిత ప్రమాణాలను అభివృద్ధి చేయటానికి సాంఘికాభివృద్ధి ప్రణాళికలద్వారా మహత్తర చైతన్యాన్ని తీసికొనిరావటానికి, ఎక్కువ అవకాశాలు ఇవ్వబడినవి. ఇదంతా చాలా పెద్ద వ్యయంతో కూడిన పని. నిజానికి ప్రతి గ్రామంలోనూ ఒక్కొక్క అభివృద్ధి ప్రణాళికను అమలు జరపటం, ప్రతి జిల్లాలోను ఒక పెద్ద పరిశ్రమను నెలకొల్పటం, జరగాలంటే కనీసం రు 500 కోట్లు అయినా కావాలి. కాని ఆర్థిక స్తోమతు దృష్టిలో నుంచుకొని, వీలయినంత మేలు చేకూర్చాలనే ఉద్దేశంతో ఈ క్రింది విధంగా ఆయా పద్దులకు ధనాన్ని కేటాయించారు. మొత్తం కేటాయించిన ధనం రు 116.20 కోట్లు. కాని ఈ మొత్తం రు 150 కోట్ల వరకు పెరగవచ్చునని అనుకొనుచున్నారు. ఇక పద్దుల వివరాలు.

వ్యవసాయం : రు 16 కోట్లు. జాతీయ విస్తరణ పథకాలు : రు 11 కోట్లు. సాగు, విద్యుత్సౌకర్యాలు : రు 56 కోట్లు. పరిశ్రమలు : రు 10 కోట్లు. ప్రజారోగ్యం : రు 8 కోట్లు గృహ నిర్మాణం : రు 2 కోట్లు విద్య: రు 8 కోట్లు, సాంఘిక సంక్షేమం: రు 3 కోట్లు.

ఆయా రంగాలలో సాగుతున్న పురోగమనాన్ని గూర్చి క్లుప్తంగా తెలియజేస్తాను.

## వ్యవసాయం

రాష్ట్రంలో నూటికి 70 మంది వ్యవసాయం మీదనే జీవిస్తున్న కారణంగా, వంశపారంపర్యంగా వస్తున్న వృత్తులలో వ్యవసాయం ముఖ్యమైనదైన కారణంగా, వ్యవసాయాభివృద్ధికై ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఇంచుమించుగా రు 16 కోట్లు కేటాయించారు. జపాను వరిసాగు విధానాల ద్వారా, నమూనా వ్యవసాయ క్షేత్రాలద్వారా, వ్యవసాయ, వాణిజ్య పంటలకు సంబంధించిన పరిశోధనల కేంద్రాల ద్వారా, మేలిరకపు విత్తనాల సరఫరాద్వారా, సకాలపు వ్యవసాయపు ఋణాలద్వారా, భూసార సంరక్షణ విధానాలద్వారా, నీటి వనరుల అభివృద్ధిద్వారా, రసాయనిక ఎరువుల సరఫరాద్వారా, ఇంకను అనేక విధాల, వ్యవసాయ రంగంలో చెప్పుకోదగిన అభివృద్ధి జరుగుతున్నది.

అధికాహారోత్పత్తి పథకాలద్వారా 8 లక్షల టన్నులు. ఇతర నీటిపారుదల ప్రాజెక్టులద్వారా 2 లక్షల 80 వేల టన్నులు ధాన్యం అదనంగా పండించటానికి ప్రయత్నాలు విరివిగా జరుగుతున్నవి. కొత్త భూములు అనేకం సాగులోకి వస్తున్నవి జొన్నల నిమిత్తం ప్రాంతీయ పరిశోధనకేంద్రాలను స్థాపిస్తున్నారు. ఉత్తమజాతి పశువులను పెంపొంద చేయటానికి మార్గాలను అమలుపరుస్తున్నారు. జాతీయ విస్తరణ కేంద్రాలలో 300 విత్తనాల క్షేత్రాలను ప్రారంభిస్తారు. పచ్చిఎరువుల ఉత్పత్తి 12 లక్షల టన్నుల వరకు పెరుగుతుంది. భూసార సంరక్షణకోసం

తీసికొంటున్న చర్యలవలన 8600 ఎకరాల భూమి అదనంగా సాగులోనికి రానున్నది.

అంతేగాక పశువుల గ్రాసం విషయంలోకూడా ప్రభుత్వం శ్రద్ధ తీసికొంటున్నది. పశువుల తిండికి పనికివచ్చే పంటలను అధికంగా పండించాలనీ, ప్రతి తాలూకాలోనూ సరిగా మంచిరకం పచ్చికను పెంచే విధానాన్ని ప్రదర్శించే కేంద్రాలను ప్రారంభించాలని ప్రభుత్వ సంకల్పం.

ఇదంతా ఇలా ఉండగా, బాపట్లలోని వ్యవసాయకళాశాలను అన్నివిధాల అభివృద్ధి చేస్తున్నారు. నవీన వ్యవసాయ విధానాలలో ప్రతి ఏటా 72 మంది కర్షకులకు ఇప్పట శిక్షణను ఇస్తారు. ఇచ్చటి వ్యవసాయపరిశోధనా కేంద్రంలో ఏటా 500 మంది మేస్త్రీలకు, ఫీల్డుమెన్‌కు శిక్షణ ఇస్తారు

ఈ విధంగా చూస్తే, వ్యవసాయరంగంలో ఎంత అభివృద్ధి జరుగుతున్నదీ సులభంగా అవగతం అవుతుంది.

## విద్యా రంగం

విద్యా రంగంలో అభివృద్ధి సాధించటానికి 760.64 లక్షలు కేటాయించారు. ఆంధ్రదేశం విద్యారంగంలో చాలావరకు పురోగమనాన్ని సాధించింది. ఈ నాడు మనకు రెండు విశ్వవిద్యాలయాలు-ఆంధ్ర, వెంకటేశ్వర-ఉన్నవి. తిరుపతిలో 1954 సెప్టెంబరు 2 న వెంకటేశ్వర విశ్వ విద్యాలయం నెలకొల్పారు. ఈ రెండూగాక గుంటూరుకు ప్రత్యేకంగా విశ్వవిద్యాలయం ఒకటి ఏర్పడే అవకాశం ఉన్నది. (ఒక్క గుంటూరు జిల్లాలోనే 14 కళాశాలలు 1146 హైస్కూళ్లు, 2566 ఎలిమెంటరీ పాఠశాలలు, 182 నిర్బంధ ప్రాథమిక విద్యాకేంద్రాలు, 40 వయోజన కేంద్రాలు, 12 ట్రెయినింగ్ స్కూళ్లు ఉన్నవి.

ప్రాథమిక విద్యాలయాల విషయంలో గానీ, వయోజనవిద్యాలయాల విషయంలో గానీ, బేసిక్ విద్యాలయాల విషయంలో గానీ సంస్కృత పాఠశాలల విషయంలో గాని, ఉన్నతపాఠశాలల విషయంలో గానీ బ్రహ్మాండమైన అభివృద్ధి ఈ ద్వితీయ ప్రణాళిక పూర్తి అయ్యేలోగా రానున్నది. 2000 బేసిక్ విద్యాలయాలు, 20 కొత్త ఉన్నతపాఠశాలలు, 1000 ఏకోపాధ్యాయ పాఠశాలలు నెలకొల్పబడనున్నవి 1500 పాఠశాలలను ప్రాతిపదిక పాఠశాలలుగా మారుస్తారు. ఈవిధంగా రాష్ట్రంలో విద్యాభివృద్ధిప్రణాళిక పూర్తి అయ్యేనాటికి బ్రహ్మాండంగా కనపడనున్నది.

## నీటిపనరులు-ప్రాజెక్టులు

ఆహారపంటలుగానీ, వాణిజ్య పంటలుగానీ, నీటివనరుల వ్యాప్తివలన, ప్రాజెక్టులవలన పెరగటం జరుగుతుంది కనుక, వ్యవసాయాన్ని నమ్ముకొని ఉన్న గ్రామసీమలు నిత్యకల్యాణం పచ్చతోరణంగా విలసిల్లాలన్న నీటివనరులు, ప్రాజెక్టులు అనులుజరుగాలికనుక ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో కృష్ణ,బారేజి స్కీము. తుంగభద్ర ప్రాజెక్టు, రాళ్ళపాడు ప్రాజెక్టు ఎగువ పెన్నార్ ప్రాజెక్టు, భైరవానితిప్ప ప్రాజెక్టు ఇంకను మరికొన్ని ప్రాజెక్టులు ప్రారంభింపబడినవి. తుంగభద్ర ప్రాజెక్టువలన ఆంధ్ర ప్రాంతంలో కనీసం 50 వేల ఎకరాలయినా సాగులోనికి వస్తవి.

ద్వితీయ పంచవర్షప్రణాళికలో నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణం చేర్చబడినది. ఇది ప్రపంచంలోని బ్రహ్మాండమైన ప్రాజెక్టులలో ఒకటి. దీని ఉత్తరపు కాలవఖర్చు రు 2620 లక్షలు, దక్షిణపునైపు కాలవఖర్చు రు 6110 లక్షలు. మొదటికాలవవలన మొదటిపంట 1099 వేల ఎకరాలు, రెండవపంట 120 వేల ఎకరాలు సాగుఅవుతవి. ఇక రెండవకాలవవలన మొదటిపంట 2008 వేల ఎకరాలు, రెండవపంట 175 వేల ఎకరాలు సాగు అవుతవి. మొదటి కాలవపొడవు 140 మైళ్లు. రెండవకాలవ పొడవు 276 మైళ్లు.

ఈ ప్రాజెక్టు నిర్మాణం పూర్తి అయ్యేటప్పటికి కనీసం పది సంవత్సరాలు పడుతుంది. దీనివలన సాగు అయ్యే భూములమీద వేయబడే పన్నులవలన దానికి అయ్యే పెట్టుబడిఖర్చులు రాగలవని అంచనా. ఆంధ్రప్రదేశ్ అవతరణతో ఈ ప్రాజెక్టు నిర్మాణంచక్కగా సాగగలదు. దీనివలన రాష్ట్ర ఆర్థికసంపూర్ణత్వానికి ఎంతో అవకాశం లభిస్తుంది.

## సహకారం

సహకార పద్ధతులమీద ఫ్యాక్టరీలు (పంచదార,సిమెంటు) నెలకొల్పటానికి, గ్రామీణప్రాంతాలలో ఉత్పత్తిఅయిన సరకులను సహకారపద్ధతులపై అమ్మకం చేయించటానికి, ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఎక్కువ అవకాశం ఇవ్వబడినది.

ఆయా గ్రామాలకు వినియోగ పడగలందులకై సుమారు 500 సహకారసంఘాలు స్థాపించబడనున్నవి. శాశ్వతంగా భూమిని బాగుచేసికొనటానికి, నీటి వనరులను బాగుచేసుకొనటానికి ఏటా సహకార బ్యాంకుల ద్వారా 48 లక్షలనుండి 155 లక్షలవరకు అప్పులు ఇవ్వబడగలవు. ఉత్పత్తి ఋణాలు 55-56 లో 176 లక్షలుఉంటే 60-61 నాటికి 400 లక్షలవరకు పెరగగలవు. ధాన్యసేకరణకు సంబంధించిన ముఖ్యమైన కేంద్రాలలో 65 గిడ్డంగులు, మారుమూలగ్రామాలలో 120 చిన్నగిడ్డంగులు నిర్మిస్తారు. ప్రతిసంవత్సరం సహకారసంఘాల మూలసూత్రాలలో, వాని నిర్వహణ మార్గాలలో 31, 500 మంది పంచాయితీదార్లకు శిక్షణను ఇస్తారు.

తిరుపతిలోని సహకార ఇన్స్టిట్యూట్‌లో ఏటా 50 మంది చొప్పున, అనంతపురం, రాజమండ్రి నగరాలలో కొన్నివందలమందికి శిక్షణ ఇవ్వబడుతుంది. వ్యవసాయ మార్కెటింగ్‌లో 62 మంది సహకారశాఖాధికారులకు, 50 మంది అధికార సభ్యులకు శిక్షణ ఇస్తారు.

అటు శిక్షణ ఇవ్వటంతోపాటు, సహకార పద్ధతులపై చిన్నచిన్న పరిశ్రమలుకూడా నెలకొల్పబడటం జరుగుతున్నది.

## చేనేత పరిశ్రమ

రాష్ట్రంలోని కుటీరపరిశ్రమలన్నింటిలో చేనేతపరిశ్రమ ప్రముఖమైనది. రాష్ట్రంలో 21, 90, 000 పై చిల్లర చేనేత మగ్గాలున్నవి. దాని వలన సుమారు 6 లక్షలమంది బ్రతుకుతున్నారు. చేనేత పారిశ్రామికులలో నూటికి 35 మంది సహకార సంఘాలక్రింద పనిచేస్తున్నారు. మిగిలినవారు మాస్టరు వీవర్లక్రింద పనిచేస్తున్నారు. వీరినికూడా సహకార సంఘాలక్రిందకి తీసికొనిరావటానికి కృషిజరుగుతున్నది. తత్కారణంగా వీరికి సదుపాయాలు అనేకం లభ్యం కాగలవు.

1955-56 సంవత్సరంలో 1, 38, 54, 000 రూపాయలు ఖర్చుకాగల పథకాలను అమలు జరుపటానికి, రాష్ట్రప్రభుత్వం అఖిలభారత చేనేతబోర్డు వారికి తత్సంబంధమైన కార్యక్రమాంశాలను పంపినది. అంతేగాక రాష్ట్రప్రభుత్వం సహకార పద్ధతులపై 77 విక్రయశాలలను నెలకొల్పింది. ఈ చేనేత పరిశ్రమవిషయంలో మరమగ్గాలను ప్రవేశపెట్టడానికి ప్రభుత్వాలోచనలో ఉన్నది కాని ఇవి ఈ పరిశ్రమను నమ్ముకొన్న వారికి ప్రతిబంధకాలని ఆందోళన సాగుతున్నది.

## విద్యుచ్ఛక్తి

విద్యుచ్ఛక్తి అనేది కేవలం ఒక సౌకర్యం మాత్రమే గాక, గ్రామీణ ఆర్థిక వ్యవస్థను చక్కబఱచే ఒక మహత్తర సాధనం అనికూడా గమనించాలి. అనేక గ్రామీణ పరిశ్రమలు సులభంగా సాగటానికి, వ్యవసాయాభివృద్ధి జరగటానికి, విద్యుచ్ఛక్తి అవసరమయిన కారణంగా ప్రథమ పంచవర్ష ప్రణాళికలోనే దీని విషయంలో అత్యంత శ్రద్ధ తీసికొనటం జరిగింది. తత్కారణంగా ఆప్రణాళిక పూర్తిఅయ్యే నాటికి 4300 వ్యవసాయ కేంద్రాలకు 13800 గ్రామ పరిశ్రమలకు విద్యుచ్ఛక్తి సప్లయి ఏర్పాటయినది. 681 పట్టణాలకు పల్లెలకు విద్యుద్దీపాల సౌకర్యం ఏర్పడినది. ప్రణాళిక ప్రారంభంలో 305 పట్టణాలకు మాత్రమే విద్యుచ్ఛక్తి లభ్యమయినది. ప్రణాళిక ప్రారంభం నాటికి 21,000 కిలోవాట్లు విద్యుదుత్పాదన శక్తి ఉంటే ప్రణాళిక అంత్యం నాటికి 62000 కిలోవాట్లవరకు పెరిగింది. సాలుసరి ఆదాయం ప్రారంభంలో 110 లక్షలయితే అంత్యం నాటికి 168 లక్షలవరకు పెరిగింది.

ఇక ద్వితీయ పంచవర్ష ప్రణాళిక విషయం:

విద్యుదుత్పాదన ప్రాజెక్టులకై ఈ ప్రణాళికలో 21 76 కోట్లు కేటాయించారు. ఇది, మొత్తం ప్రణాళిక ఖర్చు అయిన 118 8 కోట్ల రూపాయలలో 18% మాత్రమే.

ఈ ప్రణాళికా కాలంలో అమలు జరుపబడనున్న విద్యుచ్ఛక్తి పథకాలవలన 1564 పట్టణాలకు గ్రామాలకు విద్యుత్సరఫరా ఏర్పడుతుంది. సగటు తలసరి వినియోగం 20 యూనిట్లకు పెరుగుతుంది. అసలు ఈ విద్యుచ్ఛక్తిని ఎన్నోరెట్లు అభివృద్ధి చేయడానికి మాచ్‌ఖండ్ వద్ద 21,250 కిలోవాట్లు శక్తిగల మిగతా మూడు యంత్రాలను స్థాపించటం, తుంగభద్ర డాం వద్ద 9000 కిలోవాట్ల శక్తిగల నాలుగు యంత్రాలను స్థాపించటం, తుంగభద్ర నుంచి జలవిద్యుచ్ఛక్తిని సంపాదించి 'గ్రిడ్' సప్లయిని పటిష్ఠం చేసేందుకు

నెల్లూరువద్ద 30 వేల కిలోవాట్ల థర్మల్ కేంద్రాన్ని ఏర్పాటు చేయటం జరుగుతుంది. ఈ పనులవలన అదనముగా 30,000 కిలోవాట్ల విద్యుదుత్పాదన శక్తి లభించటము, సాలుసరి ఆదాయం 147 కోట్లనుండి 315 కోట్ల వరకు పెరగటం సంభవిస్తుంది

రెండుకోట్ల పైగా జనాభా గలిగిన ఆంధ్ర రాష్ట్రానికి ప్రస్తుతం మాచ్‌ఖండ్, తుంగభద్ర జలవిద్యుచ్ఛక్తి పథకాలవలన విద్యుచ్ఛక్తి లభ్యమవుతున్నది. సీలేరు, శ్రీశైలము, సింగారెడ్డి, లక్ష్మీరెడ్డి, సిద్ధేశ్వరం పులిచింతల, నాగార్జున సాగర్ మొదలగు జలవిద్యుత్పథకాల వలన ఆంధ్రరాష్ట్రం యొక్క విద్యుచ్ఛక్తి అధికతరంగా ఇనుమడింపగలదు. తత్కారణంగా వ్యవసాయక, పారిశ్రామిక పురోగమనానికి పునాదిరాయి వేయబడుతుంది.

## లఘు, కుటీరపరిశ్రమలు

లఘు, కుటీరపరిశ్రమలవలన నిరుద్యోగ సమస్యను పరిష్కరించటానికి అవకాశం గల్గటమేగాక గ్రామీణజీవితంలో మహత్తరమైన ఆర్థిక చైతన్యాన్ని సాధించటానికి కూడా అవకాశం గల్గుతున్నది. ఇవి ఎక్కువగా కాకినాడ—పెద్దాపురం, కడప—కర్నూలు కమ్యూనిటీప్రాజెక్టు కేంద్రాలలో నెలకొల్పబడుతున్నవి. ఈ కేంద్రాలు స్వచ్ఛంద సేవద్వారా ప్రజలను సంఘటితపరచి, వారిచే కాయకష్టం విలువను, గౌరవాన్ని గుర్తింపచేయటానికి నెలకొల్పబడినవి. మొదటి కేంద్రంలో తేనెపట్టు పరిశ్రమ, కుట్టుపని, పాదరక్షల పరిశ్రమ, దంపుడుబియ్యం పరిశ్రమలు, రెండవ కేంద్రంలో తాపీపనివారి శిక్షణ, కంబళ్లి నేత పరిశ్రమ, నూలువడుకు పరిశ్రమ, తేనెపట్టు పరిశ్రమ, దంపుడుబియ్యం పరిశ్రమ—వీనికి సంబంధించిన పథకాలు అమలులోనున్నవి.

సామర్లకోటను లఘుపరిశ్రమల కేంద్రంగా రూపొందించటానికి 3½ లక్షల రూపాయలు వ్యయం కాగలవని, అందుకు కేంద్రపరిశ్రమలశాఖ నిర్ణయించినదని తెలుస్తున్నది.

ఉన్నికి, ఉన్నినూలుకు రంగులు వేసే ఫ్యాక్టరీని ఏలూరులో ఏర్పాటుచేయటానికి రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వానికి కొన్నిలక్షలు ఖర్చుఅయ్యే ఒక పథకాన్ని పంపినది. తివాచి పరిశ్రమ పునరుద్ధరణకై సహకారశాఖవారు సమర్పించిన రూ 5 లక్షలు విలువగల పథకాన్ని ఆంధ్రప్రభుత్వం పరిశీలిస్తున్నది. ఆంధ్రప్రదేశ్ అవతరణతో, వరంగల్‌లోని తివాచీ పరిశ్రమను కూడా ఈ ఏలూరులోని తివాచీ పరిశ్రమతో కలిపి, ఒకే ఒక పెద్దపథకంక్రింద అభివృద్ధి చేయటానికి అవకాశాలు లభిస్తవి.

ఇక తోళ్లపరిశ్రమ విషయం. ఆధునిక పద్ధతులలో తోళ్లను పదునుచేయటంలోనూ పాదరక్షలు వగైరా చేయటంలోనూ యువకులకు శిక్షణఇచ్చే నిమిత్తం ఏలూరులో ఒక కేంద్రం ఏర్పాటుచేయటానికి ఆంధ్రప్రభుత్వం నిశ్చయించినది. అందువలన అనేకమందికి జీవనోపాధి గల్గటమేగాక, నైపుణ్యం కూడా అలవరుచుకోటానికి అవకాశం లభ్యమవుతుంది. శిక్షణానంతరం వృత్తి ప్రారంభించేందుకు పరికరాలనిమిత్తం, తోళ్లనిమిత్తం, కోరినమొత్తం అప్పుగాకూడా ఇస్తారు. తోళ్లను పదునుచేసే పరిశ్రమవిషయంలో సహకారపద్ధతులపై పారిశ్రామిక ఎస్టేటు పథకాన్ని వివరాలతో సహా పూర్తిచేసి ఏ పారిశ్రామిక వేత్తలయినా పంపితే, దాన్ని ప్రభుత్వం సానుభూతితో పరిశీలిస్తుందని ప్లానింగ్ మంత్రి శ్రీ కళా వెంకట్రావు గారు అన్నారు.

అఖిల భారత ఖాదీ సంఘంవారు 1½ లక్షలు ఖర్చుపెట్టి 38 గ్రామాలలో 6 వేలమంది నూలు వడికేవారికి, 450 మంది నేతపనివారికి పనులు కల్పించారు. కాకినాడ-పెద్దాపురం అభివృద్ధి కేంద్ర ప్రాంతంలో 1956 సంవత్సరం మొదటి మూడు మాసాలలో రు. 5 లక్షలు విలువచేసే ఖద్దరు తయారయినది. సుమారు 265 వేల రూపాయలు వేతనాల క్రింద చెల్లించారు.

ఇదిగాక గుంటూరులో ఎనామెల్ వస్తువులు తయారుచేసే పరిశ్రమకు సంబంధించిన శిక్షణ కేంద్రం ఒకటి రు. 80 వేలతో నెలకొల్పబడనున్నది.

గూడూరు, సింహాచలం, పాపానాయుడు పేట గుట్టూరు గ్రామాలలో గాజు పరిశ్రమ ఏర్పడినది. కొన్ని కేంద్రాలలో గాజులేగాక పూసలుకూడా తయారు చేస్తారు. అంతేగాక శిక్షణకూడా ఇవ్వడం జరుగుతున్నది. గూడూరు కేంద్రంలో 15 మంది, సింహాచలంలో 15 మంది, పాపానాయుడు పేటలో 6 గురు ఈ పరిశ్రమలో శిక్షణ పొందుతున్నారు.

మోతులు, త్రాళ్లు పేనడం పరిశ్రమలలో, శిక్షణ ఇవ్వటానికి బారువలోనూ, కుంభకారక వృత్తిలో శిక్షణ ఇవ్వటానికి రాజమండ్రిలోనూ శిక్షణాలయాలు ఏర్పడినవి.

కొండపల్లి బొమ్మలు, ఏటికొప్పాక లక్కపిడతలు, తిరుపతి చందనపు బొమ్మలు, మొదలైన కుటీర పరిశ్రమల అభివృద్ధికి ఎన్నో అవకాశాలను ప్రభుత్వం కల్పిస్తున్నది.

ఇవన్నీ గాక అంబర్ చర్ఖా కేంద్రాలు అచ్చుటచ్చుట నెలకొల్పారు. వీనిలో 1500 మందికి శిక్షణ పొందటానికి అవకాశాలను కల్పించారు.

ఈవిధంగా ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలోను లఘు, కుటీర పరిశ్రమల వ్యాప్తికి ఎంతో దోహదం గలిగినది.

ఇక పెద్దపరిశ్రమల విషయం

గరివిడిలో ఫెర్రోమాంగనీస్ ఫ్యాక్టరీ, త్వరలోనే నెలకొల్పబడగలదు. గూడూరులోని పింగాణీ ఫ్యాక్టరీ, మైకాగనులు, రాజమండ్రిలోని కాగితపు మిల్లు, గుంటూరులోని గోతాలమిల్లు, చల్లపల్లి, కైకలూరు, చుండూరు, చిత్తూరు, పాలకొల్లు, గ్రామాలలో పంచదార ఫ్యాక్టరీలు, తాడేపల్లిలోని సిమెంటు ఫ్యాక్టరీ, ఈ మొదలైనవన్నీ పెద్దపరిశ్రమల అభివృద్ధికి సంబంధించిన అంశాలను తెలియజేస్తవి. ఇవి సహకారపద్ధతులపై నెలకొల్పబడనున్నవి.

ఒక్క పరిశ్రమలను నెలకొల్పటమే గాక, ఆయా వానిలో శిక్షణను గరపటానికి విద్యాకేంద్రాలు కూడా గలవు. కాకినాడలోని పోలీటెక్నిక్, సిరమిక్ స్కూలు, వుయ్యూరులోని పోలీటెక్నిక్ కళాశాల, చెప్పుకోతగినవి.

## వైద్యరంగం

వైద్యం విషయంలో ద్వితీయ పంచవర్షప్రణాళికాకాలంలో ప్రభుత్వం అత్యంతశ్రద్ధను గనబరుస్తున్నది. విశాఖపట్టణంలో కింగ్ జార్జి హాస్పిటలు, గుంటూరులోని ప్రభుత్వ ఆసుపత్రి బ్రహ్మాండంగా వృద్ధిఅయినవి. మొదటిదానిలో రేడియోగ్రాంలో శిక్షణను కూడా ఇస్తారు. రెండవదానిలో రు. 10 లక్షలు వ్యయంచేసే అభివృద్ధి కార్యక్రమాలు జరుగుచున్నవి. కర్నూలులోని ఆసుపత్రిలో మంచాల సంఖ్య 250 కి పెంచటానికి ఏర్పాట్లు జరుగుచున్నవి. ఒక వందమంది కాంపౌండర్లకు, 300 మంది నర్సులకు శిక్షణఇవ్వటానికి అవకాశాలు లభ్యమయినవి. ఇవిగాక విశాఖపట్నం మెడికల్ కాలేజి, గుంటూరు మెడికల్ కాలేజీలు విస్తృతం చేయబడినవి గుంటూరు కాలేజికి అదనంగా బ్రహ్మాండమైన భవనాలు నిర్మింపబడుచున్నవి. పైగా ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పూర్తిఅయ్యేలోగా రాష్ట్రం మొత్తంమీద ఈ క్రింది వైద్యాలయాలు ఏర్పాటుకానున్నవి.

రెండు కుష్ఠువైద్య కేంద్రాలు, రెండు కుష్ఠు విశ్రాంతి కేంద్రాలు, 15 క్షయ చికిత్సాలయాలు, 6 నేత్ర వైద్యశాలలు, 8 దంత వైద్యాలయాలు, 10 కుటుంబనియంత్రణ కేంద్రాలు, 10 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, 1 దేశీయ వైద్యకళాశాల 6 సుఖరోగ చికిత్సాలయాలు, ఒక పిచ్చాసుపత్రి 1 దంత వైద్యకళాశాల.

ఈవిధంగా వైద్యరంగంలోకూడా చెప్పుకోదగిన పురోగమనం కనపడనున్నది.

## ప్రజారోగ్యం

సమాజవికాస కేంద్రాలలోనూ, వెనుకబడిన ప్రాంతాలలోను ప్రజారోగ్యానికి సంబంధించిన వివిధ సమస్యలు పరిష్కారమవుతున్నవి.

క్షయ నివారణకు బి. సి. జి. టీకాలు వేయటం, ఒక మలేరియా లేబొరేటరీ, ఆరోగ్య విద్యాశాఖ, రెండు బాధానివారణదళాలు, 4 మలేరియా మాపకదళాలు, ఒక ఆహార పరిశోధనాదళం—ఇంకను ఇలాంటి దళాలు రాష్ట్రం మొత్తంమీద పనిచేస్తున్నవి. మలేరియా వ్యాధి నిర్మూలన పథకం క్రిందకి—కొన్ని వందల గ్రామాలు తీసికొనిరాబడినవి గ్రామసీమలలో నీటిసరఫరా, పారిశుద్ధ్యం—వీనికి సంబంధించిన కార్యక్రమాలు అమలుజరుగుచున్నవి.

అంతేగాక ప్రజారోగ్యసంబంధమైన శిక్షణ ఇవ్వటానికి ప్రత్యేకశ్రద్ధను ప్రభుత్వం కనబరుస్తున్నది. దేశంలోని ప్రజారోగ్య శిక్షణ కేంద్రాలలో 30 మంది హెల్తు ఆఫీసరులు శిక్షణ పొందనున్నారు. క్షయ, కుష్ఠులాంటి ప్రత్యేక శాఖలలో 25 మందికి

శిక్షణ ఇస్తారు. 10 మంది ప్రజారోగ్యశాఖ ఇంజనీర్లకు పట్టణ నీటిసరఫరా, మురుగునీటి పారుదల కార్యక్రమాల్లో శిక్షణ ఇస్తారు. మాతాశిశు సంరక్షణ కార్యక్రమాల్లో కుష్ఠురోగ నివారణలో, క్షయ నివారణలో మొత్తం 40 మంది శిక్షణ పొందుతారు. ఈ విధంగా ఇంకను ఆయా చికిత్సలలో అనేకులు శిక్షణ పొందుతారు. విశాఖపట్టణం మెడికల్ కాలేజిలో 500 మందికి, గుంటూరులో 250 మంది శానిటరీ ఇన్స్పెక్టర్లకు శిక్షణ ఇస్తారు.

ఈవిధంగా ఆయా శాఖలలో శిక్షణపొందిన వ్యక్తుల వలన రాష్ట్రంలోని ప్రజల ఆరోగ్యం విషయంలో రక్షణకు అవకాశాలు లభింపనున్నవి.

## సంక్షేమ కార్యక్రమాలు

సంక్షేమ కార్యక్రమాలవలన ప్రజానీకంలో అనేక విధాలైన చైతన్యం ఏర్పడటానికి అవకాశం గల్గుతున్నది. శిశుసంక్షేమం, మాతా సంక్షేమం, కార్మికసంక్షేమం, గిరిజనసంక్షేమం,—ఇలా సంక్షేమానికి సంబంధించిన అనేకరకాల కార్యక్రమాలు అమలుజరుగుతున్నవి. అనాథలైన బిడ్డలను పెంచి పెద్దవారినిగా చేయటం, పతితలైన స్త్రీలను ఉద్ధరించటం కార్మిక శ్రేయస్సుకు సంబంధించిన వేతనాల అభివృద్ధి, ప్రావిడెంటుఫండు మొదలగు సౌకర్యాలను గల్గించటం, గిరిజనుల (షెడ్యూల్డు తెగలవారు) ఆర్థిక, సాంఘిక, విద్యాభ్యున్నతికై దోహదం గల్గించు కార్యక్రమాలను అమలు జరపటం—ఇలాంటి పనులన్నీ సంక్షేమ కార్యక్రమాల పథకం క్రింద అమలు జరుగుతున్నవి. ఇలాంటివి రాష్ట్రం మొత్తంమీద 321 ఉన్నవి.

ప్రభుత్వం, రాష్ట్రంలో సంక్షేమ కార్యక్రమాలను నిర్వహించే సంస్థలకు ధనసహాయంచేస్తూ ఆవిధంగా కార్యక్రమాలను విస్తృతం చేస్తున్నది. భారత సేవక్ సమాజ్, రెడ్ క్రాస్, రోటరీ, భారత గైడ్స్ అండ్ స్కౌట్సు ఇలాంటివన్నీ సంఘ సంక్షేమానికి కృషిచేస్తున్నట్టివే. జాతిని నైతికంగా తీర్చి దిద్దటానికి, ధర్మాభిరతులనుగా ప్రజలను చేయటానికి, ఈ సంక్షేమ కార్యక్రమాలు తోడ్పడుతున్న కారణంగా, ఏ ఇతర కార్యక్రమాలకు లేని ప్రాధాన్యం వీనికి ఉన్నది. ఈ కార్యక్రమాలలో శిక్షణ కూడా ఇవ్వబడుతున్నది.

## అభివృద్ధి కేంద్రాలు

భారతదేశం మొత్తంమీద ఆంధ్రదేశంలో ఉన్నన్ని అభివృద్ధికేంద్రాలు మరి ఏ ఇతరరాష్ట్రంలోనూ లేవు. తత్కారణంగానే ఆంధ్రదేశంలో అభివృద్ధి కార్యక్రమాలు చాలా ఎక్కువగా జరుగుచున్నవి

రాష్ట్రాన్ని 303 కేంద్రాలుగా విభజిస్తారు. ఇప్పటికి 79 కేంద్రాలు స్థాపితమయినవి. అగస్టులో 22 కేంద్రాలను నిర్ణయించారు. తిరిగి నవంబరులో మరికొన్నింటిని నిర్ణయిస్తారు. కేంద్రప్రభుత్వ సహాయంతో విశాఖజిల్లా ఏజన్సీ ప్రాంతంలో, అరకు లోయలో మరికొన్ని ఏర్పాటు కాగలవు.

ఈవిధంగా రాష్ట్రం ఆయా రంగాలలో సముజ్జ్వల పురోగమనాన్ని సాధిస్తున్నది. ప్రభుత్వం చేసే పనులకు ప్రజలు కూడా హృదయపూర్వకంగా సహకరించిననాడు, ప్రభుత్వం ప్రజాశ్రేయస్సును అభిలషించి పనిచేసిననాడు రాష్ట్రం నిస్సంశయంగా మహోజ్జ్వల భవిష్యత్తును దర్శించగలదు.

# క్రొత్తగడ్డ

చంద్రమౌళి

వహీదాలీ రోడ్డుచివర కనిపించాడు. రెల్లుగడ్డి గుడిసెలముందు అరుగులమీద కూర్చొన్న భర్తలతో సాంసారిక విషయాలు మాట్లాడుతున్న వెంకమ్మలూ, సీతమ్మలూ, లోపలికి వెళ్ళిపోయారు. వాళ్ళ భర్తలు లేచి క్రిందకు దిగి నిల్చున్నారు. వహీదాలీ ఒక్కొక్క యిల్లూ దాటుతున్నప్పుడు యింటి యజమానులు 'సలామా లేఖుం'లు కొడుతున్నారు. వహీదాలీ—కాదు, జనాబ్ వహీదాలీ మింటివంకకు చూస్తూ ఉదయ భాస్కరుకన్న మిడిసిపడుతున్నాడు. ఐతే తన నెత్తిమీది తురకటోపీ లేకపోతే—ఆ ఉదయభానుని తీక్ష్ణ వీక్షణాలకు దడిసి పారిపోవలసి వచ్చేదన్న సంగతి మరిచిపోయాడు. ఆ ఊరికే మకుటం లేని మహారాజాయె మరి.

* * *

హైదరాబాదులో పోలీస్ యాక్షన్ జరగక మునుపు రోజులవి. అది నిజామాబాదుజిల్లాలో ఓ కుగ్రామం. అంతా కలిసినా వందకొంపలుండవ్. ఇళ్ళన్నీ గాలిచొరకుండా, వెలుతురు ప్రాంగణంలో అడుగుపెట్టడానికి వీలులేకుండా నిర్మించబడినవి. కప్పుకు సిమెంటు శ్లాబులో పెంకులో ఉపయోగించబడినై. ఆ ఊరిలోకల్లా జనాబ్ వహీదాలీగారిదీ, పటేల్ జనార్దనరెడ్డిగారివీ చిన్న డాబాలు. వాటి చుట్టూ పట్నంలో (హైదరాబాదులో) మాదిరిగా చిన్న చిన్న బగీచాలున్నై. అంతకుమించి వేరే వాటిని యిళ్ళనటం యేమంత సబబుగాదు. కోతులు కొల్లలు గావటాన యింటి కప్పుమీద ముళ్ళకంప లుంచబడినై. గట్టిగా గాలివాన కురిస్తే పడిపోయేలాంటివి. ఏ పని జరిగినా జనార్దనరెడ్డీ వహీదాలీగార్ల ఆమోదముద్రపడనిది జరిగేదిలేదు. వారిద్దరూ బజారున నడుస్తుంటే అంతా లేచి నిల్చోవాలి. సలాములు కొట్టాలి అది తరతరాలా వస్తున్న ఆచారం. అది జరగని నాడు—దాన్ని ఎవరైనా ఉల్లంఘించిననాడు—వాడు చంపినాసరే "ఔరా నేను నీబానిసగాన్నా" లాభంలేదు జుల్మానా చెల్లించక తప్పదు కూడాను.

వహీదాలీ వెళ్ళిన తరువాత లేచిన వాళ్ళంతా కూర్చోనారంభించారు తలుపుచాటునుంచి బయటకు వచ్చిన భార్యల చూపులు 'ఏమిటీబానిసత్వం' అంటున్నట్లున్నై. భద్రయ్య ప్రక్కింటిశోభనాద్రిని దగ్గరకు పిలిచాడు. ఊరుబయట అసలు ఊరు నానుకొని వేసుకొన్న పదియిళ్లో యీ బజారు. అసలు ఊరికీ యీ పదిళ్ళకు యెంతో తేడా కనిపిస్తుంది. ఇళ్ళముందు శుభ్రంగా అలికి ముగ్గులు పెట్టున్నై. ఏమిటిబాబాయ్ అంటూ దగ్గరకొచ్చాడు శోభనాద్రి. శోభనాద్రిదీ భద్రయ్యదీ కృష్ణా జిల్లాలో చిన్న పల్లెటూరు. నిజాం రాజ్యంలో భూములు చౌక. ఇద్దరివంశం పూర్వం బాగా కలిగినవాళ్ళదే. తాతలనాటినుంచీ కొంచెం ఆర్థికంగా పలుచబడినై కుటుంబాలు. శోభనాద్రి వాళ్ళన్నలూ పంచుకొనేటప్పటికి అతనికి మిగిలిందల్లా ఓకుంట. రెక్కలాడితేగాని డొక్కలాడని సంసారం. భార్య కాపురానికి వచ్చిన రెండు సంవత్సరాలకే యిద్దరు కూతుళ్ళు కలిగారు. సంసారం గడవటం కష్టమనిపించింది.

కూలిదొరకటం అనూహ్యం. అలాంటిశోభనాద్రికి బెజవాడ వెళ్ళివచ్చిన భద్రయ్య ఉన్నట్టుగా రమ్మని కబురంపాడు. "శోభనాద్రీ! నువ్వు పిల్లలుగలవాడివి. బాధపడుతున్నావ్. చూడబోతే నాకూ అంతఆస్తిలేదు. ఐన బంధువులలో తలెత్తుకు తిరిగేట్టులేదు. ఎంతకష్టపడ్డా సంవత్సరానికి వందరూపాయలు మిగిలేటప్పటికి పెటపెటలాడుతుంది. నీదీ పిల్లలుగల సంసారమేగా? నిజామాబాదుజిల్లాలో భూములు చౌకట. గుంటూరు జిల్లావాళ్లు చాలామంది అక్కడకు వలస వెళ్తున్నారు. ఎకరం రెండొందలు. నీకుంట అమ్ముకొన్నావంటే కనీసం పదెకరాలు కొనుక్కోవచ్చు. బాగా ఆలోచించుకో—తరువాత మనసపడి లాభంలేదు. చెరుకుబాగా

అవుతుందంటున్నారు. నేనొక్కడినే వెళ్ళిపోదామంటే మనసవటంలేదు. చిన్నప్పటినుంచీ నీవంటే నాకభిమానం" అన్నాడు భద్రయ్య.

శోభనాద్రి కళ్ళు మిలమిలలాడినై. తను పదెకరాల ఆసామీ కాబోతున్నాడు. తను కలలోకూడా తలచని విషయం. అలాంటిది. అతని ముఖం చేటంతైంది. సరిగా మోకాల్లోతేవాడుంటాడా? "అలాగే బాబాయ్! నువ్వంతగా నైజా మేమిటి నడిసముద్రంలో దూకమంటే దూకుతా" అన్నాడు. "బాగా ఆలోచించుకొని సాయంత్రం కనబడు. తరువాత తేమనుకొనీ లాభంలేదు. ఎంత చెడ్డా ఉన్నఊరూ-పుట్టి పెరిగిన ఊరూ వదిలి క్రొత్తగడ్డ త్రొక్కడం సాహసంతో కూడుకొన్న పని" అన్నాడు భద్రయ్య. శోభనాద్రికి పగలల్లా పని తెమలలేదు. పొలంగట్టు విరిపించాల్సిన పనున్నది. మినుములు కొట్టించగా రెండు బస్తాలు అమ్మకానికి సిద్ధంగా ఉన్నై. బేరం యివ్వాలి, ప్రక్క ఊళ్ళో పెద్దకూతురికి సంబంధం చూద్దామనుకొన్నాడు. చెయ్యాడలేదు ఆటూ-ఇటూ ఊరికే తిరిగాడు. తన పెద్దన్న చిన్నన్నలతో సంబంధ బాంధవ్యా లేనాడో తెగిపోయినై. మూడోవాడు గుంటూరు జిల్లాలో అత్తగారి ఊళ్ళోనే స్థిరపడిపోయాడు. పెళ్లాంతో మాత్రం తను చేయబోతున్న సాహస కార్యాన్నిగురించి ముచ్చటించాడు. సీతమ్మ ప్రోత్సాహకరంగా మాట్లాడలేదు. ఈ అడవాళ్ళంతా పిరికిపందలు, సనాతినులు, పురోగమించటం నేర్వని పరమ ఛాందసులనుకున్నాడు. ప్రొద్దు పడమటికి తిరగంగానే పొలంపైపుకు వెళ్ళి వచ్చాడు. ఊళ్లో అడుగు పెట్టేటప్పటి కింకా చీకటి పడలేదు. అరుగుమీద కూర్చొన్న మునసబు మల్లయ్య, "ఏరోయ్ శోభనాద్రీ యిలా రా" అన్నాడు. ఆయన ప్రక్కన కరణంగారు కూడా కూర్చొనున్నారు యెట్టివాడు రోడ్డుమీద చలికిల బడున్నాడు. మునసబుగారు వయసులో పెద్దవాడు. ఆయనమీద ఊళ్ళో అందరికీ అపరిమితమైన గౌరవం-ఆదరాభిమానాలు. "ఏరా శోభనాద్రీ! పొలం బేరం పెట్టావ్రటగా" అన్నాడాయన, శోభనాద్రిని దగ్గరకు రానిచ్చి.

శోభనాద్రికి యేం సమాధానం చెప్పటానికి తోచలేదు. ఈ విషయం ఐదు గంటల క్రితమే తాననుకొన్నది. అప్పుడే ఆయన కెలా తెల్సిందో-దగ్గటానికి ప్రయత్నించి ఆపేశాడు శోభనాద్రి. "ఏం లేదు మామా. నైజాంలో పొలం తక్కువ ధరకు గిట్టుబాటు ఔతుందంటే పోనీ". "పోరా పిచ్చివన్నా [illegible] ఉన్నంతరంజా—[illegible] ఉండ[illegible]. [illegible] తొక్కామంటే చిత్తగి[illegible]నాల్సిందే. ఐనా యిక్కడ లేనందుకుగా—నైజాంపోయి [illegible] పట్టి సన్నాసివైపోతేను. దానినిపోలిన [illegible] తెచ్చుకోవటంగాక" అన్నాడు మునసబుగారు. "భద్రయ్య ప్రయోజకత్వం ఎవరికి తెలీదు? [illegible] పోయిన పదెకరాలూ—[illegible] మంటే—నాటకాలాడటం – [illegible] టంట్రూ—భద్రయ్యమీద [illegible] మన్నా [illegible]" ఐనా నీయిష్టం [illegible]—[illegible] [illegible] శోభనాద్రి [illegible] [illegible] తెమలటంలేదు. [illegible] చెప్పవద్దాం[illegible] [illegible] మల్లయ్య చెప్పింది [illegible] తప్పేమి గాదు. [illegible] తెల్లవారక[illegible] [illegible] లేస్తూ—[illegible]న్నాడు. [illegible] అమ్మేశాడు. [illegible] జరిగింది. [illegible] లేదు. [illegible] పిస్తా" అన్నాడు మునసబు.

* * *

రెండు నెలల తర్వాత [illegible] గ్రామంలో భద్రయ్య పదెకరాలభూములు [illegible] కొన్నాడు. శోభనాద్రి పదెకరాలభూమి [illegible] కొన్నాడు. ఎకరం రెండొందలకొనికి [illegible] చేసుకొన్నారు. [illegible] కన్నముందుగానే గుంటూరుజిల్లానుంచి ఒకటి రెండు కుటుంబా లొచ్చినై. ఊరిబయటంటే [illegible] కొ[illegible]ని యిటుకలతో గోడలు లేపి—[illegible] పాకలు వేసుకొన్నారు. సంసారాలతో వచ్చి స్థిరపడి పోయేటప్పటికి రెండు నెలలు పట్టింది. [illegible] తెలిసినవ్వదపాయపుపవస్తు [illegible] తెలిసాపు. [illegible] నరెడ్డి, జనాబ్ [illegible] దగ్గరనుంచి పామాన్యు[illegible] ముప్పాటలా [illegible] సేవించాల్సిందే. [illegible]

ప్రక్కలెక్కడా తాడిచెట్లు లేవు. కొన్ని మైళ్ళవరకూ దాదాపు నలభైమైళ్ళవరకూ లేవు. ఎప్పుడో భీముడికీ — ఘటోత్కచుడికీ జరిగిన యుద్ధంలో తాటిచెట్లు పీకి యుద్ధం చేశారనీ — అందుకనే తాటిబోదె కనబడదనీ ప్రతీతి. ఒకటిరెండు చెట్లున్నా తాటికల్లైనా ముట్టుకోరు. అది పాపంట. ఊరుబయట వళ్ళు తెలియకుండా త్రాగి యెసురుతారు. కొందరుమాత్రం యిళ్ళలోనే త్రాగుతారు. త్రాగుడుకు ఆడా మొగా విచక్షణ లేదు. బాలింతలు నొప్పులు మరిచిపోవటంకోసం కల్లు త్రాగిస్తారు. చెరువుకింద పంట. నారు నాటడంగానీ పల్చగా ఎరువులు చల్లటంగానీ వాళ్ళకు క్రొత్త. చిన్న చిన్న మళ్ళుచేసి గింజలు చల్లేస్తారు. అవే మొలుస్తై, పెద్దవౌతై. ఎరువు కుప్పలు కుప్పలుగా పోస్తారు. నాగరికతెంత అథ్వాన్నంగా ఉందంటే యెద్దుగానీ — గున్నగానీ లేని చిన్న చిన్న రైతులు. పెళ్ళాలచేతే యేతాములు లాగిస్తారు బియ్యంమటుకు పసందుగా రుచిగా ఉంటై.

ఇలాంటి వాతావరణంలో భూములుకొని లక్ష్మిని కట్టివేద్దామని ముందు వచ్చిన నాలుగు కుటుంబాలకూ, ఆరునెలలు దాటేటప్పటికి యింకొక ఆరుకుటుంబాలొచ్చి చేరినై. భద్రయ్యకు వ్యవసాయపు సులువు మెలికలు తెలియవు. అతను చిన్నతనంనుంచీ నాటకాలనీ, బూటకాలనీ తిరిగి డబ్బు ఖర్చుచెయ్యటం తప్ప, కానీ సంపాయించి ఎరగడు. అందుకనే శోభనాద్రిని కూడా వెంబడి పెట్టుకొచ్చాడు. శోభనాద్రికి వ్యవసాయం కొట్టినపిండి. పదియిళ్ళు లేచినై. వాటికెదురుగా పొందికగా రోడ్డు వేసుకొన్నారు. రోడ్డుకిరుప్రక్కలా చెట్లు నాటారు. వ్యవసాయం సాగించారు. వేసవిలో చెరువులో నీళ్లు తగ్గిపోతై. రెండోపంట యెక్కువగా కాదు. జొన్న వేసినా యేపుగా రాదు. ఊళ్ళో నలుగురూ యీ పదిళ్ళంటే ఒకవిధంగా చూసేవాళ్ళు. ఊళ్ళో స్కూలు లేదు. ఆసుపత్రి లేదు. పదిమైళ్ళు పోతేగాని యేమీ దొరకవు. కాయగూరలూ, పాలు పెరుగూ అతిచౌక. కలలో కూడా తలచరానంతచౌక. కోస్తా జిల్లాలనుంచి వచ్చిన పదిళ్ళతాలూకు ప్రజలూ — దొడ్లో వంకాయలూ, పొట్లకాయలూ పెట్టారు. మిరపలు పొలాల్లో వేశారు. తలా ఒక గేదెను జతియెడ్లనూ కొనుక్కొచ్చారు. శోభనాద్రి సుళ్ళూ, వళ్ళూ చూచి మంచివాటిని యేరి తీసుకొచ్చాడు. భద్రయ్య పొలంపనిలో చెయ్యి చేసుకోవటం మొదలు పెట్టాడు. మొదటిసంవత్సరం పంట బాగానే అయింది. ధర నిలబడింది. రెండోసంవత్సరం సాంతం నష్టమే వచ్చింది. భద్రయ్య చేతిలో కొంత పైకం నిలవుండటాన శోభనాద్రీ భద్రయ్యలు నిలదొక్కుకొన్నారు. మిగతా సంసారులు పాతికెకరమో, అరయెకరమో, అమ్ముకొంటేగాని సంవత్సరం గడవలేదు. నైజాం పద్ధతిని పంటవేసినవాళ్ళకు నష్టమేం రాలేదు. కూలిఖర్చులకుపోను, కొద్దో గొప్పో యింటికి తోలుకొచ్చుకొన్నారుకూడాను. ఊళ్ళో చాలా మంది కోస్తాజిల్లావాళ్ళ వ్యవసాయాన్నిగురించి ఎగతాళిచేయ నారంభించారు.

శోభనాద్రి అంత పెంపెరల్లోనూ తన పెద్ద కూతురిని కృష్ణాజిల్లాలోనే యిచ్చాడు. ఆ సంవత్సరం అంత పంట సంపాకపోయినా — యింకో పది కుటుంబాలు ఆ ఊరొచ్చి వలస యేర్పరుచుకొన్నై. ఊరుబయట యింకొక ఊరు తయారౌతున్నది. వీళ్ళని చూచి ఊళ్ళోవాళ్ళు నవ్వనారంభించారు. "యీనాని యక్ వాళ్ళు తెలివిగలవాళ్ళంటారే — యింతేం తెలివి యెవరనాయాళ్ళు. కొంచెం నేలకూడా యెకరం రెండొందలు మూడొందలకు కొంటున్నారు — మట్టి బొక్క తాగుతే." అనుకొన్నారు. షాపుకోరు రామలింగయ్య ఊళ్లోవాళ్ళకొక ధరకూ ఊరిబయటివాళ్ళకొక ధరకూ సరుకు లివ్వసాగాడు. ఊళ్ళో ఒక్క మంచినీటిబావి లేదు. చెరువునీరు త్రాగటానికి బాగుండదు, ఊరిబయట — దాదాపు మైలుదూరం పోతేగాని మంచినీళ్ళు దొరకవు. అక్కడ చిన్న వాగొకటుంది. అదే గ్రామానికంతకూ మంచినీళ్ళకి. చిన్న చిన్న బళ్ళందరికీ ఉన్నై. వాటిమీద పీపాలు వేసుకొనిపోయి రెండురోజులకు సరిపోయేటట్లు తెచ్చుకొంటారు. ఊరిబయటవాళ్ళకిదేం సరిపడలేదు. రోజులో సగభాగం మంచినీళ్ళు తెచ్చుకోవటానికే సరిపోతే...... "ఇరవైయిళ్ళవాళ్ళం కలిసి బావి త్రవ్వించుకొందాం" అన్నాడు శోభనాద్రి. భద్రయ్య తలూపాడు, గుంటూరుజిల్లానుంచి వచ్చిన వెంకటేశ్వర్లుమాత్రం — "మనం త్రవ్వే బావిలోమాత్రం మంచి నీళ్ళు పడతాయని నమ్మకమేమిటన్నాడు. మంచి నీళ్ళు పడకపోతే యింట్లోకి, చెట్లకూ, పాదులకు

నీళ్లు తోడుకోవచ్చన్నారంతా. ఆరోజు నే వెంకటేశ్వర్లను సికింద్రాబాదు పంపించటానికి నిశ్చయమైంది.

బావి త్రవ్వటం పూర్తైంది నీళ్లు బాగా ఊరినై. శోభనాద్రి మొదటి బొక్కెనడు నీళ్ళు బయటకులాగి ఓ గుక్కెడు నోట్లో పోసుకొన్నాడు. అందరూ అతని ముఖంకేసే చూస్తున్నారు. ఎగిరి గంతేసి 'పంచదారలాగున్నై బాబోయ్' అన్నాడు అందరి ముఖాలలోనూ ఆనందం తాండవమాడింది. ఈ వార్త ఊరందరికీ క్షణంలో తెలిసిపోయింది. సంవత్సరం గిర్రున తిరిగింది. నిజాంసాగరు ప్రాజెక్టుప్రాంతంలో చెరుకు కెక్కువ కాసాగింది. బోధన్ ఫ్యాక్టరీకి సప్లై ఎక్కువగా కావలసివచ్చింది. చెరువులక్రింద చెరుకు వేశారు ఊరిబయట వాళ్లు. తాముంటున్న ప్రాంతానికి 'క్రొత్తపేట' అని పేరు పెట్టుకొన్నారు. దొడ్లో చెట్లపాదుల్లోనే గాక కరిపొలంలో చెరుకు తోటల్లో లక్ష్మి నాట్యమాడింది. హైదరాబాదునించి ట్యూషను మాష్టరును పిలిపించి పిల్లలకు తెలుగు చెప్పించనారంభించారు అతను బి ఏ దాకా చదువుకొన్నవాడు. అతనొచ్చిన తర్వాత యింకా ఒకరిద్దర్ని రప్పించి చిన్న స్కూలు మొదలుపెట్టారు. ఆ స్కూలుకు పాక వేశారు. హెడ్మాష్టరు పేరు రామారావు. రామారావుకు హోమ్యోపతి వైద్యం కొద్దిగా తెలుసు. 'డీన్స్ మెడికల్ చెస్ట్' — హోమ్యోపతీ మందుల పెట్టొకటి తెచ్చాడు. స్కూలుకు ఊళ్లో పిల్లలు కూడా రాసాగారు. రోజూ ఓ ఏభైమంది పోరగాళ్లు (కుర్రాళ్లు) వచ్చేవాళ్లు. వాళ్ళకు తెలుగు, హిందీ, ఉరుదూ చెబుతుండేవాళ్లు. ఉదయంపూట రామారావు చిన్న చిన్న రోగాలకు మందులిస్తుండేవాడు. అతని సంసారభారం అతని దొక్కెడిదీ గాక— 'క్రొత్తపేట' మొత్తానిదైంది.

చెరుకు ధర బాగా పెరిగిపోయింది. శోభనాద్రీ భద్రయ్యా చెరోక పదెకరాలూ కొన్నారు. వీళ్ళ ఐశ్వర్యం చూసి జనార్దనరెడ్డికీ, వహీదాలీకి కళ్లు కుట్టినై. స్కూలు పాకవేసిన స్థలం గ్రామానిదనీ, దాంట్లో పాకవేయటం నైజాం నవాబుగారి అధికారాన్నే ధిక్కరించటమనీ కుడినుంచి ఎడమకు(ఉర్దూ) దరఖాస్తు పెట్టారు. తహశీల్దారుగారు వచ్చి భద్రయ్యాను కబురంపాడు. వణుకుతూ భద్రయ్యా పోయి దర్శనం చేసుకొన్నాడు. భద్రయ్యను తహశీల్దారుగారు పిలిపించారని తెలిసి రామారావు పరుగెత్తుకొంటూ వెళ్లాడు. అతను ఉర్దూలో గూడా ధారాళంగా మాట్లాడగలడు. అభియోగమంతా విని ఏమి చెప్పటానికీ తోచక రామారావువంక చూశాడు భద్రయ్యా రామారావు ఉన్న విషయమంతా విన్నవించుకొని "పీకి పారెయ్యమంటే రేపొద్దునకు పీకేయిస్తాను కాని పిల్లలచదువుపాడైపోతుంది" అన్నాడు. తహశీల్దారుగారు తల పంకించి మెదలకుండా చక్కాపోయారు. అటు జగనార్దనరెడ్డీ—యిటు భద్రయ్యా, ఆయనేం చేస్తాడోనని తహతహతో - భయంతో కూడుకొన్న బాధ ననుభవించారు.

రోజులు గడిచిపోయాయి.

* * *

ఒకరోజు తెలవారింది. క్రొత్త పేటలో అందరూ బద్ధకంగా నిద్రలేచారు. స్త్రీలు గొడ్ల కొట్టాలలోనుంచి పేడతెచ్చి కళ్లాపి చల్లుతున్నారు. పిల్లలు రకరకాలైన పుల్లలు నోట్లో పెట్టుకొని పండ్లు తోముతున్నారు. భద్రయ్యా లేచి ఊరి బయటకు వెళ్ళాడు. శోభనాద్రి అరుగుమీద కూర్చొని ముఖం కడుగుతున్నాడు. వహీదాలీ పొలంవైపుకు వెళ్ళిపోయాడు. అతను వెళ్లిపోయిన తర్వాత తిరిగి వస్తున్న భద్రయ్యకు దూరాన పరుగులు కట్టుకొంటూ వస్తున్న రామారావు కనిపించాడు. స్వేద బిందువు లతని ముఖానికొక క్రొత్తకళ నిస్తున్నై. దగ్గరకొచ్చి నిల్చున్నా అతని నోట మాటరాలేదు. ఆరోజు రాత్రే రజాకార్ల దుండగాలారంభమైనై నిజామాబాదు జిల్లాలో కూడా అలజడి చెలరేగింది. ఓక గ్రామంలో ఓ రెడ్డిని చిత్రవధ చేశారు. దేశ్ ముఖ్ లలో అలజడి బయలుదేరింది. రెడ్లు పీచుపెంటలైనై ప్రాణమానాలకు కాపుల లేదు ఆ వార్త తీసుకొచ్చాడు రామారావు.

ఆ రాత్రే జనార్దనరెడ్డి ఊరువిడిచి పారిపోయాడు. మళ్ళీ తెల్లవారింది. మామూలుగా వహీదాలీ ఊరి చివర కనిపించాడు. అంతా లేచి నిల్చొన్నారు. ఈనాడు వహీదాలీ ముఖంలో క్రౌర్యం ఉట్టి పడుతున్నది. దూరంనుంచే వెగటుగా అందరి వంకా చూడ నారంభించాడు. గడ్డం సవరించుకొన్నాడు. భద్రయ్య ఇంటివద్దకువచ్చి ఒక్క క్షణం ఆగిపోయాడు. "భద్రయ్యా బాగా ఉన్నావా?" అంటూ అసహ్యంగా నవ్వాడు. భద్రయ్యా తలవంచి తల ఊపాడు. మధ్యాహ్నానికి వింత వింత వార్తలొచ్చి చేరసాగినై. నిజామాబాదులో స్త్రీలు చెరచబడ్డారని......ఈ ఊళ్ళో ఒక్క క్షణం ఉండటం మంచిది కాదన్నాడు రామారావు. "మా ఊరిదేగా?" అన్నాడు శోభనాద్రి. ఎన్నో తర్క వితర్కాలు జరిగినై చివరకు భద్రయ్యా, రామారావు, పిల్లా జెల్లా అంతా బెజవాడ వెళ్ళిపోవాలని నిర్ణయించబడింది. వెంకటేశ్వర్లు శోభనాద్రి ఉండిపోయారు—పొలం పనులకోసం. అరగంటలో క్రొత్తపేట ఖాళీ ఐపోయింది.

విజయవాడవెళ్ళే ప్యాసింజరులో జనం క్రిక్కిరిసి పోయారు. రైలు పెట్టెలమీదా, ఫుట్ బోర్డుల మీదా ఖాళీ లేకుండా కూర్చొన్నారు. ప్రపంచంలోని జనమంతా యీ రైలులోనే ప్రయాణం చేస్తున్నట్లున్నది. ఎటు చూసినా భయ సందేహాలే. కళ్ళల్లో గాబరా, కాళ్ళూ చేతులూ నీరసించిపోతున్నై. ఏక్షణాన ఏ నరరూపరాక్షసుడు మీదపడి—ఏం చేస్తాడోనన్న పిరికితనం నరనరాల ఆ మానవసందోహంలో కనిపిస్తున్నది. శరీరమంతా ముచ్చెమటలు పోసినై. ఒకరిద్దరు 'రజాకార్' అన్న మాట గొణుగుకొన్నారు కూడా. రైలుగూడా బెరుకు బెరుకుగా బయలుదేరింది. ఆ బెరుకుతనంతో గంటసేపు ప్రయాణం చేసింది.

అంతే జనగామ దాదాపుకు రాకముందే రైలాగిపోయింది. పెట్టెలపైకెక్కినవాళ్ళు ఒక్కసారి క్రిందకుదూకారు. మొలలోఉన్న బాకులు బయటకు తీశారు. అందులో ఒకతనిదగ్గర రివాల్వరుకూడా ఉంది. చెట్లచాటులనుంచి మరికొందరు రజాకార్లు వచ్చారు. అంతా ఇంద్రజాలంలా జరిగిపోతున్నది. ఎదురొచ్చిన మగవాడల్లా యమసదనానికి తరలిపోతున్నారు. ఎటుచూచినా ఆర్తనాదాలు హాహాకారాలే. కలియుగాంతపు విలయం లాగుంది; కొద్ది క్షణాలు గడిచిపోయినై. భద్రయ్యావాళ్ళూ ఉన్న పెట్టెలోకి రజాకార్లు, రౌడీలు, గుండాలు ప్రవేశించారు. పసిపిల్లలూ తల్లులూ బిగ్గరగా యేడ్వనారంభించారు. పదినిముషాలు, పదేనిముషాలు చేతులు విరిచికట్టబడ్డ భర్తలకెదురుగా అందరి భార్యల మానహరణము జరిగిపోయింది. తరువాత కసిదీర భర్తల హృదయాల్లోకి కత్తులు పొడిచారు. ఆడవాళ్లు శవాల్లా నేలమీద పడిపోయారు. ఆ రాక్షసులవాంఛ లంతటితో తీరలేదు. శవాల్లాంటి ఆ శరీరాలమీదపడి దొర్లారు. బుగ్గలు కొరికారు. కొన్నిగంటలు నరకం భూలోకంలోకి తరలివచ్చింది. మళ్ళీ తరలిపోయింది. తుపానువచ్చి తగ్గిపోయినప్పటి వాతావరణం చల్లగా ఉంటుంది. ఈ వాతావరణం కలకత్తా కాళి నృత్యం చేసిన వాతావరణం. ఇక్కడ అసహాయంగా అమానుషంగా చంపబడిన భర్తల శవాలు- అదే శ్మశానవాటిక.

* * *

పోలీసు యాక్షన్ జరిగింది. హైదరాబాదు యూనియన్ లో కలిసింది. రజాకార్ల గుండగాల కొందరో బలైపోయారు. కోస్తాజిల్లాలలో తలలు దాచుకోవటానికి వెళ్ళిన ప్రజానీకం మళ్ళీ స్వగ్రామాలు చేరుకొంటున్నవి. ఎక్కడ అలజడి అక్కడ అణిగిపోయింది. కాని భద్రయ్య జాడకానీ తతిమ్మావాళ్ళ జాడకానీ యిటు శోభనాద్రికి—అటు బంధువులకూ తెలియలేదు.

ఒకనాటి మధ్యాహ్నం శోభనాద్రి పొలంనుంచి యింటికివచ్చాడు. తిక్కనపొలాలన్నీ బీళ్ళుపడినై. శోభనాద్రి వెంకటేశ్వర్లు సాగుచేసిన ఇరవై ఎకరాలు బాగా పండినై. రజాకార్లు ఎప్పుడొచ్చిపడతారో! వాళ్ళెక్కడున్నారో ఎవరికీ తెలియదాయె అసలు యితర ప్రపంచ మెలావున్నదో తెలీదు. ముందు కుండేదిటువు చేసుకున్నాడుగానీ—శోభనాద్రి హృదయంకూడా కొన్నిరోజులు జరగగానే బీటలు వారసాగింది. పిల్లాజెల్లా కులాసాగా చేరారో లేదోనన్న బాధ కలవసాగింది. ఊళ్ళోకూడా ఒకటిరెండు గురకలిళ్లు గోల చేశినై. ఏదో హడావుడి కంతా నిమిగిపోయినప్పటి వాతావరణం గొంతుమీదికత్తిలాంటి భావాలు జొరబడలు.

పంట యింటికివచ్చింది. అది దక్కుతుందో లేదో జనార్దనరెడ్డి కుటుంబం విప్రలంపలేదు. వసీనాలీ కోర మీసాలు మెలివేస్తూ నవ్వుతుండేవాడు.

శోభనాద్రి నాలుగు ముద్దలు తిని నందివాల్చి కూర్చుని వెంకటేశ్వర్లుకోసం ఎదురుచూస్తున్నాడు. అతనెంతసేపటికీ రాలేదు. సాయంత్రపుసేపుగడిచిపోయింది. అతనింక ఓర్చుకోలేకపోయాడు. తలుపు తాళంవేసి పొలంవైపుకు నడక సాగించాడు. ఇంటిదగ్గర పంటే మాతుందోనని గుండెల్లో భయంగా వుంది. చెరుకు ఏపుగా పెరిగింది. కూలీలు దొంక్క కోయించటానికి వీలుపడలేదు. పదిగజాల మెరకలో చిన్నగుడిసె వేసున్నది. దాన్ని దూరాన్నుంచే చూశాడు శోభనాద్రి మనుష్య సంచారమేమీ కనిపించటంలేదు. బాగా దగ్గరగా వచ్చేశాడు. గుడిసెక్రింద వెంకటేశ్వర్లు స్పృహతప్పి పడిపోయున్నాడు తల రక్తంలో ఓలలాడుతున్నది. ధోవతినిండా రక్తం మరకలైనై. రెండోవంట వరికి వేసిన మడికచాపనా మనుష్యులు త్రొక్కినట్లయింది చెరుకుతోటలో కొన్నిగడలు అడ్డంగా వంగి కోసుకుపోయినచాయలు కనుపించినై శోభనాద్రి కేమీ అర్థంకాలేదు. జరిగిందేమిటో ఊహించుకోలేకపోయాడు పైపంచతీసి వెంకటేశ్వర్లు తలకుకట్టాడు. అతను బాధగామూల్గి కళ్లు మూసుకున్నాడు. బలమైన తన హస్తాలతో పసిపిల్లాడినెత్తుకున్నట్టు వెంకటేశ్వర్లును వీపున వేసుకొని గట్టునపడి యింటికి తీసుకొచ్చాడు శోభనాద్రి.

గుంటూరుజిల్లానుంచివచ్చి కొత్తపేటలో నివాసమేర్పరచుకున్న పుల్లయ్య తిరిగివచ్చి అరుగుమీద కూర్చొనున్నాడు. నిర్జీవంగాఉన్న కొత్తపేట అతని కాహ్వానమిచ్చింది. ఊళ్ళోనూ యిప్పుడిప్పుడే జనం

# క్రొత్త గడ్డ

వచ్చి చేరుతున్నట్టున్నది. పుల్లయ్య బాగా చిక్కిపోయాడు. అతనిలో మునుపటి ఉత్సాహం కనిపించటంలేదు. శోభనాద్రినీ అతని భుజంమీదున్న వెంకటేశ్వర్లును చూచి అతను బావురుమన్నాడు. వెంకటేశ్వర్లును మంచం మీద పడుకోబెట్టి 'పుల్లయ్యా సంగతులేమిటి' అన్నాడు శోభనాద్రి. పుల్లయ్య గొంతు పూడుకుపోయింది. శ్రావణమేఘాలు అతని ముఖంలో నాట్యమాడినై. బొంగురుపోయిన గొంతుతో జరిగినకథ చెప్పాడు. క్రొత్తపేట వాస్తవ్యుల్లో తనూ తన కొడుకూ తప్ప యింకెవ్వరు మిగలలేదన్నాడు. అగ్నిలో సమిధల్లా అంతా బుగ్గయినారన్నాడు. భావరహితమైన ముఖంతో శోభనాద్రి తన భార్య బిడ్డల మానభంగ చరిత్రా-చివరకు వాళ్ళెల్లా చిత్రవధ చెయ్యబడిందీ విన్నాడు. తన ప్రాణతుల్యుడైన భద్రయ్య సకుటుంబంగా ఎలాచనిపోయిందీ విన్నాడు. కనుకొలకుల్లో రెండు కన్నీటిబిందువులు నాట్యంచేసినై. మసిపట్టి గాలి కారిపోయిన దీపపుకళపడ్డ దానిముఖానికి. ఒక్క గుటక మ్రింగాడు-ఇంతలో లోపల వెంకటేశ్వర్లు 'అమ్మా' అని మూలిగాడు.

ఆ ఊళ్ళో జరిగిన రజాకార్ల గుండెగమని చెప్పటానికి తగినది చెరు కపహారణ వెంకటేశ్వర్లు తలపగలడం. అందరితో పాటు జనార్దనరెడ్డీ తిరిగివచ్చాడు. క్రొత్తపేటలోనుంచి మాత్రం ఆశాజ్యోతి తరలి పోయింది. గాఢాంధకారంలో - అనంతవిశ్వంలో తమవుకులాడే వ్యక్తిలాగైనాడు శోభనాద్రి. పెద్దకూతురు దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది తమ క్షేమసమాచారాలు తెలియ చేయమని. ఊళ్ళోకి వచ్చిన రెండోరోజున జనార్దనరెడ్డి. శోభనాద్రికి కబురంపాడు. శోభనాద్రి మనసు పరిపరివిధాలపోయింది. కారణరహితంగా రెడ్డి తనను పిలిపించడు. రెడ్డి యెన్నడూ చూపని ఔదార్యం గౌరవం చూపించాడు. కుర్చీలో కూర్చోబెట్టి సానునయంగా సానుభూతి చూపించాడు, 'చీకటి శాశ్వతమా. వెలుగు ఏనాడో ఓనాడు రాక తప్పద న్నాడు. చివరకు తన పొలంలో ఐదెకరాలు అమ్మజూపాడు. శోభనాద్రి ఆలోచనలోపడ్డాడు. భూమిమీద సారంలేక కాదు. రెడ్డి హయాంలో అగుపు అజా కనుక్కోక పోవటమే. ఎవరూ ఆభూమిని కొనరు. భద్రయ్య బ్రతికుంటేగా అనేవాడు. 'శోభనాద్రీ-నీ చేతిలో బడితే కొండరాళ్ళైనా నల్లరేగడి కావాలిసిందే.' శోభనాద్రి భూమి తీసుకోవటానికి నిశ్చయించుకొన్నాడు. అవసరంకొద్దీ రెడ్డి రెండొందలుతక్కువకే ఖరారు చేశాడు. క్రుంగిపోయిన మనసుతాలూకు గల్లు-క్రొత్త ఆశనే పాటి దిబ్బలతో పైకి లేస్తుండగా జనార్దన రెడ్డి యిల్లువదిలాడు శోభనాద్రి.

నెల తిరగకముందే క్రొత్తపేట అనేక క్రొత్త ముఖాలు వచ్చి వెళ్ళనారంభించినై. బంధువు లేమైనారో తెలుసుకోవడానికి కొందరూ క్రొత్తగా వలస వస్తున్నవాళ్ళు కొందరూ. శోభనాద్రి తాలూకు బంధువులు ఓదార్చటానికి వచ్చినట్లు వచ్చి 'నీకేంగా వయసుమళ్ళిందా?' — ఏమన్నానూ — నా మేనమామకూతురు యెదిగినపిల్ల — రత్నంలాంటిదుంది.” అని తరచి—తరచి మనసులోది వెళ్ళగక్కి సలహాలూ అనునయాలూ పూర్తిచేసి వెళ్ళిపోయారు. వాళ్ళ బాధపడలేకనైతేనేం—మళ్ళీ పెళ్ళి చేసుకుందామనే కాంక్ష మనసులో ఏ మూలో రేగడానైతేనేం శోభనాద్రి ఆరు సంవత్సరాల తర్వాత తాతల, తండ్రుల గ్రామం బయలుదేరాడు.

ఊరంతా మారిపోయింది. తాను వలస వెళ్ళిన నాటి ఊరుకాదిది. ఊళ్ళో హైస్కూలు పెట్టారు. కంకరరోడ్లు వేశారు. ఐదారు హోటళ్లు లేచినై. మునసబుగారు నిరుడు చనిపోయారు. అతని కుమారుడు మేడగట్టాడు. ఆ ఊరిమీ దందుకో శోభనాద్రికి కినుకగానే ఉన్నది. అది ఒకప్పుడు తన స్వగ్రామమన్న సంగతి కూడా మరిచిపో ప్రయత్నించాడు. ఈ ఊళ్ళో తను చెల్లనిరూపాయైనాడు. క్రొత్తపేట తనకు విలువ కట్టింది. లక్ష్మిని తనవాకిటిముందు కట్టివేసి నాట్యం చేయించాడు. క్రొత్తపేట తను ప్రోగేసిన్లు- తన కూడు—తను. ఆ సాయంత్రమే బయలుదేరి పెద్ద కూతురిగారింటికి వెళ్ళిపోయాడు. కూతురు పరిస్థితేమంత బాగుండలేదు. ఆ ఊళ్ళో కూడా ఒకరిద్దరు తనకు పిల్లనిస్తామని వచ్చారు. శోభనాద్రి మనసులో ఏదో పురుగు తొలిచింది. పెళ్లి చేసుకోకూడదని నిశ్చయించుకొన్నాడు.

పదిరోజుల తర్వాత కూతురూ అల్లుడితో సహా క్రొత్తపేట పొలిమేరలో అడుగుపెట్టిన శోభనాద్రి హృదయంలో అవ్యక్తమైన ఆనందం పూలుపూసింది. మామగారి దగ్గరుండిపోవటానికల్లుడంత అడ్డుచెప్పలేదు. ఊరింకా మైలుదూరముండగానే కచ్చడం (బండి) లోనుంచి దిగి శోభనాద్రి చుట్టూతా పెరిగిన చెరుకుతోటలూ—దూరాన బంగారు తునకల్లాగా మిసమిసలాడుతున్న వరికంకులు చూచి పరవశత్వంతో ఓ క్షణం కళ్లుమూసుకొని ప్రకృతి అందాన్ని లావణ్యాన్నీ చూచి అబ్బురపడి పుస్తెకట్టాడు మనసులో. కూతురూ అల్లుడూ జాలిగా అతనివంక చూస్తూ ఉండిపోయారు.

# ఆంధ్రదేశ సహజ సంపదలు

శ్రీ టి. ఆర్. లక్ష్మణన్

బ్రిటిష్ హయాములో భారతదేశపు రాజకీయ ప్రాంతాల విభజన అర్థంపర్థంలేని విధంగా జరిగింది. భారతదేశ చరిత్రకూ ఆ రాష్ట్రాల విభజనకూ ఎలాంటి సంబంధమూ వుండేదిలేదు. కేవలం బ్రిటిష్ పరిపాలకుల సైనికావసరాలకు అనుగుణంగానూ పరిపాలనావసరాలకు అనుగుణంగానూ రాష్ట్రాలను యేర్పాటు చేశారు. 19 వ శతాబ్దంలో వివిధ ప్రాంతీయ భాషలూ సమగ్రరూపాలలో పెంపొంద సాగినాయి. క్రమేపీ వివిధభాషా ప్రాంతాల ప్రజలకు ప్రత్యేక ప్రత్యేక సంస్కృతు లున్నట్టు విస్పష్టమైంది. రాష్ట్రాలను యోగ్యమైన నూతనపద్ధతిని పునర్నిర్మించాలనే ఆందోళన దేశంలోని అభిజ్ఞవర్గాలలో బయలుదేరటంతో భాషా ప్రాంతాలపై దృష్టి మరలింది. దేశానికి స్వాతంత్ర్య లభించినతోడనే, ఈ రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ వెంటనే పరిష్కారం కావలసిన ప్రధాన సమస్యగా నాయకులకు తోచింది ఈ సమస్యను పరిశీలించటానికి 'రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ' సంఘాన్ని ఒకదాన్ని నియమించారు. ఈ సంఘం సమర్పించిన నివేదికకు తెలుమార్పులు చేసి ఈ నవంబరు 1 వ తేదీ నుంచీ సక్రమమైన పద్ధతిని రాష్ట్రాలను పునఃవ్యవస్థీకరించి నూతన రాష్ట్రాలను సృష్టించుతున్నారు. ఇలా ఆవిర్భవించుతున్న రాష్ట్రాలలో మహాంధ్రరాష్ట్రం అత్యంత ప్రధానమైనది. దీనికి 'ఆంధ్రప్రదేశ్' అని నామకరణం చేశారు. సర్కారు జిల్లాలు, తెలంగాణా, రాయలసీమా కలసి ఈ మహాంధ్రరాష్ట్రం ఏర్పాటు తుంది. వైశాల్యం దృష్ట్యా భారతదేశంలోని ప్రథమ శ్రేణి రాష్ట్రం అవుతుంది.

| | రాష్ట్రము | వైశాల్యం | జనాభా |
|---|---|---|---|
| 1 | ఆంధ్రప్రదేశ్ | 105962 చ. మై. | 313లక్షలు |
| 2 | మద్రాసు | 50170 | 300 |
| 3 | కేరళ | 14980 | 136 |
| 4 | కర్ణాటకము | 72730 | 190 |
| 5 | ఒరిస్సా | 60140 | 146 |
| 6 | ఉత్తరప్రదేశ్ | 113410 | 622 |
| 7 | మధ్యప్రదేశ్ | 171200 | 261 |

ఆంధ్రప్రదేశ్ గొప్పరాష్ట్రం కావటమేగాక, అనేక సహజ సంపదలుగల సంపన్నమైన రాష్ట్రం. ఈ సహజ సంపదలను ఈ విధంగా విభజించవచ్చు: (1) నీటివనరులు-విద్యుచ్ఛక్తి (2) అడవులు (2) ఖనిజములు (4) వ్యవసాయము.

## నీటివనరులు

ఆంధ్రప్రదేశ్ అనేక భాగాలలో వర్షపాతం తక్కువగా వుండటమేగాక వర్షంమీద ఆధారపడి వుండటానికి ఎట్టి ఆస్కారమూ లేదు. అందుచేత అనేక ప్రాంతాలు బుతుపవనాల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి వున్నాయి ఈ ప్రాంతాలు ఎప్పుడూ క్షామాలకు లోనవుతూ వుంటాయి తగిన నీటి వసతులను అభివృద్ధి చేస్తే నేతప్ప ఈ ప్రాంతాల చిక్కులు తీరవు. ఇప్పటికే రాష్ట్రంలోని చాలాభాగం, వ్యవసాయ యోగ్యంగా చేయబడ్డది. కృష్ణా, గోదావరి జిల్లాల పంటకాలువల అభివృద్ధితో, ఆంధ్రదేశం దక్షిణభారత ధాన్యాగారంగా పెంపొందింది. తెలంగాణా ప్రాంత మంతా చెరువుల క్రింది సాగుగా మాత్రమే వుంది. కాని రాష్ట్రంలో వ్యవసాయాభివృద్ధికి ఇంకా అనంతమైన అవకాశా లున్నాయి. తుంగభద్ర ఆనకట్ట నిర్మాణం పూర్తి అయితే దానిక్రింద 450,000 ఎకరాల పల్లపు సాగుకూ 13,5000 ఎకరాలు గడ్డిబీళ్లూ అరణ్య ప్రాంతాలు పెంచటానికీ నీరు లభించుతుంది.

నాగార్జునసాగర నిర్మాణం పూర్తిఅయితే కృష్ణానదీ జలాలలో నూటికి 20 వంతులు వినియోగానికి వచ్చి, నల్లగొండ, కంభం, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాలన్నీ, సస్యశ్యామలా లవుతాయి.

రాష్ట్రంలో జలవిద్యుదభివృద్ధికి అనంతమైన సావకాశా లున్నాయి. క్రొత్తగా నిర్మించుతున్న తుంగభద్ర మొదలైన ప్రాజెక్టులవద్ద విద్యుచ్ఛక్తి అపారంగా ఉత్పత్తి కాగల సావకాశా లున్నాయి.

తుంగభద్రప్రాజెక్టు—1,00,000 కిలోవాట్లు
నాగార్జునసాగరం—75,000 ,,
ముచికుంద—1,02,000 ,,

ఈ విద్యుదుత్పత్తి కేంద్రాలలో మచికుంద అత్యంత ప్రధానమైనది. డుడుమా జలపాతం దగ్గర గోదావరి ఉపనదియైన మచికుందను అరికట్టుతున్నారు. అక్కడ జలముయొక్క పాతప్రమాణాన్ని 850 అడుగులకు పెంచినారు. దీనివల్ల లభించే విద్యుచ్ఛక్తిని విశాఖ, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరుజిల్లాలకు అందజేస్తారు. ఇంకా కావాలంటే కృష్ణ, గోదావరి, పెన్నా మొదలైన ప్రధాననదుల ఉపనదులను అరికట్టి ఇంకా వలసిన అవధికి విద్యుచ్ఛక్తిని పెంపొందించుకోగల సావకాశాలున్నాయి. ఏది ఏమైనా, ఈ రాష్ట్రానికి తగిన అవధికి విద్యుచ్ఛక్తి లభింపక అభివృద్ధి కార్యక్రమాలు ఆపుకోవలసిన అవసరమేమీ పట్టదు.

## అడవులు

శతాబ్దాల తరబడి కేవల వ్యావసాయక ప్రాంతంగా వుంటున్న భారతదేశంవంటి ఏ దేశంలోనూ ఎక్కడో అందుబాటులోలేని మారుమూలలో తప్ప వన్యప్రాంతమంటూ ఎక్కువగా మిగిలి వుండే సావకాశం వుండదు. కాని అదృష్టవశాత్తూ ఆంధ్రప్రదేశ్‌లో మొత్తం భూభాగంలో నూటికి 20 వంతులు ఇంకా అరణ్యప్రాంతంగా మిగిలే వుంది- (భారతదేశపు సగటు అరణ్యప్రాంతం 13 15%) కాని అరణ్యప్రాంతంవల్ల కలిగే అనేక ప్రయోజనాల దృష్ట్యా, ఇంకా ఈ ప్రాంతం తక్కువేనని చెప్పాలి. ఈ అరణ్యాలు, విశాఖ, శ్రీకాకుళం, వరంగల్, అదిల్లాబాద్



మొదలైన పర్వత ప్రాంతాలలో వ్యాపించి వున్నాయి. ఈ అరణ్యాలు అనవసరమైన తుప్పలు గాదు. టేకు, మొదలైన ప్రసిద్ధమైన కలపజాతుల చెట్లు కలవి. కాగితం ఉత్పత్తికి అత్యంత ప్రధానమైన వెదురు విస్తృతంగా లభించుతుంది. అందుచేతనే సిరిపూర్ మొదలైన ప్రాంతాలలో కాగితం మిల్లులు స్థాపించారు.

## ఖనిజ సంపదలు

ఈ ప్రాంతంలో గల ఖనిజ సంపదలు ఎక్కడ ఏమి లభించగలవో, ఇప్పటికీ శాస్త్రీయ పద్ధతిని అన్వేషణ చేసి తేల్చినవారెవరూ లేరు. అయినా ఇప్పటికి లభించిన భోగట్టాలనుబట్టి యీ దేశానికి బహుళతరమైన ఖనిజసంపద వున్నదని చెప్పటానికి ఎట్టి అభ్యంతరమూ లేదు. మైకా, మాంగనీసు, బొగ్గు, సున్నపురాయి, బారైట్, జిప్సమ్ ఈ ఖనిజాలు పుష్కలంగా వున్నవి. సింగరేణి గనులలోనూ, ఇంకా, గోదావరి లోయలోని కొన్ని ప్రాంతాలలోనూ బొగ్గు వుంది. సింగరేణి ప్రాంతల భూగర్భంలో 100 కోట్ల టన్నుల బొగ్గు వున్నదంటున్నారు. విశాఖలో మాంగనీసు, గూడూరులో మైకా ప్రధానమైన ఖనిజాలు. ఇవి అమెరికా, బ్రిటన్, జపాన్ దేశాలకు ఎగుమతిఅవుతూ విదేశీ చెలామణి ద్రవ్యాన్ని ఎక్కువగా సంపాదించటానికి అవకాశంగా వున్నాయి. ఇంకా యీ ఖనిజాలు ఎక్కడెక్కడ దొరకగలవో తెలుసుకోవటానికి భారీయెత్తున పరిశోధనలు జరుగవలసివున్నాయి. ఇవిగాక కడప, ఆదిల్లాబాద్, మహబూబ్‌నగర్ ప్రాంతాలలో సున్నపురాయి, ఆస్బెస్టాస్, గ్రాఫైట్, బారైట్, మొదలైన—ఖనిజాలు లభించుతున్నాయి.

ఒక్కటి మాత్రం చెప్పవలసివుంది. ఉన్న ఖనిజ సంపదల దృష్ట్యా, ఉత్పత్తులు మాత్రం చాలా తక్కువగా వున్నాయి. ఈ సంపదనంతను బయటికి త్రవ్వకోవలసి వుంది. భారతదేశంయొక్క ఖనిజ వ్యాపారంలో ఆంధ్రప్రాంతం ప్రధానమైన స్థానం ఆక్రమించి తీరుతుంది.

## వ్యవసాయం

ఈ ప్రాంతంలో చాలా భాగం వ్యవసాయ భూమిగా వుంది. ఈదేశం, ప్రజలుకూడా అధికభాగం వ్యవసాయ వృత్తిమీదనే ఆధారపడి వున్నారు. గత 50 సంవత్సరాలలో వ్యవసాయభూముల విస్తీర్ణంలో చెప్పుకోదగినంత పెంపుదల రాలేదు. బహుళార్థసాధకములుగా నిర్మింపబడుతున్న ఈ క్రొత్త ప్రాజెక్టుల వల్ల విశేషభూభాగం వ్యవసాయ యోగ్యమయ్యే అవకాశం వుంది. అయితే ఈ పెంపుదల జనాభా పెంపుదలకు సరిపోయేదిగా కనుపించటంలేదు. ఈ పెరిగే జనాభాకు ఆహారం సరిపోవాలన్నా, ప్రజల జీవన ప్రమాణం పెరగాలన్నా యీ క్రొత్త భూములలో కూడా మామూలుగా పండుతున్న అవధిని పండితే చాలదు. అందుచేత పంట అభివృద్ధికి కూడా నూతన మార్గాలు అవలంబించవలసి వుంది. దీనితోపాటు కుటుంబ నియమన కార్యక్రమం కూడా అమలు జరుపవలసి వుంది. అలా జరిగితేనే తప్ప, ఆంధ్రప్రదేశ్ ప్రజలకు సౌఖ్యకరమైన జీవనస్థితి యేర్పడదు.

| రాష్ట్రము | సాగుభూమి | తృణధాన్యాల ఉత్పత్తి | భూభాగ విస్తీర్ణం | జనాభా | తల 1 కి సగటుభూమి | తల1-కి సగటున వ్యవసాయ భూమి |
|---|---|---|---|---|---|---|
| బొంబాయి | 583 లక్షల ఎకరాలు | 62 లక్షల టన్నులు | 190,919 చ. మై. | 483 లక్షలు | 2.54 ఎకరాలు | 1.96 ఎకరాలు |
| ఉ. ప్రదేశ్ | 406 ,, | 88 ,, | 113,409 ,, | 632 ,, | 1.2 ,, | 0.86 ,, |
| ఆంధ్రప్రదేశ్ | 353 ,, | 58 ,, | 171,201 ,, | 261 ,, | 4.19 ,, | 1.74 ,, |
| మ. ప్రదేశ్ | 253 ,, | 52 ,, | 105,962 ,, | 313 ,, | 2.16 ,, | 1.2 ,, |

# ఆంధ్రప్రదేశ్ జనాభా, వ్యవసాయము

## జనాభా

ఒక్కొక్క చుక్క 100,000 ప్రజలకు సంకేతం



## నీటివసతి గల సాగుభూమి




## సాగు భూమి

ఒక్కొక్క చుక్క 50 వేల ఎకరాలకు సంకేతము




## క్రొత్త సాగు

ఒక్కొక్క చుక్క 80,000 ఎకరాలకు సంకేతం



# కలగూరగంప

## అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు

### యదార్థవాది

ఇటీవల అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు ఒకటి ఆ చిరకాలములోనే స్థాపింపబడవలసిన అవసరము కలదని సాహిత్యాభిమానులైన నాయకులును, కవులును సభాముఖమునను; పత్రికా మూలముననుఁ ప్రకటించియున్నారు. కాని సదరు పరిషత్తుయొక్క నిర్మాణ విధానమును గూర్చి కాని దాని కార్యకలాపములను గూర్చి కాని యింతవఱకును ఎవరును చర్చించి యుండలేదు. ఈ పరిషత్తును స్థాపించు సందర్భమున దాని ఆశయములను, కార్యకలాపములను రూపొందించు సందర్భములో అందఱును గుర్తించుకొనవలసిన విషయములు కొన్ని కలవు.

ఇంతకు మునుపు మనదేశములో ఆంధ్రసాహిత్య పరిషత్తు, నవ్యసాహిత్య పరిషత్తు మొదలైన సాహిత్య సంస్థలు నెలకొని సాహిత్యాభివృద్ధికి అనేక విధముల తోడ్పడినవి. క్రీ. శ. 1911 లో ఆంధ్ర సాహిత్య పరిషత్తు స్థాపన జరిగినది. కాని ఆ సంస్థ గ్రాంథిక భాషను మాత్రమే ప్రోత్సహించునది అగుటచేత ఆ సంస్థ అఖిలాంధ్ర సాహిత్య సంస్థగా ప్రజాభిమానమును పొందలేకపోయినది. ప్రాచీనాంధ్ర సాహిత్యము మీద ఆదరాభిమానములు కలవారికి మాత్రమే ఆ సంస్థ ఆరాధ్యమైనది.

దీనికి ప్రత్యామ్నాయముగా నవ్యసాహిత్యమును ప్రచారము చేయుటకొరకై యేర్పడిన నవ్యసాహిత్య పరిషత్తుకూడ సారస్వతేయులలో నొక వర్గమువారికి మాత్రమే ఆదరప్రోత్సాహములు కల్పించుచుండినది. ఇది వ్యావహారిక భాషను ప్రచారము చేయు నాశయము కలిగియుండుటచేతను, నవ్యసాహితీపరుల సాహిత్య కృషిని మాత్రమే ప్రోత్సహించుచుండుటచేతను నిది ప్రాచీన సాహిత్యాభిమానుల ఆదరాభిమానములను చూఱగొనజాలకపోయినది.

దీనితరువాత ఇటీవల స్థాపింపబడినది తెలుగుభాషా సమితి - సంయుక్త మదరాసు రాష్ట్రములో ఆంధ్రదేశము అంతర్భాగమై యున్నప్పుడు ప్రభుత్వాదరముతో స్థాపింపబడిన యీ సంస్థ తెలుగు విజ్ఞాన సర్వస్వమును తయారుచేయుటకై ప్రధానముగా నెలకొల్పబడినది. ప్రతి సంవత్సరమును కొన్ని విషయములను నిర్దేశించి యా విషయములపై వ్రాయబడిన గ్రంథములకు ప్రభుత్వము పారితోషికము లీయదలచి ఆ పోటీలను నిర్వహించు నధికారమును ఈ సంస్థకు అప్పగించినది. కాని వీరు చేయుచున్న విజ్ఞాన సర్వస్వ నిర్మాణమును పోటీల నిర్వహణమును ప్రజాభిమానమును చూఱగొన్నట్లు తెలియుటలేదు. నూతనముగా నిర్మింపబడుచున్న యీ తెలుగు విజ్ఞాన సర్వస్వము నెవరును చూడజాలకపోవుటయే దీనికి నిదర్శనము. వారు నిర్వహించుచున్న పోటీలలో బహుమతులు పొందిన కొన్ని గ్రంథములు ప్రజాభిమానమును పొందలేక పోవుటచే వారి బహుమానములును నిష్ఫలితముగా చేయబడినవి కావని తెలియుచున్నది. ఆ గ్రంథములలో ననేకములు నేడు వ్యాప్తిలో లేవనువిషయము సర్వవిదితము.

ఇటీవల కేంద్రప్రభుత్వము 'సాహిత్య అకాడెమీ' నొకదానిని స్థాపించి దాని మూలమున వివిధ భాషల యందలి సాహిత్యములను ప్రోత్సహింప దలపెట్టినది. తెలుగుదేశమునకు సాహిత్య ప్రతినిధిగా నిలువదగిన సంస్థ యేదియు లేకపోవుటచేత వారు తెలుగుదేశములోని కొందరు సాహితీపరులతో ఒక సలహా సంఘమును నిర్మించి యా సంఘముయొక్క సలహా ప్రకారము ప్రభుత్వ బహుమతుల నొసగుచున్నది. కాని ఈ సలహా సంఘముకూడ వ్యక్తిగతాభిమానములకు అభిప్రాయములకు

# కలగూరగంప

అతీతమై ఐకమత్యముతో పనిచేయుట లేదనియే చెప్పవలసియున్నది. ఈ సంఘము బహుమతికై సిఫారసు చేసిన గ్రంథములలో ఒకటి శ్రీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్ర, రెండవది శ్రీ బులుసు వెంకటేశ్వర్లుగారి భారతీయ తత్త్వశాస్త్రము. వీనిలో ఒకటి అనువాద గ్రంథము. మఱొక గ్రంథమునకు కర్త ఆ బహుమతి నందుకొనుట కీనాడు లేడు. ఈ రెండు విషయములును సలహా సంఘములో ఏకవాక్యత లేదనియు, ఏదో తప్పించుకొను మార్గముగా ఈ గ్రంథముల నెన్నుకొనినదనియు తెలియుచున్నది. బహుమతి నొసగుటకు అనువాద గ్రంథము తప్ప స్వతంత్రగ్రంథమే లేదని కేంద్రమునకు సిఫారసు చేసిన ఈ సలహాసంఘముచర్య వింతగొలుపుననుటలో సందేహము లేదు. మరింత వింతగొలుపు సందర్భ మింకొకటి యున్నది ఆంగ్లములోని కనువదింప జేయుటకై కేంద్ర ప్రభుత్వము ఈ సలహా సంఘమును ఒక గ్రంథమును సూచించవలసినదని కోరగా నిప్పుడు రచింపబడిన గ్రంథము లేవియు లేవన్నట్లు వీరు ఒక ప్రాచీన తాళపత్ర గ్రంథమును సిఫారసు చేయుట అత్యాశ్చర్యకరము. ఇట్టి హాస్యాస్పదములైన సిఫారసులను అందజేయుచుండుటచే ఈ సంస్థకూడ ప్రజాభిమానమును చూరగొనలేక పోయినది.

ఇదిగాక ఇతరుల రాష్ట్ర ప్రభుత్వములవారు ప్రాచీన తాళపత్ర గ్రంథములను ముద్రింపదలచి అట్టి వానిని సిఫారసు చేయుటకై ఒక్కొక్క భాషకొక్కొక్క సలహా సంఘమును స్థాపించియున్నారు. వారి సలహా మేరకు ప్రాచీన గ్రంథముల నెన్నుకొని ముద్రించుచున్నారు. ఇంతకుముందు మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము వారిచేతను, తంజావూరు సరస్వతీ మహాలు పుస్తక భాండాగారము వారిచేతను అనేక తెలుగు గ్రంథములు ముద్రింపబడినవి. కాని వానిలో ఏకొన్నియో తప్ప తక్కినవి ప్రజల కేవిధముగాను నుపకరించునవిగా లేవు. ఔషధయోగములు, వైద్య నిఘంటువు మొదలైన గ్రంథములు నేడు ప్రజల కే విధముగాను సహాయకారులు కావని చెప్పుటకు సందేహము లేదు. వీరిచే ముద్రింపబడిన శాస్త్ర గ్రంథముల మాట యటుంచి సాహిత్యగ్రంథములను చూచినచో అందనేకములు తప్పులకుప్పలుగానున్నవి. ఆర్థిక స్తోమతగల ప్రభుత్వము వారిచే ముద్రింపబడిన ఈ గ్రంథములకన్న లాభదృష్టితో పుస్తక వ్యాపారులచే ముద్రింపబడిన గ్రంథములే వేయిరెట్లు నయముగానున్నవి. దీనికంతకును కారణము సలహాసంఘము వారు ఆ యా గ్రంథముల పరిష్కరణమునకు తగిన యోగ్యతలు గలవారిని ఎన్నుకొనక తమ అభిమానులను ఎన్నుకొనుటయో లేక వారిని తమలో తాము పంచుకొనుటయో జరుగుటయే యని చెప్పవలసియున్నది తాళపత్ర గ్రంథములలో నున్న తప్పులను మించి ముద్రిత గ్రంథములలో తప్పులు కానవచ్చుట మిక్కిలి శోచనీయము.

ఈ విధముగా తెలుగుదేశములో ఇంతవరకు పనిచేసిన, పనిచేయుచున్న సాహిత్య సంస్థలేవియు సక్రమముగా తమ విధులను నెరవేర్చుచుండుట లేదనియే చెప్పవలసి యున్నది.

నేడు తెలంగాణములో పనిచేయుచున్న హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తు, తెలంగాణా రచయితల సంఘము అనునవి సాహిత్య, ప్రచారమునకు కొంత తోడ్పడుచున్నవి. వీనిలో ఆంధ్రసారస్వత పరిషత్తు తెలుగులో పరీక్షలు జరిపి తెలంగాణములోను, ఇతర ప్రదేశములలోను సాహిత్య ప్రచారము చేయుచున్నది. తెలంగాణా రచయితల సంఘముకూడ ఆధునికాంధ్ర గ్రంథములను ముద్రించుచు కవులకు, రచయితలకు ప్రోత్సాహ మొసగుచున్నది. కాని ఆ సంస్థలింకను అఖిలాంధ్ర సంస్థలుగా పేర్కొనదగిన స్థాయిని అందుకొనలేదు.

ఈ పరిస్థితులలో అచిర కాలములో నిర్మింపబడనున్న అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తుయొక్క నిర్మాణము ఏపద్ధతిలో నుండిన నది ప్రజాభిమానమును పొందగలుగునో మనము పరిశీలింపవలసి యున్నది. అట్టి పరిషత్తుయొక్క నిర్మాణమునకు సంబంధించిన కొన్ని ప్రధాన సూత్రములు మాత్రము ఇచ్చట పేర్కొనబడుచున్నవి. ఇవి సాహితీపరుల యామోదము పొందుచో ఆ సంస్థ సవ్యముగా పటిష్ఠముగా నడువగలదని ఆశింపవచ్చును.

అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు రాజకీయములకు ముఠాతత్త్వములకు, కుల మత ప్రాంతీయ దురభిమానములకు అతీతమైన సంస్థగా నుండవలెను. ఏదో సాహిత్య సంస్థయని కాక ప్రజలు దానిని తమ సంస్థగానే భావించి యభిమానించు పరిస్థితులు కల్పింపవలెను.

గతములో చేసిన తప్పులు నెమరుకు తెచ్చుకొని అలాంటివి ఇప్పుడు కూడా జరుగకుండునట్లు అందరును పాటుపడవలెను.

గ్రాంథిక, వ్యావహారిక భాషోద్యమములు, ప్రాచీన, నవ్య అధివాస్తవిక కవితాపద్ధతులు—వీనిలో ఏ ఒక్కదాని నభిమానించుట కాని దానితో ప్రత్యక్ష సంబంధము కలిగి యుండుట కాని పరిషత్తు చేయరాదు.

అఖిలాంధ్ర దేశములోను సాహిత్య విషయముల కది ప్రతినిధిగా రూపొందవలెను.

దేశములో వివిధ ప్రదేశములలో పని చేయుచున్న సాహిత్య సాంస్కృతిక సంస్థలు ప్రతి సంవత్సరమును కొంత రుసుము చెల్లించు పద్ధతిపై కేంద్ర సంస్థకనుబంధ సంస్థలు కావలెను. అట్లు రిజిష్టరు చేసికొన్న సంస్థలు మాత్రమే తమ సంస్థ తరఫున ప్రతి సంవత్సరమును ఇద్దరు చొప్పున ప్రతినిధులను పంపుట కర్హత కలిగి యుండును.

అఖిలాంధ్ర సాహిత్యపరిషత్తు ప్రతి సంవత్సరము కాని, మూడు సంవత్సరముల కొక పర్యాయము కాని ఎన్నుకొనబడిన ప్రతినిధులతో ఏర్పడిన కార్యవర్గము యొక్క సలహా ననుసరించి తన కార్యకలాపములను నిర్వర్తింపవలెను.

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, విద్యామంత్రి, విద్యాశాఖాధికారి, ఆంధ్ర ఉస్మానియా, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయోపాధ్యక్షులు, ఆంధ్రప్రధాన న్యాయమూర్తి-అందు అధికార సభ్యులుగా నుందురు.

ఆంధ్ర, ఉస్మానియా, శ్రీ వేంకటేశ్వర, మదరాసు విశ్వవిద్యాలయములలోని ప్రధానాంధ్రాచార్యులు అందు ఎక్స్ అఫీషియో సభ్యులుగా నుందురు.

ప్రతి విశ్వవిద్యాలయములోను గల అనుబంధ కళాశాలలలోని ఆంధ్రోపన్యాసకుల ప్రతినిధి ఒక్కొక్కరు చొప్పున అందు సభ్యులుగా నుందురు.

హైస్కూళ్ళలోను ప్రాచ్య కళాశాలల్లోను పనిచేయు పండితులచే ఎన్నుకొనబడిన ఆర్గురు ప్రతినిధులు. (తెలంగాణాలో ఇద్దరు, సర్కారులలో ఇద్దరు, రాయలసీమలో ఇద్దరు) అందులో సభ్యులుగానుందురు.

రాయలసీమ, సర్కారులు, తెలంగాణాలలో ప్రసిద్ధులైన సాహిత్య వ్యక్తులను ఒక్కొక్క ప్రాంతమున కిద్దరు చొప్పున కార్యవర్గములోనికి కో-అప్టు చేసికొనవలయును.

మదరాసు, విజయవాడ, హైదరాబాదు రేడియో స్టేషనులలో పనిచేయు తెలుగుశాఖవారి ప్రతినిధులు ముగ్గురు ఇందు సభ్యులుగా నుందురు.

ఆంధ్ర దినపత్రికల సంపాదకుల ప్రతినిధులిద్దరు, వార, మాసపత్రికల సంపాదకుల ప్రతినిధులిద్దరు ఇందు సభ్యులుగా నుందురు.

రచయితలు తాము రచించిన గ్రంథములను ఒక్కొక్క ప్రతిచొప్పున సాహిత్య పరిషత్తు భాండాగారమునకు పంపుకొనవలెను.

ప్రతి సంవత్సరమును పరిషత్తు ఆ సంవత్సరము జరిగిన సాహిత్య కృషిని అధికారికముగా సమీక్ష చేసి అందలి భాగోతులను నిర్దాక్షిణ్యముగా విమర్శించుటయే కాక సాధ్యమైనయెడల సాహిత్యము నుంచి పద్ధతులలో నడచుటకు సూచనలు గావింపవలెను

ప్రతినిధులచే ఎన్నుకొనబడిన కార్యవర్గము తిరిగి ఏడుగురు గాని, తొమ్మండుగురు గాని ప్రతినిధుల నెన్నుకొని ఒక సారథ్య సంఘమును ఏర్పాటు చేయవలెను. ఆ సారథ్య సంఘము పరిషత్తునకు సంబంధించినంత వరకు సర్వాధికారము కలిగియుండును.

అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు, కేంద్రసాహిత్య పరిషత్తులో ఆంధ్రమునకు ప్రతినిధిగా తను ఉత్తమ కవిని, తమ ఉత్తమ గ్రంథమును సిఫారసు చేయు అధికారము కలిగియుండును.

ఈ పరిషత్తు స్థాపింపబడిన మూడు సంవత్సరములలో సమగ్రమైన ఆంధ్రదేశ చరిత్రము. సమగ్రమైన ఆంధ్రవాఙ్మయ చరిత్రమును సముచితముగ వారిచే రచింపజేయవలెను. ఆ యా శాఖలలో కృషి చేసిన పండితులచే ఒక్కొక్క శాఖకు సంబంధించిన వాఙ్మయ చరిత్రను రచింపజేసి వానినొక సంపుటముగా సంకలనము చేయవలెను.

మూడు నెలల కొకతూరి పరిషత్తు ఆవరణలో గాని, పరిషత్తు సారథ్యసంఘము సూచించిన ఏ స్థలములో గాని సాహిత్యసభ జరిపించి అందు సాహిత్యమునకు సంబంధించిన విషయముపై సమర్థులగు పండితులచే 'ఎక్స్టెన్షన్ లెక్చర్సు' ఇప్పింపవలెను.

వ్యక్తులయొక్క పలుకుబడితోను, ప్రభుత్వము యొక్క ప్రోత్సాహముతోను మాత్రమే. పనిచేయు సంస్థకాక, ఇది శాశ్వతముగా ఎవరి అదరాభిమానములకు గాని ప్రాకులాడక పనిచేయు సంస్థగా రూపొందవలెను.

ఇవి ఆశయములు మాత్రమే. కార్యరూపమున పెట్టునప్పుడు ఎన్నో ఇబ్బందులను అధిగమింపవలసిన అవసరము కలుగుననుట వాస్తవము. కాని వ్యక్తిగత ద్వేషములతో కాక — స్వార్థమును విసర్జించి — సాహితీపరులు సాహిత్య ప్రతిష్ఠయే తమ లక్ష్యముగా పనిచేసినప్పుడు గాని ఏ సంస్థయు పురోభివృద్ధి కాంచజాలదు. పై చెప్పిన విషయములను సావధానముగా పరిశీలించి తెలుగు సాహితీపరులును, సాహిత్యాభిమానులును అచిరకాలములో అఖిలాంధ్ర సాహిత్యపరిషత్తును స్థాపించుటకు ప్రయత్నింతురుగాకని సవినయముగా మనవిచేయుచున్నాను.

# గ్రంథ విమర్శనము

## నెలవంక

బాలగేయాలు; రచన: శ్రీ కవిరావు; చిత్ర రచన: శ్రీ జి. వి. సుబ్బారావు; ప్రచురణ: బాల సాహితి, మారిసుపేట, తెనాలి; మూల్యం: రూ. 2-0-0.

ఇటీవల కాలంలో బాలసాహిత్యానికి ఎక్కువ చలామణీ లభించింది. అందుచేత బాలసాహిత్యం ఉత్పత్తికూడా విరివిగానే సాగుతున్నది. కాని ఈ రచనలలో చెప్పుకోదగ్గవిమాత్రం ఎక్కువ రావటం లేదు. కలంపట్టనేర్చిన ప్రతి ఒక్కరూ బాల సాహిత్యాన్నైనా సృష్టి చెయ్యలేకపోతామా అనుకోవటమే యిందుకు కారణం. కాని నిజమాలోచించితే బాల సాహిత్య నిర్మాణంకంటే మామూలు సాహిత్య నిర్మాణమే కొంత సులభం. బాలసాహిత్య నిర్మాణానికి కొన్ని ప్రత్యేక ప్రతిభా సంపదలుండాలి. ముఖ్యంగా బాలగేయాల నిర్మాణం మాటలతో పని గాదు. బాలగేయాల రచనకు రచయిత కావ్య తత్వాన్ని జీర్ణించుకున్న మహాపురుషుడై వుండాలి. మామూలు కావ్యనిర్మాణం చేసేటప్పుడు కవికి తన యిష్టం వచ్చిన భావాలనూ తన యిష్టం వచ్చిన పదజాలాన్నీ చాలనం చేస్తూ తన యిష్టం వచ్చిన రీతిని చెప్పటానికి స్వాతంత్ర్యం వుంటుంది. కాని బాలగేయ నిర్మాతకు అలాంటి స్వాతంత్ర్యం వుండదు. రచయిత సేకరించే భావాలు బాలబాలికలను ఆకర్షించ గలిగేవిగానూ వారి ఔత్సుక్యాన్ని రెచ్చగొట్టగలిగేవిగానూ వుండాలి. ఈ భావాలను వ్యక్తంచేసే మాటలు బాలబాలికలకు తేలికగా అర్థమయేవిగా వుండటమే గాక వాటికి తగిన రంగూ ధ్వనీకూడా వుండాలి. ఇవి కాక వాడే ఛందస్సులు గజ్జలగుర్రాలలాగు కదను త్రొక్కుతూ వుండాలి. ఇన్ని హంగులుంటేనేగాని బాలగేయాలను రచించటం సాధ్యంకాదు. అనాది కాలంనుంచీ దేశంలో వ్యాప్తిలో వున్న ఒకటి రెండు బాలగేయాలను పరిశీలించితే ఈ విషయం బాగా బోధపడుతుంది:

చందామామా
చాక్కాగుండీ
తాతా నాకూ
దమ్మిడీ యిస్తే
దమ్మిడి తీసుకెళ్లి
కోమటి కిస్తే
కోమటి నాకూ
కొబ్బరి పెట్టే
కొబ్బరి తీసుకెళ్లి
మామా కిస్తే
మామా నాకు
పిల్లా నిచ్చే
పిల్లా పేరూ మల్లీ మొగ్గ
నా పేర్ ... జమిందార్ !

* * *

చెమ్మ చెక్కా
చారడేసి మొగ్గ
ముత్యాల చెమ్మ చెక్క
ముగ్గులెయ్యంగ
రత్నాల చెమ్మ చెక్క
రంగులెయ్యంగా.

ఇవి నమూనాకు పాతపాటలు. ఈ దృష్ట్యా కవిరావుగారి పాటలు ఒకటి రెండు పరిశీలించుదాం. ఈ సంపుటిలో మొదటిపాట:

'చిలుకననుకోవె నీ
చిన్నారి కూననూ
కిలకిలా మనసిచ్చి
పలుకరిస్తా ననూ
పట్టి పంజరములో
బంధింపుతావా ?
పట్టుకేసను విడిచి
పెట్టివేస్తావా ?

పట్టి బంధించితే
ఎట్టులో తప్పుకొని
అగుపించకుండ
నే నెగిరి కావలకేగి
మరలి రానేరాను మాటాడనింక
పలుకనిక నీవెంత బ్రతిమాలుకొనిన.

కుక్కపిల్లగ నేను
పక్కవాటుగ వచ్చి
ముట్టె నీకంచాన
పెటినా వసుకొనె !
'ఛీచీ' పొమ్మని నన్ను ఛీదరిస్తావా ?
చేరదీసుక నన్ను ఆదరిస్తావా ?
ఛీదరిస్తే యింక
నాదారి నే పోదు
లేదు పొత్తిక మనకు
లేదమ్మ లేదమ్మ
ముద్దివ్వ నింక నీ వద్దకే రాను
ముట్టనిక నీవేది పెట్టవచ్చినను.

ఏరికోరి యీ గేయాన్ని ఈ సంపుటిలో తొలి గేయంగా ఎందుకు ముద్రించారో తెలియదు. పిల్లల మాట అలావుంచి అసలు ఈ గేయంలోని భావ మేమిటో పెద్దవాళ్ళకుకూడా అర్థంకాని యేదో అయోమయమైన వేదాంతావబోధంగా వుంది ఎత్తుగడలో. వెనుకటికి ఒక భావకవి:

రెక్కలవిచ్చి మెడసాచి రిక్కపట్టి
చక్రవాకంబు స్వర్ణపతంగతితోడ
ఇంచుమోదాన చెలి కౌగలించు వేళ
ఏదియో యెపోయి పైకెగసి యచటి
శూన్యదేశాన శూన్యమై చొక్కి మింట
నసురు బ్రణవనాదాన నైక్యమయిపోదు'

అన్నారు. ఈ పాటకూడా అదే ధోరణిలో కనుపించుతోంది. ఎత్తుగడ సంగతి ఇలావుండగా 'కుక్కపిల్ల ముట్టెకంచాన బెట్టడం' దగ్గరికి వచ్చేసరికి ఎంతో జుగుప్సాకరంగా తయారైంది. పైపెచ్చు గేయాన్ని రచయిత ఆదినుంచి తుదివరకూ చచ్చిన గేదెదూడను యీడ్చినట్టు యీడ్చుకురావటంతప్ప దానంతటికది చెంగు చెంగున ఉల్లాసంగా గెంతటం కనుపించదు. దురదృష్టవశాత్తూ ఈ పాటలన్నీ ఇంచుమించు ఇలానే వున్నాయి.



కాని ఇంచుమించు పాటపాటకూ శ్రీ జి. వి. సుబ్బారావుగారు ఒక్కొక్క రేఖాచిత్రాన్ని రచించారు. ఈ చిత్రాలు పాటపాటకూ జీవంపోసి బ్రతికించుతున్నయ్. ఈ బొమ్మలకోసం రెండు రూపాయలూ పెట్టి ఈ గ్రంథం కొనవచ్చు.

## అంతర్గోళాలు

ఖండకావ్య సంపుటి, రచన: శ్రీ గుర్గానంద్. ప్రచురణ: శిష్టక్ పబ్లిషర్స్, తెనాలి. వెల 1.8.0.

20వ శతాబ్ది ఒక పెద్ద సంధియుగం; ఈయుగంలో ప్రపంచం నలుగడలా వివిధ రంగాలలో అనేక పరిణామాలు వస్తున్నాయి, ఇంకా రానున్నాయి. ఈ పరిణామాల కారణంగా తాత్విక రంగంలో పెద్ద సంఘర్షణ కనుపించుతున్నది.

భౌతిక శాస్త్ర విజ్ఞానం పరిస్ఫుటం కావటం ఈమహా పరిణామానికి ప్రధాన కారణం. సంప్రదాయ వాదులు, ఈ పరిణామాలు ప్రమాద భరితాలుగా వున్నాయని, వెనుకకు నడవటం శ్రేయస్కర మనీ వాదించుతున్నారు. పరిణామవాదులు ఈ మార్పులన్నీ ప్రజాక్షేమానికే వస్తున్నాయనీ పరిణామ దశలో అనేక ప్రమాదాలు కనుపించుతున్నా వాటిని అదుపులోకి తెచ్చుకొని ముందుకు సాగకపోతే మానవునకు భవిష్యత్తు లేదనీ అంటున్నారు. ఈ భావ సంఘర్షణను కావ్యరూపాలలో వ్యక్తం చెయ్యటానికి కవులు పలువురు ప్రయత్నించారు. శ్రీ గుర్గానంద్ దాదాపు 30 వరకూ వున్న ఈ ఖండ కృతులలో ఈ విషయాన్నే వ్యక్తం చేశారు. ఈరచనలలో ప్రతి ఒక్కటీ పాఠకుణ్ణి కదలించి యోజనామగ్నుణ్ణి చేస్తుంది. "బుద్ధుని మందలింపు" అన్న గేయంలో బుద్ధుని ముఖాన, ఈ సంఘర్షణను విస్పష్టంగా ప్రతిపాదించారు:

"నా యుగసమస్యతో నే ముడిపడ్డా,
నా యుగధర్మంతో నే పోరాడా,
మీ యుగ సమస్యతో మీరు
మీరణపరికరాలు వేరు—
....................
నా సూక్తులు శాశ్వతాలు
కావు—మీరు భ్రమసినారు
సంస్కృతిలాంటి పేరుతో
మీ యుగధర్మం మరువకండి
సంస్కృతీ పతాకాల నీడల్లో
మీ యుగ సమస్య దాచకండి
నా చిత్రాల రంగు కుంచియతో
మీ ముఖనైరాశ్యం పోదుడుపకండి.
నావ్యాఖ్యల సాయంతో

# గ్రంథ విమర్శనము

కరువుకు పరిభాష లివ్వకండి
నన్ననుకరించకండి
నా వంక వెనక్కి చూడకండి!
నా జీర్ణ కవాటం గడియ తెరువకండి.
రెండు వేల పైచిలుకు
ఏండ్లు గడచి ముదిసియున్న
నా చైత్యంలో ప్రవేశించకండి!!

'ముక్తి' అనే గేయానికి స్వయంగా వ్రాసుకున్న వ్యాఖ్యలో రచయిత: "ఈ కవితలోని మానవుడు కూడా జ్యోతిష్మంతుడే. కాని ఆత్మ సాపేక్షకంగా గాదు —సమాజ సాపేక్షకంగా" అన్నారు. దానికి "తండ్రి కెదురు తిరిగిన రాముడు" అన్న రచనలో ఇలా రూపకల్పన జేశారు. అరణ్యవాసానికి సుమంత్ర చోదితమయిన రథంలో బయలుదేరిన రాముడు రథానికి అడ్డునిల్చి అటకాయించిన ప్రజానీకాన్ని ఉద్దేశించి ఇలా అంటాడు:

"ఓ అన్నలారా! నా రాజ్యాన్ని మోసే
కలిమిలేముల్లారా!
నే రాజును అందుక నే నా గృహంమీద
నా వొంటిమీద వున్నది హక్కు మీకు.
అడవులకు వద్దంటే, మీ కోర్కెను
తప్పక పాలిస్తా.
(సారథినైపు తిరిగి)
నేను వనంలోకి పోను
సుమంత్రుడా! త్రిప్పు నా రథం
నా ప్రజ నన్ను పిలుస్తోంది
ఒలిచెయ్యండి నా కాషాయపు కుడ్డలు"

కాని ఆ రాచమందిరాల్లో రాముడికి శాంతి చిక్కదు.

"గృహచ్ఛిద్రం—గృహచ్ఛిద్రం
బంగరు కట్టడాల మధ్య
ర జగృహంలో ముసలం
కత్తులు కావేషాలు——
........................
అంతిపురి చీరకొంగుతో
ముడివేసుకున్న రాచరికాలు
తల నెరిసిన భీష్ములిలా
మూల్గుతున్న శాసనాలు"

వీటితో రాముడికి చికాకెత్తిపోతుంది.

"పరుగు పరుగు ఒకే పరుగు
ఎక్కడికీ పరుగు?
ఎందుకు నాకీ పరుగు
నా ముందర నా హృదినిండా
అలముకొన్న తిమాలాలు
నే నే దండకగర్భంలో
చొచ్చుకుపోతున్నానో!
నే పోయే బాటల్లో
ఇరుప్రక్కల ఏవో గుహలు
కదిలిస్తే ఏవో బెబ్బులులు
నే నే కాదు
నాతో కొందరు జీవులు
నా వెన్నంటే రక్తపు నీడలు
పొడవు పొడవుగా పొట్టి పొట్టిగా
నా కాళ్ళకు చుట్టేస్తున్నాయి.
ఈ కల్లోల భారతీరంనుండి
గుహుడా! నను దాటిస్తావా!
శబరీ! నీ పండులు ఎంగిలివా
అయినా ఎంతో బాగున్నాయి
లక్ష్మణా! నువ్వాగుకో!
ఇవి స్వార్థం అంటని రసాలాలు
చప్పుడు చెయ్యక తినివేయి."

ధ్వని కావ్యానికి ప్రాణం; శ్రీ దుర్గానంద్ రచనలో ఈ కావ్యగుణం జీవనదిలా కనుపించుతుంది. ఈ దిగువ పంక్తులను పరిశీలించండి.

'ఛీ-ఛీ శాంతిలేదు
ఇంత చేసి- ఈ మాయ లేడివెంట
ఇంకా యెంతకాలం పరుగెత్తేది?
అయ్యో లక్ష్మణా!
నా అతిదూరపు ఆశాపరిధుల్లో
ఏమూలనుంచి నాబాణం
నిర్గమించి పోయిందో
ఆమూలనుంచి నా సర్వస్వం
అపహృతమై పోయింది
బైరాగిలాంటి లోకంయిది
మోసగించి పోయింది-
ఎవరబ్బో! నమ్మకబంటుల్లా
కిష్కింధలాంటి బ్రతుకుల్లో
తోకలెత్తి వస్తున్నారు?
కిచకిచలాడే ఆశాపులకలా!
అయితే వెనక్కంటా మీకన్నుల్లో
అశోకాల మధ్యనున్న
నా శీతలశాంతి విపంచిని".

'షాజహాను స్వప్నంలో ముంతాజ్' అన్న గేయంలో ముంతాజ్ ఇలా అంటుంది:

'ఏవిటీ తాజమాలు
ఇలా కట్టావు పాదుషా!
నీవు తెలీకపోతే మానె
లోకాన్నైనా అడిగావుకావు
ఏంజేస్తాను నా నసీబు '——
........................
వట్టి పిచ్చిదాన్ని,
నీ కోర్కెను—నవ్వి ఊరుకుంటే పోయేది

అసలు నేనిలా కోరక
నీ షేర్వాణీలో తలకాయదూర్చి
'అమ్మో పాదుషా! అని
పెద్దపెట్టున కేక వేసి కన్నుమూస్తే
అప్పుడు...
నువ్వెమైనా కత్తివాడి వేసూ
పాలరాళ్లు ఒలకబోసి
సముద్రంమీద ప్రాజెక్టు—
ఓపిచ్చి మొగలాయిరాజా!
ఈ పాలరాళ్ల మైకంలో
పడుకున్న నన్ను
కయామత్తురోజున ఖుదా కూడా లేపలేడు".—

వాస్తవిక జీవితాన్ని చిత్రించితే కవితకు రస పుష్టి చిక్కదని వాదిస్తారు కొందరు. కరుణరసం చిప్పిలుతున్న 'టీచరు' అన్న కావ్యంలోని ఈపంక్తులను చిత్తగించితే ఆ వాదం సరియైనది కాదని తేలుతుంది.

'బోర్డు అనే యంత్రంలో తలకాయదూర్చి
గిలగిలా తన్నుకుంటున్న టీచరూ! ఇదేమిటి?
ఈ సర్వీసు రిజిష్టరుతో నా ..చీ
కట్టేసుకున్నావు భవిష్యత్తు—
అయ్యో? నీ ప్రతిచిన్ని కోర్కమీదా రెడ్డింకు
రిమార్కు
నీ నిశ్వాసాలమీద ఎవరివో సంతకాలు, ముహర్లు.
ఎవడో సంతకం పెడితే నీవు నిశ్వసిస్తావు
మానేస్తే ఆగిపోతావు పాపం! నీ జీవితం అగి
పోతుంది.

..............................

ఓ టీచరు!......
రాజకీయం వ్యాపారం పోటీ పడుతున్న లోకం
యిది
నువ్వొక బఫర్ స్టేటులా, రెండు ఏనుగుల మధ్య
లేగలా
అండర్ కన్సిడరేషన్‌లో అణిగున్న
తావున్నరఅర్జీ పత్రంలా
నలుగుతున్నావు. బెల్ కొట్టారు
వినిపించుకోకు ఇంటి గొడవ
ఓకింపెరు గార్డను వనమాలీ...భూమి సూర్యుని
చుట్టూ
కాదు నీ బుర్ర ఆలోచనల చుట్టూ
గుండ్రంగా తిరుగుతోంది
..............................

నీ జీవితం యెప్పుడూ మైన సుడుగుల్లో నే వుందేం
మాస్టారూ!
నీ ప్రాబ్లెం సాల్వ్ చేసే పైతాగరస్ పుట్టలేదా?

ఈఖండ కృతులలో ప్రతి ఒక్కటి మనలను యోజనాపథులను జేయ సమర్థమైవుంది. ప్రతి ఒక్కరూ తప్పక చదువతగిన గ్రంథం.

## ఆంధ్ర - హిందీ నిఘంటువు

నిఘంటు నిర్మాణ కర్తలు: శ్రీ కో. శఠకోపం (శ్రీ కొమాండూరి శఠకోపాచార్యులు గారు. ప్రాప్తి స్థానం: రచయిత, కాకినాడ — లేక — ఆంధ్ర రాష్ట్ర హిందీప్రచార సంఘము, విజయవాడ-2. వెల 4-0-0.

ఇది ఆంధ్ర శబ్దాలకు హిందీ అర్థాలున్న నిఘంటువు ఇది హిందీ భాషను నేర్చుకునే వారికంటే, హిందీ కొంత వచ్చి తెలుగులోనుంచి హిందీలోకి ఏమేనా అనువాదం చేసుకునే వారికి యెక్కువ ప్రయోజనకరంగా వుంది. జాతీయభాషగా వుండటానికి హిందీభాషకు గల అర్హతలను పేర్కొంటూ శ్రీ ఆచార్యులవారు, ఈ గ్రంథానికి పెద్ద ఉపోద్ఘాతము రచించారు.

హిందీకి గల అర్హతానర్హతలు ఎట్టివైనా, దీన్ని జాతీయభాషగా రాజ్యాంగం అంగీకరించింది గనుక యిష్టమున్నా లేకపోయినా, మనం ప్రతి ఒక్కరూ అభ్యసింపవలసే రావచ్చు. శ్రీ శఠకోపాచార్యుల వారివంటి ప్రముఖులు చాలామంది యిప్పటికే ఈ భాషను అభ్యసించి పండితుల మనిపించుకుంటున్నారు. నేర్చుకోమని ఇతరులను ప్రోత్సహించుతున్నారు కూడా. కాని ఈ నిఘంటువు హిందీ నేర్చుకునేవారికి ఉపకరించేది గాదు. తెలుగు నేర్చుకోవాలనుకునే హిందీ వాళ్ళకు ఎక్కువ ఉపయోగపడుతుంది. లేదా పైన చెప్పినట్లు హిందీలో కొంత ప్రవేశముండి తెలుగు రచనలను హిందీలోకి అనువాదం చేసుకోదలచినవారికి కొంత ఉపకరించవచ్చు. అట్టివారికయినా ఇది యెంతవరకు ఉపయోగపడుతుందో చెప్పలేము. ఎందుచేతనంటే 290 పేజీలలోపు చిన్న గ్రంథం. అర్ణవప్రాయమైన ఆంధ్రమహావాఙ్మయంలోని పదజాలానికి అంతకూ ఈ పరిమితావధిలో హిందీ అర్థాలను సమకూర్చగలగటం అసంభవ కార్యం. ఏది ఏమయినా ఆంధ్రంనుంచి హిందీలోకి ఇంతవరకు నిఘంటువేదీ లేదు గనుక ఏకైకాధారంగా ఇది కొంతవరకు ఉపయుక్తం కావచ్చు.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by
S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty
Street, Madras—1. Editor: S. Sambhu Prasad.

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

డిసెంబరు 1956

సంపుటము 33 : : సంచిక 12

విడిపత్రిక వెల ఒక రూపాయి

# భారతి ముప్పది మూడవ సంపుటము

## అకారాది విషయ సూచిక

# విషయానుక్రమణిక

## డిసెంబరు 1956

# మాంచాల

శ్రీ బెల్లంకొండ సూర్యప్రకాశరావు

ఈ మధుర ప్రభాతమున నెన్ని శకుంతము లెన్ని గొంతులన్
ఏమని పాడుకొన్నవో సుమీ! ఫలియించె మదీయ వాంఛితం
బీ మధుభావనా తతుల నిండిన తీయనిగుండెతోడ నా
స్వామికి, బాలచంద్రునకు స్వాగత మిత్తును వేయి గొంతులన్.

"కో" యని ప్రొద్దునే పలికె కోయిల; 'ఝు' మ్మని భృంగ మేలనో
హాయిగఁ బువ్వుపైన నడయాడెను; పిచ్చుకజంట చెట్టుపైఁ
గూయుచు ముక్కులన్ బొడుచుకొన్నవి; నే నివే గాంచుచుండ నే
దో యనుభూతి 'జిల్లు' మని తోచిన దీ పరిణామ మందగన్.

'వచ్చుచున్నాఁడు దీవెన లిచ్చి పనుపు,
బాలుఁ డుత్సాహమున బోవు బవరమునకు'
ననుచుఁ బ్రొద్దునెఁ గబు రంపి రత్తగారు
మంచి యమృతము తలఁ బ్రుమ్మరించినారు.

ఎన్నటికేని నా విభున కేర్పడదా దయ! యద్దె వచ్చు నం
చెన్నిదినాలనుండియొ నిరీక్షణ సేయుచు నుంటి; నెన్నియో
వెన్నెలరేలు నన్ విరహవేదనముంచిన వీదినాన నా
కన్నుల వత్తితోఁ గడపఁ గాచిన భాగ్యముపండుఁ దీయగా.

వియ్యము లందుకొన్న చెడువేళ యదేమొ ప్రియుండు నాపయిన్
నెయ్యము జూపబోడని యనేకవిధమ్ముల నెంచి నా మదిన్
గుయ్యిడు నన్నుగాంచ నిదుగో యరుదెంచెద రీ దినమ్ము; నే
దయ్యము నా ప్రభూ? నను విదల్చితి రీగతి జాలిమాలుచున్.

మీపతి, నగ్నిసాక్షిగ ననేకులు బెద్దలముందు పెండ్లియై
మీ సదనంబు ద్రొక్కితిని; నేటికి భాగ్యముపండె; యుద్ధ సం
తోషము మీ మదిన్, గడప ద్రొక్కు విభుం డని నాకు గల్గు సం
తోషము; వీరకుంకుమలతోడుత మానసపూజ సేయుదున్.

కన్నీటితో ముందు కడిగిన తరువాత
పన్నీట గడిగెద పాదయుగము
హృదయాన మీ రూపు పదిలమ్ము చేసిన
పిదప నాసనమును వేయుదాన
ఫాలభావాలతో బల్కరించిన మీద
పలికెద ప్రేమతో స్వాగతమ్ము
ఎద విచ్చి మీ చేతి కిచ్చిన పిమ్మట
వీరగంధము బొట్టు పెట్టుదాన
మంగళారతు లిచ్చెద మనసువిప్పి
ఖడ్గమిత్తు నాదు హృదయాంతరాలలోంచి
పలికెదను వీడుకోలు సంబరము వడుచు
నేడ్చుకొందును వెన్క మీ రేగ ననికి.

'వత్తు' రను మాట యమృతంపు బొట్టిపోత;
'కదనమేగెద' రను మాట కత్తికోత;
ముట్టవలెను గులాబిని ముండ్లవద్ద
తీయని విషము నోటి కందీయవలెను.

'రాడు! రాడయ్యె బతి' యను గోడుపోయి
'వచ్చె రణమేగి' యను చెప్పవలయు నింక
సతులఘనవిపత్కరపరిస్థితులలోన
ద్రోయదలచిన నా కేల నాయువిడుట!"

# ప్రేక్షకులు

శ్రీ అత్తిలి సూర్యనారాయణమూర్తి

ఏమిటీ యీ భాగోతం అంతా? అనో: 'బ్రతుకే ఓ భాగోతం' అనో అనటం మామూలైంది...' జీవితం నాటకమనీ, తతంగమంతా నటన అనీ ప్రతి ఒక్కరూ నమ్మినవిషయాలు.

ఎఱిగున్న విషయాలే ఐనా; భిన్నభిన్న ప్రకృతులు విడిగా చిత్రించుకోటంలోకంటె, కుదిమట్టంలో ఒకేరంగస్థలాన్ని-కళ్ళను—మెరసేట్టు చేయటంలో-ఒకరికా యిద్దరికా?!—పసులూ వంసలూ మీద ఏక మహూర్తాన ఐక్యానుభావమైన హృదయ స్పందనాలు సలుపవీలు...

ఐతే వాచికాంగికాభినయం స్వాభావికమైతే నే మనస్సుకుపట్టి ఊగిసలాడేది...

పురాణాలై ప్రజాజీవితంలో మఱుగుపడుతూన్న విషయాన్ని సున్నితంగా ముందుకు తెచ్చి నీతిఅనేది నశించకుండా అరికట్టాలనే ఆవేశం, ఆవేదనా, ఫలితంగా, 'తోలుబొమ్మలూ, భాగోతం-వీధినాటకం' పునాదిరాళ్ళుగా ఉపయోగించుకున్నారు.

మంచునకు లెక్కచేయకుండా తెల్లవార్లూ గడ్డిమెత్తల వాశ్రయించుకుని కూర్చుని — ఏమంటే, మొదట్లో, కథ యింకా రక్తికట్టాక కదఃవచ్చుననీ తీరా కాస్సేపు కూర్చున్నాక, ఆ కథా నాయకుడో నాయికో కష్టాలల్లో ఉండేఘట్టమే కనకవస్తే, అయ్యో! 'యీ పట్టలో వదలివెళ్ళటం ఎల్లాగ?! తమకీ రావొచ్చు యిల్లాంటివి! ఇల్లావెళ్ళిపోయే, అసుబ్బావధానులు యిన్నికష్టాలు రాల్చుకుంట!' అనుకొని సుఖాంతంచూసి మరీ కదలేసరికి కోళులు కూసేవంటి!

'అరీ! అరిద్చంద్రమారాజు ఎన్నికష్టాలు పడ్డాడురా! అయితేం, ఆసిమంపతెగ యిస్సామిత్తుడికి లొంగితేనా?! సత్తెంఅంటే అదీ, అందుకే అన్నివొరాలు!!' అనుకుంటూ యిళ్ళకుసాగేవారు...

సాలుకోసారి, ప్రజాహృదయాన్ని సత్యంకేసి మళ్ళించిన ఆ భాగోతం పెద్ద, తాళాలువాయించుకుంటూ ప్రతీకుమ్మం త్రొక్కటం ఆవేసంలోనే! అయూరి పెద్దకాపు—లేదా, కాస్తకల ఆసామీ అల్లా—తినపైమీది వస్త్రంయిచ్చో, యింతధాన్యం కొలిచో, యీ కళావేత్త విధానపునాదులు చవుకు పట్టకుండా—ఏమీఅంటే, కాలంమార్పు ప్రవాహపు తాకిడినుంచి ఊడి వెళ్ళలు పడకుండా—ప్రాతమెట్లు గులుపెట్టి ఆ కళామందిరాన్ని నిలబెట్టుతూండటం ఆచారమైంది.

ఇక్కడొక మాట :

సత్యాన్ని— ఋతాన్ని— ఆరాధించటంలో సర్వమూ ఆఖరికి తానూ ఆహుతి అయ్యేఘట్టంలో, ప్రజాహృదయాన్ని దూసుకుపోయే పలుకుల్ని ప్రసరించగల తావుల్లో ముఖపు తెఱచినటలో ప్రేక్షకజన సంద్రంలో తుఫానురేపే గతులున్నాయి అని అనుకోలేదు ఆనాటిపెద్దలు. నేటకీ అదే అనుసరణగా ఉంది. ఔను, పట్టుకొన్న పాతది వదలటం, వదలిపోవటం, ఎట్లాగ మరి?

జనవర్తన :

వీధి నాటకాల్లో పాత్రలు యించుమించు అంతా ఎవరెవరో తెలిసేట్టు ముందుగానే, రంగస్థలాన్ని అలంకరించటంకద్దు. వేషాల్నిబట్టి పాత్ర నిరూపణ. శరీరమాద్యంఖలు ధర్మసాధనం; అంచేతే రక్షక సాధనాలైన వస్తువులే అలంకారాలు.

కృష్ణుడు వచ్చేఉంటాడు; విమానలో కూర్చునే ఉంటాడు. ఇక—సత్యాదేవి, చూడండీ! యీమె తెల్లనిచీరలేగాని ధరించదు 'తెల్లనిచీరలుకా విడులు తియ్యనినంబును మెచ్చు, పంట్రుకల్ నల్లన' యిత్యాది గుణాల్ని సభ్యులు ఆయాపాత్రల్లో గమనించి పద్మినీ జాతి పడతిగా ఎంచుకోవాలి. ఇల్లాంటివనో

పాత్రలూ, ప్రేక్షకులూ కూడా గమనించేవీ, ఉల్లాస పర్చుకు సేవీని !

సత్య, కృష్ణుడు రానందుకూ, వెన్నెల వేడికీ, వియోగబాధలో, తెర-సగం సగంగా పట్టి ఉంటుంది; ఉంచుతారనండి-తన వాల్జడ యీవలికి వచ్చి తన హృదయబాధ అంతా ఆ వేణీవర్తనలో పలిబుచ్చుతుంది. ఒక హారమో, అంగుళీయకమో సంధాన కర్తగా-సంసారం పొత్తుపర్చి, పొలయల్కలు విసుగుదలకు విలుగుకు అన్న సత్యం నిరూపించే కావ్యం అల్లుతుంది. నిజంగా ఆ వర్ణన కావ్యమే! ఈ మాధుర్యపు మగతలో తెల్లవారుట గమనించని జనాలు-స్త్రీ పురుషులు-పెక్కురుండేవారు.

గాంధోళిగాడు :

హాస్యం ప్రతి నాటకానికీ అంగం. అదీ తెచ్చిపెట్టుకున్న అనవసర పాత్రగా అంగీకరించబడలేదు; ఎల్లాగో చెప్తాను.

ప్రత్యేకం ప్రతిపక్షుల్ని వక్రమార్గాన ఎద్దేవా చేయుటకే యేర్పడ్డాడు గాంధోళిగాడు. పెద్ద కాపునకో, ఊరి పెద్దకో యీ యేటా ఓసారి వచ్చి చూసిపోయే యీతడు ఊతకోలు...ఇల్లాగ కొంతకాలం గడిచాక యిది మోటు అనిపించిందో యేమో భాగోతాల ప్రసక్తిలో మాత్రం యీ వ్యక్తి మాతి బిగించుకొని, సత్యభామ పిలుపులకి ఉలకడు, పలకడు. నారీ వేషానికి చీరె కట్టితేనే సరిపోతుంది అనుకొన్న రోజులకి ప్రాతిపదికగా, నలుగురూ నవ్వుకున్నా-అదీ నవ్వించటమే అనుకున్న ధీమాలో ఉండటం-వహ్వా. అదీ అభిరుచి.

ఆనాటి ఆ కథా నాయికకు-కాదు ప్రజాభిరుచికి-ప్రియులలో సంధానకర్త - ఊహుం - కర్తగా 'నేను' అని నిలబడ్డ ఆవ్యక్తి, 'అమ్మా రావే! బొమ్మా రావే! కాస్త కృష్ణుణ్ణి వెదకగదవే' అని ముద్దుగా పిలిస్తే మరీ బిగిసి,- మాతి బిడాయించుకుంటే, యీ నాయిక విసిగెత్తిపోయి ఆఖరికి 'ఓసి ముండా రావే' అంటే ఆనందంతో-ముఖం చేటంతై - దరిచేరే ఆ విదూషకి ఆ నవక నే 'అబ్బ ఏమి అభినయం అనుకున్నారు' - పుం స్త్రీ గమనం!! రాను రాను విదూషకుడు లేందే ప్రధానపాత్ర రక్తికట్టదన్నారు. పాద ప్రహారణం సంపాదించిన కృష్ణునితో నీకు ప్రదక్షిణమైనా చేస్తానుగాని, నాకీదక్షిణా నాయకత్వం ఎన్నడూ రాకండా మాత్రం అనుగ్రహించాలి' అనే సున్నితానికి అలవాటుపడి 'నేను హాస్యం చేస్తున్నాను, మీరు నవ్వండి' అంటే భళ్లున యికిలించే పద్ధతికి దూరమైనారు.

తెరలు :

ధిం తక్కతై ధిణతోంధిక ధినతో అని తాళాల గింఘరలలో ప్రతిపాత్రా పాదం అంగుకుని గొంతెత్తితే అసహ్యమనిపించింది. అదీగాక అడవిలో ఉన్నా అంతఃపురంలో ఉన్నా ఒకే పరిసరాల్ని ప్రదేశాన్ని తిలకించుటలో ఏదో లోటు కన్పించింది. దానికి ప్రతిఫలంగా తెరలు వలిసాయి. ఇంతటితో ఊరుకోలేదు జనం. అద్దాలం—హరివళం—పూసుకుని హాజరైనా నారపీచుగడ్డాలైనా చీదరించుకున్నారు. అంతిమాత్రంతోనూ వీరికి సంతుష్టి కాలేదు...స్త్రీ పాత్ర—నిజానికి పురుషసింహులే అయినా—గంధగజయాన కావలెనన్నారు. పలుకు ఒదుగూ చూపు బెదుగూ సరిపోవాలనుకొన్నారు. మన ఎదుట, తగిన అభినయంతో, తగ్గ గొంతులతో జరిగిన విషయాన్నొక దానిని ప్రదర్శించే యీ పాత్రలు—అసలు వారు వీరు కాదన్నది ఎఱిగే ఉంపటం చేత —సభారంజకంగా ఆయాపట్టుల, పద్యం కూర్పులో పలకటమే, నోట పట్టడానికి, మనసుకు తట్టడానికీ వీలు అనుకున్నారు. కాని సభాస్తారులకు పన్నుమాపి నడిచే రంగస్థల పాత్రల్ని నిరసించకనూ పోలేదు.

నాతి, నీతి, లేనిది ప్రదర్శనార్హంగా భావించనూ లేదు.

అలంకారం :

రాగిడి చంద్రవంకో, బంగారపు జడకూ అలవాటుపడిన సీత యేనాటిదో అయినా, అందెలూ అడ్డబాస త్యజించి, ఉంటే పటాగోలుసులూ,—అసలు అదిమాత్రం మోటకాదా అనితీసి దాచి, చెవులలో లకులతో, ఒంటిపేట పెట్టుగొలుసుతో ఉంటేనే హాయి అనిపించిందాయిరి. రాజసింహుని రసపుత్రదుస్తులూ జుత్తూ చెమ్కీలాగూ, సెమిలితురాయిటోపీ, స్లిప్పరు పాదరక్షలూతో సరిపెట్టుకున్నాం ... అడవిలో ఉన్నా శ్రీరామచంద్రుని ముఖకళలకు తీసికట్టు రాకుండా గడ్డం మీసం నున్నగా ఉండాలనీ, జన

## ప్రేక్షకులు

లోపలికి ప్రవేశంలేని బైటి జనాలకు కూడా యింటి కప్పుదాటి ఘలానావారి గొంతురాయిది అని పించుకుంటేనే మరోసారి ఆ ఊళ్ళో ఆ హాల్లో పూజ!

'విమలోజ్జ్వలాంగియీ...' అని చెల్లనూ పుల్లనూ చూడంశ్రా! నేను చెప్పకుండా పాటిపోతున్నానని గొంతెత్తి దమయంతికి నిద్రాభంగం కాకుండా పారి పోయే నలుణ్ణి మరోసారి హెచ్చుగా వేసుకోకుండా- పాడకుండా - పోనిచ్చామా అని? వనమధ్యంలో దుప్పటి కప్పుకొని పడున్న పర్ణాదుణ్ణి చూసి, అతడు యితణ్ణి గమనించకుండా 'హాహా, చోటు లేదిచ్చట' అంటే 'కూశవు దుర్మదాంధుడవు' అని పద్యంలో తిడితే 'వన్సుమోర్' - పెద్ద కుర్చీల్లోని వాళ్ళయినా వదలకుండా అన్నాం. సుదేవుడు మాత్రం ఏమనుకు న్నాడో యేమో గాని 'తెలివాల్సి' అని—అంగ వస్త్రంభ్రష్టుడై గా డ్రెస్సుమార్చుకునే అక్కడ లేదు. గనుక—సామీ! నటనే అయినా ఆపర్ణాదుడు చోటు లేదన్నాడు. నలదమయంతుల్లో ఒక్కరూ దొరక లేదన్న మానసికావస్థ మీద ప్రదర్శిస్తున్నప్పటి పలుకులే అప్పటికి నాటికి ముందున్న వాతావరణం సాయంగా మిమ్మల్ని కదల్చాయి. ఇప్పుడు మళ్ళా పాడమంటే యింకా మెప్పించాలనుకున్న మనస్సుతో రాగం సాగదీయటమో, కుదించటమో, ఐ, అస్తుపిస్తు అవుతుంది. ఈ రంగం మొదణ్ణించీ ఆరంభింప అనుజ్ఞ అయితే...' అని చెప్పకుంటే మాత్రం వదిలామా?!

'నాకీ రాజ్యము కావలెనంటినటే ఎన్నడైన నీతో' అనీ 'బంతిపూలు ఎవరు గోసిరే - నీళ్ళుపోసి పెంచినాగదే' అనే తిజలామట్టులే తలలూపిస్తే...

ఏమిటేం గోలంతా? సమయంబే సమయం లేకుండా! ఏదైనా అడిగితే పద్యంలోనా జవాబు చెప్పటం!...అనుకుంటూ వచ్చి, వచనానికి— అందులోనూ మామూలు సంభాషణా చెవికింపై అపార్థం రాని పలుకూ, నిఘంటు తెలిస్తే నేకాని, నిగ్గుతేలని సమాసంలేని వాక్యాలూ, విసుగించకుండా ధ్వని ప్రాధాన్యమైన వర్ణనా, అలిస్తూవచ్చారు...

మహారాజు కోపంగాని, సంతసంగాని, కనుగోల కుటతొణికిసలాడుతుంది గాని, వాచికాంగిక ప్రస్ఫుటమ్రుట అస్వాభావికమని గ్రహించాక నరకుడు, రావణుడు, హిరణ్యకశిపుడూ, కడుపులో పిండాలు కదిలేట్టు అరచే గొంతునకు 'అబ్బా' అనుకుని చెవులు మూసుకోలేదా?...రాజరాజు 'తప్పెవరిదో నిర్ణ యించే ముఖకవళికా గొంతు రుద్ధతలలో తెలివాలితే గుండెలు పట్టుకున్నట్లుయి ఘట్టిగా ఊపిరి పీల్చుకుని తల్లలో ఎకవో స్మృతుల రేపుకోలేదా?

మార్పులు :

కొంతకాలం ఏ ధనికులో యీకళా రాధకులను బహూకరించి పోషిస్తూ వచ్చేవారా, యీనాటికి పరి వర్తనం కూలినాలిజనాల టికెకాసుల ముంపే సంస్థ నిలపే వెల్లువ! ఆదాయానికి అధికారంతోడై ఆసరా అయ్యే స్థానాన్ని—ప్రజాపోషకత్వాన్ని—అవ తలికి నెట్టి, ముందు సీట ఎక్కే కాముంగులవుతున్నారు. సినిమాతో మరువలి స్థితిలో నటించే ఆకథా సరళిలో మనల్ని రసపుష్టుల జేసి 'మైమరపిస్తోంటే పోయి అను కునే పట్టులో ఏపనిమీదో బైటకుపోయివచ్చిన ఆ సామీ 'అయిపోతోందే' అన్న ఖంగారులో కుర్చీలూ బెంచీలూ తప్పించుకువచ్చే శ్రమ పొందటం యిష్టం లేక రంగస్థలం మీదనుంచి రెండంగల్లో గెంతి తన స్థానానిక పోబోతాడు ఇఖ మాచుకోండి! 'దాసీ'... తెలుపవయ్యామని చెప్పలేదటే" బుద్ధిలేదూ. పెద్దవాళ్లు దూరుతారని?!"అన్న చిత్రాంగి చిన్న చపేటంతో తల గిఱ్ఱున తిరిగి క్రిందబడుతూ వచ్చారు కూడా.

'పెద్దగెడ్డి వచ్చాడు మొదలాడు' మన్న కాలం దాటివచ్చాం గనక టేబరీలైటు ఫోకస్ చెయ్యటం విజ్ఞానం కరిపెట్టి యిచ్చిందిగా—ఉపయోగించుకో వద్దూ మరి?...'వస్త్రాల విడిన క్రూర! నిన్ను వదలి నన్ను చూసే నిర్భాగ్యులెవ్వరే?' అనే లింగరాజు లింగరాజు ఖబుర్లకు ఘొల్లుమంటే వెనక వాళ్లంతా. పాపం! తన రసికతా స్వారస్యానికే యీ ఎగతాళి అనుకోకుండా ఆనవ్వులో యీ తసామీ కూడా వెలవెలా నవ్వులు పోలేదా?...

దీనితో పోనిచ్చామా?...పాత్ర తన వేసంలోనే సంగీత.కచేరీ చేసేందుకు కూడా అవును-అప్పటితో గాని రక్తి కట్టవద్దూ? యిచ్చిన డబ్బులు కిట్టొద్దా?... సావకాశం యిచ్చిన విశాలహృదయం.

పేర్లుచూసి యీనాటకంలో అమరుతాడా లేదా అన్నది గమనించటం, పెద్దల చాకచక్యాన్ని అనుమానించటమనే దుస్సంకల్పం లేనివారం కాబట్టే

గ్రామఫోనుపాటలు పాడతారన్న ప్రచురణ ఉంటేనే దండిగా కట్నాలు కప్పగల్గాం...!

రాతు కొద్దిని:

ప్రజాభిరుచినిబట్టి పాకం కుదురుతోంటుంది. పురమాయింపులో నే నిగ్గు తేలుతవి.

'రసపుత్ర విజయం — వేణీ సంహారం — బొబ్బిలి—' ఇత్యాది పద్యగద్య జిగిబిగి నాటకములను అర్ధ మొనర్చుకొను శ్రావ్యత వహించ నిచ్చలేక నే 'జేనరాజు' మరగున పడుత.

ఏపనిలేని రోజుల్లోనో భాగోతం కడ్తే తెల్లవార్లూ కూర్చుని ఉండే వారనండి. అంతగా భూమినే ఆశ్రయించుకు బ్రతికే జీవులం కాని యీనాడు ...మర్నాటి కొలువులకు మగత రాకుండాను, మనస్సుకు విశ్రాంతీ, భావోత్తేజం కల్గిస్తూ తక్కువ కాలంలో ముగింపు అయ్యే నాటికలు కోరుతున్నాం.

అందునా, దీర్ఘాలు కాని చక్కటి వచన సంభాషణలోని ఏకాంకికలు-ప్రదర్శనార్హాలే. ఒక దానిలో ఒకటి కల్పించి విషయాన్ని క్లిష్టం చేసేకంటె 'నత్త గుల్లలో యిమిడిన డక్కా మజిలీలులా' చవులూరిస్తవి; కళ్లు మెరుస్తవి, అనే కుతూహల పడటం లేదా మనం?

ఎరువు సొమ్ము బరువుచేటు, పుట్టింటిది పసుపు కొమ్మైనేం'... తెనుగుదనం పుణికి పుచ్చుకొన్న రాగ వరసలు అవసరమైనపట్ల వాడనిస్తే ఎంతముద్దు!

అల్లాగని గిరిగీసు కూర్చుంటామా? పెద్దన కవీంద్రుడే పెఱజాతిమాటలు వాడుకొన్నాడు; అక్కడి వారలిక్కడికి వచ్చే రోజుల్లోనే ఆ కథ ఐతే- దూరాలు తగ్గి ఆచారాల సహా ఐక్యమయ్యే యీ రోజుల్లో శృతి పేయాలైన హిందూస్తానీ వరసలు అనుకోకుండా కలగాపులగమవటం ఆదరించక పోతామా? ముళ్లున్నవని గులాబీ మాచూ చేందుకు వెరుస్తామా? అనువులు వెదుక్కుంటాం గాని...

వ్యక్తి సంఘాన్ని, సంఘం దేశాన్ని, సర్వతో ముఖంగా సంపూర్ణకళల వికసిల్లేందుకు తాపత్రయ పడుతూండటం సహజం ... ఇందుకు పటుత్వాలైన రచనలు పుట్టటకు తగ్గ ప్రజా ప్రోత్సాహం [Demand] శ్రావ్యతా మన శక్తిపైన వేసుకోవాలి; 'వాడొకందుకు పోస్తున్నాడు; వీడొకందుకు త్రాగుతున్నాడు' అన్న సామెత వర్తించుకొన్నంత కాలం ఏ జాతీ ముందడుగు వేయలేదు. పాతలోని ప్రాగల్భ్యాన్ని ఏర్చి కూర్చి స్మరణకు తెచ్చుటగాని, నేడు జరుగుతూన్నదే ముందుకు పెట్టుటగాని, కాలాన్ని నెట్టుకొని యిల్లా ఉంటే ఉత్తేజితాలైన భావసౌందర్యాల చాకాల విహరించే పొరపొచ్చాలు లేని పొరుగు బాంధవ్యాలు నిలుస్తవని భావికాలపుష్టినీ తుష్టినీ చిత్రించుటలో సౌకుమార్యం ఉంది.

ఇచ్చేవారు యిల్లా నిజవాలన్నా ఎక్కువ మందికి కావలసిందీ లాభించేదీ చిక్కనీయక పోయినా, మనకింత మట్టుకే రాసిఉంది అని పడి ఉంటే జాతి తరలిపోయింది కాదని అడ్డేవాళ్ళుంటే పీడని పడే కాలమే మన మట్టాఉంట!

పురమాయింపు:

సరసంగల రచనలు ఏ భాషలో ఉన్నా అనువాదయోగ్యాలే! కానైతే అసలుసరకు బంగారమే అయినా వారి వారి మనసుబట్టి వస్తువులు పురమాయించుకోవలసి వస్తుంది.

ఈ పని ప్రేక్షక మహాశయులది. సత్యదూరాలు కాని చారిత్రక వ్యక్తుల్ని రంగస్థలంపై అనుకరిస్తే ఆనందించక పోతామా?

"అడగందే అమ్మైనా పెట్టదు"; "సంగీతానికి చింతకాయలూ రాలవు!" ఇవి అవును, యిది కాదు అని విప్పి చెప్పగల ధీమా ఉండి, ఎదిరి అవునూ కాదూ అని విగిస్తే ప్రతిష్టంభన పడిస్తే ఉంది మజా. చక్కటి తీరులు మెలుచుకుని వస్తవో లేదో చూడండి! "లేస్తే మనుష్యులం కాదు లేవరనుకొన్నంతవరకే యీ మాంద్యం! కావలసినవార్ని పైనున్న పెద్దలు కాదు తెచ్చేది- మనం, మనలో ఉన్న ఉన్నతాశయాల ప్రస్ఫుటపుబలమూ...వాటికొక రూపం యేర్పడి ప్రజా హృదయాల కరగని రీతిలను కొత్తగా ప్రచారసంచార మొనర్చవలెననే గాఢవాంఛ పుట్టుకొస్తోంది కదూ!

ఔను! మనస్సుల్లో ఉన్న మీ యీ కోరిక మీ ముఖాలే తెల్పుతున్నాయి.

# ఐదాసీంతన్యము

శ్రీ సూరంపూడి భాస్కరరావు

చనిపోయిన ప్రాణంరా ఇది
మణి పోయిన హారంరా ఇది
ఎందుకురా వ్యర్థవిలాపం !
ఏటికిరా వృథా ప్రలాపం !

కావ్యంలో తీపులుపండీ
కంఠంలో తేనెలు నిండీ
హసియించిన కోయిల కాలం
నశియించెను లే ఆమూలం !

పగిలిన ఈ హృదయాండంలో
ముగియని జీవిత కాండంలో
మిగిలిన దిక నీరసరుధిరం !
రగిలెడి ఒక దుర్భర శిశిరం !

జీవన మిక తిమిరాక్రాంతం
జీవన మిక ముదివేదాంతం
జీవన మది క్షణికవసంతం
జీవన మిది యజ్ఞమనంతం !

# బూర్గుల మంత్రివర్గ జాతకము

### శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు

హైదరాబాదు రాష్ట్రముయొక్క మంత్రివర్గము నకు నాయకునిగా శ్రీయుత బూర్గుల రామకృష్ణరావు 1952 సంవత్సరమున మార్చి నెల 6.వ తేదీ గురువారమునాడు సాయంత్రము గం. 3 48 లకు ప్రమాణస్వీకారము చేసెననుట సుప్రసిద్ధ విషయము. అప్పటినుండి ఎంతోయుక్తితో, సమర్థతతో, చాకచక్యముతో ఆ మహనీయుడు రాష్ట్రపరిపాలనమును నిర్వహించి ప్రజాదరమును వడసియుండుట అతని రాజనీతి నైపుణ్యముయొక్క మాలంకషత్వమును చాటుతున్నది. హైదరాబాదురాష్ట్రములోని మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతభాగములను వేరుపరచి, నిలచిన తెలంగాణా ప్రదేశమును ఆంధ్రరాష్ట్రముతో చేర్చి "ఆంధ్రప్రదేశ"మను పేర గొప్ప నూతనరాష్ట్ర మొకటి 1-11-1956నాడు ఏర్పరచుటకు సంకల్పించుటవలన, శ్రీ రామకృష్ణరావుగారి మంత్రివర్గము 31.10-1956 నాటితో తమఅధికారమును చాలించుకోవలసి వచ్చినది. ఈ మంత్రివర్గము నాల్గుసంవత్సరములు, ఏడు నెలలు, 25 దినముల కాలము పరిపాలనము సాగించెను.

శుభక్షణములలో కార్యారంభము జరుగవలయుననుటే జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయము.

> "శుభక్షణ క్రియారంభ
> జనితాః, పూర్వసంభవాః,
> సంపద స్సర్వ లోకానాం;
> జ్యోతిశ్శాస్త్ర ప్రయోజనం"

అని సత్యాచార్యుని నిర్వచనము. లోకకల్యాణ కాంక్షులగు మన ప్రాచీన మహర్షులు ఈ విషయమున పెక్కు సూత్రములు రచించిరి. రాజ్యాధికార స్వీకరణము ఎట్టిక్షణములలో, ఏవిధమగు గ్రహసంపత్తితో, జరుగవలెనో, వారు అతివిపులముగా చర్చించి నిర్ణయించినారు. పాలకులకు, పాలితులకు, దేశమునకు, శ్రేయోభివృద్ధి సమకూర్చుటే, ఈ ముహూర్త శాస్త్ర సూత్రముల పరమోద్దేశము.

ప్రశంసలోనున్న మంత్రివర్గము రాజ్యాధికార స్వీకారము చేసిన క్షణ మెట్టిదో, అప్పటి గ్రహస్థితి సూచించిన ఫలమెట్టిదో, గమనించుట విద్యార్థులకు ప్రయోజనకారి కాగలదు. ఆ క్షణమునకు సాధించిన సాయనచక్ర మీక్రిందనున్నది:—

| | | | |
|---|---|---|---|
| బు 27-36<br>ర 15.47-58 | శు 17-22 | X 9-27 | |
| రా 29 59<br>కు 17.30 | (సాయనము) | | నెప్ట్యూ 9.58<br>(వ)<br>చ 17-7 |
| | — | | 1 10-21<br>యుర 19-44<br>(వ)<br>కే 29 59 |
| పుణ్య 11 40 | రాజ్య 2-1[illegible]<br>కు 16.26 | శ 13-32<br>(వ)<br>ఇ 21-14 | |

లగ్నము స్థిరరాశియగు సింహము. అధికార స్వీకారమునకు ఉత్తమమయిన లగ్నమిది. భాగ్యస్థానమందలి బృహస్పతియొక్క శుభదృష్టి లగ్నముపై నున్నది. చతుర్థభాగ్యాధిపతి అగుటచే రాజయోగకారకుడైన కుజుడు స్వక్షేత్రములో ప్రబలుడై చతుర్థ భావములో నున్నాడు. విక్రమ భావములో ఉచ్చబలముగల శనియుండుట. ఇవి ఈ ముహూర్తమందలి సుగుణములు. కాని, ప్రబలములగు దోషములు కొన్ని కలవు. లగ్నాధిపతియగు గ్రహరాజు రవి జలరాశియగు మీనములో నుండుటచే, బలవంతుడు కాడు. సాధుత్వమున్నదే కాని, శక్తి మట్టము. పైగా, ఈ గ్రహము అష్టమభావములో నుండుటె దోషము. చంద్రుడో, వ్యయములో నిలచినాడు. రాజ్యస్థా

నాధిపతియగు శుక్రునికి ప్రబల కుజుని నుండియు, యమునినుండియు, క్రూర దృష్టిదోష మున్నది ఇవి ముఖ్యమగు లోపములు.

అగుటచే, ఈ ముహూర్తము ఉత్తమ కక్ష్యలో చేర్చదగినది కాదు సాయనరవి మేష ప్రవేశము చేసిన తరువాత,—అనగా, మార్చి నెల 21 వ తేదీ దాటిన అనంతరమనుట—ఇతర గ్రహ సౌకర్యములు కల దినమున, ఇదే సింహలగ్నము నే ఏర్పరచియుండినచో, ఎంతో రమ్యముగా నుండెడిది. అంతవరకు కాచి, మంచికాలములో మంత్రివర్గముల నేర్పరచుటకు శ్రీరామ కృష్ణరావుగారు సిద్ధపడిరట. కాని, వారి అనుయాయులలో కొందరు మంత్రిత్వముకుల ధారణమునకై పదునైదు దినముల ఆలస్యమును సహించలేని ఆత్రగాండ్రగుటచే, విధిలేక పై ముహూర్తము నందే మంత్రివర్గము ఏర్పడవలసి వచ్చినదట! అధునిక విద్యావంతులలో అనేకులకు ముహూర్త శాస్త్రముల పైన భక్తి కాని, విశ్వాసము కాని, లేక పోవుట ఈ అవ్యవస్థకు ముఖ్యకారణము. ఇప్పటి శోచనీయ పరిస్థితులలో ఇది యొక్కటి. అదియట్లుండె

దోషభూయిష్ఠమైన ముహూర్తములో ఏర్పడిన రాజ్యాంగసంస్థ శాంతియుతము గా, అభివృద్ధికరముగా, ప్రజారంజకముగా, పరిపాలన బాధ్యత నిర్వహించుట కష్టము. లగ్నాధిపతియొక్క అష్టమభావస్థితి బాలారిష్టమును సూచింపజాలినది. శత్రువృద్ధిసహా దీనిఫలమే. చంద్రుని వ్యయభావస్థితి సైతము ఇట్టి ఫలము నీయజాలినదే. శుక్రుడు సప్తమమందున్నచో, మిత్రులు శత్రువులుగా ఏర్పడగలరు. స్వజనమునుండి కుప్తైరమును మీనరని తెలుపును. రాజ్యస్థానాధిపతి శుక్రుడు. ఇతనికిగల ప్రబల క్రూరదృష్టివేన రాజ్య కార్యనిర్వహణ విషయమున ఎడతెగని ప్రతిబంధక సామగ్రిని సూచించును. కుజుని చతుర్థభావస్థితి భూస్వామ్య సంప్రదాయములో గొప్పమార్పులు కలుగునని తెలుపును. ఆ కుజునిపైన రవి వరుణుల స్నేహదృష్టి యున్నవి. ప్రతిబంధకము లెన్ని పొడకట్టినా, ఆ సంప్రదాయములో గొప్ప సంస్కరణములు జరిగి తీరునని యర్థము. ఇట్టి కుజుని వేన రాజ్యాధిపతి శుక్రునిపై నుండుటచే, ఈ మార్పులవలన నష్టపడినవారు, భూస్వాముల తరగతికి చెందినవారు, ఈ పరిపాలన విధానమును ద్వేషింతురని సూచన. వ్యయభావమందలి చంద్రుడు ఈకుజునికి మిత్ర దృష్టిలో నుండు కారణమున, స్వార్థపరులగు హిత శత్రువులు కొందరు చిక్కులు కల్గింతురు. రాజ్య సహమ మందుభాగ (వృశ్చిక రాశిలో 3 వది) కుట్రలు కుతంత్రములు తెలుపుచట్టిది. దీనికి విప్లవకారియగు వరుణుని అనుకూల్యము (మిత్రదృష్టి) కలదు. విప్లవకాంక్షులగు అతివాదులు కొందరు కుట్రలు పన్ని మంత్రివర్గమును కూలద్రోయుటకు ప్రయత్నింతురని అర్థము. శని శుక్రులకు పరివర్తన యోగమున్నది. నెమ్మదిగా, గౌరవకరముగా, ఉద్రేక రహితముగా, మంత్రివర్గము తమ కార్యములు నిర్వహించగల్గును. విద్యాభివృద్ధి లలితకళా పోషణము బాగుగా జరుగగలవని పంచమ భావమందలి పుణ్య సహమము, కేంద్రమందున్న శుక్రుడు, చాటుచున్నారు.

పై ముహూర్తపు సామాన్యఫల మిట్టిది. ఈ కుండలికి దేవరూవదశలను సాధించినచో, ఇప్పటికి దశాపరిపాక మెట్లు పరిణమించినదో, చూడ గల్గుదుము. 1-11 1956 నాటికి చలిత గ్రహభావ స్థితిని చూపు చక్రమిది:—

| | | | |
|---|---|---|---|
| ర 20-32 | బు 6-3<br>గు 18-26 | X 14 0 | |
| రా 29-41<br>వ 23.18 | (సాయనము)<br>—<br>చలిత | గ్రహభావకుండలి<br>1-11-1956 నాటికి | శు 9 56 |
| | | | I 14-26<br>కే 19-41 |
| పుణ్య 15-46 | రాజ్య 6 40<br>కు 17-18 | శ 18-13<br>ఇ 21-8 | చ 13-35 |

ఆరంభమునుండి దాదాపు నాల్గు సంవత్సరములు, ఎనిమిది మాసములకు కేవయానముతో గ్రహచలనము దశాపరిపాకమును ఎట్లు చూపినదో, పాఠక మహాశయులు పరికించెదరు. ముఖ్యవిషయము లివి:—

(i) చలిత కుజుని క్రూర కేంద్రదృష్టి దశమాధిపతి యగు శుక్రు నాక్రమించినది. చతుర్థ కేంద్రము

నుండి వచ్చిన ఈ దృష్టి రాజ్యాధిపతికి స్థాన భ్రంశము చేయ జాలినది.

(ii) చలిత పుణ్యసహమము లగ్నాధిపతి యగు రవి నుండి కేంద్ర వేధ పాలయినది. ఇది ఈ సంస్థ యొక్క పుణ్య సమాప్తిని తెలుపగలదు.

(iii) చలిత చంద్రుడు రవి యొక్క సమ సప్తక వేధకు లోనై పుణ్య సహమమునకు కేంద్రమునకు వచ్చినాడు.

ఇది పైదశకు ఉత్తేజనము నిచ్చును. ప్రశంస లోని మంత్రివర్గము అధికారమునుండి విరమించు కాలము ఆసన్నమైనదని ఈ దశలు సూచించు చున్నవి. 31-10-1956 నాటికి ఈ దశాఫలము సిద్ధించినది. ముహూర్తచక్రము తెలిపిన సూచన ఇది.

ఇట్టి పరిస్థితులలో, ఇన్ని చిక్కులలో, ఇంత కాలము అరిష్టము పాలుగాకుండ ఈ మంత్రివర్గము నిలుచుటకు కారణమేమి? అనవచ్చును. లగ్నముపై నున్న గురుదృష్టియని ప్రతి చెప్పుట సులభము. కాని, ఈ గురువు అష్టమభావాధిపతి యనుట మనము మరువ రాదు. దృష్టినుంచిదైనా, భావాధిపత్య ధర్మముపోదు. కాలపురుషుని రాజ్యములో గ్రహములకు ఒక్కొక్క కాలములో ఒక్కొక్క అధికారము వచ్చుచుండును. ఆ అధికార ధర్మములను గ్రహములు 'చెలాయించక' తప్పదు. అధికారప్రయుక్తముగా తన ధర్మము నిర్వర్తించవలసివచ్చినప్పుడు, సహజశుభుడే,లగ్నముపై శుభదృష్టికల కారణమున, బృహస్పతి "శ్రేయోభివృద్ధిరస్తు." అని మంగళాశాసనము చేయవచ్చును; చేయునుకూడ. ఇదే విశేషము. అంతేకాని, అరిష్టము తొలగించుపనిమాత్రము ఇతనిది కాదు.

ముహూర్త శాస్త్ర సూత్రములను అన్వయించు సందర్భమున, ఒక విశేషధర్మమును మనము గమనించ వలసి యుండును.

"ప్రమాణం జన్మకాలోత్థం
ఫలం సర్వత్ర సర్వదా
కర్మలగ్న ఫలం తత్ర
తదధీనం సమాదిశేత్," (జ్యోతిర్వివరణము)

ముహూర్తఫల మెట్టిదైనా, అది కార్యకర్త జాతకఫలమునకు లోబడియుండుననుట. ముహూర్త మొక్క ఆయుధము, లేక ఉపకరణము వంటిది. దానిని ఉపయోగించుకొను శిల్పియొక్క శక్తికి, సంస్కారమునకు, అభిరుచికి, అవకాశమునకు తగినరీతిగా అది ఉపయోగపడగలదు. ముహూర్తము సంపాదించి యిచ్చు మంచిఫలమైనా, చెడు ఫలమైనా, కర్త జాతక ఫలమునకు అధీనముగా, అనుగుణముగా, జరుగు ననియు, ముహూర్తము స్వతః ఫలకారి కానేరదనియు, గర్గమహాముని ఆనతిచ్చెను.

"తిథివారర్క్ష లగ్నాద్యైః,
యదుక్తం సదసత్ఫలం,
తత్సర్వం జాతకాధీనం;
న స్వతః ఫలదం మతం"

మౌహూర్తికులు మరవకూడని బంగారు సూత్ర మిది.

అగుటచే, ముఖ్యమంత్రి జాతకముతో ఈ ముహూర్తమునకు ఎట్లు పొత్తు కుదిరినదో, గమనించుట ముఖ్యము. ఆ మహనీయుని జాతకము ఉత్కృష్టమైనది. చతుర్థ, భాగ్యాధిపతి అగుటచే రాజయోగప్రదుడైన శుక్రుడు లగ్నములో తిరతిరలాడు చున్నాడు. ధన లాభాధిపత్యము కల శుభగ్రహము బృహస్పతి నికరముగా రాజ్యభావ మధ్యమునందే నివసించుట. భూగోళ సర్వసేనాని కుజునికి రాజ్యాధిపత్యము సిద్ధించినది. ఈకుజుడు నీచభంగము పొంది, చంద్రునితో పరివర్తన యోగము సాధించి, గ్రహరాజునుండి ప్రబల స్నేహ దృష్టిని సంపాదించుకొని, శత్రు విజయమును సాధించి ఇచ్చు షష్ఠభావములో నున్నాడు. రాజసహమము రాజ్యస్థానమునందే బృహస్పతి సంయోగములో నున్నది. ధన స్థానములోనున్న పుణ్య సహమము రాజ్యస్థానములోని బృహస్పతి యాజమాన్యము లోనిదే ఇది గొప్పయోగజాతకమని వేరుగ చెప్పుట అనవసరము.

ఈ జాతకమందలి అభ్యుదయశక్తి ముహూర్తపు సామగ్రిని ఎట్లు ఉపయోగపరచుకొన్నదో, చూడుడు! యోగకారకుడగు శుక్రుని స్థానమే సప్తమ కేంద్రముగా రాజ్యభావ నిర్వాహకుడగు బృహస్పతి స్థానమే దశమకేంద్ర మధ్యముగా, చలితపుణ్య సహమస్థానమే రాజ్యస్థానముగా, నికరముగా ఏర్పడుటే ఈ ముహూర్తమందలి విశిష్టమైన సుగుణము. ముఖ్యమంత్రి జాతకమందలి అభ్యుదయ శక్తుల సంబంధము ఈ ముహూర్త కేంద్రములకు వ్యాపించుటచే, ఆ జాతక వ్యాఖ్యానముతో సమన్వయము కుదుర్చుకొనియే ముహూ

ర్తము తన ఫలములు చూపవలసియున్నది అట్లే చూపినది.

జాతకఫలము ప్రశస్తముగా నుండి ముహూర్తము దోషయుక్తముగా నుండెనేని, కష్టముతో కార్య సాధనమగుననియు, కార్యము సిద్ధించిన తరువాత సుఖ సౌభాగ్యసంపత్తులు చేకూరగలవనియు, పెద్దలు చెప్పిరి.

"యత్ర జన్మఫలం శస్తం,
కష్టం తాత్కాలికం భవేత్,
కార్యం సిధ్యతి కృచ్ఛ్రేణ;
సిద్ధౌ సౌఖ్యార్థ సంపదః"

(జ్యోతిష్ప్రకాశము)

ఈ మంత్రివర్గపు నాయకుడుగా పరిపాలన నిర్వహించు విషయమున ముఖ్యమంత్రి ఎన్నియో కష్టముల నెదుర్కొనవలసివచ్చుట చదువరు లెరుంగు దురు. అంతః కలహములతో, అవిశ్వాసములతో, మిత్రులు కొందరు శత్రువులుగా పరిణమించిరి. స్వార్థ పరులు కొందరు మతవైషమ్యములనో, సంఘద్వేష మునో రెచ్చగొట్టి దేశములో అశాంతి కలుగుటకవకాశములు కల్గించిరి. విప్లవవాదులు చెలరేగి ప్రభుత్వమును విచ్ఛిన్నము చేయజూచిరి. మంత్రి వర్గము బాలారిష్టములపాలై, రెండుమార్లు కొంపలు—"అయే పాయే" ననిపించినది. కాని, ప్రతిభాశాలి, రాజ్యతంత్ర నిపుణుడు నగు ముఖ్యమంత్రి వైయక్తిక శక్తివలన ఈ సంస్థ గండములు గడిచి గట్టెక్కినది. తరువాత మార్గము సుకరమై ప్రజలకు ఎన్నియో సదుపాయములు సమకూడినవి. భూస్వామ్య సంప్ర దాయములో జరిగిన సంస్కరణములు ఇతర రాష్ట్ర ముల కాదర్శప్రాయములు. విద్యావ్యాప్తికి అభూత పూర్వములైన సౌకర్యము లేర్పడినవి. దేశమును సస్య శ్యామలము చేయగల జలాశయముల నిర్మాణమునకు అంకురార్పణము జరిగినది. ముక్కోటి ఆంధ్రుల నొక పరిపాలనలోనికి తెచ్చు ప్రణాళిక సిద్ధము చేయ బడినది. నాలుగున్నర సంవత్సరముల కాలము దేశా భ్యుదయ దృష్టిలో నిట్లు ప్రజాసేవ చేసి యీ సంస్థ ఇపుడు తనపదవిని చాలించుకొనెను.

అది యట్లుండె. ఈ ముహూర్తమునకు 1956 వ సంవత్సరమున వర్షజాతకము ఏమి సూచించెనో, పరిశీలింతము.

ఈ సంవత్సరమున మార్చి నెల 6-వ తేదీనాడు మధ్యాహ్నము 3-18-47 P. M. (I. S. T.) వేళలో వర్షప్రవేశము జరుగుట. అప్పటి గ్రహభావ కుండలి ఇది:—

<table>
<tr><td>ర 15.47-58</td><td>శు 28.17<br>X 28 18</td><td>పుణ్య 21-3</td><td>కే 12-38</td></tr>
<tr><td>బు 22-34</td><td colspan="2" rowspan="2">(సాయనము)<br>—<br>వర్ష జాతకము<br>—<br>(1956)</td><td>వ 28-36 (వ)</td></tr>
<tr><td>చ 6 25<br>కు 4.18</td><td>I 0-26<br>కు 24 7</td></tr>
<tr><td>రా 12-38<br>శ 2-47</td><td>ఇ 0.6<br>రాజ్య 24-36</td><td></td><td></td></tr>
</table>

ముహూర్తచక్రములో దశమాధిపతి శుక్రుడు దేవమానదశలో ఇప్పటికి ప్రబలవేధ పాలయినాడని కనుగొంటిమికదా? వర్ష జాతకములో ఈ శుక్రుడు రాజ్య భావమందే నిలిచియున్నాడు కాని, మోక్ష కారకుడగు కేతువుయొక్క అర్ధ కేంద్రవిషను దృష్టిని పొంది, వరుణుని కేంద్ర దృష్టితో, ఇంద్రుని సమసప్తక దృష్టితో, ఆకర్షించబడుచున్నాడు. ఉన్న దానిని ఊడగొట్టు ప్రతిభాశాలి వరుణుడు. ఇతడు లగ్నమందే 'తిష్ఠ' వేసినాడు. రాజ్య సహమును జన్మాష్టమాధిపతియగు గురువునుండి కేంద్రవేధ పాల్పడినది పుణ్య సహమము చంద్రుని సార్ధ కేంద్ర విషదృష్టికి చిక్కినది. లగ్నమునకో, ఇంద్రా వరుణుల వేధయేకాక, లగ్నాధిపతియగు రవినుండి సార్ధ కేంద్రవీక్షణ క్లేశము కలదు. ఈ వర్షమున ఈ మంత్రివర్గ పరిపాలన అంతమొందవలెనని ఈ యోగ ములు సూచించుచున్నవి.

ఈ అధికార విరమణము మంత్రుల అసమర్థత వలననో, అన్యాయ్య ప్రవర్తనమువలననో, ప్రజా ప్రతినిధుల అవిశ్వాసము వలననో, కలిగిన పతనము కాదని పాఠకమహాశయు

తెరుగుదురు. జన్మరాజ్యాధిపతి శుక్రుడు వర్షజాతకమున రాజ్యభావ మధ్య బిందువందే ప్రకాశించుచుండగా—అందులో బృహస్పతి శుభత్రికోణ దృష్టి కలదు—అట్టి పతనము సంభవించుట కల్ల. పైగా, మంత్రివర్గమునకు చక్కని పేరుప్రతిష్ఠల ఔన్నత్యమునే ఇది ఉద్ఘోషించగలదు. వరుణుని కార్యము విభజనము; తాత్కాలిక పరిస్థితులలో తారుమారు; నూతన మార్గావలంబనము, భారత ప్రభుత్వపు రాజనీతిలో వచ్చినమార్పుల ఫలితముగా ఏర్పడిన రాష్ట్ర పునర్నిర్మాణ పథకము ననుసరించి హైదరాబాదు రాష్ట్రమునందలి మహారాష్ట్ర కర్ణాటక భాగములు విడిపోయి, తెలంగాణా ప్రదేశము ఆంధ్రరాష్ట్రములో చేరి ఆంధ్ర ప్రదేశము పేరున గొప్ప నూతనరాష్ట్రము సిద్ధమగుటచే, పరిస్థితులకు తగిన మంత్రివర్గము నెన్నుకొనుట కవకాశము కలిగించుటకై, ఈ మంత్రివర్గము సగౌరవముగా తన అధికారమును వదలుకొన్నది. ఆంధ్రప్రదేశాభ్యుదయమే దాని పరాయణము.

వర్షజాతకములో లగ్నములోనున్న వరుణ గ్రహమునకు ఇంతఫలమున్నదా, అని సందేహించువారుందురు. నూతన గ్రహములివి పాశ్చాత్యుల సృష్టియని ఇంద్రవరుణుల కార్యములను విశ్వసించనివారు మన ప్రాచీన సంప్రదాయపు జ్యోతిశ్శాస్త్రవేత్తలలో ఇప్పటికిని పలువురున్నారుకదా? రాష్ట్రవిభజనమును వరుణగ్రహము సూచించునేని, తత్ఫలముగా ఏర్పడిన ఈ మంత్రివర్గ పరిపాలన సమాప్తికాలమును ఈ గ్రహము చూపవలదా అని విమర్శించువారు సైతము ఉండకపోరు. రాజ్యసహమముపైన అనుకూలదృష్టిగల వరుణుడు రాజ్యమును భంగపరచనేల? అనవచ్చును. ఈ రాష్ట్రవిభజనముకాని, ఈ అధికార సమాప్తికాని, దేశాభ్యుదయముకొరకే, ముక్కోటి ఆంధ్రుల క్షేమముకొరకే, అనుట మనము మరచిపోరాదు.

అనుకున్నట్లుగా, లగ్నముపైన, రాజ్య సహమముపైన, వరుణుని కైవాటమున్నమాట వాస్తవమైనచో, అట్టి కైవాటముయొక్క ఫలము ఎప్పుడు సిద్ధించవలెననుట మన ప్రశ్న.

“గ్రహైశ్చ భావాంశగతైః ఫలోక్తిః” అను యాదవుని సూత్రములో ప్రత్యుత్తరము మనకు లభించుచున్నది. వరుణునికిక్కి రాజ్యసహమమును, లగ్నాధిపతి రవిని, ఎప్పుడు ఉద్బోధించునో, అప్పుడే ఫలమునకై మనము నిరీక్షించవలయుననుట!

రాజ్యసహమమును తీసుకొందము. వరుణుడు ఈ సహమ స్థానమునకు వచ్చినా, ఈ సహమము వరుణ స్థానమునకు పోయినా, మనము కోరిన ఉద్బోధనము జరుగగలదు. కాని, చారవశమున వరుణుడు గమ్య స్థానము చేరుట ఈ సంవత్సరములో జరుగదు కనుక, సహమమునే వరుణస్థానమునకు పంపవలసియున్నది.

“కాలక్రమేణ జగతః పరివర్తమానా, చక్రారపంక్తిరివ గచ్ఛతి భాగ్యపంక్తిః” అను భాసమహాకవి వాక్యములో ఈ హోరాశాస్త్ర మర్మము ఎంతో ముగ్ధమనోహరముగా ఇమిడియున్నది. భూమండలము యొక్క చక్రార రేఖలవలె (మానవుల) భాగ్యరేఖలు నడచుచున్నవట! ఏడాది కొక్కతూరి గిర్రున తిరుగునియా? కాదు. భూచక్రమునకు మూడువందల అరువది అరములు (ఆకులు) కలవు. పరిభ్రమణమువలన ఈ అరములన్నియు దినక్రమమున స్థలమునుండి స్థలాంతరమునకు పోవుచుండుట సృష్టిధర్మము. అట్టి సంచార పద్ధతిలో ఒక్కొకచోట వీనికి శుభగ్రహ సంబంధమో, పాపగ్రహ సంబంధమో, కలుగుచుండును. వర్ష జాతకములో ఫలప్రద స్థానములలో నున్న ప్రత్యేకారములు పరిభ్రమణమువలన స్థానాంతరములకు పోయినపుడు, అచట తమతో సహకరించు గ్రహ సంబంధము లభించినపుడే అవి తమ ఫలమును చూపగల్గును. అగుటచే, భూచక్రారములకు పరిభ్రమణమువలన కలుగు ఉత్తేజనము ననుసరించి మానవుల భాగ్యరేఖ మార్పుచెందుచుండునని సారాంశము.

ఈ సంప్రదాయానుసారముగా, రాజ్య సహమమునకు వరుణగ్రహమునుండి ఉత్తేజన మెప్పుడు వచ్చునో, చూతము.

17½° ఉత్తరాక్షాంశంలో:—వరుణ స్థానము (కర్కాటక రాశిలో 28°-36') ఉదయమగు నాక్షత్ర కాలము...... 1 గం॥ 35 ని॥

రాజ్యసహమ స్థానము (వృశ్చిక రాశిలో 24°-36') ఉదయించు నాక్షత్ర కాలము... 9 గం॥ 54 ని॥
భోగా నిలువ ... ... 15 గం॥ 41 ని॥

# బూర్గుల మంత్రివర జాతకము

| | |
|---|---|
| వర్షప్రవేశము నాటి స్థానిక నాక్షత్రకాల భుక్తి | 22 గం|| 56 ని|| |
| చేర్చగా మొత్తము | 38 గం|| 37 ని|| |
| మండలము తీసివేయగా | 24 గం|| |
| నిలువ నాక్షత్ర కాలము | 14 గం|| 37 ని|| |

ఈ నాక్షత్రకాలము ఏదినమునకు భుక్తి అగునో అప్పటికి రాజ్యసహామవరుణ సంయోగ ఫలము సిద్ధించ వలయునని అర్థము. రాజ్యసహమును నాశ్రయించి యుండిన చక్రారము వరుణగ్రహ స్థానమును చేగ కొనగల నాటి నాక్షత్రకాల భుక్తి 14-37 అనుట ర్యాఫేలు ఎఫెమెరిస్సు పుటలు త్రిప్పినచో, ఈ నాక్షత్రకాల భుక్తి ఖచ్చితముగా 1956, అక్టోబరు 31 వ తేదీ నాటికే యని సర్వసులభముగా గ్రహింపగల్గుదుము. ఆనాటితోనే కదా ఈమంత్రి వర్గపు పదవీ విరమణము? వరుణ గ్రహకార్యమునకు చక్కగా సాక్ష్యమిదియని చదువరులు గుర్తించగలరు.

మరియొక్కమాట. లగ్నములో నున్న వరుణుని శక్తి లగ్నాధిపతి రవి నేమి చేసినది? అందురేమో? పైన వివరించిన చక్రార భ్రమణ పద్ధతి ఏమి సూచించ గలదో, పరికింతము.

| | |
|---|---|
| రవి స్థానము మీనరాశిలో 15-48 ఉదయించు నాక్షత్రకాలములో... | ... 17 గం. 15 ని. |
| వరుణస్థాన ముదయించు నాక్షత్రకాలము | 1 గం. 35 ని. |
| పోగా, నిలువ......... | 15గం. 40ని. |
| వర్షప్రవేశము నాటి స్థానిక నాక్షత్ర కాల భుక్తి......... | 22గం. 56ని. |
| చేర్చగా, మొత్తములో మండలముపోగా నిలువ ...... | 14 గం. 36 ని. |

ఈ నాక్షత్రకాలము 31-10-1956 నాటిదే యని కనుగొన్నాము కదా? వరుణుని ప్రచండశక్తి రవికి సంక్రమించుట సయితము ఆ నాడే యని వర్షజాతకము నిరూపించుచున్నది. ఏమి ఈ కాల పురుషుని విచిత్ర వినోద లీల!

ప్రకృతమింత చాలును:

ఆంధ్రుల చిరకాల తపఃఫలముగా "ఆంధ్రప్రదేశము" అవతరించినది అభివృద్ధి కార్యక్రమ మెంతయో జరుగవలసి యున్నది. ఆంధ్ర భాష, ఆంధ్ర సంస్కృతి, ఆంధ్రజాతి, ఇతోధికముగా వికాసము చెందవలసియున్నది. కష్టపడి సంపాదించిన అవకాశము వ్యర్థముగాకుండ, విప్లవ శక్తుల విజృంభణమువలన దేశము అశాంతిపాలు గాకుండ, జాతి, మత, కుల భాషా ద్వేషము పెరిగి వికృత పరిణామమునకు దారితీయకుండ, అధికారము స్వార్థపరుల ముసుపై ప్రజలను హింసించకుండ, నూతనరాష్ట్ర శిశువును సంరక్షించుచు సర్వతోముఖముగా ఆంధ్రజాతికి అభ్యుదయమును ప్రసాదించు మంగళాశాసనములను అనుగ్రహింపుడని ఇంద్రా వరుణులను ప్రార్థింతము గాక.

"ధ్రువం తే రాజా వరుణో,
ధ్రువం దేవో బృహస్పతిః,
ధ్రువంత ఇంద్ర శ్చాగ్నిశ్చ,
రాష్ట్రం ధారయతాం ధ్రువం."

# ఇంగ్లీషు 'రొమాంటిక్' కవులు

శ్రీ కె. శ్రీరామ్

ఇంగ్లీషు సాహిత్యచరిత్రలో పదునెనిమిదవ శతాబ్దాంతమున చిగిర్చి పందొమ్మిదవ శతాబ్ది మొదటి అర్ధభాగమున విస్తృతమైన నూతన సాహిత్యోద్యమము 'రొమాంటిక్' ఉద్యమము. ఇంచుమించు సమకాలీనముగ ఇటలీ, జర్మనీ, ఫ్రాన్సులలో కూడ సరూపమైన ఉద్యమములు బయలుదేరినవి. పాశ్చాత్య సాహిత్యచరిత్రలో ఆకాల మొక విప్లవాత్మక యుగమనవచ్చును. ఫ్రెంచి మహావిప్లవము ప్రజాజీవితము నొక్కమారుగ కలచివైచెను. భావనా ప్రపంచమున కల్లోలము బయలుదేరెను. సంప్రదాయ శృంఖలముల త్యజించి వ్యక్తిత్వ ప్రదర్శనములపై కుతూహలము చూపుట హెచ్చెను. విప్లవము ఫ్రాన్సులో బయలుదేరినను దాని ప్రభావము ఖండమంతటను కన్పట్టెను. స్వేచ్ఛానినాదము లెల్లెడల చెలరేగెను. రాజకీయ సాంఘిక పద్ధతులపైని విప్లవము సాహిత్యరంగమున ప్రతిఫలించెను. నియమములపై నిరసనము హెచ్చెను. పాత కవిత్వములోని కృత్రిమతపై విద్వేషము జనించెను. ప్రకృతిపై మక్కువ హెచ్చెను. రూపచిత్రణముపై ప్రీతి మిక్కుటమయ్యెను. భావతీవ్రత ప్రతి రంగమునను అతిశయించెను. రచనా సౌలభ్యముపైనను ధారాశుద్ధిపైనను దృష్టి మరలెను. విలక్షణమగు వ్యక్తిత్వమే ఏకైకలక్ష్యమయ్యెను. సాహిత్యమున స్వతంత్రత పెల్లుబికెను. ఆంగ్లసాహిత్యమున వర్డ్స్‌వర్త్, కాల్‌రిడ్జి, సథే, స్కాట్, లాండర్, బైరన్, షెల్లీ, లీహంట్, కీట్స్ మున్నగువారి రచనలలో ఈ ఉద్యమ ప్రభావము ప్రస్ఫుటము.

ఉద్యమారంభమునందలి కవులలో వర్డ్స్‌వర్త్, కాల్‌రిడ్జిలు ముఖ్యులు. నాటి రాజకీయ రంగమున కలిగిన శీఘ్రపరిణామములు వర్డ్స్‌వర్త్ భావనలలో ఒక విధమైన సంఘర్షణ జనింపజేసెను. తొలి లక్ష్యము లన్నియు పోయి జీవితముపై నైరాశ్య మంకురించెను. ఆ నిరాశా భావమే ఇతని దృష్టిని ప్రకృతిపైకి మరల్చినది. ప్రకృతి లాలింపులో పాతకళలు, ఆశయములు చిగిర్చినవి. కాని యీ ప్రభావమున విప్లవాత్మక చర్యలపై నితని విరక్తి మాయలేదు. జీవితముపై తాత్త్వికదృష్టి పెంపొందెను. మానవుని మనస్సులోను, పరిసర ప్రపంచములోను వ్యక్తమగు సార్వజనీనమైన శక్తి యొక్క రూపమే ప్రకృతియని వర్డ్స్‌వర్త్ తత్త్వము. ప్రకృతి పరిష్వంగమున అమరమగు సత్యపరిజ్ఞానము కల్గునని ఇతని నమ్మకము. స్వచ్ఛమగు ఇతని భావనలకు ప్రకృతి చుక్కానియయ్యెను. ప్రకృతియే ఇతని కవితాత్మ. భాషలో సహజమగు పలుకుబడికి ఇత డంకురార్పణము గావించెను. వస్తువులు సామాన్య జీవితము నుండి గ్రహింపబడవలెననియు, శక్తివంతమైన భావనల సహజ ప్రకాశనమే కవిత్వమనియు ఇతని వాదము. వాస్తవ జీవితమున వాడు భాషను తన భావనాదర్పణమున విచిత్ర కాంతులలో నితడు ప్రదర్శించును. సంప్రదాయములను కృత్రిమతను నిరసించి స్వాభావికతపైనను సారళ్యతపైనను మొదటిసారిగ దృష్టి మరల్చిన అమరకవి వర్డ్స్‌వర్త్. కవిగా, అధ్యాపకుడుగా, మానవుడుగా ఇతడు తనలో అంతర్లీనమైన విప్లవ సూత్రములను స్వయంవ్యక్త మొనర్చినాడు. సహజమైన మానవుని సంభావనముపైనను, జీవితసారళ్యముపైనను లక్ష్యముంచిన ఇతని కవిత్వము నాటి ప్రజాప్రభుత్వోద్యమముతో అభేదముగ కలసిపోయిన దన వచ్చును. ఇతని కవితా వ్యాసంగమును విమర్శించునపుడు సాహితీ సేద్యమున ఇతనికున్న హద్దులను గుర్తింపవలెను. ఇతడు జీవితమును పాక్షికదృష్టితోడనే ఉపలక్షించెను. ఇతని అభిరుచు లొక నియమితపరిధిలోనే ఉండెడివి. కథాకథనశక్తియు నాటకానుగుణమైన శైలియు ఇతనిలో మృగ్యములు. ధర్మసూత్రములను తత్త్వరహస్యములను వ్యక్తపరచు నాసక్తిలో కవితా సౌందర్యము కొంతవరకు పూజ్యమగు చుండును. ఇన్ని సుస్పష్టమైన హద్దులున్నను ఇతడు ఆంగ్లకవిశ్రేణిలో ఉత్తమకవి

స్థానమునే పొందినాడు. అందులకు కారణము ప్రకృతియొక్క సహజ శాంతమూర్తిని మనకు ప్రత్యక్షము చేయగల అతిలోకమైన ప్రజ్ఞ సామాన్యమానవ జీవితములోని అపురూపమైన మాధురిమను చవిచూపగల అనన్య సామర్థ్యము. స్పృశించిన ప్రతి విషయమును అతి మోహనముగ అలంకరించగల అప్రతిమాన శిల్పకళానైపుణ్యము. సహజసుకుమారభావమును లలిత పద విన్యాసముతో వ్యక్తపరచు సాటిలేని కవితాశక్తి.

కాల్‌రిడ్జి, వర్డ్స్‌వర్త్ అనుచరులలో ముఖ్యుడు. వీరిరువురును కలసి చాల పద్యములను ప్రచురించిరి. వర్డ్స్‌వర్త్ స్వాభావికతపై దృష్టి కేంద్రీకరించగా ఇతడు మానవాతీతశక్తి (Supernatural) పై దృష్టి నిగిడ్చెను. ఫ్రెంచి విప్లవము మానవతపై నితని నమ్మకమును నశింపజేసెను. ఇతనికి అధ్యాత్మిక విషయములపై మొదటినుండియు అభిలాష మెండు. ఇతని భావన ఎప్పుడును పరోక్షలోకమున విహరించును. సామాన్యజీవిత సత్యము లెప్పుడును ఇతనిలో ఆసక్తిని రేకెత్తించవు. ఇతని విప్లవాసక్తికి కారణము స్వేచ్ఛాస్వాతంత్ర్యములవంటి అగోచర సూత్రములపైగల మక్కువేకాని నాటి ప్రజల దుస్థితి కాదు. ఇతడు తన భావనాంబరమున ఒక ఆదర్శరాజ్యమును స్థాపించుకొనెను. కష్టములనేకములు వచ్చుటచే ఇతని భావన ఆచరణదూరమైన ఆదర్శముగ నుండిపోయెను. ఇతడు తన కవిత్వములో శృంగారాద్భుతరసములు రెంటికిని ప్రాధాన్యము నిచ్చెను. సుకుమార జీవితానుభవములను ముచ్చటించుటలోను, సుందరదృశ్యములను హృద్యముగ అభివర్ణించుటలోను ఇతడు మేటి. మనలోని ఆంతరంగిక స్వభావమున కితడు సార్వజనీనమైన ఆసక్తిని కల్గించి, తన కల్పనలను త్రికాలాబాధిత సత్యస్వరూపములుగా మార్చివైచును. నిశితములు భావములు చెప్పుచున్నను, చదువరిలో అభిరుచిని, ఆసక్తిని కల్గించుట ఇతనిసొమ్ము. అసాధారణ సన్నివేశములను నిర్దుష్టమైన మనస్తత్త్వ సూత్రములతో జతచేసి అతి సహజముగ చేయును. సరసమగు శృంగార సన్నివేశములు చిత్రించుచున్నను కేవలము ఇంద్రియ పరితృప్తికాక పవిత్రప్రేమ ప్రకర్షచే వానిని పునీతము చేయును. మానవాతీతమైన దానిని వర్ణించుచున్నను అందు అద్భుతత్వమును స్వాభావికతతో మిళితము చేయును. చదువరిని స్వాప్నిక జగత్తులోనికి దింపి సహజాసహజభావసంఘర్షణమున మంత్రముగ్ధుని చేయును. పారలౌకిక విషయవిజ్ఞాపనమున కూడ ఐహిక ప్రపంచ సత్యములను మరువడు. ఇతని ప్రకృతి కవిత్వమున ఇంద్రియప్రేరక వర్ణన లున్నను అంతకన్న ఎక్కుడుగ ఆధ్యాత్మిక భావ సౌందర్యముండును. శ్రవణపేయమైన ఛందోరీతులలో చక్కని కవిత్వము చేసి కాల్‌రిడ్జి సుస్థిరమగు కీర్తి నార్జించినాడు.

సమకాలీన కవులకు సాటికవి కాకపోయినను వర్డ్స్‌వర్త్ కాల్‌రిడ్జిలకు అనుచరుడగుటచే సథే కూడ ఇచ్చట స్మరణీయుడు. ఇతనిపై రూసో ప్రభావమపరిమితము. కాల్‌రిడ్జితో కలిసి ఆదర్శ ప్రజారాజ్య సంస్థాపనమునకు కలలుగని విఫలుడైనాడు. తరువాత ఆదర్శస్వప్నవీథులనుండి ఇతని దృష్టి ప్రాచీనుల పైకి మరలెను. ఇతని కవిత్వము గ్రంథ బాహుళ్యముచే మిన్నయైనను రచనా సౌందర్యము చిన్నపద్యములలోననే వ్యక్తమగును. వానిలో కొన్నిటిపై జర్మను ఉద్యమ ప్రభావము మిక్కుటము. ఇతని కథనాత్మకమైన పెద్ద పద్యములు నాడు మంచిపేరునే సంపాదించినను, నేడు నామమాత్రావశిష్టములు. కథలుగా రమ్యముగనున్నను, వర్ణనలు కొన్ని చక్కగానున్నను, వానిలో కవితాశక్తి స్వల్పము. ఐనను పదునెనిమిదవ శతాబ్ది సూత్రములకు విరుద్ధమైన స్వతంత్రఛందస్సులో కవిత్వము చెప్పె ఉద్యమ ప్రభావమునకు లోనగుటచే ఇతనికి చారిత్రక ప్రాముఖ్యము గలదు.

'రొమాంటిక్' కవులలో స్కాట్‌కు విశిష్ట స్థానము గలదు. ఇతడాభిజాత్య కుటుంబములో జనించినవాడు. తన కుటుంబీకుల గొప్పతన మితని ప్రతినాడిలోనికి పోయి ప్రాచీనులపై అమితమైన అభిరుచిని కల్గించినది. ఎడింబరోలోని విద్యాభ్యాస మితడు కవియగుటకేమియు తోడ్పడక పోయినను ఇటలీ, జర్మనీ, స్పానిష్ రొమాంటిక్ సాహిత్యములను చక్కగా ఆకళింపు చేసుకొనుటకు తోడ్పడినది. వివిధ భాషలలోని సుప్రసిద్ధ కవిత్వముపై అభిరుచి అతిశయించినది. వర్డ్స్‌వర్త్ కాల్‌రిడ్జిలపై వలెకాక 'స్కాట్'పై ఫ్రెంచి మహావిప్లవము విభిన్నమైన ప్రభావము చూపినది. విప్లవము స్కాట్‌కు పునరుద్ధరింపబడిన నూతనసమాజముయొక్క భావికాంతులను చూపి మానవుని స్వేచ్ఛాప్రవృత్తిపై ఆసక్తిని కల్గించలేదు. ప్రజాప్రభుత్వముపై తనకుగల వైరుధ్యము నినుమడింపజేసి శృంగార ప్రాచీనములపై

అపరిమితాసక్తి కల్గించెను. పుట్టుకతోనే 'టోరీ' యైన స్కాట్ విప్లవమును తీవ్రముగ ఎదిర్చిన పాతపాలనపైనే ప్రేమొగ్గియుండెను. స్కాట్‌పై సుప్రసిద్ధ ప్రాచీన రచనల ప్రభావమమేయము. ఇతని పద్యకావ్యము లన్నియు పద్యరూపములోని 'రొమాంటిక్' కథలు. కథాకథన నైపుణ్య మితనికి పుట్టుకతోనే అబ్బినది. ఇతని కథనము సులభముగను శీఘ్రముగను నడచును. ఇతనికి చిత్రణముపై మక్కువ హెచ్చు. శైలి కొన్ని చోట్ల నాటకీయముగనుండి కడురమణీయముగనుండును. యుద్ధవర్ణనలందును, ప్రముఖ శౌర్యకథనమందును, శిల్పనైపుణ్యముతో నలరారు వర్ణనలయందును ఇతని ప్రతిభ నిరుపమానము. కాని కథలుగా కడుసుందరము లగు నితని రచనలు కావ్యములుగా ఉత్తమ కవితాశక్తి లేమిచే అంత రమణీయములు కావు. శైలి ఒక్కొకచో ఒక్కొక రీతినుండి విశిష్టతను కోల్పోవును. ఇతని పదగుంభనమున సౌకుమార్యము తక్కువగుటచే చిరస్మరణీయము కాదు. ఇతని వస్తు విస్తరణము సంప్రదాయబద్ధమై నీరసముగనుండును. ఇతని కవితాశక్తికి తాత్త్విక భావన నేపథ్యముగ కుదురలేదు. అందుచే ఉత్తమ కవిగా ఇతనిని నిర్దేశించుట కష్టము కాని పద్యకావ్యములలో ఉత్తమ కథకునిగా ఇతనికితడే సాటి.

ప్రాచీనత పైకి బాగుగా మొగ్గ చూపిన కవులలో లాండర్ ఒకడు. గ్రీసు, రోముల నైతిక ఆశయములలో ఉత్తమమైనవి, వీరోచితమైన వన్నియు నితడు జీర్ణించుకొనెను. ఇతని రాజకీయములపై కూడ నీ ప్రభావము స్పష్టము, ఇతనికి రాజులపై రాచరికముపై ఎంత అనిష్టతయో ప్రజాబాహుళ్యముపై అంత విరక్తి. మామూలు జీవితమునందును సాహిత్య జీవితమందును దృగ్గోచరమగు నీ ప్రభావమే ఈ యుగ కవులలో నితనికొక నూతన వ్యక్తిత్వమును సమకూర్చినది. 'రొమాంటిక్' స్వాతంత్ర్యము, ధారాశుద్ధి విచ్చలవిడిగా స్వైర విహారము నెరపుచున్న కాలమున శైలియందు సంయమనము, స్వచ్ఛత నెలకొల్పిన కీర్తి ఇతనికి దక్కినది.

వర్డ్స్‌వర్త్, కోల్‌రిడ్జి మున్నగువారు చిగురింపజేసిన 'రొమాంటిక్' ఉద్యమము సద్యో వికాస మొందుచున్న సమయమున దానిని సర్వతోముఖ ప్రజ్ఞతో వినూత్న శోభతో ప్రకాశింపజేసిన యువకవులు బైరన్, షెల్లీ, కీట్సులు. వీరు నాడు ప్రబలిన విప్లవ శిఖలకు తమ కవితాజ్యమును పోసి దేదీప్యమానముగ చేసిరి. బైరన్ చిన్నతనమునందే సమకాలీన కవులను, విమర్శకులను తీవ్రముగ ఎదుర్కొనుట కుపక్రమించెను. కవిగా అత్యున్నతదశలో వెలుగొందుచున్న కాలమున బైరన్ జీవిత రంగమున అనేక విషాద పరిణామములు పొడసూపెను. క్రొత్తగా వివాహమాడిన వధువునుండి సంవత్సర కాలములో జీవితాంత వియోగము సంభవించెను. ఆ వియోగము విపరీతమైన అనేక ప్రవాదులకు గురియయ్యెను సామాన్య ప్రజాభిరుచి ఇతనికి దూరమయ్యెను. దానితో ఇతనికి సంఘమన్నను ప్రజలన్నను జుగుప్స ఏర్పడెను. వ్యక్తిగత స్వేచ్ఛపై మక్కువ ఎక్కువై, సమాజముపైనను సంప్రదాయముపైనను నమ్మకము నశించెను. ఈ మార్పు అంతటితో ఆగక సమకాలీనమైన ప్రతి విషయముపైన నితనిని క్రోధావేశునిగా చేసినది. ఇతని శీలము విపరీతమైన ఆవేశభావములకు కూడలి స్థలము. శ్రీమంతుల జాత్యహంకారము, సంఘ విద్వేషము, భావోన్మాదము, స్వేచ్ఛాభ్యుదయాల నిరంకుశ చిత్తవృత్తి ఇతనియందు కరడుగట్టినవి తత్ఫలితముగ ఇతని కవిత్వములో నాటి సాహిత్యోద్యమములోని విప్లవము, స్వేచ్ఛ మూర్తీభవించినవి. ఒకచోట భావప్రధానముగను, ఒకచో వర్ణనాత్మకముగను, వేరొకచోట కథనాత్మకముగను, వేరొకతరి నాటకీయముగను ఇంకొకచో వ్యంగ్య ప్రధానముగను ఉండి ఇతని శైలి వివిధ భంగులలో విశిష్టముగ నుండును కాని యీ వైవిధ్యము కేవలము బాహ్యమే. పద్యములు రచించినను, నాటకములు సంతరించినను, వ్యాసములు వ్యంగ్యరచనలు వ్రాసినను భావన ఒకతీరుగనే యుండును. ఇతని యోజన యొక్క విస్తృతి పరిమితము. వ్యక్తిగతమైన తీవ్రాహంభావమే ఇతని రచనలన్నిటి వెనుక దాగుడుమూతలాడును. నిజమైన కళాకారునివలె తాను బాహ్య ప్రపంచములో లీనమగుట కితడు సమ్మతింపడు. బాహ్య ప్రపంచమే ఇతనిలో అంతరీనము కావలెనని యితని తత్త్వము. తనకున్న భావావేశమును నిరుపమాన ప్రతిభతో వ్యక్తము చేయగల నేర్పు ఇతనికి గలదు. కాని యీ నేర్పు తన కజ్ఞాతమైన అనుభవ దూరమైన భావముల ప్రకాశనమున క్షీణించును. అందుచేతనే పద్ధతియును భావములు నితని కవిత్వమున ఆమ్రేడితము లగుచుండును. కవిత్వమున ఎక్కడ చూచినను నైరాశ్యము, దుఃఖము, విద్వేషము వ్యక్త

మగును. నాటి జీవితములోని అన్ని రంగములను తీవ్రముగ ద్వేషించి, బైరన్ విప్లవముయొక్క విధ్వంసక శక్తులను వ్యక్తీకరించిన ఏకైక కవియైనాడు. ఇతని రచనలలో విప్లవముయొక్క సృజనాత్మక శక్తిగాని, సాంఘిక చైతన్యముగాని, ఆదర్శభావ ప్రకోపనము గాని కన్పించవు. ఇతడు స్వేచ్ఛకు నిజమైన బానిసయైనాడు. ఇతని దృష్టిలో స్వేచ్ఛయే వ్యక్తిత్వము. తానే తన జీవితమునకు చట్టము. నాటి పద్ధతులను నిరసించుటయే ఇతని లక్ష్యము. క్రొత్త నమ్మకములను, క్రొత్త ఆశయములను, క్రొత్త పద్ధతులను వెదకు ప్రయత్నమితడు చేయలేదు. ఈతనికృషిఫలిత మొక విధమైన శూన్యత్వ ప్రతిష్ఠాపనము ఇతని పద్యములు చాలవరకు క్షణికోద్రేకములో విచ్చలవిడిగా శీఘ్రముగ రచించినవే. ఈ సంతరణశక్తి శ్లాఘనీయమే కాని యీతని అభిరుచి పరిమిత మగుటచేతను, తన్నుతాను విమర్శించుకొను శక్తి ఇతనిలో శూన్యమగుటచేతను ఉత్తమ కళాలక్షణము లిందు లోపించినవని చెప్పవచ్చును. ఇతనియొక్క ఉత్తమ రచనలు కూడ ఒక్కొకచోట విరసమైన విషయ విజ్ఞాపనముతో విసుగుపుట్టించును. కాని యిట్టి దోషము లెన్నియున్నను ఆత్మీయతా ప్రభావ మీతని కవిత్వమును విద్యుద్వంతముగ జేసినది. వ్యక్తిగా అతని నెంత విద్వేషించినను, రచనలలో నితని వ్యక్తిత్వమునకు చదువరి జోహారు చేయును. తన ఆత్మకును నాటి యుగతత్త్వమునకును గల సన్నిహితసంబంధమే రచనలలో నీతని ప్రభావమునకు హేతువు. యుగధర్మముల కింతగా లోనై, సమకాలీన ప్రజలపై కవులపై నింత ప్రభావము చూపి, కవిత్వములో తన ఆత్మీయత నింత శక్తివంతముగ చూపి, విప్లవ లక్షణములలో నిట్లు కలసిపోయిన వేరొక ఆంగ్లకవి లేకపోవుటచే 'రొమాంటిక్' కవులలో బైరన్ విశిష్టవ్యక్తిత్వము కలవాడయ్యెను.

షెల్లీకూడ బైరన్ వలె సమకాలీన సమాజమును, సంప్రదాయమును నిరసించెను. నాటిరాజులపైనను, ప్రభుత్వముపైనను, మత ప్రవక్తలపైనను, వివాహ విధానములపైనను, ఆర్థిక పద్ధతులపైనను దాడి వెడలెను. బాల్యములో విపరీత వర్తనములచే 'పిచ్చి షెల్లీ'యని పేరు గాంచెను. ఇతని కప్పటి పద్ధతులను చూచుచో ఒకమారు లజ్జయు, వేరొకమారు తీవ్రాసంతృప్తియు కల్గెడివి. విద్యార్థి దశలో బహుళగ్రంథపఠనము చేసి ప్రాచీనుల రచనలలో తన సౌందర్యతృష్ణను తీర్చికొనెను. పదునెనిమిదవ శతాబ్ది తత్త్వవేత్తల రచనలలో మతవిషయకముగ ననేక సంశయములు పుట్టినను మానవజాతి భావివికాసమును సుందర దృశ్యములను ఇతడు వానిలో చూచెను. తరువాత రాజకీయరంగమును పునరుద్ధరించుటకు అవిరళముగ ప్రణాళికలు వేసి ప్రయత్నించెను. సమాజమును సరిదిద్దుటకు సంతతము కలలుగనెను. ఈర్ష్యలు, అసూయలు, ద్వేషములతో నిండియున్న యీ నికృష్ట ప్రపంచమును విడనాడి దివ్యతేజోమయమైన మరియొక మంగళలోకమును దర్శింప యత్నించెను. వీనియన్నిటికిని ప్రేమయే చక్కని చుక్కాని యని నిశ్చయించెను. అమరమగు ప్రేమవాహినియే జీవితమును పునీతము చేయుననియు, ప్రేమయే జీవిత పరమార్థమనియు నితనిదృఢనమ్మకము. ఈనమ్మకమే యీతని కవిత్వమునకు సౌందర్యమును శక్తిని చేకూర్చినవి. సార్వజనీనమైన యీనిగూఢ భావప్రకర్షయే ఇతని నాంగ్లసాహిత్యములోని ఉత్తమోత్తమ కవులలో నొకనిగ జేసినది. కాని సాహితీ రసికులు కొందరు షెలీ కవిత్వములో ఐహికముగ మానవసహజమైన ప్రకృష్టభావనలు కానరావందురు. ఇదియే ఇతని కవిత్వములోని నీరసత్వము. ఇతని భావనాలోకములో స్వాప్నికజగత్తులోవలె అతిలోకమనోహరమైన సుందర ఛాయా స్వరూపములే కాని సహజాకృతులను సామాన్యమానవులును కానరారు. ఇతని విశిష్టతయంతయు ఛందోగమనమునందును అగోచరాధ్యాత్మిక విషయ వ్యక్తీకరణమునందును కేంద్రీకృతము. ప్రతి పద్యమునందును షెల్లీ ప్రత్యక్షమై తన భావాంబర వీధులలోనికి మనలను తోడ్కొనిపోవును. సహజమగు సంగీతగతులలో నితని ప్రతిపద్యమొక పాటవలె వీనులలో కరగిపోవును. కవితలో మానవుని సహజభావనలగు ప్రేమ స్వాతంత్ర్యములకు అజరామరమగు వాక్కునిచ్చిన ఏకైకాంగ్లకవి షెల్లీ.

బైరన్, షెల్లీల కాలములోనే వారిరువురికన్న వయస్సులో చిన్నవాడయ్యు విశేషముగ కీర్తి నార్జించి షేక్స్పియరు తరువాత షేక్స్పియరంతటివాడని పేరు మోసిన యువకవి కీట్సు. మొదటిలో వైద్యవిద్యనభ్యసించి వృత్తియందు ప్రవేశించినను తదుపరి తన మనస్సు సాహిత్యమందు లగ్నమై యున్నదని గుర్తించి దానిని విడనాడెను. పదునెనిమిదవ

యేట పఠించిన 'పెయిరీ క్వీన్' తనలోని కవిత్వ శక్తులను పులకింపజేసెను. దానితో ఇతని భావనా వియత్పథమునుండి కవితాపగలు వెలువడ జొచ్చినవి. 'ఛాప్‌మన్' యొక్క అనువాదములో చదివిన 'ఇలియడ్', 'ఒడిస్సీ' లు ఇతనిపై చూపిన ప్రభావ మమేయము. యౌవన ప్రాదుర్భావమున నున్న బాలకవిని ఆ రెండు గ్రంథములు మంత్రముగ్ధుని చేసినవి. వానిలోని కల్పనాసౌందర్యమున నీతని సహజశక్తులు విజృంభించినవి. మొదటి రచనలలో భావనలోను శైలిలోను పరిపూర్ణత్వసిద్ధి లేకపోయినను కళానుగుణమైన సుందర పదగుంభనము, సుకుమారార్థస్ఫూర్తి సుస్పష్టము. తరువాతి రచనలలో ఆదర్శసౌందర్యమునకై ఆత్మయొక్క అన్వేషణమును రమణీయముగ వర్ణించెను. ఇతని ప్రథమ ప్రయత్నములు, కథాకథనమున సుసంఘటితములుగా నుండకపోయినను, విషయబాహుళ్యముచే వర్ణనలు పేలవములైనను, శైలి ఆద్యంతము మొక్కతీరున నుండకపోయినను, భావగాంభీర్యముచేతను లలిత పద ప్రయోగవిన్యాసముచేతను జయప్రదములైనవనియే చెప్పవచ్చును. కాని వీనిపై సమకాలికులు కొందరు తీవ్రవిమర్శలు చేయుటచే కీట్సు ఒక విధముగ నిరుత్సాహపడినను తరువాత అతని యంతరంగమున కలిగిన భావసంఘర్షణా ఫలితముగ సుందరములగు రచనల కవి మార్గదర్శకము లయ్యెను. సోదరుని మృతియు తన అనారోగ్యము కూడ ఈ రచనలకు భావావేశ నేపథ్యమును సమకూర్చినవి. ప్రమాదకరమగు రోగకారణమున తాను మనసార ప్రేమించిన కన్యను పరిణయమాడలేకపోయెను. ఫలించని ప్రేమ (లౌకికదృష్టిలో) ఇతని భావనలను చక్కగా మలచినది. ప్రేమయే త్రికాలాబాధితమైన సత్యముగ తన కనుల యెదుట సాక్షాత్కరించినది. ఆ సందర్శనమున జగమంతయు శృంగారమయముగా కన్పించెను. ఇతని ప్రేమలో ఇంద్రియ పరితృప్తి పూర్ణముగా పొందలేక పోవుటచే తానూహించిన ప్రతిభావనలోను ఆ యింద్రియ లోలత్వము అంతర్లీన మయ్యెను. ఇతని కవిత్వములో ప్రకృతి కూడ ఇంద్రియసుఖమయముగా కన్పట్టును. వర్డ్స్‌వర్త్ కవిత్వములోని తత్త్వస్ఫూర్తి ఇతనిలో మృగ్యము. కవిత్వము సాంఘిక మత రాజకీయ వేదాంత సిద్ధాంతములకు వాహిని వలె నుండరాదని కీట్సు నమ్మెను. సౌందర్యమే సత్యమనియు, సత్యమే సౌందర్యమనియు ఇతని తత్త్వము. సృష్టిలోని ప్రతి వస్తువులోను సౌందర్యమును సందర్శించు అతిలోకమైన భావుకత ఇతని కవిత్వమును మధురరసస్యందినిగా నొనర్చినది. పద ప్రయోగమున నింతటి మాధుర్యమును లాలిత్యమును మరి యేకవియు సాధించలేదు. ప్రతి పదమున నొక సుందర చిత్రమును చూపి చదువరిని మంత్రముగ్ధునిగ చేయు శిల్పకళాప్రజ్ఞ ఇతని సొమ్ము. షెల్లీ బైరన్‌లవలె ఇతనిపై విప్లవము ప్రభావము చూపలేదు. ఇతడు తన సంఘము నెదిరింపలేదు. పద్ధతుల నిరసింపలేదు. వీని యన్నింటికిని అతీతమైన సౌందర్యలోకమున విహరించి వయసున పిన్నయయ్యు తన భావనలను అపురూపమైన భావుకతతో మేళవించి సహృదయ హృదయంగమమైన సుందర కవిత్వమును సృష్టించెను. 'రొమాంటిక్' కవులలో 'రొమాంటిక్' తత్త్వము పరిపూర్ణముగ గల కవి కీట్సు ఒక్కడే. ఇతని రచనలలో పదునెనిమిదవ శతాబ్ది సాహిత్య చిహ్నములు మచ్చుకైనను కానరావు. ఇతని విశిష్టత యంతయు శైలియందు సుస్పష్టము. గ్రీకు పండితుల భావరీతుల నన్నిటిని స్వంతము చేసికొని వానికి తన వ్యక్తిత్వముచే రంగులు దిద్ది సుందరముగు శైలిలో వ్యక్తపరచి సాహిత్యమున నొక నందన వనమును సృష్టించినాడు. ఇతని కవిత్వము సమకాలీన జీవితమునకు దూరముగనుండి విప్లవముయొక్క సాంఘికాధ్యాత్మికోద్యమములపై ఉబలాటము క్షీణించుటను వ్యక్తీకరించును. ఈ కారణముచేతనే తోటి కవులందరికన్న ముందే అసువులు విడిచినను వారందరికన్న ఎక్కువగా ఆయుగాంతమున గూడ దివ్యముగు కాంతితో ప్రకాశించుచున్నాడు.

మొత్తముపై 'రొమాంటిక్' కవులందరును విభిన్నమైన వ్యక్తిత్వములు ప్రదర్శించి భిన్న మార్గములలో కవిత్వము చెప్పినను యుగప్రభావమునకు తప్పనిసరిగ లోనై నిశితమైన నియమములకు దాసులుగాక సర్వోన్మార్గములకును ధారాశుద్ధికిని ఉత్తమ స్థానమిచ్చి స్వేచ్ఛాస్వాతంత్ర్యములకు తమ కవితలో వాక్కునిచ్చి సాహిత్యమున నొక నూతనోద్యమమును పరిపోషించి తరువాతివా రందరకును స్వతంత్ర ఛందోమార్గములు, సహజభావప్రకాశనము, ప్రకృతిప్రేమ, భావావేశత్వము, అధ్యాత్మికత, శిల్పదృష్టి మున్నగు ననేక విషయములలో మార్గదర్శకులై ఆంగ్ల భాషా సాహిత్యముల కొక క్రొత్త వెలుగు నిచ్చిరి.

# అనుబంధము

రమణశ్రీ

'చారీ బాబూ! నన్ను తీసుకెళ్లి ఏ లోయలసానువుల్లోనో పారేయండి! ప్రకృతి చేలాంచలాలు ముసురుతోన్న, బాహాటమైన ప్రకృతి సౌందర్యం లోనుంచి జారుతూ కేకతూ కన్నుమూస్తాను. ఈ బాధ భరించలేను'—అన్నాను.

నా ఆవేదనలోనుంచి కవిత్వం పుడుతోంది. కళ్లలో తుపానులా భయం రేగుతోంది! భరించలేని తపన. ఆపాదమస్తకం కుదిపి పారేస్తోన్న చలిజ్వరం.

రోగపిశాచి కనుగ్రుడ్డులా మండుతోంది విద్యుద్దీపం. ఆ మంటలో మృత్యుజ్వాల...వెలుగు భరించలేక కళ్లుమూసుకొన్నాను.

అసలీ రోగరూపంలో కెందుకొచ్చాను? ఈ పర్వతాల్లో నేగాని మరెక్కడా ఉద్యోగం దొరకదా?...ఈ ఉద్యోగానికి నేను చేసిన పెద్దప్రయత్నమేమిలేదు. పిలిచి పిల్లనిచ్చిన సామెతలో కొట్టుకొంటున్నా......

నువ్వేనా మహా ఊడబొడిచిన వ్యక్తివి?...... శాస్త్రి, జ్వాలా నరసింహం నీవెరిగున్న వాళ్లెంతమంది పనిచేయడంలేదు? అసలుద్యోగాలే దొరకని ఇలాంటి సమయంలో......

శాస్త్రి, జ్వాలా నరసింహం మాచ్‌ఖండ్ మహా శిఖరాలమీదనుంచి కేలెత్తి కేకలేశారు! డుడుమా జలపాతం స్వప్నసౌందర్యం నా కళ్లముందు మువ్వలుకట్టి తాండవించింది!

స్నేహితుల ఆహ్వానానికి తబ్బిబ్బులై, ఱెక్కలుకట్టుక వాలాను.

ఏవో జ్వరాలు, బాధలూ రాకండాఉంటారా మానవులు?...అంతా చిత్రమైంది నా ప్రవృత్తి. ఏ చిన్నకష్టమొచ్చినా అది మృత్యుసమున్ముఖమైందని నే తల్లడిల్లిపోతాను.

'చారీబాబు! నాకిక్కడ చావు రాసిపెట్టుందంటావా?' చారీబాబు ముఖంలో అవ్యక్తంగా నవ్వునీడ పడింది 'పిచ్చివాడా! ఈమాత్రందానికే ఇంత బేజారెత్తిపోతావా? రేపొద్దుట, ఇంజనీరు గారికోసం జీపు వెడుతోంది. అందులో నిన్ను విశాఖపట్నం చేర్చేబాధ్యత నాది.'

అన్న హామీ చేత్తోపుచ్చుకొని, హృదయంలో దాచుకొన్నాను.

'ఇప్పుడెంతయింది?'

నా గొంతులో నీరసం మాటాడనివ్వడంలేదు. ఐనా గొంతు పెగుల్చుకొంటున్నాను.

'ఏడుగంటలయింది' చారీబాబు టైముచూసి చెప్పాడు. 'బార్లీ ఎక్కువగా తాగమన్నాడు డాక్టరు! మందు వేసుకొంటావా?'

చారీబాబు గొంతులో ఆప్యాయత నేనెలా పుణికిపుచ్చుకోను? అతని ఋణం నేనెలా తీర్చుకోను? స్నేహానికి ప్రాణం ఇవ్వాలంటాడు చారీ.

ఇక్కడీ స్వల్పకాలంలో నా బతుకున అంత ప్రముఖపాత్ర వహిస్తాడనుకోలేదు శాస్త్రి, జ్వాలా నరసింహంమీద ఆశలు పెట్టుకొచ్చిన నాకీ చారీబాబు సుహృదయం ఈ కొండకోనల్లో, ప్రకృతి నిట్టూర్చిన గాడ్పులో దొరుకుతుందనుకోలేదు.

గాలి బాగా రావాలనికాబోలు కిటికీ ఱెక్కలు తెరిచాడు. దట్టంగా చీకటి! పగలంతా ఏ కొండ గుహల్లోనో తలదాచుకొని రాత్రి బయటపడినట్టు—గాలి రివ్వున వీస్తోంది...ఆపాదమస్తకం కప్పుకొన్న శాలువలో నా చలికి చావులేదు! మరింత బిగుసుకుపోసాగాను.

ఈ పుణ్యమంతా చారీదే...ఈ గది, శాలువ సమస్తం నేనుపశమన పొందుతోన్న సుకృతం అంతా చారీదే!......

ఈ గది నానుకొన్న వరండాలో, దయ్యాలుండేవని, ఎవరూ ఈ పక్కకి రావడం మానేశారు.

చారీబాబు దయ్యాల దురాక్రమణను, జయించి, ఇక్కడ కాపురం పెట్టాడు.

'అంతా నన్ను చూసి భయపడుతున్నారల్లే వుంది! నే నేం పాపం చేశాను? నవ్వుతూ పేలుతూ తిరుగుతోన్నప్పుడు చుట్టూ మసిరే స్నేహితులంతా, ఇప్పు డేమూల దాక్కొన్నారు? నా జ్వరం చూసి......'

చారీబాబుమాత్రం అన్నింటికీ తెగించినమనిషి! రెండు సంవత్సరాలు కొండప్రాంతంలో చక్కని అనుభవం గడించాడు. అప్పుడప్పుడు దొరగారితో వేటకుకూడా వెళ్ళాలనంటున్నాడు. 'త్వరలో నిన్ను కూడా తీసుకొనివెడతా' అనే ఆశమాత్రం నాజ్వరంతో మిగిలిపోయింది!

మొదట ఉద్యోగంలో ప్రవేశించేముందు ఆఫీసులో టయింకీపరుగా సంతకాలు చేయించుకొంటూ, మస్తరువేస్తోన్న ఈ చారీబాబు తెలుగువాడేనని భ్రమసిపోయాను. కాని తెలుగు రాదని, బెంగాలీబాబు అని తెలియడంతోనే, నాగుండెల్నెవరో అదాటుగా నొక్కినట్టయింది!

'ఈ అడవిలో నాలాంటి మొండివాళ్లు జీవించవలసిందేగాని, నీలాంటి సుకుమారు లుండడానికి కాదు. ఈపాటి ఉద్యోగం నీ కక్కడే దొరక్కపోయిందా?'

చారీబాబు మందలింపుకి నాకు దుఃఖంఆగలేదు. పైగా అతనిమాటలు హిందీలో, నా చెవుల్ని దూసుకుపోతున్నాయ్. 'నువ్వు విశాఖనించి డుడుమా బస్ సర్వీసులో తెల్లవారకండా కారెక్కి ఎలాప్రయాణం చేసి వచ్చావు?...ఈ భయంకరమైన అడవిలో ఏదో దాక్కొని వుందని చూడ్డానికి...ఆ మహాజలపాతం వైపు కళ్లెత్తిచూడు. దీనిప్రభావం, మీ తెలుగుదేశమంతా, వెలుగులో ముంచెత్తిపోతుంది! ఈప్రకృతిలో ఇంత భయంకరమైన బాహాటమైన సౌందర్యం నిండి, నాలుగు దిక్కులు పరచుకొని యోగతపస్సులో ఉందని, నీవు ఊహామాత్రంగా నేనా ఆలోచించావా?

నేనెప్పుడూ ఆలోచించి, హృదయాన్ని చించుకోలేకనే, పరుగెత్తుకొచ్చాను. జనపదాలకి దూరంగా పారిపోయి, 'అంనం' మహాయోగ తపస్సులో, క్రూరజంతువుల క్రూరత్వాన్ని నిశ్శబ్ద భయానకతని సముద్రంలో బడబానలమల్లే కడుపులో పెట్టుకొని పాలించుకొంటోంది అడివిని...ఈ అడవి చూడాలనే తహతహే ఇంతదూరం లాక్కొచ్చింది!

తొలిసారి ప్రయాణానుభవంలో, నామీద నాకే జాలి, భయం, అసహ్యం, ఆవృతి — అనేక భావాలతో ప్రకంపించిపోయాను.

చారీబాబు కిటికీముందు కూచుని సిగరెట్టు పొగ వదులుతున్నాడు. అతనికళ్లు ఎవరికోసమో, వెదకుతున్నట్టు, నిరీక్షిస్తున్నట్టు కనిపిస్తున్నయ్!....

నాప్రయాణం పూర్తిగా నాకళ్ళకు కట్టుకొంటున్నాను......శృంగవరపుకోటనించి నిర్జనత్వం, అరణ్యం ఆరంభమైంది. అక్కణ్ణుంచి కారు వేగం కూడా శృతిమించిపోయింది!

కొండలు పిల్లగంతు లేసుకుంటూ ముందుకు పోతున్నయ్! చెట్లు చేమలూ, మహావేగాన్ని తట్టుకోలేక, వెనక్కి విరిగి పడిపోతున్నయ్!...ఆ వేగంలో ఏదిశగా కొట్టుకపోతున్నానో అర్థంకాలేదు.

దూరపు కొండల నునుపు, ఆకాశంలో తల దాచుకోవాలనుకొనే శిఖరాలూ, వెర్రిగా పిచ్చిగా పెంచుకొన్న జడల్లా చెట్లూ చేమలూ తప్ప అడవిలో ఏముంటుందనుకొన్నాను.

ఊహలకి రూపందిద్దుతూ ప్రత్యక్షమైంది అడివి. కారులో కూచున్నంతసేపూ, నాఅవస్థ నా ఎదురుగా కూచున్న ఆ అమ్మాయి ముసిముసినవ్వుల్లో మూలిగింది!

కారులోంచి తలబయట పెట్టి చూద్దామనుకుంటే ఝంఝామారుత వేగానికి, తల ఎగిరి ఎక్కడ పడిపోతుందో? మళ్ళీ తల వెదికి తెచ్చుకోడానికి కారాపుచేసి పరుగెత్తాలి!

'మీ రెప్పుడూ ఇదివరలో ప్రయాణం చేయలేదా?' అంది ఆ అమ్మాయి. ఆవిడ కిప్పుడిది ఎన్నో అనుభవమో?...'నే నిదివర కెప్పుడూ ఈ ప్రాంతాలకి రాలేదండి!' అన్నాను. ఆవిడ పక్క కూచున్న ముసలాయన, తండ్రి కాబోలు నావైపు అదోలా చూశాడు.

ఆ అమ్మాయి ఏ అరమరికా లేకండా నిశ్చింతగా మాట్లాడసాగింది. అక్కడి ప్రకృతి విషయం...జాలాపుట్ లో దిగిపోతారంట! ఎక్కడో, ఏదో పల్లెటూరు చెప్పింది అక్కణ్ణుంచి, విశాఖ వచ్చినట్టు — మాచ్

ఖండ్ నుంచి, జాలాపుట్ కేంద్రానికి మారినట్టు — ఏదో సోదిలా చెప్పుకుపోతోంది...

గాలి ఆవిడ మాటల్ని ఏ అనంతదూరతీరాలకో మోసుకుపోతోంది. ఛటుక్కున ఒకచోట ఆగి:

'మీదే గ్రామం?' అంది.

'మీకు తెలీదులెండి! గజపతిరాజపురం అని మారుమూల కుగ్రామం' అన్నాను.

ఇంత మంచి పేరు ఏ మహాపట్నానికో ఉంటుంది కాని...అనే ఆవిడ భ్రమని వమ్ముచేస్తూ...

'ఓహో! అదా?' అంది—

ఏదో తెలుసున్నట్టే!... మా ఊరి పేరు చుట్టు పక్కల ఉండే పట్నాలవారికే తెలియదు...

'మీ రీ పర్వత వాతావరణాని కలవాటుపడ్డవా రల్లే వుంది.' నా ప్రశ్న అందుకొని సమాధానంగా చిరునవ్వు చిందింది. చెక్కిళ్ళు నవ్వినపుడు పడే గుంటల్లో హాసరసం నిలవచేసుకొని...వయసు ఇరవై దాటవనిపించింది. కళ్ళలో చురుకుదనం, సంభాషణలో చాతుర్యం ఇట్టే ఆకడుతుంది!

కాస్త అలసటనిపించినపుడల్లా, ఆ ముఖంలో దేనికోసమో వెదికేవాణ్ణి...చిక్కని చిరునవ్వు పెదవుల్నించి రెక్కలు విప్పుకొని ఎగిరిపోయేది...

అలా ఎంతసేపు ప్రయాణం చేశామో...

సూర్యుడు నడినెత్తిన పొడుస్తున్నాడు.

'అదే అరకులోయ' అంది...'మల్బరీ చెట్లు, పట్టు పరిశ్రమ బాగా సాగుతుంది'...

బస్సు ఓ అరగంటన్నా ఆగుతుందిక్కడ.

ప్రకృతి బహిస్సౌందర్యవిశాలమైనదేదో, మానవుల దృక్పథాని కందనిచోట, దాని, ఏకాంత తపస్సు...

'ఆ చెట్టు క్రిందికి రండి! మీరు భోజనం తెచ్చుకొన్నారా? లేకపోతే, మాతో చేయండి'

నేను తెచ్చుకొన్న ఆహార పదార్థాలతో చెట్టు క్రిందికి చేరాను.

'కారు వెళ్ళిపోతుందేమో?'

'మాచ్‌ఖండ్‌కి నడిచి వెడుదురుగాని లెండి!...' అంది నవ్వుతూ ... ముసలాయన లేకండా చూచి, 'ఏమండీ? వారు మీ నాన్నగారేనా?' అన్నా.

'ఆ సందేహం మీ కెందుకొచ్చింది?...' నవ్వబోయింది. విచారం మేఘంలా నవ్వు చుట్టూ కప్పేసింది.

'కాదు! నేను వారితో ఉంటున్నా ... అంటే పోషణలో ... ఆయన నీడకింద తలదాచుకొంటున్నా...'

నే నాశ్చర్యంతో క్రిందుమీదయ్యాను. ఐనా లోకానికి విరుద్ధం కాదుగా!

'ఇప్పుడు మీకు బాగా అర్థమైందా?...ఒక కంపెనీ విశాఖనించి, మాచ్‌ఖండ్‌కి సామాన్లు చేరవేయడానికి లారీలు కంట్రాక్టు చేసింది. ఆ కాంట్రాక్టు బేసిస్‌కి ఆయనగారిని మేనేజరుగా వేశారు కంపెనీ వారు అదీ సంగతి...'

'ఐతే మీరూ మాచ్‌ఖండ్‌కి రాకూడదూ?' అన్నాను. 'ఇప్పట్లో రావడం పడదులెండి! వస్తే, మీ ఆఫీసులో తప్పకండా కలుసుకొంటా'

ఆవిడ ఏ విషయంలోనూ ముసుగట్టుకొన్నట్టు లేదు. స్వేచ్ఛాహృదయంతో అన్ని విషయాలు తరచి తరచి మాట్లాడింది.

నేనే అంత చొరవగా చొచ్చుకుపోవడానికి సంకోచించాను.

కారు హారన్ మోగేసరికి ఉలిక్కిపడి లేచాను. వెళ్లి కారులో కూలబడ్డాం. చక్రాలు ముందుకు దొర్లాయి.

భావప్రపంచం ఒక్కసారి గుభిల్లున క్రిందికి దూకినట్టుంది అరకులోయ—ఎన్నాళ్లనించీ పర్వతాలిలా పతితమైన హృదయంలా, రాయిగా శపింపబడ్డ రాతి సత్వంలా కొండవాగుల్ని కన్నీళ్లు చారికల్లా కట్టించుకొన్నయ్!...ప్రతిక్షణం ఒక మహామాయ ఉత్పన్నమౌతుంది ... ఉదయ సంధ్యా కిరణాల సువర్ణానికి కొండలు గీటురాళ్లు ... సౌందర్యమంతా ఋతువుల్నించి తలదాచుకొందీ లోయలో...

'మీకు భావనాశక్తీ కావ్యశక్తీ ఉంటే, ఈ ఉదయసంధ్యల ప్రశాంతవాతావరణంలో, ఏకాంతంగా కూచుని, ఎటువంటి మహాకావ్యాలు వ్రాయగలరో, ఆలోచించండి!'

ఆవిడ అంటోంది—

'నీ చుట్టూ ఉన్న ఈ మహాప్రకృతిని చూచి ఆనందించలేని నీ బ్రతుకెందుకు?' అన్న సరోవరకవి వసుద్స్నవస్తుమాటలు స్మృతిపథంలో మెరవకుండా ఎవరూ ఉండలేరు.

ఈ జన్మకీ జీవితానికీ ఇది చాలనిపించింది. లేలేతగా మబ్బుపట్టిన ఆకాశంలో నా హృదయం ఉవ్వెత్తుగా పొంగింది. ఎటుచూసినా పచ్చని వాతావరణం కళ్లలో కాలుష్యాన్ని ప్రక్షాళిస్తున్నది.

అడవి గర్జిస్తోన్న క్రూరసత్వాల కంఠాల్లోనుంచి వినిపిస్తోన్న భయంకరధ్వానం, ఎప్పుడైనా దారి కడ్డంగా రావచ్చు...

'పగ లేమంత భయం లేదండి! చిరుతలూ, సివంగులూ...' అవేమంత పెద్ద లెక్కలోకి రానట్టు చెప్పుకుపోతోంది.

అడివి విశేషాలు, జరిగినవీ, జరగాలిసినవి ఎవరి గొంతులోనుంచేనా వినిపిస్తాయేమోనని చూశాను. కాని, వాటి సంగతే పట్టించుకొన్నట్టు కనిపించలేదెవరూ...

ఐనా, ఈ అరణ్యసుందరి సౌందర్యాన్ని కాపాడ్డంకోసమేమో అనిపించింది క్రూరత్వం—

కొండల్ని పగలగొట్టి, ఇంజన్లునడిపించి, ఇక్కడీ బాట ఏర్పాటేచిన కార్మికుల రుధిర స్వేదధార ఇంకిపోయిన గుండెలమీదనుంచి పరుగెడుతోన్న కారు...

'ఇంత రోడ్డు ఎప్పుడు వేశారండీ?' అని ఎవరేనా, అంటే 'అబ్బే ఏవుంది?' అని చప్పరించి, 'డబ్బండి...డబ్బు...కొన్ని కోట్ల రూపాయలీరోడ్డు మీద పారబోశారు' అంటారు.

ఎక్కడో వాళ్లు దిగిపోయారు.

చల్లని మంచినీళ్లెక్కడేనా దొరుకుతాయేమోనని చూశాను. దాహంతో నోరెండుకుపోవాలే గాని...గుక్కెడు నీళ్లు దొరకవు.

'వే టు ది ఫారెస్ట్' అనే దయ్యాలంతలేసి ఇంగ్లీషు అక్షరాల, బోర్డు రాక్షసిలా వేలెత్తి చూపిస్తోంది మహామృత్యుమార్గానికి!...

ఫారెస్టు ఆఫీసులు చాలా కనిపించాయి దారిపొడుగునా...ఫస్ట్ గ్లేడ్, సెకండ్ గ్లేడ్...ఇవన్నీ అడవిలోకి చూపించేదారులు ... తిరిగి రోడ్డుమీదికి లాక్కొచ్చి వదిలే దారులు...

ఇదీ స్పష్టాస్పష్టంగా మనోఫలకంమీద గోచరమౌతున్న ప్రయాణానుభవం...

మాచ్ ఖండ్‌లో అడుగుపెట్టేటప్పటికి, ఐదు దాటుతోంది!

కమ్ముకుతోన్న అరుణరక్తంతో తడిసిపోతున్న కొండలు...ఆయాసంగా వగరుస్తోన్న ప్రకృతి... చీకటిముసుగు పైకి లాక్కోవడానికి ప్రయత్నిస్తోన్న ఆకాశకాంత...ముసుగును తొక్కి పట్టుకొంటోన్న పర్వతాలు...లోయలోకి దిగజారిపోతోన్న కాంతివసనాలని, సిగ్గుతో పైకి చేదుకొంటోన్న ప్రకృతిశ్రీ..

ఒళ్లంతా కుదుపు, గాలివేగం...ఎండాకొండనక చేసిన ప్రయాణం .... నరాల్లో ఘనీభవించిన రక్తం ... వీటన్నిటినించీ విముక్తి పొందడానికి... విశ్రాంతి కావాలి!

ఆఫీసులో నా ముఖం కనిపించింది చిందరవందరగా...రెమింగ్‌టన్ మీదనుంచు టకటక వేళ్ళని నృత్యం చేయిస్తున్న శాస్త్రి, నావైపు అదోలా చూశాడు. ఆఫీసు ఎకవుంట్లలోనుంచి, జ్వాలా నరసింహం తలెత్తిచూశాడు.

దాంతో పదిజతలకళ్లూ పలకరించాయి.

'మాతో భాగం పంచుకోవచ్చిన జంతువువా?' అన్నట్టు.

'ఈ అడవిలో చావుబ్రతుకుసమస్య అల్లాడిపోతున్న మాతో ఈ పోరాటానికి నీవూ భాగస్వామివా?'

'మానవప్రపంచానికి, నూటయాభయిరెండు వందలమైళ్లు దూరంలో ప్రకృతిని సాధించి, విశ్వోపకృతికోసం విద్యుత్తు పుట్టించేందుకిక్కడ యోగతపస్సులో ఉన్నాం.'

అన్నికళ్లలోనుంచీ అన్ని ప్రశ్నలూ, ఓదార్పులూ, నిట్టూర్పులూ వెలువడుతున్నయ్!...

నా కళ్లు తిరుగుతున్నయ్! నిలబడలేకపోయాను. శాస్త్రి వచ్చి చేయిపట్టుకొన్నాడు.

'కళ్లు తిరుగుతున్నాయా?'

'ఊహుఁ'

'మీ అమ్మా నాన్నా రానిచ్చారా?....పాపం! నౌకరీ...రానీకేం చేస్తారు?'

'మీరంతా ఉన్నారుగా! మీతోపాటే నేనూ'

'నీకు ఆర్డరు టైపు చేసింది నేనే!'

గర్వం కళ్ళలో తొణికిసలాడింది.

'మా అమ్మా నాన్నా వెళ్ళొద్దని పోరుపెట్టారు. మీరు కొండశిఖరంమీదనుంచి వేసిన కేక వినిపించింది. నేను రెక్కలు గట్టుకవాలాను. దారిలో, ఏం అడవిరా భగవాన్! అనిపించింది.'

'ఇక చాలించు. అక్కణ్ణుంచి మహాప్రయాణం చేసి వచ్చిన ప్రతీవాడికి పిచ్చెక్కుతుంది అందులో సందేహం లేదు'—అని.

'ఇంజనీరుకీ, ఆఫీసరుకి ముహం చూపించావా?' అన్నాడు.

'ఇంకా లేదు. ఇప్పుడు నేనెవర్నీ చూడను!... బడలిక—అలసట పోయేలా నిద్రపోవాలి!'—

అఫీషియల్ క్వార్టర్సులోకి దారితీశాం.

అప్పుడే చారీబాబు ముఖం చిరునవ్వుతో సాక్షాత్కరించింది!

## 2

'ఏమిటిది? దీర్ఘాలోచనలో పడ్డట్టున్నావు? నిద్రపోతున్నావా?' చారీబాబు కుర్చీనించి లేచొచ్చి, నేను నెమరువేసుకొంటున్న స్మృతిపథాల్లోనుంచి మేల్కొల్పుతూ అన్నాడు...

'ఇక్కడి కెలా వచ్చిపడిందీ...జ్ఞాపకంలో....'

'నిద్రపో! అనవసరంగా మెదడుకి పని చెప్పకు.' ప్లాస్కులో బార్లీ, గ్లూకోజు కలిపి ఇచ్చాడు.

'మీ కనవసరంగా శ్రమిస్తున్నాను. మీ ఋణం...'

నా కళ్ళలో నీరసంగా కృతజ్ఞత మెరిసింది...

బార్లీ తాగడానికి వెగటనిపించింది. ఐనా తప్పదు.

'ప్రొద్దుట్నుంచీ, నారింజకోసం తిరిగాను... ఎక్కడా...'

'చారీబాబు! నిన్నీ అడవిలో, నా కోసమే దేవుడు పడేశాడు.' ఆపత్కాలంలో, ఆర్తహృదయం నించి వెలువడేమాటలే నా నోటినించి వెలువడుతున్నయ్... కాని, చారీబాబుకి అవి వినడమంటే, ఇష్టంలేదు. అది మానవధర్మంలో శతాంశమాత్రమే? నేను చేయగల్గిం దేవుంది? నీ కన్నీళ్ళు తుడవడాన్ని ప్రయత్నిస్తున్నా, అంటాడు చారి.

నే నొకందుకొస్తే, ఒకందుకయింది...

శాస్త్రి, జ్వాలా నరసింహం అనుకుంటూ రనుకొని వచ్చినవాణ్ణి ఈ చారీబాబు కళ్ళలో మెదిలిపోతున్నా.

'ఏదో ఉద్యోగం చేసుకోనీకండా, ఈ జ్వరం నీ మీద నే పగసాధించాలీ? నువ్వొచ్చి నెలదాటిందా? కర్మ...'

అంతా కర్మసిద్ధాంతంమీద ఆధారపడి వున్న మానవత, అభ్యుదయం ఏం సాధించగలుగుతుంది?...

చారీబాబు ముఖంమీద చిరునవ్వునీడలో ఒదిగి నిలుచున్న మధురస్మృతి ప్రణయం మెరుగుల్తో నాలో కలవరించింది—

'మా వాళ్ళకి ఉత్తరం రాయాలి! కార్డుంటే తెచ్చిపెట్టు చారీబాబూ!'

నా పరిస్థితి కాస్త ఇంటికి తెలియజేదామని...

'రేపెలాగైనా, విశాఖ పోతాంగా! అక్కడ ఎలా వీలైతే, అలా చేసుకోవచ్చు. అసలే కంగారుపడి పరిగెత్తుకొస్తారు...బోలెడంత ఖర్చు...ఎవడు తిన్నది?'—

'నా జీవితంమీద ఇంత ప్రభావం ప్రసరిస్తుందనుకోలేను నీ పేరు! చారీబాబు అనే నీ పేరు నా శిలాహృదయంమీద చెక్కుకోడానికి ప్రయత్నిస్తాను.'

'కొంచెంసేపు విశ్రాంతి తీసుకో! నేను వెళ్తున్నా.' బయటేదో చప్పుడైంది. చారీబాబు చీకట్లో కలిసిపోయాడు. తర్వాత నల్లనినీడ అతన్ని వెంటబెట్టుకొని పోయింది. ఆ నీడలో ఏ కోరిక దాక్కుందో ఎవరికీ అర్థంకాదు!...

ఒక నిట్టూర్పు విడిచాను...నీ హృదయం మహోన్నతమైన శిఖరమే కావచ్చు. కాని చారీబాబు! అది నేనెక్కలేను. జారి అగాధపాతాళానికి కుంగిపోతాను! దానిచుట్టూ తాండవిస్తున్న చీకటిలోమాత్రం నీకెన్ని దూషణలు వినిపిస్తున్నయ్యో! వాటన్నింటినీ సిగ్గుతో, చిదరతో పెదవులమీదినవ్వుతో తుడిచిపారేస్తావు... నీతో వెళ్ళిపోయిననీడలో నీకేమిటి, చీకటిసమస్య?...

* * *

మెదడు మళ్లీ గతంమీద పొదగడం మొదలు పెట్టింది—వెళ్లి వెళ్లడంతోనే, రూపాయలూ పైసలు కూడికలూ తీసి వేతలూ ముందు పారేశారు! వాటితోనే సాయంకాలం వరకూ. శాస్త్రి రెమింగ్టన్ మీద అక్షరనృత్యం చేస్తూ భావసౌందర్యం ప్రసరించేవాడు. జ్వాలా నరసింహం, డిస్పాచింగ్ క్లర్కు...ఎంత పోష్షింగయినా అతని చేతిమీదనుంచి జారుకోవాలిసిందే!

ఇక చారీబాబు! కొండజాతివాళ్లతో పని... వాళ్ళచేత త్రవ్వించడం, పూడ్పించడం ..అమట్టిలోనించే ఏదో పుట్టించడం—

ఇక్కడేవో గనులున్నాయట...పరీక్షించడానికొస్తుంటారు అనేవాడు చారీ!...

'నిన్ను డుడుమా జలపాతం దగ్గరికి తీసికెడతా'.. అనేవాడు—ఈక్షణంవరకూ పడలేదు. ఇక్కడికి రెండుక్రోసుల దూరమన్నా వుంటుంది...దారంతా అడివి...ఒక్కడూ బిక్కుబిక్కుమంటూ వెళ్లితే, ఇంక తిరిగిరాడు. ఏ క్రూరజంతువూ మీద పడనక్కర్లేదు. భయంలోనించే, అతనిమృత్యువు పుడుతుంది—

ఒకఆదివారం అంతా కలిసి వెళ్లాలనుకొన్నాం. దొరగారిదగ్గర తుపాకి పుచ్చుకొంటానన్నాడు చారీబాబు!... ఇంతలోనే, వన్నిపిశాచం ఆవహిస్తుందనుకోలేదు!...

ఆఫీసరుకూడా నాపట్ల ఏదో అవ్యాజమైన అనురాగంతో ఉండడం నన్ను మరింత ఉత్తేజపరిచింది. 'పాపం అనారోగ్యంగా ఉండి, ఈ వాతావరణాన్ని తట్టుకోగలవా?' అని జాలిపడ్డారు. నాకు తప్పలేదన్నాను. తల్లీ, దండ్రీ అనుభవిస్తున్న నికృష్టదశ, నా యీవుద్యోగం—అంతా ఒక అంతర్నాటకంలా వుంది, నాకు!—'మా యింట్లోవాళ్లు ఆనందబాష్పాలు రాల్చారు నా యీఉద్యోగానికి' అని సిగ్గుపడుతూ అన్నాను అందరితో—

ఒకరోజు నా గదిలో కూర్చుని, నా అదృష్టాన్ని పొగుడుకొనే పదాలు వెదుక్కొంటూంటే, నాకళ్లు ఆనందంతో నృత్యంచేశాయి. ఏ అదృశ్యహస్తాలో నాకళ్లు తుడవడానికి కాబోలు చూచుకుంటున్నాయి—

నాగొంతులో సుడితిరుగుతోన్న సంగీతం ఒక్కసారి పెల్లుబికింది. అప్రయత్నంగా ఏకొండసానువుల్లో ఒరసుకొని ప్రవహించసాగింది...

అప్పుడే తనగదిలోకి వెళ్లిపోబోతున్న చారీబాబు నాదగ్గరకొచ్చి కూలబడిపోయాడు.

'హిందీపాట లేవయినా ఉంటే పాడండి! నామత్తు వదిలిపోతుంది' అన్నాడు ఇంగ్లీషులో...అతనేంమాట్లాడినా, ఇంగ్లీషులో, పోతే హిందీలో—

'మీ కంఠంలో నినదిస్తున్న గానం. సైగల్ని హృదయపూర్వకంగా ఆహ్వానిస్తుంది'—

బైజూబావరాలో సంగీతం విని తన్మయం పొందాడు.

'మీరు గాయకులని నాకు తెలీదే? సంగీతానికి నాప్రాణం ధారపోస్తా —ఆఖరికి పెద్దపులి గాండ్రింపులోనూ నాకు సంగీతం వినిపిస్తుంది'

'పెద్దపులి అరుపా? ఐతే ఏపలకమీదన్నా గాజుపెంకుతో చేసే, గరగరశబ్దం మీరు వినగలరా?'

'అబ్బ...ఒక్కక్షణం భరించలేను ఆగరగర...?

మీరు సాహిత్యంలో, ఏవేనా, చదువుకొన్నారా? కనీసం అభిరుచన్నా...?

'అలాంటి దేంలేదు...'

'మీరు శరత్ పేరు విన్నారా? మీ బెంగాలీ తత్త్వాన్ని కాచివడపోసిన మహారచయిత...విశ్వజనీనమైన ఆ తత్త్వం మా తెలుగులో చదివి, తెలుగువాడే అనుకొంటారు'—

'ఆయన పేరు విన్నానుగాని, ఏంచదవలేదు! అంత గొప్పవాడా?

ఆశ్చర్యపోయాను. తను దేశీయసాహిత్యంలో రచయితయొక్క స్థానంగుర్తించని, జాతీయుడొక డున్నాడంటే...

ఏం ఎందుకుండరూ? అందరికీ కావాలేమిటి? ఈపాటి మీమాంసలూ, సాహితీప్రశంసలు...అనిపించింది...

ఏజాతి తన జానపదసాహిత్యం, సమకాలీన సాహిత్య ప్రభావంలో భాసిస్తున్న వ్యక్తుల్ని గుర్తించలేదో, దాని కభ్యుదయ మెక్కడ సాధ్యం?...

పెద్దపులిగాండ్రింపులో సంగీతం వింటోన్న చారీబాబు, పలకమీద గరగర వినలేక నరాలు కుంచించుకు పోతాయి. ఐనా, శరత్తుని చదవేలేదంటాడు... దానిమీద అభిరుచి లేదన్నట్టూరుకొన్నాడు. ఆ అభిరుచి ఎందుకు లేదో ఎవరిని ప్రశ్నించడం?...

అప్పట్నుంచీ, చారీబాబుకీ నాకూ పరిచయం పెన వేసుకుపోయింది. సంసారసారం తెలిసినమనిషి... చిత్రమైనవ్యక్తి...ఇతనితో నాకేమిటి స్నేహం?... అతని వ్యభిచారం చూస్తే తల పగిలిపోతుంది...ఎంత పేపూరాదహించే కోర్కెతో వేదనపడేవ్యక్తి

'మీరెందుకు పెళ్ళిచేసుకోలేదు?' ఒకనాటి నా ప్రశ్న...

'బజారులో అన్నివస్తువుల్లాగే అదీ దొరుకుతుంది కనక' అంటూ పకపక నవ్వేశాడు.

తర్వాత బాధగా నిట్టూరుస్తూ, 'నాకెవర్నీ లేరనుకోకు! మాదేశంలో నాకోసం. ఒకప్రియురాలు ఎప్పుడూ ఎదురుచూస్తూ వుంటుంది! ఎప్పుడువెళ్ళినా నాపాదధూళి తీసుకొంటుంది. ఏదోసంసారం చేసుకొంటోంది భర్త తాగుబోతు...అనుష్య ఒక మగపిల్లవాణ్ణి కన్నటు తెలిసింది. పిల్లవాడికి ఆశీస్సులతో కొంతడబ్బుకూడా పంపాను...డబ్బుకిబ్బందిగా వున్నపుడు ఉత్తరం రాస్తుంది. మా అగర్వాల్ ద్వారా... ఆయనకే డబ్బుపంపిస్తా...అగర్వాలంటే మా వేలువిడిచిన మావయ్య...ఆవిడ భర్తకీ నాకూ చిన్నప్పట్నుంచీ ప్రబలశత్రుత్వం...ఆ పగ ఏనాటికైనా సాధించాలి! ఐతే, నాప్రియురాలి ఆటంకం కన్నీళ్లు, మాంగల్యం...'

'ఆవిడ వ్యభిచరించిందా నీతో?' అన్నాను. కళ్లలోకి సూటిగా చూస్తూ.

ముఖం చిట్లించుకుని, అసహ్యంగా చూస్తూ, 'ఛీ! నీకిదా అర్థమైంది? నీనోట ఆమాటవాలని ఎలా అనిపించింది?' అన్నాడు.

నాతల క్రుంగిపోయింది, అలా భావించుకొన్నందుకు—భర్తవున్నా తనతో ప్రేమనటిస్తుందట! అక్కడికివెళితే ఒక్కరోజన్నా గడపకండా గడప దాటనివ్వదట?...ఏమిటీమాటలు? అది వ్యభిచారం కాదంటాడు...తన ప్రియురాలు మహాపతివ్రత!

నాముఖంమీదికి నవ్వు తోసుకొచ్చి, చారీబాబుని చూడగా నల్లగా మాడిపోయింది?

'అతనితో స్నేహం ప్రమాదంసుమా!' శాస్త్రి, జ్వాలానరసింహం హెచ్చరికచేశారు! నాకు తెలుసు—అందులో స్వార్థం—ఐనా, నేనంత అజాగ్రత్తగాలేను! నావల్ల చారీబాబుకైతే, వ్యయమే గాని, లాభంలేదు!

## 3

పదిరోజులకి ఉత్తరం వచ్చింది ఇంటిదగ్గర్నుంచి. ఏ పరిస్థితిలో ఇల్లు వదిలిపెట్టి వచ్చిందీ అప్పటిగ్గాని నాకు గుర్తురాలేదు. పండక్కీయింటికొచ్చిన అక్కయ్యమెడలో వస్తువులు తాకట్టుపెట్టి నన్ను సాగనంపారు ఉద్యోగానికి!

ఈ ఉత్తరం చూసేసరికి హృదయం చివుక్కుమనిపోయింది. మానవుల్లో ఇంత నీచానికొడిగట్టే దానవత్వముందా? అనిపించింది. నాన్న వ్యంగ్యంగా వ్రాసినవాక్యం కొట్టొచ్చినట్టు, ఉత్తరాన్నంతినీ దహిస్తున్న ఆర్థికాభ్యర్ధనతో నిండిపోయింది జీతాలు రావడాని కింకా ఇరవైరోజులు పనిచేయాలి! ఈలోపులో అక్కడి పరిస్థితులు తారుమారయితే...

నేనా ఉత్తరం పట్టుకొని, శాస్త్రి, జ్వాలానరసింహాలదగ్గరికి పరుగెత్తాను. మాబాధని నిందించడం తప్ప వాళ్ళు చేయగల్గిందేమీ లేకపోయింది! పెదవి విరిచారు! 'ఏభయి రూపాయలు సహాయం చేయమంటే మాటలా?'...

వాళ్లముందు ఒక్కక్షణం నిలదొక్కుకోలేకపోయాను. డబ్బుండికూడా ఇవ్వలేని దుస్థితిలో వున్నారు? పాపం!...'ఇవ్వడికిస్తే, తిరిగివ్వకపోతే, మనగతేంకావాలి?' అన్న ధోరణిలో వున్నారు.

ఎవరేనా, ఈ సమయంలో ఏభయి రూపాయలిస్తే, కొండశిఖరంనుంచి, లోయలోకి పతనమైపోవడానికి సిద్ధంగా వున్నా. ఏకాంతంలో ప్రత్యక్షమై భగవంతుడు, 'ఏభయి రూపాయలు తీసుకొని, నీ అవసరం గడుపుకో! నేను ప్రత్యక్షమైనట్టు ఎవరికీ చెప్పకు' అని చెప్పినా, నేను సిద్ధంగా ఉన్నాను కాని, ఏది? ఏదీ జరగదు!

నాకాలెక్కడికి సాగిపోయిందో. ఊరు కొద్దిగా దూరంలో కనిపిస్తోంది. పడమటికొండపై అందాలు!...

స్వర్ణారుణ కిరణాలు కరిగించిన, కొన్ని కోట్ల రూపాయల విలువచేసే, బంగారం కొండలకి పూత పెడుతోంది. మిగిలింది పర్వతాంచలాల్నించి జారి లోయల్లో ప్రవహిస్తోంది! ఈ దృశ్యాలు చూసి, ఆకలి దప్పుల్లేకుండా ఆనందించవచ్చు...

నేనలాగే ఓ పెద్దగుట్టమీద నిలిచి చూస్తున్నా. ఆకాశంలో తలదూర్చి మేఘాల్ని చీల్చి పాకేస్తోన్న చెట్లూ, కొండకొమ్మలూ తప్ప వేటితో స్నేహం?...

నాదృష్టికి కిందుగా, అల్లంత దూరంలో రెండు విగ్రహాలు కనిపించాయి నన్ను రమ్మని సైగ చేస్తూ...

దూరంనించే పోల్చుకొన్నా చారీ బాబని... పక్కనున్న నల్లని నిగనిగలాడే విగ్రహం ఎవరో దగ్గరకు చేరితే నేగాని తెలిసింది కాదు!....

ఆ నల్లని విగ్రహం చూపులు నల్లగా, నాకళ్లని ఢీకొని తూలిపడ్డాయి, కొండవాగు తరంగాల్లో—

ఆ విగ్రహం అక్కడుండడానికి సంకోచం చాను—

'ఈ విగ్రహం ఎవరూ?'

'ఇక్కడే కొండవాళ్లు...కాని వాళ్ల నీచ త్వమూ మొరటుదనం లేని మనిషి...ఆ కళ్లలో నీకేం సౌందర్యం కనిపించడం లేదూ? అందులోనుంచే, హృదయాన్ని తొంగిచూడవచ్చు......' అన్నాడు చారీ బాబు

'పూసల పేరులూ, అవీ లేవేం? కొండదానిలా లేనే లేదు. ఏదో శాపం అనుభవిస్తున్న...'

'నిజం...నీవు చెప్పింది అక్షరాలా నిజం... ఒక దేవకన్య అనుకో'

ఈ విగ్రహానికి సిగ్గు బిడియా లున్నాయా? దయాదాక్షిణ్యం కడుపులో ప్రేవులూ అంటూ ఉన్నాయా?...నిగనిగ లాడుతూన్న వళ్లు....పుష్టిగా ప్రతీ అవయవం చుట్టూ సుడి తిరుగుతోన్న యౌవనం. కొండల్లోనుంచి పుట్టిన సెలయేరులాంటి కన్య...... హాయిగా ఆహ్వానిస్తోన్న వయసు...

'అందరిలాంటిది కాదు కాదీ రీటా...రీటా అంటే నేను పెట్టిన పేరు......ప్రభుత్వ వాజెం చూసే సరికి, వీళ్ల కళ్లు మిలమిల మెరిసిపోతాయి. దాంతో ఏది కావలసినా ధారపోస్తారు'

'నాకు పులిగోళ్లు కావాలి తెచ్చి పెట్టమను— ఎంత కావలిస్తే అంతా ఇస్తా' నా చేతిలో కాగితం రెపరెపలాడింది—

'ఏమిటా ఉత్తరం?'

చారీబాబు దృష్టిలో పడిన ఈ ఉత్తరం మోక్షం పొందుతుందేమో? చిన్నప్పట్నుంచీ ఎరిగున్న శాస్త్రీవాళ్ళే పెంచిపెద్దచేసినప్పుడే చారీబాబు నా అనాథత్వానికి ఏభయి రూపాయలు ధారపోసి కన్నీళ్లు తుడుస్తాడా?... ఈ ఉత్తరంలో నా పరువు ప్రతిష్ఠలకి భంగం కలిగే, వ్యవహారం మేమైనా ఉంటే ఎంత సిగ్గు?—

ఉత్తరం చదివి అర్థం చెప్పాను.

'ఇక్కడ క్షేమంగా ఉన్నానని, అబద్ధం చెప్పడం నా కిష్టం లేదు. నీవు వెళ్ళినప్పట్నుంచీ మరింత ఇంట్లో అసౌకర్యం—అక్కయ్యని తీసుకెళ్లడానికి బావ వచ్చాడు. దాని వంటిమీద నగల కోసం నిర్బంధించాడట! తమ్ముడికి ఉద్యోగం జీతం రాగానే పంపిస్తా దూరంగా ఉంచకూ అంటే— ఆ నగలు, నీ ప్రయాణానికి తాకట్టు పెట్టాను నాకు తెలియక పోలేదు. అక్కా బావ వెళ్ళిపో కొన్నారు. బావ అనరాని మాటల్తో అక్కని గాయపరిచాడు. ఆత్మాభిమానంగల అక్కయ్య నాతిలో పడబోతే పట్టుకొన్నాం. మన ఇల్లంతా నరకంగా మారిపోయింది. బావ ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయాడు. అక్కయ్య నగల్ని విడిపించడానికి ఏభయి రూపాయిలు కావాలి!'—

'ఐతే, డబ్బెందుకు మనియార్డరు చేయలేదు నీవింకా?' అన్నాడు చారీబాబు

'నా దగ్గరుంటే ఇంతసేపా?'

'నీ దగ్గర లేకపోతే, నా దగ్గరుంటుంది. అడగడానికి అభిమానపడ్డావా?'

'మీ దేశం పంపా లనుకొన్నావని...?'

అతని అభిమానానికి దుఃఖం పొర్లుకొచ్చింది.

'దేశం మాట దేవుడెరుగును. మీ అక్కయ్య ఆత్మాభిమానంతో దహించుకుపోతోంటే, దహనం చల్లార్చుకోడానికి నీళ్లదగ్గిరికి పరుగెత్తింది...మీ బావ నైచ్యానికి ఆహుతి కావలసిందేనా? అలా ఎప్పటికీ జరగకూడదు.'

మా మాటల్లో అర్థభావాల్ని గ్రహించేందుకు రీటా కళ్లు ప్రయత్నిస్తున్నయ్! ఆ కళ్లలో, మిలమిల మెరిసే తారకలు, ప్రకృతిని మండించినపుడు రెండు అగ్నికణాలు, ఆ నేత్రాలలో స్థానం ఏర్పరచుకొన్నాయా అన్నట్టు—

నాలో తీరిపోయిన సమస్యానందం...రీటాలో సౌందర్యాన్ని అన్వేషించేందుకు పూనుకొంది.

'బయల్దేర. ఒకవేళ పోస్టాఫీసు తెరిచివుంటే కట్టేద్దాం' అని చారీబాబు లేచాడు. రీటా కూడా ఏదో ఆలోచిస్తున్నదల్లా లేచింది. నేను ఉక్కిరిబిక్కిరిగా లేచాను.

నిస్వార్థమైన ఒక మానవ హృదయం నాలో గంటలు కొడుతోంది

రీటా తీస్తోన్న పరుగులో రమిస్తోన్న వాంఛాతృప్తమైన సౌందర్యం, ఏదో చెప్పలేని, ఆకర్షణ— నన్ను ముందుకు లాక్కుపోతోంది. చారీబాబు నేనూ, ఒకడుగు వెనకముందులో ఉన్నాం.

అడవిలా పెరిగిన అందం, నునుపుదేరిన కొండల బరువు మోస్తోన్న వక్షస్సూ, నరాల్లో ప్రవహిస్తున్న వాంఛాతృప్తమైన రక్తం—వీటన్నింటితో ఇదో స్త్రీ! పర్వతకన్య—

చారీబాబుతో రీటాని గురించి, ఏదో అశ్లీల భావం స్ఫురించేలా వ్యంగ్యంగా అనాలనిపించింది. కానీ అతనికీ, రీటాకీ ఏదో ఆంతరంగికం—అవినాభావం—ఉన్నట్టుంది. అంటే బాధపడవచ్చు. 'అని ఊరుకొన్నాను. అతనావిషయం ఎత్తనూ లేదు

కొండకన్యలు మెల్లగా చీకటిముసుగు పైకి లాక్కుంటున్నాయి. చేతిలో చిన్న బ్యాటరీ లైటుతో చారీ ముందు దారితీస్తున్నాడు.

'అర్ధరాత్రి చీకటిపడ్డాక, ఇక్కడికి రావడానికి పడేభయం ఎంత మహోదాత్తపరిమాణంలో వుంటుందో నీవూహించగలవా? అలాంటి భయం అనుభవించి, రక్తం నరాల్లో గడ్డకట్టుకపోయి, ఏ లోయలోనో కూలిపోవాలిసిందేగాని, తిరిగి రాడు'—

'ఊళ్లో కప్పుడప్పుడు పెద్దపులులొస్తాయటగా! నిజమేనా?'

'నిజమే! ఎప్పుడేనా వస్తాయి—కిందటి సంవత్సరం ఒక చిరుతపులీ, పులీ వచ్చినట్టు చెప్పుకొన్నారు. వస్తే ప్రాణాలతో తిరిగి వెళ్ళవుగా!' అన్నాడు చారీబాబు.

దారిలో మరింక విశేషమైన సంభాషణేం జరగలేదు—

బజారు కొచ్చేశాం—

విద్యుత్కాంతిలో మునిగిపోయిన ఊరు, దూరానికెలా కనిపిస్తుందో?......విద్యుచ్ఛక్తిని మంచినీళ్లప్రాయంగా వాడ్డమే ఇక్కడ పని—

కిళ్ళీ కొట్టు దగ్గర సోడా తాగడానికి ఆగాం, పోస్టాఫీసుకు నడవమన్నాడు చారీబాబు.

## 4

చారీబాబు అందించిన చేబదులుతో, ఒక సమస్య ఎత్తుకుపోయింది. అక్కయ్య ఇంకెప్పుడూ నూతిలో పడానికి పరుగెత్తదని ధైర్యంగా గుండెలమీద చేయి వేసుకొన్నాను. స్త్రీ స్వభావంలోని చపలత్వం ఆదినించీ గమనిస్తూనే వస్తోంది ప్రపంచం. ఏదీ లేకపోతే, కన్నీళ్ళతో పురుషహృదయంలోని కార్కశ్యాన్ని కరిగించేశక్తి వుంది!...

చారీబాబు, ఆర్థిక సహకారం, శాస్త్రి, జ్వాలా నరసింహాలలో చైతన్యం రేకెత్తించింది. 'మేమూ చేద్దుంగాని...' అని నసిగేశారు. వాళ్లలో సజాతీయత దెబ్బతింది. నా కన్నీళ్లు తుడవడానికి ప్రయత్నించారు. విజాతిధ్రువాలు ఆకర్షించుకొంటాయిగాని అయస్కాంతంలో సజాతిని ఆకర్షించుకోవుగా! ఆధర్మం మానవత్వంలోనూ ప్రసరించాలి కాబోలు!

వర్ధిష్ణులైన మాయిద్దరిస్నేహం అందరికీ కన్నెర్రగా వుంది. చారీతో అంత విపరీతమైన స్నేహం మంచిదికాదుసుమా! అనే సలహాలు హెచ్చరికలూ వినిపించసాగినయ్. ఐనా, నేనంత పట్టించుకోలేదు. అది ఈర్ష్యతాలూకు భావస్వరూపం అనుకున్నాను.

'అతనితో స్నేహం చేసిన వాళ్లు రోగాలూరొచ్చులతో పతితమైపోయారు' అని ఉదాహరణలు చూపించారు.

ఒకరోజు దెయ్యాలవిషయం ప్రస్తావనవచ్చింది. 'మనతో కాపురం చేస్తున్నాయి అవికూడా. అదృశ్యహస్తాలతో అవీ మిషన్లూ అవీ తిప్పుతున్నయ్! అర్ధరాత్రి భయంకరంగా చేసేచప్పుళ్లు వాటిప్రభావమే!' అన్నారు.

'ఇదంతా ఎక్కడపుట్టిందీ?' అనడిగాను.

'చారీబాబు క్వార్టర్సులో! అతని మకాం అక్కడే!' వెంటనే చారీదగ్గరికి పరుగెత్తాను.

'ఏమిటిదే? ఆఫీసులో దెయ్యాల సంగతి?' అన్నాను. సమాధానం చిరునవ్వుతో సరిపుచ్చాడు.

'ఈ మహారణ్యంలో దెయ్యాలూ, దేవతలూ లేకుండా ఉంటాయా? విస్మృత్తుతో ఇవీకూడా పుడుతున్నట్టుంది. మానవులకీ వాటికీ, ఏదో గొప్ప సంబంధం వుండివుంటుంది. నా గది పక్క వసారాలో పెద్ద బండ రాళ్లు గుభిల్లున పడుతూండేవి. అంతా వికావికలై పారిపోయారు. వాటి విషయం నేనంతు తేల్చుకోవాలని అక్కడే వున్నాను. అంతగా కావాలనుకుంటే ఒక రాత్రి రా!'

'ఐతే స్వార్థపరులైన మానవులు కల్పించిన కల్పన కాదంటావా?'

'అది నీ ఊహాకే...!'

ఎవళ్లికవసరమైతే వాళ్లు సృష్టించుకుంటారు. అసలీ దెయ్యాల్ని చూసి నిర్ధారించిందెవరు? అంతా కృతకం, నటన...అనిపిస్తుంది.

తర్వాత ఆ ప్రసంగం మళ్ళీ ఎత్తలేదు.

ఎలాంటి అరమరికలూ లేకుండా స్నేహం సాగుతోంది. ఆఫీసు వ్యవహారాలు సక్రమంగా ఉన్నాయి. ఇంటిదగ్గర్నుంచి ఉత్తరంకూడా వచ్చింది. క్షేమ సమాచారాలతో...కష్టసమయంలో సహాయం చేసిన వారీబాబుకి కృతజ్ఞతాపూర్వకవందనాలు సమర్పించింది మా కుటుంబం—

అప్పుడప్పుడు కొండలమీదికి షికారు వెడుతూ నేనున్నా ఒంటిగా. రోజూ ఏదో కొత్తందం గోచరించేది. గాలిపాడే, సన్నని ఆకుల్ని కోసుకుపోతూన్న ఈలసంగీతం—రంగురంగుల పక్షులు... పేరూ ఊరూ లేని మొక్కలూ చెట్లూ...

విశ్రబ్దసౌందర్యాన్ని గాలిద్వారా పీలుస్తూ కొండవాగుల జలజలల్లో హృదయం కొట్టుకుపోతూ వుంటే చూస్తూ ఎన్ని సంవత్సరాలైనా గడపవచ్చు. ఈ సౌందర్యం వయసెంత?...దీన్నెవ్వాళ్లిలా అనుభవించవచ్చు? అనుభవించేకొలందీ మెరుగులుతీరే ముగ్ధ మోహనస్వరూపం ప్రకృతిది...

మేఘాలు కమ్ముకొన్నప్పుడొక అందం, వర్షించబోయేముందు ఒకఅందం. క్షణక్షణ పరిణామలావణ్యాల విన్యాసరీతిలో విస్తరిస్తున్న ఈ ప్రకృతి, మేఘకేశాల్ని వర్షస్నానానంతరం ఆరబోసుకొనేటప్పుడు నగ్నంగా వున్నపుడు సిగ్గుతో పులకరెత్తి కట్టుకునే పచ్చిక పట్టుచీరల్నీ, చీకటి ముసుగుల్నీ, వెన్నెల ముసుగుల్నీ పర్యాలోచిస్తూ, లీనమైపోవాలనిపిస్తుంది, ప్రకృతి అమృతహృదయంలో—

అహహా నహహా, రీటాకూడా ఏకొండలమీదో దూకుతూ లేస్తూ కనిపించింది. రకరకాలుగా ప్రసరిస్తున్న దృగంతాలకి ప్రతిస్పందనాలలో ప్రత్యక్షమయ్యేది!

నిశ్చల మైనవాగు.

ఆవాగుముందు నేను. పర్వతపాదంలో నించుని చూస్తున్నాను. నీరు దోసిలిలో పోసుకొని పుక్కిలించాను. చప్పగా జిగురుగా వున్నాయి. చూడ్డానికి స్ఫటికంలా వున్నాయి నీళ్లు. దాహంకూడా వేస్తోంది. కొద్దిగా దోసిట్లో పోసుకు తాగాను మళ్లీ దోసిట్లో పోసుకు తాగబోతున్నా. పైనుంచి గబుక్కున ఓ కంకరరాయి పడింది దోసిట్లో. పారబోసి పైకి చూశాను. రీటా!...పైనుంచి, సైగ చేస్తోంది తాగొద్దని.

నా దాహం మరింత ఎక్కువయ్యింది.

గుట్టలమీదనుంచి జారుతూ, కేరుతూ దిగి వచ్చింది. నా వైపు ఆశ్చర్యక్రోధాలతో మింగేలా చూసింది.

'వారీబాబు నీతో రాలేదా?'

రాలేదంది వాళ్లభాషలో. ఆభాష నాకర్థమై చావలేదు. ఏదో వాగుతూపోతోంది. కళ్ళలో మిలమిల మాత్రం కనిపించిందంతే! వంటిమీదిరంగు చేతికంటుకొనేంత నల్లగావుంది నిగనిగ మెరుస్తూ...

కనురెప్పకాలంలో వాగులోకి దూకింది జలజల చేపపిల్లలా ఈతకొడుతూ నన్నూ రమ్మనమని చేయెత్తింది!... నేను ఒడ్డునకూచుని, ఈ జలక్రీడాదృశ్యం చూస్తున్నాను.

బంతిలా తేలిపోతూ, చిలకలా పడుకొని లేలేత నీరెండ కిరణాల్ని వంటిమీద తిరిమిణీ పెట్టుకొంటూ జలకన్యలా జలకమాడుతోంది. ఆదృశ్యం చూచి భావోద్రేకంతో చలించాను.

గట్టుమీదికొచ్చి. నీరోడ్చుకొంటూ తల ఆరబెట్టుకొంటూ నిలబడింది. వేకువరాణి వంటినిండా తూలుతోన్న మంచుబిందువుల్లా, రీటా శరీరంమీంచి రేసతోన్న నీటిబిందువులు చిందుతున్నాయి. ఎప్పుడు పడితే, అప్పుడు నీళ్ళలో మునిగిపోతుంది రీటా. వంటి నంటి పెట్టుకొన్న తెల్లని గుడ్డ శరీరసౌందర్యాన్ని

వహగడుతోంది!...వంటమీాఎ వంపులూ సొంపులూ నిష్కపటంగా, సహజాతి సహజంగా ప్రదర్శిస్తూ...

రీటా! నీవో ప్రకృతి దేవతవి...వసంత కాలంలో వసంతకన్యవి......చలికి ముడుచుకుపోయే శిశిర కాంతవి...హేమంత కాలంలో కొత్త బట్టలు ధరించడానికి ఆకులు రాల్చే వనదేవతవి—ఈ వసంతంలో నీవూ నీ హృదయం ఎంతో బాగా చివురించి, మకరందంతో నిండిన నల్లగలువలా వున్నావు!...

అప్పట్నుంచీ రీటా మీాద భావరేఖ కుదురుకోనారంభించింది.

ఈ జాతివాళ్లు సంతలు చేసుకోనేందుకు చుట్టుపక్కల్నుంచి, చాలామంది వస్తూ ఉంటారు! పుట్టలోనుంచి బైటబడ్డ పాముల్లా...మందు మూలికలు, తేనె, మైనం ఇంకా అడవి సరుకులు, తెచ్చి అమ్ముకుంటారు. అందులో రీటా ఇక్కడే స్థిరపడిపోయిందంటాడు చారీబాబు.

ఒకరాత్రి ఏంతోచక చారీబాబుగదికివెళ్లి తలుపు తట్టాను. తలుపు తీసేవుందేమో, లోపలికి తోసుకుపోయింది తల్పు!

నూరు కొవ్వొత్తి దీపాలకాంతిలో...

కళ్లు బయర్లుకమ్మాయి. నల్లనిరాతివిగ్రహం చుట్టూ పెనవేసుకొన్న చారీబాబు

నాగొంతులో నాకే తెలియని అవ్యక్తమైన నాదం. ఈసమయంలో చీకటి నామీాద ఎందుకువిరుచు పడిపోదూ? ఒక్కసారి జలజలవర్షంకురిసి, ఈ గదిని ప్రక్షాళించి పారేయదూ?

నేను వెనక్కు తగ్గిపోయాను.

నిశ్చేష్టుడైన చారి ఏదో గొణిగాడు 'ఎందుకొచ్చావిక్కడికి? వెంటనే పో!'—

గదినిండా చీకటి...

ఇదా నీపని చారీబాబు! ఇప్పుడు నీకృత్రిమ స్వభావం అర్థమైంది! నీవు సృష్టించినవేనా? ఈ దయ్యాలూ, భూతాలు! ఉత్తముడి వనుకొన్నాను - ఇంత నీచత్వానికి దాసుడివైపోతావనుకోలేదు. నీ స్వార్థరహితమైన హృదయం చుట్టూ పెనవేసుకొన్న చీకటిలో, నువ్వు చేస్తోన్నపని...ఇంత దిగజారిపోతావనుకోలేదు....'ప్రభుత్వానాణెం చూపిస్తే చాలు. వాళ్లు ఏది పడితే అది చ్చేస్తారు' అన్నదానికిదా అర్థం... రీటా శపింపబడిన దేవతేమో అని భ్రమించాను. పిశాచ ప్రకృతి సాక్షాత్కరించింది—

నీదేశంలో నిన్నెప్పుడూ ఆహ్వానించే ప్రియురాలు మేఘాల్నీ మంచునీ చలినీ కప్పుకొని దుఃఖిస్తోంది చూడు!

ఆ చీకటిలో ఎలా గది చేరుకొన్నానో, ఏ వెలుగు దారి చూపించిందో నాకు తెలీలేదు. నాగదిలో కాముహృదయంలా భయంకరంగా దీపంవెలుగుతోంది. చారీబాబు సృష్టించిన దెయ్యంలా చీకటి బయట వెంపరలాడుతోంది!

# 5

తర్వాత చారీబాబు ముఖం చూచినప్పుడల్లా భయంకరమైన అనుభవం విషనాగంలా నన్ను కాటువేసేది రెండు రోజులు ముభావంగా గడిచిపోయింది.

'అతన్నెందుకనుమానిస్తున్నావ్? నిస్వార్థమైన అతని స్నేహమకరందాన్ని ఆస్వాదించలేవా? ఏభయిరూపాయలు త్యాగం చేశాడు. నీకష్టం గట్టెక్కించాడు. నూతిలో పడబోయే అక్కయ్యని కాపాడాడు. అతడూ మానవుడే! ఆకలిదప్పులూ, ద్వేషం స్వార్థం రజస్తమోగుణాలూ అన్నీ ఉన్నాయి అతనిలో... కామప్రేరితమైన అతని గుణంలో స్నేహం వర్జనీయవస్తువుకాదు' నాఅంతరాత్మ సమాధానపడజొచ్చింది.

నా కంటె గుప్పెడు పొడుగు...చిక్కని మనసు...గతజన్మలో ఏదో పారేసుకొని, ఈ జన్మలో వెదుక్కునేందుకొచ్చిన నేత్రాలూ...చిత్రంగా స్నేహాన్ని కలుపుకొనే వ్యక్తి...చారీబాబు...అతనెప్పుడూ నా కళ్లలో ప్రతిఫలించాలి!

తర్వాత రీటా ఎప్పుడేనా కనిపిస్తే, జాలిగా నా కళ్లలోకి చూసేది. జ్వరంవచ్చి ప్రస్తుతం నేనిప్పుడిలా పడిపోయాను. నాకు జ్వరమని తెలియగానే చారీబాబు పరుగెత్తుకొచ్చాడు.

'నీవు మొన్న వాగులో నీళ్లు తాగావా?' అనడిగాడు.

'దాహం పట్టలేక తాగాను. పుడిసెడు...స్ఫటికంలా వున్నాయని నీళ్లు...వాటికేం?...'

'అదే కోపముంచింది. ఇక్కడ కొన్ని వాగుల్లో మలేరియా అలలై ప్రవహిస్తోంది ఇంకా నయం...మరో రెండు గుక్కిళ్లు తాగావుకాదు'

నా కళ్లు చెమర్చాయి. స్పృహలేకండా వున్నాను. చారీబాబుని చూసి, లేనిసత్తువ తెచ్చుకొని మాట్లాడాను.

అరగంటసేపు నా దగ్గర కూచుని మాట్లాడి, 'విశ్రాంతి తీసుకో వెళ్లివస్తా' అని వెళ్లిపోయాడు.

నేను గతాన్ని నెమరేసుకుంటూ మగతలో మునిగిపోయాను. మగతలో పీడకలలు...

అక్కయ్యని బావ ఇంట్లోనుంచి గెంటేసినట్టు—ఎవరో తెచ్చి పెట్టుకొన్నట్టు—

మనియార్డరు పోస్టుమేన్ కాజేసినట్టు—

ఇల్లంతా అల్లకల్లోలంగా వున్నట్టు—

అక్కయ్య నూతిలో పడ్డానికి పరుగెత్తుతూన్నట్టు—రకరకాల భావోద్వేగాలతో మెదడు కుతకుత ఉడుకెత్తిపోయింది. తల బరువుగా ఏ లోయల్లోకో క్రుంగిపోతోంది. వంటినిండా పారగట్టిన నీరసం, నరనరాల వ్యాపించిన జ్వరం, మూలుగుతోన్న మూలుగు, గదినిండా వ్యాపించిన రోగవాయువు.—నాకు మృత్యువు చేరువలో ఉందా? అనిపించింది.

చావొచ్చి మీద పడుతుందేమో, అని భ్రమించి పోతాను. అప్పటికేపదకొండో ఐవుంటుంది—

గడియారం ముల్లు గుండెల్లో గుచ్చుకొంటున్నాయి. నా కళ్లు జ్యోతుల్లా మండుతున్నాయి.

అడుగులచప్పుడు వినిపించింది. అలికిడయింది. బయట చారీబాబు పెట్టిన గొళ్లెంతీసిన చప్పుడైంది.

ఒక్కో అడుగు ముందు పడుతోంది మృత్యువు అడుగులేసుకొంటూ వస్తోందనుకొన్నా. లేకపోతే, ఇంత రాత్రివేళ ఎవరొస్తారు? ఆఫీసరా? జ్వాలా నరసింహమా? శాస్త్రి?...ఎవరు?

ఆపాదమస్తకం కప్పుకొన్న ముసుగు తొలగించి చూశాను. వాళ్లెవరూ కారు!

అందరికంటె, అతీతమైనవ్యక్తి!

నా గుండెల్లో ఆవేదన, కడుపులో తపన—

అన్నింటినీ, ఏ అమృతహస్త స్పర్శలో, అదృశ్యంగా ఓదారుస్తున్నాయి.

నా కాళ్లు సమ్మెటతో బాదుతూన్నట్టు లాగుతున్నయ్! నరనరాలు జరజర లాగుతున్నాయి నా బతుకుమీద ఆశ మిణుకుమిణుకు మంటోంది అరుణ తారలా.

నే నిప్పుడు వచ్చినవ్యక్తిని బాగా చూడగలిగాను దీపంకంటె ఎక్కువగా నా కళ్లు మంటలెత్తుతున్నాయి

నిగనిగ లాడుతూన్న శరీరం...చీకటిని పులుముకొని, నన్ను పరామర్శించడానికొచ్చింది!

కళ్లు సూదుల్లా గుచ్చుకుంటున్నాయి.

పెదవులమీది గుసగుసలు వినిపిస్తున్నాయి

'చారీబాబు...' అన్నపదం ఉచ్చరించిన, ఆ ఎఱ్ఱని మందారంలాంటి పెదవులు మాట్లాడుతోన్న భాష నా కర్థంకాదు!

చారీ పంపితే, వచ్చావని కాబోలు చెబుతోంది.

అబ్బ! ఈ ఆవేదనలో, ఏవీ అర్థం కావడం లేదు! మనస్సు ప్రశాంతంగా ఉండాలని ప్రయత్నించుతోంది.

లేవబోయాను. బాధగా మూలిగాను.

రీటా దగ్గరకొచ్చి లేవదీయబోయింది.

నేను వారించి, నా అంతటనేనే గోడకి జారబడ్డాను ఏదో మూలిక ముక్కుదగ్గర పెట్టింది వాసన నాకేం తెలియలేదు. ఆ మూలిక నోట్లో పెట్టుకొని నమలమంది. నేను తీసుకొని నమలటానికి పూనుకొన్నాను. చేదుగా, వెగటుగా, వాంతి వచ్చినంత పనయింది. ఊమిసిపారేశాను.

ఎఱ్ఱగా కోపంగా, రీటా పెదవులు వణికాయి. నా నిస్సహాయతకి జాలిపడ్డాయి

మరో మూలిక తీసి ఇచ్చింది.

ఏమిటో, ఈ వనమూలికలు...ఏంపని చేస్తాయి నా జ్వరంమీద దీని పిచ్చిగాని...అనిపించింది!

ఏదో సీసా తీసి, నోరు చాపమంది.

పెదవులమీద ఒక్కో చుక్క తీసి పోస్తుంటే చప్పరించాను. పుట్టతేనె కాబోలు...చిక్కని చేదు వాసన, తియ్యని వాసనా కలిసి సృష్టించిన రుచి—దిగజారిపోతోన్న ప్రాణాల్ని పైకి చేదుకునే, శక్తి ఆ మధువులో వుంది గాబోలు—సీసాలోదంతా తాగే

శాను. నా కళ్లు తృప్తిగా మెరిశాయి. కడుపులో తపన తగ్గింది. నాలో క్షీణిస్తున్న సత్తువ తిరిగి చేరుకొన్నట్టయింది.

తేలిగ్గా హృదయం తేరుకొంది.

నా కళ్లు కృతజ్ఞతాభావంతో వర్షించసాగినయ్! రీటా దేవతనిపించింది నా కోసం ఇంత కష్టపడుతోంది, ఎటువంటి సంబంధంలేని, ఈ మూర్తి. దీని కంతకీ ఏదో అవ్యాజమైన మనస్సంబంధమైన రజ్జువే.... కారణం...అనుకొంటాను

నా దీనస్థితికి నాకే ఏడుపొచ్చింది.

ప్రస్తుతం ఈ సమయంలో నా దగ్గర నావాళ్లనే వాళ్లెవరూ లేరు-తల్లి లేదు, తండ్రి లేడు, బంధువుల్లేరు... ఆప్యాయంగా, 'నాయనా? ఎలావుంది?' అని పెదవి విప్పి పలకరించే, ఆప్తహృదయంలేదు — నన్నాదరించి, సమాశ్వాసించి, కన్నీరు నించుతూ, 'నీ నుదురు వేడిగా వుందా? ఒంట్లో ఎలావుంది బాబూ!...కడుపులో తపన తగ్గిందా?...అబ్బ వళ్లిలా సలసల కాగిపోతుందో? నా చిట్టితండ్రికే రావాలా ఇంతిజ్వరం? ఎంత కష్టమొచ్చింది నా బాబుకి!...త్వరలో తగ్గిపోతుందిలే!...ఈ మాత్ర వేసుకోవూ? ఈ రెండు రోజులు బాధపడాలి తండ్రీ! తర్వాత మాలో కలిసిపోతావు ... ఏడుస్తున్నావా? ఛా ... ఏడవొచ్చా? పిచ్చినాయనా! ఏడవకు...తగ్గిపోతుందన్నాంగా...'

చెమ్మగిలిన కళ్ళతో, జాలిగదిరే హృదయంతో, గద్గదకంఠంతో ఓదార్చే నావాళ్లనేవాళ్లు లేని, ఈ అరణ్యమధ్యమందిరంలో చిక్కి చివికిపోతున్నాను. బాధలో కుమిలిపోతున్నాను. మానవతా దూరమై ఏ కొండల్లోనో ఏ ప్రకృతిలోనో పుట్టి, పెరిగిన కొండజాతి కాంత లాలనలో నిట్టూర్పు విడవాలిసొచ్చింది గదా? అని భోరుమని ఏడ్చాను. వెక్కి వెక్కి ఏడ్చాను. నా వెచ్చని కన్నీళ్లు చేత్తో తుడుస్తూ, తల నిమిరింది. నుదురుమీద చేయివేసి, ఆశ్వాసించింది. తన భాషలో జాలిగా గొణిగింది. తనూ నా దీనస్థితికి, కన్నుల కన్నీరు నించింది.

కళ్ళలోకి చూశాను కృతజ్ఞతాసూచకంగా.

సిగు రేకులు రేకులుగా విడి, జాలిగామారి కలువల్లో కలిసి, ఏదో అపూర్వానుభూతిని స్ఫురింప చేస్తోంది.

ఆ చీకటి చుట్టూ పెనవేసుకోబోయాను. ఆ గుండెల్లో తలదాచుకొని, దీనంగా ఏడవాలనిపిస్తోంది.

చైతన్యవంతమైన రాతివిగ్రహంలాంటి ఈ మనిషి, నిశాకాంతలా, నల్లని ముసుగులో రాగిల్లింది నాముందు ... ఏవరం కోరినా దయచేసే మాతృహృదయం, మాధురీనిలయం...అన్నింటికీ సహించి, నన్ను సేదదీర్చింది. ఓదార్చింది బాధ పోకార్చింది. కార్చిచ్చులాంటి నా శరీరాన్ని చల్లని హస్తంతో సాకింది. నా కాళ్లలో ఉడిగిపోయిన జవసత్వాల్ని మేల్కొల్పింది తన తామరపువ్వుల్లాంటి చేతుల్తో...

నా శరీరం హాయిగా తేలిపోయింది. తర్వాత చల్లగా, నిద్రపోవడమే తెలుసు. చారీబాబుని కళ్ళనిండా చూసుకుంటూ ఎంతసేపుందో, ఏమో...నిద్రపోయిందో లేదో నాకు తెలియనేలేదు ఆ చల్లనితల్లి—

## 6

తెల్లవారేసరికి జీపొచ్చింది. నేను వెళ్లిపోతుంటే, ఆఫీసంతా చూడ్డానికొచ్చింది. ఇంజనీరు కూడా చూసి, విచారించాడు. చారీబాబుకూడా నాతో వస్తున్నాడు గనక, నాకేలోటూ వుండదు. తిన్నగా విశాఖపట్నంలోపోయి పడితే, అక్కణ్ణుంచి బతికుంటే, ఎప్పటికైనా, ఇల్లు చేరుకోవచ్చు! ... రీటా వచ్చిందేమో?...అని చూశాను. రాత్రి జరిగిన విషయానికి సిగ్గుపడి రాలేదనుకొన్నా.

జీపులో ఎక్కేటప్పుడు ఉత్సాహంగానే, ఎక్కాను పాడ్డెక్కేలది, నాలో, శైశవ్యం గాలి వేగానికి, హారతి కర్పూరంలా హరించుకుపోతోంది.

జీప్ రోడ్ని తరుముకుపోతోంది.

డుడుమా జలపాతం చూడనేలేకపోయ్యాను ఇంతదూరం వచ్చి కొండదారులు దిగేటప్పుడు ఎక్కేటప్పుడు నన్ను జాగ్రత్తగా పట్టుకొంటున్నాడు. పాపం! అతని కెందుకొచ్చిన బెడద?......

ఇంతదూరం వచ్చి, ఇంతమందిచేత సేవచేయించుకోవడం నామీద నాకే అసహ్యమనిపించింది.

మగతగా వుంది మెదడు. అందులో దృశ్యాదృశ్యాలు...నాన్నా, అమ్మ, రెక్కలుగట్టుకొని, వాలుతున్నారు ... 'ఇంతదూరం ఎందుకొచ్చావురా నాయనా!...నిక్షేపంలా ఇంటిదగ్గరుండక...' అని వాపోతున్నారు!

నేనీ పర్వతాలనీ, పరిసరాల్నీ విడిచివెళ్ళి పోతున్నందుకు విషాదంగా విడ్కోల్లులా గాలిలో రొద వినిపించింది పర్వతాలు కొల్వలు కన్నీళ్ళుగా ఏడుస్తున్నాయి...

నా గూడు పక్షి ఏడుస్తోన్నట్టు తల్లిదండ్రులు, నాలో జ్యోతి ఆరిపోయినట్టు...

'ఏమిటి కలవరిస్తున్నావు? నీకేం భయంలేదు... నీజ్వరం తగ్గేదాకా నీతోనే వుంటా...'

నేను కళ్ళు తెరిచి చూశాను.

చారీబాబు నా పక్కనే, వున్నాడు. నా ఆత్మజ్యోతి ఇంకా వెలుగుతూనే వుంది! ఇంకా బతికేవున్నా...

చారీబాబూ! నాబుణాన్నింకా ఎందుకు పెంచుతావు? నిశ్శబ్దంగా ప్రవహిస్తున్న ఏ కొండ వాగులోనో పారేస్తే, ప్రకృతిలో కొట్టుకపోతాను. మేఘాల నిట్టూర్పుల్లో మేలుకొంటాను. ఉదయారుణ సంధ్యా సౌందర్యంలో, ఒక మంచుబిందువుగా మిల మిల మెరుస్తాను. చీకటిముసుగు కప్పుకొని, వేదనని విప్పుకొని, మంచులో ముంచుకొనిపోయి బతుకు తెల్ల వారుస్తాను.

బాధపడుతూ, నాలో నేనే ఆలోచించు కొంటూ, ఆపవిడాటి విశాఖ చేరేసరికి పొద్దు కుంకు తోంది.

హాస్పిటల్లో చేరిపించేటప్పుడు ఎంత ఖర్చు యిందో, ఏమో నన్నో మంచంమీద పారేశారు. అన్నింటికీ దేవుడులాటి చారీబాబు...

ఈ జ్వరం...విషజ్వరం...అని డాక్టరు తేల్చి నట్టు నాకు తెలియకపోలేదు. చారీబాబు దాచినట్టు నేను గ్రహించాను. తర్వాత ఉత్తరం వ్రాయించాను ఇంటికి.

అక్కడే పడుకున్నాడు ఆరాత్రి...

నాకు నిద్రపోవడానికి మందిచ్చారు. ఐనా, నిద్రపట్టందే?...ఏవో మగతగా పీడకలలు మాత్రం... కొల్లలుగా కళ్ళలో కల్లోలం రేపుతున్నయ్!...

చారీబాబు హాయిగా నిద్రపోతున్నాడు నా గుండెల్లో ఈర్ష్యా జ్వాల మేల్కొల్పుతూ...

లేచి, ఫ్లాస్కులో కాఫీ తాగుతున్నాను

గది కవతల అలికిడైంది.

లోపలికి తొంగి చూసింది పరిచితముఖం.

ఆశ్చర్యంగా చూశాను 'నువ్వెలావచ్చావిక్కడికి?'—

'లారీ' అంది. చారీబాబుని లేపింది. కళ్లు నులుముకుంటూ విసుక్కుంటూ, విసుక్కుంటూ లేచాడు ఆశ్చర్యంగా.

మాలికా, మందు సీసాలో తేనె బయటికి తీసింది.

'పొద్దుట కనిపించకుండా, ఇక్కడికలా వచ్చింది రీటా?...రాత్రి ఆమాలికల మందు, తేనె తాగాను' అన్నాను నీరసంలో ఉత్సాహంతో—

'జ్వరానికది చాలా మంచి మందు...ఐతే, అన్నింటికీ అది పని చేస్తుందో లేదో చెప్పలేం!'

'ఐనా, ఆమందు నాకమృతంతో సమానం'

రీటా, ముందుకొచ్చి జాలిగా చూసింది. నేను నోరు తెరిచాను అమృతం వర్షించింది.

చారీబాబు నేత్రాలు, సంతృప్తిగా చెమర్చాయి.

రీటా మధుహృదయం, నన్నూ నా జీవితాన్ని తడుముతోంది. బాధగా కళ్లు మూసుకొన్నాను.

'మీరు దేవతలు'

నా గొంతులో అవ్యక్తమైన ధ్వని వాళ్ళకి విని పించే వుంటుంది! తెల్లవారుతుందో లేదో! హాయిగా నిద్రపోయారు వాళ్ళిద్దరూ... నేనూ నిద్రకి ప్రయత్నిస్తున్నాను—

---

ఇందలి నేనూ, తదితరపాత్రలూ, చారీబాబు, రీటా కేవలం కల్పితం—ఎవరికీ సంబంధించినవి కావు. మాచ్ ఖండ్ ప్రకృతిసౌందర్యం వర్ణనాత్మక దృక్పథంలో మాత్రమే!

# విగ్రహవ్యావర్తని

ఆర్య నాగార్జునుడు

[గత సంచిక తరువాయి]



## ఉత్తరపక్షము

అస్మదుక్తి హేతుప్రత్యయములగాని,। దాని సాకల్యమందునగాని, యన్య
భావమున గాని లేనిదో భావ నిఃస్వ। భావతనుజేసి శూన్యత ప్రాప్తమయ్యె.

ఈ ప్రతీత్య సముత్పన్నమెల్ల శూన్య। మనెడి వాక్యమ్ము వ్యాఖ్యాతమగునుగాత:
ఈ ప్రతీత్యసముత్పత్తి నెనగుభావ। మెల్లనిఃస్వభావ మగుచు నెనగుచుండు.

మాయ చే నుద్భవించిన మనుజుడెట్టు। లితర మాయామనుజు నివర్తించుచుండు,
నట్టిరీతి నీ వ్యావర్తనార్థమితర। మైన ప్రతిషిద్ధమర్థమ్ము నాచరించు.

వాక్య మియ్యది యస్వభావమ్మయగును;। దీని చే మాకు వాదమ్ము హానిలేదు;
వైషమిక దోషమునకు సంప్రాప్తిలేదు;। కాన హేత్వంతర మ్మవక్తవ్యమగును.

"మాటలాడకు మన్నట్టి మాడ్కి యిదియు। నగు,"నటన్నది మీదు దృష్టాంతమగును;
"శబ్ద మిద్దానిచేత నా శబ్ద పరిని। వర్తనంబగు,"నని మేము పలుకలేము.

నిఃస్వభావవాక్యమ్ము చే నిఃస్వభావ। తా నివర్తనం బగునేని, తన్నివృత్తి
యందు సర్వభావసముదయమ్మునకును। జేకుఱునుగాదె స్వాభావ్యసిద్ధి యొందు.

కల్పితాంగనా రమణీయ కాయదర్శ। నమ్ము చే నుద్భవించు మోహమ్ముఘనము
భవ్యపురుష నిర్మితకుండు ప్రతిహితమ్ము। సేయునట్టులే యిదియంచు జెప్పవలయు

ధ్వనికి సత్తలేమివలన నీ హేతువు। సాధ్య సమమయగును; సంవృతమ్ము
వ్యావహారికమ్ము ప్రత్యాఖ్య మొనరింప। కుండ మేము చెప్పుచుంటిమిట్లు.
[వ్యావహారికార్థ సమాశ్రయమ్ము లేక। పరమమా నట్టి యర్థమ్ము తెలుపబడదు;
పరమమా నట్టి యర్థమ్ము నెఱుగకుండ। పరమ నిర్వాణ పదమును బడయరాదు]

కొండొక ప్రతిజ్ఞ యనుచు మా కుండెనేని,। ఇట్టి దోషమ్ము మా కావహిల్ల గలదు;
లేదు మాకు ప్రతిజ్ఞ, యా లేమివలన। నెట్టి దోషమ్ము మా కావహిల్లబోదు.

అల ప్రమాణమ్ము చేత రవ్వంతయైన। ప్రాపణీయమో, కాక ప్రవర్తనీయ
మో, నివర్తనీయమ్మొ మాకున్న వేళ। దోషమగు; నదిలే, దింక దోషమెట్లు?

---

అనువాదము : శ్రీ జి. వి. కృష్ణరావు

ఆ ప్రమాణమ్ములవలన నర్థములకు। సిద్ధి చేకూరునని నీవు చెప్పెదేని,
మరల నా ప్రమాణములకు బరగు నెట్లు। సిద్ధి యొక్కింత మాకు వచింపవలయు.

అన్యమా ప్రమాణములచే నగునయేని। తత్ప్రమాణసిద్ధి, యనవస్థ ఘటియిల్లు;
దానిచే నాది గాని, మధ్యమ్ము గాని,। యంతమును గాని సంసిద్ధి నందబోదు.

ఏ ప్రమాణమ్ములును లేక యే ప్రమాణ। సిద్ధి యనగ వాదమ్ము నశించిపోవు;
వైషమిక దోష మద్దాన బ్రాప్తమగును। కాన హేత్వంతరమ్ము వక్తవ్య మగును.

అగ్నిహోత్రమ్ము స్వాత్మపరాత్మ యుగము। భాసమానమ్ము గావించు పగిది తత్ప్రి
మాణ తతి స్వపరార్థ యుగ్మకము పూర్ణ। సిద్ధి పొందించు చున్నట్లు చెప్పవచ్చు.

విషమ మీ యుపన్యాసమ్ము వీతిహోత్రు। డాత్మ భాసమ్ము గూర్పనావశ్యకత లేదు;
అంధకారమందు ఘటమున నుపలబ్ధి। యట్లు జ్వలను ననుపలబ్ధి యరయరాదు.

స్వాత్మపరములు రెండు హుతాశనుండు। భాసిలగజేయు నని నీవు పల్కెదేని,
పరపదార్థమ్ములను గాల్పివైచునగ్ని। స్వాత్మదాహమ్ము గావింపనగును గాదె !

స్వాత్మపరములు రెండు హుతాశనుండు। భాసిలగజేయునని నీవుపల్కెదేని,
అంధతమసమ్మునట్టులే స్వాత్మ పరప। దార్థయుగళమ్ము గ్రమ్మివేయంగవలయు.

అగ్నియందుగాని, యదియున్నయెడగాని। యంధకారమద్ది యమరబోదు;
జ్వలనమెట్లు స్వాత్మభాసమ్ముగావించు?। ఆ ప్రకాశము తిమిరారిగాదె !

జాయమానమగుచు జ్వలనమ్ముభాసిల్ల। జేయుననుట సుంత చెల్లబోదు;
జాయమానమగుచు జ్వలనమ్ము సంతమ। సమ్ము పొందు నెట్లు సాధ్యమగును ?

అంధకారమ్ము దరియక యగ్ని తద్వి। ఘాత మొనరించు ననరాదుగాదె; యట్లు
యైన లోకధాతువుల సమస్తమందు। గలుగు తిమిరమ్ము నిటనుండి తొలపవలయు.

ఏ ప్రమాణమ్ము కాంక్షింపకే స్వతః ప్ర।మాణ సంసిద్ధియగునన్న మతమయేని,
తత్ప్రమాణ ప్రసిద్ధయొంతయు బర నిర। పేక్షయగుచు సిద్ధించునం చెన్నవలయు

ఏ ప్రమేయమ్ము కాంక్షవహింప బోక। యా ప్రమాణప్రసిద్ధి యొప్పారునేని,
ధర్మసందేహమందు నెద్దానికైన। నయ్యవి ప్రమాణము లగుచు నలరబోవు.

ఆ ప్రమాణమ్ములకు బ్రమేయార్థకాంక్ష। సిద్ధియన పోకు దోషమ్ము చెప్పుచుంటి :
సిద్ధమునకు సాధనమద్ది చెలగు, మఱియు। సిద్ధ మర్థ మన్య మ్మపేక్షింపబోదు.

ఎల్లభంగి ప్రమాణసాపేక్షతాప్తి నీ। ప్రమేయముల్ సిద్ధించునేని, కాంక్ష
సేయబోక ప్రమాణముల్, సిద్ధిగాంచు। గాదె ఈ ప్రమేయార్థ సంఘాత మెల్ల

# విగ్రహ వ్యావర్తని

ఏ ప్రమాణం బపేక్షింపకే ప్రమేయ। సిద్ధికల్గునేని, ప్రమాణసిద్ధి చేత
నగున దేమి ? ప్రమాణంబులైన నేల ?। తత్ప్రసిద్ధమైనట్టి యర్థమ్మదేల ?

అర్థముల బ్రమేయమ్ముల నభిలషించి। తత్ప్రమాణప్రసిద్ధి యుత్పన్నమైన,
ఆ ప్రమాణ ప్రమేయ ద్వయంబు వ్యత్య। యమ్మయిన స్థితిపొందుట నాపరాదు.

చెనసె నీ ప్రమాణపు సిద్ధిచే బ్రమేయ। సిద్ధియుం, బ్రమేయపు సిద్ధిచే బ్రమాణ
సిద్ధి, మీకు నా యుభయమ్ము సిద్ధియైన। చొప్పడుట కేవలము వట్టి సున్నయగును.

ఆ ప్రమాణమ్ములను బ్రమేయార్థసిద్ధి। యగునయేని, ప్రమేయసాధ్యంబు లా ప్ర
మాణములు ప్రమేయార్థ సంతానములకు। నెవ్విధమ్మున సంసిద్ధి నేర్పగలవు ?

ఆ ప్రమేయమ్ములను బ్రమాణార్థసిద్ధి। యగునయేని, ప్రమాణసాధ్యంబు లా ప్ర
మేయములు ప్రమాణార్థనికాయమునకు। నెవ్విధమ్మున సంసిద్ధి నేర్పగలవు ?

"తండ్రివలన గొడుకు తనరారుచుండును। తండ్రి కొడుకువలన దనరుచుండు,"
ననుచు నొకడు చెప్పినట్లైన, నెవ్వాని। వలన నెవ్వ డుద్భవమ్ముపొందు ?

జనకు డెవ్వాడు, మఱి తనూజాతుడెవడు ?। విశదఫణితిని దెల్పుడీ వినగవలయు
ఇరువురును బితాసుతలక్షణోక్షితులగు। చుంట మాకిందు సందేహ ముద్భవించె.

స్వయముగాగాని, మఱి పరసర్పతగాని,। తత్ప్రమాణమ్ములనుగాని, తత్ప్రమేయ
వితతిగాని, కారణవిహీనతనుగాని। యా ప్రమాణమ్ములకు సిద్ధియగుటలేదు.

ధర్మతత్త్వజ్ఞులు కుశలధర్మములకు। కుశలమౌ స్వభావమ్ము వాక్రుత్తురేని,
ఇయ్యదిట్టి చందంబంచు వేరుపఱచి। యా స్వభావమ్ము వివరింపనగునుగాదె!

కారణప్రత్యయమ్ములగాంచి కుశల। ధర్మమున స్వభావము సముత్పన్నమగున
యేని, పరభావజాతమై యెనగునద్ది। కుశల ధర్మస్వభావమై కొఱలుటెట్లు ?

కారణ ప్రత్యయమ్ములఁ గనక కుశల। ధర్మముల స్వభావము సముత్పన్నమగున
యేని, కుశలాది ధర్మమ్ములిట్టివేని,। బ్రహ్మచర్యవాసంబని పడయబోవు.

ధర్మమేని, మఱియధర్మమేని, వ్యవహా।రంపు ధర్మమేని క్రాలబో; ద
హేతుమంతమది సనాతనం బగుటచే। నిఖిల భావచయము నిత్యమగును.

అకుశలములందు, నవ్యాకృతాళియందు,। అల్లనైర్యాణ పూర్వాదులందు పూర్వ
దర్శితంబైన దోషముత్పన్నమగును;। అఖిల సంస్కృతార్థ మసంస్కృతార్థమగును.

పదమునకు సత్త సస్వభావతయు జెప్ప। వాడు మీచేత బ్రతిషేధపాత్రుడగును;
ఏము మాత్ర మేనాడును నామమునకు। నున్కి కలదంచు వచియించుచుండ లేదు.

పద మసత్తనువాదమ్ము పరగవలయు। నొండె, పరగకుండవలయునొండె; గాన
నిందు నెద్దాని నీవాశ్రయించుకొన్న। తావకీనవాదమ్ము విధ్వంసమగును.

"అఖిల భావముల్ శూన్యంబు,"లనుచు మున్ను। ప్రోక్తమయ్యె మాచేత; నభూతమల్లె
మా ప్రతిజ్ఞ; కావుననింక మాదు వాద। మెట్లు దోషమ్ము చేత సంస్పృష్టమగును?

ధర్మములకంటె వేఱుగా దనరుచుండు। నట్టిదేని స్వభావ, మయ్యదియు ధర్మ
మందు గల్గదం చాశంకనంది నార;। లస్మదుక్తి యాశంకనీయమ్ముగాదు.

ఉన్నదానికే ప్రతిషేధ మొప్పునేని,। భావనిఃస్వభావత్వ నివర్తనమ్ము
మీరు కడగి కావించుచున్నారుగాన। చెలగు శూన్యత్వ మప్రతిషిద్ధమగుచు.

మీరు వ్యావృత్తిసేయుచున్నారు శూన్య। భావ; మా శూన్యతయు లేని పరగబోదు;
ఉన్నదానికే ప్రతిషేధ మొప్పుననెడి। తావకీనవాద మిమ్మెట్లు ధ్వంసమందు.

కించి దర్థమేని ప్రతిషేధించుచుండ। లేదు; ప్రతిషేధ్య మర్థమే లేదుమాకు;
కావున బ్రతిషేధించుచున్నావు నీవ। టన్నయాధిలయమొండె విన్యస్తమయ్యె.

పరగబోని మీదు వాక్కుచే ప్రతిషేధ। వచనసిద్ధియంచు బలికినారు;
ఇచట లేనిదనుచు నెఱిగించునే కాని। వాక్కు దాని భంగపఱుపబోదు.

త్వన్మరీచికా దృష్టాంతదత్తవిపుల। చర్చ ప్రత్యుక్తమవుత; దృష్టాంతమద్ది
యెట్టు లుపపత్తిపొందునో యేది నిర్ణ।యంబొ వివరించుచున్నార మాలకింపు.

గ్రాహమది స్వభావమ్ముచే గ్రాలునేని,। అది ప్రతీత్య సముత్పన్నమగుటలేదు;
గ్రాహమది ప్రతీత్యభవమై క్రాలునేని,। అద్ది నిజముగా శూన్యతయగును జుమ్మి.

గ్రాహ మది స్వభావమ్ముచే గ్రాలునేని,। ఎవ్వడెట్టు లద్దాని వారింపగలడు?
శేషధర్మాల నీవిధి చెల్లుచుండు;। కాన దోష మీవాదాన గానరాదు.

హేత్వభావత సాధ్యసమత్వమగుట। జేసి మున్నె ప్రత్యుక్తితాశ్లిష్టమయ్యె;
త్వన్మరీచి దృష్టాంత నివర్తనంబు। నందు పూర్వమ్ముచెప్పిన దిందెసంగు.

మూడుకాలాల హేతువు మున్నె సాధ్య। సమత జేసి ప్రత్యుక్తి నిశ్శాంతమయ్యె;
ఈ త్రికాల నివర్తక హేతువేని। అల్లశూన్యతావాదికే ప్రాప్తమగును.

ఎవనికీ శూన్యతోద్భవ మెసగుచుండు,। వానికి నిఖిలార్థము లుద్భవమ్ములగును;
ఎవనికీ శూన్యతోద్భవ మెసగకుండు। వానికిం గించిదర్థ ముద్భవముగాదు.

సారశూన్యతయు, బ్రతీత్య సంభవమ్ము,। నైక నానార్థతత్త్వమ్ము వ్యాకరించు
పూజ్య మధ్యమా ప్రతిపత్తు బోధపఱచి। నట్టి సంబుద్ధు ననుపము నాశ్రయింతు.

సీరియల్:

# విచిత్రజీవులు

హితశ్రీ

## రంగము: 5

* * అడ్వకేట్ కూర్మావతారం గారి కన్సల్టింగ్ రూమ్ (మూడోరంగంలో వలెనే ఉంటుంది) విద్యాపతి రంగం మీద ఆలోచనగా పచారు చేస్తూ హఠాత్తుగా ఆగి జేబులోనుంచి ఓ నాణెం తీసి బొమ్మా - బొరుసూ వేస్తుంటాడు—అదేపనిగా. టైపిస్ట్ గదిలోనుంచి కల్యాణి ప్రవేశం. ముఖం కళతగ్గి వుంటుంది. కళ్లు కొంచెం ఎర్రబడివుంటాయి.

కల్యా : (విద్యాపతిని చూసి చిరునవ్వుతో చిలిపిగా) బొమ్మా - బొరుసూ ఆడుకుంటున్నారా?

విద్యా : (తలెత్తి కల్యాణిని చూసి తన ధోరణిలో) బెస్ట్ ఆఫ్ త్రీలో రెండుసార్లు బొమ్మా; ఒక్కసారి బొరుసూ. బెస్ట్ ఆవ్ ఫైవ్‌లో నాలుగుసార్లు బొరుసూ, ఒక్కసారి బొమ్మా. అబ్బ. ఎలా వచ్చేది చెప్పండి.

[కల్యాణి నవ్వుతుంది.]

నవ్వుతున్నారా? నవ్వండి, నవ్వండి. ఇతర్ల అవస్థలు చూసి నవ్వటానికే దేవుడు ఆడవాళ్ళకి నోరు పెట్టాట్ట. పిల్ల కాకికేం తెలుసురా ఉండేలు దెబ్బ అన్నాడు.

కల్యా : అయితే నేను కాకినంటారా?

విద్యా : (తెల్లబోయి) అహఁ. అబ్బె. అది కాదు. (సర్దుకుంటూ) కోయిలలా మీరలా మృదు మధురంగా మాట్లాడుతుంటే కాకిలా ఉన్నారంటానా?

కల్యా : కోయిలలా మాట్లాడితే కాకిలా ఉండటానికేం? ఇంతకీ, అనదలుచుకున్న దేదో స్పష్టంగా అనెయ్యండి.

విద్యా : ష్. రామచంద్రా! మిమ్మల్నే మీ అనలేదండీ! కర్మం కాలి ఏదో లోకోక్తి జ్ఞాపకం వొచ్చి అన్నాను. అదీ, మీరు నవ్వితే అన్నాను కాని ఊరికే అనలేదు. అసలు మీరు నన్ను చూసి నవ్వటం దేనికి చెప్పండి.

కల్యా : ఆఫీసు పని మానేసి ఆడుకుంటుంటే నేను గనక నవ్వి ఊరుకున్నానుగాని, మల్లి కాంబ గారైతే—

విద్యా : తలవాచేది చీవాట్లతో. అదేనండి సమస్య. లేకపోతే సమస్యేముందీ?

కల్యా : సమస్యా? ఏం సమస్య?

విద్యా : భవిష్యత్తుని అటో ఇటో తేల్చిపారేసే సమస్య. పరిష్కారానికి అందకుండా వేధించి వెంటపడి బాధించే సమస్య. ఒక జీవితకాలం అంతటినీ శాసించే అతిముఖ్య సమస్య. (కుడిచెయ్యి అకస్మాత్తుగా గాలిలో ఊపి రెండు వేళ్లు చాపి చూపిస్తూ) ఏదీ ఒక వేలు పట్టుకోండి.

[కల్యాణి తెల్లబోయి అతని కళ్ళలోకి చూస్తుంది.]

ఓ! సారీ!—ఈ వేలా? ఆ వేలా చెప్పండి.

[ఒక వేలువైపు కల్యాణి సంజ్ఞ చేస్తుంది]

చంపేశారే. ఎల్లప్పుడూ ప్లీడర్ గుమాస్తా గానే ఉండమంటారా నన్ను?

కల్యా : అయితే ఆ వేలు. (నవ్వుతుంది.)

విద్యా : డేంజర్, డేంజర్. కత్తికైతే ఒక వైపే కాని, మల్లికాంబగారి నాలిక్కి రెండు వైపులా పదును.

కల్యా : ఉద్యోగం మానెయ్యాలా వొద్దా అనేదేనా మీ సమస్య.

విద్యా : అటువంటి సమస్యలైతే ఈపాటికి ఓలక్షు పరిష్కారం చేసి పారేద్దును.

కల్యా : మరి అంతవిషమ సమస్య ఏమిటి ?

విద్యా : డబ్బులేక చదువులేకా, చదువులేక డబ్బులేకా ఇలా ఈ ప్లీడర్ గుమాస్తా గిరీలో నానా అవస్థలుపడుతూ జీవితశేషం వెళ్లబుచ్చటమా, లేక—(చుట్టూ చూసి) మల్లికాంబగారిని పెళ్ళిచేసేసుకుని—

కల్యా : (ఆశ్చర్యంగా) ఆఁ!

విద్యా : ఆఁ. పెళ్ళిచేసేసుకుని లా చదివి ప్రాక్టీసు పెట్టి జూనియరై, సీనియరై, లీడరైపోవటమా అనేది నా సమస్య.

కల్యా : మీరు చెప్పేది నిజమా ?

విద్యా : శుద్ధ నిజం.

కల్యా : నేను నమ్మను.

విద్యా : నమ్మకండి.

కల్యా : అయితే వొట్టిదేనా ? నాకు ముందే తెలుసులెండి.

విద్యా : ఏం ? మీరు నమ్మకపోతే నిజం అబద్ధమాతుందా ? అబద్ధం నిజమౌతుందా ? నీరుపల్లె మెరుగు నిజము దేవుడెరుగు అన్నారు. దేవుడిదగ్గిర ప్రైవేటు సెక్రెటరీ అల్లే మాట్లాడుతున్నారే !

కల్యా : మల్లికాంబగారు ఒప్పుకున్నారా ?

విద్యా : ఎందుకొప్పుకోదూ ?

కల్యా : (ఆశ్చర్యంగా) ఒప్పుకుందా ?

విద్యా : (కొంచెం కోపంగా) ఒప్పుకున్నట్టే.

కల్యా : అంటే పూర్తిగా ఒప్పుకోలేదా ?

విద్యా : ఒప్పుకుంటుంది.

కల్యా : ఇష్టముందా ?

విద్యా : (కొంచెంకోపంగా) ఊఁ.

కల్యా : మీ కెలా తెలుసు ?

విద్యా : ఏం ? ఆమాత్రం తెలుసుకోలేననా మీరనేది ?

కల్యా : ముందుజరిగేది ఎలా తెలుస్తుందండీ ? దేవుడి పర్సనల్ సెక్రెటరీ అల్లే మాట్లాడుతున్నారే!

విద్యా : (గ్రహించి, నవ్వి) గడుసువారే లెండి.

కల్యా : మిమ్మల్ని చూస్తే నవ్వొస్తోందండీ.

విద్యా : నవ్వండి. మీకేంభయం ? నవరత్నాలు రాలవుగా.

కల్యా : కోపంవొచ్చినట్టుంది.

విద్యా : రానివ్వండి. మీ యజమానిని కాదుగా మీరు భయపడటానికి.

కల్యా : ముందు కాకూడదూ ?

విద్యా : అయితే మిమ్మల్ని వెంటనే ఉద్యోగంలోనుంచి తీసేస్తాను.

కల్యా : పోనెండి. మల్లికాంబగారు నా పక్షం ఉంటారు. ఈ మధ్య అల్లికపని బాగా చేస్తున్నాను కూడా. ఆమెచేత మీ ఆర్డరు క్షణంలో రద్దుచేయించనూ !

విద్యా : ఏమిటే ?

కల్యా : తమాషాగా అన్నాన్లెండి. అలా తెల్లబోతారేం ?

విద్యా : అయితే మల్లికాంబని చేసుకోమనేనా మీ సలహా ?

కల్యా : నా సలహాకోసమే నిరీక్షిస్తున్నట్టు !

విద్యా : మీ అభిప్రాయం చెప్పండి.

కల్యా : ఇష్టమైతే చేసుకోండి, లేకపోతే మానెయ్యండి.

విద్యా : ఒక్క చిన్న సలహా ఇవ్వలేరూ ? ఆడవాళ్లు మహా పీనాసి వాళ్ళండీ, అందరూ అడగకుండా ఇచ్చే సలహాకూడా మీరు లేవంటున్నారే.

కల్యా : అయితే ఆమెని పెళ్లి చేసుకోకండి.

విద్యా : ఆఁ! గ్రొరెతోక బెత్తెడన్నట్టు ఎప్పుడూ ఈ ఉద్యోగంలో ఎదుగు బొదుగూ లేకుండా ఉండాలిసిందే!

కల్యా : అలా అయితే ఆమెని చేసుకోటానికి ఒప్పుకోండి.

విద్యా : ఒప్పుకోమంటారా ? కాని... కాని...

కల్యా : అయితే ఈ సమస్య దానంతటది పరిష్కారమయేదాకా సమస్యగానే ఉండనియ్యండి.

విద్యా : ఎలా ? ఇప్పటికే చాలా ఆలస్యమైపోయింది. కూర్మావతారంగారితో ఏదో ఒకటి తేల్చిచెప్పేసెయ్యాలి.

కల్యా : ఓ! కూర్మావతారంగారి ఎత్తా ఇది ?

విద్యా : ఎత్తేమిటే ?

కల్యా : మిమ్మల్ని చవగ్గా కొట్టేద్దామని ప్లాను వేశాడల్లే ఉందండీ.

విద్యా : దమ్మిడీ ఖరీదు చెయ్యని నన్ను చవగ్గా కొట్టేసేదేమిటే ?

కల్యా : పదిహేను వేలయినా కట్నం ఇస్తేగాని మల్లికాంబని చుట్టానిక్కూడా ఎవరూ రామంటున్నారండీ.

విద్యా : ఘోరం. ఈ కట్న పిశాచాన్ని నిర్మూలించటానికి నేను ధైర్యంగా ముందడుగు వేస్తాను. (గుండె చరుచుకుని ముందడుగు వేస్తాడు)

కల్యా : (కొంచెం వెనక్కి తగ్గి) ఆఁ !

విద్యా : ఈ సాంఘికదురాచారాన్ని మంటగలిపి పారెయ్యటానికి నడుం కడతాను.

కల్యా : నిజంగా ?

విద్యా : దమ్మిడీ కట్నం లేకుండా మల్లికాంబని వివాహం చేసుకుంటాను.

కల్యా : పెళ్ళిఖర్చు పెట్టుకుని చదువు చెప్పించే పక్షంలో—అంతేనా ?

విద్యా : (కొంచెం తెల్లబోయి) అది వాళ్ళి ఇష్టం.

కల్యా : అవతారంగారికి బోలెడంత డబ్బుంది. ఎవరైనా బీదవాళ్ళపిల్లని చేసుకుంటే మీ త్యాగానికి విలువ ఉంటుంది.

విద్యా : (ఏమీ అనలేక నీళ్లు నముల్తూ బుర్ర గోక్కుంటూ) కాని... కాని... (ముందుకి వేసిన కాలు వెనక్కి లాక్కుంటాడు !)

కల్యా : ఎవరైతే ఏంలెండి ? త్యాగం త్యాగమే !

విద్యా : అంతే. అంతే ! సరిగ్గా చెప్పారు. త్యాగం త్యాగమే. ఫలితం ఎవరనుభవిస్తే ఏం ?

కల్యా : చాల్లెండి బడాయిలు.

విద్యా : బడాయిలేమిటే?

కల్యా : డబ్బుకోసం కక్కుర్తిపడి మల్లికాంబని చేసుకోవాలనుకుంటూ కుంటి కారణం చాటున దాక్కుంటారేం?

విద్యా : (ఉక్రోషంతో) మీకు సంజాయిషీ చెప్పాలిసిన అవసరం నాకేం లేదనుకుంటాను.

కల్యా : లేదు. కాని మీ వ్యక్తిత్వాన్ని అమ్ముకోకండి. మిమ్మల్ని మీరే మోసగించుకోకండి. తొందరపడి లొంగిపోకండి. ఒంటరిగా అయినాసరే, ధైర్యంగా నిలబడండి.

విద్యా : (వ్యంగ్యంగా) మీ అయాచిత సలహాకి ధన్యవాదాలు.

కల్యా : (ఉద్రేకంలో తను అనవసరంగా జోక్యం కలిగించుకున్నట్టు తెలిసి, సిగ్గుపడి అవమానంతో కళావిహీనమైన ముఖం దించుకుని) ఎందుకో ఆవేశంకలిగి ఏదో పిచ్చిగా మాట్లాడాను. క్షమించండి... (వెళ్లబోతుంది)

విద్యా : (తన మూర్ఖత్వం గ్రహించి) ఆగండి, కల్యాణిగారూ. పొరపాటున అన్నాను. మనస్సు సరిగా లేదు. క్షమించండి. మీకు కోపంవొస్తే నా కెందుకో మనసు మరీ చెడిపోతుంది.

కల్యా : మీ వ్యవహారాల్లో అనవసరంగా జోక్యం కలిగించుకోటం నాదే గాతప్పు!

విద్యా : అలా అనకండి. మీ తెలివితేటలమీద నాకు నమ్మకముంది. మీ సలహా అమూల్యమైనదే. కాని దాన్ననుసరించే మనోధైర్యం నాకు లేదండీ.

కల్యా : నేనేదో నోటికివచ్చినట్టు మాట్లాడితే ఇంకామీరు దాన్ని గురించే ఆలోచిస్తున్నారా?

విద్యా : నిజానికి, మల్లికాంబని పెళ్ళిచేసుకోటం నాకిష్టంలేదండీ.

కల్యా : నాకు తెలుసు.

విద్యా : కాని మనం అన్నీ మనకి ఇష్టమైన పనులే చెయ్యగలమా?

కల్యా : చెయ్యలేక పోవొచ్చు.

విద్యా : చూశారా, మరి? ఏదైనా తార్కికంగా ఆలోచించాలి. ఏమంటారు?

కల్యా : కొన్నివిషయాలు హృదయంతోనే ఆలోచించాలేమో?

విద్యా : మీకు సీతారామారావంటే ఇష్టంలేదు కదూ?

[కల్యాణిమాట్లాడకుండా కిందికి చూస్తుంది

లేదు. నాకు తెలుసు. అతన్నివివాహం చేసుకోకతప్పనిపరిస్థితి ఏర్పడుతుందనుకోండి. ఏంచేస్తారు?

కల్యా : (ఆశ్చర్యంగా అతనివైపుచూసి) మీకు తెలిసిందా?

విద్యా : తెలియటమేమిటి?

కల్యా : అదే. ఇప్పుడు మీరు చెప్పినవిషయం. సన్యాసిరాజు గార్ని మానాన్నగారు బుట్టలో ఎలా వెయ్యకలిగారో ఆశ్చర్యంగా ఉంది.

విద్యా : బుట్టలో వెయ్యటమేమిటే?

కల్యా : లేకపోతే గుమాస్తాకూతుర్ని కొడుక్కి చేసుకోటానికి ఆయన ఒప్పుకుంటాడూ!

విద్యా : ఒప్పుకున్నాడా?

కల్యా : (జాలిగా) ఎంతబతిమాలుకున్నా మానాన్న వినటంలేదండీ. "సిరిరా మోకాలొడ్డట మేమిటే నీ పిచ్చిగాని! ఏమయినా అతన్ని చేసుకు తీరాలిసిందే!" అని ఖచ్చితంగా చెప్పేశారండీ.

విద్యా : (ఆశ్చర్యంగా) అందాకా వొచ్చిందీ వ్యవహారం! ఇంకేం, నిక్షేపంగా వాడిని చేసుకుని హాయిగా సుఖపడండీ.

కల్యా : ఎలా తప్పించుకోవాలా అని నేనాలోచిస్తుంటే ఇదా మీరిచ్చే సలహా?

విద్యా : ఎటువంటి సౌఖ్యాన్ని కొలదన్నుకున్నారో మీకు తెలియటంలేదు. ఏడంతస్తుల మేడ-

కల్యా : ఒంటిస్తంభం పూరిల్లు చాలు.

విద్యా : ఏడు వారాల నగలు

కల్యా : మట్టిగాజులు చాలు.

విద్యా : ఏకులత్రుల మూలధనం మూలుగుతూ వుంటే ఇనస్పెక్టైలూ—

కల్యా : ఆ మూలుగులు నేను వినలేను.

విద్యా : విమానాలలో ప్రయాణాలూ, సుందర ప్రదేశాల్లో విహారాలూ, దాసదాసీజన పరిచర్యలూ—ఓహ్! ఒకటేమిటి? ధనకనకవస్తు వాహనాది సమస్త భోగభాగ్యాలూ గడ్డిపరకలా ఎగరగొట్టేస్తారా!

కల్యా : కోరికల విత్తులు నాటితే మనసు మహావృక్షాలను పెంచుతుంది.

విద్యా : అందుకని?

కల్యా : కోరికల లక్ష్యం మానసిక తృప్తేకదూ?

విద్యా : అందుకని ఆ కోరికలేవో తీరకుండానే తీరినయ్యి అనుకోమంటారు అంతేనా?

కల్యా : సౌఖ్యం వ్యక్తిగతమైందే కదండీ, దాని కోసం వాదనెందుకు?

విద్యా : వానప్రస్థాశ్రమంలో మాట్లాడాలిసిన మాటలు మాట్లాడుతున్నారు.

కల్యా : పోన్లెండి ఓ చిన్న సహాయం చేసిపెట్టలేరూ?

విద్యా : ఏమిటది?

కల్యా : సీతారామారావు గారితో మాట్లాడి ఆ ప్రయత్నంనించి విరమించుకుని నచ్చచెప్పలేరూ?

విద్యా : ఇంకానయం! మిమ్మల్ని ఎలాగో వొప్పిస్తే ఓ వెయ్యి రూపాయలు ఇస్తానన్నాడు వాడు. మీరే మిస్తారూ?

కల్యా : ఏం కావాలి?

విద్యా : ఆవెయ్యి రూపాయలూ మీరివ్వగలరా?

కల్యా : (దీనంగా) పోయిన డబ్బు దొరికితే ఇవ్వగలనేమో!

విద్యా : (ముఖంలో కళ తగ్గుతుంది) దొరుకుతుందా?

కల్యా : ఏమో!

విద్యా : మీకా ఆశ ఉందా?

కల్యా : దొంగిలించినవాడు మీలాంటి వాడైతే తిరిగి ఇస్తాడు.

# విచిత్ర జీవులు

విద్యా : (అప్రతిభుడై) నాలాంటి వాడా?

కల్యా : ఔను.

విద్యా : నేనే అయితే?

కల్యా : బాగా నేనుంది. తమాషా. మీరే దొంగిలించినట్లు మాట్లాడుతున్నారే! ఎవరైనా వింటే నవ్వుతారు.

విద్యా : ఓ మంచిరోజు పొద్దున వెయ్యిరూపాయలు ఇస్తారని కబురు అందితే మీరు ఆశ్చర్య పడరూ?

కల్యా : నా కంటే పోలీసులు ఎక్కువగా ఆశ్చర్య పడతారు.

విద్యా : మీ డబ్బు దొరుకుతుందనే నేననుకుంటున్నానండీ.

కల్యా : మంచిదే. కాని అసలు విషయం దాటేస్తున్నారు.

విద్యా : (నవ్వుతూ) మరి మీరు ఏమీ ఇవ్వలేనన్నారుగా!

కల్యా : ఏమీ ఇవ్వలేనన్నానా? గొంతెమ్మకోరికలు కోరితే ఇవ్వలేనుగాని, నే నివ్వగలిగింది ఏదైనా సరే, అడగండి, ఇస్తాను.

[దప్పున ముఖం తిప్పుకుంటుంది]

విద్యా : అయితే ఆలోచించి అడుగుతానండి

కల్యా : సరే. (టైపిస్టు గదిలోకి వెళుతూ ఉంటుంది)

విద్యా : — ఆలోచిస్తూ, దప్పున ఏదో స్ఫురించగా తలెత్తి కల్యాణివైపు చూస్తూ కొంచెం గట్టిగా) ఏదైనా సరేనా!

[కల్యాణి ఓసారి వెనక్కి తిరిగి తల ఆడించి నిష్క్రమిస్తుంది]

సమస్యలు! సమస్యలు! సమస్యలు? (తల తట్టుకుని) అబ్బ, అన్నీ సమస్యలే.

[జేబులోంచి నాణెం తీసి మళ్ళా బొమ్మ—బొరుసూ వేస్తుంటాడు. ధర్మారావు ప్రవేశం]

ధర్మా : బొమ్మ! ఏం, అంతేనా, విద్యాపతీ?

విద్యా : (ధర్మారావుని చూసి) ఊఁహుఁ. బొరుసు. రండి.

ధర్మా : ప్లీడర్ గారున్నారా!

విద్యా : ఆ, కూర్చోండి. అదేమిటే? ఏడోసారి దివాలా తీసినట్టుగా ఉంది మీ ముఖం?

ధర్మా : ఏడోసారి? ఇంకా ఇది మొదటిసారే నయ్యా.

విద్యా : అయితే దివాలా తీశారూ? మీ ముఖం చూడగానే అనుకున్నాలెండి.

ధర్మా : (కుతూహలంగా) నిజంగానా, విద్యాపతీ? నిజంగా దివాలా తీసినట్టుగానే కనిపిస్తున్నానూ?

విద్యా : సాక్షాత్తూ దివాలా కోరల్లే ఉన్నారు. ఇప్పుడు మిమ్మల్ని చూస్తే ఇన్‌కమ్‌టాక్సు కాదుగదా, ప్రొఫెషన్ టాక్సు కూడా అడగరు.

ధర్మా : నా ముఫ్ఫై రూపాయలూ ఇచ్చేయాలని బుద్ధి పుట్టటం లేదూ?

[విద్యాపతి లేదన్నట్టుగా జేబు తడుముకుంటాడు. లోపల్నించి కూర్మావతారం ప్రవేశం. ధర్మారావు నమస్కరిస్తాడు.]

కూర్మా : ఓ, ధర్మారావుగారా! కూర్చోండి, కూర్చోండి, ఏమిటి విశేషం?

ధర్మా : కొంప మునిగిపోయిందండీ.

కూర్మా : వరదలేం రాలేదే!

ధర్మా : దివాలా తీశానండీ, దివాలా.

కూర్మా : దివాలా తీశారా? ఏం దివాలా?

ధర్మా : ఏం దివాలా ఏమిటండీ? దొంగ దివాలా తీశాననుకుంటున్నారా? అసలు దివాలాయే నండీ.

కూర్మా : అరెరె! ఏం జరిగింది?

ధర్మా : నా బట్టలకొట్టు లూటీ చేశారండీ.

కూర్మా : లూటీ! ఎవరో తెలిసిందా?

ధర్మా : సన్యాసిరాజుమీద అనుమానంగా ఉందని పోలీసువాళ్ళకి చెప్పానండి.

కూర్మా : సన్యాసిరాజు గారిమీదా?

ధర్మా : అవునండి. కక్ష సాధిద్దామని లూటీ చేయించి ఉంటాడు.

కూర్మా : కేసు ఓడిపోతేగదండీ కక్ష సాధించటం? కేసు ఇంకా మొదట్లోనే ఉంది.గా.

ధర్మా : ఆయన సంగతి మీకు బాగా తెలీదులెండి, ప్లీడరు గారూ!

కూర్మా : ఊఁ! బాగా నష్టపడ్డారా?

ధర్మా : నష్టం! కుదిమట్టంలోకి క్షౌరమయిందండీ.

కూర్మా : మిగతా దుకాణాలున్నాయిగా మీకు.

ధర్మా : అవి నావి కావండి. నా భార్యవీ, బావమరుదులవీ.

కూర్మా : అది సరేలెండి. ఎవరి పేరవున్నా మీదేగా ఆస్తి.

ధర్మా : లా ప్రకారం మాట్లాడుతున్నానండి.

కూర్మా : ఏం? వ్యవహారమేమైనా జరపాలా?

ధర్మా : ఐ. పి. దాఖలు చేయించాలండి తమరు.

కూర్మా : ఐ. పి.?

ధర్మా : అవునండి. మరి దివాలాతీశానుగా?

కూర్మా : ఎంతబాకీ ఉన్నారు?

ధర్మా : ఓ పదిహేను, ఇరవై వేలదాకా ఉంటుందండి.

కూర్మా : బ్యాంకులో మీ పేర డబ్బేం లేదూ?

ధర్మా : లేదండి. ఉన్నదంతా నా భార్యకే. ఆవిడ సొంతం.

కూర్మా : భార్య పేర ఎప్పుడు ట్రాన్స్‌ఫర్ చేశారు? లూటీముందా, తర్వాతా?

ధర్మా : లూటీకిముందేనండి.

కూర్మా : లూటీ జరుగుతుందని మీకు తెలుసన్నమాట.

ధర్మా : నాకెట్లా తెలుస్తుందండి?

కూర్మా : మరి డబ్బెందుకు ట్రాన్స్‌ఫర్ చేశారు?

ధర్మా : (తికమకపడి) ఎందుకైనా మంచిదని చేశానండి.

కూర్మా : ఎందుకైనా అంటే?

ధర్మా : నా పేర ఉంటే మంచిది కాదని చేశానండి.

కూర్మా : ఎందుకు మంచిది కాదు?

ధర్మా : వ్యాపారం ఎటుపోయి ఎటొస్తుందో ఎవరికి తెలుసు.

కూర్మా : అంటే బాకీదార్లకి ఎగ్గొట్టాలని ప్లాను వేశారన్నమాట.

ధర్మా : ప్లానేముందండీ? పెట్టుబడి నా సొంత డబ్బేమన్నానా? అది నా భార్య స్త్రీధనం. నాకేం హక్కుందీ? అందుకని జాగ్రత్తపడ్డాను.

కూర్మా : వ్యాపారంకూడా మీ భార్య పేరనే ఉంటే బావుండేదిగా!

ధర్మా : ఆ గొడవలన్నీ దేనికిలెండి. ఐ. పి. దాఖలు చేయించరూ?

కూర్మా : పోలీసులకి రిపోర్టిచ్చారుగా. అదేదో తేలనియ్యండి.

ధర్మా : ఆఁ! ఇంకేం దొరుకుతుందీ?

కూర్మా : ఎందుకు దొరక్కూడదూ?

ధర్మా : వొట్టిదీ? ఎందుకండీ ఆశలూ?

కూర్మా : ఏం? అంత నమ్మకంగా చెబుతున్నారే!

ధర్మా : పోయినవన్నీ దొరుకుతున్నాయిటండీ?

కూర్మా : నష్టపోయినందుకు మీకేం విచారం ఉన్నట్టులేదే?

ధర్మా : విచారిస్తే మళ్లీ మనది మనకి తిరిగొస్తుందా, చెప్పండి. ఇది మీదీ, ఇది నాదీ అనుకోటం వట్టిభ్రమ. ఐ. పి. దాఖలు చేయించరూ?

కూర్మా : రేపు పొద్దున అకౌంట్ పుస్తకాలు తీసుకురండి. ఆ వ్యవహారమేమిటో చూద్దాం.

ధర్మా : చిత్తం. అలాగే.

కూర్మా : ఓ వెయ్యిరూపాయలు విలువచేసే బట్టలు కొనాలనుకున్నానండీ. సమయానికి మీ కొట్టు కాస్తా లూటీ అయిపోయింది.

ధర్మా : ఒక్క పదిరోజులు ఆగండి. మా బావమరిది బజార్లో కొట్టు తెరుస్తున్నాడు. చవక రేట్లకి మీకు కావలసినన్ని గుడ్డలు ఇప్పిస్తాను. ఏం? సరేనా?

కూర్మా : లూటీసరుకు కాదుగదా!

ధర్మా : (నోటికి చెయ్యి అడ్డం పెట్టుకుని) రామ రామ. రేప్పొద్దున దర్శనం చేసుకుంటాను. సెలవు. (నెత్తిన గుడ్డేసుకుని నిష్క్రమణ.)

విద్యా : (నవ్వుతూ) కాలాంతకుడండీ.

కూర్మా : మరేమిటనుకున్నావు? సరేగాని, విద్యాపతీ నేను చెప్పిన విషయం ఏం చేశావు?

విద్యా : ఏమీ తేల్చుకోలేకుండా ఉన్నానండీ.

కూర్మా : ఏమిటోయ్ ఆ అంతులేని ఆలోచన? లక్షణంగా పిల్లనిచ్చి పెళ్ళిచేసి చదువుచెప్పిస్తానంటే మరొకడైతే ఎగిరి గంతేసేవాడు (భుజం మీద చెయ్యేసి) నీ బాగు కోరి

చెబుతున్నా. సరే నను-చూడూ! ప్రేమ-అపర్ణం ఇలాంటి పిచ్చి ఊహాలతో విని నా కలలు కంటున్నావేమో, కళ్లు తెరచి అసలు ప్రపంచాన్ని చూడు. మనిషి ముఖ్యంగా జయించాలిసింది పరమ దారిద్ర్యాన్నోయ్. ఇలాంటి అవకాశం తేలిగ్గా రాదు. ఏం, ఏమంటావ్?

విద్యా : (తటపటాయిస్తూ) మీ ఇష్టం.

కూర్మా : గుడ్ బాయ్! కంగ్రాట్యులేషన్స్.

[విద్యాపతి చెయ్యి పట్టుకుని ఊపేస్తాడు. "కల్యాణీ, కల్యాణీ" అంటూ లోపల్నించి మల్లిక ప్రవేశం.]

మల్లికా, మంచి సమయానికి వొచ్చావు. ఇలారా, అలా కూర్చో ఓ ముఖ్యవిషయం మాట్లాడాలి నీతో.

మల్లి : (విద్యాపతి వైపు కొరకొర చూస్తూ) అంత ముఖ్య విషయమైతే ఇక్కడెందుకూ? లోపలికి రా, మాట్లాడదాం.

కూర్మా : ఇక్కడే మాట్లాడాలి. మన విద్యాపతి ఉన్నాడు చూశావూ?

మల్లి : నిక్షేపంలా ఎదురుగుండా కూర్చొని ఉంటే, చూడకేం?

కూర్మా : అతను ఇవాళ్ళనించీ ఈ ఉద్యోగానికి గుడ్ బై కొట్టేస్తున్నాడు.

మల్లి : ఈసారి కాస్త మంచిగుమాస్తాని కుదుర్చుకో అన్నయ్యా.

కూర్మా : మంచిగుమాస్తా? ఓ, విద్యాపతి గుమాస్తా ఉద్యోగానికి తగడు. అతను పెద్దలాయరై పోతాడు, తెలుసా?

మల్లి : నీకంటేనా?

కూర్మా : ఓ యెస్, అవును. నాబావమరిది నాఅంత వాడై నాకంటే గొప్పవాడు కూడా అయి పోతాడు.

మల్లి : (ఆశ్చర్యంగా) బావమరదా?

కూర్మా : ఓ చిన్నరహస్యం మల్లికా. విద్యాపతి నిన్ను...నిన్ను...ప్రేమిస్తున్నాడు.

మల్లి : ఆఁ! ప్రేమా!

కూర్మా : ఆఁ- అవును- ఏం విద్యాపతీ?—చెప్పూ మాట్లాడవేం?

(విద్యాపతి గుటకలుమింగి అధైర్యంగా తల ఊపుతాడు)

మల్లి : విద్యాపతా?

కూర్మా : ఊఁ. నేను అనుమతి కూడా ఇచ్చేశాను, ఇహ నువ్వు 'ఊఁ' అనటమే తరవాయి

మల్లి : ఛీ.

కూర్మా : ఆఁ!

మల్లి : (విద్యాపతిని చూస్తూ) నా అంతరమెక్కడ, నీఅంతరమెక్కడ నన్ను ప్రేమించావూ? ఆ మాట అనటానికి నీకు సాహసం ఎలా వచ్చిందీ అంట? తాహతు తెలుసుకోకుండా మాట్లాడటమే! (కూర్మావతారంవైపు చూసి) అతనేదో బుద్ధి గడ్డితిని అంటే నువ్వు ఎలా వొప్పుకున్నావూ? ఇంకా నయం, శుభలేఖలు కూడా వేసేసింతరవాత చెప్ప లేదు. రక్షించావు.

కూర్మా: (కోపంగా) మల్లికా! ఏమిటా మాటలు?

మల్లి : లేకపోతే ఇద్దరూ కలిసి నన్ను అన్యాయం చేదామని చూశారూ? బరువైతే ఇంట్లోంచి పొమ్మనరాదూ? కట్నం ఇవ్వాలిసొస్తుందని ఎవడో వీధిన పొయ్యేవాడికి కట్టబెట్టాలని పన్నాగం పన్నావూ?

[కంఠం గాద్గదికమౌతుంది. విద్యాపతి ఆఫీసు గదిలోకి నిష్క్రమిస్తాడు.]

కూర్మా : విద్యాపతి వీధిన పోయేవాడా? గ్రాడ్యు యేటు కాబోతున్నాడు. లక్షణంగా లా చెప్పించి జూనియర్ గా వేసుకొంటాను. అతనికేం లోటొచ్చింది? మల్లికా నా మాట విను. నీ బాగుకోరి చెబుతున్నాను.

మల్లి : బాగు కోరేవాళ్లు చేసేపనులేనా ఇవి? నేను చస్తే ఒప్పుకోను.

కూర్మా : ఒప్పుకోవూ?

మల్లి : ఉహుఁ. నా కంఠంలో ప్రాణం ఉండగా ఒప్పుకోను.

కూర్మా : తల్లి లేని పిల్లవని గారాబం చేస్తూంటే రెచ్చి పోతున్నావే. నీకు-సంబంధాలు చూడలేక

నా ప్రాణం పోతోంది! ఏమయినా, నువ్వు విద్యాపతిని చేసుకుని తీరాలిసిందే! అంతే!

[కోపంగా గబగబ బయటికి నిష్క్రమిస్తాడు

మల్లి : ఇంత అన్యాయమా ? (కన్నీళ్లు పెట్టుకుంటుంది )

[సుందర్రావు ప్రవేశం.]

సుంద : మల్లికా, నవమల్లికాంబా ! నాకోసం ఎదురుచూస్తూ ఇక్కడే ఉన్నావా ! (కన్నీళ్లు చూసి) అదేమిటే ? కన్నీళ్లే ? నా మల్లికకి కన్నీళ్ళు. ఎందుకూ ? ఆలస్యంగా వచ్చాననా ? ఇంతమాత్రానికే అలా బేలవై పోతే ఎలా చెప్పు.

[రుమాలుతో కన్నీళ్లు తుడుస్తాడు]

మల్లి : అదికాదు

సుంద : నువ్వు కాదంటే మాత్రం నాకు తెలియదూ ? అదే. పిచ్చిదానా, నిన్ను చూడకుండా నేను మాత్రం ఒక్కక్షణం ఉండగలనా ?

మల్లి : అదికాదండీ మనిద్దర్నీ వేరుచెయ్యాలని చూస్తున్నారు.

సుంద : అది బ్రహ్మరుద్రాదులకూడా సాధ్యం కాదే !

మల్లి : వాళ్ళసంగతేమోకాని మా అన్నయ్యకి సాధ్యంకాని దేదీ లేదు నాకు పెళ్ళిచెయ్యాలని చూస్తున్నాడండీ.

సుంద : శుభం.

మల్లి : మీరు కూడా అలాగే అంటున్నారా ?

సుంద : అయితే అశుభం అనుమంటావా ?

మల్లి : మీకు వేళాకోళంగా ఉంది.

సుంద : లేకపోతే నాకు తెలియకుండా నీకు పెళ్ళి ఎలా అవుతుందీ ?

మల్లి : నన్ను విద్యాపతి కిచ్చి పెళ్ళిచెయ్యాలని చూస్తున్నాడండీ మా అన్నయ్య.

సుంద : నీ కోసం నేనూ, నా కోసం నువ్వూ పుట్టి పెరుగుతుంటే మధ్యన ఈ విద్యాపతి ఎవడూ ?

మల్లి : మా అన్నయ్య ఆఫీసులో గుమాస్తా అండీ.

సుంద : (వినిపించుకోక తలతిప్పుతూ) ఊహూ — అసంభవం — అసంభవం.

మల్లి : అవునండీ

సుంద : ఏమిటి అవును?

మల్లి : అతను మా గుమాస్తాగారు

సుంద : ఓ! అదా! అతను నిన్ను పెళ్లిచేసుకోటం అసంభవం.

మల్లి : నేను అతన్ని చేసుకోటం అసంభవం అనండి.

సుంద : అద్దాల గదిలో సుందర్రావు ఉండగా ఎవరైనా వచ్చి నిన్ను అమాంతం ఎగరేసుకుపోతాడూ?

మల్లి : రుక్మిణిని శ్రీకృష్ణుడెత్తుకెళ్లాడంటారే.

సుంద : సంయుక్తని పృథ్వీరాజెత్తుకెళ్లాడంటే ఇంకా బావుండదూ?

మల్లి : ఏమిటో నాకు భయంగా ఉంటుంది.

సుంద : భయమెందుకూ?

మల్లి : చివరికేమౌతుందో!

సుంద : అలా అయితే ఇప్పుడే ఈ క్షణంలోనే నిన్ను గాంధర్వ విధిని వివాహం చేసుకుంటున్నాను. ఇదిగో పెళ్లి కానుక.

[జేబ్‌బాగ్ లోంచి నెక్లెస్ కేస తీసి మల్లికకి స్వయంగా వేస్తాడు. అప్పుడే లోన కల్యాణి ద్వారం దగ్గరకి వొచ్చి ఆ దృశ్యం చూస్తుంది. తర్వాత కొంచెం పక్కకి తప్పుకుంటుంది.]

మల్లి : ఎంత బావుంది. నాకోసం తెచ్చారా!

సుంద : అహాఁ. నాకోసం. అది ధరించినప్పుడు నీ అందం చూసి ఆనందించేది నేను కాదూ?

మల్లి : ఈ వివాహం చెల్లుతుందంటారా?

సుంద : శకుంతలా దుష్యంతుల వివాహం చెల్లలేదూ?

మల్లి : చెల్లదని ఎవరైనా పేచీ పెడితే?

సుంద : అప్పుడు మళ్లీ పెళ్లి చేసుకుందాం.

మల్లి : ఇప్పుడే రిజిస్టరు మేరేజి చేసుకుంటేనో?

సుంద : చేసుకోవొచ్చు. దానికేం?

మల్లి : ఎప్పుడు?

సుంద : ఎప్పుడు వీలైతే అప్పుడే.

మల్లి : ఇటువంటివాటిలో ఆలస్యం పనికిరాదండీ. ఎప్పుడు వీలౌతుంది?

సుంద : మద్రాసు పోవాలిగా.

మల్లి : పోదాం.

సుంద : ఎప్పుడూ?

మల్లి : ఇప్పుడే.

సుంద : ఇప్పుడా! అంత అర్థంతరంగా ఎలా? వ్యవహారాలు చూసుకోవద్దూ?

మల్లి : అవన్నీ మళ్ళీ వొచ్చి చూసుకోవొచ్చు. ఇంక ఒక్క క్షణంకూడా ఇక్కడ ఉండటానికి బుద్ధిపుట్టటం లేదండీ నాకు.

సుంద : కొన్ని చిక్కులున్నాయి మల్లికా.

మల్లి : అదిగో—వెనక్కి తగ్గుతున్నారు

సుంద : అదికాదు. డబ్బు చూసుకోవద్దూ? రావలసిన బాకీలు బోలెడున్నాయి.

మల్లి : నా దగ్గిర పదివేల రూపాయల కిమ్మత్తు చేసే నగలున్నాయి.

సుంద : ఉంటే?

మల్లి : అవన్నీ తెస్తాను, కొన్నాళ్ళు వాడుకోవొచ్చు. ఏ పిక్చర్‌కో మళ్ళా ఆర్టుడైరెక్టర్ చేశారంటే అంతకి రెట్టింపు కొనిపెట్టరూ?

సుంద : ఎందుకు కొననూ?

మల్లి : మరి ఇంక అభ్యంతర మేముంది?

సుంద : ఏమీ లేదు నువ్వు రెడీగా ఉండు. ఇప్పుడే వొస్తా, ఇద్దరం కలిసి స్టేషన్‌కి వెడదాం. ఏం?

మల్లి : నిమిషంలో రెడీకానూ? మీరుమాత్రం త్వరగా రావాలి. ఎదురుచూస్తూంటాను.

సుంద : ఓ. అలాగే, ఇక్కడున్నట్టే వొచ్చేస్తా. (మల్లిక లోపలికి నిష్క్రమణ) వెర్రిబాగులది!

[విద్యాపతి గదిదగ్గిరికి వెళ్ళి] విద్యాపతి గారూ, విద్యాపతి గారూ.

[విద్యాపతి ప్రవేశం]

విద్యా : మీరా! ఏంకావాలండి సుందర్రావు గారూ?

సుంద : ఒక ముఖ్య విషయం మీతో మాట్లాడాలండీ (చుట్టూ చూసి) ఎవరూ లేరుగద. చాలా రహస్యం.

విద్యా : ఏమిటో చెప్పండి.

సుంద : మీ ప్లీడరుగారి క్లయింటు ధర్మారావు ఉన్నాడే, అతను వొట్టి నీతీ నిజాయితీలేని మనిషండీ.

విద్యా : అందులో రహస్య మేముందీ?

సుంద : అతనిమీద ఓ ప్రాంసరీనోటు విషయంలో దావా చేశారండీ సన్యాసిరాజు గారు.

విద్యా : అవును. చేస్తే?

సుంద : నోటు మీది సంతకం ఫోర్జరీ అంటాడు ధర్మారావు.

విద్యా : కోర్టులో తేలుతుందిగా.

సుంద : మీ దగ్గిర ఉన్న ధర్మారావు ఫయిల్లో—సన్యాసి రాజుగారు ఆయన గుమాస్తాకి రాసినట్టుగా ఉన్న ఓ కాగితం ఉందండీ

విద్యా : ఉంటే?

సుంద : అది ఫోర్జరీ కాగితమే అనుకోండి అయినా కొంచెం చిక్కు కలిగిస్తుంది చూడండి.

విద్యా : ఎవరికీ?

సుంద : సన్యాసి రాజుగారికి. ఈ విషయంలో నే మీరు కొంచెం సహాయం చెయ్యాలి.

విద్యా : నావల్లేమౌతుందీ?

సుంద : మరేమీ అనుకోవొద్దు. ఆ కాగితం కొంచెం దయచేసి నాకిచ్చేస్తే—

విద్యా : ఆఫీసు కాగితమా! ఇంకానయం!

సుంద : ఊరికే ఇవ్వొద్దు ఏదో యథాశక్తిని సంతోష పెడతాము

విద్యా : లంచమిచ్చి నన్ను కొనాలని చూస్తున్నారూ?

సుంద : మిమ్మల్ని కాదండీ. ఆ కాగితాన్ని. మిమ్మల్నేం చేసుకొంటాం.

విద్యా : ఇహ ఎప్పుడూ ఆ విషయం ఎత్తకండి (పోబోతాడు)

సుంద : (ఆపి) అలా తొందరపడతారేం? ధర్మారావు ఎలాగో దివాలా తీశాడని మీకు తెలిసే ఉంటుంది. కేసు గెలిచినా ఓడినా ఆయన కొక్కటే. అసలు రాజీపడి దావా ఉపసంహరించుకునేట్టు కూడా ఉన్నారు.

విద్యా : అయితే ఇహ ఆ కాగితం ఎందుకూ?

సుంద : ఏదో కొంచెం బెట్టుచెయ్యటం కోసం. మాటా మాటామీద పడ్డ దావా అండీ ఇది. పైవసబ్బుకోసం కాదు. ఆ ధర్మారావు పరువు ఎలాగో పోయింది. సన్యాసిరాజు గారి పరువైనా నిలబెట్టండీ.

విద్యా : నేను నిలబెట్టేదేమిటి?

సుంద : మరి ఇప్పుడంతా మీ చేతుల్లోనే ఉంది. కావాలంటే ఓ వంద — కాకపోతే రెండు— పోనీ మూడొందలు తీసుకోండి.

విద్యా : నావల్ల కాదండీ

సుంద : సరే, అయిదొందలు తీసుకోండి.

విద్యా : ఆఫీసు కాగితం దొంగలించటమే!

సుంద : ఆరొందలు.

విద్యా : సాధ్యం కాదండీ కూర్మావతారంగారడిగితే ఏం చెప్పను.

సుంద : గది తాళం చెవి మీదగ్గరే ఉంటుందా రాత్రిళ్లు కూడా?

విద్యా : ఉంచెదనుకోండి.

సుంద : ఆఫీసు గదిలోకి ఎంతమందో వొస్తూ పోతూ ఉంటారూ?

విద్యా : అయితే మాత్రం?

సుంద : అడిగితే 'దొంగలున్నారు, జాగ్రత్త' అనండి.

విద్యా : నమ్మేవిషయమేనా?

సుంద : నమ్మకపోతే ఉరిపెట్టుకోనీయండి మీకేం?

విద్యా : నామీద బాధ్యత లేమా?

సుంద : అయితే మీ ఇష్టం. మరి నేను వెళుతున్నాను.

విద్యా : వెళ్లండి.

సుంద : నామాటవినండి. ఏడొందలు — ఎనిమిది — పోనీ తొమ్మిదివందలు. ఆఖరిమాట వెయ్యి రూపాయలు!

విద్యా : వెయ్యిరూపాయలు!

సుంద : అమ్మో! అంతనర వెళుతున్నానా! సరే, మాట జారాక చేసేదేముంది! విద్యాపతిగారూ, ఒక్కసారి ఆలోచించుకోండి — ఈ వెయ్యిరూపాయలతో ఎటువంటి సౌఖ్యాలు కొనుక్కోవచ్చు, చెప్పండి! బి. ఏ. నే చదువుతారో, పెళ్లే చేసుకొంటారో, చిన్న ఇల్లే కొనుక్కుంటారో, ఓహో! డబ్బండి, ఈరోజుల్లో కావలసింది డబ్బు. తిరగకొట్టకండి.

విద్యా : (ఆలోచనగా) ఇప్పుడే ఇస్తారా?

సుంద : ఇప్పుడూ! ఈచేత్తో ఇలా కాగితం తీసుకోటం — ఈచేత్తో అలా పదివందల రూపాయలనోట్లు ఇచ్చెయటం. అంతే.

[ఒక్క క్షణం గిటపటాయించి విద్యాపతి ఆఫీసుగదిలోకి నిష్క్రమించి ఓ కాగితంతో వెంటనే తిరిగొస్తాడు. అతని చేతులు వొణుకుతూంటాయి. సుందర్రావు ఆ కాగితం తీసుకొని కరెన్సీనోట్లు ఇస్తాడు, విద్యాపతితో 'థాంక్స్. మీ మేలు మరిపోను. వొస్తా' (నిష్క్రమిస్తాడు)

[చేతిలోని కరెన్సీనోట్లతో విద్యాపతి స్తబ్దుడై కాసేపు అలాగే నిలబడతాడు. ఈ వ్యవహారం చూస్తూ నేయున్న కల్యాణి అతన్ని సమీపిస్తుంది. ఆమె దగ్గరికి రాగానే చూసి విద్యాపతి ఉలిక్కిపడి నోట్లు జేబులో పెట్టు ఆమెవైపు చూపులు మరలిస్తాడు. ఇద్దరి చూపులూ క్షణకాలం కలుసుకుంటాయి. ఆమె ఏదో అనబోతుంది. అతనేదో అనబోతాడు. కాని చివరికి ఎవరూ ఏమీ మాట్లాడరు. విద్యాపతి బరువుగా బయటికి నిష్క్రమిస్తాడు. అతనివైపే కొన్ని క్షణాలు చూసి కల్యాణి టేబుల్ దగ్గరికి వెళ్లి ఫోన్ చేస్తుంది ]

కల్యా : హౌస్ రిక్రియేషన్ క్లబ్ ?......అప్పోకేట్ కూర్మావతారంగారున్నారా? — ఒక్కసారి పిలవండి — ఓ — నేనండీ, కల్యాణిని— మీ ఆఫీసునించి ఫోన్ చేస్తున్నాను. అర్జంటుగా రావాలి. చాలా జరూరు. వెంటనే రండి...

[రిసీవర్ పెట్టేస్తుంది]

(చేతిలో ఓ కవరుతో వరహాలు ప్రవేశం)

వర : కల్యాణమ్మగారూ, దణ్ణం అమ్మా.

కల్యా : (వెనక్కి తిరిగి వరహాల్ని చూసి) ఓ-నువ్వా, వరహాలూ. ఏం కావాలి! ఇక్కడికొచ్చావేం?

వర : (కవరు ఇస్తూ) బాబుగారు తమరికి ఇయ్యమన్నారమ్మా

కల్యా : (తీసుకుని) ఏ బాబుగారూ?

వర : చిన్నబాబుగారండి.

కల్యా : (కోపంగా) అక్కర్లేదు. తీసుకుపో.

వర : ఓ పాలి ఇచ్చివాక మళ్లా రిటర్న్ పుచ్చుకోరాదమ్మా.

కల్యా : నే నక్కర్లేనంటున్నాగా తీసికెళ్లు.

వర : అట్టనయితే కవరుమీద మీ చిరునామా కొట్టేసి చిన్నబాబుగారి చిరునామా రాయండి.

కల్యా : నేను రాయను.

వర : చిక్కే నే—పోనీ, 'ఇది నేను పుచ్చుకోను' అని కవరుమీద రాసి సంతకం చేసివ్వండమ్మా.

కల్యా : ఇంతజాగ్రత్త ఎక్కడ నేర్చుకున్నావు వరహాలూ?

వర : సన్నాసిరాజుగారి దగ్గిరమ్మా. ఎవ్వారం ఎవ్వారమే. మాటమాటే. 'కాయితంమీద బిగిస్తేకాని మాటకి విలువొచ్చి ఎవ్వారం కాదురా వరహాలూ' అంటారమ్మ సన్నాసిరాజుగారు.

కల్యా : ఇందులో వ్యవహారమేముందీ?

వర : చిత్తం. ఆ కవర్లో ఏం యవ్వారముందో నాకేం తెలుస్తుందమ్మా?

కల్యా : బాగానే ఉంది. (కవరు ప్రమన చింపి) చూద్దాం, ఆ వ్యవహారమేమిటో! (చదివి తెల్లబోతుంది) వరహాలూ!

వర : చిత్తం. ఏంటమ్మా అలా ఇదయిపోతున్నారు? కానిమాటలేం రాయలేదుగద!

కల్యా : నీకు సుందర్రావుగారు తెలుసా?

వర : సుందర్రావుగారంటే—సన్నగా ఎర్రగా పొడుగ్గా ఉంటారు. గిరజాలుంటాయి, తోలుసంచీ ఉంటుంది. ఆయనేనా?

కల్యా : ఊఁ. ఆయనే.

వర : తెలీకేం? రోజూ సన్నాసిరాజుగారి దగ్గిరికొచ్చి కబుర్లు కొట్టిపోస్తుంటారుగా.

కల్యా : ఊఁహూఁ! ఆయనెటువంటివాడు? మంచివాడేనా?

వర : ఏంమంచో లెండి. ఆయనంటే ఎందుకో నాకిష్టంలేదమ్మా. (గొంతు తగ్గించి) ఎవ్వరితో అనబోకండి గాని, సన్నాసిరాజుగారింట్లో తాకట్టుసొమ్ము కొట్టేసింది ఈయనేనని నా అనుమానం.

కల్యా : తాకట్టుసొమ్మా? పోయిందా?

వర : చిత్తం. తమరికి తెలీయదూ? ఆరింట్లో గోల్డునెక్లెస్ పోయిందండి పొద్దున.

కల్యా : గోల్డునెక్లెసా? మామిడిపిందెల నెక్లెసేనా?

వర : చిత్తం. ఇన్స్పెక్టర్ బాబుతో బాబుగారు అట్టనే చెప్పినట్లు గుర్తు.

కల్యా : నువ్వు అర్జంటుగా వెళ్ళి సన్యాసిరాజుగారితో వెంటనే ఇక్కడికి రమ్మని చెప్పు. పోయిన నెక్లెసు దొరుకుతుందని చెప్పు. చిన్నబాబుగార్ని కూడా రమ్మను. నెక్లెస్ సంగతి చెప్పకుండా ఊరికే నేను రమ్మంటున్నానని చెప్పు. చూడూ! ఇద్దరికీ విడివిడిగా ఒకరికి తెలియకుండా ఒకరికి చెప్పు.

వర : చిత్తం తమరేదో పసిగట్టినట్టున్నారమ్మా.

కల్యా : తరవాత చెబుతాలే తొందరగా వెళ్లు.

వర : చిత్తం. (వెళ్లబోతూ ఆగి) 'ఉత్తరం చూసి కల్యాణమ్మగారు ఏమన్నార్రా, వరహాలూ?' అని చిన్నబాబుగారడిగితే, గుర్రుగా చూసీ చూసి చిర్రుబుర్రుమన్నారని చెప్పనా, కల్యాణమ్మగారూ?

కల్యా : ష్! (నవ్వుతూ వొద్దన్నట్టు సంజ్ఞ చేస్తుంది.)

[ఓసారి బుజాలెగరేసుకుని వరహాలు నిష్క్రమిస్తాడు. కొద్దిక్షణాలాగి లక్ష్మీపతి ప్రవేశం]

లక్ష్మీ : అమ్మాయ్!

కల్యా : (చూస్తూ ఉన్న ఉత్తరం దాచేసి) మీరా నాన్నా! ఇక్కడికొచ్చారెందుకూ? అడ్వకేట్ గారితో ఏమైనా పనుందా?

లక్ష్మీ : ఆయనతో నాకేం పనీ? మీ ఆఫీసుగుమాస్తా విద్యాపతి ఉన్నాడా?

కల్యా : ఇప్పుడే బయటికి వెళ్ళారు. ఏమైనా మాట్లాడాలా?

లక్ష్మీ : మరేం లేదులే. మీ ఆఫీసులో ధర్మారావు ఫైలు ఓసారి ఇలా తెస్తావూ?

కల్యా : ధర్మారావు ఫైలా? ఎందుకూ?

లక్ష్మీ : ఓ కాగితం చూడాలమ్మాయ్.

కల్యా : దానితో మీకేం పనీ?
లక్ష్మి : ఓ చిన్న వ్యవహారం ఉందిలే.
కల్యా : రేపు చూడకూడదూ?
లక్ష్మి : ఈ భాగ్యానికి రేపటిదాకా ఎందుకూ?
కల్యా : ఇప్పుడెలా? అడ్వకేటు గారూ, విద్యాపతి గారూ ఇద్దరూ లేరే!
లక్ష్మి : నువ్వున్నావుగా!
కల్యా : నాకా ఆఫీసు గొడవ లేం తెలియవే.
లక్ష్మి : తెలిసేదేముంది? ఫైలు మీద పేరుంటుంది. కాస్త చూసి తెచ్చి పెడుదూ?
కల్యా : (ఆలోచనగా) బావుండదు నాన్నా.
లక్ష్మి : బావుండకేమిటమ్మాయ్. ఇదేమైనా తప్పు పనా?
కల్యా : ఆఫీసు కాగితాలు చూపించటం తప్పు కాదూ?
లక్ష్మి : అదేదో రహస్యమైన కాగితం అనుకుంటున్నావు కాబోలు. అసలు సంగతి చెప్పమన్నావా? నన్ను ఉద్యోగం లోనుంచి తీసేస్తూ సన్యాసి రాజుగారు ఇచ్చిన కాగితమే అది.
కల్యా : అయితే అది ధర్మారావు ఫైల్లో ఉండటానికి కారణం?
లక్ష్మి : వాళ్ళిద్దరి మధ్యా దావాకీ ఆ కాగితానికీ కొంచెం సంబంధం ఉందిలే. అప్పుడేదో ఆయన మీద కోపం వొచ్చి ధర్మారావు కిచ్చాను. ఇప్పుడు వ్యవహారం సద్దుబాటయిందిగా! అందుకని—
కల్యా : అందుకని ఆ కాగితం గప్‌చిప్‌గా తీసుకు పోదామని వొచ్చారా?
లక్ష్మి : ఏం? నా కాగితం నేను తీసుకోటం తప్పా?
కల్యా : అయితే ధర్మరావు దగ్గిర్నించే తీసుకోండి.
లక్ష్మి : ఆఁ—! మళ్లీ అతని దగ్గిరికి వెళ్ళటం ఏం బావుంటుంది? నా మాట విని ఆ ఫైలిలా తెచ్చి పడేద్దూ.
కల్యా : (కోపంగా) నేనటువంటి పనులు చెయ్యను.
లక్ష్మి : (కోపంగా) చాల్లే. ఊరుకో. ఇదంతా ఎవరి కోసం? నీ కోసం కాదూ? అసలా సుందర్రావు గారే ఎలాగో సాధిస్తానన్నాడు కాని...
కల్యా : సుందర్రావా? (ఆలోచనగా కనుబొమలు ముడుస్తుంది.)
లక్ష్మి : ఊఁ సన్యాసిరాజు గారి స్నేహితుడు సుందర్రావు అని ఒకాయన ఉన్నాడులే. అఖండుడటలే. ఆయన చిటికెలో సాధించగలడు కాని కాగితం వాళ్ళ చేతుల్లో పడకుండా మన దగ్గిరే ఉండటం మంచిదని పించటంవల్ల ఇలా వొచ్చాను. నా మాట విను కల్యాణీ
[కల్యాణి తీవ్రంగా ఆలోచనలో పడుతుంది. అందువల్ల ప్రత్యుత్తరం ఇవ్వదు]
అమ్మాయ్, కల్యాణీ!
[ప్రత్యుత్తరం రాక]
పోనీ, నేనే వెతుక్కోనా?
[జవాబు రాదు. లక్ష్మిపతి అది అంగీకార సూచకంగా తీసుకుని ఆఫీసు గదిలోకి నిష్క్రమిస్తాడు. బల్లమీద టెలిఫోన్ బెల్ మోగుతుంది. కల్యాణి ఆలోచనలోనుంచి తేరుకుని రిసీవర్ తీసుకుంటుంది.]
కల్యా : ఎవరండీ? ఇన్‌స్పెక్టర్ గారా?... నేను కూర్మనాథం గారి ఆఫీసులో టైపిస్ట్‌ని. వారు లేరు ఇప్పుడే వొస్తారు....ఏం చెప్పమన్నారు? విద్యాపతి గారా? అవును. మా ఆఫీసు మేనేజర్ గారే—అరెస్టయ్యారా! అరెస్టే! ఎందుకూ?...దయచేసి ఆఫీసుకి మీరు రాగలరా! కొన్ని ముఖ్యవిషయాలు తెలియవచ్చు ఓ థాంక్స్.
[రిసీవర్ కింద పెట్టేసి ఏమీతోచక అటూ ఇటూ చూసి టైపిస్ట్ గదిలోకి నిష్క్రమిస్తుంది. చేతిలో లెదర్ సూట్‌కేస్‌తో సుందర్రావు ప్రవేశం. ఇంచుమించు అదే సమయాన లోపల్నించి చేతిలో లెదర్ సూట్‌కేస్‌తో మల్లిక ప్రవేశం]
మల్లి : (సంతోషంగా) మీరు కూడా వొచ్చేశారే!
సుంద : మాట తప్పుతాననుకున్నావా?
మల్లి : చూశారా? ఇద్దరం ఒకేసారి సిద్ధమయ్యాం. ఇద్దరిమనసులూ ఒక్కటేనన్నమాట.
సుంద : కాదుమరీ.

మల్లి : వెళదామా ?

సుంద : ఓఁ. రెడీ. చల్ మోహనరంగా !

[ఇద్దరూ కలిసి ద్వారం వైపుకి నడతారు. ద్వారం సమీపించీ సమీపించగానే కూర్మావతారం ప్రవేశం. ముగ్గురూ దిగ్భ్రాంతులై ముఖముఖాలు చూసుకుంటారు.]

కూర్మా : ఇదా కథ !

సుంద : దయచేసి సుఖాంతం కానివ్వండి అడ్వకేట్ గారూ ?

మల్లి : మేమిద్దరం గాఢంగా ప్రేమించుకున్నాం అన్నయ్యా.

కూర్మా : ప్రేమించుకున్నారా ?

మల్లి : అవును. కదండీ సుందర్రావుగారూ ?

సుంద : మా ప్రేమలత చిగురించి, పుష్పించి—(మల్లిక వైపు చూస్తాడు)

మల్లి : ఫలించింది. నిత్యకల్యాణంగా, పచ్చతోరణంగా—(సుందర్రావు వైపు చూస్తుంది)

సుంద : మూడు పువ్వులూ, ఆరు కాయలుగా—

మల్లి : మా ప్రేమలత వర్ధిల్లాలని ఆశీర్వదించు అన్నయ్యా.

కూర్మా : (కోపంగా) ఆశీర్వదించాలీ !

మల్లి : అవునన్నయ్యా. అక్షింతలు తేనా ?

సుంద : ఎందుకూ ? చిలకా, గోరింకల్లా కాలక్షేపం చెయ్యమని ఒక్కమాట అనండిచాలు.

కూర్మా : చాల్లేవయ్యా.

మల్లి : మా సంతోషాన్ని పాడుచేస్తావా అన్నయ్యా ?

సుంద : పానకంలో పుడకలా అడ్డొస్తారా ?

కూర్మా : ఇహ ఆపవయ్యా! పెద్దమనుషులచుట్టూ తిరుగుతుంటే పెద్దమనిషివనుకున్నాను గాని ఇటువంటి పాడుపని చేస్తావనుకోలేదు.

సుంద : ఏంచేశానండీ నేను ? పెళ్ళి చేసుకోటం పాడుపనా ? ఆమాట ముందే తెలుస్తే పెళ్ళి చేసుకోనేవాణ్ణి కాదే !

కూర్మా : పెళ్ళి చేసుకున్నావా ?

మల్లి : అవును. గాంధర్వవివాహం చేసుకున్నాం !

కూర్మా : గాంధర్వ వివాహం ! అదేమిటే ? లాపుస్తకాల్లో ఎక్కడా లేదే !

మల్లి : అందుకే లాప్రకారం చేసుకుందామని—

కూర్మా : ఉడాయిస్తున్నారా ! నా పరువు నట్టేట్లో కలపదలుచుకున్నావా ?

మల్లి : అడుక్కుతినే వాడికిచ్చి చేస్తే నీ పరువు గంగలో కలవదూ ?

సుంద : గంగలో కలిస్తే పవిత్రమౌతుందిలే, మల్లికా.

కూర్మా : చాల్లెండి, వెధవ్వేషాలు. మా మల్లికని చేసుకోటానికి నీ క్వాలిఫికేషనేమిటో ?

సుంద : మేమిద్దరం ప్రేమించుకున్నాం. అంతే.

కూర్మా : ప్రేమించటానికి నీ అర్హతేమిటోయ్ !

సుంద : ప్రేమ గుడ్డిదండీ, ప్లీడర్ గారూ.

కూర్మా : కుంటిది కాదూ.?

సుంద : ఎందుకాదు ? ప్రేమగుడ్డిదీ, కుంటిదీ, చెవిటిదీ, మూగదీ, పిచ్చిదీ కూడా.

కూర్మా : అయితే అటువంటి ప్రేమని ఎవరు లెక్కచేస్తారూ ? మల్లి ఇటువైపు కన్నెత్తి చూడకుండా నీదారిన నువ్వు పో. క్షమించి విడిచిపెడుతున్నాను.

సుంద : (తెల్లబోయి) క్షమించి మా ఇద్దర్నీ విడిచిపెట్టండీ.

మల్లి : ముందెప్పుడూ మేం విడిపోకుండా ఉండాలనుకున్నాం.

సుంద : అంత గాఢంగా ప్రేమించుకున్నాం.

కూర్మా : నిజంగా ?

మల్లి, సుంద : నిజంగా.

కూర్మా : నమ్మవచ్చా ?

మల్లి, సుంద : తప్పకుండా.

కూర్మా : మీ ప్రేమ స్వచ్ఛమైనదీ, నిజమైనదీ అనటానికి—సాక్ష్యం ?

మల్లి, సుంద : సాక్ష్యమా ?

కూర్మా : అవును. సాక్ష్యం లేకపోతే ఎలానమ్మను ?

సుంద : ప్రేమకి సాక్ష్యమేమిటి ?

కూర్మా : ఈ పెట్టెల్ని సాక్ష్యం వేసుకోమంటారా ?

సుంద : అదేం సాక్ష్యం ?

కూర్మా : ఆ పెట్టెలు రెండూ అక్కడ పెట్టి వెళ్ళిపొండి.

సుంద : కటుగుడ్డల్లోనా? ఆ పెట్టెలో నా డబ్బుంది.

మల్లి : ఈ పెట్టెలో నా చీరలూ, నగలూ ఉన్నాయి.

కూర్మా : సత్రా భోజనం, మఠా నిద్రా చెయ్యండి. ఇంకా విడిచిపెట్టలేక పోతే అప్పుడురండి. నేనే వైభవంగా మీ కిద్దరికీ పెళ్ళి చేస్తాను.

[మల్లికా, సుందరరావూ ఒకరి నొకరు చూసుకుంటారు]

మల్లి : అమ్ముక్కుతినమంటావా?

కూర్మా : ఎందరు తినటంలేదు?

సుంద : నావల్లకాదు.

కూర్మా : చూశావా? సాక్ష్యం తెమ్మనే సరికి బండారం బయటపడ్డది. (కఠినంగా) ఇదేం అమానుషీ వ్యవహారం అనుకున్నావా? చేసిన పనికి క్షమాపణ పత్రం రాసిచ్చి నా కంటికక్కనిపించకుండా దూరంగా వెళ్లు. ప్రేమట, ప్రేమ! కల్యాణీ ... కల్యాణీ!

[కల్యాణి వొస్తుంది]

ఓ క్షమాపణపత్రం చెబుతాను, రాసుకో. మహారాజశ్రీ అడ్వకేట్ కె. కె. . అవతారం గారికి — ఉహుఁ — గారి పాద పద్మముల సన్నిధికి —

[కల్యాణి రాయబోతూఉంటుంది. సీతారామారావు ప్రవేశం. బుజాన కెమెరా తగిలించుకుంటాడు.]

సీతా : కల్యాణీ, కల్యాణీ.

[ఇతర వ్యక్తుల్ని చూసి తటపటాయిస్తాడు.] సుందరరావు గారుకూడా ఇక్కడే ఉన్నారే.

కూర్మా : ఎవరండీ? మిమ్మల్నెక్కడో చూశానే.

సీతా : నేనండీ, సీతారామారావుని. విద్యాపతి స్నేహితుణ్ణి.

కూర్మా : (గుర్తుతెచ్చుకుని) ఓ. అవును. ఏంకావాలి మీకు?

సీతా : క...కల్యాణి.

కూర్మా : ఒక నిమిషం ఆగండి. ఊఁ-రాసుకో కల్యాణీ! సత్యశివసుందరరావు వ్రాసిఇచ్చిన క్షమాపణ పత్రం.

సీతా : క్షమాపణపత్రమా? సుందరరావుగారా ఏంచేశారండీ? వారు చాలా మంచివారే.

కూర్మా : (వినిపించుకోక కల్యాణి వైపు చూస్తూ) అయ్యా —

నేను, బుద్ధి గడ్డితిని, అజ్ఞానినై, శుంఠనై —

[సీతారామారావు, కల్యాణివైపూ మల్లిక వైపూ చూసి నెక్లెస్ మల్లిక ధరించటం గ్రహించి ఆశ్చర్యపడతాడు. ఆ ఆశ్చర్యంలో నోరు తెరుచుకుని మల్లికవైపు వేలు చూపించి కల్యాణితో ఏదో అనబోయి అవతారంగారు తనవైపు చూడటం చూసి దిగమింగుకుంటాడు.]

మల్లికాంబను ప్రేమించానని పొరపడి ఆ భ్రమలో ఆమెని వివాహం చేసుకోవాలని ప్రయత్నించాను. నా భ్రమ ఇప్పుడు వదిలిపోయినది. ఇక ఆమె జోలికిరాను. క్షమించ ప్రార్థన. చిత్తగించ వలెను. ఇట్లు

విధేయుడు.

[సన్యాసిరాజు ప్రవేశం. సీతారామారావు గతుక్కు మంటాడు.]

సన్యా : ప్లీడర్ గారు ఏదో వ్యవహారంలో ఉన్నట్టున్నారే.

కూర్మా : రండి, రండి, సన్యాసిరాజు గారూ.

సన్యా : మా సీతారాముడూ ఇక్కడే ఉన్నాడే! ఏమమ్మా కల్యాణీ, వరహాలుచేత కబురు పంపావు. ఏమిటి విశేషం?

కల్యా : మీ దగ్గిర తాకట్టు ఉంచిన సొమ్మేదో పోయిందట కదూ? ఆ విషయం మాట్లాడదామని కబురు చేశానండీ.

సన్యా : (ఆతృతగా) ఆమాకి ఏమైనా తెలిసిందా?

కల్యా : ఇంతకీ పోయిన సొమ్మేమిటి?

సన్యా : గోల్డ్ నెక్లెసమ్మా. గోల్డు నెక్లెసు!

కల్యా : ఎటువంటిది?

సన్యా : మామిడిపిందెల నెక్లేసు.

[సుందరరావు ముఖం వివర్ణమౌతుంది. అప్రయత్నంగా మల్లికవైపు చూస్తాడు. సీతారామారావు అది కనిపెడ్తాడు.

కల్యా : దొరికితే గుర్తు పట్టగలరా?

సన్యా : ఎందుకు పట్టలేనూ? దానిమీద అక్షరాలు కూడా ఉన్నాయి.

కల్యా : సీతారామారావుగారూ, మీరు సుందర్రావుగారిద్వారా నాకో బహుమానం పంపారుగదూ?

సీతా : (పాలిపోయి) నేనా.... నేనా? లేదే?

కల్యా : (ఉత్తరం చూపిస్తూ) ఇదిగో సాక్ష్యం...

సన్యా : (ఆశ్చర్యంగా) ఏదీ?

[అందరూ ఆశ్చర్యంగా కల్యాణిచేతిలోని ఉత్తరంవైపు చూస్తారు.

కల్యా : (ఉత్తరం సన్యాసిరాజు కిస్తూ) గట్టిగా చదవండి, అందరూ వింటారు.

సన్యా : (చదువుతూ) ప్రియమైన కల్యాణికి— సుందర్రావుగారి ద్వారా ఈ ఉదయం మీకు నేను బహుమానంగా పంపిన మామిడిపిందెల నెక్లెస్ అందే ఉంటుంది. మన వివాహం దాదాపు నిశ్చయమైనట్టేనని ఇప్పుడే తెలిసింది. అందుకునన్ను నేనే అభినందించుకుంటున్నాను. ఎంతశుభవార్త!

నీ,

సీతారామారావు.

హారి సీతారాముడూ, ఇదిట్రానువ్వు చేసే పని! శ్రద్ధగా చదువుకుని బుద్ధిగాపడి ఉండక ఈ చిల్లరపనులేమిట్రా! ఛీ. ఇంతకీ ఆవస్తువేం చేశావు?

కల్యా : ఆవిషయం సుందర్రావుగారి నడగండి.

సన్యా : ఏమండీ, సుందర్రావు గారూ.

[సుందర్రావు నిరుత్తరుడౌతాడు. గాభరాగా అతనివైపుచూస్తుంది మల్లిక.]

మల్లి : (చిన్నబోయిన ముఖంతో) ఇదేనా అది?

సన్యా : (అందుకుని పరీక్షించి) ఆఁ...ఇదే. ఇదే! నీదగ్గరికెలా వొచ్చిందమ్మా?

మల్లి : (కొంచెం కోపంగా) సుందర్రావుగారిచ్చారు.

కూర్మా: ఇది ఇంకో నేరమా! ఏంపెద్దమనిషివయ్యా, సుందర్రావ్?

సన్యా : (ఆశ్చర్యంగా) సుందర్రావుగా రిలాంటి పనిచేశారా? ఎంత ఆశ్చర్యం!

[ఇన్‌స్పెక్టర్ దండయ్య నాయుడు విద్యాపతితో సహా ప్రవేశం.]

కూర్మా : ఏం, విద్యాపతీ, పోలీస్ ఇన్‌స్పెక్టర్ గార్ని పిలుచుకొస్తున్నావు ఆ అవసరమేం లేదే!

ఇన్ : అవసరం లేకపోతే నేనెందుకొస్తానండీ అడ్వకేట్ గారూ? విద్యాపతిగారు నన్ను తీసుకురాలేదనీ, నేనే ఆయన్ని తీసుకొచ్చాననీ గమనించండి. మీకు తెలిసే ఉంటుంది—అతను ప్రస్తుతం నాఖైదీ.

కూర్మా: (ఆశ్చర్యంగా) ఖైదీ! ఏం! చేశాడు?

ఇన్ : లక్ష్మీపతిగారు పోగొట్టుకొన్న కరెన్సీనోట్లు ఇతని దగ్గర దొరికాయి.

[అందరూ ఆశ్చర్యంగా విద్యాపతి వైపు చూస్తారు. లక్ష్మీపతి గబగబ ఆఫీసుగదిలోంచి ప్రవేశం]

లక్ష్మీ : (సంతోషాశ్చర్యాలతో) ఆఁ! నావెయ్యి రూపాయిలూ దొరికాయా?

ఇన్ : మీరిక్కడే ఉన్నారూ? అవునండీ, దొరికాయి.

కూర్మా: ఆఫీసుగదిలో ఏం చేస్తున్నారు లక్ష్మీపతి గారూ?

లక్ష్మీ : అహఁ— ఏం లేదు—మీరంతా ప్రైవేటు విషయాలు మాట్లాడుకుంటుంటే నేనెందుకని అక్కడ ఉన్నాను...ఎలా దొరికాయండీ ఇన్‌స్పెక్టర్ గారూ?

ఇన్ : ఇతను బ్యాంకులో డిపాజిట్ చేస్తుంటే పట్టుకున్నాను.

కూర్మా: ఏ బ్యాంకూ?

ఇన్ : కోఆపరేటివ్ బ్యాంక్ సాయంత్రం అయిదింటి దాకా అందులో లావాదేవీలు జరుగుతాయి లెండి.

లక్ష్మీ : ఎంత అదృష్టం. ఎంతఅదృష్టం. ఆశ వొదులుకున్నానండీ ఇన్‌స్పెక్టర్ గారూ. దేవుడల్లే రక్షించారు.

కూర్మా: (విద్యాపతి దగ్గరగా వెళ్ళి) ఏమిటి విద్యాపతీ, ఇదంతా?

విద్యా : నా నేరం ఒప్పుకుంటున్నాను.

కూర్మా: ఒప్పుకుంటున్నావా?

ఇన్ : తప్పుకోలేకపోతే ఒప్పుకోవటమే మంచిది.

కూర్మా: అధైర్యపడకు విద్యాపతీ. నీ వనక నేను నిలబడతాను. జామీనిచ్చి విడిపిస్తాను అడ్వకేట్ కూర్మావతారం ఆజానుబాహువు. హరిహరాదు లడ్డొచ్చినా నన్నేం చెయ్యలేరు

విద్యా : మీ దయకి నేను పాత్రుణ్ణి కాను. ఆశకి లోబడి అధఃపాతాళానికి పోయిన బుద్ధిహీనుణ్ణి. లక్ష్మీపతి గారూ, మీ వెయ్యి రూపాయలూ దొంగిలించింది నేనే.

లక్ష్మీ : (ఆశ్చర్యంగా) నువ్వే! చీకట్లో ఢీకొట్టి పర్సు కాజేసి పారిపోయింది నువ్వే! ఎంత మోసం! ఎంత అన్యాయం!

విద్యా : పొరపడుతున్నారు లక్ష్మీపతిగారూ అన్యాయం చేసినమాట నిజమే గాని మోసం చెయ్యలేదు. చీకట్లో కనబడక నే అలా జరిగింది. తరవాత సిగరెట్ వెలిగించుకుంటే ఆ వెలుగులో పర్సు కనిపించింది. ఇచ్చేద్దామని మిమ్మల్ని పిలిచాను కూడా. కాని మీరు వినలేదు. ఇంతలో మనసు మార్చుకున్నాను. అవసరాన్ని నీతి నియమాలకి ధారపోసి నికృష్టంగా బ్రతికేకంటే చేజిక్కిన అవకాశాన్ని వినియోగించుకోవాలనుకున్నాను. (కూర్మావతారంవైపు చూస్తూ) బ్రతుకుసౌఖ్యం ముందు ముఖ్యం అనుకున్నాను. కాని......కాని.....దురదృష్టవంతుణ్ణి. ఆ రాత్రే—కొన్ని నిమిషాల్లోపలే పరాయి సొమ్ము పరాయి చేతుల్లో పడిపోయింది. ఎవరో నా జేబు కొట్టేశారు!

ఇన్ : అయితే ఆ డబ్బు మళ్ళీ మీ చేతుల్లోకెలా వచ్చిందీ?

విద్యా : (కొద్దిక్షణాలు సంకోచించి) దయచేసి ఆ వివరాలు అడక్కండి.

ఇన్ : చెప్పకపోతే కేసు మీమీదే పెట్టాలి సొస్తుంది.

కూర్మా: చెప్పవోయ్, విద్యాపతీ.

విద్యా : శిక్ష అనుభవించటానికి నేను సిద్ధమే.

కూర్మా: నిజం ఎప్పటికైనా బయటపడుతుంది ఏం జరిగిందో చెప్పు.

విద్యా : విశ్వాసఘాతుకత్వం చేశానండీ.

కూర్మా: ఏం చేశావు?

విద్యా : లంచం తీసుకున్నాను.

కూర్మా: ఏ విషయంలో?

విద్యా : ఆఫీసు కాగితం దొంగిలించాను.

కూర్మా: (తెల్లబోయి) ఏమిటా కాగితం?

విద్యా : క్షమించండి అడ్వకేట్ గారూ. చెప్పకూడదనుకుంటూనే చాలా చెప్పాను.

కూర్మా: చెప్పితీరాలి, విద్యాపతీ.

విద్యా : శర్మరావు గారి ఫైల్లో కాగితం.

కూర్మా: ఓ! ఎవరిదగ్గర్నించి లంచం తీసుకున్నావు?

విద్యా : క్షమించండి. అదిమాత్రం చెప్పలేను.

కల్యా : నేను చెబుతాను. సుందర్రావుగారి దగ్గర్నించి అండీ, అడ్వకేట్ గారూ?

కూర్మా: (ఆశ్చర్యంగా) సుందర్రావుగారి దగ్గర్నించా ఏమయ్యా, సుందర్రావ్? నిజమేనా?

సుంద : నిజమేనండి.

కూర్మా: నీ కెందుకూ ఆ కాగితం?

సుంద : స్నేహధర్మంలో. సన్యాసిరాజు గారికి సహాయం చెయ్యాలని వారి తరఫున అది సంపాదించానండి.

కూర్మా: ఘన కార్యం చేశావు. అయితే ఆడబ్బు సన్యాసిరాజు గారిదేనా?

సుంద : అవును.

ఇన్ : (పరమాశ్చర్యంతో) ఏమిటీ? అదొంగిలింపబడిన నోట్లు సన్యాసిరాజు గారి దగ్గిరికెలా వొచ్చాయి?

సుంద : ఏమోనండి.

ఇన్ : ఏమండీ, సన్యాసిరాజు గారూ?

సన్యా : (తెల్లబోయి) ఆనోట్ల నెంబర్లు మీ దగ్గిరున్నాయా?

ఇన్ : ఆ. ఇవిగో

[ఓ కాగితం ఇస్తాడు]

సన్యా : (తీసుకుని, జేబులోనుంచి ఓ కాగితం తీసి నెంబరు పోలుస్తూ) ఈ నోట్లు నేనిచ్చినవి కాదండీ.

సుంద : అబద్ధం, మీరిచ్చినవి కావూ?

సన్యా : ఊఁహుఁ. నాదగ్గిర్నుంచి మీరు తీసుకున్న నోట్ల నెంబర్లు ఇవిగో. (కాగితం చూపిస్తాడు)

సుంద : అవే నాకిచ్చారని నమ్మకం ఏమిటి?

సన్యా : ఇదిగో, మీ సంతకం.
(ఇన్‌స్పెక్టర్‌కి కూడా చూపిస్తాడు)

ఇన్ : ఏమిటి కుంభకోణం? అంతా అయోమయంగా ఉంది.

విద్యా : ఓ. ఇప్పుడు తెలిసింది!

ఇన్ : ఏం తెలిసింది?

విద్యా : సుందర్రావుగారూ. మిమ్మల్ని ఇదివరకు ఎక్కడ చూశానో ఇప్పుడు తెలిసిందండీ. ఆ రాత్రి ఎంతో పరిచయంగా ఆప్యాయంగా భుజంమీద చెయ్యివేసి పలకరించి 'ఓ, క్షమించండి. నా స్నేహితులనుకొని పొరపడ్డాను' అని వెళ్ళిపోయింది. మీరే కదూ?

సుంద : (కొంచెం గాభరాగా) ఎప్పుడు?

విద్యా : తెలియనట్టు అడుగుతున్నారా? నా దగ్గిర్నుంచి పర్సు కొట్టేసిన రాత్రి

కూర్మా : ఆఁ!
[అందరూ సుందర్రావు వైపు ఆశ్చర్యంగా చూస్తారు.]

సుంద : మీరు పొరబడుతున్నారు.

ఇన్ : (ఆలోచించి, చిటికె వేసి) ఓ. అసలు కిటుకు తెలిసిపోయిందండీ. సన్యాసిరాజుగారి దగ్గిర్నుంచి తీసుకొన్న కరెన్సీనోట్లు మీదగ్గిరే ఉంచుకొని దొంగిలించిన నోట్లు విద్యాపతిగారికి లంచం ఇచ్చారు. అంతేనా సుందర్రావుగారూ? లేకపోతే దొంగిలించబడిన నోట్లు మీదగ్గిరికెలా వొచ్చాయో సంజాయిషీ చెప్పండి.

సుంద : నేను విద్యాపతిగారికి దొంగిలించబడిన నోట్లిచ్చానని సాక్ష్యం ఏదీ?

కూర్మా : సాక్ష్యం సంగతి దేవుడెరుగు. అసలు సంగతి చెప్పవయ్యా మహానుభావా!

సుంద : నేనేమీ ఎరగనంటే మీరేమీ చెయ్యలేరని నాకు తెలుసు. కాని పాపం విద్యాపతిమీద కేసు నిలుచుకు పడుతుంది అసలా జాలే ఇంతవరకూ తెచ్చింది. ఆ క్షణంలో దుర్బుద్ధిపుట్టి, జీవితంలో మొదటిసారి, ఆ పని చేసినా తరవాత చాలా బాధపడ్డాను, విద్యాపతి పరిస్థితి చూసి. అందువల్ల ఎలాగో నేను బయటపడకుండా ఆ డబ్బు అతనికి ముట్టచెప్పాలని చేసిన ప్రయత్నం ఇలా పరిణమించింది.

సన్యా : పెద్దమనిషివనీ, ఆర్టు డైరెక్టరువని అనుకున్నానుగాని ఇలాంటివాడివనుకోలేదయ్యా సుందర్రావ్.

కూర్మా : ఇంకా నయం! సరిగ్గా సమయానికి వొచ్చారు గనుక సరిపోయింది కాని లేకపోతే మా మల్లిక గతి ఏమయ్యేదో! నీ ఋణం తీర్చుకోలేను, కల్యాణీ.

కల్యా : నేను చేసిందేముందండీ!

ఇన్ : (మల్లికవైపూ సుందర్రావు వైపూ చూసి) ఓ—ఇదివరకు మీరు మద్రాసులో ఓ ఘనకార్యం చేశారు కదూ?

సుంద : (కొంచెం తెల్లబోతూ) ఏం చేశాను?

ఇన్ : ఎవరో అమాయకురాల్ని సినిమాలో జేర్పిస్తానని మద్రాసుకి తీసికెళ్ళలేదూ?

సుంద : (కొంచెం చిన్నబుచ్చుకుని) ఆమె అమాయకురాలేం కాదు. పైగా నేనామెని సినిమాల్లో చేర్పిస్తాననీ ఆశ పెట్టలేదు.

ఇన్ : ఆర్ట్ డైరెక్టరునని బడాయిలుకొడితే పరపతి ఉంటుందిగదా, పైకి పాకిపోవొచ్చని మీతో వొచ్చిందా?

సన్యా : మీరు ఆర్టుడైరెక్టరు కాదూ?

ఇన్ : ఆర్ట్ డైరెక్టరయితే ఈ తిప్పలెందుకూ?

కూర్మా : ఆ అమ్మాయిసంగతేమిటో చెబుతున్నారు. ఏమయిందీ?

ఇన్ : ఏమౌతుందీ? ఇద్దర్నీ పట్టుకుని మళ్ళీ ఆమెని ఇంటికి చేర్పించాం. అయితే ఆమెకి సినిమా

పిచ్చి వదల్లేదులెండి. (ప్రస్తుతం ఎక్స్ట్రా వేషాలేస్తోంది. ఇతన్ని ఎక్కడ చూశానా అని ఆలోచిస్తూంటే ఇప్పటికి జ్ఞాపకం వొచ్చింది. సరే, ఈ గొడవంతా నా కెందుకు? ఇంతకీ కేసు ఎవరిమీద పెట్టాలి?

కల్యా : పోయినడబ్బు మా నాన్నగారిదేకదూ? వారు ఫిర్యాదు ఉపసంహరించుకుంటార్లెండి. కేసుండదు. ఏం నాన్నా.

లక్ష్మీ : డబ్బు దొరికింతరవాత ఇంక ఫిర్యాదెందుకూ?

ఇన్ : అయితే వొదిలెయ్యటమే? ఆల్ రైట్. కాని యాడ్రింది ఏంపనులయ్యా ఇవి, బుద్ధిగా ఉండకూడదూ? 'తను తమ సేవలు తప్పిన తమ మిత్రులె శత్రులౌట తథ్యము సుమతీ' అన్నారు. జాగ్రత్తగా ఉండండి సెలవండీ అడ్వకేట్ గారూ-

[వెళ్లిబోతూండగాన ధర్మారావు ప్రవేశం]

ఓ ధర్మారావుగారా! అడ్వకేట్ గారి సలహా కోసం వొచ్చారా? పాపం, వీరి బట్టలకొట్టు రాత్రికి రాత్రి బావమరదులూ, భార్యాకలిసి లూటీ చేసేశారండీ, ఈ రోజుల్లో అయిన వాళ్ళని కూడా నమ్మటానికి వీల్లేదండీ.

కూర్మా : బావమరదులూ, భార్యా లూటీచేశారా? ఏమండీ, ధర్మారావుగారూ (ధర్మారావు తలవొంచుకుంటాడు).

ఇన్ : పాపం ఆ సంగతి తెలియక ధర్మారావు గారు సన్యాసిరాజుగారు చేయించారనుకున్నారు. స్టేషన్లో రిపోర్టుకూడా ఇచ్చారు. అయినా వాళ్ళకదేం బుద్ధి? ఏమండీ ధర్మారావుగారూ? తమాషాకి చేసిఉంటారులెండి.

కూర్మా : ఇంకా నయం ధర్మారావుగారు దివాలా తీశారనుకున్నాను.

ఇన్ : వారూ అదే అనుకున్నారు. కొంచెంసేపటి కిందటిదాకా. తీరా ఆ మూకి తెలిసి సోదా చెయ్యటానికి వెళ్ళేసరికి బయట పడి పోయింది వ్యవహారం. పోన్లెండి, అన్నీ షరతులు, వొస్తా—గుడ్ —బై, (నిష్క్రమిస్తాడు.)

ధర్మా : (ఇనస్పెక్టర్ వైపు చుర చుర మాసి అవతారం దగ్గరికొచ్చి రహస్యంగా ప్లీడర్ గారూ—ఓ చిన్న సలహా కావాలండీ.

కూర్మా : బావమరదులమీదా, భార్యమీదా పరువు నష్టం దావా వేస్తారా?

ధర్మా : (బిక్క మొహంతో) అది కాదండీ, డబ్బంతా నా భార్యపేర పెట్టటం చిక్కొచ్చిందండీ

కూర్మా : ఏముంది? మళ్ళీ మీ పేర రాయించుకోండి.

ధర్మా : అది సరేనండి. ఈ తిరుగాలెందుకయ్యా అని మా ఆవిడ సన్యాసిరాజుగారి పేర బాకీ మొత్తానికి చెక్కు రాసేసి కవర్లో పెట్టి పంపించిందండీ.

కూర్మా : రైట్—రాజీ పడ్డారన్నమాట.

ధర్మా : అదేం ఆపటానికి వీల్లేదా, ప్లీడర్ గారూ?

కూర్మా : మీ భార్య ఆపదలచుకుంటే ఆపవచ్చు.

ధర్మా : అదిఒప్పుకోవటం లేదండీ

కూర్మా : అయితే మీరు మాస్తూ ఊరుకోటమే మంచిది.

ధర్మా : అంతేనంటారా?

కూర్మా : తిరుగులేదు.

ధర్మా : వెయ్యిరూపాయలకీ నీళ్ళొదులుకోటమే.

కూర్మా : మీఆస్తికాదుగా. మీభార్యదేగా. స్త్రీధనం.

ధర్మా : (బుర్రగోక్కొని) గట్టిచిక్కే వొచ్చిందండీ.

[వరహాలు చేతిలో కవరుతో ప్రవేశం]

వర : (సన్యాసిరాజుకి కవరుఇస్తూ) తమరికి ఉత్తరం ఎవరో పంపారుబాబు.

సన్యా : (కవరుచింపి చదివి) ఓ. ధర్మారావుగారూ! చెక్కు పంపించేశారే! ఇకనుంచీ మనమిద్దరం మళ్లీ స్నేహితులం అన్నమాట.

ధర్మా : (లేనిసంతోషం తెచ్చుకొని) మరేనండి.

కూర్మా : శుభం. రాజీపత్రంకూడా రాసేద్దాం. ఏమండీ?

[ధర్మారావు, సన్యాసిరాజూ తలలూపుతారు]

కల్యాణీ! ఓ రాజీ పత్రం చెబుతాను రాసుకో. మహారాజశ్రీ కోర్టువారి దివ్యసముఖమునకు

ఫిర్యాది - సన్యాసిరాజు,
ముద్దాయి - ధర్మారావు,
ఉభయవాదులు వ్రాయించి దాఖలు చేసుకొన్న రాజీ పిటీషను.

అయ్యా!

తమ కోర్టులో దాఖలు కాబడిన దావాలో ఉభయవాదులము రాజీపడినాము గాన కోర్టువారు కరుణించి యీ కేసును తమఫయిలు నుండి తొలగించవలెనని వేడుచున్నాము.

దివ్యచిత్తమునకు తేవలెను.

[కాగితం తీసుకుని]

ఊఁ - సంతకం చెయ్యండి.

[సన్యాసిరాజు సంతకం చేస్తాడు]

ధర్మారావు గారూ. సంతకం చెయ్యండి.

ధర్మా : (చెయ్యి వణుకుతోంది) అయ్యబా... (ఆపుకుంటాడు)

కూర్మా : విద్యాపతీ! ఇలా రా — ధర్మారావుగారి చెయ్యి వణుకుతోంది. కొంచెం పట్టుకో — మరేం పీకలమీదికి రాదులెండి. సంతకం చేసెయ్యండి ధర్మారావు గారు. (సంతకం చేయిస్తారు)

[తెరలో మైక్ ద్వారా ప్రకటన. సోదర సోదరీమణులారా! ఎల్లుండి సాయంకాలం అయిదు గంటలకి మునిసిపల్ కౌన్సిల్ హాల్లో ప్రఖ్యాత నాయకులైన శ్రీకోటి సూర్యప్రకాశరావు గారికి సన్మానం జరుగుతుంది. ఆ తరవాత మైదానంలో గొప్ప బహిరంగసభ జరుగుతుంది. శ్రీ సన్యాసిరాజు గారు అధ్యక్షత వహిస్తారు. అందరూ దయచేయ ప్రార్థన]

కూర్మా : సన్మానం జరుగుతుందా సుందర్రావ్?

సన్యా : ఇంకేం సన్మానం? వసూళ్లు ఎప్పుడో కైంకర్యం ఐపోయి ఉంటాయి. అవమానం జరక్కుండా ఉంటేచాలు, సన్మానానికిచ్చిన నూటపదహార్లూ, తైలవర్ణచిత్రానికిచ్చిన రెండువందలుకూడా గంగపాలేనా స్వామీ?

సుంద : (వెటకారంగా) తైలవర్ణచిత్రం కావాలా? కీర్తిదాహం లేదుగా మీకు. పంచరత్నాలు చాలా? భట్రాజు కీర్తనలు వొద్దూ? ఆకబంధ హస్తాలు భస్మాసురహస్తాలైతేగాని సంఘానికి నవనవాభ్యుదయం రాదు. మీ అందరిముందూ ఇలా తలవొగ్గి నిలబడ్డానంటే మీ అందరికంటే నాలో ఎక్కువ దుర్గుణాలున్నాయనీ, వంకరభావాలున్నాయనీ కాదని తెలుసుకోండి. పరిస్థితుల్ని ఎదిరించే ధైర్యంలేక జీవితంమీద ఆశతో జీవితాన్నే ప్రమాదంలో పడేసుకోక తప్పింది కాదు. చక్కటి ప్రకృతిచిత్రం వేసి కొనమంటే తమ నిలువెత్తు తైలవర్ణచిత్రాలు వేసి తీసుకురమ్మనే మహానుభావులున్న కళాకారుడి కళ ఏం వికసిస్తుంది? అతనెలా జీవితం గడుపుతాడు!

సన్యా : అందుకని నలుగుర్నీ మోసం చెయ్యటం వృత్తిగా పెట్టుకుంటావా? ఓ హో హో! ఏం ఉపన్యాసం? మహాగొప్పగా ఉంది. పదండి, లక్ష్మీపతి గారూ, పోదాం. సెలవండీ కూర్మావతారం గారూ.

[సన్యాసిరాజు, ధర్మారావు, లక్ష్మీపతి, వరహాలు నిష్క్రమణ.]

కూర్మా : కల్యాణీ, ఆ క్షమాపణ పత్రం ఏదీ? ఇలా తే

[కల్యాణి ఇస్తుంది]

సంతకం చెయ్యవయ్యా సుందర్రావు.

మల్లి : వొద్దు, చెయ్యకండి. మనిద్దరికీ వివాహం ఐపోయింది. కలో గంజో తాగి బతుకుదాం. పదండి. నా పదివేల రూపాయల నగలూ మీకిస్తాను. మీ ఇష్టం వొచ్చినట్టు బొమ్మ లేసుకోండి.

సుంద : (ఆశ్చర్యంగా) మల్లికా!

కూర్మా : ఏమిటా దుడుకుతనం, మల్లికా!

మల్లి : దుడుకుతనం ఏం కాదన్నయ్యా! ఆలోచించే చేస్తున్నాను. పదండి (వెళ్లబోతుంది)

కూర్మా : ఆగు! ఆర్టిస్టుల్లో చేరి బాగుపడటం ఇష్టమేనా సుందర్రావ్?

సుంద : ఆర్టిస్టులా?

కూర్మా : అవును. పెద్దమనిషి తరహాగా ఉంటానని వాగ్దానం చెయ్యగలవా?

సుంద : అంతకంటేనా?

కూర్మ : అయితేమీ ఇద్దరితో కొన్ని విషయాలు మాట్లాడాలి. ఇలా లోపలికి రండి.

(ముగ్గురూ నిష్క్రమణ.)

సీత : ఎంత నాటకం జరిగింది!

కల్యా : చూశారా మరి? ఇన్ని అవకతవక పనులు జరుగుతుంటే సౌందర్యమో అంటూ మీలాంటి యువకులు ఓమూల కూర్చుంటే ఎలా చెప్పండి.

సీతా : నిజమే నాకీ గొడవలన్నీ ఏం తెలియవు.

కల్యా : ఆత్మ సౌందర్యాన్ని పెంపొందింప చేసేదే కదండీ నిజమైన సౌందర్యం.

సీతా : ఎంతబాగా అన్నారు! నూటికి నూరుపాళ్లు నిజం.

కల్యా : ఇంకెప్పుడూ అలాంటి పనులు చెయ్యరు కదూ?

సీతా : ఇంకానా!

కల్యా : వ్యామోహం వొదిలిపోయినట్లేనా?

సీతా : పూర్తిగా. మీ మేలు మర్చిపోను కల్యాణి గారూ.

కల్యా : విద్యాపతి గారికంటే మీరే ఎంతో మంచి వారండీ. జైలునించి తప్పించినా ఆయన కృతజ్ఞతన్నా చెప్పలేదు.

విద్యా : (ఆవేదనగా) కల్యాణీ! మీతో ఒక్కమాట మాట్లాడటానికి కూడా నాకు అర్హతలేదు. వ్యక్తిత్వంలేని విద్యాపతి ఏమంటే మాత్రం ఏం విలువ ఉంటుంది?

సీతా : అర్హత లేదంటూనే అన్ని మాటలు మాట్లాడావేం?

కల్యా : ఆయన అంతేలెండి. సలహా ఇవ్వమని అడిగి మళ్లీ ఎవరడిగారు అంటారు. సంఘాన్ని ఉద్ధరిస్తానని ముందడుగేసి మళ్లీ వెనక్కి లాక్కుంటారు.

విద్యా : నేను సంఘాన్ని ఉద్ధరిస్తానని ఎప్పుడన్నాను?

కల్యా : కట్నంలేకుండా పెళ్ళి చేసుకుంటానని అనలా!

విద్యా : ఓ! అదా! ఇంకా ఆ అవకాశం ఉందిగా.

కల్యా : మీరు వెనక్కి తగ్గకుండా ఉంటేగదా!

విద్యా : తగ్గనెండి.

కల్యా : నాకు నమ్మకం లేదు.

విద్యా : చేతిలో చెయ్యివేసి వాగ్దానం చెయ్యాలా? (చెయ్యిజాపుతాడు కల్యాణి చిరునవ్వుతో అతని కళ్ళలోకి చూస్తుంది. విద్యాపతి కొంచెం సిగ్గుపడి చెయ్యివెనక్కు లాక్కుంటూ) ఓ!... సారీ. (నవ్వుతూ) కాగితం మీద రాసిస్తాలెండి (ఇద్దరూ నవ్వుతారు)

సీతా : (కెమెరా తీసి) ఓహ్. అద్భుతం! ఒక్క క్షణం అలాగే నిలబడండి. (కెమెరా క్లిక్ చేస్తాడు ఆ ఫ్లాష్ వెలుగులో అందరూ మెరిసిపోతారు) ఓ. కె. థాంక్యూ.

[అందరూ చిన్నగా నవ్వుతుండగా తెర]

# ఆంధ్ర జానపద గేయసాహిత్యము

శ్రీ బి. రామరాజు

* గత సంచిక తరువాయి

పారమార్థిక గేయములు:— భక్తి కర్మ జ్ఞానమార్గములు మూడును మోక్షసాధనములని భారతీయుల నమ్మకము. ఆయామతములవారు వీనిలో తరతమ భేదము తెల్పిరి సూక్ష్మములకు దిగి తర్కములు పెంచుకొన్నచో నాయా విభేదములు పండితులకు గానుపించునేమో కాని జానపదులం దిట్టి విభేదములు లేవు. అనగా "కృష్ణా రాంరాం గోవింద హరిహరి" యని యేకతార మీటుచు పాడుకొనెడు భక్తుడే "గూటిచిలుకేదిరా చిన్నన్నా గూడు చినబోయెరా" యను తత్త్వములు పాడుకొనుచు, తెల్లవారగానే వ్రతమునకో ఏకర్మకో కావలసిన సంభారములను సిద్ధము చేయుటలో నిమగ్నుడగును.

పై మూడుమార్గములందును భక్తిమార్గము సులభసాధ్యము. ఆంధ్రప్రదేశమున శైవ వైష్ణవ భక్తిగేయములు కీర్తనలు లక్షలకొలది రచింపబడినవి. పూర్వశైవుల తుమ్మెదపదము లిప్పటికిని నిల్చియుండుట మన భాగ్యవిశేషము. తాళ్ళపాకవారు, క్షేత్రయ్య, త్యాగరాజు, కీర్తనలును, క్షేత్రయ్య మరిముఖరంగని పదములును, ఘట్టుపల్లి, ధర్మపురి, ఛత్రపురి జావళీలును సంగీతజ్ఞుల సొమ్మైపోయినవి. ఇవి జానపదుల నోటికెక్కలేదు. అధ్యాత్మరామాయణ కీర్తన లటునిటు మ్రొగ్గినవి. జానపదులం దధికాదరణము పొందిన గేయకర్తలలో నగ్రగణ్యుడు భద్రాచల రామదాసు, తూము నృసింహదాసు, పరాంకుశదాసు, నిట్టల ప్రకాశదాసు, తాటంకము వెంకటదాసువంటి భక్తుల గేయము లూరూరు దిరిగెడు హరిదాసుల కన్నము పెట్టించుచున్నవి. మొన్నమొన్నటివరకు తెలుగు దేశమంతటను ప్రతిగ్రామమున భజనమందిరములో భక్తకూటములు యుండెడివి. భజనకీర్తనల పుస్తకములు ముద్రింపబడినవి. రఘుపతిదాసు గురుపూజకీర్తనలు, కరిమేల హనుమయ్య రామనామము, చెంచురామకవి రామనామమాహాత్మ్యము, ఎన్. వి. గోపాల్ కంపెనీ వారి భగవన్నామ సంకీర్తనలు, భోజదాసు హరిభజన కీర్తనలు, కొల్లామల్లయ్య శ్రీరామభజనామృత సంకీర్తనలు, కొంతం కొండ్రలావు భజనకీర్తనలు, అల్లూరి వెంకటాద్రిస్వాముల హరినామ సంకీర్తనలు, నరసింహాచార్యుల తిరునామములు, నారాయణదాసు పాండురంగ బృందావన సంకీర్తనలు, నిత్యానందస్వామి భజనకీర్తనలు, నాగదాసు భక్తిసార సంగ్రహకీర్తనలు, రాపాక రామకవి భజనమాల, ఇంద్రగంటి సూర్యకాంతము కాలేషా మస్తాన్ కేవలి కీర్తనలు, దంటన సాంబశివరావు కుసుమహారనామ కీర్తనలు, సుమారిరువదిమంది రచయితల కీర్తనలున్న భగవన్నామ సంకీర్తనలు, శ్రీశైల భ్రమరాంబికాష్టకము, నూతన భజన కోలాట కీర్తనలు, రాకమచెర్ల వెంకటదాసు కీర్తనలు, స్త్రీల పాటల సంపుటములందును, గంగాధరంగారి ప్రచురణములందును ఇట్టి భక్తిసారస్వతము ముద్రింపబడినను మౌఖిక ప్రచారమున ప్రాణములు నిలుపుకొనుచున్న గేయములు లక్షోపలక్షలు.

ఈ భక్తిగేయములందు సంకీర్తనములు, పదములు, దరువులతోపాటు మేలుకొలుపులు, లాలిపాటలు, జోలపాటలు, కోలాటములు, మంగళహారతులును చేరిపోవును. కోలాటపాటలందు మధురభక్తి మెండు. కోలాటమునందు సంగీత సాహిత్యములతోపాటు కొంత నృత్యముకూడ చూపెదరు. ఔత్తరాహుల కోలాటమును లకుటరాసమందురు. పాల్కురికి సోమనాథుడు కోలాటగోడియల దడచెను. సోమనాథుడు పేర్కొన్న ప్రభాతపదములు మేలుకొలుపులైయుండును. ఇండ్లయందును, గుడిగోపురములందును, ప్రభాత సమయమున నీ మేలుకొలుపులు వినబడుచుండును. వీనినే భూపాలము లందురు. భూపాలరాగమున పాడబడుటచే నివి భూపాలములైనవి. ఇవి పరమేశ్వర విభూతిని తెలుపును. కొన్ని వేదాంతపరములగు మేలుకొలుపులును కలవు. వైష్ణవపరముగా నున్న మేలుకొలుపులందు-సాధారణముగా కృష్ణు నుద్దేశించిన వానిలో మధురభక్తి కాన్పించును

మేలుకొలుపు లధికముగా ముద్రణ భాగ్యమందలే
దేలనో? మంగళహారతుల నే మంగళారతు లందురు.
పూజాదికము లందుగాని శుభకార్యములందు గాని
మంగళముపాడుట భారతదేశ మందంతటను కలదు.
మంగళహారతి శబ్దము నివాళి కర్థము కాని రాను రాను
నివాళి నిచ్చునప్పుడు పాడెడుపాట కర్థమైనది. ఆరతి
యను మరియొక శబ్ద మున్నది. అర్థము రాగాలాపము,
నన్నిచోడుడు "ఆరతులొగి చేసిపాడి రభినవలీలన్"
అనియును, "అరతులు నిర్వహాస్తమున" ననియు
"అరతుల్ నూల్కొనచేసి" యనియు ప్రయోగించెను.
అభినయము చేయుచు హారతు లెత్తెడు యాచార మిప్ప
టికిని కొన్ని దేశములం దున్నవి! కుడాగు
వేంకటదాసకవి బలరామచరిత్ర, గణపవరపు వేంకటకవి
ప్రబంధరాజ వేంకటేశ్వర విలాసములందు
ఆరాత్రికలు పేర్కొనబడినవి హారతికి నివాళి
పర్యాయపదము. పాల్కురికి పేర్కొన్న నివాళి
పదములు మంగళారతులై యుండును దీపారతులు,
ధూపారతులు మున్నగునవి తత్సంబంధములే. తెలుగు
దేశమున వ్రాయ నేర్చిన ప్రతికవి యొక మంగళారతి
వ్రాసియుండును, పాడ నేర్చిన ప్రతిస్త్రీ యొక మంగ
ళారతి పాడగలదని కొందురు. ఈరూ దేవతామనక
మంగళహారతు లన్ని దేవతలకు సంబంధించినవి కలవు.
వర్ణనాత్మకములును, స్తోత్రరూపములును, సేవారూప
ములును, భక్తి వేదాంత శృంగార పరములుగను మంగళ
హారతు లున్నవి.

వేదాంత సంబంధములు:— పాశ్చాత్యులు
భారతదేశమును వేదాంతు లుండు దేశమనుటకు
కారణము మనదేశమున శిష్టనాగరకులే కాక పామ
రులు జానపదులు కూడ నేవో గహనములగు తత్త్వ విష
యము లాలపించుటచేత నే. "తొలుత బ్రహ్మాండంబు
తొట్టి గావించి" యని జోలపాడుచును "ఓం నమ
శివాయ అరతురములతొట్టి" యను ఉయ్యాల లూపుచు
పంచదశిసారమును పాలబుగ్గల కందించు శక్తి తెలుగు
తల్లుల కలవడినది. ఇట్టి గేయములందలి భావములు
జానపదుల కెంత వరకనుభవసిద్ధములను మాట వేరు.
తత్త్వ విషయము లుండుటచే నిట్టి గేయములకు తత్త్వ
ములను పేరు కలిగినది. ఈ తత్త్వము లధికముగా నద్వైత
వేదాంత పరములు. తత్త్వములను వ్రాసిన వారును
ప్రచారము చేసినవారును నధికముగా బ్రాహ్మణే
తరులు. అద్వైతమున జీవుని బ్రహ్మత్వము ప్రతిపాదిత
మగుటచే సంఘవ్యవస్థ యందున్న ఎక్కువ తక్కు
వలు వేదాంత విచారమున నుండవు. అందుచే నింద
కంత చైతన్యము కనబరచినచో "నీ కేకుల"మని యాన
రజులను ప్రశ్నించు బ్రాహ్మణులు మరియు
నగ్రవర్ణములవారు కుమారాస్త్ర విద్యా ప్రదర్శన
కాలమునందు కనకదాసు మరియు వీరబ్రహ్మ
ముల కాలమునందు నుండిరి. ఇట్టి ప్రశ్నము
లకు "ఏకుల మని నను వివర మడిగితే ఏమని తెల్పుదు
లోకులకు పలుగాకులకు" అనుతత్త్వములు సమా
ధానములు కనుక అధికారులు బోధనకై అనధి
కారులు సంతుష్టికై యిట్టి పాటలు పాడుట ఆచార
మైనది. కనుకనే అగ్రజన్ములవారి వర్ణాశ్రమాచార
విధులు, పూజా పురస్కారములు, ప్రవచనములు
మున్నగునవి కొన్ని తత్త్వములందు గర్హింపబడినవి.
కాని వేమనయోగివంటి సంస్కారకులు మాట
లూతగాగొని యాథార్థ్య మెరుగని తినువారి దొంగ
బ్రువులు, కపటసన్యాసులు, ఇట్టి దొంగవంచకులు
పలికి, ప్రజలకంఠ మట్టినొక్కె, పాటలనే సిసొంపు గూడ
యలవాటైనది. తత్త్వములందు కొంత మార్మికత్వము
గూడకలదు. ఏకాంతివారు, పోతులూరి వీరబ్రహ్మము,
వేమనయోగి, సిద్దప్ప, శేషాచలస్వామి, సగుణగాను
పంతుల లింగమూర్తి, భోజదాసు, ఎల్లమందాసు,
మున్నగు వారనుభవజ్ఞులైన యోగులు తెలుగున తత్త్వము
లను వేదాంతగేయములను రచించియున్నారు. సీత
పాట, నారాయణశతకము, రామనామశతకము, ఆత్మ
బోధామృతతత్త్వములు, కలిప్రమాణ తత్త్వకీర్తనలు,
కాలజ్ఞాన తత్త్వములు; శుద్ధనిర్గుణతత్త్వ కందార్థ
దరువులు, తారకామృతసారము, శ్రీరామగీత, గురు
జ్ఞానామృతము, వేదాంత కుచేలకథ, బ్రహ్మానంద
కీర్తనలు, వంటి ముద్రిత గ్రంథములందలి గేయములు
జానపదుల నోటికెక్కినవి. సాధారణముగా నీ తత్త్వము
లందు రాజయోగము, అచలవేదాంతము, గురుభక్తి,
నీతిబోధము, సంఘసంస్కార పరాయణత్వము, వర్ణా
శ్రమాచార నిరాసము, వైరాగ్యబోధము, అహింస,
సత్ప్రవర్తనము, మున్నగు విషయము లుండును.

కర్మమార్గ సంబంధములు:-యజ్ఞయాగాదికర్మలు
మహాకష్టసాధ్యములు. సామాన్యజనము కవి యందు
బాటులోనివి కావు. మిగుమిక్కిలి వేదకర్మా
చరణమున కందరికి నర్హతలేదు పురాణోక్తముగా
నున్న కర్మకాండయు వ్రతములు నోములు
మున్నగునవి అందరి యందుబాటులో నుండుటచే
నట్టివాఙ్మయము కూడ బాగుగా ప్రచారమందినది.

ఇట్టికర్మకాండ యందు పురుషులకన్న స్త్రీలకే యెక్కువ అభిమాన మగుటచే స్త్రీలపాటల రూపముననే ఇట్టి వాఙ్మయ మధికముగా గానవచ్చుచున్నది. వ్రతములకు నోములకు సంబంధించిన పాటలనేకము ముద్రింపబడినవి. శ్రీ నేదునూరి గంగాధరం గారు శ్రీ బాలాంత్రపు వెంకటరావుగారు, శ్రీ మూదూరు కోటేశ్వరరావుగారు వంటివార లిట్టి వ్రతకథలను పాటలను ప్రకటించియున్నారు. మదనద్వాదశి వ్రతము (చిలుకముగ్గులపాట), నిత్యదానము నోము, దీపదానము నోము, మోచేటి పద్మమునోము, చాతుర్మాస్య వ్రతము, కృత్తిక దీపాలనోము, పెండ్లిగుమ్మడి నోము, వరలక్ష్మిపాట, తులసినోము, లక్షవత్తులనోము, కామేశ్వర వ్రతము, శ్రావణ శుక్రవారము, శ్రావణమంగళవారము వంటి పాటలు నలుబదియేండ్లకు పైబడిన తెలుగు స్త్రీలందరకును కంఠస్థములు. వీనిలో కామేశ్వరిపాట క్రీడాభిరామము కాలమునుండి తెలుగునాట వినబడునట్టిది. దుష్యంతుని సభలో శకుంతల "నుడువులు వేయు నింకేల యిప్పాటి నోములు దొల్లి కడిగి నోచితినిగా కేమి" యనుటచే నన్నయనాటినుండి మనకీ వ్రతములు నోములు వచ్చుచున్నవని భావింపనగును. స్త్రీలపాటలుగానున్న ఈ వ్రతములు బహుశః స్త్రీలకును చాతుర్వర్ణ్యముల వారికిని పూజాధికారము కల్పించుట కుద్దేశింపబడినవై యుండును. వీరశైవ వీరవైష్ణవ మతోజ్జృంభణ ఫలితముగా నిట్టిసంస్కారమునకు తావు లభించిన దని యూహింపనగును. తెలంగాణమున బొడ్డెమ్మ బతుకమ్మ వంటి పండుగుల నాధారముగా చేసికొని మనోహరములగు జానపదగేయములు పుట్టినవి. అగ్రవర్ణముల వారికి లక్ష్మిగౌరీవ్రతములు పూజ లున్నట్లే శూద్రులకు ఎల్లమ్మ, మైసమ్మ, పోచమ్మ, బాలమ్మ మున్నగు క్షుద్రదేవతా పూజలు కలవు. ఈ దేవతల కొలుపులు పల్లెటూళ్ళయందు బవనీలు మున్నగువారు చేయుదురు. ఎల్లమ్మయే రేణుకాదేవి. క్రీడాభిరామమున బవనీల చక్రవర్తి "పరశురాముని కథ లెల్ల ప్రౌఢిపాడి" నట్లున్నది.

స్త్రీలపాటలు:— సంసార యాత్రలో గృహలక్ష్మికిగల ప్రాధాన్యము పురుషునకు లేదు. అట్లే గృహజీవనమున కవిత్వమునకు గూడ స్త్రీలే అధికముగా నాలంబనములు. ఇట్టి పాటలను కేవలము స్త్రీల పాటలని పిలువవచ్చును. వీనిలో కల్పనకన్న వాస్తవికత హెచ్చు. మాతృత్వము భారత స్త్రీ కెనలేని సంపద. దాని నాధారముగా చేసికొని ఎన్నియో గేయములు పుట్టినవి. సంతానమునకై స్త్రీలు పడెడు బాధలు నోచెడు నోములు, మ్రొక్కులు, గొడ్రాండ్ర స్థితి అట్టి పాటలందు వర్ణితము. సంతానము కలిగిన వెంటనే లాలిపాటలు జోలపాటలు వచ్చును. లాలించుటకు లాలిపాటలను, జోకొట్టి నిద్రపుచ్చుటకు జోలపాటలను పాడెదరు. ఈ పాటలందు తల్లులు తమ సంతానమును రాముడుగనో, కృష్ణుడుగనో, శంకరుడుగనో, సీతగనో రుక్మిణిగనో పార్వతిగనో వర్ణించుకొందురు. ఈ పాటలు శంకరాభరణము, నవరోజు, ఆనందభైరవి, శ్రీరాగముల కనుకూలముగా నుండును. పుత్రోత్సవములందు పాడెడు పాటలుగూడ కొన్ని గలవు. స్త్రీ జీవితమున వివాహ మత్యంత ప్రధానసమస్య. ఆ సమస్య నాధారముగా చేసికొని ఎన్నియో సంఘటనలు వాని నాధారము చేసికొని ఆచార వ్యవహారములు — వేడుకలు వినోదములు — వాని ఫలితముగా ననంతమైన గేయసాహిత్యమును ఉద్భవించినవి. వీని నన్నింటిని గలిపి పెండ్లిపాటలనవచ్చును. ఈ పెండ్లిపాటలకు కొట్నములు నాందిగా అప్పగింతలు భరత వాక్యముగా గ్రహింపవచ్చును. వీనిలో కొట్నాల పాటలు, నలుగు పాటలు, గంధంపాటలు, కల్యాణపు పాటలు, తలుపుదగ్గర పాటలు, బంతులపాటలు, బువ్వము పాటలు, వధూవరులపాటలు, అలుకపాటలు, ముఖము గడుగుపాటలు, కట్నాలపాటలు, మిధునవిడెముల పాటలు, అవిరేణిపాటలు, అప్పగింతలపాటలే కాక ప్రతిచిన్న విషయమునకును, అనగా పసుపునకు, తిలకమునకు, తలంటులకు, ఊయలకు, వసంతములకు, పానుపునకు సంబంధించిన పాటలు కూడ కలవు. గాంధర్వ వివాహములు ప్రబలమైపోవుచున్న నీకాలమున నిట్టి పాటలు పాడుట కవకాశము సన్నగిల్లుచున్నది. వధువు అత్తవారింట చేరిన పిమ్మట అత్తమామల భక్తి పతిభక్తి ఆడుబిడ్డల భక్తి తోటికోడండ్రతో బావ మరదులతో మెలగవలసిన రీతి దెలుపు పాటలును గలవు. గృహజీవనము పొరపొచ్చెములు లేక సాగినా సరేసరి. లేనిచో అత్తల ఆరడులు, కోడలి సాధింపులు, ఆడుబిడ్డల ఘాతుకచర్యలు, సమస్యలై సంసార మొక నరకకూపమగును. ఇట్టి బాధల నాశ్రయించి కూడ కొంతసాహిత్యము పెరిగినది. ఇట్టి పాటలందు సాంఘిక జీవనము సమగ్రముగా కానవచ్చును.

శ్రామిక గేయములు:— జానపద గేయముల యుత్పత్తిగూర్చి చర్చించినప్పుడు కవిత్వ ముల్లాసమును

కలిగించుటకే కాక కష్టనివారణమునకు గూడ నుప
యుంచునని తెలిసికొనియుంటిమి. మానవులు శ్రమించు
నప్పుడు కష్టము కనబడకుండుటకై, అలసిపోకుండు
టకై అప్రయత్నముగా కూనిరాగములు తీయుట,
లయాన్వితము లగు ఏవోమాట లుచ్చరించుట
జరుగును. సామూహిక కర్తృత్వమున నట్టి రాగ
ములు మాటలు జానపద గేయములుగా పరిణమించి
వ్యాప్తిగాంచును. ఇల్లలుకునప్పుడో పిండి విసరు
నప్పుడో వరినాటు, కలుపు, కోత, లప్పుడో, మోట
తోలునప్పుడో, ఏతా మెత్తునప్పుడో, నాగలిదున్ను
నప్పుడో, కుప్పగొట్టునప్పుడో, పడవ నడుపునప్పుడో,
బరువులు మోయునప్పుడో, రోడ్డునెంట గోలకను
లాగునప్పుడో రాళ్లు పగులగొట్టునప్పుడో, దిమ్మిస
వేయునప్పుడో. కావడి, పాలకి, మేనాలు మోయు
నప్పుడో, శ్రమాపనోదనమునకై పాటలు పాడువారిని
మనము చూచుచునేయున్నాము. హృదయ—లేదా -
మేధాగత భారమును తొలగించి ఉల్లాసమును కలిగిం
చునటులే శారీరక శ్రమమును పోద్రోలి యుత్సాహ
మును కలిగించుటకును గేయములు తోడ్పడును. శ్రమి
కగీతములనే కొందఱు పాటకజనసారస్వతమనిరి. మరి
కొందరు కార్మిక కర్షకగీతము లనిరి. శ్రమికగీతములందు
వస్తు వెట్టిదైన నుండవచ్చును, వృత్తికి సంబంధించిన
పాటలు. శృంగారగేయములు, స్థానికవృత్తాంతములు,
విషాదగాథలు, భక్తిగేయములు, మున్నగు తీరు తీరుల
పాటలు శ్రమికులు పాడుకొందురు. ఈ గేయములు
కూడ కొల్లదిగనే ముద్రింపబడినవి. శ్రమిక గేయము
లన్నియు సాధారణముగా వారి వారి కృషికి సంబం
ధించిన లయకు సరిపోవునట్లుండుట గమనింపదగిన
విషయము. శ్రమికుల కాలుసేతుల కదలికలో ఊపిరి
తిత్తుల భారోచ్ఛ్వాసనిశ్వాసములో ఈ గీతములకు
తాళలయలు సమకూర్చును. సంగీతమే కాక శరీరసుఖ
మునకు సంబంధించిన యూహలు కూడ శ్రమికుల
కుత్సాహము నొసంగును. ఇట్టిపాటలు 'ఘుమ ఘుమా
పాటల' పేరుతో కొన్ని ప్రచురింపబడినవి. శ్రమికుల
జీవితమున వేషభూషణముల యాడంబరము, ఆధి
క్యము, ఆహారపానముల సౌఖ్యము తక్కువ వారికి మిగి
లినది శరీరసుఖమే. వారిముక్తాయింపులు మొత్తముమీద
విషయ సుఖమువైపునకే మ్రొగ్గు చూపుట కిదియే కార
ణము. ఫ్రాయిడ్ మహాశయుడు తన 'లిబిడో' సిద్ధాంత
మున దీనిగూర్చి చెప్పెను. శ్రమికుల పనిపాటలందీ లిబి
[illegible]ముగా ధ్వనించును. విలాసముగా పాడెడు
గారడివాని పాటలందు ఆకర్షించుటకును, బరువులు
లాగెడు పాటలందు శ్రమాపనోదనమునకును బూతులు
ప్రవేశించును. శ్రమికుల గేయములందు ఎన్నియో బూతు
పాటలు గలవు

బాల గేయములు :— జానపద గేయములందు
బాల గేయముల దొక ప్రత్యేక శాఖ. పసిపిల్లల
లేత హృదయము లెంత నిష్కపటములో, నిర్మ
లములో, స్వచ్ఛందములో, మృదువులో, వారి
గేయములు కూడ నంత నిష్కపటములు.
నిర్మలములు, స్వచ్ఛందములు, మృదువులు
పాశ్చాత్యులును, ఇతర భారతీయులును బాల వాఙ్మ
యము గూర్చి చేసిన సేవ యపారము. మన తెలుగువారి
దృష్టి ఇప్పుడిప్పుడే ఇటు మరలుచున్నది. బాల గేయ
ములు రెండు విధములు. బాలురకొరకై పెద్దలచే
రచింపబడి తరతరములనుండి వచ్చునవి. ఒక విధము,
బాలురచేతనే రచింపబడి ఒక తరమునుండి మరియొక
తరమువారినోటికందెడునవి, మరియొక విధము. పెద్దలు
పిల్లలకొరకు రచించిన పాటలందు కూడ రెండు విధ
ములు కలవు. పిల్లలను లాలించుటకు పాడెడు లాలి
పాటలును, నిద్రపుచ్చుటకు పాడెడు జోలపాటలును
ఒక తీరువి. పిల్లలనే వస్తువుగా గ్రహించియో లేక
నేదేని కథావిషయమునో, ప్రపంచమందలి మనో
హర విషయమునో గ్రహించి పిల్లల కానందము
గూర్చుటకై, ఆటలాడించుటకై రచింపబడినవి
ఇంకొకతీరు పాటలు. లాలి జోలపాటల భావములను
పిల్ల లెంతమాత్రము ననుభవింపరు. కేవల మా సంగీతము
మాత్రము వారిని నిద్రపుచ్చుటకో ఏడుపు మాన్పుటకో
ఉపకరించును. ఇక పెద్దలు రచించిన బాలగేయము
లనుభూతికి వచ్చుటకు పిల్లలకు తగిన వయస్సు రావల
యును. పిల్లలు కూర్చుండుట కలవాటు పడినప్పటినుండి
పెద్దల పాటలు నిచ్చెన మెట్లవలె క్రమక్రమముగా
పెరిగి పిల్లలు తాము తలిదండ్రుల వలననో లేక ఇతరు
లగు పెద్దల వలననో విన్న పాటలు స్వయముగా పాడు
నంతవరకు సాగి యాగిపోవును. ఆపైన వారి సొంత
కవిత్వ మారంభమగును, పెద్దల పాటలందు మొదట
నాదము తరువాత లయ, ఆ తరువాత అభినయము పిల్లల
కలవడునట్లు చేయు క్రమము కానుపించును. మొదటిది
ఆకర్షణము, రెండవది యుత్సాహము మూడవది వారి
శరీరమునకు శక్తి కూర్చుడు మెట్లు. శిశువులకు రెండేండ్లు
వచ్చునప్పటికి చిన్న చిన్న మాటలు రానేవచ్చును.
తలిదండ్రులు వారికి మెల్లమెల్లగా చిన్న పాటలు

పద్యములు నేర్పెదరు. తల్లిదండ్రులు పాడగా విన్న పాటలు సులభ గ్రాహ్యములగుటచే వారికి కంఠస్థమై పోవును. ఈ తరుణమున తలిదండ్రులు తమ పిల్లలకు భక్తి నీతి వినయము విజ్ఞానము గల పాటల నొక్కొక్కటిగా నేర్పుచుందురు. యతిప్రాసములు తాళలయలు మున్నగు వాని జ్ఞానమీపాటలవలన పిల్లలకు సులభముగా పట్టుపడును. పిల్లలకు నాలుగేండ్ల వయసు వచ్చునప్పటికి సొంత కవిత్వ మారంభమగును. బాలగేయములందు రెండవ ప్రధానశాఖ బాలుర చేత నే రచింపబడి తరతరములనుండి ప్రవాహరూపమున వచ్చుచున్న గేయములు. పిల్లల సొంత రచనలందు రెండు రకముల గేయము లున్నవి. పెద్దల ననుకరించి వారి పాటలందు తమ కవిత్వము చేర్చి పాడుకొనునవి కొన్ని. పూర్తిగా స్వకపోలకల్పితములగు గేయములు మరికొన్ని. పెద్దలనుండి సంక్రమించిన పాటలలో పిన్నలు తరములు గడచినకొలది తమ కవిత్వమును చేర్చి ఒకరినుండి మరియొకరి కందించుకొనుచు వచ్చెదరు. ఇట్టి పాటలు కేవల మొక ప్రాతియాచారమువలె రాను రాను అర్థవిహీనములై పోవును. తలిదండ్రుల పాటల నుండి తాము గ్రహింపగలిగిన అన్త్యప్రాసములు, యతులు, యమకములు మాత్రమే పిల్లలకు చక్కగా పట్టుబడును. ఈ వ్యుత్పత్తితో వారు కూర్చెడు పాటలలో వీనికిమించిన సొగసు లుండ నేరవు కదా! అందుకే ఇవి ఇంగ్లీషులో 'Nonsense Rhymes' అను పేరుపొందినవి. 'Nursery Rhymes' పిల్లలకొరకు పెద్దలు రచించిన వైనచో, 'Nonsense Rhymes' పిల్లలు సొంతముగా రచించిన గేయములని చెప్పవచ్చును. నాలుగేండ్లనుండి పిల్లల జీవితమంతయు నాటపాటల మయము. ఈ యాటలందును మగవారికి వేరు మరియు నాడువారికి వేరు ఆటలు గలవు. కొన్ని ఇరువురును చేరి యాడుకొనునట్టివి. ఈ క్రీడల నాధారముగా చేసికొని వానికి తగిన పాటలు పెక్కులు బయలుదేరినవి. చెమ్మచెక్క, విత్తిదిగుగుట, గుడుగుడు గుంచం, బుజబుజ రేకులు, గొబ్బిళ్ళు, చిడ్డిగోనె, కోతికొమ్మచ్చి వంటి యాటలతోపాటు పాటలును గలవు.

శృంగారగేయములు:—జానపద సాహిత్యమున శృంగారము ప్రధానరసమైన పెక్కు గేయములు కలవు. శిష్టుల నిర్వచనము ప్రకారము అవి శృంగార కావ్యములు కాజాలవు. ఆధునిక భావకవులు రచించిన ఖండకావ్యము లటులే జానపద గేయములు కూడ విభావాది సామగ్రిని సంపూర్ణముగా ప్రపంచించునవి గాక నేదో యొక సంచారిభావము నాశ్రయించినవిగా నుండును. జానపదగేయ వాఙ్మయమున నితరశాఖలతో పోల్చి చూచినచో, మిగిలినతములగు శృంగార గేయముల సంఖ్య తక్కువ. అది యెంత బహుళసంఖ్యలో నున్నవో యంత విరళముగా ముద్రింపబడినవి. ఇట శృంగారము పరకీయమా స్వకీయమా ఉత్తమ నాయికానిష్ఠమా లేక ప్రాకృతనిష్ఠమా యను చర్చ లనవసరము. శ్రీ అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు జానపదగేయము లందలి శృంగారమంతయు నీచమనియు దుష్టమనియు కేవలము కామప్రేరితమనియు నిందించిరి. వెంకయ్యచంద్రమ్మ పాట, నారాయణమ్మ నాయుడుబావపాట, వంటివి వారి యాగ్రహమునకు గురియైనవి. వారి దృష్టి కది యుచితముగనే తోచినది. ఇది జానపదుల—ప్రాకృతుల వాఙ్మయమే కనుక శిష్టుల—ఆలంకారికుల విమర్శనము లట నతుకవు. మరియును జానపదులు చిత్రించిన సీతారామాది యుత్తమనాయికా నాయకగత శృంగారము కూడ పామరభావ సమన్వితమే యని గ్రహింపవలయును జానపదుల పేరిట నున్న వాఙ్మయమంతటను గోచరించునవి వారి భావములే కాని ఆయా పాత్రముల భావములు కావు. ఎట్టి గేయములందైనను జానపదుల ప్రేమకలాపములు, సాంఘిక నియమోల్లంఘనములు, పరస్పరాకర్షణములే కానవచ్చును జానపదవాఙ్మయమందు జీవితము యథాతథముగ నగ్నతేజముతో భాసించును. కావ్యధర్మమైన ఔచిత్య విచారము జీవితమునం దంతగా నగుపింపదని యంగీకరింపక తప్పదు జానపదవాఙ్మయమున ఔచిత్యపోషణోద్దేశముతో పాత్రములకు మెరుగుపెట్టుపద్ధతి లేదు. జీవితమునం దెంత వైవిధ్యము ప్రత్యక్షమగునో అంతయు జానపద కావ్యమునందు ప్రత్యక్షమగును. అచ్చట నుదాత్తతయు, నీచతయు, సభ్యశృంగారము, రసాభాసశృంగారము నీచశృంగారము మొదలగునవి యన్నియు నొకదానితో నొకటి బుజము లొరసికొనుచుపోవుచుండును. ఐనను ధర్మావలంబనము గల ప్రేమశృంగారములతో నొప్పు గేయములు కూడ అనేకములు గలవు. రామాయణ గేయములందు సీత గడియ, సీతమ్మవారి అలుక, సీతాదేవి వేవిళ్లు, ఊర్మిళాదేవినిద్ర, సీతాదేవి ఆనవాలు మున్నగు పాటలందు శృంగారమునకు వెలికాని మనోహరభావము లున్నవి. సుందరకాండ పదమున వియోగ శృంగారము

చక్కగా ప్రదర్శింపబడినది. కుశలవ యుద్ధమువంటి పాటలలో శృంగారము మితిమీరినది. భారత సంబంధ గాథలందు నలచరిత్ర పదము, సుభద్రాకళ్యాణము, శశిరేఖాపరిణయము, దేవయాని చరిత్రము, వంటి శృంగార గేయములు కలవు. నలచరిత్ర పదమున దమయంతి విరహము శిష్ట సాహిత్యము ననుకరించును. దేవయాని జంగంకథ, ఏకతైర్యానురాగ, మనురసాభాసమున కుదాహరణము. శశిరేఖా పరిణయము పూర్తిగా శృంగార గేయము. ఇక భాగవతకథలందున్న శృంగారమునకు మితియే లేదు గోపికాస్త్రీల జలక్రీడలు, ఉషాస్వప్నము, రుక్మిణీదేవియువ్వటు, రుక్మిణీదేవి సీమంతము, చిలుకరాయబారము, సత్యభామ సరసము, పారిజాతపల్లవి, రుక్మిణీకల్యాణము భ్రమరగీతలు వంటి స్త్రీల పాటలన్నియు శృంగారరస తుందిలములు, చారిత్రక గేయములందు కూడ శృంగార భావము లున్నవి. పల్నాటివీర చరిత్రమున శ్యామాంగి ప్రదర్శించిన భావములు జారిణీశృంగారమునకును, మాంచాల యనుభవ ముత్తమశృంగారమునకును ఉదాహరణములు. దేశింగురాజు, పెద్దబొబ్బిలిరాజుకథ, సదాశివ రెడ్డి కథలందు వీరదంపతుల యనురాగ ముత్తమ శ్రేణికి చెందినది. కరుణారసపూరితములగు కథలందు లక్ష్మమ్మ, సన్యాసమ్మ, మండపేట పాపమ్మ, నల్లతంగాళ్, ఎరుకల నాంచారి, వీరరాజమ్మ గేయములందు ధర్మస్వభావులైన జానపద దంపతుల యుత్తమ శృంగారము ధ్వనించుచున్నది. ఒక్క సారంగధర చరిత్రమునమాత్రము తుచ్ఛ శృంగార భావము లున్నవి. జానపదుల శృంగారము నీచమను విద్యాశేఖరుల యభిప్రాయమునకు సన్యాసమ్మ మండపేటపాపమ్మ కామమ్మ ఎరుకల నాంచారివంటి జానపదనాయికల పవిత్రచరిత్రము సరియైన సమాధాన మీయగలదు. కమ్మవారి పణతి, కాంభోజరాజు, గాంధారి, ధర్మాంగదచరిత్ర మున్నగు అద్భుతకథలందున్న శృంగారము కూడ అనౌచితీదోషదూషితము కాదు. శైవవైష్ణవ మతములకు సంబంధించిన గేయములందనేకములు శృంగార కళాఖండములు. గంగా వివాహమున హరుడు చక్కని దక్షిణ నాయకుడు. కామిరెల్లి మల్లన్నకథకూడ అంతియ. సురాభాండేశ్వరమున పరకీయ శృంగారమున్నది. వరదరాజు పెండ్లి, అండాళ్ చరిత్రము, వెంకటేశ్వర్ల వేట, చెంచితకథ పాటలందు చక్కని శృంగార మున్నది.

పై గేయములందు శృంగార మంగము శృంగారము ప్రధానముగాగల ఖండకావ్యములవంటి గేయములు లక్షోపలక్షలు. దల్ మోహనరంగ, వెంకటమ్మ చంద్రమ్మపాట, నారాయణమ్మపాట, సిరిసిరిమువ్వక రంగంపదములవంటి కొందెసు పెద్దపాటలున్నవి. అముద్రితములే యధికము. కాముని పున్నమనాటి పాటలన్నియు శృంగార కళాఖండములు. కోలాటములు కూడ చాలవరకిట్టివే.

అద్భుతకథలు:— శిష్టులకన్న జానపదుల కద్భుతరసాభిరుచి హెచ్చు. సాధారణ విషయములందలౌకికములు నద్భుతములు నగు కల్పనలు కూర్చి పెద్దచేయుట వారికి వినోదములతో పాటు భక్తినో భయమో పెంపొందించుకొనుట కుపకరించునట్టిది. మానవు డెప్పుడును ఆశాజీవి. అగు గనుకనను కష్టగండ్లు మానవునకు సమయ లేక కలిగెను సంపద కథలలో నద్భుపడిన దేవతలో మంత్రదండమో, పావుకోళ్ళో, సంచియో, సూత్రమో, చింతామణులో తమకును ఇట్టి కష్టములందు సాయపడునని జానపదుల నమ్మకము. ఇట్టిది సంభవమైనను కాకున్నను మనము నకు మాత్రము పెట్టనికోట యని భావింపవచ్చును. దుర్భరమగు సంఘటనము కలిగినప్పుడుగాని అసాధ్యమగు విషయము నాకాంక్షించి యెట్టిపని సాధ్యమగునప్పుడుగాని ఏ మానవాతీతమగు శక్తియో యడ్డుపడి చిక్కును మంచు తెరవలె తొలగించిన ఎంతొ బాగుండునను కోరిక, అసాధ్యమైనదైనను మానవ సహజమే. ఇట్టి కోరిక నాధారముగా చేసికొని పాటను రచించిరో లేక దాని ననుసరించియే ఇట్టి కోరిక లుద్భవించినవో కాని ఇట్టి యద్భుతములుకల కథాగేయములనేకము ప్రచారమందున్నవి. అద్భుతకథలందన్నిటి కన్న నధిక ప్రచారము గాంచినది బాలనాగమ్మకథ. మాయలఫకీరు, తలారి రాముడు, బాలవర్ధిరాజు, గాండ్లసంగు, తంబళి పెద్దన్న, చాకలి తిప్పడు, చంద్రరాయుధము, వీనికి నాంధ్రదేశమున కావలసినంత కీర్తి. బాలనాగమ్మకథా కాలము నిశ్చితముగా చెప్పజాలము. ఇది దక్షిణ భారతమున తురకలు పాదుకొన్న తరువాత జరిగిన కథయై యుండును. మహబూబునగరము జిల్లాయందున్న పానుగల్లు బాలనాగమ్మ కథాంగస్థలమని యధిక ప్రచారమున్నది. కథయందలి యంతస్సాక్ష్యము దానినే బలపరచుచున్నది. యిది ప్రాంతీయమగు రామాయణగాథవంటిది. సీతాదేవికి ప్రతిగా బాలనాగమ్మను, రావణునకు ప్రతిగా మాయలఫకీరును, శ్రీరా

మునకు ప్రతిగా బాలవర్ధిరాజును, త్రిజటకు ప్రతిగా తంబలి పెద్దమ్మను భావింపవచ్చును సమ్మక్కానంతటి యద్భుత కృత్యములతో అలౌకిక విషయములతో నిండిన గాథ కమ్మవారి పణతిపసల బాలరాజుకథ. దీని జీవము వర్ణాంతరవివాహ మని తెలియవలెను. దీనిలో నొకటి రెండు సాంఘిక భావము లున్నను వాతావరణము మాత్రము పుక్కిటి పురాణయుగము నాటిదిగా గాన్పించును. అద్భుత కథాగేయములందు గాంధారి కథ యగ్రగణ్యము. పురాతనముకూడ కావచ్చును. ఇటులే కాంభోజరాజుకథ, ధర్మాంగదపాముపాట, బాలరాజుకథ వంటి యద్భుతకథలు జానపదులకు భయభక్తులను కలిగించి సత్యధర్మములకే జయమను దానిని చాటిచెప్పి వారి జీవితమును దిద్దుచుండును.

కరుణరసాత్మకములు : జానపదులు శృంగారము తరువాత కరుణాద్భుతములకు రెంటికిని సమాన ప్రాధాన్యమిచ్చిరి. నిత్యజీవితమున సుఖముకన్న దుఃఖమే యధికముగుట తత్ప్రభావితులైన జానపదులు ఆయా సంఘటనముల సహజముగనే చిత్రింపగలిగిరి. శిష్టులనున్నట్టి సూక్ష్మదర్శనస్పృహయు, అనగా దుఃఖము నధిగమించి సూక్ష్మ జీవితనిర్మాణమునకై సాహిత్యమును సాధనముగా, నుద్దేశపూర్వకముగా మలచుకొను గుణము వీరియందంతగా లేదనుకొనవచ్చును. జానపదుల కాచితీదృష్టి తక్కువ. కనుకనే వీరగాథలలో కథాభాగమునకున్న ప్రాధాన్యము వర్ణనకుండదంటిమి. వీరగాథలు కేవలము వ్యక్తులకు మాత్రమే కాక సాధారణముగా రెండు జాతులకును లేదా రెండు తెగలకును సంబంధించి యుండును. జాతి మరియు వంశము దాటినచో జానపదులదృష్టి నాకర్షించెడువారు వ్యక్తులు. వారి శౌర్యమున కుత్సాహము దుర్మరణమునకు జాలి — ఈ రెండు భావములును పామరులచే వారిచరిత్రములను పాడించినవి. ఉత్సాహము తరువాత జానపదులను సులువుగా నావరించునది జాలి. వీరగీతములందుత్సాహము మెప్పులో పాటు ఈ జాలికూడ కథారచనమునకు వారి నెగద్రోయుననుట యసత్యము కాదు. బొబ్బిలిని కొట్టుటకు దండు విడిసిన విజయరామరాజునకు మల్లమ్మదేవి వ్రాసిన యుత్తరమును అతిశయోక్తితో రచించుటలో జానపదకవి యౌచిత్యదృష్టికంటె జాలియే యెక్కువగా గోచరించును. జనకంటకుడుగా జీవితమును గడిపిన గుత్తాలగోపిరెడ్డిని పలువురుపట్టి చేలనడుమ చంపవలసి వచ్చినది. నలుగురుచేరి ఒక్కని చంపినారే యన్న జాలి "శేరు శేరు యెంచిముంగాల్ సేతులాకు బెట్టుకోని, కట్టమీద యెల్తావుంటే కలకత్తే రనుకొంటిర కొడుక" యని పాడించినది. ఈ విధమైన జాలి జానపదులకు సార్వత్రికము. దీనికితోడు వ్యక్తి జీవితము సవ్యముగ ధర్మమార్గమున నడచి యుండినచో జానపదులు వాని చరిత్రకు జలుజలుమందురు. కనుకనే ప్రతిభాషయందును జానపదులు పాడుకొన్నట్టి కరుణరస పూరితములగు గాథలు పెక్కులు కానవచ్చుచున్నవి. ఆంధ్ర జానపదగేయములందును ఇట్టి కరుణాపూరితములు చిత్రద్రుతి కారణములునగు కథలనేకమున్నవి. అత్తపెట్టిన ఆరడివలననో, కట్టుకొన్న భర్త యొనర్చిన యత్యాచారమువలననో, తోటికోడండ్ర యన్యాయముచేతనో, ఇరుగుపొరుగుల దౌష్ట్యమువలననో, దైవ దుర్విపాకమువలననో, ఇడుముల పాలైన స్త్రీల కథలు జానపదవాఙ్మయ సముద్రమందలి కన్నీటి కెరటములు జరిగిన విషాద గాథలకు జానపదులు కొంత మాహాత్మ్యమును జేర్చి భయభక్తులకు దారితీయునవిగా చేసిరి

దేశీయేతివృత్తములగు ప్రాచీనమైన కరుణాపూరిత గాథ కన్యకాంబవారికథ. ఈమెయే కన్యకాపరమేశ్వరి వైశ్యుల కిలవేల్పు. రెండవది సారంగధర కథ. ఈ రెండును రాజరాజనరేంద్రునకు కళంకమాపాదించునట్టివి. వీనికి చారిత్రకాధారములు లేవు. కామమ్మకథ పిచ్చుకకుంట్లకు కల్పవృక్షము. ఇది యాంధ్రదేశ మంతటను వ్యాపించిన పదము. కథావృత్తాంత మాంగ్లేయు లీ దేశమును పాలించిన తొలి దినములకు సంబంధించినది. సతియాచారము ప్రభుత్వము తొలగించిన పిదప కూడ కొందరు పతివ్రతలు ప్రత్యేకముగా బ్రిటిషువారి యనుమతి పొంది సహగమనము చేయుచుండిరి. అట్టి వారిలో కామమ్మ యొకటి. కామమ్మకథలో నున్న మాహాత్మ్యములు జానపదుల కల్పనలు, అనవసరము నతిశయోక్తులు గాని అద్భుత కల్పనలు గాని లేక జరిగిన కథ జరిగినట్లుగా హృదయ విదారకముగా కరుణరస పూరితముగానున్న కథలందు లక్ష్మమ్మకథ యగ్రగణ్యము, సౌశీల్యము, పాతివ్రత్యము, మూర్తీభవించిన స్త్రీమూర్తి లక్ష్మమ్మ. ఆమె సహనము త్యాగము మున్నగు గుణములు తెలుగు జాతికి గర్వకారణములు. అత్తగారి యారడి తోటి కోడండ్ర ఈర్ష్యాసూయలకు పాల్పడి భర్తతో సహగమనము చేసిన సన్యాసమ్మ గాథ మరియొకటి. అవి భక్తకుటుంబమున కనిష్ఠులు పడెడు బాధల

నీ కథ చక్కగా వివరించును. గోదావరీమండలము నకే సంబంధించిన మరియొక పేరంటాలుకథ మండపేట పాపమ్మకథ. కరుణరసాత్మక గాథలందు ఈ పేరంటాండ్ర గాథల కొక ప్రత్యేకతగలదు భర్త శరీరముతో సహగమనము చేసిన సుమంగళులను పేరంటాండ్రందురు. కామమ్మకథ, మండపేట పాపమ్మకథ శృంగవరపుకోట యెరుకమ్మకథ సన్యాసమ్మకథ, తిరుపతమ్మ కథవంటి పేరంటాండ్ర కథలు ముద్రితములు. వీరందరును సహగమనము నిషేధింపబడిన తరువాత విశేష యత్నము చేసి సహగమనము చేయుటకు అనుమతి తెచ్చుకొన్నవారు. ఈ సుగుణము జానపదుల నాకర్షించినది. పేరంటాండ్రందరును దేవతలై మ్రొక్కులు దీర్తురనునది ఈ గాథలయందలి మరియొక విశేషము. తమిళదేశమునుండి తెలుగుదేశమునకు వచ్చిన కరుణాపూరితగాథ నల్లతంగాళ్ కథ. పలనాటిసీమలో నధిక ప్రచారముగాంచిన కథలందు వీరరాజమ్మకథయొకటి. తెలంగాణమున ప్రశస్తినార్జించినవి ఎరుకలనాంచారి, రాములమ్మ, సరోజని, మూసిపొంగు కథలు.

హాస్యపుపాటలు:— నవరసములందు హాస్యమొకటి. తక్కినవానివలెనే హాస్యముకూడ బ్రహ్మానంద సహోదరమని మనపూర్వాలంకారికు లంగీకరించుట భారతీయులకు హాస్యముపట్లగల యభిమానము చాటుచున్నది. పాశ్చాత్యుల హాస్యరచనములు చూచి మనవారట్టి సాహిత్యము మనకు లేదని పెదవివిరచెదరు. అట్టిసాహిత్యము మన కధికముగా లేనిమాట వాస్తవమైనను కొరతమాత్రము లేదు. వికృతములైన యాకారము, వాక్కు, వేషము, చేష్టలు మున్నగువానియొక్క వేడుకవలన హాస్యము కలుగుననియు దానికి హాసము స్థాయి భావమనియు మనపూర్వులు చెప్పియున్నారు. ఇంకను హాస్యమును మనవారాఱువిధములుగా విభజించి ఉత్తమాధమనిర్ణయమును కూడ చేసియున్నారు. జగన్నాథపండితరాయ లింకను సూక్ష్మములకు దిగి హాస్యమును ఆత్మస్థము పరస్థములుగా విభజించెను. వీని లక్ష్యలక్షణ సమన్వయ మాయాయాలంకారికు లీవరకే యొనర్చియున్నారు. నాగరకులకుగల సుఖదుఃఖానుభూతులు జానపదులకును గలవు వీనిబాహ్యచిహ్నము లగు నవ్వు ఏడ్పులునుగలవు. ఏడ్పునుగురించి చెప్ప నవసరములేదు, జీవిత మధికముగా దుఃఖమయము కనుక ఏడ్పు తప్పదు. తాత్కాలికముగ నైనను ఏడ్పును తొలగించి దుర్భరజీవితమును కొంత సుగమ మొనర్చి సుప్రసన్న మొనర్చి జీవితమును పెంచునది నవ్వు. అట్టినవ్వు ఎప్పు డెప్పు డేయేవిధముగా జానపదులకు కలుగునో అది వారి సాహిత్యమున నెట్లు ముద్రితమైనదో పరిశీలింతము

రామాయణ సంబంధమగు "శాంతగోవింద నామము" లను పాటలో ఋష్యశృంగు డాంబనను. ఆతని వింత యాకారమే నపుసకుని సాహాయకులవంటి దివ్యస్త్రీలకు నవ్వు పుట్టించుచుండె. వారిని యాతని మాటలు మరింత నవ్వు పుట్టించినవి. "అమరవితా నేసర గోవింద నామము" లను కుంభకర్ణుని నిద్రను వర్ణించి వర్ణించి కవి మనకు నవ్వు పుట్టించుచున్నాడు. మరియు దీని వికారితను (Caricature) గా కూడ చెప్ప వచ్చును. "సూక్ష్మరామాయణము" న శూర్పణఖా వర్ణనము హాస్యరసపూరితము. శూర్పణఖ వికృతాకారమువలన కలిగిన హాస్యముకన్న నట్టి వికృతాకారముగల శూర్పణఖ శ్రీరామచంద్రుని మెచ్చుట మరియు నాతని మోహించి కోరుట ఉత్తమశ్రేణికి చెందిన హాస్యమును కలిగించును. "సీతగడియ" పాటలో హాస్య శృంగారములకు మైత్రి సీతమ్మ నర్మగర్భముగా నన్నమాటలు పరిహాసాస్పదములు. ఇవి వాగ్వికృతికి సంబంధించిన హాస్యము, వీథ్యంగములందు చెప్పబడిన "వ్యాహారము"న కిది జానపదగేయములందు కొనను ఉదాహరణము "ఊర్మిళాదేవినిద్ర" లో సీతా శాంతలకు నడచిన సరస సంభాషణము చక్కని హాస్యమున కుదాహరణము. "శ్రీరామపట్టాభిషేకము"న శంకరుడు చేసిన వేళాకోళము [illegible] చెందినహాస్యము. భారత సంబంధగాథయగు "శశిరేఖా పరిణయము"న ఘటనా వికృతికి చెందిన (Absurdity in Action) హాస్యమెంతయోగలదు చారిత్రిక గేయములందుకూడ అట నట చక్కని హాస్యము కనుపించును. పల్నాటివీర చరిత్రమున వేశ్యమాత వర్ణన యాకార వికృతికి సంబంధించిన హాస్యము. పల్నాటి చరిత్రమున మరియు కాటమరాజు కథలందలి యుద్ధ భీరువుల వర్ణనమున వాక్చేష్టలకు సంబంధించిన హాస్యముకలదు. కాటమరాజుకథలో భట్టసంవాదమున వ్యాజస్తుతి వ్యాజనింద వక్రోక్తి, నర్మోక్తి, నీచోపమ, కాక్వాక్షిప్తము మున్నగు నలంకారములతో నర్థసంబంధమగు వికృతి కల్పించి వాచ్యముగను వ్యంగ్యముగను చక్కని హాస్యము పోషింపబడినది. శైవవైష్ణవ మతవాఙ్మయమున సంవాదముల కొక ప్రత్యేకతగలదు. గంగాగౌరీ సంవాదము ఈశ్వర భృంగి సంవాదము లక్ష్మీపార్వతీ సంవాదము సతులకయ్యము, చెంచులక్ష్మికి కృష్ణునకు

సంవాదము, చెంచితకు లక్ష్మికి సంవాదము మున్నగు వానియందు వక్రోక్తులు దెప్పిపొడుపులు అవహేళనలు వ్యాజోక్తులు గలిగిన చక్కని హాస్యమున్నది. లక్ష్మీపార్వతుల సంవాదము "స్తుకవ" మున కుదాహరణము. సవతులకయ్యము 'నాళిక' కుదాహరణము ఈశ్వర భృంగి సంవాదము "అవస్పందితము"న కుదాహరణము

కేవలము హాస్యపూరితము లగు గేయములు మనకు కొలదిగనే లభించుచున్నవి అట్టివాని నధికముగా ముద్రించినవారులేరు. తెన్నేటి తిరుమలదాసుగారి వేడుక పెండ్లిపాటలందును కర్రా లచ్చయ్య అందు సన్న నారి శ్రీజనానందవిలాసకల్యాణ పాటలందును స్త్రీలపాటల సంపుటములందును పెండ్లికి సంబంధించిన వియ్యాలవారి హాస్యపుపాటలు కొన్ని ప్రకటింపబడినవి కొండపల్లి వీరవెంకయ్యగారి హాస్యపుపాటల పుస్తకమునందు తీరుతీరుల హాస్యపుపాటలున్నవి. శ్రీరంగాపురం గారి సెలయేరు ప్రకీర్ణములుగా కొన్ని పాటలున్నవి. సుమారేబది హాస్యపు పాటలు తెలంగాణమునకు సంబంధించినవి నేను సేకరింపగలిగితిని. వీనిలో హాస్యానుకృతులు. (Paradies) కూడ కలవు ఉద్దాత్యాకమునకును, చలనమునకును చక్కని యుదాహరణ లీజానపదగేయములందు కొల్లలు. జానపద సాహిత్యమున నధిక్షేపగేయము (Satire)లు కొలదిగనే యున్నవి. హాస్యపాత్రములు కూడ కొలదియే. జానపద గేయములందు గానుపించు హాస్యము మన జాతీయ హాస్యము. ఇందు సున్నిత హాస్యముతో పాటు మోటుహాస్యము కూడకలదు. ప్రపంచమందలి సాహిత్యము లన్నింట నిట్టి హాస్యములు గోచరించుచునే యుండును. స్త్రీలపాటలం దధికముగా మృదువై సభ్యమైన హాస్యముండును. ఇట్టిహాస్యము జానపదుల నిత్యజీవితమును సుఖమయముగా నొనర్చుటకు దోహదమొసంగును.

ఇంతవరకు జానపదగేయముల పుట్టుపూర్వములు వానిలక్షణములు వాని ప్రశస్తి, వానివిభేదములు సానేర్చినభంగి దిఙ్మాత్రముగా ప్రదర్శించితిని. వానిలోని విశేషము లెత్తిచూపుట కిట తావుచాలదు.

తెలుగుదేశమున నున్న నదీనదములు సెలయేళ్లు వాగులు వంకలు "సాగరోగతిః" యైనటులే ఈ జానపదగేయ స్రవంతికూడ ఇప్పటికే చాలభాగము మనకు దక్కకుండ లుప్తమైపోయినది ఉన్నదానినైన భద్రపరచుకొనుట తెలుగువారి కర్తవ్యము. పండితులు విమర్శకులు జానపదగేయము లందున్న సాహితీ విషయము లెత్తి చూపవచ్చును. సామాజికశాస్త్రవేత్తలా సంపదలో తమకు గావలసిన యమూల్యములను లేవనెత్తవచ్చును. చేయిదిరిగిన కవులు రచయితలు కళాకారులు వానియందు ఉపలబ్ధములగు దేశీయవస్తు సంపదను దిద్ది తీర్చవచ్చును. జానపద కవితా రీతుల నంగీకరించి నెక్కుడుగా సద్వినియోగము చేసినవారు రాజకీయ పక్షములవారు. తమ తమ రాజకీయసిద్ధాంత ప్రచారములకై బుఱ్ఱకథలు, జముకులకథలు, గేయములు రచించిన వీరి యాశయము కొనియాడ దగినదే. స్వరాజ్యోద్యమ సమయ సాహిత్యమున వెలువడిన "మాకొద్దీ తెలదొరతనము" "దండాలు దండాలు భరతమాతా" "కొల్లాయిగట్టితే నేమి" వంటి రచనలు పూర్తిగా జానపదుల సొమ్మై పోయినవి స్వరాజ్యోద్యమము, సంస్కరణోద్యమములకు తోడ్పడిన గేయములు వందలకొలది వెడలినవి. వీని ప్రయోజనము తాత్కాలికమే యైనను ప్రభావము మాత్రము ననంతము. చేయిదిరిగిన రచయితలు జానపద గేయములందున్న వస్తువును స్వీకరించి కలములందు కొనవలెగాని రచనలు రాల్చవచ్చును. ఆంధ్రభాషామతల్లి కెనలేని తొడవులు సమకూర్పవచ్చు. జానపదగేయము లందుండు జాతీయములు, వానుడులు, వింత వింత పలుకుబడులు శిష్టులా కళించుకొనవలసిన యమూల్య సంపద. నవ్యభారత పునర్నిర్మాణమునందు వివిధ ప్రణాళికా ప్రచారమునకును ప్రజావబోధమునకును జానపదకవితారీతు లుపయోగించు నంతగా నితరములుపయోగపడవన్న నతిశయోక్తి కాదు. ఔత్తరాహులు ముఖ్యముగా హిందీ బెంగాలీభాషలవారీ మార్గమున చాలదూరము సాగిపోయినారు. ఇరుగుపొరుగువారిజూచి యైనను తెలుగువా రభినివేశము కల్గించుకొన్నచో నాంధ్రదేశమునకు నాంధ్రభాషామతల్లికి నాంధ్ర విజ్ఞానమునకు మేలగునని సవినయముగా నివేదించుచున్నాను.

# శిలాదేవత

శ్రీ బి. పురుషోత్తం

యాంగ్‌ట్సీనదీ ప్రయాణము ఉపద్రవకరమైనదైనను ఉత్సాహ సహితముగానే నడిచింది. చెంగ్టూ దగ్గరవున్న ఆ చిన్నపట్నంలో కాపురముంటూవున్న ఆ పింఛను పుచ్చుకొన్న గవర్నరుదగ్గరకు ఎట్లయితేనేమి చేరుకున్నాను. ఈ గవర్నరు బాగా పేరుపొందిన కళారాధకుడు. పదవిలో వున్నప్పుడు విలువగలిగిన కళావస్తువులను సంపాదించుటకొరకు అతడు తన అధికారాన్ని వినియోగించాడని చెప్పుకుంటారు. ఒక ప్రతిమమీదగాని ఒక చిత్తరువు మీదగాని తనచూపు పడిందంటే ఏ రీతిగానైనా సరే అది తనయిల్లు చేరాల్సిందే, కొనుగోలు చేసిగానీ, లేక యింకేదైనా మార్గానగానీ. ఒక ప్రతిమను అతనికి అమ్మకపోయినందువల్ల ఆ కుటుంబాన్ని సర్వనాశనం చేశాడని చెప్పుకుంటారు, సత్యమో మరి అబద్ధమో. కాని అతని యీ కళావస్తు సేకరణాభిలాష ఒక మహావ్యసనమైపోయిందని మాత్రం అందరికీ తెలుసు. తత్ఫలితంగా అతనివద్ద ఉన్న వస్తుసంచయంలో అమూల్యములైన వస్తువులెన్నో వుండినవి.

గవర్నరు తనకచేరీగదిలోకి నన్నాహ్వానించారు. కళావస్తుసంపాదకునికినీ ఆ గదిలోని కళావస్తు శూన్యతకునూ ఏలాటి సంబంధమూ కనబడలేదు. ఎఱ్ఱ చందనపు కుర్చీలూ, వాటిమీద ఎఱ్ఱటి దిండ్లూ, చిఱుతపులుల చర్మాలూ అందుండినవి. ఆ దృశ్యము నిరాడంబరశోభనూ, సునిశితమైన మంచి నాగరకాభిరుచినీ చెప్పకచెప్పుతూవుంది. నేనతనితో మాట్లాడినంతసేపూ తోటవైపు కిటికీకి యెదురుగావున్న ఆ అద్భుతచిత్రాన్ని—ఒక పాత్ర, దానిలో పెట్టిన కొన్ని సీమ రేగుపూరెమ్మలు—అతడు చూచిందే చూడడం.

చూపులకు ఆగవర్నరు చాలా శాంతపురుషుడు. ఇది నాకు చాలా ఆశ్చర్యాన్ని గలిగించింది. ఎందుకంటే అతని క్రూరస్వభావాన్ని గురించి అనేక పుకారులుండేవి. బహుశః వయస్సు అతన్ని మెత్తపరిచిందేమో. తలవనితలంపుగా ఏదో ఒక ప్రొద్దున పిచ్చాపాటీకి వచ్చిన ఒక దీర్ఘకాలమిత్రునివలె నన్ను పరామర్శింపసాగాడు. నన్ను ఆయనకు పరిచయము చేసిన మిత్రుని మహిమో, లేక ఆయన యొక్క ముసలితనపు మతిమరుపో తెలీదు.

ఆమనుష్యుని చూచి నేను అసూయపడ్డాను. ఎందుకంటే, తనకైతాను నిర్మించుకొనిన యీ యింట్లో కాలము గడుపుతూ బ్రతికివుండడమే అతడు మహాభాగ్యముగా ఎంచుకున్నాడనేదే అతన్నిగురించి నాకు కలిగిన అభిప్రాయ సారాంశము.

పేరుప్రతిష్ఠలు గల అతని కళాసేకరణనుగురించి మర్యాదగా ప్రస్తావించాను.

ఒక చిరునవ్వుతో, "ఓహో! అవి నేటికి నావి, రాబోయే శతాబ్దికి యింకొకరివౌతాయి. ఏ ఒక్క కుటుంబంకూడా తన కళాధనాన్ని వంద సంవత్సరాలకు పైగా తనదగ్గరుంచుకోజాలదు. ఆ వస్తువులకొక ప్రత్యేకమైన నొసటివ్రాలు వుంది అవి మనలను చూస్తాయి, ఎగతాళి చేస్తాయి." అతడు మాట్లాడుతూండగానే అతని స్వరానికొక క్రొత్త చైతన్యం వచ్చింది. పొగాకు చిలుము గొట్టాన్ని పెదవుల మధ్య ఇరికించుకొన్నాడు.

"మీరది నమ్ముతారా?" అడిగాను.

"తప్పకుండా" గొట్టాన్ని బయటికి తియ్యకుండానే అన్నాడు. నెమ్మదిగా అడిగాను, "అంటే మీ అర్థం?"

* 12వ శతాబ్దినాటి ఒక చీనాకథకు అనువాదం

# శిలా దేవత

"ఏదైనా, వాస్తవంగా పురాతనమైనదైతే దానికొక ప్రత్యేకమైన లక్షణమూ జీవమూ ఏర్పడతాయి."

"అంటే అది జీవము పోసుకుంటుందా?"

"జీవము అంటే ఏమిటి? ప్రాణమును పుట్టించేది జీవము. ఒక కళావస్తువును తీసుకో, తల్లి తన కడుపులోని పిండములోనికి తన జీవరక్తాన్ని పోసినట్లే శిల్పి ఆవస్తువులోకి తన ఊహను, తన జీవరక్తాన్ని పోస్తాడు. కళాకారుని జీవము తన శిల్పములోనికి ప్రవేశిస్తుందంటే ఎందుకు ఆశ్చర్యపడతావు? ఒక్కొక్కప్పుడు తన శిల్పానికి జీవము పోస్తూ తాను చచ్చిపోతాడు—నిదర్శనముగా నా శిలాదేవత 'దయ' ".

నేను ఏవో కొన్ని వ్రాతప్రతులను చూడ్డానికి వచ్చాను. శిలాదేవత 'దయ'ను గురించి నేనెన్నడూ వినలేదు. దాదాపు ఇంకెవరూ కూడా వినలేదు. తలవని తలంపుగా నేను వేసిన ప్రశ్న నేనెప్పుడూ వినని ఒక మహాచిత్రమైన కథను బైటికి తెచ్చింది.

ఆ శిలాదేవత అనగా నేమిటో, ఏ ప్రత్యేక పరిస్థితులలో అది సృష్టించబడిందో నాకేమీ అంతుబట్టలేదు. మేము వ్రాతప్రతులను పరిశీలించేటప్పుడు అనేక పర్యాయములు మా సంభాషణను ఆ శిలాదేవత మీదికి మళ్లింప జూచాను.

ఒక పాత వ్రాతప్రతిని చూపిస్తూ అన్నాను: "నిజమే, శిల్పియొక్క వ్యక్తిత్వము కొంత తన శిల్పములో కనిపిస్తుంది; వాని తర్వాత ఆ శిల్పములో జీవించి వుంటుంది."

"ఔను, మంచిదీ సుందరమైనదీ ఏదైనా నిత్యమూ జీవిస్తుంది. అది శిల్పియొక్క బిడ్డగా తయారవుతుంది." అని దృఢవిశ్వాసముతో ఆ గవర్నరు జవాబిచ్చాడు.

"ఔను, మరీ ముఖ్యంగా ఆ శిల్పి తన శిల్పాన్ని సృష్టిజేయడంలో సొంత ప్రాణాన్నే కోల్పోయినప్పుడు, ఉదాహరణకు మీ శిలాదేవత" అన్నాను.

"అదొక మహా విచిత్రమైన విషయములే అతడు అద్భుంగా దానినిగురించే చావలేదు. కాని బహుశా చచ్చాడేమో-దాని తర్వాత". కొంచెం ఆగి మళ్లీ అన్నారు, "ఇదిగో ఈ కళాకారుని జీవిత సంఘటనలు సర్వమూ ఈ సూచనను నశిపిస్తాయి-ఏమంటే, అతడు ఈ శిల్ప నిర్మాణానికే, దానికొరకు బలి యగుటకే లోకంలో పుట్టినాడా అని."

"అయితే అదొక మహోద్భుతమైన పనితనముగా వుండి వుంటుంది. నేను దాన్ని చూడవచ్చునా?"

ఇంక కొన్ని యుక్తియుక్తమైన మాటల తర్వాత ఆ గవర్నరు ఎట్టకేలకు దాన్ని చూపించడాని కొప్పుకున్నాడు.

అతని అత్యుత్తమమైన సేకరణలలో కొన్ని మొదటి అంతస్తులోనే వుండగా ఈ శిలాదేవత చివరి అంతస్తులో వుండినది.

"శిల్పి యెవరు?"

"చాజ్‌పో అనే ఒకడు, ప్రపంచానికి కేవలం అజ్ఞాతుడు. అతని జీవితాన్ని గురించి క్రొత్త మఠాధికారిణి వద్ద కొంత తెలుసుకున్నాను. దీన్ని నేను పొందడానిగ్గా ఆ జిత్తులమారి ముసలిదానికి కొంత భూదానంగూడా చేయాలిసొచ్చింది. ఇది ఏ సన్యాసినిదో ఆవిడ మరణించిన తర్వాతనే ఇది జరిగింది.

మఠంలోకంటే ఇక్కడే ఇది ఎక్కువభద్రంగా వుందిగదూ."

ఈ విగ్రహము అక్కడక్కడా పచ్చపారలు గలిగిన నిగనిగలాడే తెల్లనిరాతిలో చెక్కబడివుంది. పై అంతస్తుమీద మధ్యభాగములో ఒక గాజుపెట్టెలో అమర్చబడి ఎవరికీ కదలింప సాధ్యముగాని బరువుగల పోతయినుపకమ్ముల చట్టములో సంరక్షింపబడివుంది.

"ఆమెచుట్టూ కొంచెం నడిచి చూడు, ఎటుపోయినా ఆవిడ నిన్ను చూస్తుంది" అని ఆ గవర్నరు అన్నారు.

అతడు ఆ బొమ్మనుగురించి ఆవిడ నిజముగా బ్రతికివున్నట్లే మాట్లాడటం నాకు చాలా వింతగా తోచింది. మరీ విచిత్రమేమిటంటే ఆ బొమ్మ చుట్టూ నేను అడుగులు వేస్తుంటే అది నన్నే చూచినట్లు తోచింది.

అదొక విషాద విగ్రహము. ఒకానొక ఆకస్మిక క్షణములో పారిపోవునట్టి దృశ్యము. కుడిచేయి బాగా పైకెత్తి, తల వెనుకకు త్రిప్పి, ఎడమచేయి కొంచెము చాచియున్నట్టి సంఘటన. ఒక స్త్రీ ప్రేమించిన వ్యక్తినుండి బలవంతముగా లాగివేయబడు

చున్నట్లు ఆ భావప్రకటన వుంది. ఆ బొమ్మ దయాదేవతగానూ, స్వర్గాని కెక్కిపోతూ మానవులను ఆశీర్వదించినట్లు చేయి చాపియున్నటుగానూ, ఒకవేళ చెప్పవచ్చునేమో గాని ఆ మూర్తియొక్క ముఖభావము చూచినవాడెవడైనా దాన్ని ఒప్పుకోడు. పద్దెనిమిది అంగుళముల ఎత్తుకు మించని ఆ బొమ్మలో ఆ శిల్పి అంత సజీవమైనట్టి, మఱచినా మఱపురాని, ఆ అనుభవాన్ని ఎట్లా ప్రకటించినాడా అనేది ఊహాతీతము. ఆమె చీర మడుపులు కూడా అంత సహజముగా వున్నవి. అదొక వ్యక్తి; సహజసంపూర్ణ సృష్టి.

“ఆ సన్యాసిని కిదెట్లా లభించింది?” అని అడిగాను.

“ఆ బొమ్మయొక్క వైఖరిని సాంతము చూడు, పలాయనపు తీరు, కళ్ళల్లోని ప్రేమ, భీతి, వ్యసన ఇవన్నీ బాగా చూడు,” కొంచెమాగి, “క్రిందికి పోదాం పద, ఆ కథంతా నీకు చెప్తాను” అని హఠాత్తుగా అన్నాడు.

మెయిలాన్ అనే పేరుగల ఆ సన్యాసిని ఆ మఠాధికారిణితో తాను మరణించేముందు అంతా చెప్పింది. ఆ ముసలి మఠాధికారిణి ఆ కథలోని అన్ని వివరాలూ నిజమైనవే చెప్పి వుండకపోవచ్చు. కథను మరింత ఆకర్షణీయంగా చేయడానికి కొంత కల్పన గూడా చేసియుండవచ్చు. కాని గవర్నరు కొన్ని ముఖ్యాంశములు తానే స్వయముగా పరిశోధించి సంతృప్తిపడ్డాడు. ఆ మఠాధికారిణి చెప్పినట్లు ఆ సన్యాసిని ఒకరితో కలిసేదిగాదు, తనకుతానే అన్నీని. కాని చాలా నాగరకురాలు. ఆమె మరణశయ్యమీద ఉన్నంతవరకూ తననుగురించి ఎవరికీ ఏమీ చెప్పి ఉండలేదు.

బహుశా ఒకవంద సంవత్సరాలు గడిచినవేమో. అప్పుడు మెయిలాన్ ఒకచిన్నారి బాలిక, నవ్వుతూ తుళ్లుతూ ‘కెయిఫాంగ్’లో ఒక పెద్దయింటి బిడ్డ. చాజ్ అనేపేరుగల ఒక కమీషనరు కొక్కతేబిడ్డ. చాలా గారాబముతో పెరిగినది. ఆమెతండ్రి చండశాసనుడు, కాని, ఈ ఏకైకసంతానాన్ని తన ప్రేమవాహినిలో ముంచేశాడు. మామూలుగా జరిగినట్లే తనకుటుంబబంధుకోటి చాలామంది ఆయనను ఆశ్రయించి ఆయింట్లోనే ఉండేవారు. చదువుకున్న వారికి ప్రభుత్వోద్యోగాలిప్పించారు. చదువులేనివారు ఆభవనములోనే పనివాండ్రయ్యారు.

ఒకనాడొక దూరపుచుట్టము వచ్చాడు. ఆకుఱ్ఱవాని పేరు ‘చాక్ పో’. చాల చురుకైనవాడు. వయసు పదహారు. ఉల్లాసమూ జీవమూ మూర్తీభవించినవాడు. వయసుకు మించిన పొడుగరి. పొనుపొను సన్నమై పొడుగాటి వ్రేళ్లుగల అతని చేతులు ఒకపల్లెటూరి మొద్దబ్బాయి కుండవలసినవి కావు. వచ్చేపొయ్యే చుట్టపక్కాలనూ, గొప్పగొప్ప ఉద్యోగులనూ పరామర్శించే బాధ్యత ఆగృహిణి ఇతనిమీద వదలినదంటే ఇతడెంతగా ఆకుటుంబాన్ని వశీకరణ చేసుకున్నాడో అర్థమౌతుంది. అతనికి చదువను వ్రాయను కూడా రాదు.

మెయిలాన్ కంటే ఇతడొక ఏడాది పెద్ద. వాళ్ళింకా చిన్నపిల్లలే అవటచేత పలుమారు కలుసుకొని కబుర్లు చెప్పుకొని నవ్వుకుంటూ ఉండేవాళ్ళు ఎందుచేతనంటే చాక్ పో పల్లెటూరికథలు బాగా చెప్పేవాడు, మెయిలాన్ అవి వినడానికి చాలా సర్దాపడేది.

ప్రథమములో ఆకుటుంబానికితనిమీద కలిగిన సదభిప్రాయము కొన్నివారాలకే కొంతమోజు తగ్గింది. కారణమేమంటే అతడొక అసాధారణ వ్యక్తి, అసాధ్యుడూ అవటంచేత. మొదటిమాటకు అతను మంచి సేవకుడు కాడు. పలుమారు అతని కర్తవ్యము మఱచిపోయ్యేవాడు. తప్పుచేసినప్పుడు అతనికంటే పెద్దవారతన్ని మందలిస్తే సుతిరామూ ఊరుకునేవాడు కాదు. కాబట్టి ఆయమ్మాయితల్లి ఇతన్ని తోటమాలిగా ఉండమన్నది. అబ్బాయిగూడా కడుపు ఈవుద్యోగంలో సంతోషపడసాగాడు.

చాజ్ పో ప్రగాఢమైన వ్యక్తిత్వంగల మనిషి. సృష్టించడానికేగాని ప్రపంచం నేర్పేదాన్ని నేర్చుకోడానికతడు జన్మించలేదు. ఒంటరిగా తన పువ్వులలోను చెట్లలోను లీనమై పరిపూర్ణానందాన్ని పొందుతూ ఈలలు వేసుకుంటూ సృష్టికి మూలపురుషుడైనట్లుగా అటూ ఇటూ పచారుచేసేవాడు. అతణ్ణి ఒంటరిగా వదలిపెడితే అత్యద్భుతమైన పనులు చేసేవాడు. గురువు లేకుండానే చిత్రకళ నేర్చుకున్నాడు. అతని విరామకాలములో అతి విచిత్రమైన లాంతర్లు చేసేవాడు, బంకమట్టితో బ్రతికి వున్నాయేమోనని భ్రమింపజేసే జంతు విగ్రహాలు చేసేవాడు.

# శిలా దేవత

పద్దెనిమిదేండ్ల వయస్సు వచ్చేటప్పటికి చాంగ్‌పో ఎందుకూ పనికిరానివాడేమోననిపించాడు. ఇతనిలో ఏముండి మెయిలాన్‌ను ఆకర్షించిందో ఆవిడకే తెలియదు అందరూ ఒకతీరు, ఇతడొక్కడే ఒక తీరు. అతనిలోని భిన్నత్వమే కొంత కారణమేమో. ఎత్తుగా పెరిగి అందగాడైనాడు. ప్రతి దానిలోనూ అగ్రపీఠమితనిదే, అందరూ ఇతన్ని ప్రేమించేవాళ్ళే, ఒక్క అమ్మాయి నాన్నగారు తప్ప. సహజంగానే ఆ బాలబాలికల మధ్య అన్యోన్యము బలిసిపోయింది. వారిద్దరూ ఒకే గోత్రీకులవడంవలన వాళ్ళిద్దరి మధ్యా పెళ్ళి సంబంధం మాత్రం అసంభవమని బాగా ఎరుగుదురు.

వాళ్ళ నౌకరీ వదులుకుంటున్నాడనీ, ఎక్కడో ఒక వృత్తివిద్య నభ్యసింపబోతున్నాడనీ - ఒక రోజున హఠాత్తుగా ఆ యింటి యజమానురాలితో చాంగ్‌పో చెప్పాడు. రాయిగులిచే ఒక కార్ఖానాలో పని నేర్చుకోవడానికి కుదిరాడు ఇంట్లో వుంటూ మెయిలాన్‌తో ఎక్కువకాల మితడు గడుపుతూ వుండడంవల్ల ఇదే మంచిదిలే అని ఆమె తల్లి అనుకుంది. కాని పని దూరమైనా అతనికి నివాసం మాత్రం ఈ యింట్లోనే. ప్రతిసాయంకాలమూ ఇంటికి వచ్చేవాడు. మెయిలాన్‌కు చెప్పడానికి పూర్వముకన్నా ఇప్పుడెక్కువ కబుర్లుండేవి.

ఒకనాడు తల్లి అన్నది: "మెయిలాన్, మీరిద్దరూ ఇప్పుడు పెద్దవాళ్ళయ్యారు. 'పో' అన్న, దగ్గర బంధువే అయినా తఱుచు ఒకరి నొకరు కలవకూడదమ్మా."

తల్లి మాటలు మెయిలాన్‌ను ఆలోచనలో పడవేసినవి. తాను చాంగ్‌ను ప్రేమిస్తున్నానని ఆవిడకంతకు ముందు బాగా తెలిసేది కాదు.

ఆ రాత్రి తోటలో చాంగ్‌ను కలుసుకున్నది వెన్నెల్లో ఒకరాతి బల్లమీద కూర్చుండి మాటామాట సందట్లో ఆనాడు తల్లి అన్నమాటలు జారవిడిచింది.

"నేను తఱుచు నిన్ను చూడకూడదని అమ్మ అంటున్నది" అని సిగ్గుతో అన్నది.

"ఔను, మన మిప్పుడు పెద్దవాళ్ళ మయ్యాము"

అమ్మాయి తలవంచుకుంది; "అంటే అర్థం?" తనలో తానే మాటాడుకుంటున్నట్లు అడిగింది.

చాంగ్‌పో ఆమె నడుముచుట్టూ చెయ్యిపోనిచ్చాడు. "అంటే, నీలో వున్నది ఏదో ఒకటి రోజు రోజుకు నన్ను మరింత మంత్రముగ్ధుణ్ణిగా చేసేస్తూ వుంది. అది యేదో నిన్ను చూడాల్నే తృష్ణ నాలో రేకెత్తిస్తూవుంది. అదే నీవు దగ్గరగా వుంటే నాకు ఆనందం కలుగజేస్తుంది. నేను దూరముగా వున్నప్పుడు ఏకాకిగా చింతాక్రాంతునిగా చేసేస్తుంది."

ఒకనిట్టూర్పు విడిచి ఆయమ్మాయి అడిగింది: "ఇప్పుడు నీవు సంతోషంగా వున్నావా?"

"ఔను అంతా మారిపోతుంది. మెయిలాన్, నీవు నాకొరకూ, నేను నీకొరకూ" అని మెల్లగా అన్నాడు.

"నేను నిన్ను పెళ్ళిచేసుకోలేననీ, అమ్మా, నాయనా తొందర్లోనే నాకు సంబంధం కుదురుస్తారనీ నీకుబాగా తెలును"

"ఛా! నీవట్లా అనకూడదు, అననే కూడదు!"

"నీవు కొంచెం అర్థం చేసుకోవాలి"

"నాకర్థమయ్యేదంతా యిదే"—ఆయమ్మాయిని తన బాహువుల్లోనికి లాక్కుంటూ "ఆకాశమూ భూమీ సృష్టించబడి నప్పటినుంచీ నీవు నాకొరకూ నేను నీకొరకూ. నేను నిన్ను పోనియ్యను నిన్ను ప్రేమించడం తప్పేమీ కాదు"

మెయిలాన్ అతని కౌగిట్లోనుంచి తప్పించుకొని పరుగెత్తుకపోయి తనగదిలో దాక్కుంది.

యువకప్రేమయొక్క మేలుకొలుపు భయంకరమైనది. దానికితోడు వారి పరస్పరనీతి గుర్తుకురావడం, దుర్భరమనే వాస్తవికతవలన గలిగే మధనవ్యధ ఆ ప్రేమను మరింత భయంకరంచేసింది ఆరాత్రి మెయిలాన్ తన పక్కమీద పడుకొని వాళ్ళమ్మ చెప్పినదీ, తర్వాత చాంగ్ చెప్పిందీ మననంచేస్తూ గడిపింది. ఆరాత్రి మొదలుకొని ఆపిల్ల సంపూర్ణముగా మారిపోయింది. మేలుకొన్న ప్రేమను అరికట్టడానికి వాళ్లెంత తీవ్రంగా ప్రయత్నించారో అంతకంటే గట్టిగా దాని బంధనాలలో చిక్కుకుపోయారు. ఒకరినొకరు చూడ్డానికి వారు ప్రయత్నంచెయ్యలేరు. మూడురోజుల తర్వాత ఆ అమ్మాయి లజ్జాభారముతో అతనివద్దకు మళ్ళా వచ్చింది. రహస్యకారణంచేత వారి ఉద్రేకం మరింత రెచ్చిపోయింది. ఆ రోజులు,

యువకోద్రేకములూ, తియ్యని మనస్తాపాలూ, తాత్కాలిక వియోగాలూ, పునఃప్రమాణాలూ—అతిమధురమై అతి బాధాకరమై కనిపించిన రోజులు. వారికంటే గొప్పదైనట్టి ఏదో ఒక శక్తియొక్క అభేద్యమైన ఉచ్చులలో వారు చిక్కుకుపోయారని వారికి తెలిసింది. ఈ పరిస్థితులలో ఏమిచేద్దామా అన్న ఆలోచన వారికిలేదు. ఉన్నదంతా ఒక్క వలపే. ఆకాలపుటాచారాలనుబట్టి మెయిలాన్ తలిదండ్రులు ఒకటి తర్వాత ఒకటిగా సంబంధాలు చూస్తూ ఆమెను ఒప్పింపజేయాలని ప్రయత్నిస్తూ ఉన్నారు. ఆవిడమాత్రం ఏదో ఒకవంకతో కాలహరణం చేస్తూ వచ్చింది. ఒక్కొక్కప్పుడు నాకు పెళ్లివద్దు అని చెప్పేది. దాంతో వాళ్ళమ్మకు గుండెలో బండపడేది. ఆమె యింకా చిన్నదే గనుకనూ, ఒక్కతే బిడ్డగనుకనూ వారు తొందరపడలేదు. ఇంకా కొంతకాలం వారి వద్ద ఉండడమే మేలనిపించింది.

ఈ కాలములో చాజ్ పని చేస్తూ తనవృత్తిని నేర్చుకుంటూవున్నాడు. రాతిశిల్పమే తనజీవిత పరమార్థమని గుర్తించాడు. అజన్మశిల్పివలె కొద్దికాలములోనే ఈ విద్యలో అగ్రగణ్యుడయ్యాడు. అతడు ఆ కళను ప్రేమించాడు. విధీవిరామము లేకుండా ప్రతి అంశమునూ పరిపూర్ణత్వము సిద్ధించేవరకు సాధించేవాడు. ఆ కార్ఖానా యజమాని ఇతన్ని చూచి నిర్విణ్ణుడయ్యాడు. ధనవంతులు బొమ్మలు కొనడానికి ఈ కొట్టుకు కొలలుగా రాసాగినారు.

చక్రవర్తిని యొక్క పుట్టినరోజు పండుగనాడు ఆమెకొక బహుమతి ఇయ్యవలయునని ఒకదినము మెయిలాన్ తండ్రి నిశ్చయించుకున్నాడు. ఈ కానుక ప్రత్యేకమయినదిగా ఉండాలని, చాలా ఉత్తమజాతికి చెందిన చలువరాతి ముక్క నొకదాన్ని సంపాయించాడు. అమ్మగారి సలహామేరకు చాజ్‌పో పనిచేసేకొట్టుకు దాన్ని తీసుకుపోయి తనకు ఏమిటి కావాలో వివరించాడు. చాజ్‌పోయొక్క శిల్పమును పరీక్షించి దాని విలక్షణతకు చాల ఆశ్చర్యపడ్డాడు.

"నాయనా! ఇదిగో. నీకొక ప్రత్యేకమయిన పని యిస్తున్నా, ఇది చక్రవర్తినిగారి కానుక. దీన్ని బాగా చేశావా నీ యదృష్టం పండినట్లే" అన్నాడు.

చాజ్‌పో ఆ శిలను పరీక్షచేసి చూచాడు. అతని చేతులు మెల్లగా ఆ కఠినరాతిని చుట్టూ తడివి చూచాయి. అమిత సంతోషపడ్డాడు. ఆ శిలను ఒక "కూ ఆన్ యిన్" అనగా "దయాదేవత"గా చేయాలని తీర్మానింపబడింది ఇంతకు ముందెన్నడూ ఏ మానవుడూ కనీ వినీ యెరుగని సౌందర్యమూర్తిని ఆ శిలలోనుండి సృష్టించగలనని చాజ్‌పో అంతరాత్మకు తోచింది.

ఆ విగ్రహము సంపూర్ణమయ్యేవరకు చాజ్‌పో ఎవ్వరినీ దానిని చూడనియ్యలేదు.

పరిపూర్ణమయిన తర్వాత ఆ దేవత వాళ్ళ దేశాచార బద్ధమైన ఆకారములోను వైఖరిలోను ఉన్నది. కాని అద్వితీయమయిన కళావస్తువై ప్రశస్త సుకుమార సౌందర్యమై నిలిచినది పూర్వమెన్నడూ ఏశిల్పియూ సృష్టింపజాలనిది చాజ్‌పో ఇప్పుడు సృష్టించాడు. ఆ దేవత చెవులలో నిరాటంకంగా తిరిగే అంటుపోగులను ఆ రాతిలోనే మలిచాడు. ఆ చెవులు గూడా అతి సున్నితమై ఆశ్చర్యాన్ని గొల్పినవి. ఆ దేవతయొక్క ముఖము అతడు ప్రేమించిన బాలిక ముఖమువలె వుంది.

ఆ కమీషనరు చాలా సంతోషించాడు. రాచనగరుకైనా ఈవస్తువు వన్నె తెచ్చేదే నని అతనికి తోచింది. "ఈముఖము అచ్చంగా మెయిలాన్ దే నే" అని తండ్రి అన్నాడు "ఔను" చాజ్‌పో సాతిశయంగా అన్నాడు. "ఆమె నా ఆవేశము". "మంచిది నాయనా! ఇది మొదలు నీవిజయము దృఢమైనది" చాజ్‌ను ఉదారముగా బహూకరించి, మళ్ళా అన్నాడు—"అబ్బాయీ! ఈ అవకాశము నేను నీకు కల్పించినందుకు కృతజ్ఞుడవై యుండాలి సుమా."

చాజ్‌పో పొంగిపోయాడు. కాని దేని కొరకు అతని ఆత్మ తహతహపడేదో అదే అతనికి లభించలేదు. మెయిలాన్ లేకుండా ఈ విజయము అతని కేమీ లేనట్లై. తన హృదయకాంక్ష తనకు మించినదని గ్రహించాడు ఆ పడుచువాడు. తన పనిలో శ్రద్ధను గోల్పోయినాడు. ఎక్కువ డబ్బు వచ్చే పనులేవీ ముట్టుకోడు. తన యజమాని మండిపడ్డాడు. ఐనప్పటికీ చాజ్‌పో ఏపనీ చెయ్యలేకపోయాడు.

మెయిలా నిప్పుడు నిందాస్పదమైన ఇరువదియొక్క సంవత్సరముల వయసుకు సమీపముగా వస్తూ

వుంది. ఇంకా ఎవరికీ ఒప్పందం కాలేదు. చాలా పలుకుబడి గలిగిన ఒక కుటుంబముతో ఒక సంబంధం కుదిర్చారు. వస్తువులిచ్చి పుచ్చుకోడాలూ, ప్రధానమూ అయిపోయినవి.

నిరాశాపరులై, నివేదనాశూన్యులై వాళ్ళిద్దరూ పలాయన మాటకు నిశ్చయించుకున్నారు. చాజ్ సంపాదనాసమర్థుడని రూఢిగా ఎరుగును గాబట్టి తన నగలు కొన్ని తీసుకొనిపోతే ఏదో ఒక దూర రాష్ట్రములో వాళ్ళపొట్టవాళ్ళు పోసుకోవచ్చునని ఆ యమ్మాయి అనుకొన్నది.

ఒకనాటి రేయి తోట వెనుకభాగాన్నుంచి దాటుకొని పోవాలని తయారయినారు. ఒక వృద్ధ సేవకుడు ఆ చీకటిలో వారిని గుర్తించి—ఆ యిద్దరి సంగతీ ఆయింటి లోపల తెలియని వాళ్లెవరూ లేరు గనుక—అనుమానపడ్డాడు. ఆకుటుంబం అపకీర్తిపాలు గాకుండా కాపాడటం తన విధిగా భావించి ఆ యమ్మాయిని పట్టుకొనివదల్లేదు. చాజ్‌కు మార్గాంతరం లేదు. ఆ సేవకుని అవతలికి తోసినాడు. ముసలివాడు తడబడినాడు గాని అమ్మాయినిమాత్రం వదిలాడు కాదు. చాజ్ గత్యంతరంలేక అతని పుర్రెమీద ఒక్కటి వేశాడు. దాంతో ఆ నిర్భాగ్యుడక్కడే పడిపోయాడు. పడేటప్పుడు అతనితల ఒక బండరాతికి డీకొనుటచేత పడినవాడుపడినట్టే ఉండిపోయ్యాడు. కదలలేదు, మెదలలేదు. వీళ్లేమో పరారి చిత్తగించారు.

తెల్లవారేసరికి ఇంటిల్లపాదికీ తెలిసిపోయింది, ముసలివాని మరణమూ, వారి పలాయనమూ. ఆ పరాభవము పొక్కకుండా చెయ్యాల్నని ఒకవైపు ప్రయత్నిస్తూ మరొకవైపు వారిని పట్టకోడానికి చేసిన పన్నాగాలన్నీ పూర్తిగా నిష్ఫలములైనాయి. ఆ కమిషనరు గారి కోరలులేని క్రోధావేశానికి అంతులేదు. "నేను భూమండలాన్ని గాలిస్తాను," అని అతడు ప్రతిజ్ఞ చేశాడు, "వాణ్ణి తీర్పుకు తెస్తాను"

ముఖ్యపట్టణంనుండి యివతల పడింతర్వాత ఆ యువ దంపతులు చాలాదూరం ప్రయాణంచేశారు. చిట్టచివరకు పెద్దపెద్ద పట్నాల దరికిపోకుండానే యాంగ్‌ట్సీ నదినిదాటి దక్షిణ చీనాకు చేరుకున్నారు.

"కియాంగ్సీలో మంచి చలవరాయి వుందని విన్నాను," చాజ్ మెయిలాక్‌తో అన్నాడు.

"మళ్లా చలవరాతితోనే పనిచెయ్యాలని అనుకుంటున్నావా?" అని అనుమానిస్తూ మళ్లా అన్నది "నీ పనితనము గుర్తుపడతారు, అదే నిన్ను పట్టిస్తుంది"

"ఇంతకాలమూ మనము చెయ్యాలనుకున్నది అదేనేమోనని నేను తలంచాను" అని చాజ్ జవాబిచ్చాడు.

"అది సరే, అది ముసలివాడు 'టాయి' చావక ముందుమాట. మన మతన్ని హత్యచేశామని వాళ్లు తలచారు. నీవృత్తిని మార్చుకోలేవూ? పూర్వము చేసినట్టుగా లాంతర్లుచెయ్యి, లేక బంకమట్టి బొమ్మలు చెయ్యి."

"అదేంమాట, చలవరాతితో నేను పేరు సంపాదించాను."

"సంపాదించిన మాట నిజమే ఇప్పుడు వచ్చిన చిక్కంతా అదే గదా."

"మనం బుఱ్ఱ బద్దలు కొట్టుకోవాల్సిన పని లేదనుకుంటాను. కియాంగ్సీకిన్నీ ముఖ్యపట్టణానికిన్నీ దాదాపు వెయ్యి మైళ్లకుపైగా వుంది. మనల నెవరూ తెలుసుకోలేరు."

'అయితే నీ శిల్పవైఖరన్నా మార్చుకోవాలి. ఆ అసాధారణ విగ్రహాలు చెయ్యబోకు. వ్యాపారం నడపకుండా ఉండేటుమాత్రం చెయ్యి, చాలు." చాజ్ పై పెదవి కొరుక్కున్నాడు మారు పలుకలేదు. సుఖముగా బైటపడకుండా వుండడంకోసం వెయ్యిమంది మధ్యతరగతి శిల్పులు చేసినట్టు ఇతడుగూడా చేసి తృప్తిపడాలా? అతడు తనకళను నాశనం చెయ్యాలా? లేక తన కళనే తన్ను నాశనం చెయ్యనివ్వాలా? ఇది అతడు ఆలోచింపలేదు.

కాని అతని భార్యయొక్క అంతర్వాణే సత్యమైంది. వ్యాపారానికి పనికివచ్చే చవుక పనిచేయడం తనమగని స్వభావానికే విరుద్ధమని ఆమె అనుమానించింది. యాంగ్‌ట్సీనదిని దాటింతర్వాత ఏదో తెలియరాని నిగూఢశక్తి కొంటనువద్దనున్న ఆ గొప్ప పర్వత కనుమనుండి ఆగ్నేయభాగ మైదానములలోకి నడిపించే చలవరాతి ప్రదేశమైన కియాంగ్‌సికి లాక్కుపోతూవుందని ఆమె కేదో చెవిలో చెప్పినట్లయింది. రాష్ట్ర ముఖ్యనగరమైన నాంచాంగ్‌లో వారు నిలువడానికి దమ్ములులేనందున కియాన్‌కు వెళ్లారు.

వృత్తిని మార్చమని ఆ సతీమతల్లి మళ్ళా చెప్పింది. కియాంగ్ సీలో అమిత సున్నితమైన తెల్ల బంకమన్ను చక్కని పింగాణీ దొరుకుతుంది. అతని కళాపిపాసను పింగాణీ తృప్తిపరచగలదు. కాని చాంగ్ పో వినలేదు.

"ఒక వేళ పింగాణితో నే నేను తృప్తిపడినా, నన్ను గుర్తుపట్టేటంతటి అందమైన బొమ్మలు తయారు చేస్తాను లేక దీంట్లో కూడా నేను చవుకబారు మధ్య రకపు పనే చెయ్యాల్సని కోరుతావా? ఈ వరాతితో పనిచేయటం ఇక్కడ అపాయకరమేమీ కాదనుకుంటాను."

తన స్త్రీసహజజ్ఞానమునకు విరుద్ధంగా ఆ యిల్లాలు లొంగిపోయింది. "కాని చాంగ్! నన్ను చూచి నా కోసంగా నీవు పేరు ప్రతిష్ఠలకు పోవద్దు. మనము విపత్తులో వున్నాము. పేరు ప్రతిష్ఠలకు పోతివా మనము సర్వనాశన మౌతాము."

ఆమె విశ్వాసము ఇట్లా వున్నది గనుక ఈమాట చెప్పింది. కాని తన పెనిమిటి చేతులు ఎంతటి మహా సుందరమైన పనిని చేయగలవో అది తప్ప వేరొకటి చేయునని ఆమెకు నమ్మకము లేదు అతని సౌందర్య జ్ఞానము, పరిపూర్ణతా కాంక్ష, చలవరాతిమీది వ్యామోహము—వీటివలన చాంగ్ పో భయపడవలసినది పోలీసులకు గాదు, తన ప్రతిభకే. అతని పరిస్థితి యొక్క విషాద వికటత్వము తనకు గుర్తుకు వచ్చింది.

తన భార్య సౌమ్యులతో చాంగ్ పో అనేకరకాల ముతకరాళ్లు కొని అంగడి పెట్టాడు. అతడు పని చేస్తూ వుంటే మెయిలాన్ చూస్తూవుండేది.

"అంతమట్టుకు చాలించు. ఎంతో బాగుంది. అంత కన్నా మిన్నగా ఎవరూ చెయ్యలేరు. ఇదో చూడూ, నా నిమిత్తం, ఇంక చాలేద్దూ."

చాంగ్ పో ఆమెవైపు చూచి విచారంతో నవ్వాడు. మామూలుగా గుండ్రటి చెవిపోగులూ, లోలకులూ చాలా చేసేవాడు. అయితే చలవరాయి దానికదే సాటి. అది ఒక ప్రత్యేకమైన శైలిని ఆదరణను తనంత దా అనుసంధించుకుంటుంది. అత్యంత సుందరమైన కళామూర్తిని రూపొందించటానికి అవకాశమున్న దానిని, ఉదాహరణకు, దొంపపళ్లు దొంగిలించే కోతిగా నిర్మింపగల దానిని, ఆ చలవరాతిని, లోలకుల కోసం ముక్కలు ముక్కలు చేయటం అన్యాయం. కాబట్టి అప్పుడప్పుడు—మొదట్లో చాటుగానూ వద్దని చెప్పే అంతరాత్మతోనూ—కొన్ని విచిత్రమైన చక్కని రూపాలు—అద్భుతంగా స్వతంత్రమైనవి నిర్మించేవాడు. ఈవస్తువులు, ఇతడు ప్రేమించి చేసే వస్తువులు, పని ముగిసీ ముగియక ముందే తృటిలో ఎగిరిపొయ్యేవి. మామూలు వ్యాపార వస్తువులు గడించే లాభముకన్న ఎంతో ఎక్కువగా లాభము వచ్చేది.

"చాంగ్ నా మనసుకు క్షోభగా వుంది," మెయిలాన్ అతన్ని బ్రతిమలాడుకున్నది. నీయంతటికి నీవు బయటపడిపోయేలాగు చేసుకుంటున్నావు. మనకు సంతానం కలగబోతూ వుంది కొంచెం జాగ్రత్తగా వుండవూ?"

"సంతానమా? ఓహో! అయితే మనమింక ఒక కుటుంబమన్నమాట!" అని అత్యుత్సాహముతో అన్నాడు చాంగ్ పో ముద్దులతో అతడామెకున్న ఆపెబెరుకును తుడిచి వేశాడు.

"కాని మనము మతిలకు మించిన మంచిపని చేస్తున్నాము" అన్నది మెయిలాన్. వాళ్లు చేస్తున్న పని మంచిదన్నమాట నిజమే ఒక్క సంవత్సరం తర్వాత "పాహో" చలవరాతి బొమ్మలంటే తెలియని వాళ్లు లేరు. "పాహో" అనేది చాంగ్ పో తనకొట్టుకు పెట్టిన పేరు. కలవాళ్లంతా ఇతని సరుకుకోసమే వచ్చేవాళ్లు. రాజధానికి పోయేవాళ్లందరూ మార్గమధ్యంలో ఇక్కడికివచ్చి సుందరమైన పాహో బొమ్మలు కొనుక్కుపోవటం వల్ల కియాన్ అనే వూరు ఒక పట్టణంగా వెలిసింది.

ఒక నాడొక మనుష్యుడు కొట్లోకివచ్చి అక్కడ ప్రదర్శించివున్న వస్తువుల నెగాదిగా చూచి అడిగాడు, కెయిఫాంగ్ కమీషనరు చాంగ్ గారి చుట్టము 'పో' నువ్వేగదా" వెంటనే తడుముకోకుండా జవాబిచ్చాడు—తాను కాదనీ, తానెన్నడూ కెయిఫాంగ్ ముఖము చూచి యెరుగననీ. ఆమనుష్యుడి తణ్ణి అనుమానంతో పరకాయించాడు. "నీమాటల్లో ఉత్తరాది యాసబాగావున్నదే. నీకు పెళ్లయిందా?"

"అది నీ కనవసరం."

అంగడి వెనకాల్నుంచి మెయిలాన్ తొంగి చూచింది. ఆమనుష్యుడు వెళ్ళిపోయిన తర్వాత అతడు తన తండ్రిగారి ఆఫీసునించి వచ్చిన సెక్రెటరీ

అని చాంగ్‌తో చెప్పింది. బహుశః అతని చలువరాతి పని వాళ్లకు నిజంగానే పట్టిచ్చిందేమో

మర్నాడు ఆమనుష్యుడు మళ్లా వచ్చాడు.

"నీవు మాట్లాడే దేమిటో నాకేమీ అర్థం కావటం లేదు" అని చాంగ్ పో చెప్పాడు.

"మంచిదేలే. చాజ్‌పోనిగురించి నేను నీకు చెప్తాను. ఖూనీ, బలాత్కార బాలికాపహరణం, చోరీ అనే మూడు నేరాలమీద చాంగ్ పో యిప్పుడు కావలసియున్నాడు. నీవు చాజ్‌పో కాదని నన్ను నమ్మించాలంటే నీభార్యచేత నాకొక కప్పుటీ యిప్పిస్తావా? ఆమెను నేను చూచినప్పుడు కమీషనరుగారి కుమార్తె కాదని నమ్ముతాను."

"నేనిక్కడొక షాపు నడిపిస్తున్నాను. తొందరలు కలిగించడానికి ప్రయత్నించేవాడివైతే నెమ్మదిగా బైటకినడుపడం మంచిది."

అవహేళన చూపొకటి చాజ్‌మీద విసిరి అతను వెళ్లిపొయ్యాడు.

తొందరగా వాళ్లు చలువరాతిసామానూ ఇంకా విలువగల సామానూ సర్దుకుని ఒకపడవ మాట్లాడుకొని చీకటిపడింతర్వాత నదిమీద ఎగువకు పారిపొయ్యారు. వాళ్లబిడ్డకు మూడు నెలలు మాత్రమే.

మానవ వ్యక్తిత్వమో లేక అది దేవుని సంకల్పమో యేమో తెలియదు. బిడ్డకు జబ్బు చేసినందువల్లనూ, నెలరోజులు నదిమీద ప్రయాణంచేయడంచేత చేతిలో పైకం అయిపోయినందువల్లనూ వాళ్లు కాక్ షెయిక్ వద్ద ఆగవలసివచ్చింది. చాజ్‌పో తన అత్యుత్తమ శిల్పాలలో నొకదానిని—ఒకకన్ను మూసుకొని వంగిచూచు కుక్కను—తీసి వాంగ్ అనే ఒక చలువరాతి వ్యాపారస్తునికి అమ్మవలసివచ్చింది.

"భలే, ఇది పాహోరాయి. ఇంకే కార్ఖానా ఇల్లాంటివి తయారుచెయ్యలేదు. ఇవి అనుకరణ సాధ్యములు కానేకావు."

"నీవు చెప్పింది నిజమే. నేనిది పాహోలో కొన్నాను." అని చాంగ్ పో అన్నాడు. లోలోపల చాలా గర్వపడ్డాడు.

కాక్ షెయిక్ ఎత్తయిన పర్వతపంక్తి పాదాల మీద ఉన్నది. శీతాకాలం. చాంగ్ పో ఆ స్వచ్ఛ నీలాకాశం ఆకొండగాలి వీటి వలపులో పడిపొయ్యాడు. భార్యాభర్తలు అక్కడే ఉండిపోవడానికి ఏర్పాట్లు చేసుకున్నారు. వాళ్లశిసువుకు నయమైంది. చాంగ్ పో ఒక క్రొత్తకార్ఖానా పెట్టడానికి తీర్మానించుకున్నాడు. కాన్ షెయిన్ ఒక పెద్దనగరం. అందుచేత బయలునెడలి ఇరవై మైళ్ళదూరంలో ఒక ఊళ్ళో ఉండడం యుక్తమనుకొన్నారు చాంగ్ పో ఇంకొక వస్తువు అమ్మవలసి వచ్చింది.

"ఎందుకా పనిచేశావు?" మెయిలాన్ అడిగింది.

"మనం షాపుపెట్టడానికి డబ్బు కావద్దా మరి?"

ఈసారి నామాటవిను. మన మిక్కడే ఒక బంకమట్టి బొమ్మల దుకాణం పెడదాం.

"ఏం?..." చాంగ్ పో గొంతులో మాట గొంతులోనే వుండిపోయింది.

"నీవు వినకపోవడంచేత మనం పట్టుబడడం కాస్తలో తప్పిపోయింది. చలవరాయే నీకంత గొప్పా? నీభార్యకంటే బిడ్డకంటేనా? కొంతకాలం పిదప పరిస్థితులు మారవచ్చు. అప్పుడు మళ్ళా నీ మొదటి కళకు నీవు పోవచ్చు."

తన కోరికకు విరుద్ధంగా కాల్చిన నల్లటి బంకమట్టి బొమ్మల అంగడిని చాంగ్ పో పెట్టాడు. వందలాది బుద్ధులను తయారుచేశాడు. కాని ప్రతివారం చలవరాతి వర్తకులు కాంటన్ నుండి ఈ మార్గంగా పోవడం చూచి ఆపని మళ్ళా చెయ్యాలని ఉబలాటపడ్డాడు. ఆవీధుల్లో తిరుగుతూ ఏదో ఒక చలవరాతి సామాను కొట్టవద్ద నిల్చునేవాడు. అతని కళ్ళల్లో కోపము పైకీ కిందికీ తిరిగేది. ఇంటికి వచ్చి తాను చేస్తూవుండిన పచ్చి బంకమట్టిబొమ్మల్ని ప్రేళ్ళతో పిసికి పారేసేవాడు.

"వెధవ మట్టి, చలవరాతిని మలవగలవాణ్ణి దీంతో కొట్టుకోవాల్సిన రాత నాకేమొచ్చింది?"

అతని కళ్ళల్లోని జ్వాలనుచూచి మెయిలాన్ అదిరిపోయింది. "సర్వనాశనమయ్యే వ్రాత నీకు వ్రాసివుంది."

ఒకనాడు రాతి వర్తకుడు వాంగ్, చాంగ్ పోను కలుసుకొని పాహో శిల్పాలు ఇంకా ఇతనివద్దనుండి కొట్టెయ్యడానికి వీలవుతుందేమోనని ఇతనిని తన బసకి ఆహ్వానించాడు.

"ఎక్కడకు వెళ్ళారు?" చాంగ్ పో అడిగాడు.

"కియాన్ వెళ్ళాను. ఇప్పుడే వచ్చాను." వాంగ్ అన్నాడు. ఒక మాటవిప్పి చెప్పాడు, "చూచావుకదూ పాహోషాపు ఇప్పుడెల్లాంటి సరుకు తయారు చేస్తూవుందో?".

చాంగ్ పో మారుపలుకలేదు. ఒక కురువింద మర్కటాన్ని వాంగ్ చూపించినప్పుడు చాంగ్ అరిచాడు "నకలు".

"నీవు చెప్పింది సత్యం", వర్తకుడు మెల్లిగా అన్నాడు. "ఈ కోతి మొహాన భావమే లేదు. నీ మాటల్ని బట్టి చూస్తే అంతా తెలిసినవాడి లాగున్నావే."

"నాకు తెలుసు" చాంగ్ చురుగ్గా అన్నాడు.

"ఔనౌను, జ్ఞాపకముంది. అప్పుడు నాకో అద్భుతమైన కుక్కబొమ్మను అమ్మావుగదూ. దాని మీద నేను నూటికి నూరు లాభం సంపాయించానని నీకు చెప్పడానికి నాకేమీ సంకోచంలేదు. అటువంటి సరుకు నీవద్ద ఇంకాయేమైనా వుందా?"

"అసలైన పాహో కురువింద మర్కటం ఎలా వుంటుందో నీకు నేను చూపిస్తాలే."

తన షాపుకు పోయింతర్వాత చాంగ్ పో తాను కియాన్‌లో వున్నప్పుడు చేసిన బొమ్మ నొకదాన్ని వాంగ్‌కు చూపించాడు. అమ్మమని బ్రతిమలాడితుదకు వాంగ్ దాన్ని కొన్నాడు. మరుదఫా నాం చంగ్‌లో చలవరాతిబొమ్మల సంతకు పోయినప్పుడు వాంగ్ కొంతమంది స్నేహితులతో సాధారణమైన బంకమట్టి బొమ్మల అంగడివాని వద్ద తాను ఎటువంటి విచిత్రవస్తువులు సంపాయించిందీ చెప్పుతూ "నా కౌశ్వర్యం అటువంటి వానివద్ద అంత అద్భుతమైన సరుకుండడం" అని అంటించాడు.

ఆరు నెలల తర్వాత ముగ్గురు సిపాయీలు చాంగ్‌పోనున్నూ కమీషనరుగారి కూతుర్నిన్నీ పట్టుకొని రాజధానికి తీసుక పోవడానికి అధికార పత్రాలతో సహా తయారయినారు. కమీషనరు ఆఫీసు సెక్రెటరీ కూడా వీరి వెంట ఉన్నాడు.

"కొద్ది సామాన్లు నన్ను కట్టుకోనియ్యండి, నేను మీ వెంబడి వస్తాను" అని చాంగ్ చెప్పాడు.

"బిడ్డకు కావలసిన వస్తువులు కూడా తీసుకుపోవాలి" మెయిలాన్ అందుకున్నది. "వీడు కమీషనరుగారి మనుమడని మర్చిపోకండి. దోవలో వీడికి జబ్బుచేస్తే మీదే జవాబుదారీ".

వాళ్ళను దోవలో జాగ్రత్తగా చూడమని కమీషనరుగారే ఆ మనుష్యుల కుత్తర్వు లిచ్చి పంపారు. చాంగ్‌పోనున్నూ అతని భార్యనున్నూ షాపు వెనుక భాగానికి పోనిచ్చారు. సిపాయీలు ముందు భాగాన కాచుకొని వున్నారు.

అది కఠినాతికఠినమైన వియోగ సమయం. చాంగ్‌పో తన భార్యను బిడ్డను ముద్దెట్టుకొని కిటికీలో నుంచి అవతలికి దుమికేశాడు. మళ్ళా ఈ జన్మలో వాళ్లని చూచే ప్రాప్తి లేదని అతనికి తెలుసు.

"నిత్యమూ నిన్నే ప్రేమిస్తాను" మెయిలాన్ సన్నగా కిటికీగుండా చెప్పింది:

"ఎప్పుడూ యిక చలవరాయి ముట్టుకోకు."

మెయిలాన్ కిటికీ వద్ద నిల్చుంది ఒక చెయ్యి పైకెత్తి తన భర్తకు జీవతపు కట్టకడపటి వీడ్కోలిస్తూ వుండగా చాంగ్‌పో కడసారి చూపుచూచాడు.

అతడు కనుచూపు మేర దాటింతర్వాత ఆమె ముందు భాగానికి వచ్చేసి నిశ్చలంగా ఏమీ ఎరగనట్టు చాలా తొందరగా సామాను సర్దుతూ వున్నట్టు కొన్ని వస్తువులు సంచీలో పెట్టింది. సిపాయీలను బిడ్డను పట్టుకొమ్మని చెప్పి వాళ్లతో అమాటా యీమాటా చెబుతూ సామాను కట్టుకుంటూ వుంది. సిపాయీలకు అనుమానం కలిగి ఇల్లు వెతికినారు. అప్పటికే చాంగ్‌పో చాలాదూరం వెళ్లి వుంటాడు.

మెయిలాన్ కన్న వారింటికి వచ్చింది. అమ్మ లేదు. నాయన వృద్ధుడైపొయ్యాడు. ఆమె తండ్రికి నమస్కరించినప్పుడు అతని ముఖములో క్షమామంచ హాసము కనబడలేదు. ఆమె చిన్న కుమారుణ్ణి చూచిన తర్వాత నే కొంత మెత్తబడ్డాడు. చాంగ్‌పో తప్పించుకు పోయినందుకు ఒక రకంగా ముసలివానికి బెడద తప్పినట్టే అయింది. ఎందుకంటే అతడు చిక్కివుంటే అతణ్ణి ఏమి చెయ్యాలో తెలిసేదిగాదు. ఇంతకూ తన కూతురు జీవితాన్ని నాశనము చేసి అకుటుంబమంతటికీ అంత దుర్దశ తెచ్చిపెట్టిన వానిని క్షమించలేక నే పొయ్యాడు.

ఏండ్లు గతించినవి, కాని చాంగ్‌పోను గురించిన వార్తలేవీ వినబడలేదు. కొంటనునుంచి ఒకనాడు

# శిలా దేవత

గవర్నరు యాంగ్ రాజధానిలో దిగినాడు. గవర్నరు గార్ని గౌరవించడానికి కమీషనరొక విందు చేశారు. విందు ఆరగించే సమయంలో గవర్నరు బైటపెట్టాడు. తాను ఒక మహాఅద్భుతమైన బొమ్మను తెచ్చాననీ, కమీషనరు చక్రవర్తిని కిచ్చిన 'దయాదేవత' కంటే అది మిన్నయనీ, శైలిలోనూ, పనితనపు సౌకుమార్యములోనూ ఈ రెంటికీ చాలా పోలిక వున్నదనీ, నిజానికి ఇదే అంతకన్నా చాలా సుందరంగా వున్నదనీ చెప్పాడు. ఆయన దాన్ని చక్రవర్తిని కియ్యాలనుకొన్నాడు. అప్పుడవి రెండూ జోడుగా వుంటవి.

విందుకు వచ్చినవారిలో కొందరు నమ్మజాలక చక్రవర్తినిగారి దయాదేవతకంటే మించిన పనితనం అసాధ్యమని వారి అభిప్రాయం వెలువరించారు.

“దీన్ని నేను మీకు చూపించేవరకూ ఆగండి” గవర్నరు విజయగర్వంతో అన్నాడు.

విందు ముగిసింది. బల్ల శుభ్రం చేశారు. ఒక నిగనిగలాడే కొయ్యపెట్టెను గవర్నరు లోనకు తెప్పించారు. ఆ తెలుపుమించిన చలవరాతి “దయాదేవత”ను పెట్టెలోనుంచి తీసి బల్లమధ్యలో పెట్టేసరికి ఆగదిలో శబ్దమే లేదు—'ఇదే విషాద దయాదేవత.'

ఒక పనికత్తె యీ సంగతి మెయిలాన్‌తో చెప్పడానికి పరుగెత్తింది. అల్లిక తెరచాటునుంచి మెయిలాన్ ఆగదిలోకి చూచింది. ఆ రాతి విగ్రహం మీద తనచూపు పడేసరికి ఆమెముఖం వెలవెలపోయింది. “ఆయన చేశాడు దీన్ని, నాకు తెలుసు. ఆయనే”అని గుసగుసలాడింది. చాంగ్‌పో యింకా బ్రతికి వున్నాడేమో వినడానికి ఆమె ధైర్యము చిక్కబట్టుకొని అక్కడ నిల్చుంది.

“శిల్పి యెవరు?” ఒక అతిథి అడిగాడు.

“అదే యీ కథలో ఒక విచిత్రమైన సంగతి,” ఆ కౌంటను గవర్నరు చెప్పసాగాడు. “అతడు చలవరాతిపనిని వృత్తిగా పెట్టుకున్నవాడుకాదు. నాభార్య మేనకోడలిద్వారా నేనతన్ని గురించి తెలుసుకున్నాను. ఆవిడ ఒక పెళ్ళికిపోతూ నా భార్యవద్దవున్న పురాతనపు గాజుల జతను ఎరువుతీసుకుపోయింది. అవి రెండూ ఒకే అచ్చు. పెనవేసుకొన్న రెండు నాగసర్పాలు; చాలా తికమకపు నమూనా. నా మేనకోడలు వాటిల్లో ఒకటి విరగ్గొట్టి గుండె బేజారెత్తిపోయింది. నిజంగానే అదొక శోచనీయమైన విషయం. ఎందుకంటే ఆగాజులు వాటికవేసాటి. లోపం పూరించడం అసాధ్యం. ఆ విరిగిపోయిన గాజుకుబదులు నకలు గాజు చెయ్యించాలని కోడలు పట్టుపట్టింది. అనేకమైన దుకాణాలకుపోయింది. అందరూ ఒకటేమాట, అల్లాంటిదిరోజుల్లో తయారు చెయ్యలేరని. టపాపులలో ఆవిడ ప్రకటన చేయించింది. తర్వాత తొందర్లోనే మాసిన దుస్తులు వేసికొన్న ఒక మనిషి వచ్చి పదకు ప్రకటనకు జవాబుగా వచ్చానన్నాడు. ఆగాజు అతనికి చూపించారు. అతడు చేయగలనని చెప్పాడు, చేశాడు. అతణ్ణి గురించి నేను మొట్టమొదటగా వినడం ఈ సందర్భంలోనే.

“దయాదేవతకు జతగా ఇంకొక విగ్రహముంటే బాగుంటుందని చక్రవర్తిని గారు కోరిన సంగతి నేను విన్న తర్వాత ఈ మనిషి జ్ఞాపకానికి వచ్చాడు. కౌంటన్‌లో దొరికే వాటిల్లోకల్లా ఉత్తమమైనదని అనుకొన్న ఒక చలవరాతిముక్కను కొన్నాను. ఇతణ్ణి రప్పించాను. అతడు లోపలికివచ్చి ఈరాతిని చూచి ఏదో దొంగతనం చేసినవాడిలాగ మూడు మూర్తులా భయపడిపొయ్యాడు. చక్రవర్తిని గారిదగ్గర వుండే దయాదేవతకు జతగా ఇంకొక దయాదేవత కావాలని అతనికి నచ్చజెప్పేటప్పటికి తలప్రాణం తోకకు వచ్చింది. తిరిగే చెవిపోగులను గురించి నేను వర్ణించేటప్పుడు జంకినాడు, కాని మారుపలుక లేదు. నెమ్మదిగా అతడు రాతిని సమీపించి దాన్ని నలుమూలలా పరిశీలన చేశాడు. 'ఏమిటి సంగతి, అదేమంత మంచిది కాదా?' అనడిగాను. కడకు అతడు నావైపు తిరిగి సగర్వంగా అన్నాడు. 'ఈ రాయి చాలు, దీంతో పని చెయ్యడం వృథాకాదు. నా జీవితమంతా ప్రయత్నించాను. తెలుపుమించిన యీజాతి చలవరాతిని సంపాయించడానికి. నేను చేస్తాను, గవర్నరుగారూ, కాని షరతేమిటంటే దీనికోసం మీరు నాకు జీతమియ్యకూడదు. నా మనసులోవున్న రీతిగానే శిల్పము తయారు చెయ్యడానికి నాకు స్వేచ్ఛ యివ్వాలి?

“అతన్ని ఒక మామూలు పడక మేజాలున్న గదిలో నెలకొల్పాను. అతడడిగిన పరికరాలన్నీ యిచ్చాను. అతడొక విచిత్ర వ్యక్తి. ఎవరితోనూ మాట్లాడేవాడు గాదు. పనివాడైనా తీసుకొని అతని గదిలోకి పోతే అతన్నికసురుకునేవాడు. కాని ఆ వేళము

పొందినవాడిలాగ పని చేసేవాడు. ఐదు నెలలదాకా నన్ను కూడా ఆ విగ్రహాన్ని చూడనియ్యలేదు. అతడు పని పూర్తి చేసుకొచ్చేటప్పటికి ఇంకొక మూణ్ణెల్లు గడిచింది. మీరిప్పుడు చూచుచున్నట్టే నేనూ చూచి కొయ్యబారిపొయ్యాను. తన సృష్టి తను చూచుకున్నప్పుడు అతని ముఖములో ఒక వింతైన తేజస్సు కనపడింది. 'ఇదిగో గవర్నరుగారూ, నేను మీకు కృతజ్ఞుడను. ఆ విగ్రహము నా జీవితచరిత్ర.' నేను బదులు చెప్పకముందే అతడు వెళ్ళిపొయ్యాడు. నేను వెంబడించాను, కాని అప్పుడే వెళ్ళిపొయ్యాడు. శాశ్వతంగా మాయమయ్యాడు."

ప్రక్కగదిలోనుండి ఒక భయంకరమైన కేక ను ఆ అతిథులు విన్నారు. ఒక స్త్రీయొక్క ఆర్తనాదం, గుండెలను చీల్చేకేక. ఎవరికివారు వారి స్థానాల్లో నే గడ్డకట్టుకుపోయారు. ఒంటరిగా ఆ ముసలికమీషనరు మెయిలాన్ వద్దకు పరుగెత్తుకుపోయారు ఆమె నేల మీద పడివుంది.

కమీషనరు కుటుంబానికి దగ్గర మిత్రుడైన ఒక అతిథి దిగ్భ్రాంతుడైన ఆ గవర్నరుగారితో అన్నాడు "ఆమె కమీషనరుకూతురు. ఆమే యీ దేవత. ఈ శిల్పి ఆమెభర్త చాంగ్‌పో తప్ప వేరొకడుకాదు."

మెయిలాన్ తెప్పరిలినతర్వాత వారందరి యెదురుగా ఆ బల్లదగ్గరకు వచ్చింది. నెమ్మదిగా ఆ బొమ్మను తాకడానికి చేతులు పైకిలేచినవి. తర్వాత గట్టిగా దానిమీద నిలిచినవి. ఆ శిల్పాన్ని చూడడంలో దాన్ని స్పర్శించడంలో ఆమె ఘనలా తన భర్తనుచూచి స్పృశించినట్లుగా అనుభవించినట్లు కనబడింది ఆ చలువరాతి విగ్రహమూ ఆయమ్మాయీ ఇద్దరూఒకటే నని యిప్పుడందరూ చూచారు.

జరిగినదేమిటో తెలిసికొన్న తర్వాత గవర్నరుగారిలా అన్నారు: "ఈ బొమ్మను నీవు వుంచుకో తల్లీ, చక్రవర్తినిగారి కింకొక బహుమానమేదైనా యిస్తాలే. ఇది నీకు కొంత ఉపశాంతిగా వుంటుందని నమ్ముతాను. నీవు మళ్ళా నీ భర్తను కలుసుకునేటంతవరకు ఇది నీది."

ఆ దినము నుంచీ ఏదో ఒక అగోచరమైన వ్యాధి ఆమె శరీరాన్ని తినివేస్తున్నట్టుగా మెయిలాన్ క్రమేణా ఎండిపోసాగింది. ఆమెని [illegible] కనబడితే సర్వమూ క్షమించడానికి కమీషనరు సిద్ధంగా వున్నారు. కాని అంతం వచ్చేటప్పటికి కోర్టు గవర్నరుగారినుంచి సమాచారం వచ్చింది. చాంగ్‌పోను కనుగొనడానికి చేసిన సర్వప్రయత్నాలూ వ్యర్థమైనాయని.

రెండేండ్లతర్వాత ఆ పట్టణం సగం మునిగిపోయిన ఒక భయంకరమైన తుఫానువానప్రవాహం చాంగ్‌పో కొడుకును కూడా ఎత్తుకుపోయింది. అప్పుడు మెయిలాన్ తల వెంట్రుకలు తీయించి ఒక మఠం ప్రవేశించింది, ఆ ఒక్క బొమ్మనుమాత్రం తీసుకొని.

మఠాధికారిణి చెప్పినట్టుగా మెయిలాన్ తన లోకమే తనదిగా జీవించింది. ఇంకొక సన్యాసినిని గాని మఠాధికారిణిని గాని తనగదిలోకి రానిచ్చేది కాదు.

ఇంకా మఠాధికారిణి గవర్నరుతో చెప్పిందేమంటే రాత్రులు ఒకటితర్వాత ఒకటి అంతులేని విజ్ఞాపనలు వ్రాసి ఆ బొమ్మదగ్గరకు తీసుకవచ్చి కాల్చివేస్తూవుండడం చూచారని. ఆమె తన రహస్య ప్రపంచంలోకి ఎవర్నీ అడుగుపెట్టనియ్యలేదు. కాని ఖులాసాగానే వుండేది. ఎవరికీ ఏహాని చెయ్యలేదు.

మఠములో చేరిన ఇరవై సంవత్సరాలపిదప మెయిలాన్ మరణించింది. నశ్వరమైన దయాదేవత గతించిపోయింది. శిలాదేవత మిగిలింది.

# నాటకరచనలో పాటలు, పద్యములు

శ్రీ బి. ఉమామహేశ్వరశర్మ

భావముత్పన్నమయి పంచేంద్రియములకు ప్రాకగనే కంపము, స్వేదము, రోమాంచము, అశ్రువు, స్తంభము ఇత్యాదులు కలుగును. క్రమేపీ గాత్రము నాక్రమించగనే భావమునకు నాదరూపము సిద్ధించును. మూర్ధము నాక్రమించగనే నాదమే దంత్యము, తాలవ్యము ఇత్యాదీయమై వాగ్రూపమును కూడ పొందును. అనగా భావము వాచికమగునప్పటికి దానికి 'నాదము' 'వాక్యము' అని రెండంగము లేర్పడగల వన్నమాట.

అసలు సంఘజీవనుడైన మానవుడు తోటిమానవునితో తన భావములను వెల్లడిపఱచుకొనవలెనన్న ఆ నాదము, వాక్యము అంగములే కాదు ఆవశ్యకములునూ. ప్రప్రథమమున అనగా అనాదిలో సౌజ్ఞలు సాధనములయి యుండవచ్చుగాక. ఆ సౌజ్ఞలలోనూ ఎక్కుడు ధ్వనులే గాన క్రమేపీ ఆ ధ్వనులే ఒక సాహిత్యమునకు దారితీసినవి. కాన ఎటుచూచిననూ చివరికి నాదము వాక్యము ఈ రెండూ భావములకు అవశ్యాంగములని తేలుచున్నది.

భావమునకు 'తీవ్రత' 'వేగము' అని రెండు ధర్మములుకూడ గలవు. తీవ్రతయన్నది భావస్థితికి గల ధర్మము. వేగమన్నది భావగతికి గలధర్మము, భావగతికి వేగముతోబాటు తీవ్రతయూ ఉండగలదు.

తీవ్రత, వేగము ఈ రెండును అన్యోన్యపోషకములు. తీవ్రత హెచ్చినకొలదియు వేగము, వేగము హెచ్చినకొలదియు తీవ్రతయు హెచ్చుచుండగలవు. ఇటు ఈ రెండును అన్యోన్యముగా అతిశయించినకొలదియు భావమునూ అతిశయిల్లగలదు.

మరి ఆ భావాతిశయమును అంతే తీవ్రతతో అంతే వేగముతో ఎఱుకపఱచుకొనవలెనన్న మార్గమేది?

భావాతిశయమన్ననో అంతులేనిది. స్వరము వాక్కులన్ననో కేవలము ఆంగికములు కాన, ఆంగికములకు వీనికినీ పరిమితియన్నదొక ప్రతిబంధకము గాన, ఆ వాక్స్వరములునూ అటువలెనే పరిమితులకు లోబడినవే

తారాపథము నంటుచున్న భావమును అనుసరించుటలో ఏదియో ఒకచోట ముందు వాక్కులే అనగా వచనములు నిలిచిపోగలవు తరువాతగాని స్వరము నిలచిపోదు.

వాక్కులు అనగా వచనము ఎప్పుడయితే భావముయొక్క తీవ్రతతోనూ వేగముతోనూ సమాన తీవ్రతా వేగములతో సంచరించలేక వెనుకబడునో అప్పుడే స్వరపు సాయమునుకూడ అపేక్షించవలసి యుండును. మరి ఆస్వరమునకునూ మితి గలదు మానవమాత్రుడెవడునూ ఈ మితులను దాటిపోలేడు. కాని వాటిని సాంతముగా కాకపోయిననూ కొంతవఱకయిననూ పైకి గదుముకొనగలడు. అంతే.

ఇక ఆ గింజులాటలో మొదట వాక్కులూ తర్వాత స్వరమూ అని ఒకక్రమమునూ ఉండదు. ఒకదానికొకటి జోడించియే సాధ్యమయినంతవఱకు భావసంచారము ననుసరింతుము. కొంత మేఱకు పోగా అదియూ కుంటుపడును. సరిగ అచటనే, అనగా ఎచటనయితే సామాన్య వాక్కులూ స్వరములూ కుంటుపడునో అచటనే, మరి వేరే గత్యంతరము లేక ఆ వాక్స్వరములనే సంస్కరించి ఆ సంస్కరించబడిన వాటితో మరికొంతవఱకు భావసంచారానుసరణను సాధించవలసి యున్నది.

అటు ఆ సంస్కరించబడిన వాక్కులే అనగా ఎక్కువశక్తినీ ధ్వనినీ రీతినీ యియ్యబడిన వాక్కులే వృత్తములు గీతములు గేయములు; ఎక్కువ శక్తినీ ధ్వనినీ రీతినీ యియ్యబడిన స్వరములే రాగతాళములు.

కావున భావాతిరేకమును వ్యక్తపరచుకొనవలెనన్నచో ఏదియో ఒకదశలో, ఏదియో ఒకరూపములో ఏదియో ఒకపరిమాణములో సంస్కరించబడిన వాక్స్వ

దములను అనగా పాటలను పద్యములను సంగీతముతో సహా వినియోగించుకొనక తప్పదన్నమాట.

ఇక ఆ పాటలు పద్యములు గానము నాటకమునం దెంతవఱకు సహజములన్న విషయమునకు వత్తము. అసలీ మీమాంసకుముందు అవి జీవితముననే ఎంత వఱకు సహజములో చూతము.

ఏ దేశవాఙ్మయమునైననూ వెదకిన దానికి నాంది కవనములోనే ప్రారంభించినది. అంతవఱకు దేనికి ? మన ఆర్యజాతికి అనాదిరచనలయిన వేదములన్నియూ కవనములే. ఒక వేదము నిండుగా గానమే. అసలు వేదముల చదివెడిరీతియే ఒక ప్రత్యేక గానపద్ధతి.

మనభాషకు తొలిగ్రంథములయిన శిలాశాసనములన్నియూ కవనమయములే. మనకోవకు పునాదులయిన సామెతలునూ అంతే. వాటికర్తలు సామాన్య పాటకప్రజలు. ఆవంతయూ సంగీతజ్ఞానముగాని సాహితీపరిచయముగాని అందుకు వలసిన జిజ్ఞాసగాని వ్యవధిగాని లేని పట్టి కాచి వడపోసిన పామరులు. అయిననూ వారికి కవనముగాని గానముగాని చేయవలయునన్న ప్రయత్నము లేకయే వాటంతట అవే సిద్ధించినవి. ఉదాహరణకు :

(1) తుమ్మల్లో పొద్దు కూకినట్లు
(2) గుడ్డెద్దు చేలో పడ్డట్లు
(3) బెల్లంకొట్టిన రాయల్లే
(4) తేలు కుట్టిన దొంగల్లే
(5) కన్నములోనే దొంగ చిక్కినట్లు......

ఇత్యాదులు కొకొల్లలు. ఉపమా కాళిదాసస్య అని నానుడి. అసలు కాళిదాసే గ్రామీణుల సామెతల నుంచియే తాను ఉపమించుటను పుణికిపుచ్చుకొనెనేమో.

ఇక సామెతలు :

(1) సరదాకు సమర్తాడితే చాకలాడు కొకడి గాడు.

(2) తోచీతోచనమ్మ తోటికోడలి పుట్టింటికెళ్ళింది.

(3) కళ్ళార్పినమ్మ యిళ్ళార్పుతుంది.

(4) రంకు నేర్చినమ్మ బొంక నేర్వదా?

(5) మద్దెల వెళ్లి రోలుతో మొర పెట్టుకొన్నది

(6) కుండ్రాయి దాస్తే పెళ్ళౌతుందా?

(7) సమర్త కీడు చాకలాడికి కొట్టింది......
ఇత్యాదయః.

వీటిలోని సామ్య రచన, యమకప్రాసలు, అన్నిటికన్న వాటిలోని భావపుష్టి, రసవృష్టి అపారము. అయిననూ వాటిని ఎవరునూ కావలెనని పొదుగలేదు. సామాన్యప్రజకు అలా దొర్లుకవచ్చినవే.

మరొకటి దృష్టాంతము. ఎవరితోనో ఘర్షణ పడి ఎంతయో ఉద్రేకమునకు పాల్పడిన ఒక సామాన్య స్త్రీ సామాన్యధోరణిలో తిట్టి తిట్టి విపరీతముగా నుద్రిక్తయై కసకు గొంతుచించుకొనుచూ "నీ పిండాకూడు నీ బీగాకూడు" "నీ పాడె నీ పచ్చిబద్దలు" "నీ వొల్లకాడు నీ వోశినకాడు" అని ఈ వరసన తిట్టిన తిట్టు తిట్టకుండా దుమ్మెత్తిపోయుట మన దైనందిన సన్నివేశములలో ఎన్నియోమారులు గమనించుచునే యున్నాము. ఆమె గొంతుచించుకొనుట సంస్కార సభ్యతాహీనమయిన ఒక ముడి సంగీతమునకు సన్నిహితము కాదనగలరా? ఆ తిట్టిపోతలలోని రీతి, పదజాలపు పరిమాణములు ఇత్యాదులు ఒక ముడి సాహిత్యమునకు సన్నిహితము కాదనగలరా?

కాని ఒకటే ఇచట హెచ్చరిక. సామాన్యప్రజ అనినదెల్లా సాహిత్యమనియూ, కూసినదెల్లా సంగీతమనియూ నా భావము కాదు.

ఆ ఉద్వేగములో వారి వాక్కులు, గాత్రము పడిన అవస్థను గమనించినచో ఒకానొక స్థాయిలో ప్రశాంతసమయములకన్న భిన్నమయిన పదజాలమును, గాత్రమును మన ప్రకృతికి సహజముగనే ఆలంబనముగా గ్రహింతుమని చెప్పుచున్నాను.

కాని ఉద్వేగములోనున్న వ్యక్తికి సభ్యత సరసత శూన్యము. అందువలన వాని మాటలకు గాత్రమునకునూ సభ్యతా సరసతలుండవు. కావున కవిరచనలో ఆ ఉద్వేగములను అనుభూతికి తెచ్చికొని వాటికి సభ్యతను సరసతను సమసృష్టిని ఒక నిర్దుష్టమయిన రీతిని పొదిగి సుఖబోధనార్థము కొంతవఱకు ఉత్ప్రేక్షించియూ ప్రజలకు అందియ్యవలసి యున్నది. అలా యియ్యబడినవే సంగీత సాహిత్యములు.

మరి యిన్ని దాఖలాల నుంచికొనియూ సంగీత సాహిత్యములు మన దైనందినజీవితములో సహజములు కావనుట కేవలము పక్షపాతము లేక అపోహ. అంతే.

# నాటకరచనలో పాటలు, పద్యములు

ఇక మానవుని దైనందినజీవితములో అవి కొన్ని పరిస్థితులలో ఒకానొక పరిణామములో సహజము లయినప్పుడు, మానవుని జీవితమునకు కేవలము ప్రతిబింబమయిన నాటకమునగాని తెరమీదగాని అదే సందర్భములలో ఏల సహజములు కావు?

అసలవి సహజములయిననూ కాకపోయిననూ వాటికి నాటకమునగల ఔచితికూడ అనంతము. వీటికి సహజతకు లేని వచనమునకునూ లేని మహత్తరశక్తి యొకటి యున్నది.

రసపోషణలో నాటకీయశక్తి అన్నది సృష్టి కావలెనన్న దానిని సృష్టించగల సమర్థత పాటలు పద్యములకే యున్నది. సభికులను రసవాతావరణములో ముంచెత్తి ముప్పిరిగొల్పి ముగ్ధుల చేయగల మహత్తరశక్తి ఒకరీతికే గాదు గానమునకునూ కవనమునకునూ యున్నది.

కవి తాను ప్రజ కియ్యతలచుకొన్న సందేశము అజన్మాంతము వారి హృదయఫలకములకు హత్తుకొని పోవునటుల చేయగల శక్తియూ ఒక్కరీతికే గాదు గానమునకునూ కవనమునకునూ యున్నది.

అంతేకాదు. వాస్తవజీవితములో ఒకానొక సంఘటన ఆసాంతము అగునప్పటికి కొన్నిరోజులు పట్టును. అన్నిరోజుల అకే సంఘటనను నాటకములో కుదించి కుదించి అయిదు నిముషములలో ప్రేక్షకులకు అంతే అనుభూతికి తేవలెనన్న ఆ సమర్థత ఒక్క కవనమునకూ గానమునకే యున్నది.

ఇంత మీమాంస వల్లెవేసిననూ "జీవితంలో ఎవ్వరూ రాగతాళబద్ధములుగా మాట్లాడరు. పనేమిరా ఖేమెపట్టిన కుండేటికి మాడే కాళ్ళు" అనువారున్నారు. తిరిగి వారే నాటకమునగాని ముఖ్యముగా సినిమాలోగాని సాంగ్స్ మాత్రము లేకపోయిన దానిని దుమ్మెపట్టి దుమ్మెత్తిపోసెదరు. మరి అలాంటప్పుడు ఒక్క పాటలకే ఔచితి ఆవశ్యకత కలదనియా వారి తాత్పర్యము? "అయినచో మరి పద్యముల కేంటుకు లేదు?" అని నా పూర్వపక్షము.

అసలు విషయ మదికాదు. ప్రత్యేకము పద్యముల మీదనే ప్రజకు నిర్హేతుకనిరాదరణ ప్రబలినది. పోనీ ఆ ప్రజలన్నవా రెవరు? పామరులా కారు; వారికి వాటి మీద కల అభిమానము అపారము. ఇప్పటికిని పద్యములకు "వన్స్‌మోర్" లను కొట్టుచున్నారు.

అసలు పాండవోద్యోగవిజయములు, చింతామణి, హరిశ్చంద్రీయము ఇత్యాది పద్యభూయిష్ఠ నాటకములను వటి ప్రదర్శనలో కృషిచేసి వాడివత్తలయిన నటులను పోషించుచున్నదియూ ఆ పామర ప్రజయే

'అయినచో మరెవరికి నిరాదరణ?' యన్న, రచయితలకు దర్శకులకు చదువుకొన్నవాళ్ళ మను కొన్న ఒక ప్రత్యేక తరగతి ప్రేక్షకులకు మాత్రమే. వారి వాదమొక్కటే, దేనికీ నిలబడనిది. "ఇరవయ్యో శతాబ్దంలో కూడా నాటకాల్లో సినిమాల్లో పద్యాలేమిటి?" అని.

ఏ హేతువాదమునకూ నిలబడనిదానిని లక్ష్యపెట్ట నవసరము లేదనియే నాభావన. పోనీ పద్యములు కూడదని ఒప్పుకొన్ననూ కేవలమూ వచనమే కావలెనన్ననూ ఆ వచనమును గూర్చియూ చిన్న చిక్కు గలదు

పాటలు పద్యములు ఎంత అసహజములని ఒప్పుకొన్నప్పటికినీ అంతే అసహజములయిన వచనములూ గలవు. మరి వాటిజోలి కెవరూ పోరేమి?

వచన మనగా గ్రామ్యము, వ్యవహారికము గ్రాంథికము అని మూడున్నవి. మొదటి రెండూ జీవితమున సహజములే. కాని గ్రాంథికము వారి వాదన ప్రకారము సహజము కాదే. మరి దానిజోలికి పోరేమి?

అసలు ఇంతవఱకు మన రచయితలే నాటకమునందునూ పాటలు పద్యములకు చూపవలసిన న్యాయములో సహస్రాంశమయిననూ చూపనేలేరు. నిష్పాక్షికముగా ప్రయోగాత్మకముగా వాటికి జరుపవలసిన న్యాయమును జరిపి "ఉఫ్! ఇకచాలు పాటలు పద్యాలు" అని వాటిని సన్యసించుకొన్న వద్దనువారు లేరు కానినిర్హేతుకముగా కేవలమూ పక్షపాతముతో వాటిని తోసిరాజనుట మాత్రము రచయిత అన్నవాడు చేయవలసినపనిమాటుకు కాదది.

సరే! అయితే నాటకరచనలో పాటలు పద్యములకు ఆవశ్యకత ఔచితి ఉన్నదని ఒప్పుకొందము. అయినచో అదెట్టిది?

మొదటనే చెప్పితిని "కొంతమేరకు పోగా అవియూ అనగా వచనములు కుంటుపడగా పరిగ అచట నే అనగా ఎచటనయితే సామాన్యవాక్కులు స్వరములు కుంటుపడునో అచటనే ఆ వాక్స్వరములక్షే

సంస్కరించి వాటితో భావసంచారమును మరికొంత దూరము సాధించవలసియున్నది. ఆ సంస్కరించబడిన అనగా ఎక్కువ శక్తినీ, ధ్వనినీ, రీతినీ యియ్యబడిన వాక్కులే పద్యములు గేయములూ, స్వరములే రాగ తాళములు" అని.

దీనినే : "ఏ సన్నివేశము నయిననూ చిత్రించవలెనన్న ఆ చిత్రణకు నాటకీయత వచనముతో ప్రాప్యమయినంతవరకు కవనముజోలికి పోరాదు" అని తిప్పి చెప్పుకొనవచ్చును. అనగా శబ్దశక్తి వచనరీతి వాటివల్ల మరి ఆ నాటకీయత అసంభవమైనప్పుడే పాటలు పద్యములకు అర్రులుచాచవలయు నన్నమాట. ఈ దృక్పథముతోనే ఏ నాటకరచయితయూ కలము పట్టవలసియున్నది ఇక ఆ నాటక రచయిత తన వస్తువునుబట్టి తన సమర్థతనుబట్టి తన నాటకము నందలి నాటకీయతను కేవలము వచనముతోనే సాధించ తలచుకొన్నచో మాత్రము వద్దనువారు లేరు. కాని తన అసమర్థతవల్లగాని, ఇక వచనమువల్ల సాధ్యముకాక పాటలు పద్యముల జోలికి పోయినపుడు మటుకు దానికొక రీతి సందర్భశుద్ధి అవసరము.

## 2

నాటకము కేవలము పౌరాణికమయిననూ, మత ప్రచారమున కయిననూ, స్వాప్నికజగత్తునకు సంబంధించినదయిననూ ఆసాంతము దానిని పద్యభూయిష్ఠము చేసినను ఆక్షేపణయుండదు. ఏలనన్న పాటలు పద్యములు జీవితమునకు అనగా పాత్రలయొక్క సమకాలిక జీవితమునకు సహజములు కావన్న దొక్కటే ఆక్షేపణ గాన, దానిని అంగీకరించినప్పటికినీ ఆ పురాణమూ, స్వాప్నికజగత్తూ సమకాలికజీవితమునకు సంబంధించినవి కావు

రచయిత తననాటకమును ఆసాంతము పద్యభూయిష్ఠముగా చేయనెంచినచే అవి చెల్లగలవు. నాటకమును వచనప్రాధాన్యతతో వ్రాసినమాత్రము మధ్యమధ్య పాటలను పద్యములను యిముడ్చవలెనన్న మటుకు వాటికి ఒక సమయము, సందర్భము, భావ రీతి యిత్యాదులు అవసరము అసలు కేవలము వచనముతో సరిపోయెడి సందర్భమున కవనపు ప్రమేయమే రానవసరము లేదు.

కాని కొన్ని కొన్ని సన్నివేశములలో మాత్రము [illegible] ఆ సన్నివేశము తిరిగి పౌరాణిక మయిననూ, స్వాప్నికమయిననూ, దైవసాన్నిధ్యమయిననూ, పాత్ర వాస్తవజగత్తును సన్నిధానవశాత్తూ అధిగమించిననూ, ఏకాంతమందు పాత్ర ఉబుసుపోకకు గాని, ప్రత్యేక సంగీత ప్రదర్శనల సందర్భమున గాని, స్వతః పాత్ర పాటలను పద్యములను వల్లెవేసెడి ప్రకృతి గలవాడయిననూ అవి నిరాక్షేపణీయములే.

రసస్పృష్టిలో రచయిత వచనముద్వారా తనవల్ల నయినంత సృష్టించిననూ అప్పటికిని తాననుకొన్నంత సృష్టికానపుడు మాత్రమే పాటలను పద్యములను వినియోగించుకొనవలసి యుండును. కాని అవి వాటి పూర్వోత్తరవచనములను కృత్రిమముగా అతికించినట్లుమాత్రముండరాదు.

రచయిత వచనమును వాడినంతవఱకూ అదిఒక ప్రత్యేకపద్ధతిలో పోవుచుండును. దానినుండి పద్యములకు పాటలకు మారుచున్నపుడు ఆ మార్పు భావములోగాని భాషలోగాని క్రమముగా ఆరోహణ పద్ధతిలో రావలయును. అవరోహణపద్ధతిలో ముగియవలయును. అదియూ ఎంతో సహజముగనూ, జాలువారుగనూ, ప్రేక్షకునికీ పాఠకునికీ గ్రాహ్యకము కాకుండునట్లు ఒక సమ్మోహనపద్ధతిలో ఎంతో ప్రజ్ఞతో నిర్వహించబడవలసి యుండును.

ప్రప్రథమముగా ఆరీతికి మన వాఙ్మయములో కవిబ్రహ్మ తిక్కనసోమయాజి ఒక్కరే మార్గదర్శకులు. తాను ప్రత్యేకముగా నాటకమన్న పేరుతో దేనినీ వ్రాయకపోయినప్పటికినీ ఆయన తెనిగించిన భారతములో అనేక ఘట్టములను అసమానమయిన నాటకీయ రీతితో నిర్వహించినారు. ఆరీతిని నాటకోపాసకు లెంతెయు పుణికిపుచ్చుకొనవలసి యున్నది.

ఉదాహరణకొక సన్నివేశము.

కీచకుడు వెన్నాడగా సైరంధ్రి "దైవయోగమున విరాటుం డప్పుడు కొలువునికిం జేసి తత్సభాభాగంబు దెస కా" పర్విడినది. "కామాయత్తచిత్తుండయిన" కీచకుడు అత్యుగ్రుడై "ఒడిసి తలపట్టి తిగిచి మహోగ్రవృత్తిని గొంకు కొంచరించుకయు లేక కూల దాచెను". ఆ సభయందే సైరంధ్రిభర్తలును యుండిరి. ఆమె తన "పతులం దగ సభ్యుల చూచు" మాదిరిగా చూచి మత్స్యనాథుడు వినునట్లుగా

"...గంధర్వు లేవురు, నన్ను నిట్టు"

# నాటకరచనలో పాటలు, పద్యములు

లోకదు పరుపంగ నారక యునికి నాడ
నచ్చెరువు కాదె? యెవ్వరి కాండ్రు రింక
బరిభవంబును బొందక బ్రతుకువారు?

ఈ నరపతి యాస్థానము
లో నొక్కరుడైన ధర్మలోపభయమునం
బూని తగవైన వెస వలు
కైనను బలుకంగ జాలడయ్యెను నకటా!

ఇందఱు జూడగా నిచట నెమ్మెయి నన్ను
పతివ్రతాగుణా
స్పందితవర్తనం బరమసాధ్వి ననిందితశీల
గీచకుం
డెంతను నెట్టె యంగనల నెవ్వరు జేయనియట్లు
సేయగా
గొందఱకైన నిప్డు కృపకుం దరిగావదె
యేమి సెప్పుదున్

అని మొరపెట్టుకొన్నది.

గమనించుడు. మామూలు వ్యవహారపుభాషను తీసికొని దానిని వ్యాకరణయుక్తముగా సంస్కరించి ఛందస్సునందిమిడ్చి మాధుర్యమునుమార్దవమును పొదిగి ఎలా సైరంధ్రినోట చెప్పించినారో.

మరొకటికె గమనించవలసినది. ప్రాధాన్యత వచనమునకే తిక్కన కవనరీతులన్నియు కేవలము దోహదములే. సైరంధ్రి అటు పరాభవమును పొంది సుధేష్ణపాలికి వచ్చింది. సుధేష్ణ కిదంతయు తెలిసియూ తెలియనట్లుగా ఏమేమో అనునయింపబోగా "నీ వెరింగియు నెరుగమి భావించిన కేమని పలుకంగలదాన నైనను వినుమని సైరంధ్రి యిట్లనియె"...తర్వాత...

"నను నీ వప్పుడు నాతు మందిరమునకు
మద్యంబు దెమ్మన్న బో
యిన నాతం డవినీతి సేసినను
చేయి కేను మత్స్యావనీ
శుని యాస్థానముదిక్కు వే చనిన
నచ్చో తీవ్రకోపంబున
న్ననుకం గూడగముట్టిపట్టికొని
తన్నెం పల్కు లింకేటికిన్."

అని కవనమునకు మార్చినారు. ఇందలి సారస్యమును గమనించుడు. భావాతిరేకముతో బాటు భాషకును ఒక ఆరోహణావరోహణపద్ధతికూడా గమనించబడినది.

ప్రప్రథమముగా "నీ వెరింగియు నెరుగమి భావించిన కేమని పలుకంగలదాన నైనను వినుమని" సంస్కరించబడ్డ పచ్చివ్యవహారము వాడబడినది.

రెండవదశలో, "నను నీ వప్పుడు నాతుమందిరమునకు మద్యంబు దెమ్మన్న బోయిన నాతం డవినీతి సేసినను చేయి కేను" అని యింతవఱకు అదే సంస్కరించబడ్డ వ్యవహారమునకు కవనము పొదుగబడినది.

మూడవదశలో, "మత్స్యావనీశుని యాస్థానముదిక్కు వే చనిన నచ్చో తీవ్రకోపంబునన్" అని అందు వ్యవహారభాషాప్రాధాన్యతను తగ్గించి కేవలము గ్రాంథికముగా సంస్కృతపదప్రాధాన్యతతో అదే వృత్తము సాగించబడినది.

ఇక చివరిదశ: అవరోహణము ఇక్కడికి వచ్చు నప్పటికి సైరంధ్రికే యిక సరిస్తరముగా చెప్పికొనుటకు జుగుప్సాకరమయినది. అందువల్ల "ననుకం గూడగముట్టిపట్టికొని తన్నెం పల్కు లింకేటికిన్" అని గప్పున మూడుముక్కల్లో, తిరిగి తేటతెలుగులో మిగిలిన కథను ముగించినది.

చూడుడు! ఆ శిల్పచాతుర్యము భావాతిరేకము ననుసరించిన భాషయొక్క ఆరోహణావరోహణాక్రమము. మొత్తముమీద వ్యవహారవచనమునకే యియ్యబడిన ప్రాధాన్యత, యిక ఆ వచనమునకే పొదుగబడిన మధురిమ మారవము కవనమూనూ అదీ నాటకీయ కవనమన్న (Dramatic poetry).

నాటకీయ కవితకు, పూసలలో దారమువలె మూదిరిగా, ఆయువుపట్టు వచనమే. కవనము కేవలము దోహదక్రియకే.

అయిన తిక్కనగారు అన్ని సారస్యములను ఎంచి కూర్చియే రచించిరా? లేక అంతయూ నేను చేసిన కొంపెంతలా? అన్న ఆక్షేపణ రావచ్చు. అయిన అంతనూ ఉద్దేశించిననూ ఉద్దేశించకపోయిననూ అంతయూ కవిబ్రహ్మకు అప్రయత్నముగనే తాను తాదాత్మ్యత పొందిన భావాతిరేకముతో బాటు ఆ భాషారీతియు సిద్ధించియుండవచ్చును. ఏదిఏమైననూ ఉండవలసిన నాటకీయభాషారీతి" అది.

మరొక్కటిగూడ యున్నది. తిక్కనగారి నాటకీయకవితలోని విశిష్టతభావానుగుణమైన ధ్వనినిచ్చు పదజాలమును వాడుట. సైరంధ్రి తన పసుల పరాక్రమమును చెప్పి కీచకుని బెదిరించి మందలించ తలచినప్పుడు ఆమె చేత భయమును భీషణతను ధ్వనించునట్లు :

"సుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోక
ప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతిపీరనిర్మథన విద్యాపారగుల్
మత్ప్రభుల్
గీర్వాణాకృతు లేవు రిపు నిను దోర్లీలన్ వెసన్
గిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముం గొనుట తథ్యం
బెమ్మెయిం గీచకా!"

అని శార్దూలము చెప్పించబడినది.

మొత్తముమీద నాటకీయ కవితనుగూర్చి సిద్ధాంతీకరించుకొనవలసినవి నాలుగు అంశములు

(1) భావానుగుణ్యము భాషకు ధ్వనినిపొదుగుట.

(2) వ్యవహారికభాష నే గ్రహించి ఛందోయుక్తముగా సంస్కరించి కవనమును, మధురిమను మార్దవమునూ పొదుగుట.

(3) భావసంచారమునుబట్టి భావయంగునూ ఒక ఆరోహణావరోహణాక్రమమును గమనించుట.

(4) అసలు నాటకీయ కవితకే, శ్వాసలలో దారముమాదిరిగా, అయువుపట్టు వచనమే. కవనము కేవలము దోహదక్రియకు మాత్రమే.

మొదటి అంశమును పూర్వోత్తరకవులంఒఱు వాడి వదలిరి. రెండవ అంశముజోలికి తెలిసియో తెలియకో వెళ్ళిన కవులు కొంఒఱున్నారు. అదియు అక్కడక్కడ మాత్రమే. అందువల్ల నే 'తెలిసియో తెలియకయో' అనవలసివచ్చినది. ఇక మిగిలిన అంశములను ఎవరూ గుర్తించినట్లే అగుపడదు. సత్యహరిశ్చంద్రీయములో చతుర్థాంకములో నక్షత్రకునిచే చంద్రమతితో "ఓసి! వెర్రితల్లీ! ఎక్కడి మొగుణ్ణి కట్టుకొన్నావు" అన్న భావమును "ఓసి వెర్రి తల్లీ! ఎక్కడి పతిం గట్టుకొంటివి" అని సంస్కరించి "ఒక సన్యాసికి సర్వరాజ్యాన్ని ఏదో ఓ మాట పట్టింపుమీద ధారపోసి కన్నబిడ్డతో నిన్ను మహారణ్యాల పాల్చేశాడు—". అన్న భావమును అదే వాడుకభాషతో గ్రహించి సంస్కరించి మృదుమధురముగా

"ఒక సన్యాసికి సర్వరాజ్యమును నేదో మాట
పట్టింపు మే
రకు జే జారిచి,బిడ్డతో నిను మహారణ్యంబుపా ల్జేసి,కూ
టికినిక్ గుడ్డకు గాని బెన్మటిని పీటంబుచ్చు క
మంచు న
మ్మిక సేవింతువా! వెర్రితల్లి! కొంఱగామిక్ గానలే
వింతయుక్"

అని కూర్చినారు.

"సరివారి న్నగుబాటు పిమ్మట మనశ్చాంచల్య
రోగం బనం
తర మాహారమునం దనిష్ట మటుమీదక్ దేహ
జాఢ్యం బటక్
మరణంబే శరణంబు పెక్కుదినము ల్మించాన
జీరించి; యిం
తిరో! యీ ప్రాణులకున్ బుణవ్యథలకం టెక్
దుస్సహం బేసికక్"

అన్న పద్యము చదివిన బుణములపాలెన ఏ ఆత్మబంధువో తన మనసులోని దుఃఖమును వెళ్ళగక్కుకొనుచున్నట్లుండును.

మరింకొకచోట ఎంతో సహజముగా పద్యములో నే "అరరే! యెంతటి మోసగాడవురా" అనియే యెత్తుగడ.

ఇంతమాత్రమున మనవారు రచించిన పద్యములన్నియు ఔచితితో యుక్తరీతితో నున్నవని చెప్పికొనరాదు. ఆ సత్యహరిశ్చంద్రీయమునందే ఒక సన్నివేశము, ద్వితీయాంకము చివరిభాగము—తమకు క్రూరమృగములచే కలిగిన యిక్కట్లను విన్నవించుకొనుటకు పౌరులు సత్యహరిశ్చంద్రునికడకు వచ్చిరి. ఆ సన్నివేశము కేవలము కథను నడుపుటకు మాత్రమే; ప్రధానసన్నివేశము మాత్రముకాదు. అటులనే ఆ పౌరులును. కాన వారి (పౌరుల) భాష వచనములోను అందునూ ఒకానొక మాండలికములోనూ యున్న ఎంతయో రక్తికట్టగలదు. అసలా సన్నివేశములో కవనమునకు స్థానమే లేదు. అట్టిచోట గేయములను వృత్తములను వాడి రాబట్టిన ప్రత్యేకరక్తియే లేదు, ఒక్క రసాభాస తప్ప.

అసలు పాటలనుకానీ పద్యములనుకానీ ప్రతిపాత్రకు అంటగట్టు నంతటి దాగుణము మరొకట్టి లేదు. వాటిని కొన్ని ప్రధానపాత్రలకు మాత్రమే పరిమితముచేసికొనుట ఉత్తమము. ఆ ప్రధానపాత్రలకునూ వచనమువల్ల మరి రక్తికట్టించలేనపుడు మాత్రమే. అంతేకాని పౌరులకుసైతమూ త్రిభంగివృత్తములో ఫరజురాగములో ఏకతాళములో ఒక కీర్తన, మరొకనిచేత "కనికరమున మనవిని..." అని మధ్యనున్న "మా యొక్కమాడా!" ...... "గోరపు పుట్టముల్" అని మారుమూల పదములతో...అసలు ఆ సన్నివేశములో వాడినన్ని పాటలను పద్యములను మరేసన్నివేశములోనూ వాడనేలేదు. చూడగా ఆ పౌరులకు వచనములో మాటలాడుటయే చేతకాదనిపించును. ఇదీవరస!

ఇలాగే పౌరులు విశ్వామిత్రునిపై తిరుగబడినప్పుడు, ఇచట 'డ్యూయెట్స్' సైతము వాడబడినవి.

# నాటకరచనలో పాటలు, పద్యములు

మొత్తముమీద పౌరుల దృశ్యములు. రెండునూ రసాభాసనే ప్రసాదించినవి.

మరొకచిక్కు. సత్యహరిశ్చంద్రీయమునందే షష్ఠాంకము. "పిమ్మట చంద్రమతి పిడకలేరుచు ప్రవేశించుచున్నది." ఇచట చంద్రమతి ప్రవేశమును చూతము మొదటి వచనమునకు తరవాతి సీసమునకు గల ఔచితిని గూర్చి వివాదమేలేదు. ఇక రెండవ వచనము తరువాత మత్తేభము.

చంద్రమతి పరిస్థితులభారముచే క్రుంగి క్రుశించిపోయి యున్నది శోకతీవ్రతచే యజమానురాలి యాజ్ఞను మఱచుచున్నది. "ఇంక తొందరగా పిడక లేరవలయు. (ఏరుచు) ఓహో! సాయంకాలమై పసిమిటికొంపెయుంచలి సంజకెంజాయ విశ్వామిత్రుని కోపరసమోయన ప్రకాశించుచున్నది మరియు," అని అంతటి మందభాగ్యురాలైన చంద్రమతి ఒక్కమారుగా సూర్యాస్తమయమును గూర్చి ఒకమత్తేభవృత్తమును ఆసువుగా:

"వోడు కస్తంగతుడయ్యె నంచు దలిరిన్
గోల్పోవుచున్ గన్నఁ బే
ముడి జింతించెడి లోకబాంధవునకై
పూర్వాశ, ప్రాణేశు డే
య్యెడకో పోయె నటంచు బద్మిని
సదా భృంగీరవవ్యాపృతిన్
దొడగెన్ మోమును మించి యేడ్వ
నెట బంధుత్యాగ మింతే కదా!"

చెప్తుంది. ఇచట ఈ వర్ణనకుగల సందర్భశుద్ధి ఎట్టిది? రసపుష్టిలో రాబట్టిన ప్రయోజనమేది? సాధించిన శిల్పమేది?

ఇలా కథను, రసమును స్తంభింపచేసి ఓచిన్న ఖండకావ్యమును ఆలపించుటచేత తేలున దొక్కటే. "కవికి, నాటకము చేపట్టినా కండూతి కావ్యరచన మీదనే" అని. దీనికి కారణము మన నాటకరచయితలందఱూ ప్రబంధములను కావ్యములను మాత్రమే జీర్ణించికొని "కావ్యాంతేషు నాటకం" అనిరిగదా. అని వెంటనే నాటకరచనలో దిగుటయే.

ఇక ఉద్యోగవిజయములకు వత్తము. ఇందు 'దేవా' అని ఒకపద్యము "బావా!" అని ఒక పంచరత్నము. అదియునుంగాక అని ఒకశతకము. ఇక స్వగతములో మరొకశతకము. అసలు అందలి భావములను తీసి కథనరీతికి మార్చినచో అదొక్క ప్రబంధముగా ఎక్కువ రాణించెడిదేమో. నాటకముగా మాత్రము అందు నాటకీయరక్తి ఏమాత్రమూ లేదనియే చెప్పికొనవలసియున్నది.

పాండవ విజయములో ప్రథమాంకము. పార్థుని పురికొల్పుటకు పన్నిన పన్నుగడగా కృష్ణుడు సుదర్శనమును సంస్మరించినపుడు.

కృష్ణుడు: అర్జునా! యిక నీమాటలయం దంత పాటవమున్నట్లు నాకు నమ్మికలేదు. మున్నూటికి నిన్ను పురికొల్పి వేసారియే తుదకీ సుదర్శనమును సంస్మరించితిని. నీకును నాకును లేశమేని భేదంబు లేనియపుడు మనలో అన్యోన్యజయంబు లన్యోన్యమును సంక్రమించుటలో నాక్షేపణ మేమున్నది?"...యిది ఇంతవరకు బాగుగనేయున్నది. ఇక చూడుడు.

"గాంగేయున్ బరిమార్తు మొట్టమొదటన్,
ఖండింతు నామీద దు
స్సంగున్ ద్రోణు; వధింతు నాపయిని
నశ్వత్థామ నా వెన్క న
య్యంగాధీపు గతాసుజేయుదు,
సహోదర్యంబుగా రాజు ను
ర్విం గూల్తున్ వెనువెంట, నిత్తు నవనిన్
వేయేల నీయన్నకున్"...అని.

మొట్టమొదట వాణ్ణి తరువాత వీణ్ణి అని యిలా ఇక్కడ యీపద్యపు ప్రయోజనమేమిటి? అర్జునుడికి పౌరుషమును ఎక్కించవలసి అనవలసిన మాటలతీరు అదేనా? మరొక మానవమాత్రుడెవడైనా అర్జునుడయి వున్నచో ఆసందర్భములో కృష్ణుని 'బావా! అయిందా నీ జాబితా?" అని పక్కున నవ్వగలడు. అర్జునునకు కలుగవలసిన పౌరుషమునకు బదులు ప్రహసనము మటుకు తథ్యము.

మరిఅలాటప్పుడు అక్కడ ఆపద్యపు ప్రయోజనమేమిటి? పూర్వపువచనములో ఎలా రసారోహణాన్ని సాధించినది? అసలందున్నది రసమా నీరసమా? ఆ పద్యము ఏ శిల్పమును సాధించినది? ఏ కనీస ప్రయోజనమును సాధించినది?

ఈవిధముగా ఉద్యోగవిజయములలోని పద్యములను ఒక్కొక్కదానిని నిలువతీసి అడిగినచో తట్టుకొని నిలువబడగలవి సగానికి సగము.

మరొకటి. అందే తృతీయాంకము: అభిమన్యుని పద్మవ్యూహము నెదుర్కొన పంపు దృశ్యము. అభిమన్యుడు పదునారేండ్లవాడు. ధర్మజుడు భీముడు పెత్తండ్రులు. నకులసహదేవులు పినతండ్రులు. ఇందరు తండ్రులూ ఏకమై పదునారేండ్లవానికి కర్తవ్యమును నచ్చచెప్పు పద్ధతిని గమనించుడు. భీరువుల్లా పిల్లవానికన్న పిల్లవాళ్ళలా అలాగేనా?

అసలా దృశ్యములో ప్రథమదశలో పద్యములకు తావేలేదు. ఎంతయో ధ్వనియుక్తముగా వారు కౌగలకౌర్యక్రమమును అభిమన్యునకు చిన్న చిన్న

సూచనల లాటి మాటలద్వారా నచ్చచెప్పవలసి యున్నది. అటుకాక అభిమన్యుడు వచ్చినవెంటనే వానిని కౌగలించుకొని బావురుమనుచూ: "నాయనా! సౌభద్రా" అని కాళ్ళుపట్టుకొనినంతగా అలాగేనా? "ఏది తెరువయ్యా! వచింపుము మాకు పుత్రకా" అని.

ఇక అభిమన్యుని యుద్ధమునకు పంపునపుడు "దగరలేరు మామయును..." అన్న పద్యమునకు ఎంతేని ఔచితి యున్నది. రసభరితమైనది. ఆపద్యము ఎంతటి కఠిన పాషాణమునైననూ కరిగించగలదు. తరువాత"... నీక విజయంబు సుమి సుభద్రాకుమార!" అని ముగియు పద్యములో ఎంతైననూ ధ్వని (Dramatic Irony) యున్నవి. కాని తరువాత భీముని "తినలో" మాత్రము ఒక సంజీవినీవ్యాఖ్య.

అసలు ఆద్యశ్యములో అంతవరకుగల పద్యము లను పరిశీలచేసిన నిలబడగలవి (1) "దగ్గరలేరు మామయు..." అన్నది (2)"... నీక విజయంబుసుమి సుభద్రాకుమార!" అని ముగియునది మాత్రమే?

ఇలా ప్రతి పద్యమునూ పరిశీన చేసికొనుచూ వెళ్లిన ఈ ఉద్యోగవిజయములే కాదు మన నాటక సాహిత్య మంతటిలోనూ నిలువబడగల దేదియూలేదు బహుశా ఒక్క ప్రతాపరుద్రీయముతప్ప.

మరిఅయినచో కారణ మేమిటి?...పద్యములా పుష్కలం ఒక్కొక్కటిఒక్కొకప్వాహము ప్పుతునక. రీతిలో నేమి, శైలిలో నేమి రక్తిలో నేమి. శిల్ప మనంతం. ఒక్కొక్కటి ఒక్కొక కావ్యం. అంతే... అంటే నాటకీయత లేదన్నమాట. అదే కారణం.

'కావ్యాంతే నాటకం' అనిరి. అనగా కావ్య ములను పఠించి వాటి వివిధ శిల్పములను జీర్ణించికొని వాటి రచనలో అందెవేసినచెయ్యయిన పిమ్మటనే నాటకముల జోలికి పొమ్మని పిమ్మట అనగా వెంటనే అని కాదు. తరువాత నాటక రచనాసూత్రములను ముందు గ్రహించి అటుపిమ్మట నాటకములను వాటి శిల్పమును, ఆశిల్పము కావ్యశిల్పమునుండి ఎటు భేదించునో అసలు నాటకీయత అన్న నేమో కూలంక షముగా నవగాహన మొనర్చుకొని, కావ్యరచనా దాస్యమునుంచి విముక్తుడయి కేవలము నాటకీయతనే ధ్యానమందుంచుకొని నాటకరచనకు గడంగవలయు నని.

అంతేకాని కావ్యరచనలో సిద్ధహస్తుడై వెంటనే నాటకరచనకు దిగమని మాత్రము కాదు. లేక కేవలము ఒక కావ్యమును వ్రాసి అందు ముఖ్యభాషణలను ఆయా పాత్రలకు విభజించి మిగిలిన అష్టాదశ వర్ణనలను కూడ ఏ పాత్రలకో అంటకట్టి మొత్తముమీద కావ్యయంత తనూ అంగములోని పాత్రలకు పంపిణీచేసి నాటకమును వ్రాసితినని బలవంతముగానో మభ్యపెట్టియో ప్రజల నెత్తిపై గుద్దమని కాదు.

మన నాటకరచనాయుగములో ప్రథమ శకము నకు చెందిన నాటకములన్నియూ పైవిధముగనే రచించ బడినవి. అందువలననే ప్రథమశకపు నాటకములలో ఎందు చూచినను కావ్యదాస్యమే దోబూచులాడు చున్నది.

ఆకావ్యదాస్యమే, నాటకరచనలో పాటలు పద్యముల సమస్యను సమస్యగా యిప్పటికినీ పరిష్క రించవలెనుటకు గల ముఖ్యకారణము. అయినచో నాటకములుగా అవే ఎందు కంత ప్రచారములోనికి రాగలిగినవన్న పూర్వపక్షము మున్నది.

మన తెలుగుప్రజకు అభిమానము నాటకముల మీద కావచ్చు. కాని అంతకన్ననూ ఎక్కుడు అభి మానము కేవలము పద్యములమీద నే. నిజమునకు నాట కములోని నాటకీయతజోలియే వారికక్కరలేదు. ఆ పద్యములు వారికి కావలసినరీతిలో రాగవిన్యాసముతో ఒక చిన్నక చేరీతిరహాలో పాడబడిన చాలును. యిక ఆ నాటకము జయప్రదమయినటులే

అంతేకాదు. మనవారు అంతటితో తనివిచెందక నాటకానంతరము పులిపాటిచేతనో పీసపాటిచేతనో మరికొన్ని డజను పాడింపించికొని మరీ యిళ్ళకు వెళ్ళెడము పరిపాటి అనగా పద్యములు జయప్రదము లన్నమాట. తద్వారా నాటకమునూ. అంతమాత్రమున ఆ నాటకము నాటకముగా మాత్రము జయప్రదమని సిద్ధాంతీకరించుకొనరాదు.

ఏనాటి కయిననూ నాటకములో శిల్పమును ఆశించవలసినది నాటకరచయితలనుంచియే. కాని కేవలము కావ్యరచయితనుంచి మాత్రము కాదు. కావ్య రచయితలకు నిన్నమొన్నటివరకు అవకాశము నిచ్చి తిమి వాళ్లు మనకు అందిచ్చిన విశిల్పమూలేదు. నాట కము పేర కావ్యములనే యిచ్చినారు.

కావున నాటకరచయితయే వచన నాటకములలో సిద్ధహస్తుడై ప్రబంధములను కావ్యములను కూలంకష ముగా పరిశీలించి వాటి దాస్యమున బడక, తనకు అవసరమునుబట్టి ఒకరచనాపద్ధతిని రీతిని నిర్ణయించు కొని నాటకములో పద్యరచనకు పద్యనాటకరచనకు దిగవలసియున్నది.

# పచ్చడము

శ్రీ నేలటూరి వేంకటరమణయ్య

అభ్యంతర మందిరమునుండి మొగసాలలోనికి ప్రవేశించు వాకిట కడ్డముగ వ్రేలాడుచుండిన తెర చెరగొకమూల కొంచెము వెనుక కీడ్వబడెను. కాకపక్షములతోడి బాలుని శిరస్సొకటి యందుండి వెలువడి మొగసాలను నలువంకల బరికించి చూచెను. తివాసీమీది యొరుగుల నానుకొని యర్ధనిమీలిత నేత్రుడై కూర్చునియుండిన వృద్ధుడుం దక్క మరి యెవ్వరందు గానరాలేదు. వెండ్రుకలు పండిబారి యున్నను దేహదార్ఢ్యము సన్నగిలలేదు. ముఖము వాడుబారి ముడుతలు పడలేదుగాని కన్నులక్రింద సంచు లేర్పడినవి. కాని వర్చస్వంతమై సహజ దాక్షీకభావముచే విరాజిల్లుచుండినది. కొన్ని రెప్పపాట్ల కాల మా వృద్ధుని పరికించి చూచినాడా బాలుడు. సందేహ ముప్పతిల్లు సన్నని యెలుగుతో "తాతయ్యా! తాతయ్యా!" అని పిలిచినాడు. కన్నులు విప్పిచూచినాడు తాతయ్య. ఆ బాలుని శిరస్సు దృక్పథమున పడినంతనే, యతని ముఖమున చిరునవ్వు మొలకెత్తినది. హెచ్చరించినాడు, "ఎవరోయి, చిన్న తిమ్మయ్యవా?" అని.

"అవును, తాతయ్యా!" అని బదులు చెప్పినాడు చిన్న తిమ్మయ్య.

"ఏమోయి సంగతులు? బడికి వెళ్లలేదా నేడు?"

"లేదు తాతయ్యా! ఈ రోజు పున్నమ, ఆట విడుపు కదూ!"

"అవునోయి మరచినాను. అయితే ఆట్లాడ బోలేదేమి?"

"ఆటవిడుపు పద్యము ఒకటి వ్రాసిఇచ్చినారు అయ్యవారు. దానిని గట్టిచేసికొని యవ్వల బోవచ్చుననుకొన్నాను తాతయ్యా!"

"మరి గట్టిచేసినావా?"

"లేదు తాతయ్యా!"

"గట్టిచేయక ఏల వచ్చినావు?"

"అది వింతపద్యము తాతయ్యా!"

'అయిన గట్టిచేయవలసిన యవసరములేదా!'

'కాదు తాతయ్యా! దానిని చదివిన నవ్వువచ్చుచున్నది.'

"తిండికి మిక్కిలి ఘనుడను" వ్రాసియిచ్చినాడా అయ్యవారు?"

"లేదు తాతయ్యా! మిమ్ములను గూర్చినదే!"

"నన్ను గూర్చినదా? అయిన నవ్వేల వచ్చుచున్నది? నాకు పద్యమును జెప్పించుకొనుటకు తాహత్తు చాలదా?"

"అదికాదు తాతయ్యా! ఎవరో మిమ్ము వేళాకోళముజేసి వ్రాసినారు"

వేళాకోళముజేసి వ్రాసినారా? ఏదీ, చదువు. చూతము! చంకమరుగున దాచియుండిన తాటి యాకును బయలు, బఱచి సన్నగా: "వాకిటి కావలి తిమ్మ" అని చదువ ప్రారంభించినాడు. చిన్న తిమ్మయ్య; "హా! హా! హా! ఇదేనటోయి—నీ వింత యాటవిడుపు బద్యము?" అని యడిగినాడు వృద్ధుడు.

"ఏమితాతయ్యా! మీకు గూడ నవ్వునా" యని యన్నాడు చిన్నతిమ్మయ్య.

రాకేమీ విను.

"ప్రాకటముగ సుకవిజనుల పాలిటిసొమ్మా
నీకే బద్యముగొమ్మా
నాకీ పచ్చడమెచాలు నయముగనిమ్మా"

అని పద్యమును ముగించినాడు తాతయ్య.

"ఏమితాతయ్యా దీనికి అర్థము?" అని యడిగినాడు చిన తిమ్మయ్య.

"అయ్యవారినిఅడుగకపోయినావటోయి?"

"అయ్యవారినే?"

"ఆయననే; అడుగ కూడదా?"

"ఆయన కోపదారి తాతయ్యా! మీరు చెప్పండి తాతయ్యా, మీరు చెప్పరాదూ!"

"అది పెద్ద కథోయి—ఆకథను తెలిసికొన్న గాని పద్యము అర్థముగాదోయి"

"మరీ మంచిది తాతయ్యా కథలు వినడమంటే నాకు బహు ఖుసీ."

"కానీ, రాత్రికి చెప్పెదను."

"ఇప్పుడెందుకు చెప్పకూడదు తాతయ్యా."

"నీకొక్కడికే చెప్పినట్లయితే, అక్కయ్యా, వీరప్ప, పాపతిమ్మయ్య వారందరు ఏమవుతారోయి"

"అయితే రాత్రికి తప్పకుండ చెప్పెదరా తాతయ్యా"

"ఆ"

## ౨

భోజనములైనవి—మామూలు ప్రకారము వచ్చి కూర్చున్నాడు తాతయ్య అభ్యంతరగృహములో తివాసీలమీద. చుట్టు ఆవరించికూర్చున్నారు పిల్లకాయలు. వృద్ధ సుమంగలి దోనమ్మగారు వెండి హరివాణమున పండుటాకులు, పచ్చిపోకలు, కర్పూర శకలములు, ఆణిముత్యపు సున్నము—కత్తి యడకత్తులతో భర్తకు తాంబూలము తెచ్చినది. వెంటనే వచ్చినది జలభరితమైన గిండి నెడమ చంకనిడుకొని తమ్మపుట్టెకిని కుడిచేత బట్టుకొని యడపకత్తె. హరివాణమును క్రింద తివాసీమీద పెట్టి భర్త పాదముచెంత కూర్చున్నది దోనమ్మ, గిండిని తమ్మపుట్టికెను సమీపమునుంచి వెడలిపోవను దిరిగినది. అడపకత్తె అప్పుడు మెల్లగా దాతగారి కుడిప్రక్కకు జరిగివచ్చి అడిగినాడు చిన్న తిమ్మయ్య—"తాతయ్యా రాత్రి చెప్పెదనంటిరో"అని. తాతయ్యనోటి నుండి జవాబు వెలువడక ముందే "ఏమిటిరా, చిట్టిబాబూ!" అని విచారించినది దోనమ్మ. ఇంతలోనే తాతయ్య అందుకొని 'కథ' అని బదులు చెప్పినాడు.—"

'కథా! తాతయ్యగారూ! చెప్పండి! చెప్పండి!' అని దగ్గరించినారు వీరప్ప, పాప తిమ్మయ్య, 'పసందుగానుండవలె తాతయ్యా' అని హెచ్చరించినది చిన్నమ్మక్కయ్య.

'ఏమిటండీ! ఆకథ!?' యని దోనమ్మ అడిగినది.

'నా పచ్చడముకథ నీవడిగినదే'

'ఏపచ్చడమండీ? పచ్చడానికి కథయొక్కటి ఉన్నదా?'

'రాయలదేవుడు నాకు బ్రసాదించిన పచ్చడమే, మరచితివా?'

'రాయలదేవుడు మీకు ప్రసాదించినారా? ఏ రాయలదేవుడండీ! ఎప్పుడు, ఎందుకు, ప్రసాదించినాడు?'

'అన్నట్లు మరచినాను. నీకెట్లు తెలియగలదు? అప్పుడు నేనింకను పెండ్లాడనే లేదు. స్వామివారు సింహాసనమెక్కి నాలుగైదుమాసములైనది.'

'మరి పచ్చడముకథ ఏమిటండీ?'

'వినండి చెప్పెదను. ఆనాడు సర్వశిరః ప్రధాని తిమ్మరుసయ్యగారి ఉత్తర్వైనది రాయలదేవుని దర్శనమునకు ఎవ్వరిని ప్రవేశపెట్టకూడదని. జాము ప్రొద్దెక్కువరకు, ఎవ్వరిని, రాయలవారు పుష్పోదయమైన స్నానతీర్థ సమయమున మామూలుగ హాజరగువారినిగూడ—చొర నివ్వలేదు. వాకిటి కడ్డము వేసిన గడెనొక్క సారియైన దింపలేదు. నగరిలోనికి వచ్చువారితో వాకిటివారు నోరుమూయక సంవాదము సల్పుచుండిరి. నగరి మోసాలమీది గడియారము ఎనిమిదిమారులు మ్రోగినది. అప్పుడు బజారంలో మూగియుండు బ్రాహ్మణ్యమును ఈవల నావల దొలగద్రోయుచు భటుండొకండు ముందురా నలుగురు వ్రాలవచ్చి నిలచిరి. వారిలో నిద్దఱు నాకు పరిచితులే అల్లసాని పెద్దయ్యంగారలు, ముక్కు తిమ్మయ్యంగారలు. వీరిద్దఱును రాయలవారికి నచ్చినకవులు. అందు పెద్దయ్యంగారలు యేలినవారికి బహిఃప్రాణము — వీరికి రాయలవారి సన్నిధి కెల్లవేళలయందును ప్రవేశముగలదు. అడ్డుపెట్టరాదని ఖండితముగ దేవరవారి యాజ్ఞ. తక్కినవారిద్దరిని నేనెఱుగను, వారు మొలకమీసాల యువకులు. వేషము జూడ వారును కవులనియే తోచినది. వీరినందరిని బజారములోనికి బ్రవేశపెట్టవచ్చునా వలదా యన్నది గడ్డుసమస్యయైనది. ఒకప్రక్క రాయలదేవుని యాజ్ఞ, మఱియొకప్రక్క సర్వశిరః

ప్రధానిగారి యుత్తరువు నామనస్సును కలతపెట్ట జొచ్చినది. కాని దానిని వారె సత్వరముగ దీర్మానించిరి. నేను త్రొక్కటపడుచుండగనే వారు హజారముమెట్లు నెక్కి వచ్చిరి; యథాపూర్వము వాకిటి కడ్డము వేసియుండు గడలను తీయక, పెద్దయ్యంగారితో 'అయ్యా! తిమ్మరసయ్యవారు......అనుచుండగనే వారు.'

"వాకిటికావలి తిమ్మా!" యని చెప్పుచు గడలను దొలగద్రోసికొని లోనికి వెళ్ళినారు. వారి వెనుక ముక్కు తిమ్మయ్యవారు

"ప్రాకటముగ సుకవిజనులపాలిటి సొమ్మా!?" అని వారిననుగమించినారు. తక్కినవారి నిద్దరిని పోనీ రాదని నిశ్చయించి గడలనడ్డము వేసి దృఢముగ నిలచితిని. అప్పుడా యువకులలో నొకడు ముందుకువచ్చి

"నీ కీపద్యము గొమ్మా" యని చెప్పుచు గడల సందున దూరి లోపల జొచ్చినాడు. నాకు కొంచెము కోపము వచ్చినది. అతని వెంబడించి పోయి పట్టివెనుక కీడ్చికొని రావలయునని బుద్ధిపుట్టినది. కాని నాస్థలమును విడచిపోయిన హజారములోని మూక కట్టతెగిన చెఱువునీటివలె లోనికి జొరబారుదురు. ఇట్లు చింతించు చుండగనే యా రెండవయువకుడు వచ్చి నా యెదుట నిలచి తేజోవంతమైన దృష్టిని మెఱుపుదీగవలె నాపై ప్రసరింపజేసి చిరునగ వంకురించుచుండిన వక్త్రమును విప్పి.

'నా కీ పచ్చడమె చాలు నయముగ నిమ్మా' యని నాపైనున్న పచ్చడమును దిగిచి వల్లెవాటు వేసికొని వాకిటి గడలపై నెగిరిదాటి ముగ్గురి ననుసరించి నగరిలోనికి బోయెను.

అరగడియకాలము గడచినది. అవసరం వెంకటయ్య మొగసాలనుండి వెలువడి శీఘ్రముగ నా సమీపమునకు వచ్చి 'రాయలదేవుని యాజ్ఞయైనది, వాకిటి తిమ్మయ్యగారిని సముఖమునకు రమ్మని,' అని చెప్పినాడు. ఆమాట వినిపోకనే పుట్టిమునిగినట్లయినది నా స్థితి. తిమ్మరుసయ్యగారి యుత్తరువునకు వ్యతిరిక్తముగ నావలుగురు కవులను నగరిలో ప్రవేశింప నిచ్చినందులకు దగినశిక్ష ననుభవింపక తప్పదని యెంచి వెంకటయ్య నడిగితిని.

'ఏలినవా రెచ్చట నున్నా'రని.

'నామతీర్థమండపమున' అని యతడు బదులు జెప్పెను.

'దేవరవారి దర్శనమున కెవరైనను వచ్చియున్నారా?'

'పరాయివారెవ్వరు లేరు - అప్పాజీ తిమ్మరుసయ్యగారు, అల్లసానివారు ముక్కువారు. మఱి యెవ్వరో ఊరుపేరు తెలియరాని పిల్లకవు లొకరిద్దఱు.'

నాగుండె తటతట గొట్టుకొన నారంభించినది ఏమి యాపదరానున్నదో! కాని రాయలయాజ్ఞ మీర గూడనిది కదా. కావున వెంకటయ్యను హజారమున నాస్థానమున గొంతతడ వుండుమని ప్రార్థించి, కాళ్లు ముందుకు సాగకున్నను, ఎట్లో బలవంతముగ వాని గదల్చుకొని నామతీర్థగృహము జేరితిని. అప్పటికి నామతీర్థము ముగిసినది. రాయలయ్యవారింకను నామతీర్థ పీఠముమీదనే కూర్చునియుండిరి. వారికి కుడివైపు కొంచెము ముందుగ పంచవర్ణముల జముఖాణముపై నొరగు నానుకొని కూర్చుని యుండినారు తిమ్మరసయ్య. ఆయన కెదుట ఏలినవారి వామ పార్శ్వమున పద్మాసనము వేసికొని యాసీనులై యుండినారు పెద్దయ్య తిమ్మయ్యగారు. వారికి వెనుక చేతులు గట్టుకొని నిలచియుండిరి రా బాలకవు లిద్దరును. నేను రాయల సన్నిధానముజేరినంతటనే రెండు చేతులు శిరముమీద కెత్తి ప్రమొక్కి నమ్రవదనుడనై నిలిచితిని. ఎవ్వరును నన్ను పలుకరింపరైరి. కాని స్వామివారు తీక్ష్ణదృష్టిని మొదట నామీదను దరువాత బాలకవులయం దొక్కనిపై వల్లెవాటుగనున్న నాపచ్చడమువైపునను బరగించిరి. దేవరవారు నాప్రశ్నవని యాప్రశ్నను గ్రహించితిని. మహామేధావి యాబాలకవి నోరెత్తి యాప్రశ్నకిట్లు సమాధానము జెప్పినాడు:

వాకిటి కావలి తిమ్మయ
ప్రాకటముగఁ గవిజనాళిపాలిటి సొమ్మై
మా కవిత మెచ్చి యిచ్చెను
నా కీ పచ్చడము నరసనరపతి కృష్ణా!

ఈ పద్యము విన్నతోడనే రాయలవారి మనసు నందలి కోపము మటుమాయమైనది. చంద్రోదయ సమయ నభస్థలమును బోలిన వారిముఖము ప్రసన్నత్వము నందినది. వాఙ్మయప్రపంచమున నిమన్నలై 'మా కవిత' 'నాకీ పచ్చడము' అని రెండు మూడు

పర్యాయములు దమలోదాము వల్లించుకొని చివరకా బాలకవి నడిగినారు. 'ఎవ్వరండి ఆ 'మా'? యని— వెంటనే యతఁడు—

అల్లసాని పెద్దనార్య మహాకవి,
నంది తిమ్మ సుకవి నాయకుండు,
భట్టుమూర్తి, యేను బరగ నల్వుర మైతి
మారయంగ కృష్ణరాయభూప

అని జవాబు చెప్పినాడు మరి 'నా' కర్థ మేమి? అని యడిగినారు రాయలవారు. అంతట నే నందుకొని బజారమున జరిగిన వృత్తాంతమును నివేదించితిని. రాయలదేవుని ముఖాంబుజము మందహాసముతో వికసించినది. అంతట పెద్దయ్యంగార్ల వంకముఖమై ఈబాలకవి ఎవ్వరు? అని యడుగ అవధరించినారు 'తిమ్మయ్య గార్ల శిష్యుడు. పేరు రామలింగము. జన్మస్థానము 'తెనాల్యగ్రహారము' అని పెద్దయ్యంగారు బదులు చెప్పినారు. 'రామలింగమా' అని యొక్కొక మాటను తనకు దాను నచ్చజెప్పినట్లుగా పల్కినారు స్వామివారు. వారి భావమును గ్రహించి యా బాలకవి 'అవును దేవా, రామ—లింగమె' అని రాయలదేవు



ననుకరించి తన నామధేయమందలి రెండు పదములను విడదీసి పలికి—

లింగనిషిద్ధుఁ గల్వ చెలిం గని, మేదకకంఠకంద్రిదూలిం గని, సంగతాళివలిం గని, కర్దమదూషిత వ్రణాలిం గని, కృష్ణచేలునివాలింగని నీలకచ విధాత్రినాలింగని రామలింగకవిలింగని, కీర్తి హసించు దిక్కులన్.

అను పద్యము చదివినాడు

'అబ్బ!' యని స్వామివారు చిరునవ్వునవ్వి, 'రామలింగకవి గారూ! మీ రింక కావ్యరచనకు ప్రారంభింపరాదా? అని ప్రోత్సహించినారు.

'దేవా, రచించినాడను, 'కందర్పకేతువిలాస' మను ప్రబంధమును - కవికల్పజము నీవు నాశ్రయించినాడను ఇక నాకేమి కొరత.

'దేవరవారి యాజ్ఞయైన కావ్యములెన్నిటినైన రచియింపనేర్తును' అని యూతడు మనవి చేసికొనెను.

'కందర్పకేతు విలాసమా? పేరు పసందుగనే యున్నది, కవిత్వమెట్టిదో'?

'దేవా! అది యేలినవారి వంటి ప్రాజ్ఞులు చెప్పదగిన విషయము' అని రామలింగకవి విన్నవించెను. అంత తిమ్మయ్యంగారివంక దృష్టిసారించి 'శిష్యుని కవిత్వ మెట్టిదో' యని విచారించినారు.

'సాహితీసమరాంగణ సార్వభౌములైన స్వామివారికి నేను నివేదింపగలనా? అట్లు నివేదించుటయు సరికాదు ఏలన శిష్యుడు పుత్రునివంటివాడు. పుత్రుని లోపములను తండ్రి తెలుపుచున్నవా?' యని తనవాస్తవాభిప్రాయము దెలియనీయక తిమ్మయ్యగారు జవాబు చెప్పినారు. రాయలదేవు డంతటితో తృప్తినందలేదు.' వారు రచించిన కందర్పకేతు విలాసమును మీరు తిలకించలేదా'? యని యడిగిరి. 'మహాప్రభో! తిలకింపకేమి? పదపదమును విమర్శించి చూచియున్నాను' అని బదులు చెప్పినారు. "స్మరణమందుండిన ఒకటి రెండు పద్యములను జదువుడు — విన కుతూహలముగ నున్నది.—అంతట తిమ్మయ్యగారు యిట్లు జదివిరి.

అక్కమలాక్షిఁ గన్గొనినయప్పటి
నుండియు నేమిచెప్ప నా
కెక్కుడెఁ జూచిన న్మదనుఁ డెక్కుడెఁ
జూచిన రోహిణీవిభుం

డెక్కడఁ జూచినం జిలుక
లెక్కడఁ జూచిన కమ్మగాడ్పులిం
కెక్కడ నెట్టు లోర్వఁగల నీ
విరహానలతాపవేదనన్

'పద్యము బిగువుగనే యున్నది భావము సామాన్యమేకదా!' అని సెలవిచ్చినారు. ఏలినవారు — తిమ్మయ్య బదులు చెప్పలేదు కాని మరల

లలితస్యాంబురుహంబు నీలకచభోగంబంబు నేత్రాసితో
త్పల ముద్యత్స్తనకోక మోష్ఠవిలసద్బంధూక ముద్యత్కటీ
పులినం బున్నత చిత్తజాతరసవాః పూరంబు ప్రాణేశ్వరీ
జలజావాసము సొచ్చి యాడక మనోజాతానలం బాఱునే.

అని మరియొక పద్యము చదివినారు — 'ఏట్లూ! తిమ్మయ్యంగారూ పద్యమును మఱియొకసారి సెలవివ్వండి.' అని కోరినారు రాయలవారు. అంతట నా పద్యమును మరల జదివినారు తిమ్మయ్యంగారు. 'బళి! బళి!' యనుచు రాయలవారు లేచి నిలచిరి వారు లేవగనె తక్కినవారందరును లేచిరి. కృష్ణరాయలవా రంతట రామలింగకవి యొద్దికివచ్చి 'రామలింగకవి లింగని కీర్తి హసించు దిక్కులన్' అనిపల్కుచు తన కంఠమున నలంకరించియున్న మౌక్తిక హారమును దీసి యాతని మెడను వేసిరి.

## 3

'అర్థమైనదా చినతిమ్మయ్యా ఆటవిడుపు పద్యం?'

'ఆఁ కాని తాతయ్యా, కథ...'

'కథకేమి? బాగుండలేదా?'

'అమ్మో బాబో! బాగులేకపోవడమే! బహు పసందుగానుంటేను!'

'అయితే మఱేమి?'

'ఏమీలేదు తాతయ్యా, కాని...'

'కాని? ఏమికానోయ్ కానిన్ని ముక్కానిన్ని?'

'...........'

'ఏమి పలుకవు?'

'మీకు కోపము వచ్చినది తాతయ్యా?'

'కోపములేదు తాపములేదు, చెప్పవోయ్?'

'ఆ పద్యా లెందుకు తాతయ్యా?'

'బాగుగ లేవా?'

'ఏమో నే నేమెఱుగుదు? దారిలో ముండ్లకంపల వలె నున్నవి?'

ఓరి నీతస్సాగొయ్యా? ఎంతమాటన్నావురా!'

వారి సంభాషణకు అడ్డము వచ్చి అన్నది దోనమ్మ.

'వాడిమోర పద్యాలకేమండీ రత్నాలవంటివి; కాని—'

'కాని?'

'అరగొరగా జెప్పిన కథ అదేమి బాగు?'

'అరగొఱా?'

'కాదా! పచ్చడిమెట్లు పోగొట్టుకొన్న చక్కగా వివరించితిరి. మరి మీ కెట్లు దొరికినదో సెలవివ్వండి. ఇంతవరకు మీకథ యంతయు జీరయూడ్చి వేసి రవికె దొడిగిన స్త్రీ సింగారమువలె నున్నది.'

'చెప్పియుండలేదా ఇంతకుముందె రాయలవారు ప్రసాదించినదని?'

'ఆఁ చెప్పినారు - ఎందుకు ప్రసాదించిరో సెలవివ్వండి'

'అదా? పెద్ద కథ'

'పెద్దదా? పెద్దదైన వినుట కింపుగా నుండదా? కథకుడు నేర్పరియైన ఊఁకదంపైనను వింతయై యుండును. పోషణ పసందుగనున్న వస్తు వెంతటి యప్రశస్తమైనను కథ యెంత దీర్ఘమైనను హృదయాహ్లాదకరము గాకపోవునా?'

'ఉఁహూఁ! రసజ్ఞురాలవే'

'మీ ప్రసాదమువల్ల నేకదా!'

ఊఁహూఁ!'

# కలగూరగంప

## ఆకాశపు ఎత్తులలో అల్లకల్లోలాలు

శ్రీ వసంతరావు వేంకటరావు

"ఫ్లయింగ్ సాసర్" గురించి ఈ మధ్య చాలా ఊహాగానాలు జరిగేయి. కుజ లోకంనుండి అపురూపమైన విమానాలలో కుజశాస్త్రజ్ఞులు మనలోకంలోనికి వస్తున్నారనీ, ఆ విమానాలు అద్భుతంగా ప్రయాణం చేయగలవనీ, అట్టి వైమానికులను కొందరు చూచేరనీ, వారితో మాట్లాడలేక సంజ్ఞలతో మాత్రమే వారి అర్థం చేసికొన్నారనీ వార్తలు ప్రకటితమైనాయి. కాని, పరలోకవాసులు మనలోకంలో ప్రవేశించగల అవకాశం, మనం పరలోకాలను (చంద్రుడు, కుజుడు, శుక్రుడు మొదలైనవి) చేరుకోగల అవకాశం ఉన్నదా అన్న విషయం పరిష్కారం కాలేదు. వాతావరణ శాస్త్రంలో ఈ మధ్య సేకరింపబడిన కొన్ని విషయాలు ఫ్లయింగ్ సాసర్లకు సంబంధించిన నూతనజ్ఞానాన్ని ప్రసాదించేయి. ప్రశాంతంగా నున్నదని భావింపబడుతూన్న స్ట్రాటోవరణం (Stratosphere) ఎంత కల్లోలితమై యున్నదో తెలియవచ్చింది.

ఉత్తర దక్షిణధ్రువ ప్రాంతాలలో అద్భుతమైన బహువర్ణకాంతులు కనిపిస్తూంటాయి. అవి ధ్రువప్రాంతాలకే పరిమితమైనవి. వాటిని "అరోరాలు" (Auroras) అంటారు. ఉత్తరధ్రువకాంతులను "అరోరా బోరియాలిస్" అని, దక్షిణధ్రువ కాంతులను "అరోరా ఆస్ట్రాలిస్" అని వ్యవహరిస్తారు. చీకటిలో వివిధరూపాలతో అనేకములైన రంగులలో కనిపించు అరోరాలు మానవ హృదయాల్ని ఆదినుండి ఉత్తేజపరుస్తూ వచ్చేయి. ఆదిమ మానవుడా హృదయంగమ దృశ్యాలను చూచి ఆరాధనభావంతో మోకరిల్లేడు. విజ్ఞాన వికాసంతో సంభ్రమాశ్చర్యాలు తగ్గగా, ఆ ప్రకృతి దృశ్యాలను పరిశోధనాదృష్టితో చూచి సహేతుకంగా వివరింపపూనుకొన్నాడు. మంచుప్రదేశాలలో పరావర్తనమొందిన సూర్యరశ్మియే బహువర్ణకాంతులుగా ప్రసరిస్తున్నదని ఒకప్పుడు భావించేరు. 1882—83 లో అరోరాలను సమగ్రంగా పరిశీలించడానికి [illegible] బృందం ఒకటి బయలుదేరింది. అందులో కొందరు అరోరాలను పరిశీలించగా మరికొందరు సూర్యబింబంలోని మచ్చలను, సూర్యుని పరిశీలింప పూనుకొన్నారు. మండుతూన్న సూర్యద్రవ్యం ఉపరితలంనుండి విజృంభించి గంటకు లక్షలకొలది మైళ్ళ వేగంతో ప్రయాణం చేసి భూమిని చేరుతుంది. వాటిని సౌరజ్వాలలంటారు. అవి ప్రకోపించిన సుమారు 20 గంటలకు అరోరాలు ప్రతిఫలిస్తున్నట్లు తెలియవచ్చింది. అంటే, సూర్యకాంతి కాక, మరేదో అరోరాలను ఉత్తేజపరుస్తున్నదని విదితమైంది. సూర్య 'ద్రవ్యమే' సెకనుకి 1000 మైళ్ళ వేగంతో ప్రయాణం చేసి భూవాతావరణంలో జొరబడి అరోరా కాంతులను కలిగిస్తున్నట్లు విజ్ఞానులు ఊహించేరు.

ఇప్పటి జ్ఞానానుసారంగా వాటిని వివరించినప్పుడు అరోరాలకు సూర్యునిలో కలిగే సౌరజ్వాలలకు గల సంబంధాన్ని అంగీకరించక తప్పదు. సౌరజ్వాలలో నిక్షిప్తమైన ద్రవ్యంలో కొంతభాగం భూమిపైకి వస్తుంది. అందు ముఖ్యంగానున్న ఉదజని పరమాణువులు విద్యుదావేశాన్ని పొంది భూమిని చేరుచుండగా, భూమిని ఆవరించిన అయస్కాంత క్షేత్రంలో నవి భూమియొక్క అయస్కాంత ధ్రువాలవైపు ప్రచోదింపబడతాయి. భూవాతావరణంలో నున్న నత్రజని పరమాణువులను ప్రాణవాయు పరమాణువులను అవి ఢీకొని ఉజ్జ్వలమైన అరోరాలుగా పరిణమిస్తాయి. అందులో ధనావేశంగల ఉదజని పరమాణువులు ఉత్తరధ్రువం వైపునకు, ఋణావేశంగలవి దక్షిణధ్రువంవైపునకు గమిస్తాయి.

ఇట్టిగమనంలో కొన్ని పరమాణువులు ధ్రువప్రాంతాలను చేరుకొనక ఇతరప్రాంతాలలో నడయాడవచ్చును. అవికూడ గాలిఅణువులతో ఢీకొనునప్పుడు కాంతిమంతమై భాసిస్తాయి. కాని, అరోరా ప్రాంతాలలో ముమ్మరంగానున్న ఉదజని పరమాణువులు విస్తారమైన కాంతులను కలిగించగా ఈదారి తప్పినవి చిన్న బెలూన్లవలె గోచరించవచ్చును. అట్టి దృశ్యాలు కొందరు విజ్ఞానుల కంటబడినట్లు ఇదివరకే ప్రకటింపబడింది. దీర్ఘగోళాకారపు బెలూనువలెనున్న

# కలగూరగంప

కాంతులను ఒక విజ్ఞాని 1882 లో చూచినట్లు రికార్డు కలదు. అవి ఉల్కలకంటే మెల్లగా గమించినవట. పొగచుట్ట ఆకారంలోనుండి పడమటినుండి తూర్పుకు ప్రయాణించిన ఖగోళవస్తువులను 1897 లో కొందరు చూచినట్లు పత్రికలలో ప్రకటింపబడ్డాయి. అవి బెలూనులకంటె పెద్దవట.

చాలకాలం క్రిందట జరిగిన కొన్ని విచిత్ర సంఘటనలను ప్రత్యక్షానుభవాలతో వ్రాసిన విజ్ఞానులు నేటికీ ఆశ్చర్యానికి గురయ్యేరు. 1918 లో ఒక వైమానికుడు తన విమానాన్ని రమారమి 6½ మైళ్ళ ఎత్తునకు తీసికొనిపోయి అక్కడినుండి సమంగా తూర్పు నుండి పడమరకు ప్రయాణం చేసేడు. అధికంగా రెండు గంటలసేపు నిరాటంకంగా సాగిన తరువాత క్రిందికి దిగి చూడగా తూర్పుకి 200 మైళ్ళు నెట్టబడినట్లు గమనించేడు. విమానం సాఫీగా సాగిపోయింది. ఇంజన్ యథాప్రకారంగా పనిచేసింది, కాని ఏదో అసాధారణమైనది జరుగుతున్నట్లు అనిపించిందట. ఆశ్చర్యకరమైన ఆ సంఘటనను వివరాలతో సహా పై అధికారులకు తెలియపరిచేడు. కాని, అతని మాటలను ఎవ్వరు సరకుగొనలేదు. మరి కొంతకాలం తరువాత ఆ వైమానికుడికే 7½ మైళ్ళ ఎత్తున ఎగరడం సంభవించింది. తన పూర్వ అనుభవాలను జ్ఞాపకముంచుకొని, తన విమానాన్ని సమంగా తూర్పునుండి పడమరకు రెండు గంటలసేపు పోనిచ్చేడు. అప్పుడేదో అదృశ్యశక్తి విమానాన్ని వెనుకకు నెట్టుతున్నట్లు అనిపించిందట. క్రిందకి దిగిచూడగా నిజంగా తను ముందుకు సాగలేదని తెలిసికొన్నాడు. ఈ సంఘటన కూడా అధికారులకు నివేదించేడు, కాని, వారేమీ పట్టించుకోలేదు.

ఇంతలో రెండవ ప్రపంచయుద్ధం వచ్చింది. అందులో విమానాలు బాగా ఎత్తున ఎగరగల సామర్థ్యం సంపాదించేయి. ఆ సమయంలో కొన్ని వైమానిక దళాలు విమానాలు సరిగ్గా పోవడంలేదని గమనించేయి. బాంబర్ల దళాలవారు ఎంత జాగ్రత్తగా గణనచేసి ప్రయాణం చేసినప్పటికి బాంబులు గురి తప్పుతున్నట్లు స్పష్టమైంది. B-29 విమానాలను నడుపుచుండిన వైమానికులకు అద్భుతమైన అనుభవాలు కలిగేయి. ఒక్కొక్కప్పుడు గంటకు 300 మైళ్ల వేగంతో వస్తూన్న గాలిని ఎదుర్కొంటున్నట్లు అనిపించేదట. జవంతో పోతూన్న వారి విమానాలు ఒకప్పుడు ఆగిపోయినట్లు అనుభవం కలిగేది. తిరుగు ప్రయాణం చేసినప్పుడు విమాన వేగానికి మించిన వేగంతో అవి దూసికొని పోతూన్నట్లు అనిపించేది. కాని, వాటికి కారణాలు తెలిసికొనడానికి అవకాశం లేకపోయింది.

యుద్ధం ముగిసినతరువాత, యుద్ధసమయంలో పెంపొందిన సునిశిత యంత్రాలనుపయోగించి వాతావరణ శాస్త్రజ్ఞులు ఆశ్చర్యకరమైన విషయాలు అనేకం కనుగొన్నారు. వాతావరణంలో మేఘ మండలాలకు పైనున్న భాగం చాల ప్రశాంతంగా వుంటుందని భావించేవారు; దాని పేరు 'స్ట్రాటోవరణం'. వాతావరణ విశేషాలను తెలిసికొనడానికి శాస్త్రజ్ఞులు యంత్రాలతో నింపిన బెలూన్లను పైకి వదిలి పెట్టుతారు. అవి కొంత దూరం పైకిపోయి పేలిపోతాయి. కాని, అవి ఎగురుతూన్నంతకాలం వాటిలో నున్న యంత్రాలు వాతావరణ విశేషాలను రేడియో మూలంగా తెలియజేస్తూంటాయి. అట్టి బెలూన్లు వాతావరణపు పై పొరల రహస్యాలను నిర్దిష్టంగా తెలియజేస్తాయి. ఆ వార్తలను బట్టి 8 మైళ్ళ ఎత్తువరకు బెలూన్లు సాఫీగా ఎగురుతాయని, ఆ పైని అదుపు తప్పుతాయని తెలియవచ్చింది. పైకి పోయిన కొలది 200—300 మైళ్ళ వేగంతో ప్రయాణం చేస్తాయి. పోనూ పోనూ ఆశ్చర్యకరంగా ఇష్టమొచ్చినట్లు ఎటుపడితే అటు తిరుగుతాయి. ఆ ఎత్తున ఏమి సంభవిస్తుందో తెలియక శాస్త్రజ్ఞులు తికమకపడ్డారు. ఏళ్ళ తరబడి చేసిన పరిశోధనమూలంగా వాతావరణ రహస్యాలు, కొంత వరకు గ్రహించడానికి సాధ్యమైంది.

5,6 మైళ్ళ ఎత్తున ఉత్తరార్ధ గోళంలోను దక్షిణార్ధ గోళంలోను బలవత్తరమయిన వాయు ప్రవాహాలు భూమిని చుట్టుతున్నాయి. వాటి వేగం గంటకు 250 మైళ్ళనుండి 300 మైళ్ళవరకు ఉండవచ్చును. వాటికి నియతమయిన సక్రమ మార్గం లేదు. అవి యథేచ్ఛగా చరిస్తూ, ఒకప్పుడు ఆకస్మికంగా వెనుతిరుగుతూ, అల్లకల్లోలముగా ప్రవర్తిస్తున్నట్లు విజ్ఞానులు కనుగొన్నారు. అంత అసామాన్యమైన వాయు ప్రవాహాలు అంత ఎత్తున ఎందుకుండాలో, వాటి గమనానికి హేతుభూతమై వాటిని ప్రచోదించే శక్తి ఏదో తెలియదు. కాని, వాటి ఉనికిని అంగీకరించక తప్పదు.

ఆ పరిస్థితి నూహించుకొనడానికి ఒక చిన్న ప్రయోగం సహాయపడుతుంది. సబ్బు నీళ్ళలో చిన్న గొట్టం ముంచి, పైకి తీసి, రెండవకొననుండి ఊదినట్లయితే సబ్బు బుడగలు తయారవుతాయి. గొట్టంనుండి వాటిని విదిలించినట్లయితే, అవి గాలిలో కొంతసేపు ఎగురుతాయి. గిర్రున తిరుగుతూన్న విద్యుత్ పంకా ముందు అట్టి సబ్బు బుడగలను విడిచి పెట్టినప్పుడు ఆ బుడగలు వాటి యిష్టం వచ్చినట్లు గమనం చేయుటయే కాక, వాటిలో కొన్ని ఆకారంలో మార్పు చెందినట్లు గమనించవచ్చును. కుండ్రంగా నున్నవి సాగి దీర్ఘమై కొన్ని పొగచుట్ట ఆకారం ధరిస్తాయి. మరికొన్ని తమలో తాము తిరుగుతూ సాసర్ రూపు ధరిస్తాయి. వెనుకటి విజ్ఞానులు చూచిన వలయాకారపు కాంతి పుంజాలు, ఈ నడుమ కొందరు చూచిన ఫ్లయింగ్ సాసర్‌లు ఆ సబ్బు బుడగలలో ప్రత్యక్షమవుతాయి.

అవి విపరీత వేగంతో నియమరహితంగా గమిస్తున్నట్లు కనిపిస్తుంది.

ఈ నూతన జ్ఞానవృష్టిలో ఫ్లయింగ్ సాసర్లు కేవలం కాంతిపుంజాలు మాత్రమే; కుజలోక వాసుల అపూర్వ విమానాలనడానికి బలమయిన కారణాలు కనిపించవు. సౌరజ్వాలలలో పైకెగసి, భూముఖంగా దూసికొని వచ్చిన విద్యుదావేశ పూరితమయిన ఉదజని పరమాణువులలో భూమియొక్క అయస్కాంత క్షేత్రములో ప్రవేశించి ధ్రువాలవైపు గమించక దారితప్పి ఇతర ప్రాంతాలలో చేరినవి కాంతిమంతమైనప్పుడు అండాకారంలోను సాసర్ రూపంలోను కనిపిస్తాయి. అవి అరోరాలంత దేదీప్యమానంగా నుండవు; కాని అరోరాలను కలిగించే పదార్థమే ఫ్లయింగ్ సాసర్లుగా గోచరించవచ్చునన్నది ముఖ్య విషయం. దానికి ప్రధాన కారణం ఆకాశపు ఎత్తులలో అల్లకల్లోలాలు.

# ఉడ్డియానదేశము

## శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

ఉడ్డియాన మనే ప్రాంత మొకటి భారత దేశంలో ఉండేది. ఫాహీన్ యాత్రికుడు ఇచట 500 సంఘారామము లున్నవని, ఇవిహీనయానానికి చెందినవని, బుద్ధ ధర్మ మిచట గౌరవింపబడేదని చెప్పినాడు. ఆరవశతాబ్దంలో మనదేశానికి వచ్చిన సుంగ్ యాత్రికులకు ఉడ్డియాన దేశపు రాజు గౌరవ పూర్వకమైన స్వాగత మిచ్చినాడట. ఈరాజు శాకాహారియని, ఈయన ప్రతిదినము బుద్ధుని పూజించెడివాడని వీరన్నారు. ఈ ఉడ్డియానములో 70 భిక్షువులు గల బౌద్ధ చైత్య మొకటి, 300 భిక్షువు లున్న స్వర్ణ శకలాలతో నిండిన మరొక చైత్యము, 200 భిక్షువు లున్న వేరొక మహా చైత్యము ఉండెడివని, ఈ భిక్షువులు నియమబద్ధమైన జీవితమును నడపుతూ ఉన్నారని కూడ ఈ యాత్రికులు పల్కినారు.

ఉడ్డియానములో 1400 సంఘారామములు, 18000 భిక్షువులు ఒకానొకప్పు డుండెడివారని, తన కాలానికి ఈసంఖ్య చాలతగ్గిపోయినదని, వీరనుసరించే మహాయానములోని గ్రంథాలు వీరికి అర్థము కావటం లేదని, వీరంతా తాంత్రికులై పోయినారని యువాన్ చ్వాంగ్ వాపోయినాడు. కాని ఇతని తర్వాతవచ్చిన ఇట్సింగ్ వ్రాతలను గమనిస్తే యువాన్ చ్వాంగ్ ఉడ్డియానంలో అడుగు పెట్టినాడనటానికి కారణాలు కన్పించవు. తవోహిన్ అనే చీనాభిక్షువు ఉడ్డియానమునకు పోయి, అచట సమాధిని నేర్చుకొని ప్రజ్ఞాపారమితలను అవగాహన చేసికొన సాగెనని ఇట్సింగ్ చెప్పినాడు. చీనాదేశమునుంచి ముగ్గురు భిక్షువులు ఉడ్డియానమున కేగినారని అచటి భిక్షువొక డీయనకు వర్తమానము నొసగినాడట ఇచటిరాజు మహాయానము నవలంబించుచు, త్రిరత్నములను పూజించువాడని హుయిచవో చెప్పినాడు. క్రీ. వె. 980 ప్రాంతమున ఉడ్డియాన వాస్తవ్యుడైన దానపాలుడు 111 బౌద్ధ గ్రంథాలను వ్రాయటమే గాక చీనాప్రభువుల ఆస్థానములో తన అంత్యదినాలను గడిపినాడంటే ఉడ్డియానమే మహాయానమునకు ఆశ్రయము నిచ్చి, బౌద్ధమతమును పోషించిన దేశముగా కన్పడగలదు.

ఉడ్డియాన మనే పేరును ఒడియానమని, ఉర్గ్యానమని, ఓడ్యానమని, ఉడయనమని, ఒడివిసయని రకరకాలుగా వ్యవహరించారు. తారానాథుడు మొదలగు వారి వ్రాతలలో కన్పించే ఈ శబ్దాన్ని చూచి ఇది వడ్డేవారి దేశమగు ఒరిస్సాయని కొందరన్నారు. మరికొందరు దీనిని వంగదేశంలో కనిపెట్టినారు. కాని అసలు ఈ దేశ మెక్కడిదో తెలిసికొనటానికి రెండు ఆధారాలు కన్పించుచున్నవి.

మొదటి ఆధారము 'వజ్రయానము.' మహాయానముతో బాటు వజ్రయానమనే తెగ బౌద్ధ మతంలో బయలుదేరినది. జ్ఞానోదయమైన 16 సంవత్సరాలకు బుద్ధుడు ధాన్యకటకము వచ్చినాడని అప్పుడచ్చట మూడవ ధర్మచక్రమును ప్రవర్తింప జేసినాడని, ఇదే వజ్రయానమని టిబెట్ దేశపు చరిత్రకారు లనేకులు వ్రాసినారు. పద్మవజ్రుడనే బౌద్ధాచార్యుడు గుహ్య సమాజ, హేవజ్రతంత్రములను వ్రాసి వాటిలో వజ్రయానమును లేవదీసినాడు. ఈయన శిష్యుడు అనంగవజ్రుడు అనేక వజ్రయాన గ్రంథాలను రచించినాడు. అనంగవజ్రుని శిష్యుడు ఇంద్రభూతి లేక ఇంద్రబోధి అని పిలువబడేవాడు. ఈయన ఒడియానసిద్ధుడని ప్రతీతి. ఇంద్రభూతి కుమారుడు పద్మసంభవుడు. మొదట టిబెట్ దేశానికివెళిన శాంతరక్షితుడు, అచటి రాజును ప్రోత్సహించి ఆయనచే తన బావమరదియగు పద్మసంభవుని ఆహ్వానింప జేశాడని, తర్వాత క్రీ. వె 747 లో పద్మసంభవుడు టిబెట్ జేరి అక్కడ మొట్టమొదటి చైత్యమును క్రీ. వె. 749 లో నిర్మించినట్లు దేశ చరిత్రకారులందరు చెప్పుచున్నారు. ఈ పద్మసంభవుడు కూడా ఒడియాన సిద్ధుడనబడే వజ్రయానాచార్యుడు. ఈయనతో టిబెట్ దేశమున తాంత్రిక బౌద్ధమతము ప్రచారంలోనికి వచ్చినది. దీనినిబట్టి ఉడ్డియాన దేశానికి వజ్రయానానికి సన్నిహిత సంబంధ మున్నట్లు స్పష్టమాతున్నది. తారానాథుని గురువగు బుద్ధగుప్తుడు ఉడ్డియానములో బౌద్ధమతము 16 వ శతాబ్దములో సజీవముగానున్నదని చెప్పినాడు. బుద్ధగుప్తుడు తాంత్రిక

# కలగూరగంప

బౌద్ధుడు కావటంచేత ఉడ్డియానంలో ఆనాడున్నది వజ్రయానమే కావాలి.

పదునాల్గవ శతాబ్దానికి చెందిన నికాయ సంగ్రహమనే సింహళద్వీపములోని గ్రంథము వజ్రయానమును వజ్ర పర్వతయానమని పిలచుచు వజ్ర పర్వతమునకు చెందిన భిక్షువు తొమ్మిదవ శతాబ్దంలో సింహళపురాజును బౌద్ధునిగా జేసెనన్నది. ఈ వజ్ర పర్వతమే శ్రీ పర్వతము. నాగార్జునకొండకు శ్రీ పర్వతమని పేరున్నది. నాగార్జున కొండకు, అమరావతికి సమీపంగా, జగ్గయ్యపేటకువెళ్లే దారిలో వజ్రాల దిన్నె నేటికీ కనిపిస్తున్నది. వజ్రాల దిన్నెలో వజ్రాలుండవేమో! కాని వజ్రయానానికి చెందిన బౌద్ధులకీ వజ్రాలదిన్నె పవిత్ర ప్రదేశమై ఉంటుందని మాత్రము చెప్పటానికి వీలున్నది.

రెండవ ఆధారము పద్మసంభవుని చరిత్రలో కనిపిస్తుంది. క్రీ. వె. 747లో టిబెట్ చేరిన పద్మసంభవునకు 'యెషెత్సోగ్యల్' అనే టిబెట్ దేశపు స్త్రీ ముఖ్య శిష్యురాలు. ఈమెను సరస్వతియొక్క అవతారంగా భావిస్తారు. ఈమె తన గురువుగారి జీవిత చరిత్రను వ్రాసినది. ఈ చరిత్రలో మనకీ క్రింది విషయాలు కనిపిస్తవి.

ధనకోశమని పిలువబడే ధాన్యకటకములో ఒక ప్రధాన సరోవరమున్నది ఉర్గ్యానము, ఉడ్యానము, ఉడ్డియానము, ఒగ్యానము, ఉగ్యానము, లేక ఒడియానము అని పిలువబడే దేశంలో వాయవ్య దిక్కున ఈ ధాన్యకటకము, అందలి సరస్సు ఉన్నవి. అంటే ఉడ్డియానదేశములో ధాన్యకటకమున్నది. ఇదే నాగార్జున కొండఉన్న మండలము. ఇచ్చట సరస్సులో ఒక పద్మము బయలుదేరునని, ఆ పద్మములోనుంచి తానే జన్మించగలనని బుద్ధుడు తన శిష్యులకు చెప్పినాడట! ఉడ్డియానములో ధాన్యకటకమును ప్రధాననగరముగా పాలించుచున్న రాజు ఇంద్రబోధి. ఇక్కడ క్షామము వచ్చింది. అప్పుడు అమితాభుడు ధాన్యకటకములో జన్మించదలచి, పంచకోణాత్మకమైన వజ్రమును తన హృదయమునుంచి తీసి ధాన్యకటకములోని సరస్సులోకి వేసినాడట. ఆ వజ్ర మందలి పద్మగర్భములో పసిగా అందులో ఒక శిశువు కన్పించాడు. ఆ శిశువును తన పుత్రునిగా పెంచుకొని, అతనికి పద్మసంభవుడనే పేరును ఇంద్రబోధి పెట్టినాడట.

ఈ చరిత్రనుబట్టి ఉడ్డియాన దేశమనగా ధాన్యకటక ప్రాంతమని, ఇదే వజ్రయానదేశమని, ఇచట శ్రీ పర్వతమే వజ్రపర్వతమని, ఇచట వజ్రయాన బౌద్ధము క్రీ. శ. 16 వ శతాబ్దందాకా ఉన్నదని చెప్ప వీలగుచున్నది. కచ్చితంగా ఏ భాగానికి ఉడ్డియానమనే పేరుండేదో, ఈ పేరు ఎలా వచ్చిందో కొంచెము గమనించాలి.

పైకి ఎగిరిపోవుట అనే అర్థంలో ఉడ్డియనమనే శబ్దం కనిపిస్తుంది. ఉడ్డీయన శబ్దానికి కూడా ఇంచుమించు ఇదే అర్థమున్నది. తాంత్రిక మంత్ర ప్రయోగాలను వివరించే ఉడ్డీశమనే గ్రంథమొకటి కన్పిస్తుంది. అణిమాదిసిద్ధులు మొదలగు తాంత్రిక, యోగాభ్యాసాలను తెలిపే అర్థంలో ఉడ్డియాన శబ్దముండ వీలున్నది. అప్పుడు వజ్రయానమనే మాటకు ఉడ్డియానము, ఒడియానము నేవి తాంత్రికపర్యాయాలు కావటానికి వీలున్నది.

అడివిజాతికి చెందిన బియ్యమనే అర్థంలో ఓడీ అనే శబ్దమొకటి వున్నది. ఈ బియ్యాన్ని ఆధారంగా చేసుకొని జీవించేవారు ఓడివాసులు కావచ్చును. ఏది ఎట్లున్నా వజ్రయానికులే ఓడియానులు, ఉడ్డియానులు అని పిలువబడినారు. వీరి మంత్రాలకు ధారణీలని పేరు. అందుచేత వీరికి ప్రధానాశ్రయము నిచ్చిన ధాన్యకటకము ధారణీకటకము, ధరణికోట యినది. వీరి ముఖ్యపీఠము వజ్రపర్వతమనబడిన శ్రీపర్వతము. నేడు వజ్రాలదిన్నె అనబడేది వీరి ఉపపీఠము కావచ్చును. పైగా జగ్గయ్యపేట దగ్గరగా నేడు ధనంబోడు అనబడే ఒకదిబ్బఉన్నది. ఈ ధనంబోడులో మళ్ళీ ధారణీ శబ్దమే కన్పడగలదు. వజ్రయానికు లని పిలువబడిన ఉడ్డియానికుల కిది కూడ స్థావర మొసగిన ప్రదేశమే అనుటలో సందేహంలేదు.

బౌద్ధుల యోగాభ్యాసంలో అతి ప్రాచీన కాలం నుంచీ ధ్యానాలు, సమాధులే కాక బుద్ధి పాదాలనేవి కూడా ఉన్నవి. బహుశః బుద్ధి అనే శబ్దానికి ఉడ్డీ అనేది వికృతి కావచ్చును. వృద్ధిశబ్దము వడ్డీ ఐనట్లు బుద్ధిశబ్దం ఉడ్డీ కావటానికి వీలున్నది. ఈవజ్రయానికుల ధారణీలలో బుద్ధిపాదాల కతి విశిష్టమైన స్థానమున్నది. అతిలోక శక్తులను వశపరచుకొనుట, తత్త్వమును సాక్షాత్కరింప జేసికొనుట, సిద్ధులను పొందుట అనేవన్నీ బుద్ధియానంలో ఉన్నవి. ఇదే ఉడ్డియానము. ఇది ఆచరింపబడిన దేశానికికూడా ఉడ్డియానమనే పేరు వచ్చినది.

## రేనాడు రాజ్యము

### శ్రీ కొత్త బావయ్యచౌదరి

రేనాడు రాజ్యమాంధ్ర శాతవాహనరాజుల పాలన కాలములో దాదాపు క్రీస్తుపూర్వము 200 నుండి క్రీ. శ. 250 వరకును ఉండి తర్వాత యిక్ష్వాకు రాజులగు శాంతమూలుడు, వీరపురుషదత్తుడు, రెండవ

కాంచీపురాలయందు నున్నవారి పాలనలోను ఉన్నట్లు కనబడుచున్నది. ఈ కాలములో దీనిని హిరణ్యరాష్ట్ర మని పిలుచుచు వచ్చినట్లు కొన్ని శాసనములను బట్టి చరిత్రజ్ఞులు కొందరు విశ్వసించుచున్నారు గాని హిరణ్యరాష్ట్రము నెల్లూరుజిల్లాలోనిదని మరియొక యభిప్రాయము కూడ కలదు. 7 వ శతాబ్దినాటి మాలెపాటి తామ్రశాసనములో నిది హిరణ్యరాష్ట్రముగా నే చెప్పబడినది. (Ep. Ind XI.) ఇందుదాహరింపబడిన చికప్రుఱ్ఱు గ్రామము నెల్లూరుజిల్లా కందుకూరు ప్రాంతములోని పురవపల్లియైనట్లు తెలుపబడినది. అందుచే అప్పటి వరకును హిరణ్యరాష్ట్రము కడప, నెల్లూరు జిల్లాలలో నుండెననవచ్చును. తర్వాత నిది మహారాజవాడి యను పేరులోనికి వచ్చి యేడువేల గ్రామములు గల దయ్యెను. దీనికి వల్లూరు రాజధానిగా నుండెను. ఈ రాజ్యము నే గాక సిద్ధి, పొత్తపి రాజ్యములు సహా తెలుగు చోళరాజులు పల్లవరాజులకు సామంతులుగా పాలించిన దృష్టాంతములు లభించుచున్నవి. ఇక్ష్వాకు రాజుల తర్వాత ఆంధ్రదేశములో చాలభాగము పల్లవరాజుల పాలనలోనికి వచ్చెను. అందువల్ల నే పల్లవులకు సామంతులుగా కరికాలాన్వయులైన చోళవంశీకులు యీ రేనాటి రాజ్యమును పాలింపదొడగిరి. కాని మొదట నున్నవారి విషయము 5 వ శతాబ్దివరకు తెలియుటలేదు. తర్వాత పాలించినవారిలో నందివర్మయను చోళరాజు మొదటివాడుగా గనబడుచున్నాడు.

ఈతడు క్రీ.శ. 550-75 ప్రాంతీయుడై యుండి పల్లవరాజగు నరసింహవర్మకు సామంతుడై యుండెవచ్చును. ఈతనికి సింహవిష్ణు, ధనంజయవర్మ, సుందరవర్మలను మువ్వురు పుత్రులుండి వివిధప్రదేశము లందు పాలించిరి. ధనంజయవర్మ రేనాడు పాలించె ననవచ్చును. ఈయన శాసన మొకటి కలమళ్ళ గ్రామములో నున్నది. ఈయన కుమారుడగు ధనంజయ ఎరిగ చోళుని శాసనములు, ఆజ్వాడి యను ప్రదేశము చుట్టును కనబడుచున్నవి. అంతవరకును వీరి రాజ్యము విస్తరించెను. ధనంజయవర్మ మరియొక కుమారుడే పరిప్రతాపచోళమహారాజను బిరుదము ధరించిన మహేంద్ర విక్రమవర్మ. ఈతని కుమారుడు పోర్ముఖ వర్మయను పుణ్యకుమారచోళుడు. ఈ పుణ్యకుమార చోళునకు గుణముదితుడను సోదరుడుండెను. ఈ పుణ్యకుమారునకు పురుషశార్దూల, మార్దవచిత్త, మదనవిలాస మున్నగు బిరుదము లుండెను. ఈతడు తెలుగు లిపి, భాషలలో శాసనములు వ్రాయించి కీర్తివహించినవాడు— దేవబ్రాహ్మణులకు భూదానములొసంగు ఆచారము దేవాలయ నిర్మాణకార్యములు, పల్లవ రాజులు వచ్చినవాటినుండియు అమలునకు వచ్చెను. అందుచేత నే యీతని రాణియగు వసంతపోరిచోళ మహాదేవి తన పేరిట నెలకొల్పబడిన వసంతీశ్వరాలయమునకు కొన్ని భూముల నిచ్చెను.

ఈ పుణ్యకుమారచోళుడు క్రీస్తుశకం 625-675 మధ్యను పాలించినట్లు చరిత్రజ్ఞు లూహించుచున్నారు. ఈ కాలమునకు పల్లవసామ్రాజ్యము క్షీణించుచుండెను. అప్పుడు పాలించుచుండిన వాడు కాంచీపుర రాజధానిగాగల పల్లవమహేంద్ర వర్మ III. పశ్చిమచాళుక్య చక్రవర్తియగు మొదటి విక్రమాదిత్యుడే పల్లవరాజ్యమును జయించెను. ఈతడు 655-681 మధ్య నేలినవాడు. అందుచే పుణ్యకుమార చోళుడు నైతము యీయనకు లోబడినను స్వతంత్రుడుగనే యున్నట్లు భావింపవచ్చును. పుణ్యకుమార చోళుని తర్వాత పాలనకు వచ్చిన అతని కుమారుడు విక్రమాదిత్యుడు కూడ మహారాజాధిరాజ బిరుదము ధరించి స్వతంత్రుడు డయ్యెనని చరిత్రకారుల విశ్వాసము—

ఇంతకు పూర్వపరిస్థితులను లోతుగా విచారించినగాని వీరి విషయములు స్పష్టపడవు.

రెండవ పులకేశి మహారాజు 610-642 మధ్య కాలమును పాలించుచు 621 లో మొదటిసారి కాంచీపుర పల్లవ మహేంద్రవర్మ నోడించెను. ఈతడు మరల స్వతంత్రుడు కాగోరు ప్రయత్నించినపుడు 642 లో మరల దక్షిణదేశ దండయాత్ర నొనరించెను. కాని దురదృష్టవశమున నీ యుద్ధములో పులకేశి మరణించుటయు, మహేంద్రవర్మ కొడుకు లేక మనుమడు నరసింహవర్మ మణిమంగళము, పరియాల యుద్ధములలో జయించి బాదామి నాక్రమించుటయు జరిగెను. మొదటి విక్రమాదిత్యుడు తన తండ్రియగు పులకేశి మరణమునకును, రాజ్యాపహరణమునకును వగచి మరల బలముల గూర్చుకొని ముందుగా 655 లో బాదామిని స్వాధీన పరచుకొనగలిగెను.

ఈ క్లిష్ట సమయములో ననగా 621-655 సం॥ల మధ్య యీ రేనాడు ప్రాంతములు అటు పల్లవరాజులకును, యిటు చాళుక్యరాజులకును లోబడక స్వతంత్రంగా వ్యవహరించినట్లు ఊహింపవచ్చును. అందువల్ల నే పుణ్యకుమారచోళుడు మహారాజుగా వ్యవహరించగా తర్వాత వాని వంశస్థులు కూడ ఆ బిరుదము నే ధరించి రనవచ్చును. 655 సం॥ తర్వాత యీ తెలుగు చోళరాజులు విక్రమాదిత్యునికిని, తర్వాత వినయాదిత్యచక్రవర్తికిని లోబడినవారై పోయిరిగాని మరల పల్లవ సామంతత్వము గల్గినట్లు కనబడదు. విక్రమాదిత్య చక్రవర్తి 681 A. D. లో చనిపోయెను. పల్లవరాజ్యము దాదాపు 900 వరకును నామమాత్రముగా నుండినను, ఒకవైపున రాష్ట్రకూటులతోను, రెండవవైపున దక్షిణదేశ చోళరాజులతోను

# కలగూరగంప

వైరము వహించినందున నిలువజాలకపోయెను. చోళరాజగు ఆదిత్య I చివరి పల్లవరాజగు అపరాజితుని సంహరించుటతో నా పల్లవరాజ్యము నశించెను.

ఇక బాదామినుండి చాళుక్య వినయాదిత్య చక్రవర్తి 681 నుండి సామ్రాజ్యమును శాసించుచు, కర్నూలు, రేనాడు రాజ్యములు తన పాలనలో నే యున్నట్లు చెప్పుటవలన, రేనాటిరాజ్యము సామంత రాజ్య హోదాలో నే యుండెననవచ్చును—విక్రమాదిత్యచోళుని తర్వాత నతని కుమారులగు శక్తికుమార విక్రమాదిత్యుడును, అతనిపిమ్మట సత్యాదిత్యుడును దీనిని పాలించియుండిరి. సిద వెయ్యి గ్రామములు, రేనాడు 7 వేల గ్రామములు వారిపాలనలో నుండెను. 725 A. D. ప్రాంతమునకు సత్యాదిత్యుని పాలన ముగిసియుండును. తర్వాత నీవంశీయులో మహేంద్ర వర్మ, రేళంచోళ, నృపకామ, దివాకర, శ్రీకాంతి చోళ లేక చోళధీర యనువారిపాలన గానవచ్చుచున్నది—(Eps. Ind V).

దాదాపు 835-850 A. D. ల మధ్య యీ ప్రాంతమును రాష్ట్రకూటరాజగు కృష్ణరాజు జయించి యాతని సామంతుడగు వైదుంబరాజు గండత్రినేత్రుని పాలనలో నుంచినట్లు కనబడుచున్నది. 850 A D. నుండి వైదుంబరాజు గండసంకోలు డీప్రాంతమును పాలించెను. తమ పూర్వీకుల సామ్రాజ్యమైన మీప్రాంతము పై యపహరింపబడుటను జూచి సహింపజాలక తూర్పుచాళుక్య చక్రవర్తియగు గుణగాంక విజయాదిత్యుడు దండెత్తివచ్చి జయించి తెలుగు చోళరాజులను ప్రతిష్ఠించెనుగాని యిదికూడ చిరకాలము నిలిచినట్లు కనబడదు. 900 A. D. ప్రాంతమున శోరెముతి వద్ద జరిగినయుద్ధములో నోలంబులు, బాణరాజులు, వైదుంబరాజులు కలిసి తిరిగి స్వాధీనపరచుకున్నట్లు కనబడుచున్నది. ఇందలి నోలంబరాజులు దాడిగ, రాచమల్లులనువారై యుందురని చరిత్రజ్ఞులు విశ్వసించుచున్నారు. 926 A. D. లో కమలాపురమువద్ద రాష్ట్రకూట నిత్యవర్ష ఇంద్రరాజు సామ్రాజ్యము ములికినాడులో కనబడుచున్నది. తెలుగు చోళరాజులు ఈ ప్రాంతమును బోగొట్టుకొన్నను, కొద్దికాలములో నే యీప్రాంతమున తమపాలనను సాగించుచు నేయుండిరి. 930 A D. ప్రాంతమున చిలయచోళుడు, 956నుండి జటచోళ తెలుగువిజ్జయ, 978 ప్రాంతమున జటచోళ భీమన్నపాలుడు మొదలైనవారు కోడూరు మున్నగు ప్రాంతములు పాలించినట్లు అచటి శాసనములు తెలుపుచున్నవి. మధ్యమధ్య వైదుంబరాజులతో యుద్ధములు జరుగుచు, రాజ్యము చేతులు మారుచుండెను. 971 A. D. లో కాంతి రాజ్యము పొత్తపినాడు మొదలుగా నాటివరకూ గల దేశమంతయు వైదుంబరాజగు భువన త్రినేత్రునకు వశమయ్యెను కాని మరల 978 లో నది జటచోళభీమునకు వచ్చెను.

విక్రమాదిత్య వందయ్య యనునతడు రాష్ట్రకూట రాజగు కన్నరదేవునికి సామంతుడై ములినాడు, వానగప్పాడినాడు, సింగపురినాడు, వెంక్రను కోటములు పాలించునట్లును, అతని పాలనము 940-56 సం॥ల మధ్యనున్నట్లును ఒక శాసనమువలన తెలియుచున్నది. ఇతడు మూడవ కృష్ణరాజునకుగూడ సామంతుడు. 949 లో ప్రసిద్ధిజెందిన తక్కోల యుద్ధము జరిగెను. దానిలో వైదుంబులకే జయముగల్గెను. విక్రమాదిత్య వందయ్య తర్వాత వందయ్య తిరువయ్య రాజు యీ ప్రాంతమును 956-960 మధ్య పాలించెను. అతనితర్వాత తిరువయ్య శ్రీకాంతరాజు అనునాతని కుమారుని పాలనవచ్చెను. 978 తర్వాత కొద్దికాలమునకు తిరువయ్య చంద్రాదిత్యుడును శంకరదేవుడును 1001 A D. వరకు కాంచీపుర చోళరాజగు రాజరాజునకు సామంతులుగా నీప్రాంతము పాలించిన ఆధారములు లభించుచున్నవి. 978-999 సం॥ మధ్య మాత్రము కంచి మొదలుకొని తొండమండలముతో సహా పొత్తపి, కడప, రేనాడులు జటచోళ భీమన్నపాలుడే పాలించెను. అతని మరణానంతరము తొండైమండలము సహా నీప్రాంతములు రాజరాజు సామ్రాజ్యములోనికి వచ్చెను. మహారాజ పదమును రేనాడు ఆకాలమున నన్నిమారాయడు (నన్నెచోడు?) పాలించినట్లు ఇంగులూరు నాడులోని ఒక శాసనము తెలుపుచున్నది ఈ కాలమునను రాష్ట్రకూటరాజుల వత్తిడి యీ ప్రాంతముపై నశించెనని చెప్పుటకు వీలు లేకున్నది. పాలగిరి (కడపజిల్లా) లో 1056 A D లో అకాలవర్ష కన్నరదేవ సామంతుడగు మదుకమహారాజు పాలన గనబడుచున్నది. అచటి సముద్రేశ్వరునికి 80 ఖండుగల భూమినిచ్చి దానశాసనము వ్రాయించెను. కాని యీ ఆక్రమణ చిరకాలము నిలిచినట్లులేదు.

రాజరాజు పశ్చిమచాళుక్య ఆహవమల్ల సోమేశ్వరుల తోను, రాష్ట్రకూటులతోను యుద్ధములు సల్పుటయే గాక, వారిరాజ్యములను జయించెను. కంపిలి, కొల్లిపాక, పూండూరు యుద్ధములలో వారలను జయించెను తెలుగునాయకు లనేకులు పూండూరులో ఖైదుచేయబడి, పూండూరునగరము నేలమట్టము చేయబడెనట. మహారాజపదికి దండనాయక అప్పిమయ్యను పాలకునిగా నియమించెను. ఈ ప్రాంతము చోళరాజుల సామంతత్వమునకు లోబడి తర్వాత కొందరు పాలించుచుండిరి గాని వానివివరములు లభించుటలేదు. రాజాధిరాజు పాలన 30వ సం॥లో (1048) అప్పిమయ్య వ్రాయించిన శాసనమొకటి వల్లూరు రాజధానిగా పాలించినటు తెలుపుచున్నది. (No. 6 of 1890) కాకతి మొదటి ప్రోలరాజు సేనానియగు బమ్మసేనాని కంచి దుర్గకవాటములు భేదించినట్లు శాసనములలో జెప్పబడినది. త్రైలోక్యమల్లుని సామంతుడుగా నుండి యాతడొనరించిన దండయాత్రలో నొకసారి యట్లు జరిగినను, పైశాసనమును బట్టి 1048 లో వల్లూరిరాజ్యము రాజాధిరాజు సామంతత్వము క్రిందనున్నట్లు స్పష్టము. అప్పిమయ్య తర్వాత బ్రహ్మాధిరాజు పాలన మహారాజపదిలో జరిగెను.

కాకతీయ గణపతిదేవ చక్రవర్తి కీ ప్రాంతము 1212 నాటికి వశపడెను. అచట కాయస్థ సేనాధిపతియగు గంగయసాహిణిని పాలింప నియోగించెను. అతడచటనే దానశాసనములు వ్రాయించెను. అతనితర్వాత రుద్రమదేవికాలములో జన్నిగదేవ సాహిణియు, తర్వాత రెండవప్రతాపరుద్రదేవ చక్రవర్తికాలములో ననగా 1295-1323 మధ్య త్రిపురాంతక దేవుడును యీప్రాంతమును పాలించి శాసనములు వ్రాయించిరి. దాదాపు 1304 ప్రాంతమున మహమ్మదీయులోరుగలుపైకి దండెత్తిన సమయముజూచి యీ కాయస్థ సేనాని త్రిపురాంతకుడును, అంబదేవసేనానియు తిరుగబడి స్వతంత్రులగుటకు ప్రయత్నింపగా ప్రతాపరుద్ర చక్రవర్తి గుండయ్య, మాచయ నాయకులను బంపి వారిని అణచివేసి, పాతప నాటికి జుట్టయ లంక గొంకారెడ్డిని, పాకనాటికి ముప్పిడినాయనింగారిని పాలకులుగా నియమించెను.

1323 సం॥ లో కాకతీయ సామ్రాజ్య మంతమయ్యెను. మహారాజపది యనురేనాటిరాజ్యం తర్వాతి చరిత్ర మరొకసారి తెలుసుకొందము. విజయనగర సామ్రాజ్యకాలములో నీగండికోటసీమలో జేరిపోయినది—ఈ వ్యాసము వ్రాయుటలో నాకు మదరాసు ఎపిగ్రాఫికా రిపోర్టులు, ముఖ్యముగా తోడ్పడెను.



## గమనిక

గత అక్టోబరుమాసం భారతిలో, ప్రకటించిన 'బలి పశువులు' అనే నాటిక తుదిని రచయిత: 'శ్రీ రెంటాల గోపాలకృష్ణ చక్కని తెలుగు నుడికారంతో చేసిన అనువాదం ఈ నాటికకు అణువణువునా తోడ్పడినందుకు వారికి నా కృతజ్ఞతలు.' అని లిఖించారు. దురదృష్టవశాత్తూ ముద్రణలో ఈ వాక్యం జారిపోయింది పాఠకులు గమనింప ప్రార్థన.

* పై రచయిత (శ్రీ కొండేపూడి శ్రీరామచంద్రమూర్తిగారు) శ్రీ రెంటాలవారి అనువాదంనుంచి, మక్కికి మక్కిగా చాలాభాగాలు సేకరించినట్టు కనుపించుతోంది. పైపైంగా కృతజ్ఞత తెలిపినా అట్టి విస్మృతావధిని మరొక రచననుంచి సేకరించడం సత్సంప్రదాయం కాదు. రచయిత లెవ్వరూ ఇకముందు అలా చేయరని ఆశించుతున్నాము. ఈ విషయాన్ని మా దృష్టికి తెచ్చిన శ్రీ రెంటాల గోపాలకృష్ణ గారికి కృతజ్ఞత.

—సంపా.

# గ్రంథ విమర్శనము

## దక్షిణదేశములో నాట్యము

రచన: శ్రీ తుమ్మలపల్లి సీతారామారావు; ప్రచురణ: ఉమా పబ్లిషర్సు, విజయవాడ-1; మూల్యము రు 4-0-0.

భారతజాతి కళారంగాలలో సాధించిన మహోన్నతి స్థితి అనన్యసామాన్యమైనది. మిగుల మిక్కిలి సంగీత సాహిత్యాది సర్వ కళలనూ సమన్వయ పరచుకుని ఒక మహా కళగా రూపొందిన భారతీయ నాట్యకళ ఈ జాతి ప్రతిభా సంపదకు ప్రతిచిహ్నంగా వుంది. ఇలాంటి మహాకళకు ఇంతవరకూ సరియైన చరిత్ర గ్రంథం లేకపోవటం విచారకరం. అసలు, అనాది కాలంనుంచీ, మనవారికి ఏ కళకు గాని, ఏ శాస్త్ర విజ్ఞాన శాఖకు గాని పరిణామ చరిత్ర వుండాలనే అభిప్రాయం వున్నట్లు తోచదు. ఈ చరిత్ర గ్రంథాల అభావంవల్ల యెంతో అయోమయావస్థ యేర్పడ్డది. నాట్యకళకు బొత్తుగా అలాంటి గ్రంథమే లేదు. శ్రీ తుమ్మలపల్లి సీతారామారావుగారు కొంతకుకొంత ఈ కొరత తీర్చటానికి ప్రయత్నించారు. రచయిత, దాక్షిణాత్య సంప్రదాయాలకు పరిమితం చేసుకుని ఈ గ్రంథాన్ని సంఘటించాలని ప్రయత్నం చేసినా, యావద్భారత సంప్రదాయాల ప్రభావం దాక్షిణాత్య నాట్య కళలను రూపొందించటంలో అమితమైన ప్రభావం చూపటంవల్ల ఆయా సంప్రదాయాలను కూడా తడవి చూడక తీరింది గాదు. దాక్షిణాత్యజాతులలో చరిత్ర కందని ప్రాచీన కాలంనుంచీ అనేక దేశి సంప్రదాయాలు ప్రచారంలో వున్నా, మార్గ సంప్రదాయాలను రూపొందించటంలో భరతాగుల సంప్రదాయాలను దాక్షిణాత్యులు అంది పుచ్చుకోవటం జరిగింది గదా!

రచయిత ఈ గ్రంథాన్ని అయిదు ప్రధాన భాగాలుగా విభజించారు.

(1) పూర్వయుగము:—క్రీస్తుకు పూర్వంనుండి క్రీ. వె. 9 శతాబ్దాంతము వరకూ

(2) చరిత్రయుగము:—క్రీ శ. 1000—1300

(3) మధ్యయుగము :—క్రీ. శ. 1600—1800

(4) ఆంగ్లేయయుగము:—1800—2000

నాట్యకళా పరిణామచరిత్రకూ, జాతీయ చరిత్రకూ అవినాభావ సంబంధం వున్న కారణంగా, నాట్యకళా చరిత్రకు సంబంధం వున్న ఆయా రాజకీయ సాంఘిక చరిత్రలను ఉల్లేఖించి, నాట్యకళను రూపొందించటంలో వాటి ప్రభావాన్ని వివరించుతూ వచ్చారు.

పూర్వ చరిత్ర భాగంలో, నాట్యకళా విర్భావ సంబంధి పౌరాణిక గాథలు, భరతముని సంప్రదాయం వివరించబడినై. తరువాత భరతుని సంప్రదాయమునకు భిన్నమై, దక్షిణ భారతదేశమున వ్యాప్తిలో వున్న దేశి సంప్రదాయములు, భరత సంప్రదాయమునకూ వీనికీ గల తారతమ్యములు ఉల్లేఖింప బడినై

రెండవ భాగంలో (చరిత్రయుగం). దేవదాసీ వ్యవస్థ ఆవిర్భావ వృద్ధి పతనాల సమగ్ర చరిత్రను అందజేశారు. అటుపై ఆంధ్రకర్ణాటక, తమిళ కేరళ దేశములలో పెంపొందిన నాట్య సంప్రదాయములనూ వాటి చరిత్రలనూ వివరించారు.

మూడవభాగంలో (మధ్య యుగం) దక్షిణాంధ్ర నాయకరాజుల కృషి, యక్ష గాన కృతులు, కూచిపూడి సంప్రదాయం, కేరళ కథాకళి మొదలైన విషయాలు చర్చింపబడినై.

చివరి భాగంలో (ఆంగ్లేయయుగం) దేశీయ రాజులు పతనమై పోవటంతో ఆశ్రయం లేని ఈ కళ పతనప్రవృత్తికి దోహదమై పాడైపోవటం, తిరిగి జాతీయోద్యమంతో, ఈ నైచ్యాన్ని కడిగేసుకుని క్రొత్తరూపం ధరించటానికి జరుగుతున్న ప్రయత్నం వివరించారు.

కేవలం నాట్య చరిత్రనే కాక అందులో ప్రధానమైన సాంకేతిక విషయాలను కూడా వివరించారు. ప్రథమభాగంలో 'సంయుత హస్తములు' నిర్వచించి వాటి రేఖా చిత్రాలను గ్రంథాంతంలో ప్రత్యేకానుబంధంగా ఇచ్చారు.

'మధ్యయుగ' భాగంలో నాయికానాయక లక్షణములు తెలియజేశారు. ఈ భాగంలోనే ఆయా పదకర్తల రచనలనుంచి లక్ష్యాలను ఉటంకించారు.

కేరళ జానపద సంప్రదాయాల పరిశోధనలో రచయిత చేసిన అపారమైన కృషి ద్యోతమానం అవుతోంది.

ఇలాంటి కళా చరిత్రను నిర్మించటం సామాన్య విషయంగాదు రచయితకు కేవలం నాట్యకళా సంప్రదాయ విజ్ఞానమే గాక, మత, సాంఘిక, రాజకీయ పరిణామాలకు సంబంధించిన సర్వతోముఖమైన పరిజ్ఞానం వుంటేనేగాని ఈ రచన సాధ్యం కాదు. శ్రీ సీతారామారావుగారు చేసిన మహత్తరమైన ఈ కృషిని గమనించి ఆంధ్రప్రజలు ఈ గ్రంథానికి తగిన ప్రోత్సాహమియ్యగలరని విశ్వసించుచున్నాము.



* * *

## తెలంగాణం

### 1, 2 భాగములు

వ్యాస సంపుటములు: సంకలనకర్త: శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి: ప్రచురణ: దేశోద్ధారక గ్రంథమాల, 2844 ఇమాంబావి వీధి, సికింద్రాబాదు. మూల్యం: మొదటి భాగం: రు. 2–4 0 రెండవ భాగం: రు. 2–8 0

ఆంధ్రప్రదేశ్ అవతరణ మహోత్సవ సమయానికి ఈ గ్రంథాన్ని ప్రచురించి అందజేసిన ప్రచురణకర్తలను తెలుగువారు అభినందించవలసివుంది. రాజకీయపు కట్టుబాట్లు కారణంగా నిన్న మొన్నటి వరకూ తెలంగాణా ప్రాంతంలో ఎక్కడ ఏమి జరుగుతున్నది, ఏ మహనీయులు ఉద్యమించి ఏయే కార్యకలాపాలు సాగించి ఆంధ్రాభ్యున్నతికి తోడ్పడుతున్నదీ, యితర ప్రాంతాల ఆంధ్ర ప్రజలెవ్వరికీ ఏమీ అర్థమయ్యే అవకాశం వుండేది గాదు. బయట వున్న వారికే కాదు. తెలంగాణంలోనే ఒక ప్రాంతం వారి విషయం ఒకరికి అర్థమయ్యేది గాదు. అదృష్టవశాత్తూ నేడు సర్వాంధ్ర ప్రజలూ ఏకమై మహాంధ్ర ఏర్పడినది గనుక ఈ ప్రజానీకం పరస్పరం ఒకరి ఆశయాలనొకరు, ఒకరి భావాలనొకరు అవగాహనం చేసుకుని అన్యోన్యతను సిద్ధింపజేసుకుని పెంపొందించవలసి వుంది. ఆ దృష్ట్యా ఈ వ్యాససంపుటములు రెండూ అమూల్యములైనవి.

మొదటి భాగం:— ఈ భాగంలో శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు రచించిన వ్యాసములు 9 వున్నాయి: (1) కాకతీయరాజ వంశము, కాకతీయ సాంఘిక చరిత్రము, తాళపత్ర గ్రంథములు, నాణెములు, శాసనములు, పాకాలసరస్సు, దేవాలయములు, గోలకొండపట్టణము, కిరాయినుల కథనము (ప్రాచీన సమాధులు). శ్రీ చాట్లేట నృసింహశర్మగారి, సర్వాయిపాపడు, మంత్రిమాదన్న అనే రెండు వ్యాసాలున్నాయి. తిరుపతి, శ్రీ కె. ఏ. భూపాలరావుగారి మాడన్న 'విశాలాంగనీతి', శ్రీ బి. రామరాజుగారి 'తెలంగాణా జానపద సాహిత్యము' శ్రీ బి. బాబురావువర్మగారి 'ఆదివాసులు' శ్రీ వానమామలై

# గ్రంథ విమర్శనము

వరదాచార్యులు గారి 'తెలంగాణా కవులు,' శ్రీ కొండపల్లి శేషగిరిరావు గారి, 'తెలంగాణా చిత్రకళ' శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య గారి 'మనం ఆంధ్రులం' శ్రీ దాశరథి గారి 'తెలంగాణా ఆధునిక సాహిత్య ముఖ ద్వారం,' శ్రీ ఆదిరాజు వీరభద్రరావు గారి 'తెలంగాణము' అనే వ్యాసాలున్నాయి; మొత్తం 19 వ్యాసాలు.

రెండవ భాగము:—ఈ భాగంలో మొత్తం 13 వ్యాసాలున్నాయి అవి:

నిజాము రాష్ట్రములోని యాంధ్రులు—శ్రీ మాడపాటి హనుమంతరావు

[ఇది 1914 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రకటింపబడిన వ్యాసం]

తెలంగాణా రాజకీయోద్యమ చరిత్ర—శ్రీ రావి నారాయణరెడ్డి

పారిశ్రామిక కార్మికులు — శ్రీ గొబ్బూరి రామచంద్రరావు.

తెలంగాణాలో భూదానోద్యమం—శ్రీ ముండి జగన్నాథం.

భూసంస్కరణలు—శ్రీ పల్లెర హనుమంతరావు.

కౌలుదారీ సమస్య—శ్రీ దేవులపల్లి వేంకటేశ్వరరావు.

భూసంస్కరణలు—శ్రీ కొమరగిరి సుందరరావు.

స్థానిక స్వపరిపాలనవిధానం—శ్రీ సి రామిరెడ్డి

తెలంగాణా యందలి కుటీర పరిశ్రమలు—శ్రీ ఆర్. వి. రావ్.

చేనేతపరిశ్రమ—శ్రీ పెండెం వాసుదేవరావు.

పరిటాల ప్రజా ఉద్యమము—శ్రీ మాదిరాజు సీతారామారావు

తెలంగాణా రాజకీయోద్యమాలు—శ్రీ కోదాటి నారాయణరావు.

బొగ్గుగనులు—శ్రీ ఎస్. సోమరాజు.

పై రెండు సంపుటములలోని 32 వ్యాసముల తోను, తెలంగాణమునకు సంబంధించిన ప్రాచీనాధునాతన వ్యవస్థలను, పురుషులకు సంబంధించిన వివిధ విషయాలను పాఠకుని దృష్టిపథానికి తెచ్చి తెలంగాణాను గురించి ఒక సమ్యగ్దృష్టి యేర్పడటానికి సావకాశం కల్పించారు. ఎప్పటికో ఒకనాటికి రచింపబడవలసి యున్న ఆంధ్రప్రజల సమగ్ర చరిత్రకు ఈ సంకలనం యెంతో ఉపకారి గలదు. ప్రతి ఆంధ్ర గ్రంథాలయంలోనూ నిక్షేపింపదగిన ఉత్తమ గ్రంథం.

## శాంభవీ శతకము

కావ్యసంపుటి; రచన శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు: ప్రచురణ: బి. వి. అండ్ సన్స్, రామారావుపేట, కాకినాడ వెల. రు 0-8-0.

ఈ సంపుటిలో శాంభవీశతకము, పశ్చాత్తాపము, జీవిత నాటకము, సింహావలోకనము అనే నాలుగు కృతులున్నాయి. ఇందు పశ్చాత్తాపము బ్రౌనింగ్ మహాకవి 'ఆంద్రియా' (Andrea Del Sarto) పశ్చాత్తాపమునకు అనువాదం 'ఆంద్రియా గొప్పశిల్పి. అతని శిల్పకళా నిపుణతకు మెచ్చి ఫ్రాన్సు రాజు తన సభాసదులను అలంకరింప గొప్పశిల్పముల చిత్రింపుమని కోరి ఆంద్రియాకు కాసులు రాసులుగా నిచ్చి గౌరవించెను. అందు కంగీకరించి ఆంద్రియా అసామాన్య గీసుకొనిపోవుచు నోరియారలు లుక్రీషియా అను మహాసౌందర్యవతిని జూచి. యామెను బగినయనూడి యామెకు వశుడై యామె కోరకోరకముతో నామె కదంబ మేడలు మిద్దెలు కట్టించి యామె వలలో దగుల్కొని యా విలాస విహారములలో జిక్కి పగసుగా జాతకు దాఁ సంగిన మాట మరచి లుక్రీషియా కితాను సొమ్ము ధనము వ్యయించుచు నట్లనే యుండిపోయెను. లుక్రీషియా చంచల చిత్త. ఆమె వలపుతో గాక కేవల ధనము కోసమై యాతని బెండ్లాడెను. ఆమెకు ప్రియుడు వెంబడి కలుగు వారు లాదనున ప్రార్వుల్ బడిన యప్పుల నీమె తీర్చుచుండెను. ఈమె పెనిమిటి కోరమున ఆంద్రియా యెంత సమునైనా వెంగుల కైన నిచ్చివేసెవాడు. ఈ విధముగా ఆంద్రియా స్త్రీలోలుడై తనకు ధన మొసంగిన ఫ్రాన్సు రాజును మోసగించి, ఆకట నలుగు తల్లిదండ్రుల కంటనైన జూడక విడిచి పెట్టి, ఆ జన్మసిద్ధమైన కళా నిపుణతను గంగ గల్పి, సర్వ విధముల భ్రష్టుడయ్యెను. అప్పుడు లుక్రీషియా యాతని ధనరాసు లన్నియు హరించి పోవుటవలన నతనిని విడిచి పెట్టి యింకొక నూతన ప్రియునితో లేచి పోయెను. చివరకు ఆంద్రియా పశ్చాత్తప్తుడై విరాగియై చాపోయెను—"

ఆ అనుభూతిలో ఆంద్రియా ఒక మహాసత్యాన్ని గ్రహించి దాన్ని తనకు ఉపకరించు పోయినా

భావితరం కళాకారులకు అందజేశాడు. కళాకారుడుగా మహోన్నతుడు కావాలంటే నిర్జితేంద్రియుడు— ఋషి—కావాలన్నది ఈ మహాసత్యం.

"శిల్పకళా ప్రవీణత ప్ర
　సిద్ధి గడించితి గాని చూడ న
తృల్పము నాదుశిల్పకళ యాని
　యాత్మ నెఱింగితి; నెంతయున్ బురా
శిల్పవరేణ్య శిల్పముల
　'జీవము'నందలి 'యాత్మ' లేదు నా
శిల్పమునందు దోచును వి
　శిష్ట విభేదములందు నిందునున్"

కారణ మొక్కటే కలదు
　కొంద మహాత్ములు నిర్జితేంద్రియ
శ్రీరమణీయచిత్తులు వ
　శీకృత సర్వకళా రహస్య ల
వ్వారలు నిర్మలుల్ తలప
　వారికి నాకును పోల్కి యున్నదే
మారవికార దుర్మలిన
　మానసుడన్ గద భాగ్యహీనుడన్"

కాంధవీశతకంలో ధారాశుద్ధి వినా యితర కవితా సంపన్నత లేమీ కనుపించటం లేదు.

## వా చ వి

కథా సంపుటి; 'రచన' ప్రచురణలు. లోడీ కాలనీ, న్యూఢిల్లీ—3; వెల 1-0 0.

ఈ సంపుటిలో, శ్రీయుతులు కవికొండల వెంకటరావు, 'చలం' కలపటపు రామగోపాలరావు. విశ్వనాథ అచ్యుత దేవరాయలు, పి. భానుమతి. బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు, శ్రీవిద్వడి లక్ష్మన్న, నాదెళ్ళ పతంజలి, రావూరి భరద్వాజ, గిడుతూరి సూర్యం, పన్యాల రంగనాథరావుగార్ల కథలు మొత్తం 11 వున్నాయి. వీరందరూ ప్రసిద్ధ రచయితలే అయినా వీటిలో ప్రత్యేకం మెచ్చుకోదగని రెండు కథలున్నాయి 'ఒక పువ్వుపూసింది' అన్న చలంగారి కథ రసానందవాహిని యైన ఒక మహాకావ్యంలా వుంది ఈ రచనలో శ్రీచలం 'వరువిరుద్ధ'ను త్రోసి రాజనేశారు. రెండవపని పరిస్థితుల దాసులు అన్న శ్రీ భరద్వాజకథ దీర్ఘ రచయిత, నెగడు వేసి ఆ అగ్నికాం తుల్లో జీవితపు అట్టడుగున అంధకారంలో మెసిలే దుర్భర జీవుల హృదయాలను దోష్యీకరణం చేశారు. అంతటుంది ప్రసిద్ధ కథకుల రచనలున్నాయి గనుక వైవిధ్యాభిరుచికైనా ఈ సంపుటాన్ని సేకరించవచ్చు.

## కచటతపలు

కథలసంపుటి; రచన: శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి; ప్రచురణ నవ్యభారతి, 3-8-598 హిమాయత్ నగర్ హైదరాబాదు. వెల తెలియదు.

ఈ సంపుటిలో రాగద్వేషాలు, సర్వాంతర్యామి, జీవితపు జమాఖర్చులు, సమానాంతరరేఖలు, అతుకుల బతుకులు అనే శీర్షికలలో అయిదు కథలున్నాయి. కథా నిర్మాణంలో శ్రీ శాస్త్రిగారికి ఒక ప్రత్యేకమైన ప్రతిభవుంది. సామాన్య జీవితంలో నుంచి కథావస్తువును సేకరించి దానికి అత్యంత ప్రతిభావంతంగా రససిద్ధిని సాధించగలరు లోగడ భారతిలో ప్రచురింపబడిన 'సర్వాంతర్యామి' అనేకథ చాలా విచిత్రమైనది. అధునాతన భావాలుగల యువకుడు పరిస్థితుల ప్రభావానికి లోనై విచిత్రంగా మారిపోవటం బహు చాకచక్యంగా చిత్రించారు. కథను బహుళంగా విస్తరించకుండా వుంటే వీరి శిల్పానికి ఇంకా మంచి జిగి యేర్పడే సావకాశం వుంది.

## కృష్ణాంజలి

కథలసంపుటి; రచన: శ్రీ కొండి కృష్ణమూర్తి; ప్రచురణ: యశోధర ప్రచురణలు, హనుమకొండ, వరంగల్. వెల రు 1-0-0.

## ప్ర తీ క్ష

సాంఘిక నాటిక: రచన: శ్రీ చనలవాడ పిచ్చయ్య నవ్యసాహిత్య ప్రచురణ విజయవాడ; వెల 1-8-0.

## శ్రీమదాంధ్ర భగవద్గీత

వచనము: రచన! శ్రీ బలాస్వామికవిగారు; ప్రచురణ: ఎం. ఎస్. చౌదరి అండ్ సన్సు; మండపేట తూర్పుగోదావరిజిల్లా.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.